**యః శృణోతి నరో భక్త్యా శ్రావయేద్వా సమాహితః ।**
**స యాతి బ్రహ్మణో ధామ నాత్ర కార్యా విచారణా ॥**

అని ఫలశ్రుతి. ఎవడు భక్తితో ఈ పురాణాన్ని వింటాడో, లేదా వినిపిస్తాడో, అతడు బ్రహ్మలోకం చేరుతాడు. ఇందుకు సందేహం లేదు.

## 7. మార్కండేయ పురాణం

మునులు తమ సందేహాలను మార్కండేయ మహర్షికి తెల్పగా ఆయన వారి సంశయాలు తొలగిస్తూ చెప్పిన పురాణమిది. విష్ణు భగవానుని దక్షిణపాదంగా ఇది కీర్తింపబడింది. ఇందులో 134 అధ్యాయాలు, తొమ్మిదివేల శ్లోకాలు ఉన్నాయి.

బలరాముని తీర్థయాత్రలు, హరిశ్చంద్రుని వృత్తాంతం, పతివ్రతాస్త్రీల ప్రభావం, కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయుని అనుగ్రహం పొందడం, రాజధర్మాలు, యోగశాస్త్రవిషయాలు, ఓంకారనిరూపణ, బ్రహ్మాండోత్పత్తి, దేవీమాహాత్మ్యం, సూర్యవంశవర్ణన ఇత్యాదిగా గల వివిధ విషయాలు ఈ పురాణంలో నిరూపించడమయింది.

దుర్గాదేవి జనుల ననుగ్రహించి వారి కోర్కెలు తీర్చే దేవత. ఆ దేవిని ఆరాధించడంలో సప్తశతీపారాయణం ముఖ్యకర్తవ్యం. ఆ సప్తశతి ఈ పురాణంలోని భాగమే. దేవీనవరాత్ర్యుత్సవాలలో సప్తశతిని పారాయణం చేస్తారు.

మహిళామణులలో కొందరు మహాయోగిను లున్నారు. వారిలో మదాలసాదేవి ఒకరు. ఈమెకు సంబంధించిన అద్భుతమైన చరిత్ర ఈ పురాణంలో అతి విపులంగానూ, రమణీయంగానూ నిరూపింపబడివున్నది.

ఋతధ్వజుడనే రాజుయొక్క ధర్మపత్ని మదాలస. ఈమెకు విక్రాంతుడు, సుబాహుడు, అరిమర్దనుడు, అలర్కుడు–అని నల్గురు కుమారులు. ఆమె ఉగ్గుబాలతోపాటు మొదటి ముగ్గురికీ బ్రహ్మవిద్యను గూడా బోధించింది. వారు అధ్యాత్మవిద్యలో ఆరితేరి సంసారవిరక్తులవుతారు. ఋతధ్వజుడు నాల్గవ కుమారుణ్ణి తల్లి వద్ద అధ్యాత్మవిద్యనభ్యసింపనీకుండా లౌకికవిద్యలు బోధించే ఏర్పాటు చేస్తాడు. అవసానదశలో ఆమె అతణ్ణి కూడా సత్సంగప్రభావముతో తత్త్వవేత్తగా రూపొందేటట్లు చేస్తుంది. ఇది ఆ కథా సంగ్రహ సారాంశం.

విష్ణువుయొక్క నాల్గు రూపాలు వాసుదేవ–శేష–ప్రద్యుమ్న–అనిరుద్ధములని ప్రసిద్ధాలు. వీటికి సంబంధించిన వివరణ కూడా ఈ పురాణంలో వస్తుంది.

ఇక ధర్మపక్షులుగా ప్రసిద్ధి వహించిన పక్షుల వృత్తాంతం గూడా మార్కండేయపురాణంలో పేర్కొనబడివున్నది. జైమినిమహర్షి తనకు గల్గిన సంశయాల నన్నింటినీ ఈ పక్షులద్వారానే తొలగించుకొంటాడు.

ఈ పురాణం పుత్రులను మూడురకాలుగా విభజించింది. తండ్రినుండి సంక్రమించిన కీర్తినీ, ధనాన్నీ పెంపొందించేవాడు ఉత్తముడు, పెంపొందించకున్నా పోగొట్టకుండా ఉండేవాడు మధ్యముడు, పోగొట్టుకొనేవాడు అధముడు. ఎంతో చక్కని ప్రబోధమిది.

తండ్రిపేరు చెప్పుకొని కాలం గడపువాడు వ్యర్థజన్ముడు. తండ్రికి కీర్తి తెచ్చేవాడు ఉత్తముడు ఇలాంటి విషయాలు యుక్తియుక్తంగా ఆసక్తిజనకంగా ఇందులో వివరించబడివున్నాయి.

**శ్రుత్వా తత్పూజయేద్యస్తు పురాణం సప్తమం పునః ।**
**సర్వపాపవినిర్ముక్తః పునాత్యేవ నిజం కులమ్ ॥**

అని ఫలశ్రుతి. ఇది విని దీనిని పూజించేవాడు సకలపాపవిముక్తుడై తన కులాన్ని పావనం చేస్తాడు.

## 8. అగ్నిపురాణం

అగ్నిదేవుడు వసిష్ఠమహర్షికి ఉపదేశించినదే అగ్నిపురాణం. ఇది విష్ణుదేవుని ఎడమపాదంగా వర్ణింపబడింది. ఇందులో 383 అధ్యాయాలు, 15,400 శ్లోకాలు ఉన్నాయి.

దశావతారాలు ఇందులో వర్ణింపబడ్డాయి. మరియు రామాయణ మహాభారతాలలోని కొన్ని ఘట్టాలు ఇందులో కనిపిస్తాయి.

దేవాలయ నిర్మాణం, సాలగ్రామలక్షణాలు, సూర్యపూజ, శివపూజ, వాస్తుపూజ, చతురాశ్రమధర్మాలు ఈ పురాణంలో పేర్కొనబడివున్నాయి. పలురకాల వ్రతాలు, రాజధర్మాలు, స్వప్న ఫలితాలు, స్త్రీ పురుష లక్షణాలు, ఆయుర్వేద విషయాలు, అద్వైతవేదాంతతత్త్వం ఇత్యాదిగా గల పలువిషయాలు ఈ పురాణంలో కనిపిస్తాయి.

కూర్మావతారవర్ణన సందర్భంలో విష్ణువు దేవతలకు ఎలా ఉపకరించాడో ఇక్కడ మనోజ్ఞంగా చెప్పడమయింది.

ఇక రామాయణ ఘట్టాలలో సుగ్రీవుడు సీతాన్వేషణ విషయంలో అశ్రద్ధ చూపినప్పుడు రాముడతనికి పంపిన తీక్ష్ణపదజాలంతో కూడిన సందేశం పాఠకులలో ఆసక్తిని రేకెత్తిస్తున్నది. రామాయణంలో సీతాపహరణకు రావణుడు మారీచుణ్ణి ప్రేరేపించినప్పుడు మారీచుడు చెప్పిన ఈ క్రిందిశ్లోకం గమనార్హం.

**రావణాదపి మర్తవ్యం మర్తవ్యం రాఘవాదపి ।**
**అవశ్యం యది మర్తవ్యం వరం రామాన్న రావణాత్ ॥**

“రావణుని ఆజ్ఞ పాటించకుంటే అతనినుండి చావు తప్పదు. పాటిస్తే రామునిచేత మరణం తప్పదు. రావణునికన్న రామునిచేత మరణించడమే మేలు” అని భావం. ఇలా రామాయణభారతాదులలోని కొన్ని ఘట్టాలు ఈ పురాణాల్లో కనిపిస్తాయి.

భగవంతు డనే పదానికి ఈ క్రింది శ్లోకంలో ఇచ్చిన నిర్వచనం అర్థవంతంగా ఉంది.

**ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానామాగతిం గతిమ్ ।**
**వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి ॥**

సృష్టిస్థితిలయాలు, జీవుల జననమరణాలు, విద్యా విద్యల స్వరూపం సమగ్రంగా ఎరిగినవాడే భగవంతుడు.

ఇక దేవాలయ నిర్మాణానికి చెందిన విశేషాలు కూడా ఈ పురాణంలో లభిస్తున్నాయి. ఆలయనిర్మాణం వల్ల బ్రహ్మహత్యాది దోషాలు కూడా తొలగిపోతాయని చెప్పడం విశేషం.

ఈ పురాణంలో కథలకు అంతగా ప్రాముఖ్యం లేదు కాని విద్యలు, పదార్థ లక్షణాలు, శుభాశుభస్వప్నాలు, శకునాలు, ఇవి మొదలుగాగల అనేక విషయాలు నిరూపింపబడి వున్నాయి. వివిధ శాస్త్రాలకు చెందిన విషయాలు ఇందులో ఉండడం వల్ల ఇదొక విశిష్టమైన పురాణంగా ప్రశంసింపబడుతున్నది. దీని ఫలశ్రుతి యిది–

**'ఆగ్నేయం పఠితం ధ్యాతం శుభం స్యాద్భుక్తిముక్తిదమ్'**

ఈ ఆగ్నేయ పురాణాన్ని చదివినా, ధ్యానించినా భుక్తిముక్తులు చేకూరుతాయని, శుభం కలుగుతుందని చెప్పడమయినది.

## 9. భవిష్యపురాణం

విష్ణుదేవుని కుడిమోకాలితో పోల్చబడిన ఈ పురాణంలో 14,500 శ్లోకాలున్నాయి. ఇందలి అధ్యాయాల సంఖ్య 585.

సృష్టివివరణ, పురాణాల ఉత్పత్తి, షోడశసంస్కారాలు. సావిత్రీమాహాత్మ్యం, స్త్రీలక్షణాలు, వివిధ వ్రతాలు ఇందులో వివరించడమయినది. రథసప్తమీ మాహాత్మ్యం, సూర్యుని ప్రభావం, ప్రతిమాలక్షణాలు, ధర్మస్వరూపం, జీమూతవాహనాదుల చరిత్రలు, అన్నదానప్రశస్తి మున్నగు విషయాలు అతివిస్తృతంగా ఇందులో వర్ణించడం జరిగింది.

భర్తపట్ల భార్య, భార్యపట్ల భర్త ప్రవర్తించవలసిన తీరుతెన్నులు చక్కగా ప్రతిపాదింపబడినాయి. సూర్యప్రభావవర్ణనా సందర్భంలో రాజు, దొంగలు, గ్రహాలు, పాములు, పేదరికం, దుఃఖాలు–ఇవేవీ సూర్యానుగ్రహం పొందిన వారిని బాధించవు అని చెప్పడం విశేషం.

ఇక జీవితంలో అతిముఖ్యమైన వివాహాన్ని గురించి వివరిస్తూ సమస్థాయిగలవారిలో జరిగే వివాహాలు శుభకరాలని, తదితరవివాహాలు దుఃఖదాయకాలని ఈ పురాణం చెప్పింది. స్మృతులలో పేర్కొనబడిన వివిధ వివాహభేదాలు ఇందులో ప్రతిపాదింపబడివున్నాయి. సామాజిక జీవితంలో అత్యావశ్యకాలైన వివాహాది విషయాలను ఈ పురాణంలో ప్రతిపాదించడంవల్ల సంఘశ్రేయస్సుపట్ల పురాణకర్తకు కల అభినివేశమెట్టిదో వ్యక్తమవుతున్నది.

అన్నదాన ప్రాశస్త్యాన్ని పేర్కొంటూ–

**"అన్నం వై ప్రాణినాం ప్రాణా అన్నమోజో బలం సుఖమ్ ।**
**ఏతస్మాత్కారణాత్సద్భిరన్నదః ప్రాణదః స్మృతః ॥**

ప్రాణులకు అన్నమే ప్రాణం. అన్నమే ఓజస్సు, బలం, సుఖం. అందుచేత అన్నదాత ప్రాణదాతగా పేర్కొనబడినాడు. ఈ పురాణంలో మరొక విశేషం విక్రమాదిత్యుడికీ, బేతాళునికీ సంబంధించిన కథలు. ఈ కథలు మిక్కిలి లోకప్రసిద్ధి వహించాయి. కథలలో జీవితంలో ఎదురయ్యే గడ్డు సమస్యలను పరిష్కరించే నైతికసూత్రాలు మనోజ్ఞంగా నిరూపింపబడివున్నాయి.

ఈ పురాణానికి ఫలశ్రుతిని వివరిస్తూ గ్రంథకర్త ఇలా అన్నాడు–

**యచ్ఛ్రుత్వా సర్వపాపేభ్యో ముచ్యతే మానవో నృప! ।**
**అశ్వమేధఫలం ప్రాప్య గచ్ఛేద్భానుం న సంశయః ॥**

ఈ పురాణం వింటే సకలపాపవిముక్తి చేకూరుతుంది. అశ్వమేధయాగ ఫలం లభిస్తుంది. చివరికి సూర్య సాయుజ్యప్రాప్తి కలుగుతుంది.

## 10. బ్రహ్మవైవర్తపురాణం

సావర్ణిమనువు నారదమునీంద్రునికి చెప్పిన పురాణమిది. ఇందులో వరాహమూర్తికి, శ్రీకృష్ణునికి సంబంధించిన విషయాలు ప్రధానంగా ప్రతిపాదించబడివున్నాయి. ఈ పురాణం శ్రీమహావిష్ణువుయొక్క ఎడమ మోకాలుగా కీర్తింపబడింది.

బ్రహ్మఖండం, ప్రకృతిఖండం, గణేశఖండం, శ్రీకృష్ణఖండమని నాలుగు ఖండాలుగా ఇది విభజింపబడివున్నది. అన్ని ఖండాలలోను కలిపి మొత్తం 18,000వేల శ్లోకాలున్నాయి. **'సారభూతం పురాణేషు బ్రహ్మవైవర్తముచ్యతే'** అన్నట్లు ఈ పురాణం పురాణా లన్నింటికీ సారభూతమైనదిగా ప్రశస్తి పొందింది.

బ్రహ్మఖండంలో పరబ్రహ్మవర్ణన చేయబడింది. ప్రకృతిఖండంలో దుర్గాదేవి మున్నగు స్వరూపాలతో ప్రకృతి ఆవిర్భవించడం నిర్దేశించబడింది. గణేశఖండంలో వినాయక చరిత్ర నిబద్ధమైనది. శ్రీకృష్ణఖండంలో దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మస్థాపన మొదలగు అంశాలు పేర్కొనబడ్డాయి.

అతిథిని పూజించవలసిన అవశ్యకతను వివరిస్తూ ఈ పురాణం చెప్పిన విషయమిది-

**అపూజితోఽతిథిర్యస్య భవనాద్వినివర్తతే ।**
**పితృదేవాగ్నయః పశ్చాద్గురవో యాన్త్యపూజితాః ॥**

ఏ గృహస్థుని యింట అతిథి ఆదరింపబడడో ఆ యింటినుండి పితరులు, దేవతలు, అగ్నిదేవుడు, గురువులు పూజలను తిరస్కరించి వెళ్ళిపోతారని భావం.

ఇక జన్మకారణమైన తండ్రితోపాటు విద్యాదాత, అన్నదాత, భయమునుంచి కాపాడినవాడు, కన్యాదాత- ఈ నలుగురు కూడ తండ్రులుగానే పేర్కొనబడ్డారు. అట్లే సేవకుడు, శిష్యుడు, పోషితుడు, ఔరసుడు, శరణాగతుడు- ఈ ఐదుగురు పుత్రులుగానే పరిగణింపదగి ఉన్నారు.

ఈ గ్రంథంలో మొదటి పురుషార్థమైన ధర్మముయొక్క ప్రాశస్త్యం ఈ క్రిందివిధంగా ఉగ్గడింపబడింది-

**నాస్తి ధర్మాత్పరో బన్ధుర్నాస్తి ధర్మాత్పరం ధనమ్ ।**
**ధర్మాత్ప్రియతరః కో వా స్వధర్మం రక్ష యత్నతః ॥**

"ధర్మంకంటే శ్రేష్ఠుడైన బంధువు లేడు. మేలైన ధనం లేదు. ధర్మంకంటే ప్రియతరమైన దేదీ లేదు. కాన ప్రయత్నంతో ధర్మాన్ని రక్షించాలి." అని భావం. అట్లే మరొక చోట గురువులో సకలదేవతలూ ఉన్నారని గురుమహిమ ప్రశంసింప బడినది.

పై విషయాలతోపాటు భగవంతుని స్వరూపం, సరస్వతీపూజ, భూదానప్రాశస్త్యం, గంగావతరణం, సంక్షిప్త రామాయణం, తులసీమాహాత్మ్యం, దుర్గోపాఖ్యానం మొదలైన విషయాలు కూడా ఈ పురాణంలో వివరింపబడి వున్నాయి.

ఈ గ్రంథంలో పేర్కొన్న కథలలో ముఖ్యంగా పేర్కొనదగినది వేదవతీ చరిత్ర. కృతయుగంలో వేదవతిగా, త్రేతాయుగంలో సీతగా, ద్వాపరయుగంలో ద్రౌపదిగా వేదవతిని పురాణం వర్ణించింది. తదుపరి పురాణాల కథలలో ఈ వేదవతియే పద్మావతిగా అవతరించి విష్ణుని రూపాంతరమైన వేంకటేశ్వరుణ్ణి చేపట్టినట్లు చెప్పడమయినది.

కశ్యపమహర్షిమానసపుత్రిక జరత్కారువుయొక్క స్తుతి కూడా ఈ పురాణంలోనే లభిస్తున్నది.

**శుభదం పుణ్యదం చైవ విఘ్ననిఘ్నకరం పరమ్ ।**
**హరిదాస్యప్రదం చైవ పరలోకే ప్రహర్షదమ్ ॥**

ఇత్యాదిగా ఈ పురాణ పఠనం శుభాన్నీ, పుణ్యాన్నీ, విఘ్నవినాశాన్నీ, హరిదాస్యాన్నీ, పరలోకంలో సంతోషాన్నీ ప్రసాదిస్తుంది అని చెప్పడమైనది.

## 11. లింగపురాణం

అగ్నిలింగంలో అంతర్గతుడైవున్న శివుడు ఉపదేశించినదే లింగపురాణం. ఇది విష్ణుదేవుని కుడిచీల మండతో పోల్చబడింది. శివుని ప్రభావాన్ని వర్ణించే ఈ పురాణంలో 11,000వేల శ్లోకాలున్నాయి. ఇది పూర్వార్ధమనీ, ఉత్తరార్ధమనీ రెండు భాగాలుగా ఉన్నది. పూర్వార్ధంలో 108, ఉత్తరార్ధంలో 55 కలిపి మొత్తం 163 అధ్యాయాలున్నాయి.

శివుని అవతారాలను ఈ పురాణం విరివిగా వర్ణిస్తున్నది. అందుచేత శైవులు ఈ పురాణాన్ని ప్రముఖంగా ఆదరిస్తారు. అష్టాంగయోగ సహితమైన శివారాధన, విష్ణువు కావించిన శివస్తోత్రం, బ్రహ్మజననం, లింగార్చనావిధానం, శివునికి చెందిన మానసపూజ, యుగ ధర్మాలు, సప్తద్వీపాలు, సప్తసాగరాలు, దిక్పాలకుల నగర వర్ణన, చంద్రవంశరాజుల వృత్తాంతం, త్రిపురాసురసంహారం, కైలాసగిరివర్ణన, సదాచారం ఇత్యాదిగా పలు విషయాలు ఈ పురాణంలో అతివిస్తృతంగా ప్రతిపాదింపబడివున్నాయి.

ఇందలి ఉత్తరార్ధంలో పృథివి, జలం, అగ్ని, వాయువు మొదలగు అష్టవిధాలైన శివుని మూర్తుల వివరణ వున్నది. శివభక్తిని ప్రతిపాదించే కథలు కూడా ఈ పురాణంలో చోటు చేసుకొనివున్నాయి.

మృత్యువు సమీపించిన శ్వేతుడు అనే శివభక్తుడు శివుని అనుగ్రహంచేత మరణంనుంచి తప్పించుకొనిన కథ శివారాధనవల్ల కలిగే ఫలితాన్ని వివరిస్తున్నది.

ఇక కాశీక్షేత్రమహిమ ఇందులో విస్తారంగా ప్రతిపాదితమయింది.

**కామం భుంజన్ స్వపన్ క్రీడన్ కుర్వన్హి వివిధాః క్రియాః ।**
**అవిముక్తే త్యజేత్ ప్రాణాన్ జంతుర్మోక్షాయ కల్పతే ॥**

భుజిస్తూ, నిద్రిస్తూ, క్రీడిస్తూ, యథేచ్ఛగా వివిధక్రియలాచరిస్తూ కూడ ఈ క్షేత్రంలో మరణిస్తే మోక్షం సిద్ధిస్తుందని ఇందులో చెప్పడమయినది.

అష్టదిక్పాలకులుగా ఇంద్రాదులు ప్రసిద్ధులు. వారు నివసించే నగరాలు క్రమంగా 1. అమరావతి 2.తేజస్విని 3.వైవస్వతి 4.కృష్ణవర్ణ 5. శుద్ధవతి, 6.గన్ధవతి 7.అలక 8.యశోవతి – అనేవి ఈ పురాణంలో పేర్కొనబడ్డాయి.

ఇది శైవపురాణం కాన శివపూజామాహాత్మ్యాన్ని ఘనంగా కీర్తిస్తున్నది. శివానుగ్రహంతోనే పరాశరుడు ఎన్నడో మరణించిన తన తండ్రిని, పినతండ్రులను చూస్తాడు. ఇట్టి విశిష్టమైన కథలతోను, వర్ణనలతోనూ సాగిపోయే లింగపురాణం చాలా ప్రభావోపేతమైనది.

మంచినీతులు చెప్పిన సందర్భాలు కూడా ఈ పురాణంలో లేకపోలేదు. భోగాశను నిరోధించాలనీ, విషయ విచారణచేత అది సాధ్యమనీ, మనోవాక్కాయాలతో వైరాగ్యాన్ని పాటించాలనీ చెప్పే ఈక్రింది శ్లోకం గమనార్హం–

**భోగేన తృప్తిర్నైవాస్తి విషయాణాం విచారతః ।**
**తస్మాద్విరాగః కర్తవ్యః మనసా కర్మణా గిరా ॥**

ఈ పురాణపఠన ప్రయోజనాన్ని ఈ క్రిందిశ్లోకం ఇలా చెప్పింది–

**యః పఠేచ్ఛృణుయాద్వాఽపి లైంగం పాపహరం నరః ।**
**స భుక్తభోగో లోకేఽస్మిన్నన్తే శివపురం వ్రజేత్ ॥**

పాపహరమైన ఈ పురాణాన్ని చదివేవారు, వినేవారు ఈ లోకంలో ఉన్నంతకాలం సకల భోగాల ననుభవించి కడపట కైలాసం చేరుకోగలరు.

## 12. వరాహపురాణం

వరాహావతారధారియైన విష్ణుదేవుడు భూదేవికి చెప్పిన పురాణమే వరాహపురాణం. ఇందులో 24వేల శ్లోకాలున్నాయి. విష్ణువుయొక్క ఎడమ చీలమండతో ఈ పురాణాన్ని పోల్చడమయింది. ఇందలి అధ్యాయాల సంఖ్య 215.

నానావిధ సృష్టులు, నారదమునీంద్రుని పూర్వజన్మచరిత్ర, విష్ణుభగవానుని అష్టమూర్తులు, ధర్మవ్యాధుని చరిత్ర, దక్షయాగధ్వంసం, పార్వతీజననం, వినాయకుని పుట్టుక, వివిధవ్రతాలు, వాటి ఫలితాలు, నాలుగు యుగాలు, అన్నదానప్రాశస్త్యం, వరాహస్వామి భూదేవిని ఉద్ధరించడం, నాచికేతుని వృత్తాంతం ఇత్యాదిగా పలువిషయాలు ఈ పురాణంలోని అంశాలుగా ఉన్నాయి.

అష్టాదశపురాణాల క్రమమూ, వివరణ గూడా ఇందులో నిర్దేశింపబడివున్నది. మహావిష్ణువు తన భక్తులకు అంగరక్షకుడై ఉంటాడన్న విషయం ఈ గ్రంథంలో చెప్పడమయింది.

శ్రీకృష్ణుడు గీతలో **'మమ మాయా దురత్యయా'** అని అంటాడు. 'నామాయ దాటరానిది' అని దీని అర్థం.

భూదేవి 'మాయ' అంటే ఏమిటి? దాని స్వరూపం వివరించుమని విష్ణువును అడుగుతుంది. అందు కాదేవుడు తన మాయాస్వరూపాన్ని ఈ పురాణంలో అతి విస్తృతంగా వివరిస్తాడు.

లోకంలో తరచు సంభవించే అతివృష్టి, అనావృష్టి మున్నగు విపరీత సంఘటనలు, మాయవల్లనే కల్గుతున్నాయనీ, సృష్టిలో క్రమబద్ధంగా జరిగే సూర్యోదయాదులు, పంచభూతాల ప్రవర్తన, మాయాప్రభావం వల్లనే ఏర్పడుతున్నాయనీ ఇక్కడ చెప్పడమయింది.

దానాలన్నింటిలో అన్నదానం ప్రశస్తమయింది. అట్లే మనం వాడే వివిధములైన లోహాలతో నిర్మించబడిన పాత్రలలో రాగిపాత్రలు మేలైనవి అని ఈ పురాణం నిరూపించింది.

ఇంకా ఈ పురాణంలో వివిధతీర్థాల ప్రభావం గూడా వర్ణింపబడివున్నది. ఏ తీర్థాన్ని ఎప్పుడు సేవిస్తే మంచిదో ఇక్కడ వివరించబడివున్నది.

విష్ణుమందిరాలలో సేవలు చేసే వారికి గలిగే ఫలమేమి? అన్న భూదేవి ప్రశ్నకు విష్ణువు అట్టి వివిధ సేవాఫలాలను వివరంగా పేర్కొంటాడు. సకల జగత్తుకు సత్యమే ఆధారం కాన, సత్యాన్ని తప్పక పాటించాలన్న సంగతి ఇందులో చెప్పడమయింది.

ఇక కఠోపనిషత్తులో నాచికేతుని వృత్తాంతం ఇందులో రమ్యంగా ప్రతిపాదితమయింది. ఇంకా ఎన్నో కథాంశాలు ఈ పురాణంలో కనిపిస్తాయి.

**శ్రుత్వా తు పూజయేద్యస్తు శాస్త్రం వారాహ సంజ్ఞితమ్ ।**

**సర్వపాపవినిర్ముక్తో విష్ణుసాయుజ్యమావ్రజేత్ ॥**

అన్నట్లు దీన్ని ఎవరు శ్రవణం చేసి భక్తితో పూజిస్తారో, వారు సర్వపాపనిర్ముక్తులై విష్ణుసాయుజ్యం పొందుతారని ఫలశ్రుతి.

## 13. స్కాందపురాణం

స్కందుడనగా శివుని కుమారుడైన కుమారస్వామి. ఆ దేవుని పేరుతో ఈ పురాణం ప్రసిద్ధమయింది. శివుడు స్కందుణ్ణి ఉద్దేశించి చెప్పిన విషయమే ఈ స్కాందపురాణం. తండ్రినుండి విన్న ఈ పురాణాన్ని తరువాత స్కందుడు మునుల కుపదేశిస్తాడు.

**'ఏకాశీతిసహస్రం తు స్కాందం సర్వాఘకృంతనం'** – అన్నట్లు సకల పాపవిచ్ఛేదకమైన ఈ పురాణంలో 81,000 శ్లోకాలున్నాయి. దీన్ని బట్టి ఇతరపురాణాలకంటె ఇది ఆకృతిలో చాలా పెద్ద పురాణమని తెలుస్తున్నది.

మహావిష్ణుని వెంద్రుకలతో పోల్చబడిన ఈగ్రంథంలో మహేశ్వరఖండం, వైష్ణవఖండం, బ్రహ్మఖండం, కాశీఖండం, అవంతీఖండం, నాగరఖండం, ప్రభాసఖండం అని ఏడు ఖండాలున్నాయి.

మహేశ్వరఖండంలో కేదారఖండం, కౌమారీ ఖండం, అరుణాచలమాహాత్మ్యం మొదలైన అంశాలున్నాయి.

వైష్ణవఖండంలో వేంకటాచల–జగన్నాథక్షేత్రాల మాహాత్మ్యం, బ్రహ్మఖండంలో సేతు మాహాత్మ్యం, ధర్మారణ్య, బ్రహ్మోత్తరఖండాలున్నాయి. కాశీఖండంలో కాశీక్షేత్రప్రభావం విస్తృతంగా వర్ణింపబడి వున్నది. నాగరఖండంలో వివిధ తీర్థాల వర్ణన ఉన్నది. విశ్వకర్మోపాఖ్యానాదికథలు గూడా ఉన్నాయి.

ప్రభాసఖండంలో ద్వారకానగరపరిసరాల ప్రభావం వివరించబడివున్నది. సంహితారూపంలో గూడా ఈ స్కాందపురాణం ప్రసిద్ధమైవున్నది.

సనత్కుమారసంహిత, సూతసంహిత, శంకరసంహిత, వైష్ణవసంహిత, బ్రహ్మసంహిత, సౌరసంహిత, అనేవే ఈ సంహితలు.

సూతసంహితలో శివోపాసనాప్రాముఖ్యం కీర్తింపబడివున్నది. కాశీక్షేత్రప్రభావాన్ని వర్ణించే కాశీఖండంలో అయోధ్యాదిక్షేత్రాలలో మరణించినవారు స్వర్లోకసుఖం అనుభవించి తరువాత కాశిలో జన్మించి అక్కడ ముక్తు లవుతారని చెప్పడం విశేషం. '**కాశ్యాం తు మరణాన్ముక్తిః**' అన్న మాట గూడా ప్రసిద్ధం.

జీర్ణదేవాలయోద్ధరణ చేసేవారికి కలిగే ఫలాన్ని గూడా ఈ పురాణం వివరించింది. సత్యనారాయణ వ్రతస్వరూపం ఇందలి రేవాఖండంలో నిరూపితమయింది.

ఇంకను రామావతారం, క్షీరసాగరమథనం, గిరిజా కల్యాణం, కుమారోత్పత్తి, ఓంకారప్రభావం, 14 మంది మనువుల వర్ణన ఇత్యాద్యంశాలు ఇందులో గోచరిస్తాయి. అంతే కాక వనభోజనం, కార్తికవైభవం, ఉసిరిక విశిష్టత, ఇత్యాదివిషయాలు గూడా గమనింపదగివున్నాయి.

**సర్వేషామేవ ధర్మాణాం గురుపూజా పరా మతా ।**
**గురుశుశ్రూషయా సర్వం ప్రాప్నోతి హి న సంశయః ॥**

అన్ని ధర్మాలలోనూ గురుపూజ మేలైన ధర్మం. గురుసేవచేత అన్ని ఫలితాలూ పొందవచ్చు అని గురుసేవా ప్రాశస్త్యం పేర్కొనబడింది. రుద్రాక్ష మహిమ కథాకథన పూర్వాంకంగా ఇందులో వివరించబడింది.

పురాణ శ్రవణ ఫలాన్ని ఈ పురాణం 136 శ్లోకాలతో వివరించింది. జ్ఞానదీపాలుగా, భవరోగౌషధాలుగా పురాణాలిందులో కీర్తింపబడివున్నాయి.

## 14. వామనపురాణం

బ్రహ్మదేవుడు వామనావతార ప్రభావాన్ని కీర్తిస్తూ చెప్పినదే వామనపురాణం. మహావిష్ణుని చర్మంతో దీన్ని పోల్చారు. ఇందలి శ్లోకాలు పదివేలు, అధ్యాయాలు 95.

వైష్ణవధర్మ ప్రతిపాదకమైన ఈ పురాణంలో విష్ణుమందిరాలు, విష్ణుభక్తుల వృత్తాంతాలు అధికంగా కనిపిస్తాయి. ఉత్పత్తి ప్రళయాలు, కామదహనం, ప్రహ్లాదవరదానం, దేవీమాహాత్మ్యం, నానావిధ తీర్థాలు, వినాయక విజయం ఇత్యాద్యంశాలు ఈ పురాణంలో వర్ణించబడివున్నాయి.

వివిధ దేవతలకు చెందిన 25 స్తోత్రాలు ఈ పురాణంలో లభిస్తాయి. దేవతలలో మహావిష్ణువు, ఆయుధాలలో సుదర్శనం, పక్షులలో గరుడుడు, సర్పాలలో వాసుకి, ఈ రీతిగా ఆయా వర్గాలలో మేలైనవారినీ, వస్తువులను కీర్తించే ఇందలి ఘట్టం ఆసక్తి జనకంగా ఉంటుంది.

లోకంలో ఎన్నో పాపాలున్నాయి, కాని అన్నింటినీ మించిన పాపం కృతఘ్నుత్వమని ఈ పురాణం చెబుతున్నది.

నిత్యమూ ఉదయం లేవగానే త్రిమూర్తులు, గ్రహాలూ, సప్తర్షులూ, సప్తలోకాలూ తనకు శుభావహాలు కావాలని ప్రార్థించాలని ఈ గ్రంథం బోధిస్తున్నది.

జీవితంలో ఎన్ని విపత్తు లెదురైనా, షండుడు, మార్జారుడు, ఆఖువు, కుక్కుటుడు, పతితుడు, అపవిద్ధుడు, నగ్నుడు, చండాలుడు, అధముడు-ఇట్టివారిని ఆశ్రయించరాదని ఇందులో చెప్పడమయింది.

మనుజుడు అవశ్యం ఆచరించవలసిన సదాచారాలను 122 శ్లోకాలలో ఈ పురాణం వివరించింది.

పుత్రుడు - శిష్యుడు-వీరిరువురిలో శ్రేష్ఠు డెవరు? అన్న ప్రశ్నకు ఇందులో బ్రహ్మ పుత్రునికంటె శిష్యుడే శ్రేష్ఠుడని సమాధానం చెబుతాడు.

**పున్నామ్నో నరకాత్త్రాతి పుత్రస్తేనేహ గీయతే ।**
**శిష్టపాపహరశ్శిష్య ఇతీయం వైదికీ శ్రుతిః ॥**

'పుత్' అనే నరకం నుండి మాత్రమే రక్షించువాడు పుత్రుడు కాగా తక్కిన సకలపాపాలనుండీ కాపాడేవాడు శిష్యుడని భావం.

పాపాలను దూరం చేసుకొనే విధానాన్ని ప్రతిపాదిస్తూ దానికి ఉదాహరణంగా ఇందులో కోశకారుని వృత్తాంతం చక్కగా వర్ణించబడింది. పూర్వజన్మకృతపాపాలు తరువాతి జన్మలో స్మరణకు వస్తాయని ఈ కథ ద్వారా తెలుస్తున్నది.

**యే పఠంతి చ శృణ్వంతి తేఽపి యాన్తి పరాం గతిమ్ ।**

అన్నట్లు ఈ వామనపురాణం చదివేవారు, వినేవారు ఉత్తమగతిని పొందుతారని ఫలశ్రుతి.

## 15. కూర్మపురాణం

17000 శ్లోకాలు గల కూర్మపురాణం విష్ణువు యొక్క పృష్ఠంగా వర్ణించబడింది. పూర్వార్ధం, ఉత్తరార్ధం అని రెండు విభాగాలుగా ఉన్న ఈ పురాణంలో 53+46=99 అధ్యాయాలున్నాయి.

కూర్మరూపంలో ఉన్న విష్ణుదేవుడు మహర్షుల నుద్దేశించి చెప్పిన పురాణమిది. లక్ష్మీ ఇంద్రద్యుమ్నుల సంవాదం, విష్ణువు-మహర్షులకు జరిగిన సంవాదం, సృష్టివిధానం, వర్ణాశ్రమాలు, భృగువంశవర్ణన, యుగధర్మాలు, కాశీప్రయాగక్షేత్రాల మాహాత్మ్యం, సదాచారాలు, ద్వాదశాదిత్యుల వర్ణన-ఇత్యాదిగా గల అనేకాంశాలు ఈ పురాణంలో ఉన్నాయి.

మరీచి, భృగువు, అంగిరసుడు, పులస్త్యుడు. పులహుడు, క్రతువు, దక్షుడు, అత్రి, వసిష్ఠుడు–అనే తొమ్మిదిమంది బ్రహ్మపుత్రులుగా ఇందు పేర్కొనబడినారు. మొదటికాలంలో ప్రజలు సుఖసంతోషాలతో వుండేవారనీ, క్రమంగా రాగద్వేషాలు కారణంగా ప్రజలకు దుఃస్థితి ఏర్పడిందనీ ఈ పురాణం చెబుతున్నది.

ధర్మం ఆచరణీయమనీ, ధర్మంవల్లనే తక్కిన పురుషార్థాలు సిద్ధిస్తాయనీ ఈ పురాణం పేర్కొంటున్నది.

**ధర్మాత్సంజాయతే హ్యర్థో ధర్మాత్కామోఽభిజాయతే ।**
**ధర్మ ఏవాపవర్గాయ తస్మాద్ధర్మం సమాశ్రయేత్ ॥**

అనగా ధర్మంనుంచే అర్థ,కామ,మోక్షాలు సిద్ధిస్తాయి. కాన ధర్మాన్ని ఆశ్రయించాలి అని భావం.

శివకేశవులకు భేదం లేదని భక్తులు ఏఏరూపాలను ఆరాధిస్తారో భగవంతుడు ఆయా రూపాలతోనే వారిని అనుగ్రహిస్తాడని ఈ పురాణంలో చెప్పిన విషయం భగవద్గీతలోని

**'యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహం'** అనే వచనానికి అనుగుణంగా ఉన్నది.

స్వధర్మాన్ని త్యజించి చేసే తీర్థయాత్రలవల్ల ప్రయోజనం శూన్యమనీ, దేవాలయాదులను మిక్కిలి పరిశుభ్రంగా ఉంచాలనీ, మూత్రవిసర్జనాదులతో అపరిశుద్ధం చేయరాదనీ, అలాచేయడం పాపహేతువనీ ఈ పురాణం హెచ్చరిస్తున్నది. పుణ్యక్షేత్రాల ప్రాశస్త్యం ఇందులో చక్కగా వివరించబడింది.

వేదాన్ని విభజించేవారు వేదవ్యాసు లనబడతారు. అట్టివారు 26మంది ఉన్నారనీ పరాశరపుత్రుడైన కృష్ణద్వైపాయనుడు చివరివాడనీ ఈ పురాణం చెప్పిన విషయం గమనార్హమై ఉన్నది.

ఇంకను సమాజంలో వున్నవారి కర్తవ్యాలు, గురువులవద్ద ఉండవలసిన తీరుతెన్నులు, పాపాత్ములతో చేసే సాంగత్యంవల్ల కలిగే దోషాలు–ఇత్యాది విషయాలు మిక్కిలి ఆసక్తిదాయకంగా ఈ పురాణంలో చెప్పడమయినది.

ఇందులో వామనావతారానికి సంబంధించిన చరిత్ర చాలా చక్కగా నిరూపించబడివున్నది. భక్తిప్రధానమైన దుర్జయు డనేవాని కథవంటి కొన్ని కథలు పాఠకులకు చక్కని చైతన్యం కలిగిస్తాయి. అట్టివి ఇందులో పలుకథలు వున్నాయి.

**ఏతత్కూర్మపురాణం తు చతుర్వర్గఫలప్రదమ్ ।**
**పఠతాం శృణ్వతాం నృణాం సర్వోత్కృష్టగతిప్రదమ్ ॥**

ఈ పురాణం చదివేవారికి, వినేవారికి చతుర్వర్గ ఫలాలు సిద్ధిస్తాయి. సర్వోత్కృష్టగతి కూడా కలుగుతుంది.

## 16. మత్స్యపురాణం

మహావిష్ణువు మత్స్యరూపుడై వైవస్వతమనువు నుద్దేశించి చెప్పిన పురాణమిది. విష్ణువుయొక్క మెదడుతో దీన్ని పోల్చడమైనది. ఇందులో 14.000 వేల శ్లోకాలున్నాయి. మొత్తం అధ్యాయాల సంఖ్య 283.

ఇందలి ముఖ్య విషయాలివి–మత్స్యావతారవర్ణన, అజాండసృష్టి, సూర్యచంద్రవంశాలు, గయాక్షేత్రవర్ణన, పురూరవుని చరిత్ర, కచదేవయానుల కథ, కార్తవీర్యార్జునుని వృత్తాంతం, కలిధర్మాలు మరియు కృష్ణాష్టమి, అక్షయ తృతీయ, కల్యాణసప్తమి మున్నగు పలువ్రతాల వర్ణన, సప్తద్వీపాల వివరణ, త్రిపురాసురవృత్తాంతం, తారక వృత్తాంతం మున్నగు విషయాలే కాక రాజధర్మాలు, చతుర్విధ దండోపాయాలు, స్వప్నఫలాలు, వామన వరాహావతారాల వర్ణన ఇత్యాదిగా గల విషయాలు ప్రతిపాదితాంశాలై వున్నాయి.

పుట్టిన ప్రతివాడూ పురుషార్థసాధనకై ప్రయత్నించాలి. అలా చేయనివాని జన్మ వ్యర్థమని ఈ పురాణం నొక్కి వక్కాణిస్తున్నది.

**లబ్ధ్వా జన్మ న యః కశ్చిద్ఘటయే త్పౌరుషం నరః ।**
**జన్మ తస్య వృథా భూతమజన్మా తు విశిష్యతే ॥**

శ్రాద్ధకాలంలో పితృదేవతలకు అన్నపానాదులు సమర్పించడాన్ని గూర్చిన విశేషవివరణ యిందులో కనిపిస్తున్నది. శ్రాద్ధ కర్మలు అవశ్యాచరణీయాలని ఇక్కడ పేర్కొనడమైనది.

ఇక కాలమానం గురించి ప్రస్తావిస్తూ బ్రహ్మ, శివుడు, విష్ణువు అను త్రిమూర్తులకు చెందిన వివిధ కాలమానాల విశ్లేషణ ఇందులో చేయబడింది.

1.భృగువు 2.అత్రి 3. వసిష్ఠుడు 4. విశ్వకర్మ 5.మయుడు 6. నారదుడు 7. నగ్నజిత్తు 8. విశాలాక్షుడు 9. పురందరుడు 10. బ్రహ్మ 11. కుమారుడు 12.నందీశుడు 13.శౌనకుడు 14. గర్గుడు 15. వాసుదేవుడు 16. అనిరుద్ధుడు 17. శుకుడు 18. బృహస్పతి అనే ఈ పదునెనిమిది మంది వాస్తుశాస్త్రోపదేశకులుగా ఇందులో పేర్కొనబడినారు.

తల,లలాటం మున్నగు అవయవాల కదలికవల్ల కలిగే ఫలాన్ని కూడా భగవంతుడు ఈ పురాణంలో చెప్పియున్నాడు.

ఇక పితృశ్రాద్ధంవల్ల కలిగే ఫలాన్ని వివరించే కౌశికుడనే విద్యావంతుడు, అతని ఏడుగురు కుమారులకు చెందిన విస్తృతమైన కథ ఇందులో కనిపిస్తున్నది. భక్తిశ్రద్ధలతో ఆచరించిన పితృశ్రాద్ధం గోహత్యను కూడా పోగొడుతుందని ఈ కథలో నిరూపితమయినది. బ్రహ్మదత్తుని కథలో ఆడు చీమ, మగ చీమలమధ్య జరిగే సంభాషణ ఎంతో ఆసక్తిదాయకంగా ఉన్నది.

పతివ్రతల ప్రభావం గురించి చెప్పే ఈ క్రింది శ్లోకం వారిపట్ల గౌరవంతో వుండాలని హెచ్చరిస్తున్నది.

**పతివ్రతానాం వచనం ప్రకృష్టం తాసాం తు వాక్యం భవతీహ మిథ్యా ।**
**న జాతు లోకేషు చరాచరేషు తస్మాత్సదా తాః పరిపూజనీయాః ॥**

పతివ్రతల మాట శ్రేష్ఠమైనది. ఎప్పుడును వారి మాట మిథ్య కాదు. అందువల్ల వారు సదా పూజింపదగినవారు.

ఇక ఫలశ్రుతి –

**అస్మాత్పురాణాదపి పాదమేకం పఠేత్తు యస్సోఽపి విముక్తపాపః ।**
**నారాయణాఖ్యం పదమేతి నూనమనంగవద్దివ్యసుఖాని భుంక్తే ॥**

ఈ పురాణంలో ఒక్క పాదం చదివినా పాపనివృత్తుడై వైకుంఠం పొందగలడని, సకల దివ్యసుఖాలు అనుభవింపగలడని ఫలశ్రుతి చెబుతున్నది.

## 17. గరుడపురాణం

విష్ణువాహనమైన గరుడుడు అడిగిన ప్రశ్నలకు విష్ణుదేవుడు చెప్పిన సమాధానాలే గరుడపురాణం, ఇందులో 19వేల శ్లోకాలు గల పూర్వఖండం, ఉత్తరఖండం అనే రెండు ఖండాలున్నాయి.

పూర్వఖండంలో 229, ఉత్తరఖండంలో 35 కలిపి 264 అధ్యాయాలు గల పురాణమిది. విష్ణుదేవుని "మజ్జ" గా ఇది వర్ణించబడింది.

ఈ పురాణంలోని ఉత్తరఖండంలో ప్రేతకల్పం మిక్కిలి ప్రశస్తమైనది. మరణానంతరం జీవుని స్థితిగతులను విస్తృతంగా వివరించే ఘట్టమిది. అందువల్లనే మరణించిన వానియింట పదవ దినంలోగా ఈ పురాణాన్ని పఠించే సంప్రదాయమేర్పడింది.

గరుడపురాణం కేవలం యమలోకవృత్తాంతాన్ని మాత్రమే చెబుతుందని కొందరు భావించడం కద్దు. ఈ భావన తగదు. ఇందలి పూర్వఖండంలో ఈ క్రింద నిర్దేశించబడిన నానావిషయాలున్నాయి.

భగవదవతారాలు, సరస్వత్యుపాసన, విష్ణుదీక్ష, శివార్చనావిధి, సుదర్శనచక్ర పూజావిధానం, సూర్యార్చన, దేవతాప్రతిష్ఠ, నిత్యనైమిత్తిక కామ్యకర్మల వివరణ, పాపప్రాయశ్చిత్తవిధి, నవరత్నాల పరీక్ష, వివిధములైన వ్రతాలు, ఆయుర్వేద వైద్యవిధానాలు మున్నగు అనేక విషయాలు ఈ పురాణంలో గోచరిస్తాయి. పశువుల చికిత్సా విధానం కూడా ఇందులో నిర్దిష్టమైయున్నది.

మానవజీవితానికి అత్యవసరమైన పలు నీతులు గూడా ఈ గ్రంథంలో పేర్కొనబడివున్నాయి. యజమానులు నిష్కారణంగా సేవకులను నిందించరాదన్న ఉపదేశం ఇందులో ఉన్నది. ధనం, జ్ఞానం, రూపం, మిత్రులు–వీరి స్వభావా లెలా ఉండాలో ఇందులో సూచించబడింది.

**అర్థేన కిం కృపణహస్తగతేన పుంసాం జ్ఞానేన కిం బహుశఠాకుల సంకులేన ।**
**రూపేణ కిం గుణ పరాక్రమవర్జితేన మిత్రేణ కిం వ్యసనకాలపరాఙ్ముఖేన ॥**

కృపణుని చేతి ధనం, మొండి మనిషికి గలజ్ఞానం, గుణపరాక్రమాలులేని రూపం, వ్యసనకాలంలో కనిపించని మిత్రుడు ఉండీ ప్రయోజనం లేదని భావం. కష్టకాలంలో పరిచితవ్యక్తులు సైతం ఎలా తప్పించుకొంటారో సోదాహరణంగా ఈ పురాణం వివరించింది. గృహంలో వుంటూనే ముక్తిని సాధించే విధానం గూడా చెప్పడమయింది.

గరుడ పురాణంలో ఎన్నో కథలున్నాయి. కథలకంటె ఇందలి నీతివచనాలు మనోజ్ఞాలు. ఉదాహరణకు వేలకొలది గోవులలో దూడ తన తల్లిని గుర్తించి అనుసరించినట్లు మనమెంత దూరంగా ఉన్నా మనకర్మ మనల్ని విడువక వెంటాడుతూ వుంటుందని నీతిబోధ.

హయగ్రీవ పూజావిధి, పంచమహాయజ్ఞాలు, రాజలక్షణాలు, సేవకలక్షణాలు, రోగనివారణోపాయాలు మున్నగునవి కూడా ఈ పురాణంలో చూడవచ్చు.

**'కీర్తితం పాపశమనం పఠతాం శృణ్వతాం నృణామ్'** అనగా ఈ పురాణం చదివేవారు, వినేవారు సకల పాపాల నుండి విడుదల పొందుతారని దీనికి ఫలశ్రుతి చెప్పబడింది.

## 18. బ్రహ్మాండ పురాణం

బ్రహ్మదేవుని సృష్టిని వివరించే పురాణమిది. "బ్రహ్మాండం చాస్థి గీయతే" అన్నట్లు విష్ణువుయొక్క ఎముకలుగా ఇది పేర్కొనబడింది. ఇందులో 12,000 శ్లోకాలున్నాయి. బ్రహ్మాండపురాణం పూర్వభాగం, మధ్యభాగం, ఉత్తరభాగమని మూడు భాగాలుగా వున్నది. పూర్వభాగంలో 38, మధ్యభాగంలో 74, ఉత్తర భాగంలో 44, మొత్తం కలిపి 156 అధ్యాయాల గ్రంథమిది. రోమహర్షణుడనే ముని కురుక్షేత్రంలో ఋషులకు చెప్పిన పురాణమిది.

ప్రక్రియాపాదం, అనుషఙ్గపాదం, ఉపోద్ఘాతపాదం, ఉపసంహారపాదమని నాలుగు భాగాలుగా ఈ పురాణం విభజింపబడింది. నైమిశారణ్యవర్ణన, చతుర్ముఖబ్రహ్మ వర్ణనం, వరాహావతారం మున్నగు విషయాలు ప్రక్రియాపాదంలో కనిపిస్తాయి.

తరువాతి పాదంలో చతురాశ్రమ ధర్మాలు, మునుల జన్మవృత్తాంతం, దక్షుడు గావించిన శివనింద, సతీదేవి అగ్నిప్రవేశం, దక్షుడు, శంకరుడు పరస్పరం శపించుకొనడం, ప్రియవ్రతవర్ణన మున్నగు విషయాలతోపాటు సప్తద్వీపాల వర్ణన, సూర్యుని మహిమ, సూర్యుని అధీనంలో ఉండి ఇతర గ్రహాలు సంచరించడం, రాత్రిం బవళ్ళు, మాసాలు, ఋతువులు, సంవత్సరాలు, యుగాలు అనబడే కాలానికి సూర్యుడే మూలకారణమని నిరూపించడం, లింగజననం, యుగధర్మాలు, మొదలగు విషయాలు ఇందులో కనిపిస్తాయి.

మూడవదైన ఉపోద్ఘాతపాదంలో సప్తర్షులజననం, నృసింహావతార వర్ణన, కుమారసంభవం, పుణ్యప్రదేశవర్ణన, శ్రాద్ధాలకు ప్రశస్తమైన నదులు, తీర్థాలు, అన్నదానం, గయలో శ్రాద్ధం, మొదలగు విషయాలు నిరూపింపబడి వున్నాయి. పరశురాముని తపస్సు, జమదగ్నిని కార్తవీర్యార్జునుడు హతమార్చడం, జమదగ్నిపునర్జననం, సగర యయాతుల చరిత్ర మున్నగు విషయాలు కనిపిస్తాయి.

చివరిపాదంలో లలితాదేవి వర్ణన, కామాక్షీ మాహాత్మ్యం, దేవీదీక్ష, మొదలైన విషయాలు ఉన్నాయి. ఈ పురాణపఠనఫలం క్రింది విధంగా పేర్కొనబడింది.

**య ఇదం కీర్తయేద్వత్స! శృణోతి చ సమాహితః ।**
**స విధూయేహ పాపాని యాతి లోకమనామయమ్ ॥**

బ్రహ్మాండపురాణం పఠించేవాడు, ఏకాగ్రతతో వినేవాడు పాపరహితుడై సర్వోత్తమలోకాలను చేరుకుంటాడు అని భావం.

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**
**ప్రత్యేకాధికారి**

# శ్రీవిష్ణు మహాపురాణ సారాంశం

మైత్రేయుడు ప్రాతఃకాల నిత్యకర్మలు పూర్తిచేసిన వశిష్ఠ పౌత్రుడైన పరాశర మునీంద్రునకు ప్రణామాలుచేసి నీవల్ల వేదవేదాంగాలను, ధర్మశాస్త్రాలను, అధ్యయనం చేశానని, ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయాలను, ఈ సృష్టిలోని చరాచర జంతు జగత్తు నిర్మాణాన్ని, దేవాదుల ఆవిర్భావాన్ని, సముద్రపర్వతాదుల విషయాలను, సూర్యాదుల సంస్థానాన్ని, మన్వంతరాలను, కల్పవికల్పాలను, చతుర్యుగ వ్యవస్థను, దేవర్షుల, చక్రవర్తుల వృత్తాంతాలను, ఆశ్రమధర్మాలను వర్ణధర్మాలను మున్నగువాటిని గురించి కూడా వినాలనే కుతూహలం నాకు కలిగిందని అడిగాడు.

పరాశరుడు "మైత్రేయా!" నీవడిగిన ప్రశ్నవల్ల పురాతన విషయాన్ని స్మరింపజేశావు. పితామహుడైన వశిష్ఠునిద్వారా నాకుతెలిసిన విషయాన్ని నీకు తెలియజేస్తాను. విశ్వామిత్రుని ఆజ్ఞపై ఒక రాక్షసుడు నాతండ్రి అయిన శక్తిని భక్షించాడు. అందువల్ల నాకు అమితమైన క్రోధం సంభవించింది. రాక్షసవంశ వినాశానికై సత్రయాగం ఆరంభించాను. వందలకొలది రాక్షసులు అందు భస్మమయ్యారు. అపుడు వశిష్ఠుడు వచ్చి జీవులకు అత్యంతక్రోధం వ్యర్థమని, కోపం విసర్జించమని, శక్తిమరణం విధి సంకల్పితమని, జననమరణాలు కర్మకృతాలని, మానవులకు క్షమ ప్రధానమని వివరించాడు. అపుడు నేను ఆ యాగాన్ని ఉపసంహరించాను. ఆ సమయంలో పులస్త్య ప్రజాపతి కూడ నావద్దకు వచ్చాడు. ఆయన వశిష్ఠుని మాటపై గౌరవం ఉంచావని, నీకు వరం ఇస్తున్నానని సమస్త శాస్త్రాలసారం నీకు అవగతమవుతుందని, నీవు పురాణ సంహితకు కర్త కాగలవని కూడా వచించాడు. ప్రవృత్తి నివృత్తిమార్గాలు కూడ నీకు స్ఫురిస్తాయని, ఆయన నాకు వరం ప్రసాదించాడు. అందువల్ల నీకు సర్వోత్కృష్టమైన విష్ణుపురాణాన్ని వివరిస్తాను. సావధానంగా వినవలసింది" అని ఇలా తెలియజేశాడు.

## ప్రథమాంశం

మైత్రేయా! ఈ జగత్తుకు సృష్టిస్థితిలయకారకులైన బ్రహ్మవిష్ణు శివ స్వరూపాలకు మూలకారణం ఒకటి ఉంది. అది వికారరహితం శుద్ధస్వరూపం నిత్యం. అదే పరమాత్మ. అది సర్వదా ఏకరూపం, అదే వాసుదేవతత్త్వం. అదే సర్వజీవులందు ఆత్మరూపమై ఉంటుంది. అది నామరూపాలు. జన్మాదివికారాలు లేక అంతా ఒకటై ఉంటుంది. ఆ నిత్యమైన పరబ్రహ్మమే కాలం, పురుషుడు, అవ్యక్తం, వ్యక్తం అని వ్యవహరించబడుతూ ఉంటుంది. సృష్టిపూర్వంలో పగలు, రాత్రి, చీకటి, పృథివి, ఆకాశం ఇలా ఏవీ లేవు. సృష్టిసమయంలో పంచతన్మాత్రలు, పంచభూతాలు, శబ్దస్పర్శరూప రసగంధాదులు, పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు ఇత్యాదులు ఏర్పడ్డాయి. నారాయణాఖ్యుడైన లోకపితామహుడైన బ్రహ్మ ఉత్పన్నుడై సృష్టిని ఆరంభించాడు. బ్రహ్మసృష్టిలో సర్వభూతసృష్టి, చరాచరజంతుప్రపంచం నిర్మాణమయింది.

కాలస్వరూపుడైన భగవానుడు అనాది. అంతం కూడ ఆయనకు లేదు. విష్ణువు ఉపాధిరహిత స్వరూపంలో ప్రధానం. పురుషుడు అన్ని రూపాలతో ఉంటాడు. ప్రధాన పురుషులకు సామ్యావస్థరూపం ఉన్నప్పుడు సృష్టి జరుగదు. వాటికి పరస్పరం క్షోభ కలిగినప్పుడు మాత్రమే సృష్టిసాగుతుంది. అది కాలానుగుణంగా వర్తిస్తుంది. శబ్దం నుంచి స్పర్శ, స్పర్శనుంచి రూపం, రూపంనుంచి రసం, రసం నుంచి గంధం ఏర్పడి సృష్టికి మూలకారణాలు అవుతాయి.

మైత్రేయా! బ్రహ్మప్రమాణం వేయి చతుర్యుగాలు. బ్రహ్మ ఒకరోజు పగటిసమయం పదునల్గురు మనువుల పరిపాలనాకాలం. బ్రహ్మ మొదట మరీచి మున్నగు ప్రజాపతులను సృష్టి విస్తరణ కోసం సృజించాడు. స్వాయంభువమనువు మొదటిమనువు. ఆయనకు ఇద్దరు కుమారులు. ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనేవారు. ఆకూతి, ప్రసూతి, దేవహూతి అనే ముగ్గురు కుమార్తెలు ఆయనకు భార్యయైన శతరూపద్వారా ఉద్భవించారు. ఆకూతిని రుచికి, ప్రసూతిని దక్షునకు, దేవహూతిని కర్దమునకు ఇచ్చి వివాహం చేశాడు.

కల్పాదిలో బ్రహ్మ తనతో సమానమైన పుత్రునికోసం ధ్యానం చేయగా నీలలోహితుడు అవతరించాడు. అతడే రుద్రుడు, రుద్రగణాల సృష్టి మూలకారకుడయ్యాడు. దుర్వాసుడు శంకరాంశజుడు. ఆయనక్రోధం వల్ల దేవేంద్రుడు ఇంద్రలక్ష్మిని కోల్పోయాడు. అనంతరం విష్ణువు ఆదేశానుసారం దేవదానవులు పాలసముద్రాన్ని మథించారు. అందు మహాలక్ష్మి ఆవిర్భవించింది. ఇంద్రుడు మళ్లీ లక్ష్మీవంతుడు కావడం కోసమై పదేపదే ఆమెను స్తుతించాడు. తిరిగి స్వర్గలక్ష్మిని పొందాడు. పిమ్మట భృగుమహర్షి మున్నగువారు ఉద్భవించి సృష్టిలో పాలు పంచుకొన్నారు.

ఉత్తానపాదుని కుమారుడు ధ్రువుడు. అతడు సవతి తల్లిద్వారా అవమానం పొంది అరణ్యానికి వెళ్లి విష్ణువుకోసం తపస్సుచేసి, ఆయన అనుగ్రహం పొంది, బహుదీర్ఘకాలం పరిపాలనచేసి ధ్రువపదాన్ని అలంకరించాడు. ఆ వంశంలోనే వేనుడు జన్మించాడు. అతడు బహుదుష్టుడు. బ్రహ్మర్షులు ఆతనిని దహించి దక్షిణకరాన్ని మథించగా పృథువు జన్మించాడు. ఆయన చక్రవర్తియై ధర్మాన్ని భూమిపై నిలబెట్టాడు. ప్రచేతసులు జన్మించి మహావిష్ణువు గురించి తపస్సుచేసి ఆయన అనుగ్రహం పొందారు. వారు పెరిగిపోయిన అరణ్యాలలోని వృక్షాలను కోపాగ్నితో ధ్వంసం చేస్తూ ఉండగా చంద్రుడు వచ్చి కండుమహర్షి చరిత్రను చెప్పి వారించాడు.

మైత్రేయా! ప్రహ్లాదచరిత్రను వినిపిస్తాను. సావధానంగా ఆలకించు. ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని కుమారుడు. సనకసనందాదులద్వారా శాపానికి గురై రాక్షసునిగా జన్మించాడు హిరణ్యకశిపుడు. ఆయన కుమారుడు ప్రహ్లాదుడు విష్ణుభక్తుడు. విష్ణుభక్తి విరమించమని తండ్రి కుమారునికి ఉద్బోధించాడు. కాని ప్రహ్లాదుడు మానలేదు. హిరణ్యకశిపుడు చివరకు విష్ణువెక్కడ ఉన్నాడో చెప్పమని ప్రహ్లాదుని నిర్బంధించాడు. అపుడు విష్ణువు నృసింహావతారరూపుడై ఆవిర్భవించి హిరణ్యకశిపుని వధించాడు, ప్రహ్లాదుని రక్షించాడు.

మైత్రేయా! విష్ణువిభూతులే జగద్రక్షకాలై విస్తరించాయి. అవి నాలుగువిధాలుగా ఉంటాయి. మూర్తము, అమూర్తము, అవిక్షరం, అక్షరం అనే వ్యవస్థతో సర్వభూతాలలోను ఉంటాయి. విష్ణువు ఆయుధ భూషణరూపంలో సర్వజగత్తును నియంత్రిస్తాడు. ఈ జగత్తంతా విష్ణువిభూతి అని గ్రహించు అని పరాశరుడు వివరించాడు. ఇందు 22 అధ్యాయాలు ఉన్నాయి.

## ద్వితీయాంశం

మైత్రేయా! ఇక ప్రియవ్రతుని వంశాన్ని గురించి వివరిస్తాను విను. ప్రియవ్రతునికి ఆగ్నీధ్రుడు మున్నగు పదిమంది పుత్రులు కలరు. వారు మహాబలపరాక్రమవంతులు. వారిలో ముగ్గురు యోగపరాయణులు. మిగిలిన

ఏడుగురికి ఏడుద్వీపాలుగా అతడు భూమిని విభజించి ఇచ్చాడు. అవే జంబూ, ప్లక్ష, శాల్మలీ, కుశ, క్రౌంచ, శాక, పుష్కర ద్వీపాలు. అందు జంబూద్వీపమధ్యంలో మేరుపర్వతం ఉంది. ఆ ద్వీపాలు లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, దుగ్ధ, జల అనే ఏడు సాగరాలతో చుట్టు వారి ఉన్నాయి. ఈ ద్వీపాలలో అనేక పర్వతాలు, నదులు ఉన్నాయి. అలాగే ద్వీపాలు ఖండాలుగా, వర్షాలుగా విభజింపబడ్డాయి.

భూలోకం క్రింద పాతాళాది సప్తలోకాలు ఉన్నాయి. ఈ సమస్తలోకాలతోనిండిన బ్రహ్మాండాన్ని ఆదిశేషుడు మోస్తూ ఉంటాడు. భూమండలానికి దక్షిణంగా నరకాలు ఉన్నాయి. ఇవి అనేకాలు. పాపాత్ములు అక్కడకు చేరుకొంటారు. రౌరవం, సూకరం, రోధం, తాలం, విశసనం, మహాజ్వాలం, తప్తకుంభం, శ్వసనం, విమోహనం, రుధిరాంధం, వైతరణి మున్నగు ఆ నరకాలు పాపాత్ములకు బాధలను కలిగిస్తాయి. వారు విష్ణుసంస్మరణం వల్ల ఆ పాపాలనుంచి విముక్తులవుతారు.

భూమికిపైన లక్షయోజనాల దూరంలో సూర్యమండలం ఉంది. ఆపై సోమమండలం, నక్షత్రమండలం, బుధుడు, అంగారకుడు, శుక్రుడు, గురుడు, శని గ్రహమండలాలు ఉన్నాయి. ఆపై సప్తర్షిమండలం, ధ్రువమండలం ఉన్నాయి. స్వర్గలోకానికి పైన మహర్లోకం, జనోలోకం, తపోలోకం, సత్యలోకం ఉన్నాయి. అదే బ్రహ్మలోకం. భూలోక, భువర్లోక, స్వర్లోకాలు కృతకాలని, జనలోక, తపోలోక, సత్యలోకాలు అకృతకాలని, మహర్లోకం కృతకాకృతకమని వ్యవహారం ఉంది. ఇదంతా ఒక అండకటాహం. వెలగకాయలో బీజాలు ఉన్నట్లుగా బ్రహ్మాండ కటాహంలో లోకాలు ఉన్నాయి. దానిచుట్టూ జలాగ్నివాయ్వాకాశ, అహంకార, మహత్తత్త్వాలు ఆవరించి ఉన్నాయి.

మైత్రేయా! సర్వదా ఏకరూపంలో ప్రకాశించే సూర్యునికి ఉదయాస్తమయాలు లేవు. ఆయన కనబడే సమయం ఉదయమని, కనబడని సమయం అస్తమయమని వ్యవహారం మాత్రమే. సూర్యప్రయాణం ఉత్తరాయణ దక్షిణాయనాలలో కొంచెం హెచ్చుతగ్గులుగాను, విషువత్తులలో సమానంగాను ఉంటుంది. సూర్యుడు రథావిష్టుడై పయనిస్తూ ఉంటాడనేది కూడ వ్యవహారమే. శిశుమారచక్ర పుచ్ఛభాగమే విష్ణుపదం. ఆ తేజస్సునుంచే గంగ ఆవిర్భవించింది.

మైత్రేయా! ఇక ఋషభవంశ్యుడైన భరతుని వృత్తాంతాన్ని చెబుతాను, ఆలకించు. అతడు బహుదీర్ఘకాలం రాజ్యపరిపాలన గావించాడు. చివరి సమయంలో రాజ్యం కుమారులకు ఇచ్చివేసి మహానదీ తీరంలో తపోదీక్ష కొనసాగించాడు. ఒకనాడు ఆ నదిలో స్నానంచేస్తూ ఉండగా ఆసన్నప్రసవ అయిన ఒకహరిణి నీరుత్రాగడం కోసమై అక్కడకు వచ్చింది. అది ఒక సింహగర్జనవిని ఒక్కదుముకు దుమికి నదిలో పడి ప్రాణాలు విడిచింది. గర్భపతనమైన కారణంచే జింకపిల్ల నదీ తరంగాలపై తేలియాడుతోంది. ఆ దృశ్యాన్ని తిలకించడంతోనే భరతునకు హృదయం ద్రవించింది. కరుణావిష్టహృదయంతో దానిని పట్టుకొని సాకడం ప్రారంభించాడు. భరతునికి దానిని రక్షించడంతోనే కాలం వెళ్లిపోవసాగింది. తపోదీక్షకూడ సన్నగిల్లింది. చివరకు దానిపై ధ్యాసతోనే మరణించాడు.

మళ్లీజన్మలో అతడు ఒకలేడిగా జన్మించాడు. కాని పూర్వజన్మస్మృతి కలిగి నారాయణునిపై దృష్టినిలిపి, శుష్కపర్ణాలు భుజించి తనువుచాలించాడు. ఆపై జన్మలో భరతుడు ఒక బ్రాహ్మణకుమారునిగా జన్మించాడు. ఒక

జడునిగా జీవిస్తూ జడ భరతుడుగా పేరుకెక్కాడు. తండ్రివేదాలను నేర్పి కర్మమార్గంలో ప్రవర్తింప జేయాలనుకొన్నాడు. కాని అతడు జ్ఞానియై జీవిస్తూ కర్మమార్గానికి దూరంగా ఉండిపోయాడు. తల్లిదండ్రులు మరణించడంతో సోదరులు అవమానించసాగారు. అయినా ఉదాసీనుడుగా ఉండిపోయాడు. చివరకు ఒక వృషలాధిపతి ఇతనిని కాళికాదేవికి బలి ఈయబోయాడు. ఆమె అనుగ్రహంచే రక్షించబడ్డాడు. చివరకు సౌవీర రాజ్యాధిపతి అధిరోహించిన పల్లకిమోస్తూ ఆతడడిగిన ప్రశ్నలకు ప్రత్యుత్తరం వచించి ఆ రాజును జ్ఞానిని కావించాడు.ఆ సమయంలోనే ఋభునిదాఘుల సంవాదాన్ని వివరించాడు. చివరకు భరతుడు తాను ఆత్మజ్ఞానియై పరమాత్మైక్యం పొందాడు అని పరాశరుడు వివరించాడు. ఈ విషయమంతా 16 అధ్యాయాలలో తెలియజేయబడింది.

## తృతీయాంశం

మైత్రేయా! ఇక పదునల్గురి మనువుల గురించి తెలియజేస్తాను. స్వాయంభువు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు అనే ఆరుగురు మనువుల కాలం పూర్తి అయింది. ఇప్పుడు ఏడవదైన వైవస్వతమన్వంతరం నడుస్తోంది. ఇకపైన సావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, రౌవ్యుడు, భౌత్యుడు అనేవారు మనువులు కాగలరు.

ఇక ఇంతవరకు ఈ మన్వంతరంలో వ్యాసులుగా కీర్తిగడించిన వారి నామధేయాలు తెలియజేస్తాను. స్వయంభువు, వేదవ్యాసుడు అనే ప్రజాపతి ఉశనుడు, బృహస్పతి, సవిత, మృత్యువు, ఇంద్రుడు, వసిష్ఠుడు, సారస్వతుడు, త్రిధాముడు, త్రివృషుడు, భరద్వాజుడు, అంతరిక్షుడు, వాణీదేవి, త్రయ్యారుణుడు, ధనంజయుడు, క్రతుంజయుడు, ఋణజ్యుడు, భరద్వాజుడు, గౌతముడు, ఉత్తముడు, హర్యాత్ముడు, వాజశ్రవసుడు, తృణబిందుడు, ఋక్షుడు (వాల్మీకి), శక్తి, పరాశరుడు, జాతుకర్ణుడు, కృష్ణద్వైపాయనుడు అనేవారు 28మంది వ్యాసులు. రాబోయే 29వ ద్వాపరంలో ద్రౌణి వ్యాసుడు కాగలడు.

వ్యాసుడు ఋగ్వేదాన్ని పైలునికి, వైశంపాయనునికి యజుర్వేదం, జైమినికి సామవేదం, సుమంతునికి అథర్వవేదం సంక్రమింపజేశాడు. రోమహర్షునకు ఇతిహాసపురాణాలను అనుగ్రహించాడు. ఈ విధంగా వ్యాసునిద్వారా వేదవిభజన గావించబడింది. ఆపైన శిష్యప్రశిష్యులద్వారా ఋగ్వేద, శుక్లయజుర్వేద, కృష్ణయజుర్వేద, సామవేద శాఖలు అనేక భాగాలుగా విభజింపబడి వ్యాప్తి అయ్యాయి. వ్యాసుడు పురాణప్రవర్తకుడై ప్రతియుగంలోను పురాణవాఙ్మయాన్ని వ్యాపింపజేశాడు.

బ్రాహ్మం, పాద్మం, వైష్ణవం, శైవం, భాగవతం, నారదీయం, మార్కండేయం, ఆగ్నేయం, భవిష్యం, బ్రహ్మవైవర్తం, లైంగం, వారాహం, స్కాందం, వామనం, కౌర్మం, మాత్స్యం, గారుడం, బ్రహ్మాండం అని 18 మహాపురాణాలు. మైత్రేయా! ఇవికాక అనేక మునులచే ఉపపురాణాలు కూడ చెప్పబడ్డాయి. అంతేగాక యమగీతలు కూడ వ్యాప్తిలోకి వచ్చాయి. బ్రాహ్మణక్షత్రియాదులు అవలంబించే ధర్మాలు, ఆశ్రమధర్మాలు శాస్త్రోక్తంగా ఆచరింపబడ్డాయి. జాతకర్మాదులు, శ్రాద్ధకర్మాదులు, శ్రాద్ధకర్మలలో ఎవడు పాత్రుడో, ఎవడు అపాత్రుడో తెలుసుకొని, భోక్తలకు ఉండవలసిన లక్షణాలు తెలుసుకొని ప్రజలు శ్రద్ధతో ఆ విధులు ఆచరించేవారు. కొందరు యోగిజనులను కూడ ఈ కర్మలలో వినియోగించేవారు. శ్రాద్ధకర్మలో ఒక్కొక్కప్పుడు మధుమాంసాది పదార్థాలను ఉపయోగించేవారు.

ఎట్టి పరిస్థితులలోను పాషండులతో సహవాసం చేయరాదు. దానివల్ల శతధన్వమహారాజు ఎన్నోజన్మలు ధరించి చివరకు కృతకృత్యుడయ్యాడు" అని పరాశరుడు వివరించాడు. ఈ అంశంలో 18 అధ్యాయాలు ఉన్నాయి.

**చతుర్థాంశం**

మైత్రేయా! ఇక నీకు మనువంశవిస్తారాన్ని తెలియజేస్తాను. దక్షుని కుమార్తె అదితి. ఆ అదితి కుమారుడు సూర్యుడు. సూర్యపుత్రుడే మనువు. మనువుకు ఇక్ష్వాకువు మున్నగు పదిమంది కుమారులు. మనువు ముందు పుత్రోత్పత్తికై మిత్రావరణులను ఆశ్రయించి యాగం చేశాడు. కాని మనువుభార్య పుత్రిక కావాలని సంకల్పించింది. అందువల్ల "ఇల" అనే కన్య జన్మించింది. కాని మిత్రావరుణులకృపవల్ల ఇల "సుద్యుమ్నుడు" గా మారింది. కాని ఒకనాడు పార్వతీ పరమేశ్వరుల విహారభూమిలో ప్రవేశించి సుద్యుమ్నుడు మళ్లీ "ఇల"గా మారాడు. ఆ సమయంలో చంద్రుని కుమారుడైన బుధునికి భార్యయై పురూరవుడనే చక్రవర్తికి జన్మకారకుడయ్యాడు.

ఆ వంశంలోనే శర్యాతి మహారాజు ఉండేవాడు. ఆయన కుమార్తె సుకన్య. ఆమె చ్యవన మహర్షిని వివాహమాడింది. రేవతుని కుమార్తె రేవతి. ఆమెకు తగిన భర్త కోసమై రేవతుడు బ్రహ్మలోకం వెళ్లాడు. అందువల్ల బహుకాలం గడిచిపోయింది. బ్రహ్మ ఆదేశంతో రేవతిని బలరామునికిచ్చి వివాహం చేశాడు రేవతుడు. మాంధాత చక్రవర్తికి ఏబదిమంది కుమార్తెలు. వారు సౌభరి మహర్షిని పెండ్లియాడారు.

సగరచక్రవర్తి అశ్వమేధయజ్ఞం చేశాడు. యాగాశ్వాన్ని ఇంద్రుడు అపహరించగా అంశుమంతుడు కపిలుని ప్రసన్నుని గావించుకొని ఆ గుఱ్ఱాన్ని తీసుకొని వచ్చి సగరునిచే యజ్ఞం పూర్తిచేయించాడు. ఆ తరువాత భగీరథుడు గంగను పాతాళానికి కొనివచ్చి కపిలునికోపానికి భస్మమయిన సగరపుత్రులను తడిపి, వారికి ఊర్ధ్వలోకగతులు కల్గించాడు. నిమివంశంలో జనకుని కుమార్తెగా సీతాదేవి అవతరించింది. సూర్యవంశంలో దశరథుని కుమారులుగా రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు జన్మించారు. శ్రీరాముడు విశ్వామిత్రయాగ సంరక్షణార్థమై వెళ్లి మారీచుని పారద్రోలి, సుబాహువు మున్నగువారిని వధించి, జనకుని గృహంలో ఉన్న మాహేశ్వరచాపాన్ని విరిచి సీతను వివాహమాడాడు. పరశురాముని నిగ్రహించాడు. పిమ్మట దండకారణ్యాలకేగి విరాధ, ఖర, దూషణ, కబంధ, వాలి ప్రముఖులను వధించాడు. అటు పిమ్మట లంకకేగి సీతను అపహరించిన రావణుని సమస్తరాక్షససహితంగా వధించి, తిరిగి అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడై అనేక సహస్రవత్సరాలు పరిపాలించి రాజ్యాన్ని పుత్రులకు అప్పగించి అవతారపరిసమాప్తి కావించాడు.

మైత్రేయా! చంద్రవంశం కూడ శాఖోపశాఖలుగా విస్తరిల్లింది. బుధునికుమారుడు పురూరవుడు ఊర్వశిని వివాహమాడాడు. ఆమెపై మోహంతో ఎంతో పరితపించాడు. ఆతనికి ఆయువు, ధీమంతుడు, అమావసువు, విశ్వావసువు, శతాయువు, శ్రుతాయువు అని ఆరుగురు కుమారులు. ఆ వంశంలోనే గాధిపుత్రునిగా విశ్వామిత్రుడు జన్మించాడు. ఆ వంశంలో పుట్టిన రజి అనే రాజు దైత్యులతో యుద్ధం చేశాడు.

ఆ వంశంలో జన్మించిన యయాతి మహారాజు శుక్రాచార్యుల కుమార్తె అయిన దేవయానిని, వృషపర్వుని తనయయైన శర్మిష్ఠను వివాహమాడి అయిదుగురికి జన్మనిచ్చాడు. ఈ చంద్రవంశంలోనే సహస్రబాహువైన

కార్తవీర్యార్జునుడు జన్మించి రావణుని గర్వాన్ని అణచాడు. యదువంశంలో ఎందరో మహావీరులు ఉద్భవించారు. సత్రాజిత్తు సూర్యుని ఉపాసించి స్యమంతకమణిని సంపాదించాడు. ఆ మణి సత్రాజిత్తు, ప్రసేనుడు, సింహం మున్నగువారివధకు కారణమయింది. జాంబవంతునితో యుద్ధం కూడ ఆ మణి కోసమై కృష్ణుడు చేశాడు. ఎందరో ఎన్నోనిందలు దానివల్లనే పొందారు. శతధన్వుడు కూడ సంహరించబడ్డాడు. చివరకు ఆ మణి అక్రూరుని ద్వారా బయటపడింది.

మైత్రేయా! హిరణ్యకశిపురావణులుగా అవతరించిన విష్ణుభటుడే శిశుపాలునిగా జన్మించి కృష్ణునిచే వధించబడ్డాడు. యయాతి చిన్నకుమారుడైన పురువు వల్లనే పౌరవవంశం విస్తరిల్లింది. కురువంశం బాహ్లీకసోమదత్త శంతను ధృతరాష్ట్ర పాండురాజులద్వారా విస్తరించబడింది. మైత్రేయా! జనమేజయ, శ్రుతసేన, ఉగ్రసేన, భీమసేనాదులు భవిష్యత్తులో ఈ దేశాన్ని పరిపాలిస్తారు. ఇక్ష్వాకువంశం సుమిత్రుని పాలనతో అంతమవుతుంది. మగధవంశరాజులు ఒకవేయి సంవత్సరాలు ఈ దేశాన్ని పాలిస్తారు.

శ్రీకృష్ణుడు ఈ భూమిని విడిచి ఏ రోజు వైకుంఠంచేరాడో ఆ రోజే కలియుగం ప్రవేశించింది. పురువంశజుడైన దేవాపి, ఇక్ష్వాకువంశజుడైన మరువు మహాయోగబలంతో ఇప్పుడు కలాపగ్రామంలో ఉన్నారు. కలియుగాంతమైన తరువాత వారు పరిపాలనలోనికి వచ్చి కృతయుగధర్మాలను సంస్థాపిస్తారు.

కలియుగంలో యుగధర్మాలు, వర్ణధర్మాలు, ఆశ్రమధర్మాలు వ్యత్యస్తమైపోతాయి. “మైత్రేయా! కలియుగంలో ధర్మం అస్తవ్యస్తం అని గ్రహించు” అని పరాశరుడు వచించాడు. ఈ విషయమంతా 24 అధ్యాయాలలో వివరించబడింది.

## పంచమాంశం

మైత్రేయా! ఇకపై శ్రీకృష్ణచరిత్ర వినిపిస్తాను. సావధానంగా ఆలకించు. దేవకీవసుదేవుల వివాహం పూర్తి అయిన తరువాత కంసుడు సోదరిని అత్తవారింటికి సాగనంపుతున్నాడు. మార్గమధ్యంలో ఆకాశవాణి ఈమె అష్టమగర్భం నిన్ను వధిస్తుందని కంసుని హెచ్చరించింది. వెంటనే కంసుడు ఖడ్గపాణియై ఆమెను సంహరించబోయాడు. వసుదేవుడు దేవకికి పుట్టబోయే బిడ్డలను కంసునికి సమర్పిస్తానని ఆ ప్రయత్నాన్ని వారించాడు.

ఈ సమయంలోనే భూదేవి ప్రార్థనను విని బ్రహ్మాదులు విష్ణుసన్నిధికి వెళ్లి భూభారం తగ్గించమని ప్రార్థించారు. విష్ణువు తన సితకృష్ణకేశాలను భూమిపై జారవిడిచాడు. సితకేశం బలరాముడయ్యాడు. కృష్ణకేశం కృష్ణుడయ్యాడు. దేవతలు, దేవకీదేవి కూడ శ్రీకృష్ణుని అవతరించమని సంప్రార్థించారు. దేవకికి ముందుజన్మించిన ఆరుగురుపిల్లలను కంసుడు వధించాడు. ఏడవగర్భం రాగానే విష్ణువు తనయోగమాయను స్మరించాడు. ఆమె దేవకీ గర్భస్థపిండాన్ని రోహిణీ గర్భంలో ప్రవేశపెట్టగా రౌహిణేయుడు జన్మించాడు. కృష్ణుడు దేవకీగర్భంలో అష్టమగర్భంగా అవతరించాడు. అదే సమయంలో నందగోకులంలో యశోదాదేవి యోగమాయను ప్రసవించింది. ఆమె వంచన ద్వారా వసుదేవుడు కృష్ణుని యశోద సమీపంలో పరుండబెట్టి మహామాయను దేవకి సమీపానికి కొనివచ్చాడు. ఆమెయే అష్టమగర్భమని ఎంచి కంసుడు వధించబోగా ఆమె దివ్యమాలావిభూషితురాలై ఆకాశమార్గంలో అంతర్ధానమయింది.

మైత్రేయా! శ్రీకృష్ణుడు బాల్యం నుంచే దుష్టసంహారం ప్రారంభించాడు. ముందు పూతనను వధించాడు. అనంతరం గర్గాచార్యులు వచ్చి రహస్యంగా బలరామకృష్ణులకు నామకరణోత్సవం చేశాడు. వారిద్దరు తమ బాల్యలీలలతో గోకులాన్ని ఆనందసాగరంలో ఓలలాడించారు. బృందావనం చేరిన తరువాత కృష్ణుడు కాళింది మడుగులోనికి ఉరికి కాళియమర్దనం కావించాడు. బలరామకృష్ణులు పిమ్మట ధేనుకాసుర ప్రలంబాసురవధ చేశారు. శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతాన్ని పూజించమని ఇంద్రయాగం ఆపించాడు. దేవేంద్రుడు కోపించి వర్షం కురియించగా, శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతాన్ని తనచేతితో ఎత్తి గోగోపాలక గణాన్ని రక్షించాడు.

ఇంద్రుడు సిగ్గుపడి కృష్ణుని మన్నించమని వేడుకొని గోవిందపట్టాభిషేకం కావించాడు. కృష్ణుడు శరద్రాత్రిలో రాసలీలావిహారం కావించి జగత్తునంతను ఆశ్చర్యంలో ముంచెత్తాడు. అటుపిమ్మట వృషభాసురుని, కేశిని కృష్ణుడు వధించాడు. బలరామకృష్ణులను మధురకు తీసికొనిరమ్మని కంసుడు అక్రూరుని పంపించాడు. అక్రూరుడు బృందావనానికి వచ్చి బలరామకృష్ణులను వీక్షించి ఆనందపరవశుడయ్యాడు. మార్గమధ్యంలో భక్తివినమ్రచిత్తంతో శ్రీకృష్ణభగవానుని ధ్యానం చేశాడు.

బలరామకృష్ణులు మధురకు పయనమయ్యారు. దారిలో అక్రూరుడు యమునలో స్నానం చేసి అందు బలరామకృష్ణుల దివ్యదర్శనం చేశాడు. కృష్ణుడు మధురకేగి రజకుని వధించాడు. మాలాకారుని అనుగ్రహించాడు. కుబ్జను సురూపగా చేశాడు.

అనంతరం కృష్ణుడు ధనుర్భంజనం కావించాడు. కువలయాపీడం అనే ఏనుగును సంహరించాడు. బలరాముడు ముష్టికుని, కృష్ణుడు చాణూరుడు అనే మల్లుని వధించారు. పిమ్మట కంసుని కృష్ణుడు వధించి ఉగ్రసేనునికి పట్టాభిషేకం చేశాడు. అటుపిమ్మట బలరామకృష్ణులు సాందీపని సన్నిధికేగి సమస్తవిద్యలు అభ్యసించారు. గురుపుత్రుని బ్రతికించి ఇచ్చి గురుదక్షిణ చెల్లించారు. కంసుని మామయైన జరాసంధుడు అనేక పర్యాయాలు 23 అక్షౌహిణులసైన్యంతో వచ్చి బలరామకృష్ణులతో యుద్ధం చేసి పరాజయం పాలయ్యాడు. అప్పుడు కృష్ణుడు ద్వారకా నగర నిర్మాణాన్ని కావించి పశ్చిమసముద్రతీరంలో యుద్ధభీతులైనవారికి ఆశ్రయం ఏర్పాటు చేశాడు. ముచుకుందుని కృష్ణుడు అనుగ్రహించి ఆయనకు ముక్తిమార్గాన్ని చూపాడు.

అనంతరం కృష్ణుడు రుక్మిణిని వివాహమాడాడు. వారికి ప్రద్యుమ్నుడు జన్మించాడు. అతడు శంబరాసురుని వధించాడు. బలరాముడు ద్యూతమాడుతూ రుక్మిణి సోదరుడైన రుక్మిని వధించాడు. కృష్ణుడు నరకాసురుని సంహరించి ఆతని చెరలోనున్న రాజకన్యకలను విడిపించాడు. పిమ్మట దేవలోకం వెళ్లి ఇంద్రాదులను ఓడించి పారిజాతాన్ని భూమికి కొనివచ్చాడు. ఉషానిరుద్ధుల వివాహసమయంలో కృష్ణుడు బాణాసురునితో యుద్ధం కావించి ఆతని హస్తాలను నరికి వేశాడు. అనంతరం పౌండ్రక వాసుదేవుని వధించాడు. జాంబవతీ పుత్రుడైన సాంబుడు స్వయంవరంలో దుర్యోధనుని పుత్రికను సంగ్రహించాడు. ఆ సమయంలో బలరామాదులతో దుర్యోధనాదులకు యుద్ధం సంభవించింది. అనంతరం బలరాముడు ద్వివిదుని వధించాడు. మునిశాపంతో యాదవవంశమంతా నాశనమైపోయింది. భగవంతుడైన కృష్ణుడు స్వధామానికి చేరుకొన్నాడు. పాండవులు పరీక్షిత్తుకు రాజ్యాభిషేకంచేసి మహాప్రస్థానం చేశారు. మైత్రేయా! ఇది శ్రీకృష్ణభగవానునిచరిత్ర అని పరాశరుడు వివరించాడు. ఇదంతా 38 అధ్యాయాలలో వివరించబడింది.

## షష్ఠాంశం

మైత్రేయా! ఇక కలిధర్మాలను వివరిస్తాను. ఈ యుగంలో వర్ణాశ్రమధర్మాలు సరిగా సాగవు. వేదవిహిత కర్మలు కూడ విధిప్రోక్తంగా పాటింపబడవు. గురుశిష్యసంబంధాలు నశిస్తాయి. మానవులకు విత్తంపై ఆశ ఎక్కువ. స్త్రీలకు కేశాలవల్లనే రూపసంపద. స్త్రీలు ధనంలేని భర్తలను తిరస్కరిస్తారు. అనావృష్టులు పెరుగుతాయి. ఐదు, ఆరు సంవత్సరాలకే స్త్రీలు గర్భవతులవుతారు. పండ్రెండు సంవత్సరాలకే మానవులకు జుట్టు నెరిసిపోతుంది. అల్పకాలమే మానవులు జీవిస్తారు.

జీవులు ఈ యుగంలో భగవన్నామసంకీర్తనం ద్వారా ముక్తిని పొందుతారు. ప్రలయాలు మూడురకాలుగా ఉంటాయి. అవే నైమిత్తిక ప్రలయం, ప్రాకృత ప్రలయం, ఆత్యంతిక ప్రలయం. భగవంతుని పారమార్థిక స్వరూపంపై మానవులు దృష్టిపెడతారు. ఖాండిక్యకేశిధ్వజులద్వారా కర్మయోగ, జ్ఞానయోగ వైశిష్ట్యాలు తెలియజేయబడతాయి. ఇక బ్రహ్మయోగం గొప్పతనాన్ని ఆస్తికులు గుర్తిస్తారు అని పరాశరుడు తెలియజేశాడు. విష్ణుపురాణం యొక్క ఉపసంహారం ఈ విధంగా ఈ అంశంలో 8 అధ్యాయాలలో తెలియజేయబడింది.

# శ్రీవిష్ణుపురాణమ్

ప్రథమాంశః - మొదటి అంశం

ప్రథమోఽధ్యాయః - ఒకటవ అధ్యాయం

**మంగళాచరణం, పరాశరముద్దిశ్య మైత్రేయస్య ప్రశ్నః, పరాశరస్య ఉత్తర దానం, పురాణసంహితావతారశ్చ**

మంగళాచరణం, పరాశరుని ఉద్దేశించి మైత్రేయుని ప్రశ్న, పరాశరుని ఉత్తరదానం, పురాణ సంహితావతారం

**ఓం నమో భగవతే వాసుదేవాయ**

ఓంకార స్వరూపుడగు భగవంతుడైన వాసుదేవునకు నమస్కారం

**జితం తే పుండరీకాక్ష! నమస్తే విశ్వభావన !।**
**నమస్తేఽస్తు హృషీకేశ! మహాపురుష! పూర్వజ! ॥ 1 ॥**

ఎఱ్ఱతామరపూలవంటి కన్నులుగలవాడా! నీకు జయమగుగాక! విశ్వమే స్థానమై ఉండువాడా! (విశ్వమును పుట్టించువాడా!) నీకు నమస్కారం. ఓ హృషీకేశా! ఓ మహాపురుషా! కనబడే ప్రపంచంకన్న పూర్వంనుండి ఉండువాడా! నీకు ప్రణామం అగుగాక!

**సదక్షర బ్రహ్మ య ఈశ్వరః పుమాన్ గుణోర్మిసృష్టిస్థితికాలసంలయః।**
**ప్రధానబుద్ధ్యాదిజగత్ప్రపంచసూః స నోఽస్తు విష్ణుర్మతిభూతిముక్తిదః ॥ 2 ॥**

సత్పదార్థం, అక్షరం, బ్రహ్మ, ఈశ్వరుడు, పురుషుడు, గుణప్రపూర్ణుడు, సృష్టిస్థితిలయకారుడు, ప్రధానం, బుద్ధి మున్నగు జగత్తుకు కారణమై ఉన్న భగవానుడు మాకు బుద్ధిభుక్తిముక్తిప్రదుడై ఉండుగాక!

**ప్రణమ్య విష్ణుం విశ్వేశం బ్రహ్మాదీన్ ప్రణిపత్య చ।**
**గురుం ప్రణమ్య వక్ష్యామి పురాణం వేదసమ్మితమ్ ॥ 3 ॥**

విశ్వేశ్వరుడైన విష్ణువుకు నమస్కరించి, బ్రహ్మాదులకు శిరసువంచి అభివాదం చేసి, గురువునకు ప్రణామం ఆచరించి వేదసమానమైన విష్ణుపురాణాన్ని చెబుతున్నాను.

**శ్రీమైత్రేయ ఉవాచ :-** శ్రీమైత్రేయుడు పలికాడు.

**ఇతిహాసపురాణజ్ఞం వేదవేదాంగపారగమ్।**
**ధర్మశాస్త్రాదితత్త్వజ్ఞం వశిష్ఠతనయాత్మజమ్ ॥ 4 ॥**

**పరాశరం మునివరం కృతపూర్వాహ్ణికక్రియమ్।**
**మైత్రేయః పరిపప్రచ్ఛ ప్రణిపత్యాభివాద్య చ ॥ 5 ॥**

ఇతిహాసాలను, పురాణాలను బాగా తెలిసిన వానిని, వేదాలలోను వేదాంగాలలోను పారంగతుడైన వానిని, ధర్మశాస్త్రాలు మున్నగువాటి తత్త్వాన్ని పూర్తిగా అవగతం చేసుకొన్నవానిని, వశిష్ఠుని కుమారుడగు శక్తికి నందనుడైన మునిశ్రేష్ఠుడగు పరాశరునికి మైత్రేయుడు ఉదయమే లేచి పూర్వాహ్ణంలో చేయవలసిన నిత్యకర్మలను ఆచరించి సాష్టాంగనమస్కారం చేసి, అభివాదనం కావించి ఇలా అడిగాడు.

వి॥ అభివాదనం – గోత్రపూర్వక ప్రవరంచెప్పి చేతులు జోడించుట.

**త్వత్తో హి వేదాధ్యయనమధీతమఖిలం గురో ।**
**ధర్మశాస్త్రాణి సర్వాణి వేదాఙ్గాని యథాక్రమమ్ ॥ 6 ॥**

ఓ గురువర్యా! నీవల్ల సమస్తవేదాలను అధ్యయనం చేశాను. సకలధర్మశాస్త్రాలను పఠించాను. క్రమపద్ధతిలో షడంగాలను చదివాను.

వి ॥ ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం అనేవి వేదాలు నాలుగు. యాజ్ఞవల్క్యస్మృతి, మనుస్మృతి, శంఖస్మృతి ఇత్యాది స్మృతులు, ధర్మశాస్త్రాలు. శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం – వేదాంగాలు (శీక్షావ్యాకరణం ఛందః నిరుక్తం జ్యోతిషం తథా కల్పశ్చేతి షడంగాని).

**త్వత్ప్రసాదాన్మునిశ్రేష్ఠ! మామన్యే నాకృతశ్రమమ్ ।**
**వక్ష్యంతి సర్వశాస్త్రేషు ప్రాయశో యేఽపి తద్విదః ॥ 7 ॥**

ఓ మునిశ్రేష్ఠుడా! నీ అనుగ్రహం వలన సమస్తశాస్త్రములయందు శ్రమించి అధ్యయనము చేసిన నన్ను పండితులు ప్రశంసిస్తున్నారు.

**సోఽహ మిచ్ఛామి ధర్మజ్ఞ! శ్రోతుం త్వత్తో యథా జగత్ ।**
**బభూవ భూయశ్చ యథా మహాభాగ! భవిష్యతి ॥ 8 ॥**

ధర్మాలన్నీ తెలిసిన పరాశరమహర్షీ! అట్టి ప్రశంసలు అందుకొన్న నేను నీ ద్వారా ఈ విషయాలను వినగోరుతున్నాను. ఈ జగత్తు ఇదివరకు ఏవిధంగా ఉంది? ఓ మహాభాగా! ఈ జగత్తు మరల ఏమవుతుంది?

**యన్మయం చ జగద్బ్రహ్మన్! యతశ్చైతచ్చరాచరమ్ ।**
**లీనమాసీద్ యథా యత్ర లయమేష్యతి యత్ర చ ॥ 9 ॥**

ఓ బ్రహ్మణ్యుడా! ఈ జగత్తు దేని ప్రధాన వికారము? ఈ చరాచరప్రపంచమంతా దేనినుండి ఉద్భవిస్తుంది? దేనిలో లీనమై ఉంటుంది? చివరకు దేనిలో లయమయిపోతుంది?

**యత్ప్రమాణాని భూతాని దేవాదీనాం చ సంభవమ్ ।**
**సముద్రపర్వతానాం చ సంస్థానం చ తథా భువః ॥ 10 ॥**

ప్రకాశంగా కనబడి చెప్పబడే ఈ మహాభూతాల ఆవిర్భావం ఎట్లు? దేవతల పుట్టుక, సముద్రాల, పర్వతాల అస్తిత్వం, భూమి ఉనికి ఎట్లు?

**సూర్యాదీనాం చ సంస్థానం ప్రమాణం మునిసత్తమ! ।**
**దేవాదీనాం తథా వంశాన్ మనూన్ మన్వంతరాణి చ ॥ 11 ॥**

మునీశ్వరా! సూర్యాది (గ్రహాల) స్థితులు, పరిమాణాలు ఎటువంటివి? దేవతల వంశాలు, మనువులు, మన్వంతరాలు ఏవిధంగా ఉంటాయి?

**కల్పాన్ కల్పవికల్పాంశ్చ చతుర్యుగవికల్పితాన్ ।**
**కల్పాంతస్య స్వరూపం చ యుగధర్మాంశ్చ కృత్స్నశః ॥ 12 ॥**

నాలుగు యుగాలద్వారా విభక్తమైన మహాయుగకాలం, కల్పాలు, కల్పవిభాగాలు, కల్పాంతం తీరు ఏవిధంగా ఉంటుంది? ఆ యా యుగాల ధర్మాలు ఎటువంటివి?

**దేవర్షి పార్థివానాం చ చరితం యన్మహామునే! ।**
**వేదశాఖాప్రణయనం యథావద్వ్యాసకర్తృకమ్ ॥ 13 ॥**

ఓ మహామునీ! దేవర్షుల, చక్రవర్తుల చరిత్రలు ఎటువంటివి? ఏవిధంగా వ్యాసమహర్షి కర్తృత్వంతో వేదశాఖలు ప్రకటించబడ్డాయి?

**ధర్మాంశ్చ బ్రాహ్మణాదీనాం తథా చాఽఽశ్రమవాసినామ్ ।**
**శ్రోతుమిచ్ఛామ్యహం సర్వం త్వత్తో వాశిష్ఠనందన! ॥ 14 ॥**

వశిష్ఠపుత్రుడైన శక్తియొక్క కుమారుడవయిన పరాశరా! బ్రాహ్మణాదులు ఆచరించే ధర్మాలను, నాలుగు ఆశ్రమాలలో నివసించేవారి ప్రవృత్తులను నీనుండి సమస్తం వినాలని కోరుకొంటున్నాను.

**బ్రహ్మన్! ప్రసాదప్రవణం కురుష్వ మయి మానసమ్ ।**
**యేనాహమేతజ్జానీయాం త్వత్ప్రసాదాన్మహామునే! ॥ 15 ॥**

ఓ బ్రహ్మణ్యుడా! మహామునీ! నేను ఏవిధంగా నీ అనుగ్రహంద్వారా ఈ సర్వస్వం తెలుసుకోగలనో, ఆ విధంగా నాపైన నీ మనస్సును ప్రసాదోన్ముఖం (అనుగ్రహాభిముఖం) కావించు.

**శ్రీపరాశర ఉవాచ:–** పరాశరుడు పలికాడు.

**సాధు మైత్రేయ! ధర్మజ్ఞ! స్మారితోఽస్మి పురాతనమ్ ।**
**పితుః పితా మే భగవాన్ వశిష్ఠో యదువాచ హ ॥ 16 ॥**

ధర్మాలు బాగుగా తెలిసిన మైత్రేయా! మంచిది. చక్కని ప్రశ్న వేశావు. దీనివల్ల నా పితామహుడైన భగవానుడైన వశిష్ఠుడు ఇదివరకు చెప్పినది జ్ఞాపకానికి వచ్చింది.

**విశ్వామిత్రప్రయుక్తేన రక్షసా భక్షితో మయా (పురా) ।**
**శ్రుతస్తాతస్తతః క్రోధో మైత్రేయాఽఽసీన్మమాతులః ॥ 17 ॥**

మైత్రేయా! వశిష్ఠసంతాననాశనంకొరకై విశ్వామిత్రునిచే సృష్టించబడి ప్రయోగింపబడ్డ రాక్షసునిచే నా తండ్రి భక్షింపబడ్డాడన్న విషయం వినేసరికి నాకు పట్టరానంత కోపం వచ్చింది.

**తతోఽహం రక్షసాం సత్రం వినాశాయ సమారభమ్ ।**
**భస్మీకృతాశ్చ శతశస్తస్మిన్ సత్రే నిశాచరాః ॥ 18 ॥**

అప్పుడు నేను రాక్షసుల వినాశం కొరకై ఎక్కువకాలం సాగే యజ్ఞం ప్రారంభించాను. ఆ యజ్ఞంలో వందలకొలది నిశాచరులు బూడిదైపోయారు.

**తతస్సంక్షీయమాణేషు తేషు రక్షఃస్వశేషతః ।**
**మామువాచ మహాభాగో వశిష్ఠో మత్పితామహః ॥ 19 ॥**

ఆ విధంగా సమస్తరాక్షసులు అశేషంగా నశిస్తూ ఉండగా, మహాభాగుడైన నా పితామహుడైన వశిష్ఠుడు అప్పుడు నాతో ఇలా అన్నాడు–

**అలమత్యన్తకోపేన తాత మన్యుమిమం జహి ।**
**రాక్షసా నాపరాధ్యన్తే పితుస్తే విహితం తథా ॥ 20 ॥**

నాయనా! అత్యంతమైన క్రోధం చాలు. ఈ కోపాన్ని ఇంతటితో విడిచిపెట్టు. రాక్షసులు నిరపరాధులు సుమా! విశ్వామిత్రుని ఆభిచారికహోమంవల్ల జన్మించిన రాక్షసునిచే నీ తండ్రికి వచ్చిన మరణం కాలంచే స్వభావసిద్ధంగా వచ్చినటువంటిది.

**మూఢానామేవ భవతి క్రోధో జ్ఞానవతాం కుతః ।**
**హన్యతే తాత కః కేన యతః స్వకృతభుక్ పుమాన్ ॥ 21 ॥**

నాయనా! మూఢులకే క్రోధం ఉంటుంది. జ్ఞానవంతులకు క్రోధం ఉండకూడనిది సుమా! ఎవడు ఎవనిచే చంపబడతాడు? ఎందువల్లనంటే ప్రాణి ఈ లోకంలో తాను చేసుకొన్నది తాను అనుభవిస్తాడు.

**సంచితస్యాపి మహతా వత్స! క్లేశేన మానవైః ।**
**యశసస్తపసశ్చైవ క్రోధో నాశకరః పరః ॥ 22 ॥**

వత్సా! మానవులచే కష్టపడి సంపాదించబడ్డ యశస్సుకు, తపస్సుకు మిక్కిలి నాశనం కలుగజేసేది అమితమైన క్రోధం మాత్రమే.

**స్వర్గాపవర్గ వ్యాసేధ కారణం పరమర్షయః ।**
**వర్జయన్తి సదా క్రోధం తాత! మా తద్వశో భవ ॥ 23 ॥**

నాయనా! స్వర్గానికి అపవర్గానికి (కర్మజ్ఞానాలకు) అడ్డంకి అయిన ఈ క్రోధాన్ని గొప్పవారైన ఋషులందరూ పూర్తిగా విడిచి వేస్తారు. నీవు ఈ క్రోధానికి లొంగిపోవద్దు.

**అలం నిశాచరైర్దగ్ధైర్దీనైరనపకారిభిః ।**
**సత్త్రం తే విరమ త్వేతత్ క్షమాసారా హి సాధవః ॥ 24 ॥**

నిరపరాధులైన, దీనులైన, ఈ నిశాచరులను దగ్ధం చేసింది చాలు. ఈ యాగాన్ని ఇంతటితో విరమించు. సత్పురుషులు ఓరిమినే బలంగా కలిగినవారు కదా!

**ఏవం తాతేన తేనాహమనునీతో మహాత్మనా ।**
**ఉపసంహృతవాన్ సత్రం సద్యస్తద్వాక్యగౌరవాత్ ॥ 25 ॥**

ఈ విధంగా ఆ మహాత్ముడైన వశిష్ఠుని ద్వారా నేను కోపం వీడి అనునయం పొందినవాడనయ్యాను. ఆయన మాటమీది గౌరవంతో నేను వెనువెంటనే రాక్షసలోకనాశహేతువైన సత్త్రయాగాన్ని విరమించాను.

**తతః ప్రీతః స భగవాన్ వశిష్ఠో మునిసత్తమః ।**
**సంప్రాప్తశ్చ తదా తత్ర పులస్త్యో బ్రహ్మణః సుతః ॥ 26 ॥**

అందువల్ల ఆ మునిశ్రేష్ఠుడు, భగవంతుడైన వశిష్ఠుడు సంతోషించాడు. ఆ సమయంలో అక్కడికి బ్రహ్మమానసపుత్త్రుడైన పులస్త్యుడు విచ్చేశాడు.

**పితామహేన దత్తార్ఘ్యః కృతాసనపరిగ్రహః ।**
**మామువాచ మహాభాగో మైత్రేయ! పులహాగ్రజః ॥ 27 ॥**

మైత్రేయా! మా పితామహుడు ఆయనకు అర్ఘ్యం సమర్పించాడు. ఆ తరువాత ఆయనకూడ మా తాతగారిద్వారా కల్పించబడ్డ ఆసనాన్ని స్వీకరించాడు. మహానుభావుడైన, పులహుని అన్నగారైన పులస్త్య బ్రహ్మ నాతో ఇలా అన్నాడు.

**వైరే మహతి యద్వాక్యాత్ గురోరస్యాశ్రితా క్షమా ।**
**త్వయా తస్మాత్ సమస్తాని భవాన్ శాస్త్రాణి వేత్స్యతి ॥ 28 ॥**

రాక్షసులపై గొప్పదైన వైరాన్ని పూని ఉన్నప్పటికి, తాతగారి మాటలపై విశ్వాసంతో క్షమను వహించావు. ఆ కారణంచే ఆ క్షమాగుణ ప్రసాదంగా నీవు సమస్తశాస్త్రాలు సంపూర్ణంగా తెలుసుకోగలవు.

**సన్తతేర్న మమోచ్ఛేదః క్రుద్ధేనాపి యతః కృతః ।**
**త్వయా తస్మాన్మహాభాగ! దదామ్యన్యం మహావరమ్ ॥ 29 ॥**

ఓ మహాభాగా! అంత క్రోధంలో ఉండి కూడా నీవు నా సంతతికి క్షతి (నాశనం) కలగజేయలేదు. అందువల్ల నీకు మరో గొప్ప వరాన్ని ఇస్తున్నాను.

**పురాణసంహితాకర్తా భవాన్ వత్స! భవిష్యతి ।**
**దేవతాపారమార్థ్యం చ యథావత్ వేత్స్యతే భవాన్ ॥ 30 ॥**

వత్సా! నీవు పురాణసంహితాకర్తవు కాగలవు. అన్ని పురాణాలను ప్రవర్తింపజేయువాడ వవుతావు. దేవతాస్తిత్వాన్ని, పరమార్థతత్త్వాన్ని నీవు ఉన్నది ఉన్నట్లు తెలుసుకోగలవు.

**ప్రవృత్తే చ నివృత్తే చ కర్మణ్యస్త్వమలా మతిః ।**
**మత్ప్రసాదాదసందిగ్ధా తవ వత్స! భవిష్యతి ॥ 31 ॥**

నాయనా! నా అనుగ్రహం వల్ల నీకు ఇహలోక పరలోక సుఖకారకాలైన కామ్యకర్మలయందు, నిష్కామకర్మపూర్వక జ్ఞానయోగమునందు విపరీతజ్ఞానంలేని సద్బుద్ధి ఏ సందేహం లేకుండా కలుగుతుంది.

**తతశ్చ భగవాన్ ప్రాహ వశిష్ఠో మత్పితామహః ।**
**పులస్త్యేన యదుక్తం తే సర్వమేతద్భవిష్యతి ॥ 32 ॥**

అపుడు మా తాతగారు, భగవంతుడైన వశిష్ఠుడు నీకు పులస్త్యుడు చెప్పిన విధంగా జరుగుతుందనిచెప్పాడు.

**ఇతి పూర్వం వశిష్ఠేన పులస్త్యేన చ ధీమతా ।**
**యదుక్తం తత్ స్మృతిం యాతం త్వత్ప్రశ్నాదఖిలం మమ ॥ 33 ॥**

ఈ విధంగా పూర్వం వశిష్ఠ భగవానుడు, బుద్ధిశాలియైన పులస్త్యబ్రహ్మ చెప్పినదంతా, నీ ప్రశ్నలవల్ల నాకు సమస్తం స్మరణకు వచ్చింది.

**సోఽహం వదామ్యశేషం తే మైత్రేయ! పరిపృచ్ఛతే ।**
**పురాణసంహితాం సమ్యక్ తాం నిబోధ యథాతథమ్ ॥ 34 ॥**

కాబట్టి మైత్రేయా! నన్ను ప్రశ్నిస్తున్న నీకు నా స్మృతిలోనికి వచ్చిన పురాణసంహితనంతా పూర్తిగా తెలియజేస్తాను. యథాతథంగా గ్రహించు.

**విష్ణోః సకాశాత్ సంభూతం జగత్ తత్రైవ సంస్థితమ్ ।**
**స్థితిసంయమకర్తాఽసౌ జగతోఽస్య జగచ్చ సః ॥ 35 ॥**

ఈ జగత్తు విష్ణుసంకల్పం(ఇచ్ఛ)వల్ల ఏర్పడింది. ఆ విష్ణువులోనే ఈ జగత్తు ఉంది. ఆ కారణంచే స్థితికర్తావిష్ణువే. సంయమకర్త(నియమించువాడు)కూడ విష్ణువే. ఆ విష్ణువుయొక్క స్వరూపమే ఈ జగత్తు. ఈ జగత్తుకూడ ఆయనే.

**మిత్రాపుత్రవచో నిశమ్య సకలం స్మృత్వా ఽఽత్మనస్తద్వరం**
**సత్రం చైవ నివారితం స సుమహాభాగో భవత్తారణమ్ । 36 ॥**

**కృత్వా వైష్ణవముత్తమం మునివరం మైత్రేయమధ్యాపయత్**
**తత్త్వార్థప్రతిపాదనం ప్రవదతాం సర్వార్థదం శృణ్వతామ్ ॥ 37 ॥**

మైత్రేయునిమాటలను విన్న మహాభాగుడైన పరాశరుడు ఆ యాగనివారణం తనకు సంప్రాప్తమైన వరం, సంసారంనుండి పూర్తిగా తరింపజేసే విధానం మనస్సుకు రాగా ఉత్తమమైన విష్ణుసంబంధమైన పురాణాన్ని నిర్మించి, మునీంద్రుడైన మైత్రేయుని చేత అధ్యయనం చేయించాడు. ఈ పురాణం చెప్పేవారికి తత్త్వార్థాన్ని కలిగిస్తుంది. వినేవారికి సర్వార్థాలను నెరవేరుస్తుంది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే మంగళాచరణం, పరాశరముద్దిశ్య మైత్రేయస్య ప్రశ్నః, పరాశరస్య ఉత్తర దానం, పురాణసంహితావతారశ్చేతి ప్రథమోఽధ్యాయః ॥ 1 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో మంగళాచరణం, పరాశరుని ఉద్దేశించి మైత్రేయుని ప్రశ్న, పరాశరుని ఉత్తర దానం - పురాణసంహితావతారం అనే మొదటి అధ్యాయం సమాప్తం ॥ 1 ॥

## ద్వితీయోఽధ్యాయః – రెండవ అధ్యాయం

## విష్ణుస్తుతిః, సృష్టిప్రక్రియా చ – విష్ణుస్తుతి, సృష్టి ప్రక్రియ

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరమహర్షి పలికాడు.

**అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే ।**
**సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే ॥ 1 ॥**

ఏ వికారం లేక అవికారుడైనవాడు, ఏ గుణసంపర్కం లేక శుద్ధుడైనవాడు, త్రికాలలోను ఉండేవాడు కాన నిత్యుడైనవాడు, పరమాత్మ అయినవాడు, సర్వకాలాలలోను ఒకే రూపంతో ఉండువాడు కాన సదైకరూప రూపుడైనవాడు, సమస్తాన్ని ఎల్లప్పుడూ జయించగలిగిన శీలం కలవాడు కాన సర్వజిష్ణువైనవాడు, అయిన సర్వత్ర వ్యాపించి ఉండు విష్ణువుకు నా నమస్కారం.

**నమో హిరణ్యగర్భాయ హరయే శంకరాయ చ ।**
**వాసుదేవాయ తారాయ సర్గస్థిత్యన్తకారిణే ॥ 2 ॥**

హిరణ్య గర్భరూపంలో సృష్టికారుడై, హరిరూపంలో స్థితికారుడై, శంకరరూపంలో లయకారుడై, తరింపజేసి మోక్షమిచ్చే వాసుదేవునకు నా నమస్కారం.

**ఏకానేక స్వరూపాయ స్థూలసూక్ష్మాత్మనే నమః ।**
**అవ్యక్తవ్యక్తభూతాయ (రూపాయ) విష్ణవే ముక్తిహేతవే ॥ 3 ॥**

అవ్యక్తరూపంగా సూక్ష్మంగా ఏకరూపంగా భాసిల్లేవాడు, వ్యక్తరూపుడై స్థూలంగా అనేకరూపుడై విరాజిల్లేవాడై ముక్తికారకుడైన విష్ణువుకు నా నమస్కారం.

**సర్గస్థితివినాశానాం జగతోఽస్య జగన్మయః ।**
**మూలభూతో నమస్తస్మై విష్ణవే పరమాత్మనే ॥ 4 ॥**

జగత్తుయొక్క సృష్టి స్థితి వినాశాలకు మూలభూతమైనవాడు, జగన్మయుడు, లోపల బయట అంతట వ్యాపించి ఉండువాడైన పరమోత్కృష్టమైన స్వరూపం గలవాడైన విష్ణువుకు నా నమస్కారం.

**ఆధారభూతం విశ్వస్యాప్యణీయాంసమణీయసామ్ ।**
**ప్రణమ్య సర్వభూతస్థమచ్యుతం పురుషోత్తమమ్ ॥ 5 ॥**

**జ్ఞాన స్వరూపమత్యంతం నిర్మలం పరమార్థతః ।**
**తమేవార్థస్వరూపేణ భ్రాంతి దర్శనతః స్థితమ్ ॥ 6 ॥**

**విశ్వం గ్రసిష్ణుం విశ్వస్య స్థితౌ సర్గే తథా ప్రభుమ్ ।**
**ప్రణమ్య జగతామీశమజమక్షరమవ్యయమ్ ॥ 7 ॥**

**కథయామి యథాపూర్వం దక్షాద్యైర్మునిసత్తమైః ।**
**పృష్టః ప్రోవాచ భగవానబ్జయోనిః పితామహః ॥ 8 ॥**

జగత్తుకు ఆధారభూతుడైన వాడైనప్పటికి అణువుకన్న అణువయినవాడును, సర్వప్రాణి హృదయాలలో నియంతృరూపంలో ఉండేవాడును, నాశనం లేనివాడును, సమస్త భూతకోటిలో ఉత్తముడై పురుషోత్తముడైన వానికి నమస్కరించి జ్ఞానమే స్వరూపమైనవాడును, తత్త్వనిర్ణయ ప్రకారంగా మిక్కిలి నిర్మలుడైనవాడును, వ్యావహారిక నిర్ణయ ప్రకారంగా భ్రాంతి జ్ఞానంతో దృశ్యరూపంలో ఉన్నవాడునైన ఆ విష్ణువుకు నమస్కరించి విశ్వాన్ని కాలరూపంలో గ్రసించేవాడును (లయింపజేసేవాడు), విశ్వాన్ని సృష్టించడంలోను, పోషించడంలోను సర్వత్ర స్వతంత్రుడైనవాడును, జగత్తుకు ప్రభువైనవాడును, పుట్టుక మరణం లేనివాడును, అవ్యయుడునైన విష్ణువుకు నమస్కరించి పూర్వం దక్షుడు మున్నగు మునీంద్రులు ప్రశ్నించగా భగవంతుడు, పద్మసంభవుడు అయిన పితామహుడు వారికి చెప్పిన విషయాన్ని నీకు చెబుతున్నాను.

**తైశ్చోక్తం పురుకుత్సాయ భూభుజే నర్మదాతటే ।**
**సారస్వతాయ తేనాపి మహ్యం సారస్వతేన చ ॥ 9 ॥**

నర్మదానదీతీరంలో ఆ మునీంద్రులు రాజేంద్రుడైన పురుకుత్సునికి వివరించగా, పురుకుత్సుడు సారస్వతునికి చెప్పగా, ఆ సారస్వతుడు నాకు చెప్పడం జరిగింది.

**సృష్టిక్రమః**

**పరః పరాణాం పరమః పరమాత్మాऽऽత్మసంస్థితః ।**
**రూపవర్ణాదినిర్దేశవిశేషణ వివర్జితః ॥ 10 ॥**

ఆ విష్ణువు దృశ్యమాన ప్రపంచంకన్న పరుడు. పరం అని భావించే అన్నింటికన్న పరముడు. పరమాత్మగా నిర్ణయింపబడ్డవాడు. సర్వజీవాంతర్యామిగా ఉండేవాడు. రూపం, వర్ణం మున్నగువాటిచే నిర్దేశించడానికి వీలుకాని, ఏ విశేషణంచేత నిర్వచించ శక్యంకాని శుద్ధతత్త్వమే ఆ విష్ణువు.

**అపక్షయవినాశాభ్యాం పరిణామర్ద్ధి జన్మభిః ।**
**వర్జితః శక్యతే వక్తుం యః సదాऽస్తీతి కేవలమ్ ॥ 11 ॥**

అపక్షయం (క్షీణించడం), వినాశం (నశించిపోవడం) పరిణామం (మార్పు), ఋద్ధి (వృద్ధి), జన్మ (పుట్టుక) అనే వికారాలు లేనివాడు, ఎల్లప్పుడూ 'ఉన్నాడు' అని మాత్రమే కేవలం చెప్పదగినవాడు.

**సర్వత్రాసౌ సమస్తం చ వసత్యత్రేతి వై యతః ।**
**తతస్స వాసుదేవేతి విద్వద్భిః పరిపఠ్యతే ॥ 12 ॥**

అంతట తాను, అంతా తనయందు ఉండడంచే వాసుదేవుడని విద్వాంసులచే ఎల్లప్పుడూ భావింపబడుతూ ఉండేవాడు.

**తద్బ్రహ్మ పరమం నిత్యమజమక్షయమవ్యయమ్ ।**
**ఏకస్వరూపం చ సదా హేయాభావాచ్చ నిర్మలమ్ ॥ 13 ॥**

ఆయనే పరమం నిత్యం అజం అక్షయం అవ్యయం ఎల్లప్పుడూ ఏకస్వరూపం. హేయరహితం కాన నిర్మలం. అదే బ్రహ్మం.

**తదేతత్ సర్వమేవాసీత్ వ్యక్తావ్యక్తస్వరూపవత్ ।**
**తథా పురుషరూపేణ కాలరూపేణ చ స్థితమ్ ॥ 14 ॥**

వ్యక్తావ్యక్త స్వరూపంగా కనబడుతూ కనబడకుండా, ఉన్నట్లు ఉండే ఈ సమస్తం పురుషరూపంతోను, కాలరూపంతోను ఉండేదంతా బ్రహ్మమే. అనగా వ్యక్తమై పురుషునిగా, అవ్యక్తమై కాలరూపంగా వ్యవహరింప బడేదంతా బ్రహ్మమే.

**పరస్య బ్రహ్మణో రూపం పురుషః ప్రథమం ద్విజ! ।**
**వ్యక్తావ్యక్తే తథైవాన్యే రూపే కాలస్తథా పరమ్ ॥ 15 ॥**

ఓ బ్రాహ్మణోత్తమా! ఆ పరబ్రహ్మయొక్క మొదటిరూపం పురుషుడు. అలాగే వ్యక్తం అవ్యక్తం దానియొక్క అన్యరూపాలు. కాలమే పరరూపం.

**ప్రధానపురుషవ్యక్తకాలానాం పరమం హి యత్ ।**
**పశ్యన్తి సూరయ శ్శుద్ధం తద్విష్ణోః పరమం పదమ్ ॥ 16 ॥**

ఈ వ్యక్త, అవ్యక్త (ప్రధాన), పురుష, కాలరూపాలలో ఏది పరమమై, శుద్ధమై భాసిస్తుందో, దానిని విష్ణువుయొక్క పరమపదంగా సూరులు అనగా పండితులు వీక్షిస్తారు.

**ప్రధానపురుషవ్యక్తకాలాస్తు ప్రవిభాగశః ।**
**రూపాణి స్థితిసర్గాన్తవ్యక్తిసద్భావహేతవః ॥ 17 ॥**

ప్రధానం (అవ్యక్తం), వ్యక్తం, పురుషుడు, కాలం – ఈ విభాగంతో కూడుకొన్న రూపాలే జగత్తుయొక్క సృష్టి స్థితి వినాశాల అభివ్యక్తి, సత్పదార్థజ్ఞానం అనేవాటికి హేతువులవుతాయి.

**వ్యక్తం విష్ణు స్తథాఽవ్యక్తం పురుషః కాల ఏవ చ ।**
**క్రీడతో బాలకస్యేవ చేష్టాం తస్య నిశామయ ॥ 18 ॥**

ఈ విధంగా వ్యక్తమూ విష్ణువే. అవ్యక్తమూ విష్ణువే. పురుషుడూ విష్ణువే. కాలమూ విష్ణువే. ఈ విధంగా నాలుగు రూపాలను ధరించడం విష్ణువుకు ఒక బాలకుని క్రీడలాంటిదిగా మైత్రేయా! తెలుసుకో.

**అవ్యక్తం కారణం యత్ తత్ ప్రధాన మృషిసత్తమైః ।**
**ప్రోచ్యతే ప్రకృతిః సూక్ష్మా నిత్యం సదసదాత్మకమ్ ॥ 19 ॥**

ఈ నాలుగింటిలో అవ్యక్తకారణం ఋషిపుంగవులచే ప్రధానమని చెప్పబడుతోంది. అదే ప్రకృతి. అదే సూక్ష్మం. అదే నిత్యం. అది ఉన్నట్లు లేనట్లు అనిపించేలా సదసదాత్మకమైనట్టిది.

**అక్షయ్యం (అక్షరం) నాన్యదాధారమమేయమజరం ధ్రువమ్ ।**
**శబ్దస్పర్శవిహీనం తద్రూపాదిభిరసంహితమ్ ॥ 20 ॥**

అది క్షయం లేనిది కాన అక్షయ్యం. (నాశనం లేనిది కాన అక్షరం) మరో ఆధారం లేనిది. అది అమేయమయినది (దాని పరిమితి ఇంతటిది అని చెప్పరానట్టిది). అజరమైనట్టిది. నిశ్చలమైనట్టిది కాన అది ధ్రువం. శబ్దస్పర్శములు లేనిది. రూపాదులతో కూడనటువంటిది.

**త్రిగుణం తజ్జగద్యోనిరనాదిప్రభవాప్యయమ్ ।**
**తేనాగ్రే సర్వమేవాసీద్ వ్యాప్తం వై ప్రలయాదను ॥ 21 ॥**

అది త్రిగుణాత్మకమైనట్టిది. అదే జగత్తుకు కారణమైనటువంటిది కాన అది అనాది. సృష్టికిమూలం అదే. లయస్థానం అదే. గడచిపోయిన ప్రలయం తరవాత ఈ విశ్వమంతా ఆ ప్రధానం చేతనే వ్యాపించబడి ఉంది.

**వేదవాదవిదో విద్వన్ నియతా బ్రహ్మవాదినః ।**
**పఠన్తి వై తమేవార్థం ప్రధానప్రతిపాదకమ్ ॥ 22 ॥**

వేదార్థం తెలిసిన వేదవాదులు, బ్రహ్మవేత్తలు, బ్రహ్మనిష్ఠులు అయినవారు ఈ ప్రధాన ప్రతిపాదకమైన దాన్నే జగత్కారణంగా ఇలా పఠిస్తూ ఉంటారు.

**నాహో న రాత్రి ర్న నభో న భూమి**
**ర్నాసీత్తమో జ్యోతిరభూన్న చాన్యత్ ।**
**శ్రోత్రాది బుద్ధ్యాఽనుపలభ్యమేకం**
**ప్రాధానికం బ్రహ్మ పుమాంస్తదాసీత్ ॥ 23 ॥**

అప్పుడు పగలూ లేదు. రాత్రి అన్నదీ లేదు. నింగీ లేదు. నేలా లేదు. చీకటీ లేదు. వెలుతురూ లేదు. ఏమీ లేదు. శ్రోత్రాది – ఇంద్రియ లభ్యం కాని, బుద్ధి గోచరం కాని దొక్కటే ఉంది. అదే ప్రధానం. అదే బ్రహ్మ. అదే పురుషుడై ఉన్నది.

**విష్ణోఃస్వరూపాత్ పరతో హి తేఽన్యే**
**రూపే ప్రధానం పురుషశ్చ విప్ర! ।**
**తస్యైవ తేఽన్యేన ధృతే వియుక్తే**
**రూపాన్తరం యత్తద్ద్విజకాలసంజ్ఞమ్ ॥ 24 ॥**

బ్రాహ్మణుడవైన ఓ మైత్రేయా! నిరూపాధికమైన విష్ణుస్వరూపం వల్ల ప్రధానం, పురుషుడు అనే రెండు రూపాలు రూపొందాయి. ఆ విష్ణువుయొక్క మరో రూపంచేత సృష్టికాలంలో చేర్చబడి, ప్రలయకాలంలో విడదీయబడింది. ఓ ద్విజోత్తమా! ఆ సంయోగవియోగహేతువయిన రూపాంతరానికే కాలం అని పేరు.

**ప్రకృతౌ సంస్థితం వ్యక్తమతీతప్రలయే తు యత్ ।**
**తస్మాత్ ప్రాకృతసంజ్ఞోఽయముచ్యతే ప్రతిసంచరః ॥ 25 ॥**

జరిగిపోయిన ప్రళయంలో ఈ వ్యక్తమగు విశ్వమంతా ప్రకృతిలో లీనమై ఉండిపోయింది. అందువల్ల దానిని ప్రాకృతం అనే పేరుగల మహాప్రలయమంటారు. (ప్రాకృతప్రతిసంచరమంటారు).

**అనాదిర్భగవాన్ కాలో నాన్తోఽస్య ద్విజ! విద్యతే ।**
**అవ్యుచ్ఛిన్నా స్తతస్త్వేతే సర్గస్థిత్యన్తసంయమాః ॥ 26 ॥**

ద్విజశ్రేష్ఠా! కాలం అనాది. అనగా దీనికి ఆది అన్నది లేదు. ఆది ఎప్పుడు లేదో అంతం అన్నదీ లేదు. కాబట్టి కాలం భగవత్స్వరూపం. కాబట్టి సృష్టి స్థితిలయాలు ఎడతెగక(ప్రవాహరూపంలా) కాలంవల్ల సంభవిస్తూఉంటాయి.

**గుణసామ్యే తతస్తస్మిన్ పృథక్ పుంసి వ్యవస్థితే ।**
**కాలస్వరూపరూపం తద్ విష్ణోర్మైత్రేయ! వర్తతే ।**
**కాలస్వరూపం తద్విష్ణో ర్మైత్రేయ! పరివర్తతే ॥ 27 ॥**

మైత్రేయా! అందువల్ల ప్రళయంలో త్రిగుణాలు సామ్యస్థితిలో ఉన్న ప్రధానం, పురుషుడు వేరుపడి ఉండగా, విష్ణువు యొక్క కాలస్వరూప రూపమే జగత్సృష్టికి అనుకూలంగా వర్తిస్తుంది. కాలస్వరూపమై ప్రవర్తిస్తుంది.

**తతస్తత్ పరమం బ్రహ్మ పరమాత్మా జగన్మయః ।**
**సర్వగః సర్వభూతేశః సర్వాత్మా పరమేశ్వరః ॥ 28 ॥**

**ప్రధానం పురుషం చాపి ప్రవిశ్యాత్మేచ్ఛయా హరిః ।**
**క్షోభయామాస సంప్రాప్తే సర్గకాలే వ్యయావ్యయౌ ॥ 29 ॥**

పిమ్మట ఆ పరబ్రహ్మ, ఆ పరమాత్మ, ఆ జగన్మయుడు, ఆ సర్వగామి, ఆ సర్వభూతేశుడు, ఆ సర్వాత్ముడు, ఆ పరమేశ్వరుడు అయిన విష్ణువు తన ఇచ్ఛచేత సృష్టి సమయంలో వ్యయమైన ప్రధానంలోను, అవ్యయమైన పురుషునిలోను (పరిణామ – అపరిణామ రూపాలలోనున్న ప్రధాన పురుషులలో) ప్రవేశించి క్షోభ కలుగజేస్తాడు.

వి॥ క్షోభ అనగా సంకోచవికాసాలతో కూడే ఉన్ముఖీకరణం.

**యథా సన్నిధిమాత్రేణ గన్ధః క్షోభాయ జాయతే ।**
**మనసో నోపకర్తృత్వాత్ తథాఽసౌ పరమేశ్వరః ॥ 30 ॥**

ఏవిధంగా ఏ ఉపకర్తృత్వంలేక సన్నిధిమాత్రంచేతనే గంధం మనస్సుకు క్షోభ కలగజేస్తుందో, ఆ విధంగా పరమేశ్వరుడు క్షోభను కలుగజేస్తాడు.

**స ఏవ క్షోభకో బ్రహ్మన్! క్షోభశ్చ పురుషోత్తమః । (క్షోభ్యశ్చ)**
**స సంకోచవికాసాభ్యాం ప్రధానత్వేఽపి చ స్థితః ॥ 31 ॥**

ఓ బ్రాహ్మణోత్తమా! ఆ సమయంలో ఆయనే క్షోభకుడు, క్షోభ్యుడు. అనగా క్షోభింపజేసేవాడు ఆయనే. క్షోభింపబడేవాడు ఆయనే. సంకోచవికాసాలద్వారా ప్రధానస్వరూపంగా ఉన్నవాడూ ఆయనే.

**వికారా(సా)ణుస్వరూపైశ్చ బ్రహ్మరూపాదిభిస్తథా ।**
**వ్యక్తస్వరూపశ్చ తథా విష్ణుః సర్వేశ్వరేశ్వరః ॥ 32 ॥**

వికార స్వరూపుడు (మహాభూతాది) అణుస్వరూపుడు (మహదాది) అనువాటిచే బ్రహ్మరూపాది (బ్రహ్మ హరిరుద్ర) జీవస్వరూపాలతో ఆ సమయంలో సర్వేశ్వరేశ్వరుడైన ఆ విష్ణువే వ్యక్తస్వరూపుడవుతాడు.

**గుణసామ్యాత్ తతస్తస్మాత్ క్షేత్రజ్ఞాధిష్ఠితాన్మునే! ।**
**గుణవ్యంజనసమ్భూతిస్సర్గకాలే ద్విజోత్తమ! ॥ 33 ॥**

బ్రాహ్మణోత్తమా! మునిసత్తమా! గుణసామ్య స్థితిలో ఉన్న ఆ ప్రధానం నుండి క్షేత్రజ్ఞునిచే అధిష్ఠింపబడ్డ కారణంగా సృష్టిసమయంలో గుణవ్యంజనాభివ్యక్తి (గుణాల ఆవిర్భావానికి హేతువైన మహత్తత్త్వం) ఆవిర్భవించింది.

**ప్రధానతత్త్వముద్భూతం మహాన్తం తత్సమావృణోత్ ।**
**సాత్త్వికో రాజసశ్చైవ తామసశ్చ త్రిధా మహాన్ ।**
**ప్రధానతత్త్వేన సమం త్వచా బీజమివావృతమ్ ॥ 34 ॥**

ఆ క్షేత్రజ్ఞాధిష్ఠితమైన కారణంగా ప్రధానతత్త్వం ప్రకటించబడింది. దానినుండి ఉద్భవించిన మహత్తత్త్వాన్ని ఆ ప్రధానం ఆవరించింది. ఆ మహత్తత్త్వం సాత్త్వికం, రాజసం, తామసం అని మూడువిధాలు అయింది. విత్తనం చర్మంచేత ఆవరించబడ్డట్లుగా ఆ మహత్తత్త్వం ప్రధానంచే ఆవరించబడింది.

**వైకారికస్తైజసశ్చ భూతాదిశ్చైవ తామసః ।**
**త్రివిధోఽయమహంకారో మహత్తత్త్వాదజాయత ॥ 35 ॥**

ఆ మహత్తత్త్వం నుండి వైకారికం (సాత్త్వికం), తైజసం (రాజసం), భూతాది (తామసం) అనే మూడువిధాలైన అహంకారం జనించింది.

**భూతేన్ద్రియాణాం హేతుస్స త్రిగుణత్వాన్మహామునే! ।**
**యథా ప్రధానేన మహాన్ మహతా స తథా వృతః ॥ 36 ॥**

మహామునీ! ఆ మహతత్త్వం నుండి అహంకారం త్రిగుణాత్మకమైన కారణంచే అది భూతాలకు, ఇంద్రియాలకు హేతువయింది. ఏవిధంగా ప్రధానం మహత్తత్త్వాన్ని ఆక్రమించిందో, అదేవిధంగా మహత్తత్త్వం త్రివిధాహంకారాన్ని ఆవరించింది.

**భూతసృష్టిః-భూతసృష్టి**

**భూతాదిస్తు వికుర్వాణః శబ్దతన్మాత్రకం తతః ।**
**ససర్జ శబ్దతన్మాత్రాదాకాశం శబ్దలక్షణమ్ ।**
**శబ్దమాత్రం తథాకాశం భూతాదిః స సమావృణోత్ ॥ 37 ॥**

భూతాది అయిన తామసాహంకారం విశేషంగా క్షోభింపబడగా, దానినుండి శబ్దతన్మాత్ర కలిగింది. శబ్దతన్మాత్రనుండి శబ్దగుణకమైన ఆకాశం కలిగింది. శబ్దగుణకమైన ఆకాశాన్ని భూతాది అయిన తామసాహంకారం ఆవరించింది.

**ఆకాశస్తు వికుర్వాణః స్పర్శమాత్రం ససర్జ హ ।**
**బలవానభవద్వాయుస్తస్య స్పర్శో గుణో మతః ॥ 38 ॥**

ఆకాశం విశేషంగా క్షుబ్ధంకాగా స్పర్శతన్మాత్ర కలిగింది. దానినుండి స్పర్శగుణకమైన బలవంతమైన వాయువు కలిగింది.

**ఆకాశం శబ్దమాత్రన్తు స్పర్శమాత్రం సమావృణోత్ ।**
**తతో వాయుర్వికుర్వాణో రూపమాత్రం ససర్జ హ ॥ 39 ॥**

శబ్దగుణకమైన ఆకాశం స్పర్శగుణకమైన వాయువును ఆక్రమించింది. అపుడు వాయువు విశేషంగా క్షోభింపబడగా దానినుండి రూపతన్మాత్ర కలిగింది.

**జ్యోతిరుత్పద్యతే వాయోస్తద్రూపగుణముచ్యతే ।**
**స్పర్శమాత్రన్తు వై వాయూ రూపమాత్రం సమావృణోత్ ॥ 40 ॥**

వాయువునుండి జ్యోతి (అగ్ని) జనించింది. అది రూపగుణం కలదయింది. స్పర్శతన్మాత్రమైన వాయువు రూపతన్మాత్రాన్ని ఆక్రమించింది.

**జ్యోతిశ్చాపి వికుర్వాణం రసమాత్రం ససర్జ హ ।**
**సంభవన్తి తతోఽమ్భాంసి రసాధారాణి తాని చ ॥ 41 ॥**

జ్యోతి (అగ్ని) విశేషంగా క్షుబ్ధం కాగా రసమాత్రం జనించింది. దానినుండి నీరు కలిగింది. ఆ నీళ్ళకు రసమే ఆధారం.

**రసమాత్రాణి చామ్భాంసి రూపమాత్రం సమావృణోత్ ।**
**వికుర్వాణాని చామ్భాంసి గన్ధమాత్రం ససర్జిరే ॥ 42 ॥**

రసాధారాలైన జలాలను రూపతన్మాత్ర ఆవరించింది. క్షుబ్ధమైన జలంనుండి గంధతన్మాత్రం జనించింది.

**సంఘాతో జాయతే తస్మాత్ తస్య గన్ధో గుణో మతః ।**
**తస్మింస్తస్మింస్తు తన్మాత్రా తేన తన్మాత్రతా స్మృతా ॥ 43 ॥**

దానినుండి సంఘాతం (ముద్ద – పృథివి) పుట్టింది. దానికి గంధమే గుణం. ఆయామాత్రలైన శబ్దాదులు ఆ శబ్దాదిగుణకాలైన ఆకాశాదులయందు, ఆయా మాత్రలు సూక్ష్మరూపంలో ఉన్న కారణంగా, వాటికి (ఆయా సూక్ష్మరూపం) అన్న భావంతో శబ్దాదులకు తన్మాత్రత్వం చెప్పబడింది.

**తన్మాత్రాణ్యవిశేషాని అవిశేషాస్తతో హి తే ।**
**న శాన్తా నాపి ఘోరాస్తే న మూఢాశ్చావిశేషణాః ॥ 44 ॥**

ఆ శబ్దాదిమాత్రలు ఏ విశేషం లేనివి. ఆ కారణంచే అవి "అవిశేషాలు" అయ్యాయి. అవి శాంతాలు కావు (సుఖాన్ని ఇచ్చేవి కావు). ఘోరాలు కావు (దుఃఖాన్ని కలుగజేసేవి కావు) మూఢాలును కావు. (మోహంలో ముంచెత్తేవి కావు). అందువల్ల అవి అవిశేషాలు అయ్యాయి. ఇది తామసాహంకారంవల్ల కలిగిన భూతతన్మాత్రల సృష్టి.

**విశేషార్థం :** ఈ భూతసృష్టిలో విజ్ఞానవిషయంకూడ అంతర్భూతమయింది. రెండు వస్తువులు ఒకదానితో ఒకటి ఢీకొన్నప్పుడు ముందు కలిగేది ధ్వని. అదే శబ్దం. ప్రధానం మహత్తు ఒకదానితో ఒకటి కలిసినప్పుడు జనించిన తామసాహంకారం నుండి ఉద్భవించిందే శబ్దం. దానికి ఆకారం ఉండదు. అయినా అంతటా వ్యాపిస్తుంది. అదే ఆకాశం. ఆ సమంతాత్ కాశతే ఇతి ఆకాశః. అనగా శబ్దంనుండి ఆకాశం ఉద్భవించిందన్నమాట. శూన్యంలో శబ్దం (ధ్వని) ప్రసరించలేదు. అందువల్ల దాని ప్రసరణానికి వీలైన వాయువును అది ఏర్పరచుకొంది. ధ్వనితరంగాలు వాయుతరంగాల ద్వారా ప్రసరిస్తాయని అందరూ ఎరిగిన విషయమే. అదే ఆకాశంనుండి వాయువు జనించిందనే దాని తాత్పర్యం. వాయువు తాను ప్రేరేపించబడడానికి కావలసిన పదార్థాన్ని ఏర్పరచుకొంది. అదే అగ్ని. అగ్ని తాను ఉద్దీపించబడడానికి కావలసిన తత్త్వాన్ని ఏర్పరచుకొంది. అదే రసం (నీరు). రసం తన అస్తిత్వానికి వీలైన పదార్థాన్ని ఏర్పరచుకొంది. అదే పృథివి. ఈ విధంగా శబ్దస్పర్శరూపరసగంధతన్మాత్రలు, ఆకాశ వాయువహ్ని జలపృథ్వీభూతాలు వైజ్ఞానికంగా ఏర్పడినట్టివే కాని ఇది కేవలం కథాశ్రవణయోగ్యమైన విషయం మాత్రం కాదు.

**ఇంద్రియసృష్టిః**–ఇంద్రియసృష్టి

**భూతతన్మాత్రసర్గోఽయమహంకారాత్తు తామసాత్ ।**
**తైజసానీన్ద్రియాణ్యాహుర్దేవా వైకారికా దశ ॥ 45 ॥**

తామసాహంకారంవల్ల భూతతన్మాత్రల సృష్టి ఏర్పడింది. తైజసాహంకారంవల్ల జనించిన వాటిని ఇంద్రియాలంటారు. వాటి అధిష్ఠాన దేవతలు పదిమంది సాత్త్వికాహంకారంవల్ల జన్మించారు.

**ఏకాదశం మనశ్చాత్ర దేవా వైకారికాః స్మృతాః ।**
**త్వక్ చక్షుర్నాసికా జిహ్వా శ్రోత్రమత్ర చ పంచమమ్ ॥ 46 ॥**

పదకొండవది మనస్సు. అది అంతరింద్రియం. దాని అధిష్ఠాన దైవంకూడ సాత్త్వికాహంకారం వల్ల ఉద్భవించిందే. చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు – ఈ అయిదును జ్ఞానేంద్రియాలు.

**శబ్దాదీనామవాప్త్యర్థం బుద్ధియుక్తాని వై ద్విజ! ।**
**పాయూపస్థౌ కరౌ పాదౌ వాక్చ మైత్రేయ! పంచమీ ॥ 47 ॥**

**విసర్గశిల్పగత్యుక్తి కర్మ తేషాం చ కథ్యతే ।**
**ఆకాశవాయుతేజాంసి సలిలం పృథివీ తథా ॥ 48 ॥**

ద్విజోత్తమా! అవి శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనేవాటిని గ్రహించడానికై బుద్ధితో జతపడి ఉంటాయి. మైత్రేయా! పాయువు, ఉపస్థ, చేతులు, కాళ్ళు, నోరు – ఈ అయిదునూ కర్మేంద్రియాలు.

ఇందు పాయూపస్థలకు విసర్జనం, చేతులకు శిల్పం, పాదాలకు గమనం, నోటికి పలకడం అనేవి వాటికి కర్మగా చెప్పబడ్డాయి. ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి – అవి (ముందు శ్లోకంతో అన్వయం).

**శబ్దాదిభిర్గుణైర్బ్రహన్! సంయుక్తాన్యుత్తరోత్తరైః ।**
**శాన్తా ఘోరాశ్చ మూఢాశ్చ విశేషాస్తేన తే స్మృతాః ॥ 49 ॥**

వాటి శబ్దస్పర్శరూపరసగంధాలతో ఒకదానితో ఒకటి తనకు ముందున్న వాటితో క్రమంగా మిళితమై ఉన్నాయి. ఆకాశంలో శబ్దం, వాయువులో శబ్దస్పర్శలు, అగ్నిలో శబ్దస్పర్శరూపాలు, నీటిలో శబ్దస్పర్శరూపరసాలు, పృథివిలో శబ్దస్పర్శరూపరసగంధాలు ఉన్నాయి. ఇవి సుఖాన్ని కలుగజేసేవి కాన శాంతాలు. దుఃఖాన్ని ఇచ్చేవి కాన ఘోరాలు. మోహాన్ని కలుగజేసేవి కావున మూఢాలు అయ్యాయి. అందువలన విశేషములని చెప్పబడుతున్నాయి.

**విశేషం :** ఇందు భూమి, నీరు శాంతాలు. అగ్ని, వాయువు ఘోరాలు. ఆకాశం మూఢం.

బ్రహ్మాండసృష్టిః–బ్రహ్మాండసృష్టి

**నానావీర్యాః పృథగ్భూతాస్తతస్తే సంహతిం వినా ।**
**నాశక్నువన్ ప్రజాః స్రష్టు మసమాగమ్య కృత్స్నశః ॥ 50 ॥**

నానావిధ శక్తులు కలిగి ఉన్నా, మేళనం లేక విడివిడిగా ఉన్న పైన చెప్పబడినవన్నీ సంహతి (ఒకదానితో ఒకటి ఒత్తిడి) పొందకుండా, వెంటనే అన్యోన్య సహాయం పొందకుండా, ప్రజాసృష్టి చేయడానికి సమర్థాలు కాలేకపోయాయి.

**సమేత్యాన్యోన్యసంయోగం పరస్పరసమాశ్రయాః ।**
**ఏకసంఘాతలక్ష్యాశ్చ సమ్ప్రాప్యైక్యమశేషతః ॥ 51 ॥**

అవి అన్యోన్యసంయోగం పొంది, పరస్పరం ఒకదానికొకటి ఆశ్రయాలై, ఒకే ముద్దలో (ఏ కాండమునందు) లక్ష్యం కలిగి పూర్తిగా ఐక్యం పొందాయి.

**పురుషాధిష్ఠితత్వాచ్చ ప్రధానానుగ్రహేణ చ ।**
**మహదాద్యా విశేషాన్తా హ్యణ్డముత్పాదయన్తి తే ॥ 52 ॥**

మహత్తత్త్వం మొదలుకొని, విశేషం చివరవరకూ ఉన్న అవి పురుషునిచే అధిష్ఠితమైనందువల్ల, అవ్యక్తం (ప్రధానం) యొక్క అనుగ్రహం (సృష్టికి విశిష్టోన్ముఖం) వల్ల ఒక అండాన్ని ఉద్భవింపజేశాయి.

**తత్క్రమేణ వివృద్ధస్తు జలబుద్బుదవత్సమమ్ ।**
**భూతేభ్యోఽణ్డం మహాబుద్ధే! బృహత్ తదుదకేశయమ్ ।**
**ప్రాకృతం బ్రహ్మరూపస్య విష్ణోః సంస్థానముత్తమమ్ ॥ 53 ॥**

ఓ మహాబుద్ధిమంతుడా! ఆ అండం బాగా పెద్దదియై, భూతాలనుండి లేచి, క్రమంగా పెరిగి, నీటి బుడగతో సమానమై నీటిపై తేలసాగింది. అది ప్రకృతికి కార్యం. బ్రహ్మస్వరూపుడైన విష్ణువుకు మహోత్తమస్థానం.

**తత్రావ్యక్త స్వరూపోఽసౌ వ్యక్తరూపీ జగత్పతిః ।**
**విష్ణుర్బ్రహ్మస్వరూపేణ స్వయమేవ వ్యవస్థితః ॥ 54 ॥**

అందు అవ్యక్త స్వరూపుడైన విష్ణువు వ్యక్తరూపుడై, జగదీశ్వరుడై, పరబ్రహ్మ స్వరూపంతో తనంత తానే అందులో ఉన్నవాడయ్యాడు.

**మేరురున్న(రుల్బ)మభూత్తస్య జరాయుశ్చ మహీధరాః ।**
**గర్భోదకం సముద్రాశ్చ తస్యాసన్ సుమహాత్మనః ॥ 55 ॥**

అట్లు మహాండరూపుడైన పరమాత్మయైన విష్ణువుకు ఉల్బం (గర్భం చుట్టూ ఉండే మాంసం) మేరువు. పర్వతాలు జరాయువు (మావి). గర్భమందుండే ఉదకం మహాసముద్రాలు.

**సాద్రిద్వీపసముద్రాస్తు సజ్యోతిర్లోకసంగ్రహః ।**
**తస్మిన్నణ్డేఽభవత్ విప్ర! సదేవాసురమానుషః ॥ 56 ॥**

ఓ విప్రోత్తమా! ఆ మహాండంలో పర్వతాలు, ద్వీపాలు, సముద్రాలు, జ్యోతిర్లోక సముదాయం, దేవతల, అసురుల, మనుష్యుల లోకాల సమూహాలు ఉన్నాయి. (ఇంతవరకు అండంలోపల స్థితిని గూర్చి చెప్పబడింది).

**వారి వహ్న్యనిలాకాశై స్తతో భూతాదినా బహిః ।**
**వృతం దశగుణైరణ్డం భూతాది ర్మహతా తథా ॥ 57 ॥**

(ఇకమీదట అండం వెలుపలి స్థితి చెప్పబడుతోంది).

అండానికి వెలుపల (పృథివ్యావరణం తరువాత) ఒకదానికంటె పదిరెట్లు ఎక్కువగా నీరు, అగ్ని, వాయువు, ఆకాశభూతాల ఆవరణలచే ఆవరింపబడి ఉంది. దాని వెలుపల భూతాది అయిన అహంకారతత్త్వం మహత్తత్త్వంచే ఆవరించబడి ఉంది.

**అవ్యక్తేనావృతో బ్రహ్మంస్తైః సర్వైః సహితో మహాన్ ।**
**ఏభిరావరణైరణ్డం సప్తభిః ప్రాకృతైర్వృతమ్ ।**
**నారికేలఫలస్యాన్త ర్బీజం బాహ్యదళైరివ ॥ 58 ॥**

ఓ బ్రాహ్మణోత్తమా! ఆ అన్నింటితో కూడుకొన్న మహత్తత్త్వం అవ్యక్తంచే ఆవరించబడి ఉంది. ఈ విధంగా ఆ అండం ఏడుప్రాకృతావరణలచే ఆవరించబడి ఉంది. ఈ విధంగా అండం వెలపల కొబ్బరికాయలోని బీజం వెలుపల డిప్పచేత ఆవరించబడినట్లు ఈ ఆవరణలు ఉన్నాయి.

**జుషన్ రజోగుణం తత్ర స్వయం విశ్వేశ్వరో హరిః ।**
**బ్రహ్మా భూత్వాऽస్య జగతో విసృష్టౌ సమ్ప్రవర్తతే ॥ 59 ॥**

విశ్వేశ్వరుడైన హరి తనంతట తాను రజోగుణాన్ని స్వీకరించి బ్రహ్మరూపాన్ని పొంది ఆ అండంలో జగత్తుయొక్క నిర్మాణానికై పూనుకొంటాడు.

**సృష్టం చ పాత్యనుయుగం యావత్ కల్పవికల్పనా ।**
**సత్త్వభుగ్ భగవాన్ విష్ణురప్రమేయపరాక్రమః ॥ 60 ॥**

ఈ విధంగా సృష్టించబడ్డ దానిని యుగానుసారంగా కల్పవికల్పన ఉన్నంతవరకు అప్రమేయ పరాక్రముడైన విష్ణువు సత్త్వగుణం వహించి కాపాడుతూ ఉంటాడు.

**తమోద్రేకీ చ కల్పాన్తే రుద్రరూపీ జనార్దనః ।**
**మైత్రేయాఖిలభూతాని భక్షయత్యతిభీషణః ॥ 61 ॥**

మైత్రేయా! కల్పాంతంలో జనార్దనుడు తమోగుణోద్రేకి అయిన రుద్రరూపియై మహాభయంకరుడై సమస్త భూతాలను భక్షిస్తాడు (లయం చేస్తాడు).

**స భక్షయిత్వా భూతాని జగత్యేకార్ణవీకృతే ।**
**నాగపర్యంకశయనే శేతే చ పరమేశ్వరః ॥ 62 ॥**

**ప్రబుద్ధశ్చ పునః సృష్టిం కరోతి బ్రహ్మరూపధృక్ ॥ 63 ॥**

ఈ విధంగా సమస్త భూతాలను లయంచేసి, జగత్తు ఏకార్ణవం కాగా (అంతా సముద్రంలో జలమయం కాగా) పరమేశ్వరుడు నాగపర్యంక శయనంపై పరుండిపోతాడు. ఆపై మేలుకొని మరల బ్రహ్మరూపియై సృష్టిచేస్తాడు.

**సృష్టిస్థిత్యన్తకరణీం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్ ।**
**స సంజ్ఞాం యాతి భగవానేక ఏవ జనార్దనః ॥ 64 ॥**

భగవంతుడైన ఒకే జనార్దనుడు సృష్టి స్థితి లయకారణియగు బ్రహ్మవిష్ణుశివాత్మికయైన శక్తిగా పేరు పొందుతాడు.

**స్రష్టా సృజతి చాత్మానం విష్ణుః పాల్యం చ పాతి చ ।**
**ఉపసంహ్రియతే చాన్తే సంహర్తా చ స్వయం ప్రభుః ॥ 65 ॥**

ఆ విష్ణువు స్వయంగా ప్రభువై స్రష్టగా తనను తాను సృజించుకొంటాడు. విష్ణువై పాలింపవలసిన దానిని పాలిస్తాడు. చివరి సమయంలో సంహర్తయై దీనిని ఉపసంహరిస్తాడు.

**పృథివ్యాపస్తథా తేజో వాయురాకాశమేవ చ ।**
**సర్వేంద్రియాన్తఃకరణం పురుషాఖ్యం హి యజ్జగత్ ॥ 66 ॥**

భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము, సర్వేంద్రియాలు, అన్తఃకరణం, పురుషుడు అనబడే జగత్తూ ఆయనే.

**స ఏవ సర్వభూతేశో విశ్వరూపో యతోఽవ్యయః ।**
**సర్గాదికం తతోఽస్యైవ భూతస్థముపకారకమ్ ॥ 67 ॥**

ఆయనే సర్వభూతప్రవర్తకుడు కాన సర్వభూతేశ్వరుడు. విశ్వరూపుడు. అవ్యయుడు. కాబట్టి సర్వభూతాలలోని సృష్ట్యాదికర్తృత్వమెల్ల ఆయనకే చెందుతుంది.

**స ఏవ సృజ్యః స చ సర్గకర్తా**
**స ఏవ పాత్యత్తి చ పాల్యతే చ ।**
**బ్రహ్మాద్యవస్థాభి రశేషమూర్తి**
**ర్విష్ణు ర్వరిష్ఠో వరదో వరేణ్యః ॥ 68 ॥**

బ్రహ్మమున్నగు వివిధావస్థలలో సమస్తమూర్తియై, వరిష్ఠుడై, వరదుడై, వరేణ్యుడై ఆ విష్ణువే సృజించువాడు. సృజింపబడువాడు. ఆయనే స్రష్ట. ఆయనే పాలిస్తాడు. ఆయనే పాలింపబడతాడు. ఆయనే సంహర్తయై సంహారం చేస్తాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే విష్ణుస్తుతిః, సృష్టి ప్రక్రియా చేతి ద్వితీయోఽధ్యాయః సమాప్తః ॥ 2 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో విష్ణుస్తుతి, సృష్టి ప్రక్రియ అనే రెండవ అధ్యాయం సమాప్తం.॥ 2 ॥



## తృతీయోఽధ్యాయః - మూడవ అధ్యాయం

## కాలస్వరూపం-బ్రహ్మసృష్టేః ఆవశ్యకం శక్తిస్వరూపం - ఆయుషో నిరూపణమ్

కాలస్వరూపం - బ్రహ్మసృష్టికి కావలసిన శక్తిస్వరూపం ఆయువుయొక్క నిరూపణ

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అన్నాడు.

**నిర్గుణస్యాప్రమేయస్య శుద్ధస్యాప్యమలాత్మనః ।**
**కథం సర్గాదికర్తృత్వం బ్రహ్మణోఽభ్యుపగమ్యతే ॥ 1 ॥**

బ్రహ్మ నిర్గుణుడు అని ఏ గుణాలు అంటనివాడని అంటారు కదా! ఆయన అప్రమేయుడని ఏ పరిమితికి లోబడనివాడని చెబుతారు కదా! ఆయన నిత్యశుద్ధుడని, నిర్మలాత్ముడని వచిస్తారు కదా! అటువంటి బ్రహ్మకు "పుట్టించుట, పోషించుట, నశింపజేయుట" అనే సర్గాదికర్తృత్వం ఎలా పొసగుతుంది?

**శ్రీపరాశర ఉవాచ :-**పరాశరమహర్షి చెప్పాడు

**శక్తయః సర్వభావానా మచిన్త్యజ్ఞానగోచరాః ।**
**యతోఽతో బ్రహ్మణస్తాస్తు సర్గాద్యా భావశక్తయః ॥ 2 ॥**

సమస్త వస్తువులకు (భావప్రకటన యోగ్యత ఉండే వస్తువులకు) అచింత్యమైన జ్ఞానానికి మాత్రమే గోచరమయ్యే శక్తులు ఉంటాయి. అనగా ఏ తర్కానికి లొంగకుండా మణిమంత్రౌషధుల శక్తులలాంటివి ఉంటాయి. బ్రహ్మకు సృష్ట్యాది శక్తులన్నీ ఆ కారణంచే స్వభావసిద్ధశక్తులై ఉన్నాయి.

**భవన్తి తపతాం శ్రేష్ఠ! పావకస్య యథోష్ణతా ।**
**తన్నిబోధ యథా సర్గే భగవాన్ సంప్రవర్తతే ॥ 3 ॥**

తాపసశ్రేష్ఠా! అగ్నికి వేడినిచ్చే గుణం ఎలా స్వభావసిద్ధమో, అలాగే బ్రహ్మకు సృష్టికాలంలో ఐశ్వర్యం, జ్ఞానం, యశస్సు, శ్రేయస్సు, జ్ఞానం, వైరాగ్యం ఇత్యాదులతోకూడిన సర్గాది సహజశక్తులు ఉన్నాయి. భగవంతుడు సృష్టిలో ఏవిధంగా ప్రవర్తిస్తాడో తెలుసుకో.

**నారాయణాఖ్యో భగవాన్ బ్రహ్మా లోకపితామహః ।**
**ఉత్పన్నః ప్రోచ్యతే విద్వన్! నిత్య ఏవోపచారతః ॥ 4 ॥**

ఓ విద్వాంసుడా! నారాయణుడనబడువాడే, భగవంతుడుగా చెప్పబడువాడే, లోకాలకన్నింటికి పితామహుడైన వాడే బ్రహ్మగా తనంత తాను ఆవిర్భవించాడు. ఆయన నిత్యుడు కాన బ్రహ్మగా పుట్టాడని లోకంలో జీవుల పుట్టుకతో పోల్చి చెప్పడం ఔపచారికం.

**నిజేన తస్య మానేన హ్యాయుర్వర్షశతం స్మృతమ్ ।**
**తత్పరాఖ్యం తదర్ధం చ పరార్ధమభిధీయతే ॥ 5 ॥**

బ్రాహ్మమానంలో బ్రహ్మ ఆయుఃప్రమాణం నూరేండ్లు అంటారు. దానిని 'పరం' అంటారు. అందులో సగము భాగాన్ని పరార్ధం అంటారు.

**కాలస్వరూపం విష్ణోశ్చ యన్మయోక్తం తవానఘ! ।**
**తేన తస్య నిబోధత్వం పరిమాణోపపాదనమ్ ॥ 6 ॥**

ఓ పుణ్యాత్ముడా! నీకు విష్ణువు యొక్క కాలస్వరూపం గూర్చి నాచే వివరంగా చెప్పబడింది. ఇపుడు బ్రహ్మ అయిన విష్ణువుయొక్క పరిమాణాన్ని ఉపపాదన చేస్తున్నాను. నీవు గ్రహించు.

**అన్యేషాం చైవ జన్తూనాం చరాణామచరాశ్చ యే ।**
**భూభూభృత్సాగరాదీనామశేషాణాం చ సత్తమ ॥ 7 ॥**

సత్పురుషులలో శ్రేష్ఠుడా! మిగిలిన జీవుల ఇతర చరాచరముల భూమి, పర్వతాలు, సముద్రాలు మున్నగువాటి ఆయుఃపరిమాణాల ఉపపాదనం కూడ తెలుసుకో!

**కాష్ఠా పంచదశాఖ్యాతా నిమేషా మునిసత్తమ ।**
**కాష్ఠా స్త్రింశత్కలా తాస్తు త్రింశన్మౌహూర్తికో విధిః ॥ 8 ॥**

**తావత్సంఖ్యైరహోరాత్రం ముహూర్తైర్మానుషం స్మృతమ్ ।**
**అహోరాత్రాణి తావన్తి మాసః పక్షద్వయాత్మకః ॥ 9 ॥**

మునీంద్రా! (కనురెప్పపాటు కాలానికి నిమేషం అని పేరు) పదిహేను నిమేషాల కాలం ఒక కాష్ఠ. ముప్పై కాష్ఠలు ఒక కళ. ముప్పై కళలు ఒక ముహూర్తం. ముప్పై ముహూర్తాలు ఒక అహోరాత్రం (ఒక పగలూ, ఒక రాత్రి). ముప్పై అహోరాత్రాలు ఒక మాసం. రెండు పక్షాలతో కూడుకొన్నది ఒక మాసం (మొదటిది శుక్లపక్షం, రెండోది కృష్ణపక్షం. ఈ రెండు పక్షాలు కలిస్తే ఒక మాసం).

**తైః షడ్భిరయనం వర్షం ద్వేఽయనే దక్షిణోత్తరే ।**
**అయనం దక్షిణం రాత్రి ర్దేవానాముత్తరం దినమ్ ॥ 10 ॥**

అట్టి ఆరుమాసాలతో ఒక అయనం ఏర్పడుతుంది. దక్షిణాయనం, ఉత్తరాయణం అను రెండు అయనాలు కలిస్తే ఒక వర్షం (సంవత్సరం). అందులో దక్షిణాయనం దేవతలకు రాత్రి. ఉత్తరాయణం పగలు.

**దివ్యైర్వర్షసహస్రైస్తు కృతత్రేతాదిసంజ్ఞకమ్ ।**
**చతుర్యుగం ద్వాదశభిస్తద్విభాగం నిబోధ మే ॥ 11 ॥**

అట్టి పండ్రెండు వేల దివ్యవర్షాలతో, కృతత్రేతాద్వాపర కలియుగాలనే నాలుగు యుగాలతో కూడుకొన్న కాలవిభాగాన్ని తెలుసుకో.

**వి ॥** 15 నిమేషాలు 1 కాష్ఠ, 30 కాష్ఠలు 1 కల, 30 కలలు 1 ముహూర్తం, 30 ముహూర్తాలు 1 దినం, 30 దినాలు 1 మాసం, 15 దినాలు 1 పక్షం, 2 పక్షాలు (శుక్ల కృష్ణపక్షాలు) 1 మాసం,

6 మాసాలు 1 అయనం, 2 అయనాలు (ఉత్తర, దక్షిణాయనాలు) 1 సంవత్సరం. యుగాలు నాలుగు - కృత త్రేతా ద్వాపర కలియుగాలు. ఈ నాలుగింటిని కలిపి చతుర్యుగం అంటారు.

**చత్వారి త్రీణి ద్వే చైకం కృతాదిషు యథాక్రమమ్ ।**
**దివ్యాబ్దానాం సహస్రాణి యుగేష్వాహుః పురావిదః ॥ 12 ॥**

కృతయుగానికి నాలుగు వేల దివ్యవర్షాలు, త్రేతాయుగానికి మూడువేల దివ్యవర్షాలు, ద్వాపర యుగానికి రెండువేల దివ్యవర్షాలు, కలియుగానికి ఒక వేయి దివ్యవర్షాలు అని పురావిదులైన తత్త్వవేత్తలు చెబుతూ ఉంటారు.

**తత్ప్రమాణైః శతైః సంధ్యా పూర్వా తత్రాభిధీయతే ।**
**సంధ్యాంశకశ్చ తత్తుల్యో యుగస్యానన్తరో హి సః ॥ 13 ॥**

ప్రతి యుగానికి ఎన్నివేల దివ్యవర్షాలు ఉన్నాయో, అన్ని వందల దివ్యవర్షాలు పూర్వ సంధ్యగాను, వాటితో సమానంగా అన్ని వందల దివ్య సంవత్సరాలు యుగానంతర సంధ్యాంశకంగాను చెప్పబడుతోంది.

**సన్ధ్యాసన్ధ్యాంశయోరన్తర్యః కాలో మునిసత్తమ ।**
**యుగాఖ్యః స తు విజ్ఞేయః కృతత్రేతాదిసంజ్ఞితః ॥ 14 ॥**

మునీశ్వరా! ఇలా పూర్వ సంధ్య, పైన చెప్పబడిన కాలం, అనంతర సంధ్య కలిపి కృతత్రేతాది నామాలతో యుగం అని తెలియదగింది. (లేదా) సంధ్యాసంధ్యాంశలమధ్యకాలాన్ని కృతత్రేతాది నామాలతో యుగంగా తెలియదగింది.

**కృతం త్రేతా ద్వాపరం చ కలిశ్చైవ చతుర్యుగమ్ ।**
**ప్రోచ్యతే తత్సహస్రం చ బ్రహ్మణో దివసం మునే ॥ 15 ॥**

మునిసత్తమా! ఈ కృత త్రేతా ద్వాపర కలియుగాలను కలిపి చతుర్యుగం అంటారు. అట్టి వేయి చతుర్యుగాలు (మహాయుగాలు) బ్రహ్మకు ఒక పగలు అవుతుంది.

**వి ॥** యుగం-యుగప్రమాణం - సంధ్యాంశ - అనంతర సంధ్య - మొత్తము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1) | కృత | 4000 | ది. సం॥ | 400 | 400 | 4800 |
| 2) | త్రేతా | 3000 | ” | 300 | 300 | 3600 |
| 3) | ద్వాపర | 2000 | ” | 200 | 200 | 2400 |
| 4) | కలి | 1000 | | 100 | 100 | 1200 |
| | | 10000 | | 1000 | 1000 | 12000 |

ఈ విధంగా పండ్రెండు వేల దివ్యవర్షాలకాలం ఒక మహాయుగ ప్రమాణమైతే, అట్టి వేయి మహాయుగాల మొత్తం ప్రమాణం బ్రహ్మకు ఒక పగలవుతుంది.

**బ్రహ్మణో దివసే బ్రహ్మన్! మనవశ్చ చతుర్దశ! ।**
**భవన్తి పరిమాణం చ తేషాం కాలకృతం శృణు ॥ 16 ॥**

బ్రాహ్మణోత్తమా! బ్రహ్మయొక్క ఒక పగటి కాలంలో పద్నాలుగురు మనువులు ఉంటారు. వారి కాలప్రమాణాన్ని ఆలకించు.

**సప్తర్షయః సురాః శక్రో మనుస్తత్సూనవో నృపాః ।**
**ఏకకాలే హి సృజ్యన్తే సంహ్రియంతే చ పూర్వవత్ ॥ 17 ॥**

ప్రతి మనువు కాలంలోను ఏడుగురు ఋషులు, దేవతలు, దేవేంద్రుడు, భూలోక పరిపాలకుడగు మనువు, మనువు కుమారులైన రాజులు – వీరంతా ఒకే సమయంలో సృజింపబడతారు (పదవులలో ఉంచబడతారు). అదేవిధంగా ఒకేమారు ఉపసంహరింపబడతారు (అధికారం లేనివారుగా చేయబడతారు).

**చతుర్యుగానాం సంఖ్యాతా సాధికా హ్యేకసప్తతిః ।**
**మన్వన్తరం మనోః కాలః సురాదీనాం చ సత్తమ ॥ 18 ॥**

ఓ సత్పురుషా! కొంచెం అధికంగా డెబ్బదియొక్క మహాయుగాల కాలం ఒక మన్వంతరంగా లెక్కింపబడుతోంది. మనువుల కాలమెంత ఉంటుందో, దేవతల సాధికారకాలమూ అంతే.

వి ॥ భూలోకంలో బ్రహ్మ పగటివేళలో ఒక్కొక్క మనువు మారుతున్నట్లుగా, దేవలోకంలో దేవేంద్రుడు కూడ మారుతూ ఉంటాడు.

**అష్టౌ శతసహస్రాణి దివ్యయా సంఖ్యయా గతిః ।**
**ద్వాపంచాశత్ తథాఽన్యాని సహస్రాణ్యధికాని చ ॥ 19 ॥**

ఒక మన్వంతరానికి 8,52,000 కు పైగా దివ్యవర్షాలు ఉంటాయి. (ఒక దివ్య వర్షానికి 360 మానవ సంవత్సరాలు ఉంటాయి. ఇందు అధికకాలం లెక్కించబడలేదు).

**త్రింశత్కోట్యస్తు సంపూర్ణాః సంఖ్యాతాః సంఖ్యయా ద్విజ ।**
**సప్తషష్టి స్తథాఽన్యాని నియుతాని మహామునే ॥ 20 ॥**
**వింశతిశ్చ సహస్రాణి కాలోఽయమధికం వినా ।**
**మన్వన్తరస్య సంఖ్యేయం మానుషైర్వత్సరైర్ద్విజ ॥ 21 ॥**

ఓ బ్రాహ్మణోత్తమా! మహామునీ! దీనిని మానవ సంవత్సరాలలో లెక్కిస్తే 30,67,20,000 సం॥ అవుతుంది. (ఇందు అధికకాలం లెక్కించబడలేదు.)

## విశేషాలు

| యుగం | దివ్య సం॥ | మానవ సం॥ | మొత్తము సంవత్సరాలు |
|---|---|---|---|
| కృత | 4800 | × 360 | 17,28,000 |
| త్రేతా | 3600 | × 360 | 12,96,000 |
| ద్వాపర | 2400 | × 360 | 8,64,000 |
| కలి | 1200 | × 360 | 4,32,000 |
| మొత్తము | 12000 | × 360 | 43,20,000 (ఒక మహాయుగం) |

ఒక్కొక్క మనువుయొక్క కాలం 71 మహాయుగాలు. 3 మనువుల కాలం బ్రహ్మకు ఒక పగలు 71 × 14 = 994 మహాయుగాలు. బ్రహ్మ పగటికాలం 1000 మహాయుగాలుగా చెప్పబడింది. ఈ పరిగణనలో 6 మహాయుగాల వ్యత్యాసం కనిపిస్తోంది. అందువల్లనే ఈ విష్ణుపురాణం 'సాధికా హ్యేక సప్తతిః' అని చెప్పడం జరిగింది. మానవ సంవత్సరాలలో 6×43,20,000= 2,59,20,000 సం॥ అధికం.

యుగానికి యుగానికి మధ్య సంధ్య, సంధ్యాంశ ఉన్నట్లుగానే మన్వంతరానికి మన్వంతరానికి మధ్య సంధికాలం కలదని వాయుపురాణం వచించింది. 14 మన్వంతరాలకు నడుమ 13 సంధికాలాలు వస్తాయి. ఆద్యంతాలతో కలిపి 15 సంధికాలాలు వస్తాయి. 15 సంధికాలాలు × 17,28,000 = 2,59,20,000 సం॥ ఒక సంధికాలం ఒక కృతయుగ ప్రమాణానికి సమానం. సూర్యసిద్ధాంతం కూడ దీనిని సమర్థించింది.

**యుగానాం సప్తతిః సైకా మన్వన్తరమిహోచ్యతే । కృతాబ్దసంఖ్యా తస్యాన్తే సంధిః ప్రోక్తో జలప్లవః ॥**
**ససంధయస్తే మనవః కల్పే జ్ఞేయాశ్చతుర్దశ । కృతప్రమాణః కల్పాదేః సంధిః పంచదశ స్మృతః ॥**
(సూర్యసిద్ధాంతాత్ 1-17-19)

## నైమిత్తికకల్పం

**చతుర్దశ గుణో హ్యేష కాలో బ్రాహ్మమహః స్మృతమ్ ।**
**బ్రాహ్మో నైమిత్తికో నామ తస్యాన్తే ప్రతిసంచరః ॥ 22 ॥**

మన్వంతర కాలానికి పద్నాలుగు రెట్లకాలం బ్రహ్మకు ఒక పగలు అవుతుంది. దాని చివర నైమిత్తిక ప్రళయం ఏర్పడుతుంది. బ్రహ్మ యొక్క నిద్రానిమిత్తమైన ప్రళయం కాన దానికి నైమిత్తిక ప్రళయం అని పేరు.

**తదా హి దహ్యతే సర్వం త్రైలోక్యం భూర్భువాదికమ్ ।**
**జనం ప్రయాన్తి తాపార్తా మహర్లోకనివాసినః ॥ 23 ॥**

అప్పుడు భూలోకం, భువర్లోకం, సువర్లోకం అనబడే త్రైలోక్యం దగ్ధమయిపోతుంది. ఆ తాపం ఎగసి వస్తుంటే మహర్లోకంలో నివసించే వారు తాపార్తులై జనలోకానికి వెళ్లిపోతారు.

**ఏకార్ణవే తు త్రైలోక్యే బ్రహ్మా నారాయణాత్మకః ।**
**భోగిశయ్యాగతః శేతే త్రైలోక్యగ్రాసబృంహితః ॥ 24 ॥**

మూడు లోకాలూ ఏకార్ణవం కాగా బ్రహ్మ నారాయణస్వరూపుడై, ముల్లోకాలను మ్రింగి తృప్తుడై శేషతల్పంపై శయనిస్తాడు.

**జనస్థైర్యోగిభిర్దేవ శ్చిన్త్యమానోఽబ్జసంభవః ।**
**తత్ప్రమాణం హి తాం రాత్రిం తదన్తే సృజ్యతే పునః ॥ 25 ॥**

అపుడు జనలోకవాసులైన యోగీశ్వరులు ఆయనను ధ్యానిస్తూ ఉండగా, పద్మసంభవుడైన బ్రహ్మ తన పగటి కాలమంత రాత్రి సమయం గడచిన తరువాత పునః సృష్టి కావిస్తాడు.

**ఏవంతు బ్రహ్మణో వర్షమేవం వర్షశతం చ యత్ ।**
**శతం హి తస్య వర్షాణాం పరమాయుర్మహాత్మనః ॥ 26 ॥**

ఇట్టి అహోరాత్రాలతో కూడిన కాలం దినమై క్రమంగా ఒక వర్షమై, అట్టి నూరు వర్షాలు ఆ మహాత్ముడైన బ్రహ్మకు పరమాయువయింది.

**ఏకమస్య వ్యతీతన్తు పరార్ధం బ్రహ్మణోఽనఘ! ।**
**తస్యాన్తేఽభూన్మహాకల్పః పాద్మ ఇత్యభిధీయతే ॥ 27 ॥**

ఓ పుణ్యాత్ముడా! ఆ ఆయువులో ఒక పరార్ధం గడచిపోయింది. ఆ మొదటి పరార్ధంయొక్క అంతంతో ఒక మహాకల్పం అయిపోయింది. దానిని పాద్మకల్పం అంటారు.

**ద్వితీయస్య పరార్ధస్య వర్తమానస్య వై ద్విజ ।**
**వారాహ ఇతి కల్పోఽయం ప్రథమః పరికీర్తితః ॥ 28 ॥**

ద్విజోత్తమా! ఇప్పుడు జరుగుచున్నది ద్వితీయపరార్ధంయొక్క వారాహ కల్పం అనే మొదటి కల్పంగా ప్రశస్తి వహించింది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే కాలస్వరూపం-బ్రహ్మసృష్టేః ఆవశ్యకం శక్తిస్వరూపం – ఆయుషో నిరూపణం చేతి తృతీయోఽధ్యాయః సమాప్తః ॥ 3 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో కాలస్వరూపం, బ్రహ్మసృష్టికి కావలసిన శక్తిస్వరూపం– ఆయువుయొక్క నిరూపణ అనే మూడవ అధ్యాయం సమాప్తం ॥ 3 ॥



## చతుర్థోஉధ్యాయః - నాల్గవ అధ్యాయం

## కల్పాంతే సృష్టివర్ణనమ్ - కల్పాంతంలో సృష్టివర్ణన

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అడిగాడు.

**బ్రహ్మా నారాయణాఖ్యోஉసౌ కల్పాదౌ భగవాన్ యథా ।**
**ససర్జ సర్వభూతాని తదాచక్ష్వ మహామునే ॥ 1 ॥**

ఓ మహామునీ! పరాశరా! భగవంతుడైన నారాయణుడు అనబడే బ్రహ్మ కల్పాదిలో సర్వభూతాలను ఎలా సృజించాడో నాకు తెలియజేయి (చెప్పు).

**పరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ప్రజాః ససర్జ భగవాన్ బ్రహ్మా నారాయణాత్మకః ।**
**ప్రజాపతిపతిర్దేవో యథా తన్మే నిశామయ ॥ 2 ॥**

భగవంతుడు, నారాయణ స్వరూపుడు, ప్రజాపతులకు ప్రభువు, దేవుడు అయిన బ్రహ్మ ఏవిధంగా ప్రజలను సృజించాడో చెబుతాను. విను.

**అతీతకల్పావసానే నిశాసుప్తోత్థితః ప్రభుః ।**
**సత్త్వోద్రిక్త స్తథా బ్రహ్మా శూన్యం లోకమవైక్షత ॥ 3 ॥**

గడచిపోయిన కల్పం చివర రాత్రినిద్రనుంచి లేచినవాడై, ప్రభువైన బ్రహ్మ సత్త్వగుణవృద్ధితో కూడుకొన్నవాడై, శూన్యమైన లోకాన్ని చూశాడు.

**నారాయణః పరోஉచిన్త్యః పరేషామపి స ప్రభుః ।**
**బ్రహ్మస్వరూపీ భగవాననాదిః సర్వసంభవః ॥ 4 ॥**

ఆ భగవంతుడైన నారాయణుడు పరుడు. అచింత్యుడు, పరం అని చెప్పబడే దానికన్న పరుడు ఆ ప్రభువు. బ్రహ్మస్వరూపి. తనకన్న ఆదిలేనివాడు సర్వభూతోత్పత్తి కారకుడు.

**ఇమం చోదాహరన్త్యత్ర శ్లోకం నారాయణం ప్రతి ।**
**బ్రహ్మస్వరూపిణం దేవం జగతః ప్రభవాప్యయమ్ ॥ 5 ॥**

బ్రహ్మస్వరూపుడు, దేవుడు, జగత్ప్రభవుడు, జగత్సంహారకుడు అయిన నారాయణుని గురించి ఈ శ్లోకాన్ని (మహర్షులు) ఉదాహరిస్తారు.

**ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః ।**
**అయనం తస్య తాః పూర్వం తేన నారాయణః స్మృతః ॥ 6 ॥**

నీటిని "నారములు" అని అంటారు. నరుని (పరమాత్మ) వల్ల సంభవించాయి కాబట్టి అవి 'నారములు". మొదట (మునుపు) అవి ఆయనకు నివాసస్థానాలు. కాబట్టి ఆయన నారాయణుడుగా స్మరింపబడ్డాడు.

వి ॥ 'నరతీతి నరః ప్రోక్తః పరమాత్మా సనాతనః'
'నారాః అయనం యస్య సః నారాయణః'.

**తోయాన్తః స (తోయాన్తః స్థాం) మహీం జ్ఞాత్వా జగత్యేకార్ణవే ప్రభుః ।**
**అనుమానాత్ తదుద్ధారం కర్తుకామః ప్రజాపతిః ॥ 7 ॥**

**అకరోత్ స తనూమన్యాం కల్పాదిషు యథా పురా ।**
**మత్స్యకూర్మాదికాం తద్వద్ వారాహం వపురాస్థితః ॥ 8 ॥**

జగత్తు అంతా ఏకార్ణవం కాగా, నీటిలో ఉన్నట్లుగా భూమిని గూర్చి తెలుసుకొని, దానిపైనున్న గౌరవంతో (అనుమాన ప్రమాణంతో తెలుసుకొని) ఆ ప్రభువైన ప్రజాపతి భూమిని నీటిపైకి ఎత్తదలచుకొని.

**వి ॥**తామరాకు కనిపించగా నీరు భూమి లేనిదే తామరాకు ఉండదనే దాన్ని అనుమాన ప్రమాణం అంటారు. పొగనుబట్టి నిప్పును ఊహించే ప్రమాణం. పూర్వకల్పాలలో మత్స్యం, కూర్మం మున్నగు రూపాలను ధరించినట్లే, వారాహదేహాన్ని ధరించి మరోరూపాన్ని కావించుకొన్నాడు.

**వి ॥** వరం శ్రేష్ఠం సస్యం ఆహంతీతి వరాహః శ్రేష్ఠమైన సస్యాన్ని చెరిచేది.

**వేదయజ్ఞమయం రూపమశేషజగతః స్థితౌ ।**
**స్థితః స్థిరాత్మా సర్వాత్మా పరమాత్మా ప్రజాపతిః ॥ 9 ॥**

అది వేదమయమైన యజ్ఞమయమైన రూపం. ఆ రూపం సర్వజగత్తును స్థితిరూపంలో నిలబెట్టగల్గిన రూపం. ఆ రూపమే స్థిరాత్ముడు. సర్వాత్ముడు, పరమాత్ముడు, ప్రజాపతి.

**జనలోక గతైః సిద్ధైః సనకాద్యైరభిష్టుతః ।**
**ప్రవివేశ తదా తోయమాత్మాధారో ధరాధరః ॥ 10 ॥**

ఆత్మే ఆధారంగా కలవాడై, భూమిని ధరించువాడై, జనలోకాన్ని గూర్చి వెళ్లిన సిద్ధులచేత, సనకాదుల చేత కొనియాడబడుతున్నవాడై, ఆ సమయంలో నీటిలో ప్రవేశించాడు.

**నిరీక్ష్య తం తదా దేవీ పాతాలతలమాగతమ్ ।**
**తుష్టావ ప్రణతా భూత్వా భక్తినమ్రా వసుంధరా ॥ 11 ॥**

అప్పుడు పాతాలతలానికి వచ్చిన వరాహరూప భగవంతుణ్ణి చూచి, వసుంధరాదేవి భక్తితో వంగి నమస్కరించి స్తోత్రం చేసింది.

**నమస్తే సర్వభూతాయ (పుండరీకాక్ష) తుభ్యం శంఖగదాధర! ।**
**మాముద్ధరాస్మాదద్య త్వం త్వత్తోఽహం పూర్వముత్థితా ॥ 12 ॥**

సర్వభూతాత్మకుడా! (పుండరీకాక్ష!) శంఖగదాధరా! నీకు నమస్కారం. పూర్వం నేను నీవల్ల ఉద్ధరించబడినదాననయ్యాను. ఇప్పుడు కూడా నీవు నన్ను నీటినుండి ఉద్ధరించు.

**త్వత్తోఽ హముద్ధృతా పూర్వం త్వన్మాయాహం జనార్దన! ।**
**తథాఽన్యాని చ భూతాని గగనాదీన్యశేషతః ॥ 13 ॥**

జనార్దనా! ఇదివరకు నన్ను నీవు పైకి లేవనెత్తావు. నీద్వారా నేను యథాప్రకారంగా ఉద్ధరించబడ్డాను. నేను, గగనాదిభూతాలు, సర్వం నీ మాయా స్వరూపాలే.

**నమస్తే పరమాత్మాత్మన్ పురుషాత్మన్ నమోఽస్తు తే ।**
**ప్రధానవ్యక్తభూతాయ కాలభూతాయ తే నమః ॥ 14 ॥**

పరమాత్మ స్వరూపుడవయిన నీకు నమస్కారం. పురుషభూతుడవయిన నీకు నమస్కారం. ప్రధాన (కారణ) వ్యక్త (కార్య) స్వరూపుడవైన, కాలరూపుడవైన నీకు నమస్కారం.

**త్వం కర్తా సర్వభూతానాం త్వం పాతా త్వం వినాశకృత్ ।**
**సర్గాదిషు ప్రభో బ్రహ్మవిష్ణురుద్రాత్మరూపధృక్ ॥ 15 ॥**

ప్రభూ! సమస్త ప్రాణులకు నీవు బ్రహ్మరూపంతో కర్తవు. విష్ణురూపంతో రక్షకుడవు. రుద్రరూపంతో వినాశకుడవు. సృష్టి స్థితిలయాలలో నీవు ఇలా రూపాలు ధరిస్తావు.

**సంభక్షయిత్వా సకలం జగత్యేకార్ణవీకృతే ।**
**శేషే త్వమేవ గోవిన్ద! చింత్యమానో మనీషిభిః ॥ 16 ॥**

గోవిందా! సమస్తాన్ని భక్షించి, జగత్తు ఏకార్ణవం కాగా, మనీషులచే ధ్యానింపబడుతూ, నీవే శయనించి ఉంటావు.

**భవతో యత్ పరం తత్త్వం తన్న జానాతి కశ్చన ।**
**అవతారేషు యద్రూపం తదర్చన్తి దివౌకసః ॥ 17 ॥**

నీ పరతత్త్వం ఏదై ఉందో, దాన్ని ఏ ఒక్కడూ తెలుసుకోలేడు. నీ అవతారాలలో ఏ రూపం ఉందో, దేవతలు దాన్నే అర్చిస్తారు.

**త్వామారాధ్య పరం బ్రహ్మ యాతా ముక్తిం ముముక్షవః ।**
**వాసుదేవమనారాధ్య కో మోక్షం సమవాప్స్యతి ॥ 18 ॥**

పరబ్రహ్మవైన నిన్ను ఆరాధించి ముక్తికోరే ముముక్షువులు మోక్షం పొందుతూ ఉంటారు. ఎవడు వాసుదేవుని ఆరాధించక మోక్షాన్ని పొందగలడు?

**యత్కించిన్మనసా గ్రాహ్యం యద్గ్రాహ్యం చక్షురాదిభిః ।**
**బుద్ధ్యా చ యత్పరిచ్ఛేద్యం తద్రూపమఖిలం తవ ॥ 19 ॥**

మనస్సుచే గ్రహింపబడేదీ, కన్ను మున్నగు వానిచే స్వీకరించబడేదీ, బుద్ధిచే నిశ్చయించబడేదీ సమస్తం నీ రూపమే.

**త్వన్మయాఽహం త్వదాధారా త్వత్సృష్టా త్వాముపాశ్రితా ।**
**మాధవీమితి లోకోఽయమభిధత్తే తతో హి మామ్ ॥ 20 ॥**

నేను నీతో నిండినదానను. నీవే నాకు ఆధారం. నీచే సృష్టించబడ్డదానను. నిన్నే ఆశ్రయించుకొని ఉన్నాను. ఆ కారణంచే నన్ను ఈ లోకం "మాధవి" అని అంటుంది.

**జయాఖిల జ్ఞానమయ! జయస్థూలమయావ్యయ! ।**
**జయానన్త! జయావ్యక్త! జయవ్యక్తమయ! ప్రభో! ॥ 21 ॥**

ఓ ప్రభువా! సమస్త జ్ఞానమయా! స్థూలమయా! అవ్యయా! అనంతా! అవ్యక్తా! వ్యక్తమయా! జయమగుగాక!

**పరాపరాత్మన్! విశ్వాత్మన్! జయ యజ్ఞపతేఽనఘ! ।**
**త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమోంకారస్త్వమగ్నయః ॥ 22 ॥**

ఓ పరపరాత్మా! విశ్వాత్మా! యజ్ఞేశ్వరా! పాపరహితుడా! జయమగుగాక! నీవే యజ్ఞమవు. నీవే వషట్కారం. నీవే ఓంకారమవు! అగ్నులూ నీవే.

**త్వం వేదాస్త్వం తదంగాని త్వం యజ్ఞపురుషో హరే! ।**
**సూర్యాదయో గ్రహాస్తారా నక్షత్రాణ్యఖిలం జగత్ ॥ 23 ॥**

ఓ శ్రీహరీ! నీవే వేదాలు. నీవే వేదాంగాలు. నీవే యజ్ఞపురుషుడవు. సూర్యాది గ్రహాలు, తారలు, నక్షత్రాలు, సమస్తమూ నీవే.

**మూర్తామూర్తమదృశ్యం చ కఠినం (దృశ్యం చ) పురుషోత్తమ!**
**యచ్చోక్తం యచ్చ నైవోక్తం మయాఽత్ర పరమేశ్వర ।**
**తత్సర్వం త్వం నమస్తుభ్యం భూయో భూయో నమో నమః ॥ 24 ॥**

ఓ పురుషోత్తమా! మూర్తం – అమూర్తం, దృశ్యం – అదృశ్యం నాచే ఇచ్చట చెప్పబడిందీ – చెప్పబడనిదీ సర్వం నీవే. ఓ పరమేశ్వరా! నీకు నమస్కారం. నీకు మరల మరల నమస్కారం.

**శ్రీపరాశర ఉవాచ :–** శ్రీ పరాశర మహర్షి చెప్పాడు.

**ఏవం సంస్తూయమానస్తు పృథివ్యా పృథివీశ్వరః ।**
**సామస్వరధ్వనిః శ్రీమాన్ జగర్జ పరిఘుర్ఘరమ్ ॥ 25 ॥**

ఈ విధంగా పృథివిచే స్తుతింపబడుతూ, శ్రీమంతుడైన పృథివీశ్వరుడు సామస్వరమైన ధ్వని గలవాడై ఘర్ఘర ధ్వనితో గర్జించాడు.

**తతః సముత్క్షిప్య ధరాం స్వదంష్ట్రయా మహావరాహః స్ఫుటపద్మలోచనః ।**
**రసాతలాదుత్పలపత్రసన్నిభః సముత్థితో నీల ఇవాచలో మహాన్ ॥ 26 ॥**

అటుపిమ్మట వికసించిన తామరపూలవంటి కన్నులు కలవాడు, నల్లకలువరేకులవంటి కాంతితో సమానమైనవాడు ఐన ఆ మహావరాహమూర్తి తన కోరతో భూమిని రసాతలం నుంచి పైకి లేవనెత్తి గొప్పదైన నల్లని పర్వతంలా పైకి లేచాడు.

**ఉత్తిష్ఠతా తేన ముఖానిలాహతం తత్సంభవాంభో జనలోకసంశ్రయాన్ ।**
**ప్రక్షాలయామాస హి తాన్ మహాద్యుతీన్ సనందనాదీనపకల్మషాన్మునీన్ ॥ 27 ॥**

ఆ విధంగా ఎగసి వచ్చుచున్న ఆ వరాహమూర్తి ముఖంనుండి వెల్వడిన నిశ్వాస వాయువులచే పైకి లేచిన కెరటాలలోని నీరు జనలోకవాసులైన, మహాతేజస్సంపన్నులైన సనందనాది మునీంద్రులను మరింత పాపరహితులగునట్లుగా కడిగి వేసింది.

**ప్రయాన్తి తోయాని ఖురాగ్రవిక్షతే రసాతలేఽధఃకృత శబ్దసంతతి ।**
**శ్వాసానిలాస్తాః పరతః ప్రయాన్తి సిద్ధా జనే యే నియతం వసన్తి ॥ 28 ॥**

ఆ వరాహస్వామి డెక్కల చివరి భాగాలచే రసాతలం చీలిపోగా, మహాఘోష కావిస్తూ నీళ్లు క్రిందికి ప్రవహించాయి. నిశ్వాసములనెడు వాయువులచే పైకెగసిన ఆ జలాలు సంసిద్ధములై, జనలోకమునందు వసించుచున్నవి.

**ఉత్తిష్ఠతస్తస్య జలార్ద్రకుక్షే ర్మహావరాహస్య మహీం విధార్య ।**
**విధున్వతో వేదమయం శరీరం రోమాన్తరస్థా మునయో జుషన్తి ॥ 29 ॥**

భూమాత నెత్తుకొని నీటిచేత తడవబడ్డ కుక్షితో పైకి లేస్తున్న ఆ మహావరాహమూర్తి తన వేదమయ శరీరాన్ని విదలించగా, రోమాలు ప్రసరించగా, ఆ రోమాంతఃస్థితులైన మునులు స్తోత్రం చేశారు.

**తం తుష్టువు(స్తాప) స్తోషపరీతచేతసో లోకే జనే యే నివసన్తి యోగినః ।**
**సనన్దనాద్యా (హ్య)నతినమ్రకంధరా ధరాధరం ధీరతరోద్ధతేక్షణమ్ ॥ 30 ॥**

అపుడు ఆ ధరాధర వరాహమూర్తి మహాధీరత్వంతో పైకి చూస్తూ ఉండగా, జనలోకంలో నివసించే ఏ యోగీశ్వరులైన సనందనాదులు ఉన్నారో, వారందరూ వినయవినమితకంఠంతో సంతోషంతో నిండిన మనస్సు కలవారై ఇలా స్తుతించారు.

**జయేశ్వరాణాం పరమేశ! కేశవ! ప్రభో! గదాశంఖధరాసి చక్రధృక్ ।**
**ప్రసూతినాశస్థితిహేతురీశ్వర స్త్వమేవ నాన్యత్ పరమం చ యత్పరమ్ ॥ 31 ॥**

ఓ ప్రభూ! పరమేశ్వరేశ్వరా! కేశవా! గదను, శంఖమును, భూమిని, ఖడ్గాన్ని, చక్రాన్ని ధరించియున్నవాడా! సృష్టి స్థితినాశకారకుడవైన ఓ ఈశ్వరుడవు అంతా నీవే. మరేదీ లేదు. నీకన్న పరమమైనదీ, పరమైనదీ మరొకటీలేదు.

వి॥ గదాశంఖధర+అసిచక్రధృక్ అనే పదచ్ఛేదంతో గదను, శంఖాన్ని, చక్రాన్ని, ఖడ్గాన్ని ధరించినవాడా! అని భావం.

**పాదేషు వేదాస్తవ యూపదంష్ట్ర దన్తేషు యజ్ఞాశ్చితయశ్చ వక్త్రే ।**
**హుతాశ జిహ్వోఽసి తనూరుహాణి దర్భాః ప్రభో! యజ్ఞపుమాంస్త్వమేవ ॥ 32 ॥**

ఓ ప్రభూ! నీయొక్క పాదాలలో వేదాలు ఉన్నాయి. యూపస్తంభాల వంటి నీ కోరలలో దంతాలలో యజ్ఞాలు ఉన్నాయి. వక్త్రంలో చితములు (యజ్ఞవేదికలు) ఉన్నాయి. అగ్నిహోత్రుణ్ణి జిహ్వగా కలిగి ఉన్నావు. నీ రోమాలే దర్భలు. నీవే యజ్ఞపురుషుడవు.

**విలోచనే రాత్ర్యహనీ మహాత్మన్ ! సర్వాశ్రయం బ్రహ్మపదం శిరస్తే ।**
**సూక్తాన్యశేషాణి సటాకలాపో ఘ్రాణం సమస్తాని హవీంషి దేవ ॥ 33 ॥**

ఓ మహాత్మా! నీ నేత్రాలు రేయి, పగలు. సర్వాత్మకమైన బ్రహ్మపదమే నీ శిరస్సు. (సర్వాశ్రయమైన పరబ్రహ్మమే నీ శిరస్సు) సమస్త సూక్తాలు నీజూలు. నీ నాసికయే సమస్త హవిస్సులు.

**స్రుక్తుణ్డ! సామస్వర ధీరనాద! ప్రాగ్వంశకాయాఖిల సత్రసన్ధే! ।**
**పూర్తేష్ట ధర్మశ్రవణోఽసి దేవ సనాతనాత్మన్! భగవన్! ప్రసీద ॥ 34 ॥**

స్రుక్కు నోరు (ముఖం) గా కలవాడా! సామవేద నాదంవంటి గంభీర స్వరం కలవాడా! అగ్నిశాలయే శరీరంగా కలవాడా! సమస్త యాగాలు సంధులుగా కలవాడా! స్మార్తశ్రౌత ధర్మాలు చెవులుగా కలవాడా! దేవా! నిత్యస్వరూపా! భగవంతుడా! ప్రసన్నుడవు కమ్ము.

**పదక్రమాక్రాన్తభువం భవన్త మాదిస్థితిం చాక్షర విశ్వమూర్తే! ।**
**విశ్వస్య విద్మః పరమేశ్వరోఽసి ప్రసీద నాథోఽసి చరాచరస్య ॥ 35 ॥**

వేదంలోనిపదరూపక్రమాలతో భూమిని ఆక్రమించి ఉన్న నిన్ను విశ్వానికి ఆది కారణంగా తెలుసుకొన్నాము. అక్షరా! ఓ విశ్వమూర్తీ! ఓ పరమేశ్వరా! చరాచర జగత్తుకంతకూ నీవు నాథుడవై ఉన్నావు. అనుగ్రహించు.

వి॥ నీవు భూమిని ఉద్ధరించే సమయంలో నీ అడుగులు మోపడంతో భూమిని ఆక్రమించావు.

**దంష్ట్రాగ్ర విన్యస్త మశేషమేతద్ భూమండలం నాథ! విభావ్యతే తే ।**
**విగాహతః పద్మవనం విలగ్నం సరోజినీ పత్రమివోఢ పంకమ్ ॥ 36 ॥**

ఓ ప్రభూ! నీ కోరపై ఉంచబడ్డ ఈ సమస్త భూమండలం పద్మవనంలో దిగి స్నానంచేసిన (గజరాజుయొక్క దంతాలకు చిక్కుకొన్న) బురద కల్గిన తామరాకులా ప్రకాశిస్తోంది.

**ద్యావాపృథివ్యోరతులప్రభావ! యదన్తరం తద్వపుషా తవైవ ।**
**వ్యాప్తం జగద్వ్యాప్తి సమర్థదీప్తే హితాయ విశ్వస్య విభో! భవ త్వమ్ ॥ 37 ॥**

ఓ సాటిలేని ప్రభావం కలవాడా! భూమి ఆకాశాల మధ్యభాగంలో ఉన్న ప్రదేశాన్నంతటిని నీ శరీరం వ్యాపించింది. జగత్తునంతా వ్యాపించడంలో సామర్థ్యం ఉన్న ప్రకాశం కలవాడా! ఓ ప్రభో! నీవు లోకం మేలుకొరకు ఉండవలసినవాడవు.

**పరమార్థస్త్వమేవైకో నాన్యోఽస్తి జగతఃపతే ।**
**తవైష మహిమా యేన వ్యాప్తమేతచ్చరాచరమ్ ॥ 38 ॥**

ఓ జగత్పతీ! నీవొక్కడవే పరమార్థానివి. మరెవ్వడూ కాదు. నీ మహిమ ఏదైతే ఉన్నదో, దానిచేతనే ఈ చరాచరమంతా వ్యాపించి ఉంది.

**యదేతత్ దృశ్యతే మూర్తమేతత్ జ్ఞానాత్మన స్తవ ।**
**భ్రాన్తి జ్ఞానేన పశ్యన్తి జగద్రూపమయోగినః ॥ 39 ॥**

ఏ మూర్తమైన ఈ భూతాత్మకమైన రూపం కనబడుతున్నదో, అది నీ యొక్క జ్ఞానైకమూర్తి అగు నీ జ్ఞానమయరూపమే. యోగులు కానివారు భ్రాంతిజన్యజ్ఞానంతో జగద్రూపంగా చూస్తున్నారు.

**జ్ఞానస్వరూపమఖిలం జగదేతదబుద్ధయః ।**
**అర్థస్వరూపం పశ్యన్తో భ్రామ్యన్తే మోహసంప్లవే ॥ 40 ॥**

అజ్ఞానులు జ్ఞానస్వరూపమైన ఈ సకల జగత్తును వస్తుదృష్టితో అర్థస్వరూపంగా చూస్తూ, మోహాంధకార సముద్ర ప్రవాహంలో పరిభ్రమిస్తున్నారు.

**యే తు జ్ఞానవిదః శుద్ధచేతసస్తేఽఖిలం జగత్ ।**
**జ్ఞానాత్మకం ప్రపశ్యన్తి త్వద్రూపం పరమేశ్వర ॥ 41 ॥**

ఓ పరమేశ్వరా! ఎవరు జ్ఞానవేత్తలు, నిర్మలమనస్కులు అయి ఉన్నారో, అట్టివారు దృశ్యమాన ప్రపంచాన్ని అంతటినీ, జ్ఞానస్వరూపంగా, నీరూపంగా చూస్తూ ఉంటారు.

**ప్రసీద సర్వ సర్వాత్మన్! భవాయ జగతామిమామ్ ।**
**ఉద్ధరోర్వీమమేయాత్మన్ శం నో దేహ్యబ్జలోచన! ॥ 42 ॥**

ఓ సర్వ! ఓ సర్వమూర్తీ! నీవు ప్రసన్నుడవు కమ్ము. ఈ జగత్తులు నిలిచేటట్లుగా భూమిని ఉద్ధరించు. ఓ అమేయస్వరూపా! తామరపూలవంటి కన్నులు కలవాడా! మాకు సుఖాన్ని ప్రసాదించు.

**సత్త్వోద్రిక్తోఽసి భగవన్ గోవిన్ద! పృథివీమిమామ్ ।**
**సముద్ధర భవాయేశ శం నో దేహ్యబ్జలోచన! ॥ 43 ॥**

ఓ గోవిందా! ఓ భగవానుడా! సత్త్వగుణాధికుడవై ఉన్నావు. ఈ భూమిని సృష్టి నిమిత్తం ఉద్ధరించు. ఓ ఈశ్వరా! కమలాలవంటి నేత్రాలు కలవాడా! మాకు శాంతిని అనుగ్రహించు.

**సర్గప్రవృత్తి ర్భవతో జగతాముపకారిణీ ।**
**భవత్వేషా నమస్తేఽస్తు శం నో దేహ్యబ్జలోచన! ॥ 44 ॥**

నీ సృష్టి ప్రవృత్తి జగత్తులకు ఉపకారం చేసేదగు గాక! నీకు నమస్కారం. పుండరీకాలవంటి నయనాలు కలవాడా! మాకు సుఖాన్ని ప్రసాదించు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరమహర్షి పలికాడు.

**ఏవం సంస్తూయమానస్తు (నోఽథ) పరమాత్మా మహీధరః ।**
**ఉజ్జహార క్షితిం క్షిప్రం న్యస్తవాంశ్చ మహార్ణవే ॥ 45 ॥**

ఇలా స్తుతిస్తూ ఉండగా, భూమిని ధరించి ఉన్న ఆ పరమాత్మ వెంటనే ఆ క్షితిని విడిచిపెట్టాడు. ఆ మహార్ణవంపై దానిని ఉంచాడు.

**తస్యోపరి సముద్రస్య మహతీ నౌరివ స్థితా ।**
**వితతత్వాచ్చ దేహస్య న మహీ యాతి సంప్లవమ్ ॥ 46 ॥**

ఆ సముద్రంయొక్క పై భాగంపై భూమి ఒక పెద్ద ఓడలాగా నిలిచింది. ఆ వరాహమూర్తి యొక్క బహువిస్తీర్ణమైన శరీరంవల్ల భూమి సముద్రంలో మునిగిపోలేదు. (మహీదేహ విస్తారంవల్ల అది అబ్ధిలో మునిగిపోలేదు)

**తతః క్షితిం సమాం కృత్వా పృథివ్యాం సోఽచినోద్గిరీన్ ।**
**యథావిభాగం భగవాననాదిః పరమేశ్వరః ॥ 47 ॥**

అటుపిమ్మట భూమిని సమతలంగాచేసి, ఆ అనాది అయిన, భగవంతుడైన, పరమేశ్వరుడు యథావిభాగంగా పర్వతాలను ఏర్పరచాడు.

**ప్రాక్ సర్గదగ్ధానఖిలాన్ పర్వతాన్ పృథివీతలే ।**
**అమోఘేన ప్రభావేణ ససర్జామోఘవాంఛితః ॥ 48 ॥**

సత్యమైన ఇచ్ఛ కలిగిన ఆ పరమేశ్వరుడు, వ్యర్థం కాని మహిమతో పూర్వసృష్టిలో దగ్ధమైపోయిన సమస్త పర్వతాలను భూతలంపై సృష్టించాడు.

**భూవిభాగం తతః కృత్వా సప్తద్వీపాన్ యథాతథమ్ ।**
**భూరాద్యాన్ చతురో లోకాన్ పూర్వవత్ సమకల్పయత్ ॥ 49 ॥**

అటుతరువాత భూవిభాగంచేసి, సప్తద్వీపాలను యథాతథం కావించి, మునుపటిలాగా భూలోక భువర్లోక స్వర్లోక మహర్లోకాలను (పాతాళ భూలోక భువర్లోక స్వర్లోకాలను) రూపొందించాడు.

**బ్రహ్మరూపధరో దేవ స్తతోఽసౌ రజసావృతః ।**
**చకార సృష్టిం భగవాంశ్చతుర్వక్త్రధరో హరిః ॥ 50 ॥**

ఆ తరువాత భగవంతుడైన హరి రజోగుణంతో కూడుకొన్నవాడై చతుర్ముఖుడై బ్రహ్మస్వరూపం దాల్చి సృష్టి కావించాడు.

**నిమిత్తమాత్రమేవాసీత్ సృజ్యానాం సర్గకర్మణి ।**
**ప్రధానకారణీభూతా యతో వై సృజ్యశక్తయః ॥ 51 ॥**

ఈ విధంగా సృజింపబడే సృష్టి కృత్యంలో భగవానుడు నిమిత్తమాత్రమై ఉన్నాడు. సృజించే శక్తులన్నీ ప్రధానకారణాలుగా ఉన్నాయి.

**నిమిత్తమాత్రం ముక్త్వైవం నాన్యత్కించిదపేక్షతే ।**
**నీయతే తపతాంశ్రేష్ఠ! స్వశక్త్యా వస్తు వస్తుతామ్ ॥ 52 ॥**

తపస్వులలో శ్రేష్ఠుడవైన మైత్రేయా! పరమేశ్వరునికి విశ్వరచనలో నిమిత్త కారణం తప్ప, కావలసింది మరేమీలేదు. వస్తువు స్వశక్తితోనే అనగా పరమేశ్వరగత మాయ అనెడి శక్తితోనే వస్తుత్వాన్నీ పొందుతుంది. అనగా పరిణామం చెందుతుంది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే కల్పాంతే సృష్టివర్ణనం నామ చతుర్థోఽధ్యాయః సమాప్తః ॥ 4 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో కల్పాంతంలో సృష్టివర్ణన అనే నాల్గవ అధ్యాయం సమాప్తం ॥ 4 ॥



## పంచమోఽధ్యాయః - ఐదవ అధ్యాయం

## అవిద్యాది వివిధ సృష్టి వర్ణనమ్ - అవిద్యాది వివిధ సృష్టివర్ణన

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు పలికాడు.

**యథా ససర్జ దేవోఽసౌ దేవర్షిపితృదానవాన్ ।**
**మనుష్యతిర్యగ్వృక్షాదీన్ భూవ్యోమసలిలౌకసః ॥ 1 ॥**

ఈ బ్రహ్మదేవుడు దేవతలను, ఋషులను, పితృగణాలను, దానవులను, మానవులను, తిర్యక్కులైన పశు పక్ష్యాదులను, వృక్షాలు మున్నగువాటిని, భూమిపై ఆకాశంలో నీటిలో వసించే ప్రాణులను ఎలా సృష్టించాడు?

**యద్గుణం యత్స్వరూపం చ యత్స్వభావం జగద్ద్విజ ।**
**సర్గాదౌ సృష్టవాన్ బ్రహ్మా తన్మమాచక్ష్వ తత్త్వతః ॥ 2 ॥**

ఓ ద్విజోత్తమా! ఈ జగత్తు ఏ గుణం కలదానినిగా, ఏ స్వరూపం కలదానినిగా, ఏ స్వభావం కలదానినిగా, సృష్ట్యాదిలో బ్రహ్మ సృష్టించాడో దానిని నాకు యథార్థంగా వివరించు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**మైత్రేయ కథయామ్యేష (తత్) శృణుష్వ సుసమాహితః ।**
**యథా ససర్జ దేవోఽసౌ దేవాదీనఖిలాన్ ప్రభుః ॥ 3 ॥**

మైత్రేయా! ఆ ప్రభువైన బ్రహ్మదేవుడు దేవతలు మున్నగు సర్వులను ఏవిధంగా సృజించాడో (ఇది) చెబుతాను. సావధానంగా విను.

**సృష్టిం చిన్తయతస్తస్య కల్పాదిషు యథా పురా ।**
**అబుద్ధిపూర్వకః సర్గః ప్రాదుర్భూతస్తమోమయః ॥ 4 ॥**

బ్రహ్మదేవుడు పూర్వకల్పాదులలోని సృష్టిని గూర్చి ధ్యానిస్తూ ఉండగా, మున్ముందు తమోమయమైన విశేష ధ్యానంలేని బుద్ధిపూర్వకంగాని సృష్టి సంభవించింది.

**తమో మోహో మహామోహ స్తామిస్రో హ్యన్ధసంజ్ఞితః ।**
**అవిద్యా పంచ పూర్వైషా ప్రాదుర్భూతా మహాత్మనః ॥ 5 ॥**

ఆ మహాత్మునివల్ల తమస్సు, మోహం, మహామోహం, తామిస్రం, అంధతామిస్రం అనే పేర్లతో పిలవబడే అవిద్యాపూర్వకమైన అయిదు విధాల సృష్టి ప్రాదుర్భవించింది.

**పంచధాఽవస్థితః సర్గో ధ్యాయతో ప్రతిబోధవాన్ ।**
**బహిరన్తోఽప్రకాశశ్చ సంవృతాత్మా నగాత్మకః ॥ 6 ॥**

ఈ అయిదు విధాలైన సృష్టి భగవంతుడు ధ్యానిస్తూ ఉండగా (మొదట నిలకడ సరిగా లేని కారణంగా) ఆత్మజ్ఞానం ఏమాత్రం లేనిదీ, వెలుపల ఉండే శబ్దాదులను గ్రహించలేనిదీ, లోన సుఖాదులను అనుభవించ లేనిదీ నగాత్మకమైన (స్థావరాత్మకమైన) సృష్టిగా గుర్తించినవాడయ్యాడు.

**ముఖ్యా నగా యతశ్చోక్తా ముఖ్య సర్గస్తత స్త్వయమ్ ।**
**తం దృష్ట్వాఽసాధకం సర్గ మమన్యదపరం పునః ॥ 7 ॥**

**తస్యాభిధ్యాయతః సర్గ స్తిర్యక్స్రోతాఽభ్యవర్తత ।**
**యస్మాత్ తిర్యక్ ప్రవృత్తః స తిర్యక్స్రోతా స్తతః స్మృతః ॥ 8 ॥**

ఈ నగాలు (స్థావరాలు) ముఖ్యమైనవి కాన దీనిని ముఖ్యసర్గ అని అంటారు. పురుషార్థ సాధకంకాని ఆ సృష్టిని చూచి, మరోసృష్టి కావించాలని బ్రహ్మ ధ్యానం కావించాడు. ఆయన అలా ధ్యానిస్తూ ఉండగా తిర్యక్స్రోతమైన సృష్టి కలిగింది. ఆ సృష్టిలోని ప్రాణులు అడ్డంగా సంచరిస్తాయి కాన అది తిర్యక్స్రోతం అని వ్యవహరించబడింది.

**పశ్వాదయస్తే విఖ్యాతా స్తమఃప్రాయా హ్యవేదినః ।**
**ఉత్పథ గ్రాహిణశ్చైవ తేఽ జ్ఞానే జ్ఞానమానినః ॥ 9 ॥**

అందుపుట్టిన పశుపక్ష్యాదులు తమోగుణంతో కూడినవి. జ్ఞానం లేనివి. దారి తప్పి నడిచేవి. తెలివిలేనివయినను తెలివికలవానిలా ప్రవర్తించేవి. అందువల్ల పశువులని పేరు వహించాయి.

**అహంకృతా అహంమానా అష్టావింశద్వధాత్మకాః ।**
**అన్తః ప్రకాశాస్తే సర్వే ఆవృతాశ్చ పరస్పరమ్ ॥ 10 ॥**

అవి అహంకారంతో కూడుకొన్నవి. వాటి చిత్తవృత్తులు అహంకార పూరితాలు. అవి ఇరవై ఎనిమిది వధస్వభావాలు కలిగినట్టివి. వాటిలో చైతన్యం అంతర్గతమై ఉంటుంది. అనగా బహిర్గతం కాదు. ఒకటి ఇంకొకదాని స్వభావాలు తెలియనట్టివి. ఒక జీవి సంగతి మరో జీవికి తెలియనివి కాన పరస్పరావృతాలు.

**వి ॥**వధలనగా దోషాలు. చెవుడు, గ్రుడ్డి మున్నగు ఇంద్రియ దోషాలు 11, తుష్టి యొక్క అశక్తులు9, సిద్ధి యొక్క అశక్తులు 8, మొత్తం 28 దోషాలని సాంఖ్యకారికలు చెబుతున్నాయి.

**తమప్యసాధకం మత్వా ధ్యాయతోఽన్యస్తతోఽభవత్ ।**
**ఊర్ధ్వస్రోతాస్తృతీయస్తు సాత్త్వికోర్ధ్వమవర్తత ॥ 11 ॥**

దాన్ని కూడ పురుషార్థసాధకం కాని దాన్నిగా తలచి, మళ్లీ ధ్యానిస్తూ ఉండగా మరో సృష్టి సంభవించింది. ఇది మూడవదైన ఊర్ధ్వస్రోతం (స్సు). ఇది సాత్త్వికగుణం అధికంగా కలది కాబట్టి ఆ సృష్టి ఊర్ధ్వగమనం కలదయింది.

**తే సుఖప్రీతిబహులా బహిరన్త స్త్వనావృతాః ।**
**ప్రకాశబహిరన్తశ్చ ఊర్ధ్వస్రోతోద్భవాః స్మృతాః ॥ 12 ॥**

ఇందలి జీవులు సుఖము, ప్రీతి ఎక్కువగా కలవారు. బయటా, లోపలా విజ్ఞానానికి అడ్డంకి లేనివారు. బహిరన్తః ప్రకాశకులు. ఈ ఊర్ధ్వస్రోతస్సునుండి పుట్టినవారు జ్ఞానవంతులు.

**తుష్టాత్మానస్తృతీయస్తు దేవసర్గస్తు స స్మృతః ।**
**తస్మిన్ సర్గేఽభవత్ ప్రీతిర్నిష్పన్నే బ్రహ్మణ స్తదా ॥ 13 ॥**

**తతోఽన్యం స తదా దధ్యే సాధకం సర్గముత్తమమ్ ।**
**అసాధకాంస్తు తాన్ జ్ఞాత్వా ముఖ్యసర్గాదిసంభవాన్ ॥ 14 ॥**

ఈ తృతీయసర్గ సంతోషముతో కూడుకొన్న ఆత్మ కలిగినట్టిది. అది దేవసర్గగా వ్యవహరించబడింది. ఈ సృష్టిపట్ల బ్రహ్మకు సంప్రీతి కలిగింది. అంత సంతుష్టి కలిగినప్పటికీ ముఖ్యసర్గమున్నగు సృష్టులలో కలిగిన ప్రాణులన్నీ పురుషార్థ సాధకాలు కావన్నట్లు తెలిసికొని, దేవసర్గ మిక్కిలి ఉన్నతమైనా అది ప్రజాసృష్టికి ఉపకరించేది కాదని భావించి, బ్రహ్మ తత్సాధకమైన మరో ఉత్తమ సృష్టిని గూర్చి ధ్యానించాడు.

**తథాఽభిధ్యాయతస్తస్య సత్యాభిధ్యాయినస్తతః ।**
**ప్రాదుర్బభూవ చావ్యక్తా దర్వాక్స్రోతస్తు సాధకమ్ ॥ 15 ॥**

ఆ సత్యసంకల్పుడైన బ్రహ్మ అలా ధ్యానిస్తూ ఉండగా, పురుషార్థసాధకమైన అర్వాక్ స్రోతస్సు అనే సృష్టి అవ్యక్తం నుంచి ఉద్భవించింది.

**యస్మాదర్వాక్ ప్రవర్తన్తే తతోఽర్వా క్స్రోతసస్తు తే ।**
**తే చ ప్రకాశబహులా స్తమోద్రిక్తా రజోఽధికాః ॥ 16 ॥**

ఈ సృష్టిలోని జీవులు క్రిందివైపు (పోయిన ఆహారంవల్ల) వృద్ధి పొందుతారు కాబట్టి, వారు అర్వాక్స్రోతస్సులు అయ్యారు. వీరు జ్ఞానాధికులు. తమోద్రిక్తులు. రజోగుణ బాహుల్యం కలవారు. వీరు త్రిగుణభావాలలోను అధికులే.

**తస్మాత్తే దుఃఖబహులా భూయో భూయశ్చ కారిణః ।**
**ప్రకాశా బహిరన్తశ్చ మనుష్యాః సాధకాశ్చ తే ॥ 17 ॥**

ఆ కారణంచే వారు దుఃఖబాహుళ్యం కలవారు. ఒక పనిని మాటిమాటికి చేసేవారు. బహిరన్తః జ్ఞానం కలవారు. మనుష్యులు పురుషార్థసాధకులు కూడ అయ్యారు.

**ఇత్యేతే కథితాః సర్గాః షడత్ర మునిసత్తమ! ।**
**ప్రథమో మహతః సర్గో విజ్ఞేయో బ్రహ్మణస్తు సః ॥ 18 ॥**

మునిశ్రేష్ఠా! ఈ విధంగా నీకు ఆరు సృష్టులు చెప్పబడ్డాయి. బ్రహ్మయొక్క సృష్టిలో మొదటిది మహత్తత్త్వసృష్టి.

**తన్మాత్రాణాం ద్వితీయశ్చ భూతసర్గస్తు స స్మృతః ।**
**వైకారిక స్తృతీయస్తు సర్గ ఐన్ద్రియకః స్మృతః ॥ 19 ॥**

రెండవది తన్మాత్రసృష్టి. అదే భూతసృష్టిగా వ్యవహరింపబడుతోంది. మూడోది వైకారికసృష్టి. అది ఇంద్రియసమూహసృష్టిగా స్మరించబడుతోంది.

**ఇత్యేష ప్రాకృతః సర్గః సంభూతో బుద్ధిపూర్వకః ।**
**ముఖ్యసర్గశ్చతుర్థస్తు ముఖ్యా వై స్థావరాః స్మృతాః ॥ 20 ॥**

ఈ మూడింటినీ కలిపి ప్రాకృతసర్గ అంటారు. ఇది చతుర్ముఖ బ్రహ్మకు బుద్ధిపూర్వకంగా సంభవించింది. నాల్గవది ముఖ్య సర్గ. ముఖ్యాలే స్థావరాలుగా స్మరించబడ్డాయి.

**తిర్యక్స్రోతాస్తు యః ప్రోక్త స్తైర్యగ్యోన్యః స ఉచ్యతే ।**
**ఊర్ధ్వస్రోతాస్తతః షష్ఠో దేవసర్గస్తు స స్మృతః ॥ 21 ॥**

తిర్యగ్యోని సంభవసృష్టి ఏదైతే ఉన్నదో, అది తిర్యక్ స్రోతః సృష్టి అనబడుతోంది (ఇది అయిదవది). ఆరోది ఊర్ధ్వస్రోతఃసృష్టి. అదే దేవసృష్టి.

**తతోఽర్వాక్స్రోతసః సర్గః సప్తమః స తు మానుషః ।**
**అష్టమోఽనుగ్రహః సర్గః సాత్త్వికస్తామసశ్చ సః ॥ 22 ॥**

అటుతర్వాత ఏడోది అర్వాక్ స్రోతఃసృష్టి. అదే మానుషసృష్టి. ఎనిమిదోది అనుగ్రహ సర్గ. అది సాత్త్వికం, తామసికం అని రెండు విధాలు.

**పంచైతే వైకృతాః సర్గాః ప్రాకృతాస్తు త్రయః స్మృతాః ।**
**ప్రాకృతా వైకృతాశ్చైవ కౌమారో నవమః స్మృతః ॥ 23 ॥**

ఈ అయిదూ వైకృతసర్గలు. ప్రాకృత సర్గలు మూడు. ప్రాకృత వైకృత సర్గలు మొత్తం ఎనిమిది. తొమ్మిదోది కౌమారసర్గగా వ్యవహరింపబడింది.

**ఇత్యేతే వై సమాఖ్యాతా నవసర్గాః ప్రజాపతేః ।**
**ప్రాకృతా వైకృతాశ్చైవ జగతో మూలహేతవః ।**
**సృజతో జగదీశస్య కిమన్యత్ శ్రోతుమిచ్ఛసి ॥ 24 ॥**

సృష్టి కర్తయొక్క తొమ్మిది విధాలైన సర్గలు ఈ విధంగా చెప్పబడ్డాయి. సృష్టి చేసే జగదీశ్వరునికి, జగన్నిర్మాణానికి ప్రాకృత వైకృత సర్గలు మూలకారణాలయ్యాయి. ఇంక మరి ఏమి వినగోరుచున్నావు?

**శ్రీమైత్రేయ ఉవాచ :–** మైత్రేయుడు అడుగుతున్నాడు.

**సంక్షేపాత్ కథితః సర్గో దేవాదీనాం మునే! త్వయా ।**
**విస్తరాచ్ఛ్రోతుమిచ్ఛామి త్వత్తో మునివరోత్తమ ॥ 25 ॥**

మునీంద్రా! నీచే దేవాదిసృష్టి సంక్షేపంగా చెప్పబడింది. ఓ మునివరులలో ఉత్తముడా! నీవల్ల దానిని సవిస్తరంగా వినుటకై కుతూహలపడుతున్నాను.

**శ్రీపరాశర ఉవాచ :–** శ్రీపరాశరుడు చెప్పాడు.

**కర్మభిర్భావితాః పూర్వైః కుశలాకుశలైస్తు తాః ।**
**ఖ్యాత్యా తయా హ్యనిర్ముక్తాః సంహారే హ్యుపసంహృతాః ॥ 26 ॥**

మైత్రేయా! పూర్వంలో వారిచే కావించబడ్డ పుణ్యపాపకర్మల ప్రభావంవల్ల వారు, దానిచే ఏర్పడ్డ సంస్కార విశేషంచే ముక్తిని పొందకుండా లయకాలంలో ఉపాధి భంగమయినా వాసనలచే విడివిడక సూక్ష్మరూపావశిష్టులై ఉపసంహరించబడ్డారు.

**స్థావరాన్తాః సురాద్యాస్తు ప్రజా బ్రహ్మంశ్చతుర్విధాః ।**
**బ్రహ్మణః కుర్వతః సృష్టిం జజ్ఞిరే మానసాస్తు తాః ॥ 27 ॥**

ఓ బ్రాహ్మణా! దేవతలు మొదలుకొని స్థావరాల వరకూ గల నాల్గువిధాలైన ప్రజాసృష్టి బ్రహ్మసృష్టి చేసే సమయంలో వాటి పూర్వకర్మానుసారబుద్ధిప్రకారంగా బ్రహ్మమానసిక సంతతిగా ఆవిర్భవించడం జరిగింది.

**తతో దేవాసురపితౄన్ మానుషాంశ్చ చతుష్టయమ్ ।**
**సిసృక్షురంభాంస్యేతాని స్వమాత్మానమయూయుజత్ ॥ 28 ॥**

అనంతరం దేవతలను, అసురులను, పితరులను, మనుష్యులను అనే నాలుగురకాల జీవులను సృజించాలని జలాల నుంచి (దానిలోని జీవులను) సృజించదలచుకొన్నవాడై, తన మనస్సును శరీరంతో సంయోజనం చేశాడు (అంభసి).

**యుక్తాత్మనస్తమోమాత్రా హ్యుద్రిక్తాఽభూత్ ప్రజాపతేః ।**
**సిసృక్షోర్జఘనాత్ పూర్వమసురా జజ్ఞిరే తతః ॥ 29 ॥**

అట్లు సంయోగమందినంతమాత్రాన ఆ ప్రజాపతియొక్క తమోమాత్రమైన శరీరం ఉద్రేకం చెందింది. అప్పుడు ఆయనయొక్క సృష్టికార్యంలో మొదట జఘనం (పిరుదు) నుంచి అసురులు జన్మించారు.

**ఉత్ససర్జ తతస్తాన్తు తమోమాత్రాత్మికాం తనూమ్ ।**
**సా తు త్యక్తా తతస్తేన మైత్రేయాభూద్విభావరీ ॥ 30 ॥**

మైత్రేయా! ఆ తరువాత ఆయన తమోమాత్రాస్వరూపమైన ఆ తనువును విడిచిపెట్టాడు. ఆయనచే వదలివేయబడ్డ ఆ తనువు ఆ కారణంచే రాత్రి అయింది.

**సిసృక్షు రన్యదేహస్థః ప్రీతిమాప తతః సురాః ।**
**సత్త్వోద్రిక్తాః సముద్భూతా ముఖతో బ్రహ్మణో ద్విజ ॥ 31 ॥**

ద్విజోత్తమా! ఆయన మరో శరీరం స్వీకరించి సృష్టి కావించాలని సంప్రీతి చెందాడు. అంతట బ్రహ్మయొక్క ముఖంనుంచి సత్త్వగుణాధికులైన సురలు జన్మించారు.

**త్యక్త్వా సా తు తనుస్తేన సత్త్వప్రాయమభూద్దినమ్ ।**
**తతో హి బలినో రాత్రావసురా దేవతా దివా ॥ 32 ॥**

ఆ తరువాత ఆయన సత్త్వప్రాయమైన ఆ శరీరాన్ని విడిచిపెట్టాడు. అది పగలు అయింది. అందువల్ల రాత్రివేళ రాక్షసులు, పగటివేళ దేవతలు బలవంతులయ్యారు.

**సత్త్వమాత్రాత్మికామేవ తతోఽన్యాం జగృహే తనూమ్ ।**
**పితృవన్మన్యమానస్య పితరస్తస్య జజ్ఞిరే ॥ 33 ॥**

ఆ తరువాత ఆయన మరో సత్త్వమాత్రాత్మికమైన శరీరాన్ని స్వీకరించాడు. అపుడు ఆయన "నేను తండ్రిని" అని భావించుకొన్న కారణంచే పితరులు జన్మించారు.

**ఉత్ససర్జ పితౄన్ సృష్ట్వా తతస్తామపి స ప్రభుః ।**
**సా చోత్సృష్టాఽభవత్ సన్ధ్యా దిననక్తాన్తరస్థితిః ॥ 34 ॥**

ఆ ప్రభువు అట్లు పితరులను సృష్టించి, అటుపిమ్మట ఆ తనువునూ విడిచిపెట్టాడు. అట్లు విడిచిపెట్టబడిన ఆ దేహం పగటికి రాత్రికి నడుమ నుండే సంధ్య అయింది.

**రజోమాత్రాత్మికామన్యాం జగృహే స తనుం తతః ।**
**రజోమాత్రోత్కటా జాతా మనుష్యా ద్విజసత్తమ! ॥ 35 ॥**

ద్విజపుంగవా! ఆ పైన ఆయన రజోమాత్రాత్మికమైన మరో శరీరం స్వీకరించాడు. దానినుండి రజోగుణాధికులైన మనుష్యులు జన్మించారు.

**తామప్యాశు స తత్యాజ తనుం సద్యః ప్రజాపతిః ।**
**జ్యోత్స్నా సమభవత్ సాఽపి ప్రాక్సన్ధ్యా యాఽభిధీయతే ॥ 36 ॥**

చాలా శీఘ్రంగా ఆ ప్రజాపతి వెంటనే ఆ శరీరాన్ని విడిచిపెట్టాడు. అది జ్యోత్స్న (వెన్నెల) గా ఏర్పడింది. అది ప్రాక్సంధ్య (తొలిసంజ) అని పిలవబడింది.

**జ్యోత్స్నాయామేవ బలినో మనుష్యాః పితరస్తథా ।**
**మైత్రేయ సన్ధ్యాసమయే తస్మాదేతే భవన్తి వై ॥ 37 ॥**

మైత్రేయా! అందువల్లనే ఆ వెన్నెల ఏర్పడగానే ప్రాతఃసంధ్య నుండి సాయంసంధ్య వరకు క్రమంగా మనుష్యులు పితరులు బలవంతులగుచున్నారు. అందువల్ల పూర్వాహ్ణంలో మానవులు, అపరాహ్ణంలో పితరులు బలవంతులు.

**జ్యోత్స్నా రాత్ర్యహనీ సన్ధ్యా చత్వార్యేతాని వై ప్రభోః ।**
**బ్రహ్మణస్తు శరీరాణి త్రిగుణోపాశ్రయాణి తు ॥ 38 ॥**

వెన్నెల, రాత్రి, పగలు, సంధ్య అనే ఈ నాలుగు ప్రభువైన బ్రహ్మదేవుని యొక్క త్రిగుణాలను ఆశ్రయించి ఉండే శరీరాలు.

**రజోమాత్రాత్మికామేవ తతోఽన్యాం జగృహే తనుమ్ ।**
**తతః క్షుద్ బ్రహ్మణో జాతా జజ్ఞే కోపస్తయా తతః ॥ 39 ॥**

ఆ తరువాత ఆయన రజోమాత్రాత్మికమైన మరో తనువునే స్వీకరించాడు. దానివల్ల బ్రహ్మనుండి ఆకలి పుట్టింది. దానిచే వ్యాపించబడి కోపం జనించింది.

**క్షుత్క్షామానన్ధకారేఽథ సోఽసృజత్ భగవాంస్తతః ।**
**విరూపాః శ్మశ్రులా జాతాస్తేఽభ్యధావంస్తతః ప్రభుమ్ ॥ 40 ॥**

పిమ్మట భగవంతుడు చీకటిలో ఆకలికి బక్కచిక్కిన వారిని సృజించాడు. అపుడు వికృతరూపులు, గడ్డాలు కలిగినవారు పుట్టారు. వారు బ్రహ్మనే (తినదలచి) తరిమారు.

**మైవం భో రక్ష్యతామేష యైరుక్తం రాక్షసాస్తు తే ।**
**ఊచుః ఖాదామ ఇత్యన్యే యే తే యక్షాస్తు జక్షణాత్ ॥ 41 ॥**

"ఇలా కాదు ఈతడు రక్షించబడుగాక!" అని కొందరు ఎవరైతే అన్నారో వారు రాక్షసులయ్యారు. మరికొందరు "ఈ సృష్టికర్తను తినివేద్దాము" అని అన్నారు. వారు జక్షణక్రియా ప్రకటనంవల్ల యక్షులయ్యారు. (మైవం భో రక్ష్యతామేషః – అని కలిపి వాక్యార్థం చెప్పినచో ఈతనిని రక్షింపవద్దని అన్నవారు కాన రాక్షసులయ్యారనే అర్థం కూడ వస్తోంది. ఇదే సరియైన భావం).

**అప్రియానథ తాన్ దృష్ట్వా కేశాః శీర్యన్త వేధసః ।**
**హీనాశ్చ శిరసో భూయః సమారోహన్త తచ్ఛిరః ॥ 42 ॥**

అప్రియంగా వారిని చూసేసరికి బ్రహ్మయొక్క కేశాలు శిరస్సునుండి రాలిపడ్డాయి. శిరస్సునుండి హీనాలై రాలిపడినప్పటికీ అవి మళ్లీ బ్రహ్మ శిరస్సునెక్కాయి.

**సర్పణాత్ తేఽభవన్ సర్పా హీనత్వాదహయః స్మృతాః ।**
**తతః క్రుద్ధో జగత్స్రష్టా క్రోధాత్మనో వినిర్మమే ॥ 43 ॥**

అవి పైకి ఎగబ్రాకడంచే (సర్పణంచే) సర్పాలయ్యాయి. క్రింద ప్రాకినందున (హీనత్వంచే) అహులు అని పిలవబడ్డాయి. (శిరస్సు హీనం అగుటచే అహి అయ్యిందని వేరొక భావం). అందువల్ల సృష్టికర్త కోపగించినవాడై క్రోధాత్ములను సృష్టించాడు.

**వర్ణేన కపిశేనోగ్రా భూతాస్తే పిశితాశనాః ।**
**ధయన్తో గాం సముత్పన్నా గంధర్వాస్తస్య తత్క్షణాత్ ॥ 44 ॥**

వారు కపిశవర్ణం (పసుపు మీరిన ఎఱ్ఱరంగు) కలవారు, మహాభయంకరులు, ప్రాణిభక్షకులు, మాంసభక్షకులు అయ్యారు. అటుపిమ్మట శీఘ్రమే ఆయన శరీరంనుంచి వాక్కును త్రాగుతూ (పాడుతూ) గంధర్వులు ఉద్భవించారు.

**పిబన్తో జజ్ఞిరే వాచం గన్ధర్వాస్తేన తే ద్విజ ।**
**ఏతాని సృష్ట్వా భగవాన్ బ్రహ్మా తచ్ఛక్తిచోదితః ॥ 45 ॥**

**తతః స్వచ్ఛన్దతోఽన్యాని వయాంసి వయసోఽసృజత్ ।**
**అవయో వక్షసశ్చక్రే ముఖతోఽజాః స సృష్టవాన్ ॥ 46 ॥**

మైత్రేయా! వారు వాక్కును త్రాగుతూ పుట్టిన కారణంచే గంధర్వులయ్యారు. భగవంతుడైన బ్రహ్మ ఈ విధంగా సృష్టించినవాడై శక్తియొక్క ప్రేరణంచే ఆ తరువాత పూర్వంలో వాటి కర్మల వశంగా ప్రేరితుడై తన వయస్సునుంచి పక్షులను తనంత తాను స్వచ్ఛందంగా సృష్టించాడు. వక్షః స్థలంనుంచి గొఱ్ఱెలను, ముఖం నుంచి మేకలను సృజించాడు.

**సృష్టవానుదరాద్గాశ్చ పార్శ్వాభ్యాం చ ప్రజాపతిః ।**
**పద్భ్యామశ్వాన్ సమాతంగాన్ శరభాన్ గవయాన్ మృగాన్ ॥ 47 ॥**

ఆ ప్రజాపతి ఉదరం నుంచి, ఇరుపార్శ్వాల నుంచి గోవులను (పశువులను) సృష్టించాడు. పాదాలనుంచి గుఱ్ఱాలను, ఏనుగులను, గాడిదలను, గవయ మృగాలను, లేళ్లను సృష్టించాడు.

**ఉష్ట్రానశ్వతరాంశ్చైవ న్యంకూనన్యాంశ్చ జాతయః ।**
**ఓషధయః ఫలమూలిన్యో రోమభ్యస్తస్య జజ్ఞిరే ॥ 48 ॥**

అంతేకాక ఆ పాదాలనుంచే ఒంటెలను, కంచరగాడిదలను, ఒక జాతి ఇఱ్ఱులను (లేళ్లను), ఇంకా పెక్కు జాతులను సృష్టించాడు. ఆయన రోమాలనుండి ఫలమూలములైన ఓషధులు ఉద్భవించాయి.

**త్రేతాయుగముఖే బ్రహ్మా కల్పస్యాదౌ ద్విజోత్తమ ।**
**సృష్ట్వా పశ్వోషధీః సమ్యగ్ యుయోజ స తదాధ్వరే ॥ 49 ॥**

బ్రాహ్మణోత్తమా! కల్పాదియందే త్రేతాయుగం యజ్ఞ ప్రధానం కాన పశువులను ఓషధులను సృష్టించి, వాటిని ఆయన యజ్ఞంలో చక్కగా ఉపయోగపరచాడు (యజ్ఞాంగాలుగా ఏర్పరచాడు).

**గౌరజః పురుషో మేషశ్చాశ్వాశ్వతర్దగద్దభాః ।**
**ఏతాన్ గ్రామ్యాన్ పశూన్ ప్రాహు రారణ్యాంశ్చ నిబోధ మే ॥ 50 ॥**

**శ్వాపదో ద్విఖురో హస్తీ వానరః పక్షిపంచమః ।**
**ఔదకాః పశవః షష్ఠాః సప్తమాస్తు సరీసృపాః ॥ 51 ॥**

(పశువు) ఆవు, మేక, మగగొఱ్ఱె, గుఱ్ఱాలు, కంచర గాడిద, గాడిద వీటిని గ్రామ్య పశువులంటారు. ఇక అడవి జంతువులను గూర్చి తెలుసుకొమ్ము. శ్వాపదాలవంటి (పులి, ఖడ్గమృగం మొ॥) క్రూర జంతువు, రెండు డెక్కలు కల ద్విశఫము, ఏనుగు, కోతి, పక్షి – ఈ ఐదు రకాలు ఆరో రకం జలజంతువులు, ఏడోరకం సరీసృపాలు (సర్పజాతి) మొదలైన మృగాలు.

**గాయత్రం చ ఋచశ్చైవ త్రివృత్స్తోమం రథన్తరమ్ ।**
**అగ్నిష్టోమం చ యజ్ఞానాం నిర్మమే ప్రథమాన్ముఖాత్ ॥ 52 ॥**

గాయత్రచ్ఛందం, ఋగ్వేదం, త్రివృత్స్తోమం (స్తుతులగు ఋక్కుల సముదాయం) రథం తరసామ, యజ్ఞాలలో అగ్నిష్టోమం బ్రహ్మ తన మొదటి ముఖంనుండి సృష్టించాడు.

**యజూంషి త్రైష్టుభం ఛన్దస్తోమం పంచ దశం తథా ।**
**బృహత్ సామ తథోక్థ్యం చ దక్షిణాదసృజన్ ముఖాత్ ॥ 53 ॥**

యజుర్వేదం, త్రిష్టుప్ ఛందం, పంచదశ స్తోమవృత్తి బృహత్సామ, యజ్ఞాలలో ఉక్థ్యయాగం వీటిని బ్రహ్మ తన దక్షిణ ముఖంనుండి సృష్టించాడు.

**సామాని జగతీఛన్దః స్తోమం సప్తదశం తథా ।**
**వైరూపమతిరాత్రం చ పశ్చిమాదసృజన్ ముఖాత్ ॥ 54 ॥**

సామవేదం, జగతీఛందం, సప్తదశ స్తోమములు (మంత్రములు), వైరూపసామ, యజ్ఞాలలో అతిరాత్రం– వీటిని బ్రహ్మ తన పశ్చిమముఖంనుంచి ప్రవర్తింపజేశాడు.

**ఏకవింశమథర్వాణ మాప్తోర్యామాణమేవ చ ।**
**అనుష్టుభం స వైరాజముత్తరాదసృజన్ముఖాత్ ॥ 55 ॥**

అథర్వణవేదం, అనుష్టుప్ ఛందం, ఏకవింశస్తోమవృత్తి వైరాజసామ, యజ్ఞాలలో ఆప్తోర్యామం – వీటిని బ్రహ్మ తన ఉత్తరముఖం నుంచి కల్పించాడు.

**ఉచ్చావచాని భూతాని గాత్రేభ్యస్తస్య జజ్ఞిరే ।**
**దేవాసుర పితౄన్ సృష్ట్వా మనుష్యాంశ్చ ప్రజాపతిః ॥ 56 ॥**

ఈ విధంగా ఉత్కృష్ట నికృష్ట (ఉచ్చనీచ) ప్రాణులు ఆయన అవయవాల నుండి జన్మించడం జరిగింది. ప్రజాపతి బ్రహ్మ దేవతలను, అసురులను, పితరులను, మానవులను పైన చెప్పిన విధంగా సృష్టించడం జరిగింది.

**తతః పునః ససర్జాదౌ స కల్పస్య పితామహః ।**
**యక్షాన్ పిశాచాన్ గన్ధర్వాంస్తథైవాప్సరసాం గణాన్ ॥ 57 ॥**

అటుపిమ్మట మళ్లీ పితామహుడు కల్పాదిలోనే యక్షులను, పిశాచులను, గంధర్వులను, అప్సరోగణాలను సృష్టించాడు.

**నరకిన్నరరక్షాంసి వయః పశుమృగోరగాన్ ।**
**అవ్యయం చ వ్యయం చైవ యదిదం స్థాణుజంగమమ్ ॥ 58 ॥**

నరులను, కిన్నరులను, రక్షస్సులను, పక్షులను, పశువులను, మృగాలను, సర్పాలను, అవినాశ వినాశాలు అయ్యే స్థావర జంగమ ప్రపంచాన్ని అంతా సృష్టించాడు.

**తత్ ససర్జ తదా బ్రహ్మా భగవానాదికృద్విభుః ।**
**తేషాం చ యాని కర్మాణి ప్రాక్ సృష్ట్యాం ప్రతిపేదిరే ॥ 59 ॥**

భగవంతుడు, ఆదికర్త, ప్రభువు అయిన బ్రహ్మ సృష్టినంతా అలా పూర్వంలా సృజించాడు. ఆ సృష్టించబడ్డ వాటికి క్రిందటి కల్పసృష్టిలో ఏయే కర్మలు విహితమై పొందాయో, వాటినే ఈ సృష్టిలో అవి పొందడం జరుగుతుంది.

**హింస్రాహింస్రే మృదుక్రూరే ధర్మాధర్మావృతానృతే ।**
**తద్భావితాః ప్రపద్యన్తే తస్మాత్ తత్ తస్య రోచతే ॥ 60 ॥**

హింస – అహింస, మృదుత్వం – క్రూరత్వం, ధర్మం – అధర్మం, ఋతం – అనృతం అనేవి ఆ బ్రహ్మచే భావించబడే ఆ భూతాలు పూర్వకర్మ వాసనారుచితో అవి పొందుతాయి. అందువల్ల అదే దానికి రుచిస్తుంది.

**ఇన్ద్రియార్థేషు భూతేషు శరీరేషు చ స ప్రభుః ।**
**నానాత్వం వినియోగం చ ధాతైవ వ్యసృజత్ స్వయమ్ ॥ 61 ॥**

ఇంద్రియార్థాలైన శబ్దాదివిషయాల్లో, ప్రాణుల్లో, శరీరాల్లో, వాటి కర్తవ్యాల్లో ఆ ప్రభువైన బ్రహ్మ నానాత్వాన్ని వాటి వాటి కర్మానుగుణంగానే సృష్టించాడు.

**నామరూపం చ భూతానాం కృత్యానాం చ ప్రపంచనమ్ ।**
**వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకార సః ॥ 62 ॥**

ఆ ప్రాణుల నామరూపాలను, వాటి వాటి కర్తవ్యవివరణం, దేవాదుల కృత్యాలను వేదశబ్దాల ననుసరించి ధాత మొదట నిర్దేశించాడు.

**ఋషీణాం నామధేయాని యథా వేద శ్రుతాని వై ।**
**యథా నియోగయోగ్యాని సర్వేషామపి సోఽకరోత్ ॥ 63 ॥**

ఋషుల, నామధేయాలను మునుపు వేదాలలో వినబడ్డవే ఇప్పుడు కావించాడు. సమస్త ప్రపంచముయొక్క కర్తవ్యయోగ్యతలను యథాపూర్వంగా ఆ ప్రభువు కావించాడు.

**యథర్తావృతులింగాని నానారూపాణి పర్యయే ।**
**దృశ్యన్తే తాని తాన్యేవ తథాభావా యుగాదిషు ॥ 64 ॥**

ఋతువులు మారుతూ ఉంటే ఆ ఋతుధర్మాలు, చిహ్నాలు నానారూపాలై ఎలా కనిపిస్తాయో, ఆ యుగం, ఆ మన్వంతరం, ఆ కల్పం వచ్చేసరికి ఆయా యుగధర్మాలు వివిధ రూపాలలో కనిపిస్తూ ఉంటాయి. (యథా+ఋతా+ ఋతులింగాని)

**కరోత్యేవం విధాం సృష్టిం కల్పాదౌ సః పునః పునః ।**
**సిసృక్షాశక్తియుక్తోఽసౌ సృజ్యశక్తిప్రచోదితః ॥ 65 ॥**

సృష్టి కావించాలనే కోరికతో కూడిన శక్తి గల్గిన ఆ బ్రహ్మ సృజించబడే శక్తులచే ప్రేరేపించబడ్డవాడై, ఇటువంటి సృష్టినే ప్రతికల్పాదిలోను పునః పునః (మళ్లీ మళ్లీ) కావిస్తూ ఉంటాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే అవిద్యాది వివిధ సృష్టి వర్ణనం నామ పంచమోఽధ్యాయః సమాప్తః ॥ 5 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో అవిద్యాది వివిధ సృష్టి వర్ణన అనే అయిదవ అధ్యాయం సమాప్తం ॥ 5 ॥



## షష్ఠోఽ ధ్యాయః - ఆరవ అధ్యాయం

## చాతుర్వర్ణ్య వ్యవస్థా - పృథివీవిభాగః - అన్నాదీనాం ఉత్పత్తి వర్ణనమ్

చాతుర్వర్ణ్య వ్యవస్థ - పృథివీవిభాగం - అన్నాదుల ఉత్పత్తి వర్ణన

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అడిగాడు.

**అర్వాక్ స్రోతాస్తు కథితో భవతా యస్తు మానుషః ।**
**బ్రహ్మన్ విస్తరతో బ్రూహి బ్రహ్మ తమసృజ ద్యథా ॥ 1 ॥**

బ్రాహ్మణోత్తమా! అర్వాక్ స్రోతస్సు అయిన మానవసృష్టిని గూర్చి నీచే ఏది చెప్పబడిందో, బ్రహ్మ దానిని ఎలా సృజించాడో సవిస్తరంగా తెలియజేయి.

**యథా చ వర్ణానసృజద్ యద్గుణాంశ్చ మహామునే! ।**
**యచ్చ తేషాం స్మృతం కర్మ విప్రాదీనాం తదుచ్యతామ్ ॥ 2 ॥**

ఓ మహామునీ! బ్రాహ్మణాది వర్ణాలను ఏ గుణాలు కలవిగా సృజించాడో, ఆ విప్రాది వర్ణాలకు ఏవిధమైన కర్మ విధించబడిందో అది నాకు వివరించు.

**పరాశర ఉవాచ :-** పరాశరుడు పలికాడు

**సత్యాభిధ్యాయినః పూర్వం సిసృక్షోః బ్రహ్మణో జగత్ ।**
**అజాయన్త ద్విజశ్రేష్ఠ! సత్త్వోద్రిక్తా ముఖాత్ప్రజాః ॥ 3 ॥**

ద్విజోత్తమా! మొదట సత్యసంకల్పుడై జగత్తును సృష్టించదలచుకొన్న బ్రహ్మయొక్క ముఖంనుంచి సత్త్వగుణం అధికంగా గల సంతానం జన్మించారు.

**వక్షసో రజసోద్రిక్తా స్తథా వై బ్రహ్మణోఽ భవన్ ।**
**రజసా తమసా చైవ సముద్రిక్తాస్తథోరుజాః ॥ 4 ॥**

ఆ బ్రహ్మయొక్క వక్షఃస్థలంనుంచి రజోగుణం అధికంగా కలవారు జన్మించారు. అదేవిధంగా రజోగుణం, తమోగుణం రెండు అధికంగా కలవారు ఊరువుల నుంచి ప్రభవించారు.

**పద్భ్యామన్యాః ప్రజా బ్రహ్మ ససర్జ ద్విజసత్తమ! ।**
**తమఃప్రధానాస్తాః సర్వా శ్చాతుర్వర్ణ్యమిదం తతః ॥ 5 ॥**

ఓ ద్విజోత్తమా! బ్రహ్మ తన రెండు పాదాలనుంచి మరో సంతానాన్ని సృజించాడు. వారు తమోగుణం ఎక్కువగా కలిగినవారయ్యారు. ఇది బ్రాహ్మణక్షత్రియాది నాలుగు వర్ణాలుగా విస్తరిల్లింది.

**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చ ద్విజసత్తమ ।**
**పాదోరువక్షఃస్థలతో ముఖతశ్చ సముద్గతాః ॥ 6 ॥**

బ్రాహ్మణోత్తమా! ఈ విధంగా ముఖం, వక్షఃస్థలం, ఊరుద్వయం, పాదద్వయం నుంచి సృజించబడ్డవారు క్రమంగా బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అయ్యారు.

**యజ్ఞనిష్పత్తయే సర్వమేతద్ బ్రహ్మా చకార వై ।**
**చాతుర్వర్ణ్యం మహాభాగ యజ్ఞసాధనముత్తమమ్ ॥ 7 ॥**

ఓ మహాభాగ! యజ్ఞనిర్వహణంకోసం దీనినంతా బ్రహ్మ ఈ చాతుర్వర్ణ్యసృష్టి కావించాడు. ఈ నాలుగువర్ణాల వారు ఉత్తమమైన యజ్ఞసాధనమయ్యారు.

**యజ్ఞైరాప్యాయితా దేవా వృష్ట్యుత్సర్గేణ వై ప్రజాః ।**
**ఆప్యాయయన్తే ధర్మజ్ఞ! యజ్ఞాః కల్యాణహేతవః ॥ 8 ॥**

ధర్మజ్ఞుడా! యజ్ఞాలవల్ల సంతుష్టులైన దేవతలు త్యాగదృష్టితో వర్షం కురిపించి ప్రజలను ఆనందింపజేస్తారు. కాబట్టి యజ్ఞాలు మంగళకారకాలు అయ్యాయి.

**నిష్పాద్యన్తే నరై స్తైస్తు స్వధర్మాభిరతై స్తతః ।**
**విశుద్ధాచరణోపేతైః సద్భిః సన్మార్గగామిభిః ॥ 9 ॥**

అంతట స్వధర్మమునందు ఆసక్తి కలవారు, నిర్మలమైన కర్మాచరణతో కూడుకొన్నవారు, సన్మార్గంలో నడచేవారు, సజ్జనులు అయిన నరులచే ఆ యజ్ఞాలు నిర్వహించబడుతూ ఉన్నాయి.

**స్వర్గాపవర్గౌ మానుష్యాత్ ప్రాప్నువన్తి నరా మునే! ।**
**యథాభిరుచితం స్థానం తద్యాన్తి మనుజా ద్విజ! ॥ 10 ॥**

మునీశ్వరా! నరులు మనుష్యజన్మవల్ల స్వర్గాపవర్గాలను (స్వర్గ లోకప్రాప్తి, మోక్షప్రాప్తి) పొందుతారు. ద్విజప్రవరా! మానవులు వారికిష్టమైన స్థానమును తత్కర్మాచరణద్వారా పొందగలుగుతున్నారు.

**ప్రజాస్తా బ్రహ్మణా సృష్టాశ్చాతుర్వర్ణ్యవ్యవస్థితౌ ।**
**సమ్యక్ఛ్రద్ధా సమాచార ప్రవణా మునిసత్తమ! ॥ 11 ॥**
**యథేచ్ఛావాసనిరతాః సర్వబాధావివర్జితాః ।**
**శుద్ధాన్తః కరణాః శుద్ధాః సర్వానుష్ఠాననిర్మలాః ॥ 12 ॥**

మునిసత్తమా! ఈ చాతుర్వర్ణ్య వ్యవస్థలో బ్రహ్మచే సృష్టించబడ్డ ఆ నాలుగు వర్ణాలవారు చక్కని శ్రద్ధ కలవారు, చక్కని సదాచారంపై ఆసక్తి కలవారు, వారి వారి ఇష్టాలను అనుసరించి నివసించడంలో అనురక్తి కలవారు, అన్ని బాధలనుంచి తొలగింపబడేవారు, నిర్మలమైన మనస్సు కలవారు, పరిశుద్ధులైనవారు, పవిత్ర కర్మల అనుష్ఠానం ద్వారా (సర్వ కర్మానుష్ఠానం ద్వారా) పరమనిర్మలులు అయినవారు.

**శుద్ధే చ తాసాం మనసి శుద్ధేఽన్తః సంస్థితే హరౌ ।**
**శుద్ధం జ్ఞానం ప్రపశ్యన్తి విష్ణ్వాఖ్యం యేన తత్పదమ్ ॥ 13 ॥**

వారికి మనస్సు శుద్ధం కాగా, ఆ శుద్ధాంతఃకరణంలో హరి వసింపగా, విశుద్ధ జ్ఞానరూపమైన విష్ణువనే పరమపదాన్ని దర్శిస్తారు.

**తతః కాలాత్మకో యోఽసౌ స చాంశః కథితో హరేః ।**
**స పాతయత్యఘం ఘోరమల్పమల్పాల్పసారవత్ ॥ 14 ॥**

అటుపిమ్మట హరి అంశగా చెప్పబడే కాలస్వరూపుడు భయంకరమైన, మిక్కిలి అల్పమైన సుఖాన్ని ఇచ్చే, అత్యంత తుచ్ఛమైన పాపకర్మలో పడవేస్తాడు.

**అధర్మబీజసంభూతం తమోలోభసముద్భవమ్ ।**
**ప్రజాసు తాసు మైత్రేయ! రాగాదికమసాధకమ్ ॥ 15 ॥**

మైత్రేయా! ఆ కారణంచే ఆ మనుష్యులలో ఆ చాతుర్వర్ణ్యంలో తమోగుణంచే పుట్టిన లోభంవల్ల కలిగే, పురుషార్థ సాధకం కాని, రాగాదులతో కూడుకొన్న, అధర్మబీజం ఉదయిస్తుంది.

**తతః సా సహసా సిద్ధిస్తేషాం నాతీవ జాయతే ।**
**రసోల్లాసాదయశ్చాన్యాః సిద్ధయోఽష్టౌ భవన్తి యాః ॥ 16 ॥**

పిమ్మట వారికి సహజసిద్ధి (సాయుజ్య ముక్తి రూపసిద్ధి) శీఘ్రంగా కలుగదు. ఇతర ఫలితాలను ఇచ్చే రసోల్లాసం మున్నగు అష్టసిద్ధులు ఏవి ఉన్నాయో అవే లభిస్తాయి. అనగా జీవన్ముక్తస్థితి పొందక సిద్ధిప్రాప్త తుష్టులవుతారు.

**వి ॥** 1) రసోల్లాసం 2) తృప్తి 3) ధర్మోత్తమ సిద్ధి 4) తుల్యతాసిద్ధి 5) విశోకసిద్ధి 6) తత్పరసిద్ధి 7) కామచారిత్వసిద్ధి 8) ఎక్కడో ఒక్కచోట సంతోషంగా ఉండుట. (స్కందపురాణం 1-6-5-17).

---

ఆరవ అధ్యాయంలో విష్ణుచిత్తీయవ్యాఖ్య

16 స్కందవాయుపురాణాలలో అష్టసిద్ధులు ఇట్లు చెప్పబడినవి.

**కృతే తు మిథునోత్పత్తి స్సిద్ధిశ్చాపి రసోల్లసా । సకృద్వృష్టిమయీ చాన్యా గృహవృక్షాత్మికా పరా ॥**
**పశ్చాత్సంకల్పసిద్ధిశ్చ కల్పవృక్షాత్మికా పరా । ప్రకామ వృష్టి శ్చాకృష్ట పచ్యసిద్ధిస్తథాఽష్టమీ ॥**

1.మిథునోత్పత్తిః 2. రసోల్లసా 3. సకృద్వృష్టిమయీ 4. గృహవృక్షాత్మికా 5. సంకల్పసిద్ధిః 6.కల్పవృక్షాత్మికా 7.ప్రకామవృష్టిః 8.అకృష్టపచ్యసిద్ధిః

1.**మిథునోత్పత్తిః** :-స్త్రీనైరపేక్ష్యేణ ఆనందో మిథునోత్పత్తిః స్కాందే- స్త్రియాదినైరపేక్ష్యేణ సదా తృప్తాః ప్రజా స్తథా-స్త్రీ అపేక్ష లేకుండా ఆనందమును పొందుట సదాతృప్తి మిథునోత్పత్తి

2. **రసోల్లసా** :-యోగాభ్యాసబలాత్ స్వ మూర్ధన్యసుధాంశు బింబస్రవదమృత తృప్తతా "రసస్య స్వతఏవాంతరుల్లాసస్యాత్కృతే యుగే రసోల్లసాఖ్యా సా సిద్ధిస్తయా హంతి క్షుధం నరః" యోగాభ్యాస బలము వలన తనశిరమున నున్న చంద్ర బింబమునుండి స్రవించుచున్న అమృతము వలన తృప్తి పొందుట రసోల్లాససిద్ధి. స్వయముగానే తనలో రసము యొక్క ఉల్లాసము వలన కృతయుగమున కలిగిన సిద్ధి రసోల్లాస. దీనితో నరుడు ఆకలిని నశింప చేసుకొనును.

3.**స కృద్వృష్టిమయీ** :- సకృద్వృష్ట్యా సస్యోత్పత్తిః

4.**గృహవృక్షాత్మికా** :-ఇచ్ఛయా గృహవృక్షోద్గమః

5.**సంకల్పసిద్ధి** :- సంకల్పేనాభిమత సిద్ధిః

6.**కల్పవృక్షాత్మికా** :- భరద్వాజాశ్రమవత్. కోరినంత మాత్రాన కోరుకున్న వృక్షాలు తమ నివాస ప్రాంతమున నేర్పడి తమ కోరికలను తీర్చుట

7.**ప్రకామవృష్టిః** :- నికామే నికామేన. పర్జన్యో వర్షతు అన్నట్లుగా కోరినపుడల్లా వర్షము కురియుట.

8.**అకృష్టపచ్యసిద్ధిః** :- అకృష్టపచ్య భూమిత్వం దున్నకుండానే విత్తనము వేయకుండానే భూమి అనుకున్న పంటలను ప్రసాదించుట

**కూర్మపురాణమున కృతే తు మిథునోత్పత్తిః । తథా సాక్షాద్రసోల్లసా ।**
**ప్రజాస్తృప్తాస్తథా సాక్షాత్ సర్వానందాశ్చ యోగినః ॥ ఇత్యాదికం అత్ర ద్రష్టవ్యమ్ ॥**

**తాసు క్షీణాస్వశేషాసు వర్ధమానే చ పాతకే ।**
**ద్వన్ద్వాభిభవదుఃఖార్తాస్తా భవన్తి తతః ప్రజాః ॥ 17 ॥**

ఆ విధంగా లభించిన సిద్ధులు కూడ పూర్తిగా నశించగా పాతకం పెరిగిపోయి, అపుడు ప్రజలు శీతోష్ణం మున్నగు ద్వంద్వాలకు లొంగినవారై, దుఃఖంచే పీడింపబడతారు.

**తతో దుర్గాణి తా శ్చక్రుర్వార్‌క్షం పార్వత మౌదకమ్ ।**
**కృత్రిమం చ తథా దుర్గం పురం ఖర్వటకాదికమ్ ॥ 18 ॥**

వారు (భౌతిక సుఖంకోసమై) చెట్లవల్ల ఏర్పడే నివాసాలను కొండమీద ఆవాసాలను, నీటిమధ్య నివాసాలను, కోటకట్టి అగడ్త త్రవ్వి ఏర్పరచే కృత్రిమస్థలదుర్గాలను, నదులకూ కొండలకూ కట్టిన మిశ్రమదుర్గాలను నిర్మించి గ్రామాలు, పురాలు ఏర్పాటు చేస్తారు.

**గృహాణి చ యథాన్యాయం తేషు చక్రుః పురాదిషు ।**
**శీతాతపాదిబాధానాం ప్రశమాయ మహామునే ॥ 19 ॥**

ఓ మహామునీ! చలి, ఎండ మున్నగు బాధలు సహించడానికై యథాన్యాయంగా (శాస్త్రాన్ని అనుసరించి, ఆదాయాన్నిబట్టి) ఆ పురగ్రామాదులలో ఇళ్లు కడతారు.

**ప్రతీకారమిదం కృత్వా శీతాదేస్తాః ప్రజాః పునః ।**
**వార్తోపాయం తతశ్చక్రుర్హస్తసిద్ధిం చ కర్మజామ్ ॥ 20 ॥**

ఈ విధంగా శీతవాతాతపాదులకు తగిన ప్రతిక్రియ కావించి పిదప ఆ ప్రజలు బ్రతుకుతెరువుకు తగిన వృత్తికొరకై కర్మసిద్ధమైన చేతిపని చేస్తారు.

**వ్రీహయశ్చ యవాశ్చైవ గోధూమా అణవస్తిలాః ।**
**ప్రియంగవో హ్యుదారాశ్చ కోరదూషాః సచీకణాః (సతీనకాః) ॥ 21 ॥**

**మాషా ముద్గా మసూరాశ్చ నిష్పావాః సకులుత్థకాః ।**
**ఆఢక్యశ్చనకాశ్చైవ శణాః సప్తదశ స్మృతాః ॥ 22 ॥**

**ఇత్యేతాశ్చౌషధీనాం తు గ్రామ్యాణాం జాతయో మునే ।**
**ఓషధ్యో యజ్ఞియాశ్చైవ గ్రామ్యారణ్యాశ్చతుర్దశ ॥ 23 ॥**

మునీశ్వరా! అటుపై వడ్లు, యవలు, గోధుమలు, చిరువడ్లు, నువ్వులు, కొఱ్ఱలు, ఊదర్లు, ఆళ్లు, లంకలు, మినుములు, పెసలు, చిరుసెనగలు, అనుములు, ఉలవలు, కందులు, సెనగలు, జనుములు అనే పదిహేడు రకాలైన పంటలను, గ్రామాలలో వ్యవసాయం చేసి పండించదగ్గ ఓషధి జాతులను, గ్రామాలలోను, అరణ్యాలలోను పండించదగ్గ పదునాల్గు రకాలైన యజ్ఞసాధనంకొరకై కావలసిన ఓషధులను పండిస్తారు.

**వ్రీహయః సయవా మాషా గోధూమా అణవస్తిలాః ।**
**ప్రియంగు సప్తమా హ్యేతే అష్టమాస్తు కులుత్థకాః ॥ 24 ॥**

**శ్యామాకాస్త్వథ నీవారా జర్తిలాః సగవేధుకాః ।**
**తథా వేణుయవాః ప్రోక్తాస్తద్వత్ మర్కటకా మునే ॥ 25 ॥**

**గ్రామ్యారణ్యాః స్మృతా హ్యేతా ఓషధ్యస్తు చతుర్దశ ।**
**యజ్ఞనిష్పత్తయే యజ్ఞస్తథాసాం హేతురుత్తమః ॥ 26 ॥**

మునీశ్వరా! వడ్లు, యవలు, మినుములు, గోధుమలు, చిరువడ్లు, నువ్వులు, కొఱ్ఱలు, ఉలవలు, చామలు, నివ్వరులు, జర్తిలములు (అడవి నువ్వులు), అడవి గోధుమలు, వెదురుబియ్యం, అడవి కొఱ్ఱలు అనే ఈ పదునాల్గురకాలైన గ్రామ్యములు, అరణ్యములు అనే భేదంతో పండే ఓషధులను యజ్ఞనిర్వహణంకోసం పండిస్తారు. ఆ కారణంచే యజ్ఞం ప్రధానహేతువై ఉత్తమమయింది.

**ఏతాశ్చ సహయజ్ఞేన ప్రజానాం కారణం పరమ్ ।**
**పరావరవిదః ప్రాజ్ఞా స్తతో యజ్ఞాన్ వితన్వతే ॥ 27 ॥**

ఇవి యజ్ఞంతోపాటు ప్రజలకు ప్రధాన కారణం కనుక, పరావరవిదులైన ప్రాజ్ఞులు (ఇహలోక పరలోకాలకు సంబంధించు ముందువెనుకలు తెలిసిన పండితులు) యజ్ఞాలను విస్తరిల్లజేశారు.

**అహన్యహన్యనుష్ఠానం యజ్ఞానాం మునిసత్తమ! ।**
**ఉపకారకరం పుంసాం క్రియమాణస్య శాన్తిదమ్ ॥ 28 ॥**

మునిశ్రేష్ఠా! ప్రతిదినం పంచమహాయజ్ఞాలను అనుష్ఠానం చేయడంవల్ల పురుషులకు (గృహస్థులకు) ఉపకారం అవుతుంది. వారియొక్క పంచసూనాలను పోగొట్టి శాంతిని ప్రసాదిస్తుంది.

**వి॥** బ్రహ్మయజ్ఞం, పితృయజ్ఞం, దైవయజ్ఞం, భూతయజ్ఞం, మనుష్యయజ్ఞం అనేవి పంచయజ్ఞాలు. గృహస్థులు చేట, రోలు, అలుకుట, సన్నికల్లు, పాత్ర శుద్ధి మున్నగు క్రియలయందుపయోగించే సాధనాల ద్వారా జరిగే సూక్ష్మజీవనాశనం ద్వారా పంచసూనాలు పొందుతున్నారు.

**యేషాన్తు కాలరూపోఽసౌ పాపబిన్దుర్మహామతే ।**
**చేతః స వవృధే చక్రుస్తే న యజ్ఞేషు మానసమ్ ॥ 29 ॥**

ఓ మహామతీ! కాలరూపుడు కల్పించిన పాపబిందువు ఎవరి మనస్సులో వృద్ధి పొందుతూ ఉంటుందో, వారి మానసం యజ్ఞములందు, తత్కర్మలయందు ప్రవర్తింపదు.

**వేదవాదాంస్తథా వేదాన్ యజ్ఞకర్మాదికం చ యత్ ।**
**తత్సర్వం నిన్దమానాస్తే యజ్ఞవ్యాసేధకారిణః ॥ 30 ॥**

వేదాధ్యయనం చేసి యజ్ఞాలను నిర్వహించేవారిని, వేదాలను, యజ్ఞ కర్మాదికాన్ని, సర్వాన్ని నిందిస్తూ యజ్ఞవిధ్వంసకులౌతారు.

**ప్రవృత్తిమార్గ వ్యుచ్ఛిత్తికారిణో వేదనిన్దకాః ।**
**దురాత్మానో దురాచారా బభూవుః కుటిలాశయాః ॥ 31 ॥**

వారు ప్రవృత్తి మార్గానికి (కర్మ మార్గానికి) వినాశకారకులై, వేదనిందకులై, దురాత్ములు, దురాచారులు, కుటిల మనస్కులు అవుతారు.

**సంసిద్ధాయాన్తు వార్తాయాం ప్రజాః సృష్ట్వా ప్రజాపతిః ।**
**మర్యాదాం స్థాపయామాస యథాస్థానం యథాగుణమ్ ॥ 32 ॥**

ఈ రీతిగా ప్రజాపతి ప్రజలను సృష్టించి, వారికి జీవనవిధాన వృత్తి సిద్ధంకాగా, ఆయా స్థానాలకు తగినట్లుగా, వారి వారి గుణాలకు యోగ్యమైన మర్యాదను (కట్టడిని) ఏర్పాటు చేశాడు.

**వర్ణానామాశ్రమాణాం చ ధర్మాన్ ధర్మభృతాం వర ।**
**లోకాంశ్చ సర్వవర్ణానాం సమ్యగ్ ధర్మానుపాలినామ్ ॥ 33 ॥**

ధార్మికశ్రేష్ఠా! ఆయా వర్ణాలకు, ఆశ్రమాలకు యోగ్యమైన ధర్మాలను, ఆయా ధర్మాలను చక్కగా ఆచరించే సమస్త వర్ణాలవారికి లోకవ్యవస్థను కల్పించాడు.

**ప్రాజాపత్యం బ్రాహ్మణానాం స్మృతం స్థానం క్రియావతామ్ ।**
**స్థానమైన్ద్రం క్షత్రియాణాం సంగ్రామేష్వనివర్తినామ్ ॥ 34 ॥**

కర్మపరులైన బ్రాహ్మణులకు ప్రాజాపత్య స్థానం (పితృలోకం) యుద్ధాలలో వెన్ను చూపకుండా ఉండే క్షత్రియులకు ఇంద్రలోకం స్థానం.

**వైశ్యానాం మారుతం స్థానం స్వధర్మమనువర్తినామ్ ।**
**గాన్ధర్వం శూద్రజాతీనాం పరిచర్యానువర్తినామ్ ॥ 35 ॥**

స్వధర్మంపై ఆసక్తి కలిగిన వైశ్యులకు వాయులోకం స్థానం. సేవచేసి ధార్మికులైన ధన్యులగు శూద్రులకు గంధర్వలోకం స్థానం.

**అష్టాశీతి సహస్రాణి మునీనామూర్ధ్వరేతసామ్ ।**
**స్మృతం తేషాం మరుత్ స్థానం తదేవ గురువాసినామ్ ॥ 36 ॥**

ఎనభై ఎనిమిది వేల ఊర్ధ్వరేతస్కులైన మునీశ్వరులకు ఏ మరుత్తుల స్థానం చెప్పబడిందో, అదే స్థానం గురుకుల వాసులైన నైష్ఠిక బ్రహ్మచారులకు ఏర్పరచాడు.

**సప్తర్షీణాన్తు యత్స్థానం స్మృతం తద్వై వనౌకసామ్ ।**
**ప్రాజాపత్యం గృహస్థానాం న్యాసినాం బ్రహ్మసంజ్ఞితమ్ ॥ 37 ॥**

సప్తర్షులకు ఏ స్థానమో, వానప్రస్థులకు కూడ అదే స్థానం కల్పించాడు. గృహస్థులకు పితృలోకం, సన్యాసులకు బ్రహ్మలోకం స్థానంగా ఏర్పాటు చేశాడు.

**యోగినామమృతం స్థానం యద్విష్ణోః పరమం పదమ్ ।**
**ఏకాన్తినః సదా బ్రహ్మధ్యాయినో యోగినో హి యే ।**
**తేషాం తత్పరమం స్థానం యత్తు పశ్యన్తి సూరయః ॥ 38 ॥**

విష్ణువుయొక్క ఏ పరమపదం ఉన్నదో, అది ఆత్మసంతుష్టులగు యోగులకు అమృతస్థానమయింది. ఎల్లప్పుడూ ఏకాంతస్థితిలో ఉండేవారు, నిరంతరం బ్రహ్మవిచారం చేసేవారు యోగులు. వారందరికి అదే పరమోన్నత స్థానం. దానినే బ్రహ్మవిద్వరిష్ఠులైన సూరులు చూస్తూ ఉంటారు.

**గత్వా గత్వా నివర్తన్తే చంద్రసూర్యాదయో గ్రహాః ।**
**అద్యాపి న నివర్తన్తే ద్వాదశాక్షరచిన్తకాః ॥ 39 ॥**

చంద్రసూర్యాది గ్రహాలు (ఆ లోకవాసులు) వెళ్లి వెళ్లి తిరిగి వస్తూ ఉంటాయి. కాని ద్వాదశాక్షర మంత్రోపాసకులు ఆ ఉత్తమస్థానానికి వెళ్లినవారే కాని ఎప్పటికిని తిరిగి రారు.

**తామిస్రమన్ధతామిస్రం మహారౌరవరౌరవౌ ।**
**అసిపత్రవనం ఘోరం కాలసూత్రమవీచిమత్ ॥ 40 ॥**
**వినిన్దకానాం వేదస్య యజ్ఞవ్యాఘాత కారిణామ్ ।**
**స్థానమేతత్ సమాఖ్యాతం స్వధర్మత్యాగినశ్చ యే ॥ 41 ॥**

తామిస్రం, అంధతామిస్రం, మహారౌరవం, రౌరవం, అసిపత్రవనం, మహాభయంకరమైన కాలసూత్రం, అవీచికం వేదనిందకులై, యజ్ఞధ్వంసకులై, స్వధర్మం విడిచినవారికి ఇది స్థానంగా చెప్పబడింది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే చాతుర్వర్ణ్య వ్యవస్థా – పృథివీవిభాగః – అన్నాదీనాం ఉత్పత్తి వర్ణనం చేతి షష్ఠోఽధ్యాయః సమాప్తః ॥ 6 ॥**

శ్రీవిష్ణుపురాణం ప్రథమాంశంలో చాతుర్వర్ణ్య వ్యవస్థ – పృథివీవిభాగం – అన్నాదుల ఉత్పత్తి వర్ణన అనే ఆరవ అధ్యాయం సమాప్తం ॥ 6 ॥



## సప్తమోఽధ్యాయః - ఏడవ అధ్యాయం

## మరీచ్యాది ప్రజాపతయః - స్వాయంభువమనుసంతాన వర్ణనమ్

మరీచి మున్నగు ప్రజాపతులు - స్వాయంభువమనుసంతాన వర్ణన

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరమహర్షి చెప్పాడు.

**తతోఽభిధ్యాయతస్తస్య జజ్ఞిరే మానసాః ప్రజాః ।**
**తచ్ఛరీరసముత్పన్నైః కార్యైస్తైః కారణైః సహ (కరణైః) ॥ 1 ॥**

అటుపైన ఆ బ్రహ్మ ధ్యానిస్తూ ఉండగా, ఆయన దేహంవల్ల సంభవించిన శరీరాలతోను, ఇంద్రియాలతోను మానసిక జీవులు జన్మించారు.

**క్షేత్రజ్ఞాః సమవర్తన్త గాత్రేభ్యస్తస్య ధీమతః ।**
**తే సర్వే సమవర్తన్త యే మయా ప్రాగుదీరితాః ॥ 2 ॥**

ఆ సృష్టి ధ్యానసంకల్పుని శరీరాల నుంచి (అవయవాల నుంచి) క్షేత్రజ్ఞులు జన్మించారు. వారంతా ముందు నాచే చెప్పబడినవారే.

**దేవాద్యాః స్థావరాన్తాశ్చ త్రైగుణ్యవిషయే స్థితాః ।**
**ఏవం భూతాని సృష్టాని చరాణి స్థావరాణి చ ॥ 3 ॥**

దేవతలు మొదలుకొని స్థావరాల వరకూ సత్త్వరజస్తమోగుణాత్మకులై జన్మించారు. ఈ విధంగా చరాలు, అచరాలుగా ప్రాణులు సృష్టించబడ్డాయి.

**యదాఽస్య తాః ప్రజాః సర్వా న వ్యవర్ధన్త ధీమతః ।**
**అథాన్యాన్ మానసాన్ పుత్రాన్ సదృశానాత్మనోఽసృజత్ ॥ 4 ॥**

ఆ ధీమంతుని ఆ త్రిగుణ జన్యసంతతి ఆయన అనుకొన్నంతగా వృద్ధి పొందకపోవడంచే, ఆయన తనతో సమానమైన మానసపుత్రులను సృజించాడు.

**భృగుం పులస్త్యం పులహం క్రతుమంగిరసం తథా ।**
**మరీచిం దక్షమత్రిం చ వశిష్ఠం చైవ మానసాత్ ॥ 5 ॥**

**నవ బ్రహ్మాణ ఇత్యేతే పురాణే నిశ్చయం గతాః । 6 ॥**

భృగువు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, అంగిరసుడు, మరీచి, దక్షుడు, అత్రి, వశిష్ఠుడు వీరిని బ్రహ్మ మానసపుత్రులుగా సృష్టించాడు. వీరు పురాణాలలో నవబ్రహ్మలుగా నిశ్చయింపబడి పురాణ ప్రసిద్ధులయ్యారు.

**ఖ్యాతిం భూతిం చ సంభూతిం క్షమాం ప్రీతిం తథైవ చ ।**
**సన్నతిం చ తథైవోర్జామనసూయాం తథైవ చ ॥**

**ప్రసూతిం చ తథా సృష్ట్వా దదౌ తేషాం మహాత్మనామ్ ।**
**పత్న్యో భవధ్వమిత్యుక్త్వా తేషామేవ తు దత్తవాన్ ॥**

ఖ్యాతి, భూతి, సంభూతి, క్షమ, ప్రీతి, సన్నతి, ఊర్జ, అనసూయ, ప్రసూతి అనేవారిని అదేవిధంగా సృష్టించి ఆ మహాత్ములకు పత్నులు కావలసిందని చెప్పి వారికి ఇచ్చివేశాడు.

**సనన్దనాదయో యే చ పూర్వం సృష్టాస్తు వేధసా ।**
**న తే లోకేష్వసజ్జన్త నిరపేక్షాః ప్రజాసు తే ।**
**సర్వే తే హ్యాగతజ్ఞానా వీతరాగా విమత్సరాః ॥ 7 ॥**

బ్రహ్మచే మొదట సృష్టించబడ్డ సనందనాదులు ఎవరైతే ఉన్నారో, వారు సంతానాపేక్ష లేక ప్రపంచ విషయాసక్తి లేకుండా ఉండిపోయారు. వారంతా జ్ఞానసంపన్నులై, వీతరాగులై, మాత్సర్యం లేనివారయ్యారు.

**తేష్వేవం నిరపేక్షేషు లోకసృష్టౌ మహాత్మనః ।**
**బ్రహ్మణోఽభూన్మహాక్రోధస్త్రైలోక్య దహనక్షమః ॥ 8 ॥**

వారు ఈ విధంగా ఆ మహాత్ముడైన బ్రహ్మ చేసే సృష్టిలో ప్రజావృద్ధిలో ఆసక్తి లేనివారు కాగా, బ్రహ్మకు మూడులోకాలను దహింపజేసే మహాక్రోధం జనించింది.

**తస్య క్రోధాత్ సముద్భూతజ్వాలామాలాభిదీపితమ్ ।**
**బ్రహ్మణోఽభూత్ తదా సర్వం త్రైలోక్యమఖిలం మునే ॥ 9 ॥**

మునీశ్వరా! బ్రహ్మకు పుట్టిన క్రోధంవల్ల ఉత్పన్నమైన అగ్నిజ్వాలామాలికయొక్క ప్రకాశంతో మూడులోకాలు ధగధగలాడిపోయాయి. సర్వం అట్టుడికిపోయింది.

**భ్రుకుటీకుటిలాత్తస్య లలాటాత్ క్రోధదీపితాత్ ।**
**సముత్పన్నస్తదా రుద్రో మధ్యాహ్నార్కసమప్రభః ॥ 10 ॥**

కోపంతో భగభగలాడుతూ, ముడిపడిన కనుబొమ్మలు కల ఆయన నుదుటినుండి, మధ్యాహ్న కాలంలోని సూర్యుని తేజస్సువంటి తేజస్సుతో సమానమైన ప్రకాశంతో రుద్రుడు ఆవిర్భవించాడు.

**అర్ధనారీ నరవపుః ప్రచండోఽతిశరీరవాన్ ।**
**విభజాత్మాన మిత్యుక్త్వా బ్రహ్మా న్తర్దధే తతః ॥ 11 ॥**

ఆయన సగం స్త్రీ, సగం పురుషుడు గల శరీరం కలవాడు. ఆ మూర్తి మహాకాయంతో, అతిప్రచండుడై కోపంతో ధుమధుమలాడిపోతున్నాడు. బ్రహ్మ ఆ స్వరూపాన్ని చూచి నిన్ను నీవే రెండుగా విభజించుకొమ్మని చెప్పి అంతర్ధానమయ్యాడు.

**తథోక్తోఽసౌ ద్విధా స్త్రీత్వం పురుషత్వం తథాఽకరోత్ ।**
**బిభేద పురుషత్వం చ దశధా చైకధా చ సః ॥ 12 ॥**

**సౌమ్యా సౌమ్యైస్తథా శాన్తాశాన్తైః స్త్రీత్వం చ స ప్రభుః ।**
**బిభేద బహుధా దేవః స్వరూపైరసితైః సితైః ॥ 13 ॥**

బ్రహ్మ అలా చెప్పి మాయమయిన వెంటనే, రుద్రుడు తన స్వరూపాన్ని స్త్రీత్వంతో, పురుషత్వంతో వేరువేరుగా విభజించుకొని విడివడ్డాడు. అందు పురుషత్వాన్ని పదకొండు భాగాలుగా చేశాడు. ఆ మహాదేవుడు స్త్రీత్వాన్ని సౌమ్యం, అసౌమ్యం, శాంతం, అశాంతం, తెల్లనివి, నల్లనివి అయిన అనేక విభాగాలుగా విభజించాడు.

**తతో బ్రహ్మాఽఽత్మసంభూతం పూర్వం స్వాయంభువం ప్రభుః ।**
**ఆత్మానమేవ కృతవాన్ ప్రాజాపత్యే మనుం ద్విజ ॥ 14 ॥**

ద్విజోత్తమా! అటుతరువాత ఆ బ్రహ్మ తనకు మొదటగా పుట్టిన స్వాయంభువమనువును, తన స్వరూపం అయినవానిని ప్రజాపతి స్థానంలో నియమించాడు.

**శతరూపాం చ తాం నారీం తపోనిర్ధూతకల్మషామ్ ।**
**స్వాయంభువో మనుర్దేవః పత్నీత్వే జగృహే విభుః ॥ 15 ॥**

(సృష్టికార్యం కొరకై తన దేహంనుండి జన్మించిన) తపస్సుచేసి కల్మషాలను తొలగించుకొన్న శతరూప అను నారీరత్నాన్ని ఆ ప్రభువు, దేవుడు అయిన స్వాయంభువమనువు పత్నిగా స్వీకరించాడు.

**తస్మాచ్చ పురుషాద్దేవీ శతరూపా వ్యజాయత ।**
**ప్రియవ్రతోత్తానపాదౌ ప్రసూత్యాకూతిసంజ్ఞితమ్ ॥ 16 ॥**

**కన్యాద్వయం చ ధర్మజ్ఞ రూపౌదార్యగుణాన్వితమ్ ।**
**దదౌ ప్రసూతిం దక్షాయ తథాఽఽకూతిం రుచేః పురా ॥ 17 ॥**

అతనివల్ల శతరూప అనే ఆమె ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే కుమారులను, ప్రసూతి, ఆకూతి అనే కుమార్తెలను పొందింది. ఓ ధర్మజ్ఞుడా! ఆ కన్యలు ఇరువురు రూపంలోను, ఔదార్యంలోను, సుగుణాలలోను సుసంపన్నలు. వారిలో ప్రసూతిని దక్షునకు, ఆకూతిని రుచికి ఇచ్చాడు (వివాహం చేయడం జరిగింది).

**ప్రజాపతిః స జగ్రాహ తయోర్యజ్ఞః సదక్షిణః ।**
**పుత్రో జజ్ఞే మహాభాగ! దామ్పత్యం మిథునం తతః ॥ 18 ॥**

మహాభాగా! ఆ రుచిప్రజాపతి ఆకూతిని స్వీకరించాడు. ఆ దంపతులకు దక్షిణయను కుమార్తె యజ్ఞుడు అను కుమారుడు దాంపత్యఫలంగా కలిగారు.

**యజ్ఞస్య దక్షిణాయాన్తు పుత్రా ద్వాదశ జజ్ఞిరే ।**
**యామా ఇతి సమాఖ్యాతా దేవాః స్వాయంభువే మనౌ ॥ 19 ॥**

అటుపిమ్మట ఆ దాంపత్య జీవితంలో యజ్ఞునికి దక్షిణవల్ల పండ్రెండుగురు కుమారులు కలిగారు. వారు మొదటిదైన ఆ స్వాయంభువమన్వంతరంలో 'యాములు' అనే దేవతలుగా విఖ్యాతి వహించారు.

**ప్రసూత్యాం చ తథా దక్ష శ్చతస్రో వింశతిస్తథా ।**
**ససర్జ కన్యాస్తాసాన్తు సమ్యఙ్నామాని మే శృణు ॥ 20 ॥**

దక్షునకు ప్రసూతియందు ఇరవై నలుగురు కన్యలు కలిగారు. వారి పేర్లు చెబుతాను. సావధానంగావిను.

**శ్రద్ధా లక్ష్మీః ధృతిస్తుష్టిః పుష్టిర్మేధా క్రియా తథా ।**
**బుద్ధి ర్లజ్జావపుః శాన్తిః సిద్ధిః కీర్తిస్త్రయోదశ ॥ 21 ॥**

శ్రద్ధ, లక్ష్మి, ధృతి, తుష్టి, పుష్టి, మేధ, క్రియ, బుద్ధి, లజ్జ, వపువు, శాంతి, సిద్ధి, కీర్తి అనేవారు పదముగ్గురు.

**పత్న్యర్థం ప్రతిజగ్రాహ ధర్మో దాక్షాయణీః ప్రభుః ।**
**తాభ్యః శిష్టా యవీయస్య ఏకాదశ సులోచనాః ॥ 22 ॥**

వారిని, ఆ దక్షపుత్రికలను, ప్రభువైన ధర్ముడు పత్నులుగా స్వీకరించాడు. వారిలో మిగిలినవారు చిన్నవారు పదకొండుగురు. వారు సుందరనయనాలు కలవారు.

**ఖ్యాతిః సత్యథ సమ్భూతిః స్మృతిః ప్రీతిః క్షమా తథా ।**
**సన్నతి శ్చానసూయా చ ఊర్జా స్వాహా స్వధా తథా ॥ 23 ॥**

**భృగుర్భవో మరీచిశ్చాథ చైవాంగిరా మునిః ।**
**పులస్త్యః పులహశ్చైవ క్రతుశ్చర్షివరస్తథా ॥ 24 ॥**

**అత్రి ర్వశిష్ఠో వహ్నిశ్చ పితరశ్చ యథాక్రమమ్ ।**
**ఖ్యాత్యాద్యాః జగృహుః కన్యా మునయో మునిసత్తమ ॥ 25 ॥**

ఖ్యాతి, సతి, సంభూతి, స్మృతి, ప్రీతి, క్షమ, సన్నతి, అనసూయ, ఊర్జ, స్వాహ, స్వధ – ఇవి ఆ పదకొండుగురి పేర్లు. ఓ మునీశ్వరా! ఆ ఖ్యాతి మున్నగు కన్యలలో భృగువు ఖ్యాతిని, భవుడు సతిని, మరీచి సంభూతిని, అంగిరసుడు స్మృతిని, పులస్త్యుడు ప్రీతిని, పులహుడు క్షమను, క్రతువు సన్నతిని, అత్రి అనసూయను, వశిష్ఠుడు ఊర్జను, అగ్ని స్వాహను, పితరులు స్వధను – ఈ విధంగా యథాక్రమంగా ఆ మునీశ్వరులు స్వీకరించారు.

**శ్రద్ధా కామం చలా దర్పం నియమం ధృతిరాత్మజమ్ ।**
**సన్తోషం చ తథా తుష్టిర్లోభం పుష్టిరసూయత ॥ 26 ॥**

అందు శ్రద్ధ కాముని, చల (లక్ష్మి) దర్పుని, ధృతి నియముని, తుష్టి సంతోషుని, పుష్టి లోభుని కుమారులుగా కన్నారు (పొందారు).

**మేధా శ్రుతం క్రియా దణ్డం నయం వినయమేవ చ ।**
**బోధం బుద్ధిస్తథా లజ్జా వినయం వపురాత్మజమ్ ॥ 27 ॥**

**వ్యవసాయం ప్రజజ్ఞే వై క్షేమం శాన్తిరసూయత ।**
**సుఖం సిద్ధి ర్యశః కీర్తిరిత్యేతే ధర్మసూనవః ॥ 28 ॥**

మేధకు శ్రుతుడు, క్రియకు దండుడు మరియు నయవినయులు, బుద్ధికి బోధ, లజ్జకు వినయుడు, వపువుకు వ్యవసాయుడు, శాంతికి క్షేముడు, సిద్ధికి సుఖుడు, కీర్తికి యశస్సు కలిగి వారు ధర్ముని సంతానమయ్యారు.

**కామాన్నన్దా (రతిః) సుతం హర్షం ధర్మపౌత్రమసూయత ।**
**హింసా భార్యా త్వధర్మస్య తస్యాం జజ్ఞే తథాஉనృతమ్ ।**
**కన్యా చ నికృతిస్తాభ్యాం భయం నరకమేవ చ ॥ 29 ॥**

కామునివల్ల రతి హర్షుడనే కుమారుని కన్నది. అతడు ధర్ముని మనుమడు అయ్యాడు. అధర్ముని యొక్క భార్య హింస. వారికి అనృతుడు అనే కుమారుడు, నికృతి అనే కన్య కలిగారు. ఆ ఇరువురిద్వారా భయుడు, నరకుడు (భయం, నరకం) అనే సంతానం కలిగింది. (ధర్మంతోబాటు అధర్మం విష్ణువు పృష్ఠ భాగంనుంచి పుట్టిందని భాగవతం).

**మాయా చ వేదనా చైవ మిథునం త్విదమేతయోః ।**
**తయోర్జజ్ఞేஉథ వై మాయా మృత్యుం భూతాపహారిణమ్ ॥ 30 ॥**

వారిరువురకు మాయ మరియు వేదన అనేవారు భార్యలయ్యారు. మాయాభయులు, వేదనానరకులు దంపతులు. వారిలో మాయకు సమస్తప్రాణిసంహారకర్త అయిన మృత్యువు జన్మించాడు.

**వేదనా స్వసుతం చాపి దుఃఖం జజ్ఞేஉథ రౌరవాత్ ।**
**మృత్యోర్వ్యాధి జరాశోక తృష్ణా క్రోధాశ్చ జజ్ఞిరే ॥ 31 ॥**

వేదన రౌరవుని (నరకుని) ద్వారా దుఃఖుడు అనే కుమారునకు జన్మను ఇచ్చింది. మృత్యువువల్ల వ్యాధి, జర, శోకం, తృష్ణ, క్రోధుడు కలిగారు.

**దుఃఖోత్తరాః స్మృతా హ్యేతే సర్వే చాధర్మలక్షణాః ।**
**నైషాం భార్యాస్తి పుత్రో వా తే సర్వే హ్యూర్ధ్వరేతసః ॥ 32 ॥**

వీరంతా అధిక దుఃఖం కలవారు. అధర్మ లక్షణాలు కలిగినవారు (పాపరూపులు). వీరికి భార్యలు లేరు, పుత్రులు లేరు. అందరూ ఊర్ధ్వరేతస్కులు.

**రౌద్రాణి తాని రూపాణి విష్ణోర్మునివరాత్మజ! ।**
**నిత్యప్రలయహేతుత్వం జగతోஉస్య ప్రయాన్తి వై ॥ 33 ॥**

ఓ మునీంద్ర పుత్రా! అవన్నీ విష్ణుమూర్తి యొక్క రౌద్రరూపాలు. ఈ విశ్వానికి ఎల్లప్పుడూ ప్రళయ కారణాలు అవుతూ ఉంటాయి.

**దక్షో మరీచిరత్రిశ్చ భృగ్వాద్యాశ్చ ప్రజేశ్వరాః ।**
**జగత్యత్ర మహాభాగ నిత్యసర్గస్య హేతవః ॥ 34 ॥**

ఓ మహాభాగ! దక్షుడు, మరీచి, అత్రి, భృగువు మున్నగు బ్రహ్మలు, ప్రజాపతులు ఈ జగత్తు నిత్యం కొనసాగే సృష్టికి హేతుభూతులయ్యారు.

**మనవో మనుపుత్రాశ్చ భూపావీర్యధనాశ్చ యే ।**
**సన్మార్గాభిరతాః శూరాస్తే నిత్యస్థితికారిణః ॥ 35 ॥**

మనువులు, మనుపుత్రులు, వీర్యధనులైనరాజులు వారు సన్మార్గమునందు ఆసక్తికలవారై, మహాశూరులై, ఎల్లప్పుడూ ఈ జగత్తుయొక్క స్థితికి (రక్షణము) కారణభూతులయ్యారు.

**శ్రీమైత్రేయ ఉవాచ :–** మైత్రేయుడు అడిగాడు.

**యేయం నిత్యాస్థితిర్బ్రహ్మన్ నిత్యసర్గస్తథేరితః ।**
**నిత్యాభావశ్చ తేషాం వై స్వరూపం మమ కథ్యతామ్ ॥ 36 ॥**

బ్రాహ్మణశ్రేష్ఠా! ఏ నిత్యస్థితి, నిత్యసృష్టి, నిత్యప్రళయం అని చెప్పావో, వాటి స్వరూపాన్ని నాకు వివరించు.

**సర్గస్థితివినాశాంశ్చ భగవాన్ మధుసూదనః ।**
**తైస్తైరూపై రచిన్త్యాత్మా కరోత్యవ్యాహతాన్ విభుః ॥ 37 ॥**

**పరాశర ఉవాచ :–** పరాశరమహర్షి చెప్పాడు.

సృష్టిని, స్థితిని, వినాశాన్ని పరమాత్మ, భగవంతుడు, ప్రభువు అయిన మధుసూదనుడగు విష్ణువు వాటికి తగిన రూపాలతో నిరంతరం చేస్తూ ఉంటాడు.

**నైమిత్తికః ప్రాకృతికస్తథైవాత్యన్తికో ద్విజ ।**
**నిత్యశ్చ సర్వభూతానాం ప్రలయోఽయం చతుర్విధః ॥ 38 ॥**

ద్విజోత్తమా! నైమిత్తికం, ప్రాకృతికం, ఆత్యన్తికం, నిత్యం అని ప్రలయం నాల్గువిధాలుగా సర్వభూతాలకు ఏర్పడుతుంది.

**బ్రాహ్మో నైమిత్తికస్తత్ర యచ్ఛేతే జగతః పతిః ।**
**ప్రయాతి ప్రాకృతశ్చైవ బ్రహ్మాణ్డం ప్రకృతే లయమ్ ॥ 39 ॥**

బ్రహ్మప్రళయాన్ని నైమిత్తికప్రళయమంటారు. ఆ సమయంలో జగత్పతి నిద్రిస్తాడు. బ్రహ్మాండం ప్రకృతిలో లయమైతే దానిని ప్రాకృత ప్రళయమంటారు.

**జ్ఞానాదాత్యన్తికః ప్రోక్తో యోగినః పరమాత్మని ।**
**నిత్యః సదైవ జాతానాం యో వినాశో దివానిశమ్ ॥ 40 ॥**

యోగీశ్వరులు పరమాత్మలో జ్ఞానంద్వారా లీనమయ్యేది ఆత్యన్తికప్రళయం. ప్రాణులు రాత్రి, పగలు నిత్యం నశిస్తూ ఉండడం నిత్యప్రళయం.

**ప్రసూతిః ప్రకృతేర్యాతు సా సృష్టిః ప్రాకృతా స్మృతా ।**
**దైనన్దినీ తథా ప్రోక్తా యాఽన్తరప్రలయాదను ॥ 41 ॥**

ప్రకృతియందు జగత్తు పుట్టుక ఏదైతే కలదో, అది ప్రాకృత సృష్టి అనబడుతుంది (మహత్తత్త్వాదుల నుండి జీవసృష్టి వరకు కల సృష్టి ప్రాకృత సృష్టి). అవాంతర ప్రలయం తరవాత జరిగే సృష్టి దైనందిన సృష్టి.

**భూతాన్యనుదినం యత్ర జాయన్తే మునిసత్తమ ।**
**నిత్యః సర్గః స తు ప్రోక్తః పురాణార్థవిచక్షణైః ॥ 42 ॥**

మునీశ్వరా! ప్రాణులు అనుదినం ఎక్కడ ఎలా జన్మిస్తూ ఉంటాయో, అదే నిత్యసర్గ అని పురాణాలలోని భావాన్ని పూర్తిగా తెలిసినవారనేమాట.

**ఏవం సర్వశరీరేషు భగవాన్ భూతభావనః ।**
**సంస్థితః కురుతే విష్ణురుత్పత్తిస్థితిసంయమాన్ ॥ 43 ॥**

ఈ రీతిగా భగవంతుడు, భూతభావనుడు అయిన విష్ణువు సర్వభూతాలలో ఉండి ఉత్పత్తిస్థితి ప్రళయాలను కావిస్తూ ఉంటాడు.

**సృష్టిస్థితివినాశానాం శక్తయః సర్వదేహిషు ।**
**వైష్ణవ్యః పరివర్తన్తే మైత్రేయాఽహర్నిశం సదా ॥ 44 ॥**

మైత్రేయా! సృష్టి స్థితివినాశాలయొక్క శక్తులు విష్ణుప్రభావితాలై సర్వదేహులలోను రాత్రింబవళ్లు నిత్యం సంచరిస్తూ ఉంటాయి.

**గుణత్రయమయం హ్యేతద్ బ్రహ్మన్! శక్తిత్రయం మహత్ ।**
**యోఽతియాతి స యాత్యేవ పరం నావర్తతే పునః ॥ 45 ॥**

ఓ బ్రాహ్మణుడా! ఈ మహాశక్తిత్రయం సత్త్వరజస్తమో గుణత్రయంతో కూడి ఉంటుంది. ఈ గుణత్రయాన్ని పూర్తిగా అతిక్రమించి వెళ్లినవాడు పరమపదానికి చేరుకోవడమే కాని తిరిగిరాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే మరీచ్యాది ప్రజాపతయః - స్వాయంభువమనుసంతాన వర్ణనం చేతి సప్తమోఽధ్యాయః సమాప్తః ॥ 7 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో మరీచి మున్నగు ప్రజాపతులు - స్వాయంభువమనుసంతాన వర్ణన అనే ఏడవ అధ్యాయం సమాప్తం ॥ 7 ॥



## అష్టమోఽధ్యాయః - ఎనిమిదవ అధ్యాయం

## రౌద్రసర్గః - లక్ష్మీదేవ్యాః  సర్వవ్యాపకతా నిరూపణమ్

### రౌద్రసర్గ - లక్ష్మీదేవి యొక్క సర్వవ్యాపకతా నిరూపణ

**శ్రీపరాశర ఉవాచ :-** మహర్షి పరాశరుడు చెప్పాడు.

**కథిత స్తామసః సర్గో బ్రహ్మణస్తే మహామునే! ।**
**రుద్రసర్గం ప్రవక్ష్యామి తన్మే నిగదతః శృణు ॥ 1 ॥**

మహామునీ! బ్రహ్మయొక్క తామసస్పష్టి ఇంతవరకు నీకు తెలియజేయబడింది. ఇకమీదట రుద్రస్పష్టిని గూర్చి చెబుతున్నాను, విను.

**కల్పాదావాత్మనస్తుల్యం సుతం ప్రధ్యాయతస్తతః ।**
**ప్రాదురాసీత్ ప్రభోరంకే కుమారో నీలలోహితః ॥ 2 ॥**

బ్రహ్మ కల్పాదిలో తనతో సమానమైన కుమారుని కొరకై ధ్యానిస్తూ ఉండగా, ఆయన ఒడిలో నీలం, లోహితం రెండు రంగులు కలిసిన నీలలోహితుడు (నలుపు, ఎఱుపు కలవాడు) అనే కుమారుడు ఆవిర్భవించాడు.

**రుదన్ వై సుస్వరం సోఽథ ప్రాద్రవత్ ద్విజసత్తమ ।**
**కిం రోదిషీతి తం బ్రహ్మ రుదన్తం ప్రత్యువాచ హ ॥ 3 ॥**

ఓ ద్విజసత్తమా! పుట్టిన వెంటనే అతడు సుస్వరంతో రోదిస్తూ పరుగెత్తాడు. ఆ ఏడుస్తున్న ఆతనిని బ్రహ్మ ఎందుకు ఏడుస్తున్నావని ప్రశ్నించాడు.

**నామ దేహీతి తం సోఽథ ప్రత్యువాచ ప్రజాపతిః ।**
**రుద్రస్త్వం దేవనామ్నాఽసి మారోదీర్ధైర్యమావహ ॥ 4 ॥**

అతడు బ్రహ్మను నాకు పేరు పెట్టు అన్నాడు. అపుడు ప్రజాపతి "నీవు రుద్రుడవనే పేరుగల దేవుడవు. ఏడవకు. ధైర్యం తెచ్చుకో" అన్నాడు.

**ఏవముక్తః పునస్సోఽథ సప్తకృత్వో రురోద వై ।**
**తతోఽన్యాని దదౌ తస్మై సప్తనామాని వై ప్రభుః ॥**
**స్థానాని చైషామష్టానాం పత్నీః పుత్రాంశ్చ వై ప్రభుః ॥ 5 ॥**

ఇలా చెప్పినప్పటికీ, అతడు మళ్లీ ఏడు పర్యాయాలు ఏడ్చాడు. అపుడు ఆ ప్రభువు మరో ఏడుపేర్లను అతనికి పెట్టాడు. మొత్తం ఆ ఎనమండుగురు రుద్రులకు స్థానాలను, పత్నులను, పుత్రులను ఏర్పరచాడు.

**భవం శర్వం మహేశానం తథా పశుపతిం ద్విజ ।**
**భీమముగ్రం మహాదేవమువాచ స పితామహః ॥ 6 ॥**

ద్విజోత్తమా! (రుద్రుడు కాక) భవుడు అని, శర్వుడు అని, మహేశానుడు అని, పశుపతి అని, భీముడు అని, ఉగ్రుడు అని, మహాదేవుడు అని ఆ పితామహుడు వారికి పేర్లు పెట్టాడు.

**చక్రే నామాన్యథైతాని స్థానాన్యేషాం చకార సః ।**
**సూర్యో జలం మహీ వాయుర్వహ్నిరాకాశమేవ చ ॥**
**దీక్షితో బ్రాహ్మణః సోమ ఇత్యేతాస్తనవః క్రమాత్ ॥ 7 ॥**

బ్రహ్మ ఈ పేర్లు పెట్టిన తరువాత (రుద్రునితో సహా) ఆ ఎనమండుగురికి ఈ స్థానాలు ఏర్పరచాడు. సూర్యుడు, జలం, భూమి, వాయువు, వహ్ని, ఆకాశం, దీక్షితుడైన సోమయాజి, చంద్రుడు– ఇవి క్రమంగా వారి శరీరాలు (స్థానాలు)

**సువర్చలా తథైవోషా సుకేశీ చాపరా శివా ।**
**స్వాహా దిశస్తథా దీక్షా రోహిణీ చ యథాక్రమమ్ ॥ 8 ॥**

**సూర్యాదీనాం ద్విజ(నర) శ్రేష్ఠ! రుద్రాద్యైర్నామభిః సహ ।**
**పత్న్యః స్మృతా మహాభాగ తదపత్యాని మే శృణు ॥**
**ఏషాం సూతిప్రసూతిభ్యామిదమాపూరితం జగత్ ॥ 9 ॥**

సువర్చల అగు ఉష, సుకేశి, అపర, శివ, స్వాహ, దిశలు, దీక్ష, రోహిణి. వీరు యథాక్రమంగా పత్నులు. ద్విజోత్తమా! ఇలా సూర్యాదులకు రుద్రాది నామాలతో కలిపి వారు పత్నులయ్యారు. మహాభాగా! వారి సంతానాన్ని గూర్చి విను. వీరి పుత్రపౌత్రులతో ఈ జగత్తు నిండిపోయింది.

**శనైశ్చరస్తథా శుక్రో లోహితాంగో మనోజవః ।**
**స్కన్దః స్వర్గోఽథ సన్తానో బుధశ్చానుక్రమాత్ సుతాః ॥ 10 ॥**

శనైశ్చరుడు (శని), శుక్రుడు, లోహితాంగుడు (కుజుడు), మనోజవుడు, స్కందుడు, స్వర్గుడు (సర్గుడు), సంతానుడు, బుధుడు అనే వీరు క్రమంగా ఆ ఎనమండుగురికి కుమారులు.

**ఏవం ప్రకారో రుద్రోఽసౌ సతీం భార్యామవిన్దత ।**
**దక్షకోపాచ్చ తత్యాజ సా సతీ స్వం కలేబరమ్ ॥ 11 ॥**

ఈ విధంగా (జన్మించిన) రుద్రుడు దక్షుని కుమార్తె అయిన సతిని భార్యగా పొందాడు. ఆమె దక్షునిపై కోపంతో శరీరం విడిచిపెట్టింది.

**హిమవద్దుహితా సాఽభూన్మేనాయాం ద్విజసత్తమ ।**
**ఉపయేమే పునశ్చోమామనన్యాం భగవాన్ భవః ॥ 12 ॥**

విప్రోత్తమా! ఆ సతీదేవి మేనకయందు హిమవంతునికి కుమార్తెగా జన్మించింది. భగవంతుడైన భవుడు తనయందు అనన్యపరాయణ అయిన ఉమను మళ్లీ వివాహం చేసుకొన్నాడు.

**దేవౌ ధాతృవిధాతారౌ భృగోః ఖ్యాతిరసూయత ।**
**శ్రియం చ దేవదేవస్య పత్నీ నారాయణస్య యా ॥ 13 ॥**

భృగువువల్ల ఖ్యాతి ధాత, విధాత అనే దేవతామూర్తులను, దేవాదిదేవుడైన నారాయణునకు భార్యయైన లక్ష్మీదేవిని కన్నది.

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అడిగాడు.

**క్షీరాబ్ధౌ శ్రీః సముత్పన్నా శ్రూయతేఽమృతమన్థనే ।**
**భృగోః ఖ్యాత్యాం సముత్పన్నేత్యేతదాహ కథం భవాన్ ॥ 14 ॥**

అమృతమథనసమయంలో పాలసముద్రం నుంచి లక్ష్మి పుట్టిందని కదా వినడం జరిగింది. భృగువుకు ఖ్యాతియందు ఆమె కలిగిందని నీవు చెప్పుచున్నావు. ఇది ఎట్లు?

**శ్రీపరాశర ఉవాచ:-** పరాశరుడు పలికాడు

**నిత్యైవ సా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ ।**
**యథా సర్వగతో విష్ణుస్తథైవేయం ద్విజోత్తమ ॥ 15 ॥**

ఓ బ్రాహ్మణోత్తమా! ఆ జగన్మాత లక్ష్మీదేవి నిత్యురాలు. విష్ణువుకు లక్ష్మి అనపాయిని (ఎల్లప్పుడూ విడవకుండా ఉండేది). విష్ణువు ఎలా సర్వగతుడో లక్ష్మి అదేవిధంగా సర్వగతురాలు.

**అర్థో విష్ణురియం వాణీ నీతిరేషా నయో హరిః ।**
**బోధో విష్ణు రియం బుద్ధిర్ధర్మోఽసౌ సత్క్రియా త్వియమ్ ॥ 16 ॥**

విష్ణువు అర్థము. ఈమె శబ్దము. హరి నయుడు. ఈమె నీతి. విష్ణువు జ్ఞానం. ఈమె బుద్ధి. ఆయన ధర్మం. ఆమె సత్క్రియ.

**స్రష్టా విష్ణురియం సృష్టిః శ్రీర్భూమిర్భూధరో హరిః ।**
**సన్తోషో భగవాన్ లక్ష్మీస్తుష్టిర్మైత్రేయ! శాశ్వతీ ॥ 17 ॥**

మైత్రేయా! విష్ణువు సృష్టించు స్రష్ట. ఈమె చేయబడే సృష్టి. శ్రీలక్ష్మి భూమి. హరి భూధరుడు. భగవంతుడు సంతోషం. లక్ష్మి శాశ్వతమైన తుష్టినిచ్చేది.

**ఇచ్ఛా శ్రీర్భగవాన్ కామో యజ్ఞోఽసౌ దక్షిణా తుసా ।**
**ఆజ్యాహుతిరసౌ దేవీ పురోడాశో జనార్దనః ॥ 18 ॥**

శ్రీదేవి ఇచ్ఛ. భగవంతుడు కామం. ఆయన యజ్ఞం. ఆమె దక్షిణ. ఆ దేవి ఆజ్యాహుతి, అనగా నేతిరూపమైన ఆహుతి. జనార్దనుడు పురోడాశం.

**పత్నీశాలామునే లక్ష్మీః ప్రాగ్వంశో మధుసూదనః ।**
**చితిర్లక్ష్మీర్హరిర్యూప ఇధ్మా శ్రీర్భగవాన్ కుశః ॥ 19 ॥**

మునీశ్వరా! లక్ష్మి పత్నీశాల. మధుసూదనుడు యజమాన గృహం. లక్ష్మి చితి. హరి యూపం. శ్రీదేవి ఇధ్మ (సమిధ). భగవానుడు కుశం (దర్భ).

**సామస్వరూపీ భగవానుద్గీతిః కమలాలయా ।**
**స్వాహాలక్ష్మీర్జగన్నాథో వాసుదేవో హుతాశనః ॥ 20 ॥**

భగవంతుడు సామస్వరూపి. కమలాలయ ఉద్గీతి (సామమంత్రగానక్రియ). జగన్నాథుడైన లక్ష్మీదేవి స్వాహాదేవి. వాసుదేవుడు అగ్ని.

**శంకరో భగవాన్ శౌరిర్భూతి ర్గౌరీ ద్విజోత్తమ! ।**
**మైత్రేయ! కేశవః సూర్యస్తత్ప్రభా కమలాలయా ॥ 21 ॥**

బ్రాహ్మణోత్తమా! విష్ణు భగవానుడు శంకరుడు. లక్ష్మి గౌరి. మైత్రేయ! కేశవుడు సూర్యభగవానుడు. పద్మాలయ సూర్యకాంతి.

**విష్ణుః పితృగణః పద్మా స్వధా శాశ్వతతుష్టిదా ।**
**ద్యౌః శ్రీః సర్వాత్మకో విష్ణురవకాశో౽తివిస్తరః ॥ 22 ॥**

విష్ణువు పితృగణం. పద్మ శాశ్వతతుష్టిదాయకురాలైన స్వధ. లక్ష్మీదేవి స్వర్గం. సర్వాత్మకుడైన విష్ణువు అతివిస్తృతమైన ఆకాశం.

**శశాంకః శ్రీధరః కాన్తిః శ్రీస్తథైవానపాయినీ ।**
**ధృతిర్లక్ష్మీర్జగచ్చేష్టా వాయుస్సర్వత్రగో హరిః ॥ 23 ॥**

శ్రీధరుడు చంద్రుడు. అనపాయినియైన లక్ష్మి అట్లే కాంతి. లక్ష్మీదేవి జగత్తుకు గతి మరియు ఆధారం. హరి సర్వవ్యాపకుడైన వాయువు.

**జలధిర్ద్విజ గోవిన్దస్తద్వేలా శ్రీర్మహామతే ।**
**లక్ష్మీస్వరూపమిన్ద్రాణీ దేవేన్ద్రో మధుసూదనః ॥ 24 ॥**

ద్విజోత్తమా! గోవిందుడు సముద్రం. ఓ మహామతీ! శ్రీలక్ష్మి దాని చెలియలి కట్ట. ఇంద్రాణి లక్ష్మీస్వరూపం. దేవేంద్రుడే మధుసూదనుడు.

**యమశ్చక్రధరః సాక్షాద్ ధూమోర్ణా కమలాలయా ।**
**ఋద్ధిః శ్రీః శ్రీధరో దేవః స్వయమేవ ధనేశ్వరః ॥ 25 ॥**

చక్రధారియైన శ్రీహరి యముడు. శ్రీదేవి యమపత్ని అయిన ధూమోర్ణ. భగవంతుడు అయిన శ్రీధరుడు సాక్షాత్తు కుబేరుడు. శ్రీలక్ష్మి కుబేరశక్తి అయిన ఋద్ధి.

**గౌరీ లక్ష్మీర్మహాభాగ కేశవో వరుణః స్వయమ్ ।**
**శ్రీర్దేవసేనా విప్రేన్ద్ర! దేవసేనాపతిర్హరిః ॥ 26 ॥**

మహాభాగా! కేశవుడు స్వయంగా వరుణుడు. లక్ష్మి గౌరి. విప్రోత్తమా! శ్రీలక్ష్మి దేవసేన. దేవసేనాపతి అయిన కుమారస్వామి శ్రీహరి.

**అవష్టమ్భో గదాపాణిః శక్తిర్లక్ష్మీర్ద్విజోత్తమ ।**
**కాష్ఠాలక్ష్మీ ర్నిమేషోఽసౌ ముహూర్తోఽసౌ కలాతు సా ॥ 27 ॥**

ఓ ద్విజోత్తమా! గదాపాణి అయిన శ్రీహరి ఆధారము. లక్ష్మి శక్తి. కాష్ఠలక్ష్మి. ఆయన నిమేషం. ఆయన ముహూర్తం. కళ లక్ష్మి.

**జ్యోత్స్నా లక్ష్మీః ప్రదీపోఽసౌ సర్వః సర్వేశ్వరో హరిః ।**
**లతాభూతా జగన్మాతా శ్రీర్విష్ణుర్ద్రుమసంస్థితః ॥ 28 ॥**

వెన్నెల లక్ష్మి. సర్వేశ్వరుడైన హరి ప్రదీపం. జగన్మాత అయిన శ్రీమాత లత. శ్రీ మహావిష్ణువు వృక్షంలో నెలకొని వున్నాడు.

**విభావరీ శ్రీర్దివసో దేవశ్చక్రగదాధరః ।**
**వరప్రదా వరో విష్ణుర్వధూః పద్మవనాలయాః ॥ 29 ॥**

రాత్రి శ్రీదేవి. చక్రగదాధారి అయిన శ్రీహరి పగలు. వరములనిచ్చే విష్ణువు వరుడు (పెండ్లికొడుకు). పద్మవనవాసినియైన శ్రీలక్ష్మి వధువు (పెండ్లి కుమార్తె).

**నదస్వరూపీ భగవాన్ శ్రీర్నదీ రూపసంస్థితిః ।**
**ధ్వజశ్చ పుణ్డరీకాక్షః పతాకా కమలాలయా ॥ 30 ॥**

భగవంతుడు నదస్వరూపుడు. భగవతి శ్రీదేవి నదీస్వరూపురాలు. తామరపూలవంటి కన్నులు గల హరి ధ్వజం. తామరపూవే నివాసంగా కల లక్ష్మి పతాక.

**తృష్ణా లక్ష్మీర్జగత్స్వామీ లోభో నారాయణః పరః ।**
**రతిరాగౌ చ ధర్మజ్ఞ లక్ష్మీర్గోవింద ఏవ చ ॥ 31 ॥**

ఓ ధార్మికశ్రేష్ఠా! తృష్ణ లక్ష్మి. జగన్నాయకుడైన పరమాత్మ అయిన నారాయణుడు లోభం. రతి లక్ష్మి. రాగం (కాముడు) గోవిందుడే.

**కించాతిబహునోక్తేన సంక్షేపేణేదముచ్యతే ।**
**దేవతిర్యఙ్మనుష్యాదౌ పుంనామ భగవాన్ హరిః ।**
**స్త్రీనామ్ని లక్ష్మీర్మైత్రేయ నానయోర్విద్యతే పరమ్ ॥ 32 ॥**

మైత్రేయ! ఇంక పలుమాటలు ఏల చెప్పడం? సంక్షేపంగా ఇపుడు చెబుతున్నాను. దేవతలలో, తిర్యక్కులలో, మనుష్యులు మున్నగువారిలో పురుషనాముడు భగవంతుడైన శ్రీహరి, స్త్రీనామమైనదెల్ల శ్రీదేవి. వీరికన్నమరోపరం లేదు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే రౌద్రసర్గః-లక్ష్మీదేవ్యాః సర్వవ్యాపకతా నిరూపణమితి అష్టమోఽధ్యాయః సమాప్తః॥ 8॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో రౌద్రసర్గ-లక్ష్మీదేవియొక్క సర్వవ్యాపకతానిరూపణ అనే ఎనిమిదవ అధ్యాయం సమాప్తం ॥ 8 ॥

## **నవమోऽధ్యాయః** – తొమ్మిదవ అధ్యాయం

## **సముద్రమంథన కథా – ఇంద్రకృత లక్ష్మీస్తుతిశ్చ** – సముద్రమంథన కథ – ఇంద్రకృత లక్ష్మీస్తుతి

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**ఇదం చ శృణు మైత్రేయ యత్పృష్టోऽహమిహ త్వయా ।**
**శ్రీసంబద్ధం మయా హ్యేతచ్ఛ్రుతమాసీన్మరీచితః ॥ 1 ॥**

మైత్రేయా! శ్రీదేవికి సంబంధించి నీవు నన్ను అడిగావు కదా! ఆమెకు సంబంధించిన ఇతిహాసాన్ని మరీచిమహర్షివల్ల నేను వినడం జరిగింది. ఆ వృత్తాంతం చెబుతా విను.

**దుర్వాసాః శంకరస్యాంశ శ్చచార పృథివీమిమామ్ ।**
**స దదర్శ స్రజం దివ్యామృషిర్విద్యాధరీకరే ॥ 2 ॥**

దుర్వాసుడు శంకరాంశవల్ల జన్మించాడు. ఆయన ఒకప్పుడు పృథివిపై సంచరించడం జరిగింది. ఆ సమయంలో ఆ మహర్షి ఒక విద్యాధరిచేతిలో దివ్యకుసుమాలతో కూర్చబడిన ఒక మాల చూశాడు.

**సన్తానకానామఖిలం యస్యా గన్ధేన వాసితమ్ ।**
**అతిసేవ్యమభూద్ బ్రహ్మన్ తద్వనం వనచారిణామ్ ॥ 3 ॥**

బ్రాహ్మణోత్తమా! ఆ సంతానపుష్పాలయొక్క పరిమళం అంతట వ్యాపించి సువాసనచే ఆ వనం వనచారులకు మిక్కిలి సేవ్యమయింది (సుఖసంతోషాలను ఇచ్చేది అయింది).

**ఉన్మత్తవ్రతధృక్ విప్రస్తాం దృష్ట్వా శోభనాం స్రజమ్ ।**
**తాం యయాచే వరారోహాం విద్యాధరవధూం తతః ॥ 4 ॥**

ఉన్మత్తవ్రతధారి అయిన ఆ విప్రుడు ఆ మనోహర పుష్పమాలికను చూచి ఉత్తమాంగన అయిన విద్యాధర కన్యకను తనకిమ్మని అడిగాడు.

**యాచితా తేన తన్వంగీ మాలాం విద్యాధరాంగనా ।**
**దదౌ తస్మై విశాలాక్షీ సాదరం ప్రణిపత్య చ ॥ 5 ॥**

విశాలమైన నేత్రాలు కల, సుకుమార గాత్రి అయిన శ్రీ విద్యాధరాంగన ఆ మహర్షిచే ఇట్లు కోరబడి, ఆయనకు సాదరంగా నమస్కరించి ఆ దండను సమర్పించింది.

**తామాదాయాత్మనో మూర్ధ్ని స్రజమున్మత్తరూపధృక్ ।**
**కృత్వా స విప్రో మైత్రేయ పరిబభ్రామ మేదినీమ్ ॥ 6 ॥**

మైత్రేయా! ఉన్మత్తరూపధారి అయిన ఆ విప్రుడు ఆ మాలికను తీసికొని, తన శిరస్సుపై ఉంచుకొని భూమిపై పర్యటించాడు.

**స దదర్శ సమాయాన్తమున్మత్తైరావతస్థితమ్ ।**
**త్రైలోక్యాధిపతిం దేవం సహ దేవైః శచీపతిమ్ ॥ 7 ॥**

ఆ సమయంలో దేవతలందరూ తనను సేవిస్తూ ఉండగా, మదించిన ఐరావతాన్ని అధిరోహించి, వచ్చుచున్న త్రిలోకాధిపతి అయిన శచీదేవి భర్త అయిన దేవేంద్రుని ఆయన చూశాడు.

**తామాత్మనః స శిరసః స్రజమున్మత్తషట్పదామ్ ।**
**ఆదాయామరరాజాయ చిక్షేపోన్మత్తవన్మునిః ॥ 8 ॥**

ఆ దండలోని పరిమళానికి తుమ్మెదలన్నీ మూగి ఉండగా, తన శిరస్సుపైనున్న ఆ మాలికను తీసి ఉన్మత్తునిలా దానిని దేవతల రాజయిన ఇంద్రునివైపు విసిరాడు.

**గృహీత్వాఽమరరాజేన స్రగైరావతమూర్ధని ।**
**న్యస్తా రరాజ కైలాసశిఖరే జాహ్నవీ యథా ॥ 9 ॥**

దేవవిభుడు ఆ దండను అందుకొని దానిని ఐరావతం శిరస్సుపై ఉంచడం జరిగింది. ఆ సమయంలో ఆ మాలిక ఐరావతకుంభస్థలంపై కైలాసశిఖరంపైనున్న ఆకాశగంగలా ప్రకాశించింది.

**మదాన్ధకారితాక్షోఽసౌ గన్ధాకృష్టేన వారణః ।**
**కరేణాఘ్రాయ చిక్షేప తాం స్రజం ధరణీతలే ॥ 10 ॥**

ఎప్పుడూ మదం అనే అంధకారంతో కనులు మూతబడి ఉంటే ఐరావతం ఆ పూలవాసన తనను ఆకర్షించేసరికి మరింత మదించినదై, దానిని తొండంతో లాగి, ఆ దండను నేలపై కొట్టింది.

**తతశ్చుక్రోధ భగవాన్ దుర్వాసా మునిసత్తమః ।**
**మైత్రేయ! దేవరాజం తం క్రుద్ధశ్చైతదువాచ హ ॥ 11 ॥**

మైత్రేయా! అపుడు భగవంతుడగు మునిప్రవరుడైన దుర్వాసుడు వెంటనే కోపంతో మండిపడ్డాడు. పరమక్రుద్ధుడై ఆ దేవరాజును ఉద్దేశించి ఇలా అన్నాడు.

**శ్రీదుర్వాసా ఉవాచ :-** దుర్వాసుడు పలికాడు.

**ఐశ్వర్యమత్త! దుష్టాత్మ న్నతిస్తబ్ధోఽసి వాసవ! ।**
**శ్రియో ధామ స్రజం యస్త్వం మద్దత్తాం నాభినన్దసి ॥ 12 ॥**

**ప్రసాద ఇతి నోక్తం తే ప్రణిపాతపురస్సరమ్ ।**
**హర్షోత్ఫుల్లకపోలేన న చాపి శిరసా ధృతా ॥ 13 ॥**

**మయా దత్తామిమాం మాలాం యస్మాన్న బహుమన్యసే ।**
**త్రైలోక్యశ్రీరతో మూఢ! వినాశముపయాస్యతి ॥ 14 ॥**

ఐశ్వర్యంచే మదించి ఉన్నవాడా! ఓ దుష్టాత్ముడా! వాసవా! నీవు బాగా పొగరెక్కి ఉన్నావు. సమస్త సంపదలకు నిలయం నేను నీకిచ్చినమాల. దానిని నీవు ఆదరించావు కావు. మహాప్రసాదమని అన్నావు కావు. నాకు శిరస్సు వంచి నమస్కారమైనా చేయలేదు. ఆనందాతిరేకంలో చెక్కిళ్లు వికసించగా ఆ మాలను శిరస్సుననైనా ధరించలేదు. ఓ మూఢుడా! నాచే ఈయబడిన ఈ మాలను నీవు మన్నించి గౌరవించకపోవడం వల్ల, నీకు సంప్రాప్తమైన ఈ ముల్లోకసంపద నశించిపోవుగాక!

**మాం మన్యతేఽన్యైః సదృశం న్యూనం శక్ర! భవాన్ ద్విజైః ।**
**అతోఽవమానమస్మాకం మానినా భవతా కృతమ్ ॥ 15 ॥**

శక్రా! నీవు నిశ్చయంగా నన్ను అందరు ద్విజులవంటివాణ్ణి అనుకొన్నావు కాబోలు! ఆ కారణంచే దురభిమానివైన నీచే నాకు అవమానం కావించబడింది.

**మద్దత్తా భవతా యస్మాత్ క్షిప్తా మాలా మహీతలే ।**
**తస్మాత్ ప్రణష్టలక్ష్మీకం త్రైలోక్యం తే భవిష్యతి ॥ 16 ॥**

నాచే ప్రసాదించబడ్డ ఈ దండ నీవల్ల భూతలంపై విసరివేయబడింది. ఆ కారణంచే నీకు మూడులోకాలలోను లక్ష్మి నశించిపోతుంది.

**యస్య సంజాతకోపస్య భయమేతి చరాచరమ్ ।**
**తం త్వం మామతిగర్వేణ దేవరాజావమన్యసే ॥ 17 ॥**

దేవేంద్రా! ఎవరికి కోపం సంభవిస్తే చరాచరం గడగడలాడిపోతుందో, అటువంటి వాడనైన నన్ను గర్వాతిరేకంతో అవమానించావు.

**మహేన్ద్రో వారణస్కన్ధాదవతీర్య త్వరాఽన్వితః ।**
**ప్రసాదయామాస తదా దుర్వాససమకల్మషమ్ ॥ 18 ॥**

మహేంద్రుడు ఆ ఐరావతస్కంధం నుండి గబగబా దిగివచ్చి ఏకల్మషమూ లేని ఆ దుర్వాసుని అనుగ్రహించమని బ్రతిమాలాడు.

**ప్రసాద్యమానః స తదా ప్రణిపాతపురఃసరమ్ ।**
**ప్రత్యువాచ సహస్రాక్షం దుర్వాసా మునిసత్తమః ॥ 19 ॥**

అపుడు ఆ మునిశ్రేష్ఠుడైన దుర్వాసుడు తన పాదాలపైబడి నమస్కరిస్తూ అనుగ్రహించమని బ్రతిమాలుతూ ఉన్న ఆ సహస్రాక్షునితో ఇలా అన్నాడు.

**నాహం కృపాలుహృదయో న చ మాం భజతే క్షమా ।**
**అన్యే తే మునయః శక్ర! దుర్వాససమవేహి మామ్ ॥ 20 ॥**

శక్రా! నేను జాలిగుండె కలవాణ్ణి కాదు. ఓర్పు అనే గుణం నా దగ్గరకు రాలేదు. ఆ మునులు వేరు. నన్ను దుర్వాసునిగా తెలుసుకో.

**గౌతమాదిభిరన్యైస్త్వం గర్వమాపాదితో ముధా ।**
**అక్షాన్తిసారసర్వస్వం దుర్వాసస మవేహి మామ్ ॥ 21 ॥**

ఇతరులైన గౌతమాదిమహర్షుల ద్వారా నీకు వృథాగా పొగరెక్కింది. సహనం లేకపోవడమే నా జీవిత సర్వస్వం. నన్ను దుర్వాసునిగా తెలుసుకో.

**వసిష్ఠాద్యైర్దయాసారైః స్తోత్రం కుర్వద్భిరుచ్చకైః ।**
**గర్వం గతోఽసి యేనైవం మామప్యద్యావమన్యసే ॥ 22 ॥**

వసిష్ఠాదులు, దయాభూతులు, మాటిమాటికి నమ్రశిరస్కులై స్తోత్రం చేసేసరికి గర్వం నెత్తికి ఎక్కింది నీకు. అందువల్లనే ఇప్పుడు నన్ను అవమానించావు.

**జ్వలజ్జటాకలాపస్య భ్రుకుటీకుటిలం ముఖమ్ ।**
**నిరీక్ష్యకస్త్రిభువనే మమ యో న గతో భయమ్ ॥ 23 ॥**

ప్రజ్వలిత జటాకలాపంతో, ముడివడిన భ్రుకుటికల నా ముఖం చూచి ఈ మూడు లోకాలలో భయపడని వాడు ఎవడు ఉంటాడు?

**నాహం క్షమిష్యే బహునా కిముక్తేన శతక్రతో! ।**
**విడమ్బనామిమాం భూయః కరోష్యనునయాత్మికామ్ ॥ 24 ॥**

నేను నిన్ను క్షమించను. ఓ శతక్రతూ! పదే పదే బ్రతిమాలకు. మాటిమాటికి నన్ను అనునయించాలని చేసే ఈ విడంబనప్రక్రియను చాలించు.

**ఇత్యుక్త్వా ప్రయయౌ విప్రో దేవరాజోఽపి తం పునః ।**
**ఆరుహ్యైరావతం బ్రహ్మన్ ప్రయయావమరావతీమ్ ॥ 25 ॥**

అని కఠోరంగా పలికి ఆ విప్రుడు వెళ్లిపోయాడు. ఓ మైత్రేయా! దేవేంద్రుడు కూడా మళ్లీ ఆ ఐరావతాన్ని అధిరోహించి అమరావతీ నగరానికి వెళ్లాడు.

**తతః ప్రభృతి నిఃశ్రీకం సశక్రం భువనత్రయమ్ ।**
**మైత్రేయాసీ దపధ్వస్తం సంక్షీణౌషధివీరుధమ్ ॥ 26 ॥**

మైత్రేయా! అది మొదలుకొని ఇంద్రునితోబాటుగా ముల్లోకాలకు లక్ష్మి లేకుండాపోయింది. భాగ్యలక్ష్మి ధ్వంసమైపోయింది. ఓషధులు, లతలూ క్షీణించాయి.

**న యజ్ఞాః సంప్రవర్తన్తే న తపస్యన్తి తాపసాః ।**
**న చ దానాదిధర్మేషు మనశ్చక్రే తదా జనః ॥ 27 ॥**

యజ్ఞాలు నిర్వహించబడడం లేదు. తపస్వులు తపస్సు చేయడం లేదు. దానం చేయడంలో, ధర్మం ఆచరించడంలో జనం మనస్సు ఉంచడం లేదు.

**నిఃసత్త్వా సకలా లోకా లోభాద్యుపహతేన్ద్రియాః ।**
**స్వల్పేఽపి చ బభూవుస్తే సాభిలాషా ద్విజోత్తమ! ॥ 28 ॥**

ద్విజప్రవరా! సకలలోకాలు సత్త్వగుణం లేనివయ్యాయి. ఇంద్రియాలు లోభం మున్నగువాటిచే పీడించబడ్డాయి. జనాలు స్వల్పవిషయంలో కూడా కోరిక కలవారయ్యారు.

**యతః సత్త్వం తతో లక్ష్మీః సత్త్వం భూత్యనుసారి చ ।**
**నిఃశ్రీకాణాం కుతః సత్త్వం వినా తేన గుణాః కుతః ॥ 29 ॥**

సత్త్వగుణం ఉన్నచోటే లక్ష్మి ఉంటుంది. లక్ష్మి ననుసరించే సత్త్వం ఉంటుంది. లక్ష్మిలేని వాళ్లకు సత్త్వం ఎక్కడనుంచి వస్తుంది? సత్త్వం లేకపోతే గుణాలు ఎక్కడ నుంచి వస్తాయి?

**బలశౌర్యాద్యభావశ్చ పురుషాణాం గుణైర్వినా ।**
**లంఘనీయః సమస్తస్య బలశౌర్యవివర్జితః ॥ 30 ॥**

సుగుణాలులేని పురుషులకు బలం, శౌర్యం మున్నగునవి ఉండవు. బలశౌర్యాలు లేకపోతే అందరూ అవమానిస్తారు.

**భవత్యపధ్వస్తమతిర్లంఘితః ప్రథితః పుమాన్ ।**
**ఏవమత్యన్తనిఃశ్రీకే త్రైలోక్యే సత్త్వవర్జితే ॥ 31 ॥**
**దేవాన్ ప్రతి బలోద్యోగం చక్రుర్దైతేయదానవాః ।**
**లోభాభిభూతా నిఃశ్రీకా దైత్యాః సత్త్వవివర్జితాః ॥ 32 ॥**

సుప్రసిద్ధుడైన పురుషుడు అవమానించబడితే అతని బుద్ధి నాశనమయిపోతుంది. ఈ విధంగా మూడులోకాలూ మిక్కిలి లక్ష్మీశూన్యాలై సత్త్వంలేక విలవిలలాడగా అపుడు దైతేయులు, దానవులు దేవతలపై బలవంతంగా దండెత్తారు. దైత్యులకు సత్త్వం ఏమాత్రం లేదు. సంపద అంతకన్నా లేదు. అయినా లోభానికి లొంగి దండెత్తారు.

**శ్రియా విహీనైర్నిఃసత్త్వైర్దేవైశ్చక్రుస్తతో రణమ్ ।**
**విజితా స్త్రిదశా దైత్యై రిన్ద్రాద్యాః శరణం యయుః ॥ 33 ॥**

లక్ష్మీవిహీనులై నిఃసత్త్వులైన దేవతలతో వారు యుద్ధం చేశారు. ఆ రణంలో దైత్యులచే ఇంద్రాది దేవతలు ఓడిపోయి శరణు ఎవరని వెళ్లారు.

**పితామహం మహాభాగం హుతాశనపురోగమాః ।**
**యథావత్ కథితో దేవైర్బ్రహ్మా ప్రాహ తతః సురాన్ ॥ 34 ॥**

అపుడు దేవేంద్రాదులు అగ్నిహోత్రుని ముందుంచుకొని మహాభాగుడైన పితామహుని శరణు పొందారు. దేవతలు చెప్పిందంతా విని బ్రహ్మ ఆ సురలతో ఇలా అన్నాడు.

**పరాపరేశం శరణం వ్రజధ్వమసురార్దనమ్ ।**
**ఉత్పత్తి స్థితినాశానామహేతుం హేతుమీశ్వరమ్ ॥ 35 ॥**

**ప్రజాపతిపతిం విష్ణుమనన్తమపరాజితమ్ ।**
**ప్రధానపుంసోరజయోః కారణం కార్యభూతయోః ॥ 36 ॥**

**ప్రణతార్తిహరం విష్ణుం స వః శ్రేయో విధాస్యతి ।**
**ఏవముక్త్వా సురాన్ సర్వాన్ బ్రహ్మా లోకపితామహః ।**
**క్షీరోదస్యోత్తరం తీరం తైరేవ సహితో యయౌ ॥ 37 ॥**

"పరావరేశ్వరుడు, రాక్షసమర్దనుడు, సర్గస్థితి వినాశాలకు కారణం కానివాడు, కారణమైనవాడు, పరమేశ్వరుడు, ప్రజాపతులకు ప్రభువైనవాడు, సర్వవ్యాపకుడు, అనంతుడు, అపరాజితుడు, జన్మ లేకపోయినప్పటికి, కార్యభూతులైన ప్రధాన పురుషుల జన్మకు కారణమైనవాడు, ప్రణతులైనవారి ఆర్తిని హరించువాడు అయిన శ్రీ మహావిష్ణువును శరణు వేడండి. ఆయన మీకు శ్రేయస్సును కలిగిస్తాడు" అని ఆ సమస్త దేవతలతో పలికి సర్వలోక పితామహుడైన బ్రహ్మదేవుడు వారందరితో కలిసి పాలసముద్రం యొక్క ఉత్తర తీరానికి వెళ్లాడు.

**స గత్వా త్రిదశైః సర్వైః సమవేతః పితామహః ।**
**తుష్టావ వాగ్భి రిష్టాభిః పరాపరపతిం హరిమ్ ॥ 38 ॥**

అలా వెళ్లి ఆ పితామహుడు ఆ దేవతలందరితో కలసి పరాపరపతియైన శ్రీహరిని మంగళమయ వాక్యాలతో ఇట్లు స్తుతించాడు.

**నమామి సర్వం సర్వేశ మనన్త మజ మవ్యయమ్ ।**
**లోకధామ ధరాధార మప్రకాశ మభేదినమ్ ॥ 39 ॥**

**నారాయణ మణీయాంస మశేషాణా మణీయసామ్ ।**
**సమస్తానాం గరిష్ఠం యద్ భూరాదీనాం గరీయసామ్ ॥ 40 ॥**

**యత్ర సర్వం యతః సర్వ ముత్పన్నం సత్పురఃసరమ్ ।**
**సర్వభూతశ్చ యో దేవః పురాణా మపి యః పరః ॥ 41 ॥**

**పరః పరస్మాత్ పురుషాత్ పరమాత్మస్వరూపధృక్ ।**
**యోగిభి శ్చిన్త్యతే యోఽసౌ ముక్తిహేతు ర్ముముక్షుభిః ॥ 42 ॥**

**సత్త్వాదయో న సన్తీశే యత్ర చ ప్రాకృతా గుణాః ।**
**స శుద్ధః సర్వశుద్ధేభ్యః పుమా నద్య ప్రసీదతు ॥ 43 ॥**

సర్వస్వరూపుడు, సర్వేశ్వరుడు, అజుడు, అవ్యయుడు, త్రిలోకాలనున్న ప్రభావశాలురైన ఇంద్రాదులకు ఆశ్రయమైనవాడు, తనకన్న వేరే మరో ప్రకాశం లేనివాడు, భేదరహితుడై అద్వితీయుడైనవాడు, నారాయణుడు, సమస్తములైన పరమాణువులకన్న అణుస్వరూపుడైనవాడు, భూమిమున్నగు సమస్త భూతాలకన్న (మహాభూతాలకన్న) గరిష్ఠుడైనవాడు, సర్వము ఎవనిలో ఉన్నదో, సర్వము ఎవనినుంచి వచ్చుచున్నదో, సత్పదార్థం మొదలు సర్వం ఎవనినుంచి ఉత్పన్నం అవుతోందో, ఏ దేవుడు సర్వభూతమయుడో, ఎవడు పరం అని చెప్పబడే వాటికన్న పరుడై పరాత్పరుడు అయి ఉన్నాడో, ఎవడు ప్రధాన పురుషులకన్నపరుడో, ఎవడు పరమాత్మ స్వరూపుడో, ఎవనిని ముక్తిహేతువుగా యోగులు, ముముక్షువులు ధ్యానిస్తూ ఉంటారో, ఏ పరమాత్మ సత్త్వం మున్నగు ప్రకృతి సంబంధ గుణాలు లేక శుద్ధసత్త్వుడై ఉంటాడో, సర్వపరిశుద్ధములైన వానికన్న ఎవడు పరమశుద్ధుడో అట్టి పరమపురుషునకు నమస్కారం. అట్టి ఆదిపురుషుడు ప్రసన్నుడవుగాక!

**కలా కాష్ఠా నిమేషాది కాలసూత్రస్య గోచరే ।**
**యస్య శక్తి ర్న శుద్ధస్య ప్రసీదతు స నో హరిః ॥ 44 ॥**

ఏ శుద్ధ స్వరూపుడైన భగవంతుడైన విష్ణుని శక్తి కల - కాష్ఠ - నిమేషం మున్నగు కాలసూత్రానికి విషయం కాదో, అట్టి శ్రీహరి మాపట్ల ప్రసన్నుడగుగాక!

**ప్రోచ్యతే పరమేశో హి యః శుద్ధోఽప్యుపచారతః ।**
**ప్రసీదతు స నో విష్ణు రాత్మా యః సర్వదేహినామ్ ॥ 45 ॥**

ఏ భగవంతుడు శుద్ధస్వరూపుడయినప్పటికి, ఔపచారికంగా భేదవివక్షతో పరమేశ్వరుడని, సర్వదేహులకు ఆత్మ అని చెప్పబడుతున్నాడో, ఆ విష్ణువు మాపట్ల ప్రసన్నుడవుగాక!

**యః కారణం చ కార్యం చ కారణస్యాపి కారణమ్ ।**
**కార్యస్యాపి చ యః కార్యం ప్రసీదతు స నో హరిః ॥ 46 ॥**

ఎవడు కారణం, కార్యం, కారణానికి కూడ కారణం, కార్యానికి కూడ కార్యం అయి ఉన్నాడో, అట్టి హరి మాపట్ల ప్రసన్నుడగు గాక!

**కార్యకార్యస్యయత్ కార్యం తత్కార్యస్యాపి యః స్వయమ్ ।**
**తత్కార్యకార్యభూతో యస్తతశ్చ ప్రణతాః స్మ తమ్ ॥ 47 ॥**

ఎవని కార్యం ప్రకృతి, దాని కార్యం మహత్తత్త్వం, దాని కార్యం అహంకారరూప భూతసూక్ష్మవర్గం, దాని కార్యం బ్రహ్మాండం, దాని కార్యం బ్రహ్మదక్షాది గణసృష్టి, దాని కార్యం ప్రజాపతి పుత్రపౌత్రాదికం అయి ఉన్నదో, ఎవడు స్వయంగా కార్యం ఏర్పడడానికి కారణం అయి ఉన్నాడో, అట్టి పరమేశ్వరుని గూర్చి వందనాలు అర్పిస్తున్నాము.

**కారణం కారణస్యాపి తస్య కారణకారణమ్ ।**
**తత్కారణానాం హేతుం త్వాం ప్రణతాః స్మ సురేశ్వరమ్ ॥ 48 ॥**

ఎవడు జగత్కారణమో (బ్రహ్మాది), దానికి కారణం బ్రహ్మాండం అయి ఉన్నదో, దానికి కారణం పంచభూతాలు, దాని కారణం పంచతన్మాత్రలు, దాని కారణం అహంకార మహత్తత్త్వాలు, దానికి కారణం మూలప్రకృతి అయి ఉన్నాడో, అట్టి దేవేశ్వరుడవైన నీకు మేము ప్రణమిల్లుతున్నాము.

**భోక్తారం భోజ్యభూతం చ స్రష్టారం సృష్ట మేవ చ ।**
**కార్యం కర్మస్వరూపం తం ప్రణతాః స్మ పరం పదమ్ ॥ 49 ॥**

భోక్త భోజ్యవస్తువు, స్రష్ట – సృజ్యం – కార్యం – కర్మస్వరూపం (కర్త– కార్యస్వరూపం) తానే అయి ఉన్నాడో, ఆ పరమ పదస్థానానికి నమస్కరిస్తున్నాము.

**విశుద్ధం బోధనం నిత్య మజ మక్షయ మవ్యయమ్ ।**
**అవ్యక్త మవికారం యత్ తద్విష్ణోః పరమం పదమ్ ॥ 50 ॥**

**న స్థూలం న చ సూక్ష్మం యన్న విశేషణ గోచరమ్ ।**
**తత్పదం పరమం విష్ణోః ప్రణమామః సదాఽమలమ్ ॥ 51 ॥**

పరమశుద్ధుడు, జ్ఞానస్వరూపుడు, నిత్యుడు, అజుడు, అక్షయుడు, అవ్యయుడు, అవ్యక్తుడు, అవికారుడు, స్థూలుడు కానివాడు, సూక్ష్ముడు కానివాడు, విశేషణ గోచరుడు కానివాడు ఎల్లప్పుడూ విమలుడు అయిన ఆ విష్ణుని పరమపదస్థానానికి ప్రణామం.

**యస్యాయుతాయుతాంశాంశే విశ్వశక్తి రియం స్థితా ।**
**పరంబ్రహ్మ స్వరూపం యత్ ప్రణమామ స్తమవ్యయమ్ ॥ 52 ॥**

ఎవనియొక్క అయుతాయుతాంశాంశంలో ఈ విశ్వరచనాశక్తి విరాజమానమై ఉంటుందో, అట్టి అవ్యయమైన పరబ్రహ్మ స్వరూపానికి నమస్కరిస్తున్నాము.

**వి॥** అయుతం పదివేలు, అయుతాయుతం పదికోట్లు అంశాంశం – దాని అంశలో అంశం అనగా స్వల్ప భాగం అదే మాయ.

**య న్న దేవా న మునయో న చాహం న చ శంకరః ।**
**జానన్తి పరమేశస్య తద్విష్ణోః పరమం పదమ్ ॥ 53 ॥**

దేనిని దేవతలుగాని, మునులుగాని, బ్రహ్మనైన నేనుకాని, శంకరుడు కాని తెలిసికొనలేమో, అదే ఆ పరమేశ్వరుడైన విష్ణువు యొక్క పరమపదస్థానం, దానికి నమస్కారం.

**యద్ యోగినః సదోద్యుక్తాః పుణ్యాపాపక్షయేఽక్షయమ్ ।**
**పశ్యన్తి ప్రణవే చిన్త్యం తద్విష్ణోః పరమం పదమ్ ॥ 54 ॥**

నిత్యం సాధన చేసి పుణ్యపాపాలు నశింపజేసికొని, యోగీశ్వరులు ప్రణవమంత్రమైన ఓంకారాన్ని జపించి, అక్షయమైన ఏ విష్ణువుయొక్క పరమపదాన్ని చూస్తూ ఉంటారో, దానికి నమస్కారం.

**శక్తయో యస్య దేవస్య బ్రహ్మవిష్ణుశివాదికాః ।**
**భవన్త్యభూతపూర్వస్య తద్విష్ణోః పరమం పదమ్ ॥ 55 ॥**

బ్రహ్మవిష్ణుశివాదికాలైన సమస్త శక్తులు ఏ దేవదేవుడైన అభూతపూర్వుడైన (అనాది అయిన) వానివిగా అయి ఉన్నాయో, ఆ విష్ణుని పరమపదస్వరూపానికి నమస్కారం.

**సర్వేశ సర్వభూతాత్మన్ సర్వ సర్వాశ్రయాచ్యుత ।**
**ప్రసీద విష్ణో భక్తానాం వ్రజ నో దృష్టిగోచరమ్ ॥ 56 ॥**

సర్వేశ్వరా! సర్వభూతాత్మా! సర్వస్వరూపా! సర్వాశ్రయా! అచ్యుతా! మహావిష్ణూ! భక్తులకు ప్రసన్నుడవు కమ్ము. మాకు ప్రత్యక్షం కావలసింది.

**ఇత్యుదీరిత మాకర్ణ్య బ్రహ్మణ స్త్రిదశా స్తతః ।**
**ప్రణమ్యోచుః ప్రసీదేతి వ్రజ నో దృష్టిగోచరమ్ ॥ 57 ॥**

ఈ విధంగా బ్రహ్మ కావించిన స్తోత్రం విని దేవతలు నమస్కరించి “ప్రసన్నుడవు కమ్ము. మాకు ప్రత్యక్షం కావలసింది” అని ఇలా అన్నారు.

**యన్నాయం భగవాన్ బ్రహ్మ జానాతి పరమం పదమ్ ।**
**తన్నతాః స్మ జగద్ధామ తవ సర్వగతాచ్యుత ॥ 58 ॥**

ఓ అచ్యుతా! సర్వగతా! జగద్ధామ! ఏ నీ పరమపదాన్ని ఈ భగవంతుడైన బ్రహ్మకూడ తెలియలేదో, అట్టి నీ స్వరూపానికి వినమ్రుల మవుతున్నాము.

**ఇత్యన్తే వచస స్తేషాం దేవానాం బ్రహ్మణ స్తథా ।**
**ఊచు ర్దేవర్షయ స్సర్వే బృహస్పతిపురోగమాః ॥ 59 ॥**

ఈరీతిగా దేవతలు, బ్రహ్మస్తోత్రంచేసి విన్నవించిన తరువాత బృహస్పతి మున్నగు దేవర్షులందరూ ఇలా స్తుతించారు.

**ఆద్యో యజ్ఞపుమానీడ్యః యః సర్వేషాం చ పూర్వజః ।**
**తం నతాః స్మ జగత్స్రష్టుః స్రష్టార మవిశేషణమ్ ॥ 60 ॥**

“ఆద్యుడు, యజ్ఞపురుషుడు, స్తుతింపదగినవాడు, పూర్వులకంటె పూర్వుడు, జగత్తును పుట్టించినవానిని కూడా పుట్టించినవాడు, ఏ విశేషణాలు లేనివాడు అయినవానికి ప్రణమిల్లుతున్నాము.

**భగవన్ భూతభవ్యేశ జగన్మూర్తిధరావ్యయ! ।**
**ప్రసీద ప్రణతానాం త్వం సర్వేషాం దేహి దర్శనమ్ ॥ 61 ॥**

భగవంతుడా! భూతభవ్యేశా! జగన్మూర్తిధరా! అవ్యయా! ప్రసన్నుడవు కమ్ము. నమస్కరిస్తున్నవారందరికి నీవు దర్శనం ప్రసాదించు.

**ఏష బ్రహ్మా తథైవాయం సహ రుద్రై స్త్రిలోచనః ।**
**సర్వాదిత్యైః సమం పూషా పావకోఽయం సహాగ్నిభిః ॥ 62 ॥**

**అశ్వినౌ వసవ శ్చేమే సర్వే చైతే మరుద్గణాః ।**
**సాధ్యా విశ్వే తథా దేవా దేవేన్ద్రశ్చాయ మీశ్వరః ॥ 63 ॥**

**ప్రణామ ప్రవణా నాథ! దైత్యసైన్యపరాజితాః ।**
**శరణం త్వా మనుప్రాప్తాః సమస్తా దేవతాగణాః ॥ 64 ॥**

మాతోబాటు ఈ బ్రహ్మ, రుద్రులతో సహా ఈ ముక్కంటి సర్వాదిత్యులతో కలిసి ఈ పూషుడు. అగ్నులతోకలిసి ఈ వీతిహోత్రుడు, ఈ అశ్వినీ దేవతలు, ఈ వస్తువులు, ఈ సమస్తమరుద్గణాలు, సాధ్యులు, విశ్వేదేవతలు, దేవతలు, దేవేంద్రుడు, ఈ ఈశ్వరుడు అందరూ ప్రణామపరాయణులై ఉన్నారు. సమస్త దేవతాగణాలు దైత్యసేనవల్ల ఓడిపోయి నిన్ను శరణు చొచ్చి ఉన్నారు. అని విన్నవించారు.

**ఏవం సంస్తూయమానస్తు భగవాంఛంఖచక్రధృక్ । (వాన్+శంఖ)**
**జగామ దర్శనం తేషాం మైత్రేయ! పరమేశ్వరః ॥ 65 ॥**

మైత్రేయా! ఈ విధంగా వారందరిచే స్తుతించబడుతూ భగవంతుడు, పరమేశ్వరుడు శంఖచక్రాలు ధరించిన రూపంతో వారికి దర్శనం ఇచ్చాడు. (శంఖ చక్రాద్యాయుధాలు)

**తం దృష్ట్వా తే తదా దేవాః శంఖచక్రగదాధరమ్ ।**
**అపూర్వరూపసంస్థానం తేజసాం రాశిమూర్జితమ్ ॥ 66 ॥**

**ప్రణమ్య ప్రణతాః పూర్వం సంక్షోభిస్తిమితేక్షణాః ।**
**తుష్టువుః పుణ్డరీకాక్షం పితామహపురోగమాః ॥ 67 ॥**

**నమో నమోఽవిశేషస్త్వం త్వం బ్రహ్మా త్వం పినాకధృక్ ।**
**ఇన్ద్ర స్త్వమగ్నిః పవనో వరుణః సవితా యమః ॥ 68 ॥**

**వసవో మరుతః సాధ్యా విశ్వేదేవగణా భవాన్ ।**
**యోఽయం తవాగతో దేవ సమీపం దేవతాగణః ॥ 69 ॥**

అపుడు దేవతలు ఆ శంఖచక్రగదాధారిని, పూర్వంలో తాము చూడనట్టి రూపాకృతి ధరించినవానిని, దివ్యతేజఃపుంజనిలయమైనవానిని చూచి ఆ పితామహాది దేవతలందరు విచకితనేత్రాలుకలవారై వంగి నమస్కరించారు. అనంతరం తామరపూలవంటి నేత్రాలుకల ఆ భగవంతుని ఇలా స్తుతించారు. (దివ్య తేజస్సును చూడలేక ముందు క్షోభపొంది తరువాత స్తిమితంపొందిన కన్నులు కలవారయ్యారు)

దేవా! నీకు నమస్కారం. నీవు శుద్ధపరమాత్మవు నీవే బ్రహ్మవు పినాకధారివి నీవే. ఇంద్రుడవు నీవు. నీవే అగ్నివి. పవనుడవు; వరుణుడవు; సవితవు, యముడవు నీవే. వస్తువులూ, మరుత్తులు, సాధ్యులు, విశ్వేదేవతలూ నీవే. నీ సమీపానికి వచ్చి ఉన్న ఈ సమస్త దేవతాగణమూ నీవే.

**స త్వమేవ జగత్స్రష్టా యతః సర్వగతో భవాన్ ।**
**త్వం యజ్ఞ స్త్వం వషట్కార స్త్వమోంకారః ప్రజాపతిః ॥ 70 ॥**

జగత్తు సృష్టించేవాడవు నీవే. ఆ జగత్తును అంతా వ్యాపించి ఉన్నవాడవు నీవే. నీవే యజ్ఞం. వషట్కారం నీవే. ఓంకారం నీవే. నీవే ప్రజాపతివి.

**వేద్యావేద్యం చ సర్వాత్మన్! త్వన్మయం చాఖిలం జగత్ ।**
**త్వామత్ర శరణం విష్ణో! ప్రయాతా దైత్యనిర్జితాః ॥ 71 ॥**

ఓ సర్వాత్మ స్వరూపా! వేత్తవూ నీవే. వేద్యము నీవే. ఈ సమస్త జగత్తూ విష్ణుమయమే. అందువల్ల ఓ మహావిష్ణూ! దైత్యుల చేతిలో ఓడిపోయి దిక్కుతోచక నీ శరణు పొందాము.

**వయం ప్రసీద సర్వాత్మం స్తేజ సాప్యాయయస్వ నః ।**
**తావదార్తి స్తథా వాంఛా తావన్మోహస్తథా సుఖమ్ ॥ 72 ॥**

**యావ న్నాయాతి శరణం త్వా మశేషాఘనాశనమ్ ।**
**త్వం ప్రసాదం ప్రసన్నాత్మన్! ప్రపన్నానాం కురుష్వ నః ॥ 73 ॥**
**తేజసాం నాథ! సర్వేషాం స్వశక్త్యాప్యాయనం కురు ॥ 74 ॥**

ఓ సర్వాత్మా! మమ్మల్ని అనుగ్రహించు. నీ తేజస్సుతో మమ్మల్ని వృద్ధిపొందించు. జీవులలో ఆర్తికాని, వాంఛకాని మోహంకాని, సుఖంకాని సమస్త పాపాలను నాశనంచేసే నిన్ను శరణుపొందేవరకే ఉంటాయి. ప్రసన్నాత్మా! ప్రపన్నులమైన మాపై నీవు అనుగ్రహం చూపించు. ఓ తేజోనిధీ! నీ స్వీయశక్తితో మా తేజస్సులను వృద్ధిపొందించు.

**ఏవం సంస్తూయమానస్తు ప్రణతై రమరైర్హరిః ।**
**ప్రసన్నదృష్టి ర్భగవా నిదమాహ స విశ్వకృత్ ॥ 75 ॥**

ఈ విధంగా దేవతలు వినమ్రులై స్తోత్రం చేయగా, విశ్వకర్త అయిన ఆ భగవంతుడు అనుగ్రహదృష్టితో ఇలా అన్నాడు.

**తేజసో భవతాం దేవాః కరిష్యామ్యుపబృంహణమ్ ।**
**వదామ్యహం యత్ క్రియతాం భవద్భి స్తదిదం సురాః ॥ 76 ॥**

ఓ దేవతలారా! మీ తేజస్సులను అభివృద్ధి పొందింపజేస్తాను. సురలారా! మీచేత చేయబడవలసిం దేదైతే ఉన్నదో దానిని నేను చెబుతాను.

**ఆనీయ సహితా దైత్యైః క్షీరాబ్ధౌ సకలౌషధీః ।**
**మన్థానం మందరం కృత్వా నేత్రం కృత్వా తు వాసుకిమ్ ॥ 77 ॥**

**మథ్యతా మమృతం దేవాః! సహాయే మయ్యవస్థితే ।**
**సామపూర్వం చ దైతేయా స్తత్ర సాహాయ్యకర్మణి ॥ 78 ॥**

**సామాన్యఫలభోక్తారో యూయం వాచ్యా భవిష్యథ ।**
**మథ్యమానే చ తత్రాబ్ధౌ యత్ సముత్పద్యతేఽమృతమ్ ॥ 79 ॥**

దితిసంతానంతో కలసి, సమస్తములైన ఓషధులను తెచ్చి, పాలసముద్రంలో వేసి, మందరపర్వతాన్ని కవ్వంగా చేసి, వాసుకిని కవ్వపు త్రాడు కావించి, అమృతంకోసం మథించండి దేవతలారా! నేను మీకు సహాయంగా ఉంటాను. దైత్యులతో సామపూర్వంగా వ్యవహరించండి. వారి సహాయం కావలసి ఉందని చెప్పండి. దీనిఫలం ఏదైతే ఉందో, దానిని సమానంగా అనుభవిద్దామని చెప్పండి. అలా క్షీరాంభోధిని మథిస్తే అమృతం ఉద్భవిస్తుంది.

**తత్పానాద్ బలినో యూయ మమరా శ్చ భవిష్యథ ।**
**తథా చాహం కరిష్యామి యథా త్రిదశవిద్విషః ।**
**న ప్రాప్స్యన్త్యమృతం దేవాః! కేవలం క్లేశభాగినః ॥ 80 ॥**

దేవతలారా! ఆ అమృతాన్ని త్రాగి మీరు బలవంతులు, మృత్యువులేనివారు కాగలరు. మీ శత్రువులైన దితిపుత్రులకు కేవలం క్లేశం మాత్రమే మిగులుతుంది. వారికి అమృతం దక్కకుండా ఎలాచేయాలో అలా నేనుచేస్తాను.

**ఇత్యుక్తా దేవదేవేన సర్వ ఏవ తతః సురాః ।**
**సన్ధాన మసురైః కృత్వా యత్నవన్తోఽమృతేఽభవన్ ॥ 81 ॥**

ఈ రీతిగా దేవదేవుడు పలుకగా, సమస్త దేవతలు అసురులతో సంధి కావించుకొని అమృతంకోసం యత్నం సాగించారు.

**నానౌషధీః సమానీయ దేవదైతేయదానవాః ।**
**క్షిప్త్వా క్షీరాబ్ధిపయసి శరదభ్రామలత్విషి ॥ 82 ॥**

**మన్థానం మందరం కృత్వా నేత్రం కృత్వా చ వాసుకిమ్ ।**
**తతో మథితు మారబ్ధా మైత్రేయ! తరసాఽమృతమ్ ॥ 83 ॥**

మైత్రేయా! దేవతలు, దైతేయులు, దానవులు నానావిధాలైన ఓషధులను కొనివచ్చి, శరత్కాలంలోని ఆకాశంలా స్వచ్ఛంగా ఉన్న పాలకడలి నీటిలో పడవేసి, మందర పర్వతాన్ని కవ్వంగా చేసి, వాసుకిని కవ్వపు త్రాడు కావించి అమృతంకోసమై వేగంగా చిలకడానికి ఆరంభించారు.

**విబుధాః సహితాః సర్వే యతః పుచ్ఛం తతః కృతాః ।**
**కృష్ణేన వాసుకే ర్దైత్యాః పూర్వకాయే నివేశితాః ॥ 84 ॥**

విష్ణుమూర్తివల్ల సమస్తవిబుధులు (సురలు) వాసుకియొక్క తోకవైపు ఉంచబడ్డారు. దైత్యులు ముఖంవైపు ఉంచబడ్డారు.

**తే తస్య ఫణనిఃశ్వాసవహ్నినాపహతత్విషః ।**
**నిస్తేజసోఽసురాః సర్వే బభూవు రమితద్యుతేః ॥ 85 ॥**

**తేనైవ ముఖనిఃశ్వాసవాయునాస్తబలాహకైః ।**
**పుచ్ఛప్రదేశే వర్షద్భి స్తథా చాప్యాయితాః సురాః ॥ 86 ॥**

అమిత తేజస్వంతుడైన వాసుకియొక్క పడగల నిఃశ్వాసాగ్ని తగిలి కాంతి కోల్పోయి, అసురులు తేజోవిహీనులయ్యారు! ఆ వాసుకి ముఖనిఃశ్వాసవాయువులద్వారా చెదరగొట్టబడిన, మేఘాలు వర్షించగా తోకనుపట్టుకొని వున్న దేవతలు తడపబడ్డారు.

**క్షీరోదమధ్యే భగవాన్ కూర్మరూపీ స్వయం హరిః ।**
**మన్థనాద్రే రధిష్ఠానం భ్రమతోఽభూ న్మహామునే! ॥ 87 ॥**

మునీంద్రా! భగవంతుడైన శ్రీహరి స్వయంగా కూర్మరూపం దాల్చి, క్షీరసాగరమధ్యంలో తిరిగే మందర పర్వతానికి ఆధారం అయ్యాడు.

**రూపేణాన్యేన దేవానాం మధ్యే చక్రగదాధరః ।**
**చకర్ష భోగిరాజానం దైత్యమధ్యేఽపరేణ చ ॥ 88 ॥**

చక్రగదాధారియైన విష్ణువు మరోరూపంతో దేవతలమధ్య నిలిచి, ఇంకో రూపంతో దైత్యుల మధ్య నిలిచి నాగరాజును అటూ ఇటూ లాగాడు.

**ఉపర్యాక్రాన్తవాన్ శైలం బృహద్రూపేణ కేశవః ।**
**తథాఽపరేణ మైత్రేయ యన్న దృష్టం సురాసురైః ॥ 89 ॥**

మైత్రేయా! అదేవిధంగా కేశవుడు మరోబృహద్రూపం ధరించి శైలంయొక్క ఉపరిభాగాన్ని ఆక్రమించి ఉన్నాడు. అది సురాసురుల కంటబడలేదు.

**తేజసా నాగరాజానం తథాఽఽప్యాయితవాన్ హరిః ।**
**అన్యేన తేజసా దేవా నుపబృంహితవాన్ హరిః (విభుః) ॥ 90 ॥**

ఆ రీతిగా తన తేజస్సుతో శ్రీహరి నాగరాజుకు సుఖం కలిగించాడు. మరో తేజస్సుతో ఆ విభుడు దేవతల తేజస్సును అభివృద్ధి చేశాడు.

**మథ్యమానే తత స్తస్మిన్ క్షీరాబ్ధౌ దేవదానవైః ।**
**హవిర్ధామాఽభవత్ పూర్వం సురభిః సురపూజితా ॥ 91 ॥**

**జగ్ము ర్ముదం తతో దేవా దానవాశ్చ మహామునే ।**
**వ్యాక్షిప్తచేతస శ్చైవ బభూవు స్తిమితేక్షణాః ॥ 92 ॥**

మునీశ్వరా! దేవతలు, దానవులు అంతట పాలకడలిని మథిస్తూ ఉండగా మొదట దేవతలచే పూజించబడేది, హవిస్సుకు ఆశ్రయమైనది అయిన కామధేనువు లభించింది. అంతట దేవతలు దానవులు తమ కృషి సఫలమవుతున్నందులకు సంతోషాన్ని పొందారు. చెదరిన మనస్సులతో కదలని నేత్రాలతో దానిని వీక్షించారు.

**కిమేతదితి సిద్ధానాం దివి చిన్తయతాం తతః ।**
**బభూవ వారుణీదేవీ మదాఘూర్ణితలోచనా ॥ 93 ॥**

అటుపిమ్మట ఆకాశంలో సిద్ధులు ఇదేమిటని ఆలోచిస్తూ ఆశ్చర్యపోతూ ఉండగా, మదంచే కళ్ళు తిరుగుతుండగా వారుణీదేవి (మదిరకు అధిష్ఠానదేవత) జన్మించింది.

**కృతావర్తాత్ తత స్తస్మాత్ క్షీరోదాద్ వాసయన్ జగత్ ।**
**గన్ధేన పారిజాతోఽభూద్ దేవస్త్రీనన్దనస్తరుః ॥ 94 ॥**

పిదప ఆ దుగ్ధజలధినుండి సుడులు తిరుగుతూ ఉండగా, జగత్తును ఘుమఘుమలాడిస్తూ, దేవకాంతలకు ఆనందదాయకమైన, సుగంధాలు వ్యాపింపజేస్తూ పారిజాతవృక్షం ఆవిర్భవించింది.

**రూపౌదార్యగుణోపేతస్తతశ్చాప్సరసాం గణః ।**
**క్షీరోదధేః సముత్పన్నో మైత్రేయ! పరమాద్భుతః ॥ 95 ॥**

మైత్రేయా! అటుపిమ్మట క్షీరసముద్రంనుంచి మంచిరూపం, తగిన ఔదార్యం, సముచితమైన సద్గుణం గల, చూచిన వెంటనే మిక్కిలి ఆశ్చర్యం కలిగించే అప్సరోగణం ఆవిర్భవించింది.

**తతః శీతాంశురభవజ్జగృహే తం మహేశ్వరః ।**
**జగృహుశ్చ విషం నాగాః క్షీరోదాచ్చ సముత్థితమ్ ॥ 96 ॥**

అటు తరవాత చల్లని కిరణాలుగల చంద్రుడు ఉద్భవించాడు. ఈశ్వరుడు ఆ చంద్రుని స్వీకరించాడు. క్షీరసాగరంనుండి విషం బుగబుగలాడుతూ పైకిరాగా, మహేశ్వరుడు, నాగులు ఆ విషాన్ని స్వీకరించాయి.

**తతో ధన్వన్తరిర్దేవః శ్వేతామ్బరధరః స్వయమ్ ।**
**బిభ్రత్కమణ్డలుం పూర్ణమమృతస్య సముత్థితః ॥ 97 ॥**

పిదప స్వయంగా భగవంతుడైన ధన్వంతరి తెల్లనిబట్టలు దాల్చినవాడై, అమృతంతో నిండిన కమండలువు ధరించి పైకి వచ్చాడు.

**తతః స్వస్థమనస్కాస్తే సర్వే దైతేయదానవాః ।**
**బభూవుర్ముదితాః సర్వే మైత్రేయ! మునిభిః సహ ॥ 98 ॥**

మైత్రేయా! అపుడు వారందరు దైతేయులు, దానవులు మునులతో కూడి కుదుటపడిన మనస్సు కలవారై వెంటనే ఆనందం పొందినవారయ్యారు.

**తతః స్ఫురత్కాన్తిమతీ వికాసికమలే స్థితా ।**
**శ్రీర్దేవీ పయసస్తస్మాదుత్థితా ధృత పంకజా ॥ 99 ॥**

తదనంతరం కాంతితో తళతళలాడిపోతున్న, వికసించిన తామరపూవులో అధివసించియున్న, చేతిలో పద్మాన్ని ధరించిన శ్రీదేవి ఆ పాలకడలి పాలనుంచి పైకి వచ్చింది.

**తాం తుష్టువుర్ముదా యుక్తాః శ్రీసూక్తేన మహర్షయః ।**
**విశ్వావసుముఖాస్తస్యా గన్ధర్వాః పురతో జగుః ॥ 100 ॥**

మహర్షులు సంతోషంతో కూడినవారై శ్రీసూక్తంతో ఆమెను స్తోత్రం చేశారు. విశ్వావసువు మున్నగు గంధర్వులు ఆ లక్ష్మీదేవిముందు గానం చేశారు.

**ఘృతాచీప్రముఖా బ్రహ్మన్ ననృతుశ్చాప్సరోగణాః ।**
**గంగాద్యాః సరితస్తోయైః స్నానార్థముపతస్థిరే ॥ 101 ॥**

బ్రాహ్మణోత్తమా! ఘృతాచి మున్నగు అప్సరసలు నృత్యం చేశారు. గంగ మున్నగు నదులు నీటితో స్నానం చేయించడానికై సమీపించాయి.

**దిగ్గజా హేమపాత్రస్థమాదాయ విమలం జలమ్ ।**
**స్నాపయాంచక్రిరే దేవీం సర్వలోకమహేశ్వరీమ్ ॥ 102 ॥**

దిగ్గజాలు బంగారు పాత్రనిండా స్వచ్ఛమైన జలాలు పట్టుకొనివచ్చి, సర్వలోక మహేశ్వరి అయిన ఆ శ్రీదేవిని స్నానం చేయించాయి.

**క్షీరోదో రూపధృక్ తస్యై మాలామమ్లాన పంకజామ్ ।**
**దదౌ విభూషణాన్యంగే విశ్వకర్మా చకార చ ॥ 103 ॥**

క్షీరసాగరుడు రూపందాల్చి వచ్చి ఆమెకు వాడని తామరపూలదండ ఇచ్చాడు. విశ్వకర్మ ఆయా అంగప్రత్యంగాలకు తగినట్లుగా అనేకాభరణాలతో అలంకరించాడు.

**దివ్యమాల్యాంబరధరా స్నాతా భూషణభూషితా ।**
**పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః ॥ 104 ॥**

ఆమె స్నానం ఆచరించి, దివ్యాంబరాలు, దివ్యమాల్యాలు ధరించి, సర్వాలంకారభూషితయై, సమస్త దేవతలు చూస్తూ ఉండగా శ్రీహరియొక్క వక్షఃస్థలాన్ని చేరింది.

**తయాఽవలోకితా దేవా హరివక్షఃస్థలస్థయా ।**
**లక్ష్మ్యా మైత్రేయ సహసా పరాం నిర్వృతిమాగతాః ॥ 105 ॥**

మైత్రేయా! శ్రీహరి వక్షఃస్థలాన్ని అలంకరించిన లక్ష్మీదేవిచే వీక్షించబడ్డవారై దేవతలందరూ వెంటనే పరానందం పొందారు.

**ఉద్వేగం పరమం జగ్ముర్దైత్యా విష్ణుపరాఙ్ముఖాః ।**
**త్యక్తా లక్ష్మ్యా! మహాభాగ్య విప్రచిత్తిపురోగమాః ॥ 106 ॥**

మహాభాగా! లక్ష్మీదేవి తమను విడిచి శ్రీహరిని చేరడంచే విష్ణువువల్ల విముఖత్వాన్ని పొందిన విప్రచిత్తి మున్నగు దైత్యులు మిక్కిలి ఆకులపాటు చెందారు.

**తతస్తే జగృహుర్దైత్యా ధన్వన్తరికరే స్థితమ్ ।**
**కమణ్డలుం మహావీర్యా యత్రాఽఽస్తే తద్ద్విజామృతమ్ ॥ 107 ॥**

ద్విజోత్తమా! అపుడు మహావీర్యవంతులైన దైత్యులు ధన్వంతరి చేతిలో ఉన్న అమృతపూర్ణ కమండలువును లాగుకొన్నారు.

**మాయయా లోభయిత్వా తాన్ విష్ణుః స్త్రీరూపమాస్థితః ।**
**దానవేభ్యస్తదాదాయ దేవేభ్యః ప్రదదౌ విభుః ॥ 108 ॥**

ప్రభువైన శ్రీ మహావిష్ణువు స్త్రీరూపం దాల్చి, మాయతో వారిని ప్రలోభపరచి, ఆ అమృత కలాశాన్ని దానవులనుండి లాగుకొని, దేవతలకు ఇచ్చాడు.

**తతః పపుః సురగణాః శక్రాద్యాస్తత్తదాఽమృతమ్ ।**
**ఉద్యతాయుధనిస్త్రింశా దైత్యాస్తాంశ్చ సమభ్యయుః ॥ 109 ॥**

అపుడు ఇంద్రాది దేవతాగణాలు ఆ అమృతం త్రాగారు. అంత దైత్యులు వాడియైన ఆయుధాలను పైకెత్తి దేవతలపై విరుచుకుపడి తరుమసాగారు.

**పీతేఽమృతే చ బలిభిర్దేవై ర్దైత్యచమూస్తదా ।**
**వధ్యమానా దిశో భేజే పాతాలం తు వివేశ వై ॥ 110 ॥**

అనంతరం అమృతం త్రాగడంచే బలవంతులైన దేవతలు తిరగబడి దైత్యసైన్యాన్ని చంపుతూ ఉండగా, అది తలోదిక్కుగా చెల్లాచెదరై పాతాళం ప్రవేశించింది (పారిపోయింది).

**తదా దేవా ముదాయుక్తాః శంఖచక్రగదాభృతమ్ ।**
**ప్రణిపత్య యథాపూర్వమాశాసత త్రివిష్టపమ్ ॥ 111 ॥**

అంత దేవతలు సంతోషంతో కూడుకొన్నవారై శంఖం, చక్రం, గద ధరించియున్న ఆ విష్ణువుకు వినమ్రులై నమస్కరించి పూర్వంలాగే స్వర్గాన్ని పరిపాలించసాగారు.

**తతః ప్రసన్నభాః సూర్యః ప్రయయౌ స్వేన వర్త్మనా ।**
**జ్యోతీంషి చ యథామార్గం ప్రయయుర్మునిసత్తమ! ॥ 112 ॥**

మునీంద్రా! తదనంతరం సూర్యుడు స్పష్టమైన కాంతితో తనమార్గంలో తాను పయనించాడు. తారాగ్రహాది జ్యోతిర్గోళాలు తమతమ మార్గాలతో తాము నడవసాగాయి.

**జజ్వాల భగవాంశ్చోచ్చై శ్చారుదీప్తిర్విభావసుః ।**
**ధర్మే చ సర్వభూతానాం తదా మతిరజాయత ॥ 113 ॥**

భగవంతుడైన అగ్నిహోత్రుడు పొగలేకుండా ఉండే చక్కని దీప్తితో ప్రజ్వరిల్లాడు. ఆ తరువాత సమస్త ప్రాణులకు ధర్మంపట్ల బుద్ధిపుట్టింది.

**త్రైలోక్యం చ శ్రియా జుష్టం బభూవ మునిసత్తమ! ।**
**శక్రశ్చ త్రిదశశ్రేష్ఠః పునః శ్రీమానజాయత ॥ 114 ॥**

మునీశ్వరా! మూడులోకాలు లక్ష్మీసంపన్నమయ్యాయి. దేవతలలో శ్రేష్ఠుడయిన ఇంద్రుడు మళ్లీ తిరిగి శ్రీమంతుడయ్యాడు.

**సింహాసనగతః శక్రః సంప్రాప్య త్రిదివం పునః ।**
**దేవరాజ్యే స్థితో దేవీం తుష్టావాబ్జకరాం తతః ॥ 115 ॥**

శక్రుడు మళ్లీ స్వర్గాన్ని పొందినవాడై, దేవసామ్రాజ్య సింహాసనంపై విరాజిల్లుతున్నవాడై పద్మంచేతిలో భాసిల్లే లక్ష్మీదేవిని అంత ఈ విధంగా స్తుతించాడు.

**ఇంద్ర ఉవాచ:-** ఇంద్రుడు పలికాడు.

**నమస్యే సర్వభూతానాం జననీమబ్జసమ్భవామ్ ।**
**శ్రియమున్నిద్రపద్మాక్షీం విష్ణో ర్వక్షఃస్థలస్థితామ్ ॥ 116 ॥**

సర్వప్రాణులకు తల్లియైనదానిని, తామరపూవులో ఉద్భవించినదానిని, వికసించిన కమలాలవంటి నేత్రాలు కలదానిని, విష్ణువుయొక్క వక్షఃస్థలంపై నివాసం ఉన్న లక్ష్మీదేవిని నమస్కరిస్తున్నాను.

**త్వం సిద్ధిస్త్వం సుధా స్వాహా స్వధా త్వం లోకపావని! ।**
**సన్ధ్యా రాత్రిః ప్రభా భూతిర్మేధా శ్రద్ధా సరస్వతీ ॥ 117 ॥**

ఓ లోకపావనీ! నీవు సిద్ధివి. నీవే అమృతానివి. నీవు స్వాహాదేవివి. నీవే స్వధవు. సంధ్య, రాత్రి, ప్రభ, భూతి, మేధ, శ్రద్ధ, సరస్వతి-నీవే.

**యజ్ఞవిద్యా మహావిద్యా గుహ్యవిద్యా చ శోభనే! ।**
**ఆత్మవిద్యా చ దేవి! త్వం విముక్తిఫలదాయినీ ॥ 118 ॥**

ఓ కల్యాణీ! నీవే యజ్ఞవిద్యవు. మహావిద్యవు. గుహ్యవిద్యవు. ఓ దేవీ! ముక్తిఫలాన్ని ఇచ్చే ఆత్మవిద్యవు కూడా నీవే.

**ఆన్వీక్షికీత్రయీ వార్తా దణ్డనీతి స్త్వమేవ చ ।**
**సౌమ్యాసౌమ్యైర్జగద్రూపై స్త్వయైతద్దేవి పూరితమ్ ॥ 119 ॥**

ఓ దేవీ! తర్కవిద్య, వేదత్రయి, శిల్పవాణిజ్యాదిశాస్త్రం, దండనీతి నీవే అయి ఉన్నావు. నీయొక్క సౌమ్యాసౌమ్య (శాంత మరియు ఉగ్రం) రూపాలతో ఈ విశ్వమంతా నిండిపోయింది.

**కా త్వన్యా త్వామృతే దేవి! సర్వయజ్ఞమయం వపుః ।**
**అధ్యాస్తే దేవదేవస్య యోగిచిన్త్యం గదాభృతః ॥ 120 ॥**

దేవీ! నీవు కాక ఇంకొకరు ఎవ్వరైనా దేవతలకే దేవుడైన, యోగీశ్వరులచే మనస్సులో ధ్యానించబడే, గదాధారి అయిన సర్వయజ్ఞమయుడైన విష్ణుని శరీరంపై అధివసింతురా?

**త్వయా దేవి పరిత్యక్తం సకలం భువనత్రయమ్ ।**
**వినష్టప్రాయమభవత్ త్వయేదానీం సమేధితమ్ ॥ 121 ॥**

ఓ లక్ష్మీదేవీ! నీచే విడిచి వేయబడ్డ మూడులోకాలు నష్టప్రాయాలు అయిపోయాయి. నీవు మళ్లీ త్రైలోక్యాన్ని పెంపొందింపజేశావు.

**దారాః పుత్రాస్తథాగారం సుహృద్ధాన్యధనాదికమ్ ।**
**భవత్యేతన్మహాభాగే! నిత్యం త్వద్వీక్షణాన్నృణామ్ ॥ 122 ॥**

ఓ మహైశ్వర్యసంపన్నురాలా! భార్య, పుత్రులు, ఇల్లు, స్నేహితుడు, ధాన్యం, ధనం మున్నగునవి నరులకు నీ దయావీక్షణం వల్లనే నిత్యం కలుగుతున్నాయి.

**శరీరారోగ్యమైశ్వర్య మరిపక్ష క్షయస్సుఖమ్ ।**
**దేవి త్వద్దృష్టిదృష్టానాం పురుషాణాం న దుర్లభమ్ ॥ 123 ॥**

ఓ శ్రీదేవీ! దేహానికి ఆరోగ్యం, భోగాలను కలగజేసే ఐశ్వర్యం, శత్రుపక్షం నశించిపోవడం, శరీరం అనుభవించే సుఖం నీ కంటిచూపు ప్రసరించినవారికి దుర్లభం కావు.

**త్వం మాతా సర్వభూతానాం దేవదేవో హరిః పితా ।**
**త్వయైతద్విష్ణునా చాద్య జగద్వ్యాప్తం చరాచరమ్ ॥ 124 ॥**

సమస్త ప్రాణులకు నీవు తల్లివి. దేవదేవుడైన శ్రీహరి తండ్రి. నీచేతా, విష్ణువుచేతా ఈ కదిలే, కదలకుండా ఉండే జంగమ స్థావరాత్మకమైన జగత్తంతా వ్యాపించబడి ఉంది.

**మా నః కోశం తథా గోష్ఠం మా గృహం మా పరిచ్ఛదమ్ ।**
**మా శరీరం కళత్రం చ త్యజేథాః సర్వపావని! ॥ 125 ॥**

సమస్తాన్ని పవిత్రంచేసే ఆదిలక్ష్మీ! మా కోశాగారాన్ని, గోశాలనూ, ఇంటిని, భోగసామగ్రిని, శరీరాన్ని, కళత్రాన్ని విడిచిపెట్టకు తల్లీ!

**మా పుత్రాన్ మా సుహృద్వర్గం మా పశూన్ మా విభూషణమ్ ।**
**త్యజేథా మమ దేవస్య విష్ణోర్వక్షఃస్థలాలయే! ॥ 126 ॥**

నాకు దైవమైన విష్ణువుయొక్క వక్షఃస్థలం ఆలయమై ఉన్న లక్ష్మీ! మా పుత్రులను, స్నేహబంధాన్ని, పశు గణాలను, విభూషణాలను విడిచిపెట్టకు తల్లీ!

**సత్త్వేన సత్యశౌచాభ్యాం తథా శీలాదిభిర్గుణైః ।**
**త్యజ్యన్తే తే నరాః సద్యః సన్త్యక్తా యే త్వయాఽమలే! ॥ 127 ॥**

ఏ మాలిన్యంలేని పూజ్యురాలా! నీచే పూర్తిగావిడిచి వేయబడ్డ ఏ మానవులు ఉన్నారో, వారు సత్త్వంనుంచి, సత్యంనుంచి, శౌచం నుంచి, శీలం మున్నగు సద్గుణాలనుంచి శీఘ్రంగా దూరం అవుతారు.

**త్వయాఽవలోకితాః సద్యః శీలాద్యైరఖిలైర్గుణైః ।**
**కులైశ్వర్యైశ్చ ముహ్యన్తే పురుషా నిర్గుణా అపి ॥ 128 ॥**

నీ దయా దృష్టిచే చూడబడ్డ పురుషులు గుణంలేని వారయినా, వెంటనే శీలం మున్నగు సద్గుణాలతో, మంచికులంతో, చక్కని ఐశ్వర్యంతో కూడుకొన్నవారవుతున్నారు.

**స శ్లాఘ్యః స గుణీ ధన్యః స కులీనః స బుద్ధిమాన్ ।**
**స శూరః స చ విక్రాన్తో యస్త్వయా దేవి! వీక్షితః ॥ 129 ॥**

ఓ శ్రీదేవీ! నీచే చూడబడినవాడు కొనియాడదగినవాడు. వాడే మంచి గుణాలు కల్గినవాడు. వాడే ధనవంతుడు. వాడే ఉత్తమకులంలో పుట్టినవాడు. వాడే బుద్ధిమంతుడు. వాడే శూరుడు. వాడే పరాక్రమవంతుడు.

**సద్యో వైగుణ్యమాయాన్తి శీలాద్యాః సకలా గుణాః ।**
**పరాఙ్ముఖీ జగద్ధాత్రి! యస్య త్వం విష్ణువల్లభే! ॥ 130 ॥**

ఓ విష్ణువల్లభా! ఓ జగన్మాతా! నీవు ఎవరిపట్ల విముఖురాలవుతావో వాని శీలం మున్నగు సమస్త సద్గుణాలు వెంటనే గుణాలు కాకుండా పోతాయి.

**న తే వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వాఽపి వేధసః ।**
**ప్రసీద దేవి! పద్మాక్షి! మాఽస్మాంస్త్యాక్షీః కదాచన ॥ 131 ॥**

ఓ శ్రీదేవీ! కమలాలవంటి కన్నులు కలదానా! నీ గుణాలను బ్రహ్మయొక్క మిక్కిలి ప్రభావం కల్గిన జిహ్వకూడ వర్ణించలేదు. మమ్మల్ని అనుగ్రహించు. మమ్మల్ని ఎన్నడూ విడిచిపెట్టవద్దు.

**ఏవం శ్రీః సంస్తుతా సమ్యక్ ప్రాహ దేవీ శతక్రతుమ్ ।**
**శ్రుణ్వతాం సర్వదేవానాం సర్వభూతస్థితా ద్విజ! ॥ 132 ॥**

ఓ ద్విజోత్తమా! ఈ విధంగా దేవేంద్రుడు భక్తితో స్తుతించగా, సర్వప్రాణులలోను విరాజిల్లుతూ ఉండే లక్ష్మీదేవి శతక్రతువు, సర్వదేవతలు వింటూ ఉండగా ఇలా వచించింది.

**పరితుష్టాఽస్మి దేవేశ స్తోత్రేణానేన తే హరే ।**
**వరం వృణీష్వ యస్త్విష్టో వరదాఽహం తవాగతా ॥ 133 ॥**

దేవతలకు ప్రభువైన ఇంద్రా! నీ స్తోత్రానికి చాలా ఆనందించాను. నీకు ఇష్టమైన వరం ఏదో కోరుకో. నీకు వరం ఇవ్వడానికై నేను వచ్చాను అన్నది.

**వరదా యది మే దేవి వరార్హో యది వాఽప్యహమ్ ।**
**త్రైలోక్యం న త్వయా త్యాజ్యమేష మేఽస్తు వరః పరః ॥ 134 ॥**

అపుడు ఇంద్రుడు "ఓ దేవీ! నీవు వరం ఇవ్వడానికి వచ్చిన దానవయితే, నేను వరం పొందడానికి తగిన వాడనయితే, నీవు త్రైలోక్యాన్ని విడిచిపెట్టవద్దు. ఇదే నాకు గొప్పవరమగు గాక!

**స్తోత్రేణ యస్తథైతేన త్వాం స్తోష్యత్యబ్ధిసమ్భవే! ।**
**స త్వయా న పరిత్యాజ్యో ద్వితీయోఽస్తు వరో మమ ॥ 135 ॥**

"ఓ అబ్ధిసంభవురాలా! ఎవడు నిన్ను ఈ స్తోత్రంతో స్తుతిచేస్తాడో అలాగే వాణ్ణి నీవు ఎన్నడూ విడిచిపెట్టవద్దు. ఇది నాకు రెండో వరం అగుగాక" అని పలికాడు.

**శ్రీరువాచ :**–లక్ష్మీదేవి పలికింది.

**త్రైలోక్యం త్రిదశశ్రేష్ఠ! న సంత్యక్ష్యామి వాసవ! ।**
**దత్తో వరో మయా యస్తే స్తోత్రారాధనతుష్టయా ॥ 136 ॥**

"దేవతలలో శ్రేష్ఠుడవైన ఓ వాసవా! నేను ముల్లోకాలను విడిచిపెట్టకుండా ఉంటాను. నీవు చేసిన స్తోత్రంచే ప్రసన్నురాలనై సంతుష్టిపొంది నీకు ఈ వరం ఇచ్చాను.

**యశ్చ సాయం తథా ప్రాతః స్తోత్రేణానేన మానవః ।**
**మాం స్తోష్యతి న తస్యాహం భవిష్యామి పరాఙ్ముఖీ ॥ 137 ॥**

ఏ మానవుడు ఉదయం, సాయం సమయం ఈ స్తోత్రంతో నన్ను స్తుతిస్తాడో, వానికి ఎల్లప్పుడూ నేను విముఖురాలను కాబోను" అని శ్రీదేవి పలికింది.

**ఏవం వరం దదౌ దేవీ దేవరాజాయ వై పురా ।**
**మైత్రేయ శ్రీర్మహాభాగా స్తోత్రారాధనతోషితా ॥ 138 ॥**

మైత్రేయా! పూర్వం ఈ విధంగా ఆ మహాభాగురాలు కేవలం స్తోత్రరూప ఆరాధనచే సంతోషింప చేయబడినదై శ్రీదేవి దేవరాజైన ఇంద్రునకు వరమిచ్చింది.

**భృగోః ఖ్యాత్యాం సముత్పన్నా శ్రీఃపూర్వముదధేః పునః ।**
**దేవదానవయత్నేన ప్రసూతాఽమృతమంథనే ॥ 139 ॥**

ఇలా మొదట భృగువునకు ఖ్యాతియందు పుట్టిన శ్రీదేవి తిరిగి దేవతలు దానవులు ఎంతో ప్రయత్నించి సాగించిన అమృతమథనసమయంలో పాలసముద్రంనుంచి ఉద్భవించింది.

**ఏవం యథా జగత్స్వామీ దేవదేవో జనార్దనః ।**
**అవతారం కరోత్యేషా తథా శ్రీస్తత్సహాయినీ ॥ 140 ॥**

ఈరీతిగా లోకనాథుడైన, దేవతలకే దేవుడైన, జనార్దనుడు అవతారం ధరించినప్పుడల్లా ఈ శ్రీలక్ష్మి ఆయనకు సహాయినిగా అవతరిస్తూ ఉంటుంది.

**పునశ్చ పద్మాదుద్భూతా ఆదిత్యోఽభూద్యదా హరిః ।**
**యదా తు భార్గవో రామస్తదాఽభూద్ ధరణీ త్వియమ్ ॥ 141 ॥**

శ్రీహరి ఆదిత్యుడైనప్పుడు లక్ష్మి పద్మంనుంచి ఆవిర్భవించింది. ఆయన భార్గవరాముడైనప్పుడు ఈమె భూమి అయింది.

**రాఘవత్వేఽభవత్ సీతా రుక్మిణీ కృష్ణజన్మని ।**
**అన్యేషు చావతారేషు విష్ణోరేషాఽనపాయినీ ॥ 142 ॥**

ఆయన రఘువంశంలో అవతరించినప్పుడు ఈమె సీత అయింది. ఆయన కృష్ణుడైనప్పుడు ఈమె రుక్మిణి అయింది. విష్ణువుయొక్క మిగిలిన అవతారాలలో కూడా ఈమె ఎప్పుడూ విడువకుండా సహాయినిగా ఉంటుంది.

**దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ ।**
**విష్ణోర్దేహానురూపాం వై కరోత్యేషాఽఽత్మనస్తనుమ్ ॥ 143 ॥**

ఆయన దేవత్వం ధరిస్తే, ఈమెకూడ దేవశరీరం పొందుతుంది. మనుష్యత్వం పొందితే, ఈమె మానవకాంత అవుతుంది. విష్ణువుయొక్క దేహానికి తగినట్లుగా తనశరీరాన్ని చేసుకొంటుంది.

**యశ్చైతచ్ఛృణుయాజ్జన్మ లక్ష్మ్యా యశ్చ పఠేన్నరః ।**
**శ్రియో న విచ్యుతిస్తస్య గృహే యావత్ కులత్రయమ్ ॥ 144 ॥**

ఎవడు ఈ లక్ష్మీదేవి జన్మను గూర్చి వింటూ ఉంటాడో, ఏ నరుడు ఈ చరిత్రను పఠిస్తూ ఉంటాడో, వాని ఇంట్లో లక్ష్మీదేవి మూడు కులాలవరకు విడువకుండా ఉంటుంది.

**పఠ్యతే యేషు చైవైష గృహేషు శ్రీస్తవో మునే ।**
**అలక్ష్మీః కలహాధారా న తేష్వాస్తే కదాచన ॥ 145 ॥**

మునీశ్వరా! ఈ లక్ష్మీస్తవం ఎవరి గృహాలలో నిత్యం పారాయణ పూర్వకంగా పఠించబడుతూ ఉంటుందో, వారి ఇండ్లలో కలహకారిణి అయిన దారిద్ర్యముయొక్క మాట ఎన్నడూ ఉండదు.

**ఏతత్తే కథితం బ్రహ్మన్! యన్మాం త్వాం పరిపృచ్ఛసి ।**
**క్షీరాబ్ధౌ శ్రీర్యథా జాతా పూర్వం భృగుసుతా సతీ ॥ 146 ॥**

ఓ బ్రాహ్మణోత్తమా! పూర్వం భృగునందన అయిన లక్ష్మీదేవి క్షీరసాగరంలో ఎలా జన్మించిందో చెప్పమని నీవడిగినందువల్ల ఈ వృత్తాంతమంతా నీకు చెప్పాను.

**ఇతి సకల విభూత్యవాప్తిహేతుః**
**స్తుతిరియమిన్ద్రముఖోద్గతా హి లక్ష్మ్యాః ।**
**అనుదినమిహ పఠ్యతే నృభిర్యై**
**ర్వసతి న తేషు కదాచిదప్యలక్ష్మీః ॥ 147 ॥**

ఈ విధమైన ఇంద్రుని ముఖంనుండి వెల్వడిన లక్ష్మీస్తుతి సమస్తాలైన ఐశ్వర్యాలు ప్రాప్తించడానికి కారణం అవుతోంది. కాన, అనుదినం ఈ స్తోత్రం పఠించుచున్న మానవులయందు ఎన్నడూ ఏ విధమైన దరిద్రం ఉండదు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే సముద్రమంథన కథా – ఇంద్రకృత లక్ష్మీస్తుతిశ్చేతి నవమోఽధ్యాయః సమాప్తః ॥ 9 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో సముద్రమంథన కథ – ఇంద్రకృత లక్ష్మీస్తుతి అనే తొమ్మిదవ అధ్యాయం సమాప్తం ॥ 9 ॥



## దశమోఽధ్యాయః - పదవ అధ్యాయం

## భృగ్వాదీనాం సృష్టివర్ణనమ్ - భృగువు మున్నగువారి సృష్టివర్ణన

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు పలికాడు

**కథితం మే త్వయా సర్వం యత్పృష్టోఽసి మహామునే ।**
**భృగుసర్గాత్ ప్రభృత్యేష సర్గో మే కథ్యతాం పునః ॥ 1 ॥**

మునీంద్రుడవైన పరాశరమహర్షీ! నేను అడిగినదంతా, నీవు సర్వం నాకు వివరించావు. భృగువుయొక్క సృష్టిమొదలుకొని ఈ సృష్టి ఎలా విస్తరించిందో మళ్లీ చెప్పవలసింది.

**శ్రీపరాశర ఉవాచ :-**పరాశరుడు చెప్పాడు.

**భృగోః ఖ్యాత్యాం సముత్పన్నా లక్ష్మీర్విష్ణుపరిగ్రహః ।**
**తథా ధాతృవిధాతారౌ ఖ్యాత్యాం జాతౌ సుతౌ భృగోః ॥ 2 ॥**

భృగువుకు ఖ్యాతియందు ఉద్భవించిన లక్ష్మీదేవి విష్ణువుయొక్క పత్ని అయింది. అలాగే భృగువుకు ఖ్యాతియందు ధాత, విధాత అనే ఇద్దరు కుమారులు కలిగారు.

**అయతిర్నియతిశ్చైవ మేరోః కన్యే మహాత్మనః ।**
**భార్యేధాతృవిధాత్రోస్తే తయోర్జాతౌ సుతావుభౌ ॥ 3 ॥**

ఆ ధాతకు, విధాతకు మహాత్ముడైన మేరువుయొక్క పుత్రికలు అయతి, నియతి అనేవారు భార్యలు అయ్యారు. వారికి వారియందు ఇద్దరు కుమారులు కలిగారు.

**ప్రాణశ్చైవ మృకణ్డుశ్చ మార్కణ్డేయో మృకణ్డుతః ।**
**తతో వేదశిరా జజ్ఞే ప్రాణస్యాపి సుతం శృణు ॥ 4 ॥**

వారే ప్రాణుడు, మృకండుడు అనేవారు. మృకండునికి మార్కండేయుడు, అతనికి వేదశిరుడు జన్మించారు. ప్రాణుని కుమారుని గూర్చి విను.

**ప్రాణస్య కృతిమాన్ పుత్రో రాజవాంశ్చ తతోఽభవత్ ।**
**తతో వంశో మహాభాగ! విస్తారం భార్గవో గతః ॥ 5 ॥**

మహాభాగా! ప్రాణునికి కృతిమంతుడు (ద్యుతిమంతుడు), అతనికి రాజ (అజా) వంతుడు కలిగారు. అతనివల్ల భృగువంశం చాలా విస్తరించింది.

**పత్నీ మరీచేః సమ్భూతిః పౌర్ణమాస మసూయత ।**
**విరజాః సర్వగశ్చైవ తస్య పుత్రౌ మహాత్మనః ॥ 6 ॥**

మరీచిమునీంద్రునియొక్క పత్ని సంభూతి. ఆమె పౌర్ణమాసుడు అనే కుమారుని కన్నది. ఆ మహాత్మునకు విరజుడు, సర్వగుడు అను కుమారులు జన్మించారు.

**వి॥** పౌర్ణమాసుడు అనగా పూర్ణిమకు అధిష్ఠానదేవుడు.

**వంశసంకీర్తనే పుత్రాన్ వదిష్యేఽహం తయోర్ద్విజ! ।**
**స్మృతిశ్చాంగిరసఃపత్నీ ప్రసూతాః కన్యకాస్తథా ॥ 7 ॥**

ద్విజోత్తమా! వారి పుత్రులనుగూర్చి నేను వారి వంశ సంకీర్తనంలో చెబుతాను. అంగిరసునియొక్క పత్ని పేరు స్మృతి. ఆమెకు పుత్రికలే కలిగారు.

**సినీవాలీ కుహూశ్చైవ రాకా చానుమతిస్తథా ।**
**అనసూయా తథైవాత్రేర్జజ్ఞే పుత్రానకల్మషాన్ ॥ 8 ॥**

వారే సినీవాలి, కుహు, రాక, అనుమతి అనేవారు. అత్రిమహర్షియొక్క భార్య అనసూయ. అలాగే ఆమె ఏ కళంకంలేని కుమారులను కన్నది.

**సోమం దుర్వాససం చైవ దత్తాత్రేయం చ యోగినమ్ ।**
**ప్రీత్యాం పులస్త్యభార్యాయాం దత్తోలిస్తత్సుతోఽభవత్ ॥ 9 ॥**

అనసూయ సోముని, దుర్వాసుని, యోగీశ్వరుడైన దత్తాత్రేయుని కన్నది. పులస్త్యునకు భార్యయైన ప్రీతియందు దత్తోలి అనే కుమారుడు కలిగాడు.

**పూర్వజన్మని యోఽగస్త్యః స్మృతః స్వాయమ్భువేఽన్తరే ।**
**కర్దమశ్చావరీయాంశ్చ సహిష్ణుశ్చ సుతత్రయమ్ ॥ 10 ॥**

**క్షమా తు సుషువే భార్యా పులహస్య ప్రజాపతేః ।**
**క్రతోశ్చ సన్నతిర్భార్యా వాలఖిల్యానసూయత ॥ 11 ॥**

పూర్వజన్మలో స్వాయంభువమన్వంతరంలో ఆయన అగస్త్యుడు అని చెప్పబడ్డాడు. ప్రజాపతి అయిన పులహునియొక్క భార్య క్షమ. ఆమె కర్దముడు, అవరీవంతుడు (అర్వరీవంతుడు), సహిష్ణువు అనే ముగ్గురు కుమారులను కన్నది. క్రతువుయొక్క భార్య సన్నతి. ఆమె వాలఖిల్యులు అనే మహర్షులను కన్నది.

**షష్టిర్యాని సహస్రాణి యతీనా మూర్ధ్వరేతసామ్ ।**
**అంగుష్ఠపర్వమాత్రాణాం జ్వలద్భాస్కరతేజసామ్ ॥ 12 ॥**

---

**వి॥** సినీవాలి – చతుర్దశితోకూడిన అమావాస్య
కుహువు – పాడ్యమితో కూడిన అమావాస్య
రాక – చతుర్దశితోకూడిన పూర్ణిమ
అనుమతి – పాడ్యమితో కూడిన పూర్ణిమ 8

**వి॥** దత్తోళి – దత్తోత్రి అనే పాఠాంతరం 9

వారు అరవైవేలమంది యతీశ్వరులు. ఊర్ధ్వరేతస్కులు. బొటనవ్రేలి కణుపంత ఆకారం కలవారు. ప్రకాశిస్తున్న సూర్యునివంటి తేజస్సు వారిది.

**ఊర్జాయాం చ వశిష్ఠస్య సప్తాజాయన్త వై సుతాః ।**
**రజో గోత్రోర్ధ్వబాహుశ్చ వసన శ్చానఘ స్తథా ॥13॥**

**సుతపాః శుక్ర ఇత్యేతే సర్వే సప్తర్షయోఽమలాః ।**
**యోఽసా వగ్నిరభిమానీ బ్రహ్మణ స్తనయోఽగ్రజః ॥ 14 ॥**

**తస్మాత్ స్వాహా సుతాన్ లేభే (సుతాంల్లేభే) త్రీనుదారౌజసో ద్విజ! ।**
**పావకం పవమానం చ శుచిం చాపి జలాశినమ్ ॥ 15 ॥**

వశిష్ఠమహర్షికి ఊర్జయందు ఏడుగురు కుమారులు కలిగారు. వారు రజుడు, గోత్రుడు, ఊర్ధ్వబాహుడు, వసనుడు (సవనుడు, అనఘుడు, సుతపుడు, శుక్రుడు, అనేవారు. వీరందరు నిర్మలులు. వీరి తరువాతి మన్వంతరంలో సప్తర్షులు అయ్యారు. బ్రహ్మయొక్క కుమారులలో అగ్రజుడైన అగ్న్యభిమాని దేవత, స్వాహాదేవియందు మహాతేజస్సంతులయిన ముగ్గురు కుమారులు జన్మించారు. ఓ ద్విజోత్తమా! వారు పావకుడు, పవమానుడు, జలభక్షకుడైన శుచి అనేవారు.

**తేషాన్తు సన్తతావన్యే చత్వారింశచ్చ పంచ చ ।**
**ఏవమేకోనపంచాశద్ వహ్నయః పరికీర్తితాః ॥ 16 ॥**

వారికి ముగ్గురికి ఒక్కొక్కరికి పదిహేనుగురు చొప్పున నలభై అయిదుగురు సంతానం కలిగారు. ఈ రీతిగా వారు నలభైతొమ్మందుగురు అగ్నులుగా మిక్కిలి కీర్తించబడ్డారు.

**కథ్యన్తే వహ్నయశ్చైతే పితా పుత్రత్రయం చ యత్ । 17 ॥**

వీరు వారి తండ్రులైన ముగ్గురు కుమారులు, వారి తండ్రి అగ్న్యభిమాని దేవత కలిసి మొత్తం నలభైతొమ్మిది అగ్నులుగా చెప్పబడుచున్నారు.

**పితరో బ్రహ్మణా సృష్టా వ్యాఖ్యాతా యే మయా తవ । 17 ॥**

**అగ్నిష్వాత్తా బర్హిషదోఽనగ్నయః సాగ్నయశ్చ యే ।**
**తేభ్యః స్వధా సుతే జజ్ఞే మేనాం వైధారిణీం (వైతరణీం) తథా ॥ 18 ॥**

మైత్రేయా! బ్రహ్మచే సృష్టించబడ్డ పితృదేవతలను గూర్చి నీకు నేను చెప్పడం జరిగింది. వారు అనగ్నులైన (అయజ్వలైన) అగ్నిష్వాత్తులు. అగ్నిసహితులైన (యజ్వలైన) బర్హిషదులు అనేవారు. వారివల్ల స్వధాదేవి మేన, ధారిణి (వైతరణి) అనే కుమార్తెలను కన్నది.

**తే ఉభే బ్రహ్మవాదిన్యౌ యోగిన్యౌ చాప్యుభే ద్విజ ।**
**ఉత్తమజ్ఞానసమ్పన్నే సర్వైః సముదితైర్గుణైః ॥ 19 ॥**

ద్విజోత్తమా! వారు ఇరువురు బ్రహ్మవాదినులు, యోగినులు, ఉత్తమజ్ఞానంతో కూడుకొన్నవారు, సకలసద్గుణాలతో పరిపూర్ణలు అయ్యారు.

**ఇత్యేషా దశ కన్యానాం కథితాఽపత్యసన్తతిః ।**
**శ్రద్ధావాన్ సంస్మరన్నేతామనపత్యో న జాయతే ॥ 20 ॥**

మైత్రేయా! ఈ విధంగా నీకు ఈ పది కన్యలయొక్క సంతాన విస్తృతిని గూర్చి చెప్పాను. ఈ వంశ విస్తారాన్ని శ్రద్ధతో స్మరించేవాడు సంతానహీనుడు కాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే భృగ్వాదీనాం సృష్టివర్ణనమితి దశమోఽధ్యాయః సమాప్తః ॥ 10 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో భృగువు మున్నగువారి సృష్టివర్ణన అనే పదవ అధ్యాయం సమాప్తం.॥10 ॥



## **ఏకాదశోఽధ్యాయః – పదకొండవ అధ్యాయం**

## **ధ్రువస్య వనగమనం, మరీచి ప్రముఖ ఋషి వృత్తాంతశ్చ**

ధ్రువుని వనగమనం, మరీచి ప్రముఖ ఋషి వృత్తాంతం

**శ్రీపరాశర ఉవాచ :** –పరాశరమహర్షి పలికాడు.

**ప్రియవ్రతోత్తానపాదౌ మనోః స్వాయమ్భువస్య తు ।**
**ద్వౌ పుత్రౌ సుమహావీర్యౌ ధర్మజ్ఞౌ కథితౌ తవ ॥ 1 ॥**

మైత్రేయా! స్వాయంభువమనువుకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అను ఇద్దరు కుమారులు కలిగారని, వారు మహాపరాక్రమవంతులని, ధర్మజ్ఞులు అని నీకు చెప్పాను కదా!

**తయోరుత్తానపాదస్య సురుచ్యాముత్తమః సుతః ।**
**అభీష్టాయామభూద్ బ్రహ్మన్! పితురత్యన్తవల్లభః ॥ 2 ॥**

బ్రాహ్మణోత్తమా! వారిలో ఉత్తానపాదునకు మిక్కిలి ఇష్టురాలైన సురుచి అనే భార్యయందు ఎక్కువప్రీతి కల్గిన ఉత్తముడనే కుమారుడు కలిగాడు.

**సునీతిర్నామ యా రాజ్ఞస్తస్యాభూన్మహిషీ ద్విజ ।**
**స నాతిప్రీతిమాంస్తస్యాం తస్యాశ్చాభూద్ ధ్రువః సుతః ॥ 3 ॥**

ద్విజోత్తమా! ఆ రాజుయొక్క పట్టపురాణి సునీతి అనే ఆమె. ఆమెపట్ల రాజుకు దాంపత్య ధర్మసంబంధమైన ప్రీతి మాత్రమే కలదు. ఆ రాజుకు ఆమెయందు ధ్రువుడనే కుమారుడు జన్మించాడు.

**రాజాసనస్థితస్యాంకం పితుర్భ్రాతరమాశ్రితమ్ ।**
**దృష్ట్వోత్తమం ధ్రువశ్చక్రే తమారోఢుం మనోరథమ్ ॥ 4 ॥**

ఒకనాడు తండ్రి సింహాసనంపై అధిష్ఠించియుండగా అతని ఒడిలో సోదరుడైన ఉత్తముడు కూర్చొని ఉన్నాడు. అదిచూచి ధ్రువుడు తండ్రి ఒడిలో కూర్చోవాలనే కోరిక కల్గినవాడయ్యాడు.

**ప్రత్యక్షం భూపతిస్తస్యాః సురుచ్యా నాభ్యనన్దత ।**
**ప్రణయేనాగతం పుత్రముత్సంగారోహణోత్సుకమ్ ॥ 5 ॥**

**సపత్నీతనయం దృష్ట్వా తమంకారోహణోత్సుకమ్ ।**
**పితుః పుత్రం తదారూఢం సురుచిర్వాక్యమబ్రవీత్ ॥ 6 ॥**

ఆ సురుచి అలా ప్రత్యక్షంగా చూస్తూ ఉండగా, ప్రేమతో వచ్చి ధ్రువుడు తనఒడిలో కూర్చోవాలను కోవడం రాజుకు ఇష్టం కాలేదు. తన పుత్రుడు తండ్రి ఒడిలో అధివసించి ఉండడం, సవతికొడుకుకూడా అదేవిధంగా తండ్రి అంకపీఠిపై కూర్చోవాలనే సంకల్పంతో ఉండడం చూచి సురుచి ఇలా అంది.

**క్రియతే కిం వృథా వత్స మహానేష మనోరథః ।**
**అన్యస్త్రీగర్భజాతేనాసమ్భూయ మమోదరే ॥ 7 ॥**

**ఉత్తమోత్తమమప్రాప్యమవివేకోఽభివాంఛసి ।**
**సత్యం సుతస్త్వమప్యస్య కిన్తు న త్వం మయా ధృతః ॥ 8 ॥**

**ఏతద్ రాజాసనం సర్వభూభృత్సంశ్రయకేతనమ్ ।**
**యోగ్యం మమైవ పుత్రస్య కిమాత్మా క్లిశ్యతే త్వయా ॥ 9 ॥**

**ఉచ్చైర్మనోరథస్తేఽయం మత్పుత్రస్యైవ కిం వృథా ।**
**సునీత్యామాత్మనో జన్మ కిం త్వయా నావగమ్యతే ॥ 10 ॥**

"వత్సా! నా కడుపులో పుట్టక, మరో స్త్రీ గర్భంలో జన్మించిన నీకు ఈ వ్యర్థమైన పేరాశ ఎందుకు? నీవు తెలివి తక్కువగా పొందరాని ఉత్తమోత్తమమైన స్థానాన్ని కోరుతున్నావు. నిజమే నీవు ఈ మహారాజు కొడుకువే. కాని నీవు నాకు పుట్టలేదు. ఈ రాజసింహాసనం సమస్తరాజేంద్రులకు ఆశ్రయమిచ్చేటటువంటిది. ఇది నా కొడుకుకే తగినట్టిది. ఎందుకు వృథాగా మనస్సును కష్టపెడతావు? నా పుత్రునిలా ఉండాలనుకోవడం నీకు అందరాని, పొందలేని కోరిక. నీవు సునీతియందు నీ జన్మను పొందియున్నావు. ఈ మాత్రం నీకు తెలియరాలేదా? అనిఅన్నది.

**ఉత్సృజ్య పితరం బాలస్తచ్ఛ్రుత్వా మాతృభాషితమ్ ।**
**జగామ కుపితో మాతుర్నిజాయా ద్విజ!మన్దిరమ్ ॥ 11 ॥**

ద్విజప్రవరా! ఆ బాలుడు పినతల్లి మాటవిని, నిరుత్తరుడైన తండ్రిని విడిచి, కోపగించినవాడై, తన తల్లియైన సునీతిమందిరానికి వెళ్లాడు.

**తం దృష్ట్వా కుపితం పుత్రమీషత్ప్రస్ఫురితాధరమ్ ।**
**సునీతిరంకమారోప్య మైత్రేయైతదభాషత ॥ 12 ॥**

మైత్రేయా! క్రోధంతో కొంచెం అదరుతున్న క్రింది పెదవితో వచ్చిన కుమారుని వీక్షించి, తల్లియైన సునీతి ఒడిలో కూర్చుండబెట్టుకొని ధ్రువునితో ఇలా అన్నది.

**వత్స కః కోపహేతుస్తే కశ్చ త్వాం నాభినన్దతి ।**
**కోఽవజానాతి పితరం తవ యస్తేఽపరాధ్యతి ॥ 13 ॥**

నాయనా! కుమారా! నీ కోపానికి కారణం ఏమి? ఎవడు నిన్ను అవమానపరిచాడు? మీ తండ్రిని కించపరుస్తూ నీ పట్లనేరం చేసినవాడు ఎవడు?

**ఇత్యుక్తః సకలం మాత్రే కథయామాస తద్యథా ।**
**సురుచిః ప్రాహ భూపాలప్రత్యక్షమపి గర్వితా ॥ 14 ॥**

**వినిఃశ్వస్యేతి కథితే తస్మిన్ పుత్రేణ దుర్మనాః ।**
**శ్వాసక్షామేక్షణా దీనా సునీతిర్వాక్యమబ్రవీత్ ॥ 15 ॥**

అని తల్లి అడుగగా ధ్రువుడు సురుచి మిక్కిలి గర్వంతో, భూపాలుని సమక్షంలో తనను అవమానపరుస్తూ అన్న మాటలన్నీ సునీతికి వివరించాడు. కొడుకు చెప్పిందంతావిని సునీతి నిట్టూర్చి మనస్సు కలతచెందగా, దుఃఖంతో శ్వాసకు కన్నులు వాడిపోగా దీనురాలై ఇలా అన్నది.

**సురుచిః సత్యమాహేదం స్వల్పభాగ్యోఽసి పుత్రక! ।**
**న హి పుణ్యవతాం వత్స! సపత్నైరేవముచ్యతే ॥ 16 ॥**

నాయనా! సురుచి చెప్పింది సత్యం. కుమారా! నీవు మందభాగ్యుడవు. పుణ్యం చేసుకొన్న సుకృతాత్ములను పగవారు (సపత్నులు) ఇలా అనలేరు.

**నోద్వేగస్తాత కర్తవ్యః కృతం యద్భవతా పురా ।**
**తత్కోఽపహర్తుం శక్నోతి దాతుం కశ్చాకృతం త్వయా ॥ 17 ॥**

నాయనా! తండ్రీ! ఆకులపాటుచెందకు. పూర్వం చేసుకొన్నదానిని ఎవరు తొలగించగలరు? నీచే చేయబడని దానిని ఎవ్వరు ఈయగలరు?

**రాజాసనం తథా ఛ్చత్రం వరాశ్వా వరవారణాః ।**
**యస్య పుణ్యాని తస్యైతే మత్వైతచ్ఛామ్య పుత్రక! ॥ 18 ॥**

కుమారా! రాజాసనం, ఛత్రం, ఉత్తమాశ్వాలు, మదేభాలు పూర్వకాలంలో పుణ్యం చేసుకొన్నవారికే ప్రస్తుతం లభిస్తాయని భావించి ఊరడిల్లుము.

**అన్యజన్మకృతైః పుణ్యైః సురుచ్యాం సురుచిర్నృపః ।**
**భార్యేతి ప్రోచ్యతే చాన్యా మద్విధా భాగ్యవర్జితా ॥ 19 ॥**

ఇతర జన్మలలో చేసుకొన్న పుణ్యాలవల్ల సురుచియందు రాజు మంచిప్రీతి (సురుచి) కలిగినవాడయ్యాడు. నాలాంటి భాగ్యహీనురాలు అన్యకారణంవల్ల భార్యగా మాత్రమే చెప్పబడుతుంది.

**పుణ్యోపచయసమ్పన్నస్తస్యాః పుత్రస్తథోత్తమః ।**
**మమ పుత్రస్తథా జాతః స్వల్పపుణ్యో ధ్రువో భవాన్ ॥ 20 ॥**

పుణ్యసంచయం బాగా చేసుకొన్నవాడు ఉత్తముడు. అలా ఆమె కొడుకయ్యాడు. నీవు కొద్దిపాటి సుకృతం మాత్రమే చేసుకొన్నవాడవు. నీవు ఇలా నా కొడుకువై పుట్టావు. ఇది నిశ్చయం.

**తథాఽపి దుఃఖం న భవాన్ కర్తుమర్హతి పుత్రక! ।**
**యస్య యావత్ స తేనైవ స్వేన తుష్యతి బుద్ధిమాన్ ॥ 21 ॥**

కుమారా! అయినా నీవు దుఃఖపడవలసిన అవసరం లేదు. బుద్ధిమంతుడు తనకు ఏదైతే ఉన్నదో, దానితోనే తృప్తిపడతాడు.

**యది వా దుఃఖమత్యర్థం సురుచ్యా వచసా తవ ।**
**తత్ పుణ్యోపచయే యత్నం కురు సర్వఫలప్రదే ॥ 22 ॥**

సురుచి పలికిన పలుకులవల్ల నీకు దుఃఖం మరీ ఎక్కువ అయివుంటే సమస్త ఫలితాలను ఇచ్చే పుణ్యసంపాదనకోసం ప్రయత్నించు.

**సుశీలో భవ ధర్మాత్మా మైత్రః ప్రాణిహితే రతః ।**
**నిమ్నం యథాఽఽపః ప్రవణాః పాత్ర మాయాన్తి సమ్పదః ॥ 23 ॥**

సుశీలుడవు, ధర్మాత్ముడవు, స్నేహపాత్రుడవు, సర్వభూతహితాసక్తుడవు కమ్ము. నీరు పల్లానికి ప్రవహించినట్లుగా సంపదలు పాత్రుడైనవానిని తమంత తామే చేరుతాయి అని సునీతి అన్నది.

**శ్రీధ్రువ ఉవాచ :–** ధ్రువుడు అన్నాడు.

**అంబ! యత్ త్వమిదం ప్రాహ ప్రశమాయ వచో మమ ।**
**నైతద్ దుర్వచనాభిన్నే హృదయే మమ తిష్ఠతి ॥ 24 ॥**

అమ్మా! నాకు ఊరడింపు కలిగేటట్లుగా నీవు ఉపదేశం చేశావు. అయినా సురుచి పలికిన దుష్టవాక్యాలచే పగిలిన నా హృదయంలో అది శాంతినిస్తూ నిలిచేది కాదు.

**సోఽహం తథా యతిష్యామి యథా సర్వోత్తమోత్తమమ్ ।**
**స్థానం ప్రాప్స్యామ్యశేషాణాం జగతామపి పూజితమ్ ॥ 25 ॥**

సమస్త జగత్తులచే పూజింపబడే, ఆదరించబడే, సర్వశ్రేష్ఠమైన స్థానం ఏదయితే పొందదగింది ఉందో ఆ స్థానం పొందేటందుకు ప్రయత్నం చేస్తాను.

**సురుచిర్దయితా రాజ్ఞస్తస్యా జాతోఽస్మి నోదరాత్ ।**
**ప్రభావం పశ్య మేఽమ్బ త్వం వృద్ధస్యాపి తవోదరే ॥ 26 ॥**

అమ్మా! సురుచి రాజుకు ప్రియురాలు. ఆమె కడుపున నేను పుట్టవలసిన అవసరం లేదు. నీ కడుపున పుట్టి అత్యంతాభివృద్ధిపొందే నా ప్రభావం ఇకపై చూడు.

**ఉత్తమః స మమ భ్రాతా యో గర్భేన ధృతస్త్వయా ।**
**స రాజాసనమాప్నోతు పిత్రా దత్తం తథాఽస్తు తత్ ॥ 27 ॥**

ఉత్తముడు నా సోదరుడు. అతడు నీ కడుపున పుట్టక సురుచి గర్భాన పుట్టినవాడు. వాడికి తండ్రిచే ఇవ్వబడ్డ రాజాసనం లభించుగాక! అది అలా ఉండనీ.

**నాన్యదత్తమభీప్సామి స్థానమమ్బ స్వకర్మణా ।**
**ఇచ్ఛామి తదహం స్థానం యన్న ప్రాప పితా మమ ॥ 28 ॥**

అమ్మా! నేను స్వయం శక్తితో ఎవ్వరిచేత ఈయబడని స్థానాన్ని పొందగోరుతున్నాను. నా తండ్రికూడ పొందకుండా ఉండిపోయిన శాశ్వతస్థానాన్ని కోరుతున్నాను అన్నాడు.

**నిర్జగామ గృహాన్మాతురిత్యుక్త్వా మాతరం ధ్రువః ।**
**పురాచ్చ నిష్క్రమ్య తతస్తద్ బాహ్యోపవనం యయౌ ॥ 29 ॥**

ధ్రువుడు ఈ రీతిగా తల్లితో పలికి, మాతృమందిరంనుంచి బయలుదేరి వెళ్లిపోయాడు. పిదప నగరం నిర్గమించి బయట ఉద్యానవనానికి వెళ్లాడు.

**స దదర్శ మునీంస్తత్ర సప్త పూర్వాగతాన్ ధ్రువః ।**
**కృష్ణాజినోత్తరీయేషు విష్టరేషు సమాస్థితాన్ ॥ 30 ॥**

ధ్రువుడు అలా వెళ్లిపోయి అచ్చట సప్తర్షులను చూశాడు. వారు అంతకుముందే అచ్చటకు వచ్చి దర్భాసనాలపై కృష్ణాజినాలు ఉత్తరీయాలు పరచుకొని తపోనిష్ఠతో కూర్చొని ఉన్నారు.

**స రాజపుత్రస్తాన్ సర్వాన్ ప్రణిపత్యాభ్యభాషత ।**
**ప్రశ్రయావనతః సమ్యగభివాదనపూర్వకమ్ ॥ 31 ॥**

ఆ రాజకుమారుడు వారికందరికి వినమ్రుడై నమస్కరించి వినయ పూర్వకంగా అభివాదనం కావించి ఇలా అన్నాడు.

**ఉత్తానపాదతనయం మాం నిబోధత సత్తమాః! ।**
**జాతం సునీత్యాం నిర్వేదాద్ యుష్మాకం ప్రాప్తమన్తికమ్ ॥ 32 ॥**

సత్పురుషులారా! నేను ఉత్తానపాదుని కుమారుడను. సునీతియందు జన్మించినవాడను (ధ్రువుడను). నిర్వేదంతో మీ సన్నిధికి వచ్చియున్నవాడను –అన్నాడు.

**ఋషయ ఊచుః :–** ఋషులు పలికారు.

**చతుః పంచాబ్దసమ్భూతో బాలస్త్వం నృపనన్దన ।**
**నిర్వేదకారణం కించిత్ తవ నాద్యాపి విద్యతే ॥ 33 ॥**

ఆ ఋషులు రాజకుమారా! నీవు నాలుగైదేండ్ల వయస్సు ఉన్నవాడవు. బాలుడవు. నీ నిర్వేదానికి గల కారణం ఏమిటో కొంచెం కూడ తెలియలేదు.

**న చిన్త్యం భవతః కించిద్ ధ్రియతే భూపతిః పితా ।**
**న చైవేష్టవియోగాది తవ పశ్యామ బాలక! ॥ 34 ॥**

బాలకా! నీవు విచారించవలసిన అవసరం ఏమున్నదికనుక? నీ తండ్రి జీవించియేయున్నాడు. నీకు ఇష్టం, వియోగం మున్నగునవి కలిగినట్లు కనిపించే వయస్సుకాదు.

**శరీరే న చ తే వ్యాధిరస్మాభిరుపలక్ష్యతే ।**
**నిర్వేదః కింనిమిత్తం తే కథ్యతాం యది విద్యతే ॥ 35 ॥**

నీ శరీరంలో అనారోగ్యం ఉన్నట్లు మాకు కొంచెంకూడ కనిపించడంలేదు. నీకు నిర్వేదం ఏ కారణంగా కలిగిందో, అది ఏమిటో ఉన్నది ఉన్నట్లుగా చెప్పు" అన్నారు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**తతః స కథయామాస సురుచ్యాం యదుపాహృతమ్ ।**
**తన్నిశమ్య తతః ప్రోచుర్మునయస్తే పరస్పరమ్ ॥ 36 ॥**

అపుడు ధ్రువుడు సురుచివల్ల జరిగిన అవమానాన్ని వారికి వివరించి చెప్పాడు. ఆ మునులు అతడు చెప్పిన వృత్తాంతం విని ఒకరితో ఒకరు ఇలా అనుకొన్నారు.

**అహెూ క్షాత్రం పరం తేజో బాలస్యాపి యదక్షమా ।**
**సపత్న్యా మాతురుక్తస్య హృదయాన్నాపసర్పతి ॥ 37 ॥**

"అహెూ! క్షత్రియజన్మ. ఉత్తమ తేజస్సు. బాలుడు కాబట్టి అవమానం సహించలేకపోతున్నాడు. సవతితల్లి పలికిన ములుకుల్లాంటి మాటలు ఈతని హృదయం నుంచి బయటకు తొలగిపోవడంలేదు."

**భో భో క్షత్రియదాయాద నిర్వేదాద్ యత్ త్వయాఽధునా ।**
**కర్తుం వ్యవసితం తన్నః కథ్యతాం యది రోచతే ॥ 38 ॥**

**యచ్చ కార్యం తవాస్మాభిః సాహాయ్యమమితద్యుతే! ।**
**తదుచ్యతాం వివక్షుస్త్వమస్మాభిరుపలక్ష్యసే ॥ 39 ॥**

అని భావించి "ఓ క్షత్రియ కుమారా! ఈ నిర్వేదగ్లానితో నీవు ఇప్పుడు ఏమి చేయదలచుకొన్నావో, నీకు ఇష్టమయితే అది మాతో చెప్పు. ఓ అమిత తేజస్వీ! మాచే చేయబడవలసియున్న సహాయం ఏదైనా ఉన్నదా? నిన్ను చూస్తే మాకు ఏదో నివేదించాలనుకొంటున్నట్లు కనిపిస్తున్నావు." అని అన్నారు.

**ధ్రువ ఉవాచ :–** ధ్రువుడు చెప్పాడు.

**నాహమర్థమభీప్సామి న రాజ్యం ద్విజసత్తమాః! ।**
**తత్స్థానమేకమిచ్ఛామి భుక్తం నాన్యేన యత్ పురా ॥ 40 ॥**

**ఏతన్మే క్రియతాం సమ్యక్ కథ్యతాం ప్రాప్యతే యథా ।**
**స్థానమగ్ర్యం సమస్తేభ్యః స్థానేభ్యో మునిసత్తమాః! ॥ 41 ॥**

ధ్రువుడు "ద్విజోత్తములారా! నేను ధనాన్ని కోరను, రాజ్యాన్ని వాంఛించను. ఇదివరకు ఎవ్వరూ అనుభవించని స్థానం ఏదైనా ఉంటే దానిని ఒక్కటే కోరుతున్నాను. ఓ మునిసత్తములారా! అది నాకు తెలియజేయండి. సమస్తస్థానాలకన్న అగ్రస్థానం ఎలా లభిస్తుందో అది నాకు సరిగా చెప్పండి." అని అడిగాడు.

**మరీచి రువాచ :–** మరీచి చెప్పాడు.

**అనారాధితగోవిన్దై ర్నరైః స్థానం నృపాత్మజ! ।**
**న హి సంప్రాప్యతే శ్రేష్ఠం తస్మాదారాధయాచ్యుతమ్ ॥ 42 ॥**

(వారు ఒక్కొక్కరు ఇలా చెబుతున్నారు.) "రాజకుమారా! గోవిందుని ఆరాధించని నరులచే ఉన్నత స్థానం లభించేదికాదు. కాబట్టి అచ్యుతుని ఆరాధించు.

**అత్రి రువాచ :–** అత్రి చెప్పాడు.

**పరః పరాణాం పురుషో యస్య తుష్టో జనార్దనః ।**
**స ప్రాప్నోత్యక్షయం స్థానమేతత్ సత్యం మయోదితమ్ ॥ 43 ॥**

పరం అనుకొనే వాటికంటె పరుడైన పురుషుడు అయినట్టి జనార్దనుడు ఎవనివల్ల సంతోషిస్తాడో అతనికి నశించని అక్షయమైన స్థానం లభిస్తుంది. నేను చెప్పినది ఇది సత్యం.

**అఙ్గిరా ఉవాచ :–** అంగిరుడు చెప్పాడు.

**యస్యాన్తః సర్వమేవేదమచ్యుతస్యావ్యయాత్మనః ।**
**తమారాధయ గోవిన్దం స్థానమగ్ర్యం యదీచ్ఛసి ॥ 44 ॥**

ఏ మహాత్ముడైన, అవ్యయుడైన, అచ్యుతునిలో ఈ కనిపించే జగత్తు సర్వం ఉన్నదో, అగ్రస్థానం కోరుకొనేవాడవయితే, ఆ గోవిందుని ఆరాధించు.

**పులస్త్య ఉవాచ :–** పులస్త్యుడు చెప్పాడు.

**పరంబ్రహ్మ పరంధామ యోఽసౌ బ్రహ్మ తథా పరమ్ ।**
**తమారాధ్య హరిం యాతి ముక్తిమప్యతిదుర్లభామ్ ॥ 45 ॥**

పరంబ్రహ్మ, పరంధాముడు, పరమాత్మ స్వరూపుడు ఏ శ్రీహరి అయి ఉన్నాడో, ఆ హరిని ఆరాధించి సాధకుడు పొందశక్యంకాని ముక్తిని కూడ పొందుతాడు.

**క్రతు రువాచ :–** క్రతువు చెప్పాడు.

**యో యజ్ఞపురుషో యజ్ఞే యోగే యః పరమః పుమాన్ ।**
**తస్మింస్తుష్టే యదప్రాప్యం కిం తదస్తి జనార్దనే ॥ 46 ॥**

ఎవడు యజ్ఞంలో యజ్ఞపురుషుడు, యోగంలో పరమపురుషుడు ఆ జనార్దనుడు అయి ఉన్నాడో, ఆయన సంతుష్టుడు అయితే పొందరానిది అంటూ ఏముంది కనుక?

**పులహ ఉవాచ :–** పులహుడు చెప్పాడు.

**ఐన్ద్రమిన్ద్రః పరం స్థానం యమారాధ్య జగత్పతిమ్ ।**
**ప్రాప యజ్ఞపతిం విష్ణుం తమారాధయ సువ్రత! ॥ 47 ॥**

దృఢవ్రతా! ఏ యజ్ఞపతిని, జగత్పతిని, మహావిష్ణుని ఆరాధించి ఇంద్రుడు మహోత్తమమైన ఇంద్రపదవిని పొందాడో, నీవు కూడ ఆయనను ఆరాధించు.

**వసిష్ఠ ఉవాచ :–** వసిష్ఠుడు చెప్పాడు.

**ప్రాప్నోత్యారాధితే విష్ణౌ మనసా యద్ యదిచ్ఛతి ।**
**త్రైలోక్యాన్తర్గతం స్థానం కిము వత్సోత్తమోత్తమమ్ ॥ 48 ॥**

వత్సా! విష్ణువును ఆరాధిస్తే మనస్సుచే ఏది కోరబడుతుందో, అది లభిస్తుంది. ముల్లోకాలలో ఉన్న ఉత్తమోత్తమస్థాన విషయాన్ని గూర్చి చెప్పేదేముంది? అని సప్తర్షులు వచించారు.

**ఆరాధ్యః కథితో దేవో భవద్భిః ప్రణతస్య మే ।**
**మయా తత్ పరితోషాయ యజ్జప్తవ్యం తదుచ్యతామ్ ॥ 49 ॥**

**యథా చారాధనం తస్య మయా కార్యం మహాత్మనః ।**
**ప్రసాదసుముఖాస్తన్మే కథయన్తు మహర్షయః ॥ 50 ॥**

అంత ధ్రువుడు "ప్రణతుడను అయినట్టి నాకు మీచే ఆరాధ్యదేవుని గూర్చి వివరించబడింది. ఆయనను సంతోషింపజేయడానికి నాచే ఏ మంత్రం జపించబడాలో అది తెలియజేయబడుగాక! మహర్షులారా! మహాత్ములారా! ఆయనను ఎలా ఆరాధించాలో, అదికూడ నాపై అనుగ్రహం చూపించి సుముఖులై తెలియజేయండి". అని ప్రార్థించాడు.

**ఋషయ ఊచుః :–** ఋషులు చెప్పారు.

**రాజపుత్ర! యథా విష్ణోరారాధనపరైర్నరైః ।**
**కార్యమారాధనం తన్మే యథావచ్ఛ్రోతుమర్హసి ॥ 51 ॥**

సప్తర్షులు "రాజకుమారా! విష్ణువును ఆరాధించుటయందు ఆసక్తికల నరులచే చేయబడే ఆరాధన గురించి, నీకు చెబుతాము. అది ఉన్నదున్నట్లు విను.

**బాహ్యార్థానఖిలాంశ్చిత్తం త్యాజయేత్ ప్రథమం నరః ।**
**తస్మిన్నేవ జగద్ధామ్ని తతః కుర్వీత నిశ్చలమ్ ॥ 52 ॥**

మొదట నరుడు సమస్తాలైన బాహ్య విషయాలనుంచి మనస్సును వదలివేయాలి. పిమ్మట ఆ మనస్సును ఆ జగత్ప్రకాశకుడైన భగవంతుని యందే నిశ్చలంగా నిలపాలి.

**ఏవమేకాగ్రచిత్తేన తన్మయేన ధృతాత్మనా ।**
**జప్తవ్యం యన్నిబోధైతత్ త్వం నః పార్థివనన్దన! ॥ 53 ॥**

మహారాజపుత్రా! ఈ విధంగా ఏకాగ్రతతో కూడిన మనస్సుతో తన్మయచిత్తంతో, దృఢమైన ఆత్మబుద్ధితో ఏది జపించాలో, దానిని చెబుతాము. సావధానబుద్ధితో తెలుసుకో.

**హిరణ్యగర్భపురుషప్రధానావ్యక్తరూపిణే ।**
**ఓం నమో వాసుదేవాయ శుద్ధజ్ఞానస్వభావినే ॥ 54 ॥**

హిరణ్యగర్భుడు, పురుషుడు, ప్రధానం, అవ్యక్తం వీనిరూపమైన శుద్ధజ్ఞానస్వభావుడైన, ఓంకార శబ్దవాచ్యుడైన, వాసుదేవునకు నమస్కారం.

**ఏతజ్జజాప భగవాన్ జప్యం స్వాయమ్భువో మనుః ।**
**పితామహస్తవ పురా తస్య తుష్టో జనార్దనః ॥ 55 ॥**

ఈ మంత్రాన్ని భగవంతుడైన స్వాయంభువమనువు, నీ పితామహుడు పూర్వం జపించాడు. ఆయన చేసిన జపంవల్ల జనార్దనుడు సంతోషించాడు.

**దదౌ యథాఽభిలషితాం బుద్ధిం త్రైలోక్యదుర్లభామ్ ।**
**తథా త్వమపి గోవిన్దం తోషయైతత్ సదా జపన్ ॥ 56 ॥**

మూడులోకాలలోను దుర్లభమైన, కోరిన ఐశ్వర్యాన్ని ఇచ్చాడు. ఆ రీతిగా నీవుకూడా ఈ మంత్రాన్ని ఎల్లప్పుడూ జపించి గోవిందుని సంతోషపరచు అన్నారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే ధ్రువస్య వనగమనం, మరీచి ప్రముఖ ఋషి వృత్తాంతశ్చేతి ఏకాదశోఽధ్యాయః సమాప్తః ॥ 11 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో ధ్రువుని వనగమనం, మరీచి ప్రముఖ ఋషి వృత్తాంతం అనే పదకొండవ అధ్యాయం సమాప్తం ॥ 11 ॥



## ద్వాదశోఽధ్యాయః - పన్నెండవ అధ్యాయం

## ధ్రువస్య భగవద్దర్శనం - వరప్రాప్తిశ్చ - ధ్రువునకు భగవద్దర్శనం - వరప్రాప్తి

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**నిశమ్య తదశేషేణ మైత్రేయ! నృపతేః సుతః ।**
**నిర్జగామ వనాత్ తస్మాత్ ప్రణిపత్య స తానృషీన్ ॥ 1 ॥**

మైత్రేయా! ఆ రాజనందనుడు దానినంతా పూర్తిగావిని, ఆ సప్తర్షులకు నమస్కరించి ఆ అరణ్యంనుంచి బయలుదేరి వెళ్లిపోయాడు.

**కృతకృత్యమివాత్మానం మన్యమానస్తతో ద్విజ! ।**
**మధుసంజ్ఞం మహాపుణ్యం జగామ యమునాతటమ్ ॥ 2 ॥**

ద్విజోత్తమా! అటుపిమ్మట తాను కృతకృత్యుడనయ్యానని భావించుకొంటూ, యమునా నదీ తీరంలో ఉన్న, మహాపవిత్రమైన మధువనానికి వెళ్లాడు.

**పునశ్చ మధుసంజ్ఞేన దైత్యేనాధిష్ఠితం యతః ।**
**తతో మధువనం నామ్నా ఖ్యాతమత్ర మహీతలే ॥ 3 ॥**

కాలాంతరంలో ఆ ప్రదేశంలో మొదట మధుడనే దైత్యుడు నివసించిన కారణంచే, భూమండలంలో దానికి మధువనం అనే ప్రసిద్ధి లభించింది.

**హత్వా చ లవణం రక్షో మధుపుత్రం మహాబలమ్ ।**
**శత్రుఘ్నో మధురాం నామ పురీం యత్ర చకార వై ॥ 4 ॥**

మహాబలవంతుడగు, మధువుయొక్క కుమారుడైన, లవణాసురుడు అనే రాక్షసుని సంహరించి శత్రుఘ్నుడు మధుర అనే పురాన్ని అక్కడే నిర్మించాడు కూడ.

**యత్ర వై దేవదేవస్య సాన్నిధ్యం హరిమేధసః ।**
**సర్వపాపహరే తస్మిన్ తపస్తీర్థే చకార సః ॥ 5 ॥**

ఆ అరణ్యంలో సమస్తపాపాలను హరించే దేవదేవుడైన శ్రీహరి కొలువై ఉంటాడు. ఆ పుణ్యతీర్థంలో ధ్రువుడు తపస్సు చేశాడు.

**మరీచిముఖ్యైర్మునిభిర్యథోద్దిష్టమభూత్ తథా ।**
**ఆత్మన్యశేషదేవేశం స్థితం విష్ణుమమన్యత ॥ 6 ॥**

మరీచిమున్నగు మునులు ఉపదేశించిన విధంగా ధ్రువుడు తన మనస్సులో సకలదేవేశ్వరుడైన విష్ణుమూర్తి ఉన్నట్లు భావనచేశాడు.

**అనన్యచేతసస్తస్య ధ్యాయతో భగవాన్ హరిః ।**
**సర్వభూతగతో విప్ర సర్వభావగతోఽభవత్ ॥ 7 ॥**

విప్రవర్యా! అనన్యమనస్కుడై ధ్యానం చేస్తున్న ఆ ధ్రువుని సమస్త చిత్తవృత్తులతో సర్వభూతగతుడైన భగవంతుడైన శ్రీహరి, ఆ మహావిష్ణువే ఉన్నాడు.

**మనస్యవస్థితే తస్య విష్ణౌ మైత్రేయ! యోగినః ।**
**న శశాక ధరాభారముద్వోఢుం భూతధారిణీ ॥ 8 ॥**

మైత్రేయా! ఆ యోగీశ్వరుని మనస్సులో విష్ణువు ఆ విధంగా విరాజిల్లుతూ ఉండగా, సమస్త ప్రాణులను ధరించి ఉండే ధారుణి (భూమి) ఆ భారం మోయలేకపోయింది.

**వామపాదస్థితే తస్మిన్ ననామార్ధేన మేదినీ ।**
**ద్వితీయం చ ననామార్ధం క్షితేర్దక్షిణసంస్థితే ॥ 9 ॥**

ఆ ధ్రువుడు ఎడమపాదంమీద నిలిచేసరికి భూమి సగం వంగిపోయింది. కుడిపాదంపై నిలిచేసరికి భూమియొక్క కుడిభాగం వంగిపోయింది.

**పాదాంగుష్ఠేన సంపీడ్య యదా స వసుధాం స్థితః ।**
**తదా సా వసుధా విప్ర! చచాల సహపర్వతైః ॥ 10 ॥**

విప్రోత్తమా! బొటనవ్రేలు భూమిమీద ఆనించి అతడు నిలిచేసరికి వసుధ పర్వతాలతో సహా చలించిపోయింది.

**నద్యో నదాః సముద్రాశ్చ సంక్షోభం పరమం యయుః ।**
**తత్క్షోభాదమరాః క్షోభం పరం జగ్ముర్మహామునే! ॥ 11 ॥**

ఓ మహర్షీ! నదులూ, నదాలు, సముద్రాలు మిక్కిలి సంక్షోభాన్ని పొందాయి. ఆ సంక్షోభంవల్ల అమరులు చాలా క్షోభ పొందారు.

**యామా నామ తదా దేవా మైత్రేయ పరమాకులాః ।**
**ఇన్ద్రేణ సహ సంమంత్ర్య ధ్యానభంగం ప్రచక్రముః ॥ 12 ॥**

మైత్రేయా! అపుడు 'యాములు' అని పిలవబడే దేవతలు చాలా కలతచెందినవారై ధ్యానభంగం కలిగించాలని ప్రయత్నంచేశారు (యాములు స్వాయంభువమన్వంతరంలోని దేవతలు).

**కూష్మాణ్డా వివిధై రూపైః సహస్రేణ (సహేంద్రేణ) మహామునే ।**
**సమాధిభంగమత్యన్త మారబ్ధాః కర్తుమాతురాః ॥ 13 ॥**

మహర్షీ! ఇంద్రునితోపాటుగా మిక్కిలి వ్యాకులత చెందిన కూష్మాండ దేవతలు నానారూపాలతో వచ్చి అతని సమాధికి భంగం కలిగించడానికి విశేషంగా పూనుకొన్నారు.

**సునీతిర్నామ తన్మాతా సాస్రా తత్పురతః స్థితా ।**
**పుత్రేతి కరుణాం వాచమాహ మాయామయీ తదా ॥ 14 ॥**

ఆ సమయంలో అతని తల్లి సునీతి మహామాయామయిగా వచ్చి అతని ఎదుట నిల్చి కొడుకా! అని జాలిగా పిలిచి కన్నీరు కార్చుచూ నిలబడినట్లయింది.

**పుత్రకాస్మాన్నివర్తస్వ శరీరవ్యయదారుణాత్ ।**
**నిర్బన్ధతో మయా లబ్ధో బహుభిస్త్వం మనోరథైః ॥ 15 ॥**

నాయనా! కుమారా! ఈ తపస్సు చాలించు, ఇది దారుణమైనట్టిది. శరీరాన్ని కృశింపచేసేది. ఈ పట్టుదల విరమించు. ఎన్నో ఆశలు పెట్టుకోగా నీవు నాకు దొరికావు.

**దీనామేకాం పరిత్యక్తుమనాథాం న త్వమర్హసి ।**
**సపత్నీవచనాద్వత్స! హ్యగతేస్త్వం గతిర్మమ ॥ 16 ॥**

నేను దీనురాలిని, ఒంటరిదానను, దిక్కులేనట్టి దానిని . నన్ను సవతితల్లి మాటలపై విడిచిపెట్టడం నీవంటివానికి తగదు నాయనా! ఏ దిక్కులేని నాకు నీవే దిక్కు.

**క్వ చ త్వం పంచవర్షీయః క్వ చైతద్ దారుణం తపః ।**
**నివర్త్యతాం మనః కష్టాన్నిర్బన్ధాత్ ఫలవర్జితాత్ ॥ 17 ॥**

అయిదేండ్ల బాలుడవైన నీవెక్కడ? ఈ దారుణమైన తపస్సు ఎక్కడ? ఇది ఫలితంలేనిది. బహుకష్టమైనది. ఈ పట్టుదలనుంచి మనస్సును మళ్లించు.

**కాలః క్రీడనకానాం తే తదన్తేఽధ్యయనస్య చ ।**
**తతః సమస్తభోగానాం తదన్తే చేష్యతే తపః ॥ 18 ॥**

ఇది నీకు ఆటలాడుకొనే కాలం. తరువాత చదువుకొనే సమయం. అటుపిమ్మట సమస్తసుఖాలు అనుభవించాలి. ఆ తరువాత తపస్సు ఆచరింపతగినది.

**కాలః క్రీడనకానాం యస్తవ బాలస్య పుత్రక ।**
**తస్మింస్త్వమిత్థం తపసి కిం నాశాయాత్మనో రతః ॥ 19 ॥**

నాయనా! నీవు చిన్నపిల్లవాడవు. ఆడుకోవలసిన సమయంలో తపస్సు చేయాలనుకొంటున్నావు. ఈ విధంగా ఆత్మనాశం కలగజేసే తపస్సు ఏమిటి? ఎందుకు ఇది?

**మత్ప్రీతిః పరమోధర్మో వయోఽవస్థాం క్రియాక్రమమ్ ।**
**అనువర్తస్వ మాం మోహాన్నివర్త్యాస్మాదధర్మతః ॥ 20 ॥**

నాకు సంప్రీతి కలిగించడమే నీకు పుత్రునిగా పరమధర్మం. నీ వయస్సుకు, దానికి అనుగుణమైన అవస్థకు, దానికి తగినట్టి క్రియను క్రమపద్ధతిలో ఆచరించడం న్యాయం. నన్ను అనుసరించు. ఇది అజ్ఞానం, అధర్మం దీనినుంచి తప్పుకో.

**పరిత్యజసి వత్సాద్య యద్యేతన్న భవాంస్తపః ।**
**త్యక్ష్యామ్యహమపి ప్రాణాంస్తతో వై పశ్యతస్తవ ॥ 21 ॥**

నాయనా! ఇప్పుడు నీవు ఈ తపస్సు చాలించకపోయినట్లయితే, నీవు చూస్తూ ఉండగానే నీ ఎదుటనే నేనుకూడ ప్రాణాలు వదలివేస్తాను – అన్నది.

**తాం విలాపవతీమేవం బాష్పావిలవిలోచనామ్ ।**
**సమాహితమనా విష్ణౌ పశ్యన్నపి న దృష్టవాన్ ॥ 22 ॥**

ఇలా కన్నీళ్లు కురిపిస్తూ ఉన్న నేత్రాలతో, పల్లవిస్తూ పలుకుతున్న ఆమెను మహావిష్ణువునందు నిలిపిన దృఢచిత్తం కల ధ్రువుడు చూచినా చూడనట్లే ఉండిపోయాడు.

**వత్స! వత్స! సుఘోరాణి రక్షాంస్యేతాని భీషణే ।**
**వనేఽభ్యుద్యతశస్త్రాణి సమాయాన్త్యపగమ్యతామ్ ॥ 23 ॥**

"నాయనా! కుమారా! ఇదుగో వీరు మహాభయంకర రాక్షసులు. ఆయుధాలు ఎత్తిపట్టుకొని ఈ అరణ్యంలోకి వచ్చి పడుతున్నారు. వెంటనే ఇక్కడనుంచి తప్పుకో" – (అంటూ ఆ మాయామయి వెళ్లిపోయింది.)

**ఇత్యుక్త్వా ప్రయయౌ సాఽథ రక్షాంస్యావిర్బభుస్తతః ।**
**అభ్యుద్యతోగ్రశస్త్రాణి జ్వాలామాలాకులైర్ముఖైః ॥ 24 ॥**

ఆమె ఇలా పలికి వెళ్లిపోయిన వెంటనే రాక్షసులు ఆవిర్భవించారు. వారు మహాభయంకరాలైన ఆయుధాలను ఎత్తిపట్టుకొన్నారు. వారి ముఖాలనుంచి మంటలు వరసగా ఎగసిపడుతున్నాయి.

**తతో నాదానతీవోగ్రాన్ రాజపుత్రస్య తే పురః ।**
**ముముచుర్దీప్తశస్త్రాణి భ్రామయన్తో నిశాచరాః ॥ 25 ॥**

అటుపిమ్మట ఆ నిశాచరులు వెలుగులు విరజిమ్మే ఆయుధాలను గిరగిరత్రిప్పుతూ, ఆ రాజపుత్రుని ముందు చాలా భయంకరాలైన ధ్వనులు కావించారు.

**శివాశ్చ శతశో నేదుః సజ్వాలాకబలైర్ముఖైః ।**
**త్రాసాయ తస్య బాలస్య యోగయుక్తస్య సర్వతః ॥ 26 ॥**

ఆడునక్కలు కొరివిమంటలుగల ముఖాలతో, యోగయుక్తుడైన ఆ బాలుని చుట్టూ నిలిచి, ఆ బాలుణ్ణి భయపెట్టడానికై వందలకొలదీ కూశాయి.

**హన్యతాం హన్యతా మేష ఛిద్యతాం ఛిద్యతామయమ్ ।**
**భక్ష్యతాం భక్ష్యతాం చాయమిత్యూచుస్తే నిశాచరాః ॥ 27 ॥**

ఆ నిశాచరులు "వీడిని చంపండి. చంపండి చీల్చండి. చీల్చండి మ్రింగండి. మ్రింగండి వీడిని" అని పెడబొబ్బలుపెట్టారు.

**తతో నానావిధాన్ నాదాన్ సింహోష్ట్రమకరాననాః ।**
**త్రాసాయ రాజపుత్రస్య నేదుస్తే రజనీచరాః ॥ 28 ॥**

ఆ తరువాత సింహముఖాలు, ఒంటెమొగాలు, మొసలి ముఖాలు కలిగిన రజనీ చరులందరు ఆ రాజకుమారుని భయపెట్టడానికై పెక్కురీతులలో నినాదాలు చేస్తూ జడిపించారు.

**రక్షాంసి తాని తే నాదాః శివాస్తాన్యాయుధాని చ ।**
**గోవిన్దాసక్తచిత్తస్య యయుర్నేన్ద్రియగోచరమ్ ॥ 29 ॥**

ఆ రాక్షసులు, ఆ భయంకరధ్వనులు, ఆ ఆడునక్కలు, ఆ భీకరాయుధాలు గోవిందుని మనస్సునందు ధ్యానించే ఆసక్తికల ఆ ధ్రువునకు కంట కానరాలేదు. ఇంద్రియగోచరాలు కాలేదు.

**ఏకాగ్రచేతాః సతతం విష్ణుమేవాత్మసంశ్రయమ్ ।**
**దృష్టవాన్ పృథివీనాథపుత్రో నాన్యత్ కథంచన ॥ 30 ॥**

ఆ పృథివీనాథనందనుడు ఏకాగ్రమనస్కుడై ఎల్లప్పుడూ తనలోనున్న విష్ణువును చూశాడే కాని మరెవ్వరిని ఏ విధంగానూ చూడలేదు.

**తతః సర్వాసు మాయాసు విలీనాసు పునః సురాః ।**
**సంక్షోభం పరమం జగ్ముస్తత్పరాభవశంకితాః ॥ 31 ॥**

ఇట్లు మాయలన్నీ మటుమాయం కాగా, మళ్లీ దేవతలు అందరూ ఏ ఉపద్రవం కలుగుతుందో అని భయపడుతూ, మిక్కిలి సంక్షోభం పొందారు.

**తే సమేత్య జగద్యోనిమనాదినిధనం హరిమ్ ।**
**శరణ్యం శరణం యాతాస్తపసా తస్య తాపితాః ॥ 32 ॥**

వారందరూ గుమిగూడి, ఆ ధ్రువుని తపస్సుచేత తపింపబడినవారై, జగత్కారణుడైన, ఆదిమధ్యాంత రహితుడైన, శరణ్యుడైన శ్రీహరిని శరణుపొందారు.

**దేవ దేవ! జగన్నాథ! పరేశ! పురుషోత్తమ! ।**
**ధ్రువస్య తపసా తప్తాస్త్వాం వయం శరణం గతాః ॥ 33 ॥**

దేవతలకే దేవుడవైనవాడా! జగత్తుకు ప్రభువైనవాడా! ఈ జగత్తులో పరం అనే చెప్పబడేవాటి కన్న పరమైనవాడా! పురుషోత్తమా! ధ్రువుడు చేస్తున్న తపస్సుచే అట్టుడికిపోయి మేము నిన్ను శరణుపొందాము.

**దినే దినే కలాలేశైః శశాంకః పూర్యతే యథా ।**
**తథాఽ_యం తపసా దేవ ప్రయాత్యృద్ధిమహర్నిశమ్ ॥ 34 ॥**

ప్రతిదినం తనకళాఖండాలతో శశాంకుడు ఎట్లు వృద్ధిపొందుతూ ఉంటాడో, అట్లే ఇతడు రాత్రి, పగలు తపోభివృద్ధి పొందుతున్నాడు.

**ఔత్తానపాదితపసా వయమిత్థం జనార్దన ।**
**భీతాస్త్వాం శరణం యాతాస్తపసస్తం నివర్తయ ॥ 35 ॥**

జనార్దనా! ఉత్తానపాదుని కుమారుడైన ధ్రువుని తపస్సుకు భీతిచెంది మేము ఈ రీతిగా నిన్ను శరణు పొందాము. ఆతనిని తపస్సునుండి మళ్లించు.

**న విద్మః కిం స శక్రత్వం కిం సూర్యత్వమభీప్సతి ।**
**విత్తపామ్బుపసోమానాం సాభిలాషః పదేషు కిమ్ ॥ 36 ॥**

అతడు ఇంద్రత్వం కోరుతున్నాడో, సూర్యత్వం అపేక్షిస్తున్నాడో, కుబేరత్వం వాంఛిస్తున్నాడో, వరుణత్వం అభిలషిస్తున్నాడో, చంద్రత్వం ఆకాంక్షిస్తున్నాడో మాకు తెలియదు.

**తదస్మాకం ప్రసీదేశ! హృదయాచ్ఛల్యముద్ధర ।**
**ఉత్తానపాదతనయం తపసః సన్నివర్తయ ॥ 37 ॥**

కాబట్టి ఈశ్వరా! మాకు ప్రసన్నుడవు కమ్ము. మా హృదయాలలో గ్రుచ్చుకొన్న శల్యాన్ని లాగివేయి. ఆ ఉత్తానపాదనందనుని తపస్సునుండి మళ్లించు – అని సురలు మొరపెట్టుకొన్నారు.

**శ్రీభగవానువాచ :** –భగవానుడు చెప్పాడు.

**నేన్ద్రత్వం న చ సూర్యత్వం నైవామ్బుపధనేశతామ్ ।**
**ప్రార్థయత్యేష యం కామం తం కరోమ్యఖిలం సురాః ॥ 38 ॥**

**యాత దేవా యథాకామం స్వస్థానం విగతజ్వరాః ।**
**నివర్తయామ్యహం బాలం తపస్యాసక్తమానసమ్ ॥ 39 ॥**

వారి ప్రార్థనలను విన్న భగవంతుడు "దేవతలారా! అతడు కోరుకొనేది ఇంద్రత్వమూ కాదు. సూర్యత్వమూ కాదు. వరుణత్వమూ కాదు. కుబేరత్వం అంతకన్నా కాదు. అతడు దేనిని అర్థిస్తున్నాడో, ఆ కోరిక నేను తీరుస్తాను. సురలారా! వెళ్లండి. స్వేచ్ఛగా మీ మీ స్థానాలకు భయంవీడి బయలుదేరండి. తపస్సునందు మాత్రమే ఆసక్తి కలిగిన మనస్సుకల ఆ బాలుని ధ్యానంనుండి నేను మళ్లిస్తాను. అని వివరించాడు.

**ఇత్యుక్తా దేవదేవేన ప్రణమ్య త్రిదశాస్తతః ।**
**ప్రయయుః స్వాని ధిష్ణ్యాని శతక్రతుపురోగమాః ॥ 40 ॥**

దేవదేవుడైన మహావిష్ణువుచే ఇలా ఆజ్ఞాపింపబడ్డవారై, త్రిదశలు ఆయనకు నమస్కరించి, దేవేంద్రుడు ముందు నడుస్తూ ఉండగా తమ తమ స్థానాలకు వెళ్లిపోయారు.

**భగవానపి సర్వాత్మా తన్మయత్వేన తోషితః ।**
**గత్వా ధ్రువమువాచేదం చతుర్భుజవపుర్హరిః ॥ 41 ॥**

సర్వాత్ముడు, భగవంతుడైన హరికూడా ధ్రువుని తపస్సుయొక్క తన్మయత్వానికి సంతోషించినవాడై, నాలుగుభుజాలతో కూడుకొన్న శరీరధారియై ధ్రువుని సమీపానికి వెళ్లి ఇలా అన్నాడు.

**శ్రీభగవానువాచ :-** భగవంతుడు చెప్పాడు.

**ఔత్తానపాదే! భద్రం తే తపసా పరితోషితః ।**
**వరదోఽహమనుప్రాప్తో వరం వరయ సువ్రత ॥ 42 ॥**

**బాహ్యార్థనిరపేక్షంతే మయి చిత్తం యదాహితమ్ ।**
**తుష్టోఽహం భవతస్తేన తద్ వృణీష్వ వరం పరమ్ ॥ 43 ॥**

"ఉత్తానపాదకుమారా! నీకు భద్రమగుగాక! నీ తపస్సుకు సంతోషించాను. వరం ఇవ్వడానికై నేను వచ్చాను. దృఢవ్రతా! కావలసిన వరం కోరుకో. బయటి విషయాలపై ఆసక్తిలేకుండా నీ మనస్సు నాయందు నిల్పియుంచినందులకు, నీ వంటే నాకు సంతోషం కలిగింది. కనుక శ్రేష్ఠమైన వరం కోరుకో" అని వచించాడు.

**శ్రుత్వా తద్ గదితం తస్య దేవదేవస్య బాలకః ।**
**ఉన్మీలితాక్షో దదృశే ధ్యానదృష్టం హరిం పురః ॥ 44 ॥**

ఈ రీతిగా పలికిన ఆ దేవదేవుని మాటలు విని, ఆ బాలకుడు కన్నులు తెరచి ఎదురుగా తన ధ్యానంతో కనబడ్డ శ్రీహరిని చూశాడు.

**శంఖచక్రగదాశార్ఙ్గవరాసిధరమచ్యుతమ్ ।**
**కిరీటినం సమాలోక్య జగామ శిరసా మహీమ్ ॥ 45 ॥**

శంఖం, చక్రం, గద, శార్ఙ్గం, అభయముద్ర, కత్తి ధరించి, కిరీటం దాల్చియున్న అచ్యుతుని తనివితీరా దర్శించి శిరస్సు భూమిని సోకేటట్లు నమస్కరించాడు.

**రోమాంచితాంగః సహసా సాధ్వసం పరమం గతః ।**
**స్తవాయ దేవదేవస్య స చక్రే మానసం ధ్రువః ॥ 46 ॥**

గగుర్పాటు కలిగిన మేనుతో తటాలున మిక్కిలి జడుపు పొందినవాడై, ఆ దేవదేవుని స్తుతించాలనే తలపుతో ధ్రువుడు మనసుపడ్డాడు.

**కిం వదామి స్తుతావస్య కేనోక్తేనాస్య సంస్తుతిః ।**
**ఇత్యాకులమతిర్దేవం తమేవ శరణం యయౌ ॥ 47 ॥**

ఈయనను ఏ విధంగా స్తోత్రం చేయాలి? ఏమి పలికితే ఈయనను స్తుతించినట్లవుతుంది? అని బుద్ధిలో కలతచెందినవాడై, చివరకు ఆయననే శరణుపొందాడు.

**ధ్రువ ఉవాచ :** - ధ్రువుడు పలికాడు

**భగవన్ యది మే తోషం తపసా పరమం గతః ।**
**స్తోతుం తదహమిచ్ఛామి వరమేతం ప్రయచ్ఛ మే ॥ 48 ॥**

ధ్రువుడు "భగవంతుడా! నా తపస్సువల్ల నీకు పరమానందం కలిగి ఉంటే, నేను నిన్ను స్తుతిచేయాలను కొంటున్నాను. నాకు ఆ వరం ప్రసాదించు.

**బ్రహ్మాద్యైర్వేదవేదజ్ఞై ర్జ్ఞాయతే యస్య నో గతిః ।**
**తం త్వాం కథమహం దేవ స్తోతుం శక్నోమి బాలకః ॥ 49 ॥**

బ్రహ్మమున్నగువారు, వేదాలు అభ్యసించినవారు, వేదార్థం తెలిసినవారు ఎవరైతే ఉన్నారో, వారికే నీ గతి తెలియరాదు. దేవా! అట్టి నిన్ను ఒక బాలకుడనైన నేను ఏ విధంగా స్తోత్రం చేయగలను?

**త్వద్భక్తిప్రవణం హ్యేతత్ పరమేశ్వర! మే మనః ।**
**స్తోతుం ప్రవృత్తం త్వత్పాదే తత్ర ప్రజ్ఞాం ప్రయచ్ఛ మే ॥ 50 ॥**

పరమేశ్వరా! నా మనస్సు నీ భక్తిపై ఆదరం వహించింది. నిన్ను స్తుతించాలనే సంకల్పం, నీ పాదాలను నుతించాలనే తలపూ పొందింది. ఆ విషయంలో నాకు ప్రజ్ఞను ప్రసాదించు- అని కోరాడు.

**శంఖప్రాన్తేన గోవిందస్తం పస్పర్శ కృతాంజలిమ్ ।**
**ఉత్తానపాదతనయం ద్విజవర్య! జగత్పతిః ॥ 51 ॥**

ద్విజోత్తమా! ఆ మాటలువిని కేలుమోడ్చి తన ఎదుట నిలుచున్న ఆ ఉత్తానపాదతనయుని జగదీశ్వరుడైన గోవిందుడు శంఖంకొనతో (వేదాంతభాగంతో) స్పృశించాడు.

**వి॥** బ్రహ్మమయేన కంబునా పస్పర్శ - అని భాగవతం.

**అథ ప్రసన్నవదనస్తత్క్షణాన్నృపనన్దనః ।**
**తుష్టావ ప్రణతో భూత్వా భూతధాతారమచ్యుతమ్ ॥ 52 ॥**

అపుడు తక్షణమే ఆ రాజనందనుడు ప్రసన్నవదనంతో నమస్కరించి సమస్తభూతాలకు అధిష్ఠానమయిన అచ్యుతుని స్తోత్రం చేశాడు.

**భూమి రాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధిరేవ చ ।**
**భూతాదిరాదిప్రకృతిర్యస్య రూపం నతోఽస్మి తమ్ ॥ 53 ॥**

భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, భూతాదియైన అహంకారం, ఆది ప్రకృతియైన ప్రధానం – ఎవనియొక్క రూపమో వానికి నమస్కరించుచున్నాను.

**వి॥** మనస్సు – ఇంద్రియాలకు ఉపలక్షణం బుద్ధిమహత్తత్త్వం.

**శుద్ధః సూక్ష్మోఽఖిలవ్యాపీ ప్రధానాత్ పరతః పుమాన్ ।**
**యస్య రూపం నమస్తస్మై పురుషాయ గుణాత్మనే ॥ 54 ॥**

పరమశుద్ధుడు, సూక్ష్ముడు, అఖిలవ్యాపి, ప్రధానం కన్న పరమైన పురుషుడూ, ఎవనిరూపమో అట్టి గుణసాక్షి అయిన పురుషునకు నమస్కారం.

**భూరాదీనాం సమస్తానాం గన్ధాదీనాం చ శాశ్వతః ।**
**బుద్ధ్యాదీనాం ప్రధానస్య పురుషస్య చ యః పరః ॥ 55 ॥**

**తం బ్రహ్మభూతమాత్మానమశేషజగతః పరమ్ ।**
**ప్రపద్యే శరణం శుద్ధం తద్రూపం పరమేశ్వరమ్ ॥ 56 ॥**

భూమిమున్నగు సమస్త (పంచ)మహాభూతాలకు, వాటి గుణాలైన గంధం మున్నగువాటికి, బుద్ధిమున్నగు కరణాలకు, ప్రధానానికి, పురుషునకు, ఆ పురుషుని కన్న పరుడు, శాశ్వతుడు ఎవడయి ఉన్నాడో, అట్టి బ్రహ్మభూతుని, పరమాత్మను, సకలజగత్తులకన్న పరమైనవానిని, పరమ నిర్మలుని, పరమేశ్వరుని రూపాన్ని శరణు పొందుతున్నాను.

**బృహత్త్వాద్ బృంహణత్వాచ్చ యద్రూపం బ్రహ్మసంజ్ఞితమ్ ।**
**తస్మై నమస్తే సర్వాత్మన్! యోగిచిన్త్యావికారవత్ ॥ 57 ॥**

సర్వాత్మా! ఏ రూపం అన్నింటికన్న పెద్దదియై, అంతట నిండియున్నదియై 'బ్రహ్మము' అని పిలవబడుతోందో, యోగులచే చింతించబడే, ఏ వికారములేని రూపం ఏదైతే ఉందో, అట్టి నీ రూపానికి నమస్కారం.

**సహస్రశీర్షాపురుష స్సహస్రాక్షః సహస్రపాత్ ।**
**సర్వవ్యాపీ భువః స్పర్శాదత్యతిష్ఠద్ దశాంగులమ్ ॥ 58 ॥**

అనంతములైన శిరస్సులు కలవాడవు. అపరిమితములైన కన్నులు కలవాడవు. అసంఖ్యాకములైన పాదాలు కలవాడవు. పురుషరూపుడవు సర్వవ్యాపివి. ఆవరణ సహితమైన సమస్త బ్రహ్మాండాన్ని పదిరెట్లుగా నిండి మహాప్రమాణుడవై ఉన్నావు.

**యద్భూతం యచ్చ వై భవ్యం పురుషోత్తమ తద్ భవాన్ ।**
**త్వత్తో విరాట్ స్వరాట్ సమ్రాట్ త్వత్తశ్చాప్యధిపూరుషః ॥ 59 ॥**

పురుషోత్తమా! పుట్టనిదీ, పుట్టబోయేది (భూత భవిష్యత్తులతో ఉన్నది) అంతా నీవే, నీ నుంచే విరాట్టు, స్వరాట్టు, సమ్రాట్టు. వానినుంచే అధిపూరుషులు. (బ్రహ్మాండం, బ్రహ్మ, మనువులు, మహాపూరుషులు) కలిగారు.

**అత్యరిచ్యత సోఽధశ్చ తిర్యక్ చోర్ధ్వం చ వై భువః ।**
**తతో విశ్వమిదం జాతం త్వత్తో భూతభవిష్యతీ ॥ 60 ॥**

నీవే భూమికి క్రిందా పైనా, అటూ ఇటూ, అన్ని వైపులా అతిశయించి ఉన్నావు. నీ వల్లనే ఈ విశ్వం ఆవిర్భవించింది. భూతభవిష్యత్తులు నీ వల్లనే ఏర్పడ్డాయి.

**త్వద్రూపధారిణశ్చాన్తర్భూతం సర్వమిదం జగత్ ।**
**త్వత్తో యజ్ఞః సర్వహుతః పృషదాజ్యం పశుర్ద్విధా ॥ 61 ॥**

నీ స్వరూపమైన బ్రహ్మాండంలోనిదే ఈ సమస్త జగత్తు అంతా. నీ నుంచే యజ్ఞం, సర్వహోమాలు, పృషదాజ్యం (పెరుగు, నేయి కలిసిన మిశ్రమం) రెండు రకాలైన జంతువులు కలిగాయి.

**వి॥** గ్రామ్యాలు, ఆరణ్యకాలు అనే రెండురకాల జంతువులు.

**త్వత్తో ఋచోఽథ సామాని త్వత్తశ్ఛన్దాంసి జజ్ఞిరే ।**
**త్వత్తో యజూంష్యజాయన్త త్వత్తోఽశ్వాశ్చైకతోదతః ॥ 62 ॥**

నీ నుంచే ఋక్కులు సామలు, ఛందస్సులు, యజుస్సులు కలిగాయి. నీనుంచే అశ్వాలు, ఒకవైపుమాత్రమే దంతాలుకల్గిన జంతువులు ఉద్భవించాయి.

**గావస్త్వత్తః సముద్భూతాస్త్వత్తోఽజా అవయో మృగాః ।**
**త్వన్ముఖాద్ బ్రాహ్మణాస్త్వత్తో బాహ్వోః క్షత్రమజాయత ॥ 63 ॥**

నీ నుంచే గోవులు, మేకలు, గొఱ్ఱెలు, మృగాలు ఉద్భవించాయి. నీ ముఖంవల్ల బ్రాహ్మణులు, బాహువులవల్ల క్షత్రియులు కలిగారు.

**వైశ్యాస్తవోరుజాః శూద్రాస్తవ పద్భ్యాం సముద్గతాః ।**
**అక్ష్ణోః సూర్యోఽనిలః శ్రోత్రాచ్చన్ద్రమా మనసస్తవ (ప్రాణాత్) ॥ 64 ॥**

ఊరువులనుంచి వైశ్యులు, పదములనుంచి శూద్రులు కలిగారు. నేత్రాలనుంచి సూర్యుడు, శ్రోత్రం (ప్రాణం) నుంచి వాయువు, మనస్సునుంచి చంద్రుడు కలిగారు.

**ప్రాణోఽన్తస్సుషిరాజ్జాతో ముఖాదగ్నిరజాయత ।**
**నాభితో గగనం ద్యౌ శ్చ శిరసః సమవర్తత ॥**
**దిశః శ్రోత్రాత్ క్షితిః పద్భ్యాం త్వత్తః సర్వమభూదిదమ్ ॥ 65 ॥**

నీ లోపలి నాసారంధ్రంనుంచి ప్రాణం, ముఖంనుంచి అగ్ని, నాభినుంచి ఆకాశం, శిరస్సునుంచి ద్యులోకం ప్రవర్తించాయి. నీ చెవులనుంచి దిక్కులు, పదముల నుంచి పృథివి ప్రభవించాయి. ఈ సమస్తం నీ నుంచే ఏర్పడింది.

**న్యగ్రోధః సుమహానల్పే యథాబీజే వ్యవస్థితః ॥**
**సంయమే విశ్వమఖిలం బీజభూతే తథా త్వయి ।**
**బీజాదంకురసమ్భూతో న్యగ్రోధః సుసముత్థితః ॥ 66 ।**

**విస్తారం చ యథా యాతి త్వత్తః సృష్టౌ తథా జగత్ ।**
**యథా హి కదలీ నాన్యా త్వక్పత్రాద్ వాఽ_థ దృశ్యతే ॥ 67 ॥**

అంత పెద్దదైన మఱ్ఱివృక్షం ఇంత చిన్నదైన విత్తనంలో ఉన్నట్లు అంతా నీలోనే ఉంది. ప్రళయకాలంలో సమస్తవిశ్వం బీజభూతుడవైన నీలోనే ఉంది. విత్తనంనుంచి మొలకపుట్టి ఉన్నతమైన వటవృక్షంగా విస్తరించినట్లు, సృష్టి సమయంలో ఈ జగత్తు నీచే విస్తారం పొందింది. పట్టలు, ఆకులు తప్పిస్తే కదలీవృక్షం కనిపించనట్లే నీవు తప్ప ఈ విశ్వం లేదు. (అంతా నీలో ఉండే కనిపిస్తుంది.)

**ఏవం విశ్వస్య నాన్యత్వం త్వత్థ్సాయీశ్వర! దృశ్యతే ।**
**హ్లాదినీ సన్ధినీ సంవిత్ త్వయ్యేకా సర్వసంస్థితే ॥ 68 ॥**

ఈశ్వరా! ఈ రీతిగా నీవు తప్ప ఈ విశ్వం లేదు. ఇది నీలో ఉండే కనిపిస్తుంది. సర్వానికి ఆధారమయిన నీయందే హ్లాదిని, సంధిని, సంవిత్తు అభిన్నంగా ఉన్నాయి.

వి॥ సదానందకరశక్తి హ్లాదిని. అవిచ్ఛిన్నకరశక్తి సంధిని. విద్యాశక్తి సంవిత్తు.

**హ్లాదతాపకరీమిశ్రా త్వయి నో గుణవర్జితే ।**
**పృథగ్భూతైకభూతాయ భూతభూతాయ తే నమః ॥ 69 ॥**

నీవు త్రిగుణవర్జితుడవుకాబట్టి నిర్గుణుడవైన నీయందు విషయానందాన్ని ఇచ్చే హ్లాదినీ శక్తికాని, తాపాన్ని అనుభవింపజేసే సంధినీ శక్తికాని, హ్లాదతాపాలను కలిగించే ఉభయమిశ్ర సంవిత్తుకాని లేనే లేవు. కార్యదృష్టితో పృథగ్రూపుడవు. కారణదృష్టితో ఏకరూపుడవు. సమస్తభూతాలలోను సూక్ష్మభూతుడవు అయిన నీకు నమస్కారం.

**ప్రభూతభూతభూతాయ తుభ్యం భూతాత్మనే నమః ।**
**వ్యక్తప్రధానపురుష విరాట్ సమ్రాట్ స్వరాట్ తథా ॥ 70 ॥**

**విభావ్యతేఽ_న్తఃకరణైః పురుషేష్వక్షయో భవాన్ ।**
**సర్వస్మిన్ సర్వభూతస్త్వం సర్వః సర్వస్వరూపధృక్ ॥ 71 ॥**

నీవే భూతాలలో సూక్ష్మరూపుడవు. మహాభూత స్వరూపుడవు. నానావిధ భూతరూపుడవు అయిన నీకు నమస్కారం. నిన్ను యోగులు తమ అంతఃకరణంలో వ్యక్తం (మహత్తత్త్వం), ప్రధానం, పురుషుడు, విరాట్టు, సమ్రాట్టు, స్వరాట్టు మున్నగు రూపాలలో భావిస్తూ ఉంటారు. నీవు క్షయశీలురైన పురుషులలో క్షయం లేనివాడవు. సమస్తమునందు నీవు భూతాత్మకుడవై ఉన్నావు. నీవే సర్వం. సర్వస్వరూపాలను ధరించేవాడవు నీవే.

**సర్వం త్వత్తస్తతశ్చ త్వం నమః సర్వాత్మనేఽస్తు తే ।**
**సర్వాత్మకోఽసి సర్వేశ! సర్వభూతస్థితోయతః ॥ 72 ॥**

సర్వేశా! నీ నుంచే సర్వం వచ్చింది. ఆ కారణంచే సర్వమూ నీవే. సర్వాత్మకుడవు అయిన నీకు నమస్కారం. సమస్తప్రాణులలోను ఉన్న కారణంచే నీవు సర్వాత్మకుడవు అయ్యావు.

**కథయామి తతః కింతే సర్వం వేత్సి హృది స్థితమ్ ।**
**సర్వాత్మన్ సర్వభూతేశ సర్వసత్త్వసముద్భవ ॥ 73 ॥**

సర్వాత్మ! సర్వభూతేశా! సర్వభూతసముద్భవా! నా హృదయములో ఉన్నదంతా నీవు ఎఱుగుదువు. మరి నీకు నేను ఏమని చెప్పుకోవలసిన అవసరం ఉంది?

**సర్వభూతో భవాన్ వేత్తి సర్వభూతమనోరథమ్ ।**
**యో మే మనోరథో నాథ సఫలః స త్వయా కృతః ।**
**తపశ్చ తప్తం సఫలం యద్దృష్టోఽసి జగత్పతే! ॥ 74 ॥**

నీవు సర్వభూతుడవు. కావున సర్వభూత (ప్రాణి) మనోరథాలు నీకు తెలుసు. నాథా! నా కోరిక యేదో అది నీచే సఫలం చేయబడింది. ఓ జగత్పతీ! నీవు దర్శనం ఇవ్వడంవల్ల నా తపస్సు ఫలించింది. అని ధ్రువుడు స్తోత్రంచేశాడు.

**శ్రీభగవానువాచ:-** భగవంతుడు పలికాడు.

**తపసస్తు ఫలం ప్రాప్తం యద్దృష్టోఽహం త్వయా ధ్రువ ।**
**మద్దర్శనం హి విఫలం రాజపుత్ర న జాయతే ॥ 75 ॥**

**వరం వరయ తస్మాత్ త్వం యథాఽభిమతమాత్మనః ।**
**సర్వం సమ్పద్యతే పుంసాం మయి దృష్టిపథంగతే ॥ 76 ॥**

భగవంతుడు "ధ్రువా! నేను నీకు ప్రత్యక్షమయ్యాను. కాబట్టి నీ తపస్సు సఫలమైనట్లే. రాజనందనా! నాదర్శనం ఎప్పుడూ విఫలం కాకూడదు. కావున నీ ఆత్మకు అభిమతమైన వరం కోరుకో. నన్ను చూడగల్గిన జీవులకు సర్వమూ సిద్ధించినట్లే" అని వచించాడు.

**ధ్రువ ఉవాచ:-**ధ్రువుడు పలికాడు.

**భగవన్! సర్వభూతేశ! సర్వస్యాస్తే భవాన్ హృది ।**
**కిమజ్ఞాతం తవ స్వామిన్! మనసా యన్మయేప్సితమ్ ॥ 77 ॥**

అపుడు ధ్రువుడు "భగవానుడా! సర్వభూతాలకు ఈశ్వరా! నీవు అందరి హృదయాలలోను ఉన్నవాడవు. స్వామీ! నా మనస్సులో ఉన్న కోరిక యేమో నీకు తెలియకుండ ఉంటుందా?

**తథాఽపి తుభ్యం దేవేశ! కథయిష్యామి యన్మయా ।**
**ప్రార్థ్యతే దుర్వినీతేన హృదయేనాతిదుర్లభమ్ ॥ 78 ॥**

దేవేశ్వరా! అయినా నా కోరిక ఏమిటో నీకు నివేదిస్తాను. చెప్పిన మాట వినని నా మనస్సు పొందరానిది అందుకోబోతున్నది.

**కిం వా సర్వజగత్స్రష్టః! ప్రసన్నే త్వయి దుర్లభమ్ ।**
**త్వత్ప్రసాదఫలం భుంక్తే త్రైలోక్యం మఘవానపి ॥ 79 ॥**

ఓ సకలజగదుత్పాదకా! నీవు ప్రసన్నుడవు కాగా పొందరానిదేముంటుంది కనుక? దేవేంద్రుడు కూడ నీ అనుగ్రహఫలంగా త్రైలోక్యాన్ని అనుభవిస్తున్నాడు.

**నైతద్ రాజాసనం యోగ్యమజాతస్య మమోదరాత్ ।**
**ఇతి గర్వాదవోచన్మాం సపత్నీ మాతురుచ్చకైః ॥ 80 ॥**
**ఆధారభూతం జగతః సర్వేషాముత్తమోత్తమామ్ ।**
**ప్రార్థయామి ప్రభో స్థానం త్వత్ప్రసాదాదతోఽవ్యయమ్ ॥ 81 ॥**

నా కడుపున పుట్టనివానికి ఈ రాజాసనం అర్హం కాదని నా తల్లికి సవతి గర్వంతో ఉచ్చైః స్వరంతో నన్ను గర్హించి పలికింది. ఆ కారణంచే ప్రభూ! నీ అనుగ్రహంవల్ల సర్వులకు, జగత్తుకు ఆధారభూతమైన, ఉన్నతమైనవానికన్న ఉత్తమమైన, నాశనంలేని స్థానాన్ని కోరుకొంటున్నాను" అని విన్నవించాడు.

**శ్రీ భగవానువాచ :-** భగవంతుడు పలికాడు.

**యత్త్వయా ప్రార్థితం స్థానమేతత్ ప్రాప్స్యతి వై భవాన్ ।**
**త్వయాఽహం తోషితః పూర్వమన్య జన్మని బాలక ॥ 82 ॥**

భగవానుడు "నీవు ఏది కోరుకొన్నావో ఆ స్థానాన్ని పొంది తీరుతావు. బాలకా! నీవు గత జన్మలో కూడా నన్ను సంతోషపరచియున్నావు.

**త్వమాసీర్బ్రాహ్మణః పూర్వం మయ్యేకాగ్రమతిః సదా ।**
**మాతాపిత్రోశ్చ శుశ్రూషుర్నిజధర్మానుపాలకః ॥ 83 ॥**

పూర్వం నీవు బ్రాహ్మణుడవు. నాయందు ఎల్లప్పుడూ ఏకాగ్రమనస్కుడవై ఉండేవాడవు. తల్లిదండ్రులను చక్కగా సేవించేవాడవు. స్వధర్మాన్ని నియమబద్ధంగా పాటించేవాడవు.

**కాలేన గచ్ఛతా మిత్రం రాజపుత్రస్తవాభవత్ ।**
**యౌవనేఽఖిలభోగాఢ్యో దర్శనీయోజ్జ్వలాకృతిః ॥ 84 ॥**

కాలం గడుస్తూ ఉండగా, యౌవనంలో సమస్తభోగాలననుభవించుచున్నవాడు, చూడచక్కని సుందరస్వరూపుడు, రాజకుమారుడు ఒకడు నీకు స్నేహితుడయ్యాడు.

**తత్సంగాత్తస్య తామృద్ధిమవలోక్యాతిదుర్లభామ్ ।**
**భవేయం రాజపుత్రోఽహమితి వాంఛా త్వయా కృతా ॥ 85 ॥**

వాని సాంగత్యంవల్ల దుర్లభమైన ఆతని కలిమి చూచి "నేను కూడ రాజపుత్రుడను కావాలనే వాంఛ" నీకు కలిగింది.

**తతో యథాఽభిలషితా ప్రాప్తా తే రాజపుత్రతా ।**
**ఉత్తానపాదస్య గృహే జాతోఽసి ధ్రువ! దుర్లభే ॥ 86 ॥**

ఆ కారణంవల్ల కోరికకు తగినట్లుగా నీకు రాజపుత్రత్వం వచ్చింది. ధ్రువా! దుర్లభమైన స్వాయంభువ వంశంలో ఉత్తానపాదుని ఇంట్లో జన్మించడం జరిగింది.

**అన్యేషాం తద్వరం స్థానం కులే స్వాయమ్భువస్య యత్ ।**
**తస్యైతదపరం బాల యేనాహం పరితోషితః ॥ 87 ॥**

ఇతరులకు ఈ స్వాయంభువకులంలో స్థానం లభించడమంటే మాటలా? ఓ బాలకా! దానికితోడు ఈ తపస్సు ఒకటి. దీనికి నేను చాలా సంతోషించాను.

**మామారాధ్య నరో ముక్తిమవాప్నోత్యవిలమ్బితామ్ ।**
**మయ్యర్పితమనా బాల కిము స్వర్గాదికం పదమ్ ॥ 88 ॥**

బాలకా! నన్ను ఆరాధించిన నరుడు వెంటనే ముక్తిని పొందుతాడు. నాకు మనస్సు అర్పించినవానికి స్వర్గం మున్నగు పదవులమాట చెప్పేదేమిటి?

**త్రైలోక్యాదధికే స్థానే సర్వతారాగ్రహాశ్రయః ।**
**భవిష్యతి న సన్దేహో మత్ప్రసాదాద్ భవాన్ ధ్రువ ॥ 89 ॥**

ధ్రువా! మూడులోకాలకు అతీతమైన పై స్థానంలో నా అనుగ్రహంవల్ల నీవు సమస్త నక్షత్రాలకు గ్రహాలకు ఆధారభూతమైన సర్వోత్తమస్థానాన్ని పొందుతావు. సందేహం లేదు.

**సూర్యాత్ సోమాత్ తథా భౌమాత్ సోమపుత్రాత్ బృహస్పతేః ।**
**సితార్కతనయాదీనాం సర్వర్క్షాణాం తథా ధ్రువ ॥ 90 ॥**

**సప్తర్షీణామశేషాణాం యే చ వైమానికాః సురాః ।**
**సర్వేషాముపరిస్థానం తవ దత్తం మయా ధ్రువ! ॥ 91 ॥**

ధ్రువా! సూర్యునికంటె, చంద్రునికంటె, కుజునికంటె, బుధునికంటె, బృహస్పతికంటె, శుక్రునికంటె, సూర్యపుత్రుడైన శనైశ్చరునికంటె, ఇతర గ్రహాలకంటె, సమస్త నక్షత్రాలకంటె, సప్తర్షులు అందరికంటె, వైమానికులైన సురలకంటె, అన్నింటికన్న మిన్న అయిన ఊర్ధ్వస్థిత స్థానాన్ని ధ్రువా! నేను నీకు ఇస్తున్నాను.

**కేచిచ్చతుర్యుగం యావత్ కేచిన్మన్వన్తరం సురాః ।**
**తిష్ఠన్తి భవతో దత్తా మయా వై కల్పసంస్థితిః ॥ 92 ॥**

దేవతలు కొందరు చతుర్యుగపర్యంతం ఉంటారు. మరికొందరు మన్వంతరపర్యంతం ఉంటారు. కాని నేను నీకిచ్చినస్థితి కల్పాంతంవరకు ఉంటుంది.

**సునీతిరపి తే మాతా త్వదాసన్నాఽతినిర్మలా ।**
**విమానే తారకా భూత్వా తావత్కాలం నివత్స్యతి ॥ 93 ॥**

నీ తల్లి సునీతి కూడా, నీకు దగ్గరగా, మిక్కిలి నిర్మలంగా అంతరిక్షంలో (విమానంలో) తారక అయి అంతకాలమూ ఉంటుంది.

**యే చ త్వాం మానవాః ప్రాతః సాయం చ సుసమాహితాః ।**
**కీర్తయిష్యన్తి తేషాం చ మహత్ పుణ్యం భవిష్యతి ॥ 94 ॥**

ఏ మానవులు నిన్ను ఉదయమూ, సాయంకాలమూ నిశ్చలమైన మనస్సుతో కీర్తిస్తారో, వారికి కూడ గొప్ప పుణ్యం లభిస్తుంది.” అని పలికి అంతర్ధానమయ్యాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు పలికాడు.

**ఏవం పూర్వం జగన్నాథాద్ దేవదేవాజ్జనార్దనాత్ ।**
**వరం ప్రాప్య ధ్రువః స్థానమధ్యాస్తే సమహామతే ॥ 95 ॥**

గొప్ప బుద్ధిమంతుడవైన మైత్రేయా! ఈ రీతిగా పూర్వం జగన్నాథుడైన, దేవదేవుడైన, జనార్దనునివల్ల ధ్రువుడు వరం పొంది ఉత్తమస్థానాన్ని అధిష్ఠించాడు.

[**శ్లో॥ స్వయం శుశ్రూషణాద్ధర్మ్యాత్ మాతాపిత్రోశ్చ వై తథా ।**
**ద్వాదశాక్షరమాహాత్మ్యా త్తపసశ్చ ప్రభావతః ॥**

తల్లిదండ్రులను తాను ధర్మంగా సేవించినందువల్లను, ద్వాదశాక్షరీ మంత్రపఠనంవల్లను, తపస్సుయొక్క ప్రభావంవల్లను]

**తస్యాపి మానవృద్ధిం చ మహిమానం నిరీక్ష్య చ ।**
**దేవాసురాణామాచార్యః శ్లోకమత్రోశనా జగౌ ॥ 96 ॥**

ఆ ధ్రువునకు కల్గిన మన్నన, సమృద్ధి, వైభవం చూచి దేవతలకు, అసురులకు ఆచార్యుడైన శుక్రుడు ఈ విధంగా గానంచేశాడు.

**అహోఽస్య తపసో వీర్యమహోఽస్య తపసః ఫలమ్ ।**
**యదేనం పురతః కృత్వా ధ్రువం సప్తర్షయః స్థితాః ॥ 97 ॥**

ఆహా! ఏమి వీని తపశ్శక్తి! ఏమి వీని తపః ఫలం! ఈ ధ్రువుని ముందుంచుకొని సప్తర్షులు జ్యోతిర్మండలంలో ఉన్నారు.

**ధ్రువస్య జననీచేయం సునీతిర్నామ సూనృతా ।**
**అస్యాశ్చ మహిమానం కః శక్తో వర్ణయితుం భువి ॥ 98 ॥**

ఈ ధ్రువునియొక్క తల్లి అయిన సునీతి నిజంగా సూనృత వచన. ఈమెయొక్క ప్రభావాన్ని వర్ణించడానికి భువిలో ఎవడు సమర్థుడు కాగలడు?

**త్రైలోక్యాశ్రయతాం ప్రాప్తం పరం స్థానం స్థిరాయతి ।**
**స్థానం ప్రాప్తా పరం ధృత్వా యా కుక్షివివరే ధ్రువమ్ ॥ 99 ॥**

వీనికి ఏనాటికీ చెక్కుచెదరని, మూడులోకాలకు ఆశ్రయమైన స్థిరస్థానం లభించింది. ఈ ధ్రువుని తన కుక్షివివరంలో భరించిన ఆ సునీతి మహోత్తమమైన స్థానం పొందింది.

**యశ్చైతత్ కీర్తయేన్నిత్యం ధ్రువస్యారోహణం దివి ।**
**స సర్వపాపనిర్ముక్తః స్వర్గలోకే మహీయతే ॥ 100 ॥**

ఈ ధ్రువునియొక్క దివ్యలోకారోహణాన్ని నిత్యం కీర్తించే వాడు సమస్త పాపాలనుంచి విడువడినవాడై స్వర్గలోకంలో మనన్నలు పొందుతాడు.

**స్థానభ్రంశం న చాప్నోతి దివి వా యది వా భువి ।**
**సర్వకల్యాణసంయుక్తో దీర్ఘకాలం స జీవతి ॥ 101 ॥**

దివిలోకాని, భువిలోకాని స్థానభ్రంశాన్ని పొందడు. సర్వకల్యాణ సంపన్నుడై ఆతడు దీర్ఘాయుష్మంతుడవుతాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే ధ్రువస్య భగవద్దర్శనం - వరప్రాప్తిశ్చేతి ద్వాదశోఽధ్యాయః సమాప్తః ॥ 12 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో ధ్రువునకు భగవద్దర్శనం - వరప్రాప్తి అనే పన్నెండవ అధ్యాయం సమాప్తం. ॥ 12 ॥



## త్రయోదశోఽధ్యాయః - పదమూడవ అధ్యాయం

## వేనస్య పృథుచక్రవర్తినశ్చ ఉపాఖ్యానమ్ - వేనుడు మరియు పృథుచక్రవర్తియొక్క ఉపాఖ్యానం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరమహర్షి చెప్పాడు.

**ధ్రువాచ్ఛిష్టిం చ భవ్యం చ భవ్యాచ్ఛమ్భుర్వ్యజాయత ।**
**శిష్టే రాధత్త సుచ్ఛాయా పంచ పుత్రానకల్మషాన్ ॥ 1 ॥**

ధ్రువునివల్ల శిష్టి, భవ్యుడు కలిగారు. భవ్యునివల్ల శంభుడు ఉద్భవించాడు. శిష్టివల్ల సుచ్ఛాయ పాపరహితులైన అయిదుగురు కుమారులను కన్నది.

**రిపుం రిపుంజయం విప్రం వృకలం వృకతేజసమ్ ।**
**రిపోరాధత్త బృహతీ చాక్షుషం సర్వతేజసమ్ ॥ 2 ॥**

వారే రిపువు, రిపుంజయుడు, విప్రుడు, వృకలుడు, వృకతేజుడు అనేవారు. అందు రిపునివల్ల బృహతి అను నామె సర్వతేజశ్శాలియైన చాక్షుషుడనే పేరుగల పుత్రుని కన్నది.

**అజీజనత్పుష్కరిణ్యాం వారుణ్యాం చాక్షుషో మనుమ్ ।**
**ప్రజాపతేరాత్మజాయాం వీరణస్య మహాత్మనః ॥ 3 ॥**

చాక్షుషుడు మహాత్ముడైన వీరణ ప్రజాపతియొక్క కుమార్తె అయిన, వరుణకులంలో జన్మించిన పుష్కరిణి యందు మనువును పొందాడు.

**మనోరజాయన్త దశ నడ్వలాయాం మహౌజసః ।**
**కన్యాయాం తపతాం శ్రేష్ఠ! వైరాజస్య ప్రజాపతేః ॥ 4 ॥**

తాపస శ్రేష్ఠుడవైన మైత్రేయా! మనువువల్ల వైరాజుడనే ప్రజాపతి కుమార్తె అయిన నడ్వలయందు మహాతేజశ్శాలులైన పదిమంది తనయులు జన్మించారు.

**ఊరుః పురుః శతద్యుమ్నస్తపస్వీ సత్యవాన్ శుచిః ।**
**అగ్నిష్టోమోఽతిరాత్రశ్చ సుద్యుమ్నశ్చేతి తే నవ ॥ 5 ॥**

**అభిమన్యుశ్చ దశమో నడ్వలాయాం మహౌజసః ।**
**ఊరోరజనయత్ పుత్రాన్ షడాగ్నేయీ మహాప్రభాన్ ॥ 6 ॥**

ఊరుడు (కురువు), పురుడు, శతద్యుమ్నుడు, తపస్వి, సత్యవంతుడు, శుచి, అగ్నిష్టోముడు, అతిరాత్రుడు, సుద్యుమ్నుడు అని వారి తొమ్మండుగురి కుమారుల పేర్లు.

**వి॥** ఊరుః-కురుః, శుచిః-కవిః, సత్యవాక్-సత్యవాన్ పాఠాంతరాలు. నడ్వల-నద్వల.

నడ్వలకుమారులలో పదవవాడైన అభిమన్యుడు మహాతేజశ్శాలి. ఊరువు ఆగ్నేయి మహాతేజస్కు లైన ఆరుగురు పుత్రులను కన్నది.

**అంగం సుమనసం ఖ్యాతిం క్రతుమంగిరసం శిబిమ్ ।**
**అంగాత్సునీథాఽపత్యం వేనమేకమజాయత ॥ 7 ॥**

వారు అంగుడు, సుమనసుడు, ఖ్యాతి, క్రతువు, అంగిరసుడు, శిబి అనేవారు. అంగునివల్ల సునీథ వేనుడనే ఒక కుమారుని కన్నది.

**ప్రజార్థమృషయస్తస్య మమన్థుర్దక్షిణం కరమ్ ।**
**వేనస్య పాణౌ మథితే సమ్బభూవ మహామునే (వేణస్య) ॥ 8 ॥**

**వైన్యో నామ మహీపాలో యః పృథుః పరికీర్తితః ।**
**యేన దుగ్ధా మహీ పూర్వం ప్రజానాం హితకారణాత్ ॥ 9 ॥**

మహామునీ! సంతానంకోసం ఋషులు ఆతని కుడిచేతిని మథించారు. అప్పుడు తరచిన వేనుని కుడిచేతినుంచి వైన్యుడనే మహీపాలుడు పుట్టాడు. ఆతడే పృథువుగా ప్రసిద్ధి వహించాడు. ప్రజలయొక్క మేలుకొరకై పూర్వం అతడు భూమిని పిదికాడు.

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు పలికాడు.

**కిమర్థం మథితః పాణిర్వేనస్య పరమర్షిభిః ।**
**యత్ర జజ్ఞే మహావీర్యః స పృథుర్మునిసత్తమ! ॥ 10 ॥**

మునిశ్రేష్ఠుడవైన పరాశరా! మహర్షులు ఏ కారణంచే వేనుని పాణిని మథించారు? మహాపరాక్రమశాలి అయిన ఆ పృథువు ఎలా జన్మించాడు?

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు పలికాడు.

**సునీథా నామ యా కన్యా మృత్యోః ప్రథమతోఽభవత్ ।**
**అంగస్య భార్యా సా దత్తా తస్యాం వేనో వ్యజాయత ॥ 11 ॥**

మృత్యువుకు సునీథ అనే కుమార్తె మొట్టమొదట కలిగింది. ఆమె అంగునకు భార్యగా ఈయబడింది. ఆమెయందే వేనుడు ఉద్భవించాడు. (వేణుడు పాఠాంతరం)

**స మాతామహదోషేణ తేన మృత్యోః సుతాత్మజః ।**
**నిసర్గాదేవ మైత్రేయ! దుష్ట ఏవ వ్యజాయత ॥ 12 ॥**

మైత్రేయా! మృత్యువుయొక్క కుమార్తెయొక్క కుమారుడు అవడంవల్ల మాతామహదోషంచే అతడు పుట్టుకతోనే స్వభావం చేతనే దుష్టుడుగా పుట్టాడు.

**అభిషిక్తో యదా రాజ్యే స వేనః పరమర్షిభిః ।**
**ఘోషయామాస స తదా పృథివ్యాం పృథివీపతిః ॥ 13 ॥**

**న యష్టవ్యం న హోతవ్యం న దాతవ్యం కదాచన ।**
**భోక్తా యజ్ఞస్య కస్త్వన్యో హ్యహం యజ్ఞపతిః ప్రభుః ॥ 14 ॥**

మహర్షులు ఆతనిని రాజ్యమునందు అభిషిక్తుని చేసినవెంటనే ఆ వేనమహారాజు భూమి నలుదిక్కులా చాటించాడు. "ఏ విధంగానూ యజ్ఞాలు చేయరాదు. హోమాలు వ్రేల్చరాదు. దానాలు ఈయరాదు. యజ్ఞభోక్త వేరే ఎవడున్నాడు? నేనే యజ్ఞానికి భోక్తను. ప్రభువును" అని చాటించాడు.

**తతస్తమృషయః పూర్వం సమ్పూజ్య జగతీపతిమ్ ।**
**ఊచుః సామకలం వాక్యం మైత్రేయ! సముపస్థితాః (సమ్యక్) ॥ 15 ॥**

మైత్రేయా! అపుడు ఆ మహర్షులు జగతీపతిని ముందుగా పూజించి, మన్నన కావించి, మంచిగా, సామమధురంగా ఇలా పలికారు.

**భో భో రాజన్! శృణుష్వ త్వం యద్వదామస్తవ ప్రభో ।**
**రాజ్యదేహోపకారాయ ప్రజానాం చ హితం పరమ్ ॥ 16 ॥**

**దీర్ఘసత్రేణ దేవేశం సర్వయజ్ఞేశ్వరం హరిమ్ ।**
**పూజయిష్యామ భద్రం తే తస్యాంశస్తే భవిష్యతి ॥ 17 ॥**

ఓ మహాప్రభూ! రాజేంద్రా! మేము చెప్పేది నీవు ఆలకించు. నీరాజ్యానికి, దేహానికి ఉపకారం కలగజేస్తుంది. ప్రజలకు మిక్కిలి హితవు కలిగిస్తుంది. మిక్కిలి దీర్ఘకాలం సాగే సత్రయాగంలో దేవేశ్వరుడైన, సమస్తయజ్ఞాలకు అధీశ్వరుడైన శ్రీహరిని పూజిస్తాము. అందువల్ల నీకు శుభం కలుగుతుంది. ఆ యజ్ఞఫలితంలో భాగంగా (ఆరవపాలు) నీకు లభిస్తుంది.

**యజ్ఞేన యజ్ఞపురుషో హరిః సమ్ప్రీణితో నృప! ।**
**అస్మాభిర్భవతః కామాన్ సర్వానేవ ప్రదాస్యతి ॥ 18 ॥**

నృపాలా! మేము చేసే యజ్ఞంవల్ల యజ్ఞపురుషుడైన హరి సంతోషిస్తాడు. మాతోబాటుగా నీకు సమస్తములైన కోరికలను తీరుస్తాడు.

**యజ్ఞై ర్యజ్ఞేశ్వరో యేషాం రాష్ట్రే సమ్పూజ్యతే హరిః ।**
**తేషాం సర్వేప్సితావాప్తిం దదాతి నృప! భూభృతామ్ ॥ 19 ॥**

నృపేంద్రా! ఎవరి రాజ్యంలో యజ్ఞాలచే యజ్ఞేశ్వరుడైన శ్రీహరి పూజింపబడతాడో, ఆ రాజులయొక్క సమస్త మనోభీష్టాలను ఆయన తీరుస్తాడు – అని వచించారు.

**వేన ఉవాచ :**–వేనుడు పలికాడు.

**మత్తః కోఽ భ్యధికోఽ న్యోఽ స్తి యశ్చారాధ్యో మమాపరః ।**
**కోఽ యం హరిరితి ఖ్యాతో యోఽ యం యజ్ఞేశ్వరో మతః ॥ 20 ॥**

అంత వేనుడు "నా కన్న వేరే అధికుడు ఎవడున్నాడు? నేను ఆరాధించవలసినవాడు వేరే ఎవడున్నాడు? మీచే హరి అని చెప్పబడేవాడు ఎవడు? మీరు యజ్ఞేశ్వరుడు అంటున్నవాడు ఎవడు?

**బ్రహ్మా జనార్దనః శంభురింద్రో వాయుర్యమో రవిః ।**
**హుతభుగ్ వరుణో ధాతా పూషాభూమిర్నిశాకరః ॥ 21 ॥**

**ఏతే చాన్యే చ యే దేవాః శాపానుగ్రహకారిణః ।**
**నృపస్యైతే శరీరస్థాః సర్వదేవమయో నృపః ॥ 22 ॥**

బ్రహ్మ, జనార్దనుడు, శంభుడు, ఇంద్రుడు, వాయువు, యముడు, రవి, అగ్నిహోత్రుడు, వరుణుడు, ధాత, పూష, భూమి, చంద్రుడు ఇంకా మిగిలిన-శాపమీయడానికి, అనుగ్రహం చూపించడానికి కారణభూతులైన ఏ దేవతలయితే ఉన్నారో, వారందరూ నృపాలుని శరీరంలో ఉంటారు. కాబట్టి నరపాలుడే సర్వదేవమయుడు.

**ఏతజ్జ్ఞాత్వా మయాऽऽజ్ఞప్తం యథావత్ క్రియతాం తథా ।**
**న దాతవ్యం న హోతవ్యం న యష్టవ్యం చ భో ద్విజాః! ॥ 23 ॥**

ద్విజులారా! ఈ విషయం తెలుసుకొని, నాచే ఎలా ఆజ్ఞాపించబడిందో ఆ విధంగా వ్యవహరించండి. ఇకపై మీరు దానం చేయరాదు. హోమాలు చేయరాదు. యజ్ఞాలు చేయరాదు.

**భర్తృశుశ్రూషణం ధర్మో యథా స్త్రీణాం పరో మతః ।**
**మమాऽऽజ్ఞాపాలనం ధర్మో భవతాం చ తథా ద్విజాః! ॥ 24 ॥**

ద్విజులారా! స్త్రీలకు భర్తచెప్పిన మాటవిని సేవచేయడమే పరమధర్మమైయున్నది. అదేవిధంగా మీకుకూడ ప్రభువైన నా ఆజ్ఞాపాలనమే కర్తవ్యం అని అన్నాడు.

**ఋషయ ఊచుః :-** ఋషులు చెప్పారు

**దేహ్యనుజ్ఞాం మహారాజ మాధర్మో యాతు సంక్షయమ్ ।**
**హవిషాం పరిణామోऽయం యదేత దఖిలం జగత్ ॥ 25 ॥**

అపుడు మహర్షులు "మహారాజా! మాకు అనుజ్ఞ ఇప్పించు. ఎన్నడూ ధర్మనాశం జరగకూడదు సుమా! ఈ సకల జగత్తు దేవతలకిచ్చు హవిర్భాగములయొక్క పరిణామమే కాని వేరే కాదు" అన్నారు.

**ఇతి విజ్ఞాప్యమానోऽపి స వేనః పరమర్షిభిః ।**
**యదా దదాతి నానుజ్ఞాం ప్రోక్తః ప్రోక్తః పునః పునః ॥ 26 ॥**

**తతస్తు మునయః సర్వే కోపామర్షసమన్వితాః ।**
**హన్యతాం హన్యతాం పాప ఇత్యూచుస్తే పరస్పరమ్ ॥ 27 ॥**

మాటిమాటికి ఇలా ఎన్నివిధాలుగా పరమర్షులు విన్నవించుకొంటున్నా, వేనుడు అనుమతి ఈయకపోయేసరికి ఆ మునీశ్వరులు అందరూ క్రోధావేశాలతో కూడుకొన్నవారై, "ఈ పాపిని చంపండి చంపండి." అని ఒకరితో ఒకరు సంభాషించుకొన్నారు.

**యో యజ్ఞపురుషం దేవమనాదినిధనం ప్రభుమ్ ।**
**వినిన్దత్యధమాచారీ న స యోగ్యో భువః పతిః ॥ 28 ॥**

వీడు యజ్ఞపురుషుడైన, అనాదినిధనుడైన, ప్రభువైన, విష్ణుమూర్తిని నిందిస్తున్నాడు. వీడు అధమాచారుడు. ఇట్టివాడు భూపాలకుడుగా ఉండడానికి అర్హుడు కాడు.

**ఇత్యుక్త్వా మన్త్రపూతైస్తైః కుశైర్మునిగణా నృపమ్ ।**
**నిజఘ్నుర్నిహతం పూర్వం భగవన్నిన్దనాదినా ॥ 29 ॥**

అని కూడబలికికొని, మంత్రపూతాలైన కుశలచే (దర్భలతో) ఆ మునిగణాలు నరపాలుని సంహరించారు. అంతకు పూర్వమే భగవంతుని నిందించడం మున్నగునవి చేయడంవల్ల అతడు ముందే హతప్రాయుడై ఉన్నాడు.

**తతశ్చ మునయో రేణుం దదృశుః సర్వతో ద్విజ ।**
**కిమేతదితి చాసన్నం పప్రచ్ఛుస్తే జనం తదా ॥ 30 ॥**

ద్విజోత్తమా! అంత ఆ మునులు నలువైపులా రేగిన ధూళిని చూశారు. చేరువనున్న ప్రజలను అపుడు వారు "ఏమిటిది"? అని అడిగారు.

**ఆఖ్యాతం చ జనైస్తేషాం చౌరీభూతైరరాజకే ।**
**రాష్ట్రే తు లోకైరారబ్ధం పరస్వాదానమాతురైః ॥ 31 ॥**

అంత జనులు వారితో "రాజ్యం రాజులేనిదయ్యేసరికి పీడితులై ప్రజలు దొంగలుగా మారిపోయి ఇతరుల సొత్తును సొంత సొత్తుగా చేసుకొంటూ దోచుకోవడం ప్రారంభించారు.

**తేషాముదీర్ణవేగానాం చౌరాణాం మునిసత్తమాః! ।**
**సుమహాన్ దృశ్యతే రేణుః పరవిత్తాపహారిణామ్ ॥ 32 ॥**

మునిశ్రేష్ఠులారా! "ఆ దొంగలు అడ్డు ఆపులేని మహావేగంతో పరుల సొత్తును దోచుకొంటూ ఉంటే లేచిన పెనుధూళి అది" అని చెప్పారు.

**తతః సంమన్త్ర్య తే సర్వే మునయస్తస్య భూభృతః ।**
**మమన్థురూరుం పుత్రార్థమనపత్యస్య యత్నతః ॥ 33 ॥**

అపుడు ఆ మునులంతా సమాలోచనచేసి సంతానంలేని ఆ నరపతియొక్క తొడను సంతతికోసమై మథించారు.

**మథ్యతశ్చ సముత్తస్థౌ తస్యోరోః పురుషః కిల ।**
**దగ్ధస్థూణా ప్రతీకాశః ఖర్వటాస్యోఽతిహ్రస్వకః ॥ 34 ॥**

తరచిన అతని తొడనుంచి ఒక పురుషుడు పుట్టుకొని వచ్చాడు. అతడు కాలిన కొరకంచులా నల్లగా ఉన్నాడు. బట్టతలతో ఉన్నాడు. నోరుచూస్తే చిన్నది. మిక్కిలి పొట్టివాడైన మరుగుజ్జు.

**కిం కరోమీతి తాన్ సర్వాన్ విప్రాన్ ప్రాహ త్వరాన్వితః ।**
**నిషీదేతి తమూచుస్తే నిషాదస్తేన సోఽభవత్ ॥ 35 ॥**

వాడు పుట్టీపుట్టడంతోనే తొందరతో నేనేమి చేయాలని ఆ విప్రులనందరినీ అడిగాడు. అంతవారు అతనిని "నిషీద – కూర్చో" అన్నారు. ఆ కారణంచే అతడు నిషాదుడయ్యాడు.

**తతస్తత్సమ్భవా జాతా విన్ధ్యశైలనివాసినః ।**
**నిషాదా మునిశార్దూల! పాపకర్మోపలక్షణాః ॥ 36 ॥**

మునిశార్దూలా! అటుపిమ్మట అతనివల్ల పుట్టిన సంతానం నిషాదులై వింధ్యపర్వత ప్రాంతంలో నివసిస్తూ పాపపు పనులుచేస్తూ జీవించారు.

**తేన ద్వారేణ తత్ పాపం నిష్క్రాంతం తస్య భూపతేః ।**
**నిషాదాస్తే తతో జాతా వేనకల్మషనాశనాః ॥ 37 ॥**

ఆ నరపతియొక్క పాపం ఆ నిషాదుని ద్వారా బయటకు వచ్చివేసింది. ఆ కారణంచే అటుపిమ్మట నిషాదులు వేనుని కల్మషాలను నశింపజేసినవారుగా అయ్యారు.

**తతోఽస్య దక్షిణం హస్తం మమన్థు స్తస్య తే ద్విజాః ।**
**మథ్యమానే చ తత్రాభూత్ పృథుర్వైన్యః ప్రతాపవాన్ ॥ 38 ॥**

అటుపిమ్మట ఆ మునీంద్రులు ఆ వేణుని శరీరంయొక్క దక్షిణ హస్తాన్ని మథించారు. అలా తరుస్తున్న సమయంలో దానినుండి ప్రతాపవంతుడైన, వేనతనయుడైన పృథువు ఏర్పడ్డాడు.

**దీప్యమానః స వపుషా సాక్షాదగ్నిరివ జ్వలన్ ।**
**ఆద్యమాజగవం నామ ఖాత్పపాత తతో ధనుః ॥ 39 ॥**

అతడు ధగధగలాడే శరీరంతో సాక్షాత్తు అగ్నిదేవుడు ప్రకాశించాడు. ఆ వెంటనే మొట్టమొదటి విల్లు అయిన "ఆజగవం" ఆకాశంనుంచి క్రిందపడింది.

**శరాశ్చ దివ్యా నభసః కవచం చ పపాత హ ।**
**తస్మిన్ జాతే తు భూతాని సమ్ప్రహృష్టాని సర్వశః ॥ 40 ॥**

అంతే కాక దివ్యబాణాలు, కవచంకూడ నింగినుంచి క్రిందపడ్డాయి. అతడు పుట్టగానే సకలప్రాణులు అన్ని విధాలా మిక్కిలి సంతోషించాయి.

**సత్పుత్రేణ చ జాతేన వేనోఽపి త్రిదివం యయౌ ।**
**పున్నామ్నో నరకాత్ త్రాతః స తేన సుమహాత్మనా ॥ 41 ॥**

సత్పుత్రుడు ప్రభవించిన కారణంచే వేనుడుకూడా స్వర్గం చేరుకొన్నాడు. మహామహితాత్ముడైన ఆ కుమారునివల్ల అతడు పున్నామ నరకంనుంచి రక్షించబడ్డాడు.

**తం సముద్రాశ్చ నద్యశ్చ రత్నాన్యాదాయ సర్వశః ।**
**తోయాని చాభిషేకార్థం సర్వాణ్యేవోపతస్థిరే ॥ 42 ॥**

ఆ పృథువును అభిషేకించడానికై అన్ని సముద్రాలు, నదులు అన్నివైపులనుండి రత్నాలను, తోయాలను పట్టుకొని వచ్చాయి.

**పితామహశ్చ భగవాన్ దేవైరాంగిరసైస్సహ ।**
**స్థావరాణి చ భూతాని జంగమాని చ సర్వశః ॥ 43 ॥**

**సమాగమ్య తదా వైన్యమభ్యషించన్ నరాధిపమ్ ।**
**హస్తే తు దక్షిణే చక్రం దృష్ట్వా తస్య పితామహః ॥ 44 ॥**

**విష్ణోరంశం పృథుం మత్వా పరితోషం పరం యయౌ ।**
**విష్ణుచిహ్నం కరే చక్రం సర్వేషాం చక్రవర్తినామ్ ॥ 45 ॥**

భగవంతుడైన పితామహుడు ఆంగిరసులతోను, దేవతలతోను కలిసివచ్చాడు. నలువైపులనుండి స్థావర జంగమాత్మకాలైన ప్రాణులు అన్నీ వచ్చాయి. అందరూ కలిసి వైన్యుని నరాధిపతిగా అభిషేకించారు. ఆతని దక్షిణ హస్తంలో ఉన్న చక్రరేఖను చూచి పితామహుడు పృథువును విష్ణువుయొక్క అంశవల్ల అవతరించినవాడుగా భావించి మహానందం పొందాడు. సమస్త చక్రవర్తుల కుడిచేతిలో విష్ణువుయొక్క చక్రపు చిహ్నం ప్రకాశిస్తూ ఉంటుంది.

**భవత్యవ్యాహతో యస్య ప్రభావస్త్రిదశైరపి ।**
**మహతా రాజరాజ్యేన పృథుర్వైన్యః ప్రతాపవాన్ ॥ 46 ॥**

**సోఽభిషిక్తో మహాతేజా విధివద్ధర్మకోవిదైః ।**
**పిత్రాపరాజితాస్తస్య ప్రజాస్తేనానురంజితాః ॥ 47 ॥**

ఆ విష్ణుచక్రంయొక్క ప్రభావంవల్ల అతడు అవ్యాహతపరాక్రముడై దేవతలచే కూడ జయింపరాని వాడవుతాడు. ఈ విధంగా గొప్పదైన రాజరాజ్యాధికారమైన చక్రవర్తి పదవియందు ప్రతాపవంతుడైన, వేణుని కుమారుడైన, పృథుమహారాజు మహాతేజస్సుతో మంత్రకోవిదులైన వారిచేత యథావిధిగా అభిషేకించ బడ్డాడు. ఆతని తండ్రివల్ల కష్టాలు పొందిన ప్రజలు పృథువువల్ల సంతోషంపొందారు.

వి॥ తండ్రివల్ల పరాజితులైనవారు కొడుకువల్ల అనురంజితులయ్యారు.

**అనురాగాత్ తతస్తస్య నామ రాజేత్యజాయత ।**
**ఆపస్తస్తమ్భిరే చాస్య సముద్రమభియాస్యతః ॥ 48 ॥**

ఆ అనురాగంవల్ల "రంజనాత్ రాజా" అని వ్యవహారంకాబట్టి అతనికి రాజు అనుపేరు సార్థకమై కలిగింది. అతడు సముద్రంమీదుగా వెడుతూఉంటే (దారి ఈయడానికై) నీరు గడ్డకట్టింది.

**పర్వతాశ్చ దదుర్మార్గం ధ్వజభంగశ్చ నాభవత్ ।**
**అకృష్టపచ్యా పృథివీ సిధ్యన్త్యన్నాని చిన్తయా ॥ 49 ॥**

కొండలు ఆ చక్రవర్తికి దారి ఇచ్చాయి. అతని జెండాకర్ర ఎక్కడా విరగలేదు. నేల దున్నకుండానే పండింది. తలచినంత మాత్రంచేతనే ఆహారపదార్థాలు సమకూరాయి.

**సర్వకామదుఘా గావః పుటకే పుటకే మధు । 50 ॥**

గోవులు ఎల్లకోరికలను తీర్చాయి. పట్టు పట్టున తేనెలు కురిశాయి.

**తస్య వై జాతమాత్రస్య యజ్ఞే పైతామహే శుభే ॥**

**సూతః సూత్యాం సముత్పన్నః సౌత్యేఽహని మహామతిః ।**
**తస్మిన్నేవ మహాయజ్ఞే జజ్ఞే ప్రాజ్ఞోఽథ మాగధః ॥ 51 ॥**

పృథుమహారాజు జన్మించిన వెంటనే బ్రహ్మదేవతాకమైన యజ్ఞం జరిగింది. అందులో సోమాభిషవకంనాడు సోమాభిషవీ భూమిలో మహాబుద్ధిశాలియైన సూతుడు ఉద్భవించాడు. తరువాత ఆ మహాయజ్ఞంలోనే ప్రాజ్ఞుడైన మాగధుడు జన్మించాడు.

**ప్రోక్తౌ తదా మునివరైస్తావుభౌ సూతమాగధౌ ।**
**స్తూయతామేష నృపతిః పృథుర్వైన్యః ప్రతాపవాన్ ॥ 52 ॥**

**కర్మైతదనురూపం వాం పాత్రం స్తోత్రస్య చాప్యయమ్ ।**
**తతస్తావూచతుర్విప్రాన్ సర్వానేవ కృతాంజలీ ॥ 53 ॥**

అపుడు ఆ మునీశ్వరులు సూతమాగధులు ఇరువురితోనూ "ఈ ప్రతాపవంతుడు, వేణపుత్రుడు, పృథుచక్రవర్తి మీచే స్తుతించబడుగాక! ఇది మీ ఉభయులకు సముచితమైన కార్యం. ఈ మహారాజు మీ స్తోత్రానికి అర్హుడు" అని పలికారు. అంత వారిరువురూ ఆ విప్రులందరికీ నమస్కరించి ఇలా అన్నారు.

**అద్య జాతస్య నో కర్మ జ్ఞాయతేఽస్య మహీపతేః ।**
**గుణా న చాస్య జ్ఞాయన్తే న చాస్య ప్రథితం యశః ॥ 54 ॥**
**స్తోత్రం కిమాశ్రయం చాస్య కార్యమస్మాభిరుచ్యతామ్ ॥**

**ఋషయ ఊచుః :–** ఋషులు పలికారు.

**కరిష్యత్యేష యత్కర్మ చక్రవర్తీ మహాబలః ।**
**గుణా భవిష్యా యే చాస్య తైరయం స్తూయతాం నృపః ॥ 55 ॥**

అపుడువారు "ఈ భూపాలుడు ఇప్పుడే కదా పుట్టింది. ఇతడు చేసింది ఏదీ తెలియదు. ఇతని గుణాలూ తెలియవు. ఇతని గొప్పదైన కీర్తికూడ ఇంకా తెలియరాలేదు. ఏ విషయాన్ని ఆధారంగా ఇతనిని మేము స్తుతించే కార్యం చేబట్టాలో తెలియజేయండి" అని అడుగగా మహర్షులు "ఈ మహాబలశాలియైన చక్రవర్తి ఏ ఘనకార్యం చేయనున్నాడో, ఇతనికి ఏ సుగుణాలు అలవడనున్నాయో, వాటిని ఆధారంగా ఈ నృపాలుని స్తుతించండి"అన్నారు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు పలికాడు

**తతః స నృపతిస్తోషం తచ్ఛ్రుత్వా పరమం యయౌ ।**
**సద్గుణైః శ్లాఘ్యతామేతి స్తవ్యాశ్చాభ్యాం గుణా మమ ॥ 56 ॥**

ఆ ఋషుల వాక్యం విని నరపాలుడు మిక్కిలి సంతోషం పొందాడు. "సద్గుణాలచే ప్రశంస సిద్ధిస్తుంది. కాబట్టి వీరిచే స్తుతించబడడానికి తగినట్టి మంచి గుణాలు అలవరచుకోవాలి".

**పృథురువాచ :–** పృథువు పలికాడు.

**తస్మాద్ యదద్య స్తోత్రేణ గుణనిర్వర్ణనం త్విమౌ ।**
**కరిష్యేతే కరిష్యామి తదేవాహం సమాహితః ॥ 57 ॥**

అందువల్ల ఇపుడు వీరు ఏ స్తోత్రంతో గుణగణవర్తనం కావిస్తారో. అదే నేను మిక్కిలి శ్రద్ధతో ఆచరిస్తాను.

**యదిమౌ వర్జనీయం చ కించిదత్ర వదిష్యతః ।**
**తదహం వర్జయిష్యామీత్యేవం చక్రే మతిం నృపః ॥ 58 ॥**

వీరు వర్ణించే సమయంలో విడువదగినవి ఏమైనా, ఏ కొంచెమైనా చెబితే వానిని విడిచిపెడతాను" అని మహారాజు మనస్సులో నిర్ణయించుకొన్నాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు పలికాడు.

**అథ తౌ చక్రతుః స్తోత్రం పృథోర్వైన్యస్య ధీమతః ।**
**భవిష్యైః కర్మభిః సమ్యక్ సుస్వరౌ సూతమాగధౌ ॥ 59 ॥**

ఆ తరువాత సూతమాగధులు ఇరువురూ ధీమంతుడైన వేణుపుత్రుడైన పృథుచక్రవర్తిని ఆయన చేయబోయే పనులను చక్కగా ఇంపైన కంఠస్వరంతో ఇలా స్తోత్రం చేశారు.

**సత్యవాగ్దానశీలోఽయం సత్యసన్ధో నరేశ్వరః ।**
**హ్రీమాన్ మైత్రః క్షమాశీలో విక్రాన్తో దుష్టశాసనః ॥ 60 ॥**

**ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ దయావాన్ ప్రియభాషకః ।**
**మాన్యమానయితా యజ్వా బ్రహ్మణ్యః సాధుసమ్మతః ॥ 61 ॥**

**సమః శత్రౌ చ మిత్రే చ వ్యవహారే స్థితో నృపః ।**
**సూతేనోక్తాన్ గుణానిత్థం స తదా మాగధేన చ ॥ 62 ॥**

**చకార హృది తాదృక్చ కర్మణా కృతవానసౌ ।**
**తతః స పృథివీపాలః పాలయన్ వసుధామిమామ్ ॥ 63 ॥**

**ఇయాజ వివిధైర్యజ్ఞై ర్మహద్భిర్భూరిదక్షిణైః ।**
**తం ప్రజాః పృథివీనాథముపతస్థుః క్షుధార్దితాః ॥ 64 ॥**

"ఈ మహారాజు సత్యవచనుడు. దానశీలుడు. సత్యసంధుడు. హ్రీమంతుడు. స్నేహశీలి. సహన స్వభావుడు. పరాక్రమవంతుడు. దుష్టశిక్షకుడు. ధర్మజ్ఞుడు. కృతజ్ఞుడు. దయాస్వభావుడు. ప్రియభాషి. మాన్యులను గౌరవించేవాడు. యజ్ఞములను చేయువాడు. బ్రహ్మజ్ఞాని. సాధువులపట్ల వాత్సల్యం కలవాడు. వ్యవహారాలలో శత్రువునందు మిత్రునియందు సమానంగా ఉండేవాడు". ఈ విధంగా సూతునిచేత, మాగధునిచేత కీర్తింపబడ్డ ఉత్తమగుణాలను ఆ చక్రవర్తి హృదయంలో పదిలపరచుకొని, దానికి అనుగణంగా కర్మలను ఆచరించాడు. అనంతరం ఆ మహీపాలుడు ఈ భూమిని పరిపాలిస్తున్నవాడై గొప్ప దక్షిణలు ఇస్తూ అనేకవిధాలైన మహాయజ్ఞాలు చేశాడు. ఆ సమయంలో ఆకలితో అల్లాడిన ప్రజలు ఆ మహీపాలుని సన్నిధికి వచ్చారు.

**వి ॥** హ్రీ అనగా మనంచేసే పనిని పెద్దలు, మహానుభావులు మెచ్చుకొంటారో లేదో, ఎక్కడ పొరపాటు జరిగిపోతుందో అన్న బెదురు.

**ఓషధీషు ప్రణష్టాసు తస్మిన్కాలే హ్యరాజకే ।**
**తమూచుస్తేన తాః పృష్టాస్తత్రాగమనకారణమ్ ॥ 65 ॥**

ఆ అరాజకసమయంలో ఓషధులు నశించిపోగా అలమటించిన ప్రజలు ఆయన వద్దకు రాగా, మీరాకకు కారణం ఏమిటని అడుగగా రాజుతో ప్రజలు ఇలా విన్నవించారు.

**ప్రజా ఊచు :–** ప్రజలు పలికారు

**అరాజకే నృపశ్రేష్ఠ ధరిత్ర్యా సకలౌషధీః ।**
**గ్రస్తాస్తతః క్షయం యాన్తి ప్రజాః సర్వాః ప్రజేశ్వర! ॥ 66 ॥**

"ఓ జనాధిపా! నృపాలోత్తమా! అరాజకసమయంలో సమస్తాలైన ఓషధులను ధరిత్రి మ్రింగివేసింది. అందువల్ల ప్రజలందరూ నశించిపోతున్నారు.

**త్వం నో వృత్తిప్రదో ధాత్రా ప్రజాపాలో నిరూపితః ।**
**దేహి నః క్షుత్పరీతానాం ప్రజానాం జీవనౌషధీః ॥ 67 ॥**

బ్రహ్మదేవునిచే నీవు మాకు జీవనవిధాతవుగా, ప్రజాపరిపాలకుడవుగా నియమించబడ్డావు. ఆకలితో అలమటించు మా ప్రజలకు జీవనౌషధులను ప్రసాదించు." అని ప్రార్థించారు.

**శ్రీ పరాశర ఉవాచ :–** పరాశరుడు పలికాడు.

**తతోఽథ నృపతిర్దివ్యమాదాయాజగవం ధనుః ।**
**శరాంశ్చ దివ్యాన్ కుపితః సోఽన్వధావత్ వసున్ధరామ్ ॥ 68 ॥**

అందువల్ల నరపతి కోపించి, అజగవమనే దివ్యమైన ధనుస్సును, దివ్యబాణాలను తీసుకొని, వసుంధరను తరుముకొంటూ వెళ్లాడు.

**తతో ననాశ త్వరితా గౌర్భూత్వా తు వసున్ధరా ।**
**సా లోకాన్ బ్రహ్మలోకాదీన్ సన్త్రాసాదగమన్మహీ ॥ 69 ॥**

ఆ వసుంధర అపుడు మిక్కిలి భయంతో వ్యాకులత చెందింది. గోరూపంధరించి త్వరత్వరగా పరుగెత్తింది. అత్యంత భీతితో బ్రహ్మలోకం మున్నగు లోకాలవరకూ పారిపోయింది.

**యత్ర యత్ర యయౌ దేవీ సా తదా భూతధారిణీ ।**
**తత్ర తత్ర తు సా వైన్యం దదర్శాభ్యుద్యతాయుధమ్ ॥ 70 ॥**

అపుడు సమస్త ప్రాణధాత్రియైన ఆ దేవి ఎక్కడెక్కడకు పరుగెత్తిందో, అక్కడల్లా ఆమె ఆయుధమెత్తి పట్టుకొన్న పృథుచక్రవర్తినే చూచింది.

**తతస్తం ప్రాహ వసుధా పృథుం పృథుపరాక్రమమ్ ।**
**ప్రవేపమానా తద్బాణపరిత్రాణపరాయణా ॥ 71 ॥**

అందువల్ల వసుధ గడగడలాడిపోతూ పృథుపరాక్రముడైన పృథుచక్రవర్తితో ఆతని దివ్యశరప్రహారం నుంచి తనను తాను రక్షించుకోదలచి ఇలా అన్నది.

**పృథివీ ఉవాచ :–** పృథివి పలికింది.

**స్త్రీవధే త్వం మహాపాపం కిం నరేన్ద్ర న పశ్యసి ।**
**యేన మాం హన్తుమత్యర్థం ప్రకరోషి నృపోద్యమమ్ ॥ 72 ॥**

"నరేంద్రా! ఏ కారణంచే నన్ను వధించడానికి మహాప్రయత్నం చేస్తున్నావు? నృపవర్యా! స్త్రీని వధించడంవల్ల వచ్చే మహాపాతకం ఎరుగవా నీవు?" అని వచించింది.

**పృథురువాచ:–**పృథువు పలికాడు.

**ఏకస్మిన్ యత్ర నిధనం ప్రాపితే దుష్టకారిణి ।**
**బహూనాం భవతి క్షేమం తస్య పుణ్యప్రదో వధః ॥ 73 ॥**

అపుడు పృథువు "దుష్టకార్యాన్ని ఆచరించే ఒకరిని చంపినందువల్ల, ఎక్కువమంది జనులకు క్షేమం కలిగే పక్షంలో, అట్టివారిని వధించడంచే పుణ్యమే కలుగుతుంది" అన్నాడు.

**పృథివీ ఉవాచ:**-పృథువు పలికాడు.

**ప్రజానాముపకారాయ యది మాం త్వం హనిష్యసి ।**
**ఆధారః కః ప్రజానాం తే నృపశ్రేష్ఠ! భవిష్యతి ॥ 74 ॥**

అపుడు పృథివి "రాజన్యవర్యా! నీ ప్రజల ఉపకారంకొరకై నీవు నన్ను చంపినట్లయితే, నీ ప్రజలకు ఇక ఆధారం ఏమి ఉంటుంది?" అని ప్రశ్నించింది.

**పృథురువాచ:**-పృథువు పలికాడు.

**త్వాం హత్వా వసుధే! బాణైర్మచ్ఛాసనపరాఙ్ముఖీమ్ ।**
**ఆత్మయోగబలేనైవ ధారయిష్యామ్యహం ప్రజాః ॥ 75 ॥**

అంత ఆ మహారాజు "వసుధా! నా ఆజ్ఞకు కట్టుబడని నిన్ను నా బాణాలతో వధించి, నా యోగబలంతోనే ఈ ప్రజలను భరించి మోస్తాను." అన్నాడు.

**శ్రీ పరాశర ఉవాచ:**- పరాశరుడు పలకాడు.

**తతః ప్రణమ్య వసుధా తం భూయః ప్రాహ పార్థివమ్ ।**
**ప్రవేపితాంగీ పరమం సాధ్వసం సముపాగతా ॥ 76 ॥**

అపుడు వసుధ మరింత జడిసిపోయి గడగడలాడుతూ కంపించు మేనితో ఆ పార్థివునకు నమస్కరించి మళ్లీ ఇలా అన్నది.

**పృథివీ ఉవాచ :**- పృథువు పలికాడు.

**ఉపాయతః సమారబ్ధాః సర్వే సిధ్యన్త్యుపక్రమాః ।**
**తస్మాద్ వదామ్యుపాయం తే తత్ కురుష్వ యదిచ్ఛసి ॥ 77 ॥**

"సర్వప్రారంభాలు (అన్ని పనులు) ఉపాయంతో ప్రారంభించినట్లయితే సిద్ధిని కలగజేస్తాయి. నీకు ఇష్టమయినట్లయితే ఒక ఉపాయం చెబుతాను. దానిని చేయవలసింది.

**సమస్తా యా మయా జీర్ణా నరనాథ మహౌషధీః ।**
**యదీచ్ఛసి ప్రదాస్యామి తాః క్షీరపరిణామినీః ॥ 78 ॥**

నరేశ్వరా! నాలో జీర్ణమైపోయిన మహౌషధులను అన్నింటినీ, నీకు ఇష్టమయితే వాటిని పాలరూపంలో తిరిగి ఈయగలదానను.

**తస్మాత్ ప్రజాహితార్థాయ మమ ధర్మభృతాంవర! ।**
**తం తు వత్సం ప్రయచ్ఛ త్వం క్షరేయం యేన వత్సలా ॥ 79 ॥**

ధార్మిక చక్రవర్తీ! కాబట్టి ప్రజలమేలుకొరకై నేను వాత్సల్యంతో పాలు ఇవ్వడానికి వీలుగా ఒకరిని నీవు దూడగాచేయి.

**సమాం చ కురు సర్వత్ర యేన క్షీరం సమన్తతః ।**
**వరౌషధీబీజభూతం వీర సర్వత్ర భావయే ॥ 80 ॥**

వీరాగ్రేసరా! అంతేకాదు. ఎగుడుదిగుడుగానున్న నన్ను సర్వత్ర సమతలంగా చేయి. అపుడు నేను ఉత్తమములైన ఔషధులను, బీజాలను క్షీరరూపంగా అంతటా ప్రసరింపజేస్తాను." అన్నది.

**శ్రీపరాశర ఉవాచ:-**పరాశరుడు పలికాడు.

**తత ఉత్సారయామాస శైలాన్ శతసహస్రశః ।**
**ధనుష్కోట్యా తథా వైన్యస్తతః శైలా వివర్ధితాః ॥ 81 ॥**

అటుపైన వైన్యుడు తన వింటికొనతో వందలుగా, వేలుగా కొండలను పెకలించి వేశాడు. అవి ఒక్కొక్కచోట వేరువేరుగా పెద్దపెద్ద కొండలుగా రూపుదాల్చాయి. (కొండలను పెల్లగించి పైకెత్తాడు)

**న హి పూర్వవిసర్గే వై విషమే పృథివీతలే ।**
**ప్రవిభాగః పురాణాం వా గ్రామాణాం వా తదాఽభవత్ ॥ 82 ॥**

పూర్వసృష్టిలో పృథివీతలం మిట్టపల్లాలతో ఎగుడు దిగుడుగా ఉండేది. అందువల్ల పట్టణాలని, గ్రామాలని ఏర్పాటు ఉండేది కాదు.

**న సస్యాని న గోరక్ష్యం న కృషి ర్న వణిక్పథః ।**
**వైన్యాత్ప్రభృతి మైత్రేయ। సర్వస్యైతస్య సమ్భవః ॥ 83 ॥**

మైత్రేయా! పంటలులేవు. గోరక్షణలేదు. వ్యవసాయమూ లేదు. వ్యాపారమూ లేదు. ఇదంతా వైణ్యుని నాటినుంచే సంభవించింది.

**యత్ర యత్ర సమం తస్యా భూమే రాసీన్నరాధిపః ।**
**తత్ర తత్ర ప్రజానాం హి నివాసం సమరోచయత్ ॥ 84 ॥**

ఆ నరపాలుడు ఎక్కడెక్కడ భూమిని సమతలం కావించాడో, ఆ తావులందు అన్నిచోట్ల ప్రజలు స్థిరనివాసం ఉండడానికి ఇష్టపడ్డారు.

**ఆహారః ఫలమూలాని ప్రజానామభవత్ తదా।**
**కృచ్ఛ్రేణ మహతా సోఽపి ప్రణష్టాస్వోషధీషు వై ॥ 85 ॥**

అపుడు ప్రజలకు కందమూలఫలాలు ఆహారమయ్యాయి. అది కూడ ఓషధులు నశించడంవల్ల బహుకష్టమైపోయింది.

**స కల్పయిత్వా వత్సం తు మనుం స్వాయమ్భువం ప్రభుమ్ । (భుః)**
**స్వపాణౌ పృథివీనాథో దుదోహ పృథివీం పృథుః ॥ 86 ॥**

ఆ పృథివీనాథుడైన పృథుచక్రవర్తి ప్రభువైన స్వాయంభువమనువును దూడగా చేసి, తనచేతిలోనే భూమినుంచి ఓషధులను, సమస్తసస్యాలను పితికాడు.

**సస్యజాతాని సర్వాణి ప్రజానాం హితకామ్యయా ।**
**తేనాన్నేన ప్రజా స్తాత! వర్తన్తేఽద్యాపి నిత్యశః ॥ 87 ॥**

ప్రజలకు మేలును కలిగించే ఆకాంక్షతో సమస్త సస్యాలను, పితికాడు. నాయనా! మైత్రేయా! ఆతడు అట్లు ఏర్పరచిన ఆహారంతోనే నేటికీ ప్రజలు నిత్యం జీవిస్తున్నారు.

**ప్రాణప్రదానాత్ స పృథుర్యస్మాద్ భూమే రభూత్ పితా।**
**తత స్తు పృథివీ సంజ్ఞామవాపాఖిలధారిణీ ॥ 88 ॥**

ఆ రీతిగా పృథుచక్రవర్తి ప్రాణదాత అయినందువల్ల ఆయన భూమికి తండ్రి అయ్యాడు. ఆనాటినుంచి అఖిలధారిణియైన ధారుణి పృథివి అనుపేరును పొందింది.

వి॥ పృథువువల్ల తిరిగి ప్రాణదాత్రి అయినందువల్ల పృథివి అయింది.

**తతశ్చ దేవైర్మునిభిర్దైత్యైరక్షోభిరద్రిభిః ।**
**గన్ధర్వైరురగైర్యక్షైః పితృభిస్తరుభిస్తథా ॥ 89 ॥**

**తత్ తత్ పాత్రముపాదాయ తత్తద్ దుగ్ధా మునే పయః ।**
**వత్సదోగ్ధృవిశేషాశ్చ తేషాం తద్యోనయోఽభవన్ ॥ 90 ॥**

అనంతరం దేవతలు, మునులు, దైత్యులు, రాక్షసులు, అద్రులు, గంధర్వులు, ఉరగులు, యక్షులు, పితరులు, తరువులు తమ తమ పాత్రలు తెచ్చుకొని తమకు తమకు కావలసిన పాలు పిండుకొన్నారు. మునీశ్వరా! ఏ జాతికి ఆ జాతివారే దూడలను కల్పించుకొని పాలు పితికేవారయ్యారు.

**సైషా ధాత్రీ విధాత్రీ చ ధారిణీ పోషిణీ తథా ।**
**సర్వస్య జగతః పృథ్వీ విష్ణుపాదతలోద్భవా ॥ 91 ॥**

ఈ విధంగా విష్ణుపాదతలంనుంచి సమస్థితిని పొందినట్లయినదై, పృథ్వి సమస్తజగత్తుకు జన్మనిచ్చి సృష్టికి విధాత్రియై, ధారిణియై, పోషిణియైనది.

**ఏవంప్రభావః సపృథుః పుత్రో వేనస్య వీర్యవాన్ ।**
**జజ్ఞే మహీపతిః పూర్వో రాజాఽభూజ్జనరంజనాత్ ॥ 92 ॥**

ఇంతటి ప్రభావం ఉన్న, వీర్యవంతుడైన, వేనుని పుత్రుడైన పృథుమహారాజుగా ఆయన అవతరించాడు. పూర్వం జనాన్ని రంజింపజేసి రాజనే సార్థకనామధేయుడయ్యాడు.

**య ఇదం జన్మ వైన్యస్య పృథోః కీర్తయతే నరః ।**
**న తస్య దుష్కృతం కించిత్ ఫలదాయి ప్రజాయతే ॥ 93 ॥**

**దుఃస్వప్నోపశమం నృణాం శృణ్వతాం చైతదుత్తమమ్ ।**
**పృథోర్జన్మ ప్రభావశ్చ కరోతి సతతం నృణామ్ ॥ 94 ॥**

వేనుని కొడుకైన పృథువుయొక్క జన్మవృత్తాంతాన్ని ఏ నరుడు కీర్తిస్తాడో, ఆ నరునకు పూర్వం చేసినపాపం కొంచెమేని ఫలించదు. ఆ పాపఫలం అనుభవించడు. అత్యుత్తమమైన పృథువుకథ విన్న నరులకు దుఃస్వప్నబాధ తొలగిపోతుంది. ఈ పృథుచక్రవర్తి జన్మవృత్తాతం నరులకు అత్యంత వైభవాన్ని, నిరంతర శుభాలను కలగజేస్తుంది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే వేనస్య పృథుచక్రవర్తినశ్చ ఉపాఖ్యానం నామ త్రయోదశోఽధ్యాయః సమాప్తః ॥ 13 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో వేనుడు మరియు పృథుచక్రవర్తియొక్క ఉపాఖ్యానం అనే పదమూడవ అధ్యాయం సమాప్తం ॥ 13 ॥



## చతుర్దశోఽధ్యాయః - పద్నాల్గవ అధ్యాయం
## ప్రచేతసాం తపః - ప్రచేతసుల తపస్సు

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**పృథోః పుత్రౌ తు ధర్మజ్ఞౌ (మహావీర్యౌ) జజ్ఞాతేఽన్తర్ధివాదినౌ ।**
**శిఖణ్డినీ హవిర్ధాన మన్తర్ధానాద్ వ్యజాయత ॥ 1 ॥**

పృథుమహారాజుకు ధర్మజ్ఞులైన అంతర్ధి, వాది అనే ఇద్దరు పుత్రులు కలిగారు. అంతర్ధానునివల్ల (అంతర్ధివల్ల) శిఖండిని అనునామె హవిర్ధానుడనే కుమారుని కన్నది.

**హవిర్ధానాత్ షడాగ్నేయీ ధిషణాఽజనయత్ సుతాన్ ।**
**ప్రాచీనబర్హిషం శుక్రం గయం కృష్ణం వ్రజాజినౌ ॥ 2 ॥**

హవిర్ధానుని అర్ధాంగి ధిషణ. ఆమె అగ్ని వంశీయురాలు. ఆమెకు హవిర్ధానునివల్ల ఆరుగురు కుమారులు జన్మించారు. వారే ప్రాచీనబర్హి, శుక్రుడు, గయుడు, కృష్ణుడు, వ్రజుడు, అజినుడు అనేవారు.

**ప్రాచీనబర్హిర్భగవాన్ మహానాసీత్ ప్రజాపతిః ।**
**హవిర్ధానాన్మహారాజో యేన సంవర్ధితాః ప్రజాః ॥ 3 ॥**

హవిర్ధానుని వల్ల జన్మించిన ప్రాచీనబర్హి భగవత్ స్వరూపుడు. గొప్ప ప్రజాపతి మహారాజు. ఆయనవల్ల ప్రజలు వృద్ధిపొందారు.

**ప్రాచీనాగ్రాః కుశాస్తస్య పృథివ్యాం విస్తృతా మునే! ।**
**ప్రాచీనబర్హిరభవత్ ఖ్యాతో భువి మహాబలః ॥ 4 ॥**

మునీశ్వరా! ఆతని యజ్ఞదర్భలు తూర్పుముఖంగా భూమి అంతా వ్యాపించాయి. కాబట్టి ఆ మహాబలవంతుడు ప్రాచీనబర్హి అనే పేరుతో భువిలో ప్రసిద్ధి వహించాడు.

**సముద్రతనయాయాం తు కృతదారో మహీపతిః ।**
**మహతస్తపసః సారే సవర్ణాయాం మహామతే ॥ 5 ॥**

మహాధీమంతుడా! ఆ మహీపాలుడు గొప్ప తపస్సు చేసిన తరువాత సముద్రుని కూతురగు సవర్ణ అను నామెను పరిణయమాడాడు.

**సవర్ణాధత్త సాముద్రీ దశ ప్రాచీనబర్హిషః ।**
**సర్వే ప్రచేతసో నామ ధనుర్వేదస్య పారగాః ॥ 6 ॥**

ప్రాచీన బర్హివల్ల సముద్ర పుత్రి అయిన సవర్ణ పదిమంది కుమారులను కన్నది. వారందరూ ధనుర్విద్యలో ఆరితేరినవారు. అందరినీ కలిపి ప్రచేతసులు అంటారు.

**అపృథగ్ధర్మచరణాస్తేఽ తప్యన్త మహత్తపః ।**
**దశవర్ష సహస్రాణి సముద్రసలిలేశయాః ॥ 7 ॥**

వారు అందరు ఒకే ధర్మాన్ని అనుష్ఠించినవారై సముద్రజలాలలో ఉండి పదివేల సంవత్సరాలు తీవ్రమైన తపస్సు చేశారు.

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు చెప్పాడు

**యదర్థం తే మహాత్మాన స్తపస్తేపుర్మహామునే! ।**
**ప్రచేతసః సముద్రామ్బుస్యేతదాఖ్యాతుమర్హసి ॥ 8 ॥**

అని వచించగా విని మైత్రేయుడు "మునీశ్వరా! దేనికోసమై ఆ మహాత్ములైన ప్రచేతసులు సముద్రజలాల యందుండి తపస్సు చేశారో చెప్పవలసింది" అని ప్రశ్నించాడు.

**పరాశర ఉవాచ :-** పరాశరుడు పలికాడు

**పిత్రా ప్రచేతసః ప్రోక్తా ప్రజార్థమమితాత్మనా ।**
**ప్రజాపతినియుక్తేన బహుమానపురస్సరమ్ ॥ 9 ॥**

అపుడు పరాశరుడు ఇలా చెప్పాడు "ప్రజాపతిచే ప్రేరేపించబడినవాడై మహితాత్ముడైన ప్రాచీనబర్హి మిక్కిలి మన్ననతో సంతానాభివృద్ధికోసమై ప్రచేతసులతో ఇలా అన్నాడు.

**బ్రహ్మణా దేవదేవేన సమాదిష్టోఽ స్మ్యహం సుతాః ।**
**ప్రజాః సంవర్ధనీయాస్తే మయా చోక్తం తథేతి తత్ ॥ 10 ॥**

కుమారులారా! దేవదేవుడయిన బ్రహ్మచే నేను ప్రజలను వృద్ధిపొందించమని ఆజ్ఞాపించబడ్డాను. నేనుకూడా ఆయనకు అలాగే అని అంగీకారం తెలిపాను.

**తన్మమ ప్రీతయే పుత్రాః ప్రజావృద్ధిమతన్ద్రితాః ।**
**కురుధ్వం మాననీయావః సమ్యగాజ్ఞా ప్రజాపతేః ॥ 11 ॥**

పుత్రులారా! ఆ కారణంచే నా ప్రీతికొరకై కడుజాగరూకతతో ప్రజావర్ధనం కావించండి. ప్రజాపతియొక్క మహత్తరమైన ఆజ్ఞను మీకు చక్కగా గౌరవింపదగినది." అని చెప్పాడు.

**తతస్తే తత్పితుః శ్రుత్వా వచనం నృపనన్దనాః ।**
**తథేత్యుక్త్వా తు తం భూయః పప్రచ్ఛుః పితరం మునే! ॥ 12 ॥**

మైత్రేయా! ఓ మునీ! అపుడు ఆ రాజనందనులు తండ్రి చెప్పిన మాటవిని "అలాగే" అని అంగీకారం తెలిపి మళ్లీ అతనితో ఇలా అన్నారు.

**ప్రచేతస ఊచుః :-**ప్రచేతసులు చెప్పారు.

**యేన తాత ప్రజావృద్ధౌ సమర్థాః కర్మణా వయమ్ ।**
**భవేమ తత్ (భవామస్తత్) సమస్తం నః కర్మ వ్యాఖ్యాతుమర్హసి ॥ 13 ॥**

తండ్రీ! మేము ఏమిచేస్తే సంతతిని చక్కగా వృద్ధి చేయగలుగుతామో, మేము చేయవలసింది ఏదో, దానినంతా వివరించవలసిందని అడిగారు.

**పితోవాచ :-**తండ్రి చెప్పాడు

**ఆరాధ్య వరదం విష్ణుమిష్టప్రాప్తిమసంశయమ్ ।**
**సమేతి నాన్యథా మర్త్యః కిమన్యత్ కథయామి వః ॥ 14 ॥**

అపుడాతడు "వరాలను ప్రసాదించే విష్ణుమూర్తిని ఆరాధించి మానవుడు ఏ సందేహం లేకుండా ఇష్టప్రాప్తిని పొందుతాడు. మరొకవిధంగా సిద్ధిపొందలేడు. ఇంతకంటె మీకు వేరుగా ఏమి చెప్పగలను?

**తస్మాత్ ప్రజా వివృద్ధ్యర్థం సర్వభూతప్రభుం హరిమ్ ।**
**ఆరాధయత గోవిన్దం యది సిద్ధిమభీప్సథ ॥ 15 ॥**

కాబట్టి ప్రజాభివృద్ధికోసమై, సిద్ధిని మీరు అపేక్షిస్తే సర్వప్రాణికోటికి ప్రభువైన, గోవిందుడైన శ్రీహరిని ఆరాధించండి.

**ధర్మమర్థం చ కామం చ మోక్షమన్విచ్ఛతా సదా ।**
**ఆరాధనీయో భగవాననాదిః పురుషోత్తమః ॥ 16 ॥**

ధర్మాన్ని, అర్థాన్ని, కామాన్ని, మోక్షాన్ని ఎల్లప్పుడూ కోరుకొనేవారందరికి భగవంతుడైన, అనాదియైన, పురుషోత్తముడే ఆరాధించదగినవాడు.

**యస్మిన్నారాధితే సర్గం చకారాదౌ ప్రజాపతిః ।**
**తమారాధ్యాచ్యుతం వృద్ధిః ప్రజానాం వో భవిష్యతి ॥ 17 ॥**

సృష్ట్యాదిలో ప్రజాపతి ఆయనను ఆరాధించే సృజనకార్యం ప్రారంభించాడు. కాబట్టి ఆ అచ్యుతుని పూజిస్తే మీకు ప్రజాభివృద్ధి కలుగుతుంది" అని చెప్పాడు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ఇత్యేవముక్తాస్తే పిత్రా పుత్రాః ప్రాచేతసో దశ ।**
**మగ్నాః పయోధిసలిలే తపస్తేపుః సమాహితాః ॥ 18 ॥**

ఈ విధంగా తండ్రిచే ఆదేశించబడినవారై, ఆయన కుమారులు ప్రచేతసులు పదిమంది సముద్రజలాలలో మునిగి అత్యంత శ్రద్ధతో తీవ్రమైన తపస్సు చేశారు.

**దశవర్షసహస్రాణి న్యస్తచిత్తా జగత్పతౌ ।**
**నారాయణే మునిశ్రేష్ఠ! సర్వలోకపరాయణే ॥ 19 ॥**

మునిప్రవరా! సర్వలోకాలకు గొప్పరక్షకుడైన, జగదీశ్వరుడైన, నారాయణునియందు ఉంచబడిన బుద్ధికలవారై పదివేల సంవత్సరాలు తపం కావించారు.

**తత్రైవ తే స్థితా దేవమేకాగ్రమనసో హరిమ్ ।**
**తుష్టువుర్యస్స్తుతః కామాన్ స్తోతురిష్టాన్ ప్రయచ్ఛతి ॥ 20 ॥**

ఆ నీటిలో అలా ఉండే, ఏకాగ్రచిత్తంతో, ఎవరిని స్తుతిచేస్తే పొగడినవారి కోరికలు తీరుతాయో, అట్టి దేవదేవుడైన శ్రీహరిని వారు స్తుతించారు.

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అడిగాడు.

**స్తవం ప్రచేతసో విష్ణోః సముద్రామ్భసి సంస్థితాః ।**
**చక్రుస్తన్మే మునిశ్రేష్ఠ సుపుణ్యం వక్తుమర్హసి ॥ 21 ॥**

"మునిశ్రేష్ఠా! ప్రచేతసులు సముద్రజలాలలో ఉన్నవారై, విష్ణువును గూర్చి చేసిన ఏ పవిత్రమైన పుణ్యప్రదమైన స్తోత్రం ఉందో, దానిని నాకు తెలియజేయవలసింది." అని అడిగాడు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**శృణు మైత్రేయ గోవిన్దం యథాపూర్వం ప్రచేతసః ।**
**తుష్టువుస్తన్మయీభూతాః సముద్రసలిలేశయాః ॥ 22 ॥**

మైత్రేయా! విను పూర్వం ప్రచేతసులు సముద్రసలిలాలలో ఉన్నవారై తన్మయచిత్తంతో ఎలా గోవిందుని స్తుతించారో ఆలకించు.

**ప్రచేతస ఊచుః :-**ప్రచేతసులు చెప్పారు.

**నతాః స్మ సర్వవచసా ప్రతిష్ఠా యత్ర శాశ్వతీ ।**
**తమాద్యన్తమశేషస్య జగతః పరమం ప్రభుమ్ ॥ 23 ॥**

"సమస్తములైన వాక్కులకు ఎచ్చట శాశ్వతమైన ప్రతిష్ఠయో అనగా ఎవడు ఎల్లప్పుడూ సర్వవాక్కులచేత ప్రతిపాదింపబడుతూ ఉంటాడో, అట్టి సర్వములైన జగత్తులకు సృష్టికర్త, ప్రలయకర్త అయిన పరమప్రభువుకు వినమ్రులమై నమస్కరిస్తున్నాము.

**జ్యోతిరాద్య మనౌపమ్యమణ్వనన్తమపారవత్ ।**
**యోనిభూతమశేషస్య స్థావరస్య చరస్య చ ॥ 24 ॥**

ఆయన మొట్టమొదటి జ్యోతిస్స్వరూపుడు. సాటిలేనివాడు. అణుస్వరూపుడు. అంతంలేనివాడు. పారం లేనట్టివాడు. సమస్తమైన స్థావరజంగమాత్మకమైన జగత్తుకు కారణమైనవాడు.

**యస్యాహః ప్రథమం రూపమరూపస్య తతో నిశా ।**
**సన్ధ్యా చ పరమేశస్య తస్మై కాలాత్మనే నమః ॥ 25 ॥**

రూపంలేనట్టి ఏ పరమేశ్వరునకు పగలు, రాత్రి, సంధ్య క్రమంగా మొట్టమొదటి రూపాలు అయ్యాయో, అట్టి కాలస్వరూపునకు నమస్కారం.

**భుజ్యతేఽనుదినం దేవైః పితృభిశ్చ సుధాత్మకః ।**
**జీవభూతః సమస్తస్య తస్మై సోమాత్మనే నమః ॥ 26 ॥**

ఆయన సమస్తజీవకోటికి జీవనమైనవాడు. అమృత స్వరూపమైనవాడు. అట్టివానిని దేవతలు, పితృదేవతలు అనుదినం భోగిస్తూ ఉంటారు. అట్టి సోమస్వరూపుడైన ప్రభువుకు నమస్కారం.

**యస్తమో హన్తి తీవ్రాత్మా స్వభాభిర్భాసయన్ నభః ।**
**ఘర్మశీతామ్భసాం యోనిస్తస్మై సూర్యాత్మనే నమః ॥ 27 ॥**

ఎవడు తీక్ష్ణస్వరూపుడై చీకట్లను పోగొట్టి, స్వీయకాంతులతో ఆకాశమండలంలో ప్రకాశిస్తూ, వేడికి, చల్లదనానికి, నీటికి కారణభూతుడై ఉన్నాడో అట్టి సూర్యస్వరూపుడైన ప్రభువుకు నమస్కారం.

**కాఠిన్యవాన్ యో బిభర్తి జగదేతదశేషతః ।**
**శబ్దాదిసంశ్రయో వ్యాపీ తస్మై భూమ్యాత్మనే నమః ॥ 28 ॥**

ఎవడు కఠినత్వాన్ని వహించి ఈ సమస్తమైన జగత్తును మోస్తున్నాడో, శబ్దం మున్నగు పంచవిషయాలకు ఆధారం, వ్యాపకుడు ఎవడై ఉన్నాడో, అట్టి భూమిస్వరూపుడైన ప్రభువుకు వందనాలు.

**యద్యోనిభూతం జగతో బీజం యత్ సర్వదేహినామ్ ।**
**తత్తోయరూపమీశస్య నమామో హరిమేధసః ॥ 29 ॥**

ఏది జగత్తుకు కారణరూపము, ఏది సమస్తదేహధారులకు బీజరూపము, అది భగవంతునికి జలరూపమై ఉన్నదో, అట్టి శ్రీహరికి ప్రణామాలు అర్పిస్తున్నాము.

**యో ముఖం సర్వదేవానాం హవ్యభుక్ కవ్యభుక్ తథా ।**
**పితౄణాం చ నమస్తస్మై విష్ణవే పావకాత్మనే ॥ 30 ॥**

ఎవడు సమస్తదేవతలకు హవ్యభుక్కు, పితృదేవతలకు కవ్యభుక్కుగా ముఖమై ఉన్నాడో, అట్టి అగ్నిస్వరూపుడైన విష్ణుదేవునకు కైమోడ్పులు.

**పంచధాఽవస్థితో దేహే యశ్చేష్టాం కురుతేఽనిశమ్ ।**
**ఆకాశయోనిర్భగవాన్ తస్మై వాయ్వాత్మనే నమః ॥ 31 ॥**

దేహంలో ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం అని ఐదువిధాలుగా ఉండి రాత్రిపగలు అనే భేదం లేక ఎల్లప్పుడూ కరచరణాదుల పనిని చేస్తూ ఎవడు ఉంటాడో, ఎవడు ఆకాశంనుంచి ఉద్భవించాడో, అట్టి భగవంతుడైన వాయుస్వరూపుడైన విష్ణువుకు నమస్కారాలు.

**అవకాశమశేషాణాం భూతానాం యః ప్రయచ్ఛతి ।**
**అనన్తమూర్తిమాన్ శుద్ధస్తస్మై వ్యోమాత్మనే నమః ॥ 32 ॥**

ఎవడు సమస్తభూతాలకు అవకాశం ఇస్తాడో, అట్టి అనంతమూర్తి అయిన, విశుద్ధుడైన, ఆకాశస్వరూపుడైన విష్ణువుకు నమస్కారం.

**సమస్తేన్ద్రియవర్గస్య యః సదా స్థానముత్తమమ్ ।**
**తస్మై శబ్దాదిరూపాయ నమః కృష్ణాయ వేధసే ॥ 33 ॥**

ఎవడు సమస్తములైన ఇంద్రియాల సృష్టికి ఎల్లప్పుడూ మూలస్థానమై ఉన్నాడో, అట్టి శబ్దాది స్వరూపుడైన పరబ్రహ్మమైన శ్రీకృష్ణునకు నమస్కారం.

**గృహ్ణాతి విషయాన్ నిత్యమిన్ద్రియాత్మా క్షరాక్షరః ।**
**యస్తస్మై జ్ఞానమూలాయ నతాః స్మ హరిమేధసే ॥ 34 ॥**

ఎవడు క్షరాలు, అక్షరాలు అయిన ఇంద్రియాల స్వరూపంతో విషయాలను నిత్యం గ్రహిస్తాడో, అట్టిజ్ఞాన కారణుడైన శ్రీహరికి వందనాలు.

**గృహీతానిన్ద్రియైరర్థాన్ ఆత్మనే యః ప్రయచ్ఛతి ।**
**అంతఃకరణభూతాయ తస్మై విశ్వాత్మనే నమః ॥ 35 ॥**

ఎవడు ఇంద్రియాలద్వారా గ్రహించిన విషయాలను ఆత్మకు అందజేస్తూ ఉంటాడో (నివేదిస్తాడో) అట్టి అంతఃకరణస్వరూపుడైన విశ్వాత్మునకు అభివాదనం.

**యస్మిన్ననన్తే సకలం విశ్వం యస్మాత్ తథోద్గతమ్ ।**
**లయస్థానం చ యస్తస్మై నమః ప్రకృతధర్మిణే ॥ 36 ॥**

అనంతుడైన ఎవనియందు ఈ సమస్త విశ్వం ఉంటూ, జన్మిస్తూ, లయమవుతూ ఉంటుందో, అట్టి ప్రకృతి స్వరూపుడైన పరమాత్మకు ప్రణామం.

**శుద్ధః సంలక్ష్యతే భ్రాన్త్యా గుణవానివ యోఽగుణః ।**
**తమాత్మరూపిణం దేవం నతాః స్మ పురుషోత్తమమ్ ॥ 37 ॥**

ఆయన శుద్ధుడు. నిర్గుణుడు కాని భ్రాంతివల్ల సగుణుడులా కనిపిస్తాడు. అట్టి ఆత్మ స్వరూపుడైన పురుషోత్తముడైన దేవునికి కైవారాలు.

**అవికారమజం సిద్ధం నిర్గుణం యన్నిరంజనమ్ ।**
**నతాః స్మ తత్పరం బ్రహ్మ యద్ విష్ణోః పరమం పదమ్ ॥ 38 ॥**

ఏది వికారం లేనిది, పుట్టుక లేనిది, స్వతస్సిద్ధమైనది, నిర్గుణమైనది, నిరంజనమైనది అయ్యుండి పరంబ్రహ్మమై ఉన్నదో, అట్టి విష్ణువు పరమపదానికి వందనం.

**అదీర్ఘహ్రస్వమస్థూలమనణ్వశ్యామలోహితమ్ ।**
**అస్నేహచ్ఛాయమనణుమసక్తమశరీరిణమ్ ॥ 39 ॥**

**అనాకాశమసంస్పర్శమగన్ధమరసం చ యత్ ।**
**అచక్షుశ్రోత్రమచలమవాక్పాణిమమానసమ్ ॥ 40 ॥**

**అనామగోత్రమసుఖమతేజస్కమహేతుకమ్ ।**
**అభయం భ్రాన్తిరహితమనిద్ర్య మజరామరమ్ ॥ 41 ॥**

**అరజోఽశబ్దమమృత మప్లుతం యదసంవృతమ్ ।**
**పూర్వాపరే న వై యస్మిన్ తద్విష్ణోః పరమంపదమ్ ॥ 42 ॥**

**పరమీశిత్వగుణవత్ సర్వభూతమసంశ్రయమ్ । (పరమేశత్వ)**
**నతాః స్మ తత్పదం విష్ణోః జిహ్వాదృగ్గోచరం న యత్ ॥ 43 ॥**

పొడవుకానిది, పొట్టికానిది, పెద్దదికానిది, చిన్నదికానిది, రజస్తమోగుణములు లేనిది. ద్రవత్వంలేనిది, కాంతిలేనిది, అల్పముకానిది, దేనిని అంటనిది, శరీరస్థుడైన జీవుడు కూడ కానిది.

అవకాశంలేనిది, స్పర్శలేనిది, వాసనలేనిది, రుచిలేనిది, (రూపంలేనిది). కన్ను, చెవి, కదలిక, పలుకు, చేయి, మనస్సు ఇవేమీ లేనిది.

పేరు, గోత్రం, సుఖం, తేజస్సు, కారణం, భయం, భ్రాంతి, నిద్ర, ముదిమి, చావు–ఇవేమీలేనిది. (అమరత్వం)

రజోగుణం, శబ్దం, మృతి, గతి, ఆచ్ఛాదనం, పూర్వం, అపరం ఇవేమీ ఎందులేవో, అదే విష్ణువుయొక్క పరమపదం.

పరమేశ్వరత్వం అనేగుణం కలిగి, సర్వరూపమై, ఆధారశూన్యమై, నాలుకకూ, దృష్టికి అందకుండా ఉండే ఆ విష్ణువు పరమపదానికి ప్రణమిల్లుతున్నాము.

**శ్రీపరాశర ఉవాచ:**–పరాశరుడు పలికాడు.

**ఏవం ప్రచేతసో విష్ణుం స్తువన్తస్తత్సమాధయః ।**
**దశవర్షసహస్రాణి తపశ్చేరుర్మహార్ణవే ॥ 44 ॥**

ఇలా ప్రచేతసులు విష్ణువును స్తుతిస్తూ, శ్రీహరిపైన చిత్తం ఉంచి సమాధిలోనే ఉండి, ఆ మహాసముద్రంలో పదివేల సంవత్సరాలు తపస్సు చేశారు.

**తతః ప్రసన్నో భగవాంస్తేషామంతర్జలే హరిః ।**
**దదౌ దర్శనమున్నిద్రనీలోత్పలదళచ్ఛవిః ॥ 45 ॥**

అపుడు భగవానుడైన శ్రీహరి వారియెడ ప్రసన్నుడై వికసించిన నల్లని కలువపూరేకు కాంతితో ఆ నీటిలోపల వారికి దర్శనమిచ్చాడు.

**పతత్రిరాజమారూఢమవలోక్య ప్రచేతసః ।**
**ప్రణిపేతు శ్శిరోభిస్తం భక్తిభారావనామితైః ॥ 46 ॥**

ప్రచేతసులు పక్షిరాజును అధిరోహించియున్న విష్ణువును అవలోకించి భక్తిపారవశ్యంతో వంగిన శిరస్సులతో ఆయనకు పాదాభివందనం చేశారు.

**తతస్తానాహ భగవాన్ వ్రియతామీప్సితో వరః ।**
**ప్రసాదసుముఖోఽహం వో వరదః సముపస్థితః ॥ 47 ॥**

అపుడు భగవానుడు వారితో "మీకు ఇష్టం వచ్చిన వరం కోరుకోండి. అనుగ్రహ దృష్టితో మీకు వరమీయాలని సాక్షాత్కరించాను." అన్నాడు.

**తతస్తమూచుర్వరదం ప్రణిపత్య ప్రచేతసః ।**
**యథా పిత్రా సమాదిష్టం ప్రజానాం వృద్ధికారణమ్ ॥ 48 ॥**

అపుడు ప్రచేతసులు ఆవరదునకు ప్రణామాలు ఆచరించి, తమ తండ్రి ఆజ్ఞాపించిన సంతానాభివృద్ధి విధాన్ని వివరించారు.

**స చాపి దేవస్తం దత్వా యథాఽభిలషితం వరమ్ ।**
**అన్తర్ధానం జగామాశు తే చ నిశ్చక్రముర్జలాత్ ॥ 49 ॥**

ఆ దేవదేవుడుకూడ వారిచే కోరబడిన ఆ వరాన్ని ఇచ్చి వెంటనే అంతర్ధానమయ్యాడు. ప్రచేతసులుకూడ తపస్సు చాలించి నీటినుండి పైకి వచ్చారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే ప్రచేతసాం తప ఇతి చతుర్దశోఽధ్యాయః సమాప్తః ॥ 14 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో ప్రచేతసుల తపస్సు అనే పద్నాల్గవ అధ్యాయం సమాప్తం ॥ 14 ॥



## పంచదశోऽధ్యాయః - పదునైదవ అధ్యాయం

## కందుముని చరిత్రమ్ - కందుముని చరిత్ర

**శ్రీపరాశర ఉవాచ:**-పరాశరుడు పలికాడు.

**తపశ్చరత్సు పృథివీం ప్రచేతస్సు మహీరుహాః ।**
**అరక్ష్యమాణా మావవ్రు ర్బభూవాథ ప్రజాక్షయః ॥ 1 ॥**

ప్రచేతసులు తపస్సు ఆచరించే సమయంలో రక్షించే వారు లేకపోవడం మూలాన (పాలించి చూచేవారు లేకపోవడంచే) నేలంతా చెట్లు గుబుర్లు గుబుర్లుగా పెరిగి ఆవరించివేశాయి. అందువల్ల ప్రజలకు సరియైన ఆహారం లభించక ప్రజానాశనం జరిగింది.

**నాశకన్మరుతో వాతుం వృతం ఖమభవద్ద్రుమైః ।**
**దశవర్షసహస్రాణి న శేకుశ్చేష్టితుం ప్రజాః ॥ 2 ॥**

పెద్దపెద్ద ద్రుమాలు ఆకాశమార్గాన్ని ఆవరించినందువల్ల, పదివేల సంవత్సరాలు వాయువు సరిగావీచే వీలులేకపోయింది. జనులు పనులు నిర్వహించుకోలేకపోయారు.

**తద్దృష్ట్వా జలనిష్క్రాన్తాః సర్వే క్రుద్ధాః ప్రచేతసః ।**
**ముఖేభ్యో వాయుమగ్నిం చ తేऽసృజన్ జాతమన్యవః ॥ 3 ॥**

నీటినుంచి బయటకువచ్చి ప్రచేతసులందరు దట్టంగా గుబురుగా ఎత్తుగా పెరిగిన వృక్షసంతతిని చూచి క్రోధంతో మండిపడ్డవారై, తక్షణం కోపంతో ఊగిసలాడి తమ ముఖాలనుంచి వాయువును, అగ్నిని సృష్టించారు.

**ఉన్మూలానథ తాన్ వృక్షాన్ కృత్వా వాయురశోషయత్ ।**
**తానగ్నిరదహద్ ఘోరస్తత్రాభూద్ ద్రుమసంక్షయః ॥ 4 ॥**

అపుడు వాయువు వృక్షాలను పెల్లగించి పడవేసి, ఆరగొడితే, అగ్ని వాటిని దహించివేసింది. అపుడు ఆ విధంగా మహాభయంకరంగా వృక్షక్షయం జరిగింది.

**ద్రుమక్షయమథో దృష్ట్వా కించిచ్ఛిష్టేషు శాఖిషు ।**
**ఉపగమ్యాబ్రవీదేతాన్ రాజా సోమః ప్రజాపతీన్ ॥ 5 ॥**

వృక్షవినాశం జరిగి, చెట్లు కొద్దిగా మాత్రమే మిగిలియుండడం చూచి రాజైన సోముడు (చంద్రుడు) ప్రజాపతుల దగ్గరకువచ్చి ఇలా అన్నాడు.

**కోపం యచ్ఛత రాజాన శృణుధ్వం చ వచో మమ ।**
**సన్ధానం వః కరిష్యామి సహక్షితిరుహైరహమ్ ॥ 6 ॥**

"రాజులారా! కోపం ఆపండి. నా మాట వినండి. మీకూ భూరుహాలకూ నేను పొందుకూరుస్తాను.

**రత్నభూతా చ కన్యేయం వార్క్షేయీ వరవర్ణినీ ।**
**భవిష్యజ్జ్ఞానతాపూర్వం మయాగోభిర్వివర్ధితా ॥ 7 ॥**

ఈ కన్య సుందరీరత్నము. వృక్షపుత్రి. చక్కని వర్ణం కలది. నాకు భవిష్యత్తు తెలుసును కనుక ఈమెను మొదటినుంచి నా కిరణాలతో పోషించాను.

**మారిషా నామ నామ్నైషా వృక్షాణామితి నిర్మితా ।**
**భార్యా వోఽస్తు మహాభాగా ధ్రువం వంశవివర్ధినీ ॥ 8 ॥**

వృక్షాలచే సృష్టించబడ్డ ఈమె పేరు మారిష. ఆ పేరుతో ప్రసిద్ధిపొందిన ఈ మహాభాగ మీకు భార్య అగుగాక! ఈమె వంశవివర్ధనురాలు అవుతుంది. ఇది నిశ్చయం.

**యుష్మాకం తేజసోఽర్ధేన మమ చార్ధేన తేజసః ।**
**అస్యాముత్పత్స్యతే విద్వాన్ దక్షో నామ ప్రజాపతిః ॥ 9 ॥**

మీ తేజస్సు సగము, నా తేజస్సు సగము కలిసి ఈమెయందు విద్వాంసుడైన దక్షుడైన ప్రజాపతి ఉద్భవిస్తాడు.

**మమ చాంశేన సంయుక్తో యుష్మత్తేజోమయేన వై ।**
**తేజసాఽగ్నిసమో భూయః ప్రజాస్సంవర్ధయిష్యతి ॥ (అగ్నినా) 10 ॥**

నా అంశతో కూడుకొన్నవాడు, మీ తేజస్సుతో నిండినవాడు అయి సమానతేజస్కుడై దక్షుడు మళ్లీ ప్రజావృద్ధి కలిగేలా చేస్తాడు.

**కణ్డుర్నామ మునిః పూర్వమాసీద్ వేదవిదాంవరః ।**
**సురమ్యే గోమతీ తీరే స తేపే పరమం తపః ॥ 11 ॥**

పూర్వము 'కండుడు' అనే మహాముని ఉండేవాడు. ఆయన వేదవేత్తలలో మిక్కిలి శ్రేష్ఠుడు. ఆయన పరమరమణీయమయిన గోమతీ తీరంలో మహాతపస్సు చేశాడు.

**తత్క్షోభ్యాయ సురేన్ద్రేణ ప్రమ్లోచాఖ్యా వరాఽప్సరాః ।**
**ప్రయుక్తా క్షోభయామాస తమృషిం సా శుచిస్మితా ॥ 12 ॥**

ఆ కండుమహర్షి తపస్సు భగ్నం చేయడానికై దేవేంద్రునిచే 'ప్రమ్లోచ' అనే అప్సరస నియోగించబడింది. ఆమె అప్సరసలలో శ్రేష్ఠురాలు. చక్కని చిరునవ్వుకలది. ఆమె ఆ ఋషీశ్వరుని తన మందస్మితంతో కలతపరచింది.

**క్షోభితః స తయా సార్ధం వర్షాణామధికం శతమ్ ।**
**అతిష్ఠన్మన్దరద్రోణ్యాం విషయాసక్తమానసః ॥ 13 ॥**

ఆమెద్వారా తపస్సు భగ్నం కాగా, అతడు విషయవాసనలయందు తగుల్కొన్న మనస్సుకలవాడై, మందర పర్వత గుహలలో వందల సంవత్సరాలకుపైగా ప్రమ్లోచతో కలిసి విహరించాడు.

**సా తం ప్రాహ మహాభాగ! గన్తుమిచ్ఛామ్యహం దివమ్ ।**
**ప్రసాదసుముఖో బ్రహ్మన్ననుజ్ఞాం దాతుమర్హసి ॥ 14 ॥**

అపుడు ఆమె ఆ ఋషీశ్వరునితో "ఓ మహాభాగా! నేను స్వర్గానికి వెళ్లిపోవాలనుకొంటున్నాను. ఓ బ్రాహ్మణోత్తమా! అనుగ్రహదృష్టితో నాకు అనుజ్ఞను ప్రసాదించవలసింది" అని కోరింది.

**తయైవముక్తః స మునిస్తస్యామాసక్తమానసః ।**
**దినాని కతిచిద్ భద్రే స్థీయతామిత్యభాషత ॥ 15 ॥**

ఆమె అలా అనగానే, కండుమహాముని ఆమెయందు మనసుగొన్నవాడై, "ఓ కల్యాణీ! మరికొద్దిరోజులు ఇక్కడ ఉండవలసింది" అన్నాడు.

**ఏవముక్తా తతస్తేన సాగ్రం వర్షశతం పునః ।**
**బుభుజే విషయాంస్తన్వీ తేన సార్ధం మహాత్మనా ॥ 16 ॥**

ఆయన అట్లు చెప్పగా ప్రమ్లోచ ఆ మహాత్మునితో కలసి మరల నూరేండ్లు విషయసుఖాలు అనుభవించింది.

**అనుజ్ఞాం దేహి భగవన్ వ్రజామి త్రిదివాలయమ్ ।**
**ఉక్తస్తథేతి స మునిః స్థీయతామిత్యభాషత ॥ 17 ॥**

అటుపిమ్మట "భగవానుడా! దేవలోకానికి వెడతాను. అనుమతిని ప్రసాదించు" అని కోరింది. కండుమహర్షి మునుపటిలాగే ఇంకా కొన్నిరోజులు ఉండవలసిందన్నాడు.

**పునర్గతే వర్షశతే సాధికే సా శుభాననా ।**
**యామీత్యాహ దివం బ్రహ్మన్ ప్రణయస్మితశోభనమ్ ॥ 18 ॥**

మరల నూరేండ్లుపైగా గడచిపోగా, ఆ సుందరవదన వలపులు చిందించే చిరునవ్వుల తళతళలతో "బ్రాహ్మణోత్తమా! దివికి వెడతాను" అన్నది.

**ఉక్తస్తయైవం స మునిరుపగుహ్యాయతేక్షణామ్ ।**
**ప్రాహాస్యతాం క్షణం సుభ్రు చిరం కాలం గమిష్యసి ॥ 19 ॥**

అలా ఆమె అనగానే ముని ఆ సోగకన్నుల చిన్నదానిని కౌగలించుకొని "చక్కని కనుబొమలు కలదానా! చిరకాలమయిన మాట నిజమే. క్షణకాలం ఉండు. వెళుదువుగానిలే" అని అన్నాడు.

**తచ్ఛాపభీతా సుశ్రోణీ సహ తేనర్షిణా పునః ।**
**శతద్వయం కించిదూనం వర్షాణామన్వతిష్ఠత ॥ 20 ॥**

ఆ సొగసైన పిరుదులు కల ప్రమ్లోచ ఆయనమాటకాదంటే శపిస్తాడనే భయంతో ఆ ఋషితో కలసి మరల క్రీడిస్తూ కొంచెం తక్కువగా రెండువందల సంవత్సరాలు ఉండిపోయింది.

**గమనాయ మహాభాగ! దేవరాజనికేతనమ్ । (నివేశనమ్)**
**ప్రోక్తః ప్రోక్త స్తయా తన్వ్యా స్థీయతామిత్యభాషత ॥ 21 ॥**

ఓ మహాభాగా! మైత్రేయా! ఆమె ఇలా దేవేంద్రలోకం వెళ్లాలని అడిగినప్పుడల్లా, అడిగిన ప్రతిపర్యాయం ఆయన మరికొంతకాలం ఆగమంటూవచ్చాడు.

**తం సా శాపభయాద్ భీతా దాక్షిణ్యేన చ దక్షిణా ।**
**ప్రోక్తా ప్రణయభంగార్తివేదినీ న జహౌ మునిమ్ ॥ 22 ॥**

ఆ ముని శపిస్తాడనే భయంవల్లనూ, సరళస్వభావం కల్గిన దక్షిణ (నాయిక) అయినందువల్లనూ, ప్రణయభంగమైనప్పుడు కలిగే బాధతెలిసిన దయినందువల్లనూ, ఆయన ఉండమన్నప్పుడల్లా కాదనక మునీశ్వరుని విడవకుండా ఉండిపోయింది.

**తయా చ రమతస్తస్య మహర్షేస్తదహర్నిశమ్ ।**
**నవం నవమభూత్ ప్రేమ మన్మథావిష్టచేతసః ॥ 23 ॥**

ఆమెతో రేయి, పవలు క్రీడిస్తూ ఉంటే, ఆ మహర్షి చిత్తంలో మన్మథుడు ఆవేశించి ఉన్న కారణంగా, ఆయనకు ప్రేమ నిత్యనూతనమవుతూ ఉండేది.

**ఏకదా తు త్వరాయుక్తో నిశ్చక్రామోటజాన్మునిః ।**
**నిష్క్రామన్తం చ కుత్రేతి గమ్యతే ప్రాహ సా శుభా ॥ 24 ॥**

ఒకనాడు ఆ మహాముని పర్ణశాలనుండి హడావుడిగా బయలుదేరాడు. అలా వెళ్లిపోతున్న కందుని చూచి ప్రమ్లోచ ఎక్కడికీపోక? అని అడిగింది.

**ఇత్యుక్తః స తయా ప్రాహ పరివృత్తమహః శుభే ।**
**సన్ధ్యోపాస్తిం కరిష్యామి క్రియాలోపోఽన్యథా భవేత్ ॥ 25 ॥**

ఆమె అలా అడిగినవెంటనే ఆతడు "ఓ మనోజ్ఞురాలా! ప్రొద్దుగ్రుంకపోతున్నది. సంధ్యావందనం ఆచరిస్తాను. లేకపోతే నిత్యకర్మకు లోపం కలుగుతుంది కదా!" అన్నాడు.

**తతః ప్రహస్య ముదితా తం సా ప్రాహ మహామునిమ్ ।**
**కిమద్య సర్వధర్మజ్ఞ పరివృత్తమహస్తవ ॥ 26 ॥**

**బహూనాం విప్రవర్షాణాం పరిణామమహస్తవ ।**
**గతమేతన్న కురుతే విస్మయం కస్య కథ్యతామ్ ॥ 27 ॥**

అపుడా సుస్మిత ఫక్కున నవ్వి ఆ మహామునితో "సర్వధర్మాలూ తెలిసినవాడా! ఏమిటీ? నేడు నీకు క్రొత్తగా ప్రొద్దుగ్రుంకుతున్నదా? విప్రవర్యా! ఎన్నివందల సంవత్సరాలకు నీకు ఈ ప్రొద్దు గ్రుంకుతున్నది? ఎన్ని ప్రొద్దులు ఇట్లు గ్రుంకిపోయినవో? తెలుసా? ఇది ఎవరికి విడ్డూరం అనిపించకుండా ఉంటుంది? నీవే చెప్పు" అని వచించింది.

**ముని రువాచ :**-ముని చెప్పాడు

**ప్రాతస్త్వమాగతా భద్రే నదీతీరమిదం శుభమ్ ।**
**మయా దృష్టాఽసి తన్వంగి ప్రవిష్టా చ మమాశ్రమమ్ ॥ 28 ॥**

**ఇయం చ వర్తతే సన్ధ్యా పరిణామమహర్గతమ్ ।**
**ఉపహాసః కిమర్థోఽయం సద్భావః కథ్యతాం మమ ॥ 29 ॥**

అపుడు ఆ ముని "కల్యాణీ! నీవు ఉదయమే కదా ఈ పావన నదీతీరానికి వచ్చినది! నాచే అప్పుడే కదా నీవు వీక్షించబడింది. ఓ మనోహరాంగీ! అప్పుడే కదా నీవు నా ఆశ్రమానికి వచ్చావు. ఇదుగో! సంధ్యాకాలం సమీపించింది. పగలు గడచిపోయింది. ఎందులకీ పరిహాసం? నాకు నిజం వచించు" అన్నాడు.

**ప్రత్యూషస్యాగతా బ్రహ్మన్ సత్యమేతన్న తే మృషా ।**
**కిన్త్వద్య తస్య కాలస్య గతాన్యబ్దశతాని తే ॥ 30 ॥**

అపుడు ఆమె "బ్రాహ్మణోత్తమా! నేను వేకువజామునందే ఇక్కడకు వచ్చాను. ఇది నిజమే. అబద్ధం కాదు. కాని ఇప్పటికీ ఆ ప్రొద్దుటికీ మధ్య నీకు వందలాది సంవత్సరాలు గడచిపోయాయి." అని పలికింది.

**తతః ససాధ్వసో విప్రస్తాం పప్రచ్ఛాయతేక్షణామ్ ।**
**కథ్యతాం భీరు కః కాలస్త్వయా మే రమతః సహ ॥ 31 ॥**

అపుడు ఆ విప్రుడు సంభ్రమంతో ఉలికిపడి ఆ విశాలాక్షితో "ఓ అబలా! నీతో విహరించిన సమయంలో ఎంతకాలం చెల్లిపోయింది?" అని అడిగాడు.

**ప్రమ్లోచోవాచ :**-ప్రమ్లోచ చెప్పింది.

**సప్తోత్తరాణ్యతీతాని నవ వర్షశతాని తే ।**
**మాసాశ్చ షట్ తథైవాన్యత్ సమతీతం దినత్రయమ్ ॥ 32 ॥**

అపుడు ఆ అప్సరస "తొమ్మిదివందల ఏడుసంవత్సరాల ఆరునెలల మూడురోజులకాలం గడిచిపోయింది" అని పలికింది.

**ముని రువాచ :**-ముని చెప్పాడు

**సత్యం భీరు వదస్యేతత్ పరిహాసోఽథ వా శుభే ।**
**దినమేకమహం మన్యే త్వయా సార్ధమిహాస్థితమ్ ॥ 33 ॥**

ఋషీశ్వరుడు అంత "భీరురాలా! నీవు చెబుతున్నది నిజమేనా? లేకపోతే కల్యాణీ! పరిహాసమా? నేను నీతో కలసి ఇక్కడ ఉన్నది ఒక్కపగలే అనుకొంటున్నాను" అన్నాడు.

**ప్రమ్లోచోవాచ :**-ప్రమ్లోచ చెప్పింది.

**వదిష్యామ్యనృతం బ్రహ్మన్ కథమత్ర తవాన్తికే ।**
**విశేషేణాద్య భవతా పృష్టా మార్గానువర్తినా ॥ 34 ॥**

అంత ఆ అచ్చర లేమ "బ్రాహ్మణోత్తమా! ఇక్కడ నీ సమాపంలో అసత్యం ఎలా చెబుతాను? అందులోనూ విశేషించి, ధర్మమార్గం అనుసరిస్తూ నీచే ప్రశ్నించబడుతూ ఉంటే?" అని అన్నది.

**నిశమ్య తద్ వచః సత్యం స మునిర్నృపనన్దనాః ।**
**ధిఙ్మాం ధిఙ్మామతీవేత్థం నినిన్దాత్మాన మాత్మనా ॥ 35 ॥**

సోముడిలా చెబుతూ ఓ రాజకుమారులారా! ఆమె చెప్పిన నిజం విని ఆ మునీశ్వరుడు ఛీ! ఛీ! అని తనను తాను నిందించుకొంటూ మిక్కిలి వాపోతూ ఇలా భావించాడు.

**ముని రువాచ :**-ముని చెప్పాడు

**తపాంసి మమ నష్టాని హతం బ్రహ్మవిదాం ధనమ్ ।**
**హతో వివేకః కేనాపి యోషిన్మోహాయ నిర్మితా ॥ 36 ॥**

"నా తపస్సులు క్షీణించిపోయాయి. బ్రహ్మవేత్తలధనం నశించిపోయింది. నా వివేకం ధ్వంసమై పోయింది. మోహం పుట్టించడానికే స్త్రీ సృష్టించబడింది.

**ఊర్మిషట్కాతిగం బ్రహ్మజ్ఞేయమాత్మజయేన మే ।**
**మతిరేషా హృతా యేన ధిక్ తం కామమహాగ్రహమ్ ॥ 37 ॥**

(మనస్సును) ఆత్మను నిగ్రహించుకొని, షడూర్ములకు (ఆకలి, దప్పిక, లోభం, మోహం, ముసలితనం, మరణం) అతీతమైన పరబ్రహ్మన్నిగూర్చి నేను తెలియవలసియుంది. ఛీ! కామమనే మహాగ్రహం నాబుద్ధినికాజేసింది.

**వ్రతాని వేదవిద్యాప్తికారణా న్యఖిలాని చ ।**
**నరకగ్రామమార్గేణ సంగేనాపహృతాని మే ॥ 38 ॥**

వేదాలచే తెలియబడే పరమాత్మను పొందింపజేసే సమస్తాలైన నా వ్రతాలనన్నింటిని నరకలోక ద్వారమైన అంగనా సంగం హరించి వేసింది".

**వినిన్ద్యేత్థం స ధర్మజ్ఞః స్వయమాత్మానమాత్మనా ।**
**తామప్సరసమాసీనామిదం వచనమబ్రవీత్ ॥ 39 ॥**

ఈ రీతిగా ఆ ధర్మజ్ఞుడు తనను తాను నిందించుకొంటూ, కూర్చొనియున్న ఆ అప్సరసతో ఇలా అన్నాడు.

**గచ్ఛ పాపే యథాకామం యత్కార్యం తత్కృతం త్వయా ।**
**దేవరాజస్య మత్క్షోభం కుర్వన్త్యా భావచేష్టితైః ॥ 40 ॥**

"పాపాత్మురాలా! నీ ఇష్టం వచ్చినచోటికి వెళ్లిపో. నీవు చేయవలసిన పని ఏదో, అది నీచే పూర్తిచేయబడింది. నీ హావభావ విలాసాలతో నన్ను కలతచెందించి దేవరాజు పని పూర్తిచేసిపెట్టావు.

**న త్వాం కరోమ్యహం భస్మ క్రోధతీవ్రేణ వహ్నినా ।**
**సతాం సాప్తపదం మైత్రముషితోఽహం త్వయా సహ ॥ 41 ॥**

నేను తీవ్రమైన క్రోధాగ్నితో నిన్ను భస్మంచేయను. మైత్రి అనేది సత్పురుషులకు ఏడడుగులు కలిసినడవడం వల్లకాని, ఏడుమాటలు మాట్లాడడం వల్లకాని ఏర్పడుతుంది. నేను నీతో చాలాకాలం కలిసియున్నాను.

**అథవా తవ కో దోషః కిం వా కుప్యామ్యహం తవ ।**
**మమైవ దోషో నితరాం యేనాహమజితేన్ద్రియః ॥ 42 ॥**

అయినా నీ తప్పు ఏముంది కనుక? నీమీద కోపపడడానికి తప్పంతా పూర్తిగా నాదే. ఇంద్రియనిగ్రహం ఏమాత్రం లేనివాడనైపోయాను.

**యయా శక్రప్రియార్థిన్యా కృతో మే తపసో వ్యయః ।**
**త్వయా ధిక్ త్వాం మహామోహమంజూషాం సుజుగుప్సితామ్ ॥ 43 ॥**

శక్రుని మెప్పుకోరి నా తపస్సు నీవు నాశనం చేశావు. ఛీ! నీవు మహామోహమనే పెద్దపెట్టెవంటిదానవు. నీ చర్య మిక్కిలి అసహ్యమైనదై నిందాపాత్రమవుగాక!"

**యావదిత్థం స విప్రర్షిస్తాం బ్రవీతి సుమధ్యమామ్ ।**
**తావద్ గళత్స్వేదజలా సా బభూవాతివేపథుః ॥ 44 ॥**

అని ఇలా ఆ బ్రాహ్మణోత్తముడైన ఋషివర్యుడు సన్నని నడుముకల ప్రమ్లోచతో పలికే సమయంలోనే, ఆమెకు చెమటలు జాలువారగా గజగజావణికిపోయింది.

**ప్రవేపమానాం సతతం స్విన్నగాత్రలతాం సతీమ్ ।**
**గచ్ఛ గచ్ఛేతి సక్రోధమువాచ మునిసత్తమః ॥ 45 ॥**

ఎడతెరపిలేకుండా వడకిపోతూ, చెమటకు తడిసిన మైతీవతో ఉన్న ఆ ప్రమ్లోచను మునివర్యుడు క్రోధంతో గట్టిగా పో! పో! అని అరిచాడు.

**సా తు నిర్భర్త్సితా తేన వినిష్క్రమ్య తదాశ్రమాత్ ।**
**ఆకాశగామినీ స్వేదం మమార్జ తరుపల్లవైః ॥ 46 ॥**

ఇలా ఆమె ఆ ఋషిచే నిందింపబడ్డదై, ఆ ఆశ్రమప్రాంతంనుంచి గబగబా బయటకువచ్చి, ఆకాశమార్గంలో వెళ్లిపోతూ, చెట్లచివుళ్లతో చెమటను తుడుచుకొన్నది.

**వృక్షాద్ వృక్షం యయౌ బాలా తదగ్రారుణపల్లవైః ।**
**నిర్మార్జమానా గాత్రాణి గళత్స్వేదజలాని వై ॥ 47 ॥**

చెమట బిందువులు స్రవించే శరీరావయవాలను చిటారు కెంజాయ చిగుళ్లతో తుడుచుకొంటూ, ఆ బాల చెట్టునుంచి చెట్టుకు అడుగువేసుకొంటూ వెళ్లిపోయింది.

**ఋషిణా యస్తదా గర్భస్తస్యా దేహే సమాహితః ।**
**నిర్జగామ సరోమాచ్చ స్వేదరూపీ తదంగతః ॥ 48 ॥**

ఋషి ఆమె శరీరంలో నిక్షిప్తంచేసి ఉంచిన గర్భం, ఆమె శరీరంనుంచి, రోమాలనుంచి చెమటరూపంలో బయటకు వచ్చివేసింది.

**తం వృక్షా జగృహుర్గర్భమేకం చక్రే తు మారుతః ।**
**మయా చాప్యాయితో గోభిః స తదా వవృధే శనైః ॥ 49 ॥**

దానిని చెట్లు సేకరించి స్వీకరించాయి. వాయువు ఆ స్వేదబిందువులను ఏకగర్భం చేశాడు. నేను నా కిరణాలచే దానిని పోషించాను. అది నెమ్మది నెమ్మదిగా వృద్ధిపొందింది.

**వృక్షాగ్రగర్భసమ్భూతా మారిషాఖ్యా వరాననా ।**
**తాం ప్రదాస్యన్తి వో వృక్షాః కోప ఏష ప్రశామ్యతామ్ ॥ 50 ॥**

ఆ వృక్షాగ్రపల్లవగర్భసంజాత "మారిష" అనే సుందరవదన. ఆమెను వృక్షాలు మీకు సమర్పించగలవు. కావున ఈ కోపం విరమించండి.

**కణ్డోరపత్యమేవం సా వృక్షేభ్యశ్చ సముద్గతా ।**
**మమాపత్యం తథా వాయోః ప్రమ్లోచా తనయా చ సా ॥ 51 ॥**

ఈ రీతిగా ఆమె కండుమహర్షియొక్క సంతానం. చెట్ల చిగురులనుండి ఉద్భవించింది. నా బిడ్డ వాయునందన ప్రమ్లోచయొక్క కుమార్తె.

**స చాపి భగవాన్ కణ్డుః క్షీణే తపసి సత్తమః ।**
**పురుషోత్తమాఖ్యం మైత్రేయ విష్ణోరాయతనం యయౌ ॥ 52 ॥**

మైత్రేయా! ఆ సత్పురుషుడు, భగవానుడు అయిన కండుడు తపస్సు క్షీణించిపోగా, విష్ణునిలయమైన పురుషోత్తమక్షేత్రానికి ధ్యానం చేయడానికి వెళ్లిపోయాడు.

**తత్రైకాగ్రమతిర్భూత్వా చకారారాధనం హరేః ।**
**బ్రహ్మపారమయం కుర్వన్ జపమేకాగ్రమానసః ॥**
**ఊర్ధ్వబాహుర్మహాయోగీ స్థిత్వాఽసౌ భూపనన్దనాః ॥ 53 ॥**

సోముడిలా చెబుతూ "రాజకుమారులారా! అక్కడ ఆ మహాయోగి చేతులుపైకెత్తి నిలిచి, ఏకాగ్రమనస్కుడై సమస్తం బ్రహ్మమయంగా భావిస్తూ విష్ణువునందు అర్పించిన చిత్తంతో హరిని ఆరాధించాడు." అని వచించాడు.

**బ్రహ్మపారం మునేః శ్రోతుమిచ్ఛామః పరమం స్తవమ్ ।**
**జపతా కణ్డునా దేవో యేనారాధ్యత కేశవః ॥ 54 ॥**

అని సోముడు పలుకగా ప్రచేతసులు "కందుమునిచే జపింపబడ్డ, కేశవుని ధ్యానించిన, ఆ బ్రహ్మపార పరమస్తవాన్ని వినగోరుతున్నాము" అని చెప్పాడు.

**పారమ్పరం విష్ణురపారపారః పరః పరేభ్యః పరమార్థరూపీ ।**
**సబ్రహ్మపారః పరపారభూతః పరః పరాణామపి పారపారః ॥ 55 ॥**

సోముడాస్తోత్రాన్ని ఇట్లు చెబుతున్నాడు "విష్ణువు సంసారమార్గానికి పరమపారము అనగా అంతిమావధి. ఆ అవధి పొందరానిది. ఆకాశం మున్నగు పరములకన్న పరుడు. పరమార్థరూపుడు. అనగా మోక్షస్వరూపుడు. బ్రహ్మనిష్ఠులకే పొందదగినవాడు. అనాత్మప్రపంచం కన్న పరంగా ఉండేవాడు. ఇంద్రియాలకు అగోచరుడైన పరమాత్మ ఆయన. భగవద్భక్తులకు అభీష్టపాలకుడు.

వి ॥ బ్రహ్మశబ్దం పారశబ్దం ఎక్కువగా వచ్చేస్తోత్రం లేదా వేదాంతస్తోత్రం.

**సకారణం కారణతస్తతోఽపి**
**తస్యాపి హేతుః పరహేతుహేతుః ।**
**కార్యేషు చైవం సహకర్మకర్తృ**
**రూపైరశేషైరవతీవ సర్వమ్ ॥ 56 ॥**

ఆయన కారణాలకే కారణమయినవాడు. కారణములైన పంచభూతాలకు, తత్కారణాలైన పంచతన్మాత్రలకు కారణమైనవాడు. దానికి హేతువయిన తామసాహంకారానికి, దానికి హేతువయిన మహత్తత్త్వానికి, దానికి హేతువయిన ప్రధానానికి కూడా పరమహేతువు. ఈ రీతిగా సమస్తకర్మకర్తృసహితమై కార్యరూపంలో ఉన్న సర్వజగత్తును రక్షిస్తున్నాడు.

**బ్రహ్మ ప్రభుర్బ్రహ్మ స సర్వభూతో బ్రహ్మ ప్రజానాం పతిరచ్యుతోఽసౌ ।**
**బ్రహ్మాక్షరం నిత్యమజం స విష్ణురపక్షయాద్యైరఖిలైరసంగి ॥ 57 ॥**

బ్రహ్మమే ప్రభువు. బ్రహ్మమే సర్వస్వరూపం. బ్రహ్మమే ప్రజలకు పాలకుడు. ఆయన చ్యుతిలేనివాడు. కాన అచ్యుతుడు. అది నాశనం లేనిది. నిత్యమైనది. పుట్టుకలేనిది. క్షీణించిపోవడం మున్నగు మార్పులేవీ దానికి లేవు. అదే విష్ణువు.

**బ్రహ్మాక్షరమజం నిత్యం యథాఽసౌ పురుషోత్తమః ।**
**తథా రాగాదయో దోషాః ప్రయాన్తు ప్రశమం మమ ॥ 58 ॥**

బ్రహ్మ క్షరంలేనిది. జన్మలేనిది. శాశ్వతమైనది. ఆ బ్రహ్మమే పురుషోత్తముడు. కాబట్టి రాగం మున్నగు దోషాలు నాకు శమించుగాక!".

**ఏతద్ బ్రహ్మపరాఖ్యం వై సంస్తవం పరమం జపన్ ।**
**అవాప పరమాం సిద్ధిం సమారాధ్య స కేశవమ్ ॥ 59 ॥**

ఇది బ్రహ్మపారమనే పరమస్తోత్రం. ఈ స్తవాన్ని జపిస్తూ, కేశవుని ఆరాధించి కండుడు పరమసిద్ధిని పొందాడు.

**ఇయం చ మారిషా పూర్వమాసీద్ యా తాం బ్రవీమి వః ।**
**కార్యగౌరవమేతస్యాః కథనే ఫలదాయి వః ॥ 60 ॥**

ఈ మారిష పూర్వజన్మలో ఎవరో దానిని మీకు తెలియజేస్తాను. దానివల్ల చేయబోయే కార్యంపై గౌరవమూ ఏర్పడుతుంది. ఇది మీకు మంచి ఫలితాన్ని ఇస్తుంది.

**మారిష పూర్వజన్మ వృత్తాంతం**

**అపుత్రా ప్రాగియం విష్ణుం మృతే భర్తరి సత్తమాః! ।**
**భూపపత్నీ మహాభాగా తోషయామాస భక్తితః ॥ 61 ॥**

"ఓ సత్పురుషులారా! పూర్వజన్మలో ఈమె ఒక మహారాజు ధర్మపత్ని. అయితే సంతానం ప్రసాదించకుండగానే భర్త కాలంచేశాడు. అపుడు ఈ మహాభాగురాలు మిక్కిలి భక్తితో విష్ణువును సంతుష్టి పరచింది.

**ఆరాధితస్తయా విష్ణుః ప్రాహ ప్రత్యక్షతాం గతః ।**
**వరం వృణీష్వేతి శుభే సా చ ప్రాహాత్మవాంఛితమ్ ॥ 62 ॥**

ఆమెచే ఆరాధించబడ్డ విష్ణువు అక్షిగోచరమయ్యాడు. ఆ ప్రభువు "కల్యాణీ! వరం కోరుకో" అన్నాడు. అపుడు ఆమె తన కోరికను ఇలా తెలియజేసింది.

**భగవన్ బాలవైధవ్యాద్ వృథా జన్మాహమీదృశీ ।**
**మన్దభాగ్యా సముత్పన్నా విఫలా చ జగత్పతే! ॥ 63 ॥**

భగవంతుడా! బాలవైధవ్యంవల్ల నా జన్మ ఇలా వ్యర్థమైపోయింది. జగన్నాథా! మందభాగ్యురాలనై, ఏ ఫలితాన్ని అందీయని సంతానవిహీనురాలనై జన్మించాను.

**భవన్తు పతయః శ్లాఘ్యా మమ జన్మని జన్మని ।**
**త్వత్ప్రసాదాత్ తథా పుత్రః ప్రజాపతిసమోऽస్తు మే ॥ 64 ॥**

నీ అనుగ్రహంవల్ల ప్రతిజన్మలోను నాకు ప్రశస్తి వహించిన వారు భర్తలు కావాలి. అదేవిధంగా ప్రజాపతితో సమానుడైన కుమారుడు కలగాలి.

**రూపసమ్పత్సమాయుక్తా సర్వస్య ప్రియదర్శనా ।**
**అయోనిజా చ జాయేయం త్వత్ప్రసాదాదధోక్షజ ॥**

**కులం శీలం వయః సత్యం దాక్షిణ్యం క్షిప్రకారితా ।**
**అవిసంవాదితా సత్త్వం వృద్ధసేవా కృతజ్ఞతా ॥ 65 ॥**

ఓ అధోక్షజా! కులం, శీలం, వయస్సు, సత్యం, దాక్షిణ్యం, శీఘ్రకారిత్వం (చురుకుతనం), నిర్వివాదం, సత్త్వం, వృద్ధసేవ, కృతజ్ఞత, రూపం, సంపత్తి ఇవి కలిగి, అందరికి ప్రియసందర్శనాన్ని కలగజేస్తూ, నీ అనుగ్రహంవల్ల నేను అయోనిజనై పుట్టాలి." (అధికపాఠశ్లోకం).

**తయైవ ముక్తో దేవేశో హృషీకేశ ఉవాచ తామ్ ।**
**ప్రణామనమ్రాముత్థాప్య వరదః పరమేశ్వరః ॥ 66 ॥**

ఆమె ఈ విధంగా ప్రార్థించి పాదాభివందనం చేయగా, దేవదేవుడు, హృషీకేశుడు, వరప్రదాత అయిన పరమేశ్వరుడు వంగియున్న ఆమెను లేవనెత్తి ఇలా అన్నాడు.

**భవిష్యన్తి మహావీర్యా ఏకస్మిన్నేవ జన్మని ।**
**ప్రఖ్యాతోదారకర్మాణో భవత్యాః పతయో దశ ॥ 67 ॥**

"నీకు ఒక జన్మలోనే మహాపరాక్రమవంతులు, గొప్పవైన, మంచివైన కార్యనిర్వాహకులు పదిమంది భర్తలు కాగలరు.

**పుత్రం చ సుమహాత్మానమతివీర్యపరాక్రమమ్ ।**
**ప్రజాపతిగుణైర్యుక్తం త్వమవాప్స్యసి శోభనే ॥ 68 ॥**

కల్యాణీ! మిక్కిలి పరాక్రమవంతుడు, అతిబలశాలి, మంచిమహాత్ముడు, ప్రజాపతియొక్క సృజనగుణాలు కల్గినవాడు అయిన కుమారుని కూడ నీవు పొందగలవు.

**వంశానాం తస్య కర్తృత్వం జగత్యస్మిన్ భవిష్యతి ।**
**త్రైలోక్యమఖిలం సూతిస్తస్య చాపూరయిష్యతి ॥ 69 ॥**

ఈ జగత్తులో అతడు అనేక వంశాలకు మూలకర్త అవుతాడు. అతని సమస్త సంతతి ముల్లోకాలలోనూ నిండిపోతుంది.

**త్వం చాప్యయోనిజా సాధ్వీ రూపౌదార్యగుణాన్వితా ।**
**మనః ప్రీతికరీ నృణాం మత్ప్రసాదాద్ భవిష్యసి ॥ 70 ॥**

నా అనుగ్రహంవల్ల నీవు కూడా అయోనిజవు, పతివ్రతవు, రూపము, సంపద మున్నగు గుణాలతో కూడుకొన్నదానవు, మానవుల మనస్సులకు సంతోషం కలగజేసేదానవు కాగలవు.

**ఇత్యుక్త్వాఽన్తర్దధే దేవస్తాం విశాలవిలోచనామ్ ।**
**సా చేయం మారిషా జాతా యుష్మత్పత్నీ నృపాత్మజాః! ॥ 71 ॥**

తననే కన్నులు పెద్దవి చేసికొని చూస్తున్న ఆ విశాలాక్షితో దేవుడు ఈ రీతిగా వరమిచ్చి అంతర్ధాన మయ్యాడు. రాజనందనులారా! ఆమెయే మారిష అయి జన్మించింది. మీకు ఈమెయే ధర్మపత్ని సుమా!”

**తతః సోమస్య వచనాజ్జగృహుస్తే ప్రచేతసః ।**
**సంహృత్య కోపం వృక్షేభ్యః పత్నీం ధర్మేణ మారిషామ్ ॥ 72 ॥**

అలా చెప్పిన సోముని మాటప్రకారం ప్రచేతసులు వృక్షాలపై కోపాన్ని ఉపసంహరించి మారిషను ధర్మబద్ధంగా ఆత్మపత్నిని కావించుకొన్నారు.

**దశభ్యస్తు ప్రచేతేభ్యో మారిషాయాం ప్రజాపతిః ।**
**జజ్ఞే దక్షో మహాయోగ్యో యః పూర్వం బ్రహ్మణోఽభవత్ ॥ 73 ॥**

ఆ మారిషయందు పదిమంది ప్రచేతసులకు మహాయోగ్యుడైన దక్షప్రజాపతి జన్మించాడు. మునుపు ఆయనయే బ్రహ్మకు కలిగినవాడుకూడ.

వి ॥ బ్రహ్మపుత్రుడైన దక్షుడే తిరిగి మారిషాపుత్రుడుగా విష్ణువరంవల్ల అవతరించాడు.

**స తు దక్షో మహాభాగః సృష్ట్యర్థం సుమహామతే! ।**
**పుత్రానుత్పాదయామాస ప్రజాసృష్ట్యర్థమాత్మనః ॥ 74 ॥**

మహాబుద్ధిమంతుడా! ఆ మహాభాగుడైన దక్షప్రజాపతి (బ్రహ్మ ఆదేశానుసారంగా) సృష్టికి ఉపక్రమించి ప్రజాపతులవల్ల జరగవలసిన సృష్టికొరకై సంతానాన్ని ఉత్పత్తి చేశాడు.

**అచరాంశ్చ చరాంశ్చైవ ద్విపదోఽథ చతుష్పదాన్ । (అవరాంశ్చ వరాంశ్చైవ)**
**ఆదేశం బ్రహ్మణః కుర్వన్ సృష్ట్యర్థం సముపస్థితః ॥ 75 ॥**

సృష్టికర్త అయిన బ్రహ్మ ఆదేశానుసారంగా అచరాలను, చరాలను, రెండుపాదాలు కలవారిని, నాలుగు పాదాలు కలవారిని అనేక విధాలుగా సృష్టిస్తూ సృజనవిస్తృతిని కలుగజేశాడు. (అధములను, ఉత్తములను)

**స సృష్ట్వా మనసా దక్షః పంచాశదసృజత్ స్త్రియః ।**
**దదౌ స దశ ధర్మాయ కశ్యపాయ త్రయోదశ ॥ 76 ॥**

ఈ విధంగా దక్షుడు మొట్టమొదట మనస్సుతోనే ఏబదిమంది స్త్రీలను సృష్టించాడు. వారిలో పదిమందిని ధర్మునకు, పదముగ్గురుని కశ్యపునకు (ఇచ్చాడు).

**కాలస్య నయనే యుక్తాః సప్తవింశతిమిన్దవే ।**
**తాసు దేవాస్తథా దైత్యా నాగా గావస్తథా ఖగాః ॥ 77 ॥**

కాలాన్ని నడిపించే ఇరవై ఏడుగురిని చంద్రునకు ఇచ్చాడు. వారియందు దేవతలు, దైత్యులు, గోవులు, పక్షులు (జన్మించారు).

**గన్ధర్వాప్సరసశ్చైవ దానవాద్యాశ్చ జజ్ఞిరే ।**
**తతః ప్రభృతి మైత్రేయ ప్రజా మైథునసమ్భవాః ॥ 78 ॥**

గంధర్వులు, అప్సరసలు, దానవులు మున్నగువారు జన్మించారు. మైత్రేయా! దక్షుని సృష్టిమొదలుకొని ప్రజలు స్త్రీపురుషసంయోగంవల్ల జన్మించ నారంభించారు.

**సంకల్పాద్ దర్శనాద్ స్పర్శాద్ పూర్వేషామభవత్ ప్రజాః ।**
**తపోవిశేషైః సిద్ధానాం తదాత్యన్తతపస్వినామ్ ॥ 79 ॥**

ఆ ముందటివారికి సంకల్పంవల్ల, దర్శనంవల్ల, స్పర్శవల్ల సంతానం కలిగేది. ఆ కాలంలో వారు మిక్కిలి తపస్సుచేసి తపోవిశేషము వల్ల సిద్ధులైనవారు అట్లు సంతానం పొందేవారు.

**మైత్రేయ ఉవాచ :–** మైత్రేయుడు అడిగాడు.

**అంగుష్ఠాద్ దక్షిణాద్ దక్షః పూర్వం జాతః శ్రుతం మయా ।**
**కథం ప్రచేతసో భూయః స సమ్భూతో మహామునే ॥ 80 ॥**

**ఏష మే సంశయో బ్రహ్మన్ సుమహాన్ హృది వర్తతే ।**
**యద్ దౌహిత్రః స సోమస్య పునః శ్వశురతాం గతః ॥ 81 ॥**

ఈ విధంగా పరాశరుడు చెప్పగా విని మైత్రేయుడు "మునీశ్వరా! దక్షుడు బ్రహ్మదేవుని కుడిచేతి బొటనవ్రేలినుండి జన్మించాడని మీవల్ల వినియున్నాను. అతడు మళ్లీ ప్రచేతసులకు కుమారుడుగా ఎలా ఉద్భవించాడు? ఓ బ్రాహ్మణోత్తమా! సోమునికి మనుమడైపుట్టి, అతనికే మామ ఎలా అయ్యాడు? ఈ పెద్దదైన సందేహం నా మనస్సులో మెదులుతున్నది." అని ప్రశ్నించాడు.

**శ్రీ పరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**ఉత్పత్తిశ్చ నిరోధశ్చ నిత్యౌ భూతేషు సత్తమ! ।**
**ఋషయోఽత్ర న ముహ్యన్తి యే చాత్ర దివ్యచక్షుషః ॥ 82 ॥**

**యుగే యుగే భవన్త్యేతే దక్షాద్యా మునిసత్తమాః ।**
**పునశ్చైవం నిరుధ్యన్తే విద్వాంస్తత్ర న ముహ్యతి ॥ 83 ॥**

పరాశరుడు సమాధానం చెబుతూ "ఓ మునిసత్తమా! భూతములయందు "పుట్టుట, గిట్టుట" అనేదినిత్యం. ఈ విషయంలో ఋషులుకాని, దివ్యదృష్టికల ఇతరులుకాని మోహాన్ని పొందరు. దక్షుడు మున్నగు శ్రేష్ఠులైన మునీశ్వరులు ప్రతియుగంలోను పుడుతూ ఉంటారు. తిరిగి లీనమైపోతూ ఉంటారు. విద్వాంసుడు అన్నవాడు అజ్ఞానవశుడు కాదు.

**కానిష్ఠ్యం జ్యైష్ఠ్యమప్యేషాం పూర్వం నాభూద్ ద్విజోత్తమ! ।**
**తప ఏవ గరీయోఽభూత్ ప్రభావశ్చైవ కారణమ్ ॥ 84 ॥**

ద్విజోత్తమా! వీరిలో పూర్వం వయస్సునుబట్టి పెద్దరికం, చిన్నరికంలేవు. వీరికి తపస్సే గొప్పది. వారి దివ్యప్రభావమే పెద్దరికానికి కారణమై ఉండేది" అని చెప్పాడు.

**మైత్రేయ ఉవాచ :–** మైత్రేయుడు అడిగాడు.

**దేవానాం దానవానాం చ గన్ధర్వోరగరక్షసామ్ ।**
**ఉత్పత్తిం విస్తరేణేహ మమ బ్రహ్మన్ ప్రకీర్తయ ॥ 85 ॥**

అంత మైత్రేయుడు "బ్రాహ్మణోత్తమా! దేవతల గురించి, దానవుల గురించి గంధర్వుల గురించి, భుజగాల గురించి, రాక్షసుల గురించి వారి ఉత్పత్తిని గూర్చి సవిస్తరంగా నాకు వివరించవలసింది" అని ప్రార్థించాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**ప్రజాః సృజేతి వ్యాదిష్టః పూర్వం దక్షః స్వయమ్భువా ।**
**యథా ససర్జ భూతాని తథా శృణు మహామతే ॥ 86 ॥**

అపుడు పరాశరుడు "మహాబుద్ధిమంతుడా! పూర్వం స్వయంభువు ప్రజలను సృజించవలసిందని దక్షుని ఆజ్ఞాపించగా, ఆయన భూతాలను (ప్రాణులను) ఎలా సృష్టించాడో, చెబుతాను. విను.

**మానసాని తు భూతాని పూర్వం దక్షోఽసృజత్ తదా ।**
**దేవాన్ ఋషీన్ సగన్ధర్వానసురాన్ పన్నగాంస్తథా ॥ 87 ॥**
**యదాఽస్య (ద్విజ మానస్యో) నాభ్యవర్ధన్త తాః ప్రజాః । (సృజమానస్య)**
**తతః సంచింత్య స పునః సృష్టిహేతోః ప్రజాపతిః ॥ 88 ॥**

**మైథునేనైవ ధర్మేణ సిసృక్షుర్వివిధాః ప్రజాః ।**
**అసిక్నీమావహత్ కన్యాం వీరణస్య ప్రజాపతేః ॥ 89 ॥**

మొదట దక్షుడు దేవతలను, ఋషులను, గంధర్వులను, అసురులను, పన్నగులను మున్నగు మానసిక ప్రాణులనే సృష్టించాడు. అలా ఎంతకాలం సృష్టించినా వారు వృద్ధి చెందలేదు. అపుడు ఆ ప్రజాపతి మళ్లీ ప్రజాసృష్టి గురించి బాగా ఆలోచించి స్త్రీపురుషసంయోగ ధర్మంతోనే ప్రజలను నానావిధాలుగా సృష్టించదలచి వీరణప్రజాపతి కుమార్తె అగు అసిక్నిని వివాహం చేసుకొన్నాడు.

**సుతాం సుతపసా యుక్తాం మహతీం లోకధారిణీమ్ ।**
**అథ పుత్రసహస్రాణి వైరణ్యాం పంచ వీర్యవాన్ ।**
**అసిక్న్యాం జనయామాస సర్గహేతోః ప్రజాపతిః ॥ 90 ॥**

ఆమె మహాతపస్విని, గొప్పది. లోకధారిణి. ఆ వీర్యవంతుడైన ప్రజాపతి సృష్టినిమిత్తం వీరణపుత్రి అయిన అసిక్నియందు ఐదువేల మంది కుమారులను జన్మింపజేశాడు.

**తాన్ దృష్ట్వా నారదో విప్ర సంవివర్ధయిషూన్ ప్రజాః ।**
**సంగమ్య ప్రియసంవాదో దేవర్షిరిదమబ్రవీత్ ॥ 91 ॥**

విప్రవర్యా! సంతాన వృద్ధిని గావించ నున్న వారిని వీక్షించి, దేవర్షియైన నారదుడు వారిని కలుసుకొని, ఇచ్చకములాడుతూ ఇలా అన్నాడు.

**హే హర్యశ్వా మహావీర్యాః ప్రజా యూయం కరిష్యథ ।**
**ఈదృశో లక్ష్యతే యత్నో భవతాం శ్రూయతామిదమ్ ॥ 92 ॥**

"ఓ హర్యశ్వులారా! మహావీర్యవంతులారా! మీరు ప్రజాసృష్టి చేస్తారు కదూ! మీ ప్రయత్నం చూస్తే అలాగే కనబడుతోంది. అయితే నా మాట వినండి.

**బాలిశా బత యూయం వై నాస్యా జానీథ వై భువః ।**
**అంతరూర్ధ్వమధశ్చైవ కథం స్రక్ష్యథ వై ప్రజాః ॥ 93 ॥**

అయ్యో! మీరు మూర్ఖులులా కనిపిస్తున్నారు. మీకు ఈ భూమియొక్క లోపల, పైన, క్రింద, అటూ, ఇటూ ఏమీ తెలియదే! ఎలా ప్రజలను సృష్టిస్తారయ్యా!

**ఊర్ధ్వం తిర్యగధశ్చైవ యదాఽప్రతిహతా గతిః ।**
**తదా కస్మాద్ భువోనాన్తం సర్వం ద్రక్ష్యథ బాలిశాః ॥ 94 ॥**

భూమిపైకి, ప్రక్కలకు, క్రిందకు అడ్డంలేకుండా పోగలిగిన వారయితే ఓ అనభిజ్ఞులారా! మీరంతా భూమి అంతం ఎందుకు చూడరు?" అని నారదుడు అన్నాడు.

**తే తు తద్వచనం శ్రుత్వా ప్రయాతాః సర్వతో దిశమ్ ।**
**అద్యాపి న నివర్తన్తే సముద్రేభ్య ఇవాపగాః ॥ 95 ॥**

మైత్రేయా! వారు ఆ దేవర్షి వాక్యాలు విని అన్నిదిక్కులకు (భూపర్యటనార్థం) వెళ్లిపోయారు. వారు ఈనాటికీ సముద్రాలలో కలిసిన నదులులాగా తిరిగిరాలేదు. అని పరాశరుడు తెలియజేశాడు.

వి॥ నారదుడు హర్యశ్వులను తప్పుదారి పట్టించినట్లు కనబడుతుంది. కానివారిని కర్మమార్గంనుండి జ్ఞానమార్గం వైపు మళ్లించడమే ఆయన ప్రధానోద్దేశ్యం.

**హర్యశ్వేష్వథ నష్టేషు దక్షః ప్రాచేతసః పునః ।**
**వైరణ్యామథ పుత్రాణాం సహస్రమసృజత్ ప్రభుః ॥ 96 ॥**

ఇలా హర్యశ్వులు అందరూ నష్టంకాగా, ప్రభువైన ప్రాచేతసుడైన ఆ దక్షప్రజాపతి మళ్లీ వైరణివల్ల వేయిమంది కుమారులను కన్నాడు.

**వివర్ధయిషవస్తే తు శబలాశ్వాః ప్రజాః పునః ।**
**పూర్వోక్తం వచనం బ్రహ్మన్ నారదేన ప్రచోదితాః ॥ 97 ॥**

బ్రాహ్మణోత్తమా! శబలాశ్వులనే ఆ వేయిమంది ప్రజావృద్ధి చేయబోగా మునుపటిలాగే మళ్లీ నారదునిచే వారు ప్రేరేపించబడ్డవారయ్యారు.

**అన్యోన్యమూచుస్తే సర్వే సమ్యగాహ మహామునిః ।**
**భ్రాతౄణాం పదవీ చైవ గన్తవ్యా నాత్ర సంశయః ॥ 98 ॥**

వారందరూ ఒకరితోఒకరు "మహాముని నారదుడు చక్కగా చెప్పాడు. అన్నల దారిలోనే మనమూ నడవాలి. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు.

**జ్ఞాత్వా ప్రయాణం పృథ్వ్యాశ్చ ప్రజాః స్రక్ష్యామహే తతః ।**
**తేఽపి తేనైవ మార్గేణ ప్రయాతాః సర్వతో దిశమ్ ।**
**అద్యాపి న నివర్తన్తే సముద్రేభ్య ఇవాపగాః ॥ 99 ॥**

భూమియొక్క ప్రయాణం తెలుసుకొని, అటుపిమ్మటే ప్రజాసృష్టి కావిద్దాము" అనుకొని ఆ మార్గంలోనే అన్ని వైపులకూ వెళ్లిపోయారు. వారుకూడా సముద్రాలతో కలిసిపోయిన నదులలాగా నేటికీ మళ్లీ తిరిగి రాలేదు.

**తతః ప్రభృతి వై భ్రాతా భ్రాతురన్వేషణే ద్విజ ।**
**ప్రయాతో నశ్యతి తథా తన్న కార్యం విజానతా ॥ 100 ॥**

ద్విజోత్తమా! నాటినుంచి సోదరుని వెదకబోయిన సోదరుడు తానూ నశిస్తాడనే మాటరూఢి అయింది. కాబట్టి బాగా తెలిసినవాడు ఆ పని చేయకూడదు. అనగా సోదరులను వెతకుటకు వెళ్ళరాదు.

**తాంశ్చాపి నష్టాన్ విజ్ఞాయ పుత్రాన్ దక్షః ప్రజాపతిః ।**
**క్రోధం చక్రే మహాభాగో నారదం స శశాప చ ॥ 101 ॥**

ఆ పుత్రులు కూడ నష్టపోయినట్లుగా తెలుసుకొన్నవాడై దక్షప్రజాపతి క్రోధం వహించాడు. ఆ మహాభాగుడు దానికి కారణభూతుడైన నారదుని శపించాడు.

### దక్షపుత్రికా సంతతి

**సర్గకామస్తతో విద్వాన్ స మైత్రేయ! ప్రజాపతిః ।**
**షష్టిం దక్షోఽసృజత్ కన్యా వైరణ్యామితి నః శ్రుతమ్ ॥ 102 ॥**

మైత్రేయా! అటు తరువాత విద్వాంసుడైన ప్రజాపతియగు ఆ దక్షుడు సృష్టిచేయ గోరినవాడై వీరణప్రజాపతి కుమార్తె అయిన అసిక్నియందు అరవైమంది కుమార్తెలను కన్నాడని మేము (మనం) విన్నదేకదా!

**దదే స దశ ధర్మాయ కశ్యపాయ త్రయోదశ ।**
**సప్తవింశతి సోమాయ చతస్రోఽరిష్టనేమినే ॥ 103 ॥**

**ద్వే చైవ బహుపుత్రాయ ద్వే చైవాంగిరసే తథా ।**
**ద్వే కృశాశ్వాయ విదుషే తాసాం నామాని మే శృణు ॥ 104 ॥**

వారిలో పదిమందిని ధర్మునకు, పదముగ్గురిని కశ్యపునకు, ఇరవైఏడుగురిని సోమునకు, నలుగురిని అరిష్టనేమికి, ఇద్దరిని బహుపుత్రునకు, ఇద్దరిని అంగిరసునికి, ఇద్దరిని విద్వాంసుడైన కృశాశ్వునకు ఇచ్చాడు. వారి పేర్లు నా ద్వారా ఆలకించు.

**అరున్ధతీ వసుర్యామీ లమ్బా భానుర్మరుద్వతీ । (మరుత్వతీ)**
**సంకల్పా చ ముహూర్తా చ సాధ్యా విశ్వా చ తా దశ ॥ 105 ॥**

అరుంధతి, వసువు, యామి, లంబ, భానువు, మరుద్వతి, సంకల్ప, ముహూర్త, సాధ్య, విశ్వ – అనే వారు పదిమంది.

**ధర్మపత్న్యో దశ త్వేతా స్తదపత్యాని మే శృణు ।**
**విశ్వేదేవాస్తు విశ్వాయాః సాధ్యా సాధ్యాన్ వ్యజాయత ॥ 106 ॥**

ఈ పదిమంది ధర్ముని యొక్క ధర్మపత్నులు. వారి సంతానాన్ని గూర్చి విను. అందు విశ్వకు విశ్వేదేవతలు, సాధ్యకు సాధ్యులు జన్మించారు.

**మరుత్వత్యా మరుత్వన్తో వసోస్తు వసవః స్మృతాః । 107 ॥**

మరుత్వతికి మరుత్వంతుడు, వసువుకు వసువులు కలిగారు.

**భానోస్తు భానవః పుత్రాః ముహూర్తాయాం ముహూర్తజాః ।**
**లమ్బాయాశ్చైవ ఘోషోఽథ నాగవీథీ తు యామిజా ॥ 108 ॥**

భానువుకు కుమారులుగా భానువులు, ముహూర్తకు ముహూర్తములు, లంబకు ఘోషుడు, యామికి నాగవీథి జన్మించారు.

**పృథివీ విషయం సర్వమరున్ధత్యాం వ్యజాయత ।**
**సంకల్పాయాన్తు సర్వాత్మా జజ్ఞే సంకల్ప ఏవ తు ॥ 109 ॥**

అరుంధతియందు పృథివియందున్న సమస్తవిషయములను, సంకల్పయందు సర్వాత్ముడైన సంకల్పనామక పుత్రుని ధర్ముడు సృజించాడు.

**యే త్వనేకవసుప్రాణా దేవా జ్యోతిఃపురోగమాః ।**
**వసవోఽష్టౌ సమాఖ్యాతాస్తేషాం వక్ష్యామి విస్తరమ్ ॥ 110 ॥**

ఇక అనేక విధాలైన వసువే (ధనమే) ప్రాణముగాగల దేవతలు (లేదా) తేజస్సే ప్రాణముగాగల దేవతలు జ్యోతి (అగ్ని) మున్నగువారు ఉన్నారు. వారు అష్టవసువులుగా ప్రసిద్ధికెక్కారు. వారి వంశవిస్తృతి గూర్చి చెబుతాను.

**ఆపో ధ్రువశ్చ సోమశ్చ ధర్మశ్చైవానిలోఽనలః ।**
**ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవో నామభిః స్మృతాః ॥ 111 ॥**

వారు ఆపుడు, ధ్రువుడు, సోముడు, ధర్ముడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు అనే పేర్లతో వ్యవహరించబడ్డారు. వీరే అష్టవసువులు.

**ఆపస్య పుత్రో వై తణ్డ్యః శ్రమః శ్రాన్తో ధ్వనిస్తథా ।**
**ధ్రువస్య పుత్రో భగవాన్ కాలో లోకప్రకాలనః ॥ 112 ॥**

ఆపుని కుమారులు వైతండ్యుడు, శ్రముడు, శ్రాంతుడు, ధ్వని అనేవారు. ధ్రువుని కుమారుడు లోకసంహారకారుడైన భగవత్స్వరూపుడైన కాలుడు.

**సోమస్య భగవాన్ వర్చా వర్చస్వీ యేన జాయతే ।**
**ధర్మస్య పుత్రౌ ద్రవిణో హుతహవ్యవహస్తథా ॥ 113 ॥**

సోముని కుమారుడు భగవంతుడైన వర్చుడు. ఇతని వల్లనే ఎవడైనా వర్చస్వి అవుతాడు. ధర్మునియొక్క కుమారులు ద్రవిణుడు, హుతహవ్యవహుడు అనేవారు.

**మనోహరాయాః శిశిరః ప్రాణోఽథ వరుణస్తథా ।**
**అనిలస్య శివా భార్యా తస్యాః పుత్రో మనోజవః ॥ 114 ॥**

ధర్ముడు తన భార్యయైన మనోహరవల్ల పై పుత్రులతోబాటు శిశిరుడు, ప్రాణుడు, వరుణుడు అనే కుమారులను పొందాడు. అనిలుని యొక్క భార్య శివ. ఆమెకు మనోజవుడనే కుమారుడు కలిగాడు.

**అవిజ్ఞాతగతిశ్చైవ ద్వే పుత్రావనిలస్య చ ।**
**అగ్నిపుత్రః కుమారస్తు శరస్తమ్బే వ్యజాయత ॥ 115 ॥**

అనిలునకు మనోజవునితోబాటుగా అవిజ్ఞాతగతి అనే కుమారుడు కూడ కలిగాడు. ఈ విధంగా అనిలునకు ఇద్దరు పుత్రులు. అగ్నియొక్క కుమారుడే కుమారస్వామి. శర స్తంబంనుండి ఆవిర్భవించాడు (రెల్లుదుబ్బు).

**తస్య శాఖావిశాఖాశ్చ నైగమేయశ్చ పృష్ఠజాః ।**
**అపత్యం కృత్తికానాం తు కార్తికేయ ఇతి స్మృతః ॥ 116 ॥**

అతని తమ్ములు శాఖుడు, విశాఖుడు, నైగమేయుడు అనేవారు. కృత్తికల కుమారుడు కాన కార్తికేయుడని వ్యవహరించబడ్డాడు.

**ప్రత్యూషస్య విదుః పుత్రమృషిం నామ్నాఽథ దేవలమ్ ।**
**ద్వౌ పుత్రౌ దేవలస్యాపి క్షమావన్తౌ మనీషిణౌ ॥ 117 ॥**

ప్రత్యూషునియొక్క కుమారుని దేవలుడు అనే ఋషిపేరుగా గ్రహించారు. ఆ దేవలునకు ఇద్దరు కుమారులు. వారు ఓరిమికలవారు. మహాబుద్ధిమంతులు.

**బృహస్పతేస్తు భగినీ వరస్త్రీ బ్రహ్మచారిణీ ।**
**యోగసిద్ధా జగత్కృత్స్నమసక్తా విచరత్యుత ॥ 118 ॥**

బృహస్పతియొక్క సోదరి ఉత్తమతన్వి బ్రహ్మచారిణి యోగసిద్ధురాలు. ఆమె దేనియందును రక్తురాలుకాకుండా సమస్త జగత్తులోనూ సంచరిస్తూ ఉంటుంది. బ్రహ్మయందు చరించే మనస్సు కలది కాన బ్రహ్మచారిణిగా ప్రసిద్ధురాలయింది.

**ప్రభాస(వ)స్య తు సా భార్యా వసూనామష్టమస్య చ ।**
**విశ్వకర్మా మహాభాగస్తస్యాం జజ్ఞే ప్రజాపతిః ॥ 119 ॥**

ఆమె వసువులలో ఎనిమిదోవాడైన ప్రభాసునకు (ప్రభావునకు) భార్య అయింది. ఆమెయందు మహాభాగుడైన విశ్వకర్మ అనే ప్రజాపతి జన్మించాడు.

**కర్తా శిల్పసహస్రాణాం త్రిదశానాం చ వర్ధకిః ।**
**భూషణానాం చ సర్వేషాం కర్తా శిల్పవతాం వరః ॥ 120 ॥**

**యః సర్వాసాం విమానాని దేవతానాం చకార హ ।**
**మనుష్యాశ్చోపజీవన్తి యస్య శిల్పం మహాత్మనః ॥ 121 ॥**

ఆయన అనంతశిల్పాలకు సృష్టికర్త. దేవతలకు వడ్రంగి. సమస్త భూషణాలకు రూపశిల్పి. శిల్పులలో శ్రేష్ఠుడు. ఆయన దేవతలకందరికి విమానాలు నిర్మించి పెట్టాడు. ఆ మహాత్ముని యొక్క శిల్పవిద్యయే మనుష్యులకు కూడ జీవనాధారమయింది.

**తస్య పుత్రాస్తు చత్వారస్తేషాం నామాని మే శృణు ।**
**అజైకపాదహిర్బుధ్న్య స్త్వష్టా రుద్రశ్చ బుద్ధిమాన్ ॥ (వీర్యవాన్)**
**త్వష్టుశ్చాప్యాత్మజః పుత్రో విశ్వరూపో మహాయశాః (మహాతపాః) ॥ 122 ॥**

ఆయనకు నలుగురు కుమారులు. వారిపేర్లు నా ద్వారా ఆలకించు. వారే అజైకపాత్తు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట, వీర్యశాలి అయిన రుద్రుడు అనేవారు. త్వష్టయొక్క కుమారుడు మహాతపస్వియైన విశ్వరూపుడు.

**హరశ్చ బహురూపశ్చ త్ర్యమ్బకశ్చాపరాజితః ।**
**వృషాకపిశ్చ శమ్భుశ్చ కపర్దీ రైవతస్తథా ॥ 123 ॥**

**మృగవ్యాధశ్చ శర్వశ్చ కపాలీ చ మహామునే ।**
**ఏకాదశైతే ప్రథితా రుద్రాస్త్రిభువనేశ్వరాః ॥ 124 ॥**

**ఏకాదశరుద్రులు**

మునీశ్వరా! హరుడు, బహురూపుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, వృషాకపి, శంభుడు, కపర్ది, రైవతుడు, మృగవ్యాధుడు, శర్వుడు, కపాలి అనేవారు ఏకాదశరుద్రులుగా ప్రసిద్ధి వహించారు. వారు త్రిభువనాలకు ఈశ్వరులుగా ఖ్యాతికెక్కారు.

**శతం త్వేవం సమాఖ్యాతం రుద్రాణామమితౌజసామ్ ॥ 125 ॥**

గొప్ప ఓజస్సు కలిగిన రుద్రులు వందలకొలది ఉన్నారని చెప్పబడింది.

**(కశ్యపస్య తు భార్యాయాస్తాసాం నామాని మే శృణు)**
**అదితిర్దితిర్దనుః కాలా అరిష్టా సురసా తథా ॥ (చైవారిష్టా సురసాస్వసా)**

**సురభిర్వినతా చైవ తామ్రా క్రోధవశా ఇరా ।**
**కద్రుర్మునిశ్చ ధర్మజ్ఞ తదపత్యాని మే శృణు ॥ 126 ॥**

ఇక కశ్యపప్రజాపతి భార్యలు ఎవరో వారి పేర్లు చెబుతాను విను. వారే అదితి, దితి, దనువు, అరిష్ట, సురస, స్వస, సురభి, వినత, తామ్ర, క్రోధవశ, ఇర, కద్రువ, ముని అనేవారు. ధర్మాత్మా! ఇక వారి సంతానాన్ని గూర్చి చెబుతాను విను.

**పూర్వమన్వన్తరే శ్రేష్ఠా ద్వాదశాసన్ సురోత్తమాః ।**
**తుషితా నామ తేఽన్యోన్యమూచుర్వైవస్వతేఽన్తరే ॥ 127 ॥**

పూర్వం చాక్షుషమన్వంతరంలో శ్రేష్ఠులైన దేవతోత్తములు తుషితులనే వారు పండ్రెండుగురు ఉండేవారు. వైవస్వత మన్వంతరం రాబోతూ ఉంటూ వారు పరస్పరం ఇలా అనుకొన్నారు.

**ఉపస్థితేఽతియశస శ్చాక్షుషస్యాన్తరే మనోః ।**
**సమవాయీకృతాః సర్వే సమాగమ్య పరస్పరమ్ ॥ 128 ॥**

వైవస్వతమన్వంతరం రాబోతూ ఉంటే వారు అందరూ చాక్షుషమన్వంతరంయొక్క కాలంలో సమావేశమై కీర్తి శాలులైనవారు ఒకరినొకరు సమీపించి (ఇలా భావించారు).

**ఆగచ్ఛత ద్రుతం దేవా అదితిం సంప్రవిశ్య వై ।**
**మన్వన్తరే ప్రసూయామస్తన్నః శ్రేయో భవిష్యతి ॥ 129 ॥**

"దేవతలారా! వేగంగారండి. మనమందరము అదితి గర్భంలో ప్రవేశించి వైవస్వత మన్వంతరంలో జన్మిద్దాము. దాని వల్ల మనకు మిక్కిలి శ్రేయస్సు లభించగలదు."

**ఏవముక్త్వా తు తే సర్వే చాక్షుషస్యాన్తరే మనోః ।**
**మారీచాత్ కశ్యపాజ్జాతా అదిత్యా దక్షకన్యయా ॥ 130 ॥**

అనివారు చాక్షుషమన్వంతర సమయంలో పరస్పరం కూడబలుకుకొని మరీచి పుత్రుడైన కశ్యపునకు, దక్షపుత్రి అయిన అదితియందు జన్మించారు.

**తత్ర విష్ణుశ్చ శక్రశ్చ జజ్ఞాతే పునరేవ చ ।**
**అర్యమా చైవ ధాతా చ త్వష్టా పూషా తథైవ చ ॥ 131 ॥**

**వివస్వాన్ సవితా చైవ మిత్రో వరుణ ఏవ చ ।**
**అంశుర్భగశ్చాతితేజా ఆదిత్యా ద్వాదశ స్మృతాః ॥ 132 ॥**

అందు మరల విష్ణువు, శక్రుడు కూడ జన్మించారు. అర్యముడు, ధాత, త్వష్ట, పూషుడు, వివస్వంతుడు, సవిత, మిత్రుడు, వరుణుడు, అంశుడు, భగుడు – ఈ మిక్కిలి తేజస్సు కల్గిన పండ్రెండుగురిని ద్వాదశా దిత్యులంటారు.

**చాక్షుషస్యాన్తరే పూర్వమాసన్ యే తుషితాః సురాః ।**
**వైవస్వతేఽన్తరే తే వై ఆదిత్యా ద్వాదశ స్మృతాః ॥ 133 ॥**

ఈ రీతిగా మునుపు చాక్షుషమన్వంతరంలో తుషితులు అనబడే దేవతలే, వైవస్వత మన్వంతరంలో ద్వాదశాదిత్యులయ్యారు.

**యాః సప్తవింశతిః ప్రోక్తాః సోమపత్న్యోఽథ సువ్రతాః ।**
**సర్వా నక్షత్రయోగిన్యస్తన్నామ్న్యశ్చైవ తాః స్మృతాః ॥ 134 ॥**

సోముని భార్యలు ఇరవై ఏడుగురుగా చెప్పబడిన వారందరు నియమాలతో వ్రతాలు ఆచరించినవారు. వారు అందరూ నక్షత్రయోగినులు. వారు ఆ నక్షత్ర నామాలతోనే ప్రసిద్ధికెక్కారు.

**తాసామపత్యాన్యభవన్ దీప్తాన్యమిత తేజసామ్ ।**
**అరిష్టనేమిపత్నీనామపత్యానీహ షోడశ ॥ 135 ॥**

ఆ అధికమైన కాంతి కల్గినవారికి ప్రకాశాన్నిచ్చే బహుసంతానం కలిగింది. ఇక అరిష్టనేమియొక్క నలుగురు భార్యలకు పదహారుమంది సంతానం కలిగారు.

**బహుపుత్రస్య విదుషశ్చతస్రో విద్యుతః స్మృతాః ।**
**ప్రత్యంగిరసజాః శ్రేష్ఠా ఋచో బ్రహ్మర్షిసత్కృతాః ॥ 136 ॥**

విద్వాంసుడైన బహుపుత్రునకు నలుగురు విద్యుత్సమానులు అయిన సంతతి కలిగారు.

**వి ॥** ఈ శ్లోకపాదానికి బహుపుత్రునకు నలుగురుభార్యలు అని వారు విద్యుత్తులనే పేరుతో ప్రసిద్ధులని హిందీ భాషలో వ్యాఖ్యానం వ్రాసిన డా॥ శ్రద్ధా శుక్లా, శ్రీమునిలాలగుప్తా వ్రాయడం జరిగింది. కాని తెలుగులో వ్యాఖ్యానం వ్రాసిన ఏలూరిపాటి అనంతరామయ్యగారు, కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారు వివరణలో నలుగురు కుమారులు అని వ్రాయడం జరిగింది. వారు కపిల, అతిలోహిత, పీత, సీత అనేవారు. కాని దక్షుడు బహుపుత్రునకు ఇద్దరినే వివాహార్థమిచ్చినట్లుగా గతంలో చెప్పబడింది కావున ఇచ్చట నలుగురు అని పేర్కొనడంవల్ల సంతానసందర్భంగానే భావం ఈయడం జరిగింది.

అంగిరసునికి బ్రహ్మర్షులచే పూజించబడే ప్రత్యంగిరసులనే ఋగభిమానదేవతలు కలిగారు.

**కృశాశ్వస్య తు దేవర్షేర్దేవప్రహరణాః స్మృతాః ।**
**ఏతే యుగసహస్రాన్తే జాయన్తే పునరేవ హి ॥ 137 ॥**

దేవప్రహరణాలు అనబడే దేవగణాలు దేవర్షి అయిన కృశాశ్వునకు సంతానంగా లభించాయి. సహస్రయుగాలు పూర్తి అయిన పిమ్మట ఈ సంతతి మళ్ళీ జనిస్తుంది.

వి ॥ ప్రహరణములనగా ఆయుధాలు. దేవప్రహరణాలు అనగా తదభిమాన దేవతలు.

**సర్వే దేవగణాస్తాత! త్రయస్త్రింశత్తు ఛన్దజాః ।**
**తేషామపీహ సతతం నిరోధోత్పత్తిరుచ్యతే ॥ 138 ॥**

నాయనా! మైత్రేయా! వేదోక్తాలైన ముప్పైమూడు దేవగణాలవారందరూ తమ ఇచ్ఛను బట్టి జన్మించేవే. వాటికి ఈ లోకంలో నిత్యం ఉత్పత్తి, వినాశం చెప్పబడ్డాయి.

వి ॥ అనగా అవసరాన్నిబట్టి దేవతాప్రకాశం, మిగిలిన సమయాల్లో వాటి అప్రకాశం జరుగుతుందని భావం.

**యథా సూర్యస్య మైత్రేయ! ఉదయాస్తమయావిహ ।**
**ఏవం దేవనికాయాస్తే సమ్భవన్తి యుగే యుగే ॥ 139 ॥**

మైత్రేయా! ఈ లోకంలో సూర్యునకు ఉదయం, అస్తమయం కనబడుతున్నట్లే, అదేరీతిగా ప్రతియుగంలోనూ దేవగణాలు ఉద్భవిస్తున్నాయి. అంతర్ధానమవుతున్నాయి.

**దితి సంతతి**

**దిత్యాః పుత్రద్వయం జజ్ఞే కశ్యపాదితి నః శ్రుతమ్ ।**
**హిరణ్యకశిపుశ్చైవ హిరణ్యాక్షశ్చ దుర్జయః ॥ 140 ॥**

కశ్యపమునీంద్రునివల్ల దితికి ఇద్దరు కొడుకులు జన్మించారని విన్నాము. వారు దుర్జయులు హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు అనేవారు.

**సింహికా చాభవత్ కన్యా విప్రచిత్తేః పరిగ్రహః ।**
**హిరణ్యకశిపోః పుత్రాశ్చత్వారః ప్రథితౌజసః ॥ 141 ॥**

ఆమెకు సింహిక అనే కుమార్తె కూడ కలిగింది. ఆమె విప్రచిత్తికి భార్య అయింది. హిరణ్యకశిపునకు విఖ్యాత తేజస్సులైన నలుగురు కుమారులు కలిగారు.

**అనుహ్లాదశ్చ హ్లాదశ్చ ప్రహ్లాదశ్చైవ బుద్ధిమాన్ ।**
**సంహ్లాదశ్చ మహావీర్యా దైత్యవంశవివర్ధనాః ॥ 142 ॥**

వారు అనుహ్లాదుడు, హ్లాదుడు, బుద్ధిమంతుడైన ప్రహ్లాదుడు, సంహ్లాదుడు అనేవారు మహాపరాక్రమవంతులు. దైత్యవంశాన్ని చక్కగా వృద్ధి పొందించిన వారయ్యారు.

**తేషాం మధ్యే మహాభాగ సర్వత్ర సమదృగ్వశీ ।**
**ప్రహ్లాదః పరమాం భక్తిం య ఉవాహ జనార్దనే ॥ 143 ॥**

మహాభాగా! వారి మధ్యలో ప్రహ్లాదుడు అన్నింటియందు సమదృష్టికలవాడు. ఇంద్రియాలను స్వవశంలో ఉంచుకొన్నవాడు. జనార్దనుని పై మిక్కిలి భక్తిని వహించినవాడు.

**దైత్యేన్ద్రదీపితో వహ్నిః సర్వాంగోపచితో ద్విజ! ।**
**న దదాహ చ యం విప్ర! వాసుదేవే హృది స్థితే ॥ 144 ॥**

విప్రోత్తమా! ఆ ప్రహ్లాదుని హృదయంలో వాసుదేవుడు ఉన్నందువల్ల, దైత్యరాజుచే అంటించబడిన వహ్ని సర్వావయవాలనూ రగుల్కొన్నా, అతనిని దహించలేకపోయింది.

**మహార్ణవాన్తఃసలిలే స్థితస్య చలతో మహీ ।**
**చచాల సకలా యస్య పాశబద్ధస్య ధీమతః ॥ 145 ॥**

ఆ జ్ఞానాత్ముని త్రాళ్లతో కట్టి మహార్ణవం మధ్యలో నీళ్లల్లో పడవేస్తే, ఆతడు నీటితో కదలాడుతూ ఉంటే, సమస్త భూమండలం కదిలిపోయింది.

**న భిన్నం వివిధైః శస్త్రైర్యస్య దైత్యేన్ద్రపాతితైః ।**
**శరీరమద్రికఠినం సర్వత్రాచ్యుతచేతసః ॥ 146 ॥**

ఆతని చిత్తం సర్వం అచ్యుతమయం అయిపోగా, శరీరం పర్వతంలా కఠినమైపోయి, దైత్యచక్రవర్తిచే ప్రయోగించబడ్డ నానావిధశస్త్రాలు ప్రహ్లాదుని దేహాన్ని భేదించలేకపోయాయి.

**విషానలోజ్జ్వలముఖా యస్య దైత్యప్రచోదితాః ।**
**నాన్తాయ సర్పపతయో బభూవురురుతేజసః ॥ 147 ॥**

మహాతేజస్సు కలిగిన ప్రహ్లాదుని, రాక్షసునిచే ప్రేరేపించబడ్డ, విషాగ్నులు భగభగలాడే ముఖాలుగల్గిన మహాసర్పాలు కరిచి అంతమొందించడానికి సామర్థ్యం లేనివైపోయాయి.

**శైలైరాక్రాన్తదేహో ఽ పి యః స్మరన్ పురుషోత్తమమ్ ।**
**తత్యాజ నాత్మనః ప్రాణాన్ విష్ణుస్మరణదంశితః ॥ 148**

పురుషోత్తముని ప్రతిక్షణం స్మరిస్తూ ఉండే ప్రహ్లాదుని, కఠిన శిలలతో ఒంటినిండా కొట్టినా (పెద్ద పెద్ద కొండలపై నుండి దేహం ముక్కలయ్యేలా క్రిందుకు త్రోసివేసినా), విష్ణుస్మరణం అనే కవచం ధరించి ఉన్న కారణంచే అతని ప్రాణాలకు హాని కల్గలేదు.

**పతన్తముచ్చాదవనిర్యముపేత్య మహామతిమ్ ।**
**దధార దైత్యపతినా క్షిప్తం స్వర్గనివాసినా ॥ 149 ॥**

ఆ మహావిష్ణుభక్తిశీలుని రాక్షసరాజు స్వర్గంనుంచి విసరి త్రోసివేస్తే, ఎత్తైన ప్రదేశంనుంచి క్రింద పడిపోతున్న అతనిని, అవని ఎదురుగా వెళ్లి క్రిందపడిపోకుండా పట్టుకొన్నది.

**యస్య సంశోషకో వాయుర్దేహే దైత్యేన్ద్రయోజితః ।**
**అవాప సంక్షయం సద్యశ్చిత్తస్థే మధుసూదనే ॥ 150 ॥**

అతని చిత్తంలో మధుసూదనుడు ఉన్నందువల్ల, ప్రహ్లాదుని శరీరాన్ని ఆర్పివేయమని దైత్యచక్రవర్తి ఆజ్ఞాపించినా, వాయువు తత్క్షణం క్షీణించింది.

**విషాణభంగమున్మత్తా మదహానిం చ దిగ్గజాః ।**
**యస్య వక్షఃస్థలే ప్రాప్తా దైత్యేన్ద్రపరిణామితాః ॥ 151 ॥**

దైత్యేంద్రునిచే ప్రేరేపించబడి ప్రయోగించబడ్డ ఉన్మత్త దిగ్గజాలు ప్రహ్లాదుని గుండెలు ఢీకొట్టి దంతాలు విరుగగొట్టుకొన్నాయి. మదాన్ని వదిలివేశాయి.

**యస్య చోత్పాదితా కృత్యా దైత్యరాజపురోహితైః ।**
**బభూవ నాన్తాయ పురా గోవిన్దాసక్తచేతసః ॥ 152 ॥**

అతని చిత్తం గోవిందునియందు తగులుకొనియున్న కారణంచే, దైత్యరాజపురోహితులు మొదట సృష్టించి పంపిన కృత్య ప్రహ్లాదుని కడతేర్చలేకపోయింది.

**శమ్బరస్య చ మాయానాం సహస్రమతిమాయినః ।**
**యస్మిన్ ప్రయుక్తం చక్రేణ కృష్ణస్య వితథీకృతమ్ ॥ 153 ॥**

మహామాయావి అయిన శంబరాసురుడు అతనిపై ప్రయోగించిన వేలకొలది మాయలను విష్ణువుచే ప్రయోగించబడ్డ చక్రం వమ్ము చేసింది.

**దైత్యేన్ద్రసూదోపహృతం యస్తు హాలాహలం విషమ్ ।**
**జరయామాస మతిమాన్ అవికారమమత్సరీ ॥ 154 ॥**

దైత్యేంద్రునియొక్క వంటలవారు వండికలిపిపెట్టిన హాలాహలవిషాన్ని ఆ నిర్వికారుడు, మాత్సర్యరహితుడు, సమస్తపదార్థాలను భగవన్మయంగా భావించేవాడు అయిన జ్ఞాని, ప్రహ్లాదుడు అరిగించి వేసుకొన్నాడు.

**సమచేతా జగత్యస్మిన్ యః సర్వేష్వేవజన్తుషు ।**
**యథాऽऽత్మని తథాऽన్యత్ర పరం మైత్రగుణాన్వితః ॥ 155 ॥**

అతడు తనయందు, ఈ జగత్తునందు, సమస్త ప్రాణులయందు సమచిత్తం కలవాడు. తనయందులాగే ఇతరులయందు కూడా పరమప్రేమ కలవాడు.

**ధర్మాత్మా సత్యశౌచాదిగుణానామాకరస్తథా ।**
**ఉపమానమశేషాణాం సాధూనాం యః సదాऽభవత్ ॥ 156 ॥**

ఆ ప్రహ్లాదుడు ధర్మాత్ముడు. సత్యం, శౌచం మున్నగు ఉత్తమగుణాలకు పుట్టినిల్లు. సమస్తమైన సాధు పురుషులకు సదా అతడు ఉపమానమయ్యాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే కందుమునిచరిత్రం నామ పంచదశోऽధ్యాయః సమాప్తః ॥ 15 ॥**

శ్రీ విష్ణుపురాణే ప్రథమాంశంలో కందుముని చరిత్ర అనే పదునైదవ అధ్యాయం సమాప్తం ॥15 ॥

## **షోడశోఽధ్యాయః** – పదునారవ అధ్యాయం

## **ప్రహ్లాద చరిత్రమ్** – ప్రహ్లాదుని చరిత్ర

**శ్రీమైత్రేయ ఉవాచ :–** మైత్రేయుడు చెప్పాడు.

**కథితో భవతా వంశో మానవానాం మహామునే! ।**
**కారణం చాస్య జగతో విష్ణురేవ సనాతనః ॥ 1 ॥**

పరాశర మహామునీంద్రా! నీచేత స్వాయంభువమనువుయొక్క సంతితిని గూర్చి, వారి వంశవిస్తారం గూర్చి చెప్పబడింది. ఈ జగత్తుకు కారణం సనాతనుడైన విష్ణువే అని తెలియజేశావు.

**యచ్చైతద్ భగవానాహ ప్రహ్లాదం దైత్యసత్తమమ్ ।**
**దదాహ నాగ్నిర్నాస్త్రైశ్చ క్షుణ్ణస్తత్యాజ జీవితమ్ ॥ 2 ॥**

భగవత్స్వరూపా! దైత్యశ్రేష్ఠుడైన ప్రహ్లాదుని గూర్చి వివరించావు కదా! అతనిని అగ్ని దహించలేక పోయిందని, అస్త్రాలతో కొట్టబడినా అతడు ప్రాణాలు విడువలేదని చెప్పావే!

**జగామ వసుధా క్షోభం యత్రాబ్ధిసలిలే స్థితే ।**
**బన్ధబద్ధే విచలతి విక్షిప్తాంగైః సమాహతా ॥ 3 ॥**

త్రాళ్లతో బంధించి అతనిని సముద్రజలాలలో పడవేస్తే, గిలగిలలాడుతూ ఉన్న అతని అవయవాలు సోకేసరికి భూమి క్షోభించి చలించిందని వచించావు కదా!

**శైలైరాక్రాన్తదేహోఽపి న మమార చ యః పురా ।**
**త్వయైవాతీవ మాహాత్మ్యం కథితం యస్య ధీమతః ॥ 4 ॥**

కొండలతో అతని శరీరం ఆక్రమించబడినా ప్రహ్లాదుడు మరణించలేదని తెలియజేశావు. ఇంతకుమునుపే ఆ విష్ణుభక్తితత్పరుని, మహాబుద్ధిమంతుని మాహాత్మ్యం నీచే మిక్కిలి చెప్పబడింది.

**తస్య ప్రభావమతులం విష్ణోర్భక్తిమతో మునే! ।**
**శ్రోతుమిచ్ఛామి యస్యైతచ్చరితం దీప్తతేజసః ॥ 5 ॥**

మునీశ్వరా! అతని గొప్పదైన ప్రభావాన్ని, సాటిలేని విష్ణుభక్తిని, ప్రకాశించు తేజస్సు కల ఆతని గొప్పచరిత్రను మరింత వివరంగా వినగోరుతున్నాను.

**కిం నిమిత్తమసౌ శస్త్రైర్విక్షిప్తో దితిజైర్మునే ।**
**కిమర్థం చాబ్ధిసలిలే నిక్షిప్తో ధర్మతత్పరః ॥ 6 ॥**

మునిశ్రేష్ఠా! ఏకారణంచే అతడు దైత్యులచే ఆయుధాలతో ఎక్కువగా కొట్టబడ్డాడు? అతడు ధర్మతత్పరుడని చెప్పావు కదా! ఎందుకని అతడు సముద్రజలంలో విసరి వేయబడ్డాడు?

**ఆక్రాన్తః పర్వతైః కస్మాత్ కస్మాద్దష్టో మహోరగైః ।**
**క్షిప్తః కిమద్రిశిఖరాత్ కిం వా పావకసంచయే ॥ 7 ॥**

ఆతనిని కొండలతో ఎందుకు ఆక్రమింపచేశారు? (కప్పిపెట్టారు) మహాసర్పాలచే ఎందుకు కరిపించారు? పర్వతశిఖరాల నుంచి క్రిందకు ఎందుకు విసరివేశారు? భగభగమండే మంటలలో ఎందుకు పడవేశారు?

**దిగ్దన్తినాం దన్తభూమిం స చ కస్మాన్నిరూపితః ।**
**సంశోషకోఽనిలశ్చాస్య ప్రయుక్తః కిం మహాసురైః ॥ 8 ॥**

దిగ్గజాలయొక్క దంతభాగంతో ఆతనిని ఎందుకు పొడిపించారు? శోషింపజేసే వాయువును ఆ భయంకరులైన దైత్యులు ఎందుకు ప్రయోగించారు?

**కృత్యాం చ దైత్యగురవో యుయుజుస్తత్ర కిం మునే! ।**
**శమ్బరశ్చాపి మాయానాం సహస్రం కిం ప్రయుక్తవాన్ ॥ 9 ॥**

మునిచంద్రా! దైత్యగురువులు ప్రహ్లాదునిపై కృత్యను సృష్టించి ఎందుకు వదిలారు? శంబరాసురుడు వేలకొలది మాయలను ఎందుకు ప్రయోగించాడు?

**హాలాహలం విషమహో దైత్యసూదైర్మహాత్మనః ।**
**కస్మాద్ దత్తం వినాశాయ యద్ జీర్ణం తేన ధీమతా ॥ 10 ॥**

వంటలవారైన రాక్షసులు అయ్యో! ఆ మహాత్ముని వధించాలని హాలాహలవిషం ఎందుకు తినిపించారు? దానిని ఆ ధీమంతుడు ఎలా జీర్ణం చేసుకొన్నాడు?

**ఏతత్ సర్వం మహాభాగ ! ప్రహ్లాదస్య మహాత్మనః ।**
**చరితం శ్రోతుమిచ్ఛామి మహామాహాత్మ్యసూచకమ్ ॥ 11 ॥**

మహాభాగా! దీనినంతటినీ, మహాత్ముడైన ప్రహ్లాదుని యొక్క చరిత్రసర్వస్వాన్నీ, ఆ అద్భుతమైన మాహాత్మ్యాన్ని సూచించే వృత్తాంతాన్ని సంపూర్ణంగా వినగోరుతున్నాను.

**న హి కౌతూహలం తత్ర యద్ దైత్యైర్న హతో హి సః ।**
**అనన్యమనసో విష్ణౌ కః శక్నోతి నిపాతనే ॥ 12 ॥**

దైత్యులు ఆ ప్రహ్లాదుని చంపలేకపోవడం ఏమిటని కాదు నాకు ఏర్పడిన కుతూహలం. విష్ణువునందు మాత్రమే తప్ప అన్యవిషయముపై మనస్సులేని వానిని పడగొట్టడానికి ఎవడు సమర్థుడు కాగలడు?

**తస్మిన్ ధర్మపరే నిత్యం కేశవారాధనోద్యతే ।**
**స్వవంశప్రభవైర్దైత్యైః కర్తుం ద్వేషోఽతిదుష్కరః ॥ 13 ॥**

అతడు ధర్మపరుడు కదా! ఎల్లప్పుడూ కేశవుని ఆరాధించుటయందే మిక్కిలి ప్రయత్నం చేసేవాడు కదా! అతని వంశంలోనే పుట్టిన దైత్యులు అంత చేయరానటువంటి విద్వేషం ఆతనిపై ఎందుకు కనబరిచారని?

**ధర్మాత్మని మహాభాగే విష్ణుభక్తే విమత్సరే ।**
**దైతేయైః ప్రహృతం కస్మాత్ తన్మమాఖ్యాతుమర్హసి ॥ 14 ॥**

ధర్మాత్ముడు, మహాభాగుడు, విష్ణుభక్తితత్పరుడు, ఏ మాత్సర్యం లేనివాడు. అట్టివానిని దైత్యులు ఎందుకు హింసాప్రవృత్తితో బాధించారో దానిని నాకు వివరించవలసింది.

**ప్రహరన్తి మహాత్మానో విపక్షా అపి నేదృశే ।**
**గుణైః సమన్వితే సాధౌ కిం పునర్యః స్వపక్షజః ॥ 15 ॥**

ఇటువంటి సుగుణాలతో కూడు కొన్నవానిని, సాధువును మహాత్ములైనట్టి ప్రతిపక్షంవారు కూడ కొట్టి హింసించరు కదా! మరి స్వపక్షంలోని వారిని గూర్చి చెప్పేదేమిటి?

**తదేతత్ కథ్యతాం సర్వం విస్తరాన్మునిసత్తమ! ।**
**దైత్యేశ్వరస్య చరితం శ్రోతుమిచ్ఛామ్యశేషతః ॥ 16 ॥**

మునిసత్తమా! ఇదంతా నాకు సవిస్తరంగా వివరించు. దైత్యులలో ఈశ్వరుడైన ప్రహ్లాదునియొక్క చరిత్రను సంపూర్ణంగా ఆలకించాలనుకొంటున్నాను అని మైత్రేయుడు అడిగాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే ప్రహ్లాద చరిత్రం నామ షోడశోఽధ్యాయః సమాప్తః ॥ 16 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో ప్రహ్లాదుని చరిత్ర అనే పదునారవ అధ్యాయం సమాప్తం ॥ 16 ॥



## **సప్తదశోఽధ్యాయః** – పదిహేడవ అధ్యాయం

## **ప్రహ్లాద చరిత్రమ్** – ప్రహ్లాదుని చరిత్ర

**శ్రీ పరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**మైత్రేయ! శ్రూయతాం సమ్యక్ చరితం తస్య ధీమతః ।**
**ప్రహ్లాదస్య సదోదారచరితస్య మహాత్మనః ॥ 1 ॥**

మైత్రేయా! బుద్ధిమంతుడు, మహాత్ముడు, నిరంతరం ఉదారచరిత్రుడు అయిన ప్రహ్లాదుని వృత్తాంతాన్ని చెబుతున్నాను, చక్కగా సావధానంగా ఆలకించు.

**దితేః పుత్రో మహావీర్యో హిరణ్యకశిపుః పురా ।**
**త్రైలోక్యం వశమానిన్యే బ్రహ్మణో వరదర్పితః ॥ 2 ॥**

పూర్వం దితియొక్క కుమారుడైన హిరణ్యకశిపుడు అనే మహాబలపరాక్రమశాలి ఉండేవాడు. అతడు బ్రహ్మవల్ల వరాలు పొంది, గొప్పగర్వంతో ముల్లోకాలను తనవశం చేసుకొన్నాడు.

**ఇన్ద్రత్వమకరోద్ దైత్యః స చాసీత్ సవితా స్వయమ్ ।**
**వాయురగ్నిరపాం నాథః సోమశ్చాభూన్మహాసురః ॥ 3 ॥**

ఆ దైత్యుడు ఇంద్రలోకాధిపత్యాన్ని చేబట్టాడు. అతడు తానే స్వయంగా సూర్యుడయ్యాడు. వాయువు అయ్యాడు. అగ్ని అయ్యాడు. జలాధినాథుడయిన వరుణుడయ్యాడు. ఆ భయంకరాసురుడు తానే చంద్రుడయ్యాడు.

**ధనానామధిపస్సోఽభూత్ స ఏవాసీత్ స్వయం యమః ।**
**యజ్ఞభాగానశేషాంస్తు స స్వయం బుభుజేఽసురః ॥ 4 ॥**

ధనాధిపతి అయిన కుబేరుడూ అతడే అయ్యాడు. తానే స్వయంగా యముడు అయ్యాడు. ఆ అసురుడే స్వయంగా సమస్తయజ్ఞభాగాలను స్వీకరించి అనుభవించాడు.

**దేవాః స్వర్గం పరిత్యజ్య తత్త్రాసాన్మునిసత్తమ ।**
**విచేరురవనౌ సర్వే బిభ్రాణా మానుషీం తనుమ్ ॥ 5 ॥**

మునిప్రవరా! దేవతలు అందరూ అతడంటే భయపడిపోయి స్వర్గం వదలివేసి, మనుష్యశరీరాలు ధరించి భూమండలంలో తిరుగాడసాగారు.

**జిత్వా త్రిభువనం సర్వం త్రైలోక్యైశ్వర్యదర్పితః ।**
**ఉపగీయమానో గన్ధర్వైర్బుభుజే విషయాన్ ప్రియాన్ ॥ 6 ॥**

అతడు త్రిభువనాలనూ పూర్తిగా జయించాడు. మూడులోకాలలో అనుభవించవలసిన భోగాలన్నీ అనుభవించి మదగర్వితుడైపోయాడు. గంధర్వులు అతని కీర్తిని గానంచేస్తూ ఉండగా ఇష్టసుఖాలను అనుభవించాడు.

**పానాసక్తం మహాత్మానం హిరణ్యకశిపుం తదా ।**
**ఉపాసాంచక్రిరే సర్వే సిద్ధగన్ధర్వపన్నగాః ॥ 7 ॥**

ఆ సమయంలో మహాత్ముడైన హిరణ్యకశిపుడు పానంచేస్తున్న వేళలో కూడా సిద్ధులు, గంధర్వులు, పన్నగులు అతనిని సేవించేవారు.

**అవాదయన్ జగుశ్చాన్యే జయశబ్దానథాపరే ।**
**దైత్యరాజస్య పురతశ్చక్రుః సిద్ధా ముదాన్వితాః ॥ 8 ॥**

దైత్యప్రభువు ఎదుట సిద్ధులు సంతోషంతో కూడుకొన్నవారై కొందరు వాద్యాలు వాయించారు. మరికొందరు గానం చేశారు. ఇంకొందరు జయజయనాదాలు కావించారు.

**తత్ర ప్రనృత్తాప్సరసి స్ఫటికాభ్రమయేఽసురః ।**
**పపౌ పానం ముదా యుక్తః ప్రాసాదే సుమనోహరే ॥ 9 ॥**

మిక్కిలి మనోహరమైన ప్రాసాదంలో, స్ఫటికం, అభ్రం మున్నగు శిలలతో నిర్మింపబడిన రమ్యస్థలిలో అప్సరసలు నాట్యం చేస్తూ ఉంటే ఆ అసురుడు త్రాగుతూ ఆనందంతో ఉండేవాడు.

**తస్య పుత్రో మహాభాగః ప్రహ్లాదో నామ నామతః ।**
**పపాఠ బాలపాఠ్యాని గురుగేహే గతోఽర్భకః ॥ 10 ॥**

ఆ హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుడనే పేరుతో ప్రసిద్ధికెక్కినవాడు. అతడు మహాభాగుడు. ఆ అర్భకుడు గురుకులవాసం చేస్తూ వయస్సుకు తగినది చదువుకొనేవాడు.

**ఏకదా తు స ధర్మాత్మా జగామ గురుణా సహ ।**
**పానాసక్తస్య పురతః పితుర్దైత్యపతేస్తదా ॥ 11 ॥**

ఒకనాడు ఆ ధర్మాత్ముడు గురువుగారితో కలసి (స్వగృహం చేరుకొన్నాడు) త్రాగుడు మత్తులో ఉన్న తండ్రియైన దైత్యపతి దగ్గరకు ఎదురుగా వెళ్లాడు.

**పాద ప్రణామావనతం తముత్థాప్య పితా సుతమ్ ।**
**హిరణ్యకశిపుః ప్రాహ ప్రహ్లాదమమితౌజసమ్ ॥ 12 ॥**

తండ్రిఅయిన హిరణ్యకశిపుడు పాదాలకు వంగి నమస్కరించిన, మిక్కిలి వర్చస్సుతో ప్రకాశిస్తున్న, ప్రహ్లాదకుమారుని లేవనెత్తి ఇలా అన్నాడు.

**పఠ్యతాం భవతా వత్స సారభూతం సుభాషితమ్ ।**
**కాలేనైతావతా యత్ తే సదోద్యుక్తేన శిక్షితమ్ ॥ 13 ॥**

"నాయనా! కుమారా! ఏదీ! ఇంతకాలం నీవు నిరంతరం శ్రద్ధతో చదివిన, గురువుచే నభ్యసించబడిన, విద్యలసారంతో నిండిన, ఒక్క సుభాషితం చదువు" అన్నాడు.

**శ్రూయతాం తాత! వక్ష్యామి సారభూతం తవాజ్ఞయా ।**
**సమాహితమనా భూత్వా యన్మే చేతస్యవస్థితమ్ ॥ 14 ॥**

అపుడు ప్రహ్లాదుడు "తండ్రీ! సావధానమనస్కుడవై విను. నా మనస్సులోనున్న దానిని, సారభూతమైన దానిని నీ ఆజ్ఞప్రకారం నివేదిస్తాను".

**అనాదిమధ్యాన్తమజమవృద్ధిక్షయమచ్యుతమ్ ।**
**ప్రణతోఽస్మి మహాత్మానం సర్వకారణకారణమ్ ॥ 15 ॥**

మొదలు, మధ్య, చివర, జన్మ, వృద్ధి, క్షయం లేనివానిని, నాశనంలేని వానిని, సమస్తకారణాలకు కారణమైన వానిని, మహాత్ముడైన అయిన వానిని (అచ్యుతునకు) నమస్కరిస్తున్నాను" అన్నాడు.

**ఏవం నిశమ్య దైత్యేన్ద్రః క్రోధసంరక్తలోచనః ।**
**విలోక్య తద్గురుం ప్రాహ స్ఫురితాధరపల్లవః ॥ 16 ॥**

**బ్రహ్మబన్ధో! కిమేతత్ తే విపక్షస్తుతిసంహితమ్ ।**
**అసారం గ్రాహితో బాలో మామవజ్ఞాయ దుర్మతే! ॥ 17 ॥**

కుమారుడు పలికిన వాక్యాలు విని దైత్యచక్రవర్తి మండిపడి కోపంతో ఎరుపెక్కిన కన్నులతో, అదరే చిగురువంటి అధరంతో గురువును వీక్షించి "బ్రహ్మబంధూ! ఓ దుర్మతీ! నన్ను అవమానపరచి ఈ కుర్రవానికి సారం లేని శత్రుస్తోత్రాన్ని నేర్పావేమిటి" అని గట్టిగా అరిచాడు.

**గురురువాచ :–** గురువు చెప్పాడు

**దైత్యేశ్వర! న కోపస్య వశమాగన్తు మర్హసి ।**
**మమోపదేశజనితం నాయం వదతి తే సుతః ॥ 18 ॥**

అపుడు గురువు "దైత్యకులసార్వభౌమా! నీవు కోపానికి లోను కావద్దు. నేను ఉపదేశించినది ఏదీ నీ కొడుకు ఇపుడు చెప్పటం లేదు" అన్నాడు.

**హిరణ్యకశిపురువాచ :–** హిరణ్యకశిపుడు చెప్పాడు

**అనుశిష్టోఽసి కేనేదృగ్ వత్స! ప్రహ్లాద! కథ్యతామ్ ।**
**మమోపదిష్టం నేత్యేష ప్రబ్రవీతి గురుస్తవ ॥ 19 ॥**

అపుడు తండ్రి "నాయనా! ప్రహ్లాదా! ఇటువంటిది నీకు ఎవనిచే ఉపదేశించబడింది? చెప్పు. నేను నేర్పినటు వంటిది కాదంటున్నాడు ఈ గురువు" అని అడిగాడు.

**ప్రహ్లాద ఉవాచ :**–ప్రహ్లాదుడు పలికెను

**శాస్తా విష్ణురశేషస్య జగతో యో హృది స్థితః ।**
**తమృతే పరమాత్మానం తాత! కః కేన శాస్యతే ॥ 20 ॥**

అంత ప్రహ్లాదకుమారుడు "హృదయంలో ఉండే విష్ణువే సకల జగత్తుకూ శాసకుడు. ఆ పరమాత్మ తప్ప తండ్రీ! ఎవడు ఎవనికి శాసకుడు అవుతాడు?" అన్నాడు.

**హిరణ్యకశిపురువాచ :**– హిరణ్యకశిపుడు చెప్పాడు

**కోఽయం విష్ణుః సుదుర్బుద్ధే యం బ్రవీషి పునః పునః ।**
**జగతామీశ్వరస్యేహ పురతః ప్రసభం మమ ॥ 21 ॥**

అపుడు హిరణ్యకశిపుడు "ఓరి దుర్బుద్ధీ! ఎవడురా విష్ణువు? మాటిమాటికి వాడిని గురించి పదేపదే చెబుతున్నావు? ఈ సకలజగత్తులకు నేనే ఈశ్వరుడను. నాముందు భయం లేకుండా ఏమిటీ ప్రలాపం" అన్నాడు.

**ప్రహ్లాద ఉవాచ :**–ప్రహ్లాదుడు పలికెను

**న శబ్దగోచరే యస్య యోగిధ్యేయం పరం పదమ్ ।**
**యతో యశ్చ స్వయం విశ్వం స విష్ణుః పరమేశ్వరః ॥ 22 ॥**

అపుడు ప్రహ్లాదుడు "విష్ణుస్వరూపం మాటలకందనిది. ఆయన పరమపదం. యోగులచే ధ్యానించ బడుతూ ఉంటుంది. ఈ విశ్వమంతా స్వయంగా ఎవనివల్ల వచ్చి, ఎవడై భాసిస్తూ ఉంటుందో అట్టి పరమేశ్వరుడే విష్ణువు" అన్నాడు.

**హిరణ్యకశిపురువాచ :**– హిరణ్యకశిపుడు చెప్పాడు

**పరమేశ్వరసంజ్ఞోఽజ్ఞ! కిమన్యో మయ్యవస్థితే ।**
**తవాస్తి మర్తుకామస్త్వం ప్రబ్రవీషి పునః పునః ॥ 23 ॥**

అంత హిరణ్యకశిపుడు "ఓరి అజ్ఞుడా! పరమేశ్వరుడు అనేవాడు నేను ఉండగా నీకు వేరే ఒకడున్నాడా? నీవు చావు కావాలని కోరుకొంటున్నావు. అందువల్లనే మాటిమాటికీ ఇలా ప్రేలుతున్నావు" అన్నాడు.

**ప్రహ్లాద ఉవాచ :**–ప్రహ్లాదుడు పలికెను

**న కేవలం తాత మమ ప్రజానాం, సబ్రహ్మభూతో భవతశ్చ విష్ణుః ।**
**ధాతా విధాతా పరమేశ్వరశ్చ, ప్రసీద కోపం కురుషే కిమర్థమ్ ॥ 24 ॥**

అపుడు ప్రహ్లాదుడు "తండ్రీ! కేవలం నాకొక్కడికే కాదు. సమస్త ప్రజలకూ, నీకూ ఆ పరబ్రహ్మమైనట్టి విష్ణువే సృజనకర్త. పోషణకర్త, పరమేశ్వరుడంటే ఆయనే. ఎందుకు కోపపడతావు? శాంతిని వహించు" అన్నాడు.

**హిరణ్యకశిపురువాచ :–** హిరణ్యకశిపుడు చెప్పాడు

**ప్రవిష్టః కోఽస్య హృదయే దుర్బుద్ధేరతిపాపకృత్ ।**
**యేనేదృశాన్యసాధూని వదత్యావిష్టమానసః ॥ 25 ॥**

అంత హిరణ్యకశిపుడు "ఈ దుష్టబుద్ధియొక్క హృదయంలో మహాఘోర పాపాలుచేసే దురాత్ముడెవడో దూరియుంటాడు! అందువల్లనే వీడు పూనకం వచ్చిన చిత్తంతో ఇటువంటి చెడ్డమాటలు పలుకుతున్నాడు!" అన్నాడు.

**ప్రహ్లాద ఉవాచ :–**ప్రహ్లాదుడు పలికెను

**న కేవలం మద్ధృదయం స విష్ణు రాక్రమ్య లోకాన్ సకలానవస్థితః ।**
**స మాం త్వదాదీంశ్చ పితః! సమస్తాన్ సమస్తచేష్టాసు యునక్తి సర్వగః ॥ 26 ॥**

అపుడు ప్రహ్లాదుడు "ఆ విష్ణువు కేవలం నా హృదయాన్ని మాత్రమేకాదు. సమస్తలోకాలను ఆక్రమించి దూరియున్నాడు. తండ్రీ! అతడు నన్ను, నిన్ను, అందరిని, సమస్తవిషయాలను అంతట ప్రవేశించినవాడై, సకలకార్యములందునూ ప్రవర్తింపజేస్తున్నాడు" అన్నాడు.

**హిరణ్యకశిపురువాచ :–** హిరణ్యకశిపుడు చెప్పాడు

**నిష్క్రామ్యతామయం దుష్టః శాస్యతాం చ గురోర్గృహే ।**
**యోజితో దుర్మతిః కేన విపక్షవితథ (విషయ) స్తుతౌ ॥ 27 ॥**

అంత హిరణ్యకశిపుడు కోపంతో "ఈ దుష్టుని నా ఎదుటనుండి తొలగించండి. గురువు సన్నిధిలో వీడిని శిక్షించండి. ఎవడు నేర్పాడోకదా ఈ దుష్టబుద్ధికి శత్రువిషయకమైన స్తోత్రాన్ని?" అని ఆజ్ఞాపించాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**ఇత్యుక్తోఽసౌ తదా దైత్యైర్నీతో గురుగృహం పునః ।**
**జగ్రాహ విద్యామనిశం గురుశుశ్రూషణోద్యతః ॥ 28 ॥**

ఈ విధంగా దైత్యేశ్వరుడు నియోగించగా అసురులు ప్రహ్లాదుని మళ్లీ గురుకులవాసానికి చేర్చారు. అతడు నిరంతరం గురువు చెప్పిన మాట వింటూ, ఆయనను సేవిస్తూ విద్య నేర్చాడు.

**కాలేఽతీతే చ మహతి ప్రహ్లాదమసురేశ్వరః ।**
**సమాహూయాబ్రవీత్ పుత్ర! గాథా కాచిత్ ప్రగీయతామ్ ॥ 29 ॥**

ఈ విధంగా మిక్కిలి చాలాకాలం గడిచిపోయాక, అసురచక్రవర్తి ప్రహ్లాదుని పిలిపించి (దగ్గరకు చేర్చుకొని) "నాయనా! కుమారా! ఏదైన ఒక విషయం వినిపించు" అన్నాడు.

**ప్రహ్లాద ఉవాచ :–**ప్రహ్లాదుడు పలికెను

**యతః ప్రధానపురుషౌ యతశ్చైతచ్చరాచరమ్ ।**
**కారణం సకలస్యాస్య స నో విష్ణుః ప్రసీదతు ॥ 30 ॥**

తండ్రి అలా ప్రశ్నించగా ప్రహ్లాదుడు "ఎవనివల్ల ప్రధానం పురుషుడు ఏర్పడుతున్నారో, ఎవని నుంచి ఈ చరం, అచరం ఉద్భవిస్తోందో, ఈ సమస్తానికి మూలకారణం ఎవడో, అట్టి విష్ణువు మనపట్ల (నాపట్ల) ప్రసన్నుడగుగాక!" అన్నాడు.

**హిరణ్యకశిపురువాచ :–** హిరణ్యకశిపుడు చెప్పాడు

**దురాత్మా వధ్యతామేష నానేనాఽర్థోఽస్తి జీవతా ।**
**స్వపక్షహానికర్తృత్వాద్ యః కులాంగారతాం గతః ॥ 31 ॥**

అంత క్రోధపరీతాత్ముడై దైత్యప్రభువు "ఈ దురాత్ముణ్ణి చంపివేయండి. వీడు బ్రతికియుండి ప్రయోజనం లేదు. తన పక్షంవారికి కీడు తలపెట్టి వీడు అసురవంశంపాలిట కొరవి అయ్యాడు." అని ఆజ్ఞాపించాడు.

**ఇత్యాజ్ఞప్తాస్తతస్తేన ప్రగృహీతమహాయుధాః ।**
**ఉద్యతాస్తస్య నాశాయ దైత్యాః శతసహస్రశః ॥ 32 ॥**

ఇలా దైత్యరాజుచే శాసించబడినవారై వందలు, వేలకొలది దైత్యులు మహాయుధాలు ధరించినవారై ఆ బాలుని వధించడానికి పూనుకొన్నారు.

**ప్రహ్లాద ఉవాచ :–**ప్రహ్లాదుడు పలికెను

**విష్ణుః శస్త్రేషు యుష్మాకం మయి చాసౌ యథా స్థితః ।**
**దైతేయాస్తేన సత్యేన మా క్రామంత్వాయుధాని మే ॥ 33 ॥**

అపుడు ప్రహ్లాదకుమారుడు "దైత్యులారా! ఆ విష్ణువు, మీరు ధరించిన ఆయుధాలలో, మీలో, నాలో ఉన్నాడు. ఇది యథార్థం. కాబట్టి ఆయుధాలు నన్ను స్పృశించలేవు" అన్నాడు.

**తతస్తైః శతశో దైత్యైః శస్త్రౌఘైరాహతోఽపి సన్ ।**
**నావాప వేదనామల్పామభూచ్చైవ పునర్నవః ॥ 34 ॥**

అతడు అలా అంటున్నా, వందలకొలది దైత్యులు ఆయుధ సమూహాలతో కొట్టసాగారు. అయినా ప్రహ్లాదునికి కొంచెంకూడ నొప్పి కలగలేదు సరికదా! తిరిగి నూతన తేజస్సు కల్గినవాడయ్యాడు.

**హిరణ్యకశిపురువాచ :–** హిరణ్యకశిపుడు చెప్పాడు

**దుర్బుద్ధే! వినివర్తస్వ వైరిపక్షస్తవాదతః ।**
**అభయం తే ప్రయచ్ఛామి మాఽతిమూఢమతిర్భవ ॥ 35 ॥**

అపుడు తండ్రి "ఓరి దుర్బుద్ధీ! శత్రుపక్షం పొగడ్తనుంచి బుద్ధిని మళ్లించు. నీకు అభయం ప్రసాదిస్తున్నాను. మరీ మిక్కిలి మూర్ఖుడువయిపోకు" అన్నాడు.

**ప్రహ్లాద ఉవాచ :**–ప్రహ్లాదుడు పలికాడు

**భయం భయానామపహారిణి స్థితే మనస్యనన్తే మమ కుత్ర తిష్ఠతి ।**
**యస్మిన్ స్మృతే జన్మజరాన్తకాదిభయాని సర్వాణ్యపయాన్తి తాత! ॥ 36 ॥**

అపుడు పుత్రుడు "తండ్రీ! భయాలను అన్నిటిని తొలగించే ఆ అనంతుడు నా మానసంలో నిండి ఉండగా, నాకు భయం అనే మాట ఎక్కడ ఉంటుంది? ఎవరిని స్మరిస్తే పుట్టుక, ముసలితనం, చావు మొదలైన భయాలన్నీ క్షణంలో మటుమాయమై పోతాయో కదా!" అన్నాడు.

**హిరణ్యకశిపురువాచ :**– హిరణ్యకశిపుడు చెప్పాడు

**భో భో సర్పాః దురాచారమేనమత్యన్తదుర్మతిమ్ ।**
**విషజ్వాలాకులైర్వక్త్రైః సద్యో నయత సంక్షయమ్ ॥ 37 ॥**

అంత హిరణ్యకశిపుడు "ఓహో! నాగులారా! ఈ దురాచారుణ్ణి ఈ పరమదుష్టబుద్ధిని, విషజ్వాలలతో వ్యాకులపరచే వదనాలతో తక్షణమే కాటువేసి నశింపజేయండి" అన్నాడు.

**ఇత్యుక్తాస్తేన తే సర్పాః కుహకాస్తక్షకాన్ధకాః ।**
**అదశన్త సమస్తేషు గాత్రేష్వతివిషోల్బణాః ॥ 38 ॥**

ఈ విధంగా ప్రభువు శాసించగా, కుహకుడు, తక్షకుడు, అంధకుడు మున్నగు సర్పగణాలు ఆ కుఱ్ఱవాని సమస్తావయవాల పైన, ఘోరవిషాన్ని క్రక్కుతూ కాటు వేయసాగాయి.

**స త్వాసక్తమతిః కృష్ణే దశ్యమానో మహోరగైః ।**
**న వివేదాత్మనో గాత్రం తత్ స్మృత్యాహ్లాదసంస్థితః ॥ 39 ॥**

మహాసర్పాలు కాటువేస్తూంటే, అతని చిత్తం విష్ణునిపైనే లగ్నమై ఉండిపోయింది. ఆ హరిని స్మరిస్తూ, ఆనందంలో తేలియాడుతూ అతడు తన ఒడలినే మరచిపోయాడు.

**సర్పా ఊచుః :**–సర్పాలు చెప్పాయి.

**దంష్ట్రా విశీర్ణా మణయః స్ఫుటన్తి ఫణేషు తాపో హృదయేషు కమ్పః ।**
**నాస్య త్వచః స్వల్పమపీహ భిన్నం ప్రశాధి దైత్యేశ్వర! కార్యమన్యత్ ॥ 40 ॥**

అపుడు ఆ భయంకరభుజంగాలు "మా కోరలు విరిగిపోయాయి. మణులు చెల్లాచెదరయిపోతున్నాయి. పడగలు చితికి మండిపోతున్నాయి. గుండెలలో మిక్కిలి దడ బయలుదేరింది. ఈతని శరీరానికి ఏ కొద్దిపాటి హాని కలగలేదు. కాబట్టి అసురసార్వభౌమా! మరోపని నియోగించు" అని గగ్గోలుపెట్టాయి.

**హే దిగ్గజాః! సంకటదన్తమిశ్రా! ఘ్నతైనమస్మద్రిపుపక్షభిన్నమ్ ।**
**తజ్జా వినాశాయ భవన్తి తస్య యథారణేః ప్రజ్వలితో హుతాశః ॥ 41 ॥**

అంత దైత్యేశ్వరుడు "ఓసి దిగ్గజాల్లారా! శత్రుపక్షంవారిచే నా నుండి విడదీయబడ్డ ఈ కుఙ్కుకుంకను మీ బలిష్ఠాలైన బాధను పొందించే చతుర్దంతాలతో పొడిచి క్రుమ్మి చంపండి. అరణివల్ల పుట్టి భగభగమండే అగ్ని అరణినే నాశనం చేసేటట్లుగా, తానుగన్నవారే తనకు వినాశకులవుతారు" అని శాసించాడు.

**తతః స దిగ్గజైర్బాలో భూభృచ్ఛిఖరసన్నిభైః ।**
**పాతితో ధరణీపృష్ఠే విషాణైరవపీడితః ॥ 42 ॥**

అపుడు పరత్వశిఖరాలతో సమానమైన దిగ్గజాలు, ఆ పసిబాలుని నేలపై పడవేసి తమ దంతాలతో మిక్కిలి బాధకలిగేలా పొడిచాయి.

**స్మరతస్తస్య గోవిన్దమిభదన్తాః సహస్రశః ।**
**శీర్ణా వక్షఃస్థలం ప్రాప్య స ప్రాహ పితరం తతః ॥ 43 ॥**

అతడు గోవిందుని స్మరిస్తూ ఉన్న కారణంచే, ఏనుగులయొక్క దంతాలు ఆ ప్రహ్లాదుని వక్షః స్థలం తాకి విరిగిపోయి వేలకొలది ముక్కలై పోయాయి. అంత ఆ పసివాడు తండ్రితో ఇలా అన్నాడు.

**ప్రహ్లాద ఉవాచ :-**ప్రహ్లాదుడు పలికాడు

**దన్తా గజానాం కులిశాగ్రనిష్ఠురాః శీర్ణా యదేతే న బలం మమైతత్ ।**
**మహావిపత్పాపవినాశనోఽయం జనార్దనానుస్మరణానుభావః ॥ 44 ॥**

"ఏనుగులదంతాలు వజ్రాయుధంయొక్క మొనలాగా మిక్కిలి కఠినమైనవి. అటువంటివి ముక్కలుముక్కలు అయిపోయాయంటే అది నా బలం మాత్రంకాదు. మహావిపత్తులను, ఘోరపాపాలను నశింపజేసే జనార్దనునియొక్క స్మరణ. పదే పదే చేసే దానియొక్క ప్రభావం సుమా!" అన్నాడు.

**హిరణ్యకశిపురువాచ :-** హిరణ్యకశిపుడు చెప్పాడు

**జ్వాల్యతామసురా! వహ్నిరపసర్పత దిగ్గజాః ।**
**వాయో సమేధయాగ్నిం త్వం దహ్యతామేష పాపకృత్ ॥ 45 ॥**

అపుడు అసురనాథుడు "దిగ్గజాల్లారా! తప్పుకోండి. అసురులారా! అగ్నిని రగుల్కొల్పండి. ఓ వాయువూ! నీవు వహ్నిని ప్రజ్వలింపజేయి. ఈ పాపకర్ముడు దహింపబడుగాక!" అన్నాడు.

**మహాకాష్ఠచయచ్ఛన్నమసురేన్ద్రసుతం తతః ।**
**ప్రజ్వాల్య దానవా వహ్నిం దదహుః స్వామిచోదితాః ॥ (నోదితాః) 46 ॥**

అపుడు ప్రభువాజ్ఞను శిరసావహించి ఆ దానవులు పెద్దపెద్ద కొయ్యదుంగలనడుమ ఆ దైత్యాధిపసూనుని ఉంచి, వహ్నిని ప్రజ్వలింపజేసి అతనిని దహించారు.

**ప్రహ్లాద ఉవాచ :**–ప్రహ్లాదుడు పలికాడు

**తాతైష వహ్నిః పవనేరితోఽపి న మాం దహత్యత్ర సమన్తతోఽహమ్ ।**
**పశ్యామి పద్మాస్తరణాస్తృతాని శీతాని సర్వాణి దిశాం ముఖాని ॥ 47 ॥**

అపుడు ప్రహ్లాదుడు "తండ్రీ! గాలిచే రగుల్కొల్పబడ్డ ఈ అగ్ని నా చుట్టూ వ్యాపించినా నన్ను తగులబెట్టడం లేదు. నా చుట్టూ తామరపూలు పరచినట్లుగా కనబడుతోంది. దిశాభాగాలన్నీ చల్లగా ఉన్నాయి." అన్నాడు.

**అథ దైత్యేశ్వరం ప్రోచుర్భార్గవస్యాత్మజా ద్విజాః ।**
**పురోహితా మహాత్మానః సామ్నా సంస్తూయ వాగ్మినః ॥ 48 ॥**

అపుడు శుక్రాచార్యుని కుమారులు, ద్విజులు, పురోహితులు, మహాత్ములు, వ్యవహారజ్ఞానం తెలిసిపలికేవారు అసురచక్రవర్తిని ముందుగా మెత్తని మంచిమాటలతో పొగడి ఇలా అన్నారు.

**రాజన్ నియమ్యతాం కోపో బాలేఽత్ర తనయే నిజే ।**
**కోపో దేవనికాయేషు యత్ర తే సఫలో యతః ॥ 49 ॥**

"మహారాజా! నీ కుమారుడు అయిన పసిబాలునిపై కోపాన్ని ఆపుకో. నీ కోపం సఫలం కావాలంటే దేవతాసమూహాలపై చూపించు.

**తథా తథైనం బాలం తే శాసితారో వయం నృప ।**
**యథా విపక్షనాశాయ వినీతస్తే భవిష్యతి ॥ 50 ॥**

రాజా! ఈ పసివాడిని దారిలోకి వచ్చేలా మేము తీర్చిదిద్దుతాము. మనశత్రువులను రూపుమాపేటట్లు, నీ పట్ల అణకువ ఉండేటట్లు మేము శిక్షిస్తాము.

**బాలత్వం సర్వదోషాణాం దైత్యరాజాస్పదం యతః ।**
**తతోఽత్ర కోపమత్యర్థం యోక్తుమర్హసి నార్భకే ॥ 51 ॥**

దైత్యరాజా! పసితనమే సర్వానర్థాలకు మూలకారణం. కాబట్టి ఈ అర్భకునిపై మరీ మిక్కిలి కోపాన్ని చూపించడం నీలాంటి వానికి తగదు.

**న త్యక్ష్యతి హరేః పక్షమస్మాకం వచనాద్ యది ।**
**తతః కృత్యాం వధాయాస్య కరిష్యామోఽనివర్తినీమ్ ॥ 52 ॥**

మా శిక్షణలో గురూపదేశం ప్రకారం మనపక్షాన్ని కాదని విష్ణుపక్షం విడవకుండా ఉండిపోతే, కృత్య అనే అభిచారికా భూతవిశేషాన్ని వీనిపై వధార్థం ప్రయోగిస్తాం. దానికి తిరుగుండదు" అని చెప్పారు.

**ఏవమభ్యర్థితస్తైస్తు దైత్యరాజః పురోహితైః ।**
**దైత్యైర్నిష్క్రామయామాస (నిష్కాస) పుత్రం పావకసంచయాత్ ॥ 53 ॥**

ఇలా పురోహితులు మరీ మరీ ప్రార్థించగా, దైత్యప్రభువు తన పుత్రుని నిప్పుమంటలనుండి దైత్యులద్వారా బయటకు రప్పించాడు.

**తతో గురుగృహే బాలః స వసన్ బాలదానవాన్ ।**
**అధ్యాపయామాస ముహురుపదేశాన్తరే గురోః ॥ 54 ॥**

అటుపిమ్మట ప్రహ్లాదకుమారుడు మళ్లీ గురుకులవాసం చేస్తూ, దానవబాలురను చేరదీసి గురువుయొక్క బోధ తరువాత తాను కుడా పాఠాలు చెప్పేవాడు.

**ప్రహ్లాద ఉవాచ :–**ప్రహ్లాదుడు పలికాడు

**శ్రూయతాం పరమార్థో మే దైతేయా దితిజాత్మజాః ।**
**న చాన్యథైతన్మన్తవ్యం నాత్రలోభాది కారణమ్ ॥ 55 ॥**

"దైతేయులారా! దైత్యకుమారులారా! పరమార్థం చెబుతున్నాను. వినండి. అన్యథా భావించకుడు. నేను లోభం, ఆశ మున్నగు కారణాలచే ఈ పాఠాలు బోధించడం లేదు.

**జన్మ బాల్యం తతః సర్వో జన్తుః ప్రాప్నోతి యౌవనమ్ ।**
**అవ్యాహతైవ భవతి తతో౽నుదివసం జరా ॥ 56 ॥**

సమస్త ప్రాణులకు పుట్టుక, బాల్యం, తరవాత యౌవనం క్రమక్రమంగా వస్తూ ఉంటాయి. అటుపిమ్మట రోజూరోజూ గడచిపోయి ముసలితనం తప్పనిసరిగా వచ్చేస్తుంది.

**తతశ్చ మృత్యుమభ్యేతి జన్తుర్దైత్యేశ్వరాత్మజాః! ।**
**ప్రత్యక్షం దృశ్యతే చైతదస్మాకం భవతాం తథా ॥ 57 ॥**

ఆ తరవాత ప్రాణి మరణించడం జరుగుతూ ఉంటుంది. దైత్యరాజనందనులారా! ఇది మీకూ, మాకూ అందరకూ ప్రత్యక్షంగా కనబడేదే సుమా!

**మృతస్య చ పునర్జన్మ భవత్యేతచ్చ నాన్యథా ।**
**ఆగమో౽యం తథా తత్ర నోపాదానం వినోద్భవః ॥ 58 ॥**

చనిపోయినవానికి మళ్లీ జన్మ కలుగుతూ ఉంటుంది. ఇది అసత్యం కాదు. కారణంలేకుండా పుట్టదని ఆగమంకూడా చెబుతోంది. (ఆగమం అనగా శ్రుతిస్మృత్యాది)

**గర్భవాసాది యావత్తు పునర్జన్మోపపాదనమ్ ।**
**సమస్తావస్థకం తావద్ దుఃఖమేవావగమ్యతామ్ ॥ 59 ॥**

ప్రాణి మళ్లీ జన్మపొందినది మొదలు తొలుత గర్భవాసనరకం, పిమ్మట బాల్యయౌవనకౌమార జరాద్యవస్థలు అన్నింట దుఃఖమే అని తెలుసుకోవాలి.

**క్షుత్తృష్ణోపశమం తద్వచ్ఛీతాద్యుపశమం సుఖమ్ ।**
**మన్యతే బాలబుద్ధిత్వాద్ దుఃఖమేవ హి తత్ పునః ॥ 60 ॥**

ఆకలి, దప్పిక ఉపశమించాలంటే అన్నం, దాహం తీర్చే నీరు కారణాలవుతాయి. అట్లే చలిపోవాలంటే అగ్ని సుఖకారణమవుతుంది. ఇవన్నీ బాలభావంతో అజ్ఞానంచే అనుకోవడమేకాని అవి మళ్లీ కాలాంతరంలో దుఃఖమే అవుతోంది.

**అత్యన్తస్తిమితాంగానాం వ్యాయామేన సుఖైషిణామ్ ।**
**భ్రాన్తిజ్ఞానావృతాక్షాణాం ప్రహారోఽపి సుఖాయతే ॥ 61 ॥**

బాగా చచ్చుపడిపోయిన అవయవాలకు వ్యాయమంద్వారా సుఖం అపేక్షిస్తారు. అట్లే భ్రాంతిజ్ఞానం కన్నులను కప్పినవారికి ప్రహారం కూడా అనగా దెబ్బకూడా సుఖమే అనిపిస్తుంది.

వి ॥ ఒకటి చూచి మరొకటి అని భావించే జ్ఞానం భ్రాంతిజ్ఞానం.

**క్వ శరీరమశేషాణాం శ్లేష్మాదీనాం మహాచయః ।**
**క్వ కాన్తిశోభాసౌరభ్యకమనీయాదయో గుణాః ॥ 62 ॥**

శ్లేష్మం మొదలైన సమస్తరోగపదార్థాలకు నిలయమైన ఈ శరీరం ఎక్కడ? దీనికి కాంతి, శోభ, పరిమళం, రామణీయకం మున్నగు గుణాలు ఎక్కడ?

**మాంసాఽసృక్పూయవిణ్మూత్ర స్నాయుమజ్జాస్థిసంహతే ।**
**దేహే చేత్ ప్రీతిమాన్ మూఢో నరకే భవితాపి సః ॥ 63 ॥**

మాంసం, రక్తం, చీము, మలం, మూత్రం, నరాలు, మజ్జ, ఎముకలు వీటి సమూహమైన దేహమందు మక్కువపడే మూఢుడు నరకమందు కూడా మక్కువ కలిగినవాడు అవుతాడు.

**అగ్నేః శీతేన తోయస్య తృషా భక్తస్య చ క్షుధా ।**
**క్రియతే సుఖకర్తృత్వం తద్ విలోమస్య చేతరైః ॥ 64 ॥**

చలివల్ల అగ్ని, దాహంవల్ల నీరు, ఆకలివల్ల ఆహారం దేహానికి సుఖకారకాలవుతున్నాయి. వాటికి వ్యతిరేకమయిన జలం మున్నగునవి అగ్ని మున్నగువానిని శాంతింపచేసి సుఖహేతువులవుతున్నాయి.

**కరోతి హే దైత్యసుతా యావన్మాత్రం పరిగ్రహమ్ ।**
**తావన్మాత్రం స ఏవాస్య దుఃఖం చేతసి యచ్ఛతి ॥ 65 ॥**

ఓ దానవబాలకులారా! ధనకనకవస్తువాహనాదులను తమ అవసరానికి మించి అధికంగా ఎంతగా సమకూర్చుకొంటే, అవి అంతగా చిత్తానికి దుఃఖాన్ని కలిగిస్తున్నాయి.

**యావతః కురుతే జన్తుః సంబంధాన్ మనసః ప్రియాన్ ।**
**తావన్తోఽస్య నిఖన్యన్తే హృదయే శోకశంకవః ॥ 66 ॥**

ప్రాణి కళత్రపుత్రబంధుమిత్రాదిసంబంధాలను మనస్సుకు ఎంతగా ప్రియానుబంధంగా ఏర్పరచుకొంటే, అవి అంతగానూ గుండెలలో దుఃఖశల్యాలై గ్రుచ్చేలా చేస్తాయి.

**యద్ యద్ గృహే తన్మనసి యత్ర తత్రావతిష్ఠతః ।**
**నాశదాహోపహరణం తస్య తత్రైవ తిష్ఠతి ॥ (దాహోపకరణం) 67 ॥**

ప్రాణి ఇంట్లో ఉన్నా బయట ఉన్నా, ఆ ప్రాణికి ఇంట్లో ఉన్న భార్యాపుత్రాది విషయములే మనస్సులో మెదలుతూ ఉంటాయి. యథార్థముగా ఆ వస్తువుల నాశము, దాహము, అపహరణము కూడా మనస్సునందే ఉంటాయి. అనగా మనస్సును తత్త్వముపై మళ్ళిస్తే భార్యాపుత్రాది విషయాలు మనస్సులో గోచరించవు అనిఅర్థం.

**జన్మన్యత్ర మహద్ దుఃఖం మ్రియమాణస్య చాపి తత్ ।**
**యాతనాసు యమస్యోగ్రం గర్భసంక్రమణేషు చ ॥ 68 ॥**

ఈ లోకంలో జన్మించడమే మహాదుఃఖం. మరణించేటప్పుడు అంతకన్న భయంకరదుఃఖం. యమయాతనలు అనుభవించే సమయంలో అంతకన్న మహోగ్రదుఃఖం. తిరిగి జన్మించే సమయంలో ఒక గర్భంనుంచి మరోగర్భంలోనికి మారడంలో అంతకన్న అతితీవ్ర దుఃఖం.

**గర్భే చ సుఖలేశోఽపి భవద్భిరనుమీయతే ।**
**యది తత్ కథ్యతామేవం సర్వం దుఃఖమయం జగత్ ॥ 69 ॥**

గర్భవాసంలో సుఖం ఉంటుందనుకోవడం ఊహించడానికి కూడ శక్యం కాదు. ఏదైనా సుఖం ఉందని మీరు అనుకొంటే అది చెప్పండి. ఈ జగత్తు సర్వమూ దుఃఖమయం మాత్రమే.

**తదేవమతిదుఃఖానామాస్పదేఽత్ర భవార్ణవే ।**
**భవతాం కథ్యతే సత్యం విష్ణురేకః పరాయణమ్ ॥ 70 ॥**

కాబట్టి ఇంత అతిదుఃఖకారకమైన సంసారమనే సాగరంలో మీకు ఒక్క సత్యం చెబుతాను. విష్ణువు ఒక్కడే ముఖ్యమైన దిక్కు.

**మా జానీత వయం బాలా దేహీ దేహేషు శాశ్వతః ।**
**జరాయౌవనజన్మాద్యా ధర్మా దేహస్య నాత్మనః ॥ 71 ॥**

మనం పసివాళ్లం. ఏమిటీ వేదాంతం? అనుకోకండి. దేహాలలో ఉండే దేహి (ఆత్మ) మాత్రమే శాశ్వతుడు. పుట్టుక, యౌవనం, ముసలితనం మున్నగు ధర్మాలు దేహానివి కాని ఆత్మవి మాత్రం కావు.

**బాలోఽహం తావదిచ్ఛాతో యతిష్యే శ్రేయసే యువా ।**
**యువాహం వార్ధకే ప్రాప్తే కరిష్యామ్యాత్మనో హితమ్ ॥ 72 ॥**

కొందరు "నేను పసివాణ్ణి, బాలుణ్ణి. కనుక చిన్నతనంలో ఇష్టం వచ్చినట్లు ఆడుకొని, యువకుడినయ్యాక నాశ్రేయస్సుకొరకు ప్రయత్నిస్తాను" అనుకొంటారు. మరికొందరు "నేను యువకుణ్ణి సుఖం అనుభవించి ముసలితనం వచ్చిన తరువాత నామేలుకొరకు చూచుకొంటాను" అని భావిస్తారు.

**వృద్ధోఽహం మమ కార్యాణి (కర్మాణి) సమస్తాని న గోచరే ।**
**కిం కరిష్యామి మన్దాత్మా సమర్థేన న యత్ కృతమ్ ॥ 73 ॥**

తీరా ముసలితనం వచ్చిన తరవాత ఇంకొందరు "నేను వృద్ధుడనై పోయాను. నేను ఇపుడు ఏదైనా చేద్దామన్నా ఏపనులూ (వస్తువులూ) నా కంటికి కనిపించడం లేదు. ఏం చేయగలను? మందమతినై పోయాను. ఓపిక ఉండగా చేసుకొన్నాను కాను." అని వాపోతారు.

**ఏవం దురాశయాక్షిప్తమానసః పురుషః సదా ।**
**శ్రేయసోఽభిముఖం యాతి న కదాచిత్ పిపాసితః ॥ 74 ॥**

ఈ రీతిగా దురాశ మనస్సును నిత్యం చెదరగొడుతూ ఉండగా, మానవుడు ఎల్లప్పుడూ, తృష్ణాదాహ ప్రపీడితుడై ఎన్నడూ శ్రేయస్సుకు అభిముఖంగా అనుగుణంగా ప్రవర్తించడు.

**బాల్యే క్రీడనకాసక్తా యౌవనే విషయోన్ముఖాః ।**
**అజ్ఞానయన్త్యశక్త్యా చ వార్ధకం సముపస్థితమ్ ॥ 75 ॥**

బాల్యంలో ఆటలలో మునిగిపోతారు. యౌవనంలో విషయసుఖాలలో తేలిపోతారు. తెలియకుండా వచ్చిపడిన ముసలితనాన్ని ఓపిక లేకపోయినా ఎలాగో గడుపుతూ ఉంటారు. ఇది అజ్ఞానుల స్థితి.

**తస్మాద్ బాల్యే వివేకాత్మా యతేత శ్రేయసే సదా ।**
**బాల్యయౌవనవృద్ధాద్యైర్దేహభావైరసంయుతః ॥ 76 ॥**

కాబట్టి జ్ఞానియైనవాడు చిన్నతనంలోనే పసితనం, యుక్తవయస్సు, ముదిమిమున్నగు దేహభావాలతో పెట్టుకోక నిరంతరం ఆత్మశ్రేయస్సుకై ప్రయత్నించాలి.

**తదేతద్ వో మయాఖ్యాతం యది జానీత నానృతమ్ ।**
**తదస్మత్ ప్రీతయే విష్ణుః స్మర్యతాం బన్ధముక్తిదః ॥ 77 ॥**

నాచే చెప్పబడినదంతా మీరు అసత్యం అనుకోకపోతే, మన అందరి ప్రసన్నత కొరకు, విష్ణువును స్మరించండి. ఆయన మనకు సంసారబంధంనుంచి విముక్తి ప్రసాదిస్తాడు.

**ఆయాసః స్మరణే కోఽస్య స్మృతో యచ్ఛతి శోభనమ్ ।**
**పాపక్షయశ్చ భవతి స్మరతాం తమహర్నిశమ్ ॥ 78 ॥**

ఆయన స్మరణంలో ఏమి శ్రమ ఉంటుంది కనుక! ఆయనను ధ్యానిస్తే చాలు సమస్త మంగళాలను ప్రసాదిస్తాడు. పాపవినాశనం కూడా జరుగుతుంది. రాత్రిపగలు అనక ఆయనను స్మరించండి.

**సర్వభూతస్థితే తస్మిన్ మతిర్మైత్రీ దివానిశమ్ ।**
**భవతాం జాయతామేవం సర్వక్లేశాన్ ప్రహాస్యథ ॥ 79 ॥**

సమస్త ప్రాణులయందు అంతర్యామి రూపంలో ఉన్న ఆయన యందు రాత్రి, పవలు అనే కాలభేదం కూడ లేకుండా, మీకు సంప్రీతి, మైత్రి కలగాలి. ఇలా సమస్త క్లేశాలను తొలగించుకోండి.

**తాపత్రయేణాభిహతం యదేతదఖిలం జగత్ ।**
**తదా శోచ్యేషు భూతేషు ద్వేషం ప్రాజ్ఞః కరోతి కః ॥ 80 ॥**

ఈ సమస్త ప్రపంచం ఆధిభౌతికం, ఆధిదైవికం, ఆధ్యాత్మికం అనే తాపత్రయంచే తగలబడుతూఉంటుంది. కాబట్టి సకల జీవులపై జాలి చూపించాలి. ప్రాజ్ఞుడైనవాడు ఎవడూ ఇతర భూతాలపై ద్వేషం చూపించడు కదా!

**అథ భద్రాణి భూతాని హీనశక్తిరహం పరమ్ ।**
**ముదం తథాఽపి కుర్వీత హానిర్ద్వేషఫలం యతః ॥ 81 ॥**

అలాకాక సమస్తజీవులు హాయిగా ఉన్నారని, నేనే మిక్కిలి శక్తిలేని వాణ్ణి అనుకొన్నప్పటికీ, అప్పుడుకూడా సంతోషంగానే ఉండాలి కాని ద్వేషం పనికిరాదు. ఎందువల్లననగా ద్వేషానికి ఫలితం కీడు కదా!

**బద్ధవైరాణి భూతాని ద్వేషం కుర్వన్తి చేత్తతః ।**
**శోచ్యాన్యహోఽతిమోహేన వ్యాప్తానీతి మనీషిణా ॥ 82 ॥**

ఇతర జీవులు వ్యర్థంగా పగబట్టి పరులయందు ద్వేషం చూపిస్తే, అప్పుడు కూడా, అయ్యో! పాపం వీరు అధికమోహంతో అజ్ఞానులై ఉన్నారని జ్ఞాని మరీ ఎక్కువ జాలిపడాలి.

**ఏతే భిన్నదృశాం దైత్యా వికల్పాః కథితా మయా ।**
**కృత్వాఽభ్యుపగమం తత్ర సంక్షేపః శ్రూయతాం మమ ॥ 83 ॥**

ఓ దైత్యులారా! వేర్వేరు దృష్టులు కలవారికి ఉండే విభిన్న సంకల్పాలు మీకు చెప్పడం జరిగింది. వాటినన్నిటినీ సమన్వయపరచి సంక్షేపంగా వివరిస్తాను. వినండి.

**విస్తారః సర్వభూతస్య విష్ణోర్విశ్వమిదం జగత్ ।**
**ద్రష్టవ్యమాత్మవత్ తస్మాదభేదేన విచక్షణైః ॥ 84 ॥**

ఈ సమస్త జగత్తు సర్వభూతస్వరూపుడైన విష్ణువుయొక్క విశ్వాకారవిస్తారమే. కాబట్టి విచక్షణులైనవారు దీనిని అభేదదృష్టితో ఆత్మలాగా (తనను వలె) చూడాలి.

**సముత్సృజ్యాసురం భావం తస్మాద్ యూయం తథా వయమ్ ।**
**తథా యత్నం కరిష్యామో యథా ప్రాప్స్యామ నిర్వృతిమ్ ॥ 85 ॥**

కాబట్టి అసురదేహాభిమానాన్ని పూర్తిగా విడిచిపెట్టి, మీరు మేమూ కూడా, ఏమిచేస్తే ఆత్మానందాన్ని పొందుతామో, ఆ ప్రయత్నం చేద్దాము.

**యా నాగ్నినా న వాఽర్కేణ నేన్దునా నైవ వాయునా ।**
**పర్జన్యవరుణాభ్యాం వా న సిద్ధైర్న చ రాక్షసైః ॥ 86 ॥**

**న యక్షైర్న చ దైత్యేన్ద్రైర్నోరగైర్న చ కిన్నరైః ।**
**న మనుష్యైర్న పశుభిర్దోషైర్నైవాత్మసమ్భవైః ॥ 87 ॥**

**జ్వరాక్షిరోగాతిసారప్లీహగుల్మాదికైస్తథా ।**
**ద్వేషేర్ష్యామత్సరాద్యైర్వా రాగలోభాదిభిః క్షయమ్ ॥ 88 ॥**

**న చాన్యైర్నీయతే కైశ్చిన్నిత్యా హ్యత్యన్తనిర్మలా ।**
**తామాప్నోతి మలం త్యక్త్వా కేశవే హృది సంస్థితే ॥ 89 ॥**
**(తామాప్నోత్యమలే న్యస్య కేశవే హృదయం నరః)**

ఆ ఆనందం అగ్నివల్లగాని, సూర్యునివల్లగాని, చంద్రునివల్లగాని, వాయువువల్లగాని, మేఘంవల్లగాని, వరుణునివల్లగాని, సిద్ధులవల్లగాని, రాక్షసులవల్లగాని, యక్షులవల్లగాని, దైత్యేంద్రులవల్లగాని, పన్నగులవల్లగాని, కిన్నరులవల్లగాని, మనుష్యులవల్లగాని, పశువులవల్లగాని, ఆత్మసంభవాలైన మానసికదోషాలవల్లగాని, జ్వరం, కంటిజబ్బు, అతిసారం, ప్లీహం (హృదయంలో ఎడమదిక్కునుండే అవయవరోగం) గుల్మం మున్నగు శారీరకదోషాలవల్లగాని, ద్వేషం, ఈర్ష్య, మాత్సర్యం మున్నగువాటివల్లగాని, రాగం, లోభం మున్నగు వాటివల్లగాని క్షీణించేది కాదు. ఇతరులచే బలవంతంగా తీసికొనబడేది అంతకన్న కాదు. నిత్యమైనదది. అది అత్యంత నిర్మలమైనట్టిది. జీవుడు విమలుడైన కేశవునిపై హృదయాన్ని పదిలపరచుకొని అటువంటి ఆనందాన్ని పొందుతాడు. (కేశవుని హృదయంలో భావన చేస్తే మాలిన్యం విడిచి ఆనందం పొందుతాడు.)

**అసారసంసారవివర్తనేషు మా యాత తోషం ప్రసభం బ్రవీమి ।**
**సర్వత్ర దైత్యాస్సమతాముపేత సమత్వమారాధన మచ్యుతస్య ॥ 90 ॥**

ఈ సంసారం సారంలేనిది. దీనిని జననమరణరూప మనుష్యపశురాక్షసాది జన్మలుపొంది సంతోషం పొందవద్దు. మీకు మరీ మరీ నొక్కి చెబుతున్నాను. దైత్యులారా! సమస్తాన్ని సమదృష్టితో భావించండి. ఆ సమభావనే అచ్యుతారాధనము.

**తస్మిన్ ప్రసన్నే కిమిహాస్త్యలభ్యం ధర్మార్థకామైరలమల్పకాస్తే ।**
**సమాశ్రితాద్ బ్రహ్మతరోరనంతాన్నిఃసంశయం ప్రాప్స్యథ వై మహత్ఫలమ్ ॥ 91 ॥**

ఆ విష్ణువే ప్రసన్నుడయితే అలభ్యమన్నది ఏమున్నది? ధర్మార్థకామాలు మిక్కిలి అల్పప్రయోజనాన్ని ఇస్తాయి కనుక అవి చాలు. అనంతమైన బ్రహ్మవృక్షాన్ని ఆశ్రయించి, నిస్సంశయంగా మోక్షరూప మహాఫలాన్ని పొందండి" అని ప్రహ్లాదుడు హితబోధ చేశాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే ప్రహ్లాద చరిత్రం నామ సప్తదశోఽధ్యాయః సమాప్తః ॥ 17 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో ప్రహ్లాదుని చరిత్ర అనే పదిహేడవ అధ్యాయం సమాప్తం ॥ 17 ॥

## అష్టాదశోఽధ్యాయః – పదునెనిమిదవ అధ్యాయం

## ప్రహ్లాద చరిత్రమ్ – ప్రహ్లాదుని చరిత్ర

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**తస్యైవం దానవాశ్చేష్టాం దృష్ట్వా దైత్యపతేర్భయాత్ ।**
**ఆచచక్షుః స చోవాచ సూదానాహూయ సత్వరః ॥ 1 ॥**

ఆ ప్రహ్లాదునియొక్క ఈ రీతి చేష్టను చూచి దానవులు దైత్యవిభునకు భయపడి ఆయనకు నివేదించారు. ఆతడు వెంటనే వంటవారిని పిలిపించి ఇలా అన్నాడు.

**హే సూదా! మమ పుత్రోఽసావన్యేషామపి దుర్మతిః ।**
**కుమార్గదేశికో దుష్టో హన్యతామవిలంబితమ్ ॥ 2 ॥**

"ఓ పాచకులారా! వీడు నా కొడుకు. మిక్కిలి దుష్టబుద్ధి అయిపోయాడు. వీడు ఇతరులకు కూడా దుర్మతియై కుమార్గం ఉపదేశిస్తున్నాడు. ఈ పాపిని చంపివేయండి. ఆలస్యం చేయవద్దు.

**హాలాహలం విషం తస్య సర్వభక్ష్యేషు దీయతామ్ ।**
**అవిజ్ఞాతమసౌ పాపో హన్యతాం మా విచార్యతామ్ ॥ 3 ॥**

హాలాహలవిషం వాడు తినే అన్ని ఆహారపదార్థాలలోనూ వాడికి తెలియకుండా కలిపి తినిపించండి. ఆ పాపిని చంపితీరాలి. ఇంక ఆలోచించకండి" అని హిరణ్యకశిపుడు ఆజ్ఞాపించాడు.

**తే తథైవ తతశ్చక్రుః ప్రహ్లాదాయ మహాత్మనే ।**
**విషదానం యథాఽఽజ్ఞప్తం పిత్రా తస్య మహాత్మనః ॥ 4 ॥**

ఆ రాజాజ్ఞను అనుసరించి వాళ్లు అలాగే చేశారు. తండ్రిచే ఎలా చెప్పబడిందో, ఆ విధంగా మహానుభావుడైన, సర్వభూత సమబుద్ధి కలిగి మహాత్ముడనిపించుకొన్న ప్రహ్లాదునకు విషం పెట్టారు.

**హాలాహలవిషం ఘోరమనన్తోచ్చారణేన సః ।**
**అభిమన్త్ర్య సహాన్నేన మైత్రేయ! బుభుజే తదా ॥ 5 ॥**

మైత్రేయా! అపుడు ప్రహ్లాదుడు అనంతునియొక్క నామాన్ని ఉచ్చరించి, హాలాహల విషాన్ని అభిమంత్రించి అన్నంతో సహా ఆరగించాడు.

**అవికారం స తద్ భుక్త్వా ప్రహ్లాదః స్వస్థమానసః ।**
**అనన్తఖ్యాతినిర్వీర్యం జరయామాస తద్విషమ్ ॥ 6 ॥**

అనంతనామసంకీర్తనంవల్ల విషం నిర్వీర్యమై పోయింది. ఏ వికారం కలిగించని ఆ విషాన్ని భుజించి ప్రహ్లాదుడు ఏ మార్పు లేకుండా పదిలపరచుకొన్న చిత్తంతో అరిగించుకొన్నాడు.

**తతస్సూదా భయత్రస్తా జీర్ణం దృష్ట్వా మహద్విషమ్ ।**
**దైత్యేశ్వరముపాగమ్య ప్రణిపత్యేదమబ్రువన్ ॥ 7 ॥**

ఆ తరువాత వంటలవారు మహావిషం అలా జీర్ణమైపోవడం చూచి భయంతో హడలిపోయినవారై, దైత్యేశ్వరుని సమీపించి, పాదాభివందనం గావించి ఇలా పలికారు.

**దైత్యరాజ! విషం దత్తమస్మాభిరతిభీషణమ్ ।**
**జీర్ణం తేన సహాన్నేన ప్రహ్లాదేన సుతేన తే ॥ 8 ॥**

"దైత్యరాజా! అతి భయంకరమైన కాలకూటవిషం మాచే పెట్టబడింది. కాని నీ కుమారుడైన ప్రహ్లాదునిచే అది అన్నంతోసహా జీర్ణం చేసుకొనబడింది" అని వారు విన్నవించారు.

**హిరణ్యకశిపురువాచ :-** హిరణ్యకశిపుడు చెప్పాడు

**త్వర్యతాం త్వర్యతాం హే హే సద్యో దైత్యపురోహితాః ।**
**కృత్యాం తస్య వినాశాయ హ్యుత్పాదయత మా చిరమ్ ॥ 9 ॥**

అంత హిరణ్యకశిపుడు "ఓ దైత్యపురోహితులారా! త్వరపడండి. త్వరపడండి. శీఘ్రంగా ప్రహ్లాదుని కడతేర్చడానికై కృత్యను పుట్టించి ప్రయోగించండి. ఏ మాత్రం ఆలస్యం చేయవద్దు" అని ఆజ్ఞాపించాడు.

**సకాశమాగమ్య తతః ప్రహ్లాదస్య పురోహితాః ।**
**సామపూర్వమథోచుస్తే ప్రహ్లాదం వినయాన్వితమ్ ॥ 10 ॥**

అటుతరవాత పురోహితులు ప్రహ్లాదుని సమీపానికి వచ్చి ఏ మాత్రం విచారం లేకుండా మిక్కిలి సంతోషంతో ఉన్న, వినయవంతుడైన బాలునితో సామపూర్వకంగా ఇలా చెప్పారు.

**జాతస్త్రైలోక్యవిఖ్యాత ఆయుష్మన్! బ్రహ్మణః కులే ।**
**దైత్యరాజస్య తనయో హిరణ్యకశిపోర్భవాన్ ॥ 11 ॥**

"ఆయుష్మంతుడా! మూడులోకాలలోను ప్రసిద్ధి వహించిన బ్రహ్మవంశంలో జన్మించావు. నీవు దైత్యరాజైన హిరణ్యకశిపుని కుమారుడవు.

**కిం దేవైః కిమనన్తేన కిమన్యేన తవాశ్రయః ।**
**పితా తే సర్వలోకానాం త్వం తథైవ భవిష్యసి ॥ 12 ॥**

నీకు దేవతలతో ఏమి ప్రయోజనం? అనంతునితో ఏమి లాభం? మరొకరితో ఏమి ఫలితం? వీరందరూ నీకు రక్షకులు అవుతారా? సర్వలోకాలకు నీతండ్రే ఆశ్రయభూతుడు. నీవు కూడా అదే స్థానంలోకి వచ్చేవాడవుకాగలవు.

**తస్మాత్ పరిత్యజైనాం త్వం విపక్షస్తవసంహితామ్ ।**
**వాచం పితా సమస్తానాం గురూణాం పరమో గురుః ॥ 13 ॥**

కాబట్టి పగవాడిని స్తోత్రం చేసే ఈ మాటలు నీవు విడిచిపెట్టు. నీకు తండ్రిమాత్రమే సంస్తవనీయుడు. సమస్తగురువులలోను పరమగురువు తండ్రికదా!" అని అన్నారు.

**ప్రహ్లాద ఉవాచ :**–ప్రహ్లాదుడు పలికాడు

**ఏవమేతన్మహాభాగాః శ్లాఘ్యమేతన్మహాకులమ్ ।**
**మరీచేః సకలేఽ ప్యస్మిన్ త్రైలోక్యే కోఽ న్యథా వదేత్ ॥ 14 ॥**

అపుడు ప్రహ్లాదుడు "ఓ మహాభాగులారా! మీరన్నమాట సత్యం. ఇది అట్టిదే. ఈ మరీచియొక్క గొప్పదైనవంశం మూడులోకాలలో అన్ని విధాల ప్రశంసనీయమైనది. దానికి భిన్నంగా మరోలా ఎవడూ ఏమీఅనడు.

**పితా చ మమ సర్వస్మిన్ జగత్యుత్కృష్టచేష్టితః ।**
**ఏతదప్యవగచ్ఛామి సత్యమత్రాపి నానృతమ్ ॥ 15 ॥**

నా తండ్రికూడ ఈ సమస్త జగత్తులోనూ మహాపరాక్రమంతో కూడిన ఉత్కృష్టకార్యాలు ఎన్నో చేశాడు. అదీ నాకు పూర్తిగా తెలుసు. అది సత్యం. ఇందులో కొంచెం కూడ అనృతం లేదు.

**గురూణామపి సర్వేషాం పితా పరమకో గురుః ।**
**యదుక్తం భ్రాన్తిరత్రాపి స్వల్పాపి హి న విద్యతే ॥ 16 ॥**

సమస్త గురువులలోను తండ్రే పరమగురువని మీరు అన్నారుకదా! ఆ విషయంలో కూడ ఏ కొద్దిగా కూడ నేను పొరబడతాననేది ఎన్నడూ ఉండదు.

**పితా గురుర్న సన్దేహః పూజనీయః ప్రయత్నతః ।**
**తత్రాపి నాపరాధ్యామీత్యేవం మనసి మే స్థితమ్ ॥ 17 ॥**

తండ్రే గురువు. అందు ఏ మాత్రం సందేహం లేదు. ఆయనే అతి ప్రయత్నంతో పూజింపదగినవాడు. ఆ విషయంలో నేను తప్పు చేసేవాడను కాననే నిశ్చితాభిప్రాయం నా మనస్సులో పరిపూర్ణంగా ఉంది.

**యదేతత్ కిమనన్తేనేత్యుక్తం యుష్మాభిరీదృశమ్ ।**
**కో బ్రవీతి యథాయుక్తం కిన్తు నైతద్ వచోఽ ర్థవత్ ॥ 18 ॥**

**ఇత్యుక్త్వా సోఽ భవన్మౌనీ తేషాం గౌరవయన్త్రితః ।**
**ప్రహస్య చ పునః ప్రాహ కిమనన్తేన సాధ్వితి ॥ 19 ॥**

అయితే మీరు ఒకమాట అన్నారు. ఏమిటది? అనంతునితో ఏమి ప్రయోజనమని? మీచే పలుకబడ్డ ఇటువంటి మాట న్యాయమని ఎవడంటాడు? ఇది అర్థం లేని మాట" అని వారి మీది గౌరవానికి కట్టుబడినవాడై మారుమాటాడక మౌనం వహించాడు. మరల మౌనం వీడి తలపంకిస్తూ చిన్నగానవ్వి "అనంతుడు ఎందుకంటారా మీరు? చాలబాగుంది."

**సాధు భోః కిమనన్తేన సాధు భో గురవో మమ ।**
**శ్రూయతాం యదనన్తేన యది ఖేదం న యాస్యథ ॥ 20 ॥**

చాలబాగున్నదండీ! అనంతునితో ఏం ప్రయోజనమని అంటారా మీరు? గురువులారా! బాగు బాగు! అనంతుడు ఎందుకో చెబుతాను వినండి. మీకు కష్టం కాకపోతే ఏమి లాభమో వివరిస్తాను. ఆలకించండి.

**ధర్మార్థకామమోక్షాఖ్యాః పురుషార్థా ఉదాహృతాః ।**
**చతుష్టయమిదం యస్మాత్ తస్మాత్ కిం కిమిదం వచః (వృథా) ॥ 21 ॥**

ధర్మం, అర్థం, కామం, మోక్షం అనేవి పురుషార్థాలు అంటారుకదా! ఈ నాలుగు పురుషార్థాలు ఎవనివల్ల సిద్ధిస్తాయంటారు మీరు? ఏ అనంతుని వల్ల ఇవి సిద్ధిస్తాయో ఆయనను తెలియక అనంతుడు ఎందుకంటారా మీరు? ఏమిటండీ మీ ఈ మాట?

**మరీచిమిశ్రైర్దక్షాద్యైః (ర్దక్షేణ) తథైవాన్యైరనన్తతః ।**
**ధర్మః ప్రాప్తస్తథైవాన్యైరర్థః కామస్తథా పరైః ॥ 22 ॥**

పూజ్యులైన మరీచులవారు, దక్షుడు మున్నగువారు, మిగిలిన ఇతరులు అనంతుని ద్వారానే ధర్మాన్ని పొందారు. మరికొందరు అర్థాన్ని పొందారు. ఇంకొందరు కామాన్ని పొందారు.

**తత్త్వవేదినో భూత్వా జ్ఞానధ్యానసమాధిభిః ।**
**అవాపుర్ముక్తిమపరే పురుషా ధ్వస్తబన్ధనాః ॥ 23 ॥**

ఆయన తత్త్వం తెలుసుకొని, జ్ఞానం, ధ్యానం, సమాధుల ద్వారా కొందరు సాధకులు బంధనాలు వదలిపెట్టినవారై ముక్తిని పొందారు.

**సమ్పదైశ్వర్యమాహాత్మ్యజ్ఞానసన్తతికర్మణామ్ ।**
**విముక్తేశ్చైకతాలభ్యం మూలమారాధనం హరేః ॥ 24 ॥**

సంపదకు, ఐశ్వర్యానికి, గొప్పదనానికి, జ్ఞానానికి, సంతానానికి, సమస్తకర్మలకు, విముక్తికి అన్నింటికీ ఏకైకమూలం శ్రీహరి ఆరాధనమే లభ్యకారణం.

**యతో ధర్మార్థకామాఖ్యం ముక్తిశ్చాపి ఫలం ద్విజాః ।**
**తేనాపి హి కిమిత్యేవమనన్తేన కిముచ్యతే ॥ 25 ॥**

ద్విజులారా! ఎవనివల్ల ధర్మం, అర్థం, కామం అనే త్రివర్గం, అత్యంత ప్రధానపురుషార్థమైన ముక్తి ఫలంగా లభిస్తూ ఉంటుందో, ఆయన ఎందుకు? ఆ అనంతుడు ఎందుకు? అని ఇలా మీరు ఎందుకు అంటున్నారో కదా!

**కిం చాత్ర బహునోక్తేన భవన్తో గురవో మమ ।**
**వదన్తు సాధు వాఽసాధు వివేకోఽస్మాకమల్పకః ॥ 26 ॥**

పదేపదే ఎందుకిన్ని మాటలు? తమరు నాకు గురువులు. మంచో, చెడో తేల్చి చెప్పండి. మాలాంటివారి జ్ఞానం మిక్కిలి స్వల్పం.” అన్నాడు.

**బహునాత్ర కిముక్తేన స ఏవ జగతః పతిః ।**
**స కర్తా చ వికర్తా చ సంహర్తా చ హృది స్థితః ॥ 27 ॥**
**స భోక్తా భోజ్యమప్యేవం స ఏవ జగదీశ్వరః ।**
**భవద్భిరేతత్ క్షన్తవ్యం బాల్యాదుక్తం తు యన్మయా ॥ 28 ॥**

ఏల పలుమాటలు? అతడే జగత్పతి. అతడే కర్త, వికర్త, సంహర్త, అంతర్యామి. అతడే భోక్త, భోజ్యము కూడా అతడే జగదీశ్వరుడు. మీరు మన్నించాలి. చిన్నతనంకొద్దీ ఏదో చెప్పాను.

**పురుహితా ఊచుః :**–పురోహితులు పలికారు

**దహ్యమానస్త్వమస్మాభిరగ్నినా బాల! రక్షితః ।**
**భూయో న వక్ష్యసీత్యేవం నైవ జ్ఞాతోఽస్య బుద్ధిమాన్ ॥ 29 ॥**

**యదాఽస్మద్వచనాన్మోహగ్రాహం న త్యక్ష్యతే భవాన్ ।**
**తతః కృత్యాం వినాశాయ తవ స్రక్ష్యామ దుర్మతే! ॥ 30 ॥**

అపుడు దైత్యపురోహితులు “బాలకా! నీవు మంటలలో మాడిపోతూ ఉంటే నిన్ను రక్షించాము. నీవు తిరిగి ఇలా అనకుండా ఉంటావనేకదా! నీవు ఇంత అవివేకివని మాకు తెలియనే లేదు. మా మాట ప్రకారం నీవు ఈ మొండి పట్టుదల వదలిపెట్టు. అలాకాకపోతే ఓరి దుర్మతీ! నిన్ను అంతంచేసే కృత్యను సృష్టిస్తాం జాగ్రత్త!” అని గద్దించి పలికారు.

**ప్రహ్లాద ఉవాచ :**–ప్రహ్లాదుడు పలికాడు

**కః కేన హన్యతే జన్తు ర్జన్తుః కః కేన రక్ష్యతే ।**
**హన్తి రక్షతి చైవాత్మా హ్యసత్ సాధు సమాచరన్ ॥ 31 ॥**

**కర్మణా జాయతే సర్వం కర్మైవ గతిసాధనమ్ ।**
**తస్మాత్సర్వప్రయత్నేన సాధుకర్మ సమాచరేత్ ॥ 32 ॥**

అంత ప్రహ్లాదుడు “ఎవడు ఏ ప్రాణిచే చంపబడతాడు? ఏ ప్రాణిచే ఎవడు రక్షించబడతాడు? చెడు ఆచరించి తనను తానే చంపుకొంటాడు. మంచిచేసి తనను తానే రక్షించుకొంటాడు. సర్వమూ కర్మవల్ల జరుగుతూ ఉంటుంది. కర్మమే గతికి సాధనం. కాబట్టి సకలవిధాల ప్రయత్నించి మంచి కర్మ ఆచరించాలి” అన్నాడు.

**ఇత్యుక్తాస్తేన తే క్రుద్ధా దైత్యరాజపురోహితాః ।**
**కృత్యాముత్పాదయామాసుర్జ్వాలామాలోజ్జ్వలాకృతిమ్ ॥ 33 ॥**

ప్రహ్లాదుడు ఈ విధంగా మాట్లాడగా, దైత్యరాజ పురోహితులు మిక్కిలి మండిపడి, అగ్నిజ్వాలలచే మండుతున్న ఆకారంగల కృత్యను సృష్టించారు.

**అతిభీమా సమాగమ్య పాదన్యాసక్షతక్షితిః ।**
**శూలేన సా సుసంక్రుద్ధా తం జఘానాశు వక్షసి ॥ 34 ॥**

ఆ కృత్య మిక్కిలి భయంకరాకారంతో, పెద్దపెద్ద పాదాలతో భూమి బ్రద్దలయ్యేలా మోదుతూ, తీక్ష్ణకోపంతో మండిపడుతూ, ఆ ప్రహ్లాదుని దగ్గరకు చేరి వక్షఃస్థలంపై శూలంతో గట్టిగా పొడిచింది.

**తత్ తస్య హృదయం ప్రాప్య శూలం బాలస్య దీప్తిమత్ ।**
**జగామ ఖణ్డితం భూమౌ తత్రాపి శతధా గతమ్ ॥ 35 ॥**

ఆ ధగధగలాడే కాంతిగల శూలం ఆ బాలుని రొమ్మును తాకి విరిగిపోయి, నేలపై పడి, అక్కడ వందలకొలది ముక్కలయిపోయింది.

**యత్రానపాయీ భగవాన్ హృద్యాస్తే హరిరీశ్వరః ।**
**భంగో భవతి వజ్రస్య తత్ర శూలస్య కా కథా ॥ 36 ॥**

భగవంతుడైన, పరమేశ్వరుడైన, శ్రీహరి ఎక్కడ మనస్సులో విడవకుండా ఉంటాడో, ఆ హృదయానికి తగిలిన వజ్రాయుధమే భగ్నమైపోతుంది కదా! ఇక ఒక శూలం మాట చెప్పేదేముంది?

**అపాపే తత్ర పాపైశ్చ పాతితా తత్ర యాజకైః ।**
**తానేవ సా జఘానాశు కృత్యా నాశం జగామ చ ॥ 37 ॥**

పాపాత్ములైన దైత్యపురోహితులచే పాపరహితుడైన ప్రహ్లాదునియందు ప్రయోగించబడిన కృత్య, అది వారినే ప్రహరించి వెంటనే అదృశ్యమైపోయింది.

**కృత్యయా దహ్యమానాంస్తాన్ విలోక్య స మహామతిః ।**
**త్రాహి కృష్ణేత్యనన్తేతి వదన్నభ్యవపద్యత ॥ 38 ॥**

కృత్యచే దైత్యపురోహితులు తగలబడిపోతూ ఉండడం వీక్షించి, గొప్పదైన దయాస్వభావంకల ఆ బాలుడు "కృష్ణా! అనంతా! వారిని రక్షించు" అంటూ జాలితో వెంటపడ్డాడు.

**సర్వవ్యాపిన్! జగద్రూప! జగత్స్రష్టర్జనార్దన! ।**
**పాహి విప్రానిమానస్మాద్ దుఃసహాన్మంత్రపావకాత్ ॥ 39 ॥**

"ఓ సర్వవ్యాపీ! జగద్రూప! జగత్కర్తృకా! జనార్దనా! ఈ సహించరాని మంత్రాగ్ని నుంచి ఈ విప్రులనురక్షించు.

**యథా సర్వేషు భూతేషు సర్వవ్యాపీ జగద్గురుః ।**
**విష్ణురేవ తథా సర్వే జీవన్త్వేతే పురోహితాః ॥ 40 ॥**

సర్వభూతాలయందు, జగద్గురువైన విష్ణువే సర్వవ్యాపియై యున్నాడు కాబట్టి, ఈ పురోహితులు అందరూ జీవించాలి.

**యథా సర్వగతం విష్ణుం మన్యమానోఽనపాయినమ్ ।**
**చిన్తయామ్యరిపక్షేఽపి జీవన్త్వేతే పురోహితాః ॥ 41 ॥**

విష్ణువు ఎల్లప్పుడూ సర్వులయందు, సర్వత్ర విడువకుండా ఉంటాడని భావన చేసేవాణ్ణి కాబట్టి, శత్రుపక్షమందు ఉన్నవారైనా కూడా ఈ పురోహితులందరూ జీవించాలని కోరుకొంటున్నాను.

**యే హన్తుమాగతా దత్తం యైర్విషం యైర్హుతాశనః ।**
**యైర్దిగ్గజైరహం క్షుణ్ణో దష్టః సర్పైశ్చ యైరపి ॥ 42 ॥**
**తేష్వహం మిత్రభావేన సమః పాపోఽస్మి న క్వచిత్ ।**
**యథా తేనాద్య సత్యేన జీవన్త్వసురయాజకాః ॥ 43 ॥**

ఎవరు నన్ను చంపబూనుకొన్నారో, ఎవరిచే నాకు విషం పెట్టబడిందో, ఎవరిచే నేను మంటలలో నెట్టబడ్డానో, ఎవరి ద్వారా నేను దిగ్గజాలచే క్రుమ్మించబడ్డానో, ఎవరిచే నేను సర్పాలచే కరిపించబడ్డానో, వారందరిపట్ల నాకు సమబుద్ధి మాత్రమే ఉంది. వారిపై స్నేహభావం కలిగి ఉన్నాను. నాకు ఎప్పుడూ పాపపు తలపులేదు. ఆ సత్యభావనవల్ల ఈ అసుర పురోహితులందరూ జీవించాలి” అని ప్రార్థించాడు.

**ఇత్యుక్తాస్తేన తే సర్వే సంస్పృష్టాశ్చ నిరామయాః ।**
**సముత్తస్థుర్ద్విజా భూయస్తం చోచుః ప్రశ్రయాన్వితమ్ ॥ 44 ॥**

ఈ రీతిగా విష్ణువును సంప్రార్థించి ప్రహ్లాదుడు వారిని స్పృశించాడు. వారందరూ వెంటనే స్వస్థులయ్యారు. ఆ ద్విజులు ఒక్కమారుగా లేచి వినయాన్వితుడైన బాలునితో మళ్లీ ఇలా అన్నారు.

**దీర్ఘాయు రప్రతిహతబలవీర్యసమన్వితః ।**
**పుత్రపౌత్రధనైశ్వర్యయుక్తో వత్స! భవోత్తమ! ॥ 45 ॥**

“నాయనా! దీర్ఘాయుష్మంతుడవు కమ్ము. ఏ ఆటంకమూ లేక మహాబలశౌర్యసమన్వితుడవుగా జీవించు. పుత్రులతో, పౌత్రులతో, ధనముతో, ఐశ్వర్యముతో ఎల్లప్పుడూ ఉండు. మహోత్తముడుగా విరాజిల్లు” అని దీవించారు.

**ఇత్యుక్త్వా తం తతో గత్వా యథావృత్తం పురోహితాః ।**
**దైత్యరాజాయ సకలమాచచక్షుర్మహామునే! ॥ 46 ॥**

మునీశ్వరుడవైన మైత్రేయా! ఈ విధంగా వారు ఆశీర్వదించి, అనంతరం అక్కడ నుండి వెళ్లి దైత్యరాజును సమీపించి జరిగినదంతా పూసగ్రుచ్చినట్లుగా వివరించారు అని పరాశరుడు చెప్పాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే ప్రహ్లాద చరిత్రం నామ అష్టాదశోఽధ్యాయః సమాప్తః ॥ 18 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో ప్రహ్లాదుని చరిత్ర అనే పదునెనిమిదవ అధ్యాయం సమాప్తం ॥ 18 ॥

## ఏకోనవింశోఽధ్యాయః – పందొమ్మిదవ అధ్యాయం

## ప్రహ్లాదకృత విష్ణుస్తుతిః – ప్రహ్లాదకృత విష్ణుస్తుతి

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**హిరణ్యకశిపుః శ్రుత్వా తాం కృత్యాం వితథీకృతామ్ ।**
**ఆహూయ పుత్రం పప్రచ్ఛ ప్రభావస్యాస్య కారణమ్ ॥ 1 ॥**

హిరణ్యకశిపుడు ఆ కృత్య పనికిరాకుండా వమ్మైపోయిందని విని, పుత్రుని పిలిచి ఈ నీ ప్రభావానికి కారణమేమిటని ప్రశ్నించాడు.

**ప్రహ్లాద! సుప్రభావోఽసి కిమేతత్తే విచేష్టితమ్ ।**
**ఏతన్మన్త్రాదిజనితముతాహో సహజం తవ ॥ 2 ॥**

"ప్రహ్లాదా! అత్యంతమహిమాన్వితుడవు. నీకు ఇట్టి గొప్ప శక్తి మంత్రాదులవల్ల కలిగిందా? లేదా సహజసిద్ధంగా లభించిందా? ఏమిటీ విచిత్రం?" అని తండ్రి అడిగాడు.

**ఏవం పృష్టస్తదా పిత్రా ప్రహ్లాదోఽసురబాలకః ।**
**ప్రణిపత్య పితుః పాదావిదం వచనమబ్రవీత్ ॥ 3 ॥**

ఈ విధంగా జనకునిచే అడగబడినవాడై, అసురకుమారుడైన ప్రహ్లాదుడు తండ్రి పాదాలకు వంగి నమస్కరించి ఇలా వచించాడు.

**న మన్త్రాదికృతం తాత! న వా నైసర్గికం మమ ।**
**ప్రభావ ఏష సామాన్యో యస్య యస్యాచ్యుతో హృది ॥ 4 ॥**

"తండ్రీ! ఈ మహిమ మంత్రాదులవల్ల సిద్ధించిందీ కాదు, నాకు సహజంగా లభించిందీ కాదు. హృదయంలో ఎవరికెవరికి అచ్యుతుడు కలడో, వారికి అందరికీ ఇది సామాన్యమే.

**అన్యేషాం యో న పాపాని చిన్తయత్యాత్మనో యథా ।**
**తస్య పాపాగమస్తాత హేత్వభావాన్న విద్యతే ॥ 5 ॥**

తండ్రీ! తనకులాగే ఇతరులకు కీడు తలపెట్టనివానికి ఏ హాని రాదు. ఇతరులపై పాపచింత చేయనివానికి ఏ పాపం అంటదు. కారణం లేనందువల్ల కార్యం పుట్టదుకదా!

**కర్మణా మనసా వాచా పరపీడాం కరోతి యః ।**
**తద్బీజం జన్మ ఫలతి ప్రభూతం తస్య చాశుభమ్ ॥ 6 ॥**

కర్మచేత, మనస్సుచేత, వాక్కుచేత త్రికరణాలద్వారా ఎవడు ఇతరునికి పీడ కలిగించునో, అదియే బీజంగాగల జన్మకలిగి, వానికి మిక్కిలి అశుభాన్ని పొందిస్తుంది.

**సోఽహం న పాపమిచ్ఛామి న కరోమి వదామి వా ।**
**చిన్తయన్ సర్వభూతస్థమాత్మన్యపి చ కేశవమ్ ॥ 7 ॥**

సర్వప్రాణులలోను, నాయందు ఉన్న కేశవుని నిత్యం స్మరిస్తూ, నేను పాపం చేయ తలపెట్టను. పాపం చేయను. పాపం మాట్లాడను.

**శారీరం మానసం దుఃఖం దైవం భూతభవం తథా ।**
**సర్వత్ర శుభచిత్తస్య తస్య మే జాయతే కుతః? ॥ 8 ॥**

ఇలా సర్వత్ర శుభకామనగల చిత్తంగల నాకు శారీరకమైన, మానసికమైన, దైవికమైన, ఇతర భూతాలవల్ల జనించే దుఃఖం ఎలా కలుగుతుంది?

**ఏవం సర్వేషు భూతేషు భక్తిరవ్యభిచారిణీ ।**
**కర్తవ్యా పణ్డితైర్జ్ఞాత్వా సర్వభూతమయం హరిమ్ ॥ 9 ॥**

ఈ విధంగా శ్రీహరిని సర్వభూతమయునిగా తెలిసికొని, పండితులు ఆత్మజ్ఞానంతో సమస్త ప్రాణులయందు అచంచలమైన గాఢమైన భక్తి కలిగి ఉండడం చేయదగిన పని" అని చెప్పాడు.

**ఇతి శ్రుత్వా స దైత్యేన్ద్రః ప్రాసాదశిఖరే స్థితః ।**
**క్రోధాన్ధకారితముఖః ప్రాహ దైతేయకింకరాన్ ॥ 10 ॥**

**దురాత్మా క్షిప్యతామస్మాత్ ప్రాసాదాచ్ఛతయోజనాత్ ।**
**గిరిపృష్ఠే పతత్వస్మిన్ శిలాభిన్నాంగ సంహతిః ॥ 11 ॥**

ప్రహ్లాదుడు అన్నమాటలను విన్న, మేడయొక్క పై అంతస్తులో ఉన్న దైత్య చక్రవర్తి క్రోధంచే నల్లబడ్డ ముఖంకలవాడై, దైత్యకింకరులను పిలిచి "ఈ దుష్టాత్ముని ఈ ప్రాసాదం నుంచి, నూరు యోజనాలెత్తు గలిగిన దీని నుంచి, ఆ కనబడే కొండమీద పడేటట్టు విసరివేయండి. ఆ రాళ్లరాపిడిచే వీడి ప్రతి అవయవం విరిగిపోవాలి" అని ఆజ్ఞాపించాడు.

**తతస్తం చిక్షిపుః సర్వే బాలం దైతేయదానవాః ।**
**పపాత సోఽప్యధః క్షిప్తో హృదయేనోద్వహన్ హరిమ్ ॥ 12 ॥**

అపుడు ఆ కుమారుని దైత్యదానవభటులందరూ పట్టుకొని రాజాజ్ఞా ప్రకారంగా విసరివేశారు. అతడు హృదయంలో శ్రీహరిని వహిస్తూ క్రిందకు పడిపోసాగాడు.

**పతమానం జగద్ధాత్రీ జగద్ధాతరి కేశవే ।**
**భక్తియుక్తం దధారైనముపసంగమ్య మేదినీ ॥ 13 ॥**

జగత్తులను ధరించియుండే విష్ణువుయొక్క భక్తుడు అయిన ప్రహ్లాదుడు క్రిందపడిపోతూఉంటే, జగద్ధాత్రి అయిన భూదేవి ఎదురుగా వెళ్లి ఆ బాలుని పట్టుకొన్నది.

**తతో విలోక్య తం స్వస్థమవిశీర్ణాస్థిపంజరమ్ ।**
**హిరణ్యకశిపుః ప్రాహ శమ్బరం మాయినాం వరమ్ ॥ 14 ॥**

**నాస్మాభిః శక్యతే హన్తుమసౌ దుర్బుద్ధిబాలకః ।**
**మాయాం వేత్తి భవాంస్తస్మాన్మాయయైనం నిషూదయ ॥ 15 ॥**

అపుడు ఎముకలు విరగకుండా, చెక్కుచెదరకుండా ఉన్న ఆ పిల్లవానిని చూచి హిరణ్యకశిపుడు మహామాయావి అయిన శంబరుని పిలిచి "ఈ కుటిలాత్మకుడైన బాలకుని మేము చంపజాలకున్నాము. నీవు అన్ని మాయలు తెలిసున్నవాడవు. కాబట్టి మాయావిద్యాకౌశలంతో వీడిని సంహరించు" అని ఆజ్ఞాపించాడు.

**శంబర ఉవాచ :**–శంబరుడు చెప్పాడు

**సూదయామ్యేష దైత్యేన్ద్ర! పశ్య మాయాబలం మమ ।**
**సహస్రమాత్రం మాయానాం యస్య కోటి శతం తథా ॥ 16 ॥**

అంత శంబరాసురుడు "దైత్యరాజా! వీణ్ణి నేను చంపుతాను. నా మాయాబలం ఎటువంటిదో చూద్దువుగాని. వందలు, వేలు, కోట్ల కొలది మాయలు కల్పిస్తాను." అన్నాడు.

**తతఃస ససృజే మాయాం ప్రహ్లాదే శమ్బకోఽసురః ।**
**వినాశమిచ్ఛన్ దుర్బుద్ధిః సర్వత్ర సమదర్శిని ॥ 17 ॥**

అట్లు పలికి శంబరనామకమాయాసురుడు అన్నింటియందు సమబుద్ధి కలిగిన ప్రహ్లాదుని మహాదుర్బుద్ధియై మట్టుపెట్టాలని మాయను ప్రయోగించాడు.

**సమాహితమతిర్భూత్వా శమ్బరేఽపి విమత్సరః ।**
**మైత్రేయ సోఽపి ప్రహ్లాదః సస్మార మధుసూదనమ్ ॥ 18 ॥**

మైత్రేయా! ఆ ప్రహ్లాదుడు కూడా సావధానచిత్తంతో శంబరునిపైన కూడా ఏ మాత్రం ద్వేషం లేకుండా, మధుసూదననే స్మరించాడు.

**తతో భగవతా తస్య రక్షార్థం చక్రముత్తమమ్ ।**
**ఆజగామ సమాజ్ఞప్తం జ్వాలామాలి సుదర్శనమ్ ॥ 19 ॥**

**తేన మాయాసహస్రం తచ్ఛమ్బరస్యాశుగామినా ।**
**బాలస్య రక్షతా దేహమేకైకం చ నిషూదితమ్ ॥ 20 ॥**

అపుడు భగవంతుడు అతని రక్షణార్థం ఆజ్ఞాపించడం చేత, జ్వాలామాలికలు గల సుదర్శన చక్రం వెంటనే వచ్చింది. అది వేగంగా తిరుగుతూ, ఆ పసివానిదేహం కాపాడుతూ, ఆ శంబరునియొక్క వేలకొలది మాయలను ఒక్కొక్క దానిని మటుమాయం చేసింది.

**సంశోషకం తథా వాయుం దైత్యేన్ద్రస్త్విదమబ్రవీత్ ।**
**శీఘ్రమేష మమాదేశాద్ దురాత్మా నీయతాం క్షయమ్ ॥ 21 ॥**

అంత దైత్యప్రభువు శంబరుని మాయ వమ్ము కావడం చూచి సమస్తాన్ని శోషింపజేసే (ఆర్చివేసే) వాయువుతో "నా ఆజ్ఞతో శీఘ్రంగా ఈ దురాత్ముణ్ణి నాశనం చేయాలి" అని ఆనతిచ్చాడు.

**తథేత్యుక్త్వా తు సోఽప్యేనం వివేశ పవనో లఘు ।**
**శీతోఽతిరూక్షః శోషాయ తద్దేహస్యాతిదుస్సహః ॥ 22 ॥**

'అలాగే' అని పవనుడు ఆ బాలుని దేహం శోషింపజేయాలని మిక్కిలి చల్లదనం, అతిరూక్షత్వం, బహుదుస్సహం, కడుతేలిక అయిన సూక్ష్మరూపంతో అతనిలో ప్రవేశించాడు.

**తేనావిష్టమథాఽఽత్మానం స బుధ్వా దైత్యబాలకః ।**
**హృదయేన మహాత్మానం దధార ధరణీధరమ్ ॥ 23 ॥**

ఆ దైత్యకుమారుడు తనను వాయువు ఆవేశించినట్లు తెలుసుకొన్నవాడై, మహానుభావుడైన ధరణీధరుడైన భగవంతుని ధ్యానం చేశాడు.

**వి ॥** ధరణీధరుడు: శేషస్వరూపుడైన అనంతుడు.

**హృదయస్థస్తతస్తస్య తం వాయుమతిభీషణమ్ ।**
**పపౌ జనార్దనః క్రుద్ధః స యయౌ పవనః క్షయమ్ ॥ 24 ॥**

ఆతని హృదయంలో ఉన్నవాడై జనార్దనుడు మిక్కిలి క్రోధించి మహాభీషణమైన ఆ వాయువును పీల్చివేశాడు (త్రాగివేశాడు). అప్పుడు వాయువుకే నష్టం వచ్చింది.

**క్షీణాసు సర్వమాయాసు పవనే చ క్షయం గతే ।**
**జగామ సోఽపి భవనం గురోరేవ మహామతిః ॥ 25 ॥**

ఇలా సకలమాయలు మటుమాయం కాగా, పవనుడు కూడా సమసిపోగా, యథాపూర్వకంగా ఆ మహామతియైన ప్రహ్లాదుడు తిరిగి గురుకులవాసానికి వెళ్లాడు.

**అహన్యహన్యథాచార్యో నీతిం రాజ్యఫలప్రదామ్ ।**
**గ్రాహయామాస తం బాలం రాజ్ఞాముశనసా కృతామ్ ॥ 26 ॥**

అటుపిమ్మట ఆచార్యుడు ప్రతిదినం రాజులనుద్దేశించి శుక్రాచార్యునిచే బోధింపబడ్డ రాజ్యపరిపాలనా పూర్వకమైన, ఫలప్రదాయకమైన నీతిశాస్త్రాన్ని ఆ కుమారునకు ఉపదేశించేవాడు.

**గృహీతనీతిశాస్త్రం తం వినీతం చ యదా గురుః ।**
**మేనే తదైనం తత్పిత్రే కథయామాస శిక్షితమ్ ॥ 27 ॥**

నీతి శాస్త్రముయొక్క అధ్యయనం పూర్తిఅయ్యాక, అతడు నయశాస్త్రకోవిదుడయ్యాడని గురువు భావించాడు. ఆ విషయాన్నే ప్రహ్లాదుడు సుశిక్షితుడయ్యాడని తండ్రికి తెలియజేశాడు.

**గృహీతనీతిశాస్త్రస్తే పుత్రో దైత్యపతే! కృతః ।**
**ప్రహ్లాదస్తత్త్వతో వేత్తి భార్గవేణ యదీరితమ్ ॥ 28 ॥**

"దైత్యసార్వభౌమా! నీ తనయుడు నీతిశాస్త్రం పూర్తిగా నేర్చాడు. శుక్రాచార్యులు బోధించిన తత్త్వాన్ని హృద్గతం కావించుకొన్నాడు" అని గురువు రాజుకు వివరించాడు.

**హిరణ్యకశిపురువాచ :–** హిరణ్యకశిపుడు చెప్పాడు

**మిత్రేషు వర్తేత కథమరివర్గేషు భూపతిః ।**
**ప్రహ్లాద! త్రిషు కాలేషు మధ్యస్థేషు కథం చరేత్ ॥ 29 ॥**

అంత హిరణ్యకశిపుడు "ప్రహ్లాదా! భూపాలకుడైన రాజు మిత్రులపట్ల ఎలా వ్యవహరించాలి? శత్రువుల పట్ల ఎలా మెలగాలి? మూడు కాలాలలోను మధ్యస్థుల విషయంలో ఎలా ప్రవర్తించాలి?

**కథం మన్త్రిష్వమాత్యేషు బాహ్యేష్వభ్యన్తరేషు చ ।**
**చారేషు పౌరవర్గేషు శంకితేష్వితరేషు చ ॥ 30 ॥**

మంత్రులయందు, అమాత్యులయందు, అంతఃపురానికి వెలుపల ఉండే సేవకులయందు, అంతపురంలో ఉండే రాజభటులయందు, గూఢచారులయందు, పురప్రజాసమూహములయందు, బలవంతంగా దాసులుగా జేయబడ్డ కింకరులయందు, తదితరులయందు రాజు ఎలా వ్యవహరించాలి?

**కృత్యాకృత్యవిధానేషు దుర్గాటవికసాధనే ।**
**ప్రహ్లాద! కథ్యతాం సమ్యక్ తథా కణ్టకశోధనే ॥ 31 ॥**

ప్రహ్లాదా! చేయదగినవాటియందు (సంధి), చేయదగనివాటియందు (విగ్రహము), వాటి విధానములందు, కోటలను స్వాధీనపరచుకొనుట యందు, ఆటవికులను లోబరచుకొనుటయందు, కంటకప్రాయులైన అరిచోరవర్గాలను ఏరిపారవేయుట యందు రాజు ఎలా చక్కగా ప్రవర్తించాలో చెప్పు.

**ఏతచ్చాన్యచ్చ సకలమధీతం భవతా యథా ।**
**తథా మే కథ్యతాం జ్ఞాతుం తవేచ్ఛామి మనోగతమ్ ॥ 32 ॥**

ఇదీ, ఇదికాకుండా నీవు చదివింది ఇంకా ఏదైనా ఉంటే దానినంతా నాకు వివరించు. నీ మనస్సులో ఉన్నదంతా నేను తెలుసుకోవాలని కోరుకొంటున్నాను" అని కుమారుని ప్రశ్నించాడు.

వి ॥ 1. మూడుకాలాలు – అభివృద్ధిదశ, సమదశ, క్షీణదశ.

2. మిత్రులు – మూడురకాలు. సహజులు, ప్రాకృతులు, కృత్రిములు అని. మేనమామ బిడ్డలు సహజులు మొ॥. శత్రువుకు శత్రువులు ప్రాకృతులు. దానాదులవల్ల ఏర్పడినవారు కృత్రిములు.

3. శత్రువులు – మూడురకాలు. 1.దాయాదులు, 2.ప్రాకృతులు, 3. కృత్రిములు

4. మధ్యస్థులు – మూడురకాలు. 1. తనకు శత్రురాజ్యానికి మధ్య ఉండేవారు. 2. పెరుగుదలపట్ల తరుగుదలపట్ల ఉదాసీనంగా ఉండేవారు. 3. తనదేశానికి, శత్రుదేశానికి సామరస్యం కూర్చేవారు.

5. ప్రవర్తనలు – వర్షణం, ఆదానం, అనుప్రవేశం, మాధ్యస్థ్యం, పూర్ణత్వం, ప్రియత్వం, సహిష్ణుత్వం– అని ఏడువిధాలు.

6. మంత్రులు అనగా బుద్ధిసహాయులు.

7. అమాత్యులు అనగా కార్యసహాయులు.

8. కరణీయములనగా సంధివిగ్రహాదులు.

**ప్రణిపత్య పితుః పాదౌ తథా ప్రశ్రయభూషణః ।**
**ప్రహ్లాదః ప్రాహ దైత్యేన్ద్రం కృతాంజలిపుటస్తథా ॥ 33 ॥**

అపుడు వినయమే ఆభరణంగా కల్గిన ప్రహ్లాదుడు జనకుని పాదాలకు వంగి నమస్కరించి దోసిలియొగ్గి ఆ దైత్యచక్రవర్తితో ఇలా అన్నాడు.

**మమోపదిష్టం సకలం గురుణా నాత్ర సంశయః ।**
**గృహీతం చ మయా కిన్తు న సదేతన్మతం మమ ॥ 34 ॥**

"గురువు నాకు సమస్తమూ ఉపదేశించాడు. ఇందు కించిత్తు కూడా సందేహం లేదు. నేను సకలం గ్రహించాను. అయితే ఒక్కవిషయం. ఈ నీతి మంచిదికాదని నా అభిప్రాయం.

**సామ చోపప్రదానం చ భేదదణ్డౌ తథాఽపరౌ ।**
**ఉపాయాః కథితాః సర్వే మిత్రాదీనాం చ సాధనే ॥ 35 ॥**

సామోపాయం, దానవిధానం, భేదదండోపాయాలు – ఈ ఉపాయాలన్నీ నాకు బోధించబడ్డాయి. ఇవన్నీ మిత్రాదులను తన వశంలో ఉంచుకోవడానికి చెప్పబడ్డమార్గాలు.

**తానేవాహం న పశ్యామి మిత్రాదీంస్తాత! మా క్రుధః ।**
**సాధ్యాభావే మహాబాహో! సాధనైః కిం ప్రయోజనమ్ ॥ 36 ॥**

తండ్రీ! నీవు కోపపడకు. నాకు ఎవరిని చూచినా మిత్రులు అనే అపేక్షయే కలుగదు (అమిత్రులు అనే ఉపేక్ష ఉండదు) అటువంటప్పుడు ఓ మహాబాహువా! సాధ్యమే లేనప్పుడు సాధనాలవల్ల ప్రయోజనం ఏముంటుంది కనుక!

**సర్వభూతాత్మకే తాత! జగన్నాథే జగన్మయే ।**
**పరమాత్మని గోవిన్దే మిత్రామిత్రకథా కుతః ॥ 37 ॥**

తండ్రీ! సర్వప్రాణి హృదయాంతర్గతుడు, జగన్నాథుడు, జగన్మయుడు, పరమాత్మ అయిన గోవిందుడు అంతటా అన్ని భూతాలలోనూ ఉండగా వీరు మిత్రులు, వీరు అమిత్రులు అనే మాట ఎందులకు?

**త్వయ్యస్తి భగవాన్ విష్ణుర్మయి చాన్యత్ర చాస్తి సః ।**
**యతస్తతోఽయం మిత్రం మే శత్రుశ్చేతి పృథక్ కుతః ॥ 38 ॥**

భగవంతుడైన విష్ణువు నీలోనూ ఉన్నాడు. నాలోనూ ఉన్నాడు. ఇతరులయందూ ఉన్నాడు. ఎటుచూచినా అటు అతడు ఉంటే వీడు నాకు మిత్రము, వీడు నాకు శత్రుడు అనే భేదం ఎక్కడ?

**తదేభిరలమత్యర్థం దుష్టారమ్భోక్తివిస్తరైః ।**
**అవిద్యాన్తర్గతైర్యత్నః కర్తవ్యస్తాత! శోభనే ॥ 39 ॥**

తండ్రీ! అటువంటప్పుడు దుష్టములైన కర్మలకు సంబంధించిన నీతిశాస్త్రాది వాక్యవిస్తారాలతో ఏమి ప్రయోజనం? అవిద్యతో నిండియున్న కార్యాలకు ప్రయత్నం చేయడంవల్ల ఏమి లాభం? చాలు చాలు. ఆత్మానందం కోసం ప్రయత్నించడం కర్తవ్యం.

**విద్యాబుద్ధి రవిద్యాయామజ్ఞానాత్ తాత! జాయతే ।**
**బాలోఽగ్నిం కిం నఖద్యోతమసురేశ్వర! మన్యతే ॥ 40 ॥**

తండ్రీ! అజ్ఞానంవల్ల అవిద్యయందు విద్యాబుద్ధి కలుగుతుంది. అసురరాజా! బాలుడు మిణుగుడుపురుగును చూచి అగ్ని అనుకోకుండా ఉంటాడా!

**తత్ కర్మ యన్న బన్ధాయ సా విద్యా యా విముక్తయే ।**
**ఆయాసాయాపరం కర్మ విద్యాఽన్యా శిల్పనైపుణమ్ ॥ 41 ॥**

బంధహేతువుగాని కర్మయే కర్మ అనబడుతుంది. మోక్షానికి ఉపయోగించు విద్యయే విద్య అనబడుతుంది. ఇతర కర్మ వృథాప్రయాసం కొరకే. ఇతర విద్య కేవలం శిల్పచాతుర్యం కొరకే.

**తదేతదవగమ్యాహమసారం సారముత్తమమ్ ।**
**నిశామయ మహాభాగ! ప్రణిపత్య బ్రవీమి తే ॥ 42 ॥**

కాబట్టి మహాభాగా! నీతిశాస్త్రాదులవల్ల వచ్చే సారాన్ని నేను సారరహితంగా తెలుసుకొని, ఉత్తమమైనసారాన్ని నీకు శిరసువంచి నమస్కరించి చెబుతున్నాను. ఆలకించు.

**న చిన్తయతి కో రాజ్యం కో ధనం నాభివాంఛతి ।**
**తథాఽపి భావ్యమేవైతదుభయం ప్రాప్యతే నరైః ॥ 43 ॥**

రాజ్యం పరిపాలించాలని ఎవడు అనుకోడు? ధనం సంపాదించాలని ఎవడు కోరడు? అయినప్పటికీ పూర్వకర్మ పుణ్యంవల్ల నరులకు రాజ్యంగాని, ధనంగాని లభ్యాలవుతూ ఉంటాయి.

**సర్వ ఏవ మహాభాగ! మహత్త్వం ప్రతి సోద్యమాః ।**
**తథాఽపి పుంసాం భాగ్యాని నోద్యమా భూతిహేతవః ॥ 44 ॥**

మహాభాగా! అందరూ గొప్పవారు కావాలని, ఐశ్వర్యవంతులు అవ్వాలని ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. అయినప్పటికీ మానవుల సంపదలకు అదృష్టాలు కారణాలు కాని ప్రయత్నాలు మాత్రం కావు.

**జడానామవివేకానామశూరాణా మపి ప్రభో ।**
**భాగ్యభోజ్యాని రాజ్యాని సన్త్యనీతిమతామపి ॥ 45 ॥**

ప్రభూ! జడులకు, అవివేకులకు, శౌర్యంలేని పిరికివారికి, నీతిలేని వారికి కూడా రాజ్యాలు పూర్వకృత కర్మకు సంబంధించిన అదృష్టంవల్ల భోగ్యాలు అవుతున్నాయి.

**తస్మాద్ యతేత పుణ్యేషు య ఇచ్ఛేన్మహతీం శ్రియమ్ ।**
**యతితవ్యం సమత్వే చ నిర్వాణమపి చేచ్ఛతా ॥ 46 ॥**

కాబట్టి గొప్పదైన సంపద కావాలనుకొనేవాడు పుణ్యకర్మలు ఆచరించడానికై ప్రయత్నించాలి. మోక్షం కావాలనుకొనేవాడు సమత్వం కోసమై యత్నించాలి.

**దేవా మనుష్యాః పశవః పక్షివృక్షసరీసృపాః ।**
**రూపమేతదనన్తస్య విష్ణోర్భిన్నమివ స్థితమ్ ॥ 47 ॥**

దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు, వృక్షాలు, సరీసృపాలు (సర్పాలు) అన్నియు ఆ అనంతుని రూపమే. విష్ణువుకన్న వేరుగా ఉన్నట్లు కనబడుతోంది.

**ఏతద్విజానతా సర్వం జగత్ స్థావరజంగమమ్ ।**
**ద్రష్టవ్యమాత్మవద్ విష్ణుర్యతోఽయం విశ్వరూపధృక్ ॥ 48 ॥**

ఈ సంగతి తెలిసినవాడు స్థావరజంగమాత్మకమైన చరాచరజగత్తునంతా అంతర్యామి అయిన ఆత్మలా (తననువలె) చూడాలి. ఎందువల్లననగా ఈ విష్ణువు విశ్వరూపుడు కదా!

**ఏవం జ్ఞాతే స భగవాననాదిః పరమేశ్వరః ।**
**ప్రసీదత్యచ్యుతస్తస్మిన్ ప్రసన్నే క్లేశసంక్షయః ॥ 49 ॥**

ఇట్లు తెలిసినవానియందు ఆ భగవంతుడైన, అనాదియైన, పరమేశ్వరుడైన అచ్యుతుడు ప్రసన్నుడు కాగలడు. ఆయన ప్రసన్నుడయితే సమస్తక్లేశాలు నశిస్తాయి అని ప్రహ్లాదుడు వచించాడు.

**ఏతచ్ఛ్రుత్వా తు కోపేన సముత్థాయ వరాసనాత్ ।**
**హిరణ్యకశిపుః పుత్రం పదా వక్షస్యతాడయత్ ॥ 50 ॥**

ఈ రీతిగా పలికిన కుమారుని వచనాలు విని కోపంతో మండిపడి హిరణ్యకశిపుడు ఉన్నతాసనంనుండి ఒక్క ఉదుటున లేచి కొడుకును కాలితో గుండెలపై తన్నాడు.

**ఉవాచ చ స కోపేన సామర్షః ప్రజ్వలన్నివ ।**
**నిక్షిప్య పాణినా పాణిం హన్తుకామో జగద్ యథా ॥ 51 ॥**

క్రోధంతో ఊగిపోయి, అసహనంతో ఒకచేతిని మరొకచేతితో నొక్కుకొంటూ జగత్సంహారానికి సిద్ధపడినట్లు మండిపడుతూ ఇలా అన్నాడు.

**హే విప్రచిత్తే! హే రాహో! హే బలైష మహార్ణవే ।**
**నాగపాశైర్దృఢైర్బధ్వా క్షిప్యతాం మా విలమ్బ్యతామ్ ॥ 52 ॥**

"ఓ విప్రచిత్తీ! రాహువా! బలా! వీడిని గట్టినాగపాశాలతో కట్టివేసి మహాసముద్రంలో పడవేయండి. ఆలస్యం చేయవద్దు.

**అన్యథా సకలో లోకస్తథా దైతేయదానవాః ।**
**అనుయాస్యన్తి మూఢస్య మతమస్య దురాత్మనః ॥ 53 ॥**

మీరలాచేయకపోతే సకలలోకాలు, సమస్తదైత్యదానవులు ఈ దురాత్ముడైనట్టి మూఢుని మతాన్నే అనుసరిస్తారు.

**బహుశో వారితోఽస్మాభిరయం పాపస్తథా పరైః ।**
**స్తుతిం కరోతి దుష్టానాం వధ ఏవోపకారకః ॥ 54 ॥**

బహువిధాల మనం వారించి చూచాము. అయినా ఈ పాపాత్ముడు పరులకు ప్రీతిగొలిపే శత్రుస్తోత్రమే చేస్తున్నాడు. ఇటువంటి దుష్టులను మట్టుపెట్టడమే మనకు ఉపకారం అవుతుంది." అని ఆజ్ఞాపించాడు.

**తతస్తే సత్వరా దైత్యా బధ్వా తం నాగబన్ధనైః ।**
**భర్తురాజ్ఞాం పురస్కృత్య చిక్షిపుః సలిలాశయే ॥ 55 ॥**

అపుడు ఆ దైత్యకింకరులు ప్రభువు ఆజ్ఞను శిరసావహించి నాగపాశాలతో వెంటనే అతనిని బంధించి సముద్రంలోనికి విసరివేశారు.

**తతశ్చచాల చలతా ప్రహ్లాదేన మహార్ణవః ।**
**ఉద్వేలోఽభూత్ పరం క్షోభముపేత్య చ సమన్తతః ॥ 56 ॥**

నీటిపై ప్రహ్లాదుడు తేలియాడుతూ ఉంటే మహాసముద్రం అన్నివైపులా వేలాప్రాంతానికే క్షోభను కలగజేస్తూ, తాను క్షోభిస్తూ ఉప్పొంగిపోయింది.

**భూర్లోకమఖిలం దృష్ట్వా ప్లావ్యమానం మహాంభసా ।**
**హిరణ్యకశిపుర్దైత్యానిదమాహ మహామతే! ॥ 57 ॥**

బుద్ధిమంతుడవైన మైత్రేయా! ఆ మహాసముద్రజలాలలో భూలోకమంతా తేలియాడటం చూచి హిరణ్యకశిపుడు మళ్లీ దైత్యులతో ఇలా అన్నాడు.

**దైతేయాః సకలైః శైలై రత్రైవ వరుణాలయే ।**
**నిశ్ఛిద్రైః సర్వశః సర్వైశ్చీయతామేష దుర్మతిః ॥ 58 ॥**

"దైతేయులారా! ఎన్నోకొండలను తెచ్చి, ఇక్కడే ఈ మహాసముద్రంలోనే ఈ దుర్మతి కప్పబడేలా అన్నివైపులా సందులేకుండా పేర్చండి.

**నాగ్నిర్దహతి నైవాయం శస్త్రైశ్ఛిన్నో న చోరగైః ।**
**క్షయం నీతో న వాతేన న విషేణ న కృత్యయా ॥ 59 ॥**

**న మాయాభిర్న చైవోచ్చాత్ పాతితో న చ దిగ్గజైః ।**
**బాలోఽతి దుష్టచిత్తోఽయం నానేనార్థోఽస్తి జీవతా ॥ 60 ॥**

**తదేష తోయధావత్ర సమాక్రాన్తో మహీధరైః ।**
**తిష్ఠత్వబ్దసహస్రాన్తం ప్రాణాన్ హాస్యతి దుర్మతిః ॥ 61 ॥**

వీడిని అగ్ని దహింపజేయలేకపోయింది. ఆయుధాలు వీడిని హింసించలేకపోయాయి. పాములు కరవలేకపోయాయి. వాయువుచే వీడు నశించలేదు. విషం పని చేయలేదు. కృత్యను ప్రయోగించినా వ్యర్థమై పోయింది. వీడిపట్ల మాయలన్నీ పటాపంచలయ్యాయి. పైనుంచి క్రిందపడవేసినా కాయం గాయం పొందలేదు. దిగ్గజాలు వీడిని వధించలేకపోయాయి. వీడు కుర్రవాడు అయినా దుష్టచిత్తుడు. వీడు బ్రతికి యున్నా ప్రయోజనం శూన్యం. కాబట్టి వీడిని సముద్రంలోని నీళ్లలో కొండలక్రింద వేలకొలది సంవత్సరాలు మ్రగ్గనీయండి. అపుడు తనంతటతానే ఈ దుర్మతి ప్రాణాలు వదలుతాడు" అని శాసించాడు.

**తతో దైత్యా దానవాశ్చ పర్వతై స్తం మహోదధౌ ।**
**ఆక్రామ్య చయనం చక్రుర్యోజనాని సహస్రశః ॥ 62 ॥**

అంత దైత్యదానవులు మహాసముద్రంలో ప్రహ్లాదుని కొండలతో కప్పబడేటట్లుగా, వేలకొలది యోజనాల మేర పేర్చారు.

**స చితః పర్వతై రన్తః సముద్రస్య మహామతిః ।**
**తుష్టావాహ్నికవేలాయామేకాగ్రమతిరచ్యుతమ్ ॥ 63 ॥**

భగవంతునియందు మాత్రమే అర్పించిన బుద్ధికల ఆ ప్రహ్లాదుడు సముద్ర మధ్యభాగంలో పేర్చబడిన కొండల క్రింద ఉండి అనుదినం కావించే నిత్యకర్మాచరణ సమయంలో ఏకాగ్రచిత్తంతో అచ్యుతుని ఇలా స్తుతించాడు.

**నమస్తే పుణ్డరీకాక్ష! నమస్తే పురుషోత్తమ ।**
**నమస్తే సర్వలోకాత్మన్ । నమస్తే తిగ్మచక్రిణే ॥ 64 ॥**

**నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ ।**
**జగద్ధితాయ కృష్ణాయ గోవిన్దాయ నమో నమః ॥ 65 ॥**

తామర పూలవంటి కన్నులు కలవాడా! నీకు నమస్కారం. సమస్త పురుషులలోను ఉత్తముడా! నీకు వందనం. సమస్త లోకాత్మ స్వరూపా! నీకు ప్రణామం. అధికమైన తేజస్సుతో ప్రకాశించే చక్రం కలిగినవాడా! నీకు అభివాదం. నీవు బ్రహ్మజ్ఞులకు దేవుడవు. నీకు నమస్కారం. గోవులకు, బ్రాహ్మణులకు మేలు చేకూర్చువాడవు. నీకు వందనం. జగత్తుకు హితం చేకూర్చే కృష్ణా! గోవిందా! నీకు పదేపదే అభివాదాలు.

**బ్రహ్మత్వే సృజతే విశ్వం స్థితౌ వా లయతే పునః ।**
**రుద్రరూపాయ కల్పాన్తే నమస్తుభ్యం త్రిమూర్తయే ॥ 66 ॥**

బ్రహ్మత్వాన్ని పొంది విశ్వాన్ని సృష్టించి, విష్ణుత్వాన్ని వహించి పాలనంచేస్తూ, కల్పాంతంలో రుద్రత్వాన్ని పూని సంహారంచేసే త్రిమూర్తి స్వరూపుడవైన నీకు నమస్కారం.

**దేవా యక్షాసురాః సిద్ధా నాగా గన్ధర్వకిన్నరాః ।**
**పిశాచా రాక్షసాశ్చైవ మనుష్యాః పశవస్తథా ॥ 67 ॥**

**పక్షిణః స్థావరాశ్చైవ పిపీలికః సరీసృపాః ।**
**భూమి రాపో నభో వాయుః శబ్దః స్పర్శస్తథా రసః ॥ 68 ॥**

**రూపం గన్ధో మనోబుద్ధి రాత్మా కాలస్తథా గుణాః ।**
**ఏతేషాం పరమార్థం చ సర్వమేతత్ త్వమచ్యుత! ॥ 69 ॥**

ఓ అచ్యుతా! దేవతలు, యక్షులు, అసురులు, సిద్ధులు, నాగులు, గంధర్వులు, కిన్నరులు, పిశాచులు, రాక్షసులు, మనుష్యులు, పశువులు, పక్షులు, స్థావరాలు, పిపీలికలు, సరీసృపాలు, భూమి, నీరు, ఆకాశం, వాయువు, అగ్ని, శబ్దం, స్పర్శ, రసం, రూపం, గంధం, మనస్సు, బుద్ధి, ఆత్మ, కాలం, త్రిగుణాలు – వీటన్నింటియొక్క పరమార్థమూ, ఈ సర్వమూ నీవే కదా !

**విద్యావిద్యే భవాన్ సత్యమసత్యం త్వం విషామృతే ।**
**ప్రవృత్తం చ నివృత్తం చ కర్మ వేదోదితం భవాన్ ॥ 70 ॥**

విద్య అవిద్య నీవే. సత్యమూ, అసత్యమూ నీవే. విషమూ, అమృతమూ నీవే. వేదములందు చెప్పబడిన ప్రవృత్తకర్మమూ, నివృత్తకర్మమూ నీవే. (కర్మమార్గమూ, జ్ఞానమార్గమూ నీవే)

**సమస్తకర్మభోక్తా చ కర్మోపకరణాని చ ।**
**త్వమేవ విష్ణో! సర్వాణి సర్వకర్మఫలం చ యత్ ॥ 71 ॥**

మహావిష్ణూ! సమస్త కర్మభోక్తవు నీవే. సకలకర్మ సాధనములూ నీవే. సర్వకర్మఫలము నీవే. ఇంతెందుకు? సర్వమూ నీవే.

**మయ్యన్యత్ర తథాశేష భూతేషు భువనేషు చ ।**
**తవైవ వ్యాప్తిరైశ్వర్యగుణసంసూచికీ ప్రభో! ॥ 72 ॥**

ప్రభూ! నాలోనూ, ఇతరులలోనూ, సకల ప్రాణులలోనూ, సమస్త భువనాలలోనూ, సామర్థ్యంయొక్క ఆధిక్యాన్ని సత్యసంకల్పం మున్నగు గుణాలను సూచించడానికి నీవు వ్యాపించి ఉండడమే లక్షణమై ఉన్నది.

**త్వాం యోగినశ్చిన్తయన్తి త్వాం యజన్తి చ యజ్వినః ।**
**హవ్యకవ్యభుగేకస్త్వం పితృదేవస్వరూపధృక్ ॥ 73 ॥**

నిన్ను యోగులు ధ్యానిస్తూ ఉంటారు. నిన్ను యాజకులు యజిస్తారు. నీవు ఒక్కడవుగా పితృరూపధారివై కవ్యాన్ని, దేవరూపధారివై హవ్యాన్ని భుజిస్తూ ఉంటావు.

**రూపం మహత్తే స్థితమత్ర విశ్వం తతశ్చ సూక్ష్మం జగదేతదీశ ।**
**రూపాణి సర్వాణి చ భూతభేదాస్తేష్వన్తరాత్మాఖ్యమతీవ సూక్ష్మమ్ ॥ 74 ॥**

ఈశ్వరా! ఈ సమస్త బ్రహ్మాండము నీయొక్క స్థూలరూపము. అంతకన్న సూక్ష్మమైనది. ఈ కనబడుతున్న జగత్తుయొక్క రూపం. అంతకన్న మరీ సూక్ష్మమైనవి. భిన్నభిన్న రూపాలలో ఉన్న ప్రాణిసముదాయాలు. వాటి అంతరాత్మ అనేది మరీ సూక్ష్మమైనది.

**తస్మాచ్చ సూక్ష్మాది విశేషణానా**
**మగోచరే యత్ పరమాత్మరూపమ్ ।**
**కిమప్య చిన్త్యం తవ రూపమస్తి**
**తస్మై నమస్తే పురుషోత్తమాయ ॥ 75 ॥**

సూక్ష్మాది విశేషణాలకు అవిషయమైనది నీ పరమాత్మరూపం. అది అనిర్వచనీయమై నట్టిది. అది ధ్యానించడానికి కూడ వీలు కానట్టిది. అట్టి నీ పురుషోత్తమస్వరూపానికి వందనము.

**సర్వభూతేషు సర్వాత్మన్! యా శక్తిరపరా తవ ।**
**గుణాశ్రయా నమస్తస్యై శాశ్వతాయై సురేశ్వర! ॥ (పరేశ్వర) 76 ॥**

సర్వాత్మా! సమస్త భూతాలలో నీ గుణాలను ఆశ్రయించి ఉండే అపరాశక్తి ఉన్నది. పరానికి ఈశ్వరుడవైనవాడా! అట్టి నీ నిత్యస్వరూపిణికి ప్రణామము.

**యాఽతీతగోచరా వాచాం మనసాం చావిశేషణా ।**
**జ్ఞానిజ్ఞానపరిచ్ఛేద్యా తాం వన్దే చేశ్వరీం పరామ్ ॥ 77 ॥**

నీ అపరాశక్తి ఏదైతే ఉన్నదో, అది మాటలకు అందనిది. మనస్సుకు అచింత్యమైనది. అది ఏ విశేషణములేక నిర్విశేషమైనట్టిది. బ్రహ్మజ్ఞానుల జ్ఞానానికి మాత్రమే లక్ష్యమైనట్టిది. అట్టి పరాశక్తి (చిచ్ఛక్తి) ఏదైతే ఉన్నదో, అట్టి ఈశ్వరతత్త్వశక్తికి నమస్కారం.

**ఓం నమో వాసుదేవాయ తస్మై భగవతే సదా ।**
**వ్యతిరిక్తం న యస్యాస్తి వ్యతిరిక్తోఽఖిలస్య యః ॥ 78 ॥**

ఆయనకు వ్యతిరిక్తమైనది (కానిది) ఏమీ లేదు. సమస్తమునకు ఆయన భిన్నస్వరూపుడు. అట్టి భగవంతుడైన వాసుదేవునకు ఎల్లప్పుడూ ప్రణామాలు.

**నమస్తస్మై నమస్తస్మై నమస్తస్మై మహాత్మనే ।**
**నామరూపం న యస్యైకో యోఽస్తిత్వేనోపలభ్యతే ॥ 79 ॥**

ఆయనకు నామమూలేదు. రూపమూలేదు. ఆయన తన ఉనికివల్లనే లభిస్తాడు. అట్టి మహాత్మునకు మనసా వాచా కర్మణా త్రికరణశుద్ధిగా నమస్కారం, ప్రణామం, వందనం.

**యస్యావతారరూపాణి సమర్చన్తి దివౌకసః ।**
**అపశ్యన్తః పరం రూపం నమస్తస్మై మహాత్మనే ॥ 80 ॥**

ఎవని పరరూపాన్ని దేవతాగణాలు వీక్షించలేక వాని అవతారరూపాలను ఆరాధిస్తూ ఉంటారో, అట్టి మహాత్మునకు నమస్కారములు.

**యోఽన్తస్తిష్ఠన్నశేషస్య పశ్యతీశః శుభాశుభమ్ ।**
**తం సర్వసాక్షిణం విష్ణుం నమస్యే పరమేశ్వరమ్ ॥ 81 ॥**

ఏ ఈశ్వరుడు సమస్తమునందు లోపలఉండి శుభకర్మలను, అశుభకర్మలను చూస్తూ ఉంటాడో, అట్టి సర్వసాక్షి అయిన, పరమేశ్వరుడయిన విష్ణుస్వరూపానికి నమస్కరిస్తున్నాను.

**నమోఽస్తు విష్ణవే తస్మై యస్యాభిన్నమిదం జగత్ ।**
**ధ్యేయః స జగతామాద్యః ప్రసీదతు మమావ్యయః ॥ 82 ॥**

ఎవడు సర్వమును వ్యాపించి ఉన్నాడో, ఈ జగత్తు ఎవనికంటె భిన్నము కాదో, ఎవడు సర్వధ్యేయుడు, సర్వజగత్తుకు ఆద్యుడు, నాశములేనివాడు అయి ఉన్నాడో ఆతడు నాపట్ల ప్రసన్నుడగుగాక!

**యత్రోతమేతత్ ప్రోతం చ విశ్వమక్షరమవ్యయమ్ ।**
**ఆధారభూతః సర్వస్య స ప్రసీదతు మే హరిః ॥ 83 ॥**

అక్షరము, అవ్యయము అయిన ఈ విశ్వం ఆయనలో పడుగూపేకగా అనుస్యూతమై ఉంది. కాబట్టి అట్టి సర్వాధారభూతుడైన శ్రీహరి నా ఎడల ప్రసన్నుడగుగాక!

**నమోఽస్తు విష్ణవే తస్మై నమస్తస్మై పునః పునః ।**
**యత్ర సర్వం యతః సర్వం యః సర్వం సర్వసంశ్రయః ॥ 84 ॥**

ఎవనితో ప్రళయకాలంలో సర్వం కలదో, ఎవనివలన సృష్టిసమయంలో సర్వం వస్తూ ఉంటుందో, ఎవడు స్థితి కాలంలో సర్వరూపుడుగా ఉంటాడో, అట్టి సర్వాధారుడైన విష్ణువుకు నమస్కారం. ఆయనకు మరల మరల వందనాలు.

**సర్వగత్వాదనన్తస్య స ఏవాహమవస్థితః ।**
**మత్తః సర్వమహం సర్వం మయి సర్వం సనాతనే ॥ 85 ॥**

అనంతుడు అంతట ఆత్మరూపుడుగా ఉండుటచే నేను ఆ అనంతుడనై ఉన్నాను. నానుంచే సర్వమూ వచ్చింది. నేను సర్వం అయిఉన్నాను. సనాతనుడనైన నాలోనే సర్వమూ ఉంది.

**అహమేవాక్షయో నిత్యః పరమాత్మాత్మసంశ్రయః ।**
**బ్రహ్మసంజ్ఞోఽహమేవాగ్రే తథాఽన్తే చ పరః పుమాన్ ॥ 86 ॥**

నేనే అక్షయుడను. నిత్యుడను. పరమాత్మను. ఆత్మాధారుడను. ఈ జగత్తుకు ముందూ, తరువాతగల బ్రహ్మసంజ్ఞగల పరమపురుషుడను నేనే అని ప్రహ్లాదుడు విష్ణువును తనకన్న వేరుకాదని భావించి స్తుతించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే ప్రహ్లాదకృత విష్ణుస్తుతిరితి ఏకోనవింశోఽధ్యాయః సమాప్తః ॥ 19 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో ప్రహ్లాదకృత విష్ణుస్తుతి అనే పందొమ్మిదవ అధ్యాయం సమాప్తం.॥ 19 ॥



## వింశోఽధ్యాయః - ఇరవైయవ అధ్యాయం

## భగవతః నృసింహస్య ప్రాదుర్భావః - నృసింహభగవానుని ప్రాదుర్భావం

**శ్రీపరాశర ఉవాచ:-** పరాశరుడు చెప్పాడు.

**ఏవం సంచిన్తయన్ విష్ణుమభేదేనాత్మనో ద్విజ! ।**
**తన్మయత్వమవాపాగ్ర్యం మేనే చాత్మానమచ్యుతమ్ ॥ 1 ॥**

ద్విజోత్తమా! ఈ విధంగా ప్రహ్లాదుడు విష్ణువును తనకన్న వేరు కాదని చక్కగా ధ్యానిస్తూ, తానే అచ్యుతుడనని భావిస్తూ, మిక్కిలి శ్రేష్ఠమయిన తన్మయత్వాన్ని పొందాడు.

**విసస్మార తథాత్మానం నాన్యత్కించిదజానత ।**
**అహమేవావ్యయోఽనన్తః పరమాత్మేత్యచిన్తయత్ ॥ 2 ॥**

తనను తాను పూర్తిగా మరచిపోయాడు. ఇతరాన్ని కొంచెంకూడ తెలియనివాడయ్యాడు. నేను "అవ్యయుడను, అనంతుడను, పరమాత్మను" అని పూర్తిగా తలంచాడు.

**తస్య తద్భావనాయోగాత్ క్షీణపాపస్య వై క్రమాత్ ।**
**శుద్ధేఽన్తఃకరణే విష్ణుస్తస్థౌ జ్ఞానమయోఽచ్యుతః ॥ 3 ॥**

అట్టి విష్ణుతాదాత్మ్యభావనాయోగంవల్ల క్రమంగా అతని పాపాలు క్షీణించాయి. జ్ఞానమయుడు, అచ్యుతుడు అయిన విష్ణువు ఆ ప్రహ్లాదుని పరిశుద్ధమైన అంతఃకరణంలో నిలిచాడు.

**యోగప్రభావాత్ ప్రహ్లాదే జాతే విష్ణుమయేఽసురే ।**
**చలత్యురగబన్ధైస్తైర్మైత్రేయ! త్రుటితం క్షణాత్ ॥ 4 ॥**

మైత్రేయా! ఆ అభేదయోగప్రభావకారణంగా అసురుడైన ప్రహ్లాదుడు విష్ణుమయుడై చలింపగా నాగబంధాలు క్షణకాలంలో తునాతునకలై పోయాయి.

**భ్రాన్తగ్రాహగణః సోర్మిర్యయౌ క్షోభం మహార్ణవః ।**
**చచాల చ మహీ సర్వా సశైలవనకాననా ॥ 5 ॥**

జలజంతువులు భయంతో ఇటు అటూ పరిభ్రమించగా, కెరటాలు పరవళ్లు త్రొక్కగా ఆ మహాసముద్రం క్షోభించిపోయింది. పర్వతాలతో, వనాలతో, కాననాలతో సహా భూమి చలించింది.

**స చ తం శైలసంఘాతం దైత్యైర్న్యస్తమథోపరి ।**
**ప్రక్షిప్య తస్మాత్ సలిలాన్నిశ్చక్రామ మహామతిః ॥ 6 ॥**

దైత్యుల ద్వారా తనపై పడవేయబడ్డ పర్వతసమూహాలను లేవనెత్తి ఆ జ్ఞానవంతుడైన ప్రహ్లాదుడు నీటినుంచి పైకి వచ్చాడు.

**దృష్ట్వా చ స జగద్భూయో గగనాద్యుపలక్షితమ్ ।**
**ప్రహ్లాదోఽస్మీతి సస్మార పునరాత్మానమాత్మనా ॥ 7 ॥**

అతడు ఆకాశాదిరూపంలో ఉపలక్షణమై కనబడుతున్న జగత్తును మళ్లీచూచి "నేను ప్రహ్లాదుడను" అని తిరిగి తనను తానుగా స్మరించుకొన్నాడు.

**తుష్టావ చ పునర్ధీమాననాదిం పురుషోత్తమమ్ ।**
**ఏకాగ్రమతిరవ్యగ్రో యతవాక్కాయమానసః ॥ 8 ॥**

మనస్సును, శరీరాన్ని, వాక్కును త్రికరణాలను నియమించుకొన్నవాడై, ఏ ఆలోచన లేనివాడై, ఏకాగ్రచిత్తుడై, ఆ బుద్ధిశాలియైన ప్రహ్లాదుడు అనాదియైన పురుషోత్తముని తొట్రుపాటులేకుండా మళ్లీ ఇలా స్తుతించాడు.

**ఓం నమః పరమార్థార్థస్థూలసూక్ష్మాక్షరాక్షర! ।**
**వ్యక్తావ్యక్త! కలాతీత సకలేశ నిరంజన! ॥ 9 ॥**

ఓంకారరూపశబ్దబ్రహ్మమా! జ్ఞానస్వరూపా! దృశ్యరూపా! జాగ్రద్దృశ్యరూపా! స్వప్నదృశ్యరూపా! కార్యకారణ స్వరూపా! వ్యక్తావ్యక్తస్వరూపా! కలాతీతా! సకలేశ్వరా! నిరంజనా! నమస్కారం.

**గుణాంజన! గుణాధార! నిర్గుణాత్మన్ గుణస్థిర! । (త)**
**మూర్తామూర్త! మహామూర్తే! సూక్ష్మమూర్తే! స్ఫుటాస్ఫుట! ॥ 10 ॥**

గుణానురంజకా! గుణాధారా! నిర్గుణాత్మకా! గుణస్థితా! మూర్తామూర్తరూపా! మహామూర్తీ! సూక్ష్మమూర్తీ! ప్రకాశస్వరూపా! అప్రకాశస్వరూపా! నమస్కారం.

**కరాలరూప! సౌమ్యాత్మన్ విద్యావిద్యామయాఽచ్యుత! ।**
**సదసద్రూపసద్భావ! సదసద్భావభావన! ॥ 11 ॥**

భీకరస్వరూపా! సుందర స్వరూపా! విద్యామయా! అవిద్యామయా! అచ్యుతా! సద్రూపా! అసద్రూపా! సద్భావా! సదసద్భావభావనా! నమస్కారం.

**నిత్యానిత్యప్రపంచాత్మన్! నిష్ప్రపంచామలాశ్రిత! ।**
**ఏకానేక! నమస్తుభ్యం వాసుదేవాదికారణ! ॥ 12 ॥**

నిత్యానిత్యప్రపంచరూపమగు ఆకాశఘటాదిరూపా! ఈ ప్రపంచంకన్న భిన్నంగా ఉండేవాడా! జ్ఞానులచే ఆశ్రయింపబడేవాడా! కారణరూపంలో ఏకరూపా! కార్యరూపంలో అనేకరూపా! వాసుదేవా! ఆదికారణమైన వాడా! నీకు నమస్కారం.

**యః స్థూలసూక్ష్మః ప్రకటః ప్రకాశో యః సర్వభూతో న చ సర్వభూతః ।**
**విశ్వం యతశ్చైతదవిశ్వహేతుర్నమోఽస్తు తస్మై పురుషోత్తమాయ ॥ 13 ॥**

ఎవడు స్థూలరూపంలో ప్రకటింపబడుతూ, సూక్ష్మరూపంలో ప్రకాశింపబడుతూ, ఎవడు సర్వభూత రూపుడై సర్వభూతాతీతుడుగా ఉంటాడో, ఎవడు ఈ విశ్వానికి ఉత్పత్తిహేతుభూతుడయినా విశ్వహేతుకాని వాడుగా ఉంటాడో, అట్టి పురుషోత్తమునకు నమస్కారం.

**తస్య తచ్చేతసో దేవః స్తుతిమిత్థం ప్రకుర్వతః ।**
**ఆవిర్బభూవ భగవాన్ పీతామ్బరధరో హరిః ॥ 14 ॥**
**ససమ్భ్రమస్తమాలోక్య సముత్థాయాకులాక్షరమ్ ।**
**నమోఽస్తు విష్ణవేత్యేతద్ వ్యాజహారాసకృద్ ద్విజ! ॥ 15 ॥**

మైత్రేయా! ఇలా ఏకాగ్రచిత్తంతో స్తోత్రం చేస్తున్న ప్రహ్లాదునకు పీతాంబరధరుడూ, భగవంతుడూ, దేవుడయిన శ్రీహరి సాక్షాత్కరించాడు. ఆ దేవదేవుని చూచి, తత్తరపడినవాడై లేచి, అక్షరాలు తడబడుతూ ఉండగా, అతడు "విష్ణుభగవానునకు నమస్కారం, విష్ణుభగవానునకు నమస్కారం" అని పలుమార్లు అన్నాడు.

**దేవ! ప్రపన్నార్తిహర! ప్రసాదం కురు కేశవ ।**
**అవలోకనదానేన భూయో మాం పావయాచ్యుత! ॥ 16 ॥**

దేవా! ప్రపన్నులయొక్క ఆర్తిని హరించువాడా! కేశవా! నాకు ప్రసన్నుడవు కమ్ము. అచ్యుతా! మళ్లీ నాకు దర్శనమిచ్చి నన్ను పవిత్రుణ్ణి కావించు" అని వేడుకొన్నాడు.

**శ్రీభగవానువాచ :**–భగవంతుడు చెప్పాడు

**కుర్వతస్తే ప్రసన్నోఽహం భక్తిమవ్యభిచారిణీమ్ ।**
**యథాభిలషితో మత్తః ప్రహ్లాద! వ్రియతాం వరః ॥ 17 ॥**

ప్రహ్లాదుని ప్రార్థనను ఆలకించిన హరి "నాపై అచంచలమైన భక్తిని ప్రదర్శించావు. నీ పట్ల నేను ప్రసన్నుడను అయ్యాను. నానుండి నీవు ఏమి అభిలషిస్తున్నావో ప్రహ్లాదా! వరం కోరుకో!" అన్నాడు.

**నాథ! యోనిసహస్రేషు యేషు యేషు వ్రజామ్యహమ్ ।**
**తేషు తేష్వచ్యుతా భక్తి రచ్యుతాఽస్తు సదా త్వయి ॥ 18 ॥**

అంత ప్రహ్లాదుడు "ప్రభూ! నేను ఎన్నివేల జన్మలు ధరించినా, ఆయా జన్మలన్నింటిలోను అచ్యుతా! నీయందు నాకు అచ్యుతమైన ఏకాంతికమైన భక్తి సదా నిలిచి ఉండుగాక!

**యా ప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ ।**
**త్వామనుసరతః సా మే హృదయాన్మాఽపసర్పతు ॥ 19 ॥**

అజ్ఞానులకు విషయములయందు ఎటువంటి విడువనటువంటి అనురాగం ఉంటుందో, అటువంటి ప్రీతి నాకు నిన్ను ఎల్లప్పుడూ స్మరించే నా హృదయం నుంచి తొలగిపోకుండా ఉండాలి!" అని కోరుకున్నాడు.

**శ్రీభగవానువాచ :**-భగవంతుడు చెప్పాడు

**మయి భక్తిస్తవాస్త్యేవ భూయోఽప్యేవం భవిష్యతి ।**
**వరస్తు మత్తః ప్రహ్లాద వ్రియతాం యస్తవేప్సితః ॥ 20 ॥**

అపుడు భగవంతుడు "ప్రహ్లాదా! నాయందు భక్తి నీకు ఎప్పుడూ ఉన్నదే. అట్టి భక్తి ఎప్పటికీ ఇలాగే ఉండగలదు. కాబట్టి నీ కోరికను అనుసరించి వరం ఇష్టమయినది కోరుకో!" అన్నాడు.

**ప్రహ్లాద ఉవాచ :**-ప్రహ్లాదుడు పలికాడు

**మయి ద్వేషానుబన్ధోఽభూత్ సంస్తుతావుద్యతే తవ ।**
**మత్పితుస్తత్కృతం పాపం దేవ! తస్య ప్రణశ్యతు ॥ 21 ॥**

అంత ప్రహ్లాదుడు "నిన్ను స్తుతించడానికి ఉద్యుక్తుడనైన నాయందు, నా తండ్రికి వైరానుబంధం ఏర్పడింది. ఓ దేవదేవా! అందువల్ల వచ్చే పాపం ఏదయితే ఉందో, అది ఆయనకు నశించాలి.

**శస్త్రాణి పాతితాన్యంగే క్షిప్తో యచ్చాగ్నిసంహతౌ ।**
**దంశితశ్చోరగైర్దత్తం యద్విషం మమ భోజనే ॥ 22 ॥**

**బద్ధ్వా సముద్రే యత్ క్షిప్తో యచ్చితోఽస్మి శిలోచ్చయైః ।**
**అన్యాని చాప్యసాధూని యాని యాని కృతాని మే ॥ 23 ॥**

**త్వయి భక్తిమతో ద్వేషాదఘం తత్సమ్భవం చ యత్ ।**
**త్వత్ప్రసాదాత్ ప్రభో! సద్యస్తేన ముచ్యేత మే పితా ॥ 24 ॥**

ప్రభూ! నీపై నాకు అనన్య భక్తి ఉందనే ద్వేషంతో నా దేహంపై ఆయుధాలు ప్రయోగించారు. నన్ను భగభగమండే అగ్నిలో త్రోసివేశారు. పాములచే కరిపించారు. భోజనంలో విషం కలిపి తినిపించారు. నన్ను కట్టివేసి సముద్రంలో విసరివేశారు. కొండలతో కప్పిపెట్టారు. ఎన్ని చేయరాని చెడ్డపనులున్నాయో, అన్నింటి చేతా నానావిధాలుగా నన్ను హింసింపజేశారు. అందువల్ల నాతండ్రికి కలిగిన దురితం ఏదయితే ఉందో, అది నీ అనుగ్రహంవల్ల తత్క్షణమే మాతండ్రి నుండి విడిచి పెట్టబడాలి" అని ప్రార్థించాడు.

**శ్రీభగవానువాచ :**-భగవంతుడు చెప్పాడు

**ప్రహ్లాద! సర్వమేతత్తే మత్ప్రసాదాద్భవిష్యతి ।**
**అన్యం చ తే వరం దద్మి వ్రియతామసురాత్మజ! ॥ 25 ॥**

ప్రహ్లాదుని సంప్రార్థనను విన్న భగవంతుడు "ప్రహ్లాదా! దైత్యనందనా! నా అనుగ్రహంవల్ల నీకు నీ అభిప్రాయానుసారంగా అంతా కలుగుతుంది. మరో వరం నీకు ఇస్తాను కోరుకో." అన్నాడు.

**కృతకృత్యోఽస్మి భగవన్ వరేణానేన యత్ త్వయి ।**
**భవిత్రీ త్వత్ప్రసాదేన భక్తిరవ్యభిచారిణీ ॥ 26 ॥**

**ధర్మార్థకామైః కిం తస్య ముక్తిస్తస్య కరే స్థితా ।**
**సమస్తజగతాం మూలే యస్య భక్తిః స్థిరా త్వయి ॥ 27 ॥**

అపుడు ప్రహ్లాదుడు "ఓ భగవానుడా! నీవిచ్చిన వరంవల్ల కృతకృత్యుడనయ్యాను. నీ అనుగ్రహప్రసారంవల్ల నీయందు నాకు చలించని భక్తి ఎల్లప్పుడూ కలుగుగాక! సమస్తజగత్తులకు ఆదిమూలమైన నీయందు స్థిరమైన భక్తి ఎవరికయితే ఉంటుందో, వారికి ముక్తి అరచేతిలో ఉంటుంది. ఇంక వానికి ధర్మార్థకామాలతో ఏమి ప్రయోజనం ఉంటుంది కనుక?" అని వేడుకొన్నాడు.

**శ్రీభగవానువాచ :**–భగవంతుడు చెప్పాడు

**యథా తే నిశ్చలం చేతో మయి భక్తిసమన్వితమ్ ।**
**తథా త్వం మత్ప్రసాదేన నిర్వాణం పరమాప్స్యసి ॥ 28 ॥**

**ఇత్యుక్త్వాఽన్తర్దధే విష్ణుస్తస్య మైత్రేయ! పశ్యతః । 29 ॥**

అంత భగవంతుడు " నీ చిత్తం ఎల్లప్పుడూ నాయందు అచంచలమైన భక్తితో కూడుకొన్నట్టిదే. కాబట్టి నా అనుగ్రహవిశేషంచే నీవు పరమనిర్వాణం పొందగలవు" అని పలికి మైత్రేయా! అతడు చూస్తూ ఉండగానే విష్ణువు అంతర్ధానమయ్యాడు.

**స చాపి పునరాగమ్య వవన్దే చరణం పితుః ॥ 29 ॥**
**తం పితా మూర్ధ్న్యుపాఘ్రాయ పరిష్వజ్య చ పీడితమ్ ।**
**జీవసీత్యాహ వత్సేతి బాష్పార్ద్రనయనో ద్విజ! ॥ 30 ॥**

ద్విజోత్తమా! ప్రహ్లాదుడు కూడా తిరిగివచ్చి తండ్రి పాదాలకు నమస్కరించాడు. తండ్రి కూడ బాధలపాలయిన ఆతనిని శిరస్సునందు మూర్కొని ఒక్కసారి కౌగలించుకొని "నాయనా! బ్రతికియుంటివా?" అంటూ కన్నీరుతో తడిసిన నయనాలు కల్గినవాడయ్యాడు.

**ప్రీతిమాంశ్చాభవత్తస్మిన్ననుతాపీ మహాసురః ।**
**గురుపిత్రోశ్చకారైవం శుశ్రూషాం సోఽపి ధర్మవిత్ ॥ 31 ॥**

అన్ని భయంకర కృత్యాలు చేయించిన ఆ మహాసురుడు కూడా పశ్చాత్తాపపడినవాడై కుమారునిపై వాత్సల్యం చూపించాడు. ధర్మం తెలిసిన ప్రహ్లాదుడు కూడా తండ్రికి, గురువర్యునకు కూడ సేవలు ఆచరించాడు.

**పితర్యుపరతిం నీతే నరసింహస్వరూపిణా ।**
**విష్ణునా సోఽపి దైత్యానాం మైత్రేయాభూత్ పతిస్తతః ॥ 32 ॥**

మైత్రేయా! ఆ తరువాత నరసింహావతారరూపంలో విష్ణువుచే తన తండ్రి సంహరించబడగా, అతడు దైత్యులకు తదనంతరం ప్రభువయ్యాడు.

**తతో రాజ్యద్యుతిం ప్రాప్య కర్మశుద్ధికరీం ద్విజ! ।**
**పుత్రపౌత్రాంశ్చ సుబహూనవాప్యైశ్వర్యమేవ చ ॥ 33 ॥**

ద్విజప్రవరా! ప్రారబ్ధకర్మను పోగొట్టే భోగానుభవరూపమైన రాజ్యలక్ష్మిని స్వీకరించి, ప్రహ్లాదుడు అనేక పుత్రపౌత్రులను, ఐశ్వర్యాన్ని పొందాడు.

**క్షీణాధికారః స యదా పుణ్యపాపవివర్జితః ।**
**తదాఽసౌ భగవద్ధ్యానాత్ పరం నిర్వాణమాప్తవాన్ ॥ 34 ॥**

ఎప్పుడయితే ప్రారబ్ధకర్మ క్షీణించిందో, అప్పుడు జ్ఞానంవల్ల పూర్వోత్తరపుణ్యపాపాలు విడువడడంతో, ప్రహ్లాదుడు నిరంతర భగవద్ధ్యానంతో పరమనిర్వాణం పొందాడు.

**ఏవం ప్రభావో దైత్యోఽసౌ మైత్రేయాసీన్మహామతిః ।**
**ప్రహ్లాదో భగవద్భక్తో ఽయం త్వం మామనుపృచ్ఛసి ॥ 35 ॥**

మైత్రేయా! ఇట్టి ప్రభావం కలిగినవాడు దైత్యుడయిన ప్రహ్లాదుడు సుమా! అతడు మహాజ్ఞాని. భగవద్భక్తుడు కూడ. అటువంటి ప్రహ్లాదుని గూర్చి నీవు నన్ను పదేపదే ప్రశ్నించావని పరాశరుడు ఇలా అన్నాడు.

**యస్త్వేతచ్చరితం తస్య ప్రహ్లాదస్య మహాత్మనః ।**
**శృణోతి తస్య పాపాని సద్యో గచ్ఛన్తి సంక్షయమ్ ॥ 36 ॥**

ఎవడయితే మహాత్ముడైన ఈ ప్రహ్లాదునియొక్క చరిత్రను వింటాడో, వాని పాపాలు వెంటనే నశించిపోతాయి.

**అహోరాత్రకృతం పాపం ప్రహ్లాదచరితం నరః ।**
**శృణ్వన్ పఠంశ్చ మైత్రేయ! వ్యపోహతి న సంశయః ॥ 37 ॥**

మైత్రేయా! నరుడు ప్రహ్లాదచరిత్రను విన్నా, చదివినా పగలూ రాత్రీ చేసిన పాపం ఏదైనా ఉంటే అదంతా పటాపంచలయిపోతుంది. ఇందు ఇసుమంత కూడా సందేహం లేదు.

**పౌర్ణమాస్యామమావాస్యామష్టమ్యామథ వా పఠన్ ।**
**ద్వాదశ్యాం వా తదాప్నోతి గోప్రదానఫలం ద్విజ ॥ 38 ॥**

ద్విజోత్తమా! పూర్ణిమనాడు కాని, అమావాస్యనాడు కాని, అష్టమినాడు కాని, ద్వాదశినాడు కాని ఈ చరిత్రను పఠించిన నరునకు గోదానం చేసిన ఫలితం కలుగుతుంది.

**ప్రహ్లాదం సకలాపత్సు యథా రక్షితవాన్ హరిః ।**
**తథా రక్షతి యస్తస్య శృణోతి చరితం సదా ॥ 39 ॥**

సమస్తములైన ఆపదలయందు శ్రీహరి ప్రహ్లాదుని ఎలా రక్షించాడో, ఆ ప్రహ్లాదచరిత్రను విన్నవారిని కూడా హరి అలా రక్షిస్తాడని పరాశరుడు మైత్రేయునకు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే భగవతః నృసింహస్య ప్రాదుర్భావో నామ వింశోఽధ్యాయః సమాప్తః ॥ 20 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో నృసింహభగవానుని ప్రాదుర్భావం అనే ఇరవైయవ అధ్యాయం సమాప్తం॥20॥

## ఏకవింశోఽధ్యాయః - ఇరవై ఒకటవ అధ్యాయం

## ప్రహ్లాదవంశవర్ణనమ్ - ప్రహ్లాద వంశవర్ణన

**శ్రీపరాశర ఉవాచ :**-పరాశరుడు పలికాడు.

**సంహ్లాదపుత్రా ఆయుష్మాన్ శిబిర్బాష్కల ఏవ చ ।**
**విరోచనస్తు ప్రాహ్లాదిర్బలిర్జజ్ఞే విరోచనాత్ ॥ 1 ॥**

సంహ్లాదుని కుమారులు ఆయుష్మంతుడు, శిబి, బాష్కలుడు అనేవారు. ప్రహ్లాదుని పుత్రుడు విరోచనుడు. విరోచనునకు బలి జన్మించాడు.

**బలేః పుత్రశతం త్వాసీద్ బాణజ్యేష్ఠం మహామునే ।**
**హిరణ్యాక్షసుతాశ్చాసన్ సర్వ ఏవ మహాబలాః ॥ 2 ॥**

**ఉత్కురః శకునిశ్చైవ భూతసన్తాపనస్తథా । (ఝర్ఝరః)**
**మహానాభో మహాబాహుః కాలనాభస్తథాఽపరః ॥ 3 ॥**

ఓ మహామునీ! బలికి జ్యేష్ఠుడు బాణుడుగా గల్గిన నూరుగురు కుమారులు జన్మించారు. హిరణ్యాక్షుని కుమారులందరూ మహాపరాక్రమవంతులై వాసికెక్కారు. వారు ఉత్కురుడు, శకుని, భూతసంతాపనుడు, మహానాభుడు, మహాబాహుడు, కాలనాభుడు అనేవారు.

**అభవన్ దనుపుత్రాశ్చ ద్విమూర్ధా శమ్బరస్తథా ।**
**అయోముఖశ్శంకుశిరాః కపిలశ్శంకరస్తథా ॥ 4 ॥**

**ఏకచక్రో మహాబాహు స్తారకశ్చ మహాబలః ।**
**స్వర్భాను ర్వృషపర్వా చ పులోమా చ మహాబలః ॥ 5 ॥**

**ఏతే దనోః సుతాః ఖ్యాతా విప్రచిత్తిశ్చ వీర్యవాన్ ।**
**స్వర్భానో స్తు ప్రభా కన్యా శర్మిష్ఠా వార్షపర్వణీ ॥ 6 ॥**

**ఉపదానీ హయశిరాః ప్రఖ్యాతా వరకన్యకాః । 7 ॥**

దనువుయొక్క కుమారులు ద్విమూర్ధుడు, శంబరుడు, అయోముఖుడు, శంకుశిరుడు, కపిలుడు, శంకరుడు, ఏకచక్రుడు, మహాబాహుడు, తారకుడు, మహాబలుడు, స్వర్భానుడు, వృషపర్వుడు, మహాబలశాలి పులోముడు, మహాపరాక్రమశాలి విప్రచిత్తి అనేవారు. విఖ్యాతిలో దనుపుత్రులుగా వాసికెక్కారు. స్వర్భానుని కుమార్తె ప్రభ. వృషపర్వుని కుమార్తెలు శర్మిష్ఠ, ఉపదాని (ఉపదానవి), హయశిర అనేవారు. వీరు ప్రసిద్ధికెక్కిన కన్యారత్నాలు.

**వైశ్వానర సుతే చోభే పులోమా కాలకా తథా ॥ 7 ॥**
**ఉభే సుతే మహాభాగే మరీచేస్తు పరిగ్రహః ।**
**తాభ్యాం పుత్రసహస్రాణి షష్టిర్దానవసత్తమాః ॥ 8 ॥**

వైశ్వానరునకు పులోమ, కాలక అనే ఇరువురు కుమార్తెలు కలరు. ఆ మహాభాగలు ఇద్దరూ మరీచియొక్క పుత్రుడయిన కశ్యపునకు పత్నులయ్యారు. వారికిద్దరికి అరవైవేలమంది పుత్రులు దానవశ్రేష్ఠులు జన్మించారు.

**పౌలోమా కాలకేయాశ్చ మారీచతనయాః స్మృతాః ।**
**తతోఽపరే మహావీర్యా దారుణాస్త్వతినిర్ఘృణాః ॥ 9 ॥**

మరీచి నందనుడైన కశ్యపుని తనయులు పౌలోములు, కాలకేయులుగా వ్యవహరించబడ్డారు. వీరు కాకుండా మహాబలపరాక్రమవంతులైన, అతిభయంకరులైన, దయారహితులైన దైత్యులు ఉన్నారు.

**సింహికాయామథోత్పన్నా విప్రచిత్తేః సుతాస్తథా ।**
**వ్యంశః శల్యశ్చ బలవాన్ నభశ్చైవ మహాబలః ॥ 10 ॥**

**వాతాపిర్నముచిశ్చైవ ఇల్వలః ఖసృమస్తథా ।**
**అన్ధకో నరకశ్చైవ కాలనాభస్తథైవ చ ॥ (అంజకో) 11 ॥**

**స్వర్భానుశ్చ మహావీర్యశ్చక్రయోధీ మహాబలః ।**
**ఏతే తే దానవాః శ్రేష్ఠా దనువంశవివర్ధనాః ॥ 12 ॥**

వారందరూ సింహికయందు విప్రచిత్తికి పుత్రులుగా జన్మించినవారు. వారే వ్యంశుడు, శల్యుడు, బలవంతుడు, నభుడు, మహాబలశాలియైన వాతాపి, నముచి, ఇల్వలుడు, ఖసృముడు, అంధకుడు, నరకుడు, కాలనాభుడు, మహావీర్యవంతుడైన స్వర్భానువు, మహాబలవంతుడైన చక్రయోధి అనేవారు. ఈ దానవశ్రేష్ఠులందరు దనువంశాన్ని విస్తరింపజేశారు.

**ఏతేషాం పుత్రపౌత్రాశ్చ శతశోఽథ సహస్రశః ।**
**ప్రహ్లాదస్య తు దైత్యస్య నివాతకవచాః కులే ॥ 13 ॥**

**సముత్పన్నాః సుమహతా తపసా భావితాత్మనః ।**
**షట్ సుతాః సుమహాసత్త్వాస్తామ్రాయాః పరికీర్తితాః ॥ 14 ॥**

వీరికొడుకులు, మనుమలు వందలూ వేలుగా ఉన్నారు. మిక్కిలి గొప్పదైన తపస్సుతో ఆత్మజ్ఞాని అయిన ప్రహ్లాదదైత్యుని వంశంలో నివాతకవచులు అనేవారు జన్మించారు. కశ్యపమునీంద్రునియొక్క పత్ని అయిన తామ్రకు మిక్కిలి ప్రభావశాలినులైన ఆరుగురు కుమార్తెలు కలిగి బహుప్రశంసలు పొందారు.

**శుకీ శ్యేనీ చ భాసీ చ సుగ్రీవీ శుచి గృధ్రికా ।**
**శుకీ శుకానజనయదులూకీ ప్రత్యులూకకాన్ ॥ 15 ॥**

వారు శుకి, శ్యేని, భాసి, సుగ్రీవి, శుచి, గృధ్రిక అనేవారు. అందు శుకి చిలుకలను, గ్రుడ్లగూబలను, వాటికి ప్రతి కక్షులయిన కాకులను కనెను.

**శ్యేనీ శ్యేనాంస్తథా భాసీ భాసాన్ గృధ్రాంశ్చ గృధ్రికా । (గృధ్రక)**
**శుచ్యౌదకాన్ పక్షిగణాన్ సుగ్రీవీ తు వ్యజాయత ॥ 16 ॥**

**అశ్వానుష్ట్రాన్ గర్దభాంశ్చ తామ్రా వంశః ప్రకీర్తితః ।**
**వినతాయాస్తు పుత్రే ద్వే విఖ్యాతే గరుడారుణే ॥ 17 ॥**

శ్యేనికి డేగలు కలిగాయి. అలాగే భాసికి గంపపులుగులు, గృధ్రికకు గ్రద్దలు, శుచికి జలపక్షిగణాలు, సుగ్రీవికి గుఱ్ఱాలు, ఒంటెలు, గాడిదలు కలిగాయి. ఈ విధంగా తామ్రయొక్క వంశం కీర్తింపబడింది. వినతకు సుప్రసిద్ధులైన గరుడుడు, అరుణుడు అనే ఇద్దరుపుత్రులు కలిగారు.

**సుపర్ణః పతతాం శ్రేష్ఠో దారుణః పన్నగాశనః ।**
**సురసాయాం సహస్రం తు సర్పాణామమితౌజసామ్ ॥ 18 ॥**

వారిలో సుపర్ణుడనేవాడు పక్షులలో శ్రేష్ఠుడు. మహాభయంకరమైనవాడు. పాములే ఆహారంగా కలవాడు. సురసకు మిక్కిలి ప్రభావంకల వేయిసర్పాలు పుట్టాయి.

**అనేకశిరసాం బ్రహ్మన్! ఖేచరాణాం మహాత్మనామ్ ।**
**కాద్రవేయాస్తు బలినః సహస్రమమితౌజసః ॥ 19 ॥**

బ్రాహ్మణోత్తమా! అవి ఎక్కువ శిరస్సులు కలవి. ఆకాశంలో ఎగుర గలిగినట్టివి. చాలపెద్దవయినటు వంటివి. కద్రువ సంతతిగొప్ప ఓజస్సు కల్గిన, మహాబలవంతులయిన వేయిసర్పాలుగా అయ్యాయి.

**సుపర్ణవశగా బ్రహ్మన్! జజ్ఞిరే నైకమస్తకాః ।**
**తేషాం ప్రధానభూతాస్తు శేషవాసుకితక్షకాః ॥ 20 ॥**

**శంఖః శ్వేతో మహాపద్మః కమ్బలాశ్వతరౌ తథా ।**
**ఏలా పుత్రస్తథా నాగః కర్కోటకధనంజయౌ ॥**
**ఏతే చాన్యే చ బహవో దన్దశూకా విషోల్బణాః । 21 ॥**

బ్రాహ్మణప్రవరా! అవన్నీ పలుతలల పాములుగా పుట్టాయి. గరుత్మంతుని అధీనంలో ఉండిపోయాయి. ఆ నాగులలో ప్రధానమైనవారు శేషుడు, వాసుకి, తక్షకుడు, శంఖుడు, శ్వేతుడు (శంఖశ్వేతుడు), మహాపద్మడు, కంబళుడు, అశ్వతరుడు, ఏలాపుత్రుడు, నాగుడు, కర్కోటకుడు, ధనంజయుడు అనేవారు. వీరు, మిగిలిన సర్పాలుకూడా విషంకలవి, కఠినమైనవి.

**గణం క్రోధవశం విద్ధి తస్యాః సర్వే చ దంష్ట్రిణః ॥ 22 ॥**

**స్థలజాః పక్షిణోఽబ్జాశ్చ దారుణాః పిశితాశనాః ।**
**క్రోధా తు జనయామాస పిశాచాంశ్చ మహాబలాన్ ॥ 23 ॥**

ఇక క్రోధవశగణం గూర్చి తెలుసుకో. ఆ సంతతికి అందరకూ కోరలు ఉన్నాయి. అవి నేలపైనా, సంచరించగలవు, ఱెక్కలు కల్గినట్టివై ఆకాశంలోనూ విహరించగలవు. నీటియందు జన్మించినట్టివై జలసంచారం చేయగలవు. మహాభయంకరమైనవి. మాంసం ఆహారంగా కలిగినట్టివి. క్రోధ మహాబలవంతులైన పిశాచాలనుకన్నది.

**గాస్తు వై జనయామాస సురభిర్మహిషాంస్తథా ।**
**ఇరా వృక్షలతావల్లీ తృణజాతీశ్చ సర్వశః ।**
**ఖనా తు యక్షరక్షాంసి మునిరప్సరసస్తథా ॥ 24 ॥**

సురభి గోవులను, మహిషాలను కన్నది. ఇర వృక్షాలను, లతలను, వల్లులను, అనేక విధాలైన తృణజాతులను ప్రభవింపజేసింది. ఖనకు యక్షులు, రాక్షసులు కలిగారు. మునికి అప్సరసలు జన్మించారు.

**అరిష్టా తు మహాసత్త్వాన్ గన్ధర్వాన్ సమజీజనత్ ।**
**ఏతే కశ్యపదాయాదాః కీర్తితాః స్థాణుజంగమాః ॥ 25 ॥**

అరిష్ట మహాబలవంతులైన గంధర్వులను కన్నది. ఈ కశ్యపసంతానం స్థావరజంగమాలుగా కీర్తింపబడ్డారు.

**తేషాం పుత్రాశ్చ పౌత్రాశ్చ శతశోఽథ సహస్రశః ।**
**ఏష మన్వన్తరే సర్గో బ్రహ్మన్! స్వారోచిషే స్మృతః ॥ 26 ॥**

బ్రాహ్మణోత్తమా! ఆ కశ్యపసంతతియొక్క కుమారులు, మనుమలు వందలు, వేలుగా ఉన్నారు. ఇది స్వారోచిషమన్వంతరంలో జరిగిన సృష్టి.

**వైవస్వతే చ మహతి వారుణే వితతే క్రతౌ ।**
**జుహ్వానస్య బ్రహ్మణో వై ప్రజాసర్గ ఇహోచ్యతే ॥ 27 ॥**

వైవస్వతమన్వంతరంలో గొప్పదైన వారుణ క్రతువు జరిగింది. ఆ యజ్ఞంలో బ్రహ్మ స్వయంగా హోత. అతడు కావించిన ప్రజాసృష్టి ఇక్కడ చెప్పబడుతోంది.

**పూర్వం యత్ర తు సప్తర్షీనుత్పన్నాన్ సప్త మానసాన్ ।**
**పుత్రత్వే కల్పయామాస స్వయమేవ పితామహః ॥ 28 ॥**

పూర్వమన్వంతరంలో తన మానసపుత్రులుగా ఉద్భవించిన ఏ సప్తర్షులయితే ఉన్నారో, వారిని ఈ మన్వంతరంలో బ్రహ్మ స్వయంగా ప్రజాభివృద్ధికోసమై వినియోగించాడు.

**గన్ధర్వభోగిదేవానాం దానవానాం చ సత్తమ ।**
**దితిర్వినష్టపుత్రా వై తోషయామాస కశ్యపమ్ ॥ 29 ॥**

సజ్జనోత్తమా! వారిని గంధర్వులకు, నాగులకు, దేవతలకు, దానవులకు సంతానవృద్ధి కోసమై తండ్రులుగా (సృష్టికారకులుగా) నియమించాడు. అనంతరం దితి తన పుత్రులు నష్టపోగా కశ్యప మునీంద్రుని సేవించిసంతుష్ట పరచింది.

**తయా చాఽఽరాధితః సమ్యక్ కశ్యపస్తపతాంవరః ।**
**వరేణ ఛన్దయామాస సా చ వవ్రే తతో వరమ్ ॥ 30 ॥**

ఆమెచే చక్కగా ఆరాధించబడ్డ తపస్వులలో శ్రేష్ఠుడైన కశ్యపుడు ప్రసన్నుడై వరం కోరుకొమ్మన్నాడు. దితి అప్పుడు ఈ విధమైన వరం కోరింది.

**పుత్రమిన్ద్రవధార్థాయ సమర్థమమితౌజసమ్ ।**
**స చ తస్యై వరం ప్రాదాద్భార్యాయై మునిసత్తమః ॥ 31 ॥**

"మునిశ్రేష్ఠా! ఇంద్రుని వధించగల అమితప్రభావం కల్గిన, సమర్థుడైన పుత్రుని ప్రసాదించు" అని దితి వరం కోరగా మునిసత్తముడైన ఆ కశ్యపుడు భార్యయైన దితికి ఆ వరం ఇచ్చాడు.

**దత్త్వా చ వరమత్యుగ్రం కశ్యపస్తామువాచ హ ।**
**శక్రం పుత్రో నిహన్తా తే యది గర్భం శరచ్ఛతమ్ ॥ 32 ॥**

**సమాహితాతిప్రయతా శుచినీ ధారయిష్యసి ।**
**ఇత్యేవ ముక్త్వా తాం దేవీం సంగతః కశ్యపో మునిః ॥ 33 ॥**

కశ్యపుడు అట్టి మిక్కిలి ఉగ్రమైన వరం ఇచ్చి ఆమెతో "నీవు మిక్కిలి నియమనిష్ఠతో, మిక్కిలి శ్రద్ధతో, సదాచారంతో నూరు సంవత్సరాలు గర్భం పవిత్రంగా ధరించగలిగితే నీ పుత్రుడు ఇంద్రుని చంపగలడు" అని వచించాడు. అనంతరం కశ్యపమహాముని ఆ దేవితో సంగమించాడు.

**దధార సా చ తం గర్భం సమ్యక్ శౌచసమన్వితా ।**
**గర్భమాత్మవధార్థాయ జ్ఞాత్వా తం మఘవానపి ॥ 34 ॥**

**శుశ్రూషుస్తామథాగచ్ఛ ద్వినయాదమరాధిపః ।**
**తస్యాశ్చైవాన్తరం ప్రేప్సురతిష్ఠత్ పాకశాసనః ॥ 35 ॥**

ఆమె కూడ మిక్కిలి శౌచంతో కూడుకొన్నదై గర్భాన్ని ధరించింది. ఇంద్రుడు కూడ తనను చంపడంకోసమే ఆ గర్భం ఉత్పన్నమయ్యిందని తెలుసుకొన్నాడు. అంత దేవరాజు ఎంతో వినయంగా ఆమె సమీపానికి వచ్చి సేవించడానికి ఉపక్రమించాడు. పాకశాసనుడు ఆమెలో నియమలోపం ఎప్పుడు సంభవిస్తుందా యని ఎదురుచూస్తూ ఉండిపోయాడు.

**ఊనే వర్షశతే చాస్యా దదర్శాన్తరమాత్మనా ।**
**అకృత్వా పాదయోః శౌచం దితిః శయనమావిశత్ ॥ 36 ॥**

**నిద్రాం చాఽఽహారయామాస తస్యాః కుక్షిం ప్రవిశ్య సః ।**
**వజ్రపాణిర్మహాగర్భం చిచ్ఛేదాథ స సప్తధా ॥ 37 ॥**

కొంచెం తక్కువగా నూరేండ్లు అవుతూ ఉండగా, ఇంద్రుడు తనకు అనుకూలమైన ఒక అవకాశం కనిపెట్టాడు. దితి ఒకనాడు కాళ్లు కడుగుకొనకుండా ప్రక్కపై పరుండడం జరిగింది. వెంటనే నిద్రకు ఉపక్రమించింది. వజ్రాయుధం చేతదాల్చి ఇంద్రుడు ఆమెయొక్క గర్భంలో ప్రవేశించాడు. ఆ మహాగర్భాన్ని ఏడు ముక్కలుగా ఖండించాడు.

**స పీడ్యమానో వజ్రేణ ప్రరురోదాతిదారుణమ్ ।**
**మా రోదీరితి తం శక్రః పునః పునరభాషత ॥ 38 ॥**

వజ్రంచే పీడింపబడినదై ఆ గర్భం మిక్కిలి దారుణంగా రోదించింది. శక్రుడు "ఏడవకు. ఏడవకు" అని మాటిమాటికీ ఆ గర్భంతో అన్నాడు.

**సోఽభవత్ సప్తధా గర్భస్తమింద్రః కుపితః పునః ।**
**ఏకైకం సప్తధా చక్రే వజ్రేణారివిదారిణా ॥ 39 ॥**

అట్లు ఆ గర్భం ఏడు ఖండాలయింది. ఇంద్రుడు కోపంతో మళ్లీ ఆ ఒక్కొక్కముక్కను ఏడేసి తునకలుగా శత్రువిదారకమైన వజ్రంతో నరికాడు.

**మరుతో నామ దేహాస్తే బభూవురతివేగినః ।**
**యదుక్తం వై మఘవతా తేనైవ మరుతోఽభవన్ ।**
**దేవా ఏకోనపంచాశత్ సహాయా వజ్రపాణినః ॥ 40 ॥**

ఆ ముక్కలే మిక్కిలి వేగం కల్గిన మరుత్తులు అనే దేవతలు అయ్యాయి. భగవంతుడైన ఇంద్రునిచే "మారోదీః" అని వచింపబడడంచే వారు మరుత్తులయ్యారు. వారు నలభై తొమ్మండుగురు వజ్రపాణికి సహాయక దేవతలయ్యారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే ప్రహ్లాదవంశవర్ణనం నామ ఏకవింశోఽధ్యాయః సమాప్తః ॥ 21 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో ప్రహ్లాద వంశవర్ణన అనే ఇరవై ఒకటవ అధ్యాయం సమాప్తం. ॥ 21 ॥



## ద్వావింశోఽధ్యాయః - ఇరవై రెండవ అధ్యాయం

## భగవతః శ్రీవిష్ణోః చతుర్విధ విభూతివర్ణనమ్ - శ్రీవిష్ణుభగవానుని చతుర్విధవిభూతివర్ణన

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**యదాఽభిషిక్తః స పృథుః పూర్వం రాజ్యే మహర్షిభిః ।**
**తతః క్రమేణ రాజ్యాని దదౌ లోకపితామహః ॥ 1 ॥**

పూర్వకాలంలో పృథుచక్రవర్తి మహర్షులచే రాజ్యమునందు అభిషేకించబడిన సమయంలో సర్వలోకపితామహుడయిన బ్రహ్మ క్రమంగా రాజ్యాలను ఈ విధంగా ఇతరులకు ఇచ్చాడు.

**నక్షత్రగ్రహవిప్రాణాం వీరుధాం చాప్యశేషతః ।**
**సోమం రాజ్యేఽదధాద్ బ్రహ్మ యజ్ఞానాం తపసామపి ॥ 2 ॥**

నక్షత్రాలకు, గ్రహాలకు, విప్రులకు, సమస్తములైన వనస్పతులకు, యజ్ఞాలకు, తపస్సులకు మున్నగు వాటి ఆధిపత్యంపై బ్రహ్మ సోముని (చంద్రుని) నియోగించాడు.

**రాజ్ఞాం వైశ్రవణే రాజ్యే జలానాం వరుణం తథా ।**
**ఆదిత్యానాం పతిం విష్ణుం వసూనామథపావకమ్ ॥ 3 ॥**

విశ్రవసుని పుత్రుడైన కుబేరుని రాజులకు రాజుగా చేశాడు. అలాగే జలాలకు అధిపతిగా వరుణుని, ద్వాదశాదిత్యులకు ప్రభువుగా విష్ణువును, వసువులకు పతిగా అగ్నిని నియమించాడు.

**ప్రజాపతీనాం దక్షం తు వాసవం మరుతామపి ।**
**దైత్యానాం దానవానాం చ ప్రహ్లాదమధిపం దదౌ ॥ 4 ॥**

ప్రజాపతులకు దక్షుని, మరుత్తులకు ఇంద్రుని, సమస్తదైత్యదానవులకు ప్రహ్లాదుని అధిపతిగా చేశాడు.

**పితౄణాం ధర్మరాజం తం యమం రాజ్యేఽభ్యషేచయత్ ।**
**ఐరావతం గజేన్ద్రాణామశేషాణాం పతిం దదౌ ॥ 5 ॥**

పితృగణాలకు యమధర్మరాజును పతిగా రాజ్యమునందు అభిషేకించాడు. సమస్తములైన శ్రేష్ఠములైన గజసమూహాలకు రాజుగా ఐరావతాన్ని చేశాడు.

**పతత్రిణాం చ గరుడం దేవానామపి వాసవమ్ (నాగానామపి వాసుకిమ్) ।**
**ఉచ్చైఃశ్రవసమశ్వానాం వృషభం తు గవామపి ॥ 6 ॥**

పక్షులకు గరుడుని, దేవతలకు ఇంద్రుని (నాగులకు వాసుకిని), అశ్వాలకు ఉచ్చైఃశ్రవమును, గోవులకు వృషభాన్ని అధిపతులను కావించాడు.

**శేషం తు నాగరాజానం మృగాణాం సింహమీశ్వరమ్ ।**
**వనస్పతీనాం రాజానం ప్లక్షమేవాభ్యషేచయత్ ॥ 7 ॥**

సర్పాలకు రాజుగా శేషుని, మృగాలకు ప్రభువుగా సింహాన్ని, వనస్పతులకు అధిపతిగా జువ్విచెట్టును బ్రహ్మ అభిషేకించాడు.

**(మృగాణాం చైవ సర్వేషాం రాజ్యే సింహం దదౌ ప్రభుః ।**
**శేషం తు దన్దశూకానా మకరోత్పతి మవ్యయః ॥ 1 ॥**

**హిమాలయం స్థావరాణాం మునీనాం కపిలం మునిమ్ ।**
**నఖినాం దంష్ట్రిణాం చైవ మృగాణాం వ్యాఘ్రమీశ్వరమ్ ॥ 2 ॥**

**వనస్పతీనాం రాజానం ప్లక్షమేవాభ్యషేచయత్ ।**
**ఏవమేవాన్యజాతీనాం ప్రాధాన్యేనాకరోత్ప్రభూన్ ॥ 3 ॥**

అవ్యయుడైన, ప్రభువైన, పరమేష్ఠి సమస్తమృగరాజ్యానికి సింహాన్ని, దందశూకాలకు శేషుని అధిపతిగా నియమించాడు. స్థావరాలకు హిమాలయాన్ని, మునీశ్వరులకు కపిలమహామునిని, గోళ్లు, కోరలు కల మృగాలకు పెద్దపులిని, క్రిందికి వేళ్లుకలిగిన వనస్పతులకు జువ్విని అధిపతులుగా అభిషేకించాడు. ఈవిధంగా ఇతర జాతులకు ప్రాధాన్యాన్ని బట్టి ప్రభువులను గావించాడు.)

**ఏవం విభజ్య రాజ్యాని దిశాం పాలాననన్తరమ్ ।**
**ప్రజాపతిపతిర్బ్రహ్మా స్థాపయామాస సర్వతః ॥ 8 ॥**

ఇలా రాజ్యాలను అధిపతులను విభజించి, పిమ్మట ప్రజాపతులకు అధిపతి అయిన బ్రహ్మ అన్నివైపుల దిక్కులయందు పాలకులను ఏర్పాటుచేశాడు.

**పూర్వస్యాం దిశి రాజానం వైరాజస్య ప్రజాపతేః ।**
**దిశః పాలం సుధన్వానం సుతం వై సోఽభ్యషేచయత్ ॥ 9 ॥**

తూర్పుదిక్కునందు వైరాజుడు అనే ప్రజాపతియొక్క కుమారుడైన సుధన్వుని దిక్పాలకుడుగా అభిషేకించాడు.

**దక్షిణస్యాం దిశి తథా కర్దమస్య ప్రజాపతేః ।**
**పుత్రం శంఖపదం నామ రాజానం సోఽభ్యషేచయత్ ॥ 10 ॥**

అలాగే దక్షిణ దిక్కునందు కర్దముడు అనే ప్రజాపతియొక్క కుమారుడైన శంఖపదుడు అనే రాజును దిక్పాలకునిగా అభిషిక్తుని కావించాడు.

**పశ్చిమస్యాం దిశి తథా రజసః పుత్రమచ్యుతమ్ ।**
**కేతుమన్తం మహాత్మానం రాజానమభిషిక్తవాన్ ॥ 11 ॥**

అదే రీతిగా పడమటి దిశయందు రజసునిపుత్రుడైన నాశరహితుడైన మహానుభావుడగు కేతుమంతుని రాజుగా అభిషేకించాడు.

**తథా హిరణ్యరోమాణం పర్జన్యస్య ప్రజాపతేః ।**
**ఉదీచ్యాం దిశి దుర్ధర్షం రాజానమభ్యషేచయత్ ॥ 12 ॥**

అలాగే ఉత్తరపు దిక్కునందు పర్జన్యుడను ప్రజాపతియొక్క కుమారుడైన ఎదుర్కోడానికి శక్యంకాని హిరణ్యరోముడనే వానిని రాజుగా అభిషిక్తుని గావించాడు.

**తైరియం పృథివీ సర్వా సప్త ద్వీపా సపత్తనా ।**
**యథాప్రదేశమద్యాపి ధర్మతః పరిపాల్యతే ॥ 13 ॥**

ఆ దిక్పాలకులచే సప్తద్వీపాలతో, పట్టణాలతో ప్రకాశిస్తున్న ఈ భూమి అంతా నేటికీ ధర్మయుక్తంగా హద్దుమీరక పరిపాలింపబడుతోంది.

**ఏతే సర్వే ప్రవృత్తస్య స్థితౌ విష్ణోర్మహాత్మనః ।**
**విభూతిభూతా రాజానో యే చాన్యే మునిసత్తమ ॥ 14 ॥**

మునిప్రవరుడవైన మైత్రేయా! మహాత్ముడైన విష్ణువు ఎల్లప్పుడూ విశ్వపరిపాలనయందు ప్రవర్తిస్తూ ఉంటాడు. ఈ దిక్పాలకులు అందరూ, మిగిలిన ఇతరరాజులు ఆ విష్ణువుయొక్క విభూతి స్వరూపులే.

**యే భవిష్యన్తి యే భూతాః సర్వేభూతేశ్వరా ద్విజ! ।**
**తే సర్వే సర్వభూతస్య విష్ణోరంశా ద్విజోత్తమ! ॥ 15 ॥**

ద్విజోత్తమా! ఇప్పుడున్న అందరు పరిపాలకులు, జరిగిపోయిన కాలంలో రాజులుగా ఉన్నవారు, జరుగబోయే కాలంలో రాజులు కాబోయేవారు, భూతపతులు అందరూ సర్వభూతుడైన ఆ విష్ణువు యొక్క అంశలే.

**యే తు దేవాధిపతయో యే చ దైత్యాధిపాస్తథా ।**
**దానవానాం చ యే నాథా యే నాథాః పిశితాశినామ్ ॥ 16 ॥**

**పశూనాం యే చ పతయః పతయో యే చ పక్షిణామ్ ।**
**మనుష్యాణాం చ సర్పాణాం నాగానాం చాధిపాశ్చ యే ॥ 17 ॥**

**వృక్షాణాం పర్వతానాం చ గ్రహాణాం చాపి యేఽధిపాః ।**
**అతీతా వర్తమానాశ్చ యే భవిష్యన్తి చాపరే ॥ 18 ॥**

**తే సర్వే సర్వభూతస్య విష్ణోరంశసముద్భవాః ।**
**న హి పాలనసామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్ ॥ 19 ॥**

**స్థితౌ స్థిరం మహాప్రాజ్ఞ భవత్యన్యస్య కస్యచిత్ । 20 ॥**

మహాప్రాజ్ఞా! ఎవరయితే దేవాధిపతులు, దైత్యాధిపతులు, దానవాధిపతులు, పిశాచనాథులు, పశుపతులు,

పక్షిరాజులు, మనుష్యాధిపులు, సర్పరాజులు, నాగరాజులు, వృక్షశ్రేష్ఠాలు, పర్వతరాజులు, గ్రహాధిపతులు ఉన్నారో, జరిగిపోయిన, ప్రస్తుతం జరుగుతున్న, జరుగబోయే కాలంలో చన్న, ఉన్న, కానున్న రాజులు ఎవరో, వారందరూ సర్వభూతాత్ముడైన విష్ణువుయొక్క అంశవల్ల ఉద్భవించినవారే. రక్షణచేసే సమయంలో పరిపాలన సామర్థ్యం సర్వేశ్వరుడైన హరికి తప్ప మరెవ్వరికి ఉండదు. కాబట్టి అట్టి శక్తి స్థిరంగా విష్ణువునందు మాత్రమే ఉంటుంది.

**సృజత్యేష జగత్సృష్టౌ స్థితౌ పాతి సనాతనః ।**
**హన్తి చైవాన్తికత్వే చ రజఃసత్త్వాదిసంశ్రయః ॥ 21 ॥**

రజోగుణ, సత్త్వగుణ, తమోగుణాలతో కూడుకొన్నవాడై ఈ సనాతనుడైన విష్ణువే సృష్టి సమయంలో జగత్తును నిర్మిస్తాడు. జగత్పాలనచేసే సమయంలో రక్షిస్తాడు. లయవేళలో అంతకుడై సంహరిస్తాడు.

**చతుర్విభాగః సంసృష్టౌ చతుర్ధా సంస్థితః స్థితౌ ।**
**ప్రలయం చ కరోత్యన్తే చతుర్భేదో జనార్దనః ॥ 22 ॥**

జనార్దనుడు విశ్వసృష్టివేళలోను, విశ్వరక్షణ వేళలోను, నాలుగేసి విభాగాలుగా ఉంటాడు. చివరకు విశ్వలయవేళలో కూడా నాలుగు విభేదాలతో ఉండి నిర్వహిస్తాడు.

**ఏకేనాంశేన బ్రహ్మాఽసౌ భవత్యవ్యక్తమూర్తిమాన్ ।**
**మరీచిమిశ్రాః పతయః ప్రజానామన్యభాగతః ॥ 23 ॥**

**కాలస్తృతీయస్తస్యాంశః సర్వభూతాని చాపరః ।**
**ఇత్థం చతుర్ధా సంసృష్టౌ వర్తతేఽసౌ రజోగుణః ॥ 24 ॥**

అవ్యక్తమూర్తి అయిన ఈ విష్ణువు తన ఒక అంశతో బ్రహ్మ అవుతాడు. మరో అంశతో మరీచిమున్నగు ప్రజాపతులుగా ఉంటాడు. కాలం ఆయనయొక్క మూడవఅంశ. సృష్టించబడ్డ సర్వప్రాణులు నాలుగో అంశ. ఈ రీతిగా సృష్టిసమయంలో విష్ణువు రజోగుణంతో కూడుకొన్నవాడై నాలుగు విభాగాలుగా ప్రవర్తిస్తాడు.

**ఏకాంశేన స్థితౌ విష్ణుః కరోతి ప్రతిపాలనమ్ ।**
**మన్వాదిరూపశ్చాన్యేన కాలరూపోఽపరేణ చ ॥ 25 ॥**

**సర్వభూతేషు చాన్యేన సంస్థితః కురుతే రతిమ్ ।**
**సత్త్వం గుణం సమాశ్రిత్య జగతః పురుషోత్తమః ॥ 26 ॥**

విష్ణువుగా ఒక అంశతో ఉండి పరిపాలన చేస్తాడు. మనువు మున్నగువారి రూపంలో రెండవ అంశతో ఉంటాడు. కాలరూపం ఆయనయొక్క మూడవఅంశ. పాలించే సర్వప్రాణిరూపంలో మరో అంశతో ఉండి ఉత్సాహం కనబరుస్తాడు. ఈ విధంగా పురుషోత్తముడు సత్త్వగుణాన్ని ఆశ్రయించి జగత్పాలనం కావిస్తాడు.

**ఆశ్రిత్య తమసో వృత్తిమన్తకాలే తథా పునః ।**

**రుద్రస్వరూపో భగవానేకాంశేన భవత్యజః ॥ 27 ॥**

**అగ్న్యన్తకాదిరూపేణ భాగేనాన్యేన వర్తతే ।**
**కాలస్వరూపో భాగోऽన్యః సర్వభూతాని చాపరః ॥ 28 ॥**

**వినాశం కుర్వతస్తస్య చతుర్ధైవం మహాత్మనః ।**
**విభాగకల్పనా బ్రహ్మన్! కథ్యతే సార్వకాలికీ ॥ 29 ॥**

జననం లేని భగవానుడు మళ్లీ అదేవిధంగా తమోగుణవృత్తి ఆశ్రయించి ఒక అంశతో రుద్ర స్వరూపుడై లయకాలంలో ఉంటాడు. అగ్ని, యముడు మున్నగు రూపాలతో మరో అంశతో ఉంటాడు. కాలస్వరూపం ఆయన మరోఅంశ. సర్వప్రాణులు వేరొకఅంశ. బ్రాహ్మణోత్తమా! వినాశం నెరపే ఆ మహాత్మునికి ఈ రీతిగా చతుర్విధ విభాగకల్పన సార్వకాలికంగా ఉండేదని చెప్పబడుతోంది.

**బ్రహ్మదక్షాదయః కాలస్తథైవాఖిలజన్తవః ।**
**విభూతయో హరేరేతా జగతః సృష్టిహేతవః ॥ 30 ॥**

బ్రహ్మ, దక్షుడు మున్నగువారు, కాలం, అలాగే సకలప్రాణులు ఇవి హరియొక్క విభూతులు. జగత్తుయొక్క సృష్టికి కారణాలు.

**విష్ణుర్మన్వాదయః కాలః సర్వభూతాని చ ద్విజ ।**
**స్థితేర్నిమిత్తభూతస్య విష్ణోరేతా విభూతయః ॥ 31 ॥**

ద్విజోత్తమా! విష్ణువు, మనువు మున్నగువారు, కాలం, అలాగే సర్వప్రాణులు ఇవి విష్ణువుయొక్క విభూతులు. ఇవి జగత్తుయొక్క స్థితికి నిమిత్త కారణాలు.

**రుద్రకాలాన్తకాద్యాశ్చ సమస్తాశ్చైవ జన్తవః ।**
**చతుర్ధా ప్రలయాయైతా జనార్దనవిభూతయః ॥ 32 ॥**

రుద్రుడు, అంతకాదులు, కాలం, అలాగే సకలప్రాణులు. ఇవి జనార్దనుని విభూతులు. ఈ నాలుగు ప్రళయకారణాలు.

**జగదాదౌ తథా మధ్యే సృష్టిరాప్రలయాద్ ద్విజ! ।**
**ధాత్రా మరీచిమిశ్రైశ్చ క్రియతే జన్తుభిస్తథా ॥ 33 ॥**

ద్విజవర్యా! జగత్తు ప్రారంభమయినప్పుడు, మధ్యకాలంలోను, ప్రలయపర్యంతం సృష్టి ధాతచేత, మరీచి మున్నగువారిచేత, ప్రాణికోటిచేత జరపబడుతూ ఉంటుంది.

**బ్రహ్మా సృజత్యాదికాలే మరీచి ప్రముఖాస్తతః ।**
**ఉత్పాదయన్త్యపత్యాని జన్తవశ్చ ప్రతిక్షణమ్ ॥ 34 ॥**

సృష్టియొక్క ఆదికాలంలో బ్రహ్మజంతుసంతతిని సృజించాడు. అనంతరం మరీచి మున్నగువారు ప్రాణికోటిని సృష్టించారు. అటుపిమ్మట ప్రతిక్షణం ప్రాణిసముదాయాలు సంతానాన్ని పుట్టిస్తూ ఉన్నాయి.

**న కాలేన వినా బ్రహ్మా సృష్టినిష్పాదకో ద్విజ! ।**
**న ప్రజాపతయః సర్వే న చైవాఖిలజన్తవః ॥ 35 ॥**

ద్విజప్రవరా! కాలంయొక్క ఆధారం లేనిదే బ్రహ్మ సృష్టిని ఉత్పత్తిచేయజాలడు. ప్రజాపతులందరూ కూడా, అలాగే సర్వప్రాణులుకూడా కాలమహిమలేనిదే సృష్టిచేయజాలరు.

**ఏవమేవ విభాగోఽయం స్థితావప్యుపదిశ్యతే ।**
**చతుర్ధా దేవదేవస్య మైత్రేయ ప్రలయే తథా ॥ 36 ॥**

మైత్రేయా! ఈ విధంగానే దేవదేవునియొక్క నాలుగు విధాల విభాగం సృష్టిసందర్భంలోలాగే స్థితి సమయంలోనూ, అలాగే లయవేళలోనూ కాలాధీనంగా చెప్పబడుతోంది.

**యత్కించిత్ సృజ్యతే యేన సత్త్వజాతేన వై ద్విజ! ।**
**తస్య సృజ్యస్యసమ్భూతౌ తత్సర్వం వై హరేస్తనుః ॥ 37 ॥**

ద్విజశ్రేష్ఠా! ఏ ప్రాణిచేత ఏ కొంచెం సృష్టిచేయబడ్డా, ఆ పుట్టింపబడ్డదానియొక్క, జీవోత్పత్తి యందు మూలకారణం హరియొక్క కాలస్వరూపమే (శరీరమే).

**హన్తి వా యత్ క్వచిత్ కించిత్ భూతం స్థావరజంగమమ్ ।**
**జనార్దనస్య తద్రౌద్రం మైత్రేయాన్తకరం వపుః ॥ 38 ॥**

మైత్రేయా! అలాగే ఏ చరాచరప్రాణి ఏ కొంచెం దేనిని నాశనం చేసినా, ఆ నాశనం చేసేది జనార్దనునియొక్క వినాశకారి అయిన రౌద్రశరీరమే.

**ఏవమేష జగత్స్రష్టా జగత్పాతా తథైవ చ ।**
**జగద్ భక్షయితా చేశః (దేవః) సమస్తస్య జనార్దనః ॥ 39 ॥**

ఈ రీతిగా జగత్తుకు సృష్టికారకుడు, అదేవిధంగా జగత్పోషణకారకుడు, అలాగే జగత్సంహారకారకుడు, ఈ సమస్తానికి జనార్దనదేవుడే కారణభూతుడు.

**సర్గస్థిత్యన్తకాలేషు త్రిధైవం సమ్ప్రవర్తతే ।**
**గుణప్రవృత్త్యా పరమం పదం తస్యాగుణం మహత్ ॥ 40 ॥**

**తస్య జ్ఞానమయం వాఽపి స్వసంవేద్యమనూపమమ్ ।**
**చతుష్ప్రకారం తదపి స్వరూపం పరమాత్మనః ॥ 41 ॥**

ఈ విధంగా ఆయనయొక్క పరమపదం త్రిగుణప్రవృత్తివల్ల సృష్టి స్థితిలయకాలాల్లో మూడువిధాలుగా ప్రవర్తిస్తూ ఉంటుంది. కాని ఆ పరమస్థానం గుణప్రకృతిరహితమై, మహారూపమై, జ్ఞానమయమై, స్వయంప్రకాశమై,

సాటిలేనిదై ఉంటుంది. ఈ విధంగా ఆ పరమాత్మస్వరూపం కూడా నాలుగువిధాలై ప్రవర్తిస్తుందని పరాశరుడు చెప్పాడు.

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు పలికాడు.

**చతుః ప్రకారతాం తస్య బ్రహ్మభూతస్య హే మునే! ।**
**మమాచక్ష్వ యథాన్యాయం యదుక్తం పరమం పదమ్ ॥ 42 ॥**

"ఓ పరాశరమహర్షీ! నీవు చెప్పినట్లుగా ఆ బ్రహ్మస్వరూపుని పరమపదం నాలుగు విధాలూ శాస్త్రప్రకారంగా ఏ రీతిగా వ్యవహరించబడతాయో నాకు వివరించవలసింది" అని అడిగాడు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**మైత్రేయ! కారణం ప్రోక్తం సాధనం సర్వవస్తుషు ।**
**సాధ్యం చ వస్త్వభిమతం యత్సాధయితు మాత్మనః ॥ 43 ॥**

మైత్రేయా! సర్వవస్తువులను సాధించుటయందు కారణమైన దానిని "సాధనం" అంటారు. దానిచే తనకు (సాధకునకు) సాధించడానికి పూర్తిగా ఇష్టమైన దానిని "సాధ్యం" అంటారు.

**యోగినో ముక్తికామస్య ప్రాణాయామాది సాధనమ్ ।**
**సాధ్యం చ పరమం బ్రహ్మ పునర్నావర్తతే యతః ॥ 44 ॥**

ముక్తిని కాంక్షించే యోగికి ప్రాణాయామం మున్నగునవి సాధనం. పునరావృత్తిలేని పరబ్రహ్మ సాధ్యం.

**సాధనాలమ్బనం జ్ఞానం ముక్తయే యోగినో హి తత్ ।**
**స భేదః ప్రథమస్తస్య బ్రహ్మభూతస్య వై మునే! ॥ 45 ॥**

మునీశ్వరా! యోగులకు ముక్తికోసమై ఏ యోగశాస్త్రజన్యమైన ప్రాణాయామసంబంధమైన సాధనాలంబన జ్ఞానం ఉందో, అదే బ్రహ్మస్వరూపునికి మొదటి భేదం అవుతుంది.

**యుంజతః క్లేశముక్త్యర్థం సాధ్యం యద్బ్రహ్మయోగినః ।**
**తదాలమ్బనవిజ్ఞానం ద్వితీయాంశో మహామునే! ॥ 46 ॥**

మహామునీ! క్లేశాలనుండి ముక్తికొరకై యోగం అభ్యసిస్తున్న యోగికి సాధ్యమగు బ్రహ్మవిషయకజ్ఞానమే ఆలంబనంగా ఉండే ఆధారమైన విజ్ఞానం ఆయనయొక్క రెండవభేదం అవుతుంది.

**ఉభయోస్త్వవిభాగేన సాధ్యసాధనయోః హి యత్ ।**
**విజ్ఞానమద్వైతమయం తద్భాగోఽన్యో మయోదితః ॥ 47 ॥**

ఈ సాధ్యసాధనాల రెండింటి విషయంలో భేదరహితమైన ఏ విజ్ఞానమయితే ఉందో, ఆ అద్వైత మయజ్ఞానమే మూడవభాగంగా నాచే తెలియజేయబడుతోంది.

**జ్ఞానత్రయస్య వై తస్య విశేషో యో మహామునే! ।**
**తన్నిరాకరణద్వారా దర్శితాత్మస్వరూపవత్ ॥ 48 ॥**

మహామునీ! ఈ మూడువిధాలైన జ్ఞానంయొక్క విశేషాన్ని నిరాకరించడంద్వారా తన స్వరూపమైన జ్ఞానం ప్రదర్శితమవుతుంది.

**నిర్వ్యాపారమనాఖ్యేయం వ్యాప్తిమాత్రమనూపమమ్ ।**
**ఆత్మసమ్బోధవిషయం సత్తామాత్రమలక్షణమ్ ॥ 49 ॥**

**ప్రశాన్తమభయం శుద్ధమవిభావ్యమసంశ్రితమ్ ।**
**విష్ణోఃజ్ఞానమయస్యోక్తం తద్జ్ఞానం పరమం పదమ్ ॥ 50 ॥**

అది ఏ వృత్తిలేనిది. అనిర్వచనీయమయినట్టిది. వ్యాప్తిమాత్రమైనది. ఏ ఔపమ్యం లేనిది. ఆత్మజ్ఞాన సంబంధమైన విషయమైనట్టిది. సత్తామాత్రమైనది. ఏ లక్షణం లేనటువంటిది. మిక్కిలి శాంతమైనట్టిది. ఏ భయం లేనిది. శుద్ధమయినటువంటిది భావనాతీతమైనది. ఏ ఆశ్రయం లేనిది. జ్ఞానమయుడైన విష్ణువుయొక్క రూపం అదే. అదే బ్రహ్మజ్ఞానం. అదే పరమపదం (ఇది నాలుగో భేదం).

**తత్రాన్యజ్ఞానరోధేన యోగినో యాన్తి యే లయమ్ ।**
**సంసారకర్షణోప్తౌ తే యాన్తి నిర్బీజతాం ద్విజ! ॥ 51 ॥**

ద్విజోత్తమా! అన్య జ్ఞానాలను నిరోధించి ఈ బ్రహ్మజ్ఞానంలో లీనమయ్యే యోగులు ఈ సంసారమనే సేద్యంలో విత్తనాలు చల్లడంలో నిర్బీజులు (వాసనారహితులు) అవుతారు.

**ఏవం ప్రకారమమలం నిత్యం వ్యాపకమక్షయమ్ ।**
**సమస్తభేదరహితం విష్ణ్వాఖ్యం పరమం పదమ్ ॥ 52 ॥**

ఈ రీతిగా విష్ణువని పిలవబడే పరమపదం నిర్మలమయినది. శాశ్వతమయినది. సర్వత్ర వ్యాపించి ఉండేది. క్షీణించనటువంటిది. సమస్తములైనట్టి ఎటువంటి భేదాలు లేనటువంటిది.

**తద్ బ్రహ్మ పరమం యోగీ యతో నావర్తతే పునః ।**
**అపుణ్యపుణ్యోపరమే క్షీణక్లేశోఽతినిర్మలః ॥ (శ్రయత్యపుణ్యోపరమే) 53 ॥**

పుణ్యపాపాలు నశించగా, క్లేశాలన్నీ క్షీణించిపోగా, అతినిర్మలుడై భాసించే యోగి ఆ పరబ్రహ్మాన్ని పొందుతాడు. దానినుండి మళ్లీ తిరిగిరాడు.

**ద్వే రూపే బ్రహ్మణస్తస్య మూర్తం చామూర్తమేవ చ ।**
**క్షరాక్షరస్వరూపే తే సర్వభూతేష్వవస్థితే ॥ 54 ॥**

ఆ పరబ్రహ్మానికి మూర్తం, అమూర్తం అనే రెండు రూపాలు ఉన్నాయి. అవి క్షరం-అక్షరం అనే స్వరూపాలతో సకలప్రాణులలోను నిండి ఉన్నాయి.

**అక్షరం తత్ పరం బ్రహ్మ క్షరం సర్వమిదం జగత్ ।**
**ఏకదేశస్థితస్యాగ్నేర్జ్యోత్స్నా విస్తారిణీ యథా ॥ 55 ॥**

**పరస్య బ్రహ్మణః శక్తిస్తదేతదఖిలం జగత్ ।**
**తత్రాప్యాసన్నదూరత్వాద్ బహుత్వస్వల్పతామయః ।**
**జ్యోత్స్నాభేదో ఽస్తి తచ్ఛక్తే స్తద్వన్మైత్రేయ! విద్యతే ॥ 56 ॥**

ఆ పరబ్రహ్మం అక్షరమయినట్టిది. ఈ సర్వజగత్తు క్షరమయినట్టిది. ఒక ప్రదేశంలో ఉన్న అగ్నియొక్క వెలుతురు ఏ రీతిగా వ్యాపిస్తుందో అలాగే పరబ్రహ్మయొక్క శక్తి ఈ జగత్తు సర్వమూ వ్యాపించి ఉంది. మైత్రేయా! ఆ అగ్ని దగ్గరగా దూరంగా ఉండడాన్నిబట్టి వెలుతురులో ఎక్కువ తక్కువ తేడాలు కానవస్తూ ఉంటాయి. అలాగే పరబ్రహ్మశక్తికి కూడా దగ్గరగా దూరంగా ఉండడాన్నిబట్టి భేదాలు కనిపిస్తాయి.

**బ్రహ్మవిష్ణుశివా బ్రహ్మన్ ప్రధానా బ్రహ్మశక్తయః ।**
**తతశ్చ దేవా మైత్రేయ! న్యూనా దక్షాదయస్తతః ॥ 57 ॥**

**తతో మనుష్యాః పశవో మృగపక్షిసరీసృపాః ।**
**న్యూనా న్యూనతరాశ్చైవ వృక్షగుల్మాదయస్తతః ॥ 58 ॥**

బ్రాహ్మణోత్తమా! బ్రహ్మ, విష్ణువు, శివుడు బ్రహ్మముయొక్క ప్రధానశక్తులు. మైత్రేయా! ఆ తరువాతి వారు దేవతలు. అంత కన్న తక్కువవారు దక్షుడు మున్నగు ప్రజాపతులు. అంతకన్న ఇంకా తక్కువవారు మనుష్యులు, పశువులు, మృగాలు, పక్షులు, సరీసృపాలు. అంతకన్న మరీ తక్కువైనవి చెట్లు పొదలు మున్నగునవి.

**తదేతదక్షరం నిత్యం జగన్మునివరాఖిలమ్ ।**
**ఆవిర్భావతిరోభావజన్మనాశవికల్పవత్ ॥ 59 ॥**

మునివరా! ఈ విధంగా సమస్తజగత్తూ వెలువడుతూ ఉండడం, మరుగునపడుతూ ఉండడం, పుడుతూ ఉండడం, నశిస్తూ ఉండడంవంటి మార్పులు ఉన్నా, అది అక్షరమయినట్టిది శాశ్వతమయినట్టిది.

**సర్వశక్తిమయో విష్ణుః స్వరూపం బ్రహ్మణోఽ పరమ్ ।**
**మూర్తం యద్ యోగిభిః పూర్వం యోగారమ్భేషు చిన్త్యతే ॥ 60 ॥**

**సాలమ్బనో మహాయోగః సబీజో యత్ర సంస్థితః ।**
**మనస్యవ్యాహతే సమ్యగ్ యుఞ్జతాం జాయతే మునే ॥ 61 ॥**

బ్రహ్మముయొక్క మరో మూర్తస్వరూపం సర్వశక్తిమయుడైన విష్ణువు. యోగులచే మొదట యోగాభ్యాస ప్రారంభావస్థలలో ఆ మూర్తస్వరూపమే ధ్యానించబడుతూ ఉంటుంది. మునీశ్వరా! ఆ విష్ణువునందు చక్కగా ఏకాగ్రమైన మనస్సును లగ్నంచేసే యోగికి దివ్యరూప విషయంతో కూడిన, శుభాలంబనంతో కలిసిన, మంత్రానుసంధానయుక్తమైన సబీజమైన మహాయోగం సమాధిలో చేకూరుతుంది.

**స పరః సర్వశక్తీనాం బ్రహ్మణః సమనన్తరమ్ ।**
**మూర్తం బ్రహ్మ మహాభాగ! సర్వబ్రహ్మమయో హరిః ॥ 62 ॥**

ఓ మహాభాగా! ఆయన పరబ్రహ్మమునకు చేరువై ఉండువాడు. సర్వశక్తులకు పరుడైనవాడు. సర్వబ్రహ్మమయుడు. హరి మూర్తబ్రహ్మము.

**తత్ర సర్వమిదం ప్రోతమోతం చైవాఖిలం జగత్ ।**
**తతో జగజ్జగత్తస్మిన్ స జగచ్చాఖిలం మునే! ॥ 63 ॥**

మునీశ్వరా! ఆయనయందే ఈ సర్వజగత్తు ఓతప్రోతభావంతో పడుగూపేకగా అల్లుకొని ఉంది. ఆయన నుండే ఈ జగత్తు వచ్చింది. ఈ జగత్తంతా ఆయనయందే ఉంది. కాబట్టి ఈ సమస్తజగత్తూ ఆయనే.

**క్షరాక్షరమయో విష్ణుర్బిభర్త్యఖిలమీశ్వరః ।**
**పురుషావ్యాకృతమయం భూషణాస్త్రస్వరూపవత్ ॥ 64 ॥**

క్షరాక్షరమయుడైన విష్ణువే (కార్యకారణరూపుడైన) ఈశ్వరుడై ఈ పురుషప్రకృతిమయమైన సమస్త జగత్తును తన భూషణాలుగా, ఆయుధాలుగా ధరిస్తున్నాడు – అని పరాశరుడు వచించాడు.

**మైత్రేయ ఉవాచ :–** మైత్రేయుడు పలికాడు.

**భూషణాస్త్రస్వరూపస్థం యదేతదఖిలం జగత్ ।**
**బిభర్తి భగవాన్ విష్ణుస్తన్మమాఖ్యాతు మర్హసి ॥ 65 ॥**

"భూషణరూపంతో, ఆయుధ స్వరూపంతో ఉన్న విష్ణు భగవానుడు ఈ సమస్తజగత్తును ఏ విధంగా ధరిస్తున్నాడో, దానిని నాకు వివరించవలసింది" అని ప్రశ్నించాడు.

**పరాశర ఉవాచ :–** పరాశరమహర్షి చెప్పాడు.

**నమస్కృత్వాఽప్రమేయాయ విష్ణవే ప్రభవిష్ణవే ।**
**కథయామి యథాఽఽఖ్యాతం వశిష్ఠేన మమాభవత్ ॥ 66 ॥**

అప్రమేయుడైన ప్రభవిష్ణువైన విష్ణువుకు నమస్కరించి, వశిష్ఠునిచే నాకు వివరించబడిన విధంగా నీకు చెబుతున్నాను.

**ఆత్మానమస్య జగతో నిర్లేపమగుణాలయమ్ ।**
**బిభర్తి కౌస్తుభమణిస్వరూపం భగవాన్ హరిః ॥ 67 ॥**

శ్రీహరి భగవానుడు దేనిచేతను స్పర్శలేని, ఏ గుణమూ అంటని, నిర్మలమైన జగదాత్మను కౌస్తుభమణి రూపంలో ధరిస్తున్నాడు.

**శ్రీవత్ససంస్థానధరమనన్తేన సమాశ్రితమ్ ।**
**ప్రధానం బుద్ధిరప్యాస్తే గదారూపేణ మాధవే ॥ 68 ॥**

అనంతునిచే ప్రధానం శ్రీవత్సరూపంలో ధరించబడుతోంది. మాధవునియందు బుద్ధి గదారూపంలో విరాజిల్లుతోంది.

**భూతాదిమిన్ద్రియాదిం చ ద్విధాऽహంకారమీశ్వరః ।**
**బిభర్తి శంఖరూపేణ శార్‌ఙ్గరూపేణ చ స్థితమ్ ॥ 69 ॥**

భూతాది హేతువైన తామసాహంకారాన్ని శంఖరూపంలోను, ఇంద్రియాది కారణమైన రాజసాహంకారాన్ని శార్‌ఙ్గధనస్సు రూపంలోను ఈశ్వరుడు ద్వివిధాహంకారాన్ని ధరిస్తున్నాడు.

**బల (చల) స్వరూపమత్యన్తజవేనాన్తరితానిలమ్ ।**
**చక్రస్వరూపం చ మనో ధత్తే విష్ణుః కరే స్థితమ్ ॥ 70 ॥**

మిక్కిలి చంచలమైనది, అత్యధికమైన వేగంలో వాయువును మించినది అయిన మనస్సు చక్రరూపంలో విష్ణువు హస్తంలో ఉంది.

**పంచరూపా తు యా మాలా వైజయన్తీ గదాభృతః ।**
**సా భూతహేతుసంఘాతో భూతమాలా చ వై ద్విజ! ॥ 71 ॥**

ద్విజోత్తమా! ముత్యం, మాణిక్యం, మరకతం, ఇంద్రనీలం, వజ్రం వీటితో సమానమైన రూపసాదృశ్యంకల గదాధరుడు ధరించే వైజయంతీమాల పంచమహాభూతాల, పంచతన్మాత్రల సముదాయమైన భూతమాలయే సుమా!

**యానీన్ద్రియాణ్యశేషాణి బుద్ధి కర్మాత్మకాని వై ।**
**శరరూపాణ్యశేషాణి తాని ధత్తే జనార్దనః ॥ 72 ॥**

సమస్తాలైన ఇంద్రియాలు జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలుగా ఉన్న, వాటినన్నింటిని జనార్దనుడు అశేషశరరూపంలో ధరిస్తున్నాడు.

**బిభర్తి యచ్చాసిరత్నమచ్యుతోऽత్యన్తనిర్మలమ్ ।**
**విద్యామయం తు తద్‌జ్ఞానమవిద్యాకోశసంస్థితమ్ ॥ 73 ॥**

అచ్యుతుడు ధరించే అత్యంత నిర్మలమైన ఖడ్గోత్తమం అనే ఆయుధం అవిద్య అనే ఒరలో ఉండే విద్యామయమైన జ్ఞానం.

**ఇత్థం పుమాన్ ప్రధానం చ బుద్ధ్యహంకారమేవ చ ।**
**భూతాని చ హృషీకేశే మనః సర్వేన్ద్రియాణి చ ।**
**విద్యావిద్యే చ మైత్రేయ! సర్వమేతత్ సమాశ్రితమ్ ॥ 74 ॥**

మైత్రేయా! ఈ విధంగా పురుషుడు, ప్రధానం బుద్ధి, అహంకారం, భూతాలు, మనస్సు, సమస్తేంద్రియాలు, అవిద్య, విద్య. ఇవన్నీ హృషీకేశుని ఆశ్రయించి ఉన్నాయి.

**అస్త్రభూషణసంస్థానస్వరూపం రూపవర్జితః ।**
**బిభర్తి మాయారూపోఽసౌ శ్రేయసే ప్రాణినాం హరిః ॥ 75 ॥**

రూపం లేనివాడు, మాయ రూపంగా కలవాడు అయిన హరి ప్రాణులయొక్క మేలుకొరకై ఈ ఆయుధాలకు, ఆభరణాలకు ఆధారమయిన స్వరూపాన్ని ధరిస్తున్నాడు.

**సవికారం ప్రధానం చ పుమాంసమఖిలం జగత్ ।**
**బిభర్తి పుణ్డరీకాక్షస్తదేవం పరమేశ్వరః ॥ 76 ॥**

పద్మాలవంటి నయనాలుకల్గిన పరమేశ్వరుడు ఈ విధంగా సవికారమైన ప్రధానాన్ని, పురుషుని, అశేషమైన జగత్తును ధరిస్తున్నాడు.

**యా విద్యా యా తథాఽవిద్యా యత్ సద్ యచ్చాసదవ్యయమ్ ।**
**తత్ సర్వం సర్వభూతేశే మైత్రేయ మధుసూదనే ॥ 77 ॥**

మైత్రేయా! విద్య, అవిద్య, సత్త, అసత్త, అవ్యయం, ఆ సర్వమూ సర్వభూతాత్మకుడైన మధుసూదనుని యందు ఉన్నది.

**కలా కాష్ఠా నిమేషాది దినర్త్వయనహాయనైః ।**
**కాలస్వరూపో భగవానపరో (నపాపో) హరిరవ్యయః ॥ 78 ॥**

కల, కాష్ఠ, నిమేషం మున్నగు వాటితోకూడిన దినం, ఋతువు, అయనం, సంవత్సరం అనే వాటితో పాపరహితుడై, అవ్యయుడై, భగవంతుడు కాలస్వరూపుడై ఉంటాడు.

**భూర్లోకోఽథ భువర్లోకః స్వర్లోకో మునిసత్తమ ।**
**మహర్జనస్తపః సత్యం సప్త లోకా ఇమే విభుః ॥ 79 ॥**

మునిశ్రేష్ఠా! భూలోక, భువర్లోక, స్వర్లోక, మహర్లోక, జనోలోక, తపోలోక, సత్యలోకాలు అనబడే ఈ ఏడులోకాలూ ఆ సర్వవ్యాపకుడైన వాని స్వరూపాలే.

**లోకాత్మమూర్తిః సర్వేషాం పూర్వేషామపి పూర్వజః ।**
**ఆధారః సర్వవిద్యానాం స్వయమేవ హరిః స్థితః ॥ 80 ॥**

లోకస్వరూపమైన ఆకారం కలవాడు, సమస్తపూర్వులకు పూర్వజుడు, అఖిలవిద్యలకు ఆధారమయిన వాడు, స్వయంగా ఆ శ్రీహరియే అయి ఉన్నాడు.

**దేవమానుషపశ్వాది స్వరూపైర్బహుభిః స్థితః ।**
**తతః సర్వేశ్వరోఽనన్తో భూతమూర్తిరమూర్తిమాన్ ॥ 81 ॥**

నిరాకారుడు సమస్తభూతాకారుడై, అనంతుడై, సర్వేశ్వరుడై, దేవతలు, మనుష్యులు, పశువులు మున్నగు స్వరూపాలతో ఉంటున్నాడు.

**ఋచో యజూంషి సామాని తథైవాథర్వణాని వై ।**
**ఇతిహాసోపవేదాస్తు వేదాన్తేషు తథోక్తయః ॥ 82 ॥**

**వేదాంగాని సమస్తాని మన్వాదిగదితాని చ ।**
**శాస్త్రాణ్యశేషాణ్యాఖ్యాన్యానువాకాశ్చ యే క్వచిత్ ॥ 83 ॥**

**కావ్యాలాపాశ్చ యే కేచిద్ గీతకాన్యఖిలాని చ ।**
**శబ్దమూర్తిధరస్యైతద్ వపుర్విష్ణోర్మహాత్మనః ॥ 84 ॥**

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం, ఇతిహాసాలు, ఉపవేదాలు, వేదాంతవాక్యాలు, వేదాంగాలు, మనువు మున్నగువారు చెప్పిన సమస్త స్మృతులు, సకలశాస్త్రాలు, పురాణాలు, ఉపాఖ్యానాలు, అనువాకాలు (కల్పసూత్రాలు), సమస్తకావ్యాలు, సద్గోష్ఠులు, సకలగేయాలు. ఇవన్నీ శబ్దమూర్తిధరుడయిన మహాత్ముడైన విష్ణువుయొక్క శరీరమే.

**యాని మూర్తాన్యమూర్తాని యాన్యత్రాన్యత్ర వా క్వచిత్ ।**
**సన్తి వై వస్తుజాతాని తాని సర్వాణి తద్వపుః ॥ 85 ॥**

సాకారాలు, నిరాకారాలు ఇచ్చటా, వేరొకచోటా ఉన్నాయో, ఆ సమస్తవస్తు సముదాయాలు అంతా ఆ విష్ణుభగవానుని శరీరమే.

**అహం హరిః సర్వమిదం జనార్దనో నాన్యత్ తతః కారణకార్యజాతమ్ ।**
**ఈదృఙ్మనో యస్య న తస్య భూయో భవోద్భవా ద్వన్ద్వగదా భవన్తి ॥ 86 ॥**

"నేను శ్రీహరిని. ఇదంతా జనార్దనుడు. కార్యకారణజాతమంతా ఆయనకన్న వేరు కాదు." అనే ఇటువంటి మనస్సు కలవానికి మళ్లీ శరీరంలో జనించే రాగద్వేషాలు కాని, హృద్రోగాలవంటివికాని ఎన్నడూ కలుగవు. (సంసారబంధాలు జనించవు)

**ఇత్యేష తేఽంశః ప్రథమః పురాణస్యాస్య వై ద్విజ ।**
**యథావత్ కథితో యస్మిన్ శ్రుతే పాపైః ప్రముచ్యతే ॥ 87 ॥**

ద్విజోత్తమా! ఈ విధంగా ఈ విష్ణుపురాణంలోని మొదటి అంశాన్ని ఉన్నది ఉన్నట్లుగా నీకు వివరించాను. ఇది వింటే సర్వపాపాలనుంచీ విముక్తుడు అవుతాడు.

**కార్తిక్యాం పుష్కరస్నానే ద్వాదశాబ్దేన యత్ఫలమ్ ।**
**తదస్య శ్రవణాత్ సర్వం మైత్రేయాఽఽప్నోతి మానవః ॥ 88 ॥**

మైత్రేయా! పంద్రెండు సంవత్సరాలు కార్తికమాసంలో పుష్కరతీర్థంలో స్నానమాచరిస్తే ఏఫలం లభిస్తుందో, మానవుడు దీనిని విన్నందున అట్టి ఫలితాన్ని పొందుతాడు.

**దేవర్షి పితృగన్ధర్వయక్షాదీనాం చ సమ్భవమ్ ।**
**భవన్తి శృణ్వతః పుంసో దేవాద్యా వరదా మునే! ॥ 89 ॥**

మునీశ్వరా! దేవతలు, ఋషులు, పితృదేవతలు, గంధర్వులు, యక్షులు మున్నగువారియొక్క పుట్టుకను గురించి వినే పురుషునకు దేవతలు మున్నగువారు వరప్రదాతలవుతారు అని పరాశరుడు మైత్రేయునకు వచించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రథమాంశే భగవతః శ్రీవిష్ణోః చతుర్విధ విభూతివర్ణనం నామ ద్వావింశోఽధ్యాయః సమాప్తః ॥ 22 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో శ్రీవిష్ణుభగవానుని చతుర్విధవిభూతివర్ణన అనే ఇరవై రెండవ అధ్యాయం ప్రథమాంశం సమాప్తం ॥ 22 ॥



# **ద్వితీయాంశః - రెండవ అంశం**

## **ప్రథమోऽధ్యాయః - మొదటి అధ్యాయం**

## **ప్రియవ్రత వంశవర్ణనమ్ - ప్రియవ్రతుని వంశవర్ణన**

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు చెప్పాడు.

**భగవన్! సమ్యగాఖ్యాతం మమైతదఖిలం త్వయా ।**
**జగతః సర్గసమ్బంధి యత్ పృష్టోऽసి గురో! మయా! । 1 ॥**

“జగత్స్వరూపుడవైన గురువర్యా! నాచే అడగబడిన, జగత్తుయొక్క సృష్టిసంబంధమైన వృత్తాంతమంతా నీచే నాకు సర్వం చక్కగా వివరించబడింది.

**యోऽయమంశో జగత్సృష్టిసంబంధో గదితస్త్వయా ।**
**తత్రాహం శ్రోతుమిచ్ఛామి భూయోऽపి మునిసత్తమ! ॥ 2 ॥**

మునిసత్తమా! జగత్తు యొక్క సృష్టికి సంబంధించిన అంశం చెప్పావో, అందు మరికొంత విషయాన్ని మళ్లీ నీ ద్వారా నేను వినాలనుకొంటున్నాను.

**ప్రియవ్రతోత్తానపాదౌ సుతౌ స్వాయమ్భువస్య యౌ ।**
**తయోరుత్తానపాదస్య ధ్రువః పుత్రస్త్వయోదితః ॥ 3 ॥**

స్వాయంభువమనువుకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే కుమారులున్నారని, వారిలో ఉత్తానపాదుని కుమారుడు ధ్రువుడని చెప్పావుకదా!

**ప్రియవ్రతస్య నైవోక్తా భవతా ద్విజ సన్తతిః ।**
**తామహం శ్రోతు మిచ్ఛామి ప్రసన్నో వక్తుమర్హసి ॥ 4 ॥**

ద్విజప్రవరా! ప్రియవ్రతుని యొక్క సంతతిని గూర్చి నీవు చెప్పడం జరగలేదు. దానిని గూర్చి నేను వినాలని కోరుకొంటున్నాను. ప్రసన్నుడవై నాకు వివరించవలసింది.” అని ప్రశ్నించాడు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు పలికాడు.

**కర్దమస్యాత్మజాం కన్యాముపయేమే ప్రియవ్రతః ।**
**సమ్రాట్ కుక్షిశ్చ తత్కన్యే దశపుత్రాస్తథాऽపరే ॥ 5 ॥**

ప్రియవ్రతుడు కర్దముని యొక్క కుమార్తెను వివాహం చేసుకొన్నాడు. ఆమెకు సమ్రాట్టు, కుక్షి అనే ఇద్దరు కన్యలు, మరో పదిమంది కుమారులు కలిగారు.

**మహాప్రాజ్ఞా మహావీర్యా వినీతా దయితాః పితుః ।**
**ప్రియవ్రతసుతాః ఖ్యాతాస్తేషాం నామాని మే శృణు ॥ 6 ॥**

ఆ ప్రియవ్రతుని కుమారులు మహాప్రాజ్ఞులు, మహాబలవంతులు, వినయవంతులు, తండ్రికి చాలా ప్రియమైనవారు. వాసికెక్కారు. వారిపేర్లు నా ద్వారా ఆలకించు.

**అగ్నీధ్రశ్చాగ్నిబాహుశ్చ వపుష్మాన్ ద్యుతిమాంస్తథా ।**
**మేధామేధాతిథిర్భవ్యః సవనః పుత్ర ఏవచ ॥ 7 ॥**

**జ్యోతిష్మాన్ దశమస్తేషాం సత్యనామా సుతోఽభవత్ ।**
**ప్రియవ్రతస్య పుత్రాస్తే ప్రఖ్యాతా బలవీర్యతః ॥ 8 ॥**

వారు అగ్నీధ్రుడు, అగ్నిబాహుడు, వపుష్మంతుడు, ద్యుతిమంతుడు, మేధ, మేధాతిథి, భవ్యుడు, సవనుడు, పుత్రుడు, జ్యోతిష్మంతుడు అనేవారు. వారిలో పదవవాడైన జ్యోతిష్మంతుడు అనేవాడు యథార్థ నామధేయు డయ్యాడు. ప్రియవ్రతుని కుమారులు బలంలో, పరాక్రమంలో ప్రఖ్యాతు లయ్యారు.

**మేధాగ్నిబాహుపుత్రాస్తు త్రయో యోగపరాయణాః ।**
**జాతిస్మరా మహాభాగా న రాజ్యాయ మనో దధుః ॥ 9 ॥**

అందు మేధ, అగ్నిబాహుడు, పుత్రుడు అనే ముగ్గురూ బ్రహ్మజ్ఞానైకయోగపరాయణులు. పూర్వజన్మస్మరణ కలిగిన మహాభాగులు. రాజ్యభోగాలయందు మనసుపెట్టినవారు కారు.

**నిర్మమాః సర్వకాలన్తు సమస్తార్థేషు వై మునే ।**
**చక్రుః క్రియాం యథాన్యాయమఫలాకాంక్షిణో హి తే ॥ 10 ॥**

మునీశ్వరా ! వారు సమస్త విషయాలలోను, ఎల్లప్పుడూ మమత్వం లేని విరక్తులు. ఏ ఫలితాన్ని ఆశించకుండా శాస్త్రమర్యాదలకు అనుగుణంగా నిష్కామకర్మను ఆచరించారు.

**ప్రియవ్రతో దదౌ తేషాం సప్తానాం మునిసత్తమ! ।**
**విభజ్య సప్తద్వీపాని మైత్రేయ! సుమహాత్మనామ్ ॥ 11 ॥**

మునిశ్రేష్ఠుడవైన మైత్రేయా ! ప్రియవ్రతుడు మిగిలిన ఆ ఏడుగురు మహాత్ములకు ఏడు ద్వీపాలను విభజించి ఇచ్చాడు.

**జమ్బూద్వీపం మహాభాగ! సోఽగ్నీధ్రాయ దదౌ పితా ।**
**మేధాతిథే స్తథా ప్రాదాత్ ప్లక్షద్వీపమథాపరమ్ ॥ 12 ॥**

మహాభాగా! ఆ తండ్రి అగ్నీధ్రునకు జంబూద్వీపాన్ని ఇచ్చాడు. అదేవిధంగా మరొకటయిన ప్లక్షద్వీపాన్ని మేధాతిథికి ఇచ్చాడు.

**శాల్మలే చ వపుష్మన్తం నరేన్ద్రమభిషిక్తవాన్ ।**
**జ్యోతిష్మన్తం కుశద్వీపే రాజానం కృతవాన్ ప్రభుః ॥ 13 ॥**

శాల్మల ద్వీపంలో వపుష్మంతుని రాజుగా అభిషేకించాడు. ఆ ప్రభువు కుశద్వీపంలో జ్యోతిష్మంతుని రాజుగా చేశాడు.

**ద్యుతిమంతం చ రాజానం క్రౌంచద్వీపే సమాదిశత్ ।**
**శాకద్వీపేశ్వరం చాపి భవ్యం చక్రే చ స ప్రభుః ॥ 14 ॥**

**సవనం పుష్కరద్వీపే రాజానం సమకారయత్ ॥ 15 ॥**

ఆ తండ్రి ద్యుతిమంతుని క్రౌంచద్వీపానికి రాజుగా ఆజ్ఞాపించాడు. ప్రభువైన ఆ ప్రియవ్రతుడు శాకద్వీపానికి అధిపతిగా భవ్యుని నియమించాడు. పుష్కరద్వీపానికి రాజుగా సవనుని కావించాడు.

**జమ్బూద్వీపేశ్వరో యస్తు హ్యగ్నీధ్రో మునిసత్తమ! ।**
**తస్య పుత్రా బభూవుస్తే ప్రజాపతిసమా నవ ॥ 16 ॥**

మునిశ్రేష్ఠా! జంబూద్వీపానికి చక్రవర్తి అయిన అగ్నీధ్రుడు ఉన్నాడే, ఆయనకు ప్రజాపతులతో సమానులయిన తొమ్మండుగురు పుత్రులు ఉన్నారు.

**నాభిః కిమ్పురుషశ్చైవ హరివర్ష ఇలావృతః ।**
**రమ్యో హిరణ్వాన్ షష్ఠశ్చ కురు ర్భద్రాశ్వ ఏవ చ ॥ 17 ॥**

**కేతుమాలస్తథైవాన్యః సాధుచేష్టోఽభవన్నృపః ।**
**జమ్బూద్వీప విభాగాంశ్చ తేషాం విప్ర! నిశామయ ॥ 18 ॥**

వారు నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావృతుడు, రమ్యుడు, ఆరవ వాడు హిరణ్వంతుడు, కురువు, భద్రాశ్వుడు, చివరివాడు సాధుకార్యాలు చేసే నృపసత్తముడయిన కేతుమాలుడు అనేవారు. విప్రోత్తమా! వారికి పంచి ఇచ్చిన జంబూద్వీపం యొక్క విభాగాలను గూర్చి ఆలకించు.

**పిత్రా దత్తం హిమాహ్వంతు వర్షం నాభేస్తు దక్షిణమ్ ।**
**హేమకూటం తథా వర్షం దదౌ కిమ్పురుషాయ సః ॥ 19 ॥**

అందు దక్షిణభాగమయిన హిమమనే పేరుగల వర్షం (భారతవర్షం) నాభికి తండ్రిచే పంచిపెట్టబడింది. అలాగే హేమకూటమనే వర్షం కింపురుషునకు ఈయబడింది.

**తృతీయం నైషధం వర్షం హరివర్షాయ దత్తవాన్ ।**
**ఇలావృతాయ ప్రదదౌ మేరుర్యత్ర తు మధ్యమః ॥ 20 ॥**

మూడవదయిన నైషధవర్షాన్ని హరివర్షునకు ఇచ్చాడు. మేరుపర్వతం మధ్యభాగంలో ఉన్న ఇలావృతవర్షాన్ని ఇలావృతునకు ఇచ్చాడు.

**నీలాచలాశ్రితం వర్షం రమ్యాయ ప్రదదౌ పితా ।**
**శ్వేతం తదుత్తరం వర్షం పిత్రా దత్తం హిరణ్వతే ॥ 21 ॥**

అలాగే నీలపర్వతం ఉన్న వర్షాన్ని తండ్రి రమ్యునకు ఇచ్చాడు. దానికి ఉత్తరంగా ఉన్న శ్వేతవర్షాన్ని హిరణ్వంతునకు తండ్రి పంచి ఇచ్చాడు.

**యదుత్తరం శృంగవతో వర్షం తత్ కురవే దదౌ ।**
**మేరోః పూర్వేణ యద్వర్షం భద్రాశ్వాయ ప్రదత్తవాన్ ॥ 22 ॥**

అదే విధంగా దానికి ఉత్తరంగా ఉన్న, శృంగవంతం అనే పర్వతమున్న వర్షాన్ని కురువుకు ఇచ్చాడు. మేరు పర్వతానికి తూర్పుదిక్కుగా ఉన్న వర్షాన్ని భద్రాశ్వునకు ఇచ్చాడు.

**గన్ధమాదనవర్షన్తు కేతుమాలాయ దత్తవాన్ ।**
**ఇత్యేతాని దదౌ తేభ్యః పుత్రేభ్యః స నరేశ్వరః ॥ 23 ॥**

గంధమాదనవర్షాన్ని కేతుమాలునకు ఇచ్చాడు. ఈ విధంగా ఆ నరేశ్వరుడైన అగ్నీధ్రుడు తన తొమ్మండుగురు కుమారులకు తొమ్మిది వర్షాలను విభజించి ఇచ్చాడు.

**వర్షేష్వేతేషు తాన్ పుత్రా నభిషిచ్య స భూమిపః ।**
**శాలగ్రామం మహాపుణ్యం మైత్రేయ! తపసే యయౌ ॥ 24 ॥**

మైత్రేయా! ఈ విధంగా ఆ భూపతి తొమ్మిదివర్షాలయందు తన పుత్రులను అభిషిక్తులను గావించి, తపస్సుకొరకై శాలగ్రామమనే మహాపుణ్యప్రదేశానికి వెళ్లిపోయాడు.

**యాని కిమ్పురుషాదీని వర్షాణ్యష్టౌ మహామునే! ।**
**తేషాం స్వాభావికీ సిద్ధిః సుఖప్రాయా హ్యయత్నతః ॥ 25 ॥**

**విపర్యయో న తేష్వస్తి జరామృత్యుభయం న చ ।**
**ధర్మాధర్మౌ న తేష్వాస్తాం నోత్తమాధమమధ్యమాః ॥ 26 ॥**

**న తేష్వస్తి యుగావస్థా క్షేత్రేష్వష్టాసు సర్వదా ।**

మునీశ్వరుడవైన మేత్రేయా! కింపురుషవర్షం మున్నగు ఎనిమిదివర్షాలు ఉన్నాయో, అందు సుఖబాహుళ్యం ఎక్కువ. ఏ ప్రయత్నంలేకుండా స్వాభావికంగానే సమస్తములైన భోగసిద్ధులు లభిస్తాయి. ఆ ద్వీపాలలో అకాలమృత్యువు, సుఖరాహిత్యం వంటి విపర్యయదోషం లేదు. ముసలితనం, చావు వంటి వానివల్ల భయంలేదు. ధర్మం, అధర్మం, ఉత్తమం, మధ్యమం, అధమం వంటి భేదాలు లేవు. ఆ ఎనిమిది దీవులలోను ఎల్లప్పుడు యుగపరివర్తనం కానరాదు.

**హిమాహ్వయంతు వై వర్షం నాభేరాసీన్మహాత్మనః ॥ 27 ॥**

**తస్యర్షభోఽభవత్పుత్రో మేరుదేవ్యాం మహాద్యుతిః ।**
**ఋషభాద్భరతో జజ్ఞే జ్యేష్ఠః పుత్రశతస్య సః ॥ 28 ॥**

హిమవర్షం అనేపేరుగల ప్రదేశం మహాత్ముడయిన నాభియొక్క వర్షం. అతనికి మేరుదేవి యందు మిక్కిలి తేజస్వంతుడైన “ఋషభుడు” అనే పుత్రుడు కలిగాడు. ఋషభునకు భరతుడు జన్మించాడు. అతడు ఋషభుని నూర్గురి కొడుకులలో పెద్దవాడు.

**కృత్వా రాజ్యం స్వధర్మేణ తథేష్ట్వా వివిధాన్ మఖాన్ ।**
**అభిషిచ్య సుతం జ్యేష్ఠం భరతం పృథివీపతిమ్ ॥ 29 ॥**
**తపసే చ మహాభాగః పులస్త్యస్యాశ్రమం యయౌ ।**

మహాభాగుడైన ఋషభరాజేంద్రుడు స్వధర్మానుసారంగా రాజ్యం చేసి, అనేకవిధాలైన యజ్ఞాలు ఆచరించి, తన మొదటి కుమారుడైన భరతుని పృథివీపతిగా రాజ్యాభిషేకం గావించి తపస్సుకొరకై పులస్త్యాశ్రమానికి వెళ్లాడు. పులహస్యాశ్రమం యయౌ–అని పాఠాంతరం.

**వానప్రస్థవిధానేన తత్రాపి కృతనిశ్చయః ॥ 30 ॥**
**తపస్తేపే యథాన్యాయ మియాజ స మహీపతిః ।**

**తపసా కర్శితోఽ త్యర్థం కృశో ధమని సన్తతః ।**
**నగ్నో వీటాం ముఖే దత్వా వీరాధ్వానన్తతోగతః ॥ 31 ॥**

అక్కడకూడా ఆ రాజేంద్రుడు నిశ్చయబుద్ధితో వానప్రస్థవిధానంతో తపస్సును, నియమానుకూలంగా యజ్ఞకార్యాలను నిర్వహించాడు. తపస్సువల్ల మిక్కిలి ఎండిపోయి, కృశించి, సిరలు బయల్పడగా, దిగంబరుడై, నోట బంతివంటిరాయి నుంచుకొని పిమ్మట మహాప్రస్థానం చేశాడు.

వి॥ అనశనవ్రతం చేసేవారు నోటిలో రాతిబంతిని ఉంచుకొంటారని ప్రతీతి. వీట అనగా ఔషధవిశేషమని కొందరివ్యాఖ్య.

**తతశ్చ భారతం వర్షమేతల్లోకేషు గీయతే।**
**భరతాయ యతః పిత్రా దత్తం ప్రాతిష్ఠతా వనమ్ ॥ 32 ॥**

తండ్రిచే వనానికి వెళ్లబోయే సమయంలో రాజ్యం భరతునకు ధారాదత్తం కావడంవల్ల నాటినుండి ఈ లోకంలో ఇది భారతవర్షమనే పేరుతో జనప్రసిద్ధి వహించింది.

**సుమతిర్భరతస్యాభూత్ పుత్రః పరమధార్మికః ।**
**కృత్వా సమ్యగ్ దదౌ తస్మై రాజ్యమిష్టమఖః పితా ॥ 33 ॥**

భరతునకు సుమతి అనే పరమధార్మికుడైన పుత్రుడు కలడు. తండ్రి యజ్ఞ నిర్వహణయందు ఆసక్తికలవాడై చక్కగా రాజ్యంచేసి కుమారునకు అధికారం అప్పగించాడు.

**పుత్రసంక్రామితశ్రీస్తు భరతః సమహీపతిః ।**
**యోగాభ్యాసరతః ప్రాణాన్ శాలగ్రామేఽ త్యజన్మునే! ॥ 34 ॥**

మునీశ్వరా! భరతమహీపాలుడు రాజ్యశ్రీని పుత్రునకు సంక్రమింపజేసి శాలగ్రామక్షేత్రంలో నిరంతరయోగాభ్యాసరతుడై ప్రాణాలు విడిచి పెట్టాడు.

**పాఠాంతరం:**–సాలగ్రామే అని.

**అజాయత చ విప్రోఽసౌ యోగినాం ప్రవరే కులే।**
**మైత్రేయ! తస్య చరితం కథయిష్యామి తే పునః। 35॥**

మైత్రేయా! ఆ భరతుడే మళ్లీ యోగివర్యుల వంశంలో విప్రుడై పుట్టాడు. ఆయన చరిత్ర మళ్లీ నీకు వివరిస్తాను.

**సుమతేస్తేజసస్తస్మాదిన్ద్రద్యుమ్నో వ్యజాయత।**
**పరమేష్ఠీ తతస్తస్మాత్ప్రతిహార స్తదన్వయః॥ 36॥**

ఆ సుమతి తేజస్సువల్ల ఇంద్రద్యుమ్నుడనే కుమారుడు జన్మించాడు. అతనికి పరమేష్ఠి కలిగాడు. అతనికి తనయుడుగా ప్రతిహారుడు ఉద్భవించాడు.

**ప్రతిహర్తేతి విఖ్యాత ఉత్పన్నస్తస్య చాత్మజః।**
**భవస్తస్మాత్ తథోద్గీథః ప్రస్తారస్తత్సుతో విభుః॥ 37॥**

అతనికి ప్రతిహర్త అనే ప్రసిద్ధుడైన కుమారుడు కలిగాడు. అతని వల్ల భవుడు, అతనికి కుమారుడుగా ఉద్గీథుడు, అతనికి కుమారుడుగా సమర్థుడైన ప్రస్తారుడు జన్మించారు.

**పృథుస్తతస్తతో నక్తో నక్తస్యాపి గయః సుతః।**
**నరో గయస్య తనయస్తత్పుత్రోఽభూత్ విరాట్తతః॥ 38॥**

అతనికి పృథుడు, అతనికి నక్తుడు, నక్తునకు గయుడు, గయునకు నరుడు కుమారులయ్యారు. నరునకు విరాట్టు అనే పుత్రుడు జన్మించాడు.

**తస్య పుత్రో మహావీర్యో ధీమాంస్తస్మాదజాయత।**
**మహాన్తస్తత్సుతశ్చాభూన్మనస్యు స్తస్యచాత్మజః॥ 39॥**

ఆ విరాట్టుకు మహావీర్యుడు జన్మించాడు. అతనికి ధీమంతుడు పుట్టాడు. అతనికి మహాంతుడు అనే కుమారుడు కలిగాడు. అతని కుమారుడే మనస్యుడు.

**త్వష్టా త్వష్టుశ్చ విరజో రజస్తస్యాప్యభూత్సుతః।**
**శతజిద్రజసస్తస్య జజ్ఞే పుత్రశతం మునే॥ 40॥**

మునీశ్వరా! అతడే త్వష్ట. త్వష్టని కుమారుడు విరజుడు. అతనికి రజుడు అనే కుమారుడు కలిగాడు. రజుని పుత్రుడు శతజిత్తు. అతనికి నూరుగురు పుత్రులు కలిగారు.

**విష్వగ్జ్యోతిః ప్రధానస్తే యైరిమావర్ధితాః ప్రజాః ।**
**తైరిదం భారతం వర్షం నవభేద మలంకృతమ్ ॥ 41 ॥**

వారిలో విష్వగ్జ్యోతి ప్రధానుడు. వారి వలన ప్రజలు వృద్ధిపొందారు. వారిచే నవవిధవిభాగం పొందిన భారతవర్షం అలంకరించబడింది.

**తేషాం వంశప్రసూతైశ్చ భుక్తేయం భారతీపురా ।**
**కృతత్రేతాదిసర్గేణ యుగాఖ్యా హ్యేకసప్తతిః ॥ 42 ॥**

వారి వంశంలో పుట్టిన వారివల్ల పూర్వకాలంనుండి ఈ భారతధాత్రి అనుభవించబడింది. కృతయుగం, త్రేతాయుగం మున్నగు యుగవేళా సృష్టితో డెబ్బైయొక్క మహాయుగాలు (ఒక మన్వంతరం) పాలించబడ్డాయి.

**ఏష స్వాయమ్భువః సర్గో యేనేదం పూరితం జగత్ ।**
**వారాహే తు మునే! కల్పే పూర్వ మన్వన్తరాధిపః ॥ 43 ॥**

మునీశ్వరా! వారాహకల్పంలో మొదటి మన్వంతరాధిపతి అయిన స్వాయంభువమనువుయొక్క సర్గ ఇది. దీనివల్ల జగత్తంతా నిండి ఉంది."–అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే ప్రియవ్రత వంశవర్ణనం నామ ప్రథమోऽధ్యాయః సమాప్తః ॥ 1 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో ప్రియవ్రతుని వంశవర్ణన అనే మొదటి అధ్యాయం సమాప్తం ॥ 1 ॥



## ద్వితీయోఽధ్యాయః - రెండవ అధ్యాయం
## భూగోళవర్ణనమ్ - భూగోళవర్ణన

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు పలికాడు.

**కథితో భవతా బ్రహ్మన్ ! సర్గః స్వాయమ్భువశ్చ మే ।**
**శ్రోతుమిచ్ఛామ్యహం త్వత్తః సకలం మణ్డలం భువః ॥ 1 ॥**

"బ్రాహ్మణోత్తమా! నీచే నాకు స్వాయంభువమను సృష్టి వివరించబడింది. ఇక నీ ద్వారా సమస్త భూమండలం గురించి వినాలని నేను కోరుకొంటున్నాను.

**యావన్తః సాగరా ద్వీపాస్తథా వర్షాణి పర్వతాః ।**
**వనాని సరితః పుర్యో దేవాదీనాం తథా మునే! ॥ 2 ॥**

మునీశ్వరా! సముద్రాలు ఎన్ని? ద్వీపాలు ఎన్ని? వర్షాలు ఎన్ని? పర్వతాలు ఎన్ని? వనాలు ఎన్ని? నదులు ఎన్ని? అలాగే దేవతల పురాలు ఎన్ని ?

**యత్ప్రమాణమిదం సర్వం యదాధారం యదాత్మకమ్ ।**
**సంస్థాన మస్య చ మునే ! యథావద్వక్తుమర్హసి ॥ 3 ॥**

మునిశేఖరా! ఈ భూమండల ప్రమాణం ఎంత? దీనికి ఆధారం ఏమిటి? దీనికి కారణం ఏమిటి? దీని ఆకారమెటువంటిది? ఉన్నదున్నట్లు చెప్పడానికి అర్హుడవయినవాడవు" అని అడిగాడు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**మైత్రేయ! శ్రూయతామేతత్ సంక్షేపాద్గదతో మమ ।**
**నాస్య వర్షశతేనాపి వక్తుం శక్యో హి విస్తరః ॥ 4 ॥**

మైత్రేయా ! ఇది ఆలకించు. నేను సంక్షేపంగా చెబుతున్నాను. నూఱు ఏండ్లయినా దీనిని విస్తృతంగా చెప్పడానికి శక్యం కాదు.

**జమ్బూప్లక్షాహ్వయౌ ద్వీపౌ శాల్మల (లి) శ్చాపరో ద్విజ ।**
**కుశః క్రౌంచస్తథా శాకః పుష్కరశ్చైవ సప్తమః । 5 ॥**

ద్విజోత్తమా! జంబూద్వీపం, ప్లక్షద్వీపం అని పిలువబడే ద్వీపాలు రెండు, మరో ద్వీపమైన శాక ద్వీపం, కుశద్వీపం, క్రౌంచద్వీపం, శాకద్వీపం, ఏడవదయిన పుష్కర ద్వీపం.

**ఏతే ద్వీపాః సముద్రైస్తు సప్త సప్తభిరావృతాః ।**
**లవణేక్షుసురాసర్పిర్దధి దుగ్ధజలైః సమమ్ ॥ 6 ॥**

ఈ ఏడు ద్వీపాలు ఏడు సముద్రాలచే లవణసముద్రం, ఇక్షుసముద్రం, సురాసముద్రం, ఘృత సముద్రం, దధిసముద్రం, దుగ్ధసముద్రం, జలార్ణవం -అనే వాటిచే సమంగా చుట్టుకొనివున్నాయి.

**జంబూద్వీపః సమస్తానామేతేషాం మధ్యసంస్థితః ।**
**తస్యాపి మేరుర్మైత్రేయ! మధ్యే కనకపర్వతః ॥ 7 ॥**

మైత్రేయా! ఈ అన్నింటినడుమ జంబూద్వీపం ఉన్నది.దానికి మధ్యలో బంగారుపర్వతమైన మేరుగిరి ఉంది.

**చతురాశీతి సాహస్రో యోజనైరస్య చోచ్ఛ్రయః ।**
**ప్రవిష్టః షోడశాధస్తాద్ ద్వాత్రింశన్మూర్ధ్ని విస్తృతః ॥ 8 ॥**

దాని ఎత్తు ఎనభైనాలుగువేల యోజనాలు. అది క్రిందికి భూమిలో పదహారువేల యోజనాలు ప్రవేశించి ఉంది. దాని శిఖరవైశాల్యం ముప్పైరెండువేల యోజనాలు.

**మూలే షోడశసాహస్రో విస్తారస్తస్య సర్వశః ।**
**భూపద్మస్యాస్య శైలేశః కర్ణికాకార సంస్థితః ॥ 9 ॥**

దాని మూలవైశాల్యం అన్నివైపులా పదహారువేల యోజనాలు. ఈ శైలేంద్రము భూమి అనే పద్మానికి కర్ణికయొక్క ఆకారంలో ఉన్నట్లు ఉంది.

**హిమవాన్ హేమకూటశ్చ నిషధశ్చాస్య దక్షిణే ।**
**నీలః శ్వేతశ్చ శృంగీ చ ఉత్తరే వర్షపర్వతాః ॥ 10 ॥**

దీనికి దక్షిణంలో హిమాలయం, హేమకూటం, నిషధం అనే వర్షపర్వతాలు, ఉత్తరంలో నీలం, శ్వేతం, శృంగి అనే వర్షపర్వతాలు ఉన్నాయి. (వర్షాల ద్వారా విభాగింపబడ్డ పర్వతాలే వర్షపర్వతాలు)

**లక్షప్రమాణౌ ద్వౌ మధ్యౌ దశహీనాస్తథాஉపరే ।**
**సహస్రద్వితయోచ్ఛ్రాయా స్తావద్విస్తారిణశ్చ తే ॥ 11 ॥**

వీటి నడుమనున్న నిషధనీలగిరులు రెండు లక్షయోజనప్రమాణం కలవి. అటూఇటూ మిగిలినవి క్రమంగా పదేసివేల యోజనాలు తక్కువ విస్తీర్ణం కలవి. (అనగా హేమకూట, శ్వేతగిరులు తొంబదివేల యోజనాలు, హిమాలయ శృంగి గిరులు ఎనబైవేల యోజనాలు కలవని భావం).వీటి ఎత్తు రెండేసి వేల యోజనాలు. వాటి వైశాల్యం కూడ అంతే.

**భరతం ప్రథమం వర్షం తతః కిమ్పురుషం స్మృతమ్ ।**
**హరివర్షం తథైవాన్యన్మేరో ర్దక్షిణతో ద్విజ! ॥ 12 ॥**
**రమ్యకం చోత్తరం వర్షం తస్యైవాను హిరణ్మయమ్ ।**
**ఉత్తరాః కురవశ్చైవ యథా వై భారతం తథా ॥ 13 ॥**

ద్విజోత్తమా! మేరువుకు దక్షిణంగా మొదట భరతవర్షం, తరువాత కింపురుషవర్షం, ఆ పైన హరివర్షం ఉన్నాయి. మేరువుకు ఉత్తరంగా రమ్యకవర్షం, దాని తరువాత హిరణ్మయవర్షం, ఆపైన ఉత్తరకురు వర్షం ఉన్నాయి. ఇవి ఆకారంలో భారత వర్షం వంటివి. విస్తీర్ణంలో కూడా అంతే.

**నవ సాహస్రమేకైక మేతేషాం ద్విజసత్తమ ।**
**ఇలావృతం చ తన్మధ్యే సావర్ణో మేరురుచ్ఛ్రితః ॥ 14 ॥**
**మేరోశ్చతుర్దిశం తత్ర(తత్తు)నవ సాహస్ర విస్తృతమ్ ।**
**ఇలావృతం మహాభాగ ! చత్వారశ్చాత్రపర్వతాః ॥ 15 ॥**

మహాభాగా! ద్విజోత్తమా! వీటియొక్క ఒక్కొక్క దాని విస్తీర్ణం తొమ్మిదివేల యోజనాలు. వీటి మధ్యలో ఇలా వృతవర్షం ఉన్నది. దీని మధ్యలో సువర్ణమయమైన మేరుపర్వతం నిలిచి ఉంది. మేరుగిరికి నాలుగువైపులాతొమ్మిదివేల యోజనాల విస్తీర్ణంతో ఇలావృతవర్షం వ్యాపించి ఉంది. ఇందు నాలుగు వైపులా నాలుగు పర్వతాలు ఉన్నాయి.

**విష్కమ్భారచితా మేరో ర్యోజనాయుత ముచ్ఛ్రితాః ॥ 16 ॥**

ఇవి మేరువుకు మేకులులాగా (ఈశ్వరునిచే) నిర్మించబడ్డాయి. (అడుగున కన్న పైన విశాలంగా పడిపోకుండా మేరువును నిలబెట్టాయి). అవి పదేసివేల యోజనాలు ఎత్తుకలవి.

**పూర్వేణ మన్దరో నామ దక్షిణో గన్ధమాదనః ।**
**విపులః పశ్చిమే పార్శ్వే సుపార్శ్వశ్చోత్తరే స్మృతః ॥ 17 ॥**

అవి తూర్పున మందరం, దక్షిణాన గంధమాదనం, పశ్చిమదిక్కున విపులం, ఉత్తరం వైపున సుపార్శ్వం అని చెప్పబడ్డాయి.

**కదమ్బస్తేషు జమ్బూశ్చ పిప్పలో వట ఏవ చ ।**
**ఏకాదశ శతాయామాః పాదపా గిరి కేతవః ॥ 18 ॥**

వీటిపై క్రమంగా కడిమిచెట్లు, నేరేడుచెట్లు, రావిచెట్లు, మఱ్ఱిచెట్లు (మర్రిచెట్లు) పదకొండు వందల యోజనాల పొడవుగా కొండలకు జెండాలుగా ఉన్నాయి.

**జమ్బూద్వీపస్య సా జమ్బూర్నామహేతుర్మహామునే ।**
**మహాగజప్రమాణాని జమ్బ్వాస్తస్యాః ఫలాని వై ॥ 19 ॥**
**పతన్తి భూభృతః పృష్ఠే శీర్యమాణాని సర్వశః ।**
**రసేన తేషాం ప్రఖ్యాతా తత్ర జామ్బూనదీతి వై ॥ 20 ॥**

మహామునీ! జంబూద్వీపం అనిపేరు రావడానికి కారణం ఆ నేరేడు చెట్టు మాత్రమే. ఆ జంబూవృక్షం యొక్క పండ్లు పెద్దపెద్ద ఏనుగులంత ఉండి కొండపై భాగంపై అన్ని వైపులా రాలిపడి చితికిపోతూ ఉంటాయి. వాటి రసంతో అక్కడ జాంబూనది అనే నది ఏర్పడింది.

**సరిత్ ప్రవర్తతే సా చ పీయతే తన్నివాసిభిః ।**
**న స్వేదో న చ దౌర్గన్ధ్యం న జరా నేన్ద్రియక్షయః ॥ 21 ॥**

**తత్పానాత్ స్వచ్ఛమనసాం జనానాం తత్ర జాయతే ।**
**తీరమృత్ తద్రసం ప్రాప్య సుఖవాయువిశోషితా ।**

**జామ్బూనదాఖ్యం భవతి సువర్ణం సిద్ధభూషణమ్ ॥ 22 ॥**

అది ఒక నదిగా అచట ప్రవహిస్తూ ఉంటుంది. అచట నివాసం ఉన్నవారు దానిని త్రాగుతారు. దానిని త్రాగినందువల్ల చెమట కాని, దుర్వాసనకాని, ముసలితనంకాని, ఇంద్రియక్షయం కాని ఏర్పడవు. అచ్చటి జనాలకు స్వచ్ఛమైన మనస్సు ఉంటుంది. తీరంలో ఉన్నమట్టి, ఆ రసంతో తడిసిపోయి, పరిమళంతో ఉండే గాలిచే ఆరిపోయి ఘనీభవించి జాంబూనదం" అనే బంగారం అయి సిద్ధులకు అలంకారం అవుతోంది.

**భద్రాశ్వం పూర్వతో మేరోః కేతుమాలం చ పశ్చిమే ।**
**వర్షే ద్వే తు మునిశ్రేష్ఠ ! తయోర్మధ్యమిలావృతమ్ ॥ 23 ॥**

మునిశ్రేష్ఠా! మేరువుకు తూర్పుగా భద్రాశ్వమనే వర్షం, పడమటి దిక్కుగా కేతుమాలమనే వర్షం అనే రెండు వర్షాలు ఉన్నాయి. వాటి నడుమ ఉన్నదే ఇలావృతవర్షం.

**వనం చైత్రరథం పూర్వే దక్షిణే గన్ధమాదనమ్ ।**
**వైభ్రాజం పశ్చిమే తద్వదుత్తరే నన్దనం స్మృతమ్ ॥ 24 ॥**

దానికి తూర్పున చైత్రరథం, దక్షిణాన గంధమాదనం, పడమట దిక్కున వైభ్రాజం, అలాగే ఉత్తరదిక్కున నందనం అనే వనాలు ఉన్నాయి.

**అరుణోదం మహాభద్ర మసితోదం సమానసమ్ ।**
**సరాంస్యేతాని చత్వారి దేవభోగ్యాని సర్వదా ॥ 25 ॥**

అదేవిధంగా ఎల్లప్పుడూ దేవతలచే ఉపభోగ్యాలై, అరుణోదం, మహాభద్రం, అసితోదం, మానసం అనే నాలుగు సరోవరాలు ఉన్నాయి.

**శీతామ్భశ్చ కుముద్వాంశ్చ కురరీ మాల్యవాంస్తథా ।**
**వైకంకప్రముఖా మేరోః పూర్వతః కేసరాచలాః । 26 ॥**

శీతాంభం, కుముద్వాన్, కురరి, మాల్యవంతం, వైకంకం మున్నగునవి మేరువుకు తూర్పుదిక్కున ఉన్న కేసరపర్వతాలు.

వి॥ శీతాన్తశ్చక్రముంజశ్చ-శీతాంతం, చక్రముంజం అని పాఠాంతరం

**త్రికూటః శిశిరశ్చైవ పతంగో రుచకస్తథా ।**
**నిషధాద్యా దక్షిణత స్తస్య కేసరపర్వతాః ॥ 27 ॥**

త్రికూటం, శిశిరం, పతంగం, రుచకం, నిషధం మొదలైన దానికి దక్షిణదిక్కున ఉన్న కేసర పర్వతాలు.

**శిఖివాసాః సవైదూర్యః కపిలో గన్ధమాదనః ।**
**జారుధి ప్రముఖాస్తద్వత్ పశ్చిమే కేసరాచలాః ॥ 28 ॥**

శిఖివాసస్సు, వైదూర్యం, కపిలం, గంధమాదనం, జారుధి మున్నగునవి అలాగే పడమటి దిక్కున ఉన్న కేసర పర్వతాలు.

**మేరోరనన్తరాంగేషు జఠరాదిష్వవస్థితాః ।**
**శంఖకూటోఽథ ఋషభో హంసో నాగస్తథాఽపరః ॥**
**కాలాంజరాద్యాశ్చ తథాహి హ్యుత్తరే కేసరాచలాః ॥ 29 ॥**

మేరువుకు అనంతరం జఠరం మున్నగు ఇతరావయవాలతో ఉన్నట్లుగా ఉత్తరదిక్కున శంఖకూటం, ఋషభం, హంసం, నాగం, కాలాంజర అనే కేసరపర్వతాలు ఉన్నాయి.

వి ॥ కాలాంజనాద్యాశ్చ తథా–అని పాఠాంతరం.

**చతుర్దశ సహస్రాణి యోజనానాం మహాపురీ ।**
**మేరోరుపరి మైత్రేయ ! బ్రహ్మణః ప్రథితా దివి ॥ 30 ॥**

మైత్రేయా! మేరువు యొక్క పైభాగంలో అంతరిక్షంలో పద్నాలుగువేల యోజనాల విస్తీర్ణంతో బ్రహ్మదేవుని యొక్క మహాపురి విరాజిల్లుతోంది.

**తస్యాః సమన్తతశ్చాష్టౌ దిశాసు విదిశాసు చ ।**
**ఇన్ద్రాదిలోకపాలానాం ప్రఖ్యాతాః ప్రవరాః పురః ॥ 31 ॥**

దానికి అన్నివైపులా ఎనిమిది దిక్కులయందు, మూలల యందు ఇంద్రుడు మున్నగు లోకపాలకుల యొక్క ముఖ్య పట్టణాలు ప్రకాశిస్తూ ఉన్నాయి.

**విష్ణుపదవినిష్క్రాన్తా ప్లావయిత్వేన్దుమండలమ్ ।**
**సమన్తాత్ బ్రహ్మణః పుర్యాం గంగా పతతి వై దివః ॥ 32 ॥**

విష్ణుపదం నుండి వెలువడి, చంద్రమండలాన్ని అన్నివైపులా తడుపుతూ, గంగ దివినుండి బ్రహ్మపురిలో పడుతోంది.

**సా తత్ర పతితా దిక్షు చతుర్ధా ప్రతిపద్యతే ।**
**సీతా చాలకనన్దా చ చక్షుర్భద్రా చ వై క్రమాత్ ॥ 33 ॥**

ఆ గంగ అక్కడపడి నలుదిక్కులలోను క్రమంగా సీత, అలకనంద, చక్షువు, భద్ర అనే పేర్లతో ప్రవహిస్తోంది.

**పూర్వేణ శైలాత్ సీతా తు శైలం యాత్యన్తరిక్షగా ।**
**తతశ్చ పూర్వవర్షేణ భద్రాశ్వేనైతి సార్ణవమ్ ॥ 34 ॥**

సీతానది అంతరిక్షంనుండి పడి, తూర్పుకొండనుండి కొండకు చేరి తూర్పున ఉన్న భద్రాశ్వవర్షం చేరి అచ్చటనుండి సముద్రంలో కలుస్తున్నది.

**తథైవాలకనన్దాఽపి దక్షిణేనైత్య భారతమ్ ।**
**ప్రయాతి సాగరం భూత్వా సప్తభేదా మహామునే ॥ 35 ॥**

మునీశ్వరా! అలాగే అలకనందకూడ దక్షిణదిక్కుగా భారతవర్షం చేరి ఏడుపాయలై సాగరంలో కలుస్తున్నది.

**చక్షుశ్చ పశ్చిమగిరీ నతీత్య సకలాంస్తతః ।**
**పశ్చిమం కేతుమాలాఖ్యం వర్షం గత్వేతి సాగరమ్ ॥ 36 ॥**

అదేవిధంగా చక్షువుకూడా పడమట వైపునున్న సమస్తపర్వతాలనుదాటి, ఆ పశ్చిమదిక్కుననున్న కేతుమాలవర్షం దాటి సముద్రంలో కలుస్తున్నది.

**భద్రా తథోత్తరగిరీ నుత్తరాంశ్చ తథా కురూన్ ।**
**అతీత్యోత్తరమమ్భోధిం సమభ్యేతి మహామునే! ॥ 37 ॥**

మునిశేఖరా! అదేరీతిగా భద్రకూడా, ఉత్తరం వైపునున్న కొండలను, అలాగే ఉత్తరదిక్కుననున్న కురువర్షాలను దాటి ఉత్తర మహాసముద్రంలో కలుస్తున్నది.

**ఆనీలనిషధాయామౌ మాల్యవద్ గన్ధమాదనౌ ।**
**తయోర్మధ్యగతో మేరుః కర్ణికాకారసంస్థితః ॥ 38 ॥**

మాల్యవంతం, గంధమాదనం నీలనిషధపర్వతాలవరకూ వ్యాపించి ఉన్నాయి. ఆ ఉత్తర దక్షిణ దిక్కుల మధ్యగా కర్ణికాకారంలో మేరువు నిలిచి ఉంది.

**భారతాః కేతుమాలాశ్చ భద్రాశ్వాః కురవస్తథా ।**
**పత్రాణి లోకపద్మస్య మర్యాదాశైలబాహ్యతః ॥ 39 ॥**

దాని సరిహద్దు పర్వతాలకు వెలుపల భాగంలో ఉన్న భారతకేతుమాల భద్రాశ్వకురువర్షాలు లోకం అనే పద్మానికి రేకుల వంటివి.

**జఠరో దేవకూటశ్చ మర్యాదా పర్వతావుభౌ ।**
**తౌ దక్షిణోత్తరాయామా వానీలనిషధాయతే ॥ 40 ॥**

జఠరం, దేవకూటం అనే రెండు పర్వతాలు దానికి సరిహద్దుకొండలు. అవి రెండూ ఉత్తర దక్షిణదిశలలో నీల నిషధ పర్వతాలవరకూ వ్యాపించి ఉన్నాయి.

**గన్ధమాదనకైలాసౌ పూర్వపశ్చాయతావుభౌ ।**
**అశీతియోజనాయామా వర్ణవాన్తర్వ్యవస్థితౌ ॥ 41 ॥**

గంధమాదన కైలాసాలు రెండూ తూర్పుపడమరలుగా ఎనభైయోజనాల పొడవువరకూ వ్యాపించి సముద్రాలలో నిలిచి ఉన్నాయి.

**నిషధః పారియాత్రశ్చ మర్యాదా పర్వతావుభౌ ।**
**మేరోః పశ్చిమదిగ్భాగే యథాపూర్వౌ తథా స్థితౌ । 42 ॥**

మేరువుకు తూర్పుదిగ్భాగంలో పర్వతాలు ఉన్నట్లుగా, పశ్చిమదిగ్భాగంలో నిషధపారియాత్రపర్వతాలు రెండు సరిహద్దు గిరులుగా ఉన్నాయి.

**త్రిశృంగో జారుధిశ్చైవ హ్యుత్తరౌ వర్షపర్వతౌ ।**
**పూర్వపశ్చాయతావేతావర్ణవాన్తర్వ్యవస్థితౌ । 43 ॥**

త్రిశృంగం, జారుధి ఉత్తరం వైపుననున్న వర్షపర్వతాలు. ఇవి తూర్పు పడమరలుగా వ్యాపించి సముద్ర మధ్యంలో నిలిచి ఉన్నాయి.

**ఇత్యేతే మునివర్యోక్తా మర్యాదా పర్వతాస్తవ ।**
**జఠరాద్యాః స్థితా మేరోస్తేషాం ద్వౌ ద్వౌ చతుర్దిశమ్ ॥ 44 ॥**

మునిప్రవరా! ఈ విధంగా నీకు జఠరం మున్నగు ఎనిమిది సరిహద్దు పర్వతాలను గూర్చి వివరించాను. అవి రెండేసి చొప్పున మేరువుకు నలుదెసలా ఉన్నాయి.

**మేరోశ్చతుర్దిశం యే తు ప్రోక్తాః కేసరపర్వతాః ।**
**శీతాన్తాద్యా మునే తేషామతీవ హి మనోరమాః ॥ 45 ॥**
**శైలానామన్తరే ద్రోణ్యః సిద్ధ చారణసేవితాః ।**
**సురమ్యాణి తథా తాసు కాననాని పురాణి చ ॥ 46 ॥**

మునీశ్వరా! మేరువుకు నాలుగుదిక్కులా శీతాంతం మున్నగు కేసర పర్వతాలు ఉన్నాయని చెప్పాను కదా! వాటిలో మిక్కిలి మనోహరాలైన గుహలు ఉన్నాయి. అవి సిద్ధులచేత, చారణులచేత సేవించబడుతూ ఉంటాయి. వాటిలో చక్కనైనట్టి తోటలు, పురాలు ఉంటాయి.

**లక్ష్మీవిష్ణ్వగ్ని సూర్యాది దేవానాం మునిసత్తమ! ।**
**తాస్వాయతనవర్యాణి జుష్టాని వరకిన్నరైః ॥ 47 ॥**

మునిప్రవరుడువైన మైత్రేయా! లక్ష్మి, విష్ణువు, అగ్ని, సూర్యుడు మొదలైన దేవతలకు అందు అతి శ్రేష్ఠములయిన మందిరాలు ఉన్నాయి. ఆ గుహలలో గొప్పవారైన కిన్నరులు విహరిస్తూ ఉంటారు.

**గన్ధర్వయక్షరక్షాంసి తథా దైతేయదానవాః ।**
**క్రీడన్తి తాసు రమ్యాసు శైలద్రోణీష్వహర్నిశమ్ ॥ 48 ॥**

గంధర్వులు, యక్షులు, రక్షస్సులు, అదే విధంగా దైత్య దానవులు ఆ మనోహరశైల కంఠదరాలలో రాత్రి పగలూ క్రీడిస్తూ ఉంటారు.

**భౌమా హ్యేతే స్మృతాః స్వర్గా ధర్మిణామాలయా!మునే! ।**
**నైతేషు పాపకర్మాణో యాన్తి జన్మశతైరపి ॥ 49 ॥**

మునిశేఖరా! ఇవి భూతల స్వర్గాలుగా కీర్తించబడుతూ ఉంటాయి. ఇవి ధర్మాత్ములయిన వారికి నిలయాలు. పాపకర్ములు చేసేవారు ఈ ప్రదేశాలలోనికి నూరుజన్మలు ఎత్తినా ప్రవేశించలేరు.

**భద్రాశ్వే భగవాన్ విష్ణురాస్తే హయశిరాద్విజ ।**
**వరాహః కేతుమాలే తు భారతే కూర్మరూపధృక్ ॥ 50 ॥**
**మత్స్యరూపశ్చ గోవిన్దః కురుష్వాస్తే జనార్దనః ।**
**విశ్వరూపేణ సర్వత్ర సర్వః సర్వేశ్వరో హరిః ।**
**సర్వస్యాధారభూతోఽసౌ మైత్రేయా స్తేఽఖిలాత్మకః ॥ 51 ॥**

ద్విజోత్తముడువైన మైత్రేయా ! భద్రాశ్వవర్షంలో విష్ణుభగవానుడు హయగ్రీవరూపంలో ఉంటాడు. కేతుమాల వర్షంలో వరాహరూపంలోను, భారతవర్షంలో కూర్మరూపంలోను ఉంటాడు. జనార్దనుడైన గోవిందుడు ఉత్తరకురువర్షాలలో మత్స్యరూపంలో ఉంటాడు. సర్వాధారుడు, సర్వభూత కారణుడు, సర్వాత్మకుడు, సర్వేశ్వరుడు, సర్వము తానే అయినవాడు అయిన శ్రీహరి విశ్వరూపుడై సర్వత్ర ఉంటాడు.

**యాని కిమ్పురుషాదీని వర్షాణ్యష్టౌ మహామునే! ।**
**న తేషు శోకో నాయాసో నోద్వేగః క్షుద్భయాదికమ్ ॥ 52 ॥**

మహామునీ! కింపురుషవర్షం మున్నగు ఏ ఎనిమిది వర్షాలు ఉన్నాయో, అందు శోకం ఉండదు. ఆయాసం ఉండదు. ఏ ఉద్వేగం ఉండదు. ఆకలిచింత ఉండదు. భయం మున్నగు వాటి మాట ఉండదు.

**సుస్థాః ప్రజాః నిరాతంకాః సర్వదుఃఖవివర్జితాః ।**
**దశద్వాదశవర్షాణాం సహస్రాణాం స్థిరాయుషః ॥ 53 ॥**

ఆ వర్షాలలో ప్రజలు ఆరోగ్యవంతులై ఉంటారు. ఏ ఆరాటం లేనివారు. ఎటువంటి దుఃఖాలు కించిత్తుకూడా లేనివారు. పదిపండ్రెండువేల సంవత్సరాలు స్థిరమైన ఆయుష్షు కలవారై ఉంటారు.

**న తేషు వర్షతే దేవో భౌమాన్యమ్భాంసి తేషు వై ।**
**కృతత్రేతాదికానైవ తేషు స్థానేషు కల్పనా ॥ 54 ॥**

ఆ ప్రదేశాలలో దేవుడు వర్షాలు కురియడు. అందు భూగర్భజలాలు మాత్రమే వినియోగాలు. అక్కడ కృతత్రేతాది కల్పన కనిపించదు.

**సర్వేష్వేతేషు వర్షేషు సప్త సప్త కులాచలాః ।**
**నద్యశ్చ శతశస్తేభ్యః ప్రసూతా యా ద్విజోత్తమ! ॥ 55 ॥**

ద్విజోత్తమా! ఈ సమస్తవర్షాలలోను ఏడేసి ఏడేసికులపర్వతాలు ఉన్నాయి. వాటి నుండి పుట్టి ప్రవహించే నదులు వందలకొలదీ ఉన్నాయి అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే భూగోళవర్ణనం నామ ద్వితీయోఽధ్యాయః సమాప్తః ॥ 2 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో భూగోళవర్ణన అనే రెండవ అధ్యాయం సమాప్తం ॥ 2 ॥

## **తృతీయోఽధ్యాయః** – మూడవ అధ్యాయం

## **భారతాది నవఖండవిభాగః** – భారతాది నవఖండవిభాగం

**శ్రీపరాశర ఉవాచ:**–పరాశరుడు పలికాడు.

**ఉత్తరం యత్సముద్రస్య హిమాద్రేశ్చైవ దక్షిణమ్ ।**
**వర్షం తద్భారతం నామ భారతీ యత్ర సన్తతిః ॥ 1 ॥**

**నవయోజనసాహస్రో విస్తారోఽస్య మహామునే! ।**
**కర్మభూమిరియం స్వర్గమపవర్గం చ గచ్ఛతామ్ ॥ 2 ॥**

"మహామునీ! సముద్రానికి ఉత్తరంగాను, హిమగిరికి దక్షిణంగాను ఉన్న వర్షం భారతవర్షం అని చెప్పబడుతోంది. ఇచ్చటి సంతతికి భారతి అనిపేరు. దీని విస్తీర్ణం తొమ్మిదివేల యోజనాలు. స్వర్గం, మోక్షం కోరుకొనేవారికి, తత్ప్రాప్తి పొందే వారికి అనుకూలమైన కర్మభూమి ఇది.

**మహేన్ద్రో మలయః సహ్యః శుక్తిమాన్ ఋక్షపర్వతః ।**
**విన్ధ్యశ్చ పారియాత్రశ్చ సప్తాత్ర కులపర్వతాః ॥ 3 ॥**

మహేంద్రం, మలయం, సహ్యం, శుక్తిమంతం, ఋక్షపర్వతం, వింధ్యం, పారియాత్రం–ఇవి ఏడును ఇచ్చటి కులపర్వతాలు.

**అంతః సంప్రాప్యతే స్వర్గో ముక్తిమస్మాత్ ప్రయాన్తి వై ।**
**తిర్యక్త్వం నరకం చాపి యాన్త్యతః పురుషా మునే! ॥ 4 ॥**

**ఇతః స్వర్గశ్చ మోక్షశ్చ మధ్యశ్చాన్తశ్చ గమ్యతే ।**
**న ఖల్వన్యత్ర మర్త్యానాం కర్మభూమౌ విధీయతే ॥ 5 ॥**

మునీశ్వరా! ఈ ప్రదేశంనుంచే జీవులు శుభకర్మలాచరించి తద్ద్వారా స్వర్గాన్ని చేరుతారు. లేదా ముక్తిని పొందుతారు. పాపకర్మలు కావించి తిర్యగ్యోనుల యందు జన్మిస్తారు. లేదా నరకం పొందుతారు. ఇక్కడనుంచే మానవులు స్వర్గం, మోక్షం, అంతరిక్షం, పాతాళం చేరుకొంటారు. మర్త్యులకు ఇక్కడ తప్ప మరో చోట భూమియందు కర్మవిధి విధింపబడలేదు.

**ఇన్ద్రద్వీపః కశేరుమాన్ తామ్రపర్ణో గభస్తిమాన్ ।**
**నాగద్వీప స్తథా సౌమ్యో గన్ధర్వస్త్వథవారుణః ॥ 6 ॥**

**అయంతు నవమస్తేషాం ద్వీపః సాగరసంవృతః ।**
**యోజనానాం సహస్రం తు ద్వీపోఽయం దక్షిణోత్తరాత్ ॥ 7 ॥**

ఇంద్రద్వీపం, కశేరువు, తామ్రపర్ణం, గభస్తిమంతం, నాగద్వీపం, అలాగే సౌమ్యం, గంధర్వం, వారుణం అనే ప్రదేశాలు, వీటిలో తొమ్మిదో ద్వీపం సాగరంచే చుట్టుకొనబడింది. అది ఉత్తర దక్షిణాలుగా వేయి యోజనాలు పరిమితి కలిగిన ద్వీపం (ఇదే భారత ద్వీపమని వరాహపురాణం)

**పూర్వే కిరాతా యస్య స్యుః పశ్చిమే యవనాః స్థితాః ।**
**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా మధ్యే శూద్రాశ్చ భాగశః ॥ 8 ॥**

దీనికి తూర్పున కిరాతులు ఉంటారు. పడమట దిక్కులో యవనులు ఉంటారు. మధ్యభాగాలలో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు ఉన్నారు.

**ఇజ్యాయుద్ధవాణిజ్యాద్యై ర్వర్తయన్తో వ్యవస్థితాః । 9 ॥**

వీరు యజనయాజనాలు, యుద్ధం, వాణిజ్యం మున్నగు వృత్తులను ఆచరిస్తూ విభాగానుసారంగా వ్యవహరిస్తూ ఉంటారు.

**శతద్రుచన్ద్రభాగాద్యా హిమవత్పాదనిర్గతాః ।**
**వేదస్మృతిముఖాద్యాశ్చ పారియాత్రోద్భవా మునే! ।**
**నర్మదా సురసాద్యాశ్చ నద్యో విన్ధ్యాద్రినిర్గతాః ॥ 10 ॥**

మునీశ్వరా! శతద్రువు, చంద్రభాగ మున్నగు నదులు హిమగిరి పాదాల నుంచి వెలువడ్డాయి. వేద, స్మృతి మున్నగు నదులు పారియాత్రపర్వతం నుంచి పుట్టాయి. నర్మద, సురస మున్నగు నదులు వింధ్యాద్రి నుండి ప్రవహిస్తున్నాయి.

**తాపీ పయోష్ణీ నిర్విన్ధ్యా ప్రముఖా ఋక్షసమ్భవాః ।**
**గోదావరీ భీమరథా కృష్ణవేణ్యాదికాస్తథా ॥ 11 ॥**
**సహ్యపాదోద్భవా నద్యః స్మృతాః పాపభయాపహాః ।**
**కృతమాలా తామ్రపర్ణీ ప్రముఖా మలయోద్భవాః ॥ 12 ॥**

తాపి, పయోష్ణి, నిర్వింధ్య మున్నగు నదులు ఋక్షపర్వతం నుంచి ఉద్భవించాయి. గోదావరి, భీమరథి, కృష్ణవేణి మున్నగు నదులు అలాగే సహ్యపర్వత పాదాలనుంచి పుట్టాయి. అవి పాప భయాన్ని పోగొట్టే పుణ్యనదులు. కృతమాల, తామ్రపర్ణి మున్నగు నదులు మలయపర్వతం నుంచి పుట్టి ప్రవహించాయి.

**త్రిసామాచార్యకుల్యాద్యా మహేన్ద్రప్రభవాః స్మృతాః ।**
**ఋషికుల్యాకుమార్యాద్యాః శుక్తిమత్పాదసమ్భవాః ॥ 13 ॥**

త్రిసామ, ఆర్యకుల్య మున్నగు నదులు మహేంద్ర పర్వతం నుంచి ప్రభవించాయి. ఋషి కుల్య, కుమారి మున్నగు నదులు శుక్తిమంతం అనే పర్వతం నుండి ఉద్భవించాయి.

**ఆసాం నద్యుపనద్యశ్చ సన్త్యన్యాశ్చ సహస్రశః ।**
**తాస్విమే కురుపాంచాలా మధ్యదేశాదయో జనాః । 14 ॥**

ఈ నదులకు వేరే ఉపనదులు వేలకొదిగా ఉన్నాయి. ఈ నదీతటాలలోని జనులు కురు, పాంచాల, మధ్య దేశాలవారును.

**పూర్వదేశాదికాశ్చైవ కామరూపనివాసినః ।**
**పుణ్డ్రాః (ఆంధ్రాః) కలింగా మగధా దాక్షిణాత్యాశ్చ సర్వశః ॥ 15 ॥**

తూర్పుదేశాలు మున్నగువాటిలో నివసించేవారైన కామరూపులవలె వసించేవారును, పుండ్రులు, కలింగులు, మగధులు, దక్షిణదిక్కులో నివసించేవారు అందరూ,

**తథాపరాన్తాః సౌరాష్ట్రాః శూరాఽఽభీరాస్తథాఽర్బుదాః ।**
**కారుషా మాలవాంశ్చైవ పారియాత్రనివాసినః ॥ 16 ॥**
**సౌవీరాః సైన్ధవాహూణాః శాల్వాః (సాల్వాః) కోసలవాసినః ।**
**మద్రాఽఽరామాస్తథాఽమ్బష్ఠాః పారశీకాదయస్తథా ॥ 17 ॥**

అదేవిధంగా పశ్చిమ దిక్కుగా ఉండే సౌరాష్ట్రులు, శూరులు, ఆభీరులు, అర్బుదులు, కారూషులు, మాళవులు, అదే విధంగా పారియాత్రపర్వత ప్రాంత నివాసులు, సౌవీరులు, సైంధవులు, హూణులు, సాల్వులు, కోసలదేశవాసులు, మాద్రులు, ఆరాములు, అంబష్ఠులు, అదే రీతిగా పారశీకులు మున్నగువారును-

**ఆసాం పిబన్తి సలిలం వసన్తి సరితాం సదా ।**
**సమీపతో మహాభాగ ! హృష్టపుష్టజనాకులాః ॥ 18 ॥**

ఓ మహాభాగ! ఎల్లప్పుడూ ఈ నదీతీరాలలో కలిసిఉంటూ, వీటి నీరు త్రాగుతూ, సంతోషం పొంది, పుష్టిని అనుభవిస్తూ, జన సమ్మర్దమై ఉండడం జరుగుతోంది.

**చత్వారి భారతే వర్షే యుగాన్యత్ర మహామునే ।**
**కృతం త్రేతా ద్వాపరశ్చ కలిశ్చాన్యత్ర న క్వచిత్ ॥ 19 ॥**

మునీశ్వరా! భారతవర్షంలో ఇక్కడ కృత త్రేతా ద్వాపర కలియుగాలనబడే నాలుగుయుగాల కాలవిభాగం ఉంది. ఇది మరోచోట కనబడదు.

**తపస్తప్యన్తి మునయో జుహ్వతే చాత్ర యజ్వినః ।**
**దానాని చాత్ర దీయన్తే పరలోకార్థమాదరాత్ ॥ 20 ॥**

ఇక్కడ మునులు తపస్సులు కావిస్తారు. యాజ్ఞికులు యజ్ఞాలు చేస్తారు. పరలోకం పొందడానికై మహాపవిత్రంగా జనులు దానాలు చేస్తారు.

**పురుషైర్యజ్ఞపురుషో జమ్బూద్వీపే సదేజ్యతే ।**
**యజ్ఞైర్యజ్ఞమయో విష్ణురన్య ద్వీపేషు చాన్యథా । 21 ॥**

జంబూద్వీపంలో పురుషులచే యజ్ఞపురుషుడైన విష్ణుమూర్తి యజ్ఞాల ద్వారా పూజించబడతాడు. మిగిలిన ద్వీపాలలో విధానం మరోలా ఉంటుంది.

**అత్రాపి భారతం శ్రేష్ఠం జమ్బూద్వీపే మహామునే ।**
**యతో హి కర్మభూరేషా తతోఽన్యా భోగభూమయః ॥ 22 ॥**

మునీశ్వరా ! జంబూద్వీపంలో కూడ ఇచ్చట భారత వర్షం శ్రేష్ఠమైనది. దానికి కారణం ఇది కర్మ భూమి కావడం మిగిలినవి భోగ భూములుగా ప్రసిద్ధి చెందడం.

**అత్ర జన్మసహస్రాణాం సహస్రైరపి సత్తమ ।**
**కదాచిల్లభతే జన్తుర్మానుష్యం పుణ్యసంచయాత్ ॥ 23 ॥**

మునిసత్తమా! పుణ్యసంపాదనవల్ల వేలకొలదిజన్మలు వేనవేలుగా గడిచిన పిమ్మట, ఎప్పుడో ప్రాణికి ఈ భారతవర్షంలో మానవునిగా పుట్టుక లభిస్తుంది.

**గాయన్తి దేవాః కిల గీతకాని**
**ధన్యాస్తు తే భారతభూమిభాగే ।**
**స్వర్గాపవర్గాస్పదమార్గభూతే**
**భవన్తి భూయః పురుషాస్సురత్వాత్ ॥ 24 ॥**

"దేవత్వం పొంది పురుషులు మళ్లీ స్వర్గానికి, మోక్షానికి నిలయమార్గమైన భారత భూభాగంలో జన్మించేవారు ఎంత ధన్యులోకదా!" అని దేవతలు పాటలు పాడుకొంటూ ఉంటారు.

**కర్మాణ్యసంకల్పిత తత్ఫలాని**
**సంన్యస్య విష్ణౌ పరమాత్మభూతే ।**
**అవాప్యతాం కర్మమహీమనన్తే**
**తస్మింల్లయం యే త్వమలాః ప్రయాన్తి ॥ 25 ॥**

"ఏ దోషం లేని మహాత్ములు ఎవరయితే ఉన్నారో, వారు ఈ కర్మభూమిలో జన్మను పొంది, ఏ ఫలితాలను కోరుకొనకుండా నిష్కామకర్మలను ఆచరించి, వాటి ఫలాలను విష్ణువునందు సమర్పించి ఆయనలో లీనమవుతున్నారు కదా! వారు ఎంత సుకృతులు !

**జానీమ నైతత్ క్వ వయం విలీనే**
**స్వర్గప్రదే కర్మణి దేహబన్ధమ్ ।**
**ప్రాప్స్యామ ధన్యాః ఖలు తే మనుష్యా**
**యే భారతే నేన్ద్రియవిప్రహీనాః ॥ 26 ॥**

స్వర్గాన్ని ప్రసాదించిన కర్మ క్షీణించి పోయిన పిమ్మట దేహాభిమానంతో మనం ఎక్కడ జన్మిస్తామో ఎరుగము. భారతభూమిలో జన్మించి ఇంద్రియనిగ్రహలోపం లేని మనుష్యులు ఎంత ధన్యులో కదా! అని దేవతలు స్తుతిస్తారని పరాశరుడు పలికాడు.

**నవవర్షంతు మైత్రేయ! జమ్బూదీపమిదం మయా ।**
**లక్షయోజనవిస్తారం సంక్షేపాత్ కథితం తవ ॥ 27 ॥**

మైత్రేయా! తొమ్మిది వర్షాలు, లక్షయోజన విస్తారం కల ఈ జంబూద్వీపాన్ని గురించి నీకు సంక్షిప్తంగా వివరించబడింది.

**జమ్బూద్వీపం సమావృత్య లక్షయోజన విస్తరః ।**
**మైత్రేయ! వలయాకారః స్థితః క్షారోదధిర్బహిః ॥ 28 ॥**

మైత్రేయా! జంబూద్వీపాన్ని చుట్టువారి కొన్ని లక్షయోజనాల విస్తీర్ణంతో లవణసముద్రం వలయాకారంలో ఉంది – అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే భారతాది నవఖండవిభాగో నామ తృతీయోఽధ్యాయః సమాప్తః ॥ 3 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో భారతాది నవఖండవిభాగం అనే మూడవ అధ్యాయం సమాప్తం ॥ 3 ॥



# చతుర్థోఽధ్యాయః - నాల్గవ అధ్యాయం

## ప్లక్షాది ద్వీపవర్ణనమ్ - ప్లక్షాది ద్వీపవర్ణన

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**క్షారోదేన యథా ద్వీపో జమ్బూసంజ్ఞోఽభివేష్టితః ।**
**సంవేష్ట్య క్షారముదధిం ప్లక్షద్వీప స్తథా స్థితః ॥ 1 ॥**

లవణసముద్రంచే ఏ రీతిగా జంబూద్వీపం అనే పేరుగల దీవి చుట్టబడి ఉందో, అదే రీతిగా ఉప్పునీటి సముద్రం చుట్టూ ప్లక్షద్వీపమనే దీవి ఉంది.

**జమ్బూద్వీపస్య విస్తారః శతసాహస్రసమ్మితః ।**
**స ఏవ ద్విగుణో బ్రహ్మన్! ప్లక్షద్వీప ఉదాహృతః ॥ 2 ॥**

బ్రాహ్మణోత్తమా! జంబూద్వీప విస్తీర్ణం లక్షయోజనాలు కదా! దానికి రెట్టింపు విస్తీర్ణం కలది ప్లక్షద్వీపమని చెప్పబడుతోంది.

**సప్త మేధాతిథేః పుత్రాః ప్లక్షద్వీపేశ్వరస్య వై ।**
**జ్యేష్ఠః శాన్తహయో నామ శిశిరస్తదనన్తరమ్ ॥ 3 ॥**

**సుఖోదయస్తథాఽఽనన్దః శివః క్షేమక ఏవ చ ।**
**ధ్రువశ్చ సప్తమస్తేషాం ప్లక్షద్వీపేశ్వరా హితే ॥ 4 ॥**

ప్లక్షద్వీపానికి అధిపతి మేధాతిథి అనేవాడు కదా! అతనికి ఏడుగురు కుమారులు. అందు జ్యేష్ఠుడు శాంతహయుడు. తరువాతివాడు శిశిరుడు. ఆ తరువాతివారు సుఖోదయుడు, ఆనందుడు, శివుడు, క్షేమకుడు అనేవారు. ఏడవవాడు ధ్రువుడు. వారు ఏడుగురు ప్లక్షద్వీపానికి అధిపతులయ్యారు.

వి ॥ శాంతభయో నామ-అని పాఠాంతరం.

**పూర్వం శాన్తహయం వర్షం శిశిరం సుఖదం తథా ।**
**ఆనన్దం చ శివం చైవ క్షేమకం ధ్రువమేవ చ ॥ 5 ॥**

వారు పరిపాలించిన వర్షాలలో మొదటిది శాంతహయ వర్షం. తరువాతది వరుసగా శిశిరవర్షం, సుఖదవర్షం, ఆనందవర్షం, శివవర్షం, క్షేమకవర్షం, ధ్రువవర్షం అనేవి.

**మర్యాదాకారకాస్తేషాం తథాఽన్యే వర్షపర్వతాః ।**
**సప్తైవ తేషాం నామాని శృణుష్వ మునిసత్తమ ॥ 6 ॥**

మునిశ్రేష్ఠా! వాటికి సరిహద్దులు ఏర్పరచే మిగిలిన వర్షపర్వతాలు కూడా ఏడే. వాటి పేర్లను ఆలకించు.

**గోమేధశ్చైవ చన్ద్రశ్చ నారదో దున్దుభిస్తథా ।**
**సోమకః సుమనాశ్చైవ వైభ్రాజశ్చైవ సప్తమః ॥ 7 ॥**

అది గోమేధం, చంద్రం, నారదం, దుందుభి, సోమకం, సుమనసం, ఏడవదైన వైభ్రాజం అనేవి.

**వర్షాచలేషు రమ్యేషు సర్వేష్వేతేషు చానఘాః ।**
**వసన్తి దేవగన్ధర్వసహితాః సతతం ప్రజాః ॥ 8 ॥**

ఈ రమ్యములైన సమస్త వర్షపర్వతాలపైనా, ఆ సుందరవర్షప్రదేశాలలోను, ఏ పాపం చేయని పుణ్యాత్ములైన ప్రజలు ఎల్లప్పుడూ దేవతలతోను, గంధర్వులతోనూ కలసి నివసిస్తూ ఉంటారు.

**తేషు పుణ్యా జనపదాశ్చిరాచ్చ మ్రియతే జనః ।**
**నాధయో వ్యాధయో వాఽపి సర్వకాలసుఖం హి తత్ ॥ 9 ॥**

అక్కడ నివసించే జనపదాలలోని ప్రజలు పుణ్యాత్ములు. చాలాకాలం జీవించి మరణిస్తూ ఉంటారు. అచ్చటి జనాలకు ఆధివ్యాధులుండవు. అక్కడ సర్వకాలాలలోను సుఖమే. దానికి కారణం ఆ జనపదాలు పరమపవిత్రాలు.

**తేషాం నద్యస్తు సప్తైవ వర్షాణాం చ సముద్రగాః ।**
**నామతస్తాః ప్రవక్ష్యామి శ్రుతాః పాపం హరన్తి యాః ॥ 10 ॥**

ఆ వర్షాలలో నదులు కూడా ఏడే. అవి ప్రవహించి సముద్రంలో కలుస్తాయి. ఏ నామాలు వింటే పాపాలు పోతాయో, వాటి పేర్లు చెబుతాను.

**అనుతప్తా శిఖీ చైవ విపాశా త్రిదివాఽక్లమా ।**
**అమృతా సుకృతా చైవ సప్తైతాస్తత్ర నిమ్నగాః ॥ 11 ॥**

అనుతప్త, శిఖి, విపాశా, త్రిదివ, అక్లమ, అమృత, సుకృత అనబడే ఈ ఏడూ అక్కడ ప్రవహించే నదులు.

**ఏతే శైలా స్తథా నద్యః ప్రధానాః కథితాస్తవ ।**
**క్షుద్రశైలాస్తథా నద్యస్తత్ర సన్తి సహస్రశః ॥ 12 ॥**

ఈ పర్వతాలు, నదులు ప్రధానమైనవి నీకు చెప్పబడ్డాయి. ఇక అక్కడ చిన్నచిన్న కొండలూ, నదులు వేల కొలది ఉన్నాయి.

**తాః పిబన్తి సదా హృష్టా నదీర్జనపదాస్తుతే ।**
**అపసర్పిణీ న తేషాం(వై)న చైవోత్సర్పిణీ ద్విజ! ॥ 13 ॥**

ద్విజోత్తమా! అచ్చటి జనపదులు ఆ నదీజలాలను ఎల్లప్పుడూ బహుసంతుష్టులై త్రాగుతూ ఉంటారు. అందువల్ల వారికి వృద్ధి క్షయాలు ఉండవు.

**న త్వేవాస్తి యుగావస్థా తేషు స్థానేషు సప్తసు ।**
**త్రేతాయుగసమః కాలః సర్వదైవ మహామతే! ॥ 14 ॥**

ఓ మహామతీ! ఆ ఏడు వర్షప్రదేశాలలోనూ యుగవ్యవస్థ అనేది కనిపించదు. కాలం ఎప్పుడూ త్రేతాయుగంతో సమానంగా ఉంటుంది.

**ప్లక్షద్వీపాదిషు బ్రహ్మన్! శాక ద్వీపాన్తికేషు వై ।**
**పంచవర్ష సహస్రాణి జనా జీవన్త్యనామయాః ॥ 15 ॥**

బ్రాహ్మణోత్తమా! ప్లక్షద్వీపం మొదలు శాకద్వీపంవరకూ ఆయాప్రదేశాలలో నివసించే జనులు ఏ రోగం లేకుండా అయిదు వేల ఏండ్లవరకూ జీవిస్తూ ఉంటారు.

**ధర్మాః పంచ త్వథైతేషు వర్ణాశ్రమవిభాగజాః ।**
**వర్ణాశ్చ తత్ర చత్వారస్తాన్ నిబోధ వదామి తే ॥ 16 ॥**

ఈ ద్వీపాలలో వర్ణాశ్రమవిభాగానుసారంగా ధర్మం (అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం,అపరిగ్రహం) అని ఐదు విధాలుగా ఉంటుంది. అచ్చట వర్ణాలు నాలుగు. వాటిని గూర్చి తెలుసుకో. వాటిని నీకు చెబుతాను.

**ఆర్యకాః కురవశ్చైవ వివింశా (విదిశ్యా) భావినశ్చ తే ।**
**విప్రక్షత్రియవైశ్యాస్తే శూద్రాశ్చ మునిసత్తమ ॥ 17 ॥**

మునిశ్రేష్ఠా! ఆర్యకులు, కురువులు, వివింశులు, భావులు అనేవారు బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రులుగా ఉంటారు.

వి॥ కురరాశ్చైవ అని పాఠాంతరం.

**జమ్బూవృక్ష ప్రమాణస్తు తన్మధ్యే సుమహాంస్తరుః ।**
**ప్లక్షస్తన్నామసంజ్ఞోఽ యం ప్లక్షద్వీపో ద్విజోత్తమ! ॥ 18 ॥**

ద్విజోత్తమా ! ఆ ద్వీపం యొక్క మధ్యభాగంలో జంబూద్వీపంలోని జంబూవృక్షప్రమాణ మంతటి జువ్విచెట్టు ఒకటుంది. ఆ చెట్టుయొక్క పేరు వల్లనే అది ప్లక్షద్వీపమనబడింది.

**ఇజ్యతే తత్ర భగవాంస్తైర్వర్ణైరార్యకాదిభిః ।**
**సోమరూపీ జగత్స్రష్టా సర్వః సర్వేశ్వరో హరిః ॥ 19 ॥**

అక్కడ ఆర్యకాది వర్ణాల వారిచే భగవంతుడు, జగత్స్రష్ట, సర్వుడు, సర్వేశ్వరుడైన శ్రీహరి సోమరూపిగా పూజింపబడుతూ ఉంటాడు.

**ప్లక్షద్వీపప్రమాణేన ప్లక్షద్వీపః సమావృతః ।**
**తథైవేక్షురసోదేన పరివేషానుకారిణా ॥ 20 ॥**

ప్లక్షద్వీపమంతప్రమాణంలో ప్లక్షద్వీపం చుట్టూ ఇక్షురససముద్రం పరివేషాకారంలో ఉంది.

**ఇత్యేవం తవ మైత్రేయ! ప్లక్షద్వీప ఉదాహృతః ।**
**సంక్షేపేణ మయా భూయః శాల్మలం మే నిశామయ ॥ 21 ॥**

మైత్రేయా! ఈ రీతిగా నీకు ప్లక్షద్వీపం గురించి సంక్షిప్తంగా వివరించాను. ఇటుపిమ్మట శాల్మల ద్వీపం గురించి చెబుతున్నాను. ఆలకించు.

## శాల్మల ద్వీపవర్ణన

**శాల్మలస్యేశ్వరో వీరో వపుష్మాంస్తత్సుతాన్ శృణు ।**
**తేషాన్తు నామ సంజ్ఞాని సప్తవర్షాణి తాని వై ॥ 22 ॥**

శాల్మల ద్వీపానికి అధిపతి వీరుడైన వపుష్మంతుడు కదా! అతని కుమారుల నామాలను, వారిపేరులతో ఏర్పడిన సప్తవర్షాలను గూర్చి చెబుతాను. ఆలకించు.

**శ్వేతోఽథ హరితశ్చైవ జీమూతో రోహితస్తథా ।**
**వైద్యుతో మానసశ్చైవ సుప్రభశ్చ మహామునే! ॥ 23 ॥**

మహామునీ! వారు శ్వేతుడు, హరితుడు, జీమూతుడు, రోహితుడు, వైద్యుతుడు, మానసుడు, సుప్రభుడు అనేవారు.

**శాల్మలేన సముద్రోఽసౌ ద్వీపేనేక్షురసోదకః ।**
**విస్తారాద్ద్విగుణేనాథ సర్వతః సంవృతః స్థితః ॥ 24 ॥**

ఇక్షురససముద్రాన్ని అన్నివైపుల చుట్టుకొని దానికంటె రెండు రెట్లు విస్తీర్ణంతో శాల్మల ద్వీపం ఉంది.

**తత్రాపి పర్వతాః సప్త విజ్ఞేయా రత్నయోనయః ।**
**వర్షాభివ్యంజకా యే తు తథా సప్త చ నిమ్నగాః ॥ 25 ॥**

అక్కడ కూడా ఏడు పర్వతాలు ఉన్నాయి. అవి రత్నాలకు జన్మస్థానాలు. ఆ ఏడు దానిని ఏడు వర్షాలుగా విభజిస్తున్నాయి. అలాగే అక్కడ ఏడు నదులు కూడా ఉన్నాయి.

**కుముదశ్చోన్నతశ్చైవ తృతీయశ్చ బలాహకః ।**
**ద్రోణో యత్ర మహౌషధ్యః స చతుర్థో మహీధరః ॥ 26 ॥**

**కంకస్తు పంచమః షష్ఠో మహిషః సప్తమస్తథా ।**
**కకుద్మాన్ పర్వతవరః సరిన్నామాని మే శృణు ॥ 27 ॥**

ఆ పర్వతాలలో మొదటిది కుముదం. తరువాతిది ఉన్నతం మూడోది బలాహకం. నాలుగోది గొప్పఓషధులకు నిలయమైన ద్రోణమనే పర్వతం. అయిదోది కంకం. ఆరవది మహిషం. ఏడోది పర్వతశ్రేష్ఠమైన కకుద్మంతం. ఇక నదులపేర్లు నాద్వారా ఆలకించు.

**యోని స్తోయా వితృష్ణా చ చన్ద్రా ముక్తా విమోచనీ ।**
**నివృత్తిః సప్తమీ తాసాం స్మృతాస్తాః పాపశాంతిదాః ॥ 28 ॥**

యోని, తోయ, వితృష్ణ, చంద్ర, ముక్త, విమోచని, ఏడవదైన నివృత్తి వీటి పేర్లు స్మరిస్తే చాలు పాపాలు పటాపంచలవుతాయి.

వి॥ శ్రోణీ-అని పాఠాంతరం. యోనికి బదులుగా శ్రోణి అని.

**శ్వేతం చ హరితం చైవ వైద్యుతం మానసం తథా ।**
**జీమూతరోహితే చైవ సుప్రభం చాతిశోభనమ్ ॥ 29 ॥**

**సప్తైతాని తు వర్షాణి చాతుర్వర్ణ్యయుతాని వై ।**
**శాల్మలే యే తు వర్ణాశ్చ వసన్త్యేతే మహామునే ॥ 30 ॥**

మునీశ్వరా! శ్వేతం, హరితం, వైద్యుతం, మానసం, జీమూతం, రోహితం, శుభప్రదమైన సుప్రభం - ఈ ఏడును వర్షాలు. ఇందు చాతుర్వర్ణ్యవ్యవస్థ ఉన్నది. శాల్మల ద్వీపంలో ఉన్న వర్ణాలు ఈ విధంగా ఉంటున్నాయి.

**కపిలాశ్చారుణాః పీతాః కృష్ణాశ్చైవ పృథక్ పృథక్ ।**
**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చైవ యజన్తి తే ॥ (తం) 31 ॥**

వారు కపిలం, అరుణం, పీతం, కృష్ణం అనే రంగులు కలవారై వేరువేరుగా అవే వర్ణాలుగా క్రమంగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులుగా వ్యవహరించబడుతూ భగవంతుని పూజిస్తున్నారు.

**భగవన్తం సమస్తస్య విష్ణుమాత్మాన మవ్యయమ్ ।**
**వాయుభూతం మఖైః శ్రేష్ఠైః యజ్వినో యజ్ఞసంస్థితమ్ ॥ 32 ॥**

వారందరూ యజనశీలులై సమస్తము తానే అయినవానిని, అన్నిట వ్యాపించియుండువానిని, సర్వాత్ముని, అవ్యయుని, యజ్ఞస్వరూపుడైన వానిని, వాయుభూతుడైన భగవంతుని ఉత్తమములైన యజ్ఞాలతో యజిస్తారు.

**దేవానామత్ర సాన్నిధ్యమతీవ సుమనోహరే ।**
**శాల్మలిః సుమహాన్ వృక్షో నామ్నా నిర్వృతికారకః ॥ 33 ॥**

ఈ సుందరమనోహర ద్వీపంలో దేవతాగణాల యొక్క సాన్నిధ్యం మిక్కిలిగా లభిస్తుంది. ఈ ద్వీపంలో శాల్మలి అనే మిక్కిలి గొప్పదైన వృక్షం అత్యంత శాంతిదాయకమై ఉంది.

**ఏష ద్వీపః సముద్రేణ సురోదేన సమావృతః ।**
**విస్తారాచ్ఛాల్మలస్యేవ సమేన తు సమన్తతః ॥ 34 ॥**

**సురోదకః పరివృతః కుశద్వీపేన సర్వతః ।**
**శాల్మలస్య తు విస్తారాద్ ద్విగుణేన సమన్తతః ॥ 35 ॥**

ఈ ద్వీపం సురాసముద్రంచే చుట్టుకొనబడిఉంది. దాని విస్తీర్ణం నలువైపులా శాల్మలద్వీపం అంత ఉంది. ఈ సురా సముద్రం నలుదిక్కులా కుశద్వీపంచే చుట్టుకొని ఉంది. కుశద్వీపం విస్తీర్ణంలో అన్నివైపులా శాల్మల ద్వీపానికి రెండురెట్లుగా ఉంది.

## కుశద్వీప వర్ణన

**జ్యోతిష్మతః కుశద్వీపే సప్తపుత్రాః శృణుష్వ తాన్ ।**
**ఉద్భిదో వేణుమాంశ్చైవ వైరథోలమ్బనోధృతిః ॥ 36 ॥**

**ప్రభాకరోఽథ కపిలస్తన్నామ్నా వర్షపద్ధతిః । 37 ॥**

కుశద్వీపంలో పరిపాలకుడైన జ్యోతిష్మంతునియొక్క ఏడుగురు కుమారులను గురించీ ఆలకించు. వారు ఉద్భిదుడు, వేణుమంతుడు, వైరథుడు, లంబనుడు, ధృతి, ప్రభాకరుడు, కపిలుడు అనేవారు. వారి పేర్లను అనుసరించే వర్షపద్ధతి కూడ ఏర్పడింది.

**తస్మిన్ వసన్తి మనుజాః సహ దైతేయదానవైః ।**
**తథైవ దేవగన్ధర్వయక్ష కిమ్పురుషాదయః ॥ 38 ॥**

ఆ కుశద్వీపంలో మానవులు, అలాగే దేవగంధర్వ యక్షకింపురుషాదులు దైతేయ దానవులతో కలసి నివసిస్తూ ఉంటారు.

**వర్ణాస్తత్రాపి చత్వారో నిజానుష్ఠానతత్పరాః ।**
**దమినః శుష్మిణః స్నేహమన్దేహాశ్చ మహామునే ॥**
**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చానుక్రమోదితాః ॥ 39 ॥**

మహామునీ! అక్కడ కూడ జాతులు నాలుగే. వారు తమ అనుష్ఠానాలపై మిక్కిలి ఆసక్తి కలిగి ఉంటారు. వారు దములు (ఇంద్రియ నిగ్రహం కలవారు), శుష్మలు (తేజస్సు కలవారు), స్నేహులు (ప్రీతి కలిగినవారు), మందేహులు (స్వల్పమగు కోరిక కలవారు) అనే పేర్లతో వరుసగా బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులుగా చెప్పబడుతున్నారు.

**యథోక్తకర్మకర్తృత్వాత్ స్వాధికారక్షయాయ తే ।**
**తత్రైవ తం కుశద్వీపే బ్రహ్మరూపం జనార్దనమ్ ।**
**యజన్తః క్షపయన్త్యుగ్రమధికారం ఫలప్రదమ్ ॥ 40 ॥**

వారు తమప్రారబ్ధకర్మల క్షయం కోసమై శాస్త్రోక్తకర్మలను ఆచరిస్తారు. ఆ కుశద్వీపంలో ఆ బ్రహ్మ స్వరూపుడైన జనార్దనునే యజిస్తూ, ప్రారబ్ధఫలాన్ని ఇచ్చే ఉగ్రమైన అహంకారాన్ని నశింపజేసు కొంటారు.

**విద్రుమో హేమశైలశ్చ ద్యుతిమాన్ పుష్పవాంస్తథా ।**
**కుశేశయో హరిశ్చైవ సప్తమో మన్దరాచలః**
**వర్షాచలాస్తు తత్రైతే సప్తద్వీపే మహామునే ॥ 41 ॥**

మునీశ్వరా ! విద్రుమం, హేమశైలం, ద్యుతిమంతం, పుష్పవంతం కుశేశయం, హరి, ఏడవదైన మందరాచలం ఈ ఏడును కుశద్వీపంలో వర్ష పర్వతాలు.

**నద్యస్తు సప్త తాసాన్తు శృణు నామాన్యనుక్రమాత్ ।**
**ధూతపాపా శివా చైవ పవిత్రా సమ్మతిస్తథా ॥ 42 ॥**

**విద్యుదమ్భా మహీచాన్యా సర్వపాపహరాస్త్విమాః ।**
**అన్యాః సహస్రశస్తత్ర క్షుద్రనద్యస్తథాఽచలాః ॥ 43 ॥**

అచ్చట నదులు కూడ ఏడే. వాటిపేర్లు ఆలకించు. అవి క్రమంగా ఆ ఏడు వర్షాలలో ధూతపాప, శివ, పవిత్ర, సమ్మతి, విద్యుత్తు, అంభ, మహి అనే నామాలతో సమస్తపాపాలను పోగొడుతూ ఉంటాయి. ఇవికాక చిన్నచిన్న నదులు, అలాగే చిన్నచిన్న కొండలు వేలకొలది ఉన్నాయి.

**కుశద్వీపే కుశస్తమ్బః సంజ్ఞయా తస్యతత్ స్మృతమ్ ।**
**తత్ప్రమాణేన స ద్వీపో ఘృతోదేన సమావృతః ॥ 44 ॥**

**ఘృతోదశ్చ సముద్రో వై క్రౌంచద్వీపేన సంవృతః ।**
**క్రౌంచద్వీపో మహాభాగ ! శ్రూయతాం చాపరో మహాన్ ॥ 45 ॥**

కుశద్వీపంలో రెల్లుదుబ్బు ఉంది. ఆ పేరుతో అది కుశద్వీపం అని పిలవబడుతోంది. ఆ ద్వీపం అంతే ప్రమాణం కల్గిన ఘృత సముద్రంచే చుట్టబడిఉంది. ఘృత సముద్రం చుట్టూ క్రౌంచద్వీపం ఉంది. మహాభాగుడవైన మైత్రేయా! ఆ క్రౌంచద్వీపం మరో గొప్ప ద్వీపం. దానిని గూర్చి విను.

## క్రౌంచద్వీపవర్ణన

**కుశద్వీపస్య విస్తారాద్ ద్విగుణో యస్య విస్తరః ।**
**క్రౌంచద్వీపే ద్యుతిమతః పుత్రాః సప్త మహాత్మనః ॥ 46 ॥**
**తన్నామాని చ వర్షాణి తేషాం చక్రే మహీపతిః ॥ 47 ॥**

కుశద్వీపం యొక్క విస్తీర్ణత కన్న దీని విస్తీర్ణత రెండురెట్లుగా ఉంది. క్రౌంచద్వీపంలో అధిపతి అయిన మహాత్ముడైన ద్యుతిమంతునకు ఏడుగురు కుమారులు. ఆ మహీపతి ఆ కుమారులపేర్లతోనే అచ్చట వర్షాలను ఏర్పరచాడు.

**కుశలో మన్దగశ్చోష్ణః పీవరోఽప్యన్ధకారకః ।**
**మునిశ్చ దున్దుభిశ్చైవ సప్తైతే తత్సుతా మునే! ॥ 48 ॥**

మునీశ్వరా! కుశలుదు, మందగుడు, ఉష్ణుడు, పీవరుడు, అంధకారకుడు, ముని, దుందుభి–అనే ఏడుగురు ఆ రాజేంద్రుని పుత్రులు.

**తత్రాపి దేవగన్ధర్వసేవితాః సుమనోహరాః ।**
**వర్షాచలా మహాబుద్ధే ! తేషాం నామాని మే శృణు ॥ 49 ॥**

గొప్పబుద్ధిమంతుడవైన మైత్రేయా! అక్కడ కూడ దేవతలచేత గంధర్వుల చేత సేవించబడే సుందర మనోహర వర్షపర్వతాలు ఉన్నాయి. వాటి పేర్లు నా ద్వారా ఆలకించు.

**క్రౌంచశ్చ వామనశ్చైవ తృతీయశ్చాన్ధకారకః। (అర్ధకారకః)**
**చతుర్థో రత్నశైలశ్చ స్వాహినీ హయసన్నిభః ॥ 50 ॥**

**(ది) దేవావృత్ పంచమశ్చాత్ర తథాఽన్యః పుండరీకవాన్ ।**

**దున్దుభిశ్చ మహాశైలో ద్విగుణాస్తే పరస్పరమ్ ।**
**ద్వీపా ద్వీపేషు యే శైలా యథా ద్వీపేషు తే తథా ॥ 51 ॥**

క్రౌంచం, వామనం, మూడోది అంధకారకం, నాలుగోది అశ్వాకారంలో ఉన్న రత్నమయమైన స్వాహినీశైలం, అయిదోది దే(ది)వావృతం, మరొకటి ఆరోదైన పుండరీకవంతం, ఏడోది మహాశైలమైన దుందుభి–ఇవన్నీ ఒకదాని కంటె మరొకటి రెండురెట్లు. ఆ ద్వీపాలు, ఆ ద్వీపాలలోని శైలాలవలె ఒకదానికంటె ఇంకొకటి రెండురెట్లు పెద్దవి.

**వర్షేష్వేతేషు రమ్యేషు తథా శైలవరేషు చ ।**
**నివసన్తి నిరాతంకాః సహదేవగణైః ప్రజాః ॥ 52 ॥**

ఈ మనోహరములైన వర్షాలలోను, సుందరములైన పర్వతాలపైన ప్రజలు దేవగణాలతో కలసి నిర్భయంగా నివసిస్తూ ఉంటారు.

**పుష్కరాః పుష్కలాధన్యాస్తిష్యాఖ్యాశ్చ మహామునే! ।**
**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చానుక్రమోదితాః ॥ 53 ॥**

మునీశ్వరా! పుష్కరులు, పుష్కలులు, ధన్యులు, తిష్యులు (అర్థసిద్ధిలో సంతోషించువారు)అనబడే వారు క్రమంగా బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులుగా చెప్పబడుతున్నారు.

**నదీ మైత్రేయ ! తే తత్ర యాః పిబన్తి శృణుష్వ తాః ।**
**సప్తప్రధానా శతశస్తత్రాన్యాః క్షుద్రనిమ్నగాః ॥ 54 ॥**

మైత్రేయా! అక్కడవారు ఏ నదీజలాలను త్రాగుతారో ఆ ప్రధానమైన ఏడు నదులనూ గూర్చి విను. ఇదికాక అక్కడ చిన్నచిన్న నదులు వందలుగా ఉన్నాయి.

**గౌరీ కుముద్వతీచైవ సన్ధ్యా రాత్రిర్మనోజవా ।**
**క్షాన్తిశ్చ పుణ్డరీకా చ సప్తైతే వర్షనిమ్నగా ః ॥ 55 ॥**

గౌరి, కుముద్వతి, సంధ్య, రాత్రి, మనోజవ, క్షాంతి, పుండరీక–ఇవి ఏడును ఆ వర్షాలలోని ప్రధానమైన నదులు.

వి ॥ క్షాంతిశ్చ–అనుదానికి బదులుగా ఖ్యాతిశ్చ అని పాఠాంతరం.

**తత్రాపి విష్ణుర్భగవాన్ పుష్కరాద్యైర్జనార్దనః ।**
**యాగై రుద్రస్వరూపశ్చ ఇజ్యతే యజ్ఞసన్నిధౌ ॥ 56 ॥**

ఆ ద్వీపంలో యజ్ఞవిధిలో పుష్కరాది నాలుగు జాతులవారిచే జనార్దనుడైన విష్ణుభగవానుడు యాగాలలో రుద్రస్వరూపుడుగా పూజింపబడతాడు.

**క్రౌంచద్వీపః సముద్రేణ దధిమన్డోదకేన చ ।**
**ఆవృతః సర్వతః క్రౌంచద్వీపతుల్యేన మానతః ॥ 57 ॥**

**దధిమన్డోదకశ్చాపి శాకద్వీపేన సంవృతః ।**
**క్రౌంచద్వీపస్య విస్తారాత్ ద్విగుణేన మహామునే! ॥ 58 ॥**

మునీశ్వరా! క్రౌంచద్వీపం చుట్టూ దధిసార (పెరుగుయొక్కతేట) సముద్రం నలువైపులా ఆవరించి ఉంది. ఆ సముద్రప్రమాణం క్రౌంచద్వీపవిస్తీర్ణంతో సమానం. ఆ దధిసారసముద్రం చుట్టూ నలువైపుల శాకద్వీపం ఉంది. అది విస్తీర్ణంలో క్రౌంచద్వీపం కన్న రెండు రెట్లు ఎక్కువ.

## శాకద్వీపవర్ణన

**శాకద్వీపేశ్వరస్యాపి భవ్యస్య సుమహాత్మనః ।**
**సప్తైవ తనయాస్తేషాం దదౌ వర్షాణి సప్త సః ॥ 59 ॥**

శాకద్వీపానికి అధిపతి అయిన, మిక్కిలి గొప్పవాడైన భవ్యునికి కూడ కుమారులు ఏడుగురే. ఆ రాజు వారికి ఏడు వర్షాలుగా విభజించి రాజ్యాన్ని ఇచ్చాడు.

**జలదశ్చ కుమారశ్చ సుకుమారో మరీచకః ।**
**కుసుమోదశ్చ మోదాకిః సప్తమశ్చ మహాద్రుమః ॥ 60 ॥**

వారు జలదుడు, కుమారుడు, సుకుమారుడు, మరీచకుడు, కుసుమోదుడు, మోదాకి, ఏడవవాడు మహాద్రుముడు అనేవారు.

వి॥ కుసుమోదస్సుమోదశ్చ–అని పాఠాంతరం.

**తత్సంజ్ఞాన్యేవ తత్రాపి సప్తవర్షాణ్యనుక్రమాత్ ।**
**తత్రాపి పర్వతాః సప్త వర్షవిచ్ఛేదకారిణః ॥ 61 ॥**

ఆకాశద్వీపంలోని ఏడు వర్షాలు క్రమంగా వారి పేర్లతో ఏర్పడినటువంటివే. అక్కడ పర్వతాలు కూడా ఏడే. అవి ఆ వర్షాలను వేర్వేరుగా విభజించేటటువంటివి.

**పూర్వస్తత్రోదయగిరి ర్జలాధారస్తథాఽపరః ।**
**తథారైవతకః శ్యామస్తథైవాస్తగిరిర్ద్విజ! ॥ 62 ॥**

**ఆమ్బికేయస్తథారమ్యః కేసరీ పర్వతోత్తమః ।**
**శాకస్తత్ర మహావృక్షః సిద్ధగన్ధర్వసేవితః ॥ 63 ॥**

ద్విజోత్తమా! ఆ పర్వతాలలో మొదటిది ఉదయగిరి తరువాతిది జలాధారం. ఆ తరువాతివి రైవతకం, శ్యామం, అస్తగిరి, ఆంబికేయం, అలాగే చివరిది చక్కని పర్వతశ్రేష్ఠమైన కేసరి అనేవి. అక్కడ సిద్ధులచేత, గంధర్వులచేత సేవించబడే శాకమనేపేరుగల గొప్పచెట్టు ఉంది.

వి ॥ జాలాధారం, జలధారం అనేవి జలాధారమనే దాని పాఠాంతరాలు. అస్తగిరికి బదులు అంభోగిరి అని పాఠాంతరం.

ఆంబికేయం అన్నదానికి ఆస్తికేయం అని పాఠాంతరం.

**యత్పత్ర(యత్రత్య) వాతసంస్పర్శాదాహ్లాదో జాయతే పరః ।**
**తత్ర పుణ్యా జనపదాశ్చాతుర్వర్ణ్యసమన్వితాః ॥ 64 ॥**

ఆ శాకవృక్షం యొక్క ఆకులగాలి సోకితే మిక్కిలి ఆహ్లాదం కలుగుతుంది. అక్కడ జనపదాలు పరమపవిత్రాలు, చాతుర్వర్ణ్య వ్యవస్థతో కూడుకొన్నవి.

**నద్యశ్చాత్ర మహాపుణ్యాః సర్వపాపభయాపహాః ।**
**సుకుమారీ కుమారీ చ నలినీ ధేనుకా చ యా ॥ 65 ॥**

**ఇక్షుశ్చ వేణుకా చైవ గభస్తీ సప్తమీ తథా ।**
**అన్యాస్త్వయుతశస్తత్ర క్షుద్రనద్యో మహామునే! ॥ 66 ॥**

మహామునీ! అక్కడ నదులుకూడ మిక్కిలి పావనమైనవి. సమస్తపాపాలను, సర్వభయాలను తొలగించేటటు వంటివి. అవి సుకుమారి, కుమారి, నలిని, ధేనుక, ఇక్షువు, వేణుక, ఏడవదైన గభస్తి అనేవి. అక్కడ ఇంకా చిన్న చిన్న నదులు వేనకువేలుగా ఉన్నాయి.

**మహీధరాస్తథా సన్తి శతశోఽథ సహస్రశః ।**
**తాః పిబన్తి ముదా యుక్తా జలదాదిషు యే స్థితాః ॥ 67 ॥**

అదే విధంగా చిన్నచిన్న కొండలు కూడా వందలకొలదీ, వేలకొలదీ ఉన్నాయి. ఆ నదీజలాలను అచ్చటి జలదాదివర్షాలలో ఉండేవారు పానం చేస్తూ ఉంటారు.

**వర్షేషు తే జనపదాః స్వర్గాదభ్యేత్య మేదినీమ్ ।**
**ధర్మహానిర్నతేష్వస్తి న సంఘర్షః పరస్పరమ్ ॥ 68 ॥**

స్వర్గభోగాలు అనుభవించడం పూర్తి అయ్యాక, దివినుండి భువికి వచ్చి ఆ వర్షాలలో జన్మలుపొంది అచ్చటి జనులుగా జీవిస్తారు. ఆ ఏడువర్షాలలో ధర్మహాని ఉండదు. పరస్పరసంఘర్షణలు కాన్పించవు.

**మర్యాదావ్యుత్క్రమో నాస్తి తేషు దేశేషు సప్తసు ।**
**మృగాశ్చ (వంగాశ్చ) మాగధాశ్చైవ మానసా మన్దగాస్తథా ॥ 69 ॥**

**వంగా బ్రాహ్మణభూయిష్ఠా మాగధాః క్షత్రియాస్తథా! ।**
**వైశ్యాస్తు మానసాస్తేషాం శూద్రాస్తేషాన్తు మన్దగాః ॥ 70 ॥**

ఆ ఏడుప్రదేశాలలోను హద్దులు మీరి ప్రవర్తించడం అన్నది లేదు. వంగులు, మాగధులు, మానసులు, మందగులు అనే నాలుగు జాతులవారు అక్కడ ఉంటారు. వంగులు బ్రాహ్మణులవలె సర్వశ్రేష్ఠులు. మాగధులు క్షత్రియులు. మానసులు వైశ్యులు. మందగులు శూద్రులు.

**శాకద్వీపే తు తైర్విష్ణుః సూర్యరూపధరో మునే! ।**
**యథోక్తై రిజ్యతే సమ్యక్ కర్మభిర్నియతాత్మభిః ॥ 71 ॥**

మునీశ్వరా! శాకద్వీపంలో నివసించే నియతమైన మనస్సు కలవారిచేత విష్ణువు సూర్యరూపధారియై శాస్త్రీయవిధానాలతో చక్కగా యజింపబడుతూ ఉంటాడు.

**శాకద్వీపస్తు మైత్రేయ! క్షీరోదేన సమావృతః ।**
**శాకద్వీపప్రమాణేన వలయేనేవ వేష్టితః ॥ 72 ॥**

మైత్రేయా! శాకద్వీపం క్షీర సముద్రంచే చుట్టబడి ఉంది. ఆ క్షీరసముద్రం శాకద్వీప ప్రమాణంతో కంకణంలా చుట్టుకొనివుంది.

**క్షీరాబ్ధిః సర్వతో బ్రహ్మన్ ! పుష్కరాఖ్యేన వేష్టితః ।**
**ద్వీపేన శాకద్వీపాత్తు ద్విగుణేన సమన్తతః ॥ 73 ॥**

బ్రాహ్మణోత్తమా! క్షీరసముద్రం చుట్టూ అన్నివైపులా చుట్టి పుష్కరద్వీపం ఉంది. అది శాకద్వీప ప్రమాణంకన్న అన్నిదెసలా రెండురెట్లు ఎక్కువ.

## పుష్కరద్వీపవర్ణన

**పుష్కరే సవనస్యాపి మహావీరోఽభవత్సుతః ।**
**ధాతకిశ్చ తయోస్తత్ర ద్వేవర్షే నామచిహ్నితే ॥ 74 ॥**

పుష్కరద్వీపానికి అధిపతి అయిన సవనునకు మహావీరుడు అనే కుమారుడు కలిగాడు. అనంతరం ధాతకి అని పుత్రుడు ఉదయించాడు. వారిద్దరిపేర అక్కడ రెండు వర్షాలు ఏర్పడ్డాయి.

**మహావీరం తథైవాన్యం ధాతకీ ఖణ్డసంజ్ఞితమ్ ।**
**ఏకశ్చాత్ర మహాభాగ ప్రఖ్యాతో వర్షపర్వతః ॥ 75 ॥**

మహాభాగా! అందులో మొదటిది మహావీరఖండం, మిగిలిన రెండోది ధాతకీఖండమని పేర్లు పొందాయి. ఇక్కడ మిక్కిలి ప్రసిద్ధి పొందిన ఒకే ఒక వర్షపర్వతం ఉంది.

**మానసోత్తరసంజ్ఞో వై మధ్యతో వలయాకృతిః ।**
**యోజనానాం సహస్రాణి ఊర్ధ్వం పంచాశదుచ్ఛ్రితః ॥ 76 ॥**

దానిపేరు మానసోత్తరవర్షపర్వతం. అది పుష్కరద్వీపానికి మధ్యలో కంకణంలా ఉంది. అది ఏబదివేల యోజనాల ఎత్తు ఉంది.

**తావదేవ చ విస్తీర్ణః సర్వతః పరిమణ్డలః ।
పుష్కరద్వీపవలయం మధ్యేన విభజన్నివ ॥ 77 ॥**

**స్థితోఽసౌ తేన విచ్ఛిన్నం జాతం తద్వర్షకద్వయమ్ ।
వలయాకారమేకైకం తయోర్వర్షం తథా గిరిః । 78 ॥**

దాని విస్తీర్ణత అన్నివైపులా మండలాకారంగా అదే పరిమాణంలో ఉంది. ఆ పర్వతం పుష్కరద్వీప వలయాన్ని మధ్యగా విభజిస్తున్నట్లు ఉంది. ఆ రెండు వర్షాలు ఆ పర్వతంవల్ల విడివడి ఒక్కొక్కటే వేరువేరుగా ఆ కొండలాగానే వలయాకారంగా ఉన్నాయి.

**దశవర్షసహస్రాణి తత్ర జీవన్తి మానవాః ।
నిరామయా విశోకాశ్చ రాగద్వేషాదివర్జితాః ॥ 79 ॥**

ఆ పుష్కరద్వీపంలో మానవులు పదివేల సంవత్సరాలు జీవిస్తూ ఉంటారు. వారికి ఏ రోగం ఉండదు. శోకం ఉండదు. రాగం, ద్వేషం మున్నగునవి ఉండనే ఉండవు.

**అధమోత్తమౌ న తేష్వాస్తాం న వధ్యవధకౌ ద్విజ! ।
నేర్ష్యాసూయా భయం ద్వేషో దోషో లోభాదికో న చ ॥ 80 ॥**

ద్విజోత్తమా! అచ్చటి జనులలో ఎక్కువ తక్కువలు లేవు. చంపబడేవాడు, చంపేవాడు అనేవారు కనిపించరు. ఈర్ష్య,అసూయలేవు. భయం,ద్వేషం, లోభం మున్నగు దోషాలు మచ్చునకైన కానరావు.

**మహావీరం బహిర్వర్షం ధాతకీఖణ్డమన్తతః ।
మానసోత్తరశైలస్య దేవదైత్యాదిసేవితమ్ ॥ 81 ॥**

మానసోత్తరపర్వతానికి వెలుపల ఉండేది మహావీరవర్షం. లోపల ఉండేది ధాతకీఖండం. వీటిని దేవతలు, దైత్యులు సేవిస్తూ ఉంటారు.

**సత్యానృతే న తత్రాఽఽస్తాం ద్వీపే పుష్కరసంజ్ఞితే ।
న తత్ర నద్యః శైలా వా ద్వీపే వర్షద్వయాన్వితే ॥ 82 ॥**

పుష్కర మనేపేరుగల ఆ ద్వీపంలోని రెండు వర్షాలలోను సత్యాసత్యాలన్న మాట లేదు. నదులూ లేవు. ఇతర శైలాలూ లేవు.

**తుల్యవేషాస్తు మనుజా దేవాస్తత్రైకరూపిణః ।
వర్ణాశ్రమాచారహీనం ధర్మాచరణవర్జితమ్ ॥ 83 ॥**

మనుష్యులు, దేవతలు అక్కడ ఏకరూపులై సమానవేషంతో ఉంటారు. అక్కడ వర్ణాశ్రమాచారాలు లేవు. కామ్యకర్మనిష్కామకర్మాదిధర్మాచరణం లేదు.

**త్రయీ వార్తా దణ్డనీతి శుశ్రూషా రహితం చ తత్ ।
వర్షద్వయం తు మైత్రేయ! భౌమస్స్వర్గోఽయముత్తమః ॥ 84 ॥**

మైత్రేయా! అచ్చట వేదత్రయి, వృత్తిప్రధానమైన కృషి, దండనీతి, శుశ్రూష (బోధ లేదా సేవ) అన్నవి కాన్పించవు. ఆ మహావీరధాతకీ వర్షద్వయం అత్యుత్తమమైన భూతలస్వర్గం సుమా!

**సర్వస్య సుఖదః కాలో జరారోగాదివర్జితః ।**
**ధాతకీ ఖణ్డసంజ్ఞేஉథ మహావీరే చ వై మునే! ॥ 85 ॥**

మునీశ్వరా! ఆ మహావీరధాతకీ ఖండాలలో కాలం అన్ని ఋతువులలోను సుఖప్రదం. ఆ ప్రదేశంలో ముసలితనం కాని, రోగం మున్నగు భయాలు కాని ఉండవు.

**న్యగ్రోధః పుష్కరద్వీపే బ్రహ్మణః స్థానముత్తమమ్ ।**
**తస్మిన్నివసతి బ్రహ్మా పూజ్యమానః సురాసురైః ॥ 86 ॥**

పుష్కరద్వీపంలో బ్రహ్మకు ఉత్తమమైన ఆవాసస్థానమైన న్యగ్రోధవృక్షం ఒకటి ఉంది. దానిపై బ్రహ్మ సురలచేత, అసురులచేత పూజించబడుతూ నివసిస్తూ ఉంటాడు.

**స్వాదూదకేనోదధినా పుష్కరః పరివేష్టితః ।**
**సమేన పుష్కరస్యైవ విస్తారాన్మణ్డలం తథా ।**
**ఏవం ద్వీపాః సముద్రైశ్చ సప్త సప్తభిరావృతాః ॥ 87 ॥**

పుష్కరద్వీపం తియ్యనీటి సముద్రంచే నలువైపుల చుట్టబడి ఉండి. ఆ సముద్రమండల విస్తీర్ణం పుష్కర ద్వీపవిస్తీర్ణతతో సమానం. ఈ విధంగా సప్తద్వీపాలు సప్తసముద్రాలచే చుట్టుకొనబడి ఉన్నాయి.

**ద్వీపశ్చైవ సముద్రశ్చ సమానౌ ద్విగుణౌ పరౌ । 88 ॥**

ద్వీపం దానిచుట్టుఉన్న సముద్రం పరిమాణంలో సమానం. తరువాతివి వాటికి రెట్టింపు ఉన్నాయి.

**పయాంసి సర్వదా సర్వసముద్రేషు సమాని వై ।**
**న్యూనాతిరిక్తతా తేషాం కదాచిన్నైవ జాయతే ॥ 89 ॥**

సమస్త సముద్రాలలోని జలాలు ఎల్లప్పుడూ సమంగానే ఉంటాయి. వాటికి ఎన్నడూ హెచ్చుతగ్గులు అనేవి కలుగవు.

**స్థాలీస్థమగ్నిసంయోగా దుద్రేకి సలిలం యథా ।**
**తథేన్దువృద్ధౌ సలిల మమ్భోధౌ మునిసత్తమ! ॥ 90 ॥**

మునీశ్వరా! నిప్పురగుల్కొనే సమయంలో గిన్నెలోని నీరుపొంగినట్లుగానే, చందమామ సమస్తకళలలో వృద్ధిపొందే సమయంలో సముద్రంలోని జలం కూడా పొంగుతుంది.

**న న్యూనా నాతిరిక్తాశ్చ వర్ధన్త్యాపో హ్రసన్తి చ ।**
**ఉదయాస్తమయేష్విన్దోః పక్షయోః శుక్లకృష్ణయోః ॥ 91 ॥**

శుక్ల కృష్ణపక్షాలలో చంద్రుని యొక్క ఉదయాస్తమయాలలో సముద్రజలాలకు హెచ్చుతగ్గులు లేకుండా పోటూ, పాటు సంభవిస్తాయి.

**దశోత్తరాణి పంచైవ అంగుళానాం శతాని వై ।**
**అపాం వృద్ధిక్షయౌ దృష్టౌ సముద్రాణాం మహామునే! ॥ 92 ॥**

మునీశ్వరా! సముద్రజలాలకు వృద్ధిక్షయాలు ఐదువందల పది అంగుళాలు మాత్రమే కనబడుతున్నాయి.

**భోజనం పుష్కరద్వీపే తత్ర స్వయముపస్థితమ్ ।**
**షడ్రసం భుంజతే విప్ర! ప్రజాః సర్వాః సదైవ హి ॥ 93 ॥**

విప్రోత్తమా! పుష్కరద్వీపంలో ప్రజలు అందరూ ఎల్లప్పుడూ కూడా ఆరురుచులతో కూడుకొన్న, స్వయంప్రాప్తమైన (అప్రయత్నంగా సిద్ధించిన) భోజనాన్ని స్వీకరిస్తారు.

**స్వాదూదకస్య పరితో దృశ్యతే లోకసంస్థితిః ।**
**ద్విగుణా కాంచనీ భూమిః సర్వజన్తు వివర్జితా ॥ 94 ॥**

స్వాదూదకసముద్రం చుట్టూ అన్నిదిక్కులా ఏ లోకమూ లేని, ఏ ఒక్కప్రాణీ నివసించని దానికి రెండురెట్లు విస్తీర్ణంతో బంగారపురంగు భూమి కనబడుతూ ఉంటుంది.

**లోకాలోకస్తతశ్శైలో యోజనాయుతవిస్తృతః ।**
**ఉచ్ఛ్రయేణాపి తావన్తి సహస్రాణ్యచలో హి సః ॥ (ఉచ్ఛ్రాయేణ) 95 ॥**

అటు తరువాత లోకాలోకపర్వతం ఉంది. దాని విస్తీర్ణం పదివేల యోజనాలు. ఎత్తుకూడ అన్నివేల యోజనాలు ఉన్న పర్వతం అది.

**తతస్తమః సమావృత్య తం శైలం సర్వతః స్థితమ్ ।**
**తమశ్చాణ్డకటాహేన సమన్తాత్పరివేష్టితమ్. ॥ 96 ॥**

ఆలోకాలోకపర్వతం చుట్టూ అన్నివైపుల తమస్సు (చీకటి) ఆవరించిఉంది. ఆ తమస్సుచుట్టూ అన్నివైపులా బ్రహ్మాండకటాహం ఆవరించి ఉంది. (అండకటాహం).

**పంచాశత్కోటి విస్తారా సేయముర్వీ మహామునే! ।**
**సహైవాణ్డకటాహేన సద్వీపాబ్ధిమహీధరా ॥ 97 ॥**

మహామునీ! బ్రహ్మాండకటాహంతో కూడి, ద్వీపాలు, సముద్రాలు, పర్వతాలతో కలసి ఈ ఉర్వియొక్క విస్తీర్ణం ఏభైకోట్ల యోజనాలు.

**సేయం ధాత్రీవిధాత్రీ చ సర్వభూతగుణాధికా ।**
**ఆధారభూతా సర్వేషాం మైత్రేయ! జగతామితి ॥ 98 ॥**

మైత్రేయా! ఈ భూమి ఆకాశాది సర్వభూతాలకన్న గుణాధికురాలు. సకలజగుత్తులకు ఆధారభూతురాలు. ఇట్లు ఈ ఉర్విసృష్టి కర్త్రి, పోషణ కర్త్రికూడ" అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే ప్లక్షాది ద్వీపవర్ణనం నామ చతుర్థోఽధ్యాయః సమాప్తః ॥ 4 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో ప్లక్షాది ద్వీపవర్ణన అనే నాల్గవ అధ్యాయం సమాప్తం ॥ 4 ॥

## పంచమోఽధ్యాయః - ఐదవ అధ్యాయం

## పాతాళాది సప్తలోక వర్ణనమ్ - పాతాళాది సప్తలోక వర్ణన

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**విస్తార ఏష కథితః పృథివ్యా భవతో మయా ।**
**సప్తతిస్తు సహస్రాణి ద్విజోచ్ఛ్రాయోఽపి కథ్యతే ॥ 1 ॥**

ద్విజోత్తమా! మైత్రేయా! పృథివి యొక్క విస్తీర్ణతను గూర్చి నాచే నీకు వివరించబడింది. ఇక దాని ఎత్తు డెబ్బైవేల యోజనాలు అని చెప్పబడింది.

**దశసాహస్రమేకైకం పాతాలం మునిసత్తమ! ।**
**అతలం వితలంచైవ నితలం చ గభస్తిమత్ ।**
**మహాఖ్యం సుతలం చాగ్ర్యం పాతాలం చాపి సప్తమమ్ ॥ 2 ॥**

మునిశ్రేష్ఠా! పదేసివేల యోజనాల మేరలో ఒక్కొక్క పాతాళం (అధోలోకం) ఉంది. అవి అతలం, వితలం, నితలం, గభస్తిమంతం, మహాతలం, సుతలం, శ్రేష్ఠమైనది ఏడోది అయినది పాతాళం-అనబడేవి.

**శుక్లా కృష్ణాఽరుణా పీతా శర్కరా శైలకాంచనాః ।**
**భూమయో యత్ర మైత్రేయ! వరప్రాసాదమణ్డితాః ॥ 3 ॥**

మైత్రేయా! అవి మనోహరములైన ప్రాసాదాలచే ఒప్పారుతూ, తెలుపు, నలుపు, ఎరుపు, పచ్చరంగు, ధవలవర్ణం కల నేలలతోనూ, బంగారపు రంగుకల పర్వతాలతోను ప్రకాశిస్తూ ఉంటాయి.

**తేషు దానవదైతేయా యక్షాశ్చ శతశస్తథా ।**
**నివసన్తి మహానాగ జాతయశ్చ మహామునే! ॥ 4 ॥**

మహామునీ! ఆ ఏడు పాతాళలోకాలయందు దానవులు, దైతేయులు, యక్షులు, మహానాగజాతులు వందలకొలది నివసిస్తూ ఉంటారు.

**స్వర్లోకాదపి రమ్యాణి పాతాలానీతి నారదః ।**
**ప్రాహ స్వర్గసదాం మధ్యే పాతాలేభ్యో గతో దివి ॥ 5 ॥**

నారదుడు పాతాళాదిలోకాల నుంచి సంచారం చేసి దివికి వచ్చి అక్కడ స్వర్గలోకనివాసుల మధ్యలో పాతాలం మున్నగు అధోలోకాలు స్వర్లోకంకన్న అందమైనవని చెప్పాడు.

**ఆహ్లాదకారిణః శుభ్రా మణయో యత్ర సుప్రభాః ।**
**నాగై రాభ్రియమాణాసు పాతాలం కేన తత్సమమ్ ॥ 6 ॥**

నాగులచే ధరించబడే ఆభరణాలలోని మణులు ధగధగ కాంతులు ప్రసరింపజేస్తూ, ఆహ్లాదం కలిగిస్తూ, మిక్కిలి స్వచ్ఛంగా ఉంటాయి. కాబట్టి పాతాళానికి దీటయినది ఏది?

వి ॥ నాగాభరణభూషాసు అని పాఠాంతరం.

**దైత్యదానవ కన్యాభిరితశ్చేతశ్చ శోభితే ।**
**పాతాలే కస్య న ప్రీతిర్విముక్తస్యాపి జాయతే ॥ 7 ॥**

దైత్యకన్యలతో, దానవకాంతలతో ఇటూఅటూ చక్కగా కళకళలాడే పాతాళమంటే ఎవనికి ప్రీతి పుట్టకుండా ఉంటుంది? అది రాగం లేక ముక్తుడైన వానికికూడా సంప్రీతిని కలిగిస్తుంది.

**దివార్కరశ్మయో యత్ర ప్రభాం తన్వన్తి నాతపమ్ ।**
**శశినశ్చ న శీతాయ నిశి ద్యోతాయ కేవలమ్ ॥ 8 ॥**

పగటివేళ సూర్యకిరణాలు వెలుగును వ్యాపింపజేస్తాయేతప్ప, ఎండను కాయవు. రాత్రి సమయంలో చంద్రకిరణాలవల్ల కేవలం వెన్నెల తప్ప చలి ఉండదు.

**భక్ష్యభోజ్య మహాపాన ముదితై రతిభోగిభిః ।**
**యత్ర న జ్ఞాయతే కాలో గతో౽పి దనుజాదిభిః ॥ 9 ॥**

అచ్చట భక్ష్యభోజ్యాదులచేత, గొప్పవైన పానీయాదులచేత ప్రమోదం పొందే మహాభోగులైన దనుజాదులకు ఎంతకాలం గడిచినా తెలియరాదు.

**వనాని నద్యో రమ్యాణి సరాంసి కమలాకరాః ।**
**పుంస్కోకిలాభిలాపాశ్చ మనోజ్ఞాన్యమ్బరాణి చ ॥ (అపరాణి చ) 10 ॥**

**భూషణాన్యతిరమ్యాణి గన్ధాఢ్యం చానులేపనమ్ ।**
**వీణావేణుమృదంగానాం స్వనాస్తూర్యాణి చ ద్విజ ॥ 11 ॥**

**ఏతాన్యన్యాని చోదార భాగ్యభోగ్యాని దానవైః ।**
**దైత్యోరగైశ్చ భుజ్యన్తే పాతాలాన్తరగోచరైః ॥ 12 ॥**

ద్విజోత్తమా ! అక్కడి వనాలు, నదులు కడుసుందరాలు. సరస్సులు తామరపూలకు ఆవాసాలు. ఎక్కడచూచినా మగకోయిలల సుమధురాలైన కుహూ ధ్వనులు, మనోహరాలైన వస్త్రాలు (ఆకాశప్రదేశాలు), నిగనిగలాడే నగలు, ఘుమఘుమలాడే సుగంధానులేపనాలు, వీణావేణుమృదంగధ్వనులు, తూర్యధ్వనులు, నృత్యగీతవాద్యాలు, ఇవే కాకుండా ఇంకా మిక్కిలిగొప్పవైన భోగభాగ్యాలు దావనవులచేత, దైత్యులచేత, మహానాగులచేత, పాతాళంలో కానవచ్చే అందరిచేత అనుభవించబడుతున్నాయి.

**పాతాలానామధశ్చాస్తే విష్ణోర్యా తామసీ తనుః ।**
**శేషాఖ్యా యద్గుణాన్ వక్తుం న శక్తా దైత్యదానవాః ॥ 13 ॥**

**యో౽నన్తః పఠ్యతే సిద్ధై ర్దేవో దేవర్షిపూజితః ।**
**స సహస్రశిరా వ్యక్తస్వస్తికామలభూషణః ॥ 14 ॥**

సప్తపాతాళాలకు అడుగుభాగంలో విష్ణువుయొక్క తామసీమూర్తి అయిన శేషుడు ఉంటాడు. ఆయన గుణాలను వర్ణించడానికి దైత్యులు కాని, దానవులు కాని సమర్థులు కారు. ఆయన సిద్ధులచే అనంతుడని

పిలువబడ్డాడు. ఆయన దేవుడుగా దేవతలచేత, దేవర్షులచేత పూజించబడుతున్నాడు. ఆ శేషుడు వేయితలలు కలిగినవాడు. ఆయన పడగలపై స్పష్టంగా కనిపించే స్వస్తిక చిహ్నాలే నిగనిగలాడే ఆభరణాలు.

**ఫణామణిసహస్రేణ యః స విద్యోతయన్ దిశః ।**
**సర్వాన్ కరోతి నిర్వీర్యాన్ హితాయ జగతోఽసురాన్ ॥ 15 ॥**

ఆయన మణులతో నిండిన వేయిపడగలచే దిక్కులను అన్నింటిని ధగధగలాడిస్తూ, లోకాలకు మేలుచేయుట కొరకై అసురులను అందరిని నిర్వీర్యులను కావిస్తూ ఉంటాడు.

**మదాఘూర్ణితనేత్రోఽసౌ యః సదైవైకకుణ్డలః ।**
**కిరీటీ స్రగ్ధరో భాతి సాగ్నిః శ్వేత ఇవాచలః ॥ 16 ॥**

ఆయన మత్తుచే తిరుగుడు పడిన నేత్రాల వంటి కన్నులు కలవాడు. ఎల్లప్పుడూ ఒకే కుండలాన్ని ఆభరణంగా ధరిస్తాడు. కిరీటాన్ని ధరించి, పుష్పమాలాలంకృతుడై అగ్నితో కూడుకొన్న శ్వేతపర్వతంలా వెలుగుతూ ఉంటాడు.

**నీలవాసా మదోత్సిక్తః శ్వేతహారోపశోభితః ।**
**సాభ్రగంగాప్రవాహోఽసౌ కైలాసాద్రిరివోన్నతః ॥ 17 ॥**

నిగనిగలాడే నీలవర్ణపు వస్త్రం కలవాడు, తమోగుణంతో ఉండేవాడు కావున మదోద్రిక్తునిలా భాసిస్తాడు. తెల్లని ముత్యాలదండలతో ప్రకాశిస్తాడు. మబ్బుతో భాసించే గంగానదీ జలప్రవాహంగల ఉన్నత కైలాస పర్వతంలా వెలిగిపోతూ ఉంటాడు.

**లాంగలాసక్త హస్తాగ్రో బిభ్రన్ముసలముత్తమమ్ ।**
**ఉపాస్యతే స్వయం కాన్త్యా యో వారుణ్యా చ మూర్తయా ॥ 18 ॥**

నాగలిపై చేతికొనను ఉంచి, మంచిరోకలిని ధరించి ఉంటాడు. స్వయంగా రూపుదాల్చిన కాంతిదేవిచేత, వారుణీదేవిచేత ఆయన సేవించబడుతూ ఉంటాడు.

**కల్పాన్తే యస్య వక్త్రేభ్యో విషానల శిఖోజ్జ్వలః ।**
**సంకర్షణాత్మకో రుద్రో నిష్క్రమ్యాత్తి జగత్త్రయమ్ ॥ 19 ॥**

కల్పాంతంలో ఆయన ముఖాల నుంచి విషాగ్ని జ్వాలలతో ప్రకాశించే, సంకర్షణరూపుడైన రుద్రుడు వెలువడి మూడు లోకాలను భక్షిస్తాడు.

**స బిభ్రచ్ఛేఖరీభూత మశేషం క్షితిమండలమ్ ।**
**ఆస్తే పాతాల మూలస్థః శేషోఽశేష సురార్చితః ॥ 20 ॥**

ఆ శేషుడు సమస్తమైన భూమండలాన్ని మకుటంలా శిరస్సుపై మోస్తూ, సకల సురులచేత పూజించబడుతూ, పాతాళం కుదుటిలో ఉంటాడు.

**తస్య వీర్యం ప్రభావం చ స్వరూపం రూపమేవ చ ।**
**నహి వర్ణయితుం శక్యం జ్ఞాతుం వా త్రిదశైరపి ॥ 22 ॥**

ఆయన బలవీర్యాలను, ప్రభావాన్ని, తత్త్వాన్ని, ఆకారాన్ని వర్ణించడానికి కాని, తెలుసుకోవడానికి కాని దేవతలకు కూడ వీలుకాదు.

**యస్యైషా సకలాపృథ్వీ ఫణామణి శిఖారుణా ।**
**ఆస్తే కుసుమమాలేవ కస్తద్వీర్యం వదిష్యతి ॥ 23 ॥**

ఈ సమస్తమైన పృథివి పడగలలోని మణికాంతులచే ఎర్రబడి ఎవనికి ఎఱ్ఱని విరిదండలా ప్రకాశిస్తోందో, అట్టి శేషుని బలవీర్యప్రభావాన్ని ఎవడు నుతించగలడు?

**యదా విజృమ్భతేఽనన్తో మదాఘూర్ణితలోచనః ।**
**తదా చలతి భూరేషా సాద్రితోయా సకాననా ॥ 24 ॥**

ఎప్పుడు మదంతో తిరుగుడుపడిన కన్నులతో అనంతుడు చెలరేగుతాడో, అప్పుడు ఈ భూమి కొండలతో, సముద్రజలాలతో, అడవులతో సహితంగా కంపిస్తుంది.

**గన్ధర్వాప్సరసః సిద్ధాః కిన్నరోరగచారణాః ।**
**నాన్తం గుణానాం గచ్ఛన్తి తేనానన్తోఽయమవ్యయః ॥ 25 ॥**

గంధర్వులు, అప్సరసలు, సిద్ధులు, కిన్నరులు, ఉరగులు, చారణులు ఆయన గుణాల యొక్క అంతం తెలియలేరు కాబట్టి శేషుడు అనంతుడును, అవ్యయుడును అయ్యాడు.

**యస్యనాగవధూహస్తై ర్లంబితం హరిచన్దనమ్ ।**
**ముహుః శ్వాసానిలాపాస్తం యాతి దిక్షూదవాసతామ్ ॥ 26 ॥**

ఆయనకు నాగకాంతలు తమ హస్తాలచే పూసిన హరిచందనం మాటిమాటికి ఆయన వదలిన ఊపిరి ధ్వనులకు చెదరి దిక్కుల వరకూ వ్యాపించి, అచ్చటి సముద్రాలలో జలవాసం చేస్తుంది.

**యమారాధ్య పురాణర్షి ర్గర్గో జ్యోతీంషి తత్త్వతః ।**
**జ్ఞాతవాన్ సకలం చైవ నిమిత్తపఠితం ఫలమ్ ॥ 27 ॥**

ఆయనను ఆరాధించి పురాణ మహర్షి (పురాతన మహర్షి)అయిన గర్గుడు గ్రహనక్షత్రాది జ్యోతిర్మండల గతులను, సమస్తములైన సుశకునాపశకునాది నైమిత్తికఫలాలను తెలుసుకోగలిగాడు.

**తేనేయం నాగవర్యేణ శిరసా విధృతా మహీ ।**
**బిభర్తి మాలాం లోకానాం సదేవాసురమానుషామ్ ॥ 28 ॥**

ఆ నాగశ్రేష్ఠునిచే శిరస్సుపై ఈ భూమండలం అంతా ధరించబడుతోంది. ఆయన ఇట్లు దేవతలతోను, అసురులతోను, మనుష్యులతోను నిండియున్న సమస్తలోకపంక్తులను మోస్తున్నాడు-అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే పాతాళాది సప్తలోక వర్ణనం నామ పంచమోఽధ్యాయః సమాప్తః ॥ 5 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో పాతాళాది సప్తలోక వర్ణన అనే అయిదవ అధ్యాయం సమాప్తం ॥ 5 ॥

## **షష్ఠోఽధ్యాయః** - ఆరవ అధ్యాయం

## **నరకవర్ణనం - హరిమాహాత్మ్యప్రభావశ్చ** - నరకవర్ణన - హరిమాహాత్మ్యప్రభావం

**శ్రీపరాశరువాచ :-** పరాశరుడు చెప్పాడు

**తతశ్చ నరకాన్ విప్ర! భువోఽధః సలిలస్య చ ।**
**పాపినో యేషు పాత్యన్తే తాన్ శృణుష్వ మహామునే! ॥ 1 ॥**

విప్రోత్తమా! మహామునీ! భూమికి, జలాలకు దిగువగా నరకలోకాలు ఉన్నాయి. పాపులు వాటిలో పడవేయబడతారు. ఇటుపిమ్మట వాటిని గురించి చెబుతాను. ఆలకించు.

వి ॥ పాతాళానికి దిగువగా నరకాలు ఉన్నాయని కూర్మపురాణాదులు వివరించాయి.

**రౌరవః సూకరో రోధస్తాలో విశసనస్తథా ।**
**మహాజ్వాల స్తప్తకుమ్భః శ్వసనోఽథ విమోహనః ॥ 2 ॥**

రౌరవం, సూకరం, రోధం, తాళం, విశసనం, మహాజ్వాలం, తప్తకుంభం, శ్వసనం, విమోహనం-అనేవి.

**రుధిరామ్భః వైతరణీ కృమీశః కృమిభోజనః ।**
**అసిపత్రవనం కృష్ణో లాలాభక్షశ్చ దారుణః ॥ 3 ॥**

రుధిరాంభం, వైతరణి, కృమీశం, కృమిభోజనం,అసిపత్రవనం, కృష్ణం, లాలాభక్షం, దారుణం-అనేవి.

**తథా పూయవహః పాపో వహ్నిజ్వాలో హ్యధః శిరాః ।**
**సన్దంశః కాలసూత్రశ్చ తమశ్చావీచిరేవ చ ॥ 4 ॥**

పూయవహం, పాపం, వహ్నిజ్వాలం, అధశ్శిరం, సందంశం, కాలసూత్రం, తమస్సు, అవీచి-అనేవి.

**శ్వభోజనోఽథాప్రతిష్ఠశ్చావీచిశ్చ తథాఽపరః । (అప్రచిశ్చ)**
**ఇత్యేవ మాదయశ్చాన్యే నరకా భృశదారుణాః ॥ 5 ॥**

శ్వభోజనం, అప్రతిష్ఠం, తరువాతిది అవీచి-అనేవి, (అప్రచి) ఇటువంటివి మిగిలినవెన్నో మిక్కిలి భయంకరాలైన నరకాలు ఉన్నాయి.

వి ॥ అవీచిశ్చ-అనేదానికి అప్రచిశ్చ-అనేది పాఠాంతరం, పైశ్లోకంలో

అవీచిరేవ చ అని చెప్పబడిందికాన పాఠాంతరమే స్వీకరణ యోగ్యం.

**యమస్య విషయే ఘోరాః శస్త్రాగ్నిభయదాయినః ।**
**పతన్తి యేషు పురుషాః పాపకర్మరతాస్తు యే ॥ 6 ॥**

అవి ఆయుధాలవల్ల, అగ్నివల్ల భయం కలిగించేవి. ఇటువంటి ఘోరనరకాలు ఎన్నో యముని అధీనంలో ఉన్నాయి. పాపకర్మలలో ఆసక్తి కల్గిన పురుషులు(జీవులు)ఈ నరకాలలో పడుతూ ఉంటారు.

**కూటసాక్షీ తథా సమ్యక్ పక్షపాతేన యో వదేత్ ।**
**యశ్చాన్యదనృతం వక్తి స నరో యాతి రౌరవమ్ ॥ 7 ॥**

దొంగసాక్ష్యంచెప్పేవాడు, అదే విధంగా పక్షపాత బుద్ధితో ప్రియంగా మాట్లాడేవాడు, అదేరీతిగా సత్యానికి బదులుగా అసత్యం పలికేవాడు. అటువంటి నరుడు రౌరవం అనే నరకానికి పోతాడు.

**భ్రూణహా పురహన్తా చ గోఘ్నశ్చ మునిసత్తమ! ।**
**యాన్తి తే నరకం రోధం యశ్చోచ్ఛ్వాస నిరోధకః ॥ 8 ॥**

మునిశ్రేష్ఠా! గర్భవిచ్ఛేదం (శిశుహత్య) చేసేవాడు, పురాలు నాశనం చేసేవాడు, గోవులను చంపేవాడు, జీవులను ఊపిరి ఆడకుండ చేసేవాడు రోధం అనే నరకానికి పోతారు.

**సురాపో బ్రహ్మహా స్తేయీ (హర్తా) సువర్ణస్య చ సూకరే ।**
**ప్రయాతి నరకే యశ్చ సంసర్గముపైతి వై ॥ 9 ॥**

సురాపానం చేసేవాడు, బ్రహ్మహత్య కావించేవాడు, బంగారం దొంగిలించేవాడు, వీరు–వీరి సాంగత్యాన్ని పొందేవారు సూకరమనే నరకంలో పడతారు.

**రాజన్యవైశ్యహా తాలే తథైవ గురుతల్పగః ।**
**తప్తకుణ్డే స్వసృగామీ హన్తి రాజభటాంశ్చ యః ॥ 10 ॥**

ఉత్తమరాజవంశ సంజాతులను, వైశ్యులను సంహరించే వాడు తాలం అనే నరకానికి పోతాడు. గురుతల్పాన్ని పొందినవాడు, తోబుట్టువును అనుభవించేవాడు, రాజభటులను చంపేవాడు తప్తకుండం అనే నరకంలో పడతాడు.

**సాధ్వీ విక్రియకృద్బన్ధ పాలః కేసరివిక్రయీ ।**
**తప్తలోహే పతన్త్యేతే యశ్చ భక్తం పరిత్యజేత్ ॥ 11 ॥**

సాధ్వి అయిన భార్యను అమ్మేవాడు, కారాగృహాన్ని రక్షించేవాడు, గుఱ్ఱాలను విక్రయించేవాడు, భక్తుని విడిచి పెట్టేవాడు తప్తలోహం అనే నరకంలో పడతారు.

**స్నుషాం సుతాంచాపి గత్వా మహాజ్వాలే నిపాత్యతే । 12 ॥**

కోడలితో, కూతురుతో కూడినవానిని మహాజ్వాలం అనే నరకంలో పడవేస్తారు.

**అవమన్తా గురూణాం యో యశ్చాక్రోష్టానరాధమః । (యశ్చ)**
**వేదదూషయితా యశ్చ వేదవిక్రియకశ్చ యః ।**
**అగమ్యగామీ యశ్చ స్యాత్ తే యాన్తి లవణం ద్విజ! ॥ 13 ॥**

ద్విజవర్యా! గురువులను అవమానించేవాడు, ఆ గురువులతో కఠినవచనాలు పలికే అధముడు, వేదాలను దూషించేవాడు, వేదాలను అమ్ముకొని జీవించేవాడు, పొందరాని పొందులు పొందేవాడు లవణమనే నరకానికి పోతారు.

**చోరో విమోహే పతతి మర్యాదాదూషకస్తథా ।**
**దేవద్విజపితృద్వేష్టా రత్నదూషయితా చ యః ।**
**సయాతి కృమిభక్షే వై కృమీశే చ దురిష్టకృత్ ॥ 14 ॥**

దొంగ, మర్యాదలు మీరినవాడు విమోహమనే నరకంలో పడతారు. దేవతలను, ద్విజులను, తల్లిదండ్రులను ద్వేషించేవాడు, రత్నాలను పాడుచేసేవాడు కృమిభక్షం అనే నరకానికి పోతారు. శాస్త్రవిహితంగా యజ్ఞాలు ఆచరించకుండా దుష్టయజ్ఞాలు చేసే వాడు కృమీశనరకంలో పడతాడు. (విమోహానికి బదులు విలోహమని పాఠాంతరం)

**పితృదేవాతిథీన్ యశ్చ పర్యశ్నాతి నరాధమః ।**
**లాలాభక్షే సయాత్యుగ్రే శరకర్తా చ వేధకే ॥ 15 ॥**

పితృదేవతలు, దేవతలు, అతిథులు, వారిని విడిచిపెట్టి భుజించే నరాధముడు ఉగ్రమైన లాలాభక్షం అనే నరకానికి పోతాడు. బాణాలు చేసేవాడు "వేధకం" అనే నరకంలో పడతాడు.

**కరోతి కర్ణినో యశ్చ యశ్చ ఖడ్గాదికృన్నరః ।**
**ప్రయాన్త్యేతే విశసనే నరకే భృశదారుణే ॥ 16 ॥**

"కర్ణి" అనే పేరుగల బాణాలు తయారు చేయువాడు, ఖడ్గం మున్నగు శస్త్రాలు తయారు చేయు నరుడు మిక్కిలి భయంకరమైన "విశసనం" అనే నరకానికి పోతాడు.

**అసత్ప్రతిగృహీతా తు నరకే యాత్యధోముఖే ।**
**అయాజ్యయాజకశ్చైవ తథా నక్షత్రసూచకః ॥ 17 ॥**

యోగ్యంకాని దానాలు పట్టేవాడు, హోమంలో యజనం చేయకూడని పదార్థాలు వ్రేల్చేయాజకుడు, శాస్త్రం పూర్తిగా తెలియకుండా నక్షత్రాలు మాత్రం లెక్కించి దైవజ్ఞుడుగా నటించే నక్షత్ర సూచకుడు "అధోముఖం" అనే నరకానికి పోతారు.

**వేగీ పూయవహే చైకో యాతి మృష్టాన్నభుఙ్నరః ।**
**లాక్షామాంసరసానాంచ తిలానాం లవణస్య చ ।**
**విక్రేతా బ్రాహ్మణోయాతి తమేవ నరకం ద్విజ ॥ 18 ॥**

ద్విజోత్తమా! నిష్ఠుర కర్మలాచరించే సాహసికుడు పూయవహం అనే నరకానికి పోతాడు. దగ్గరవారికి ఎవ్వరికీ పెట్టకుండా రుచికరమైన భోజనాన్ని ఒంటరిగా భుజించే నరుడు; లక్క, మాంసం, మద్యాదిరసాలు, నువ్వులు, ఉప్పు అమ్మే బ్రాహ్మణుడు అదే నరకానికి పోతారు.

**మార్జార కుక్కుటచ్ఛాగ శ్వవరాహవిహంగమాన్ ।**
**పోషయన్నరకం యాతి తమేవ ద్విజసత్తమ ॥ 19 ॥**

ద్విజశ్రేష్ఠా! పిల్లి, కోడి, మేక, కుక్క, పంది, పిట్ట – వీటిని పెంచిపోషించేవాడు అదే నరకానికి చేరుకొంటాడు.

**రంగోపజీవీ కైవర్తః కుణ్డాశీ గరదస్తథా ।**
**సూచీ మాహిషికశ్చైవ పూర్వకారీ చ యో ద్విజః ॥ 20 ॥**

**ఆగారదాహీ మిత్రఘ్నః శాకునిర్గ్రామయాజకః ।**
**రుధిరాన్ధే పతన్త్యేతే సోమం విక్రీణతే చ యే ॥ 21 ॥**

నటనపైనా లేక మల్లవిద్యపైనా ఆధారపడి జీవించేవాడు, చేపలు పట్టేవాడు, ఉపపతివల్ల కలిగే కుండుడు అనే సంతానంద్వారా బ్రతికేవాడు, విషంపెట్టేవాడు, కొండెగాడు, భార్య వ్యభిచరించి తెచ్చిన ధనంతో బ్రతికేవాడు, ఒక రోజుచేయవలసినపనిని కానిరోజునచేయించే ద్విజుడు, కొంపకు నిప్పుపెట్టేవాడు, మిత్రులను చంపువాడు, శకునం చెప్పేవాడు, గ్రామ పురోహితుడు, యజ్ఞంలో ఉపకరించే సోమం అమ్మేవాడు రుధిరాంధం అనే నరకంలో పడతారు.

వి ॥ కుండభోజి–అనగా పచ్చికుండతో వండినవంట తినేవాడని వేరే వ్యాఖ్యానం. మాహిషికుడు అనగా గేదెపై ఆధారపడి బ్రతికేవాడని ఇతర వ్యాఖ్యానాలు.

**మఖహా గ్రామహన్తా చ యాతి వైతరణీం నరః ।**
**రేతః పాతాదికర్తారో మర్యాదాభేదినో హి యే ।**
**తే కృష్ణే యాన్త్యశౌచాశ్చ కుహకాజీవినశ్చ యే ॥ 22 ॥**

యజ్ఞాన్ని నాశనం చేసేవాడు, గ్రామాలను ధ్వంసం చేసేవాడు అయిన నరుడు వైతరణిలో పడతాడు. వీర్యపాతం చేసేవారు, సరిహద్దులు చెరిపేవారు, ఆచారవిహీనులు, మోసం చేసి పొట్టపోషించుకొనేవారు "కృష్ణం" అనే నరకంలో పడతారు.

**అసిపత్రవనం యాతి వనచ్ఛేదీ వృథైవ యః ।**
**ఔరభ్రికామృగవ్యాధా వహ్నిజ్వాలే పతన్తి వై ॥ 23 ॥**

ఏ ప్రయోజనం లేకుండా వ్యర్థంగా వనాలను నరికేవాడు అసిపత్రవనం అనే నరకానికి పోతాడు. గొఱ్ఱెలపై ఆధారపడి జీవించేవాడు, జంతువులను వేటాడి బ్రతికేవాడు వహ్నిజ్వాలం అనే నరకంలోకి పోతారు.

**యాన్త్యేతే ద్విజ! తత్రైవ యే చాపాకేషు వహ్నిదాః । 24 ॥**

ద్విజోత్తమా! ఇటుక ఆవలు మొదలైనవి అంటించేవారు (వండగూడని వస్తువులకు అగ్నిని పెట్టేవారు) అదే నరకానికి పోతారు.

**వ్రతానాం లోపకో యశ్చ స్వాశ్రమాత్ విచ్యుతశ్చ యః ॥ 24 ॥**
**సన్దంశయాతనామధ్యే పతత స్తావుభావపి ।**

**దివాస్వప్నే చ స్కందన్తే యే నరా బ్రహ్మచారిణః ।**
**పుత్రైరధ్యాపితా యే చ తే పతన్తి శ్వభోజనే ॥ 25 ॥**

వ్రతలోపం కావించేవాడు, తన ఆశ్రమధర్మం నుండి భ్రష్టుడైనవాడు – ఆ ఇరువురు సందంశం అనే నరకం మధ్యలో పడతారు. పగటి కలలుకంటూ రేతఃపతనం చేసుకొనే బ్రహ్మచారులు, కొడుకుల వద్ద విద్యాభ్యాసం చేసేవారు శ్వభోజనం అనే నరకంలో పడతారు.

**ఏతే చాన్యే చ నరకాః శతశో౽థ సహస్రశః ।**
**యేషు దుష్కృతకర్మాణః పచ్యన్తే యాతనాగతాః ॥ 26 ॥**

ఇవే కాకుండా ఇంకా నరకాలు వందలకొలదీ, వేల కొలదీ ఉన్నాయి. వీటియందు పాపకర్మలు చేసేవారు యాతనలు అనుభవిస్తూ ఉంటారు.

**యథైవ పాపాన్యేతాని తథా౽న్యాని సహస్రశః ।**
**భుజ్యన్తే తాని పురుషైర్నరకాన్తరగోచరైః ॥ 27 ॥**

పాపాలు కూడా ఇవే కాకుండా వేలకొలది ఇతరమైనవి ఉన్నాయి. ఆ పాపాలు ఆచరించేవారు వాటి ఫలితాలను ఇతరనరకాలలో ఆ జీవులు పొందుతూ ఉంటారు.

**వర్ణాశ్రమవిరుద్ధం చ కర్మ కుర్వన్తి యే నరాః ।**
**కర్మణా మనసా వాచా నిరయేషు పతన్తి తే ॥ 28 ॥**

కర్మచేత, మనస్సుచేత, వాక్కుచేత ఆ వర్ణాలకు, ఆశ్రమాలకు సంబంధించిన ధర్మాలకు వ్యతిరేకమైన కర్మలు ఆచరించే నరులు నరకాలలో పడిపోతూ ఉంటారు.

**అధః శిరోభిర్దృశ్యన్తే నరకై ర్దివి దేవతాః ।**
**దేవాశ్చాధోముఖాన్ సర్వానధః పశ్యన్తి నారకాన్ ॥ 29 ॥**

"అధః శిరం" అనే నరకలోకవాసులచే ద్యులోకమందలి దేవతలు (తలక్రిందులుగా ఉండే జీవులచే) చూడబడుతూ ఉంటారు. దేవతలు కూడ అధోముఖులైన నరకలోక వాసులను అందరిని క్రిందికి చూస్తూ ఉంటారు.

**స్థావరాః కృమయో౽బ్జాశ్చ పక్షిణః పశవో నరాః ।**
**ధార్మికాస్త్రిదశాస్తద్వ న్మోక్షిణశ్చ యథాక్రమమ్ ॥ 30 ॥**

**సహస్రభాగాః ప్రథమా ద్వితీయానుక్రమాస్తథా ।**
**సర్వే హ్యేతే మహాభాగ! యావన్ముక్తి సమాశ్రయాః ॥ 31 ॥**

(పాపాత్ములు నరకలోకానుభవం పూర్తి అయిన తరువాత) స్థావరాలు, కృములు, జలజన్యాలైన ప్రాణులు, పక్షులు, పశువులు, నరులు, ధార్మికులు, దేవతలు, ముముక్షువులు – అనే క్రమంగా యథాప్రాప్తంగా జన్మలు ధరిస్తారు. మహాభాగా! వీరు అందరూ ముముక్షువులవరకూ రెండవవారికన్న మొదటివారు వేయిరెట్లు ఎక్కువ సంఖ్యలో ఉంటారు.

**యావన్తో జన్తవః స్వర్గే తావన్తో నరకౌకసః ।**
**పాపకృద్ యాతి నరకం ప్రాయశ్చిత్తపరాఙ్ముఖః ॥ 32 ॥**

స్వర్గంలో ఎన్నిప్రాణులు ఉంటాయో, అన్ని ప్రాణులు నరకాలలో ఉంటాయి. పాపంచేసి ప్రాయశ్చిత్తం చేసుకోవడానికి విముఖుడైనవాడు నరకానికి పోతాడు.

**పాపానామనురూపాణి ప్రాయశ్చిత్తాని యద్యథా ।**
**తథా తథైవ సంస్మృత్య ప్రోక్తాని పరమర్షిభిః ॥ 33 ॥**

పాపాలకు తగినట్లుగా ప్రాయశ్చిత్తాలు ఎలా ఉంటాయో, వాటిని పరమర్షులు వేదధర్మానుసారంగా భిన్నభిన్నపాపాలకు భిన్నభిన్నప్రాయశ్చిత్తాలు చెప్పారు.

**పాపే గురూణి గురుణి స్వల్పాన్యల్పే చ తద్విదః ।**
**ప్రాయశ్చిత్తాని మైత్రేయ! జగుః స్వాయమ్భువాదయః ॥ 34 ॥**

మైత్రేయా! పాపం పెద్దదయితే ప్రాయశ్చిత్తాలు ఎక్కువగా ఉంటాయి. పాపం చిన్నదయతే అవి తక్కువగా ఉంటాయని స్వాయంభువమనువు మున్నగువారు వివరించారు. గానం చేశారు.

**ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపః కర్మాత్మకాని వై ।**
**యాని తేషామశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్ ॥ 35 ॥**

సమస్తప్రాయశ్చిత్తాలు తపోరూపంలోను, కర్మరూపంలోను ఉన్నాయి. వాటి అన్నింటిలోనూ కృష్ణనామస్మరణం మిక్కిలి శ్రేష్ఠమైనది.

**కృతే పాపేఽనుతాపో వై యస్య పుంసః ప్రజాయతే ।**
**ప్రాయశ్చిత్తం తు తస్యైకం హరి సంస్మరణం పరమ్ ॥ 36 ॥**

పాపం చేసి పశ్చాత్తాపం పొందినవానికి హరి సంస్మరణచేస్తే అదే ఒక ఉత్తమప్రాయశ్చిత్తం అవుతుంది.

**ప్రాతర్నిశి తథా సన్ధ్యామధ్యాహ్నాదిషు సంస్మరన్ ।**
**నారాయణమవాప్నోతి సద్యః పాపక్షయం నరః ॥ 37 ॥**

ఉదయం, రాత్రి, సంధ్యా సమయం, మధ్యాహ్నం మొదలైన వేళలలో నారాయణ స్మరణచేసే నరుడు, ఆ కాలమందే పాపం క్షయమైపోతూ ఉండడంవల్ల ఆయనను పొందుతాడు.

**విష్ణుసంస్మరణాత్ క్షీణసమస్తక్లేశసంచయః ।**
**ముక్తిం ప్రయాతి స్వర్గాప్తి స్తస్య విఘ్నోఽనుమీయతే ॥ 38 ॥**

విష్ణువును సదా స్మరించడం వల్ల సకలపాపరాశి క్షీణించి పోగా ముక్తిని పొందుతాడు. అతనికి స్వర్గలోకప్రాప్తి పెద్ద విఘ్నమనిపిస్తుంది.

**వాసుదేవే మనో యస్య జపహోమార్చనాదిషు ।**
**తస్యాన్తరాయో మైత్రేయ దేవేన్ద్రత్వాదికం ఫలమ్ ॥ 39 ॥**

మైత్రేయా! జపం, హోమం, అర్చన మున్నగునవి చేసేటప్పుడు ఎవని మనస్సు వాసుదేవునియందే లగ్నమై ఉంటుందో, అట్టివానికి దేవేంద్రపదవి మున్నగు ఫలం కూడ ఒక పెద్ద విఘ్నమే.

**క్వ నాకపృష్ఠగమనం పునరావృత్తి లక్షణమ్ ।**
**క్వ జపో వాసుదేవేతి ముక్తి బీజమనుత్తమమ్ ॥ 40 ॥**

పునరావృత్తితో కూడుకొన్న స్వర్గలోక గమనకర్మ యెక్కడ? అపునరావృత్తి హేతువయిన, అత్యుత్త మమయిన, ముక్తిదాయకమైన "వాసుదేవ" మంత్రజపం ఎక్కడ ? (వాసుదేవమంత్రజపమే ప్రధానమైనదని భావం)

**తస్మాదహర్నిశం విష్ణుం సంస్మరన్ పురుషో మునే ।**
**న యాతి నరకం మర్త్యః సంక్షీణాఖిలపాతకః ॥ 41 ॥**

మునీశ్వరా! కాబట్టి రాత్రి, పగలు విష్ణువును సంస్మరిస్తూ, సకలపాతకాలను సంపూర్తిగా క్షీణింపచేసుకొన్న మర్త్యుడైన జీవుడు నరకానికి పోడు.

**మనః ప్రీతికరః స్వర్గో నరకస్తద్విపర్యయః ।**
**నరకస్వర్గసంజ్ఞే వై పాపపుణ్యే ద్విజోత్తమ! ॥ 42 ॥**

ద్విజోత్తమా! మనస్సుకు సంప్రీతిని కల్గించేది స్వర్గం. దానికి వ్యతిరేకమైనది నరకం. పాపానికి నరకమని, పుణ్యానికి స్వర్గమని పేర్లు.

**వస్త్వేకమేవ దుఃఖాయ సుఖాయేర్ష్యోద్భవాయ చ ।**
**లోపాయ చ యతస్తస్మాద్ వస్తు వస్త్వాత్మకం కుతః ॥ 43 ॥**

ఒకే వస్తువు దుఃఖానికి, సుఖానికి, ఈర్ష్యపుట్టడానికి, కోపానికి కారణం అవుతున్నప్పుడు వస్తువుకు నియత స్వరూపం ఎక్కడ?

**తదేవ ప్రీతయే భూత్వా పునర్దుఃఖాయ జాయతే ।**
**తదేవ కోపాయ తతః ప్రసాదాయ చ జాయతే ॥ 44 ॥**

అదే ప్రీతికి కారణమయి మళ్లీ దుఃఖాన్ని కలిగిస్తున్నది. అదే కోపాన్ని రప్పిస్తున్నది. అదే మళ్లీ ప్రసన్నత్వాన్ని జనింపచేస్తోంది.

**తస్మాద్ దుఃఖాత్మకం నాస్తి న చ కించిత్ సుఖాత్మకమ్ ।**
**మనసః పరిణామోఽయం సుఖదుఃఖాది లక్షణః ॥ 45 ॥**

కాబట్టి దుఃఖ స్వరూపమైనది ఏదీలేదు. అదే విధంగా సుఖరూపమైనదీ ఏకొంచెము లేదు సుఖం,దుఃఖం ఇత్యాది లక్షణం మనస్సుయొక్క పరిణామం మాత్రమే.

**జ్ఞానమేవ పరంబ్రహ్మ జ్ఞానం బన్ధాయ చేష్యతే ।**
**జ్ఞానాత్మకమిదం విశ్వం న జ్ఞానాద్విద్యతే పరమ్ ॥**
**విద్యాఽవిద్యేతి మైత్రేయ! జ్ఞానమేవావధారయ ॥ 46 ॥**

మైత్రేయా! కాబట్టి జ్ఞానమే పరబ్రహ్మం. అవిద్యోపాధివల్ల జ్ఞానమే బంధకారణం అవుతోంది. ఈ విశ్వం జ్ఞానస్వరూపం. జ్ఞానం కన్న మించినది ఏదీ లేదు. విద్యావిద్యల స్వరూపం తెలుసుకొని జ్ఞానం గ్రహించు.

**ఏవమేతన్మయాఽఽఖ్యాతం భవతో మణ్డలం భువః ।**
**పాతాలాని చ సర్వాణి తథైవ నరకా ద్విజ ॥ 47 ॥**

**సముద్రాః పర్వతాశ్చైవ ద్వీప వర్షాణి నిమ్నగాః ।**
**సంక్షేపాత్ సర్వమాఖ్యాతం కిం భూయః శ్రోతుమిచ్ఛసి ॥ 48 ॥**

ద్విజశ్రేష్ఠా! ఈ రీతిగా నీకు భూమండలం, సకలపాతాలాలు, సమస్తనరకాలు, సముద్రాలు, పర్వతాలు, ద్వీపాలు, వర్షాలు, నదులు-వీటి గురించి, సమస్తం నాచే సంక్షిప్తంగా తెలియజేయబడింది. ఇక మీదట ఏమి వినగోరుతున్నావు? అని పరాశరుడు మైత్రేయుని ప్రశ్నించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే నరకవర్ణనం - హరిమాహాత్మ్యప్రభావశ్చేతి షష్ఠోఽధ్యాయః సమాప్తః ॥ 6 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో నరకవర్ణన-హరిమాహాత్మ్యప్రభావం అనే ఆరవ అధ్యాయం సమాప్తం ॥6॥



## సప్తమోఽధ్యాయః – ఏడవ అధ్యాయం

## సూర్యాదిగ్రహాణాం సప్తలోకానాం చ వర్ణనమ్ – సూర్యాదిగ్రహాలు, సప్తలోకాల వర్ణన

**శ్రీమైత్రేయ ఉవాచ :–** మైత్రేయుడు పలికాడు

**కథితం భూతలం బ్రహ్మన్! మమైతదఖిలం త్వయా ।**
**భువర్లోకాదికాన్ లోకాన్ శ్రోతుమిచ్ఛామ్యహం మునే ॥ 1 ॥**

**తథైవ గ్రహసంస్థానం ప్రమాణాని యథా తథా ।**
**సమాచక్ష్వ మహాభాగ! మహ్యం త్వం పరిపృచ్ఛతే ॥ 2 ॥**

"బ్రహ్మవేత్తవయిన పరాశరమునీంద్రా! నీచే భూమండలం గూర్చి సర్వం నాకు తెలియజేయబడింది. భువర్లోకం మున్నగు లోకాలను గూర్చి మునీంద్రా! ఇక నేను వినగోరుతున్నాను. మహాభాగా! అదే విధంగాగ్రహాల ఉనికి, వాటి ప్రమాణాలు ఉన్నది ఉన్నట్లుగా నాకు వివరించు. నేను నిన్ను అడుగుతున్నాను" అని మైత్రేయుడుకోరాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు

**రవిచన్ద్రమసోర్యావన్మయూఖైరవభాసతే (భాస్యతే) ।**
**ససముద్రసరిచ్ఛైలా తావతీ పృథివీ స్మృతా ॥ 3 ॥**

సూర్యునియొక్కయు, చంద్రుని యొక్కయు కిరణాల వెలుగు ప్రకాశించినంతమేర, సముద్రాలతో, నదులతో, కొండలతో కూడి ఉండే దానిని "పృథివి" అంటారు.

**యావత్ప్రమాణా పృథివీ విస్తారపరిమణ్డలాత్ ।**
**నభస్తావత్ప్రమాణం వై వ్యాసమణ్డలతో ద్విజ ॥ 4 ॥**

ద్విజోత్తమా! పృథివి ఎంత ప్రమాణమో, దాని విస్తీర్ణత, చుట్టుకొలత ఎంతఉందో, నభానికి (భువర్లోకానికి) అంతే ప్రమాణం, విస్తీర్ణం, చుట్టుకొలత ఉన్నాయి.

**భూమేర్యోజనలక్షే తు సౌరం మైత్రేయ! మణ్డలమ్ ।**
**లక్షాద్దివాకరస్యాపి మణ్డలం శశినః స్థితమ్ ॥ 5 ॥**

మైత్రేయా! భూమికి లక్షయోజనాలదూరంలో సూర్యమండలం ఉంది. ఆ సౌరమండలానికి లక్షయోజనాల దూరంలో చంద్రమండలం ఉంది.

**పూర్ణే శతసహస్రే తు యోజనానాం నిశాకరాత్ ।**
**నక్షత్రమణ్డలం కృత్స్నముపరిష్టాత్ ప్రకాశతే ॥ 6 ॥**

చంద్రమండలం నుండి నూరువేల యోజనాలదూరంలో నిండి పైన సమస్తనక్షత్రమండలం ప్రకాశిస్తోంది.

**ద్వే లక్షే చోపరి బ్రహ్మన్ బుధో నక్షత్రమణ్డలాత్ ।**
**తావత్ప్రమాణభాగే తు బుధస్యాప్యుశనాః స్థితః ॥ 7 ॥**

బ్రాహ్మణోత్తమా! నక్షత్రమండలం నుండి రెండులక్షల యోజనాల దూరంలో పైన బుధ గ్రహమండలం ఉంది. బుధునకు అంతే రెండులక్షల యోజనాల దూరంలో శుక్రగ్రహమండలం ఉంది.

**అంగారకో౾పి శుక్రస్య తత్ప్రమాణే వ్యవస్థితః ।**
**లక్షద్వయేన భౌమస్య స్థితో దేవపురోహితః ॥ 8 ॥**

శుక్రునకు రెండు లక్షల యోజనాల అంతే దూరంలో అంగారక (కుజ) మండలం ఉన్నది. అంగారకునకు రెండు లక్షల యోజనాల దూరంలో దేవపురోహితుడైన బృహస్పతి మండలం ఉంది.

**సౌరిర్బృహస్పతేశ్చోర్ధ్వం ద్విలక్షే సమ్యగవస్థితః ।**
**సప్తర్షిమణ్డలం తస్మాల్లక్షమేకం ద్విజోత్తమ! ॥ 9 ॥**

ద్విజోత్తమా! బృహస్పతికి పైన రెండు లక్షల యోజనాల దూరంలో శనిగ్రహమండలం ఉంది. శనిమండలానికి లక్ష యోజనాల దూరంలో సప్తర్షిమండలం ఉంది.

**ఋషిభ్యస్తు సహస్రాణాం శతాదూర్ధ్వం వ్యవస్థితః ।**
**మేఢీభూతః సమస్తస్య జ్యోతిశ్చక్రస్య వై ధ్రువః ॥ 10 ॥**

సప్తర్షిమండలానికిపైన లక్షయోజనాల దూరంలో సమస్తజ్యోతిశ్చక్రానికి నాభిరూపంగా (పశువులను గట్టే రాట రూపంగా) ధ్రువమండలం ఉంది.

**త్రైలోక్యమేతత్ కథితముత్సేధేన మహామునే! ।**
**ఇజ్యాఫలస్య భూరేషా ఇజ్యా చాత్ర ప్రతిష్ఠితా ॥ 11 ॥**

మునీశ్వరా! త్రిలోకాల ఎత్తు (పొడవు) గురించి నీకు చెప్పాను. యజ్ఞములు చేసేవారి ఫలరూపమే ఈ మూడులోకాల స్థానభూమి. అందులోను భారతవర్షంలో యజ్ఞాచరణం ప్రతిష్ఠితమై ఉంది.

వి ॥ భూమండలం మొదలు ధ్రువమండలపర్యంతం ఉన్నలోకాలు మూడు. అవిముందు చెప్పబడతాయి.

**ధ్రువాదూర్ధ్వం మహర్లోకో యత్ర తే కల్పవాసినః ।**
**ఏకయోజనకోటిస్తు యత్ర తే కల్పవాసినః ॥ 12 ॥**

ధ్రువమండలానికి కోటియోజనాల దూరంలో మహర్లోకం ఉంది. అందు కల్పం యొక్క చివరివరకు నివసించేవారు (భృగువు మున్నగువారైన సిద్ధగణాలు), అందు వసిస్తూ ఉంటారు.

**ద్వే కోట్యౌ తు జనోలోకో యత్ర తే బ్రహ్మణః సుతాః ।**
**సనన్దనాద్యాః కథితా మైత్రేయామలచేతసః ॥ 13 ॥**

మైత్రేయా! ఆ లోకంనుంచి రెండుకోట్లయోజనాలదూరంలో జనోలోకం ఉంది. అందు బ్రహ్మదేవుని కుమారులైన నిర్మల మనస్కులైన సనందనాదులు నివసిస్తూ ఉంటారు.

**చతుర్గుణోత్తరే చోర్ధ్వం జనలోకాత్తపః స్థితమ్ ।**
**వైరాజా యత్ర తే దేవాః స్థితా దాహవివర్జితాః ॥ 14 ॥**

జనలోకానికి నాలుగురెట్లదూరంలో (అనగా ఎనిమిది కోట్ల యోజనాల దూరంలో పైన తపోలోకం ఉంది. అందు వైరాజులు అనే దేవతాగణాలు వసిస్తారు. ఆ దేవతలకు దాహం ఉండదు.)

**షడ్గుణేన తపోలోకాత్ సత్యలోకో విరాజతే ।**
**అపునర్మారకా యత్ర బ్రహ్మలోకో హి స స్మృతః ॥ 15 ॥**

తపోలోకం నుంచి ఆరురెట్లదూరంలో (అనగా పండ్రెండు కోట్లయోజనాల దూరంలో) సత్యలోకం ప్రకాశిస్తోంది. అందు పునర్మరణంలేనివారు (అనగా పునర్జన్మ పొందనవసరంలేనివారు) వసిస్తారు. అదే బ్రహ్మ లోకమని పిలవబడుతుంది.

**పాదగమ్యంతు యత్కించిత్ వస్త్వస్తి పృథివీమయమ్ ।**
**స భూర్లోకః సమాఖ్యాతో విస్తారోఽస్య మయోదితః ॥ 16 ॥**

పాదాలతో నడచి పోవడానికి వీలయిన పృథివీమయ పదార్థాన్ని భూలోకం అంటారు. దాన్ని గురించి సవివరంగా నీకు చెప్పడం జరిగింది.

**భూమిసూర్యాన్తరం యత్తు సిద్ధాదిమునిసేవితమ్ ।**
**భువర్లోకస్తు సోఽప్యుక్తో ద్వితీయో మునిసత్తమ! ॥ 17 ॥**

మునిశ్రేష్ఠా! భూమికి, సూర్యునకు నడుమ ఉండే సిద్ధులు మున్నగువారిచేత, మునీశ్వరులచేత సేవించబడేది భువర్లోక మనబడుతోంది. అది రెండవలోకం.

**ధ్రువసూర్యాన్తరం యచ్చ నియుతాని చతుర్దశ ।**
**స్వర్లోకః సోఽపి గదితో లోకసంస్థానచిన్తకైః ॥ 18 ॥**

ధ్రువమండలానికి సూర్యమండలానికి నడుమ ఉండే పద్నాలుగు నియుతాలు (అనగా పద్నాలుగు లక్షలు) యోజనాల మేర లోకాలయొక్క ఉనికిని గూర్చి ఆలోచించేవారిచే, స్వర్లోకం అని చెప్పబడుతోంది.

**త్రైలోక్యమేతత్ కృతకం మైత్రేయ! పరిపఠ్యతే ।**
**జనస్తపస్తథా సత్యమితి చాకృతకం త్రయమ్ ॥ 19 ॥**

మైత్రేయా! ఈ మూడులోకాలను కృతకం అంటారు. జనోలోకతపోలోకసత్యలోకాలు మూడింటిని అకృతకం అంటారు.

**కృతకాకృతయోర్మధ్యే మహర్లోక ఇతి స్మృతః ।**
**శూన్యో భవతి కల్పాన్తే యోఽత్యన్తం న వినశ్యతి ॥ 20 ॥**

కృతకం, అకృతకం యొక్క మధ్యలోకాన్ని మహర్లోకం అంటారు. ఇది కల్పాంతంలో (బ్రహ్మగారిదైనందిన ప్రళయాంతంలో) జనశూన్యమయిపోతుందికాని పూర్తిగా నశించదు. (కాబట్టి దీనిని కృతకాకృతకలోకం అంటారు.)

**ఏతే సప్త మయా లోకా మైత్రేయ! కథితాస్తవ ।**
**పాతాలాని చ సప్తైవ బ్రహ్మాణ్డస్యైష విస్తరః ॥ 21 ॥**

మైత్రేయా! ఈ ఏడు (ఊర్ధ్వ) లోకాలు నా ద్వారా నీకు వివరించబడ్డాయి. పాతాళాలు కూడ ఏడే. ఇది బ్రహ్మాండం యొక్క విస్తీర్ణం.

**ఏతదణ్డకటాహేన తిర్యక్ చోర్ధ్వమధస్తథా ।**
**కపిత్థస్య యథాబీజం సర్వతో వై సమావృతమ్ ॥ 22 ॥**

వెలగ విత్తుతో కూడిన గుజ్జు చుట్టూ వెలగడిప్ప కప్పబడినట్లే, ఈ బ్రహ్మాండం చుట్టూ క్రిందా, పైనా, అన్ని వైపుల చిప్ప (కటాహం) కప్పబడిఉంది. (దీనినే పృథివ్యావరణం అంటారు)

**దశోత్తరేణ పయసా మైత్రేయాణ్డం చ తద్ వృతమ్ ।**
**సర్వోఽమ్బుపరిధానోఽసౌ వహ్నినా వేష్టితో బహిః ॥ 23 ॥**

మైత్రేయా! ఈ అండకటాహం చుట్టూ దానికి పదిరెట్లుమేర జలావరణం ఉంది. ఆ జలావరణం చుట్టూ అంతటి విస్తీర్ణంతో అగ్ని ఆవరించి ఉంది.

**వహ్నిశ్చ వాయునా వాయుర్మైత్రేయ ! నభసాఽఽవృతః ।**
**భూతాదినానభః సోఽపి మహతా పరివేష్టితః ॥ 24 ॥**

మైత్రేయా! అదేవిధంగా అగ్నిచుట్టూ వాయువు, వాయువుచుట్టూ ఆకాశం ఆవరించి ఉన్నాయి. ఆకాశమును తామసాహంకారం, దానిని మహత్తత్త్వం ఆవరించాయి.

**దశోత్తరాణ్యశేషాని మైత్రేయైతాని సప్త వై ।**
**మహాన్తం చ సమావృత్య ప్రధానం సమవస్థితమ్ ॥ 25 ॥**

మైత్రేయా! ఈ ఏడునూకూడ అన్నీ ఒకదానికంటె ఒకటి పదిరెట్లు ఎక్కువ. మహత్తత్త్వాన్నిచుట్టి ప్రధానం ఆవరించి ఉంది.

**అనన్తస్య న తస్యాన్తః సంఖ్యానం చాపి విద్యతే ।**
**తదనన్తమసంఖ్యాతప్రమాణం చాపి వై యతః ॥ 26 ॥**

ఆ ప్రధానం అనంతమైనది. దానికి అంతుగాని, లెక్కగాని లేదు. ఆ కారణంచే అది అనంతం. సంఖ్యారహితం. ప్రమాణ విరహితం.

**హేతుభూతమశేషస్య ప్రకృతిః సాపరా మునే ।**
**అణ్డానాం తు సహస్రాణాం సహస్రాణ్యయుతాని చ ।**
**ఈదృశానాం తథా తత్ర కోటి కోటి శతాని చ ॥ 27 ॥**

మునీశ్వరా! ఇదే సమస్తానికి మూలకారణం, అదే పరా ప్రకృతి. ఇందులో ఇట్టి అండాలు వేలు, లక్షలు, కోట్లు, వందల కోట్లు ఉన్నాయి.

**దారుణ్యగ్నిర్యథా తైలం తిలే తద్వత్ పుమానపి ।**
**ప్రధానేఽవస్థితో వ్యాపీ చేతనాత్మాత్మవేదనః ॥ 28 ॥**

కట్టెలో నిప్పు, నువ్వుగింజలో నూనె ఉన్నట్లుగా ప్రధానంలో పురుషుడు ఉన్నాడు. ఆ పురుషుడు సర్వం వ్యాపించి ఉండేవాడు. చైతన్యమే ఆత్మ అయినవాడు. ఆత్మప్రకాశమైనవాడు.

**ప్రధానం చ పుమాంశ్చైవ సర్వభూతాత్మభూతయా ।**
**విష్ణుశక్త్యా మహాబుద్ధే ! వృతౌ! సంశయధర్మిణౌ ॥ 29 ॥**

గొప్ప బుద్ధిమంతుడవైన మైత్రేయా! ప్రధానాన్ని, పురుషుని, సర్వభూతాలకు ఆత్మస్వరూపమైన విష్ణుశక్తి ఆవరించి ఉంది. ప్రధానం పురుషుడు-ఒకదానినొకటి ఆశ్రయించి ఉంటాయి.

**తయోః సైవ పృథగ్భావకారణం సంశ్రయస్య చ ।**
**క్షోభకారణభూతా చ సర్గకాలే మహామతే ॥ 30 ॥**

ఓ మహామతీ! ప్రళయకాలంలో ఇవి వేరుగా ఉండడానికి, సృష్టిసమయంలో కలిసిఉండడానికి కారణమైనది. వాటి సంకోచవికాసాలకు హేతువైనది ఆ విష్ణుశక్తియే.

**యథా శైత్యం జలే వాతో బిభర్తి కణికాశతమ్ ।**
**జగచ్ఛక్తిస్తథా విష్ణోః ప్రధాన పురుషాత్మికా ॥ 31 ॥**

నీటితో కలిసినగాలి వందల జలబిందువులను మోస్తూ చల్లదనాన్ని ఇస్తున్నట్లు ప్రధానంతో కలిసిన పురుష రూపమైన విష్ణుశక్తి జగత్తును వహిస్తోంది.

**యథా చ పాదపో మూలస్కన్ధ శాఖాదిసంయుతః ।**
**ఆదిబీజాత్ ప్రభవతి బీజాన్యన్యాని వై తతః ॥ 32 ॥**

**ప్రభవన్తి తతస్తేభ్యః సమ్భవన్త్యపరే ద్రుమాః ।**
**తేఽపి తల్లక్షణ ద్రవ్యకారణానుగతా మునే ॥ 33 ॥**

మునీశ్వరా! వ్రేళ్లు, మ్రాను, కొమ్మలు మున్నగు వాటితో కూడుకొన్న వృక్షం మొదట విత్తనంనుండిపుట్టి, పిమ్మట అదే చెట్టునుంచి విడివిడిగా విత్తనాలు, మళ్లీ ఆ విత్తనాలనుండి అనేక వృక్షాలు పుట్టడానికికారణం అవుతున్నట్లు, ఈ జగత్పరంపరకు దానిలక్షణాలు, ఆ ద్రవ్యాలు ఆ కారణం అనుసరించి ఉంటాయి.

**ఏవమవ్యాకృతాత్ పూర్వం జాయన్తే మహదాదయః ।**
**విశేషాన్తాస్తతస్తేభ్యః సమ్భవన్తి సురాదయః ॥ 34 ॥**

ఈ విధంగా అవ్యాకృతమైన ప్రధానం నుంచి మహత్తత్త్వం మొదలు విశేషాల వరకు జన్మించాయి. వాటి నుంచి క్రమంగా సురలు ఉద్భవించారు.

**తేభ్యశ్చ పుత్రాస్తేషాం చ పుత్రాణామపరే సుతాః ।**
**బీజాద్ వృక్షప్రరోహేణ యథా నాపచయస్తరోః ।**
**భూతానాం భూతసర్గేణ నైవాస్త్యపచయస్తథా ॥ 35 ॥**

వారికి కొడుకులు, మరల ఆ కొడుకులకు కొడుకులు జన్మించారు. బీజం నుంచి చెట్టు ఉద్భవించినా, ఆ విత్తనానికి కారణమైన చెట్టు నశించనట్లే, ప్రాణుల వల్ల ప్రాణులు ఉద్భవించినా ఆ ప్రాణులు నశించరు.

**సన్నిధానాద్ యథాకాశకాలాద్యాః కారణం తరోః ।**
**తథైవాపరిణామేన విశ్వస్య భగవాన్ హరిః ॥ 36 ॥**

సామీప్యం వల్ల చెట్టుకు దగ్గరగా నున్న ఆకాశం, అది ఈ కాలంలోని చెట్టు, అది ఈ ప్రదేశం లోనిది అనే కారణస్థితి ఏర్పడుతుందో, అదే విధంగా ఈ విశ్వానికి భగవంతుడైన హరి కూడ ఏ విధమైన పరిణామంలేని కారణం.

**వ్రీహి బీజే యథామూలం నాలం పత్రాంకురౌ తథా ।**
**కాణ్డం కోశస్తథా పుష్పం క్షీరం తద్వచ్చ తండులాః ॥ 37 ॥**

**తుషాః కణాశ్చ సంతో వై యాన్త్యావిర్భావమాత్మనః ।**
**ప్రరోహహేతుసామగ్రీమాసాద్య మునిసత్తమ! ॥ 38 ॥**

**తథా కర్మస్వనేకేషు దేవాద్యాః సమవస్థితాః ।**
**విష్ణుశక్తిం సమాసాద్య ప్రరోహముపయాన్తి వై ॥ 39 ॥**

మునిశ్రేష్ఠా! ధాన్యపుగింజలో వేరు, కాడ, ఆకులు, మొక్క, కాండం, పొట్ట, పువ్వు, పాలు, బియ్యం, ఊక, తవుడు మొదలైన పదార్థాలు అవ్యక్తంగా ఇమిడియుండి, మొలకెత్తే సమయంలో (నేల, నీరు మున్నగు) కారణసామగ్రిని పొంది వెలుపలకు వస్తాయి. అలాగే అనేక కర్మలు చేసి తత్ఫలాలు అనుభవించబోయే దేవతలు మున్నగు ఉపాధులు జీవశరీరంతో నిండియుండి విష్ణుశక్తివల్ల తత్కారణంగా ఆవిర్భవిస్తాయి.

**స చ విష్ణుః పరం బ్రహ్మ యతః సర్వమిదం జగత్ ।**
**జగచ్చ యో యత్ర చేదం యస్మింశ్చ లయమేష్యతి ॥ 40 ॥**

ఆ విష్ణువే పరబ్రహ్మం. ఆయననుంచే ఈ సమస్తమైన జగత్తూ వచ్చింది. జగత్తూ ఆయనే. ఆయన యందే ఈ జగత్తు ఉంది. చివరకు ఆయనలోనే లీనమవుతుంది.

**తద్బ్రహ్మ తత్పరం ధామ సదసత్పరమం పదమ్ ।**
**యస్య సర్వమభేదేన యతశ్చైతచ్చరాచరమ్ ॥ 41 ॥**

ఆయనే బ్రహ్మం. ఆయనే పరమమైన స్థానం. సత్తుకంటె, అసత్తు కంటె విశిష్ట లక్షణయుక్తమయిన పరమ పదం ఆయనే. ఈ కనబడే చరాచర ప్రపంచం సర్వం ఆయననుంచే వచ్చింది. కాబట్టి ఇది ఆయనకన్న భిన్నంకానిది.

**స ఏవ మూలప్రకృతి ర్వ్యక్తరూపీ జగచ్చ సః ।**
**తస్మిన్నేవ లయం సర్వం యాతి యత్ర చ తిష్ఠతి ॥ 42 ॥**

ఆయనయే మూలప్రకృతి. వ్యక్తరూపమైన సమస్త జగత్తూ ఆయనే. లయవేళలో ఆయన యందే సర్వం లీనమవుతుంది. సృష్టివేళ వరకు ఆయన యందే ఉంటుంది.

**కర్తా క్రియాణాం స చ ఇజ్యతే క్రతుః**
**స ఏవ తత్కర్మఫలం చ తస్య తత్ ।**
**స్రుగాది యత్సాధనమప్యశేషతో**
**హరేర్నకించిద్ వ్యతిరిక్తమస్తి వై ॥ 43 ॥**

యజ్ఞాదిక్రియలకు కర్త ఆయనే. ఆయనే పూజించ (యజించ) బడేది. క్రతువూ ఆయనే. కర్మఫలమూ ఆయనే. అది కూడా ఆయనదే. స్రుక్కులు మొదలైన సమస్తములైన యజ్ఞోపకరణములూ ఆయనే. ఆ హరి కంటె వ్యతిరిక్తమైనది కించిత్తూ లేదు అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే సూర్యాదిగ్రహాణాం సప్తలోకానాం చ వర్ణనమితి సప్తమోఽధ్యాయః సమాప్తః ॥7॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో సూర్యాదిగ్రహాలు – సప్తలోకాల వర్ణన అనే ఏడవ అధ్యాయం సమాప్తం॥7॥



## అష్టమోఽధ్యాయః - ఎనిమిదవ అధ్యాయం

## కాలనిరూపణం-గంగావిర్భావవర్ణనమ్ - కాలనిరూపణం - గంగావిర్భావవర్ణన

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**వ్యాఖ్యాతమేతద్ బ్రహ్మాణ్డసంస్థానం తవ సువ్రత! ।**
**తతః ప్రమాణసంస్థానే సూర్యాదీనాం శృణుష్వ మే ॥ 1 ॥**

నియమబద్ధమైన వ్రతం కలిగిన మైత్రేయా! నీకు ఈ బ్రహ్మాండం యొక్క ఉనికిని గూర్చి చెప్పాను. ఇటుపైన సూర్యాది మండలాలయొక్క ఉనికిని, ప్రమాణాన్ని ఆలకించు.

**యోజనానాం సహస్రాణి భాస్కరస్య రథో నవ ।**
**ఈషాదణ్డస్తథైవాస్య ద్విగుణో మునిసత్తమ । 2 ॥**

మునిశ్రేష్ఠా! భగవంతుడైన సూర్యునియొక్క రథం విస్తీర్ణత తొమ్మిదివేల యోజనాలు. దాని ఈషాదండం (పోలుకఱ్ఱ) దానికి రెట్టింపు (అనగా పద్దెనిమిదివేల యోజనాలు)

**వి ॥** ఇచ్చట సూర్యమండలం రథంతో పోల్చబడి వర్ణించబడుతోంది.

**సార్ధకోటిస్తథా సప్త నియుతాన్యధికాని వై ।**
**యోజనానాం తు తస్యాక్షస్తత్ర చక్రం ప్రతిష్ఠితమ్ ॥ 3 ॥**

దాని ఇరుసు ఒక కోటి ఏభైఏడు లక్షలయోజనాలు ఉంటుంది. అందు చక్రం అమర్చబడింది.

**త్రినాభిమతి పంచారే షణ్ణేమిన్యక్షయాత్మకే ।**
**సంవత్సరమయే కృత్స్నం కాలచక్రం ప్రతిష్ఠితమ్ ॥ 4 ॥**

మూడు తూములు, ఐదు ఆకులు, ఆరు పట్టాలు కలిగిన ఈ అక్షయమైన సంవత్సరమయమైన కాలచక్రమంతా పూర్తిగా దానిలో ప్రతిష్ఠించబడింది.

**వి ॥** ఇచ్చట మూడు తూములు అనగా పూర్వాహ్ణ, మధ్యాహ్న, అపరాహ్ణ రూపము లేదా శీతకాల, వర్షకాల, వసంతకాలరూపము లేదా భూతవర్తమాన భవిష్యత్కాలరూపము అని భావం. ఐదు ఆకులు అనగా సంవత్సరం, పరివత్సరం, ఇడావత్సరం, అనువత్సరం, వత్సరం అని భావం. ఆరునేములు కలది అనగా ఆరు ఋతువులు అని భావం. సూర్యుడనే జ్యోతిర్మయమండలం దూరం నుంచి గుండ్రంగా కనిపిస్తుంది కాని వర్తులాకారపుకొలతలతో ఉండేది కాదు.

**చత్వారింశత్సహస్రాణి ద్వితీయోఽక్షో వివస్వతః ।**
**పంచాన్యాని తు సార్ధాని స్యన్దనస్య మహామతే! ॥ 5 ॥**

ఓ మహామతీ! భగవంతుడైన సూర్యునియొక్క రథానికి ఉన్న రెండో ఇరుసు ప్రమాణం నలభై ఐదున్నరవేల యోజనాలు.

**అక్షప్రమాణముభయోః ప్రమాణం తద్యుగార్ధయోః ।**
**హ్రస్వో౽క్షస్తద్యుగార్ధేన ధ్రువాధారో రథస్య వై ।**
**ద్వితీయే౽క్షే తు తచ్చక్రం సంస్థితం మానసాచలే ॥ 6 ॥**

ఈ రెండు ఇరుసుల పొడవు కాడి రెండు సగాల పొడవుకు సమానం. ఈ రథం యొక్క చిన్న ఇరుసు కాడి సగం భాగం ధ్రువమండలం ఆధారంగా ఉంది. రెండవ ఇరుసులోని చక్రం మానసోత్తర పర్వతంపై ఆధారంగా ఉంది.

**హయాశ్చ సప్తఛన్దాంసి తేషాం నామాని మే శృణు ।**
**గాయత్రీ స బృహత్యుష్ణిగ్ జగతీ త్రిష్టుబేవ చ ।**
**అనుష్టుప్ పంక్తిరిత్యుక్తాశ్ఛందాంసి హరయో రవేః ॥ 7 ॥**

ఆ రథానికి ఉండే గుఱ్ఱాలు ఏడు ఛందస్సులు. వాటిపేర్లు ఆలకించు. గాయత్రి, బృహతి, ఉష్ణిక్కు, జగతి, త్రిష్టుప్పు, అనుష్టుప్పు, పంక్తి–ఈ ఏడు ఛందస్సులు సూర్యరథాశ్వాలుగా పేర్కొనబడ్డాయి.

**మానసోత్తరశైలే తు పూర్వతో వాసవీ పురీ ।**
**దక్షిణేన యమస్యాన్యా ప్రతీచ్యాం వరుణస్య చ ।**
**ఉత్తరేణ చ సోమస్య తాసాం నామాని మే శృణు ॥ 8 ॥**

మానసోత్తరశైలానికి తూర్పుగా వాసవుని పురం, దక్షిణంగా యమపురం, పశ్చిమాన వరుణుని నగరం, ఉత్తరంగా చంద్రపురి ఉన్నాయి. వాటిపేర్లు ఆలకించు.

**వస్వౌకసారా శక్రస్య యామ్యా సంయమనీ తథా ।**
**పురీ సుఖా జలేశస్య సోమస్య చ విభావరీ ॥ 9 ॥**

ఇంద్రుని యొక్క నగరం వస్వౌకసార. యమపురి. పేరు సంయమని. వరుణుని పట్టణం సుఖ. చంద్రుని పురి విభావరి.

**కాష్ఠాం గతో దక్షిణతః క్షిప్తేషురివ సర్పతి ।**
**మైత్రేయ! భగవాన్ భానుర్జ్యోతిషాం చక్రసంయుతః ॥ 10 ॥**

మైత్రేయా! భగవంతుడైన భానుడు జ్యోతిశ్చక్రంతో కూడుకొన్నవాడై దక్షిణదిక్కునుంచి ప్రవేశించి విసరబడిన బాణంలా తీవ్రవేగంతో తనవెంటగొని పయనిస్తాడు.

**అహోరాత్రవ్యవస్థానకారణం భగవాన్ రవిః ।**
**దేవయానః పరః పన్థా యోగినాం క్లేశసంక్షయే ॥ 11 ॥**

భగవంతుడైన రవి రేయింబవళ్లు వ్యవస్థకు కారణం అవుతున్నాడు. రాగలోభాదిక్లేశాలన్నీ పూర్తిగా క్షీణింపజేసుకొన్న (క్రమముక్తిని పొందే) యోగీశ్వరులకు ఆ సూర్యుడు "దేవయానం" అనే ఉత్తమమార్గం.

**దివసస్య రవిర్మధ్యే సర్వకాలం వ్యవస్థితః ।**
**సర్వద్వీపేషు మైత్రేయ । నిశార్ధస్య చ సమ్ముఖః ॥ 12 ॥**

మైత్రేయా! సర్వద్వీపాలలోను, సర్వకాలాలలోను రవి రోజుయొక్క మధ్యభాగంలో (అనగా మధ్యాహ్న సమయంలోను) రాత్రియొక్క మధ్యభాగంలో (అనగా అర్ధరాత్రిసమయంలోను) ఎదురుగా ఉంటాడు.

వి॥ సూర్యుడు ఒక ఖండంలో ఒకరేఖపై మధ్యాహ్నవేళ ఉంటే, ఆ రేఖకు అవతలవైపున నున్న ఖండంలో అర్ధరాత్రం అని భావం.

**ఉదయాస్తమనే చైవ సర్వకాలన్తు సమ్ముఖే ।**
**విదిశాసు త్వశేషాసు తథా బ్రహ్మన్! దిశాసు చ ॥ 13 ॥**

**యైర్యత్ర దృశ్యతే భాన్వాన్ స తేషాముదయః స్మృతః ।**
**తిరోభావం చ యత్రైతి తత్రైవాస్తమనం రవేః ॥ 14 ॥**

బ్రాహ్మణోత్తమా! సమస్త దిక్కులయందు, అలాగే విదిక్కులయందు భాస్వంతుడు ఎక్కడ చూడబడతాడో అది వారికి ఉదయమవుతుంది. ఎక్కడ కనబడకుండా పోతాడో అక్కడ రవికి అస్తమయం అవుతుంది. ఉదయాస్తమయాలు కూడ సర్వకాలంలోను ఎదురెదురుగానే ఉంటాయి.

**నైవాస్తమనమర్కస్య నోదయః సర్వదా సతః ।**
**ఉదయాస్తమనాఖ్యం హి దర్శనాదర్శనం రవేః ॥ 15 ॥**

అర్కునకు అస్తమనం అన్నది లేదు. అలాగే ఉదయం అన్నది లేదు. రవి కనబడడం, కనబడకపోవడమన్నదే ఉదయం, అస్తమనంగా చెప్పబడుతున్నాయి.

**శక్రాదీనాం పురే తిష్ఠన్ స్పృశత్యేష పురత్రయమ్ ।**
**వికర్ణౌ ద్వౌ వికర్ణస్థస్త్రీన్ కోణాన్ ద్వే పురే తథా ॥ 16 ॥**

ఇంద్రాదుల యొక్క పట్టణంలో ఉన్నప్పుడు మూడు పట్టణాలను ఈ సూర్యుడు స్పృశిస్తాడు (అనగా తూర్పున ఉన్న ఇంద్రనగరం అయిన వస్వోకసారలో ఉన్నప్పుడు దక్షిణోత్తరాలలోనున్న సంయమనీ విభావరులను తాకి ఉంటాడని భావం) అలాగే రెండుకోణాలను (తూర్పు దక్షిణాల మధ్యన ఉన్న కోణాన్ని, తూర్పు ఉత్తరాలకు మధ్యన ఉన్న కోణాన్ని) స్పృశిస్తాడు. అదే విధంగా ఆగ్నేయాది కోణాలలో ఉన్నప్పుడు, ఏ మూల ఉన్నా మూడు కోణాలను, ఆ కోణాల మధ్య ఉన్న రెండు పురాలను స్పృశిస్తాడు.

**ఉదితో వర్ధమానాభిరా మధ్యాహ్నాత్ తపన్ రవిః ।**
**తతః పరం హ్రసన్తీభిర్గోభిరస్తం నియచ్ఛతి ॥ 17 ॥**

రవి ఉదయించే సమయం నుండి మధ్యాహ్నసమయంవరకు పెరిగే కిరణాలతో తపింపచేస్తూ, అటుపిమ్మట కురచగా ఉండే కిరణాలలో అస్తమిస్తాడు.

**ఉదయాస్తమనాభ్యాం చ స్మృతే పూర్వాపరే దిశౌ ।**
**యావత్ పురస్తాత్ తపతి తావత్ పృష్ఠే చ పార్శ్వయోః ।**
**ఋతేఽమరగిరేర్మేరోరుపరి బ్రహ్మణః సభామ్ ॥ 18 ॥**

భాస్కరుని యొక్క ఉదయాన్ని బట్టి తూర్పు అని, అస్తమనాన్ని బట్టి పడమర అని చెబుతారు. సూర్యుడు తూర్పుదిశను ఉన్నట్లుగా పశ్చిమ దిశను, పార్శ్వదిక్కులైన ఉత్తర దక్షిణాల యందు ఉండి ప్రకాశిస్తూ ఉంటాడు. మేరు పర్వతం మీదనుండే బ్రహ్మసభను తప్ప ముందు, వెనక, అన్నిదిక్కులా ప్రకాశింపజేస్తాడు.

**యే యే మరీచయోఽర్కస్య ప్రయాన్తి బ్రహ్మణః సభామ్ ।**
**తే తే నిరస్తాస్తద్భాసా ప్రతీపముపయాన్తి వై ॥ 19 ॥**

బ్రహ్మసభలోనికి ప్రవేశించిన, సూర్యకిరణాలు బ్రహ్మలోక కాంతికి పరాభూతాలై వెనుకకు వచ్చివేస్తాయి.

**తస్మాద్దిశ్యుత్తరస్యాం వై దివారాత్రిః సదైవ హి ।**
**సర్వేషాం ద్వీపవర్షాణాం మేరురుత్తరతో యతః ॥ 20 ॥**

సమస్తద్వీపాలను, సకలవర్షాలకు మేరువు ఉత్తరదిశగా ఉంది. ఆ కారణంచే ఉత్తర దిక్కునందు ఎల్లప్పుడూ ఒకే పగలు ఒకే రాత్రి.

**ప్రభా వివస్వతో రాత్రావస్తం గచ్ఛతి భాస్కరే ।**
**విశత్యగ్నిమతో రాత్రౌ వహ్నిర్దూరాత్ ప్రకాశతే ॥ 21 ॥**

వివస్వంతుడు అస్తమించిన పిమ్మట రాత్రియందు సూర్యప్రభ అగ్నిలో ప్రవేశిస్తుంది. ఆ కారణంచే రాత్రివేళ అగ్ని దూరం నుంచి ప్రకాశిస్తుంది.

**వహ్నిపాదస్తథా భాన్తం దినేష్వావిశతి ద్విజ ।**
**అతీవ వహ్నిసంయోగాదతః సూర్యః ప్రకాశతే ॥ 22 ॥**

ద్విజోత్తమా! పగటివేళలలో వహ్నికాంతి సూర్యునిలో ప్రవేశిస్తుంది. ఆ కారణంచే వహ్నిసంయోగంచే సూర్యుడు మండుతూ మిక్కిలి ప్రకాశిస్తాడు.

**తేజసీ భాస్కరాగ్నేయే ప్రకాశోష్ణస్వరూపిణీ ।**
**పరస్పరానుప్రవేశాదాప్యాయేతే దివానిశమ్ ॥ 23 ॥**

భాస్కరుని తేజస్సు ప్రకాశరూపం. అగ్నితేజస్సు ఉష్ణరూపం. ఇవి ఒకదానిలో ఒకటి ప్రవేశించి పగలూ, రేయీ సంతోషాన్ని కలిగిస్తాయి.

**దక్షిణోత్తరభూమ్యర్ధే సముత్తిష్ఠతి భాస్కరే ।**
**అహోరాత్రం విశత్యప్సుస్తమః ప్రాకాశ్యశీలవత్ ॥ 24 ॥**

భాస్కరుడు దక్షిణోత్తర భూమికి సగం భాగంలో ప్రవేశించగా, ప్రకాశరూపమైన పగలు, చీకటిరూపమైన తమస్సు క్రమంగా జలప్రవేశం చేస్తాయి.

**ఆతామ్రా హి భవన్త్యాపో దివా నక్తప్రవేశనాత్ ।**
**దినం విశతి చైవామ్భో భాస్కరేఽస్తముపేయుషి ।**
**తస్మాచ్ఛుక్లీభవన్త్యాపో నక్తమహ్నః ప్రవేశనాత్ ॥ 25 ॥**

పగటివేళ నీళ్లు కొంచెం ఎఱ్ఱగా ఉంటాయి. దానికి కారణం రాత్రి తమలో ప్రవేశించి ఉన్నందున జలాలు ఆ రంగులో ఉంటాయి. అలాగే సూర్యుడు అస్తమించగానే పగలు నీటిలో ప్రవేశిస్తుంది. ఆ కారణంచే నీళ్లు రాత్రి తెల్లగా ఉంటాయి.

**ఏవం పుష్కరమధ్యే తు యదా యాతి దివాకరః ।**
**త్రింశద్భాగన్తు మేదిన్యాస్తదా మౌహూర్తికీ గతిః ॥ 26 ॥**

ఈ విధంగా సూర్యుడు పుష్కర ద్వీపం యొక్క మధ్యభాగంలోకి వెళ్లేసరికి భూమియొక్క ముప్పైవంతుల భాగాన్ని అతిక్రమిస్తాడు. ఆ సమయం సూర్యగమనానికి ఒక ముహూర్తకాలం పడుతుంది.

**కులాలచక్రపర్యన్తో భ్రమన్నేష దివాకరః ।**
**కరోత్యహస్తథా రాత్రిం విముంచేన్మేదినీం ద్విజ! ॥ 27 ॥**

ద్విజోత్తమా! ఇట్లు దివాకరుడు కుమ్మరిచక్రంపై వలె తిరుగుతూ, పగలునూ, రాత్రిని కలుగజేస్తూ భూమిని దాటిపోతాడు.

**అయనస్యోత్తరస్యాదౌ మకరం యాతి భాస్కరః ।**
**తతః కుమ్భం చ మీనం చ రాశే రాశ్యన్తరం ద్విజ! ॥ 28 ॥**

ద్విజప్రవరా! భాస్కరుడు ఉత్తరాయణం యొక్క ప్రారంభంలో మకరరాశిలో ప్రవేశిస్తాడు. అటుపిమ్మట కుంభమీనరాశులలో ఒక రాశినుంచి మరోరాశికి ప్రవేశిస్తాడు.

**త్రిష్వేతేష్వథ భుక్తేషు తతో వైషువతీం గతిమ్ ।**
**ప్రయాతి సవితా కుర్వన్నహోరాత్రం తతః సమమ్ ।**
**తతో రాత్రిః క్షయం యాతి వర్ధతేఽనుదినం దినమ్ ॥ 29 ॥**

ఈ మూడురాశులు ఈ విధంగా భుక్తములయ్యేసరికి సవితకు విషువద్గమనం ఏర్పడుతుంది. అపుడు పగలు, రాత్రి సమానమవుతాయి. అనంతరం రాత్రి సమయం తరుగుతుంది. పగటి సమయం పెరుగుతుంది.

**తతశ్చ మిథునస్యాన్తే పరాకాష్ఠాముపాగతః ।**
**రాశిం కర్కటకం ప్రాప్య కురుతే దక్షిణాయనమ్ ॥ 30 ॥**

అటుపిమ్మట మేషరాశిని, వృషభరాశిని దాటి మిథునరాశి చివరకు అనగా ఉత్తరాయణం యొక్క చివరి హద్దుకు వస్తాడు. తరవాత కర్కటకరాశిలో ప్రవేశించి దక్షిణాయన ప్రారంభం చేస్తాడు.

**కులాలచక్రపర్యన్తో యథా శీఘ్రం ప్రవర్తతే ।**
**దక్షిణే ప్రక్రమే సూర్యస్తథా శీఘ్రం ప్రవర్తతే ॥ 31 ॥**

కుమ్మరిసారె చివరనున్న జీవుడు ఏ విధంగా వేగంగా తిరుగుతాడో, దక్షిణాయనంలో సూర్యుడు అదే విధంగా వేగంగా తిరుగుతాడు.

**అతివేగితయా కాలం వాయువేగబలాచ్చరన్ ।**
**తస్మాత్ ప్రకృష్టాం భూమిన్తు కాలేనాల్పేన గచ్ఛతి ॥ 32 ॥**

మిక్కిలి వేగగమనంతో వాయువేగంయొక్క బలంతో సంచరిస్తూ సూర్యనారాయణుడు ఉత్కృష్టమార్గంలో భూమిని అల్పకాలంతో దాటుతాడు.

**సూర్యో ద్వాదశభిః శైఘ్ర్యాన్ ముహూర్తై ర్దక్షిణాయనే ।**
**త్రయోదశార్ధమృక్షాణామహ్నే తు చరతి ద్విజ! ।**
**ముహూర్తైస్తావదృక్షాణి నక్తమష్టాదశైశ్చరన్ ॥ 33 ॥**

ద్విజోత్తమా! సూర్యుడు దక్షిణాయనంలో పగటి సమయంలో వేగగమనంతో పండ్రెండు ముహూర్తాలకాలంలో పదమూడున్నర నక్షత్రాలను దాటిపోతాడు. రాత్రి సమయంలో అన్నే పదమూడున్నర నక్షత్రాలను పద్దెనిమిది ముహూర్తాలకాలంలో దాటుతాడు.

**కులాలచక్రమధ్యస్థో యథా మన్దం ప్రసర్పతి ।**
**తథోదగయనే సూర్యః సర్పతే మన్దవిక్రమః ॥ 34 ॥**

కుమ్మరిసారె నడుమనున్న జీవుడు ఎలా మెల్లగా తిరుగుతాడో, అలా ఉత్తరాయణంలో సూర్యుడు మెల్లనైన నడకతో సంచారం చేస్తాడు.

**తస్మాద్ దీర్ఘేణ కాలేన భూమిమల్పాం తు గచ్ఛతి ।**
**అష్టాదశముహూర్తం యదుత్తరాయణ పశ్చిమమ్ ।**
**అహర్భవతి తచ్చాపి చరతే మన్దవిక్రమః ॥ 35 ॥**

ఆ కారణంచే ఎక్కువ సమయంలో అల్పభూమిని నెమ్మదిగా అతిక్రమిస్తాడు. అందువల్ల ఉత్తరాయణం చివరి సమయంలో పగటికాలం పద్దెనిమిది ముహూర్తాలు అవుతుంది. (అనగా 14 గంటలు 24 ని॥ కాలం) అప్పుడు కూడా సూర్యుడు మందగమనంతోనే సంచరిస్తాడు.

**త్రయోదశార్ధమహ్నే తు ఋక్షాణాం చరతే రవిః ।**
**ముహూర్తైస్తావదృక్షాణి రాత్రౌ ద్వాదశభిశ్చరన్ ॥ 36 ॥**

రవి పగటి సమయంలో జ్యోతిశ్చక్రంలో పదమూడున్నర నక్షత్రాలను అతిక్రమిస్తాడు. అదేవిధంగా రాత్రిసమయంలో అదే సంఖ్యగల పదమూడున్నర నక్షత్రాలను పంద్రెండు ముహూర్తాల సమయంలో అధిగమిస్తాడు (అనగా 9 గంటల 36 ని॥ కాలం).

**అతో మన్దతరం నాభ్యాం చక్రం భ్రమతి వై యథా ।**
**మృత్పిణ్డ ఇవ మధ్యస్థో ధ్రువో భ్రమతి వై తథా ॥ 37 ॥**

కాబట్టి చక్రం (కుమ్మరిసారె) నాభియందు (కుంచంవద్ద) మిక్కిలి నెమ్మదిగా తిరిగినట్లు, అక్కడ మధ్యలో ఉన్న మట్టిముద్దలాగే జ్యోతిశ్చక్రం మధ్యలో ఉన్న ధ్రువుడు కూడ నెమ్మదినెమ్మదిగా తిరుగుతాడు.

**కులాలచక్రనాభిస్తు యథా తత్రైవ వర్తతే ।**
**ధ్రువస్తథా హి మైత్రేయ! తత్రైవ పరివర్తతే ॥ 38 ॥**

మైత్రేయా! కుమ్మరిచక్రంయొక్క నాభి ఏ విధంగా అక్కడే ఉంటుందో, అదే విధంగా ధ్రువుడు కూడ అక్కడే తిరుగుతూ ఉంటాడు.

**ఉభయోః కాష్ఠయోర్మధ్యే భ్రమతో మణ్డలాని తు ।**
**దివా నక్తం చ సూర్యస్య మన్దా శీఘ్రా చ వై గతిః ॥ 39 ॥**

ఈ విధంగా ఉత్తరదక్షిణాల రెండింటి హద్దుల మధ్య మండలాకారంగా పరిభ్రమిస్తూ ఉండే సూర్యగమనం పగలూ, రాత్రి వేగంగానో, మందంగానో ఉంటూ ఉంటుంది.

**మన్దాహ్ని యస్మిన్నయనే శీఘ్రా నక్తం తదా గతిః ।**
**శీఘ్రా నిశి యదా చాస్య తదా మన్దా దివా గతిః ॥ 40 ॥**

ఏ అయనంలో సూర్యగమనం పగలు మందంగా ఉంటుందో, ఆ సమయంలో రాత్రివేళ గమనం వేగంగా ఉంటుంది. పగటివేళ గమనం వేగంగా ఉంటే, రాత్రి సూర్యగతి మెల్లగా ఉంటుంది.

**ఏక ప్రమాణమేవైష మార్గం యాతి దివాకరః ।**
**అహో రాత్రేణ యో భుంక్తే సమస్తా రాశయో ద్విజ! ॥ 41 ॥**

ద్విజోత్తమా! ఈ దివాకరుడు ఎల్లప్పుడూ ఒకే ప్రమాణం గల మార్గంలో పయనిస్తాడు. ఒక రాత్రి, ఒక పగలు కలిస్తే ఉండే రోజువేళలో పంద్రెండు రాశులను అతిక్రమిస్తాడు (భోగిస్తాడు.)

**షడేవ రాశీన్ యో భుంక్తే రాత్రావన్యాంశ్చ షడ్ దివా ।**
**రాశిప్రమాణజనితా దీర్ఘహ్రస్వాత్మతా దినే ।**
**తథా నిశాయాం రాశీనాం ప్రమాణై ర్లఘుదీర్ఘతా ॥ 42 ॥**

సూర్యుడు పగటివేళ ఆరురాశులను, రాత్రిసమయంలో మిగిలిన ఆరురాశులను భోగిస్తాడు. రాశియొక్క ప్రమాణాన్ని బట్టి పగటికి పొడవూ, కురుచా ఏర్పడతాయి. అదే విధంగా రాశిప్రమాణాన్ని అనుసరించి రాత్రికి కూడ హ్రస్వదీర్ఘాలు వస్తాయి.

**దినాదే ర్దీర్ఘహ్రస్వత్వం తద్భోగేనైవ జాయతే ।**
**ఉత్తరే ప్రక్రమే శీఘ్రా నిశిమన్దా గతిర్దివా ।**
**దక్షిణే త్వయనే చైవ విపరీతా వివస్వతః ॥ 43 ॥**

ఈ విధంగా రాశి భోగాన్ని బట్టి దినాదులకు దీర్ఘహ్రస్వత్వాలు సంభవిస్తాయి. ఉత్తరాయణకాలంలో సూర్య గమనం పగలు మందం. రాత్రివేగం. దక్షిణాయనకాలంలో ఇది వ్యతిరేకం అనగా పగలు వేగం, రాత్రి మందం.

**ఉషా రాత్రిః సమాఖ్యాతా వ్యుష్టిశ్చాప్యుచ్యతే దినమ్ ।**
**ప్రోచ్యతే చ తథా సన్ధ్యా ఉషావ్యుష్ట్యోర్యదన్తరమ్ ॥ 44 ॥**

రాత్రి ఉష అని చెప్పబడుతుంది. పగటినికూడ వ్యుష్టి అని అంటారు. ఉషావ్యుష్టుల మధ్యకాలాన్ని సంధ్య అని అంటారు.

వి ॥ ఉషాస్యాద్రజనీశేషే ఉష ఇత్యపి దృశ్యతే-అని రభసుడు
విగతా ఉష్టిః వ్యథా అస్యా ఇతి వ్యుష్టిః-వ్యథ లేదిది.
సమ్యక్ ధ్యాయంతి అస్యామితి సంధ్యా-దీనియందు లెస్సగా ధ్యానం చేస్తారు.

**సన్ధ్యాకాలే తు సంప్రాప్తే రౌద్రే పరమదారుణే ।**
**మన్దేహా రాక్షసా ఘోరాః సూర్యమిచ్ఛన్తి ఖాదితుమ్ ॥ 45 ॥**

మిక్కిలి భయంకరమైనట్టి ఘోరమైన సంధ్యాకాలం సమీపించగానే, మందేహులు అనే ఘోర రాక్షసులు సూర్యుని భక్షించడానికై ప్రయత్నిస్తారు. (అనగా సూర్యగమనానికి అడ్డు తగలబోతారు.)

**ప్రజాపతి కృతశ్శాపస్తేషాం మైత్రేయ! రక్షసామ్ ।**
**అక్షయత్వం శరీరాణాం మరణం చ దినే దినే ॥ 46 ॥**

మైత్రేయా! ఆ మందేహాదిరాక్షసులకు "రోజురోజుకు మరణం. అక్షయమైన శరీరం" అని ప్రజాపతిచే ఈయబడిన శాపం ఒకటి ఉంది.

**తతః సూర్యస్య తైర్యుద్ధం భవత్యత్యన్తదారుణమ్ ।**
**తతో ద్విజోత్తమాస్తోయం యత్ క్షిపన్తి మహామునే! ॥ 47 ॥**

మహామునీ! ఆ కారణంచే సూర్యున కయితే వారితో మిక్కిలి భయంకరమైన యుద్ధం జరుగుతుంది. అందువల్ల ద్విజశ్రేష్ఠులు జలం చల్లుతారు. (అర్ఘ్యం సమర్పిస్తారు.)

**ఓంకార బ్రహ్మసంయుక్తం గాయత్ర్యా చాభిమన్త్రితమ్ ।**
**తేన దహ్యన్తి తే పాపా వజ్రభూతేన వారిణా ॥ 48 ॥**

గాయత్రితో అభిమంత్రించి ఓంకార బీజయుక్తమైన బ్రహ్మసహితమైన నీరు చల్లుతారు. వజ్రంలా అయిన ఆ జలాలతో ఆ పాపాత్ములయిన రాక్షసులు దగ్ధమయిపోతారు.

**అగ్నిహోత్రే హూయతే యా సమన్త్రా ప్రథమాహుతిః ।**
**సూర్యో జ్యోతిః సహస్రాంశుస్తయా దీప్యతి భాస్కరః ॥ 49 ॥**

అగ్నిహోత్రంలో "సూర్యో జ్యోతిః" ఇత్యాది మంత్రంతో కూడుకొన్న ప్రథమాహుతిని హోమం చేయగానే భాస్కరుడు సహస్రకిరణుడై తత్కాంతితో ప్రకాశించి దేదీప్యమానమవుతాడు.

**ఓంకారో భగవాన్ విష్ణుస్త్రిధామా వచసాం పతిః ।**
**తదుచ్చారణతస్తే తు వినాశం యాన్తి రాక్షసాః ॥ 50 ॥**

ఓంకారం జాగ్రత్స్వప్నసుషుప్తిరూప త్రిధామ స్వరూపం. అది సమస్తవేదవాక్కులకు అధిపతి. ఓంకారం భగవంతుడైన విష్ణువు యొక్క నిర్గుణస్వరూపం. అట్టి ఓంకారం ఉచ్చరించబడినంత మాత్రంచేతనే ఆ రాక్షసులు నాశనం పొందుతారు.

**వైష్ణవోంఽశః పరం సూర్యో యోఽన్తర్జ్యోతిరసంప్లవమ్ ।**
**అభిధాయక ఓంకారస్తస్య తత్ప్రేరకః పరః ॥ 51 ॥**

విష్ణువుయొక్క పరమోత్కృష్టమైన అంశమే సూర్యుడు. ఆయనే అంతర్జ్యోతి. ఆయన ఏ వికారం లేనివాడు. ఆయనను గూర్చి చెప్పేదే ఓంకారం. అదే ఆయనకు ఉత్తమమయిన ప్రేరణను ఇచ్చేది.

**తేన సంప్రేరితం జ్యోతిరోంకారేణాఽథ దీప్తిమత్ ।**
**దహత్యశేషరక్షాంసి మన్దేహాఖ్యాని తాని వై ॥ 52 ॥**

ఆ ఓంకారంచే ప్రేరేపించబడే జ్యోతిస్సు మిక్కిలి దీప్తిమంతమై "మందేహులు" అనబడే సమస్త రాక్షసులను దహించి వేస్తుంది.

**తస్మాన్నోల్లంఘనం కార్యం సన్ధ్యోపాసనకర్మణః ।**
**స హన్తి సూర్యం సన్ధ్యాయాం నోపాస్తిం కురుతే తు యః ॥ 53 ॥**

కాబట్టి సంధ్యోపాసనమనే కర్మను ఎన్నడూ ఉల్లంఘించకూడదు. సంధ్యాకాలంలో ఉపాసన చేయనివాడు సూర్యుని వధించిన వాడవుతున్నాడు. (అనగా సూర్యునకు హాని చేసిన వాడవుతున్నాడు.)

**తతః ప్రయాతి భగవాన్ బ్రాహ్మణైరభిరక్షితః ।**
**వాలఖిల్యాదిభిశ్చైవ జగతః పాలనోద్యతః ॥ 54 ॥**

వాలఖిల్యాది మహర్షులచేతను, బ్రాహ్మణులు అభిమంత్రించిన జలాలచేతను సురక్షితుడైన సూర్యభగవానుడు మందేహాది రాక్షస సంహారానంతరం జగత్తును పరిపాలించే ప్రయత్నంతో పూనిక వహిస్తాడు.

### కాలగణనం

**కాష్ఠా నిమేషా దశపంచ చైవ**
**త్రింశచ్చ కాష్ఠా గణయేత్ కలాం చ ।**

**త్రింశత్కలాశ్చైవ భవేన్ముహూర్త**
**స్త్రైస్త్రింశతా రాత్ర్యహనీ సమేతే ॥ 55 ॥**

ఒక రెప్పపాటు కాలాన్ని ఒక నిమేషం అంటారు. అట్టి పదిహేను నిమేషాల కాలం ఒక కాష్ఠ అవుతుంది. ముప్పైకాష్ఠల కాలాన్ని ఒక కళగా లెక్కిస్తారు. ముప్పైకళల కాలం ఒక ముహూర్తం అవుతుంది. అట్టి ముప్పై ముహూర్తాల కాలం ఒక రాత్రి ఒక పగలు కలిపిన దినం (అహోరాత్రం) అవుతుంది.

వి ॥ ముహూర్తం అనగా 48ని॥ అని, 30×48= 1440ని॥ ఒక రోజు అని, అనగా గంటకు 60ని॥ అని, 24గం॥ కాలం ఒక రోజని నేటి గణన.

**హ్రాసవృద్ధీ త్వహర్భాగై ర్దివసానాం యథాక్రమమ్ ।**
**సన్ధ్యాముహూర్తమాత్రా వై హ్రాసవృద్ధ్యోః సమా స్మృతా ॥ 56 ॥**

పగటియొక్క పెరుగు, తరుగు దినభాగాలతో సహితంగా యథాక్రమంగా ఉంటాయి. సంధ్యమాత్రం పెరుగు తరుగులలో సమానంగా ముహూర్తకాలం మాత్రమే ఉంటుంది.

**లేఖాత్ ప్రభృత్యథాదిత్యే త్రిముహూర్తగతే తు వై ।**
**ప్రాతః స్మృత స్తతః కాలో భాగశ్చాప్హ్నః స పంచమః ॥ 57 ॥**

సూర్యగమనరేఖా సమయం మొదలుకొని (అనగా సూర్యోదయారంభం నుండి) మూడు ముహూర్తాలు గడిచే కాలాన్ని ప్రాతఃకాలం అంటారు. అది పగటి సమయంలో ఐదవవంతుకాలం అవుతుంది.

**తతః ప్రాతస్తనాత్ కాలాత్ త్రిముహూర్తస్తు సంగవః ।**
**మధ్యాహ్నస్త్రిముహూర్తస్తు తస్మాత్ కాలాత్తు సంగవాత్ ॥ 58 ॥**

అటు తరువాత ప్రాతఃకాలం గడచిన పిమ్మట మూడు ముహూర్తాల కాలాన్ని సంగవం అంటారు. ఆ సంగవకాలం దాటిన తరవాత మూడు ముహూర్తాల కాలాన్ని మధ్యాహ్నం అంటారు.

**తస్మాన్మాధ్యాహ్నికాత్ కాలాదపరాహ్ణ ఇతి స్మృతః ।**
**త్రయ ఏవ ముహూర్తాస్తు కాలభాగః స్మృతో బుధైః ।**
**అపరాహ్ణే వ్యతీతే తు కాలః సాయాహ్న ఏవ చ ॥ 59 ॥**

ఆ మధ్యాహ్నకాలం గడచిన తరువాత కాలాన్ని అపరాహ్ణం అంటారు. అది కూడ మూడు ముహూర్తాల కాలంగా బుధులచే భావించబడింది. ఆ అపరాహ్ణకాలం దాటిన తరువాతి కాలాన్ని సాయాహ్నం అంటారు.

**దశ పంచ ముహూర్తా వై ముహూర్తాస్త్రయ ఏవ చ ।**
**దశపంచముహూర్తం వై అహర్వైషువతం స్మృతమ్ ॥ 60 ॥**

ఆ సాయాహ్నం కూడ మూడు ముహూర్తాలే. ఈ విధంగా ప్రాతఃకాలం, సంగవం, మధ్యాహ్నం, అపరాహ్ణం, సాయాహ్నం అని ఒక్కొక్కటి మూడు ముహూర్తాల వంతున ఒక నిండు పగటికి పదిహేను ముహూర్తాలు సమయం అవుతుంది. ఈ విధంగా పదిహేను ముహూర్తాల సమయం కల పూర్తిపగలును 'వైషువతం' అంటారు.

వి ॥ అనగా 15×48=720ని॥ (720÷60=12 గం॥ కాలం)

**వర్ధతే హ్రసతే చైవాప్యయనే దక్షిణోత్తరే ।**
**అహస్తు గ్రసతే రాత్రిం రాత్రిర్గ్రసతి వాసరమ్ ॥ 61 ॥**

కాని ఉత్తరాయణ దక్షిణాయనములందు క్రమంగా దానికి వృద్ధి, క్షీణత గోచరిస్తాయి. ఉత్తరాయణంలో పగలు రాత్రిని, దక్షిణాయనంలో రాత్రి పగలునూ గ్రసిస్తాయి. (మ్రింగివేస్తాయి.)

**శరద్వసన్తయోర్మధ్యే విషువన్తు విభావ్యతే ।**
**తులామేషగతే భానౌ సమరాత్రిదినన్తు తత్ ॥ 62 ॥**

శరత్కాలంమధ్యలో భానుడు తులారాశిలో ప్రవేశించినప్పుడు, వసంతకాలం మధ్యలో మేషరాశిలో ప్రవేశించినప్పుడు "విషువత్పుణ్యకాలం"గా సంభావించబడుతుంది. ఆ నాడు రాత్రి, పగలు సమానంగా ఉంటాయి.

**కర్కటావస్థితే భానౌ దక్షిణాయనముచ్యతే ।**
**ఉత్తరాయణమప్యుక్తం మకరస్థే దివాకరే ॥ 63 ॥**

భానుడు కర్కటరాశిలో ప్రవేశిస్తే దక్షిణాయనం అనబడుతుంది. దివాకరుడు మకరరాశిలో ప్రవేశిస్తే ఉత్తరాయణం అని చెప్పబడుతుంది.

**త్రింశన్ముహూర్తం కథితమహోరాత్రం తు యన్మయా ।**
**తాని పంచదశ బ్రహ్మన్ ! పక్ష ఇత్యభిధీయతే ॥ 64 ॥**

బ్రాహ్మణోత్తమా! ముప్పైముహూర్తాల కాలం ఒక అహోరాత్రమవుతుందని నాచే చెప్పబడింది కదా! అటువంటి పదిహేను అహోరాత్రాలు ఒక పక్షమని వ్యవహరించబడుతుంది.

**మాసః పక్షద్వయేనోక్తో ద్వౌ మాసౌ చార్కజావృతుః ।**
**ఋతుత్రయం చాప్యయనం ద్వేఽయనే వర్షసంజ్ఞితమ్ ॥ 65 ॥**

రెండుపక్షాలు ఒక మాసం అని చెప్పబడుతుంది. రెండు సౌరమాసాలు ఒక ఋతువు. మూడు ఋతువులు ఒక అయనం. రెండు అయనాలు ఒక వర్షం అని చెప్పబడుతుంది.

వి ॥ సౌరమానం, చాంద్రమానం, సావనమానం, నక్షత్రమానం–అనే నాలుగు విధాలుగా కాలగణన జరుగుతూ ఉంటుంది.

**సంవత్సరాదయః పంచ చతుర్మాసవికల్పితాః ।**
**నిశ్చయః సర్వకాలస్య యుగమిత్యభిధీయతే ॥ 66 ॥**

సౌర, సావన, చాంద్ర, నక్షత్రమాసానుసారంగా వివిధ రూపాలుగా సంవత్సరం మున్నగు ఐదు విధాలైన నామాలతో కాలగణన చేయబడుతూ ఉంటుంది. యుగపరిగణనే అన్ని విధాలైన కాలగణనలకు నిశ్చయప్రమాణంగా చెప్పబడుతోంది.

**సంవత్సరస్తు ప్రథమో ద్వితీయః పరివత్సరః ।**
**ఇద్వత్సరః తృతీయస్తు చతుర్థశ్చానువత్సరః ।**
**వత్సరః పంచమశ్చాత్ర కాలో౽యం యుగసంజ్ఞితః ॥ 67 ॥**

ఈ అయిదు విధాలైన గణనలో మొదటిది సంవత్సరం, రెండోది పరివత్సరం, మూడోది ఇద్వత్సరం, నాలుగోది అనువత్సరం, అయిదోది వత్సరం. ఈ కాలానికే యుగం అనిపేరు.

వి॥ సూర్యుడు ఒకరాశినుండి మరోరాశి లోనికి మారే రోజును బట్టి సౌరమాసం. యజ్ఞాదులలో ఒక అహోరాత్రాన్ని ఒకరోజుగా లెక్కించి సూర్యచంద్రులు కలిసి ఉన్న 'దర్శ' నుండి దర్శవరకు లెక్కించే మాసం సావనమాసం. తిథిని బట్టి లెక్కించే మాసం చాంద్రమాసం. అనగా పాడ్యమినుండి అమావాస్యవరకు చాంద్రమాసం. కృత్తికా నక్షత్రంతో ప్రారంభించి లెక్కించే మాసం నాక్షత్రమాసం. ఈ నాలుగు మాసాలను అనుసరించి నాలుగు విధాలైన మాసాలు, ఒకనాడేప్రారంభం.

అయితే ఈ నాలుగు ఒకేసారి పూర్తి అయ్యే కాలానికి యుగం అనిపేరు. ఈ అయిదు సంవత్సరాల ఆరంభంలో సూర్యచంద్రయోగం ఉంటూ ఈ నాలుగు విధాలమానం పూర్తి అయ్యేసరికి ఐదు సంవత్సరాల కాలం పడుతుంది. అయిదూ సంవత్సరం, పరివత్సరం, ఇద్వత్సరం, అనువత్సరం, వత్సరం అని పిలవబడతాయి.

### విషువద్విషయం

**యః శ్వేతస్యోత్తరః శైలః శృంగవానితి విశ్రుతః ।**
**త్రీణి తస్య తు శృంగాణి యైరసౌ శృంగవాన్ స్మృతః ॥ 68 ॥**

శ్వేతవర్షానికి ఉత్తర దిశలో "శృంగవంతం" అని చెప్పబడే ఒక ప్రసిద్ధశైలం ఉంది. ఆ పర్వతానికి మూడు శృంగాలు, ఆ శృంగాలను బట్టి దానికి శృంగవంతం అనేపేరు సార్థకమయింది.

**దక్షిణం చోత్తరం చైవ మధ్యం వైషువతం తథా ।**
**శరద్వసన్తయోర్మధ్యే తద్భానుః ప్రతిపద్యతే ॥ 69 ॥**

వాటిలో ఒక శృంగం ఉత్తరం లోను, ఒక శృంగం దక్షిణంలోను ఉన్నాయి. మధ్యలో ఉన్న శృంగమే "వైషువతం". శరత్కాల వసంతకాల మధ్య సమయాలలో సూర్యుడు దాని పైకి వస్తాడు.

**మేషాదౌ చ తులాదౌ చ మైత్రేయ విషువత్ స్థితః ।**
**తదా తుల్యమహోరాత్రం కరోతి తిమిరాపహః ।**
**దశపంచముహూర్తం వై తదేతదుభయం స్మృతమ్ ॥ 70 ॥**

మైత్రేయా! చీకట్లను పటాపంచలు చేసే సూర్యుడు మేషరాశియొక్క ఆరంభంలోను, తులారాశియొక్క ప్రారంభంలోను "విషువత్తు" అనే శృంగంపై ఉన్నవాడై అహోరాత్రాలను సమం చేస్తాడు. అపుడు పగలు, రేయి రెండింటికి కూడా పదిహేను ముహూర్తాల కాలం సమానంగా ఉంటుంది.

**ప్రథమే కృత్తికాభాగే యదా భాస్వాంస్తదా శశీ ।**
**విశాఖానాం చతుర్థేఽంశే మునే! తిష్ఠత్యసంశయమ్ ॥ 71 ॥**

మునీశ్వరా! కృత్తికా నక్షత్రంయొక్క మొదటిపాదంలో (మేషరాశి చివర) సూర్యభగవానుడుఉన్నప్పుడు, చంద్రుడు విశాఖా నక్షత్రం యొక్క నాల్గవపాదంలో (వృశ్చికరాశి మొదట) నిస్సందేహంగా ఉంటాడు.

**విశాఖానాం యదా సూర్యశ్చరత్యంశం తృతీయకమ్ ।**
**తదా చన్ద్రం విజానీయాత్ కృత్తికా శిరసి స్థితమ్ ॥ 72 ॥**

సూర్యుడు విశాఖా నక్షత్రం యొక్క మూడవపాదంలో (తులారాశి చివర) ఉన్నప్పుడు, చంద్రుడు కృత్తికా నక్షత్ర ప్రథమ పాదంలో (మేషరాశిచివర) ఉంటాడని గ్రహించవలసి ఉంది.

**తదైవ విషువాఖ్యో వై కాలః పుణ్యోఽభిధీయతే ।**
**తదా దానాని దేయాని దేవేభ్యః ప్రయతాత్మభిః ॥ 73 ॥**

**బ్రాహ్మణేభ్యః పితృభ్యశ్చ ముఖమేతత్తు దానజమ్ ।**
**దత్తదానస్తు విషువే కృతకృత్యోఽభిజాయతే ॥ 74 ॥**

అప్పుడే ఆ పుణ్యకాలమే "విషువం" అనబడుతుంది. అపుడు నియతమనస్కులై దేవతలకు, బ్రాహ్మణులకు, పితృదేవతలకు దానాలు చేయాలి. ఈ పుణ్యకాలం దానం స్వీకరించడానికి వారికి ముఖం వంటిది. ఈ విషువంలో దానాలు చేసినవాడు కృతకృత్యుడవుతాడు(తానుచేసిన దానఫలం పొందినవాడు అవుతాడు.)

**అహోరాత్రార్ధమాసౌ తు కలాకాష్ఠాక్షణాస్తథా ।**
**పౌర్ణమాసీ తథా జ్ఞేయా అమావస్యా తథైవ చ ।**
**సినీవాలీ కుహూశ్చైవ రాకా చానుమతిస్తథా ॥ 75 ॥**

యుగాదికాలనిర్ణయంలో పగలు, రాత్రి, పక్షం, కల, కాష్ఠ, క్షణం, పౌర్ణమాసి, అమావాస్య ముఖ్యంగా తెలియదగినవి. పౌర్ణమాసి రాక, అనుమతి అని రెండువిధాలని, అమావాస్య సినీవాలి, కుహు అని రెండువిధాలని మున్నగునవన్నీ తెలుసుకోవాలి.

**తపస్తపస్యౌ మధుమాధవౌ చ**
**శుక్రః శుచిశ్చాయనముత్తరం స్యాత్ ।**
**నభో నభస్యోఽథ ఇషశ్చ సోర్జః**
**సహః సహస్యావితి దక్షిణం స్యాత్ ॥ 76 ॥**

మాఘఫాల్గుణాలు, చైత్రవైశాఖాలు, జ్యేష్ఠాషాఢాలు–ఈ ఆరుమాసాలు ఉత్తరాయణం అవుతుంది. శ్రావణ భాద్రపదాలు, ఆశ్వినకార్తికమాసాలు, మార్గశిరపుష్యాలు. ఈ ఆరుమాసాలు దక్షిణాయనం అవుతుంది.

**లోకాలోకశ్చ యః శైలః ప్రాగుక్తో భవతో మయా ।**
**లోకపాలాస్తు చత్వారస్తత్ర తిష్ఠన్తి సువ్రతాః ॥ 77 ॥**

లోకాలోకపర్వతం గురించి మైత్రేయా! ఇదివరకు నాచే నీకు చెప్పబడింది కదా! ఆ శైలంపై నియమవ్రత శీలురై నలుగురు లోకపాలురు ఉంటారు.

**సుధామా శంఖపాచ్చైవ కర్దమస్యాత్మజో ద్విజ! ।**
**హిరణ్యరోమా చైవాన్యశ్చతుర్థః కేతుమానపి ॥ 78 ॥**

ద్విజోత్తమా! వారు సుధాముడు, కర్దముని కుమారుడైన శంఖపాదుడు, మరొకడు హిరణ్యరోముడు, నాల్గవవాడు కేతుమంతుడు అనేవారు.

**నిర్ద్వన్ద్వా నిరభీమానా నిస్తన్ద్రా నిష్పరిగ్రహాః ।**
**లోకపాలాః స్థితా హ్యేతే లోకాలోకే చతుర్దిశమ్ ॥ 79 ॥**

ఈ నలుగురు లోకపాలురు ద్వంద్వాలకు అతీతులు. దేహాభిమానం లేనివారు. ఏ అలసత్వం లేనివారు. పరిగ్రహం చేయనివారు. వీరు లోకాలోకపర్వతం మీద నలువైపులా ఉంటారు.

**ఉత్తరం యదగస్త్యస్య అజవీథ్యాశ్చ దక్షిణమ్ ।**
**పితృయానః స వై పన్థా వైశ్వానరపథాద్బహిః ॥ 80 ॥**

అగస్త్యునకు ఉత్తరంగా, అజవీథికి దక్షిణంగా, వైశ్వానరమార్గానికి (మృగవీథికి) వెలుపలగా పితృయానమనే మార్గం ఉంది.

**తత్రాసతే మహాత్మాన ఋషయో యేఽగ్నిహోత్రిణః ।**
**భూతారమ్భకృతం బ్రహ్మ శంసన్తో ఋత్విగుద్యతాః ॥ 81 ॥**

**ప్రారభన్తే తు యే లోకాస్తేషాం పన్థాః స దక్షిణః ।**
**చలితం తే పునర్బ్రహ్మ స్థాపయన్తి యుగే యుగే ॥ 82 ॥**

ఈ పితృయానమార్గంలో అగ్నిహోత్రులు, మహాత్ములు అయిన ఋషిజనాలు నివసిస్తారు. వారు ప్రాణిసృష్టి కారణమైన వేదాన్ని స్తుతిస్తూ ఉంటారు. వారు ఋత్విగ్భాగంతో యజ్ఞానుష్ఠానానికి సన్నద్ధులై యజ్ఞారంభం చేస్తూ ఉంటారు. వారిది దక్షిణమార్గం. వారు ప్రతియుగంలోను సడలిపోయిన వేదాన్ని స్థాపిస్తారు.

**సన్తత్యా తపసా చైవ మర్యాదాభిః శ్రుతేన చ ।**
**జాయమానాస్తు పూర్వే చ పశ్చిమానాం గృహేషు వై ॥ 83 ॥**

వీరు సంతానం ద్వారా, తపస్సు ద్వారా, సదాచారాల ద్వారా, వేదశాస్త్రాధ్యయనం ద్వారా వేదాన్ని పునః స్థాపిస్తారు. పూర్వులైన వీరు తరువాతి వారి ఇండ్లలో జన్మిస్తూ ఉంటారు.

**పశ్చిమాశ్చైవ పూర్వేషాం జాయన్తే నిధనేష్విహ ।**
**ఏవమావర్తమానాస్తే తిష్ఠన్తి నియతవ్రతాః ।**
**సవితుర్దక్షిణం మార్గం శ్రితా హ్యాచన్ద్రతారకమ్ ॥ 84 ॥**

అలాగే తరువాతివారు మళ్లీ పూర్వుల ఇండ్లలో జన్మిస్తూ ఉంటారు. ఈ విధంగా ఆ నియతవ్రతులైనవారు సూర్యుని యొక్క దక్షిణమార్గంలో ఆచంద్రతారకంగా వస్తూ పోతూ (అనగా పుడుతూ, చనిపోతూ) పునరావృత్తి పూర్వకంగా ఉంటారు.

**నాగవీథ్యుత్తరం యచ్చ సప్తర్షిభ్యశ్చ దక్షిణమ్ ।**
**ఉత్తరః సవితుః పన్థా దేవయానశ్చ స స్మృతః ॥ 85 ॥**

నాగవీథికి ఉత్తరంగా, సప్తర్షులకు దక్షిణంగా సూర్యుని యొక్క (సవితయొక్క) ఉత్తరమార్గం ఉంది. అది దేవయానం అనబడుతుంది.

**తత్ర తే వశినః సిద్ధా విమలా బ్రహ్మచారిణః ।**
**సన్తతిం తే జుగుప్సన్తి తస్మాన్మృత్యుర్జితశ్చ తైః ॥ 86 ॥**

అక్కడ జితేంద్రియులైనవారు, సిద్ధులు పొందినవారు, నిర్మలమైన ఆత్మ కలవారు, బ్రహ్మచారులు ఉంటారు. వారు సంతానంపై అపేక్షలేక ఉంటారు. కాబట్టి వారు మృత్యువును జయించిన వారయ్యారు.

**అష్టాశీతిసహస్రాణాం మునీనామూర్ధ్వరేతసామ్ ।**
**ఉదక్పన్థానమర్యమ్ణః స్థితా హ్యాభూతసంప్లవమ్ ॥ 87 ॥**

సూర్యుని (అర్యముని) ఉత్తరమార్గంలో ఎనభై ఎనిమిది వేలమంది ఊర్ధ్వరేతస్కులైన మునీశ్వరులు ప్రళయంవరకూ ఉంటారు.

**తేఽసంప్రయోగాల్లోభస్య మైథునస్య చ వర్జనాత్ ।**
**ఇచ్ఛాద్వేషాప్రవృత్త్యా చ భూతారమ్భవివర్జనాత్ ॥ 88 ॥**

**పునశ్చాకామసంయోగాచ్ఛబ్దాదేర్దోషదర్శనాత్ ।**
**ఇత్యేభిః కారణైః శుద్ధాస్తేఽమృతత్వం హి భేజిరే ॥ 89 ॥**

ఏ విధమైన లోభంతోనూ సంసర్గం లేకపోవడం, మైథునం విడిచిపెట్టడం, ఇచ్ఛాద్వేషాల యందు ప్రవర్తించక పోవడం, కర్మాచరణ విడిచిపెట్టడం, కామవాసనలు లేకపోవడం, శబ్దాదివిషయాలపై దోషదృష్టిని ప్రదర్శించడం– అనే ఈ కారణాల వల్ల అత్యంతపరిశుద్ధులై వారు అమృతత్వాన్ని పొందారు.

**ఆభూతసంప్లవం స్థానమమృతత్వం హి భావ్యతే ।**
**త్రైలోక్యస్థితికాలోఽయమపునర్మార ఉచ్యతే ॥ 90 ॥**

ప్రలయం వరకూ ఉండడమనేదే అమృతత్వంగా భావింపబడుతుంది. మూడులోకాలు ఉన్నంతవరకు ఉండే కాలం పునరావృత్తిరహితం (పునర్మృత్యురహితం) అని చెప్పబడుతుంది.

**బ్రహ్మహత్యాఽశ్వమేధాభ్యాం పుణ్యపాపకృతో విధిః ।**
**ఆభూతసంప్లవాన్తం తత్ఫలముక్తం తయోర్ద్విజ! ॥ 91 ॥**

ద్విజోత్తమా! బ్రహ్మహత్యాపాపానికి, అశ్వమేధపుణ్యానికి వచ్చే రెండింటి ఫలితం ప్రలయాంతం వరకు ఉంటుంది.

**విష్ణుపదప్రాశస్త్యం**

**యావన్మాత్రే ప్రదేశే తు మైత్రేయావస్థితో ధ్రువః ।**
**క్షయమాయాతి తావత్తు భూమేరాభూతసంప్లవాత్ ॥ (వే) 92 ॥**

మైత్రేయా! ఎంతదూరంలో ఏ ప్రదేశంలో ధ్రువుడు ఉన్నాడో భూమినుంచి ఆ ప్రదేశపర్యంతం గల ప్రాంతమంతా ప్రలయకాలంలో (దైనందినప్రలయంలో) నాశనమవుతుంది.

**ఊర్ధ్వోత్తరమృషిభ్యస్తు ధ్రువో యత్ర వ్యవస్థితః ।**
**ఏతద్విష్ణుపదం దివ్యం తృతీయం వ్యోమ్ని భాస్వరమ్ ॥ 93 ॥**

సప్తర్షిమండలానికి ఉత్తరంగా ఊర్ధ్వంలో ధ్రువమండలం ఉన్న ప్రదేశం ఆకాశంలో పరమ తేజోమయమై ప్రకాశిస్తుంది. ఇది విష్ణుభగవానుని మూడవదైన దివ్యధామం.

**నిర్ధూతదోషపంకానాం యతీనాం సంయతాత్మనామ్ ।**
**స్థానం తత్ పరమం విప్ర! పుణ్యాపాపపరిక్షయే ॥ 94 ॥**

విప్రోత్తమా! పూర్తిగా తొలగింపబడిన (కడుగబడిన) దోషపంకం కలవారు, పుణ్యాపాపములు పూర్తిగా నశించినవారు, సంపూర్ణంగా ఇంద్రియాలను జయించి ఆత్మనిగ్రహం కలిగినవారు అయిన యతీశ్వరులు ఉండే పరమపదమది.

**అపుణ్యపుణ్యోపరమే క్షీణాశేషాప్తిహేతవః ।**
**యత్ర గత్వా న శోచన్తి తద్విష్ణోః పరమం పదమ్ ॥ 95 ॥**

పుణ్యములు, అపుణ్యములు నశించగా, దేహప్రాప్తికి చెప్పబడే సమస్తకారణాలు క్షీణించగా, అటువంటివారు వెళ్లి దుఃఖింపనిది విష్ణువు యొక్క పరమపదం.

**ధర్మధ్రువాద్యాస్తిష్ఠన్తి యత్ర తే లోకసాక్షిణః ।**
**తత్సాంఖ్యోత్పన్నయోగేంఽ గస్తద్విష్ణోః పరమం పదమ్ ॥ 96 ॥**

యోగంద్వారా పరమతేజస్వులై, పరమాత్మకు ఉన్నట్టి ఇంద్రియవశీకరణశక్తి కల ధర్ముడు, ధ్రువుడు మున్నగు లోకసాక్షులు నివసించే స్థానం విష్ణువు యొక్క పరమపదం.

**యత్రోతమేతత్ ప్రోతం చ యద్భూతం సచరాచరమ్ ।**
**భవ్యం చ విశ్వం మైత్రేయ! తద్విష్ణోః పరమం పదమ్ ॥ 97 ॥**

మైత్రేయా! పడుగూ, పేకగా అల్లుకొనిపోయి ఉన్న ఈ వర్తమానభూతభవిష్యచ్చరాచరప్రపంచమంతా జనించిన చోటు విష్ణువు యొక్క పరమపదం.

**దివీవ చక్షురాతతం యోగినాం తన్మయాత్మనామ్ ।**
**వివేకజ్ఞానదృష్టం చ తద్ విష్ణోః పరమం పదమ్ ॥ 98 ॥**

తన్మయాత్ములైన యోగీశ్వరేశ్వరులకు ఆకాశమండలంలో దేదీప్యమానమైన సూర్యనేత్రంలా, వివేకజ్ఞాన దృష్టికి గోచరమయ్యేదే, ఆ విష్ణువు యొక్క పరమపదం.

**యస్మిన్ ప్రతిష్ఠితో భాస్వాన్ మేఢీభూతః స్వయం ధ్రువః ।**
**ధ్రువే చ సర్వజ్యోతీంషి జ్యోతిష్వమ్భోముచో ద్విజ! ॥ 99 ॥**

**మేఘేషు సంగతా వృష్టి ర్వృష్టేః సృష్టేశ్చ పోషణమ్ ।**
**ఆప్యాయనం చ సర్వేషాం దేవాదీనాం మహామునే! ॥ 100 ॥**

ద్విజోత్తమా! మహామునీ! ఆ విష్ణుపదంలో అన్నింటికీ ఆధారభూతుడైన, పరమతేజస్వి అయిన ధ్రువుడు స్వయంగా ఏ ఆధారం లేక ఉన్నాడు. ఆ ధ్రువునిలో సర్వనక్షత్రాలు, ఆ నక్షత్రాలలో మేఘాలు, మేఘాలలో వర్షం, వర్షం వల్ల సృష్టి పోషణం, సర్వదేవతలయొక్క మానవులయొక్క–పరిపుష్టి ఉన్నాయి.

**తతశ్చా జ్యాహుతిద్వారా పోషితాస్తే హవిర్భుజః ।**
**వృష్టేః కారణతాం యాన్తి భూతానాం స్థితయే పునః ॥ 101 ॥**

అటుపైన ఆజ్యాహుతులద్వారా (నేతిచే చేయబడిన హోమాలద్వారా) ఆ అగ్నులు (దేవతలు) మరింత పోషించబడి, వర్షానికి, మరల ప్రాణులపోషణకు కారణం అవుతున్నారు.

**ఆధారభూతం లోకానాం త్రయాణాం వృష్టికారణమ్ ।**
**ఏవమేతత్ పదం విష్ణోస్తృతీయమమలాత్మకమ్ ॥ 102 ॥**

ఈరీతిగా ఈనిర్మలరూపమైన విష్ణువుయొక్క తృతీయపదం వర్షావిర్భావానికి కారణమై, మూడులోకాలకు ఆధారభూతమవుతుంది.

### ఆకాశగంగా ప్రస్తావన

**తతః ప్రవర్తతే బ్రహ్మన్! సర్వపాపహరా సరిత్ ।**
**గంగా దేవాంగనాంగానామనులేపనపింజరా ॥ 103 ॥**

బ్రాహ్మణోత్తమా! ఆ విష్ణుపదం నుంచి సమస్తపాపాలను పోగొట్టే గంగానది ఉద్భవించింది. ఆ గంగానది దేవాంగనల అంగరాగాల (మైపూత) లతో పాండురవర్ణం ధరించింది.

**వామపాదామ్బుజాంగుష్ఠనఖస్రోతోవినిర్గతామ్ ।**
**విష్ణోర్బిభర్తి యా భక్త్యా శిరసాఽహర్నిశం ధ్రువః ॥ 104 ॥**

విష్ణువుయొక్క ఎడమదైన పాదపద్మంయొక్క అంగుష్ఠంయొక్క గోటినుంచి ప్రవాహరూపంలో వెలువడిన ఆ నదిని ధ్రువుడు భక్తితో రేయింబవళ్లు శిరసా వహిస్తాడు.

**తతః సప్తర్షయో యస్యాః ప్రాణాయామపరాయణాః ।**
**తిష్ఠన్తి వీచిమాలాభి రుహ్యమానజటా జలే ॥ 105 ॥**

ఆ తరువాత ప్రాణాయామపరాయణులయిన సప్తర్షులు గంగాజలాలలో నిలిచి స్నానాలు చేస్తూ ఆ గంగాతరంగశ్రేణులను తమ జడల పంక్తులలో ధరిస్తూ ఉంటారు.

**వార్యోఘైః సన్తతైర్యస్యాః ప్లావితం శశిమణ్డలమ్ ।**
**భూయోఽధికతమాం కాన్తిం వహత్యేతదుపక్షయమ్ ॥ 106 ॥**

ఆ గంగానదియొక్క జలప్రవాహాలతో ఎల్లప్పుడూ తడిసి శశి(చంద్ర) మండలం క్షయానంతరం (కృష్ణపక్షమైన పిమ్మట) తిరిగి మరింత అధికమైన కాంతిని సంతరించుకొంటూ ఉంటుంది.

**మేరుపృష్ఠే పతత్యుచ్చైర్నిష్క్రాన్తా శశిమణ్డలాత్ ।**
**జగతః పావనార్థాయ యా ప్రయాతి చతుర్దిశమ్ ॥ 107 ॥**

శశిమండలం నుండి వెలువడి మేరుపర్వతంయొక్క పైభాగంపై పడి జగత్తును పావనం చేయడానికై నలుదిక్కులకూ ప్రవహిస్తోంది.

**సీతా చాలకనన్దా చ చక్షుర్భద్రా చ సంస్థితా ।**
**ఏకైవ యా చతుర్భేదా దిగ్భేదగతిలక్షణా ॥ 108 ॥**

సీత, అలకనంద, చక్షువు, భద్ర అనే రూపాలతో ఉండి ఒకటే నాలుగు భేదాలుగా వేరువేరు దిక్కులకు పోవడాన్ని బట్టి అస్తిత్వం వహించింది.

**భేదం చాలకనన్దాఖ్యం యస్యాః శర్వోఽపి దక్షిణమ్ ।**
**దధార శిరసా ప్రీత్యా వర్షాణామధికం శతమ్ ॥ 109 ॥**

ఆ గంగానదియొక్క దక్షిణపుపాయ అయిన అలకనంద అనే నదీశాఖను వందసంవత్సరాలకు పైగా శర్వుడు ప్రీతితో శిరస్సున ధరించాడు.

**శమ్భోర్జటాకలాపాచ్చ వినిష్క్రాన్తాఽస్థిశర్కరాః ।**
**ప్లావయిత్వా దివం నిన్యే పాపాఢ్యాన్ సగరాత్మజాన్ ॥ 110 ॥**

ఆ అలకనంద శంభునియొక్క జటాకలాపం నుంచి వెలువడి ఎముకల బూడిదలను తడిపి, పాపాత్ములైన సగరచక్రవర్తి కుమారులను దివికి చేర్చింది.

**స్నాతస్య సలిలే యస్యాః సద్యః పాపం ప్రణశ్యతి ।**
**అపూర్వపుణ్యప్రాప్తిశ్చ సద్యో మైత్రేయ! జాయతే ॥ 111 ॥**

మైత్రేయా! ఆ గంగానదీజలంలో స్నానం చేసినవానియొక్క పాపం వెంటనే నశిస్తుంది. అంతేకాక అపూర్వపుణ్యప్రాప్తి తక్షణమే చేకూరుతుంది.

**దత్తాః పితృభ్యో యత్రాపస్తనయైః శ్రద్ధయాఽన్వితైః ।**
**సమాశతం ప్రయచ్ఛన్తి తృప్తిం మైత్రేయ! దుర్లభామ్ ॥ 112 ॥**

మైత్రేయా! ఆ గంగానదిలో శ్రద్ధాళువులైన కుమారులచే తర్పణార్థం వదలిపెట్టబడిన జలాలు పితృదేవతలకు పొందశక్యంకాని తృప్తిని నూరేళ్లవరకు కలిగిస్తాయి.

**యస్యామిష్ట్వా మహాయజ్ఞైర్యజ్ఞేశం పురుషోత్తమమ్ ।**
**ద్విజ! భూపాః పరామృద్ధిమవాపుర్దివి చేహ చ ॥ 113 ॥**

ద్విజోత్తమా! భూపాలకులు ఈ గంగానదీతీరంలో గొప్ప గొప్ప యజ్ఞాలతో యజ్ఞేశ్వరుడైన పురుషోత్తముని పూజించి ఇహ పరలోకాలలో పరమసిద్ధిని పొందియున్నారు.

**స్నానాద్విధూతపాపాశ్చ యజ్జలే యతయస్తథా ।**
**కేశవాసక్తమనసః ప్రాప్తా నిర్వాణముత్తమమ్ ॥ 114 ॥**

యతీశ్వరులు ఆ గంగానదీ జలాలలో స్నానం కావించి, సమస్తపాపాలను కడుగుకొని, కేశవునిపై ఆసక్తి కలిగిన మనస్సు కలవారై ఉత్తమమైన నిర్వాణాన్ని పొందారు.

**శ్రుతాఽభిలషితా దృష్టా స్పృష్టా పీతాఽవగాహితా ।**
**యా పావయతి భూతాని కీర్తితా చ దినే దినే ॥ 115 ॥**

ప్రతిదినం ఆ గంగానదిని గూర్చి వినినా, కోరినా, చూచినా, తాకినా, ఆ నీరు త్రాగినా, అందు మునిగినా, దానిని పొగడినా అది సమస్త భూతాలను పవిత్రం కావిస్తుంది.

**గంగా గంగేతి యైర్నామ యోజనానాం శతేష్వపి ।**
**స్థితైరుచ్చరితం హన్తి పాపం జన్మత్రయార్జితమ్ ॥ 116 ॥**

వందలకొలది యోజనాలదూరంలో ఉండి అయినా, "గంగ గంగ" అనే పేరు ఎవరు ఉచ్చరిస్తారో వారియొక్క మూడు జన్మలలో చేసుకొన్న పాపాన్ని ఆ గంగానామస్మరణం పోగొడుతుంది.

**యతః సా పావనాయాలం త్రయాణాం జగతామపి ।**
**సముద్భూతా పరం తత్తు తృతీయం భగవత్పదమ్ ॥ 117 ॥**

మూడులోకాలను పావనం చేయడానికి సమర్థమైన ఈ నది ప్రభవించిన ప్రదేశం భగవంతుని యొక్క పరమపదం.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే కాలనిరూపణం-గంగావిర్భావవర్ణనం చేతి అష్టమోఽధ్యాయః సమాప్తః॥ 8 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో కాలనిరూపణం-గంగావిర్భావవర్ణన అనే ఎనిమిదవ అధ్యాయం సమాప్తం॥ 8॥

## నవమోఽధ్యాయః – తొమ్మిదవ అధ్యాయం

## జ్యోతిశ్చక్ర శింశుమారచక్రవివరణమ్ – జ్యోతిశ్చక్ర శింశుమారచక్రవివరణ

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెబుతున్నాడు.

**తారామయం భగవతః శింశుమారాకృతి ప్రభోః ।**
**దివి రూపం హరేర్యత్తు తస్య పుచ్ఛే స్థితో ధ్రువః ॥ 1 ॥**
**సైష భ్రమన్ భ్రామయతి చన్ద్రాదిత్యాదికాన్ గ్రహాన్ ।**
**భ్రమన్తమను తం యాన్తి నక్షత్రాణి చ చక్రవత్ ॥ 2 ॥**

అంతరిక్షంలో భగవంతుడైన, సర్వభూతప్రభువైన శ్రీహరియొక్క తేజస్సు తారాతేజోమయమై శిశుమారాకృతిలో (మొసలి ఆకారంలో) ఉంటుంది. దాని తోకపై ధ్రువుడు ఉంటాడు. ఆ ధ్రువుడు తాను తిరుగుతూ, చంద్రుడు సూర్యుడు మున్నగు గ్రహాలను త్రిప్పుతూ ఉంటాడు. ఆ తిరుగుతున్న ధ్రువుని అనుసరించి చక్రంలా నక్షత్రాలు తిరుగుతూ వెడుతూ ఉంటాయి.

**సూర్యాచన్ద్రమసౌ తారా నక్షత్రాణి గ్రహైః సహ ।**
**వాతానీకమయైర్బన్ధైర్ధ్రువే బద్ధాని తాని వై ॥ 3 ॥**

సూర్యచంద్రులు, తారలు, నక్షత్రాలు, గ్రహాలతో కలసి వాయురూపబంధాలతో ధ్రువునితో కట్టబడివున్నాయి.

వి ॥ భూమికి దగ్గరగా ఉండి ప్రకాశించేవి తారలు. దూరంగా ఉండి మినుకు మినుకు మనేవి నక్షత్రాలు. వాయుబంధాలు ఏడు. అవి 1) ఆవహము 2) ప్రవహము 3) అనువహము 4)సంవహము 5)వివహము 6) పురోవహము 7) పరివహము అనేవి. ఇవి భూమి, మేఘాలు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, గ్రహాలు, సప్తర్షిమండలం, ధ్రువుడు అనే ఎనిమిదింటి నడుమ ఏడు వాయుబంధాలుగా ఉండి భువనత్రయాన్ని వహిస్తున్నాయి.

**శిశుమారాకృతి ప్రోక్తం యద్రూపం జ్యోతిషాం దివి ।**
**నారాయణః పరం ధామ్నాం తస్యాధారః స్వయం హృది ॥ 4 ॥**

అంతరిక్షంలో సమస్తజ్యోతిర్మండలంయొక్క రూపం శిశుమారాకారంలో ఉంది. దాని హృదయంలో ఉన్న నారాయణుడు దానికి స్వయంగా ఆధారం. ఆయన అనంత తేజస్సుకు ఆశ్రయం.

**ఉత్తానపాదపుత్రస్తు తమారాధ్య ప్రజాపతిమ్ ।**
**స తారాశిశుమారస్య ధ్రువః పుచ్ఛే వ్యవస్థితః ॥ 5 ॥**

ఉత్తానపాదుని కుమారుడైన ధ్రువుడు ఆ జగదీశ్వరుని ఆరాధించి తారామయ శిశుమారాకార పుచ్ఛంపై స్థిరంగా ఉన్నాడు.

**ఆధారః శిశుమారశ్చ సర్వాధ్యక్షో జనార్దనః ।**
**ధ్రువస్య శిశుమారశ్చ ధ్రువే భానుర్వ్యవస్థితః ॥ 6 ॥**

శిశుమారానికి ఆధారం సమస్తానికి అధిపతి అయిన జనార్దనుడు. ధ్రువునకు ఆధారం శిశుమారం. భానుడు ధ్రువునియందు ఉన్నాడు. (అనగా భానునకు ఆధారం ధ్రువుడు)

**తదాధారం జగచ్చేదం సదేవాసురమానుషమ్ ।**
**యేన విప్ర! విధానేన తన్మమైకమనాః శృణు ॥ 7 ॥**

విప్రోత్తమా! దేవతలతోను, అసురలతోను, మనుష్యులతోను కూడియున్న ఈ సమస్తజగత్తుకు సూర్యుడు ఆధారం. ఆ విషయాన్ని ఆ విధానమంతా ఏకాగ్రచిత్తుడవై ఆలకించు.

**వివస్వానష్టభిర్మాసైరాదాయాపో రసాన్వితాః ।**
**వర్షత్యమ్బు తతశ్చాన్నమన్నాదప్యఖిలం జగత్ ॥ 8 ॥**

వివస్వంతుడు ఎనిమిదినెలలు రససహితాలైన ఉదకాలను గ్రహించి వర్షరూపంలో వర్షిస్తాడు. ఆ వర్షం వల్ల అన్నం, ఆ అన్నం (ఆహారం) వల్ల సమస్తజగత్తూ నిలుస్తోంది.

**వివస్వానంశుభిస్తీక్ష్ణైరాదాయ జగతో జలమ్ ।**
**సోమం పుష్యత్యథేన్దుశ్చ వాయునాడీమయైర్దివి ॥ 9 ॥**

**నాలైర్విక్షిపతేఽభ్రేషు ధూమాగ్న్యనిలమూర్తిషు ।**
**న భ్రశ్యన్తి యతస్తేభ్యో జలాన్యభ్రాణి తాన్యతః ॥ 10 ॥**

వివస్వంతుడు తన తీక్ష్ణకిరణాలతో జగత్తునుండి జలాన్ని గ్రహించి, సోమునియందు విడిచి, పుష్టిని కలుగజేస్తాడు. చంద్రుడు అంతరిక్షంలో వాయునాడీమయాలైన గొట్టాలద్వారా పొగ,నిప్పు,గాలి రూపాలైన అభ్రాలలో (మబ్బులలో) చిమ్ముతాడు. జలాలు వాటి నుండి భ్రంశం కావు కాబట్టి మేఘాలను “అభ్రములు” అంటారు.

**అభ్రస్థాః ప్రపతన్త్యాపో వాయునా సముదీరితాః ।**
**సంస్కారం కాలజనితం మైత్రేయాసాద్య నిర్మలాః ॥ 11 ॥**

మైత్రేయా! ఆ జలాలు అభ్రాలలో ఉండి కాలానుసారంగా సంస్కారం పొంది, ఏ మాలిన్యం లేకుండా స్వచ్ఛాలై వాయువుద్వారా ప్రేరేపించబడి క్రిందకు పడతాయి.

**సరిత్సముద్రభౌమాస్తు తథాఽపః ప్రాణిసమ్భవాః ।**
**చతుః ప్రకారా భగవానాదత్తే సవితా మునే ॥ 12 ॥**

మునీశ్వరా! భగవంతుడైన సవితృడు నదులలో, సముద్రాలలో, భూప్రదేశాలలో, ప్రాణిదేహాలలో కల నాలుగు విధాలైన నీటిని గ్రహిస్తాడు.

**ఆకాశగంగాసలిలం తదాదాయ గభస్తిమాన్ ।**
**అనభ్రగతమేవోర్వ్యాం సద్యః క్షిపతి రశ్మిభిః ॥ 13 ॥**

అదేవిధంగా గభస్తిమంతుడైన సూర్యుడు ఆకాశగంగా జలాలను స్వీకరించి అభ్రాలకు పంపకుండా, నేరుగా కిరణాలద్వారా వెంటనే భూమియందు చిమ్ముతాడు.

**తస్య సంస్పర్శనిర్ధూతపాపపంకో ద్విజోత్తమ ।**
**న యాతి నరకం మర్త్యో దివ్యస్నానం హి తత్ స్మృతమ్ ॥ 14 ॥**

ద్విజశ్రేష్ఠా! ఆ సూర్యభగవానునియొక్క సంస్పర్శచేత పాపపంకం (ఆకాశగంగా జలాలతో) పూర్తిగా క్షాళితమవుతుంది. ఆ నీటిలో స్నానం ఆచరించినవాడు నరకానికి పోడు. అది దివ్యస్నానంగా వ్యవహరించబడుతుంది కదా!

**దృష్టసూర్యం హి యద్వారి పతత్యభ్రైర్వినా దివః ।**
**ఆకాశగంగాసలిలం తద్గోభిః క్షిప్యతే రవేః ॥ 15 ॥**

సూర్యునికాంతి (ఎండ) కనబడుతూ ఉండగా, మేఘాలద్వారా కాక అంతరిక్షంనుండి జలాలు పడుతూ ఉంటే, ఆ వర్షం సూర్యకిరణాలద్వారా ఆకాశగంగాజలమే చిమ్మబడి పడుతూ ఉంటుంది.

**కృత్తికాదిషు ఋక్షేషు విషమేష్వమ్బు యద్దివః ।**
**దృష్టార్కపతితం జ్ఞేయం తద్గాంగం దిగ్గజోజ్ఝితమ్ ॥ 16 ॥**

కృత్తిక మున్నగు బేసి నక్షత్రాలలో, ఆకాశంలో సూర్యుడు (సూర్యకాంతి) కనబడుతూ ఉండగా, ఏ నీరు పడుతుందో ఆ నీరు దిగ్గజాలు వదలిన ఆకాశగంగాజలం అని తెలుసుకోవాలి.

**యుగ్మర్క్షేషు చ యత్తోయం పతత్యర్కోజ్ఝితం దివః ।**
**తత్ సూర్యరశ్మిభిః సద్యః సమాదాయ నిరస్యతే ॥ 17 ॥**

రోహిణి మున్నగు సరి నక్షత్రాలలో, ఆకాశంలో సూర్యుడు (సూర్యకాంతి) కనబడుతూ ఉండగా, పడే నీరు సూర్యకిరణాలద్వారా వేగంగా గ్రహించబడి వదలబడిన గాంగోదకమని గ్రహించాలి.

**ఉభయం పుణ్యమత్యర్థం నృణాం పాపాపహం ద్విజ! ।**
**ఆకాశగంగాసలిలం దివ్యస్నానం మహామునే ॥ 18 ॥**

ద్విజోత్తమా! ఈ రెండురకాలయిన నీరు మిక్కిలి పవిత్రమైనది. నరుల పాపాలను పూర్తిగా నశింపజేసేది. మహామునీ! ఈ ఆకాశగంగా సలిలస్నానమే దివ్యస్నానం అనబడుతుంది.

**యత్తు మేఘైః సముత్సృష్టం వారి తత్ప్రాణినాం ద్విజ! ।**
**పుష్ణాత్యోషధయః సర్వా జీవనాయామృతం హి తత్ ॥ 19 ॥**

ద్విజశ్రేష్ఠా! మేఘాలద్వారా ప్రాణికోటికి కురిసిన నీరు సమస్తములైన ఓషధులకు పుష్టిని ప్రసాదిస్తుంది. అది ప్రాణి జీవనానికి అమృతమే కదా!

**తేన వృద్ధిం పరాం నీతః సలిలేనౌషధీగణః ।**
**సాధకః ఫలపాకాన్తః ప్రజానాం ద్విజ! జాయతే ॥ 20 ॥**

ద్విజోత్తమా! ఆ నీటిచేత బాగా వృద్ధిపొందిన ఓషధీసమూహం పండినదై, ప్రజలకు ఫలమును సాధించి ఉత్తమసాధనకారణం అవుతోంది.

**తేన యజ్ఞాన్ యథా ప్రోక్తాన్ మానవాః శాస్త్రచక్షుషః ।**
**కుర్వన్త్యహరహస్తైశ్చ దేవానాప్యాయయన్తి తే ॥ 21 ॥**

ఆఓషధులద్వారా శాస్త్రదృష్టి కల్గిన మానవులు, ప్రతిదినం యథాప్రకారంగా చెప్పబడ్డ యజ్ఞాలను ఆచరిస్తూ, దేవతలను సంతుష్టి పరుస్తున్నారు.

**ఏవం యజ్ఞాశ్చ వేదాశ్చ వర్ణాశ్చ ద్విజపూర్వకాః ।**
**సర్వే దేవనికాయాశ్చ పశుభూతగణాశ్చ యే ॥ 22 ॥**

**వృష్ట్యా ధృతమిదం సర్వ మన్నం నిష్పాద్యతే యథా ।**
**సాఽపి నిష్పాద్యతే వృష్టిః సవిత్రా మునిసత్తమ! ॥ 23 ॥**

మునిశ్రేష్ఠా! ఈ విధంగా యజ్ఞాలు, వేదాలు, బ్రాహ్మణాది వర్ణాలు (ద్విజాదులు), సమస్త దేవతాబృందాలు, సకలపశుప్రాణి సముదాయాలు, ఈ సర్వం వర్షంవల్ల నిలుస్తున్నది. ఆ వర్షంవల్ల అన్నం సముత్పన్నమవుతున్నది. ఆ వర్షంకూడ సవితృదేవునివల్ల ఉత్పాద్యమానమవుతోంది.

**ఆధారభూతః సవితు ర్ధ్రువో మునివరోత్తమ ! ।**
**ధ్రువస్య శిశుమారోఽసౌ సోఽపి నారాయణాశ్రయః ॥ 24 ॥**

మునీశ్వరేశ్వరా! ఆ సవితకు ధ్రువుడు ఆధారం. ఆ ధ్రువునికి శిశుమారం ఆధారం. ఆ శిశుమారంకూడ నారాయణుడు ఆశ్రయంగా కలిగినట్టిది.

**హృది నారాయణస్తస్య శిశుమారస్య సంస్థితః ।**
**బిభర్తా సర్వభూతానామాదిభూతః సనాతనః ॥ 25 ॥**

ఆ శిశుమారం యొక్క హృదయంలో నారాయణుడు ఉన్నాడు. ఆ ఆదిభూతుడే, ఆ సనాతనుడే సమస్త భూతాలను భరిస్తున్నాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే జ్యోతిశ్చక్ర శింశుమారచక్రవివరణమితి నవమోఽధ్యాయః సమాప్తః ॥ 9 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ప్రథమాంశంలో జ్యోతిశ్చక్ర శింశుమారచక్రవివరణ అనే తొమ్మిదవ అధ్యాయం సమాప్తం॥ 9॥



## దశమోఽధ్యాయః - పదవ అధ్యాయం

## సూర్యరథస్య అధికారిదేవతావర్ణనమ్ - సూర్యరథముయొక్క అధికారిదేవతావర్ణన

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**సాశీతిమణ్డలశతం కాష్ఠయోరన్తరం ద్వయోః ।**
**ఆరోహణావరోహాభ్యాం భానో రబ్దేన యా గతిః ॥ 1 ॥**

ఆరోహణం, అవరోహణం అనే వాటిచే సూర్యుని యొక్క గమనం సంవత్సరానికి ఉత్తర దక్షిణదిశల (కాష్ఠల) నడుమ నూటఎనభై మండలాలుగా ఉంటుంది.

**స రథోఽధిష్ఠితో దేవైరాదిత్యైః ఋషిభిస్తథా ।**
**గన్ధర్వైరప్సరోభిశ్చ గ్రామణీ సర్పరాక్షసైః ॥ 2 ॥**

ఆ సూర్యరథం ఆదిత్యదేవులచేత, ఋషులచేత, గంధర్వులచేత, అప్సరసలచేత, యక్షులచేత, నాగులచేత, రాక్షసులచేత అధిష్ఠించబడి ఉంటుంది.

### చైత్రమాసగణం

**ధాతా క్రతుస్థలా చైవ పులస్త్యో వాసుకిస్తథా ।**
**రథభృద్ గ్రామణీర్హేతిస్తుమ్బురుశ్చైవ సప్తమః ॥ 3 ॥**

**ఏతే వసన్తి వై చైత్రే మధుమాసే సదైవ హి ।**
**మైత్రేయ! స్యన్దనే భానోః సప్త మాసాధికారిణః ॥ 4 ॥**

మైత్రేయా! మధుమాసమైన చైత్రంలో సూర్యునియొక్క రథంపై ఎల్లప్పుడూ ధాత అనుపేరుగల ఆదిత్యుడు, క్రతుస్థల అను పేరుగల అప్సరస, పులస్త్యుడను పేరుగల ఋషి, వాసుకి అనుపేరుగల సర్పం, రథభృత్తు అనే యక్షుడు, హేతి అనే రాక్షసుడు, తుంబురుడనే గంధర్వుడు-ఈ ఏడుగురూ మాసాధికారులుగా ఉంటారు.

### వైశాఖమాసగణం

**అర్యమా పులహశ్చైవ రథౌజాః పుంజికస్థలా ।**
**ప్రహేతిః కచ్ఛవీరశ్చ నారదశ్చ రథే రవేః ।**
**మాధవే నివసన్త్యేతే శుచిసంజ్ఞే నిబోధ మే ॥ 5 ॥**

అర్యముడనే ఆదిత్యుడు, పులహుడనే ఋషి, రథౌజుడనే యక్షుడు, పుంజికస్థల అనే అప్సరస, ప్రహేతి అనే రాక్షసుడు, కచ్ఛవీరుడనే సర్పం, నారదుడనే గంధర్వుడు. వీరు ఏడుగురు వైశాఖమాసంలో సూర్యరథంపై అధివసించి యుంటారు. ఇక జ్యేష్ఠమాసంలో సూర్యరథంపై వసించే వారిని గూర్చి చెబుతాను. గ్రహించు.

### జ్యేష్ఠమాసగణం

**మిత్రోఽత్రిస్తక్షకో రక్షః పౌరుషేయోఽథ మేనకా ।**
**హాహా రథస్వనశ్చైవ మైత్రేయైతే వసన్తి వై ॥ 6 ॥**

మైత్రేయా! మిత్రుడనే పేరుగల ఆదిత్యుడు, అత్రి అనే పేరుగల ఋషి, తక్షకుడనుపేరుగల సర్పం, పౌరుషేయుడు అనే పేరుగల రాక్షసుడు, మేనక అనే పేరుగల అప్సరస, హాహా అనే గంధర్వుడు, రథస్వనుడనే యక్షుడు–ఈ ఏడుగురు సూర్యరథంపై ఉంటారు. (జ్యేష్ఠమాసపర్యాయంగా శుచి శబ్దప్రయోగం)

**ఆషాఢమాసగణం**

**వరుణో వశిష్ఠో నాగః సహజన్యా హుహూ రథః ।**
**రథచిత్రస్తథా శుక్రే వసన్త్యాషాఢసంజ్ఞకే ॥ 7 ॥**

ఆషాఢమాసంలో వరుణుడనే ఆదిత్యుడు, వశిష్ఠుడనే ఋషి, నాగుడనే సర్పం, సహజన్య అనే అప్సరస, హుహూ అనే గంధర్వుడు, రథుడనే రాక్షసుడు, రథచిత్రుడనే యక్షుడు–ఈ ఏడుగురు సూర్యరథంపై వసించి ఉంటారు. (శుక్రశబ్దం ఆషాఢమనే మాసంలో ప్రయోగించబడింది).

**శ్రావణమాసగణం**

**ఇన్ద్రో విశ్వావసుః స్రోత ఏలాపుత్రస్తథాంఽగిరాః ।**
**ప్రమ్లోచా చ నభస్యేతే సర్పిశ్చార్కే వసన్తి వై ॥ 8 ॥**

శ్రావణమాసంలో ఇంద్రుడనుపేరుగల ఆదిత్యుడు, విశ్వావసువు అను పేరుగల గంధర్వుడు, స్రోతుడు అను పేరుగల యక్షుడు. ఏలాపుత్రుడు అను పేరుగల సర్పం, అంగిరసుడు అను పేరుగల ఋషి, ప్రమ్లోచ అను పేరుగల అప్సరస, సర్పి అను పేరుగల రాక్షసుడు సూర్యరథంపై ఉంటారు.

**భాద్రపదమాసగణం**

**వివస్వానుగ్రసేనశ్చ భృగుశ్చాపూరణస్తథా ।**
**అనుమ్లోచా శంఖపాలో వ్యాఘ్రో భాద్రపదే తథా ॥ 9 ॥**

భాద్రపదమాసంలో వివస్వంతుడనే ఆదిత్యుడు, ఉగ్రసేనుడనే గంధర్వుడు, భృగువనే ఋషి, ఆపూరణుడనే యక్షుడు, అనుమ్లోచ అనే అప్సరస, శంఖపాలుడనే సర్పం, వ్యాఘ్రుడనే రాక్షసుడు సూర్యరథంపై ఉంటారు.

**ఆశ్వయుజమాసగణం**

**పూషా వసురుచిర్వాతో గౌతమోఽథ ధనంజయః ।**
**సుషేణోఽన్యో ఘృతాచీ చ వసన్త్యాశ్వయుజే రవౌ ॥ 10 ॥**

ఆశ్వయుజమాసంలో పూషుడు అనే ఆదిత్యుడు, వసురుచి అనే గంధర్వుడు, వాతుడు అనే రాక్షసుడు, గౌతముడు అనే ఋషి, ధనంజయుడు అనే సర్పం, సుషేణుడు అనే గంధర్వుడు, ఘృతాచి అనే అప్సరస సూర్యుని యందు ఉంటారు.

### కార్తికమాసగణం

**విశ్వావసుభరద్వాజౌ పర్జన్యైరావతౌ తథా ।**
**విశ్వాచీసేనజిచ్చాపః కార్తికే చ వసన్తి వై ॥ (చాధికారిణః) 11 ॥**

కార్తికమాసంలో విశ్వావసువు అనే గంధర్వుడు, భరద్వాజుడు అనే ఋషి, పర్జన్యుడు అనే ఆదిత్యుడు, ఐరావతం అనే సర్పం, విశ్వాచి అనే అప్సరస, సేనజిత్తు అనే యక్షుడు, ఆపుడు అనే రాక్షసుడు సూర్యరథంపై ఉంటారు. (అధికారులు)

### మార్గశీర్షమాసగణం

**అంశుకాశ్యపతార్క్ష్యాస్తు మహాపద్మస్తథోర్వశీ ।**
**చిత్రసేనస్తథా విద్యున్మార్గశీర్షేఽధికారిణః ॥ 12 ॥**

మార్గశీర్షమాసంలో అంశుడు అనే ఆదిత్యుడు, కాశ్యపుడు అనే ఋషి, తార్క్ష్యుడు అనే యక్షుడు, మహాపద్ముడు అనే సర్పం, ఊర్వశి అనే అప్సరస, చిత్రసేనుడు అనే గంధర్వుడు, విద్యుత్తు అనే రాక్షసుడు సూర్యరథాధికారులు.

**క్రతుర్భగస్తథోర్ణాయుః స్ఫూర్జః కర్కోటకస్తథా ।**
**అరిష్టనేమిశ్చైవాన్యా పూర్వచిత్తిర్వరాప్సరాః ॥ 13 ॥**

**పౌషమాసే వసన్త్యేతే సప్త భాస్కరమణ్డలే ।**
**లోకప్రకాశనార్థాయ విప్రవర్యాధికారిణః ॥ 14 ॥**

విప్రవర్యా! క్రతువు అనే ఋషి, భగుడు అనే ఆదిత్యుడు, ఊర్ణాయువు అనే గంధర్వుడు, స్ఫూర్జుడు అనే రాక్షసుడు, కర్కోటకుడు అనే సర్పం, అరిష్టనేమి అనే యక్షుడు, అదే విధంగా మరొక సుప్రసిద్ధురాలైన పూర్వచిత్తి అనే అప్సరస–ఈ ఏడుగురు పౌషమాసంలో భాస్కరమండలంలో లోకప్రకాశనం కోసం అధికారులుగా అధివసించి ఉంటారు.

### మాఘమాసగణం

**త్వష్టాఽథ జమదగ్నిశ్చ కమ్బలోఽథ తిలోత్తమా ।**
**బ్రహ్మోపేతోఽథ ఋతజిద్ ధృతరాష్ట్రోఽథ సప్తమః ॥ 15 ॥**

**మాఘమాసే వసన్త్యేతే సప్త మైత్రేయ! భాస్కరే । 16 ॥**

మైత్రేయా! మాఘమాసంలో త్వష్ట అనే ఆదిత్యుడు, జమదగ్ని అనే ఋషి, కంబళుడు అనే సర్పం, తిలోత్తమ అనే అప్సరస, బ్రహ్మోపేతుడు అనే రాక్షసుడు, ఋతజిత్తు అనే యక్షుడు, ఏడవవాడైన ధృతరాష్ట్రుడనే గంధర్వుడు – ఈ ఏడుగురు సూర్యునియందు అధివసించి ఉంటారు.

**ఫాల్గునమాసగణం**

**శ్రూయతాం చాపరే సూర్యే ఫాల్గునే నివసన్తి యే ।**

**విష్ణురశ్వతరో రమ్భా సూర్యవర్చాశ్చ సత్యజిత్ ।**
**విశ్వామిత్రస్తథా రక్షో యజ్ఞోపేతో మహామునే ॥ 17 ॥**

ఫాల్గున మాసంలో సూర్యమండలంలో ఇక ఎవరు నివసిస్తారో చెబుతాను. ఆలకించు. మహామునీ! విష్ణువు అనే ఆదిత్యుడు. అశ్వతరుడు అనే సర్పం. రంభ అనే అప్సరస, సూర్యవర్చసుడు అనే గంధర్వుడు, సత్యజిత్తు అనే యక్షుడు, విశ్వామిత్రుడు అనే ఋషి, యజ్ఞోపేతుడనే రాక్షసుడు. వీరు సూర్యరథాధికారులు.

**మాసేష్వేతేషు మైత్రేయ! వసన్త్యేతే తు సప్తకాః ।**
**సవితుర్మణ్డలే బ్రహ్మన్! విష్ణుశక్త్యుపబృంహితాః ॥ 18 ॥**

బ్రాహ్మణోత్తముడవైన మైత్రేయా! ఈ విధంగా ఈ పంద్రెండు మాసాలలో ఈ ఏడుగురు చొప్పున విష్ణుశక్తిచే వృద్ధిపొందించబడినవారై సవితృమండలంలో నివసిస్తారు.

**స్తువన్తి మునయః సూర్యం గన్ధర్వైర్గీయతే పురః ।**
**నృత్యన్త్యప్సరసో యాన్తి సూర్యస్యాను నిశాచరాః ॥ 19 ॥**

మునీశ్వరులు సూర్యభగవానుని స్తోత్రం చేస్తారు. ముందు గంధర్వులు గానం చేస్తారు. అప్సరసలు నృత్యం చేస్తారు. రాక్షసులు సూర్యుని అనుసరించి వెడుతూ ఉంటారు.

**వహన్తి పన్నగా యక్షైః క్రియతేఽభీషుసంగ్రహః ।**
**వాలఖిల్యాస్తథైవేనం పరివార్య సమాసతే ॥ 20 ॥**

నాగులు సూర్యరథాన్ని మోస్తారు. యక్షులు పగ్గాలు పట్టుకొంటారు. అదేవిధంగా వాలఖిల్యులు ఆయన చుట్టూ కూర్చుండి ఉంటారు.

**సోఽయం సప్తగణః సూర్యమణ్డలే మునిసత్తమ ।**
**హిమోష్ణవారివృష్టీనాం హేతుత్వే సమయం గతః ॥ 21 ॥**

మునిశ్రేష్ఠా! సూర్యమండలంలో భిన్న భిన్న మాసాలలో ఇట్లు ఈ భిన్న భిన్న సప్తగణము తమ సమయంలో చలికి, వేడికి, వారివృష్టికి కారణమవుతోంది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే సూర్యరథస్య అధికారిదేవతావర్ణనమితి దశమోఽధ్యాయః సమాప్తః ॥10 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో సూర్యరథముయొక్క అధికారిదేవతావర్ణన అనే పదవ అధ్యాయం సమాప్తం॥10॥



## ఏకాదశోఽధ్యాయః - పదకొండవ అధ్యాయం

## సూర్యరథవైష్ణవీశక్తివర్ణనమ్ - సూర్యరథవైష్ణవీశక్తివర్ణన

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అడుగుతున్నాడు

**యదేతద్ భగవానాహ గణః సప్తవిధో రవేః ।**
**మణ్డలే హిమతాపాదేః కారణం తన్మయా శ్రుతమ్ ॥ 1 ॥**

మహర్షీ! భగవంతుడవైన నీవు రవిమండలంలో నున్న ఏడుగురను గూర్చి వివరించి, ఆ సప్తగణమే చలికి, ఎండకు కారణమని చెప్పగా నేను విన్నాను.

**వ్యాపారాశ్చాపి కథితా గన్ధర్వోరగరక్షసామ్ ।**
**ఋషీణాం వాలఖిల్యానాం తథైవాప్సరసాం గురో! ॥ 2 ॥**

గురువర్యా! గంధర్వులు, ఉరగులు, రాక్షసులు, వాలఖిల్యాది ఋషీశ్వరులు, అదేవిధంగా అప్సరసలు వారు చేసే పనులను గూర్చి కూడ తెలియజేశావు.

**యక్షాణాం చ రథే భానోర్విష్ణుశక్తిధృతాత్మనామ్ ।**
**కిన్త్వాదిత్యస్య యత్కర్మ తన్నాత్రోక్తం త్వయా మునే! ॥ 3 ॥**

అలాగే యక్షుల కృత్యాలను కూడ వివరించావు. విష్ణుశక్తిని ధరించియున్న, సూర్యరథాన్ని అధిష్ఠించి యున్న సప్తవిధగణకృత్యాలన్నీ తెలియజేశావు. కాని మునీశ్వరా! ఇక్కడ ఆదిత్యుని కర్మవ్యాపారాన్ని గూర్చి నీవు నాకు చెప్పలేదు.

**యది సప్తగణో వారి హిమముష్ణం చ వర్షతే ।**
**తత్కిమత్ర రవేర్యేన వృష్టిః సూర్యాదితీర్యతే ॥ 4 ॥**

సప్తగణమే నీటికి, మంచుకు, వేడికి వృష్టి కారణమయితే ఇక రవివల్ల ఏమి ప్రయోజనమున్నట్లు? సూర్యుని వల్ల వర్షం కురుస్తుందంటారు కదా!

**వివస్వానుదితో మధ్యే యాత్యస్తమితి కిం జనాః ।**
**బ్రవీత్యేతత్ సమం కర్మ యది సప్తగణస్య తత్ ॥ 5 ॥**

"సూర్యుడు ఉదయించాడు. ఆకాశం మధ్యలో ఉన్నాడు. అస్తమించాడు" అని జనులంటారు కదా! సూర్యుని సప్తగణమే వృష్ట్యాది సమగతుల కర్మలకు కారణమయితే జనవాక్యానికి అర్థమేముంది?-అని ప్రశ్నించాడు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు ఇలా బదులిచ్చాడు.

**మైత్రేయ! శ్రూయతామేతత్ యద్ భవాన్ పరిపృచ్ఛతి ।**
**యథా సప్తగణేఽప్యేకః ప్రాధాన్యేనాధికో రవిః ॥ 6 ॥**

మైత్రేయా! నీవు అడిగిన, దానికి సమాధానం చెబుతున్నాను. ఆలకించు. సప్తగణంలో రవికూడా ఒకడైనప్పటికి ప్రాధాన్యాన్నిబట్టి అతడే అధికుడు.

**సర్వా శక్తిః పరా విష్ణోః ఋగ్యజుః సామసంజ్ఞితా ।**
**సైషా త్రయీ తపత్యంహో జగతశ్చ హినస్తి యా ॥ 7 ॥**

విష్ణువుయొక్క సమస్తమైన పరమమైన శక్తి ఋగ్యజుః సామములనే పేరుతో ఉంది. ఈ వేదత్రయియే వేడిని ఇస్తున్నది. జగత్తులయొక్క పాపాన్ని పోగొడుతున్నది.

**సైష విష్ణుః స్థితః స్థిత్యాం జగతః పాలనోద్యతః ।**
**ఋగ్యజుస్సామభూతోఽన్తః సవితుర్ద్విజ! తిష్ఠతి ॥ 8 ॥**

ద్విజోత్తమా! ఆ త్రయీరూపవిష్ణువే స్థితిసమయంలో జగత్తును పాలించు పూనికలో ఉంటాడు. (పాలింప పూనుకొని ఉంటాడు.) ఆ విష్ణువే ఋగ్యజుస్సామరూపుడై సవితృమండలంలో ఉంటాడు.

**మాసి మాసి రవిర్యో యస్తత్ర తత్ర హి సా పరా ।**
**త్రయీమయీ విష్ణుశక్తిరవస్థానం కరోతి వై ॥ 9 ॥**

ప్రతిమాసమునందు సూర్యుడు ఉంటున్న రూపంలో అక్కడక్కడే వేదత్రయీ రూపమైన విష్ణుని పరాశక్తి నివసించి ఉంటున్నది.

**ఋచస్తువన్తి పూర్వాహ్ణే మధ్యాహ్నేఽథ యజూంషి వై ।**
**బృహద్రథన్తరాదీని సామాన్యహ్నః క్షయే రవౌ ॥ 10 ॥**

ప్రాతఃకాలంలో ఋక్కులు, మధ్యాహ్నకాలంలో యజస్సులు, సూర్యుడు అస్తమించే సాయంకాలంలో బృహద్రథంతరాది సామలు రవిని స్తుతిస్తూ ఉంటాయి.

**అంగమేషా త్రయీ విష్ణోః ఋగ్యజుః సామసంజ్ఞితా ।**
**విష్ణుశక్తి రవస్థానం సదాఽఽదిత్యే కరోతి సా ॥ 11 ॥**

ఈ ఋగ్యజుః సామనామకమైన వేదత్రయి విష్ణుభగవానుని స్వరూపం. ఈ విష్ణుశక్తియే ఎల్లప్పుడూ ఆదిత్యునిలో (సూర్యునిలో) నిలిచి ఉంటుంది.

**న కేవలం రవౌ శక్తిర్వైష్ణవీ సా త్రయీమయీ ।**
**బ్రహ్మాఽథ పురుషో రుద్రస్త్రయమేతత్త్రయీమయమ్ ॥ 12 ॥**

ఆ త్రయీమయమైన వైష్ణవీశక్తి కేవలం ఒక్క రవికి మాత్రమే అధిష్ఠాత్రి కాదు. ఇక బ్రహ్మ, పురుషుడు (విష్ణువు), రుద్రుడు ఈసృష్టి స్థితిలయకారక త్రయము కూడ త్రయీమయమే.

**సర్గాదౌ ఋఙ్మయో బ్రహ్మా స్థితౌ విష్ణుర్యజుర్మయః ।**
**రుద్రః సామమయోఽన్తాయ తస్మాత్ తస్యాశుచిర్ధ్వనిః ॥ 13 ॥**

సర్గాదియందు బ్రహ్మ ఋగ్వేదమయుడు. స్థితివేళలో విష్ణువు యజుర్వేదమయుడు. అంతకాలంలో రుద్రుడు సామవేదమయుడు. అందువల్ల ప్రలయకాల సామవేదధ్వని అమంగళకరమైనది.

**ఏవం సా సాత్త్వికీ శక్తిర్వైష్ణవీ యా త్రయీమయీ ।**
**ఆత్మసప్తగణస్థం తం భాస్వన్త మధితిష్ఠతి ॥ 14 ॥**

ఈ విధంగా ఆ త్రయీమయమైన సాత్త్వికమైన వైష్ణవీశక్తి తనతో కలసి ఆ ఏడింటి గణంలోని భాస్కరునిలో అధిష్ఠించి ఉంటుంది.

**తయా చాధిష్ఠితః సోఽపి జాజ్వలీతి స్వరశ్మిభిః ।**
**తమః సమస్తజగతాం నాశం నయతి చాఖిలమ్ ॥ 15 ॥**

ఆ వైష్ణవీశక్తిచే అధిష్ఠించబడిన సూర్యుడు కూడ తన కిరణాలతో జాజ్వల్యమానుడవుతూ, సమస్తజగత్తుల యొక్క సర్వాంధకారాన్ని నాశనం పొందిస్తాడు.

**స్తువన్తి తం వై మునయో గన్ధర్వైర్గీయతే పురః ।**
**నృత్యన్త్యప్సరసో యాంతి తస్య చాను నిశాచరాః ॥ 16 ॥**

ఆ సూర్యభగవానుని మునులు స్తోత్రం చేస్తారు. ఆ సూర్యరథం ముందు గంధర్వులు గానం చేస్తారు. అప్సరసలు నృత్యం చేస్తారు. ఆ సూర్యుని అనుసరించి నిశాచరులు వెంబడిస్తారు.

**వహన్తి పన్నగా యక్షైః క్రియతేఽభీషుసంగ్రహః ।**
**వాలఖిల్యాస్తథైవైనం పరివార్య సమాసతే ॥ 17 ॥**

నాగులు రథాన్ని మోస్తారు. యక్షులు పగ్గాలు పట్టుకొంటారు. వాలఖిల్యులు అదే విధంగా ఆ సూర్యుని చుట్టూ పరివేష్టించి ఉంటారు.

**నోదేతా నాస్తమేతా చ కదాచిచ్ఛక్తిరూపధృక్ ।**
**విష్ణుర్విష్ణోః పృథక్ తస్య గణః సప్తవిధోఽప్యయమ్ ॥ 18 ॥**

శక్తిరూపధరుడగు విష్ణువు ఒకప్పుడు ఉదయించడమనేదీ లేదు. ఒకప్పుడు అస్తమించడమనేదీ లేదు. ఆయన అధిష్ఠాత అగుటచే సదా స్థిరుడు. అధిష్ఠేయము, అస్థిరము అగు సప్తవిధగణము విష్ణువు కన్న ఎప్పుడూ వేరయినదే.

**స్తమ్భస్థదర్పణస్యేవ యోఽయమాసన్నతాం గతః ।**
**ఛాయాదర్శనసంయోగం స తం ప్రాప్నోత్యథాఽఽత్మనః ॥ 19 ॥**

స్తంభంలో ఉన్న అద్దం దగ్గరకు ఎదురుగా వెళ్ళు వాడే అందు ప్రతిబింబదర్శనాన్ని పొంది దానితో సంబంధం కలిగి ఉంటాడు.

**ఏవం సా వైష్ణవీ శక్తిర్నైవాపైతి తతో ద్విజ ।**
**మాసానుమాసం భాస్వన్తమధ్యాస్తే తత్ర సంస్థితమ్ ॥ 20 ॥**

ద్విజోత్తమా! అదే రీతిగా మాసం తరువాత మాసం అక్కడకు వచ్చే భాస్కరునికి అధిష్ఠాత్రియై నిలిచి ఉంటుంది కాని, ఆ వైష్ణవీశక్తి అక్కడనుంచి తొలగనే తొలగదు.

**పితృదేవమనుష్యాదీన్ స సదాఽప్యాయయన్ ప్రభుః ।**
**పరివర్తత్యహోరాత్రకారణం సవితా ద్విజ! ॥ 21 ॥**

ద్విజశ్రేష్ఠా! పగలు, రాత్రి ఏర్పడుటకు కారణభూతుడైన సూర్యభగవానుడు పితరులను, దేవతలను, మనుష్యులను మున్నగు వారిని ఎల్లప్పుడూ తృప్తిపరుస్తూ తిరుగుతూ ఉంటాడు.

**సూర్యరశ్మిః సుషుమ్నా యస్తర్పితస్తేన చన్ద్రమాః ।**
**కృష్ణపక్షేఽమరైః శశ్వత్ పీయతే వై సుధామయః ॥ 22 ॥**

సుషుమ్న అనే సూర్యకాంతి ద్వారా చంద్రుడు తృప్తి పొందుతాడు. సుధామయుడైన చంద్రుడు కృష్ణపక్షంలో (రోజుకు ఒక కళ చొప్పున) దేవతలచే త్రాగబడతాడు.

**పీతం తం ద్వికలం సోమం కృష్ణపక్షక్షయే ద్విజ! ।**
**పిబన్తి పితరస్తేషాం భాస్కరాత్ తర్పణం తథా ॥ 23 ॥**

**ఆదత్తే రశ్మిభిర్యస్తు క్షితిసంస్థం రసం రవిః ।**
**తముత్సృజతి భూతానాం పుష్ట్యర్థం సస్యవృద్ధయే ॥ 24 ॥**

ద్విజోత్తమా! కృష్ణపక్షం చివర దేవతలు స్వీకరించిన పిమ్మట మిగిలిన రెండుకళలు గల చంద్రుని (చతుర్దశి తరువాత పితరులు గ్రహిస్తారు. వారికి ఆ విధంగా సూర్యునివల్ల తృప్తి అవుతుంది.) సూర్యుడు తన కిరణాలద్వారా భూమినుండి గ్రహించిన ఉదకాలను, భూతకోటి పోషణం కోసం, సస్యాలు పెరగడం కోసం తిరిగి విడుస్తాడు.

**తేన ప్రీణాత్యశేషాణి భూతాని భగవాన్ రవిః ।**
**పితృదేవ మనుష్యాదీనేవమాప్యాయయత్యసౌ ॥ 25 ॥**

ఆ వర్షంవల్ల భగవంతుడైన రవి సమస్తప్రాణులను తృప్తిపరుస్తున్నాడు. ఈ విధంగా ఆయన పితరులను, దేవతలను, మనుష్యులు మున్నగువారిని తుష్టి పరుస్తున్నాడు.

**పక్షతృప్తిం తు దేవానాం పితౄణాం చైవ మాసికీమ్ ।**
**శశ్వత్తృప్తిం చ మర్త్యానాం మైత్రేయార్కః ప్రయచ్ఛతి ॥ 26 ॥**

మైత్రేయా! అర్కుడు ఈ విధంగా దేవతలకు పక్షంపాటు తృప్తిని, పితృగణానికి మాసతృప్తిని, మర్త్యులకు నిరంతరతృప్తిని కలిగిస్తున్నాడు అని మైత్రేయునకు పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే సూర్యరథవైష్ణవీశక్తివర్ణనమితి ఏకాదశోఽధ్యాయః సమాప్తః ॥ 11 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో సూర్యరథవైష్ణవీశక్తివర్ణన అనే పదకొండవ అధ్యాయం సమాప్తం ॥ 11 ॥

## ద్వాదశోఽధ్యాయః - పన్నెండవ అధ్యాయం

## చంద్రాదిగ్రహవర్ణనమ్ - చంద్రాదిగ్రహవర్ణన

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెబుతున్నాడు.

**రథస్త్రిచక్రః సోమస్య కున్దాభాస్తస్య వాజినః ।**
**వామదక్షిణతో యుక్తా దశ తేన చరత్యసౌ ॥ 1 ॥**

సోముని రథం మూడు చక్రాలు కలిగి ఉంటుంది. మల్లె మొగ్గలవంటి గుఱ్ఱాలు పది ఆ రథానికి కుడి ఎడమలలో పూన్చి ఉంటాయి. ఆ రథంద్వారా చంద్రుడు సంచరిస్తాడు.

**వీథ్యాశ్రయాణి ఋక్షాణి ధ్రువాధారేణ వేగినా ।**
**హ్రాసవృద్ధిక్రమస్తస్య రశ్మీనాం సవితుర్యథా ॥ 2 ॥**

నక్షత్రాలన్నీ ఈ చంద్ర (నాగ) వీథిని ఆశ్రయించి ఉంటాయి. ధ్రువునిపై ఆధారపడి చంద్రరథవేగం ఉంటుంది. సూర్యకిరణాలరీతిగానే చంద్రకిరణాలకు కూడ హెచ్చుతగ్గుల క్రమం ఉంటుంది.

**అర్కస్యేవ హి తస్యాశ్వాః సకృద్యుక్తా వహన్తి తే ।**
**కల్పమేకం మునిశ్రేష్ఠ! వారిగర్భసముద్భవాః ॥ 3 ॥**

మునిశ్రేష్ఠా! సూర్యుని అశ్వాలు లాగానే ఈ చంద్రాశ్వాలు కూడ ఒకసారి పూన్చినటువంటివే. అవి ఒక కల్పం పాటు రథాన్ని లాగుతాయి. ఆ అశ్వాలు సముద్రోదకగర్భంలోనుంచి పుట్టినటువంటివి.

**క్షీణం పీతం సురైః సోమమాప్యాయయతి దీప్తిమాన్ ।**
**మైత్రేయైకకలం సన్తం రశ్మినైకేన భాస్కరః ॥ 4 ॥**

మైత్రేయా! సురలు త్రాగగా క్షీణించియున్న, ఒకే కళతో ఉన్న చంద్రునకు కాంతిమంతుడైన భాస్కరుడు ఒకే ఒక కిరణంతో పుష్టిని కలుగజేస్తాడు.

**క్రమేణ యేన పీతోఽసౌ దేవైస్తేన నిశాకరమ్ ।**
**ఆప్యాయయత్యనుదినం భాస్కరో వారితస్కరః ॥ 5 ॥**

వారి సంగ్రహణం చేసే భాస్కరుడు ఏ క్రమంలో దేవతలు చంద్రుణ్ణి పానం చేస్తూ ఉంటారో అదే క్రమంలో (శుక్ల పక్షంలో ప్రతిపత్తు మొదలుకొని) ప్రతిదినం చంద్రునకు పుష్టిని ఇస్తాడు.

**సంభృతం చార్ధమాసేన తత్సోమస్థం సుధామృతమ్ ।**
**పిబన్తి దేవా మైత్రేయ! సుధాహారా యతోఽమరాః ॥ 6 ॥**

మైత్రేయా! ఈ విధంగా అర్ధమాసంలో (శుక్లపక్షంలో) ఒకచోట నిండియున్న చంద్రునిలోని సుధామృతాన్ని (కృష్ణపక్షంలో) దేవతలు త్రాగుతారు. అందువల్ల వారు అమృతాహారులై అమరులయ్యారు.

**త్రయస్త్రింశత్సహస్రాణి త్రయస్త్రింశచ్ఛతాని చ ।**
**త్రయస్త్రింశత్ తథా దేవాః పిబన్తి క్షణదాకరమ్ ॥ 7 ॥**

ముప్పైమూడువేల, ముప్పైమూడువందల, ముప్పైముగ్గురు దేవతలు చంద్రునిలోని అమృతాన్ని త్రాగుతారు.

**కలాద్వయావశిష్టస్తు ప్రవిష్టః సూర్యమణ్డలమ్ ।**
**అమాఖ్యరశ్మౌ వసతి అమావాస్యా తతః స్మృతా ॥ 8 ॥**

రెండుకళలు మిగిలియున్న స్థితిలో చంద్రుడు సూర్యమండలం ప్రవేశించినవాడై "అమా" అనే కిరణంలో నివసిస్తాడు. ఆ కారణంచే దానిని అమావాస్య అంటారు.

**అప్సు తస్మిన్నహోరాత్రే పూర్వం వసతి చన్ద్రమాః ।**
**తతో వీరుత్సు వసతి ప్రయాత్యర్కం తతః క్రమాత్ ॥ 9 ॥**

ఆ అమావాస్యరోజున ఆ అహోరాత్రసమయంలో చంద్రుడు ముందుగా నీళ్లలో ప్రవేశిస్తాడు. తరువాత వృక్షలతాదులలో నివసిస్తాడు. ఆ పైన క్రమంగా సూర్యునిలోనికి వెడతాడు.

**ఛినత్తి వీరుధో యస్తు వీరుత్సంస్థే నిశాకరే ।**
**పత్రం వా పాతయత్యేకం బ్రహ్మహత్యాం స విన్దతి ॥ 10 ॥**

నిశాకరుడు వృక్షలతాదులలో ఉండగా, ఆ లతలను త్రుంచినా, ఒక్క ఆకునైనా పడగొట్టినా, వాడు బ్రహ్మహత్యాపాతకాన్ని పొందుతాడు.

**శేషే పంచదశే భాగే కించిచ్ఛిష్టే కలాత్మకే ।**
**అపరాహ్ణే పితృగణా జఘన్యం పర్యుపాసతే ॥ 11 ॥**

పదిహేనవ కళ కొంచెం మాత్రమే మిగిలియుండి పదహారు కళలు కేవలం కళామాత్రుడై, క్షీణుడై యున్న చంద్రుని, అపరాహ్ణ సమయంలో పితృగణాలు నాలుగుప్రక్కలనుంచి చుట్టివేస్తారు.

**పిబన్తి ద్వికలాకారం శిష్టా తస్య కలా తు యా ।**
**సుధామృతమయీ పుణ్యా తామిన్దోః పితరో మునే! ॥ 12 ॥**

మునీశ్వరా! ఆ సమయంలో రెండు కళల స్వరూపంకల ఆ చంద్రమండలంలోని మిగిలిన పరమపావనమైన అమృతమయమైన కళను పితరులు త్రాగుతారు.

**నిఃసృతం తదమావాస్యాం గభస్తిభ్యః సుధామృతమ్ ।**
**మాసం తృప్తిమవాప్యాగ్ర్యాం పితరః సన్తి నిర్వృతాః ।**
**సౌమ్యా బర్హిషదశ్చైవ అగ్నిష్వాత్తాశ్చ తే త్రిధా ॥ 13 ॥**

అమావాస్యరోజున చంద్రకిరణాలద్వారా వెలువడిన సుధామృతాన్ని స్వీకరించి సౌమ్యులు, బర్హిషదులు, అగ్నిష్వాత్తులు అనే మూడు తెగలకు చెందిన పితృదేవతలు మిక్కిలి సంతృప్తిని పొంది నెలవరకూ సంతుష్టులయి ఉంటారు.

**ఏవం దేవాన్ సితే పక్షే కృష్ణపక్షే తథా పితౄన్ ।**
**వీరుధశ్చామృతమయైః శీతైరప్పరమాణుభిః ॥ 14 ॥**

**వీరుధౌషధి నిష్పత్త్యా మనుష్యపశుకీటకాన్ ।**
**ఆప్యాయయతి శీతాంశుః ప్రకాశాహ్లాదనేన తు ॥ 15 ॥**

ఈ విధంగా శుక్లపక్షంలో దేవతలను, కృష్ణపక్షంలో పితరులను, అమృతమయములైన చల్లనివారి పరమాణువులతో లతలను, తరులతలను, ఓషధులను ఉత్పత్తి చేయడం ద్వారా మనుష్యులను, పశువులను, కీటకాలను శీతకిరణుడు ఆనందపరచి, పుష్టిని కలుగజేస్తున్నాడు.

వి ॥ పదకొండో అధ్యాయంలో 22వ శ్లోకంలో కృష్ణపక్షంలో అమరులు సుధను స్వీకరిస్తారని చెప్పడం జరిగింది. కాని ఇక్కడ శుక్లపక్షంలో అమరులకు చంద్రుడు పుష్టినిస్తాడని చెప్పబడింది. శుక్లపక్షంలో సూర్యునిద్వారా తాను పొందిన సుధను కృష్ణపక్షంలో చంద్రుడు అందిస్తాడని దీని భావంగా గ్రహించాలి.

**వాయ్వగ్నిద్రవ సమ్భూతో రథశ్చన్ద్రసుతస్య చ ।**
**పిశంగైస్తురగైర్యుక్తః సోఽష్టాభిర్వాయువేగిభిః ॥ 16 ॥**

చంద్రుని కుమారుడైన బుధుని రథం వాయువుతోను, అగ్నిమయద్రవ్యంతోను ఉత్పన్నమైనదై, వాయువేగంతో కూడుకొన్న పచ్చని రంగుకల ఎనిమిది గుఱ్ఱాలు పూన్చినటువంటిది.

**స వరూథః సానుకర్షో యుక్తో భూసమ్భవైర్హయైః ।**
**సోపాసంగపతాకస్తు శుక్రస్యాపి రథోమహాన్ ॥ 17 ॥**

శుక్రుని రథం చాలపెద్దది (గొప్పది), దానికి వరూథం (రథరక్షణార్థం కప్పే వ్యాఘ్రచర్మం మున్నగునది), అనుకర్షం (ఇరుసు వెనుకనుండు కొయ్య), ఉపాసంగం (శస్త్రాలను ఉంచు అంబులపొది), పతాకం (జెండా) కూడి ఉన్నాయి. దానికి పూన్చిన గుఱ్ఱాలు భూమినుండి పుట్టినవి. (వరూథమనగా లోహమయమైన రథకవచం అని వేరొక అర్థం)

**అష్టాశ్వః కాంచనః శ్రీమాన్ భౌమస్యాపి రథో మహాన్ ।**
**పద్మరాగారుణైరశ్వైః సంయుక్తో వహ్నిసమ్భవైః ॥ 18 ॥**

అంగారకుని రథంకూడ గొప్పది. అది మిక్కిలి శోభాయమానమైన సువర్ణనిర్మితమైన రథం. దానికి ఎనిమిది గుఱ్ఱాలు ఉంటాయి. అవి పద్మరాగమణుల్లా ఎఱ్ఱగా ఉంటాయి. అవి అగ్నినుంచి జన్మించాయి. వాటిచే ఆ రథం పూన్చబడి ఉంటుంది.

**అష్టాభిః పాణ్డురైర్యుక్తో వాజిభిః కాంచనో రథః ।**
**తస్మింస్తిష్ఠతి వర్షాన్తే రాశౌ రాశౌ బృహస్పతిః ॥ 19 ॥**

బృహస్పతిరథం కాంచనరథం. అది తెల్లని ఎనిమిది గుఱ్ఱాలతో పూన్చబడి ఉంటుంది. దానిపై ప్రతిరాశిలోను సంవత్సరాంతంలో ఆయన ఉంటాడు.

**ఆకాశసమ్భవైరశ్వైః శబలైః స్యన్దనం యుతమ్ ।**
**తమారుహ్య శనైర్యాతి మన్దగామీ శనైశ్చరః ॥ 20 ॥**

ఆకాశంనుండి జన్మించినవి, చిత్రవిచిత్రాలైన రంగులు కలవి అయిన గుఱ్ఱాలను పూన్చిన రథాన్ని అధిరోహించి మందగామి అయిన శనైశ్చరుడు మెల్లగా నడుస్తాడు.

**స్వర్భానోస్తురగా హ్యష్టౌ భృంగాభా ధూసరం రథమ్ ।**
**సకృద్ యుక్తాస్తు మైత్రేయ! వహన్త్యవిరతం సదా ॥ 21 ॥**

మైత్రేయా! రాహువు రథం ధూసరవర్ణంతో (దుమ్మురంగుతో) ఉంటుంది. దానికి తుమ్మెదరంగు గుఱ్ఱాలు ఎనిమిది పూన్చబడి ఉంటాయి. వాటిని ఒకసారి రథానికి కడితే, ఎప్పుడూ నిరంతరాయంగా లాగుతూనే ఉంటాయి.

**ఆదిత్యాన్నిఃసృతో రాహుః సోమం గచ్ఛతి పర్వసు ।**
**ఆదిత్యమేతి సోమాచ్చ పునః సౌరేషు పర్వసు ॥ 22 ॥**

రాహువు సూర్యుని నుండి వెలువడి పర్వాలలో (పూర్ణిమలలో) చంద్రుని చేరుతూ ఉంటాడు. తిరిగి చంద్రుని నుంచి బయలుదేరి పర్వాలలో (అమావాస్యలలో) సూర్యుని చేరుతూ ఉంటాడు.

**తథా కేతురథస్యాశ్వా అప్యష్టౌ వాతరంహసః ।**
**పలాలధూమవర్ణాభా లాక్షారసనిభారుణాః ॥ 23 ॥**

అలాగా కేతువుకు సంబంధించిన రథానికి వేగంలో వాయువుతో సమానమైన ఎనిమిది గుఱ్ఱాలు ఉంటాయి. అవి ఎండుగడ్డిరంగు, పొగరంగు, లక్కరసంలా ఎఱ్ఱనిరంగు కలిగి ఉంటాయి.

**ఏతే మయా గ్రహాణాం వై తవాఽఽఖ్యాతా రథా నవ ।**
**సర్వే ధ్రువే మహాభాగ! ప్రబద్ధా వాయురశ్మిభిః ॥ 24 ॥**

మహాభాగా! నవగ్రహాలయొక్క ఈ తొమ్మిది రథాలను గూర్చి నేను నీకు తెలియజేశాను. ఇవి అన్నీ గాలిపగ్గాలద్వారా (వాయు సహిత కాంతిమార్గాలద్వారా) ధ్రువునికి కట్టబడి ఉన్నాయి.

**గ్రహర్క్షతారాధిష్ణ్యాని ధ్రువే బద్ధాన్యశేషతః ।**
**భ్రమన్త్యుచితచారేణ మైత్రేయానిలరశ్మిభిః ॥ 25 ॥**

గ్రహాలు, నక్షత్రాలు, తారామండలాలు అన్నీ ధ్రువునికి గాలిపగ్గాలద్వారా కట్టబడి తమకు తగిన గతిలో భ్రమణం చేస్తున్నాయి.

**యావన్త్యశ్చైవ తారాస్తాస్తావన్తో వాతరశ్మయః ।**
**సర్వే ధ్రువే నిబద్ధాస్తే భ్రమన్తో భ్రామయన్తి తమ్ ॥ 26 ॥**

తారలు ఎన్ని ఉన్నాయో, గాలిపగ్గాలు అన్ని ఉన్నాయి. అన్నీ ధ్రువుని యందు కట్టబడి, తాము తిరుగుతూ, ఆ ధ్రువుని (మండలాన్ని) త్రిప్పుతున్నాయి.

**తైలపీడా యథా చక్రం భ్రమన్తో భ్రామయన్తి వై ।**
**తథా భ్రమన్తి జ్యోతీంషి వాతావిద్ధాని సర్వశః ॥ 27 ॥**

నూనె గానుగ ఆడే పళ్ల చక్రములు తాము తిరుగుతూ, చక్రాన్ని (గానుగను) త్రిప్పునట్లుగా, సమస్తజ్యోతిస్సులు గాలితో బంధింపబడి తాము తిరుగుతూ (ధ్రువుని త్రిప్పుతూ) ఉన్నాయి.

**అలాతచక్రవద్ యాన్తి వాతచక్రేరితాని తు ।**
**యస్మాజ్జ్యోతీంషి వహతి ప్రవహస్తేన స స్మృతః ॥ 28 ॥**

సమస్తజ్యోతిర్గోళాలు గాలిచక్రం త్రిప్పితే, మండే కొరకంచుచక్రం తిరుగుతున్నటుగా తిరుగుతున్నాయి. జ్యోతిస్సులను వహిస్తున్నందువల్లనే ఆ గాలికి "ప్రవహం" అనే పేరు వచ్చింది.

**శిశుమారస్తు యః ప్రోక్తః స ధ్రువో యత్ర తిష్ఠతి ।**
**సన్నివేశం చ తస్యాపి శృణుష్వ మునిసత్తమ ॥ 29 ॥**

మునిశ్రేష్ఠా! ఆ ధ్రువుడు ఉండేచోటు శిశుమారం. దానిని గూర్చి చెప్పాను కదా! ఇక దాని ఉనికిని గూర్చి ఆలకించు.

**యదహ్నా కురుతే పాపం తం దృష్ట్వా నిశి ముచ్యతే ।**
**యావన్త్యశ్చైవ తారాస్తాః శిశుమారాశ్రితా దివి ।**
**తావన్త్యేవ తు వర్షాణి జీవత్యభ్యధికాని చ ॥ 30 ॥**

పగలుచేసిన పాపం రాత్రివేళ శిశుమారాన్ని చూస్తే తొలగిపోతుంది. ఆకాశంలో శిశుమారాన్ని ఆశ్రయించి ఎన్ని తారలు ఉన్నాయో, (దానిని వీక్షించినవాడు) అన్ని సంవత్సరాలు ఎక్కువగా జీవిస్తాడు.

**ఉత్తానపాదస్తస్యాథ విజ్ఞేయో హ్యుత్తరో హనుః ।**
**యజ్ఞోఽధరస్స విజ్ఞేయో ధర్మో మూర్ధానమాశ్రితః ॥ 31 ॥**

ఉత్తానపాదుడు ఆ శిశుమారపు పైదవుడ అని తెలియాలి. అడుగుదవుడ యజ్ఞుడు అని గ్రహించాలి. ధర్ముడు శిరస్సును ఆశ్రయించి ఉన్నాడు.

**హృది నారాయణశ్చాస్తే అశ్వినౌ పూర్వపాదయోః ।**
**వరుణశ్చార్యమా చైవ పశ్చిమే తస్య సక్థినీ ॥ 32 ॥**

దాని హృదయంలో నారాయణుడు ఉన్నాడు. ముందు కాళ్లయందు అశ్వినీదేవతలు ఉన్నారు. వెనుకకాళ్లతొడలపై వరుణుడు, అర్యముడు ఉన్నారు.

**శిశ్నః సంవత్సరస్తస్య మిత్రోఽపానం సమాశ్రితః ।**
**పుచ్ఛేఽగ్నిశ్చ మహేన్ద్రశ్చ కశ్యపోఽథ తతో ధ్రువః ।**
**తారకాశిశుమారస్య నాస్తమేతి చతుష్టయమ్ ॥ 33 ॥**

దాని శిశ్నస్థానంలో సంవత్సరుడు ఉన్నాడు. అపానప్రాంతంలో మిత్రుడు ఉన్నాడు. తోకపై అగ్ని, మహేంద్రుడు, కశ్యపుడు, ఆ తరవాత ధ్రువుడు ఉన్నారు. శిశుమారం యొక్క ఈ నాలుగు నక్షత్రాలు అస్తమించవు.

**ఇత్యేష సన్నివేశోఽయం పృథివ్యా జ్యోతిషాం తథా ।**
**ద్వీపానాముదధీనాం చ పర్వతానాం చ కీర్తితః ॥ 34 ॥**

**వర్షాణాం చ నదీనాం చ యే చ తేషు వసన్తి వై ।**
**తేషాం స్వరూపమాఖ్యాతం సంక్షేపః శ్రూయతాం పునః ॥ 35 ॥**

ఈ ప్రకారంగా భూమి, జ్యోతిర్గోళాలు, ద్వీపాలు, సముద్రాలు పర్వతాలు, వర్షాలు, నదులు. వీటి ఉనికిని గురించి, అందు నివసించేవారి స్వరూపం గురించి నీకు వివరించాను. మళ్లీ వాటిని గూర్చి సంగ్రహంగా విను.

**యదమ్బువైష్ణవః కాయస్తతో విప్ర! వసున్ధరా ।**
**పద్మాకారా సముద్భూతా పర్వతాబ్ధ్యాదిసంయుతా ॥ 36 ॥**

విప్రవర్యా! విష్ణుమూర్తికి సంబంధించిన జలస్వరూప శరీరం నుంచి పర్వతాలు, సముద్రాలు మున్నగు వాటితో కూడుకొన్న పద్మం వంటి ఆకారంతో భూమి ప్రభవించింది.

**జ్యోతీంషి విష్ణుర్భువనాని విష్ణు**
**ర్వనాని విష్ణు ర్గిరయో దిశశ్చ ।**
**నద్యః సముద్రాశ్చ స ఏవ సర్వం**
**యదస్తి యన్నాస్తి చ విప్రవర్య! ॥ 37 ॥**

విప్రోత్తమా! నక్షత్రాలు విష్ణువు. లోకాలు విష్ణువు. వనాలు విష్ణువు, పర్వతాలు, దిక్కులు, నదులు, సముద్రాలు. సర్వమూ ఆ విష్ణువే. ఉన్నదీ, లేనిదీ అంతా ఆ విష్ణువే.

**జ్ఞానస్వరూపో భగవాన్ యతోఽసా**
**వశేషమూర్తిర్న చ వస్తుభూతః ।**
**తతో హి శైలాబ్ధిధరాదిభేదాన్**
**జానీహి విజ్ఞాన విజృమ్భితాని ॥ 38 ॥**

ఆ భగవంతుడైన విష్ణువు జ్ఞానస్వరూపుడు. ఆయన అఖండమూర్తి కాని పరిచ్ఛిన్నపదార్థం కాదు. కాబట్టి శైలాలు, సముద్రాలు, భూమి మున్నగు వస్తువిభేదాలు ఆయన విజ్ఞాన లీలావిలాసాలని తెలుసుకో.

**యదా తు శుద్ధం నిజరూపి సర్వం**
**కర్మక్షయే జ్ఞానమపాస్తదోషమ్ ।**
**తదా హి సంకల్పతరోః ఫలాని**
**భవన్తి నో వస్తుషు వస్తుభేదాః ॥ 39 ॥**

కర్మక్షయం అయిన పిమ్మట, దోషాలు అన్నీ తొలగిపోయి స్వస్వరూపమైన విశుద్ధజ్ఞానం పూర్తిగా ఏర్పడితే, సంకల్పం అనే వృక్షం యొక్క ఫలాలు అయిన వస్తువులలో వస్తుభేదాలు అనేవి ఉండనే ఉండవు కదా!

**వస్త్వస్తి కిం కుత్రచిదాదిమధ్య**
**పర్యన్తహీనం సతతైకరూపమ్ ।**
**యచ్చాన్యథాత్వం ద్విజ! యాతి భూయో**
**న తత్తథా కుత్ర కుతో హి తత్త్వమ్ ॥ 40 ॥**

మొదలు, నడుమ, చివర లేకుండగా, ఎల్లప్పుడూ ఒకే రూపంతో ఉండే వస్తువు ఎక్కడయినా, ఎప్పుడయినా ఉంటుందా? ద్విజోత్తమా! ఏ వస్తువు మళ్లీ మళ్లీ మారుతుందో, ఏది పూర్వంలా ఉండదో, అక్కడ వాస్తవికత ఎక్కడ ఉంటుంది?

**మహీ ఘటత్వం ఘటతః కపాలికా**
**కపాలికా చూర్ణ రజస్తతోఽణుః ।**
**జనైః స్వకర్మస్తిమితాత్మనిశ్చయై**
**రాలక్ష్యతే బ్రూహి కిమత్రహి వస్తు ॥ 41 ॥**

ఒక విషయం చెప్పు. మట్టినుంచి కుండ తయారయింది. దానినుండి పెంకు, పెంకునుండి మట్టిపొడి, దానినుంచి అణువులు కనబడుతున్నాయి కదా! తమ కర్మలచేత ఆత్మజ్ఞానం మరుగున పడిపోయిన జనులకు ఇటు మృత్తులో నానావికారాలు గోచరిస్తాయి. కాని జ్ఞానులకు ఆ వికారజీతంలో మృత్తుమాత్రమే గోచరిస్తుంది. కాబట్టి ఏది ఇందులో వస్తువు?

**తస్మాన్న విజ్ఞానమృతేఽస్తి కించిత్**
**క్వచిత్ కదాచిద్ ద్విజ! వస్తుజాతమ్ ।**
**విజ్ఞానమేకం నిజకర్మభేద**
**విభిన్నచిత్తై ర్బహుధాఽభ్యుపేతమ్ ॥ 42 ॥**

ద్విజశ్రేష్ఠా! కాబట్టి విజ్ఞానం తప్ప పదార్థసముదాయమనేది ఎప్పుడూ, ఎక్కడా, ఏ కొంచెమూ లేదు. స్వస్వరూప జ్ఞానం అనే విజ్ఞానమొక్కటే తమ తమ కర్మభేదాలవల్ల, భిన్న భిన్నచిత్రాలకు నానావిధాలుగా గోచరిస్తోంది.

**జ్ఞానం విశుద్ధం విమలం విశోక**
**మశేష శోకాదినిరస్తసంగమ్ ।**

**ఏకం సదైకం పరమః పరేశః**
**స వాసుదేవో న యతోఽన్యదస్తి ॥ 43 ॥**

ఒక్కటైన ఆ జ్ఞానం మిక్కిలి శుద్ధమైనట్టిది. ఏ మాలిన్యం లేనట్టిది. శోకరహితమైనట్టిది. లోభం మున్నగు సమస్త సంగములూ లేనిది. ఆ సత్స్వరూపమైన ఒక్కటైన జ్ఞానమే పరముడు, పరేశ్వరుడు అయిన ఆ వాసుదేవుడు. ఆయన కంటె వేరు లేదు.

**సద్భావ ఏషో భవతో మయోక్తో**
**జ్ఞానం యథా సత్యమసత్యమన్యత్ ।**
**ఏతత్తు యత్సంవ్యవహారభూతం**
**తత్రాపి చోక్తం భువనాశ్రితం తే ॥ 44 ॥**

ఈ సద్భావాన్ని గురించి నేను నీకు ఇలా చెప్పాను. జ్ఞానం మాత్రమే సత్యం. ఇతరమంతా అసత్యం. సత్యం కన్న వ్యతిరిక్తమైన వ్యావహారికంగా సత్యంలా గోచరించే భువనాలకు సంబంధించిన విషయాలను కూడ నీకు చెప్పాను.

**యజ్ఞః పశుర్వహ్నిరశేష ఋత్విక్**
**సోమః సురాః స్వర్గమయశ్చ కామః ।**
**ఇత్యాదికర్మాశ్రితమార్గదృష్టం**
**భూరాదిభోగాశ్చ ఫలాని తేషామ్ ॥ 45 ॥**

యజ్ఞం, పశువు, అగ్ని, సమస్త ఋత్విక్కులు, సోమం, సురలు, స్వర్గమయవాంఛారీతి–ఈ విధంగా అనేకంగా కర్మమార్గంలో కనిపించేవి, వాటి ఫలితాలైన భూలోకనివాసాదిభోగాలను గూర్చి నీకు తెలియజేశాను.

**యచ్చైతద్ భువనగతం మయా తవోక్తం**
**సర్వత్ర వ్రజతి హి తత్ర కర్మవశ్యః ।**
**జ్ఞాత్వైవం ధ్రువమచలం సదైకరూపం**
**తత్ కుర్యాద్విశతి హి యేన వాసుదేవమ్ ॥ 46 ॥**

నీకు ఈ భువనాలను గురించి నేను చెప్పాను కదా! వాటి అన్నింటిలోను జీవుడు కర్మవశుడై వెడుతూ ఉంటాడు. కాబట్టి జ్ఞాని ఇలా తెలుసుకొని నిత్యుడు, అచలుడు, సదా ఏకరూపుడు అయిన వాసుదేవునిలో ఎలా ప్రవేశించాలో అలా చేయాలి.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే చంద్రాదిగ్రహవర్ణనం నామ ద్వాదశోఽధ్యాయః సమాప్తః ॥ 12 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో చంద్రాదిగ్రహవర్ణన అనే పన్నెండవ అధ్యాయం సమాప్తం ॥ 12 ॥

## త్రయోదశోఽధ్యాయః - పదమూడవ అధ్యాయం

## జడభరతోపాఖ్యానమ్ - జడభరతోపాఖ్యానం

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు చెప్పాడు

**భగవన్! సమ్యగాఖ్యాతం యత్ పృష్టోఽసి మయాఽఖిలమ్ ।**
**భూసముద్రాదిసరితాం సంస్థానం గ్రహసంస్థితమ్ ॥ 1 ॥**

భగవంతుడా! నేను అడిగిన విధంగా భూమి, సముద్రాలు, నదులు, వీటి ఉనికి గురించి, గ్రహాదుల సంస్థానం గురించి లెస్సగా వివరించావు.

**విష్ణ్వాధారం తథా చైతత్ త్రైలోక్యం సమవస్థితమ్ ।**
**పరమార్థస్తు తే ప్రోక్తో యథాజ్ఞానం ప్రధానతః ॥ 2 ॥**

ఈ మూడులోకాలు విష్ణువునందు ఆధారంగా చక్కగా ఎలా ఉన్నాయో, జ్ఞానం ప్రధానంగా ఎలా పరమార్థమయిందో నీ ద్వారా తెలియజేయబడింది.

**యస్త్వేతద్ భగవానాహ భరతస్య మహీపతేః ।**
**కథయిష్యామి చరితం తన్మమాఽఽఖ్యాతుమర్హసి ॥ 3 ॥**

భగవంతుడవైన నీవు భరతరాజేంద్రుని చరిత్రను చెబుతానని నాకు చెప్పావుకదా! ఆ కథను నాకు చెప్పడానికై ఇప్పుడు అర్హుడవయి ఉన్నావు.

**భరతః స మహీపాలః శాలగ్రామేఽవసత్ కిల ।**
**యోగయుక్తః సమాధాయ వాసుదేవే సదా మనః ॥ 4 ॥**

ఆ భరతమహీపాలుడు ధ్యానావిష్టుడై మనస్సును సదా వాసుదేవునియందు నిలిపి శాలగ్రామక్షేత్రంలో నివసించాడు కదా!

**పుణ్యదేశప్రభావేణ ధ్యాయతశ్చ సదా హరిమ్ ।**
**కథం తు నాభవన్ముక్తిర్యదభూత్ స ద్విజః పునః ॥ 5 ॥**

పుణ్యప్రదేశనివాసప్రభావంవల్ల, సదా విష్ణువును ధ్యానించినందువల్ల కూడ ఏ కారణంచే ముక్తి కలగలేదు? అతడు మళ్లీ ద్విజుడు ఎందువల్ల అయ్యాడు?

**విప్రత్వే చ కృతం తేన యద్భూయః సుమహాత్మనా ।**
**భరతేన మునిశ్రేష్ఠ! తత్ సర్వం వక్తుమర్హసి ॥ 6 ॥**

మునిప్రవరా! బ్రాహ్మణజన్మ పొందిన పిమ్మట, ఆ విఖ్యాతమహాత్ముడైన భరతునిచే ఏమి చేయబడింది? దానిని అంతా చెప్పదగియున్నావు” అని అడిగాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు పలికాడు

**శాలగ్రామే మహాభాగో భగవన్న్యస్తమానసః ।**
**స ఉవాస చిరం కాలం మైత్రేయ! పృథివీపతిః ॥ 7 ॥**

మైత్రేయా! ఆ మహాభాగుడైన ధరణీపతి భగవంతునిపై చిత్తం లగ్నంచేసి (ధ్యానం చేస్తూ) చాలాకాలం శాలగ్రామంలో నివసించాడు.

**అహింసాదిష్వశేషేషు గుణేషు గుణినాం వరః ।**
**అవాప పరమాం కాష్ఠాం మనసశ్చాపి సంయమే ॥ 8 ॥**

తపస్వియైన, సద్గుణవరిష్ఠుడగు భరతుడు అహింస మున్నగు సమస్తగుణాలలోను, అంతరింద్రియ నిగ్రహంలోను ఉత్తమమైన ఉత్కర్షను పొందాడు.

**యజ్ఞేశాచ్యుత గోవిన్ద మాధవానన్త కేశవ ।**
**కృష్ణ విష్ణో హృషీకేశేత్యాహ రాజా స కేవలమ్ ॥ 9 ॥**

ఆ భరతమహీపతి కేవలం "యజ్ఞేశ! అచ్యుత! గోవింద! మాధవ! అనంత! కేశవ! కృష్ణ! విష్ణూ! హృషీకేశ! వాసుదేవ" అనే హరి (పది) నామాలనే ఉచ్చరించాడు.

**నాన్యజ్జగాద మైత్రేయ! కించిత్ స్వప్నాన్తరేఽపి చ ।**
**ఏతత్పరం తదర్థం చ వినా నాన్యదచిన్తయత్ ॥ 10 ॥**

మైత్రేయా! మరొకటి ఏదీ కించిత్తయినా, కలలో కూడ అనేవాడు కాదు. ఆ హరినామశబ్దాన్ని, దాని అర్థాన్ని తప్ప మరొకటి ఏదీ మనస్సులో తలచేవాడు కాదు.

**సమిత్పుష్పకుశాదానం చక్రే దేవక్రియాకృతే ।**
**నాన్యాని చక్రే కర్మాణి నిఃసంగో యోగతాపసః ॥ 11 ॥**

నిస్సంగుడు, ధ్యాననిష్ఠుడు, తపస్వి అయిన ఆ భరతుడు దేవపూజానిమిత్తం సమిధలు, పుష్పాలు, దర్భలు తెచ్చుకోవడం చేసేవాడు కాని మరే పనులు చేసేవాడు కాదు.

**జగామ సోఽభిషేకార్థమేకదా తు మహానదీమ్ ।**
**సస్నౌ తత్ర తదా చక్రే స్నానస్యానన్తరక్రియాః ॥ 12 ॥**

ఒకప్పుడు ఆ రాజయోగి స్నానం చేయడానికై మహానదికి వెళ్లాడు. ఆ నదిలో స్నానం చేశాడు. అక్కడ స్నానం చేసిన తరువాత చేయవలసిన విధివిహితకృత్యాలు ఆచరించాడు.

**అథాఽఽజగామ తత్తీర్థం జలం పాతుం పిపాసితా ।**
**ఆసన్నప్రసవా బ్రహ్మన్నేకైవ హరిణీ వనాత్ ॥ 13 ॥**

బ్రాహ్మణవర్యా! ఆ సమయంలో ఆ వనం నుండి ఒక లేడి దప్పికతో నీరుత్రాగడానికై ఆ నదీతీరానికి వచ్చింది. అది ఒంటరిగా ఏతెంచింది. అది ప్రసవించడానికి సిద్ధంగా ఉంది.

**తతః సమభవత్తత్ర పీతప్రాయే జలే తయా ।**
**సింహస్య నాదః సుమహాన్ సర్వప్రాణిభయంకరః ॥ 14 ॥**

ఆ హరిణి నీరు త్రాగడం పూర్తి అయ్యే సమయంలో అక్కడ సమస్తప్రాణికోటికి భయమును కలిగిస్తూ సింహనాదం మిక్కిలి గట్టిగా వినవచ్చింది.

**తతః సా సహసా త్రాసాదాప్లుతా నిమ్నగాతటమ్ ।**
**అత్యుచ్చారోహణేనాస్యా నద్యాం గర్భః పపాత సః ॥ 15 ॥**

అంతట ఆ లేడి భయపడిపోయి కంగారుగా నది ఒడ్డు మీదకు ఒక్కమారు గెంతింది. అది మరీ పైకి ఎగిరిన కారణంచే దాని గర్భం (బయటకు వచ్చి) నదిలో పడిపోయింది.

**తమూహ్యమానం వేగేన వీచీమాలాపరిప్లుతమ్ ।**
**జగ్రాహ స నృపో గర్భాత్ పతితం మృగపోతకమ్ ॥ 16 ॥**

ఆలేడిగర్భంనుంచి బయటపడ్డ లేడికూన కెరటాల పరవళ్లపై తేలియాడుతూ నదిలో పోతుంటే, ఆ రాజు తటాలున పోయి దానిని పట్టుకొన్నాడు.

**గర్భప్రచ్యుతిదోషేణ ప్రోత్తుంగాక్రమణేన చ ।**
**మైత్రేయ! సాఽపి హరిణీ పపాత చ మమార చ ॥ 17 ॥**

మైత్రేయా! కడుపు ఒక్కమారుగా జారిపడిన క్లేశంవల్ల, ఆ లేడి ఒకేమారు మరీ పైకి ఎగిరి దూకినందువల్ల క్రిందపడిపోయి వెంటనే కన్నుమూసింది.

**హరిణీం తాం విలోక్యాథ విపన్నాం నృపతాపసః ।**
**మృగపోతం సమాదాయ నిజమాశ్రమమాగతః ॥ 18 ॥**

అటు పిమ్మట ఆ రాజయోగి కాలం చెల్లిపోయి కన్నుమూసిన ఆ లేడిని చూచి, లేడిపిల్లను చేతబట్టుకొని తన ఆశ్రమానికి చేరాడు.

**చకారానుదినం చాసౌ మృగపోతస్య వై నృపః ।**
**పోషణం పుష్యమాణశ్చ స తేన వవృధే మునే! ॥ 19 ॥**

మునీశ్వరా! అదిమొదలు ఆ నృపాలుడు ప్రతిదినం ఆ లేడిపిల్ల పోషణాన్ని చేబట్టాడు. అదికూడ ఆ రాజుపోషణలో పెరగసాగింది.

**చచారాశ్రమపర్యన్తం తృణాని గహనేషు సః ।**
**దూరం గత్వా చ శార్దూలత్రాసాదభ్యాయయౌ పునః ॥ 20 ॥**

అది ఆశ్రమం చుట్టూ పూరిమేతకై తిరిగేది. ఆ అడవి భూములలో దూరంగా పోయినా, పెద్దపులుల భయంతో మళ్లీ తిరిగి ఆశ్రమానికి వచ్చేసేది.

**ప్రాతర్గత్వాఽతి దూరం చ సాయమాయాద్ యథాశ్రమమ్ ।**
**పునశ్చ భరతస్యాభూ దాశ్రమస్యోటజాజిరే ॥ 21 ॥**

ఉదయమే చాలాదూరం పోయేది. సాయంకాలానికి మళ్లీ ఆశ్రమానికి యథాప్రకారంగా తిరిగి వచ్చేది. ఈ విధంగా అది భరతుని ఆశ్రమపర్ణశాలాప్రాంగణంలో ఉండేది.

**తస్య తస్మిన్మృగే దూరసమీపపరివర్తిని ।**
**ఆసీచ్చేతః సమాయుక్తం న యయావన్యతో ద్విజ! ॥ 22 ॥**

ద్విజోత్తమా! భరతునకు ఆ లేడి దూరంలో ఉన్నా, దగ్గరలో ఉన్నా, మనస్సు దానినే అంటిపెట్టుకొని ఉండేది. మరోవైపు పోయేది కాదు.

**విముక్తరాజ్యతనయః ప్రోజ్ఝితాశేషబాన్ధవః ।**
**మమత్వం స చకారోచ్చై స్తస్మిన్ హరిణబాలకే ॥ 23 ॥**

ఆ భరతుడు రాజ్యాన్ని త్యజించాడు. పిల్లలను విడిచి పెట్టేశాడు. సమస్త బాంధవులను విరక్తుడై దూరం చేసుకొన్నాడు. కాని ఆ లేడిపిల్లపై మితిమీరిన మమకారం పెంచుకొన్నాడు.

**కిం వృకైర్భక్షితో వ్యాఘ్రైః కిం సింహేన నిపాతితః ।**
**చిరాయమాణే నిష్క్రాన్తే తస్యాసీదితి మానసమ్ ॥ 24 ॥**

అది బయటకువెళ్లి చాలాసేపటివరకు తిరిగిరాకపోతే తోడేళ్లు మ్రింగేశాయేమో? పులులు తినేశాయేమో? సింహం చంపేసిందేమో? అని అతని మనస్సు గుబగుబలాడేది.

**ఏషా వసుమతీ తస్య ఖురాగ్రక్షతకర్బురా ।**
**ప్రీతయే మమ జాతోఽసౌ క్వ మమైణక బాలకః ॥ 25 ॥**

ఆ లేడిపిల్ల డెక్కల చివర గ్రుచ్చుకొన్న విచిత్రమైన రంగుగల నేల ఇదిగో! ఇది నా ఆనందానికై పుట్టింది. ఆ లేడికూన ఏమయిందో ఎక్కడ ఉందో కదా!

**విషాణాగ్రేణ మద్బాహు కణ్డూయనపరో హి సః ।**
**క్షేమేణాభ్యాగతోఽరణ్యా దపి మాం సుఖయిష్యతి ॥ 26 ॥**

ఆ లేడి తన కొమ్ము చివరిభాగంతో నా భుజం గోకడానికి ఇష్టపడేదికదా! అడవి నుంచి క్షేమంగా తిరిగి వచ్చి ఇక నన్ను సుఖపెడుతుందా!

**ఏతే లూనశిఖాస్తస్య దశనైరచిరోద్గతైః ।**
**కుశాః కాశా విరాజన్తే వటవః సామగా ఇవ ॥ 27 ॥**

అది క్రొత్తగా మొలిచిన పాల (లేత) పళ్లతో కొనలు కొరికిన దర్భల దుబ్బులు, రెల్లుదుబ్బులు ఇవిగో. అవి సామగానం చేసే బ్రహ్మచారుల విధంగా విరాజిల్లుతున్నాయి. (లేవడుగుల్లా ముద్దుగొల్పు తున్నాయి)

**ఇత్థం చిరగతే తస్మిన్ సచక్రే మానసం మునిః ।**
**ప్రీతి ప్రసన్నవదనః పార్శ్వస్థే చాభవన్మృగే ॥ 28 ॥**

ఈ విధంగా ఆ ముని మనస్సు అదివెళ్లి చాలాసేపయి తిరిగి రాకపోతే అనిపించేది. ఆ మృగశాబకం ప్రక్కన ఉంటే వదనం ప్రీతితో కళకళలాడేది.

**సమాధి భంగస్తస్యాసీత్ తన్మమత్వాదృతాత్మనః ।**
**సంత్యక్తరాజ్యభోగర్ధిస్వజనస్యాపి భూపతేః ॥ 29 ॥**

ఆ మహీపతి రాజ్యం, భోగం, సంపద, స్వజనం. ఇలా అన్నింటినీ విడిచిపెట్టినవాడయినా, ఆ సత్యాత్మునకు ఇట్లు లేడి యందు మమకారం పెరిగేసరికి సమాధిభంగం అయింది.

**చపలం చపలే తస్మిన్ దూరగం దూరగామిని ।**
**మృగపోతేఽభవచ్చిత్తం స్థైర్యవత్తస్య భూపతేః ॥ 30 ॥**

ఆ రాజుయొక్క స్థిరచిత్తం చంచలమై మృగశాబకం కదిలితే కదిలేది. అది దూరంగా వెళ్లిపోతే దూరంగా పోయేది.

### భరతుని ద్వితీయజన్మ

**కాలేన గచ్ఛతా సోఽథ కాలం చక్రే మహీపతిః ।**
**పితేవ సాస్రం పుత్రేణ మృగపోతేన వీక్షితః ॥ 31 ॥**

ఇలా కాలం గడుస్తూ ఉండగా, ఆ లేడిపిల్ల బిక్కమొగం పెట్టి కన్నీళ్లతో కన్నబిడ్డ తండ్రిని చూస్తూ ఉన్నట్లు తనను వీక్షిస్తూ ఉండగా ఆ ధరణీపతి కాలం చేశాడు.

**మృగమేవ తదాఽద్రాక్షీత్ త్యజన్ ప్రాణానసావపి ।**
**తన్మయత్వేన మైత్రేయ! నాన్యత్ కించిదచిన్తయత్ ॥ 32 ॥**

మైత్రేయా! ఆ భరతుడుకూడ ప్రాణాలు వదలిపెడుతూ ఆ లేడినే తన్మయత్వంతో చూశాడుకాని మరొక విషయాన్ని కించిత్తయినా స్మరించలేదు. (చివరి సమయంలో స్మరించవలసిన భగవంతుని గూర్చి కించిత్తూ చింతించలేదు.)

**తతశ్చ తత్కాలకృతాం భావనాం ప్రాప్య తాదృశీమ్ ।**
**జమ్బూమార్గే మహారణ్యే జాతో జాతిస్మరో మృగః ॥ 33 ॥**

ఆ తరువాత ఆ అవసానసమయంలో తాను చేసిన అటువంటి భావననే పొంది (తరువాతిజన్మలో) పూర్వజన్మస్మృతి కలిగిన ఒక మృగంగా జంబూమార్గమైన (కాలాంజరపర్వతప్రాంతంలో) ఒక భయంకరమైన అడవిలో జన్మించాడు. (విష్ణుసేవాఫలితంవల్ల పూర్వజన్మస్మృతి కలిగింది).

**జాతిస్మరత్వాదుద్విగ్నః సంసారస్య ద్విజోత్తమ! ।**
**విహాయ మాతరం భూయః శాలగ్రామముపాయయౌ ॥ 34 ॥**

ద్విజప్రవరా! పూర్వజన్మస్మృతి ఉన్న కారణంచే అది అతడు సంసారం పట్ల ఉదాసీనతను పొంది (భయాందోళన పొంది) తల్లిని విడిచిపెట్టి తిరిగి సాలగ్రామం చేరడం జరిగింది.

**శుష్కైస్తృణై స్తథాపర్ణైః స కుర్వన్నాత్మపోషణమ్ ।**
**మృగత్వహేతుభూతస్య కర్మణో నిష్కృతిం యయౌ ॥ 35 ॥**

ఎండుగడ్డితోను, పండుటాకులతోను తనపొట్ట తాను పోషించుకొంటూ మృగజన్మకు కారణమైన కర్మను అతడు (అది) తొలగించుకోవడం జరిగింది.

## భరతుని తృతీయజన్మ

**తత్ర చోత్సృష్టదేహోఽసౌ జజ్ఞే జాతిస్మరో ద్విజః ।**
**సదాచారవతాం శుద్ధే యోగినాం ప్రవరే కులే ॥ 36 ॥**

ఆ పుణ్యప్రదేశంలో శరీరం విడిచిపెట్టి, సదాచార సంపన్నులైన యోగీశ్వరుల పరిశుద్ధమైన ఉత్తమవంశంలో పూర్వజన్మస్మృతికల ద్విజుడై జన్మించాడు.

**సర్వవిజ్ఞానసమ్పన్నః సర్వశాస్త్రార్థతత్త్వవిత్ ।**
**అపశ్యత్ స చ మైత్రేయ! ఆత్మానం ప్రకృతేః పరమ్ ॥ 37 ॥**

మైత్రేయా! సర్వవిద్యలవిజ్ఞానంతో కూడుకొన్నవాడు. సకలశాస్త్రాల సారాంశాన్ని, నిగూఢరహస్యాలను, వాటి తత్త్వాన్ని తెలిసినవాడు అయి అతడు తనను ప్రకృతికన్న పరునిగా (దర్శించాడు.)

**ఆత్మనోఽధిగతజ్ఞానో దేవాదీని మహామునే! ।**
**సర్వభూతాన్యభేదేన స దదర్శ మహామతిః ॥ 38 ॥**

మహామునీ! ఆత్మజ్ఞానం తెలిసినవాడు కాబట్టి. దేవతలు మున్నగువారిని, సమస్తప్రాణులను ఆ మహాప్రాజ్ఞుడు తనకు అభేదంగా చూసేవాడు.

**న పపాఠ గురుప్రోక్తం కృతోపనయనః శ్రుతిమ్ ।**
**న దదర్శ చ కర్మాణి శాస్త్రాణి జగృహే న చ ॥ 39 ॥**

ఉపనయనం అయ్యుండి కూడ అతడు గురువు చెప్పిన వేదపాఠం చదవలేదు. చేయవలసిన కర్మలను ఆచరించలేదు. శాస్త్రాలను అభ్యసించలేదు.

**ఉక్తో౽పి బహుశః కించిజ్జడవాక్యమభాషత ।**
**తదప్యసంస్కారగుణం గ్రామ్యవాక్యోక్తిసంశ్రితమ్ ॥ 40 ॥**

పదేపదే పలుమార్లు చెప్పగా, ఏదో ఒకమాట జడునిలా అనేవాడు. అదికూడా సంస్కారం లేకుండా గ్రామ్యభాషలో మోటుగా ఉండేది.

**అపధ్వస్తవపుః సో౽పి మలినామ్బరధృగ్ ద్విజః ।**
**క్లిన్నదంతాన్తరః సర్వైః పరిభూతః స నాగరైః ॥ 41 ॥**

అతని శరీరం ఎప్పుడూ బూడిదకొట్టి ఉండేది. ఆ ద్విజుడు ఎల్లప్పుడూ మాసిపోయిన బట్టలు ధరించేవాడు. పళ్లనడుమ పాచిచేరి ఉండేది. నాగరకులందరూ అతనిని అవమానించేవారు.

**సమ్మాననా పరాం హానిం యోగర్ధేః కురుతే యతః ।**
**జనేనావమతో యోగీ యోగసిద్ధిం చ విందతి ॥ 42 ॥**

సాధకుని యోగాభివృద్ధికి సమ్మానం చాలా అంతరాయాన్ని (హాని) కలిగిస్తుంది. కాబట్టి జనులచే అవమానాన్ని పొందే యోగి శీఘ్రంగా యోగసిద్ధుడు అవుతాడు.

**తస్మాచ్చరేత వై యోగీ సతాం మార్గమదూషయన్ ।**
**జనా యథా౽వమన్యేరన్ గచ్ఛేయుర్నైవ సంగతిమ్ ॥ 43 ॥**

కాబట్టి యోగసాధకుడు సత్పురుషుల ధర్మాన్ని దూషించకుండా, జనులు తనను అవమానించేటట్లు, తనతో ఏవిధమైన పొత్తుపెట్టుకోకుండా పోయేటట్లు సంచరించాలి.

**హిరణ్యగర్భవచనం విచిన్త్యేత్థం మహామతిః ।**
**ఆత్మానం దర్శయామాస జడోన్మత్తాకృతిం జనే ॥ 44 ॥**

ఈ రీతిగా అన్న హిరణ్యగర్భుని (బ్రహ్మ) సారయుక్తమైన వాక్యం లెస్సగా స్మరించి, ఆ మహామేధావి జనులకు జడునిలా, ఉన్మత్తునిలా తనకు తాను కనిపించసాగాడు.

**భుంక్తే కుల్మాషవ్రీహ్యాదిశాకం వన్యం ఫలం కణాన్ ।**
**యద్ యదాప్నోతి సుబహు తదత్తే కాలసంయమమ్ ॥ 45 ॥**

అలసందలు, వడ్లు మున్నగునవి, కూరలు, అడవిలో దొరికే వస్తువులు, పండ్లు, గింజలు తినేవాడు. ఎంత కొంచెం దొరికినా, అదే చాల ఎక్కువ అనుకొని కాలక్షేపం కోసమై ప్రీతితో భుజించేవాడు.

**పితర్యుపరతే సో౽థ భ్రాతృభ్రాతృవ్యబాన్ధవైః ।**
**కారితః క్షేత్రకర్మాది కదన్నాహారపోషితః ॥ 46 ॥**

తండ్రి చనిపోయిన తరవాత సోదరులు, వారి పిల్లలు, బంధువులు అతనిచే పొలం పనులు మున్నగునవి చేయించేవారు. అతని పోషణకై పనికిమాలిన అన్నం పెట్టేవారు.

**స తూక్షపీనావయవో జడకారీ చ కర్మణి ।**
**సర్వలోకోపకరణం బభూవాహారచేతనః ॥ 47 ॥**

కాని అతడు ఎద్దులా బలిసిన శరీరం కలిగి, మొద్దులా పనిచేసేవాడు. సమస్తజనులకు అతడు తిండికి పనిచేసే పనిముట్టులా అయ్యాడు.

**తం తాదృశమసంస్కారం విప్రాకృతివిచేష్టితమ్ ।**
**క్షత్తా పృషతరాజస్య కాల్యై పశుమకల్పయత్ ॥ 48 ॥**

ఆ విధంగా ఏ సంస్కారం లేకుండా, బ్రాహ్మణవేషానికి తగని చేష్టలతో ఉన్న అతనిని ఒకనాడు పృషతరాజు సేవకుడు కాళికాదేవికి బలిపశువుగా సిద్ధం కావించాడు.

**రాత్రౌ తం సమలంకృత్య వైశసస్య విధానతః ।**
**అధిష్ఠితం మహాకాలీ జ్ఞాత్వా యోగేశ్వరం తథా ॥ 49 ॥**

**తతః ఖడ్గం సమాదాయ నిశితం నిశి సా తథా ।**
**క్షత్తారం క్రూరకర్మాణమచ్ఛినత్కంఠమూలతః ।**
**స్వపార్షదయుతా దేవీ పపౌ రుధిర ముల్బణమ్ ॥ 50 ॥**

ఆ సేవకుడు రాత్రి సమయంలో బలి ఇచ్చి చంపే పద్ధతిలో అతనిని అలంకరించాడు. బలిపీఠాన్ని అధిష్ఠించినవాడు మహాయోగేశ్వరుడని మహాకాళి తెలుసుకొని వాడి అయిన కత్తితీసుకొని ఆ రాత్రి సమయంలో క్రూరకర్ముడైన ఆ సేవకుని కంఠం మొదలంటానరికి వేసింది. పిమ్మట ఆ దేవి, ధ్వని చేస్తూ ఉబికిన రక్తాన్ని తన పరివారదేవతలతో కలిసి త్రాగింది.

## బోయీ అయిన భరతుడు

**తతః సౌవీరరాజస్య ప్రయాతస్య మహాత్మనః ।**
**విష్టికర్తాఽథ మన్యేత విష్టియోగ్యోఽయమిత్యపి ॥ 51 ॥**

ఆ తరవాత మహాత్ముడైన సౌవీరరాజు ఒకనాడు ప్రయాణమై పల్లకీలో వెడుతూ ఉండగా, ఆతని వద్ద వెట్టిచాకిరీ చేసేవాడు భరతుని చూసి ఇతడుకూడ వెట్టి చాకిరీకి పనికి వస్తాడనుకొన్నాడు.

**తం తాదృశం మహాత్మానం భస్మచ్ఛన్నమివానలమ్ ।**
**తం తాదృశమసంస్కారం విప్రాకృతివిచేష్టితమ్ ।**
**క్షత్తా సౌవీరరాజస్య విష్టియోగ్యమమన్యత ॥ 52 ॥**

అటువంటి సంస్కారవిహీనుని, బ్రాహ్మణరూపానికి తగని చేష్టలతో ఉన్న, నివురుగప్పిన నిప్పులా ఉన్న అట్టి మహాత్ముడైన భరతుని సౌవీరరాజుసేవకుడు వెట్టిచాకిరీకి తగినవాడిగా భావించాడు.

**స రాజా శిబికారూఢో గన్తుం కృతమతిర్ద్విజ! ।**
**బభూవేక్షుమతీతీరే కపిలర్షేర్వరాశ్రమమ్ ॥ 53 ॥**

ద్విజోత్తమా! ఆ రాజు పల్లకి అధిరోహించి ఇక్షుమతీ తీరంలో ఉన్న కపిలమహర్షి శ్రేష్ఠమైన ఆశ్రమానికి వెళ్లడానికై సంకల్పించుకొన్నవాడయ్యాడు.

**శ్రేయః కిమత్ర సంసారే దుఃఖప్రాయే నృణామితి ।**
**ప్రష్టుం తం మోక్షధర్మజ్ఞం కపిలాఖ్యం మహామునిమ్ ॥ 54 ॥**

మోక్షధర్మాలు తెలిసిన కపిలుడనే మహామునిని "నరులకు దుఃఖప్రాయమైన సంసారంలో శ్రేయస్సును కలిగించేదేమిటి?" అని అడగడానికి (వెడుతున్నాడు).

**ఉవాహ శిబికాం తస్య క్షత్తుర్వచనచోదితః ।**
**నృణాం విష్టిగృహీతానామన్యేషాం సోఽపి మధ్యగః ॥ 55 ॥**

రాజసేవకుని మాటను (రాజాజ్ఞగా) భావించిన భరతుడు వెట్టిచాకిరీకి కుదిరిన మిగిలిన నరులనడుమ ఉండి, నడుస్తూ, తద్వచనప్రకారం పల్లకిమోయసాగాడు.

**గృహీతో విష్టినా విప్రః సర్వజ్ఞానైక భాజనమ్ ।**
**జాతిస్మరోఽసౌ పాపస్య క్షయకామ ఉవాహ తామ్ ॥ 56 ॥**

సంపూర్ణమైన ఆత్మజ్ఞానానికి ముఖ్యపాత్రమైన విప్రుడు వెట్టిచాకిరీకి కట్టుబడి, పూర్వజన్మ విషయస్మరణం కలిగినవాడు కాబట్టి స్వీయపాప కర్మక్షయం కోసమై పల్లకీ మోశాడు.

**యయౌ జడగతిః సోఽథ యుగమాత్రావలోకనః ।**
**కుర్వన్ మతిమతాం శ్రేష్ఠస్తదన్యే త్వరితం యయుః ॥ 57 ॥**

బుద్ధిమంతులలో శ్రేష్ఠుడైన ఆ భరతుడు నాలుగుచేతుల కొలతపాటి దూరం చూస్తూ మెల్లగా నడుస్తూ వెళ్లాడు. మిగిలిన సేవకులు గబగబా నడిచారు.

**విలోక్య నృపతిః సోఽథ విషమాం శిబికాగతిమ్ ।**
**కిమేతదిత్యాహ సమం గమ్యతాం శిబికావహాః! ॥ 58 ॥**

అపుడు నరపాలుడు పల్లకీ నడక ఎగుడుదిగుడుగా సాగుతూ ఉండడం చూసి "ఏమిటిది? పల్లకీబోయీల్లారా! సరిగ్గా నడవండి" అని గట్టిగా అన్నాడు.

**పునస్తథైవ శిబికాం విలోక్య విషమాం హి సః ।**
**నృపః కిమేతదిత్యాహ భవద్భిర్గమ్యతేఽన్యథా ॥ 59 ॥**

తిరిగి మళ్లీపల్లకీ అదేవిధంగా ఎగుడుదిగుడుగా సాగడంచూసి ఆ రాజు “ఏమిటిది? మీరు మరోవిధంగా నడుస్తున్నారు?” అని గట్టిగా అరిచాడు.

**భూపతేర్వదతస్తస్య శ్రుత్వేత్థం బహుశో వచః ।**
**శిబికావాహకాః ప్రోచురయం యాతీత్యసత్వరమ్ ॥ 60 ॥**

ఈ విధంగా చాలాసార్లు ఆ రాజు అడిగిన పిమ్మట పల్లకీబోయీలు “వీడు వేగంగా నడవడం లేదు” అని భరతుని చూపించి అన్నారు.

**కిం శ్రాన్తోఽస్యల్పమధ్వానం త్వయోఢా శిబికా మమ ।**
**కిమాయాససహో న త్వం పీవానసి నిరీక్ష్యసే ॥ 61 ॥**

అపుడు రాజు ఆ విప్రునిచూసి “ఏం అలసిపోయావా? నాపల్లకీని కొద్దిదూరం మాత్రమే మోశావు. తెగబలిసి కనబడుతున్నావు. ఈ మాత్రం శ్రమను ఓర్చుకోలేవా?” అని వెటకారంగా గట్టిగా అన్నాడు.

**నాహం పీవాన్న చైవోఢా శిబికా భవతో మయా ।**
**న శ్రాన్తో ఽస్మి న చాయాసః సోఢవ్యోఽస్తి మహీపతే ! ॥ 62 ॥**

బ్రాహ్మణుడు ఆ మాటలు విని “మహీపాలా! నేను బలిసియున్నవాడనూ కాను. నీ పల్లకీని మోసేవాడనూ కాను. అలాగే అలసియున్నవాడనూ కాను. శ్రమఓర్చుకోవలసిందనేదీ ఇక్కడ ఏమీ లేదు” అని అర్థగర్భితంగా అన్నాడు.

**ప్రత్యక్షం దృశ్యసే పీవానద్యాపి శిబికా త్వయి ।**
**శ్రమశ్చ భారోద్వహనే భవత్యేవ హి దేహినామ్ ॥ 63 ॥**

రాజు “నీవు ప్రత్యక్షంగా బలిసి కనిపిస్తున్నావు కదా! పల్లకీ ఇప్పటికీ నీ భుజంపైనే ఉంది. బరువును మోసే ప్రాణులకు శ్రమ కలగడం సహజమైనదే కదా! అని ప్రశాంతంగా అన్నాడు.

### భరతుని అద్వైతబోధ

**ప్రత్యక్షం భవతా భూప! యద్దృష్టం మమ తద్వద ।**
**బలవానబలశ్చేతి వాచ్యం పశ్చాద్విశేషణమ్ ॥ 64 ॥**

అపుడు భరతుడు “రాజా! నాకు మొదట ఈ విషయం చెప్పు. నీకు నాలో ప్రత్యక్షంగా ఏం కనబడిందో! బలవంతుడు, బలహీనుడు అనే విశేషణం తరువాత చెప్పవలసింది కదా!

**త్వయోఢా శిబికా చేతి త్వయ్యద్యాపి చ సంస్థితా ।**
**మిథ్యైతదత్ర తు భవాంచ్ఛృణోతు వచనం మమ ॥ 65 ॥**

“నీవు పల్లకీని మోశావు. ఇప్పటికీ నీ భుజం మీద పల్లకీ ఉండనే ఉంది” అని నీవు అన్నావే! ఇదంతా ఇక్కడ మిథ్య. నీవు నామాటను సావధానంగా ఆలకించు.

**భూమౌ పాదయుగం త్వాస్తే జంఘే పాదద్వయే స్థితే ।**
**ఊరూ జంఘాద్వయావస్థౌ తదాధారం తథోదరమ్ ॥ 66 ॥**

భూమిపై రెండు పాదాలు ఉన్నాయి. పాదద్వయంపై పిక్కలు ఉన్నాయి. రెండు జంఘలపై ఊరువులు ఉన్నాయి. ఆ తొడలు ఆధారంగా ఉదరం ఉంది.

**వక్షః స్థలం తథా బాహూ స్కన్ధౌ చోదరసంస్థితా ।**
**స్కన్ధాశ్రితేయం శిబికా మమ భారోఽత్ర కింకృతః ॥ 67 ॥**

ఉదరంపై వక్షఃస్థలం అలాగే చేతులు, భుజాలపైభాగాలు ఉన్నాయి. స్కంధభాగాలను ఆశ్రయించి పల్లకీ ఉంది. ఇందులో నాకు భారం దేనివల్ల వచ్చినట్లు?

**శిబికాయాం స్థితం చేదం వపుస్త్వదుపలక్షితమ్ ।**
**తత్రత్వమహమప్యత్ర ప్రోచ్యతే చేదమన్యథా ॥ 68 ॥**

ఈ పల్లకీలో నీవు ఎక్కడికి వెడుతున్నావో, నీ దనబడే శరీరం ఉంది. వాస్తవంగా నీవు శిబికలో ఉన్నట్లు, నేను భూమిమీద ఉన్నట్లు చెప్పబడుతోంది. కాని ఈ విధంగా వచించడం మిథ్యమాత్రమే.

**అహం త్వం చ తథాఽన్యే చ భూతైరుహ్యామ పార్థివ ।**
**గుణప్రవాహపతితో భూతవర్గోఽపి యాత్యయమ్ ॥ 69 ॥**

పార్థివా! నిజానికి నీవు, నేను, అలాగే మిగిలినవారు పంచమహాభూతాలచే మోయబడుతున్నాము. ఆ పంచభూతాలు కూడ గుణప్రవాహంలో పడిపోతూ నడుస్తున్నాయి.

**కర్మవశ్యా గుణాశ్చైతే సత్త్వాద్యాః పృథివీపతే ।**
**అవిద్యాసంచితం కర్మ తచ్చాశేషేషు జన్తుషు ॥ 70 ॥**

మహీపతీ! ఈ సత్త్వం మున్నగుగుణాలు కర్మకు అధీనంలో ఉన్నాయి. కర్మ అనేది అవిద్యద్వారా సంపాదించుకొనేది. ఆ అవిద్య సమస్తప్రాణులలోను ఉంది.

**ఆత్మా శుద్ధోఽక్షరః శాన్తో నిర్గుణః ప్రకృతేః పరః ।**
**ప్రవృద్ధ్యపచయౌ నాస్య ఏకస్యాఖిలజన్తుషు ॥ 71 ॥**

దానికి అతీతమైనది ఆత్మ. అది విశుద్ధమైనది, అక్షరమైనది, శాంతమైనది, నిర్గుణమైనది, ప్రకృతికన్న పరమైనది. సమస్తప్రాణులలోను ఆ ఒకటే ఉండేది. దానికి వృద్ధి (పెరుగుదల), క్షయం (తరుగుదల)లేవు.

**యదా నోపచయస్తస్య న చైవాపచయో నృప ।**
**తదా పీవానసీతీత్థం కయా యుక్త్యా త్వయేరితమ్ ॥ 72 ॥**

నృపాలా! ఎప్పుడయితే ఆత్మకు పెరుగుదల తరుగుదలలు లేవో, అప్పుడు నీవు బలిసిఉన్నావని ఇట్లు ఏ యుక్తితో నీవు పలికావు?

**భూపాదజంఘాకట్యూరుజఠరాదిషు సంస్థితే ।**
**శిబికేయం యథా స్కన్ధే తథా భారః సమస్త్వయా ॥ 73 ॥**

**తదాఽన్యైర్జన్తుభిర్భూప శిబికోఢా న కేవలమ్ ।**
**శైలద్రుమగృహోత్థోఽపి పృథివీ సమ్భవోఽపి వా ॥ 74 ॥**

భూమి, పాదాలు, జంఘులు, నడుము, తొడలు, ఉదరం మొదలయిన వాటితో కూడుకొన్న మెడపై శిబిక ఎట్లున్నదో, సరిగ్గా నీచే శరీరం కూడ అలాగే ఉంది. భూపాలా! మిగిలిన జంతువుల అన్నింటి విషయమూ ఇంతే. కేవలం ఒక్క శిబికను మోయడం మాత్రమే కాదు. కొండలు, చెట్లు, ఇళ్లు మున్నగు వాటివల్ల కలిగే భారమంతా నీపై ఉంది. మరియు భూభారం కూడా మోస్తున్నావు.

**యదా పుంసః పృథగ్భావః ప్రాకృతైః కారణైర్నృప ।**
**సోఢవ్యస్తు తదాయాసః కథం వా నృపతే మయా ॥ 75 ॥**

రాజా! ప్రాకృతకారణాలకన్న పురుషుడు ఇలా వేరయినప్పుడు వాటి బరువు నేను మోయడమేమిటి? నరపాలా! అందువల్ల నాకు శ్రమ కలగడమేమిటి?

**యద్ద్రవ్యా శిబికా చేయం తద్ద్రవ్యో భూతసంగ్రహః ।**
**భవతో మేఽఖిలస్యాస్య మమత్వేనోపబృంహితః ॥ 76 ॥**

ఈ పల్లకీకి సంబంధించిన ద్రవ్యం సమస్తప్రాణులకు ఆధారమయిన ద్రవ్యమై ఉంది. అదే నీకు, నాకు, సమస్తానికి ఒకటే అయిఉంది. కాని మమత్వం ఆరోపించబడుతోంది." అని పలికాడు.

**ఏవముక్త్వాఽభవన్మౌనీ స వహంచ్ఛిబికాం ద్విజ! ।**
**సోఽపి రాజాఽవతీర్యోర్వ్యాం తత్పాదౌ జగృహే త్వరన్ ॥ 77 ॥**

ద్విజవర్యా! అని చెప్పి భరతుడు మౌనం వహించి పల్లకీని మోయసాగాడు. ఆ రాజు కంగారుపడిపోయి (పల్లకీని ఆపించి) నేలపై దిగి అతని రెండు పాదాలు పట్టుకున్నాడు" -అని పరాశరుడు చెప్పి ఇలా అంటున్నాడు

**భో భో విసృజ్య శిబికాం ప్రసాదం కురు మే ద్విజ! ।**
**కథ్యతాం కో భవానత్ర జాల్మరూపధరః స్థితః ॥ 78 ॥**

అపుడు రాజు "అయ్యా! అయ్యా! పల్లకీని విడిచిపెట్టి ద్విజప్రవరా! నన్ను అనుగ్రహించండి. ఇక్కడ జడప్రాయంగా అల్పుని వేషంలో ఉన్న తమరు ఎవరు? చెప్పండి.

**యో భవాన్ యన్నిమిత్తం వా యదాగమన కారణమ్ ।**
**తత్సర్వం కథ్యతాం విద్వన్ మహ్యం శుశ్రూషవే త్వయా ॥ 79 ॥**

మీరు ఎవరు? మీ రాకలోని కారణం ఏమిటి? అంతా నాకు తెలియజేయండి. ఓ విద్వాంసుడా! మీ శుశ్రూష చేయాలనుకొంటున్న ఈ దాసునకు తమరు సెలవియ్యండి" అని వినయంగా ప్రార్థించాడు.

**శ్రూయతాం కోఽహమిత్యేతద్వక్తుం భూప న శక్యతే ।**
**ఉపభోగనిమిత్తం చ సర్వత్ర గమనక్రియా ॥ 80 ॥**

అపుడాబ్రాహ్మణుడు "భూపాలా! ఆలకించు. నేను ఫలానా వాడనని చెప్పడానికి శక్యం కాదు. ఇక్కడకు సర్వవిధాలా నారాక కర్మఫలం అనుభవించడానికే.

**సుఖదుఃఖోపభోగౌ తు తౌ దేహాద్యుపపాదకౌ ।**
**ధర్మాధర్మోద్భవౌ భోక్తుం జన్తుర్దేహాదిమృచ్ఛతి ॥ 81 ॥**

సుఖానికి దుఃఖానికి సంబంధించిన అనుభవాలే దేహం మున్నగువాటికి కారణాలు. ధర్మాధర్మాలవల్ల కలిగే పుణ్యపాపాలను అనుభవించడానికే ప్రాణి దేహాదులను ధరిస్తుంది.

**సర్వస్యైవ హి భూపాల! జన్తోః సర్వత్ర కారణమ్ ।**
**ధర్మాధర్మౌ యతః కస్మాత్ కారణం పృచ్ఛ్యతే త్వయా ॥ 82 ॥**

మహీపాలా! అన్ని విషయాలలోను అన్నింటికి సర్వప్రాణులకు ధర్మాధర్మాలే కారణాలు కదా! మరి నీవు నా పల్యంకి వహన కర్మకు కారణం అడుగుతావు దేనికి?" అని అన్నాడు.

**ధర్మాధర్మౌ న సన్దేహః సర్వకార్యేషు కారణమ్ ।**
**ఉపభోగనిమిత్తం చ దేహాద్దేహాన్తరాగమః ॥ 83 ॥**
**యస్త్వేతత్ భవతా ప్రోక్తం కోఽహమిత్యేతదాత్మనః ।**
**వక్తుం న శక్యతే శ్రోతుం తన్మమేచ్ఛా ప్రవర్తతే ॥ 84 ॥**

అపుడు రాజు "సమస్తకర్మలకు కారణం ధర్మాధర్మాలే. అందు సందేహం లేదు. ఒక దేహం నుంచి మరోదేహానికి రాక కర్మఫలితం అనుభవించడానికే. అందునూ ఏమాత్రం సంశయం లేదు కాని "నేను ఫలానా వాడను" అని ఆత్మకు చెప్పడం శక్యం కాదని నీవు అన్నావే దానిని గూర్చి వినాలనే కోరికతో ఉన్నాను.

**యోఽస్తి సోఽహమితి బ్రహ్మన్! కథం వక్తుం న శక్యతే ।**
**ఆత్మన్యేష న దోషాయ శబ్దోఽహమితి యో ద్విజ! ॥ 85 ॥**

బ్రాహ్మణుడా! ఆ ఉంటున్నవాడు "అతణ్ణి నేనే" అని ఎందుకు చెప్పడానికి శక్యం కావడం లేదు? ద్విజోత్తమా! నేను అనే శబ్దం ఆత్మయందు అన్వయించడం తప్పు కానప్పుడు అట్లు చెప్పడానికి ఏమిటి అభ్యంతరం?" అన్నాడు.

**శబ్దోఽహమితి దోషాయ నాత్మన్యేష తథైవ తత్ ।**
**అనాత్మన్యాత్మవిజ్ఞానం శబ్దో వా భ్రాన్తిలక్షణః ॥ 86 ॥**

అంత ఆ బ్రాహ్మణుడు “నేను అన్నశబ్దం ఆత్మవిషయమై వర్తించడం దోషం కాదు. అది యథార్థం. ఆత్మకానిది ఆత్మ అనుకోవడం కాని, అట్లు అనడం కాని భ్రాంతికి లక్షణం.

**జిహ్వా బ్రవీత్యహమితి దన్తోష్ఠౌ తాలుకే నృప ।**
**ఏతే నాహం యతః సర్వే వాఙ్నిష్పాదనహేతవః ॥ 87 ॥**

నృపాలా! నాలుక ‘నేను’ అని పలుకుతోంది. దంతాలు, పెదవులు, దవుడలూ అలా అంటున్నవి. ఇవి అన్నీ వాక్కు పుట్టడానికి సాధనాలు కాని “నేను” మాత్రం కావు.

**కింహేతుభిర్వదత్యేషా వాగేవాహమితి స్వయమ్ ।**
**తథాఽపి వాగ్ నాహమేతద్ వక్తుమిత్థం న యుజ్యతే ॥ 88 ॥**

ఈ హేతువుల ద్వారా (జిహ్వాది సాధనాలద్వారా) వాక్కే ‘నేను’ అని స్వయంగా అంటున్నదా? (లేదు కదా!) ఆ కారణంచే వాక్కు ‘నేను’ అని చెప్పడం ఈ విధంగా ఒప్పదు.

**పిణ్డః పృథక్ యతః పుంసః శిరః పాణ్యాదిలక్షణః ।**
**తతోఽహమితి కుత్రైతాం సంజ్ఞాం రాజన్! కరోమ్యహమ్ ॥ 89 ॥**

రాజా! కాబట్టి తల, చేతులు మున్నగు దేహభాగలక్షణాలుకల పిండం పురుషుని (ఆత్మ) కన్న వేరు. ఇక ‘నేను’ అనే పేరు నన్ను దేనికి పెట్టమంటావు?

**యద్యన్యోఽస్తి పరః కోఽపి మత్తః పార్థివసత్తమ! ।**
**తదైషోఽహమయం చాన్యో వక్తుమేవమపీష్యతే ॥ 90 ॥**

రాజన్యోత్తమా! నాకంటె పరుడు వేరే ఎవడయినా ఉంటే అపుడు “నేను వీడిని, ఇతడు అన్యుడు” అని చెప్పడం యుక్తమవుతుంది.

**యదా సమస్తదేహేషు పుమానేకో వ్యవస్థితః ।**
**తదా హి కో భవాన్ సోఽహమిత్యేతద్ విఫలం వచః ॥ 91 ॥**

సమస్తదేహాలలోను ఉన్నవాడు ఒకే పురుషుడు అయినప్పుడు, “నీవెవడవు? నేను ఫలానావాడను” అన్నమాట నిష్ప్రయోజనం అవుతుంది.

**త్వం రాజా శిబికా చేయమిమే వాహాః పురఃసరాః ।**
**అయం చ భవతో లోకో న సదేతన్నృపోచ్యతే ॥ 92 ॥**

నృపాలా! ఇది పల్లకీ. నీవు రాజువు. వీరు ముందు నడిచేబోయీలు. వీరు నీ ప్రజలు–అని ఈ విధంగా అనడం వాస్తవానికి సత్యం కాదు.

**వృక్షాద్ దారు తతశ్చేయం శిబికా త్వదధిష్ఠితా ।**
**కిం వృక్షసంజ్ఞా వాఽస్యాః స్యాద్దారుసంజ్ఞాఽథవా నృప! ॥ 93 ॥**

రాజా! చెట్టునుంచి కొయ్య, కొయ్యనుంచి నీవు అధిష్ఠించిన పల్లకీ వచ్చాయి. ఇపుడు ఈ పల్లకీ పేరు చెట్టు అంటావా? లేక కొయ్య (కట్టె) అంటావా?

**వృక్షారూఢో మహారాజో నాయం వదతి తే జనః ।**
**న చ దారుణి సర్వస్త్వాం బ్రవీతి శిబికాగతమ్ ॥ 94 ॥**

నీ ప్రజలు మహారాజు చెట్టెక్కాడని అనడం లేదు. అలాగని కొయ్యను ఎక్కాడని అనడం లేదు. జనం అందరూ నిన్ను పల్లకీ ఎక్కావనే అంటున్నారు.

**శిబికా దారుసంఘాతో రచనాస్థితిసంస్థితః ।**
**అన్విష్యతాం నృపశ్రేష్ఠ తద్భేదే శిబికా త్వయా ॥ 95 ॥**

రాజశ్రేష్ఠా! వృక్షమనేది ఒకటే కట్టెలమోపై పనితనంలోని నేర్పుకూర్పువల్ల పల్లకీ అయింది. వృక్షమనే ఒక్క వస్తువే రచనా భేదాన్ని బట్టి నామభేదం పొందింది. కాబట్టి ఈ శిబికకు మూలమేదో నీ ద్వారా అన్వేషించబడుగాక!

**ఏవం ఛత్రశలాకానాం పృథగ్భాగే విమృశ్యతామ్ ।**
**క్వ యాతం ఛత్రమిత్యేష న్యాయ్యస్త్వయి తథా మయి ॥ 96 ॥**

ఇలాగే ఊచలు గొడుగు వేరుచేసి గొడుగును పరిశీలించు. ఇప్పుడు గొడుగు ఎక్కడికి పోయినట్లు? ఇదే పద్ధతి నీయందు నాయందు కూడ వర్తిస్తుంది.

వి॥ శలాకశబ్దానికి గొడుగుయొక్క కామ అనే అర్థం కూడ ఉంది.

**పుమాన్ స్త్రీ గౌరజా వాజీ కుంజరో విహగస్తరుః ।**
**దేహేషు లోకసంజ్ఞేయం విజ్ఞేయా కర్మహేతుషు ॥ 97 ॥**

మగవాడు, ఆడది, ఎద్దు(ఆవు), మేక, గుర్రం, ఏనుగు, పక్షి, చెట్టు–ఇది కర్మకారణాలవల్ల వచ్చిన దేహాలకు లోకం పెట్టినపేరు అని తెలుసుకోవాలి.

**పుమాన్ దేవో న నరో నపశుర్న చ పాదపః ।**
**శరీరకృతిభేదాస్తు భూపైతే కర్మయోనయః ॥ 98 ॥**

ధరణీపాలా! పురుషుడు దేవతా కాదు. నరుడూ కాదు. పశువూ కాదు. చెట్టూ కాదు. ఇవన్నీ కర్మవల్ల ఏర్పడిన శరీరాలలోని ఆకారభేదాలు మాత్రమే.

**వస్తు రాజేతి యల్లోకే యచ్చ రాజభటాత్మకమ్ ।**
**తథాऽన్యచ్చ నృపేత్థం తన్న సత్యం కల్పనామయమ్ ॥ 99 ॥**

నరపాలా! లోకంలో రాజని, రాజభటులని, అలాగే తదితరములని అనబడుతున్న వస్తువు సత్యం కాదు. అది కల్పనామయం.

వి॥ సత్సంకల్పమనామయమ్–అని పాఠాంతరం. వస్తువు సత్పదార్థం కాదు. అది కేవలం సంకల్పనరూపం అని భావం.

**యత్తు కాలాన్తరేణాపి నాన్యాం సంజ్ఞాముపైతి వై ।**
**పరిణామాదిసమ్భూతాం తద్వస్తు నృప! తచ్చ కిమ్ ॥ 100 ॥**

నరపాలా! ఏది మరోకాలంలో పరిణామం మున్నగు వాటివల్ల మరోపేరు పొందనిదే వస్తువు అంటే. అది ఏమిటి అంటావా?

**త్వం రాజా సర్వలోకస్య పితుః పుత్రో రిపో రిపుః ।**
**పత్న్యాః పతిః పితా సూనోః కిం త్వం భూప! వదామ్యహమ్ ॥ 101 ॥**

భూపాలా! నీవు సమస్తప్రజలకు రాజువు. తండ్రికి కుమారుడవు. శత్రువుకు శత్రువు. ధర్మపత్నికి భర్తవు. కొడుకుకు తండ్రివి. ఇప్పుడు నిన్ను నేను ఏమని పిలవాలో చెప్పు.

**త్వం కిమేతచ్ఛిరః కిం ను గ్రీవా తవ తథోదరమ్ ।**
**కిము పాదాదికం త్వం వా తవైతత్ కిం మహీపతే! ॥ 102 ॥**

ధరణీపతీ! నీవు ఎవరవు? నీ శిరస్సా, కంఠమా, ఉదరమా పాదం మున్నగునవా? ఇది నీదా? లేక ఇది నీవా?

**సమస్తావయవేభ్యస్త్వం పృథక్ భూప! వ్యవస్థితః ।**
**కోఽహమిత్యత్ర నిపుణో భూత్వా చిన్తయ పార్థివ! ॥ 103 ॥**

భూపాలా! కాబట్టి శరీరంలోని అన్ని అవయవాల కన్న నీవు వేరుగా ఉన్నావు. "నేను ఎవరిని?" అన్న విషయంలో తత్త్వనిపుణుడవై పర్యాలోచించు.

**ఏవం వ్యవస్థితే తత్త్వే మయాఽహమితి భాషితుమ్ ।**
**పృథక్కారణనిష్పాద్యం శక్యతే నృపతే! కథమ్ ॥ 104 ॥**

నృపాలా! తత్త్వవిచారం ఇలా ఉండగా నాద్వారా "నేను" అని చెప్పడానికి, పృథగ్భావంతో వేరుచేసి చెప్పడానికి ఎలా శక్యమవుతుంది?"–అని ద్విజుడు పలికాడని పరాశరుడు మైత్రేయునకు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే జడభరతోపాఖ్యానం నామ త్రయోదశోఽధ్యాయః సమాప్తః ॥ 13 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో జడభరతోపాఖ్యానం అనే పదమూడవ అధ్యాయం సమాప్తం ॥ 13 ॥



## చతుర్దశోఽధ్యాయః - పద్నాల్గవ అధ్యాయం

## పరమశ్రేయః ఉద్దిశ్య సౌవీరరాజప్రశ్నః-భరతస్య సమాధానమ్

పరమశ్రేయస్సును గూర్చి సౌవీరరాజు ప్రశ్న - భరతుని సమాధానం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**నిశమ్య తస్యేతి వచః పరమార్థసమన్వితమ్ ।**
**ప్రశ్రయావనతో భూత్వా తమాహ నృపతిర్ద్విజమ్ ॥ 1 ॥**

ఈ విధంగా భరతుని తత్త్వవిచారంతో కూడుకొన్న ఆత్మబోధ విని నరపాలుడు వినయపూర్వకంగా వంగి నమస్కరించి ఆద్విజునితో ఇలా అన్నాడు.

**భగవన్! యత్త్వయా ప్రోక్తం పరమార్థమయం వచః ।**
**శ్రుతే తస్మిన్ భ్రమన్తీవ మనసో మమ వృత్తయః ॥ 2 ॥**

"భగవత్స్వరూపుడవైన బ్రాహ్మణోత్తమా! నీవు పరమార్థంతో కూడుకొన్న జ్ఞానబోధ చేశావు. అది వినేసరికి (నామనస్సు) నా అంతఃకరణ ప్రవృత్తులు భ్రమపడుతున్నట్లున్నాయి.

**ఏతద్వివేకవిజ్ఞానం యదశేషేషు జన్తుషు ।**
**భవతా దర్శితం విప్ర! తత్పరం ప్రకృతేర్మహత్ ॥ 3 ॥**

విప్రోత్తమా! సకలప్రాణులలోను నీవు దర్శించి చెప్పిన వివేక విజ్ఞానం ఏదయితే ఉందో, అది ప్రకృతికన్న విలక్షణమయిన మహోన్నతమయిన పరబ్రహ్మం.

**నాహం వహామి శిబికాం శిబికా న మయి స్థితా ।**
**శరీరమన్యదస్మత్తో యేనేయం శిబికా ధృతా ॥ 4 ॥**

నేను పల్లకీని మోయడం లేదు. శిబిక నామీద లేదు. ఈ పల్లకీని మోస్తున్న శరీరం నాకన్న వేరు.

**గుణప్రవృత్త్యా భూతానాం ప్రవృత్తిః కర్మచోదితా ।**
**ప్రవర్తన్తే గుణా హ్యేతే కిం మమేతి త్వయోదితమ్ ॥ 5 ॥**

ప్రాణులప్రవర్తన సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాల ప్రవృత్తిని బట్టి ఉంటుంది. ఆ గుణాలు కూడ కర్మలచే ప్రేరేపించబడతాయి. ఇందు నా ప్రవృత్తి ఏముందని నీ వన్నావు.

**ఏతస్మిన్ పరమార్థజ్ఞ! మమ శ్రోత్రపథం గతే ।**
**మనో విహ్వలతామేతి పరమార్థార్థితాం గతమ్ ॥ 6 ॥**

పరమార్థం తెలిసిన విజ్ఞుడా! ఈ నీ ఆత్మబోధ నా చెవినిపడగానే మనస్సు వ్యాకులత చెందింది. ఆ తత్త్వార్థ ప్రయోజనం తెలుసుకోవాలనే కోరికతో ఉంది.

**పూర్వమేవ మహాభాగం కపిలర్షిమహం ద్విజ! ।**
**ప్రష్టుమభ్యుద్యతో గత్వా శ్రేయః కిం త్వత్ర శంస మే ॥ 7 ॥**

ద్విజప్రవరా! నేను ఇదివరకే మహాభాగుడైన కపిలమహర్షివద్దకు ప్రయాణమై వెళ్ళి ఈ లోకంలో ఏది శ్రేయస్సో చెప్పమని అడగడానికై బయలుదేరాను.

**తదన్తరే చ భవతా తదేతద్వాక్యమీరితమ్ ।**
**తేనైవ పరమార్థార్థం త్వయి చేతః ప్రధావతి ॥ 8 ॥**

కాని మార్గమధ్యంలోనే నీవు ఈ మాట అన్నావు కాబట్టి ఆ పరమార్థం తెలుసుకోవడానికై నా మనస్సు నీ వైపు పరుగులు పెడుతోంది.

**కపిలర్షిర్భగవతః సర్వభూతస్య వై ద్విజ ।**
**విష్ణోరంశో జగన్మోహనాశాయోర్వీముపాగతః ॥ 9 ॥**

ద్విజశ్రేష్ఠా! కపిలమహర్షి సర్వాత్ముడైన భగవంతుడగు విష్ణుమూర్తి అంశ. జగత్తులోని వ్యామోహాన్ని నశింపజేయాలని భూమిపై అవతరించాడు.

**స ఏవ భగవాన్ నూనమస్మాకం హితకామ్యయా ।**
**ప్రత్యక్షతామత్ర గతో యథైతద్ భవతోచ్యతే ॥ 10 ॥**

నీవు ఇలా తెలియజేశావు కాబట్టి ఆ భగవంతుడైన కపిలమహర్షియే మామేలుకోరి ఇక్కడ ప్రత్యక్షమయి నాడని భావిస్తున్నాను.

**తన్మహ్యం ప్రణతాయ త్వం యచ్ఛ్రేయః పరమం ద్విజ ।**
**తద్వదాఖిలవిజ్ఞానజలవీచ్యుదధిర్భవాన్ ॥ 11 ॥**

ద్విజోత్తమా! నేను నీకు వంగి నమస్కరిస్తున్నాను. పరమశ్రేయస్సు ఏదో అది నీవు చెప్పు. నీవు అఖండవిజ్ఞానమనే జలతరంగాలకు సముద్రంవంటివాడవు.” అని అడిగాడు.

**బ్రాహ్మణ ఉవాచ :–**బ్రాహ్మణుడు చెప్పాడు

**భూప! పృచ్ఛసి కిం శ్రేయః పరమార్థం ను పృచ్ఛసి ।**
**శ్రేయాంస్యపరమార్థాని అశేషాణి చ భూపతే ॥ 12 ॥**

అంత ఆ ద్విజుడు “భూపాలా! శ్రేయస్సు గురించి ప్రశ్నిస్తున్నావా? లేక పరమార్థం గురించి అడుగుతున్నావా? మహీపతీ! సకలములైన శ్రేయస్సులు పరమార్థాలు ఏ మాత్రం కాదు.

**దేవతారాధనం కృత్వా ధనసమ్పదమిచ్ఛతి ।**
**పుత్రానిచ్ఛతి రాజ్యం చ శ్రేయస్తస్యైవ తన్నృప ॥ 13 ॥**

నృపాలా! దేవతలను ఆరాధనంచేసి ధనం, సంపద కోరుకొంటూ ఉంటాడు. పుత్రులను, రాజ్యాన్ని కాంక్షిస్తూ ఉంటాడు. ఆ ఆరాధన చేసేవానికి అదే శ్రేయస్సు.

**కర్మ యజ్ఞాత్మకం శ్రేయః స్వర్లోకఫలదాయి చ ।**
**శ్రేయః ప్రధానం చ ఫలే తదేవానభిసంహితే ॥ 14 ॥**

కర్మమనగా యజ్ఞరూపం. అది స్వర్గలోకఫలరూపమైన శ్రేయస్సును ఇస్తుంది. యజ్ఞకర్మ శ్రేయస్సే. కాని ప్రధానమైన శ్రేయస్సు మాత్రం ఫలమునందు ఏ కాంక్ష లేనిదే.

**ఆత్మా ధ్యేయః సదా భూప! యోగయుక్తైస్తథాஉపరమ్ ।**
**శ్రేయస్తస్యైవ సంయోగః శ్రేయో యః పరమాత్మనా ॥ 15 ॥**

భూపాలా! యోగసాధనచేసే సాధకులు ప్రకృతికన్న అతీతమైన ఆత్మను ధ్యానించాలని కోరుకొంటారు. ఎందువల్ల నంటే పరమాత్మతో సంయోగరూపమయిన శ్రేయస్సు మాత్రమే పరమశ్రేయస్సు అని.

**శ్రేయాంస్యేవమనేకాని శతశోஉథ సహస్రశః ।**
**సన్త్యత్ర పరమార్థస్తు న త్వేతే శ్రూయతాం చ మే ॥ 16 ॥**

ఈ విధంగా శ్రేయస్సులు అనేక విధాలుగా వందలకొలది వేలకొలది ఉన్నాయి. ఇవి ఏవీ పరమార్థం కావు. పరమార్థం ఏమిటో నేను చెబుతాను. ఆలకించు.

**ధర్మాయ త్యజ్యతే కిన్ను పరమార్థో ధనం యది ।**
**వ్యయశ్చ క్రియతే కస్మాత్కామప్రాప్త్యుపలక్షణః ॥ 17 ॥**

ధనం పరమార్థం అయితే ధర్మం కోసం త్యాగం చేస్తారా? (ఎవరైనా పరమార్థాన్ని త్యాగం చేయరు కదా!) ఇక కోరికలను తీర్చుకొనే ఆసక్తితో ధనం వ్యయం చేస్తారా? (పరమార్థాన్ని వ్యయంచేసే అవివేకి ఉండదు కదా!)

**పుత్రశ్చేత్ పరమార్థః స్యాత్ సోஉప్యన్యస్య నరేశ్వర! ।**
**పరమార్థభూతః సోஉన్యస్య పరమార్థో హి తత్పితా ॥ 18 ॥**

నరేశ్వరా! పుత్రుడే పరమార్థం అయితే, అతడు (ఆ తండ్రి) మఱి యొకనికి (ఆతని తండ్రికి) పరమార్థం కావాలి. ఇలా వానితండ్రి కూడ ఇంకొకనికి పరమార్థం అవ్వాలి. ఈ విధంగా పరమార్థనిశ్చయం అనేది స్థిరంగా లేకుండ పోతుంది.

**ఏవం న పరమార్థోஉస్తి జగత్యస్మింశ్చరాచరే ।**
**పరమార్థో హి కార్యాణి కారణానామశేషతః ॥ 19 ॥**

ఈ ప్రకారంగా ఈ చరాచరజగత్తులో పరమార్థం అనేదే లేకుండా పోతుంది. సకలకారణాలకు కార్యరూపంలో ఉండేవి ఒక్కపరమార్థమే కదా!

**రాజ్యాదిప్రాప్తిరత్రోక్తా పరమార్థతయా యది ।**
**పరమార్థా భవన్త్యత్ర న భవన్తి చ వై తతః ॥ 20 ॥**

ఈ లోకంలో రాజ్యం మున్నగునవి పరమార్థంవల్ల లభించేవి అని చెబుతామంటే, ఈ పరమార్థాలు ఇపుడు ఉంటాయి కాని తరువాత ఉండేవి కావు.

**ఋగ్యజుస్సామనిష్పాద్యం యజ్ఞకర్మ మతం తవ ।**
**పరమార్థభూతం తత్రాపి శ్రూయతాం గదతో మమ ॥ 21 ॥**

ఋగ్వేదయజుర్వేదసామవేదాలవల్ల లభించే యజ్ఞసంబంధమైన కర్మయే పరమార్థం అని నీ అభీష్టమయితే ఆ విషయమై కూడ చెబుతాను. ఆలకించు.

**యత్తు నిష్పాద్యతే కార్యం మృదా కారణభూతయా ।**
**తత్ కారణానుగమనాజ్జాయతే నృప! మృణ్మయమ్ ॥ 22 ॥**

నృపాలా! కారణమైన మట్టిచేత కుండ మున్నగు కార్యం తయారవుతోంది. అపుడు కారణమైన వస్తువును అనుసరించి అది (కార్యం) మట్టిదని తెలుస్తోంది.

**ఏవం వినాశిభిర్ద్రవ్యైః సమిదాజ్యకుశాదిభిః ।**
**నిష్పాద్యతే క్రియా యా తు సా భవిత్రీ వినాశినీ ॥ 23 ॥**

ఈ విధంగా వినాశనాన్ని పొందే సమిధలు, నెయ్యి,దర్భలు మున్నగు ద్రవ్యాలతో పుట్టించబడే క్రియ కూడా నశించిపోయేదే అవుతుంది.

**అనాశీ పరమార్థస్తు ప్రాజ్ఞైరభ్యుపగమ్యతే ।**
**తత్తు నాశి న సన్దేహో నాశిద్రవ్యోపపాదితమ్ ॥ 24 ॥**

పరమార్థానికి నాశనం లేదని ప్రాజ్ఞులచే అనుభవపూర్వకంగా చెప్పబడినమాట. నశించే ద్రవ్యాలతో తయారు చేసింది నశిస్తుంది. అందు సందేహం ఏమీ లేదు.

**తదేవాఫలదం కర్మ పరమార్థో మతస్తవ ।**
**ముక్తిసాధనభూతత్వాత్ పరమార్థో న సాధనమ్ ॥ 25 ॥**

ఫలాన్ని కాంక్షించని నిష్కామకర్మ పరమార్థం అనడం నీ అభిమతమయితే, అది ముక్తికి సాధనం మాత్రమే అవుతోంది. కాన పరమార్థం కాదు. పరమార్థం సాధ్యం కాని సాధనం కాదు.

**ధ్యానం చైవాత్మనో భూప! పరమార్థార్థశబ్దితమ్ ।**
**భేదకారి పరేభ్యస్తు పరమార్థో న భేదవాన్ ॥ 26 ॥**

భూపాలా! ఆత్మధ్యానం పరమార్థం అనే శబ్దంచే చెప్పబడదు. అది ఇతర వస్తువులనుంచి వేరు చేసేది. భేదం కలిగిస్తుంది. పరమార్థం ఎన్నటికి భేదం కలది కాదు.

**పరమాత్మాత్మనోర్యోగః పరమార్థ ఇతీర్యతే ।**
**మిథ్యైతదన్యద్ ద్రవ్యం హి నైతి తద్ద్రవ్యతాం యతః ॥ 27 ॥**

ఇక ఆత్మపరమాత్మల సంయోగం పరమార్థం అందామా అది మిథ్యమాత్రమే. ఒక ద్రవ్యం మరో ద్రవ్యం కాదు కదా!

**తస్మాచ్ఛ్రేయాంస్యశేషాణి నృపైతాని న సంశయః।**
**పరమార్థస్తు భూపాల! సంక్షేపాచ్ఛ్రూయతాం మమ ॥ 28 ॥**

నృపాలా! కాబట్టి ఇలా శ్రేయస్సులు అనేక విధాలుగా ఉన్నాయి. సందేహం లేదు. భూపాలా! పరమార్థాన్ని గూర్చి నేను సంక్షేపంగా చెబుతున్నాను. ఆలకించు.

**ఏకో వ్యాపీ సమః శుద్ధో నిర్గుణః ప్రకృతేః పరః।**
**జన్మవృద్ధ్యాదిరహిత ఆత్మా సర్వగతోఽవ్యయః ॥ 29 ॥**

ఆత్మ ఏకం. వ్యాపకం. సమం. శుద్ధం. నిర్గుణం. ప్రకృతికన్న పరం. జన్మ,వృద్ధి మున్నగునవి లేనిది. అది సర్వగతం. అవ్యయం.

**పరజ్ఞానమయోఽసద్భిర్నామజాత్యాదిభిర్విభుః।**
**న యోగవాన్న యుక్తోఽభూన్నైవ పార్థివ! యోక్ష్యతే ॥ 30 ॥**

రాజన్యవర్యా! పరమజ్ఞానమయమైన పరమార్థం అసత్తులైన నామం, జాతి మున్నగువాటితో సర్వవ్యాపకమయిన ఆత్మకు యోగం కాని, కలిసియుండడం గాని ఇదివరకు గాని, ఇప్పుడు కాని, ఇకపై కాని ఉండదు.

**తస్యాత్మపరదేహేషు సతోఽప్యేకమయం హి యత్।**
**విజ్ఞానం పరమార్థోఽసౌ ద్వైతినోఽతత్త్వదర్శినః ॥ 31 ॥**

తనదేహంలోను, పరదేహాలలోను ఉన్నప్పటికీ అది ఒక్కటే అన్న విజ్ఞానమే పరమార్థం. రెండనేవారు తత్త్వదర్శులు కారు.

**వేణురన్ధ్రప్రభేదేన భేదః షడ్జాదిసంజ్ఞితః।**
**అభేదవ్యాపినో వాయోస్తథా తస్య మహాత్మనః ॥ 32 ॥**

**ఏకత్వం రూపభేదశ్చ బాహ్యకర్మప్రవృత్తిజః।**
**దేవాదిభేదేఽపధ్వస్తే నాస్త్యేవావరణే హి సః ॥ 33 ॥**

ఏ భేదంలేకుండా వ్యాపించే వాయువుకు పిల్లనగ్రోవిలో గల రంధ్రాలను బట్టి షడ్జం మొదలయిన భేదాలు కనబడుతున్నట్లే ఆ పరమాత్మకు ఏకస్వరూపమైన ఆత్మకు భేదం బాహ్యకర్మప్రవృత్తివల్ల గోచరిస్తోంది. దేవాదిశరీరభేదం తొలగిపోతే ఆ భేదం ఉండదు. అవిద్యాకృతమైన ఆవరణ ఉన్నంతవరకే ఆ భేదం ఉంటుంది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే పరమశ్రేయః ఉద్దిశ్య సౌవీరరాజప్రశ్నః-భరతస్య సమాధానం చేతి చతుర్దశోఽధ్యాయః సమాప్తః ॥ 14 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో పరమశ్రేయస్సును గూర్చి సౌవీరరాజుప్రశ్న-భరతుని సమాధానం అనే పద్నాల్గవ అధ్యాయం సమాప్తం ॥ 14 ॥

## పంచదశోఽధ్యాయః - పదునైదవ అధ్యాయం

## ఋభునిదాఘసంవాదః - ఋభునిదాఘ సంవాదం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ఇత్యుక్తే మౌనినం భూయశ్చిన్తయానం మహీపతిమ్ ।**
**ప్రత్యువాచాథ విప్రోఽసావద్వైతాన్తర్గతాం కథామ్ ॥ 1 ॥**

ఇలా చెబుతూ ఉండగా, మహీపతి మళ్లీ మౌనంగా ఆలోచిస్తూ ఉండిపోయాడు. అంతట ఆ విప్రుడు అద్వైతవిషయం అంతర్గతంగా ఉన్న కథను ఈ రీతిగా చెప్పసాగాడు.

**శ్రూయతాం నృపశార్దూల ! యద్గీతమృభుణా పురా ।**
**అవబోధం జనయతా నిదాఘస్య మహాత్మనః ॥ 2 ॥**

నృపశార్దూలా! మహాత్ముడైన నిదాఘునకు పూర్వం ఋభుమహర్షి జ్ఞానాన్ని కలిగిస్తూ చెప్పిన గీతం ఆలకించు.

**ఋభుర్నామాభవత్ పుత్రో బ్రహ్మణః పరమేష్ఠినః ।**
**విజ్ఞాతతత్త్వసద్భావో నిసర్గాదేవ భూపతే! ॥ 3 ॥**

పరమేష్ఠి అయిన బ్రహ్మకుమారుడు ఋభుడు అనే ఆయన ఒకడు ఉండేవాడు. మహీపతీ! ఆయనకు తెలియవలసిన పరమార్థతత్త్వం, సత్పదార్థజ్ఞానం సహజంగానే లభించింది.

**తస్య శిష్యో నిదాఘోఽభూత్ పులస్త్యతనయః పురా ।**
**ప్రాదాదశేషవిజ్ఞానం స తస్మై పరయా ముదా ॥ 4 ॥**

ఆయనకు ముందునుంచి పులస్త్యుని కుమారుడైన నిదాఘుడు అనే శిష్యుడు ఉండేవాడు. ఆయన ఆ శిష్యునికి మహాసంతోషంతో సమస్తవిజ్ఞానాన్ని అనుగ్రహించాడు.

**అవాప్తజ్ఞానతత్త్వస్య న తస్యాద్వైతవాసనా । (తంత్రస్య)**
**స ఋభుస్తర్కయామాస నిదాఘస్య నరేశ్వర! ॥ 5 ॥**

నరేంద్రా! ఆ నిదాఘుడు జ్ఞానం కలిగించే సకలశాస్త్రాలు చదివినా, అతనికి అద్వైతవాసన అబ్బలేదన్న విషయం ఆ ఋభుడు గ్రహించాడు.

**దేవికాయాస్తటే వీరనగరం నామ వై పురమ్ ।**
**సమృద్ధమతిరమ్యం చ పులస్త్యేన నివేశితమ్ ॥ 6 ॥**

'దేవిక' అనే నదీతీరంలో పులస్త్యుడు అన్నింటితోను అభివృద్ధిపొందిన, మిక్కిలి మనోహరమైన "వీరనగరం" అనే పురం కట్టించాడు.

**రమ్యోపవనపర్యన్తే స తస్మిన్ పార్థివోత్తమ! ।**
**నిదాఘో నామ యోగజ్ఞ ఋభుశిష్యోఽవసత్ పురా ॥ 7 ॥**

రాజన్యోత్తమా! సుందరములైన ఉద్యానవనాలతో కళకళలాడే ఆ నగరంలోనే పూర్వం యోగవేత్త అయిన ఋభుశిష్యుడగు నిదాఘుడు నివసించేవాడు.

**దివ్యే వర్షసహస్రే తు సమతీతేఽస్య తత్పురమ్ ।**
**జగామ స ఋభుః శిష్యం నిదాఘమవలోకకః ॥ 8 ॥**

వేయి దివ్యసంవత్సరాలు గడచిపోయిన పిమ్మట, తన శిష్యుడైన నిదాఘుని చూడాలనే సంకల్పంతో, ఋభుమహర్షి అతని నగరానికి వెళ్లాడు.

**స తస్య వైశ్వదేవాన్తే ద్వారాలోకనగోచరే ।**
**స్థితస్తేన గృహీతార్ఘ్యో నిజవేశ్మ ప్రవేశితః ॥ 9 ॥**

ఆ నిదాఘుడు వైశ్వదేవబలి పూర్తిచేసే సమయానికి గుమ్మం దగ్గరకు వెళ్లి అతనికి కనబడే దూరంలో నిలబడ్డాడు. ఆ శిష్యుడు గురువును చూసి, అర్ఘ్యం సమర్పించి తన ఇంటిలో ప్రవేశపెట్టాడు.

**ప్రక్షాలితాంఘ్రిపాణిం చ కృతాసనపరిగ్రహమ్ ।**
**ఉవాచ స ద్విజశ్రేష్ఠో భుజ్యతామితి సాదరమ్ ॥ 10 ॥**

కాళ్లూ, చేతులు కడుగుకోవడం పూర్తి అయిన తరవాత, ఉచితమైన ఆసనంపై అతనిని కూర్చోబెట్టి ఆ ద్విజశ్రేష్ఠుడు సాదరంగా భోజనం చేయమని గురువును కోరాడు.

**ఋభురువాచ :–** ఋభుడు పలికాడు.

**భో విప్రవర్య! భోక్తవ్యం యదన్నం భవతో గృహే ।**
**తత్ కథ్యతాం కదన్నేషు న ప్రీతిః సతతం మమ ॥ 11 ॥**

“ఓ విప్రశ్రేష్ఠా! నీ గృహంలో అన్నం భుజించాలంటే, నీ ఇంట్లోగల ఆహారపదార్థాలు ఏమిటో చెప్పు. నీరసాన్నాలపై నాకు ఎన్నడూ ప్రీతి కలగదు” అన్నాడు.

**నిదాఘ ఉవాచ:–**నిదాఘుడు అన్నాడు.

**సక్తుయావకవాట్యానామపూపానాం చ మే గృహే ।**
**యద్రోచతే ద్విజశ్రేష్ఠ ! తత్ త్వం భుంక్ష్వ యథేచ్ఛయా ॥ 12 ॥**

“ద్విజశ్రేష్ఠా! నా గృహమందు సత్తుపిండి, యవలపిండితో తయారుచేసిన రొట్టెలు, అప్పాలు ఉన్నాయి. తమ కిష్టమైనది యథేచ్ఛగా భుజించవచ్చు” అన్నాడు.

**ఋభురువాచ :–** ఋభువు అన్నాడు.

**కదన్నాని ద్విజైతాని మృష్టమన్నం ప్రయచ్ఛ మే ।**
**సంయావ పాయసాదీని ద్రప్సఫాణితవన్తి చ ॥ 13 ॥**

"ద్విజా! ఇవన్నీ పనికిమాలిన ఆహారాలు. నాకు మృష్టాన్నం పెట్టు. సారుపత్తులు (హల్వా), పరమాన్నం, పెరుగు, కండచక్కెరతో తయారుచేసిన భక్ష్యవిశేషాలు మున్నగునవి వడ్డించు" అన్నాడు.

**నిదాఘ ఉవాచ:**–నిదాఘుడు పలికాడు.

**హే హే శాలిని మద్గేహే యత్కించిదతిశోభనమ్ ।**
**భక్ష్యోపసాధనం మృష్టం తేనాస్యాన్నం ప్రసాధయ ॥ 14 ॥**

"ఓ గృహలక్ష్మీ (మనోహరీ)! మన యింట్లో మంచి ఆహారం ఏ కొంచెం ఉన్నా, పరిశుభ్రమైన తియ్యని భక్ష్యాలు సమకూర్చి, వాటితో ఈయనకు భోజనం వడ్డించు" అన్నాడు.

**బ్రాహ్మణ ఉవాచ:**– బ్రాహ్మణుడు పలికాడు.

**ఇత్యుక్తా తేన సా పత్నీ మృష్టమన్నం ద్విజస్య యత్ ।**
**ప్రసాధితవతీ తద్వై భర్తుర్వచనగౌరవాత్ ॥ 15 ॥**

భర్త ఇలా అన్న వెంటనే ఆ ఇల్లాలు ఆయన మీది గౌరవంతో అప్పటికప్పుడు మృష్టాన్నం తయారుచేసి ఆ ద్విజప్రవరుడైన ఋభువుకు వడ్డించింది.

**తం భుక్తవన్తమిచ్ఛాతో మృష్టమన్నం మహామునిమ్ ।**
**నిదాఘః ప్రాహ భూపాల! ప్రశ్రయావనతః స్థితః ॥ 16 ॥**

ధరణీపాలా! ఇలా తనకునచ్చిన మధురాహారం తిన్న ఆ మహామునితో నిదాఘుడు వినయంతో వంగి నిల్చుండి ఈ రీతిగా అన్నాడు.

**నిదాఘ ఉవాచ :**– నిదాఘుడు పలికాడు.

**అపి తే పరమా తృప్తిరుత్పన్నా తుష్టిరేవ చ ।**
**అపి తే మానసం స్వస్థమాహారేణ కృతం ద్విజ ॥ 17 ॥**

**క్వ నివాసో భవాన్ విప్ర! క్వ చ గన్తుం సముద్యతః ।**
**ఆగమ్యతే చ భవతా యతస్తచ్చ ద్విజోచ్యతామ్ ॥ 18 ॥**

"ద్విజప్రవరా! నీకు బాగా తృప్తికలిగిందా? సంతుష్టి అయిందా? ఈ ఆహారంతో నీ మనస్సు కుదుట పడిందా? విప్రోత్తమా! తమరి నివాసం ఎక్కడ? ఎక్కడికి వెళ్లాలనే సంకల్పంతో బయలుదేరారు?ద్విజశ్రేష్ఠా! ఎక్కడనుంచి ఇక్కడకు వచ్చారు? తెలియజేయవలసింది?" అని గురుభక్తితో ప్రార్థించాడు.

**ఋభురువాచ :**– ఋభుడు అన్నాడు.

**క్షుద్యస్య తస్య భుక్తేఽన్నే తృప్తిర్బ్రాహ్మణ! జాయతే ।**
**న మే క్షున్నాభవత్ తృప్తిః కస్మాన్మాం పరిపృచ్ఛసి ॥ 19 ॥**

**వహ్నినా పార్థివే ధాతౌ క్షపితే క్షుత్సముద్భవః ।**
**భవత్యమ్భసి చ క్షీణే నృణాం తృడపి జాయతే ॥ 20 ॥**

బ్రాహ్మణోత్తమా! ఆకలి ఉన్నవాడు అన్నం తింటే అతనికి తృప్తి కలుగుతుంది. నాకు ఆకలీ వేయలేదు. తృప్తి అన్నదీ కలుగలేదు. ఎందుకు నన్ను సప్రశ్రయంగా ప్రశ్నిస్తావు? నరులకు జఠరాగ్నివల్ల పార్థివధాతువు క్షీణిస్తే ఆకలి పుడుతుంది. జలధాతువు క్షీణిస్తే దప్పికకూడ కలుగుతుంది.

**క్షుత్తృషౌ దేహధర్మాఖ్యే న మమైతే యతో ద్విజ! ।**
**తతః క్షుత్సమ్భవాభావాత్ తృప్తిరస్త్యేవ మే సదా ॥ 21 ॥**

ద్విజోత్తమా! ఆకలి, దప్పిక (తృష్ణ) దేహధర్మాలు అని చెప్పబడతాయి. అందువల్ల ఇవి నావి కావు. (నేను అనే దానిది కావు). నాకు ఆకలివేయడం అనేదే లేనందువల్ల ఎల్లప్పుడూ తృప్తి అనేది ఉండనే ఉంది.

**మనసః స్వస్థతా తుష్టిశ్చిత్తధర్మావిమౌ ద్విజ ।**
**చేతసో యస్య తత్ పృచ్ఛ పుమానేభిర్న యుజ్యతే ॥ 22 ॥**

ద్విజప్రవరా! మనస్సుకు కుదురు, మనస్సంతుష్టి. ఇవి రెండూ చిత్తధర్మాలు. కాబట్టి నీవు ఆ చిత్తాన్ని వీటిని గూర్చి అడుగు. పురుషునకు (ఆత్మకు) వీటితో ఏ సంబంధం లేదు.

**క్వ నివాసస్తవేత్యుక్తం క్వ గన్తాసి చ యత్త్వయా ।**
**కుతశ్చాగమ్యతే తత్ర త్రితయేఽపి నిబోధ మే ॥ 23 ॥**

నీ నివాసం ఎక్కడ అన్నావు. "ఎక్కడకు వెడుతున్నావని అడిగావు నీవు. ఎక్కడనుండి వస్తున్నావని కూడ అన్నావు. ఈ మూడింటి విషయం చెబుతాను. గ్రహించు.

**పుమాన్ సర్వగతో వ్యాపీ ఆకాశవదయం యతః ।**
**కుతః కుత్ర క్వ గన్తాసీత్యేతదప్యర్థవత్ కథమ్ ॥ 24 ॥**

పురుషుడు (ఆత్మ) సర్వగతుడు. ఆకాశంలా సర్వవ్యాపకుడు. అందువల్ల "ఎక్కడనుంచి, ఎక్కడ ఉంటూ, ఎక్కడకు వెడుతున్నావు?" అనేది ఎలా అర్థవంతం అవుతుంది?

**నాహం గన్తా న చాగన్తా నైకదేశనికేతనః ।**
**త్వం చాన్యే చ న చ త్వం త్వం నాన్యే నైవాహమప్యహమ్ ॥ 25 ॥**

ఆ నేను వెళ్లేవాడను కాను. వచ్చేవాడను కాను. ఒకేచోట ఉండేవాడను కాను. నీవు నీవూ కావు. అన్యులు అన్యులూ కారు. నేను నేనూ కాను.

**మృష్టం న మృష్టమప్యేషా జిజ్ఞాసా మే కృతా తవ ।**
**కిం వక్ష్యసీతి తత్రాపి శ్రూయతాం ద్విజసత్తమ! ॥ 26 ॥**

ద్విజసత్తమా! 'తియ్యనిది–తియ్యనిదికానిది అనే ఈ జిజ్ఞాసకూడ నేనే నీకు కలిగించాను. దానికి నీవేమి చెబుతావో అని. ఆ విషయంలో కూడ ఆలకించు.

**కిమస్వాద్వథవా మృష్టం భుంజతోఽస్తి ద్విజోత్తమ! ।**
**మృష్టమేవ యదామృష్టం తదైవోద్వేగకారకమ్ ॥ 27 ॥**

ద్విజశ్రేష్ఠా! తినేవానికి రుచి కానిది(కాని) తియ్యనిది (కాని) అని ఏముంది? ఒకప్పుడు తియ్యగా ఉండేదే మరొకప్పుడు తియ్యగా లేక ఉద్వేగకారకమవుతోంది.

**అమృష్టం జాయతే మృష్టం మృష్టాదుద్విజతే జనః ।**
**ఆదిమధ్యావసానేషు కిమన్నం రుచికారకమ్ ॥ 28 ॥**

ఒకప్పుడు అరుచికరమయినదే మరొకప్పుడు రుచికరమవుతుంది. రుచికరమైన వస్తువువల్ల జనుడు బాధపడతాడు. ఎప్పుడైనా మొదటా, నడుమా, చివరా అన్నం ఒకే విధంగా రుచిగా ఉంటుందా?

**మృన్మయం హి గృహం యద్వన్మృదా లిప్తం స్థిరం భవేత్ ।**
**పార్థివోఽయం తథా దేహః పార్థివైః పరమాణుభిః ॥ 29 ॥**

మట్టితో కట్టిన ఇల్లు ఆ మట్టితో పూస్తేనే గట్టిపడ్డట్లు. ఈ పార్థివదేహంకూడ పార్థివపరమాణువులతోనే గట్టిపడుతుంది.

**యవగోధూమముద్గాది ఘృతం తైలం పయోదధి ।**
**గుడం ఫలాదీని తథా పార్థివాః పరమాణవః ॥ 30 ॥**

యవలు, గోధుమలు, పెసలు మున్నగునవి; నేయి, నూనె, పాలు, పెరుగు, బెల్లం, పండ్లు మొదలైనవి అన్నీ పార్థివపరమాణువులు.

**తదేతత్ భవతా జ్ఞాత్వా మృష్టామృష్టవిచారి యత్ ।**
**తన్మనః సమతాలమ్బి కార్యం సామ్యం హి ముక్తయే ॥ 31 ॥**

కాబట్టి ఈ విషయాన్ని నీవు తెలుసుకొని రుచి, అరుచి అనే ఆలోచనచేసే నీ మనస్సును సమత్వాన్ని ఆశ్రయించేటట్లు చేయాలి ఎందువల్లనంటే సమత్వంవల్లనే ముక్తి కదా!

**ఇత్యాకర్ణ్య వచస్తస్య పరమార్థాశ్రితం నృప ।**
**ప్రణిపత్య మహాభాగో నిదాఘో వాక్యమబ్రవీత్ ॥ 32 ॥**

నృపాలా! ఇలా చెప్పిన పరమార్థంతో కూడుకొన్న ఋభుని వాక్యంవిని, మహాభాగుడైన నిదాఘుడు ఆయనపాదాలకు నమస్కరించి ఇలా అన్నాడు.

**ప్రసీద మద్ధితార్థాయ కథ్యతాం యస్త్వమాగతః ।**
**నష్టో మోహస్తవాకర్ణ్య వచాంస్యేతాని మే ద్విజ ॥ 33 ॥**

"ద్విజోత్తమా! ప్రసన్నుడవు కమ్ము. నామేలు కోసమై చెప్పు. "వచ్చినవాడవు నీవు ఎవరవు? నీ యీమాటలు వినడంతోడనే నామోహం నశించింది" అని వేడుకొన్నాడు.

**ఋభురస్మి తవాచార్యః ప్రజ్ఞాదానాయ తే ద్విజ! ।**
**ఇహాగతోఽహం యాస్యామి పరమార్థస్తవోదితః ॥ 34 ॥**

అంత ఋభుడు "ద్విజశ్రేష్ఠా! నేను ఋభుడను. నీ ఆచార్యుడను. నీకు జ్ఞానం బోధించాలని ఇక్కడకు వచ్చాను. ఇక నేను వెడతాను. నీకు పరమార్థం ఏమిటో చెప్పాను.

**ఏవమేకమిదం విద్ధి న భేది సకలం జగత్ ।**
**వాసుదేవాభిధేయస్య స్వరూపం పరమాత్మనః ॥ 35 ॥**

ఈ రీతిగా "సకలజగత్తూ ఒకటే అని, భేదం ఉన్నది కాదని, వాసుదేవుడనే పేరుగల పరమాత్మస్వరూపమని గ్రహించు" అని అన్నాడు.

**తథేత్యుక్త్వా నిదాఘేన ప్రణిపాతపురఃసరమ్ ।**
**పూజితః పరయా భక్త్యా ఇచ్ఛతః ప్రయయావృభుః ॥ 36 ॥**

అలాగే అని నిదాఘుడు ఆయనకు సాష్టాంగనమస్కారంచేసి, పరమభక్తితో పూజించాడు. ఋభుడు కూడ తన ఇచ్ఛానుసారంగా వెళ్లిపోయాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే ఋభునిదాఘసంవాదో నామ పంచదశోఽధ్యాయః సమాప్తః ॥ 15 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో ఋభునిదాఘసంవాదం అనే పదునైదవ అధ్యాయం సమాప్తం ॥15 ॥



## షోడశోఽధ్యాయః - పదునారవ అధ్యాయం

## ఆత్మతత్త్వోపదేశః - ఆత్మతత్త్వోపదేశం

**ఋభుర్వర్షసహస్రే తు సమతీతే నరేశ్వర ।**
**నిదాఘజ్ఞానదానాయ తదేవ నగరం యయౌ ॥ 1 ॥**

భరతుడు ఇలా చెబుతున్నాడు. సౌవీరమహారాజా! వేయి సంవత్సరాలు గడచిన తరవాత, నిదాఘునకు జ్ఞానబోధచేయాలని ఋభుడు మళ్లీ ఆ నగరానికే వెళ్లాడు.

**నగరస్య బహిః సోఽథ నిదాఘం దదృశే మునిః ।**
**మహాబలపరీవారే పురం విశతి పార్థివే ॥ 2 ॥**

ఆ ఋభుమహర్షి నగరం వెలుపల శిష్యుడైన నిదాఘుని చూశాడు. ఆ సమయంలో గొప్ప సైన్యంతో, ఎక్కువ పరివారంతో రాజు నగరప్రవేశం చేస్తున్నాడు.

**దూరే స్థితం మహాభాగం జనసమ్మర్దవర్జకమ్ ।**
**క్షుత్క్షామకణ్ఠమాయాన్తమరణ్యాత్ ససమిత్కుశమ్ ॥ 3 ॥**

అడవినుంచి సమిధలు దర్భలు పట్టుకొనివస్తూ ఆకలిచే బక్కచిక్కిన గొంతుతో, ఏ జనసమ్మర్దం లేకుండా, దూరంగా నిలిచియున్న మహాభాగుడైన శిష్యుని చూశాడు.

**దృష్ట్వా నిదాఘం స ఋభురుపగమ్యాభివాద్య చ ।**
**ఉవాచ కస్మాదేకాన్తే స్థీయతే భవతా ద్విజ ॥ 4 ॥**

ఆ ఋభుమహాముని నిదాఘుని చూసి దగ్గరకు వచ్చి అభివాదనం చేసి "ద్విజోత్తమా! ఏ కారణంచే నీవు ఇలా ఏకాంతంగా ఉన్నావు?" అని అడిగాడు.

**నిదాఘ ఉవాచ :-** నిదాఘుడు చెప్పాడు

**భో విప్ర! జనసమ్మర్దో మహానేష జనేశ్వరే ।**
**ప్రవివిక్షౌ పురం రమ్యం తేనాత్ర స్థీయతే మయా ॥ 5 ॥**

అపుడు నిదాఘుడు "ఓ విప్రోత్తమా! జనాలసందడి బాగా ఎక్కువగా ఉంది. ఈ జనపాలుడు ఈ సుందరనగరంలో ప్రవేశించాలనే కోరికతో ఉన్నాడు. అందువల్ల నేను ఇక్కడ నిల్చుండిపోయాను." అన్నాడు.

**నరాధిపోఽత్ర కతమః కతమశ్చేతరో జనః ।**
**కథ్యతాం మే ద్విజశ్రేష్ఠ! త్వమభిజ్ఞో మతో మమ ॥ 6 ॥**

అంత ఋభుడు "ఇందు నరపాలుడు ఎవడు? ఇతర జనులు ఎవరు? ద్విజశ్రేష్ఠా! నాకు తెలియజేయి. నీవు తెలిసున్నవాడవనిపిస్తోంది నాకు." అని అడిగాడు.

**యోஉ యం గజేన్ద్రమున్మత్తమద్రిశృంగసముచ్ఛ్రితమ్ ।**
**అధిరూఢో నరేన్ద్రోஉ యం పరిలోకస్తథేతరః ॥ 7 ॥**

నిదాఘుడు అపుడు "పర్వత శిఖరంలా మిక్కిలి ఎత్తుగా ఉన్న, మదించిన పట్టపుటేనుగును అధిరోహించిన వాడే మహారాజు. మిగిలినవారు అతని పరిజనులు" అన్నాడు.

**ఏతౌ హి గజరాజానౌ యుగపద్దర్శితౌ మమ ।**
**భవతా న విశేషేణ పృథక్చిహ్నోపలక్షణౌ ॥ 8 ॥**

**తత్కథ్యతాం మహాభాగ! విశేషీ భవతాஉ నయోః ।**
**జ్ఞాతుమిచ్ఛామ్యహం కోஉ త్ర గజః కో వా నరాధిపః ॥ 9 ॥**

అంత ఋభుడు "గజాన్ని, రాజునూ. ఈ ఇద్దరినీ నాకు ఒకేసారి చూపించావు. ప్రత్యేకంగా వేరే గుర్తులు కాని, విశేషలక్షణాలు కాని నీవు నాకు చూపించలేదు. కాబట్టి మహాభాగా! ఆ విషయం తెలియజేయి. ఇక్కడ గజం ఏది? రాజు ఎవడు? ఈ రెండింటిలో విశేషం ఏమిటో నేను తెలుసుకోవాలనుకొంటున్నాను." అన్నాడు.

**గజో యోஉ యమథో బ్రహ్మన్! ఉపర్యస్యైష భూపతిః ।**
**వాహ్యవాహకసంబంధం కో న జానాతి వై ద్విజ! ॥ 10 ॥**

నిదాఘుడు అంత "బ్రాహ్మణోత్తమా! ఆ క్రిందనున్నది గజం, దానిపైన ఉన్నవాడు మహీపతి. ద్విజశ్రేష్ఠా! ఈ వాహ్యవాహకసంబంధం తెలియనివాడు ఎవడుంటాడు" అన్నాడు.

**జానామ్యహం యథా బ్రహ్మంస్తథా మామవబోధయ ।**
**అధఃశబ్దనిగద్యం కిం కిం చోర్ధ్వమభిధీయతే ॥ 11 ॥**

అపుడు ఋభుడు "బ్రాహ్మణోత్తమా! నాకు తెలిసేటట్లు పరిశీలించి చెప్పవయ్యా! క్రింద అనే శబ్దంచే చెప్పబడేది ఏది? అలాగే పైన అనే శబ్దంచే చెప్పబడేది ఏది? అని ప్రశ్నించాడు.

**ఇత్యుక్తః సహసాஉ உ రుహ్య నిదాఘః ప్రాహ తమృభుమ్ ।**
**శ్రూయతాం కథయామ్యేష యన్మాం త్వం పరిపృచ్ఛసి ॥ 12 ॥**

ఇలా ప్రశ్నించగానే నిదాఘుడు వేగంగా ఆ ఋభునిపైకి ఎక్కి "నీవు నన్ను అడుగుతున్నావు కాన చెబుతున్నాను. విను" అని ఇలా అన్నాడు.

**ఉపర్యహం యథా రాజా త్వమధః కుంజరో యథా ।**
**అవబోధాయ తే బ్రహ్మన్! దృష్టాన్తో దర్శితో మయా ॥ 13 ॥**

"బ్రాహ్మణా! నేను రాజులా నీపై నున్నాను. నీవు ఏనుగులా నాక్రింద ఉన్నావు. నీకు పూర్తిగా తెలియడం కోసం దృష్టాంతం చూపించాను." అని పలికాడు.

**త్వం రాజేవ ద్విజశ్రేష్ఠ! స్థితోఽహం గజవద్యది ।**
**తదేతత్ త్వం సమాచక్ష్వ కతమస్త్వమహం తథా ॥ 14 ॥**

అపుడు ఋభుడు "ద్విజశ్రేష్ఠా! నీవు రాజులా ఉండి నేను గజంలా ఉన్నట్లయితే, ఇది నీవు పరిశీలించి చెప్పు. అపుడు నీవు ఎవడవు? నేను ఎవడను?" అని అడిగాడు.

**ఇత్యుక్తః సత్వరం తస్య ప్రగృహ్య చరణావుభౌ ।**
**నిదాఘః ప్రాహ భగవానాచార్యస్త్వమృభుర్ధ్రువమ్ ॥ 15 ॥**

ఇలా అడిగిన వెంటనే నిదాఘుడు ఆయన రెండు చరణాలు పట్టుకొని ఇలా అన్నాడు. "నీవు నిశ్చయంగా ఆచార్య భగవానుడవయిన ఋభుడవే."

**నాన్యస్యాద్వైతసంస్కారసంస్కృతం మానసం తథా ।**
**యథాఽఽచార్యస్య తేన త్వాం మన్యే ప్రాప్తమహం గురుమ్ ॥ 16 ॥**

అన్యుని మనస్సు ఆ ఆచార్యుని మనస్సులా అద్వైతభావనతో కూడుకొన్న సంస్కారంతో సుసంపన్నం కాదు. కాబట్టి నావద్దకు విచ్చేసిన తమర్ని నా గురువని భావిస్తున్నాను" అని అన్నాడు.

**ఋభురువాచ :–**ఋభుడు చెప్పాడు

**తవోపదేశదానాయ పూర్వశుశ్రూషణాదృతః ।**
**గురుస్నేహాదృభుర్నామ్నా నిదాఘ! సముపాగతః ॥ 17 ॥**

ఋభుడు అపుడు "నిదాఘా! నీకు ఉపదేశం చేయాలని, పూర్వం నీవు చేసిన శుశ్రూషవల్ల కలిగిన గౌరవంతో, గురువాత్సల్యంతో ఋభుడనే వాడను వచ్చాను.

**తదేతదుపదిష్టం తే సంక్షేపేణ మహామతే ।**
**పరమార్థసారభూతం యదద్వైతమశేషతః ॥ 18 ॥**

"మహామతీ! పరమార్థసారభూతమైన అద్వైతాన్ని అంతా సంక్షేపంగా నీకు ఉపదేశించాను" అన్నాడు.

**ఏవముక్త్వా యయౌ విద్వాన్ నిదాఘం స ఋభుర్గురుః ।**
**నిదాఘోఽప్యుపదేశేన తేనాద్వైతపరోఽభవత్ ॥ 19 ॥**

ఈ రీతిగా ఆవిద్వాంసుడైన గురువర్యుడగు ఋభుడు నిదాఘునితో పలికి తనదారిని తాను వెళ్లి పోయాడు. నిదాఘుడు కూడ ఆ జ్ఞానోపదేశంతో అద్వైతనిష్ఠుడు అయ్యాడు.

**సర్వభూతాన్యభేదేన దదృశే స తదాఽఽత్మనః ।**
**యథా బ్రహ్మపరో ముక్తిమవాప పరమాం ద్విజ! ॥ 20 ॥**

ద్విజశ్రేష్ఠా! అతడు అప్పటినుంచి సర్వప్రాణులను తనకు అభేదంగా చూశాడు. ఆ నిదాఘుడు బ్రహ్మమునందు మాత్రమే జ్ఞానం కలవాడై ముక్తిని పొందాడు.

**తథా త్వమపి ధర్మజ్ఞ! తుల్యాత్మరిపుబాన్ధవః ।**
**భవ సర్వగతం జానన్నాత్మానమవనీపతే! ॥ 21 ॥**

ఆ విధంగా ధర్మజ్ఞుడవైన సౌవీరమహీపతీ! నీవు కూడ నీపట్ల, శత్రువులపట్ల, బంధువులపట్ల సమానుడవై నిన్ను సర్వప్రాణిగతునిగా తెలిసికొని ముక్తుడవు కమ్ము.

**సితనీలాదిభేదేన యథైకః దృశ్యతే నభః ।**
**భ్రాంతిదృష్టిభిరాత్మా౭పి తథైకం సన్ పృథక్ పృథక్ ॥ 22 ॥**

తెలుపు,నలుపు మున్నగు వేరు వేరు రంగులతో ఒకే ఆకాశం కనబడినట్లుగా, భ్రాంతిచిత్తంగల దృష్టి ఉన్నవారికి ఒక్కటైన ఆత్మ కూడ వేరు వేరుగా కనిపిస్తుంది.

**ఏకః సమస్తం యదిహాస్తి కించిత్**
**యదచ్యుతో నాస్తి పరం తతో౭న్యత్ ।**
**సో౭హం స చ త్వం స చ సర్వమేత**
**దాత్మస్వరూపం త్యజ భేదమోహమ్ ॥ 23 ॥**

ఇక్కడ ఏ కొంచెం ఉన్నదో, అది ఒకటే సమస్తమైనది. అది నాశనం లేనిది. దాని కన్న వేరయినది లేదు. అదే నేను. అదే నీవు. అదే సర్వం. ఇదే ఆత్మస్వరూపం. భేదమోహం విడిచిపెట్టు అని భరతుడుచెప్పాడు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ఇతీరితస్తేన స రాజవర్య**
**స్తత్యాజ భేదం పరమార్థదృష్టిః ।**
**స చాపి జాతిస్మరణాప్తబోధ**
**స్తత్రైవ జన్మన్యపవర్గమాప ॥ 24 ॥**

ఇలా భరతుడు చెప్పిన మాటపై, ఆ సౌవీరరాజవరేణ్యుడు కూడ పరమార్థదృష్టికలవాడై భేదబుద్ధి విడిచిపెట్టాడు. ఆ విప్రుడు కూడ పూర్వజన్మస్మృతితో జ్ఞానం కలిగినవాడై, ఆ జన్మలోనే ముక్తిని పొందాడు.

**ఇతి భరతనరేన్ద్రసారవృత్తం**
**కథయతి యశ్చ శృణోతి భక్తియుక్తః ।**
**స విమలమతిరేతి నా౭౭త్మమోహం**
**భవతి చ సంసరణేషు ముక్తియోగ్యః ॥ 25 ॥**

ఈ సారవంతమైన భరతరాజేంద్రుని వృత్తాంతం భక్తియుక్తుడై చెప్పినవాడు, విన్నవాడు నిర్మలబుద్ధినొంది ఆత్మమోహం పొందదు. ఆ జన్మలో కాని, జన్మాంతరంలో కాని ముక్తికి యోగ్యుడవుతాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే ఆత్మతత్త్వోపదేశో నామ షోడశో౭ధ్యాయః సమాప్తః ॥ 16 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో ఆత్మతత్త్వోపదేశం అనే పదునారవ అధ్యాయం సమాప్తం ॥ 16 ॥

## తృతీయాంశః - మూడవ అంశం

## ప్రథమోఽధ్యాయః - మొదటి అధ్యాయం

## మన్వంతరవర్ణనమ్ - మన్వంతరవర్ణన

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు పలికాడు.

**కథితా గురుణా సమ్యగ్ భూసముద్రాదిసంస్థితిః ।**
**సూర్యాదీనాం చ సంస్థానం జ్యోతిషామపి విస్తరాత్ ॥ 1 ॥**

**దేవాదీనాం తథా సృష్టిః ఋషీణామపి వర్ణితా ।**
**చాతుర్వర్ణ్యస్య చోత్పత్తిస్తిర్యగ్యోనిగతస్య చ ॥ 2 ॥**

**ధ్రువప్రహ్లాదచరితం విస్తరాచ్చ త్వయోదితమ్ ।**
**మన్వన్తరాణ్యశేషాని శ్రోతుమిచ్ఛామ్యనుక్రమాత్ ॥ 3 ॥**

**మన్వన్తరాధిపాంశ్చైవ శక్రదేవపురోగమాన్ ।**
**భవతా కథితానేతాన్ శ్రోతుమిచ్ఛామ్యహం గురో! ॥ 4 ॥**

"గురువర్యా! భూమి, సముద్రాలు మున్నగువాటి ఉనికి గురించి, సూర్యుడు మున్నగువారి స్థానాలను గురించి, జ్యోతిర్గోళాల ఉనికిని గురించి విస్తారంగా తెలియజేశావు. దేవతలు మున్నగు వారి సృష్టిని గురించి, ఋషుల ఆవిర్భావాన్ని గురించి వర్ణించావు. నాలుగువర్ణాల ఉత్పత్తిని, పశువులు, పక్షులు మున్నగు వాటి పుట్టుకను వివరించావు. ధ్రువునివృత్తాంతాన్ని, ప్రహ్లాదచరిత్రను బహువిస్తారంగా సవివరంగా నీవు చెప్పావు. ఇకపై మన్వంతరాలు అన్నింటిని గురించి క్రమం తప్పకుండా వినాలనుకొంటున్నాను. కాబట్టి మన్వంతరాధిపులను గురించి ఇంద్రుడు, దేవతలను గురించి నీవు చెబుతూ ఉండగా, వినాలనే కోరికతో ఉన్నాను" అని అడిగాడు

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు పలికాడు.

**అతీతానాగతానీహ యాని మన్వన్తరాణి వై ।**
**తాన్యహం భవతే సమ్యక్ కథయామి యథాక్రమమ్ ॥ 5 ॥**

"గడిచిపోయిన, రాబోయే మన్వంతరాలు ఉన్నాయో వాటిని చక్కగా ఒక క్రమపద్ధతిలో నేను నీకు చెబుతాను.

**స్వాయమ్భువో మనుః పూర్వో మనుః స్వారోచిషస్తథా ।**
**ఉత్తమస్తామసశ్చైవ రైవతశ్చాక్షుషస్తథా ॥ 6 ॥**

**షడేతే మనవోఽతీతాః సామ్ప్రతన్తు రవేః సుతః ।**
**వైవస్వతోఽయం యస్యైతత్ సప్తమం వర్తతేఽన్తరమ్ ॥ 7 ॥**

మొదటిమనువు స్వాయంభువుడు. రెండో వాడు స్వారోచిషుడు. తరువాతి వారు ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు అనేవారు. ఈ ఆరుగురు మనువులు గడచి పోయిన వారు. ప్రస్తుతం ఉన్న మనువు సూర్యుని కుమారుడైన వైవస్వతుడు. ఇపుడు ఏడవ మన్వంతరం నడుస్తోంది.

**స్వాయంభువస్తు కథితం కల్పాదావన్తరం మయా ।**
**దేవాః సప్తర్షయశ్చైవ యథావత్ కథితా మయా ॥ 8 ॥**

కల్పం మొదట్లో ఉండే స్వాయంభువమన్వంతరం గురించి నేను ఇదివరకే చెప్పాను. దేవతలు, సపర్షులు-వీరిని గురించి కూడా నేను ఉన్నది ఉన్నట్లుగా తెలియజేశాను.

**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి మనోః స్వారోచిషస్య తు ।**
**మన్వంతరాధిపాన్ సమ్యగ్ దేవర్షీంస్తత్సుతాంస్తథా ॥ 9 ॥**

ఇక పైన స్వారోచిషమన్వంతరంలోని అధికారులను, దేవతలను, ఋషులను, ఆ మనువు కుమారులను, వీరిని గూర్చి స్పష్టంగా తెలియజేస్తాను.

**పారావతాః సతుషితా దేవాః స్వారోచిషేఽన్తరే ।**
**విపశ్చిచ్చైవ దేవేన్ద్రో మైత్రేయాఽఽసీన్మహాబలః ॥ 10 ॥**

మైత్రేయా! స్వారోచిషమన్వంతరంలో పారావతులు, తుషితగణాలు, దేవతలు, మహాబలవంతుడైన విపశ్చిత్తు అనేవాడు దేవేంద్రుడు.

**ఊర్జః స్తమ్భస్తథా ప్రాణో దత్తోలిః ఋషభస్తథా ।**
**నిరయశ్చ పరీవాంశ్చ తత్ర సప్తర్షయోఽభవన్ ॥ 11 ॥**

ఊర్జుడు,స్తంభుడు,ప్రాణుడు, దత్తోలి,ఋషభుడు, నిరయుడు, పరీవంతుడు అనేవారు అపుడు సప్తర్షులయ్యారు.

వి॥ దత్తోళి-వాతుడు, ఋషభుడు-ప్రషభుడు, నిరయుడు-పాయుడు పాఠాంతరాలు

**చైత్రకిమ్పురుషాద్యాశ్చ సుతాః స్వారోచిషస్య తు ।**
**ద్వితీయమేతత్ కథితమన్తరం శృణు చోత్తమమ్ ॥ 12 ॥**

చైత్రుడు, కింపురుషుడు మున్నగువారు స్వారోచిషమనువు కుమారులు. ఈవిధంగా ద్వితీయ మన్వంతరం గురించి చెప్పాను. తరువాతిది ఉత్తరమన్వతరం గురించి విను.

**తృతీయే త్వన్తరే బ్రహ్మన్! ఉత్తమో నామ యో మనుః ।**
**సుశాన్తిర్నామ దేవేన్ద్రో మైత్రేయాఽఽసీత్ సురేశ్వరః ॥ 13 ॥**

బ్రాహ్మణోత్తమా! మూడవ మన్వంతరంలో ఇక మనువు ఉత్తముడనేవాడు. మైత్రేయా! సుశాంతి అనేవాడు సురలకు అధిపతి అయిన దేవేంద్రుడు (ఔత్తమిః అని పాఠాంతరం).

**సుధామానస్తథా సత్యాః జపాశ్చాఽఽసన్ ప్రతర్దనాః ।**
**వశవర్తిశ్చ పంచైతే గణా ద్వాదశకాః స్మృతాః ॥ 14 ॥**

సుధాములు, సత్యులు, జపులు, ప్రతర్దనులు, వశవర్తులు అని అయిదు దేవగణాలు. ఒక్కొక్క గణానికి పంద్రెండుగురు దేవతలు ఉంటారు.

వి ॥ జపులు – జయులు, శివులు – పాఠాంతరం.

**వసిష్ఠతనయాస్తత్ర సప్త సప్తర్షయోఽభవన్ ।**
**అజఃపరశుదీప్తాద్యాస్తథోత్తమమనోస్సుతాః ॥ 15 ॥**

వసిష్ఠుని కుమారులు ఏడుగురు సప్తర్షులు అయ్యారు. అజుడు, పరశువు, దీప్తుడు మున్నగువారు ఉత్తమ మనువు కుమారులు.

**తామసస్యాన్తరే దేవాః సుపారా హరయస్తథా ।**
**సత్యాశ్చ సుధియశ్చైవ సప్తవింశతికా గణాః ॥ 16 ॥**

తామసమన్వంతరంలో సుపారులు, హరులు,సత్యులు,సుధీమంతులు అనేవారు దేవగణాలు. ఒక్కొక్కగణంలోను ఇరవై ఏడుగురు దేవతలు ఉంటారు.

**శిబిరిన్ద్రస్తథా చాఽఽసీచ్ఛతయజ్ఞోపలక్షణః ।**
**సప్తర్షయశ్చ యే తేషాం తత్ర నామాని మే శృణు ॥ 17 ॥**

నూరు యజ్ఞాలు చేసినవాడు కాన శిబి ఇంద్రుడయ్యాడు. ఆ మన్వంతరంలోని సప్తర్షుల పేర్లు నేను చెబుతాను విను.

**జ్యోతిర్ధామా పృథుః కావ్యశ్చైత్రోఽగ్నిర్వనకస్తథా ।**
**పీవరశ్చర్షయో హ్యేతే సప్త తత్రాపి చాన్తరే ॥ 18 ॥**

జ్యోతిర్ధాముడు, పృథుడు, కావ్యుడు, చైత్రుడు, అగ్ని, వనకుడు, పీవరుడు–అనే ఈ ఏడుగురు ఆ మన్వంతరంలో సప్తర్షులు అయ్యారు.

**నరః ఖ్యాతిః కేతురూపో జానుజంఘాదయస్తథా ।**
**పుత్రాస్తు తామసస్యాసన్ రాజానః సుమహాబలాః ॥ 19 ॥**

నరుడు, ఖ్యాతి,కేతురూపుడు, జానుజంఘుడు మున్నగువారు మహాబలవంతులైన రాజులు, వారు తామసమనువు కుమారులు.

**విశే:** కేతురూపుడు–శాంతహయుడు పాఠాంతరం.

**పంచమే చాపి మైత్రేయ! రైవతో నామ నామతః ।**
**మనుర్విభుశ్చ తత్రేన్ద్రో దేవాంశ్చైవాన్తరే శృణు ॥ 20 ॥**

మైత్రేయా! ఐదోదైన మన్వతరంలో రైవతుడు అనేవాడు మనువు. విభుడు అనేవాడు ఇంద్రుడు. ఈ మన్వంతరంలోని దేవతలను గురించి విను.

**అమితాభా భూతరజో వైకుణ్ఠాః ససుమేధసః ।**
**ఏతే దేవగణాస్తత్ర చతుర్దశ చతుర్దశ ॥ 21 ॥**

అమితాభులు, భూతరజులు, వైకుంఠులు, సుమేధసులు అనేవారు దేవతాగణాలు. ఒక్కొక్కగణంలోను పద్నాలుగురు, పద్నాలుగురు దేవతలు ఉంటారు.

**హిరణ్యరోమా వేదశ్రీరూర్ధ్వబాహుస్తథాఽపరః ।**
**వేదబాహుః సుధామా చ పర్జన్యశ్చ మహామునిః ।**
**ఏతే సప్తర్షయో విప్ర తత్రాసన్ రైవతేఽన్తరే ॥ 22 ॥**

విప్రవర్యా! హిరణ్యరోముడు, వేదశ్రీ,ఊర్ధ్వబాహుడు, వేదబాహుడు, సుధాముడు, పర్జన్యుడు, మహాముని అనేవారు రైవతమన్వంతరంలో సప్తర్షులు అయ్యారు.

**బలబంధుశ్చ సమ్భావ్యః సత్యకాద్యాశ్చ తత్సుతాః ।**
**నరేన్ద్రాః సుమహావీర్యా బభూవుర్మునిసత్తమ! ॥ 23 ॥**

మునిశ్రేష్ఠా! బలబంధుడు, సంభావ్యుడు, సత్యకుడు మున్నగు మిక్కిలి పరాక్రమవంతులయిన రాజేంద్రులయిన వారు రైవతమనువుయొక్క కుమారులు.

**స్వారోచిషశ్చోత్తమశ్చ తామసో రైవతస్తథా ।**
**ప్రియవ్రతాన్వయా హ్యేతే చత్వారో మనవస్తథా ॥ 24 ॥**

స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు ఈనలుగురు మనువులు ప్రియవ్రతుని వంశంవారు.

**విష్ణుమారాధ్య తపసా స రాజర్షిః ప్రియవ్రతః ।**
**మన్వన్తరాధిపానేతాన్ లబ్ధవానాత్మవంశజాన్ ॥ 25 ॥**

రాజర్షి అయిన ఆ ప్రియవ్రతుడు విష్ణువును తపస్సుచే ఆరాధించి తనవంశీయులగు వీరిని మన్వంతరాలకు అధిపతులయ్యేటట్లుగా వరం పొందాడు.

**షష్ఠే మన్వన్తరే చాసీచ్చాక్షుషాఖ్యస్తథా మనుః ।**
**మనోజవస్తథైవేన్ద్రో దేవానపి నిబోధ మే ॥ 26 ॥**

ఆరవ మన్వంతరంలో చాక్షుషుడు అనే పేరు గలిగినవాడు మనువు అయ్యాడు. అలాగే ఇంద్రుడు మనోజవుడు అనేవాడు. ఇక దేవతలను గూర్చి చెబుతున్నాను విను.

**ఆద్యాః ప్రసూతా భవ్యాశ్చ పృథుకాశ్చ దివౌకసః ।**
**మహానుభావా లేఖాశ్చ పంచైతేఽప్యష్టకా గణాః ॥ 27 ॥**

ఆద్యులు, ప్రసూతులు, భవ్యులు, పృథుకులు, లేఖులు–వీరు ఐదుగురు మహానుభావులైన దేవతాగణాలు. ఒక్కొక్కగణానికి ఎనమండుగురు దేవతలు ఉంటారు.

**సుమేధా విరజాశ్చైవ హవిష్మానుత్తమో మధుః ।**
**అతినామా సహిష్ణుశ్చ సప్తాఽఽసన్నితి చర్షయః ॥ 28 ॥**

సుమేధసుడు, విరజుడు, హవిష్మంతుడు, ఉత్తముడు, మధుడు, అతినాముడు, సహిష్ణువు–వీరు ఏడుగురు ఋషులు అయ్యారు.

**ఊరుః పురుః శతద్యుమ్నప్రముఖాః సుమహాబలాః ।**
**చాక్షుషస్య మనోః పుత్రాః పృథివీపతయోఽభవన్ ॥ 29 ॥**

ఊరువు, పురువు, శతద్యుమ్నుడు మున్నగు ప్రసిద్ధి కెక్కిన మహాబలవంతులయిన చాక్షుషమనువు కుమారులు ధరణీపాలకులు అయ్యారు.

**వివస్వతః సుతో విప్ర! శ్రాద్ధదేవో మహాద్యుతిః ।**
**మనుః సంవర్తతే ధీమాన్ సాంప్రతం సప్తమేఽన్తరే ॥ 30 ॥**

విప్రవర్యా! వివస్వంతుని కుమారుడైన శ్రాద్ధదేవుడు మిక్కిలి తేజస్సు కలవాడు. బహుముఖప్రజ్ఞ కలవాడు. ఇప్పటి ఏడవదైన మన్వంతరంలో అతడు మనువుగా వ్యవహరిస్తున్నాడు.

**ఆదిత్యవసురుద్రాద్యా దేవాశ్చాత్ర మహామునే ।**
**పురన్దరస్తథైవాత్ర మైత్రేయ! త్రిదశేశ్వరః ॥ 31 ॥**

మహామునీ! ఆదిత్యులు, వసువులు, రుద్రులు మున్నగువారు ఈ మన్వంతరంలో దేవతలు. మైత్రేయా! అలాగే ఇందు పురందరుడు అనేవాడు దేవేంద్రుడు.

**వశిష్ఠః కాశ్యపోఽథాత్రిర్జమదగ్నిః సగౌతమః ।**
**విశ్వామిత్రో భరద్వాజః సప్త సప్తర్షయోఽభవన్ ॥ 32 ॥**

వశిష్ఠుడు, కాశ్యపుడు, అత్రి, జమదగ్ని, గౌతముడు, విశ్వామిత్రుడు, భరద్వాజుడు అనే ఏడుగురు సప్తర్షులయ్యారు.

**ఇక్ష్వాకుశ్చ నృగశ్చైవ ధృష్టః శర్యాతిరేవ చ ।**
**నరిష్యన్తశ్చ విఖ్యాతో నాభాగోఽరిష్ట ఏవ చ ॥ 33 ॥**

**కరూశశ్చ పృషధ్రశ్చ సుమహాన్ లోకవిశ్రుతః ।**
**మనోర్వైవస్వతస్యైతే నవ పుత్రాశ్చ ధార్మికాః ॥ 34 ॥**

ఇక్ష్వాకువు, నృగుడు,ధృష్టుడు,శర్యాతి,నరిష్యంతుడు, విఖ్యాతికల్గిన నాభాగుడు, అరిష్టుడు, కరూషుడు,మిక్కిలి లోకప్రసిద్ధుడయిన పృషధ్రుడు-ఈ తొమ్మండుగురు వైవస్వతమనువు కుమారులు. ధర్మం తెలిసినవారు (ప్రస్తుత రాజేంద్రులు).

**విష్ణుశక్తిరనౌపమ్యా సత్త్వోద్రిక్తా స్థితౌ స్థితా ।**
**మన్వన్తరేష్వశేషేషు దేవత్వేనాధితిష్ఠతి ॥ 35 ॥**

విష్ణుశక్తి సాటిలేనిది. అది స్థితివేళలో సత్త్వగుణసంపన్నమై ఉంటుంది. సమస్తమన్వంతరాలలోను అధిష్ఠాన దేవతయై నిలిచి ఉంటుంది.

**అంశేన తస్యా జజ్ఞేఽసౌ యజ్ఞః స్వాయమ్భువేఽన్తరే ।**
**ఆకూత్యాం మానసో దేవ ఉత్పన్నః ప్రథమేఽన్తరే ॥ 36 ॥**

ఆ విష్ణుశక్తి అంశతోనే మొట్ట మొదటిదైన స్వాయంభువమన్వంతరంలో యజ్ఞమయుడైన విష్ణువు మానసదేవుడనే పేరుతో ఆకూతిగర్భంలో జన్మించాడు.

**తతః పునః స వై దేవఃప్రాప్తే స్వారోచిషేఽన్తరే ।**
**తుషితాయాం సముత్పన్నో హ్యజితస్తుషితైః సహ ॥ 37 ॥**

ఆ తరువాత మళ్లీ ఆ దేవుడే స్వారోచిషమన్వంతరం రాగా, తుషితులు అనే దేవతలతో కలిసి అజితుడు అనే పేరుతో తుషితాగర్భంలో పుట్టాడు.

**ఔత్తమే త్వన్తరే చైవ తుషితస్తు పునః స వై ।**
**సత్యాయామభవత్ సత్యః సత్యః సహ సురోత్తమైః ॥ 38 ॥**

మళ్లీ ఆ తుషితుడే ఉత్తమమన్వంతరంలో సత్యులు అనే దేవతాశ్రేష్ఠులతో కలిసి, సత్యుడు అనే పేరుతో సత్యయందు ఉద్భవించాడు.

**తామసస్యాన్తరే చైవ సమ్ప్రాప్తే పునరేవ హి ।**
**హర్యాయాం హరిభిః సార్ధం హరిరేవ బభూవ హ ॥ 39 ॥**

తామసమన్వంతరం రాగా ఆ సత్యుడే మళ్లీ హరినామకులైన దేవతలతో కలిసి, హర్యాగర్భంలో హరిగా అవతరించాడు.

**రైవతేఽప్యన్తరే దేవః సమ్భూత్యాం మానసోఽభవత్ ।**
**సమ్భూతో రైవతైః సార్ధం దేవైర్దేవవరో హరిః ॥ 40 ॥**

ఆ తరువాత రైవతమన్వంతరంరాగా, దేవశ్రేష్ఠుడయిన ఆ శ్రీహరిదేవుడే మళ్లీ రైవతులు అనే దేవతలతో కలిసి సంభూతియందు మానసుడుగా జన్మించాడు.

**చాక్షుషే చాన్తరే దేవో వైకుణ్ఠః పురుషోత్తమః ।**
**వికుణ్ఠాయామసౌ జజ్ఞే వైకుణ్ఠైర్దేవతైః సహ ॥ 41 ॥**

చాక్షుషమన్వంతరంలో ఆ దేవుడైన పురుషోత్తముడే వైకుంఠులు అనే దేవతలతో కలిసి వికుంఠయందు వైకుంఠునిగా అవతరించాడు.

**మన్వన్తరే తు సమ్ప్రాప్తే తథా వైవస్వతే ద్విజ! ।**
**వామనః కశ్యపాద్ విష్ణురదిత్యాం సమ్బభూవ హ ॥ 42 ॥**

ద్విజశ్రేష్ఠా! ఈ ఏడవదైన వైవస్వతమన్వంతరం రాగా, ఆ మహావిష్ణువే కశ్యపునివల్ల అదితియందు వామనుడై ఆవిర్భవించాడు.

**త్రిభిః క్రమైరిమాన్ లోకాన్ జిత్వా యేన మహాత్మనా ।**
**పురన్దరాయ త్రైలోక్యం దత్తం నిహతకణ్టకమ్ ॥ 43 ॥**

ఆ మహాత్ముడైన వామనుడు మూడు అడుగులతో ఈ లోకాలను జయించి, నిష్కంటకమైన త్రిలోకరాజ్యవైభవాన్ని పురందరునకు ఇచ్చాడు.

**ఇత్యేతాస్తనవస్తస్య సప్తమన్వన్తరేషు వై ।**
**సప్తాథవాఽభవన్ విప్ర! యాభిః సంవర్ధితాః ప్రజాః ॥ 44 ॥**

విప్రోత్తమా! ఈవిధంగా ఏడుమన్వంతరాలలోను, ఏడు అవతారాలను విష్ణువు ధరించి ప్రజలను వృద్ధి కావించాడు.

**యస్మాద్ విష్టమిదం సర్వం తస్య శక్త్యా మహాత్మనః ।**
**తస్మాత్ స ప్రోచ్యతే విష్ణుర్విశేర్ధాతోః ప్రవేశనాత్ ॥ 45 ॥**

ఆ మహాత్ముడైన విష్ణువుశక్తియే ఈవిశ్వమంతట ప్రవేశించింది కాబట్టి, ప్రవేశించడం అనే అర్థం కల 'విశ' ధాతువువల్ల ఆయన "విష్ణువు" అని పిలవబడ్డాడు.

**సర్వే చ దేవా మనవః సమస్తాః**
**సప్తర్షయో యే మనుసూనవశ్చ ।**
**ఇన్ద్రశ్చ యో యం త్రిదశేశభూతో**
**విష్ణోరశేషాస్తు విభూతయస్తాః ॥ 46 ॥**

సర్వదేవతలు, సమస్త మనువులు, సప్తర్షులు,మనుపుత్రులు, దేవతాప్రభువైన ఇంద్రుడు, వీరు అందరూ విష్ణువు సంబంధమైన విభూతులే.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే మన్వంతరవర్ణనం నామ ప్రథమోఽధ్యాయః సమాప్తః ॥ 1 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో మన్వంతరవర్ణన అనే మొదటి అధ్యాయం సమాప్తం ॥ 1 ॥

## ద్వితీయోఽధ్యాయః - రెండవ అధ్యాయం

## సావర్ణి ప్రభృతి మనువృత్తాంతః - సావర్ణి మున్నగు మనువుల వృత్తాంతం

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు చెప్పాడు.

**ప్రోక్తాన్యేతాని భవతా సప్త మన్వన్తరాణి వై ।**
**భవిష్యాణ్యపి విప్రర్షే! మమాఽఽఖ్యాతుం త్వమర్హసి ॥ 1 ॥**

"పరాశరమహర్షీ! ఇప్పటివరకూ నీవు గడిచిపోయిన మన్వంతరాలను గురించి, జరుగుతున్న మన్వంతరం గురించి ఏడింటిని వివరించావు. జరగబోయే మన్వంతరాలను గురించి కూడా నీవు నాకు వివరించదగియున్నావు" అని అడిగాడు.

**సూర్యస్య పత్నీ సంజ్ఞాఽభూత్తనయా విశ్వకర్మణః ।**
**మనుర్యమో యమీ చైవ తదపత్యాని వై మునే ॥ 2 ॥**

మునీశ్వరా! సూర్యునకు సంజ్ఞ అనే పత్ని ఉన్నది. ఆమె విశ్వకర్మ కుమార్తె. మనువు, యముడు, యమి అనేవారు ఆమె సంతానం(వైవస్వతమనువు).

**అసహన్తీ తు సా భర్తుస్తేజశ్ఛాయాం యుయోజ వై ।**
**భర్తుః శుశ్రూషణేఽరణ్యం స్వయం చ తపసే యయౌ ॥ 3 ॥**

ఆమె భర్త తేజస్సుకు తాళలేక ఛాయను భర్తృసేవకు నియోగించి, తాను తపం చేసుకోవడానికై అరణ్యానికి వెళ్లిపోయింది.

**సంజ్ఞేయమిత్యథార్కశ్చ ఛాయాయామాత్మజత్రయమ్ ।**
**శనైశ్చరం మనుం చాన్యం తపతీం చాప్యజీజనత్ ॥ 4 ॥**

సూర్యదేవుడు ఆ ఛాయను సంజ్ఞగానే భావించాడు. ఆమెయందు శనైశ్చరుని, మరొక మనువును, తపతిని-ఈముగ్గురిని సంతానంగా పొందాడు.

**ఛాయాసంజ్ఞా దదౌ శాపం యమాయ కుపితా యదా ।**
**తదన్యేయమసౌ బుద్ధిరిత్యాసీద్ యమసూర్యయోః ॥ 5 ॥**

ఒకనాడు ఛాయారూపంలో ఉన్న సంజ్ఞ కోపించి యముని శపించింది. (నిజంగా తల్లి అయితే అలా శపించదని) యముడు, సూర్యుడు ఈమె మరో స్త్రీ అయి ఉండవచ్చని అభిప్రాయపడ్డారు.

**తతో వివస్వానాఖ్యాతే తయైవారణ్యసంస్థితామ్ ।**
**సమాధిదృష్ట్యా దదృశే తామశ్వాం తపసి స్థితామ్ ॥ 6 ॥**

అపుడు ఛాయ(రహస్యం) చెప్పివేసింది. అంత సూర్యుడు సమాధిదృష్టితో చూడగా, అడవిలో ఉండి అశ్వరూపంతో తపోనిమగ్నురాలయి ఉన్న సంజ్ఞ గోచరించింది.

**వాజిరూపధరః సోఽథ తస్యాం దేవావథాశ్వినౌ ।**
**జనయామాస రేవన్తం రేతసోఽన్తే చ భాస్కరః ॥ 7 ॥**

ఆ తరువాత భాస్కరుడు అశ్వరూపాన్ని ధరించి సంజ్ఞను చేరుకోగా, ఆమెకు మొదట అశ్వినీదేవతలు జన్మించారు. రేతః పాతాంతంలో రేవంతుడు ఉద్భవించాడు.

**ఆనిన్యే చ పునః సంజ్ఞాం స్వస్థానం భగవాన్ రవిః ।**
**తేజసశ్శమనం చాస్య విశ్వకర్మా చకార హ ॥ 8 ॥**

భగవంతుడైన రవి సంజ్ఞను మళ్లీ యథాస్థానానికి తీసుకొని వచ్చాడు. తరవాత విశ్వకర్మ సూర్య భగవానుని తేజస్సును కొంత తగ్గించాడు.

**భ్రమిమారోప్య సూర్యన్తు తస్య తేజోవిశాతనమ్ ।**
**కృతవానష్టమం భాగం న(స)వ్యశాతయతావ్యయమ్ ॥ 9 ॥**

అతడు సూర్యుని భ్రమియంత్రంపై ఉంచి, ఆయన తేజస్సును సాన పెట్టగా, తరగని తేజస్సులో ఎనిమిదో వంతు మాత్రమే తరిగింది.

**యత్ సూర్యాద్ వైష్ణవం తేజః శాతితం విశ్వకర్మణా ।**
**జాజ్వల్యమానమపతత్ తద్భూమౌ మునిసత్తమ ॥ 10 ॥**

మునిశ్రేష్ఠా! విశ్వకర్మసానపెట్టగా సూర్యునినుంచి రాలిన వైష్ణవతేజస్సు జాజ్వల్యమానంగా భాసిస్తూ భూమిపై పడింది.

**త్వష్టైవ తేజసా తేన విష్ణోశ్చక్రమకల్పయత్ ।**
**త్రిశూలం చైవ రుద్రస్య శిబికాం ధనదస్య చ ॥ 11 ॥**

**శక్తిం గుహస్య దేవానామన్యేషాం చ యదాయుధమ్ ।**
**తత్సర్వం తేజసా తేన విశ్వకర్మా వ్యవర్ధయత్ ॥ 12 ॥**

విశ్వకర్మ ఆ తేజస్సుతోనే విష్ణువుకు చక్రం, రుద్రునకు త్రిశూలం, కుబేరునకు విమానం, కుమారస్వామికి శక్తి అనే ఆయుధాన్ని తయారుచేసిపెట్టాడు. మిగిలినదేవతలకు ఏ ఏ ఆయుధాలు ఉన్నాయో, వాటి నన్నింటిని విశ్వకర్మ ఆ సూర్యతేజస్సుతోనే ఉద్దీపింపజేశాడు.

**ఛాయాసంజ్ఞాసుతో యోఽసౌ ద్వితీయః కథితో మనుః ।**
**పూర్వజస్య సవర్ణోఽసౌ సావర్ణిస్తేన చోచ్యతే ॥ 13 ॥**

ఛాయాసంజ్ఞ కుమారుడని, అతడు రెండవమనువు అని చెప్పాను కదా! అతడు అన్నతో సమానమైన వర్ణం కలవాడు కాన సావర్ణి" అని చెప్పబడ్డాడు.

**తస్య మన్వన్తరం హ్యేతత్ సావర్ణిక మథాష్టమమ్ ।**
**తచ్ఛృణుష్వ మహాభాగ! భవిష్యం కథయామి తే ॥ 14 ॥**

మహాభాగ! ఇది ఎనిమిదో మన్వంతరం. ఇదే సావర్ణికమన్వంతరమని అతనిపేరుతోనే రాబోతున్నది. దానిని గురించి నీకు చెబుతాను, విను.

**సావర్ణిస్తు మనుర్యోఽసౌ మైత్రేయ! భవితా తతః ।**
**సుతపాశ్చామితాభాశ్చ ముఖ్యాశ్చాపి తదా సురాః ॥ 15 ॥**

మైత్రేయా! అపుడు ఈ సావర్ణియే మనువు అవుతాడు,సుతపులు,అమితాభులు, ముఖ్యులు అనేవారు అపుడు దేవతాగణాలు.

**తేషాం గణస్తు దేవానామేకైకో వింశకః స్మృతః ।**
**సప్తర్షీనపి వక్ష్యామి భవిష్యాన్ మునిసత్తమ ॥ 16 ॥**

మునిశ్రేష్ఠా! ఈదేవతాగణం ఒక్కొక్క దానిలోను ఇరవై మంది దేవతలు ఉంటారు. ఇక అందు రాబోయే సప్తర్షులను గురించి చెప్పబోతున్నాను.

**దీప్తిమాన్ గాలవో రామః కృపో ద్రౌణిస్తథాఽపరః ।**
**మత్పుత్రస్తు తథా వ్యాస ఋష్యశృంగశ్చ సప్తమః ॥ 17 ॥**

దీప్తిమంతుడు, గాలవుడు, రాముడు, కృపుడు, అలాగే ద్రౌణి(అశ్వత్థామ),నాపుత్రుడైన వ్యాసుడు, ఏడవవాడు ఋష్యశృంగుడు వీరు ఏడుగురు సప్తర్షులు.

**విష్ణుప్రసాదాదనఘః పాతాలాన్తరగోచరః ।**
**విరోచనసుతస్తేషాం బలిరిన్ద్రో భవిష్యతి ॥ 18 ॥**

విష్ణువు అనుగ్రహంవల్ల పుణ్యాత్ముడై పాతాళంలో ఉంటూ ఉన్న విరోచనుని కుమారుడగు బలి చక్రవర్తి వారికి ఇంద్రుడు కాగలడు.

**విరజాశ్చోర్వరీవాంశ్చ నిర్మోహాద్యాస్తథాఽపరే ।**
**సావర్ణేస్తు మనోః పుత్రా భవిష్యన్తి నరేశ్వరాః ॥ 19 ॥**

విరజుడు, ఉర్వరీవంతుడు, నిర్మోహుడు మొదలైన ఇతరులు సావర్ణిమనువుకుమారులు రాజేంద్రులు కాగలరు.

**నవమో దక్షసావర్ణిర్మైత్రేయ! భవితా మనుః ।**
**పారా మరీచిగర్భాశ్చ సుధర్మాణస్తథా త్రిధా ॥ 20 ॥**

**భవిష్యన్తి తదా దేవా ఏకైకో ద్వాదశో గణః ।**
**తేషామిన్ద్రో మహావీర్యో భవిష్యత్యద్భుతో ద్విజ! ॥ 21 ॥**

మైత్రేయా! ఆ తరవాత దక్షసావర్ణి అనేవాడు తొమ్మిదో మనువు కాగలడు, పారులు, మరీచిగర్భులు, సుధర్ములు అనే మూడు విధాల దేవతాగణాలు ఉంటారు. ఒక్కొక్కగణంలోను పంద్రెండుగురు దేవతలు ఉంటారు. ద్విజశ్రేష్ఠా! వారికి ఇంద్రుడు మహాబలపరాక్రమశాలి అయిన అద్భుతుడు కాగలడు.

**సబలో ద్యుతిమాన్ భవ్యో వసుర్మేధాతిథిస్తథా ।**
**జ్యోతిష్మాన్ సప్తమః సత్యస్తత్రైతే చ మహర్షయః ॥ 22 ॥**

సబలుడు, ద్యుతిమంతుడు, భవ్యుడు, వసువు, మేధాతిథి,జ్యోతిష్మంతుడు, ఏడవవాడు సత్యుడు, వీరు సప్తమహర్షులు.

**ధృతకేతుర్దీప్తికేతుః పంచహస్తో నిరామయః ।**
**పృథుశ్రవాద్యాశ్చ తథా దక్షసావర్ణికాత్మజాః ॥ 23 ॥**

ధృతకేతువు, దీప్తికేతువు, పంచహస్తుడు, నిరామయుడు, పృథుశ్రవుడు మున్నగు దక్షసావర్ణికుమారులు రాజేంద్రులు అవుతారు.

**దశమో బ్రహ్మసావర్ణిర్భవిష్యతి మునే! మనుః ।**
**సుధామానో విశుద్ధాశ్చ శతసంఖ్యా స్తథా సురాః ॥ 24 ॥**

మునీశ్వరా! తరవాత బ్రహ్మసావర్ణి పదోమనువు కాగలడు. సుధాములు, విశుద్ధులు అనేవారు దేవతాగణాలు. ఒక్కొక్కగణంలో నూరుగురు దేవతలు ఉంటారు.

**తేషామింద్రశ్చ భవితా శాన్తిర్నామ మహాబలః ।**
**సప్తర్షయో భవిష్యన్తి యే తదా తాన్ శృణుష్వ చ ॥ 25 ॥**

వారికి మహాబలవంతుడైన శాంతి అనే వాడు ఇంద్రుడు అవుతాడు. ఇక సప్తర్షులు కాగలవారిని గురించి విను.

**హవిష్మాన్ సుకృతః సత్యస్తపోమూర్తిస్తథాఽపరః ।**
**నాభాగోఽప్రతిమౌజాశ్చ సత్యకేతుస్తథైవ చ ॥ 26 ॥**

హవిష్మంతుడు, సుకృతుడు, సత్యుడు, తపోమూర్తి, అలాగే ఋషి నాభాగుడు, అప్రతిమౌజుడు, సత్యకేతుడు వీరు సప్తర్షులు.

**సుక్షేత్రశ్చోత్తమౌజాశ్చ భూరిషేణాదయో దశ ।**
**బ్రహ్మసావర్ణిపుత్రాస్తు రక్షిష్యన్తి వసున్ధరామ్ ॥ 27 ॥**

సుక్షేత్రుడు, ఉత్తమౌజుడు, భూరిషేణుడు (హరిసేనుడు) మున్నగు వారు పదిమంది బ్రహ్మసావర్ణి కుమారులు ఈ వసుంధరను భవిష్యత్తులో రక్షిస్తారు.

**ఏకాదశశ్చ భవితా ధర్మసావర్ణికో మనుః ।**
**విహంగమాః కామగమా నిర్వాణరతయస్తథా ॥ 28 ॥**

**గణాస్త్వేతే తదా ముఖ్యా దేవానాం చ భవిష్యతామ్ ।**
**ఏకైకస్త్రింశకస్తేషాం గణశ్చేన్ద్రశ్చ వై వృషః ॥ 29 ॥**

అటు పిమ్మట ధర్మసావర్ణి అనేవాడు పదకొండో మనువు అవుతాడు. విహంగములు, కామగములు, నిర్వాణరతులు అనేవారు అప్పుడు దేవగణాలు అవుతారు. ఆ ముఖ్యులైన దేవగణాలలో ఒక్కొక్కటి ముప్పైమంది చొప్పున ఉంటారు. వారికి ఇంద్రుడు వృషుడు కాగలడు.

**నిశ్చరశ్చాగ్నితేజాశ్చ వపుష్మాన్ ఘృణిరారుణిః ।**
**హవిష్మాననఘశ్చైతే భావ్యాః సప్తర్షయస్తథా ॥ 30 ॥**

నిశ్చరుడు, అగ్నితేజుడు, వపుష్మంతుడు, ఘృణి, ఆరుణి, హవిష్మంతుడు, అనఘుడు–వీరు ఆ మన్వంతరంలో కాబోయే సప్తర్షులు.

**విశే:** నిశ్చరుడు–నిఃస్వరుడు,ఘృణి–విష్ణువు–పాఠాంతరాలు.

**సర్వగః సర్వధర్మా చ దేవానీకాదయస్తథా ।**
**భవిష్యన్తి మనోస్తస్య తనయాః పృథివీశ్వరాః ॥ 31 ॥**

సర్వగుడు,సర్వధర్ముడు, దేవానీకుడు మున్నగువారు ఆ మనువుయొక్క కుమారులు. వారు మహీపాలకులు కాగలరు.

**రుద్రపుత్రస్తు సావర్ణిర్భవితా ద్వాదశో మనుః ।**
**ఋతధామా చ తత్రేన్ద్రో భవితా శృణు మే సురాన్ ॥ 32 ॥**

రుద్రుని కుమారుడైన సావర్ణి పంద్రెండవ మనువు కాగలడు. ఋతుధాముడు అప్పుడు ఇంద్రుడు అవుతాడు. ఆ మన్వంతరంలోని దేవతలను గూర్చి చెబుతాను, విను.

**హరితా రోహితా దేవాస్తథా సుమనసో ద్విజ! ।**
**సుకర్మాణశ్చ తారాశ్చ దశకః పంచ వై గణాః ॥ 33 ॥**

ద్విజోత్తమా! హరితులు, రోహితులు, సుమనసులు, సుకర్ములు, తారులు అనే ఐదుగణాలవారు దేవతలు. ఒక్కొక్కగణానికి పదిమంది ఉంటారు.

వి ॥ తారాశ్చ–సురాపాశ్చ–సురాపులు అని పాఠాంతరం.

**తపస్వీ సుతపాశ్చైవ తపోమూర్తిస్తపోరతిః ।**
**తపోధృతిస్తపోద్యుతిః సప్తమస్తు తపోధనః ॥ 34 ॥**

తపస్వి, సుతపుడు, తపోమూర్తి,తపోరతి, తపోధృతి,తపోద్యుతి, ఏడవవాడు తపోధనుడు– వీరు సప్తర్షులు.

వి ॥ తపోద్యుతికి బదులుగా ద్యుతి అనేవాడు మరొకడు అని పాఠాంతరం.

**దేవవానుపదేవశ్చ దేవశ్రేష్ఠాదయస్తథా ।**
**మనోస్తస్య మహావీర్యా భవిష్యన్తి సుతా నృపాః ॥ 35 ॥**

దేవవంతుడు, ఉపదేవుడు, దేవశ్రేష్ఠుడు మున్నగువారు ఆ మనువుకుమారులు. మహాబలవంతులు వారు రాజేంద్రులు కాగలరు.

**త్రయోదశో రౌచ్య నామా భవిష్యతి మునే ! మనుః ।**
**సుత్రామాణః సుధర్మాణః సుకర్మాణస్తథాఽపరాః ॥ 36 ॥**

**త్రయస్త్రింశత్ విభేదాస్తే దేవా యే తు వై గణాః ।**
**దివస్పతిర్మహావీర్యస్తేషామిన్ద్రో భవిష్యతి ॥ 37 ॥**

మునీశ్వరా! పదమూడవ మనువు రౌచ్యుడు(రుచి) అనే వాడు కాగలడు, సుత్రాములు, సుధర్ములు, సుకర్ములు మున్నగువారు దేవతాగణాలు, ఒక్కొక్క గణానికి ముప్పైముగ్గురు దేవతలు ఉంటారు. వారికి మహాబలశాలి అయిన దివస్పతి ఇంద్రుడు కాగలడు.

**నిర్మోహస్తత్త్వదర్శీ చ నిష్ప్రకమ్ప్యో నిరుత్సుకః ।**
**ధృతిమానవ్యయశ్చాన్యః సప్తమః సుతపా మునిః ॥ 38 ॥**

**సప్తర్షయస్త్విమే తస్య పుత్రానపి నిబోధ మే ।**
**చిత్రసేనవిచిత్రాద్యా భవిష్యన్తి మహీక్షితః ॥ 39 ॥**

నిర్మోహుడు,తత్త్వదర్శి, నిష్ప్రకంప్యుడు, నిరుత్సుకుడు, ధృతిమంతుడు, అవ్యయుడనే మరొకడు, ఏడవాడు సుతపుడనే ముని–వీరు ఏడుగురు సప్తర్షులు. ఆ మనువుకుమారులను గూర్చి నేను చెబుతాను విను. చిత్రసేనుడు, విచిత్రుడు మున్నగువారు ఆ మనుపుత్రులు వారు ధరణీపాలకులు కాగలరు.

**భౌమశ్చతుర్దశశ్చాత్ర మైత్రేయ! భవితా మనుః ।**
**శుచిరిన్ద్రః సురగణాస్తత్ర పంచ శృణుష్వ తాన్ ॥ 40 ॥**

మైత్రేయా! పధ్నాలుగో మన్వంతరంలో భౌముడు అనేవాడు మనువు అవుతాడు. శుచి అనే వాడు ఇంద్రుడు కాగలడు, ఆ మన్వంతరంలో అయిదు దేవగణాలు ఉంటాయి. వారిని గూర్చి విను.

**చాక్షుషాశ్చ పవిత్రాశ్చ కనిష్ఠా భ్రాజికాస్తథా ।**
**వచోవృద్ధాశ్చ వై దేవాః సప్తర్షీనపి మే శృణు ॥ 41 ॥**

చాక్షుషులు, పవిత్రులు, కనిష్ఠులు, భ్రాజికులు, వచోవృద్ధులు–అనే వారు దేవతాగణాలు. ఇక సప్తర్షులను గూర్చి కూడ విను.

**అగ్నిబాహుః శుచిః శుక్రో మాగధోఽగ్నిధ్ర ఏవ చ ।**
**యుక్తస్తథాఽజితశ్చాన్యో మనుపుత్రానతః శృణు ॥ 42 ॥**

అగ్నిబాహువు, శుచి, శుక్రుడు, మాగధుడు, అగ్నిధ్రుడు, యుక్తుడు, అలాగే అజితుడు - వీరు ఋషులు. ఇకపై మనువుకుమారులను గూర్చి ఆలకించు.

వి ॥ అజితః - జితః (జితుడు) అని పాఠాంతరం.

**ఊరుర్గభీరబుద్ధ్యాద్యా మనోస్తస్య సుతా నృపాః ।**
**కథితా మునిశార్దూల! పాలయిష్యన్తి యే మహీమ్ ॥ 43 ॥**

ఊరుడు, గభీరబుద్ధి మున్నగువారు మనుపుత్రులు నృపాలురు కాగలరు. మునిశార్దూల! ఈ భూమిని పరిపాలించే వారిని గురించి నీకు చెప్పాను.

**చతుర్యుగాన్తే వేదానాం జాయతే కిల విప్లవః ।**
**ప్రవర్తయన్తి తానేత్య భువి సప్తర్షయో దివః ॥ 44 ॥**

చతుర్యుగాంతంలో వేదాలకు లోపం సంభవిస్తుంది. అపుడు సప్తర్షులు దివినుండి భువికి దిగివచ్చి తిరిగి ఆ వేదాలను ప్రవర్తింపజేస్తారు.

**కృతే కృతే స్మృతేర్విప్ర! ప్రణేతా జాయతే మనుః ।**
**దేవా యజ్ఞభుజస్తే తు యావన్మన్వంతరం తు తత్ ॥ 45 ॥**

విప్రోత్తమా! ప్రతికృతయుగంలోను స్మృతికర్త (ధర్మశాస్త్రప్రవక్త) అయిన మనువు అవతరిస్తాడు. ఆ కాలంలోని దేవతలు ఆ మన్వంతరం చివరివరకు యజ్ఞభోక్తలుగా వ్యవహరిస్తారు.

**భవన్తి యే మనోః పుత్రా యావన్మన్వన్తరన్తు తైః ।**
**తదన్వయోద్భవైశ్చైవ తావద్భూః పరిపాల్యతే ॥ 46 ॥**

మనువుకుమారులు, వారి వంశంలో జన్మించినవారు ఆయా మన్వంతరాల చివరివరకు భూమిని పరిపాలిస్తారు.

**మనుః సప్తర్షయో దేవా భూపాలాశ్చ మనోః సుతాః ।**
**మన్వన్తరే భవన్త్యేతే శక్రశ్చైవాధికారిణః ॥ 47 ॥**

మనువు, సప్తర్షులు, దేవతలు, మనువుకుమారులైన రాజేంద్రులు, ఇంద్రుడు. వీరు వారి మన్వంతరంలో అధికారులుగా వ్యవహరిస్తూ ఉంటారు.

**చతుర్దశభిరేతైస్తు గతైర్మన్వన్తరైర్ద్విజ ।**
**సహస్రయుగపర్యన్తః కల్పో నిఃశేష ఉచ్యతే ॥ 48 ॥**

ద్విజోత్తమా! ఇలా ఈ పద్నాలుగు మన్వంతరాలు గడచిపోతే వేయి యుగాల కాలపరిమితిగల ఒక కల్పం పూర్తి అయిందని అంటారు.

**తావత్ప్రమాణా చ నిశా తతో భవతి సత్తమ! ।**
**బ్రహ్మరూపధరః శేతే శేషాహావమ్బుసమ్ప్లవే ॥ 49 ॥**

మునిశ్రేష్ఠా! తరవాత అంతే కాలపరిమితిగల రాత్రి ఉంటుంది. అపుడు బ్రహ్మరూపధరుడైన భగవంతుడు ప్రలయజలంలో శేషనాగేంద్రునిపై శయనిస్తాడు.

**త్రైలోక్యమఖిలం గ్రస్త్వా భగవానాదికృత్ విభుః ।**
**స్వమాయాసంస్థితో విప్ర! సర్వభూతో జనార్దనః ॥ 50 ॥**

విప్రోత్తమా! ఆదికర్త, ప్రభువు, భగవంతుడు, సర్వభూతస్వరూపుడు అయిన జనార్దనుడు భూలోక, భువర్లోక, స్వర్లోకాలనే మూడు లోకాలను శూన్యంచేసి (మ్రింగి) తన మాయలోనే తాను ఉంటాడు.

**తతః ప్రబుద్ధో భగవాన్ యథాపూర్వం తథా పునః ।**
**సృష్టిం కరోత్యవ్యయాత్మా కల్పే కల్పే రజోగుణః ॥ 51 ॥**

ప్రతికల్పంలోను ఆ అవ్యయాత్ముడైన భగవంతుడు రాత్రి గడచిన పిమ్మట మేలుకొన్నవాడై రజోగుణాన్ని ఆశ్రయించినవాడై మళ్లీ యథాపూర్వకంగా సృష్టి చేస్తాడు.

**మనవో భూభుజః సేన్ద్రా దేవాః సప్తర్షయస్తథా ।**
**సాత్త్వికోంఽశః స్థితికరో జగతో ద్విజసత్తమ ॥ 52 ॥**

ద్విజశ్రేష్ఠా! మనువులు, రాజులు, ఇంద్రులు, దేవతలు, అలాగే సప్తర్షులు అందరూ జగత్తు స్థితికారణమైన సాత్త్వికగుణాంశమే సుమా!

**చతుర్యుగేఽప్యసౌ విష్ణుః స్థితివ్యాపారలక్షణః ।**
**యుగవ్యవస్థాం కురుతే యథా మైత్రేయ! తచ్ఛృణు ॥ 53 ॥**

మైత్రేయా! స్థితివ్యాపారకారకుడైన విష్ణుభగవానుడు నాలుగు యుగాలలోను కల్పాంతపర్యంతం కూడ ఎలా రక్షణ చేస్తాడో ఆలకించు.

**కృతే యుగే పరం జ్ఞానం కపిలాదిస్వరూపధృక్ ।**
**దదాతి సర్వభూతానాం సర్వభూతహితే రతః ॥ 54 ॥**

సమస్తప్రాణులకు మేలును కూర్చుటలో ఆసక్తిగల భగవంతుడు కృతయుగంలో కపిలుడు మున్నగు రూపాలను ధరించినవాడై సర్వభూతాలకు జ్ఞానాన్ని ఉపదేశిస్తాడు.

**చక్రవర్తిస్వరూపేణ త్రేతాయామపి స ప్రభుః ।**
**దుష్టానాం నిగ్రహం కుర్వన్ పరిపాతి జగత్త్రయమ్ ॥ 55 ॥**

త్రేతాయుగంలో ఆ భగవానుడు చక్రవర్తులరూపంలో అవతరించి దుష్టులను నిగ్రహించి మూడు లోకాలను చక్కగా రక్షిస్తాడు.

**వేదమేకం చతుర్భేదం కృత్వా శాఖాశతైర్విభుః ।**
**కరోతి బహులం భూయో వేదవ్యాసస్వరూపధృక్ ॥ 56 ॥**

ఆ తరవాత ద్వాపరయుగంలో ఆ ప్రభువు వేదవ్యాసుని రూపాన్ని ధరించినవాడై, ఒకటిగా ఉన్న వేదాన్ని నాలుగు భేదాలుగా చేసి, మళ్లీ వందలు శాఖలుగా విభజించి బహురూపంగా విస్తరింపజేస్తాడు.

**వేదాంస్తు ద్వాపరే వ్యస్య కలేరన్తే పునర్హరిః ।**
**కల్కిస్వరూపీ దుర్వృత్తాన్ మార్గే స్థాపయతి ప్రభుః ॥ 57 ॥**

ప్రభువైన శ్రీహరి ద్వాపరంలో వేదాలను విభజించి, కలియుగం అంతమయ్యే సమయంలో కల్కిరూపంలో అవతరించి, దుర్మార్గులను కృతయుగమార్గంలో సంచరించే రీతిగా చక్కని దారిలోకితెస్తాడు.

**ఏవమేష జగత్ సర్వం పరిపాతి కరోతి చ ।**
**హన్తి చాన్తేష్వనన్తాత్మా నాస్త్యస్మాద్ వ్యతిరేకి యత్ ॥ 58 ॥**

ఈ విధంగా ఆ అనంతస్వరూపుడు ఈ జగత్తునంతటినీ సృష్టిస్తున్నాడు. పరిపాలనం చేస్తున్నాడు. ప్రలయసమయాలలో నశింపజేస్తున్నాడు. ఈరీతిగా ఈవిశ్వంలో ఆయనకన్న వేరుగా ఏ వస్తువూ లేదు.

**భూతం భవ్యం భవిష్యం చ సర్వభూతాన్మహాత్మనః ।**
**తదత్రాన్యత్ర వా విప్ర! సద్భావః కథితస్తవ ॥ 59 ॥**

**మన్వన్తరాణ్యశేషాణి కథితాని మయా తవ ।**
**మన్వన్తరాధిపాశ్చైవ కిమన్యత్ కథయామి తే ॥ 60 ॥**

"విప్రోత్తమా! జరిగిపోయినది, ప్రస్తుతం ఉన్నది, భవిష్యత్కాలంలో రాబోయేది, ఇక్కడ కాని, వేరే ఇంకోచోట కాని ఉన్నది, అంతా సర్వభూతస్వరూపుడైన ఆ మహాత్మునినుంచి వచ్చినదే. ఈవిధంగా సంపూర్ణసద్భావం నీకు తెలియజేశాను. అదేరీతిగా సమస్తమన్వంతరాలను గురించి, ఆ మన్వంతరాధిపతులను గురించి నీకు వివరించాను. ఇంక నీకు ఏ విషయం తెలియజేయమంటావు?" అని పరాశరుడు ప్రశ్నించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే సావర్ణి ప్రభృతి మనువృత్తాంతో నామ ద్వితీయోఽధ్యాయః సమాప్తః ॥ 2 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో సావర్ణి మున్నగు మనువుల వృత్తాంతం అనే రెండవ అధ్యాయం సమాప్తం॥2॥

## **తృతీయోఽధ్యాయః** - మూడవ అధ్యాయం

## **అష్టావింశతి వేదవ్యాసానాం నామాని** - ఇరవై ఎనమందుగురు వేదవ్యాసుల నామాలు

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు చెప్పాడు.

**జ్ఞాతమేతన్మయా త్వత్తో యథాపూర్వమిదం జగత్ ।**
**విష్ణుర్విష్ణౌ విష్ణుతశ్చ న పరం విద్యతే తతః ॥ 1 ॥**

ఈసమస్తజగత్తూ యథాపూర్వకల్పవిధానపద్ధతిగా ఎలా ఏర్పడిందో నీవల్ల పూర్తిగా తెలిసింది. ఇదంతా విష్ణుస్వరూపమని, విష్ణువులోనే ఉన్నదని, విష్ణువునుంచే వచ్చిందని, విష్ణువుకంటె భిన్నమైనది కాదని తెలిసింది.

**ఏతత్తు శ్రోతుమిచ్ఛామి వ్యస్తా వేదా మహాత్మనా ।**
**వేదవ్యాసస్వరూపేణ యథా తేన యుగే యుగే ॥ 2 ॥**

వేదవ్యాసరూపంలో అవతరించిన ఆ మహాత్మునిచే ప్రతియుగంలోను వేదాలు ఎలా విభజించబడ్డాయో, ఆ వృత్తాంతాన్ని గురించి వినగోరుతున్నాను.

**యస్మిన్ యస్మిన్ యుగే వ్యాసో యోఽయ ఆసీన్మహామునే ।**
**తం తమాచక్ష్వ భగవన్! శాఖాభేదాంశ్చ మే వద ॥ 3 ॥**

"భగవత్స్వరూపుడవైన మహామునీ! పరాశర సద్గురువర్యా! ఏ యే యుగాలలో ఎవరు ఎవరు వ్యాసులు అయ్యారో వారి వారిని గురించి నాకు తెలియజేయి. వారు విభజించిన వేదశాఖాభేదాలను కూడ నాకు వివరించు" అని కోరాడు.

**పరాశర ఉవాచ :-** పరాశరుడు పలికాడు.

**వేదద్రుమస్య మైత్రేయ! శాఖాభేదైః సహస్రశః ।**
**న శక్యో విస్తరో వక్తుం సంక్షేపేణ శృణుష్వ తత్ ॥ 4 ॥**

మైత్రేయా! వేదవృక్షానికి ఉన్న శాఖలు, వాటి భేదాలు వేలకొలదీ ఉన్నాయి. వీటిని గూర్చి సవివరంగా చెప్పడం సులభం కాదు. అయినా సంగ్రహంగా చెబుతాను, ఆలకించు.

**ద్వాపరే ద్వాపరే విష్ణుర్వ్యాసరూపీ మహామునే! ।**
**వేదమేకం స బహుధా కురుతే జగతో హితః ॥ 5 ॥**

మహామునీ! ప్రతి ద్వాపరయుగంలోను విష్ణువు వ్యాసరూపంలో అవతరించి ఏకరూపంగా ఉన్న వేదాన్ని లోకాలకు మేలు చేకూర్చడానికై అనేక భాగాలుగా విభజిస్తాడు.

**వీర్యం తేజో బలం చాల్పం మనుష్యాణామవేక్ష్య వై ।**
**హితాయ సర్వభూతానాం వేదభేదాన్ కరోతి సః ॥ 6 ॥**

ఆ వేదవ్యాసుడు మనుష్యుల వీర్యం, తేజస్సు, బలం అత్యల్పమని గ్రహించి సమస్తప్రాణిహితంకోసమై వేదవిభాగాలను చేస్తాడు.

**యయాఽసౌ కురుతే తన్వా వేదమేకం పృథక్ ప్రభుః ।**
**వేదవ్యాసాభిధానా తు సా మూర్తిర్మధువిద్విషః ॥ 7 ॥**

ఆ విష్ణువు ఏ శరీరంతో ఏకరూపంగా ఉన్న వేదాన్ని వేరు వేరుగా విభజిస్తాడో, అదే మధుసూదనుని వేదవ్యాసుడు అనే పేరుగల స్వరూపం.

**యస్మిన్ మన్వన్తరే యే యే వ్యాసాస్తాంస్తాన్నిబోధ మే ।**
**యథా చ భేదః శాఖానాం వ్యాసేన క్రియతే మునే ॥ 8 ॥**

మునీశ్వరా! ఏ యే మన్వంతరంలో ఎవరెవరు వ్యాసులుగా ఉన్నారో వారి వారిని గూర్చి చెబుతాను గ్రహించు. ఏవిధంగా వ్యాసుని వేదశాఖాభేదాలు చేయబడ్డాయో అది కూడ ఆలకించు.

**అష్టావింశతి కృత్వో వై వేదా వ్యస్తా మహర్షిభిః ।**
**వైవస్వతేఽన్తరే హ్యస్మిన్ ద్వాపరేషు పునః పునః ॥ 9 ॥**

ఈ వైవస్వత మన్వంతరంలో ద్వాపరయుగాలలో ఇరవై ఎనిమిది పర్యాయాలు మహర్షులు పునః పునః వేదవిభాగం కావించారు.

**వేదవ్యాసా వ్యతీతా యే అష్టావింశతి సత్తమ! ।**
**చతుర్ధా యైః కృతో వేదో ద్వాపరేషు పునః పునః ॥ 10 ॥**

సజ్జనోత్తమా! ప్రతి ద్వాపరయుగంలోను మళ్లీ మళ్లీ వేదాలను నాలుగుగా విభాగించినటువంటి, గడచిపోయిన ఇరవై ఎనిమిది మంది వేదవ్యాసులు ఎవరెవరో (ఆలకించు).

**ద్వాపరే ప్రథమే వ్యస్తాః స్వయం వేదాః స్వయంభువా ।**
**ద్వితీయే ద్వాపరే చైవ వేదవ్యాసః ప్రజాపతిః ॥ 11 ॥**

మొదటి ద్వాపరయుగంలో బ్రహ్మదేవునివల్లనే వేదాలు స్వయంగానే విభజించబడ్డాయి. రెండో ద్వాపరయుగంలో ప్రజాపతి (మనువు) వేదవ్యాసుడయ్యాడు.

**తృతీయే చోశనా వ్యాసశ్చతుర్థే చ బృహస్పతిః ।**
**సవితా పంచమే వ్యాసో మృత్యుః షష్ఠే స్మృతః ప్రభుః ॥ 12 ॥**

మూడో ద్వాపరంలో శుక్రుడు వ్యాసుడు, నాలుగో ద్వాపరంలో బృహస్పతి, ఐదో ద్వాపరంలో సవిత, ఆరో ద్వాపరంలో ప్రభువైన మృత్యువు వ్యాసులయ్యారు.

**సప్తమే చ తథైవేన్ద్రో వసిష్ఠశ్చాష్టమే స్మృతః ।**
**సారస్వతశ్చ నవమే త్రిధామా దశమే స్మృతః ॥ 13 ॥**

ఏడో ద్వాపరంలో ఇంద్రుడు, ఎనిమిదో ద్వాపరంలో వసిష్ఠుడు, తొమ్మిదో ద్వాపరంలో సారస్వతుడు, పదో ద్వాపరంలో త్రిధాముడు వ్యాసులయ్యారు.

**ఏకాదశే తు త్రివృషా భరద్వాజస్తతః పరమ్ ।**
**త్రయోదశే చాన్తరిక్షో వర్ణీ చాపి చతుర్దశే ॥ 14 ॥**

పదకొండో ద్వాపరంలో త్రివృషుడు, ఆ తరువాతిదైన పన్నెండో ద్వాపరంలో భరద్వాజుడు, పదమూడో ద్వాపరంలో అంతరిక్షుడు, పద్నాలుగో ద్వాపరంలో వర్ణి వ్యాసులయ్యారు

**విశే:** త్రివృషా–త్రిశిఖ–త్రిశిఖుడు అని పారాంతరం వర్ణీ–ధర్మీ–ధర్ముడు అని పాఠాంతరం.

**త్రయ్యారుణః పంచదశే షోడశే తు ధనంజయః ।**
**క్రతుంజయః సప్తదశే తదూర్ధ్వం చ జయః స్మృతః ॥ 15 ॥**

పదిహేనో ద్వాపరంలో త్రయ్యారుణుడు, పదహారో ద్వాపరంలో ధనంజయుడు, పదిహేడో ద్వాపరంలో క్రతుంజయుడు, పద్దెనిమిదో ద్వాపరంలో జయుడు వ్యాసులయ్యారు.

**విశే:** ఋణజ్యోఽష్టాదశే స్మృతః.(పద్దెనిమిదో ద్వాపరంలో ఋణజ్యుడు వ్యాసుడు)

**తతో వ్యాసో భరద్వాజో భరద్వాజాత్తు గౌతమః ।**
**గౌతమాదుత్తమో వ్యాసో హర్యాత్మా యోఽభిధీయతే ॥ 16 ॥**

ఆ తరువాత పందొమ్మిదో ద్వాపరంలో భరద్వాజుడు, భరద్వాజుని తరవాత ఇరవయ్యో ద్వాపరంలో గౌతముడు, గౌతముని అనంతరం ఇరవై ఒకటో ద్వాపరంలో ఉత్తముడైన హర్యాత్ముడు వ్యాసులయ్యారు.

**అథ హర్యాత్మనోఽన్తే చ స్మృతో వాజశ్రవాన్వయః ।**
**సోమశుష్మాయనస్తస్మాత్ తృణబిన్దురితి స్మృతః ॥ 17 ॥**

హర్యాత్ముని తరవాత ఇరవైరెండో ద్వాపరంలో వాజశ్రవుడనే ముని, అతని తరువాత ఇరవై మూడో ద్వాపరంలో సోమశుష్మవంశజుడైన తృణబిందువు వ్యాసులయ్యారు.

**ఋక్షోఽభూత్ భార్గవస్తస్మాత్ వాల్మీకి ర్యోఽభిధీయతే ।**
**తస్మాదస్మత్పితా శక్తిర్వ్యాసస్తస్మాదహం మునే ॥ 18 ॥**

మునీశ్వరా! అతని అనంతరం ఇరవై నాలుగో ద్వాపరంలో భృగువంశీయుడైన ఋక్షుడు వ్యాసుడయ్యాడు. అతనిని వాల్మీకి అంటారు. అటుపిమ్మట ఇరవై అయిదో ద్వాపరంలో నా తండ్రి శక్తి వ్యాసుడయ్యాడు. అనంతరం ఇరవై ఆరో ద్వాపరంలో నేను(పరాశరుడను) వ్యాసుడనయ్యాను.

**జాతుకర్ణోఽభవన్మత్తః కృష్ణద్వైపాయనస్తతః ।**
**అష్టావింశతిరిత్యేతే వేదవ్యాసాః పురాతనాః ॥ 19 ॥**

నాతరవాత ఇరవై ఏడో ద్వాపరంలో జాతుకర్ణుడు వ్యాసుడు అయ్యాడు. అనంతరం ఇరవై ఎనిమిదో ద్వాపరంలో కృష్ణద్వైపాయనుడు వ్యాసుడయ్యాడు. ఈ ఇరవై ఎనమండుగురు ప్రాచీనకాల వేదవ్యాసులు.

**ఏకో వేదశ్చతుర్ధా తు యైః కృతో ద్వాపరాదిషు ।**
**భవిష్యే ద్వాపరే చాపి ద్రౌణిర్వ్యాసో భవిష్యతి ।**
**వ్యతీతే మమ పుత్రేఽస్మిన్ కృష్ణద్వైపాయనే మునౌ ॥ 20 ॥**

వారు ప్రతి ద్వాపరయుగారంభంలో ఏకరూపంగా ఉన్న వేదాన్ని నాలుగు భాగాలుగా విభజించారు. ఈ ద్వాపరంలో నాపుత్రుడైన కృష్ణద్వైపాయనమహర్షి వెళ్లిపోయిన తరవాత, రాగల ఇరవై తొమ్మిదో ద్వాపరంలో ద్రోణపుత్రుడైన అశ్వత్థామ వ్యాసుడు కాగలడు.

**ధ్రువమేకాక్షరం బ్రహ్మ ఓమిత్యేవం వ్యవస్థితమ్ ।**
**బృహత్వాత్ బృంహణత్వాచ్చ తద్బ్రహ్మేత్యభిధీయతే ॥ 21 ॥**

ఓంకారం ఏకాక్షరం. ఆ ఓంకారమే శాశ్వతమైన బ్రహ్మముగా సదా ఉండేది. పెద్దదయినది, వ్యాపింప చేసేది కావున అది బ్రహ్మమని పిలవబడుతోంది.

**ప్రణవావస్థితం నిత్యం భూర్భువః స్వరితీర్యతే ।**
**ఋగ్యజుః సామాథర్వణం యత్తస్మై బ్రహ్మణే నమః ॥ 22 ॥**

భూలోకం, భువర్లోకం, స్వర్లోకం–ఈ మూడూనిత్యం ప్రణవంలో (ఓంకారంలో)ఉన్నాయని అంటారు ఋగ్యజుస్సామాథర్వణవేదాలు నాలుగూ ప్రణవమే. అట్టి బ్రహ్మమునకు నమస్కారం.

**జగతః ప్రలయోత్పత్త్యోర్యత్తత్ కారణసంజ్ఞితమ్ ।**
**మహతః పరమం గుహ్యం తస్మై సుబ్రహ్మణే నమః ॥ 23 ॥**

జగత్తు సృష్టించబడడానికి, నాశనమవడానికి ఏది కారణం అవుతోందో, ఏది మహత్తత్త్వం కన్న మిక్కిలి సూక్ష్మమయినదో, అట్టి గొప్పదైన బ్రహ్మమునకు నమస్కారం.

**అగాధాపారమక్షయ్యం జగత్ సమ్మోహనాలయమ్ ।**
**సంప్రకాశప్రవృత్తిభ్యాం పురుషార్థప్రయోజనమ్ ॥ 24 ॥**

అది అగాధమైనది. అపారమైనది. అక్షయ్యమైనది. జగత్తును మోహింపజేసే తమోగుణానికి నిలయమైనది. ప్రకాశరూపమైన సత్త్వగుణంతోను, ప్రవృత్తిరూపరజోగుణంతోను పురుషార్థాలకు సాధకం అవుతోంది.

**సాంఖ్యజ్ఞానవతాం నిష్ఠా గతిః శమదమాత్మనామ్ ।**
**యత్తదవ్యక్తమమృతం ప్రవృత్తం బ్రహ్మ శాశ్వతమ్ ॥ 25 ॥**

పరబ్రహ్మను గూర్చి జ్ఞానం కలిగినవారికి అదే పరాకాష్ఠ(అది ఒకటే నిష్ఠ) శమం,దమం కలిగిన యోగులకు అదే పరాగతి. అది అవ్యక్తమైనది. నాశనం లేనిది. క్రియాప్రకృతి కలిగినది. అదే శాశ్వతమైన బ్రహ్మము.

**ప్రధానమాత్మయోనిశ్చ గుహాసత్త్వం చ శస్యతే ।**
**అవిభాగం తథా శుక్లమక్షరం బహుధాత్మకమ్ ॥ 26 ॥**

అదే ప్రధానము అదే స్వయంభువు అదే అంతర్యామిగా వ్యవహరించబడుతోంది. అది ఏ విభాగం లేనట్టిది. మిక్కిలి ప్రకాశించేది, నశించనిది, బహురూపాత్మకమైనది.

**పరమబ్రహ్మణే తస్మై నిత్యమేవ నమో నమః ।**
**యద్రూపం వాసుదేవస్య పరమాత్మస్వరూపిణః ॥ 27 ॥**

పరమాత్మస్వరూపుడైన వాసుదేవుని రూపంగా భాసించు, ఓంకారరూప పరమబ్రహ్మమునకు నిత్యం నమస్కారం.

**ఏతద్బ్రహ్మ త్రిధాభేదమభేదమపి స ప్రభుః ।**
**సర్వభూతేష్వభేదోఽసౌ భిద్యతే భిన్నబుద్ధిభిః ॥ 28 ॥**

ఆ ఓంకార పరబ్రహ్మం ఏ భేదం లేనిదైనా, (అకార,ఉకార,మకారరూపంగా) మూడు భేదాలు ఉన్నట్లుగా ఉంటుంది. సర్వభూతాలలోను అభేదంగా ఉన్న ఈ బ్రహ్మమును భిన్నబుద్ధులైన వారు భిన్నంగా చూస్తూ ఉంటారు.

**స ఋఙ్మయః సామమయః స చాత్మా స యజుర్మయః ।**
**ఋగ్యజుః సామసారాత్మా స ఏవాత్మాశరీరిణామ్ ॥ 29 ॥**

ఆ ఓంకారరూప పరబ్రహ్మం ఋఙ్మయం, యజుర్మయం, సామమయం,అదే ఆత్మ. అదే ఋగ్యజుస్సామసారాత్మ, అదే సమస్తశరీరులకు అంతరాత్మ.

**స భిద్యతే వేదమయః స వేదం కరోతి భేదైర్బహుభిః స శాఖమ్ ।**
**శాఖా ప్రణేతా స సమస్తశాఖా జ్ఞానస్వరూపో భగవాననన్తః ॥ 30 ॥**

వేదమయమైన ఆ ఓంకారమే(మూడవిధాలుగా)భిన్నం అవుతోంది. అదే వేదాన్ని అనేక భేదాలు, అనేక శాఖలుగా చేస్తోంది. అదే సమస్తశాఖలు అదే సమస్తశాఖా ప్రవర్తకులు కూడ. అదే అసంగమైన జ్ఞానస్వరూపం. అదే భగవంతుడు అదే అనంతుడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే అష్టావింశతి వేదవ్యాసానాం నామానీతి తృతీయోఽధ్యాయః సమాప్తః ॥ 3 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో ఇరవై ఎనమండుగురు వేదవ్యాసుల నామాలు అనే మూడవ అధ్యాయం సమాప్తం ॥ 3 ॥

## చతుర్థోఽధ్యాయః - నాల్గవ అధ్యాయం

## ఋగ్వేదశాఖా వర్ణనమ్ - ఋగ్వేదశాఖల వర్ణన

**శ్రీపరాశర ఉవాచ** :- పరాశరుడు చెప్పాడు.

**ఆద్యో వేదశ్చతుష్పాదః శతసాహస్రసమ్మితః ।**
**తతో దశగుణః కృత్స్నో యజ్ఞోఽయం సర్వకామధుక్ ॥ 1 ॥**

ఆదికాలంలో వేదం నాలుగు పాదాలుగా లక్షమంత్రాలకు పరిమితమై ఉండేది. ఆ వేదం నుంచి కోరికలు తీర్చే పదివిధానాలైన యజ్ఞాలు నిర్వహించబడ్డాయి.

**తతోఽత్ర మత్సుతో వ్యాసో హ్యష్టావింశతిమేఽన్తరే ।**
**వేదమేకం చతుష్పాదం చతుర్ధా వ్యభజత్ ప్రభుః ॥ 2 ॥**

ఆ తరువాత నాకుమారుడైన అత్యంతసామర్థ్యంకల వ్యాసుడు ఇరవై ఎనిమిదో ద్వాపరయుగంలో నాలుగు పాదాలుగా నున్న ఏకరూపమైన వేదాన్ని నాల్గు విధాలుగా విభజించాడు.

**యథా తు తేన వై వ్యస్తా వేదవ్యాసేన ధీమతా ।**
**వేదాస్తథా సమస్తైస్తైర్వ్యస్తా వ్యాసైస్తథా మయా ॥ 3 ॥**

ధీమంతుడైన ఆ వేదవ్యాసుడు ఏవిధంగా వేదాలను విభజించాడో, అదేవిధంగా పూర్వయుగాలలోని వ్యాసులు, నేను, అందరమూ వేదాలను విభజన చేయడం జరిగింది.

**తదనేనైవ వేదానాం శాఖాభేదాన్ ద్విజోత్తమ! ।**
**చతుర్యుగేష్వాచరితాన్ సమస్తేష్వవధారయ ॥ 4 ॥**

ద్విజశ్రేష్ఠా! ఆ కారణంచే జరిగిపోయిన అన్ని చతుర్యుగాలలోను వేదపాఠశాఖాభేదాలు ఆ విధంగానే ఒక్కరీతిగానే ఉన్నాయని గ్రహించు.

**కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్ ।**
**కోఽన్యో హి భువి మైత్రేయ! మహాభారతకృద్ భవేత్ ॥ 5 ॥**

కృష్ణద్వైపాయనుని సాక్షాత్తు భగవంతుడైన నారాయణునిగా తెలుసుకో. అలా కానివాడు మరొకడు ఎవడయినా మహాభారత సృష్టికర్త కాగలడా?

**తేన వ్యస్తా యథా వేదా మత్పుత్రేణ మహాత్మనా ।**
**ద్వాపరే హ్యత్ర మైత్రేయ! తస్మిన్ శృణు యథార్థతః ॥ 6 ॥**

మైత్రేయా! మహాత్ముడైన నాకుమారుడైన వ్యాసుడు ఈ ఇరవై ఎనిమిదో ద్వాపరంలో ఏవిధంగా వేదాలను విభజించాడో, ఆ వృత్తాంతం ఉన్నది ఉన్నట్లుగా ఆలకించు.

**బ్రహ్మణా చోదితో వ్యాసో వేదాన్ వ్యస్తుం ప్రచక్రమే ।**
**అథ శిష్యాన్ స జగ్రాహ చతురో వేదపారగాన్ ॥ 7 ॥**

బ్రహ్మదేవుడు ఆజ్ఞాపించగా వ్యాసుడు వేదాలను విభజించడానికి ఉపక్రమించాడు. వేదాలను సంపూర్తిగా చదవగల్గిన నలుగురు శిష్యులను స్వీకరించాడు.

**ఋగ్వేదశ్రావకం పైలం జగ్రాహ స మహామునిః ।**
**వైశంపాయననామానం యజుర్వేదస్య చాగ్రహీత్ ॥ 8 ॥**

ఆ వేదవ్యాసమహర్షి ఋగ్వేదం అధ్యయనం చేయడానికై పైలుని స్వీకరించాడు. యజుర్వేదం అభ్యసించడానికై వైశంపాయనుడు అనే పేరుగల శిష్యుని గ్రహించాడు.

**జైమినిం సామవేదస్య తథైవాథర్వవేదవిత్ ।**
**సుమన్తుస్తస్య శిష్యో౽భూద్ వేదవ్యాసస్య ధీమతః ॥ 9 ॥**

సామవేదం గానం చేయడానికై జైమినిని చేరదీశాడు. ధీమంతుడైన వేదవ్యాసునికి సుమంతుడు శిష్యుడు అయి అథర్వవేదసారవేత్త అయినాడు.

**రోమహర్షణనామానం మహాబుద్ధిం మహామునిః ।**
**సూతం జగ్రాహ శిష్యం స ఇతిహాసపురాణయోః ॥ 10 ॥**

ఆ మహామునియైన వ్యాసుడు మహామేధావియైన రోమహర్షణుడు అనే పేరుగల సూతుని ఇతిహాస పురాణాలను ప్రవర్తింపజేయడానికై శిష్యునిగా స్వీకరించాడు.

**ఏక ఆసీద్ యజుర్వేదస్తం చతుర్ధా వ్యకల్పయత్ ।**
**చాతుర్హోత్రమభూద్ యస్మింస్తేన యజ్ఞమథాకరోత్ ॥ 11 ॥**

పూర్వం యజుర్వేదం ఒకటే ఉండేది. దానిని వ్యాసుడు నాలుగు విధాలుగా విభజించాడు. అందువల్ల దానితో చాతుర్హోత్రం ఏర్పడింది. దాని విధానంతోనే యజ్ఞవిధి ఏర్పడింది.

**ఆధ్వర్యవం యజుర్భిస్తు ఋగ్భిర్హోత్రం తథా మునిః ।**
**ఔద్గాత్రం సామభిశ్చక్రే బ్రహ్మత్వం చాప్యథర్వభిః ॥ 12 ॥**

వ్యాసమునీంద్రుడు యజుస్సులతో ఆధ్వర్యవం, ఋక్కులతో హెూత్రం,సామలతో ఔద్గాత్రం, అథర్వములతో బ్రహ్మత్వం ఏర్పరచాడు.

**తతః స ఋచముద్ధృత్య ఋగ్వేదం కృతవాన్ మునిః ।**
**యజూంషి చ యజుర్వేదం సామవేదం చ సామభిః ॥ 13 ॥**

**రాజ్ఞస్త్వథర్వవేదేన సర్వకర్మాణి చ ప్రభుః ।**
**కారయామాస మైత్రేయ! బ్రహ్మత్వం చ యథాస్థితి ॥ 14 ॥**

మైత్రేయా! అనంతరం ఆ ముని ఋక్కులను ఒకచోటకు చేర్చి ఋగ్వేదం అని వ్యవహరించడం జరిగింది. యజుస్సులతో యజుర్వేదాన్ని, సామలతో సామవేదాన్ని నిర్మించడం జరిగింది. సమర్థుడైన వేదవ్యాసులు అథర్వవేదం ద్వారా రాజుల సమస్త కర్మలను ఏర్పాటు చేశాడు. బ్రహ్మత్వమును యథావిధిగా స్థాపన చేశాడు.

**సోఽయమేకో మహావేద స్తరుస్తేన ప్రృథక్ కృతః ।**
**చతుర్ధా తు తతో జాతం వేదపాదపకాననమ్ ॥ 15 ॥**

ఆ వ్యాసునిచే నాలుగుగా విభజించబడిన ఆ ఒకే ఒక మహావేదవృక్షం తరువాత విస్తరించి ఒక వేద వృక్షారణ్యం అయింది.

**బిభేద ప్రథమం విప్ర! పైల ఋగ్వేద పాదపమ్ ।**
**ఇన్ద్రప్రమితయే ప్రాదాద్ బాష్కలాయ చ సంహితే ॥ 16 ॥**

విప్రోత్తమా! మొదలు పైలుడు ఋగ్వేదవృక్షాన్ని రెండుగా చేశాడు. ఆ రెండు సంహితలను ఇంద్రప్రమితికి, బాష్కలునికి ఇచ్చాడు.

**చతుర్ధా స బిభేదాథ బాష్కలోఽపి చ సంహితామ్ ।**
**బౌధ్యాదిభ్యో దదౌ తాస్తు శిష్యేభ్యః స మహామునిః ॥ 17 ॥**

ద్విజోత్తమా!మహాముని అయిన ఆ బాష్కలుడు తన సంహితను నాలుగుగా వేర్పరచి, వాటిని బౌధ్యుడు మున్నగు నలుగురు శిష్యులకు ఇచ్చాడు.

**బౌధ్యాగ్నిమాఠరౌ తద్వద్ యాజ్ఞవల్క్యపరాశరౌ ।**
**ప్రతిశాఖాస్తు శాఖాయాస్తస్యాస్తే జగృహుర్మునే! ॥ 18 ॥**

మునీశ్వరా! ఆ బాష్కలీయ శాఖలోని నాలుగు ప్రతి(ఉప)శాఖలను బాష్కలశిష్యులైన బౌధ్యుడు, అగ్నిమాఠరుడు(అగ్నిమాఢకుడు), యాజ్ఞవల్క్యుడు, పరాశరుడు స్వీకరించారు.

**ఇన్ద్రప్రమితిరేకాన్తు సంహితాం స్వసుతం తతః ।**
**మాణ్డూకేయం మహాత్మానం మైత్రేయాధ్యాపయత్తదా ॥ 19 ॥**

మైత్రేయా! అనంతరం ఇంద్రప్రమితి తనకు ప్రాప్తమైన ఒకే ఒక సంహితను తనకుమారుడైన మహాత్ముడగు మాండు(డూ) కేయునికి బోధించాడు.

**తస్య శిష్యప్రశిష్యేభ్యః పుత్రశిష్యాన్ క్రమాద్ యయౌ ।**
**వేదమిత్రస్తు శాకల్యః సంహితాం తామధీతవాన్ ॥ 20 ॥**

ఆ శాఖ అతని శిష్యులకు, ప్రశిష్యులకు, పుత్రులకు, వారి శిష్యులకు క్రమంగా ప్రచారంలోకి వెళ్లింది. పరంపరానుసారంగా వచ్చిన ఆ సంహితను వేదమిత్రుడైన శాకల్యుడు అధ్యయనం చేశాడు.

**చకార సంహితాః పంచ శిష్యేభ్యః ప్రదదౌ చ తాః ।**
**తస్య శిష్యాస్తు యే పంచ తేషాం నామాని మే శృణు ॥ 21 ॥**

అతడు దానిని ఈ అయిదు సంహితలుగా విభజించి వాటిని తన అయిదుగురు శిష్యులకు అందించాడు. ఆతని శిష్యులు అయిదుగురు. వారిపేర్లు చెబుతాను. విను.

**ముద్గలో గోముఖశ్చైవ వాత్స్యః శాలీయ ఏవ చ ।**
**శిశిరః(శరీరః) పంచమశ్చాసీన్మైత్రేయ! సుమహామునిః ॥ 22 ॥**

వారు–ముద్గలుడు, గోముఖుడు, వాత్స్యుడు, శాలీయుడు, శరీరుడు(శిశిరుడు) అనేవారు. మైత్రేయా! వారిలో అయిదో వాడు మహాబుద్ధిమంతుడు.

**సంహితాత్రితయం చక్రే శాకపూర్ణస్తథేతరః ।**
**నిరుక్తమకరోత్ తద్వచ్చతుర్థం మునిసత్తమ! ॥ 23 ॥**

మునిశ్రేష్ఠా! ఆ శిష్యపరంపరలో ఒకడైన శాకపూర్ణుడు అనేవాడు మూడు సంహితలను, అదేవిధంగా నాలుగో శాఖగా నిరుక్తం నిర్మించాడు.

**క్రౌంచో వైతాలికస్తద్వద్ బలాకశ్చ మహామతిః ।**
**నిరుక్తకృచ్చతుర్థోఽభూద్ వేదవేదాంగపారగః ॥ 24 ॥**

ఆ మూడు సంహితలను అధ్యయనం చేసినవారు క్రౌంచుడు, వైతాలికుడు, అలాగే మహామేధావి అయిన బలాకుడు, అలాగే నాలుగోశాఖ అయిన నిరుక్తం నిర్మించినవాడు వేదవేదాంగపారగుడు.

**ఇత్యేతాః ప్రతిశాఖాభ్యోప్యనుశాఖా ద్విజోత్తమ! ।**
**బాష్కలశ్చాపరాస్తిస్రః సంహితాః కృతవాన్ ద్విజ! ॥ 25 ॥**

ద్విజోత్తమా! ఈరీతిగా ఇవి ప్రతిశాఖలనుంచి ఏర్పడి అనుశాఖలయ్యాయి. మైత్రేయా! బాష్కలుడు మరో మూడు సంహితలను ఏర్పరచాడు.

**శిష్యః కాలాయనిర్గార్గ్యస్తృతీయశ్చ కథాజవః ।**
**ఇత్యేతే బహుధా ప్రోక్తాః సంహితా యైః ప్రవర్తితాః ॥ 26 ॥**

ఆ సంహితలను అధ్యయనంచేసినవారు కాలాయని, గార్గ్యుడు, మూడోవాడు కథాజవుడు అనే శిష్యులు. ఈవిధంగా ఈ సంహితలు బహువిధాలుగా విస్తరించాయి. వాటిని ప్రవర్తింపచేసిన వారిని బహ్వృచులు అంటారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే ఋగ్వేదశాఖావర్ణనం నామ చతుర్థోఽధ్యాయః సమాప్తః ॥ 4 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో ఋగ్వేదశాఖల వర్ణన అనే నాలుగవ అధ్యాయం సమాప్తం ॥ 4 ॥

## పంచమోఽధ్యాయః - ఐదవ అధ్యాయం

## శుక్లయజుర్వేద తైత్తిరీయ యజుశ్శాఖా వివరణమ్ - శుక్లయజుర్వేద తైత్తిరీయయజుశ్శాఖా వివరణ

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**యజుర్వేదతరోః శాఖాః సప్తవింశన్మహామతిః ।**
**వైశమ్పాయననామాఽసౌ వ్యాసశిష్యశ్చకార వై ॥ 1 ॥**

వ్యాసుని శిష్యుడైన మహామేధావియగు వైశంపాయను డనేవాడు యజుర్వేదమనే వృక్షానికి ఇరవై ఏడు శాఖలు ఏర్పరచాడు.

**శిష్యేభ్యః ప్రదదౌ తాశ్చ జగృహుస్తేఽప్యనుక్రమాత్ ।**
**యాజ్ఞవల్క్యస్తు తత్రాభూత్ బ్రహ్మరాతసుతో ద్విజః ॥ 2 ॥**

వాటిని ఆయన తన శిష్యులకు బోధించగా, వారు క్రమంగా వాటిని స్వీకరించారు. ఆ శిష్యులలో బ్రహ్మరాతుని కుమారుడైన యాజ్ఞవల్కుడనే బ్రాహ్మణుడు ఒకడు ఉండేవాడు.

**శిష్యః పరమధర్మజ్ఞో గురువృత్తిపరః సదా ।**
**ఋషిర్యోఽద్య మహామేరోః సమాజే నాగమిష్యతి ॥ 3 ॥**

**తస్య వై సప్తరాత్రాత్తు బ్రహ్మహత్యా భవిష్యతి ।**
**పూర్వమేవం మునిగణైః సమయోఽభూత్ కృతో ద్విజ! ॥ 4 ॥**

ఆతడు పరమధార్మికుడైన శిష్యుడు. ఎల్లప్పుడూ గురువును సేవించుటలో మిక్కిలి ఆసక్తికలవాడు. ద్విజోత్తమా! ఇలా ఉండగా ఒకనాడు ఋషిబృందాలు అన్నీ కలిసి "మహామేరువుపై ఉన్న మన ముని బ్రహ్మహత్యాపాతకం సమాజంలో ఈనాడు వచ్చి కలియని ఋషికి ఏడురాత్రులలో బ్రహ్మహత్యాపాతకం సంప్రాప్తిస్తుంది." అని ఒక నియమం పూర్వకాలంలో పెట్టడం జరిగింది.

**వైశమ్పాయన ఏకస్తు తం వ్యతిక్రాన్తవాంస్తదా ।**
**స్వస్రీయం బాలకం సోఽథ పదా స్పృష్టమఘాతయత్ ॥ 5 ॥**

ఆ సమయంలో వైశంపాయనుడొక్కడే ఆ కట్టడిని అతిక్రమించాడు. అనంతరం ఒకనాడు వైశంపాయనుని కాలు తగిలి అతని మేనల్లుడు మరణించాడు.

**శిష్యానాహ స భోః శిష్యాః! బ్రహ్మహత్యాపహం వ్రతమ్ ।**
**చరధ్వం మత్కృతే సర్వే న విచార్యమిదం తథా ॥ 6 ॥**

అంత ఆయన తనశిష్యులతో "ఓ శిష్యులారా! నాకోసమై మీరు అందరూ బ్రహ్మహత్యాపాపాన్ని తొలగించే వ్రతాన్ని ఆచరించండి. ఈ విషయంలో మీరు మరో ఆలోచన చేయకండి" అన్నాడు.

**అథాహ౽౽యాజ్ఞవల్క్యస్తు కిమేభిర్భగవన్! ద్విజైః ।**
**క్లేశితైరల్పతేజోభిశ్చరిష్యే౽హమిదం వ్రతమ్ ॥ 7 ॥**

అపుడు యాజ్ఞవల్క్యుడు “భగవంతుడా! తక్కువ తేజస్సుతో కష్టపడే ఈ బ్రాహ్మణులవల్ల ఏమవుతుంది? మీరు చెప్పిన ఈ వ్రతాన్ని నేనొక్కడనే ఆచరిస్తాను” అని అహంకృతితో పలికాడు.

**తతః క్రుద్ధో గురుః ప్రాహ యాజ్ఞవల్క్యం మహామతిః ।**
**ముచ్యతాం యత్ త్వయా౽ధీతం మత్తో విప్రావమానక! ॥ 8 ॥**

అంతట మిక్కిలి కోపంతో మహామేధావి అయిన గురువర్యుడైన వైశంపాయనుడు మండిపడి యాజ్ఞవల్క్యునితో “విప్రులను అవమానించిన అహంభావీ! నావల్ల అధ్యయనం కావించిన దానినంతా విడిచిపెట్టు” అని గట్టిగా అరిచాడు.

**నిస్తేజసో వదస్యేనాన్ యస్త్వం బ్రాహ్మణపుంగవాన్ ।**
**తేన శిష్యేణ నార్థో౽స్తి మమాజ్ఞాభంగకారిణా ॥ 9 ॥**

అంతే కాక“ఈ బ్రాహ్మణోత్తములను నీవు తేజోవిహీనులని నిందించావు. నా ఆజ్ఞను తిరస్కరించిన శిష్యునితో నాకు పని లేదు” అన్నాడు.

**యాజ్ఞవల్క్యస్తతః ప్రాహ భక్త్యైతత్తే మయోదితమ్ ।**
**మమాప్యలం త్వయా౽ధీతం యన్మయా తదిదం ద్విజ! ॥ 10 ॥**

అపుడు యాజ్ఞవల్క్యుడు“ద్విజోత్తమా! నేను నీకు ఇది భక్తితో చెప్పినది కాని మరొకటి కాదు. ఇంతటితో నాకు చాలు. నీదగ్గర అధ్యయనం చేసింది ఇదిగో” అని అన్నాడు.

**ఇత్యుక్తో రుధిరాక్తాని సరూపాణి యజూంషి సః ।**
**ఛర్దయిత్వా దదౌ తస్మై యయౌ స స్వేచ్ఛయా మునిః ॥ 11 ॥**

అని ఈవిధంగా రోషంగా పలికి రూపందాల్చిన యజుస్సులను రక్తంతో సహా క్రక్కివేసి ఆయనకు ఇచ్చివేశాడు. అటుపైన యాజ్ఞవల్క్యుడు తన ఇష్టం వచ్చిన దారిని వెళ్లిపోయాడు.

**యజూంష్యథ విసృష్టాని యాజ్ఞవల్క్యేన వై ద్విజ ।**
**జగృహుస్తిత్తిరా భూత్వా తైత్తిరీయాస్తు తే తతః ॥ 12 ॥**

యజుస్సులను అక్కడి మిగిలిన శిష్యులు తిత్తిరపక్షులరూపం ధరించి స్వీకరించారు. అందువల్లనే వారు తైత్తిరీయులు అయ్యారు.

**బ్రహ్మహత్యావ్రతం చీర్ణం గురుణా చోదితైస్తు యైః ।**
**చరకాధ్వర్యవస్తే తు చరణాన్మునిసత్తమ! ॥ 13 ॥**

మునిశ్రేష్ఠా! గురువు ఆజ్ఞాప్రకారంగా బ్రహ్మహత్యాపాతకనాశవ్రతాన్ని ఆచరించిన, వారు వ్రతాచరణం వల్ల, యజుర్వేద శాఖాధ్యయనంవల్ల చరకాధ్వర్యవులుగా వ్యవహరించ బడ్డారు.

**యాజ్ఞవల్క్యోఽపి మైత్రేయ!ప్రాణాయామపరాయణః ।**
**తుష్టావ ప్రయతః సూర్యం యజూంష్యభిలషంస్తతః ॥ 14 ॥**

మైత్రేయా! అనంతరం యాజ్ఞవల్క్యుడు కూడ యజుర్వేదాధ్యయనమందు అభిలాషకలవాడై ప్రాణాయామపరాయణుడై మనోనిగ్రహంతో సూర్యునిగూర్చి తపమాచరించి ఇలా స్తుతించాడు.

**నమః సవిత్రే ద్వారాయ విముక్తేః సితతేజసే ।**
**ఋగ్యజుః సామభూతాయ త్రయీధామవతే నమః ॥ 15 ॥**

"అసమాన తేజస్సు కల్గిన, మోక్షద్వార స్వరూపుడైన సవితృదేవునికి నమస్కారం. ఋగ్యజుస్సామ స్వరూపుడైన వేదత్రయీరూపనిలయునకు నా నమస్కారం.

**నమోఽగ్నీషోమభూతాయ జగతః కారణాత్మనే ।**
**భాస్కరాయ పరం తేజః సౌషుమ్నమురు బిభ్రతే ॥ 16 ॥**

అగ్ని,చంద్రస్వరూపుడైనవానికి, జగత్తుకు కారణరూపుడైనవానికి సుషుమ్న నామక పరమతేజస్సును గొప్పగా ధరించే భాస్కరునకు ప్రణామం.

**కలాకాష్ఠానిమేషాది కాలజ్ఞానాత్మనే నమః ।**
**ధ్యేయాయ విష్ణురూపాయ పరమాక్షరరూపిణే ॥ 17 ॥**

కల, కాష్ఠ, నిమేషం మున్నగు ప్రమాణాలతో లెక్కించబడే కాలమే జ్ఞానమైన రూపంగల్గిన వానికి, ధ్యానం చేయడానికి తగిన వానికి, పరస్వరూపుడైనవానికి, అక్షయుడైనవానికి, విష్ణురూపుడైన సూర్యదేవునికి వందనం.

**బిభర్తి యః సురగణానాప్యాయ్యేన్దుం స్వరశ్మిభిః ।**
**సుధామృతేన చ పితౄంస్తస్మై తృప్త్యాఽఽత్మనే నమః ॥ 18 ॥**

తన కిరణాలచే చంద్రుని సంతుష్టిపరచి, తద్ద్వారా దేవతాగణాలను, స్వధా(సుధా)రూపమైన అమృతంతో పితృగణాలను పోషించే తృప్తిస్వరూపుడైన సూర్యభగవానునకు ప్రణతులు.

**హిమామ్బుఘర్మవృష్టీనాం కర్తా హర్తా చ యః ప్రభుః ।**
**తస్మై త్రికాలరూపాయ నమః సూర్యాయ వేధసే ॥ 19 ॥**

మంచు, నీరు, వేడి, వర్షం–వీటికి కారకుడు, వినాశకుడు అయిన ప్రభువుకు, త్రికాల స్వరూపునకు, సృష్టికారకునకు, ఆ సూర్యనారాయణునకు నమస్కారం.

**యో హన్తి తిమిరాణ్యేకో జగతోఽస్య జగత్పతిః ।**
**సత్త్వధామధరో దేవో నమస్తస్మై వివస్వతే ॥ 20 ॥**

జగత్తులోని చీకటిని అంతా ఒక్కడై తొలగించువాడు, ఈ జగత్తుకు ప్రభువైనవాడు, సత్త్వరూపాన్ని ధరించేవాడు, దేవాదిదేవుడైనవాడు, అట్టి వివస్వంతునకు సాష్టాంగదండప్రణామం.

**సత్కర్మయోగ్యో న జనో నైవాపః శౌచకారణమ్ ।**
**యస్మిన్ననుదితే తస్మై నమో దేవాయ వేధసే ॥ 21 ॥**

ఏ భగవానుడు ఉదయించకపోతే, జనానికి సత్కర్మలు చేసే యోగ్యత లేదో, జలాలు పరిశుభ్ర కారకాలు కాకుండ పోతాయో, అట్టి దేవునికి బ్రహ్మస్వరూపునకు నమోవాకాలు.

**స్పృష్టో యదంశుభిర్లోకః క్రియాయోగ్యోఽభిజాయతే ।**
**పవిత్రతాకారణాయ తస్మై శుద్ధాత్మనే నమః ॥ 22 ॥**

ఆయన కిరణస్పర్శలభించే సరికి లోకాలకు కర్మాచరణచేసే అర్హత చేకూరుతుంది. ఆ విధంగా సూర్యుడు పవిత్రతకు కారకుడు అవుతున్నాడు. అట్టి పరిశుద్ధ స్వరూపుడైన సూర్యభగవానునకు నమస్కారం.

**నమః సవిత్రే సూర్యాయ భాస్కరాయ వివస్వతే ।**
**ఆదిత్యాయాదిభూతాయ దేవాదీనాం నమో నమః ॥ 23 ॥**

సవితకు, సూర్యునకు, భాస్కరునకు, వివస్వంతునకు, ఆదిత్యునకు నా ప్రణామం. సమస్తదేవాదులకు ఆదిస్వరూపం అయినవానికి పునఃపునః నమస్సులు.

**హిరణ్మయం రథం యస్య కేతవోఽమృతవాజినః ।**
**వహన్తి భువనాలోకిచక్షుషం తం నమామ్యహమ్ ॥ 24 ॥**

ఎవని రథం స్వర్ణమయమో (తేజోమయమో), ఎవని జెండాలు ప్రజ్ఞామయాలో, ఎవనిని ఛందోమయాలైన అశ్వాలు మోస్తాయో, ఆ లోకాలకు వెలుగును ప్రకాశించే నేత్రస్వరూపునకు నేను నమస్కరిస్తున్నాను.

**ఇత్యేవమాదిభిస్తేన స్తూయమానః స్తవై రవిః ।**
**వాజిరూపధరః ప్రాహ వ్రియతామితి వాంఛితమ్ ॥ 25 ॥**

అని ఈ విధంగా అనేక స్తోత్రాలతో స్తుతిస్తూ ఉండగా, సూర్యుడు వాజిరూపంలో ప్రత్యక్షమై యాజ్ఞవల్క్యుని "ఇష్టమైన వరం కోరుకో" అన్నాడు.

**యాజ్ఞవల్క్యస్తదా ప్రాహ ప్రణిపత్య దివాకరమ్ ।**
**యజూంషి తాని మే దేహి యాని సన్తి న మే గురౌ ॥ 26 ॥**

అపుడు యాజ్ఞవల్క్యమహాముని దివాకరునకు వంగి నమస్కరించి "నా గురువువద్ద లేని యజుస్సులను నాకు ఈయవలసింది" అని ప్రార్థించాడు.

**ఏవముక్తో దదౌ తస్మై యజూంషి భగవాన్ రవిః ।**
**అయాతయామసంజ్ఞాని యాని వేత్తి న తద్గురుః ॥ 27 ॥**

ఇలా కోరేసరికి సూర్యభగవానుడు ఆతని గురువుకు తెలియని "అయాతయామములు" అనే పేరుగల యజుస్సులను యాజ్ఞవల్క్యునకు ఇచ్చాడు.

**యజూంషి యైరధీతాని తాని విప్రైర్ద్విజోత్తమ! ।**
**వాజినస్తే సమాఖ్యాతాః సూర్యాశ్వః సోఽభవద్ యతః ॥ 28 ॥**

విప్రోత్తమా! సూర్యుడు తనరథాశ్వం(వాజి)గా అయిన కారణంచేత, ఆ యజుస్సులను అధ్యయనం చేసిన విప్రులు "వాజులు" అని వ్యవహరించబడ్డారు.

**శాఖాభేదాస్తు తేషాం వై దశ పంచ చ వాజినామ్ ।**
**కాణ్వాద్యాస్తు మహాభాగ! యాజ్ఞవల్క్య ప్రవర్తితాః ॥ 29 ॥**

మైత్రేయమహాభాగా! ఆ వాజి యజుఃశ్రుతుల శాఖాభేదాలు పదిహేను. అవే కాణ్వశాఖ మొదలైనవి, అవి యాజ్ఞవల్క్య మహర్షిద్వారా ప్రవర్తించబడ్డ కారణంచే యాజ్ఞవల్క్యములు" అని వ్యవహరించబడ్డాయి.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే శుక్లయజుర్వేదతైత్తిరీయయజుశ్శాఖావివరణం నామ పంచమోఽధ్యాయః సమాప్తః ॥ 5 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో శుక్లయజుర్వేద తైత్తిరీయయజుశ్శాఖావివరణ అనే అయిదవ అధ్యాయం సమాప్తం ॥ 5 ॥



## షష్ఠోఽధ్యాయః - ఆరవ అధ్యాయం

## సామవేదశాఖానాం-అష్టాదశపురాణానాం-అథర్వశాఖానాం చ వివరణమ్

### సామవేదశాఖలు-అష్టాదశపురాణాలు-అథర్వశాఖల వివరణ

**సామవేదతరోః శాఖా వ్యాసశిష్యః స జైమినిః ।**
**క్రమేణ యేన మైత్రేయ! బిభేద శృణు తన్మమ ॥ 1 ॥**

అనంతరం పరాశరుడు "మైత్రేయా! వ్యాసమహర్షి శిష్యుడైన ఆ జైమిని సామవేదమనే వృక్షశాఖలను ఏ క్రమంగా విభజించాడో నేను చెబుతాను, విను.

**సుమన్తుస్తస్య పుత్రోఽభూత్ సుకర్మాస్యాప్యభూత్ సుతః ।**
**అధీతవన్తావేకైకాం సంహితాం తౌ మహామునీ ॥ 2 ॥**

జైమిని కుమారుడు సుమంతుడు, సుమంతుని కుమారుడు సుకర్ముడు, ఆ మహామునులు ఇద్దరూ సామవేదంలోని రెండు సంహితలను తలకొక్కటి అధ్యయనం చేశారు.

**సహస్రం సంహితాభేదం సుకర్మా తత్సుతస్తతః ।**
**చకార తచ్చ తచ్ఛిష్యా జగృహాతే మహామతీ ॥ 3 ॥**

ఆ తరువాత సుమంతుని కుమారుడైన ఆ సుకర్ముడు తనకు సంప్రాప్తమైన సంహితాభేదాన్ని వేయి శాఖలుగా చేశాడు. మహాబుద్ధిశాలురైన అతని ఇద్దరు శిష్యులు ఆ శాఖలను అధ్యయనం చేశారు.

**హిరణ్యనాభః కౌశల్యః పౌష్పింజిశ్చ ద్విజోత్తమ! ।**
**ఉదీచ్యసామగాః శిష్యాస్తేభ్యః పంచశతం స్మృతాః ॥ 4 ॥**

ద్విజోత్తమా! ఆ శిష్యులు ఇరువురు కౌశల్యహిరణ్యనాభుడు, పౌష్టింజి అనేవారు. అందు హిరణ్యనాభుని శిష్యులు ఐదువందలమంది. వారిని ఉదీచ్యసామగులు అంటారు.(ఔత్తరాహసామగులు)

**హిరణ్యనాభాత్ తావత్యః సంహితా యైర్ద్విజోత్తమైః ।**
**గృహీతాస్తేఽపి చోచ్యన్తే పణ్డితైః ప్రాచ్యసామగాః ॥ 5 ॥**

హిరణ్యనాభునివల్ల ద్విజోత్తములు అధ్యయనంచేసిన మిగిలిన ఐదువందలశాఖలు చదివినవారిని పండితులు ప్రాచ్యసామగులు అంటారు.

**లోకాక్షిర్నౌధమిశ్చైవ కక్షీవాంల్లాంగలిస్తథా ।**
**పౌష్పింజిశిష్యాస్తద్భేదైః సంహితా బహులీకృతాః ॥ 6 ॥**

లోకాక్షి, నౌధమి,కక్షీవంతుడు, లాంగలి అనేవారు పౌష్పింజి శిష్యులు. వారి శిష్యప్రశిష్యులచే చాలా సంహితలు ఏర్పాటుచేయబడ్డాయి.

**హిరణ్యనాభశిష్యశ్చ చతుర్వింశతిసంహితాః ।**
**ప్రోవాచ కృతినామాఽసౌ శిష్యేభ్యః స మహామతిః ॥ 7 ॥**

హిరణ్యనాభుని మరోశిష్యుడు కృతి అనేవాడు. అతడు మహామేధావి, అతడు తనశిష్యులకు ఇరవైనాలుగు సంహితలు చెప్పాడు.

**తైశ్చాపి సామవేదోఽసౌ శాఖాభిర్బహులీకృతః ।**
**అథర్వణామథో వక్ష్యే సంహితానాం సముచ్చయమ్ ॥ 8 ॥**

ఆ శిష్యులు కూడ ఆ సామవేదాన్ని శాఖోపశాఖలుగా బహువిధాలుగా పెంచారు. అనంతరం అథర్వవేదానికి సంబంధించిన శాఖాభేదసముచ్చయాలను గురించి చెబుతున్నాను.

**శిష్యమధ్యాపయామాస కబన్ధం సోఽపి తం ద్విధా ।**
**కృత్వా తు దేవదర్శాయ తథా పథ్యాయ దత్తవాన్ ॥ 9 ॥**

**అథర్వవేదం స మునిః సుమన్తురమితద్యుతిః ।**
**దేవదర్శస్య శిష్యాస్తు మౌద్గో బ్రహ్మబలిస్తథా ।**
**శౌక్తాయనిః పిప్పలాదస్తథాఽన్యో మునిసత్తమ! ॥ 10 ॥**

మునిసత్తమా! అధికతేజశ్శాలి మహాముని అయిన ఆ సుమంతుడు అథర్వవేదాన్ని కబంధుడు అనే శిష్యుని ద్వారా అధ్యయనం చేయించాడు. అతడు దానిని రెండుగా చేసి ఒకటి దేవదర్శునకు, రెండోదానిని పథ్యునకు ఇచ్చాడు. దేవదర్శుని శిష్యులు మౌద్గుడు, బ్రహ్మబలి, శౌక్తాయని, మరొకడు పిప్పలాదుడు అనేవారు.

**పథ్యస్యాపి త్రయః శిష్యాః కృతా యైర్ద్విజ! సంహితాః ।**
**జాబాలిః కుముదాదిశ్చ తృతీయః శౌనకో ద్విజ! ॥ 11 ॥**

ద్విజశ్రేష్ఠా! పథ్యునకు ముగ్గురు శిష్యులున్నారు. వారు జాబాలి, కుముదాది, మూడోవాడు శౌనకుడు అనేవారు. ఈ శిష్యులు కూడ అథర్వవేదాధ్యయనంచేసి సంహితలను ఏర్పరచారు.

**శౌనకస్తు ద్విధా కృత్వా దదావేకాన్తు బభ్రవే ।**
**ద్వితీయాం సంహితాం ప్రాదాత్ సైన్ధవాయనసంజ్ఞినే ॥ 12 ॥**

శౌనకుడు తాను అభ్యసించిన సంహితను రెండుగా చేసి, అందు ఒక దానిని బభ్రునికి, రెండో సంహితను సైంధవాయనునకు ఇచ్చాడు.

**సైన్ధవాన్ముంజికేశాశ్చ ద్విధా భిన్నాస్త్రిధా పునః ।**
**నక్షత్రకల్పో వేదానాం సంహితానాం తథైవ చ ॥ 13 ॥**

**చతుర్థః స్యాదాంగిరసః శాన్తికల్పశ్చ పంచమః ।**
**శ్రేష్ఠాస్త్వథర్వణామేతే సంహితానాం వికల్పకాః ॥ 14 ॥**

సైంధవునినుంచి గ్రహించిన సంహితను ముంజికేశుడు మొదట రెండుగాను, తరువాత మూడుగాను విభజించాడు. నక్షత్రకల్పం, వేదకల్పం, సంహితాకల్పం,నాలుగోది ఆంగిరసకల్పం, అయిదోది శాంతి కల్పం, ఇవి(ముంజికేశుని) సంహితలకు వికల్పాలు. ఇవి అథర్వసంహితలలో మిక్కిలి ఉత్తమమైనవి.

**ఆఖ్యానైశ్చాప్యుపాఖ్యానైర్గాథాభిః కల్పసిద్ధిభిః ।**
**పురాణసంహితాం చక్రే పురాణార్థవిశారదః ॥ 15 ॥**

ఆఖ్యానాలు, ఉపాఖ్యానాలు, గాథలు, కల్పసిద్ధులు–వీటి అన్నింటితో, పురాణార్థవిశారదుడైన వ్యాసుడు పురాణసంహితను కూర్చాడు.

**ప్రఖ్యాతో వ్యాసశిష్యోఽభూత్ సూతో వై రోమహర్షణః ।**
**పురాణసంహితాం తస్మై దదౌ వ్యాసో మహామునిః ॥ 16 ॥**

సూతజాతీయుడైన రోమహర్షణుడు వేదవ్యాసమహర్షికి ప్రఖ్యాతివహించిన శిష్యుడు. మహామేధావి అయిన వ్యాసమునీంద్రుడు పురాణసంహితను ఆ సూతునికి ఇచ్చాడు.

**సుమతిశ్చాగ్నివర్చాశ్చ మిత్రాయుః శాంశపాయనః ।**
**అకృతవర్ణః సావర్ణిః షట్ శిష్యాస్తస్య చాభవన్ ॥ 17 ॥**

సుమతి, అగ్నివర్చుడు, మిత్రాయువు, శాంశపాయనుడు, అకృతవర్ణుడు, సావర్ణి అనే ఆరుగురు శిష్యులు ఆ సూతునకు కలరు.

**కాశ్యపః సంహితా కర్తా సావర్ణిః శాంశపాయనః ।**
**రోమహర్షణికా చాన్యా తిసృణాం మూలసంహితా ॥ 18 ॥**

కశ్యపగోత్ర సంజాతుడైన అకృతవ్రణుడు, సావర్ణి, శాంశపాయనుడు, వీరు ముగ్గురూ సంహితా కర్తలయ్యారు. ఈ మూడు పురాణసంహితలకు మూలసంహిత రోమహర్షణిక సంహిత.

**చతుష్టయేనాప్యేతేన సంహితానామిదం మునే! ।**
**ఆద్యం సర్వపురాణానాం పురాణం బ్రాహ్మముచ్యతే ॥ 19 ॥**

మునీశ్వరా! ఈ నాలుగు సంహితల సారభూతమే ఈ విష్ణుపురాణం. సమస్తపురాణాలలోను మొదటి పురాణం బ్రహ్మపురాణంగా వ్యవవహరించబడుతోంది.

**అష్టాదశ పురాణాని పురాణజ్ఞాః ప్రచక్షతే ।**
**బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం భాగవతం తథా ॥ 20 ॥**

**అథాన్యన్నారదీయం చ మార్కండేయం చ సప్తమమ్ ।**
**ఆగ్నేయమష్టమం చైవ భవిష్యం నవమం తథా ॥ 21 ॥**

**దశమం బ్రహ్మవైవర్తం లైంగమేకాదశం స్మృతమ్ ।**
**వారాహం ద్వాదశం చైవ స్కాందం చాత్ర త్రయోదశమ్ ॥ 22 ॥**

**చతుర్దశం వామనం చ కౌర్మం పంచదశం స్మృతమ్ ।**
**మాత్స్యం చ గారుడం చైవ బ్రహ్మాండం చ తతః పరమ్ ॥ 23 ॥**

**తథా చోపపురాణాని మునిభిః కథితాని చ ।**
**మహాపురాణాన్యేతాని హ్యష్టాదశ మహామునే! ॥ 24 ॥**

పురాణవిదులు పురాణాలు పద్దెనిమిది అని చెబుతారు. అవి బ్రాహ్మపురాణం, పాద్మపురాణం, వైష్ణవపురాణం, శైవపురాణం,భాగవతపురాణం, అలాగే ఆరోది నారదీయం, ఏడోది మార్కండేయం, ఎనిమిదోది ఆగ్నేయం, తొమ్మిదోది భవిష్యపురాణం, పదోది బ్రహ్మవైవర్తపురాణం, పదకొండోది లింగపురాణం, పంద్రెండోది వారాహపురాణం, పదమూడోది స్కాందపురాణం, పద్నాలుగోది వామనపురాణం, పదిహేనోది కూర్మ(కౌర్మ) పురాణం, మాత్స్యపురాణం, గారుడపురాణం, బ్రహ్మాండ పురాణం మిగిలినవి. అలాగే అనేక మునీంద్రులచే ఎన్నో ఉపపురాణాలు చెప్పబడ్డాయి, మహామునీ! కాని ఈ పద్దెనిమిది పురాణాలు మహాపురాణాలుగా వాసి కెక్కాయి.

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వన్తరాణి చ ।**
**సర్వేష్వేతేషు కథ్యన్తే వంశానుచరితం చ యత్ ॥ 25 ॥**

సృష్టి ఉత్పత్తి, సృష్టిప్రలయం, దేవాదుల వంశం, మన్వంతరాలు, అనేక మహారాజులచరిత్ర వర్ణనం–ఈ అయిదూ అన్ని పురాణాలలోను ప్రధానంగా వివరించబడ్డాయి.

**యదేతత్ తవ మైత్రేయ! పురాణం కథ్యతే మయా ।**
**ఏతద్ వైష్ణవసంజ్ఞం వై పాద్మస్య సమనన్తరమ్ ॥ 26 ॥**

మైత్రేయా! నేను నీకు చెబుతున్న ఈ విష్ణుపురాణం పద్మపురాణం తరువాతిది.

**సర్గే చ ప్రతిసర్గే చ వంశమన్వన్తరాదిషు ।**
**కథ్యతే భగవాన్ విష్ణురశేషేష్వేవ సత్తమ ॥ 27 ॥**

సజ్జనోత్తమా! సర్గములోను, ప్రతిసర్గములోను, వంశంలోను, మన్వంతరాలలోను ఈవిధంగా అన్నింటిలోను ఈపురాణంలో భగవంతుడైన విష్ణువే చెప్పబడుతున్నాడు.

**అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః ।**
**పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతాశ్చతుర్దశ ॥ 28 ॥**

ఆరు అంగాలు, నాలుగు వేదాలు, మీమాంస, న్యాయశాస్త్రం, పురాణం, ధర్మశాస్త్రం, ఈపదునాలుగు చతుర్దశవిద్యలు.

**ఆయుర్వేదో ధనుర్వేదో గాన్ధర్వశ్చైవ తే త్రయః ।**
**అర్థశాస్త్రం చతుర్థస్తు విద్యా హ్యష్టాదశైవ తాః ॥ 29 ॥**

ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వం ఈ మూడునూ, నాలుగోదైన అర్థశాస్త్రం-ఈవిధంగా మొత్తం కలిపితే అష్టాదశ విద్యలయ్యాయి.

**జ్ఞేయా బ్రహ్మర్షయః పూర్వం తేభ్యో దేవర్షయః పునః ।**
**రాజర్షయః పునస్తేభ్య ఋషిప్రకృతయస్త్రయః ॥ 30 ॥**

మొదట బ్రహ్మర్షులను గురించి, తరువాత మళ్లీ దేవర్షులను గురించి, అటు తరవాత మళ్లీ రాజర్షులను గురించి తెలుసుకోవాలి. ఈవిధంగా ఋషిప్రకృతులు మూడువిధాలు.

**ఇతి శాఖాః ప్రసంఖ్యాతాః శాఖాభేదాస్తథైవచ ।**
**కర్తారశ్చైవ శాఖానాం భేదహేతుస్తథోదితః ॥ 31 ॥**

ఈ విధంగా నీకు వేదశాఖలను గురించి వివరంగా చెప్పాను. అలాగే శాఖాభేదాలను గూర్చి తెలియజేశాను, అట్లే శాఖాకర్తలను గూర్చి వివరించాను. అట్లు భేదాలు రావడానికి కల హేతువులను గురించి కూడా చెప్పాను.

**సర్వమన్వన్తరేష్వేవం శాఖాభేదాః సమాః స్మృతాః ।**
**ప్రాజాపత్యా శ్రుతిర్నిత్యా తద్వికల్పాస్త్విమే ద్విజ! ॥ 32 ॥**

ద్విజోత్తమా! అన్ని మన్వంతరాలలోను శాఖాభేదాలు సమంగానే ఉంటాయి. అందు బ్రహ్మవల్ల వచ్చిన వేదం నిత్యం. మిగిలినవన్నీ దాని వికల్పాలు.

**ఏతత్ తవోదితం సర్వం యత్ పృష్టోఽహమిహ త్వయా ।**
**మైత్రేయ! వేదసమ్బద్ధం కిమన్యత్ కథయామి తే ॥ 33 ॥**

మైత్రేయా! నీవు నన్ను చెప్పమన్న వేదసంబంధమైన విషయమంతా ఈ విధంగా నీకు తెలియజేయడం జరిగింది. ఇకపైన వేరే ఏమి చెప్పమంటావు" అని పరాశరుడు అడిగాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే సామవేదశాఖానాం-అష్టాదశపురాణానాం-అథర్వశాఖానాం చ వివరణమితి షష్ఠోఽధ్యాయః సమాప్తః ॥ 6 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో సామవేదశాఖలు-అష్టాదశపురాణాలు-అథర్వశాఖలు అనే ఆరవ అధ్యాయం సమాప్తం ॥ 6 ॥

## సప్తమోఽధ్యాయః - ఏడవ అధ్యాయం

## యమగీతా - యమగీత

**శ్రీమైత్రేయ ఉవాచ** :- మైత్రేయుడు అడుగుతున్నాడు.

**యథావత్ కథితం సర్వం యత్ పృష్టోఽసి మయా ద్విజ! ।**
**శ్రోతుమిచ్ఛామ్యహం త్వేకం తద్భవాన్ ప్రబ్రవీతు మే ॥ 1 ॥**

"ద్విజవర్యా! నేను అడిగిన దానిని గురించి సర్వం ఉన్నదున్నట్లు చెప్పావు. నేను ఇంకొకటి వినాలను కొంటున్నాను. దానిని నాకు వివరించాలి.

**సప్త ద్వీపాని పాతాలవీథయశ్చ సుమహామునే! ।**
**సప్త లోకా యేఽన్తరస్థా బ్రహ్మాణ్డస్యాస్య సర్వతః ॥ 2 ॥**

**స్థూలైః సూక్ష్మైస్తథా సూక్ష్మాత్ సూక్ష్మైః సూక్ష్మతరైస్తథా ।**
**స్థూలైః స్థూలతరైశ్చైవ సర్వప్రాణిభిరావృతమ్ ॥ 3 ॥**

మహామేధావి అయిన పరాశరమునీంద్రా! సప్తద్వీపాలను, పాతాలంలోని సప్తవిధలోకాలను, బ్రహ్మాండానికి లోపల ఉన్న సప్తలోకాలను, బ్రహ్మాండానికి అన్నివైపుల ఉన్నవాటిలోనూ స్థూలములు, సూక్ష్మములు అలాగా సూక్ష్మము కంటె సూక్ష్మతరములు, స్థూలముకంటె సూక్ష్మతరములు, స్థూలముకంటె స్థూలతరములు అయిన సమస్త ప్రాణులు ఆవరించి ఉన్నాయి.

**అంగులస్యాష్టభాగోఽపి న సోఽస్తి మునిసత్తమ ।**
**న సన్తి ప్రాణినో యత్ర కర్మబన్ధనిబన్ధనాః ॥ 4 ॥**

మునిశ్రేష్ఠా! కర్మబంధాలకు కట్టుబడకుండా ఉండని ప్రాణులు (కర్మాధీనప్రాణులు) ఉండని ప్రదేశం అంగుళంలో ఎనిమిదోవంతు కూడ కనిపించదు కదా!

**సర్వే చైతే వశం యాన్తి యమస్య భగవన్! కిల ।**
**ఆయుషోఽన్తే తథా యాన్తి యాతనాస్తత్ప్రచోదితాః ॥ 5 ॥**

భగవంతుడా! ఈ ప్రాణులు అన్నీకూడ ఆయువు తీరిపోగానే యమునికి వశమై పోతాయట కదా! ఆ యముని ఆదేశానుసారంగా సమస్తప్రాణులు యమయాతనలు అనుభవిస్తాయట.

**యాతనాభ్యః పరిభ్రష్టా దేవాద్యాస్వథ యోనిషు ।**
**జన్తవః పరివర్తన్తే శాస్త్రాణామేష నిర్ణయః ॥ 6 ॥**

యమయాతనలు తీరిపోయిన ప్రాణులు దేవతలు మున్నగు జన్మలు ధరిస్తూ సంసారచక్రంలో పరిభ్రమిస్తూ ఉంటాయి. ఇది శాస్త్రాలలోని నిర్ణయం కదా!

**సోఽహమిచ్ఛామి తచ్ఛ్రోతుం యమస్య వశవర్తినః ।**
**న భవన్తి నరా యేన తత్ కర్మ కథయామలమ్ ॥ 7 ॥**

"ఏ కర్మలను ఆచరిస్తే నరులు యమునివశం కాకుండ ఉంటారో, వినాలనే కోరికతో ఉన్నాను, ఆ నిర్మలమైన విషయాన్ని నాకు వినిపించు" అని ప్రార్థించాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు బదులిచ్చాడు.

**అయమేవ మునే! ప్రశ్నో నకులేన మహాత్మనా ।**
**పృష్టః పితామహః ప్రాహ భీష్మో యత్ తచ్ఛృణుష్వ మే ॥ 8 ॥**

మైత్రేయమునీంద్రా! నీవడిగిన ఇదే ప్రశ్నను ఒకప్పుడు మహాత్ముడైన నకులుడు భీష్మపితామహుని అడగడం జరిగింది. దానిని విను.

**భీష్మ ఉవాచ :–** భీష్ముడు చెబుతున్నాడు.

**పురా సమాగతో వత్స! సఖా కాలింగకో ద్విజః ।**
**స మాము వాచ పృష్టో వై మయా జాతిస్మరో మునిః ॥ 9 ॥**

నాయనా! నకులా! మునుపు ఒకనాడు నాస్నేహితుడయిన కలింగదేశీయుడైన ఒక బ్రాహ్మణుడు నా వద్దకు వచ్చాడు. అతడు అపుడు నేను జాతిస్మరుడైన మునిని (పూర్వజన్మ జ్ఞానంకలిగిన మునిని)అడుగగా అతడు నాకు ఇలా సమాధాన మిచ్చాడని చెప్పాడు.

**తేనాఖ్యాతమిదం చేదమిత్థం చైతద్ భవిష్యతి ।**
**తథా చ తదభూద్ వత్స! యథోక్తం తేన ధీమతా ॥ 10 ॥**

నాయనా!(నీవు నన్ను అడిగినదే) అపుడు నేను ఆయనను ఒక ప్రశ్న అడిగాను. ఆయన ఇలా జరుగుతుందని నాకు సర్వమూ చెప్పాడు. ఆ ధీమంతుడు చెప్పినదే జరిగింది.

**స పృష్టశ్చ మయా భూయః శ్రద్ధధానవతా ద్విజః ।**
**యద్ యదాహ న తద్ దృష్టమన్యథా హి మయా క్వచిత్ ॥ 11 ॥**

అతనిని నేను పరిపూర్ణంగా విశ్వసించి పదే పదే ప్రశ్నించాను. ఆ ద్విజుడు చెప్పినట్టు జరిగింది. కాని మరోలా జరగడం కనబడలేదు.

**ఏకదా తు మయా పృష్టం యదేతద్ భవతోదితమ్ ।**
**ప్రాహ కాలింగకో విప్రః స్మృత్వా తస్య మునేర్వచః ॥ 12 ॥**

నకులా! ఒకనాడు నన్ను ఇపుడు నీవడిగిందే, నేను ఆయనను ప్రశ్నించగా, ఆ కలింగదేశవిప్రుడు ఆ జాతిస్మరుడనే మునిచెప్పిన మాటలను జ్ఞాపకం తెచ్చుకొని చెప్పాడు.

**జాతిస్మరేణ కథితో రహస్యః పరమో మమ ।**
**యమకింకరయోర్యోఽ భూత్ సంవాదస్తం బ్రవీమి తే ॥ 13 ॥**

జాతిస్మరుడు తనకు చెప్పిన పరమరహస్యం నాకు చెబుతున్నానని యమ కింకరసంవాదం చెప్పాడు.

**యమగీతలు**

**స్వపురుషమభివీక్ష్య పాశహస్తం**
**వదతి యమః కిల తస్య కర్ణమూలే ।**
**పరిహర మధుసూదనప్రపన్నాన్**
**ప్రభురహమన్యనృణాం న వైష్ణవానామ్ ॥ 14 ॥**

చేతిలో పాశాన్ని పట్టుకొని ఆయువు తీరిన వారిని తీసుకొని పోవడానికి సిద్ధపడుతున్న తన కింకరుని పరిశీలించి చూచి యముడు అతని చెవిలో ఇలా చెప్పాడు“మధుసూదనునిపై అత్యంతభక్తిగల ప్రపన్నులను విడిచిపెట్టు, వైష్ణవులు కాకుండా ఉన్న ఇతరులకే నేను ప్రభువును.

**అహమమరగణార్చితేన ధాత్రా**
**యమ ఇతి లోక హితాహితే నియుక్తః ।**
**హరిగురువశగోఽస్మి న స్వతన్త్రః**
**ప్రభవతి సంయమనే మమాపి విష్ణుః ॥ 15 ॥**

నిరంతరం దేవగణాలచే పూజించబడే బ్రహ్మ నన్ను యముడనని, లోకుల హితాహితాల(పుణ్యపాపాల) విషయంలో పర్యవేక్షకునిగా నియమించాడు, నాకు దైవం(గురువు)శ్రీహరి. నేను ఆయన చెప్పుచేతలలో ఉండే వాడను, నేను స్వంతంత్రుడను కాను, నన్ను కూడ నిగ్రహించగలవాడు విష్ణుమూర్తి.

**కటకమకుటకర్ణికాదిభేదైః**
**కనకమభేదమపీష్యతే యథైకమ్ ।**
**సురపశుమనుజాదికల్పనాభి**
**ర్హరిరఖిలాభిరుదీర్యతే తథైకః ॥ 16 ॥**

ఏ భేదంలేని బంగారం  కంకణం, కిరీటం, కుండలం మున్నగు అనేక భేదాలతో నానావిధరూపాలలో కన్పిస్తున్నట్లే, ఒక్కడైన భగవంతుడైన శ్రీహరి దేవతలు, జంతువులు, మనుష్యులు మున్నగు కాల్పనికరూపాలతో బహురూపునిగా కనిపిస్తున్నాడు.

**క్షితితలపరమాణవోఽనిలాన్తే**
**పునరపి యాన్తి యథైకతాం ధరిత్ర్యాః ।**
**సురపశుమనుజాదయస్తథాఽన్తే**
**గుణకలుషేణ సనాతనేన తేన ॥ 17 ॥**

గాలి తాకిడికి భూమినుంచి పైకి లేచిన ధూళికణాలు గాలి తగ్గిపోయాక మళ్లీ నేలపై పడి కలిసిపోయి నట్లే, గుణసంక్షోభంవల్ల జన్మించిన దేవతలు, పశువులు, మనుష్యులు మున్నగు జీవులు గుణసామ్యవేళలో సనాతనుడైన ఆ పరమాత్మలో లీనమవుతారు.

**హరిమమరగణార్చితాంఘ్రిపద్మం**
**ప్రణమతి యః పరమార్థతో హి మర్త్యః ।**
**తమపగతసమస్తపాపబన్ధం**
**వ్రజ పరిహృత్య యథాఽగ్నిమాజ్యసిక్తమ్ ॥ 18 ॥**

శ్రీహరి దేవగణాలచే పూజించబడే పాదపద్మాలు కలవాడు. ఆ భగవంతుని పరమార్థబుద్ధితో నమస్కరించే నరునకు సమస్తపాపబంధాలు తొలగిపోతాయి. నేతితో హుతం చేయబడ్డ అగ్ని పరమపవిత్రం కాన అట్టి విష్ణుభక్తుని విడిచిపెట్టి వెళ్లిపో? అని యముడు ఆ కింకరునకు ఆనతిచ్చాడు.

**ఇతి యమవచనం నిశమ్య పాశీ**
**కథయ మమ విభో! సమస్తధాతుః ।**
**యమపురుషస్తమువాచ ధర్మరాజం**
**భవతి హరేః ఖలు యాదృశోఽస్య భక్తః ॥ 19 ॥**

ఈవిధంగా యముడు చెప్పిన వాక్యాలను విన్న పాశధారి అయిన ఆ యముని సేవకుడు ధర్మరాజుతో "ప్రభూ! సమస్త జగత్పోషకుడైన శ్రీహరి భక్తుడు ఎటువంటి వాడో నాకు వివరించు" అని కోరాడు.

**యమ ఉవాచ :**–యముడు చెప్పాడు

**న చలతి నిజవర్ణధర్మతో యః**
**సమమతిరాత్మసుహృద్విపక్షపక్షే ।**
**న హరతి న చ హన్తి కించిదుచ్చైః**
**సితమనసం తమవైహి విష్ణుభక్తమ్ ॥ 20 ॥**

అపుడు యముడు ఆ కింకరునితో"ఎవడు తన వర్ణధర్మంనుంచి జారిపోకుండా ఉన్నవాడు తనవారి యందు, మిత్రపక్షం వారియందు, శత్రుపక్షం వారియందు సమాన భావంతో ఉన్నవాడు, రవంతకూడా పరద్రవ్యాన్ని బలవంతంగా హరించకుండ ఉన్నవాడు, ఏ జీవిని హింసించకుండా ఉన్నవాడు, నిర్మల మనస్కుడు విష్ణుభక్తుడని తెలుసుకో.

**కలికలుషమలేన యస్య నాత్మా**
**విమలమతేర్మలినీకృతోఽస్తమోహే ।**
**మనసి కృత జనార్దనం మనుష్యం**
**సతతమవైహి హరేరతీవ భక్తమ్ ॥ 21 ॥**

కలిపురుషుని మలినమైన కాలుష్యంతో, మనస్సు కలుషితం కాకుండా,మోహం మటుమాయమై, నిర్మలంగా ఉన్న స్వచ్ఛమైన మానసంలో జనార్దనుని నిల్పుకొని ఉన్నవాడు ఎల్లప్పుడూ శ్రీహరిఉత్తమభక్తుడని తెలుసుకో.

**కనకమపి రహస్యవేక్ష్య బుద్ధ్యా**
**తృణమివ యః సమవైతి వై పరస్వమ్ ।**
**భవతి చ భగవత్యనన్యచేతాః**
**పురుషవరం తమవైహి విష్ణుభక్తమ్ ॥ 22 ॥**

రహస్య ప్రదేశంలో ఎవరూ లేనిచోట బంగారం కనిపించినా, ఆ పరద్రవ్యాన్ని గడ్డిపరకతో సమానంగా భావించేవాడు, భగవంతునియందు మాత్రమే అనన్యచిత్తం కలిగియున్న మానవశ్రేష్ఠుడు ఉత్తమ విష్ణుభక్తుడని తెలుసుకో.

**స్ఫటికగిరిశిలామలః క్వ విష్ణు**
**ర్మనసి నృణాం క్వ చ మత్సరాదిదోషః ।**
**న హి తుహినమయూఖరశ్మిపుంజే**
**భవతి హుతాశనదీప్తిజః ప్రతాపః ॥ 23 ॥**

(మలినమైన) నరులమానసంలో స్ఫటికపర్వతశిలలా స్వచ్ఛమైన నిర్మలుడైన విష్ణువు ఉండడమనేది ఎక్కడ? మాత్సర్యం మున్నగు దోషాలకు నిలయమైన నరులమనస్సు నిర్మలంగా ఉండడమనేది ఎక్కడ? నిర్మల మనస్కులలో మాత్రమే విష్ణువు ఉంటాడు. చంద్రకిరణాల వెన్నెలలో అగ్నిజ్వాలల ప్రభావం(వేడి) ఉండడమనేది జరగదు కదా!

**విమలమతివిమత్సరః ప్రశాన్తః**
**శుచిచరితోఽఖిలసత్త్వమిత్రభూతః ।**
**ప్రియహితవచనోఽస్తమానమాయో**
**వసతి సదా హృది తస్య వాసుదేవః ॥ 24 ॥**

స్వచ్ఛమైన బుద్ధి కలవాడు, అసూయ లేనివాడు, ఎల్లప్పుడూ శాంతంగా ఉండేవాడు, పరిశుద్ధమైన చరిత్రకలవాడు, సమస్తభూతాలకు మిత్రుడైనవాడు, ప్రియమును, మేలును కలిగించు మాట పలికే వాడు, కపటం లేనివాని హృదయంలో సదా వాసుదేవుడు నివసించి ఉంటాడు.

**వసతి హృది సనాతనే చ తస్మిన్**
**భవతి పుమాన్ జగతోఽస్య సౌమ్యరూపః ।**
**క్షితిరసమతిరమ్యమాత్మనోఽన్తః**
**కథయతి చారుతయైవ శాలపోతః ॥ 25 ॥**

మనస్సులో ఆ సనాతనుడు నివసించి ఉంటే, వాడు ఈ జగత్తుకు సౌమ్యరూపుడుగా కనిపిస్తాడు, అందంగా కనిపించే శాలవృక్షం(మామిడి) మొక్కయే తనలో ఉన్న భూసారం సొంపును వ్యక్తం చేస్తుంది.

**యమనియమవిధూతకల్మషాణా**
**మనుదినమచ్యుతసక్తమానసానామ్ ।**
**అపగతమదమానమత్సరాణాం**
**త్యజ భట! దూరతరేణ మానవానామ్ ॥ 26 ॥**

సేవకుడా! యమనియమాలతో కల్మషాలు పూర్తిగా తొలగించుకొనేవారిని, నిత్యం అచ్యుతునిపై మనస్సును లగ్నం చేసేవారిని, మదం, అహంకారం, మాత్సర్యంలేని వారిని ఇటువంటి మానవులకు మిక్కిలి దూరంలో ఉండి విడిచిపెట్టి వెళ్లిపో.

**హృది యది భగవాననాదిరాస్తే**
**హరిరసి శంఖగదాధరోఽవ్యయాత్మా ।**
**తదఘమఘవిఘాతకర్తృభిన్నం**
**భవతి కథం సతి చాన్ధకారమర్కే ॥ 27 ॥**

హృదయంలో శంఖఖడ్గగదాధారి, అవ్యయాత్ముడు, అనాది, భగవంతుడయిన శ్రీహరి నివసించి ఉంటే, పాపం ఆ పాపనాశకునివల్ల పటాపంచలయి పోతుంది. సూర్యుడు భాసిస్తూ ఉంటే అంధకారం ఎక్కడ ఉంటుంది?

**హరతి పరధనం నిహన్తి జన్తూన్**
**వదతి తథాఽనృతనిష్ఠురాణి యశ్చ ।**
**అశుభజనితదుర్మదస్య పుంసః**
**కలుషమతేర్హృది తస్య నాస్త్యనన్తః ॥ 28 ॥**

ఇతరుల ధనాన్ని అపహరించేవాని, ప్రాణులను సంహరించేవాని, అసత్యం పలికేవాని, నిష్ఠురంగా మాట్లాడే వాని, అమంగళకార్యాలను ఆచరించి మదమెక్కి ఉన్న పాపబుద్ధి కల్గిన జీవుని హృదయంలో అనంతుడు ఉండడు.

**న సహతి పరసమ్పదం వినిన్దాం**
**కలుషమతిః కురుతే సతామసాధుః ।**
**న యజతి న దదాతి యశ్చ సన్తం**
**మనసి న తస్య జనార్దనోఽధమస్య ॥ 29 ॥**

పాపాత్ముని, పరుల సంపదను చూచి ఓర్వలేని, ఎల్లప్పుడూ ఇతరులను నిందించువాని. దుష్టబుద్ధియై సాధువులకు అపకారంచేసేవాని, దైవపూజ కావించనివాని, దానం చేయని అధమపురుషుని హృదయంలో ఎప్పుడూ భగవంతుడు అయిన జనార్దనుడు ఉండడు.

**పరమసుహృది బాన్ధవే కలత్రే**
**సుతతనయా పితృమాతృభృత్యవర్గే ।**
**శఠమతిరుపయాతి యోఽర్థతృష్ణాం**
**తమధమచేష్టమవైహి నాస్య భక్తమ్ ॥ 30 ॥**

ఆప్తమిత్రునియందు, మిక్కిలి దగ్గరైన చుట్టమునందు, భార్యయందు, కన్నకుమారునియందు, కన్న కుమార్తెయందు, తండ్రియందు, తల్లియందు, తన పనివారియందు కూడా దుర్బుద్ధిధనాశతో నీచ కృత్యాలు కలవాడు విష్ణుభక్తుడు కాదని తెలుసుకో.

**అశుభమతిరసత్ప్రవృత్తిసక్తః సతతమనార్యకుశీలసంగమత్తః ।**
**అనుదినకృతపాపబన్ధయత్నః పురుషపశుర్న హి వాసుదేవభక్తః ॥ 31 ॥**

ఎల్లప్పుడు బుద్ధి అమంగళకృత్యాలపై ఉన్నవాడు, పాడు పనులపై ఆసక్తి ఎక్కువ ఉన్నవాడు, నిత్యం అయోగ్యులతోను, నీచస్వభావం కలిగిన వారితోను స్నేహంవల్ల మదం అధికమైనవాడు, ప్రతి దినం పాపచర్యలపై ప్రయత్నం అమితంగా ఉన్నవాడు, పురుషపశువు అనబడతాడు కాని వాసుదేవభక్తుడు కాడు.

**సకలమిదమహం చ వాసుదేవః**
**పరమపుమాన్ పరమేశ్వరః స ఏకః ।**
**ఇతి మతిరచలా భవత్యనన్తే**
**హృదయగతే వ్రజ తాన్ విహాయ దూరాత్ ॥ 32 ॥**

సమస్తమైన ఈ ప్రపంచము, నేను కూడా వాసుదేవునికి ప్రకారములే–పరమపురుషుడైన పరమేశ్వరుడు ఒక్కడే అనే బుద్ధి హృదయమునందున్న అనంతుని పట్ల ఉన్న వారిని దూరంగా విడిచిపెట్టి వెళ్ళు.

**కమలనయన వాసుదేవ విష్ణో**
**ధరణిధరాచ్యుత శంఖచక్రపాణే ।**
**భవ శరణమితీరయన్తి యే వై**
**త్యజ భట! దూరతరేణ తానపాపాన్ ॥ 33 ॥**

భటుడా! కమలాలవంటి నయనాలు కలవాడా! వాసుదేవా! విష్ణూ! భూమిని ధరించువాడా! అచ్యుతా! శంఖం, చక్రం చేతులలో ధరించువాడా! అని పలుకుతూ శరణు! శరణు! అని అంటున్న పాపరహితులను (పుణ్యాత్ములను) విడిచిపెట్టి మిక్కిలి దూరంగా వెళ్లిపో.

**వసతి మనసి యస్య సోఽవ్యయాత్మా**
**పురుషవరస్య న తస్య దృష్టిపాతే ।**
**తవ గతిరథవా మమాస్తి చక్ర**
**ప్రతిహత వీర్యబలస్య సోఽన్యలోక్యః ॥ 34 ॥**

ఎవని హృదయంలో ఆ అవ్యయాత్ముడైన భగవంతుడు నివసించి ఉంటాడో అటువంటి ఉత్తమ పురుషుని కనుచూపుమేర లోనికి వెళ్లడానికి అర్హత నీకూ లేదు. నాకూ లేదు. ఆ చక్రం ధాటికి మన వీరత్వం,బలం ఆగవు. ఆ విష్ణుభక్తుడు మనలోకం కాకుండా మిగిలిన లోకాలకు వెళ్లే యోగ్యుడు అవుతాడు.

**ఇతి నిజభటశాసనాయ దేవో**
**రవితనయః స కిలాఽఽహ ధర్మరాజః ।**

**మమ కథితమిదం చ తేన తుభ్యం**
**కురువర! సమ్యగిదం మయాఽపి చోక్తమ్ ॥ 35 ॥**

అని తనభటుని శాసిస్తూ, సూర్యపుత్రుడైన దేవుడగు యమధర్మరాజు తనకు చెప్పిన దానిని జాతిస్మరుడు నాకు చెప్పగా కురువంశోత్తముడవైన భీష్మా! నేను నీకు ఈవిధంగా చెప్పడం జరిగింది.

**నకులైతన్మమాఽఽఖ్యాతం పూర్వం తేన ద్విజన్మనా ।**
**కలింగదేశాదభ్యేత్య ప్రీయతా సుమహాత్మనా ॥ 36 ॥**

నకులా! కలింగదేశం నుంచి వచ్చిన మహామేధావి అయిన ఆ ద్విజుడు పూర్వం ప్రీతితో నాకు చెప్పిన దానిని, నీకు పూర్తిగా యథాశ్రుతంగా వినిపించాను.

**మయాఽప్యేతద్ యథాన్యాయం సమ్యగ్ వత్స!తవోదితమ్ ।**
**యథా విష్ణుమృతే నాన్యత్ త్రాణం సంసారసాగరే ॥ 37 ॥**

నాయనా! నీవు కోరినట్లుగా యథాన్యాయంగా పూర్తిగా నేను నీకు నివేదించాను. ఈ సంసారసాగరంలో విష్ణువు తప్ప వేరొక రక్షకుడు లేడు.

**కింకరా పాశదణ్డాశ్చ న యమో న చ యాతనాః ।**
**సమర్థాస్తస్య యస్యాఽఽత్మా కేశవాలమ్బనః సదా ॥ 38 ॥**

"ఎల్లప్పుడూ కేశవునిపైనే మనస్సు లగ్నంచేసుకొన్న వానికి యమకింకరులుకాని, యమపాశాలుకాని, యమదండనాలుకాని, యమయాతనలుకాని, స్వయంగా యముడైనా ఏమీ చేయజాలరు సుమా!" అని భీష్ముడు నకులునకు వివరించాడు.

**పరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**ఏతన్మునే! తవాఽఽఖ్యాతం గీతం వైవస్వతేన యత్ ।**
**త్వత్ప్రశ్నానుగతం సమ్యక్ కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి ॥ 39 ॥**

"మైత్రేయమునీంద్రా! వైవస్వతుడైన యముడు చెప్పినది నీకు తెలియజేశాను, అది నీప్రశ్నకు పూర్తిగా అనుకూలమైన సమాధానం. ఇకమీద ఏం వినాలనే కోరికతో ఉన్నావు?" అని అడిగాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే యమగీతా నామ సప్తమోఽధ్యాయః సమాప్తః ॥ 7 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో యమగీత అనే ఏడవ అధ్యాయం సమాప్తం ॥ 7 ॥

## అష్టమోఽధ్యాయః - ఎనిమిదవ అధ్యాయం

## చాతుర్వర్ణ్య ధర్మకథనమ్ - చాతుర్వర్ణ్య ధర్మకథనం

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అడిగాడు.

**భగవన్! భగవాన్ దేవః సంసారవిజిగీషుభిః ।**
**సమాఖ్యాహి జగన్నాథో విష్ణురారాధ్యతే యథా ॥ 1 ॥**

**ఆరాధితాచ్చ గోవిన్దాదారాధనపరైర్నరైః ।**
**యత్ ప్రాప్యతే ఫలం శ్రోతుం తవేచ్ఛామి మహామునే! ॥ 2 ॥**

"భగవంతుడవగు పరాశరమునీంద్రా! సంసారాన్ని జయించాలనుకొనేవారు జగన్నాథుడైన శ్రీమహావిష్ణుదేవుని ఎలా ఆరాధిస్తారు? గోవిందుని ఆరాధించడంవల్ల, ఆరాధనాసక్తులైన నరులకు ప్రాప్తించే ఫలం ఏమిటి? ఇది నీద్వారా వినాలను కొంటున్నాను." అని కోరాడు.

**యత్ పృచ్ఛతి భవానేతత్ సగరేణ మహాత్మనా ।**
**ఔర్వః ప్రాహ యథాపృష్టస్తన్మే కథయతః శృణు! ॥ 3 ॥**

నీవు నన్ను అడిగినదానినే మహాత్ముడైన సగరుడు ఒకప్పుడు ప్రశ్నించగా, ఔర్వుడు ఆయనకు ఇలా సమాధానం చెప్పాడు. అది నేను నీకు చెబుతున్నాను. విను.

**సగరః ప్రణిపత్యైదమౌర్వం పప్రచ్ఛ భార్గవమ్ ।**
**విష్ణోరారాధనోపాయసమ్బన్ధం మునిసత్తమ! ॥ 4 ॥**

**ఫలం చారాధితే విష్ణౌ యత్ పుంసామభిజాయతే ।**
**స చాహ పృష్టో యత్తేన తన్మైత్రేయాఖిలం శృణు ॥ 5 ॥**

మునిశ్రేష్ఠా! భృగువంశీయుడైన ఔర్వునకు వినయంతో వంగి నమస్కరించి, విష్ణువును ఆరాధించే ఉపాయానికి సంబంధించిన ప్రశ్న అడిగాడు. అంతే కాక విష్ణువును ఆరాధించే పురుషులకు (జీవులకు) కలిగే ఫలం గురించి కూడ అడిగాడు. అప్పుడు ఔర్వుడు ఆయనకు ఓపికగా బదులిచ్చాడు. మైత్రేయా! అదంతా చెబుతాను. విను.

**భౌమాన్ మనోరథాన్ స్వర్గాన్ స్వర్గే రమ్యం చ యత్పదమ్ ।**
**ప్రాప్నోత్యారాధితే విష్ణౌ నిర్వాణమపి చోత్తమమ్ ॥ 6 ॥**

"విష్ణువును ఆరాధించిన వానికి ఈభూమిపై పొందే సుఖాలు, స్వర్గలోకంలో లభించే భోగాలు, స్వర్గలోకవాసులు కోరురమ్యమగు బ్రహ్మపదం, ఉత్తమమైన మోక్షం కూడా లభిస్తాయి.

**యద్ యదిచ్ఛతి యావచ్చ ఫలమారాధితేఽచ్యుతే ।**
**తత్ తదాప్నోతి రాజేన్ద్ర! భూరి స్వల్పమథాపి వా ॥ 7 ॥**

మహారాజా! అచ్యుతుని ఆరాధించే వారికి ఏది ఏది కావాలను కొంటారో ఆ యా ఫలాలు గొప్పవైనా, తక్కువైనా లభించి తీరుతాయి.

**యత్తు పృచ్ఛసి భూపాల! కథమారాధ్యతే హి సః ।**
**తదహం సకలం తుభ్యం కథయామి నిబోధ మే ॥ 8 ॥**

మహీపాలా! శ్రీమహావిష్ణువును పూజించడం ఎలా? అని నీవడిగావే, అదంతా నేను నీకు పూర్తిగా వివరిస్తాను. గ్రహించు.

**వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్ ।**
**విష్ణురారాధ్యతే పన్థా నాన్యత్ తత్తోషకారణమ్ ॥ 9 ॥**

వర్ణాచారాలు, ఆశ్రమధర్మాలు పాటించే పురుషుని ద్వారా పరమపురుషుడైన విష్ణువు ఆరాధించబడుతూ ఉంటాడు. ఆయనను సంతోషపరచాలంటే వర్ణాశ్రమధర్మపాలనం తప్ప వేరే దారిలేదు.

**యజన్ యజ్ఞాన్ యజత్యేనం జపత్యేనం జపన్ నృప! ।**
**నిఘ్నన్నన్యాన్ హినస్త్యేనం సర్వభూతో యతో హరిః ॥ 10 ॥**

నృపాలా! శ్రీహరి సర్వాత్ముడు కాబట్టి యజ్ఞాలు చేసేవాడు ఆయననే యజిస్తున్నాడు. జపం చేసేవాడు ఆయననే జపిస్తున్నాడు. అన్యప్రాణిహింస చేసేవాడు ఆయననే హింసిస్తున్నాడు.

**తస్మాత్ సదాచారవతా పురుషేణ జనార్దనః ।**
**ఆరాధ్యతే స్వవర్ణోక్తధర్మానుష్ఠానకారిణా ॥ 11 ॥**

కాబట్టి సదాచారవంతుడు, తన వర్ణాశ్రమాలకు విధించబడిన ధర్మాలను అనుష్ఠించేవాడు అయిన పురుషుడు జనార్దనుని ఆరాధించినట్లే అవుతుంది.

**బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రశ్చ ధరణీపతే! ।**
**స్వధర్మతత్పరో విష్ణుమారాధయతి నాన్యథా ॥ 12 ॥**

ధరణీనాయకా! బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు తన ధర్మంపై ఆసక్తి కలవాడై విష్ణువును ఆరాధిస్తాడు, మరొక విధంగా మాత్రం కాదు.

**పరాపవాదం పైశున్యమనృతం చ న భాషతే ।**
**అన్యోద్వేగకరం చాపి తోష్యతే తేన కేశవః ॥ 13 ॥**

ఇతరులను నిందించడం, చాడీలు చెప్పడం, అసత్యం పలకడం, పరులకు ఉద్వేగం కలిగించేలా మాట్లాడడం-ఇవి చేయనివాడంటే కేశవుడు సంతోషిస్తాడు.

**పరపత్నీ పరద్రవ్య పరహింసాసు యో మతిమ్ ।**
**న కరోతి పుమాన్ భూప! తోష్యతే తేన కేశవః ॥ 14 ॥**

మహీపాలా! పరభార్యలపైన, ఇతరుల ద్రవ్యంపైన, అన్యులను హింసించడంపైన పురుషుడు ఆసక్తి చూపించకుండా ఉంటే కేశవుడు ఆనందిస్తాడు.

**న తాడయతి నో హన్తి ప్రాణినోఽన్యాంశ్చ దేహినః ।**
**యో మనుష్యో మనుష్యేన్ద్ర! తోష్యతే తేన కేశవః ॥ 15 ॥**

మానవేంద్రా! ఇతరప్రాణులను కొట్టని, అన్యప్రాణులను హింసించని మనుష్యుడంటే కేశవుడు సంతోషం పొందుతాడు.

**దేవద్విజగురూణాం యః శుశ్రూషాసు సదోద్యతః ।**
**తోష్యతే తేన గోవిన్దః పురుషేణ నరేశ్వర ॥ 16 ॥**

నరేశ్వరా! దేవతలను, ద్విజులను, గురువులను సేవించాలని ఎల్లప్పుడూ ఆసక్తి కలిగి ఉండే పురుషుడంటే గోవిందుడు సంతోషిస్తాడు.

**యథాఽఽత్మని చ పుత్రే చ సర్వభూతేషు యస్తథా ।**
**హితకామో హరిస్తేన సర్వదా తోష్యతే సుఖమ్ ॥ 17 ॥**

తనకు, తన కుమారునకు లాగానే సర్వప్రాణులకు హితం కోరుకునే వాడు సుఖపూర్వకంగా ఎల్లప్పుడూ శ్రీహరిని సంతోషపరచేవాడు అవుతాడు.

**యస్య రాగాదిదోషేణ న దుష్టం నృప! మానసమ్ ।**
**విశుద్ధచేతసా విష్ణుస్తోష్యతే తేన సర్వదా ॥ 18 ॥**

నృపాలా! రాగం, లోభం మున్నగు దోషాలవల్ల మనస్సు కలుషం కాకుండా ఉన్నవాడు, అటువంటి నిర్మలమైన చిత్తం కలిగినవాడు సర్వదా శ్రీహరిని ఆనందపరచినవాడు అవుతాడు.

**వర్ణాశ్రమేషు యే ధర్మాః శాస్త్రోక్తా నృపసత్తమ! ।**
**తేషు తిష్ఠన్ నరో విష్ణుమారాధయతి నాన్యథా ॥ 19 ॥**

రాజన్యవర్యా! శాస్త్రాలలో చెప్పబడిన వర్ణాశ్రమధర్మాలను స్థిరచిత్తంతో ఆచరించే నరుడు విష్ణువును ఆరాధించగలడు కాని మరొకవిధంగా మాత్రం కాదు." అని ఔర్వుడు చెప్పాడు.

**తదహం శ్రోతుమిచ్ఛామి వర్ణధర్మానశేషతః ।**
**తథైవాశ్రమధర్మాంశ్చ ద్విజవర్య! బ్రవీహి తాన్ ॥ 20 ॥**

అంత సగరుడు"ద్విజవర్యా! నేను సమస్తవర్ణధర్మాలను గురించి, అలాగే ఆశ్రమధర్మాలను గురించి వినాలనే కోరికతో ఉన్నాను. వాటిని గూర్చి వివరించు" అని ఔర్వుని ప్రశ్నించాడు.

**బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ యథాక్రమమ్ ।**
**త్వమేకాగ్రమనా భూత్వా శృణు ధర్మాన్ మయోదితాన్ ॥ 21 ॥**

అపుడు ఔర్వుడు"బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రవర్ణాలధర్మాలను యథాక్రమంగా చెబుతాను, సావధాన మనస్కుడవై నేను చెప్పేవాటిని ఆలకించు.

**దానం దద్యాత్ యజేద్ దేవాన్ యజ్ఞైః స్వాధ్యాయతత్పరః ।**
**నిత్యోదకీ భవేద్ విప్రః కుర్యాచ్చాగ్నిపరిగ్రహమ్ ॥ 22 ॥**

విప్రుడు దానం చేయాలి. యజ్ఞాలద్వారా దేవతలను పూజించాలి. వేదాధ్యయనంపై ఆసక్తి కలిగి ఉండాలి. ఎల్లప్పుడూ స్నానం, తర్పణం మున్నగునవి కావించాలి. అగ్న్యాధానం నిత్యం ఆచరించాలి.

**వృత్త్యర్థం యాజయేచ్చాన్యానన్యానధ్యాపయేత్ తథా ।**
**కుర్యాత్ ప్రతిగ్రహాదానం గుర్వర్థం నాన్యతో ద్విజః ॥ 23 ॥**

ద్విజుడు జీవికకోసం ఇతరులచే యజ్ఞాలు చేయించాలి. అన్యులకు చదువు చెప్పాలి. న్యాయపూర్వకంగా సంపాదించబడిన శుద్ధద్రవ్యాన్ని దానంగా స్వీకరించాలి. అది కూడ గురువుకోసం చేయాలి. మరోవిధంగా జీవించరాదు.

వి ॥ వంశపరంపరగా వచ్చినది, ప్రీతిగా ఎవరైనా ఇచ్చినది, భార్యతో సహా ప్రేమగా సంప్రాప్తమైనది, చదువు, శౌర్యం, తపస్సు, కన్య, యజనం,శిష్యుడు, వంశక్రమంవల్ల లభ్యమైనది శుద్ధ ద్రవ్యం.

**సర్వభూతహితం కుర్యాన్నాహితం కస్యచిద్ ద్విజః ।**
**మైత్రీ సమస్తభూతేషు బ్రాహ్మణస్యోత్తమం ధనమ్ ॥ 24 ॥**

ద్విజుడు సమస్తప్రాణులకు హితం ఆచరించాలి. ఏ ఒక్కరికి కీడు చేకూర్చరాదు. సమస్తభూతాల పట్ల మిత్రభావం చూపించడం బ్రాహ్మణునకు ఉత్తమధనం.

**గ్రావే రత్నే చ పారక్యే సమబుద్ధిర్భవేద్ ద్విజః ।**
**ఋతావభిగమః పత్న్యాం శస్యతే చాస్య పార్థివ! ॥ 25 ॥**

మహారాజా! ద్విజుడు రాయిపట్లను, పరుల రత్నాలపట్లను సమానమైన బుద్ధి కలిగి ఉండాలి. ఋతుకాలంలో భార్యను చేరడం బ్రాహ్మణునకు ప్రశస్తమైనది.

**దానాని దద్యాదిచ్ఛాతో ద్విజేభ్యః క్షత్రియోఽపి హి ।**
**యజేచ్చ వివిధైర్యజ్ఞైరధీయాత చ పార్థివ! ॥ 26 ॥**

పార్థివా! క్షత్రియుడయినట్లయితే ద్విజులకు ప్రీతిపూర్వకంగా దానం చేయాలి. వివిధ యజ్ఞాలద్వారా యజ్ఞానుష్ఠానం చేయాలి. అధ్యయనం చేయాలి.

**శస్త్రాజీవో మహీరక్షా ప్రవరా తస్య జీవికా ।**
**తస్యాపి ప్రథమే కల్పే పృథివీపరిపాలనమ్ ॥ 27 ॥**

ఆయుధం ధరించి జీవించడంవల్ల, ధరిత్రీపాలనంవల్ల క్షత్రియుని జీవిక సార్థకమవుతుంది. అందులో కూడా పృథివీపాలనం అతని ప్రథమ కర్తవ్యం.

**ధరిత్రీపాలనేనైవ కృతకృత్యా నరాధిపాః ।**
**భవన్తి నృపతేరంశా యతో యజ్ఞాదికర్మణామ్ ॥ 28 ॥**

నరేశ్వరులు భూమిని పరిపాలించడంవల్లనే కృతార్థులు అవుతారు, ఎందువల్లనంటే యజ్ఞం మున్నగు కర్మలఫలితాలలో నరపతికి భాగఫలం చేకూరుతుంది.

**దుష్టానాం త్రాసనాద్ రాజా శిష్టానాం పరిపాలనాత్ ।**
**ప్రాప్నోత్యభిమతాంల్లోకాన్ వర్ణసంస్థాకరో నృపః ॥ 29 ॥**

దుష్టులను శిక్షించడంవల్ల, శిష్టులను రక్షించడంవల్ల, వర్ణాశ్రమధర్మాలు నిలిచేటట్లు చేసేవాడు తనకు ఇష్టమైన ఉత్తమలోకాలు పొందుతాడు.

**పాశుపాల్యం చ వాణిజ్యం కృషిం చ మనుజేశ్వర! ।**
**వైశ్యాయ జీవికాం బ్రహ్మా దదౌ లోకపితామహః ॥ 30 ॥**

మానవేంద్రా! పశుపాలనం, వాణిజ్యం, వ్యవసాయం, వైశ్యునకు జీవనోపాయంగా లోకపితామహుడైన బ్రహ్మ ప్రసాదించాడు.

**తస్యాప్యధ్యయనం యజ్ఞో దానం ధర్మశ్చ శస్యతే ।**
**నిత్యనైమిత్తికాదీనామనుష్ఠానం చ కర్మణామ్ ॥ 31 ॥**

ఆ వైశ్యునకు కూడ అధ్యయనం, యజ్ఞం, దానం, ధర్మం ప్రశస్తాలు. నిత్యం, నైమిత్తికం మున్నగు కర్మల అనుష్ఠానం కూడ వైశ్యునకు చెప్పబడ్డాయి.

**ద్విజాతిసంశ్రయం కర్మ తాదర్థ్యం తేన పోషణమ్ ।**
**క్రయవిక్రయజైర్వాఽపి ధనైః కారూద్భవేన వా ॥ 32 ॥**

ద్విజాతులను ఆశ్రయించి కర్మను ఆచరించాలి. వారి నిమిత్తమైన పనిచేసి పోషణం కావించుకోవాలి, కొనడం, అమ్మడంవల్ల వచ్చిన ధనంవల్లగాని, హస్తనైపుణ్యంవల్ల వచ్చిన విత్తంతోకాని జీవనం చేయాలి.

**శూద్రస్య సన్నతిః శౌచం సేవా స్వామిన్యమాయయా ।**
**అమన్త్రయజ్ఞో హ్యస్తేయం సత్సంగో విప్రరక్షణమ్ ॥ 33 ॥**

వినయం కలిగి ఉండడం, పవిత్రత, యజమానియందు కపటంలేని సేవ, మంత్రరహితమైన యజ్ఞాచరణం, దొంగతనం చేయకపోవడం, సత్పురుషులతో సహవాసం, విప్రసంరక్షణం శూద్రుడు చేయవలసిన కర్మలు.

**దానం చ దద్యాచ్ఛూద్రోఽపి పాకయజ్ఞైర్యజేత చ ।**
**పిత్ర్యాదికం చ తత్సర్వం శూద్రః కుర్వీత తేన వై ॥ 34 ॥**

శూద్రుడు కూడ దానం చేయాలి. పాకయజ్ఞాలతో (బలివైశ్య దేవాది యజ్ఞాలతో) యజనం చేయాలి. పితృశ్రాద్ధం మొదలైన కర్మలన్నీ తప్పనిసరిగా ఆచరించాలి.

**భృత్యాదిభరణార్థాయ సర్వేషాం చ పరిగ్రహః ।**
**ఋతుకాలే ఽభిగమనం స్వదారేషు మహీపతే ॥ 35 ॥**

మహీపాలా! అన్ని వర్ణాలవారు భృత్యులు మున్నగువారిని పోషించడానికై ధనం సంపాదించాలి. ఋతుకాలంలో తమ భార్యను పొందాలి.

**దయా సమస్తభూతేషు తితిక్షాఽనభిమానితా ।**
**సత్యం శౌచమనాయాసో మాంగల్యం ప్రియవాదితా ॥ 36 ॥**

**మైత్ర్యస్పృహా తథా తద్వదకార్పణ్యం నరేశ్వర! ।**
**అనసూయా చ సామాన్యా వర్ణానాం కథితా గుణాః ॥ 37 ॥**

మానవేశ్వరా! సమస్తప్రాణులపై దయ చూపించడం, శీతోష్ణాలు మున్నగు ద్వంద్వాలను సహించడం, అహంకారం లేకుండా ఉండడం, సత్యం, పవిత్రత, ఆయాసం లేకుండ ఉండడం, మంగళ కృత్యాలు ఆచరించడం, ప్రియంగా భాషించడం, మైత్రి, అస్పృహ, కార్పణ్యం లేకపోవడం, అసూయ కనపర్చకపోవడం ఇవన్నీ సర్వవర్ణాల వారికి సాధారణంగా ఉండవలసిన గుణాలు.

**ఆశ్రమాణాం చ సర్వేషామేతే సామాన్యలక్షణాః ।**
**గుణాంస్తథాఽఽపద్ధర్మాంశ్చ విప్రాదీనామిమాంఛృణు ॥ 38 ॥**

ఇవి అన్ని ఆశ్రమాలవారికి ఉండే సామాన్యలక్షణాలు. ఇక బ్రాహ్మణాదుల గుణాలను, ఆపద్ధర్మాలను ఆలకించు.

**క్షాత్రం కర్మ ద్విజస్యోక్తం వైశ్యం కర్మ తథాఽఽపది ।**
**రాజన్యస్య చ వైశ్యోక్తం శూద్రం కర్మ న వై తయోః ॥ 39 ॥**

ఆపద్ధర్మంగా ద్విజుడు క్షత్రియకార్యాన్ని, అటుపైన వైశ్యవృత్తిని అవలంబించవచ్చు. అలాగే, ఆపత్కాలంలో క్షత్రియుడు వైశ్యకర్మ చేబట్టవచ్చు, ఉభయులకు కూడ శూద్రవృత్తి పనికిరాదు.

**సామర్థ్యే సతి తత్త్యాజ్యముభాభ్యామపి పార్థివ! ।**
**తదేవాఽఽపది కర్తవ్యం న కుర్యాత్ కర్మసంకరమ్ ॥ 40 ॥**

పార్థివా! సామర్థ్యం ఉన్ననాడు ఇరువురుకూడ ఇతర వృత్తులను విడిచిపెట్టాలి, పైన చెప్పిన వృత్తులను వారు ఆపత్కాలంలో మాత్రమే చేపట్టాలి. సాధారణంగా కర్మసాంకర్యం పనికిరాదు.

**ఇత్యేతే కథితా రాజన్! వర్ణధర్మా మయా తవ ।**
**ధర్మమాశ్రమిణాం సమ్యగ్బ్రువతో మే నిశామయ ॥ 41 ॥**

రాజేంద్రా! ఈ విధంగా నేను నీకు ఈ వర్ణధర్మాలు తెలిపాను. ఇకపై ఆశ్రమాచారాలు పాటించే వారి ధర్మాలు తెలియజేస్తాను, ఆలకించు" అని ఔర్వుడు చెబుతున్నాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే చాతుర్వర్ణ్య ధర్మకథనం నామ అష్టమోఽధ్యాయః సమాప్తః ॥ 8॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో చాతుర్వర్ణ్య ధర్మకథనం అనే ఎనిమిదవ అధ్యాయం సమాప్తం ॥ 8 ॥

## నవమోఽధ్యాయః - తొమ్మిదవ అధ్యాయం

## ఆశ్రమధర్మవర్ణనమ్ - ఆశ్రమధర్మవర్ణన

**ఔర్వ ఉవాచ:-** ఔర్వుడు సగరునితో చెబుతున్నాడు.

**బాలః కృతోపనయనో వేదాహరణతత్పరః ।**
**గురుగేహే వసేద్ భూప! బ్రహ్మచారీ సమాహితః ॥ 1 ॥**

"భూపాలా! బాలుడు ఉపనయనం అయిన తరువాత వేదాలను అభ్యసించడంలో ఆసక్తి కలవాడై, బ్రహ్మచర్యం అవలంబించి గురువుగృహంలో నియమంతో నివసించాలి.

**శౌచాచారవతా తత్ర కార్యం శుశ్రూషణం గురోః ।**
**వ్రతాని చరతా గ్రాహ్యో వేదశ్చ కృతబుద్ధినా ॥ 2 ॥**

అక్కడ శౌచం, ఆచారం పాటిస్తూ,గురుశుశ్రూష చేయాలి. వ్రతాలు (నియమాలు) ఆచరిస్తూ, స్థిరమైన బుద్ధితో వేదాభ్యాసం చేయాలి.

**ఉభే సన్ధ్యే రవిం భూప! తథైవాగ్నిం సమాహితః ।**
**ఉపతిష్ఠేత్తదా కుర్యాద్ గురోరప్యభివాదనమ్ ॥ 3 ॥**

ధరణీపాలకా! ఉభయసంధ్యలలోను సూర్యుని ఉపాసించాలి. అగ్నిని వ్రేల్చాలి. తరువాత గురువుకు అభివందనం కూడ ఆచరించాలి.

**స్థితే తిష్ఠేద్ వ్రజేద్ యాతే నీచైరాసీత్ తథా సతి ।**
**శిష్యో గురౌ నృపశ్రేష్ఠ! ప్రతికూలం న సమ్భజేత్ ॥ 4 ॥**

నృపశేఖరా! గురువు నిలబడితే శిష్యుడు నిలబడాలి. ఆయన నడిస్తే నడవాలి. ఆయన కూర్చుంటే క్రింద కూర్చోవాలి. శిష్యుడు గురువుకు ప్రతికూలంగా మెలగరాదు.

**తేనైవోక్తః పఠేద్ వేదం నాన్యచిత్తః పురః స్థితః ।**
**అనుజ్ఞాతశ్చ భిక్షాన్నమశ్నీయాద్గురుణా తతః ॥ 5 ॥**

ఆయనకు ఎదురుగా కూర్చుండి, పరధ్యానం లేకుండా ఉండాలి. ఆయన చెప్పిన వేదమే చదవాలి. అనంతరం గురువు అనుమతితో భిక్షాన్నం భుజించాలి.

**అవగాహేదపః పూర్వమాచార్యేణావగాహితాః ।**
**సమిజ్జలాదికం చాస్య కల్యం కల్యముపానయేత్ ॥ 6 ॥**

ఆచార్యుడు స్నానం చేయకమునుపే, ఆయన స్నానం చేయబోయే నీటిలో స్నానం చేయాలి. ప్రతి ప్రాతఃకాలం ఆయనకు సమిధలు, జలం మున్నగునవి తెచ్చిపెట్టాలి.

**గృహీతగ్రాహ్యవేదశ్చ తతోఽనుజ్ఞామవాప్య చ ।**
**గార్హస్థ్యమావసేత్ప్రాజ్ఞో నిష్పన్నగురునిష్కృతిః ॥ 7 ॥**

అధ్యయనం చేయవలసిన వేదం చదవాలి. ఆయన అనుమతిపొంది, ప్రాజ్ఞుడైన శిష్యుడు గురుదక్షిణ చెల్లించి, అనంతరం గృహస్థాశ్రమంలో ప్రవేశించాలి.

**విధినాఽవాప్తదారస్తు ధనం ప్రాప్య స్వకర్మణా ।**
**గృహస్థకార్యమఖిలం కుర్యాద్ భూపాల!శక్తితః ॥ 8 ॥**

భూమిపాలకా! విధిపూర్వకంగా పెండ్లి చేసుకొని భార్యను పొందాలి, స్వీయకృషితో ధనం సంపాదించాలి. గృహస్థకార్యక్రమాలను అన్నింటిని యథాశక్తిగా ఆచరించాలి.

**నివాపేన పితౄనర్చేద్ యజ్ఞైర్దేవాంస్తథాఽతిథీన్ ।**
**అన్నైర్మునీంశ్చ స్వాధ్యాయైరపత్యేన ప్రజాపతిమ్ ॥ 9 ॥**

పిండతర్పణాదులచే పితృదేవతలను, యజ్ఞాదులచే దేవతలను, అన్నములచే అతిథులను, స్వాధ్యాయంతో ఋషులను, సంతానం పొందడంవల్ల ప్రజాపతిని సంతుష్టి పరచాలి.

**బలికర్మణా భూతాని వాత్సల్యేనాఖిలం జగత్ ।**
**ప్రాప్నోతి లోకాన్ పురుషో నిజకర్మసమార్జితాన్ ॥ 10 ॥**

బలిప్రదానంచే ప్రాణికోటిని, వాత్సల్యగుణంతో సమస్తజగత్తునూ ఆరాధిస్తూ, జీవుడు తన కర్మలచే పొందదగిన లోకాలను పొందుతాడు.

**భిక్షాభుజశ్చ యే కేచిత్ పరివ్రాడ్ బ్రహ్మచారిణః।**
**తేఽప్యత్రైవ ప్రతిష్ఠన్తే గార్హస్థ్యం తేన వై పరమ్ ॥ 11 ॥**

భిక్షాన్నం భుజించే పరివ్రాజకులు, బ్రహ్మచారులు, వారందరూ గృహస్థాశ్రమస్వీకారంచేసిన వారిపై ఆధారపడి ఉంటారు. కాబట్టి గృహస్థాశ్రమం ఉత్తమమైనది.

**వేదాహరణకార్యాయ తీర్థస్నానాయ చ ప్రభో! ।**
**అటన్తి వసుధాం విప్రాః పృథివీ దర్శనాయ చ ॥ 12 ॥**

మహాప్రభూ! వేదాధ్యయనంకోసం, పుణ్యతీర్థస్నానంకోసం, భూమిలోని పుణ్యక్షేత్ర సందర్శనంకోసం విప్రులు వసుధలో పర్యటిస్తూ ఉంటారు.

**అనికేతా హ్యనాహారా యత్ర సాయం గృహాశ్చ యే ।**
**తేషాం గృహస్థః సర్వేషాం ప్రతిష్ఠా యోనిరేవ చ ॥ 13 ॥**

ఇల్లు అనేది లేక, తిండి అనేది సంపాదించుకోకుండా, సాయంకాలమవడంతోనే ఎక్కడుంటే అదే ఇల్లుగా భావించే వారికందరికి గృహస్థుడే ఆశ్రయభూతుడు, కన్నతల్లి కూడ, (అనగా ఆధారం, మూలం కూడ గృహస్థుడే.)

**తేషాం స్వాగతదానాది వక్తవ్యం మధురం నృప! ।**
**గృహాగతానాం దద్యాచ్చ శయనాసనభోజనమ్ ॥ 14 ॥**

నృపాలా! గృహస్థుడు తన ఇంటికి వచ్చిన వారికి స్వాగతం చెప్పాలి. అర్ఘ్యపాద్యాదులు సమర్పించాలి. మనస్సుకు నచ్చేటట్లుగా మాట్లాడాలి. ఆసనంపై కూర్చుండ జేయాలి. భోజనం పెట్టాలి. పరుండడానికి ప్రక్క ఏర్పాటు చేకూర్చాలి.

**అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ ప్రతినివర్తతే ।**
**స దత్వా దుష్కృతం తస్మై పుణ్యమాదాయ గచ్ఛతి ॥ 15 ॥**

అతిథి ఎవని ఇంటినుండి కోరిక తీరక వెళ్ళి పోతాడో, ఆ గృహస్థునకు అతడు తన పాపాన్ని ఇచ్చివేసి, పుణ్యాన్ని తీసుకొని వెళ్లిపోతాడు.

**అవజ్ఞానమహంకారో దమ్భశ్చైవ గృహే సతః ।**
**పరితాపోపఘాతౌ చ పారుష్యం చ న శస్యతే ॥ 16 ॥**

గృహస్థునకు అతిథిని అవమానించడం, అహంకారం ప్రదర్శించడం, దంభాలు పలకడం కూడదు, ఇచ్చి పరితపించడం,కొట్టడం, దురుసుగా మాట్లాడం చేయరాదు.

**యస్తు సమ్యక్ కరోత్యేవం గృహస్థః పరమం విధిమ్ ।**
**సర్వబన్ధవినిర్ముక్తో లోకానాప్నోత్యనుత్తమాన్ ॥ 17 ॥**

గృహస్థుడు తాను చేయవలసిన ఉత్తమవిధిని ఈవిధంగా చక్కగా ఆచరిస్తే, వాడు అన్ని బంధాలనుంచి పూర్తిగా విముక్తుడై ఉత్తమలోకాలను పొందుతాడు.

**వయః పరిణతౌ రాజన్! కృతకృత్యో గృహాశ్రమీ ।**
**పుత్రేషు భార్యాం నిక్షిప్య వనం గచ్ఛేత్ సహైవ వా ॥ 18 ॥**

రాజా! వయస్సు మళ్లిపోతూ ఉంటే, గృహస్థాశ్రమంలో ఉన్నవాడు తాను చేయవలసిన పనులన్నీ పూర్తిచేసి, భార్యను పుత్రులకు అప్పగించికాని, భార్యతో కలసికాని అరణ్యానికి వెళ్లాలి.

**పర్ణమూలఫలాహారః కేశశ్మశ్రుజటాధరః ।**
**భూమిశాయీ భవేత్తత్ర మునిః సర్వాతిథిర్నృప! ॥ 19 ॥**

నృపాలా! ఆకులు, కంద మూలాలు, పండ్లు ఆహారంగా భుజిస్తూ, జుట్టు, గెడ్డం, జడలు ధరించి, నేలమీద మాత్రమే పరుంటూ, మునివృత్తిని స్వీకరించి, అతిథుల నందరినీ సత్కరించాలి.

**చర్మకాశకుశైః కుర్యాత్ పరిధానోత్తరీయకే ।**
**తద్వత్ త్రిషవణం స్నానం శస్తమస్య నరేశ్వర! ॥ 20 ॥**

మానవేశ్వరా! చర్మం,రెల్లు,దర్భలతో నేసిన వస్త్రాన్ని ధోవతిగాను, ఉత్తరీయంగాను ధరించాలి. ఉదయం, మధ్యాహ్నం, సాయంసమయాలలో అతనికి స్నానం మిక్కిలి ప్రశస్తమైనది.

**దేవతాభ్యర్చనం హోమః సర్వాభ్యాగతపూజనమ్ ।**
**భిక్షా బలిప్రదానం చ శస్తమస్య నరేశ్వర! ॥ 21 ॥**

నరాధిపా! దేవతలను విశేషంగా పూజించడం, హోమం, అభ్యాగతులను అందరిని అర్చించడం, భిక్షవేయడం, బలిప్రదానం అతనికి చాలాశ్రేష్ఠమైన పనులు.

**వన్యస్నేహేన గాత్రాణామభ్యంగశ్చాస్య శస్యతే ।**
**తపశ్చ తస్య రాజేన్ద్ర! శీతోష్ణాదిసహిష్ణుతా ॥ 22 ॥**

రాజేంద్రా! అడవిలో దొరికే నూనెలతో ఒడలికి పూసి తలంటు స్నానంచేయడం అతనికి ఉత్తమం. శీతోష్ణాలు మున్నగు ద్వంద్వాలను ఓర్చుకొంటూ అతడు తపస్సు చేయాలి.

**యస్త్వేతాం నిహితశ్చర్యాం వానప్రస్థశ్చరేన్మునిః ।**
**స దహత్యగ్నివద్దోషాన్ జయేల్లోకాంశ్చ శాశ్వతాన్ ॥ 23 ॥**

వానప్రస్థుడై ఉన్నవాడు నియమంతో ఈ వ్రతచర్యను ఆచరిస్తూ మునిలా జీవించాలి. అతడు అగ్నిలా దోషాలను దహింపజేసుకొని, శాశ్వతమైన లోకాన్ని జయిస్తాడు.

**చతుర్థశ్చాశ్రమో భిక్షోః ప్రోచ్యతే యో మనీషిభిః ।**
**తస్య స్వరూపం గదతో మమ శ్రోతుం నృపార్హసి ॥ 24 ॥**

నృపాలా! మహాజ్ఞానులు నాలుగో ఆశ్రమాన్ని భిక్షుకాశ్రమం అంటారు. దాని స్వరూపాన్ని నేను తెలియజేస్తాను. నీవు సావధానంగా వినడానికి అర్హుడవై ఉన్నావు.

**పుత్రదవ్యకలత్రేషు త్యక్తస్నేహో నరాధిప! ।**
**చతుర్థమాశ్రమం స్థానం గచ్ఛేన్నిర్ధూతమత్సరః ॥ 25 ॥**

నరపాలా! పుత్రులు, ద్రవ్యాలు, భార్య–వీటి యందు అనురాగం విడిచిపెట్టాలి. మాత్సర్యం వదలి వేయాలి. అప్పుడు చతుర్థాశ్రమస్వీకారం చేయాలి.

**త్రైవర్గికాంస్త్యజేత్ సర్వానారమ్భానవనీపతే! ।**
**మిత్రాదిషు సమో మైత్రః సమస్తేష్వేవ జన్తుషు ॥ 26 ॥**

ధరణీపతీ! ధర్మం, అర్థం, కామం అనే త్రివర్గాలకు సంబంధించిన సమస్తకార్యాలను విడిచి వేయాలి. మిత్రుడు, శత్రువు మున్నగు వారియందు స్నేహభావం కలిగి ఉండాలి. సమస్తజంతువులయందు సమబుద్ధి కలిగి మెలగాలి.

**జరాయుజాణ్డజాదీనాం వాఙ్మనఃకాయకర్మభిః ।**
**యుక్తః కుర్వీత న ద్రోహం సర్వసంగాంశ్చ వర్జయేత్ ॥ 27 ॥**

జరాయుజాలు, అండజాలు, స్వేదజాలు, ఉద్భిజ్జాలు అనే నాలుగువిధాల ప్రాణులపై మనస్సు, వాక్కు, శరీరం, కర్మలద్వారా ఏవిధమైన హాని చేయకూడదు. అన్నింటితోను సన్నిహితబంధం విడిచివేయాలి.

**ఏక రాత్రస్థితిర్గ్రామే పంచరాత్రస్థితిః పురే ।**
**తథా తిష్ఠేద్ యథా ప్రీతిర్ద్వేషో వా నాస్య జాయతే ॥ 28 ॥**

గ్రామంలో ఒకరాత్రి ఉండాలి. పురంలో ఐదు రాత్రులు చొప్పున ఉండాలి. ఏచోటా, ఎవరియందూ ప్రీతికాని, ద్వేషం కాని కలగకుండా మెలగాలి.

**ప్రాణయాత్రా నిమిత్తం చ వ్యంగారే భుక్తవజ్జనే ।**
**కాలే ప్రశస్తవర్ణానాం భిక్షార్థం పర్యటేద్ గృహాన్ ॥ 29 ॥**

భిక్షకోసమై ఇండ్లలో నిప్పు చల్లారిన తరువాత, జనాలు భోజనం చేశాక, ప్రాణయాత్రకై ఆకలి తీర్చుకోవడానికి మాత్రమే ఉత్తమవర్ణస్థుల గృహాలలో యాచిస్తూ పర్యటించాలి.

**కామః క్రోధస్తథా దర్పమోహలోభాదయశ్చ యే ।**
**తాంస్తు దోషాన్ పరిత్యజ్య పరివ్రాడ్ నిర్మమో భవేత్ ॥ 30 ॥**

కామం, క్రోధం అలాగే దర్పం, మోహం, లోభం మున్నగు దోషాలను పూర్తిగా విడిచిపెట్టి పరివ్రాజకుడు ఏ మమకారం, అహంకారం లేనివాడుగా కావాలి.

**అభయం సర్వభూతేభ్యో దత్వా యశ్చరతే మునిః ।**
**తస్యాపి సర్వభూతేభ్యో న భయం విద్యతే క్వచిత్ ॥ 31 ॥**

సర్వప్రాణులకూ అభయం ఇచ్చి సంచరించే మహామనీషియైన మునికి ఎక్కడా ఇతరప్రాణులనుంచి భయం అనేది ఏదీ ఉండదు.

**కృత్వాఽగ్నిహోత్రం స్వశరీరసంస్థం**
**శారీరమగ్నిం స్వముఖే జుహోతి ।**
**విప్రస్తు భైక్ష్యోపగతైర్హవిర్భి**
**శ్చితాగ్నికానాం వ్రజతిస్మ లోకాన్ ॥ 32 ॥**

తనశరీరంలో ఉన్న జఠరాగ్ని అగ్నిహోత్రం వ్రేల్చి, భిక్షద్వారా సంపాదించిన ద్రవ్యాలను హవిస్సులుగా చేసి, తన నోటిలో హోమం చేసే విప్రుడు అగ్నిహోత్రం చేసేవారు చేరే లోకాలకు వెడతాడు.

**మోక్షాశ్రమం యశ్చరతే యథోక్తం**
**శుచిః స్వసంకల్పిత బుద్ధియుక్తః ।**
**అనిన్ధనం జ్యోతిరివ ప్రశాన్తః**
**స బ్రహ్మలోకం జయతి ద్విజాతిః ॥ 33 ॥**

బ్రహ్మముకంటె భిన్నమైనది మిథ్య అని, సమస్తజగత్తు భగవంతుని అంశయే అని భావించి స్వీయ సంకల్పంతో బుద్ధియోగం అలవరచుకొని పవిత్రుడై మోక్షాశ్రమంలో పైన చెప్పబడిన రీతిగా సంచరిస్తూ ఉంటాడో, అటువంటి ద్విజాతుడు ఇంధనంలేని అగ్నిలా శాంతుడై బ్రహ్మలోకాన్ని కూడ జయిస్తాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే ఆశ్రమధర్మవర్ణనం నామ నవమోఽధ్యాయః సమాప్తః ॥ 9 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో ఆశ్రమధర్మవర్ణన అనే తొమ్మిదవ అధ్యాయం సమాప్తం ॥ 9 ॥



## దశమోఽధ్యాయః - పదవ అధ్యాయం

## జాతకర్మ-వివాహసంస్కారాదివర్ణనమ్ - జాతకర్మ-వివాహసంస్కారాదివర్ణన

**సగర ఉవాచ :**-సగరుడు చెప్పాడు

**కథితం చాతురాశ్రమ్యం చాతుర్వర్ణ్యక్రియాస్తథా ।**
**పుంసః క్రియామహం శ్రోతుమిచ్ఛామి ద్విజసత్తమ! ॥ 1 ॥**

అపుడు సగరుడు "ద్విజశ్రేష్ఠా! నాలుగు ఆశ్రమాలకు, నాలుగు వర్ణాలకు సంబంధించిన క్రియలను వివరించావు. పురుషులకు సంబంధించిన సంస్కారరూపమైన కర్మలను గురించి నేను వినాలని కోరుకుంటున్నాను.

**నిత్యాం నైమిత్తికీం కామ్యాం క్రియాం పుంసామశేషతః ।**
**సమాఖ్యాహి భృగుశ్రేష్ఠ! సర్వజ్ఞో హ్యసి మే మతః ॥ 2 ॥**

"భృగువంశోత్తమా! నీవు సర్వజ్ఞుడవని నాసంపూర్ణవిశ్వాసం. పురుషుల నిత్యకర్మలు, నైమిత్తిక కర్మలు, కామ్యకర్మలు పూర్తిగా నాకు వివరించు" అని అడిగాడు.

**ఔర్వ ఉవాచ :**-ఔర్వుడు చెప్పాడు

**యదేతదుక్తం భవతా నిత్యనైమిత్తికాశ్రితమ్ ।**
**తదహం కథయిష్యామి శృణుష్వైకమనా నృప! ॥ 3 ॥**

అంత ఔర్వుడు "నరపాలా! నీవడిగిన మానవుల నిత్యనైమిత్తికకర్మలకు సంబంధించిన విషయమంతా నేను తెలియజేస్తాను. సావధానమనస్కుడవై ఆలకించు" అని ఇలా చెప్పాడు.

**జాతస్య జాతకర్మాది క్రియాకాణ్డమశేషతః ।**
**పుత్రస్య కుర్వీత పితా శ్రాద్ధం చాభ్యుదయాత్మకమ్ ॥ 4 ॥**

పుట్టిన కుమారునికి తండ్రి జాతకర్మ మున్నగు సమస్తక్రియాకలాపం, అట్లే అతని అభివృద్ధిరూపమైన శ్రాద్ధం నిర్వర్తించాలి.

**యుగ్మాంస్తు ప్రాఙ్ముఖాన్ విప్రాన్ భోజయేన్మనుజేశ్వర! ।**
**యథావృత్తిస్తథా కుర్యాద్దైవం పిత్ర్యం ద్విజన్మనామ్ ॥ 5 ॥**

మానవేశ్వరా! తూర్పుదిక్కుగా, జంటలు జంటలుగా విప్రులను కూర్చోపెట్టి భోజనం పెట్టాలి, ద్విజన్ముల ఆచారాన్ని అనుసరించి దైవకార్యం, పితృకార్యం చేయాలి.

**దధ్నా యవైః సబదరైర్మిశ్రాన్ పిణ్డాన్ ముదా యుతః ।**
**నాన్దీముఖేభ్యస్తీర్థేన దద్యాద్దైవేన పార్థివ! ॥ 6 ॥**

పార్థివా! పెరుగు, యవలు, రేగుపళ్లు వీనితో కలిపిన పిండాలను సంతోషంతో దైవతీర్థంలా (కరాగ్రభాగం నుంచి) అంగుళ్యగ్రభాగం మీదుగా నాందీముఖ దేవతలను ఉద్దేశించి వేయాలి.

**ప్రాజాపత్యేన వా సర్వముపచారం ప్రదక్షిణమ్ ।**
**కుర్వీత తత్తథాశేషవృద్ధికాలేషు భూపతే! ॥ 7 ॥**

ధరణీపతీ! లేదా ప్రాజాపత్య తీర్థంలా కనిష్ఠిక మొదలునుంచి నిర్వహిస్తూ, సమస్తములైన ఉపచారాలను చేస్తూ, ప్రదక్షిణంగా కావిస్తూ, సర్వవృద్ధి కాలాలలోను వృద్ధికర్మ ఆచరించాలి.

**తతశ్చ నామ కుర్వీత పితైవ దశమేఽహని ।**
**దేవపూర్వం నరాఖ్యం హి శర్మవర్మాది సంయుతమ్ ॥ 8 ॥**

అటు తరవాత పదోరోజున తండ్రియే నామకరణం చేయాలి. దైవనామం పేరులో మొదటగా ఉంచి పురుషవాచకంగా శర్మ, వర్మ మొదలైన పదాలలో కలిపి పేరు పెట్టాలి.

**శర్మేతి బ్రాహ్మణస్యోక్తం వర్మేతి క్షత్ర సంశ్రయమ్ ।**
**గుప్తదాసాత్మకం నామ ప్రశస్తం వైశ్యశూద్రయోః ॥ 9 ॥**

శర్మ అనే పేరు బ్రాహ్మణునికి చెప్పబడింది. వర్మ అన్న పేరు క్షత్రియునికి సంబంధించింది. వైశ్యునికి గుప్త అన్న పేరు, శూద్రునకు దాస అనే పేరు ప్రశస్తమైనవి.

**నార్థహీనం న చాశస్తం నాపశబ్దయుతం తథా ।**
**నామంగల్యం జుగుప్స్యం వా నామ కుర్యాత్ సమాక్షరమ్ ॥ 10 ॥**

అర్థంలేని పేరుకాని, అప్రశస్తమైన పేరు కాని, అపశబ్దంతో కూడుకొన్న పేరుకాని, అశుభమైన పేరు కాని, ఏవగింపు కలిగించే పేరుకాని పెట్టకూడదు. పేరులో కూడ అక్షరాలు సరిసంఖ్యలో ఉండాలి.

**నాతిదీర్ఘం నాతిహ్రస్వం నాతిగుర్వక్షరాన్వితమ్ ।**
**సుఖోచ్చార్యం తు తన్నామ కుర్యాద్ యత్ప్రణవాక్షరమ్ ॥ 11 ॥**

పేరు మరీ పొడుగుగాకాని, మరీ పొట్టిగాకాని, మిక్కిలి గురువు అక్షరాలతోకాని ఉండరాదు. పేరు ఉచ్చరించడానికి తేలికగా ఉండాలి. చివరి అక్షరం లఘువై పొందికగా ఉండాలి.

**తతోఽనన్తరసంస్కారసంస్కృతో గురువేశ్మని ।**
**యథోక్తవిధిమాశ్రిత్య కుర్యాత్ విద్యాపరిగ్రహమ్ ॥ 12 ॥**

అటుపిమ్మట అనంతరసంస్కారం(ఉపనయనం)ద్వారా అతడు సంస్కరించబడి, గురుకులంలో ప్రవేశించాలి. గురువువద్ద శాస్త్రపద్ధతితో పనులు కావిస్తూ విద్యను అభ్యసించాలి.

**గృహీతవిద్యో గురవే దత్త్వా చ గురుదక్షిణామ్ ।**
**గార్హస్థ్యమిచ్ఛన్ భూపాల! కుర్యాద్ దారపరిగ్రహమ్ ॥ 13 ॥**

రాజా! అధ్యయనం పూర్తి అయ్యాక, గురువుకు గురుదక్షిణను సమర్పించాలి. గృహస్థజీవితం కావాలనుకొంటే వివాహం చేసుకొని భార్యా పరిగ్రహం చేయాలి.

**బ్రహ్మచర్యేణ వా కాలం కుర్యాత్ సంకల్పపూర్వకమ్ ।**
**గురోః శుశ్రూషణం కుర్యాత్ తత్పుత్రాదేరథాపి వా ॥ 14 ॥**

లేదా బ్రహ్మచర్యదీక్షను వహించి సంకల్పపూర్వకంగా, గురుశుశ్రూషను, అనంతరం గురుపుత్ర శుశ్రూషను కావిస్తూ కాలం గడపాలి.

**వైఖానసో వాఽపి భవేత్ ప్రవ్రజేద్ వా యథేచ్ఛయా ।**
**పూర్వం సంకల్పితం యాదృక్ తాదృక్ కుర్యాన్నరాధిప ॥ 15 ॥**

నరేశ్వరా! లేదా తన ఇష్టాన్ని అనుసరించి వానప్రస్థుడు కావాలి, లేదా సన్యసించి పరివ్రాజకుడు కావాలి. పూర్వం తాను చేసుకొన్న సంకల్పవిధంగా అతడు చేయాలి.

**వర్షైరేక గుణాం భార్యాముద్వహేత్ త్రిగుణః స్వయమ్ ।**
**నాతికేశామకేశాం వా నాతికృష్ణాం న పింగలామ్ ॥ 16 ॥**

గృహస్థాశ్రమంలో ప్రవేశించే కోరిక గలవాడయితే, తన వయస్సులో మూడు వంతుల వయస్సుగల ఆమెను పెండ్లి చేసుకోవాలి. (తనవయస్సులో మూడింట ఒకవంతు వయస్సుగల ఆమెను పెండ్లి చేసుకొవాలి.) జుట్టు మరీ ఎక్కువ ఉన్న దానిని, జట్టుబాగా తక్కువ ఉన్న దానిని, ఎక్కువ నల్లగా ఉన్న దానిని, మరీ తెల్లగా ఉన్న దానిని వివాహమాడరాదు.

**నిసర్గతో వికలాంగీమధికాంగీం చ నోద్వహేత్ ।**
**నావిశుద్ధాం సరోమాం వాఽకులజాం వాఽపి రోగిణీమ్ ॥ 17 ॥**

పుట్టుకతో అవయవలోపం ఉన్న దానినికాని, అవయవాలు ఎక్కువగా ఉన్న దానిని కాని పెండ్లాడరాదు. అపవిత్రురాలిని, రోమాలు ఉన్న దానిని, కులం లేనిదానిని, రోగంతో ఉన్న దానిని వివాహమాడరాదు.

**న దుష్టాం దుష్టవాచాటాం వ్యంగినీం పితృమాతృతః ।**
**న శ్మశ్రువ్యంజనవతీం న చైవ పురుషాకృతిమ్ ॥ 18 ॥**

దుష్టురాలిని, చెడ్డమాటలు పలికే దానిని, తల్లిదండ్రులలో అవయవలోపం ఉన్న దానిని, గెడ్డం మీసం కనిపించే దానిని, మగరాయడులా కనిపించే దానిని పెండ్లాడరాదు.

**న ఘర్ఘరస్వరాం క్షామాం తథా కాకస్వరాం న చ ।**
**నానిబద్ధేక్షణాం తద్వద్ వృత్తాక్షీం నోద్వహేద్ బుధః ॥ 19 ॥**

బొంగురుగొంతు దానిని, బాగా పీలగా ఉన్న దానిని, కీచుగొంతుగల దానిని, కనురెప్పలకు వెంట్రుకలు లేని దానిని, అలాగే మిడిగ్రుడ్లు కల దానిని వివేకవంతుడు పెండ్లిచేసుకోరాదు.

**యస్యాశ్చ రోమశే జంఘే గుల్ఫౌ యస్యాస్తథోన్నతౌ ।**
**గణ్డయోః కూపకౌ యస్యా హసన్త్యాస్తాం న చోద్వహేత్ ॥ 20 ॥**

పిక్కలపై రోమాలు ఉన్న దానిని, ఎత్తైన చీలమండలు కల దానిని, నవ్వుతూ ఉండగా బుగ్గలపై గుంటలు పడే దానిని మనువాడరాదు.

**నోద్వహేత్ తాదృశీం కన్యాం ప్రాజ్ఞః కార్యవిశారదః ।**
**నాతిరూక్షచ్ఛవిం పాణ్డు కరజామరుణేక్షణామ్ ॥ 21 ॥**

మిక్కలి భయంకరమైన కాంతి ఉన్న దానిని, తెల్లనిగోళ్లు ఉన్న దానిని, ఎఱ్ఱని కన్నులున్న దానిని, అటువంటి కన్యను కార్యసాధకుడైన విద్వాంసుడు పెండ్లి చేసుకోరాదు.

**ఆపీనహస్తపాదాం చ న కన్యాముద్వహేద్బుధః ।**
**న వామనాం నాతిదీర్ఘాం నోద్వహేత్ సంహతభ్రువమ్ ॥ 22 ॥**

బాగా బలిసిన పాదాలు, ఉబ్బి ఉన్న జబ్బలు గల కన్యను బుద్ధిమంతుడు పెండ్లాడరాదు. మరుగుజ్జు దానిని, బాగా పొడుగైన దానిని, కనుబొమలు కలసిపోయిన దానిని వివాహమాడరాదు.

**న చాతిచ్ఛిద్రదశనాం న కరాళముఖీం నరః ।**
**పంచమీం మాతృపక్షాచ్చ పితృపక్షాచ్చ సప్తమీమ్ ॥ 23 ॥**
**గృహస్థశ్చోద్వహేత్ కన్యాం న్యాయేన విధినా నృప ၊ 24 ॥**

నరపాలా! మిక్కిలి ఎడమైన పండ్లు ఉన్న దానిని, భయంకరమైన ముఖం కల దానిని నరుడు వివాహమాడరాదు. తల్లివైపునుండి ఐదుతరాలవరకు, తండ్రివైపునుండి ఏడుతరాల వరకు సంబంధంలేని కన్యను గృహస్థుడు శాస్త్రవిధిని అనుసరించి వివాహం చేసుకోవాలి.

**విశే:–** మేనరికం దేశజాతికులధర్మాలను బట్టి జరిగేది.

**బ్రాహ్మో దైవస్తథైవాఽఽర్షః ప్రాజాపత్యస్తథాఽఽసురః ।**
**గాంధర్వరాక్షసౌ చాన్యౌ పైశాచశ్చాష్టమో మతః ॥ 25 ॥**

బ్రాహ్మం, దైవం, ఆర్షం, ప్రాజాపత్యం, ఆసురం, గాంధర్వం, రాక్షసం, పైశాచం అని వివాహం ఎనిమిది విధాలు.

**వి ॥** 1) విద్య, ఆచారం కల వరుని పూజించి కన్యాదానం చేయడం బ్రాహ్మం.

2) యజ్ఞసమయంలో ఋత్విజునకు కన్యనీయడం దైవం.

3) వరునినుండి గోమిథునం స్వీకరించి కన్యాదానం చేయడం ఆర్షం.

4) మీరిద్దరు కలిసి ధర్మం ఆచరించండి అని చెప్పి కన్యనీయడం ప్రాజాపత్యం.

5) కన్యాశుల్కం ఇచ్చి చేసుకొనే పెండ్లి ఆసురం.

6) కన్య, వరుడు పరస్పరేచ్ఛతో చేసుకొనే పెండ్లి గాంధర్వం

7) కన్యవైపునున్న వారితో యుద్ధం చేసి జయించి, ఆమెను పెండ్లి చేసుకోవడం రాక్షసం.

8) నిద్రించికాని, మైమరచికాని, సంభోగేచ్ఛతో పెండ్లిచేసుకోవడం పైశాచం.

**ఏతేషాం యస్య యో ధర్మో వర్ణస్యోక్తో మహర్షిభిః ।**
**కుర్వీత దారాహరణం తేనాన్యం పరివర్జయేత్ ॥ 26 ॥**

వీటిలో ఎవరికి ఏది ధర్మమో, ఏ వర్ణానికి ఏది యుక్తమని మహర్షులు చెప్పారో ఆ విధంగా పెండ్లిచేసుకొని భార్యను స్వీకరించాలి, వీటిలో చివరిదైన పైశాచవివాహాన్ని విడిచి పెట్టాలి.

**సధర్మచారిణీం ప్రాప్య గార్హస్థ్యం సహితస్తయా ।**
**సముద్వహేద్ దదాత్యేషా సమ్యగూఢాం మహాఫలమ్ ॥ 27 ॥**

ఈవిధంగా సహధర్మచారిణిని పొంది, ఆమెతో కలిసి గృహస్థజీవితం కొనసాగించాలి. గార్హస్థ్యం నియమబద్ధంగా చక్కగా నిర్వహిస్తే అది మహాఫలితాన్ని ఇస్తుంది అని ఔర్వుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే జాతకర్మ-వివాహసంస్కారాది వర్ణనం నామ దశమోఽధ్యాయః సమాప్తః ॥ 10॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో జాతకర్మ-వివాహసంస్కారాది వర్ణన అనే పదవ అధ్యాయం సమాప్తం.॥10॥



## ఏకాదశోఽధ్యాయః - పదకొండవ అధ్యాయం

## గృహస్థ సదాచారవర్ణనమ్ - గృహస్థ సదాచారవర్ణన

**సగర ఉవాచ :-** సగరుడు చెప్పాడు.

**గృహస్థస్య సదాచారం శ్రోతుమిచ్ఛామ్యహం మునే! ।**
**లోకాదస్మాత్ పరస్మాచ్చ యమాతిష్ఠన్న హీయతే ॥ 1 ॥**

అంత సగరుడు "మునీశ్వరా! గృహస్థుడు ఏ సదాచారం ఆచరించడంవల్ల ఈలోకం నుంచి, పరలోకం నుంచి భ్రష్టుడు కాడో, అట్టి ఆచారం గురించి వినాలని కోరుకొంటున్నాను" అని అడిగాడు.

**ఔర్వ ఉవాచ :-** ఔర్వుడు చెప్పాడు.

**శ్రూయతాం పృథివీపాల! సదాచారస్య లక్షణమ్ ।**
**సదాచారవతా పుంసా జితౌ లోకావుభావపి ॥ 2 ॥**

ఔర్వుడు అపుడు "మహీపాలా! సదాచారస్వరూపం గురించి ఆలకించు. సదాచార వంతుడైన పురుషుడు ఇహపరలోకాలు రెండింటినీ జయిస్తాడు.

**సాధవః క్షీణదోషాస్తు సచ్ఛబ్దః సాధువాచకః ।**
**తేషామాచరణం యత్తు సదాచారః స ఉచ్యతే ॥ 3 ॥**

'సత్' అనే శబ్దానికి అర్థం "సాధువు" అని. సాధువులు నశించిన పాపం కలవారు. అటువంటి సజ్జనులు ఆచరించే కర్మయే సదాచారం అనబడుతుంది.

**సప్తర్షయోఽథ మనవః ప్రజానాం పతయస్తథా ।**
**సదాచారస్య వక్తారః కర్తారశ్చ మహీపతే! ॥ 4 ॥**

భూపతీ! సప్తర్షులు, మనువులు, ప్రజాపతులు సదాచారం గురించి చెప్పేవారు, చేసే వారు కూడ.

**బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ మానసే మతిమాన్నృప! ।**
**ప్రబుద్ధశ్చిన్తయేద్ధర్మమర్థం చాప్యవిరోధినమ్ ॥ 5 ॥**

నృపాలా! బుద్ధిమంతుడు బ్రాహ్మముహూర్తంలో నిద్రనుంచి లేవాలి. నిద్రలేచి మనస్సులో ధర్మం గురించి, దానికి విరుద్ధంకాని అర్థం గురించి ఆలోచించాలి.

**అపీడయా తయోః కామముభయోరపి చిన్తయేత్ ।**
**దృష్టాదృష్టవినాశాయ త్రివర్గే సమదర్శితా ॥ 6 ॥**

పిమ్మట ధర్మార్థాలకు హాని కలిగించని కామం గురించి ఆలోచించాలి. కనిపిస్తూ, కనిపించకుండా ఉండే అనిష్టం తొలగించుకోవడానికై ధర్మార్థకామాలనే త్రివర్గంపై సమదృష్టిని ప్రదర్శించాలి.

**పరిత్యజేదర్థకామౌ ధర్మపీడాకరౌ నృప! ।**
**ధర్మమప్యసుఖోదర్కం లోకవిద్విష్టమేవ చ ॥ 7 ॥**

నరపాలకా! ధర్మానికి హాని కలిగించే అర్థకామాలను రెండింటినీ విడిచిపెట్టాలి. అనంతరం మోక్షపురుషార్థసాధనకై మిక్కిలి కష్టం కలిగించేది, లోకం ఎక్కువగా ద్వేషించేది అయిన ధర్మాన్ని కూడ వదలి వేయవలసిందే.

**తతః కల్యం సముత్థాయ కుర్యాన్మూత్రం నరేశ్వర! ।**
**నైరృత్యామిషువిక్షేపమతీత్యాభ్యధికం భువః ॥ 8 ॥**

నరపాలా! ఈ విధంగా బ్రాహ్మీముహూర్తంలో లేచి ధర్మార్థకామమోక్షాలను గూర్చి విచారించి, పిమ్మట నైర్‌ఋతి (నిర్‌ఋతి) మూలగా ధనుస్సునుంచి బాణం వేసిన దూరం దాటిపోయి భూమిపై మూత్రవిసర్జన చేయాలి.

**దూరాదావసథాన్మూత్రం పురీషం చ విసర్జయేత్ ।**
**పాదావసేచనోచ్ఛిష్టే ప్రక్షిపేన్న గృహాంగణే ॥ 9 ॥**

నివాసగృహానికి దూరంగా మూత్రం, మలం విసర్జించాలి. ఇంటివాకిటిలో కాళ్లుకడిగిన నీళ్లు, ఎంగిలి నీళ్లు పారబోయకూడదు.

**ఆత్మచ్ఛాయాం తరుచ్ఛాయాం గోసూర్యాగ్న్యనిలాంస్తథా ।**
**గురుద్విజాతీంస్తు బుధో న మేహేత కదాచన ॥ 10 ॥**

తననీడలోను, చెట్టునీడలోను, గోవు, సూర్యుడు, అగ్ని, వాయువు, గురువు, ద్విజుడు మున్నగు పూజ్యులకు ఎదురుగా ఎన్నడూ బుధుడు మలమూత్ర విసర్జన చేయరాదు.

వి ॥ ద్విజాతీన్-ద్విజాదీన్-పాఠాంతరం.

**న కృష్టే సస్యమధ్యే వా గోవ్రజే జనసంసది ।**
**న వర్త్మని న నద్యాదితీర్థేషు పురుషర్షభ! ॥ 11 ॥**

పురుషపుంగవా! దున్నిన నేలపైన, పంటచేనులోను, ఆవుల మందలోను, జననివాసాలలోను, మార్గ మధ్యంలో, నదులు మున్నగు తీర్థప్రదేశాలలోను మలమూత్రాలను విసర్జింపరాదు.

**నాప్సు నైవామ్భసస్తీరే శ్మశానే న సమాచరేత్ ।**
**ఉత్సర్గం వై పురీషస్య మూత్రస్య చ విసర్జనమ్ ॥ 12 ॥**

నీళ్లలోను, నీరు ఉన్నప్రదేశాల ఒడ్డున, శ్మశానంలోను మలమూత్ర విసర్జనం, వాటిని త్యజించడంచేయరాదు.

**ఉదఙ్ముఖో దివా మూత్రం విపరీతముఖో నిశి ।**

**కుర్వీతానాపది ప్రాజ్ఞో మూత్రోత్సర్గం చ పార్థివ ॥ 13 ॥**

పార్థివా! ప్రాజ్ఞుడయిన వాడు ఆపదలేని సమయంలో అనగా ఏరోగం, కష్టం లేనివేళలో పగలు ఉత్తరముఖంగాను, రాత్రి దక్షిణముఖంగాను మూత్రవిసర్జన చేయాలి.

**తృణైరాస్తీర్య వసుధాం వస్త్రప్రావృతమస్తకః ।**
**తిష్ఠేన్నాతిచిరం తత్ర నైవ కించిదుదీరయేత్ ॥ 14 ॥**

మలవిసర్జన సమయంలో భూమిని గడ్డితో కప్పాలి. శిరస్సుపైన వస్త్రం కప్పుకోవాలి. అక్కడ ఎక్కువ సేపు ఉండరాదు. ఏమీ మాట్లాడరాదు.

**వల్మీకమూషికోత్ఖాతాం మృదమంతర్జలం తథా ।**
**శౌచావశిష్టాం గేహాచ్చ నాదద్యాల్లేపసమ్భవామ్ ॥ 15 ॥**

**అంతఃప్రాణ్యవపన్నాం చ హలోత్ఖాతాం చ పార్థివ! ।**
**పరిత్యజేన్మృదో హ్యేతాః సకలాః శౌచకర్మణి ॥ 16 ॥**

పార్థివా! పుట్టమన్ను, ఎలుకలు త్రవ్వినమట్టి, నీళ్లలోని అడుసు ఒకరు ఉపయోగించగా మిగిలినది, ఇంటికి మెత్తినది, చిన్నచిన్న పురుగులు ప్రోగు చేసినది, నాగలిచే దున్నినది–ఇటువంటి మన్ను అంతా శుద్ధికర్మలో ఉపయోగించరాదు.

**ఏకా లింగే గుదే తిస్రో దశ వామకరే నృప ।**
**హస్తద్వయే చ సప్త స్యుర్మృదశ్శౌచోపపాదికాః ॥ 17 ॥**

నరపాలా! మూత్రం విడిచే అవయవాన్ని ఒకమారు, మలం విసర్జించే అవయవాన్ని మూడు సార్లు, ఎడమ చేతిని పదిమార్లు, రెండు చేతులను ఏడుసార్లు మట్టి పట్టిస్తే మలినం పోయి శుద్ధి అవుతుంది.

**అచ్ఛేనాగన్ధఫేనేన జలేనాబుద్బుదేన చ ।**
**ఆచమేచ్చ మృదం భూయస్తథా దద్యాత్ సమాహితః ॥ 18 ॥**

వాసన, నురుగు, బుడగలులేని స్వచ్ఛమైన నీటితో ఆచమించి, మళ్లీ మట్టిని జాగ్రత్తగా తీసుకొని పట్టించుకోవాలి.

**నిష్పాదితాంఘ్రిశౌచస్తు పాదావభ్యుక్ష్య వై పునః ।**
**త్రిః పిబేత్ సలిలం తేన తథా ద్విః పరిమార్జయేత్ ॥ 19 ॥**

ఆ మట్టిని రెండు పాదాలకు పట్టించుకొని, మంచినీటితో పాదాలు కడుగుకొని మూడుసార్లు ఆచమించి, రెండుసార్లు మళ్లీ కడుగుకోవాలి.

**శీర్షణ్యాని తతః ఖాని మూర్ధానం చ సమాలభేత్ ।**
**బాహూ నాభిం చ తోయేన హృదయం చాపి సంస్పృశేత్ ॥ 20 ॥**

నీటితో శిరస్సుపై ఉన్న ఇంద్రియాలను, శిరస్సును తాకాలి. పిమ్మట భుజాలను, నాభిని, హృదయాన్ని తాకాలి.

**ఆ(స్వా)చాన్తస్తు తతః కుర్యాత్ పుమాన్ కేశప్రసాధనమ్ ।**
**ఆదర్శాంజనమాంగల్యం దూర్వాద్యాలంబనాని చ ॥ 21 ॥**

ఈ విధంగా శుద్ధిస్నానం కావించిన పిమ్మట పురుషుడు జుట్టు అలంకరించుకోవాలి. అద్దం, కాటుక, మంగళ ద్రవ్యాలు, గరికలు మున్నగు అలంకరణసామగ్రి ఉపయోగించుకోవాలి.

**తతః స్వవర్ణధర్మేణ వృత్త్యర్థం చ ధనార్జనమ్ ।**
**కుర్వీత శ్రద్ధాసమ్పన్నో యజేచ్చ పృథివీపతే ॥ 22 ॥**

మహీపతీ! అటుపిమ్మట తన వర్ణధర్మాన్ని అనుసరించి, జీవనంకోసం ధనం సంపాదించాలి. శ్రద్ధతో కూడుకొన్నవాడై యజ్ఞాలు చేయాలి.

**సోమసంస్థా హవిఃసంస్థాః పాకసంస్థాశ్చ సంస్థితాః ।**
**ధనే యతో మనుష్యాణాం యతేతాతో ధనార్జనే ॥ 23 ॥**

సోమసంస్థలు, హవిస్సంస్థలు, పాకసంస్థలు ధనంపైనే ఆధారపడి ఉన్నాయి. కాబట్టి మనుష్యులు డబ్బు సంపాదించడానికై ప్రయత్నించాలి.

విశే: 1) సోమసంస్థలు ఏడు. అవి అగ్నిష్టోమం, అత్యగ్నిష్టోమం, ఉక్థ్యం, షోడశి, వాజపేయం, అతిరాత్రం, ఆప్తోర్యామం అనేవి.

2) హవిస్సంస్థలు ఏడు: అవి అగ్న్యాధేయం, అగ్నిహోత్రం,దర్శపూర్ణమాసాలు, ఆగ్రాయణం, చాతుర్మాస్యం, యజ్ఞపశుబంధం, సౌత్రామణి అనేవి.

3)పాకసంస్థలు ఏడు. అవి. అష్టక, పార్వణ, శ్రాద్ధ, శ్రావణి ఆగ్రహాయణి, చైత్రి, ఆశ్వయుజి అనేవి.

**నదీనదతటాకేషు దేవఖాతజలేషు చ ।**
**నిత్యక్రియార్థం స్నాయీత గిరిప్రస్రవణేషు చ ॥ 24 ॥**

నదులలో, నదాలలో, చెరువులలో, కోవెలవద్దకల కోనేళ్లలో, సెలయేళ్లలో నిత్యకర్మానుష్ఠానంకోసం స్నానం చేయాలి.

**కూపేషూద్ధృతతోయేన స్నానం కుర్వీత వా భువి ।**
**గృహేషూద్ధృతతో యేన హ్యథవా భువ్యసమ్భవే ॥ 25 ॥**

లేదా నూతులనుంచి నీళ్లు తోడుకొని దగ్గరనున్న భూప్రదేశంలో స్నానం చేయాలి. అటువంటి ప్రదేశం నూతులదగ్గర లభ్యంకాకపోతే నీళ్లు ఇంటికి తెచ్చుకొని స్నానం చేయాలి.

**శుచివస్త్రధరః స్నాతో దేవర్షిపితృతర్పణమ్ ।**
**తేషామేవ హి తీర్థేన కుర్వీత సుసమాహితః ॥ 26 ॥**

స్నానం అయిన తరవాత, శుచిగలవస్త్రాలు ధరించి దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు తర్పణం ఆ నదులు మున్నగు వాటియందలి తీర్థంతోనే మిక్కిలి శ్రద్ధగా చేయాలి.

**త్రిరపః ప్రీణనార్థాయ దేవానామపవర్జయేత్ ।**
**ఋషీణాం చ యథాన్యాయం సకృచ్చాపి ప్రజాపతేః ॥ 27 ॥**

దేవతలకు,ఋషులకు తృప్తికోసమై మూడు సార్లు యథాశాస్త్రంగా నీళ్లు వదలాలి. ప్రజాపతి కయితే ఒకసారి వదలాలి.

**వి ॥** దేవతలకు తర్జనీమూలం, ఋషులకు కనిష్ఠికామూలం మీదుగా, పితృదేవతలకు తర్జనీమూలం మీదుగా తర్పణం ఇవ్వాలి.

**భూర్భువస్సువః** – దేవాన్, ఋషీన్, పితౄన్ తర్పయామి అని విడవాలి.

**పితౄణాం ప్రీణనార్థాయ త్రిరపః పృథివీపతే ।**
**పితామహేభ్యశ్చ తథా ప్రీణయేత్ప్రపితామహాన్ ॥ 28 ॥**

ధరణీపాలకా! పితృదేవతల తృప్తికొరకై మూడు సార్లు నీళ్లు వదలాలి. అలాగే పితామహునకు, ప్రపితామహునకు తృప్తి కలగడానికై మూడుసార్లు నీళ్లు విడిచిపెట్టాలి.

**మాతామహాయ తత్పిత్రే తత్పిత్రే చ సమాహితః ।**
**దద్యాత్ పైత్రేణ తీర్థేన కామ్యం చాన్యచ్ఛృణుష్వ మే ॥ 29 ॥**

అదేవిధంగా మాతామహ, మాతృపితామహ, మాతృప్రపితామహులకు కూడ శ్రద్ధతో పితృతీర్థం విడిచిపెట్టాలి. కామ్యతర్పణం అనేది ఒకటి ఉంది. దానిని గురించి చెబుతాను. ఆలకించు.

**మాత్రే ప్రమాత్రే తన్మాత్రే గురుపత్న్యై తథా నృప! ।**
**గురవే మాతులాదీనాం స్నిగ్ధమిత్రాయ భూభుజే ॥ 30 ॥**

**ఇదం చాపి జపేదమ్బు దద్యాదాత్మేచ్ఛయా నృప! ।**
**ఉపకారాయ భూతానాం కృతదేవాదితర్పణః ॥ 31 ॥**

నృపాలా! ఈ జలం అమ్మకు. ఇది అమ్మమ్మకు ఇది ఆమె అమ్మకు. ఇది గురువుకు, ఇది గురుపత్నికి, ఇది మేనమామ మున్నగు వారికి. ఇది ప్రియమిత్రునకు. ఇది భూమిని పాలించు మహారాజుకు అని మంత్రం జపిస్తూ

రాజా! దేవాది తర్పణం పూర్తి అయిన తరవాత తన ఇచ్ఛను అనుసరించి సకలప్రాణుల ఉపకారానికై నీళ్లు వదలాలి.

**దేవాసురాస్తథా యక్షా నాగగన్ధర్వరాక్షసాః ।**
**పిశాచా గుహ్యకాః సిద్ధా కుష్మాణ్డాస్తరవః ఖగాః ॥ 32 ॥**

**జలేచరా భూనిలయా వాయ్వాహారాశ్చ జన్తవః ।**
**తృప్తిమేతేన యాన్త్వాశు మద్దత్తేనామ్బునాఖిలాః ॥ 33 ॥**

దేవతలు, అసురులు, యక్షులు, నాగులు, గంధర్వులు. రాక్షసులు, పిశాచులు, గుహ్యకులు, సిద్ధులు, కూష్మాండులు, తరువులు (పశువులు), పక్షులు, జలచరాలు, భూచరాలు, వాయువును భక్షించే ప్రాణులు–అందరూ నేను ఇచ్చే ఈ నీటితో వెంటనే తృప్తిని పొందాలి.

వి ॥ తరవః– పశవః అని పాఠాంతరం.

**నరకేషు సమస్తేషు యాతనాసు చ యే స్థితాః ।**
**తేషా మాప్యాయనాయైతద్దీయతే సలిలం మయా ॥ 34 ॥**

సమస్తనరకప్రదేశాలలో ఎవరకు యాతనలు అనుభవిస్తున్నారో, వారి తృప్తికోసమై ఈ నీళ్లు విడిచిపెడు తున్నాను.

**యేఽబాన్ధవా బాన్ధవా యే హ్యన్యజన్మని బాన్ధవాః ।**
**తే సర్వే తృప్తిమాయాన్తు యే చాస్మత్తోయకాంక్షిణః ॥ 35 ॥**

బాంధవులుకాని, అబాంధవులుకాని, అన్యజన్మబాంధవులుకాని, నేను ఇచ్చే ఈ నీళ్లను కావాలని కోరుకొనేవారు అందరూ తృప్తి పొందెదరుగాక!

**యత్ర క్వచన సంస్థానాం క్షుత్తృష్ణోపహతాత్మనామ్ ।**
**ఇదమప్యక్షయం చాస్తు మయా దత్తం తిలోదకమ్ ॥ 36 ॥**

ఆకలి, దప్పికతో బాధపడుతూ ఎక్కడ ఏవిధంగా ఉన్న వారికైనాసరే, నేను ఇచ్చే తిలోదకం అక్షయమైన తృప్తిని కలిగించాలంటూ తర్పణం చేయాలి.

**కామ్యోదకప్రదానం తే మయైతత్ కథితం నృప! ।**
**యద్ దత్వా ప్రీణయత్యేతన్మనుష్యః సకలం జగత్ ॥ 37 ॥**

నృపాలా! ఈవిధంగా కామ్యోదకప్రదానం గురించి నీకు చెప్పాను. మనుష్యుడు ఇటువంటి తర్పణం ఇస్తూ సకలజగత్తునూ తృప్తి పరుస్తాడు.

**జగదాప్యాయనోద్భూతం పుణ్యమాప్నోతి చానఘ ।**
**దత్త్వా కామ్యోదకం సమ్యగేతేభ్యః శ్రద్ధయాఽన్వితః ॥ 38 ॥**

పుణ్యాత్ముడవైన రాజా! వీరికి మిక్కిలి శ్రద్ధతో కూడుకొన్నవాడై కామ్యోదకం ఈయాలి. ఈవిధంగా జగత్తును తృప్తిపరచినందువల్ల మానవుడు పుణ్యం పొందుతాడు.

**ఆచమ్య చ తతో దద్యాత్ సూర్యాయ సలిలాంజలిమ్ ।**
**నమో వివస్వతే బ్రహ్మన్ భాస్వతే విష్ణుతేజసే ।**
**జగత్సవిత్రే శుచయే సవిత్రే కర్మసాక్షిణే.(దాయినే) ॥ 39 ॥**

అనంతరం ఆచమనంచేసి ఓ బ్రహ్మా ! వివస్వంతునికి, తేజస్స్వరూపునికి, విష్ణుప్రకాశవంతునికి, జగత్ సృష్టికారకునికి, పవిత్రునికి, కర్మసాక్షికి, సవితృదేవునికి నమస్కారం" అంటూ సూర్యభగవానునకు జలాంజలి సమర్పించాలి.

**తతో గృహార్చనం కుర్యాదభీష్టసురపూజనమ్ ।**
**జలాభిషేకపుష్పాణాం ధూపాద్యైశ్చ నివేదనమ్ ॥ 40 ॥**

అటు తరవాత జలాభిషేకంతో, పుష్పాలతో, ధూపం మున్నగువాటితో, నైవేద్యంతో గృహదేవతలను, ఇష్టదేవతలను పూజించాలి.

**అపూర్వమగ్నిహోత్రం చ కుర్యాత్ ప్రాగ్ బ్రహ్మణే నృప! ।**
**ప్రజాపతిం సముద్దిశ్య దద్యాదాహుతిమాదరాత్ ॥ 41 ॥**

**గుహ్యేభ్యః కాశ్యపాయాథ తతో౽నుమతయే క్రమాత్ । 42 ॥**

నృపాలా! అనంతరం అగ్నిహోత్రం అపూర్వమైన విధంగా చేయాలి. మొట్టమొదట బ్రహ్మను ఉద్దేశించి ఆహుతి ఈయాలి. తరవాత శ్రద్ధగా ప్రజాపతిని ఉద్దేశించి ఆహుతి సమర్పించాలి.

వి॥ ఆదరపూర్వకంగా ఆహుతి ఈయాలి. (అనుమతిదేవతలు)

**తచ్ఛేషం మణికే పృథ్వీ పర్జన్యేభ్యః క్షిపేత్తతః ।**
**ద్వారే ధాతుర్విధాతుశ్చ మధ్యే చ బ్రహ్మణే క్షిపేత్ ।**
**గృహస్య పురుషవ్యాఘ్ర దిగ్దేవానపి మే శృణు ॥ 43 ॥**

అనంతరం మిగిలిన హవిస్సును భూమికోసం, మేఘాల కోసం మణికం (ఒక ఉదకపాత్ర)లో వేయాలి. తరువాత ద్వారంలో ధాతకు, విధాతకు, గృహమధ్యంలో బ్రహ్మకు బలిప్రదానం చేయాలి. పురుషశ్రేష్ఠా! ఇక దిగ్దేవతలను గురించి చెబుతాను విను.

**ఇన్ద్రాయ ధర్మరాజాయ వరుణాయ తథేన్దవే ।**
**ప్రాచ్యాదిషు బుధో దద్యాద్ హుతశేషాత్మకం బలిమ్ ॥ 44 ॥**

కర్మలపట్ల విశేషశ్రద్ధకల బుధుడు ఇంద్రునికి, ధర్మరాజుకి, వరుణునికి, చంద్రునికి తూర్పు మున్నగు దిక్కులలో హోమం చేయగా మిగిలిన దానిని బలిగా వేయాలి.

**ప్రాగుత్తరే చ దిగ్భాగే ధన్వన్తరిబలిం బుధః ।**
**నిర్వపేద్ వైశ్వదేవం చ కర్మ కుర్యాదతః పరమ్ ॥ 45 ॥**

విద్వాంసుడైన పురుషుడు తూర్పు,ఉత్తరదిగ్భాగంలో (ఈశాన్యభాగంలో) ధన్వంతరబలి ఉంచాలి. అటు తరువాత వైశ్యదేవకర్మ ఆచరించాలి.

**వాయవ్యే వాయవే దిక్షు సమస్తాసు యథాదిశమ్ ।**
**బ్రహ్మణే చాన్తరిక్షాయ భానవే చ క్షిపేద్ బలిమ్ ॥ 46 ॥**

వాయవ్యంలో వాయువుకు, సమస్తదిక్కులలోను ఆయా దిక్కులకు, బ్రహ్మకు, అంతరిక్షానికి, సూర్యునికి బలిని ఉంచాలి.

వి: ఒక కళ తక్కువైన చంద్రుడుగల పౌర్ణమి.(శబ్దరత్నాకరం) అనుమతిః కలాహీనత్వేఽపి పూర్ణిమా విహితయాగాదికరణాయ అనుజ్ఞాయతే (శబ్దకల్పద్రుమమ్)

**విశ్వేదేవాన్ విశ్వభూతానథ విశ్వపతీన్ పితౄన్ ।**
**యక్షాణాం చ సముద్దిశ్య బలిం దద్యాన్నరేశ్వర! ॥ 47 ॥**

మానవేశ్వరా! విశ్వేదేవతలను, విశ్వభూతాలను, విశ్వపతులను, పితరులను, యక్షులను ఉద్దేశించి బలిని వేయాలి.

**తతోఽన్యదన్నమాదాయ భూమిభాగే శుచౌ బుధః ।**
**దద్యాదశేషభూతేభ్యః స్వేచ్ఛయా సుసమాహితః ॥ 48 ॥**

అనంతరం బుద్ధిమంతుడైన పురుషుడు వేరే అన్నం తీసుకొని పవిత్రమైన ప్రదేశంలో మిక్కిలి శ్రద్ధ కూడినవాడై తన కోరికను అనుసరించి సమస్తప్రాణులకు బలిప్రక్షేపం చేయాలి.

**దేవా మనుష్యాః పశవో వయాంసి**
**సిద్ధాః సయక్షోరగదైత్యసంఘాః ।**
**ప్రేతాః పిశాచాస్తరవః సమస్తా**
**యే చాన్నమిచ్ఛన్తి మయా ప్రదత్తమ్ ॥ 49 ॥**

దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు, సిద్ధులు, యక్షులు, ఉరగులు, దైత్యసంఘాలు, ప్రేతములు, పిశాచాలు, వృక్షాలు ఇలా అన్నం కోరుకొంటున్న వారికందరికి ఈ అన్నం ఉంచుతున్నాను.

**పిపీలికాః కీటపతంగకాద్యా**
**బుభుక్షితాః కర్మనిబన్ధ బద్ధాః ।**
**ప్రయాన్తు తే తృప్తిమిదం మయాఽన్నం**
**తేభ్యో విసృష్టం సుఖినో భవన్తు ॥ 50 ॥**

పిపీలికలు(చీమలు), కీటకాలు, మిడుతలు మున్నగునవి, కర్మబంధాలకు కట్టుబడి ఆకలితో ఉన్న ప్రాణులు-ఇంటువంటి వాటి కన్నింటికి నేను ఇక్కడ అన్నం ఉంచాను. అవి తృప్తిచెంది సుఖం పొందునుగాక!

**యేషాం న మాతా న పితా న బంధు**
**ర్నైవాన్నసిద్ధిర్న తథాఽన్నమస్తి ।**
**తత్తృప్తయేఽన్నం భువి దత్తమేతత్**
**తే యాన్తు తృప్తిం ముదితా భవన్తు ॥ 51 ॥**

ఎవరికయితే తల్లి,తండ్రి, బంధువు లేరో, ఎవరికయితే అన్నం తయారుచేసుకోవడం అనేది లేదో, ఎవరికి అన్నం లేకుండా ఉంటుందో అటువంటి వారి కోసమై వారి తృప్తికొరకై భూమిపై ఈ అన్నం ఉంచాను. అవి తనివితీరా సంతోషపడుగాక!

**భూతాని సర్వాణి తథాఽన్నమేత**
**దహం చ విష్ణుర్న యతోఽన్యదస్తి ।**
**తస్మాదహం భూతనికాయభూత**
**మన్నం ప్రయచ్ఛామి భవాయ తేషామ్ ॥ 52 ॥**

సమస్తప్రాణులు, ఈ అన్నము, నేనూ విష్ణుస్వరూపమే. విష్ణువుకన్న వేరు లేదు. కాబట్టి నేను భూత సముదాయశరీరభూతమైన అన్నమును వాటి పోషణకొరకై ఉంచుతున్నాను.

**చతుర్దశో భూతగణో య ఏష**
**తత్ర స్థితా యేఽఖిలభూతసంఘాః ।**
**తృప్త్యర్థమన్నం హి మయా విసృష్టం**
**తేషామిదం తే ముదితా భవన్తు ॥ 53 ॥**

పద్నాలుగురకాల ప్రాణిగణాలు, వాటిలోపల ఉండే సకలప్రాణిసమూహాలు తృప్తిపొందాలని నేను ఈ అన్నం పెట్టానుకదా! కాబట్టి వారు సంతోషాన్ని పొందెదరుగాక!

**విశే॥అష్టవిధం దైవత్వం తైర్యగ్యోన్యశ్చ పంచధా భవంతి ।**
**మనుష్యం చైకవిధం సమాసతో భౌతికః సర్గః ॥**

సిద్ధులు, గుహ్యకులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, పన్నగులు, విద్యాధరులు, పిశాచులు-ఈ ఎనిమిది దేవయోనులు. సరీసృపాలు, వానరాలు, పశువులు, మృగాలు, పక్షులు-ఈ ఐదు తిర్యక్కులు, మనుష్యజాతి ఒకటి-మొత్తం పధ్నాలుగు భూతసంఘాలు.

**ఇత్యుచ్చార్య నరో దద్యాదన్నం శ్రద్ధాసమన్వితః ।**
**భువి సర్వోపకారాయ గృహీ సర్వాశ్రయో యతః ॥ 54 ॥**

అని ఈ రీతిగా పలికి మానవుడు శ్రద్ధతో కూడుకొన్నవాడై, గృహస్థుడు అందరికి ఆశ్రయం కనుక, సమస్తప్రాణుల ఉపకారంకోసమై భూమిపై అన్నం ఉంచాలి.

**శ్వచణ్డాలవిహంగానాం భువి దద్యాన్నరేశ్వర! ।**
**యే చాన్యే పతితాః కేచిదపుత్రాః సన్తి మానవాః ॥ 55 ॥**

నరేశ్వరా! శునకాలు, చండాలురు,పక్షులు,ఇంకా ఎవరయితే పతితులు ఉన్నారో, అలాగే పిల్లలు లేని మానవులు ఎవరయితే ఉన్నారో, అటువంటి వారి కోసమై నేలపై అన్నం ఉంచాలి.

**అతిథిసత్కారాదులు**

**తతో గోదోహమాత్రం వై కాలం తిష్ఠేద్గృహాంగణే ।**
**అతిథిగ్రహణార్థాయ తదూర్ధ్వం వా యథేచ్ఛయా ॥ 56 ॥**

ఆ తరువాత ఆవుపాలు పితికినంత సమయం ఇంటి వాకిటిలో అతిథులను స్వీకరించడంకోసమై నిలబడాలి. ఆపైన తన ఇష్టం వచ్చినంత సేపు వేచి ఉండాలి.

**అతిథిం తత్ర సమ్ప్రాప్తం పూజయేత్ స్వాగతాదినా ।**
**తథాసనప్రదానేన పాదప్రక్షాళనేన చ ॥ 57 ॥**

ఇంటిలో వాకిలిలో లభ్యమైన అతిథిని స్వాగతాదులతో పూజించాలి. అతనికి ఉచితమైన ఆసనం ఏర్పాటు చేయాలి. ఆతని పాదాలు కడగాలి.

**శ్రద్ధయా చాన్నదానేన ప్రియప్రశ్నోత్తరేణ చ ।**
**గచ్ఛతశ్చానుయానేన ప్రీతిముత్పాదయేద్ గృహీ ॥ 58 ॥**

పిమ్మట గృహస్థుడు శ్రద్ధతో అన్నం పెట్టాలి. ఇంపు కలిగించేలా కుశల ప్రశ్నలు వేయాలి. అతిథి బయలుదేరివెళ్లబోతూ ఉంటే కొంత దూరం సాగనంపాలి. ఈవిధంగా అతనికి ప్రీతి కలిగించాలి.

**అజ్ఞాతకులనామానమన్యదేశాదుపాగతమ్ ।**
**పూజయేదతిథిం సమ్యక్ నైకగ్రామనివాసినమ్ ॥ 59 ॥**

కులం,పేరు తెలియని వానిని, ఇతరదేశం నుంచి వచ్చిన వానిని, ఏకగ్రామనివాసి కాని సన్యాసిని, అతిథిని చక్కగా పూజించాలి.

**అకించనమసమ్బన్ధమజ్ఞాతకులశీలినమ్ ।**
**అసంభోజ్యాతిథిం భుంజన్ భోక్తుకామం వ్రజత్యధః ॥ 60 ॥**

పేదవాడు, ఏసంబంధం లేనివాడు, కులం శీలం తెలియనివాడు, అన్నంకోరి వచ్చినవాడు అయిన అతిథిని గౌరవింపక అన్నం పెట్టకపోతే అధఃపతితుడవుతాడు.

**పిత్రర్థం చాపరం విప్రమేకమప్యాశయేన్నృప ।**
**తద్దేశ్యం విదితాచారసమ్భూతిం పాంచయజ్ఞికమ్ ॥ 61 ॥**

నృపాలా! ఆచారం, వంశం తెలుసుకొని, పంచయజ్ఞాలుచేసే, ఆప్రాంతం వాడైన మరోవిప్రునికి పితరుల తృప్తికోసమై ఒకనికయినా భోజనం పెట్టాలి.

**స్వాధ్యాయగోత్రాచరణమపృష్ట్వా చ తథా కులమ్ ।**
**హిరణ్యగర్భబుద్ధ్యా తం మన్యేతాభ్యాగతం గృహీ ॥ 62 ॥**

గృహస్థుడు చదువు,గోత్రం,ఆచారం, అలాగే కులం అడగకుండా హిరణ్యగర్భునిగా భావించి అభ్యాగతుని గౌరవించాలి.

**అన్నాగ్రం చ సముద్ధృత్య హన్తకారోపకల్పితమ్ ।**
**నిర్వాపభూతం భూపాల! శ్రోత్రియాయోపపాదయేత్ ॥ 63 ॥**

భూపాలా! ఉచ్ఛిష్టముకాని అన్నమును తీసి, "మనుష్యేభ్యో హంతా" అను మంత్రంచే వేరుచేయబడిన దానిని శ్రోత్రియబ్రాహ్మణునకు హంతకారనామకాన్నమును సమర్పించాలి. అది తర్పణపూర్వక ప్రదానంగా ఈయాలి.

**దద్యాచ్చ భిక్షా త్రితయం పరివ్రాడ్ బ్రహ్మచారిణామ్ ।**
**ఇచ్ఛయా చ బుధో దద్యాద్ విభవే సత్యవారితమ్ ॥ 64 ॥**

ఈవిధంగా దేవాతిథిబ్రాహ్మణభిక్షలు మూడింటిని పెట్టిన తరవాత పరివ్రాజకులకు, బ్రహ్మచారులకు, తనకు ఓపిక ఉన్నట్లయితే, లేదనకుండా బుద్ధిమంతుడైన మానవుడు యథేచ్ఛగా భోజనం పెట్టాలి.

**ఇత్యేతేఽ తిథయః ప్రోక్తాః ప్రాగుక్తా భిక్షవశ్చ యే ।**
**చతురః పూజయన్నేతాన్ నృయజ్ఞర్ణాత్ ప్రముచ్యతే ॥ 65 ॥**

ముందు చెప్పిన ముగ్గురు అతిథులు, భిక్షుకులు కలిపితే వీరిని అతిథులు అంటారు. ఈ నాలుగు రకాల అతిథులను పూజించి నరుడు నరయజ్ఞఋణం నుంచి విముక్తుడవుతాడు.

**అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ ప్రతినివర్తతే ।**
**స తస్మై దుష్కృతం దత్త్వా పుణ్యమాదాయ గచ్ఛతి ॥ 66 ॥**

ఎవని ఇంటినుండి అతిథి ఆశతీరక తిరిగివెళ్లిపోతాడో, అతడు ఆ గృహస్థునకు పాపం ఇచ్చి పుణ్యం తీసుకొని పోతాడు.

**ధాతా ప్రజాపతిః శక్రో వహ్నిర్వసుగణోఽ ర్యమా ।**
**ప్రవిశ్యాతిథిమేవైతే భుంజన్తేఽ న్నం నరేశ్వర! ॥ 67 ॥**

నరపాలా! ధాత, ప్రజాపతి, శక్రుడు, వహ్ని, వసుగణం, అర్యముడు–వీరందరు అతిథిలో ప్రవేశించి గృహస్థుడు పెట్టే అన్నం భుజిస్తారు.

**తస్మాదతిథిపూజాయాం యతేత సతతం నరః ।**
**స కేవలమఘం భుంక్తే యో భుంక్తే హ్యతిథిం వినా ॥ 68 ॥**

కాబట్టి ఎల్లప్పుడూ నరుడు అతిథిని పూజించడానికై ప్రయత్నించాలి. అతిథిని గౌరవించక భుజించిన వాడు కేవలం పాపాన్ని భుజించిన వాడవుతాడు.

**తతః సువాసినీ దుఃఖిగర్భిణీ వృద్ధబాలకాన్ ।**
**భోజయేత్ సంస్కృతాన్నేన ప్రథమం చరమం గృహీ ॥ 69 ॥**

అటు తరవాత వివాహమై పుట్టింట ఉన్న ఆడపడుచులు, దుఃఖంలో ఉన్న గర్భిణులు, వృద్ధులు, చిన్నపిల్లలు ముందు ఆ సంస్కృతాన్నమును భుజించిన పిమ్మట చివర గృహస్థుడు భుజించాలి.(స్వవాసినీ– తనింటిలోనున్నవారని పాఠాంతరం)

**అభుక్తవత్సు చైతేషు భుంజన్ భుంక్తే హి దుష్కృతమ్ ।**
**మృతశ్చ నరకం గత్వా శ్లేష్మభుగ్జాయతే నరః ॥ 70 ॥**

వీరు తినకుండా నరుడు భుజిస్తే తినేది పాపమే అవుతుంది. అట్టివాడు మరణించి నరకానికిపోయి శ్లేష్మం తింటాడు.

**అస్నాతాశీ మలం భుంక్తే హ్యజపీ పూయశోణితమ్ ।**
**అసంస్కృతాన్నభుజ్ మూత్రం బాలాదిప్రథమం శకృత్ ॥ 71 ॥**

స్నానం చేయకుండా అన్నం తినేవాడు మలం తింటాడు. జపం చేయకుండా తినేవాడు చీము, రక్తము భుజిస్తాడు. సంస్కారంలేని అన్నం తినేవాడు మూత్రం త్రాగుతాడు. పిల్లలకన్నముందు తినేవాడు మలం భుజిస్తాడు.

(అహోమీ చ కృమీన్ భుంక్తే అదత్వా చ విషమశ్నుతే) ।

హోమం చేయక తినేవాడు క్రిములను తింటాడు. ఎదుటి వారికి పెట్టకుండా తినేవాడు విషమును తింటాడు.

**తస్మాచ్ఛృణుష్వ రాజేన్ద్ర యథా భుంజీత వై గృహీ ।**
**భుంజతశ్చ తథా పుంసః పాపబన్ధో న జాయతే ॥ 72 ॥**

రాజేంద్రా! కాబట్టి ఆలకించు. గృహస్థుడు ఎలా భోజనం చేయాలో, ఎలా తింటే పాపబంధంనుండి పురుషుడు విముక్తుడవుతాడో చెబుతాను.

**ఇహ చారోగ్యమతులం బలవృద్ధిస్తథా నృప! ।**
**భవత్యనిష్టశాంతిశ్చ వైరిపక్షాభిచారికా ॥ 73 ॥**

నరపాలా! ఇహలోకంలో గొప్పదైన ఆరోగ్యం, బలవృద్ధి ఎలా కలుగుతుందో, అమంగళకరంగా శత్రువులు చేయించే ప్రయోగాదులు ఎలా శాంతిస్తాయో చెబుతాను.

**స్నాతో యథావత్ కృత్వా చ దేవర్షిపితృతర్పణమ్ ।**
**ప్రశస్తరత్నపాణిస్తు భుంజీత ప్రయతో గృహీ ॥ 74 ॥**

గృహస్థుడు ఇదివరలో చెప్పిన రీతిగా స్నానంచేయాలి. దేవ,ఋషి,పితృతర్పణం కావించాలి. నియమవంతుడై రత్నాలు (ఉంగరంలోకాని, కంకణంలోకాని) ధరించిన చేతితో భోజనం చేయాలి.

**కృతజాప్యో హుతే వహ్నౌ శుద్ధవస్త్రధరో నృప! ।**
**దత్త్వాఽతిథిభ్యో విప్రేభ్యో గురుభ్యః సంశ్రితాయ చ ॥ 75 ॥**

నృపాలా! జపం పూర్తిచేసి, అగ్నిహోత్రం వ్రేల్చి, అనగా నిర్వర్తించి, పరిశుభ్రమైన వస్త్రాలు ధరించి అతిథులకు, విప్రులకు,గురువులకు, ఆశ్రితులకు భోజనం పెట్టాలి.

**పుణ్యగన్ధధరః శస్తమాల్యధారీ నరేశ్వర!**
**నైకవస్త్రధరోఽథార్ద్రపాణిపాదో మహీపతే! । 76 ॥**

**విశుద్ధవదనః ప్రీతో భుంజీత న విదిఙ్ముఖః**
**ప్రాఙ్ముఖోదఙ్ముఖో వాఽపి న చైవాన్యమనా నృప! ॥ 77 ॥**

నరేశ్వరా! పవిత్రమైన గంధాన్ని ధరించాలి. ప్రశస్తాలైన పుష్పమాలలు ధరించి భుజించాలి. మహీపతీ! ఏకవస్త్రం ధరించి (మూలలకు) సగం తడిసిన కాళ్లు, చేతులు(తడి కాళ్లు, తడిచేతులు) కలవాడైకాని, విదిక్కులకు అభిముఖుడైకాని భుజించరాదు. నృపాలా! పరిశ్రుభమైన ముఖం(నోరు) కలవాడై, సంతుష్టుడై భుజించాలి. తూర్పుదిక్కుగాకాని, ఉత్తర దిక్కుగాకాని కూర్చుండి, ఇతరదృష్టి లేనివాడై భుజించాలి.

**అన్నం ప్రశస్తం పథ్యం చ ప్రోక్షితం ప్రోక్షణోదకైః ।**
**న కుత్సితా హృతం నైవ జుగుప్సావదసంస్కృతమ్ ॥ 78 ॥**

అన్నం ప్రశస్తమైనదై ఉండాలి. ఆరోగ్యకరమైనదై ఉండాలి. దానిపై మంత్రోదకాలచే (గాయత్రీ మంత్రంచే) ప్రోక్షితం చేయాలి. కుత్సితులు (దురాచారులు) తెచ్చినది కాకుండా ఉండాలి. అసహ్యం కలిగించేది కాకూడదు. సంస్కారం లేనిది కాకుండా ఉండాలి. వైశ్వదేవాదులచే సంస్కరించబడాలి.

**దత్త్వా తు భుక్తం శిష్యేభ్యః క్షుధితేభ్యస్తథా గృహీ ।**
**ప్రశస్తశుద్ధపాత్రేషు భుంజీతాకుపితో నృప! ॥ 79 ॥**

నృపాలా! గృహస్థుడు అన్నాన్ని శిష్యులకు, ఆకలితో ఉన్న వారికి పెట్టి, ఏ కోపం(విసుగుదల) లేకుండా పరిశుభ్రములైన పవిత్రపాత్రలలో భుజించాలి.

**నాసన్దీసంస్థితే పాత్రే నాదేశే చ నరేశ్వర! ।**
**నాకాలే నాతిసంకీర్ణే దత్వాఽగ్రం చ నరోఽగ్నయే ॥ 80 ॥**

నరేశ్వరా! వేపబెత్తాలచే తయారుచేసిన పాత్రలతో కాని, అయోగ్యప్రదేశాలలో కాని, కాలంకాని కాలంలో కాని, ఇరుకు ప్రదేశాలలోకాని తినరాదు. నరుడు అగ్రభాగం అగ్నికి సమర్పించాలి.

**మన్త్రాభిమన్త్రితం శస్తం న చ పర్యుషితం నృప! ।**
**అన్యత్ర ఫలమూలేభ్యః శుష్కశాకాదికాత్తథా ॥ 81 ॥**

నరపాలా! మంత్రాలచే అభిమంత్రితమైన ప్రశస్తమైన ఆహారం తినాలి. నిలవ ఉన్న పదార్థం పనికి రాదు. పండ్లు, దుంపలు, (కందమూలాలు), ఎండిపోయిన కూరలు(వరుగులు) వీటి విషయంలో పైనిషేధం లేదు.

**తద్వద్ధరీతకేభ్యశ్చ గుడపక్వేభ్య ఏవ చ**
**భుంజీతోద్ధృతసారాణి న కదాపి నరేశ్వర! । 82 ॥**

**నాశేషం పురుషోఽశ్నీయాదన్యత్ర జగతీపతే!**
**మధ్వమ్బుదధిసర్పిభ్యః సక్తుభ్యశ్చ వివేకవాన్ ॥ 83 ॥**

నరేశ్వరా! అదేవిధంగా లేహ్యాలు,బెల్లంతో చేసిన భక్ష్యాలు భుజించవచ్చు. సారం తీసివేసిన పదార్థాలు ఎన్నడూ తినకూడదు. పృథివీపతీ! వివేకవంతుడు ఎప్పుడూ తేనె, నీరు, పెరుగు, నేయి, సత్తుపిండి వీటిని మినహాయించి సగం తినినదానిని మరల తినరాదు.

**అశ్నీయాత్తన్మనా భూత్వా పూర్వన్తు మధురం రసమ్ ।**
**లవణామ్లౌ తథా మధ్యే కటుతిక్తాదికం తతః ॥ 84 ॥**

తదేకచిత్తుడై ముందు తీపిపదార్థాలను, తియ్యనిరసాన్ని, తరవాత ఉప్పనివి, పుల్లనివి మధ్యలోను, అటు తరవాత కారంపదార్థాలు, చేదువి తినాలి.

**ప్రాగ్ద్రవం పురుషోఽశ్నీయాన్మధ్యే కఠినభోజనః ।**
**అన్తే పునర్ద్రవాశీ తు బలారోగ్యే న ముంచతి ॥ 85 ॥**

ముందు ద్రవపదార్థం, మధ్యలో ఘనపదార్థం, చివర మళ్లీ ద్రవపదార్థం భుజించే పురుషుడు బలాన్ని, ఆరోగాన్ని విడిచిపెట్టడు.

**అనిన్ద్యం భక్షయేదిత్థం వాగ్యతోఽన్నమకుత్సయన్ ।**
**పంచగ్రాసం మహామౌనం ప్రాణాద్యాప్యాయనాయ చ ॥ 86 ॥**

ఈ విధంగా అక్కరలేనిమాటలు పలకకుండా, ఏవగించు కోకుండా, పవిత్రమైన, పరిశుభ్రమైన అన్నం భుజించాలి. మొదట మహామౌనంతో ఐదుప్రాణాహుతులు పుచ్చుకోవాలి. అవి ప్రాణాదులకు తృప్తి కలిగించేవి.

**భుక్త్వా సమ్యగథాచమ్య ప్రాఙ్ముఖోదఙ్ముఖోఽపి వా ।**
**యథావత్ పునరాచామేత్ పాణీ ప్రక్షాల్య మూలతః ॥ 87 ॥**

భోజనం చేసి తూర్పు ముఖంగాకాని, ఉత్తరముఖంగాకాని చక్కగా ఆచమనం చేయాలి. రెండుచేతులు, కాళ్లు పూర్తిగా కడుగుకొని యథావిధిగా మళ్లీ ఆచమనం చేయాలి.

**స్వస్థః ప్రశాన్తచిత్తస్తు కృతాసనపరిగ్రహః ।**
**అభీష్టదేవతానాన్తు కుర్వీత స్మరణం నరః ॥ 88 ॥**

కుదుటపడిన పిమ్మట ప్రశాంతమైన మనస్సుతో, ఆసనంపై కూర్చుండి పురుషుడు తన ఇష్టదేవతలను స్మరించాలి.

**అగ్నిరాప్యాయయత్వన్నం పార్థివం పవనేరితః ।**
**దత్తావకాశం నభసా జరయత్వస్తు మే సుఖమ్ ॥ 89 ॥**

ప్రాణవాయువుచే ప్రేరేపించబడిన జఠరాగ్ని అన్నాన్ని జీర్ణం చేయుగాక! ఆకాశంచే ఈయబడిన అవకాశంగల పార్థివధాతువులను అరిగించుగాక! నాకు సంతృప్తి అగుగాక!

**అన్నం బలాయ మే భూమేరపామగ్న్యనిలస్య చ ।**
**భవత్వేతత్పరిణతం మమాస్త్వవ్యాహతం సుఖమ్ ॥ 90 ॥**

నేను తిన్న అన్నం నాశరీరంలోని భూమి,నీరు,అగ్ని,వాయువు–వీటికి బలాన్ని చేకూర్చాలి. ఈవిధంగా నాలుగు విధాలుగా పరిణమించిన ఆహారం నాకు నిరంతర సుఖాన్ని కూర్చుగాక!

**ప్రాణాపానసమానానాముదానవ్యానయోస్తథా ।**
**అన్నం పుష్టికరం చాస్తు మమాప్యవ్యాహతం సుఖమ్ ॥ 91 ॥**

ప్రాణం, అపానం, సమానం, ఉదానం, వ్యానం అనే ఐదువిధాల వాయువులకు నేను భుజించిన ఆహారం పుష్టిని కలిగించుగాక! నాకు నిరంతరాయమైన తృప్తిని ఇచ్చుగాక!

**అగస్తిరగ్నిర్బడబానలశ్చ**
**భుక్తం మయాఽన్నం జరయత్వశేషమ్ ।**
**సుఖం చ మే తత్పరిణామసమ్భవం**
**యచ్ఛన్త్వరోగం మమ చాస్తు దేహే ॥ 92 ॥**

అగస్త్యుడు,అగ్ని,బడబాగ్ని–వీరు నాచే భుజించ బడిన ఆహారాన్ని సంపూర్ణంగా జీర్ణంచేసి, దాని పరిణామం వల్ల సంభవించే సుఖాన్ని ఇచ్చెదరుగాక! దానివల్ల నా శరీరంలో ఏరోగం ఉండకుండుగాక!

**విష్ణుః సమస్తేన్ద్రియదేహదేహే**
**ప్రధానభూతో భగవాన్ యథైకః ।**

**సత్యేన తేనాన్నమశేషమేత**
**దారోగ్యదం మే పరిణామమేతు ॥ 93 ॥**

సమస్తములైన ఇంద్రియాలలోను, శరీరంలోను అధిష్ఠాతగా ఉండే ప్రధానభూతుడైన వాడు ఒక్క విష్ణుభగవానుడే. ఈ సత్యంవల్ల, నేను తిన్న అన్నం అంతా పరిపక్వమై నాకు ఆరోగ్యం చేకూరుగాక!

**విష్ణురత్తా తథైవాన్నం పరిణామశ్చ వై తథా !**
**సత్యేన తేన మద్భుక్తం జీర్యత్వన్నమిదం తథా । 94 ॥**

**ఇత్యుచార్య స్వహస్తేన పరిమృష్య(జ్య)తథోదరమ్**
**అనాయాసప్రదాయీని కుర్యాత్ కర్మాణ్యతన్ద్రితః ॥ 95 ॥**

విష్ణువే తినేవాడు. తినిన అన్నం విష్ణువే. దాని పరిణామం కూడ విష్ణువే. ఈ సత్యంవల్ల నేను తిన్న ఈ అన్నం పరిపక్వమై జీర్ణం కావాలి:– అని పలికి తన చేతితో పొట్ట నిమురుకొంటూ బద్ధకం లేకుండా, ఆయాసం కలిగించని పనులు మాత్రమే చేయాలి.

**సచ్ఛాస్త్రాదివినోదేన సన్మార్గాదవిరోధినా ।**
**దినం నయేత్తతః సన్ధ్యాముపతిష్ఠేత్ సమాహితః ॥ 96 ॥**

సజ్జనుల మార్గానికి విరుద్ధం కాకుండా, మంచిమంచి శాస్త్రపఠనాలు మున్నగు వినోదంతో పగలంతా గడిపి, పిమ్మట సావధానచిత్తుడై సంధ్యోపస్థానం చేయాలి.

**దిశాన్తసన్ధ్యాం సూర్యేణ పూర్వామృక్షైర్యుతాం బుధః ।**
**ఉపతిష్ఠేత్ యథా న్యాయం సమ్యగాచమ్య పార్థివ! ॥ 97 ॥**

పార్థివా! విద్వాంసుడైన వాడు చక్కగా ఆచమనం కావించి, యథావిధిగా సూర్యుడు ఉండగా సాయంసంధ్యను, చుక్కలు (నక్షత్రాలు) ఉండగా ప్రాతస్సంధ్యను ఉపాసించాలి.

**సర్వకాలముపస్థానం సన్ధ్యయోః పార్థివేష్యతే ।**
**అన్యత్ర సూతకాశౌచవిభ్రమాతురభీతితః ॥ 98 ॥**

పార్థివా! జాతాశౌచం, మృతాశౌచం, ఉన్మాదం, రోగం, భయం ఉన్నప్పుడు తప్ప సర్వకాలాలలోను ఉభయసంధ్యలలోను ఉపస్థానం చేయాలి.

**సూర్యేణాభ్యుదితో యశ్చ త్యక్తః సూర్యేణ వా స్వపన్ ।**
**అన్యత్రాతురభావాత్తు ప్రాయశ్చిత్తీ భవేన్నరః ॥ 99 ॥**

ఆతుర(రోగ) స్థితిలో తప్ప, ఇతరసమయాలలో సూర్యోదయాస్తమయాలలో నిద్రపోతున్న నరుడు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

**తస్మాదనుదితే సూర్యే సముత్థాయ మహీపతే! ।**
**ఉపతిష్ఠేన్నరః సన్ధ్యా మస్వపంశ్చ దివాన్తజమ్ ॥ 100 ॥**

మహీపతీ! కాబట్టి సూర్యోదయంకాకుండా లేచి ఉదయసంధ్యను, నిద్రపోకుండా సాయంసంధ్యను నరుడు ఉపాసించాలి.

**ఉపతిష్ఠన్తి వై సన్ధ్యా యేన పుర్వాం న పశ్చిమామ్ ।**
**వ్రజన్తి తే దురాత్మానస్తామిస్రం నరకం నృప ॥ 101 ॥**

నృపాలా! ఉదయసంధ్యను గాని, సాయంసంధ్యనుగాని ఉపాసించని దురాత్ములు తామిస్రనరకానికి పోతారు.

**పునఃపాకముపాదాయ సాయమప్యవనీపతే! ।**
**వైశ్వదేవనిమిత్తం వై పత్న్యమన్త్రం బలిం హరేత్ ॥ 102 ॥**

మహీపతీ! మళ్లీ సాయంకాలం కూడా వండినవంట తీసుకొని గృహపత్ని మంత్రం లేకుండా వైశ్యదేవ నిమిత్తమైన బలి ఉంచాలి.

**తత్రాపి శ్వపచాదిభ్యస్తథైవాన్నవిసర్జనమ్ ।**
**అతిథిం చాఽఽగతం తత్ర స్వశక్త్యా పూజయేద్ బుధః ॥ 103 ॥**

సాయంసమయంలో కూడ మధ్యాహ్నవేళలోలాగే చండాలురకు అన్నం ఉంచాలి. ఇంటికి వచ్చిన అతిథిని బుద్ధిమంతుడైన గృహస్థుడు తన శక్తిని అనుసరించి పూజించాలి.

**పాదశౌచాసనప్రహ్వస్వాగతోక్త్యా చ పూజనమ్ ।**
**తతశ్చాన్నప్రదానేన శయనేన చ పార్థివ! ॥ 104 ॥**

మహారాజా! అతిథికి కాళ్లుకడగడం, ఆసనమీయడం, వినమ్రుడవడం, స్వాగతం పలకడం–ఇలా పూజించి అన్నంపెట్టి పడక ఏర్పాటుచేయాలి.

**దివాఽతిథౌ తు విముఖే గతే యత్ పాతకం నృప! ।**
**తదేవాష్టగుణం పుంసాం సూర్యోఢే విముఖే గతే ॥ 105 ॥**

నృపాలా! పగటివేళ అతిథి విముఖుడై వెళ్ళిపోతే వచ్చే పాతకానికి ఎనిమిదిరెట్లు సూర్యాస్తమయం తరవాత వచ్చిన అతిథి విముఖుడై వెళ్లిపోతే వస్తుంది.

**తస్మాత్ స్వశక్త్యా రాజేన్ద్ర! సూర్యోఢమతిథిం నరః ।**
**పూజయేత్పూజితే తస్మిన్ పూజితాః సర్వదేవతాః ॥ 106 ॥**

రాజశేఖరా! కాబట్టి మానవుడు సూర్యాస్తమయం అయిన తరువాత వచ్చిన అతిథిని తన శక్త్యను సారంగా పూజించాలి. అపుడు అతిథి పూజించబడితే సర్వదేవతలు పూజించబడినట్లే.

**అన్నశాకామ్బుదానేన స్వశక్త్యా ప్రీణయేత్పుమాన్ ।**

**శయనప్రస్తరమహీప్రదానైరథవా౽పి తమ్ ॥ 107 ॥**

పురుషుడు తన శక్తిని బట్టి అన్నం, శాకం, జలప్రదానంచే అతిథికి తృప్తి కలిగించాలి. పడుకొనేటందుకై పక్కగాని, చాపకాని, (అది లేకపోతే)కనీసం సరైన చోటయినా ఏర్పాటు చేయాలి.

**కృతపాదాదిశౌచస్తు భుక్త్వా సాయం తతో గృహీ ।**
**గచ్ఛేచ్ఛయ్యామస్ఫుటితామపి దారుమయీం నృప! ॥ 108 ॥**

నృపాలా! తరువాత గృహస్థుడు సాయంసమయంలో భోజనంచేసి కాళ్లు, చేతులు కడుగుకొన్నవాడై, పగుళ్లులేని కొయ్యమంచంపై పడుకోవాలి.

**నావిశాలాం న వై భగ్నాం నాసమాం మలినాం న చ ।**
**న చ జన్తుమయీం శయ్యామధితిష్ఠేదనాస్తృతామ్ ॥ 109 ॥**

ఇరుకుగా ఉన్నదానిపైగాని, విరిగిన దానిపైకాని, ఎగుడు దిగుడుగా నున్నదానిపై కాని, మలినమైనదానిపై కాని, నల్లులుమున్నవిగలదానిపైగాని ప్రక్కలేని దానిపై కాని శయ్యపై పరుండరాదు.

**ప్రాచ్యాం దిశి శిరః శస్తం యామ్యాయామథవా నృప ।**
**సదైవ స్వపతః పుంసో విపరీతం తు రోగదమ్ ॥ 110 ॥**

నృపాలా! పరుండే సమయంలో తూర్పుదిక్కున తల ఉంచడం సదా ప్రశస్తం. లేదా దక్షిణదిక్కున తల ఉంచాలి. ఇందుకు వ్యతిరేకమైతే రోగదాయకం.

**ఋతావుపగమః శస్తః స్వపత్న్యామవనీపతే! ।**
**పున్నామర్క్షే శుభే కాలే జ్యేష్ఠాయుగ్మాసు రాత్రిషు ॥ 111 ॥**

మహీపతీ! రాత్రివేళలలో శుభసమయంలో పున్నామనక్షత్రంలో, జ్యేష్ఠాయుగ్మాలలో ఋతు సమయంలో తనధర్మపత్నియందు సంగమము ప్రశంసనీయమైనది.

విశే:- శ్రీపున్నామనక్షత్రాలు- అశ్విని, కృత్తిక, రోహిణి,పునర్వసు,పుష్యమి,హస్త,అనురాధ,శ్రవణం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర-అనేవి.

2) జ్యేష్ఠాయుగ్మాలు-ఋతువు కనిపించిన నాటినుండి శుభప్రదాలైన సమసంఖ్యారాత్రులు.(నాలుగవ రోజు నుండి పదహారో రోజువరకు)

**నాస్నాతాన్తు స్త్రియం గచ్ఛేన్నాతురాం న రజస్వలామ్ ।**
**నానిష్టాం న ప్రకుపితాం న త్రస్తాం న చ గర్భిణీమ్ ॥ 112 ॥**

**నాదక్షిణాం నాన్యకామాం నాకామాం నాన్యయోషితమ్ ।**
**క్షుత్క్షామాం నాతిభుక్తాం వా స్వయం చైభిర్గుణైర్యుతః ॥ 113 ॥**

ఋతుస్నానం చేయకుండా ఉన్న స్త్రీతో, రోగపీడితురాలితో, వెలుపలనున్న (రజస్వల) ఇంతితో, ఇష్టంలేని కాంతతో, కోపంతో ఉన్న స్త్రీతో, భయపడిన ఆమెతో, గర్భవతితో, అనుకూలవతి(దాక్షిణ్యవతి) కానిదానితో, పరుని కోరే పడతితో, కామరహితురాలితో, పరాయికాంతతో, ఆకలిగొన్న అతివతో, ఎక్కువగా తిని ఆయాసపడే స్త్రీతో సంగమం కూడదు. అవే లక్షణాలు తనకు ఉన్నప్పుడు కూడ తగదు.

**స్నాతః స్రగ్గన్ధధృక్ ప్రీతో నాధ్మాతః క్షుధితోఽపి వా ।**
**సకామః సానురాగశ్చ వ్యవాయం పురుషో వ్రజేత్ ॥ 114 ॥**

పురుషుడు స్నానంచేసి, పూలమాల ధరించి, సుగంధం పూసికొని, ఎక్కువగా తినక, ఆకలితో ఉన్నప్పుడు కాకుండా, ప్రీతితో, కోరికతో,అనురాగంతో స్త్రీసంగమం పొందాలి.

**చతుర్దశ్యష్టమీ చైవ అమావాస్యాథ పూర్ణిమా ।**
**పర్వాణ్యేతాని రాజేన్ద్ర! రవిసంక్రాన్తిరేవ చ ॥ 115 ॥**

**తైలస్త్రీమాంససమ్భోగీ సర్వేష్వేతేషు వై పుమాన్ ।**
**విణ్మూత్రభోజనం నామ ప్రయాతి నరకం మృతః ॥ 116 ॥**

రాజేంద్రా! చతుర్దశి, అష్టమి, అమావాస్య, పూర్ణిమ, రవిసంక్రాంతి. ఇవి పర్వాలు. ఈ పర్వాలలో తైలంతో అభ్యంగం,స్త్రీసంగమం, మాంసభోజనంచేసే పురుషుడు మరణించిన పిమ్మట మలమూత్రభోజనం అనే పేరుగల నరకానికి పోతాడు.

**అశేషపర్వస్వేతేషు తస్మాత్ సంయమిభిర్బుధైః ।**
**భావ్యం సచ్ఛాస్త్రదేవేజ్యా ధ్యానజప్యపరైర్నరైః ॥ 117 ॥**

కాబట్టి ఈ సమస్తపర్వాలలోను నరులు జ్ఞానం కలిగి, ఇంద్రియనిగ్రహంతో, భగవచ్ఛాస్త్రాలు, దేవపూజలు, యజ్ఞాలు, ధ్యానం, జపం మున్నగు వాటియందు ఆసక్తి కలిగి ఉండడం భావ్యం.

**నాన్యయోనావయోనౌ వా నోపయుక్తౌషధస్తథా ।**
**దేవద్విజగురూణాం చ వ్యవాయీ నాశ్రమే భవేత్ ॥ 118 ॥**

అన్యయోనులయందుకాని, అయోనియందుగాని, రసాయనాదులను ఉపయోగించికాని, దేవతా మందిరాల వద్ద, ద్విజనివాసాలవద్ద, గురువుల ఆశ్రమాలవద్ద స్త్రీసంగమంచేయరాదు.

**చైత్యచత్వరతీర్థేషు నైవ గోష్ఠే చతుష్పథే ।**
**నైవ శ్మశానోపవనే సలిలేషు మహీపతే! ॥ 119 ॥**

**ప్రోక్తపర్వస్వశేషేషు నైవ భూపాలసన్ధ్యయోః ।**
**గచ్ఛేద్ వ్యవాయం మతిమాన్ న మూత్రోచ్చారపీడితః ॥ 120 ॥**

మహీపతీ! చైత్యవృక్షం క్రిందకాని, నాలుగుబాటల కూడళ్లలోకాని, పుణ్యతీర్థాలలోకాని, గోశాల యందుకాని, ఇంటిముంగిలియందుకాని, శ్మశానంలోకాని, ఉద్యానవనంలో కాని, భూపాలా! ముందుచెప్పబడిన పర్వాలలో కాని, నీళ్లలో కాని, మల మూత్రంవిసర్జన చేయవలసిన అవసరం ఉన్నప్పుడు కాని బుద్ధిమంతుడైన వాడు స్త్రీసంగమం చేయరాదు(చైత్యమనగా గుడిప్రాంతము.

**పర్వస్వభిగమో నిన్ద్యో దివా పాపప్రదో నృప! ।**
**భువి రోగావహో నృణామప్రశస్తో జలాశయే ॥ 121 ॥**

నృపాలా! పర్వాలలో సంగమం నింద్యం. పగటివేళ మైధునం పాపప్రదం, నేలమీద రోగదాయకం, జలాశయంలో అమంగళకరం.

**పరదారాన్ న గచ్ఛేచ్చ మనసాఽపి కదాచన ।**
**కిమువాచాఽస్థిబన్ధోఽపి నాస్తి తేషు వ్యవాయినామ్ ॥ 122 ॥**

పరదారల సంపర్కం ఏవిధంగానూ మనస్సుచే కూడా తగదు, ఇక వాచా సంగతి చెప్పేదేముంటుంది? వారిని సంగమించిన వారికి ఎముకల సంబంధంలేని కృమికీటకాదిజన్మ వస్తుంది(ఎముకలకు అతుకులే ఉండవు)

**మృతో నరకమభ్యేతి హీయతేఽత్రాపి చాయుషః ।**
**పరదారగతిః పుంసాముభయత్రాపి భీతిదా ॥ 123 ॥**

మరణించిన వెంటనే నరకానికి పోతాడు. ఇక్కడ కూడా ఆయువు క్షీణిస్తుంది. పురుషులకు ఇతర స్త్రీలతో పొందు ఇహలోకంలోను, పరలోకంలోను కూడా భయాన్ని కలిగిస్తుంది.

**ఇతి మత్వా స్వదారేషు ఋతుమత్సు బుధో వ్రజేత్ ।**
**యథోక్త దోషహీనేషు సకామేష్వనృతావపి ॥ 124 ॥**

ఈవిధంగా ఆలోచించి బుద్ధిమంతుడైనవాడు, పైన చెప్పిన దోషాలు లేని రీతిగా, ఋతుమతి అయిన స్వభార్యతో సంగమించాలి. కోరిక అధికంగా ఉంటే ఋతు కాలం కాకపోయినా ప్రవర్తింపవచ్చు." అని ఔర్వుడు సగరునకు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే గృహస్థ సదాచారవర్ణనం నామ ఏకాదశోఽధ్యాయః సమాప్తః ॥ 11 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో గృహస్థ సదాచారవర్ణన అనే పదకొండవ అధ్యాయం సమాప్తం ॥ 11 ॥



## ద్వాదశోఽధ్యాయః - పన్నెండవ అధ్యాయం

## గృహస్థసదాచారవర్ణనమ్ - గృహస్థ సదాచారవర్ణన

**ఔర్వ ఉవాచ :-** ఔర్వుడు చెప్పాడు.

**దేవగోబ్రాహ్మణాన్ సిద్ధాన్ వృద్ధాచార్యాంస్తథాఽర్చయేత్ ।**
**ద్వికాలం చ నమేత్ సన్ధ్యామగ్నీనుపచరేత్తథా ॥ 1 ॥**

"మహారాజా! దేవతలను, గోవులను, బ్రాహ్మణులను,సిద్ధులను, వృద్ధులను, ఆచార్యులను యథావిధిగా అర్చించాలి. రెండు కాలాలలోను సంధ్యావందనం చేయాలి. అదే విధంగా అగ్నులను సేవించాలి.(ఉపాసించాలి).

**సదానుపహతే వస్త్రే ప్రశస్తాశ్చ మహౌషధీః ।**
**గారుడాని చ రత్నాని బిభృయాత్ ప్రయతో నరః ॥ 2 ॥**

నరుడు ఎల్లప్పుడూ చినిగిపోని ధోవతి, ఉత్తరీయం అనే వస్త్రద్వయాన్ని,ఉత్తమములైన ఓషధులను,గరుడ పచ్చలరత్నాలను నియమబద్ధుడై ధరించాలి.

**ప్రస్నిగ్ధామలకేశశ్చ సుగన్ధశ్చారువేషధృక్ ।**
**సితాః సుమనసో హృద్యా బిభృయాచ్చ నరః సదా ॥ 3 ॥**

నున్నగా, నిగనిగలాడే జుట్టు కలవాడై, సుగంధం పూసుకొని, చక్కనివేషం ధరించాలి. నరుడు ఎల్లప్పుడూ మనోహరములయిన తెల్లని పూలు అలంకరించుకోవాలి.

**కించిత్ పరస్వం న హరేన్నాల్పమప్యప్రియం వదేత్ ।**
**ప్రియం చ నానృతం బ్రూయాన్నాన్యదోషానుదీరయేత్ ॥ 4 ॥**

పరధనాన్ని కొంచెం కూడా దొంగిలించరాదు. రవ్వంత అయినా అప్రియం పలకరాదు. ప్రియమయినా అనృతం మాట్లాడకూడదు. పరుల దోషాలను ఎన్నరాదు.

**నాన్యస్త్రియం తథా వైరం రోచయేత్ పురుషర్షభ! ।**
**న దుష్టం యానమారోహేత్ కూలచ్ఛాయాం న సంశ్రయేత్ ॥ 5 ॥**

పురుషశ్రేష్ఠా! పరస్త్రీ మక్కువ కాని, అలాగే పగ కాని తగదు. నీచమైన (దుష్టమైన) వాహనాన్ని అధిరోహించ రాదు. ఒడ్డున నున్న నీడను ఆశ్రయించి కూర్చుండరాదు.

**విద్విష్టపతితోన్మత్తబహువైరాతికీటకైః ।**
**బన్ధకీబన్ధకీభర్తృక్షుద్రానృతకథైః సహ ॥ 6 ॥**

**తథాఽతివ్యయశీలైశ్చ పరివాదరతైః శఠైః ।**
**బుధో మైత్రీం న కుర్వీత నైకః పన్థానమాశ్రయేత్ ॥ 7 ॥**

బుద్ధిమంతుడైనవాడు శత్రువులతో, పతితులతో, పిచ్చివాళ్లతో, ఎక్కువవైరం కలవారితో, కీటకాలవలె బాధించే వారితో, కులటతో, కులటభర్తతో, నీచులతో, అబద్ధాలకోరులతో, అతిగా ధనం ఖర్చుపెట్టే వారితో, అపనిందలు వేసే వారితో, శఠులతో, స్నేహం చేయరాదు. మార్గంలో ఒంటరిగా పోరాదు.

**నావగాహేజ్జలౌఘస్య వేగమగ్రే నరేశ్వర! ।**
**ప్రదీప్తం వేశ్మ న విశేన్నారోహేచ్ఛిఖరం తరోః ॥ 8 ॥**

నరపాలా! నీటి ప్రవాహవేగంలో ఎదురుగా ఉండి స్నానం చేయరాదు. అగ్నితో తగలబడే ఇంటిలోనికి ప్రవేశించరాదు. చెట్టు చిటారుకొమ్మవరకు ఎక్కరాదు.

**న కుర్యాద్దన్తసంఘర్షం కుష్ణీయాచ్చ న నాసికామ్ ।**
**నాసంవృతముఖో జృంభేచ్ఛ్వాసకాసౌ చ వర్జయేత్ ॥ 9 ॥**

పళ్లు పటపట లాడించరాదు(కొరకరాదు), ముక్కును నలపరాదు. నోటికి అడ్డం పెట్టుకోకుండా ఆవులించరాదు, దగ్గరాదు, ఇతరులకు తగిలేలా ఊపిరి విడువరాదు.

**నోచ్చైర్హసేత్ సశబ్దం చ న ముంచేత్ పవనం బుధః ।**
**నఖాన్న ఖాదయేచ్ఛిన్ద్యాన్నతృణం న మహీం లిఖేత్ ॥ 10 ॥**

జ్ఞానవంతుడు శబ్దంచేస్తూ బిగ్గరగా నవ్వరాదు. చప్పుడు అయ్యేలా అపానవాయువు విడువరాదు. గోళ్ళుకొరకరాదు. గడ్డిని ముక్కలు ముక్కలు చేయరాదు. నేలపై గీయరాదు.

**న శ్మశ్రు భక్షయేల్లోష్టం న మృద్నీయాద్విచక్షణః ।**
**జ్యోతీంష్యమేధ్యశస్తాని నాభివీక్షేత చ ప్రభో! ॥ 11 ॥**

రాజా! విచక్షణుడైన మానవుడు గెడ్డం, మీసం కొరకరాదు. మట్టి గడ్డను అరగదీయరాదు. అపవిత్రములైన, అప్రశస్తములైన నక్షత్రాలను చూడరాదు.

**నగ్నాం పరస్త్రియం చైవ సూర్యం చాస్తమయోదయే ।**
**న హుంకుర్యాచ్ఛవం చైవ శవగన్ధో హి సోమజః ॥ 12 ॥**

దిగంబరంగా ఉన్న పరస్త్రీని చూడరాదు. ఉదయించే సూర్యుని, అస్తమించే సూర్యుని వీక్షించరాదు. శవాన్ని శవగంధాన్ని అసహ్యించు కోరాదు. శవగంధం అగ్నీషోమీయమైన శరీరమునందలి సోమాంశం కదా!

**చతుష్పథాంశ్చైత్యతరూన్ శ్మశానోపవనాని చ ।**
**దుష్టస్త్రీసన్నికర్షం చ వర్జయేన్నిశి సర్వదా ॥ 13 ॥**

రాత్రివేళ ఎల్లప్పుడూ నాలుగు దారుల కూడళ్లను, చైత్యవృక్షాలను (అరుగు కట్టి పూజించేచెట్లను), శ్మశానాలను, ఉపవనాలను, దుష్ట స్త్రీసాంగత్యాన్ని విడిచి పెట్టాలి.

**పూజ్యదేవధ్వజజ్యోతిశ్ఛాయాం నాతిక్రమేత్ బుధః ।**
**నైకః శూన్యాటవీం గచ్ఛేన్న చ శూన్యగృహం వసేత్ ॥ 14 ॥**

విజ్ఞుడైనవాడు పూజ్యులు, దేవతలు, ధ్వజం, జ్యోతి-వీటి నీడను దాటరాదు. ఒక్కడుగా నిర్జనారణ్యంలోకి వెళ్లకూడదు. ఎవరూ లేని ఇంటిలో ఒంటరిగా ఉండరాదు.

వి ॥ ధ్వజ-ద్విజ-పాఠాంతరం

**కేశాస్థికణ్టకామేధ్యవహ్నిభస్మతుషాం స్తథా ।**
**స్నానార్ద్ర ధరణీం చైవ దూరతః పరివర్జయేత్ ॥ 15 ॥**

వెంట్రుకలు, ఎముకలు, ముళ్లు, అశుద్ధం, అగ్ని, బూడిద, పొట్టు, స్నానం చేయగా తడిసిన నేల దాటరాదు కాబట్టి వీటికి దూరంగా తొలగాలి.

వి ॥ వహ్ని-బలి-పాఠాంతరం.

**నానార్యానాశ్రయేత్ కాంశ్చిన్న జిహ్మం రోచయేద్ బుధః ।**
**ఉపసర్పేత న వ్యాలం చిరం తిష్ఠన్నచోత్థితః ॥ 16 ॥**

బుధుడు అనార్యులను(చెడ్డవారిని) ఎవరినీ చేరరాదు. కుటిలుల పట్ల ప్రీతి కూడదు. పాముల దగ్గరకు, క్రూరమృగాల దగ్గరకు, అటువంటి వారి దగ్గరకు వెళ్లి ఎక్కువసేపు ఉండరాదు. మెలకువ వచ్చాక ఎక్కువసేపు పరుండి ఉండరాదు.

**అతీవ జాగరస్స్వప్నే తద్వత్ స్నానాసనే బుధః ।**
**న సేవేత తథా శయ్యాం వ్యాయామం చ నరేశ్వర! ॥ 17 ॥**

మానవేంద్రా! బుద్ధిమంతుడైనవాడు ఎక్కువసేపు మెలకువ, నిద్ర, స్నానం, కూర్చుండిపోవడం, పరుండిపోవడం, వ్యాయామం చేయడం చేయరాదు.

**దంష్ట్రిణః శృంగిణశ్చైవ ప్రాజ్ఞో దూరేణ వర్జయేత్ ।**
**అవశ్యాయం చ రాజేన్ద్ర! పురోవాతాతపౌ తథా ॥ 18 ॥**

రాజేంద్రా! ప్రాజ్ఞుడైనవాడు కోరలు, కొమ్ములు గల జంతువులకు దూరంగా ఉండాలి. మంచులో కాని, ఎదురుగాలిలో కాని, ఎదరురెండలో కాని ఉండకూడదు.

**న స్నాయాన్న స్వపేన్నగ్నో న చైవోపస్పృశేద్ బుధః ।**
**ముక్తకేశశ్చ నాచామేద్ దేవాభ్యర్చాం చ వర్జయేత్ ॥ 19 ॥**

జ్ఞానవంతుడైన వాడు దిగంబరుడై స్నానం చేయరాదు. అలాగే నగ్నుడై నిద్రపోరాదు. ఆచమనం కూడ బట్టలు లేకుండ చేయరాదు. జుట్టు విరబోసుకొని ఆచమనం కాని, దేవతార్చనకాని చేయకూడదు. (గోచీలేకుండ ఈ పని చేయరాదు).

**హోమదేవార్చనాద్యాసు క్రియాస్వాచమనే తథా ।**
**నైకవస్త్రః ప్రవర్తేత ద్విజవాచనికే జపే ॥ 20 ॥**

హోమం,దేవతార్చనం మున్నగు పవిత్ర కర్మలు, ఆచమనం, పుణ్యాహవాచనం,జపం, ఇటువంటి క్రియలు చేసేటప్పుడు ఉత్తరీయం లేకుండా ఏకవస్త్రంతో ఉండరాదు.

**నాసమంజసశీలైస్తు సహాసీత కదాచన ।**
**సద్వృత్తసన్నికర్షో హి క్షణార్ధమపి శస్యతే ॥ 21 ॥**

మంచిశీలం లేనివారితో ఎప్పుడూ కలిసి కూర్చోరాదు. సాధుశీలురతో సాంగత్యం అర్ధక్షణమయినా ప్రశస్తమైనదికదా!.

**విరోధం నోత్తమైర్గచ్ఛేన్నాధమైశ్చ సదా బుధః ।**
**వివాహశ్చ వివాదశ్చ తుల్యశీలైర్నృపేష్యతే ॥ 22 ॥**

రాజా! బుధుడు తనకన్న గొప్ప వారితోకాని, తక్కువవారితో కాని విరోధం పెట్టుకోరాదు. వియ్యమయినా, కయ్యమయినా సమానమైన నడివడి కలవారితోనే చేయాలి.

**నారభేత కలిం ప్రాజ్ఞః శుష్కవైరశ్చ వర్జయేత్ ।**
**అప్యల్పహానిః సోఢవ్యా వైరేణార్థాగమం త్యజేత్ ॥ 23 ॥**

ప్రాజ్ఞుడు కయ్యానికి కాలుదువ్వరాదు. శుష్కవైరం పనికిరాదు. కొంచెం హాని కలిగితే పట్టించుకోరాదు. విరోధం తెచ్చిపెట్టే ధనసంపాదన విడిచిపెట్టాలి.

**స్నాతో నాంగాని నిర్మార్జేత్ స్నానశాట్యా న పాణినా ।**
**న చ నిర్ధూతయేత్ కేశాన్ నాచమేన్నైవ చోత్థితః ॥ 24 ॥**

స్నానంచేసి స్నానం చేసిన వస్త్రంతోకాని, చేతితోకాని శరీరాన్ని తుడుచుకోరాదు. జట్టు దులుపుకోరాదు. నిలబడి ఆచమనం చేయరాదు.

**పాదేన నాక్రమేత్పాదం న పూజ్యాభిముఖం నయేత్ ।**
**నోచ్చాసనం గురోరగ్రే భజేతావినయాన్వితః ॥ 25 ॥**

ఒక పాదంలో మరొకదాన్ని త్రొక్కరాదు. పూజ్యులకు ఎదురుగా కాలు చాపరాదు. అవినయంతో గురువుగారి ఎదురుగుండా ఉన్నతాసనంపై కూర్చోరాదు.

**అపసవ్యం న గచ్ఛేచ్చ దేవాగారచతుష్పథాన్ ।**
**మాంగల్యపూజ్యాంశ్చ తథా విపరీతాన్న దక్షిణమ్ ॥ 26 ॥**

దేవాలయం, నాలుగుదారుల కూడలి, వీటిని అపసవ్యంగా చుట్టి నడవరాదు. మంగళద్రవ్యాలు, పూజ్యులు–వీటికి అప్రదక్షిణంగా నడవరాదు.

**శ్లేష్మశింఘాణికోత్సర్గో నాన్నకాలే ప్రశస్యతే ।**
**బలిమంగల జప్యాదౌ న హెూమే న మహాజనే ॥ 29 ॥**

అన్నంతినే సమయంలో, బలివేసేవేళలో, శుభకార్యాలలో, జపం మున్నగునవిచేసేటప్పుడు. హెూమ సమయాలలో, మహా పురుషుల సమక్షంలో కాండ్రించి చీదరాదు, తుమ్మరాదు ఉమ్మివేయరాదు.

**యోషితో నావమన్యేత న చాఽఽసాం విశ్వసేద్ బుధః ।**
**న చైవేర్ష్యాభవేత్తాసు న ధిక్కుర్యాత్ కదాచన ॥ 30 ॥**

ప్రాజ్ఞుడైనవాడు ఆడవారిని అవమానించరాదు. అంతమాత్రం చేత వారిని నమ్మనూ కూడదు. వారిపై అసూయ కూడ పనికిరాదు. వీరిని ఎన్నడూ ధిక్కరించనూ కూడదు.

**మాంగల్యపుష్పరత్నాజ్యపూజ్యాననభివాద్య చ ।**
**న నిష్క్రమేద్ గృహాత్ ప్రాజ్ఞస్సదాచారపరో నరః ॥ 31 ॥**

సదాచారమునందు ఆసక్తి గల మానవుడు మంగళద్రవ్యాలకు, పుష్పాలకు, రత్నాలకు, నేతికి, పూజ్యులకు నమస్కరింపకుండా ఇంటి నుంచి బయటకు వెళ్లరాదు.

**చతుష్పథాన్ నమస్కుర్యాత్ కాలే హోమపరో భవేత్ ।**
**దీనానభ్యుద్ధరేత్ సాధూనుపాసీత బహుశ్రుతాన్ ॥ 32 ॥**

వెళ్లేటప్పుడు నాలుగుదారుల కూడలి కనబడితే నమస్కరించాలి. సకాలంలో హెూమంచేసే ఆసక్తి ఉండాలి. దీనులపై దయ చూపించాలి. సాధువులను, బహుశాస్త్రకోవిదులను సేవించాలి.

**దేవర్షిపూజకః సమ్యక్ పితృపిణ్డోదకప్రదః ।**
**సత్కర్తా చాతిథీనాం యః స లోకానుత్తమాన్ వ్రజేత్ ॥ 33 ॥**

దేవతలను,ఋషులను పూజించేవాడు, శాస్త్రవిధానంగా పితృదేవతలకు పిండోదకక్రియలు ఆచరించేవాడు, అతిథులను గౌరవించేవాడు ఉత్తమలోకాలను పొందుతాడు.

**హితం మితం ప్రియం కాలే వశ్యాత్మా యోఽభిభాషతే ।**
**స యాతి లోకానాహ్లాదహేతుభూతాన్ నృపాక్షయాన్ ॥ 34 ॥**

నృపాలా! హితంగా,మితంగా, ప్రియంగా, ఆత్మ సంయమనంతో తగురీతిగా మాట్లాడేవాడు ఆహ్లాదం పొందించే అక్షయలోకాలకు చేరుకొంటాడు.

**ధీమాన్ హ్రీమాన్ క్షమాయుక్తో హ్యాస్తికో వినయాన్వితః ।**
**విద్యాభిజనవృద్ధానాం యాతి లోకాననుత్తమాన్ ॥ 35 ॥**

బుద్ధిమంతుడు, లజ్జావంతుడు, క్షమాన్వితుడు, ఆస్తికుడు, వినయయుక్తుడు అయినవాడు విద్యావంతులు, ఉత్తమవంశజులు, జ్ఞానవంతులు చేరుకొనే ఉత్తమలోకాలకు వెడతాడు.

**అకాలగర్జితాదౌ చ పర్వస్వాశౌచకాదిషు ।**
**అనాధ్యాయం బుధః కుర్యాదుపరాగాదికే తథా ॥ 36 ॥**

అకాలంలో ఉరుములు మున్నగునవి వచ్చినపుడు, పర్వదినాలలోను, ఆశౌచం(మైల) మున్నగునవి వచ్చినపుడు, గ్రహణసమయం మున్నగు వేళలలోను ప్రాజ్ఞుడైన వాడు వేదాధ్యయనం చేయరాదు.

**శమం నయతి యః క్రుద్ధాన్ సర్వబన్ధురమత్సరీ ।**
**భీతాశ్వాసనకృత్ సాధుః స్వర్గస్తస్యాల్పకం ఫలమ్ ॥ 37 ॥**

కోపించిన వారిని శాంతింపజేసేవాడు, అందరికి బంధువు వంటివాడు, మాత్సర్యం లేనివాడు(పరుల ఉత్కర్షను, చూసి అసూయ పడనివాడు), భయపడిన వారిని ఓదార్చేవాడు, సాధుస్వభావం కలవాడు ఇటువంటి వారికి స్వర్గమనేది స్వల్పమైన ఫలం మాత్రమే.

**వర్షాతపాదికే ఛత్రీ దణ్డీ రాత్ర్యటవీషు చ ।**
**శరీరత్రాణకామో వై సోపానత్కస్సదా వ్రజేత్ ॥ 38 ॥**

శరీరాన్ని రక్షించుకోడానికై వర్షం, ఎండ మున్నగు సమయాలలో గొడుగు వేసుకోవాలి. రాత్రులందు, అడవులందు ప్రయాణించేటప్పుడు కఱ్ఱపట్టుకొని నడవాలి. ఎల్లప్పుడూ చెప్పులు వేసుకొని నడవాలి.

**నోర్ధ్వం న తిర్యగ్ దూరం వా నిరీక్షన్ పర్యటేత్ బుధః ।**
**యుగమాత్రం మహీపృష్ఠం నరో గచ్ఛేద్ విలోకయన్ ॥ 39 ॥**

పైకిగాని, ఇటూ అటూ ప్రక్కలకుగాని, దూరంగాని చూస్తూ బుద్ధిమంతుడు నడవరాదు. నాలుగు బారల దూరం నేలపై భాగాన్ని చూసుకొంటూ నరుడు నడక సాగించాలి. (నాలుగుచేతులదూరం అని వేరే వ్యాఖ్యానం).

**దోషహేతూనశేషాంస్తు వశ్యాత్మా యో నిరస్యతి ।**
**తస్య ధర్మార్థకామానాం హానిర్నాల్పాఽపి జాయతే ॥ 40 ॥**

ఇంద్రియనిగ్రహంతో సమస్తదోషహేతువులను తొలగించు కొన్నవానికి, అతడు కావించే ధర్మార్థకామాలకు హాని స్వల్పంగా కూడ కలుగదు.

**సదాచారరతః ప్రాజ్ఞో విద్యావినయశిక్షితః ।**
**పాపేఽప్యపాపః పరుషే హ్యభిధత్తే ప్రియాణి యః ।**
**మైత్రీ ద్రవాన్తఃకరణస్తస్య ముక్తిః కరే స్థితా ॥ 41 ॥**

ప్రాజ్ఞుడైనవాడు మంచి ఆచారాలయందు ఆసక్తి కలిగి ఉందాలి. విద్యలన్నీ సంపూర్ణంగా నేర్వాలి. వినయవంతుడై మెలగాలి. పాపులపట్ల పాపాన్ని ఆచరించరాదు. ఎదుటివారు పరుషంగా మాట్లాడినా, తాను మాత్రం ప్రియవాక్యాలు పలకాలి. అంతఃకరణం స్నేహభావంతో ద్రవించాలి. అటువంటివానికి ముక్తి అరచేతిలో ఉంటుంది.

**యే కామక్రోధలోభానాం వీతరాగా న గోచరే ।**
**సదాచారస్థితాస్తేషామనుభావైర్ధృతా మహీ ॥ 42 ॥**

ఎవరయితే కామక్రోధలోభాలకు గురి కాకుండా, రాగం నశింపజేసుకొని సదాచార పరాయణులై ఉంటారో, అట్టి మహాత్ముల ప్రభావాల వల్లనే భూమి నిలిచి ఉంది.

**తస్మాత్ సత్యం వదేత్ ప్రాజ్ఞో యత్ పరప్రీతికారణమ్ ।**
**సత్యం యత్పరదుఃఖాయ తత్ర మౌనపరో భవేత్ ॥ 43 ॥**

కాబట్టి ప్రాజ్ఞుడు పరులకు సంతోషం కలిగేలా సత్యం పలకాలి. సత్యం ఇతరులకు దుఃఖం కలిగించే దయినప్పుడు మౌనముద్ర వహించాలి.

**ప్రియం యుక్తం హితం నైతదితి మత్వా న తద్వదేత్ ।**
**శ్రేయస్తత్ర హితం వాక్యం యద్యప్యత్యన్తమప్రియమ్ ॥ 44 ॥**

తాను చెప్పేది ప్రియమనినా కూడా, ఇది హితం కాదను కొంటే అది పలకనే పలకరాదు. అటువంటి సమయంలో అది అత్యంతమూ, అప్రియమయినా హితం పలకడమే శ్రేయస్కరం.

**ప్రాణినాముపకారాయ యథైవేహ పరత్ర చ ।**
**కర్మణా మనసా వాచా తదేవ మతిమాన్ భజేత్ ॥ 45 ॥**

మతిమంతుడైనవాడు ఇహలోకంలోను, పరలోకంలోను ప్రాణులకు ఎక్కువ మేలుచేసే దానినే మనసా, వాచా, కర్మణా త్రికరణశుద్ధిగా ఆచరించాలి.”

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే గృహస్థ సదాచారవర్ణనం నామ ద్వాదశోఽధ్యాయః సమాప్తః ॥ 12 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో గృహస్థ సదాచారవర్ణన అనే పన్నెండవ అధ్యాయం సమాప్తం ॥ 12 ॥



## త్రయోదశోఽధ్యాయః - పదమూడవ అధ్యాయం

## శ్రాద్ధవిచారః - శ్రాద్ధవిచారం

**ఔర్వ ఉవాచ :-** ఔర్వుడు చెప్పాడు.

**సచేలస్య పితుః స్నానం జాతే పుత్రే విధీయతే ।**
**జాతకర్మ తదా కుర్యాచ్ఛ్రాద్ధమభ్యుదయే చ యత్ ॥ 1 ॥**

"పుత్రుడు పుట్టీ పుట్టగానే తండ్రి కట్టుబట్టతో స్నానం చేయాలి. అపుడు జాతకర్మ, అభ్యుదయ శ్రాద్ధం (నాందీకర్మ) ఆచరించాలి.

**యుగ్మాన్ దైవాంశ్చ పిత్ర్యాంశ్చ సమ్యక్ సమ్యక్ క్రమాద్ద్విజాన్ ।**
**పూజయేద్భోజయేచ్చైవ తన్మనా నాన్యమానసః ॥ 2 ॥**

తదేకచిత్తుడై, అనన్యమనస్కుడై దేవతలకు, పితరులకు తృప్తికొరకై క్రమంగా (కుడివైపున, ఎడమవైపున) చక్కగా కూర్చోబెట్టి ఇద్దరు ఇద్దరు బ్రాహ్మణులను పూజించి భోజనం పెట్టాలి.

**దధ్యక్షతైః సబదరైః ప్రాఙ్ముఖోదఙ్ముఖోఽపి వా ।**
**దైవతీర్థేన వై పిణ్డాన్ దద్యాత్ కాయేన వా నృప! ॥ 3 ॥**

సగర రాజేంద్రా! తూర్పుదిక్కుగా కాని, ఉత్తరదిక్కుగా కాని కూర్చున్నవాడై పెరుగు, అక్షతలు, రేగిపండ్లు- వీటితో చేసిన పిండాలను దేవతీర్థంతో (అనామికామధ్యమాంగుళీ మూలాలతో) కాని, ప్రాజాపత్యతీర్థం (కనిష్ఠికా మూలంతో) కాని సమర్పించాలి.

**నాన్దీముఖః పితృగణస్తేన శ్రాద్ధేన పార్థివ! ।**
**ప్రీయతే తత్తు కర్తవ్యం పురుషైః సర్వవృద్ధిషు ॥ 4 ॥**

పార్థివా! ఈ అభ్యుదయశ్రాద్ధంవల్ల నాందీముఖులనే పితృగణాలు సంతృప్తి చెందుతాయి. కాబట్టి సమస్తములైన అభివృద్ధికర్మలలోను పురుషులు దానిని తప్పక ఆచరించాలి.

**కన్యాపుత్ర వివాహేషు ప్రవేశే నవవేశ్మనః ।**
**నామకర్మణి బాలానాం చూడా కర్మాదికే తథా ॥ 5 ॥**

**సీమన్తోన్నయనే చైవ పుత్రాదిముఖదర్శనే ।**
**నాన్దీముఖం పితృగణం పూజయేత్ ప్రయతో గృహీ ॥ 6 ॥**

కుమార్తెపెండ్లిలోను, కుమారుని వివాహంలోను, నూతన గృహప్రవేశ సమయంలో, పిల్లల నామకరణంలో, చూడాకర్మసంస్కారంలో,(పుట్టువెండ్రుకలు తీయించుట), సీమంత సమున్నయన సంస్కారంలో, పిల్లల ముఖదర్శనసమయంలో, గృహస్థుడు నియమబద్ధుడై నాందీముఖపితృగణాన్ని పూజించాలి.

**పితృపూజావిధిః ప్రోక్తో వృద్ధావేష సనాతనః ।**
**శ్రూయతామవనీపాల! ప్రేతకర్మక్రియావిధిః ॥ 7 ॥**

మహీపాలా! అభివృద్ధికారకమైన సనాతమైన పితృపూజావిధిని దీనిని నీకు తెలియ జెప్పాను. ఇక మీద ప్రేతకర్మక్రియావిధిని గూర్చి ఆలకించు.

### మృతశ్రాద్ధక్రియ

**ప్రేతదేహం శుభైః స్నానైః స్నాపితం స్రగ్విభూషితమ్ ।**
**దగ్ధ్వా గ్రామాద్ బహిః స్నాత్వా సచేలస్సలిలాశయే ॥ 8 ॥**

ప్రేతదేహాన్ని పవిత్రజలాలతో స్నానం చేయించాలి. కళకళలాడే పూలతో అలంకరించాలి. ఊరికి వెలుపలగా శవాన్ని దహనం చేయాలి. తటాకంలోకాని, నదిలోకాని, కాలువలో కాని(జలాశయంలో) స్నానం చేయాలి.

**యత్ర యత్ర స్థితాయైతదముకాయేతి వాదినః ।**
**దక్షిణాభిముఖా దద్యు ర్బాన్ధవాః సలిలాంజలిమ్ ॥ 9 ॥**

(యత్ర యత్ర స్థితాయ ఏతత్ అముకాయ) ఎక్కడయితే ఈ జీవిఉన్నదో, అక్కడ ఉన్నవానికి ఇది చెందుగాక! అని అంటూ బంధువులైన వారు దక్షిణముఖంగా తిరిగి జలాంజలులు ఇవ్వాలి.

**ప్రవిష్టాశ్చ సమం గోభిర్గ్రామం నక్షత్రదర్శనే ।**
**కటధర్మాంస్తతః కుర్యుర్భూమౌ ప్రస్తరశాయినః ॥ 10 ॥**

గోవులతోపాటు (ఆవులు ఇంటికి తిరిగి వచ్చే సమయంలో) నక్షత్రాలు కనబడే సమయంలో గ్రామంలో ప్రవేశించాలి. తరువాత అశౌచధర్మాలను పాటించాలి. నేలపై గడ్డిమున్నగునవి పరచుకొని పరుండాలి.

**దాతవ్యోఽనుదినం పిణ్డః ప్రేతాయ భువి పార్థివ! ।**
**దివా చ భక్తం భోక్తవ్య మమాంసం మనుజర్షభ! ॥ 11 ॥**

పార్థివా! ప్రతిదినం నేలపై ప్రేతకు పిండప్రదానం చేయాలి. మానవశ్రేష్ఠా! పగటిపూట మాంసంలేని భోజనం చేయాలి.

**దినాది తావదిచ్ఛాతః కర్తవ్యం విప్రభోజనమ్ ।**
**ప్రేతస్తృప్తిం తథా యాతి బన్ధువర్గేణ భుంజతా ॥ 12 ॥**

మొదటిరోజునుంచి తన ఇష్టాన్ని అనుసరించి విప్రులకు భోజనం పెట్టాలి. బంధువర్గంతో, బ్రాహ్మణ బృందంతో భుజించడంవల్ల ప్రేతతృప్తిని పొందుతాడు.

**ప్రథమేఽహ్ని తృతీయే చ సప్తమే నవమే తథా ।**
**వస్త్రత్యాగం బహిః స్నానం కృత్వా దద్యాత్ తిలోదకమ్ ॥ 13 ॥**

మొదటి రోజున, మూడవరోజున, ఏడవరోజున, తొమ్మిదవ రోజున వస్త్రత్యాగం చేసి బహిః స్నానం చేయాలి. పిమ్మట తిలోదకాలు ఈయాలి.

**తతోఽ బన్ధువర్గస్తు భువి దద్యాత్ తిలోదకమ్ ।**
**చతుర్థేఽ హ్ని చ కర్తవ్యం భస్మాస్థిచయనం నృప ! ।**
**తదూర్ధ్వమంగసంస్పర్శస్సపిణ్డానామపీష్యతే ॥ 14 ॥**

తరువాత బంధువర్గంతో కలిసి భూమిపై తిలోదకం సమర్పించాలి. నృపాలా! నాలుగో రోజున చనిపోయిన వానిని కాల్చగా ఉన్న భస్మాన్ని, ఎముకలను సంచయనం చేయాలి. (నీటిలో కలపాలి). అటుపిమ్మట సపిండుల శరీరాన్ని తాకవచ్చు.

**యోగ్యాః సర్వక్రియాణాన్తు సమానసలిలాస్తథా ।**
**అనులేపనపుష్పాదిభోగాదన్యత్ర పార్థివ! ॥ 15 ॥**

పార్థివా! ఆనాటి నుంచి గంధపుపూత, పుష్పాలంకరణం మున్నగు భోగాలు మినహాయించి తమతో బాటుగా సమానంగా ఉదకాలు ఇచ్చిన వారు సమస్త కర్మలు ఆచరించడానికి యోగ్యులు అవుతారు.

**శయ్యాసనోపభోగశ్చ సపిణ్డానామపీష్యతే ।**
**భస్మాస్థిచయనాదూర్ధ్వం సంయోగో న తు యోషితామ్ ॥ 16 ॥**

శయ్య, ఆసనం, భోగం సపిండులైన వారికి పనికివస్తుంది. భస్మాస్థి సంచయనం అయిన తరవాత స్త్రీసంగమం మాత్రం పనికి రాదు.

**బాలే దేశాన్తరస్థే చ పతితే చ మునౌ మృతే ।**
**సద్యః శౌచం తథేచ్ఛాతో జలాగ్న్యుద్బన్ధనాదిషు ॥ 17 ॥**

బాలుడు, పరదేశంలో ఉన్నవాడు, పతితుడు, ముని మరణించినప్పుడు, నీళ్లలో ఉరికికాని, నిప్పుల్లో దుమికికాని, ఉరివేసుకొనికాని, ఆత్మహత్యగా కాని, చనిపోతే వెంటనే శుద్ధి. ప్రమాదవశాత్తు మరణిస్తే మైల పట్టాలి.

**మృతబన్ధోర్దశాహాని కులస్యాన్నం న భుజ్యతే ।**
**దానం ప్రతిగ్రహో యజ్ఞః స్వాధ్యాయశ్చ నివర్తతే ॥ 18 ॥**

మృతుడైన వాని ఇంటిలో పదిరోజులు అన్నం తినరాదు. దానం ఈయడం, దానం పుచ్చుకోవడం, యజ్ఞకర్మ చేయడం, వేదాధ్యయనం చేయరాదు.

**విప్రస్యైతద్ ద్వాదశాహం రాజన్యస్యాప్యశౌచకమ్ ।**
**అర్ధమాసం చ వైశ్యస్య మాసం శూద్రస్య శుద్ధయే ॥ 19 ॥**

ఈ అశౌచం బ్రాహ్మణులకు పండ్రెండు రోజులు, రాజన్యులకు కూడ పండ్రెండు రోజులు, వైశ్యునికి పదిహేను రోజులు, శూద్రునకు నెల రోజులు ఉంటుంది. తరువాత శుద్ధి(బ్రాహ్మణులకు పది రోజులే అని వేరే వ్యాఖ్యానం).

**అయుజో భోజయేత్ కామం ద్విజానాద్యే తతో దినే ।**
**దద్యాత్ దర్భేషు పిణ్డం చ ప్రేతాయోచ్ఛిష్టసన్నిధౌ ॥ 20 ॥**

మైల గడచిపోయిన తరవాత తన ఇచ్ఛానుసారంగా, మొదట బేసి సంఖ్యలో బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. అనంతరం వారు విడిచిన ఉచ్ఛిష్టం వద్ద దర్భలు పరచి, పిండం ఉంచి ప్రేతకు సమర్పించాలి.

**వార్యాయుధప్రతోదాస్తు దణ్డశ్చ ద్విజభోజనాత్ ।**
**స్ప్రష్టవ్యోఽనన్తరం వర్ణైః శుధ్యేరంస్తే తతః క్రమాత్ ॥ 21 ॥**

మైల శుద్ధి అయిన తరువాత, బ్రాహ్మణుల భోజనం అయిన పిమ్మట నాలుగు వర్ణాల వారు క్రమంగా జలం, ఆయుధం, కొరడాకర్ర, కర్ర,చేతితో తాకాలి.

**తతః స్వవర్ణధర్మా యే విప్రాదీనాముదాహృతాః ।**
**తాన్ కుర్వీత పుమాన్ జీవేన్నిజధర్మార్జనైస్తథా ॥ 22 ॥**

అటు తరవాత బాహ్మణులు మున్నగు వారికి ఏయే వారివారి వర్ణధర్మాలు చెప్పబడ్డాయో, ఆయా ధర్మాలను ఆచరించాలి. పురుషుడు పిమ్మట తన ధర్మంచే సంపాదించిన ధనంతో జీవించాలి.

**మృతాహని చ కర్తవ్యమేకోద్దిష్టమతః పరమ్ ।**
**ఆహ్వానాదిక్రియాదైవనియోగరహితం హి తత్ ॥ 23 ॥**

అనంతరం రెండవ మాసం నుంచి చనిపోయిన తిథిరోజున ఏకోద్దిష్ట శ్రాద్ధం చేయాలి. ఈ మాసికవిధిలో ఆహ్వానాదిక్రియలు కాని, విశ్వేదేవస్థాననిమంత్రణం కాని ఉండవు.

**ఏకోఽర్ఘ్యస్తత్ర దాతవ్యస్తథైవైకపవిత్రకమ్ ।**
**ప్రేతాయ పిన్డో దాతవ్యో భుక్తవత్సు ద్విజాతిషు ॥ 24 ॥**

ఆ శ్రాద్ధంలో అర్ఘ్యం ఒకటి, అలాగే పవిత్రం ఒకటి ఈయాలి. బ్రాహ్మణభోజనం పూర్తి అయిన తరవాత ప్రేతకు పిండప్రదానం చేయాలి.

**ప్రశ్నశ్చ తత్రాభిరతిర్యజమానైర్ద్విజన్మనామ్ ।**
**అక్షయ్యమముకస్యేతి వక్తవ్యం విరతౌ తథా ॥ 25 ॥**

అపుడు యజమానులు బ్రాహ్మణులను "అభిరమ్యతామ్" అని ప్రశ్నవేయాలి. భోక్తలు "అభిరతాః స్మః" అని అనాలి. పిండప్రదానం అయిన తరవాత "అముకస్య అక్షయ్యమిద ముపతిష్ఠతామ్" అని పలకాలి.

**ఏకోద్దిష్టమయో ధర్మ ఇత్థ మావత్సరాత్ స్మృతః ।**
**సపిణ్డీకరణం తస్మిన్ కాలే రాజేన్ద్ర! తచ్ఛృణు ॥ 26 ॥**

రాజేంద్రా! ఈ విధంగా ఒక సంవత్సరం (ప్రతిమాసం)ఏకోద్దిష్ట ధర్మం ఆచరించాలి. ఆ సంవత్సరం పూర్తి అయిన పిమ్మట సపిండీకరణం చేయాలి. అది ఆలకించు.

**ఏకోద్దిష్ట విధానేన కార్యం తదపి పార్థివ ।**
**(సంవత్సరేఽథ షష్ఠే వా మాసే వా ద్వాదశేఽహ్ని తత్)**
**తిలగన్ధోదకైర్యుక్తం తత్ర పాత్రచతుష్టయమ్ ॥ 27 ॥**

పార్థివా! ఆ సపిండీకరణం కూడ ఏకోద్దిష్టవిధానంగానే చేయాలి. సంవత్సరం పూర్తి అయిన తరువాత కాని, ఆరు మాసాల తరువాత కాని, ఒకనెల తరువాత కాని, పంద్రెండవ రోజు తరువాత కాని చేయవచ్చు. అందు తిలలు, గంధం, జలం కల పాత్రలు నాలుగు ఉంచాలి. ఒక పాత్ర ప్రేతకు, మూడు పాత్రలు పితృదేవతలకు ఉంచాలి.

**పాత్రం ప్రేతస్య తత్రైకం పైత్రం పాత్రత్రయం తథా ।**
**సేచయేత్ పితృపాత్రేషు ప్రేతప్రాతం తతస్త్రిషు ॥ 28 ॥**

అందు ఒక పాత్ర మృత పురుషుని పాత్ర, మూడు పాత్రలు పితృదేవతలవి కాన, పిమ్మట ప్రేతపాత్రలోని జలం తీసుకొని పితృపాత్రలు మూడింటిలోను చల్లాలి.

**తతః పితృత్వమాపన్నే తస్మిన్ ప్రేతే మహీపతే! ।**
**శ్రాద్ధధర్మై రశేషైస్తు తత్ పూర్వానర్చయేత్ పితౄన్ ॥ 29 ॥**

అవనీపాలకా! తరువాత ఆ ప్రేత పితృత్వం పొందిన పిదప, సమస్తశ్రాద్ధవిధానాల ద్వారా ఆ పూర్వపితరులను అర్చించాలి.

**పుత్రః పౌత్రః ప్రపౌత్రోవా భ్రాతా వా భ్రాతృసన్తతిః ।**
**సపిణ్డసన్తతిర్వాఽపి క్రియార్హో నృప! జాయతే ॥ 30 ॥**

నృపాలా! పుత్రుడు, పౌత్రుడు, ప్రపౌత్రుడు, సోదరుడు, సోదర సంతతి, సపిండ సంతతి–వీరిలో ఎవరయినా శ్రాద్ధాదిక్రియలు చేయదగినవారు అవుతారు.

**తేషామభావే సర్వేషాం సమానోదకసన్తతిః ।**
**మాతృపక్షసపిణ్డేన సమ్బద్ధా యే జలేన వా ॥ 31 ॥**

**కులద్వయేఽపి చోచ్ఛిన్నే స్త్రీభిః కార్యాః క్రియా నృప! ।**
**సంఘాతాన్తర్గతైర్వాఽపి కార్యాః ప్రేతస్య చ క్రియాః ।**
**ఉత్సన్నబంధోరిక్థాద్వా కారయేదవనీపతిః ॥ 32 ॥**

నృపాలా! వారెవరూ లేకపోతే సమానోదక సంతతి వారు అర్హులవుతారు. మాతృపక్ష సపిండ సంబంధులు, మాతృపక్షజల సంబంధులు కూడ లేకుండ పోతే, తల్లివైపుకాని, తండ్రివైపుకాని ఎవరూలేక పోతే స్త్రీలే ఆక్రియలు చేయదగినవారవుతారు. ఆ స్త్రీలు కూడ లేక పోతే ప్రేతకు సహాధ్యాయులు, సహయాత్రికులు అయిన మిత్రులలోనివారు ఎవరైనా ప్రేతకర్మలు చేయాలి. లేదా బంధువులు ఎవరూ లేకపోతే, అతని ధనముతో భూపాలకుడే అతనికి ప్రేతకర్మలు చేయించాలి.

విశే:– పిండంతో సంబంధంతో ఉన్నవారు సపిండులు, జలంతో సంబంధం ఉన్నవారు సమానోదకులు.

**పూర్వాః క్రియా మధ్యమాశ్చ తథా చైవోత్తరాః క్రియాః ।**
**త్రిప్రకారాః క్రియాః సర్వాస్తాసాం భేదం శృణుష్వ మే ॥ 33 ॥**

ఈ ప్రేతకర్మలు అన్నీ పూర్వక్రియలు, మధ్యమ క్రియలు, ఉత్తర క్రియలు అని మూడు విధాలుగా ఉన్నాయి. వాటిని అన్నింటి భేదం నేను చెబుతాను. ఆలకించు.

**ఆదాహవార్యాయుధాని స్పర్శాద్యాన్తాస్తు యాః క్రియాః ।**
**తాః పూర్వా మధ్యమా మాసి మాస్యేకోద్దిష్టసంజ్ఞితాః ॥ 34 ॥**

**ప్రేతే పితృత్వమాపన్నే సపిణ్డీకరణాదను ।**
**క్రియన్తే యాః క్రియాః పిత్ర్యాః ప్రోచ్యన్తే తా నృపోత్తరాః ॥ 35 ॥**

రాజా! దహనం అయినప్పటి నుండి జలం, ఆయుధం మున్నగు వాటిని తాకే వరకు కల క్రియలు పూర్వ క్రియలు. ప్రతిమాసంలోను చేసే ఏకోద్దిష్టశ్రాద్ధాలు మధ్యమక్రియలు. ప్రేతపితృత్వం కోసమై సంపిండీకరణాన్ని అనుసరించి చేసే పితృక్రియలు ఉత్తరక్రియలుగా చెప్పబడుతున్నాయి.

**పితృమాతృసపిణ్డైస్తు సమానసలిలైస్తథా ।**
**తత్సంఘాన్తర్గతైర్వాఽపి రాజ్ఞా తద్ధనహారిణా ॥ 36 ॥**

**పూర్వాః క్రియాశ్చ కర్తవ్యాః పుత్రాద్యైరేవ చోత్తరాః ।**
**దౌహిత్రైర్వా నృపశ్రేష్ఠ! కార్యాస్తత్తనయైస్తథా ॥ 37 ॥**

తండ్రి, తల్లి వంశాలకు చెందిన సపిండులుకాని, సమానోదకులు కాని, మిత్రులు మున్నగువారిలో ఎవడయినా కాని, చనిపోయినవాని ధనం తీసుకొన్న రాజుగాని పూర్వక్రియలు చేయాలి. ఉత్తరక్రియలు మాత్రం పుత్రులు మున్నగువారు కాని, దౌహిత్రులు(కూతురు కుమారుడు) కాని, వారితనయులు కాని చేయదగినవి.

**మృతాహని చ కర్తవ్యాః స్త్రీణామప్యుత్తరాః క్రియాః ।**
**ప్రతిసంవత్సరం రాజన్నేకోద్దిష్టవిధానతః ॥ 38 ॥**

రాజా! మృతతిథిరోజున ఏకోద్దిష్ట విధానంగా ప్రతి సంవత్సరం స్త్రీలకు కూడ ఉత్తరక్రియలు చేయాలి.

**తస్మాదుత్తరసంజ్ఞాయాః క్రియాస్తాః శృణు పార్థివ! ।**
**యదా యదా చ కర్తవ్యా విధినా యేన చానఘ! ॥ 39 ॥**

పుణ్యాత్ముడవైన మహారాజా! ఎప్పుడు ఎప్పుడు, ఏవిధి ప్రకారం ఎలా ఎలా ఈ ఉత్తరక్రియలు నిర్వహించాలో ఆలకించు అని ఔర్వుడు వచించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే శ్రాద్ధవిచారో నామ త్రయోదశోఽధ్యాయః సమాప్తః ॥ 13 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో శ్రాద్ధవిచారం అనే పదమూడవ అధ్యాయం సమాప్తం ॥ 13 ॥

## చతుర్దశోఽధ్యాయః - పద్నాల్గవ అధ్యాయం

## శ్రాద్ధనిర్వహణే పాత్రాపాత్రవిచారణమ్ - శ్రాద్ధనిర్వహణలో పాత్రాపాత్రవిచారణ

**ఔర్వ ఉవాచ** :- ఔర్వుడు చెప్పాడు.

**బ్రహ్మేంద్రరుద్రనాసత్యసూర్యాగ్నివసుమారుతాన్ ।**
**విశ్వేదేవాన్ పితృగణాన్ వయాంసి మనుజాన్ పశూన్ ॥ 1 ॥**

**సరీసృపాన్ ఋషిగణాన్ యచ్చాన్యద్భూతసంజ్ఞితమ్ ।**
**శ్రాద్ధం శ్రద్ధాన్వితః కుర్వన్ ప్రీణయత్యఖిలం జగత్ ॥ 2 ॥**

మహారాజా! శ్రద్ధగా కర్మ చేసేవాడు బ్రహ్మను, ఇంద్రుని, రుద్రుని, అశ్వినీదేవతలను, సూర్యుని, అగ్నిని, వసువులను, మరుత్తులను, విశ్వేదేవతలను, పితృగణాలను, పక్షులను, మనుష్యులను, పశువులను, సరీసృపాలను, ఋషిగణాలను, ఏ మిగిలిన ప్రాణిసమూహం కలదో దానిని, ఇక మిగిలిన సమస్తజగత్తును సంతోషపెట్టేవాడవుతాడు.

**మాసి మాస్యసితే పక్షే పంచదశ్యాం నరేశ్వర! ।**
**తథాఽష్టకాసు కుర్వీత కామ్యాన్ కాలాంచ్ఛృణుష్వ మే ॥ 3 ॥**

నరేంద్రా! ప్రతిమాసంలో కృష్ణపక్షంలో అమావాస్యనాడు, అష్టకాలలోను (హేమంత శిశిర ఋతువులలోని, మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణమాసాలలోని, శుక్లపక్షంలోని, అష్టమితిథులలో) శ్రాద్ధం తప్పని సరిగా పెట్టాలి. ఇక కామ్యశ్రాద్ధాల గురించి, అవి వచ్చే సమయాల గురించి నేను చెబుతాను విను.

**శ్రాద్ధార్హమాగతం ద్రవ్యం విశిష్టమథవా ద్విజమ్ ।**
**శ్రాద్ధం కుర్వీత విజ్ఞాయ వ్యతీపాతేఽయనే తథా ॥ 4 ॥**

శ్రాద్ధం నిర్వహించడానికి తగిన ద్రవ్యం లభించినప్పుడు, విశిష్టుడయిన ద్విజుడు సంప్రాప్తమైనప్పుడు కామ్యశ్రాద్ధం ఆచరించాలి. అయనారంభంలోను, వ్యతీపాతయోగంలోను కూడా కామ్య శ్రాద్ధం చేయాలి.

విశేషాంశం:- శ్రవణాశ్విధనిష్ఠార్ద్రా నాగదైవతమస్తకే ।
యద్యమారవివారేణ వ్యతీపాతః స ఉచ్యతే ॥(శబ్దకల్పద్రుమం)

**విషువే చాపి సమ్ప్రాప్తే గ్రహణే శశిసూర్యయోః ।**
**సమస్తేష్వేవ భూపాల! రాశిష్వర్కే చ గచ్ఛతి ॥ 5 ॥**

**నక్షత్రగ్రహపీడాసు దుష్టస్వప్నావలోకనే ।**
**ఇచ్ఛాశ్రాద్ధాని కుర్వీత నవసస్యాగమే తథా ॥ 6 ॥**

భూపాలా! విషువత్‌సంక్రాతి నాడు, చంద్రసూర్యగ్రహణాలు వచ్చినపుడు, సూర్యుడు ప్రతిరాశిలోను ప్రవేశించినపుడు, నక్షత్రగ్రహపీడలు కలిగినపుడు, చెడుకలలు కనబడినపుడు, క్రొత్తగా పంట వచ్చినపుడు కామ్యశ్రాద్ధం చేయాలి.

వి ॥ పగటి సమయం, రాత్రివేళ సమానంగా ఉండేరోజును"విషువం" అంటారు.

**అమావాస్యా యదా మైత్రవిశాఖాస్వాతియోగినీ ।**
**శ్రాద్ధైః పితృగణస్తృప్తిం తథాప్నోత్యష్టవార్షికీమ్ ॥ 7 ॥**

అమావాస్య ఏనాడు అనూరాధతోకాని, విశాఖతోకాని, స్వాతితో కాని కలిసి ఉంటుందో, ఆరోజు శ్రాద్ధం పెడితే, పితృగణం ఎనిమిది సంవత్సరాల వరకు తృప్తిచెంది ఉంటుంది.

**అమావాస్యా యదా పుష్యే రౌద్రే చర్క్షే పునర్వసౌ ।**
**ద్వాదశాబ్దం తదా తృప్తిం ప్రయాన్తి పితరోఽర్చితాః ॥ 8 ॥**

అమావాస్య ఏరోజున పుష్యమి, ఆర్ద్రపునర్వసు నక్షత్రాలతో కలిసి ఉంటుందో, ఆనాడు శ్రాద్ధం నిర్వహిస్తే పితరులు పండ్రెండు సంవత్సరాలకు తృప్తిని పొంది ఉంటారు.

**వాసవాజైకపాదర్క్షే పితౄణాం తృప్తిమిచ్ఛతామ్ ।**
**వారుణే చాప్యమావాస్యా దేవానామపి దుర్లభా ॥ 9 ॥**

పితృదేవతలను తృప్తి పొందించదలచు కొన్నవారికి, అలాగే దేవతలకు సంతృప్తి నీయదలచు కొన్నవారికి ధనిష్ఠతోకాని, పూర్వాభాద్రతోకాని, శతభిషంతోకాని కలిసిన అమావాస్య కడు దుర్లభమైనది.

**నవస్వృక్షేష్వమావాస్యా యదైతేష్వవనీపతే! ।**
**తదా తృప్తిపదం శ్రాద్ధం పితౄణాం శృణు చాపరమ్ ॥ 10 ॥**

మహీపతీ! ఈతొమ్మిది నక్షత్రాలతోను అమావాస్య కూడి యున్నప్పుడు కావించిన శ్రాద్ధం పితరులకు మిక్కిలి తృప్తినిచ్చేది అవుతుంది. మరోవిషయం ఆలకించు.

**గీతం సనత్కుమారేణ యథైలాయ మహాత్మనే ।**
**పృచ్ఛతే పితృభక్తాయ ప్రశ్రయావనతాయ చ ॥ 11 ॥**

పితృభక్తుడైన, మహాత్ముడైన, ఇలాపుత్రుడు(పురూరవుడు) వినయంతో శరణాగతిచేసి నమస్కరించి అడిగినప్పుడు చెప్పినది విను.

**వైశాఖమాసస్య చ యా తృతీయా**
**నవమ్యసౌ కార్తికశుక్లపక్షే ।**
**నభస్య మాసస్య చ కృష్ణపక్షే**
**త్రయోదశీ పంచదశీ చ మాఘే ॥ 12 ॥**

వైశాఖమాసంలోని శుక్లపక్షంలోని తదియ, కార్తికమాసంలోని శుక్లపక్షనవమి, భాద్రపదమాసంలోని బహుళత్రయోదశి, మాఘమాసంలోని అమావాస్య.

**ఏతా యుగాద్యాః కథితాః పురాణై**
**రనన్తపుణ్యా స్తిథయ శ్చతస్రః ।**
**ఉపప్లవే చంద్రమసో రవేశ్చ**
**త్రిష్వష్టకాస్వప్యయనద్వయే చ ॥ 13 ॥**

ఈ నాలుగు తిథులు పురాణాలద్వారా"యుగాద్యములు" అని పేర్కొనబడ్డాయి. చంద్రసూర్యగ్రహణ సమయాలలోను, మూడు అష్టకాలలోను (మార్గశిర పుష్య మాఘమాసాలలోని అష్టమి తిథులలోను, ఉత్తర దక్షిణాయన ప్రారంభాలలోను. ఇది అనంత పుణ్యప్రదములైన తిథులు

**పానీయమప్యత్ర తిలైర్విమిశ్రం**
**దద్యాత్ పితృభ్యః ప్రయతో మనుష్యః ।**
**శ్రాద్ధం కృతం తేన సమాః సహస్రం**
**రహస్యమేతత్ పితరో వదన్తి ॥ 14 ॥**

మిక్కిలి నియమం పాటించి నువ్వులతో కలిపిన నీళ్లైనా పితృదేవతలకు మనుష్యుడు సమర్పిస్తే, వేయి సంవత్సరాలవరకు అతడు శ్రాద్ధం పెట్టడంతో సమానం. ఈ రహస్యం పితరులు చెప్పినటువంటిది.

**మాఘాసితే పంచదశీ కదాచి**
**దుపైతి యోగం యది వారుణేన ।**
**ఋక్షేణ కాలః స పరః పితౄణాం**
**న హ్యల్పపుణ్యైర్నృప లభ్యతేఽసౌ ॥ 15 ॥**

నృపాలా! మాఘమాసంలో కృష్ణపక్షంలో అమావాస్య ఏనాడు శతభిషం నక్షత్రం కలిసి ఉంటుందో, అది పితరులకు చాలా గొప్పకాలం. అది స్వల్పపుణ్యాత్ములకు లభించేది కాదు.

**కాలే ధనిష్ఠా యది నామ తస్మిన్**
**భవేత్తు భూపాల! తదా పితృభ్యః ।**
**దత్తం జలాన్నం ప్రదదాతి తృప్తిం**
**వర్షాయుతం తత్ కులజైర్మనుష్యైః ॥ 16 ॥**

భూపాలా! ఆ మాఘ అమావాస్యనాడు ధనిష్ఠా నక్షత్రం కలిసి ఉన్నా, ఆసమయంలో పితరులకోసం ఆవంశంలో పుట్టిన మనుష్యులచే ఈయబడిన జలం, అన్నం పదివేల సంవత్సరాల వరకు తృప్తినిస్తుంది.

**తత్రైవ చేద్ భాద్రపదాస్తు పూర్వాః**
**కాలే యథావత్క్రియతే పితృభ్యః ।**
**శ్రాద్ధం పరాం తృప్తిముపేత్య తేన**
**యుగం సమగ్రం పితరః స్వపన్తి ॥ 17 ॥**

అదేవిధంగా మాఘ అమావాస్య నాడు పూర్వాభాద్రపద నక్షత్రం వచ్చినట్లయితే, శాస్త్రవిధిగా పితరులకు శ్రాద్ధం పెడితే, దానితో వారు తృప్తి చెంది యుగపర్యంతం హాయిగా నిద్రిస్తారు.

**గంగాం శతద్రూం యమునాం విపాశాం**
**సరస్వతీం నైమిశగోమతీం వా ।**
**తత్రావగాహ్యార్చనమాదరేణ**
**కృత్వా పితౄణాం దురితాని హన్తి ॥ 18 ॥**

గంగానదిలో కాని, శతద్రువులో కాని, యమునానదిలో కాని, విపాశానదిలో కాని, సరస్వతీనదిలో కాని, నైమిశం వద్దకల గోమతినదిలో కాని స్నానం చేసి ప్రీతితో పితరులను అర్చిస్తే సకలదురితాలు పటాపంచలవుతాయి.

**గాయన్తి చైతత్ పితరః కదాను**
**హర్షాదమీ తృప్తిమవాప్య భూయః ।**
**మాఘాసితాన్తే శుభతీర్థతోయై**
**ర్యాస్యామ తృప్తిం తనయాదిదత్తైః ॥ 19 ॥**

మళ్లీ మాఘమాసంలో కృష్ణపక్షం చివర అమావాస్యనాడు కుమారులు మున్నగు వారిచే ఈయబడే పుణ్య తీర్థజలాలతో ఎప్పుడు మళ్ళీ పరమసంతృప్తిని చెందుతామో కదా!" అని పితరులు గానం చేస్తూ ఉంటారు.

**చిత్తం చ విత్తం చ నృణాం విశుద్ధం**
**శస్తశ్చ కాలః కథితో విధిశ్చ ।**
**పాత్రం యథోక్తం పరమా చ భక్తి**
**ర్నృణాం ప్రయచ్ఛన్త్యభివాంఛితాని ॥ 20 ॥**

నిర్మలమైన చిత్తం, పరిశుద్ధమైన ధనం, ప్రశస్తమైన కాలం, ముందుగా చెప్పిన విధానం, యోగ్యమైన పాత్రం, అత్యంతభక్తి–ఇవి నరులకు కోరిన ఫలితాలను చక్కగా ఇస్తాయి.

వి ॥ యోగ్యపాత్రమనగా నియమవంతుడైన భోక్త.

**పితృగీతాస్తథైవాత్ర శ్లోకాస్తాంశ్చ శ్రుణుష్వ మే ।**
**శ్రుత్వా తథైవ భవతా భావ్యం తత్ర ధృతాత్మనా ॥ 21 ॥**

మహారాజా! ఈ విషయంలో పితృగణాలు గానం చేసిన శ్లోకాలను నాద్వారా ఆలకించు. విని అలాగే నీవు కూడా దృఢచిత్తంతో ఆచరించవలసింది.

**అపి ధన్యః కులే జాయాదస్మాకం మతిమాన్నరః ।**
**అకుర్వన్ విత్తశాఠ్యం యః పిణ్డాన్నో నిర్వపిష్యతి ॥ 22 ॥**

మాకులంలో ధనలోపం చేయకుండా, మాకు పిండప్రదానం చేయబోయే బుద్ధిమంతుడైన ధన్యాత్ముడైన నరుడు జన్మించడం జరుగుతుందా?

**రత్నం వస్త్రం మహీ యానం సర్వభోగాదికం వసు ।**
**విభవే సతి విప్రేభ్యో యోఽస్మానుద్దిశ్య దాస్యతి ॥ 23 ॥**

ఐశ్వర్యం ఉండగా, మాపితృదేవతలను ఉద్దేశించి, రత్నం, వస్త్రం, భూమి, వాహనం, ధనం, సమస్తభోగద్రవ్యాలు మున్నగు వాటిని విప్రుల కొరకు దానం చేసేవాడు మావంశంలో ఉద్భవిస్తాడా!

**అన్నేన వా యథాశక్త్యా కాలేఽస్మిన్ భక్తినమ్రధీః ।**
**భోజయిష్యతి విప్రాగ్ర్యాంస్తన్మాత్రవిభవో నరః ॥ 24 ॥**

ఈప్రకారం దానం చేయగల్గిన వైభవం అంతంతమాత్రమే కల నరుడు, శ్రాద్ధ సమయంలో భక్తి, వినయం కల్గిన చిత్తంతో శ్రేష్ఠులైన విప్రులకు మమ్మల్ని ఉద్దేశించి అన్నమైనా తృప్తిగా భోజనంపెట్టేవాడు మాకులంలో జన్మిస్తాడా ?

**అసమర్థోఽన్నదానస్య ధాన్యమామం స్వశక్తితః ।**
**ప్రదాస్యతి ద్విజాగ్ర్యేభ్యః స్వల్పాల్పాం వాఽపి దక్షిణామ్ ॥ 25 ॥**

ఆవిధంగా అన్నం పెట్టడానికి అసమర్థుడయినా, తనశక్తిని అనుసరించి ద్విజశ్రేష్ఠులకు పచ్చిధాన్యమైనా దానమిచ్చి స్వల్పంగానో, లేక ఎంతో కొంత కొంచమైనా దక్షిణ ఇచ్చేవాడు మా అన్వయంలో పుడతాడా?

**తత్రాప్యసామర్థ్యయుతః కరాగ్రాగ్రస్థితాంస్తిలాన్ ।**
**ప్రణమ్య ద్విజముఖ్యాయ కస్మైచిద్ భూప! దాస్యతి ॥ 26 ॥**

భూపాలా! ఆవిధంగా చేయడానికి సామర్థ్యం లేకపోయినా చేతివ్రేళ్ల కొనలతో నువ్వులు ఉంచుకొని ఏ ద్విజముఖ్యునకైనా నమస్కరించి (తిలోదకం) మాకు సమర్పించేవాడు మాకులంలో ప్రభవిస్తాడా?

**తిలైః సప్తాష్టభిర్వాఽపి సమవేతం జలాంజలిమ్ ।**
**భక్తినమ్రః సముద్దిశ్య భువ్యస్మాకం ప్రదాస్యతి ॥ 27 ॥**

అవి కూడ లేనివాడు ఏడు, ఎనిమిది నూవుగింజలయినా పట్టుకొని భక్తివినయసమన్వితుడై మమ్మల్ని ఉద్దేశించి భూమిపై జలాంజలితో కలిపి విడిచిపెట్టే వాడు మావంశంలో జన్మిస్తాడా?

**యతఃకుతశ్చిత్ సమ్ప్రాప్య గోభ్యో వాఽపి గవాహ్నికమ్ ।**
**అభావే ప్రీణయన్నస్మాచ్ఛ్రద్ధాయుక్తః ప్రదాస్యతి ॥ 28 ॥**

అది కూడ లేనినాడు, ఒక గోవుకు ఒక రోజుకు సరిపడే మేత ఎక్కడ నుంచయినా తెచ్చి శ్రద్ధా సమన్వితుడై మాకు సంతృప్తిని ఇస్తూ గోవులకు పెట్టేవాడు మా కులంలో పుడతాడా?

**సర్వాభావే వనం గత్వా కక్షామూలప్రదర్మకః ।**
**సూర్యాదిలోకపాలానామిదముచ్చైర్వదిష్యతి ॥ 29 ॥**

ఇలాపైన చెప్పిన వన్నీ శూన్యం అయిపోతే, అడవిలో ప్రవేశించి చంకలు కనబడేటట్లు చేతులు పైకెత్తి సూర్యుడు మున్నగు లోకపాలకులను ఉద్దేశించి ఇలా అయినా గట్టిగా పలికేవాడు మావంశంలో జన్మిస్తాడా?

**న మేఽస్తి విత్తం న ధనం న చాన్య**
**చ్ఛ్రాద్ధోపయోగ్యం స్వపితౄన్నతోఽస్మి ।**
**తృప్యన్తు భక్త్యా పితరో మయైతౌ**
**కృతౌ భుజౌ వర్త్మని మారుతస్య ॥ 30 ॥**

నావద్ద శ్రాద్ధానికి ఉపయుక్తమయ్యే విత్తం లేదు. ధనం లేదు. మరేమీ లేదు. నా పితృదేవతలకు నమస్కరిస్తున్నాను. నా పితరులు తృప్తిపొందెదరుగాక! ఇదిగో! నా రెండు భుజాలు పైకెత్తి వాయుపథంలో (ఆకాశంలో చాచాను–అనేవాడయినా మావంశంలో ఉద్భవిస్తాడా?(విత్తమనగా బంగారం, వెండి మున్నగు నవి.)

**ఇత్యేతత్ పితృభిర్గీతం భావాభావప్రయోజనమ్ ।**
**యః కరోతి కృతం తేన శ్రాద్ధం భవతి పార్థివ ! ॥ 31 ॥**

మహారాజా! ఈ విధంగా పితృదేవతలు గానం చేసినట్లు ధనవంతుడైనా, ధనహీనుడయినా కలిమి లేములలో యథోక్తంగా శ్రాద్ధక్రియ ఎవడు చేస్తాడో, వాడు యథావిత్రశ్రాద్ధం నిర్వహించినట్లే" అని ఔర్వుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే శ్రాద్ధనిర్వహణే పాత్రాపాత్రవిచారణం నామ చతుర్దశోఽధ్యాయః సమాప్తః ॥14॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో శ్రాద్ధనిర్వహణలో పాత్రాపాత్రవిచారణ అనే పద్నాల్గవ అధ్యాయం సమాప్తం ॥ 14 ॥



## పంచదశోऽధ్యాయః - పదునైదవ అధ్యాయం

## శ్రాద్ధభోక్తృ లక్షణాని - యోగిజనప్రశంసా చ - శ్రాద్ధభోక్తల లక్షణాలు - యోగిజనప్రశంస

**ఔర్వ ఉవాచ :-** ఔర్వుడు చెప్పాడు.

**బ్రాహ్మణాన్ భోజయేచ్ఛ్రాద్ధే యద్గుణాంస్తాన్నిబోధ మే ।**
**త్రిణాచికేతస్త్రిమధుస్త్రిసువర్ణః షడంగవిత్ ॥ 1 ॥**

**వేదవిచ్ఛ్రోత్రియో యోగీ తథా వై జ్యేష్ఠసామగః ।**
**ఋత్విక్స్వస్రేయదౌహిత్రజామాతృశ్వసురాస్తథా ॥ 2 ॥**

**మాతులోऽథ తపోనిష్ఠః పంచాగ్న్యభిరతస్తథా ।**
**శిష్యాః సమ్బన్ధినశ్చైవ మాతాపితృరతశ్చ యః ॥ 3 ॥**

**ఏతాన్ నియోజయేచ్ఛ్రాద్ధే పూర్వోక్తాన్ ప్రథమం నృపః ।**
**బ్రాహ్మణాన్ పితృపుష్ట్యర్థ మనుకల్పేష్వనన్తరాన్ ॥ 4 ॥**

నృపాలా! శ్రాద్ధవిధిలో ఏ యే గుణాలు గలిగిన బ్రాహ్మణులకు భోజనం పెట్టాలో చెబుతాను. నా ద్వారా ఆలకించు. త్రిణాచికేతుడు, త్రిమధుడు, త్రిసుపర్ణుడు, షడంగవిదుడు, వేదవేత్త, శ్రోత్రియుడు, యోగి, జ్యేష్ఠసామగాయకుడు, ఋత్విక్కు, మేనల్లుడు, దౌహిత్రుడు, అల్లుడు, మామ, మేనమామ, తపోనిష్ఠుడు, పంచాగ్నులను ఉపాసించువాడు, శిష్యులు, బంధువులు, తల్లిదండ్రులపై ప్రీతి కలిగినవారు. వీరిని శ్రాద్ధంలో భోక్తలుగా నియమించాలి. ఇందు ముందు మొదట చెప్పిన బ్రాహ్మణులను పూర్వక్రియలోను, తరువాతి వారిని ఉత్తర క్రియలోను పితృదేవతల సంతృప్తికోసమై నియోగించాలి.

**వి ॥** 1. వేదంలోని రెండవ కఠంలోని అయం వావయః పవతే మొదలైన మూడు అనువాకాలకు త్రిణాచికేతములనిపేరు. అవి చదివేవాడు త్రిణాచికేతుడు.

2. మధువాతాః మున్నగు ఋక్కులను చదివేవాడు త్రిమధుడు.

3. ఛాందోగ్యంలోని "బ్రహ్మమేతు మాం" అనే మూడు అనువాకాలను చదివేవాడు త్రిసుపర్ణుడు.

4. ఆహవనీయం, దక్షిణాగ్ని, గార్హపత్యం, సభ్యం, అవసథ్యం అనేవి పంచాగ్నులు లేదా ద్యుపర్జన్య పృథివీ పురుషయోషిద్రూప పంచాగ్నివిద్య.

**మిత్రధ్రుక్ కునఖీ క్లీబః శ్యావదన్తస్తథా ద్విజః ।**
**కన్యాదూషయితా వహ్నివేదోజ్ఝః సోమవిక్రయీ ॥ 5 ॥**

**అభిశస్తస్తథా స్తేనః పిశునో గ్రామయాజకః ।**
**భృతకాధ్యాపకస్తద్వత్ భృతకాధ్యాపితశ్చ యః ॥ 6 ॥**

**పరపూర్వాపతిశ్చైవ మాతాపిత్రోస్త్యథోజ్ఝకః ।**
**వృషలీసూతిపోష్టా చ వృషలీపతిరేవ చ ॥ 7 ॥**

**తథాదేవలకశ్చైవ శ్రాద్ధే నార్హన్తి కేతనమ్ ॥ 8 ॥**

మిత్రద్రోహం చేసినవాడు, చెడ్డ గోళ్లు కలిగినవాడు, నపుంసకుడు, నల్లని దంతాలు (పిప్పి పళ్ళు) కలిగినవాడు, కన్యలను పాడు చేసినవాడు, అగ్నిని వేదాలను విడిచి పెట్టినవాడు, సోమరసం అమ్మేవాడు, నలుగురిచే ఛీ అని నిందించబడేవాడు, దొంగ, చాడీకోరు, గ్రామపురోహితుడు, జీతం తీసుకొని వేదం చెప్పేవాడు, అలాగే జీతం చెల్లించి వేదం చదివేవాడు, రెండో పెండ్లి దానిని వివాహం చేసుకొన్నవాడు, తల్లిదండ్రులను విడిచిపెట్టినవాడు, శూద్రకాంతల సంతతిని పెంచేవాడు, శూద్రకాంతకు భర్త అయినవాడు, దేవాలయంలో దేవార్చనపై ఆధారపడి బ్రతికేవాడు – ఇటువంటి సమస్తబ్రాహ్మణులు శ్రాద్ధంలో భోజనానికి నియోగించడానికి తగినవారు కారు.

**ప్రథమేఽహ్ని బుధః శస్తాంఞ్ఛ్రోత్రియాదీన్ నిమన్త్రయేత్ ।**
**కథయేచ్చ తథైవైషాం నియోగాన్ పైత్ర్యదైవికాన్ ॥ 9 ॥**

శ్రాద్ధానికి ముందు రోజునే, బుద్ధిమంతుడైనవాడు ప్రశస్తి కెక్కిన శ్రోత్రియులు మున్నగువారిని ఆమంత్రణం చేయాలి. అదేవిధంగా వారికి పితృదేవస్థానమో, విశ్వేదేవస్థానమో నియోగించి చెప్పాలి.

**తతః క్రోధవ్యవాయాదీనాయాసం తైర్ద్విజైః సహ ।**
**యజమానో న కుర్వీత దోషస్తత్ర మహానయమ్ ॥ 10 ॥**

ఆ తరువాత శ్రాద్ధం పెట్టే యజమాని ఆ ద్విజులతో కోపగించ కూడదు. ఇంకనూ ఆ ద్విజులతో వ్యవాయము అనగా ఎడబాటు మొ॥నవి కలిగియుండరాదు. ఆ ద్విజులకు ఆయాసము అనగా శ్రమను కలిగించరాదు. అట్లు చేసినచో అది కర్తకు మిక్కిలి దోషమవుతుంది.

**శ్రాద్ధే నియుక్తో భుక్త్వా వా భోజయిత్వా నియుజ్య చ ।**
**వ్యవాయీ రేతసో గర్తే మజ్జయత్యాత్మనః పితౄన్ ॥ 11 ॥**

శ్రాద్ధ విషయంలో నియుక్తుడైన భోక్త భోజనం చేసి కాని, భోజనం పెట్టికాని, భోజనానికి నియోగించి కాని, స్త్రీసంగమం చేసికాని ప్రవర్తిస్తే తన పితరులను రేతఃకుండ మనే నరకంలో పడవేస్తాడు.

**తస్మాత్ ప్రథమమత్రోక్తం ద్విజాగ్ర్యాణాం నిమన్త్రణమ్ ।**
**అనిమన్త్ర్య ద్విజాన్ గేహమాగతాన్ భోజయేద్ యతీన్ ॥ 12 ॥**

కాబట్టి ముందురోజునే ద్విజశ్రేష్ఠులను శ్రాద్ధవిషయమై నిమంత్రించాలని చెప్పబడింది. ఆమంత్రణం చేయకుండా ఇంటికి కనుక ద్విజులు కాని, యతులు కాని వస్తే వారికి భోజనం పెట్టాలి.

**పాదశౌచాదినా గేహమాగతాన్ పూజయేత్ ద్విజాన్ ।**
**పవిత్రపాణిరాచాన్తానాసనేషూపవేశయేత్ ॥ 13 ॥**

ఇంటికి వచ్చిన ద్విజోత్తములను పాదప్రక్షాళనమున్నగు క్రియలతో పూజించాలి. పవిత్రమును ధరించిన హస్తంతో ఆచమనం చేయించి, వారిని ఆసనాలపై కూర్చోబెట్టాలి.

**పిత్రూణామయుజో యుగ్మాన్ దేవానామిచ్ఛయా ద్విజాన్ ।**
**దేవానామేకమేకం వా పిత్రూణాం చ నియోజయేత్ ॥ 14 ॥**

తన శక్తిని అనుసరించి పితృపక్షంలో ఇద్దరినికాని, దేవపక్షంలో ఇద్దరిని గాని బ్రాహ్మణులను నియమించాలి. అలా కాని పక్షంలో దేవపక్షంలో ఒకరిని, పితృపక్షంలో ఒకరిని బ్రాహ్మణులుగా నియోగించాలి.

**తథా మాతామహశ్రాద్ధం వైశ్వదేవసమన్వితమ్ ।**
**కుర్వీత భక్తిసమ్పన్న స్తన్త్రం వా వైశ్వదైవికమ్ ॥ 15 ॥**

అదేవిధంగా మాతామహశ్రాద్ధం వైశ్యదేవసహితంగా చేయాలి. అలా కాని పక్షంలో పితృపక్షం మాతామహపక్షం వారికి ఇద్దరికీ అత్యంత భక్తియుక్తుడై ఒకే వైశ్యదేవశ్రాద్ధం పెట్టాలి.

**ప్రాఙ్ముఖాన్ భోజయేత్ విప్రాన్ దేవానాముభయాత్మకాన్ ।**
**పితృమాతామహానాం చ భోజయేచ్చాప్యుదఙ్ముఖాన్ ॥ 16 ॥**

విశ్వేదేవతల స్థానంలో నియోగించిన విప్రులను తూర్పు ముఖంగా కూర్చోబెట్టి, పితృపక్ష మాతామహపక్ష స్థానంలో నిమంత్రించినవారిని ఉత్తర ముఖంగా కుర్చోబెట్టి భోజనం పెట్టాలి.

**పృథక్ తయోః కేచిదాహుః శ్రాద్ధస్య కరణం నృప! ।**
**ఏకత్రైకేన పాకేన వదన్త్యన్యే మహర్షయః ॥ 17 ॥**

నృపాలా! కొందరు పితృపక్షం వారికి, మాతామహపక్షం వారికి విడిగా శ్రాద్ధం నిర్వహించాలన్నారు. మరి కొందరు మహర్షులయితే ఒకేచోట ఒకేవంటతోనే శ్రాద్ధం పెట్టాలన్నారు.

**విష్టరార్థం కుశాన్ దత్వా సమ్పూజ్యార్ఘ్య విధానతః ।**
**కుర్యాదావాహనం ప్రాజ్ఞో దేవానాం తదనుజ్ఞయా ॥ 18 ॥**

ప్రాజ్ఞుడైనవాడు ఆసనం నిమిత్తం దర్భలు సమర్పించి, శాస్త్రవిధిచే పూజించి, అర్ఘ్యం ఇచ్చి, వారి అనుజ్ఞతో దేవతలను ఆవాహనం చేయాలి.

**యవామ్బునా చ దేవానాం దద్యాదర్ఘ్యం విధానవిత్ ।**
**స్రగ్గన్ధధూపదీపాంశ్చ తేభ్యో దద్యాద్ యథావిధి ॥ 19 ॥**

శ్రాద్ధవిధానవేత్త అయిన కర్త యవోదకంతో దేవతలకు అర్ఘ్యం ఇవ్వాలి. వారికి యథావిధిగా మాల్యం, గంధం, ధూపం, దీపం మున్నగునవి సమర్పించాలి.

**పిత్రూణామపసవ్యం తత్ సర్వమేవోపకల్పయేత్ ।**
**అనుజ్ఞాంశ్చ తతః ప్రాప్య దత్వా దర్భాన్ ద్విధా కృతాన్ ॥ 20 ॥**

**మన్త్రపూర్వం పితౄణాన్తు కుర్యాచ్చావాహనం బుధః ।**
**తిలామ్బునా చాపసవ్యం దద్యాదర్ఘ్యాదికం నృప! ॥ 21 ॥**

నృపాలా! పితృదేవతలకు దానిని అంతా అపసవ్యంగా నిర్వహించాలి. తరువాత వారి అనుజ్ఞ పొంది, రెండుగా చేసిన దర్భలు వారికి ఇచ్చి, బుధుడు పితరులను ముందు మంత్ర పూర్వకంగా ఆహ్వానం చేయాలి. తిలోదకంతో, అపసవ్యంగా వారికి అర్ఘ్యం మొదలైనవి ఈయాలి.

**కాలే తత్రాతిథిం ప్రాప్తమన్నకామం నృపాధ్వగమ్ ।**
**బ్రాహ్మణైరభ్యనుజ్ఞాతః కామం తమపి భోజయేత్ ॥ 22 ॥**

నృపాలా! ఆ సమయానికి అక్కడకు అన్నం కోరుకొని వచ్చిన అతిథి, బాటసారి అయినా కూడా బ్రాహ్మణులు అనుమతితో యథేచ్ఛగా భోజనం పెట్టాలి.

**యోగినో వివిధై రూపై ర్నరాణాముపకారిణః ।**
**భ్రమన్తి పృథివీమేతామవిజ్ఞాతస్వరూపిణః ॥ 23 ॥**

ఈ భూమండలంపై యోగులు మానవులకు ఉపకారం చేయాలని, తమ స్వరూపం తెలియనీయకుండా, నానావిధ రూపాలలో సంచరిస్తూ ఉంటారు.

**తస్మాదభ్యర్చయేత్ ప్రాప్తం శ్రాద్ధకాలేఽతిథిం బుధః ।**
**శ్రాద్ధక్రియాఫలం హన్తి నరేన్ద్రాపూజితోఽతిథిః ॥ 24 ॥**

నరేంద్రా! కాబట్టి వివేకశీలి అయిన వాడు శ్రాద్ధసమయంలో వచ్చిన అతిథిని సత్కరించాలి. అపుడు అతిథి పూజించబడక పోయినచో అతడు శ్రాద్ధక్రియాఫలాన్ని నాశనం చేస్తాడు.

**జుహుయాద్వ్యంజనక్షారవర్జమన్నం తతోఽనలే ।**
**అనుజ్ఞాతో ద్విజైస్తైస్తు త్రికృత్వః పురుషర్షభ! ॥ 25 ॥**

నరశ్రేష్ఠా! అనంతరం కూర, ఉప్పులేని అన్నాన్ని అగ్నిహోత్రంలో ఆ ద్విజుల అనుమతితో మూడు సార్లు హోమం చేయాలి.

**అగ్నయే కవ్యవాహాయ స్వాహేత్యాదౌ నృపాహుతిః ।**
**సోమాయ వై పితృమతే దాతవ్యా తదనన్తరమ్ ॥ 26 ॥**

**వైవస్వతాయ చైవాన్యా తృతీయా దీయతే తతః ।**
**హుతావశిష్టమల్పాల్పం పితృపాత్రేషు నిర్వపేత్ ॥ 27 ॥**

నృపాలా! "అగ్నయే కవ్యవాహాయ స్వాహా" అని మొదటి ఆహుతిని, "సోమాయ పితృమతే స్వాహా" అని తరువాతి దానిని, "వైవస్వతాయ స్వాహా" అని మూడవ ఆహుతిని ఈయాలి. అనంతరం హోమం చేయగా మిగిలిన బహుస్వల్పమైన అన్నం విప్రపాత్రలలో ఉంచాలి.

**తతోఽత్ర మిష్టమత్యర్థమభీష్టమతిసంస్కృతమ్ ।**
**దత్త్వా జుషధ్వమిచ్ఛాతో వాచ్యమేతదనిష్ఠురమ్ ॥ 28 ॥**

తరువాత మిక్కిలిరుచికల, ఇష్టపూర్వకమైన, చక్కగా వండిన, మధుర పదార్థాలతో కూడిన అన్నం వడ్డించి "కావలసింది భోజనం చేయండి" అని మృదువుగా చెప్పాలి.

**భోక్తవ్యం తైశ్చ తచ్చిత్తై ర్మౌనిభిః సుముఖైః సుఖమ్ ।**
**అక్రుధ్యతా చాత్వరతా దేయం తేనాపి భక్తితః ॥ 29 ॥**

భోక్తలు కూడా తదేక చిత్తులై, మౌనంగా, ప్రసన్న ముఖులై సుఖంగా భోజనం చేయాలి. కర్త కూడా భక్తితో కోపం లేకుండా, తొందర పెట్టకుండా పదార్థాలు వడ్డించాలి.

**రక్షోఘ్నమన్త్రపఠనం భూమేరాస్తరణం తిలైః ।**
**కృత్వా ధ్యేయాః స్వపితరస్త ఏవ ద్విజసత్తమాః ॥ 30 ॥**

రక్షోఘ్నమంత్రం పఠించి, భూమిపై తిలలు చల్లి, ఆ ద్విజశ్రేష్ఠులే తన పితరులని ధ్యానం చేయాలి.

**పితా పితామహశ్చైవ తథైవ ప్రపితామహః ।**
**మమ తృప్తిం ప్రయాన్త్వగ్నిహోమాప్యాయితమూర్తయః ॥ 31 ॥**

నేను చేసిన అగ్నిహోత్రం, హోమం వల్ల నా తండ్రి, నా తాత, నా ముత్తాత శరీరాలు పుష్టిచెంది తృప్తి చెందెదరుగాక !

**పితా పితామహశ్చైవ తథైవ ప్రపితామహః ।**
**తృప్తిం ప్రయాన్తు పిణ్డేన మయా దత్తేన భూతలే ॥ 32 ॥**

నా తండ్రి, నా పితామహుడు, నా ప్రపితామహుడు నేను భూతలం పై ఉంచిన పిండంతో తృప్తి చెందెదరుగాక!

**పితా పితామహశ్చైవ తథైవ ప్రపితామహః ।**
**తృప్తిం ప్రయాన్తు మే భక్త్యా యన్మయైతదుదాహృతమ్ ॥ 33 ॥**

శ్రాద్ధ సమయంలో ఏమీ పెట్టలేని అసమర్థుడనయి నందువల్ల నేను భక్తితో సమర్పించిన దానివల్ల నా తండ్రి, తాత, ముత్తాత తృప్తి చెందెదరుగాక !

**మాతామహస్తృప్తిముపైతు తస్య**
**తథా పితా తస్య పితా తథాఽన్యః ।**
**విశ్వే చ దేవాః పరమా ప్రయాన్తు**
**తృప్తిం ప్రణశ్యన్తు చ యాతుధానాః ॥ 34 ॥**

నా మాతామహుడు, ఆయన తండ్రి, అలాగే ఆయన తండ్రి, అలాగే మిగిలిన బ్రాహ్మణబృందం, విశ్వేదేవతలు పరమసంతృప్తి పొందెదరుగాక ! రాక్షసులు నశించెదరుగాక !

**యజ్ఞేశ్వరో హవ్యసమస్తకవ్య**
**భోక్తావ్యయాత్మా హరిరీశ్వరోఽ త్ర ।**
**తత్సన్నిధానా దపయాన్తు సద్యో**
**రక్షాంస్యశేషాణ్యసురాశ్చ సర్వే ॥ 35 ॥**

యజ్ఞేశ్వరుడు, సమస్తహవ్యకవ్యభోక్త, అవ్యయాత్ముడు, ఈశ్వరుడు అయిన శ్రీహరి ఇక్కడ ఉన్నాడు. కాబట్టి ఆయన ఈ సన్నిధానంలో ఉన్నందువల్ల అసురులందరూ, సమస్తరాక్షసులు వెంటనే తొలగి పోవుదురుగాక! – అని ధ్యానం చేయాలి.

**తృప్తేష్వేతేషు వికిరేదన్నం విప్రేషు భూతలే ।**
**దద్యాదాచమనార్థాయ తేభ్యో వారి సకృత్ సకృత్ ॥ 36 ॥**

ఆ విప్రులు తృప్తి పొందిన పిమ్మట భూతలంపై కొంచెం అన్నం చల్లాలి. వారి ఆచమనం కోసమై ఒక్కొక్కసారి నీళ్లు పోయాలి.

**సుతృప్తైస్తైరనుజ్ఞాతః సర్వేణాన్నేన భూతలే ।**
**సలిలేన తతః పిణ్డాన్ సమ్యగ్ దద్యాత్ సమాహితః ॥ 37 ॥**

భోక్తలు సంపూర్ణంగా తృప్తిచెంది అనుమతి ఇచ్చిన తరువాత తిలలు కలిపిన అన్నం అంతటితోనూ పిండాలు చేసి భూతలంపై సావధానచిత్తంతో చక్కగా ఉంచాలి.

**పితృతీర్థేన సతిలాన్ దద్యాదథ జలాంజలీన్ ।**
**మాతామహేభ్యస్తేనైవ పిణ్డాంస్తీర్థేన నిర్వపేత్ ॥ 38 ॥**

తరువాత పితృతీర్థంతో నువ్వులు కలిపి జలాంజలులు ఈయాలి. అలాగా మాతామహాదులకు కూడా పితృతీర్థంతోనే పిండప్రదానం చేయాలి.

**దక్షిణాప్రవణం చైవ ప్రయత్నేనోపపాదయేత్ ।**
**అవకాశేషు చోక్షేషు జలతీరేషు చైవ హి ॥ 39 ॥**

ఈ సమస్త కర్మలు సావధానపూర్వకంగా దక్షిణదిక్కుగా భూమిపై చేయాలి. జలాశయతీరంలోకాని, లేదా మిగిలిన ఉత్తమపరిశుభ్రస్థానంలోకాని చేయాలి.

**దక్షిణాగ్రేషు దర్భేషు పుష్పధూపాదిపూజితమ్ ।**
**స్వపిత్రే ప్రథమం పిణ్డం దద్యాదుచ్ఛిష్టసన్నిధౌ ॥ 40 ॥**

దర్భలు దక్షిణాగ్రాలుగా పరచి, ఉచ్ఛిష్టం దగ్గరే తన తండ్రికి మొదట పిండం ఉంచి పుష్పధూపాది పూజలు సమర్పించాలి.

**పితామహాయ చైవాన్యత్ తత్పిత్రే చ తథా పరమ్ ।**
**దర్భమూలే లేపభుజః ప్రీణయేల్లేపఘర్షణైః ॥ 41 ॥**

పితామహునికి వేరొక పిండం, అలాగే ప్రపితామహునికి మరొక పిండం ఉంచాలి. దర్భల మొదలుచేతికి అంటిన అన్నంచల్లి "లేపభాగ భుజః పితరః తృప్యంతాం" అంటూ లేపభోజులైన పితృదేవతలకు తృప్తి కలిగించాలి.

**పిణ్డైర్మాతామహాంస్తద్వద్ గన్ధమాల్యాదిసంయుతైః ।**
**పూజయిత్వా ద్విజాగ్ర్యాణాం దద్యాచ్చాచమనం తతః ॥ 42 ॥**

అదేవిధంగా మాతామహాదులకు పిండాలు సమర్పించి గంధమాల్యాదులతో పూజించాలి. అనంతరం ద్విజశ్రేష్ఠులచే ఆచమనం చేయించాలి.

**పితృభ్యః ప్రథమం భక్త్యా తన్మనస్కో నరేశ్వర! ।**
**సుస్వధేత్యాశిషా యుక్తాం దద్యాచ్ఛక్త్యా చ దక్షిణామ్ ॥ 43 ॥**

సగరరాజేంద్రా! ముందు భక్తితో పితృదేవతల యందు మనస్సు ఉంచినవాడై "సుస్వధా" అనే ఆశీర్వాదం పొందుతూ, శక్తిని అనుసరించి భోక్తలకు దక్షిణ ఈయాలి.

**దత్త్వాచ దక్షిణాం తేభ్యో వాచయేద్వైశ్వదేవికాన్ ।**
**ప్రీయన్తామిహ యే విశ్వేదేవాస్తేన ఇతీరయేత్ ॥ 44 ॥**

విశ్వేదేవస్థానంలో ఉన్న బ్రాహ్మణులకు కూడా దక్షిణ ఇచ్చి,"దీనితో ఇక్కడ విశ్వేదైవతలు తృప్తి పొందుదురుగాక!" అని పలకాలి.

**తథేతి చోక్తే తైర్విప్రైః ప్రార్థనీయా స్తథాశిషః ।**
**పశ్చాద్విసర్జయేద్ దేవాన్ పూర్వం పైత్ర్యాన్మహీపతే! ॥ 45 ॥**

మహీపతే! ఆ బ్రాహ్మణులు "తథాస్తు" అన్న తరవాత వారి ఆశీర్వాదాలను కోరాలి. అనంతరం ముందు పితరులను, పిమ్మట దేవతలను సాగనంపాలి.

**మాతామహానామప్యేవం సహదేవైః క్రమః స్మృతః ।**
**భోజనే చ స్వశక్త్యా చ దానే తద్వద్ విసర్జనే ॥ 46 ॥**

మాతామహాదులకు కూడా ఈవిధంగానే విశ్వేదేవతలతో కలిపి భోజనం పెట్టడంలోను, తన శక్తిని అనుసరించి దక్షిణ ఈయడంలోను, అదే విధంగా సాగనంపటంలోను క్రమం చెప్పబడింది.

**ఆపాదశౌచనాత్ పూర్వం కుర్యాద్దేవద్విజన్మసు ।**
**విసర్జనస్తు ప్రథమం పైత్రమాతామహేషు వై ॥ 47 ॥**

పాదాలు కడగడం నుంచి ముందు దేవస్థానీయులైన ద్విజులకు అర్చనం చేయాలి. విసర్జనం మాత్రం పితృమాతామహులకు ముందు నిర్వహించాలి.

**విసర్జయేత్ ప్రీతివచః సమ్మానాభ్యర్చితాంస్తతః ।**
**నివర్తేతాభ్యనుజ్ఞాత ఆద్వారాన్తాదనువ్రజేత్ ॥ 48 ॥**

తరవాత ప్రీతినిచ్చే మాటలతో, సన్మాన పూర్వకంగా వారిని సాగనంపాలి. ద్వారం వరకు వారి వెనుకనే నడచి వెళ్లి, వారు అనుమతి ఇచ్చిన తరవాత మళ్లీ తిరిగి రావాలి.

**తతస్తు వైశ్వదేవాఖ్యాం కుర్యాన్నిత్యక్రియాం బుధః ।**
**భుంజీయాచ్చ సమం పూజ్యభృత్యబన్ధుభిరాత్మనః ॥ 49 ॥**

అటు తరువాత బుద్ధిమంతుడు వైశ్వదేవం అనే నిత్యక్రియను ఆచరించాలి. పిమ్మట పూజ్యులతో, భృత్యులతో, బంధువులతో బాటుగా తాను భుజించాలి.

**ఏవం శ్రాద్ధం బుధః కుర్యాత్ పైత్ర్యం మాతామహం తథా ।**
**శ్రాద్ధైరాప్యాయితా దద్యుః సర్వాన్ కామాన్ పితామహాః ॥ 50 ॥**

బుద్ధిమంతుడయినవాడు ఈరీతిగా పితృశ్రాద్ధమయినా, మాతామహశ్రాద్ధమయినా నిర్వహించాలి. పితామహాదులు శ్రాద్ధం వల్ల తృప్తినందిన వారై అన్ని కోరికలను తీరుస్తారు.

**త్రీణి శ్రాద్ధే పవిత్రాణి దౌహిత్రః కుతపస్తిలాః ।**
**రజతస్య తథాదానం కథాసంకీర్తనాదికమ్ ॥ 51 ॥**

శ్రాద్ధక్రియలో దౌహిత్రుడు, కుతపకాలం (పగటిలో ఎనిమిదో ముహూర్తం), తిలలు ఈ మూడూ పవిత్రమైనవి. అలాగే రజతదానం, వారి కథాసంకీర్తనాదులు కూడా పావనమైనవే.

**వర్జ్యాని కుర్వతా శ్రాద్ధం కోపోఽధ్వగమనం త్వరా ।**
**భోక్తురప్యత్ర రాజేన్ద్ర! త్రయమేతన్న శస్యతే ॥ 52 ॥**

సగరరాజేంద్రా! శ్రాద్ధం పెట్టే కర్త కోపం, మార్గగమనం, తొందరబాటు విడిచివేయాలి. ఈ మూడు భోక్తకు కూడా ప్రశస్తములు కావు.

**విశ్వేదేవాః స్వపితరస్తథా మాతామహా నృప ।**
**కులం చాప్యాయతే పుంసాం సర్వం శ్రాద్ధం ప్రకుర్వతామ్ ॥ 53 ॥**

నృపాలా! విశ్వేదేవతలు, పితృదేవతలు, మాతామహులు కూడా శ్రాద్ధం నియమబద్ధంగా నిర్వహించేవారి వంశాన్ని అంతటినీ, శ్రాద్ధం పెట్టే వారిని వృద్ధిపొందిస్తారు.

**సోమాధారః పితృగణో యోగాధారస్తు చన్ద్రమాః ।**
**శ్రేష్ఠయోగి నియోగస్తు తస్మాద్ భూపాల! శస్యతే ॥ 54 ॥**

అవనీపాలకా! పితృగణం అంతా సోమునిపై ఆధారపడి ఉంది. చంద్రుడు యోగధారుడై ఉన్నాడు. కాబట్టి శ్రాద్ధంలో యోగిని నియోగించడం మిక్కిలి శ్రేష్ఠమయినది.

**సహస్రస్యాపి విప్రాణాం యోగీచేత్ పురతః స్థితః ।**
**సర్వాన్ భోక్తౄంస్తారయతి యజమానం తథా నృప! ॥ 55 ॥**

నృపాలా! వేయిమంది విప్రుల ముందు ఒక యోగి నిలబడితే, ఆ యోగి యజమానుని, భోక్తలను, అందరినీ తరింపజేస్తాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే శ్రాద్ధభోక్తృ లక్షణాని – యోగిజనప్రశంసా చేతి పంచదశోఽధ్యాయః సమాప్తః ॥ 15 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో శ్రాద్ధభోక్తల లక్షణాలు – యోగిజనప్రశంస అనే పదునైదవ అధ్యాయం సమాప్తం. ॥ 15 ॥



## షోడశోఽధ్యాయః - పదునారవ అధ్యాయం

## శ్రాద్ధే మధుమాంసాది దానఫలమ్ - శ్రాద్ధంలో మధుమాంసాది దానఫలం

**హవిష్యమత్స్యమాంసైస్తు శశస్య శకునస్య చ ।**
**సౌకరచ్ఛాగలైణేయ రౌరవైర్గవయేన చ ॥ 1 ॥**
**ఔరభ్రగవ్యైశ్చ తథా మాసవృద్ధ్యా పితామహాః ।**
**ప్రయాన్తి తృప్తిం మాంసైస్తు నిత్యం వార్ధ్రీణసామిషైః ॥ 2 ॥**

ఔర్వుడు చెబుతూ"హవిష్యం, మత్స్యాలు, మాంసాలు, కుందేలు, పక్షి, వరాహం, మేక, కస్తూరిమృగం, కృష్ణమృగం, గవయమృగం, గొఱ్ఱె–వీటి మాంసాలు, ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునేయి –వీటితో పితృగణాలు క్రమంగా ఒక్కొక్క నెలకూ అధికంగా కలిపే మాంసాలతో ఎక్కువ తృప్తిని పొందుతూ ఉంటారు. కాని వార్ధ్రీణపక్షిమాంసంద్వారా సదా సంతృప్తి పొందుతూ ఉంటారు.

**ఖడ్గమాంసమతీవాత్ర కాలశాకం తథా మధు ।**
**శస్తాని కర్మణ్యత్యన్త తృప్తిదాని నరేశ్వర ॥ 3 ॥**

సగరరాజేంద్రా! శ్రాద్ధక్రియలో ఖడ్గమృగమాంసం, కాలశాకం, తేనె మిక్కిలి తృప్తి కలిగించేవి. అత్యంత ప్రశస్తమైనవి.

**విశే :** కాలశాకం – కరివేప అని కొందరి భావం.

**గయాముపేత్య యః శ్రాద్ధం కరోతి పృథివీపతే! ।**
**సఫలం తస్య తజ్జన్మ జాయతే పితృతుష్టిదమ్ ॥ 4 ॥**

మహీపతీ! గయకువెళ్లి పితృదేవతలకు తృప్తి దాయకంగా శ్రాద్ధం పెడితే అతని జన్మ సఫలం అవుతుంది.

**ప్రశాన్తికాః సనీవారాః శ్యామాకా ద్వివిధా స్తథా ।**
**వన్యౌషధీప్రధానాస్తు శ్రాద్ధార్హాః పురుషర్షభ! ॥ 5 ॥**

పురుషపుంగవా! దేవధాన్యం, నీవారధాన్యం, నల్లని తెల్లని చామలు, వనంలో లభించే ప్రధానములైన ఔషధులు శ్రాద్ధక్రియలో ఉపయోగించదగినవి.

**యవాః ప్రియంగవో ముద్గా గోధూమా వ్రీహయస్తిలాః ।**
**నిష్పావాః కోవిదారాశ్చ సర్షపాశ్చాత్ర శోభనాః ॥ 6 ॥**

యవలు, కొఱ్ఱలు, పెసలు, గోధుమలు, వరిబియ్యం, నూవులు, అనుములు, కోవిదారాలు, ఆవాలు – ఇవి శ్రాద్ధక్రియలో పరమప్రశస్తమైనవి.

**అకృతాగ్రయణం యచ్చ ధాన్యజాతం నరేశ్వర ।**
**రాజమాషానణూంశ్చైవ మసూరాంశ్చ వివర్జయేత్ ॥ 7 ॥**

నరేంద్రా! ఆగ్రయణేష్టిచే సంస్కరించబడని ధాన్యం నుండి వచ్చే బియ్యం, అలచందలు, చిరువడ్లు (బుడమధాన్యం) చిరుసెనగలు వీటిని శ్రాద్ధక్రియలో విడిచిపెట్టాలి.

**అలాబుం గుంజనం చైవ పలాణ్డుం పిణ్డమూలకమ్ ।**
**గాన్ధారకం కరమ్భాణి లవణాన్యౌషరాణి చ ॥ 8 ॥**
**ఆరక్తాశ్చైవ నిర్యాసాః ప్రత్యక్షలవణాని చ ।**
**వర్జ్యాన్యేతాని వై శ్రాద్ధే యచ్చ వాచా న శస్యతే ॥ 9 ॥**

ఆనపకాయ, వెల్లుల్లి, ఉల్లిపాయ, ముల్లంగి జాతి దుంప, గాంధారకమనే వరి, పొట్టులేని ధాన్యపు పిండి, ఎడారి ఉప్పులు, ఎర్రనైన ఇంగువవంటి పదార్థాలు, కేవలం ఉప్పుతో చేసే పదార్థాలు, వీటిని, వాడుకలో వినియోగించని వాటిని శ్రాద్ధకర్మలో విడిచి వేయాలి.

**నక్తాహృతం నచోత్సృష్టం తృప్యతే న చ యత్ర గౌః ।**
**దుర్గన్ధి ఫేనిలం చామ్బు శ్రాద్ధయోగ్యం న పార్థివ । 10 ॥**

పార్థివా! రాత్రి తెచ్చినది, ప్రసిద్ధి వహించని జలాశయాలలోనివి, ఆవుకు తృప్తినీయనిది, కంపు కొట్టేది, నురుగుతో ఉన్నది అయిన నీరు శ్రాద్ధంలో ఉపయోగించడానికి తగినటు వంటిది కాదు.

**క్షీరమేకశఫానాం యదౌష్ట్రమావికమేవ చ ।**
**మార్గం చ మాహిషం చైవ వర్జయేచ్ఛ్రాద్ధ కర్మణి ॥ 11 ॥**

ఒంటిగిట్ట కలిగిన జంతువులు, ఒంటెలు, మేకలు, లేడి, గేదె-వీటి పాలు శ్రాద్ధ కర్మలలో విడిచిపెట్టాలి.

**షణ్డాపవిద్ధచాణ్డాలపాషణ్డోన్మత్తరోగిభిః ।**
**కృకవాకుశ్వనగ్నైశ్చ వానరగ్రామసూకరైః ॥ 12 ॥**
**ఉదక్యాసూతకాశౌచి మృతహారైశ్చ వీక్షితే ।**
**శ్రాద్ధే సురా న పితరో భుంజతే పురుషర్షభ! ॥ 13 ॥**

పురుషశ్రేష్ఠా! నపుంసకులు, సజ్జనులచే వెలివేయబడ్డవారు, చండాలురు, పాషండులు, ఉన్మత్తులు, రోగులు, కుక్కుటములు(కోడి), కుక్కలు, నగ్నులు (వైదిక కర్మలు విడిచినవారు), కోతులు, ఊరపందులు, రజస్వలలు, జన్మాశౌచ మృతాశౌచాలలో ఉన్నవారు, శవాలను మోసేవారు - వీరిని శ్రాద్ధసమయంలో చూస్తే విశ్వేదేవతలు కాని, పితృదేవతలు కాని భోజనం చేయరు.

**తస్మాత్ పరిశ్రితే కుర్యాచ్ఛ్రాద్ధం శ్రద్ధాసమన్వితః ।**
**ఉర్వ్యాం చ తిలవిక్షేపాద్ యాతుధానాన్ నివారయేత్ ॥ 14 ॥**

కాబట్టి చుట్టూ ఆవరణం కలచోట శ్రద్ధతో కూడుకొన్నవాడై శ్రాద్ధకర్మ నిర్వహించాలి. నేలపై నూవులు చల్లి రాక్షసులు లేకుండా, రాకుండా చూచుకోవాలి.

**న పూతి నైవోపపన్నం కేశకీటాదిభిర్నృప ।(నఖాదినా)**
**నచైవాభిషవైర్మిశ్రమన్నం పర్యుషితం తథా ॥ 15 ॥**

నృపాలా! చెడువాసనతో కూడుకొన్న, వెంట్రుకలు, పురుగులు, గోళ్లు మున్నగు వానితో నిండి యున్న, కల్లు(పులిసిన కడుగు) కలిసిన, పాసిపోయిన పదార్థాలతో వండిన అన్నం పెట్టరాదు.

**శ్రద్ధాసమన్వితైర్దత్తం పితృభ్యో నామగోత్రతః ।**
**యదాహారాస్తు తే జాతాస్తదాహారత్వమేతి తత్ ॥ 16 ॥**

పితృగణాలకు నామం, గోత్రం చెప్పి శ్రద్ధతో సమర్పించిన ఆహారం ఏదయితే ఉందో, వారు ఏలోకంలో ఏ ఆహారం తినేవారిగా పుట్టారో అది ఆ ఆహారంగా మారి వారికి చెందుతుంది.

**శ్రూయతే చాపి పితృభిర్గీతా గాథా మహీపతే! ।**
**ఇక్ష్వాకోర్మనుపుత్రస్య కలాపోపవనే పురా ॥ 17 ॥**

ధరణీపతీ! పూర్వం మనువు కుమారుడైన ఇక్ష్వాకుని కలాపమనే ఉద్యానవనంలో పితృగణంచే గానం చేయబడ్డ గాథ ఒకటి వినవస్తున్నది.

**అపి నస్తే భవిష్యన్తి కులే సన్మార్గగామినః ।**
**గయాముపేత్య యే పిణ్డాన్ దాస్యన్త్యస్మాకమాదరాత్ ॥ 18 ॥**

మా వంశంలో సన్మార్గంలో నడుస్తూ, గయకు వెళ్లి మాకు ప్రీతితో పిండప్రదానం చేసేవారు జన్మిస్తారా?

**అపి నః స్వకులే జాయాద్ యో నో దద్యాత్ త్రయోదశీమ్ ।**
**పాయసం మధుసర్పిభ్యాం వర్షాసు చ మఘాసు చ ॥ 19 ॥**

వర్షాకాలంలో, మఘానక్షత్రంతో కలిసిన త్రయోదశి నాడు మా పితృదేవతలను ఉద్దేశించి తేనెతో, నేయితో పాయసం అర్పించే వాడు ఎవడయినా మా వంశంలో జన్మిస్తాడా ?

**గౌరీం వాఽప్యుద్వహేత్ కన్యాం నీలం వా వృషముత్సృజేత్ ।**
**యజేత వాశ్వమేధేన విధివద్దక్షిణావతా ॥ 20 ॥**

(గౌరిని) పది సంవత్సరాల బాలికను కన్యాదానం చేసేవాడు కాని, నీలవృషభాన్ని ఉత్సర్జనం చేసే వాడుకాని, యథావిధిగా దక్షిణలు ఇచ్చి అశ్వమేధం చేసేవాడు కాని మా అన్వయంలో ఉద్భవిస్తాడా? అని గానం చేస్తూ ఉంటారని సగరునకు తెలియజేశాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే శ్రాద్ధే మధుమాంసాదిదానఫలం నామ షోడశోఽధ్యాయః సమాప్తః ॥ 16 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో శ్రాద్ధంలో మధుమాంసాది దానఫలం అనే పదునారవ అధ్యాయం సమాప్తం ॥ 16 ॥

## సప్తదశోఽధ్యాయః - పదిహేడవ అధ్యాయం

## విష్ణుస్తుతిః - మాయామోహోత్పత్తిశ్చ - విష్ణుస్తుతి - మాయామోహోత్పత్తి

**శ్రీ పరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ఇత్యాహ భగవానౌర్వః సగరాయ మహాత్మనే ।**
**సదాచారాన్ పురా సమ్యఙ్ మైత్రేయ! పరిపృచ్ఛతే ॥ 1 ॥**

**మయాప్యేతదశేషేణ కథితం భవతే ద్విజ! ।**
**సముల్లంఘ్య సదాచారం కశ్చిన్నాప్నోతి శోభనమ్ ॥ 2 ॥**

"మైత్రేయా! పూర్వకాలంలో తనకు సదాచారాలను గూర్చి చక్కగా తెలియజేయవలసిందని అడిగిన మహాత్ముడైన సగరునకు భగవానుడైన ఔర్వుడు ఇదంతా వివరించాడు" అని పరాశరుడు ఇలా చెప్పాడు. "ద్విజోత్తమా! నేను కూడా సమస్తం నీకు యథాతథంగా వివరించాను. సదాచారం లేకుండా ఎవడూ శుభాన్ని పొందలేడు" అని చెప్పాడు.

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అన్నాడు.

**షణ్డాపవిద్ధప్రముఖా విదితా భగవన్! మయా ।**
**ఉదక్యాద్యాశ్చ యే సర్వే నగ్నమిచ్ఛామి వేదితుమ్ ॥ 3 ॥**

"భగవంతుడా! షండుడు, అపవిద్ధుడు మున్నగువారిని గురించి నాకు తెలిసి ఉన్నదే. అలాగే రజస్వల మొదలయిన వారంటే కూడా నాకు తెలుసు. కాని నగ్న స్వరూపాన్ని గురించి మాత్రం నీద్వారా వినగోరుతున్నాను.

**కో నగ్నః కిం సమాచారో నగ్నసంజ్ఞాం నరో లభేత్ ।**
**నగ్నస్వరూప మిచ్ఛామి యథావత్ గదితం త్వయా ॥ 4 ॥**
**(శ్రోతుం ధర్మభృతాం శ్రేష్ఠ! న హ్యస్త్యవిదితం తవ)**

ధర్మజ్ఞులలో శ్రేష్ఠుడువైన పరాశరమునీంద్రా! నగ్నుడు అనగా ఎవడు? ఆతని నడవడిక ఎటువంటిది? ఎటువంటి నరుడు నగ్నుడు అనే పేరుతో వ్యవహరించబడతాడు? నగ్నస్వరూపం ఎటువంటిదో వాస్తవంగా నీవు చెబుతూ ఉండగా వినాలని కోరుకొంటున్నాను. నీకు తెలియనిది ఏమీ ఉండదు కదా!" అని మైత్రేయుడు ప్రార్థించాడు.

**పరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ఋగ్యజుఃసామసంజ్ఞేయం త్రయీ వర్ణావృతిర్ద్విజ! ।**
**ఏతాముజ్ఝతి యో మోహాత్ స నగ్నః పాతకీ స్మృతః ॥ 5 ॥**

ద్విజశ్రేష్ఠా! ఋగ్యజుస్సామవేదాలు మూడూ వేదత్రయి అనబడతాయి. అది ఆయా వర్ణాలకు ఆవరణవంటిది. మోహంవల్ల ఈ ఆవరణ విడిచినవాడే నగ్నుడు. వాడు మహాపాపి అవుతాడు.

**త్రయీ సమస్తవర్ణానాం ద్విజ! సంవరణం యతః ।**
**నగ్నో భవత్యుజ్ఝితాయామతస్తస్యాం న సంశయః ॥ 6 ॥**

ద్విజప్రవరా! సమస్తవర్ణాల వారిని వేదత్రయి కప్పి ఉంచుతుంది. కాబట్టి అజ్ఞానంచే దానిని విడిచిపెట్టేవాడు నగ్నుడవుతాడు. అందు లేశము కూడా సందేహం లేదు.

**ఇదం చ శ్రూయతామన్యద్ భీష్మాయ సుమహాత్మనే ।**
**కథయామాస ధర్మజ్ఞో వసిష్ఠోऽస్మత్పితామహః ॥ 7 ॥**

ఇది కూడా మరో విషయం. చెబుతాను. ఆలకించు. నా పితామహుడైన ధర్మజ్ఞుడగు వసిష్ఠుడు ఒకప్పుడు జ్ఞాని అయిన మహాత్ముడగు భీష్మునికి చెప్పాడు.

**మయాऽపి తస్య గదతః శ్రుతమేతన్మహాత్మనః ।**
**నగ్నసమ్బన్ధి మైత్రేయ! యత్ పృష్టోऽహమిహ త్వయా ॥ 8 ॥**

మైత్రేయా! ఆ మహాత్ముడు చెబుతూ ఉండగా నేను వినడం జరిగింది. అది నన్ను నీవడిగిన నగ్న విషయానికి సంబంధించినదే.

**దేవాసుర మభూద్ యుద్ధం దివ్యమబ్దం పురా ద్విజ! ।**
**తస్మిన్ పరాజితా దేవా దైత్యైర్హ్లాదపురోగమైః ॥ 9 ॥**

ద్విజోత్తమా! పూర్వం దేవాసురులకు యుద్ధం ఒక వంద దివ్యసంవత్సరాలు జరిగింది. అందు హ్లాదుడు మున్నగు దైత్యులచే దేవతలు ఓడిపోయారు.

**క్షీరోదస్యోత్తరం కూలం గత్వాऽతప్యన్త వై తపః ।**
**విష్ణోరారాధనార్థాయ జగుశ్చేమం స్తవం తదా ॥ 10 ॥**

అపుడు దేవతలు పాలసంద్రం ఉత్తరతీరం చేరి తపస్సు చేశారు. విష్ణుప్రీతి కొరకై వారు ఇలా స్తోత్రం చేశారు కూడా.

**ఆరాధనాయ లోకానాం విష్ణోరీశస్య యాం గిరమ్ ।**
**వక్ష్యామో భగవానాద్యస్తయావిష్ణుః ప్రసీదతు ॥ 11 ॥**

లోకేశ్వరుడైన విష్ణుని ఆరాధనం కోసమై మేము చెప్పే ఈ స్తోత్రవాక్యాలతో భగవంతుడైన విష్ణువు ఇపుడు ప్రసన్నుడగు గాక!

**యతో భూతాన్యశేషాణి ప్రసూతాని మహాత్మనః ।**
**యస్మింశ్చ లయమేష్యన్తి కస్తం స్తోతుమిహేశ్వరః ॥ 12 ॥**

ఏ మహాత్ముని వల్ల సమస్తభూతాలు ప్రభవిస్తూ ఉంటాయో, చివరకు ఎవనిలో లయమైపోతాయో, అట్టి పరమేశ్వరుని స్తుతించడానికి ఇక్కడ ఎవడు సమర్థుడు?

**తథాప్యరాతివిధ్వంసధ్వస్తవీర్యాఽభయార్థినః ।**
**త్వాం స్తోష్యామ స్తవోక్తీనాం యాథార్థ్యం నైవ గోచరే ॥ 13 ॥**

సమర్థులం కాకపోయినా, శత్రువులు మమ్మల్ని నాశనం చేసి నందున ధ్వంసమైపోయిన తేజస్సుకల మేము అభయం కోరి నిన్ను స్తోత్రం చేస్తున్నాము. నీ యథార్థస్వరూపం వాక్కులకు గోచరమయ్యేది కాదు.

**త్వముర్వీ సలిలం వహ్నిర్వాయురాకాశమేవ చ ।**
**సమస్తమన్తఃకరణం ప్రధానం తత్పరః పుమాన్ ॥ 14 ॥**

భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, అహంకారం(అంతఃకరణం), ప్రధానం(ప్రకృతి), దాని కన్న పరమమైన పురుషుడూ అంతా నీవే.

**ఏకం తవైతద్ భూతాత్మన్! మూర్తామూర్తమయం వపుః ।**
**ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం స్థానకాలవిభేదవత్ ॥ 15 ॥**

భూతస్వరూపా! దేశకాలభేదంతో కూడుకొన్న, బ్రహ్మ మొదలు తృణపర్యంతం గోచరించే ఇదంతా నీదైన మూర్తం, అమూర్తం అయినట్టి ఏకశరీరమే.

**తత్రేశ! తవ యత్పూర్వం త్వన్నాభికమలోద్భవమ్ ।**
**రూపం విశ్వోపకారాయ తస్మై బ్రహ్మాత్మనే నమః ॥ 16 ॥**

ఈశ్వరా! అందు పూర్వం నీ నాభిపద్మంలోనుంచి జగత్తు ఉపకారంకోసమై సంభవించిన రూపం ఏదయితే ఉన్నదో, అట్టి బ్రహ్మస్వరూపానికి నమస్కారం.

**శక్రార్కరుద్రవస్వశ్విమరుత్సోమాదిభేదవత్ ।**
**వయమేతత్ స్వరూపం యత్ తస్మై దేవాత్మనే నమః ॥ 17 ॥**

శక్రుడు, అర్కుడు, రుద్రులు, వసువులు, అశ్వినులు, మరుత్తులు, సోముడు మొదలైన భేదాలుకల మేము ఏదికలదో అది నీ స్వరూపమే. అట్టి దేవస్వరూపునికి వందనం.

**దమ్భప్రాయమసమ్బోధి తితిక్షాదమవర్జితమ్ ।**
**యద్రూపం తవ గోవిన్ద! తస్మై దైత్యాత్మనే నమః ॥ 18 ॥**

గోవిందా! కపటమయం, అజ్ఞానయుక్తం అయిన, ఓర్పు, ఇంద్రియనిగ్రహం లేకుండా ఉండే నీ మాయామయరూపం ఏదయితే ఉందో, అటువంటి దైత్యస్వరూపానికి ప్రణామం.

**నాతిజ్ఞానవహా యస్మిన్ నాడ్యః స్తిమితతేజసి ।**
**శబ్దాదిలోభి యత్తస్మై తుభ్యం యక్షాత్మనే నమః ॥ 19 ॥**

మిక్కిలి స్వల్పమైన తేజస్సు కలిగి, అత్యన్త జ్ఞానవాహినులు కాని నాడులతో, శబ్దాదులపై లోభంతో ఉండే నీరూపం ఏదయితే ఉందో, అటువంటి యక్షస్వరూపునికి నమస్కృతి.

**క్రౌర్యమాయామయం ఘోరం యచ్చ రూపం తవాసితమ్ ।**
**నిశాచరాత్మనే తస్మై నమస్తే పురుషోత్తమ! ॥ 20 ॥**

పురుషోత్తమా! క్రౌర్యయుక్తం, మాయామయం, ఘోరం, నల్లనిది అయిన నీ రూపం ఏదయితే ఉందో, అట్టి నీ నిశాచరస్వరూపానికి నమోవాకం.

**స్వర్గస్థధర్మిసద్ధర్మఫలోపకరణం తవ ।**
**ధర్మాఖ్యం చ తథారూపం నమస్తస్మై జనార్దన! ॥ 21 ॥**

జనార్దనా! స్వర్గలోకంలో ఉన్న ధార్మికులకు సద్ధర్మఫలసాధనమైన ధర్మమనే పేరుగల్గిన నీరూపం ఏదయితే ఉన్నదో, అట్టి ధర్మస్వరూపానికి ప్రణతి.

**హర్షప్రాయమసంసర్గి గతిమద్ గమనాదిషు ।**
**సిద్ధాఖ్యం తవ యద్రూపం తస్మై సిద్ధాత్మనే నమః ॥ 22 ॥**

ఆనందప్రచురము, దేనితోనూ సంబంధము లేనిది, చలించేవానియందు చలించేది అగు సిద్ధమనే నీ రూపానికి నమస్కారము.

**అతితిక్షాయనం క్రూరముపభోగసహం హరే! ।**
**ద్విజిహ్వం తవ యద్రూపం తస్మై నాగాత్మనే నమః ॥ 23 ॥**

శ్రీహరీ! ఓర్పులేనిది, క్రూరమయినది, భోగసహిష్ణుత కలిగినది, రెండు నాలుకలు కలిగినది అయిన నీ నాగస్వరూపానికి నమస్కారం.

**అవబోధి చ యచ్ఛాన్తమదోషమపకల్మషమ్ ।**
**ఋషిరూపాత్మనే తస్మై విష్ణో రూపాయ తే నమః ॥ 24 ॥**

మహావిష్ణూ! జ్ఞానస్వరూపం, పరమశాంతం, దోషశూన్యం, నిష్కల్మషం అయిన నీ ఋషిరూపం ఏదయితే ఉందో, దానికి సన్నుతి.

**భక్షయత్యథ కల్పాన్తే భూతాని యదవారితమ్ ।**
**త్వద్రూపం పుణ్డరీకాక్ష! తస్మై కాలాత్మనే నమః ॥ 25 ॥**

పుండరీకముల వంటి(పద్మాలవంటి) కన్నులు కలవాడా! కల్పాంత సమయంలో అడ్డు, ఆపు లేకుండా సమస్తభూతాలను భక్షించే నీ రూపం ఏదయితే ఉన్నదో, అట్టి కాలస్వరూపానికి ప్రణతి.

**సమ్భక్ష్య సర్వభూతాని దేవాదీన్యవిశేషతః ।**
**నృత్యత్యన్తే చ యద్రూపం తస్మై రుద్రాత్మనే నమః ॥ 26 ॥**

ప్రళయాంతంలో ఏ తేడా లేకుండా సామాన్యభావంతో దేవాదిసమస్తభూతాలను భక్షించి నృత్యం చేసే నీ రూపం ఏదయితే ఉన్నదో, అట్టి రుద్రరూపానికి జోహారు.

**ప్రవృత్త్యా రజసో యచ్చ కర్మణాం కారకాత్మకమ్ ।**
**జనార్దన! నమస్తస్మై త్వద్రూపాయ నరాత్మనే ॥ 27 ॥**

జనార్దనా! రజోగుణ ప్రవృత్తితో సమస్త కర్మలకు కారణాత్మకమైన సాధనరూపం ఏదయితే ఉన్నదో అట్టి నరస్వరూపానికి దండాలు.

**అష్టావింశద్వధోపేతం యద్రూపం తామసం తవ ।**
**ఉన్మార్గగామి సర్వాత్మన్! తస్మై పశ్వాత్మనే నమః ॥ (వశ్యాత్మనే) 28 ॥**

సర్వాత్మా! ఇరవై ఎనిమిది వధల దోషాలు కల, మార్గాన్ని అతిక్రమించి నడచే తామస స్వరూపం ఏదయితే ఉన్నదో, అట్టి తామసరూప పశుస్వరూపానికి నమస్కారం.

**విశే :** ఇంద్రియవధలు 11, తుష్టివధలు 9, సిద్ధవధలు 8 = మొత్తం 28 వధలు.

**యజ్ఞాంగభూతం యద్రూపం జగతః సిద్ధిసాధనమ్ ।**
**వృక్షాదిభేదైష్షడ్భేది తస్మై ముఖ్యాత్మనే నమః ॥ 29 ॥**

యజ్ఞాంగస్వరూపం, జగత్తుకు సిద్ధిసాధనం, వృక్షాలు, లతలు, పొదలు, తీగలు, గడ్డి, కొండలు అనే ఆరువిధాల వృక్షరూపభేదాలతో కూడిన నీరూపం ఏదయితే ఉందో, అట్టి నీ ముఖ్యస్వరూపానికి నమస్కారాలు.

**తిర్యఙ్మానుషదేవాదివ్యోమశబ్దాదికం చ యత్ ।**
**రూపం తవాదేః సర్వస్య తస్మై సర్వాత్మనే నమః ॥ 30 ॥**

పశువులు, పక్షులు, మనుష్యులు, దేవతలు మున్నగునవి, ఆకాశం, శబ్దం మున్నగు పంచభూత తన్మాత్రలు అయిన సమస్తానికి ఆది అయిన నీరూపం ఏదయితే ఉన్నదో, ఆ సర్వరూపానికి ప్రణామాలు.

**ప్రధానబుద్ధ్యాదిమయాదశేషాద్**
**యదన్యదస్మాత్ పరమం పరాత్మన్! ।**
**రూపం తవాऽऽద్యం న యదన్యతుల్యం**
**తస్మై నమః కారణకారణాయ ॥ 31 ॥**

పరమాత్మా! ప్రధానం, బుద్ధిమహత్తత్వం మున్నగు అఖిలకారణాలకు మూలకారణమై, పరమమై, నీతో సమానమైన మరో రూపం లేకుండా ఏది ఉందో, అటువంటి జగత్కారణ కారణస్వరూపానికి వినతులు.

**శుక్లాదిదీర్ఘాదిఘనాదిహీన**
**మగోచరే యచ్చ విశేషణానామ్ ।**
**శుద్ధాతిశుద్ధం పరమర్షిదృశ్యం**
**రూపాయ తస్మై భగవన్నతాః స్మః ॥ 32 ॥**

భగవంతుడా! తెల్లదనం మొదలైనవి, పొడవు మొదలైనవి, గట్టిదనం మొదలైనవి లేనిది, ఏ విశేషణాలకు గోచరం కానిది, శుద్ధాతిశుద్ధమయినది, పరమర్షులకు మాత్రమే కనిపించేది అయిన నీరూపానికి వినమ్రులమై నమస్కరిస్తున్నాము.

**యన్నః శరీరేషు యదన్యదేహే**
**ష్వశేషజన్తుష్వజమవ్యయం యత్ ।**
**యస్మాచ్చ నాన్యద్వ్యతిరిక్తమస్తి**
**బ్రహ్మ స్వరూపాయ నతాః స్మ తస్మై ॥ 33 ॥**

మా శరీరాలలోను, ఇతరుల దేహాలలోను, సమస్తప్రాణులలోను ఉండేది, జన్మలేనిది, నాశనం లేనిది, తనకన్న వ్యతిరిక్తమైనది ఏదీ లేనిది అయిన ఆ బ్రహ్మస్వరూపానికి ప్రణమిల్లుతున్నాము.

**సకలమిదమజస్య యస్య రూపం**
**పరమపదాత్మవతః సనాతనస్య ।**
**తమనిధనమశేషబీజభూతం**
**ప్రభుమమలం ప్రణతాః స్మ వాసుదేవమ్ ॥ 34 ॥**

ఈ సమస్తమూ పుట్టుకలేని ఏ బ్రహ్మముయొక్క రూపమో అట్టి పరమపద స్వరూపుడైనవాడు, సనాతనుడైనవాడు, మరణం లేనివాడు, సమస్తసృష్టికి బీజభూతమైనవాడు, నిర్మలుడైనవాడు, నియంత అయిన వాసుదేవుని రూపానికి వినమ్రులమై నమస్కరిస్తున్నాము.

**స్తోత్రస్యచావసానే తే దదృశుః పరమేశ్వరమ్ ।**
**శంఖచక్రగదాపాణిం గరుడస్థం సురా హరిమ్ ॥ 35 ॥**

ఈ విధంగా స్తోత్రం పూర్తి అయిన తరువాత ఆ దేవతలు శంఖం, చక్రం, గద, అభయముద్ర ధరించిన చేతులుకల, గరుడునిపై ఆసీనుడై ఉన్న పరమేశ్వరుడైన శ్రీహరిని సందర్శించారు.

**తమూచుః సకలా దేవాః ప్రణిపాతపురఃసరమ్ ।**
**ప్రసీద దేవ! దైత్యేభ్యస్త్రాహీతి శరణార్థినః ॥ 36 ॥**

సమస్తదేవతలు ఆయనముందు సాగిలపడి, నమస్కరించి ఇలా అన్నారు. "దేవా! మమ్ము అనుగ్రహించు. శరణార్థులమైన మమ్ము రక్షించు. దైత్యుల బారినుంచి మమ్ము కాపాడు."

**త్రైలోక్యం యజ్ఞభాగాశ్చ దైత్యైర్హ్లాదపురోగమైః ।**
**హృతం నో బ్రహ్మణోఽప్యాజ్ఞాముల్లంఘ్య పరమేశ్వర ॥ 37 ॥**

పరమేశ్వరా! బ్రహ్మ ఆజ్ఞను కూడా కాదని, హ్లాదుడు మొదలైన దైత్యులు మా ముల్లోకాలను, యజ్ఞభాగాలను అపహరించారు.

**యద్యప్యశేషభూతస్య వయం తే చ తవాంశజాః ।**
**తథాఽప్యవిద్యాభేదేన భిన్నం పశ్యామహే జగత్ ॥ 38 ॥**

మేము, ఆ దైత్యులు కూడా సమస్తమూ నీస్వరూపమైన అంశవల్ల సంభవించిన వారమయినా అజ్ఞానంవల్ల జగత్తును భిన్నంగా చూస్తున్నాము.

**స్వవర్ణధర్మాభిరతా వేదమార్గానుసారిణః ।**
**న శక్యాస్తేఽరయో హన్తుమస్మాభిస్తపసా న్వితాః ॥ 39 ॥**

మా శత్రువులు కూడా తమ వర్ణాలకు సంబంధించే ధర్మాలపై ఆసక్తి కలవారు. వారు వేదమార్గాన్ని అవలంబిస్తున్నారు. ఆ కారణంచే తపోనిరతులైన వారిని మేము చంపడానికి తగినవారం కాలేకపోతున్నాము.

**తముపాయమమేయాత్మన్! అస్మాకం దాతుమర్హసి ।**
**యేన తానసురాన్ హన్తుం భవేమ భగవన్! క్షమాః ॥ 40 ॥**

"అమేయాత్మా! కాబట్టి వారిని చంపే ఆ ఉపాయాన్ని మాకు ప్రసాదించడానికి తగి ఉన్నావు. భగవంతుడా! ఏ విధంగా ఆ అసురులను వధించడానికి మేము సమర్థులం కాగలము!" అని కోరారు.

**ఇత్యుక్తో భగవాంస్తేభ్యో మాయామోహం శరీరతః ।**
**తముత్పాద్య దదౌ విష్ణుః ప్రాహ చేదం సురోత్తమాన్ ॥ 41 ॥**

ఈ విధంగా వారు ప్రార్థించగా, భగవంతుడైన విష్ణువు తన శరీరంనుంచి మాయామోహుని ఉద్భవింపజేసి వారికిచ్చి, ఆ సురశ్రేష్ఠులతో ఇలా అన్నాడు.

**మాయామోహోఽయమఖిలాన్ దైత్యాంస్తాన్మోహయిష్యతి ।**
**తతో వధ్యా భవిష్యన్తి వేదమార్గబహిష్కృతాః ॥ 42 ॥**

వీడు మాయామోహుడు. వీడు సమస్తదైత్యులను మోహింపజేస్తాడు. అపుడు వారు వేదమార్గంనుంచి బహిష్కృతులవుతారు. అంత వారు వధ్యులు కాగలరు.

**స్థితౌ స్థితస్య మే వధ్యా యావన్తః పరిపన్థినః ।**
**బ్రహ్మణో యేఽధికారస్య దేవదైత్యాదికాః సురాః ॥ 43 ॥**

సురలారా! రక్షణస్థితిలో ఉన్న నేను బ్రహ్మ అధికారానికి వ్యతిరేకంగా శత్రువులుగా ఉన్న దేవదైత్యాదులెవరయినా సరే, వారిని నేను సంహరిస్తాను.

**విశే :** ఆ మాయలో దేవతలు పడినా, వారయినా వధ్యులవుతారని భావం.

**తద్గచ్ఛత న భీః కార్యా మాయామోహోఽయమగ్రతః ।**
**గచ్ఛత్వద్యోపకారాయ భవతాం భవితా సురాః ॥ 44 ॥**

"సురలారా! కాబట్టి వెళ్లండి. మీరు భయపడకండి. ఈ మాయామోహుని ముందుంచుకొని నడవండి. ఇతడు మీకు ఉపకారం చేసేవాడు కాగలడు." అని విష్ణువు చెప్పాడు.

**ఇత్యుక్తాః ప్రణిపత్యైనం యయుర్దేవా యథాగతమ్ ।**
**మాయామోహోఽపి తైః సార్ధం యయౌ యత్ర మహాసురాః ॥ 45 ॥**

భగవంతుడు ఇలా చెప్పగానే దేవతలు ఆయనకు వినయపూర్వకంగా నమస్కరించి ఎక్కడ నుంచి వచ్చారో అక్కడకు వెళ్లారు. మాయామోహుడు కూడా వారితో కలసి మహాసురులు ఉన్న చోటికి వెళ్లాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే విష్ణుస్తుతిః - మాయామోహోత్పత్తిశ్చేతి సప్తదశోఽధ్యాయః సమాప్తః ॥ 17 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో విష్ణుస్తుతి-మాయామోహోత్పత్తి అనే పదిహేడవ అధ్యాయం సమాప్తం॥17॥



## అష్టాదశోఽధ్యాయః - పదునెనిమిదవ అధ్యాయం

## బౌద్ధధర్మోత్పత్తిః - శతధను మహారాజకథా - బౌద్ధధర్మోత్పత్తి - శతధను మహారాజుకథ

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**తపస్యభిరతాన్ సోఽథ మాయామోహో మహాసురాన్ ।**
**మైత్రేయ! దదృశే గత్వా నర్మదాతీరసంశ్రితాన్ ॥ 1 ॥**

మైత్రేయా! ఆ మాయామోహుడు వెళ్లి నర్మదాతీరంలో మహానిష్ఠతో తపస్సు చేస్తున్న మహాసురులను చూశాడు.

**తతో దిగమ్బరో ముణ్డో బర్హిపిఞ్ఛధరో ద్విజ! ।**
**మాయామోహోఽసురాన్ శ్లక్ష్ణమిదం వచనమబ్రవీత్ ॥ 2 ॥**

ద్విజోత్తమా! ఆ మాయామోహుడు దిగంబరుడై, జుట్టులేనివాడై, నెమలి పింఛం ధరించినవాడై అసురులతో మధురంగా ఇలా అన్నాడు.

**హే దైత్యపతయో! బ్రూత యదర్థం తప్యతే తపః ।**
**ఐహికం వాఽథ పారత్ర్యం తపసః ఫలమిచ్ఛథ ॥ 3 ॥**

"ఓ దైత్యపతులారా! చెప్పండి. దేనికోసం తపస్సు చేస్తున్నారు? తపస్సువల్ల పొందే ఫలం ఈ లోకంలో సుఖం పొందడానికా? పరలోకంలో భోగాలు(ఆనందం) అనుభవించడానికా?" అని అడిగాడు.

**అసురా ఊచుః :-**అసురులు చెప్పారు.

**పారత్ర్యఫలలాభాయ తపశ్చర్యా మహామతే! ।**
**అస్మాభిరియమారబ్ధా కిం వా తేఽత్ర వివక్షితమ్ ॥ 4 ॥**

అపుడా అసురులు "మహామతీ! పరలోకఫలలాభంకోసమే మేము తపస్సు చేయడం ప్రారంభించాము. ఇంతకూ నీవు మాకు చెప్పదలచుకొన్నది ఏమిటి?" అని ప్రశ్నించారు.

**మాయామోహ ఉవాచ :-** మాయామోహుడు చెప్పాడు.

**కురుధ్వం మమ వాక్యాని యది ముక్తిమభీప్సథ ।**
**అర్హధ్వమేనం ధర్మం చ ముక్తిద్వారమసంవృతమ్ ॥ 5 ॥**

అంత మాయామోహుడు ముక్తి కావాలని కోరుకొనేవారు అయితే నా మాట పాటించండి. నేను తెలిపే ధర్మం తెరచియున్న మోక్షద్వారం వంటిది. దీనిని ఆదరించండి. ఆచరించండి.

**ధర్మో విముక్తేరర్హోఽయం నైతస్మాదపరో వరః ।**
**అత్రైవ సంస్థితాః స్వర్గం విముక్తిం వా గమిష్యథ ।**
**అర్హధ్వం ధర్మమేతం చ సర్వే యూయం మహాబలాః ॥ 6 ॥**

"మహాబలులారా! నేను చెప్పబోయే ఈ ధర్మం విముక్తికి తగినటువంటిది. దీనికన్న శ్రేష్ఠమయినది వేరే ఏమీలేదు. ఈ లోకంలో ఉండే స్వర్గమైనా, ముక్తినైనా పొందాలి. మీరందరూ ఈ ధర్మాన్ని పాటించడానికి తగినవారు." అన్నాడు.

**ఏవం ప్రకారైర్బహుభిర్యుక్తిదర్శనవర్ధితైః ।**
**మాయామోహేన తే దైత్యా వేదమార్గాదపాకృతాః ॥ 7 ॥**

ఈ విధంగా అనేక యుక్తులను చూపిస్తూ, బహువిధ చర్చలద్వారా మాయామోహుడు ఆ దైత్యులను వేదమార్గంనుంచి తొలగించాడు.

**ధర్మాయైతదధర్మాయ సదేతన్న సదిత్యపి ।**
**విముక్తయే త్విదం నైతద్ విముక్తిం సమ్ప్రయచ్ఛతి ॥ 8 ॥**

**పరమార్థోఽయమత్యర్థం పరమార్థో న చాప్యయమ్ ।**
**కార్యమేతదకార్యం చ నైతదేవం స్ఫుటం త్విదమ్ ।**
**దిగ్వాససామయం ధర్మో ధర్మోఽయం బహువాససామ్ ॥ 9 ॥**

**ఇత్యనైకాన్తవాదం చ మాయామోహేన నైకధా ।**
**తేన దర్శయతా దైత్యాః స్వధర్మాంస్త్యాజితా ద్విజ! ॥ 10 ॥**

ద్విజోత్తమా! "ఇది ధర్మం, ఇది ధర్మం కాదు. ఇది సత్పదార్థం, ఇది సత్తు కాదు. ఇది విముక్తినిస్తుంది, ఇది విముక్తిని ఈయదు. ఇది మిక్కిలి పరమార్థమైనది, ఇది పరమార్థం కానే కాదు. ఇది చేయదగినది, ఇది చేయతగనిది. ఇది ఇలా కాదు, ఇది అలాగే స్పష్టం. ఇది దిగంబర ధర్మం, ఇది బహువస్త్రధారుల ధర్మం." అని మాయామోహుడు అనేక విధాలుగా జ్ఞానానికి భిన్నమైన అనేకాన్తవాదం చేశాడు. అతడు చేసిన భ్రాంతివాదంవల్ల దైత్యులు స్వధర్మం నుంచి తొలగిపోయారు.

**అర్హతేమం మహాధర్మం మాయామోహేన తే యతః ।**
**ప్రోక్తా స్తమాశ్రితా ధర్మమార్హతాస్తేన తేఽభవన్ ॥ 11 ॥**

మాయామోహునిచే "అర్హత ఏతం మహాధర్మం" అని బోధించబడడంవల్ల,(ఈ మహాధర్మాన్ని ఆదరించండి అని చెప్పడంవల్ల), వారు ఆ ధర్మాన్ని ఆశ్రయించినందువల్ల "ఆర్హతులు" గా వ్యవహరించబడ్డారు.

**త్రయీధర్మ సముత్సర్గం మాయామోహేన తేఽసురాః ।**
**కారితాస్తన్మయా హ్యాసంస్తతోఽన్యే తత్ప్రబోధితాః ॥ 12 ॥**

**తైరప్యన్యే పరే తైశ్చ తైరప్యన్యే పరే చ తైః ।**
**అల్పైరహోభిః సన్త్యక్తా తైర్దైత్యైః ప్రాయశస్త్రయీ ॥ 13 ॥**

మాయామోహుడు ఆ అసురులను ఈ విధంగా వేదమార్గాన్ని విడిచి పెట్టేటట్లు చేశాడు. వారు అందరూ ఆ మాయామోహునికి వశులైపోయారు. తరువాత వారి ప్రబోధంతో ఇతరులు, వారివల్ల అన్యులు, వారివల్ల మరి కొందరు, మళ్లీ వారివల్ల ఇంకా కొందరు ఇలా కొద్ది రోజులలోనే ఆ దైత్యులు అందరూ వేదధర్మాచరణం విడిచి పెట్టేశారు.

**పునశ్చ రక్తామ్బరధృఙ్మాయామోహో జితేన్ద్రియః ।**
**అన్యానాహాసురాన్ గత్వా మృద్వల్పమధురాక్షరమ్ ॥ 14 ॥**

మళ్లీ జితేంద్రియుడైన ఆ మాయామోహుడు ఎర్రని వస్త్రాలు ధరించి మిగిలిన అసురుల వద్దకు వెళ్లి మృదువుగా, సంక్షిప్తంగా, తియ్యగా ఇలా మాట్లాడాడు.

**స్వర్గార్థం యది వో వాంఛా నిర్వాణార్థమథాసురాః ।**
**తదలం పశుఘాతాదిదుష్టధర్మైర్నిబోధత ॥ 15 ॥**

"అసురులారా! మీ కోరిక స్వర్గం కోసమా? లేక మోక్షం కోసమా? ఈ పశుహింసమున్నగు దుష్టక్రియలతో కూడిన నీచధర్మాలు చాలు. నా బోధలు వినండి.

**విజ్ఞానమయమేవైతదశేషమవగచ్ఛత ।**
**బుధ్యధ్వం మే వచః సమ్యగ్ బుధైరేవముదీరితమ్ ॥ 16 ॥**

ఇది విజ్ఞానమయం. ఇది సర్వస్వం అని తెలుసుకోండి. నా మాటలు ఒకసారి ఆలోచించండి. పండితులైన వారే ఈ విషయం ఇలా చెప్పారు.

**జగదేతదనాధారం భ్రాన్తిజ్ఞానార్థతత్పరమ్ ।**
**రాగాదిదుష్టమత్యర్థం భ్రామ్యతే భవ సంకటే ॥ 17 ॥**

ఈ జగత్తుకు ఆధారమంటూ ఏమి లేదు. అది భ్రాంతిజన్యజ్ఞానంతో కూడుకొన్నట్టిది. అర్థాన్వేషణ తత్పర మైనది. రాగం మున్నగు దోషాలవల్ల మిక్కిలి దుష్టమైనది. ఇది సంసారసంకటంలో తిరుగుతోంది.

**ఏవం బుధ్యత బుధ్యధ్వం బుధ్యతైవమితీరయన్ ।**
**మాయామోహః స దైతేయాన్ ధర్మమత్యాజయన్నిజమ్ ॥ 18 ॥**

అని ఆ మాయామోహుడు అంటూ "తెలుసుకోండి. తెలుసుకోండి. తెలుసుకోండి." అని ఎక్కువసార్లు పలుకుతూ ఆ అసురులను స్వధర్మం విడిచేటట్లు చేశాడు.

**నానాప్రకారవచనం స తేషాం యుక్తియోజితమ్ ।**
**తథా తథా చ తద్ధర్మం తత్యజుస్తే యథా యథా ॥ 19 ॥**

అతడు అనేక విధాల బోధలతో, యుక్తివచనాలతో వారు ఎలా ఎలా ధర్మం విడిచిపెడతారో అలా అలా అన్ని రకాలయిన వాక్యాలు చెప్పాడు.

**తేఽ ప్యన్యేషాం తథైవోచురన్యైరన్యే తథోదితాః ।**
**మైత్రేయ! తత్యజుర్ధర్మం వేదస్మృత్యుదితం పరమ్ ॥ 20 ॥**

మైత్రేయా! వారు కూడా మిగిలిన వారికి అలాగే చెప్పారు. ఆ మాటలు విన్నవారు కూడా ఇతరులకు ఆ రీతిగానే బోధించారు. ఇలా అందరూ వేదాలలోను, స్మృతులలోను చెప్పబడిన పరమధర్మాన్ని విడిచివేశారు.

**అన్యానప్యన్యపాషణ్డప్రకారైర్బహుభిర్ద్విజ! ।**
**దైతేయాన్ మోహయామాస మాయామోహోఽ తిమోహకృత్ ॥ 21 ॥**

ద్విజప్రవరా! ఈ రీతిగా మాయామోహుడు మిక్కిలి మోహాన్ని కలిగిస్తూ, అనేక విధాలైన బహుపాషండ(వేదబాహ్య)రీతులలో మిగిలిన దైతేయులను కూడా మోహింపజేశాడు.

**స్వల్పేనైవ హి కాలేన మాయామోహేన తేఽ సురాః ।**
**మోహితాస్తత్యజుః సర్వాం త్రయీమార్గాశ్రితాం కథామ్ ॥ 22 ॥**

మిక్కిలి తక్కువ కాలంలోనే ఆ అసురులు మాయామోహితునిచే మోహం పొందినవారై వేదత్రయ మార్గానికి చెందిన సర్వవచనాలను బహిష్కరించారు.

**కేచిద్వినిన్దాం వేదానాం దేవానామపరే ద్విజ! ।**
**యజ్ఞకర్మకలాపస్య తథాఽ న్యే చ ద్విజన్మనామ్ ॥ 23 ॥**

ద్విజశ్రేష్ఠా! కొందరు వేదాలను నిందించారు. మరికొందరు దేవతలను దూషించారు. ఇంకొందరు యజ్ఞక్రియాకలాపాన్ని బహిష్కరించారు. వేరే కొందరు బ్రాహ్మణులను హింసించారు.

**నైతద్యుక్తిసహం వాక్యం హింసా ధర్మాయ చేష్యతే ।**
**హవీంష్యనలదగ్ధాని ఫలాయేత్యర్భకోదితమ్ ॥ 24 ॥**

"ధర్మం కోసమై హింస చేయవచ్చు" అన్న ఈ వాక్యం యుక్తి సహంగాలేదు. "అగ్నిలో వ్రేల్చబడ్డ హవిస్సులు ఫలాన్ని ఇస్తాయి" అనే మాట జ్ఞానశూన్యులు పలికేది.

**యజ్ఞైరనేకైర్దేవత్వమవాప్యేన్ద్రేణ భుజ్యతే ।**
**శమ్యాది యది చేత్కాష్ఠం తద్వరం పత్రభుక్పశుః ॥ 25 ॥**

అనేక యజ్ఞాలద్వారా దేవత్వాన్ని పొందిన ఇంద్రుడు జమ్మి మున్నగు సమిధలు తింటే, అప్పుడు ఆ పుల్లల కన్న కోమలాలైన ఆకులను తినే పశువే శ్రేష్ఠమైనది కదా!

**నిహతస్య పశోర్యజ్ఞే స్వర్గప్రాప్తిర్యదీష్యతే ।**
**స్వపితా యజమానేన కిన్ను తస్మాన్న హన్యతే ॥ 26 ॥**

యజ్ఞంలో వధించబడిన పశువుకు స్వర్గలోకం లభిస్తే, యజ్ఞంచేసేవాడు తండ్రికి కూడ స్వర్గప్రాప్తికై ఆయననే చంపవచ్చు కదా!

**తృప్తయే జాయతే పుంసో భుక్తమన్యేన చేత్తతః ।**
**కుర్యాచ్ఛ్రాద్ధం శ్రమాయాన్నం న వహేయుః ప్రవాసినః ॥ 27 ॥**

ఒకడు అన్నం తింటే, మరో పురుషునికి తృప్తి కలిగేటట్లయితే, ప్రవాసం చేసేవాళ్లు అన్నం మోసిపట్టుకొని వెళ్ళడం ఎక్కువ శ్రమ అవుతుంది కదా! శ్రాద్ధం పెడితే సరి.

**జనశ్రద్ధేయమిత్యేతదవగమ్య తతో వచః ।**
**ఉపేక్ష్య శ్రేయసే వాక్యం రోచతాం యన్మయేరితమ్ ॥ 28 ॥**

ఇది అంతా జనుల విశ్వాసమే అని భావించి, ఉపేక్ష వహించి, శ్రేయస్సుకొరకై ఇష్టమయితే నేను చెప్పిన మాట పాటించండి.

**న హ్యాప్తవాదా నభసో నిపతన్తి మహాసురాః! ।**
**యుక్తిమద్ వచనం గ్రాహ్యం మయాన్యైశ్చ భవద్విధైః ॥ 29 ॥**

"మహాసురులారా! ఆప్తవాక్యాలు అనేవి ఆకాశంనుంచి క్రిందకు ఊడిపడేవి కావు. నేనయినా, మిగిలినవారైనా, మీవంటి వారయినా యుక్తియుక్తమైన మాటనే గ్రహించాలి."

**మాయామోహేన తే దైత్యాః ప్రకారైర్బహుభిస్తథా ।**
**వ్యుత్థాపితా యథా నైషాం త్రయీం కశ్చిదరోచయత్ ॥ 30 ॥**

ఈ విధంగా మాయామోహుడు అనేక విధాలుగా ఆ దైత్యులలో ఎవ్వరికీ కూడా వేదాలు రుచించనట్లుగా చంచలత్వాన్ని లేవదీశాడు.

**ఇత్థమున్మార్గయాతేషు తేషు దైత్యేషు తేఽమరాః ।**
**ఉద్యోగం పరమం కృత్వా యుద్ధాయ సముపస్థితాః ॥ 31 ॥**

ఇలా ఆ రాక్షసులు, దైత్యులు, అసురులు అందరూ వేదమార్గం తప్పేసరికి దేవతలందరు మహాప్రయత్నంతో యుద్ధానికి వచ్చారు.

**తతో దేవాసురం యుద్ధం పునరేవాభవద్ ద్విజ! ।**
**హతాశ్చ తేఽసురా దేవైః సన్మార్గపరిపన్థినః ॥ 32 ॥**

ద్విజోత్తమా! అనంతరం దేవాసురయుద్ధం మళ్లీ జరిగింది. సన్మార్గ (వేదమార్గ) విరోధులైన అసురులను దేవతలు వధించారు.

**స్వధర్మకవచం తేషామభూద్యత్ ప్రథమం ద్విజ! ।**
**తేన రక్షాఽ భవత్ పూర్వం నేశుర్నష్టే చ తత్ర తే ॥ 33 ॥**

ద్విజప్రవరా! ఆ దైత్యులకు స్వధర్మపాలనరూపకవచం ఉండేది – మొదట దానివల్ల వారికి పూర్వం రక్షణ ఉండేది. అది పోయేసరికి వారు అసమర్థులైపోయారు.

**తతో మైత్రేయ! తన్మార్గవర్తినో యేఽ భవజ్జనాః ।**
**నగ్నాస్తే తైర్యతస్త్యక్తం త్రయీసంవరణం వృథా ॥ 34 ॥**

మైత్రేయా! తరువాత ఆ అధర్మమార్గాన్ని అవలంబించిన జనులు ఎవరయితే ఉన్నారో, వారు వృథాగా వేదత్రయి అనే కవచాన్ని విడిచి పెట్టారు కనుక, వారే "నగ్నులు" అయ్యారు.

**బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థస్తథాశ్రమీ ।**
**పరివ్రాడ్ వా చతుర్థోఽ త్ర పంచమో నోపపద్యతే ॥ 35 ॥**

బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, నాలుగోవాడు పరివ్రాజకుడు. వీరే ఆశ్రమస్థులు. ఐదవ ఆశ్రమస్థుడు అన్నవాడు లేనే లేడు.

**యస్తు సన్త్యజ్య గార్హస్థ్యం వానప్రస్థో న జాయతే ।**
**పరివ్రాడ్ వాఽ పి మైత్రేయ! స నగ్నః పాపకృన్నరః ॥ 36 ॥**

మైత్రేయా! గృహస్థాశ్రమాన్ని విడిచిపెట్టి, వానప్రస్థుడుకాని, సన్యాసికాని కాకుండా ఉండే వాడు నగ్నుడు. ఆ నరుడు పాపకారి.

**నిత్యానాం కర్మణాం విప్ర! తస్య హానిరహర్నిశమ్ ।**
**అకుర్వన్ విహితం కర్మ శక్తః పతతి తద్దినే ॥ 37 ॥**

విప్రోత్తమా! ఓపిక ఉండి కూడా చేయవలసిన కర్మ చేయనివాడు. ఆనాడే పతితుడైపోతాడు. ఒక్క రోజులోనే అతని నిత్యకర్మలకు హాని కలుగుతుంది.

**ప్రాయశ్చిత్తేన మహతా శుద్ధిమాప్నోత్యనాపది ।**
**పక్షం నిత్యక్రియాహానేః కర్తా మైత్రేయ! మానవః ॥ 38 ॥**

మైత్రేయా! ఏ ఆపదలేకుండా పదిహేను రోజులపాటు నిత్యక్రియలు మానివేసిన మానవుడు గొప్పదైన ప్రాయశ్చిత్తంతో మాత్రమే పరిశుద్ధుడవుతాడు.

**సంవత్సరం క్రియాహానిర్యస్య పుంసోఽ భిజాయతే ।**
**తస్యావలోకనాత్సూర్యో నిరీక్ష్యః సాధుభిః సదా ॥ 39 ॥**

సంవత్సరకాలంపాటు నిత్యకర్మలు మానివేసిన పురుషుణ్ణి కనుక సాధుపురుషులు చూసినట్లయితే, వారు ఆ దర్శనంవల్ల కలిగే పాపపరిహారంకోసమై సూర్యసందర్శనం చేయాలి.

**స్పృష్టే స్నానం సచేలస్య శుద్ధేర్హేతుర్మహామతే! ।**
**పుంసో భవతి తస్యోక్తా న శుద్ధిః పాపకర్మణః ॥ 40 ॥**

మహామతీ! అటువంటి వానిని ముట్టుకుంటే ప్రాయశ్చిత్తశుద్ధికోసమై సచేలస్నానం చేయాలి. ఆ పాపకర్మ చేసిన పురుషునికి మాత్రం ప్రాయశ్చిత్తశుద్ధి చెప్పబడలేదు.

**దేవర్షిపితృభూతాని యస్య నిఃశ్వస్య వేశ్మని ।**
**ప్రయాన్త్యనర్చితాన్యత్ర లోకే తస్మాన్న పాపకృత్ ॥ 41 ॥**

ఎవని గృహంనుంచి దేవతలు, ఋషులు, పితృగణాలు, భూతగణాలు పూజింపబడకుండా నిట్టూర్చి వెళ్లిపోతారో, ఈ లోకంలో అతనికన్న పాపకారి వేరొకడు లేడు.

**దేవాదినిఃశ్వాసహతం శరీరం యస్య వేశ్మ చ ।**
**న తేన సంకరం కుర్యాద్ గృహాసనపరిచ్ఛదైః ॥ 42 ॥**

దేవాదుల నిట్టూర్పుచే దుష్టమైన శరీరము మరియు గృహము గలవానితో అతని గృహము, ఆసనములు, వస్త్రములతో సహా సంబంధము పెట్టుకొనరాదు.

**సమ్భాషణానుప్రశ్నాది సహాస్యాం చైవ కుర్వతః ।**
**జాయతే తుల్యతా తస్య తేనైవ ద్విజ! వత్సరమ్ ॥ 43 ॥**

ద్విజోత్తమా! అటువంటి యజమానితో సంవత్సరంపాటు సంభాషణ, కుశలప్రశ్న, అతనితోపాటు కూర్చోవడం(పనిచేయడం)చేసేవాడు అతనితో సమానుడై పాపి అయిపోతాడు.

**అథ భుంక్తే గృహే తస్య కరోత్యాస్యాం తథాసనే ।**
**శేతే చాప్యేకశయనే స సద్యస్తత్సమో భవేత్ ॥ 44 ॥**

ఇంక అతని ఇంటిలో భోజనంచేసినా, ఆసనంపై కలిసి కూర్చున్నా, ఒకే శయ్యపై పరున్నా, వెంటనే అతనితో తుల్యుడైన మహాపాతకుడయిపోతాడు.

**దేవతాపితృభూతాని తథాऽనభ్యర్చ్య యోऽతిథీన్ ।**
**భుంక్తే స పాతకం భుంక్తే నిష్కృతిస్తస్య నేష్యతే ॥ 45 ॥**

దేవతలను, పితృదేవతలను, భూతగణాలను, అతిథులను పూజించకుండా భోజనంచేసే, వాడు పాపం తింటాడు. అతనికి ప్రాయశ్చిత్తం లేదు.

**బ్రాహ్మణాద్యాస్తు యే వర్ణాః స్వధర్మాదన్యతో ముఖాః ।**
**యాన్తి తే నగ్నసంజ్ఞాం తు హీనకర్మస్వవస్థితాః ॥ 46 ॥**

బ్రాహ్మణులు మున్నగు సమస్తవర్ణాలు, తమ ధర్మంనుంచి విముఖులై పరధర్మంవైపు మరలి, నీచవృత్తులు అవలంబిస్తే "నగ్నులు" అనే పేరు పొందుతారు.

**చతుర్ణాం యత్ర వర్ణానాం మైత్రేయాత్యన్తసంకరః ।**
**తత్రాస్యా సాధువృత్తీనాముపఘాతాయ జాయతే ॥ 47 ॥**

మైత్రేయా! నాలుగు వర్ణాల వారికి మిక్కిలి సాంకర్యమైన చోటు కనుక ఉంటే, ఆ చోటు సజ్జనుల వృత్తులకు పతనకారణమవుతుంది.

**అనభ్యర్చ్య ఋషీన్ దేవాన్ పితౄన్ భూతాతిథీంస్తథా ।**
**యో భుంక్తే తస్య సమ్భాషాత్ పతన్తి నరకే నరాః ॥ 48 ॥**

ఋషులను, దేవతలను, పితరులను, భూతగణాలను, అతిథులను పూజించకుండా భుజించే వానితో మాట్లాడితే, నరులు నరకలోకంలో పడిపోతారు.

**తస్మాదేతాన్నరో నగ్నాంస్త్రయీసన్త్యాగదూషితాన్ ।**
**సర్వదా వర్జయేత్ ప్రాజ్ఞ ఆలాపస్పర్శనాదిషు ॥ 49 ॥**

కాబట్టి ప్రాజ్ఞుడవైన మైత్రేయా! నరుడు వేదత్రయిని విడిచి దూషితులైన ఈ నగ్నులతో మాట్లాడడంకాని, తాకడంకాని మున్నగు వాటిని ఎల్లప్పుడూ చేయరాదు.

**శ్రద్ధావద్భిః కృతం యత్నాద్దేవాన్ పితృపితామహాన్ ।**
**న ప్రీణయతి తచ్ఛ్రాద్ధం యదేభిరవలోకితమ్ ॥ 50 ॥**

మిక్కిలి శ్రద్ధకలవారు ఎంతో ప్రయత్నించి చేసే ఆ శ్రాద్ధాన్ని ఇటువంటి నగ్నులు కనుక చూస్తే విశ్వేదేవతలను, పితృపితామహులను సంతోషపెట్టదు.

**శతధనువుకథ**

**శ్రూయతే చ పురా ఖ్యాతో రాజా శతధనుర్భువి ।**
**పత్నీ చ శైవ్యా(శైబ్యా) తస్యాభూదతిధర్మపరాయణా ॥ 51 ॥**

పూర్వం భూలోకంలో శతధనువనే సుప్రసిద్ధుడైన రాజు ఒకడు ఉండేవాడని వినడం జరిగింది. అతని భార్య శైబ్య(శైవ్య). ఆమె మిక్కిలి ధర్మపరాయణురాలుగా ఉండేది.

**పతివ్రతా మహాభాగా సత్యశౌచదయాన్వితా ।**
**సర్వలక్షణసమ్పన్నా వినయేన నయేన చ ॥ 52 ॥**

ఆమె మహాపతివ్రత. పుణ్యభాగ. సత్యం, శౌచం, దయ కూడుకొన్నది. నయం, వినయం మున్నగు సమస్తశుభలక్షణాలు ఆమెకు ఉన్నాయి.

**స తు రాజా తయా సార్ధం దేవదేవం జనార్దనమ్ ।**
**ఆరాధయామాస విభుం పరమేణ సమాధినా ॥ 53 ॥**

ఆ రాజు ఒకప్పుడు ఆమెతో కలసి దేవదేవుడైన ప్రభువగు జనార్దనుని పరమసమాధినిష్ఠతో ఉండి ఆరాధించాడు.

**హోమైర్జపైస్తథా దానైరుపవాసైశ్చ భక్తితః ।**
**పూజాభిశ్చానుదివసం తన్మనా నాన్యమానసః ॥ 54 ॥**

హోమాలతో, జపాలతో, దానాలతో, ఉపవాసాలతో, పూజలతో ప్రతిదినం ఆ భగవంతునియందే మనస్సు నిలిపి అన్యమనస్కుడు కాకుండా భక్తి కలిగి ఆరాధించాడు.

**ఏకదా తు సమం స్నాతౌ తౌ తు భార్యాపతీ జలే ।**
**భాగీరథ్యాః సముత్తీర్ణౌ కార్తిక్యాం సముపోషితౌ ॥ 55 ॥**
**పాషణ్డినమపశ్యేతామాయాన్తం సమ్ముఖం ద్విజ! ।**

ద్విజా! ఒకప్పుడు ఆ భార్యాభర్తలిరువురూ కార్తికమాసంలో పూర్ణిమనాడు ఉపవాసం ఉండి కలిసి పుణ్యాభాగీరథీ జలంలో స్నానంచేసి, ఒడ్డున చేరి, ఎదురుగా వస్తున్న ఒక పాషండుని చూశారు.

**చాపాచార్యస్య తస్యాసౌ సఖా రాజ్ఞో మహాత్మనః ॥ 56 ॥**
**అతస్తద్గౌరవాత్తేన సహాఽఽలాపమథాకరోత్ ॥ 57 ॥**

మహాత్ముడైన ఆ రాజేంద్రునకు చాపాచార్యుడైన గురువొకడున్నాడు. ఆ పాషండుడు ఆ చాపాచార్యునకు మిత్రుడు. ఆ కారణంచే గురువునందలి గౌరవంచే రాజు పాషండునితో సంభాషించి మైత్రీభావం చూపించాడు.

**న తు సా వాగ్యతా దేవీ తస్య పత్నీ పతివ్రతా ।**
**ఉపోషితాస్మీతి రవిం తస్మిన్ దృష్టే దదర్శ చ ॥ 58 ॥**

ఆ మహారాజు ధర్మపత్ని మహాపతివ్రత. ఉపవాసం ఉన్నాను కదా అని అలా చేయక వాఙ్నియమంతో ఉండి పోయి అతనిని చూచిన వెంటనే సూర్యభగవానుని సందర్శించింది.

**సమాగమ్య యథాన్యాయం దమ్పతీ తౌ యథావిధి ।**
**విష్ణోః పూజాదికం సర్వం కృతవన్తౌ ద్విజోత్తమ! ॥ 59 ॥**

ద్విజశ్రేష్ఠా! తిరిగి ఇంటికి వచ్చాక ఆ దంపతులు ఇద్దరు యథావిధిగా విష్ణువుకు పూజాదికాలు సర్వం నెరవేర్చారు.

**కాలేన గచ్ఛతా రాజా మమారాసౌ సపత్నజిత్ ।**
**అన్వారురోహ తం దేవి చితాస్థం భూపతిం పతిమ్ ॥ 60 ॥**

కాలచక్రం ఇలా తిరుగుతూ ఉండగా శత్రుంజయుడైన ఆ శతధనువు మరణించాడు. ఆ దేవి చితిపైనున్న పతిదేవుడైన భూపతినిచూసి ఆయనను అనుసరించి చితిని అధిరోహించింది.(సహగమనం చేసింది)

**స తు తేనాపచారేణ శ్వా జజ్ఞే వసుధాధిపః ।**
**ఉపోషితేన పాషణ్డసంలాపీ యః కృతోఽభవత్ ॥ 61 ॥**

ఆ వసుధాధిపుడైన శతధనువు ఉపవాసం ఉండి పాషండునితో మాట్లాడిన అపచారంవల్ల, ఆ తరువాతి జన్మలో కుక్కై పుట్టాడు.

**సా తు జాతిస్మరా జజ్ఞే కాశీ రాజసుతా శుభా ।**
**సర్వవిజ్ఞానసమ్పూర్ణా సర్వలక్షణపూజితా ॥ 62 ॥**

కాని మహారాజ్ఞి మాత్రం పూర్వజన్మస్మృతితో సమస్తమంగళలక్షణలక్షితురాలైన సర్వవిజ్ఞాన సంపూర్ణయగు తన్విగా కాశీమహారాజు కుమార్తెగా జన్మించింది.

**తాం పితా దాతుకామోఽభూత్ వరాయ వినివారితః ।**
**తయైవ తన్వ్యా విరతో వివాహారమ్భతో నృపః ॥ 63 ॥**

తండ్రి ఆమెకు పెండ్లి చేద్దామని సంకల్పించాడు. కాని ఆమె వారించినందువల్ల, ఆ రాజు పెండ్లి ప్రయత్నాల నుంచి విరమించాడు.

**తతః సా దివ్యయా దృష్ట్యా దృష్ట్వా శ్వానం నిజం పతిమ్ ।**
**విదిశాఖ్యం పురం గత్వా తదవస్థం దదర్శ తమ్ ॥ 64 ॥**

తరువాత ఆమె దివ్యదృష్టితో తన భర్త కుక్కగా ఉండడం చూసింది. వెంటనే ఆమె 'విదిశ' అనే పేరు గల నగరం వెళ్లి, కుక్కశరీరంతో ఉన్న తన భర్తను దర్శించింది.

**తం దృష్ట్వైవ మహాభాగం శ్వభూతం తు పతిం తథా ।**
**దదౌ తస్మై వరాహారం సత్కారప్రవణం శుభా ॥ 65 ॥**

ఆ శుభాంగి కుక్కగా ఉన్న మహాభాగుడైన పతిని చూసీచూడగానే, ఎంతో ఆదరంతో మంచి ఆహారంపెట్టింది.

**భుంజన్ దత్తం తయా సోఽన్నమతిమృష్టమభీప్సితమ్ ।**
**శ్వజాతిలలితం కుర్వన్ బహు చాటు చకార వై ॥ 66 ॥**

అతడు ఆమె పెట్టిన ఇష్టమైన కమ్మని ఆహారం భుజిస్తూ, తన జాతి స్వభావమైన అందమైన విచిత్ర చేష్టలు ఎన్నో చేశాడు.

**అతీవ వ్రీడితా బాలా కుర్వతా చాటు తేన సా ।**
**ప్రణామపూర్వమాహేదం దయితం తం కుయోనిజమ్ ॥ 67 ॥**

ఆ కుక్క ఇష్టానుసారంగా వికృతచేష్టలు చేస్తూ ఉంటే, ఆ కల్యాణి చాలా సిగ్గుపడిపోయి, నీచజన్మలో ఉన్న తన భర్తకు ప్రణామంచేసి ఈ మాట అన్నది.

**స్మర్యతాం తన్మహారాజ! దాక్షిణ్యలలితం త్వయా ।**
**యేన శ్వయోనిమాపన్నో మమ చాటుకరో భవాన్ ॥ 68 ॥**

“మహారాజా! నీవు చూపిన ఔదార్యం జ్ఞప్తి తెచ్చుకో, నీ గురువుమిత్రుడని ఒక పాషండునితో మధుర భాషణం చేయడంవల్ల, కుక్క జన్మ యెత్తావు. ఒక్కసారి గతం జ్ఞప్తికి తెచ్చుకో. ఇపుడు నాకు ప్రీతికరంగా ఈ నీచకృత్యాలు ఆచరిస్తున్నావు. (లేదా నా పై చూపిన ఔదార్యం జ్ఞప్తికి తెచ్చుకో)

**పాషణ్డినం సమాభాష్య తీర్థస్నానాదనన్తరమ్ ।**
**ప్రాప్తోఽసి కుత్సితాం యోనిం కిం న స్మరసి తత్ప్రభో! ॥ 69 ॥**

“ప్రభూ! గంగానదీ స్నానంచేసిన తరవాత నగ్నుడనబడే పాషండునితో ప్రీతిపూర్వకంగా మాట్లాడి, ఈ నీచమైన జన్మ పొందిన వాడవయ్యావు. జ్ఞాపకం లేదా?” అని ఆ కాశీరాజపుత్రి పలికింది.

**తయైవం స్మారితే తస్మిన్ పూర్వజాతికృతే తదా ।**
**దధ్యౌ చిరమథావాప నిర్వేదమతిదుర్లభమ్ ॥ 70 ॥**

ఆమె ఇలా జ్ఞాపకం చేయగానే, అతడు పూర్వజన్మస్మృతిని తెచ్చుకొని, చాలా సేపు అలా ఉండిపోయి మిక్కిలిగా భరింపశక్యంకాని దుఃఖం పొందాడు.

**నిర్విణ్ణచిత్తః స తతో నిర్గమ్య నగరాద్ బహిః ।**
**మరుత్ప్రపతనం కృత్వా శార్గాలీం యోనిమాగతః ॥ 71 ॥**

ఆ తరువాత అతడు మిక్కిలి నిర్వేదంచెందిన మనస్సుతో, నగరం వెలుపలకుపోయి ప్రాణత్యాగంచేసి నక్క జన్మ పొందాడు.

**సాఽపి ద్వితీయే సమ్ప్రాప్తే వీక్ష్య దివ్యేన చక్షుషా ।**
**జ్ఞాత్వా శృగాలం తం ద్రష్టుం యయౌ కోలాహలం గిరిమ్ ॥ 72 ॥**

ఈ విధంగా అతడు రెండవ జన్మ ఎత్తగా, ఆమె ఇది వరకటిలాగే దివ్యదృష్టితో చూచి, భర్త నక్కగా ఉండడం తెలుసుకొని, అతడున్న కోలాహలపర్వతానికి చూడడానికై వెళ్లింది.

**తత్రాపి దృష్ట్వా తం ప్రాహ శార్గాలీం యోనిమాగతమ్ ।**
**భర్తారమతిచార్వంగీ తనయా పృథివీపతేః ॥ 73 ॥**

ఆ మహీపతికుమార్తె అయిన ఆ సుందరాంగి అక్కడ నక్కజన్మదాల్చిన భర్తను చూచి ఇలా అన్నది.

**అపి స్మరసి రాజేన్ద్ర! శ్వయోనిస్థస్య యన్మయా ।**
**ప్రోక్తం తే పూర్వచరితం పాషణ్డాలాపసంశ్రయమ్ ॥ 74 ॥**

“రాజేంద్రా! గుర్తుకు ఉన్నదా? నీవు కుక్కజన్మలో ఉండగా, పాషండునితో మాట్లాడిన వృత్తాంతానికి సంబంధించిన పూర్వజన్మ చరిత్ర చెప్పాను. జ్ఞప్తికి వచ్చిందా?” అని అడిగింది.

**పునస్తయోక్తం స జ్ఞాత్వా సత్యం సత్యవతాం వరః ।**
**కాననే స నిరాహారస్తత్యాజ స్వం కలేబరమ్ ॥ 75 ॥**

మళ్లీ ఆమె చెప్పింది సత్యమని తెలుసుకొని, సత్యవంతులలో శ్రేష్ఠుడైన అతడు అరణ్యంలో ఆహారం ఏమీ భుజించకుండా తన శరీరాన్ని విడిచిపెట్టాడు.

**భూయస్తతో వృకం జాతం గత్వా తం నిర్జనే వనే ।**
**స్మారయామాస భర్తారం పూర్వవృత్తమనిన్దితా ॥ 76 ॥**

అతడు మళ్లీ తరువాతి జన్మలో తోడేలుగా పుట్టాడు. ఆ అనిందితురాలైన రాజపుత్రి భర్త ఉన్న నిర్జనవనానికి వెళ్లి పూర్వవృత్తాంతం జ్ఞాపకం చేసింది.

**న త్వం వృకో మహాభాగ! రాజా శతధనుర్భవాన్ ।**
**శ్వా భూత్వా త్వం శృగాలోఽభూర్వృకత్వం సామ్ప్రతం గతః ॥ 77 ॥**

"ఓ మహాభాగ! నీవు తోడేలువు కావు. శతధనువు అనే మహారాజువు నీవు. కుక్కవై, నక్కవై ఇపుడు తోడేలు వయ్యావు" అని పలికింది.

**స్మారితేన యదా త్యక్తస్తేనాత్మా గృధ్రతాం గతః ।**
**అపాపా సా పునశ్చైనం బోధయామాస భామినీ ॥ 78 ॥**

ఆమె అలా స్మరణకు తెచ్చీతేవగానే అతడు ఆ శరీరాన్ని విడిచి పెట్టాడు. ఈ సారి గ్రద్దగా జన్మించాడు. పాపరహితురాలైన ఆ భామిని మళ్లీ అతనిని సమీపించి జ్ఞానోపదేశం చేసింది.

**నరేన్ద్ర! స్మర్యతామాత్మా హ్యలం తే గృధ్రచేష్టయా ।**
**పాషణ్డాలాపజాతోఽయం దోషో యద్ గృధ్రతాం గతః ॥ 79 ॥**

"నరేంద్రా! నిన్ను నీవు గుర్తుకు తెచ్చుకో. ఈ గ్రద్దచేష్టలు చాలు. పాషండునితో సల్లాపం చేసినందు వల్ల ఈ దోషం నిన్ను వెంటాడుతోంది. ఇప్పుడు గ్రద్దవై పోయావు" అని పలికింది.

**తతః కాకత్వమాపన్నం సమనన్తరజన్మని।**
**ఉవాచ తన్వీ భర్తారముపలభ్యా ఽఽత్మయోగతః ॥ 80 ॥**

ఆ తరువాత మళ్లీ అతడు ఆ శరీరంవిడిచి తదనంతర జన్మయందు కాకియై పుట్టాడు. ఆ కోమలాంగి ఆత్మయోగంతో భర్తను చేరి ఇలా అన్నది.

**అశేషా భూభృతః పూర్వం వశ్యా యస్మై బలిం దదుః ।**
**స త్వం కాకత్వమాపన్నో జాతోఽద్య బలిభుక్ ప్రభో! ॥ 81 ॥**

"ప్రభూ! పూర్వం సమస్తరాజేంద్రులు ఎవరికి లొంగి కప్పాలు సమర్పించారో, అట్టి నీవు ఇప్పుడు కాకివై బలిమెతుకులు తింటున్నావా?" అని పలికింది.

**ఏవమేవ చ కాకత్వే స్మారితః స పురాతనమ్ ।**
**తత్యాజ భూపతిః ప్రాణాన్ మయూరత్వమవాప చ ॥ 82 ॥**

ఈ రీతిగా కాకి జన్మలో ఉండగా పురాతన వృత్తాంతం ఆమె జ్ఞప్తికి తెచ్చేసరికి, ఆ భూపతి ప్రాణాలు విడిచి నెమలిజన్మ ధరించాడు.

**మయూరత్వం తతః సా వై చకారానుగతిం శుభా ।**
**దత్తైః ప్రతిక్షణం భోజ్యైర్బాలా తజ్జాతిభోజనైః ॥ 83 ॥**

అతడు ఆ విధంగా నెమలి అయిన తరువాత ఆ కల్యాణి అతనిని అనుసరించింది. ఆ బాల అపుడు ప్రతిక్షణం ఆ జాతి ఆహారాలు, భోజ్యపదార్థాలు పెడుతూ అతనికి తృప్తిని కలగజేసింది.

**తతస్తు జనకో రాజా వాజిమేధం మహాక్రతుమ్ ।**
**చకార తస్యావభృథే స్నాపయామాస తం తదా ॥ 84 ॥**

ఆ తరువాత జనకుడు అనే మహారాజు అశ్వమేధయజ్ఞం చేయడం జరిగింది. అపుడు ఆ రాజపుత్రి అవభృథస్నానంతో అతనిని స్నానం చేయించింది.(తాను కూడ స్వయంగా స్నానం చేసింది)

**సస్నౌ స్వయం చ తన్వంగీ స్మారయామాస చాపి తమ్ ।**
**యథాఽసౌ శ్వశృగాలాద్యా యోనీర్జగ్రాహ పార్థివః ॥ 85 ॥**

తాను కూడ స్నానం ఆచరించిన పిమ్మట, అతనికి రాజై కుక్క, నక్క మున్నగు జన్మలు ధరించిన విషయాన్ని జ్ఞప్తికి తెచ్చింది.

**స్మృతజన్మక్రమః సోఽథ తత్యాజ స్వం కలేబరమ్ ।**
**జజ్ఞే స జనకస్యైవ పుత్రోఽసౌ సుమహాత్మనః ॥ 86 ॥**

జన్మక్రమం జ్ఞాపకంచేసిన పిమ్మట అతడు తన దేహాన్ని విడిచిపెట్టాడు. అతడు మరల మహాజ్ఞాని అయిన ఆ జనకమహారాజుకే కుమారుడుగా జన్మించాడు.

**తతః సా పితరం తన్వీ వివాహార్థమచోదయత్ ।**
**స చాపి కారయామాస తస్యా రాజా స్వయంవరమ్ ॥ 87 ॥**

అనంతరం ఆ తన్వంగి తండ్రిని పెండ్లిగురించి ప్రేరేపించింది. అతడు కూడా కుమార్తెకు స్వయంవరం ఏర్పాటు చేశాడు.

**స్వయంవరే కృతే సా తం సమ్ప్రాప్తం ప్రీతిమాత్మనః ।**
**వరయామాస భూయోఽపి భర్తృభావేన భామినీ ॥ 88 ॥**

ఈ విధంగా స్వయంవరం ఏర్పాటుకాగా, అచ్చటికి ఏతెంచిన తన భర్తను గమనించి ఆ భామిని ప్రీతితో తన భర్తనే మళ్లీ వరించింది.

వి ॥ రాజకుమారుడు అనేక జన్మలు ధరించాడు కాబట్టి వయస్సులో వ్యత్యాసం కానవస్తుంది కదా అనే శంక కలుగక మానదు. అందువల్లనే మహర్షి పలుసందర్భాలలో ఆమెను బాలగానే పేర్కొనడం జరిగింది. ఇది ఆమెకు భగవంతునిద్వారా పూర్వజన్మజ్ఞానం లభించినట్లుగానే, వయస్సు కూడా ఆమెకు ఆ విధంగానే స్థిరీకరణ జరిగిందని గ్రహించాలి.

**బుభుజే చ తయా సార్ధం సమ్భోగాన్నృపనన్దనః ।**
**పితర్యుపరతే రాజ్యం విదేహేషు చకార సః ॥ 89 ॥**

అనంతరం ఆ రాజనందనుడు ఆమెతో పాటు సమస్తభోగాలు అనుభవించాడు. తండ్రి మరణించిన తరవాత అతడు విదేహరాజ్యాన్ని పరిపాలించాడు.

**ఇయాజ యజ్ఞాన్ సుబహూన్ దదౌ దానాని చార్థినామ్ ।**
**పుత్రానుత్పాదయామాస యుయుధే చ సహారిభిః ॥ 90 ॥**

అనేకయజ్ఞాలు ఆచరించాడు. యాచకులకు బహుదానాలు ఇచ్చాడు. ఎక్కువ మంది పుత్రులను కన్నాడు. శత్రురాజులతో యుద్ధం చేశాడు.

**రాజ్యం భుక్త్వా యథాన్యాయం పాలయిత్వా వసున్ధరామ్ ।**
**తత్యాజ స ప్రియాన్ ప్రాణాన్ సంగ్రామే ధర్మతో నృపః ॥ 91 ॥**

న్యాయధర్మంగా రాజ్యభోగాలు అనుభవించాడు. వసుంధరను చక్కగా పరిపాలించాడు. ఆ రాజు తనకు ఇష్టమైన ప్రాణాలను సంగ్రామరంగంలో ధర్మబద్ధంగా విడిచిపెట్టాడు.

**తతశ్చితాస్థం తం భూయో భర్తారం సా శుభేక్షణా ।**
**అన్వారురోహ విధివత్ యథాపూర్వం ముదా సతీ ॥ 92 ॥**

తరువాత చితిపైనున్న ఆ భర్తను మళ్లీ పతివ్రత అయిన ఆ సులోచన ఆనందంగా యథాపూర్వంగా యథావిధిగా అనుగమించి అధిరోహించింది.

**తతోఽవాప తయా సార్ధం రాజపుత్ర్యా స పార్థివః ।**
**ఐన్ద్రానతీత్య వై లోకాన్ లోకాన్ కామదుహోఽక్షయాన్ ॥ 93 ॥**

అనంతరం ఆ శతధనువు మహారాజు రాజపుత్రి అయిన శైబ్యతో బాటుగా ఇంద్రాదిలోకాలను దాటి సమస్తవాంఛలుతీరే అక్షయపుణ్యలోకాలకు చేరుకొన్నాడు.

**స్వర్గాక్షయత్వమతులం దామ్పత్యమతిదుర్లభమ్ ।**
**ప్రాప్తం పుణ్యఫలం ప్రాప్య సంశుద్ధిం తాం ద్విజోత్తమ! ॥ 94 ॥**

ద్విజోత్తమా! ఈ విధంగా పరిశుద్ధుడైన పిమ్మట అతడు సాటిలేని అక్షయమైన స్వర్గలోకవాసం, మిక్కిలి దుర్లభమయిన దాంపత్యధర్మం, అత్యంత పుణ్యఫలం పొందాడు.

**ఏష పాషణ్డసమ్భాషాద్దోషః ప్రోక్తో మయా ద్విజ! ।**
**తథాఽశ్వమేధావభృథస్నానమాహాత్మ్యమేవ చ ॥ 95 ॥**

ద్విజోత్తమా! ఇది పాషండులతో మాట్లాడడం వల్ల వచ్చే దోషం. నేను నీకు వివరించి చెప్పాను. అలాగే అశ్వమేధయాగంలో అవబృథస్నానం చేయడంవల్ల వచ్చే మహిమను కూడా తెలియజేశాను.

**తస్మాత్ పాషణ్డిభిః పాపైరాలాపస్పర్శనం త్యజేత్ ।**
**విశేషతః క్రియాకాలే యజ్ఞాదౌ చాపి దీక్షితః ॥ 96 ॥**

కాబట్టి పాపాత్ములైన పాషండులతో మాట్లాడడం, వారిని తాకడం విడిచి పెట్టాలి. విశేషించి యజ్ఞాది కర్మకలాపంలో దీక్షితుడైనవాడు అట్టి వారితో కలవరాదు.(ఒకనాడు చూడవలసివస్తే వెంటనే సూర్యుని చూడాలి).

**క్రియాహానిర్గృహే యస్య మాసమేకం ప్రజాయతే ।**
**తస్యావలోకనాత్సూర్యం పశ్యేత మతిమాన్ నరః ॥ 97 ॥**

ఎవని ఇంటిలో ఒకనెలరోజుల పాటు నిత్యకర్మలకు హాని కలుగుతుందో, బుద్ధిమంతుడైన నరుడు అట్టి గృహంలో ఉన్న వానిని కనుక చూసినట్లయితే వెంటనే సూర్యనారాయణుని వీక్షించాలి.

**కిం పునర్యైస్తు సన్త్యక్తా త్రయీ సర్వాత్మనా ద్విజ! ।**
**పాషణ్డభోజిభిః పాపైర్వేదవాదవిరోధిభిః ॥ 98 ॥**

ద్విజోత్తమా! వేదత్రయిని సర్వవిధాల విడిచి పెట్టిన వారిని, పాషండుల భోజనం చేసేవారిని, పాపకర్ములైన వారిని, వేదవాక్యాలను విరుద్ధంగా వ్యవహరించే వారిని గురించి ఇక చెప్పవలసింది ఏముంటుంది?

**సహాలాపాస్తు సంసర్గః సహాస్యా చాతిపాపినీ ।**
**పాషణ్డిభిర్దురాచారైస్తస్మాత్తాన్ పరివర్జయేత్ ॥ 99 ॥**

దురాచారులైన పాషండులతో కలిసి సరస సల్లాపాలుచేయడం, వారితో స్నేహం, వారితోకలిసి ఉండడం మహాపాపం అవుతుంది. కాబట్టి అటువంటి వారిని పూర్తిగా విడిచివేయాలి.

**పాషణ్డినో వికర్మస్థాన్ బైడాలవ్రతికాంచ్ఛఠాన్ ।**
**హైతుకాన్ బకవృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపి నార్చయేత్ ॥ 100 ॥**

పాషండులను(స్వధర్మం విడిచినవారిని), వికర్మస్థులను(నిషిద్ధ కర్మలు ఆచరించేవారిని), బైడాల వ్రతం ఆచరించే వారిని(గుట్టు చప్పుడు కాకుండా పాపాలు చేసేవారిని), హైతుకులను (కుతర్కం చేసే వారిని), శఠులను(మన

ముందు ఇచ్చకాలుపలికి వెనుక గోతులు త్రవ్వేవారిని), బకవృత్తులను (మనస్సును నిరోధించకుండా కొంగ జపంచేసేవారిని), దుష్టులను మాటమాత్రంచేత కూడా గౌరవించరాదు.

**దూరతస్తైస్తు సంపర్కస్త్యాజ్యశ్చాప్యతిపాపిభిః ।**
**పాషణ్డిభిర్దురాచారైస్తస్మాత్తాన్ పరివర్జయేత్ ॥ 101 ॥**

మిక్కిలి పాపులైన పాషండులతోను, దురాచారులతోను సంపర్కం కూడనిది. వారిని దూరంగా తొలగించాలి. కాబట్టి వారిని సర్వవిధాల విడిచివేయాలి.

**ఏతే నగ్నాస్తవాఽఽఖ్యాతా దృష్టాః శ్రాద్ధోపఘాతకాః ।**
**యేషాం సమ్భాషణాత్పుంసాం దినపుణ్యం ప్రణశ్యతి ॥ 102 ॥**

ఈ నగ్నులను గురించి నీకు తెలియజేశాను. వారిని చూస్తే శ్రాద్ధం తగలబడిపోతుంది. వారితో సంభాషిస్తే పురుషులకు ఆనాడు చేసినపుణ్యం పూర్తిగా నశించి పోతుంది.

**ఏతే పాషణ్డినః పాపా న హ్యేతా నాలపేద్ బుధః ।**
**పుణ్యం నశ్యతి సమ్భాషాదేతేషాం తద్దినోద్భవమ్ ॥ 103 ॥**

ఈ పాషండులు మహాపాపులు. పండితుడైనవాడు వీరితో మాట్లాడరాదు. వీరితో మాట్లాడడంవల్ల ఆనాడు లభించిన పుణ్యం ఏదైనా ఉంటే అది తుడిచిపెట్టుకు పోతుంది.

**పుంసాం జటాధరణమౌణ్డ్యవతాం వృథైవ**
**మోఘాశినామఖిలశౌచనిరాకృతానామ్ ।**
**తోయప్రదానపితృపిణ్డబహిష్కృతానాం**
**సమ్భాషణాదపి నరా నరకం ప్రయాన్తి ॥ 104 ॥**

"వృథాగా జడలు ధరించేవారు, ముండనం చేయించు కొనేవారు, అతిథులు మున్నగువారికి పెట్టకుండా తామే తినేవారు, అన్ని విధాల శౌచం(ఆచారం) విడిచిపెట్టేసినవారు, పితృదేవతలకు ఉదకప్రదానం, పింద సమర్పణం చేయకుండా ఉండేవారు అయిన పురుషులతో మాట్లాడినా కూడా, నరులు నరకలోకానికి పోతారు" అని పరాశర మహర్షి మైత్రేయునకు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే బౌద్ధధర్మోత్పత్తిః – శతధను మహారాజకథా చేతి అష్టాదశోఽధ్యాయః సమాప్తః ॥ 18 ॥**

శ్రీవిష్ణుపురాణంలో తృతీయాంశంలో బౌద్ధధర్మోత్పత్తి – శతధను మహారాజుకథ అనే పదునెనిమిదవ అధ్యాయం సమాప్తం ॥ 18 ॥

# **చతుర్థాంశః** - నాల్గవ అంశము

## **ప్రథమోऽధ్యాయః**-మొదటి అధ్యాయం

### **పురూరవస్య జన్మ – రేవతీ బలరామయోః వివాహశ్చ** – పురూరవుని జన్మ–రేవతీ బలరాముల వివాహం

**శ్రీమైత్రేయ ఉవాచ :–** మైత్రేయుడు అడుగుతున్నాడు.

**భగవన్! యన్నరైః కార్యం సాధుకర్మణ్యవస్థితైః ।**
**తన్మహ్యం గురుణాऽऽఖ్యాతం నిత్యనైమిత్తికాత్మకమ్ ॥ 1 ॥**

భగవంతుడవైన పరాశరమహర్షీ! సాధుకర్మలు ఆచరించే నరులు చేయదగినవి, నిత్యనైమిత్తిక కర్మస్వరూపాన్ని, గురువరేణ్యులయిన తమరు నాకు తెలియజేయడం జరిగింది.

**వర్ణధర్మాస్తథాऽऽఖ్యాతా ధర్మా యే చాశ్రమేషు చ ।**
**శ్రోతుమిచ్ఛామ్యహం వంశాన్ తాంస్త్వం ప్రబ్రూహి మే గురో! ॥ 2 ॥**

"గురువర్యా! వర్ణధర్మాలు వివరించావు. అదే విధంగా ఆశ్రమధర్మాలు తెలియజేశావు. నేను ఇక రాజవంశాల గురించి వినగోరుతున్నాను. వాటిని గూర్చి చెప్పవలసింది" అని ప్రార్థించాడు.

**పరాశర ఉవాచ :–** పరాశరమునీంద్రుడు చెబుతున్నాడు.

**మైత్రేయ! శ్రూయతామయమ్ – అనేక యజ్వవీరశూరభూపాలాలంకృతో బ్రహ్మాదిర్మానవో వంశః ।**
**తథా చోచ్యతే – 3 ॥**

మైత్రేయా! ఇది విను. ఇది ఎందరో యజ్ఞకర్తలు, వీరులు, శూరులు(ధీరులు) అయిన భూపాలురతో అలంకరించబడిన మనువు వంశం.

**బ్రహ్మాద్యం యో మనోర్వంశం అహన్యహని సంస్మరేత్ ।**
**తస్య వంశసముచ్ఛేదో న కదాచిద్భవిష్యతి ॥ 4 ॥**

ఇది బ్రహ్మతో మొదలయ్యింది. ఆ వంశవృత్తాంతం చెబుతున్నాను. ఆదిపురుషుడైన బ్రహ్మతో ప్రారంభమైన మనువు వంశం ప్రతిదినం స్మరించాలి. అ వంశాన్ని విచ్ఛేదంచేయడం ఎన్నటికీ వీలుకానట్టిది.

**తదస్య వంశానుపూర్వీమశేషపాపప్రక్షాళనాయ మైత్రేయ! ఏతాం శృణు. తదా యథా సకలజగతా మనాదిరాదిభూత ఋగ్యజుః సామాదిమయో భగవాన్విష్ణుః, తస్య బ్రహ్మణో మూర్తిరూపం హిరణ్యగర్భో బ్రహ్మాణ్డతో భగవాన్ బ్రహ్మా ప్రాగ్బభూవ. ॥ 5 ॥**

మైత్రేయా! పూర్వం నుంచి వినవస్తున్న వంశపరంపరను గూర్చిన కథ విను. అది సమస్తపాపాలను పూర్తిగా నశింపజేస్తుంది. సకలజగత్తుకు ఆది అయినవాడు, ఆది లేనివాడు, ఋగ్యజుస్సామాదిమయుడు, భగవంతుడైన విష్ణువు అనేవాడు ఆ పరబ్రహ్మస్వరూపుని మూర్తరూపం. ఆ హిరణ్యగర్భ బ్రహ్మాండమయునినుండి భగవానుడైన బ్రహ్మ స్వయంగా ముందు ఆవిర్భవించాడు.

**బ్రహ్మణశ్చ దక్షిణాంగుష్ఠజన్మా దక్షప్రజాపతిః, దక్షస్యాప్యదితిః, అదితేర్వివస్వాన్, వివస్వతో మనుః, మనోరిక్ష్వాకు నృగధృష్ట శర్యాతి నరిష్యన్త ప్రాంశు నాభాగనేదిష్ఠ కరూష పృషధ్రాఖ్యాః పుత్రా బభూవుః । 6 ॥**

ఆ బ్రహ్మ కుడిబొటనవ్రేలినుండి దక్షప్రజాపతి జన్మించాడు. దక్షుని కుమార్తె అదితి. అదితి కుమారుడు వివస్వంతుడు. వివస్వంతుని పుత్రుడు మనువు. ఆ మనువుకు ఇక్ష్వాకువు, నృగుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, ప్రాంశుడు, నాభాగుడు, నేదిష్ఠుడు, కరూషుడు, పృషధుడు అనే పదిమంది కుమారులు కలరు.

**ఇష్టిం చ మిత్రావరుణయోర్మనుః పుత్రకామశ్చకార । 7 ॥**

ముందు మనువు పుత్రులుకలగాలనే కోరికతో మిత్రావరుణనామకమైన యజ్ఞం చేశాడు.

**తత్రతావదహ్నుతే హోతురపచారాదిలా నామ కన్యా బభూవ । 8 ॥**

అందు హోత విపరీత సంకల్పంవల్ల, యజ్ఞం విపర్యయం కాగా పుత్రునకు బదులుగా 'ఇల' అనే పుత్రిక జన్మించింది.

**సైవ చ మిత్రావరుణప్రసాదాత్ సుద్యుమ్నో నామ మనోః పుత్రో మైత్రేయాఽఽ సీత్, పునశ్చేశ్వరకోపాత్ స్త్రీ సతీ సా తు సోమసూనోర్బుధస్యాశ్రమసమీపే బభ్రామ । 9 ॥**

మైత్రేయా! ఆ ఇలా కన్య మిత్రావరుణుల అనుగ్రహంవల్ల సుద్యుమ్నుడనే మనువు కుమారుడుగా మారడం జరిగింది. అతడు ఒకనాడు ఈశ్వరాపరాధంచేసి ఆయన క్రోధానికి గురి అయి మళ్లీ స్త్రీగా అయిపోయాడు. ఇలా స్త్రీగా మారి ఆమె చంద్రుని కుమారుడైన బుధుని ఆశ్రమసమీపంలో సంచరించింది.

**సానురాగశ్చ తస్యాం బుధః పురూరవమాత్మజముత్పాదయామాస । 10 ॥**

బుధుడు ఆమెయందు అనురాగాన్ని పొందినవాడై 'పురూరవుడు' అనే కుమారుని ఉద్భవింపజేశాడు.

**జాతే చ తస్మిన్నమితతేజోభిః పరమర్షిభిరిష్టిమయఋఙ్మయో యజుర్మయః సామమయోఽథర్వమయః సర్వమయో మనోమయో జ్ఞానమయోఽకించన్మయో(అన్నమయో) భగవాన్ యజ్ఞపురుష స్వరూపీ సుద్యుమ్నస్య పుంస్త్వమభిలషద్భిర్యథావదిష్టః । 11 ॥**

ఆ పురూరవుడు పుట్టిన తరవాత అధిక తేజస్వంతులైన పరమర్షులు యజ్ఞమయుడు, ఋఙ్మయుడు, యజుర్మయుడు, సామమయుడు, అథర్వమయుడు, సర్వమయుడు, మనోమయుడు, జ్ఞానమయుడు, అకించన్మయుడు, (అన్నమయుడు) అయిన భగవంతుడగు యజ్ఞస్వరూపుడైన వేదపురుషుని గురించి సుద్యుమ్నునకు(ఇలకు) పురుషత్వాన్ని కోరి యజ్ఞం చేశారు.

**తత్ప్రసాదిలా పునరపి సుద్యుమ్నోఽభవత్ । 12 ॥**

ఆ ఈశ్వరానుగ్రహంవల్ల ఇల మళ్లీ సుద్యుమ్నునిగా మారిపోయింది.

**తస్యాప్యుత్కల గయవినత సంజ్ఞాస్త్రయః పుత్రా బభూవుః । సుద్యుమ్నస్తు స్త్రీపూర్వకత్వాద్ రాజ్యభాగం న లేభే ॥ 13 ॥**

అతనికి ఉత్కలుడు, గయుడు, వినతుడు అనే పేర్లుగల ముగ్గురు కుమారులు జన్మించారు. సుద్యుమ్నుడు ముందు స్త్రీరూపంపొందియున్న కారణంచే రాజ్యభాగం పొందలేదు.

**తత్పిత్రా తు వశిష్ఠవచనాత్ ప్రతిష్ఠానం నామ నగరం సుద్యుమ్నాయ దత్తమ్. తచ్చాసౌ పురూరవసే ప్రాదాత్(తదన్వయాశ్చ క్షత్రియాః సర్వే దిక్ష్వభవన్) పృషధ్రస్తు గురుగోవధాత్ శూద్రత్వమగమత్ ׀ 14 ॥**

అతని తండ్రి వశిష్ఠుని ఆజ్ఞాప్రకారంగా ప్రతిష్ఠానమనే పేరు గల నగరాన్ని సుద్యుమ్నునికి ఇచ్చాడు. దానిని అతడు పురూరవునకు ఇచ్చాడు. ఆ మనువు కుమారులు, పురూరవుని పుత్రులైన క్షత్రియులు అందరూ అన్ని దిక్కులలోనూ వ్యాపించారు. మనువు పదో కుమారుడైన పృషధ్రుడు గురువుగారి గోవును ప్రమాదవశంచే వధించి శూద్రత్వాన్ని పొందాడు.

**కరూషాత్ కారూషా మహాబలాః క్షత్రియా బభూవుః ׀ 15 ॥**

మనువు తొమ్మిదో కుమారుడు కరూషుడు. కరూషుని వల్ల కారూషులు అనే మహాబలపరాక్రమ వంతులైన క్షత్రియులు జన్మించారు.

వి ॥ కరూషులు – కరూశులు అని పాఠాంతరం.

**(దిష్టపుత్రస్తు) నాభాగో నేదిష్ఠపుత్రస్తు వైశ్యతామగమత్ ׀ 16 ॥**

వి ॥ ఇక్ష్వాకువు సోదరుడు నాభాగుడు. అతడు మనువు కుమారుడు. అతడుకాక దిష్టుని పుత్రుడు నా భాగుడువేరని పాఠాంతరం. ఈ నాభాగుడు నేదిష్ఠుని కుమారుడని వేరే పాఠం.

నేదిష్ఠపుత్రుడైన నాభాగుడు రాజ్యం చేయకుండా వైశ్యత్వాన్ని పొందాడు.

**తస్మాద్ బలన్దనః పుత్రోఽభవత్. బలన్దనాద్ వత్సప్రీతిరుదారకీర్తిః, వత్సప్రీతేః ప్రాంశురభవత్. ప్రజానిశ్చ ప్రాంశోరేకోఽభవత్. తతశ్చ–ఖనిత్రః. తస్మాచ్చ క్షుపః. చాక్షుపాచ్చ అతిబలపరాక్రమోఽవివింశోఽభవత్. తతో వివింశః యః తస్మాచ్చ ఖనినేత్రః. తతశ్చాతివిభూతిః, అతివిభూతేర్భూరిబలపరాక్రమః కరన్ధమః పుత్రోఽభవత్. తస్మాదప్యవిక్షిత్, అవిక్షితోఽప్యతిబలః పుత్రోఽభూత్ ׀ 17 ॥**

వైశ్యత్వప్రాప్తికి పూర్వమే నాభాగునకు బలందనుడు అనే కుమారుడు ఉన్నాడు. బలందనునివల్ల మహాకీర్తిశాలి అయిన వత్సప్రీతి కలిగాడు. వత్సప్రీతికి ప్రాంశుడు జన్మించాడు. ప్రాంశునివల్ల ఒక్కడే ప్రజాని జన్మించాడు. అతనికి ఖనిత్రుడు, అతనికి క్షుపుడు, క్షుపునివల్ల మహాబలపరాక్రమశాలి అయిన అవివింశుడు, అతనికి వివింశుడు, అతనికి ఖనినేత్రుడు, అతనికి అతివిభూతి, అతివిభూతివల్ల అతిబలపరాక్రమవంతుడైన కరంధముడనే పుత్రుడు జన్మించారు. అతనికి అవిక్షిత్తు, అవిక్షిత్తుకు అతిబలుడైన కుమారుడు జన్మించారు.

**మరుత్తో నామాభవత్. యస్యేమావద్యాపి శ్లోకౌ గీయేతే ׀**

అతడు మరుత్తు అనే పేరు గలవాడు. అతని కీర్తికి సంబంధించిన ఈ రెండు శ్లోకాలు నేటికి కూడా గానం చేయబడుతున్నాయి.

**మరుత్తస్య యథా యజ్ఞస్తథా కస్యాభవద్ భువి ।**
**సర్వం హిరణ్మయం యస్య యజ్ఞవస్త్వతిశోభనమ్ ॥**
**అమాద్యదిన్ద్రః సోమేన దక్షిణాభి ర్ద్విజాతయః ।**
**మరుతః పరివేష్టారః సదస్యాశ్చ దివౌకసః ॥ 18 ॥**

"మరుత్తు చేసిన యజ్ఞం వంటిది ఈ భూమండలంపై ఎవరిదైనా జరిగిందా? యజ్ఞంలోని వస్తువులన్నీ మిక్కిలి మంగళప్రదాలు. అంతా బంగారంతో నిండిపోయింది. ఇంద్రుడు సోమరసంచే మదం పొందాడు. ద్విజులు దక్షిణలచే తృప్తి పొందారు. మరుత్తు సభలో పరివేష్టించి కూర్చున్న సభ్యులందరు దివ్యలోక నివాసులే." అని మరుత్తు కీర్తించబడ్డాడు.

**మరుత్తశ్చక్రవర్తీ నరిష్యన్తనామానం పుత్రమవాప. తస్మాచ్చ దమః. దమస్య పుత్రో రాజ్యవర్ధనో జజ్ఞే. రాజ్యవర్ధనాత్ సుధృతిరభూత్. తతశ్చ నరః. తస్మాచ్చ కేవలః. కేవలాత్ బన్ధుమాన్. బన్ధుమతో వేగవాన్. వేగవతో బుధః. తతశ్చ తృణబిన్దుః. తస్యాప్యేకా కన్యా ఇలావిలా నామ. తశ్చాలమ్బుషా(సా) నామ వరాఽప్సరా తృణబిన్దుం భేజే. తస్యామస్య విశాలో జజ్ఞే యః పురీం వైశాలీం నామ నిర్మమే. హేమచంద్రశ్చ విశాలస్య పుత్రోఽభవత్ ।**

ఆ మరుత్తచక్రవర్తికి నరిష్యంతుడనే కుమారుడు జన్మించాడు. అతనికి దముడు, దమునకు రాజ్య వర్ధనుడనే పుత్రుడు కలిగాడు. రాజ్యవర్ధనునికి సుధృతి, సుధృతికి నరుడు, నరునికి కేవలుడు, కేవలునకు బంధుమంతుడు, బంధుమంతునకు వేగవంతుడు, వేగవంతునకు బుధుడు, అతనికి తృణబిందువు జన్మించారు. ఆ తృణబిందువుకు ఇలావిల(ఇలాబిల) అనే ఒక కన్య కలిగింది. ఆ తరువాత అలంబుస అనే అప్సరస వరాంగన తృణబిందువును సేవించింది. అతనికి ఆమెవల్ల విశాలుడు జన్మించాడు. అతడే గొప్పదైన వైశాలీనగరాన్ని నిర్మించాడు. ఆ విశాలునకే హేమచంద్రుడనే పేరుగల కొడుకు పుట్టాడు.

**తస్మాచ్చ సుచన్ద్రః, తత్తనయో ధూమ్రాశ్వః, తస్యాపి సృంజయోఽభూత్. సృంజయాత్ సహదేవః, తతః కృశాశ్వో నామ పుత్రోఽభూత్. సోమదత్తః కృశాశ్వాజ్జజ్ఞే, యో దశాశ్వమేధాన్ ఆజహార. తత్పుత్రశ్చ జనమేజయః, జనమేజయాత్ సుమతిః. ఏతే వైశాలికా భూభృతః । 19 ॥**

ఆ హేమచంద్రునకు సుచంద్రుడు కలిగాడు. అతని కుమారుడు ధూమ్రాశ్వుడు. అతనికి సృంజయుడు జన్మించాడు. సృంజయునకు సహదేవుడు, సహదేవునివల్ల కృశాశ్వుడు అనే పుత్రుడు ఉద్భవించారు. కృశాశ్వుని వల్ల సోమదత్తుడు ప్రభవించాడు. అతడు పది అశ్వమేధయాగాలు చేశాడు. అతని పుత్రుడు జనమేజయుడు. జనమేజయుని కుమారుడు సుమతి. వీరందరూ విశాలదేశాన్ని ఏలిన భూపాలురు.

**వి ॥** సోమదత్తుడు నూరు అశ్వమేధాలు చేశాడని పాఠాంతరం.

**తృణబిన్దోః ప్రసాదేన సర్వే వైశాలికా నృపాః ।**
**దీర్ఘాయుషో మహాత్మానో వీర్యవన్తోఽతిధార్మికాః ॥ 20 ॥**

తృణబిందువు కుమారుడైన విశాలమహారాజు అనుగ్రహంతో ఏర్పడిన విశాలరాజ్యాన్ని పాలించిన రాజేంద్రులు అందరూ దీర్ఘాయుష్మంతులు. మహాత్ములు. బలవంతులు. పరమధార్మికులు.

**శర్యాతేః కన్యా సుకన్యా నామాభవత్, యాముపయేమే చ్యవనః. ఆనర్తశ్చ నామ ధార్మికః శర్యాతి పుత్రోఽభవత్. ఆనర్తస్యాపి రేవతో నామ పుత్రో జజ్ఞే, యోఽసావానర్తవిషయం బుభుజే, పురీం చ కుశస్థలీమధ్యువాస ।**

మనుపుత్రుడైన శర్యాతికి సుకన్య అనే కన్య ప్రభవించింది. ఆమెను చ్యవన మహర్షి వివాహమాడాడు. ఆనర్తుడు అనేవాడు శర్యాతి కుమారుడు. అతడు పరమధార్మికుడు. ఆనర్తునికి రేవతుడు అనే కుమారుడు జన్మించాడు. అతడు ఆనర్తదేశాన్ని పరిపాలించాడు. అతడు కుశస్థలీపురంలో నివసిస్తూ ఉండేవాడు.

**రేవతస్యాపి రైవతః పుత్రః. కకుద్మీ నామా ధర్మాత్మా భ్రాతృశతస్య జ్యేష్ఠోఽభవత్. తస్య చ రేవతీ నామ కన్యా. తామాదాయ కస్యేయమర్హతీతి భగవంతమబ్జయోనిం ప్రష్టుం బ్రహ్మలోకం జగామ. తావచ్చ బ్రహ్మణోఽన్తికే హాహా హూహూ సంజ్ఞాభ్యాం గన్ధర్వాభ్యామతితానం నామ దివ్యం గాన్ధర్వమగీయత । 21 ॥**

రేవతునికి రైవతుడు అనే పుత్రుడు జన్మించాడు. అతడు కకుద్మి అనే పేరుతో ప్రసిద్ధికెక్కాడు. మహాధర్మాత్ముడు. అతడు నూర్గురు సోదరులకు అగ్రజుడై జన్మించాడు. అతనికి రేవతి అనే కన్య కలిగింది. అతడు ఆమెను తీసుకొని ఎవనికి ఈమె భార్యగా తగినదని భగవంతుడైన పద్మసంభవుడగు బ్రహ్మను అడగడానికై బ్రహ్మలోకం వెళ్లాడు. ఆ సమయంలో హాహా హూహూ అనే ఇద్దరు గంధర్వులు " అతితానం" అనే దివ్యగాంధారరాగం పాడుతున్నారు.

**తావచ్చ త్రిమార్గపరివృత్తైరనేకయుగపరివృత్తిం తిష్ఠన్నపి రైవతకః శృణ్వన్ ముహూర్తమివ మేనే । 22 ॥**

అది చిత్ర, దక్షిణ, ధాత్రి అనే గాన సంబంధమైన మూడు మార్గాల పరివర్తనాలతో అనేక యుగాలు గడచిపోతూ ఉన్నా, రైవతుడు అలా నిల్చుండిపోయి వింటూ ముహూర్తసమయం అయినట్లుగా భావించాడు.

**గీతావసానే భగవంతమబ్జయోనిం ప్రణమ్య రైవతకః కన్యాయోగ్యం వరమపృచ్ఛత్. తచ్చాహ భగవాన్. కథయ యోఽభి మతస్తే వర ఇతి. పునశ్చ ప్రణమ్య భగవతే తస్మై యథాఽభిమతానాత్మనస్స వరాన్ కథయామాస. క ఏషాం భగవతోఽభిమతః? కస్మై కన్యామిమాం ప్రయచ్ఛామీతి. తతః కించిదవనతశిరాః సస్మితో భగవాన్ అబ్జయోనిరాహ । 23 ॥**

పాట అయిపోయిన తరవాత రైవతకుడు భగవానుడైన అబ్జయోనికి ప్రణమిల్లి తన కన్యకు తగిన వరుని గురించి అడిగాడు. అపుడు భగవంతుడు" నీకు ఇష్టుడైన కన్యకు తగిన వరుడు ఎవడో చెప్పు." అని ప్రశ్నించాడు. మళ్లీ రైవతకుడు ఆయనకు వినయపూర్వకంగా నమస్కరించి తనకు నచ్చిన వారిని గూర్చి ప్రస్తావించాడు. "వీరితో ఎవడు దేవరకు ఇష్టుడు? ఏ వరునికి ఈ కన్యను ఈయాలి?" అని అడిగాడు. అపుడు ఆ అబ్జసంభవుడు తలపంకించి చిరునవ్వుతో రైవతకునితో ఇలా అన్నాడు.

**య ఏతే భవతోఽభిమతాః, నైతేషాం సాంప్రతమపత్యాపత్యసన్తతిరప్యవనీతలేఽస్తి. బహూని హి తవాత్రైతద్ గాన్ధర్వం శృణ్వతశ్చతుర్యుగాన్యతీతాని. సాంప్రతం భూతలేఽష్టావింశతితమస్య మనోశ్చతుర్యు గమతీతప్రాయమ్. ఆసన్నో హి తత్కలిః. అన్యస్మై కన్యారత్నమిదం భవతైకాకినాఽభిమతాయ దేయమ్ । 24 ॥**

“నీకు ఇష్టమైన వాళ్లు ఎవ్వరూ ఇప్పుడు భూతలంలో లేరు. వారి సంతానంకాని, ఆ సంతానం సంతతి కాని ఇప్పుడు అక్కడ లేదు. నీవు ఇక్కడ గాంధర్వంవింటూ ఉండగా, చాలా చతుర్యుగాలు గడిచిపోయాయి. ఇప్పుడు భూలోకంలో మన్వంతరంలోని చతుర్యుగంలో ఇరవై ఎనిమిదో మహాయుగం గడిచిపోతోంది. కలియుగం కూడ దగ్గర పడింది. నీవు ఇప్పుడు ఒంటరివాడవు. ఈ కన్యను నీకు ఇష్టమయిన మరెవ్వరికయినా ఇచ్చి వివాహం చెయ్యి.

**భవతోఽపి మిత్రమంత్రిభృత్యకలత్రబన్ధుబలకోశాదయః కాలేనైతే నాత్యన్తమతీతాః । 25 ॥**

“నీ సంబంధమైన మిత్రులు, మంత్రులు, భృత్యులు, కలత్రం, మంత్రులు, బంధువులు, సేనలు, కోశాదులన్నీ కాలగమనంలో పూర్తిగా వెళ్లిపోయాయి.” అని బ్రహ్మ చెప్పాడు.

**పునరప్యుత్పన్నసాధ్వసః స రాజా భగవన్తం ప్రణమ్య పప్రచ్ఛ–భగవన్! ఏవమవస్థితే మమేయం కస్మై దేయేతి. తతః స భగవాన్ కించిదవనతకన్ధరం కృతాంజలిభూతం సర్వలోకగురురబ్జయోనిరాహ–। 26 ॥**

అంతట ఆ రాజు మళ్లీ భయంపొందినవాడై భగవంతునకు వినమ్రుడై నమస్కరించి ఇలా అన్నాడు. “భగవాన్! ఇట్టి స్థితిలో నేను ఈమెను ఎవ్వరికి ఈయవలసి ఉంది” అని ఆయనను ప్రశ్నించాడు. అపుడు ఆ భగవంతుడు, సర్వలోకగురువైన ఆ పద్మసంభవుడు కొద్దిగా మెడవంచి చేతులుజోడించియున్న రైవతకునితో ఇలా చెప్పాడు.

**న హ్యాదిమధ్యాన్తమజస్య యస్య**
**విద్మో వయం సర్వగతస్య ధాతుః ।**
**న చ స్వరూపం న పరం స్వభావం**
**న చైవ సారం పరమేశ్వరస్య ॥ 27 ॥**

ఆది, మధ్యం, అన్తం లేనివాడు, అజుడు, సర్వమయుడు అయిన ధాతను గూర్చి మనకు ఏమీ తెలియవు. ఆ పరమేశ్వరస్వరూపంకాని, ఆ పరమస్వభావంకాని, ఆ పరమసారంకాని మనకు తెలియరావు.

**కలా ముహూర్తాదిమయశ్చ కాలో**
**న యద్విభూతేః పరిణామహేతుః ।**
**అజన్మ నాశస్య సమస్తమూర్తే**
**రనామరూపస్య సనాతనస్య ॥ 28 ॥**

కల, ముహూర్తం మున్నగు వాటితో కూడుకొన్న కాలం కూడా ఎవని విభూతికి పరిణామకారణం కాకుండా ఉంటుందో, అది జన్మ, నాశనం లేనిది. అది సదా ఏకమూర్తి. అది నామం, రూపం లేనట్టిది. అది సనాతనమైనది.

**యస్య ప్రసాదాదహమచ్యుతస్య**
**భూతః ప్రజా సృష్టికరోఽన్తకారీ ।**

**క్రోధాచ్చ రుద్రః స్థితి హేతుభూతో**
**యస్మాచ్చ మధ్యే పురుషః పరస్మాత్ ॥ 29 ॥**

ఆ అవ్యయమైన పరబ్రహ్మ అనుగ్రహంవల్ల ప్రజాసృష్టి కారకుడనైన నేను జన్మించాను. క్రోధంవల్ల సంహారకారకుడైన రుద్రుడు ప్రభవించాడు. ఆ పరమ పురుషునివల్లనే స్థితికారకుడైన మధ్యనున్న పురుషుడు(విష్ణువు) ఉద్భవించాడు.

**మద్రూపమాస్థాయ సృజత్యజో యః**
**స్థితౌ చ యోఽసౌ పురుషస్వరూపీ ।**
**రుద్రస్వరూపేణ చ యోఽత్తి విశ్వం**
**ధత్తే తథాఽనన్తవపుః సమస్తమ్ ॥ 30 ॥**

జన్మలేని అతడు నారూపం స్వీకరించి సృష్టిస్తాడు. స్థితికాలంలో పురుషస్వరూపుడై ఉంటాడు. రుద్రరూపంతో విశ్వాన్ని భక్షిస్తాడు. అలాగే అనంతరూపుడై సమస్తాన్ని ధరిస్తాడు.

**శక్రాదిరూపీ పరిపాతి విశ్వ**
**మర్కేన్దురూపశ్చ తమో హినస్తి ।**
**పాకాయ యోఽగ్నిత్వముపేత్య లోకాన్**
**బిభర్తి పృథ్వీవపురవ్యయాత్మా ॥ 31 ॥**

ఇంద్రాదిరూపాలతో విశ్వాన్ని పరపాలిస్తున్నాడు. సూర్యచంద్రస్వరూపాలతో చీకటిని తొలగిస్తున్నాడు. తినే ఆహారాన్ని పచనం చేయడంకోసమై అగ్ని అవుతున్నాడు. ఆ అవ్యయాత్ముడు పృథివీరూపంతో లోకాలను మోస్తున్నాడు.

**చేష్టాం కరోతి శ్వసనస్వరూపీ**
**లోకస్య తృప్తిం చ జలస్వరూపీ ।**
**దదాతి విశ్వస్థితిసంస్థితస్తు**
**సర్వావకాశం. చ నభఃస్వరూపీ ॥ 32 ॥**

వాయుస్వరూపుడై జీవగణానికి చేష్టా ప్రదానం చేస్తున్నాడు. జలరూపంతో లోకాలకు తృప్తిని,(అన్నరూపంతో సంతృప్తిని) కలిగిస్తున్నాడు. విశ్వం ఉనికికి నడుము బిగించినవాడై ఆకాశస్వరూపంతో సమస్తానికి అవకాశం ఇస్తున్నాడు.

**యః సృజ్యతే సర్గకృదాత్మనైవ**
**యః పాల్యతే పాలయితా చ దేవః ।**
**విశ్వాత్మకః సంహ్రియతేఽన్తకారీ**
**పృథక్ త్రయస్యాస్య చ యోఽవ్యయాత్మా ॥ 33 ॥**

ఆ అవ్యయాత్ముడు సృష్టికర్తగా తనను తానే సృజించుకొంటున్నాడు. ఆ దేవుడే పరిపాలకునిగా తనను తాను పాలించుకొంటున్నాడు. ఆ విశ్వస్వరూపుడే అంతకారియై తనను తాను ఉపసంహరించుకొంటున్నాడు. తాను మాత్రం ఈ మూడింటికి వేరుగా ఉన్నాడు.

**యస్మిన్ జగద్ యో జగదేతదాద్యో**
**యశ్చాశ్రితోஉస్మిన్ జగతి స్వయమ్భూః ।**
**స సర్వభూతప్రభవో ధరిత్ర్యాం**
**స్వాంశేన విష్ణుర్నృపతేஉవతీర్ణః ॥ 34 ॥**

నృపాలా! ఈ జగత్తు ఆయనలోనే ఉన్నది. ఆయనే ఈ జగత్తు. ఈ జగత్తుకు ఆయనే ఆద్యుడు. ఈ జగత్తులో ఆయనే ఆశ్రయం. ఆయన స్వయంభువు. ఆయన సమస్తభూతకారణుడు. ఆ విష్ణువు ధరిత్రియందు తన అంశతో అవతరించాడు.

**కుశస్థలీ యా తవ భూప! రమ్యా**
**పురీ పురాஉభూదమరావతీవ ।**
**సా ద్వారకా సమ్ప్రతి తత్ర చాస్తే**
**స కేశవాంశో బలదేవనామా ॥ 35 ॥**

భూపాలా! పూర్వం నీపురి రమ్యమైన కుశస్థలి. అది అమరావతిలా ఉండేది. ఇప్పుడు అక్కడ ద్వారకా నగరం ఉంది. అందు కేశవాంశ బలదేవుడనే పేరుతో ఉన్నది.

**తస్మై త్వమేనాం తనయాం నరేన్ద్ర!**
**ప్రయచ్ఛ మాయామనుజాయ జాయామ్ ।**
**శ్లాఘ్యో వరోஉసౌ తనయా తవేయం**
**స్త్రీరత్నభూతా సదృశో హి యోగః ॥ 36 ॥**

"మానవేంద్రా! నీవు ఈ తనయను ఆ మాయామనుష్య విగ్రహునకు భార్యగా ఇయ్యి. ఈ వరుడు మిక్కిలి కొనియాడదగినవాడు. నీ ఈ కన్యకూడ నారీలోకచూడామణి. వీరి వివాహయోగం తగినటువంటిది." అని చెప్పాడు.

**ఇతీరితేஉసౌ కమలోద్భవేన**
**భువం సమాసాద్య పతిః ప్రజానామ్ ।**
**దదర్శ హ్రస్వాన్ పురుషానశేషా**
**నల్పౌజసః స్వల్పవివేక వీర్యాన్ ॥ 37 ॥**

పద్మసంభవుడు ఇలా చెప్పగానే, జనపతి అయిన ఆ రైవతకుడు వెంటనే భూలోకానికి వచ్చాడు. అప్పటికి ఆనాటి పురుషులు పొట్టిగా, వికారరూపంతో, తక్కువ తేజస్సుతో, స్వల్పమైనట్టి వివేకవీర్యాలతో అందరూ కనిపించారు.

**కుశస్థలీం తాం చ పురీముపేత్య**
**దృష్ట్వా౽న్యరూపాం ప్రదదౌ స్వకన్యామ్ ।**
**సీరాయుధాయ స్ఫటికాచలాభ**
**వక్షఃస్థలాయాతులధీర్నరేంద్రః ॥ 38 ॥**

అతడు తన రాజధాని అయిన కుశస్థలీపురికి వెళ్లాడు. అప్పటికి దానిరూపే మారిపోయింది. సాటిలేని ధీమంతుడైన ఆ నరేంద్రుడు స్ఫటికాచలంవంటి తెల్లని విశాల వక్షఃస్థలంగల హలాయుధుడైన బలదేవునకు తనకన్యను భార్యార్థం ఇచ్చాడు.

**ఉచ్చప్రమాణామితి తామవేక్ష్య**
**స్వలాంగలాగ్రేణ స తాలకేతుః ।**
**వినామయామాస తతశ్చ సా౽పి**
**బభూవ సద్యో వనితా యథా౽న్యా ॥ 39 ॥**

మిక్కిలి పొడవైన ప్రమాణంతో ఉన్న ఆమెను చూచి తాలధ్వజుడైన ఆ బలదేవుడు తననాగలికొనతో వంచాడు. అందువల్ల ఆమె కూడ వెంటనే ఆనాటి మిగిలిన స్త్రీలరూపం కలదయ్యింది.

**తాం రేవతీం రైవతభూపకన్యాం**
**సీరాయుధో౽సౌ విధినోపయేమే ।**
**దత్త్వా చ కన్యాం స నృపో జగామ**
**హిమాచలం వై తపసే ధృతాత్మా ॥ 40 ॥**

అనంతరం ఆ రైవతరాజపుత్రి అయిన రేవతిని హలాయుధుడు యథావిధిగా వివాహం చేసుకొన్నాడు. ఆ నరపాలుడు కూడ ఈ విధంగా కన్యాదానంచేసి, ఇంద్రియనిగ్రహంతో తపస్సుకోసమై హిమాలయానికి వెళ్లి పోయాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే పురూరవస్య జన్మ – రేవతీబలరామయోః వివాహశ్చేతి ప్రథమో౽ధ్యాయః సమాప్తః ॥ 1 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో పురూరవుని జన్మ – రేవతీబలరాముల వివాహం అనే మొదటి అధ్యాయం సమాప్తం ॥ 1 ॥



## ద్వితీయోఽధ్యాయః – రెండవ అధ్యాయం

## యువనాశ్వసౌభరివృత్తాంతౌ – యువనాశ్వసౌభరి వృత్తాంతాలు

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**యావచ్చ బ్రహ్మలోకాత్ కకుద్మీరైవతో నాభ్యేతి తావత్ పుణ్యజనసంజ్ఞా రాక్షసాస్తామస్య పురీం కుశస్థలీం జఘ్నుః । 1 ॥**

బ్రహ్మలోకంనుంచి రైవతకకుద్మి ఎప్పటికీ రాకపోయే సరికి, పుణ్యజనులు అని పిలవబడే రాక్షసులు అతని రాజధాని అయిన కుశస్థలిని సర్వనాశనం చేశారు.

**తచ్చాస్య భ్రాతృశతం పుణ్యజనత్రాసాద్ దిశో భేజే. తదన్వయాశ్చ క్షత్రియాః సర్వదిక్షు అభవన్. ధృష్టస్యాపి ధార్‌ష్టకం క్షత్రం సమభవత్. నాభాగస్యాత్మజో నాభాగః, తస్యామ్బరీషః, అమ్బరీషస్యాపి విరూపోఽభవత్. విరూపాత్ పృషదశ్వో జజ్ఞే. తతశ్చ రథీతరః. తత్రాయం శ్లోకః । 2 ॥**

**"ఏతే క్షత్ర ప్రసూతా వై పునశ్చాంగిరసః స్మృతాః ।**
**రథీతరాణాం ప్రవరాః క్షత్రోపేతా ద్విజాతయః" ॥ ఇతి**

అతని నూరుగురు సోదరులు రాక్షసుల భయంతో నలుదిక్కులకు వెళ్లిపోయారు. అతని వంశంలోని క్షత్రియులు అన్ని దిక్కులలోను ఉన్నారు. మనువు మూడో కుమారుడైన ధృష్టుని కులంలో పుట్టిన వారు ధార్‌ష్టక క్షత్రియులయ్యారు. మనువు ఏడో కుమారుడైన నాభాగునకు (నభారునకు) నాభాగుడనే కుమారుడు జన్మించాడు. అతనివల్ల రథీతరుడు ఉద్భవించాడు. ఈ సందర్భంలో ఈ శ్లోకం ప్రసిద్ధి వహించింది.

"వీరు క్షత్రియవంశంలో జన్మించినా, తరువాత ఆంగిరసులుగా కీర్తించబడ్డారు. రథీతరవంశంలోని శ్రేష్ఠులు అందరూ క్షత్రతేజస్సుతో కూడిన ద్విజధర్మం కలవారు." అని వీరు వాసికెక్కారు.

**క్షువతశ్చ మనోరిక్ష్వాకుర్ఘ్రాణతః పుత్రో జజ్ఞే. తస్య పుత్రశతప్రవరా వికుక్షినిమిదణ్డాఖ్యాస్త్రయః పుత్రాః. శకుని ప్రముఖాః పంచాశత్ పుత్రా ఉత్తరాపథరక్షితారో బభూవుః. చత్వారింశదష్టౌ చ దక్షిణాపథే భూపాలాః ।3 ॥**

ఒకనాడు మనువు తుమ్మగా అతని ముక్కులోనుంచి తేజశ్శక్తి బయటకువచ్చి ఇక్ష్వాకుడనే కొడుకుగా రూపుదాల్చాడు. అతనికి నూరుగురు కొడుకులు. వారిలో వికుక్షి, నిమి, దండుడు అనే ముగ్గురు కుమారులు సుప్రసిద్ధులు. అందు శకుని మొదలయిన యాభైమంది కొడుకులు ఉత్తరాపథానికి రక్షకులయ్యారు. నలభై ఎనమండుగురు దక్షిణాపథానికి రాజేంద్రులయ్యారు.

**స చ ఇక్ష్వాకురష్టకాయాశ్రాద్ధముత్పాద్య శ్రాద్ధార్హమాంసమానయేతి వికుక్షిమాజ్ఞాపయామాస । 4 ॥**

ఆ ఇక్ష్వాకువు ఒకప్పుడు అష్టకాశ్రాద్ధం చేయసంకల్పించి దానికి తగిన మాంసం తీసుకురమ్మని వికుక్షిని ఆజ్ఞాపించాడు.

**స తథేతి గృహీతాజ్ఞో వనమభ్యేత్యానేకాన్ మృగాన్ హత్వా అతిశ్రాన్తోఽతిక్షుత్పరీతో వికుక్షిరేకం శశమభక్షయత్. శేషం చ మాంసమానీయ పిత్రే నివేదయామాస. ఇక్ష్వాకుణాఽపి ఇక్ష్వాకుకులాచార్యః తత్ప్రోక్షణాయ**

**వశిష్ఠః ప్రచోదితః ప్రాహ. అలమనేనామేధ్యేనామిషేణ. దురాత్మనాఽనేన తే పుత్రేణ, ఏతన్మాంసముపహతమ్, యతోఽనేన శశకో భక్షితః. తతశ్చాసౌ వికుక్షిః గురుణైవముక్తః శశాదసంజ్ఞామవాప. పిత్రాఽపి చ పరిత్యక్తః. పితర్యుపరతే చాఖిలామేతాం పృథ్వీం ధర్మతః శశాస. శశాదస్య చ పురంజయో నామ పుత్రోఽభవత్ । 5 ॥**

అతడు అలాగే అని తండ్రివద్ద సెలవు తీసుకొని అడవిలోనికి వెళ్లాడు. ఎక్కువ జంతువులను వేటాడి అతడు బాగా అలిసిపోయాడు. వికుక్షి ఆకలితో నకనకలాడిపోయి ఒక కుందేలును తిన్నా, మిగిలిన (ఉచ్ఛిష్ట) మాంసం తీసుకొని వచ్చి తండ్రికి సమర్పించాడు. ఇక్ష్వాకువు తమవంశ కులాచార్యుడైన వశిష్ఠుని శుద్ధికోసమై మాంసాన్ని సంప్రోక్షణ చేయవలసిందని చెప్పాడు. అపుడాయన “చాలు. ఈ అపవిత్రమైన మాంసంవల్ల ఏం ప్రయోజనం? దురాత్ముడైన నీ ఈ కుమారుడు కుందేలును తిని దీనిని పాడుచేశాడు.” అన్నాడు. ఆ తరవాత వికుక్షి గురువిలా అన్నందువల్ల శశాదుడనే పేరు పొందాడు. తండ్రి కూడ శ్రాద్ధం అపవిత్రమయినందువల్ల కొడుకును విడిచి పెట్టాడు. ఇక్ష్వాకువు చనిపోయిన తరువాత శశాదుడు (వశిష్ఠుని ఆజ్ఞచే) ఈ సమస్త భూమండలాన్ని ధర్మయుక్తంగా పరిపాలించాడు. ఆ శశాదునికి పురంజయుడనే పుత్రుడు కలిగాడు.

**ఇదం చాన్యత్. పురా హి త్రేతాయాం దేవాసురయుద్ధమతీవ భీషణమాసీత్. తత్ర చాతిబలిభిరసురైరమరాః పరాజితాః, భగవన్తం విష్ణుమారాధయాంచక్రుః । 6 ॥**

ఇక్కడ మరో వృత్తాంతం ఉంది. పూర్వం ఒకప్పుడు త్రేతాయుగంలో దేవతలకు, అసురులకు మిక్కిలి భయంకరమైన యుద్ధం సంభవించింది. అందు మహాబలవంతులయిన అసురులు అమరులను ఓడించారు. సురలప్పుడు భగవంతుడైన విష్ణువును ఆరాధించారు.

**ప్రసన్నశ్చ, దేవానామనాదినిధనః సకలజగత్పరాయణో నారాయణః ప్రాహ. జ్ఞాతమేవ మయా యుష్మాభిర్యదభిలషితమ్, తదర్థమిదం శ్రూయతామ్ । 7 ॥**

అనాదినిధనుడు, సకలజగత్పరాయణుడు అయిన నారాయణుడు దేవతలపై అనుగ్రహం చూపినవాడై “మీకు ఏం కావాలో నాకు పూర్తిగా తెలుసు. మీ కోరిక నెరవేరాలంటే ఇది వినండి.”

**పురంజయో హి నామ శశాదస్య చ రాజర్షే స్తనయః క్షత్రియవర్యః. తచ్ఛరీరేఽహమంశేన స్వయమేవావ తీర్య తానశేషానసురాన్ నిహనిష్యామి. తద్ భవద్భిః పురంజయోఽ(అ)సుర వధార్థముద్యోగః కార్యః । ఏతచ్ఛ్రుత్వా ప్రణమ్య భగవన్తం విష్ణుమమరాః పురంజయసకాశమాజగ్ముః । 8 ॥**

క్షత్రియశ్రేష్ఠుడైన రాజర్షి అగు శశాదుని తనయుడు పురంజయుడు అనేవాడు ఉన్నాడు. అతని శరీరంలో నేను స్వయంగా నా అంశతో అవతరించి ఆ సమస్తమైన అసురబృందాన్ని సంహరిస్తాను. కాబట్టి మీరు అందరు ఆ పురంజయుని అసురవధకోసం కార్యం నెరవేరడానికై సిద్ధం చేయండి.” అన్నాడు. ఇది విని అమరులు విష్ణుభగవానునికి నమస్కారంచేసి సెలవడిగి పురంజయుని వద్దకు వచ్చారు.

**“ఊచుశ్చైనం భోః భోః క్షత్రియవర్య! అస్మాభిరభ్యర్థితేన భవతా, అస్మాకమరాతివధోద్యతానాం సాహాయ్యం, కృతమిచ్ఛామః । 9 ॥**

వారందరూ అతనితో "ఓయీ!ఓయీ! క్షత్రియవర్యా! నీవు మా ప్రార్థనను అంగీకరించు. శత్రువులను వధించే ప్రయత్నంలో ఉన్న మాకు నీవు సహకారం చేయాలని కోరుకొంటున్నాము.

**తద్ భవతా అస్మాకమభ్యాగతానాం ప్రణయభంగో న కార్యః." ।**

కాబట్టి నీవు అభ్యాగతులమయిన మాకు స్నేహప్రీతిభంగం కలిగించరాదు." అని వేడుకొన్నారు.

**ఇత్యుక్తః పురంజయః ప్రాహ. సకలత్రైలోక్యనాథో యోஉయం యుష్మాకమిన్ద్రః శతక్రతుః, అస్య యద్యహం స్కన్ధమారూఢో యుష్మదరాతిభిః సహ యోత్స్యే, తదాஉహం భవతాం సహాయః. ఇత్యాకర్ణ్య సమస్తదేవైరిన్ద్రేణ చ బాఢమిత్యేవం సమన్వీప్సితమ్ । 10 ॥**

వారు ఇలా ప్రార్థించగా పురంజయుడు "సమస్తత్రైలోక్యనాథుడైన శతక్రతువగు మీ ప్రభువైన ఈ ఇంద్రుడు ఉన్నాడు కదా! అతని భుజంపై కూర్చొని నేను మీ శత్రువులతో యుద్ధం చేయడానికి ఒప్పుకొంటే అప్పుడు నేను మీకు సహాయం చేస్తాను." అన్నాడు. అతడు ఇలా చెప్పగా దేవతలందరూ విని దేవేంద్రునితో బాటు "చాలా బాగుంది" అని వెంటనే అంగీకారం తెలియజేశారు.

**తతశ్చ శతక్రతోర్వృషభరూపధారిణః కకుది స్థితో హర్షసమన్వితో భగవతశ్చరాచరగురోరచ్యుతస్య తేజసాஉప్యాయితో దేవాసురసంగ్రామే సమస్తానేవాసురాన్ నిజఘాన. యతశ్చ వృషభకకుది స్థితేన రాజ్ఞా నిషూదితమసుర బలమ్, తతశ్చాసౌ కకుత్స్థసంజ్ఞామవాప । 11 ॥**

అనంతరం పురంజయుడు వృషభరూపాన్ని ధరించిన శతక్రతువు మూపురంపై కూర్చొని సంతోషం పొందినవాడయ్యాడు. చరాచరప్రభువైన భగవంతుడైన అచ్యుతుని తేజస్సువల్ల పుష్టి చెందాడు. దేవాసురసంగ్రామంలో అసురులను అందరినీ పూర్తిగా సంహరించాడు. వృషభం (ఎద్దు) మూపురంపై ఉండి, ఆ రాజు దైత్యసైన్యాన్ని సంహరించిన కారణంచే, అతనికి కకుత్స్థుడనే పేరు వచ్చింది.

**కకుత్స్థస్యాప్యనేనాః పుత్రోஉభూత్. అనేనసః పృథుః, పృథోర్విష్టరాశ్వః(విశ్వగశ్వః). తస్య చార్ద్రోஉభూత్. ఆర్ద్రస్య యువనాశ్వః, తస్య శ్రావస్తః, యః శ్రావస్తీం పురీం నివేశయామాస. శ్రావస్తస్య బృహదశ్వః, బృహదశ్వస్యాపి కువలయాశ్వః. యోஉసావుత్తంకస్య మహర్షేరపకారిణం ధున్ధు నామానమసురం వైష్ణవేన తేజసాஉప్యాయితః పుత్రసహస్రైరేకవింశద్భిః పరివృతో జఘాన. ధున్ధుమారసంజ్ఞామవాప. తస్య చ సమస్తా ఏవ పుత్రా ధున్ధుముఖనిఃశ్వాసాగ్నినా విప్లుష్టా వినేశుః । 12 ॥**

కకుత్స్థునికి కూడా అనేనసుడనే పుత్రుడు జన్మించాడు. అనేనసునకు పృథువు, పృథువుకు విష్టరాశుడు (విశ్వగశ్వుడు), అతనికి ఆర్ద్రుడు, ఆర్ద్రునకు యువనాశ్వుడు, అతనికి శ్రావస్తుడు జన్మించారు. శ్రావస్తుడే శ్రావస్తీనగరాన్ని నిర్మించాడు. అతనికి బృహదశ్వుడు, బృహదశ్వునకు కువలయాశ్వుడు జన్మించారు. ఒకప్పుడు ధుంధువనే అసురుడు ఉత్తంకమహర్షికి అపకారం చేశాడు. అప్పుడు కువలయాశ్వుడు విష్ణుతేజస్సువల్ల అభివృద్ధి పొందినవాడై ఆ ధుంధువనే రాక్షసుని ఇరవై యొక్క వేల కుమారులతో వెళ్ళి చంపివేసెను. దుంధువును చంపినందున ధుంధుమారుడనే పేరు పొందాడు. ధుంధువు ముఖంలోనుంచి బయల్వెడలిన నిట్టూర్పుల వేడివల్ల అతని కుమారులు తగులబడిపోయి నశించారు.

**దృఢాశ్వచన్ద్రాశ్వకపిలాశ్వాస్త్రయః కేవలమవశేషితాః దృఢాశ్వాద్ హర్యశ్వః, తస్మాద్ నికుమ్భః, నికుమ్భాత్ సంహతాశ్వః (అమితాశ్వః), తతశ్చ కృశాశ్వః, తస్మాత్ ప్రసేనజిత్, తతో యువనాశ్వో౾భవత్. తస్య చాపుత్రస్యాతినిర్వేదాన్మునీనామాశ్రమమణ్డలే నివసతః కృపాలుభిస్తైర్మునిభిరపత్యోత్పాదనాయ ఇష్టిః కృతా. తస్యాం చ మధ్యరాత్రే నివృత్తాయాం మన్త్రపూతజలపూర్ణకలశం వేదిమధ్యే నివేశ్య తే మునయః సుషుపుః । 13 ॥**

కేవలం దృఢాశ్వుడు, చంద్రాశ్వుడు, కపిలాశ్వుడు అనే ముగ్గురు మాత్రమే మిగిలారు. అందు దృఢాశ్వుని వల్ల హర్యశ్వుడు, అతనివల్ల నికుంభుడు, నికుంభునివల్ల సంహతాశ్వుడు (అమితాశ్వుడు), అతనివల్ల కృశాశ్వుడు, అతనివల్ల ప్రసేనజిత్తు, ప్రసేనజిత్తుకు యువనాశ్వుడు జన్మించారు. అతడు పుత్రులులేక మిక్కిలి దుఃఖంతో మునీశ్వరులు ఉండే ఆశ్రమప్రదేశాలలో నివసించసాగాడు. అందువల్ల అతనికి సంతానోత్పత్తి కలిగించడానికై కృపాపరులైన మునులందరూ యజ్ఞం చేశారు. ఆ యజ్ఞంలో అర్ధరాత్రి దాటిన తరవాత మంత్రాలతో పవిత్రమైన జలం నిండియున్న కలశాన్ని యజ్ఞవేదిక నడుమ భద్రంగా ఉంచి ఆ మునీశ్వరులు నిద్రించారు.

**తేషు చ సుప్తేషు అతీవ తృట్పరీతః స భూపాలస్తమాశ్రమం వివేశ. సుప్తాంశ్చ తానృషీన్ నైవోత్థాపయామాస । 14 ॥**

వారు నిద్రపోయిన పిమ్మట ఆ భూపాలుడు చాలా దప్పిక కాగా ఆశ్రమంలోకి ప్రవేశించాడు. నిద్రపోతున్న ఋషులను లేపనే లేపలేదు.

**తచ్చ కలశజలమపరిమేయమాహాత్మ్యం మన్త్రపూతం పపౌ. ప్రబుద్ధాశ్చ ఋషయః పప్రచ్ఛుః. కేనైతన్మన్త్రపూతం వారి పీతమ్. అత్ర హి పీతే రాజ్ఞో౾స్య యువనాశ్వస్య పత్నీ మహాబలపరాక్రమం పుత్రం జనయిష్యతి. ఇత్యాకర్ణ్య స రాజా అజానతా మయా పీతమిత్యాహ । 15 ॥**

మంత్రపూతమైన, ప్రమాణాలచే నిర్ణయించశక్యంకాని, మహామహిమకలదైన కలశమందలి జలం త్రాగివేశాడు. మేలుకొన్న ఋషీశ్వరులు "ఎవరు ఈ మంత్రపవిత్రనీరం త్రాగారు? దీని వల్లనే కదా యువనాశ్వమహారాజుధర్మపత్ని మహాబలపరాక్రమవంతుడైన కుమారుని కనబోయేది?" అని ప్రశ్నించారు. అది విని ఆ రాజు తెలియక దాహబాధతో నేనే త్రాగానన్నాడు.

**గర్భశ్చ యువనాశ్వోదరే౾భవత్ క్రమేణ చ వవృధే. ప్రాప్తసమయశ్చ దక్షిణం కుక్షిమవనీపతేర్నిర్భిద్య నిశ్చక్రామ న చాసౌ రాజా మమార । 16 ॥**

అందువల్ల యువనాశ్వుని ఉదరంలో గర్భం ఏర్పడింది. అది క్రమంగా పెరగసాగింది. తగిన సమయం రాగానే ఆ మహీపతి కుడిడొక్క చీల్చుకొని (మగశిశువు) బయటకు వచ్చాడు. కాని (మంత్రమహిమవల్ల) ఆ రాజు మాత్రం మరణించలేదు.

**జాతో నామ కం ధాస్యతీతి తే మునయః ప్రోచుః. అథాగమ్య దేవరాడబ్రవీత్. మామయం ధాస్యతీతి. తతో మాన్ధాతా నామతో౾భవత్. వక్త్రే చాస్య ప్రదేశినీ దేవరాజేన న్యస్తా, తాం పపౌ. తాం చామృతస్రావిణీమాసాద్య పీత్వా చాహ్నైవ వ్యవర్ధత. స తు మాన్ధాతా చక్రవర్తీ సప్తద్వీపాం మహీం బుభుజే. భవతి చాత్ర శ్లోకః ।**

**యావత్సూర్య ఉదేత్యస్తం యావచ్చ ప్రతితిష్ఠతి ।**
**సర్వం తద్ యౌవనాశ్వస్య మాన్ధాతుః క్షేత్రముచ్యతే ॥ 17 ॥**

అంత మునులు "వీడు పుట్టాడు సరే. ఎవరిని (పాలు) త్రాగుతాడు" అని భావించారు. అపుడు దేవేంద్రుడు వచ్చి "మాం ధాస్యతి=నన్ను త్రాగుతాడు" అన్నాడు. అందువల్ల అతడు మాంధాత అన్న పేరుతో వాసికెక్కాడు. దేవరాజు ఆ బాలుని నోటిలో తన చూపుడు వ్రేలు పెట్టగా దానిని చీకాడు. చూపుడు వ్రేలు అమృతాన్ని స్రవించింది. దానిని ఆస్వాదించి అతడు ఒక్కరోజులోనే పెరిగాడు. అనంతరం మాంధాత చక్రవర్తియై ఏడు ద్వీపాలతో నిండిన భూమినంతటినీ ఏలాడు. ఈ సందర్భంలో ఈ శ్లోకం గానం చేయబడుతోంది.

"సూర్యుడు ఏ మేరకు ఉదయించునో, ఏ మేరకు అస్తమించునో, ఎందాక సంచరించునో అది అంతా యువనాశ్వుని కుమారుడైన మాంధాత ఏలుబడిలో ఉన్న ప్రదేశమే."

**మాన్ధాతా చ శశబిన్దుదుహితరం బిన్దుమతీముపయేమే. పురుకుత్సమమ్బరీషం ముచుకుందం చ తస్యామపత్యత్రయముత్పాదయామాస. పంచాశచ్చ దుహితరస్తస్యామేవ తస్య నృపతేర్బభూవుః. (శతబిన్దురితి పాఠాంతరః) । 18 ॥**

మాంధాత శశబిన్దుని కుమార్తె అయిన బిందుమతిని పెండ్లి చేసుకొన్నాడు. అతడు ఆమె వల్ల పురుకుత్సుడు, అంబరీషుడు, ముచుకుందుడు అనే ముగ్గురు కుమారులను కన్నాడు. ఆమెవల్లనే అతనికి యాభైమంది కమార్తెలు కూడ కలిగారు.

**(తస్మిన్నన్తరే) బహ్వృచశ్చ సౌభరిర్నామ ఋషిరన్తర్జలే ద్వాదశాబ్దం కాలమువాస । 19 ॥**

ఈ సమయంలోనే బహ్వృచుడైన సౌభరి అనే మహర్షి నీటిలో పండ్రెండు సంవత్సరాలు తపస్సుచేస్తూ ఉండిపోయాడు.

**తత్ర చాన్తర్జలే సుమ్మందో నామాతిబహుప్రజాః అతిప్రమాణో మీనాధిపతిరాసీత్. తస్య పుత్రపౌత్రదౌహిత్రాః పార్శ్వతః పృష్ఠతోఽగ్రతో వక్షః పుచ్ఛ శిరసాం చోపరి భ్రమన్తస్తేనైవ సహాహర్నిశమతినిర్వృత్తా రేమిరే. స చాపి తత్స్పర్శోపచీయమానహర్షప్రకర్షో బహుప్రకారం తస్యర్షేః పశ్యతస్తైరాత్మజపౌత్రదౌహిత్రాదిభిః సహానుదివసం బహుప్రకారం రేమే. అథాన్తర్జలావస్థితః స సౌభరిరేకాగ్రతాసమాధానమపహాయానుదినం తత్ తస్య మత్స్యస్యాత్మజ పౌత్రదౌహిత్రాదిభిః సహాతిరమణీయం లలితమవేక్ష్యాచిన్తయత్ । 20 ॥**

ఆ నీటిలోనే సుమ్మందుడు అనే ఒక మీనాధిపతి ఉన్నాడు. అతడు ఎక్కువ సంతానం కలవాడు. మిక్కిలి పెద్దదైన శరీరప్రమాణం కల్గినవాడు. అతని పుత్రులు, పౌత్రులు, దౌహిత్రులు రెండు ప్రక్కలా, వెనక, ముందూ ఉండి, పొట్టమీద, తోకమీద, శిరస్సుమీద తిరుగుతూ అతనితో కలిసి రాత్రిపగలు ఆనందంతో ఆడుకొనేవారు. అతడు కూడా ఆ సంతానస్పర్శవల్ల సంతోషం పెరుగుతూ ఉండగా, అనేక రీతులతో ఆ ఋషీశ్వరుడు చూస్తూ ఉండగా, కొడుకులతో, మనుమలతో, కూతుళ్లకొడుకులతో, ఇంకా మిగిలిన వారితో ప్రతిదినం బహుప్రకారం

క్రీడించేవాడు. అంత జలాంతఃస్థితుడైయున్న సౌభరి ఏకాగ్రతతోనిండిన సమాధిని విడిచి పెట్టి, ప్రతిదినం ఆ మత్స్యం అలా పుత్రపౌత్ర దౌహిత్రాదులతో కలిసి అతి మనోహరంగా ఉండడం చూచి ఇలా అనుకున్నాడు.

**అహో!ధన్యోఽయమీదృశమపి అనభిమతం యోన్యంతరమవాప్య ఏభిరాత్మజపౌత్రాదిభిః సహ రమమాణోఽతీవ, అస్మాకం స్పృహాముత్పాదయతి. వయమప్యేవం పుత్రాదిభిః సహ రమిష్యామః. ఇత్యేవమభిసమీక్ష్య స తస్మాదన్తర్జలాన్నిష్క్రమ్య సంతానాయ నిర్వేష్టుకామః కన్యార్థం మాన్ధాతారం రాజానమగచ్ఛత్ । 21 ॥**

"ఆహా! ఇతడెంత ధన్యుడో కదా! ఇటువంటి అభీప్సితంకాని జన్మ ఎత్తి కూడా, ఈ ఆత్మజ పౌత్ర దౌహిత్రాదులతో ఎలా ఆనందంగా క్రీడిస్తున్నాడో? మాలాంటి వారికి కూడా సంసారస్పృహ కలిగిస్తున్నాడు. నేను కూడా ఇలా సంసారంలో పుత్రాదులతో క్రీడిస్తాను." అని బాగా ఆలోచించి ఆ జలంనుంచి బయటకు వచ్చి సంతానంకోసమై గృహస్థాశ్రమప్రవేశం చేయగోరి కన్యకోసమై మాంధాత చక్రవర్తి వద్దకు వెళ్లాడు.

**అథాగమనశ్రవణసమనన్తరం చోత్థాయ తేన రాజ్ఞా సమ్యక్ అర్ఘ్యాదినా పూజితః కృతాసనపరిగ్రహః సౌభరి రువాచ ।**

**నిర్వేష్టుకామోఽస్మి నరేన్ద్ర!కన్యాం**
**ప్రయచ్ఛ మే మాప్రణయం విభాంక్షీః ।**
**న హ్యర్థినః కార్యవశాభ్యుపేతాః**
**కకుత్స్థగోత్రే విముఖే ప్రయాన్తి ॥ 22 ॥**

సౌభరి రాక విన్నవెంటనే, ఆ రాజు ఆసనంనుండి లేచి, ఎదురువెళ్లి ఆయనకు అర్ఘ్యాదులతో చక్కగా పూజించాడు. ఉచితాసనం కల్పించాడు. అపుడు ఆ మహర్షి "నరేంద్రా! నేను గృహస్థాశ్రమంలో ప్రవేశించాలనుకొంటున్నాను. నాకు కన్యను ఇవ్వు. నా కోరిక కాదనకు. ప్రత్యేకించి కకుత్స్థగోత్రంలో పుట్టిన వారి వద్దకు వచ్చిన యాచకులు కార్యసాధన కొరకై వచ్చి పెడమొగంతో వెళ్లిపోరు కదా!

**అన్యే వసన్త్యేవ నృపాః పృథివ్యాం**
**క్ష్మాపాల యేషాం తనయాః ప్రభూతాః ।**
**కిన్త్వర్థినామర్థితదానదీక్షా**
**కృతవ్రతశ్లాఘ్యమిదం కులం తే ॥ 23 ॥**

భూపాలా! పృథివిపై ఆడపిల్లలనుకన్న నరపాలురు అనేకులు ఉండవచ్చుగాక! కాని అర్థులు అడిగిన దానిని దానం ఇవ్వాలనే దీక్షతో వ్రతం పట్టిన, మిక్కిలి కొనియాడదగిన వంశం మీదే కదా!(నీదే కదా!)

**శతార్ధ సంఖ్యాస్తవ సన్తి కన్యా**
**స్తాసాం మమైకాం నృపతే! ప్రయచ్ఛ ।**
**యత్ ప్రార్థనాభంగభయాద్ బిభేమి**
**తస్మాదహం రాజవరాతిదుఃఖాత్ ॥ 24 ॥**

నృపాలా! నీకు యాభైమంది కుమార్తెలు ఉన్నారు. వారిలో ఒక్కదానిని నాకియ్యి చాలు. రాజవర్యా! నిన్ను చూస్తూ ఉంటే కోరిన కోరిక తీరదేమో అన్న బెంగ కలుగుతోంది. నేను అందువల్ల మిక్కిలి భయపడుతూ దుఃఖం చెందుతున్నాను" అన్నాడు.

**ఇతి ఋషివచనమాకర్ణ్య స రాజా జరాజర్జరిత దేహం తమృషిమాలోక్య ప్రత్యాఖ్యానకాతరస్తస్మాచ్చ భగవతః శాపతో బిభ్యత్ కించిదధోముఖశ్చిరం దధ్యౌ.**

**సౌభరిరువాచ :**–సౌభరి చెప్పాడు

**నరేన్ద్ర! కస్మాత్ సముపైషి చిన్తా**
**మశక్యముక్తం న మయాఽత్ర కించిత్ ।**
**యాఽవశ్యదేయా తనయా తవైవ**
**కృతార్థతా నో యది కిం న లబ్ధమ్ ॥ 25 ॥**

ఈ విధంగా పలికిన సౌభరి వచనం విని, ఆ రాజు ముసలితనంతో సడలిపోయిన మేను గల ఆ ఋషిని వీక్షించి, ఆయన కోరికను తిరస్కరించడానికి భయపడి, ఎక్కడ ఆ భగవత్స్వరూపుడు శపిస్తాడో అని గడగడలాడి కొంచెం తలవంచుకొని, చాలా సేపు ఆలోచించాడు.

అంత సౌభరి "నరేంద్రా! ఎందుకు ఇలా విచారిస్తున్నావు? నేనేమీ తగనిమాట పలకలేదు కదా! ఇక్కడ నీవు నీ తనయను ఇవ్వక తప్పదు. నీ కుమార్తె నిస్తేనే నేను కృతార్థుడనౌతాను. ఏం? నాకు అది లభించదంటావా?" అన్నాడు.

**అథ తస్య శాపభీతః సప్రశ్రయమువాచాసౌ రాజా. భగవన్! అస్మత్కులస్థితిరియమ్. య ఏవ కన్యాయా అభిరుచితోఽభిజనవాన్ వరస్తస్మై కన్యా ప్రదీయతే. భవద్యాచ్ఞా చాస్మన్మనోరథానామప్యగోచరవర్తినీ కథమప్యేషా సంజాతా. తదేవమవస్థితే న విద్మః కిం కుర్మ ఇతి. తన్మయా చిన్త్యత ఇత్యభిహితే తేన భూభుజా మునిరచిన్తయత్. అహో! అయమన్యోఽస్మత్ప్రత్యాఖ్యానోపాయః. వృద్ధోఽయమనభిమతః స్త్రీణాం కిముత కన్యానామిత్యమునా సంచిన్త్యైవమభిహితమ్ । 26 ॥**

అపుడు అతని శాపానికి భయపడి ఆ రాజు వినయంతో "భగవానుడా! ఇది మా వంశాచారం. మంచి వంశంలో పుట్టిన వానికే, కన్యకు ఇష్టమైన వానికే పిల్లనీయడం జరుగుతుంది. నీ కోరిక మా అభీష్టాలకు కూడా అందనిది. ఇది ఎలా కలిగిందో? ఈ స్థితిలో ఏమి చేయాలో పాలు పోవడం లేదు. అందుకే ఈ ఆలోచన" అన్నాడు. ఆ రాజేంద్రుడు ఇలా చెప్పగానే సౌభరి మహర్షి ఆలోచించి "ఇది కాదనడానికి మరో ఉపాయం అన్నమాట. ఇతడు ముసలివాడు. ఆడవాళ్లకే నచ్చడు. ఇక కన్యలవిషయంలో చెప్పేదేముంది? సరే అని భావించి అని ఉండవచ్చు ఈ రీతిగా." అని తలపోసి ఇలా అన్నాడు.

**ఏవమస్తు తథా కరిష్యామీతి సంచిన్త్య మాన్ధాతారమువాచ । 27 ॥**

"అలాగే కానియ్యి. నీవు చెప్పినట్లుగానే చేస్తాను" అని అతడు మాంధాతతో చెప్పాడు.

**యద్యేవం తదాదిశ్యతామస్మాకం ప్రవేశాయ కన్యాన్తఃపురవర్షధరః ॥ 28 ॥**

"రాజా! ఇలా అయితే మేము కన్యాంతఃపురప్రవేశం చేయడానికై అంతిపురిని కావలికాచేవానికి ఆజ్ఞ ఇయ్యి.

**యది కన్యైవ కాచిన్మామభిలషతి, తదాऽహం దారపరిగ్రహం కరిష్యామీతి. అన్యథా చైతదలమస్మాకమ్. ఏతేనాతీతకాలారమ్భేణ, ఇత్యుక్త్వా విరరామ ।**

ఏ కన్య అయినా నన్ను కోరుకొంటేనే, అప్పుడు నేను భార్యా పరిగ్రహం చేస్తాను, లేదా ఇది ఇంతటితో నాకు చాలు. కాలం గడిచిపోయిన తరవాత ప్రారంభించిన ప్రయత్నాన్ని ఇంతటితో చాలించుకొంటాను" అని విరమించాడు.

**తతశ్చ మాన్ధాత్రా మునిశాపశంకితేన కన్యాన్తఃపురవర్షధరః సమాజ్ఞప్తః. తేన సహ కన్యాన్తఃపురం ప్రవిశన్నేవ భగవాన్ అఖిలసిద్ధగన్ధర్వమనుష్యేభ్యోऽతిశయేన కమనీయం రూపమకరోత్. ప్రవేశ్య చ తమృషిమన్తఃపురే వర్షధరస్తాః కన్యకాః ప్రాహ. భవతీనాం జనయితా మహారాజః సమాజ్ఞాపయతి, అయమస్మాన్ బ్రహ్మర్షిః కన్యార్థం సమభ్యాగతః. మయా చాస్య ప్రతిజ్ఞానం యద్యస్మత్కన్యకా యా కాచిద్ భగవన్తం వరయతి, తత్కన్యాయాశ్ఛన్దే నాహం పరిపన్థానం కరిష్యామి. ఇత్యాకర్ణ్య సర్వా ఏవ తాః కన్యకాః సానురాగాః సప్రమదాః కరేణవ ఇవేభయూథపతిం తమృషి మహమహమికయా వరయాంబభూవురూచుశ్చ-॥ 29 ॥**

ఆ తరువాత మాంధాత మునిశాపానికి జడిసి కన్యాంతఃపురరక్షకశ్రేష్ఠునికి ఆజ్ఞాపించాడు. అతనితో కలసి కన్యకాంతఃపురంప్రవేశిస్తూనే భగవంతుడైన సౌభరి సమస్తసిద్ధగంధర్వమనుష్యులను మించిన కమనీయమైన రూపం ధరించాడు. ఆ ఋషిని అతడు అంతిపురిలో ప్రవేశపెట్టి ఇలా అన్నాడు ఆ రాజకన్యలతో "మీ తండ్రి మహారాజు ఇలా ఆజ్ఞాపించాడు. ఈ బ్రహర్షి కన్యకోసమై నా వద్దకు వచ్చాడు. మా అమ్మాయిలలో ఏ ఒక్క కన్య అయినా ఈ దేవరను వరిస్తే, ఆమె ఇష్టానికి నేను అడ్డుచెప్పనని ప్రతిజ్ఞ చేశానని చెప్పడం జరిగింది" అని వినయంగా పలికాడు. ఆ వచనం ఆలకించి ఆ రాజకన్యకలందరూ అనురాగంతో, సంతోషంతో ఆడఏనుగులు కొమ్ముటేనుగును చేరినట్లు అహమహమికతో ఆ ఋషిని వరించి ఇలా అన్నారు.

**అలం భగిన్యోऽహమిమం వృణోమి**
**వృణోమ్యహం నైష తవానురూపః ।**
**మమైవ భర్తా విధినైష సృష్టః**
**సృష్టాऽహమస్యోపశమం ప్రయాహి ॥ 30 ॥**

"తోబుట్టువులారా! చాలు. ఈ సుందరస్వరూపుని నేను వరిస్తున్నాను." "వరించేది నీవుకాదు. నేను. ఇతడు నీకు తగినట్టి వాడు కాదు.". "ఇతడు నాకు అనుకూలుడైన భర్త. బ్రహ్మదేవుడే ఇలా సృష్టించాడు." "వెళ్లు వెళ్లు. తగ్గు తగ్గు. ఇతని కోసమై నేను సృష్టించబడ్డాను."

**వృతో మయాఽయం ప్రథమం మయాఽహం**
**గృహం విశన్నేవ విహన్యసే కిమ్ ।**
**మయా మయేతి క్షితిపాత్మజానాం**
**తదర్థమత్యర్థకలిర్బభూవ ॥ 31 ॥**

"నేను ఇతనిని మొదటనే వరించాను. ఇక మాట్లాడకు." "ఇంట్లో ప్రవేశించేటప్పుడు నేను వరించాను. ఎందుకు అడ్డుపడుతున్నావు?". "కాదు నేను వరించా". అని అతని కోసమై ఆ రాజకన్యకలకు పెద్దకలహమే అయింది.

**యదా తు సర్వాభిరతీవహార్దాద్**
**ధృతః స కన్యాభిరనిన్ద్య కీర్తిః ।**
**తదా స కన్యాధికృతో నృపాయ**
**యథావదాచష్ట వినమ్రమూర్తిః ॥ 32 ॥**

ఇలా ఆ రాజకన్యలందరు ఎంతో హృదయపూర్వకంగా ప్రశస్తయశశ్శాలి అయిన ఆ మునిబాలకుని వరించగానే, కన్యాంతఃపురరక్షకుడు రాజు సన్నిధికేగి వినయంతో వంగి వాస్తవం విన్నవించాడు.

**తదవగమాత్ కిమేతత్ కథయ, కిం కరోమీతి, కిం మయాఽభిహితమిత్యాకులమతిరనిచ్ఛన్నపి కథమపి రాజాఽనుమేనే. కృతానురూపవివాహశ్చ మహర్షిః సకలా ఏవ తాః కన్యకాః స్వమాశ్రమమనయత్।**

అది తెలిసికొని రాజు"ఏమిటేమిటి? మరోసారి చెప్పు. ఇలా జరిగిందేమిటి? ఏం చేయాలి? నేను ఏమన్నాను?" అని కలవరపడుతున్న మనస్సుతో ఇష్టం లేకపోయినా అంగీకరించడం జరిగింది. ఆ మహర్షి కూడా తగినవిధంగా వివాహం చేసుకొని, ఆ కన్యకలనందరిని తన ఆశ్రమానికి చేర్చాడు.

**తత్ర చాశేషశిల్పకల్పప్రణేతారం విధాతారమివాన్యం విశ్వకర్మాణమాహూయ సకలకన్యానామేకైకస్యాః ప్రోత్ఫుల్ల పంకజకూజత్కలహంసకారణ్డవాదివిహంగమాభిరామజలాశయాః సోపధానాః సావకాశాః సాధు శయ్యాసనపరిచ్ఛదాః ప్రాసాదాః క్రియన్తామిత్యాదిదేశ ॥ 33 ॥**

అక్కడ ఆ ఋషి సమస్తశిల్పాలను కల్పించడంలో నేర్పరి అయిన, అపరసృష్టికర్తవంటి విశ్వకర్మను రావించి " ఈ సమస్త రాజకన్యకలకు ఒక్కొక్కరికి ఒక్కొక్కటి చొప్పున వికసించే పద్మాలతో, సుస్వరంతో పలికే కలహంసలతో, కారండవాది పక్షులతో నిండియున్న మనోహర జలాశయాలు, ఉద్యానవనాలు, విహరించడానికి సువిశాలప్రదేశాలు, చక్కని శయ్యలు, తగిన ఆసనాలు, పరిజనాలు, అందమైన మేడలు నిర్మించవలసింది." అని ఆజ్ఞాపించాడు. (పరిచ్ఛదాలు అనగా ఉపకరణాలు).

**తచ్చ తథైవానుతిష్ఠితమశేషశిల్పవిశేషాచార్యస్త్వష్టా దర్శితవాన్ ॥ 34 ॥**

సమస్తశిల్పవిశేష నిర్మాణాచార్యుడైన ఆ విశ్వకర్మ అవి అలాగే నిర్మించి చూపించాడు.

**తతశ్చ పరమర్షిణా సౌభరిణాఽఽజ్ఞప్తస్తేషు గృహేష్వనపాయా నందనామా మహానిధిరాసాంచక్రే ॥ 35॥**

ఆ తరువాత మహర్షియైన సౌభరి ఆజ్ఞచే వారి గృహాలలో ఎన్నడూ ఎడబాయకుండా ఉండే "నందం" అనే మహానిధినివాసం చేసింది.

**తతో౭నవరతభక్ష్యభోజ్యలేహ్యాద్యుపభోగైరాగతానుగతభృత్యాదీనహర్నిశమశేషగృహేషు తాః క్షితీశదుహితరో భోజయామాసుః । 36 ॥**

ఆ నిధివల్ల ఆ రాజకన్యలు ఎల్లప్పుడూ భక్ష్యం, భోజ్యం, లేహ్యం మున్నగు ఆహారపదార్థాలతో వచ్చేవారికి, అనుచరులకు, పరిచారకులకు రాత్రిపగలు అనే భేదం పాటించక అన్ని ఇళ్లలోనూ భోజనం పెట్టారు.

**ఏకదా తు దుహితృస్నేహాకృష్టహృదయః స మహీపతిరతిదుఃఖితాస్తాః సుఖితా వా ఇతి విచిన్త్య తస్యమహర్షే రాశ్రమముపేత్య స్ఫురదంశుమాలాం స్ఫటికమయీం ప్రాసాదమాలామతిరమ్యోపవనజలాశయాం దదర్శ ॥37॥**

ఒకప్పుడు కుమార్తెలపై గల ప్రేమతో గుండెలు నిండుకొనగా ఆ రాజు "తన పుత్రికలు మిక్కిలి దుఃఖపడుతున్నారా? లేక సుఖపడుతున్నారా?" అని ఆలోచించి ఆ మహర్షి ఆశ్రమవాటికకు చేరుకొన్నాడు. అక్కడ మెరుస్తున్న కిరణమాలికలతో, స్ఫటికంలా తెల్లగా ప్రకాశించే ప్రాసాదపంక్తిని, చూడ చక్కని ఉద్యానవనాలను, సరోవరాలను దర్శించాడు.

**ప్రవిశ్య చైకం ప్రాసాదమాత్మజాం పరిష్వజ్య కృతాసనపరిగ్రహః ప్రవృత్తస్నేహనయనామ్బుగర్భనయనో౭బ్రవీత్ ॥ 38 ॥**

ఒక భవనంలోకి ప్రవేశించాడు. ఎదురు వచ్చిన కూతురును కౌగలించుకొన్నాడు. ఒక ఆసనంపై కూర్చున్నాడు. కూతుళ్లపై స్నేహప్రీతిపెరగగా, కన్నీటితోనిండిన నయనాలతో ఇలా అన్నాడు.

**అప్యత్ర వత్సే! భవత్యాః సుఖముత, కించిదసుఖమ్ అపి తే, మహర్షిః స్నేహవానుత న, సంస్మర్యతే౭స్మద్గృహవాసస్య. ఇత్యుక్తా తం తనయా పితరమాహ ।**

"అమ్మాయీ! ఇక్కడ నీకు సుఖంగా ఉందా? లేక ఏమైనా కొంచెం కష్టంగా ఉందా? నీపట్ల మహర్షి ప్రణయచిత్తంతో ఉంటున్నాడా? లేదా? మా ఇంట్లో ఉండే మాట జ్ఞప్తికి వస్తోందా? లేదా?" అని ప్రశ్నించగా ఆ రాజతనయ తండ్రితో ఇలా అంది.

**తాత! అతిశయరమణీయః ప్రాసాదో౭త్ర. అతి మనోజ్ఞముపవనమ్, ఏతే కలవాక్యవిహగాభిరుతాః ప్రోత్ఫుల్ల పద్మాకరజలాశయాః, మనో౭నుకూలభక్ష్యభోజ్యానులేపనవస్త్రభూషణాది భోగోపభోగః,మృదూని శయనాసనాని, సర్వసమ్పత్సమేతమ్ మే గార్హస్థమ్. తథా౭పి కేనవా జన్మభూమిర్న స్మర్యతే? త్వత్ప్రసాదాద్ ఇదమశేషమతి శోభనమ్ ॥ 39 ॥**

"తండ్రిగారూ! ఈ మేడ ఎంతో అందంగా ఉంది. చాలా మనోహరంగా ఉంది ఈ పూలతోట. చక్కగా మధురంగా వినిపించే పక్షులకూతలతో, బాగా వికసించిన తామరపూలతో నిండిన ఈ కోనేరు, మనస్సుకు ఇంపైన భక్ష్యభోజ్యాలు, సుగంధాలు వెదజల్లే పరిమళ ద్రవ్యాలు, ఎంతో విలువైన వస్త్రాలు, అలంకారాలు, మెత్తనైన శయ్యలు, ఆసనాలు – ఇలా నా గృహస్థజీవనం అన్ని సంపదలతోను సమృద్ధిగా ఉంది. అయినా పుట్టింటిని ఎవరు తలచుకోకుండా ఉంటారు? నీ అనుగ్రహంవల్ల ఇలా అంతా మిక్కిలి మంగళప్రదంగా ఉంది.

**కిన్తు ఏతన్మమైకం దుఃఖకారణమ్, యదస్మాద్ గృహాన్మహర్షిరయమ్, మద్భర్తా న నిష్క్రామతి. మమైవ కేవలమతిప్రీత్యా సమీపవర్తీ, నాన్యాసామస్మద్భగినీనామ్, ఏవం చ మమ సోదర్యోఽతిదుఃఖితా ఇత్యేవమతి దుఃఖకారణమ్ ।**

అయినా నాకు ఇదొక్కటే విచారంగా ఉంది. అది ఏమిటంటే నా ఇల్లును నా భర్త, ఈ మహర్షి విడిచిపెట్టి ఒక్కసారీ బయటకు వెళ్లడు. కేవలం నా పై నున్న అత్యంత ప్రేమతో ఎప్పుడూ నా చెంతనే ఉంటాడు. మిగిలిన నా సోదరీమణులవద్దకు వెళ్లిన జాడ కానరాదు. దీనివల్ల నా అప్పచెల్లెంద్రు మిక్కిలి దుఃఖంతో ఉంటారు కదా! అనేదొక్కటే నాఖేదకారణం" అని ఆమె చెప్పినది.

**ఇత్యుక్త స్తయా ద్వితీయం ప్రాసాదముపేత్య స్వతనయాం పరిష్వజ్యోపవిష్ట స్తథైవ పృష్టవాన్. తయాఽపి తథైవ సర్వమేతత్ ప్రాసాదాద్యుపభోగసుఖమాఖ్యాతమ్. మమైవ కేవలం పార్శ్వవర్తీ నాన్యాసామస్మద్భగినీనా మిత్యేవమాది శ్రుత్వా సమస్తప్రాసాదేషు రాజా ప్రవివేశ. తనయాం తనయాం తథైవాపృచ్ఛత్, తాభిశ్చ తథైవాభిహితః. పరితోషవిస్మయనిర్భరవివశహృదయో భగవన్తం సౌభరిమేకాన్తావస్థితముపేత్య కృతపూజోఽబ్రవీత్ ॥ 40 ॥**

అని తన కుమార్తె అలా చెప్పగా, ఆ రాజేంద్రుడు రెండవ మేడకు వెళ్లి, తన తనూజను కౌగిలించుకొని, యథా ప్రకారంగా కూర్చొని అలాగే అడిగాడు. ఆమె కూడా అంతా ప్రాసాదాది భోగాలు, సర్వసుఖాలు ఎలా ఉన్నాయో అన్నీ చెప్పింది. "నా మగడు మిక్కిలి ప్రీతితో ఎప్పుడూ నా చెంతనే ఉంటాడు. మిగిలిన అక్కాచెల్లెళ్ల వద్దకు వెళ్లనే వెళ్లడు". ఇలాంటి వాక్యాలు విని రాజు అన్ని మేడలలోకి ప్రవేశించాడు. కుమార్తెలనందరినీ గుచ్చి గుచ్చి ప్రశ్నించాడు. వాళ్లందరూ కూడా అలాగే బదులిచ్చారు. మాంధాత సంతోషంతో, ఆశ్చర్యంతో పరవశించిపోయే హృదయం కలవాడయ్యాడు. ఒక చోట ఏకాంతంలో ఉన్న భగవంతుడైన సౌభరి మహర్షి వద్దకు వెళ్లాడు. అతడు కూడా వచ్చిన మామగారిని పూజించాడు.

**దృష్టస్తే భగవన్ సుమహానేష సిద్ధిప్రభావో నైవంవిధమన్యస్య కస్యచిదస్మాభిర్విభూతివిలసితముపలక్షితమ్. యదేతద్ భగవతస్తపసః ఫలమిత్యభిపూజ్య తమృషిం తత్రైవ తేన ఋషివర్యేణ సహ కించిత్ కాలమభిమతోపభోగం బుభుజే, స్వపురం చ జగామ । 41 ॥**

రాజు సౌభరిని ఉద్దేశించి "పూజ్యుడా! మిక్కిలి ప్రభావంతో ఉండే నీ సిద్ధివైభవం చూశాను. ఇన్ని విభూతులతో కూడుకొన్న ఈ విధమైన సిద్ధిదర్శనం మరొక్కరికి ఉన్నట్లుగా మేము ఎన్నడూ చూడలేదు. ఇది అంతా దేవరవారి తపఃఫలితం" అని ఆయనను పూజించాడు. అనంతరం కొంతకాలం ఆ ఋషివర్యునితో బాటు ఇష్టభోగాలు అనుభవించాడు. తన కుమార్తెల సంతుష్టితో సంతృప్తి పొందిన మాంధాత తన నగరానికి వెళ్లిపోయాడు.

**కాలేన గచ్ఛతా తస్య రాజతనయాసు తాసు పుత్రశతం సార్ధమభవత్. తదనుదినారూఢస్నేహః స తత్రాతీవ మమతాకృష్టహృదయోఽభవత్ । 42 ॥**

కొంతకాలం ఇలా గడవగా, ఆ సౌభరికి రాజకుమారికలయందు నూట యాభై మంది కుమారులు కలిగారు. ప్రతిదినం వారిపై అనురాగం వ్రేళ్లూనుకొని విస్తరిస్తూ ఉంటే, ఆ మునికి మమకారం వర్ధిల్లి మనస్సు నాకర్షించింది.

**అప్యేతేఽస్మత్పుత్రాః కలభాషిణః పద్భ్యాం గచ్ఛేయుః, అప్యేతే యౌవనినో భవేయుః, అపి కృతదారానేతాన్ పశ్యేయమ్, అప్యేతేషాం పుత్రా భవేయుః, అథ తత్పుత్రాన్ పుత్రసమన్వితాన్ పశ్యేయమ్. ఏవమాది మనోరథ మనుదినకాలసమ్పత్తివృత్తిముపేక్ష్యైతత్ సంచిన్తయామాస. (ఉపేక్ష్య+ఏతత్) । 43 ॥**

"నా పుత్రులు ముద్దుముద్దుగా మాట్లాడతారా? బుల్లి బుల్లి అడుగులు వేస్తూ నడుస్తారా? వీళ్లకు ఎప్పటికి యౌవనం వస్తుంది? వీళ్లకు భార్యలు రావడమనేది నేను చూస్తానా? వీళ్లకు ఎప్పుడు కొడుకులు పుడతారో కదా? ఈ నా కుమారులు వాళ్ల కొడుకులతో సుఖంగా ఉండడం నేను చూస్తానా?" ఈ విధంగా కాలంతోపాటు పెరిగే కోరికలను, సంపత్తిని, ఆవృత్తిగా ప్రతిదినం ఆలోచించాడు. ఈ విధంగా పెరుగుతున్న కోరికలను ఉపేక్షించి ఒకనాడు ఇలా చింతించసాగాడు.

**అహో! మే మోహస్యాతివిస్తారః ?**

ఆహా! నా వ్యామోహం ఎంత విస్తరల్లింది ?

**మనోరథానాం న సమాప్తిరస్తి**
**వర్షాయుతేనాపి తథాఽబ్దలక్షైః ।**
**పూర్ణేషు పూర్ణేషు పునర్నవానాం**
**ఉత్పత్తయః సన్తి మనోరథానామ్ ॥ 44 ॥**

పదివేల ఏండ్లు గడిచినా, అలాగే లక్ష సంవత్సరాలు గడిచినా కోరికలకు అంతం లేదు. కోరికలు తీరే కొలది, మళ్లీ క్రొత్త కోరికలు పుట్టి అవి తీరేకొలది, మళ్లీ నూతనంగా కోరికలు పుట్టుకొస్తూ ఉంటాయి కదా!

**పద్భ్యాం గతా యౌవనినశ్చ జాతాః**
**దారైశ్చ సంయోగమితాః ప్రసూతాః ।**
**దృష్టాః సుతాస్తత్తనయప్రసూతిం**
**ద్రష్టుం పునర్వాంఛతి మేఽన్తరాత్మా ॥ 45 ॥**

పిల్లలు అడుగులు వేస్తున్నారు. వయసు వచ్చిన వాళ్లయ్యారు. తోడుగా పెళ్లాలు కూడ వచ్చారు. బిడ్డల్నికన్నారు. కొడుకులను చూశారు. వాళ్ల బిడ్డలను చూడాలని నా అంతరాత్మ కోరుతోంది.

**ద్రక్ష్యామి తేషామపి చేత్ ప్రసూతిం**
**మనోరథో మే భవితా తతోఽన్యః ।**
**పూర్ణేఽపి తత్రాప్యపరస్య జన్మ**
**నివార్యతే కేన మనోరథస్య ॥ 46 ॥**

ఆ బిడ్డలను గూడా చూడగలననుకొంటే, అప్పుడు నాకు మరో కోరిక ఉదయిస్తుంది. అది తీరితే మరొకటి పుడుతుంది. కోరిక పుట్టుకను ఎవడు నివారించగలడు ?

**ఆమృత్యుతో నైవ మనోరథానా**
**మన్తోఽస్తి విజ్ఞాతమిదం మయా చ ।**

**మనోరథాసక్తి పరస్య చిత్తం**
**న జాయతే వై పరమార్థసంగి ॥ 47 ॥**

చచ్చేవరకు కోరికలకు అంతు అన్నది లేనే లేదు. ఈ విషయం నాకిప్పుడు తెలిసింది. కోరికలపై ఆసక్తి ఉన్న చిత్తం పరమార్థంపై ఆసక్తి కలిగి ఉండదు.

**స మే సమాధిర్జలవాసమిత్ర**
**మత్స్యస్య సంగాత్ సహసైవ నష్టః ।**
**పరిగ్రహః సంగకృతో మమాయం**
**పరిగ్రహోత్థాశ్చ మమాతిలిప్సాః ॥ 48 ॥**

ఆనాడు నీళ్లల్లో ఉన్నప్పుడు చెలికాడయిన చేపతో చెలిమివల్ల నా సమాధి వెంటనే నశించి పోయింది. దానితో సాంగత్యంవల్లనే నాకు ఈ సంసారం ఏర్పడింది. భార్యా పరిగ్రహంవల్లనే నాకు మిక్కిలి వాంఛలు పెరిగిపోయాయి.

**దుఃఖం యదేవైక శరీరజన్మ**
**శతార్ధసంఖ్యం తదిదం ప్రసూతమ్ ।**
**పరిగ్రహేణ క్షితిపాత్మజానాం**
**సుతైరనేకైర్బహులీకృతం తత్ ॥ 49 ॥**

ఒక్క కొడుకుతోనే దుఃఖం. వీళ్లు ఏకంగా నూటయాభై మంది పుట్టారు. రాజకన్యకలను పరిణయమాడడం వల్ల ఎక్కువ మంది కొడుకులతో అది మరీ అధికమయింది.

**సుతాత్మజైస్తత్తనయైశ్చ భూయో**
**భూయశ్చ తేషాం చ పరిగ్రహేణ ।**
**విస్తారమేష్యత్యతిదుఃఖహేతుః**
**పరిగ్రహో వై మమతానిధానమ్ ॥ 50 ॥**

మనుమలతో, మునిమనుమలతో, మళ్లీ మళ్లీ వాళ్ల వివాహాలతో సంసారం విస్తరిల్లుతుంది. ఇది మిక్కిలి దుఃఖకారణం. మమకారానికి మారుపేరే పరిగ్రహం.

**చీర్ణం తపో యత్తు జలాశ్రయేణ**
**తస్యర్ధిరేషా తపసోఽన్తరాయః ।**
**మత్స్యస్య సంగాదభవచ్చ యో మే**
**సుతాదిరాగో ముషితోఽస్మి తేన ॥ 51 ॥**

నీళ్లలో ఉండి ఎంతో కాలం తపస్సు చేశాను. అదంతా భగ్నమై పోయింది. ఆ తపస్సుకు తగిన ఫలితంగా ఈ అంతరాయం ఏర్పడింది. చేపతో ఉండే సాంగత్యంవల్ల నాకు ఈ సుతాదులపై అనురాగం ఏర్పడింది. అది నన్ను పూర్తిగా దోచేసుకుంది.

**నిస్సంగతా ముక్తిపదం యతీనాం**
**సంగాదశేషాః ప్రభవన్తి దోషాః ।**
**ఆరూఢయోగోఽపి నిపాత్యతేఽధః**
**సంగేన యోగీ కిముతాల్పసిద్ధిః ॥ 52 ॥**

యతులకు ఏ విధమైన సంగం లేకుండా ఉండడమే ముక్తిమార్గం. సంబంధాలు పెట్టుకోవడంవల్లనే సకలదోషాలు కలుగుతాయి. సంగంవల్ల పూర్ణయోగి అయినా అధఃపతితుడైపోతాడు. ఇక స్వల్పసిద్ధికల యోగిని గురించి చెప్పేదేముంది?

**అహం చరిష్యామి తథాఽఽత్మనోఽర్థే**
**పరిగ్రహగ్రాహగృహీత బుద్ధిః ।**
**యథా హి భూయః పరిహీణదోషో**
**జనస్య దుఃఖైర్భవితా న దుఃఖీ ॥ 53 ॥**

పరిగ్రహమనే గ్రాహం (భార్యను స్వీకరించడమనే మొసలి) నా బుద్ధిని గట్టిగా పట్టివేసింది. నేను మళ్లీ అన్ని దోషాలు పోగొట్టుకొనేలా, స్వజనులుపొందే దుఃఖాలకు నేను దుఃఖపడకుండా, ఇక పరమాత్మకోసం మాత్రమే చరిస్తాను.

**సర్వస్య ధాతారమచిన్త్యరూప**
**మణోరణీయాంసమతిప్రమాణమ్ ।**
**సితాసితం చేశ్వరమీశ్వరాణా**
**మారాధయిష్యే తపసైవ విష్ణుమ్ ॥ 54 ॥**

సర్వవిశ్వానికి సృష్టికర్త, అచిన్త్యస్వరూపుడు, అణువుకన్న అణుస్వరూపుడు, అలాగే అన్నింటికన్న మహాస్వరూపుడు, తెల్లగా సత్త్వగుణంతోను, నల్లగా తమోగుణంతోను, ఎఱ్ఱగా రజోగుణంతోను ఉండేవాడు, ఈశ్వరులు అని వ్యవహరించబడేవారికే ఈశ్వరుడైనవాడు అయిన మహావిష్ణువును తపస్సుతో ఆరాధిస్తాను.

**తస్మిన్నశేషౌజసి సర్వరూపి**
**ణ్యవ్యక్త విస్పష్ట తనావనన్తే ।**
**మమాచలం చిత్తమపేతదోషం**
**సదాఽస్తు విష్ణావభవాయ భూయః ॥ 55 ॥**

సమస్తశక్తిమంతుడు, సర్వస్వరూపుడు, వ్యక్తావ్యక్త (కార్యకారణ) స్వరూపుడు, అనంతుడు అయిన మహావిష్ణువునందు దోషాలన్నీ తొలగిపోయిన నా మనస్సు చలించనిదై పునర్జన్మలేకుండా ఉండడంకోసమై, ఎల్లప్పుడూ ఉండుగాక!

**సమస్తభూతాదమలాదనన్తాత్**
**సర్వేశ్వరాదన్యదనాదిమధ్యాత్ ।**

**యస్మాన్న కించిత్తమహం గురూణాం**
**పరం గురుం సంశ్రయమేమి విష్ణుమ్ ॥ 56 ॥**

సమస్తరూపుడు, నిర్మలుడు, అనంతుడు, సర్వేశ్వరుడు, ఆదిమధ్యమములు లేనివాడు, ఎవనికన్న భిన్నంగా ఏ కొంచెమూ లేదో, సమస్తగురువులకు పరమగురువు అయినవాడైన విష్ణువును ఆశ్రయంగా పొందుతాను." అని సౌభరి భావించాడని పరాశరుడు మైత్రేయునితో చెప్పాడు.

**ఇత్యాత్మానమాత్మనైవాభిధాయాసౌ సౌభరిరపహాయ పుత్రగృహాసనపరిచ్ఛదాదికమశేషమర్థజాతం సకలభార్యాసమవేతో వనం ప్రవివేశ. తత్రాప్యనుదినం వైఖానస నిష్పాద్యమశేషం క్రియాకలాపం నిష్పాద్య క్షపిత సకలపాపః పరిపక్వమనోవృత్తిరాత్మన్యగ్నీనారోప్య భిక్షురభవత్ ॥ 57 ॥**

అని ఈ విధంగా సౌభరి తనలో తాను ఆలోచించుకొన్నవాడై, కొడుకులను, గృహాలను, ఆసనాలను, పరిజనం మున్నగు సమస్తవస్తుసామగ్రిని విడిచిపెట్టి, భార్యలందరితో కలిసి అడవిలో ప్రవేశించాడు. అక్కడ కూడ ప్రతిదినం వైఖానసులు ఆచరించే సమస్త ప్రక్రియలను ఆచరించాడు. సమస్తపాపాలను నాశనం చేసుకొన్నాడు. పిమ్మట పరిపక్వంచెందిన మనోవర్తనం కల్గినవాడయ్యాడు. తనయందు అగ్నులను ఆరోపించుకొని (సన్న్యాసం స్వీకరించి) సన్న్యాసి అయ్యాడు.

**భగవత్యాసజ్యాఖిలం కర్మకలాపం హిత్వాఽనన్తమజమవికారమమరణాదిధర్మమవాప పరం పరవతా మచ్యుతపదమ్ ॥ 58 ॥**

భగవంతునిపై ఆసక్తిని నిలిపి, సంపూర్ణంగా కర్మకలాపం పరిత్యజించి, అంతంలేనిది, పుట్టుకలేనిది, ఏ వికారంలేనిది, మరణం మున్నగు లక్షణాలులేనిది, పరం అని చెప్పబడే అన్నింటికన్న పరమైనది అయిన అచ్యుతపదాన్ని (నాశనంలేని స్థానాన్ని) పొందాడు.

**ఇత్యేతన్మాన్ధాతుర్దుహితృసమ్బన్ధాదాఖ్యాతమ్ । 59 ॥**

మైత్రేయా! ఇదంతా మాంధాతకుమార్తెలప్రసక్తి వచ్చినందువల్ల నీకు చెప్పాను.

**యశ్చైతత్ సౌభరిచరితమనుస్మరతి, పఠతి, శృణోత్యవధారయతి, తస్యాష్టౌ జన్మాన్యసన్మతిరసద్ధర్మో వా మనసోఽసన్మార్గాచరణమశేషహేయేషు వా మమత్వం న భవతీతి । 60 ॥**

ఎవడయితే ఈ సౌభరిమహర్షి చరిత్రను నిత్యం స్మరిస్తాడో, చదువుతాడో, వింటాడో, మనస్సులో ధారణ చేస్తాడో అతనికి ఎనిమిది జన్మల వరకు దుర్గతికాని, అధర్మంకాని, మనస్సు అవినీతిమార్గంలో పయనించడం కాని, సమస్తప్రాపంచికవస్తువులపై మమకారంకాని కలుగవు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే యువనాశ్వసౌభరి వృత్తాంతావితి ద్వితీయోఽధ్యాయః సమాప్తః ॥ 2 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో యువనాశ్వసౌభరి వృత్తాంతాలు అనే రెండవ అధ్యాయం సమాప్తం ॥2 ॥

# తృతీయోऽధ్యాయః – మూడవ అధ్యాయం
## సగరచరిత్రమ్ – సగరచరిత్ర

**అతో మాన్ధాతుః పుత్రసన్తతిరభిధీయతే ॥ 1 ॥**

మైత్రేయా! ఇక పైన మాంధాతృ చక్రవర్తి పుత్రసంతతిని గూర్చి చెబుతాను.

**అమ్బరీషస్య మాన్ధాతృతనయస్య యువనాశ్వః పుత్రోऽభూత్. తస్మాత్ హారీతః, యతోऽంగీరసో హారీతాః ॥ 2 ॥**

మాంధాతకుమారుడైన అంబరీషునికి యువనాశ్వుడు అనే పుత్రుడు కలిగాడు. అతనివల్ల హారీతుడు జన్మించాడు. ఈ హారీతునివల్లనే అంగిరోగోత్రీయులు (ఆంగీరసులు) అందరూ హారీతులు అయ్యారు.

**రసాతలే మౌనేయా నామ గన్ధర్వాః షట్కోటి సంఖ్యాతాస్తైరశేషాణి నాగకులాని అపహృతప్రధాన రత్నాధిపత్యాన్యక్రియన్త ॥ 3 ॥**

రసాతలంలో మౌనేయులనే గంధర్వులు ఆరుకోట్ల మంది ఉండేవారు. వారు నాగకులాల ప్రధానరత్నాలను, ఆధిపత్యాలను అన్నింటిని అపహరించి వేశారు.

**తైశ్చ గన్ధర్వవీర్యావధూతైరురగేశ్వరైః స్తూయమానో భగవాన్ అశేషదేవేశః స్తవశ్రవణోన్మీలితోన్నిద్ర పుణ్డరీక నయనో జలశయనో నిద్రావసానాత్ విబుద్ధః ప్రణిపత్యాభిహితో భగవన్! అస్యస్మాకమేతేభ్యో గన్ధర్వేభ్యో భయముపశమ మేష్యతీత్యాహ, భగవాననాదిపురుషః పురుషోత్తమో యౌవనాశ్వస్య మాన్ధాతుః పురుకుత్సనామా పుత్ర స్తమహమనుప్రవిశ్య, తానశేషదుష్టగన్ధర్వానుపశమం నయిష్యామి । 4 ॥**

ఆ ఉరగేశ్వరులు గంధర్వుల పరాక్రమానికి ఓడిపోయారు. సమస్తదేవతలకు ప్రభువైన విష్ణుభగవానుని సన్నిధికి వెళ్లి స్తోత్రం చేశారు. వారి స్తవాన్ని విని, కనులు తెరచి పుండరీకాక్షుడు జలాధివాసంపైనుంచి నిద్రనుండి మేల్కొన్నాడు. అపుడు వారు నమస్కరించి " భగవంతుడా! మాకు ఈ గంధర్వులవల్ల భయం ఏర్పడింది. అది ఎలా పోతుంది?" అని ప్రార్థించారు. అపుడు పురుషోత్తముడు, అనాదినిధనుడు అయిన భగవంతుడు "యువనాశ్వుని కుమారుడైన మాంధాతకు పుత్రుడుగా పుట్టిన పురుకుత్సుడు ఉన్నాడుకదా! నేను అతనిలో ప్రవేశించి ఆ సమస్త దుష్టగంధర్వులను నాశనం పొందిస్తాను." అని వారికి వరమిచ్చాడు.

**ఇత్యాకర్ణ్య భగవతే కృతప్రణామాః పునర్నాగలోకమాగతాః, పన్నగపతయో నర్మదాం చ పురుకుత్సానయనాయ చోదయామాసుః । 5 ॥**

అది విని వారు భగవంతునికి ప్రణామాలు అర్పించి మళ్లీ నాగలోకం చేరుకొన్నారు. పన్నగాధిపతులందరు పురుకుత్సుని తీసుకొని రావడానికై నర్మదను ప్రేరేపించారు.

**సా చైనం రసాతలం నీతవతీ । రసాతలగతశ్చాసౌ భగవత్తేజసాऽऽప్యాయితాత్మవీర్యః సకలగన్ధర్వాన్ జఘాన, పునశ్చ స్వభవనమాజగామ. సకలపన్నగపతయశ్చ నర్మదాయై వరం దదుః. యస్తేऽనుస్మరణసమవేతం నామగ్రహణం కరిష్యతి, తస్య సర్వవిషభయం న భవిష్యతీతి । 6 ॥**

నర్మద కూడ పురుకుత్సుని (మెప్పించి నెమ్మదిగా) రసాతలానికి చేర్చింది. అతడు రసాతలం చేరిన వెంటనే భగవత్తేజస్సువల్ల శక్తి పెరగగా, సకలగంధర్వులను సంహరించాడు. మళ్లీ తిరిగి తన భవనానికి (లోకానికి) వచ్చాడు. అపుడు సకలపన్నగాధీశులు "ఎవరు ఎప్పుడూ నిన్ను స్మరిస్తూ ఉంటారో, నీ నామాన్ని పేర్కొంటూ ఉంటారో, వారికి సర్పాలవల్ల విషభయం సంభవించదు." అని నర్మదకు వరం ఇచ్చారు.

**"నర్మదాయై నమః ప్రాతర్నర్మదాయై నమో నిశి ।**
**నమోఽస్తు నర్మదే తుభ్యం రక్ష మాం విషసర్పతః" ।**
**ఇత్యుచ్చార్యాహర్నిశమన్ధకారప్రవేశే వా న సర్పైర్దశ్యతే ॥ 7 ॥**

"ప్రాతః కాలంలో నర్మదా! నీకు నమస్కారం. రాత్రి సమయంలో నర్మదా! నీకు నమస్కారం. నర్మదా! నీకు ఎల్లప్పుడూ నమస్కారం. విషసర్పంనుంచి నన్ను రక్షించు." అని పలికితే పగలు కాని, రాత్రికాని, చీకటిలో ప్రవేశించినపుడుకాని ఈ రీతిగా ప్రార్థిస్తే. అటువంటి వాడు సర్పాలచే కరవబడడు.

**న చాపి కృతానుస్మరణభుజో విషమపి సుభుక్తముపఘాతాయ భవిష్యతి । 8 ॥**

ఏ వ్యక్తి అయినా నర్మదను స్మరిస్తూ విషం తిన్నా కూడా, అది జీర్ణమైపోయి అతనికి ఏ విధమైన హాని సంభవించదు.

**పురుకుత్సాయ చ భవతః సన్తతివిచ్ఛేదో న భవిష్యతీత్యురగపతయో వరం దదుః । 9 ॥**

పురుకుత్సునికి కూడా "నీకు ఎప్పుడూ సంతతి విచ్ఛిన్నం కాబోదు" అని ఉరగాధీశులు వరం ఇచ్చారు.

**పురుకుత్సో నర్మదాయాం త్రసదస్యుమజీజనత్. త్రసదస్యుతః సమ్భూతః, తతోఽనరణ్యః, తం రావణో దిగ్విజయే జఘాన. అనరణ్యస్య పృషదశ్వః, పృషదశ్వస్య హర్యశ్వః పుత్రోఽభవత్. తతశ్చ సుమనాః, తస్యాపి త్రిధన్వా, త్రిధన్వనస్త్రయ్యారుణిః । 10 ॥**

పురుకుత్సునివల్ల నర్మదకు త్రసదస్యుడు జన్మించాడు. త్రసదస్యుని కొడుకు సంభూతుడు (సంభృతుడు), అతని కుమారుడు అనరణ్యుడు. అతనిని రావణుడు దిగ్విజయంలో సంహరించాడు. అనరణ్యునికి పృషదశ్వుడు, పృషదశ్వునకు హర్యశ్వుడు అనే పుత్రుడు కలిగారు. అతనివల్ల సుమనుడు, అతనికి త్రిధన్వుడు, త్రిధన్వునికి త్రయ్యారుణి కలిగారు.

**తస్మాత్ సత్యవ్రతః. సోఽసౌ త్రిశంకుసంజ్ఞామవాప, చణ్డాలతాముపగతశ్చ. ద్వాదశవార్షిక్యామనావృష్ట్యాం విశ్వామిత్రకలత్రాపత్యపోషణార్థం చణ్డాలప్రతిగ్రహపరిహరణాయ చ జాహ్నవీ తీరే న్యగ్రోధే మృగమాంసమనుదినం బబన్ధ । 11 ॥**

అతనికి సత్యవ్రతుడు కలిగాడు. అతడే త్రిశంకువు అనే పేరు పొందిన వాడయ్యాడు. ఒకప్పుడు పండ్రెండు సంవత్సరాలు రాజ్యంలో వర్షాలు పడలేదు. అప్పుడు విశ్వామిత్రుని భార్యాపుత్రులను పోషించడానికై, చండాలురనుండి దానం తీసుకోకుండా ఉండడానికై గంగాతీరంలో ఉన్న మర్రిచెట్టుకు ప్రతిదినం మృగమాంసం తెచ్చి వ్రేలాడగడుతూ ఉండేవాడు.

**విశే :** తండ్రి ఆజ్ఞ కాదనడం, గురువుగారి గోవును వధించడం, ప్రోక్షించని మాంసం తినడం అనే మూడు దోషాలు ఉన్నందున అతడు త్రిశంకువయ్యాడు.

**పరితుష్టేన చ విశ్వామిత్రేణ సశరీరః స్వర్గ మారోపితః. త్రిశంకోర్హరిశ్చన్ద్రః, తస్మాత్ రోహితాశ్వః, తతశ్చ హరితః, హరితాచ్చుంచుః, చంచోర్విజయ సుదేవౌ. రురుకో విజయాత్, రురుకస్య చ వృకః, తతో బాహుః. యోఽసౌ హైహయతాలజంఘాదిభిరవజితోఽన్తర్వత్న్యా మహిష్యా సహ వనం ప్రవివేశ. । 12 ॥**

విశ్వామిత్రుడు సంతోషించి త్రిశంకువును సశరీరంతో స్వర్గానికి పంపాడు. ఆ త్రిశంకువుకు హరిశ్చంద్రుడు, అతనివల్ల రోహితాశ్వుడు, అతనివల్ల హరితుడు, హరితునికి చంచువు, చంచువుకు విజయుడు, సుదేవుడు అనే ఇద్దరు పుత్రులు, విజయునివల్ల రురుకుడు, రురుకునికి వృకుడు, ఆ వృకునికి బాహువు కలిగారు. ఇతడే హైహయ తాలజంఘాదులచే ఓడింపబడిన వాడై, గర్భవతి అయిన పట్టపురాణితో కలసి అడవిలో ప్రవేశించాడు.

**తస్యాశ్చ సపత్న్యా గర్భస్తమ్భనాయ గరో దత్తః. తేనాస్యా గర్భః సప్తవర్షాణి జఠర ఏవ తస్థౌ. స చ బాహుర్వృద్ధభావా దౌర్వాశ్రమ సమీపే మమార । 13 ॥**

ఆమెకు గర్భాన్ని స్తంభింపజేయడానికై సవతి విషం పెట్టింది. అందువల్ల ఆమె గర్భం ఏడేళ్లపాటు పొట్టలో అలాగే ఉండి పోయింది. ఇలా ఉండగా ఆ బాహువు ముసలితనంవల్ల ఔర్వుని ఆశ్రమ సమీపంలో మరణించాడు.

**సా తస్య భార్యాచితాం కృత్వా తమారోప్యానుమరణకృతనిశ్చయాఽభూత్. అథైనామతీతా నాగతవర్తమాన కాలవేదీ భగవానౌర్వః స్వస్మాదాశ్రమా న్నిర్యాయాబ్రవీత్. అలమలమేతేనాసద్గ్రహేణ, అఖిల భూమణ్డలపతిరతివీర్య పరాక్రమోఽనేకయజ్ఞకృద్, అరాతిపక్ష క్షయకర్తా తవోదరే చక్రవర్తీ తిష్ఠతి. మైవం మైవం సాహసాధ్యవసాయినీ భవతీ భవతు, ఇత్యుక్తా చ సా తస్మాదనుమరణనిర్బన్ధాద్ విరరామ ॥ 14 ॥**

అతని భార్యచితిని సిద్ధంచేసి, భర్తశరీరాన్ని దానిపై ఉంచి సహగమనం చేయడానికి నిశ్చయించు కొన్నది. తరువాత జరిగిపోయిన, జరగబోయే, జరుగుతున్న కాలవిషయాలను గ్రహించగలిగే భగవంతుడైన ఔర్వమహాముని తన ఆశ్రమం నుంచి బయటకువచ్చి ఆమెతో “చాలు. చాలు. ఈ పనికి మాలిన పని నుంచి పట్టుదల విడిచి పెట్టు. సమస్తభూమండలాన్ని పరిపాలించే, మిక్కిలి ధైర్యం, పరాక్రమంతో విక్రమించే, ఎక్కువ యజ్ఞాలు నిష్ఠతో కావించే, పగవారని చెప్పబడే పగదాల్చిన వారి వైపునున్న వారినందరిని నశింపజేసే చక్రవర్తి నీ ఉదరంలో ఉన్నాడు. సాధ్వీ! నీవు ఇటువంటి మిక్కిలి సాహసంతో కూడిన నిర్ణయం తీసుకోవద్దు” అని హితవు పలికాడు. ఈ ఉపదేశవాక్యాలు విని ఆమె ఆ సహగమనమనే పట్టుదల నుంచి విరమించింది.

**తేనైవ భగవతా స్వాశ్రమమానీయత. కతిపయదినాన్తరే చ సహైవ తేన గరేణాతితేజస్వీ బాలకో జజ్ఞే. తస్యౌర్వో జాతకర్మాదికాం క్రియాం నిష్పాద్య సగర ఇతి నామ చకార. కృతోపనయనం చైనమౌర్వోవేదాన్ శాస్త్రాణ్యశేషాణి అస్త్రం చాగ్నేయం భార్గవాఖ్య మధ్యాపయామాస. ఉత్పన్నబుద్ధిశ్చ మాతరమపృచ్ఛత్,అమ్బ! కథమత్ర వయమ్? క్వ వా తాతః? తాతోఽస్మాకం కః? ఇత్యేవమాది పృచ్ఛతః తన్మాతా సర్వమవోచత్.తతః పితురాహరణామర్షితో హైహయతాలజంఘాదివధాయ ప్రతిజ్ఞామకరోత్. ప్రాయశశ్చ హైహయాన్ జఘాన. శకయవన కామ్భోజపారదపహ్లవాః, హన్యమానాస్తత్కులగురుం వశిష్ఠం శరణం యయుః ॥ 15 ॥**

ఆ భగవంతుడు ఆమెను తన ఆశ్రమానికి తీసుకొని వెళ్లాడు. కొద్ది రోజులు పోయిన తరవాత ఆ గరం(విషం) తో బాటుగా మిక్కిలి తేజస్సు కలిగిన బాలకుడు ఆమెకు జన్మించాడు. అతనికి ఔర్వుడు జాతకర్మమున్నగు క్రియలు చేసి "సగరుడు" అనే పేరు పెట్టాడు. ఉపనయనం కావించి ఔర్వుడు అతనికి వేదాలు, సకలశాస్త్రాలు, భార్గవమనే ఆగ్నేయాస్త్రం నేర్పాడు. సగరుడు బుద్ధి తెలిసిన తరువాత తల్లితో "అమ్మా! మనం ఇక్కడ ఎందుకున్నాం? నా తండ్రి ఎక్కడున్నాడు? నా తండ్రి ఎవ్వడు?" అని ఇటువంటివి పదే పదే అడుగుతూ ఉంటే అతని తల్లి తండ్రి వృత్తాంతం సర్వమూ చెప్పింది. అనంతరం సగరుడు తన తండ్రి రాజ్యం అపహరించిన వారిపై కోపం పెంచుకొని హైహయతాలజంఘాదులందరిని చంపడానికై ప్రతిన కావించాడు. ఇంచుమించుగా హైహయ వంశజులందరినీ చంపివేశాడు. ఆ సమయంలో శకులు, యవనులు, కాంభోజులు, పారదులు, పహ్లవులు చంపబడుతూ కులగురువైన వశిష్ఠుని శరణుపొందారు.

**అథైతాన్ వశిష్ఠో జీవన్మృతకాన్ కృత్వా సగరమాహ,వత్స! వత్స! అలమేభిరతిజీవన్మృతకైరనుసృతైః॥16॥**

అపుడు వశిష్ఠుడు వారిని జీవచ్ఛవాలనుచేసి సగరునితో "నాయనా! కుమారా! ఈ జీవన్మృతులను తరమడం విరమించు. చాలు.

**ఏతే చ మయైవ త్వత్ప్రతిజ్ఞాపరిపాలనాయ నిజధర్మద్విజసంగపరిత్యాగం కారితాః । 17 ॥**

నేను నీ ప్రతిజ్ఞను నెరవేర్చడంకోసమే వీరినందరినీ తమ ధర్మం, ద్విజసంగతి విడిచిపెట్టేటట్లు చేశాను." అన్నాడు.

**స తథేతి తద్గురువచనమభినన్ద్య తేషాం వేషాన్యత్వమకారయత్. యవనాన్ ముణ్డితశిరసః, అర్ధముణ్డాన్ శకాన్, ప్రలమ్బకేశాన్ పారదాన్, పహ్లవాంశ్చ శ్మశ్రుధరాన్, నిఃస్వాధ్యాయ వషట్కారాన్ ఏతానన్యాంశ్చ క్షత్రియాంశ్చకార. తే చ నిజధర్మపరత్యాగాద్ బ్రాహ్మణైశ్చ పరిత్యక్తా మ్లేచ్ఛతాం యయుః. సగరోఽపి స్వమధిష్ఠానమాగమ్య అస్ఖలిత చక్రః సప్తద్వీపవతీమిమాముర్వీం ప్రశశాస ॥ 18 ॥**

అపుడు అతడు "అలాగే" అని గురువు గారి మాటను మన్నించి వారి వేషాలను మార్చివేశాడు. యవనులు బుర్ర గొరిగించుకొనేలా, శకులు సగం గొరిగించుకొనేలా, పారదులు జుట్టు వ్రేలాడేసుకొనేలా, పహ్లవులు గడ్డం పెంచుకొనేలా చేశాడు. వీరికి, మిగిలిన క్షత్రియులకు వేదాధ్యయనం, హోమాధికారాలు లేకుండా చేశాడు. వీరు తమ ధర్మాన్ని విడిచి వేయడంవల్ల. బ్రాహ్మణులు పరిత్యజించగా మ్లేచ్ఛులయ్యారు. సగరుడు కూడా తన యథాస్థానానికి వచ్చి, తన రథచక్రాలకు అడ్డు లేకుండా ఏడు ద్వీపాలతో కూడిన ఈ భూమినంతటినీ పరిపాలించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే సగరచరిత్రం నామ తృతీయోఽధ్యాయః సమాప్తః ॥ 3 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో సగరచరిత్ర అనే మూడవ అధ్యాయం సమాప్తం ॥ 3 ॥



## చతుర్థోఽధ్యాయః - నాల్గవ అధ్యాయం

## సగరస్య అశ్వమేధః-భగీరథద్వారా గంగాయాః ఆగమనం- శ్రీరామచంద్రావతారశ్చేతి

### సగరుని అశ్వమేధం - భగీరథునిద్వారా గంగ ఆగమనం - శ్రీరామచంద్రావతారం

**కశ్యపదుహితా సుమతిర్విదర్భరాజతనయా చ కేశినీ ద్వే భార్యే సగరస్యాస్తామ్ । 1 ॥**

కశ్యపుని కుమార్తె 'సుమతి', విదర్భరాజు కుమార్తె 'కేశిని' అని సగరునికి ఇద్దరు భార్యలు ఉండేవారు.

**తాభ్యాం చాపత్యార్థమారాధిత ఔర్వః పరమేణ సమాధినా వరమదాత్ । 2 ॥**

వారు ఇద్దరు సంతానంకోసమై ఏకాగ్రచిత్తంతో ఆరాధించగా, ఔర్వుడు వారికి వరం ప్రసాదించాడు.

**ఏకా వంశధరమేకం పుత్రమ్, అపరా షష్టిం పుత్రసహస్రాణి జనయిష్యతీతి, యస్యా యదభిమతం గృహ్యతామ్ ఇత్యుక్తే కేశినీ పుత్రమేకమ్, సుమతిః పుత్రసహస్రాణి షష్టిం వవ్రే. తథేతి చ ఋషిణాఽభిహితే అల్పైరేవాహోభి రేకమసంజసం నామ వంశధరం పుత్రమసూత కేశినీ. వినతా(కాశ్యప) తనయాయాస్తు సుమత్యాః షష్టిఃపుత్రసహస్రాణ్యభవన్. తస్మాదసమంజసోఽంశుమాన్ నామ కుమారో జజ్ఞే । 3 ॥**

"మీలో ఒకరికి వంశకర్తయైన ఒకే ఒక కుమారుడు, ఇంకొకరికి అరవై వేల మంది పుత్రులు కలుగుతారు. ఎవరికి ఇష్టమైనది వారు కోరుకొని స్వీకరించవచ్చు." అని ఔర్వుడు పలికాడు. ఆ ముని అలా అనగానే కేశిని ఒక కుమారుని, సుమతి అరవై వేల మంది కుమారులను కోరుకున్నారు. ఋషి కూడా వారికి అలాగే వరం ఇచ్చాడు. కొద్ది రోజులలోనే కేశిని అసమంజసుడనే వంశప్రతిష్ఠాకరుడైన ఒక పుత్రుని కన్నది. వినతకుమార్తె(కాశ్యపుని కుమార్తె) సుమతికి అరవై వేల మంది కుమారులు కలిగారు. ఆ అసమంజసునివల్ల అంశుమంతుడనే కుమారుడు కలిగాడు.

**వి ॥** సంగతమంజః సత్యం దీని యందు కూడి ఉంటుంది. అది సమంజసం ధర్మంవల్ల చలింపకుండా ఉండేవాడు. అది లేనివాడు అసమంజసుడు. తన క్షత్రియ ధర్మంనుండి చలించి యోగిధర్మం అవలంబించినవాడు.

**స తు అసమంజా బాల్యాదేవాపవృత్తః. పితా చాస్యాచిన్తయత్, అయమతీత బాల్యో బుద్ధిమాన్ భవిష్యతీతి. అథ తత్రాపి వయస్యతీతే తచ్చరితమేవైనం పితా తత్యాజ ॥ 4 ॥**

ఆ అసమంజసుడు బాల్యంనుంచే చెడ్డదైన నడవడికకు అలవాటు పడ్డాడు. అతని తండ్రి ఇతనికి చిన్నతనం పోతే మంచి బుద్ధిమంతుడవుతాడని భావించాడు. ఆ వయసు గడచిపోయిన తరువాత కూడా అతడు చెడు నడతతో ఉండిపోగా అసమంజసుని తండ్రియైన సగరుడు విడిచి పెట్టేశాడు.

**తాన్యపి షష్టిః కుమార సహస్రాణి అసమంజసచరితమనుచక్రుః ॥ 5 ॥**

ఇక సుమతి కొడుకులైన అరవై వేల మంది కూడ అసమంజసుని ప్రవర్తననే అనుసరించారు.

**తతశ్చాసమంజసచరితానుకారిభిః సాగరైరపధ్వస్తయజ్ఞాది సన్మార్గే జగతి దేవాః సకల విద్యామయమసంస్పృష్ట మశేషదోషైర్భగవతః పురుషోత్తమస్యాంశభూతం కపిలర్షిం ప్రణమ్య తదర్థమూచుః ॥ 6 ॥**

తరువాత అసమంజసుని నడవడికనే అనుసరిస్తున్న సగరపుత్రులవల్ల లోకంలో సమస్తయజ్ఞాది ధర్మ మార్గాలు ధ్వంసం అయిపోతూ ఉంటే, దేవతలు సకలవిద్యాస్వరూపుడు, సమస్త కల్మషరహితుడు, పురుషోత్తమాంశ సంభూతుడు అయిన కపిలమహర్షికి నమస్కరించి వారినుద్దేశించి ఇలా అన్నారు.

**భగవన్! ఏభిః సగరతనయైరసమంజసచరితమనుగమ్యతే, కథమేవమేభిరనుసరద్భిర్జగద్ భవిష్యతీతి, అత్యార్త జగత్పరిత్రాణాయ చ భగవతోఽత్ర శరీరగ్రహణమ్. ఇత్యాకర్ణ్య భగవాన్ "అల్పైరేవ దినైరేతే వినంక్ష్యన్తి" ఇత్యుక్తవాన్ ॥ 7 ॥**

"భగవన్! ఈ సగరపుత్రులు సమంజసంగా ప్రవర్తించడం లేదు. అసమంజసుని నడవడినే అనుసరిస్తున్నారు. ఇట్టి చెడుప్రవర్తనతో సంచరిస్తున్న వీరివల్ల లోకం ఏమయిపోతుందో కదా! మిక్కిలి పరితపించే జగత్తును రక్షించడానికే కదా భగవంతుడిక్కడ శరీరాన్ని ధరించి అవతరించింది" అని వారు వేడుకోగా ఆ మాటలు విని భగవానుడు "వీరు కొద్ది రోజుల్లోనే నశిస్తారు" అని వారిని ఓదార్చాడు.

**తత్రాన్తరే చ సగరో హయమేధమారేభే. తత్ర చ తత్పుత్రైరధిష్ఠితమస్యాశ్వం కోఽప్యపహృత్య భువో వివరం ప్రవివేశ ॥ 8 ॥**

ఆ సమయంలో సగరుడు అశ్వమేధయాగం ఆరంభించాడు. అంత అతని కొడుకుల రక్షణలో ఉన్న అశ్వాన్ని ఎవడో అపహరించి, భూవివరంలో(రంధ్రంలో) ప్రవేశించాడు.

**తతశ్చాశ్వాన్వేషణాయ తనయాన్ యుయోజ. తతస్తత్తనయాశ్చాశ్వఖురపదవీమనుసరన్తోఽతినిర్బన్ధేన వసుధాతలమేకైకోయోజనం యోజనమవనేశ్చఖాన ॥ 9 ॥**

అపుడు ఆ అశ్వాన్ని వెదకమని సగరుడు కుమారులకు ఆదేశించాడు. తరువాత అతని కొడుకులు గుర్రపు డెక్కల జాడనుబట్టి భూమిని గాలిస్తూ, భూరంధ్ర సమీపంలో ఒక్కొక్కడు ఒక్కొక్క యోజనం మేరకు భూమిని త్రవ్వారు.

**పాతాలే చాశ్వం పరిభ్రమన్తమవనీపతితనయాస్తే దదృశుః. నాతిదూరస్థితం చ భగవన్తమపఘనే శరత్కాలేఽర్కమివ తేజోభిరనవరతమూర్ధ్వమధశ్చాశేషదిశశ్చోద్భాసయమానం కపిలర్షిమపశ్యన్ ॥ 10 ॥**

పాతాళంలో ఇటుఅటూ తిరుగుతూ ఉండే గుర్రాన్ని ఆ చక్రవర్తి కుమారులు వీక్షించారు. దానికి సమీపంలోనే ఉన్న, మబ్బులు తొలగిపోగా శరత్కాలంలో ప్రకాశిస్తున్న సూర్యునిలా ఉన్న, స్వీయకాంతులతో ఎల్లప్పుడూ పైన, క్రింద, అన్నిదిక్కులను ప్రకాశింపజేస్తూ ఉన్న భగవంతుడైన కపిలమహర్షిని కూడా చూశారు.

**తతశ్చోద్యతాయుధా దురాత్మాఽయమస్మదపకారీ యజ్ఞవిఘాతకర్తా హయహర్తా హన్యతాం హన్యతా" మిత్యధావన్. తతశ్చ తేనాపి భగవతా కించిదీషత్పరివర్తితలోచనేన విలోకితాః స్వశరీరసముత్థేనాగ్నినా దహ్యమానా వినేశుః । 11 ॥**

వెంటనే వారు ఆయుధాలు పైకెత్తినవారై "ఈ దురాత్ముడే మనకు అపకారం చేశాడు. యజ్ఞానికి విఘాతం కల్గించాడు. గుర్రాన్ని దొంగిలించినవాడు వీడే. చంపండి. చంపండి." అని అరుస్తూ దాడిచేశారు. తరవాత ఆ భగవంతుడు కూడా ఏదో కొంచెం కన్నులు అటూఇటూ త్రిప్పి చూచీ చూడగానే, వారందరూ తమ శరీరాల నుంచి పుట్టిన అగ్నిచే తగలబడిపోయి నశించారు.

**సగరోఽ ప్యనుగమ్యాశ్వానుసారి తత్ పుత్రబలమశేషం పరమర్షి కపిలతేజసా దగ్ధమంశుమన్తమసమంజస పుత్రమశ్వానయనాయ చోదయామాస ॥ 12 ॥**

సగరుడు కూడా అశ్వాన్ని అనుసరించి వెళ్లిన తన కుమారులు, సైన్యం అంతా కపిలమహర్షిచే, ఆయన తేజస్సుద్వారా దగ్ధమైపోవడం తెలుసుకొన్నాడు. అనంతరం అసమంజసుని కుమారుడైన అంశుమంతుని గుర్రాన్ని తీసుకొని రావడానికై పంపాడు.

**స తు సగరతనయఖాతమార్గేణ కపిలముపగమ్య భక్తినమ్రస్తథా తథా చ తుష్టావ, యథైనం భగవానాహ, గచ్ఛైనం పితామహాయాశ్వం ప్రాపయ, వరం వృణీష్వ చ, పుత్ర! పౌత్రశ్చ తే స్వర్గాద్ గంగామానయిష్యతీతి॥13॥**

ఆ అంశుమంతుడు కూడా సగరపుత్రులు త్రవ్విన మార్గంలో పోయి కపిలమహామునిని సందర్శించి భక్తితో వంగి ఎలా స్తుతించాలో అలా నుతించాడు. ఆ పైన భగవంతుడు కూడా అతనితో "నాయనా! వెళ్లు. ఈ గుర్రాన్ని పితామహుని సన్నిధికి చేర్చు. వరం కూడా కోరుకో. నీ మనుమడు స్వర్గంనుంచి గంగను భూమికి కొనివస్తాడు." అని చెప్పాడు.

**అథాంశుమానపి బ్రహ్మదణ్డహతానామస్మత్పితౄణాం స్వర్గాయ స్వర్గాయోగ్యానాం స్వర్గప్రాప్తికరం వరమస్మాకం భగవాన్ ప్రయచ్ఛతు ఇత్యాహ । 14 ॥**

అంతట అంశుమంతుడు"బ్రహ్మదండానికి గురై చనిపోయిన, నా తండ్రులకు స్వర్గలోకవాసం లేకుండా పోతుంది కాబట్టి, వారికి స్వర్గప్రాప్తి కలిగించేవరం నాకు భగవంతుడు ప్రసాదించు గాక!" అని కోరాడు.

**తం చాహ భగవాన్, ఉక్తమేవైతన్మయా పౌత్రస్తే త్రిదివాద్ గంగాం భువమానయిష్యతీతి. తదమ్భసా సంస్పృష్టేష్వస్థిభస్మస్వేతే స్వర్గమారోక్ష్యన్తి. భగవద్విష్ణుపాదాంగుష్ఠవినిర్గతజలస్య హి తన్మాహాత్మ్యం యన్న కేవలమభిసన్ధి పూర్వకం స్నానాద్యుపభోగేషూపకారకమ్, అనభిసంహితమప్యేతత్. ప్రాణస్యాస్థిచర్మస్నాయు కేశాద్యుత్సృష్టం శరీరజం యద్భూపతితం సద్యః శరీరిణం స్వర్గం నయతీత్యుక్తః, ప్రణమ్య చ భగవతేఽ శ్వమాదాయ పితామహయజ్ఞమాజగామ ॥ 15 ॥**

అపుడు భగవంతుడు అతనితో "నీకు ఇప్పుడే చెప్పాను కదా! నీ మనుమడు దివినుంచి భువికి గంగకు తీసుకొనివస్తాడని. ఆ నీరు ఎముకలకూ, బూడిదకు తగిలిన వెంటనే వీరు స్వర్గం అధిరోహిస్తారు. భగవంతుడైన మహావిష్ణువు కాలిబొటన వ్రేలినుంచి వెలువడే నీటికి అంత మహిమ ఉంది కదా! ఆ నీరు కేవలం కామనతో స్నానం మున్నగు ఉపభోగాలకు ఉపకరించడమే కాదు. నిష్కామంగా కర్మలు ఆచరించి చనిపోయేవారి ఎముకలు,

చర్మం, నరాలు, కేశాలు మొదలైనవి తగిలినా, శరీరం నుంచి పుట్టినవేమైనా పడినా, వెంటనే ఆ శరీరిని స్వర్గం చేరుస్తుంది." అని చెప్పాడు. అంశుమంతుడు ఆ భగవంతునకు నమస్కరించి గుర్రాన్ని తీసుకొని, తాతగారి యజ్ఞసమీపానికి వచ్చాడు.

**సగరోఽప్యశ్వమాసాద్య తం యజ్ఞం సమాపయామాస. సాగరం చాత్మజప్రీత్యా పుత్రత్వే కల్పయామాస।16॥**

సగరుడు కూడ అశ్వం దొరికినందువల్ల ఆ యజ్ఞం పూర్తి చేశాడు. తన పుత్రులచే త్రవ్వబడిన సాగరాన్ని సంతతిపై ఉన్న ప్రేమతో కొడుకుగా చేసుకొని గౌరవించాడు.

**తస్యాప్యంశుమతో దిలీపః పుత్రోఽభవత్. దిలీపస్యాపి భగీరథః, యోఽసౌ గంగాం స్వర్గాదిహానీయ భాగీరథీ సంజ్ఞాం చకార । 17 ॥**

ఆ అంశుమంతునికి దిలీపుడనే పుత్రుడు కలిగాడు. దిలీపునకు భగీరథుడు జన్మించాడు. ఆ భగీరథుడే గంగను స్వర్గంనుంచి ఇక్కడకు కొనివచ్చాడు. అందువల్ల గంగ భాగీరథి అనే పేరు పొందినదయింది.

**భగీరథాత్ శ్రుతః, తస్యాపి నాభాగః, తతోఽప్యమ్బరీషః, తస్మాత్ సిన్ధుద్వీపః, తస్యాప్యయుతాశ్వః, తత్పుత్రశ్చ ఋతుపర్ణః, యోఽసౌ నలసహాయోఽక్షహృదయజ్ఞోఽభూత్ । 18 ॥**

భగీరథునివల్ల శ్రుతుడు, అతనికి నాభాగుడు, అతనివల్ల అంబరీషుడు, అతనివల్ల సింధుద్వీపుడు, అతనికి అయుతాశ్వుడు (అయుతాయువు), అతనికి ఋతుపర్ణుడు కలిగారు. ఇతడే నలునికి సహాయపడినవాడై, ద్యూతక్రీడారహస్యం తెలుసుకొన్నాడు.

వి ॥ భగీరథునకు సుహోత్రుడు, అతనికి శ్రుతుడు కలిగారని పాఠాంతరం.

**ఋతుపర్ణపుత్రః సర్వకామః, తత్తనయః సుదాసః, సుదాసాత్ సౌదాసో మిత్రసహ నామా ॥ 19 ॥**

ఋతుపర్ణుని కుమారుడు సర్వకాముడు. అతని పుత్రుడు సుదాసుడు. సుదాసునివల్ల మిత్రసహుడనే పేరుగల సౌదాసుడు జన్మించాడు.

**యోఽసావటవ్యాం మృగయాగతో వ్యాఘ్రద్వయమపశ్యత్ ॥ 20 ॥**

ఒకనాడు అతడు అడవిలో వేటాడుతూ రెండు పెద్ద పులులను చూశాడు.

**తాభ్యాం చ తద్వనమపమృగం కృతమ్ ॥ 21 ॥**

ఆ రెండింటిచేత వనంలో మృగాలు లేకుండా పోయాయనుకొన్నాడు.

**స చైకం తయోర్బాణేన జఘాన ॥ 22 ॥**

వాటిలో ఒకదానిని సౌదాసుడు బాణంతో కొట్టాడు.

**మ్రియమాణశ్చాసావతిభీషణాకృతిరతికరాలవదనో రాక్షసోఽభవత్ ॥ 23 ॥**

అది ఆ దెబ్బకు చనిపోతూ, అత్యంత భీషణాకారంతో అతిభయంకరవదనంతో ఉన్న రాక్షసుడై పడిపోయింది.

**ద్వితీయోఽపి ప్రతిక్రియాం తే కరిష్యామీత్యుక్త్వా, అన్తర్ధానం జగామ । 24 ॥**

రెండోపులి అయితే నీకు తగిన ప్రతీకారం చేస్తానని చెప్పి మాయమయిపోయింది.

**కాలేన గచ్ఛతా స సౌదాసో యజ్ఞమయజత్, పరినిష్ఠితయజ్ఞే చాచార్యవసిష్ఠే నిష్క్రాన్తే తద్రక్షో వసిష్ఠరూప మాస్థాయ యజ్ఞావసానే మమ నరమాంసం భోజనం దేయమ్, తత్ సంస్క్రియతాం క్షణాదిహాగమిష్యామీత్యుక్త్వా నిష్క్రాన్తః ॥ 25 ॥**

ఇలా కాలం గడస్తూ ఉండగా సౌదాసుడు యజ్ఞం చేశాడు. యజ్ఞం పూర్తిచేయించి, ఆచార్యుడైన వసిష్ఠుడు వెళ్లిపోయాడు. అతడు ఇలా వెళ్లాడో లేదో ఆ రాక్షసుడు వసిష్ఠునిరూపం స్వీకరించి వచ్చి "యజ్ఞం చివర నాకు (నర) మాంసభోజనం పెట్టాలి. అది సిద్ధం చేయి. క్షణకాలంలో వస్తాను." అని చెప్పి వెళ్లిపోయాడు.

**భూయశ్చ సూదవేషం కృత్వా రాజాజ్ఞయా మానుషమాంసం సంస్కృత్య రాజ్ఞే న్యవేదయత్. అసావపి హిరణ్యపాత్ర స్థితం మాంసమాదాయ వశిష్ఠాగమనప్రతీక్షోఽభవత్ ॥ 26 ॥**

అంతేకాక వంటలవాని వేషంలో, రాజు ఆనతి ప్రకారంగా నరమాంసం వండి రాజేంద్రునికి దానిని నివేదించాడు. అతడు కూడా బంగారుపాత్రలో ఉన్న మాంసం గ్రహించి వసిష్ఠునిరాకకై ఎదురు చూడసాగాడు.

**ఆగతాయ చ వసిష్ఠాయ నివేదితవాన్, స చాచిన్తయత్. అహో! రాజ్ఞోఽస్య దౌఃశీల్యమ్, యేనైతన్మాంస మస్మాకం ప్రయచ్ఛతి. కిమేతద్ ద్రవ్యజాతమితి ధ్యానపరోఽభూత్. అపశ్యం చ తన్మానుషమాంసమ్. తతశ్చ యస్మాదభోజ్యమస్మద్విధానాం తపస్వినామ్ అవగచ్ఛన్నపి భవాన్ మహ్యం దదాతి, అతః క్రోధకలుషీకృతచేతా రాజానం ప్రతి శాపముత్ససర్జ, తస్మాత్తవైవాత్ర లోలుపా బుద్ధిర్భవిష్యతీతి ॥ 27 ॥**

ఆ సమయంలో వచ్చిన వసిష్ఠునికి దానిని సమర్పించాడు. వసిష్ఠుడు ఆ మాంసాన్ని చూచి చింతించి "ఆహా! ఎంత చెడు శీలం కలవాడు ఈ రాజు! ఎంత ఆశ్చర్యం? ఈ మాంసం మాకు పెడుతున్నాడేమిటి? ఇంతకు ఏమిటీ పదార్థం? దేని వల్ల తయారయింది? అని ధ్యానపరుడయ్యాడు. అది నరమాంసంగా తెలుసుకొన్నాడు. దానితో క్రోధం పెరిగింది. మనస్సు కల్లోలమైపోయింది. వెంటనే రాజుపై శాపం విడిచి పెట్టాడు. "ఇది మా వంటి తపస్వులు తినకూడనిదని తెలిసి కూడా నీవు నాకు ఆహారంగా పెట్టావు. కాబట్టి దీనిపట్ల నీకే అతివాంఛ కలుగుతుంది." అని శపించాడు.

**అనంతరం చ తేనాపి భగవతైవాభిహితోఽస్మీత్యుక్తః, కిం కిం మయైవాభిహితమ్, ఇతి పునరపి సమాధౌ తస్థౌ ॥ 28 ॥**

తరువాత అతడు కూడా దేవరవారే నాకిలా భోజనం పెట్టవలసిందని చెప్పారన్నాడు. "ఏమిటేమిటి? నేను చెప్పానా?" అంటూ వసిష్ఠుడు మళ్లీ సమాధిస్థితుడయ్యాడు.

**సమాధివిజ్ఞానావగతార్థశ్చాస్యానుగ్రహం చకార, నాత్యన్తమేతత్, ద్వాదశాబ్దం భవతో భోజనం భవిష్యతీతి ॥ 29 ॥**

సమాధిలో జరిగిన యథార్థవిషయం తెలిసికొన్నవాడై, ఆ సౌదాసునిపట్ల అనుగ్రహం చూపించాడు."ఇది ఎల్లప్పుడూ ఉండేది కాదు. నీకు ఈ మాంసభోజనాసక్తి పండ్రెండు సంవత్సరాలపాటు మాత్రమే ఉంటుంది" అని చెప్పాడు.

**అసావపి తు ప్రగృహ్యోదకాంజలిం మునిశాపప్రదానాయోద్యతో "భగవానస్మద్గురుః. నార్హస్యేవం కులదేవతాభూతమాచార్యం శప్తుమ్" ఇతి స్వపత్న్యా మదయన్త్యా ప్రసాదితః. సస్యామ్బుదరక్షార్థం తచ్ఛాపామ్బు నోర్వ్యాం నాకాశే చిక్షేప, తేనైవ స్వపాదౌ సిషేచ । 30 ॥**

సౌదాసుడు కూడ జరిగిన వంచన తెలియక దోసిట్లో నీరుతీసుకొని వసిష్ఠమునికి శాపం ఇవ్వాలని సిద్ధపడ్డాడు. అపుడు అతని భార్య మదయంతి "ఈ భగవంతుడు మన గురువు. కులదేవతవంటివాడు. ఈ ఆచార్యుని శపించడం నీవంటివానికి తగదు. " అని సౌదాసుని శాంత పరచింది. అపుడు రాజు కూడ కోపం వదలి శాంతుడై పంటలను, మబ్బులను కాపాడడం కోసమై ఆ నీళ్లను నేలమీద కాని, నింగిలో కాని చల్లక తనరెండు పాదాల మీద చల్లుకొన్నాడు.

**తేన క్రోధాశ్రితేనామ్బుసా దగ్ధచ్ఛాయౌ తత్పాదౌ కల్మాషతాముపగతౌ । 31 ॥**

అలుకతో కూడిన ఆ నీటితో అతని పాదాలు కాంతిమాడిపోయి నల్లబడిపోయాయి.

**తతశ్చ,స కల్మాషపాద సంజ్ఞామవాప. వసిష్ఠశాపాచ్చ(షష్ఠే) షష్ఠే కాలే రాక్షసభావముపేత్య అటవ్యాం పర్యటన్ననేకశో మానుషానభక్షయత్ । 32 ॥**

అందువల్ల అతనికి కల్మాషపాదుడనే పేరు వచ్చింది. వసిష్ఠుని శాపంవల్ల ఆరవకాలం (ప్రతి మూడవనాటి సాయంకాలం) రాక్షసస్వభావం ఏర్పడగా, అడవిలో తిరుగుతూ, ఎందరినో మనుష్యులను భక్షించాడు.

**ఏకదా తు కంచిన్మునిమృతుకాలే భార్యయా సహ సంగతం దదర్శ । 33 ॥**

ఒకప్పుడు అతడు ఋతుకాలంలో భార్యతో సంగమించబోతున్న ఒక మునిని చూశాడు.

**తయోశ్చ తమతిభీషణం రాక్షసమాలోక్య త్రాసాత్ ప్రధావితయోర్దమ్పత్యోర్బ్రాహ్మణం జగ్రాహ । 34 ॥**

అతిభయంకరమైన రాక్షసస్వరూపం చూచి భయపడిపోయి, పరుగెత్తుతున్న ఆ దంపతులిద్దరిలో బ్రాహ్మణుని పట్టుకొన్నాడు.

**తతః సా బ్రాహ్మణీ బహుశస్తం యాచితవతీ. ప్రసీద! ఇక్ష్వాకుకులతిలకభూతస్త్వం మహారాజమిత్రసహః న రాక్షసః, నార్హసి స్త్రీధర్మసుఖాభిజ్ఞో మయ్యకృతార్థాయామిమం మద్భర్తారమత్తుమ్, ఇత్యేవం బహుప్రకారం తస్యాం విలపన్త్యాం వ్యాఘ్రః పశుమివ తం బ్రాహ్మణమభక్షయత్ ॥ 35 ॥**

అపుడు ఆ బ్రాహ్మణి అతనిని పలువిధాలుగా బ్రతిమాలుకొంది. "రాజా! నన్ను అనుగ్రహించు. నీవు ఇక్ష్వకువంశానికే తిలకంవంటివాడవు. మిత్రసహుడవనే చక్రవర్తివి కాని రాక్షసుడవు కావు. స్త్రీ ధర్మసుఖం పూర్తిగా తెలిసినవాడవు. నా కోరిక తీరకుండగా నా భర్తను చంపడం తగదు." అని ఈ విధంగా పెక్కువిధాలుగా ఆమె విలపిస్తూ ఉన్నా, పెద్దపులి పశువును తినేసినట్లుగా, అతడు ఆ బ్రాహ్మణుని భక్షించి వేశాడు.

**తతశ్చాతికోపసమన్వితా బ్రాహ్మణీ తం రాజానం "యస్మాదేవం మయ్యతృప్తాయాం త్వయాఽయం మత్పతిర్భక్షితః, తస్మాత్ త్వమపి అత్యన్తకామోపభోగప్రవృత్తౌ ప్రాప్యస్యన్తమ్ "(అన్తమవలోపభోగప్రవృత్తౌ ప్రాప్యసి) ఇతి శశాపాగ్నిం ప్రవివేశ చ । 36 ॥**

అందువల్ల ఆ బ్రాహ్మణి మిక్కిలి కోపంతో కూడుకొన్నదై రాజును శపించింది. "నాకు తృప్తి కలగకుండగానే, నీవు ఈ నా పతిని భక్షించావు కనుక, నీవు కూడా ఇలాగే కామోపభోగానికి పూనుకొన్నప్పుడు మరణం చెందుతావు" అని శాప మిచ్చింది. తరువాత అగ్నిలో ప్రవేశించింది.

**తతస్తస్య ద్వాదశాబ్దపర్యయే విముక్తశాపస్య స్త్రీవిషయాభిలాషిణో మదయన్తీ స్మారయామాస. తతశ్చ పరమసౌ స్త్రీసమ్భోగం తత్యాజ । 37 ॥**

తరువాత పండ్రెండేండ్లు గడచిపోయాక సౌదాసునకు శాపవిముక్తి ఏర్పడింది. స్త్రీసమాగమం కోరుకోగానే అతనికి మదయంతి బ్రాహ్మణి ఇచ్చిన శాపాన్ని గుర్తుచేసింది. అటుపైన అతడు స్త్రీసంభోగవాంఛను విడిచివేశాడు.

**వసిష్ఠశ్చ, అపుత్రిణా రాజ్ఞా పుత్రార్థమభ్యర్థితో మదయన్త్యాం గర్భాధానం చకార. యదా చ సప్త వర్షాణ్యసౌ గర్భో న జజ్ఞే. తతస్తం గర్భమశ్మనా దేవీ జఘాన. పుత్రశ్చాజాయత. తస్య చాశ్మక ఏవ నామాభవత్. అశ్మకస్య మూలకో నామ పుత్రోఽభవత్. యోఽసౌ నిఃక్షత్రేఽస్మిన్ క్ష్మాతలే క్రియమాణే స్త్రీభిర్వివస్త్రాభిః పరివార్య రక్షితః। తతస్తం నారీకవచముదాహరన్తి. మూలకాద్ దశరథః, తస్మాద్ ఇలవిలః, తతశ్చ విశ్వసహః. తస్మాచ్చ ఖట్వాంగో (దిలీపః) ।**

సంతానంలేని రాజు పుత్రులు కావాలని కోరగా, వసిష్ఠుడు మదయంతికి గర్భం కలిగించాడు. ఏడు ఏండ్లు గతించినా, బిడ్డ జన్మించక పోయేసరికి, ఆ రాణి రాతితో గర్భాన్ని కొట్టింది. గర్భవిచ్ఛేదమై కొడుకు పుట్టాడు. అశ్మతాడనంవల్ల పుట్టాడు కాబట్టి అతనికి అశ్మకుడనే పేరు వచ్చింది. ఆ అశ్మకునకు మూలకుడనే కొడుకు కలిగాడు. పరశురాముడు ఈ భూమండలంలో క్షత్రియులు లేకుండా చేసే సమయంలో, స్త్రీలు ఈతనిని రక్షించాలని వివస్త్రలై చుట్టూ నిలిచి కాపాడారు. అందువల్ల అతనిని నారీకవచుడని పలకడం జరిగింది. మూలకుని వల్ల దశరథుడు, అతనివల్ల ఇలవిలుడు, అతనివల్ల విశ్వసహుడు, అతనివల్ల (దిలీపుడనబడే) ఖట్వాంగుడు కలిగారు.

**యోఽసౌ దేవాసురాణాం సంగ్రామే దేవతాభిరభ్యర్థితోఽసురాన్ జఘాన. స్వర్గే చ కృతప్రియైర్దేవైర్వరార్థం చోదితః ప్రాహ. యద్యవశ్యం వరో గ్రాహ్యస్తన్మమాయుః కథ్యతామితి. అనన్తరం చేతైరుక్తమ్, ఏక ముహూర్త ప్రమాణమాయుః. ఇత్యుక్తోఽస్ఖలితగతినా విమానేన లఘిమగుణో మర్త్యలోకమాగమ్యాహ – యథా న బ్రాహ్మణేభ్యః**

**సకాశాదాత్మా ఽ పి మే ప్రియతరః, న చాపి స్వధర్మోల్లంఘనం మయా కదాచిదప్యనుష్ఠితమ్, న చ సకలదేవమానుషపశు వృక్షాదికేష్వచ్యుతవ్యతిరేకవతీ దృష్టిర్మమాభూత్, తథా తమేవ దేవం మునిజనానుస్మృత భగవన్తమస్ఖలితగతిరద్య ప్రాపయేయమిత్యశేషదేవగురౌ భగవత్యనిర్దేశ్యవపుషి సత్తామాత్రాత్మన్యాత్మానం పరమాత్మని వాసుదేవే యుయోజ, తత్రైవ చ లయమవాప। 38 ॥**

అతడే దేవాసురయుద్ధంలో దేవతలు కోరగా దివికేగి అసురులను సంహరించాడు. స్వర్గంలో ప్రీతిపొందిన కొందరు దేవతలు ఈతనిని వరం కోరుకొమ్మని ప్రేరేపించారు. అపుడు ఖట్వాంగుడు "మీ నుంచి వరం తప్పక తీసుకోవలసి ఉంటే, నా ఆయుష్షు ఎంతో చెప్పండి" అని వేడుకున్నాడు. అంతట వారు "ఒక్క ముహుర్తం మాత్రమే ఇక నీకు ఆయువు ఉంది" అని చెప్పారు. వెంటనే అతడు అడ్డులేకుండా వేగంగా తేలికగా ప్రయాణంచేసి విమానంలో మానవలోకం వచ్చి ఇలా అనుకొన్నాడు.

"బ్రాహ్మణులకన్న నాకు ఆత్మకూడా ప్రియతరంకాదనే మాట నిజమయినట్లుయితే, నేను ఎల్లప్పుడూ స్వధర్మం ఉల్లంఘించి ఉండకపోతే, సమస్తదేవతలు, మనుష్యులు, పశువులు, వృక్షాదులయందు - ఇవన్నీ అచ్యుతస్వరూపంకన్న వేరుకాదనే దృష్టి ఉన్నవాడననే మాట సత్యమయితే, మునిజనులు అనుదినం స్మరించే ఆ భగవంతుని వారించ శక్యంకాని గమనంతో పొందుతాను" అని పలికి సమస్తదేవతలకు పరమగురువు, భగవానుడు, అనిర్దేశ్యాకారుడు, సత్తామాత్రస్వరూపుడు, వాసుదేవుడనబడే పరమాత్మపై మనస్సు లగ్నం చేశాడు. ఆయనలోనే లీనమై పోయాడు.

**తత్రాపి శ్రూయతే శ్లోకో గీతః సప్తర్షిభిః పురా ।**
**ఖట్వాంగేన సమో నాన్యః కశ్చిదుర్వ్యాం భవిష్యతి ॥**

**యేన స్వర్గాదిహాగత్య ముహూర్తం ప్రాప్య జీవితమ్ ।**
**త్రయోఽతిసంహితా లోకా బుద్ధ్యా దానేన చైవ హి ॥ 39 ॥**

ఈ సందర్భంలో కూడా సప్తర్షులచే గానం చేయబడ్డ ఒక శ్లోకం వినవస్తున్నది. ఖట్వాంగునితో సమానమైన వాడు ఈ భూమియందు మరొక్కడు ఎవడూ ఉండడు. ముహూర్తకాలం ఆయువు మాత్రమే ఉండగా, దివి నుండి భువికిచేరి, జ్ఞానబుద్ధితో ముల్లోకాలు దాటి పోయాడు కదా! - అని మైత్రేయా! ఆ ఖట్వాంగుడు స్తుతించబడ్డాడని పరాశరుడు ఇంకా ఇలా చెబుతున్నాడు.

**ఖట్వాంగతో దీర్ఘబాహుః పుత్రోఽభవత్. తతో రఘుః, తస్మాదప్యజః, అజాద్ దశరథః, దశరథస్యాపి శ్రీభగవాన్ అబ్జనాభో జగత్స్థిత్యర్థమాత్మాంశేన రామలక్ష్మణభరతశత్రుఘ్నరూపేణ చతుర్ధా పుత్రత్వమయా సీత్॥40॥**

ఖట్వాంగునివల్ల దీర్ఘబాహువనే పుత్రుడు కలిగాడు. అతనికి రఘువు, రఘువుకు అజుడు, అజునివల్ల దశరథుడు జన్మించారు. దశరథునికి భగవంతుడైన పద్మనాభుడు జగత్తును రక్షించడంకోసం తన అంశతో రామలక్ష్మణభరతశత్రుఘ్నరూపాలతో నలుగురు కుమారులుగా జన్మించారు.

**రామోఽపి బాల ఏవ విశ్వామిత్రయజ్ఞరక్షణాయ గచ్ఛంస్తాటకాం జఘాన ॥ 41 ॥**

రాముడు బాలుడుగా ఉండగానే, విశ్వామిత్రుని యాగాన్ని రక్షించడానికి వెడుతూ, తాటకను సంహరించాడు.

**యజ్ఞే చ మారీచమిషుపాతాహతం దూరం చిక్షేప. సుబాహుప్రముఖాంశ్చ క్షయమనయత్. సన్దర్శన మాత్రేణైవ, అహల్యామపాపాం చకార. జనకగృహే చ మాహేశ్వరం చాపమనాయాసేనైవ బభంజ. సీతాం చాయోనిజాం జనకరాజతనయాం వీర్యశుల్కాం లేభే । 42 ॥**

యజ్ఞంలో మారీచుని ఒక్క బాణంవేసి పడగొట్టి, ప్రాణంతో దూరంగా విసరివేశాడు. సుబాహువు మున్నగు రాక్షసులను నాశనం చేశాడు. దర్శనమాత్రంచేతనే అహల్యకు శాపవిమోచనం కల్పించి పాపరహితురాలిని కావించాడు. జనకుని సభాగృహంలో శివుని విల్లును ఏ శ్రమ పొందకుండా లీలగావిరిచాడు. అయోనిజయైన, జనకరాజుకుమార్తెయగు, వీర్యశుల్కగా నిర్ణయించబడిన సీతను వివాహమాడాడు.

**సకలక్షత్రక్షయకారిణమశేషహైహయకులకేతుభూతం చ పరశురామమపాస్తవీర్యబలావలేపం చకార॥43॥**

సమస్త క్షత్రియుల నాశనానికి కారకుడైన, హైహయవంశానికి అంతటికీ తోకచుక్క(కేతుగ్రహం) వంటివాడైన పరశురాముని వీర్యబలగర్వాన్నంతా పూర్తిగా తొలగించివేశాడు.

**పితృవచనాచ్చాగణితరాజ్యాభిలాషీ భ్రాతృభార్యాసమన్వితో వనం వివేశ । 44 ॥**

తండ్రి మాటను గౌరవించి, రాజ్యమునందు కోరికను లెక్కచేయకుండా, తమ్మునితోను, భార్యతోను కూడుకొన్నవాడై అడవిలో ప్రవేశించాడు.

**విరాధఖరదూషణాదీన్ కబన్ధవాలినౌ చ జఘాన. బధ్వా చామ్భోనిధిమ్, అశేషరాక్షస కులక్షయం కృత్వా, దశాననాపహృతాం తద్వధాపహతకలంకామపి, అనలప్రవేశశుద్ధామశేషదేవేశస్తూయమానాం సీతాం జనకరాజతనయామయోధ్యామానిన్యే ॥ 45 ॥**

విరాధుని, ఖరుని, దూషణుడుమున్నగు వారిని, కబంధుని, వాలిని కూడా హతమార్చాడు. సముద్రానికి సేతువు కట్టాడు. సమస్తరాక్షసవంశనాశనం కావించాడు. దశాననుడు ఎత్తుకొని పోయిన సీతను, ఆతని వధ కావించి ఏ కళంకంలేని దానినిగా చేశాడు. అయినప్పటికి అగ్నిప్రవేశంచేసి పరిశుద్ధురాలైన దానిని, సమస్తదేవతలు స్తోత్రంచేసిన పవిత్రచరిత్ర కలదానిని, జనకరాజసుతయైన సీతను అయోధ్యానగరానికి తీసుకొని వచ్చాడు.

**తతశ్చాభిషేకమంగళం మైత్రేయ ! వర్షశతేనాపి వక్తుం న శక్యతే సంక్షేపేణ శ్రూయతామ్ ।**

మైత్రేయా! అనంతరం జరిగిన రామపట్టాభిషేకమంగలవృత్తాంతం నూరేండ్లయినా చెప్పడానికి శక్యం కాదు. సంక్షిప్తంగా విను.

**లక్ష్మణభరతశత్రుఘ్నవిభీషణసుగ్రీవాంగదజాంబవద్ధనుమత్ప్రభృతిభిః సముత్ఫుల్లవదనైః ఛత్రచామరాదియుతైః సేవ్యమానో దాశరథిః బ్రహ్మేంద్రాగ్నియమనిర్‌ఋతివరుణవాయుకుబేరేశాన ప్రభృతిభిః సర్వామరైః వసిష్ఠవామదేవ వాల్మీకి మార్కండేయ విశ్వామిత్ర భరద్వాజాగస్త్య ప్రభృతిభిః మునివరైః ఋగ్యజుస్సామాథర్వభిః సంస్తూయమానో నృత్యగీతవాద్యాద్యఖిలలోకమంగళవాద్యైః వీణావేణు మృదంగ భేరీ పటహ శంఖ కాహల గోముఖ ప్రభృతిభిః**

**సునాద్యైః సమస్తభూభృతాం మధ్యే సకలలోకరక్షార్థం యథోచితం అభిషిక్తో దాశరథిః కోసలేన్ద్రో రఘుకులతిలకో జానకీప్రియో భ్రాతృత్రయప్రియసింహాసనగత ఏకాదశాబ్దసహస్రం రాజ్యమకరోత్ ।**

లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు, విభీషణుడు, సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు, హనుమంతుడు మున్నగువారు వికసించిన ముఖాలతో ఛత్రం, చామరం మొదలైనవి పట్టుకొని సేవించారు. బ్రహ్మ, ఇంద్రుడు, అగ్ని, యముడు, నిర్‌ఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు మొదలైన సమస్తదేవతలు, వసిష్ఠుడు, వామదేవుడు, వాల్మీకి, మార్కండేయుడు, విశ్వామిత్రుడు, భరద్వాజుడు, అగస్త్యుడు మొదలైన మునివరేణ్యులు ఋగ్యజుస్సామాథర్వణవేదాలతో ప్రస్తుతిస్తూ ఉండగా నృత్తం, గీతం, వాద్యం మున్నగు సమస్తలోక మంగల వాద్యాలతో, వీణావేణు మృదంగ భేరీ పటహశంఖ కాహళగోముఖాది కృత శుభధ్వనులతో, సకలరాజేంద్రుల మధ్యలో, సమస్తలోకరక్షణార్థమై యథావిధిగా కోసలాధిపతి, రఘువంశ తిలకుడు, జానకీ మనోభిరాముడు అయిన దశరథరాముడు ముగ్గురు సోదరులకు సంతోషదాయకుడై పట్టాభిషిక్తుడయి సింహాసనాసీనుడై పదకొండు వేల సంవత్సరాలు రాజ్యం చేశాడు.

**భరతోఽపి గన్ధర్వవిషయసాధనాయ, ఉగ్రగన్ధర్వకోటీస్తిస్రో జఘాన. శత్రుఘ్నేనాప్యమితబలపరాక్రమో మధుపుత్రో లవణో నామ రాక్షసేశ్వరో నిహతో, మథురా చ నివేశితా ।**

**ఇత్యేవమాద్యతులబలపరాక్రమవిక్రమణైరతిదుష్టనిబర్హణైరశేషస్యాస్య జగతో నిష్పాదితస్థితయో రామలక్ష్మణ భరతశత్రుఘ్నాః పునర్దివమారూఢాః. యేఽపి తేషు భగవదంశేష్వనురాగిణః కోసలనగరజనపదాస్తేఽపి తన్మనసస్తత్సలోకతామవాపుః ॥ 46 ॥**

భరతుడు గంధర్వనగరాన్ని జయించడానికై సంగ్రామంలో మూడుకోట్ల భీకరగంధర్వులను సంహరించాడు. శత్రుఘ్నుడు కూడా అమిత బలపరాక్రమశాలి అయిన మధుపుత్రుడైన లవణుడనే పేరుగల రాక్షసేశ్వరుని సంహరించి, మథురానగరం నిర్మించాడు.

ఈ విధమైన అనేకాతిబలపరాక్రమ విక్రమాలతో, అతిదుష్టసంహారకులై, సమస్తజగత్తుకు సంరక్షణ కల్పించి రామలక్ష్మణభరతశత్రుఘ్నులు నలుగురు మళ్లీ దివికి చేరుకొన్నారు. ఆ భగవదంశకలవారిపై అనురాగం ఉన్నవారెవరయితే ఉన్నారో, ఆ కోసల నగరస్థులు, ఆ జనపదాలలో ఉండేవారు అందరూ వారిపై మనస్సు లగ్నం చేసి వారితోకలిసి సాలోక్యం పొందారు.

**రామస్య తు కుశలవౌ పుత్రౌ. లక్ష్మణస్యాంగద చిత్రకేతూ. తక్షపుష్కలౌ(రౌ) భరతస్య. సుబాహు శూరసేనౌ చ శత్రుఘ్నస్య ॥ 47 ॥**

రామునకు కుశుడు, లవుడు అనే కుమారులు, లక్ష్మణునకు అంగదుడు, చిత్రకేతువు అనే తనయులు, భరతునకు తక్షుడు, పుష్కలుడు అనే పుత్రులు, శత్రుఘ్నునకు సుబాహువు, శూరసేనుడనే సుతులు కలిగారు.

**కుశస్యాతిథిః, అతిథేరపి నిషధః పుత్రోఽభవత్. నిషధస్యాపి నలః(అనలః), తస్యాపి నభాః, నభసః పుణ్డరీకః, తత్తనయః క్షేమధన్వా, తస్య చ దేవానీకః. తస్యాప్యహీనగుః,(తతో రూపః),తతో రురుః, తస్య చ పారిపాత్రః,**

**పారిపాత్రాద్దలః, దలాచ్ఛలః, తస్యాప్యుక్థః, ఉక్థాద్ వజ్రనాభః, తస్మాత్ శంఖనాభః, తతో వ్యుత్థితాశ్వః, తతశ్చవిశ్వసహో జజ్ఞే. తస్మాద్ హిరణ్యనాభః, యో మహాయోగీశ్వరాత్ జైమినిశిష్యాద్ యాజ్ఞవల్క్యాద్ యోగమవాప ।**

కుశునికి అతిథి, అతిథికి నిషధుడనే పుత్రుడు కలిగాడు. నిషధునకు నలుడు(అనలుడు), అతనివల్ల నభుడు, నభునివల్ల పుండరీకుడు, అతని తనయుడు క్షేమధన్వుడు, అతనికి దేవానీకుడు, అతనికి అహీనగుడు (అహీనకుడు), (అతనికి రూపుడు), అతనికి రురువు, అతనికి పారిపాత్రుడు(పారియాత్రకుడు), అతనికి దలుడు, అతనికి ఛలుడు, అతనికి ఉక్థుడు, అతనికి వజ్రనాభుడు, అతనికి శంఖనాభుడు, అతనికి వ్యుత్థితాశ్వుడు, అతనికి విశ్వసహుడు కలిగారు. అతనివల్ల హిరణ్యనాభుడు జన్మించాడు. అతడే మహాయోగీశ్వరుడైన జైమినిశిష్యుడైన యాజ్ఞవల్క్యుని వల్ల యోగవిద్య పొందాడు.

**హిరణ్యనాభస్య పుత్రః పుష్యః, తస్మాద్ ధ్రువసన్ధిః, తతః సుదర్శనః, తస్మాదగ్నివర్ణః, తతశ్చ శీఘ్రః, తతోఽపి మరుపుత్రోఽభూత్. యోఽసౌ యోగమాస్థాయాద్యాపి కలాపగ్రామమాశ్రితస్తిష్ఠతి. ఆగామియుగే సూర్యవంశ క్షత్రప్రవర్తయితా భవిష్యతీతి. ప్రసుశ్రుతస్తస్యాత్మజః, తస్యాపి సుగన్ధిః, తతశ్చామర్షః, తస్య మహస్వాన్, తతో విశ్రుతవాన్, తతో బృహద్బలః, యోఽర్జునతనయేనాభిమన్యునా భారతయుద్ధే క్షయమనీయత ॥ 48 ॥**

హిరణ్యనాభుని పుత్రుడు పుష్యుడు, అతనివల్ల ధ్రువసంధి, అతనివల్ల సుదర్శనుడు, అతనివల్ల అగ్నివర్ణుడు, అతనివల్ల శీఘ్రుడు, అతనివల్ల మరుడనే పుత్రుడు కలిగారు. ఈ మరుడే యోగం అవలంబించి, నేటికి కలాపగ్రామంలో ఉన్నాడు. రాబోయే యుగంలో సూర్యవంశక్షత్రియులకు వంశప్రవర్తకుడు అవుతాడు. అతనికి కుమారుడు ప్రసుశ్రుతుడు, అతనికి సుగంధి, అతనికి అమర్షుడు, అతనికి మహస్వంతుడు, అతనికి విశ్రుతవంతుడు, అతని కుమారుడు బృహద్బలుడు. ఇతనినే అర్జునుని కుమారుడైన అభిమన్యుడు భారతయుద్ధంలో సంహరించాడు.

**ఏతే హీక్ష్వాకుభూపాలాః ప్రాధాన్యేన మయోదితాః ।**
**ఏతేషాం చరితం శృణ్వన్ సర్వపాపైః ప్రముచ్యతే ॥ 49 ॥**

మైత్రేయా! ఈ ఇక్ష్వాకుభూపాలుర చరిత్రను ప్రాముఖ్యాన్ని అనుసరించి నీకు తెలియజేశాను. వీరి చరిత్రను విన్నవాడు సమస్తపాపాలనుంచి పూర్తిగా ముక్తుడవుతాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే సగరస్య అశ్వమేధః-భగీరథద్వారా గంగాయాః ఆగమనం-శ్రీరామచంద్రావతారశ్చేతి చతుర్థోఽధ్యాయః సమాప్తః ॥ 4 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో సగరుని అశ్వమేధం - భగీరథునిద్వారా గంగ ఆగమనం - శ్రీరామచంద్రావతారం అనే నాలుగవ అధ్యాయం సమాప్తం ॥ 4 ॥



## పంచమోఽధ్యాయః - ఐదవ అధ్యాయం
## సీతాదేవీ జననమ్ - సీతాదేవి జననం

**ఇక్ష్వాకుతనయో యోఽసౌ నిమిర్నామ, స తు సహస్రవత్సరం సత్రమారేభే, వసిష్ఠం చ హోతారం వరయామాస । 1 ॥**

పరాశరుడు ఇలా చెబుతున్నాడు. ఇక్ష్వాకుని కుమారుడైన నిమి అనే వాడు వేయి సంవత్సరాల కాలపరిమితి గల దీర్ఘసత్రయాగం ప్రారంభించాడు. వసిష్ఠుని హోతగా వరించాడు.

**తమాహ వసిష్ఠః, అహమిన్ద్రేణ పంచవర్షశతం యాగార్థం ప్రథమతరం వృతః. తదనన్తరం ప్రతిపాల్యతామ్, ఆగతస్తవాపి ఋత్విగ్ భవిష్యామి, ఇత్యుక్తే స పృథివీపతినా న కించిదుక్తః. వసిష్ఠోఽప్యనేన సమన్వీప్సితమిత్యమరపతే ర్యాగమకరోత్ । 2 ॥**

వసిష్ఠుడు అతనితో “ ఐదు వందల ఏండ్లు కాలపరిమితిగల యాగం జరిపించమని ఇంద్రుడు నీకన్న ముందే నన్ను కోరియున్నాడు. ఆ యాగం పూర్తి అయ్యేవరకు ఎదురుచూడు. వచ్చిన వెంటనే నీ యాగానికి ఋత్విక్కునవుతాను” అని చెప్పాడు. అలా చెబుతూ ఉంటే ఆ మహీపతి ఔనని కాదని ఏమీ మాటాడలేదు. వసిష్ఠుడు కూడా అతని మౌనాన్ని అంగీకారంగా భావించి, ముందు వెళ్లి అమరేంద్రుని యాగం పూర్తి చేయించాడు.

**సోఽపి తత్కాలమేవాన్యై ర్గౌతమాదిభిర్యాగమకరోత్. సమాప్తే చామరపతేర్యాగే త్వరావాన్ వసిష్ఠో నిమేః కర్మ కరిష్యామీత్యాజగామ । 3 ॥**

నిమి కూడా ఆ సమయంలోనే ఇతరులైన గౌతమాదులచే యాగం నిర్వహించాడు. అమరపతి యాగం పూర్తి కాగానే, వసిష్ఠుడు చాలా తొందరగా నిమియజ్ఞం నిర్వర్తించడానికై వచ్చాడు.

**తత్కర్మ కర్తృత్వం చ తత్ర గౌతమస్య దృష్ట్వా, అథ స్వపతే తస్మై రాజ్ఞే మామప్రత్యాఖ్యాయైతదనేన గౌతమాయ కర్మాన్తరమర్పితం యస్మాత్, తస్మాదయం విదేహో భవిష్యతీతి శాపం దదౌ । 4 ॥**

ఆ యజ్ఞకర్మకు కర్తగా ఉన్న గౌతముని చూచి, నిద్రిస్తున్న రాజును ఉద్దేశించి “నన్ను వద్దని అనకుండా,ఇతడు గౌతమునికి యజ్ఞకర్మాచరణాధికారం సమర్పించాడు కాబట్టి ఈ రాజు విదేహుడై పోవుగాక!” అని శాపం ఇచ్చాడు.

**ప్రతిబుద్ధశ్చాసావవనీపతిరపి ప్రాహ, యస్మాన్మామసమ్భాష్య, అజ్ఞానత ఏవ శయానస్య శాపోత్సర్గమసౌ దుష్టగురుశ్చకార, తస్మాత్ తస్యాపి దేహః పతితో భవిష్యతీతి ప్రతిశాపం దత్వా దేహమత్యజత్ । 5 ॥**

ఆ అవనీపతి మేలుకొని “నాతో కలిసి మాట్లాడకుండగానే, తెలియక నిద్రపోతున్న నాపై ఈ దుష్ట గురువు శాపం వదిలాడు. కాబట్టి అతనికి కూడ దేహం పడిపోతుంది” అని ప్రతిశాపమిచ్చి దేహం విడిచి పెట్టేశాడు.

**తస్మాచ్ఛాపాచ్చ మిత్రావరుణయోస్తేజసి వసిష్ఠతేజః ప్రవిష్టమ్, ఊర్వశీదర్శనాద్, ఉద్భూత వీర్యప్రపాతయోః సకాశాద్ వసిష్ఠో దేహమపరం లేభే । 6 ॥**

ఆ శాపంవల్ల మిత్రావరుణుల తేజస్సులలో వశిష్ఠుని తేజస్సు(లింగదేహం) ప్రవేశించింది. ఊర్వశీ దర్శనం వల్ల వారిద్దరికీ ఒకేసారి రేతఃపతనం అయినందువల్ల వసిష్ఠుడు మరో శరీరం పొందాడు.

**నిమేరపి తచ్ఛరీరమతిమనోహరతైలగన్ధాదిభిరుపసంస్క్రియమాణం నైవ క్లేదాదికం దోషమవాప, సద్యో మృతమివ తస్థౌ ॥ 7 ॥**

నిమిశరీరాన్ని యజ్ఞం పూర్తయ్యేవరకు మిక్కిలి మనోహరములైన గంధతైలాదులతో సంస్కారంచేస్తూ ఉన్నందువల్ల నీరుకారడం మొదలైన ఏ దోషం కలగలేదు. అప్పుడే మరణించినట్లు ఉంది.

**యజ్ఞసమాప్తౌ చ భాగగ్రహణాయాగతాన్ దేవాన్ ఋత్విజ ఊచుః, యజమానాయ వరో దీయతామితి, దేవైశ్ఛన్దితో నిమిరాహ ॥ 8 ॥**

యజ్ఞం పూర్తి అయ్యే సమయంలో భాగంతీసుకోవడానికై వచ్చిన అమరులతో ఋత్విక్కులు "యజమానునికి వరం ఈయండి" అని కోరారు. దేవతలు కోరుకొమ్మనగా నిమి ఇలా కోరాడు.

**భగవన్తోఽఖిల సంసారదుఃఖసంఘాతస్యచ్ఛేత్తారః న హ్యేతాదృగ్ జగతి, అన్యద్ దుఃఖమస్తి, యచ్ఛరీరాత్మనో ర్వియోగో భవతి. తదహమిచ్ఛామి సకలలోక లోచనేషు వస్తుమ్, న పునః శరీరగ్రహణం కర్తుమ్. ఇత్యుక్తే దేవై రసావశేషభూతానాం నేత్రేష్వవతారితః. తతో భూతాన్యున్మేషనిమేషం చక్రుః ॥ 9 ॥**

"మీరు భగవంతులు. సమస్తసంసారదుఃఖసంహారకులు. శరీరానికి, ఆత్మకు ఎడబాటు కలిగేటప్పుడు వచ్చేటటువంటి దుఃఖంలాంటిది ఈ జగత్తులో వేరే ఇంకొకటి ఉండదు. కాబట్టి నేను సకలలోకాలలో ఉండే వారి లోచనాలలో నివసించాలనుకొంటున్నాను. నేను తిరిగి శరీరాన్ని స్వీకరించాలని అనుకోవడం లేదు." అని ప్రార్థించాడు. నిమి ఇలా కోరేసరికి దేవతలు అతనిని సర్వప్రాణుల నేత్రాలలో దింపారు. అందువల్ల ప్రాణులు ఉన్మేష నిమేషాలు (కన్నులు తెరవడం, మూయడం) చేశారు.

**అపుత్రస్య చ తస్య భూభుజః శరీరమ్, అరాజక భీరవస్తే మునయోఽరణ్యాం మమథుః ॥ 10 ॥**

అరాజకానికి భయపడిపోయిన మునులు పుత్రులులేని ఆ రాజుశరీరాన్ని అరణితో మథించారు.

**తత్ర కుమారో జజ్ఞే జననాజ్జనక సంజ్ఞాశ్చాసావవాప ॥ 11 ॥**

ఆ అరణిమథనంతో కుమారుడు జన్మించాడు. ఆ జననంవల్ల అతనికి జనకుడనే పేరు వచ్చింది.

**అభూద్ విదేహోఽస్య పితేతి వైదేహో,మథనాత్, మిథిరభూత్. తస్యోదావసుః పుత్రోఽభూత్. తతో నన్దివర్ధనః, తస్మాత్ సుకేతుః, తస్యాపి దేవరాతః, తతశ్చ బృహదుక్థః, తస్య చ మహావీర్యః, తస్యాపి సత్యధృతిః, తతశ్చ ధృష్టకేతుః, ధృష్టకేతోర్హర్యశ్వః, తస్య చ మరుః, మరోః ప్రతిబన్ధకః, తస్మాత్ కృతరథః, తస్మాత్ కృతిః, తస్య విబుధః, తస్యాపి మహాధృతిః, తస్య చ కృతిరాతః, తతో మహారోమా, తతః సువర్ణరోమా, తస్య పుత్రో హ్రస్వరోమా, తతః సీరధ్వజోఽభూత్. తస్య పుత్రార్థం యజనభువం కృషతః సీరే సీతా దుహితా సముత్పన్నాసీత్, సీరధ్వజస్య భ్రాతా సాంకాశ్యాధిపతిః కుశధ్వజ నామా. సీరధ్వజస్యాపత్యో భానుమాన్ । 12 ॥**

ఇతని తండ్రి విదేహుడు కనుక వైదేహుడని, మథనంవల్ల జన్మించాడు కాబట్టి "మిథి" అనే పేర్లు కలిగాయి. అతనికి "ఉదావసుడు" అనే పుత్రుడు కలిగాడు. అతనికి నందివర్ధనుడు, అతనికి సుకేతుడు, అతనికి దేవరాతుడు, అతనికి బృహదుక్థుడు, అతనికి మహావీర్యుడు, అతనికి సత్యధృతి, అతనికి ధృష్టకేతువు, అతనికి హర్యశ్వుడు,

అతనికి మరువు(మనువు), మరువుకు ప్రతిబంధకుడు, అతనికి కృతిరథుడు, అతనికి కృతి, అతనికి విబుధుడు, అతనికి మహాధృతి, అతనికి కృతిరాతుడు, అతనివల్ల మహారోముడు, అతనివల్ల సువర్ణరోముడు, అతని పుత్రుడు హ్రస్వరోముడు, అతనివల్ల సీరధ్వజుడు పుట్టారు. అతడే పుత్రుని కోసం యజ్ఞభూమిని దున్నుతూ ఉండగా, నాగేటిచాలులో సీత అనే కుమార్తె ప్రభవించింది. సీరధ్వజుని సోదరుడు కుశధ్వజుడు. అతడే సాంకాశ్యదేశాధిపతి అయ్యాడు. సీరధ్వజుని సంతానమే భానుమంతుడు.

**భానుమతః శతద్యుమ్నః. తస్య శుచిః, తస్మాదూర్జవహో నామ పుత్రో జజ్ఞే. తస్యాపి శతధ్వజః(సత్యధ్వజః), తతః కృతిః(కునిః), కునేరంజనః, తత్పుత్రః ఋతుజిత్(కురుజిత్), తతోఽరిష్టనేమిః,తస్మాత్ శ్రుతాయుః, తతః సూర్యాశ్వః, తస్మాత్ సంజయః (సంనయః), తతః క్షేమావిః, తస్మాదనేనాః, తస్మాన్మీనరథః(మానరథః), తస్య సత్యరథః, తస్య సాత్యరథిః, సాత్యరథేరుపగుః, తస్మాత్ శ్రుతః, (తస్మాచ్ఛాపాచ్చ మిత్రావరుణయోస్తేజసి వశిష్ఠతేజః(సువర్చాః), తస్యాపి సుభాసః, తతః సుశ్రుతః, తస్మాజ్జయః, జయపుత్రో విజయః, తస్య ఋతః, ఋతాత్ సునయః, తతో వీతహవ్యః, తస్మాత్ సంజయః, తస్మాత్ (క్షేమాశ్వః తస్మాత్)ధృతిః, ధృతేర్బహులాశ్వః. తస్య పుత్రః కృతిః, కృతౌ సన్తిష్ఠతేఽయం జనకవంశః ॥ 13 ॥**

భానుమంతునికి శతద్యుమ్నుడు, అతనికి శుచి, అతనివల్ల ఊర్జవహుడనే పుత్రుడు జన్మించారు. అతనికి సత్యధ్వజుడు(శతధ్వజుడు), అతనికి కృతి(కుని), కునికి అంజనుడు, అతని కుమారుడు ఋతుజిత్తు, అతనికి అరిష్టనేమి, అతనివల్ల శ్రుతాయువు, అతనివల్ల సూర్యాశ్వుడు, అతని వల్ల సంజయుడు (సంనయుడు), అతని వల్ల క్షేమావి, అతనివల్ల అనేనసుడు, అతనివల్ల మీనరథుడు(మానరథుడు), అతనివల్ల సత్యరథుడు, అతనివల్ల సాత్యరథి, అతనివల్ల ఉపగువు, అతనివల్ల శ్రుతుడు కలిగారు. (అతని శాపంవల్ల మిత్రావరుణుల తేజస్సు నందు వసిష్ఠతేజం ఉంచబడింది). అతనికి సువర్చుడు, అతనికి సుభానుడు, అతనికి సుశ్రుతుడు, అతనికి జయుడు, జయునికి విజయుడు,అతనికి ఋతుడు, ఋతునికి సునయుడు, అతని వల్ల వీతహవ్యుడు, అతనివల్ల సంజయుడు, అతనివల్ల (క్షేమాశ్వుడు, అతని వల్ల) ధృతి, ధృతికి బహులాశ్వుడు, అతని కుమారుడు కృతి కలిగారు. ఈ జనకుని వంశం కృతితో నిలిచిపోయింది. ఇంతవరకు ఉన్న రాజులు జనకవంశీయులుగా పిలువబడ్డారు.

**ఇత్యేతే మైథిలాః. ప్రాచుర్యేణ, ఏతేషామాత్మవిద్యాశ్రయిణో భూపాలా భవన్తి. 14 ॥**

ఇలా వీరందరూ మైథిలులయ్యారు. వీరు ఇంచుమించుగా అందరూ బ్రహ్మవిద్యను ఆశ్రయించే భూపాలురై ఉండేవారు.

**విశే :** ఉపగునివల్ల ఉపగుప్తుడు, అతనికి స్వాగతుడు, అతనికి స్వానందుడు, అతనికి సువర్చుడు కలిగారని పాఠాంతరం. సువర్చుని కుమారుడు సుపార్శ్వుడని, అతని కుమారుడు సుభాషుడని పాఠాంతరం.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే సీతాదేవీ జననం నామ పంచమోఽధ్యాయః సమాప్తః ॥ 5 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో సీతాదేవి జననం అనే ఐదవ అధ్యాయం సమాప్తం ॥ 5 ॥

# షష్ఠోఽధ్యాయః - ఆరవ అధ్యాయం
## చంద్రవంశవర్ణనమ్ - చంద్రవంశవర్ణన

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అడుగుతున్నాడు.

**సూర్యస్య భగవన్! వంశః కథితో భవతా మమ ।**
**సోమస్య వంశే త్వఖిలాన్ శ్రోతుమిచ్ఛామి పార్థివాన్ ॥ 1 ॥**

**కీర్త్యతే స్థిరకీర్తీనాం యేషామద్యాపి సన్తతిః ।**
**ప్రసాదసుముఖస్తన్మే బ్రహ్మన్నాఖ్యాతుమర్హసి ॥ 2 ॥**

"భగవంతుడవైన పరాశరమునీంద్రా! నాకు సూర్యవంశరాజుల చరిత్రను వివరించి చెప్పావు. ఇకపై చంద్రవంశంలోని రాజుల అందరి వృత్తాంతాన్ని వినాలని కుతూహల పడుతున్నాను. బ్రాహ్మణోత్తమా! శాశ్వతమైన కీర్తికల్గిన ఎవరి సంతతి, ఈ నాటికి కూడా ప్రశంసింపబడుతూ ఉందో, వారిని గురించి అనుగ్రహవదనంతో నాకు చెప్పడానికి తగియున్నావు." అని అడిగాడు.

**పరాశర ఉవాచ :-** పరాశరుడు చెబుతున్నాడు.

**శ్రూయతాం మునిశార్దూల వంశః ప్రథితతేజసః ।**
**సోమస్యానుక్రమాత్ ఖ్యాతా యత్రోర్వీపతయోఽభవన్ ॥ 3 ॥**

మునిశార్దూలా! ప్రశస్తమైన కీర్తితేజస్సుతో అలరారే చంద్రవంశంగురించి ఆలకించు. అందులో సోముని నుంచి వరుసగా ప్రసిద్ధులైన భూపతులు ఎందరో జన్మించారు.

**అయం హి వంశోఽతిబలపరాక్రమద్యుతిశీలచేష్టావద్భిరతిగుణాన్వితైర్నహుష, యయాతి, కార్తవీర్యర్జునాదిభిర్భూపాలైరలంకృతః ॥ 4 ॥**

ఈ వంశాన్ని మిక్కిలి బలం, పరాక్రమంకల తేజశ్శీలురైన, కార్యనిష్ఠులైన, గొప్పగుణాలుకల్గిన నహుషుడు, యయాతి, కార్తవీర్యార్జునుడు మున్నగు మహీపాలురు అలంకరించారు.

**తమహం కథయామి శ్రూయతామ్. అఖిలజగత్ స్రష్టుః, భగవన్నారాయణనాభిసరోజినీసముద్భవాబ్జయోనేర్బ్రహ్మణః పుత్రోఽత్రిః, అత్రేః సోమః, తం చ భగవానబ్జయోనిః. అశేషౌషధి, ద్విజ, నక్షత్రాణామాధిపత్యేఽభ్యషేచయేత్ ॥ 5 ॥**

దానిని గురించి చెబుతాను ఆకర్ణించు. సమస్తజగత్తును సృష్టించే భగవంతుడైన నారాయణుని నాభికమలంనుంచి పద్మసంభవుడు ఆవిర్భవించాడు. ఆ అబ్జసూనుని బ్రహ్మమానసపుత్రుడే అత్రి. అత్రి కుమారుడు చంద్రుడు. భగవంతుడైన అబ్జయోని అశేషమైన ఓషధులకు, ద్విజులకు, నక్షత్రాలకు అతనిని అధిపతిగా అభిషేకించాడు.

**స చ రాజసూయమకరోత్. తత్ప్రభావాదత్యుత్కృష్టాధిపత్యాధిష్ఠాతృత్వాచ్చైనం మద ఆవివేశ ॥ 6 ॥**

ఆ సోముడు(చంద్రుడు) రాజసూయం చేశాడు. దాని ప్రభావంవల్ల, మిక్కిలి ఉత్కృష్టమైన ఆధిపత్యం అధిష్ఠించడంవల్ల అతనిని మదం ఆవేశించింది.

**మదావలేపాచ్చాసౌ సకలదేవగురోర్బృహస్పతేస్తారాం నామ పత్నీం జహార ॥ 7 ॥**

ఆ మదగర్వంవల్ల చంద్రుడు సమస్తదేవతలకు గురువైన బృహస్పతి భార్య అయిన 'తార' అనే ఆమెను అపహరించాడు.

**బహుశశ్చ బృహస్పతిచోదితేన భగవతా బ్రహ్మణా చోద్యమానః సకలైశ్చ దేవర్షిభిర్యాచ్యమానోఽపి న ముమోచ. తస్య హి బృహస్పతిద్వేషాదుశనాః పార్ష్ణిగ్రాహోఽభవత్ ॥ 8 ॥**

బృహస్పతి ప్రేరేపించగా పెక్కుసార్లు భగవానుడైన బ్రహ్మ చెప్పినా, సకల దేవతలు, ఋషులు బ్రతిమాలినా చంద్రుడు ఆమెను విడిచిపెట్టలేదు. ఇలా ఉండగా బృహస్పతిపై ద్వేషంవల్ల శుక్రాచార్యుడు చంద్రుని వెనుక నిలిచాడు.

**అంగిరసశ్చ సకాశాత్, ఉపలబ్ధవిద్యో భగవాన్రుద్రో బృహస్పతేః సాహాయ్యమకరోత్ ॥ 9 ॥**

అంగిరసునివద్ద విద్యలు నేర్చిన కారణంచే భగవంతుడైన రుద్రుడు బృహస్పతికి సాయంచేశాడు.

**యతశ్చోశనాః, తతో హి జమ్భకుమ్భాద్యాః సమస్తా ఏవ దైత్యదానవనికాయా మహాన్తముద్యమం చక్రుః, బృహస్పతేరపి సకలదేవసైన్యసహాయః శక్రోఽభవత్ ॥ 10 ॥**

శుక్రుడున్న చంద్రునిపక్షంలో జంభుడు, కుంభుడు మొదలైన సమస్తదైత్యదానవసమూహాలు గొప్ప అండగా నిలిచాయి. బృహస్పతికి సకలదేవసైన్యంతో కూడుకొన్నవాడై ఇంద్రుడు కొమ్ము కాశాడు.

**ఏవం చ తయోరతీవోగ్రః సంగ్రామస్తారానిమిత్తస్తారకామయో నామాభవత్. తతశ్చ సమస్తశస్త్రాణ్యసురేషు రుద్రపురోగమా దేవా దేవేషు చాశేషదానవా ముముచుః ॥ 11 ॥**

ఈ విధంగా వారిద్దరి మధ్య తారకోసమై, తారకామయమైన మహాభీకరసంగ్రామం జరిగింది. ఆ తరువాత రుద్రుణ్ణి ముందుంచుకొని సమస్తదేవతలు అనేకాయుధాలను అసురులపై ప్రయోగించారు. అదేవిధంగా సకల దానవులు దేవతలపై బహువిధశస్త్రాలు ప్రయోగించారు.

**ఏవం చ దేవాసురాహవక్షోభక్షుబ్ధహృదయమశేషమేవ జగద్ బ్రహ్మాణం శరణం జగామ ॥ 12 ॥**

ఈ విధంగా దేవాసురయుద్ధంవల్ల అట్టుడికి పోయిన, కల్లోలమైపోయిన హృదయంతో సకలజగత్తు బ్రహ్మదేవుని శరణువేడింది.

**తతశ్చ భగవానప్యుశనసం శంకరమసురాన్ దేవాంశ్చ నివార్య బృహస్పతేః, తారామదాపయత్. తాం చాన్తః ప్రసవామవలోక్య బృహస్పతిరాహ ॥ 13 ॥**

అనంతరం భగవంతుడైన పద్మసంభవుడు కూడ శుక్రుని, శంకరుని, అసురులను, దేవతలను నివారించి బృహస్పతికి తారను ఇప్పించాడు. ఆమె గర్భవతి అని తెలుసుకొని ఇలా అన్నాడు.

**నైష మమ క్షేత్రే భవత్యాఽన్యసుతో ధార్యస్తదుత్సృజైనమలమతిధార్ష్ట్యేనేతి. సా చ తేనైవముక్తా పతివ్రతా భర్తృవచనాత్ తమీషికాస్తమ్బే గర్భముత్ససర్జ ၊ 14 ॥**

"నా క్షేత్రంలో నీవు ఎవరి కొడుకునో మోయడానికి వీలు లేదు. వీడిని వెంటనే విసర్జించు. చాలు చాలు. ఈ పనికిమాలిన తెగులు" అన్నాడు బృహస్పతి. తార కూడా గురువు ఇలా వచించగా పతివ్రతయై చరించేది కావున, భర్తమాట జవదాటలేక దుబ్బుపొదపై ఆ గర్భాన్ని విడిచి వేసింది.

**స చోత్సృష్టమాత్ర ఏవాతితేజసా దేవానాం తేజాంస్యాచిక్షేప ၊ 15 ॥**

అలా విడిచీ విడువగానే అది మిక్కిలి తేజస్సుతో దేవతల తేజస్సును ఆకర్షించింది.

**బృహస్పతిమిన్దుం చ తస్య కుమారస్యాతిచారుతయా సాభిలాషౌ దృష్ట్వా దేవాః సముత్పన్నసన్దేహా స్తారాం పప్రచ్ఛుః, సత్యం కథయాస్మాకమతి సుభగే! కస్యాయమాత్మజః, సోమస్యాథ బృహస్పతేః?ఇత్యుక్తాఽపి సా తారా హ్రియా న కించిదువాచ ॥ 16 ॥**

మరీ అందంగా ఉన్న ఆ పసివానిపై బృహస్పతి, చంద్రుడు కూడా మమకారం కలిగి ఉండడం చూచి దేవతలు సందేహం పొందినవారై తారను అడిగారు. " సుందరీ! మాకు సత్యం ఏమిటో చెప్పు. ఈ పసివాడు ఎవని కుమారుడు? చంద్రుని తనయుడా? లేక బృహస్పతి పుత్రుడా?" అని వారు ప్రశ్నించగా ఆ తార సిగ్గువల్ల ఏమీ సమాధానం ఈయలేక పోయింది.

**బహుశోఽప్యభిహితా యదాఽసౌ దేవేభ్యో నాచచక్షే, తతః కుమారస్తాం శప్తుముద్యతః ప్రాహ చ దుష్టే! అమ్బ! కస్మాన్మమ తాతం నాఖ్యాసి, అద్యైవ తేఽలీకలజ్జావత్యాః శాస్తిమయమహం కరోమి, యథా నైవమస్యాప్యతి మన్థరవచనా భవిష్యసీతి ॥ 17 ॥**

ఎన్నిసార్లు అడిగినా, ఆమె దేవతలకు చెప్పక పోయేసరికి ఆ కుమారుడు ఆమెను శపించాడానికి సిద్ధపడి ఇలా అన్నాడు. " ఓసి! దుష్టురాలా! నన్ను కన్న దానవే కదా! నా తండ్రిని గూర్చి ఎందుకని చెప్పడం లేదు? దొంగ సిగ్గు ఇప్పుడే పుట్టుకొని వచ్చినట్లుంది నీకు! నీకు తగిన శాస్తి నేను చేస్తాను. ఇలా మెల్లగా (తేలు దొంగకు కుట్టినట్లు) ఉన్నావు కాబట్టి, అలా మాట్లాడకుండా చేస్తాను." అని కోపంగా పలికాడు.

**అథ భగవాన్ పితామహస్తం కుమారం సన్నివార్య స్వయమపృచ్ఛత్ తారామ్, కథయ, వత్సే! కస్యాయమాత్మజః? సోమస్యాథ బృహస్పతేః? ఇత్యుక్తా లజ్జాజడమాహ సోమస్యేతి ॥ 18 ॥**

అనంతరం భగవంతుడైన పితామహుడు ఆ కుమారుని వారించి స్వయంగా తారతో "అమ్మాయీ! చెప్పు! వీడు ఎవడి కుమారుడు? చంద్రుని వాడా? లేక బృహస్పతి వాడా?" అని అడిగాడు. ఆయన అలా అడిగేసరికి ఆమె సిగ్గుపడుతూ " చంద్రుని వాడు" అని చెప్పింది.

**తతః స్ఫురదుచ్ఛ్వసితామలకపోలకాన్తిర్భగవానుడుపతిః కుమారమాలింగ్య సాధు సాధు వత్స! ప్రాజ్ఞోఽసీతి బుధ ఇతి తస్యచ నామ చక్రే. తదాఖ్యాతమేవైతత్ స చ యథేలాయామాత్మజం పురూరవముత్పాదయామాస ॥ 19 ॥**

ఆ తరువాత ఆనందంతో నిట్టూర్చి, స్వచ్ఛమైన చెక్కిళ్లు పొంగి, కాంతితో మెరయగా, భగవంతుడైన తారాపతి కుమారుని కౌగిలించుకొని "మంచిది. మంచిది. నాయనా! ప్రాజ్ఞుడువయ్యావు." అని అతనికి బుధుడని పేరు పెట్టాడు. అతనికి ఇలయందు పురూరవుడు అనే కుమారుడు కలిగాడని నీకు ఇది వరకే చెప్పి యున్నాను.

**పురూరవాస్త్వతిదానశీలోఽతియజ్వాఽతితేజస్వినం సత్యవాదినమతిరూపవన్తం మిత్రావరుణశాపాన్మానుషే లోకే మయా వస్తవ్యమ్ ఇతి కృతిమతిరూర్వశీ దదర్శ ॥ 20 ॥**

పురూరవుడు మిక్కిలి దానంచేసే శీలం కలవాడు. పెక్కు యజ్ఞాలు ఆచరించేవాడు. గొప్పతేజస్సు కలవాడు. ఆ సత్యవాదిని, గొప్పరూపం కలవానిని, మిత్రావరుణుల శాపంవల్ల మనుష్యలోకంలో నివసించాలని నిర్ణయించుకొన్న ఊర్వశి చూచింది.

**దృష్టమాత్రే చ యస్మిన్ అపహాయ మానమశేషమపాస్య స్వర్గసుఖాభిలాషం తన్మనాభూత్వా తమేవోపతస్థే॥21॥**

అతనిని చూచీ చూడగానే సమస్తమైన అభిమానం విడిచిపెట్టి, స్వర్గలోకసుఖంపై నున్న అభిలాషను పూర్తిగా తొలగించి వేసి, అతని మీదనే మనస్సు ఉంచి అతని వద్దకే చేరింది.

**సోఽపి చ తామతిశయిత సకలలోకస్త్రీ కాన్తి, సౌకుమార్య, లావణ్యాతివిలాసహాసాదిగుణామవలోక్య తదాయత్తచిత్తవృత్తిర్బభూవ ॥ 22 ॥**

అతడు కూడా సకలలోకాలలోని స్త్రీలకన్న అతిశయించే, కాంతి, సౌకుమార్యం, లావణ్యం, విలాసం, హాసం, హావభావాలు కలిగియున్న ఆమెను చూడగానే అతని చిత్తం ఊర్వశితో నిండిపోయింది.

**ఉభయమపి తన్మనస్కమనన్యదృష్టి పరిత్యక్తసమస్తాన్యప్రయోజనమభూత్ ॥ 23 ॥**

ఇద్దరూ కూడా ఒకరియందొకరు మనస్సు కలవారై, ఇతర దృష్టిలేనివారై, ఇతర ప్రయోజనాలు అన్నీ విడిచిపెట్టిన వారయ్యారు.

**రాజా తు ప్రాగల్భ్యాత్ తామాహ ॥ 24 ॥**

రాజు కూడా సంకోచం విడిచి ఆమెతో ఇలా అన్నాడు.

**సుభ్రు! త్వామహఽమభికామోఽస్మి. ప్రసీదానుగ్రహముద్వహ. ఇత్యుక్తా లజ్జావఖణ్డితమూర్వశీ ప్రాహ॥25॥**

"అందమైన కనుబొమ్మలు కలదానా! నేను నిన్ను కోరుకొంటున్నాను. ప్రసన్నురాలవుకా. నాపై అనురాగం వహించు." అని సిగ్గు విడిచి ధైర్యంగా పలికిన పురూరవునితో ఊర్వశి ఇలా అంది.

**భవత్యేవం యది మే సమయపరిపాలనం భవాన్ కరోతీతి ॥ 26 ॥**

“అలాగే కానీ. కాని నీవు నా ప్రతిజ్ఞను నెరవేర్చవలసి ఉంది.” అన్నది.

**ఆఖ్యాహి మే సమయమిత్యథ పృష్టా పునరబ్రవీత్ । 27 ॥**

ఆమె అలా అనే సరికి అతడు మళ్లీ ఆమెతో నీ ప్రతిజ్ఞ ఏమిటో నాకు చెప్పవలసిందనగా ఊర్వశి రాజుతో ఇలా అంది.

**శయనసమీపే మమోరణకద్వయం పుత్రభూతం నాపనేయమ్. భవాంశ్చ మయా నగ్నో న ద్రష్టవ్యః, ఘృతమాత్రం చ మమాహారః. ఇత్యేవమేవేతి భూపతిరాహ ॥ 28 ॥**

అపుడు ఆమె “మంచం దగ్గరనుంచి నా బిడ్డలవంటి ఈ రెండు గొఱ్ఱె(గ్రె) పిల్లలను ఎప్పుడు తొలగించకూడదు. నీవు ఎప్పుడూ నాకు దిగంబరుడవై కనిపించరాదు. నెయ్యి మాత్రమే నాకు ఆహారం” అని పురూరవునితో తన షరతులను వివరించింది. ఆ భూపతి కూడా అలాగే జరిగితీరుతుందన్నాడు.

**తయా చ సహావనీపతిరలకాయాం చైత్రరథాదివనేషు అమలపద్మషణ్డేషు అభిరమణీయేషు మానసాది సరఃసు అభిరమమాణ ఏవ షష్టివర్ష సహస్రాణి అనుదినప్రవర్ధమానప్రమోదోఽనయత్. ఊర్వశీ చ తదుపభోగాత్ ప్రతిదినప్రవర్ధమానానురాగా అమరలోకవాసేఽపి న స్పృహాం చకార. వినా చోర్వశ్యా సురలోకోఽప్సరసాం సిద్ధగన్ధర్వాణాం చ నాతిరమణీయోఽభవత్ ॥ 29 ॥**

ఆ అవనీపతి ఆమెతో కలసి అలకానగరంలో, చైత్రరథం మున్నగు ఉద్యానవనాలలో, స్వచ్ఛమైన తామరపూల సమూహాలతో నిండిన, అతిమనోహరాలైన మానసాది సరస్సులలో అంతట విహరిస్తున్నవాడై, రోజురోజుకు సంతోషం పెరుగుతూ ఉండగా, అరవైవేల సంవత్సరాలు క్రీడించాడు. ఊర్వశి కూడా అతనితో భోగం అనుభవిస్తూ ప్రతిదినం అనురాగం అభివృద్ధికాగా, దేవలోకనివాసాన్ని కూడ కోరుకోవడం లేదు. ఊర్వశి లేని కారణంగా సురలోకం అప్సరసలకు, సిద్ధులకు, గంధర్వులకు మిక్కిలి రమణీయావాసం కాకుండా పోయింది.

**తతశ్చోర్వశీ పురూరవసోః సమయవిద్ విశ్వావసుర్గన్ధర్వసమవేతో నిశి శయనాభ్యాశాదేకమురణకం జహార ॥ 30 ॥**

అందువల్ల ఊర్వశీపురూరవుల ప్రతిజ్ఞను తెలిసికొన్న విశ్వావసువు ఒకనాటి రాత్రి గంధర్వులతో వచ్చి శయనాగారంలో ప్రవేశించి మంచం వద్దనుంచి ఒక పొట్టేలు పిల్లను అపహరించుకొనిపోయాడు.

**తస్య చాకాశే నీయమానస్యోర్వశీ శబ్దమశృణోత్, ఆహ చ మమానాథాయాః పుత్రః కేనాప్యపహ్రియతే, క్వ శరణముపయామీత్యాకర్ణ్య రాజా “నగ్నం మాం దేవీ ద్రక్ష్యతి” ఇతి న యయౌ. అథాన్యమప్యురణకమాదాయ గన్ధర్వా యయుః. తస్యాపహ్రియమాణస్య శబ్దమాకర్ణ్య ఆకాశే పునరపి “అనాథాఽస్మ్యహమభర్తృకా కుపురుషాశ్రయేతి” ఆర్తరావిణీ బభూవ. రాజాఽప్యమర్షవశాదన్ధకారమేతదితి ఖడ్గమాదాయ దుష్ట! దుష్ట! హతోఽసీతి వ్యాహరన్నభ్యధావత్. తావచ్చ గన్ధర్వైరతీవోజ్జ్వలా విద్యుజ్జనితా. తత్ప్రభయా చోర్వశీ రాజానమపగతామ్బరం దృష్ట్వా పవృత్తసమయా తత్క్షణాదేవాపక్రాన్తా ॥ 31 ॥**

ఆకాశంలో తీసుకొని పోబడుతున్న దాని అరపును ఊర్వశి విన్నది. విన్నవెంటనే "నేను దిక్కులేని దానను. నా కన్నబిడ్డతో సమానమైన దానిని ఎవరో ఎత్తుకొని పోతున్నారు. నేను ఎవరిని శరణు వేడాలి?" అని గట్టిగా అరచింది. రాజు అది విని బట్టలు లేకుండా ఉన్న తనను దేవి చూస్తే అది తమ వైవాహిక జీవనానికి అంతరాయం ఏర్పడుతుందని వెళ్లలేదు. ఆ తరువాత గంధర్వులు రెండో పొట్టేలు పిల్లను కూడ తీసుకొనిపోయారు. అలా అపహరించబడుతున్న దాని అరపును ఆకాశంలోంచి విని ఊర్వశి "నేను అనాథురాలను. భర్త ఉండి కూడా లేనిదాననయ్యాను. ఇంత కాలం ఒక నీచ పురుషుని ఆశ్రయించి ఉండి పోయాను." అని ఆర్తరావాలు చేసింది. రాజుకు ఆ ఆక్రందనధ్వని వినబడడంతోనే మహాకోపం వచ్చింది. ఇది చీకటి వేళ కదా! అని తాను ఎవరికీ కానరానని కత్తి చేతదాల్చి "ఓరి దుష్టుడా! దుష్టుడా! చచ్చావు." అని అంటూ వెనకనే పరుగు పెట్టాడు. ఈ సమయంలోనే గంధర్వులు మహోజ్జ్వలమైన విద్యుత్తును పుట్టించారు. ఆ మెరపుల కాంతిలో ఊర్వశి దిగంబరుడైన రాజును చూడడం జరిగింది. తాము చేసుకొన్న నియమం గుర్తుకు రాగా, ప్రతిజ్ఞనుంచి రాజు తప్పుకొన్నందున ఆ క్షణమే పురూరవుని వీడి వెళ్లిపోయింది.

**పరిత్యజ్య తావురణకౌ గన్ధర్వాః సురలోకముపాగతాః. రాజాఽపి తౌ మేషావాదాయ హృష్టమనాః స్వశయనమాయాతో నోర్వశీం దదర్శ ॥ 32 ॥**

ఆ పొట్టేళ్లను రెండింటినీ అక్కడే వదలివేసి గంధర్వులు స్వర్గలోకం చేరుకున్నారు. రాజు కూడా ఆ రెండు మేషాలను తీసుకొని మనస్సులో సంతోషిస్తూ తన శయనమందిరం చేరుకొన్నాడు. కాని అక్కడ ఊర్వశి కానరాలేదు.

**తాం చాపశ్యన్నపగతామ్బర ఏవోన్మత్తరూపో బభ్రామ, కురుక్షేత్రే చామ్భోజసరసి అన్యాభిశ్చతసృభిరప్సరోభిః సమవేతామూర్వశీం దదర్శ. తతశ్చోన్మత్తరూపో రాజా జాయే! హే తిష్ఠ, మనసి ఘోరే వచసి, ఇత్యనేక ప్రకారం సూక్తమవోచత్ । 33 ॥**

ఆమె కనబడక పోవడంచే రాజు దిగంబరుడుగానే పిచ్చివాడయిపోయి తిరిగాడు. కురుక్షేత్రంలో, తామరకొలనులో, వేరే నలుగురు అప్సరసలతో విహరిస్తున్న ఊర్వశిని చూశాడు. తరువాత ఆ ఉన్మత్తరూపుడు అయిన రాజు "ఓసి ! ఇల్లాలా! నిలు నిలు, ఓసి కఠిన మనస్కురాలా! నిలు. ఓసి కపట వచనురాలా! నిలు." అని అనేక ప్రకారాలుగా ఉక్రోషంగా పలికాడు.

**ఆహ చోర్వశీ, మహారాజ! అలమనేనావివేకచేష్టితేన. అంతర్వత్నీ అహమ్. అబ్దాన్తే భవతాఽత్రాగన్తవ్యమ్, కుమారస్తే భవిష్యతి, ఏకాం చ నిశామహం త్వయా సహ వత్స్యామి, ఇత్యుక్తః ప్రహృష్టః స్వపురమాజగామ. తాసాం చాప్సరసామూర్వశీ కథయామాస, అయం స పురుషోత్కర్షో, యేన అహమేతావన్తం కాలమనురాగాకృష్టమానసా సహోషితా । 34 ॥**

అపుడు ఊర్వశి "మహారాజా! చాలు. ఈ అవివేకచేష్టలు చాలించు. నేను ప్రస్తుతం గర్భవతిని. ఈ ఏడాది చివర నీవు ఇక్కడకు రా. నీకు కుమారుడు కలుగుతాడు. ఆ ఒక రాత్రి నేను నీతో పాటు ఉంటాను." అని చెప్పింది. ఆమె ఇలా చెప్పగానే పురూరవుడు చాలా సంతసించి తన నగరానికి తిరిగి వచ్చేశాడు. అంత ఊర్వశి ఆ అప్సరసలతో "ఇతడు గొప్ప ఉత్కృష్టపురుషుడు. ఇంతకాలం నేను ఇతనితోనే అనురాగంతో ఆకర్షించబడినదాననై ఉండి పోయాను." అన్నది.

**ఇత్యేవముక్తాస్తా అప్సరస ఊచుః-సాధు సాధు అస్య రూపమ్, అనేన సహాస్మాకమపి సర్వకాలమభిరన్తుం స్పృహా భవేదితి ॥ 35 ॥**

ఆమె ఇలా చెప్పేసరికి ఆ అప్సరసలు "ఇతని రూపం ఎంత బాగుంది? బాగు. బాగు. ఇతనితో బాటు మాకు కూడా ఎల్లవేళలా ఉండే సుఖం కలగాలి." అని అనుకొన్నారు.

**అబ్దే చ పూర్ణే స రాజా తత్రాజగామ. కుమారం చాయుషమస్మై తదోర్వశీ దదౌ. ఏకాం చ నిశాం తేన రాజ్ఞా సహోషిత్వా పంచ పుత్రోత్పత్తయే గర్భమాప ॥ 36 ॥**

సంవత్సరం నిండగానే ఆ పురూరవుడు అక్కడికి వచ్చాడు. ఊర్వశి "ఆయువు" అనే కుమారుని అతనికి ఇచ్చింది. అన్నమాట ప్రకారంగా ఒక రాత్రి ఆ రాజుతో ఉండిపోయింది. ఆమె ఐదుగురు కుమారులు కలిగే గర్భం ధరించింది.

**ఉవాచ చైనం రాజానమ్, అస్మత్ప్రీత్యా మహారాజాయ సర్వ ఏవ గన్ధర్వా వరదాః సంవృత్తాః, తస్మాద్ వ్రియతాం వర ఇతి ॥ 37 ॥**

అంతేకాక ఆ రాజవరేణ్యునితో "మన ప్రీతికోసమై మహారాజువైన నీకు సమస్తగంధర్వులు వరం ఈయాలని సంకల్పించారు. కాబట్టి వరం కోరుకో." అన్నది.

**ఆహ రాజా చ విజితసకలారాతిరవిహతేన్ద్రియసామర్థ్యో బన్ధుమానమితబలకోశః, నాన్యదస్మాక మూర్వశీసాలోక్యాద్ అప్రాప్తవ్యమస్తి, తదహమనయా సహోర్వశ్యా కాలం నేతుమభిలషామి ॥ 38 ॥**

అపుడు ఆ రాజేంద్రుడు "సమస్తశత్రువులను జయించాను. ఇంద్రియాల సామర్థ్యమా చెక్కుచెదరకుండా ఉంది. బంధువులు ఉన్నారు. అత్యధికమైన సైన్యం ఉంది. కోశాగారాలకు లోటులేదు. ఊర్వశీ సాలోక్యంకన్న నాకు పొందవలసిదంటూ ఏదీ లేదు. కాబట్టి నేను ఈ ఊర్వశితోనే కాలం గడపాలనుకొంటున్నాను." అనిఅన్నాడు.

**ఇత్యుక్తే గన్ధర్వా రాజ్ఞేఽగ్నిస్థాలీం దదుః ॥ 39 ॥**

రాజు ఇలా కోరగా గంధర్వులు అతనికి అగ్నిస్థాలిని(అగ్ని ఉన్న గిన్నెను) ఇచ్చారు.

**ఊచుశ్చ ఏనమగ్నిమామ్నాయానుసారీ భూత్వా త్రిధా కృత్వా ఊర్వశీ సలోకతామనోరథముద్దిశ్య సమ్యగ్ యజేథాః. తతోఽవశ్యమభిలషితమవాప్స్యసి ॥ 40 ॥**

అంతేకాక ఆ రాజుతో "ఈ అగ్నిని వేదానుసారంగా మూడువిధాలుగా చేసి, ఊర్వశీ సాలోక్యాన్ని కోరికగా ఉద్దేశించి చక్కగా యజించు. అందువల్ల నీ అభిలాష నెరవేరుతుంది" అని అన్నారు.

**ఇత్యుక్త స్తామగ్నిస్థాలీమాదాయ స్వపురమాజగామ. అన్తరటవ్యామచిన్తయత్. అహో! మేఽతీవ అతి మూఢతా. యదగ్నిస్థాలీ మయా నీతా, నోర్వశీతి. అథైనామటవ్యామేవాగ్నిస్థాలీం తత్యాజ స్వపురం చ జగామ॥41॥**

అలా గంధర్వులు చెప్పగా రాజు ఆ అగ్నిస్థాలిని తీసుకొని వచ్చివేశాడు. కొంతదూరం వచ్చి అడవి మధ్యలో ఇలా ఆలోచించాడు. "అయ్యో! నాకు ఎంత మూఢత్వం వచ్చింది? ఏమి చేశాను నేను? అగ్నిస్థాలిని తీసుకొని వచ్చాను. ఊర్వశిని కాదు." అని ఆ అగ్నిస్థాలిని అడవిలో విడిచి వేసి తన నగరానికి వెళ్లిపోయాడు.

**వ్యతీతార్ధరాత్రౌ వినిద్రశ్చాచిన్తయత్, మమోర్వశీసాలోక్యప్రాప్త్యర్థమగ్నిస్థాలీ గన్ధర్వైర్దత్తా, సా చ మయా అటవ్యాం పరిత్యక్తా. తదహం తత్ర తదాహరణాయ యాస్యామి, ఇత్యుత్థాయ తత్రాప్యుపగతో నాగ్నిస్థాలీమపశ్యత్, శమీగర్భం చాశ్వత్థమగ్నిస్థాలీస్థానే దృష్ట్వా అచిన్తయత్. మయాఽత్ర స్థాలీ నిక్షిప్తా, సా చాశ్వత్థః శమీగర్భోఽభూత్. తదేతమేవాహమగ్నిరూపమాదాయ స్వపురమభిగమ్య అరణిం కృత్వా తదుత్పన్నాగ్నేరుపాస్తిం కరిష్యామీతి ॥ 42 ॥**

అర్ధరాత్రి గడిచేసరికి మెలకువ వచ్చి ఇలా ఆలోచించాడు.“ నాకు ఊర్వశీ సాలోక్య ప్రాప్తికోసమై గంధర్వులు అగ్నిస్థాలిని ఇచ్చారు కదా! దానిని నేను అడవిలో విడిచి పెట్టేశాను. కాబట్టి దానిని తీసుకొని రావడానికే ఇప్పుడే అక్కడకు వెడతాను.” అని పురూరవుడు లేచి గబగబా వెళ్లాడు కాని అక్కడ అగ్నిస్థాలి కనబడలేదు. అగ్నిస్థాలి ఉండవలసిన చోటులో జమ్మిలోపల ఉన్న రావిని చూచి ఇలా విచారించాడు. “నేను ఇక్కడ అగ్నిస్థాలిని ఉంచాను. అది జమ్మిలో ఉన్న రావిచెట్టుగా మారిపోయింది. కాబట్టి అగ్నిరూపమైన దీనినే నా నగరానికి తీసుకొని పోయి, అరణిని కావించి, అందులో పుట్టిన అగ్నినే ఉపాసన చేస్తాను.” అని ఆలోచించాడు.

**ఏవమేవ స్వపురముపగతోఽరణిం చకార ॥ 43 ॥**

ఆ విధంగానే తన పురానికి వెళ్లి అరణిని చేశాడు.

**తత్ప్రమాణం చాంగులైః కుర్వన్ గాయత్రీమపఠత్. పఠతశ్చాక్షరసంఖ్యాన్యేవాంగులాన్యరణ్యభవత్॥ 44 ॥**

దాని ప్రమాణాన్ని అంగుళాలతో కొలుస్తూ గాయత్రిని పఠించాడు. అలా చదువుతూ ఉండగా, ఆ మంత్రంలోని అక్షరాలసంఖ్య కలిగిన(ఇరవై నాలుగు అంగుళాల) అరణి అయింది.

**తత్రాగ్నిం నిర్మథ్యాగ్నిత్రయమామ్నాయానుసారీ భూత్వా జుహావ, ఊర్వశీ సాలోక్యం చేహ ఫలమభిసంహితవాన్. తేనైవాగ్నివిధినా బహువిధాన్ యజ్ఞాన్ ఇష్ట్వా గన్ధర్వలోకాన్ ప్రాప్య, ఊర్వశ్యా సహ వియోగం నావాప ॥ 45 ॥**

అందులోనే అగ్నిని మథించాడు. వేదానుసారంగా మూడు అగ్నులలోనూ హెూమం చేశాడు. ఊర్వశీ సాలోక్య ఫలాన్ని పూర్తిగా కాంక్షించాడు. ఆ అగ్నివిధితోనే అనేక విధాలైన యజ్ఞాలు చేశాడు. గంధర్వలోకాలు చివరకు చేరుకొన్నాడు. ఊర్వశితోపాటు వియోగం పొందకుండా ఉండిపోయాడు.

**ఏకోఽగ్నిరాదావభవత్, ఐలేన త్వత్ర మన్వన్తరే త్రేతా ప్రవర్తితా ॥ 46 ॥**

ఆదిలో ఒకటే అగ్ని ఉండేది. ఈ మన్వంతరంలో ఇలాపుత్రుడైన పురూరవునివల్ల ఒక అగ్ని నుంచే (గార్హపత్య, ఆహవనీయ, దక్షిణ) అనబడే మూడు అగ్నులు ఏర్పడ్డాయి.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే చంద్రవంశవర్ణనం నామ షష్ఠోఽధ్యాయః సమాప్తః ॥ 6 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో చంద్రవంశవర్ణన అనే ఆరవ అధ్యాయం సమాప్తం ॥ 6 ॥

## సప్తమోఽధ్యాయః – ఏడవ అధ్యాయం

## పురూరవస్య, జహ్నోశ్చ వంశవర్ణనమ్ – పురూరవుని, జహ్నుని వంశవర్ణన

**తస్యాప్యాయుర్ధీమానమావసుర్విశ్వావసుః, శతాయుః, శ్రుతాయుర, యుతాయుసంజ్ఞాః షడభవన్ పుత్రాః ॥ 1 ॥**

పరాశరుడు ఇలా చెబుతున్నాడు. ఆ పురూరవునికి ధీశాలి అయిన ఆయువు, అమావసువు, విశ్వావసువు, శతాయువు, శ్రుతాయువు, అయుతాయువు అనే పేర్లు గల ఆరుగురు పుత్రులు కలిగారు.

**అమావసోర్భీమో నామ పుత్రోఽభవత్. భీమస్య కాంచనః, కాంచనాత్ సుహోత్రః, తస్యాపి జహ్నుః. యోఽసౌ యజ్ఞవాటమఖిలం గంగామ్భసా ప్లావితమాలోక్య క్రోధసంరక్తనయనో భగవన్తం యజ్ఞపురుషమాత్మని పరమేణ సమాధినా సమారోప్యాఖిలామేవ గంగామపిబత్ ॥ 2 ॥**

అమావసునికి భీముడనే పుత్రుడు జన్మించాడు. భీమునికి కాంచనుడు, కాంచనునికి సుహోత్రుడు, అతనికి జహ్నుడు ఉద్భవించారు. ఇతడే యజ్ఞవాటిక అంతా గంగాజలంలో మునిగి పోవడం చూచాడు. వెంటనే కోపంతో నేత్రాలు ఎరుపెక్కాయి. భగవంతుడైన యజ్ఞపురుషుని తనలో పరమసమాధిలో ధ్యానంచేసి గంగాజలాల నన్నింటినీ త్రాగి వేశాడు.

**అథైనం దేవర్షయః ప్రసాదయామాసుః. దుహితృత్వే చాస్య గంగామనయన్. జహ్నోశ్చ సుజహ్నుర్నామ పుత్రోఽభవత్. తస్యాప్యజకః, తతో బలాకాశ్వః, తస్మాత్ కుశః, కుశస్య కుశాశ్వకుశనాభామూర్త రయామావసవ శ్చత్వారః పుత్రా బభూవుః ॥ 3 ॥**

అనంతరం దేవతలు, ఋషులు ఇతనిని శాంతింపజేశారు. గంగామాతను అతనికి పుత్రికగా జేశారు. జహ్నుమహర్షికి సుజహ్నుడు (సుమంతుడు) అనే పుత్రుడు కలిగాడు. అతనికి అజకుడు, అతనికి బలాకాశ్వుడు, అతనికి కుశుడు కలిగారు. కుశునికి కుశాశ్వుడు (కుశాంబుడు), కుశనాభుడు, అమూర్తరయుడు, అమావసువు అనే నలుగురు పుత్రులు జన్మించారు.

**తేషాం కుశాశ్వః "శక్రతుల్యో మే పుత్రో భవేత్" ఇతి తపశ్చకార. తం చోగ్రతపసమవలోక్య మా భవత్వన్యోఽస్మత్తుల్యవీర్య ఇత్యాత్మనైవాస్యేన్ద్రః పుత్రత్వమగచ్ఛత్ ॥ 4 ॥**

వారిలో కుశాశ్వుడు ఇంద్రునితో సమానుడైన పుత్రుడు తనకు కలగాలని తపస్సు చేశాడు. ఉగ్రమైన తపస్సు చేస్తున్న అతనిని చూచి "నాతో సమానమైన వీర్యం కలవాడు మరొకడు ఉండకుండు గాక!" అని ఇంద్రుడు తానే అతనికి పుత్రుడయ్యాడు.

**గాధిర్నామ స కౌశికోఽభవత్. గాధిశ్చ సత్యవతీం నామ కన్యామజనయత్. తాం చ భార్గవ ఋచీకో వవ్రే ॥ 5 ॥**

అతని పేరే గాధి. అతనినే కౌశికుడని అంటారు. గాధికి సత్యవతి అనే కన్య కలిగింది. ఆమెను భృగువు కుమారుడైన(వంశీయుడైన) ఋచీకుడు వరించాడు.

**గాధిరప్యతిరోషణాయ అతివృద్ధాయ చ బ్రాహ్మణాయ దాతుమనిచ్ఛన్నేకతః శ్యామకర్ణానామిన్దువర్చసామనిలరంహసామశ్వానాం సహస్రం కన్యాశుల్కమయాచత ॥ 6 ॥**

మిక్కిలి రోషం కలవాడు, కడు ముదుసలి అయిన ఆ బ్రాహ్మణునకు తన కన్యను ఈయడం ఇష్టం లేక గాధి ఒక చెవి నల్లగా ఉండి, చంద్రునిలా తెల్లగా ఉండి, వాయువేగంతో సమానమైన వేగంకల వేయి గుర్రాలను కన్యాశుల్కంగా కోరాడు.

**తేనాపి ఋషిణా వరుణసకాశాదుపలభ్య అశ్వతీర్థోత్పన్నం తాదృశాశ్వసహస్రం దత్తమ్. తతస్తామృచీకః కన్యాముపయేమే. ఋచీకశ్చ తస్యాశ్చరుమపత్యార్థం చకార, తథా ప్రసాదితశ్చ తన్మాత్రే క్షత్రవరపుత్రోత్పత్తయే చరుమపరం సాధయామాస ॥ 7 ॥**

అపుడు ఆ ఋషి అశ్వతీర్థంలో పుట్టిన అటువంటి వేయి గుర్రాలను వరుణుని మూలంగా పొంది గాధికి సమర్పించాడు. అనంతరం ఆ కన్యను ఋచీకుడు పెండ్లి చేసుకొన్నాడు. ఋచీకుడు తన భార్యయైన సత్యవతికి సంతానంకోసమై చరువు(అన్నం) సిద్ధం చేశాడు. ఆమె తల్లి కూడా సంతానం కావాలని కోరినందున, ఆమెకు ఉత్తముడైన క్షత్రియకుమారుడు కలగాలని మరొక చరువు సిద్ధం చేశాడు.

**ఏష చరుర్భవత్యా, అయమపరస్త్వన్మాత్రా సమ్యగుపయోజ్య ఇత్యుక్త్వా వనం జగామ ॥ 8 ॥**

"ఈ చరువు నీచేత, ఈ మరో చరువు మీ అమ్మచేత చక్కగా ఉపయోగించవలసి ఉంది" అని చెప్పి ఋచీకుడు అడవికి వెళ్లాడు.

**ఉపయోగకాలే చ తాం మాతా సత్యావతీమాహ. సర్వ ఏవ, ఆత్మపుత్రమతిగుణం సమభిలషతి, నాత్మజాయాభ్రాతృగుణేష్వతీవాదృతో భవతీతి. అతోఽర్హసి మమ త్వమాత్మీయం చరుం దాతుం, మదీయం చరుమాత్మనోపయోక్తుమ్ ॥ 9,10 ॥**

చరువును ఉపయోగించే సమయంలో తల్లి సత్యవతితో, "అమ్మాయీ! ఈ లోకంలో అందరూ తన కన్న కొడుకు అన్నింటిలోను గుణవంతుడు కావాలని కోరుకొంటాడు. తన భార్య సోదరుని గుణాలపై ఎక్కువ మక్కువ ఉండదు. కాబట్టి నీకు ఉద్దేశించిన చరువు నాకిచ్చి, నా చరువు నీవు ఉపయోగించు.

**మత్పుత్రేణ హి సకలభూమణ్డలపరిపాలనం కార్యమ్ ॥ 11 ॥**

నా కుమారుడైనట్లయితే సమస్తధరణీమండలాన్ని పరిపాలించవలసి ఉంది.

**కియద్బ్రాహ్మణస్య బలవీర్యసమ్పదిత్యుక్తా సా స్వం చరుం మాత్రే దత్తవతీ ॥12॥**

బ్రాహ్మణునికి ఎంత బలం, వీర్యం, సంపద ఉంటే మాత్రం ఏమి ప్రయోజనం?" అని పలికింది. కుమార్తె ఆ మాటలు విని తల్లిపైనున్న గౌరవంతో తాను ఉపయోగించబోయే చరువును తల్లికి ఇచ్చింది.

**అథ వనాదభ్యాగత్య సత్యవతీమృషిరపశ్యత్, ఆహ చైనామ్, అతిపాపే! కిమిదమకార్యం భవత్యా కృతమ్, అతిరౌద్రం తే వపురాలక్ష్యతే, నూనం త్వయా త్వన్మాతృసత్కృతశ్చరురుపయుక్తః, న యుక్తమేతత్ ॥ 13 ॥**

అనంతరం ఋషి వనంనుంచి తిరిగి వచ్చి సత్యవతిని చూశాడు. ఆమెతో "ఓసి! పాపాత్మురాలా! ఎంత కాని పని చేశావు నీవు? నీ శరీరం మిక్కిలి రౌద్రంగా కనబడుతోంది. అనుమానం ఏమీ లేదు. నీవు నీ తల్లికోసమై చక్కగా చేసిన చరువును ఉపయోగించావు. ఇది నీకు తగినది కాదు.

**మయా హి తత్ర చరౌ సకలైశ్వర్యశౌర్యవీర్యబలసమ్పదారోపితా, త్వదీయ చరావపి, అఖిలశాన్తి జ్ఞాన తితిక్షాదికా బ్రాహ్మణగుణసమ్పత్. ఏతం చ విపరీతం కుర్వన్త్యాస్తవాతిరౌద్రాస్త్రధారణమారణనిష్ఠః క్షత్రియాచారః పుత్రో భవిష్యతి. అస్యాశ్చోపశమరుచిర్బ్రాహ్మణాచారః ॥ 14 ॥**

నేను ఆ సంబంధమైన చరువులో సకలైశ్వర్యాలను, శౌర్యవీర్యాలను, బలసంపత్తులను నిక్షేపించాను. నీ సంబంధమైన చరువులో సమస్తమైన శాంతగుణాన్ని, జ్ఞానాన్ని, తితిక్ష మున్నగు బ్రాహ్మణగుణసంపత్తిని నిక్షేపించాను. అది తలక్రిందులు కావించిన నీకు అతిరౌద్రమైన అస్త్రాలు ధరించేవాడు, అందరినీ చంపేవాడు అయిన క్షత్రియాచారం కల పుత్రుడు ఉద్భవిస్తాడు. ఆమెకు శాంతగుణంపై ఆసక్తికల బ్రాహ్మణాచారంకల తనయుడు ప్రభవిస్తాడు." అని ఋచీకుడు చెప్పాడు.

**ఇత్యాకర్ణ్యైవ సా తస్య పాదౌ జగ్రాహ,ప్రణిపత్య చ ఏనమాహ.భగవన్!మయైతదజ్ఞానాదనుష్ఠితం,ప్రసాదం మే కురు. మైవంవిధః పుత్రో భవతు, కామమేవం విధః పౌత్రో భవతు ఇత్యుక్తో మునిరప్యాహ. 'ఏవమస్తు' ఇతి ॥15॥**

ఈ మాటలు వినగానే ఆమె భర్త రెండు కాళ్లను పట్టుకొంది. ఆయనకు నమస్కరించి ఇలా అంది "భగవానుడా! నేను ఇది తెలియక చేసిన అకార్యం. నా పై దయ చూపించు. నాకు అటువంటి పుత్రుడు కలగకూడదు. మనుమడు అటువంటి వాడయితే కావచ్చుగాక!" అని ప్రార్థించింది. ఆమె ఇలా అనేసరికి ముని కనికరించి "అలాగే అవుతుందిలే" అని అంగీకరించాడు.

**అనంతరం చ సా జమదగ్నిమజీజనత్. తన్మాతా చ విశ్వామిత్రం జనయామాస. సత్యవతీ చ కౌశికీ నామ నద్యభవత్. జమదగ్నిరిక్ష్వాకువంశోద్భవస్య రేణోస్తనయాం రేణుకాముపయేమే. తస్యాం చాశేషక్షత్రహన్తారం పరశు రామసంజ్ఞం భగవతః సకలలోకగురోర్నారాయణాంశం జమదగ్నిరజీజనత్ ॥ 16 ॥**

ఆ తరువాత ఆమె జమదగ్నిని కన్నది. ఆమె తల్లి విశ్వామిత్రుని కన్నది. సత్యవతి కూడా కౌశికి అనే నదిగా మారిపోయింది. జమదగ్నిమహాముని ఇక్ష్వాకువంశంలో పుట్టిన రేణువు కుమార్తె అయిన రేణుకను వివాహమాడాడు. జమదగ్ని ఆమెయందు సమస్తక్షత్రియులను సంహరించిన, సకలలోకాలకు గురువైన, శ్రీమన్నారాయణుని అంశ అయిన పరశురామునికి జన్మనీయడం జరిగింది.

**విశ్వామిత్రపుత్రస్తు భార్గవ ఏవ శునఃశేఫో నామ దేవైర్దత్తః. తతశ్చ దేవరాత నామాభవత్. తతశ్చ తే మధుచ్ఛన్ద, జయ, కృతదేవ, దేవాష్టక, కచ్ఛప, హారీతకాఖ్యా విశ్వామిత్రపుత్రా బభూవుః ॥ 17 ॥**

విశ్వామిత్రుని కుమారుడయితే భృగువంశంలోని శునశ్శేపుడయ్యాడు. అతడు దేవతలచే ఈయబడిన కారణంచే దేవరాతుడనే పేరు కలిగిన వాడయ్యాడు. అనంతరం మధుచ్ఛందుడు, జయుడు(ధనంజయుడు), కృతదేవుడు, దేవాష్టకుడు, కచ్ఛపుడు, హారీతుడు అనే పుత్రులు విశ్వామిత్రునికి కలిగారు.

**తేషాం చ బహూని కౌశికగోత్రాణి ఋష్యన్తరేషు వైవాహ్యాని భవన్తి ॥ 18 ॥**

వారివే అనేక కౌశిక గోత్రాలు వివిధములైన ఋషివంశాలలో వివాహయోగ్యమైనట్లుగా ఏర్పడ్డాయి.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే పురూరవస్య, జహ్నోశ్చ వంశవర్ణనం చేతి సప్తమోఽధ్యాయః సమాప్తః ॥ 7 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో పురూరవుని, జహ్నుని వంశవర్ణన అనే ఏడవ అధ్యాయం సమాప్తం ॥ 7 ॥

## అష్టమోఽధ్యాయః - ఎనిమిదవ అధ్యాయం

## ధన్వంతరేః ఉత్పత్తిః - ధన్వంతరి ఉత్పత్తి

**పురూరవసో జ్యేష్ఠః పుత్రో యస్త్వాయుర్నామా, స బాహోర్దుహితరముపయేమే. తస్యాం స పంచపుత్రాన్ జనయామాస. నహుష క్షత్రవృద్ధరమ్భరజిసంజ్ఞాః, తథైవానేనాః పంచమః పుత్రోఽభూత్. క్షత్రవృద్ధాత్ సుహోత్రః పుత్రోఽభూత్. కాశ్య(కాశ) లేశ గృత్సమదాస్తస్య పుత్రా స్త్రయోఽభవన్. గృత్సమదస్య శౌనక శ్చాతుర్వర్ణ్య ప్రవర్తయితాఽభూత్ ॥ 1 ॥**

పరాశరుడు చెబుతున్నాడు. పురూరవుని పెద్దకొడుకు ఆయువు అనేవాడు. అతడు బాహువు(రాహువు) కూతురును వివాహమాడాడు. అతనివల్ల ఆమెకు ఐదుగురు కుమారులు కలిగారు. వారే నహుషుడు, క్షత్రవృద్ధుడు, రంభుడు, రజి అనే వారు. అయిదోవాడు అనేనసుడనే కుమారుడు. క్షత్రవృద్ధునివల్ల సుహోత్రుడనే పుత్రుడు కలిగాడు. అతనికి కాశుడు, లేశుడు, గృత్సమదుడు అనే ముగ్గురు పుత్రులు కలిగారు. అందు గృత్సమదునికి శౌనకుడనే పుత్రుడు చాతుర్వర్ణ్యప్రవర్తకుడై ఉద్భవించాడు.

**కాశ్యస్య కాశిరాజః, తతో దీర్ఘతమాః(తపాః)పుత్రోఽభవత్. ధన్వన్తరిస్తు దీర్ఘతమసోఽభూత్. స హి సంసిద్ధకార్యకరణః సకలసమ్భూతిష్వశేషజ్ఞానవిత్ । 2 ॥**

కాశునికి కాశిరాజు, అతనికి దీర్ఘతముడు(దీర్ఘతపుడు) అనే పుత్రుడు కలిగారు. దీర్ఘతమునికి ధన్వంతరి అనే కుమారుడు ప్రభవించాడు. అతని శరీరం, ఇంద్రియాలు, ముసలితనం మున్నగు మార్పులు లేనివి. సమస్తజన్మలయందు అశేషజ్ఞానవేత్త అతడు.

**భగవతా నారాయణేన చ అతీతసమ్భూతావస్మై వరో దత్తః । 3 ॥**

భగవంతుడైన నారాయణుడు గతించిన జన్మలో అతనికి వరం ఇచ్చాడు.

**కాశిరాజగోత్రేఽవతీర్య త్వమష్టధా సమ్యగాయుర్వేదం కరిష్యసి, యజ్ఞభాగ్ భవిష్యసి ఇతి ॥ 4 ॥**

"కాశిరాజవంశంలో నీవు జన్మించి, ఆయుర్వేదాన్ని ఎనిమిది భాగాలుగా చక్కగా విభజించి యజ్ఞ భాగభోక్తవవుతావు" అని వరం ఇచ్చాడు అతనికి.

**తస్య చ ధన్వన్తరేః పుత్రః కేతుమాన్. కేతుమతో భీమరథః, తస్యాపి దివోదాసః, తతః ప్రతర్దనః, స చ మద్రశ్రేణ్యవంశవినాశాదశేషాః శత్రవోఽనేన జితా ఇతి శత్రుజిదభవత్ ॥ 5 ॥**

ఆ ధన్వంతరి పుత్రుడు కేతుమంతుడు. కేతుమంతుని కుమారుడు భీమరథుడు, అతని కుమారుడు దివోదాసుడు. అతనకి ప్రతర్దనుడు అనే కొడుకు కలిగాడు. అతడు మద్రరాజవంశాన్ని నాశనంచేసినందువల్ల, సమస్తశత్రువులను జయించినందువల్ల "శత్రుజిత్తు" అనే పేరు కలిగిన వాడయ్యాడు.

**తేన చ ప్రీతిమతాఽఽత్మపుత్రో వత్స వత్సేత్యభిహితః, తతో వత్సోఽసావభవత్ ॥ 6 ॥**

దివోదాసుడు ప్రీతితో తన పుత్రుని "వత్సా! వత్సా!" అని పిలిచినందువల్ల అతడు "వత్సుడు" అయ్యాడు.

**సత్యవ్రతతయా ఋతధ్వజ సంజ్ఞామవాప. పునశ్చ కువలయనామానమశ్వం లేభే, కువలయాశ్వ ఇత్యస్యాం పృథివ్యాం ప్రథితః ॥ 7 ॥**

సత్యమే వ్రతముగా గల్గినవాడు కాబట్టి "ఋతధ్వజుడు" అనే పేరు పొందాడు. అంతే కాక అతడు "కువలయం" అనే పేరు గల అశ్వాన్ని పొందాడు. కాబట్టి "కువలయాశ్వుడు" అనే నామంతో ఈ పృథివిలో ప్రసిద్ధి కెక్కాడు.

**తస్య చ వత్సస్య పుత్రోఽలర్కో నామాభవత్. యస్యాయమద్యాపి శ్లోకో గీయతే -**

**షష్టివర్షసహస్రాణి షష్టివర్షశతాని చ ।**
**అలర్కాదపరో నాన్యో బుభుజే మేదినీం యువా ॥ 8 ॥**

ఆ వత్సునికి అలర్కుడు అనే పుత్రుడు కలిగాడు. అతని గురించి ఈ నాటికి ఈ శ్లోకం గానం చేయబడుతోంది.

"యౌవనంలో ఉండగానే అరవై ఆరువేల సంవత్సరాలు రాజ్యపాలన చేసినవాడు. అలర్కునికన్న వేరే ఎవడైనా ఉన్నాడా?" అని ఆతనిని స్తుతిస్తూ ఉంటారు.

**తథాఽలర్కస్య సన్నతిర్నామాత్మజోఽభవత్. తతః సునీథః, తస్య సుకేతుః, తతో ధర్మకేతుః,తతః సత్యకేతుః. తస్మాద్ విభుః, తత్తనయః సువిభుః. తతశ్చ సుకుమారః, తస్యాపి ధృష్టకేతుః, తతశ్చ వైన హోత్రః, తతశ్చ భార్గః, భార్గస్య భార్గభూమిః, అతశ్చాతుర్వర్ణ్య ప్రవృత్తిః, ఇత్యేతే కాశ్యపా భూపతయః కథితాః. రజేస్తు సన్తతిః శ్రూయతామితి ॥ 9 ॥**

ఆ అలర్కునికి సన్నతి అనే పేరు కలిగిన ఆత్మజుడు కలిగాడు. అతని వల్ల సునీథుడు, అతని వల్ల సుకేతువు, అతని వల్ల ధర్మకేతువు, అతని వల్ల సత్యకేతువు, అతని వల్ల విభుడు, అతనికి కొడుకుగా సువిభుడు కలిగారు. అతనికి సుకుమారుడు, అతనికి ధృష్టకేతువు, అతనికి వైనహోత్రుడు (వీతిహోత్రుడు), అతనికి భార్గుడు, అతనికి భార్గభూమి జన్మించారు. అతనివల్ల చాతుర్వర్ణ్యవ్యవస్థ చక్కగా ఏర్పడింది. వీరందరూ కాశ్యపరాజులుగా కీర్తించబడ్డారు. వారిని గురించి నీకు తెలియజేశాను. ఇక మీదట రజి సంతతిని గురించి ఆలకించు." అని మైత్రేయునకు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే ధన్వంతరేః ఉత్పత్తిరితి అష్టమోఽధ్యాయః సమాప్తః ॥ 8 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో ధన్వంతరి ఉత్పత్తి అనే ఎనిమిదవ అధ్యాయం సమాప్తం ॥ 8 ॥



## నవమోఽధ్యాయః – తొమ్మిదవ అధ్యాయం

## రజిదైత్యయోః యుద్ధం – రజిదైత్యుల యుద్ధం

**రజేః పంచపుత్రశతాన్యతులవీర్యసారాణ్యాసన్. దేవాసురసంగ్రామారమ్భే పరస్పరవధేప్సవో దేవాశ్చాసురాశ్చ బ్రహ్మాణం పప్రచ్ఛుః ॥ 1 ॥**

పరాశరుడు ఇలా చెబుతున్నాడు. రజికి సాటిలేని బలంకలిగిన, సారవంతమైన పరాక్రమంకలిగిన ఐదు వందలమంది పుత్రులు కలిగారు. దేవాసురయుద్ధప్రారంభంలో, ఒకరినొకరు చంపుకోదలచుకొన్నవారై దేవతలు, అసురులు బ్రహ్మవద్దకు వెళ్లి ఇలా ప్రశ్నించారు.

**భగవన్ ! అస్మాకమత్ర విరోధే కతరః పక్షో జేతా భవిష్యతీతి. అథాఽఽహ భగవాన్, యేషామర్థే రజి రాత్తాయుధో యోత్స్యతీతి. అథ దైత్యైరుపేత్య రజిరాత్మసాహాయ్యదానాయ, అభ్యర్థితః ప్రాహ. యోత్స్యేఽహం భవతామర్థే, యద్యహమమరజయాద్ భవతామిన్ద్రో భవిష్యామ ఇతి. ఆకర్ణ్యైతత్ తైరభిహితో న వయమన్యథా వదిష్యామోఽన్యథా కరిష్యామః అస్మాకమిన్ద్రః ప్రహ్లాదస్తదర్థమయం ఉద్యమ ఇత్యుక్త్వా గతేష్వసురేషు దేవైరప్యసావవనీపతి రేవమేవోక్తః. తేనాపి చ తథైవోక్తే దేవైరిన్ద్రస్త్వం భవిష్యసీతి సమన్వీప్సితమ్ ॥ 2 ॥**

“భగవంతుడా! మా ఈ విరోధంలో ఏ పక్షానికి జయం కలుగుతుంది?” అని అడుగగా భగవంతుడైన బ్రహ్మ వారితో “ఎవరికోసమైతే రజి ఆయుధం చేతదాల్చి పోరాడతాడో, ఆ పక్షం జయిస్తుంది” అని చెప్పాడు. ఆ తరువాత దైత్యులు ముందుగా వచ్చి తమకు సాయం చేయవలసిందని రజిని ప్రార్థించారు. అపుడు అతడు “నేను మీ కోసమై పోరాడుతాను. దేవతలను జయించిన తరువాత నేను ఇంద్రుడిని కావాలి” అన్నాడు. వారది విని రజితో “మేము మరోలా చెప్పేవాళ్లం కాదు. మరోలా చేసే వాళ్లం అంతకన్న కాదు. మాకు ఇంద్రుడు ప్రహ్లాదుడే. అతనిని ఇంద్రునిగా చేయడంకోసమే మా ఈ ప్రయత్నమంతా” అని పలికి వెళ్లిపోయారు. వారు అలా వెళ్లిపోయిన తరవాత దేవతలు వచ్చి రాజును అడగగా, అతడు అసురులకు చెప్పినట్లే వారికి కూడా చెప్పాడు. వారు వెంటనే “నీవే ఇంద్రుడవు అవుతా” వని అంగీకరించడం జరిగింది.

**రజినాఽపి దేవసైన్యసహాయేన అనేకైర్మహాస్త్రై స్తదశేషమసురబలం నిషూదితమ్. అథ జితారాతిపక్షశ్చ ఇన్ద్రో రజిచరణయుగలమాత్మ శిరసా నిపీడ్యాఽఽహ. భయత్రాణాదన్నదానాద్, భవానస్మత్పితా, అశేషలోకానా ముత్తమో భవాన్, యస్యాహం పుత్రస్త్రిలోకేన్ద్రః ॥ 3 ॥**

రజి కూడ దేవసైన్యానికి తోడుగా ఉండి, పెక్కు మహాస్త్రాలచేత, ఆ సమస్తదైత్యసైన్యాన్ని సంహరించాడు. అనంతరం శత్రుపక్షాన్ని అంతా జయించిన వెంటనే ఇంద్రుడు రజిరాజేంద్రుని రెండు పాదాలపై తన శిరస్సునుంచి “భయం నుంచి రక్షించినందువల్ల, అన్నం పెట్టినందువల్ల నీవు మాకు తండ్రివి. సమస్తలోకస్థులకన్న ఉత్తముడవీవు. నీ పుత్రుడనైన నేను త్రిలోకేంద్రుడుగా ఉండాలి” అని ప్రార్థించాడు.

**స చాపి రాజా ప్రహస్యాఽఽహ, ఏవమేవాస్తు. అనతిక్రమణీయా హి వైరిపక్షాదప్యనేకవిధచాటువాక్యగర్భా ప్రణతిః ఇత్యుక్త్వా స్వపురమాజగామ ॥ 4 ॥**

అంతట రాజు పకపక నవ్వి "అలాగే కానీ. శత్రుపక్షానికి సంబంధించిన వారుకూడా, రకరకాలుగా ఇంపైన సొంపగు వాక్యాలతోనింపి, నమస్కరించి ఇలా పలికితే కాదనడానికి వీలు లేదు కదా!" అని పలికి తన లోకానికి వెళ్లిపోయాడు.

**శతక్రతురపీన్ద్రత్వం చకార. స్వర్యాతే చ రజౌ, నారదర్షిచోదితా రజిసుతాః శతక్రతుమాత్మపితృపుత్రం సమాచారాద్ రాజ్యం యాచితవన్తః ॥ 5 ॥**

అనంతరం శతక్రతువు ఇంద్రాధిపత్యాన్ని పొందాడు. రజి స్వర్గానికి వెళ్లిపోయిన తరువాత, నారదమహర్షి ప్రేరేపణతో రజికుమారులు తమ తండ్రి కుమారుడైన శతక్రతువును సమీపించి, అతడు ఆచరించిన ధర్మానుసారంగా రాజ్యం ఇమ్మని కోరారు.

**అప్రదానేన చావజిత్యేన్ద్రమతిబలినః స్వయమిన్ద్రత్వం చక్రుః తతశ్చ బహుతిథే కాలే వ్యతీతే బృహస్పతి మేకాన్తే దృష్ట్వా, అపహృత త్రైలోక్యయజ్ఞభాగః శతక్రతురాహ ॥ 6 ॥**

అతడు రాజ్యం ఇవ్వకపోవడంచే, ఆ అతిబలశాలులు ఇంద్రుని జయించి స్వయంగా ఇంద్రత్వం చేశారు. ఆ తరువాత చాలాకాలం గడిచిపోయాక, మూడు లోకాలకు సంబంధించిన యజ్ఞభాగం కోల్పోయిన శతక్రతువు ఏకాంతంగా బృహస్పతిని దర్శించి ఇలా బ్రతిమిలాడాడు.

**బదరీఫలమాత్రమప్యర్హసి మమ ఆప్యాయనాయ పురోడాశఖణ్డం దాతుమిత్యుక్తో బృహస్పతిరూచే. యద్యేవం పూర్వమేవ త్వయాఽహం చోదితః స్యాం, తన్మయా త్వదర్థం కిమకర్తవ్యమితి ॥ 7 ॥**

"నాకు తృప్తి కలగడానికై రేగిపండంత పురోడాశభాగం పెట్టదగియున్నావు" అని దీనంగా మాట్లాడగా బృహస్పతి జాలి చూపి ఇలా అన్నాడు" నీవు ఇదివరకే ఇలా నాతో అని ఉంటే, నేను నీకోసం చేయనిదేముంటుంది కనుక!

**స్వల్పైరేవాహోభిస్త్వాం నిజం పదం ప్రాపయిష్యామి, ఇత్యభిధాయ తేషామనుదినాభిచారికం బుద్ధిమోహాయ శక్రతేజోవృద్ధయే జుహావ ।**

కొద్దిరోజులలోనే నీ స్థానం నీకు తిరిగి వచ్చేటట్లు చేస్తాను" అని దేవగురువు ప్రతిదినం రజికుమారులకు బుద్ధిమోహం కలిగేటట్లుగా శక్రునితేజస్సు అభివృద్ధిచెందేలాగా ఆభిచారిక హోమంచేశాడు.

**తే చాపి తేన బుద్ధిమోహేనాభిభూయమానా బ్రహ్మద్విషః ధర్మత్యాగినో వేదవాదపరాఙ్ముఖా బభూవుః. తతశ్చ తానపేతధర్మాచారాన్ ఇన్ద్రో జఘాన, పురోహితాప్యాయిత తేజాశ్చ త్రిదివమాక్రమత్. ఏతదిన్ద్రస్య స్వపద చ్యవనారోహణం శ్రుత్వా పురుషః స్వపదభ్రంశం దౌరాత్మ్యం వా న చాప్నోతి ।**

రజితనయులు కూడా ఆ బుద్ధిమోహంవల్ల చెడిపోయినవారై, బ్రహ్మద్వేషం కలవారయ్యారు. ధర్మం విడిచిపెట్టేశారు. వేదప్రవృత్తిపట్ల విముఖులయ్యారు. అనంతరం ధర్మం, ఆచారం వదలివేసిన వారిని ఇంద్రుడు

సంహరించాడు. తన పురోహితునివల్ల తేజస్సు అభివృద్ధిచెందగా శక్రుడు మళ్లీ స్వర్గం ఆక్రమించాడు. ఈ విధమైన ఇంద్రుని పదవీచ్యుతిని, తిరిగి స్వర్గారోహణం విన్నటువంటి పురుషుడు తన పదవీ భ్రంశం, దానివల్ల అనుభవించే దురాత్మత్వం పొందడు.

**రమ్భస్త్వనపత్యోఽభవత్. క్షత్రవృద్ధసుతః ప్రతిక్షత్రః, తత్పుత్రః సంజయః, (తస్యాపి జయః), తతశ్చ విజయః, తస్మాచ్చ యజ్ఞకృత్, తస్య హర్షవర్ధనః, హర్షవర్ధనసుతః సహదేవః, తస్మాదదీనః, తస్య జయసేనః, తతశ్చ సంహృతిః, తత్పుత్రః క్షత్రధర్మాః ఇత్యేతే క్షత్రవృద్ధస్య. అతో నహుషవంశం వక్ష్యామి ॥ 8 ॥**

రంభుడు సంతానం లేనివాడయ్యాడు. క్షత్రవృద్ధునికి ప్రతిక్షత్రుడనే కొడుకు కలిగాడు. అతని పుత్రుడు సంజయుడు. (అతనికి జయుడు), అతనికి విజయుడు, అతనివల్ల యజ్ఞకృత్తు, అతనికి హర్షవర్ధనుడు కలిగారు. హర్షవర్ధనుని సుతుడు సహదేవుడు, అతనికి అదీనుడు, అతనికి జయసేనుడు, అతనికి సంహృతి (సంస్కృతి), అతనికి పుత్రుడుగా క్షత్రధర్ముడు కలిగారు. వీరు అందరు క్షత్రవృద్ధుని వంశీయులు. ఇటుపైన నహుషుని వంశం గురించి చెప్పబోతున్నాను అని పరాశరుడు ఇలా చెప్పాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే రజిదైత్యయోః యుద్ధం నామ నవమోఽధ్యాయః సమాప్తః ॥ 9 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో రజిదైత్యులయుద్ధం అనే తొమ్మిదవ అధ్యాయం సమాప్తం ॥ 9 ॥



## దశమోఽధ్యాయః - పదవ అధ్యాయం

## యయాతి కథా - యయాతి కథ

**యతి, యయాతి, సంయాతి, ఆయాతి, వియతి, కృతి సంజ్ఞా నహుషస్య షట్ పుత్రా మహాబలపరాక్రమా బభూవుః. యతిస్తు రాజ్యం నైచ్ఛత్. యయాతిస్తు భూభృదభవత్, ఉశనసశ్చ దుహితరం దేవయానీం శర్మిష్ఠాం చ వార్షపర్వణీముపయేమే ॥ 1 ॥**

పరాశరుడు చెబుతున్నాడు. మైత్రేయా! యతి, యయాతి, సంయాతి, ఆయాతి, వియతి, కృతి అనే పేర్లుగల ఆరుగురు కుమారులు, మహాబలపరాక్రమవంతులైన వారు నహుషునికి జన్మించారు. యతి రాజ్యం పాలించడానికి ఇష్టపడలేదు. అందువల్ల యయాతి మహారాజు అయ్యాడు. శుక్రాచార్యుని కుమార్తెను దేవయానిని, వృషపర్వుని తనయను శర్మిష్ఠను వివాహమాడాడు.

**యదుం చ తుర్వసుం చైవ దేవయానీ వ్యజాయత ।**
**ద్రుహ్యం చానుం చ పూరుం చ శర్మిష్ఠా వార్షపర్వణీ ॥ 2 ॥**

యదువు, తుర్వసుడు అనేవారు దేవయాని కుమారులు. ద్రుహ్యుడు, అనువు, పూరువు అనే కుమారులను వృషపర్వుని కూతురైన శర్మిష్ఠ కన్నది.

**కావ్యశాపాచ్చ అకాలేనైవ యయాతిర్జరామవాప ॥ 3 ॥**

శుక్రుని శాపంవల్ల కాలంకాని కాలంలోనే యయాతి ముసలితనం పొందాడు.

**ప్రసన్న శుక్రవచనాచ్చ జరాం సంక్రమయితుం జ్యేష్ఠం పుత్రం యదుమువాచ, త్వన్మాతామహశాపా దియమకాలేనైవ జరా మాముపస్థితా. తామహం తస్యైవానుగ్రహాద్ భవతః సంచారయామి, ఏకం వర్ష సహస్రమ్, నఽతృప్తోఽస్మి విషయేషు, త్వద్వయసా విషయానహం భోక్తుమిచ్ఛామి ॥ 4 ॥**

శుక్రుడు శాంతించి వచించిన దానినిబట్టి, తన ముసలితనం మార్పుచేయడానికై పెద్ద కుమారుడైన యదువుతో ఇలా అన్నాడు "నీ మాతామహుని శాపంవల్ల నాకు అకాలంలో ఈ ముసలితనం వచ్చి పడింది. దానిని నేను ఆ శుక్రాచార్యుల అనుగ్రహంతోనే నీవు పొందేటట్లుగా నీకు సంక్రమింపజేస్తాను. నాకు విషయసుఖాలలో తృప్తి తీరలేదు. ఒక వేయి సంవత్సరాలపాటు నేను నీ వయస్సుతో విషయభోగాలు అనుభవించాలనుకొంటున్నాను.

**నాత్ర భవతా ప్రత్యాఖ్యానం కర్తవ్యమిత్యుక్తః స నైచ్ఛత్ తాం జరామాదాతుమ్, తం చాపి పితా శశాప, త్వత్ప్రసూతిర్న రాజ్యార్హా భవిష్యతీతి ॥ 5 ॥**

ఈ విషయాన్ని నీవు కాదనడం న్యాయం కాదు" అని నీవు చేసి తీరాలని వచించాడు. తండ్రి అలా అనగానే ఆ ముసలితనాన్ని పుచ్చుకోవడానికి యదువు అంగీకరించలేదు. అందువల్ల యయాతి అతనిని "నీ సంతతికి రాజ్యంచేసే అధికారం ఉండబోదు" అని శపించాడు.

**అనంతరం చ తుర్వసుం ద్రుహ్యమనుం చ పృథివీపతిర్జరాగ్రహణార్థం స్వయౌవనప్రదానాయ చ చోదయామాస. తైరప్యేకైకేన ప్రత్యాఖ్యాతస్తాంశ్చ శశాప. అథ శర్మిష్ఠాతనయమశేష కనీయాంసం పూరుం తథైవాహ.**

**స చాతిప్రవణమతిః ప్రణమ్య పితరం సబహుమానో మహాన్ ప్రసాదోఽయమస్మాకమ్, ఇత్యుదారమభిధాయ జరాం ప్రతిజగ్రాహ. స్వకీయం చ యౌవనం పిత్రే దదౌ ।**

ఆ తరువాత యయాతిరాజు తుర్వసుని, ద్రుహ్యుని, అనువును తన ముసలితనం తీసుకొని వారి యౌవనం ఈయవలసిందని వారిని బలవంతపెట్టాడు. వారు ఒక్కొక్కరు కూడా యదువులాగే తండ్రి కోరికను తిరస్కరించారు. యయాతి కూడా వారిని శపించాడు. అనంతరం శర్మిష్ఠ కొడుకయిన, అందరిలో చిన్నవాడయిన పూరువుతో కూడా తండ్రి అలాగే పలికాడు. అతడు మిక్కిలి వినయబుద్ధితో సగౌరవంగా తండ్రికి నమస్కరించి "ఇది నాకు మహాప్రసాదం" అని ఔదార్యంతో పలికి తండ్రిముసలితనాన్ని స్వీకరించాడు. తన యౌవనాన్ని తండ్రికి ప్రదానం చేశాడు.

**సోఽపి చ నవం యౌవనమాసాద్య ధర్మావిరోధేన యథాకామం యథాకాలోపపన్నం యథోత్సాహం విషయం చచార. సమ్యక్ ప్రజాపాలనమకరోత్ ॥ 6 ॥**

అతడు కూడా పూరుని నవయౌవనం స్వీకరించి ధర్మానికి వ్యతిరేకం కాకుండా, కాలానికి తగినట్లుగా, ఇష్టం వచ్చినట్లుగా ఉత్సాహం పెంపొందగా విషయభోగాలు అనుభవించాడు. చక్కగా ప్రజాపాలన కూడా కావించాడు.

**విశ్వాచ్యా(దేవయాన్యా చ)సహోపభోగం భుంక్త్వా కామానామన్తమవాప్స్యామీత్యనుదినం తన్మనస్కో బభూవ॥ 7॥**

విశ్వాచి అనే అప్సరసతోను (దేవయానీ శర్మిష్ఠలతోను) కలసి అనేక భోగాలు అనుభవించి "ఈ కామాల అంతు చూస్తాను" అని ప్రతిదినం కామోపభోగదృష్టికలిగిన వాడయ్యాడు.

**అనుదినం చ, ఉపభోగతశ్చ కామానతీవ రమ్యాన్ మేనే ॥ 8 ॥**

రోజురోజుకు కామాలను అనుభవిస్తున్నందువల్ల వాటిని మిక్కిలి సుఖంగా భావించేవాడు.

**న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥ 9 ॥**

ఎన్నడూ కూడా కామాలను అనుభవించి వేయడంవల్ల కామం శాంతించడమనే మాట కల్ల. నేతితో హోమం చేయబడిన అగ్నిహోత్రంలా కామం ఎల్లప్పుడూ పెరుగుతూనే ఉంటుంది.

**యత్ పృథివ్యాం వ్రీహి యవం హిరణ్యం పశవః, స్త్రియః ।
ఏకస్యాపి న పర్యాప్తం తదిత్యతితృషం త్యజేత్ ॥10 ॥**

కామం ఉన్నవాడికి భూమిమీద ఉన్న ధాన్యం, యవలు, బంగారం, పశువులు, స్త్రీలు ఒక్కడికి కూడా సరిపోవు. కాబట్టి (జ్ఞాని) అతితృష్ణను (అత్యాశను) వదలిపెట్టాలి.

**యదా న కురుతే భావం సర్వభూతేషు పాపకమ్ ।
సమదృష్టేస్తదా పుంసః సర్వా ఏవ సుఖా దిశః ॥ 11 ॥**

సమస్తప్రాణులయందు పాపభావం లేకుండా, సమానమైన (బ్రహ్మ) దృష్టికలిగినపుడు, పురుషులకు సర్వదిక్కులు ఆనందస్వరూపాలవుతాయి.

**యా దుస్త్యజా దుర్మతిభిర్యా న జీర్యతి జీర్యతః ।**
**తాం తృష్ణాం సన్త్యజన్ ప్రాజ్ఞః సుఖేనైవాభిపూర్యతే ॥ 12 ॥**

దురాత్ములు విడిచిపెట్టడానికి వీలుకానిది, అతడు ముసలితనంతో జీర్ణమయిపోతున్నా శిథిలం కానిది తృష్ణ ఒక్కటే. ప్రాజ్ఞుడు ఆ ఆశను విడిచి సుఖముతో నింపబడుతాడు.

**జీర్యన్తి జీర్యతః కేశా దన్తా జీర్యన్తి జీర్యతః ।**
**ధనాశా జీవితాశా చ జీర్యతోఽపి న జీర్యతః ॥ 13 ॥**

ముసలితనం పైబడుతూఉంటే జుట్టు ఊడిపోతుంది. పళ్లు కూడా ఊడిపోతాయి. తాను శైథిల్యం చెందిపోతూ ఉన్నా, ధనాశ, జీవితాశమాత్రం జీర్ణం కావు.

**పూర్ణం వర్షసహస్రం మే విషయాసక్తచేతసః ।**
**తథాఽప్యనుదినం తృష్ణా మమైతేష్వేవ జాయతే ॥ 14 ॥**

నా మనస్సు విషయభోగాలపై మక్కువతో ఉండిపోగా, వేయి ఏండ్లు ఇట్టే గడచి పోయాయి. కాని రోజుకు రోజుకు తృష్ణమాత్రం వాటిపైన అట్లే ఉండిపోయింది.

**తస్మాదేతామహం త్యక్త్వా బ్రహ్మణ్యాధాయ మానసమ్ ।**
**నిర్ద్వన్ద్వో నిర్మమో భూత్వా చరిష్యామి మృగైః సహ ॥ 15 ॥**

కనుక నేను ఈ తృష్ణను వదలి వేస్తాను. బ్రహ్మమందే మనస్సును లగ్నం చేస్తాను. ద్వంద్వాలను విడిచిపెడతాను. మమత్వం త్యజిస్తాను. మృగాలతోకలిసి సంచరిస్తాను అని ఆలోచించాడు.

**పూరోః సకాశాదాదాయ జరాం దత్త్వా చ యౌవనమ్ ।**
**రాజ్యేఽభిషిచ్య పూరుం చ ప్రయయౌ తపసే వనమ్ ॥ 16 ॥**

పూరువు (పూరువు) వద్దనుంచి మళ్లీ ముసలితనం తీసుకొని, అతని యౌవనం తిరిగి ఇచ్చివేసి, అతనిని రాజ్యంలో అభిషేకించి తపస్సు చేసుకోవడంకోసమై అడవికి వెళ్లిపోయాడు.

**దిశి దక్షిణపూర్వస్యాం తుర్వసుం ప్రత్యథాదిశత్ ।**
**ప్రతీచ్యాం చ తథా ద్రుహ్యం దక్షిణాపథతో యదుమ్ ॥ 17 ॥**

**ఉదీచ్యాం చ తథైవానుం కృత్వా మణ్డలినో నృపాన్ ।**
**సర్వపృథ్వీపతిం పూరుం సోఽభిషిచ్య వనం యయౌ ॥ 18 ॥**

ఆగ్నేయభాగమందు తుర్వసుని, పడమటదిశను ద్రుహ్యుని, దక్షిణాపథంలో యదువును, ఉత్తరాన అనువును మండలాధిపతులుగా చేశాడు. సమస్తభూమండలానికి పూరువును చక్రవర్తిగా అభిషేకించి యయాతి అడవికి చేరుకొన్నాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే యయాతి కథేతి దశమోఽధ్యాయః సమాప్తః ॥ 10 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో యయాతి కథ అనే పదవ అధ్యాయం సమాప్తం ॥ 10 ॥

## ఏకాదశోఽధ్యాయః - పదకొండవ అధ్యాయం

## సహస్రబాహోః అర్జునస్య చరిత్రమ్ – సహస్రబాహువైన అర్జునుని చరిత్ర

**అతః పరం యయాతేః ప్రథమపుత్రస్య యదోర్వంశమహం కథయామి. యత్రాశేషలోకనివాసో మనుష్య సిద్ధగన్ధర్వయక్షరాక్షసగుహ్యక కిమ్పురుషాప్సర ఉరగవిహగదైత్యదానవదేవర్షి ద్విజర్షి ముముక్షుభిః, ధర్మార్థకామ మోక్షార్థిభిః, తత్ఫలలాభాయ సదాఽభిష్టుతాపరిచ్ఛేద్య మాహాత్మ్యేనాంశేన భగవాననాదినిధనో విష్ణురవతతార॥ 1 ॥**

పరాశరుడు చెబుతున్నాడు. ఇక మీద యయాతి పెద్దకొడుకైన యదువువంశం గురించి నేను చెబుతున్నాను. మైత్రేయా! ఆ వంశంలో సమస్తలోకనివాసుడు–మనుష్యులు, సిద్ధులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, గుహ్యకులు, కింపురుషులు, అప్సరసలు, ఉరగులు, విహగులు, దైత్యులు, దానవులు, దేవర్షులు, బ్రహ్మర్షులు, ముముక్షువులు – వీరిచే ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే పురుషార్థాలఫలప్రాప్తికోసమై ఎల్లప్పుడూ స్తోత్రం చేయబడేవాడు, పరిచ్ఛిన్నంకాని మాహాత్మ్యంతో కూడుకొన్నవాడు, భగవానుడు, అనాదినిధనుడైన విష్ణువు అవతరించాడు.

**యదోర్వంశం నరః శ్రుత్వా సర్వపాపైః ప్రముచ్యతే ।**
**యత్రావతీర్ణం కృష్ణాఖ్యం పరంబ్రహ్మ నిరాకృతి ॥ 2 ॥**

నిరాకారనిర్గుణపరబ్రహ్మమే కృష్ణుడన్న పేరుతో ఎక్కడ అవతరించాడో, ఆ యదువంశం గురించి విన్న నరుడు సమస్తపాపాలనుంచి విముక్తుడవుతాడు.

**సహస్రజిత్, క్రోష్టు, నల, రఘు (నహుష) సంజ్ఞాశ్చత్వారో యదుపుత్రా బభూవుః. సహస్రజిత్పుత్రః శతజిత్. తస్య హైహయ హేహయ వేణుహయాస్త్రయః పుత్రా బభూవుః. హైహయపుత్రో ధర్మః, తస్యాపి ధర్మనేత్రః, తతః కున్తిః, కున్తేః సాహంజిః (సహజిత్), తత్తనయో మహిష్మాన్ యోఽసౌ మాహిష్మతీం పురీం నివాసయాయాస।**

సహస్రజిత్తు, క్రోష్టువు, నలుడు, రఘువు (నహుషుడు) అనే పేర్లు కలిగిన నలుగురు పుత్రులు యదువుకు జన్మించారు. సహస్రజిత్తుయొక్క పుత్రుడు శతజిత్తు. అతనికి హైహయుడు, హేహయుడు. వేణుహయుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. హైహయుని కుమారుడు ధర్ముడు. అతని కుమారుడు ధర్మనేత్రుడు. అతనివల్ల కుంతి, కుంతివల్ల సాహంజి (సహజిత్తు) కలిగారు. అతని కుమారుడే మహిష్మంతుడు. అతడే మాహిష్మతీ నగరాన్ని ఏర్పాటు చేశాడు.

**తస్మాద్ భద్రశ్రేణ్యః, తతో దుర్దమః, తస్మాద్ ధవకః, ధనకస్య కృతవీర్య, కృతాగ్ని, కృతవర్మ (కృతధర్మ), కృతౌజసశ్చత్వారః పుత్రా బభూవుః. కృతవీర్యాదర్జునః, సప్తద్వీపపతిర్బాహుసహస్రో జజ్ఞే. యోఽసౌ భగవదంశ మత్రికులప్రసూతం దత్తాత్రేయాఖ్యమారాధ్య బాహుసహస్రమధర్మసేవానివారణం, ధర్మేణ పృథివీజయం, ధర్మతశ్చానుపాలనం, అరాతిభ్యోఽపరాజయమ్, అఖిలజగత్ప్రఖ్యాతపురుషాచ్చ మృత్యుమ్, ఇత్యేతాన్ వరాన్ అభిలషితవాన్ లేభే చ. తేనేయమశేష ద్వీపవతీ పృథ్వీ సమ్యక్ పరిపాలితా, దశయజ్ఞ సహస్రాణ్యసావయజత్. తస్య చ శ్లోకోఽద్యాపి గీయతే ॥ 3 ॥**

అతనికి భద్రశ్రేణ్యుడు, అతనివల్ల దుర్దముడు, అతని వల్ల ధవకుడు కలిగారు. ధవకునకు కృతవీర్యుడు, కృతాగ్ని, కృతవర్మ (కృతధర్ముడు), కృతౌజసుడు అనే నలుగురు పుత్రులు కలిగారు. కృత్యవీర్యునకు అర్జునుడు జన్మించాడు. అతడు ఏడుద్వీపాలను పాలించాడు. వేయిచేతులు కలవాడు. ఇతడు భగవదంశతో అవతరించిన, అత్రికులంలో జన్మించిన దత్తాత్రేయుని ఆరాధించి వేయిచేతులు, అధర్మాన్ని చేసేవారిని నివారించడం, ధర్మయుక్తంగా పృథివిని జయించడం, ధర్మానుసారంగా భూమిని పరిపాలించడం, శత్రువులనుంచి ఓటమి లేకపోవడం, సకలలోకాలలోను ప్రఖ్యాతిగాంచిన పురుషునివల్ల మరణం అనే వరాలు కోరుకొన్నాడు. వాటిని వరాలుగా పొందాడు కూడ. అతడు ఈ సకలద్వీపాలతో కూడుకొన్న భూమిని అంతా చక్కగా పరిపాలించాడు. పదివేల యజ్ఞాలు చేశాడు. అతనికి చెందిన ప్రస్తుతి శ్లోకం ఈ నాటికీ గానం చేయబడుతోంది.

**నూనం న కార్తవీర్యస్య గతిం యాస్యన్తి పార్థివాః ।**
**యజ్ఞైర్దానైస్తపోభిర్వా ప్రశ్రయేణ దమేన చ ॥ 4 ॥**

యజ్ఞాలు, దానాలు, తపస్సులు, వినయం, ఇంద్రియనిగ్రహం మున్నగు వాటిలో ఏరాజులు నిశ్చయంగా కార్తవీర్యునికి సాటిరారు.

**అనష్టద్రవ్యతా చ తస్య రాజ్యేఽభవత్ ॥ 5 ॥**

అతని రాజ్యపాలనలో పదార్థాలు నశించి పోవడమన్నది జరగలేదు.

**ఏవం పంచాశీతి సహస్రవర్షాణి, అవ్యాహతారోగ్యశ్రీబలపరాక్రమో రాజ్యమకరోత్. మాహిష్మత్యాం దిగ్విజయాఖ్యాగతో నర్మదాజలావగాహన క్రీడాతిపానమదాకులేనాయత్నేనైవ, తేనాశేషదేవదైత్యగన్ధర్వేశ జయోద్భూత మదావలేపోఽపి రావణః పశురివ బద్ధ్వా స్వనగరైకాన్తే స్థాపితః ॥ 6 ॥**

ఈ విధంగా అతడు ఎనభై ఐదువేల సంవత్సరాలు ఆరోగ్యం, సంపద, బలం, పరాక్రమం అనే వాటికి ఎదురులేకుండా రాజ్యపరిపాలన చేశాడు. ఒకనాడు కార్తవీర్యార్జునుడు నర్మదాజలాలలో స్నానక్రీడలో అతిపానమదాకులుడై ఉన్నాడు. ఆ సమయంలో సమస్తదేవతలను, దైత్యులను, గంధర్వేశ్వరులను జయించి అహంకారగర్వంతో మాహిష్మతీనగరానికి దిగ్విజయంకోసమై రావణుడు వచ్చాడు. అపుడతడు దశకంఠుని మరీ పెద్దప్రయత్నం ఏమిచేయకుండానే పశువును బంధించినట్లు కట్టివేసి తననగరంలో నిర్జనప్రదేశంలో ఖైదీగా ఉంచాడు.

**యః పంచాశీతి వర్షసహస్రోపలక్షణ కాలావసానే, భగవన్నారాయణాంశేన పరశురామేణ ఉపసంహృతః తస్య చ పుత్రశతప్రధానాః పంచ పుత్రా బభూవుః. శూర, శూరసేన, వృషసేన (వృషణ), మధు, జయధ్వజ సంజ్ఞాః**

ఎనభై ఐదువేల సంవత్సరాల కాలం పూర్తి అయిన తరవాత, భగవంతుడగు నారాయణాంశచే అవతరించిన పరశురాముడు ఈ అర్జునుని సంహరించాడు. అతనికి నూర్గురు కొడుకులు ఉన్నారు. అందు ఐదుగురు కుమారులు ప్రధానులు. వారు శూరుడు, శూరసేనుడు, వృషణుడు (వృషసేనుడు), మధుడు, జయధ్వజుడు అనేవారు.

**జయధ్వజాత్ తాలజంఘః పుత్రోఽభవత్. తాలజంఘస్య పుత్రశతమాసీత్. యేషాం జ్యేష్ఠో వీతిహోత్రః, తథాఽన్యో భరతః, భరతాద్ వృషసుజాతౌ చ. వృషస్య పుత్రో మధురభవత్. తస్యాపి వృష్ణిప్రముఖం పుత్రశతమాసీత్, యతో వృష్ణిసంజ్ఞామేతద్గోత్రమవాప. మధుసంజ్ఞాహేతుశ్చ మధురభవత్. యాదవాశ్చ యదునామోపలక్షణాత్॥ 7॥**

జయధ్వజునకు తాలజంఘుడనే పుత్రుడు కలిగాడు. తాలజంఘునికి వందమంది కుమారులు కలిగారు. వీరిలో పెద్దవాడు వీతిహోత్రుడు. తరువాతివాడు భరతుడు. భరతునివల్ల వృషుడు, సుజాతుడు జన్మించారు. వృషునికి మధువనే పుత్రుడు కలిగాడు. అతనికి వృష్ణిమున్నగు వందమంది పుత్రులు కలిగారు. అతనివల్లనే ఈ గోత్రానికి వృష్ణినామం లభించింది. మధువు పేరు కారణంగా మధువంశ నామం కూడ వచ్చింది. యదువు వంశస్థుల పేరును బట్టి యాదవులనే పేరుకూడ పొందింది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే సహస్రబాహోః అర్జునస్య చరిత్రమితి ఏకాదశోఽధ్యాయః సమాప్తః ॥ 11 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో సహస్రబాహువైన అర్జునుని చరిత్ర అనే పదకొండవ అధ్యాయం సమాప్తం॥ 11॥



## ద్వాదశోஉధ్యాయః - పన్నెండవ అధ్యాయం

## యదుపుత్రస్య క్రోష్టోః వంశవర్ణనమ్ – యదుపుత్రుడైన క్రోష్టుని వంశవర్ణన

**క్రోష్టోశ్చ యదుపుత్రస్యాత్మజో ధ్వజినీవాన్. తతశ్చ స్వాహి, తతో రుషద్రుః, రుషద్రోశ్చిత్రరథః తత్తనయ శ్శశబిన్దుః, చతుర్దశ మహారత్నేశశ్చక్రవర్త్యభవత్ ॥1॥**

పరాశరుడు చెబుతున్నాడు. మైత్రేయా! యదువు కుమారుడైన క్రోష్టువు పుత్రుడే ధ్వజినీవంతుడు. అతనివల్ల స్వాహి, అతనివల్ల రుషద్రువు (రుశంకుడు), రుషద్రునివల్ల చిత్రరథుడు కలిగారు. అతని కుమారుడు శశబిందువు. అతడు పద్నాలుగు మహారత్నాలకు ప్రభువు. అంతేకాక చక్రవర్తి కూడా అయ్యాడు.

**తస్య చ శత సహస్రం పత్నీనామభవత్. దశలక్ష సంఖ్యాశ్చ పుత్రాః. తేషాం చ పృథుయశాః, పృథుకర్మా, పృథుజయః, పృథుదానః, పృథుకీర్తిః, పృథు శ్రవాః షట్పుత్రాః ప్రధానాః. పృథుశ్రవసః పుత్రః పృథుతమః, తస్మాదుశనాః, యో వాజిమేధానాం శతమాజహార. తస్య చ శితేషుర్నామ పుత్రోஉభూత్, తస్యాపి రుక్మకవచః, తతః పరావృత్, పరావృతో రుక్మేషు, పృథురుక్మ, జ్యామఘు, పాలిత, హరిత సంజ్ఞాః పంచాత్మజా బభూవుః. అత్రాద్యాపి జ్యామఘస్య శ్లోకో గీయతే ॥ 2 ॥**

అతనికి లక్షమంది భార్యలు ఉండేవారు. పదిలక్షలమంది కుమారులు అతనికి కలిగారు. వారిలో పృథుయశుడు, పృథుకర్ముడు, పృథుజయుడు, పృథుదానుడు, పృథుకీర్తి, పృథుశ్రవుడు అనే ఆరుగురు పుత్రులు ప్రధానులు. పృథుశ్రవుని కుమారుడు పృథుతముడు. అతనివల్ల ఉశనుడు కలిగాడు. అతడు నూరు అశ్వమేధయాగాలు చేశాడు. అతనికి శితేషుడు (శితపుడు) అనే పుత్రుడు జన్మించాడు. అతనివల్ల రుక్మకవచుడు, అతనివల్ల పరావృత్తు, పరావృత్తునివల్ల రుక్మేషువు, పృథురుక్ముడు, జ్యామఘుడు, పాలితుడు, హరితుడు అనే ఐదుగురు కుమారులు కలిగారు. ఈ నాటికీ కూడ ఆ జ్యామఘునికి సంబంధించిన ప్రశస్తిగీతం గానం చేయబడుతూనే ఉంది.

**భార్యావశ్యాస్తు యే కేచిద్ భవిష్యన్త్యథ వా మృతాః**
**తేషాన్తు జ్యామఘః శ్రేష్ఠః శైబ్యాపతిరభూన్నృపః ।**

**అపుత్రా తస్య సాஉపత్నీ శైబ్యా నామ తథాஉ ప్యసౌ ।**
**అపత్యకామోஉపి భయాన్నాన్యాం భార్యామవిన్దత ॥**

భార్యకు వశమైనవారు ఇక ముందూ ఉంటారు. గతంలో ఉండి మరణించినవారూ ఉన్నారు. వారందరిలోను శైబ్యభర్తయైన జ్యామఘుడు అనే రాజేంద్రుడే మిక్కిలి శ్రేష్ఠుడు. ఆయన భార్య శైబ్య వంధ్య. జ్యామఘుడు సంతానం కావాలనే కోరికతో ఉన్నవాడు. అయినా అతడు భార్యనుండి భయంతో మళ్లీ పెళ్లి చేసుకోలేదు.

**స త్వేకదాஉతిప్రభూతగజతురగసమ్మర్దేనాతిదారుణే మహాహవే యుధ్యమానః సకలమేవారాతిచక్ర మజయత్. తచ్చారిచక్రమపాస్తపుత్రకలత్రబన్ధుబలకోశం స్వమధిష్ఠానం పరిత్యజ్య దిశః ప్రవిద్రుతమ్ ॥ 3 ॥**

అతడు ఒకప్పుడు రథగజతురగసమ్మర్దమైన గొప్ప సైన్యంకల శత్రుపక్షంతో మహాభయంకరమైన యుద్ధంచేస్తూ సమస్తశత్రుసమూహాన్ని జయించాడు. ఆ వైరిమండలం అంతా పుత్రులు, కళత్రాలు, బంధువులు, సైన్యాలు, కోశాగారాలు నశించగా తమరాజధాని నగరం విడిచిపెట్టి చెల్లాచెదరై పారిపోయింది.

**తస్మింశ్చ విద్రుతేఽతిత్రాసాల్లోలాయతలోచనయుగలం త్రాహి త్రాహి తాత భ్రాతరిత్యాకులవిలాప విధురం స రాజకన్యారత్నమద్రాక్షీత్ ॥ 4 ॥**

అందరూ అలా పారిపోయాక, మిక్కిలిభయంతో విశాలమైన కన్దోయిని ఇటు అటూ త్రిప్పుతూ "రక్షించు రక్షించు నాన్నా! అన్నా!" అని కలవర పడుతూ విలపిస్తున్న ఒక ఉత్తమ రాజకన్యను అతడు చూశాడు.

**తద్దర్శనాచ్చ తస్యామనురాగానుగతాన్తరాత్మా స భూపోఽచిన్తయత్ ॥ 5 ॥**

ఆమెను చూడగానే, ఆమెయందు జాలితో కూడ ప్రేమ మనస్సులో పొందినవాడై ఆ భూపాలుడు ఇలా ఆలోచించాడు.

**సాధ్విదం మయాఽపత్యవిరహితస్య వన్ధ్యాభర్తుః సామ్ప్రతం విధినా, అపత్యకారణం కన్యారత్న ముపపాదితమ్, తదేతత్ సముద్వహామి. అథ చైనాం స్యన్దనమారోప్య స్వమధిష్ఠానం నయామి ॥ 6 ॥**

**తథైవ దేవ్యాఽహమనుజ్ఞాతః సముద్వహామీతి. అథైనాం రథమారోప్య స్వనగరమాగచ్ఛత్ ॥ 7 ॥**

నిరంతరం సంతానంగురించి ఆలోచించే ఆ రాజు "చాలా బాగుంది. సంతానంలేని నాకు, ఈ గొడ్రాలి మగనికి, ఇప్పుడు సంతానకారణమైన ఈ కన్యారత్నాన్ని దైవమే సమకూర్చాడు. కాబట్టి ఈమెను నేను పెండ్లి చేసుకొంటాను. అందువల్ల ఈమెను రథం ఎక్కించుకొని నారాజధానికి తీసుకొని వెడతాను. ఆ దేవియైన శైబ్య అనుమతితోనే నేను ఈమెను పెండ్లి చేసుకొంటాను. "అని ఆమెను స్యందనం ఎక్కించుకొని తననగరం వెళ్లాడు.

**విజయినం చ రాజానమ్, అశేషపౌరభృత్యపరిజనామాత్య సమవేతా శైబ్యా ద్రష్టుమధిష్ఠాన ద్వారమాగతా॥8॥**

విజయాన్ని చేబట్టి వస్తున్న రాజును చూడడానికై, సమస్తభృత్యులతోను, పరిజనాలతోను, మంత్రులతోను కూడుకొన్నదై రాణియైన శైబ్య నగరద్వారంవద్దకు వచ్చింది.

**సా చ అవలోక్య రాజ్ఞః సవ్యపార్శ్వవర్తినీం కన్యామీషదుద్భూతామర్షస్ఫురదధరపల్లవా రాజానమవోచత్, అతిచపలచిత్తాఽత్ర స్యన్దనే కేయమారోపితా ఇతి. అసావప్యనాలోచితోత్తరవచనోఽతిభయాత్ తామాహ, స్నుషా మమేయమితి ॥ 9 ॥**

ఆమె రాజుకు ఎడం ప్రక్కన ఉన్న కన్యను చూచింది. వెంటనే కోపం కొంచెం పుట్టుకొని వచ్చింది. అనుకోకుండా చిగురుటాకులాంటి క్రింద పెదవి అదరింది. రోషంతో రాజుతో ఇలా "మిక్కిలి చాంచల్యచిత్తం కల్గిన రాజా! ఈ రథంలో ఎక్కించు కొన్నావు ఎవరిని?" అని ప్రశ్నించింది. ఆ రాజేంద్రుడు కూడా సమాధానం ఆలోచించుకొని ఉండని కారణంచే, ఆమె ఏమంటుందో అన్న భయాతిరేకంతో ఆమెతో "ఈమె నాకోడలు" అన్నాడు.

**నాహం ప్రసూతా పుత్రేణ నాన్యా పత్న్యభవత్ తవ ।**
**స్నుషా సమ్బన్ధవాచ్యైషా కతమేన సుతేన తే ॥ 10 ॥**

"నేను పుత్రునే కనలేదు. పుత్రునితో కూడు కొన్న వేరే పత్ని నీకు లేనేలేదు. ఏకుమారునివల్ల నీకు ఈమె కోడలిసంబంధం కలదయ్యింది?" అని శైబ్య అడిగింది.

**ఇత్యాత్మేర్ష్యా కోపకలుషితవచన ముషితవివేకతయా దురుక్తపరిహారార్థమిదమవనీపతిరాహ ॥ 11 ॥**

ఇలా ఆమె చూపించిన ఈర్ష్య, కోపంతో తడబడిన మాటలచే వివేకంకోల్పోయి, జంకుతూ, పలికిన తప్పును సరిదిద్దుకోవడానికై రాజు ఈమాట అన్నాడు.

**యస్తే జనిష్యత్యాత్మజః తస్యేయమనాగతమేవ భార్యా నిరూపితా. ఇత్యాకర్ణ్యోద్భూత మృదుహాసా తథేత్యాహ ప్రవివేశ చ రాజ్ఞా సహాధిష్ఠానమితి ॥ 12 ॥**

"నీకు పుట్టబోయే కొడుకుకు ఈమె భార్య అవుతుందిలే. జరగబోయే విషయానికి నేను ఇలా నిర్ణయించాను" అని రాజు చెప్పిన మాట విని రాణి చిరునవ్వు పొటమరిస్తూ ఉండగా "సరే" అని రాజుతో పాటు నగరంలో ప్రవేశించింది.

**అనన్తరం చాతిశుద్ధ లగ్నహోరాంశకావయవోక్త కృతపుత్రజన్మలాభగుణాద్ వయసః పరిణామము పగతాఽపి శైబ్యా స్వల్పైరేవాహోభిర్గర్భమవాప ॥ 13 ॥**

ఆ తరువాత మిక్కిలి శుద్ధమైన లగ్నం, హోర, అంశ, అవయవంతో కూడుకొన్న శుభవేశలో, పుత్ర జన్మలాభం గురించి మాట్లాడుకొన్న కారణంచే శైబ్యవయస్సు మళ్లిపోయినప్పటికీ కొద్ది రోజులలోనే గర్భం ధరించడం జరిగింది.

**కాలేన చ పుత్రమజీజనత్. తస్య చ విదర్భ ఇతి పితా నామ చక్రే. స చ తాం స్నుషాముపయేమే ॥ 14॥**

తగిన సమయంలో ఆమె (నవయౌవనవంతుడైన) కుమారుని కన్నది. తండ్రి అతనికి విదర్భుడని పేరు పెట్టాడు. ఆ విదర్భుడే కోడలని చెప్పిన రాజకన్యను పెళ్లి చేసుకొన్నాడు.

**తస్యాం చాసే క్రథ కౌశిక సంజ్ఞా పుత్రావజనయత్. పునశ్చ తృతీయం రోమపాదసంజ్ఞం కుమారమజీజనత్. (యో నారదాదవాప్తజ్ఞానవానభవత్.) రోమపాదాద్ బభ్రుః, బభ్రోః పుత్రో ధృతిః ।**

అతనివల్ల ఆమెకు క్రథుడు, కౌశికుడు అనే ఇరువురు పుత్రులు జన్మించారు. మళ్లీ రోమపాదుడనే మూడవ కుమారుడు కలిగాడు (అతడు నారదునివల్ల జ్ఞానవంతుడయ్యాడు.) రోమపాదునివల్ల బభ్రువు. బభ్రువుకు పుత్రుడుగా ధృతి కలిగారు.

**కౌశికస్యాపి చేదిః పుత్రోఽభూత్, యస్య సన్తతౌ చైద్యా భూపాలాః, క్రథస్య స్నుషాపుత్రస్య పుత్రః కున్తిరభవత్ ॥ 15 ॥**

కౌశికునికి చేది అనే పుత్రుడు కలిగాడు. అతని సంతానంలోని భూపాలురు చైద్యులు అయ్యారు. స్నుషా పుత్రుడైన క్రథునికి కుంతి అనే పుత్రుడు పుట్టాడు.

**కున్తేర్వృష్ణిః, వృష్ణేర్నిర్వృతిః, నిర్వృతేర్దశార్హః, తతశ్చ వ్యోమా, తస్మాదపి జీమూతః, తస్యాపి వంశాకృతిః, తతో భీమరథః, తస్మాత్ నవరథః, తతశ్చ దశరథః, తస్య శకునిః, తత్తనయః కరమ్భిః, కరమ్భేర్దేవరాతోఽభవత్. తస్మాద్ దేవక్షత్రః, తస్య మధుః, మధోరనవరథః, అనవరథాత్ కురువత్సః, తతశ్చానురథః, తతః పురుహోత్రో జజ్ఞే, తతశ్చ అంశః, తతశ్చ సత్వతః, సత్వతాదేతే సాత్వతాః ॥ 16 ॥**

కుంతివల్ల వృష్ణి, వృష్ణివల్ల నిర్వృతి, నిర్వృతివల్ల దశార్హుడు, అతనివల్ల వ్యోముడు, అతనివల్ల జీమూతుడు, అతనికి వంశాకృతి, అతనివల్ల భీమరథుడు, అతనివల్ల నవరథుడు, అతనివల్ల దశరథుడు, అతనివల్ల శకుని కలిగారు. అతని కుమారుడే కరంభి. కరంభికి దేవరాతుడు కలిగాడు. అతనివల్ల దేవక్షత్రుడు, అతనికి మధువు, మధువుకు అనవరథుడు, అనవరథునివల్ల కురువత్సుడు, అతనికి అనురథుడు, అతనివల్ల పురుహోత్రుడు కలిగారు. అతనివల్ల అంశుడు, అతనివల్ల సత్వతుడు, కలిగారు. సత్వతునివల్ల ఈ వంశం వారు సాత్వతులయ్యారు.

**ఇత్యేతాం జ్యామఘసన్తతిం సమ్యక్ శ్రద్ధాసమన్వితః శ్రుత్వా సర్వపాపైః ప్రముచ్యతే । 17 ॥**

మైత్రేయా! ఈవిధమైన ఈ జ్యామఘుని సంతతిని గూర్చి చక్కని శ్రద్ధతో విన్నవాడు సమస్తపాపాలనుంచి విముక్తుడవుతాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే యదుపుత్రస్య క్రోష్టోఃవంశవర్ణనం నామ ద్వాదశోఽధ్యాయః సమాప్తః ॥ 12 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో యదుపుత్రుడైన క్రోష్టునివంశవర్ణన అనే పన్నెండవ అధ్యాయం సమాప్తం॥12॥



## త్రయోదశోఽధ్యాయః - పదమూడవ అధ్యాయం
## స్యమన్తకమణి వృత్తాంతః - స్యమన్తకమణి వృత్తాంతం

**భజనభజమానదివ్యాన్ధకదేవావృథమహాభోజవృష్ణిసంజ్ఞాః సత్వతస్య పుత్రా బభూవుః ॥ 1 ॥**

సత్వతునికి భజనుడు, భజమానుడు, దివ్యుడు, అంధకుడు, దేవావృథుడు, మహాభోజుడు, వృష్ణి అనే కుమారులు కలిగారు.

**భజమానస్య నిమివృకణవృష్ణయః, తథాఽన్యే(త)ద్వైమాత్రాః శతజిత్, సహస్రజిద్, అయుతజిత్ సంజ్ఞాస్త్రయః ॥ 2 ॥**

భజమానునికి నిమి, వృకణుడు, వృష్ణి అనేవారు కలిగారు. అలాగే మరోభార్యవల్ల శతజిత్తు, సహస్రజిత్తు, అయుతజిత్తు అనే ముగ్గురు కుమారులు కలిగారు.

**దేవావృథస్యాపి బభ్రుః పుత్రోఽభూత్. తస్య చ అయం శ్లోకో గీయతే ॥ 3 ॥**

దేవావృథునికి బభ్రువు అనే పుత్రుడు కలిగాడు. అతనినిగూర్చి ఈ శ్లోకం గానం చేయబడుతోంది.

**యథైవ శృణుమో దూరాత్ సమ్పశ్యామస్తథాఽన్తికాత్ ।**
**బభ్రుః శ్రేష్ఠో మనుష్యాణాం దేవై ర్దేవావృథః సమః ॥ 4 ॥**

**పురుషాః షట్ చ షష్టిశ్చ షట్ సహస్రాణి చాష్ట చ ।**
**యేఽమృతత్వమనుప్రాప్తా బభ్రోర్దేవావృథాదపి ॥ 5 ॥**

దూరంనుంచి విన్ననట్లుగానే, దగ్గరనుంచి కూడా చూడడం జరిగింది. దేవతలతో సమానుడు దేవావృథుడయితే, మనుష్యులలో శ్రేష్ఠుడు బభ్రుడయ్యాడు. ఆరువేల డెబ్బై నాలుగుమంది మానవులు బభ్రుని వల్ల, దేవావృథునివల్ల అమృతత్వం పొందారు.

**మహాభోజస్త్వతిధర్మాత్మా. తస్యాన్వయే భోజా మృత్తికావరపురనివాసినో మార్తికావరా బభూవుః ॥ 6 ॥**

అందు మహాభోజుడు మిక్కిలి ధర్మాత్ముడు. అతని వంశంలోని భోజులు మృత్తికావరపురంలో నివసించి మార్తికావరులు అయ్యారు.

**వృష్ణేః సుమిత్రో యుధాజిచ్చ పుత్రావభూతామ్. తతశ్చానమిత్రశినీ తథా । 7 ॥**

వృష్ణికి సుమిత్రుడు, యుధాజిత్తు అనే ఇద్దరు పుత్రులు కలిగారు. అలాగే వారివల్ల అనమిత్రుడు, శిని కలిగారు.

**అనమిత్రాన్నిఘ్నః, నిఘ్నస్య ప్రసేనసత్రాజితౌ. తస్య చ సత్రాజితస్య భగవానాదిత్యః సఖాఽభవత్ ॥ 8 ॥**

అనమిత్రునివల్ల నిఘ్నుడు, నిఘ్ననకు ప్రసేనుడు, సత్రాజితుడు అనే ఇద్దరు కుమారులు కలిగారు. ఆ సత్రాజిత్తుకు భగవంతుడైన ఆదిత్యుడు మిత్రుడయ్యాడు.

**ఏకదా త్వమ్భోధేస్తీరసంశ్రయః సూర్యం సత్రాజిత్తుష్టావ. తన్మనస్కతయా చ భాస్వానభిష్టూయ మానోఽ గ్రత స్తస్థౌ. తతస్తు, అస్పష్టమూర్తిధరం చైనమాలోక్య సత్రాజితః సూర్యమాహ యథైవ వ్యోమ్ని త్వాం వహ్నిపిణ్డో పమమహమపశ్యం, తథైవాద్యాగ్రతో గతమప్యత్ర న కించిద్ భగవతా ప్రసాదీకృతం విశేషముపలక్షయామి ॥ 9 ॥**

ఒకనాడు సత్రాజితుడు సముద్రతీరంలో సావధానుడై ఉండి సూర్యుని సంస్తుతించాడు. ఏకాగ్ర చిత్తంతో అతడు ప్రస్తుతిస్తూ ఉంటే భాస్వంతుడు ఎదుట నిలిచాడు. ఆ తరువాత కనబడీ కనబడకుండా ఉన్న ఆకారంతో ఉన్న సూర్యునిచూచి సత్రాజిత్తు ఆయనతో "ఆకాశంలో నిన్ను అగ్నిగోళంగా చూసినట్లే, ఇక్కడ ఎదురుగా ఉన్నప్పుడూ కూడా అలాగే చూస్తున్నాను. భగవానుడు నాకు ఇప్పుడు దయచూపించిన అనుగ్రహవిశేషం ఏమి ప్రత్యేకంగా కనిపించడం లేదు" అన్నాడు.

**ఇత్యేవముక్తే భగవతా సూర్యేణ నిజకణ్ఠాదున్ముచ్య స్యమన్తకం నామ మణిమవతార్య ఏకాన్తే న్యస్తమ్. తతస్తయా తామ్రోజ్జ్వలహ్రస్వవపుషమ్ ఈషదాపింగల నయనమాదిత్యమద్రాక్షీత్. కృత ప్రణిపాతస్తవాదికం చ సత్రాజితమాహ భగవాన్, 'వరమస్మత్తోఽ భిమతం వృణీష్వే'తి. స చ తదేవ మణిరత్నమయాచత. స చాపి తస్మై తద్ దత్వా వియతి స్వం ధిష్ణ్యమారురోహ ॥ 10 ॥**

అతడు ఇలా అనగానే భగవంతుడైన సూర్యుడు తనకంఠసీమనుంచి స్యమంతకమనే శ్రేష్ఠమైన మణిని బయటకుతీసి విడిగా ఒక ప్రక్కన ఉంచాడు. ఆ తరవాత సత్రాజితుడు కొంచెం రాగిరంగుకాంతితో అంతటా ప్రకాశిస్తున్న పొట్టిదైన శరీరంకల, కొంచెం గోరోచనరంగుకల నేత్రాలుకల ఆదిత్యుని చూశాడు. వెంటనే వినయంతో వంగి నమస్కరించాడు. భక్తితో స్తోత్రం చేశాడు. అపుడు సూర్యభగవానుడు సత్రాజిత్తుతో "నానుంచి నీఅభీష్టమైన వరం కోరుకో" అన్నాడు. అతడు ఆ స్యమంతకమణిరత్నాన్ని ఇమ్మని కోరాడు. ఆదిత్యుడు కూడా దానిని అతనికిచ్చి, ఆకాశంలో తన నివాసస్థానానికి వెళ్లిపోయాడు.

**సత్రాజితోఽ ప్యమలమణిరత్నసనాథకణ్ఠతయా సూర్య ఇవ తేజోభిరశేషదిగన్తరాణ్యుద్భాసయన్ ద్వారకాం వివేశ ॥ 11 ॥**

స్వచ్ఛమైన మణిరత్నాన్ని కంఠంలో వేసుకొన్నందున, సత్రాజిత్తుకూడ అపర సూర్యునిలా తన కాంతులతో సమస్తదిక్కులమధ్యభాగాలను ప్రకాశింపజేస్తూ ద్వారకానగరం ప్రవేశించాడు.

**ద్వారకావాసిజనస్తు తమాయాన్తమవేక్ష్య భగవన్తమనాదిపురుషం పురుషోత్తమమవనిభారావతారణాయాంశేన మానుషరూపధారిణం ప్రణిపత్యాహ, భగవన్! భగవన్తమయం నూనం ద్రష్టుమాయాత్యాదిత్యః. ఇత్యాకర్ణ్య ప్రహస్య చ తానాహ భగవాన్. నాయమాదిత్యః సత్రాజితోఽ యమాదిత్యదత్తం స్యమన్తకాఖ్యం మహామణిం బిభ్రదత్రోపయాతి. తదేనం విస్రబ్ధాః పశ్యత, ఇత్యుక్తాస్తే యయుః (తథైవ దదృశుః) ॥ 12 ॥**

ద్వారకాపురిలో నివసించే జనులు ఆ వస్తున్న వానిని చూశారు. భూభారాన్ని తగ్గించడంకోసం అంశతో మనుష్యరూపం ధరించిన అనాదిపురుషుడైన భగవంతుడగు పురుషోత్తమునికి నమస్కరించి "భగవానుడా! నిన్ను చూడడానికై నిశ్చయంగా ఆ ఆదిత్యుడే వస్తున్నాడు" అని నివేదించారు. అపుడు అది విని భగవంతుడగు

శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వి "ఇతడు ఆదిత్యుడు కాదు. సత్రాజిత్తు ఇతడు. ఆదిత్యుడిచ్చిన స్యమంతకమనే పేరు గల మహామణిని ధరించి వస్తున్నాడు. కాబట్టి ప్రశాంతులై ఇతనిని చూడండి." అని చెప్పాడు. ఆ మాటలు విని వారు అలాగే చూశారు. అనంతరం అక్కడనుంచి వెళ్లిపోయారు.

**స చ తం స్యమన్తకాఖ్యం మహామణిమాత్మనివేశనే చక్రే ॥ 13 ॥**

ఆ సత్రాజిత్తు కూడా స్యమంతకమనే ఆ మహామణిని తన గృహంలో భద్రపరచుకొన్నాడు.

**ప్రతిదినం చ తన్మణిరత్నప్రవరమష్టౌ కనకభారాన్ స్రవతి ॥ 14 ॥**

ప్రతిదినం ఆ మహామణిరత్నం ఎనిమిది బారువుల బంగారాన్ని ప్రసాదిస్తుంది.

**తత్ప్రభావాచ్చ సకలస్యైవ రాష్ట్రస్యోపసర్గానావృష్టివ్యాలాగ్నిచోరదుర్భిక్షాది భయం న భవతి ॥ 15 ॥**

దాని ప్రభావంవల్ల సమస్తరాష్ట్రానికి ఉత్పాతాలు, అనావృష్టి, క్రూరమృగభయాలు, అగ్నిభయం, చోరభయం, కరువులు, రోగాలు మున్నగు భయాలు లేకుండా ఉంటుంది.

**అచ్యుతోఽపి తద్రత్నముగ్రసేనస్య భూపతే ర్యోగ్యమేతదితి లిప్సాం చక్రే. గోత్రభేదభయాచ్ఛక్తోఽపి న జహార ॥ 16 ॥**

అచ్యుతుడు కూడా ఆ దివ్యరత్నం రాజైన ఉగ్రసేనుని సన్నిధిలో ఉండడానికి తగినటువంటిదని దానిని పొందగోరాడు. అయినా స్వజాతీయులతో కలహం ఏర్పడుతుందని సమర్థుడయినా దానిని బలవంతంగా తీసుకోలేదు.

**సత్రాజితోఽప్యచ్యుతో మామేతద్ యాచిష్యతీత్యవగతరత్నలోభః స్వభ్రాత్రే ప్రసేనాయ తద్రత్నం దత్తవాన్ ॥ 17 ॥**

సత్రాజిత్తుకూడా "అచ్యుతుడు నన్ను ఈ మణిని అడిగి తీరుతాడు." అని భావించాడు. కాని రత్నంమీద లోభదృష్టికలిగినవాడై సోదరుడైన ప్రసేనునికి ఒకనాడు ఆ మణిని ఈయడం జరిగింది.

**తచ్చ శుచినా ధ్రియమాణమశేషసువర్ణస్రవాదికం గుణముత్పాదయతి, అన్యథా య ఏవ ధారయతి, తమేవ హన్తీతి. అసావపి ప్రసేనః స్యమన్తకేన కణ్ఠాసక్తేన అశ్వమారుహ్య, అటవ్యాం మృగయామగచ్ఛత్. తత్ర చ సింహాద్ వధమవాప. సాశ్వం చ తం నిహత్య సింహోఽప్యమలమణిరత్నమాస్యాగ్రేణాదాయ గన్తుముద్యతః. ఋక్షాధిపతినా జామ్బవతా దృష్టో ఘాతితశ్చ. జామ్బవానప్యమలం తన్మణిరత్నమాదాయ స్వబిలం ప్రవివేశ. సుకుమారకసంజ్ఞాయ చ బాలకాయ క్రీడనకమకరోత్ ॥ 18 ॥**

అది సదాచారవంతుడైనవాడు ధరిస్తే బంగారం ప్రసవించడం మున్నగు సమస్తగుణసముదాయాన్ని కలిగి ఉంటుంది. లేదా ధరించిన వానినే సంహరించి వేస్తుంది. అది తెలియని ప్రసేనుడు ఆ స్యమంతకాన్ని మెడలో ధరించి గుర్రం ఎక్కి అడవిలోనికి వేటకు వెళ్లాడు. అక్కడ సింహంవల్ల మరణం పొందాడు. సింహం గుర్రంతో పాటుగా అతనిని సంహరించి స్వచ్ఛమైన కాంతులను ప్రసరింపజేసే మణిరత్నాన్ని నోటకరచి పట్టుకొని

వెళ్లడానికి ప్రయత్నం చేసింది. ఆ సమయంలో భల్లూకాధిపతి అయిన జాంబవంతుడు దానిని చూచి సంహరించాడు. జాంబవంతుడు ఆ శ్రేష్ఠమైన మణిని సంగ్రహించి తనగుహలోనికి ప్రవేశించాడు. సుకుమారకుడనే చిన్నపిల్లవానికి దానికి ఆటవస్తువుగా చేశాడు.

**అనాగచ్ఛతి చ తస్మిన్ ప్రసేనే, కృష్ణో మణిరత్నమభిలషితవాన్, న చ ప్రాప్తవాన్, నూనమేతదస్య కర్మ, నాన్యేన ప్రసేనో హన్యేత ఇత్యఖిల ఏవ యదులోకః పరస్పరం కర్ణాకర్ణ్యకథయత్ ॥ 19 ॥**

ఎన్నాళ్లకు ప్రసేనుడు రాకపోయేసరికి “కృష్ణుడు మణిరత్నం కోరినమాట వాస్తవం. కాని అతడు దానిని పొంది యుండలేదు. ఇది నిశ్చయంగా అతని పనే. అతనిచే తప్ప మరొక్కరిచే ప్రసేనుడు మరణించడం అనే మాట కల్ల” అని అఖిలయాదవలోకం ఒకళ్ల చెవులు ఒకరు కొరుక్కొన్నారు.

**విదిత లోకాపవాదవృత్తాన్తశ్చ భగవాన్ యదుసైన్య పరివారః, ప్రసేనాశ్వపదవీమనుససార. దదర్శ చాశ్వసమేతం ప్రసేనం నిహతం సింహేన. అఖిల జనపదమధ్యే సింహపదదర్శనకృతపరిశుద్ధిః సింహపదమనుససార ॥20॥**

ఈ లోకనిందావృత్తాంతం తెలుసుకొన్న భగవంతుడు సమస్తయదుసైన్యంతోను, పరివారంతోను కూడు కొన్నవాడై ప్రసేనుని అశ్వం పయనించిన మార్గాన్ని అనుసరించాడు. సింహంవల్ల గుర్రంతోపాటుగా చనిపోయిన ప్రసేనుని చూశాడు. సమస్తజనపదమధ్యంలో సింహం అడుగుజాడలు చూపించి నిందపోగొట్టుకొని, సింహగమన మార్గాన్ని అనుసరించి పయనించాడు.

**ఋక్ష వినిహతం చ సింహమప్యల్పే భూమిభాగే దృష్ట్వా తతశ్చ తద్రత్నగౌరవాదృక్షస్యాపి పదాన్యనుయయౌ. గిరితటే చ సకలమేవ యదుసైన్యమవస్థాప్య తత్పదానుసారీ ఋక్షబిలం ప్రవివేశ. అన్తః ప్రవిష్టశ్చ ధాత్ర్యాః సుకుమారక ముల్లాలయన్త్యా వాణీం శుశ్రావ ॥ 21 ॥**

ఋక్షపతిచే చంపబడిన సింహం కూడా కొద్దిదూరంలోనే నేలపై కనిపించింది. అక్కడనుంచి ఆ రత్నవిషయం తెలుసుకోవాలనే కోరికతో ఆ భల్లూకం అడుగుజాడలనుబట్టి ముందుకు వెళ్లాడు. కొండచరియపై సమస్తయాదవసైన్యాన్ని నిలిపి, ఆ అడుగుజాడలను అనుసరించి ఋక్షగుహలో ప్రవేశించాడు. లోపలకువెళ్లిన వాడై శ్రీకృష్ణుడు సుకుమారకుని లాలిస్తున్న దాది మాటలను విన్నాడు.

**సింహః ప్రసేనమవధీత్ సింహో జామ్బవతా హతః ।**
**సుకుమారక! మా రోదీస్తవ హ్యేష స్యమన్తకః ॥ 22 ॥**

“ప్రసేనుని సింహం సంహరించింది. జాంబవంతుడు సింహాన్ని వధించాడు. సుకుమారకా! ఏడవవద్దు. ఈ స్యమంతకం ఇక నీదే.”

**ఇత్యాకర్ణ్య లబ్ధస్యమన్తకోదన్తోఽన్తఃప్రవిష్టః కుమారక్రీడనకీకృతం చ ధాత్రీహస్తే తేజోభిర్జాజ్వల్యమానం స్యమన్తకం దదర్శ ॥ 23 ॥**

ఆ మాటలు విని స్యమన్తకమణి దొరకిందని గబగబా లోపలకు ప్రవేశించి, కుమారునికి ఆటవస్తువుగా చేయబడి, దాదిచేతులలో అపూర్వకాంతులతో జాజ్వల్యమానంగా ఉన్న ఆ మణిరత్నాన్ని చూశాడు.

**తం చ స్యమన్తకాభిలాషచక్షుషమపూర్వం పురుషమాగతమవేక్ష్య ధాత్రీ త్రాహి త్రాహీతి వ్యాజహార ॥24॥**

స్యమన్తకంమీద అభిలాషతో నయనాలను ప్రసరింపజేసి వస్తున్న, ఎన్నడూ చూడని పురుషుని చూచి దాది "రక్షించు రక్షించు" అని గట్టిగా అరచింది.

**తదార్తనాదశ్రవణానన్తరం చామర్షపూర్ణహృదయః స జామ్బవాన్ ఆజగామ. తయోశ్చ పరస్పరం యుధ్యతోర్ద్వయోర్యుద్ధ మేకవింశతి దినాన్యభవత్. తే చ యదుసైనికాస్తత్ర సప్తాష్టదినాని తన్నిష్క్రాన్తిముదీక్షమాణాస్తస్థుః. అనిష్క్రమమాణే చ మధురిపౌ, అసావావశ్యమత్ర బిలేఽత్యన్తనాశమాప్తో భవిష్యత్యన్యథా తస్య కథమేతావన్తి దినాని శత్రుజయే వ్యాపేక్షో భవతీతి కృతాధ్యవసాయా ద్వారకామాగతా హతః కృష్ణ ఇతి కథయామాసుః ॥ 25 ॥**

ఆ ఆర్తనాదం విన్నవెంటనే క్రోధంతో ఊగిసలాడిపోయిన హృదయంతో జాంబవంతుడు వచ్చాడు. వారిద్దరికీ అక్కడ పరస్పరం యుద్ధాభిలాషతో ఉన్నారేమో ఇరవై ఒక్కరోజులు పోరు జరిగింది. కొండచరియపై ఉన్న యాదవసైనికులు కృష్ణుడు తిరిగి ఎప్పుడు వస్తాడో అని పదిహేను రోజులు ఎదురుచూస్తూ నిలిచారు. ఆయన ఇక రాకపోయేసరికి ఈ మధుసూదనుడు ఈ కొండగుహలో తప్పని సరిగా వినాశం చెంది ఉంటాడు. లేకపోతే ఆయన బ్రతికి ఉన్నట్లయితే శత్రువులను జయించడానికి ఇన్నిరోజులు ఎందుకు పడుతుంది? అని నిర్ణయం చేసుకొని ద్వారకాపురికి తిరిగి వచ్చి కృష్ణుడు హతుడయ్యాడుని తెలియజెప్పారు.

**తద్బాన్ధవాశ్చ తత్కాలోచితమఖిలముపరతక్రియాకలాపం చక్రుః ॥ 26 ॥**

అతని బాంధవులు కూడా ఆ కాలానికి తగిన సమస్తమైనఔర్ధ్వదైహికక్రియలన్నీ చేశారు.

**తత్ర చాస్య యుధ్యమానస్యాతి శ్రద్ధాదత్త విశిష్టపాత్రోపయుక్తాన్నతోయాదినా కృష్ణస్య బలప్రాణపుష్టిరభూత్ ॥ 27 ॥**

ఆ సమయంలో యుద్ధం చేస్తున్న కృష్ణునికి మిక్కిలి శ్రద్ధతో పెట్టిన, మిక్కిలి విశిష్టులయిన పాత్రుల ద్వారా సమర్పించబడ్డ అన్నజలాదులవల్ల బలప్రాణాలకు పుష్టి ఏర్పడింది.

**ఇతరస్యానుదినమతిగురుపురుషభిద్యమానస్య, అతినిష్ఠురప్రహారపీడితాఖిలావయవస్య నిరాహారతయా బలహానిః నిర్జితశ్చ భగవతా జామ్బవాన్ ప్రణిపత్యాహ-అసుర, సుర,యక్ష, గన్ధర్వ, రాక్షసాదిభిరప్యఖిలైర్భవాన్ న జేతుం శక్యః, కిముతావనిగోచరైరల్పవీర్యైర్నరావయవభూతైశ్చ తిర్యగ్యోన్యనుసృతిభిః కింపునరస్మద్విధైరవశ్యం భగవతోఽస్మత్ స్వామినో నారాయణస్య సకలజగత్పరాయణస్యాంశేన భగవతా భవితవ్యమిత్యుక్తః ॥ 28 ॥**

ఇక ఇతరుడైన జాంబవంతునికి రోజురోజుకు ఆ పురుషోత్తముడు శరీరాన్ని బ్రద్దలుకొడుతూ ఉంటే, మిక్కిలి గట్టివైన దెబ్బలు పడుతూ ఉంటే, అవయవాలన్నీ విరిగి పోయాయి. ఆహారంలేనందువల్ల బలం క్షీణించింది. ఇలా భగవంతునిచే ఓటమిపాలై జాంబవంతుడు ఆయనకు నమస్కరించి "అసురులు, సురలు, యక్షులు, గంధర్వులు,

రాక్షసులు మున్నగు వారు ఎవ్వరూ కూడా నిన్ను జయించడానికి సమర్థులుగారు. ఇక భూమిమీద కనిపించే, తక్కువ బలం కల, నరుల అవయవాలవంటి ఎముకలుగల మావంటి పశుపక్ష్యాది జన్మలు ఎత్తిన వారి సంగతి చెప్పేది ఏముంటుంది? నీవు తప్పక మాస్వామి అయిన నారాయణుడైన శ్రీరామచంద్రమూర్తి వలెనె, సకలజగత్తులను రక్షించడానికి నారాయణాంశతో అవతరించిన భగవంతుడవై ఉంటావు" అని వేడుకొన్నాడు.

**తస్మై భగవానఖిలమవనిభారావతారమాచచక్షే ॥ 29 ॥**

జాంబవంతుడు అలా అనగానే భగవానుడు అతనితో తాను సమస్తభూభారాన్ని తగ్గించడంకోసమై అవతరించడం గురించి వివరించాడు.

**ప్రీత్యభివ్యంజిత కరతలస్పర్శనేన చైనమపగతయుద్ధఖేదం చకార ॥ 30 ॥**

ప్రీతితో అభివ్యక్తమైన తనహస్తతలస్పర్శచే శరీరాన్ని నిమిరి, అతనికి యుద్ధంవల్ల ఏర్పడిన శ్రమను అంతా పోగొట్టాడు.

**స చ ప్రణిపత్యైనం పునరపి ప్రసాద్య జామ్బవతీం నామ కన్యాం గృహాగమనార్ఘ్యభూతాం గ్రాహయామాస ॥31॥**

జాంబవంతుడు మళ్లీ ఆయనకు తలవంచి నమస్కరించి, ఆయనను ప్రసన్నంకావించుకొని ఇంటికి వచ్చిన అతిథికి అర్ఘ్యంరూపంగా జాంబవతి అనే కన్యను ప్రదానం చేశాడు.

**స్యమన్తకమణిమప్యసౌ ప్రణిపత్య తస్మై ప్రదదౌ. అచ్యుతోఽపి, అతిప్రణతాత్ తస్మాదగ్రాహ్యమపి తన్మణిరత్న మాత్మశోధనాయ జగ్రాహ ॥ 32 ॥**

అనంతరం నమస్కరించి స్యమన్తకమణిని కూడ ఆయనకు సమర్పించాడు. శ్రీకృష్ణుడు కూడా మిక్కిలి వినయవంతుడైన అతనినుంచి తీసుకోకూడనిదయినా, తన కళంకం తొలగించుకోవడానికై ఆ మణిరత్నాన్ని స్వీకరించాడు.

**సహ జామ్బవత్యా ద్వారకామాజగామ. భగవదాగమనోద్భూతహర్షోత్కర్షస్య ద్వారకావాసి జనస్య కృష్ణావలోకనానుక్షణమేవాతిపరిణతవయసోఽపి నవయౌవనమివాభవత్. ఆనకదున్దుభిశ్చ దిష్ట్యా దిష్ట్యేతి చ సకలయాదవాః, స్త్రియశ్చ సభాజయామాసుః ॥ 33 ॥**

అపుడు కృష్ణుడు జాంబవతితోకలసి ద్వారకకు వచ్చాడు. భగవంతుని రాకవల్ల కలిగిన మిక్కిలి సంతోషాతిరేకంతో, కృష్ణుని సందర్శించిన మరుక్షణమే ద్వారకలోనివసించే మిక్కిలి వయస్సుమళ్లిన ముసలి వారు కూడా క్రొత్తగా యౌవనం వచ్చినవారులా అయ్యారు. వసుదేవుడు. సకలయాదవులు, స్త్రీలు "ఎంత అదృష్టం? ఎంత అదృష్టం?" అంటూ ఆయనను గౌరవించారు.

**భగవానపి యథానుభూతమశేషయాదవసమాజే యథావదాచచక్షే. స్యమన్తకం చ సత్రాజితాయ దత్వా మిథ్యాభిశాస్తి విశుద్ధిమవాప. జామ్బవతీం చాన్తఃపురే నివేశయామాస. సత్రాజితోఽపి మయాఽస్యాభూత మలినమారోపితమితి జాతసన్త్రాస స్వసుతాం సత్యభామాం భగవతే భార్యాం దదౌ ॥ 34 ॥**

సకలయాదవసమక్షంలో భగవంతుడు కూడా యథార్థం ఏమిజరిగిందో ఉన్నదున్నట్లుగా చెప్పాడు. స్యమంతకాన్ని సత్రాజిత్తుకు ఇచ్చి అనవసరంగా తనకు ఏర్పడ్డ అపనిందనుంచి పరిశుద్ధుడయ్యాడు. జాంబవతిని భార్యగా స్వీకరించి అన్తఃపురంలో ప్రవేశం కల్పించాడు. సత్రాజిత్తు కూడా కృష్ణునిపై అపనిందవేశానని భయపడినవాడై, తద్దోషనివారణార్థమై తన కుమార్తె అయిన సత్యభామను భగవంతునికి భార్యగా ఇచ్చాడు

**తాం చాక్రూరకృతవర్మశతధన్వప్రముఖా యాదవాః పూర్వం వరయామాసుః. తతస్తత్ ప్రదానాద్, అవజ్ఞాత మాత్మానం మన్యమానాః సత్రాజితి వైరానుబన్ధం చక్రుః అక్రూరకృతవర్మ ప్రముఖాశ్చ శతధన్వానమూచుః –అయమతి దురాత్మా సత్రాజితో యోఽస్మాభిర్భవతా చాభ్యర్థితోఽపి, ఆత్మజామస్మాన్ భవన్తం చావిగణయ్య కృష్ణాయ దత్తవాన్, తదలమనేన జీవతా. ఘాతయిత్వైనం తన్మహారత్నం త్వయా కిం న గృహ్యతే? వయమభ్యుపపత్స్యామః యద్యచ్యుతస్తవాపి వైరానుబన్ధం కరిష్యతీతి ॥ 35 ॥**

ఆమెను ఇదివరకే అక్రూరుడు, కృతవర్మ, శతధన్వుడు మున్నగు యాదవులు వరించియున్నారు. సత్యభామను కృష్ణునకిచ్చి వివాహం చేయడంవల్ల తమను అవమానించాడని భావించి వారు సత్రాజిత్తుపై పగ వహించారు. అక్రూరుడు, కృతవర్మమున్నగువారు శతధన్వునితో “ఈ సత్రాజిత్తు మిక్కిలి దురాత్ముడు. మేమూ, నీవూ కూడా అర్థించినా, మనల్ని లెక్కచేయక తనకూతురును కృష్ణునికి ఇచ్చివేశాడు. ఇంక వీడు బ్రతికి ఉండకూడదు. సత్రాజిత్తును చంపి, ఆ మణిని నీవు ఎందుకు స్వీకరించగూడదు? మేము నీకు సాయపడతాం. అచ్యుతుడు కనుక నీపై విరోధం చూపిస్తే మేమున్నాం” అని పలికారు.

**ఏవముక్తస్తథేత్యసావప్యాహ. జతుగృహదగ్ధానాం చ పాండునన్దనానాం విదితపరమార్థోఽపి భగవాన్ దుర్యోధనప్రయత్నశైథిల్యార్థం కుల్యకరణాయ వారణావతం గతః ॥ 36 ॥**

వారు అలా చెప్పగానే శతధన్వుడు కూడా “సరే” అన్నాడు. ఇలా ఉండగా లక్క ఇంటిలో తగుల బడిపోయిన పాండవులకు కులోచితకర్మచేయడానికై, సత్యమేమిటో తెలిసి ఉన్నవాడైనా, దుర్యోధనుని కుటిలప్రయత్నాలు సడలింపజేయడానికై భగవానుడు వారణావతం వెళ్లాడు.

**గతే చ తస్మిన్ సుప్తమేవ సత్రాజితం శతధన్వా జఘాన, మణిరత్నం చాదదాత్. పితృవధామర్షపూర్ణా చ సత్యభామా శీఘ్రం స్యన్దనమారూఢా వారణావతం గత్వా భగవతేఽహం ప్రతిపాదితేతి, అక్షాన్తిమతా శతధన్వనా అస్మత్పితా వ్యాపాదితః, తచ్చ స్యమన్తకమణిరత్నమపహృతమ్. తదియం త్వదీయాపహాసనా. తదాలోచ్య యదత్ర యుక్తం, తత్ క్రియతామితి కృష్ణమాహ ॥ 37 ॥**

అతడలా వెళ్లిన వెంటనే నిద్రపోతున్న సత్రాజిత్తును శతధన్వుడు సంహరించాడు. ఆ మణిరత్నాన్ని కూడా పట్టుకుపోయాడు. తనతండ్రి హత్యగావించబడినందువల్ల సత్యభామ మిక్కిలి కోపంతో నిండినదై, గబగబా రథమెక్కి వారణావతంవెళ్లి “భగవానునకు నన్నిచ్చి వివాహం చేశాడని ఓర్వలేని శతధన్వుడు నాతండ్రిని వధించివేశాడు. ఆ మణిరత్నమూ అపహరించబడింది. ఇది కేవలం నీకే తలవంపు. ఈ విషయంలో ఆలోచించి చేయదగినదేదో చెయ్యి “అని కృష్ణునితో చెప్పినది.

**తయా చైవముక్తః పరితుష్టాన్తఃకరణోఽపి కృష్ణః, సత్యభామామమర్షతామ్రలోచనః ప్రాహ, సత్యే ! మమైషావహసనా. నాహమేతాం తస్య దురాత్మనః సహిష్యే ॥ 38 ॥**

సత్యభామ ఇలా చెప్పగానే కృష్ణుడు మొదట సంతోషంతోనిండిన అంతరంగం కలవాడే అయ్యాడు. అయినా తరువాత క్రోధంతో నేత్రాలు ఎఱ్ఱబారగా సత్యభామతో "సత్యా! నిజం. ఇది నాకే తలవంపు. నేను ఆ దురాత్ముడు చేసిన దానిని సహించను. (సత్రాజిత్తు లోభి కావున తగిన శిక్ష అనుభవించాడని ముందు సంతసించాడు).

**న హ్యనుల్లంఘ్య వరపాదపం తత్కృతనీడాశ్రయిణో విహంగా వధ్యన్తే ॥ 39 ॥**

ప్రకాండవృక్షాన్ని ఆక్రమించకుండా, దానిమీద గూళ్లల్లో ఉన్న పక్షులను ఎవ్వరూ సంహరించరుకదా!

**తదలమత్యర్థమమునాఽస్మత్పురతః శోకప్రేరితవాక్యపరికరేణ, ఇత్యుక్త్వా ద్వారకామభ్యేత్య బలదేవమేకాన్తే వాసుదేవః ప్రాహ – మృగయా గతం ప్రసేనమటవ్యాం మృగపతిర్జఘాన. సత్రాజితోఽపి, అధునా శతధన్వనా నిధనం ప్రాపితః. తదుభయవినాశాత్ తన్మణిరత్నమావాభ్యాం సామాన్యం భవిష్యతి. తదుత్తిష్ఠ, ఆరుహ్యతాం రథః, శతధన్వనిధనాయోద్యమం కురు, ఇత్యభిహితస్తథేతి సమన్వీప్సితవాన్ ॥ 40 ॥**

కాబట్టి నా ఎదుట శోకంనిండిన హృదయంతో నీవు పలికిన ఈ మాటలు చాలు "అని ఆమెను ఓదార్చి ద్వారకకు వచ్చాడు. వాసుదేవుడు ఏకాంతసమయంలో బలదేవునితో "వేటకై వెళ్లిన ప్రసేనుని అడవిలో సింహం సంహరించింది. ఈ నాడు సత్రాజిత్తు శతధన్వునివల్ల హతుడయ్యాడు. ఆ మణిరత్నంవల్ల ఇద్దరూ మరణం పాలయ్యారు. సత్యభామ భర్తను కాన నాకు, రాజువు కాన నీకు ఆ మణిపై సమానాధికారం ఉంది. కాబట్టి లే. రథం అధిరోహించు. శతధన్వుని సంహరించడానికి ప్రయత్నించు" అని చెప్పాడు. కృష్ణుడు అలా చెప్పగానే, బలరాముడు కూడా అలాగే అని అంగీకారం తెలిపాడు.

**కృతోద్యోగౌ చ తావుభావుపలభ్య శతధన్వా కృతవర్మాణముపేత్య పార్ష్ణిపూరణ కర్మనిమిత్తమచోదయత్. ఆహ చైనం కృతవర్మా, నాహం బలభద్రవాసుదేవాభ్యాం సహ విరోధాయాలమ్. ఇత్యుక్తశ్చాక్రూరమచోదయత్. ఆహ చాసావపి, న హి కశ్చిద్ భగవతా పాదప్రహారపరికమ్పితజగత్త్రయేణ, అసురవర వనితావైధవ్యకారిణా, ప్రబలరిపుచక్రాప్రతిహతచక్రేణ చక్రిణా, మదముదితనయనావలోకితారిబలవిశాతనేన, అతిగురువైరివారణాకర్షణా విఖ్యాతమహిమోరుసీరేణ సీరిణా చ సహ సకలజగద్వన్ద్యానామమరవరాణామపి యోద్ధుం సమర్థః కిముతాహమ్. తదన్యతః శరణమభిలష్యతామ్ ॥ 41 ॥**

బలరామకృష్ణులు ఇద్దరూ తనను చంపడానికి పూనుకొన్నారని తెలుసుకొన్న శతధన్వుడు కృతవర్మవద్దకు వెళ్లి తనప్రక్క బాసటగా నిలబడవలసిందని అడిగాడు. కృతవర్మ అపుడు అతనితో "నేను బలరామ వాసుదేవులిద్దరితోను విరోధానికి సరిపడేవాడను కాను" అన్నాడు. వెంటనే అతడు అక్రూరునివద్దకు వెళ్లి తనకు తోడుగా ఉండవలసిందని కోరాడు. అక్రూరుడంత "ఆభగవంతుడు తనపాదంతో ఒకసారి కొద్దిగా తన్నితే చాలు మూడులోకాలు గడ గడ వణికిపోయాయి. ఆయనవల్ల ఇప్పటికే పెక్కుమంది రాక్షసస్త్రీలు వైధవ్యం అనుభవిస్తున్నారు. ఆయన చేతి చక్రానికి మిక్కిలి బలం కలిగినరిపుచక్రంలో ఎదురు నిలిచినవాడు ఒక్కడూ లేదు. ఆ బలదేవుడు

మదాతిరేకనయనాలతో వీక్షిస్తే చాలు శత్రుబలం అంతా చీల్చి చెండాడబడుతుంది. ఆయన హలాయుధం మదించిన శత్రుమహాగజాలచే పట్టించి లాగినా మొక్కవోని మహిమ కలిగినటువంటిది. ఆ చక్రాయుధసీరాయుధులతో జగత్తులన్నింటిచే పూజించబడే అమరశ్రేష్ఠులు కూడా ఎదిరించి పోరాడడానికి అసమర్థులు. ఇక వారిముందు నేనెంత? కనుక మరొకరిని శరణు కోరుకో" అన్నాడు.

**ఇత్యుక్తః శతధనురాహ. యద్యస్మత్పరిత్రాణాసమర్థం భవాన్ ఆత్మానమవగచ్ఛతి, తదయమస్మన్మణిః సంగృహ్య రక్ష్యతామ్. ఇత్యుక్తః సోఽప్యాహ. యద్యన్యాయామప్యవస్థాయాం న కస్మైచిద్ భవాన్ కథయిష్యతి, తదహమేనం గ్రహీష్యామి. తథేత్యుక్తే అక్రూరస్తన్మణిరత్నం జగ్రాహ ॥ 42 ॥**

అక్రూరుడు అలా అనగానే శతధన్వుడు "నన్ను రక్షించడానికి నిన్ను నీవు శక్తిహీనుడవనుకొంటే, ఈ మణిని నానుంచి తీసుకొని దాచు. చాలు" అన్నాడు. అతడలా అనగా అక్రూరుడు "చివరిసమయంలో కూడా ఎవరికీ నీవు చెప్పకుండా ఉంటానని మాట ఇస్తే, దీనిని తీసుకొని దాచి ఉంచుతాను" అన్నాడు. శతధన్వుడు "సరే" అనగానే అక్రూరుడు ఆ మణిరత్నాన్ని తీసుకొన్నాడు.

**శతధనురపి, అతులవేగాం శతయోజనవాహినీం బడబామారుహ్యాపక్రాన్తః. శైబ్యసుగ్రీవమేఘపుష్ప వలాహకాశ్వచతుష్టయయుక్తరథావస్థితౌ బలదేవవాసుదేవౌ తమనుప్రయాతౌ ॥ 43 ॥**

శతధన్వుడు సాటిలేని వేగంగల, నూరుయోజనాలు ఏకధాటిగాపోగల ఆడగుర్రాన్ని ఎక్కి పారిపోయాడు. శైబ్యం, సుగ్రీవం, మేఘపుష్పం, వలాహకం అనే నాలుగు గుర్రాలను పూన్చిన రథం అధిరోహించి బలదేవవాసుదేవులు ఇద్దరూ అతనిని తరుముకొంటూ వెళ్లారు.

**సా చ బడబా శతయోజనప్రమాణం మార్గమతీత్య పునరపి వాహ్యమానా మిథిలావనోద్దేశే ప్రాణానుత్ససర్జ. శతధనురపి తాం పరిత్యజ్య పదాతిరేవాద్రవత్ ॥ 44 ॥**

ఆ గుర్రంకూడ నూరుయోజనాలమేర ప్రయాణంచేసి, ఇంకా పయనిస్తూ, అతనిని మోస్తూవెళ్లి మిథిలానగర వనప్రదేశంలో ప్రాణాలు విడిచింది. శతధన్వుడు మరణించిన ఆ గుర్రాన్నివదలి కాలినడకనే పరుగులు తీశాడు.

**కృష్ణోఽపి బలభద్రమాహ, తావదత్రైవ స్యన్దనే భవతా స్థేయమ్. అహమేనమధమాచారం పదాతిరేవ పదాతిమనుగమ్య యావద్ ఘాతయామి. అత్ర హి భూభాగే దృష్టదోషా హయాః, నైతేఽశ్వా భవతేమం భూమిభాగముల్లంఘ్య నేయాః ॥ 45 ॥**

కృషుడయితే బలభద్రునితో "నీవీ రథంలో ఉండు. ఈ కాలినడకన పారిపోయే ఈ అధమాచారంచేసిన వానిని, నేనుకూడా పదాతిగానే వెంబడించి సంహరిస్తాను. అంతవరకూ నీవు ఇచ్చటనే ఉండవలసింది. ఈ భూభాగంలో శతధన్వునిగుర్రం ప్రాణాలువిడిచినందున దానిని చూచి మన గుర్రాలు భయపడుతున్నాయి. కాబట్టి ఈ గుర్రాలను ఈ నేల దాటనీయకు." అని వేడుకొన్నాడు.

**తథేత్యుక్త్వా బలభద్రో రథ ఏవ తస్థౌ. కృష్ణోఽపి ద్విక్రోశమాత్రభూమిభాగమనుసృత్య దూరస్థస్యైవ చక్రం క్షిప్త్వా శతధనుషః శిరశ్చిచ్ఛేద. తచ్ఛరీరామ్బరాదిషు చ బహుప్రకారమన్విష్యన్నపి స్యమన్తకం మణిం నావాప**

**యదా, తదోపగమ్య బలభద్రమాహ. వృథైవాస్మాభిర్ఘాతితః శతధనుః, న ప్రాప్తమఖిలజగత్సారభూతం తన్మణిరత్నమ్. ఇత్యాకర్ణ్య ఉద్భూతకోపో బలదేవో వాసుదేవమాహ, ధిక్ త్వాం యస్త్వమర్థలిప్సుః. ఏతచ్చ తే భ్రాతృత్వాన్మర్షయే తదయం పన్థాః, స్వేచ్ఛయా గమ్యతామ్, న మే ద్వారకయా, న త్వయా, న బన్ధుభిః కార్యమ్. అలమేభిర్మమాగ్రతోఽలీకశపథైః. ఇత్యాక్షిప్య తం తథా ప్రసాద్యమానోఽపి న తస్థౌ, విదేహపురీం ప్రవివేశ ॥ 46 ॥**

బలభద్రుడు సరేనని రథం మీదనే ఉండిపోయాడు. కృష్ణుడు అయితే రెండుక్రోసులదూరం తరుముకొని వెళ్లి, దూరంలో ఉండగానే చక్రంవదలి శదధన్వుని శిరస్సు ఛేదించాడు. అతని శరీరావయవాలలోను, వస్త్రాలలోను స్యమంతకమణి గురించి అనేకవిధాల వెతికాడు. ఎక్కడా మణి దొరకలేదు. తిరిగి బలభద్రునివద్దకు వచ్చి "మనం వృథాగా శతధన్వుని వధించాము. సకలజగత్తులకు సారభూతమైన ఆ మణిరత్నం అతనివద్ద లభించలేదు" అని చెప్పాడు. ఆ మాటలు వినగానే కోపం కట్టలుతెగి ప్రవహించగా బలదేవుడు వాసుదేవునితో "ఛీ! నీవే ఇలా దానిని కాజేయాలను కొన్నావు. నీవు దురాశకు వశుడవై పోయావు. నీవు తమ్ముడవు కాబట్టి సహిస్తున్నాను. నీ దారిని నీవు పో. నాకు ద్వారకతోగాని, నీతోగాని, బంధువులతోకాని ఇక పనిలేదు. చాలు చాలు. నా ఎదుట ఈ అబద్ధపు ప్రతిజ్ఞలు చాలించు" అని రూక్షంగా ఆక్షేపించాడు. కృష్ణుడు ఎంతో శాంతపరుస్తూ బ్రతిమాలుతున్నా బలదేవుడు వినలేదు. ద్వారకాపురికి వెళ్లకుండా విదేహపురిని ప్రవేశించాడు.

**జనకశ్చార్ఘ్యపూర్వకమేవైనం గృహం ప్రవేశయామాస. స తత్రైవ చ తస్థౌ. వాసుదేవోఽపి ద్వారకామాజగామ. యావచ్చ జనకరాజగృహే బలభద్రోఽవతస్థే, తావద్ ధార్తరాష్ట్రో దుర్యోధనస్తత్సకాశాద్ గదాశిక్షామశిక్షత ॥47॥**

జనకరాజు కూడ ఆయనకు అర్ఘ్యపూజాదులు సమర్పించి తనమందిరంలో ప్రవేశపెట్టాడు. బలరాముడు అక్కడే ఉండి పోయాడు. వసుదేవనందనుడు ఒక్కడుగా ద్వారకకు తిరిగి వచ్చాడు. బలభద్రుడు జనకరాజేంద్రుని గృహంలో ఉన్నంతకాలం ధృతరాష్ట్రుని కుమారుడైన దుర్యోధనుడు ఆయన సన్నిధికివచ్చి గదావిద్యను అభ్యసించాడు.

**వర్షత్రయాన్తే చ బభ్రూగ్రసేనప్రభృతిభిర్యాదవైర్న తద్రత్నం కృష్ణేనాపహృతమితి కృతావగతిభిర్విదేహనగరీం గత్వా బలదేవః సమ్ప్రత్యాయ్య ద్వారకామానీతః ॥ 48 ॥**

ఇలా మూడేళ్లు గడచిపోయాయి. బభ్రువు, ఉగ్రసేనుడు మున్నగు యాదవులు ఆ రత్నాన్ని కృష్ణుడు అపహరించలేదని తెలుసుకొన్నవారై, విదేహనగరానికివెళ్లి బలదేవుని దర్శించి, ఆయనను నమ్మించి తిరిగి ద్వారకకు తీసుకొనివచ్చారు.

**అక్రూరోఽప్యుత్తమమణిసముద్భూతసువర్ణధ్యానపరస్తతో యజ్ఞానీజే ॥ 49 ॥**

అక్రూరుడు భగవద్ధ్యానంచేస్తూ, ఆ ఉత్తమమణివల్ల లభించే బంగారంతో అనేక యజ్ఞాలు చేశాడు.

**సవనగతౌ హి క్షత్రియవైశ్యౌ నిఘ్నన్ బ్రహ్మహా భవతీత్యతో దీక్షాకవచం ప్రవిష్ట ఏవ తస్థౌ ద్విషష్టి వర్షాణి॥50॥**

యజ్ఞంచేస్తున్న క్షత్రియునిగాని, వైశ్యునిగాని చంపితే బ్రహ్మహత్య కలుగుతుంది కాబట్టి, వాడు బ్రహ్మఘాతకుడవుతాడని తెలిసి తనకు భయంలేకుండగా యజ్ఞదీక్షాకవచం ధరించినవాడై అరవై రెండు సంవత్సరాలు అలా యజ్ఞాలుచేస్తూ ఉండిపోయాడు.

**ఏవం తన్మణిరత్నప్రభావాత్ తత్రోపసర్గదుర్భిక్షమారకాదికం నాభూత్ ॥ 51 ॥**

అంతకాలం ఆ మణిరత్నప్రభావంవల్ల అక్కడ రోగంకాని, దుర్భిక్షంకాని, మారకంకాని మున్నగునవి లేకుండా పోయాయి.

**అథాక్రూరపక్షీయైర్భోజైః శత్రుఘ్నే సాత్వతస్య ప్రపౌత్రే వ్యాపాదితే భోజైః సహాక్రూరో ద్వారకామపహాయ అపక్రాన్తః ॥ 52 ॥**

ఆ తరువాత అక్రూరునివైపు ఉన్న భోజులు సాత్వతుని మునిమనుమడైన శత్రుఘ్నుని సంహరించారు. ఆ సమయంలో అక్రూరుడు భోజులతో కలసి ద్వారకను విడిచి వెళ్లిపోయాడు.

**తదపక్రాన్తిదినాదారభ్య తత్రోపసర్గవ్యాలానావృష్టి మారికాద్యుపద్రవా బభూవుః । అథ యాదవ, బలభద్రోగ్రసేన సమవేతోఽమన్త్రయద్ భగవానురగారికేతనః, కిమిదమేకదైవ ప్రచురోపద్రవాగమనమేతదాలోచ్యతామ్ ॥ 53 ॥**

అటుపిమ్మట అతడు వెళ్ళిపోయిన రోజు మొదలుకొని అక్కడ రోగాలు, క్రూరమృగభయం, అనావృష్టి, మారికం మున్నగు ఉపద్రవాలు ఎక్కువగా సంభవించాయి. అంత గరుడకేతనుడైన భగవంతుడగు శ్రీకృష్ణుడు యాదవులతో, బలభద్రునితో, ఉగ్రసేనునితో కూడుకొన్నవాడై సమాలోచన చేశాడు. "ఏమిటిది? ఒకేసారి ఇన్ని ఉపద్రవాలు ఎందుకు వస్తున్నాయి? ఆలోచించండి" అన్నాడు.

**ఇత్యుక్తే అన్ధక నామా యదువృద్ధః ప్రాహ, అస్యాక్రూరస్య పితా శ్వఫల్కో నామ యత్ర యత్రాభూత్, తత్ర తత్ర దుర్భిక్షమారికానావృష్ట్యాదికం నాభూత్ ॥ 54 ॥**

ఆయన ఇలా అనేసరికి అంధకుడనే యదువృద్ధుడు చెబుతున్నాడు "ఈ అక్రూరుని తండ్రి శ్వఫల్కుడనే వాడు. అతడు ఉన్నచోట దుర్భిక్షం, మారికం, అనావృష్టి మొదలైనవి ఉండేవికావు.

**కాశిరాజస్య విషయేఽత్యన్తానావృష్ట్యాం శ్వఫల్కోఽనీయత. తతస్తత్క్షణాదేవ దేవో వవర్ష. కాశీరాజ స్య పత్న్యాశ్చ గర్భే కన్యా పూర్వమాసీత్ ॥ 55 ॥**

ఒకప్పుడు కాశిరాజుదేశంలో తీవ్రమైన అనావృష్టి ఏర్పడింది. అప్పుడు అక్కడకు శ్వఫల్కుని తీసుకొని వెళ్లడం జరిగింది. అందువల్ల ఆ క్షణమే దేవుడు వర్షం కురిపించాడు. మరోవిషయం చెబుతున్నాను. ఒకప్పుడు కాశిరాజుధర్మపత్ని గర్భవతియై ఉన్నది. ఆమెగర్భంలో ఒక కన్యారత్నం ఉండేది.

**సాఽపి పూర్ణేఽపి ప్రసూతి కాలే నైవ నిశ్చక్రామ. ఏవం చ తస్య గర్భస్య ద్వాదశ వర్షాణ్యనిష్క్రామతో యయుః. కాశిరాజస్తు తామాత్మజాం గర్భస్థామాహ. పుత్రి! కస్మాన్న జాయసే? నిష్క్రామ్యతామ్. ఆస్యం తే ద్రష్టు మిచ్ఛామి. స్వకాం చ మాతరం కిమిదం చిరం క్లేశయసి, ఇత్యుక్తా సా గర్భస్థైవ వ్యాజహార ।**

ఆ కన్య పురిటిరోజులు నిండిపోయినా బయటపడలేదు. అలా గర్భం బయటపడకుండా పన్నెండు సంవత్సరాలు గడచిపోయాయి. అపుడు కాశిరాజు తన భార్యకడుపులో ఉన్న కన్యతో "అమ్మాయీ! ఎందుకు

ఇంకా నీవు పుట్టడంలేదు? బయటకు రా. నేను నీ ముఖం చూడాలనుకొంటున్నాను. నీతల్లిని ఎందుకని ఇలా ఎక్కువ కాలం బాధిస్తావు?" అని ప్రశ్నించాడు. అలా తండ్రి అనగానే ఆమె కడుపులో ఉండే ఇలా అన్నది.

**తాత! యద్యేకైకాం గాం దినే దినే బ్రాహ్మణేభ్యః ప్రయచ్ఛసి, తదాఽహమన్యైస్త్రిభిర్వర్షైరస్మాద్ గర్భాత్ తావదవశ్యం నిష్క్రమిష్యామీతి. ఏతచ్చ తద్వచనమాకర్ణ్య రాజా బ్రాహ్మణాయ దినే దినే గాం ప్రాదాత్, సాఽపి తావతా కాలేన జాతా. తతస్తస్యాః పితా గాన్దినీతి నామ చకార. తాం చ గాన్దినీం కన్యాం శ్వఫల్కాయోపకారిణే గృహాగతాయ, అర్ఘ్యభూతాం ప్రాదాత్, సా చ గాన్దినీ ప్రతిదినం యావజ్జీవం బ్రాహ్మణాయ గాం దత్తవతీ. తస్యామయమక్రూరః శ్వఫల్కాజ్జజ్ఞే. తస్యైవంగుణమిథునాదుత్పత్తిః ॥ 56 ॥**

"తండ్రీ! ప్రతిదినం ఒక్కొక్క ఆవుచొప్పున బ్రాహ్మణులకు నీవు దానం చేస్తే, మరో మూడు సంవత్సరాలలో నేను ఈ గర్భంనుంచి తప్పక బయటపడతాను" అని అనగానే ఆ మాటలు విని మహారాజు ప్రతిదినం ఒక్కొక్క ఆవు చొప్పున బ్రాహ్మణునకు దానం ఈయసాగాడు. ఇలా ఆ మూడేళ్ల కాలం గడిచేసరికి ఆమె జన్మించింది. తరవాత తండ్రి ఆమెకు గాందిని అని పేరు పెట్టాడు. అనంతరం తనకు ఉపకారంచేసిన శ్వఫల్కుడు ఒకప్పుడు ఇంటికి రాగా, రాజు ఆ గాందిని అనే తనకన్యను అర్ఘ్యరూపంగా ఆయనకు దానం చేశాడు. ఆ గాందిని కూడా బ్రతికియున్నంతకాలం రోజుకొక గోవు చొప్పున బ్రాహ్మణునకు దానమీయడం జరిగింది. ఆ శ్వఫల్కునివల్ల గాందినియందు ఈ అక్రూరుడు జన్మించాడు. ఇటువంటి సుగుణాలుగల పుణ్యదంపతులవల్ల ఇతడు ప్రభవించాడు.

**తత్ కథమస్మిన్నపక్రాన్తేఽత్ర మారికదుర్భిక్షాద్యుపద్రవా న భవిష్యన్తి. తదయమానీయతామితి. అలమత్రాతి గుణవత్యపరాధాన్వేషణేన ఇతి ॥ 57 ॥**

అందువల్ల అటువంటివాడు వెళ్లిపోతే, ఇక్కడ మారి, దుర్భిక్షం మున్నగు ఉపద్రవాలు రాకుండా ఎలా ఉంటాయి? కాబట్టి అతనిని ఇక్కడకు తీసుకొని రండి. మిక్కిలి గుణవంతుడైన ఆ అక్రూరునియందు అపరాధం వెదకడం చాలించండి" అని హితవు చెప్పాడు.

**యదువృద్ధస్యాన్ధకస్య ఏతద్వచనమాకర్ణ్య కేశవోగ్రసేనబలభద్రపురోగమైర్యదుభిః కృతాపరాధ తితిక్షాభవమభయందత్వా శ్వాఫల్కిః స్వపురమానీతః. తత్ర చాగత ఏవ తస్య స్యమన్తకమణేరనుభావాదనావృష్టిఫలక దుర్భిక్ష వ్యాలాద్యుపద్రవః శశామ. కృష్ణశ్చ చిన్తయామాస, స్వల్పమేతత్ కారణం, యదయం గాన్దిన్యాం శ్వఫల్కేనాక్రూరో జనితః సుమహాంశ్చాయమనావృష్టి, దుర్భిక్షమారకాద్యుపశమన కారీ ప్రభావః ॥ 58 ॥**

యదువృద్ధుడైన అంధకుని ఈ ఉపదేశంవిని కేశవుడు, ఉగ్రసేనుడు, బలభద్రుడు మున్నగు యాదవులు అక్రూరుడుచేసిన తప్పును సహించారు. ఆతనికి అభయం ప్రసాదించారు. శ్వఫల్కుని కుమారుడైన ఆ అక్రూరుని తన సొంత నగరానికి రప్పించారు. అతడు అక్కడకు వచ్చాడో లేదో, ఆ స్యమంతకమణి ప్రభావంవల్ల అనావృష్టి, మారి, దుర్భిక్షం, క్రూరబాధ మున్నగు ఉపద్రవాలు శాంతించాయి. అంత కృష్ణుడు ఇలా ఆలోచించాడు. "గాందినీ శ్వఫల్కులకు ఈ అక్రూరుడు జన్మించడమనేది ఉపద్రవాలు పోయాయని చెప్పడానికి ఒక చిన్న కారణమే. ఈ అనావృష్టి, దుర్భిక్షం, మారి మున్నగు కీడులను తొలగించే ప్రభావం ఈతనిదగ్గర ఉందంటే వేరే ఒక మహాకారణం ఏదో ఉండి ఉంటుంది.

**తన్నూనమస్య సకాశే స మహామణిః స్యమన్తకాఖ్యస్తిష్ఠతి. తస్య హ్యేవంవిధాః ప్రభావాః శ్రూయన్తే. అయమపి యజ్ఞాదనన్తరమన్యత్ క్రత్వన్తరం తస్మాద్ యజ్ఞాన్తరం చాజస్రమవిచ్ఛిన్నం యజతీతి. అల్పోపాదానం చాస్య. అసంశయమత్రాసౌ వరమణిస్తిష్ఠతీతి కృతాధ్యవసాయోఽన్యత్ ప్రయోజన ముద్దిశ్య సకలయాదవసమాజమాత్మగేహ ఏవాచీకరత్. తత్ర చోపవిష్టేష్వఖిలేషు యాదవేషు పూర్వప్రయోజనముపన్యస్య పర్యవసితే చ తస్మిన్ ప్రసంగాగత పరిహాసకథామక్రూరేణ సహ కృత్వా జనార్దనస్తమక్రూరమాహ ॥ 59 ॥**

కాబట్టి సందేహం ఏమిలేదు. ఇతనివద్దనే ఆ స్యమన్తకమహామణి ఉండి ఉంటుంది. దానిదగ్గర ఇటువంటి మహిమలు ఉన్నాయని వినవస్తూనే ఉన్నాయి. ఇతడు కూడా యజ్ఞం తరువాత మరోయజ్ఞం, క్రతువు తరువాత మరో క్రతువు ఎల్లప్పుడూ ఎడతెరిపి లేకుండా చేస్తూనే ఉన్నాడు. ఇతని ఆదాయం చూస్తే కడుస్వల్పం. నిశ్చయంగా ఈ అక్రూరునివద్దనే ఆ మణిరత్నం ఉండి ఉంటుంది" అని నిర్ణయించు కొన్నాడు. వేరే ప్రయోజనాన్ని ఉద్దేశించి తన భవనంలోనే సకలయాదవసమాజాన్ని సమావేశపరచాడు. సమస్తయాదవులు తమ తమ ఆసనాలలో కూర్చుండియుండగా జనార్దనుడు ముందుగా ఉద్దేశించిన అంశాన్ని గూర్చి ప్రసంగించాడు. ఆ ఉపన్యాసం పూర్తి అయిన తరువాత అక్రూరుని వేరే మాటలలోనికి దింపాడు. క్రమంగా పరిహాసంగా మాట్లాడడం ఆరంభించాడు. చివరకు ఆతనితో ఇలా అన్నాడు.

**దానపతే! జానీమ ఏవ వయం, యథా శతధన్వనా అఖిలజగత్సారభూతం స్యమన్తకరత్నం భవతః సకాశే సమర్పితమ్. తదేతత్ రాష్ట్రోపకారకం భవతః సకాశే తిష్ఠతీతి తిష్ఠతు, సర్వ ఏవ వయం తత్ప్రభావఫలభుజః కిన్త్వేష బలభద్రోఽస్మానాశంకితవాన్. తదస్మత్ప్రీతయే దర్శయ, ఇత్యభిహితః సరత్నః సోఽచిన్తయత్. కిమత్రానుష్ఠేయమ్? అన్యథా చేత్ బ్రవీమ్యహం, తత్కేవలామ్బర తిరోధానమన్విష్యన్తో రత్నమేతే ద్రక్ష్యన్తీతి, అతోఽన్వేషణం న క్షేమమితి సంచిన్త్య తమఖిలజగత్కారణభూతం నారాయణమాహాక్రూరః, భగవన్! మమైతత్ స్యమన్తకమణిరత్నం శతధనుషా సమర్పితమ్ ॥ 60 ॥**

"మహాదాతా! అక్రూరా! మాకు అంతా తెలుసు. శతధన్వుడు సమస్తలోకాలలోను అత్యంతమహిమకల్గిన స్యమంతకరత్నం నీకు సమర్పించాడని మాకు తెలిసున్నదే. సమస్తరాష్ట్రాలకు ఉపకరించే ఆ మణి నీదగ్గర ఉంటే ఉండనీ. దాని ప్రభావఫలాన్ని మేమందరం కూడ అనుభవించే వారమే. కాని ఈ బలదేవుడు మమ్మల్ని అనుమానించాడు. అందువల్ల మాఅందరి ప్రీతికోసమై ఒకసారి చూపించు" అన్నాడు. అని పలికి భగవానుడు మౌనంవహించగా రత్నం తనవద్దనే ఉన్న అక్రూరుడు "ఇప్పుడు నేనేం చేయాలి? నేను మరోలా చెబితేమాత్రం బట్టలచాటున ఉన్న ఈ రత్నాన్ని వెదకిచూడకుండ ఉంటారా? ఆ విధమైన అన్వేషణ నాకు క్షేమం కాదు." అని ఆలోచించి సమస్తజగత్తుకు కారణభూతుడైన ఆ నారాయణునితో అతడు "భగవానుడా! నిజమే. ఈ స్యమంతకరత్నాన్ని నాకు శతధన్వుడు ఇచ్చాడు.

**అపగతే చ తస్మిన్ అద్య శ్వః పరశ్వో వా భగవాన్ మాం యాచిష్యతీతి కృతమతిరతికృచ్ఛ్రేణైతావన్తం కాలమధారయమ్. అస్య చ ధారణక్లేశే నాహమశేషోపభోగేష్వసంగిమానసో న వేద్మి స్వసుఖకలామపి ॥ 61॥**

అతడు చనిపోయిన తరువాత నేడో, రేపో, ఎల్లుండో భగవానుడు ఈ రత్నవిషయం అడగకమానడని నేను మనస్సులో నిర్ణయించుకొన్నాను. అతికష్టంతో ఇంతకాలం దీనిని భరిస్తూ వస్తున్నాను. దీనిని భరించే క్లేశంతో ఉండిపోయి సమస్తసుఖోపభోగాలపట్ల మనస్సులేకుండా కాలం గడుపుతున్నాను. నాసుఖం లేశమైనా ఎరుగను.

**ఏతావన్మాత్రమశేషరాష్ట్రోపకారిధారయితుం న శక్నోతీతి మాం భగవాన్ మంస్యత ఇత్యాత్మనా న చోదితమ్ ॥ 62 ॥**

సమస్తదేశానికి ఉపయోగించే ఈ మాత్రం మణిని ఈతడు ధరించ సమర్థుడు కాడా? అని భగవానుడు నన్నుగూర్చి మరో భావన చేస్తాడేమో అని నాకుగా నేను చెప్పలేదు.

**తదిదం స్యమన్తకరత్నం గృహ్యతామ్. ఇచ్ఛయా యస్యాభిమతం తస్య సమర్ప్యతామ్. తతః స్వోదరవస్త్ర నిగోపితాతిలఘుకనకసముద్గకం ప్రకటీకృతవాన్ ॥ 63 ॥**

కాబట్టి ఈ స్యమంతకరత్నం తీసుకో. నీ ఇష్టాన్ని బట్టి ఎవరికి ఇష్టమయతే వారికి ఈయవచ్చు." అని తన బొడ్డువద్ద కొంగున రహస్యంగా దాచిన చిన్నబంగారుపెట్టెలో ఉన్న మణిని బయటపెట్టాడు.

**తతశ్చ నిష్క్రామ్య స్యమన్తకమణిం తత్ర యదుసమాజే ముమోచ. ముక్తమాత్రే చ తేనాతికాన్త్యా తదఖిలమాస్థానముద్యోతితమ్ ॥ 64 ॥**

ఆ పెట్టెనుంచి బయటకుతీసి, ఆ స్యమంతకమణిని ఆ యదుకులసమాజంలో బయట పెట్టాడు. దానిని వెలుపలకు తీయగానే దాని గొప్పకాంతితో ఆ ఆస్థానమంతా దేదీప్యమానంగా వెలిగి పోయింది.

**అథాఽఽహాక్రూరః, స ఏష మణిర్యః శతధన్వనాఽస్మాకం సమర్పితః, యస్యాయం, స ఏనం గృహ్ణాత్వితి. తన్మణిరత్నమాలోక్య సర్వయాదవానాం సాధు సాధ్వితి విస్మితమనసాం వాచోఽశ్రూయన్త. తమాలోక్య మమాయమ్ అచ్యుతేనైవ సామాన్యస్సమన్విచ్ఛిత ఇతి బలభద్రః సస్పృహోఽభవత్ ॥ 65 ॥**

అపుడు అక్రూరుడు "శతధన్వుడు నావద్ద దాచియుంచిన ఆ మణి ఇదిగో. ఇది ఎవరికి చెందుతుందో వారే స్వీకరింతురు గాక!" అని అన్నాడు. దానిని చూచీ చూడగానే సమస్తయాదవులు మనస్సులలో నివ్వెరపోయి "బాగు! బాగు" అంటూ ఉండగా మాటలు వినిపించాయి. దానిని బలభద్రుడు చూచిన వెంటనే "ఇది నాది. ముందే అచ్యుతుడు నాకు దీనియందు సమానమైన హక్కు ఉందని అంగీకరించాడు" అని చాలా ఆశపడ్డాడు.

**మమైవేదం పితృధనమిత్యతీవ చ సత్యభామాఽపి స్పృహయాంచకార. బలసత్యానవలోకనాత్ కృష్ణోఽప్యాత్మానం గోచక్రాన్తరావస్థితమివ మేనే ॥ 66 ॥**

"ఇది నాదే. ఇది నాతండ్రి స్వార్జితధనం" అని సత్యభామ కూడా బాగా ఆశకు లోనయ్యింది. బలరాముడు, సత్యభామ వీరు ఇద్దరూ దానిని అభిలాషతో చూడడంవల్ల కృష్ణుడు తాను ఎద్దుకూ, బండిచక్రానికి మధ్య చిక్కుకు పోయానని భావించాడు.

**సకలయాదవసమక్షం చాక్రూరమాహ, ఏతద్ధి మణిరత్నమాత్మశోధనాయైషాం యదూనాం దర్శితమ్. ఏతచ్చ మమ బలభద్రస్య చ సామాన్యం, పితృధనం చైతత్ సత్యభామాయా నాన్యస్య ॥ 67 ॥**

సకలయాదవుల ఎదురుగా అక్రూరునితో "ఈ మణిరత్నాన్ని నాపై ఏర్పడిన నిందతొలగించుకోవడం కోసం ఈ యాదవులందరి ఎదురుగుండా దీనిని ఈ విధంగా దర్శింపజేయడం జరిగింది. దీనిపై నాకు, బలదేవునకు ఉమ్మడి అధికారం ఉంది. సత్యభామకయితే ఇది పితృధనం కూడా. ఇది మరెవ్వరిదీ కాదు.

**ఏతచ్చ సర్వకాలం శుచినా బ్రహ్మచర్యగుణవతా ధ్రియమాణమశేషరాష్ట్రస్యోపకారకమ్, అశుచినా ధ్రియమాణమాధారమేవ హన్తి ॥ 68 ॥**

దీనిని ఎల్లకాలము బ్రహ్మచర్యాదిగుణాలు కలవాడు, సదాచారంతో శుచి అయిన వాడు ధరిస్తే సమస్తరాష్ట్రానికి ఉపయోగకారి అవుతుంది. అశుచి అయిన వాడు ధరిస్తే, ధరించిన ఆధారాన్నే సంహరిస్తుంది.

**అతోఽ హమస్య షోడశస్త్రీసహస్రపరిగ్రహాదసమర్థో ధారణే ॥ 69 ॥**

కాబట్టి పదహారువేలమంది వనితలను వివాహమాడినందువల్ల దీనిని భరించే సామర్థ్యం నాకు లేదు.

**కథం చైతత్ సత్యభామా స్వీకరోతు? ఆర్యేణ బలభద్రేణాపి మదిరాపానాద్యశేషోపభోగపరిత్యాగః కథం కార్యః, తదయం యదులోకోఽ యం బలభద్రోఽ హం సత్యా చ త్వాం దానపతే! ప్రార్థయామః ఏతద్ భవానేవ ధారయితుం సమర్థః, త్వత్స్థం చాస్య రాష్ట్రస్యోపకారకం తద్భవానశేషరాష్ట్రోపకారనిమిత్తమేతత్ పూర్వవద్ ధారయతు. త్వయాఽ న్యథా న వక్తవ్యమిత్యుక్తే దానపతిస్తథేత్యుక్త్వా జగ్రాహ తన్మహామణిరత్నమ్. తతః ప్రభృతి చాక్రూరః ప్రకటేనైవాతీవతేజసా జాజ్వల్యమానేనాఽ ఽ త్మకణ్ఠాసక్తేనాఽ ఽ దిత్య ఇవాంశుమాలీ చచార ॥ 70 ॥**

ఇక దీనిని సత్యభామ ఎలా స్వీకరిస్తుంది? ఆర్యుడైన బలభద్రుడు గ్రహించినా మదిరాపానంవంటి సమస్త సుఖోపభోగాలను విడిచి పెట్టవలసి వస్తుంది. కాబట్టి ఈ యదులోకం, ఈ బలదేవుడు, నేను, సత్యభామ కూడ నిన్నే ఓ దానపతీ! ప్రార్థిస్తున్నాము. కాబట్టి దీనిని ధరింప నీవే సమర్థుడవు. ఇది నీదగ్గర ఉంటేనే ఈ రాష్ట్రానికి ప్రయోజనకారి అవుతుంది. కాబట్టి నీవే సమస్తరాష్ట్రోపకారంకోసమై దీనిని పూర్వంలాగానే ధరించాలి. నీవు మరోలా అనగూడదు." అన్నాడు. కృష్ణుడు అలా అనగానే దానపతి "అలాగే" అని ఆ మహామణిరత్నాన్ని యథాపూర్వంగా స్వీకరించాడు. అప్పటినుంచి అక్రూరుడు బహిరంగంగానే మహాకాంతితో జాజ్వల్యమైన ఆ రత్నాన్ని కంఠంలో ధరించి కిరణమాలికలతోగూడిన ఆదిత్యునిలా సంచరించాడు.

**ఇత్యేతాం భగవతో మిథ్యాభిశాస్తిక్షాళనాం యః స్మరతి, న తస్య కదాచిదల్పాఽ పి మిథ్యాభిశాస్తిర్భవతి, అవ్యాహతేన్ద్రియశ్చాఖిలపాపమోక్షమవాప్నోతి ॥ 71 ॥**

ఈ విధమైన భగవంతుని ఈ నీలాపనిందపోయిన కథను స్మరించే వానికి ఏ సమయంలోనూ కూడా ఏ కారణంవల్లా కించిత్తుగూడా అపనింద కలగదు. సమస్తములైన ఇంద్రియాలకు హానిలేకుండా ఉంటుంది. వాడు సకలపాపాలనుంచి విముక్తుడవుతాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే స్యమన్తకమణివృత్తాంతో నామ త్రయోదశోఽ ధ్యాయః సమాప్తః ॥ 13 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో స్యమన్తకమణివృత్తాంతం అనే పదమూడవ అధ్యాయం సమాప్తం ॥ 13 ॥

# చతుర్దశోఽధ్యాయః - పద్నాల్గవ అధ్యాయం

## అన్ధకవంశవర్ణనమ్ – అన్ధకవంశవర్ణన

**అనమిత్రస్యానుజః శినిర్నామాభవత్, తస్యాపి సత్యకః, సత్యకాత్ సాత్యకిర్యుయుధాన నామా, తతోఽప్యసంగః, తత్పుత్రశ్చ తూణిః, తూణేర్యుగన్ధర ఇతి శైనేయాః ॥ 1 ॥**

అనమిత్రునికి శిని అనే పేరుగల ఒక తమ్ముడు ఉన్నాడు. ఆ శినికుమారుడు సత్యకుడు. సత్యకునివల్ల యుయుధానుడు అనే మరో పేరు కలిగిన సాత్యకి కలిగాడు. అతనివల్ల అసంగుడు జన్మించాడు. అతని కుమారుడు తూణి. తూణి కుమారుడు యుగంధరుడు. వీరు అందరూ శైనేయులు అయ్యారు.

**అనమిత్రస్యైవాన్వయే పృశ్నిః, తస్మాచ్చ శ్వఫల్కః, తత్ప్రభావః కథిత ఏవ. శ్వఫల్కస్య కనీయాంశ్చిత్రకో నామాభవద్ భ్రాతా, శ్వఫల్కాదక్రూరో గాన్దిన్యామభవత్. తథోపమద్గు, మృదర, విశారి, మేజయ, గిరిక్షత్రోపక్షత్ర శత్రుఘ్న విమర్దన ధర్మదృగ్దృష్టశర్మగన్ధభోజ వాహప్రతివాహాఖ్యాః పుత్రాః, సుతారాఖ్యా చ కన్యా. దేవవాన్ ఉపదేవశ్చ అక్రూరపుత్రౌ. పృథు, విపృథు ప్రముఖాశ్చిత్రకస్య పుత్రా బహవోఽభవన్ ॥ 2 ॥**

అనమిత్రుని వంశంలో పృశ్ని జన్మించాడు. అతనివల్ల శ్వఫల్కుడు కలిగాడు. అతని ప్రభావం మైత్రేయా! నీకు చెప్పినదే. శ్వఫల్కునికి చిత్రకుడనే మరో సోదరుడు ఉన్నాడు. శ్వఫల్కునివల్ల గాందినికి అక్రూరుడు కలిగాడు. అలాగే ఆ వంశంలో ఉపమద్గుడు, మృదరుడు, విశారి, మేజయుడు, గిరిక్షత్రుడు, ఉపక్షత్రుడు, శత్రుఘ్నుడు, విమర్దనుడు, ధర్మదృక్కు, దృష్టశర్ముడు, గంధభోజుడు, వాహుడు, ప్రతివాహుడు అనే పుత్రులు, సుతర అనే కన్య కలిగారు. దేవవంతుడు, ఉపదేవుడు అక్రూరుని కుమారులు. పృథుడు, విపృథుడు మున్నగు పెక్కు మంది కుమారులు చిత్రకునికి కలిగారు.

**కుకుర, భజమాన, శుచికమ్బళ, బర్హిషాఖ్యాస్తథాఽన్ధకస్య చత్వారః పుత్రాః ॥ 3 ॥**

కుకురుడు, భజమానుడు, శుచికంబళుడు, బర్హిషుడు అనే పేర్లుగల నలుగురు పుత్రులు అంధకునికి కలిగారు.

**కుకురాద్ ధృష్టః, తస్మాచ్చ కపోతరోమా, తతశ్చ విలోమా, తస్మాదపి తుమ్బురుసఖోఽభవదనుసంజ్ఞశ్చ. అనోరానకదున్దుభిః (చన్దనోదకదున్దుభిః). తతశ్చాభిజిత్, తతః పునర్వసుః, తస్యాప్యాహుకః పుత్రః, ఆహుకీ కన్యాఽభూత్ ॥ 4 ॥**

కుకురునివల్ల ధృష్టుడు, అతనివల్ల కపోతరోముడు, అతనివల్ల విలోముడు, అతనివల్ల అనువు (భవుడు) అనేవాడు తుంబురుని మిత్రుడు జన్మించారు. అనువుకు ఆనకదుందుభి (చందనోదకదుందుభి) ప్రభవించాడు. అతనివల్ల అభిజిత్తు, అతనివల్ల పునర్వసువు, అతనివల్ల ఆహుకుడనే పుత్రుడు, ఆహుకి అనే పుత్రిక కలిగారు.

**ఆహుకస్య దేవకోగ్రసేనౌ ద్వౌ పుత్రౌ. దేవవానుపదేవశ్చ సుదేవో దేవరక్షితో దేవకస్యాపి చత్వారః పుత్రాః. తేషాం చ వృకదేవా, ఉపదేవా, దేవరక్షితా, శ్రీదేవా, శాంతిదేవా, సహదేవా, దేవకీ చ సప్త భగిన్యః. తాశ్చ సర్వా ఏవ**

**వసుదేవ ఉపయేమే. ఉగ్రసేనస్యాపి కంస, న్యగ్రోధ, సునామ, కంక, శంకు, స్వభూమి, రాష్ట్రపాల, యుద్ధ ముష్టి, తుష్టిమత్సంజ్ఞాః పుత్రాః కంసా, కంసవతీ, సుతనూ, రాష్ట్రపాలీ కంకీ చోగ్రసేనతనూజాః ॥ 5 ॥**

ఆహుకునికి దేవకుడు, ఉగ్రసేనుడు అనే ఇద్దరు పుత్రులు కలిగారు. దేవకునికి దేవవంతుడు. ఉపదేవుడు, సుదేవుడు, దేవరక్షితుడు అనే నలుగురు పుత్రులు జన్మించారు. వారికి వృకదేవ, ఉపదేవ, దేవరక్షిత, శ్రీదేవ, శాంతిదేవ, సహదేవ, దేవకి అనే ఏడుగురు సోదరీమణులు ఉన్నారు. ఆ ఏడుగురు అప్పచెల్లెండ్రను వసుదేవుడు వివాహమాడాడు. ఉగ్రసేనునికి కంసుడు, న్యగ్రోధుడు, సునాముడు, కంకుడు, శంకుడు, స్వభూమి, రాష్ట్రపాలుడు, యుద్ధముష్టి, తుష్టిమంతుడు అనే కుమారులు కలిగారు. అంతేకాక కంస, కంసవతి, సుతనువు, రాష్ట్రపాలి, కంకి అనే కుమార్తెలు ఆయనకు జన్మించారు.

**భజమానాచ్చ విదూరథః పుత్రోఽభవత్. విదూరథాత్ శూరః, శూరాత్ శమీ, శమినః ప్రతిక్షత్రః తస్మాత్ స్వయమ్భోజః, తతశ్చ హృదికః ॥ 6 ॥**

భజమానుని వల్ల విదూరథుడు అనే పుత్రుడు కలిగాడు. విదూరథునివల్ల శూరుడు. శూరునివల్ల శమి. శమివల్ల ప్రతిక్షత్రుడు, అతనివల్ల స్వయంభోజుడు, అతనివల్ల హృదికుడు కలిగారు.

**తతశ్చ కృతవర్మా, తస్మాత్ శతధనుర్దేవమీఢుషాద్యా బభూవుః ॥ 7 ॥**

అతనికి కృతవర్మ, అతనికి శతధన్వుడు, దేవమీఢుషుడు మున్నగు కుమారులు జన్మించారు.

**దేవమీఢుషస్య శూరః, శూరస్యాపి మారిషా నామ పత్న్యభవత్ ॥ 8 ॥**

దేవమీఢుషునకు శూరుడు జన్మించాడు. శూరునకు మారిష అనే భార్య కలదు.

**అస్యాం చాసౌ దశపుత్రానజనయద్ వసుదేవపూర్వాన్. వసుదేవస్య జాతమాత్రస్యైవ ఏతద్గృహే భగవదంశావతారమవ్యాహతదృష్ట్యా పశ్యద్భిర్దేవైర్దివ్యా ఆనకా దున్దుభయశ్చ వాదితాః ॥ 9 ॥**

అతనికి ఆమెయందు వసుదేవుడు మొదటివాడుగా పదిమంది కుమారులు జన్మించారు. వసుదేవుడు పుట్టగానే అతని ఇంటిలో భగవంతుని అంశావతారం అడ్డులేకుండా ఆవిర్భవించబోవడం చూచిన దేవతలు దివ్యములైన ఆనకములు, దుందుభులు మ్రోగించారు.

**తతస్తద్దైవానకదున్దుభి సంజ్ఞామవాప. తస్యాపి దేవభాగ, దేవశ్రవోఽనాధృష్టి, కరున్ధక, వత్సబాలక, సృంజయ, శ్యామ, శమీక గణ్డూష సంజ్ఞా నవ భ్రాతరో బభూవుః, పృథా శ్రుతదేవా శ్రుతకీర్తిః శ్రుతశ్రవాః రాజాధిదేవీ చ వసుదేవాదీనాం పంచ భగిన్యోఽభవన్ ।**

అందువల్ల అతనికి ఆనకదుందుభి అనే పేరు వచ్చింది. వసుదేవునికి దేవభాగుడు, దేవశ్రవుడు, అనాధృష్టి, కరుంధకుడు, వత్సబాలకుడు, సృంజయుడు, శ్యాముడు, శమీకుడు, గండూషుడు అనే తొమ్మండు గురు సోదరులు ఉన్నారు. పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి, శ్రుతశ్రవ, రాజాధిదేవి అనే చెల్లెండ్రు వసుదేవాదులకు ఉన్నారు.

**శూరస్య కున్తిభోజ నామా సఖాఽభవత్. తస్మై చాపుత్రాయ పృథామాత్మజాం విధినా శూరోఽదదాత్. తాం చ పాణ్డురువాహ. తస్యాం చ ధర్మానిలశక్రైర్యుధిష్ఠిరభీమార్జునాఖ్యాస్త్రయః పుత్రాః. సముత్పాదితాః పూర్వమనూఢాయాశ్చ భగవతా భాస్వతా కర్ణాఖ్యః కానీనః పుత్రోఽజన్యత ॥ 10 ॥**

శూరునికి కుంతిభోజుడు అనే స్నేహితుడు ఉన్నాడు. అతనికి సంతానం లేనందున పృథ అనే కుమార్తెను శూరుడు యథావిధిగా దత్తం చేశాడు. ఆమెను పాండురాజు పెండ్లియాడాడు. ఆమెకు ధర్ముడు, వాయువు, ఇంద్రుడు – వీరి వరంవల్ల యుధిష్ఠిరుడు, భీముడు, అర్జునుడు అనే ముగ్గురు పుత్రులు ఉద్భవించారు. ఆమెకు పెండ్లి కాక పూర్వమే కన్యకగా ఉన్నప్పుడే భగవంతుడైన సూర్యుని అనుగ్రహంవల్ల కర్ణుడనేవాడు కానీనుడై జన్మించాడు.

**తస్యాశ్చ సపత్నీ మాద్రీ నామాభవత్. తస్యాం చ నాసత్యదస్రాభ్యాం నకులసహదేవౌ పాణ్డోః పుత్రౌ జనితౌ।**

ఆమెకు మాద్రి అనే సవతి ఉండేది. ఆమెయందు నాసత్యుడు, దస్రుడు అనే అశ్వినీదేవతలవల్ల నకులుడు, సహదేవుడు అనే ఇద్దరు పుత్రులు పాండుతనయులుగా ప్రభవించారు.

**శ్రుతదేవాం తు వృద్ధశర్మా నామ కారూష ఉపయేమే. తస్యాం దన్తవక్త్రో నామ మహాసురో జజ్ఞే.శ్రుత కీర్తిమపి కైకేయరాజ ఉపయేమే. తస్యాం సన్తర్దనాదయః పంచ కైకేయాః పుత్రా బభూవుః రాజాధిదేవ్యామావన్త్యౌ విన్దానువిన్దౌ జజ్ఞాతే ॥ 11 ॥**

శ్రుతదేవను వృద్ధశర్ముడు (వృద్ధధర్ముడు) అనే కారూష దేశాధిపతి వివాహంచేసుకొన్నాడు. అతనికి ఆమెయందు దంతవక్త్రుడనే మహాసురుడు జన్మించాడు. శ్రుతకీర్తిని కేకయరాజు పెండ్లియాడాడు. ఆమెయందు సంతర్దనుడు మున్నగు ఐదుగురు కైకేయులు జన్మించారు. రాజాధిదేవికి అవంతి దేశాధిపునివల్ల విందుడు, అనువిందుడు అనే ఇద్దరు కుమారులు జన్మించారు.

**శ్రుతశ్రవసమపి చేదిరాజో దమఘోష నామా ఉపయేమే. తస్యాం శిశుపాలముత్పాదయామాస. స హి పూర్వమపి, ఉదారవిక్రమసమ్పన్నో దైత్యాదిపురుషో హిరణ్యకశిపురభూత్ ॥12॥**

శ్రుతశ్రవను చేదిరాజయిన దమఘోషుడనే వాడు వివాహమాడాడు. ఆమెయందు శిశుపాలుడు జన్మించాడు. అతడు పూర్వజన్మలో మహావిక్రమశాలి అయిన దైత్యులకు ముఖ్యపురుషుడైన హిరణ్యకశిపుడై పుట్టాడు.

**యశ్చ భగవతా సకలలోకగురుణా నరసింహేన ఘాతితః పునరపి, అక్షత వీర్యశౌర్య సమ్పత్పరాక్రమగుణః సమాక్రాన్తసకలత్రైలోక్యేశ్వరప్రభావో దశాననోఽభవత్ ॥ 13 ॥**

అతడు భగవంతుడైన సకలలోక గురువగు నృసింహునిచే సంహరించబడ్డాడు. అతడే మళ్లీ నశించిన శౌర్యవీర్యసంపదలచే పరాక్రమశాలియై సకలత్రిలోకాధిపతియైన దేవేంద్రుని వైభవాన్ని ఆక్రమించినవాడై దశకంఠునిగా జన్మించాడు.

**బహుకాలోపభుక్త భగవత్సకాశాదేవాప్త శరీరపాతోద్భవ పుణ్యఫలోఽథ భగవతైవ రాఘవరూపిణా సోఽపి నిధనముపనీతః. పునశ్చేదిరాజ దమఘోషపుత్రః శిశుపాల నామాభవత్ ॥ 14 ॥**

భగవానునివల్ల స్వయంగా సంహరించబడినందువల్ల కలిగిన పుణ్యఫలితంవల్ల చాలకాలం సౌఖ్యం అనుభవించిన రావణుడు భగవంతుడైన శ్రీరామునిద్వారా తిరిగి మరణం పొందాడు. మళ్లీ తిరిగి చేదిరాజైన దమఘోషునికి కుమారుడుగా శిశుపాలుడు అనే పేరుతో జన్మించాడు.

**శిశుపాలత్వే చ భగవతో భూభారావతారణాయ, అవతీర్ణాంశస్య, పుణ్డరీకనయనాఖ్యస్య ఉపరి ద్వేషాను బన్ధనమతితరాం చకార. భగవతా చ నిధనముపనీతస్తత్రైవ పరమాత్మభూతే మనసస్తదేకాగ్రతయా తత్రైవ సాయుజ్యమవాప ॥ 15 ॥**

శిశుపాలునిగా పుట్టినప్పుడు కూడా భూభారాన్ని తగ్గించడంకోసమై అవతరించిన, భగవదంశమైన తామరపూలవంటికన్నులుకల్గిన శ్రీ కృష్ణునిపట్ల వైరానుబంధం మిక్కిలిగా పెంచుకొన్నాడు. చివరకు ఆ భగవానుని ద్వారా మరణం పొంది, మనస్సును ఏకాగ్రంచేసి ఆపరమాత్మలోనే సాయుజ్యం పొందాడు.

**భగవాన్ యది ప్రసన్నో యథాఽభిలషితం దదాతి, అప్రసన్నోఽపి నిఘ్నన్ దివ్యమనుపమం స్థానం ప్రయచ్ఛతి । 16 ॥**

భగవంతుడు ప్రసన్నుడయితే భక్తునకు కోరినది ఇస్తాడు. అలాగే అప్రసన్నుడయితే సంహరించి సాటిలేని దివ్యస్థానం ప్రసాదిస్తాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే అన్ధకవంశవర్ణనం నామ చతుర్దశోఽధ్యాయః సమాప్తః ॥ 14 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో అన్ధకవంశవర్ణన అనే పద్నాల్గవ అధ్యాయం సమాప్తం.॥ 14 ॥



## పంచదశోఽధ్యాయః - పదునైదవ అధ్యాయం

## శిశుపాలపూర్వజన్మవృత్తాన్తః - శిశుపాలపూర్వజన్మ వృత్తాంతం

**శ్రీమైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అడుగుతున్నాడు.

**హిరణ్యకశిపుత్వే రావణత్వే చ విష్ణునా ।**
**అవాప నిహతో భోగానప్రాప్యానమరైరపి ॥**

**న లయం తత్ర తేనైవ నిహతః స కథం పునః ।**
**సమ్ప్రాప్తః శిశుపాలత్వే సాయుజ్యం శాశ్వతే హరౌ ॥**

**ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం సర్వధర్మభృతాం వర! ।**
**కౌతూహలపరేణైతత్ పృష్టో మే వక్తుమర్హసి ॥ 1 ॥**

"హిరణ్యకశిపుడుగా ఉన్నప్పుడు, రావణునిగా ఉన్నప్పుడు కూడా విష్ణువు సంహరించినా, దేవతలకు కూడా పొందరాని వివిధభోగాలు అనుభవించాడు.

అప్పుడు ఆయనలో లీనం కాలేదు. కాని మళ్లీ ఆయనచే సంహరించబడి శిశుపాలుడుగా ఉన్నప్పుడు శాశ్వతుడైన హరిలో ఎలా సాయుజ్యం పొందాడు?

సమస్తధర్మజ్ఞులలో శ్రేష్ఠుడవైన పరాశరమహర్షీ! నేను దీనిని వినగోరుతున్నాను. మిక్కిలి కుతూహలంతో అడుగుతున్నాను. నాకు దీనిని వివరించదగియున్నావు." అని అడిగాడు.

**పరాశర ఉవాచ:-** పరాశరుడు చెబుతున్నాడు.

**దైత్యేశ్వరస్య వధాయ, అఖిలలోకోత్పత్తిస్థితి పూర్వతనుం గృహ్ణతా నృసింహరూపమావిష్కృతమ్. తత్ర హిరణ్యకశిపోః విష్ణురయమిత్యేవం న మనస్యభూత్ ॥ 2 ॥**

సమస్తలోకాలకు సృష్టిస్థితిలయకారకుడైనవాడు పూర్వం దైత్యేశ్వరుని వధించడానికై శరీరాన్ని స్వీకరించాడు. నరసింహరూపాన్ని ఆవిష్కరించాడు. అపుడు హిరణ్యకశిపుని చిత్తంలో ఆయన విష్ణువనే భావనలేదు.

**నిరతిశయపుణ్యజాతసమ్భూతమేతత్ సత్త్వజాతమితి. రజఉద్రేకప్రేరితైకాగ్రమతిస్తద్భావనాయోగాత్తతోఽవాప్తవధహైతుకీం నిరతిశయామేవాఖిలత్రైలోక్యాధిక్యధారిణీం దశాననత్వే భోగసమ్పదమవాప ॥ 3 ॥**

మిక్కిలి అతిశయంతో కూడిన పుణ్యంవల్ల ప్రభవించినవాడే అని అనుకొన్నాడు. రజోగుణంపట్ల ఉద్రేకం, దాని ప్రేరణపట్ల ఏకాగ్రబుద్ధి కలిగిన వాడయ్యాడు. ఆ భావనాయోగంవల్ల, ఆ భగవంతునివల్ల మరణించినా కూడా సాయుజ్యం పొందలేదు. కాని దాని ఫలితంగా సమస్తత్రైలోక్యవిషయమైన, మిక్కిలి అతిశయంతో కూడుకొన్న భోగసంపదను దశాననుడుగా పొందాడు.

**నాతస్తస్మిన్, అనాదినిధనే పరబ్రహ్మభూతే భగవత్యనాలమ్బిని కృతే మనసస్తత్ర లయమ్ ॥ 4 ॥**

ఆ అనాదినిధనుడైన, పరబ్రహ్మస్వరూపమైన, నిరాధారుడైన పరమాత్మపై మనస్సును లగ్నం చేయకపోవడం వల్ల భగవంతునిలో లీనం గాలేదు.

**దశాననత్వేఽపి, అనంగపరాధీనతయా జానకీసమాసక్తచేతసో దాశరథిరూపధారిణస్తద్రూపదర్శనమేవాసీత్. నాయమచ్యుత ఇత్యాసక్తిర్విపద్యతోఽన్తఃకరణాయ మానుషబుద్ధిరేవ కేవలమభూత్ ॥ 5 ॥**

దశకంఠుడుగా ఉన్నప్పుడు మన్మథవశుడై లొంగిపోవడంవల్ల, జానకీదేవియందే మనస్సులగ్నంచేసిన వాడై, దశరథపుత్రుడైన రామునిచే మరణించినప్పుడు ఆతనికి రూపదర్శనంమాత్రమే అయింది. అతడు పరమాత్మ అయిన అచ్యుతుడు కాదని, అతడు మనుష్యమాత్రుడే అన్న భావమే చనిపోయేసమయంలో కేవలం అతని అంతఃకరణంలో నిలిచియుండి పోయింది.

**పునరచ్యుతవినిపాతమాత్రఫలమఖిల భూమణ్డలశ్లాఘ్య చేదిరాజకులజన్మావ్యాహతం చైశ్వర్యం శిశుపాలత్వే చావాప ॥ 6 ॥**

మళ్లీ అచ్యుతునిద్వారా చనిపోవడంవల్ల లభించిన ఫలంచే అఖిలభూప్రపంచంలో కొనియాడబడే చేదిరాజవంశంలో పుట్టుక, ఎదురులేని ఐశ్వర్యం శిశుపాలుడుగా ఉన్నప్పుడు పొందగలిగాడు.

**తత్ర త్వఖిలాన్యేవ భగవన్నామ కారణాన్యభవన్. తతశ్చ త్వంకారకారణకృతానాం తేషామశేషాణామే వాచ్యుతనామ్నామ్, అనవరతమనేక జన్మసంవర్ధిత విద్వేషానుబన్ధిచిత్తో వినిన్దన్ సన్తర్జనాదిషు ఉచ్చారణమకరోత్॥ 7॥**

ఇక భగవంతుని నామాలు అనంతాలుగా ఉన్నాయి. భగవంతుని పేర్లు అన్నింటితోను అతడు "నీవు" అనడమే జరిగింది. ఆ అచ్యుతుని అనేకనామాలపై, ఎల్లప్పుడూ అనేక జన్మలలో పెరిగిన విద్వేషం మనసుకు పట్టి ఉన్నందున, ఆ నామాలను నిందిస్తూ, ఆక్షేపిస్తూ వాటినే ఎక్కువ సార్లు ఉచ్చరించాడు.

**తచ్చ రూపముత్ఫుల్లాబ్జదలామలాక్షమతి, ఉజ్జ్వలపీతవస్త్రధారి, అమలకిరీటకేయూరకటకోపశోభితమ్, ఉదారపీవరచతుర్బాహు. శంఖచక్రగదాఽసిధరమ్, అతి ప్రౌఢవైరానుభావాటనభోజనస్నానాసనశయనాదిషు, అవస్థాన్తరేషు నాన్యత్రోపయయావస్య చేతసః ॥ 8 ॥**

వికసించిన తామరరేకులవంటి కన్నులు కలిగి, ధగధగ ప్రకాశించే పీతాంబరం ధరించి, చక్కని కిరీటం, కేయూరాలు, కంకణాలతో మెరిసిపోతూ, గొప్పవై పుష్టికలిగిన నాలుగు చేతులలో శంఖం, చక్రం, గద, ఖడ్గం ధరించిన ఆ రూపం నయనాలముందు కదలాడుతూ ఉంటే, వ్రేళ్ళూనిన విరోధభావంవల్ల తిరుగుతున్నా, భుజిస్తున్నా, స్నానం చేస్తున్నా, కూర్చున్నా, పడుకొన్నా, అన్ని అవస్థలలోను ఆ శిశుపాలుని మనస్సునుంచి మరోచోటికి పోలేదు.

**తతస్తమేవాక్రోశేషూచ్చారయన్, తమేవ హృదయే ధారయన్, భగవద్ధస్తచక్రాంశుమాలోజ్జ్వలమ్, అక్షయతేజః స్వరూపం, పరమబ్రహ్మస్వరూపం, అపగతరాగద్వేషాదిదోషం, భగవన్తమ్ అద్రాక్షీత్. తావచ్చ భగవచ్చక్రేణాశు వ్యాపాదితః తేన తత్స్మరణదగ్ధాఖిలాఘసంచయో భగవతైవాన్తముపనీతః, తస్మిన్నేవ లయముపయయౌ । 9 ॥**

అనంతరం ఆయనను గూర్చే అరుస్తూ. ఆయనపేరే పలుకుతూ, ఆయననే హృదయంలో ధరించాడు. భగవంతుని చేతిలోని చక్రకిరణమాలికతో ప్రకాశవంతమైన, అక్షయమైన తేజోరూపమైన, రాగం, ద్వేషం మున్నగు దోషాలులేని, భగంతుని పరబ్రహ్మస్వరూపాన్నే నిరంతరం దర్శించాడు. ఆ సమయంలో వేగంగా వచ్చి ఆ భగవంతుని చక్రమే ఆతనిని సంహరించింది. ఆయనను ఎల్లప్పుడు స్మరించడంవల్ల సమస్తపాపపుంజం నశించిపోయింది. భగవంతునివల్ల మరణించినందున ఆయనలోనే లీనమయ్యాడు.

**ఏతత్ తవాఖిలం మయాఽభిహితమ్. భగవానిహ కీర్తితః సంస్మృతశ్చ ద్వేషానుబన్ధేనాపి, అఖిల సురాసురాది దుర్లభం ఫలం ప్రయచ్ఛతి కిముత సమ్యగ్ భక్తిమతామ్ ॥ 10 ॥**

నేను ఈ సమస్తం నీకు వివరించాను. భగవంతుని వైరానుబంధం చేతనైనా కీర్తించినా, స్మరించినా, సమస్తదేవతలకు, అసురులకు లభ్యంకాని ఫలం చేకూరుస్తాడు. ఇక చక్కని భక్తి కలిగియున్న వారికి లభించే ఫలం గురించి చెప్పేదేముంది?

**వసుదేవస్యానకదున్దుభేః పౌరవీ, రోహిణీ, మదిరా, భద్రా, దేవకీ ప్రముఖా బహ్వ్యః పత్న్యోఽభవన్. బలభద్ర, సారణ, శఠదుర్మదాదీన్ పుత్రాన్ రోహిణ్యామానకదున్దుభిరుత్పాదయామాస. బలభద్రోఽపి రేవత్యాం నిశఠోల్ముకౌ పుత్రావజనయత్. మార్ష్టిమార్ష్టిమచ్ఛిశిశుసత్యధృతి ప్రముఖాః సారణస్యాత్మజాః ॥ 11 ॥**

ఆనకదుందుభి అని పిలవబడే వసుదేవునికి పౌరవి, రోహిణి, మదిర, భద్ర, దేవకి మొదలైన చాలామంది భార్యలున్నారు. ఆనకదుందుభివల్ల రోహిణియందు బలభద్రుడు, సారణుడు, శఠుడు, దుర్మదుడు మున్నగు పుత్రులు కలిగారు. బలభద్రుడు రేవతియందు నిశఠుడు, ఉల్ముకుడు అనే పుత్రులను పొందాడు. సారణునికి మార్ష్టి, మార్ష్టిమంతుడు, శిశి, శిశువు, సత్యధృతి మున్నగు కుమారులు కలిగారు.

**భద్రాశ్వ, భద్రబాహు, దుర్దమ, భూతాద్యా రోహిణ్యాః కులజాః ॥ 12 ॥**

భద్రాశ్వుడు, భద్రబాహుడు, దుర్దముడు, భూతుడు మొదలైనవారు కూడా రోహిణికుమారులే.

**నన్దోపనన్ద కృతకాద్యా మదిరాయాస్తనయాః. భద్రాయాశ్చ ఉపనిధిగదాద్యాః వైశాల్యాం కౌశిక మేక మజనయదానకదుందుభిః. దేవక్యామపి కీర్తిమత్ సుషేణోదాయు భద్రసేన ఋజుదాస భద్రదేహాఖ్యాః షట్పుత్రా జజ్ఞిరే. తాంశ్చ సర్వానేవ కంసో ఘాతితవాన్ ॥ 13 ॥**

నందుడు, ఉపనందుడు, కృతకుడు మొదలైన వారు వసుదేవునికి మదిరయందు కలిగిన కుమారులు. ఉపనిధి, గదుడు మున్నగు వారు భద్రయందు అతనికి జన్మించారు. వైశాలియందు ఆనకదుందుభికి కౌశికుడనే ఒకే కుమారుడు పుట్టాడు. దేవకియందు కీర్తిమంతుడు, సుషేణుడు, ఉదాయువు, భద్రసేనుడు, ఋజుదాసుడు, భద్రదేహుడు అనే ఆరుగురు పుత్రులు జన్మించారు. వారినందరిని కంసుడు సంహరించడం జరిగింది.

**అనంతరం చ సప్తమం గర్భమర్ధరాత్రే భగవత్ప్రహితా యోగనిద్రా రోహిణ్యా జఠరమపకృష్య నీతవతీ॥14॥**

తరువాత దేవకీదేవి ఏడోగర్భాన్ని అర్ధరాత్రిసమయంలో భగవంతునిచే నియమించబడ్డ యోగనిద్ర లాగి రోహిణి గర్భం (కడుపు)లోకి చేర్చింది.

**కర్షణాచ్చాసావపి సంకర్షణాఖ్యామవాప ॥ 15 ॥**

కర్షణంవల్ల పుట్టిన ఇతనికి సంకర్షణుడనే పేరు వచ్చింది.

**తతః సకలజగన్మహాతరుమూలభూతో, భూతాతీత భవిష్యదాది సకలసురాసుర మునిమనుజమన సామప్యగోచరః, అబ్జభవప్రముఖైరనలప్రముఖైశ్చ ప్రణమ్యావనిభారావతారణాయ ప్రసాదితో భగవాన నాదిమధ్యనిధనో దేవకీ గర్భే సమవతతార వాసుదేవః ॥ 16 ॥**

అనంతరం సమస్తజగత్తు అనే మహావృక్షానికి మొదలు వంటివాడు, భూత, వర్తమాన, భవిష్యదాది కాలాలలో సమస్త దేవతలకు, అసురులకు, మునులకు, మనుష్యులకు మనస్సులలో కూడ గోచరం కాని వాడు, బ్రహ్మాదిదేవతలచే అగ్ని మున్నగు మహాభూతాలచే ప్రార్థింపబడినవాడై, వారందరూ నమస్కరించినందువల్ల భూభారం తగ్గించడానికై అనాదిమధ్యనిధనుడైన వాసుదేవుడు దేవకీ గర్భంలో ప్రవేశించాడు.

**తత్ప్రసాదవివర్ధితమహాభిమానా చ యోగనిద్రా నన్దగోపపత్న్యా యశోదాయా గర్భమధిష్ఠితవతీ ॥ 17 ॥**

ఆ భగవంతుని అనుగ్రహంవల్ల పెరుగుతున్న గొప్ప ప్రభావంకల్గిన యోగనిద్ర నందగోపుని భార్యయైన యశోదగర్భాన్ని ఆవరించి ఉన్నది.

**సుప్రసన్నాదిత్యచన్ద్రాదిగ్రహమవ్యాలాధి భయం సుస్థమానసమఖిలమేవైతత్. జగదపాస్తా ధర్మమభవత్ తస్మింశ్చ పుణ్డరీకనయనే జాయమానే ॥ 18 ॥**

ఆ పుండరీకాక్షుడు అవతరిస్తూ ఉంటే సూర్యుడు, చంద్రుడు మున్నగు గ్రహాలు ప్రసన్నంగా ఉన్నాయి. క్రూరమృగాల, సర్పాలవంటి భయం తొలగిపోయింది. సమస్తజగత్తుల మనస్సులు కుదుటబడి ఉన్నాయి. అధర్మం తొలగి పోయింది.

**జాతేన చ తేనాఖిలమేవైతత్ సన్మార్గవర్తి జగదక్రియత. భగవతోఽప్యత్ర మర్త్యలోకేఽవతీర్ణస్య షోడశ సహస్రాణ్యేకోత్తర శతాధికాని స్త్రీణామభవన్. తాసాం చ రుక్మిణీ, సత్యభామా, జామ్బవతీ చారుహాసినీ ప్రముఖా అష్టౌ పత్న్యః ప్రధానాః. తాసు చాష్టాయుతాని లక్షం చ పుత్రాణాం భగవానఖిలమూర్తిరనాదిమానజనయత్ ॥19॥**

ఆ భగవానుడు ఆవిర్భవించిన తరువాత సమస్తజగత్తునూ మంచిమార్గంలో ఉండేటట్లుగా నడిపించాడు. ఆయన ఈ మానవలోకంలో అవతరించిన తరువాత పదహారువేల, ఒక వందమంది భార్యలై సేవించారు. వారిలో రుక్మిణి, సత్యభామ, జాంబవతి, చారుహాసిని మొదలైన వారు ఎనమండుగురు ప్రధానంగా పత్నులయ్యారు. వారియందు ఆదిలేని ఆ భగవంతుడు సమస్తరూపుడై ఒకలక్ష ఎనభైవేలమంది పుత్రులను పొందాడు.

**తేషాం చ ప్రద్యుమ్నచారుదేష్ణ సామ్బాదయస్త్రయోదశ ప్రధానాః. ప్రద్యుమ్నో హి రుక్మిణస్తనయాం కకుద్మతీం (రుక్మవతీం) నామోపయేమే. తస్యామస్యానిరుద్ధో జజ్ఞే. అనిరుద్ధోఽపి రుక్మిణ ఏవ పౌత్రీం సుభద్రాం నామోపయేమే. తస్యామస్య వజ్రోఽభవత్. వజ్రస్య ప్రతిబాహుః, తస్యాపి సుచారుః ।**

వారిలో ప్రద్యుమ్నుడు, చారుదేష్ణుడు, సాంబుడు మొదలైన వారు పదముగ్గురు ముఖ్యమైన వారు. ప్రద్యుమ్నుడు రుక్మికుమార్తెను కకుద్మతిని (రుక్మవతిని) పెండ్లిచేసుకొన్నాడు. ఆమెయందు అతనికి అనిరుద్ధుడు జన్మించాడు. అనిరుద్ధుడు కూడా రుక్మిమనుమరాలగు సుభద్ర అన్న ఆమెను వివాహమాడాడు. అతని వల్ల ఆమెకు వజ్రుడు పుట్టాడు. వజ్రునికి ప్రతిబాహువు, అతనికి సుచారువు జన్మించారు.

**ఏవమనేక శతసహస్రపురుషసంఖ్యస్య యదుకులస్య పుత్రసంఖ్యా వర్షశతైరపి జ్ఞాతుం న శక్యతే. యతో హి శ్లోకావిమా వత్ర చరితార్థౌ ॥ 20 ॥**

ఈ రీతిగా ఎన్నో వందలు, వేలు, పురుషసంఖ్యతో కూడినట్టి యదువంశంలోని పుత్రసంఖ్యను వందల సంవత్సరాలయినా చెప్పడానికి శక్యంకాదు. అందువల్లనే ఈ రెండు శ్లోకాలు ఈ సందర్భంలో సార్థక్యాన్ని పొందాయి.

**తిస్రః కోట్యః సహస్రాణామష్టాశీతి శతాని చ ।**
**కుమారాణాం గృహాచార్యాశ్చాపయోగేషు యే రతాః ॥ 21 ॥**

యాదవకుమారులకు ధనుర్విద్యనేర్పిన రాజగురువులు మూడు కోట్ల ఎనభై ఎనిమిదిలక్షల మంది ఉన్నారట.

**సంఖ్యానం యాదవానాం కః కరిష్యతి మహాత్మనామ్ ।**
**యత్రాయుతానామయుతం లక్షేణాస్తే శతాధికమ్ ॥ 22 ॥**

ఇక మహాత్ములైన యాదవుల సంఖ్యను ఎవరు లెక్కించగలరు? అక్కడ లక్షల కోట్లమంది యాదవులతో ఆహుకుడు (ఉగ్రసేనుడు) ఉంటాడు.

విశే:- శతాధికమ్ - సదాహుకః- అని పాఠాంతరం.

**దేవాసురే హతా యే తు దైతేయాః సుమహాబలాః ।**
**తే చోత్పన్నా మనుష్యేషు జనోపద్రవకారిణః ॥ 23 ॥**

పూర్వం దేవాసురయుద్ధంలో చనిపోయిన మహాబలశాలులైన దైత్యులందరు మనుష్యులలో జన్మించి జనులకు ఉపద్రవం కలిగిస్తున్నారు.

**తేషాముత్సాదనార్థాయ భువి దేవా యదోః కులే ।**
**అవతీర్ణాః కులశతం యత్రైకాభ్యధికం ద్విజ ॥ 24 ॥**

మైత్రేయా! వారిని సంహరించడంకోసమై భూమిపై దేవతలు యాదవవంశంలో నూటొక్కటి కులాలుగా అవతరించారు.

**విష్ణుస్తేషాం ప్రమాణే చ ప్రభుత్వే చ వ్యవస్థితః ।**
**నిదేశస్థాయినస్తస్య బభూవుః సర్వయాదవాః ॥ 25 ॥**

వారికి నియంతగా అధికారిగా భగవంతుడైన విష్ణువే నిలిచాడు. సమస్తయాదవులు ఆయన ఆదేశాన్ని అనుసరించి నిలిచారు.

**ప్రసూతిర్వృష్ణివీరాణాం యః శృణోతి నరః సదా ।**
**స సర్వపాతకైర్ముక్తో విష్ణులోకం ప్రపద్యతే ॥ 26 ॥**

ఈ ఉత్పత్తి అంతా వృష్ణివంశీయులకు సంబంధించినది. దీనిని విన్నవాడు సమస్తపాపాలనుంచి విముక్తుడై విష్ణులోకం పొందుతాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే శిశుపాల పూర్వజన్మవృత్తాంతో నామ పంచదశోఽధ్యాయః సమాప్తః ॥ 15 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో శిశుపాల పూర్వజన్మ వృత్తాంతం అనే పదిహేనవ అధ్యాయం సమాప్తం॥15॥

## **షోడశోఽధ్యాయః** – పదునారవ అధ్యాయం

## **తుర్వసువంశః** – తుర్వసు వంశం

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెబుతున్నాడు.

**ఇత్యేష సమాసతస్తే కథితః, తుర్వసోర్వంశమవధారయ । 1 ॥**

మైత్రేయా! నీకు ఈ యదువంశాన్నిగురించి సంగ్రహంగా తెలియజేశాను. ఇక తుర్వసుని వంశం గురించి వినుము.

**తుర్వసోర్వహ్నిరాత్మజః, వహ్నేర్భార్గః, భార్గాద్భానుః, తతశ్చ త్రైశామ్బః, తస్మాచ్చ కరన్ధమః, తస్మాదపి మరుత్తః సోఽనపత్యోఽభవత్. తతశ్చ పౌరవం దుష్యన్తం పుత్రమకల్పయత్. ఏవం యయాతి శాపాత్ తద్వంశః పౌరవం వంశ మాశ్రితవాన్ ॥ 2 ॥**

తుర్వసుని కుమారుడు వహ్ని. వహ్నికుమారుడు భార్గుడు. భార్గునివల్ల భానుడు, అతనివల్ల త్రైశాంబుడు (త్రయీసానుడు) కలిగారు. అతనివల్ల కరంధముడు, అతనికి మరుత్తు జన్మించారు. ఎందువల్లనో అతనికి సంతానం కలగలేదు. అపుడు పురువంశీయుడైన దుష్యంతుని (దుష్మంతుని)దత్తత చేసుకొన్నాడు. ఈ విధంగా యయాతి ఇచ్చిన శాపంవల్ల అతని వంశం పూరునివంశాన్నే ఆశ్రయించింది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే తుర్వసువంశో నామ షోడశోఽధ్యాయః సమాప్తః ॥ 16 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో తుర్వసు వంశం అనే పదహారవ అధ్యాయం సమాప్తం ॥16 ॥

## **సప్తదశోఽధ్యాయః** - పదిహేడవ అధ్యాయం

## **ద్రుహ్యువంశః** – **ద్రుహ్యువంశం**

**ద్రుహ్యోస్తు తనయో బభ్రుః ।**
**ద్రుహ్యుని కుమారుడు బభ్రుడు ॥ 1 ॥**

**తతః సేతుః, సేతుపుత్ర ఆరద్వాన్నామ, తదాత్మజో గాన్ధారః, తతో ధర్మః, ధర్మాద్ ఘృతః, ఘృతాద్దుర్గమః, తతః ప్రచేతాః,ప్రచేతసః పుత్రః శతధర్మో బహులానాంమ్లేచ్ఛానాముదీచ్యాదీనామాధిపత్యమకరోత్.॥ 2 ॥**

బభ్రునివల్ల సేతువు జన్మించాడు. సేతువు పుత్రుడు ఆరద్వంతుడు. అతని కుమారుడు గాంధారుడు. అతనివల్ల ధర్ముడు, ధర్మునివల్ల ఘృతుడు, ఘృతునివల్ల దుర్దముడు, అతనివల్ల ప్రచేతసుడు కలిగారు. ప్రచేతసుని కుమారుడు శతధర్ముడు. అతడు ఉత్తర దిక్కునందలి పెక్కుమంది మ్లేచ్ఛులకు అధిపతిఅయ్యాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే ద్రుహ్యువంశో నామ సప్తదశోఽధ్యాయః సమాప్తః ॥ 17 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో ద్రుహ్యువంశం అనే పదిహేడవ అధ్యాయం సమాప్తం ॥17 ॥

## **అష్టాదశోఽధ్యాయః** - పదునెనిమిదవ అధ్యాయం

### **అనువంశః** - అనువు వంశం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**యయాతేశ్చతుర్థస్య పుత్రస్య అనోః సభానల, చక్షుః, పరమేషుసంజ్ఞాస్త్రయః పుత్రా బభూవుః. సభానల (సభానర) పుత్రః కాలానలః, కాలానలాత్ సృంజయః, సృంజయాత్ పురంజయః తస్మాజ్జనమేజయః, తతో మహామణిః, తస్మాచ్చ మహామనాః, తస్మాదుశీనర, తితిక్షూ ద్వౌ పుత్రావుత్పన్నౌ. ఉశీనరస్యాపి శిబినృగ నరకృమిఖర్వాఖ్యాః పంచ పుత్రా బభూవుః. వృషదర్భ, సువీర, కేకయ, మద్రకాశ్చత్వారః శిబిపుత్రాః. తితిక్షోరపి రుషద్రథః పుత్రోఽభూత్. తతో హేమః, హేమాత్ సుతపాః, తస్మాద్ బలిః యస్య క్షేత్రే అంగ, వంగ, కలింగ, సుహ్యపుణ్డ్రాఖ్యం బాలేయం క్షత్రమజన్యత ॥ 1 ॥**

పరాశరుడు చెబుతున్నాడు. యయాతి నాలుగోకుమారుడైన అనువుకు సభానలుడు, చక్షువు, పరమేషువు అనే ముగ్గురు తనయులు కలిగారు. సభానలుని (సభానరుని) పుత్రుడు కాలానలుడు. కాలానలునివల్ల సృంజయుడు, సృంజయునివల్ల పురంజయుడు, అతనివల్ల జనమేజయుడు, అతనివల్ల మహామణి, అతనివల్ల మహామనస్కుడు, అతనివల్ల ఉశీనరుడు, తితిక్షువు అనే ఇద్దరు పుత్రులు పుట్టారు. అందు ఉశీనరునికి శిబి, నృగుడు, నరుడు, కృమి, ఖర్వుడు అనే ఐదుగురు పుత్రులు ఉద్భవించారు. శిబికి వృషదర్భుడు, సువీరుడు, కేకయుడు, మద్రకుడు అనే నలుగురు సుతులు కలిగారు. అందు తితిక్షువుకు రుషద్రథుడు అనే కుమారుడు పుట్టాడు. అతనికి హేముడు, హేమునివల్ల సుతపుడు, అతనివల్ల బలి కలిగారు. ఆ బలిక్షేత్రంలో (భార్యయందు) (దీర్ఘతముడనే మునివల్ల) అంగుడు, వంగుడు, కలింగుడు, సుహ్యుడు, పుండ్రుడు అనే బాలేయక్షత్రియులు జన్మించారు.

**తన్నామసన్తతి సంజ్ఞాశ్చ పంచ విషయా బభూవుః ॥ 2 ॥**

ఆ బలిసంతానంపేర్లతో అంగవంగకలింగాది ఐదు దేశాలు ఏర్పడ్డాయి.

**అంగసుతః పారః, తతో దివిరథః, తస్మాద్ ధర్మరథః తతశ్చిత్రరథః, రోమపాద సంజ్ఞో యస్య దశరథో మిత్రం జజ్ఞే। యస్మై అజపుత్రో దశరథః శాన్తాం నామ కన్యామనపత్యాయ దుహితృత్వే యుయోజ ॥ 3 ॥**

అంగుని కుమారుడు పారుడు (అనపానుడు), అతనివల్ల దివిరథుడు, అతనివల్ల ధర్మరథుడు. అతని వల్ల చిత్రరథుడు కలిగారు. అతనికే రోమపాదుడనిపేరు. అతడు దశరథునికి మిత్రుడు. అజుని కుమారుడైన దశరథుడు శాంత అనే తనకన్యను సంతానంలేని అతనికి కుమార్తెగా (దత్తత) ఇచ్చాడు.

**రోమపాదాచ్చతురంగః, తస్మాచ్చ పృథులాక్షః, తతశ్చమ్పః, యశ్చమ్పాం నివేశయామాస ॥ 4 ॥**

రోమపాదునివల్ల చతురంగుడు, అతనివల్ల పృథులాక్షుడు, అతనివల్ల చంపుడు కలిగారు. అతడే చంపానగరం నిర్మించాడు.

**చమ్పస్య హర్యంగః, తతో భద్రరథః, భద్రరథాత్ బృహద్రథో, బృహద్రథాత్ బృహత్కర్మా, బృహత్కర్మణశ్చ బృహద్భానుః, తస్మాద్ బృహన్మనాః, తతోజయద్రథః జయద్రథో బ్రహ్మ క్షత్రాన్తరాల సమ్భూత్యాం పత్న్యాం విజయం నామ పుత్రమజీజనత్ ॥ 5 ॥**

చంపునికి హర్యంగుడు, అతనికి భద్రరథుడు, భద్రరథునివల్ల బృహద్రథుడు (బ్రహ్మ రథుడు), అతనివల్ల బృహత్కర్ముడు, అతనివల్ల బృహద్భానుడు, అతనివల్ల బృహన్మనుడు, అతనివల్ల జయద్రథుడు కలిగారు. బ్రాహ్మణీ క్షత్రియ సాంకర్యంవల్ల జన్మించిన పత్నియందు జయద్రథుడు విజయుడనే పేరుగల పుత్రుని పొందాడు.

**విజయశ్చ ధృతిం పుత్రమవాప. తస్యాపి ధృతవ్రతః పుత్రోఽభూత్. ధృతవ్రతాత్ సత్యకర్మా, సత్యకర్మణ స్త్వతిరథః యోఽసౌ గంగాం గతో మంజూషాగతం పృథాఽపవిద్ధం కర్ణం పుత్రమవాప ॥ 6 ॥**

విజయునికి ధృతి అనే పుత్రుడు కలిగాడు. అతనికి ధృతవ్రతుడనే కుమారుడు జన్మించాడు. ధృత వ్రతుని వల్ల సత్యకర్ముడు, సత్యకర్మునివల్ల అతిరథుడు కలిగారు. ఇతడు ఒకనాడు గంగానదికి వెళ్లగా, కుంతి విడిచి వేసిన పెట్టెలోనున్న కర్ణుని కుమారునిగా అచట పొందడం జరిగింది.

**కర్ణాద్ వృషసేన ఇత్యేతే అంగాః ॥ 7 ॥**

కర్ణునివల్ల వృషసేనుడు కలిగాడు. వీరందరు అంగవంశీయులయ్యారు.

**అతశ్చ పురోర్వంశం శ్రోతుమర్హసీతి । 8 ॥**

ఇకపైన పూరువంశంగురించి చెబుతున్నాను, కాబట్టి మైత్రేయా! నీవు వినడానికి దగియున్నావు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే అనువంశో నామ అష్టాదశోఽధ్యాయః సమాప్తః ॥ 18 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో అనువంశం అనే పదునెనిమిదవ అధ్యాయం సమాప్తం ॥ 18 ॥



## ఏకోనవింశోఽధ్యాయః - పందొమ్మిదవ అధ్యాయం

## పురువంశః – పురువంశం

**పురోర్జనమేజయః పుత్రస్తస్యాపి ప్రచిన్వాన్, ప్రచిన్వతః ప్రవీరః, తస్మాన్మనస్యుః, మనస్యోశ్చాభయదః, తస్యాపి సుద్యుమ్నః, తతో బహుగవః, తస్య సంయాతిః, సంయాతే రహంయాతిః, తతో రౌద్రాశ్వః ఋతేయు, కృతేయు, కక్షేయు, స్థణ్డిలేయు, ధృతేయు, జలేయు, స్థలేయు, సన్తతేయు, ధనేయు, వనేయు నామానో రౌద్రాశ్వస్య దశాత్మజా బభూవుః ॥ 1 ॥**

పరాశరుడు చెబుతున్నాడు. పురునకు జనమేజయుడనే కుమారుడు కలడు. అతనికి ప్రచిన్వంతుడు, ప్రచిన్వంతునకు ప్రవీరుడు, అతనికి మనస్యుడు, మనస్యునివల్ల అభయదుడు, అతనికి సుద్యుమ్నుడు (సుద్యువు), అతనికి బహుగతుడు, అతనికి సంయాతి (సంపాతి), సంయాతివల్ల అహంయాతి, అతనివల్ల రౌద్రాశ్వుడు కలిగారు. రౌద్రాశ్వునికి ఋతేయువు, కృతేయువు, కక్షేయుడు, స్థండిలేయుడు, ధృతేయుడు, జలేయుడు, స్థలేయుడు, సంతతేయుడు, ధనేయుడు, వనేయుడు అనే పేర్లుకలిగిన పదిమంది కుమారులు కలిగారు.

వి ॥ ఈ నామాలలో "యు" కు బదులుగా "షు" పాఠాంతరంగా ఉంది.

**ఋతేయో రన్తినారః పుత్రోఽభూత్, తంసుమప్రతిరథం ధ్రువం చ రన్తినారః పుత్రానవాప. అప్రతిరథాత్ కణ్వః, తస్యాపి మేధాతిథిః, యతః కాణ్వాయనా ద్విజా బభూవుః తంసోరైలీనః తతో దుష్యన్తాద్యాశ్చత్వారః పుత్రా బభూవుః దుష్యన్తాచ్చక్రవర్తీ భరతోఽభూత్. యన్నామహేతుర్దేవైః శ్లోకో గీయతే ॥ 2 ॥**

ఋతేయునకు రంతి నారుడు (అంతినారుడు) అనే కాదుకు కలిగాడు. ఆరంతినారునికి తంసుడు (సుమతి), అప్రతిరథుడు, ధ్రువుడు అనే ముగ్గురు కుమారులు జన్మించారు. అప్రతిరథుని వల్ల కణ్వుడు, అతని వల్ల మేధాతిథి జన్మించారు. అతని వల్లనే కాణ్వాయనులనే ద్విజులు సంభవించారు. తంసునికి ఐలీనుడు (అనిలుడు), అతనికి దుష్యంతుడు మున్నగు నలుగురు కలిగారు. అందు దుష్యంతునికి చక్రవర్తి అయిన భరతుడు ఉద్భవించాడు. అతని పేరుకు ప్రధానకారణంగా దేవతలు ఈశ్లోకం గానంచేస్తూ ఉంటారు.

వి ॥ అప్రతిరథుని మరో పుత్రుడు ఐలీనుడని పాఠాంతరం.

**మాతా భస్త్రా పితుః పుత్రో యేన జాతః స ఏవ సః ।**
**భరస్వ పుత్రం దుష్యన్తమావమంస్థాః శకున్తలామ్ ॥ 3 ॥**

తల్లి తోలుతిత్తి లాంటిది. తండ్రివంటి కుమారుడు ఎవనివల్ల జన్మిస్తాడో అటువంటివాడే కుమారుడు సుమా! దుష్యంతా! ఈ పుత్రుని స్వీకరించు. శకుంతలను అవమానించకు.

**రేతోధాః పుత్రో నయతి నరదేవ! యమక్షయాత్ ।**
**త్వం చాస్య ధాతా గర్భస్య సత్యమాహ శకున్తలా ॥ 4 ॥**

నరదేవా! పుత్రుడు తండ్రి వీర్యంవల్ల పుట్టినవాడై, తన తండ్రిని యమలోకంనుంచి స్వర్గలోకానికి చేరుస్తాడు. ఈపుత్రుని పుట్టుకకు నీవే సంధానకర్తవు సుమా! శకుంతల సత్యం చెప్పింది.

**భరతస్య పత్నీత్రయే నవపుత్రా బభూవుః, నైతే మమానురూపాః పుత్రా ఇత్యభిహితాస్తన్మాతరో పరిత్యాగభయాత్ తత్పుత్రాన్ జఘ్నుః ॥ 5 ॥**

భరతునికి ముగ్గురు భార్యలయందు తొమ్మండుగురు కుమారులు కలిగారు. ఈపిల్లలు నాకు తగిన వాళ్లు కారని భర్త అన్నాడని, తమను విడిచిపెడతాడేమో అన్నభయంతో ఆ తల్లులు ఆ కుమారులను సంహరించారు.

**తతోఽస్య పుత్రజన్మని వితథే పుత్రార్థినో మరుత్సోమయాజినో దీర్ఘతమసా పార్ష్ణ్యపాస్త బృహస్పతి వీర్యా దుతథ్యపత్నీ మమతా సముత్పన్నో భరద్వాజాఖ్యః పుత్రో మరుద్భిర్దత్తః। తస్యాపి నామ నిర్వచనశ్లోకః పఠ్యతే ॥6॥**

అలా పుత్రజన్మనిష్ఫలమైపోయినందువల్ల భరతుడు పుత్రులను అర్థించి మరుత్సోమం అనే యజ్ఞం చేశాడు. ఆ యజ్ఞంచివర మరుద్గణం సంతోషించి అతనికి భరద్వాజుడనే అతనిని పుత్రునిగా సమర్పించారు. అతడు ఉతథ్యుని భార్యయైన సుమతియందు, గర్భంలో ఉన్న దీర్ఘతముడు అనే ముని తన్నగా, బృహస్పతివీర్యం వల్ల ఉద్భవించినవాడు. అతని పేరును కూడా ప్రస్తావిస్తూ ఒక శ్లోకం వినవస్తూ ఉంది.

**మూఢే! భరద్వాజమిమం భరద్వాజం బృహస్పతే! ।**
**యాతౌ యదుక్త్వా పితరౌ భరద్వాజస్తతస్త్వయమ్ ॥ 7 ॥**

కుమారుడు జన్మించాక బృహస్పతి మమతతో "ఓసి మూఢురాలా! మన ఇరువురు వల్ల పుట్టిన ఈ బాలుని భరించు" అన్నాడు. అపుడు మమత ఆయనతో "బృహస్పతీ! ఈ ద్వాజుని నీవే పోషించు" అన్నది. ఇలా పలికి ఆ తల్లిదండ్రులు వెళ్లి పోయినందున ఆ బాలుడు భరద్వాజుడయ్యాడు.

**భరద్వాజస్స తస్య వితథే పుత్రజన్మని మరుద్భిర్దత్తః, తతో వితథసంజ్ఞామవాప. వితథస్య భవన్మన్యుః పుత్రోఽభూత్ ॥ 8 ॥**

ఈ విధంగా భరతునికి పుత్రజన్మ విఫలం (వితథం) అయిన తరువాత, మరుత్తులు భరద్వాజుని ఇచ్చారు కాబట్టి, అతనికి వితథుడు అనే పేరు వచ్చింది. ఆ వితథునికి భవన్మన్యువు (మన్యువు) అనే పుత్రుడు కలిగాడు.

**బృహత్క్షత్ర, మహావీర్య, నర, గర్గాద్యా భవన్మన్యుపుత్రాః । నరస్య సంకృతిః, సంకృతేః రుచిరథీరన్తిదేవౌ। గర్గాత్ శినిః, తతో గార్గ్యాః శైన్యాః, క్షత్రోపేతా ద్విజాతయో బభూవుః ॥ 9 ॥**

బృహత్క్షత్రుడు, మహావీర్యుడు, నరుడు, గర్గుడు మున్నగువారు భవన్మన్యుని కుమారులు. నరునకు సంకృతి, సంకృతికి రుచిరథి (గురుప్రీతి), రంతి దేవుడు కలిగారు. గర్గునివల్ల శిని జన్మించాడు. అతనివల్ల గార్గ్యులు, శైన్యులు, క్షత్రతేజస్సుతో కూడిన బ్రాహ్మణులు కలిగారు.

**మహావీర్యాదురుక్షయో నామ పుత్రోఽభూత్ । తస్య త్రయ్యారుణి పుష్కరిణ్యౌ కపిలశ్చ పుత్రత్రయమభూత్। అస్య త్రితయమపి పశ్చాత్ విప్రతాముపజగామ. బృహత్క్షత్రస్య సుహోత్రః, సుహోత్రాత్ హస్తీ, య ఇదం హస్తి (నా) పురమారోపయామాస । అజమీఢద్విజమీఢ పురుమీఢాస్త్రయో హస్తినస్తనయాః అజమీఢాత్ కణ్వః, కణ్వాన్మేధాతిథిః, యతః కాణ్వాయనా ద్విజాః ॥ 10 ॥**

అందుమహావీర్యునివల్ల ఉరుక్షయుడు (దురుక్షయుడు) అనే పుత్రుడు కలిగాడు. అతనికి త్రయ్యారుణి, పుష్కరిణ్యుడు, కపిలుడు (కపి) అనే ముగ్గురు కుమారులు కలిగారు. ఆ ముగ్గురు పుత్రులు తరువాత విప్రత్వాన్ని పొందారు. బృహత్క్షత్రునికి సుహోత్రుడు, అతనివల్ల హస్తి కలిగారు. ఆ హస్తి హస్తి(నా) పురాన్ని నిర్మింపజేశాడు. ఆ హస్తికి అజమీఢుడు, ద్విమీఢుడు, పురుమీఢుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. అజమీఢునివల్ల కణ్వుడు, కణ్వునివల్ల మేధాతిథి కలిగారు. అతనివల్ల కాణ్వాయనులనే ద్విజులు సంభవించారు.

**అజమీఢస్యాన్యః పుత్రో బృహదిషుః, బృహదిషోర్బృహద్వసుః తతశ్చ బృహత్కర్మా, తస్మాజ్జయద్రథః తతోఽపి విశ్వజిత్. తతశ్చ సేనజిత్। రుచిరాశ్వకాశ్యదృఢహనుర్వత్సహనుసంజ్ఞాః సేనజితః పుత్రాః। రుచిరాశ్వతః పృథుసేనః, తస్మాత్ పారః, పారాద్ నీపః(నీలః) తస్యైకశతం పుత్రాణామ్. తేషాం ప్రధానః కామ్పిల్యాధిపతిః సమరః ॥ 11 ॥**

అజమీఢుని మరో కుమారుడు బృహదిషుడు. బృహదిషుని కుమారుడు బృహద్వసువు (బృహద్ధనుడు). అతని వల్ల బృహత్కర్ముడు, అతని వల్ల జయద్రథుడు, అతని వల్ల విశ్వజిత్తు, అతని వల్ల సేనజిత్తు కలిగారు. సేనజిత్తుకు రుచిరాశ్వుడు, కాశ్యుడు, దృఢహనువు, వత్సహనువు అనే నలుగురు కుమారులు జన్మించారు. రుచిరాశ్వుని వల్ల పృథుసేనుడు, అతనివల్ల పారుడు, పారునివల్ల నీపుడు (నీలుడు). కలిగారు. అతనికి నూట ఒక్కమంది పుత్రులు కలిగారు. వారిలో ముఖ్యమైనవాడు కాంపిల్యనగరాధిపతియైన సమరుడు.

**సమరస్యాపి పారసమ్పార సదశ్వాస్త్రయః పుత్రాః. పారాత్ పృథుః, పృథోః సుకృతిః, సుకృతేర్విభ్రాజః, తతశ్చానుహః। స చ శుకదుహితరం కీర్తిం నామోపయేమే ॥ 12 ॥**

సమరునికి కూడ పారుడు, సంపారుడు, సదశ్వుడు అనే ముగ్గురు పుత్రులు కలిగారు. పారునివల్ల పృథువు, పృథునివల్ల సుకృతి, అతనివల్ల విభ్రాజుడు, అతనివల్ల అనుహుడు కలిగారు. ఆ అనుహుడు శుకుని కుమార్తె అయిన కీర్తి అన్న ఆమెను పెండ్లిచేసుకొన్నాడు.

**అనుహాద్ బ్రహ్మదత్తః, తతో విష్వక్సేనః, తస్యోదకసేనః, తతో భల్లాటః, తస్యాత్మజో ద్విమీఢః, ద్విమీఢకస్య యవీనరసంజ్ఞః, తస్యాపి ధృతిమాన్. తతః సత్యధృతిః, తతశ్చ దృఢనేమిః, తస్మాచ్చ సుపార్శ్వః, తతః సుమతిః, తతశ్చ సన్నతిమాన్, సన్నతిమతః కృతోఽభూత్. యం హిరణ్యనాభో యోగమధ్యాపయామాస। యశ్చతుర్వింశతి ప్రాచ్యసామగానాం చకార సంహితాః ॥ 13 ॥**

అనుహునివల్ల బ్రహ్మదత్తుడు, అతనివల్ల విష్వక్సేనుడు, అతనివల్ల ఉదకసేనుడు, అతనివల్ల భల్లాటుడు, అతనివల్ల ద్విమీఢుడు కలిగారు. ద్విమీఢునకు యవీనరుడనే పేరుగల పుత్రుడు, అతనికి ధృతిమంతుడు, అతని వల్ల సత్యధృతి, అతనివల్ల దృఢనేమి, అతనివల్ల సుపార్శ్వుడు, అతనివల్ల సుమతి, అతనివల్ల సన్నతిమంతుడు, సన్నతిమంతునివల్ల కృతుడు కలిగారు. హిరణ్యనాభుడు ఇతనికి యోగవిద్యనేర్పాడు. అతడు ప్రాచ్యసామగసంహితలను ఇరవైనాలిగింటిని ఏర్పరచాడు. (హస్తిరెండో కుమారుడైన ద్విమీఢునివంశమని కొందరి వ్యాఖ్యానం).

**కృతాచ్చోగ్రాయుధః, యేన ప్రాచుర్యేణ నృప (నీప) క్షయః కృతః। 14 ॥**

కృతునివల్ల ఉగ్రాయుధుడు జన్మించాడు. ఇతడు ఇంచుమించుగా క్షత్రియవంశ (నీపవంశ) నాశనంచేశాడు.

**ఉగ్రాయుధాద్ క్షేమ్యః, తస్మాత్ సువీరః, తస్య నృపంజయః, తతో బహురథః ఇత్యేతే పౌరవాః ।**

ఉగ్రాయుధునివల్ల క్షేమ్యుడు, అతనివల్ల సువీరుడు (సుధీరుడు), అతనివల్ల నృపంజయుడు (రిపుంజయుడు), అతనివల్ల బహురథుడు కలిగారు. వీరందరు పురువంశీయులు.

**అజమీఢస్య నీలినీ నామ పత్నీ । తస్యాం నీలసంజ్ఞః పుత్రోఽభవత్ । తస్మాదపి శాన్తిః, శాన్తేః సుశాన్తిః సుశాన్తేః పురజానుః, తతశ్చక్షుః, తతో హర్యశ్వః, తస్మాన్ముద్గల, సృంజయ, బృహదిషు, ప్రవీరకామ్పిల్యాః పంచానామేతేషాం విషయాణాం రక్షణాయాలమేతే మత్పుత్రాః ఇతి పిత్రాఽభిహితాః, అతస్తే పాంచాలాః ॥ 15 ॥**

అజమీఢునికి నీలిని (నలిని) అనే భార్య ఉంది. ఆమెయందు నీలుడనే కుమారుడు కలిగాడు. అతనివల్ల శాంతి, శాంతివల్ల సుశాంతి, సుశాంతికి పురజానుడు (పురంజయుడు), అతనివల్ల చక్షువు (ఋక్షుడు), అతని వల్ల హర్యశ్వుడు కలిగారు. అతనివల్ల ముద్గలుడు, సృంజయుడు, బృహదిషుడు, ప్రవీరుడు (యవీనరుడు), కాంపిల్యుడు అనే పేర్లుగల ఐదుగురు కుమారులు జన్మించారు. వారిపేర్లతో ఐదు దేశాలు ఏర్పడ్డాయి. “ఆ పంచదేశాల రక్షణకు ఈ నా ఐదుగురు కుమారులు చాలినటువంటివారు.” అని తండ్రి అన్నాడు కాబట్టి వారు పాంచాలురయ్యారు.

**ముద్గలాచ్చ మౌద్గల్యాః, క్షత్రోపేతా ద్విజాతయో బభూవుః । ముద్గలాద్ వృద్ధశ్వః, వృద్ధశ్వాద్ దివోదాసః, అహల్యా చ మిథునమభూత్. శరద్వతోఽహల్యాయాం శతానన్దోఽభవత్. శతానన్దాత్ సత్యధృతిః, ధనుర్వేదాన్తగో జజ్ఞే । సత్యధృతేస్తు వరాప్సరసమూర్వశీం దృష్ట్వా రేతఃస్కన్నం శరస్తమ్బే పపాత ॥ 16 ॥**

ముద్గలునివల్ల మౌద్గల్యులు అనే క్షత్రశక్తితో కూడిన ద్విజులు జన్మించారు. ముద్గలునివల్ల వృద్ధశ్వుడు (బృహదశ్వుడు), అతనివల్ల దివోదాసుడు, అహల్య అనే జంట ప్రభవించారు. శరద్వతునివల్ల అహల్యకు శతానందుడు ఉద్భవించాడు. శతానందునివల్ల సత్యధృతి జన్మించాడు. అతడు ధనుర్వేదంలో మిక్కిలి నిష్ణాతుడు. సత్యధృతి ఒకనాడు ఊర్వశి అనే వరాప్సరసను వీక్షించగా ఆతనిరేతస్సు పతనమై రెల్లు దుబ్బుపై పడింది.

**తచ్చ ద్విధాగతమపత్యద్వయం కుమారః, కన్యకా చ అభవత్. మృగయాముపగతః శాన్తనుర్దృష్ట్వా కృపయా జగ్రాహ ॥ 17 ॥**

అది రెండు భాగాలుగా అయి ఇద్దరు బిడ్డలుగా పిల్లవాడు, పిల్లగా ఏర్పడడం జరిగింది. ఒకనాడు వేటకు వచ్చిన శాంతనుడు వారిని చూచి కృపతో స్వీకరించాడు.

**తతః స కుమారః కృపః, కన్యా చాశ్వత్థామ్నో జననీ కృపీ, ద్రోణపత్న్యభవత్. దివోదాసస్య మిత్రాయుః, మిత్రాయోః చ్యవనో నామ రాజా, చ్యవనాత్ సుదాసః, తతః సౌదాసః, సౌదాసాత్ సహదేవః, తస్యాపి సోమకః, తతో జన్తుః శతపుత్రజ్యేష్ఠోఽభవత్. తేషాం యవీయాన్ పృషతః, పృషతాద్ ద్రుపదః, తస్మాద్ ధృష్టద్యుమ్నః, తస్మాత్ ధృష్టకేతుః, అజమీఢస్యాన్య ఋక్షనామా పుత్రోఽభవత్. ఋక్షాత్ సంవరణః, సంవరణాత్ కురుః, య ఇదం ధర్మక్షేత్రం, కురుక్షేత్రం చకార ॥ 18 ॥**

ఆ కారణంచే ఆ బాలుడు కృపుడు అయ్యాడు. బాలిక కృపి అయ్యింది. ఆమెయే ద్రోణునకు ధర్మపత్ని అయ్యింది. అశ్వత్థామకు తల్లి అయ్యింది. దివోదాసుని కుమారుడు మిత్రాయువు. మిత్రాయువు కుమారుడు చ్యవనుడనే రాజు. చ్యవనునివల్ల సుదాసుడు, అతనివల్ల సౌదాసుడు, సౌదాసునివల్ల సహదేవుడు, అతనికి సోమకుడు, అతనికి జంతుడు కలిగారు. అతడు నూరుగురు కుమారులలో జ్యేష్ఠుడు. చివరివాడు పృషతుడు. పృషతునివల్ల ద్రుపదుడు, అతనికి ధృష్టద్యుమ్నుడు, అతనివల్ల ధృష్టకేతువు కలిగారు. అజమీఢునికి ఋక్షుడనే పేరుగల మరో కొడుకు ఉన్నాడు. ఋక్షునివల్ల సంవరణుడు, అతనివల్ల కురువు జన్మించారు. ఆ కురువే ధర్మక్షేత్రమైన కురుక్షేత్రం నిర్మించాడు.

**సుధనుర్జహ్నుః పరీక్షిత్ ప్రముఖాః కురోః పుత్రా బభూవుః । సుధనుషః సుహోత్రః, తస్మాత్ చ్యవనః, చ్యవనాత్ కృతకః, తతశ్చోపరిచరోవసుః, బృహద్రథ, ప్రత్యగ్ర, కుశామ్బ, కుచేల (మావేల్ల), మత్స్యప్రముఖా వసోః పుత్రాః సప్తాజాయన్త । బృహద్రథాత్ కుశాగ్రః, తస్మాదృషభః, తతః పుష్పవాన్, తస్మాత్ సత్యహితః, తస్మాత్ సుధన్వా, తస్య చ జన్తుః ॥ 19 ॥**

కురువుకు సుధనుడు, జహ్నుడు, పరీక్షిత్తు మొదలైన కుమారులు కలిగారు. సుధనునకు సుహోత్రుడు, అతనివల్ల చ్యవనుడు, చ్యవనునివల్ల కృతకుడు, అతనివల్ల ఉపరిచరవసువు కలిగారు. ఆ వసువుకు బృహద్రథుడు, ప్రత్యగ్రుడు, కుశాంబుడు, కుచేలుడు (మావేల్లుడు), మత్స్యుడు మున్నగు ఏడుగురు కుమారులు జన్మించారు. బృహద్రథునివల్ల కుశాగ్రుడు, అతనివల్ల ఋషభుడు, అతనివల్ల పుష్పవంతుడు, అతనివల్ల సత్యహితుడు, అతని వల్ల సుధన్వుడు, అతనికి జంతుడు (జతుడు) కలిగారు.

**బృహద్రథాచ్చాన్యః శకలద్వయ జన్మా జరయా సంహితో జరాసన్ధో నామ । తస్మాత్ సత్యధృతః, తస్మాత్ సహదేవః, తతః సోమపః, తతః శ్రుతశ్రవాః ఇత్యేతే మాగధభూభృతః ॥ 20 ॥**

బృహద్రథునివల్ల కలిగిన రెండు ముక్కలను జర సంధించగా, జన్మించిన వాడు జరాసంధుడనే పేరుగలిగిన వాడయ్యాడు. అతనివల్ల సత్యధృతుడు, అతనివల్ల సహదేవుడు, అతనివల్ల సోమపుడు, అతనివల్ల శ్రుతశ్రవుడు కలిగారు. వీరందరు మగధభుపాలురు అయ్యారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే పురువంశో నామ ఏకోనవింశోఽధ్యాయః సమాప్తః ॥ 19 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో పురువంశం అనే పందొమ్మిదవ అధ్యాయం సమాప్తం ॥ 19 ॥



## **వింశోఽధ్యాయః** - ఇరవైయవ అధ్యాయం

## **కురువంశః** – కురువంశం

**పరీక్షితో జనమేజయ శ్రుతసేనోగ్రసేన భీమసేనాశ్చత్వారః పుత్రాః ॥ 1 ॥**

పరాశరుడు చెబుతున్నాడు. పరీక్షిత్తుకు (కురుకుమారుడు) జనమేజయుడు, శ్రుతసేనుడు, ఉగ్రసేన, భీమసేనుడు అనే నలుగురు కుమారులు ఉన్నారు.

**జహ్నోస్తు సురథో నామాత్మజో బభూవ ॥ 2 ॥**

జహ్నువుకు సురథుడనే పేరు గల కొడుకు కలిగాడు.

**తస్య విదూరథః, విదూరథస్య సార్వభౌమః, సార్వభౌమాత్ జయసేనః, తస్మాదారావీ, తతశ్చాయుతాయుః, అయుతాయోరక్రోధనః, తస్మాద్ దేవాతిథిః, తతశ్చ ఋక్షోఽన్యః ॥ 3 ॥**

అతనికి విదూరథుడు, విదూరథునకు సార్వభౌముడు, సార్వభౌమునివల్ల జయసేనుడు, అతనివల్ల ఆరావి (ఆరాధితుడు), అతనివల్ల అయుతాయువు, అయుతాయువుకు అక్రోధనుడు, అతనివల్ల దేవాతిథి, అతని వల్ల మరో ఋక్షుడు కలిగారు.

**ఋక్షాద్ భీమసేనః, తతశ్చ దిలీపః, దిలీపాత్ ప్రతీపః, తస్యాపి దేవాపి, శాన్తను, బాహ్లీకసంజ్ఞాస్త్రయః పుత్రా బభూవుః । దేవాపిర్బాల్య ఏవారణ్యం వివేశ ॥ 4 ॥**

ఋక్షునివల్ల భీమసేనుడు, అతనివల్ల దిలీపుడు, దిలీపునివల్ల ప్రతీపుడు, అతనికి దేవాపి, శాంతనుడు, బాహ్లీకుడు అనే పేర్లుగల ముగ్గురు కుమారులు పుట్టారు. దేవాపి బాల్యంలోనే అడవికి వెళ్లిపోయాడు.

**శాన్తనురవనీపతిరభవత్. అయం చ తస్య శ్లోకః పృథివ్యాం గీయతే–**

**యం యం కరాభ్యాం స్పృశతి జీర్ణం యౌవనమేతి సః ।**

**శాన్తిం చాప్నోతి యేనాగ్ర్యాం కర్మణా తేన శాన్తనుః ॥ 5 ॥**

అందువల్ల శాంతనుడు భూమిని పాలించే రాజయ్యాడు. అతనిని గురించి ఈ శ్లోకం భూలోకంలో గానం చేయబడుతూ ఉంటుంది.

అతడు ఎవరినెవరినయితే తన చేతులతో తాకుతాడో ముసలివాని కయినా యౌవనం వస్తుంది. అతని హస్తస్పర్శవల్ల ఉత్తమమైన శాంతి కలుగుతుంది. అట్టి పవిత్రకర్మవల్ల అతడు శాంతనుడని ప్రశస్తి పొందాడు.

**తస్య శాన్తనో రాష్ట్రే ద్వాదశ వర్షాణి దేవో న వవర్ష ॥ 6 ॥**

అట్టి శాంతనుని రాజ్యంలో ఒకప్పుడు పండ్రెండు సంవత్సరాలు దేవుడు వానలు కురిపించలేదు.

**తతశ్చాశేషరాష్ట్రవినాశమవేక్ష్యాసౌ రాజా బ్రాహ్మణాన్ అపృచ్ఛత్, భోః! కస్మాదస్మిన్ రాష్ట్రే దేవో న వర్షతి, కో మమాపరాధ ఇతి. తే తమూచుః అగ్రజస్య తేఽర్హేయమవనిస్త్వయా భుజ్యతే, పరివేత్తా త్వమిత్యుక్తః. స**

**పునస్తానపృచ్ఛత్, కిం మయా విధేయమితి. తే తమూచుః, యావద్ దేవాపిర్న పతనాధిభిర్దోషైరభిభూయతే, తావత్తస్యార్హం రాజ్యం, తదలమేతేన, తస్మై దీయతామ్. ఇత్యుక్తే తస్య మన్త్రిప్రవరేణాశ్మసారిణా తత్రారణ్యే తపస్వినే వేదవాదవిరోధవక్తారః ప్రయోజితాః ॥ 7 ॥**

అందువల్ల సమస్తరాజ్యం నశించి పోవడం వీక్షించి ఆ రాజు బ్రాహ్మణులను అడిగాడు. "అయ్యా! ఏకారణం వల్ల నా రాష్ట్రంలో దేవుడు వర్షం కురిపించడం లేదు? నేను చేసిన అపరాధం ఏమిటి?" అని ప్రశ్నించగా ఆ ద్విజులు శాంతనునితో "ఈ రాజ్యం నీ అన్నగారిది. ఆ భూమిని నీవు అనుభవిస్తున్నావు. అందువల్ల నీవు పరివేత్తవు అయ్యావు. (అన్నకు పెండ్లి కాకుండా తమ్ముడు పెండ్లి చేసుకొంటే పరివేత్త అవుతాడు. అది దోషం. అది నిన్ను వెంటాడుతోంది)" అన్నారు. వారు అలా అనగానే రాజు "ఇప్పుడు నేను ఏంచేయాలి?" అని అడిగాడు. అపుడా బ్రాహ్మణులు రాజుతో "ఎంతకాలమయితే దేవాపి పతనాది దోషాలవల్ల పతితుడు కాకుండా ఉంటాడో, అంత కాలం ఈ రాజ్యం అతనిదే. కనుక ఇక చాలు. ఈ రాజ్యం అతనికి ఇచ్చివేయి" అని హితవు చెప్పారు. వారిలా పలుకగా, శాంతనుని మంత్రులలో శ్రేష్ఠుడైన అశ్మసారి అనేవాడు అడవిలో తపస్సుచేసుకొంటున్న దేవాపి వద్దకు వేదవాదానికి వ్యతిరేకంగా మాట్లాడే ప్రవక్తలను పంపించాడు.

**తైరప్యతిఋజుమతేర్మహీపతిపుత్రస్య బుద్ధిర్వేదవాదవిరోధమార్గానుసారిణ్యక్రియత । 8 ॥**

ఆ మహీపతిపుత్రుడైన దేవాపి స్వభావం మిక్కిలి సరళమైనది. అందువల్ల వారు అతనిని చాలా సులభంగా వేదవాదవిరోధమార్గం పాటించేటట్లు చేశారు.

**రాజా చ శాన్తనుర్ద్విజవచనోత్పన్నపరిదేవనశోకస్తాన్ బ్రాహ్మణాన్ అగ్రతః కృత్వా, అగ్రజస్య ప్రదానాయారణ్యం జగామ. తదాశ్రమముపగతాశ్చ తమవనీపతిపుత్రం దేవాపిముపతస్థుః । తే బ్రాహ్మణా వేదవాదానుబద్ధాని వచాంసి రాజ్యమగ్రజేన కర్తవ్యమిత్యర్థవన్తి తమూచుః. అసావపి వేదవాదవిరోధయుక్తిదూషితమనేక ప్రకారం తానాహ । తతస్తే బ్రాహ్మణాః శాన్తనుమూచుః, ఆగచ్ఛ భో రాజన్! అలమత్రాతి నిర్బన్ధేన, ప్రశాన్త ఏవాసావనావృష్టిదోషః పతితోఽ యమనాదికాల మహితవేదవచనదూషణోచ్చారణాత్. పతితే చాగ్రజేనైవ పరివేద్యం భవతి, ఇత్యుక్తః శాన్తనుః స్వపురమాగత్య రాజ్యమకరోత్. వేదవాదవిరోధవచనోచ్చారణదూషితే చ జ్యేష్ఠేఽస్మిన్ భ్రాతరి దేవాపావఖిలసస్య నిష్పత్తయే వవర్ష భగవాన్ పర్జన్యః ॥ 9 ॥**

రాజైన శాంతనుడు ద్విజుల మాటలవల్ల దుఃఖం, శోకం పొందినవాడై, ఆ బ్రాహ్మణులను ముందుంచుకొని అన్నగారికి రాజ్యం ఈయడంకోసమై అరణ్యానికి వెళ్లాడు. ఆయన ఉండే ఆశ్రమానికి వెళ్లి రాజపుత్రుడైన దేవాపిని సమిపించారు. ఆ బ్రాహ్మణులు అతనితో "రాజ్యం అగ్రజుడే చేయాలి" అనే అర్థవంతమైన వేదవచనాలకు కట్టుబడే మాటలు పలికారు. దేవాపికూడా ముందు చెప్పిన వారిమాటలప్రభావానికి లోనయినవాడై ఆ బ్రాహ్మణులతో వేదవాదానికి విరుద్ధమైన, దూషించబడే యుక్తివాదాన్ని నానావిధాలుగా భాషించాడు. అనంతరం ఆ బ్రాహ్మణులు శాంతనునితో "మహారాజా! రండి, ఇక చాలు. మిక్కిలి నిర్బంధంచేయడం తగదు. ఈ అనావృష్టిదోషం పూర్తిగా తొలగిపోయింది. అనాదికాలంనుండి వచ్చే మిక్కిలి మహిమకల వేదవచనాలను దూషిస్తూ ఇతడు ఉచ్చారణ చేయడంవల్ల పతితుడైపోయాడు. అగ్రజుడు పతితుడైనప్పుడు నీకు పరివేత్తృత్వదోషం లేదు "అని చెప్పారు. వారలా

చెప్పగా శాంతనుడు తనపురానికి వచ్చి రాజ్యం చేశాడు. అన్నయైన దేవాపి వేదవచనాలకు విరుద్ధంగా మాట్లాడి దూషితుడై పతితుడయ్యాడు కాబట్టి, శాంతనునిలో దోషం లేనందున సమస్తసస్యాలు పండడానికై పర్జన్యభగవానుడు వానలు కురిపించాడు.

**బాహ్లీకస్య సోమదత్తః పుత్రోఽభూత్ । సోమదత్తస్యాపి భూరి, భూరిశ్రవః, శల్యసంజ్ఞాస్త్రయః పుత్రాః । శాన్తనోరప్యమరనద్యాం గంగాయాముదారకీర్తిరశేషశాస్త్రార్థవిద్ భీష్మః పుత్రోఽభూత్ । సత్యవత్యాం చ చిత్రాంగద విచిత్రవీర్యౌ పుత్రావజనయత్ శాన్తనుః । చిత్రాంగదస్తు బాల ఏవ చిత్రాంగదేన గన్ధర్వేణాహవే వినిహతః । విచిత్రవీర్యోఽపి కాశిరాజతనయే అమ్బికామ్బాలికే ఉపయేమే । తదుపభోగాదిఖేదాచ్చ యక్ష్మణా గృహీతః పంచత్వమగమత్ । సత్యవతీనియోగాచ్చ మత్పుత్రః కృష్ణద్వైపాయనో మాతృవచనమనతిక్రమణీయమితి విచిత్రవీర్యక్షేత్రే ధృతరాష్ట్ర పాణ్డూ, తత్ప్రహిత భుజిష్యాయాం చ విదురముత్పాదయామాస ॥ 10 ॥**

బాహ్లీకునికి సోమదత్తుడు అనే పుత్రుడు కలిగాడు. సోమదత్తునకు భూరి, భూరిశ్రవుడు, శల్యుడు అనే పేర్లు గలిగిన ముగ్గురు పుత్రులు జన్మించారు. శాంతనునికి అమరనదియైన గంగయందు గొప్ప కీర్తికలిగిన, సమస్తశాస్త్రార్థవేత్త అయిన భీష్ముడనే పుత్రుడు ఉద్భవించాడు. శాంతనునివల్ల సత్యవతియందు చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు అనే ఇద్దరు కుమారులు జన్మించారు. చిత్రాంగదుడు చిన్నతనంలో ఉండగానే, చిత్రాంగదుడనే గంధర్వునిచే యుద్ధంలో సంహరించబడ్డాడు. విచిత్రవీర్యుడు కూడా కాశిరాజు కుమార్తెలయిన అంబిక, అంబాలిక అనే వారిని వివాహం చేసుకొన్నాడు. వారితో అతిగా భోగించడంవల్ల శ్రమ ఎక్కువై క్షయ వచ్చి అతడు కాలధర్మం చెందాడు. నామాట నాపుత్రుడు జవదాటడని తల్లి సత్యవతి నియోగించగా, కృష్ణద్వైపాయనుడు ఆమె ఆజ్ఞ దాటరానిదని నిర్ణయించుకొని విచిత్రవీర్యుని క్షేత్రాలలో ధృతరాష్ట్రుని, పాండురాజుని ప్రభవింపజేశాడు. అలాగే అంబికాంబాలికలు పంపించిన దాసియందు విదురుని ఉద్భవింపజేశాడు.

**ధృతరాష్ట్రోఽపి దుర్యోధన దుఃశాసనాది ప్రధానం పుత్రశతం గాన్ధార్యాముత్పాదయామాస. పాణ్డోరప్యరణ్యే మృగశాపోపహత ప్రజాజననసామర్థ్యస్య, ధర్మవాయుశక్రైర్యుధిష్ఠిర భీమసేనార్జునాః కున్త్యాం, నకుల సహదేవౌ చ అశ్విభ్యాం మాద్ర్యాం పంచ పుత్రాః సముత్పాదితాః । తేషాం ద్రౌపద్యాం పంచపుత్రా బభూవుః । యుధిష్ఠిరాత్ ప్రతివిన్ధ్యః, భీమసేనాత్ శ్రుతసేనః (సుతసోమః), శ్రుతకీర్తిరర్జునాత్, శతానీకో నకులాత్, శ్రుతకర్మా సహదేవాత్। అపరే చ పాణ్డవానామాత్మజాః, తద్యథా యౌధేయీ యుధిష్ఠిరాద్ దేవకం పుత్రమవాప । హిడిమ్బా ఘటోత్కచం భీమసేనాత్ పుత్రమవాప । కాశీ చ భీమసేనాదేవ సర్వత్రగం పుత్రమవాప. సహదేవాచ్చ విజయా సుహోత్రం నామ పుత్రం ప్రాప్తవతీ. కరేణుమత్యాం చ నకులోఽపి నిరమిత్రమజీజనత్ । అర్జునస్యాప్యులూప్యాం నాగకన్యాయామిరావాన్ నామ పుత్రోఽభూత్ । మణిపురపతిపుత్ర్యాం చ పుత్రికాధర్మేణ బభ్రువాహనం నామ పుత్రమజీజనత్ ॥ 11 ॥**

ధృతరాష్ట్రుడు కూడ దుర్యోధనుడు, దుశ్శాసనుడు మున్నగు ప్రముఖులైన నూరుగురు కుమారులను గాంధారియందు ఉద్భవింపజేశాడు. పాండురాజు కూడ ఒకనాడు అడవిలో వేటాడుతూ మృగరూపంలో ఉన్న ఋషి శాపానికి గురికాబడి, సంతానజననసామర్థ్యం కోల్పోయాడు. అందువల్ల ధర్ముడు, వాయువు, శక్రుడు

వీరివరంవల్ల యుధిష్ఠిరభీమార్జునులను కుంతియందు, అశ్వినీదేవతల అనుగ్రహంవల్ల నకుల, సహదేవులను మాద్రియందు, ఐదుగురు కుమారులను పొందడం జరిగింది. వారికి ద్రౌపదియందు ఐదుగురు కుమారులు కలిగారు. యుధిష్ఠిరునివల్ల ప్రతివింధ్యుడు, భీమసేనునివల్ల శ్రుతసేనుడు (సుతసోముడు), అర్జునునివల్ల శ్రుతకీర్తి, నకులునివల్ల శతానీకుడు, సహదేవునివల్ల శ్రుతకర్ముడు ద్రౌపదికి కలిగారు. పాండవుల మిగిలిన కుమారుల వల్ల క్రమం ఈ విధంగా ఉంది. యౌధేయి యుధిష్ఠిరునివల్ల దేవకుడనే పుత్రుని పొందింది. హిడింబ భీమసేనుని వల్ల ఘటోత్కచుడనే కుమారుని పొందింది. కాశి అనునామె ఆ భీమసేనునివల్లనే సర్వత్రగుడనే సుతుని పొందింది. విజయ సహదేవునివల్ల సుహోత్రుడనే తనయుని పొందగలిగింది. నకులుడు కరేణుమతియందు నిరమిత్రుడనే పుత్రుని జన్మింపజేశాడు. అర్జునునికి ఉలూపి అనే నాగకన్యయందు ఇరావంతుడనే పుత్రుడు కలిగాడు. మణిపురపతికుమార్తె అయిన చిత్రాంగదయందు పుత్రికాధర్మంవల్ల అర్జునుడు బభ్రువాహనుడు అనే పేరుగల కుమారుని ప్రభవింపజేశాడు.

విశే: పుత్రికాధర్మం అనగా ఆమెకు జన్మించిన వాడు కన్యాదానంచేసిన వారికి చెందడమనే ధర్మం.

**సుభద్రాయాం చార్భకత్వేఽపి యోఽసావతిబలపరాక్రమః, సమస్తారాతిరథవిజేతా సోఽభిమన్యురజాయత. అభిమన్యోరుత్తరాయాం పరిక్షీణేషు కురుషు, అశ్వత్థామప్రయుక్త బ్రహ్మాస్త్రేణ గర్భ ఏవ భస్మీకృతో, భగవతః సకల సురాసురవన్దిత చరణయుగళస్యాత్మేచ్ఛాకారణ మానుషరూపధారిణోఽనుభావాత్, పునర్జీవితమవాప్య పరీక్షిత్ జజ్ఞే ॥ 12 ॥**

అర్భకుడుగా ఉండి కూడా, మహాబలపరాక్రమసంపన్నుడై, సమస్తశత్రుసైన్యంలోని అతి రథమహారథులను జయించిన అభిమన్యుడు అర్జునునికి సుభద్రయందు జన్మించాడు. ఆ అభిమన్యునకు ఉత్తరయందు పరీక్షిత్తు ప్రభవించాడు. సమస్త కురుసైన్యాలు, కురుజనులు పూర్తిగా నశించిన తరువాత, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రంవల్ల తల్లిగర్భంలోనే భస్మమై పోయాడు. సమస్తసురాసురులచే నమస్కరించబడే పాదపద్మాలుకలిగిన తనసంకల్పకారణంగా మాయామానుషరూపధారి అయిన శ్రీకృష్ణభగవానుని అనుగ్రహంవల్ల తిరిగి పరీక్షిత్తు జీవించినవాడయ్యాడు.

**యోఽయం సామ్ప్రతమేతత్ భూమణ్డలమఖణ్డితాయతిః ధర్మేణ పాలయతీతి ॥ 13 ॥**

అతడే ఇపుడు అనంతైశ్వర్యసంపన్నుడై, ధర్మయుక్తంగా భూమండలాన్ని పరిపాలిస్తున్నాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే కురువంశో నామ వింశోఽధ్యాయః సమాప్తః ॥ 20 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో కురువంశం అనే ఇరవైయవ అధ్యాయం సమాప్తం ॥ 20 ॥



## ఏకవింశోఽధ్యాయః - ఇరవై ఒకటవ అధ్యాయం

## భవిష్యరాజవర్ణనమ్ – భవిష్యరాజవర్ణన

**అతః పరం భవిష్యానహం భూమిపాలాన్ కీర్తయిష్యే. యోఽయం సామ్ప్రతమవనిపతిః పరీక్షిత్. తస్యాపి జనమేజయ శ్రుతసేనోగ్రసేన భీమసేనాశ్చత్వారః పుత్రా భవిష్యన్తి. జనమేజయస్యాపి శతానీకో భవిష్యతి. యోఽసౌ యాజ్ఞవల్క్యాద్ వేదమధీత్య కృపాదస్త్రాణ్యవాప్య విషయవిరక్తచిత్తవృత్తిశ్చ శౌనకోపదేశాదాత్మవిజ్ఞానప్రవణః పరం నిర్వాణమవాప్స్యతి ॥ 1,2 ॥**

పరాశరుడు చెబుతున్నాడు. ఇటుపైన నేను రాబోయే భూపాలురను గురించి కీర్తిస్తాను. ఇప్పటి రాజు పరీక్షిత్తు అని చెప్పానుకదా! అతనికి కూడ జనమేజయుడు, శ్రుతసేనుడు, ఉగ్రసేనుడు, భీమసేనుడు అనే నల్గురు పుత్రులు కలుగుతారు. జనమేజయునికి శతానీకుడు జన్మిస్తాడు. అతడు యాజ్ఞవల్క్యునివల్ల వేదాలునేర్చి, పిమ్మట కృపునివల్ల అస్త్రాలు అభ్యసించి, విషయవాసనలందు విరక్తిచెందిన చిత్తవృత్తి కలవాడై, శౌనకుని ఉపదేశంవల్ల ఆత్మజ్ఞానంపై మిక్కిలి ఆసక్తితో చివరకు పరమనిర్వాణం పొందుతాడు.

**శతానీకాదశ్వమేధదత్తో భవితా, తస్మాదప్యధిసీమకృష్ణః, అధిసీమకృష్ణాద్ నిచక్షుః, యోఽసౌ గంగయాఽపహృతే హస్తినాపురే కౌశామ్బ్యాం నివత్స్యతి. తస్యాప్యుష్ణః పుత్రో భవితా । ఉష్ణాచ్చిత్రరథః, తతః శుచిరథః, తస్మాద్ వృష్ణిమాన్, తతః సుషేణః, తస్మాదపి సునీథః, సునీథాదృచః, తతో నృచక్షుః, తస్యాపి సుఖావలః, తస్మాత్ పరిప్లవః, తతశ్చ సునయః, తతో మేధావీ, మేధావినో నృపంజయః, తతో మృదుః, తస్మాత్ తిగ్మః, తిగ్మాద్ బృహద్రథః, తస్మాద్ వసుదానః, తతోఽప్యపరః శతానీకః ॥ 3 ॥**

శతానీకునివల్ల అశ్వమేధదత్తుడు సంభవిస్తాడు, అతనివల్ల అధిసీమకృష్ణుడు, అతనివల్ల నిచక్షువు కలుగుతారు. హస్తినాపురం గంగలో మునిగిపోగా, ఇతడే కౌశాంబిలో నివసిస్తాడు. అతనికి ఉష్ణుడు అనే కుమారుడు కలుగుతాడు. ఉష్ణునివల్ల చిత్రరథుడు, అతనివల్ల శుచిరథుడు, అతనివల్ల వృష్ణిమంతుడు, అతనివల్ల సుషేణుడు, అతనివల్ల సునీథుడు, సునీథునివల్ల ఋచుడు, అతనివల్ల నృచక్షుడు, అతనికి సుఖావలుడు, అతనివల్ల పారిప్లవుడు, అతనివల్ల సునయుడు, అతనివల్ల మేధావి, మేధావికి నృపంజయుడు, అతనివల్ల మృదుడు, అతనివల్ల తిగ్ముడు, తిగ్మునివల్ల బృహద్రథుడు, అతనివల్ల వసుదానుడు, అతనివల్ల మరో శతానీకుడు ప్రభవిస్తారు.

**తస్మాచ్చ ఉదయనః, ఉదయనాదహీనరః, తతశ్చ దణ్డపాణిః, తతో నిరమిత్రః, తస్మాచ్చ క్షేమకః, తత్రాయం శ్లోకః–**

**బ్రహ్మక్షత్రస్య యో యోనిరంశో రాజర్షిసత్కృతః ।**
**క్షేమకం ప్రాప్య రాజానం సంస్థానం ప్రాప్స్యతే కలౌ ॥ 4 ॥**

అతనివల్ల ఉదయనుడు, ఉదయనునివల్ల అహీనరుడు, అతనివల్ల దండపాణి, అతనివల్ల నిరమిత్రుడు, అతనివల్ల క్షేమకుడు సంభవిస్తారు. ఈ సందర్భంలో అతనిని గూర్చి ఒక శ్లోకం ఉంది.

బ్రహ్మక్షత్రానికి మూలకారణమైన, రాజర్షులు మెచ్చిన వంశం క్షేమకుని మహారాజుగా పొంది, కలియుగంలో అతనితో సమాప్తమైపోతుంది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే భవిష్యరాజవర్ణనం నామ ఏకవింశోఽధ్యాయః సమాప్తః ॥ 21 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో భవిష్యరాజవర్ణన అనే ఇరవై ఒకటవ అధ్యాయం సమాప్తం ॥ 21 ॥

## ద్వావింశోఽధ్యాయః – ఇరవై రెండవ అధ్యాయం

## భవిష్యకాలే ఇక్ష్వాకురాజవర్ణనమ్ – భవిష్యకాలంలో ఇక్ష్వాకురాజుల వర్ణన

**అతశ్చ, ఇక్ష్వాకవో భవిష్యాః పార్థివాః కథ్యన్తే బృహద్బలస్య పుత్రో బృహత్క్షణః ॥ 1 ॥**

పరాశరుడు చెబుతున్నాడు. ఇటుపైన రాబోయే ఇక్ష్వాకువంశంలోని రాజుల గురించి చెబుతున్నాను. బృహద్బలుని కుమారుడు బృహత్క్షణుడు.

**తస్మాద్ గురుక్షేపః, తతో వత్సః, వత్సాద్ వత్సవ్యూహః, తతః ప్రతివ్యోమః, తస్యాపి దివాకరః, తస్మాద్ సహదేవః ॥ 2 ॥**

అతనివల్ల గురుక్షేపుడు, అతనివల్ల వత్సుడు, వత్సునివల్ల వత్సవ్యూహుడు, అతనివల్ల ప్రతివ్యోముడు, అతనివల్ల దివాకరుడు, అతనివల్ల సహదేవుడు కలుగుతారు.

**తతో బృహదశ్వః, తత్సూనుర్భానురథః, తస్యాపి సుప్రతీకః, తతో మరుదేవః, మరుదేవాత్ సునక్షత్రః, తస్మాత్ కిన్నరః, కిన్నరాదన్తరిక్షః, తస్మాత్ సువర్ణః, తతశ్చామిత్రజిత్, తతశ్చ బృహద్రాజః, తస్యాపి ధర్మీ, ధర్మిణః కృతంజయః, కృతంజయాద్ రణంజయః, రణంజయాత్ సంజయః, తస్మాత్ శాక్యః, శాక్యాత్ శుద్ధోదనః, తస్మాద్ రాహులః, తతః ప్రసేనజిత్, తతశ్చ క్షుద్రకః, తతః కుణ్డకః, తస్మాదపి సురథః, తతశ్చ సుమిత్రోఽన్యః ఇత్యేతే చేక్ష్వాకవో బృహద్బలాన్వయాః । అత్రానువంశశ్లోకః–**

**ఇక్ష్వాకూణామయం వంశః సుమిత్రాన్తో భవిష్యతి ।**
**యతస్తం ప్రాప్య రాజానం స సంస్థాం ప్రాప్స్యతే కలౌ ॥ 3 ॥**

అతనివల్ల బృహదశ్వుడు కలుగుతాడు. అతని సూనుడు భానురథుడు. (అతని వల్ల ప్రతీతాశ్వుడు), అతనికి సుప్రతీకుడు, అతనివల్ల మరుదేవుడు, మరుదేవునివల్ల సునక్షత్రుడు, అతనివల్ల కిన్నరుడు, కిన్నరుని వల్ల అంతరిక్షుడు, అతనివల్ల సువర్ణుడు (సుపర్ణుడు), అతనివల్ల అమిత్రజిత్తు, అతనివల్ల బృహద్రాజు, అతనివల్ల ధర్మి, ధర్మివల్ల కృతంజయుడు, కృతంజయునివల్ల రణంజయుడు, రణంజయునివల్ల సంజయుడు, అతని వల్ల శాక్యుడు, శాక్యునివల్ల శుద్ధోదనుడు, అతనివల్ల రాహులుడు, అతనివల్ల ప్రసేనజిత్తు, అతనివల్ల క్షుద్రకుడు, అతని వల్ల కుండకుడు, అతనివల్ల సురథుడు, అతనివల్ల మరో సుమిత్రుడు కలుగుతారు. వీరందరు ఇక్ష్వాకువంశీయులైన బృహద్బలాన్వయులు. ఈ సందర్భంలో ఈ అనువంశశ్లోకం వినవస్తూ ఉంటుంది.

ఇక్ష్వాకుల ఈ వంశం సుమిత్రునితో అంతమవుతుంది. కలియుగంలో ఇతడు రాజైన తరువాత ఈ వంశం సమాప్తమవుతుంది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే భవిష్యకాలే ఇక్ష్వాకురాజవర్ణనం నామ ద్వావింశోஉధ్యాయః సమాప్తః ॥ 22 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో భవిష్యకాలంలో ఇక్ష్వాకు రాజులవర్ణన అనే ఇరవై రెండవ అధ్యాయం సమాప్తం. ॥ 22 ॥

## త్రయోవింశోஉధ్యాయః – ఇరవై మూడవ అధ్యాయం

## మాగధవంశవర్ణనమ్ – మాగధవంశ వర్ణన

**మాగధానాం బార్హద్రథానాం భవిష్యాణామనుక్రమం కథయామి । 1 ॥**

పరాశరుడు చెబుతున్నాడు. మగధవంశంలో బార్హద్రథులలో రాబోయే వారి కులానుక్రమం చెబుతాను.

**అత్ర హి వంశే మహాబలా జరాసన్ధప్రధానా బభూవుః ॥ 2 ॥**

ఈ వంశంలోనే మహాబలవంతులైన జరాసంధుడు మున్నగు ముఖ్యమైన వారు జన్మించారు.

**జరాసన్ధసుతాత్ సహదేవాత్ సోమాపిః, తస్మాత్ శ్రుతవాన్, తస్యాప్యయుతాయుః, తతశ్చ నిరమిత్రః, తత్తనయః సుక్షత్రః (సునేత్రః), తస్మాదపి బృహత్కర్మా, తతశ్చ సేనజిత్, తస్మాచ్చ శ్రుతంజయః, తతో విప్రః, తస్య చ పుత్రః శుచి నామా భవిష్యతి. తస్యాపి క్షేమ్యః, తతశ్చ సువ్రతః, సువ్రతాత్ ధర్మః, తతః సుశ్రవాః, తతో దృఢసేనః, తస్మాత్ సుబలః, సుబలాత్ సునీతో భవితా. తతః సత్యజిత్ సత్యజితో విశ్వజిత్, తస్యాపి రిపుంజయః ఇత్యేతే బార్హద్రథా భూపతయో వర్షసహస్రమేకం భవిష్యన్తి । 3 ॥**

జరాసంధుని కుమారుడైన సహదేవునివల్ల సోమాపి, అతనివల్ల శ్రుతశ్రవుడు (శ్రుతవంతుడు), అతనికి అయుతాయువు, అతనివల్ల నిరమిత్రుడు, అతనికి కుమారుడుగా సుక్షత్రుడు (సునేత్రుడు), అతనివల్ల బృహత్కర్ముడు, అతనివల్ల సేనజిత్తు, అతనివల్ల శ్రుతంజయుడు, అతనివల్ల విప్రుడు కలుగుతారు. అతని పుత్రుడు శుచి అనే పేరు కలిగిన వాడు జన్మిస్తాడు. అతనికి క్షేమ్యుడు. అతనివల్ల సువ్రతుడు, అతనివల్ల ధర్ముడు, అతనివల్ల సుశ్రవుడు, అతనివల్ల దృఢసేనుడు, అతనివల్ల సుబలుడు, సుబలునివల్ల సునీతుడు కలుగుతారు. అతనివల్ల సత్యజిత్తు, అతనివల్ల విశ్వజిత్తు, అతనివల్ల రిపుంజయుడు జన్మిస్తారు. ఈ బార్హద్రథభూపాలురు ఒకవేయి సంవత్సరాల పాటు ఉంటారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే మాగధవంశవర్ణనం నామ త్రయోవింశోஉధ్యాయః సమాప్తః ॥ 23 ॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో మాగధవంశ వర్ణన అనే ఇరవై మూడవ అధ్యాయం సమాప్తం ॥ 23 ॥

## చతుర్వింశోఽధ్యాయః - ఇరవై నాల్గవ అధ్యాయం

## కలియుగనరేంద్రాణాం చరిత్రం - కలిధర్మవర్ణనమ్ - కలియుగనరేంద్రుల చరిత్ర - కలిధర్మవర్ణన

**యోఽయం రిపుంజయో నామ బార్హద్రథోఽన్త్యః, తస్య సునికో నామామాత్యో భవిష్యతి ॥ 1 ॥**

బార్హద్రథులలో చివరివాడైన రిపుంజయునికి సునికుడు అనే మంత్రి ఉంటాడు.

**స చైనం స్వామినం హత్వా స్వపుత్రం ప్రద్యోత నామానమభిషేక్ష్యతి. తస్యాపి పాలక నామా పుత్రో భవితా. తతశ్చ విశాఖయూపః, తత్పుత్రో జనకః, తస్య చ నన్దివర్ధనః (తతో నన్దీ). ఇత్యేతే అష్టత్రింశదుత్తర మబ్దశతం పంచప్రద్యోతాః పృథివీం భోక్ష్యన్తి ॥ 2 ॥**

అతడు తనప్రభువును సంహరించి, నిజపుత్రుడైన ప్రద్యోతుడనే వానికి పట్టంగడతాడు. అతనికి పాలకుడనే కొడుకు పుడతాడు. అతనివల్ల విశాఖయూపుడు జన్మిస్తాడు. అతని కుమారుడు జనకుడు. అతనికి నందివర్ధనుడు, అతని వల్ల నంది కలుగుతారు. ఇలా ఈ అయిదుగురు ప్రద్యోతవంశీయులు నూటముప్పైఎనిమిది ఏండ్లు భూమిని అనుభవిస్తారు.

**తతశ్చ శిశునాగః, తత్పుత్రశ్చ కాకవర్ణో భవితా, తత్పుత్రః క్షేమధర్మా, తస్యాపి క్షత్రౌజాః, తత్పుత్రో విద్మసారః, తతశ్చ అజాతశత్రుః, తస్మాచ్చ దర్భకః, దర్భకాచ్చోదయాశ్వః, తస్మాదపి నందివర్ధనః, తతో మహానన్దీ. ఇత్యేతే శైశు నాగా దశ భూమిపాలాః, త్రీణివర్షశతాని ద్విషష్ట్యధికాని భవిష్యన్తి ॥3 ॥**

అతనివల్ల శిశునాగుడు, అతని పుత్రుడు కాకవర్ణుడు, అతని కుమారుడు క్షేమధర్ముడు, అతనికి క్షత్రౌజుడు, అతనివల్ల విద్మసారుడు (విధి సారుడు), అతనివల్ల అజాతశత్రువు, అతనివల్ల దర్భకుడు (అర్భకుడు), అతనివల్ల ఉదయాశ్వుడు (ఉదయనుడు), అతనివల్ల నందివర్ధనుడు, అతనివల్ల మహానంది కలుగుతారు. ఈ పదిమంది శైశునాగభూపాలురు మూడువందల అరవై రెండు సంవత్సరాలు భూమిని పరిపాలిస్తారు.

**మహానన్దినః శూద్రగర్భోద్భవోఽతిలుబ్ధో మహాపద్మనన్దః పరశురామ ఇవాపరోఽఖిలక్షత్రాన్తకారీ భవితా॥4॥**

మహానందివల్ల ఒక శూద్రురాలి గర్భంలో మహాపద్మనందుడు పుట్టినవాడై అతిలుబ్ధుడు, మహాబలశాలి అయి అపరపరశురాముడులా సమస్తక్షత్రియవినాశకుడవుతాడు.

**తతఃప్రభృతి శూద్రా భూమిపాలా భవిష్యన్తి । స చైకచ్ఛత్రామనుల్లంఘితశాసనో మహాపద్మః పృథవీంభోక్ష్యతి॥5॥**

అప్పటినుంచి శూద్రులు భూమిపాలకులు అవుతారు. ఆ మహాపద్ముడు తన ఆజ్ఞను మీరి ఎవరూ ప్రవర్తించకుండా చేసి, ఏకచ్ఛత్రంగా భూమిని అనుభవిస్తాడు.

**తస్యాప్యష్టౌ సుతాః సుమాల్యాద్యా భవితారః. తస్య చ మహాపద్మస్యాను పృథవీం భోక్ష్యన్తి. మహాపద్మస్తత్పుత్రాశ్చ ఏకం వర్షశతమవనిపతయో భవిష్యన్తి. నవైవ తాన్ నన్దాన్ కౌటిల్యో బ్రాహ్మణః సముద్ధరిష్యతి ॥ 6 ॥**

అతనికి సుమాలి మున్నగు ఎనమండుగురు కుమారులు కలుగుతారు. వారు ఆ మహాపద్ముని తరువాత పృథివిని ఏలుతారు. మహాపద్ముడు, అతని పుత్రులు కలసి ఒక వంద సంవత్సరాల పాటు రాజులై భూమిని పరిపాలిస్తారు. ఆ తరువాత ఈ నవనందులను కౌటిల్యుడనే బ్రాహ్మణుడు పెకలించి వేస్తాడు.

**తేషామభావే మౌర్యాశ్చ పృథివీం భోక్ష్యన్తి. కౌటిల్య ఏవ చన్ద్రగుప్తం రాజ్యేఽభిషేక్ష్యతి ॥ 7 ॥**

వారు గతించాక మౌర్యులు పృథివిని అనుభవిస్తారు. కౌటిల్యుడే చంద్రగుప్తుని రాజ్యానికి అభిషిక్తుని చేస్తాడు.

**తస్యాపి పుత్రో బిన్దుసారో భవిష్యతి. తస్యాపి అశోకవర్ధనః, తతః సుయశాః, తతో దశరథః, తతః సంగతః, తతః శాలిశుకః, తస్మాత్ సోమశర్మా, తస్మాత్ శతధన్వా, తస్యాప్యను బృహద్రథ నామా భవితా । ఏవం మౌర్యా దశ భూపతయో భవిష్యన్తి, అబ్దశతం సప్తత్రింశదుత్తరమ్. తేషామన్తే పృథివీం శుంగా భోక్ష్యన్తి ॥ 8 ॥**

అతనికి బిందుసారుడనే పుత్రుడు కలుగుతాడు. అతనికి అశోకవర్ధనుడు, అతనివల్ల సుయశుడు, అతని వల్ల దశరథుడు, అతనివల్ల సంగతుడు (సంయుతుడు), అతనివల్ల శాలికుడు, అతనివల్ల సోమశర్మ, అతనివల్ల శతధన్వుడు, అతనికి బృహద్రథుడు అనే వాడు కలుగుతారు. ఇలా ఈ పదిమంది మౌర్యులు నూట ముప్పై ఏడు సంవత్సరాలపాటు భూపాలురవుతారు. వీరు గతించాక శుంగులు భూమిని అనుభవిస్తారు.

**తతః పుష్పమిత్రః సేనాపతిః స్వామినం హత్వా రాజ్యం కరిష్యతి ॥ 9 ॥**

అపుడు పుష్ప (పుష్య) మిత్రుడనే సేనాపతి తనప్రభువును వధించి రాజ్యం ఏలుతాడు.

**అస్యాత్మజోఽగ్నిమిత్రః, తస్మాత్ సుజ్యేష్ఠః, తతో వసుమిత్రః, తస్మాదప్యార్ద్రకః, తతః పులిన్దకః, తతో ఘోషవసుః, తస్మాదపి వజ్రమిత్రః, తతో భాగవతః ॥ 10 ॥**

అతని కుమారుడే అగ్నిమిత్రుడు, అతనివల్ల సుజ్యేష్ఠుడు, అతనివల్ల వసుమిత్రుడు, అతనివల్ల ఆర్ద్రకుడు (ఉదంకుడు), అతనివల్ల పుళిందకుడు, అతనివల్ల ఘోషవసువు, అతనివల్ల వజ్రమిత్రుడు, అతనివల్ల భాగవతుడు కలుగుతారు.

**అస్మాద్ దేవభూతిః, ఇత్యేతే దశ శుంగా ద్వాదశోత్తరం వర్షశతం పృథవీం భోక్ష్యన్తి । తతః కణ్వానేషా భూర్యాస్యతి ॥ 11 ॥**

అతనివల్ల దేవభూతి జన్మిస్తాడు. ఇలా ఈ పదిమంది శుంగులు నూటపన్నెండు సంవత్సరాలు పృథివిని అనుభవిస్తారు. ఆ తరువాత ఈ భూమి కణ్వుల పరిపాలనలోనికి వెడుతుంది.

**దేవభూతిం తు శుంగరాజానం వ్యసనినం తస్యైవామాత్యః కణ్వో వసుదేవ నామా నిహత్య స్వయమవనీం భోక్తా. తత్పుత్రో భూమిమిత్రః, తస్యాపి నారాయణః, నారాయణస్యాత్మజః సుశర్మా. ఏతే కాణ్వాయనాశ్చత్వారః పంచచత్వారింశద్వర్షాణి భూపతయో భవిష్యన్తి ।**

వ్యసనపరాయణుడైన శుంగరాజగు దేవభూతిని అతని మంత్రియైన కణ్వవంశీయుడైన వసుదేవుడనే వాడు సంహరించి తానే భూమిని పరిపాలిస్తాడు. అతని కుమారుడు భూమిమిత్రుడు. అతని కుమారుడు నారాయణుడు. నారాయణుని ఆత్మజుడు సుశర్మ. ఈ కాణ్వాయనులు నలుగురు నలభై ఐదు సంవత్సరాలపాటు భూపాలకులు అవుతారు.

**సుశర్మాణం కణ్వం చ తద్భృత్యో బలాత్, శిప్రక నామా హత్వా అన్ధ (ఆన్ధ్ర) జాతీయో వసుధాం భోక్ష్యతి. తతశ్చ కృష్ణనామా తద్భ్రాతా భూపతిర్భావీ. తస్యాపి పుత్రః శ్రీశాన్తకర్ణిః, తస్యాపి పూర్ణోత్సంగః, తత్పుత్రశ్చ శాతకర్ణిః, తస్మాచ్చ లమ్బోదరః, తస్మాద్ ద్వివిలకః, తతో మేఘస్వాతిః, తతః పటుమాన్, తతశ్చ అరిష్టకర్మా, తతో హాలః, హాలాత్ పుత్తలకః, తతః ప్రవిల్లసేనః, తతః సున్దరః, తతః (స్వల్పాయుషో) శాతకర్ణిః, తస్మాచ్చకోరశాతకర్ణిః॥12॥**

కణ్వవంశీయుడైన సుశర్మను అతని భృత్యుడు బలాత్కారంగా సంహరించి, ఆ ఆంధ్ర (అంధ) జాతీయుడైన శిప్రకుడు (బలిపుచ్ఛకుడు) అనే పేరుగలవాడు వసుధను అనుభవిస్తాడు. తరువాత అతని సోదరుడు కృష్ణుడు అనే వాడు రాబోయే కాలంలో భూపతి అవుతాడు. అతని కుమారుడు శ్రీశాంతకర్ణి, అతనికి పూర్ణోత్సంగుడు, అతనికి కుమారుడుగా శాతకర్ణి, అతనివల్ల లంబోదరుడు, అతనివల్ల ద్వివిలకుడు (పిలకుడు), అతనివల్ల మేఘస్వాతి, అతని వల్ల పటుమంతుడు, అతనివల్ల అరిష్టకర్ముడు, అతనివల్ల హాలుడు, హాలునివల్ల పుత్తలకుడు (పలలకుడు), అతనివల్ల ప్రవిల్లసేనుడు (పుళిందసేనుడు), అతనివల్ల సుందరుడు, అతనివల్ల అల్పాయుష్కుడైన శాతకర్ణి, అతని వల్ల చకోరశాతకర్ణి జన్మిస్తారు.

**తతః శివస్వాతిః, తతశ్చ గోమతీపుత్రః, తత్పుత్రః పులిమాన్, తస్యాపి శాతకర్ణీ శివశ్రీః, తతః శివస్కన్ధః, తతో యజ్ఞశ్రీః, తతో విజయః, తతశ్చన్ద్రశ్రీః, తస్యాపి పులోమాచిః । ఏవమేతే త్రింశచ్చత్వార్యబ్దశతాని షట్ పంచాశదధికాని పృథివీం భోక్ష్యన్తి ఆన్ధ్రభృత్యాః ॥ 13 ॥**

అతనివల్ల శివస్వాతి, అతనివల్ల గోమతీపుత్రుడు, అతనికి కుమారుడుగా (అలిమంతుడు) పులిమంతుడు, అతనివల్ల శివశ్రీశాతకర్ణి, అతనివల్ల శివస్కంధుడు, అతనివల్ల యజ్ఞశ్రీ, అతనివల్ల విజయుడు (ద్వియజ్ఞుడు), అతనివల్ల చంద్రశ్రీ, అతనివల్ల పులోమాచి కలుగుతారు. ఇలా ముప్పైమంది ఆంధ్రులు నాలుగు వందల యాభై ఆరు సంవత్సరాలు పృథివిని అనుభవిస్తారు.

**సప్తాభీరా, దశ గర్దభిలా భూభుజో భవిష్యన్తి. తతః షోడశ శకా భూభుజో భవితారః । తతశ్చ అష్టౌ యవనాః, చతుర్దశ తురుష్కాః, ముణ్డాశ్చ త్రయోదశ, ఏకాదశ మౌనాః । ఏతే పృథివీం త్రయోదశ వర్ష శతాని నవనవత్యధికాని భోక్ష్యన్తి ॥ 14 ॥**

పిమ్మట ఏడుగురు ఆభీరులు, పదిమంది గర్దభిలులు రాజులవుతారు. అనంతరం పదహారుమంది శకులు భూపాలకులు అవుతారు. ఆ తరువాత ఎనమండు గురు యవనులు, పద్నాలుగురు తురుష్కులు, పదముగ్గురు ముండులు, పదకొండుగురు మౌనజాతీయులు. వీరందరు ఈ భూమిని పదమూడు వందల తొంభైతొమ్మిది సంవత్సరాలు అనుభవిస్తారు.

**తతశ్చ పౌరా ఏకాదశ భూపతయోఽబ్దశతాని త్రీణి మహీం భోక్ష్యన్తి ॥ 15 ॥**

అనంతరం పదకొండుగురు పౌరవంశీయులైన భూపతులు మూడు వందల సంవత్సరాలు ఈ మహిని ఏలుతారు.

**తేషూత్సన్నేషు కైలకిలా (కైంకిలా)యవనా భూపతయో భవిష్యన్తి (అమూర్ధాభిషిక్తాః) తేషామపత్యం విన్ధ్యశక్తిః। 16 ॥**

వారు గతించిన తరువాత కైంకిలులు అనే యవనులు మూర్ధాభిషిక్తులు కాకుండా భూపతులవుతారు. వారి సంతానంలో వింధ్యశక్తి ప్రధాననరేంద్రుడు కాగలడు.

**తతః పురంజయః, తతో రామచన్ద్రః, తస్మాద్ ధర్మః, ధర్మాద్ వరాంగః (వంగః), కృతనన్దనః, సుషినన్దిః, నందియశాః, శిశికప్రవారీ చ. ఏతే వర్షశతం షడ్ వర్షాణి భవిష్యన్తి ।**

అతనివల్ల పురంజయుడు, అతనివల్ల రామచంద్రుడు, అతనివల్ల ధర్ముడు, ధర్మునివల్ల వరాంగుడు, కృతినందనుడు, సుషినంది, నందియశుడు, శిశికప్రవారి కలుగుతారు. వీరు నూట ఆరు సంవత్సరాలపాటు రాజులవుతారు.

విశే:– ధర్మునివల్ల వంగుడు, అతనివల్ల నందనుడు, అతనివల్ల సునంది, అతని సోదరులు నందియశుడు, శుక్రుడు, ప్రవీరుడని పాఠాంతరం.

**తతః, తత్పుత్రాస్త్రయోదశైవ, బాహ్లికాశ్చ త్రయః, తతః పుష్పమిత్ర, పటుమిత్ర, పద్మమిత్రాస్త్రయో దశ మేకలాశ్చ, సప్త ఆంధ్రాః, కోసలాయాన్తు నవైవ భూపతయో భవిష్యన్తి । నైషధాస్తు త ఏవ భూపతయో భవిష్యన్తి। 17॥**

అనంతరం వారిసంతతి పదముగ్గురు, బాహ్లికులు ముగ్గురు, తరువాత పుష్పమిత్ర, పటుమిత్ర, పద్మమిత్రాదులు, పదముగ్గురు మేకలులు (ఏకలులు), ఏడుగురు ఆంధ్రులు, కోసలదేశంలో తొమ్మండుగురు భూపతులు కాగలరు. నిషధదేశాన్ని పాలించే రాజులు కూడా వారే అవుతారు.

**మాగధాయాం విశ్వస్ఫటికసంజ్ఞోఽన్యాన్ వర్ణాన్ కరిష్యతి. కైవర్త, కటు, పులిన్ద, బ్రాహ్మణ్యాన్ రాజ్యే స్థాపయిష్యన్నుత్సాద్యాఖిలక్షత్రజాతిమ్ ।**

మగధరాజ్యంలో విశ్వస్ఫటికుడనే వాడు ఇతర వర్ణాలను కల్పిస్తాడు. సమస్తక్షత్రజాతిని నశింపజేసి రాజ్యంలో కైవర్తులను, కటువులను, పుళిందులను, బ్రాహ్మణులను నిలుపుతాడు.

**నవనాగాః పద్మావత్యాం, కాన్తిపుర్యాం మథురాయామ్ అనుగంగా ప్రయాగం, గయాయాం మాగధా, గుప్తా భవిష్యన్తి ।**

పద్మావతీపురంలో తొమ్మండుగురు నాగులు, మథురా రాజ్యంలోని కాంతిపురియందును, గంగాతీరంలోని ప్రయాగలోను, గయలోను మాగధులు, గుప్తులు రాజులు కాగలరు.

**కోసలాన్ధ్ర పుణ్డ్రతామ్రలిప్తాన్ సముద్రతటపురీం చ దేవరక్షితో రక్షిష్యతి. కలింగమాహిషిక మాహేన్ద్ర భీమా గుహా భోక్ష్యన్తి. నైషాదనైనీషిక కాలతోయాన్ జనపదాన్ మణిధారవంశా భోక్ష్యన్తి. త్రైరాజ్య (స్త్రీరాజ్య) మూషిక జనపదాన్ కనకాహ్వాయా భోక్ష్యన్తి ।**

కోసలం, ఆంధ్రం, పుండ్రం, తామ్రలిప్తం, సముద్రతీరంలోని పురిని దేవరక్షితుడు రక్షిస్తాడు. కలింగం, మాహిషికం, మాహేంద్రం, భీమం వీటిని గుహులు ఏలుతారు. నైషాదం, నైనీషికం, కాలతోయం (కాల కోశకం) అనే జనపదాలను మణిధార (ధాన్య) వంశీయులు అనుభవిస్తారు. త్రైరాజ్యం (స్త్రీరాజ్యం), మూషికం అనే జనపదాలను కనకులనే వారు అనుభవిస్తారు.

**సౌరాష్ట్రావన్తి శూద్రాభీర (నర్మదా) మరుభూమి విషయాంశ్చ వ్రాత్యా ద్విజాభీరశూద్రాద్యా భోక్ష్యన్తి । సిన్ధుతట, దావికోర్వీ, చన్ద్రభాగా, కాశ్మీరవిషయాన్ వ్రాత్యా, మ్లేచ్ఛాదయః శూద్రా భోక్ష్యన్తి ।**

సౌరాష్ట్రం, అవంతి, శూద్రం, ఆభీరం, (నర్మదా తీరంలోని) ఊషరక్షేత్రాలు – వీటిని వ్రాత్యులు, ద్విజులు, ఆభీరులు, శూద్రులు మున్నగువారు అనుభవిస్తారు. సముద్రతీరం, దావికోర్వి, చంద్రభాగ, కాశ్మీరదేశాలను వ్రాత్యులు, మ్లేచ్ఛులు మున్నగువారు, శూద్రులు పరిపాలిస్తారు.

**ఏతే చ తుల్యకాలాః సర్వే పృథివ్యాం భూభృతో భవిష్యన్తి । అల్పప్రసాదాః, బృహత్కోపాః సర్వకాలమనృతాధర్మ రుచయః స్త్రీబాలగోవధకర్తారః, పరస్వాదానరుచయః, అల్పసారాస్తమిస్రప్రాయాః, ఉదితాస్తమితప్రాయాః, స్వల్పాయుషో, మహేచ్ఛా, అల్పాల్పధర్మాశ్చ భవిష్యన్తి ॥ 18 ॥**

వీరందరూ ఏకకాలంలో ఈ భూమియందు భూపాలురు అవుతారు. వీరికి అనుగ్రహం తక్కువ. ఆగ్రహం ఎక్కువ. వీరికి ఎల్లప్పుడు అసత్యంపై ఆసక్తి. అధర్మంపై అనురక్తి. స్త్రీలను, బాలురను, గోవులను చంపుటయందు వీరికి అత్యంతరక్తి. పరులసొమ్ము కాజేయడంపై వీరికి అభిరుచిమెండు. అల్పమైన శక్తి కలవారు. తమోగుణంతో ఉంటారు. ఉదయాస్తమయసమానులు. అల్పమైన ఆయుష్షు కలవారు. అధికమైన ఆశ కలవారు. స్వల్పాల్పధర్మం ఆచరిస్తారు. వీరు ఇటువంటి గుణాలు కలవారు కాగలరు.

**తైశ్చ విమిశ్రా జనపదాస్తచ్ఛీలానువర్తినో, రాజాశ్రయశుష్మిణో, మ్లేచ్ఛాశ్చార్యాశ్చ విపర్యయేణ వర్తమానాః ప్రజాః క్షపయిష్యన్తి ॥ 19 ॥**

వీరితో దేశాలు సంకీర్ణమై కలసిపోతాయి. వారి శీలాన్ని అనుసరించి, రాజాశ్రయంతో బలవంతులైపోతారు. మ్లేచ్ఛులు, ఆర్యులు విపరీతంగా ప్రవర్తిస్తూ ప్రజలను నాశనం చేస్తారు.

**తతశ్చానుదినమల్పాల్పహ్రాసవ్యవచ్ఛేదాద్ ధర్మార్థయోః, జగతః సంక్షేపో భవిష్యతి ॥ 20 ॥**

ఆ తరువాత ప్రతిదినం ధర్మార్థాలు కొంచెం కొంచెంగా తగ్గుతూ, జగత్తు నశించిపోతూ ఉండడం జరుగుతుంది.

**తతశ్చార్థ ఏవాభిజనహేతుః, ధనమేవాశేషధర్మహేతుః, అభిరుచిరేవ దామ్పత్యసమ్బన్ధహేతుః, స్త్రీత్వమేవోపభోగహేతుః, అనృతమేవ వ్యవహారజయహేతుః, ఉన్నతామ్బుతైవ పృథివీహేతుః, బ్రహ్మసూత్రమేవ విప్రత్వహేతుః, రత్నతామ్రభాగితైవ శ్లాఘ్యతాహేతుః, లింగధారణమేవాఽఽ శ్రమహేతుః, అన్యాయ ఏవ వృత్తిహేతుః ॥ 21,22 ॥**

అపుడు డబ్బే ఉత్తమకులత్వానికి హేతువు. ధనమే (బలమే) సమస్తధర్మాలకు హేతువు. కామాభిరుచి మాత్రమే దాంపత్య సంబంధహేతువు. స్త్రీత్వం కేవలోపభోగహేతువు. అసత్యమే నిత్యవ్యవహార విజయానికి హేతువు. ఎక్కువ నీరు ఉండడమే పృథివీ సమ్యక్పరిపాలనాహేతువు. యజ్ఞోపవీతధారణమే విప్రత్వానికి హేతువు. రత్నాలు, విలువైన లోహాలు ధరించడమే ప్రశంసాహేతువు. బహిరంగచిహ్నాలు ధరించడమే ఆశ్రమహేతువు. అన్యాయమే జీవనానికి హేతువు.

**దౌర్బల్యమేవ అవృత్తిహేతుః. అభయప్రగల్భోచ్చారణమేవ పాణ్డిత్యహేతుః ॥ 23 ॥**

దుర్బలత్వంతో ఉండడమే వృత్తిలేమితనానికి హేతువు. భయంలేకుండా నేర్పుగా మాట్లాడడమే పాండిత్య హేతువు.

**దానమేవ ధర్మహేతుః. ఆఢ్యతైవ సాధుత్వహేతుః ॥ 24 ॥**

దానమే ధర్మానికి హేతువు. సంపన్నత్వమే సాధుత్వానికి హేతువు.

**వి ॥** అనాఢ్యతైవ సాధుత్వహేతుః– లేమితనమే సాధుత్వహేతువని పాఠాంతరం.

**స్నానమేవ ప్రసాధనహేతుః, స్వీకరణం వివాహహేతుః, సద్వేషధార్యేవ పాత్రమ్. దూరాయతనోదకమేవ తీర్థహేతుః । ఇత్యేవమనేకదోషోత్తరే తు భూమణ్డలే సర్వవర్ణేష్వేవ యో యో బలవాన్ స భూపతిర్భవిష్యతి ।**

స్నానమే అలంకరణహేతువు. స్వీకరణమే వివాహహేతువు. మంచివేషం ధరించినవాడే యోగ్యుడు. దూరప్రదేశంలో ఉన్న నీరే తీర్థహేతువు. (కపటవేషధారణమే గొప్పదనానికి హేతువు). ఇలా అనేక దోషాలు అధికంగా ఎవనికుంటాయో, అతడే సర్వవర్ణాలలోను బలవంతుడై భూపతి కాగలడు.

**ఏవం చాతిలుబ్ధకరభారాసహాః శైలానామన్తరా ద్రోణీః ప్రజాః సంశ్రయిష్యన్తి. మధు శాకమూలఫలపత్ర పుష్పాహారాశ్చ భవిష్యన్తి । తరువల్కల పర్ణచీరప్రావరణాశ్చాతిబహుప్రజాః, శీతవాతాతపవర్షసహా భవిష్యన్తి । న చ కశ్చిత్ త్రయోవింశతి వర్షాణి జీవిష్యతి. అనవరతం చాత్ర కలియుగే క్షయమాయాత్యఖిల ఏవ జనః క్షయముపైష్యతి ॥ 25 ॥**

మధువు, కాయలు, కందమూలలు, పండ్లు, ఆకుకూరలు, పువ్వులవంటి పదార్థాలు ఆహారాలుగా ఉంటాయి. ప్రజలు అతిలుబ్ధులైన రాజులను భరించలేక కొండలను, గుహలను ఆశ్రయిస్తారు. చెట్లపట్టాలను, చెట్ల ఆకులను కప్పుకొని చాలా మంది ప్రజలు చలి, గాలి, ఎండ వానలను ఓర్చుకొంటారు. ఎవడూ ఇరవైమూడు ఏండ్లు మించి బ్రతకడు. ఈ కలియుగంలో ఎల్లప్పుడూ సమస్తజనాలు క్షీణిస్తూ, నశిస్తూ ఉంటారు.

**శ్రౌతస్మార్తధర్మే విప్లవమత్యన్తముపగతే క్షీణప్రాయే చ కలావశేషజగత్స్రష్టుశ్చరాచరగురో రాదిమధ్యాన్త రహితస్య సర్వమయస్య బ్రహ్మమయస్యాఽఽత్మస్వరూపిణో భగవతో వాసుదేవస్యాంశః శమ్బలగ్రామప్రధాన బ్రాహ్మణస్య విష్ణుయశసో గృహే అష్టగుణర్ధిసమన్వితః కల్కిరూపీ జగత్యత్రావతీర్య సకలమ్లేచ్ఛదస్యుదుష్టాచరణ చేతసామ్, అశేషాణామపరిచ్ఛిన్నమాహాత్మ్యశక్తిః క్షయం కరిష్యతి ॥ 26 ॥**

శ్రౌతస్మార్తధర్మాలు పూర్తిగా నశించి పోతాయి. ధర్మం అనేది ఇంచుమించుగా లేకుండా పోతుంది. దాని కళ ఏదో ఒకటి మాత్రమే మిగిలి ఉంటుంది. ఆ సమయంలో జగత్సృష్టి కారకుడు, చరాచరాలన్నింటికి ప్రభువు, ఆది, మధ్యం, అంతం లేనివాడు, సర్వమయుడు, బ్రహ్మమయుడు, ఆత్మస్వరూపుడైన భగవంతుడుగు వాసుదేవుని అంశ శంబలగ్రామంలో ఒకానొక ప్రధానుడైన బ్రాహ్మణుడగు విష్ణుయశుని ఇంటిలో అష్టసిద్ధులు, సమస్తసుగుణవృద్ధితో కూడుకొన్న కల్కిరూపంతో జగత్తునందు అవతరించి, సమస్తమ్లేచ్ఛులను, దస్యులను, దుష్టకర్మాచరణచిత్తులనందరిని తన అఖండమైన మహిమతోను, సామర్థ్యంతోను నశింపజేస్తాడు.

**స్వధర్మేషు చాఖిలం జగత్ సంస్థాపయిష్యతీతి. అనన్తరం చాశేషకలేరవసానే నిశావసానే ప్రబుద్ధానామివ తేషామేవ జనపదానామమలస్ఫటిక విశుద్ధమతయో భవిష్యన్తి ॥ 27 ॥**

సమస్తమైన జగత్తును తనధర్మంలో పూర్తిగా నిలిచేటట్లు చేస్తాడు. తరువాత కలియుగం అంతా పూర్తిగా గడిచిపోయిన పిమ్మట, రాత్రి అయిపోయిన తరువాత నిద్రనుంచి మేల్కొన్నట్లుగా, ఆ నాటి జనపదనివాసులకే బుద్ధులన్నీ స్వచ్ఛమైన స్ఫటికంలా మిక్కిలి పరిశుభ్రమైపోతాయి.

**తేషాం చ బీజభూతానామశేషమనుష్యాణాం పరిణతానామపి తత్కాలకృతానామపత్యప్రసూతిర్భవిష్యతి॥28॥**

ఆ సమయంలో విత్తనాలవంటి ఆ సమస్తప్రజలకు, వారు బాగా వృద్ధులైనప్పటికీ కూడా, ఆ కృతయుగలక్షణాలతో కూడుకొన్న సంతానోత్పత్తి కలుగుతుంది.

**తాని చ తదపత్యాని కృతయుగధర్మానుసారీణి భవిష్యన్తీతి ॥ 29 ॥**

అప్పుడు వారు వారి సంతతి కృతయుగధర్మాలను అనుసరించే కర్మలను ఆచరిస్తారు.

**యదా చన్ద్రశ్చ సూర్యశ్చ తథా తిష్యబృహస్పతీ ।
ఏకరాశౌ సమేష్యన్తి భవిష్యతి తదా కృతమ్ ॥ 30 ॥**

చంద్రుడు, సూర్యుడు, బృహస్పతి ఏకరాశిలో ఉండగా, ఆ సమయంలో పుష్యమినక్షత్రం కూడా కలిసి ఉన్నప్పుడు, అది కృతయుగసమయం అవుతుంది.

**అతీతా వర్తమానాశ్చ తథైవానాగతాశ్చ యే ।
ఏతే వంశేషు భూపాలాః కథితా మునిసత్తమ! ॥ 31 ॥**

మునిశ్రేష్ఠుడవైన మైత్రేయా! గడిచిపోయిన, జరుగుతున్న, రాబోయే కాలాలలో రాజవంశాలకు చెందిన భూపాలురను గూర్చి నీకు తెలియజేశాను.

**యావత్ పరీక్షితో జన్మ యావన్నన్దాభిషేచనమ్ ।
ఏతద్వర్షసహస్రం తు జ్ఞేయం పంచశతోత్తరమ్ ॥ 32 ॥**

పరీక్షిత్తు జన్మించినదిమొదలు నందుని అభిషేకంవరకు ఒకవేయి ఐదువందల సంవత్సరాలకాలం అని తెలుసుకోవాలి.

**సప్తర్షీణాం చ యౌ పూర్వౌ దృశ్యేతే హ్యుదితౌ దివి ।**
**తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతే యత్ సమం నిశి ।**
**తేన సప్తర్షయో యుక్తాస్తిష్ఠన్త్యబ్దశతం నృణామ్ ॥ 33 ॥**

సప్తర్షులలో (పులస్త్యుడు, క్రతువు) అనే రెండు నక్షత్రాలు అంతరిక్షంలో ముందు కన్పించి నపుడు, ఆ రెండింటి నడుమ రాత్రి సమయంలో (దక్షిణోత్తరరేఖపై) సమప్రదేశంలో అశ్విని మున్నగు నక్షత్రాలలో, ప్రతినక్షత్రం వద్ద సప్తర్షులు ఒక్కొక్కరు వందసంవత్సరాలపాటు ఉంటారు.

**తే తు పారీక్షితే కాలే మఘాస్వాసన్ ద్విజోత్తమ! ।**
**తదా ప్రవృత్తశ్చ కలిర్ద్వాదశాబ్దశతాత్మకః ॥ 34 ॥**

ద్విజశ్రేష్ఠా! వారు పరీక్షిత్తుకు సంబంధించిన కాలంలో మఘానక్షత్రంపై ఉన్నారు. ఆ సమయంలో పన్నెండు వందల సంవత్సరాల కాలపరిమితిగల కలియుగం ప్రారంభమయింది.

వి ॥ 1200 సం॥ దేవప్రమాణం; 1200×360=4,32,000 సం॥ మానవ ప్రమాణం.

**యదైవ భగవద్విష్ణోరంశో యాతో దివం ద్విజ! ।**
**వసుదేవకులోద్భూతస్తదైవ కలిరాగతః ॥ 35 ॥**

ద్విజోత్తమా! విష్ణువు అంశతో వసుదేవునివంశంలో భూలోకంలో పుట్టిన కృష్ణభగవానుడు దివికి వెళ్లినపుడే కలియుగం ప్రారంభమయింది.

**యావత్స పాదపద్మాభ్యాం పస్పర్శేమాం వసున్ధరామ్ ।**
**తావత్పృథ్వీపరిష్వంగే సమర్థో నాభవత్కలిః ॥ 36 ॥**

ఆయన తన పాదపద్మాలతో ఈ వసుంధరను స్పృశిస్తున్నప్పుడు, అంతకాలంకూడ పృథివిని కౌగిలించు కోవడానికి కలిపురుషుడు సమర్థుడు కాలేకపోయాడు.

**గతే సనాతనస్యాంశే విష్ణోస్తత్ర భువో దివమ్ ।**
**తత్యాజ సానుజో రాజ్యం ధర్మపుత్రో యుధిష్ఠిరః ॥ 37 ॥**

సనాతనమైన విష్ణువు అంశమైన కృష్ణుడు భువినుంచి దివికి వెళ్లిపోగా, ధర్మపుత్రుడైన యుధిష్ఠిరుడు తమ్ములతో కలసి రాజ్యం విడిచి పెట్టాడు.

**విపరీతాని దృష్ట్వా చ నిమిత్తాని స పాణ్డవః ।**
**యాతే కృష్ణే చకారాథ సోఽభిషేకం పరీక్షితః ॥ 38 ॥**

కృష్ణుడు భూమియందు అంతర్ధానమై వెళ్లిపోయిన వెంటనే, విపరీతములైన ప్రకృతినిమిత్తాలను చూచి పాండుపుత్రుడైన ధర్మరాజు పరీక్షిత్తుకు అభిషేకం చేశాడు.

**ప్రయాస్యన్తి యదా తే చ పూర్వాషాఢాం మహర్షయః ।**
**తదా నన్దాత్ ప్రభృత్యేష కలిర్వృద్ధిం గమిష్యతి ॥ 39 ॥**

అపుడు (సప్త) మహర్షులు పూర్వాషాఢా నక్షత్రాన్ని ప్రవేశిస్తారు. తరువాత నందరాజు పాలననుంచి కలిప్రభావం అభివృద్ధి పొందుతుంది.

**యస్మిన్ కృష్ణో దివం యాతస్తస్మిన్నేవ తదాఽహని ।**
**ప్రతిపన్నం కలియుగం తస్య సంఖ్యాం నిబోధ మే ॥ 40 ॥**

మైత్రేయా! ఏనాడు కృష్ణుడు దివికి వెళ్లాడో, ఆ నాడే అదేరోజున కలియుగం ప్రాగంభమయింది. దాని సంవత్సరసంఖ్య చెబుతాను. ఆలకించు.

**త్రీణి లక్షాణి వర్షాణాం ద్విజ! మానుషసంఖ్యయా ।**
**షష్టిం చైవ సహస్రాణి భవిష్యత్యేష వై కలిః ॥ 41 ॥**

ద్విజోత్తమా! ఈ కలియుగం మానవసంవత్సర పరిగణనచే మూడులక్షల అరవైవేలసంవత్సరాలుఉంటుంది.

**వి ॥** కలియుగ ప్రమాణం 4,32,000 సం॥లు. కాని ఇక్కడ 3,60,000 సం॥ అని చెప్పబడింది. ఇది సంధ్యాంశాలు విడిచి చెప్ప బడినట్లుగా గ్రహించాలి.

**శతాని తాని దివ్యాని సప్త పంచ చ సంఖ్యయా ।**
**నిఃశేషేణ తతస్తస్మిన్ భవిష్యతి పునః కృతమ్ ॥ 42 ॥**

పన్నెండు వందల దివ్యసంవత్సరాలు (1200×360=4,32,000సం॥) సంధ్యాసంధ్యాంశలు కలసి పూర్తిగా ఏ శేషం లేకుండా గడిచిపోయిన తరువాత కృతయుగం వస్తుంది.

**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చ ద్విజసత్తమ! ।**
**యుగే యుగే మహాత్మానః సమతీతాః సహస్రశః ॥ 43 ॥**

ద్విజశ్రేష్ఠా! ప్రతియుగంలోను బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులలో మహాత్ములైనవారు వేలకొలది గతించారు.

**బహుత్వాన్నామధేయానాం పరిసంఖ్యా కులే కులే ।**
**పునరుక్త బహుత్వాత్తు న మయా పరికీర్తితాః ॥ 44 ॥**

వారి పేర్లు చాల ఎక్కువ. ప్రతికులంలోను వారి సంఖ్య కూడా ఎక్కువే. పునరుక్తివల్ల, ఆధిక్యంవల్ల (వారి పేర్లలోని సామ్యంవల్ల) వారిని గూర్చి నేను చెప్పలేదు.

**దేవాపిః పౌరవో రాజా మరుశ్చేక్ష్వాకువంశజః ।**
**మహాయోగబలోపేతౌ కలాపగ్రామ సంశ్రయౌ ॥ 45 ॥**

పురువంశంలో పుట్టిన దేవాపి, ఇక్ష్వాకువంశంలో జన్మించిన మరుదు వీరిద్దరు మహాయోగమహిమతో కూడుకొన్నవారై, కలాపగ్రామంలో అందరికి ఆశ్రయభూతులై ఉన్నారు.

**కృతే యుగ ఇహాగత్య క్షత్రప్రావర్తకౌ హి తౌ ।**
**భవిష్యతో మనోర్వంశే బీజభూతౌ వ్యవస్థితౌ ॥ 46 ॥**

కృతయుగంలో వారిద్దరు ఇక్కడికి వచ్చి క్షత్రియవంశప్రవర్తకులవుతారు. వారు రాబోయే మను వంశానికి విత్తనాల (బీజ) రూపంగా వ్యవహరిస్తారు.

**ఏతేన క్రమయోగేన మనుపుత్రైర్వసున్ధరా ।**
**కృతత్రేతాదిసంజ్ఞాని యుగాని త్రీణి భుజ్యతే ॥ 47 ॥**

ఈ క్రమపద్ధతిలో వసుంధర మనువు పుత్రులచే కృతత్రేతాద్వాపరయుగాలు మూడూ కూడ అనుభవించడం జరుగుతుంది.

**కలౌ తు బీజభూతాస్తే కేచిత్ తిష్ఠన్తి భూతలే ।**
**యథైవ దేవాపిమరూ సామ్ప్రతం సమధిష్ఠితౌ ॥ 48 ॥**

దేవాపి, మరువు బీజస్వరూపాలుగా ఉన్నట్లుగానే, ఈ భూమండలంలో కొందరు (వారు) ఈ కలియుగంలో ఇప్పుడు కూడా విత్తనాలుగా అధిష్ఠించి ఉన్నారు.

వి ॥ ఇచట వారు అనే పదంచే మనుపుత్రులు గ్రహించ బడతారు.

**ఏష తూద్దేశతో వంశస్తవోక్తో భూభుజాం మయా ।**
**నిఖిలో గదితుం శక్యో నైవ జన్మ(వర్ష)శతైరపి ॥ 49 ॥**

మైత్రేయా! ఈ రాజవంశాలనుగూర్చి ఉద్దేశపూర్వకంగా సంక్షేపంగా నీకు వివరించాను. వంద సంవత్సరాలైనా (వంద జన్మలైనా) పూర్తిగా అంతా చెప్పడానికి శక్యం కాదు.

**ఏతే చాన్యే చ భూపాలా యైరత్ర క్షితిమణ్డలే ।**
**కృతం మమత్వం మోహాన్ధైర్నిత్యం హేయకలేబరే ॥ 50 ॥**

ఇతర భూపాలురైన వారు ఈ భూమండలంలో ఉన్నారో, వారు మోహంతో అంధులై హేయమైన ఈ కళేబరంపై మమకారం ఏర్పరచుకొన్నారు.

**కథం మమేయమచలా మత్పుత్రస్య కథం మహీ ।**
**మద్వంశస్యేతి చిన్తార్తా జగ్మురన్తమిమే నృపాః ॥ 51 ॥**

ఈ నృపాలకులు ఈ భూమి స్థిరంగా నాకు ఎలా చెందుతుంది? నాకుమారునికి ఈ మహాస్థలి ఎలా శాశ్వతంగా ఉంటుంది? నావంశం వారికే ఈ ధరణి ఎలా వశమై ఉంటుంది? అనే చింతతో పీడించ బడ్డవారై అంతమైపోయారు.

**తేభ్యః పూర్వతరాశ్చాన్యే తేభ్యస్తేభ్యస్తథాఽపరే ।**
**భవిష్యాశ్చైవ యాస్యన్తి తేషామన్యే చ యేఽప్యను ॥ 52 ॥**

వారికన్న బాగా పూర్వం ఉన్న ఇతరులు, అలాగే వారికన్న, వారికంటె ఇంకా బాగా పూర్వం ఉన్న ఇతరులు, ఇకపైన రాబోయేవారు, వారి తరువాతివారు, వారికి తరువాతి వారు కూడా గతించిపోయేవారే.

**విలోక్యాత్మజయోద్యోగ యాత్రావ్యగ్రాన్ నరాధిపాన్ ।**
**పుష్పప్రహాసైః శరది హసతీవ వసున్ధరా ॥ 53 ॥**

తనను జయించాలని ఎల్లప్పుడు ప్రయత్నిస్తూ, దండయాత్రలు చేస్తూ, వ్యగ్రులై ఉన్న నరపాలురను విలోకించి, వసుంధర శరత్కాలసమయంలో వికసించే పువ్వులనే నవ్వులతో పరిహాసం చేస్తోందా అన్నట్లు ఉంటుంది.

**మైత్రేయ! పృథివీగీతాః శ్లోకాంశ్చాత్ర నిబోధ తాన్ ।**
**యానాహ ధర్మధ్వజినే జనకాయాసితో మునిః ॥ 54 ॥**

మైత్రేయా! ఈ సందర్భంలో పృథివిగానంచేసిన ఆ శ్లోకాలను గూర్చి ఆలకించు. వీటిని ధర్మధ్వజుడనే పేరుగల జనకరాజునకు అసితుడనే మహాముని చెప్పడం జరిగింది.

**కథమేష నరేన్ద్రాణాం మోహో బుద్ధిమతామపి ।**
**యేన ఫేనసధర్మాణోఽప్యతివిశ్వస్తచేతసః ॥ 55 ॥**

ఎంతో బుద్ధిమంతులైనప్పటికి ఈ నరేంద్రులకు ఇంతమోహం ఎందుకో? దీనివల్ల నురుగుతో (నీటిబుడగతో) సమానమైన జీవితాన్ని తాము ఎల్లప్పుడూ శాశ్వతులమని మనస్సులలో నమ్ముతారు కదా!

**పూర్వమాత్మజయం కృత్వా జేతుమిచ్ఛన్తి మన్త్రిణః ।**
**తతో భృత్యాంశ్చ పౌరాంశ్చ జిగీయన్తే తథా రిపూన్ ॥ 56 ॥**

మొదట తమను తాము జయం పొందాలని కోరుకొంటారు. పిమ్మట మంత్రులను, తరువాత సేవకులను, అటుతరువాత పౌరులను, చివరకు శత్రువులను జయించాలని కోరుకొంటారు.

**క్రమేణానేన జేష్యామో వయం పృథ్వీం ససాగరామ్ ।**
**ఇత్యాసక్తధియో మృత్యుం న పశ్యన్త్యవిదూరగమ్ ॥ 57 ॥**

ఇదే క్రమంలో సముద్రాలచే చుట్టబడియున్న భూమినంతనూ మేము జయింపగలమనే ఆశతో కూడు కొన్న బుద్ధికలవారై, తమను వెంటాడుతూ చేరువలో ఉన్న మృత్యువును చూడడంలేదు.

**సముద్రావరణం యాతి భూమణ్డలమథో వశమ్ ।**
**కియదాత్మజయాదేతన్ముక్తిరాత్మజయే ఫలమ్ ॥ 58 ॥**

సముద్రాలు చుట్టియున్న భూమండలం ఆత్మవశం కావచ్చు. కాని ఆత్మజయం ముందు ఇది ఎంత? అత్మజయానికి ఫలం ముక్తి కదా!

**ఉత్సృజ్య పూర్వజా యాతా యాం నాదాయ గతః పితా ।**
**తాం మమేతి విమూఢత్వాజ్జేతుమిచ్ఛన్తి పార్థివాః ॥ 59 ॥**

పూర్వులందరూ విడిచిపెట్టి వెళ్లిపోయారు. తండ్రి కూడా ఏమి పట్టుకొని వెళ్లలేదు. అటువంటి నన్ను మిక్కిలి మూఢత్వంవల్ల రాజులు జయించాలని కోరుకొంటూ ఉంటారు.

**మత్కృతే పితృపుత్రాణాం భ్రాతౄణాం చాపి విగ్రహాః ।**
**జాయన్తేఽ త్యన్తమోహేన మమతాధృతచేతసామ్ ॥ 60 ॥**

నాకోసమై తండ్రికి కొడుకుకు, సోదరులకు మిక్కిలి మమకారం పెరిగి, మనస్సులలో వాంఛ పెరిగిపోయి, అత్యంత వ్యామోహంతో విరోధాలు పుడుతూ ఉంటాయి.

**పృథ్వీ మమేయం సకలా మమైషా మమాన్వయస్యాపి చ శాశ్వతేయమ్ ॥**
**యో యో మృతో హ్యత్ర బభూవ రాజా కుబుద్ధిరాసీదితి తస్య తస్య ॥ 61 ॥**

ఈ పృథివి అంతా నాదే. ఇదంతా నాకు, నావంశానికి శాశ్వతంగా ఉంటుంది – అన్న దురాశతో కూడుకొన్న బుద్ధి ఇక్కడ ఉండి ఏ ఏ రాజయితే మరణించాడో, ఆయా ప్రతినృపాలునికి ఉన్నటువంటిదే.

**దృష్ట్వా మమత్వాదృతచిత్తమేకం విహాయ మాం మృత్యువశం వ్రజన్తమ్ ॥**
**తస్యాన్వయస్థస్య కథం మమత్వం హృద్యాస్పదం మత్ప్రభవం కరోతి ॥ 62 ॥**

ఇలా మమకారంతో ఆదరించ బడ్డ చిత్తం కలిగి, నన్ను విడిచిపెట్టి మృత్యువును కౌగిలించుకొంటూ వెళ్లి పోతున్న ఒక్కని చూచి కూడా, ఆ వంశంలో ఉన్న ఆ తరువాతి వానికి నాపట్ల హృదయంలో ఎలా మమత్వం చోటు చేసుకొంటొందో? (ఇది తెలియరావడం లేదు).

**పృథ్వీ మమైషా సుపరిత్యజైనాం వదన్తి యే దూతముఖైః స్వశత్రుమ్ ॥**
**నరాధిపాస్తేషు మమాతిహాసః పునశ్చ మూఢేషు దయాఽభ్యుపైతి ॥ 63 ॥**

"ఈ భూమి నాది. దీనిని వెంటనే వదలి పెట్టు" అని దూతల ద్వారా శత్రువుకు కబురు పంపించే నరపాలురను చూస్తూ ఉంటే నాకు చాలా నవ్వు వస్తుంది. మళ్లీ ఆ మూఢులపైనే నాకు జాలి కూడా కలుగుతూ ఉంటుంది.

**ఇత్యేతే ధరణీగీతా శ్లోకా మైత్రేయ! యైః శ్రుతాః ।**
**మమత్వం విలయం యాతి తాపన్యస్తం యథా హిమమ్ ॥ 64 ॥**

మైత్రేయా! ఈ విధంగా ధరణి గానం చేసిన ఈ శ్లోకాలను ఎవరు వింటారో, వారి మమత్వం సూర్యుడు ఫెళఫెళ మండిపోతూ ఉంటే మంచులా కరిగి పోతుంది.

**ఇత్యేష కథితః సమ్యఙ్మనోర్వంశో మయా తవ ।**
**యత్ర స్థితిప్రవృత్తస్య విష్ణోరంశాంశకా నృపాః ॥ 65 ॥**

ఇది మనువు సంబంధి వంశం. నేను దీనిని నీకు చక్కగా వివరించాను. ఈ వంశంలోని రాజులు అందరూ స్థితికారకుడైన విష్ణువు అంశాంశలు కలవారే సుమా!

**శృణుయాద్ య ఇమం భక్త్యా మనువంశమనుక్రమాత్ ।**
**తస్య పాపమశేషం వై ప్రణశ్యత్యమలాత్మనః ॥ 66 ॥**

ఎవడైతే భక్తితో ఈ మనువంశాన్ని క్రమాన్ని అనుసరించి వింటాడో, అటువంటివాడు నిర్మలాత్ముడవుతాడు. అతని సర్వపాపాలు నశిస్తాయి.

**ధనధాన్యర్ధిమతులాం ప్రాప్నోత్యవ్యాహతేన్ద్రియః ।**
**శ్రుత్వైవమఖిలం వంశం ప్రశస్తం శశిసూర్యయోః ॥ 67 ॥**

సూర్యచంద్రవంశరాజుల ఈ ప్రశస్తవృత్తాంతం పూర్తిగా విన్నవాడు ఇంద్రియవైకల్యంలేక సాటిలేని ధనం, ధాన్యం, అభివృద్ధి పొందుతాడు.

**ఇక్ష్వాకు జహ్నుమాన్ధాతృ సగరాధిష్ఠితాన్ రఘూన్ ।**
**యయాతి నహుషాద్యాంశ్చ జ్ఞాత్వా నిష్ఠాముపాగతాన్ ॥**
**మహాబలాన్ మహావీర్యాననన్తధనసంచయాన్ । 68 ॥**
**కృతాన్ కాలేన బలినా కథాశేషాన్నరాధిపాన్ ॥**

**శ్రుత్వా న పుత్రదారాదౌ గృహక్షేత్రాదికే తథా ।**
**ద్రవ్యాదౌ చ కృతప్రజ్ఞో మమత్వం కురుతే నరః ॥ 69 ॥**

ఇక్ష్వాకువు, జహ్నుడు, మాంధాత, సగరుడు, అవిక్షిత్తు (మరుత్తుడు), రఘువు, యయాతి, నహుషుడు మున్నగు నిష్ఠావంతులైన, మహాబలశాలులైన, మహావీర్యవంతులైన, అనంతధనసంపన్నులైన నరపాలురు ఎందరో కాలబలానికి లొంగి పోయారు. వారు కథలుగా చెప్పుకోవడానికి మాత్రమే మిగిలి పోయారు. ఇది తెలుసుకొన్న ప్రజ్ఞావంతుడైన నరుడు పుత్రులు, భార్యమొదలైన వారి యందును, ఇల్లు, పొలం మొదలైన వాటియందును, ద్రవ్యం, ధనం మున్నగు వాటియందును మమత్వం అనేది పెట్టుకోడు.

**తప్తం తపో యైః పురుషప్రవీరై రుద్బాహుభిర్వర్షగణాననేకాన్ ॥**
**ఇష్ట్వా సుయజ్ఞై ర్బలినోఽతివీర్యాః కృతాస్తు కాలేన కథావశేషాః ॥ 70 ॥**

చేతులు పైకెత్తి అనేక సంవత్సరాల పాటు తపస్సు చేసిన పురుషశ్రేష్ఠులను, గొప్ప యజ్ఞాలతో యజించిన బలశాలురను, మహావీర్యవంతులను కాలం అనేది కథావశేషులుగా మిగిల్చివేసింది.

**పృథుః సమస్తాన్ ప్రచచార లోకాన్ అవ్యాహతో యోఽరివిదారిచక్రః ॥**
**స కాలవాతాభిహతో వినష్టః క్షిప్తం యథా శాల్మలితూలమగ్నౌ ॥ 71 ॥**

పృథుచక్రవర్తి శత్రువులనందరిని చీల్చివేసి, ఏ అడ్డులేకుండా సమస్తలోకాలలో సంచరించాడు. అటువంటివాడు అగ్నిలో పడ్డ బూరుగు దూదిలాగా కాలమనే వాయువుచే విసరివేయబడి నశించాడు.

**యః కార్తవీర్యో బుభుజే సమస్తాన్ ద్వీపాన్ సమాక్రమ్య హతారిచక్రః ॥**
**కథాప్రసంగేష్వభిధీయమానః స ఏవ సంకల్పవికల్పహేతుః ॥ 72 ॥**

శత్రుసమూహాన్ని చీల్చి చెండాడి, సమస్త ద్వీపాలను ఆక్రమించి, ఈ భూమండలాన్ని అంతా అనుభవించిన కార్తవీర్యుడు, కథాప్రసంగాలలో చెప్పబడుతూ ఉంటే, అసలు అతడు ఒకప్పుడు ఉన్నాడా? లేదా? అనే సంకల్పవికల్పాలకు కారణమవుతున్నాడు.

**దశాననా విక్షిత రాఘవాణా మైశ్వర్యముద్భాసిత దిఙ్ముఖానామ్ ।**
**భస్మాపి జాతం న కథం క్షణేన భ్రూభంగపాతేన ధిగన్తకస్య ॥ 73 ॥**

దిక్కుల ముఖాలను కళకళలాడించిన దశాననుడు, అవిక్షితుడు (మరుత్తుడు), రఘువంశీయులు (శ్రీరాముడు) – వీరి ఐశ్వర్యమంతా, ఇసీ! యముని కనుబొమ్మలు ముడిపడేసరికి క్షణంలో బూడిద కూడా మిగలలేదు. ఎందుచేతనంటావు?

**కథా శరీరత్వ మవాప యద్వై మాన్ధాతృనామా భువి చక్రవర్తీ ।**
**శ్రుత్వాఽపి తం కోఽపి కరోతి సాధుర్మమత్వమాత్మన్యపి మన్దచేతాః ॥ 74 ॥**

భూమియందు మాంధాత అనే పేరుగల చక్రవర్తికూడా కథలలో మాత్రమే శరీరాన్ని ధరించియున్నాడు. ఈ విషయాన్ని విని ఏమందబుద్ధి అయినా తనపైనైనా మమత్వం ఉంచుకొంటాడా?

**భగీరథాద్యాస్సగరః కకుత్స్థో దశాననో రాఘవలక్ష్మణౌ చ ।**
**యుధిష్ఠిరాద్యాశ్చ బభూవురేతే సత్యం న మిథ్యా క్వ ను తే న విద్మః ॥ 75 ॥**

భగీరథుడు మున్నగు వారు, సగరుడు, కకుత్థ్సుడు, దశాననుడైన రావణుడు, రామలక్ష్మణులు, యుధిష్ఠిరుడు మున్నగు వారు వీరందరూ ఒకప్పుడు ఉన్నవారే. నిజమే, అసత్యం కాదు. కాని వారు ఇప్పుడు ఎక్కడున్నారో తెలియరావడం లేదు.

**యే సాంప్రతం యే చ నృపా భవిష్యాః ప్రోక్తా మయా విప్రవరోగ్రవీర్యాః ॥**
**యేతే తథాఽన్యే చ తథాఽభిధేయాః సర్వే భవిష్యన్తి యథైవ పూర్వే ॥ 76 ॥**

విప్రవర్యా! ఈ నాడు ఇప్పుడు ఉన్న నరపాలురు, నేను చెప్పిన మహావీర్యవంతులైన భవిష్యభూపాలురు, అలాగే ఎవరయితే ఇతరులు ఉన్నారో, అందరు పూర్వులలాగానే చెప్పదగిన వారు (కథలయందు మాత్రమే మిగిలినవారు) అయిపోతారు.

**ఏతద్విదిత్వా న నరేణ కార్యం మమత్వ మాత్మన్యపి పణ్డితేన ।**
**తిష్ఠన్తు తావత్ తనయాత్మజాద్యాః క్షేత్రాదయో యే చ శరీరిణోఽన్యే ॥ 77 ॥**

ఇది తెలుసుకొని పండితుడైనట్టి నరుడు కుమారులు, కుమార్తెలు మొదలయిన వారు ఉండుగాక! పొలము మున్నగునవి ఉండుగాక! ఇతరప్రాణులు ఉండుగాక! చివరకు తనపైన కూడా మమకారం ఉంచుకోరాదు. మైత్రేయా! అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే చతుర్థాంశే కలియుగనరేంద్రాణాం చరిత్రం – కలిధర్మవర్ణనం చేతి చతుర్వింశోఽధ్యాయః సమాప్తః ॥24॥**

శ్రీవిష్ణుపురాణంలో చతుర్థాంశంలో కలియుగనరేంద్రుల చరిత్ర – కలిధర్మవర్ణన అనే ఇరవై నాల్గవ అధ్యాయం సమాప్తం ॥ 24 ॥

# పంచమాంశః - ఐదవ అంశం

## ప్రథమోఽధ్యాయః–మొదటి అధ్యాయం

## దేవకీవసుదేవయోః వివాహః – దేవకీవసుదేవుల వివాహం

**శ్రీమైత్రేయ ఉవాచ :–** మైత్రేయుడు అడుగుతున్నాడు.

**నృపాణాం కథితః సర్వో భవతా వంశవిస్తరః ।**
**వంశానుచరితం చైవ యథావదనువర్ణితమ్ ॥ 1 ॥**

**అంశావతారో బ్రహ్మర్షే! యోఽయం యదుకులోద్భవః ।**
**విష్ణోస్తం విస్తరేణాహం శ్రోతుమిచ్ఛామ్యశేషతః ॥ 2 ॥**

**చకార యాని కర్మాణి భగవాన్ పురుషోత్తమః ।**
**అంశాంశేనావతీర్యోర్వ్యాం తత్ర తాని మునే! వద ॥ 3 ॥**

"పరాశరమహర్షీ! రాజుల సంపూర్ణవంశవిస్తారం, అదేవిధంగా వారి వంశచరిత్రలను ఒక క్రమంలో వర్ణించి నాకు తెలియజేశావు. బ్రహ్మర్షీ! యదువంశంలో విష్ణువు అంశావతారం ఉద్భవించిందికదా! ఆ యథార్థ వృత్తాంతాన్ని విస్తారపూర్వకంగా అంతా వినాలని కోరుకొంటున్నాను. మునీశ్వరా! భగవంతుడైన పురుషోత్తముడు అంశరూపంతో పృథివిపై అవతరించి ఏ ఏ కర్మలు ఆచరించాడో, వాటినన్నింటినీ నాకు చెప్పవలసింది." అని కోరాడు.

**పరాశర ఉవాచ :–** పరాశరుడు చెబుతున్నాడు.

**మైత్రేయ! శ్రూయతామేతద్ యత్ పృష్టోఽహమిదం త్వయా ।**
**విష్ణోరంశాంశసమ్భూతిచరితం జగతో హితమ్ ॥ 4 ॥**

"మైత్రేయా! నీవు నన్ను అడిగిన దానిని గూర్చి తెలియజేస్తున్నాను. ఈ జగత్తుకు పరమమంగళం చేకూర్చడంకోసమై విష్ణువు అంశాంశావతారం జరిగిన చరిత్రను ఆలకించు.

**దేవకస్య సుతాం పూర్వం వసుదేవో మహామునే! ।**
**ఉపయేమే మహాభాగాం దేవకీం దేవతోపమామ్ ॥ 5 ॥**

మహామునీ! పూర్వకాలంలో దేవకుని కుమార్తె అయిన మహాభాగ్యశాలినియగు, దేవతాస్వరూపిణి అయిన దేవకీదేవిని వసుదేవుడు వివాహం చేసుకొన్నాడు.

**కంసస్తయోర్వరరథం చోదయామాస సారథిః ।**
**వసుదేవస్య దేవక్యాః సంయోగే భోజనన్దనః ॥ 6 ॥**

దేవకీవసుదేవుల వివాహం పూర్తి అయిన తరువాత, నవదంపతులిద్దరిని శుభప్రదమైన రథంపై కూర్చుండజేసి, భోజనందనుడైన కంసుడు తానే స్వయంగా సారథియై రథం తోలసాగాడు.

**అథాన్తరిక్షే వాగుచ్చైః కంసమాభాష్య సాదరమ్ ।**
**మేఘగమ్భీరనిర్ఘోషం సమాభాష్యేదమబ్రవీత్ ॥ 7 ॥**

ఆ సమయంలో మేఘంయొక్క ఉరుముతో సమానమైన గంభీరధ్వనితో ఆకాశంలో ఆదరప్రపూర్ణ దివ్యవాణి ఉచ్చైఃస్వరంతో కంసుని ఉద్దేశించి మాట్లాడుతూ ఇలా అన్నది.

**యామేతాం వహసే మూఢ! సహభర్త్రా రథే స్థితామ్ ।**
**అస్యాస్తే చాష్టమో గర్భః ప్రాణానపహరిష్యతి ॥ 8 ॥**

"ఓరి మూఢా! భర్తతో కలసి ఎవరిని రథంపై కూర్చుండజేసి దానిని తోలుతున్నావో, ఆమె అష్టమగర్భం నీప్రాణాలను అపహరించి వేస్తుంది" అని వచించింది.

**ఇత్యాకర్ణ్య సమాదాయ ఖడ్గం కంసో మహాబలః ।**
**దేవకీం హన్తుమారబ్ధో వసుదేవోఽబ్రవీదిదమ్ ॥ 9 ॥**

ఈ మాటలు వినీ వినడంతోనే మహాబలుడైన కంసుడు వెంటనే కత్తి గైకొన్నవాడై దేవకిని చంపడానికి ఉద్యుక్తుడయ్యాడు. ఆ సమయంలో అతనిని వారిస్తూ వసుదేవు డిలా అంటున్నాడు.

**న హన్తవ్యా మహాబాహో! దేవకీ భవతా తవ ।**
**సమర్పయిష్యే సకలాన్ గర్భానస్యోదరోద్భవాన్ ॥ 10 ॥**

"ఓ మహాబాహో! నీవు దేవకిని వధించవద్దు. ఈమె గర్భంలో ఉద్భవించబోయే సమస్తశిశువులను (గర్భాలను) నేను ఏ సందేహం లేకుండా అర్పిస్తాను." అని వాగ్దానం చేశాడు.

**తథేత్యాహ చ తం కంసో వసుదేవం ద్విజోత్తమ! ।**
**న ఘాతయామాస చ తాం దేవకీం తస్య గౌరవాత్ ॥ 11 ॥**

ద్విజశ్రేష్ఠా! కంసుడు ఆ వసుదేవుని మాటలు విని, ఆతనిపైనున్న సత్యవాక్యగౌరవంతో సరేయని, చెల్లెలయిన దేవకిని చంపడం మానివేశాడు.

**ఏతస్మిన్నేవ కాలే తు భూరిభారావపీడితా ।**
**జగామ ధరణీ మేరౌ సమాజే త్రిదివౌకసామ్ ॥ 12 ॥**

ఇదే సమయంలో ఎక్కువ భారాన్ని మోయలేక పీడితురాలై పృథివి (గోరూపం ధరించి) సుమేరు పర్వతోపరిభాగంపై ఉన్న దేవసమాజం సన్నిధికి చేరింది.

**సబ్రహ్మకాన్ సురాన్ సర్వాన్ ప్రణిపత్యాఽఽహ మేదినీ ।**
**కథయామాస తత్ సర్వం ఖేదాత్ కరుణభాషిణీ ॥ 13 ॥**

అక్కడ ఆ మేదిని బ్రహ్మదేవునితో కూడుకొనియున్న సమస్తదేవతలకు ప్రణమిల్లి, జాలిగొలిపే కంఠస్వరంతో తన కష్టాన్ని దుఃఖంతో వ్యక్తంచేస్తూ సర్వం ఇలా వివరించింది.

**అగ్నిః సువర్ణస్య గురుర్గవాం సూర్యః పరో గురుః ।**
**మమాప్యఖిలలోకానాం గురుర్నారాయణో గురుః ॥ 14 ॥**

అగ్ని సువర్ణానికి గురువు, సమస్తకిరణసమూహాలకు సూర్యుడు పరమగురువు, సకలలోకాలకు నారాయణుడు గురువు. నాకు కూడా ఆయనే గురువు.

**ప్రజాపతిపతిర్బ్రహ్మా పూర్వేషామపి పూర్వజః ।**
**కలాకాష్ఠానిమేషాత్మా కాలశ్చావ్యక్తమూర్తిమాన్ ॥ 15 ॥**

ఆయన ప్రజాపతులకెల్ల పతియగు బ్రహ్మపూర్వులు అని వ్యవహరించబడే వారిందరికన్న పూర్వం నుండి ఉండేవాడు. కల, కాష్ఠ, నిమేషం మున్నగు ప్రమాణాలతో లెక్కించబడే కాలస్వరూపుడు. ఆ అవ్యక్తకాలరూపుడు ఆయనే.

**తదంశభూతస్సర్వేషాం సమూహో వః సురోత్తమాః ।**
**ఆదిత్యా మరుతః సాధ్యా రుద్రా వస్వశ్వివహ్నయః ॥ 16 ॥**

**పితరో యే చ లోకానాం స్రష్టారోఽత్రిపురోగమాః ।**
**ఏతత్ తస్యాప్రమేయస్య రూపం విష్ణోర్మహాత్మనః ॥ 17 ॥**

దేవతాశ్రేష్ఠులారా! మీ సమస్తదేవగణాలన్నీ కూడా ఆ విష్ణువుయొక్క అంశస్వరూపాలే. ఆదిత్యులు, మరుత్తులు, సాధ్యులు, రుద్రులు, వసువులు, అశ్వినీకుమారులు, అగ్నులు, పితృగణాలు, లోకసృష్టికారకులైన అత్రిమొదలైన ప్రజాపతులు (బ్రహ్మమానసపుత్రులు) – ఈ సమస్తం ఆ అప్రమేయుడగు మహాత్ముడైన విష్ణువురూపమే.

**యక్షరాక్షసదైతేయాః పిశాచోరగదానవాః ।**
**గన్ధర్వాప్సరసశ్చైవ రూపం విష్ణోర్మహాత్మనః ॥ 18 ॥**

యక్షులు, రాక్షసులు, దైతేయులు, పిశాచులు, ఉరగులు, దానవులు, గంధర్వులు, అప్సరసలు ఆ మహాత్ముడైన విష్ణువు స్వరూపమే.

**గ్రహర్క్ష తారకాచిత్ర గగనాగ్నిజలానిలాః ।**
**అహం చ విషయాశ్చైవ సర్వం విష్ణుమయం జగత్ ॥ 19 ॥**

గ్రహాలు, నక్షత్రాలు, తారకాసమూహంతో కూడుకొన్న ఆకాశం, అగ్ని, జలం, వాయువు, భూమినైన నేను, సకల విషయాలు (శబ్దస్పర్శాదులు, ఇంద్రియాలు) సర్వజగత్తూ ఆ విష్ణుమయమే.

**తథాఽప్యనేకరూపస్య తస్య రూపాణ్యహర్నిశమ్ ।**
**బాధ్యబాధకతాం యాన్తి కల్లోలా ఇవ సాగరే ॥ 20 ॥**

అయినప్పటికి సర్వస్వరూపుడైన ఆయన సమస్తరూపాలు కడలిలోని కెరటాలలాగా రాత్రి, పగలు అనే భేదం లేకుండా ఒకటి ఇంకొక దానిని బాధించేది, బాధింపబడేది అన్నట్లుగా ఉంటాయి.

**తత్ సాంప్రతమిమే దైత్యాః కాలనేమిపురోగమాః ।**
**మర్త్యలోకం సమాక్రమ్య బాధన్తేఽహర్నిశం ప్రజాః ॥ 21 ॥**

అందువల్ల ఇప్పుడు కాలనేమి మున్నగు దైత్యగణాలు మర్త్యలోకాన్ని ఆక్రమించి రాత్రి, పగలు అనే భేదం లేకుండా ఎల్లప్పుడూ అచ్చటి ప్రజలను బాధిస్తున్నాయి.

**కాలనేమిర్హతో యోఽసౌ విష్ణునా ప్రభవిష్ణునా ।**
**ఉగ్రసేనసుతః కంసః సమ్భూతః స మహాసురః ॥ 22 ॥**

సర్వశక్తిమంతుడైన మహావిష్ణువుచే ఒకప్పుడు కాలనేమి సంహరించబడ్డాడు కదా! ఆ మహాసురుడే ఉగ్రసేనుని కుమారుడుగా కంసుడై ఉద్భవించాడు.

**అరిష్టో ధేనుకః కేశీ ప్రలమ్బో నరకస్తథా ।**
**సున్దోఽసురస్తథాఽత్యుగ్రో బాణశ్చాపి బలేః సుతః ॥ 23 ॥**

**తథాఽన్యే చ మహావీర్యా నృపాణాం భవనేషు యే ।**
**సముత్పన్నా దురాత్మానస్తాన్ న సంఖ్యాతుముత్సహే ॥ 24 ॥**

అరిష్టుడు, ధేనుకుడు, కేశి, ప్రలంబుడు, నరకుడు, సుందుడు, అదేవిధంగా బలిచక్రవర్తి కుమారుడైన అతి భయంకరుడైన బాణాసురుడు, అలాగే మిగిలిన మహాబలవంతులైన, దురాత్ములైన రాక్షసులు రాజభవనాలలో తదంశలతో ఇప్పుడు జన్మించారు. వారి సంఖ్యలను లెక్కించలేను.

**అక్షౌహిణ్యోఽత్ర బహులా దివ్యమూర్తిధరాస్సురాః ।**
**మహాబలానాం దృప్తానాం దైత్యేన్ద్రాణాం మమోపరి ॥ 25 ॥**

దివ్యమూర్తి ధారులైన దేవగణములారా! ఈ నాడు నాపై (భూమిపై) మహాబలవంతులైన, అతిగర్వితులైన దైత్యేంద్రులసేనలు అక్షౌహిణులకొలదీ ఉన్నాయి.

వి॥ 21,870 రథాలు, 21,870 ఏనుగులు, 65,610 అశ్వాలు, 1,09,350 కాల్బలం కలసి 2,18,700 సంఖ్య అవుతుంది. దీనిని ఒక అక్షౌహిణి అంటారు.

**తద్భూరిభారపీడార్తా న శక్నోమ్యమరేశ్వరాః! ।**
**బిభర్తుమాత్మానమహమితి విజ్ఞాపయామి వః ॥ 26 ॥**

అమరేశ్వరులారా! నేను మీకు విజ్ఞప్తి చేస్తున్నాను. నేను ఈ విధంగా అత్యంతభారంచే పీడించబడుతున్నాను. ఆ భారాన్ని నేను భరించలేక పోతున్నాను. దీనిని మోయడానికి నాశక్తి సరిపోవడం లేదు.

**క్రియతాం తన్మహాభాగాః! మమ భారావతారణమ్ ।**
**యథా రసాతలం నాహం గచ్ఛేయమతివిహ్వలా ॥ 27 ॥**

ఓ మహాభాగులారా! నాకు మిక్కిలి వేదనగా ఉంది. నేను రసాతలానికి క్రుంగిపోకుండా, ఈ బరువును దించి వేయండి." అని భూదేవి ప్రార్థించింది.

**ఇత్యాకర్ణ్య ధరావాక్యమశేషం త్రిదశైస్తతః ।**
**భువో భారావతారార్థం బ్రహ్మా ప్రాహ ప్రచోదితః ॥ 28 ॥**

ఈ విధంగా (పలికిన) భూమి చెప్పిందంతా విని, దేవతలచే ప్రేరేపించబడి, భూభారంపోగొట్టడానికై బ్రహ్మ ఇలా పలికాడు.

**యథా ఒ ఒ హ వసుధా సర్వం సత్యమేవ దివౌకసః! ।**
**అహం భవో భవన్తశ్చ సర్వే నారాయణాత్మకాః ॥ 29 ॥**

"దేవతలారా! భూమి చెప్పినదంతా నిజమే. నేను, శంకరుడు, మీరు అందరూ నారాయణస్వరూపులమే.

**విభూతయశ్చ యాస్తస్య తాసామేవ పరస్పరమ్ ।**
**ఆధిక్యం న్యూనతా బాధ్యబాధకత్వేన వర్తతే ॥ 30 ॥**

ఆయన విభూతులలో పెద్ద, చిన్న, అవే పరస్పరం బాధించేవాడు, బాధింపబడే వాడుగా ప్రవర్తించడం జరుగుతోంది.

**తదాగచ్ఛత గచ్ఛామః క్షీరాబ్ధేస్తటముత్తరమ్ ।**
**తత్రారాధ్య హరిం తస్మై సర్వం విజ్ఞాపయామ వై ॥ 31 ॥**

అందువల్ల రండి. నడవండి. క్షీరసముద్రం ఉత్తరతీరం చేరుదాం పదండి. అక్కడనున్న భగవంతుడైన హరిని ఆరాధించి ఆయనకు సమస్తం నివేదనచేద్దాం. త్వరపడండి.

**సర్వథైవ జగత్యర్థే స సర్వాత్మా జగన్మయః ।**
**సత్త్వాంశేనావతీర్యోర్వ్యాం ధర్మస్య కురుతే స్థితిమ్ ॥ 32 ॥**

ఆయన సర్వస్వరూపుడు. జగన్మయుడు. ఈ విశ్వంకోసమై ఎల్లప్పుడూ అన్నివిధాలా ఆయన సత్త్వగుణాంశతో అవతరిస్తూ ఉంటాడు. భూమిలో ధర్మపాలనంచేస్తూ ఉంటాడు." అని పలికాడు.

**ఇత్యుక్త్వా ప్రయయౌ విప్ర! సహదేవైః పితామహః ।**
**సమాహితమతిశ్చైవం తుష్టావ గరుడధ్వజమ్ ॥ 33 ॥**

విప్రోత్తమా! ఈ విధంగా చెప్పి పితామహుడు దేవతలతో కలసి పాలకడలికి పయనమై వెళ్లాడు. అక్కడ సమాధిస్థితిని పొంది గరుడధ్వజుని ఇలా స్తుతించాడు.

**ద్వే విద్యే త్వమనామ్నాయపరా చైవాపరా తథా ।**
**త ఏవ భవతో రూపే మూర్తామూర్తాత్మికే ప్రభో! ॥ 34 ॥**

వేదాలకు గోచరంకాని ఓమహాప్రభో! పరా, అపరా అనే రెండు విద్యలు నీవే. మూర్తం, అమూర్తం అనే రెండు స్వరూపాలు నీరూపాలే.

వి॥ మూర్తం అనగా సాకారం అమూర్తం అనగా నిరాకారం.

**పరావిద్య అనగా బ్రహ్మవిద్య. అపరావిద్య అనగా దానికన్న వేరైన విద్య.**

**ద్వే బ్రహ్మణీ త్వణీయోఽతిస్థూలాత్మన్ సర్వ సర్వవిత్ ।**
**శబ్దబ్రహ్మ పరం చైవ బ్రహ్మ బ్రహ్మమయస్యయత్ ॥ 35 ॥**

ఓ అత్యంత సూక్ష్మస్వరూపా! బృహద్విరాటస్వరూపా! సర్వ! సర్వజ్ఞ! శబ్దబ్రహ్మం, పరబ్రహ్మం అనే రెండు విధాలైన బ్రహ్మలు నీ బ్రహ్మమయరూపమే.

**ఋగ్వేదస్త్వం యజుర్వేదస్సామవేదస్త్వథర్వణః ।**
**శిక్షా కల్పో నిరుక్తం చ ఛన్దో జ్యౌతిషమేవ చ ॥ 36 ॥**

**ఇతిహాసపురాణే చ తథా వ్యాకరణం ప్రభో! ।**
**మీమాంసా న్యాయశాస్త్రం చ ధర్మశాస్త్రాణ్యధోక్షజ! ॥ 37 ॥**

ఓప్రభూ! ఓ అధోక్షజా! ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం నీవే. శిక్ష, కల్పం, నిరుక్తం, ఛందస్సు, జ్యౌతిషం, ఇతిహాసం, పురాణం, వ్యాకరణం, మీమాంస, న్యాయశాస్త్రం, ధర్మశాస్త్రాలు నీ స్వరూపమే.

**ఆత్మాత్మదేహగుణవద్ విచారాచారి యద్వచః ।**
**తదప్యాదిపతే! నాన్యదధ్యాత్మాత్మస్వరూపవత్ ॥ 38 ॥**

ఓ ఆదిపతీ! జీవాత్మ, పరమాత్మ, స్థూలదేహం, సూక్ష్మదేహం, వాటికారణం అయిన అవ్యక్తం, వాటి విమర్శకు సంబంధించిన అంతరాత్మ, వాటిస్వరూపాన్ని బోధించే పరమాత్మజ్ఞానానికి సంబంధించిన వేదాంతవాక్యం వాస్తవంగా నీకన్న వేరుగావు.

**త్వమవ్యక్తమనిర్దేశ్యమచిన్త్యానామవర్ణవత్ ।**
**అపాణిపాదరూపం చ శుద్ధం నిత్యం పరాత్పరమ్ ॥ 39 ॥**

నీవే అవ్యక్తం అనిర్దేశ్యం, అచింత్యం, అనామరూపం, వర్ణరహితం పాణిపాదరహితరూపం పరమ శుద్ధం. నిత్యం, పరాత్పరం నీవే. (దేహేంద్రియాదులచే వ్యక్తంకానిది. దేనిచేతను నిర్దేశించశక్యంకానిది. ధ్యానం చేయడానికి వీలుకానట్టిది. పేరు, రూపం లేనట్టిది. రంగు లేనట్టిది. కాలు, చేయి మున్నగు కర్మేంద్రియాలు లేనట్టిది. మిక్కిలి శుద్ధమైనది. ఎల్లప్పుడూ ఉండేది. కనిపించే ప్రకృతికన్న పరమైనది).

**శృణోష్యకర్ణః పరిపశ్యసి త్వమచక్షురేకో బహురూపరూపః ॥**
**అపాదహస్తో జవనో గ్రహీతా త్వం వేత్సి సర్వం న చ సర్వవేద్యః ॥ 40 ॥**

వీనులు లేకపోయినా అన్నీ వినగలుగుతావు. కన్నులు లేకుండా అన్నీ చూడగలుగుతావు. రూపంలేకున్నా బహురూపుడవు. పాదాలులేకుండా వేగంగా సంచరిస్తావు. చేతులులేకుండా సర్వం అందుకొంటావు. నీవు అందరికి ఎరుకపడకున్నా, అంతా నీవు ఎరిగినవాడవే.

**అణోరణీయాంసమసత్స్వరూపం త్వాం పశ్యతోఽజ్ఞాననివృత్తిరగ్ర్యా ।**
**ధీరస్య ధీరస్య బిభర్తి నాన్యద్వరేణ్యరూపాత్పరతః పరాత్మన్! ॥ 41 ॥**

హే పరస్వరూపా! నీవు అణువుకన్న అణువైనట్టి వాడవు. దృశ్యరూపంలేని వాడవు. అట్టి నీస్వరూపదర్శనం చేసే వానికి అజ్ఞానం తొలగిపోయి పరమఫలం లభిస్తుంది. ఈ ప్రకృతిలో ధీరుడైనవాని బుద్ధి నీ శ్రేష్ఠతమమైన స్వరూపంకన్న వ్యతిరిక్తమైన దానిని గ్రహించదు.

**త్వం విశ్వనాభిర్భువనస్య గోప్తా సర్వాణి భూతాని తవాన్తరాణి ।**
**యద్భూతభవ్యం తదణోరణీయః పుమాంస్త్వమేకః ప్రకృతేః పరస్తాత్ ॥ 42 ॥**

ఈ విశ్వానికి నాభిస్థానం నీవు. త్రిభువనాలకు రక్షకుడవు. సమస్తభూతాలు నీలోనే ఉన్నాయి. పుట్టినది, పుట్టబోయేది, అణువుకన్న అణువై, ప్రకృతికన్న పరుడవైన ఏకైక పరమపురుషుడవు నీవే.

**ఏకశ్చతుర్ధా భగవాన్ హుతాశో వర్చోవిభూతిం జగతో దదాసి ।**
**త్వం విశ్వతశ్చక్షురనన్తమూర్తే! త్రేధా పదం సంనిదధే విధాతః ॥ 43 ॥**

భగవంతుడవైన నీవు ఒక్కడవే నాలుగు విధాలయిన (వైద్యుత జాఠర నిర్మథ్య బాడబాగ్నిరూపాలు) అగ్నివై జగత్తుకు వర్చస్సును, విభూతిని ఒసంగుతున్నావు. ఓ అనంతమూర్తీ! నీవు విశ్వతశ్చక్షువవు. (నలుదిక్కులా నీనేత్రాలు ప్రకాశింపజేస్తావు) ఓవిధాతా! (త్రివిక్రమరూపంలో మూడుపాదాలద్వారా) మూడులోకాలను నీపాదం ఉంచగలవు.

వి ॥ త్రేతాగ్నులు, ఔపాసనాగ్ని-అగ్ని నాలుగురూపాలు.

**యథాఽగ్నిరేకో బహుధా సమిధ్యతే వికారభేదైరవికారరూపః ।**
**తథా భవాన్ సర్వగతైకరూపో రూపాణ్యశేషాణ్యనుపుష్యతీశ! ॥ 44 ॥**

ఈశ్వరా! వికారరూపంలేని ఒకే అగ్ని అనేక ప్రకారాలుగా వికారభేదాలతో జ్వలిస్తూ ఉన్నట్లుగా సర్వవ్యాపివైన నీవు ఏకరూపుడవైనా అనంతరూపాలను ధరించి అనుపోషణం చేస్తున్నావు.

**ఏకస్త్వమగ్ర్యం పరమం పదం యత్ పశ్యన్తి త్వాం సూరయో జ్ఞానదృశ్యమ్ ।**
**త్వత్తో నాన్యత్ కించిదస్తి త్వయీహ యద్వా భూతం యచ్చ భవ్యం పరాత్మన్! ॥ 45 ॥**

సర్వశ్రేష్ఠమైన పరమపదం నీవు ఒక్కడవే అయి ఉన్నావు. జ్ఞానయోగులయిన వారు మాత్రమే జ్ఞానదృష్టిచే నిన్ను దర్శించ గలుగుతున్నారు. నీకన్న వ్యతిరిక్తమైనది ఏదీ కించిత్తు కూడాలేదు. ఓ పరస్వరూపా! ఈ జగత్తులో గతంలో ఉన్నది, భవిష్యంలో ఉండబోయేది, వర్తమానంలో ఉన్నది అంతా నీయందే ఉంది.

**వ్యక్తావ్యక్తస్వరూపస్త్వం సమష్టివ్యష్టిరూపవాన్ ।**
**సర్వజ్ఞః సర్వదృక్ సర్వశక్తిజ్ఞానబలర్ధిమాన్ ॥ 46 ॥**

నీవు వ్యక్తంగా వ్యష్టిరూపుడవై, అవ్యక్తంగా సమష్టిరూపుడవై ఉన్నావు. నీవు సర్వం తెలిసిన వాడవు. నీవు సర్వసాక్షివి. నీవు సమస్తశక్తిజ్ఞానబలైశ్వర్యసంపన్నుడవు.

**అన్యూనశ్చాప్యవృద్ధిశ్చ స్వాధీనోఽనాదిమాన్వశీ ।**
**క్షమతన్ద్రాభయక్రోధకామాదిభిరసంయుతః ॥ 47 ॥**

నీవు ఏ కొరత (కొదువ) లేని వాడవు. అలాగే పెరుగుదల అనేది లేనివాడవు. అంతా నీ అధీనంలో ఉంచుకొనే వాడవు. 'ఆది' లేని వాడవు కాన అనాదివి. ఇంద్రియనిగ్రహం కలవాడవు. వసివాడడం, అలసి పోవడం, భయపడడం, కోపపడడం, కోరికలతో ఉండడం మొదలయిన దోషాలతో కూడి యుండే వాడవు కావు.

**నిరవద్యః పరప్రీతో (పరఃప్రాప్తేః) నిరధిష్ఠోఽక్షరః క్రమః ।**
**సర్వేశ్వరః పరాధారో ధామ్నాం ధామాత్మకోఽక్షయః ॥ 48 ॥**

నీవు ఏ దోషంలేని నిర్మలుడవు. పరోపకారివి (అప్రాప్యుడవు). నిరాధారుడవు. నీవు అంతరాయంలేని గతి కలవాడవు. నీవు అన్నింటికి ఈశ్వరుడవు. పరమని వ్యవహరించబడే వాటికి ఆధారుడవు. సమస్తతేజస్సులకన్న తేజస్స్వరూపుడవు. నీవు అవినాశివి.

**సకలావరణాతీత! నిరాలమ్బనభావన! ।**
**మహావిభూతిసంస్థాన! నమస్తే పురుషోత్తమ! ॥ 49 ॥**

నీవు అన్ని ఆవరణములకన్న అతీతుడవు. ఏ ఆలంబనంలేని భావనయే నీ స్వరూపం. అన్ని మహా విభూతులకు ఆధారమైనవాడవు. ఓ పురుషోత్తమా! నీకు నమస్కారం.

**నాకారణాత్ కారణాద్ వా కారణాకారణాన్న చ ।**
**శరీరగ్రహణం వాఽపి ధర్మత్రాణాయ కేవలమ్ ॥ 50 ॥**

నీవు అకారణంగా, సకారణంగా, కారణాకారణాలమధ్యస్థితిగా శరీరధారణంచేసినా, చేయకపోయినా అది కేవలం ధర్మరక్షణం కొరకే."

**ఇత్యేవం సంస్తుతిం శ్రుత్వా మనసా భగవానజః ।**
**బ్రహ్మాణమాహ ప్రీతాత్మా విశ్వరూపధరో హరిః ॥ 51 ॥**

అని ఈ విధంగా చేసిన బ్రహ్మస్తవాన్ని మనస్సుతో విని భగవంతుడైన అజుడగు హరి తన విశ్వరూపధరుడైన హరి ప్రసన్నచిత్తుడై బ్రహ్మతో ఇలా అన్నాడు.

**భో భో బ్రహ్మంస్త్వయా మత్తః సహదేవైర్యదిష్యతే ।**
**తదుచ్యతామశేషం వః సిద్ధమేవావధార్యతామ్ ॥ 52 ॥**

"ఓ బ్రహ్మ! నీవు, దేవతలు కలిసి నావల్ల ఏం కోరుతున్నారో తెలియజేయండి. మీపని పూర్తయినట్లే భావించండి. మీ అభిలాషను వ్యక్తం చేయండి" అని జగన్నాథుడు వారికి వరమీయడం జరిగింది.

**తతో బ్రహ్మా హరేర్దివ్యం విశ్వరూపమవేక్ష్య తత్ ।**
**తుష్టావ భూయో దేవేషు సాధ్వసావనతాత్మసు ॥ 53 ॥**

అపుడు శ్రీహరి దివ్యమైన విశ్వరూపాన్ని బ్రహ్మ వీక్షించాడు. దేవతలందరు భయవినయాలతో వినమ్రులు కాగా, మళ్లీ విష్ణువును ఇలా స్తుతించాడు.

**నమో నమస్తేఽస్తు సహస్రమూర్తే! సహస్రబాహో! బహువక్త్రపాద! ।**
**నమో నమస్తే జగతః ప్రవృత్తివినాశసంస్థానకరాప్రమేయ! ॥ 54 ॥**

వేలకొలది ఆకారాలు కలవాడా! వేలకొలది బాహువులు కలవాడా! అనేకముఖచరణాలు కలవాడా! నీకు పదే పదే నమస్కారాలు. జగత్తుకు ఉత్పత్తి, స్థితి, వినాశాలు కలగజేసేవాడా! ఓ అప్రమేయా! నీకు పునః పునః ప్రణామాలు.

**సూక్ష్మాతిసూక్ష్మాతిబృహత్ప్రమాణ గరీయసామప్యతిగౌరవాత్మన్! ।**
**ప్రధానబుద్ధీన్ద్రియవత్ప్రధాన మూలాత్పరాత్మన్! భగవన్! ప్రసీద ॥ 55 ॥**

పరమస్వరూపా! భగవత్స్వరూపా! నీవు సూక్ష్మం కన్న మిక్కిలి సూక్ష్మమైన వాడవు. అతివిశాలప్రమాణం గలవాడవు. గొప్ప పదార్థాలు అన్నింటికన్న మిక్కిలి గొప్పవాడవు. ప్రకృతి, బుద్ధి, అహంకారం వీటికి మూలపురుషుడైన వాడవు. మాపట్ల అనుగ్రహం చూపించు.

**ఏషా మహీ దేవ! మహీప్రసూతైర్మహాసురైః పీడితశైలబన్ధా ।**
**పరాయణం త్వాం జగతాముపైతి భారావతారార్థమపారసార! ॥ 56 ॥**

దేవా! ఇదిగో ఈమె భూదేవి. భూమియందు ఉద్భవించిన మహారాక్షసులచే ఆమె శైలబంధాలు సడలిపోతున్నాయి. అపరిమితవీర్యంకల ఓదేవా! అందువల్ల జగత్తుభారం దింపడానికై జగత్పరాయణుడవైన నిన్ను శరణు పొంద వచ్చింది.

**ఏతే వయం వృత్రరిపుస్తథాఽయం నాసత్యదస్రౌ వరుణస్తథైవ ।**
**ఇమే చ రుద్రా వసవస్ససూర్యాః సమీరణాగ్నిప్రముఖాస్తథాఽన్యే ॥ 57 ॥**

ఓ సురనాథా! మేము, ఈ ఇంద్రుడు, అలాగే ఈ అశ్వినీ కుమారులు, వరుణుడు, అలాగే ఈ రుద్రులు, వసువులు, సూర్యుడు, వాయువు, అగ్ని మున్నగు వారు, అలాగే ఈ మిగిలిన దేవతాగణాలు (నిన్ను శరణు వేడుతున్నాం).

**సురాస్సమస్తాస్సురనాథ! కార్యమేభిర్మయా యచ్చ తదీశ సర్వమ్ ।**
**ఆజ్ఞాపయాజ్ఞాం పరిపాలయన్తస్తథైవ తిష్ఠామ సదాస్తదోషాః ॥ 58 ॥**

ఓ సురనాథా! సమస్తదేవతాబృందాలు-వీరితో కలసి మేము చేయవలసిందేదో సర్వం ఆనతి ఈయ వలసింది. ఓ ఈశ్వరా! మేము అందరం నీ ఆజ్ఞను పాలించడానికై వేచియున్నాము. మేము ఇలా సమస్తదోషాలను పోగొట్టుకొని నివసిస్తాము.

**ఏవం సంస్తూయమానస్తు భగవాన్ పరమేశ్వరః ।**
**ఉజ్జహారాత్మనః కేశౌ సితకృష్ణౌ మహామునే! ॥ 59 ॥**

మునీశ్వరుడవైన మైత్రేయా! ఈ ప్రకారంగా బ్రహ్మచే స్తుతించబడినవాడై, భగవంతుడగు పరమేశ్వరుడు తన తెల్లని, నల్లని కేశాలు రెండు ఊడబెరికాడు.

**ఉవాచ చ సురానేతౌ మత్కేశౌ వసుధాతలే ।**
**అవతీర్య భువోభారక్లేశహానిం కరిష్యతః ॥ 60 ॥**

"ఈ నా రెండు వెంట్రుకలే భూమండలంలో అవతరించి భూభారక్లేశాన్ని హరించి వేస్తాయి" అని దేవతలతో చెప్పాడు.

**సురాశ్చ సకలాః స్వాంశైరవతీర్య మహీతలే ।**
**కుర్వన్తు యుద్ధమున్మత్తైః పూర్వోత్పన్నైర్మహాసురైః ॥ 61 ॥**

"సమస్తదేవతలు తమ తమ అంశలతో భూతలంపై అవతరించి, ఇది వరకే పుట్టియున్న మదోన్మత్తులైన భయంకరరాక్షసులతో యుద్ధం చేయండి.

**తతః క్షయమశేషాస్తే దైతేయా ధరణీతలే ।**
**ప్రయాస్యన్తి న సన్దేహో మద్దృక్పాతవిచూర్ణితాః ॥ 62 ॥**

అందువల్ల మహీతలంలో ఆ సమస్తదైత్యులు నశిస్తారు. సందేహంలేదు. నాదృష్టి పడినంత మాత్రం చేతనే వారందరూ పొడి పొడి అయిపోయి మరణిస్తారు.

**వసుదేవస్య యా పత్నీ దేవకీ దేవతోపమా ।**
**తత్రాయమష్టమో గర్భో మత్కేశో భవితా సురాః ॥ 63 ॥**

దేవతలారా! వసుదేవుని పత్నియైన దేవతాస్వరూపిణి అయిన దేవకియందు ఈ నా (నల్లని) కేశం ఎనిమిదో శిశువుగా అవతరిస్తుంది (అవుతుంది).

**అవతీర్య చ తత్రాయం కంసం ఘాతయితా భువి ।**
**కాలనేమిం సముద్భూతమిత్యుక్త్వాఽన్తర్దధే హరిః ॥ 64 ॥**

ఆ కేశం అలా అవతారం ధరించి భూమిలో పుట్టియున్న కాలనేమిరూపుడైన కంసుని వధిస్తుంది" అని చెప్పి హరి అంతర్ధానం చెందాడు.

**అదృశ్యాయ తతస్తస్మై ప్రణిపత్య మహామునే! ।**
**మేరుపృష్ఠం సురా జగ్మురవతేరుశ్చ భూతలే ॥ 65 ॥**

మహామునీ! అంతట ఆ దేవతలు ఆ అదృశ్యరూపుడైన శ్రీహరికి నమస్కరించి మేరుపర్వతోపరిభాగానికి చేరుకొన్నారు. వారు భగవదాజ్ఞాప్రకారం భూమండలంలో ఆ తరువాత అవతరించారు.

**కంసాయ చాష్టమో గర్భో దేవక్యాం ధరణీధరః ।**
**భవిష్యతీత్యాచచక్షే భగవాన్ నారదో మునిః ॥ 66 ॥**

ఈ సమయంలో భగవంతుడైన నారదమహర్షి కంసుని వద్దకు వెళ్లి దేవకియందు పుట్టబోయే అష్టమగర్భం ధరణిని ఉద్ధరించగలదని తెలియజేశాడు.

**కంసోఽపి తదుపశ్రుత్య నారదాత్ కుపితస్తతః ।**
**దేవకీం వసుదేవం చ గృహే గుప్తావధారయత్ ॥ 67 ॥**

అంతట నారదునివల్ల ఆ సమాచారంవిన్న కంసుడు కూడ కోపోద్రిక్తుడై దేవకీవసుదేవులిద్దరిని గృహములో రహస్యంగా బంధించాడు.

**వసుదేవేన కంసాయ తేనైవోక్తం యథా పురా ।**
**తథైవ వసుదేవోఽపి పుత్రమర్పితవాన్ ద్విజ! ॥ 68 ॥**

ద్విజోత్తమా! వసుదేవుడు కూడా పూర్వం అన్నమాటకు కట్టుబద్ధవాడై, తాను పుట్టిన ప్రతిపుత్రుని కంసునికి అర్పించడం జరిగింది.

**హిరణ్యకశిపోః పుత్రాః షడ్గర్భా ఇతి విశ్రుతాః ।**
**విష్ణుప్రయుక్తా తాన్ నిద్రా క్రమాద్ గర్భే నియోజయత్ ॥ 69 ॥**

వారు ఆరుగురు పూర్వం హిరణ్యకశిపుని కుమారులని చెప్పగా విన్న విషయమే. విష్ణువుచే నియోగించ బడ్డ యోగనిద్ర వారారుగురిని దేవకీగర్భంలో క్రమంగా సంధానం చేసింది.

**యోగనిద్రా మహామాయా వైష్ణవీ మోహితం యయా ।**
**అవిద్యయా జగత్సర్వం తామాహ భగవాన్ హరిః ॥ 70 ॥**

ఏ అవిద్యారూపిణిద్వారా సమస్తమైన జగత్తు మోహింపచేయబడుతున్నదో ఆ యోగనిద్రారూపమైన మహామాయతో భగవానుడైన శ్రీహరి ఇలా అన్నాడు.

**నిద్రే! గచ్ఛ మమాదేశాత్ పాతాలతలసంశ్రయాన్ ।**
**ఏకైకత్వేన షడ్గర్భాన్ దేవకీజఠరం నయ ॥ 71 ॥**

"ఓ యోగనిద్రా! వెళ్లు. నా ఆజ్ఞ పాటించు. పాతాళలోకాన్ని ఆశ్రయించి ఉన్న (హిరణ్య కశిపుని కుమారులను) ఆరుగురిని ఒక్కొక్కరిగా క్రమంగా దేవకీ గర్భంలో చేర్చు.

**హతేషు తేషు కంసేన శేషాఖ్యోఽంశస్తతో మమ ।**
**అంశాంశేనోదరే తస్యాః సప్తమః సమ్భవిష్యతి ॥ 72 ॥**

వారు ఆరుగురు కంసునిచే హతులు కాగా, అనంతరం శేషుడనే నా అంశ, దేవకి గర్భంలో అంశాంశావతారంగా ఏడోవాడై ఆవిర్భవించగలడు.

**గోకులే వసుదేవస్య భార్యా ఽన్యా రోహిణీ స్థితా ।**
**తస్యాః స సమ్భూతి సమం దేవి! నేయస్త్వయోదరమ్ ॥ 73 ॥**

నందగోకులంలో వసుదేవుని వేరే భార్య రోహిణి అనే ఆమె ఉన్నది. ఓదేవీ! ఆమె ఉదరంలో ఆ సప్తమగర్భాన్ని ఆకర్షించి ప్రవేశపెట్టు. అందువల్ల రోహిణీ జఠరంలో ఉత్పన్నం కాబోయే గర్భం దేవకీగర్భసమం అవుతుంది.

**సప్తమో భోజరాజస్య భయాద్ రోధోపరోధతః ।**
**దేవక్యాః పతితో గర్భ ఇతి లోకో వదిష్యతి ॥ 74 ॥**

భోజరాజైన కంసుని భయంవల్లను, కారాగారంలో నిర్బంధించబడినందువల్లను దేవకీదేవి సప్తమ గర్భం నష్టమయిందని లోకం చెప్పుకొంటుంది.

**గర్భసంకర్షణాత్ సోఽథ లోకే సంకర్షణేతి వై ।**
**సంజ్ఞామవాప్స్యతే వీరః శ్వేతాద్రిశిఖరోపమః ॥ 75 ॥**

ఆ శిశువు గర్భంనుంచి సంకర్షించినందువల్ల (లాగబడినందువల్ల) లోకంలో సంకర్షణుడనే పేరుతో ప్రసిద్ధుడవుతాడు. అతడు కైలాసగిరిశిఖరంవంటివాడై మహావీరుడవుతాడు.

**తతోఽహం సమ్భవిష్యామి దేవకీ జఠరే శుభే।**
**గర్భే త్వయా యశోదాయా గన్తవ్యమవిలమ్బితమ్ ॥ 76 ॥**

అటుపైన నేను శుభస్థానమైన దేవకిజఠరంలో అవతరిస్తాను. ఆ సమయంలో నీవు కూడా ఏ అలస్యంచేయకుండా యశోదాగర్భంలో ప్రవేశించవలసింది.

**ప్రావృట్కాలే చ నభసి కృష్ణాష్టమ్యామహం నిశి ।**
**ఉత్పత్స్యామి నవమ్యాం చ ప్రసూతిం త్వమవాప్స్యసి ॥ 77 ॥**

వర్షఋతువులో శ్రావణమాసంలో కృష్ణపక్షంలో రాత్రిసమయంలో అష్టమినాడు నేను పుడతాను. నీవు నవమి నాడు ఉద్భవిస్తావు (పుట్టగలవు).

**యశోదాశయనే మాం తు దేవక్యాస్త్వామనిన్దితే! ।**
**మచ్ఛక్తిప్రేరితమతిర్వసుదేవో నయిష్యతి ॥ 78 ॥**

అనిందితురాలా! ఆ సమయంలో నాశక్తివల్ల ప్రేరేపించబడిన బుద్ధికలవాడై వసుదేవుడు యశోదప్రక్కను నన్ను, దేవకిప్రక్కను నిన్ను చేర్చగలడు.

**కంసశ్చ త్వాముపాదాయ దేవి! శైలశిలాతలే ।**
**ప్రక్షేప్స్యత్యన్తరిక్షే చ సంస్థానం త్వమవాప్స్యసి ॥ 79 ॥**

దేవీ! కంసుడు కూడా నిన్ను పట్టుకొని బండరాయిపైభాగంపై విసరివేస్తాడు. అపుడు నీవు అంతరిక్షంలో ప్రవేశించి నిలుస్తావు.

**తతస్త్వాం శతదృక్ శక్రః ప్రణమ్య మమ గౌరవాత్ ।**
**ప్రణిపాతానతశిరా భగినీత్వే గ్రహీష్యతి ॥ 80 ॥**

అపుడు ఇంద్రుడు వేయికన్నులు కలవాడు కాబట్టి నిన్ను గమనించి, నాపైనున్న గౌరవంతో నిన్ను నమస్కరించి, నీకు తలవంచి ప్రణమిల్లి తన చెల్లెలుగా స్వీకరిస్తాడు.

**(త్వం చ) తతః శుమ్భనిశుమ్భాదీన్ హత్వా దైత్యాన్ సహస్రశః ।**
**స్థానైరనేకైః పృథివీమశేషాం మణ్డయిష్యసి ॥ 81 ॥**

ఆ తరువాత నీవు కూడా శుంభుడు, నిశుంభుడు మున్నగు దైత్యులను వేలకొలది సంహరించి, (వింధ్యాచలం, జాలంధరం) మున్నగు అనేకస్థానాలలో, అనేకనామాలతో వెలసి పృథివినెల్ల అలంకరిస్తావు.

**త్వం భూతిః సన్నతిః కీర్తిః క్షాన్తిర్ద్యౌః పృథివీ ధృతిః ।**
**లజ్జా పుష్టిరుషా యా చ కాచిదన్యా త్వమేవ సా ॥ 82 ॥**

నీవే సంపదవు. సన్నతివి (గురుశుశ్రూష), కీర్తివి, క్షాంతివి, స్వర్గానివి, భూమివి, ధృతివి, లజ్జవు, పుష్టివి, ఉషవు ఇతరమైన దంతా నీవే అయియున్నావు.

**యే త్వామార్యేతి దుర్గేతి వేదగర్భాఽమ్బికేతి చ ।**
**భద్రేతి భద్రకాలీతి క్షేమ్యా క్షేమంకరీతి చ ॥ 83 ॥**

**ప్రాతశ్చైవాపరాహ్ణే చ స్తోష్యన్త్యానమ్రమూర్తయః ।**
**తేషాం హి ప్రార్థితం సర్వం మత్ప్రసాదాద్భవిష్యతి ॥ 84 ॥**

ఎవరైతే నిన్ను ఆర్య, దుర్గ, వేదగర్భ, అంబిక, భద్ర, భద్రకాలి, క్షేమ్య, క్షేమంకరి అనే మున్నగు నామాలతో ఉదయం, సాయంకాలం (అపరాహ్ణం) భక్తిపూర్వకంగా వినుతించి స్తోత్రం చేస్తారో, అటువంటి వారికి కోరిందంతా నా అనుగ్రహంవల్ల లభిస్తుంది.

**సురా మాంసోపహారైస్తు భక్ష్యభోజ్యైశ్చ పూజితా ।**
**నృణామశేషకామాంస్త్వం ప్రసన్నా సంప్రదాస్యసి ॥ 85 ॥**

సుర, మాంసం మున్నగు ఉపహారాలతో, భక్ష్యం, భోజ్యం మున్నగు ఆహారాలతో నిన్ను అర్చించిన నరులకు నీవు ప్రసన్నురాలవై సమస్తములైన కోరికలను ప్రసాదిస్తావు.

**తే సర్వే సర్వదా భద్రే! మత్ప్రసాదాదసంశయమ్ ।**
**అసన్దిగ్ధా భవిష్యన్తి గచ్ఛ దేవి! యథోదితమ్ ॥ 86 ॥**

ఓ కల్యాణీ! నీద్వారా (అన్ని కోరికలు) ఈయబడ్డ, వరాలన్నీ నా అనుగ్రహంవల్ల ఏ సందేహం లేకుండా సంపూర్ణంగా నెరవేరుతాయి. ఓ దేవీ! నేను చెప్పిన రీతిగా యథోచితస్థానానికి వెళ్ళు" అని విష్ణువు యోగమాయను ఆదేశించాడని పరాశరుడు మైత్రేయునికి తెలియజేశాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే దేవకీవసుదేవయోః వివాహ ఇతి ప్రథమోఽధ్యాయః సమాప్తః ॥ 1 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో దేవకీవసుదేవుల వివాహం అనే మొదటి అధ్యాయం సమాప్తం ॥ 1 ॥

## ద్వితీయోఽధ్యాయః - రెండవ అధ్యాయం
## దేవకృత దేవకీస్తుతిః - దేవతలు చేసిన దేవకీస్తుతి

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**యథోక్తం సా జగద్ధాత్రీ దేవదేవేన వై తదా ।**
**షడ్గర్భ గర్భవిన్యాసం చక్రే చాన్యస్య కర్షణమ్ ॥ 1 ॥**

పరాశరుడు ఇలా చెబుతున్నాడు– "మైత్రేయా! దేవదేవుడైన శ్రీవిష్ణుభగవానుడు చెప్పినట్టుగా ఆ జగద్ధాత్రియగు యోగమాయ ఆరుగర్భాలను దేవకీ గర్భంలో స్థాపించడం జరిగింది. అదేవిధంగా ఏడవగర్భాన్ని లాగివేయడం కూడ చేసింది.

**సప్తమే రోహిణీం ప్రాప్తే గర్భే గర్భం తతో హరిః।**
**లోకత్రయోపకారాయ దేవక్యాః ప్రవివేశ వై ॥ 2 ॥**

సప్తమగర్భాన్ని రోహిణీ జఠరంలో పునఃస్థాపించడం కూడ జరిగింది. అనంతరం భగవంతుడైన శ్రీహరి మూడులోకాలకు ఉపకారం చేయడంకొరకై స్వీయసంకల్పంచే దేవకీగర్భంలో ప్రవేశించాడు కూడ.

**యోగనిద్రా యశోదాయాస్తస్మిన్నేవ తథా దినే।**
**సమ్భూతా జఠరే తద్వద్ యథోక్తం పరమేష్ఠినా ॥ 3 ॥**

ఏ విధంగా పరమేశ్వరుడు చెప్పాడో అదే విధంగా యోగమాయ కూడా అదే రోజు అదే సమయంలో యశోదాదేవి జఠరంలో ప్రవేశించింది.

**తతో గ్రహగణః సమ్యక్ ప్రచచార దివి ద్విజ!।**
**విష్ణోరంశే భువం యాతే ఋతవశ్చాభవన్ శుభాః ॥ 4 ॥**

ద్విజప్రవరా! విష్ణువు అంశ భూమిపై రాగానే ఆకాశంలో గ్రహసమూహం తనస్థానంలో చక్కని గమనంతో సంచరించింది. భూమిపై ఋతువులు మంగళప్రదాలై శోభను చేకూర్చాయి.

**న సేహే దేవకీం ద్రష్టుం కశ్చిదప్యతితేజసా ।**
**జాజ్వల్యమానాం తాం దృష్ట్వా మనాంసి క్షోభమాయయుః ॥ 5 ॥**

అద్భుతతేజస్సుతో జాజ్వల్యమానంగా ప్రకాశించే ఆ దేవకీదేవిని ఏ ఒక్కడూ కూడ తేరిపారచూడలేక పోయాడు. ఆమెను చూడగానే మనస్సులు ఆందోళన పొందాయి.

**అదృష్టాః పురుషైః స్త్రీభిర్దేవకీం దేవతాగణాః ।**
**బిభ్రాణాం వపుషా విష్ణుం తుష్టువుస్తామహర్నిశమ్ ॥ 6 ॥**

స్త్రీలచేత, పురుషులచేత చూడబడకుండా, దేవతాగణాలు విష్ణువును తన ఉదరంలో ధరించిన ఆ దేవకీ దేవిని రాత్రిపవలు అనేది లేకుండా ఇలా స్తుతించారు.

**ప్రకృతిస్త్వం పరా సూక్ష్మా బ్రహ్మగర్భాఽభవత్ పురా।**
**తతో వాణీ జగద్ధాతుర్వేదగర్భాసి శోభనే! ॥ 7 ॥**

"కల్యాణీ! నీవు ముందు బ్రహ్మమందు ప్రతిబింబధారణవల్ల ఏర్పడిన సూక్ష్మమయిన పరాప్రకృతివి (మూలప్రకృతివి) అయియున్నావు. అటుపిమ్మట జగత్తుకు విధాతయగు బ్రహ్మకు వాణివై వేదగర్భవైతివి.

**సృజ్యస్వరూపగర్భాసి సృష్టిభూతా సనాతనే! ।**
**బీజభూతా తు సర్వస్య యజ్ఞభూతాఽభవత్త్రయీ ॥ 8 ॥**

సనాతనీ! సృష్టించబడే దృశ్యాత్మకజగత్తుకు ఉత్పన్నకారకురాలివై సృష్టిరూపవైతివి. సర్వమునకు బీజస్వరూపిణివైతివి. త్రయీరూపమైన యజ్ఞగర్భవైతివి.

**ఫలగర్భా త్వమేవేజ్యా వహ్నిగర్భా తథాఽరణిః ।**
**అదితిర్దేవగర్భా త్వం దైత్యగర్భా తథా దితిః ॥ 9 ॥**

నీవు యజించబడుదానవై ఫలగర్భవైతివి. అరణిరూపంలో నీవు వహ్నిగర్భవైయున్నావు. అదితి రూపంలో దేవగర్భవైతివి. అలాగే దితిరూపంలో దైత్యగర్భవైయున్నావు.

**జ్యోత్స్నా వాసరగర్భా త్వం జ్ఞానగర్భాసి సన్నతిః ।**
**నయగర్భా పరానీతి లజ్జా త్వం ప్రశ్రయోద్వహా ॥ 10 ॥**

వెన్నెలవై వాసరగర్భవైతివి. గురుశుశ్రూషవల్ల జ్ఞానగర్భవైయున్నావు. పరమమైన నీతిద్వారా నయగర్భవైతివి. వినయాన్ని వహించి లజ్జాగర్భవై యున్నావు.

**కామగర్భా తథేచ్ఛా త్వం తుష్టిః సన్తోషగర్భిణీ ।**
**మేధా చ బోధగర్భాసి ధైర్యగర్భోద్వహా ధృతిః ॥ 11 ॥**

ఇచ్ఛారూపిణివై కామగర్భవైయున్నావు. సంతుష్టిదాయివై సంతోషగర్భవైతివి. ప్రజ్ఞవై బోధగర్భవై యున్నావు. ధృతిని వహించి ధైర్యగర్భవైతివి.

**గ్రహర్క్షతారకాగర్భా ద్యౌరస్యాఖిలహైతుకీ ।**
**ఏతా విభూతయో దేవి తథాఽన్యాశ్చ సహస్రశః ॥ 12 ॥**

సమస్తానికి హేతువైన ద్యులోకంవల్ల గ్రహనక్షత్రతారకాగర్భవై యున్నావు. దేవీ! ఈ విధంగా వేలకొలదివిభూతులు మిగిలినవి ఎన్నో ఉన్నాయి.

**తథా సంఖ్యా జగద్ధాత్రి! సామ్ప్రతం జఠరే తవ ।**
**సముద్రాద్రి నదీద్వీప వనపత్తన భూషణా ॥ 13 ॥**
**గ్రామఖర్వటఖేటాఢ్యా సమస్తా పృథివీ శుభే!**
**సమస్తవహ్నయోఽమ్భాంసి సకలాశ్చ సమీరణాః ।**
**గ్రహర్క్ష తారకాచిత్రం విమానశతసంకులమ్ ॥ 14 ॥**
**అవకాశమశేషస్య యద్దదాతి నభఃస్థలమ్ ॥ 15 ॥**

ఓ జగద్ధాత్రీ! అలాగే అసంఖ్యాకములైన విభూతులన్నీ ఇప్పుడు నీ జఠరంలో ఉన్నాయి. ఓ కల్యాణీ! సముద్రాలు, పర్వతాలు, నదులు, ద్వీపాలు, వనాలు, నగరాలు – వీటితో అలంకరించబడ్డ గ్రామాలు, ఖర్వటాలు (పర్వత సమీపగ్రామాలు), ఖేటాలు (కృషకగ్రామాలు) – వీటితో సుసంపన్నమైన సమస్తపృథివి అన్ని అగ్నులు, అన్ని జలాలు, సకల వాయువులు, గ్రహాలు, నక్షత్రాలు, తారాసమూహాలు – వీటితో చిత్రితమైన, వందల విమానాలలో కూడుకొన్న, అన్నింటికి అవకాశాన్ని ఇచ్చే ఆకాశము.

**భూర్లోకశ్చ భువర్లోకః స్వర్లోకోఽథ మహర్జనః।**
**తపశ్చ బ్రహ్మలోకశ్చ బ్రహ్మాణ్డమఖిలం శుభే॥ 16 ॥**

మంగళ స్వరూపురాలా! భూలోకం, భువర్లోకం, స్వర్లోకం, మహర్లోకం, జనో(న)లోకం, తపోలోకం, బ్రహ్మ (సత్య) లోకం వరకు ఉన్న ఈ సంపూర్ణబ్రహ్మాండం

**తదన్తరే స్థితా దేవా దైత్యగన్ధర్వచారణాః ।**
**మహోరగాస్తథా యక్షా రాక్షసాః ప్రేతగుహ్యకాః ॥ 17 ॥**

**మనుష్యాః పశవశ్చాన్యే యే చ జీవా యశస్విని! ।**
**తైరన్తస్థైరనంతోఽసౌ సర్వగః సర్వభావనః ॥ 18 ॥**

ఆ బ్రహ్మాండంలో ఉన్న దేవతలు, దైత్యులు, గంధర్వులు, చారణులు, మహానాగులు, యక్షులు, రాక్షసులు, ప్రేతలు, గుహ్యకులు, మనుష్యులు, పశువులు – ఇంకా మిగిలిన జీవకోటి ఓ యశస్వినీ! ఇలా అందరిని తనలో ఉంచుకొన్న ఆ సర్వగామియైన, సర్వభావనుడగు అనంతుడు,

**రూపకర్మస్వరూపాణి న పరిచ్ఛేదగోచరే।**
**యస్యాఖిలప్రమాణాని స విష్ణుర్గర్భగస్తవ॥ 19 ॥**

ఎవని రూపకర్మస్వభావాలు, ఎవ్వని సమస్త ప్రమాణాలు కొలతలకంది దృగ్గోచరాలు కాకుండ ఉంటాయో, అట్టి విష్ణువు నీగర్భంలో ఉన్నాడు. నీవు ఇలా విష్ణుగర్భవు.

**త్వం స్వాహా త్వం స్వధా విద్యా సుధా త్వం జ్యోతిరమ్బరే।**
**త్వం సర్వలోకరక్షార్థమవతీర్ణా మహీతలే॥ 20 ॥**

నీవు స్వాహాదేవివి. స్వధా దేవివి. విద్యాస్వరూపిణివి. నీవు సుధామయివి. నీవు ఆ కాశంలో జ్యోతిస్సువు. నీవు సమస్తలోకాలను రక్షించడానికై భూమండలంలో అవతరించిన దానవు.

**ప్రసీద దేవి! సర్వస్య జగతః శం శుభే! కురు।**
**ప్రీత్యా త్వం ధారయేశానం ధృతం యేనాఖిలం జగత్॥ 21 ॥**

దేవీ! ప్రసన్నురాలవుకా. కల్యాణీ! సమస్త జగత్తుకు సుఖాన్ని ప్రసాదించు. ఈ సకల ప్రపంచాన్ని ధరిస్తున్న ఈశానుని నీవు ప్రీతితో గర్భంలో ధరించు." అని దేవతలు స్తోత్రం చేశారని పరాశరుడు చెప్పాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే ద్వితీయాంశే దేవకృత దేవకీస్తుతిరితి ద్వితీయోఽధ్యాయః సమాప్తః ॥ 2 ॥**

శ్రీవిష్ణుపురాణంలో ద్వితీయాంశంలో దేవతల దేవకీస్తుతి అనే రెండవ అధ్యాయం సమాప్తం ॥ 2 ॥

## తృతీయోఽధ్యాయః - మూడవ అధ్యాయం

### భగవతః ఆవిర్భావః- యోగమాయావంచనమ్ - భగవంతుని ఆవిర్భావం - యోగమాయ వంచన

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెబుతున్నాడు

**ఏవం సంస్తూయమానా సా దేవైర్దేవమధారయత్ ।**
**గర్భేణ పుణ్డరీకాక్షం జగతస్త్రాణకారణమ్ ॥ 1 ॥**

ఈ రీతిగా ఆ దేవకీదేవి దేవతలచే స్తుతించబడినదై, సర్వజగత్తుకు రక్షణకారకుడైనట్టి తామరరేకులవంటి కన్నులు కలవాడైన భగవంతుని తన గర్భంలో ధరించింది.

**తతోఽఖిలజగత్పద్మబోధాయాచ్యుతభానునా ।**
**దేవకీ పూర్వసన్ధ్యాయామావిర్భూతం మహాత్మనా ॥ 2 ॥**

అనంతరం సమస్తలోకాలు అనే పద్మాలను వికసింపజేయడానికై, దేవకి అనే పూర్వసంధ్యయందు మహాత్ముడైన విష్ణువు అనే సూర్యభగవానుడు ఉదయించాడు.

**తజ్జన్మదినమత్యర్థమాహ్లాద్యఖిలదిఙ్ముఖమ్ ।**
**బభూవ సర్వలోకస్య కౌముదీ శశినో యథా ॥ 3 ॥**

అతని పుట్టిన రోజు చంద్రుని వెన్నెల సకలలోకాలకు ఆనందకారకం అవుతున్నట్లుగా, సమస్తదిశాముఖాలకు మిక్కిలి ఆహ్లాద కారకం అయింది.

**సన్తః సన్తోషమధికం ప్రశమం చణ్డమారుతాః ।**
**ప్రసాదం నిమ్నగా యాతా జాయమానే జనార్దనే ॥ 4 ॥**

జనార్దనుడు ఆవిర్భవించగానే సత్పురుషులు ఎక్కువ సంతోషాన్ని పొందారు. ప్రచండవాయువులు శాంతించాయి. నదులు ప్రసన్నతను వహించాయి.

**సిన్ధవో నిజశబ్దేన వాద్యం చక్రుర్మనోహరమ్ ।**
**జగుర్గన్ధర్వపతయో ననృతుశ్చాప్సరోగణాః ॥ 5 ॥**

సముద్రాలు తమఘోష ధ్వనులచే మనోహర మంగళవాద్యాలను మేళవించాయి. గంధర్వప్రభువులు గానం చేశారు. అప్సరోగణాలు నృత్యాలు చేశాయి.

**ససృజుః పుష్పవర్షాణి దేవా భువ్యన్తరిక్షగాః ।**
**జజ్వలుశ్చాగ్నయశ్శాన్తా జాయమానే జనార్దనే ॥ 6 ॥**

జగన్నాథుడు అవతరించగా అంతరిక్షంలో ఉండే దేవతలు భువిపై పుష్పవర్షాలు కురిపించారు. శాంతించి యున్న యజ్ఞాగ్నులు ప్రజ్వలించాయి.

**అర్ధరాత్రేఽఖిలాధారే జాయమానే జనార్దనే ।**
**మన్దం జగర్జుర్జలదాః పుష్పవృష్టిముచో ద్విజ! ॥ 7 ॥**

ద్విజోత్తమా! అర్ధరాత్రి సమయంలో సర్వాధారుడైన భగవానుడైన జనార్దనుడు ఆవిర్భవిస్తూ ఉండగా, మేఘాలు మందమందంగా గర్జిస్తూ పుష్పవర్షం కురియించినట్లు వానకురిసాయి.

**ఫుల్లేన్దీవరపత్రాభం చతుర్బాహుముదీక్ష్య తమ్ ।**
**శ్రీవత్సవక్షసం జాతం తుష్టావానకదున్దుభిః ॥ 8 ॥**

వికసించిన నల్లతామరరేకువంటి నిగనిగలాడే మేనికాంతితో, నాలుగు చేతులతో, శ్రీవత్సం అనే చిహ్నంతో కూడిన వక్షఃస్థలంతో పుట్టిన ఆ భగవంతుని వీక్షించి ఆనకదుందుభి (వసుదేవుడు) స్తోత్రం చేశాడు.

**అభిష్టూయ చ తం వాగ్భిః ప్రసన్నాభిర్మహామతిః ।**
**విజ్ఞాపయామాస తదా కంసాద్భీతో ద్విజోత్తమ! ॥ 9 ॥**

ద్విజశ్రేష్ఠా! మహాజ్ఞానియైన వసుదేవుడు ప్రసాదగుణంనిండిన వచనాలతో ఆయనను స్తుతించి, కంసుని వల్ల భయంతో అప్పుడు ఇలా విన్న వించాడు.

**జ్ఞాతోఽసి దేవదేవేశ! శంఖచక్రగదాధర ।**
**దివ్యరూపమిదం దేవ ప్రసాదేనోపసంహర ॥ 10 ॥**

"ఓ దేవదేవేశ! ఇంతకాలానికి నీవు ఈ రీతిగా సాక్షాత్కరించావు. నేను నిన్ను తెలుసుకొన్నాను. దేవా! శంఖం, చక్రం, గద ధరించియున్నవాడా! ఈ దివ్యరూపాన్ని నాపై అనుగ్రహంతో ఉపసంహరించు.

**అద్యైవ దేవ! కంసోఽయం కురుతే మమ ఘాతనమ్।**
**అవతీర్ణ ఇతి జ్ఞాత్వా త్వమస్మిన్ మమ మన్దిరే॥ 11 ॥**

దేవా! నీవు ఈ నానివాసంలో అవతరించినట్లు తెలిస్తే చాలు, ఆ కంసుడు ఇప్పుడే నన్ను అంతం చేస్తాడు" అని కోరాడు.

**దేవక్యువాచ :–** దేవకి పలికింది.

**యోఽనన్తరూపోఽఖిలవిశ్వరూపో గర్భేఽపి లోకాన్ వపుషా బిభర్తి ।**
**ప్రసీదతామేష స దేవదేవః స్వమాయయావిష్కృత బాలరూపః ॥ 12 ॥**

అంత దేవకిగర్భంలో ఉన్నప్పటికి, అనంతరూపుడు, సమస్తవిశ్వస్వరూపుడుగా ఉండి తనశరీరంచే సమస్త లోకాలను భరిస్తూ ఉండువాడు, తనమాయచే బాలరూపాన్ని ధరించినవాడు, దేవదేవుడు మాపట్ల ప్రసన్నుడు అగుగాక.

**ఉపసంహర సర్వాత్మన్! రూపమేతచ్చతుర్భుజమ్ ।**
**జానాతు మావతారం తే కంసోఽయం దితిజన్మజః ॥ 13 ॥**

ఓ సర్వస్వరూపా! నీవు ఈ చతుర్భుజరూపాన్ని ఉపసంహరించు. రాక్షసాంశచే జన్మించిన ఆ కంసుడు నీవు ఇక్కడ అవతరించినట్లుగా తెలియకుండా ఉండాలి.” అని ప్రార్థించింది.

**భగవానువాచ :–** భగవానుడు పలికాడు.

**(స్తు) తతోఽహం యత్ త్వయా పూర్వం పుత్రార్థిన్యా తదద్య తే ।**
**సఫలం దేవి! సంజాతం జాతోఽహం యత్ తవోదరాత్ ॥ 14 ॥**

అపుడు భగవంతుడు “మునుపు నేనే కుమారుడు కావాలని కోరి నీవు నన్ను స్తుతించావు. అది ఇప్పుడు ఫలించింది. దేవీ! నీకడుపున నేను ఈ రీతిగా పుట్టడం జరిగింది” అని ఎరుకపరచాడు.

**ఇత్యుక్త్వా భగవాంస్తూష్ణీం బభూవ మునిసత్తమ! ।**
**వసుదేవోఽపి తం రాత్రావాదాయ ప్రయయౌ బహిః ॥ 15 ॥**

మునిశ్రేష్ఠుడవైన మైత్రేయా! ఇట్లా పలికి భగవంతుడు మౌనంతో ఊరకుండి పోయాడు. వసుదేవుడు కూడా రాత్రిసమయంలో ఆ బాలుని ఎత్తుకొని కారాగారంనుండి బయటకు వచ్చాడని పరాశరుడు చెబుతున్నాడు.

**మోహితాశ్చాభవంస్తత్ర రక్షిణో యోగనిద్రయా।**
**మథురాద్వారపాలాశ్చ వ్రజత్యానకదున్దుభౌ॥ 16 ॥**

కారాగారరక్షకులు ఆ సమయంలో యోగనిద్రవల్ల మోహం పొందారు. మథురానగరద్వార పాలురందరూ కూడా మాయామోహపరవశులయ్యారు. ఆనకదుందుభి బయటకు రావడంతో సర్వం మాయామయమైపోయింది.

**వర్షతాం జలదానాం చ తోయమత్యుల్బణం నిశి ।**
**సంఛాద్యానుయయౌ శేషః ఫణేనానకదున్దుభిమ్ ॥ 17 ॥**

ఆ నడిరేయి మేఘాలు పెనువాన కురిశాయి. అపుడు భగవంతుడైన శేషుడు తన పడగ విప్పి ఆనకదుందుభిని కప్పివేసి వెనువెంట నడిచాడు.

**యమునాం చాతిగమ్భీరాం నానావర్తసమాకులామ్ ।**
**వసుదేవో వహన్ విష్ణుం జానుమాత్రవహాం యయౌ ॥ 18 ॥**

మిక్కిలి లోతుగా ఉండి, పెద్దపెద్ద సుడులతో, నురుగులతో ఉరకలుపెట్టే యమునానదిని విష్ణువునెత్తికొని వసుదేవుడు దాటుతూ ఉండగా, అది మోకాలిలోతై ఉండడం జరిగింది.

**కంసస్య కరమాదాయ తత్రైవాభ్యాగతాంస్తటే ।**
**నన్దాదీన్ గోపవృద్ధాంశ్చ యమునాయా దదర్శ సః ॥ 19 ॥**

ఆ సమయంలో ఆ యమునానదీతటంలో కంసునికి పన్నులు కట్టడానికై వచ్చి విడిదిచేసిన నందుడు మున్నగు వారిని, గోపవృద్ధులను వసుదేవుడు చూశాడు.

**తస్మిన్ కాలే యశోదాఽపి మోహితా యోగనిద్రయా ।**
**తామేవ కన్యాం మైత్రేయ! ప్రసూతా మోహితే జనే ॥ 20 ॥**

అదే సమయంలో యశోద యోగనిద్రచే మైమరచి నిద్రపోతూ ఉండగా, పరిజనం అంతా ఒడలెరుగక పడుకొని ఉండగా, మైత్రేయా! ఆ యోగమాయనే కుమార్తెగా ప్రసవించింది.

**వసుదేవోఽపి విన్యస్య బాలమాదాయ దారికామ్ ।**
**యశోదాశయనాత్తూర్ణమాజగామామితద్యుతిః ॥ 21 ॥**

అత్యధికమైన కాంతితో భాసిల్లే వసుదేవుడు ఆ బాలుని యశోదప్రక్కలోనుంచి, ఆమె ప్రక్కపైనున్న బాలికను ఎత్తుకొని యశోదా మందిరంలోనున్న శయనప్రదేశంనుంచి తిరిగి వడివడిగా వచ్చేశాడు.

**దదృశే చ ప్రబుద్ధా సా యశోదా జాతమాత్మజమ్ ।**
**నీలోత్పలదలశ్యామం తతోఽత్యర్థం ముదం యయౌ ॥ 22 ॥**

ఆ తరువాత ఆ యశోద మేల్కొని, నల్లకలువరేకులలాంటి (సమానమైన) నిగనిగలాడే మేనికాంతితో విరాజిల్లే, పుట్టిన కొడుకును చూచి మిక్కిలి మురిసి పోయింది.

**ఆదాయ వసుదేవోఽపి దారికాం నిజమన్దిరమ్ ।**
**దేవకీశయనే న్యస్య యథాపూర్వమతిష్ఠత ॥ 23 ॥**

వసుదేవుడు కూడా ఆ బాలికను తీసుకొని తన నివాసానికేతెంచి దేవకిప్రక్కలో ఆమెనుంచి, తాను పూర్వం ఉన్నట్లుగా ఉండిపోయాడు.

**తతో బాలధ్వనిం శ్రుత్వా రక్షిణః సహసోత్థితాః ।**
**కంసాయావేదమాయాసుర్దేవకీప్రసవం ద్విజ! ॥ 24 ॥**

ద్విజోత్తమా! అనంతరం శిశువు ఏడుపు విని కారాగార రక్షకులు తొట్రుపడి లేచారు. వేగంగా వెళ్లి దేవకి ప్రసవించిందని కంసునకు నివేదించారు.

**కంసస్తూర్ణముపేత్యైనాం తతో జగ్రాహ బాలికామ్ ।**
**ముంచ ముంచేతి దేవక్యా సన్నకణ్ఠ్యా నివారితః ॥ 25 ॥**

**చిక్షేప చ శిలాపృష్ఠే సా క్షిప్తా వియతి స్థితమ్ ।**
**అవాప రూపం చ మహత్ సాయుధాష్టమహాభుజమ్ । 26 ॥**

కంసుడు వెంటనే వచ్చి ఆ బాలికను పట్టుకొన్నాడు. దేవకి "విడిచిపెట్టు విడిచిపెట్టు" అని ఏడుస్తూ అరుస్తూ నివారిస్తూ ఉన్నా, ఒక బండరాతిపై ఆమెను విసరి కొట్టాడు. ఆ బాలిక నింగి కెగిరి ఆయుధాలతో కూడిన ఎనిమిది చేతులతో ఒక మహారూపాన్ని పొందింది.

**ప్రజహాస తథైవోచ్చైః కంసం చ రుషితాఽబ్రవీత్ ।**
**కిం మయా క్షిప్తయా మూఢ! జాతో యస్త్వాం వధిష్యతి ॥ 27 ॥**

**సర్వస్వభూతో దేవానామాసీన్మృత్యుః పురా స తే ।**
**తదేతత్ సమ్ప్రధార్యాశు క్రియతాం హితమాత్మనః ॥ 28 ॥**

ఆమె బిగ్గరగా నవ్వుతూ, కోపోద్రిక్తురాలై కంసునితో "ఓరీ మూఢా! నన్ను విసరివేసినంతమాత్రంచే ఏమవుతుంది? నిన్ను చంపేటటువంటి, దేవతల సర్వభాగ్యాధిదేవతయైనటువంటివాడు పుట్టియే యున్నాడు. అతడు పూర్వజన్మలో నీకు మృత్యువు. ఈ సంగతిని బుద్ధిలో ధారణచేసి, నీకు మేలు చేకూర్చే పని వెంటనే ఆచరించు." అని పలికింది.

**ఇత్యుక్త్వా ప్రయయౌ దేవీ దివ్యస్రగ్గన్ధభూషణా ।**
**పశ్యతో భోజరాజస్య స్తుతా సిద్ధైర్విహాయసా ॥ 29 ॥**

అని చెప్పి దివ్యాలైన పుష్పమాలికలు, గంధాలు, భూషణాలు ధరించిన ఆ దేవి భోజరాజైన కంసుడు చూస్తూ ఉండగానే, సిద్ధులు స్తుతిస్తూ ఉండగా గగనమార్గంలోకి ఎగిరిపోయింది అని పరాశరుడు చెప్పాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే భగవతః ఆవిర్భావః – యోగమాయావంచనం చేతి తృతీయోఽధ్యాయః**
dŸÖ| Ÿö3 ॥

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో భగవంతుని ఆవిర్భావం – యోగమాయవంచన అనే మూడవ అధ్యాయం సమాప్తం ॥ 3 ॥



## **చతుర్థోఽధ్యాయః** - నాల్గవ అధ్యాయం
## **కంస దురాలోచనమ్** - కంసదురాలోచన

**కంసస్తతోద్విగ్నమనాః ప్రాహ సర్వాన్ మహాసురాన్ ।**
**ప్రలమ్బ కేశిప్రముఖా నాహూయాసురపుంగవాన్ ॥ 1 ॥**

పరాశరుడు ఇలా చెబుతున్నాడు. ఆ తరువాత కంసుడు మనస్సు ఉద్వేగం చెందగా ప్రలంబుడు, కేశి మున్నగు అసురశ్రేష్ఠులను, సమస్తమహాసురశ్రేష్ఠులను రావించి వారితో ఇలా అన్నాడు.

**హే ప్రలమ్బ! మహాబాహో! కేశిన్! ధేనుక! పూతనే! ।**
**అరిష్టాద్యా స్తథైవాన్యే శ్రూయతాం వచనం మమ ॥ 2 ॥**

"మహా బాహుడవైన ప్రలంబా! కేశీ! ధేనుకా! పూతనా! అరిష్టాదులారా! అదేవిధంగా మిగిలిన వారందరు నామాటను ఆలకించండి.

**మాం హన్తుమమరైర్యత్నః కృతః కిల దురాత్మభిః ।**
**మద్వీర్యతాపితాన్ వీరో నత్వేతాన్ గణయామ్యహమ్ ॥ 3 ॥**

దురాత్ములైన దేవతలు నన్ను చంపే ప్రయత్నంలో ఉన్నారు కదా! నేను వీరాధివీరుడను. నావీర్య ప్రతాపంతో వాళ్లను అట్టుడికించేటట్లు చేశాను. కాబట్టి వాళ్లను నేను ఏమాత్రం లెక్కచేయడం లేదు.

**కిమిన్ద్రేణాల్పవీర్యేణ కిం హరేణైకచారిణా ।**
**హరిణా వాఽపి కిం సాధ్యం ఛిద్రేష్వసురఘాతినా ॥ 4 ॥**

అల్పబలుడైన ఇంద్రుని వల్ల ఏమవుతుంది? ఏకాకిగా చరించే తపస్వి అయిన ఈశ్వరుని వల్ల ఏమవుతుంది? దొంగదారులలో అసురులకు విఘాతం కలిగించే విష్ణువుకు మాత్రం నన్ను వధించడం ఎలా సాధ్యమవుతుంది?

**కిమాదిత్యైః కిం వసుభిరల్పవీర్యైః కిమగ్నిభిః ।**
**కిం చాన్యైరమరైః సర్వై ర్మద్బాహుబలనిర్జితైః ॥ 5 ॥**

ఇక ఆదిత్యుల వల్ల ఏమవుతుంది? వసువుల వల్ల ఏం హాని కలుగుతుంది? అల్పతేజస్సు కల్గిన అగ్నులు మాత్రం నన్నేమి చేస్తాయి? నాబాహుబలంచే ఓడించబడ్డ మిగిలిన సర్వదేవతలవల్ల నాకు కలిగే కీడు ఏం ఉంటుంది?

**కిం న దృష్టోఽమరపతిర్మయా సంయుగమేత్య సః ।**
**పృష్ఠేనైవ వహన్ బాణా నపాగచ్ఛన్న వక్షసా ॥ 6 ॥**

అమరేంద్రుడు నాతో యుద్ధానికి వచ్చినపుడు, నేను విసరిన బాణాలు ఆతని వక్షఃస్థలంపై కాకుండా వెనక్కితిరిగి పారిపోతూ ఉంటే పృష్ఠభాగంపై నాటుకోవడం మీరు చూడలేదా?

**మద్రాష్ట్రే వారితా వృష్టిర్యదా శక్రేణ కిం తదా ।**
**మద్బాణభిన్నైర్జలదై ర్నాపో ముక్తా యథేప్సితాః ॥ 7 ॥**

నారాష్ట్రంలో చినుకు పడకుండా ఇంద్రుడు ఆపి వేసిన సమయంలో, నాబాణాల వల్ల మేఘాలు విడివడిపోయి యథేచ్ఛగా కుంభవృష్టి కురియించలేదా?

**కిముర్వ్యామవనీపాలా మద్బాహుబలభీరవః ।**
**న సర్వే సన్నతిం యాతా జరాసన్ధమృతే గురుమ్ ॥ 8 ॥**

నాబాహుబలానికి పిరికిపందలై నాగురువుగారైన (మామగారైన) ఒక్క జరాసంధుడు తప్ప, ఈ ఉర్విలోని అవనీ పాలురందరూ నాపాదాలవద్ద తలలు వంచలేదా?

**అమరేషు చ మేఽవజ్ఞా జాయతే దైత్యపుంగవాః! ।**
**హాస్యం మే జాయతే వీరాస్తేషు యత్నపరేష్వపి ॥ 9 ॥**

దైత్య శ్రేష్ఠరాలా! దేవతలపై నాకు తిరస్కార భావం ఏర్పడింది. ఓ వీరాధివీరులారా! అయినా వారు ఇంకా ఏవేవో ప్రయత్నాలు చేస్తూ ఉంటే నాకు నవ్వుపుట్టుకొని వస్తోంది.

**తథాఽపి ఖలు దుష్టానాం తేషామభ్యధికం మయా ।**
**అపకారాయ దైత్యేన్ద్రా! యతనీయం దురాత్మనామ్ ॥ 10 ॥**

అయినప్పటికి ఓ దైత్యేంద్రులారా! దురాత్ములకు అపకారం మిక్కిలిగా చేసి తీరవలసిందే. నేను అవశ్యం అందుకు పూనుకోవలసిందే.

**తద్ యే యశస్వినః కేచిత్ పృథివ్యాం యే చ యజ్వినః ।**
**కార్యో దేవాపకారాయ తేషాం సర్వాత్మనా వధః ॥ 11 ॥**

అందువల్ల ఎవరు భూమిపై పేరు గడించిన వారు ఉన్నారో, యజ్ఞాలు చేసేవారు ఉన్నారో, వాళ్ల నందరిని దేవతలకు అపకారం చేయడానికై వెదకివెదకి సర్వవిధాలా వధించవలసిందే.

**ఉత్పన్నశ్చాపి మృత్యుర్మే భూతపూర్వః స వై కిల ।**
**ఇత్యేతత్ బాలికా ప్రాహ దేవకీగర్భసమ్భవా ॥ 12 ॥**

లోగడ నాపాలిట మృత్యువైనవాడు ఇప్పుడు మళ్లీ పుట్టి ఉన్నాడట! అని ఈ మాట దేవకీ గర్భంలో జన్మించిన పసిపిల్ల చెప్పింది.

**తస్మాద్ బాలేషు పరమో యత్నః కార్యో మహీతలే ।**
**యత్రోద్రిక్తం బలం బాలే స హన్తవ్యః ప్రయత్నతః ॥ 13 ॥**

కాబట్టి పృథ్వీమండలంలో పుట్టియున్న బాలురు అందరిపై విశేషదృష్టి ఉంచాలి. ఏ బాలుడు బలోద్రిక్తుడై కనబడుతున్నాడో, వానిని ఏదో విధంగా మట్టుపెట్టే గట్టి ప్రయత్నం చేయాలి."

**ఇత్యాజ్ఞాప్యాసురాన్ కంసః ప్రవిశ్యాత్మగృహం తతః ।**
**ముమోచ వసుదేవం చ దేవకీం చ నిరోధతః ॥ 14 ॥**

అని ఈ విధంగా అసురులకు ఆజ్ఞాపించి, అనంతరం కంసుడు తన మందిరంలో ప్రవేశించి, కారాగారబంధనంనుంచి వసుదేవుని, దేవకీదేవిని విడిపించాడు.

**కంస ఉవాచ :–** కంసుడు పలికాడు.

**యువయోర్ఘాతితా గర్భా వృథైవైతే మయాఽధునా ।**
**కోఽప్యన్య ఏవ నాశాయ బాలో మమ సముద్గతః ॥ 15 ॥**

**తదలం పరితాపేన నూనం తద్భావినో హితే ।**
**అర్భకా యువయోర్దోషాచ్చాయుషో యద్వియోజితాః ॥ 16 ॥**

అపుడు కంసుడు వారితో "నేను మీశిశువులను అకారణంగా చంపి వేశాను. ఇప్పుడు ఎవడో ఒకడు బాలుడు నావినాశానికై పుట్టియే ఉన్నాడట! మీరింక పరితపించడం చాలించండి. మీకు ముందు కాలంలో తోడుగా ఉండవలసిన ఆ అర్భకులు, మీప్రారబ్ధకర్మదోషం వల్ల అల్పాయుష్కులై పోయారు." అని వారిని ఓదార్చాడు.

**ఇత్యాశ్వాస్య విముక్త్వా చ కంసస్తౌ పరిశంకితః ।**
**అన్తర్గృహం ద్విజశ్రేష్ఠ! ప్రవివేశ పునః స్వకమ్ ॥ 17 ॥**

ద్విజశ్రేష్ఠుడవైన మైత్రేయా! కంసుడు ఈ విధంగా వారితో సాంత్వన వాక్యాలు పలికి, అప్పటికీ మదిలో శంక విడిచిపెట్టకుండా ఆ దంపతులను వదలిపెట్టి, తన అభ్యంతర గృహంలోనికి ప్రవేశించాడు– అని మైత్రేయునకు పరాశరుడు చెప్పాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే కంసదురాలోచనం నామ చతుర్థోఽధ్యాయః సమాప్తః ॥ 4 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో కంసదురాలోచన అనే నాల్గవ అధ్యాయం సమాప్తం ॥ 4 ॥



## పంచమోఽధ్యాయః - ఐదవ అధ్యాయం

## పూతనావధః – పూతనావధ

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు పలికాడు.

**విముక్తో వసుదేవోఽపి నన్దస్య శకటం గతః ।**
**ప్రహృష్టం దృష్టవాన్ నన్దం పుత్రో జాతో మమేతి వై ॥ 1 ॥**

బంధవిముక్తుడై నందుని బండి వద్దకుచేరి, తనకు పుత్రుడు పుట్టాడని మిక్కిలి ఆనందిస్తున్న నందుని చూశాడు.

**వసుదేవోఽపి తం ప్రాహ దిష్ట్యా దిష్ట్యేతి సాదరమ్ ।**
**వార్ధకేఽపి సముత్పన్న స్తనయోఽయం తవాధునా ॥ 2 ॥**

అపుడు వసుదేవుడు ఆదరపూర్వకంగా అతనితో "ఎంత అదృష్టం! ఎంత మహాభాగ్యం! ఇంత ముసలితనంలో ముదిమి చిక్కిన నీకు ఇప్పుడు కొడుకు పుట్టడం జరిగింది.

**దత్తో హి వార్షికః సర్వో భవద్భిర్నృపతేః కరః ।**
**యదర్థమాగతాస్తస్మా న్నావస్థేయం మహాధనైః ॥ 3 ॥**

రాజుకు చెల్లించవలసిన, ఏటేట కట్టే పన్ను అంతా నీవు ఇచ్చేశావు కదా! మీరు ఇక్కడకు వచ్చిన పని అయినట్లే కదా! ఎక్కువ ధనరాశులతో మీరు ఇక్కడ ఉండడం మంచిది కాదు.

**యదర్థమాగతాః కార్యం తన్నిష్పన్నం కిమాస్యతే ।**
**భవద్భిర్గమ్యతాం నన్ద! తచ్ఛీఘ్రం నిజగోకులమ్ ॥ 4 ॥**

నందా! మీరు ఏపని గురించి వచ్చారో, ఆ కార్యం పూర్తి అయిపోయినప్పుడు ఇక్కడ ఉండే పని ఏముంది? అందువల్ల శీఘ్రంగా గోకులానికి మీరు పయనం కండి.

**మమాపి బాలకస్తత్ర రోహిణీప్రసవో హి యః ।**
**స రక్షణీయో భవతా యథాఽయం తనయో నిజః ॥ 5 ॥**

రోహిణీ గర్భంలో ఉద్భవించిన నాకొడుకు అక్కడ ఉన్నాడు. అతనిని నీ కొడుకును కాపాడినట్లుగా నీవు కాపాడవలసింది" అని చెప్పాడు.

**ఇత్యుక్తాః ప్రయయుర్గోపాః నన్దగోపపురోగమాః ।**
**శకటారోపితైర్భాణ్డైః కరం దత్వా మహాబలాః ॥ 6 ॥**

అని వసుదేవుడు చెప్పగా పన్ను చెల్లించి, మహాబలులైన గోపాలకులందరు నందుని ముందుంచుకొని, తమతమ భాండాదులనన్నింటిని బండ్లపైకెక్కించి అక్కడనుండి తరలిపోయారు.

**వసతాం గోకులే తేషాం పూతనా బాలఘాతినీ ।**
**సుప్తం కృష్ణముపాదాయ రాత్రౌ తస్మై దదౌ స్తనమ్ ॥ 7 ॥**

వాళ్లు గోకులంలో ఆనందంతో ఉండగా, పిల్లల్ని చంపేస్వభావం కల్గిన పూతన ఒకనాడు రాత్రిసమయంలో అక్కడకు వెళ్లి నిద్రిస్తున్న బాలకృష్ణుని తన ఒడిలోనికెత్తుకొని పాలిచ్చింది.

**యస్మై యస్మై స్తనం రాత్రౌ పూతనా సమ్ప్రయచ్ఛతి ।**
**తస్య తస్య క్షణే నాంగం బాలకస్యోపహన్యతే ॥ 8 ॥**

ఆ పూతన రాత్రికాలంలో ఎవరెవరికయితే స్తన్యం ఇస్తూ ఉంటుందో, ఆ యా బాలుని శరీరం క్షణకాలంలో మృతప్రాయమై పడిపోతూ ఉంటుంది.

**కృష్ణస్తు తత్స్తనం గాఢం కరాభ్యామవపీడితమ్ ।**
**గృహీత్వా ప్రాణసహితం పపౌ కోపసమన్వితః ॥ 9 ॥**

కాని కృష్ణుడు మాత్రం దాని రొమ్మును రెండు చేతులతో పీడించి గట్టిగా పట్టుకొని, కోపంతో కూడుకొన్నవాడై పాలతో బాటు దాని ప్రాణాలను కూడ త్రాగివేశాడు.

**సా విముక్త మహారావా విచ్ఛిన్న స్నాయుబన్ధనా ।**
**పపాత పూతనా భూమౌ మ్రియమాణాఽతిభీషణా ॥ 10 ॥**

ఆ రక్కసి పూతన మిక్కిలిగా హాహారావాలు చేస్తూ, ప్రేగుల బంధాలన్నీ సడలి పోగా, ప్రాణవాయువులు విడుస్తూ, మహాభయంకరరూపంతో నేలపై పడిపోయింది.

**తన్నాద శ్రుతిసన్త్రాసాత్ ప్రబుద్ధాస్తే వ్రజౌకసః ।**
**దదృశుః పూతనోత్సంగే కృష్ణం తాం చ నిపాతితామ్ ॥ 11 ॥**

దాని అరపు విని మిక్కిలి భీతిచెందిన వారై, ఆ వ్రేపల్లెలో నివసించే వారందరు చటుక్కున లేచి, పూతన ఒడిలోనున్న కృష్ణుని, అక్కడ పడియున్న రక్కసిని చూశారు.

**ఆదాయ కృష్ణం సన్త్రస్తా యశోదాఽపి ద్విజోత్తమ!।**
**గోపుచ్ఛం భ్రామ్య హస్తేన బాలదోషమపాకరోత్ ॥ 12 ॥**

ద్విజశ్రేష్ఠా! యశోదాదేవి కూడ మిక్కిలి జడిసిపోయి, గబగబా కృష్ణునెత్తుకొని, చేతితో ఆవుతోకను పట్టుకొని, అతని తలచుట్టూ దిగతుడిచి బాలదోషనివారణం కావించింది.

**గోః కరీష (పురీష) ముపాదాయ నన్దగోపోఽపి మస్తకే ।**
**కృష్ణస్య ప్రదదౌ రక్షాం కుర్వంశ్చైతదుదీరయన్ ॥ 13 ॥**

నందగోపుడు కూడ అవుపేడను తీసుకొని వచ్చి, కృష్ణుని నడినెత్తిపైనుంచి ఈ క్రింది మంత్రాలు జపిస్తూ రక్షపెట్టాడు.

**రక్షతు త్వామశేషాణాం భూతానాం ప్రభవో హరిః ।**
**యస్య నాభి సముద్భూత పంకజాదభవజ్జగత్ ॥ 14 ॥**

నాభినుంచి పద్మం వెలుపలికి వచ్చి సంపూర్ణ జగత్తుల సృష్టికి కారణమయిన, సమస్త ప్రాణికోటి పుట్టుకకు ఆది స్థానమయిన, శ్రీహరి నిన్ను ఎల్లప్పుడూ రక్షించాలి.

**యేన దంష్ట్రాగ్ర విధృతా ధారయత్యవనీ జగత్ ।**
**వరాహరూపధృగ్దేవః స త్వాం రక్షతు కేశవః ॥ 15 ॥**

కోరపైభాగంచే ఎత్తబడి, ఈ సమస్త భూమండలం అంతా ధరించబడినదైన ఆ వరాహరూపాన్ని దాల్చిన దేవదేవుడైన కేశవుడు నిన్ను సతతం కాపాడుతూ ఉండాలి.

**నఖాంకుర వినిర్భిన్న వైరి వక్షఃస్థలో విభుః ।**
**నృసింహరూపీ సర్వత్ర స త్వాం రక్షతు కేశవః ॥ 16 ॥**

తనగోటి కొనలచేతనే శత్రువు వక్షః స్థలాన్ని చీల్చివేసిన సర్వవ్యాపియైన నృసింహస్వరూపుడగు కేశవుడు ఎల్లవేళలా నిన్ను సంరక్షించాలి.

**వామనో రక్షతు సదా భవన్తం యః క్షణాదభూత్ ।**
**త్రివిక్రమః క్రమాక్రాన్తత్రైలోక్యః స్ఫురదాయుధః ॥ 17 ॥**

క్షణకాలంలో (పొట్టివడుగు రూపంతో వచ్చి) ముల్లోకాలను మూడడుగుల నేలగా ఆక్రమించి, ప్రకాశించే అస్త్రాలతో త్రివిక్రమస్వరూపుడై దర్శనమిచ్చిన వామనుడు సర్వదా నీకు ఏడుగడయై ఉండాలి.

**శిరస్తే పాతు గోవిన్దః కణ్ఠం రక్షతు కేశవః ।**
**గుహ్యం చ జఠరం విష్ణు ర్జంఘే పాదౌ జనార్దనః ॥ 18 ॥**

**ముఖం బాహూ ప్రబాహూ చ మనః సర్వేన్ద్రియాణి చ ।**
**రక్షత్వవ్యాహతైశ్వర్యస్తవ నారాయణోఽవ్యయః ॥ 19 ॥**

గోవిందుడు నీ శిరస్సును రక్షించాలి. కేశవుడు కంఠాన్ని కాపాడాలి. నీ గుహ్యాన్ని, జఠరాన్ని విష్ణువు సంరక్షించాలి. జంఘాలను, పాదాలను జనార్దనుడు కాపాడాలి. నీముఖాన్ని, చేతులను, మోచేతులను, మనస్సును, సర్వేంద్రియాలను సాటిలేని ఐశ్వర్య సంపన్నుడైన, అక్షయుడగు నారాయణుడు రక్షిస్తూ ఉండాలి.

**శార్ఙ్గచక్రగదాఖడ్గ శంఖనాదాహతాః క్షయమ్ ।**
**గచ్ఛన్తు ప్రేతకూష్మాణ్డరాక్షసా యే తవాహితాః ॥ 20 ॥**

శ్రీ మహావిష్ణువుయొక్క శార్ఙ్గం, చక్రం, గద, ఖడ్గం, శంఖం వీటి భంభం నాదాలవల్ల నీకు శత్రువులైన వారు, ప్రేతలు, కూష్మాండులు, రాక్షసులు అందరూ నాశనం చెందాలి.

**త్వాం పాతు దిక్షు వైకుణ్ఠో విదిక్షు మధుసూదనః ।**
**హృషీకేశోఽమ్బరే భూమౌ రక్షతు త్వాం మహీధరః ॥ 21 ॥**

నిన్ను వైకుంఠుడు నాలుగు దిక్కులందును, మధుసూదనుడు నాలుగు విదిక్కుల (మూలల) యందును, ఆకాశంలో (పైభాగంలో) హృషీకేశుడు, భూమిపై ధరణీధరుడు రక్షిస్తూ ఉండాలి.

**ఏవం కృతస్వస్త్యయనో నన్దగోపేన బాలకః ।**
**శాయితః శకటస్యాధో బాలపర్యంకికాతలే ॥ 22 ॥**

ఈ విధంగా నందగోపుడు ఆపిల్లవానికి శాంతికర్మను ఒనరించి, బండిక్రింద పసిపిల్లలు పడుకొనే ఉయ్యాలలో పరుండ బెట్టాడు.

**తే చ గోపా మహద్ దృష్ట్వా పూతనాయాః కలేబరమ్ ।**
**మృతాయాః పరమం త్రాసం విస్మయం పరమం యయుః ॥ 23 ॥**

ఆ గోపాలురందరు చనిపోయిన పూతన పెద్దశరీరాన్ని చూచి గొప్పభయాన్ని, మిక్కిలి ఆశ్చర్యాన్ని పొందారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే పూతనావధో నామ పంచమోఽధ్యాయః సమాప్తః ॥ 5 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో పూతనావధ అనే అయిదవ అధ్యాయం సమాప్తం ॥ 5 ॥



## షష్ఠోఽధ్యాయః - ఆరవ అధ్యాయం

## బలదేవ శ్రీకృష్ణ నామకరణమ్ - బలదేవ శ్రీకృష్ణుల నామకరణం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు పలికాడు.

**కదాచిచ్ఛకటాధస్తాచ్ఛయానో మధుసూదనః ।**
**చిక్షేప చరణావూర్ధ్వం స్తన్యార్థీ ప్రరురోద చ ॥ 1 ॥**

పరాశరుడు చెబుతున్నాడు. ఒకానొక సమయంలో మధుసూదనుడు బండిక్రింద పరుండి, పాలు త్రాగాలనే కోరికతో, తన రెండు బుల్లి పాదాలు పైకెత్తి ఏడ్వసాగాడు.

**తస్య పాదప్రహారేణ శకటం పరివర్తితమ్ ।**
**విధ్వస్తకుమ్భభాణ్డం వై విపరీతం పపాత చ ॥ 2 ॥**

ఆ పిల్లవాని కాలితాకిడికి బండి తలక్రిందులయింది. దానిపైనున్న పాలకడవలు, కుండలు బోర్లాపడి పగిలిపోయి క్రిందపడ్డాయి.

**తతో హాహాకృతం సర్వో గోపగోపీజనో ద్విజ! ।**
**ఆజగామాథ దదృశే బాలముత్తానశాయినమ్ ॥ 3 ॥**

ద్విజోత్తమా! ఆ సమయంలో సమస్తగోపగోపీగణాలు హాహాకారంచేస్తూ గబగబా వచ్చాయి. వెల్లకిలా పడిపోయి ఉన్న చిన్నికృష్ణుని వారు చూడడం జరిగింది.

**గోపాః కేనేతి కేనేదం శకటం పరివర్తితమ్ ।**
**తత్రైవ బాలకాః ప్రోచు ర్బాలేనానేన పాతితమ్ ॥ 4 ॥**

ఆ సమయంలో గోపాలురు "ఎవరివల్ల? ఎవరివల్ల? ఈ బండి తలక్రిందులయింది?" అంటూ వచ్చారు. అప్పుడు అక్కడనున్న గొల్ల పిల్లలు ఈ పిల్లవాని వల్లే బండి తలక్రిందులయ్యిందన్నారు.

**రుదతా దృష్ట మస్మాభిః పాదవిక్షేపతాడితమ్ ।**
**శకటం పరివృత్తం వై నైతదన్యస్య చేష్టితమ్ ॥ 5 ॥**

ఇతడు ఏడుస్తూ కాలు ఆడించినంతమాత్రంచేతనే, శకటం బోర్లాపడడం మేము చూశాము. ఈ పని ఇంకొకడు చేసింది కాదన్నారు ఆ పిల్లలు.

**తతః పునరతీవాసన్ గోపా విస్మితచేతసః ।**
**నన్దగోపోఽపి జగ్రాహ బాలమత్యన్త విస్మితః ॥ 6 ॥**

ఆ సంగతి విన్న గోపాలకులందరు మళ్లీ మిక్కిలి అచ్చెరువు పొందిన మనస్సు కలవారయ్యారు. నందగోపుడు కూడ అత్యధిక విస్మయంతో ఆ బాలుని అక్కున చేర్చుకొన్నాడు.

**యశోదా శకటారూఢ భగ్నభాండకపాలికాః ।**
**శకటం చార్చయామాస దధిపుష్ప ఫలాక్షతైః ॥ 7 ॥**

యశోద బండిపైనెక్కించిన, చెదరిపడి పగిలిపోయిన కుండలను పాలికలను సరిచేసి పెరుగు, పూలు, పండ్లు అక్షతలు మున్నగు వాటితో ఆ శకటాన్ని పూజించింది.

**గర్గశ్చ గోకులే తత్ర వసుదేవప్రచోదితః ।**
**ప్రచ్ఛన్న ఏవ గోపానాం సంస్కారానకరోత్తయోః ॥ 8 ॥**

వసుదేవుడు ఆజ్ఞాపించగా, గర్గుడు గోకులానికి వచ్చి అక్కడ గొల్లవారికందరికి తెలియరాకుండా, ఆ బలరామకృష్ణులిద్దరికి నామకరణం మున్నగు సంస్కారాలు జరిపించాడు.

**జ్యేష్ఠం చ రామమిత్యాహ కృష్ణం చైవ తథా పరమ్ ।**
**గర్గో మతిమతాం శ్రేష్ఠో నామ కుర్వన్మహామతిః ॥ 9 ॥**

జ్ఞానవంతులలో శ్రేష్ఠుడయిన మహాబుద్ధిమంతుడైన గర్గముని పెద్దవానికి రాముడని, చిన్నవానికి కృష్ణుడని పేర్లు పెట్టడం జరిగింది.

**స్వల్పేనైవ తు కాలేన రంగిణౌ తౌ తదా వ్రజే ।**
**ధృష్టజానుకరౌ తౌ హి బభూవతురుభావపి ॥ 10 ॥**

మిక్కిలి తక్కువ కాలంలోనే వారిద్దరూ ఆ వ్రేపల్లెలో మోకాళ్లు చేతులు నేలపై తాకించుచూ, ఇటు అటూ పాకడం, అడుగులు వేయడం ప్రారంభించారు.

**కరీషభస్మదిగ్ధాంగౌ భ్రమమాణావితస్తతః ।**
**న నివారయితుం సేహే యశోదా న చ రోహిణీ ॥ 11 ॥**

వారిద్దరూ ఆవుపిడకల బూడిదతో నిండిన శరీరాలతో ఇటు అటూ పరుగులు పెడుతూ ఉంటే, యశోదాదేవికి రోహిణికి కూడా వారిని పట్టుకోవడానికి శక్యం కాలేదు.

**గోవాట మధ్యే క్రీడన్తౌ వత్సవాటం గతౌ పునః ।**
**తదహర్జాతగోవత్స పుచ్ఛాకర్షణ తత్పరౌ ॥ 12 ॥**

ఆవులదొడ్డిలో ఆటలాడుతూ ఆడుతూ, ఒకేసారి మళ్లీ దూడల మందలో కురికి, వాటితోకలు పట్టుకొని లాగుతూ, అదే రోజు పుట్టిన దూడల మధ్య తిరుగుతూ తోకలులాగి చెంగున చెంగున గంతులు వేయసాగారు.

**యదా యశోదా తౌ బాలావేకస్థానచరావుభౌ ।**
**శశాక నో వారయితుం క్రీడన్తావతిచంచలౌ ॥ 13 ॥**
**యశోదా యష్టిమాదాయ కోపేనానుగతా చ తమ్ ।**
**కృష్ణం కమలపత్రాక్షం తర్జయన్తీ రుషా తదా ॥ 14 ॥**

**దామ్నా బధ్వా తదా మధ్యే నిబధ్యాథ ఉలూఖలే ।**
**కృష్ణమక్లిష్ట కర్మాణమాహ చేదమమర్షితా ॥ 15 ॥**

ఒకానొకసమయంలో అన్న, తమ్ముడు ఒక్కటై ఒకచోట ఆటలాడుతూ, గంతులు వేస్తూ ఉండగా యశోద వారిని వారించలేక పోయింది. అపుడు యశోద కోపంతో కర్రచేతితో పట్టుకొని కృష్ణుని వెంట పరుగెత్తింది. ఎలాగో మిక్కిలి కష్టంతో తామరరేకులవంటి కన్నులు కలిగిన చిన్న కన్నయ్యను పట్టుకొంది. కోపంతో ఆతని బొజ్జచుట్టూ త్రాడుచుట్టి రోటికి కట్టివేసింది. అనాయాసంగా అన్ని అల్లరి పనులను చేయు ముద్దుల కృష్ణునితో కోపంతో ఇలా అంది.

**యది శక్నోషి గచ్ఛ త్వమతిచంచలచేష్టిత! ।**
**ఇత్యుక్త్వా చ నిజం కర్మ సా చకార కుటుమ్బినీ ॥ 16 ॥**

"మిక్కిలి అల్లరిపనులు చేసే పిల్లవాడా! ఏదీ చేతనయితే ఎలా వెడతావో వెళ్లు" అని బెదిరించి ఆ గృహిణి తన ఇంటిపనులు చేసుకోసాగింది.

**వ్యగ్రాయామథ తస్యాం స కర్షమాణ ఉలూఖలమ్ ।**
**యమలార్జున మధ్యేన జగామ కమలేక్షణః ॥ 17 ॥**

యశోద ఆ విధంగా తన పనులతొందరలో ఉండగా, కమలదళాక్షుడైన ఆ కృష్ణుడు రోలు ఈడ్చుకొంటూ, రెండు మద్దిచెట్లనడుమగా పాకుతూ వెళ్లాడు.

**కర్షతా వృక్షయోర్మధ్యే తిర్యగ్గతములూఖలమ్ ।**
**భగ్నావుత్తుంగశాఖాగ్రౌ తేన తౌ యమలార్జునౌ ॥ 18 ॥**

**తతః కటకటాశబ్దసమాకర్ణనతత్పరః ।**
**ఆజగామ వ్రజజనో దదర్శ చ మహాద్రుమౌ॥ 19 ॥**

ఆ రెండు చెట్లమధ్యలో లాగుతూ ఉండగా, ఆ రోలు అడ్డం తిరిగి, ఆ బాలుని వల్ల పొడుగైన కొమ్మలతో కూడిన ఆ యమలార్జున మహావృక్షాలు విరిగి పడిపోయాయి. అంతట ఆ ఫెళఫెళ శబ్దాలు విని అదేమిటో తిలకిద్దామనే ఆసక్తితో వ్రేపల్లె జనం అంతా విరిగిన ఆ పెనుమ్రాకులను చూడడం జరిగింది.

**భగ్నస్కన్ధౌ నిపతితౌ భగ్నశాఖౌ మహీతలే ।**
**నవోద్గతాల్పదన్తాంశు సితహాసం చ బాలకమ్ ॥ 20 ॥**

నేలపై పడిపోయి ఉన్న బ్రద్దలైన మ్రానులను చూశారు. విరిగి పడిపోయిన కొమ్మలను కూడా తిలకించారు. వచ్చీరాని లేత పలువరుసలనుంచి తెలికాంతులు ప్రసరిస్తూ ఉండగా, అచ్చమైన చిరునవ్వులు చిందిస్తూ ఉన్న చిన్ని కృష్ణుని చూచారు.

**తయోర్మధ్యగతం బద్ధం దామ్నా గాఢం తథోదరే ।**
**తతశ్చ దామోదరతాం స యయౌ దామబన్ధనాత్ ॥ 21 ॥**

ఆ రెండు చెట్ల మధ్య, దామంచే గట్టిగా కట్టబడిన ఉదరంతో ఉన్నాడు కాబట్టి, ఆనాటినుంచి కృష్ణుడు దామబంధన కారణంచే 'దామోదరుడు' అనే పేరు పొందినవాడయ్యాడు.

**గోపవృద్ధాస్తతః సర్వే నన్దగోపపురోగమాః ।**
**మన్త్రయామాసురుద్విగ్నా మహోత్పాతాతిభీరవః ॥ 22 ॥**

అనంతరం నందగోపుడు మొదలైన గోపవృద్ధులందరూ అక్కడ కలుగుతున్న పెద్దపెద్ద ఉత్పాతాలకు జడిసిపోయి ఎంతో ఆందోళన చెంది ఇలా ఆలోచించసాగారు.

**స్థానేనేహ న నః కార్యం గచ్ఛామోఽన్యన్మహావనమ్ ।**
**ఉత్పాతా బహవో హ్యత్ర దృశ్యన్తే నాశహేతవః ॥ 23 ॥**

"మనకు ఇక్కడ ఉండడం మంచిపని కాదు. మరో గొప్పదైన వనానికి వెళ్లిపోదాము. ఇచట మనకు వినాశాన్ని కలిగించే పెక్కు విపత్తులు గోచరిస్తున్నాయి.

**పూతనాయా వినాశశ్చ శకటస్య విపర్యయః ।**
**వినా వాతాదిదోషేణ ద్రుమయోః పతనం తథా ॥ 24 ॥**

ఇక్కడే పూతన చచ్చిపోయింది. బండి తలక్రిందులుగా బోల్తాపడింది. ఏ పెనుగాలి లేకుండగానే ఈ మహావృక్షాలు కూలిపోయాయి.

**బృన్దావనమితః స్థానాత్ తస్మాద్ గచ్ఛామ మాచిరమ్ ।**
**యావద్ భౌమ మహోత్పాత దోషో నాభిభవేద్ వ్రజమ్ ॥ 25 ॥**

ఈ వ్రేపల్లెలో పెద్దపెద్ద భౌమోత్పాతాలు, దోషాలు కలగకముందే ఇక్కడనుంచి బృందావనానికి వెళ్లిపోదాము. ఆలస్యం చేయకుండా త్వరగా వెళ్లడం మంచిది." అని భావించారు.

**ఇతి కృత్వా మతిం సర్వే గమనే తే వ్రజౌకసః ।**
**ఊచుః స్వం స్వం కులం శీఘ్రం గమ్యతాం మావిలమ్బ్యతామ్ ॥ 26 ॥**

ఈ ప్రకారంగా సమస్త వ్రజవాసులు అక్కడనుంచి వెళ్లి పోవడానికి నిశ్చయించుకొన్నవారై, తమతమ కుటుంబాల వారితో "లెండి లెండి. నడవండి నడవండి. ఆలస్యం చేయకండి" అని హెచ్చరికలు చేశారు.

**తతః క్షణేన ప్రయయుః శకటైర్గోధనై స్తథా ।**
**యూథశో వత్సపాలాశ్చ కాలయన్తో వ్రజౌకసః ॥ 27 ॥**

ఆక్షణమే బండ్లతో, ఆలమందలతో గుంపులు గుంపులుగా వ్రజవాసులు, ఆలకాపరులు ఒకరినొకరిని పిలుచుకొంటూ బృందావనానికి పయనమై వెళ్లిపోయారు.

**ద్రవ్యావయవనిర్ధూతం క్షణమాత్రేణ తత్తథా ।**
**కాకభాససమాకీర్ణం వ్రజస్థాన మభూద్ ద్విజ! ॥ 28 ॥**

ద్విజోత్తముడవైన మైత్రేయా! సమస్తద్రవ్యాలు, సకలవస్తువులు శూన్యం కాగా క్షణకాలంలో వ్రేపల్లె అంతా కాకులకు, భాసాలకు (గంపపులుగు) నిలయమైపోయింది.

**బృన్దావనం భగవతా కృష్ణేనాక్లిష్టకర్మణా ।**
**శుభేన మనసా ధ్యాతం గవాం సిద్ధిమభీప్సతా ॥ 29 ॥**

ఆ సమయంలో ఏ క్లేశం లేకుండగా మంచి పనులు ఆచరించే లీలావిహారియైన భగవంతుడగు కృష్ణుడు, గోగణాల పెంపు కోసమై శుభసంకల్పంతో బృందావనాన్ని మనస్సులో ధ్యానించాడు.

**తతస్తత్రాతిరూక్షేఽపి ఘర్మకాలే ద్విజోత్తమ! ।**
**ప్రావృట్కాల ఇవోద్భూతం నవశష్పం సమన్తతః ॥ 30 ॥**

ద్విజశ్రేష్ఠా! అందువల్ల మిక్కిలి మండువేసవికాలంలో కూడా, వర్ష ఋతువులోలాగ అంతట లేతపచ్చిక మొలకెత్తి సస్యశ్యామలమయింది.

**స సమావాసితః సర్వో వ్రజో బృన్దావనే తతః ।**
**శకటీవాటపర్యన్తశ్చన్ద్రార్ధాకారసంస్థితిః ॥ 31 ॥**

అనంతరం అక్కడ బృందావనంలో వ్రజవాసులందరూ, నాలుగు దిక్కుల బండ్లను విప్పిన దొడ్డిలో అర్ధచంద్రాకారంగా హద్దు ఏర్పరచుకొన్న వారై విడిది చేశారు.

**వత్సపాలౌ చ సంవృత్తౌ రామదామోదరౌ తతః ।**
**ఏకస్థానస్థితౌ గోష్ఠే చేరతుర్బాలలీలయా ॥ 32 ॥**

ఆ సమయంలో బలరామకృష్ణులిద్దరూ ఆలకాపరులు అయ్యారు. ఆ ఆలమందలో ఇద్దరూ ఒకే చోట కూడి బాలలీలలతో విహరించ సాగారు.

**బర్హి పత్రకృతాపీడౌ వన్యపుష్పావతంసకౌ ।**
**గోపవేణుకృతాతోద్యపత్రవాద్య కృతస్వనౌ ॥ 33 ॥**

వారిద్దరు నెమలి పింఛములు శిరస్సుపై ధరించి, అడవిలో లభించే పూలను చెవులకు అలంకారం చేసుకొని, గొల్లపిల్లల మధ్యలో పిల్లనగ్రోవులు ఊదుతూ, మద్దెలచప్పుళ్లు కావిస్తూ, కొబ్బరి ఆకులు మున్నగు వాటితో చేసిన బూరాలు ఊదారు.

**కాకపక్షధరౌ బాలౌ కుమారావివ పావకీ ।**
**హసన్తౌ చ రమన్తౌ చ చేరతుః స్మ మహావనమ్ ॥ 34 ॥**

ఆ బలరామకృష్ణు లిద్దరూ వ్రేలాడే జునపాలజుట్టుతో, కుమారస్వామి అంశభూతులైన శాఖ విశాఖులనే కుమారులలాగా మిగిలిన గోపకుమారకులతో కలిసి నవ్వుతూ, ఆడుతూ, ఆ మహావనంలో విహరించారు.

**క్వచిద్ధసన్తావన్యోన్యం క్రీడమానౌ తథా పరైః ।**
**గోపపుత్రైః సమం వత్సాంశ్చారయన్తౌ విచేరతుః ॥ 35 ॥**

ఒక్కొక్కప్పుడు ఒకరి వీపుపై ఇంకొకరిని మోస్తూ, కేరింతలు కొడుతూ, ఆ గొల్లపిల్లలతో సమంగా గోవులను కాస్తూ, వాళ్లతో కలిసి ఆడుతూ సంచరించారు.

**కాలేన గచ్ఛతా తౌ తు సప్తవర్షౌ మహావ్రజే ।**
**సర్వస్య జగతః పాలౌ వత్సపాలౌ బభూవతుః ॥ 36 ॥**

ఈ విధంగా ఆ మహాబృందావనంలో కాలం గడుపుతూ, ఏడేండ్ల ఈడువారై, ఆ సర్వజగత్పరిపాలకులు అచట గోవత్సపరిపాలకులు అయ్యారు.

**ప్రావృట్కాలస్తతోఽతీవ మేఘౌఘస్థగితామ్బరః ।**
**బభూవ వారిధారాభిరైక్యం కుర్వన్ దిశామివ ॥ 37 ॥**

ఆ సమయంలో వర్షఋతువు ప్రవేశించింది. ఆకాశం మేఘసమూహాలతో నిండిపోయింది. మిన్ను మన్ను ఏకం కాగా, దిక్కులన్నీ ఒకటయ్యేటట్లుగా వర్షధారలు కురిశాయి.

**ప్రరూఢ నవశష్పాఢ్యా శక్రగోపాచితా మహీ ।**
**తదా మారకతీవాసీత్ పద్మరాగవిభూషితా ॥ 38 ॥**

మొలచిన పచ్చని లేతపచ్చికలతో, ఆర్ద్రపుపురుగులతో భూమి అంతా పద్మరాగమణులతో తాపడం చేసిన మరకతమాణిక్యమయమై ముచ్చట కూర్చింది.

**జగ్ముః రున్మార్గ వాహీని నిమ్నగామ్భాంసి సర్వతః ।**
**మనాంసి దుర్వినీతానాం ప్రాప్య లక్ష్మీం నవామివ ॥ 39 ॥**

అన్నివైపుల నదులు వరదలతో కట్టలుతెంచుకొని పరవళ్లు త్రొక్కుతూ, నడిమంత్రపుసిరులతో మిడిసి పడే అవినయశీలుర మనస్సులులాగా దుందుడుకుతో ప్రవహింపసాగాయి.

**న రేజేఽన్తరితశ్చన్ద్రో నిర్మలో మలినైర్ఘనైః ।**
**సద్వాక్యవాదో మూర్ఖాణాం ప్రగల్భాభిరివోక్తిభిః ॥ 40 ॥**

ఏ మచ్చలేని తెల్లని జాబిల్లి నల్లమబ్బుల చాటున కనబడకుండాపోయి, మూర్ఖుల ప్రగల్భవచనాలచే సత్పురుషుల యథార్థవాదం వెలవెలబోయినట్లు అయిపోయింది.

**నిర్గుణేనాపి చాపేన శక్రస్య గగనే పదమ్ ।**
**అవాప్యతావివేకస్య నృపస్యేవ పరిగ్రహే ॥ 41 ॥**

అవివేకి అయిన రాజు సభలో గుణహీనుడైన మనుష్యుడు కీర్తి పొందినట్లుగా ఆకాశమండలంలో వింటినారి త్రాడులేని ఇంద్రధనుస్సు భాసిల్లింది. (వివేకంలేని రాజుచేతిలోని విల్లు గుణహీనమైతే అనగా నారిలేక పోతే పనికిమాలినదవుతుంది. అలాగే నారితో ఎక్కుపెట్టని ఇంద్రధనుస్సు కనిపించింది.)

**మేఘపృష్ఠే బలాకానాం రరాజ విమలాతతిః ।**
**దుర్వృత్తే వృత్తచేష్టేవ కులీనస్యాతిశోభనా ॥ 42 ॥**

నల్లనైన మబ్బుల వెనక తెల్లనైన బెగ్గురు పక్షులబారు కులభ్రష్టుడైన వానివద్ద సత్కులంలో పుట్టిన ఆచారవంతుడు చేసిన శోభనచర్య (ప్రాయశ్చిత్తక్రియ) లా భాసిల్లింది.

**న బబన్ధామ్బరే స్థైర్యం విద్యుదత్యన్తచంచలా ।**
**మైత్రీవ ప్రవరే పుంసి దుర్జనేన ప్రయోజితా ॥ 43 ॥**

ఉత్తమ పురుషునియందు దుర్జనుడు చూపిన స్నేహంలాగ, ఆకాశంలో మెరుపుతీగ మిక్కిలి చంచలమై నిలకడగా ఉండలేక పోయింది.

**మార్గా బభూవు రస్పష్టా నవసస్యచయావృతాః ।**
**అర్థాన్తరమనుప్రాప్తాః ప్రజడానామివోక్తయః ॥ 44 ॥**

పెడ అర్థాలు (విపరీతార్థాలు) ఇచ్చే మూర్ఖుల మాటలలాగా, గడ్డిగాదం బాగా పెరిగి పోయి, బాటలు తెలియ రాకుండా పోయాయి.

**ఉన్మత్త శిఖి సారఙ్గే తస్మిన్ కాలే మహావనే ।**
**కృష్ణరామౌ ముదా యుక్తౌ గోపాలైశ్చేరతుః సహ ॥ 45 ॥**

నెమళ్లు, బెగ్గురు పక్షులు మిక్కిలిగా మదంతో ఆనందించే ఆ వానకాలంలో, బృందావనంలో రామకృష్ణు లిద్దరు మిక్కిలి సంతోషంతో గోపాలురతో కలిసి క్రీడించారు.

**క్వచిద్ గోపైః సమం రమ్యం గేయనృత్యరతావుభౌ ।**
**చేరతుః క్వచిదత్యర్థం శీతవృక్షతలాశ్రయౌ ॥ 46 ॥**

ఒక్కొక్కప్పుడు గోపాలకులతో సమంగా రమణీయంగా పాటలు పాడుతూ, వారితో కలసి నృత్యం చేస్తూ, శ్రమ పోగొట్టుకోవడం కోసమై చల్లని చెట్ల నీడల నాశ్రయించి మిక్కిలి ఉత్సాహంతో వారిద్దరూ విహరించారు. (గోభిః సమం–గోవులతో బాటు శ్రుతి కలుపుతూ)

**క్వచిత్ కదమ్బస్రక్ చిత్రౌ మయూరస్రగ్ధరౌ క్వచిత్ ।**
**విచిత్రౌ క్వచి దాసాతాం వివిధై ర్గిరిధాతుభిః ॥ 47 ॥**

ఒక్కొక్కప్పుడు కడిమిపూలదండలు ధరిస్తూ, మరొకప్పుడు నెమలి పింఛముల మాలలు చిత్రంగా దాల్చి, ఇంకొకప్పుడు గైరికాదిధాతువులను అంగరాగాలుగా విచిత్రంగా పూసుకొంటూ వారు చరించారు.

**పర్ణశయ్యాసు సంసుప్తౌ క్వచిన్నిద్రాన్తరైషిణౌ ।**
**క్వచిద్ గర్జతి జీమూతే హాహాకార రవాదృతౌ ॥ 48 ॥**

ఒక్కొక్కప్పుడు నిద్రపోవాలనే తహతహతో ఆకులసెజ్జలపై పడుకొని గాఢనిద్ర పోయేవారు. ఇంకొక్కప్పుడు మేఘాలు ఉరిమినప్పుడు హాహాకారధ్వనులు చేసేవారు.

**గాయతా మన్యగోపానాం ప్రశంసాపరమౌ క్వచిత్ ।**
**మయూరకేకానుగతౌ గోపవేణుప్రవాదకౌ ॥ 49 ॥**

మరొకప్పుడు మిగిలిన గోపాలురు పాటలు పాడుతూ ఉండగా, బాగు బాగని ఎక్కువగా అభినందించేవారు. మయూరాల కేకారవాలకనుగుణంగా ధ్వని చేసేవారు. గోపాలురతో కలిసి పిల్లనగ్రోవులు ఊదేవారు.

**ఇతి నానావిధైర్భావై రుత్తమప్రీతిసంయుతౌ ।**
**క్రీడాసక్తౌ వనే తస్మిన్ చేరతుః ప్రీతమానసౌ ॥ 50 ॥**

ఈ రీతిగా అనేక విధాలుగా మనస్సులలో బాల్యచేష్టలతో ఆనందపరవశులవుతూ, ఆటలాడుతూ, మనస్సులు తృప్తిచెందగా ఆ బృందావనంలో వారిద్దరూ విహరించారు.

**వికాలే తు సమం గోభిర్గోపబృన్ద సమన్వితౌ ।**
**ఆజగ్మతుః కృష్ణబలౌ గోపవేషధరావుభౌ ॥ 51 ॥**

సాయంకాలం అవడంతోనే గోవులతో, గోపబృందాలతో కలిసి గొల్లలవేషం ధరిస్తూ రామకృష్ణు లిద్దరు పల్లెకు తిరిగి వచ్చేవారు.

**వికాలే చ యథాయోగం వ్రజమేత్య మహాబలౌ ।**
**గోపైః సమానైః సహితౌ చిక్రీడాతేఽమరావివ ॥ 52 ॥**

సంజవేళలో సమవయస్కులైన గోపాలకులతో కలిసి ఆ మహాబలవంతులిద్దరు తమవ్రజనివాసానికి యథేచ్ఛగా తిరిగి వస్తూ, దేవకుమారులవలె క్రీడించారు – అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే బలదేవ శ్రీకృష్ణ నామకరణం నామ షష్ఠోఽధ్యాయః సమాప్తః ॥ 6 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో బలదేవ శ్రీకృష్ణ నామకరణం అనే ఆరవ అధ్యాయం సమాప్తం ॥ 6 ॥



## సప్తమోఽధ్యాయః - ఏడవ అధ్యాయం

## కాలియమర్దనమ్ - కాలియమర్దనం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెబుతున్నాడు

**ఏకదాతు వినా రామం కృష్ణో బృన్దావనం యయౌ ।**
**విచచార వృతో గోపై ర్వన్యపుష్పస్రగుజ్జ్వలః ॥ 1 ॥**

ఒకనాడు బలరాముడు తోడు లేకుండా కృష్ణుడు ఒక్కడు బృందావనానికి వెళ్లాడు. అక్కడ అడవిలో దొరకేపూలతో దండలు కూర్చి చక్కగా అలంకరించుకొని చుట్టూ ఉన్న గోపాలురతో కలిసి విహరించాడు.

**స జగామాథ కాలిన్దీం లోలకల్లోలశాలినీమ్ ।**
**తీరసంలగ్న ఫేనౌఘైః హసన్తీమివ సర్వతః ॥ 2 ॥**

కెరటాలు ఉవ్వెత్తున పైకి లేస్తూ ఉండగా, ఒడ్డున చేరిన పెనునురుగులతో అంతటా అల్లన నవ్వులు చిందిస్తోందా అన్నట్లుగా ఉన్న కాలిందీ నదిని అతడు చేరుకొన్నాడు.

**తస్యాం చాతిమహాభీమం విషాగ్నిశ్రితవారికమ్ ।**
**హ్రదం కాలియనాగస్య దదృశేఽతీవ భీషణమ్ ॥ 3 ॥**

ఆ నదిలో మిక్కిలి భయాన్ని కూర్చే, విషాగ్నులతో కూడుకొన్న నీటితో నిండిన, కాలియుడనే నాగం నివసించే మహాభయంకరమైన మడుగును చూశాడు.

**విషాగ్నినా ప్రసరతా దగ్ధతీరమహీరుహమ్ ।**
**వాతాహతామ్బువిక్షేప స్పర్శదగ్ధ విహంగమమ్ ॥ 4 ॥**

ఆ హ్రదంనుండి కాళియుని విషాగ్ని జ్వాలలు ప్రసరించడం వల్ల, తీరమందున్న వృక్షసమూహాలన్నీ మాడి మసి అయిపోయాయి. ఆ విషంతో కూడుకొన్న గాలివల్ల చిమ్మబడిన నీటివల్ల ఆకాశంలోని పక్షులన్నీనశించాయి.

**తమతీవ మహారౌద్రం మృత్యువక్త్ర మివాపరమ్ ।**
**విలోక్య చిన్తయామాస భగవాన్ మధుసూదనః ॥ 5 ॥**

మిక్కిలి భయంకరమైన, మృత్యుదేవత మరో నోరు అన్నట్లున్న ఆ మడుగును చూచి భగవంతుడైన మధుసూదనుడు తన ఎదలో ఇలా అనుకొన్నాడు.

**అస్మిన్వసతి దుష్టాత్మా కాలియోఽసౌ విషాయుధః ।**
**యో మయా నిర్జిత స్త్యక్త్వా దుష్టో గచ్ఛేత్ పయోనిధిమ్ ॥ 6 ॥**

ఈ నదిలో దుష్టాత్ముడైన విషాయుధుడగు కాలియుడు ఉన్నాడు. నాచే ఓటమిపొందిన వాడై ఆ దుష్టుడు ఈ మడుగును విడిచిపెట్టి సముద్రానికి వెళ్ళి పోయేటట్లుగా నష్టం కలిగించాలి. (ఇతడు పూర్వం నావిభూతి అయిన గరుడుని ద్వారా ఓడించ బడ్డాడు.)

**తేనేయం దూషితా సర్వా యమునా సాగరంగమా ।**

**న నరైర్గోధనైశ్చాపి తృషార్తైరుపభుజ్యతే ॥ 7 ॥**

ఆ కాళియుని వల్ల సాగరగామినియైన యమునానది అంతా కలుషితమై పోతోంది. దప్పికపొందే ఆలమందలు కాని, మానవులు కాని దీనిని అనుభవించలేకపోతున్నారు. (నీరు త్రాగలేక పోతున్నారు).

**తదస్య నాగరాజస్య కర్తవ్యో నిగ్రహో మయా ।**
**నిస్త్రాసాస్తు సుఖం యేన చరేయుర్వ్రజవాసినః ॥ 8 ॥**

అందువల్ల ఆ నాగరాజును నిగ్రహించడం అనేది నేను తప్పని సరిగా చేయవలసినపని. అలాచేస్తే ఈ వ్రజవాసులందరూ జడుపులేక ఈమడుగులో స్వేచ్ఛగా సంచరించగలుగుతారు.

**ఏతదర్థం నృలోకేఽస్మి న్నవతారో మయా కృతః ।**
**యదేషాముత్పథస్థానాం కార్యా శాన్తిర్దురాత్మనామ్ ॥ 9 ॥**

ఇందు గురించే నేను ఈ నరలోకంలో అవతారం ధరించాను. ఈ మిడిసిపడే చెడుమార్గంలో సంచరించే దురాత్ములందరిని అదుపులో పెట్టి తీరాలి.

**తదేనం నాతిదూరస్థం కదమ్బమురుశాఖినమ్ ।**
**అధిరుహ్యోత్పతిష్యామి హ్రదేఽస్మిన్ననిలాశినః ॥ 10 ॥**

ఇదిగో! అల్లంతదూరంలో ఉన్న ఈ కదంబ వృక్షాన్ని ఎక్కి ఆ వాయుభక్షకుడైన కాళియుడు నివసించే ఈ హ్రదంలో ఒక్క సారిగా దుముకుతాను" అని భావించాడు.

**ఇత్థం విచిన్త్య బద్ధ్వా చ గాఢం పరికరం తతః ।**
**నిపపాత హ్రదే తత్ర నాగ(సర్ప) రాజస్య వేగితః ॥ 11 ॥**

అని ఈ విధంగా ఆలోచించి భగవంతుడైన శ్రీ కృష్ణుడు, తనవస్త్రాది పరికరాలను బిగించి కట్టుకొని, ఆ సర్పరాజు నివసించే మడుగులోనికి చటుక్కున దుమికాడు.

**తేనాపి పతతా తత్ర క్షోభితః స మహాహ్రదః ।**
**అత్యర్థం దూరజాతాంస్తు సమసించన్మహీరుహాన్ ॥ 12 ॥**

అలా కృష్ణుడు ఆ మహాహ్రదంలోకి దూకిన వెంటనే అది కలగుండు పడిపోయింది. అందలి జలాలు ఒక్కసారిగా పెల్లుబికి దూరంగా ఉన్న చెట్లను కూడా తడిపి వేశాయి.

**తే హి దుష్టవిషజ్వాలా తప్తామ్బుపవనోక్షితాః ।**
**జజ్వలుః పాదపాః సద్యో జ్వాలావ్యాప్తదిగన్తరాః ॥ 13 ॥**

దుష్టుడైన పాపరేని విషజ్వాలలతో క్రాగియున్న నీటిగాలితో తడిసిపోయి, చెట్లన్నీ వెంటనే నలుదెసలా మంటలు క్రమ్ముకోగా మండిపోయాయి.

**ఆస్ఫోటయామాస తదా కృష్ణో నాగహ్రదే భుజమ్ ।**
**తచ్ఛబ్ద శ్రవణాచ్చాశు నాగరాజోఽభ్యుపాగమత్ ॥ 14 ॥**

ఆ సమయంలో కృష్ణుడు ఆ నాగహ్రదంలో ఒక్కసారిగా జబ్బ చరిచాడు. ఆ శబ్దాన్ని విన్నంతమాత్రంచేతనే మండిపడుతూ సర్పరాజు మీదికి వచ్చాడు.

**ఆతామ్రనయనో దుష్ట విషజ్వాలాకులైర్ముఖైః ।**
**వృతో మహావిషై శ్చాన్యై రురగై రనిలాశిభిః ॥ 15 ॥**

అప్పుడు ఎర్రనైన కనుగ్రుడ్లతో, కాలకూటవిషం వెలిగ్రక్కే నోళ్లు తెరచి కృష్ణునిపై ఒక్కసారిగా కాళియుడు మీద పడ్డాడు. గాలిమేతమేసే మహావిషాలు చిమ్మివేసే పాములన్నీ ఆ కృష్ణుని చుట్టుముట్టాయి.

**నాగపత్న్యశ్చ శతశో హారిహారోపశోభితాః ।**
**ప్రకమ్పిత తనుక్షేప చలత్కుణ్డల కాన్తయః ॥ 16 ॥**

వందల కొలది నాగరాజు భార్యలు మనోహరహారాలతో ప్రకాశిస్తూ, కుండలాల కాంతులు ప్రసరిస్తూ ఉండగా, మేనులు మిక్కిలి వణకి పోతూ ఉండగా ఆ నాగుని వెంట వచ్చారు.

**తతః ప్రవేష్టితః సర్పైః స కృష్ణో భోగబన్ధనైః ।**
**దదంశుశ్చాపి తే కృష్ణం విషజ్వాలావిలైర్ముఖైః ॥ 17 ॥**

ఆ సమయంలో పాములన్నీ కృష్ణుని తమ పడగల చుట్టలతో చుట్టివేశాయి. అంతేకాక తమ విషాగ్నులను వెదజల్లే ముఖాలతో కరచి వేయసాగాయి.

**తం తత్ర పతితం దృష్ట్వా సర్పభోగ నిపీడితమ్ ।**
**గోపా వ్రజముపాగమ్య చుక్రుశుః శోకలాలసాః ॥ 18 ॥**

ఆ విధంగా మడుగులోకి ఉరికి, పాముల పడగల మధ్య ఇరుక్కొని పోయిన కృష్ణుని చూచి, గోపాలురు వెనువెంటనే వ్రేపల్లెకు వ్రజానికి వచ్చి శోకపరవశులై ఏడ్వసాగారు.

**ఏష మోహం గతః కృష్ణో మగ్నో వై కాలియహ్రదే ।**
**భక్ష్యతే సర్పరాజేన తదాగచ్ఛత పశ్యత ॥ 19 ॥**

"ఇదుగో! కృష్ణుడు కాళియహ్రదంలో మునిగి పోయాడు. అంతే కాక మూర్ఛను పొందాడు. సర్పరాజు ఆతనిని మింగేస్తున్నాడు. కాబట్టి వేగంగా రండి. రండి. చూడండి" అని ఒక్కసారిగా విలపించారు.

**తచ్ఛ్రుత్వా తే తదా గోపా వజ్రపాతోపమం వచః ।**
**గోప్యశ్చ త్వరితా జగ్ముర్యశోదాప్రముఖా హ్రదమ్ ॥ 20 ॥**

పిడుగు పాటులాంటి ఆ మాట విన్నవారై, అప్పుడు గోపాలకులు, గోపికలు, యశోద మున్నగు వారు త్వరత్వరగా ఆ మడుగు వద్దకు పరుగులు తీస్తూ వచ్చారు.

**హా హా క్వాసావితి జనో గోపీనామతివిహ్వలః ।**
**యశోదయా స సమ్భ్రాన్తో ద్రుతం ప్రస్ఖలితం యయౌ ॥ 21 ॥**

"అయ్యో! అయ్యో! కృష్ణు డెక్కడ?" అని మిక్కిలి విహ్వాలత్వాన్ని పొంది గోపగోపీజనం యశోదతో కూడి దైన్యంతో తడబడుతూ అడుగులు తడబడగా అచ్చటికి చేరారు.

**నన్దగోపశ్చ గోపాశ్చ రామశ్చాద్భుతవిక్రమః ।**
**త్వరితం యమునాం జగ్ముః కృష్ణదర్శనలాలసాః ॥ 22 ॥**

నందగోపుడు, అలాగే మిగిలిన గోపాలకులు, అద్భుతపరాక్రమవంతుడైన బలరాముడు కూడ వడివడిగా కృష్ణుని చూడాలనే తపనతో యమునానదికి చేరుకొన్నారు.

**దదృశుశ్చాపి తే తత్ర సర్పరాజవశం గతమ్ ।**
**నిష్ప్రయత్నీకృతం కృష్ణం సర్పభోగేన వేష్టితమ్ ॥ 23 ॥**

సర్పరాజుకు లొంగిపోయి పాముపడగలచే చుట్టబడియున్న, చేష్టలుడిగియున్న కృష్ణుని ఆ సమయంలో వారందరూ చూశారు.

**నన్దగోపశ్చ నిశ్చేష్టో న్యస్య పుత్రముఖే దృశౌ ।**
**యశోదా చ మహాభాగా బభూవ మునిసత్తమ! ॥ 24 ॥**

మునిశ్రేష్ఠా! నందగోపుడు నివ్వెరపోయి, మహాభాగయైన యశోద బిత్తరయైపోయి, కుమారుని ముఖంవంక బిక్కచూపులు చూస్తూ ఉండి పోవడం జరిగింది.

**గోప్యస్త్వన్యా రుదన్త్యశ్చ దదృశుః శోకకాతరాః ।**
**ప్రోచుశ్చ కేశవం ప్రీత్యా భయకాతర్య గద్గదమ్ ॥ 25**

మిగిలిన గోపికలు అందరూ రోదిస్తూ దిగాలు పడిపోయి కృష్ణుని చూశారు. భయంతో వణకి పోతున్నవారై, బొంగురు పోయిన కంఠాలతో కృష్ణునిపై ప్రీతి పెంచుకొంటూ ఇలా అన్నారు.

**సర్వా యశోదయా సార్ధం విశామోఽత్ర మహాహ్రదే ।**
**నాగరాజస్య నో గన్తుమస్మాకం యుజ్యతే వ్రజే ॥ 26 ॥**

మనమందరం ఈ యశోదతో కలిసి నాగరాజుదైన పెద్ద మడుగులోకి దూకి వేస్తాము. మేము ఇంక వ్రేపల్లెకు వెళ్లడం సరియైనదికాదు.

**దివసః కో వినా సూర్యం వినా చన్ద్రేణ కా నిశా ।**
**వినా వృషేణ కా గావో వినా కృష్ణేన కో వ్రజః ॥ 27 ॥**

సూర్యుడు లేకుండా పగటికి విలువ ఉండదు. చంద్రుడు లేకుండా రాత్రికి సౌందర్యం ఉండబోదు. వృషభరాజు లేకుండా ఆవులు శోభతో ఉండవు. కృష్ణుడు లేకపోతే వ్రేపల్లెకు ఏం అందం ఉంటుంది కనుక?

**వినాకృతా న యాస్యామః కృష్ణేనానేన గోకులమ్ ।**
**అరణ్యం నాపి సేవ్యం చ వారిహీనం యథా సరః ॥ 28 ॥**

ఏ విధంగా నీరులేని కాసారం వద్దకు జనులు వెళ్లి సేవించరో, అదేవిధంగా కృష్ణుడు లేని వ్రేపల్లె, బృందారణ్యం నిరుపయోగం. కాబట్టి ఆతడు లేకుండా మేము తిరిగి వ్రేపల్లెకు వెళ్లనే వెళ్లము.

**యత్ర నేన్దీవరదలశ్యామకాన్తిరయం హరిః ।**
**తేనాపి మాతుర్వాసేన రతిరస్తీతి విస్మయః ॥ 29 ॥**

నల్లకలువరేకులులాగా నిగనిగలాడే శ్యామలకాంతిమూర్తి అయిన ఈ హరి లేకుండా, ఆ తల్లి యశోద గృహంలో ఆనందం ఉండడమనేది కడు వింతైన సంగతి కదా!

**ఉత్ఫుల్లపంకజదలస్పష్టకాన్తి విలోచనమ్ ।**
**అపశ్యన్త్యో హరిం దీనాః కథం గోష్ఠే భవిష్యథ ॥ 30 ॥**

వికసించిన తామరపూరేకులాగా తళతళలాడే కాంతులు చిమ్మే కన్నులు గల్గిన ఆ హరిని చూడకుండా దీనురాండ్రమై ఎలా గోష్ఠంలో నివాసం ఉండగలం?

**అత్యన్తమధురాలాపహృతాశేషమనోధనాః ।**
**న వినా పుణ్డరీకాక్షం యాస్యామో నన్దగోకులమ్ ॥ 31 ॥**

మిక్కిలి తియ్యనైన పలుకులతో మామనోధనాలు అన్నింటిని దొంగిలించిన పుండరీకాక్షుడు లేకుండా, నంద గోకులానికి వెళ్లనే వెళ్లము.

**భోగేనావేష్టితస్యాపి సర్పరాజేన పశ్యత ।**
**స్మితశోభిముఖం గోప్యః కృష్ణస్యాస్మద్విలోకనే ॥ 32 ॥**

గోపికలారా! చూడండే. సర్పరాజైన కాళియుని పడగలతో చుట్టుకొనబడియున్నా, చిరునవ్వులు చిందించే కృష్ణుని ముఖాన్ని తిలకించండే. ఆతని చూపులన్నీ మనపైనే ఉన్నాయి” అని ఒకరితో నొకరు సంభాషించారు.

**ఇతి గోపీ వచః శ్రుత్వా రౌహిణేయో మహాబలః ।**
**గోపాంశ్చ త్రాసవిధురాన్ విలోక్య స్తిమితేక్షణాన్ ॥ 33 ॥**

**నందం చ దీనమత్యర్థం న్యస్తదృష్టిం సుతాననే ।**
**మూర్ఛాకులాం యశోదాం చ కృష్ణమాహాత్మ్యసంజ్ఞయా ॥ 34 ॥**

మహాబలవంతుడైన రోహిణీ కుమారుడగు బలరాముడు ఈ విధంగా విలపిస్తూ పలికిన గోప స్త్రీలమాటలు విన్నాడు. భయంతో వణకి పోతున్న చకితనేత్రులైన గోపాలకులను వీక్షించాడు. కన్నకొడుకు మోముపై దృష్టినుంచి మిక్కిలి దైన్యాన్ని పొందియున్న నందుని విలోకించాడు. మూర్ఛనుంచి తేరుకోకుండా ఉన్న యశోదను చూశాడు. శ్రీ కృష్ణుని మహిమ గుర్తెరిగి ఇలా అంటున్నాడు.

**కిమిదం దేవదేవేశ! భావోఽయం మానుషస్త్వయా ।**
**వ్యజ్యతే ఽత్యన్తమాత్మానం కిమనన్తం న వేత్సి యత్ ॥ 35 ॥**

"దేవదేవా! ప్రభూ! నీ ఈ సాధారణ మనుష్య ప్రవర్తనం ఎందుకు? ఇంతగా నటిస్తున్నావు ఎందుకు? నిన్ను నీవు అనంతునిగా భావించడం లేదా?

**త్వమస్య జగతో నాభిరరాణామివ సంశ్రయః ।**
**కర్తాఽపహర్తా పాతా చ త్రైలోక్యం త్వం త్రయీమయః ॥ 36 ॥**

నీవు ఈ జగత్తు అనే చక్రానికి నాభి (కేంద్రమయిన బండికుంచం) లాంటి వాడవు. అందలి అరలకు (ఆకులకు) ఆశ్రయం (ఆధారం) అయిన వాడవు. కర్తవు, అపహర్తవు, భర్తవు మూడులోకాలకు నీవే. నీవు వేదత్రయస్వరూపుడవు.

**సేన్ద్ర రుద్రాశ్వివసుభిరాదిత్యై ర్మరుదగ్నిభిః ।**
**చిన్త్యసే త్వమచిన్త్యాత్మన్! సమస్తైశ్చైవ యోగిభిః ॥ 37 ॥**

అచింత్యస్వరూపా! ఇంద్రుడు, రుద్రులు, అశ్వినీకుమారులు, వసువులు, ఆదిత్యులు, మరుత్తులు, అగ్నులు, అలాగే సమస్తయోగీశ్వరులు నిన్నే సదా ధ్యానిస్తూ ఉంటారు.

**జగత్యర్థం జగన్నాథ! భారావతరణేచ్ఛయా ।**
**అవతీర్ణోఽత్ర మర్త్యేషు తవాంశశ్చాహమగ్రజః ॥ 38 ॥**

జగన్నాథా! జగత్తును రక్షించడానికై, భూదేవి ప్రార్థనపై ఆమె బరువుదించడానికై మర్త్యలోకంలో మానవుడవై అవతరించావు. నీకు అన్ననైన నేను నీ అంశనే.

**మనుష్యలీలాం భగవన్! భజతా భవతా సురాః ।**
**విడమ్బయన్తస్త్వల్లీలాం సర్వ ఏవ సమాసతే ॥ 39 ॥**

భగవంతుడా! మనుష్యలీలతో నటించే నీతో, సమస్తదేవతలు నీ లీలలనే అనుకరిస్తూ నీతోనే ఉన్నారు.

**అవతార్య భవాన్ పూర్వం గోకులేఽత్ర సురాంగనాః ।**
**క్రీడార్థమాత్మనః పశ్చాదవతీర్ణోఽసి శాశ్వతః ॥ 40 ॥**

శాశ్వతుడవైన నీవు నీకు ముందే గోకులంలో దేవకాంతలను అవతరింపజేసి, నీ క్రీడార్థమై వారిని ముందు పుట్టించి, ఆ తరువాత భూమికి దిగి వచ్చావు.

**అత్రావతీర్ణా యే కృష్ణ! గోపా ఏవ హి బాన్ధవాః।**
**గోప్యశ్చ సీదతః కస్మాత్ త్వం బన్ధూన్ సముపేక్షసే॥ 41 ॥**

కృష్ణా! ఇక్కడ అవతరించిన గోపకులు, గోపికలు మనకు చుట్టాలేకదా! వారందరూ విషాదంతో దుఃఖిస్తూ ఉండగా నీవు బంధువులను ఎందుకు ఉపేక్షిస్తున్నావు?

**దర్శితో మానుషో భావో దర్శితం బాలచాపలమ్ ।**
**తదయం దమ్యతాం కృష్ణ! దురాత్మా దశనాయుధః ॥ 42 ॥**

ఇంతవరకూ మాయామానుషభావం చూపించావు. చిన్నతనపు చిలిపి చేష్టను కూడా ఇప్పటివరకు కనబరిచావు. కృష్ణా! ఇంక చాలు. దంతాలే ఆయుధాలుగా గల ఈ దుష్టాత్ముని అణగద్రొక్కు" అనిచెప్పాడు.

**ఇతి సంస్మారితః కృష్ణః స్మితభిన్నోష్ఠసమ్పుటః ।**
**ఆస్ఫోట్య మోచయామాస స్వదేహం భోగబన్ధనాత్ ॥ 43 ॥**

అని ఈ విధంగా బలరామునిచే జ్ఞప్తి చేయబడిన వాడై, శ్రీకృష్ణుడు చిరునవ్వులు పెదవులపై చిందించాడు. తనదేహాన్ని ఒక్క సారిగా పెంచాడు. నాగదేహబంధంనుంచి ఆక్షణమే విడివడ్డాడు.

**ఆనమ్య చాపి హస్తాభ్యాముభాభ్యాం మధ్యమం ఫణమ్ ।**
**ఆరుహ్యాభుగ్నశిరసః ప్రననర్తోరువిక్రమః ॥ 44 ॥**

రెండు చేతులతోను ఆ పాము యొక్క మధ్య పడగను వంచి, వంచిన ఆ తలపైకి ఎక్కిమిక్కిలి ఉత్సాహ వేగంతో నృత్యం చేయసాగాడు.

**వ్రణాః ఫణేఽభవంస్తస్య కృష్ణస్యాంఘ్రి నికుట్టనైః ।**
**యత్రోన్నతిం చ కురుతే ననామాస్య తతః శిరః ॥ 45 ॥**

దాని మస్తకంపై ఆ కృష్ణుడు పాదాలచే కసాబిసా త్రొక్కివేయగా ఫణాలపై వ్రణాలు ఏర్పడ్డాయి. దానికి తోకనున్న ప్రాణాలు తలకు వచ్చినట్లయ్యాయి. ఆ కాళియుడు తల ఎత్తిన చోటల్లా, దానిని వంచేలా త్రొక్కి వేయసాగాడు.

**మూర్చాముపాయయౌ భ్రాన్త్యా నాగః కృష్ణస్య రేచకైః ।**
**దణ్డపాతనిపాతేన వవామ రుధిరం బహు ॥ 46 ॥**

కృష్ణపరమాత్మ నాట్యభ్రమణం వల్ల, రేచకగతుల వల్ల, దండపాత నామక నృత్యగమనంవల్ల పడగలు నుగ్గు నుగ్గు కాగా కాళియుడు మూర్ఛ పొందాడు. మిక్కిలిగా రక్తం వెలిగ్రక్కాడు.

**తన్నిర్భిన్నశిరోగ్రీవమాస్యేభ్యః స్రుతశోణితమ్ ।**
**విలోక్య శరణం జగ్ముస్తత్పత్న్యో మధుసూదనమ్ ॥ 47 ॥**

తల, మెడ చితికి పోగా, ముఖాలనుంచి నెత్తురు కారుతూ ఉండగా, ఆ నాగరాజు భార్యలు మధుసూదనుని జాలిగా చూస్తూ శరణు అర్థించారు.

**జ్ఞాతోఽసి దేవదేవేశ! సర్వేశస్త్వమనుత్తమః ।**
**పరంజ్యోతిరచిన్త్యం యస్తదంశః పరమేశ్వరః ॥ 48 ॥**

"దేవదేవేశ్వరా! నీవెవరివో మాకు తెలిసింది. నీవు సర్వేశ్వరుడవు. సర్వోత్తముడవు. పరంజ్యోతివి. ధ్యానైకవిదితుడవు. నీవు పరమేశ్వరుని అంశరూపుడవు.

**న సమర్థాః సురాః స్తోతుం యమనన్యభవం ప్రభుమ్ ।**
**స్వరూపవర్ణనం తస్య కథం యోషిత్ కరిష్యతి ॥ 49**

అనన్యభవుడగు స్వయంప్రభువైన నిన్ను వేల్పులే స్తుతించడానికి సమర్థులు కారు. అటువంటి నీ స్వరూప వర్ణనం చేయడానికి స్త్రీ ఎట్లు సర్వసమర్థురాలు అవుతుంది?

**యస్యాఖిల మహీ వ్యోమ జలాగ్నిపవనాత్మకమ్ ।**
**బ్రహ్మాణ్డ మల్పకాంశాంశః స్తోష్యామస్తం కథం వయమ్ ॥ 50 ॥**

ఎవరికి సమస్తములైన భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశాలు – వీటితో కూడిన బ్రహ్మాండాలు అల్పాంశకాలో అట్టి వానిని మేము ఎట్లు స్తుతించగలము?

**యతన్తో న విదుర్నిత్యం యత్స్వరూపం హి యోగినః ।**
**పరమార్థమణోరల్పం స్థూలాత్ స్థూలం నతాః స్మ తమ్ ॥ 51 ॥**

యోగీశ్వరులు ఏ పరమార్థరూపాన్ని తెలుసుకోవడానికై నిత్యం ప్రయత్నిస్తూ గ్రహించలేకుండా ఉంటారో, అటువంటి అణువుకన్న అణువు, స్థూలంకన్న స్థూలము అయిన ఆ స్వస్వరూపానికి ప్రణమిల్లుతున్నాము.

**న యస్య జన్మనే ధాతా యస్య చాన్తాయ నాన్తకః ।**
**స్థితికర్తా న చాన్యోఽస్తి యస్య తస్మై నమః సదా ॥ 52 ॥**

ఎవని పుట్టుకకు ధాత, ఎవని కాలానికి నాశకారకుడు, ఎవని స్థితికి కారణభూతుడు వేరొకడు లేకుండా ఉంటాడో, అటువంటి అస్తిత్వ కారకునికి సదా నమస్కారం.

**కోపః స్వల్పోఽపి తే నాస్తి స్థితిపాలనమేవ తే ।**
**కారణం కాలియస్యాస్య దమనే శ్రూయతాం వచః ॥ 53 ॥**

నీకు స్థితిని కాపాడడంలో ఇంచుకేనియు కినుక యన్నది లేదు. ఈ కాళియుని నిగ్రహించడంలో కారణం ధర్మపరిపాలనం మాత్రమే. మావిన్నపం ఆలకించు.

**స్త్రియోఽనుకమ్ప్యా స్సాధూనాం మూఢా దీనాశ్చ జన్తవః ।**
**యతస్తతోఽస్య దీనస్య క్షమ్యతాం క్షమతాంవర! ॥ 54 ॥**

క్షమాశీలురలో శ్రేష్ఠుడవైన వాడా! సాధుపురుషులు స్త్రీలపట్ల కనికరం చూపిస్తారు. ప్రాణులు మూఢులు, దీనులు కాబట్టి వారి పట్ల దయ చూపించాలి. కాబట్టి ఈ దీనుని అపరాధాన్ని క్షమించు.

**సమస్త జగదాధారో భవానల్పబలః ఫణీ ।**
**త్వయా చ పీడితో జహ్యాన్ముహూర్తార్ధేన జీవితమ్ ॥ 55 ॥**

నీవయితే సమస్త ప్రపంచానికి ఆశ్రయమిచ్చేవాడవు. ఈ పామయితే తక్కువ బలం కలది. నీవెక్కడ? ఈ అల్పు డెక్కడ? నీ అడుగుల పీడించబడి ఇంక అర్ధముహూర్తకాలంలో ఇది ప్రాణాలు వదలడం నిశ్చయం.

**క్వ పన్నగోఽల్పవీర్యోఽయం క్వ భవాన్ భువనాశ్రయః ।**
**ప్రీతిద్వేషౌ సమోత్కృష్ట గోచరౌ భవతోఽవ్యయ! ॥ 56 ॥**

అల్పాల్పపరాక్రమంగల ఈ పన్నగం ఎక్కడ? అఖిలభువనాలకు ఆశ్రయుడవైన నీ వెక్కడ? ఓ అవ్యయా! నీకు ప్రీతి, ద్వేషం సమానంగా ఒకే స్థాయిలో కనిపిస్తాయి కదా!

**తతః కురు జగత్స్వామిన్! ప్రసాదమవసీదతః ।**
**ప్రాణాంస్త్యజతి నాగోఽయం భర్తృభిక్షా ప్రదీయతామ్ ॥ 57 ॥**

ఓ జగత్స్వామీ! అందువల్ల చావనున్న దీనిపై దయ చూపించు. ఈ నాగరాజు ప్రాణాలు వదలడానికి సిద్ధంగా ఉన్నాడు. మాకు భర్తృభిక్ష ప్రసాదించు" అని కాళియుని భార్యలు వేడుకొన్నారు.

**భువనేశ! జగన్నాథ! మహాపురుషపూర్వజ!**
**ప్రాణాంస్త్యజతి నాగోఽయం భర్తృభిక్షాం ప్రయచ్ఛ నః ॥**
**వేదాన్తవేద్య దేవేశ! దుష్టదైత్య నిబర్హణ!**
**ప్రాణాంస్త్యజతి నాగోఽయం భర్తృభిక్షా ప్రదీయతామ్ ॥**

భువనేశ్వరా! జగన్నాథా! ఎల్లమహాపురుషులకు పూర్వంలో ఉండేవాడా! ఈ నాగం ప్రాణాలు వదలడానికి సిద్ధంగా ఉంది. మాకు భర్తృభిక్ష పెట్టు.

వేదాంతవేద్యా! దేవేశా! దుష్టదైత్యవినాశకా! ఈ సర్పం జీవం విడిచిపెట్టడానికి సిద్ధంగా ఉంది. మాకు భర్తృభిక్ష ప్రసాదించు.

**ఇత్యుక్తే తాభిరాశ్వస్య క్లాన్తదేహోఽపి పన్నగః ।**
**ప్రసీద దేవదేవేతి ప్రాహ వాక్యం శనైః శనైః ॥ 58 ॥**

నాగపత్నులు ఈ విధంగా మొరపెట్టుకోగా, ఒడలంతా వాడిపోయినప్పటికి, ఆ సర్పరాజు నెమ్మది నెమ్మదిగా "దేవదేవా! నాపట్ల ప్రసన్నుడవు కా" అని పలుకసాగాడు.

**తవాష్టగుణమైశ్వర్యం నాథ! స్వాభావికం బలమ్ ।**
**నిరస్తాతిశయం యస్య తస్య స్తోష్యామి కిన్న్వహమ్ ॥ 59 ॥**

"నాథా! నీ ఐశ్వర్యం ఎనిమిదివిధాలు. ఆ సంపద నీకు స్వభావసిద్ధంగా ఉండేది. ఆ అతిశయం ఏనాటికి నిన్ను విడిచియుండేది కాదు. అట్టి నిన్ను నేను ఏమని స్తుతించాలి?

**త్వం పరస్త్వం పరస్యాద్యః పరం త్వత్తః పరాత్మక! ।**
**పరస్మాత్ పరమో యస్త్వం తతః స్తోష్యామి కిన్న్వహమ్ ॥ 60 ॥**

పరస్వరూపా! నీవు పరుడవు. నీవే పరానికి మొదటి వాడవు. నీవల్లనే పరం అనేది ఏర్పడింది. పరం అని వ్యవహరించబడే దానికన్న నీవే పరముడవు. అందువల్ల నిన్ను ఎలాగ ప్రస్తుతించాలి?

**యస్మాద్ బ్రహ్మా చ రుద్రశ్చ చన్ద్రేన్ద్రమరుతోఽశ్వినౌ ।**
**వసవశ్చ సహాదిత్యై స్తస్య స్తోష్యామి కిన్న్వహమ్ ॥ 61 ॥**

ఎవని వల్ల బ్రహ్మ, రుద్రుడు, చంద్రుడు, ఇంద్రుడు, మరుత్తులు, అశ్వినీకుమారులు, వసువులు, ఆదిత్యులు మున్నగు వారు ఉత్పన్నులు అవుతున్నారో, అట్టివానిని నేనెలా ప్రశంసించాలి?

**ఏ కావయవసూక్ష్మాంశో యస్యైతదఖిలం జగత్ ।**
**కల్పనావయవస్యాంశస్తస్య స్తోష్యామి కిం న్వహమ్ ॥ 62 ॥**

ఈ కనబడే సమస్త జగత్తు ఎవనికి ఒక భాగంలో సూక్ష్మభాగమో, ఆ భాగంకూడ నిరవయవునికి ఒక కల్పనామాత్రావయవమో అటువంటి నిన్ను ఏమని కొనియాడాలి?

**సదసద్రూపిణో యస్య బ్రహ్మాద్యాస్త్రిదశోత్తమాః ।**
**పరమార్థం న జానన్తి తస్య స్తోష్యామి కిం న్వహమ్ ॥ 63 ॥**

బ్రహ్మాదులు, దేవతా శ్రేష్ఠులు ఎవని సదసద్రూప (కార్యకారణరూప) వాస్తవికస్వరూపాన్ని తెలుసుకో జాలకున్నారో, అటువంటి వానిని నేనేమని సంస్తుతించాలి?

**బ్రహ్మాద్యైరర్చితో యస్తు గన్ధపుష్పానులేపనైః ।**
**నన్దనాది సముద్భూతైః సోఽర్చ్యతే వా కథం మయా ॥ 64 ॥**

నందనవనం మున్నగు వాటిలో ఉద్భవించే సుగంధకుసుమాలచే, దివ్యపరిమళలేపనాలచే ఎవడు బ్రహ్మాదులచే పూజించబడుతూ ఉంటాడో, అట్టి స్వామిని నేను ఏ విధంగా అర్చించాలి?

**యస్యావతారరూపాణి దేవరాజస్సదాఽర్చతి ।**
**న వేత్తి పరమం రూపం సోఽర్చ్యతే వా కథం మయా ॥ 65 ॥**

ఎవని అవతారరూపాలను దేవేంద్రుడు నిత్యం అర్చిస్తూ ఉన్నా, ఆ పరమస్వరూపాన్ని తెలుసుకోకుండా ఉండి పోయాడో, అట్టి స్వస్వరూపాన్ని నేను ఏ విధంగా పూజించాలి?

**విషయేభ్యః సమావృత్య సర్వాక్షాణి చ యోగినః ।**
**సమర్చయంతి ధ్యానేన సోఽర్చ్యతే వా కథం మయా ॥ 66 ॥**

యోగీశ్వరులు సమస్తేంద్రియాలను విషయవాసనలనుంచి మరలించి ధ్యాన యోగంచే ఎవని ధ్యానించి అర్చిస్తూ ఉంటారో, అట్టి వానిని నేను ఏ విధంగా ధ్యానించి అర్చించాలి?

**హృది సంకల్ప్య యద్రూపం ధ్యానేనార్చన్తి యోగినః ।**
**భావపుష్పాదినా నాథ! సోఽర్చ్యతే వా కథం మయా ॥ 67 ॥**

నాథా! యోగీంద్రులు ధ్యానంలో హృదయమునందు ఎవని రూపాన్ని కల్పించుకొని, భావ పుష్పం మున్నగు వాటితో (అహింసా పుష్పం) సమర్పిస్తూ ఉంటారో, అటువంటి వానికి నా మనః పుష్పం ఎలా అర్పించాలి?

**సోఽహం తే దేవదేవేశ! నార్చనాయాం స్తుతౌ న చ ।**
**సామర్థ్యవాన్ కృపామాత్ర మనోవృత్తిః ప్రసీద మే ॥ 68 ॥**

అటువంటి నేను దేవదేవ! ఈశ్వరా! అర్చించడంలో కాని, స్తుతి చేయడంలో కాని శక్తిలేని వాడను! కేవలం దయతో కూడుకొన్న మనోవృత్తితో నన్ను అనుగ్రహించు.

**సర్పజాతిరియం క్రూరా యస్యాం జాతోఽస్మి కేశవ! ।**
**తత్స్వభావోఽయమత్రాస్తి నాపరాధో మమాచ్యుత! ॥ 69 ॥**

కేశవా! ఈ సర్పజాతి మిక్కిలి క్రూరాతిక్రూరమైనది. ఆజాతిలో నేను పుట్టాను. అచ్యుతా! అందువల్ల ఆ స్వభావమే నన్ను వెంటాడింది. ఇందు నాతప్పిదమంటూ ఏదీ లేదు.

**సృజ్యతే భవతా సర్వం తథా సంహ్రియతే జగత్ ।**
**జాతిరూపస్వభావాశ్చ సృజ్యన్తే జగతాం త్వయా ॥ 70 ॥**

ఈ జగత్తు అంతా నీ వల్ల సృష్టించబడుతోంది. నీ చేతనే ఉపసంహరించబడుతోంది. ఈ జగత్తులోని జీవులకు జాతి, రూపం, స్వభావం నీ వల్లనే నిర్ణయించబడి ఏర్పడుతున్నాయి.

**యథాఽహం భవతా సృష్టో జాత్యా రూపేణ చేశ్వర! ।**
**స్వభావేన చ సంయుక్త స్తథేదం చేష్టితం మమ ॥ 71 ॥**

ఈశ్వరా! నేను నీ వల్ల ఏ విధంగా జాతి చేతను, దానికి సంబంధించిన రూపం చేతను, దానికి అనురూపమైన స్వభావం చేతను సృష్టించబడ్డానో, దాని కనుగుణమైన ప్రవృత్తితో ఈ పాపచేష్ట నాద్వారా ఒనరించబడింది.

**యదన్యథా ప్రవర్తేయం దేవదేవ! తతో మయి ।**
**న్యాయ్యో దణ్డ నిపాతో వై తవైవ వచనం యథా ॥ 72 ॥**

దేవదేవా! నేను దానికి భిన్నంగా మరో విధంగా ప్రవర్తిస్తే, అప్పుడు నాపై దండపాతం సరైనదవుతుంది. ఇది నీ కథనానుసారంగా జరిగిందే.

**తథాఽపి యజ్జగత్స్వామిన్ దణ్డం పాతితవాన్మయి ।**
**స సోఢోఽయం వరం దణ్డస్త్వత్తో నాన్యత్ర మే వరః ॥ 73 ॥**

జగత్స్వామీ! అయినా అజ్ఞానినైన నాపై శిక్షవేశావు. ఇది ఇతరుల వల్ల అయ్యేది కాదు. నీ వల్ల ఈ దండన జరిగింది కాబట్టి ఇది నాకు వరమే (అనుగ్రహమే).

**హతవీర్యో హతవిషో దమితోఽహం త్వయాఽచ్యుత! ।**
**జీవితం దీయతామేకమాజ్ఞాపయ కరోమి కిమ్ ॥ 74 ॥**

అచ్యుత! నాబలం నశించింది. విషమూ నష్టమై పోయింది. నన్ను పూర్తిగా అణగ ద్రొక్కి వేశావు. ఒక్క ప్రాణం ఉండేటట్లుగా అనుగ్రహించు. దానికి నేనేమి చేయాలో ఆజ్ఞాపించు" అని పదే పదే వేడుకొన్నాడు.

**భగవానువాచ :-** భగవానుడు పలికాడు.

**నాత్ర స్థేయం త్వయా సర్ప! కదాచిద్ యమునాజలే ।**
**సభృత్యపరివారస్త్వం సముద్రసలిలం వ్రజ(పుత్ర) ॥ 75 ॥**

ఈ రీతిగా కాళియుడు ప్రార్థించగా కృష్ణుడు "సర్పరాజా! నీ విక్కడ ఈ యమునా జలంలో ఎన్నటికీ ఉండడానికి వీలులేదు. పుత్రులతో, పరివారంతో, అందరితో కలసి నీవు సముద్రానికి పోయి అచ్చట జలాలలో వసించు.

**మత్పదాని చ తే సర్ప! దృష్ట్వా మూర్ధని సాగరే ।**
**గరుడః పన్నగరిపు స్త్వయి న ప్రహరిష్యతి ॥ 76 ॥**

నాగరాజా! నీ తలపై నున్న నాపాదాల చిహ్నాలను చూచి సాగరంలో పాములకు సహజశత్రువయిన గరుడుడు నీపట్ల ఏ విధమైన హాని తలపెట్టడు"

**ఇత్యుక్త్వా సర్పరాజానం ముమోచ భగవాన్ హరిః ।**
**ప్రణమ్య సోఽపి కృష్ణాయ జగామ పయసాం నిధిమ్ ॥ 77 ॥**

అని పలికి భగవంతుడైన హరి సర్పరాజును విడిచి వేశాడు. ఆ కాళియుడు కూడ కృష్ణునకు వినమ్రుడై ప్రణామంచేసి జలరాశికి పయనమయ్యాడు.

**పశ్యతాం సర్వభూతానాం సభృత్యాపత్యబాన్ధవః ।**
**సమస్తభార్యాసహితః పరిత్యజ్య స్వకం హ్రదమ్ ॥ 78 ॥**

సమస్తప్రాణులు చూస్తూ ఉండగా భృత్యులు, తనయులు, బాంధవులతో కూడినవాడై అతని భార్యలందరూ వెంటవస్తూ ఉండగా తన మడువు విడిచి పెట్టివెళ్లి పోయాడు.

**తతః సర్వే పరిష్వజ్య మృతం పునరివాగతమ్ ।**
**గోపా మూర్ధని గోవిన్దం సిషిచుర్నేత్రజైర్జలైః ॥ 79 ॥**

అనంతరం ఆ గోపాలకుందరూ చనిపోయిన వాడు బ్రతికి వచ్చినట్లుగా భావించి గోవిందుని కౌగిలించుకొని, శిరస్సు మూర్కొని ఆనందనయనబాష్పాలతో తడిపివేశారు.

**కృష్ణమక్లిష్టకర్మాణమన్యే విస్మితచేతసః ।**
**తుష్టువుర్ముదితా గోపా దృష్ట్వా శివజలాం నదీమ్ ॥ 80 ॥**

క్లేశం లేని శుభకర్మలు ఆచరించే కృష్ణుని చూచి మిగిలిన వారందరు అచ్చెరువుతో కూడిన మనస్సు కలవారయ్యారు. మంగళదాయకాలైన ఏ విషం లేని యమునానదీ జలాలను వీక్షించి గోపాలురందరు ఆనందంతో ఉప్పొంగి పోయారు.

**గీయమానః స గోపీభిశ్చరితైః సాధు చేష్టితైః ।**
**సంస్తూయమానో గోపైశ్చ కృష్ణో వ్రజముపాగమత్ ॥ 81 ॥**

గోపికలందరూ కృష్ణచరిత్రలను గానం. చేయసాగారు. వారు కృష్ణుని బాల్యచేష్టలను అభినయించారు. గోపాలకుందరూ కృష్ణుని ప్రశంసించసాగారు. అందరితో కలసి కృష్ణుడు వ్రేపల్లెకు విచ్చేశాడు – అని పరాశరుడు మైత్రేయునికి వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే కాలియమర్దనం నామ సప్తమోఽధ్యాయః సమాప్తః ॥ 7 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో కాలియమర్దనం అనే ఏడవ అధ్యాయం సమాప్తం ॥ 7 ॥



## అష్టమోఽధ్యాయః - ఎనిమిదవ అధ్యాయం

## ధేనుకాసురవధః - ధేనుకాసురవధ

**పరాశర ఉవాచ :-** పరాశరుడు పలికాడు.

**గాః పాలయన్తౌ చ పునః సహితౌ బలకేశవౌ ।**
**భ్రమమాణౌ వనే తస్మిన్ రమ్యం తాలవనం గతౌ ॥ 1 ॥**

ఒకప్పుడు బలరామకేశవులు ఇద్దరూ మళ్లీ గోపాలురతో కలిసి పశువులను మేపుతూ ఇటూ అటూ తిరుగుతూ ఆ బృందారణ్యంలో నున్న తాలవనానికి వెళ్లారు.

**తత్తు తాలవనం దివ్యం ధేనుకో నామ దానవః ।**
**మృగమాంసకృతాహారః సదాఽధ్యాస్తే ఖరాకృతిః ॥ 2 ॥**

ధేనుకుడు అనే పేరుగల దానవుడు గార్దభరూపంతో మృగమాంసాన్ని ఆహారంగా స్వీకరిస్తూ, దివ్యమైన ఆ తాలవనంలో ఎల్లప్పుడూ వాసం చేస్తూ ఉంటాడు.

**తత్తు తాలవనం పక్వఫలసమ్పత్సమన్వితమ్ ।**
**దృష్ట్వా స్పృహాన్వితా గోపాః ఫలాదానేఽబ్రువన్వచః ॥ 3 ॥**

ఆ తాలవనం పండిన తాటిపండ్లతో సమృద్ధిగా ఉండడం చూచి, ఆ పండ్లు తినాలనే కోరిక మిక్కుటం కాగా గోపాలురు అందరూ రామకృష్ణులతో ఇలా చెప్పారు.

**హే రామ! హే కృష్ణ! సదా ధేనుకేనైష రక్ష్యతే ।**
**భూప్రదేశో యతస్తస్మాత్ పక్వానీమాని సన్తి వై ॥ 4 ॥**

"రామా! ఓ కృష్ణా! ఇది ఎల్లప్పుడూ ధేనుకుని రక్షణలో ఉండడం వల్ల, ఈ ప్రదేశమంతా పండిన తాటిపండ్లతో నిండి ఎంతో సమృద్ధిగా ఉంది.

**ఫలాని యస్య తాలానాం గన్ధామోదితదింశి చ ।**
**వయమత్తుమభీప్సామః పాత్యన్తాం యది రోచసే ॥ 5 ॥**

ఈ తాటిచెట్ల పండ్లు తమ సువాసనల ద్వారా దిక్కులను పరిమళింపజేస్తున్నాయి. మేము ఈ ఫలాలను తినాలని కోరుకొంటున్నాము. మీకు ఇష్టమయితే ఈ పండ్లను రాల్చండి" అని కోరారు.

**ఇతి గోపకుమారాణాం శ్రుత్వా సంకర్షణో వచః ।**
**కృష్ణశ్చ పాతయామస భువి తాలఫలాని వై ॥ 6 ॥**

గోపకుమారుల మాటలను విన్న సంకర్షణుడు, కృష్ణుడు ఆ తాటిచెట్ల ఫలాలను నేలపైకి రాల్చారు.

**ఫలానాం పతతాం శబ్దమాకర్ణ్య స దురాసదః ।**
**ఆజగామ సుదుష్టాత్మా కోపాద్ దైతేయ గర్దభః ॥ 7 ॥**

పండ్లు దబదబా క్రిందకు రాలుతున్న శబ్దం విన్న, తేరిపార చూడరాని మహాదుష్టుడైన గర్దభాసురుడు మహాకోపంతో గబగబా అచ్చటకు వచ్చాడు.

**పద్భ్యాముభాభ్యాం స తదా పశ్చిమాభ్యాం బలీ బలమ్ ।**
**జఘానోరసి తాభ్యాం చ స చ తేనాప్యగృహ్యత ॥ 8 ॥**

ఆ మహాబలవంతుడు ఆ సమయంలో వెనుక కాళ్లను నేలపై కొట్టుకుంటూ వచ్చి మిక్కిలి బలంతో వాళ్ల వక్షః స్థలంపై గట్టిగా తన్నాడు. బలరాముడు కూడా (కృష్ణసహితుడై) ఆ రెండు కాళ్లు పట్టుకోగా అతడు వారికి చిక్కాడు.

**గృహీత్వా భ్రామణేనైవ సోఽమ్బరే గతజీవితమ్ ।**
**తస్మిన్నేవ చ చిక్షేప వేగేన తృణరాజని ॥ 9 ॥**

ఆ ధేనుకాసురుని పట్టుకొని ఆకాశంలో గిరగిర త్రిప్పగా, వాడక్కడే అసువులు విడిచాడు. వాడు అక్కడనున్న పచ్చిక బయలుపై మహావేగంగా విసరివేయబడ్డాడు.

**తతః ఫలాన్యనేకాని తాలాగ్రాన్నిపతన్ ఖరః ।**
**పృథివ్యాం పాతయామాస మహావాతోఽమ్బుదానివ ॥ 10 ॥**

ఆ సమయంలో ఆ ఖరాసురుడు తాలాగ్రభాగం నుంచి భూమిపై పడుతూ, మహావాయువు మేఘాలను కొల్ల గొట్టినట్లుగా ఎక్కువ తాటి పండ్లను జలజలా రాల్చాడు.

**అన్యానప్యస్య వై జ్ఞాతీనాగతాన్ దైత్యగర్దభాన్ ।**
**కృష్ణశ్చిక్షేప తాలాగ్రే బలభద్రశ్చ లీలయా ॥ 11 ॥**

ఆతని జ్ఞాతులైన మిగిలిన గర్దభాసురానుచరులు కూడా తమమీదికి వస్తూ ఉండగా, కృష్ణుడు, బలరాముడు వారిని పట్టుకొని తాలాగ్రాలపై అవలీలగా విసరివేశారు.

**క్షణేనాలంకృతా పృథ్వీ పక్వైస్తాలఫలైస్తథా ।**
**దైత్యగర్దభదేహైశ్చ మైత్రేయ! శుశుభేఽధికమ్ ॥ 12 ॥**

మైత్రేయా! ఒకక్షణకాలంలో భూమి అంతా పండిన తాటిపండ్లతో సుశోభితమయింది. గర్దభాసురుల శరీరాలతో పృథివి ఎక్కువగా శోభిల్లింది.

**తతో గావో నిరాబాధా స్తస్మింస్తాలవనే ద్విజ! ।**
**నవశష్పం సుఖం చేరు ర్యన్న భుక్తమభూత్పురా ॥ 13 ॥**

ద్విజా! ఆనాటి నుంచి గోవులు ఏ బాధ లేకుండా ఆ తాలవనంలో మున్నెన్నడు రుచిచూడని లేతగడ్డి మేస్తూ సుఖంగా సంచరించాయి.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే ధేనుకాసురవధో నామ అష్టమోఽధ్యాయః సమాప్తః ॥ 8 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో ధేనుకాసురవధ అనే ఎనిమిదవ అధ్యాయం సమాప్తం ॥ 8 ॥

## నవమోఽధ్యాయః - తొమ్మిదవ అధ్యాయం

## ప్రలంబాసురవధః – ప్రలంబాసురవధ

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**తస్మిన్ రాసభదైతేయే సానుగే వినిపాతితే ।**
**సేవ్యం గోగోపగోపీనాం రమ్యం తాలవనం బభౌ ॥ 1 ॥**

ఆ గర్దభాసురుడు అనుచరులతో కలసి అలా మరణించగా, ఆ తాలవనం గోవులచేత, గోపాలకులచేత, గోపికల చేత సేవించబడుతూ ప్రశాంతపరమరమణీయమయింది.

**తతస్తౌ జాతహర్షౌ తు వసుదేవసుతావుభౌ ।**
**హత్వా ధేనుకదైతేయం భాణ్డీర వటమాగతౌ ॥ 2 ॥**

వసుదేవుని కుమారులైన బలరామకృష్ణులిరువురు అలా ధేనుకాసురుని వధించి ఆనందంతో ఉప్పొంగుతూ, భాండీరం అనే వటవృక్ష సమీపానికి వచ్చారు.

**క్ష్వేలమానౌ ప్రగాయన్తౌ విచిన్వన్తౌ చ పాదపాన్ ।**
**చారయన్తౌ చ గా దూరే వ్యాహరన్తౌ చ నామభిః ॥ 3 ॥**
**నిర్యోగ పాశస్కన్ధౌ తౌ వనమాలావిభూషితౌ ।**
**శుశుభాతే మహాత్మానౌ బాలశృంగావివర్షభౌ ॥ 4 ॥**

గోవులను బంధించే త్రాళ్లను భుజాలపైన, వనమాలలను కంఠాలయందు అలంకారంగా ధరించి, ఆ మహాత్ములిద్దరూ సింహనాదాలు చేస్తూ, పాటలు పాడుతూ, చెట్లమాటున ఒకరినొకరు వెదకుకొంటూ ఆటలాడుతూ, అల్లంత దూరంలో ఆలమందలను కాస్తూ, వాటిని పేరుపేరున పిలుస్తూ, చిరు కొమ్ములతో కులికే గిత్తలు లాగా శోభించారు.

**సువర్ణాంజనచూ(వ)ర్ణాభ్యాం తౌ తదా రుషితామ్బరౌ ।**
**మహేన్ద్రాయుధసంయుక్తౌ శ్వేతకృష్ణావివామ్బుదౌ ॥ 5 ॥**

బంగారు జరీ, కాటుక పొడి (రంగు) చిందే చక్కని వలువలు ధరించి, ఇంద్రధనుస్సుతో ప్రకాశించే తెల్లనైన, నల్లనైన మేఘాలలాగా వారు శోభించారు.

**చేరతుర్లోకసిద్ధాభిః క్రీడాభిరితరేతరమ్ ।**
**సమస్తలోకనాథానాం నాథభూతౌ భువం గతౌ ॥ 6 ॥**

సమస్తలోకనాథులకు నాథులైన ఆ మహానుభావులు భువి నవతరించి, నానావిధ లౌకిక క్రీడల ద్వారా, చెడుగుడి మున్నగు లోకప్రసిద్ధాలైన ఆటలతో విహరించారు.

**మనుష్యధర్మాభిరతౌ మానయన్తౌ మనుష్యతామ్ ।**
**తజ్జాతిగుణయుక్తాభిః క్రీడాభిశ్చేరతుర్వనమ్ ॥ 7 ॥**

మానవధర్మాలు పాటించడంలో మిక్కిలి మక్కువ కలవారై, మనుష్యత్వాన్ని గౌరవిస్తూ, ఆ మానవజాతి స్వభావాలకు తగినటువంటి క్రీడలద్వారా బృందారణ్యంలో విహరించారు.

**తతః స్వాన్దోలికాభిశ్చ నియుద్ధైశ్చ మహాబలౌ ।**
**వ్యాయామం చక్రతుస్తత్ర క్షేపణీయైస్తథాఽశ్మభిః ॥ 8 ॥**

అంతే కాక ఉయ్యాలలూగడం, కుస్తీలు, సాముగరిడీలు, గోటీబిళ్లలు, వడిసెలరాళ్లు విసరడం మున్నగు బాల్యక్రీడలతో ఆ మహాబలశాలురిరువురు వ్యాయామలీలలు ఆచరించారు.

**తల్లిప్సురసురస్తత్ర హ్యుభయో రమమాణయోః ।**
**ఆజగామ ప్రలమ్బాఖ్యో గోపవేషతిరోహితః ॥ 9 ॥**

వారిద్దరూ ఇలా ఆడుకొంటూ ఉండగా, వారిని ఎత్తుకు పోవడానికై ప్రలంబుడు అనే పేరుగల రక్కసుడు గోపాలకవేషంలో తనరూపం కానరాకుండా అక్కడకు చేరాడు.

**సోఽవగాహత నిశ్శంకస్తేషాం మధ్యమమానుషః ।**
**మానుషం వపురాస్థాయ ప్రలమ్బో దానవోత్తమః ॥ 10 ॥**

ఆ దానవ శ్రేష్ఠుడయిన ప్రలంబుడు మానవదేహం ధరించి వారిమధ్యలో రాక్షసప్రవృత్తిని మరుగు పరచి ఏ జంకూ కొంకూ లేకుండా కలిసిపోయాడు.

**తయోశ్ఛిద్రాన్తరం ప్రేప్సురవిషహ్యం మమన్యత ।**
**కృష్ణం తతో రౌహిణేయం హన్తుం చక్రే మనోరథమ్ ॥ 11 ॥**

వారిద్దరు ఏమరుపాటుగా ఉండే సమయం కొరకై వేచి చూడ సాగాడు. అందు కృష్ణుడు సర్వథా అజేయుడని భావించాడు. అందువల్ల రోహిణీ తనయుడైన బలరాముని చంపాలని ఉబలాటపడ్డాడు.

**హరిణా క్రీడనం నామ బాలక్రీడనకం తతః ।**
**ప్రకుర్వన్తౌ హి తే సర్వే ద్వౌ ద్వౌ యుగపదుత్పతన్ ॥ 12 ॥**

ఆ సమయంలో వారు హరిణా క్రీడనం (లేళ్లవలె గంతులు వేస్తూ ఇద్దరిద్దరు పరుగెత్తాలి. లక్ష్యం చేరుకొన్నవాడు ముందు విజేత. ముందు చేరుకోలేని వాడు ఓడిపోయిన వాడు. ఓడినవాడు విజేతను తన భుజాలపైకెక్కించుకొని మోయాలి). అనే ఒకానొక బాల్యక్రీడ ఆడాలని వారు అందరూ ఇద్దరిద్దరు చొప్పున రెండు జట్లుగా ఏర్పడి పరుగెత్తారు.

**శ్రీదామ్నా సహ గోవిన్దః ప్రలమ్బేన తథా బలః ।**
**గోపాలైరపరైశ్చాన్యే గోపాలాః పుప్లువుస్తతః ॥ 13 ॥**

గోవిందుడు శ్రీదామునితోను, బలరాముడు ప్రలంబునితోను, కృష్ణపక్షంలోని గోపాలకులు అన్యపక్షంలోని గోపాలురతోను కలసి పరుగెత్తి ఎగిరారు.

**శ్రీదామానం తతః కృష్ణః ప్రలమ్బం రోహిణీసుతః ।**
**జితవాన్ కృష్ణపక్షీయై ర్గోపైరన్యే పరాజితాః ॥ 14 ॥**

అందు కృష్ణుడు శ్రీదాముని, బలరాముడు ప్రలంబుని ఓడించారు. అలాగే కృష్ణపక్షీయులగు గోపాలకులు విపక్షంలోని గోపాలురను పరాజయంపాలు చేశారు.

**తే వాహయన్త స్త్వన్యోన్యం భాణ్డీరస్కన్ధమేత్య వై ।**
**పునర్నివవృతుః సర్వే యే యైశ్చాత్ర పరాజితాః ॥ 15 ॥**

వారు ఒకరి నొకరు మోసుకొంటూ భాండీర వటవృక్షం వద్దకు వెళ్లి, తిరిగి అక్కడ నుంచి స్వస్థలానికి రావాలని, ఓడినవారు ఓడనివారిని మోసుకొంటూ విచ్చేయాలని పందెం ముందే పరచు కొన్నారు.

**సంకర్షణస్తు స్కన్ధేన శీఘ్రముత్క్షిప్య దానవః ।**
**న తస్థౌ స జగామైవ సచన్ద్ర ఇవ వారిదః ॥ 16 ॥**

అపుడు ప్రలంబాసురుడు సంకర్షణుని మూపుపైకి ఎక్కించు కొని తటాలున ఎగిరి తిరిగి రాకుండా ఆ క్షణమే చంద్రుని తోడి మబ్బులాగా ఆకాశానికి పోయాడు.

**అసహన్ రౌహిణేయస్య స భారం దానవోత్తమః ।**
**వవృధే సుమహాకాయః ప్రావృషేవ బలాహకః ॥ 17 ॥**

ఆ దానవశ్రేష్ఠుడు బలరాముని బరువును మోయలేక తన శరీరాన్ని పెంచనారంభించి వర్షా కాలంలోని మేఘంలాగా విజృంభించాడు.

**సంకర్షణస్తు తం దృష్ట్వా దగ్ధశైలోపమాకృతిమ్ ।**
**స్రగ్దామలమ్బాభరణం మకుటాటోపమస్తకమ్ ॥ 18 ॥**

**రౌద్రం శకటచక్రాక్షం పదన్యాసచలత్ క్షితిమ్ ।**
**(అభీతమనసా తేన రక్షసా రోహిణీసుతః)**
**హ్రియమాణస్తతః కృష్ణమిదం వచనమబ్రవీత్ ॥ 19 ॥**

బలరాముడయితే మండుతున్న పర్వతంలాంటి రూపంతో ఉన్న, పొడుగుగా వ్రేలాడుతున్న పూలమాలలు భూషణాలతో ఉన్న, నెత్తిపై కిరీటంతో భాసిస్తూ ఉన్న, బండి చక్రాల వంటి కన్నులతో ఉన్న, అడుగు వేస్తే చాలు భూమి కంపిస్తుందా అన్నట్లున్న, మహారౌద్ర స్వరూపంతో ఉన్న, జడుపూ గిడుపూ లేని మనస్సుతో తనను అపహరిస్తూ ఉన్న ఆ రక్కసుని చూచి కృష్ణునితో ఇలా అన్నాడు.

**కృష్ణ! కృష్ణ! హ్రియామ్యేష పర్వతోదగ్రమూర్తినా ।**
**కేనాపి పశ్య దైత్యేన గోపాలచ్ఛద్మరూపిణా ॥ 20 ॥**

"కృష్ణా! కృష్ణా! చూడు వీడెవడో పెద్దపర్వతంలా మహాభయంకరంగా ఉన్నాడు. గోపాలరూపంలో ఉన్న ఒక మాయావియైన దైత్యునిచే నేనపహరించబడుతున్నాను.

**యదత్ర సాంప్రతం కార్యం మయా మధునిషూదన! ।**
**తత్కథ్యతాం ప్రయాత్యేష దురాత్మాఽతిత్వరాఽన్వితః ॥ 21 ॥**

ఓ మధుసూదనా! ఇప్పుడు నేను ఏం చేయవలసి ఉంది? ఈ దుష్టాత్ముడు మిక్కిలి తొందరగా నన్ను హరించుకొని పోతున్నాడు. త్వరగా చెప్పు" అని గట్టిగా అన్నాడు.

**తమాహ రామం గోవిన్దః స్మితభిన్నోష్ఠసమ్పుటః ।**
**మహాత్మా రౌహిణేయస్య బలవీర్యప్రమాణవిత్ ॥ 22 ॥**

అట్లు అనగా మహాత్ముడైన గోవిందుడు చిరునవ్వుతో పెదవులు చిందులాడగా బలరాముని బలం, వీర్యం, ప్రమాణం తెలిసున్నవాడు కాన రౌహిణేయునితో ఇలా అన్నాడు.

**కిమయం మానుషో భావో వ్యక్తమేవావలమ్బ్యతే ।**
**సర్వాత్మన్! సర్వగుహ్యానాం గుహ్యగుహ్యాత్మనా త్వయా ॥ 23 ॥**

"ఓ సర్వస్వరూపా! సర్వగుహ్యములకన్న గుహ్యాతిగుహ్యమైన వాడవు నీవు. నిర్గుణపరబ్రహ్మవయిన నీకు ఈ మనుష్యరూపవిడంబనం ఏల? ఏల నీలో మనుష్యత్వం వ్యక్తమవుతోంది?

**స్మరాశేషజగద్బీజకారణం కారణాగ్రజమ్ ।**
**ఆత్మానమేకం తద్వచ్చ జగత్యేకార్ణవే చ యత్ ॥ 24 ॥**

సమస్తజగత్తుకు ఉత్పత్తికారణమైన కారణం కన్న ముందు పుట్టిన వాడవీవు. జగత్తు అంతా ఏ కార్ణవం కాగా, ఏకాత్మకమై మిగిలియున్న నీ స్వస్వరూపాన్ని ఒక్కసారి స్మరించు.

**కిం న వేత్సి యథా హం చ త్వం చైకం కారణం భువః ।**
**భారావతారణార్థాయ మర్త్యలోకముపాగతౌ ॥ 25 ॥**

నీవు ఎందుకు తెలుసుకోవడం లేదు? నేను, నీవు కూడ జగత్తుకు మూలకారణం కదా! ఈ భూమి భారాన్ని తగ్గించడానికై మనం ఇద్దరం మర్త్యలోకంలో అవతరించాము కదా!

**నభః శిరస్తేఽమ్బువహాశ్చ కేశాః పాదౌ క్షితిర్వక్త్ర మనన్త వహ్నిః ।**
**సోమో మనస్తే శ్వసితం సమీరో దిశశ్చతస్రోఽవ్యయ బాహవస్తే ॥ 26 ॥**

అనంతా! గగనమే నీ శిరస్సు. మేఘాలే కేశాలు. పాదాలే భూమి. ముఖమే అగ్ని. నీకు చంద్రుడే మనస్సు. నీ నిట్టూర్పు వాయువే. అవ్యయా! నీ నాలుగు బాహువులే నాలుగు దిశలు.

**సహస్రవక్త్రో భగవాన్ మహాత్మా సహస్రహస్తాంఘ్రిశరీరభేదః ।**
**సహస్రపద్మోద్భవయోనిరాద్యః సహస్రశస్త్వాం మునయో గణన్తి ॥ 27 ॥**

నీవు భగవంతుడవు. మహాత్ముడవు. సహస్రవదనుడవు. సహస్రహస్తుడవు. సహస్రపాదుడవు. అనేకశరీర భేదం కలవాడవు. సహస్రబ్రహ్మలకు ఆది కారణుడవు. సహస్రవిధాలుగా మునులు నిన్ను పరిగణిస్తూ ఉంటారు.

వి ॥ ఇచట సహస్రశబ్దానికి అనంతం అని అర్థం.

**దివ్యం హి రూపం తవ వేత్తి నాన్యో దేవైరశేషైరవతారరూపమ్ ।**
**తవార్చ్యతే వేత్సి న కిం యదన్తే త్వయ్యేవ విశ్వం లయమభ్యుపైతి ॥ 28 ॥**

నీ దివ్యరూపాన్ని అన్యుడు తెలిసికొనలేడు. నీకన్న వ్యతిరిక్తమైన వాడు నిన్నెవడో ఎరుగడు. అందువల్ల సమస్తదేవతాగణాలు నీ అవతారరూపాన్ని ఉపాసనచేస్తూ ఉంటారు. చివరకు ఈ విశ్వమంతా నీలోనే లయమవుతోందని నీవు గ్రహించలేదా?

**త్వయా ధృతేయం ధరణీ బిభర్తి చరాచరం విశ్వమనన్తమూర్తే! ।**
**కృతాదిభేదైరజ! కాలరూపో నిమేషపూర్వో జగదేతదత్సి ॥ 29 ॥**

అనంతమూర్తీ! నీ చే ధరించబడే ఈ ధరణి సమస్తచరాచరప్రపంచాన్ని ధరిస్తోంది. ఓ అజా! నీ నిమేషాది కాలస్వరూపం కృతయుగాది భేదాలతోనున్న ఈ జగత్తును గ్రసించి వేస్తోంది.

**అత్తం యథా బాడబవహ్నినాఽమ్బు హిమస్వరూపం పరిగృహ్య కాన్తమ్ ।**
**హిమాచలే భానుమతోఽంశుసంగా జ్జలత్వ మభ్యేతి పునస్తదేవ ॥ 30 ॥**

బడబాగ్నిచే త్రాగివేయబడిన నీరు ఏదయితే ఉందో, అది చక్కని మంచుగా (వాయువు ద్వారా) హిమాచలం చేరి ఏర్పడుతోంది. అదే హిమాలయంపై సూర్యకిరణ సాంగత్యం వల్ల మళ్లీ అదే మంచు నీరుగా మారుతోంది.

**ఏవం త్వయా సంహరణేఽత్తమేత జ్జగత్ సమస్తం పునరప్యవశ్యమ్ ।**
**తవైవ సర్గాయ సముద్యతస్య జగత్త్వమభ్యేత్యనుకల్పమీశ! ॥ 31 ॥**

అదే విధంగా ఓ ఈశ్వరా! ఈ సమస్త జగత్తు (రుద్రాదిరూపంతో) నీద్వారా లయమైపోయి పరమేశ్వర రూపంతో నీ అధీనమై ఉంటోంది. మళ్లీ తరువాతి కల్పంలో నీద్వారా (హిరణ్య గర్భరూపంతో) సృష్టిరచన ప్రవర్తించి (విరాట్సురూపంతో) స్థూలజగత్తు ఏర్పడుతోంది.

**భవానహం చ విశ్వాత్మన్నేకమేవ హి కారణమ్ ।**
**జగతోఽస్య జగత్యర్థే భేదేనావాం వ్యవస్థితౌ ॥ 32 ॥**

విశ్వస్వరూపా! నీవు, నేను మనమిద్దరం ఈ జగత్తుకు ఏకమాత్ర కారణమై యున్నాము. ఈ విశ్వం హితం కొరకై భిన్నభిన్నరూపాలను ధరించాము.

**తత్ స్మర్యతామమేయాత్మన్! త్వయాత్మా జహి దానవమ్ ।**
**మానుష్యమేవావలమ్బ్య బన్ధూనాం క్రియతాం హితమ్ ॥ 33 ॥**

అమేయాత్మా! నీవు నీస్వస్వరూపాన్ని ఒక్కసారి స్మరించు. మానుష్య భావాన్ని స్వీకరించిన నీ అవతారాన్ని జ్ఞప్తికి తెచ్చుకో. ఈ దానవుని సంహరించు. నీ బంధువులకు మేలు చేకూర్చు" అని కృష్ణుడు బలరామునితో చెప్పాడు.

**ఇతి సంస్మారితో విప్ర! కృష్ణేన సుమహాత్మనా ।**
**విహస్య పీడయామాస ప్రలమ్బం బలవాన్ బలః ॥ 34 ॥**

విప్రవర్యా! అని ఈ రీతిగా మహాత్ముడైన కృష్ణుడు స్మరణకు వచ్చేటట్లు పలుకగా, బలవంతుడైన బలరాముడు నవ్వుతూ ప్రలంబుని పట్టుకొని పీడించసాగాడు.

**ముష్టినా చాహనన్మూర్ధ్ని కోపసంరక్తలోచనః ।**
**తేన చాస్య ప్రహారేణ బహిర్యాతే విలోచనే ॥ 35 ॥**

కోపంతో ఎరుపెక్కిన నయనాలు కలవాడై రాముడా రక్కసుని నడినెత్తిపై పిడికిలితో ఒక గ్రుద్దు గుద్దాడు. ఆ ముష్టి ప్రహారంచే అతని కనుగ్రుడ్లు వెలుపలికి వచ్చాయి.

**స నిష్కాసిత మస్తిష్కో ముఖాచ్ఛోణితముద్వమన్ ।**
**నిపపాత మహీపృష్ఠే దైత్యవర్యో మమార చ ॥ 36 ॥**

మెదడు బయటకు వచ్చి వేసింది. నోటినుంచి రక్తం గ్రక్కాడు. అవనితలంపై పడిపోయాడు. ఇలా ఆ దైత్యశ్రేష్ఠుడు మరణించాడు.

**ప్రలమ్బం నిహతం దృష్ట్వా బలేనాద్భుతకర్మణా ।**
**ప్రహృష్టాస్తుష్టువుర్గోపాః సాధుసాధ్వితి చాబ్రువన్ ॥ 37 ॥**

అద్భుతకర్ముడైన బలరాముని ద్వారా ప్రలంబుడు కూలిపోయి చనిపోవడం చూచి గోపాలురు మిక్కిలి సంతసించి బాగుబాగని బలభద్రుని కొనియాడారు.

**సంస్తూయమానో గోపైస్తు రామో దైత్యే నిపాతితే ।**
**ప్రలమ్బే సహ కృష్ణేన పునర్గోకులమాయయౌ ॥ 38 ॥**

అలా గోపాలకులచే బలరాముడు స్తుతించబడ్డ అనంతరం ప్రలంబదైత్యుడు ఈ రీతిగా కూలిపోగా, అతడు కృష్ణునితో కలసి తిరిగి గోకులానికి వచ్చాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే ప్రలంబాసురవధో నామ నవమోఽధ్యాయః సమాప్తః ॥ 9 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో ప్రలంబాసురవధ అనే తొమ్మిదవ అధ్యాయం సమాప్తం ॥ 9 ॥



## దశమోఽధ్యాయః - పదవ అధ్యాయం

## గోవర్ధనపూజా - గోవర్ధనపూజ

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**తయోర్విహరతో స్తత్ర రామకేశవయో ర్వ్రజే ।**
**ప్రావృడ్ వ్యతీతా వికసత్సరోజా చాభవచ్ఛరత్ ॥ 1 ॥**

ఇలా వ్రజభూమిలో బలరామకేశవులు ఇద్దరూ విహరిస్తూ ఉండగా వర్షాకాలం గతించింది. తామరపూలు చక్కగా వికసించే శరదృతువు ప్రవేశించింది.

**అవాపుస్తాపమత్యర్థం శఫర్యః పల్వలోదకే ।**
**పుత్రక్షేత్రాది సక్తేన మమత్వేన యథా గృహీ ॥ 2 ॥**

ఏ విధంగా గృహస్థుడైన వాడు పుత్రుడు, భార్య మున్నగు వాటియందలి మోహంచే పుట్టిన మమ కారంతో తపిస్తూ ఉంటాడో, అదే విధంగా గుంటలలోని నీటిలోనున్న చేపలు మిక్కిలి తాపాన్ని పొనం చేయసాగాయి (అనుభవించాయి).

**మయూరా మౌనినస్తస్థుః పరిత్యక్తమదా వనే ।**
**అసారతాం పరిజ్ఞాయ సంసారస్యేవ యోగినః ॥ 3 ॥**

సారజ్ఞులైన యోగులు సంసారం సారం లేనిదని గ్రహించి ప్రశాంతులై ఎలా ఉంటారో, అలా అరణ్యంలోని మయూరాలు నీలమేఘాలు కానరాక పోవడంచే మదం సంపూర్ణంగా విడిచి మౌనంగా ఉండి పోయాయి.

**ఉత్సృజ్య జలసర్వస్వం నిర్మలాః సితమూర్తయః ।**
**తత్యజుశ్చామ్బరం మేఘా గృహం విజ్ఞానినో యథా ॥ 4 ॥**

జ్ఞానవంతులైన పరబ్రహ్మతత్త్వజ్ఞులు మమకారం వదలి ఎలా గృహాన్ని పరిత్యజిస్తారో, అలా మేఘాలు జలమంతా విడిచి పుచ్చి నిర్మలాలై నింగిలో అచ్చపు తెల్లదనాన్ని పొందాయి.

**శరత్సూర్యాంశు తప్తాని యయుః శోషం సరాంసి చ ।**
**బహ్వాలమ్బి మమత్వేన హృదయానీవ దేహినామ్ ॥ 5 ॥**

శరత్కాల సూర్యకిరణాలచే వేడెక్కి సరస్సులలోని జలాలు బహువిషయ భోగాల మీది మమకారంచే దేహుల హృదయాలవలె పరితపించాయి.

**కుముదైః శరదమ్భాంసి యోగ్యతాలక్షణం యయుః ।**
**అవబోధైర్మనాంసీవ సమ్బన్ధమమలాత్మనామ్ ॥ 6 ॥**

నిర్మలస్వభావం కలిగిన వ్యక్తుల మనస్సు జ్ఞానబోధలచే సమత్వం పొందునట్లు శరత్కాలంలోని జలాలు వికసించిన తెల్లకలువలచే యోగ్యసంబంధాన్ని పొందాయి.

**తారకా విమలే వ్యోమ్ని రరాజాఖణ్డమణ్డలః ।**
**చన్ద్రశ్చరమదేహాత్మా యోగీ సాధుకులే యథా ॥ 7 ॥**

నక్షత్రాలచే విమలమైన ఆకాశంలో అఖండకాంతిమండలం కల శరత్కాలంలోని పున్నమి నాటి చందమామ శుచులైన శ్రీమంతులగు సాధువుల వంశంలో పుట్టిన చరమదేహాత్ముడగు జ్ఞానయోగిలాగా ప్రకాశించాడు.

**శనకైః శనకైస్తీరం తత్యజుశ్చ జలాశయాః ।**
**మమత్వం క్షేత్రపుత్రాది రూఢముచ్చైర్యథా బుధాః ॥ 8 ॥**

విద్వాంసులైన వారు ఏ విధంగా భార్యాపుత్రాదులయందున్న గాఢమైన మమకారాన్ని క్రమక్రమంగా వదలివేస్తూ ఉంటారో, అదే విధంగా రోజురోజుకు అల్లనల్లన ఇంచుకించుకగా జలాశయాలు తీరాన్ని వదలసాగాయి.

**పూర్వత్యక్తైః సరోఽమ్భోభిః హంసా యోగం పునర్యయుః ।**
**క్లేశైః కుయోగినోఽశేషై రన్తరాయహతా ఇవ ॥ 9 ॥**

అనేక యోగవిఘ్నాలచే దెబ్బతిన్న యోగులు మళ్లీ తిరిగి యోగాన్ని ఆశ్రయించినట్లుగా, వర్ష ఋతువులో మానససరోవరానికి వెళ్లిపోయిన హంసలు మళ్లీ తమ స్వస్థానమైన సరోవరసంయోగం పొందాయి.

**నిభృతోఽభవదత్యర్థం సముద్రః స్తిమితోదకః ।**
**క్రమావాప్త మహాయోగో నిశ్చలాత్మా యథా యతిః ॥ 10 ॥**

క్రమంగా మహాయోగాన్ని పొంది యతీశ్వరుడు ఏ విధంగా నిశ్చలాత్ముడు అవుతాడో, అదే విధంగా అలల అలజడి తగ్గిపోయి స్తిమితపడి మిక్కిలి నిండుతనాన్ని పొంది సముద్రం విలసిల్లింది.

**సర్వత్రాతిప్రసన్నాని సలిలాని తథాఽభవన్ ।**
**జ్ఞాతే సర్వగతే విష్ణౌ మనాంసీవ సుమేధసామ్ ॥ 11 ॥**

సర్వత్ర విష్ణువు తెలియబడగా (కార్తికమాసంలో శుద్ధ ఏకాదశినాడు విష్ణువు పాలసంద్రంనుంచి మేల్కొంటాడు కాబట్టి) మేధావులైన జ్ఞానుల మనస్సులలాగా అన్నిచోట్ల జలాలు బురద వీడిపోగా మిక్కిలి నిర్మలం అయ్యాయి.

**బభూవ నిర్మలం వ్యోమ శరదా ధ్వస్త తోయదమ్ ।**
**యోగాగ్నిదగ్ధక్లేశౌఘం యోగినామివ మానసమ్ ॥ 12 ॥**

యోగాగ్నిచే సమస్తక్లేశాలు దగ్ధంకాగా ప్రకాశించే యోగీంద్రుల మనస్సులాగా, శరత్కాలంలో మబ్బులు వీడిపోగా ఆకాశం నిర్మలమై స్వచ్ఛమై విరాజిల్లింది.

**సూర్యాంశు జనితం తాపం నిన్యే తారాపతిః శమమ్ ।**
**అహంకారోద్భవం దుఃఖం వివేకః సుమహానివ ॥ 13 ॥**

దైవవివేకము మిక్కిలి గొప్ప అహంకారముచే జనించిన దుఃఖాన్ని శాంతింపచేసినట్లు, తారాపతి అయిన చంద్రుడు సూర్యకిరణ సంప్రాప్త సంతాపాన్ని శమింపజేసుకొన్నాడు.

**నభసోఽభ్రాన్ భువః పంకాన్ కాలుష్యం చామ్బుసః శరత్ ।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యః ప్రత్యాహార ఇవాహరత్ ॥ 14 ॥**

ఇన్ద్రియార్థాలనుంచి (శబ్దాదివిషయాలనుంచి) ఇంద్రియాలను యోగి ప్రత్యాహారం చేసినట్లు (వెనుకకు మరలించునట్లుగా) శరత్తు నింగినుంచి మబ్బులను, భూమినుంచి బురదను, నీళ్లనుంచి కాలుష్యాన్ని హరించింది.

**ప్రాణాయామ ఇవామ్భోభిః సరసాం కృతపూరకైః ।**
**అభ్యస్యతేఽనుదివసం రేచకాకుమ్భకాదిభిః ॥ 15 ॥**

సరస్సులందలి నీళ్లు మొదట పూరకాలచేత, పిమ్మట కుంభకాలచేత, అటుపిమ్మట రేచకాలచేత (నింపుకోవడం, ఇమిడించు కోవడం, వదలివేయడం) ప్రతిదినం ప్రాణాయామం సాధనచేస్తున్నాయా అన్నట్లుగా ఉన్నాయి.

**విమలామ్బరనక్షత్రే కాలే చాభ్యాగతే వ్రజమ్ ।**
**దదర్శేన్ద్రో మహారమ్భాయోద్యతాంస్తాన్ వ్రజౌకసః ॥ 16 ॥**

ఆకాశం, నక్షత్రాలు నిర్మలాలైన శరదృతువు సమీపించగానే, వ్రజంలో ఇంద్రుని పూజించే మహోత్సవ ప్రయత్నంలో ఉన్న ఆ వ్రేపల్లెలో నివసించే గోపాలురను కృష్ణుడు చూచాడు.

**కృష్ణస్తానుత్సుకాన్ దృష్ట్వా గోపానుత్సవలాలసాన్ ।**
**కౌతూహలాదిదం వాక్యం ప్రాహ వృద్ధాన్ మహామతిః ॥ 17 ॥**

మహాబుద్ధిశాలియైన కృష్ణుడు ఇంద్రోత్సవం చేయాలనే ఆసక్తితో ఉత్సుకులైయున్న గోపాలకులను వీక్షించి, సాదరంగా అందున్న వృద్ధులతో ఇలా అన్నాడు.

**కోఽయం శక్రమఖో నామ యేన వో హర్ష ఆగతః ।**
**ప్రాహ తం నన్దగోపశ్చ పృచ్ఛన్తమతిసాదరమ్ ॥ 18 ॥**

"ఇంద్రయాగం అంటే ఏమిటి? మీకింత ఆనందం ఏ కారణంచే కలుగుతోంది?" అని కృష్ణుడు ప్రశ్నించగా నందగోపుడు మిక్కిలి ప్రీతిపూర్వకంగా ఇలా చెప్పాడు.

**మేఘానాం పయసాం చేశో దేవరాజః శతక్రతుః ।**
**తేన సంచోదితా మేఘా వర్షన్త్యమ్బుమయం రసమ్ ॥ 19 ॥**

శతక్రతువగు దేవరాజు మేఘాలకు, జలాలకు ప్రభువు. అతని ప్రేరణవల్ల మేఘాలు జలమయమైన రసాన్ని వానగా కురుస్తాయి.

**తద్వృష్టి జనితం సస్యం వయమన్యే చ దేహినః ।**
**వర్తయామోపయుంజానాస్తర్పయామశ్చ దేవతాః ॥ 20 ॥**

ఆ వర్షం వల్ల పండిన పంటనే మనం, మిగిలిన ప్రాణికోటులు ఉపయోగించుకొంటూ బ్రతుకుతూ ఉంటాము. దేవతలకు సంతృప్తి చేకూరుస్తూ ఉంటాము.

**క్షీరవత్య ఇమా గావో వత్సవత్యశ్చ నిర్వృతాః ।**
**తేన సంవర్ధితైః సస్యైః పుష్టాస్తుష్టా భవన్తి వై ॥ 21 ॥**

ఆ వర్షం వల్ల పెరిగిన గడ్డి మొదలగు సస్యాలవల్ల గోవులు పాలు కలవై, దూడలు కలవై సంతృప్తి పొందుతాయి. అవి పుష్టి పొంది సంతుష్టి నందుతాయి.

**నాసస్యా నాతృణా భూమిర్న బుభుక్షార్దితో జనః ।**
**దృశ్యతే యత్ర దృశ్యన్తే వృష్టిమన్తో వలాహకాః ॥ 22 ॥**

ఎక్కడ మేఘాలు వానకురుస్తూ దర్శనమిస్తాయో, అక్కడ పంటలు లేకపోవడం కాని, గడ్డిలేకపోవడం కాని ఉండదు. జనం ఆకలితో నకనకలాడడం అనేది ఉండదు.

**భౌమమేతత్ పయో దుగ్ధం గోభిః సూర్యస్య వారిదః ।**
**పర్జన్యః సర్వలోకస్య భవాయ భువి వర్షతి ॥ 23 ॥**

పర్జన్యదేవుడైన ఇంద్రుడు సూర్యకిరణాలద్వారా భూమియందలి జలాన్ని పీలుస్తాడు. సంపూర్ణ ప్రాణి కోటి ఉత్పత్తికి ఆ జలాన్నే మేఘాలద్వారా వృథివియందు వర్షిస్తాడు.

**తస్మాత్ ప్రావృషి రాజానః సర్వే శక్రం ముదాయుతాః ।**
**మఖైః సురేశమర్చన్తి వయమన్యే చ మానవాః ॥ 24 ॥**

అందువల్ల వర్షఋతువులో రాజులెల్లరు, అలాగే మనమందరం, మిగిలిన మానవులు కూడా మహానందంతో సురేశ్వరుడైన ఇంద్రుని యజ్ఞాలతో అర్చిస్తూ ఉంటారు" అని నందగోపుడు చెప్పాడు.

**నన్దగోపస్య వచనం శ్రుత్వేత్థం శక్రపూజనే ।**
**కోపాయ త్రిదశేన్ద్రస్య ప్రాహ దామోదరస్తదా ॥ 25 ॥**

ఇంద్రపూజా విషయంలో ఈ రీతిగా భాషించిన నందగోపుని పలుకులు విని దేవేంద్రునకు రోషం రప్పించడానికై దామోదరుడు ఇలా అన్నాడు.

**న వయం కృషికర్తారో వాణిజ్య జీవినో న చ ।**
**గావోఽస్మద్దైవతం తాత! వయం వనచరా యతః ॥ 26 ॥**

"తండ్రీ! మడులు దున్నే కర్షకులం కాము మనం. వాణిజ్యం చేసి జీవించే వారం అంతకంటే కాదు. మనకు గోవులే దేవతలు. మనం వనాలలో తిరిగే వారంకదా!

**ఆన్వీక్షికీ త్రయీ వార్తా దణ్డనీతిస్తథాఽపరా ।**
**విద్యా చతుష్టయం త్వేతత్ వార్తామత్ర శ్రుణుష్వ మే ॥ 27 ॥**

ఆన్వీక్షికి (తర్కశాస్త్రం), త్రయి (కర్మకాండ), వార్త, దండనీతి (అర్థశాస్త్రం) అనేవి నాలుగు విద్యలు. ఇందు వార్త అనేది ఏ విధంగా ఉంటుందో తెలియ జేస్తాను. ఆలకించు.

**కృషిర్వణిజ్యా తద్వచ్చ తృతీయం పశుపాలనమ్।**
**విద్యా హ్యేకా మహాభాగ! వార్తా వృత్తిత్రయాశ్రయా॥ 28 ॥**

మహాభాగ! వ్యవసాయం, వర్తకం, అలాగే మూడోది పశుపాలనం ఈ మూడు వృత్తులను ఆశ్రయించి ఉండేవి. వార్త అనేది ఒకటే విద్య. ఇదే మూడింటికి ఆధారం.

**కర్షకాణాం కృషిర్వృత్తిః పణ్యం విపణి జీవినామ్ ।**
**అస్మాకం గౌః పరావృత్తి ర్వార్తాభేదై రియం త్రిభిః ॥ 29 ॥**

భూమి దున్నేవారికి వ్యవసాయం వృత్తి. క్రయవిక్రయాలు చేసే వారి వృత్తి వ్యాపారం. మనకయితే గోవే ముఖ్యవృత్తి. ఈ విధంగా ఈ మూడువృత్తులు వార్త అనే దాని భేదములే.

**విద్యయా యో యయా యుక్త స్తస్య సా దైవతం మహత్ ।**
**సైవ పూజ్యాఽర్చనీయా చ సైవ తస్యోపకారికా ॥ 30 ॥**

ఎవడు ఏ విద్యతో కూడుకొని యుంటాడో, వానికదే మహాదైవం. ఆ విద్య అతనికి పూజించదగినది. అర్చించదగినది కూడ. అదే వానికి ఉపకారం కలగజేస్తుంది.

**యోఽన్యస్య ఫలమశ్నన్ వై పూజయత్యపరం నరః ।**
**ఇహ చ ప్రేత్య చైవాసౌ తాత! నాప్నోతి శోభనమ్ ॥ 31 ॥**

తండ్రీ! పురుషుడు దేని ఫలం అనుభవిస్తూ, దానిని పూజించకుండా మరోదానిని అర్చిస్తూ ఉంటాడో, ఆ నరుడు ఈ లోకంలో కాని, పరలోకంలో కాని శుభాలను పొందడు.

**కృష్యన్తా ప్రథితా సీమా సీమాన్తం చ పునర్వనమ్ ।**
**వనాన్తా గిరయః సర్వే తే చాస్మాకం పరా గతిః ॥ 32 ॥**

కృషికి పరమావధి పొలిమేర. దానికి అవధి అనేది వనం. దానికి హద్దులు పర్వతాలు. కాబట్టి మనకందరికి పరమగతి కొండలే.

**న ద్వారబన్ధావరణా న గృహక్షేత్రిణస్తథా ।**
**సుఖినః సకలే లోకే యథా వై చక్రచారిణః ॥ 33 ॥**

ద్వారబంధాలు ఉన్న గృహం, ఆవరణాలు ఉన్న పొలం కలవారు సుఖులు కారు. ఎల్లలోకంలోను సుఖించే వారు చక్రచారులు.

వి॥శే: చక్రచారులనగా బండ్లపై తిరిగేవారు. వారికి ఎక్కడా శాశ్వత నివాస గృహం అనేది ఉండదు. అలాగే ఇది నాపొలం అనేది ఉండదు. సాయంకాలం అవడంతో ఒకచోట ఆగుతారు. ఉదయం రాగానే మళ్లీ ప్రయాణమవుతారు.

**శ్రూయన్తే గిరయశ్చామీ వనేఽస్మిన్ కామరూపిణః ।**
**తత్తద్రూపం సమాస్థాయ రమన్తే స్వేషు సానుషు ॥ 34 ॥**

ఈ వనంలోని ఈ గిరులన్నీ కామరూపం కలవని వినియున్నాము. అవి ఆ యా రూపాలను స్వీకరించి తమతమ చరియలలో క్రీడిస్తాయి.

**యదా చైతేఽపరాధ్యన్తే తేషాం మే కాననౌకసః ।**
**తదా సింహాదిరూపైస్తాన్ ఘాతయన్తి మహీధరాః ॥ 35 ॥**

అటువంటి వానియందు అపరాధం చేస్తే, ఆ పర్వతాలు తమకొండలలోని అడవులందు సింహాది రూపాలలో సంచరిస్తూ, అవి ఆ కాననాలలో తిరిగే వారిని కడముట్టిస్తాయి.

**గిరియజ్ఞస్త్వయం తస్మాద్ గోయజ్ఞశ్చ ప్రవర్త్యతామ్ ।**
**కిమస్మాకం మహేన్ద్రేణ గావశ్శైలాశ్చదేవతాః ॥ 36 ॥**

అందువల్ల ఇంద్రయజ్ఞం బదులుగా గిరియజ్ఞాన్ని, గోయజ్ఞాన్ని మనం చేయదగినది. మనకు మహేంద్రుని వల్ల ఏమి పని? ఆవులు, కొండలే మనకు దేవతలు.

**మన్త్రయజ్ఞపరా విప్రాః సీరయజ్ఞాశ్చ కర్షకాః,(సీతా) ।**
**గిరిగోయజ్ఞశీలాశ్చ వయమద్రివనాశ్రయాః ॥ 37 ॥**

విప్రులు మంత్రయజ్ఞంపై ఆసక్తి చూపిస్తారు. కర్షకులు సీతా యజ్ఞంపై (హలపూజనంపై) మక్కువ కలిగి ఉంటారు. మనం కొండలలోను, అడవులలోను తిరిగే వారము కాబట్టి గిరియజ్ఞం, గోయజ్ఞం ఆచరించడం ప్రధానకర్తవ్యం.

**తస్మాద్ గోవర్ధనః శైలో భవద్భిర్వివిధార్హణైః ।**
**అర్చ్యతాం పూజ్యతాం మేధ్యాన్ పశూన్ హత్వా విధానతః ॥ 38 ॥**

అందువల్ల ఈ గోవర్ధనపర్వతాన్ని మీరందరూ వివిధ పూజాసామగ్రిచే అర్చించాలి. శాస్త్రవిధి ననుసరించి పవిత్రములగు పశువులను బలి ఇచ్చి పూజించాలి.

**సర్వఘోషస్య సన్దోహో గృహ్యతాం మా విచార్యతామ్ ।**
**భోజ్యన్తాం తేన వై విప్రాస్తథా యేచాభివాంఛకాః ॥ 39 ॥**

వ్రేపల్లెలోని సమస్తవస్తుసామగ్రిని తీసుకొనిరండి ఆలోచించకండి. ముందు విప్రసంతర్పణం, అతిథి భోజనం కావించండి.

**సమర్చితే కృతే హోమే భోజితేషు ద్విజాతిషు ।**
**శరత్పుష్పకృతాపీడాః పరిగచ్ఛన్తు గోగణాః ॥ 40 ॥**

ముందు అర్చనం, హోమం చేసి, బ్రాహ్మణుదులు భుజించిన పిమ్మట శరత్కాలపుష్పమాలలను ధరించిన గోవులతో గిరికి ప్రదక్షిణం ఆచరించండి.

**ఏతన్మమ మతం గోపాః సమ్ప్రత్యాద్రియతే యది ।**
**తతః కృతా భవేత్ ప్రీతిర్గవామద్రేస్తథా మమ ॥ 41 ॥**

గోపాలకులారా! ఇది నాకు అభిమతం. ఇప్పుడు నేను చెప్పినట్లుగా సాదరంగా ఇలా చేస్తే గోవులకు, గోవర్ధన పర్వతానికి ప్రీతి చేకూరుతుంది. నాకు కూడ సంప్రీతి కలుగుతుంది" అని కృష్ణుడు వారికి బోధచేశాడు.

**ఇతి తస్య వచః శ్రుత్వా నన్దాద్యాస్తే వ్రజౌకసః ।**
**ప్రీత్యుత్ఫుల్లముఖా విప్ర! సాధు సాధ్విత్యథాబ్రువన్ ॥ 42 ॥**

ఈ విధంగా పలికిన కృష్ణుని మాటలు విని, నందుడు మున్నగు ఆ వ్రజవాసులందరూ సంతోషంతో విప్పారిన మోములు కలవారైరి. విప్రవర్యా! వారందరూ బాగు బాగని ఇలా అన్నారు.

**శోభనం తే మతం వత్స! యదేతద్ భవతోదితమ్ ।**
**తత్ కరిష్యామహే సర్వం గిరియజ్ఞః ప్రవర్త్యతామ్ ॥ 43 ॥**

"వత్సా! నీ మతమే పరమశోభనమైనది. నీవు చెప్పిన దానిని మేము చేస్తాము. అందరమూ గిరియజ్ఞం పాటిస్తాము" అని వారు ఏకగ్రీవంగా పలికారు.

**తథా చ కృతవన్తస్తే గిరియజ్ఞం వ్రజౌకసః ।**
**దధిపాయసమాంసాద్యై ర్దదుః శైలబలిం తతః ॥ 44 ॥**

అని ఆ వ్రేపల్లె వాసులందరూ గిరియజ్ఞం ఆచరించారు. పెరుగు, పాయసం, మాంసం మున్నగు వాటితో పర్వతానికి బలినివేదనం చేశారు.

**ద్విజాంశ్చ భోజయామాసుః శతశోఽథ సహస్రశః ।**
**అన్యానప్యాగతానిత్థం కృష్ణేనోక్తం యథా పురా ॥ 45 ॥**

వందలకొలది వేలకొలది ద్విజులకు భోజనాలు పెట్టారు. అక్కడకు వచ్చిన మిగిలిన వారికి కూడా సంతర్పణ కావించారు. కృష్ణుడు పూర్వం చెప్పినట్లుగా సర్వం ఆచరించారు.

**గావః శైలం తతశ్చక్రురర్చితాస్తాః ప్రదక్షిణమ్ ।**
**వృషభాశ్చాతినర్దన్తః సతోయా జలదా ఇవ ॥ 46 ॥**

అనంతరం సంపూర్ణంగా పూజించబడ్డ గోవులు, వృషభాలు నీటితో నిండిన మేఘాల వలె రంకెలు వేస్తూ గోపాలకులు వెంటవస్తూ ఉండగా గోవర్ధనగిరికి ప్రదక్షిణం చేశాయి.

**గిరిమూర్ధని కృష్ణోఽపి శైలోఽహమితి మూర్తిమాన్ ।**
**బుభుజేఽన్నం బహు తదా గోపవర్యాహృతం ద్విజ! ॥ 47 ॥**

ద్విజోత్తమా! కృష్ణుడు కూడ ఆ కొండశిఖరంపై కూర్చుండి రూపం వహించిన శైలాన్ని నేనే యని గోపశ్రేష్ఠులు తీసుకొనివచ్చి నివేదించిన వివిధాన్నాలను నిండుగా ఆరగించాడు.

**అన్యేన కృష్ణ రూపేణ గోపైః సహగిరేః శిరః ।**
**అధిరుహ్యార్చయామాస ద్వితీయామాత్మనస్తనుమ్ ॥ 48 ॥**

మరో కృష్ణరూపాన్ని స్వీకరించి గోపాలకులతో కలసి ఆ కొండశిఖరాన్ని అధిరోహించి తనరెండో మూర్తియగు గోవర్ధనశైలాన్ని తాను కూడా అర్చించాడు.

**అన్తర్ధానం గతే తస్మిన్ గోపా లబ్ధ్వా తతో వరాన్ ।**
**కృత్వా గిరిమహం గోష్ఠం నిజమభ్యాయయుః పునః ॥ 49 ॥**

అతడు అంతర్ధానమైన పిమ్మట గోపాలకులు వరాలు పొంది, గిరియజ్ఞం అలా నిర్వహించి మళ్లీ తమ గోష్ఠానికి తిరిగి వచ్చారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే గోవర్ధనపూజా నామ దశమోఽధ్యాయః సమాప్తః ॥ 10 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో గోవర్ధనపూజ అనే పదవ అధ్యాయం సమాప్తం ॥ 10 ॥



## ఏకాదశోఽధ్యాయః - పదకొండవ అధ్యాయం

## శ్రీకృష్ణకృత గోవర్ధన పర్వతధారణమ్ - శ్రీకృష్ణకృతగోవర్ధన పర్వతధారణం

**శ్రీ పరాశర ఉవాచ :-** పరాశరుడు చెపుతున్నాడు.

**మఖే ప్రతిహతే శక్రో మైత్రేయాతిరుషాన్వితః ।**
**సంవర్తకం నామ గణం తోయదానామథాబ్రవీత్ ॥ 1 ॥**

"మైత్రేయా! ఇంద్రుడు యాగం భంగమైనందుకు మిక్కిలి రోషాన్ని పొందాడు. సంవర్తకం అనే మేఘాల సమూహాన్ని రావించి ఇలా అన్నాడు.

**భో భో మేఘా! నిశమ్యైతద్ వచనం వదతో మమ ।**
**ఆజ్ఞానన్తరమేవాశు క్రియతామవిచారితమ్ ॥ 2 ॥**

"ఓ మేఘాల్లారా! నేను చెప్పే ఈ మాటలు వినండి. నా ఆజ్ఞ విన్న వెంటనే ఏమి ఆలోచించకుండా యథోక్తంగా ఆచరించండి.

**నన్దగోపః సుదుర్బుద్ధి ర్గోపైరన్యైః సహాయవాన్ ।**
**కృష్ణాశ్రయబలాధ్మాతో మఖభంగమచీకరత్ ॥ 3 ॥**

గోకులంలో నందగోపుడు మిక్కిలి దుష్టబుద్ధియై మిగిలిన గోపాలకుల సహాయంతో కృష్ణుని అండ తీసుకొని బలాంధుడై నా ఉత్సవానికి భంగం కలగజేశాడు.

**ఆజీవో యః పరస్తేషాం యాశ్చ గోపత్వకారణమ్ ।**
**తా గావో వృష్టివాతేన పీడ్యన్తాం వచనాన్మమ ॥ 4 ॥**

ఆ గోపకులకు జీవనాధారమయిన గోగణం కూడ వారికి గర్వకారణమవుతోంది. కాబట్టి ఆ గోవులను వర్షపాతంచే నామాటద్వారా బాధించండి.

**అహమప్యద్రిశృంగాభం తుంగమారుహ్య వారణమ్ ।**
**సాహాయ్యం వః కరిష్యామి వాయ్వమ్బూత్సర్గయోజితమ్ ॥ 5 ॥**

నేను కూడ గిరిశృంగంతో సమానమైన ఎత్తైన ఐరావతాన్ని అధిరోహించి వాయుజలోపద్రవంలో మీకు సహాయం అంద జేస్తాను" అని ఆజ్ఞాపించాడు.

**ఇత్యాజ్ఞప్తాః సురేన్ద్రేణ ముముచుస్తే బలాహకాః ।**
**వాతవర్షం మహాభీమమభావాయ గవాం ద్విజ! ॥ 6 ॥**

ద్విజోత్తమా! ఈ విధంగా సురేంద్రునిచే ఆజ్ఞను గొని ఆ మేఘాలు గోవులు నాశనం కావాలని మహాభయంకరమైన పెనుగాలివాన కురిశాయి.

**తతః క్షణేన ధరణీ కకుభో౽మ్బరమేవ చ ।**
**ఏకధారా మహాసార పూరణేనాభవన్మునే! ॥ 7 ॥**

మునీశ్వరా! క్షణకాలంలో ఆ మేఘాలనుంచి మహాజలధారలు ఏకధారగా కురిసి భూమి, దిక్కులు, ఆకాశం నిండిపోయి ఏకాకారమై పోయింది.

**విద్యుల్లతా కశాఘాత త్రస్తైరివ ఘనై ర్ఘనమ్ ।**
**నాదాపూరితదిక్చక్రైః ధారాసారమపాత్యత ॥ 8 ॥**

మెరుపుతీగలనే కొరడాదెబ్బలకు భయపడ్డాయా అన్నట్లుగా మేఘాలు పెనుగర్జనలతో దిక్కులు ప్రతిధ్వనించేటట్లుగా ఉరుముతూ కుంభవృష్టి కురిశాయి.

**అన్ధకారీకృతే లోకే వర్షద్భిరనిశం ఘనైః ।**
**అధశ్చోర్ధ్వం చ తిర్యక్చ జగదాప్యమివాభవత్ ॥ 9 ॥**

నిరంతరం వర్షించే మేఘసమూహాలద్వారా లోకం అంధకారబంధురం కాగా నేల, నింగి, (క్రిందు, మీదు) అంతరాళం (మధ్య) అంతా జలమయమైపోయింది.

**గావస్తు తేన పతతా వర్షవాతేన వేగినా ।**
**ధూతాః ప్రాణాన్ జహుః సన్నత్రికసక్థిశిరోధరాః ॥ 10 ॥**

గోవులయితే ఆ పెనుగాలివాన మీద పడుతూ ఉండగా, నడుములు, ఊరువులు, కంఠాలు,సంధి బంధాలు సడలిపోగా కొన్ని గాలికెగిరి పోయాయి. మరి కొన్ని తలలు వాల్చి ప్రాణాలు విడిచాయి.

**క్రోడేన వత్సానాక్రమ్య తస్థురన్యా మహామునే! ।**
**గావో వివత్సాశ్చ కృతా వారిపూరేణ చాపరాః ॥ 11 ॥**

మహామునీ! కొన్ని ఆవులు తమ దూడలను కడుపునకు అదిమి పెట్టుకొని నిలిచాయి. మరి కొన్ని వారిధారలలో తమలేగలను పోగొట్టుకొన్నాయి.

**వత్సాశ్చ దీనవదనాః పవనాకమ్పికన్ధరాః ।**
**త్రాహి త్రాహీత్యల్పశబ్దాః కృష్ణమూచురివార్తకాః ॥ 12 ॥**

దూడలు బిక్కమొగం వేసుకొని, పెనుగాలికి మెడలు పూర్తిగా కదలుతూ ఉండగా, కృష్ణుని చూచి ఆర్తులులాగా" రక్షించు, రక్షించు" అంటూ మెల్లగా అంబారవాలు చేశాయి.

**తతస్తద్ గోకులం సర్వం గోగోపీగోప సంకులమ్ ।**
**అతీవార్తం హరిర్దృష్ట్వా మైత్రేయాచిన్తయత్ తదా ॥ 13 ॥**

మైత్రేయా! గోవులు, గోపికలు, గోపాలకులతో నిండిన ఆ గోకులం అంతా ఆ సమయంలో మిక్కిలి ఆర్తిని పొందగా చూచి శ్రీకృష్ణుడు అపుడు ఇలా ఆలోచించాడు.

**ఏతత్ కృతం మహేన్ద్రేణ మహభంగ విరోధినా ।**
**తదేతదఖిలం గోష్ఠం త్రాతవ్యమధునా మయా ॥ 14 ॥**

"మఖభంగం జరిగిందని మహేంద్రుడే ఇలా చేశాడు కాబట్టి ఇప్పుడు నేను ఈ వ్రేపల్లెనంతా రక్షించితీరాలి.

**ఇమమద్రిమహం ధైర్యాదుత్పాట్యోరుశిలాఘనమ్ ।**
**ధారయిష్యామి గోష్ఠస్య పృథుచ్ఛత్రమివోపరి ॥ 15 ॥**

నేను ధైర్యాన్ని వహించి శిలామయమై కనిపించే ఈ పర్వతాన్ని పెకలించి పైకెత్తి ఈ వ్రేపల్లెకు పైభాగంలో గొప్పగొడుగుగా పట్టుకొని ధరిస్తాను" అని కృష్ణుడు నిశ్చయించాడు.

**ఇతి కృత్వా మతిం కృష్ణో గోవర్ధనమహీధరమ్ ।**
**ఉత్పాట్యైకకరేణైవ ధారయామాస లీలయా ॥ 16 ॥**

కృష్ణుడు ఈ విధంగా మదిలో నిర్ణయించుకొని గోవర్ధనపర్వతాన్ని పెకల్చి ఒక చేతితో అవలీలగా ఎత్తి పట్టుకొన్నాడు.

**గోపాంశ్చాహ జగన్నాథః సముత్పాటితభూధరః ।**
**విశధ్వమత్ర త్వరితాః కృతం వర్షనివారణమ్ ॥ 17 ॥**

అలా జగన్నాథుడు కొండను పెల్లగించి పైకెత్తి పట్టుకొని "గోపాలకులారా! తొందరగా అందరు దీని క్రిందకి రండి. మీకు వానబాధ ఇందు ఉండబోదు.

**సునిర్వాతేషు దేశేషు యథా జోషమిహాస్యతామ్ ।**
**ప్రవిశ్యతాం న భేతవ్యం గిరిపాతస్య నిర్భయైః ॥ 18 ॥**

మీరందరు ఈదురుగాలులులేని ఈ ప్రదేశంలో సుఖంగా ఉండండి. త్వరగా రండి. కొండ మీమీద పడిపోతుందేమోనన్న భయంతో జడియకండి" అని పలికాడు.

**ఇత్యుక్తాస్తే తతో గోపా వివిశుర్గోధనైః సహ ।**
**శకటారోపితైర్భాణ్డై ర్గోప్యశ్చాసారపీడితాః ॥ 19 ॥**

అని కృష్ణుడు చెప్పగా గోపాలురందరు వస్తుసామగ్రినంతను భాండాలతో సహా బండ్లకెక్కించి గోగణాలతో కలిసి దానిక్రింద నిలిచారు. గోపికలు కూడ వానబాధ తట్టుకోలేక గబగబా ఆ కొండ క్రిందకు చేరారు.

**కృష్ణోఽపి తం దధారైవ శైలమత్యన్తనిశ్చలమ్ ।**
**వ్రజైకవాసిభిర్హర్షవిస్మితాక్షైర్నిరీక్షితః ॥ 20 ॥**

వ్రజవాసులందరు హర్షవిస్మయపూర్ణనేత్రాలతో వీక్షిస్తూ ఉండగా, శ్రీకృష్ణుడా పర్వతాన్ని అటూ ఇటూ కదలకుండా మిక్కిలి నిశ్చలంగా తనకేల ధరించాడు.

**గోపగోపీజనై ర్హృష్టైః ప్రీతి విస్తారితేక్షణైః ।**
**సంస్తూయమానచరితః కృష్ణః శైలమధారయత్ ॥ 21 ॥**

సంతోషం, సంప్రీతి నిండిన విచ్చుకొన్న నేత్రాలతో గోపగోపీజనాలు తన లీలలను గానం చేస్తూ ఉండగా, భగవంతుడైన కృష్ణుడు ఆ కొండను అలాగే పట్టుకొని ఉండిపోయాడు.

**సప్తరాత్రం మహామేఘా వవర్షుర్నన్దగోకులే ।**
**ఇన్ద్రేణ చోదితా విప్ర! గోపానాం నాశకారిణః ॥ 22 ॥**

విప్రవర్యా! గోపగణాలనన్నింటిని వినాశనం చేయాలని మహామేఘాలు ఇంద్రుని ప్రేరేపణతో నంద గోకులంలో ఏడు రాత్రుల వరకు కుండపోతగా జడివాన కురిశాయి.

**తతో ధృతే మహాశైలే పరిత్రాతే చ గోకులే ।**
**మిథ్యాప్రతిజ్ఞో బలభిద్ వారయామాస తాన్ ఘనాన్ ॥ 23 ॥**

కృష్ణుడు ఆ విధంగా గోవర్ధనశైలాన్ని ధరించి గోకులాన్ని రక్షించగా, బలరిపుడైన ఇంద్రుడు తన ప్రతిజ్ఞ వమ్ము కాగా, ఆ మేఘసమూహలను వాన కురియకుండా వారించాడు.

**వ్యభ్రే నభసి దేవేన్ద్రే వితథాత్మవచస్యథ ।**
**నిష్క్రమ్య గోకులం సర్వం స్వస్థానే పునరాగమత్ ॥ 24 ॥**

ఆకాశంలో మేఘాలు తొలగి పోయాయి. దేవేంద్రుడు పంతం విడిచి తన ప్రతిజ్ఞ వ్యర్థమయిందను కొన్నాడు. సమస్తగోకులవాసులు తిరిగి స్వస్థానాలకు చేరుకొన్నారు.

**ముమోచ కృష్ణోఽపి తదా గోవర్ధనమహాచలమ్ ।**
**స్వస్థానే విస్మితముఖై ర్దృష్టస్తైస్తు వ్రజౌకసైః ॥ 25 ॥**

ఆశ్చర్యచకితవదనులై వ్రజవాసులందరూ చూస్తూ ఉండగా కృష్ణుడు కూడ ఆ గోవర్ధనమహాశైలాన్ని దానిస్థానంలో నిలబెట్టాడు. అని పరాశరుడు చెప్పాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే శ్రీకృష్ణకృతగోవర్ధనపర్వతధారణం నామ ఏకాదశోఽధ్యాయః సమాప్తః ॥ 11 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో శ్రీకృష్ణకృతగోవర్ధనపర్వతధారణం అనే పదకొండవ అధ్యాయం సమాప్తం ॥ 11 ॥



# ద్వాదశోఽధ్యాయః - పన్నెండవ అధ్యాయం
## ఇంద్రకృత గోవింద పట్టాభిషేకః - ఇంద్రకృత గోవింద పట్టాభిషేకం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ధృతే గోవర్ధనే శైలే పరిత్రాతే చ గోకులే ।**
**రోచయామాస కృష్ణస్య దర్శనం పాకశాసనః ॥ 1 ॥**

కృష్ణుడు గోవర్ధనశైలాన్ని ఎత్తి, గోకులాన్ని ఉద్ధరించగా, పాకశాసనుడైన ఇంద్రుడు శ్రీకృష్ణ సందర్శనాన్ని అభిలషించాడు.

**సోఽధిరుహ్య మహానాగమైరావతమమిత్రజిత్ ।**
**గోవర్ధనగిరౌ కృష్ణం దదర్శ త్రిదశేశ్వరః ॥ 2 ॥**

శత్రువిజేత అయిన దేవేంద్రుడు మహాగజమైన ఐరావతాన్ని అధిరోహించి వచ్చి గోవర్ధన పర్వత సమీపంలో గోవిందుని వీక్షించాడు.

**చారయన్తం మహావీర్యం గాస్తు గోపవపుర్ధరమ్ ।**
**కృష్ణం చ జగతో గోపం వృతం గోపకుమారకైః ॥ 3 ॥**

గోపాలబాలకరూపం ధరించి గోవులను కాస్తూ, గోపకుమారులచే చుట్టబడియున్న మహావీర్యుడగు జగద్రక్షకుడైన శ్రీకృష్ణుని సందర్శించాడు.

**గరుడం చ దదర్శోచ్చైరన్తర్ధానగతం ద్విజ! ।**
**కృతచ్ఛాయం హరేర్మూర్ధ్ని పక్షాభ్యాం పక్షిపుంగవమ్ ॥ 4 ॥**

ద్విజశ్రేష్ఠా! ఎవ్వరికి కానరాకుండా పైభాగంలో హరిశిరస్సున తన రెక్కలతో నీడ కల్పిస్తూ ఉన్న పక్షి వరేణ్యుడైన గరుత్మంతుని కూడ వీక్షించాడు.

**అవరుహ్య స నాగేన్ద్రా దేకాన్తే మధుసూదనమ్ ।**
**శక్రః సస్మితమాహేదం ప్రీతివిస్ఫారితేక్షణః ॥ 5 ॥**

ఆ శక్రుడు ఐరావతం నుంచి క్రిందకు దిగి ఏకాంతంలో మధుసూదనుని సన్నిధికేగి ప్రీతితో కన్నులు విప్పారగా అల్లన నవ్వుతూ ఇలా అన్నాడు.

**కృష్ణ! కృష్ణ! శృణుష్వేదం యదర్థమహమాగతః ।**
**త్వత్సమీపం మహాభాగ! నైతచ్చిన్త్యం త్వయాఽన్యథా ॥ 6 ॥**

"కృష్ణ! కృష్ణ! ఇది ఆలకించు. నేను నీ సన్నిధికి ఎందుకు వచ్చానో విన్నవిస్తున్నాను. మహాభాగా! నీవు నన్ను ఇంకో విధంగా భావించవద్దు.

**భారావతారణార్థాయ పృథివ్యాః పృథివీతలమ్ ।**
**అవతీర్ణోఽఖిలాధారస్త్వమేవ పరమేశ్వర! ॥ 7 ॥**

పరమేశ్వరా! సమస్త ప్రపంచానికి నీవే ఆధారమై ఉన్నావు. పృథివీభారాన్ని అణగించడానికై నీవు ఈ పృథ్వీతలంపై అవతరించావు.

**మహ(ఖ)భంగ విరుద్ధేన మయా గోకులనాశకాః ।**
**సమాదిష్టా మహామేఘాస్తైశ్చేదం కదనం కృతమ్ ॥ 8 ॥**

యాగభంగం చేశావనే క్రోధంతో పగబూని నేను గోకులాన్ని అంతా ఆకులపరచమని మహామేఘాలను ఆజ్ఞాపించాను. వాటిచే ఈ అలజడి ఎంతో చేయబడింది.

**త్రాతా స్తాశ్చ త్వయా గావః సముత్పాట్య మహాగిరిమ్ ।**
**తేనాహం తోషితో వీర! కర్మణాఽత్యద్భుతేన తే ॥ 9 ॥**

వీరాగ్రేసరా! నీవు ఈ మహాగిరిని పెల్లగించి పైకెత్తి ఇచ్చటి గోవులను అన్నింటిని రక్షించావు. నీవు చేసిన ఈ అద్భుతకృత్యంవల్ల నేను ఎంతో సంతసించాను.

**సాధితం కృష్ణ! దేవానామహం మన్యే ప్రయోజనమ్ ।**
**త్వయా యమద్రిప్రవరః కరేణైకేన యద్ధృతః ॥ 10 ॥**

కృష్ణా! ఒక్కచేతితో నీవు ఈ ఉత్తమగిరిని అవలీలగా ఎత్తడం వల్ల, దేవతల ప్రయోజనం నెరవేరిందని నేను భావిస్తున్నాను.

**గోభిశ్చ చోదితః కృష్ణ! త్వత్సకాశమిహాగతః ।**
**త్వయాఽత్ర తాభిరత్యర్థం యుష్మత్సత్కారకారణాత్ ॥ 11 ॥**

కృష్ణ! గోవంశాన్ని రక్షించాలని, నీచే ఎల్లప్పుడు కాపాడబడే కామధేనువు మున్నగు వేల్పుటావులచే ప్రేరేపించబడి, నీకు విశేషసత్కారం కావించాలనే కోరికతో నేను నీ దరికి ఏతెంచాను.

**స త్వాం కృష్ణాభిషేక్ష్యామి గవాం వాక్యప్రచోదితః ।**
**ఉపేన్ద్రత్వే గవామిన్ద్రో గోవిన్దస్త్వం భవిష్యసి ॥ 12 ॥**

కృష్ణా! ఈ సమయంలో గోవుల వాక్యానుసారంగా నిన్ను ఉపేంద్ర పదవియందు అభిషిక్తుణ్ణి చేస్తాను. గోవులకు ఇంద్రుడవైన కారణంచే నీకు గోవింద నామం సార్థకం అవుతుంది (గోవిందుడవుతావు).

**అథోపవాహ్యాదాదాయ ఘణ్టామైరావతాద్ గజాత్ ।**
**అభిషేకం తయా చక్రే పవిత్ర జలపూర్ణయా ॥ 13 ॥**

అంతట సురేంద్రుడు తన వాహనమైన ఐరావతగజేంద్రంనుంచి గంటను తీసుకొని, దానిని పవిత్ర జలాలతో నింపి దానితో కృష్ణునకు అభిషేకం కావించాడు.

**క్రియమాణేఽభిషేకే తు గావః కృష్ణస్య తత్క్షణాత్ ।**
**ప్రస్రవోద్భూత దుగ్ధార్ద్రాం సద్యశ్చక్రుర్వసుంధరామ్ ॥ 14 ॥**

ఇంద్రుడా విధంగా గోవింద పట్టాభిషేకం చేస్తూ ఉండగా ఆ క్షణంలో గోవులు పొదుగులలో పాలు నింపుకొని వసుంధరనంతను తమక్షీరధారలచే నిండుగా తడిపి వేశాయి.

**అభిషిచ్య గవాం వాక్యాదుపేన్ద్రం వై జనార్దనమ్ ।**
**ప్రీత్యా సప్రశ్రయం వాక్యం పునరాహ శచీపతిః ॥ 15 ॥**

గోవుల వచనానుసారంగా శచీపతి జనార్దనుని ఉపేంద్రునిగా అభిషేకించి సంతుష్టుడై సవినయంగా మళ్లీ ఇలా అన్నాడు.

**గవామేతత్ కృతం వాక్యం తథాఽన్యదపి మేశృణు ।**
**యద్ బ్రవీమి మహాభాగ! భారావతరణేచ్ఛయా ॥ 16 ॥**

"మహాభాగ! నేను గోవుల మాట ఏదయితే ఉందో, దానిని చెల్లించాను. నీవు భూభారం తగ్గించదలచావు కాబట్టి నేను చెప్పే మరో విషయం ఆలకించు.

**మమాంశః పురుషవ్యాఘ్ర! పృథాయాం పృథివీతలే ।**
**అవతీర్ణోఽర్జునో నామ స రక్ష్యో భవతా సదా ॥ 17 ॥**

పురుషవ్యాఘ్రా! నా అంశమే భూమండలంలో పృథ (కుంతీ దేవి) యందు అర్జునుడనే పేరుతో అవతరించింది. అతడు ఎల్లప్పుడూ నీచే రక్షించబడాలి.

**భారావతరణే సాహ్యం స తే వీరః కరిష్యతి ।**
**స రక్షణీయో భవతా యథాఽఽత్మా మధుసూదన! ॥ 18 ॥**

ఆ వీరుడు ధరణీ భారావతరణంలో నీకు సహాయం అందీయగలడు. కాబట్టి మధుసూదనా! నీకు ఆతడు ఆత్మ సమానుడుగా రక్షింపదగినవాడు" అని వేడుకొన్నాడు.

**భగవానువాచ:–** భగవానుడు పలికెను.

**జానామి భారతే వంశే జాతం పార్థం తవాంశతః ।**
**తమహం పాలయిష్యామి యావదస్మి మహీతలే ॥ 19 ॥**

అపుడు భగవంతుడు దేవేంద్రునితో "భరతవంశంలో నీ అంశతో పృథాతనయుడర్జునుడు పుట్టాడని నాకు తెలుసు. నేను భూతలంలో ఉన్నంతకాలం అతనిని సంరక్షిస్తాను.

**యావన్మహీతలే శక్ర! స్థాస్యామ్యహ మరిన్దమ! ।**
**న తావదర్జునం కశ్చిద్ దేవేన్ద్ర! యుధి జేష్యతి ॥ 20 ॥**

శత్రువులను అణగించు స్వభావంకల శక్రా! దేవేంద్రా! ఎంత కాలమయితే నేను మహీస్థలిలో నివసిస్తానో, అంతకాలం కూడ అర్జునుని యుద్ధంలో ఏ ఒక్కడు గెల్వలేడు.

**కంసో నామ మహాబాహుర్దైత్యోఽరిష్ట స్తథా పరః ।**
**కేశీ కువలయాపీడో నరకాద్యాస్తథాఽపరే ॥ 21 ॥**
**హతేష్వేతేషు దేవేన్ద్ర! భవిష్యతి మహాహవః ।**
**తత్ర విద్ధి సహస్రాక్ష! భారావతరణం కృతమ్ ॥ 22 ॥**

మహాబాహుడైన కంసుడనే పేరుగల్గిన దైత్యుడు, అలాగే మరోరాక్షసుడైన అరిష్టుడు, కేశి, కువలయా పీడుడు, నరకాసురుడు మున్నగు మిగిలిన అసురులు అనేకులు ఉన్నారు.

దేవేంద్రా! ఇలాంటి రక్కసులు అందరూ వధించబడిన తరువాత మహాయుద్ధం సంభవిస్తుంది. సహస్రాక్షా! అపుడు సర్వభూభారావతరణం చేయబడినట్లుగా గ్రహించు.

**స త్వం గచ్ఛ న పుత్రార్థే సన్తాపం కర్తుమర్హసి ।**
**నార్జునస్య రిపుః కశ్చిన్మమాగ్రే ప్రభవిష్యతి ॥ 23 ॥**

నీ కుమారుడైన అర్జునుని విషయంలో నీవు పరితాపం చెందవద్దు. ఇక నీవు యథేచ్ఛగా వెళ్ల వచ్చు. అర్జునునికి శత్రువైన వాడెవ్వడు నా ఎదుట నిలిచి బ్రతకడం అనేది ఉండదు.

**అర్జునార్థే త్వహం సర్వాన్ యుధిష్ఠిర పురోగమాన్ ।**
**నివృత్తే భారతే యుద్ధే కున్త్యై దాస్యామ్యవిక్షతాన్ ॥ 24 ॥**

నేను అర్జునుని కోసమై మహాభారతయుద్ధం పూర్తి అయిన తరువాత యుధిష్ఠిరుడు మున్నగు పాండవులను ఏ మాత్రము క్షతగాత్రులు కాకుండా కుంతీదేవికి అప్పగిస్తాను” అని చెప్పాడు.

**ఇత్యుక్తః సమ్పరిష్వజ్య దేవరాజో జనార్దనమ్ ।**
**ఆరుహ్యైరావతం నాగం పునరేవ దివం యయౌ ॥ 25 ॥**

అని వరం ఈయగా దేవవిభుడు జనార్దనుని కౌగిలించుకొని, ఐరావతగజాన్ని అధిరోహించి తిరిగి దివికి వెళ్లి పోయాడు

**కృష్ణోఽపి సహితో గోభిర్గోపాలై శ్చ పునర్వ్రజమ్ ।**
**ఆజగామాథ గోపీనాం దృష్టిపూతేన వర్త్మనా ॥ 26 ॥**

అటుపిమ్మట శ్రీ కృష్ణుడు కూడ గోవులతోను, గోపాలకులతోను కూడుకొన్నవాడై, గోపికల చూపులచే పరమపవిత్రంగా మారిన దారివెంట తిరిగి వ్రేపల్లెకు చేరుకొన్నాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే ఇంద్రకృత గోవిందపట్టాభిషేకో నామ ద్వాదశోఽధ్యాయః సమాప్తః ॥ 12 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో ఇంద్రకృత గోవిందపట్టాభిషేకం అనే పన్నెండవ అధ్యాయం సమాప్తం॥12॥



## **త్రయోదశోఽధ్యాయః** – పదమూడవ అధ్యాయం

## **శ్రీకృష్ణకృత గోపికాసంయుత రాసలీలా** – శ్రీకృష్ణకృత గోపికాసంయుత రాసలీల

**పరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**గతే శక్రే తు గోపాలాః కృష్ణమక్లిష్ట కారిణమ్ ।**
**ఊచుః ప్రీత్యా ధృతం దృష్ట్వా తేన గోవర్ధనాచలమ్ ॥ 1 ॥**

ఇంద్రుడు అలా వెళ్లిపోగా, గోపాలురందరూ పరమప్రీతితో గోవర్ధన పర్వతాన్ని చేతదాల్చి తమ్ము రక్షించిన క్లేశం లేకుండాకర్తవ్యం ఆచరించే కృష్ణుని వీక్షించి ఇలా అన్నారు.

**వయమస్మా న్మహాబాహో! భగవన్! మహతో భయాత్ ।**
**గావశ్చ భవతా త్రాతా గిరిధారణకర్మణా ॥ 2 ॥**

"మహాభాగా! భగవన్! గోవర్ధన గిరినెత్తి, నీ బాహుబలంచూపించి, మమ్మల్ని అందరిని పెద్ద భయంనుంచి రక్షించావు. నీ వల్ల గోవులన్నీ కాపాడబడ్డాయి.

**బాల క్రీడేయమతులా గోపాలత్వం జుగుప్సితమ్ ।**
**దివ్యం చ కర్మ భవతః కిమేతత్ తాత! కథ్యతామ్ ॥ 3 ॥**

నీవు చూపించిన ఈ బాల క్రీడ. సాటిలేనిది. నీకు ఈ గోపాలకత్వమనేది సైరింపరానిది. నీ కృత్యాలన్నీ దివ్యమై కనిపిస్తున్నాయి. నాయనా! ఇదేమిటోమాకు తెలియజేయి.

**కాలియో దమిత స్తోయే ప్రలమ్బో వినిపాతితః, (ధేనుకో) ।**
**ధృతో గోవర్ధనశ్చాయం శంకితాని మనాంసి నః ॥ 4 ॥**

మడుగులో కాళియుడా అణచి వేయబడ్డాడు. ప్రలంబుడా (ధేనుకుడా) కూల్చబడ్డాడు. ఇంత పెద్దదైన గోవర్ధనాద్రినా పైకెత్తావు. మామనస్సులలో శంకలు కలుగుతున్నాయి.

**సత్యం సత్యం హరేఃపాదౌ శపామోఽమితవిక్రమ! ।**
**యథావద్వీర్యమాలోక్య న త్వాం మన్యామహే నరమ్ ॥ 5 ॥**

అమిత విక్రమా! భగవంతుడైన శ్రీ హరిపాదాలపై ఒట్టుపెట్టి అడుగుతున్నాము. నిజం యథార్థం నీ పరాక్రమాన్ని చూస్తూ ఉంటే, నిన్ను సాధారణమానవునిగా ఊహింపలేకున్నాము.

**ప్రీతిః సస్త్రీకుమారస్య వ్రజస్య తవ కేశవ! ।**
**కర్మచేదమశక్యం యత్సమస్తై స్త్రిదశైరపి ॥ 6 ॥**

కేశవా! ఆ బాలగోపాలానికి, స్త్రీలకు, చిన్న పిల్లలకు నీ పట్ల ఎక్కడ లేని ప్రీతి. ఎల్ల వేల్పులకు శక్యం కాని అద్భుత కృత్యం నీవు చేశావు.

**బాలత్వం చాతివీర్యం చ జన్మ చాస్మాస్వశోభనమ్ ।**
**చిన్త్యమాన మమేయాత్మన్! శంకాం కృష్ణ! ప్రయచ్ఛతి ॥ 7 ॥**

కృష్ణా! ఒక వంక చూస్తే బాల్యం మరొకవంకచూస్తే అపూర్వ ప్రభావం పుట్టుకచూస్తే మావంటి తక్కువ కులంలో జన్మ. ఆమేయస్వరూపా! ఆలోచించే కొలదీ మాకు సందేహం కలుగుతోంది.

**దేవో వా దానవో వా త్వం యక్షో గన్ధర్వ ఏవ వా ।**
**కిం వా౽స్మాకం విచారేణ బాన్ధవో౽సి నమో౽స్తు తే ॥ 8 ॥**

నీవు దేవుడవా! దానవుడవా! లేక యక్షుడవా! కాక గంధర్వుడవా! మాకు ఈ విమర్శ వల్ల ఏం ప్రయోజనం ఉంది కనుక? నీవు మాకు అందరికి బంధువవు. అట్టి నీకు మా నమస్కారం.

**క్షణం భూత్వాత్వసౌ తూష్ణీం కించిత్ ప్రణయకోపవాన్ ।**
**ఇత్యేవముక్తస్తైర్గోపైః కృష్ణో౽ప్యాహ మహామునే! ॥ 9 ॥**

మహామునీ! ఈ విధంగా సమస్త గోపాలకులు మాట్లాడగా ఆ కృష్ణుడు కూడ క్షణకాలం మౌనం వహించి కొంచెం నెయ్యంతో కూడిన అలుక చూపించి వారికి ఇలా మారుపలికాడు.

**మత్సమ్బన్ధేన భో గోపాః! యది లజ్జా న జాయతే ।**
**శ్లాఘ్యో వా౽హం తతః కింవో విచారేణ ప్రయోజనమ్ ॥ 10 ॥**

"ఓ గోపాలకులారా! నా సంబంధం వల్ల మీకు ఏ మాత్రం సిగ్గు కలగ కుండా ఉంటే చాలు కదా! అప్పుడు మీరు నన్ను కొనియాడ వచ్చు కూడ దానికి మారుగా వేరే ఆలోచన వల్ల ఏం ప్రయోజనం?

**యది వో౽స్తి మయి ప్రీతిః శ్లాఘ్యో౽హం భవతాం యది ।**
**తదాత్మబన్ధు సదృశీ బుద్ధిర్వః క్రియతాం మయి ॥ 11 ॥**

నాపట్ల మీకు ప్రీతి ఉంటే, నేను మీచే ప్రశంసలందుకోవడానికి అర్హుడనయితే, మీరు మీ ఆత్మ బంధువులపై ఏవిధమైన ప్రేమ చూపిస్తారో ఆ అనురాగ బుద్ధిని నాపై కనబరచండి చాలు

**నాహం దేవో న గన్ధర్వో న యక్షో న చ దానవః ।**
**అహం వో బాన్ధవో జాతో నాస్తి చిన్త్యమతో౽న్యథా ॥ 12 ॥**

నేను దేవుడనూ కాను, గంధర్వుడనూ కాను, యక్షుడనూ కాను, దానవుడనూ కాను. నేను మీకు చుట్టమునై పుట్టినాను. ఇంతకన్న వేరే ఆలోచించ వలసిన పనేమి లేదు" అని కొంచెం కినుకతో పలికాడు.

**ఇతి శ్రుత్వా హరే ర్వాక్యం బద్ధమౌనా స్తతోవనమ్ ।**
**యయుర్గోపా మహాభాగ! తస్మిన్ ప్రణయకోపిని ॥ 13 ॥**

మహాభాగ! మైత్రేయా! ఈ విధంగా భగవంతుడు ప్రేమతో నిండిన కోపం చూపించి పలుకగా, ఆ పలుకులను విన్న గోపాలురు మారుమాటాడక మౌనం వహించి బృందావనం చేరారు.

**కృష్ణస్తు విమలం వ్యోమ శరచ్చన్ద్రస్య చన్ద్రికామ్ ।**
**తథా కుముదినీం ఫుల్లా మామోదిత దిగన్తరామ్ ॥ 14 ॥**

**వనరాజిం తథా కూజద్ భృంగమాలాం మనోరమామ్ ।**
**విలోక్య సహ గోపీభి ర్మనశ్చక్రే రతిం ప్రతి ॥ 15 ॥**

కృష్ణుడయితే నిర్మలమైన ఆకాశాన్ని, శరత్కాలచంద్రుని వెన్నెలను, వికసించిన పూలతో దిశలనన్నిటిని పరిమళింప జేస్తున్న తెల్ల కలువ తీగల్ని, ఝుంకారాలు చేస్తూ ఉన్న తుమ్మెదల గుంపులతో మనసు హరిస్తున్న వన రాజిని చూచి గోపికలతో కలసి విహరించాలని హృదయంలో అభిలషించాడు.

**వినా రామేణ మధుర మతీవ వనితాప్రియమ్ ।**
**జగౌ కలపదం శౌరిస్తార మన్ద్ర కృతక్రమమ్ ॥ 16 ॥**

బలరాముడు లేకుండా గోపవనితలకు మిక్కిలి ప్రీతి కలిగేటట్లుగా, అవ్యక్తమధురంగా, మృదుపదయుక్తంగా తారమంద్ర స్థాయి ననుసరిస్తూ శౌరి సంగీతం పాడాడు.

**రమ్యం గీతధ్వనిం శ్రుత్వా సంత్యజ్యావసథాంస్తదా ।**
**ఆజగ్ము స్త్వరితా గోప్యో యత్రాస్తే మధుసూదనః ॥ 17 ॥**

ఆ రమ్యమైన సంగీత ధ్వనిని విని గోపికలు తమ ఇండ్లను విడిచి పెట్టి, మధుసూదను డెక్కడ ఉన్నాడో ఆ ప్రదేశానికి పరుగులు తీస్తూ వచ్చారు.

**శనైః శనై ర్జగౌ గోపీ కాచిత్ తస్య లయానుగమ్ ।**
**దత్తావధానా కాచిత్తు తమేవ మనసాఽస్మరత్ ॥ 18 ॥**

ఒక గోపిక కృష్ణుని పాటలకనుకూలంగా అల్లనల్లన గొంతు కలిపింది. మరోగోపిక ఆ పాటపైనున్న ఆసక్తితో ఆతనినే మనస్సులో ధ్యానించింది.

**కాచిత్ కృష్ణేతి కృష్ణేతి ప్రోక్త్వా లజ్జాముపాగతా ।**
**యయౌచ కాచిత్ ప్రేమాన్ధా తత్పార్శ్వమవిలజ్జితా ॥ 19 ॥**

ఒక మగువ కృష్ణా! కృష్ణా! అని పైకి వినబడేలా పలికి సిగ్గుచెందింది. మరొక వనిత సిగ్గు విడిచి పెట్టి ప్రేమాంధురాలై ఆతని ప్రక్కకు చేరింది.

**కా చిదావసథస్యాన్తః స్థితా దృష్ట్వా బహిర్గురూన్ ।**
**తన్మయత్వేన గోవిన్దం దధ్యౌ మీలితలోచనా ॥ 20 ॥**

వేరొక తరుణి తమముంగిలి వాకిటకువచ్చి బయట ఉన్న పెద్దలను చూచి జంకుతో రాలేక కనులు మూసికొని స్థైర్యాన్ని పొంది తన్మయత్వంతో శ్రీకృష్ణుని ధ్యానం చేయసాగింది.

**తచ్చిన్తావిపులాహ్లాద క్షీణపుణ్యచయా తథా ।**
**తదప్రాప్తి మహాదుఃఖవిలీనాశేష పాతకా ॥ 21 ॥**

**చిన్తయన్తీ జగత్సూతిం పరబ్రహ్మస్వరూపిణమ్ ।**
**నిరుచ్ఛ్వాసతయా ముక్తిం గతాఽన్యా గోపకన్యకా ॥ 22 ॥**

వేరొక గోపకన్య ఆ కృష్ణునిపైనున్న చింతతో అధికమైన ఆహ్లాదాన్ని పొందింది అలా తొలిజన్మలలో చేసుకొన్న పుణ్యాల ఫలాన్ని అంతటినీ క్షీణింపచేసుకొంది. ఆ కృష్ణుని పొందలేకపోవడమనే మహాదుఃఖంలో గతజన్మలలో చేసుకొన్న సమస్త పాపాలను నశింపజేసుకొంది. జగత్పిత అయిన కేవల పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీకృష్ణునే ధ్యానిస్తూ ఉచ్ఛ్వాసం నిలిచిపోయి ముక్తిని పొందింది.

**గోపీ పరివృతో రాత్రిం శరచ్చన్ద్రమనోరమామ్ ।**
**మానయామాస గోవిన్దో రాసారమ్భరసోత్సుకః ॥ 23 ॥**

గోపికలు చుట్టూ కూడి ఆడగా, శరత్కాల చంద్రునితో మనోహరమైన రాత్రివేళను, గోవిందుడు రాస క్రీడను ఆరంభించే కేళీ రసోల్లాసంతో గౌరవించాడు.

**గోప్యశ్చ బృన్దశః కృష్ణచేష్టాస్వాయత్తమూర్తయః ।**
**అన్యదేశం గతే కృష్ణే చేరు ర్బృన్దావనాన్తరమ్ ॥ 24 ॥**

కృష్ణుడు ఆ సమయంలో అంతర్ధానమై మరోచోటికి చేరుకోగా, గోపికలు గుంపులు గుంపులుగా కృష్ణలీలలు అభినయిస్తూ, ఆతనియందే హృదయాలు నిల్పి బృందావనమధ్యంలో ఇటు అటూ తిరుగుతూ వెదకసాగారు.

**కృష్ణే నిరుద్ధహృదయా ఇదమూచుః పరస్పరమ్ ।**
**కృష్ణోఽహమేతల్లలితం వ్రజామ్యాలోకతాం గతిః ॥**
**అన్యా బ్రవీతి కృష్ణస్య మమ గీతి ర్నిశమ్యతామ్ । 25 ॥**

కృష్ణునియందే నిలిపిన హృదయాలతో ఆ గోపికలు పరస్పరం ఇలా మాట్లాడుకోసాగారు "ఒక గోపిక ఇదిగో! నేను కృష్ణుడను, చక్కగా మీకు కనబడకుండా వెళ్లి పోతున్నాను. నాజాడ కనుక్కోండి చూద్దామంది. ఇంకో గోపిక నేనే కృష్ణుడను, నాపాట వినండే అని పలికింది.

**దుష్ట కాలియ! తిష్ఠాత్ర కృష్ణోఽహమితి చాపరా ।**
**బాహుమాస్ఫోట్య కృష్ణస్య లీలయా సర్వమాదదే ॥ 26 ॥**

మరో గోపిక ఓరి దుష్టుడా! కాలియుడా! నిలవరా! నిలు నేనే కృష్ణుడనురా అని జబ్బచరచి కృష్ణలీలను అనుకరిస్తూ సర్పాన్ని పట్టుకొన్నట్లు అభినయించింది.

**అన్యా బ్రవీతి భో గోపా! నిఃశంకైః స్థీయతామిహ ।**
**అలం వృష్టి భయేనాత్ర ధృతో గోవర్ధనో మయా ॥ 27 ॥**

ఇంకో గోపిక ఓ గోపాలకులారా! మీరు భయపడకండి. మీరు ధైర్యంగా ఇక్కడ నిలవండి. ఈ వానకు జడిసిపోకండి. నేను గోవర్ధన గిరిని పైకెత్తాను రండని చెప్పింది.

**ధేనుకోఽ యం మయాక్షిప్తో విచరన్తు యథేచ్ఛయా ।**
**గోపీ బ్రవీతి వై చాన్యా కృష్ణలీలానుకారిణీ ॥ 28 ॥**

మరోగోపికయితే ఇడుగో ధేనుకాసురుడు. వీడిని నేను విసరివేస్తున్నాను. మీరు యథేచ్ఛగా విహరించండి అంటూ శ్రీకృష్ణలీలను అనుకరించింది.

**ఏవం నానా ప్రకారాసు కృష్ణచేష్టాసు తాస్తదా ।**
**గోప్యో వ్యగ్రాః సమం చేరూ రమ్యం బృన్దావనాన్తరమ్ ॥ 29 ॥**

ఈ ప్రకారంగా పెక్కురకాలుగా కృష్ణచేష్టల ద్వారా గోపికలు అందరూ ఆకులపడి ఒక చోటచేరి రమణీయమైన బృందావనమధ్యంలో తిరుగాడజొచ్చారు.

**విలోక్యైకా భువం ప్రాహ గోపీ గోపవరాంగనా ।**
**పులకాంచిత సర్వాంగీ వికాసి నయనోత్పలా ॥ 30 ॥**

**ధ్వజ వజ్రాంకుశాబ్జాంక రేఖావన్త్యాలి! పశ్యత ।**
**పదాన్యేతాని కృష్ణస్య లీలాలంకృత గామినః ॥ 31 ॥**

ఒక గోపిక భూమిపైకి చూచి గోపికా స్త్రీలలో శ్రేష్ఠురాలుకాన మేనెల్ల పులకరించగా, కలువ పూలవంటి నయనాలు విప్పారగా “ఓ సఖీ! ఇటు చూడవే ధ్వజం, వజ్రం, అంకుశం, పద్మం అనే గుర్తులతో ఉండే రేఖలు కలిగిన కృష్ణుని అడుగుజాడలను తిలకించవే. ఇవి ఆ కృష్ణదేవుని లీలావిలాస గమనాన్ని సూచిస్తున్నాయి” అన్నది.

**కా ఽపి తేన సమం యాతా కృతపుణ్యా మదాలసా ।**
**పదాని తస్యాశ్చైతాని ఘనాన్యల్పతనూని చ ॥ 32 ॥**

ఇలా చూడవే! ఎవరో ఆ అదృష్టవంతురాలు! ఒక మదవతి ఆ కృష్ణునితోపాటు వెళ్లి ఉంటుంది. ఆమె అడుగుల గుర్తులు గట్టివిగాను, చిన్నవిగాను ఇక్కడ కనబడుతున్నాయి.

**పుష్పాపచయ మత్రోచ్చై శ్చక్రే దామోదరో ధ్రువమ్ ।**
**యేనాగ్రాక్రాన్తమాత్రాణి పదాన్యత్ర మహాత్మనః ॥ 33 ॥**

ఇక్కడ దామోదరుడు పైకి ఎత్తుగానున్న పూల మొక్కలోని పూలను కోసి ఉండవచ్చు. సందేహం లేదు. ఇక్కడ ఆ మహానుభావుని ముందడుగు పైభాగాలు మాత్రమే స్పష్టంగా గోచరిస్తున్నాయి.

**అత్రోపవిశ్య సా తేన కాఽపి పుష్పైరలంకృతా ।**
**అన్యజన్మని సర్వాత్మా విష్ణురభ్యర్చితో యయా ॥ 34 ॥**

ఆ సౌభాగ్యవతి ఎవరో ఇక్కడ కూర్చుండి ఆ మహాత్ముని ద్వారా పుష్పాలంకరణం చేయించుకొంది. అది వేరే జన్మలో సర్వాత్ముడైన విష్ణువును అర్చించి యుండవచ్చు.

**పుష్పబన్ధన సమ్మాన కృత మానమపాస్య తామ్ ।**
**నన్దగోపసుతో యాతో మార్గేణానేన పశ్యత ॥ 35 ॥**

ఇలా చూడవే! స్వామి పూలుదురిమి ఆదరించిన కారణంచే ఆగోపిక నా అంతటిది లేదని మిడిసి పడింది కాబోలు, ఆ మానవతిని ఇట విడిచివేసి నందగోపుని ముద్దుబిడ్డడు ఈ దారిని వెళ్లిపోయి ఉండవచ్చు.

**అనుయానేఽ సమర్థాన్యా నితమ్బభరమన్థరా ।**
**యా గన్తవ్యే ద్రుతం యాతి నిమ్నపాదాగ్ర సంస్థితిః ॥ 36 ॥**

ఇటు చూడండి! అలా వెళ్లిపోతున్న ఆ చక్కనివాని వెంట తాను కూడ నడవాలని, పిరుదుల బరువుచే గబగబా పోలేక మంద మందంగా ఒక మందయాన అడుగులు వేసింది కాబోలు, దాని పాదాగ్రాలు ఇక్కడ ఈ నేలపై గట్టిగా మోపబడ్డాయి.

**హస్తన్యస్తాగ్రహస్తేయం తేన యాతి తథా సఖి! ।**
**అనాయత్తపదన్యాసా లక్ష్యతే పదపద్ధతిః ॥ 37 ॥**

ఓ చెలీ! ఆ అందగాని చేతిని చేతితో పట్టుకొని ఒకామె ఆతనితో కలిసి ఇలా వెళ్లి ఉండవచ్చు. ఎందు చేతనంటావా? ఈ దారిలో అడుగులు అంటీ అంటనట్లుగా నేలపై సరిగా ఆనించకుండా ఉన్నట్లుగా కనబడుతోంది. (అగ్రహస్తా–కొనవ్రేలుతో)

**హస్త సంస్పర్శమాత్రేణ ధూర్తేనైషా విమానితా ।**
**నైరాశ్యాన్మన్ద గామిన్యా నివృత్తం లక్ష్యతే పదమ్ ॥ 38 ॥**

చేయిపట్టుకొన్నంత మాత్రంచేతనే ఆ అల్లరి కృష్ణుడు ఈ గోపబాలికను విదలించుకొని ఉంటాడు. అందు వల్లనే ఆమె అవమానంతో నిరాశ చెంది, ఆ మందగామిని వెనుదిరిగి వెళ్లిపోయిన అడుగుజాడలిచ్చట కనపడుతున్నాయి.

**నూనముక్త్వా త్వరామీతి పునరేష్యామి తేఽన్తికమ్ ।**
**తేన కృష్ణేన యేనైషా త్వరితా పద పద్ధతిః ॥ 39 ॥**

కృష్ణుడు ఒక గోపికతో “నేను తొందరగా వెళ్లాలి. నీవు ఇక్కడే ఉండు, నేను మళ్లీ నీదరికి వస్తాను. (ఈ వనంలో నివసించే రాక్షసుని సంహరించాలి”) అంటూ గబగబా వెళ్లి పోయాడు కాబోలు. అందు వల్లనే ఆచిన్న వాని పాదచిహ్నాలు ఇక్కడ త్వరత్వరగా పడ్డాయి.

**ప్రవిష్టో గహనం కృష్ణః పదమత్ర న లక్ష్యతే ।**
**నివర్తధ్వం శశాంకస్య నైతద్దీధితిగోచరే ॥ 40 ॥**

కృష్ణుడు చొరరాని ఈ అడవిలోకి వెళ్లిపోయాడు కాబోలు! ఈ అడుగు జాడ చూస్తే అలా కనబడుతోంది. జాబిల్లి వెలుగులు ఇందు కానరావడంలేదు మనం వెనుదిరిగి పోవాలి.

**నివృత్తాస్తా స్తతో గోప్యో నిరాశాః కృష్ణదర్శనే ।**
**యమునాతీర మాగత్య జగుస్తచ్చరితం తదా ॥ 41 ॥**

అలా ఆగోపికలు కృష్ణుడు కానరాక పోవడంచే ఆశలు విడిచి వెనుదిరిగారు. అందరూ యమునానదీ తీరానికి వచ్చి ఆ గోవిందలీలలను గానం చేయసాగారు.

**తతో దదృశు రాయాన్తం వికాసి ముఖపంకజమ్ ।**
**గోప్యస్త్రైలోక్యగోప్తారం కృష్ణమక్లిష్టచేష్టితమ్ ॥ 42 ॥**

అంతట ఆ గోపవనితలు అందరూ ఎదురుగా అక్కడకు వస్తూ ఉన్న వికసించిన తామరవంటి ముద్దుమోము కల, ముల్లోకాలను కాపాడ గల్గిన, అనాయాసంగా అద్భుత కర్మలు ఆచరించే శ్రీ కృష్ణుని వీక్షించారు.

**కాచి దాలోక్య గోవిన్ద మాయాన్తమతిహర్షితా ।**
**కృష్ణ కృష్ణేతి కృష్ణేతి ప్రాహ నాన్యదుదీరయత్ ॥ 43 ॥**

ఒక గోపిక ఎదురుగా వస్తూ ఉన్న గోవిందుని చూచి పట్టరాని ఆనందంతో "కృష్ణా! కృష్ణా! కృష్ణా!" అని ముమ్మారు గొంతెత్తి పిలిచింది కాని మారుమాట మాట్లాడలేకపోయింది.

**కాచిద్ భ్రూభంగురం కృత్వా లలాట ఫలకం హరిమ్ ।**
**విలోక్యనేత్ర భృంగాభ్యాం పపౌ తన్ముఖపంకజమ్ ॥ 44 ॥**

మరో గోపిక కనుబొమలు ముడివడగా, లలాట భాగంలో (నుదుటిపై) హరిని వీక్షించి, తన కనులుతుమ్మెదలై పోగా ఆ కృష్ణుని ముఖపద్మ మకరందాన్ని త్రాగసాగింది. (మోముదామరలోని తేనెను గ్రోలసాగింది).

**కాచి దాలోక్య గోవిన్దం నిమీలిత విలోచనా ।**
**తస్యైవ రూపం ధ్యాయన్తీ యోగారూఢేవ సా బభౌ ॥ 45 ॥**

ఇంకో గోపిక గోవిందుని తదేక దృష్టితో చూచి, మైమరచి పోయి, కన్నులు అల్లనల్లన మూసుకొని, ఆతని రూపాన్నే మనస్సులో ధ్యానిస్తూ యోగారూఢయైన తపస్వినిలా ప్రకాశించింది.

**తతః కాంచిత్ ప్రియాలాపైః కాంచిత్ భ్రూభంగ వీక్షణైః ।**
**నిన్యేఽనునయ మన్యాం చ కరస్పర్శేన మాధవః ॥ 46 ॥**

అంత మాధవుడు ఒక గోపకాంతను ఇంపునుగూర్చే సొంపెసలారు పలుకులతోను, మరొక గొల్ల పడుచును కనుబొమలుముడిచి చూస్తూ, ఇంకో ముద్దు లాడిని చేతితో తాకి ఓ దారుస్తూ, అందరి మనస్సులలోని కలతలను పోగొట్టి లాలించాడు.

**తాభిః ప్రసన్న చిత్తాభి ర్గోపీభిః సహసాదరమ్ ।**
**రరామ(స) రాసగోష్ఠీభి రుదారచరితో హరిః ॥ 47 ॥**

ఉదారచరిత్ర కల్గిన ఆ హరి ఆ గోపికల చిత్తములు ప్రసన్నాలు కాగా ఎంతో ప్రీతితో వారితో రాసక్రీడలచే క్రీడించాడు.

**రాసమణ్డల బన్ధోఽపి కృష్ణ పార్శ్వమనుజ్ఝతా ।**
**గోపీజనేన నైవాభూదేకస్థాన స్థిరాత్మనా ॥ 48 ॥**

ఆ సమయంలో ఏ ఒక్క గోపిక కూడ, కృష్ణ సాన్నిధ్యం కోరి స్థిరమైన మనస్సుతో ఆయన స్థానాన్ని విడిచి పెట్టక పోవడంతో గోపికా జనంచే రాసమండలబంధం కుండలాకారంగా ఏర్పడడం వీలుకాకపోయింది.

**హస్తే ప్రగృహ్య చైకైకాం గోపికాం రాసమణ్డలమ్ ।**
**చకార తత్కరస్పర్శ నిమీలిత దృశం హరిః ॥ 49 ॥**

అంత కృష్ణుడు ఒక్కొక్క గోపికను చేతితో పట్టి లాగుకొని వచ్చి రాసమండలం ఏర్పరచాడు. హరి కరసంస్పర్శ వల్ల కల్గిన ఆనందంచే ఆ గోపకాంతల కన్నులు మూతలుపడ్డాయి.

**తతః స వవృతే రాస శ్చలద్వలయనిఃస్వనః ।**
**అనుయాత శరత్కావ్య గేయగీతి రనుక్రమాత్ ॥ 50 ॥**

అనంతరం రాసక్రీడ ఆరంభమయింది. ఆ రాసకేళిలో కృష్ణుడు, గోపీగణం చలిస్తున్న కంకణధ్వనులతో మధురమైన శరదృతు ప్రబంధగానం చేస్తూ ఉండగా క్రమంగా రాసారంభమయింది.

**కృష్ణః శరచ్చన్ద్రమసం కౌముదీం కుముదాకరమ్ ।**
**జగౌ గోపీ జనస్త్వేకం కృష్ణనామ పునఃపునః ॥ 51 ॥**

కృష్ణుడు శరత్కాలచంద్రుని, వెన్నెలను, కలువ పూలకొలను గురించి గానం చేశాడు. గోపికలు మాత్రం ఒక్క కృష్ణనామాన్నే పదేపదే పాడసాగారు.

**పరివృత్తి శ్రమేణైకా చలద్వలయలాపినీమ్ ।**
**దదౌ బాహులతాం స్కన్ధే గోపీ మధునిఘాతినః ॥ 52 ॥**

ఒక గోపిక పదేపదే గుండ్రంగా తిరగడం వల్ల కల్గిన అలసటచే, ముంజేతి కంకణాలు ధ్వనిస్తూఉండగా, మధుసూదనుని బాహుపీఠంపై తన బాహులతను వేసి అలంకరించింది.

**కాచిత్ ప్రవిలసద్బాహుః పరిరభ్య చుచుమ్బ తమ్ ।**
**గోపీ గీతస్తుతి వ్యాజాన్నిపుణా మధుసూదనమ్ ॥ 53 ॥**

మరో నెరజాణయైన గోపిక పాటపాడే నెపంతో తనరమణీయ బాహువులను పొడుగ్గా చాచి మధుద్వేషిని కౌగిలించుకొని ముద్దులు పెట్టింది.

**గోపీ కపోల సంశ్లేష మభిగమ్య హరేర్భుజౌ ।**
**పులకోద్గమ సస్యాయ స్వేదామ్బుఘనతాం గతౌ ॥ 54 ॥**

శ్రీ కృష్ణుని రెండు చేతులు గోపికల ధగదగ మెరిసే చెక్కిళ్ల సంస్పర్శను పొంది పులంకాకురాలనే సస్యాలు పెంపొందడానికై చెమట బిందువులను వర్షించే మేఘాలయ్యాయి.

**రాసగేయం జగౌ కృష్ణో యావత్ తారతరధ్వనిః ।**
**సాధు కృష్ణేతి కృష్ణేతి తావత్ తా ద్విగుణం జగుః ॥ 55 ॥**

కృష్ణుడు తారస్థాయిలో రాసగేయం ఆలపించగానే, ఆ గోపికలు దానికి రెట్టింపు స్వరంతో “కృష్ణా! బాగు! కృష్ణా! బాగుంది” అని సల్లాపంగావించారు.

**గతేతు గమనం చక్రు ర్వలనే సమ్ముఖం యయుః ।**
**ప్రతిలోమానులోమాభ్యాం భేజుర్గోపాంగనా హరిమ్ ॥ 56 ॥**

రాసంలో కృష్ణుడు వెడుతూ ఉంటే గోపికలు వెళ్లసాగారు. అతడు వలయాకారంలో తిరుగుతూ ఉంటే వారుకూడ అతని కెదురుగా తిరగసాగారు. ప్రతిలోమం, అనులోమం అనే గమనాలద్వారా గోపాంగనలు హరిని సేవించారు.

**స తథా సహ గోపీభీ రరామ మధుసూదనః ।**
**యథాబ్దకోటి ప్రమితః క్షణస్తేన వినాభవత్ ॥ 57 ॥**

ఆ మధుసూదనుడు ఆ విధంగా గోపికలతో క్రీడ కావించాడు. కృష్ణుడు కనబడని ఒక క్షణ కాలమయినా, వారికి కోటిసంవత్సరాల కాలంగా తోచింది.

**తా వార్యమాణాః పతిభిః పితృభి ర్భాతృభిస్తథా ।**
**కృష్ణం గోపాంగనా రాత్రౌ రమయన్తి రతిప్రియాః ॥ 58 ॥**

ఆ గోపాంగనలు మగలచే, తండ్రులచే, సోదరులచే నివారించబడినా, రాత్రి సమయంలో ఆనందాతి రేకంతో కృష్ణునితో క్రీడించారు.

**సోఽపి కై శోరకవయో మానయన్ మధుసూదనః ।**
**రేమే తాభి రమేయాత్మా క్షపాసు క్షపితాహితః ॥ 59 ॥**

శత్రువులను తపింపచేసే అమేయాత్ముడగు ఆమధుసూదనుడు కూడ తనకైశోరవయస్సును మన్నించి రాత్రులలో వారితో కలసి విహరించాడు.

**తద్ భర్తృషు తథా తాసు సర్వభూతేషు చేశ్వరః ।**
**ఆత్మస్వరూప రూపోऽసౌ వ్యాప్య సర్వమవస్థితః ॥ 60 ॥**

వారి యందు, వారిభర్తలయందు, సమస్త ప్రాణులయందు, ఆ సర్వవ్యాపియైన భగవంతుడగు కృష్ణుడు ఆత్మస్వరూపుడై వాయువులా సమానుడై వ్యాపించి ఉన్నాడు.

**యథా సమస్త భూతేషు నభోऽగ్నిః పృథివీ జలమ్ ।**
**వాయు శ్చాత్మా తథైవాసౌ వ్యాప్య సర్వమవస్థితః ॥ 61 ॥**

సర్వభూతాలయందు ఆకాశం, అగ్ని, భూమి, నీరు, గాలి, ఆత్మ ఎలా వ్యాపించియున్నాయో,అలా ఆభగవంతుడు సర్వమునందు వ్యాపించి ఉన్నాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే శ్రీ కృష్ణకృతగోపికాసంయుత రాసలీలా నామ త్రయోదశోऽధ్యాయః సమాప్తః॥13॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో శ్రీకృష్ణకృతగోపికాసంయుత రాసలీల అనే పదమూడవ అధ్యాయం సమాప్తం ॥13॥



## చతుర్దశోఽధ్యాయః - పద్నాల్గవ అధ్యాయం

## వృషభాసురవధః - వృషభాసుర వధ

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు పలికాడు.

**ప్రదోషాగ్రే కదాచిత్తు రాసాసక్తే జనార్దనే ।**
**త్రాసయన్సమదో గోష్ఠమరిష్ట స్సముపాగమత్ ॥ 1 ॥**

ఒకనాటి సాయంకాల సంధ్యానంతరం కృష్ణుడు రాస క్రీడయందు ఆసక్తుడై ఉండగా, అరిష్టుడనే అసురుడు మదించిన వృషభరూపం ధరించి వ్రేపల్లెను కకావికలు చేస్తూ సమీపించాడు.

**స తోయ తోయద చ్ఛాయ స్తీక్ష్ణశృంగోఽర్కలోచనః ।**
**ఖురాగ్ర పాతై రత్యర్థం దారయన్ వసుధాతలమ్ ॥ 2 ॥**

**లేలిహానః సనిష్పేషం జిహ్వయోష్ఠౌ పునఃపునః ।**
**సంరమ్భావిద్ధ లాంగూలః కఠిన స్కన్ధ బన్ధనః ॥ 3 ॥**

ఆ వృషభం నీటితో నిండిన మేఘంలా నల్లగా ఉంది. కొమ్ములు బాగా వాడిగా ఉన్నాయి. కన్నులు సూర్యుని వేడిని కురుస్తున్నాయి. కాలి డెక్కలచే నేలనంతా చీల్చివేస్తోంది. అది పాములా బుసలుకొడుతూ పండ్లు నూరింది. నాలుకచాచి పెదవులను పదేపదే నాకింది. తోకనుపైకెత్తి క్రోధంతో త్రిప్పసాగింది. దాని కఠినమైన మెడను కదల్పసాగింది.

**ఉదగ్ర కకుదా భోగః ప్రమాణాద్దురతిక్రమః ।**
**విణ్మూత్రలిప్త పృష్ఠాంగో గవాముద్వేగ కారకః ॥ 4 ॥**

అది మిక్కిలి ఎత్తయిన మూపురంతో ఉంది. అంతులేని ఒడ్డూ, పొడవు కలిగి ఉంది. మూత్ర పురీషాలతో పూయబడ్డ పృష్ఠభాగంతో ఉంది. అది పశువుల కన్నింటికి ఉద్వేగం చేకూర్చింది.

**ప్రలమ్బ కణ్ఠోఽతిముఖ స్తరుఘాతాంకితాననః ।**
**పాతయన్ స గవాంగర్భాన్ దైత్యో వృషభరూపధృక్ ॥**
**సూదయంస్తాపసానుగ్రో వనాన్యటతి యః సదా । 5 ॥**

పొడవైనమెడ, పెద్దదైన ముట్టె కలిగి చెట్లను అది రాపాడిస్తూ ఉంటే పుండ్లు పడిన ముఖం కలదయింది. అది గోవులకు గర్భవిచ్ఛేదనం చేయసాగింది. వృషభరూపుడైన ఆ దైత్యుడు తపస్వులను చంపుతూ సదా వన ప్రదేశాలలో తిరుగాడసాగాడు.

**తతస్తమతిఘోరాక్ష మవేక్ష్యాతి భయాతురాః ।**
**గోపా గోపస్త్రియశ్చైవ కృష్ణ కృష్ణేతి చుక్రుశుః ॥ 6 ॥**

మహాభయంకర నేత్రాలు కల్గిన ఆ ఘోర రాక్షసుని చూచి గోపాలకులు, (వారిభార్యలు) గోపికలు మిక్కిలి జడుపుచే ఆందోళనచెంది "కృష్ణా" అని ఆక్రందన చేశారు.

**సింహ నాదం తతశ్చక్రే తలశబ్దంచ కేశవః ।**
**తచ్ఛబ్ద శ్రవణా చ్చాసౌ దామోదర ముపాయయౌ (గోవిన్దాభిముఖం యయౌ) ॥ 7 ॥**

అప్పుడు కృష్ణుడు ఒక్క సారిగా సింహ నాదం చేశాడు. చప్పుడు చేస్తూ అరచేతులు చరచాడు. ఆ సవ్వడి విన్నంత మాత్రంచేతనే ఆదైత్యుడు గోవిందునిపైకి ఎదురుగా వచ్చాడు.

**అగ్రన్యస్త విషాణాగ్రః కృష్ణ కుక్షికృతేక్షణః ।**
**అభ్యధావత దుష్టాత్మా కృష్ణం వృషభదానవః ॥ 8 ॥**

దుష్టాత్ముడైన ఆ వృషభాసురుడు కృష్ణుని కుక్షిపై దృష్టి పెట్టి కొమ్ముల కొనలను ముందుకు చాచి గోవిందుని పొడవాలని మీదకు పరుగు పెట్టాడు.

**ఆయాన్తం దైత్యవృషభం దృష్ట్వా కృష్ణో మహాబలః ।**
**న చచాల తతః స్థానా దవజ్ఞాస్మితలీలయా ॥ 9 ॥**

తన మీదకు వస్తున్న వృషభదైత్యుని చూచి మహాపరాక్రమశాలియైన కృష్ణుడు అవహేళనతో లీలగా నవ్వుతూ నీ లెక్కేమిటన్నట్లు ఉన్నతావునుంచి కదలకుండా ఉండిపోయాడు.

**ఆసన్నంచైవ జగ్రాహ గ్రాహవన్మధుసూదనః ।**
**జఘాన జానునా కుక్షౌ విషాణగ్రహణాచలమ్ ॥ 10 ॥**

తనమీదకు పొడవడానికి వస్తున్న దానిని ఏ విధంగా మొసలి ఒక క్షుద్ర జీవుని పట్టుకొంటుందో,ఆ విధంగా దానిని కదలకుండా రెండుకొమ్ములు పట్టుకొని దాని కడుపులో మధుసూదనుడు మోకాలితో ఒక్క పోటు పొడిచాడు.

**తస్య దర్ప బలం భంక్త్వా గృహీతస్య విషాణయోః ।**
**ఆపీడయ దరిష్టస్య కణ్ఠం క్లిన్నమివామ్బరమ్ ॥ 11 ॥**

దాని కొమ్ములను పట్టుకొని ఇటు అటు త్రిప్పుతూ, ఆ అరిష్టాసురుని బలదర్పం అణచివైచి, తడిబట్ట పట్టుకొని పిడిచేసినట్లుగా వాని మెడను బట్టుకొని ఒక్క పిడుపు పిడిచాడు.

**ఉత్పాట్య శృంగమేకన్తు తేనైవాతాడయత్ తతః ।**
**మమార స మహాదైత్యో ముఖాచ్ఛోణిత ముద్వమన్ ॥ 12 ॥**

పిమ్మట దాని కొమ్మును ఒకదానిని ఊడబెరికి, దానితోనే వానిని ఒక్కదెబ్బ కొట్టాడు. ఆ దెబ్బతో ఆ మహారాక్షసుడు నోటనెత్తురు క్రక్కుకొంటూ మరణించాడు.

**తుష్టువుర్నిహతే తస్మిన్ దైత్యే గోపా జనార్దనమ్ ।**
**జమ్భే హతే సహస్రాక్షం పురా దేవగణా యథా ॥ 13 ॥**

పూర్వం జంభాసురుడు చంపబడగా దేవగణాలు సహస్రాక్షుడైన ఇంద్రుని కొనియాడినట్లుగా, అరిష్టాసురుడు నిహతుడు కాగా గోపాలురందరూ జనార్దనుని ప్రశంసించారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే వృషభాసురవధో నామ చతుర్దశోఽధ్యాయః సమాప్తః ॥ 14 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో వృషభాసురవధ అనే పద్నాల్గవ అధ్యాయం సమాప్తం ॥ 14 ॥



## పంచదశోஉధ్యాయః - పదునైదవ అధ్యాయం

## ధనుర్యాగః - అక్రూరప్రేషణమ్ - ధనుర్యాగం - అక్రూరప్రేషణం

**కకుద్మతి హతేஉరిష్టే ధేనుకే వినిపాతితే ।**
**ప్రలమ్బే నిహతే వీరే ధృతే గోవర్ధనాచలే ॥ 1 ॥**

**దమితే కాలియే నాగే భగ్నే తుంగతరుద్వయే ।**
**హతాయాం పూతనాయాంచ శకటే పరివర్తితే ॥ 2 ॥**

**కంసాయ నారదః ప్రాహ యథావృత్తమనుక్రమాత్ ।**
**యశోదా దేవకీ గర్భపరివర్తాద్యశేషతః ॥ 3 ॥**

అరిష్టుడనే వృషభాసురుడు అలా చంపబడగా, ధేనుకుడు అంతకుమునుపే కూలిపోగా, వీరుడైన ప్రలంబుడు నిహతుడుకాగా, గోవర్ధన పర్వతం ఒంటి చేతితో పైకెత్తబడగా, కాలియ నాగం దర్పాన్ని విడిచి సముద్రానికి వెళ్లిపోగా, ఎత్తైన పెనువృక్షాలు రెండూ వ్రేళ్లతో కూలిపోగా, పూతన ముందే మరణించగా, శకటుడు తలక్రిందులు చేయబడగా నారదుడు కంసుని వద్దకు వచ్చి యశోదాదేవకి గర్భాలు తారుమారైన సమస్త వృత్తాంతాలను పూస గ్రుచ్చినట్లుగా ఉన్నది ఉన్నట్లు గా ఒకవరుసలో జరిగినదంతా తెలియజేశాడు.

**శ్రుత్వా తత్ సకలం కంసో నారదాద్ దేవదర్శనాత్ ।**
**వసుదేవం ప్రతి తదా కోపం చక్రే సుదుర్మతిః ॥ 4 ॥**

దైవ సమానుడైన నారదుని వల్ల కంసుడు ఆ యావద్వృత్తాంతం విని (లేదా ఆకాశవాణి వల్ల, నారదుని వల్ల విని) దుష్టబుద్ధితో వసుదేవుని పట్ల పగబూనాడు.

**సోஉతికోపాదుపాలభ్య సర్వయాదవ సంసది ।**
**జగర్హ యాదవాంశ్చైవ కార్యం చైతదచిన్తయత్ ॥ 5 ॥**

ఆ కంసుడు అపరిమిత క్రోధంతో సర్వయాదవ సమాజంలో వసుదేవుని ఆడిపోయసాగాడు. యాదవుల నందరినీ నిందించాడు. తరువాత జేయవలసిన దానిని గూర్చి ఇలా ఆలోచించాడు.

**యావన్న బలమారూఢౌ రామకృష్ణౌ సుబాలకౌ ।**
**తావదేవ మయా వధ్యావసాధ్యౌ రూఢయౌవనౌ ॥ 6 ॥**

"రామ కృష్ణులు పూర్తిగా బలవంతులు కాకుండా, బాలకులుగా ఉన్న ఈ సమయంలోనే కడముట్టించాలి. వయసువచ్చి యౌవన వంతులై పరిపూర్ణ పరాక్రమవంతులయితే నాకు వారు అసాధ్యులయి పోతారు.

**చాణూరోஉత్ర మహావీర్యో ముష్టికశ్చమహాబలః ।**
**ఏతాభ్యాం మల్లయుద్ధేన ఘాతయిష్యామి దుర్మదౌ ॥ 7 ॥**

ఇక్కడ నావద్ద మహావీర్యవంతుడైన చాణూరుడు, మహాబలవంతుడైన ముష్టికుడు ఉన్నారు. వీరిద్దరి ద్వారా మల్లయుద్ధంలో ఆ దుర్మదులిద్దరిని కడతేరుస్తాను.

**ధనుర్మహ మహాయాగ వ్యాజే నానీయ తౌ వ్రజాత్ ।**
**తథా తథా యతిష్యామి యాస్యేతే సంక్షయం యథా ॥ 8 ॥**

ధనుర్యాగోత్సవం అనే నెపంతో వారిద్దరిని వ్రేపల్లెనుంచి ఇచ్చటకు రావించి, వారు ఏఏ విధంగా చేస్తే నాశనంచెందుతారో ఆయా విధంగా చంపడానికి ప్రయత్నిస్తాను.

**శ్వఫల్కతనయం సోఽహ మక్రూరం యదుపుంగవమ్ ।**
**తయో రానయనార్థాయ ప్రేషయిష్యామి గోకులమ్ ॥ 9 ॥**

యదుశ్రేష్ఠుడైన శ్వఫల్కుని కుమారుడగు అక్రూరుని వారిని తీసుకొని రావడానికై నేను గోకులానికి పంపిస్తాను.

**బృన్దావనచరం ఘోర మాదేక్ష్యామి చ కేశినమ్ ।**
**తత్రైవాసావతిబల స్తావుభౌ ఘాతయిష్యతి ॥ 10 ॥**

బృందావనంలో తిరుగాడే కేశి అనబడే ఘోర రాక్షసునికి ఆజ్ఞ ఇస్తాను. మహాబలిశాలియైన అతడు వారిద్దరిని కనిపిస్తేచాలు అక్కడే చంపివేస్తాడు.

**గజః కువలయాపీడో మత్సమీప ముపాగతౌ ।**
**ఘాతయిష్యతి వా గోపౌ వసుదేవసుతావుభౌ ॥ 11 ॥**

ఒకనాడు వారు నా సమీపానికి రాగలిగితే కువలయాపీడం అనే పెద్దఏనుగు ఉంది కదా! అదే గోప వేషధారులైన ఆ వసుదేవ కుమారులిద్దరిని మట్టు బెట్టేస్తుంది."

**ఇత్యాలోచ్య స దుష్టాత్మా కంసో రామజనార్దనౌ ।**
**హన్తుం కృత మతిర్వీర మక్రూరం వాక్యమబ్రవీత్ ॥ 12 ॥**

అని ఆ దుష్టబుద్ధి అయిన కంసుడు ఈ విధంగా ఆలోచించి బలరామ కృష్ణులిద్దరిని చంపాలని బుద్ధియందు నిశ్చయించుకొన్నవాడై అక్రూరుని రావించి ఇలా చెప్పాడు.

**భో భో దానపతే! వాక్యం క్రియతాం ప్రీతయే మమ ।**
**ఇతః స్యన్దన మారుహ్య గమ్యతాం నన్దగోకులమ్ ॥ 13 ॥**

"ఓ దానపతీ! నాకు సంతుష్టి కలగడానికై నేను చెప్పినట్లు ఆచరించు. ఇక్కడ నుంచి రథాన్ని అధిరోహించి నందగోకులానికి వెళ్లు.

**వసుదేవసుతౌ తత్ర విష్ణోరంశసముద్భవౌ ।**
**నాశాయ కిల సమ్భూతౌ మమ దుష్టౌ ప్రవర్ధతః ॥ 14 ॥**

అక్కడ విష్ణువు అంశ వల్ల పుట్టిన వసుదేవుని కుమారులు బలరామ కృష్ణులు ఉన్నారు. ఆ దుష్టులిద్దరు నా నాశనం కొరకై వ్రేపల్లెలో పెరుగుతున్నారట.

**ధనుర్మహో మమాప్యత్ర చతుర్దశ్యాం భవిష్యతి ।**
**ఆనేయౌ భవతా గత్వా మల్లయుద్ధాయ తత్ర తౌ ॥ 15 ॥**

ఈ చతుర్దశి రోజున ఇక్కడ ధనుర్యాగోత్సవం జరగబోతోంది. నీవు అక్కడకు వెళ్లి వారిద్దరిని మల్లయుద్ధానికై ఇక్కడకు తీసుకొనిరా.

**చాణూర ముష్టికౌ మల్లౌ నియుద్ధ కుశలౌ మమ ।**
**తాభ్యాం సహానయోర్యుద్ధం సర్వలోకోఽత్ర పశ్యతు ॥ 16 ॥**

నా(మన) చాణూరముష్టికులు ఇద్దరు మల్లయుద్ధంలో మిక్కిలి నేర్పరులు. వారితో ఈ యిద్దరు చేసే బాహు యుద్ధాన్ని సర్వజనులు వీక్షిస్తారు.

**నాగః కువలయా పీడో మహామాత్ర ప్రచోదితః ।**
**స వా నిహంస్యతే పాపౌ వసుదేవాత్మజౌ శిశూ ॥ 17 ॥**

లేదా కువలయాపీడం అనే పేరుగల ఏనుగు మావటీంద్రనాయకునిచే ప్రేరేపించబడినదై పాపాత్ములైన వసుదేవకుమారులగు ఆ పిల్లలనిద్దరిని చంపివేస్తుంది.

**తౌ హత్వా వసుదేవం చ నన్దగోపం చ దుర్మతిమ్ ।**
**హనిష్యే పితరంచైన ముగ్రసేనం సుదుర్మతిమ్ ॥ 18 ॥**

వారిద్దరిని కడముట్టించిన పిమ్మట వసుదేవుని, దుష్టబుద్ధి అయిన నందగోపుని, అలాగా మిక్కిలి దుర్మతి అయిన తండ్రియగు ఉగ్రసేనుని కూడా కడతేరుస్తాను.

**తతః సమస్త గోపానాం గోధనాన్యఖిలాన్యహమ్ ।**
**విత్తం చాపి హరిష్యామి దుష్టానాం మద్వధైషిణామ్ ॥ 19 ॥**

అటు తరువాత నన్ను చంపాలని కోరుకొంటున్న దుష్టులగు సమస్త గోపాలకుల గోధనాలను, వారి ధనాలను కూడ నేను పూర్తిగా హరించి వేస్తాను.

**త్వామృతే యాదవాశ్చైతే ద్విషో దానపతే! మమ ।**
**ఏతేషాంచ వధాయాహం ప్రయతిష్యామ్యనుక్రమాత్ ॥ 20 ॥**

ఓ దానపతీ! నీవు తప్ప మిగిలిన యాదవులు అందరూ నాకు శత్రువులే. అటుపైన వారిని కూడ క్రమక్రమంగా వధించే ప్రయత్నం నేను చేస్తాను.

**తతో నిష్కణ్టకం సర్వం రాజ్యమేతదయాదవమ్ ।**
**ప్రశాసిష్యే త్వయా తస్మాన్మత్ప్రీత్యా వీర! గమ్యతామ్ ॥ 21 ॥**

ఆ తరువాత ఈ రాజ్యమంతా యాదవులు లేకుండా నిష్కంటకం కావించి నీతో కలిసి దీనిని నేను పరిపాలిస్తాను. కాబట్టి ఓ వీరపురుషా! నాకు ప్రసన్నత చేకూర్చడానికై నీవు గోకులానికి వెళ్లాలి.

**యథా చ మాహిషం సర్పిర్దధి వాప్యుపహార్యవై ।**
**గోపాః సమానయన్త్వాశు త్వయా వాచ్యస్తథా తథా ॥ 22 ॥**

గేదెనెయ్యి, పెరుగు, పాలు మున్నగు ఉపాయనాలతో పాటు ఆ గోపాలకులు ఇక్కడకు వేగంగా వచ్చేటట్లుగా ఎలా చెప్పాలో, అలా వారికి నచ్చచెప్పి తీసుకొనిరా" అని అక్రూరునికి ఆనతిచ్చాడు.

**ఇత్యాజ్ఞప్తస్తదాఽక్రూరో మహాభాగవతో ద్విజ! ।**
**ప్రీతిమానభవత్ కృష్ణం శ్వో ద్రక్ష్యామీతి సత్వరః ॥ 23 ॥**

ద్విజోత్తమా! ఈ విధంగా భాగవతోత్తముడైన అక్రూరుడు కంసునిచే ఆజ్ఞాపించబడినవాడై, కృష్ణుని రేపే తాను దర్శించబోతున్నానని వెంటనే ఉప్పొంగి పోయాడు.

**తథేత్యుక్త్వా చ రాజానం రథమారుహ్య శోభనమ్ ।**
**నిశ్చక్రామ తతః పుర్యా మథురాయా మధుప్రియః ॥ 24 ॥**

అనంతరం అతడు కంసరాజునకు అలాగే వెళ్లివస్తానని పలికి మిక్కిలి మనోహరమైన రథం అధిరోహించి, మధు వంశీయులకు ఇష్టుడైన వాడై మథురానగరం నుంచి బయలుదేరాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే ధనుర్యాగః - అక్రూరప్రేషణం చేతి పంచదశోఽధ్యాయః సమాప్తః ॥15॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో ధనుర్యాగం-అక్రూరప్రేషణం అనే పదునైదవ అధ్యాయం సమాప్తం ॥15॥



## **షోడశోఽధ్యాయః – పదునారవ అధ్యాయం**

## **కేశివధః – కేశివధ**

**పరాశర ఉవాచ:–** పరాశరుడు పలికాడు.

**కేశీ చాపి బలోదగ్రః కంసదూత ప్రచోదితః ।**
**కృష్ణస్య నిధనాకాంక్షీ బృన్దావన ముపాగమత్ ॥ 1 ॥**

కేశి అనే రాక్షసుడు ఉదగ్రమైన బలం కలవాడు (అతడు అశ్వరూపుడు) ఒకనాడు కంసుని దూత ప్రేరేపించగా కృష్ణుని చంపాలనే ఉద్దేశ్యంతో బృందావనానికి చేరుకొన్నాడు.

**స ఖుర క్షత భూపృష్ఠః సటాక్షేప ధుతామ్బుదః ।**
**ప్లుత విక్రాన్త చన్ద్రార్క మార్గే గోపానుపాద్రవత్ ॥ 2 ॥**

అతడు భూతలాన్ని గిట్టలతో తోడేస్తూ, జూలు విదలిస్తూ, మబ్బులను అదలిస్తూ, ఒక్క దాటుతో సూర్యచంద్రులు సంచరించే అంతరిక్షమార్గం ఆక్రమిస్తూ గోపాలకులపైకి దూకాడు.

**తస్య హ్రేషితశబ్దేన గోపాలా దైత్యవాజినః ।**
**గోప్యశ్చ భయ సంవిగ్నా గోవిన్దం శరణం యయుః ॥ 3 ॥**

దాని సకిలింపు విని, ఆ అశ్వరూప రాక్షసుని వీక్షించి గోపాలురు, గోపికలు కూడ ఒక్కసారిగా బెదరిపోయి గోవిందుని శరణు పొందారు.

**త్రాహి త్రాహీతి గోవిన్దః శ్రుత్వా తేషాం తదా వచః ।**
**సతోయజలదధ్వాన గమ్భీరమిదముక్తవాన్ ॥ 4 ॥**

అపుడు "రక్షించు రక్షించు" అనే వారి ఆర్తనాదం విని కృష్ణుడు నీటితో నిండియున్న నల్లని మేఘం ఉరిమినట్లున్న గంభీర స్వరంతో ఇలా అన్నాడు.

**అలం త్రాసేన గోపాలాః కేశినః కిం భయాతురైః ।**
**భవద్భి ర్గోపజాతీయై ర్వీరవీర్యం విలోప్యతే ॥ 5 ॥**

గోపాలకులారా! భయపడకండి. ఈ కేశిరాక్షసుని చూచి ఎలా మీరు భీతిని పొంది ఆందోళన చెందుతున్నారు? గోపజాతిలో పుట్టిన మీరు ఇలా తల్లడిల్లడం వల్ల వీరోచితపురుషార్థానికే లోపం వస్తుంది.

**కిమనేనాల్పసారేణ హ్రేషితాటోప కారిణా ।**
**దైతేయబలవాహ్యేన వల్గతా దుష్టవాజినా ॥ 6 ॥**

ఈ తక్కువ వీర్యం కల వాని వల్ల ఏమవుతుంది? ఈ వట్టిసకిలింపుల ఆటోపంవల్ల ఏం ముప్పు వస్తుంది? రాక్షస బలం దీనియందు ప్రవేశించడవల్ల ఈ దుష్టాశ్వం ఇలా మిడిసిపడుతోంది.

**ఏహ్యేహి దుష్ట! కృష్ణోఽహం పూష్ణస్త్వివ పినాకధృక్ ।**
**పాతయిష్యామి దశనాన్ వదనాదఖిలాంస్తవ ॥ 7 ॥**

ఓరి దుష్టుడా! రారా! ఇలారారా! నేనే కృష్ణుడను. పినాక ధారియైన వీరభద్రుడు ఏ విధంగా పూషుని పండ్లు రాల గొట్టాడో, అదే విధంగా నీ నోటిలోని పండ్లన్నీ ఊడగొడతాను" అని వారికి ధైర్యం చెబుతూ ఆరాక్షసాశ్వంతో చెప్పాడు.

**ఇత్యుక్త్వాస్ఫోట్య గోవిన్దః కేశినః సమ్ముఖం యయౌ ।**
**వివృతాస్యస్తు సోఽప్యేనం దైతేయశ్చాప్యుపాద్రవత్ ॥ 8 ॥**

ఈ విధంగా గోవిందుడు జబ్బచరిచి హుంకరిస్తూ, కేశికి ఎదురుగా వెళ్లాడు. ఆరాక్షసుడు కూడ ఒక్కసారిగా నోరు తెరచి ఆతనిపైకి దూకాడు.

**బాహుమాభోగినం కృత్వా ముఖే తస్య జనార్దనః ।**
**ప్రవేశయామాస తదా కేశినో దుష్ట వాజినః ॥ 9 ॥**

అంత జనార్దనుడు తన బాహువును పొడుగ్గా చాచి ఆ దుష్టాశ్వమైన కేశి నోటిలోనికి తటాలున దూర్చాడు.

**కేశినో వదనం తేన విశతా కృష్ణబాహునా ।**
**శాతితా దశనాః పేతుః సితాభ్రావయవా ఇవ ॥ 10 ॥**

అనంతరం కేశిముఖంలో ప్రవేశించిన కృష్ణుని విశాల బాహువు ద్వారా దాని పండ్లు ఊడ గొట్ట బడ్డాయి. అవి తెల్లని మబ్బుతునకల్లాగా కిందపడ్డాయి.

**కృష్ణస్య వవృధే బాహుః కేశిదేహగతో ద్విజ! ।**
**వినాశాయ యథా వ్యాధి రాసమ్భూతేరుపేక్షితః ॥ 11 ॥**

ద్విజశ్రేష్ఠా! దేహంలో అంకురించిన వ్యాధిని ఉపేక్షిస్తే, అది ముంచుకొని వచ్చేటట్లు పెరిగినట్లుగా కేశిముఖంలో ప్రవేశించిన కృష్ణుని బాహువు దాని దేహంలో తద్వినాశనం కొరకై పెరగసాగింది.

**విపాటితోష్ఠో బహులం సఫేనం రుధిరం వమన్ ।**
**సోఽక్షిణీ వివృతే చక్రే నిః సృతే ముక్తబన్ధనే ॥ 12 ॥**

**జఘాన ధరణీం పాదైః శకృన్మూత్రం సముత్సృజన్ ।**
**స్వేదార్ద్ర గాత్రః శ్రాన్తశ్చ నిర్యత్నః సోఽభవత్ తతః ॥ 13 ॥**

అంత దాని పెదవులు (దౌడలు) రెండు చీలిపోయాయి. అది నోటినుంచి నురుగులతోరక్తం వెళ్లగక్కింది. కనుగ్రుడ్లు స్థానాలు తప్పిపోయాయి. దాని ప్రేగుల బంధాలు విడిపోయాయి. మూత్ర పురీషాలను విడిచి పెట్టింది. పాదాలను నేలపై కొట్టసాగింది. దానికి ముచ్చెమటలు పట్టాయి. అది పూర్తిగా అలసిపోయింది. దాని వడి తగ్గిపోయింది. ఏ ప్రయత్నం చేయకుండా అది నివ్వెరపోయింది.

**వ్యాదితాస్యో మహారౌద్రః సోఽసురః కృష్ణబాహునా ।**
**నిపపాత ద్విధా భూతో వైద్యుతేన ద్రుమో యథా ॥ 14 ॥**

కృష్ణబాహు ప్రసారం వల్ల ఆ మహాభయంకర రాక్షసుడు ముఖం రెండుగా చీలిపోగా, పిడుగు పాటుకు చెట్టు రెండుగా చీలి కూలిపోయినట్లుగా నేల కూలిపోయాడు.

**ద్విపాద పృష్ఠ పుచ్ఛార్ధే శ్రవణైకాక్షి నాసికే ।**
**కేశినస్తే ద్విధా భూతే శకలే ద్వే విరేజతుః ॥ 15 ॥**

రెండు పాదాలు, సగం పృష్ఠం, సగంతోక, ఒకేచెవి, ఒక కన్ను, ఒకే ముక్కు కలవై ఆ కేశిరాక్షసుని రెండుగా చీలిపోయిన శకలాలు ప్రకాశించాయి.

**హత్వా తు కేశినం కృష్ణో గోపాలై ర్ముదితై ర్వృతః ।**
**అనాయస్త తనుః స్వస్థో హసంస్తత్రైవ తస్థివాన్ ॥ 16 ॥**

కేశిరాక్షసుని ఆ విధంగా చంపగానే గోపాలురందరు సంబరపడుతూ ఉండగా, కృష్ణుడు హాయిగా ఒడలు ఇంచుకయైన నొవ్వకుండా నవ్వుతూ స్వస్థుడై అక్కడే ఉండిపోయాడు.

**తతో గోప్యశ్చ గోపాశ్చ హతే కేశిని విస్మితాః ।**
**తుష్టువుః పుణ్డరీకాక్ష మనురాగ మనోరమమ్ ॥ 17 ॥**

అంతట గోపికలు, గోపాలకులు కేశి చనిపోవడం చూచి నివ్వెరపడి అత్యంత ప్రీతితో మిక్కిలి సుందరంగా గోచరించే కమలలోచనుడైన గోవిందుని బహువిధాల ప్రశంసించారు.

**అథాహాన్తర్హితో విప్ర! నారదో జలదే స్థితః ।**
**కేశినం నిహతం దృష్ట్వా హర్షనిర్భరమానసః ॥ 18 ॥**

**సాధు సాధు జగన్నాథ లీలయైవ యదచ్యుత ।**
**నిహతోఽయం త్వయా కేశీ క్లేశద స్త్రిదివౌకసామ్ ॥ 19 ॥**

విప్రవర్యా! కేశి మరణించడం చూచి నారదమహర్షి సంతోషంతో నిండిన మనస్సుకలవాడై ఎవరికి కనబడకుండా మబ్బుల చాటున నుండి పరమాత్మతో ఇలా అంటున్నాడు. "జగన్నాథా! అచ్యుతా! బాగు బాగు! లీలామాత్రంగా ఈతడు నీచే చంపబడ్డాడు. కేశి దేవలోక వాసులందరికీ క్లేశాలు కలుగజేసేవాడు.

**యుద్ధోత్సుకోఽహమత్యర్థం నరవాజిమహాహవమ్ ।**
**అభూతపూర్వమన్యత్ర ద్రష్టుం స్వర్గాదుపాగతః ॥ 20 ॥**

నాకు కలహమంటే మిక్కిలి ఇష్టం. ముందెన్నడు జరగని ఒక నరునికి ఒకగుఱ్ఱానికి జరిగే మహాయుద్ధం చూడాలని దేవలోకం నుంచి ఇచ్చటకు వచ్చాను.

**కర్మాణ్యత్రావతారే తే కృతాని మధుసూదన! ।**
**యాని తై ర్విస్మితం చేత స్తోష మేతేన మే గతమ్ ॥ 21 ॥**

మధుసూదనా! ఈ కృష్ణావతారంలో నీవు చేసే లీలలను చూస్తూ ఉంటే నామనస్సు మిక్కిలి ఆశ్చర్యం చెందింది. నేను ఎంతో ఆనందం పొందిన వాడనయ్యాను.

**తురంగ స్యాస్య శక్రోఽపి కృష్ణ! దేవాశ్చ బిభ్యతి ।**
**ధుతకేసరజాలస్య హ్రేషతోఽభ్రావలోకినః ॥ 22 ॥**

కృష్ణా! ఈ గుర్రానికి ఇంద్రుడు, మిగిలిన దేవతలు కూడ జడిసిపోతూ ఉంటారు. ఇది సకిలించినా, జూలు విదలించినా, నింగివంక చూచినా వారికి చెప్పరాని భయం.

**యస్మాత్ త్వయైవ దుష్టాత్మా హతః కేశీ జనార్దన! ।**
**తస్మాత్ కేశవ నామ్నా త్వం లోకే గేయో భవిష్యసి ॥ 23 ॥**

జనార్దనా! దుష్టబుద్ధియైన ఈ కేశి నీ వల్ల చంపబడ్డాడు. ఆ కారణం వల్ల నీవు లోకంలో కేశవుడనే పేరుతో విఖ్యాతి పొందుతావు.

**స్వస్త్యస్తు తే గమిష్యామి కంసయుద్ధేఽధునా పునః ।**
**పరశ్వోఽహం సమేష్యామి త్వయా కేశినిషూదన! ॥ 24 ॥**

కేశి అనే రాక్షసుని సంహరించిన కేశవా! నీకు మంగళం అగుగాక! నేను వెళ్లి వస్తాను ఇప్పుడు. మళ్లీ ఎల్లుండి జరగబోయే కంసునితో పోరులో నేను నిన్ను కలుసుకొంటాను.

**ఉగ్రసేన సుతే కంసే సానుగే వినిపాతితే ।**
**భారావతార కర్తా త్వం పృథివ్యాః పృథివీధర! ॥ 25 ॥**

పృథ్వీధరా! ఉగ్రసేనుని కుమారుడైన కంసుని పరివారంతో బాటు కూల్చిన పిమ్మట అక్కడనుంచి నీవు పృథివి భారాన్ని తొలగించినవాడవు అవుతావు.

**తత్రానేక ప్రకారాణి యుద్ధాని పృథివీక్షితామ్ ।**
**ద్రష్టవ్యాని మయా యుష్మత్ప్రణీతాని జనార్దన! ॥ 26 ॥**

జనార్దనా! అక్కడ నానా విధాలుగా పృథ్వీభారావతరణార్థమై నీవు రాజులతో కావించే అనేక యుద్ధాలను ఇక మీదట నేను చూడవలసియున్నది.

**సోఽహం యాస్యామి గోవిన్ద! దేవకార్యం మహత్ కృతమ్ ।**
**త్వయా సభాజిత శ్చాయం స్వస్తి తేఽస్తు వ్రజామ్యహమ్ ॥ 27 ॥**

గోవిందా! ఇప్పుడు నేను వెళ్లి పోతున్నాను నీవు దేవకార్యం గొప్పగా చక్కబరచావు. ఈ కేశిని వధించడం వల్ల దేవగణం అంతా నీచే సమ్మానించబడినట్లే. నీకు కల్యాణమగుగాక! ఇదిగో వెళ్లిపోతున్నా" అని అంతర్ధానమయ్యాడు.

**నారదే తు గతే కృష్ణః సహ గోపైః సభాజితః ।**
**వివేశ గోకులం గోపీనేత్రపానైక భాజనమ్ ॥ 28 ॥**

అలా నారదుడు వెళ్లి పోగా గోపగణంచే సన్మానింపబడుతూ, కృష్ణుడు గోపికల కన్నులకు అమృతపాన స్థానమైన గోకులంలో ప్రవేశించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే కేశివధో నామ షోడశోఽధ్యాయః సమాప్తః ॥ 16 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో కేశివధ అనే పదునారవ అధ్యాయం సమాప్తం ॥ 16 ॥



## **సప్తదశోஉధ్యాయః** - పదిహేడవ అధ్యాయం

## **అక్రూరస్య గోకులాగమనమ్** – అక్రూరుని గోకులాగమనం

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు పలికాడు.

**అక్రూరోஉపి వినిష్క్రమ్య స్యన్దనేనాశుగామినా ।**
**కృష్ణసన్దర్శనాయైకః ప్రయయౌ నన్దగోకులమ్ ॥ 1 ॥**

అక్రూరుడు కూడా చాలా వేగంగా పయనించే రథం ఎక్కి మధురా నగరం విడిచి ఒక్కడే శ్రీకృష్ణుని సందర్శించాలనే అభిలాషతో నందగోకులానికి బయలుదేరాడు.

**చిన్తయామాస చాక్రూరో నాస్తి ధన్యతరో మయా ।**
**యోஉహమంశావతీర్ణస్య ముఖం ద్రక్ష్యామి చక్రిణః ॥ 2 ॥**

అపుడు అక్రూరుడు పయనిస్తూ ఇలా ఆలోచించసాగాడు. “నాకన్న ధన్యాత్ముడు వేరే ఇంకొకడు ఉండదు. అంశావతారంతో అవతరించిన చక్రాయుధుడైన మహావిష్ణుని ముఖం నేను దర్శించబోతున్నాను.

**అద్య మే సఫలం జన్మ సుప్రభాతా చ మే నిశా ।**
**యదున్నిద్రాబ్జపత్రాక్షం విష్ణోర్ద్రక్ష్యామ్యహం ముఖమ్ ॥ 3 ॥**

ఇప్పుడు నాజన్మ సఫలమయింది. నాకు రాత్రి సుప్రభాతాన్ని అంతజేసేదయ్యింది. అప్పుడే వికసించిన తామరపూరేకుల వంటి కన్నులుగల విష్ణు భగవానుని ముఖారవిందాన్ని నేడు చూడబోతున్నాను.

**అద్యమే సఫలే నేత్రే అద్య మే సఫలా గిరః ।**
**యన్మే పరస్పరాలాపో దృష్ట్వా విష్ణుం భవిష్యతి ॥ 4 ॥**

ఈనాడు నానేత్రాలు పరమపావనాలు కాబోతున్నాయి. నాపలుకులు అర్థవంతాలుగా శబ్దించనున్నాయి. ఆ విష్ణువును దర్శించి ఒకరితో నొకరు మాట్లాడే భాగ్యం నాకు కలుగబోతోంది.

**పాపం హరతి యత్ పుంసాం స్మృతం సంకల్పనామయమ్ ।**
**తత్పుణ్డరీకనయనం విష్ణో ర్ద్రక్ష్యామ్యహం ముఖమ్ ॥ 5 ॥**

కల్పన ద్వారా ఏ రూపాన్ని మనస్సులో ధ్యానిస్తే, పురుషుల సమస్తపాపాలు నశించిపోతాయో, అట్టి పుండరీకాక్షుడైన విష్ణువు వదనారవిందాన్ని నేను వీక్షించబోతున్నాను.

**నిర్జగ్ముశ్చ యతో వేదా వేదాంగాన్యఖిలాని చ ।**
**ద్రక్ష్యామి తత్పరంధామ ధామ్నాం భగవతో ముఖమ్ ॥ 6 ॥**

ఎక్కడ నుండి వేదాలు, సమస్త వేదాంగాలు బయటకు ప్రకటించబడ్డాయో, సమస్త తేజస్సులకు ఆశ్రయుడైన ఆ పరంధాముని ముఖాన్ని సందర్శించబోతున్నాను.

**యజ్ఞేషు యజ్ఞపురుషః పురుషైః పురుషోత్తమః ।**
**ఇజ్యతే యోఽఖిలాధారస్తం ద్రక్ష్యామి జగత్పతిమ్ ॥ 7 ॥**

యజ్ఞములందు యజ్ఞపురుషుడుగా, పురుషులచే పురుషోత్తముడుగా పూజించబడే సర్వాధారుడైన ఆ జగత్పతిని సంవీక్షించబోతున్నాను.

**ఇష్ట్వా యమిన్ద్రో యజ్ఞానాం శతేనామరరాజతామ్ ।**
**అవాప తమనన్తాదిమహం ద్రక్ష్యామి కేశవమ్ ॥ 8 ॥**

ఇంద్రుడు నూరు యజ్ఞాలచే ఎవనిని యజించి దేవరాజపదవిని అందుకొన్నాడో, అట్టి ఆద్యంతాలు లేని కేశవుని నేను చూడబోతున్నాను.

**న బ్రహ్మా నేన్ద్రరుద్రాశ్వివస్వాదిత్యమరుద్గణాః ।**
**యస్య స్వరూపం జానన్తి ప్రత్యక్షం యాతి మే హరిః ॥ 9 ॥**

బ్రహ్మ, ఇంద్రుడు, రుద్రులు, అశ్వినీ కుమారులు, వసువులు, ఆదిత్యులు, మరుద్గణాలు ఎవని స్వరూపాన్ని తెలియకుండా ఉన్నారో అట్టి హరి నాకు ప్రత్యక్షం కాబోతున్నాడు.

**సర్వాత్మా సర్వవిత్ సర్వః సర్వభూతేష్వవస్థితః ।**
**యో వితత్యావ్యయో వ్యాపీ స వక్ష్యతి మయా సహ ॥ 10 ॥**

సర్వాత్ముడు, సర్వవిదుడు, సర్వస్వరూపుడు, సర్వభూతాంతరస్థుడు, ఎవడు వ్యాపకుడై సర్వమునందు వ్యాపించి ఉంటాడో అట్టి అవ్యయుడు నన్ను పలకరించబోతున్నాడు.

**మత్స్య కూర్మ వరాహాశ్వసింహరూపాదిభిః స్థితిమ్ ।**
**చకార జగతో యోఽజః సోఽద్య మామాలపిష్యతి ॥ 11 ॥**

మత్స్య కూర్మ వరాహ హయగ్రీవనరసింహాద్యవతారాలతో ఏ పుట్టుకలేనట్టి ప్రభువు జగాల రక్షణను కావిస్తూ ఉంటాడో, అట్టి మహాత్ముడు నాతో మాట్లాడబోతున్నాడు.

**సాంప్రతం చ జగత్స్వామీ కార్యమాత్మహృది స్థితమ్ ।**
**కర్తుం మనుష్యతాం ప్రాప్తః స్వేచ్ఛాదేహధృగవ్యయః ॥ 12 ॥**

ఇప్పుడు ఆ జగత్ప్రభువు తన సంకల్ప కార్యం నెరవేర్చడానికై, అవ్యయుడైన తాను తన ఇచ్ఛచే స్వీకరించబడిన మనుష్యదేహం ధరించియున్నాడు.

**యోఽనన్తః పృథివీం ధత్తే శేఖరస్థితిసంస్థితామ్ ।**
**సోఽవతీర్ణో జగత్యర్థే మామక్రూరేతి వక్ష్యతి ॥ 13 ॥**

ఎవడు అనంతరూపుడై తన శిరస్సుపై ఈ భూమిని కదలకుండా ధరిస్తూ ఉంటాడో, ఆతడు ఈ జగత్తు స్థితిని కాపాడడం కోసమై అవతరించి నన్ను అక్రూరా! అని పిలవబోతున్నాడు.

**పితృపుత్రసుహృద్భ్రాతృమాతృబన్ధుమయీమిమామ్ ।**
**యన్మాయాం నాలముత్తర్తుం జగత్ తస్మై నమో నమః ॥ 14 ॥**

తల్లి, తండ్రి, కుమారుడు, స్నేహితుడు, సోదరుడు, బంధువు మున్నగు స్వరూపమైన, ఎవని మాయతో కూడుకొన్న ఈ సంసారాన్ని తరించడానికి ఎవ్వరూ సమర్థులు కారో, అట్టి దేవునకు నా నమస్కారం.

**తరత్యవిద్యాం వితతాం హృది యస్మిన్ నివేశితే ।**
**యోగమాయామమేయాయ తస్మై విద్యాత్మనే నమః ॥ 15 ॥**

ఎవడు హృదయంలో ప్రవేశిస్తే, ఆ పురుషుడు యోగమాయా రూపమైన విస్తృతమైన అవిద్యను తరిస్తున్నాడో, అట్టి అమేయుడైన విద్యాస్వరూపుడైన భగవంతునికి నమస్కారం.

**యజ్వభిర్యజ్ఞపురుషో వాసుదేవశ్చ సాత్వతైః ।**
**వేదాన్తవేదిభిర్విష్ణుః ప్రోచ్యతే యో నతోఽస్మి తమ్ ॥ 16 ॥**

ఎవనిని యాజ్ఞికులు యజ్ఞపురుషుడని, సాత్వతులు (భగవద్భక్తులు) వాసుదేవుడని, వేదాంత విదులు విష్ణువని చెబుతూ ఉంటారో, ఆ పరాత్పరునకు వినయంతో వంగి నమస్కరిస్తాను.

**యథా యత్ర జగద్ధామ్ని ధాతర్యేతత్ ప్రతిష్ఠితమ్ ।**
**సదసత్ తేన సత్యేన మయ్యసౌ యాతు సౌమ్యతామ్ ॥ 17 ॥**

ఏ విధంగా, ఎచట, ఏ జగదాధారమైన విధాతయందు (ఏ సత్యమునందు) సదసద్రూపమైన ఈ జగత్తు ప్రతిష్ఠితమై ఉందో, అట్టి సత్యస్వరూపుడు నాయందు సౌమ్యత్వాన్ని వహించి ప్రసన్నుడై ఉండాలి.

**స్మృతే సకల కల్యాణ భాజనం యత్ర జాయతే ।**
**పురుషస్తమజం నిత్యం వ్రజామి శరణం హరిమ్ ॥ 18 ॥**

ఎవనిని స్మరించినంత మాత్రం చేతనే పురుషుడు అన్ని విధాలా సమస్తశుభాలను పొందునో, అట్టి పుట్టుకలేని హరిని ఎల్లప్పుడు శరణు పొందుతాను" అని భావించాడు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడన్నాడు.

**ఇత్థం సంచిన్తయన్ విష్ణుం భక్తినమ్రాత్మమానసః ।**
**అక్రూరో గోకులం ప్రాప్తః కించిత్ సూర్యే విరాజతి ॥ 19 ॥**

ఈ విధంగా అక్రూరుడు భక్తితో నిండిన వినయబుద్ధి కలవాడై విష్ణువునే మనస్సులో ధ్యానిస్తూ, కొంచెం ప్రొద్దు ఉండగా గోకులానికి చేరాడు.

**స దదర్శ తదా తత్ర కృష్ణమాదోహనే గవామ్ ।**
**వత్సమధ్యగతం ఫుల్లనీలోత్పలదలచ్ఛవిమ్ ॥ 20 ॥**

అతడు మొదట ఆవుల పాలు పితుకుతూ, దూడల మధ్యనున్న, వికసించిన నల్లకలువ పూరేకుల వంటి కాంతిగల్గిన కృష్ణుని సందర్శించాడు.

**ప్రఫుల్లపద్మపత్రాక్షం శ్రీవత్సాంకితవక్షసమ్ ।**
**ప్రలమ్బబాహుమాయామతుంగోరఃస్థలమున్నసమ్ ॥ 21 ॥**

**సవిలాసస్మితాధారం బిభ్రాణం ముఖపంకజమ్ ।**
**తుంగరక్తనఖం పద్భ్యాం ధరణ్యాం సుప్రతిష్ఠితమ్ ॥ 22 ॥**

**బిభ్రాణం వాససీ పీతే వన్యపుష్పవిభూషితమ్ ।**
**సేన్దునీలాచలాభం తం సితామ్భోజావతంసకమ్ ॥ 23 ॥**

**హంసం కున్దేన్దుధవలనీలామ్బరధరం ద్విజ! ।**
**తస్యానుబలభద్రంచ దదర్శ యదునన్దనమ్ ॥ 24 ॥**

బాగా వికసించిన తామర రేకులవంటి కన్నులు గలవానిని, శ్రీవత్సమనే చిహ్నంతో కూడిన వక్షఃస్థలం కలవానిని, పొడవైన చేతులు కలవానిని, విశాలమైన రొమ్ము కలవానిని, ఎత్తైన వక్షం కలవానిని, ఎత్తైన ముక్కు కలవానిని, విలాసంతో కూడు కొన్న నవ్వుతో దీపించే సుందరముఖారవిందం కలవానిని, చక్కనైన ఎర్రని గోళ్లతో కూడు కొన్న పాదాలు పృథివిపై ఆన్చియున్నవానిని, పీతాంబరోత్తరీయాలు ధరించిన వానిని, వనమాలను అలంకరించి యున్నవానిని, చంద్రబింబంతో కూడిన నీల పర్వతంలాగా తెల్ల తామరపూలను తలపూలుగా ధరించిన శ్రీ కృష్ణుని చూశాడు. ద్విజోత్తమా! ఆ యదుకుమారుని వెంట హంసలు, మొల్లలు, చంద్రుడు - వీటితో సమానమైన కాంతితో నీల వస్త్రంధరించి ఉన్న బలరాముని ఆతరువాత వీక్షించాడు.

**ప్రాంశుమున్నతబాహ్వంసం వికాసిముఖపంకజమ్ ।**
**మేఘమాలాపరివృతం కైలాసాద్రిమివాపరమ్ ॥ 25 ॥**

ఎత్తరిగా, ఎత్తైన చేతులు, స్కంధ భాగంకల, వికసించిన పద్మం వంటి వదనంతో, మేఘపంక్తితో కూడు కొన్న రెండవ కైలాసపర్వతమా అన్నట్లున్న ఆ బలభద్రుని సందర్శించాడు.

**తౌ దృష్ట్వా వికసద్వక్త్రసరోజః స మహామతిః ।**
**పులకాంచితసర్వాంగస్తదాऽక్రూరోऽభవన్మునే! ॥ 26 ॥**

మునీశ్వరా! అలా ప్రకాశిస్తున్న వారిద్దరిని చూడగానే ఆ మహాబుద్ధిశాలియైన అక్రూరుని ముఖపద్మం ఒక్కసారిగా విప్పారింది. అతని మేనులోని సర్వాంగాలు పులకించిపోయాయి.

**ఏతత్ తత్ పరమం ధామ తదేతత్ పరమం పదమ్ ।**
**భగవద్వాసుదేవాంశో ద్విధా యోఽయమవస్థితః ॥ 27 ॥**

ఆ పరమతేజస్సు ఇదే. ఇదే ఆ పరమపదం. ఆ వాసుదేవ భగవానుని అంశ ఇక్కడ రెండు రూపాలై గోచరిస్తోంది.

**సాఫల్యమక్ష్ణోర్యుగమేతదత్ర దృష్టే జగద్ధాతరి యాతముచ్చైః ।**
**అప్యంగమేతద్ భగవత్ప్రసాదాద్ దత్తేఽంగసంగే ఫలవన్మమ స్యాత్ ॥ 28 ॥**

ఈ జగద్విధాత దర్శనం చేయుడంవల్ల నేడు నారెండు నేత్రాలు సాఫల్యం పొందాయి. అయినప్పటికి ఆ భగవంతుని అనుగ్రహంవల్ల ఆయన దేహసంస్పర్శను పొంది నాశరీరం కృతకృత్యతను పొందడమనేది జరుగుతుందా?

**అప్యేష పృష్ఠే మమ హస్తపద్మం కరిష్యతి శ్రీమదనన్తమూర్తిః ।**
**యస్యాంగులిస్పర్శహతాఖిలాఘై రవాప్యతే సిద్ధిరపాస్తదోషా ॥ 29 ॥**

శ్రీమంతుడైన అనంతస్వరూపుడగు ఈ హరి తనకర కమలంచే నావెన్ను తట్టడమనేది జరుగుతుందా? ఆ స్వామి చేతి వ్రేళ్లు సోకినంత మాత్రంచేతనే సమస్తపాపాలు పటాపంచలైపోయి, దోషాలన్నీ మటుమాయమై పోయి వెంటనే ముక్తి కలుగుతుంది కదా!

**యేనాగ్నివిద్యుద్ రవిరశ్మిమాలా కరాలమత్యుగ్రమపాస్య చక్రమ్ ।**
**చక్రం ఘ్నతా దైత్యపతేర్హృతాని దైత్యాంగనానాం నయనాంజనాని ॥ 30 ॥**

అగ్ని, మెరపు, సూర్యకిరణాలతో సమానంగా వెలిగే, భయాన్ని కలిగించే, మిక్కిలి ఉగ్రమైన చక్రాయుధాన్ని ఒక్క సారి ప్రయోగిస్తే చాలు రాక్షస రాజ్యచక్రం అంతా అకస్మాతుగా కూలిపోయి దైత్యకాంతల కన్నులయందుండే సౌభాగాన్నిచ్చే కాటుకలను హరించి వేస్తుందికదా!

**యత్రాంబు విన్యస్య బలిర్మనోజ్ఞా నవాప భోగాన్ వసుధాతలస్థః ।**
**తథామరత్వం త్రిదశాధిపత్యం మన్వన్తరం పూర్ణమపేతశత్రుః ॥ 31 ॥**

భూతలంనుంచే బలి ఎవని చేతిలో దానధార వదిలి, మనోహర భోగాలను, అలాగే అమరత్వాన్ని, మన్వంతరం వరకు స్వర్గాధిపత్యాన్ని, శత్రువనే వాడు ఏ మూలయందు లేకుండా పొందడమనేది జరిగింది కదా!

**అప్యేష మాం కంసపరిగ్రహేణ దోషాస్పదీభూతమదోషదుష్టమ్ ।**
**కర్తాఽవమానోపహతం ధిగస్తు తజ్జన్మనః సాధు బహిష్కృతం యత్ ॥ 32 ॥**

ఆ విష్ణు భగవానుడు దోషరహితుడనైన నన్ను కంసుడు చేరదీసినందు వల్ల దోషాలకు స్థానమైయున్న వానిగా భావించి అవమాన దూషితునిగా కాని చేస్తాడా? అలాగే అయితే సాధువులచే వెలివేయబడిన వాని జన్మ ఛీ! ఛీ! పరమనికృష్టం కదా!

**జ్ఞానాత్మకస్యామలసత్త్వరాశే రపేతదోషస్య సదా స్ఫుటస్య ।**
**కింవా జగత్యత్ర సమస్తపుంసా మజ్ఞాతమస్యాస్తి హృది స్థితస్య ॥ 33 ॥**

ఆయన జ్ఞానస్వరూపుడు. నిర్మలమైన సత్త్వగుణానికి నిధి. ఏదోషం లేనివాడు ఎల్లప్పుడూ ప్రస్ఫుటమై తోచువాడు. సమస్త ప్రాణికోటిహృదయాలయందు ఉండేవాడు. అటువంటి ఈ స్వామికి ఈ జగత్తులో తెలియరానిదంటూ ఏమి ఉంటుంది కనుక?

**తస్మాదహం భక్తి వినమ్రచేతా వ్రజామి సర్వేశ్వరమీశ్వరాణామ్ ।**
**అంశావతారం పురుషోత్తమస్య హ్యనాదిమధ్యాన్తమజస్య విష్ణోః ॥ 34 ॥**

కాబట్టి నేను భక్తితో మనస్సు విధేయంగా చేసుకొని, ఈశ్వరులు అనబడే వారికే సర్వేశ్వరుడైన, పురుషోత్తముడైన, ఆదిమధ్యాంతరహితుడైన, పుట్టుకలేని విష్ణువుయొక్క అంశావతారమైన కృష్ణుని శరణు పొందుతానని అక్రూరుడు నిశ్చయించాడని పరాశరుడు మైత్రేయునికి తెలియజేశాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే అక్రూరస్య గోకులాగమనం నామ సప్తదశోఽధ్యాయః సమాప్తః॥17॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో అక్రూరుని గోకులాగమనం అనే పదిహేడవ అధ్యాయం సమాప్తం ॥ 17 ॥



## అష్టాదశోఽధ్యాయః - పదునెనిమిదవ అధ్యాయం
## శ్రీకృష్ణస్య మథురాప్రస్థానమ్ - శ్రీకృష్ణుని మథురాప్రస్థానం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**చిన్తయన్నితి గోవిన్ద ముపాగమ్య స యాదవః ।**
**అక్రూరోఽస్మీతి చరణౌ ననామ శిరసా హరేః ॥ 1 ॥**

'మైత్రేయా! ఈ విధంగా ఆ యాదవుడు భావిస్తూ గోవిందుని సమీపించి ఆయన పాదాలపై శిరసువంచి నమస్కరించి నేను అక్రూరుడనని హరికి విన్నవించుకొన్నాడు.

**సోఽప్యేనం ధ్వజవజ్రాబ్జకృతచిహ్నేన పాణినా ।**
**సంస్పృశ్యాకృష్య చ ప్రీత్యా సుగాఢం పరిషస్వజే ॥ 2 ॥**

ఆ శ్రీహరికూడ ధ్వజరేఖ, వజ్రరేఖ, పద్మరేఖలు అనే చిహ్నాలతో కూడుకొన్న తనచేతితో అక్రూరుని తాకి దగ్గరకు లాగుకొని మిక్కిలి ప్రీతితో అక్కున గాఢంగా కౌగిలించుకొన్నాడు.

**కృతసంవన్దనౌ తేన యథావద్ బలకేశవౌ ।**
**తతః ప్రవిష్టౌ సంహృష్టౌ తమాదాయాత్మమన్దిరమ్ ॥ 3 ॥**

ఆతని శాస్త్రవిహిత భక్తిపూరిత వందనాలు అందుకొన్నవారై బలరామకేశవులిద్దరు మిక్కిలి ఆనందించి ఆతనిని తీసుకొని తమ మందిరానికి చేరుకొన్నారు.

**సహ తాభ్యాం తదాక్రూరః కృతసంవదనాదికః ।**
**భుక్తభోజ్యో యథాన్యాయ మాచచక్షే తతస్తయోః ॥ 4 ॥**

అంత అక్రూరుడు వారితో కలసి లోనికేగి కుశలప్రశ్నలు పూర్తి అయిన తరువాత యథారీతిగా సగౌరవంగా విందారగించి తాను వచ్చిన పని వారికి ఇలా తెలియజేశాడు.

**యథా నిర్భర్త్స్యతే తేన కంసేనానకదున్దుభిః ।**
**యథా చ దేవకీదేవీ దానవేన దురాత్మనా ॥ 5 ॥**

**ఉగ్రసేనే యథా కంసః సుదురాత్మా చ వర్తతే ।**
**యం చైవార్థం సముద్దిశ్య స కంసేన విసర్జితః ॥ 6 ॥**

ఆ దుష్టాత్ముడైన కంసదానవుడు వసుదేవుని, దేవకీదేవిని ఎలా బెదిరిస్తున్నాడో, దురాత్ముడైన ఆ కంసరాక్షసుడు ఉగ్రసేనుని పట్ల ఎలా దుర్వృత్తితో ఉంటున్నాడో, అతనిని ఎలా బంధించి ఉంచాడో, తనను ఏ కారణంచే బృందావనానికి పంపించడం జరిగిందో అంతా పూస గ్రుచ్చినట్లుగా తెలియజేశాడు.

**తత్సర్వం విస్తరాచ్ఛ్రుత్వా భగవాన్ కేశిసూదనః ।**
**ఉవాచాఖిలమప్యేతత్ జ్ఞాతం దానపతే! మయా ॥ 7 ॥**

కేశిరాక్షసుని సంహరించిన భగవంతుడగు కృష్ణుడు ఆ వృత్తాంతమంతా పూర్తిగా విని దానపతీ! నీవు చెప్పినదంతా సంపూర్ణంగా నాకు తెలుసని చెప్పాడు.

**కరిష్యేచ మహాభాగ! యదత్రౌపయికం మతమ్ ।**
**విచిన్త్యం నాన్యథైతత్ తే విద్ధి కంసం హతం మయా ॥ 8 ॥**

"మహాభాగా! అక్రూరా! ఇందు నేను చేయవలసిందేదైతే ఉందో, దానిని జాగ్రత్తగా ఆలోచించి చేస్తాను. నీవు మరో రీతిగా ఆలోచించవలసిన అవసరం ఏ మాత్రం లేదు. ఇక ఆ కంసుడు నాచే చంపబడినట్లే భావించు.

**అహం రామశ్చ మథురాం శ్వో యాస్యావః సమం త్వయా ।**
**గోపవృద్ధాశ్చ యాస్యన్తి ఆదాయోపాయనం బహు ॥ 9 ॥**

నేను బలరాముడు కూడ నీతోబాటు రేపు మథురకు వస్తాము. గోపవృద్ధులు కూడ కానుకలు ఎన్నో తీసుకొని అచ్చటకు రాగలరు.

**నిశేయం నీయతాం వీర! న చిన్తాం కర్తుమర్హసి ।**
**త్రిరాత్రాభ్యన్తరే కంసం హనిష్యామి సహానుగమ్ ॥ 10 ॥**

ఓ వీరాగ్రేసరా! ఈ రాత్రి ఇక్కడ హాయిగా గడపవచ్చు. మనస్సులో చింతించవద్దు. మూడు రాత్రులలోగా కంసుని సపరివారంగా సంహరిస్తాను." అని అక్రూరునితో చెప్పాడు.

**సమాదిశ్య తతో గోపానక్రూరోఽపి చ కేశవః ।**
**సుష్వాప బలభద్రశ్చ నన్ద గోపగృహే తతః ॥ 11 ॥**

అనంతరం గోపాలకులకు రేపే మథురకు ప్రయాణమని ఆజ్ఞాపించి, ఆ కేశవుడు, బలభద్రుడు, అక్రూరుడు ఆ రాత్రి నందగోపుని ఇంటిలో నిదురించారు.

**తతః ప్రభాతే విమలే కృష్ణరామౌ మహామతీ ।**
**అక్రూరేణ సమం గన్తుముద్యతౌ మథురాం ప్రతి ॥ 12 ॥**

అనంతరం వేకువజామున వెలుగులు ప్రసరించగానే, మహాబలశాలురైన బలరామకృష్ణులిరువురూ అక్రూరునితో బాటు మథురానగరానికి వెళ్లడానికి సన్నద్ధులయ్యారు.

**దృష్ట్వా గోపీజనః సాస్రః శ్లథద్వలయబాహుకః ।**
**నిఃశ్వస్య చాతిదుఃఖార్తః ప్రాహ చేదం పరస్పరమ్ ॥ 13 ॥**

గోపికా గణమంతా అదిచూచి కంట నీరుపెట్టుకొంది. చేతులకు వేసుకొన్న కంకణాలు క్రిందకు జారిపోతూ ఉండగా కృశించి కుమిలిపోయి నిట్టూర్పులు విడుస్తూ ఒకరితో ఇంకొకరు ఇలా అనుకోసాగారు.

**మథురాం ప్రాప్య గోవిన్దః కథం గోకులమేష్యతి ।**
**నగరస్త్రీకలాలాపమధు శ్రోత్రేణ పాస్యతి ॥ 14 ॥**

“మథురానగరాని కేగిన గోవిందుడు ఇక తిరిగి గోకులానికి వస్తాడా? అక్కడ నాగరిక సుందరుల మధురాలాపాల తేనెధారలను వీనుల గ్రోలడానికై అలవాటు పడుతాడుకదా!

**విలాస వాక్యపానేషు నాగరీణాం కృతాస్పదమ్ ।**
**చిత్తమస్య కథం భూయో గ్రామ్యగోపీషు యాస్యతి ॥ 15 ॥**

మథురానగర స్త్రీలతో వారి విలాసవంతమైన సంభాషణలు గావించిన పిమ్మట కృష్ణుని చిత్తం మళ్లీ ఈ పల్లెటూరి పడుచులపై ఎట్లు మరలుతుంది.

**సారం సమస్త గోష్ఠస్య విధినా హరతా హరిమ్ ।**
**ప్రహృతం గోపయోషిత్సు నిర్ఘృణేన దురాత్మనా ॥ 16 ॥**

సమస్తగోకులానికి సారభూతుడైన హరిని ఆనాడు విధి హరించుకొనిపోయింది. ఆ దైవం దయమాలినదై గోపకాంతల పట్ల అపకారబుద్ధితో దెబ్బకొట్టింది.

**భావగర్భస్మితం వాక్యం విలాసలలితాగతః ।**
**నాగరీణామతీవైతత్ కటాక్షేక్షితమేవ చ ॥ 17 ॥**
**గ్రామ్యో హరిరయం తాసాం విలాసనిగలైర్యుతః ।**
**భవతీనాం పునఃపార్శ్వం కయా యుక్త్యా సమేష్యతి ॥ 18 ॥**

నర్మగర్భంగా పలికే నవ్వుమాటలు, ఒయ్యారం కులికించే నడకలు, కొంటెగా విసరే వాల్చూపులు ఆనాగరిక స్త్రీలకు సహజంగా గొప్ప అలంకారాలు. ఈ వెట్టివాడయిన హరి, పల్లెటూరి పిల్లడు ఒక్కసారిగా ఆ విలాసబంధాలకు లొంగిపోతే, మళ్లీ తిరిగి ఏ మమకారాసక్తితో మన చెంతకు రావడమనేది జరుగుతుంది?

**ఏషైష రథమారుహ్య మథురాం యాతి కేశవః ।**
**క్రూరేణాక్రూరకేణాత్ర నిర్ఘృణేన ప్రతారితః (నిరాశేన) ॥ 19 ॥**

ఇటుచూడండి. ఇదుగో, క్రూరుడు, దయలేనివాడు అయిన అక్రూరుడు మోసం చేశాడు. ఈ కేశవుడు రథం ఎక్కి మధురాపురికి వెళ్లిపోతున్నాడు.

**కిం న వేత్తి నృశంసోఽత్ర అనురాగపరం జనమ్ ।**
**యేనైవమక్ష్ణోరాహ్లాదం నయత్యన్యత్ర నో హరిమ్ ॥ 20 ॥**

ఈ ఘాతకుడైన అక్రూరుడు ఇచ్చటి జనం వీనిపై ఎంతో మోహం కల్గియున్నదని తెలియకుండా ఉన్నాడా? మన కన్నులపండువైన హరిని ఈ క్రూరుడు ఇంకోచోటకు తీసుకొనిపోతున్నాడు.

**ఏష రామేణ సహితః ప్రయాత్యత్యన్తనిర్ఘృణః ।**
**రథమారుహ్య గోవిన్దస్త్వర్యతామస్య వారణే ॥ 21 ॥**

ఈ గోవిందుడు మిక్కిలి దయమాలినవాడయ్యాడు. అతడు బలరామునితో కలిసి రథమెక్కి వెళ్లిపోతున్నాడు. అతనిని ఆపడానికి త్వరపడండి.

**గురూణామగ్రతో వక్తుం కిం బ్రవీషి న నః క్షమమ్ ।**
**గురవః కిం కరిష్యన్తి దగ్ధానాం విరహాగ్నినా ॥ 22 ॥**

ఈ విషయాన్ని పెద్దల ముందు చెప్పడం మనకు మంచిది కాదని అంటారా? అవునులే. విరహాగ్నిలో కాగిపోతున్న మనల్ని పెద్దలు మాత్రం ఏం చేయగలరు కనుక?

**నన్దగోపముఖా గోపా గన్తుమేతే సముద్యతాః ।**
**నోద్యమం కురుతే కశ్చిద్ గోవిన్దవినివర్తనే ॥ 23 ॥**

అదీకాక నందగోపుడు ముందు పయనమై వెడుతూ ఉండగా వీరందరూ వెంట బయలుదేరుతున్నారు. ఇక ఎవడు గోవిందుని మరలించడానికి ప్రయత్నం చేస్తాడు కనుక?

**సుప్రభాతాఽద్య రజనీ మథురావాసయోషితామ్ ।**
**పాస్యన్త్యచ్యుతవక్త్రాబ్జం యాసాం నేత్రాలిపంక్తయః ॥ 24 ॥**

ఈ రాత్రి మథురాపురిలో నివసించే స్త్రీల కందరికి సుప్రభాతమే. వారి కంటిచూపులనే తుమ్మెదల గుంపులు కృష్ణుని ముఖపద్మమకరందాన్ని పానం చేయబోతున్నాయి.

**ధన్యాస్తే పథి యే కృష్ణమితో యాన్త్యనివారితాః ।**
**ఉద్వహిష్యన్తి పశ్యన్తః స్వదేహం పులకాంచితమ్ ॥ 25 ॥**

ఎవరయితే నివారింపబడకుండా కృష్ణునితో కలసి మార్గంలో పయనిస్తారో, వారు మిక్కిలి ధన్యులు కదా! ఎందువల్లనంటే ఆయన దర్శనం చేస్తూ పులకాంకితులయిన శరీరాలు కలవారు ఆ గోపికలు అవుతారు కదా!

**మథురానగరీ పౌర నయనానాం మహోత్సవః ।**
**గోవిన్దావయవై ర్దృష్టైః రతీవాద్య భవిష్యతి ॥ 26 ॥**

మథురానగర పౌరుల నయనాలకు ఇప్పుడు పండగే. ఆ గోవిందుని సర్వావయవ సౌందర్య సౌకుమార్యాలను చూచే మహాభాగ్యం వారికి పట్టనుంది.

**కో ను స్వప్నః సభాగ్యాభిర్దృష్టస్తాభిరధోక్షజమ్ ।**
**విస్తారికాన్తినయనా యా ద్రక్ష్య న్త్యనివారితాః ॥ 27 ॥**

సౌభాగ్యశాలినులైన మథురాపుర స్త్రీలు తమ సుందర విశాలనేత్రాలతో ఎవ్వరి అడ్డులేకుండా స్వేచ్ఛగా ఆ అధోక్షజుని చూచే భాగ్యం పొందడానికి ఎటువంటి మంచి కలలుకన్నారో కదా!

**అహో! గోపీ జనస్యాస్య దర్శయిత్వా మహానిధిమ్ ।**
**ఉద్ధృతాన్యత్ర నేత్రాణి విధాత్రాఽకరుణాత్మనా ॥ 28 ॥**

అయ్యో! ఇంతకాలం ఈ గోపికాజనానికి ఒక పెన్నిధిని చూపించి ఆ విధి కరుణమాలి ఇప్పుడు మా కన్నులు ఊడబెరికినాడు.

**అనురాగేణ శైథిల్యమస్మాసు వ్రజతా హరేః ।**
**శైథిల్యముపయాన్త్యాశు కరేషు వలయాన్యపి ॥ 29 ॥**

మనయందున్న ప్రేమ హరికి తగ్గిపోవడం వల్లనే కాబోలు ఇలా వెళ్లిపోతున్నాడు. అందువల్లనే మనముంజేతి కంకణాలు కూడ విరహబాధచే కృశించడం వల్ల వదులుగా అయిపోతున్నాయి.

**అక్రూరః క్రూరహృదయః శీఘ్రం ప్రేరయతే హయాన్ ।**
**ఏవమార్తాసు యోషిత్సు ఘృణా కస్య న జాయతే ॥ 30 ॥**

నిజంగా ఇతడు అక్రూరుడు కాడు. క్రూర హృదయుడు. అందువల్లనే గుర్రాలను వేగంగా తోలుతున్నాడు. లేకపోతే ఇలా బాధపడే అబలలపట్ల ఎవరికైనా జాలి కలగకుండా ఉంటుందా?

**హా హా కృష్ణరథస్యోచ్చైశ్చక్రరేణుర్నిరీక్ష్యతామ్ ।**
**దూరీకృతో హరిర్యేన సోఽపి రేణుర్న లక్ష్యతే ॥ 31 ॥**

అయ్యో! అయ్యో! శ్రీకృష్ణుని రథం అదిగో, చక్రాలనుంచి ధూళి పైకి రేగింది. అలా చూడండి. ఆ దుమ్ము కూడా కనబడడం లేదే. హరి చాలాదూరం వెళ్లిపోయాడు" అని వారు సంతాపం చెందారు.

**ఇత్యేవమతిహార్దేన గోపీజననిరీక్షితః ।**
**తత్యాజ వ్రజభూభాగం సహరామేణ కేశవః ॥ 32 ॥**

ఈ విధంగా గోపికాజనంచే మిక్కిలి గుండెలు నిండిన ప్రేమతో చూడబడుతూ, కృష్ణుడు బలరామునితో కలిసి ఆ వ్రేపల్లె ప్రాంతాన్ని వదిలిపెట్టి వెళ్లిపోయాడు.

**గచ్ఛన్తో జవనాశ్వేన రథేన యమునాతటమ్ ।**
**ప్రాప్తా మధ్యాహ్నసమయే రామాక్రూరజనార్దనాః ॥ 33 ॥**

మిక్కిలి వేగంతో పయనించే గుఱ్ఱాలు పూన్చిన రథంపై వెడుతూ, మధ్యాహ్నసమయానికి అక్రూర బలరామ శ్రీకృష్ణులు ముప్పురూ యమునానదీ తీరానికి చేరుకొన్నారు.

**అథాహ కృష్ణమక్రూరో భవద్భ్యాం తావదాస్యతామ్ ।**
**యావత్కరోమి కాలిన్ద్యామాహ్నికార్హణమమ్భసి ॥ 34 ॥**

అపుడు అక్రూరుడు కృష్ణునితో "మీరిద్దరు ఇక్కడ ఉండండి. నేను కాళిందీనదికేగి మాధ్యాహ్నిక సంధ్యోపాసన పూర్తిచేసుకొని వస్తాను." అన్నాడు.

**తథేత్యుక్తే తతః స్నాతః స్వాచాన్తః స మహామతిః ।**
**దధ్యౌ బ్రహ్మపరం విప్ర! ప్రవిశ్య యమునాజలే ॥ 35 ॥**

విప్రోత్తమా! వారు సరే అనగానే ఆ మహాబుద్ధిశాలియైన అక్రూరుడు స్నానంచేసి, ఆచమించి, ఆ యమునానదీజలాలో ఉన్నవాడై పరబ్రహ్మమును ధ్యానించాడు.

**ఫణాసహస్రమాలాఢ్యం బలభద్రం దదర్శ సః ।**
**కున్దమాలాంగమున్నిద్రపద్మపత్రాయతేక్షణమ్ ॥ 36 ॥**

**వృతం వాసుకి రమ్భాద్యై ర్మహద్భిః సవనాశిభిః ।**
**సంస్తూయమానం గన్ధర్వై ర్వనమాలావిభూషితమ్ ॥ 37 ॥**

**దధాన మసితే వస్త్రే చారుపద్మావతంసకమ్ ।**
**చారు కుణ్డలినం భాన్తమన్తర్జలతరే స్థితమ్ ॥ 38 ॥**

ఆ సమయంలో వేయి పడగల శీర్షమండలంతో ప్రకాశించేవాడు, మొల్లపూల కాంతులతో సమానమైన తెల్లని మేనిచాయకలవాడు. వికసించిన తామర రేకులవంటివిశాలకన్నులు కలవాడు, వాసుకి రంభుడు మున్నగు మహాసర్పాలతో పరివేష్టించి యున్నవాడు, గంధర్వులచే స్తుతించబడుతున్న వాడు, వనమాలతో ప్రకాశించేవాడు, నల్లని వస్త్రం ధరించినవాడు, అందమైనతామర పూలను శిరోభూషణాలుగా ధరించినవాడు, మనోహరములైన కుండలాలు ధరించినవాడు, ఆ యమునానదీ జలాంతర్భాగంలో ఉండి ప్రకాశిస్తున్నవాడు అయిన బలభద్రుని అక్రూరుడు సందర్శించాడు.

**తస్యోత్సంగే ఘనశ్యామమాతామ్రాయతలోచనమ్ ।**
**చతుర్బాహుముదారాంగం చక్రాద్యాయుధభూషణమ్ ॥ 39 ॥**

**పీతే వసానం వసనే చిత్రమాల్యవిభూషణమ్ ।**
**శక్రచాపతటిన్మాలా విచిత్రమివ తోయదమ్ ॥ 40 ॥**

**శ్రీవత్సవక్షసం చారు(కేయూర) స్ఫురన్మకరకుణ్డలమ్ ।**
**దదర్శ కృష్ణమక్లిష్టం పుణ్డరీకావతంసకమ్ ॥ 41 ॥**

ఆయన ఒడిలో నల్లమబ్బువంటిచాయ కలవాడు, ఎర్రనైన విశాలమైన కన్నులు గలవాడు, నాలుగు చేతులు కలవాడు, అందమైన శరీరం కలవాడు. చక్రం మున్నగు ఆయుధాలను అలంకారాలుగా ధరించిన వాడు, పీతాంబరాలు దాల్చినవాడు, చక్కని వనమాలను అలంకరించుకొన్నవాడు, ఇంద్రధనుస్సు మెరుపుతీగలతో కూడుకొన్నవాడు, విచిత్రమేఘం వంటివాడు, వక్షఃస్థలంపై శ్రీవత్స చిహ్నం కలవాడు, దేదీప్యమానమైన (కేయూరాలు) మకరకుండలాలు ధరించినవాడు, తామరపూలను శిరోభూషణాలుగా దాల్చినవాడు అగు ఆనందమయుడైన శ్రీకృష్ణుని సందర్శించాడు.

**సనన్దనాద్యైర్మునిభిః సిద్ధయోగైరకల్మషైః ।**
**విచిన్త్యమానం తత్రస్థైర్నాసాగ్రన్యస్తలోచనైః ॥ 42 ॥**

పుణ్యశీలురు, సిద్ధయోగులు, ముక్కుకొనయందు చూపులు నిలిపినవారు, ఆ యమునా నదీతీరంలోఉన్న సనందనాది మహర్షులచే ధ్యానించబడుచున్న కృష్ణపరమాత్మను అక్రూరుడు వీక్షించాడు.

**బలకృష్ణౌ తథాక్రూరః ప్రత్యభిజ్ఞాయ విస్మితః ।**
**సోఽచిన్తయద్ రథాచ్ఛీఘ్రం కథమత్రాగతావితి ॥ 43 ॥**

ఆ సమయంలో అక్రూరుడు వారిద్దరిని బలరామకృష్ణులుగా గుర్తించి ఆశ్చర్యపోయి, రథం నుంచి ఇంతవేగంగా వీరు ఇక్కడకు ఎలా రాగలిగారని ఆలోచించసాగాడు.

**వివక్షోః స్తమ్భయామాస వాచం తస్య జనార్దనః ।**
**తతో నిష్క్రమ్య సలిలాద్ రథ మభ్యాగతః పునః ॥ 44 ॥**

అలా అడగాలనుకొన్న అతని వాక్కును జనార్దనుడు అపుడు స్తంభింపజేశాడు. అనంతరం అతడు నదీజలాల నుంచి బయటకు వచ్చి రథం ఉన్నచోటికి తిరిగివచ్చాడు.

**దదర్శ తత్ర చైవోభౌ రథస్యోపర్యధిష్ఠితౌ ।**
**రామకృష్ణౌ యథాపూర్వం మనుష్యవపుషాన్వితౌ ॥ 45 ॥**

అతడు అక్కడ ఆ రామకృష్ణులను రథంపై మునుపటిలాగా కూర్చుండియున్న మనుష్య శరీరంలో ఉన్న వారిని చూచి నివ్వెరపోయాడు.

**నిమగ్నశ్చ తతస్తోయే స దదర్శ తథైవతౌ ।**
**సంస్తూయమానౌ గన్ధర్వమునిసిద్ధమహోరగైః ॥ 46 ॥**

అనంతరం అతడు మళ్లీ నదిలోనికి ప్రవేశించి నీటిలో మునిగి గంధర్వులచేత, మునీశ్వరుల చేత, సిద్ధులచేత, పన్నగశ్రేష్ఠుల చేత స్తుతించబడుతున్న వారిద్దరినీ సందర్శించాడు.

**తతో విజ్ఞాతసద్భావః సతు దానపతిస్తథా ।**
**తుష్టావ సర్వవిజ్ఞానమయమచ్యుతమీశ్వరమ్ ॥ 47 ॥**

అంతట ఆ దానపతియైన అక్రూరుడు వాస్తవిక రహస్యం గ్రహించినవాడై సర్వవిజ్ఞానమయుడైన, అచ్యుతుడగు, ఆ భగవంతుని ఈ రీతిగా స్తుతించాడు.

**సన్మాత్రరూపిణేఽచిన్త్యమహిమ్నే పరమాత్మనే ।**
**వ్యాపినే నైకరూపైకస్వరూపాయ నమో నమః ॥ 48 ॥**

"సన్మాత్ర స్వరూపుడు, ఊహింప శక్యంకాని మహిమకలవాడు, సమస్తం వ్యాపించి యున్నవాడు, కార్యదశయందు అనేక రూపుడుగా నున్నప్పటికి కారణ స్థితియందు ఏకరూపుడై ఉన్నవాడు అయిన ఆ పరమాత్మకు నమస్కారం.

**సర్వరూపాయ తేఽచిన్త్య! హవిర్భూతాయ తే నమః ।**
**నమోఽవిజ్ఞాత పారాయ పరాయ ప్రకృతేః ప్రభో! ॥ 49 ॥**

ఓ అచింత్యరూపా! ప్రభూ! నీవు సర్వరూపుడవు. హవిస్స్వరూపుడవు. అవిజ్ఞేయ స్వరూపుడవు. ప్రకృతికన్న పరమైన వాడవు. అటువంటి నీకు నమస్కారం.

**భూతాత్మా చేన్ద్రియాత్మా చ ప్రధానాత్మా తథా భవాన్ ।**
**ఆత్మా చ పరమాత్మా చ త్వమేకః పంచధా స్థితః ॥ 50 ॥**

ప్రభూ! నీవు ఒక్కడవే అయినప్పటికి భూతాత్ముడవు, ఇంద్రియాత్ముడవు, ప్రధానాత్ముడవు, ప్రత్యగాత్మవు (ఆత్మవు), పరమాత్మవుగా అయిదు విధాలుగా అయియున్నావు.

**ప్రసీద సర్వసర్వాత్మన్ క్షరాక్షరమయేశ్వర! ।**
**బ్రహ్మవిష్ణుశివాఖ్యాభిః కల్పనాభిరుదీరితః (శివాద్యాభిః) ॥ 51 ॥**

ఓ సర్వ! సర్వాత్మకా! క్షరాక్షరమయా! ఈశ్వర! నన్ను అనుగ్రహించు. నీవు బ్రహ్మ, విష్ణువు, శివుడు అనే నామాలతో వివిధ కల్పనలతో వ్యవహరించబడుతున్నావు.

**అనాఖ్యేయస్వరూపాత్మన్! అనాఖ్యేయప్రయోజన! ।**
**అనాఖ్యేయాభిధానం త్వాం నతోఽస్మి పరమేశ్వర! ॥ 52 ॥**

నిర్వచించ శక్యంకాని స్వరూపంతో ప్రకాశించేవాడా! నిశ్చయించ శక్యంకాని బహువిధకార్య రూపంతో భాసిల్లేవాడా! నిర్ణయించ శక్యంకాని అనేక నామాలతో విరాజిల్లే వాడా! పరమేశ్వరా! నీకు వినయంతో వంగి నమస్కరిస్తున్నాను.

**న యత్ర నాథ! విద్యన్తే నామజాత్యాదికల్పనాః ।**
**తద్ బ్రహ్మ పరమం నిత్యమవికారి భవానజః ॥ 53 ॥**

ఓ నాథా! నామం, జాతి మున్నగు కల్పనలు ఎచ్చట లేవో అదే పరబ్రహ్మం. అదే నిత్యం. అది ఏ వికారాలు లేనిది. దానికి పుట్టుక లేదు. అది నీవే అయియున్నావు.

**న కల్పనామృతేఽర్థస్య సర్వస్యాధిగమో యతః ।**
**తతః కృష్ణాచ్యుతానన్త విష్ణుసంజ్ఞాభిరీడ్యసే ॥ 54 ॥**

అయినప్పటికి ఏ కల్పన లేకుండా ఏ పదార్థజ్ఞానం కలుగదు కాబట్టి నీవు కృష్ణుడు, అచ్యుతుడు, అనంతుడు, విష్ణువు మున్నగు నామాలతో స్తుతించబడుతున్నావు.

**సర్వార్థస్త్వమజ! వికల్ప నాభిరేతద్**
**దేవాద్యం జగదఖిలం త్వమేవ విశ్వమ్ ।**
**విశ్వాత్మా త్వమితి వికారభావహీనః**
**సర్వస్మిన్ న హి భవతోఽస్తి కించి దన్యత్ ॥ 55 ॥**

పుట్టుకలేని దేవా! నీవే బ్రహ్మ మున్నగు అనేక కల్పనల ద్వారా సమస్త విశ్వోత్పత్తి చేస్తున్నావు కాబట్టి ఈ సకల ప్రపంచం నీవే. సమస్త పదార్థాలు నీ ఆత్మవస్తువులే అయినా, నీవు అవికారుడవు కాబట్టి వాటియందు నీవు ఏ వికారం లేకుండా ఉంటావు కాన నీకన్న ఏ కొంచెమైనా వేరే అన్నది లేదు.

**త్వం బ్రహ్మా పశుపతిరర్యమా విధాతా**
**ధాతా త్వం త్రిదశపతిః సమీరణోஉగ్నిః ।**
**తోయేశో ధనపతి రన్తకస్త్వమేకో**
**భిన్నార్థై ర్జగదపి పాసి శక్తి భేదైః ॥ 56 ॥**

నీవే బ్రహ్మవు. పశుపతివి. అర్యముడవు (సూర్యుడవు). విధాతవు. ధాతవు. ఇంద్రుడవు, వాయుదేవుడవు. అగ్నివి. వరుణుడవు. కుబేరుడవు. యముడవు. ఈ ప్రకారం ఆ నీవొక్కడవే భిన్న భిన్న రూపాలద్వారా శక్తిభేదాలతో ఈ సమస్త జగత్తును రక్షిస్తున్నావు.

**విశ్వం భవాన్ సృజతి సూర్యగభస్తిరూపో**
**విశ్వం చ తే గుణమయోஉయ మజ! (తః)ప్రపంచః ।**
**రూపం పరం సదితి వాచకమక్షరం యద్**
**జ్ఞానాత్మనే సదసతే ప్రణతోஉస్మి తస్మై ॥ 57 ॥**

జన్మరహితుడా! నీవు సూర్యకిరణ రూపంతో (వర్షరూపంలో) విశ్వసృష్టి చేస్తున్నావు. అందువల్ల ఈ గుణమయ ప్రపంచమంతా నీ స్వరూపమే. 'సత్' అనే పదం దేనిని తెలియజేస్తుందో, ఆ అక్షరమైన ఓంకారం నీ పరమ స్వరూపం. నీ జ్ఞానాత్మకమైన సదసత్స్వరూపానికి వినమ్రుడనై నమస్కరిస్తున్నాను.

**ఓం నమో వాసుదేవాయ నమః సంకర్షణాయ తే ।**
**ప్రద్యుమ్నాయ నమస్తుభ్య మనిరుద్ధాయ తే నమః ॥ 58 ॥**

ఓ ప్రభూ! నీ వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు అనబడే నాలుగు వ్యూహాలకు పదేపదే నా ప్రణామాలు" అని ఈ విధంగా అక్రూరుడు స్తుతించాడని పరాశరుడు మైత్రేయునకు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే శ్రీకృష్ణస్య మథురాప్రస్థానం నామ అష్టాదశోஉధ్యాయః సమాప్తః ॥ 18 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో శ్రీకృష్ణుని మథురాప్రస్థానం అనే పదునెనిమిదవ అధ్యాయం సమాప్తం ॥18॥



## ఏకోనవింశోఽధ్యాయః - పందొమ్మిదవ అధ్యాయం

## శ్రీకృష్ణకృతరజకనిగ్రహః-మాలాకారానుగ్రహశ్చ-శ్రీకృష్ణకృతరజకనిగ్రహం-మాలాకారానుగ్రహం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ఏవమన్తర్జలే విష్ణుమభిష్టూయ స యాదవః ।**
**అర్చయామాస సర్వేశం పుష్పైర్ధూపై ర్మనోహరైః (మయైః) ॥ 1 ॥**

మైత్రేయా! ఈ విధంగా యదువంశంలో పుట్టిన ఆ అక్రూరుడు యమునా నదీజల మధ్యంలో విష్ణువును స్తుతించి, ఆ సర్వేశ్వరుని పుష్పాదులచే పూజించి, ధూపాదులచే అర్చించి మానసికపూజ కావించాడు.

**పరిత్యక్తాన్య విషయో మనస్తత్ర నివేశ్య సః ।**
**బ్రహ్మభూతే చిరం స్థిత్వా విరరామ సమాధితః ॥ 2 ॥**

మనస్సును ఇతరవిషయాల నుంచి మరలించి, శ్రీకృష్ణపరబ్రహ్మమునందే చిరకాలం నిలిపి, క్రమంగా సమాధిస్థితినుంచి బయటకు వచ్చాడు.

**కృతకృత్యమివాత్మానం మన్యమానో మహామతిః ।**
**ఆజగామ రథం భూయో నిర్గమ్య యమునామ్భసః ॥ 3 ॥**

మహాబుద్ధిశాలియైన అక్రూరుడు తనను కృతకృత్యునిగా (ధన్యునిగా) భావించుకొని, యమునా జలాలనుంచి బయటకు వచ్చి మళ్లీ రథం వద్దకు వచ్చాడు.

**రామకృష్ణౌ చ దదృశే యథాపూర్వం రథే స్థితౌ ।**
**విస్మితాక్ష స్తదాఽక్రూర స్తం చ కృష్ణోఽభ్యభాషత ॥ 4 ॥**

మునుపటిలాగే రథమునందు అధివసించి యున్న రామకృష్ణులను చూశాడు. అప్పుడు అక్రూరుడు ఒక్కసారి ఆశ్చర్యచకితనయనుడయ్యాడు. అతనిని అలా చూచి కృష్ణుడిలా అన్నాడు.

**నూనం తే దృష్టమాశ్చర్య మక్రూర! యమునాజలే ।**
**విస్మయోత్ఫుల్లనయనో భవాన్ సంలక్ష్యతే యతః ॥ 5 ॥**

"అక్రూరా! యమునాజలంలో ఏదో వింత చూచినట్లున్నావు. ఇది నిజం. అందువల్లనే నీ నేత్రాలు ఆశ్చర్యంతో వికసించినట్లున్నాయి. నీవు కూడా ఏదో అద్భుతంగా గోచరిస్తున్నావు" అని వచించాడు.

**అన్తర్జలే యదాశ్చర్యం దృష్టం తత్ర మయాచ్యుత! ।**
**తదత్రాపి హి పశ్యామి మూర్తిమత్ పురతః స్థితమ్ ॥ 6 ॥**

అంత అక్రూరుడు "స్వామీ! అచ్యుతా! అక్కడ నీటి లోపలి భాగంలో ఏ దృశ్యాన్ని నేను నివ్వెరపోయి చూశానో, ఆ వింతయే ఇప్పుడు ఇక్కడ కన్నులకట్టినట్లుగా రూపుదాల్చి ఎదురుగా ఉన్నట్లు చూస్తున్నాను.

**జగదేతన్మహాశ్చర్యరూపం యస్య మహాత్మనః ।**
**తేనాశ్చర్యవరేణాహం భవతా కృష్ణ! సంగతః ॥ 7 ॥**

కృష్ణా! ఈ జగత్తు ఏ మహాత్ముని మహాద్భుత స్వరూపమై విరాజిల్లుతోందో, ఆ అబ్బురపరచే పరబ్రహ్మాన్ని నిన్ను నేను కలుసుకొన్నాను.

**తత్కిమేతేన మథురాం వ్రజామో మధుసూదన ।**
**బిభేమి కంసాద్ధిగ్ జన్మ పరపిణ్డోపజీవినామ్ ॥ 8 ॥**

ఆ విషయం ఇక వదలిపెట్టు. మధుసూదనా! ఇక మనం శీఘ్రంగా మథురకు బయలుదేరుదాము. నేను ఆ కంసునికి భయపడుతున్నాను. పరులను ఆశ్రయించి అన్నం భుజించి జీవించే వారి బ్రతుకు పరమతుచ్ఛం కదా!" అని అన్నాడు.

**ఇత్యుక్త్వా చోదయామాస తాన్ హయాన్ వాతరంహసః ।**
**సమ్ప్రాప్తశ్చాతిసాయాహ్నే సోఽక్రూరో మథురాం పురీమ్ ॥ 9 ॥**

అని అక్రూరుడు పలికి వాయువేగంతో కూడుకొన్న ఆ గుఱ్ఱాలను గబగబా త్రోలసాగాడు. ప్రొద్దుగ్రుంకే వేళలో అతడు మథురానగరానికి చేరుకోవడం జరిగింది.

**విలోక్య మథురాం కృష్ణం రామం చాహ స యాదవః ।**
**పద్భ్యాం యాతం మహావీర్యౌ రథేనైకో విశామ్యహమ్ ॥ 10 ॥**

ఆ యాదవుడు మథుర చేరడంతోనే బలరామకృష్ణులను చూచి ఇలా అన్నాడు "మహావీరులారా! మీరు కాలినడకతో పురం చూస్తూ రండి. నేను ఒంటరిగా ఈ రథంతో నగరం ప్రవేశిస్తాను.

**గన్తవ్యం వసుదేవస్య భవద్భ్యాం న తథా గృహమ్ ।**
**యువయోర్హి కృతే వృద్ధః స కంసేన నిరస్యతే ॥ 11 ॥**

మీరు వసుదేవుని మందిరానికి మాత్రం వెళ్లవద్దు. కంసుడు మీ కారణంగా ఆ వృద్ధుని బయటికి గెంటివేస్తాడు." అని వారికి తెలియజేశాడు.

**ఇత్యుక్త్వా ప్రవివేశాథ సోఽక్రూరో మథురాం పురీమ్ ।**
**ప్రవిష్టౌ రామకృష్ణౌ చ రాజమార్గముపాగతౌ ॥ 12 ॥**

అని పలికి మొదట ఆ అక్రూరుడు మథురాపురిలో ప్రవేశించాడు. అనంతరం బలరామకృష్ణులు ఆ నగరిలో ప్రవేశించి రాజమార్గానికి ఏతెంచారు.

**స్త్రీభిర్నరైశ్చ సానన్దం లోచనైరభివీక్షితౌ ।**
**జగ్మతుర్లీలయా వీరౌ దృప్తౌ బాలగజావివ ॥ 13 ॥**

స్త్రీలు, పురుషులు ఆనందంతో కనులారా వారిని వీక్షించారు. వారు వీరులై మదించిన ఏనుగు గున్నలలాగా వయ్యారంగా  నడయాడసాగారు.

**భ్రమమాణౌ తు తౌ దృష్ట్వా రజకం రంగకారకమ్ ।**
**అయాచేతాం సురూపాణి వాసాంసి రుచిరాననౌ ॥ 14 ॥**

వారు అలా రాజవీథిలో పరిభ్రమిస్తూ, రంగాలంకరణం చేసే ఒక చాకలివానిని చూచి, ఆ సుందర వదనారవిందులైన రామకృష్ణులు తమకు చక్కని రాజోచిత వస్త్రాలిమ్మని అడిగారు.

**కంసస్య రజకః సోఽథ ప్రసాదారూఢ విస్మయః (ప్రాసాదారూఢ) ।**
**బహూన్యాక్షేపవాక్యాని ప్రాహోచ్చై రామకేశవౌ ॥ 15 ॥**

అతడు కంసరాజేంద్రుని దివాణపు చాకలి కావడం వల్ల, నిరంతరం ప్రాసాదాలు అధిరోహించడం వల్ల పుట్టిన గర్వం కలవాడై, ఆ రామకేశవులను ఎకసక్కెము లాడుతూ గట్టిగా (బిగ్గరగా) అరచాడు.

**తతస్తల ప్రహారేణ కృష్ణస్తస్య దురాత్మనః ।**
**పాతయామాస కోపేన రజకస్య శిరో భువి ॥ 16 ॥**

అందువల్ల శ్రీకృష్ణుడు క్రుద్ధుడై తన అరచేతితో ఒక దెబ్బకొట్టి ఆ దురాత్ముడైన రజకుని తలను నేలపై బడవేశాడు.

**హత్వాదాయ చ వస్త్రాణి పీత నీలామ్బరౌ తతః ।**
**కృష్ణరామౌ ముదా యుక్తౌ మాలాకార గృహం గతౌ ॥ 17 ॥**

ఈ ప్రకారంగా కృష్ణుడు ఆ రజకుని చంపిన పిమ్మట, కృష్ణరాములిర్వురు వారికి తగినటువంటి పచ్చని, నల్లని బట్టలు తీసుకొని, వాటిని ధరించి మురియుచూ మాలాకారుని ఇంటికి వెళ్లారు.

**వికాసినేత్రయుగలౌ మాలాకారోఽతివిస్మితః ।**
**ఏతౌ కస్య సుతౌ యాతౌ మైత్రేయాచిన్తయ త్తదా ॥ 18 ॥**

మైత్రేయా! వికసించిన కనుదోయితో కూడుకొన్న వారిని చూచి మాలాకారుడు మిక్కిలి నివ్వెరపోయి వీరు ఎవరి కుమారులు? వీరు ఎక్కడ నుంచి వస్తున్నారు” అని ఆలోచించసాగాడు.

**పీత నీలామ్బరధరౌ తౌ దృష్ట్వాఽతిమనోహరౌ ।**
**స తర్కయామాస తదా భువం దేవావుపాగతౌ ॥ 19 ॥**

పీత నీలాంబరధారులై, అతిసుందరులగు ఆ అన్నదమ్ములనుచూచి దివినుండి భువికి దిగివచ్చిన దేవతామూర్తులుగా ఆ మాలాకారుడు భావించాడు.

**వికాసి ముఖపద్మాభ్యాం తాభ్యాం పుష్పాణి యాచితః ।**
**భువం విష్టభ్య హస్తాభ్యాం పస్పర్శ శిరసా మహీమ్ ॥ 20 ॥**

వారిద్దరు విప్పారిన పద్మాలవంటి ముఖాలు కలవారై ఈ పువ్వులు తమ కిమ్మని అతనిని అడిగారు. ఆ మాలాకారుడు వెంటనే వారిరువురికి చేతులు దోసిలిగా పట్టుకొని భూమిపై ఆనించి, శిరస్సు నేలపై వాల్చి మోకరిల్లాడు (సాష్టాంగ ప్రణామం కావించాడు).

**ప్రసాదపరమౌ నాథౌ మమగేహముపాగతౌ ।**
**ధన్యోఽ హమర్చయిష్యామీత్యాహ తౌ మాల్యజీవకః ॥ 21 ॥**

“పరమ ప్రసన్నులు, నాపాలి ప్రభువులు నా ఇంటికి వచ్చేశారు. ధన్యుడనయ్యాను. మిమ్మల్ని అర్చించుకొంటాను’ అని ఆ పూలమ్ముకొని జీవించే అతడు వారిని ప్రార్థించాడు.

**తతః ప్రహృష్టవదనస్తయోః పుష్పాణి కామతః ।**
**చారూణ్యేతాన్యథైతాని ప్రదదౌ స విలోభయన్ ॥ 22 ॥**

అనంతరం అతడు సంతోషంతో నిండిన ముఖంతో వారికి పూలు సమర్పిస్తూ “ఇవి మంచివి అంతకన్న ఇవి మంచివి. ఇవి తీసుకోండి” అంటూ వారిని మురిపిస్తూ ఊరించసాగాడు.

**పున పునః ప్రణమ్యాసౌ మాలాకారో నరోత్తమౌ ।**
**దదౌ పుష్పాణి చారూణి గన్ధవన్త్యమలాని చ ॥ 23 ॥**

ఆ మాలాకారుడు మాటిమాటికి ఆ పురుషోత్తములకు నమస్కరిస్తూ, సువాసనలు వెదజల్లే, వాడిపోని చక్కని పూలను ఎంచి వారికి అర్పించాడు.

**మాలాకారాయ కృష్ణోఽ పి ప్రసన్నః ప్రదదౌ వరాన్ ।**
**శ్రీస్త్వాం మత్సంశ్రయా భద్ర! న కదాచిత్త్యజిష్యతి ॥ 24 ॥**

కృష్ణుడు కూడా ఆ మాలాకారుని పట్ల ప్రసన్నుడై ఇలా వరాలిచ్చాడు. “ఓ భద్రుడా! నా ఆశ్రయంలో ఉండే లక్ష్మి ఎల్లప్పుడూ నిన్ను విడిచి పెట్టకుండా ఉంటుంది.

**బలహానిర్న తే సౌమ్య! ధనహానిస్తథైవ చ ।**
**యావద్దినాని తావచ్చ న నశిష్యతి సన్తతిః ॥ 25 ॥**

సౌమ్యుడా! నీకు బలహాని కాని, ధనహాని కాని ఎన్నడూ కలుగదు. నీ సంతతివారు సంపూర్ణంగా ఆయుష్మంతులై జీవిస్తారు.

**భుక్త్వా చ విపులాన్ భోగాంస్త్వమన్తే మత్ప్రసాదజమ్ ।**
**మమానుస్మరణం ప్రాప్య దివ్యం లోకమవాప్స్యసి ॥ 26 ॥**

నీవు జీవితపర్యంతం అనేక మహాభోగాలు అనుభవించి, నా అనుగ్రహంవల్ల నా స్మరణే పొంది, చివరి సమయంలో దివ్యలోకాన్ని పొందుతావు.

**ధర్మే మనశ్చ తే భద్ర! సర్వకాలం భవిష్యతి ।**
**యుష్మత్సన్తతి జాతానాం దీర్ఘమాయుర్భవిష్యతి ॥ 27 ॥**

ఓ భద్రుడా! నీ మనస్సు సర్వకాలములందు ధర్మం చేయడమందే నిలిచి ఉంటుంది. నీ సంతానానికి జన్మించిన వారికి కూడా దీర్ఘాయువు లభిస్తుంది.

**నోపసర్గాదికం దోషం యుష్మత్సన్తతిసమ్భవః ।**
**అవాప్స్యతి మహాభాగ! యావత్సూర్యో ధరిష్యతి ॥ 28 ॥**

ఓ మహాభాగా! సూర్యుడు ఉన్నంత కాలం నీ వంశంలో జన్మించిన వారికి ఏ ఆకస్మిక రోగాదులైన ఉపద్రవాలు ఏనాటికీ కలగవు" అని కృష్ణుడు ఆతనికి వరాలు ఇచ్చాడు.

**ఇత్యుక్త్వా తద్ గృహాత్ కృష్ణో బలదేవసహాయవాన్ ।**
**నిర్జగామ మునిశ్రేష్ఠ! మాలాకారేణ పూజితః ॥ 29 ॥**

మునిశ్రేష్ఠా! మైత్రేయా! అని కృష్ణుడు ఈ విధంగా మాలాకారుని అనుగ్రహించి బలరామునితో కలిసి అతని పూజలందుకొని, అతని ఇంటినుండి వెళ్ళిపోయాడు - అని పరాశరుడు చెప్పాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే శ్రీకృష్ణకృత రజకనిగ్రహః - మాలాకారానుగ్రహశ్చేతి ఏకోనవింశోఽధ్యాయః సమాప్తః ॥ 19 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో శ్రీకృష్ణకృత రజకనిగ్రహం - మాలాకారానుగ్రహం అనే పందొమ్మిదవ అధ్యాయం సమాప్తం ॥ 19 ॥



## **వింశోఽధ్యాయః** – ఇరవైయవ అధ్యాయం

## **కంసవధః** – కంసవధ

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**రాజమార్గే తతః కృష్ణః సానులేపనభాజనామ్ ।**
**దదర్శ కుబ్జా మాయాన్తీం నవయౌవన గోచరామ్ ॥ 1 ॥**

మైత్రేయా! అనంతరం కృష్ణుడు రాజమార్గంలో వస్తున్న సుగంధపాత్రను ధరించియున్న, నవయౌవనవతిగా గోచరమవుతున్న కుబ్జను చూశాడు.

**తామాహ లలితం కృష్ణః కస్యేద మనులేపనమ్ ।**
**భవత్యా నీయతే సత్యం వదేన్దీవరలోచనే ॥ 2 ॥**

అంత కృష్ణుడు మనోహర కంఠధ్వనితో "ఓ నల్ల కలువల (తామరల) వంటి కన్నులు కలదానా! ఈ మైపూతలను ఎవరికొరకై నీవు తీసుకొని వెడుతున్నావు? నిజం చెప్పు" అని ఆమెను అడిగాడు.

**సకామేనేవ సా ప్రోక్తా సానురాగా హరిం ప్రతి ।**
**ప్రాహ సా లలితం కుబ్జా తద్దర్శనబలాత్కృతా ॥ 3 ॥**

అని కృష్ణుడు సాభిలాషుడై వచించగా, ఆమె కృష్ణ దర్శనంచే వివశురాలై, ఆయన పట్ల అనురక్తయై, ప్రీతిపూర్వకంగా ఇంపుగా ఇలా అన్నది.

**కాన్త! కస్మాన్న జానాసి కంసేనాభినియోజితామ్ ।**
**నైకవక్రేతి విఖ్యాతామనులేపనకర్మణి ॥ 4 ॥**

"ఓ మనోహర స్వరూపా! నేను కంసుని దాసిని. నన్ను నీవేల గ్రహించకున్నావు? నేను ఎక్కువ వంకరలతో వాసి గాంచిన దానను. కంసరాజుకు కలాపాలు కూర్చడమే నా పని.

**నాన్యపిష్టం హి కంసస్య ప్రీతయే హ్యనులేపనమ్ ।**
**భవామ్యహమతీవాస్య ప్రసాద ధనభాజనమ్ ॥ 5 ॥**

ఇంకొకరు తీసిన అనులేపనం కంసునకు ఏ మాత్రం ఇష్టం కాదు. నేను ఆ రాజుకు మిక్కిలి అనుగ్రహపాత్రురాలనై జీవిస్తున్నదానను" అని ఆమె పలికింది.

**సుగన్ధమేతద్ రాజార్హం రుచిరం రుచిరాననే ।**
**ఆవయోర్గాత్ర సదృశం దీయతా మనులేపనమ్ ॥ 6 ॥**

అపుడు కృష్ణుడు "ఓ సుందరవదనా! రాజుకు ఉపభోగయోగ్యమైన ఈ మనోహర సుగంధానికి మా శరీరాలకు అనువైన పూతగా ఈయవలసింది" అని అడిగాడు.

**శ్రుత్వైతదాహ సా కుబ్జా గృహ్యతామితి సాదరమ్ ।**
**అనులేపం చ ప్రదదౌ గాత్రయోగ్య మథోభయోః ॥ 7 ॥**

ఆ కుబ్జ ఆ మాటలు వినగానే సాదరంగా “ఇది తీసుకోండి” అంటూ వారిరువురి మైపూతకు యోగ్యమైన చందనాన్ని వారికి సమర్పించింది.

**భక్తిచ్ఛేదానులిప్తాంగౌ తతస్తౌ పురుషర్షభౌ ।**
**సేన్ద్రచాపౌ విరాజేతాం సితకృష్ణావివామ్బుదౌ ॥ 8 ॥**

అనంతరం ఆ పురుషశ్రేష్ఠులైన బలరామకృష్ణులు ఆ గంధాలను రంగురంగుల పత్రరచనా విధానంగా అలంకరించుకొని ఇంద్రధనుస్సుతో కూడిన తెలుపు నలుపు మేఘాలవలె విలసిల్లారు.

**తతస్తాం చిబుకే శౌరిరుల్లాఘనవిధానవిత్ ।**
**ఉత్పాట్య తోలయామాస ద్వ్యంగుళేనాగ్రపాణినా ॥ 9 ॥**

అటుపిమ్మట శౌరి ఉల్లాఘన విధానం (పైకెత్తి సరిచేయడం అనే క్రియ) తెలిసున్నవాడు కావున ఆమె గడ్డాన్ని తన కుడిచేతి రెండు వ్రేళ్లతో పైకెత్తి చలింపచేశాడు.

**చకర్ష పద్భ్యాం చ తదా ఋజుత్వం కేశవోఽనయత్ ।**
**తతః సా ఋజుతాం ప్రాప్తా యోషితామభవద్వరా ॥ 10 ॥**

అనంతరం తన పాదాలతో కేశవుడు ఆమె పాదాలను త్రొక్కి పైకి ఎత్తి వంకరలను సరిచేశాడు. ఆమె ఆ వంకరలు తొలగిపోగా సరైన చక్కని శరీరంతో సుందరీమణులతో కడు చక్కనిదై విరాజిల్లింది.

**విలాస లలితం ప్రాహ ప్రేమగర్భభరాలసమ్ ।**
**వస్త్రే ప్రగృహ్య గోవిన్దం మమ గేహం వ్రజేతి వై ॥ 11 ॥**

అంత ఆ సుందరి ప్రేమతో నిండిన భావంతో అల్లన గోవిందుని కట్టుకొన్న బట్టపట్టుకొని తన ఇంటికి రమ్మని ఎంతో ఒయ్యారంగా ముగ్ధమోహనంగా ఆహ్వానించింది.

**ఆయాస్యే భవతీగేహమితి తాం ప్రహసన్ హరిః ।**
**విససర్జ జహాసోచ్చై రామస్యాలోక్యచాననమ్ ॥ 12 ॥**

ఆ సమయంలో హరి ఆమెను చూచి నవ్వుతూ కొద్దిరోజుల పోయిన తరువాత మీ ఇంటికి వస్తానని చెప్పి, బలరాముని ఆననం చూచి పకపక నవ్వుతూ ఆ కుబ్జను విడిచివెళ్లాడు.

**భక్తిచ్ఛేదానులిప్తాంగౌ నీలపీతామ్బరౌ తు తౌ ।**
**ధనుశ్శాలాం తతో యాతౌ చిత్రమాల్యోపశోభితౌ ॥ 13 ॥**

గంధం పూసుకొన్న పత్రాదిరచన కొంచెం కూడా సడలకుండా, రంగురంగుల పూలమాలలతో అలంకరింపబడ్డ, నీలాంబరం, పీతాంబరం ధరించిన ఆ బలరామకృష్ణులిరువురు ధనుశ్శాలకు వెళ్లారు.

**ఆయోగం చ ధనూరత్నం తాభ్యాం పృష్టైశ్చ రక్షిభిః ।**
**ఆఖ్యాతే సహసా కృష్ణో గృహీత్వాఽపూరయద్ధనుః ॥ 14 ॥**

యాగంలో లక్ష్యంగా ఉన్న విల్లును చూచి, వారిద్దరు గొప్పదైన ఆ విల్లుని గూర్చి దానిని రక్షించే వారినడిగి తెలుసుకొన్నారు. అంత తటాలున కృష్ణుడు దానిని పైకెత్తి ఎక్కుపెట్టాడు.

**తతః పూరయితా తేన భజ్యమానం బలాద్ధనుః ।**
**చకార సుమహచ్ఛబ్దం మథురా యేన పూరితా ॥ 15 ॥**

బలంగా ఎక్కుపెట్టిన వెంటనే ఆతనిచే ఆ విల్లు విరుగగొట్టబడింది. అంత మథురానగరం నిండి పోయేటట్లుగా మహాధ్వని వ్యాపించింది.

**అనుయుక్తౌ తతస్తౌ తు భగ్నే ధనుషి రక్షిభిః ।**
**రక్షిసైన్యం నిహత్యోభౌ నిష్క్రాన్తౌ కార్ముకాలయాత్ ॥ 16 ॥**

అనంతరం విల్లు విరగడంతోనే దానిని రక్షించేవారు రామకృష్ణులను ఎదిరించారు. వారు ఆ రక్షక భటులను కూల్చివేసి ధనుశ్శాలనుండి బయటకు వచ్చివేశారు.

**అక్రూరాగమవృత్తాన్తముపలభ్య మహద్ధనుః ।**
**భగ్నం శ్రుత్వాథ కంసోఽపి ప్రాహ చాణూరముష్టికౌ ॥ 17 ॥**

అక్రూరుడు వచ్చిన వృత్తాంతాన్ని, వచ్చిన వెంటనే గొప్పదైన విల్లు విరిగి పోవడం వంటి సమాచారాన్ని విన్న కంసుడు చాణూర ముష్టికులతో ఇలా అన్నాడు.

**గోపాల దారకౌ ప్రాప్తౌ భవద్భ్యాం తౌ మమాగ్రతః ।**
**మల్లయుద్ధేన హన్తవ్యౌ మమ ప్రాణహరౌ హి తౌ ॥ 18 ॥**

"ఆ గోపాలబాలకులు ఇద్దరూ వచ్చారు. వారు నా ప్రాణాలు తీయడానికి జన్మించినవారు. నేను చూస్తూండగానే నా ఎదుటనే మీరు వారిని తుదముట్టించండి.

**నియుద్ధే తద్వినాశేన భవద్భ్యాం తోషితో హ్యహమ్ ।**
**దాస్యామ్యభిమతాన్ కామాన్ నాన్యథైతన్మహాబలౌ ॥ 19 ॥**

మీరిద్దరు మల్లయుద్ధంలో వారిద్దరిని కడతేరిస్తే నాకు సంతోషం కలిగించినవారవుతారు. మీ సమస్తములైన కోరికలను నేను తీరుస్తాను. మరోవిధంగా మీరు ఊహించవద్దు.

**న్యాయతోఽన్యాయతో వాపి భవద్భ్యాం తౌ మమాహితౌ ।**
**హన్తవ్యౌ తద్వధాత్ రాజ్యం సామాన్యం నో భవిష్యతి ॥ 20 ॥**

మహాబలవంతులగు వారిద్దరూ నాకు శత్రువులు. న్యాయంగా కాని, అన్యాయంగా కాని మీరు వారిని చంపివేయండి. వారు మరణిస్తే చాలు ఈ రాజ్యం మీకు, నాకు అనుభవించడానికి సమానమైన సొత్తవుతుంది" అని వారిని ఆజ్ఞాపించాడు.

**ఇత్యాజ్ఞాప్య స తౌ మల్లౌ తత శ్చాహూయ హస్తిపమ్ ।**
**ప్రోవాచోచ్చై స్త్వయా మేఽద్య సమాజద్వారి కుంజరః ॥ 21 ॥**

**స్థాప్యః కువలయాపీడస్తేన తౌ గోపదారకౌ ।**
**ఘాతనీయౌ నియుద్ధాయ రంగద్వారముపాగతౌ ॥ 22 ॥**

అని కంసుడు ఆ మల్లుర కిద్దరికి ఆదేశించి, అటుపైన మావటీనిని రావించి అతనితో గట్టిగా "నీవు ఇప్పుడే సభాద్వారంలో కువలయాపీడమనే నా ఏనుగును నిలబెట్టి ఉంచు. ఆ గోపబాలకులిరువురూ బాహుయుద్ధానికై రంగస్థలద్వారానికి వచ్చిన వెంటనే చచ్చేటట్లు త్రొక్కించు" అని అరచాడు.

**తమథాజ్ఞాప్య దృష్ట్వా చ మంచాన్ సర్వానుపాకృతాన్ ।**
**ఆసన్నమరణః కంసః సూర్యోదయముదైక్షత ॥ 23 ॥**

ఆ విధంగా అతనికి ఆనతిచ్చి, ఆ మల్లయుద్ధాన్ని చూడడానికి వచ్చిన ప్రేక్షకులు కూర్చోవడానికి మంచెలు ఎలా ఏర్పాటు చేయబడ్డాయో పర్యవేక్షించి, చావు దాపురించిన కంసుడు సూర్యోదయానికై ఎదురు చూడసాగాడు.

**తతః సమస్తమంచేషు నాగరః స తథా జనః ।**
**రాజమంచేషు చారూఢాః సహామాత్యైర్మహీభృతః ॥ 24 ॥**

**మల్లప్రాశ్నికవర్గశ్చ రంగమధ్యసమీపతః ।**
**కృతః కంసేన కంసోఽపి తుంగమంచే వ్యవస్థితః ॥ 25 ॥**

అనంతరం మంచెలు అన్నింటిపై నగర జనం, రాజాసనాలపై అధిరోహించి మంత్రులతో బాటు రాజేంద్రులు కూర్చున్నారు. మల్లయుద్ధాన్ని పరీక్షించే అధికార వర్గాన్ని రంగమధ్య సమీపంలో ఉండేటట్లుగా కంసుడు ఏర్పాటు చేశాడు. కంసుడు మాత్రం అన్నింటిలోను ఎత్తైన మంచెపై అధిష్ఠించాడు.

**అన్తః పురాణాం మంచాశ్చ తథాన్యే పరికల్పితాః ।**
**అన్యే చ వారముఖ్యానామన్యే నాగరయోషితామ్ ॥ 26 ॥**

అంతఃపుర స్త్రీలు కూర్చోడానికై మరికొన్ని మంచెలు ఏర్పాటు చేయబడ్డాయి. అలాగే వారకాంతలు, నగరకాంతలు కూర్చోడానికై వేరువేరుగా మరికొన్ని ఆసనాలు కల్పించబడ్డాయి.

**నన్దగోపాదయో గోపా మంచేష్వన్యేష్వవస్థితాః ।**
**అక్రూర వసుదేవౌ చ మంచప్రాన్తే వ్యవస్థితౌ ॥ 27 ॥**

నందగోపుడు మున్నగు గోపాలకులు వేరే స్థలాలలో కూర్చున్నారు. అక్రూరుడు, వసుదేవుడు మంచ ప్రాంతంలో అధివసించియున్నారు.

**నాగరీయోషితాం మధ్యే దేవకీ పుత్రగర్ధినీ ।**
**అన్తకాలేఽపి పుత్రస్య ద్రక్ష్యామి రుచిరం ముఖమ్ ॥ 28 ॥**

దేవకి పుత్రునిపై గల ఉబలాటంతో, తుది సమయంలోనైనా తన పుత్రుని సుందరముఖం చూడబోతున్నానని నగరకాంతల నడుమ ఆసీనురాలయ్యింది.

**వాద్యమానేషు తూర్యేషు చాణూరే చాపి వల్గతి ।**
**హాహాకారపరే లోకే హ్యాస్ఫోటయతి ముష్టికే ॥ 29 ॥**

వెంటనే ఒక్కసారి తూర్యనాదాలు మ్రోగసాగాయి. చాణూరుడు గంతులువేస్తూ రంకెలు వేయసాగాడు. ముష్టికుడు జబ్బలు, తొడలుచరుస్తూ హాహాకారాలు చేయసాగాడు.

**ఈషద్ధసన్తౌ తౌ వీరౌ బలభద్రజనార్దనౌ ।**
**గోపవేష ధరౌ బాలౌ రంగద్వారముపాగతౌ ॥ 30 ॥**

అపుడు వీరులైన బలభద్ర జనార్దనులు అల్లనల్లన నవ్వుతూ గోపాలక బాలక వేషం ధరించి రంగద్వారం వద్దకు వచ్చారు.

**తతః కువలయాపీడో మహామాత్రప్రచోదితః ।**
**అభ్యధావ త్సువేగేన హన్తుం గోప కుమారకౌ ॥ 31 ॥**

అపుడు మావటీనిచే ప్రేరేపించబడి కువలయాపీడం ఆ గోపకుమారకులను చంపడానికై మిక్కిలి వేగంగా పరుగెత్తింది.

**హాహాకారో మహాన్ జజ్ఞే రంగమధ్యే ద్విజోత్తమ! ।**
**బలదేవోఽనుజం దృష్ట్వా వచనం చేదమబ్రవీత్ ।**
**హన్తవ్యో హి మహాభాగ! వాగోఽయం శత్రుచోదితః ॥ 32 ॥**

ద్విజశ్రేష్ఠా! అంత రంగమధ్యంలో ఒక్కసారిగా హాహాకారాలు మిన్నుముట్టాయి. బలదేవుడు తమ్ముని చూచి “మహాభాగ! శత్రువులచే ఉసిగొల్పబడిన ఈ కువలయాపీడాన్ని వెంటనే సంహరించవలసింది” అని గట్టిగా పలికాడు.

**ఇత్యుక్తః సోఽగ్రజేనాథ బలదేవేన వై ద్విజ! ।**
**సింహనాదం తతశ్చక్రే మాధవః పరవీరహా ॥ 33 ॥**

ద్విజప్రవరా! ఈ విధంగా అన్నగారైన బలదేవుడు హెచ్చరించి వచించగానే శత్రుహంతయైన మాధవుడు ఒక్కసారిగా సింహగర్జన చేశాడు.

**కరేణ కరమాకృష్య తస్య కేశినిఘాదనః ।**
**భ్రామయామాస తం శౌరిరైరావత సమం బలే ॥ 34 ॥**

కేశి సంహారకుడైన శౌరి తన చేతితో బలంతో ఐరావతంతో సమానమైన దాని తొండాన్ని పట్టుకొని ఇటుఅటూ నింగిలో త్రిప్పసాగాడు.

**ఈశో౽ పి సర్వజగతాం బాలలీలానుసారతః ।**
**క్రీడిత్వా సుచిరం కృష్ణః కరిదన్తపదాన్తరే ॥ 35 ।**
**ఉత్పాట్య వామదన్తం తు దక్షిణేనైవ పాణినా ।**
**తాడయామాస యన్తారం తస్యాసీచ్ఛతధా శిరః ॥ 36 ॥**

సర్వజగత్తులకు మహాప్రభువైన తాను బాల్యక్రీడను అనుసరించి, కృష్ణుడు చాలసేపు దానితో క్రీడించాడు. పిమ్మట ఆ ఏనుగు దంతాలను తన పాదాల మధ్య నొక్కి పట్టుకొని తన కుడిచేతితో దాని ఎడమ దంతాన్ని ఊడబెరికి ఆ మావటీని శిరస్సు తెగిపోయేలా కొట్టాడు.

**దక్షిణం దన్తముత్పాట్య బలభద్రో౽ పి తత్ క్షణాత్ ।**
**సరోషస్తేన పార్శ్వస్థాన్ గజపాలా నపోథయత్ ॥ 37 ॥**

బలరాముడు కూడ వెంటనే దాని కుడిదంతాన్ని ఊడబెరికి మహారోషంతో ప్రక్కనున్న గజపాలురను నేల కూల్చాడు.

**తతస్తూత్ప్లుత్య వేగేన రౌహిణేయో మహాబలః ।**
**జఘాన వామపాదేన మస్తకే హస్తినం రుషా ॥ 38 ॥**

అటుపైన మిక్కిలి వేగంతో మహాబలుడైన రోహిణీ పుత్రుడగు బలదేవుడు దానిపైకెగిరి మహాక్రోధంతో ఆ హస్తి మస్తకాన్ని గట్టిగా అదిమాడు.

**స పపాత హతస్తేన బలభద్రేణ లీలయా ।**
**సహస్రాక్షేణ వజ్రేణ తాడితః పర్వతో యథా ॥ 39 ॥**

ఈ విధంగా లీలగా బలభద్రుడు దానిని గట్టిగా కొట్టగా ఇంద్రుని వజ్రాయుధంచే పర్వతం కూలిపోయినట్లుగా, కువలయాపీడం రంగద్వారం వద్ద కూలిపోయింది

**హత్వా కువలయాపీడం హస్త్యారోహ ప్రచోదితమ్ ।**
**మదాసృగనులిప్తాంగౌ హస్తిదన్తవరాయుధౌ ॥ 40 ॥**

**మృగమధ్యే యథా సింహౌ గర్వలీలావలోకినౌ ।**
**ప్రవిష్టౌ సుమహారంగం బలభద్రజనార్దనౌ ॥ 41 ॥**

ఈ విధంగా మావటీనిచే ప్రేరేపించబడ్డ కువలయాపీడాన్ని చంపి, దాని మదం, రక్తం మేనుపై పూతగా పడగా, ఆ గజదంతాలనే ఆయుధాలుగా ధరించి, లేళ్ల మధ్యలో సింహాలలాగా గర్వలీలలు చూపిస్తూ, బలభద్ర జనార్దనులిద్దరూ ఆ మహారంగ మధ్యంలో ప్రవేశించారు.

**హాహాకారో మహాన్ జజ్ఞే సర్వమంచేష్వనన్తరమ్ ।**
**కృష్ణోఽయం బలభద్రోఽయమితి లోకస్య విస్మయః ॥ 42 ॥**

అనంతరం ఆ రంగస్థలంలో అన్ని మంచెలవద్ద హాహాకారం పెద్దగా చెలరేగింది. ఇతడే కృష్ణుడు, ఇతడే బలరాముడు అంటూ జనం ఆశ్చర్యం చెందారు.

**సోఽయం యేన హతా ఘోరా పూతనా బాలఘాతినీ, (సా నిశాచరీ) ।**
**క్షిప్తం తు శకటం యేన భగ్నౌ తు యమలార్జునౌ ॥ 43 ॥**

"పిల్లలను చంపే భయాన్ని కలిగించే పూతనను చంపినవాడు ఇతడే. ఇతడే బండిని తలక్రిందులుగా విసరివేశాడు. యమలార్జున వృక్షాలను కూల్చినవాడు ఇతడే.

**సోఽయం యః కాలియం నాగం ననర్తారుహ్య (మమర్దారుహ్య)బాలకః ।**
**ధృతో గోవర్ధనో యేన సప్తరాత్రం మహాగిరిః ॥ 44 ॥**

కాలియసర్పంపైకెక్కి నాట్యం చేసిన కుర్రవాడు ఇతడే. ఏడురోజులు గోవర్ధన మహాపర్వతాన్ని పైకెత్తి పట్టుకొన్న కృష్ణుడు ఇతడే.

**అరిష్టో ధేనుకః కేశీ లీలయైవ మహాత్మనా ।**
**నిహతా యేన దుర్వృత్తా దృశ్యతాం సోఽయమచ్యుతః ॥ 45 ॥**

ఈ మహాత్ముడైన అచ్యుతుడే దుష్టవర్తనులైన అరిష్టాసురుని, ధేనుకాసురుని, కేశిని లీలగా వధించాడట. చూడండి.

**అయం చాస్య మహాబాహుర్బలభద్రోఽగ్రజోఽగ్రతః ।**
**ప్రయాతి లీలయా యోషిన్మనోనయన నన్దనః ॥ 46 ॥**

ఈతనికి ముందున్నవాడు, ఇతడే కృష్ణునకు అన్న అయిన మహాబాహుబలసంపన్నుడగు బలరాముడు. ఇక్కడనున్న సుందరీమణులకు కన్నుల పండుగ కలగజేస్తూ విలాసంగా ఇటే వస్తున్నాడు.

**అయం స కథ్యతే ప్రాజ్ఞైః పురాణార్థావలోకిభిః ।**
**గోపాలో యాదవం వంశం మగ్నమభ్యుద్ధరిష్యతి ॥ 47 ॥**

పురాణాలలోని తాత్పర్యాన్ని బాగా తెలిసున్న విద్వాంసులు ఈ గోపాలుడు యాదవవంశాన్ని పైకి తెచ్చి ఉద్ధరిస్తాడని చెబుతూ ఉంటారు కదా!

**అయం హి సర్వలోకస్య విష్ణోరఖిలజన్మనః ।**
**అవతీర్ణో మహీమంశో నూనం భారహరో భువః ॥ 48 ॥**

ఈ గోపాలుడే సర్వభూతమయుడైన సర్వకారణుడగు భగవంతుడైన శ్రీమహావిష్ణువు అంశగా భూమిపై అవతరించినాడు. ఇతడు నిశ్చయంగా భూభారాన్ని హరించివేస్తాడు."

**ఇత్యేవం వర్ణితే పౌరై రామే కృష్ణే చ తత్క్షణాత్ ।**
**ఉరస్తతాప దేవక్యాః స్నేహస్రుతపయోధరమ్ ॥ 49 ॥**

ఈ విధంగా పౌరులందరూ రాముని, కృష్ణుని ప్రశంసిస్తూ ఉండగా, వెంటనే దేవకీదేవికి వాత్సల్యంతో పాలు చేపు వచ్చి హృదయం పరితాపంతో నిండిపోయింది.

**మహోత్సవమివాసాద్య పుత్రాననవిలోకనాత్ ।**
**యువేవ వసుదేవోఽభూద్ విహాయాభ్యాగతాం జరామ్ ॥ 50 ॥**

తన పుత్రుల ముఖాలను విలోకించి, గొప్ప పండుగ అన్నట్లు భావించి వసుదేవుడు తనకు వచ్చిన ముసలితనాన్ని విడిచి నవయువకుడన్న సమానభావాన్ని పొందాడు.

**విస్తారితాక్షి యుగలో రాజాన్తఃపురయోషితామ్ ।**
**నాగరస్త్రీ సమూహశ్చ ద్రష్టుం న విరరామ తమ్ ॥ 51 ॥**

రాజాంతఃపురకాంతలు, నగరస్త్రీ సమూహాలు కనుదోయి విప్పారగా ఆ కృష్ణుని అంతరాయం లేకుండా వీక్షించ సాగారు.

**సఖ్యః పశ్యత! కృష్ణస్య ముఖమత్యరుణేక్షణమ్ ।**
**గజ యుద్ధకృతాయాసస్వేదామ్బుకణికాచితమ్ ॥ 52 ॥**

**వికాసిశరదమ్భోజమవశ్యాయజలోక్షితమ్ ।**
**పరిభూయ స్థితం జన్మ సఫలం క్రియతాం దృశః ॥ 53 ॥**

"సఖులారా! కృష్ణుని ముఖాన్ని ఒక్కసారి చూడండి. ఎర్రనైన కన్నులు వీక్షించండే. ఏనుగుతో యుద్ధం చేయడంవల్ల వచ్చిన శ్రమతో చెమట బిందువులు మంచుబిందువులుగా మారగా, శరత్కాలంలో వికసించిన కమలాన్ని కృష్ణుని మోము తిరస్కరిస్తున్నట్లు ఉందే. కనులార వీక్షించి జన్మసఫలం చేసుకోండి.

**శ్రీవత్సాంకం మహద్ధామ బాలస్యైతద్ విలోక్యతామ్ ।**
**విపక్షక్షపణం వక్షో భుజయుగ్మం చ భామిని ॥ 54 ॥**

ఓ భామినీ! శ్రీవత్సమనే చిహ్నంతో భాసించే మహాలక్ష్మికి ఆశ్రయమైన, శత్రువులను మర్దించగలిగే ఈ బాలుని వక్షఃస్థలాన్ని, బాహుయుగళాన్ని ఒక్కసారి తిలకించవే.

**కిం న పశ్యసి దుగ్ధేన్దు మృణాల ధవలాననమ్ ।**
**బలభద్ర మిమం నీల పరిధాన ముపాగతమ్ ॥ 55 ॥**

అప్పుడే పితికిన పాలలాగా, నిండు జాబిల్లిలాగా, తెల్ల తామరలాగా స్వచ్ఛధవళాననంతో భాసించే, నీల వస్త్రాన్ని ధరించి ఇటు వస్తున్న బలభద్రుని ఏల చూడడం లేదే!

**వల్గతా ముష్టికే నైవచాణూరేణ తథా సఖి ।**
**(హరేః) క్రీడతో బలభద్రస్య హాస్యమీషద్విలోక్యతామ్ ॥ 56 ॥**

ఓ చెలీ! గంతులు వేస్తున్న ముష్టికునితోను, చాణూరునితోను క్రీడించడానికి సిద్ధపడుతున్న బలభద్రుని శ్రీకృష్ణుని పరిహాసాలను తిలకించండే.

**సఖ్యః! పశ్యత చాణూరో నియుద్ధార్థమయం హరిమ్ ।**
**సముపైతి న సన్త్యత్ర కిం వృద్ధా యుక్తకారిణః ॥ 57 ॥**

చెలులారా! ఇటు చూడండే. చాణూరుడు మల్లయుద్ధం చేయడం కోసమై కృష్ణునిపైకి వస్తున్నాడు. బాహుయుద్ధ మర్యాద లెరిగిన, సుకుమారుడైన కృష్ణునికి న్యాయం చేసే పెద్దలు ఎవరూ ఇక్కడ లేరంటారా?

**క్వ యౌవనోన్ముఖీ భూతసుకుమారతనుర్హరిః ।**
**క్వ వజ్రకఠినాభోగశరీరోఽయం మహాసురః ॥ 58 ॥**

ఇప్పుడిప్పుడే యౌవనం అంకురిస్తున్న ఎలప్రాయం వాడైన సుకుమారుడైన ఈ నంద తనూజుడు ఎక్కడ? వజ్రంలాగా కఠినమైన గడిదేరిన శరీరం కలవాడైన మహారాక్షసుడు ఎక్కడ?

**ఇమౌ సులలితౌ రంగే వర్తేతే నవయౌవనౌ ।**
**దైతేయమల్లాశ్చాణూరప్రముఖాస్త్వతిదారుణాః ॥ 59 ॥**

మిక్కిలి సొగసు కల్గిన, నవయౌవనవంతులైన ఈ ఇద్దరూ మహాభయంకరులైన చాణూరుడు మున్నగు దైత్య మల్లగణాలతో ఢీకొనడానికి రంగమధ్యంలో సిద్ధపడుతున్నారు.

**నియుద్ధప్రాశ్నికానాన్తు మహానేష వ్యతిక్రమః ।**
**యద్బాలబలినోర్యుద్ధం మధ్యస్థైః సముపేక్ష్యతే ॥ 60 ॥**

ఈ మల్లయుద్ధ పరీక్షాధికులు బాలురకు, బలవంతులకు పోటీ ఏర్పాటు చేశారు. ఇది గొప్ప తప్పిదం. మధ్యస్థులైన వారు ఇలా ఊరుకొని ఉండిపోవడం మహాదారుణం."

**ఇత్థం పురస్త్రీలోకస్య వదతశ్చాలయన్ భువమ్ ।**
**వవల్గ బద్ధకక్ష్యోఽన్తర్జనస్య భగవాన్ హరిః ॥ 61 ॥**

ఈ విధంగా నగర స్త్రీలు పరస్పరం మాట్లాడుతూ ఉండగా భగవంతుడైన హరి కచ్చ బిగించి భూమి చలిస్తూ ఉండగా, ఆ జనమధ్యంలో రంగస్థలంలో అటూ ఇటూ గంతులు వేయసాగాడు.

**బలభద్రోఽపి చాస్ఫోట్య వవల్గ లలితం తదా ।**
**పదే పదే తదా భూమి ర్యన్నశీర్ణా తదద్భుతమ్ ॥ 62 ॥**

బలరాముడు కూడ జబ్బచరచి చక్కగా గంతులు వేయసాగాడు. అతడు అడుగు పిమ్మట అడుగు వేస్తుంటే భూమి కంపిస్తోంది కాని, అది బీటలు వారకుండా ఉండడమే ఆశ్చర్యమయింది.

**చాణూరేణ తదా కృష్ణో యుయుధేఽమిత విక్రమః ।**
**నియుద్ధ కుశలో దైత్యో బలభద్రేణ ముష్టికః ॥ 63 ॥**

అధిక పరాక్రముడైన కృష్ణుడు చాణూరునితో తలపడ్డాడు. మల్లయుద్ధంలో కడునేర్పరియైన ముష్టికాసురుడు బలభద్రుని ఢీకొన్నాడు.

**సన్నిపాతావధూతైస్తు చాణూరేణ సమం హరిః ।**
**క్షేపణై ర్ముష్టిభిశ్చైవ కీలవజ్రనిపాతనైః ॥ 64 ॥**

**జానుభిశ్చాశ్మ నిర్ఘాతై స్తథా బాహువిఘట్టితైః ।**
**పాదోద్ధూతైః ప్రసృష్టైశ్చ తయోర్యుద్ధమభూన్మహత్ ॥ 65 ॥**

సన్నిపాతం (ఒకేసారి మీదపడడం), అవధూతం (లాగుకోవడం), క్షేపణం (విసరుకోవడం), భయంకర వజ్రపాతం వంటి పిడికిళ్లతో గ్రుద్దుకోవడం, పిడుగుల్లాంటి మోకాళ్ల ధ్వనులు, బాహువులను చరచి కొట్టడం, పాదాలు నేల తాడించడం, ప్రసృష్టం (ఒకరిని ఒకరు తాకుతూ పోరడం) వంటి మల్లయుద్ధ విధానాలతో హరికి చాణూరునికి సమంగా పోరు సాగింది.

**అశస్త్ర మతిఘోరం తత్ తయోర్యుద్ధం సుదారుణమ్ ।**
**బలప్రాణ వినిష్పాద్యం సమాజోత్సవసన్నిధౌ ॥ 66 ॥**

వారిద్దరికి జరిగిన ఆ యుద్ధం మిక్కిలి భయంకరమైనది. అతిదారుణమైనది. ఏ ఆయుధం ఉపయోగించనట్టిది. ఆ సభాసదుల ఎదుట ఒక ఉత్సవంగా బలంతో ప్రాణాలతో చెలగాటం ఆడడం లాంటిది.

**యావద్ యావచ్చ చాణూరో యుయుధే హరిణా సహ ।**
**ప్రాణహానిమవాపాగ్ర్యాం తావత్తావల్లవాల్లవమ్ ॥ 67 ॥**

చాణూరుడు ఎంతెంత సేపు హరితో కలసి యుద్ధంచేశాడో, అంతకంతకు ఇంచుకించుకగా అతని ప్రాణశక్తి మిక్కిలి హాని పొందడం, తగ్గిపోవడం జరిగింది.

**కృష్ణోఽపి యుయుధే తేన లీలయైవ జగన్మయః ।**
**ఖేదా చ్చాలయతా కోపాన్నిజశేఖరకేసరమ్ ॥ 68 ॥**

జగన్మయుడైన కృష్ణుడు లీలామాత్రంగా ఆ చాణూరునితో యుద్ధం సాగించాడు. ఆ కృష్ణుడు కోపంతో కాని, ఖేదంతో కాని తన సిగలోనున్న పూలదండను కదలించేలా తేలికగా పోరుచేశాడు.

**బలక్షయం వివృద్ధిం చ దృష్ట్వా చాణూర కృష్ణయోః ।**
**వారయామాస తూర్యాణి కంసః కోపపరాయణః ॥ 69 ॥**

చాణూరుని బలనాశనాన్ని, కృష్ణుని బలాభివృద్ధిని చూచి కంసుడు కోపంతో ఊగిపోయిన వాడై (నిండినవాడై) ఆ ప్రక్కగా మృదంగాది వాద్యాలు వాయింపవద్దని ఆజ్ఞాపించాడు.

**మృదంగాదిషు తూర్యేషు ప్రతిషిద్ధేషు తత్క్షణాత్ ।**
**ఖే సంగతా న్యవాద్యన్త దేవతూర్యాణ్యనేకశః ॥ 70 ॥**

వెంటనే మృదంగాది తూర్యనాదాలు ఆగిపోగా, ఆకాశంలో ఒక్కసారిగా దేవదుందుభులు నానావిధాలుగా మ్రోగసాగాయి.

**జయ గోవిన్ద! చాణూరం జహి కేశవ! దానవమ్ ।**
**ఇత్యన్తర్ధానగతా దేవాస్తదోచు రతిహర్షితాః ॥ 71 ॥**

"గోవిందా! జయించు కేశవా! దానవుడైన చాణూరుని వధించు" అని దేవతలు అంతర్ధానం పొంది మిక్కిలి సంతోషంతో ఆ సమయంలో పలికారు.

**చాణూరేణ చిరం కాలం క్రీడిత్వా మధుసూదనః ।**
**ఉత్పాట్య భ్రామయామాస తద్వధాయ కృతోద్యమః ॥ 72 ॥**

మధుసూదనుడు చాలాసేపు ఈ విధంగా చాణూరునితో క్రీడించి, అతనిని కడతేర్చాలని నిశ్చయించి, ఒక్కసారిగా అతనిని పైకెత్తి అటూ ఇటూ గిరగిరా త్రిప్పసాగాడు.

**భ్రామయిత్వా శతగుణం దైత్యమల్లమమిత్రజిత్ ।**
**భూమావాస్ఫోటయామాస గగనే గతజీవితమ్ ॥ 73 ॥**

శత్రుంజయుడైన కృష్ణుడు ఆ దైత్య మల్లుని నూరుసార్లు అటు గిరగిరా త్రిప్పి, ఆకాశంలోనే ప్రాణాలు వదలివేసిన ఆ చాణూరుని నేలపై వేసి విసరికొట్టాడు.

**భూమావాస్ఫోటితస్తేన చాణూరః శతధాఽభవత్ ।**
**రక్తస్రావమహాపంకాం చకార స తదా భువమ్ ॥ 74 ॥**

అలా భూమిపై విసరికొట్టగా చాణూరుడు నూరుముక్కలై పోయాడు. రక్తస్రావమై ఆ సమయంలో భూమి పెద్ద బురదగా అయిపోయింది.

**బలదేవోఽపి తత్కాలం ముష్టికేన మహాబలః ।**
**యుయుధే దైత్యమల్లేన చాణూరేణ యథా హరిః ॥ 75 ॥**

ఆ సమయంలో మహాబలవంతుడైన బలదేవుడు కూడ ముష్టికునితో, కృష్ణుడేవిధంగా చాణూరదైత్య మల్లునితో పోరొనరించాడో, ఆ విధంగా యుద్ధం చేశాడు.

**సోఽప్యేనం ముష్టినా మూర్ధ్ని వక్షస్యాహత్య జానునా ।**
**పాతయిత్వా ధరాపృష్ఠే నిష్పిపేష గతాయుషమ్ ॥ 76 ॥**

అతడు ముష్టికుని శిరస్సును పిడికిలితో మొట్టి, వక్షఃస్థలాన్ని మోకాలితో గ్రుద్ది, భూతలంపై పడవేసి ప్రాణాలు పోయేటట్లుగా ముద్దముద్ద చేశాడు.

**కృష్ణస్తోషలకం భూయో మల్లరాజం మహాబలమ్ ।**
**వామముష్టిప్రహారేణ పాతయామాస భూతలే ॥ 77 ॥**

కృష్ణుడంత మళ్లీ మహాబలుడైన తోషలకుడు అనే మల్లశ్రేష్ఠుని ఎడమ పిడికిలితో గ్రుద్ది భూభాగంపై పడవేశాడు.

**చాణూరే నిహతే మల్లే ముష్టికే వినిపాతితే ।**
**నీతే క్షయం తోషలకే సర్వే మల్లాః ప్రదుద్రువుః ॥ 78 ॥**

చాణూర మల్లుడు కూలిపోగా, ముష్టికుడు నేలకూలగా, తోషలకుడు చనిపోగా మిగిలిన మల్లురు ప్రాణాలపై తీపితో రంగస్థలం వీడి పరుగెత్తారు.

**వవల్గతుస్తదారంగే కృష్ణసంకర్షణావుభౌ ।**
**సమానవయసో గోపాన్ బలాదాకృష్య హర్షితౌ ॥ 79 ॥**

అనంతరం కృష్ణ బలభద్రులిరువురు రంగస్థలంలో తమ ఈడు వారైన గోపాలురను బలంతో లాగి ఆనందసంభరితులై తమ ఇచ్ఛవచ్చినట్లు గంతులు వేశారు.

**కంసోఽపి కోపరక్తాక్షః ప్రాహోచ్చైర్వ్యాపృతాన్ నరాన్ ।**
**గోపావేతౌ సమాజౌఘాన్నిష్కాస్యేతాం బలాదితః ॥ 80 ॥**

అనంతరం కంసుడు క్రోధంతో ఎఱ్ఱబారిన కన్నులు కలవాడై గుంపులు గుంపులుగా నున్న వారిని, ఈ గోపాలురను ఇద్దరిని బలవంతంగా బయటకు గెంటండని తన సభాభటులతో గట్టిగా అరచాడు.

**నన్దోఽపి గృహ్యతాం పాపో నిగలైరాయసైరిహ ।**
**అవృద్ధార్హేణ దణ్డేన వసుదేవోఽపి వధ్యతామ్ ॥ 81 ॥**

"మహాపాపియైన నందుని ఇక్కడ ఇనుప సంకెళ్లతో బంధించండి. ముసలివాళ్లకు ఉచితంకాని దండనంతో వసుదేవుని కూడ కడ ముట్టించండి.

**వల్గన్తి గోపాః కృష్ణేన యేచేమే సహితాః పురః ।**
**గావో హ్రియన్తామేతేషాం యచ్చాస్తి వసు కించన ॥ 82 ॥**

నా ఎదుట కృష్ణునితో కలసి గంతులు వేస్తున్న ఈ గోపాలుర గోవులను అపహరించండి. వారివద్ద ఏ కొద్దిపాటి ధనాలున్నా వాటిని కూడ హరించండి." అని ఆజ్ఞ ఇచ్చాడు.

**ఏవమాజ్ఞాపయానం చ ప్రహస్య మధుసూదనః ।**
**ఉత్పత్యారుహ్య తం మంచం కంసం జగ్రాహ వేగతః ॥ 83 ॥**

ఈ రీతిగా ఆజ్ఞ ఇస్తున్న కంసుని మధుసూదనుడు గేలిచేసి ఒక్క ఎగురెగిరి ఆతని ఆసనంపైకురికి మహావేగంతో ఆతనిని పట్టుకొన్నాడు.

**కేశేష్వాకృష్య విగలత్కిరీటమవనీతలే ।**
**స కంసం పాతయామాస తస్యోపరి పపాత చ ॥ 84 ॥**

కిరీటం అవనీతలంపై పడిపోతూ ఉండగా, అతని జుట్టు పట్టిలాగి కంసుని పుడమిపై పడవేసి, అతనిపై తాను దబాలున పడ్డాడు.

**అశేష జగదాధారగురుణా పతతోపరి ।**
**కృష్ణేన త్యాజితః ప్రాణానుగ్రసేనాత్మజో నృపః ॥ 85 ॥**

సమస్త జగత్తులకు ఆధారుడైన మహాభారం కలిగిన హరి అట్లు తనమీద పడగా, ఉగ్రసేనుని కుమారుడైన కంసరాజు వెంటనే ప్రాణాలు కోల్పోయాడు.

**మృతస్య కేశేషు తదా గృహీత్వా మధుసూదనః ।**
**చకర్ష దేహం కంసస్య రంగమధ్యే మహాబలః ॥ 86 ॥**

మహాబలుడైన మధుసూదనుడు రంగమధ్యంలో చచ్చిన ఆ కంసుని జుట్టు అప్పుడు పట్టుకొని వాని శరీరాన్ని బరబరా ఈడ్చాడు.

**గౌరవేణాతిమహతా పరిఘాతేన కృష్యతా ।**
**కృతా కంసస్య దేహేన వేగేనేవ మహామ్భసః ॥ 87 ॥**

ఆ కంసుని శరీరం మిక్కిలి పెద్దది బరువైనది. కృష్ణుడు ఆతనిని అలా ఈడుస్తూ ఉండగా గొప్పదైన జలప్రవాహంతో వేగంగా తిరిగే ఒక ఇనుప గుదియలాంటిదయింది.

**కంసే గృహీతే కృష్ణేన తద్భ్రాతాఽభ్యాగతో రుషా ।**
**సునామా బలభద్రేణ లీలయైవ నిపాతితః ॥ 88 ॥**

కృష్ణుడు ఈ విధంగా కంసుని కూల్చగా, మహాకోపంతో అతని సోదరుడు సునాముడు ఒక్కసారిగా దండెత్తి వచ్చాడు. బలభద్రుడాతనిని పట్టుకొని లీలామాత్రంగా కూల్చివేశాడు.

**తతో హాహాకృతం సర్వమాసీత్ తద్రంగమణ్డలమ్ ।**
**అవజ్ఞయా హతం దృష్ట్వా కృష్ణేన మధురేశ్వరమ్ ॥ 89 ॥**

కృష్ణుడు ఆ రీతిగా మధురాధిపతియైన కంసుని తృణీకార భావంతో (ఒక గడ్డిపరకగా వెంచి) చంపడం చూచి, ఆ రంగమండల మధ్యంలో అంతట హాహాకారం మిన్నుముట్టింది.

**కృష్ణోఽపి వసుదేవస్య పాదౌజగ్రాహ సత్వరః ।**
**దేవక్యాశ్చ మహాబాహు ర్బలదేవసహాయవాన్ ॥ 90 ॥**

బలదేవుడు తోడురాగా మహాబాహువైన శ్రీకృష్ణుడు వెంటనే దేవకీ వసుదేవులకు పాదాలు తాకి అభివందనం గావించాడు.

**ఉత్థాప్య వసుదేవస్తం దేవకీ చ జనార్దనమ్ ।**
**స్మృతజన్మోక్త వచనౌ తావేవ ప్రణతౌ స్థితౌ ॥ 91 ॥**

వసుదేవుడు, దేవకీదేవి జనార్దనుని పైకెత్తి, పుట్టిన సమయంలో హరి చెప్పిన మాటలు జ్ఞప్తికి తెచ్చుకొని వారే స్వామికి నమ్ర భావాన్ని ప్రకటించారు.

**ప్రసీద సీదతాం నాథ! దేవానాం వరదః ప్రభో ।**
**తథా ఽఽవయోః ప్రసాదేన కృతోద్ధారశ్చ కేశవ! ॥ 92 ॥**

ప్రభూ! నాథా! కేశవా! మమ్మల్ని అనుగ్రహించు. బాధలతో కుమిలిపోయే దేవతలకు వరం ప్రసాదించావు. అది మాపట్ల నీవు చూపిన అనుగ్రహంవల్ల సఫలం చేయబడింది.

**ఆరాధితో యద్ భగవాన్ అవతీర్ణో గృహే మమ ।**
**దుర్వృత్తనిధనార్థాయ తేన నః పావితం కులమ్ ॥ 93 ॥**

గతంలో నేను నిన్ను ఆరాధించాను. అందువల్లనే భగవంతుడవైన నీవు నా ఇంట అవతరించావు. దానివల్ల దుష్టసంహారం జరిగింది. నా వంశం కూడ పావనమయింది.

**త్వమన్తః సర్వభూతానాం సర్వభూతమయః స్థితః**
**ప్రవర్తేతే సమస్తాత్మన్! త్వత్తో భూతభవిష్యతీ ॥ 94 ॥**

నీవు సమస్త ప్రాణుల లోపల ఉండేవాడవు. నీవు సర్వభూతమయుడవై ఉంటావు. ఓ సమస్త స్వరూపా! నీ వల్లనే భూతం, భవిష్యత్తు ప్రవర్తిస్తూ ఉంటాయి.

**యజ్ఞైస్త్వమిజ్యసే నిత్యం సర్వదేవమయాచ్యుత! ।**
**త్వమేవ యజ్ఞో యష్టా చ యజ్ఞానాం పరమేశ్వరః ॥ 95 ॥**

సర్వదేవమయా! అచ్యుతా! నిత్యం యజ్ఞాలద్వారా నీవే యజింపబడుతున్నావు. నీవే యజ్ఞం. యజించువాడవు కూడా నీవే. సమస్త యజ్ఞాలకు నీవే పరమేశ్వరుడవు.

**సాపహ్నవం మమ మనో యదేతత్ త్వయి జాయతే ।**
**దేవక్యాశ్చాత్మజప్రీత్యా తదత్యన్తవిడమ్బనా ॥ 96 ॥**

నాకు దేవకికి కూడ మా మనస్సు నీ పట్ల నీవు మా పుత్రుడవనే భావం పొందడం కృత్రిమం మాత్రమే. అట్లు కలిగినపుడు ప్రేమకూడ పూర్తిగా లోకవిడంబనం కొరకే.

**క్వం కర్తా సర్వభూతానామనాదినిధనో భవాన్ ।**
**క్వాం మనుష్యస్యకస్యైషా జిహ్వా పుత్రేతి వక్ష్యతి ॥ 97 ॥**

సమస్త భూతాలకు ఆదికర్తవైన, అనాది నిధనుడవైన (ఆది, అంతం లేని) నీవెక్కడ? ఒక మానవ మాత్రుడనైన నా జిహ్వ నిన్ను "పుత్రా!" అని పిలవబోవడమనేది ఎక్కడ?

**జగదేతజ్జగన్నాథ! సమ్భూతమఖిలం యతః ।**
**కయా యుక్త్యా వినా మాయాం సోస్మత్తః సమ్భవిష్యతి ॥ 98 ॥**

జగన్నాథా! ఈ సమస్త జగత్తు ఎవ్వనివల్ల పుడుతుందో, అది అటువంటివాని మాయే కదా! అది మావల్ల పుట్టడమనేది ఎలా సంభవమవుతుంది?

**యస్మిన్ ప్రతిష్ఠితం సర్వం జగత్ స్థావరజంగమమ్ ।**
**స కోష్ఠోత్సంగ శయనో మానుషో జాయతే కథమ్ ॥ 99 ॥**

స్థావర జంగమాత్మకమైన సమస్త జగత్తు ఎవనియందు సుప్రతిష్ఠితమై ఉందో, అటువంటివాడు మాతృగర్భంలో, ఒడిలో శయనించు మనుష్యుడై జన్మించడం ఎట్లు?

**సత్వం ప్రసీద పరమేశ్వర! పాహి విశ్వ**
**మంశావతారకరణైర్నమమాసి పుత్రః ।**
**ఆబ్రహ్మపాదప మిదం జగదేతదీశ!**
**త్వత్తో విమోహయసి కిం పురుషోత్తమాస్మాన్ ॥ 100 ॥**

ఓ పరమేశ్వరా! అటువంటి నీవు మమ్మల్ని అనుగ్రహించు. అంశావతార సాధన సంపత్తితో ఈ విశ్వాన్ని కాపాడు. నీవు నా పుత్రుడవు కావు. ఈశ్వరా! బ్రహ్మాది వృక్ష (స్తంబ) పర్యంతమైన జగత్తు నీ నుండి పుట్టింది. పురుషోత్తమా! ఇంకేల మమ్ము మోహింపజేస్తావు.

**మాయావిమోహితదృశా తనయో మమేతి**
**కంసాద్భయం కృతమపాస్తభయాతితీవ్రమ్ ।**
**నీతోఽసి గోకులమరాతిభయాకులేన**
**వృద్ధిం గతోఽసి మమ నాస్తి మమత్వమీశ! ॥ 101 ॥**

ఏ భయం లేనివాడా! మాయచే మోహం పొందిన చూపుచే నీవు నా బిడ్డవని కంసునివల్ల తీవ్రమైన భయాన్ని పొందాను. శత్రుభీతితో వ్యాకులత చెంది నిన్ను గోకులానికి చేర్చాను. ఈశ్వరా! నీవు అక్కడ ఉంటూ పెద్దవయ్యావు. అందువల్ల నీ పట్ల మమకారానికి దూరమయ్యాను.

**కర్మాణి రుద్రమరుదశ్విశతక్రతూనాం**
**సాధ్యాని యాని న భవన్తి నిరీక్షితాని ।**
**త్వం విష్ణురీశ! జగతాముపకారహేతోః**
**ప్రాప్తోఽసి నః పరిగతో విగతో హి మోహః ॥ 102 ॥**

రుద్రులు, మరుత్తులు, అశ్వినీ దేవతలు, ఇంద్రాదులు – ఇటువంటి వారికి సాధ్యంకాని నీ లీలాకృత్యాలు నేను ప్రత్యక్షంగా వీక్షించాను. ఈశ్వరా! నీవు విష్ణుభగవానుడవు! జగత్తులకు ఉపకారం చేయడానికై అవతారం స్వీకరించి ఇలా ప్రకటించబడ్డావు. మా మోహం అంతా పటాపంచలైపోయింది" అని వారిరువురు భావించి నుతించారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే కంసవధో నామ వింశోఽధ్యాయః సమాప్తః ॥ 20 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో కంసవధ అనే ఇరవైయవ అధ్యాయం సమాప్తం ॥ 20 ॥



## ఏకవింశోఽధ్యాయః - ఇరవై ఒకటవ అధ్యాయం

## ఉగ్రసేనరాజ్యాభిషేకః - ఉగ్రసేనరాజ్యాభిషేకం

**శ్రీపరాశర ఉవాచ:-** పరాశరుడు చెప్పాడు.

**తౌ సముత్పన్న విజ్ఞానౌ భగవత్కర్మ దర్శనాత్ ।**
**దేవకీ వసుదేవౌ తు దృష్ట్వా మాయాం పునర్హరిః ॥**
**మోహాయ యదుచక్రస్య వితతాన స వైష్ణవీమ్ ॥ 1 ॥**

మైత్రేయా! భగవంతుని లీలాదర్శనం చేయడం వల్ల దేవకీవసుదేవులిరువురు తత్త్వజ్ఞానం పొందారు. హరి వారిద్దరిని చూచి, యదుజనాన్ని అంతా మోహపెట్టడానికై మళ్లీ తన వైష్ణవ మాయను విస్తరింపజేశాడు.

**ఉవాచ చామ్బ! భోస్తాత! చిరాదుత్కణ్ఠితేన మే ।**
**భవన్తౌ కంసభీతేన దృష్టౌ సంకర్షణేన చ ॥ 2 ॥**

కృష్ణుడు అంత వారితో "అమ్మా! తండ్రీ! కంసుని భయంతోనే, ఎంతోకాలం నుంచి మిమ్మల్ని చూడాలనే అపేక్షతోనున్న నేను, ఈ బలరాముడు ఈనాటికి చూడగలిగాము.

**కుర్వతాం యాతి యః కాలో మాతాపిత్రోరపూజనమ్ ।**
**తత్ఖణ్డమాయుషో వ్యర్థమసాధూనాం హి జాయతే ॥ 3 ॥**

తల్లిదండ్రులను పూజించని కాలం ఏదయితే ఉందో, అది ఆయుర్దాయంలో వ్యర్థమైన కాలం. దురదృష్టవంతులైన వారికే అటువంటిది జీవితంలో సంప్రాప్తమవుతూ ఉంటుంది.

**గురుదేవద్విజాతీనాం మాతాపిత్రోశ్చ పూజనమ్ ।**
**కుర్వతాం సఫలం జన్మ దేహినాం తాత! జాయతే ॥ 4 ॥**

తండ్రీ! గురువులను, దేవతలను, బ్రాహ్మణులను, తల్లిదండ్రులను పూజించే వారికే, దేహధారులకు వారి పుట్టుకయే సఫలమైనదిగా సంభవమవుతుంది.

**తత్ క్షన్తవ్యమిదం సర్వమతిక్రమకృతం పితః ।**
**కంస వీర్యప్రతాపాభ్యా మావయోః పరవశ్యయోః ॥ 5 ॥**

తండ్రీ! కంసుని ప్రతాపానికి, పరాక్రమానికి లొంగిపోయిన దీనులము మేము. ఇంతకాలం ఈ పరమధర్మాన్ని పూర్తిగా తప్పిన మమ్మల్ని ఇద్దరిని క్షమించండి." అని వచించాడు.

**ఇత్యుక్త్వాఽథ ప్రణమ్యోభౌ యదువృద్ధాననుక్రమాత్ ।**
**యథావదభిపూజ్యాథ చక్రతుః పౌరమాననమ్ ॥ 6 ॥**

కృష్ణుడు ఈ విధంగా పల్కగానే, తరువాత వారిద్దరు తల్లిదండ్రులకు నమస్కరించి, యదువృద్ధులను కూడ వరుసగా యథావిధిగా పూజించి, పౌరజనాన్ని కూడ గౌరవించాడు.

**కంసపత్న్యస్తతః కంసం పరివార్య హతం భువి ।**
**విలేపుర్మాతరశ్చాస్య దుఃఖశోకపరిప్లుతాః ॥ 7 ॥**

అనంతరం కంసుని భార్యలు, ఆతని తల్లులు భూమిపై చచ్చిపడియున్న కంసుని చుట్టూ చేరి దుఃఖం, శోకం కట్టలు తెగి ప్రవహించగా రోదించసాగారు.

**బహుప్రకార మత్యర్థం పశ్చాత్తాపాతురో హరిః ।**
**తా స్సమాశ్వాసయామాస స్వయమస్రావిలేక్షణః ॥ 8 ॥**

అంతట హరి మిక్కిలిగా పశ్చాత్తాప్త వివశుడై స్వయంగా కన్నుల నీరు గ్రుక్కుకొంటూ అనేక రీతులుగా వారిని ఓదార్చాడు.

**ఉగ్రసేనం తతో బన్ధాన్ముమోచ మధుసూదనః ।**
**అభ్యషించత్ తథైవైనం నిజరాజ్యే హతాత్మజమ్ ॥ 9 ॥**

అనంతరం మధుసూదనుడు ఉగ్రసేనుని బంధవిముక్తుని చేశాడు. కొడుకును కోల్పోయిన అతనిని స్వీయ యాదవ సామ్రాజ్యానికి పట్టాభిషిక్తుని కావించాడు.

**రాజ్యాభిషిక్తః కృష్ణేన యదుసింహ స్సుతస్య సః ।**
**చకార ప్రేతకార్యాణి యే చాన్యే తత్ర ఘాతితాః ॥ 10 ॥**

ఆ విధంగా ఆ యదుసింహుడు కృష్ణునిచే రాజ్యమునందు అభిషిక్తుడై తన కుమారునికి, అక్కడ ఇంకా చనిపోయిన వారికి అందరికి ప్రేతకార్యాలు నిర్వహించాడు.

**కృతౌర్ధ్వదైహికం చైనం సింహాసనగతం హరిః ।**
**ఉవాచాజ్ఞాపయ విభో! యత్ కార్యమవిశంకితః ॥ 11 ॥**

ఊర్ధ్వలోకక్రియలు అన్నీ పూర్తిచేసి సింహాసనం అధిరోహించిన ఉగ్రసేనునితో కృష్ణుడు ఇలా అన్నాడు. "ప్రభూ! చేయవలసిందేదో ఆజ్ఞాపించండి. శంక వదలివేయండి.

**యయాతిశాపాద్ వంశోఽయమరాజ్యార్హోఽపి సామ్ప్రతమ్ ।**
**మయి భృత్యే స్థితే దేవానాజ్ఞాపయతు కిం నృపైః ॥ 12 ॥**

యయాతి ఇచ్చిన శాపంచే ఈ యాదవ వంశం రాజ్యం చేయడానికి తగినది కాకున్నా, ఇప్పుడు నేను భృత్యునిగా చరిస్తున్నాను. కాబట్టి నీవు దేవతలను కూడా శాసించడానికి అర్హుడవు. ఇక రాజుల లెక్కేమిటి?" అని చెప్పాడు కృష్ణుడు.

**ఇత్యుక్త్వా సోఽస్మరద్ వాయుమాజగామ చ తత్ క్షణాత్ ।**
**ఉవాచ చైనం భగవాన్ కేశవః కార్యమానుషః ॥ 13 ॥**

భగవంతుడైన కేశవుడు ఈ విధంగా పలికి వాయుదేవుని స్మరించాడు. ఆ క్షణమే వాయువు అచ్చుటికి రావడం జరిగింది. జగత్కార్య నిమిత్తంగా మానుష మూర్తియైన కృష్ణుడు ఆతనితో ఇలా అన్నాడు.

**గచ్ఛేన్ద్రం బ్రూహి వాయో! త్వమలం గర్వేణ వాసవ! ।**
**దీయతాముగ్రసేనాయ సుధర్మా భవతా సభా ॥ 14 ॥**

**కృష్ణో బ్రవీతి రాజార్హమేత ద్రత్నమనుత్తమమ్**
**సుధర్మాఖ్య సభా యుక్తమస్యాం యదుభిరాసితుమ్ ॥ 15 ॥**

"ఓ వాయువా! నీవు వేగంగా వెళ్లు. ఇంద్రునితో ఇలా చెప్పు. వాసవా! గర్వం వదలిపెట్టు. నీవు ఉగ్రసేనునికి సుధర్మ అనే సభను ఇచ్చివేయి. కృష్ణుడు చెబుతున్నాడు. మరొక్కడు వేరే కాదు. ఈ సుధర్మ అనే పేరుగల సభ సర్వోత్తమమైనది. ఇది ఒక రత్నం లాంటిది. రాజులకు అధిష్ఠించడానికి యోగ్యమైనది. యదవంశు ్యలు దీనిపై అధివసించడానికి తగియున్నది" అని ఆజ్ఞాపించాడు.

**ఇత్యుక్తః పవనో గత్వా సర్వమాహ శచీపతిమ్ ।**
**దదౌ సోఽపి సుధర్మాఖ్యాం సభాం వాయోః పురన్దరః ॥ 16 ॥**

కృష్ణుడు ఇలా అనగానే పవనుడు వెళ్లి శచీపతికి సర్వం విన్నవించాడు. ఆ పురందరుడు కూడా సుధర్మ అనే సభను వాయువుకు ఇచ్చివేశాడు.

**వాయునా చాహృతాం దివ్యాం సభాం తే యదుపుంగవాః ।**
**బుభుజుః సర్వరత్నాఢ్యాం గోవిన్దభుజసంశ్రయాత్ ॥ 17 ॥**

వాయువుచే కొనిరాబడిన సమస్త రత్న నిలయమగు ఆ దేవసభను గోవిందుని బాహు సంరక్షణం పొంది ఆ యదుశ్రేష్ఠులు అనుభవించారు.

**విదితాఖిలవిజ్ఞానౌ సర్వజ్ఞానమయావపి ।**
**శిష్యాచార్యక్రమం వీరౌ ఖ్యాపయన్తౌ యదూత్తమౌ ॥ 18 ॥**

**తతః సాన్దీపనిం కాశ్యమవన్తీపురవాసినమ్ ।**
**విద్యార్థం (అస్త్రార్థం) జగ్మతుర్వీరౌ (బాలే) కృతోపనయనక్రమౌ ॥ 19 ॥**

బలరామకృష్ణులు ఇద్దరు సమస్త శాస్త్రవిజ్ఞానవేత్తలు. సర్వజ్ఞాన సంపన్నులు. అయినా ఉత్తములైన ఆ యదువీరులు ఇర్వురూ ఉపనయనాది సంస్కారాలు పూర్తి అయిన తరువాత గురుశిష్య భావం ఇలా ఉండాలని లోకానికి వెల్లడిచేయడానికై, కాశీనగరంలో ఉద్భవించి అవంతీ నగరంలో నివసిస్తున్న సాందీపని మహర్షిని ఆశ్రయించి అస్త్రవిద్యాభ్యాసం చేయడానికై వెళ్లారు.

**తస్య శిష్యత్వమభ్యేత్య గురువృత్తిపరౌ హి తౌ ।**
**దర్శయాంచక్రతుర్వీరా వాచారమఖిలే జనే ॥ 20 ॥**

వారిద్దరు సాందీపని ముని శిష్యత్వాన్ని స్వీకరించి, గురుశుశ్రూషాపరులై, సమస్త జనులకు సదాచారమంటే ఏమిటో ఆచరించి చూపించారు.

**విశే:**(వేదాభ్యాస కృత ప్రీతీ సంకర్షణ జనార్దనౌ)
(సంకర్షణ జనార్దనులిద్దరు మొదట వేదాభ్యాసం పట్ల ఆసక్తి చూపించారు)

**సరహస్యం ధనుర్వేదం ససంగ్రహ మధీయతామ్ ।**
**అహోరాత్రైశ్చతుష్షష్ట్యా తదద్భుత మభూద్ ద్విజ! ॥ 21 ॥**

ద్విజోత్తమా! వారిద్దరు ధనుర్వేదాన్ని సరహస్యంగా (అస్త్ర మంత్రవిద్యను) ససంగ్రహంగా (అస్త్ర ప్రయోగ విద్యను) అభ్యసించారు. అరవై నాలుగు రోజులలో వారావిద్యలను నేర్చుకొన్న విషయం మహాద్భుతంగా ఉంది సుమా!

**సాందీపనిరసమ్భావ్యం తయోః కర్మాతిమానుషమ్ ।**
**విచిన్త్య తౌ తదా మేనే ప్రాప్తౌ చన్ద్రదివాకరౌ ॥ 22 ॥**

ఇతరులకు అసంభవమైన పని అది అనుకొని, వారి అమానుష చర్యను తలపోసి సాందీపని మహర్షి చంద్రసూర్యులు వచ్చినట్లుగా భావించాడు.

**సాంగాంశ్చ చతురో వేదాన్ సర్వశాస్త్రాణి చైవహి ।**
**అస్త్రగ్రామమశేషంచ ప్రోక్త మాత్రమవాప్య తౌ ।**
**ఊచతుర్వ్రియతాం యా తే దాతవ్యా గురుదక్షిణా ॥ 23 ॥**

(నాలుగువేదాలను సాంగంగా, సర్వశాస్త్రాలను పూర్తిగా) అస్త్ర సమూహాలను సంపూర్ణంగా ఉపదేశమాత్రం చేతనే ఆ సోదరులు గ్రహించి తమకు గురుదక్షిణ ఏమి సమర్పించుకోవలసి ఉందని గురువును అభ్యర్థించారు.

**సోఽప్యతీన్ద్రియమాలోక్య తయోః కర్మ మహామతిః ।**
**అయాచత మృతం పుత్రం ప్రభాసే లవణార్ణవే ॥ 24 ॥**

ఆ మహాబుద్ధిశాలి అయిన సాందీపని కూడ వారి ఇంద్రియాతీతబుద్ధివైభవాన్ని గుర్తించి లవణ సముద్రంలో ప్రభాసక్షేత్రంలో చనిపోయిన తన కుమారుని తెచ్చి బ్రతికించి ఇండని కోరాడు.

**గృహీతాస్త్రౌ తతస్తౌ తు సార్ఘ్యహస్తో మహోదధిః ।**
**ఉవాచ న మయా పుత్రో హృతః సాన్దీపనేరితి ॥ 25 ॥**
**దైత్యః పంచజనో నామ శంఖరూపః సబాలకమ్ ।**
**జగ్రాహ సోఽస్తి సలిలే మమైవాసురసూదన! ॥ 26 ॥**

బలరామకృష్ణులు ఇరువురూ అస్త్రాలు చేతదాల్చినంత మాత్రం సముద్రుడు అర్ఘ్యాలను చేతదాల్చి ఎదురువచ్చి "సాందీపని ముని పుత్రుని నేను అపహరించలేదు. అసురమర్దనా! పంచజనుడనే పేరుగల శంఖరూపుడనే దైత్యుడు ఆ బాలకుని పట్టుకొని పోయి నా జలాలలో ఉన్నాడు." అని అన్నాడు.

**ఇత్యుక్తోఽన్త ర్జలం గత్వా హత్వా పంచజనం ఖలమ్ ।**
**కృష్ణో జగ్రాహ తస్యాస్థి ప్రభవం శంఖముత్తమమ్ ॥ 27 ॥**

ఆ మాటలు విన్న కృష్ణుడు వెంటనే సాగరజలాలలో ప్రవేశించి పంచజనుడనే ఆ దుష్టుని చంపి వాని ఎముకలనుండి ఏర్పడిన గొప్పదైన శంఖాన్ని గైకొన్నాడు.

**యస్య నాదేన దైత్యానాం బలహాని రజాయత ।**
**దేవానాం వవృధే తేజో యాత్యధర్మశ్చ సంక్షయమ్ ॥ 28 ॥**

దాని ధ్వనివల్ల దైత్యులకు తేజోహాని ఏర్పడింది. దేవతలకు తేజోవృద్ధి సంభవించింది. అధర్మనాశనం కూడ అయింది.

**తం పాంచజన్యమాపూర్య గత్వా యమపురీం హరిః ।**
**బలదేవశ్చ బలవాన్ జిత్వా వైవస్వతం యమమ్ ॥ 29 ॥**
**తం బాలం యాతనాసంస్థం యథాపూర్వ శరీరిణమ్ ।**
**పిత్రే ప్రదత్తవాన్ కృష్ణో బలశ్చ బలినాం వరః ॥ 30 ॥**

ఆ పాంచజన్యాన్ని పూరించి, మహాబలవంతుడైన బలరామునితో కలసి, శ్రీకృష్ణుడు యమపురికేగి సూర్యపుత్రుడైన యముని జయించి అక్కడ యమయాతనల ననుభవిస్తున్న ఆ బాలునిచూచి పూర్వశరీరధారిని కావించాడు. బలవంతులలో శ్రేష్ఠుడైన బలభద్రుడు, కృష్ణుడు అతని తండ్రికి ఆ కుర్రవానిని అర్పించారు.

**మథురాం చ పునః ప్రాప్తావుగ్రసేనేన పాలితామ్ ।**
**ప్రహృష్టపురుషస్త్రీకాముభౌ రామజనార్దనౌ ॥ 31 ॥**

తిరిగి ఉగ్రసేనునిచే పాలించబడుతున్న మథురాపురికి పౌరస్త్రీపురుష బృందాలు ఆనందిస్తూ ఉండగా రామకృష్ణులు ఇద్దరూ విచ్చేశారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే ఉగ్రసేనరాజ్యాభిషేకో నామ ఏకవింశోఽధ్యాయః సమాప్తః ॥ 21 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో ఉగ్రసేనరాజ్యాభిషేకం అనే ఇరవై ఒకటవ అధ్యాయం సమాప్తం ॥ 21 ॥



## ద్వావింశోఽధ్యాయః - ఇరవై రెండవ అధ్యాయం

## జరాసంధ పరాజయః - జరాసంధ పరాజయం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెబుతున్నాడు

**జరాసన్ధసుతే కంస ఉపయేమే మహాబలః ।**
**అస్తిం ప్రాప్తిం చ మైత్రేయ! తయోర్భర్తృహణం హరిమ్ ॥ 1 ॥**
**మహాబల పరీవారో మగధాధిపతిర్బలీ ।**
**హన్తుమభ్యాయయౌ కోపాజ్జరాసన్ధః సయాదవమ్ ॥ 2 ॥**

పరాశరుడు చెబుతున్నాడు. మైత్రేయా! మహాబలుడైన కంసుడు జరాసంధుని కుమార్తెలయిన అస్తిని, ప్రాప్తిని వివాహమాడాడు. వారిద్దరి భర్తయగు కంసుని, కృష్ణుడు చంపివేశాడని బలవంతుడైన మగధ చక్రవర్తి కోపోద్రిక్తుడై మహాసేనతో దండెత్తివచ్చి అతనిని సమస్త యాదవ సమేతంగా సంహరించాలని మథురకేతెంచాడు.

**ఉపేత్య మథురాం సోఽథ రురోధ మగధేశ్వరః ।**
**అక్షౌహిణీభిః సైన్యస్య త్రయోవింశతిభి ర్వృతః ॥ 3 ॥**

మగధాధిపతి ఇరవైమూడు అక్షౌహిణుల సైన్యంతో కూడుకొని దండెత్తి వచ్చి మథురానగరాన్ని ముట్టడించాడు.

**నిష్క్రమ్యాల్ప పరీవారావుభౌ రామజనార్దనౌ ।**
**యుయుధాతే సమం తస్య బలినౌ బలసైనికైః ॥ 4 ॥**

బలశాలులైన రామకృష్ణులు ఇరువురు మిక్కిలి తక్కువ సైన్యంతో పురం వెడలి జరాసంధుని బలవంతులగు సైనికులతో పాటు సమంగా యుద్ధం చేశారు.

**తతో బలశ్చ కృష్ణశ్చ చక్రాతే మతిముత్తమామ్ ।**
**ఆయుధానాం పురాణానా మాదానే మునిసత్తమ ॥ 5 ॥**

మునిశ్రేష్ఠా! అటుపిమ్మట బలరాముడు, శ్రీకృష్ణుడు తమ పురాతనములైన ఆయుధాలను గైకొని పోరు సాగించాలని మదిలో సంకల్పం కావించారు.

**అనన్తరం హరేః శార్ఙ్గం తూణీ చాక్షయసాయకౌ ।**
**ఆకాశాదాగతౌ విప్ర! తదా కౌమోదకీ గదా ॥ 6 ॥**

**హలం చ బలభద్రస్య గగనాదాగతం మహత్ ।**
**మనసోఽభిమతం విప్ర! సునందం ముసలం తథా ॥ 7 ॥**

విప్రోత్తమా! వారు అలా తలచుకొన్నంత మాత్రంచేతనే కృష్ణుడు (విష్ణువు) ఉపయోగించే శార్ఙ్గం అనే విల్లు, ఎల్లప్పుడూ బాణాలతో నిండియుంటే అమ్ములపొదులు, కౌమోదకి అనే గద ఆకాశం నుండి వచ్చాయి. విప్రశేఖరా! బలరామునికి మనస్సుకు అభిమతమైన గొప్పదైన నాగలి, సునందం అనే పేరుగల రోకలి గగన భాగం నుండి వచ్చి చేరాయి.

**తతో యుద్ధే పరాజిత్య ససైన్యం మగధాధిపమ్ ।**
**పురం వివిశతు ర్వీరావుభౌ రామజనార్దనౌ ॥ 8 ॥**

మహావీరులైన రామకృష్ణులు ఇరువురు ఆ ఆయుధాలతో సైన్యసమేతంగా జరాసంధుని యుద్ధంలో ఓడించి పురప్రవేశం చేశారు.

**జితే తస్మిన్ సుదుర్వృత్తే జరాసన్ధే మహామునే! ।**
**జీవమానే గతే కృష్ణస్తం నామన్యత నాజితమ్ ॥ 9 ॥**

మహామునీ! ఆ పరమదుష్టుడైన జరాసంధుడు ఓడిపోయి ప్రాణాలు అరచేత పట్టుకొని పారిపోగా, కృష్ణుడు అది వానిని గెల్చినట్లు కాదనుకొన్నాడు.

**పునరప్యాజగామాథ జరాసన్ధో బలాన్వితః ।**
**జితశ్చ రామకృష్ణాభ్యా మపక్రాన్తో ద్విజోత్తమ! ॥ 10 ॥**

ద్విజశ్రేష్ఠా! కొద్దిరోజులు పోయిన తరువాత మళ్లీ జరాసంధుడు అపారబలాలతో కూడుకొని మథురపైకి దండెత్తాడు. కాని రామకృష్ణులచే ఓడింపబడి వెనుదిరిగి వెళ్లిపోయాడు.

**దశ చాష్టౌ చ సంగ్రామానేవ మత్యన్త దుర్మదః ।**
**యదుభిర్మాగధో రాజా చక్రే కృష్ణపురోగమైః ॥ 11 ॥**

మిక్కిలి మదోన్మత్తుడైన మగధ రాజేంద్రుడు ఈ ప్రకారంగా పద్దెనిమిది సార్లు కృష్ణుడు ముందుండగా సమస్త యాదవేంద్రులతో మహాసంగ్రామాలు కావించాడు.

**సర్వేష్వేతేషు యుద్ధేషు యాదవైః స పరాజితః ।**
**అపక్రాన్తో జరాసన్ధః స్వల్పసైన్యైర్బలాధికః ॥ 12 ॥**

ఈ సమస్త యుద్ధాలలోను అతడు యాదవులవల్ల ఓటమినే చవి చూశాడు. యాదవులు స్వల్ప సైన్యాలతోనే బలాధికుడైన జరాసంధుని అన్నిసార్లు ఓడించారు.

**న తద్బలం యాదవానాం విదితం యదనేకశః ।**
**తత్తు సన్నిధి మాహాత్మ్యం విష్ణోరంశస్య చక్రిణః ॥ 13 ॥**

యాదవుల బలం మిక్కిలి స్వల్పమైనా అన్నిసార్లు ఆ మహాసైన్యం ముందు ఓడిపోకపోవడం వారికి తెలియరాలేదు. అదంతా విష్ణువు అంశావతారమైన శ్రీకృష్ణుని సన్నిధాన ప్రభావమే.

**మనుష్యధర్మశీలస్య లీలా సా జగతః పతేః ।**
**అస్త్రాణ్యనేకరూపాణి యదరాతిషు ముంచతి ॥ 14 ॥**

తన శత్రువులపై అనేక విధాలైన దివ్యాస్త్రాలు విడిచి పెట్టడమనేది ఆ జగత్పతికి మనుష్య ధర్మసంబంధమైన ఒక లీలమాత్రమే.

**మనసైవ జగత్సృష్టిం సంహారం చ కరోతి యః ।**
**తస్యారిపక్షక్షపణే కోఽయముద్యమ విస్తరః ॥ 15 ॥**

ఏ భగవంతుడు సంకల్పమాత్రం చేతనే జగత్తు ఉత్పత్తిని, సంహారాన్ని చేస్తూ ఉంటాడో, అటువంటి చక్రాయుధునికి శత్రుపక్షాన్ని నాశనం చేయడంలో ఏమంత గొప్ప ప్రయత్నం కావాలి కనుక?

**తథాఽపి యో మనుష్యాణాం ధర్మస్తమనువర్తతే ।**
**కుర్వన్ బలవతా సన్ధిం హీనైర్యుద్ధం కరోత్యసౌ ॥ 16 ॥**

అయినప్పటికి అవతారం మనుష్య సంబంధమైనది కాబట్టి అతడు నరధర్మాన్నే అనుసరించాడు. అందువల్లనే బలవంతులతో సంధిని, బలహీనులతో యుద్ధాన్ని చేశాడు.

**సామ చోపప్రదానం చ తథా భేదం ప్రదర్శయన్ ।**
**కరోతి దణ్డపాతం చ క్వచిదేవ పలాయనమ్ ॥ 17 ॥**

ఆ బలహీనులతో ఒక్కొక్కప్పుడు సామోపాయాన్ని, దానోపాయాన్ని, భేదోపాయాన్ని ప్రదర్శిస్తూ, అవసరమైన చోట దండనీతిని ఉపయోగిస్తూ, ఒకప్పుడు పారిపోవడం కూడ చేశాడు.

**మనుష్యదేహినాం చేష్టామిత్యేవమనువర్తతే ।**
**లీలా జగత్పతేస్తస్య ఛన్దతః సమ్ప్రవర్తతే ॥ 18 ॥**

ఈ రీతిగా మానవ దేహధారుల కృత్యాలు ఆచరించడమనేది ఆ జగత్పతికి తన కోరికను అనుసరించి చేసే ఒక లీలగా మాత్రమే ప్రవర్తనమవుతుంది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే జరాసంధ పరాజయో నామ ద్వావింశోఽధ్యాయః సమాప్తః ॥ 22 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో జరాసంధ పరాజయం అనే ఇరవైరెండవ అధ్యాయం సమాప్తం ॥ 22 ॥



## త్రయోవింశోఽధ్యాయః - ఇరవై మూడవ అధ్యాయం

## ద్వారకాదుర్గనిర్మాణమ్ - ద్వారకాదుర్గనిర్మాణం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడన్నాడు.

**గార్గ్యం గోష్ఠ్యాం ద్విజం శ్యాలః షణ్ఢ ఇత్యుక్తవాన్ ద్విజ! ।**
**యదూనాం సన్నిధౌ సర్వే జహసుర్యాదవాస్తదా ॥ 1 ॥**

ద్విజోత్తమా! మైత్రేయా! ఒకనాడు నిండుసభలో, యాదవులందరి ఎదురుగుండా గార్గ్యుడనే బ్రాహ్మణుని అతని బావమరది నీవు నపుంసకుడవని (సంతానం లేనివాడవని) గేలిచేశాడు. అంత సర్వయాదవులు ఒక్కసారి నవ్వారు.

**తతః కోప సమావిష్టో దక్షిణాబ్ధిముపేత్య సః ।**
**సుతమిచ్ఛంస్తపస్తేపే యదుచక్ర భయావహమ్ ॥ 2 ॥**

దానితో అతడు కోపోద్రిక్తుడై దక్షిణ సముద్రతీరానికి వచ్చి సమస్త యాదవసైన్యానికి భయాన్ని కలిగించే కుమారుడు కావాలని తీవ్రమైన తపస్సు చేశాడు.

**ఆరాధయన్ మహాదేవం సోఽయశ్చూర్ణ మభక్షయత్ ।**
**దదౌ వరం చ తుష్టోఽస్మై వర్షే తు ద్వాదశే హరః ॥ 3 ॥**

అతడు ఇనుపపొడిని భక్షిస్తూ శంకరుని గూర్చి తపస్సు చేశాడు. అంత హరుడు పంద్రెండో సంవత్సరంలో సంతుష్టితో ప్రత్యక్షమై అతనికి వరం ఇచ్చాడు.

**స భాజయామాస చ తం యవనేశో హ్యనాత్మజః ।**
**తద్యోషిత్సంగమాచ్చాస్య పుత్రోఽభూదళిసన్నిభః ॥ 4 ॥**

ఆ గార్గ్యుని సంతులేనివాడైన యవనచక్రవర్తి నిష్ఠతో సేవించాడు. గార్గ్యుడంత ఆ యవనుని భార్యతో సంగమించగా తుమ్మెదలవంటి చాయకల నల్లని కొడుకు పుట్టాడు.

**తం కాలయవనం నామ రాజ్యే స్వే యవనేశ్వరః ।**
**అభిషిచ్య వనం యాతో వజ్రాగ్రకఠినోరసమ్ ॥ 5 ॥**

అతడు వజ్రంలాగా మొనదేరిన కర్కశమైన వక్షం కలవాడు. కాలయవనుడు అనే పేరుతో వాసి గాంచాడు. యవనేశ్వరుడు ఆ పుత్రుని రాజ్యమునందు అభిషిక్తుని గావించి అడవికి వెళ్లిపోయాడు.

**స తు వీర్యమదోన్మత్తః పృథివ్యాం బలినో నృపాన్ ।**
**పప్రచ్ఛ నారదస్తస్మై కథయామాస యాదవాన్ ॥ 6 ॥**

ఆ కాలయవనుడు బలాహంకార మదోన్మత్తుడై ఈనాడు భూమియందు బలవంతులగు రాజులను గూర్చి (ఎవరని) ప్రశ్నించాడు. అంత నారదుడు యాదవులు బలవంతులని తెలియజేశాడు.

**మ్లేచ్ఛకోటి సహస్రాణాం సహస్రైర్బహుభిర్వృతః ।**
**గజాశ్వరథపత్త్యోఘై శ్చకార పరమోద్యమమ్ ॥ 7 ॥**

ఆ మాట వినగానే కాలయవనుడు వేలకొలది ఏనుగులను, గుర్రాలను, రథాలను, వేలకోట్ల మ్లేచ్ఛ సైనికులను కూడగట్టుకొని యాదవులను కడ ముట్టించడానికై ఉద్యమించాడు.

**ప్రయయౌ చావ్యవచ్ఛిన్నం ఛిన్నయానో దినే దినే ।**
**యాదవాన్ ప్రతి సామర్షో మైత్రేయ! మథురాపురీమ్ ॥ 8 ॥**

మైత్రేయా! అతడు యాదవులపై మిక్కిలి కోపించి, చతురంగ బలాలతో బయలుదేరి మధ్యలో అలసిపోయిన వాటిని విడిచివేస్తూ, రోజురోజుకు విడుదులు చేస్తూ మథురాపురిపై దండయాత్రకు తరలి వెళ్లాడు.

**కృష్ణోఽపి చిన్తయామాస క్షయితం యాదవం బలమ్ ।**
**యవనేన రణే గమ్యం మాగధస్య భవిష్యతి ॥ 9 ॥**

**మాగధస్య బలం క్షీణం సకాలయవనో బలీ ।**
**హన్తా తదిదమాయాతం యదూనాం వ్యసనం ద్విధా ॥ 10 ॥**

అపుడు కృష్ణుడు "యవనునితో యుద్ధం చేస్తే యాదవసేన క్షీణించక తప్పదు. మాగధుడైన జరాసంధునికి లొంగిపోకనూ తప్పదు. లేక మొదటే మగధరాజుతో యుద్ధం చేస్తే బలం తగ్గిన యదుసైన్యాన్ని బలవంతుడైన కాలయవనుడు చంపివేస్తాడు. ఇది తథ్యం. యాదవులకు ఇప్పుడు రెండు విధాల విపత్తు వచ్చిపడింది." అని ఆలోచించాడు.

**తస్మాద్దుర్గం కరిష్యామి యదూనామరిదుర్జయమ్ ।**
**స్త్రియోఽపి యత్ర యుధ్యేయుః కింపునర్వృష్ణిపుంగవాః ॥ 11 ॥**

ఇలా భావించి "అందువల్ల ఈ సమయంలో శత్రువులకు జయింప వీలుకాని ఒక కోటను యాదవులకై నిర్మిస్తాను. స్త్రీలుకూడ అక్కడ సురక్షితంగా యుద్ధం చేయవచ్చు. ఇక వృష్ణివీరుల విషయం చెప్పవలసింది ఏముంటుంది?

**మయి మత్తే ప్రమత్తే వా సుప్తే ప్రవసితేఽపి వా ।**
**యాదవాభిభవం దుష్టా మా కుర్వంత్వంరయోఽధికాః ॥ 12 ॥**

నేను సావధానంగా ఉన్నా, లేకపోయినా, నిద్రిస్తున్నా, లేదా బయటకు ఎక్కడికైనా వెళ్లినా ఈ దుర్గంలో నివసించే యాదవులకు దుష్టులైన శత్రువీరులవల్ల ఏ విధమైన పరాజయం ఉండదు." అని నిర్ణయించాడు.

**ఇతి సంచిన్త్య గోవిన్దో యోజనాని మహోదధిమ్ ।**
**యయాచే ద్వాదశ పురీం ద్వారకాం తత్ర నిర్మమే ॥ 13 ॥**

అని బాగా ఆలోచించి గోవిందుడు మహాసముద్రాన్ని పంద్రెండు యోజనాలమేర తనకిమ్మని అడిగి అక్కడ ద్వారకాపురిని నిర్మించాడు.

**మహోద్యానాం మహావప్రాం తటాకశతశోభితామ్ ।**
**ప్రాసాదగృహసమ్బాధామిన్ద్రస్యేవామరావతీమ్ ॥ 14 ॥**

అది గొప్పదైన ఉద్యానవనాలతో, శ్రేష్ఠమైన కటకాలతో, వందల కొలది తటాకాలతో, ఉన్నత ప్రాసాదహర్మ్యాలతో ఇంద్రుని అమరావతీ నగరంలా విలసిల్లింది.

**మథురావాసినో లోకాంస్తత్రానీయ జనార్దనః ।**
**ఆసన్నే కాలయవనే మథురాంశ్చ స్వయం యయౌ ॥ 15 ॥**

జనార్దనుడు మథురానగర వాసులనందరినీ అక్కడకు రావించి, కాలయవనుడు మథురకు చేరే సమయానికి తాను అక్కడకు వెళ్లాడు.

**బహిరావాసితే సైన్యే మథురాయా నిరాయుధః ।**
**నిర్జగామ చ గోవిన్దో దదృశే యవనేశ్వరమ్ ॥ 16 ॥**

అతడు మథురకు వెలుపలి భాగంలో సైన్యాన్ని నిలపగా, అక్కడ నున్న యవనేశ్వరుని చూచి నిరాయుధుడైన గోవిందుడు తానొక్కడుగా ఆ చోటికి వెళ్లాడు.

**స జ్ఞాత్వా వాసుదేవం తం బాహుప్రహరణం నృపః ।**
**అనుయాతో మహాయోగిచేతోభిః ప్రాప్యతే న యః ॥ 17 ॥**

రిక్తహస్తుడై యున్న వాసుదేవుని కాలయవనుడు బాహుయుద్ధప్రవీణునిగా తెలుసుకొని మహాయోగులు తమ చిత్తాలతో వెంబడించి అందుకోలేని ఆ పరాత్పరుని వెంట వెళ్లసాగాడు.

**తేనానుయాతః కృష్ణోఽపి ప్రవివేశ మహాగుహామ్ ।**
**యత్ర శేతే మహావీర్యో ముచుకున్దో నరేశ్వరః ॥ 18 ॥**

కాలయవనుడు వెనువెంట పరుగెత్తి వస్తూ ఉండగా, కృష్ణుడు మహాబలపరాక్రమసంపన్నుడైన రాజేంద్రుడగు ముచుకుందుడు నిద్రించి పరున్న మహాగుహలోనికి ప్రవేశించాడు.

**సోఽపి ప్రవిశ్య యవనో దృష్ట్వా శయ్యాగతం నృపమ్ ।**
**పాదేన తాడయామాస మత్వా కృష్ణం సుదుర్మతిః ॥ 19 ॥**

ఆ కాలయవనుడుకూడ ఆ గుహలోనికి ఏగి, అక్కడ శయ్యయందు పరుండియున్న రాజును చూచి, కృష్ణుడని భావించి మిక్కిలి దుర్బుద్ధియై తన పాదంతో ఒక్క తన్ను తన్నాడు.

**(ఉత్థాయ ముచుకున్దోఽపి దదర్శ యవనం నృపః)**
**దృష్టమాత్రస్తు తేనాసౌ జజ్వాల యవనోఽగ్నినా ।**
**తత్క్రోధజేన మైత్రేయ! భస్మీభూతశ్చ తత్క్షణాత్ ॥ 20 ॥**

(రాజగు ముచుకుందుడు కూడ ఒక్కసారిగా లేచి యవనుని చూశాడు.)

మైత్రేయా! అతడు అలా ఒక్కసారి చూచీ చూడగానే, ఆ కాలయవనుడు కూడా క్రోధం వల్ల పుట్టిన అగ్నిజ్వాలలో మండిపోయి, ఆ క్షణంలోనే మసి అయిపోయాడు.

**స హి దేవాసురే యుద్ధే గతో జిత్వా మహాసురాన్ ।**
**నిద్రార్తః సుమహాకాలం నిద్రాం వవ్రే వరం సురాన్ ॥ 21 ॥**

ఆ ముచుకుందుడు దేవాసుర యుద్ధంలో పాల్గొని మహారాక్షసులను యుద్ధంలో బలిగొన్నాడు. దేవతలవల్ల వరం పొంది చాలాకాలం గాఢనిద్ర పొందే అవకాశంతో నిద్రపోయి పరుండి యుండడం జరిగింది.

**ప్రోక్తశ్చ దేవైః సంసుప్తం యస్త్వాముత్థాపయిష్యతి ।**
**దేహజేనాగ్నినా సద్యః స తు భస్మీభవిష్యతి ॥ 22 ॥**

ఆ దేవతలు కూడా మైమరచి నిద్రించియున్న నిన్ను ఎవడయితే లేపుతాడో, వాడు వెంటనే నీ శరీరంనుండి ఉద్భవించిన అగ్నిజ్వాలలో భస్మం కాగలడని వరం ప్రసాదించారు.

**ఏవం దగ్ధ్వా స తం పాపం దృష్ట్వా చ మధుసూదనమ్ ।**
**కస్త్వమిత్యాహ సోఽప్యాహ జాతోఽహం శశినః కులే ।**
**వసుదేవస్య తనయో యదోర్వంశ సముద్భవః ॥ 23 ॥**

ఆ వరప్రభావంవల్ల ఈ రీతిగా ముచుకుందుడు కాలయవనుని బూడిదచేసి, మధుసూదనుని వీక్షించి నీవెవ్వడవని అడిగాడు. కృష్ణుడు కూడా "నేను చంద్రవంశంలో జన్మించినవాడను. యాదవ వంశంలో ఉద్భవించినవాడను. వసుదేవుని తనయుడను. వాసుదేవుడను" అని బదులిచ్చాడు.

**ముచుకున్దోఽపి తత్రాసౌ వృద్ధగార్గ్య వచోఽస్మరత్ ।**
**సంస్మృత్య ప్రణిపత్యైనం సర్వభూతేశ్వరం హరిమ్ ॥ 24 ॥**

ఆ ముచుకున్దుడు కూడా ఆ సమయంలో వృద్ధగార్గ్యుడు వచించిన మాటలను జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. ఆ కృష్ణుని సర్వభూతమయుడైన శ్రీహరిగా భావించి వినయంతో నమస్కరించి

**ప్రాహ జ్ఞాతో భవాన్ విష్ణోరంశస్త్వం పరమేశ్వరః ।**
**పురా గార్గ్యేణ కథిత మష్టావింశతితమే యుగే ।**
**ద్వాపరాన్తే హరేర్జన్మ యదోర్వంశే భవిష్యతి ॥ 25 ॥**

"నీవు సాక్షాత్తు విష్ణువు అంశ అని గ్రహించాను. నీవు పరమేశ్వరుడవు. పూర్వం గార్గ్యుడు చెప్పనే చెప్పాడు. ఇరవై ఎనిమిదో మహాయుగంలో ద్వాపరయుగం చివర హరి అవతారం యదువంశంలో ఉద్భవిస్తుందని చెప్పాడు.

**స త్వం ప్రాప్తో న సన్దేహో మర్త్యానాముపకారకృత్ ।**
**తథాఽపి సుమహత్ తేజో నాలం సోఢుమహం తవ ॥ 26 ॥**

ఆ హరివే నీ విట సాక్షాత్కరించావు. సందేహం లేదు. మనుష్యులకు ఉపకారం చేయడానికై నీవు వచ్చావు. అయినప్పటికి నీ మహత్తర తేజస్సును నేను తట్టుకోలేకపోతున్నాను.

**తథా హి సజలామ్భోదనాదధీరతరం తవ ।**
**వాక్యం నమతి చైవోర్వీ యస్య పాదప్రపీడితా ॥ 27 ॥**

నీ పలుకు నీటితో నిండిన మేఘగర్జనవలె మహాగంభీరమైనటువంటిది. నీ పాద సంస్పర్శ మాత్రం చేతనే అవని క్రుంగిపోవడం జరుగుతుంది.

**దేవాసురే మహాయుద్ధే దైత్యసైన్యే మహాభటాః ।**
**న శేకుర్మమ తత్తేజస్త్వత్తేజో న సహామ్యహమ్ ॥ 28 ॥**

దేవాసుర మహాసంగ్రామంలో దైత్యసైన్యంలోని మహాభటులు నా తేజస్సుముందు నిలవలేక పోయారు. అటువంటి నేను నీ తేజస్సు ముందు నిలవలేకున్నాను.

**సంసారపతితస్యైకో జన్తోస్త్వం శరణం పరమ్ ।**
**స ప్రసీద ప్రపన్నార్తిహర! నాశయ మేఽశుభమ్ ॥ 29 ॥**

సంసారంలో పడిపోయిన వారిని దరిని చేర్చడానికి నీవొక్కడవే దిక్కు. నీవు ప్రపన్నులైన ప్రాణుల ఆర్తిని హరించే వాడవు. నా అశుభాన్ని పరిహరించు.

**త్వం పయోనిధయః శైలాః సరితస్త్వం వనాని చ ।**
**మేదినీ గగనం వాయురాపోఽగ్ని స్త్వం తథా మనః ॥ 30 ॥**

సమస్త సముద్రాలు, అఖిలపర్వతాలు, సకలనదులు అనేకవిధ వనాలు నీవే. భూమి, ఆకాశం, వాయువు, నీరు, అగ్ని అనే పంచభూతాలు నీవే. అలాగే మహత్తత్వం కూడ నీవే.

**బుద్ధి రవ్యాకృతం ప్రాణాః ప్రాణేశస్త్వం తథా పుమాన్ ।**
**పుంసః పరతరం యచ్చ వ్యాప్య జన్మవికారివత్ ॥ 31 ॥**

నీవే బుద్ధి స్వరూపం, ప్రకృతి స్వరూపం, ప్రాణ స్వరూపం, ప్రాణేశ్వర స్వరూపం, పురుష స్వరూపం నీవే. ఆ పురుష స్వరూపం కన్న పరమైన అంతట వ్యాపించియున్న పరమ స్వరూపం నీవే. అది పుట్టుక మున్నగు ఏ వికారాలు లేనట్టిది.

**శబ్దాదిహీనమజరమమేయం క్షయవర్జితమ్ ।**
**అవృద్ధినాశం తద్బ్రహ్మ త్వమాద్యన్తవివర్జితమ్ ॥ 32 ॥**

శబ్దం మున్నగు పంచ తన్మాత్రలు లేనివాడవు నీవు. అజరుడవు. అమేయుడవు. క్షయం లేని వాడవు. పెరుగుదల, తరుగుదల లేనివాడవు. ఆది, అంతం లేని పరబ్రహ్మం నీవే.

**త్వత్తోఽమరాః స పితరో యక్షగన్ధర్వకిన్నరాః ।**
**సిద్ధాశ్చాప్సరసస్త్వత్తో మనుష్యాః పశవః ఖగాః ॥ 33 ॥**

**సరీసృపా మృగాస్సర్వే త్వత్తస్సర్వే మహీరుహాః ।**
**యచ్చ భూతం భవిష్యం చ కించిదత్ర చరాచరమ్ ॥ 34 ॥**

నీ నుంచే సమస్త దేవతలు, పితరులు, యక్షులు, గంధర్వులు, కిన్నరులు, సిద్ధులు, అప్సరసలుఉద్భవించారు. అంతేకాక మనుష్యులు, పశువులు, పక్షులు, సరీసృపాలు, మృగాలు నీ నుంచి వచ్చినటువంటివే. నీ వల్లనే సమస్త వృక్షజాతులు, భూతం, భవిష్యం, కనిపించే చరాచరమేదయితే ఉందో అంతా వచ్చింది.

**అమూర్తం మూర్తమథవా స్థూలం సూక్ష్మతరం స్థితమ్ ।**
**తత్సర్వం త్వం జగత్కర్తా నాస్తి కించిత్ త్వయా వినా ॥ 35 ॥**

మూర్తం, అమూర్తం, స్థూలం, సూక్ష్మతరం, కనిపించేది. (కనిపించనిది) అంతా నీవే. నీవే జగత్కర్తవు. నీకన్న వ్యతిరిక్తమైన దేమీ లేదు.

**మాయాసంసారచక్రేఽస్మిన్ భ్రమతా భగవన్ సదా ।**
**తాపత్రయాభిభూతేన న ప్రాప్తా నిర్వృతిః క్వచిత్ ॥ 36 ॥**

భగవంతుడా! ఆధ్యాత్మికం, ఆధిదైవికం, ఆధిభౌతికం అనే తాపత్రయంతో కుమిలిపోతూ, ఎల్లప్పుడూ ఈ మాయా సంసారచక్రంలో పరిభ్రమిస్తూ, ఏ కాలంలోనూ శాంతిని పొందకుండా ఉండిపోయాను.

**దుఃఖాన్యేవ సుఖానీతి మృగతృష్ణా జలాశయా ।**
**తథా నాథ! గృహీతాని తాని తాపాయ చాభవన్ ॥ 37 ॥**

నాథా! ఎండమావులను జూచి జలాశ పొందినట్లుగా దుఃఖాలనే సుఖాలుగా భావించాను. అవన్నీ సంతాపకారణాలే అయ్యాయి.

**రాష్ట్రముర్వీబలం కోశో మిత్రపక్షస్తథాత్మజాః ।**
**భార్యాభృత్యజనా యే చ శబ్దాద్యా విషయాః ప్రభో! ॥ 38 ॥**

**సుఖబుద్ధ్యా మయా సర్వం గృహీతమిదమవ్యయ! ।**
**పరిణామే తదేవేశ! తాపాత్మకమభూన్మమ ॥ 39 ॥**

ప్రభూ! రాజ్యం, భూమి, బలం, కోశం, మిత్రపక్షం, కొడుకులు, భార్య, సేవకులు, ఇతర జనులు, శబ్దాది విషయాలు సర్వం సుఖమనే బుద్ధితోనే నేను భావించి స్వీకరించాను. కాని అవ్యయా! ఈశ్వరా! తరువాతి కాలంలో ఆ సుఖమే నాకు సంతాపకారణమయ్యింది.

**దేవలోకమిమం ప్రాప్తో నాథ! దేవగణోఽప్యయమ్ ।**
**మత్తః సాహాయ్యకామోఽభూచ్ఛాశ్వతీ కుత్ర నిర్వృతిః ॥ 40 ॥**

నాథ! నేను దేవలోకం చేరుకొన్నాను. అక్కడ ఉన్నవారు దేవగణాలు అయినా వారు నా సహాయం కోరుకొన్నారు. ఇంక శాశ్వతమైన ఆనందం అనేది ఎక్కడ ఉంది కనుక?

**త్వామనారాధ్య జగతాం సర్వేషాం ప్రభవాస్పదమ్ ।**
**శాశ్వతీ ప్రాప్యతే కేన పరమేశ్వర! నిర్వృతిః ॥ 41 ॥**

సమస్త జగత్తులకు పుట్టుకకు కారణమైన నిన్ను పూజించకుండా పరమేశ్వరా! శాశ్వతమైన బ్రహ్మానందం ఏ విధంగా లభిస్తుంది?

**త్వన్మాయా మూఢ మనసో జన్మమృత్యు జరాదికాన్ ।**
**అవాప్య తాపాన్ పశ్యన్తి ప్రేతరాజాననం నరాః ॥ 42 ॥**

నీ మాయవల్ల మోహింపబడిన బుద్ధి కలవారై (కొందరు) నరులు పుట్టుక, చావు, ముసలితనం మున్నగు భవతాపాలు పొందుతూ, తుట్టతుదివేళలో ప్రేతరాజు ముఖాన్ని సందర్శిస్తున్నారు.

**తతో నిజక్రియాసూతినరకేష్వతిదారుణమ్ ।**
**ప్రాప్నువన్తి నరా దుఃఖమస్వరూపవిదస్తవ ॥ 43 ॥**

అనంతరం తాము చేసిన కృత్యాలను అనుసరించి సంభవించిన అతిభయంకరనరకాలలో నీ స్వస్వరూపం తెలియని నరులు దుఃఖాలు అనుభవిస్తూ ఉంటారు.

**అహమత్యన్తవిషయీ మోహితస్తవ మాయయా ।**
**మమత్వగర్వగర్తాన్తర్భ్రమామి పరమేశ్వర! ॥ 44 ॥**

పరమేశ్వరా! నేను కూడా నీ మాయచే మోహించబడి, మిక్కిలి విషయవాసనలకు లోనై మమకారాహంకారాలనే గుంటలో పడి ఇటు అటూ పరిభ్రమిస్తున్నాను.

**సోఽహం త్వాం శరణమపారమీశమీడ్యం**
**సమ్ప్రాప్తః పరమపదం యతో న కించిత్ ।**
**సంసారభ్రమపరితాపతప్తచేతా**
**నిర్వాణే పరిణతధామ్ని సాభిలాషః ॥ 45 ॥**

పరమేశ్వరా! అటువంటి నేను అపారసర్వనియామకుడవైన, పరమపూజ్యుడవైన, పరబ్రహ్మపద స్వరూపుడవైన నిన్ను శరణు పొందుతున్నాను. నీ కన్న పైన ఇంకేమీ లేదు. సంసారంలో పరిభ్రమిస్తూ, పరితపిస్తూ ఉన్న మనస్సు గల నేను కేవలతేజస్సనే నిర్వాణపదవిని పొందదానికై అభిలాషతో ఉన్నాను. అని ప్రార్థించాడని పరాశరుడు మైత్రేయునకు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే ద్వారకాదుర్గనిర్మాణం నామ త్రయోవింశోఽధ్యాయః సమాప్తః ॥ 23 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో ద్వారకాదుర్గనిర్మాణం అనే ఇరవై మూడవ అధ్యాయం సమాప్తం ॥ 23॥

## చతుర్వింశోఽధ్యాయః - ఇరవై నాల్గవ అధ్యాయం

## ముచుకుందస్య తపఃప్రస్థానమ్ - ముచుకుందుని తపఃప్రస్థానం

**శ్రీపరాశర ఉవాచ:-** పరాశరుడు చెప్పాడు.

**ఇత్థం స్తుతస్తదా తేన ముచుకున్దేన ధీమతా ।**
**ప్రాహేశః సర్వభూతానామనాదిర్భగవాన్ హరిః ॥ 1 ॥**

మైత్రేయా! ఈ రీతిగా ఆ ధీశాలి అయిన ముచుకుందుడు స్తోత్రం చేసిన తరువాత సర్వభూతేశ్వరుడైన, అనాదియైన, భగవంతుడగు హరి ఈ విధంగా అన్నాడు.

**యథాభివాంఛితాన్ దివ్యాన్ గచ్ఛ లోకాన్ నరేశ్వర! ।**
**అవ్యాహతపరైశ్వర్యో మత్ప్రసాదోపబృంహితః ॥ 2 ॥**

**భుక్త్వా దివ్యాన్ మహాభోగాన్ భవిష్యసి మహాకులే ।**
**జాతిస్మరో మత్ప్రసాదాత్తతో మోక్షమవాప్స్యసి ॥ 3 ॥**

రాజేంద్రా! నీవు నీ కోరిక ననుసరించి దివ్యభోగాలను అనుభవించి, ఎడతెగని పరమైశ్వర్య సంపన్నుడవై, నా సంపూర్ణానుగ్రహబలంవల్ల దివ్యలోకాలకు వెళ్లవచ్చు. అనంతరం మహాదివ్యభోగాలు అనుభవించి ఉత్తమకులంలో జన్మిస్తావు. అప్పుడు పూర్వజన్మ స్మృతి కలవాడవై, నా అనుగ్రహంవల్ల మోక్షం పొందుతావు" అని వరమిచ్చాడు.

**ఇత్యుక్తః ప్రణిపత్యేశం జగతామచ్యుతం నృపః ।**
**గుహాముఖాద్ వినిష్క్రాన్తో దదృశే సోఽల్పకాన్ నరాన్ ॥ 4 ॥**

**తతః కలియుగం జ్ఞాత్వా ప్రాప్తం తప్తుం నృప స్తపః ।**
**నరనారాయణస్థానం ప్రయయౌ గన్ధమాదనమ్ ॥ 5 ॥**

ఈ విధంగా కృష్ణపరమాత్మ వచించగా, ఆ ముచుకుందనరేంద్రుడు జగదీశ్వరుడైన అచ్యుతునకు వినమ్రుడై నమస్కరించి, గుహాద్వారం నుండి వెలుపలకు వచ్చి అల్పాకారులైన నరులను చూశాడు. ఆ రాజు అది ద్వాపరయుగాంత సంధ్యాంశయైన కలియుగాది సంధ్యగా కాలం సంప్రాప్తమవుతున్నదని గ్రహించి తపస్సు చేయడానికై నరనారాయణ స్థానమైన బదరీక్షేత్రాంతర్గత గంధమాదనగిరికి వెళ్లిపోయాడు.

**కృష్ణోఽపి ఘాతయిత్వాఽరిముపాయేన హి తద్బలమ్ ।**
**జగ్రాహ మథురామేత్య హస్త్యశ్వస్యన్దనోజ్జ్వలమ్ ॥ 6 ॥**

**ఆనీయ చోగ్రసేనాయ ద్వారవత్యాం న్యవేదయత్ ।**
**పరాభిభవనిఃశంకం బభూవ చ యదోః కులమ్ ॥ 7 ॥**

కృష్ణుడు ఈ విధంగా ఉపాయంచే శత్రుబలాన్ని తెగటార్చి మథురాపురికి వచ్చి ఏనుగులతో, గుఱ్ఱాలతో, రథాలతో శోభిల్లే తత్సైన్యాన్ని స్వాధీనపరచుకొన్నాడు. అక్కడనుండి ద్వారవతికి వచ్చి ఉగ్రసేనునికి ఆ గజరథతురగాలను సమర్పించాడు. ఆనాటినుండి యాదవకులం శత్రుబాధ లేక ఏ జంకూ కొంకు లేక హాయిగా ఉండసాగింది.

**బలదేవోఽపి మైత్రేయ! ప్రశాన్తాఖిలవిగ్రహః ।**
**జ్ఞాతిసన్దర్శనోత్కణ్ఠః ప్రయయౌ నన్దగోకులమ్ ॥ 8 ॥**

మైత్రేయా! ఈ విధంగా శత్రుపీడ వదిలి అంతా శాంతి పొందిన పిమ్మట బలదేవుడు కూడ తన చిన్ననాటి చెలికాండ్రను చూచే కోరికతో నందగోకులానికి బయలుదేరి వెళ్లాడు.

**తతో గోపీశ్చ గోపాంశ్చ యథాపూర్వ మమిత్రజిత్ ।**
**తథైవాభ్యవదత్ ప్రేమ్ణా బహుమానపురఃసరమ్ ॥ 9 ॥**

శత్రుంజయుడైన బలరాముడు గోపికలతోను, గోపాలకులతోను మునుపటిలాగే ప్రేమతో మిక్కిలి గౌరవపూర్వకంగా పలకరించాడు.

**కైశ్చాపి సమ్పరిష్వక్తః కాంశ్చిత్ స పరిషస్వజే ।**
**హాస్యం చక్రే సమం కైశ్చిద్ గోపైర్గోపీజనైస్తథా ॥ 10 ॥**

ప్రేమతో కొందరు ఈతనిని కౌగిలించుకొన్నారు. కొందరిని ఆతడే కౌగిలించుకొన్నాడు. ఆ గోపాలురతోను, గోపికాజనంతోను సమంగా కొందరితో పరిహాసాలాడాడు.

**ప్రియాణ్యనేకాన్యవదన్ గోపాస్తత్ర హలాయుధమ్ ।**
**గోప్యశ్చ ప్రేమకుపితాః ప్రోచుః సేర్ష్యమథాపరాః ॥ 11 ॥**

ఆ గోపాలకులు ఆ సమయంలో బలరామునితో అనేక ప్రియవచనాలు పలికారు. గోపికలు మాత్రం మిక్కిలి మక్కువతో కినుక పూని, ఈసు వహించి నర్మగర్భంగా పలికారు.

**గోప్యః పప్రచ్ఛురపరా నగరీజనవల్లభః ।**
**కచ్చిదాస్తే సుఖం కృష్ణశ్చలత్ప్రేమలవాత్మకః ॥ 12 ॥**

కొంతమంది గోపికలయితే మాత్సర్యంతో "నగరకాంతల పట్ల వాల్లభ్యం చూపిస్తూ, మాపట్ల చంచల ప్రీతి కనబర్చిన ఆ ఇచ్చకాలమారి కృష్ణుడు సుఖంగా ఉన్నాడా?

**అస్మచ్చేష్టామపహసన్ కచ్చిన్న పురయోషితామ్ ।**
**సౌభాగ్యమానమధికం కరోతి క్షణసౌహృదః ॥ 13 ॥**

క్షణకాలం మొగమిచ్చకంగా వర్తించే ఆ కొంటెవాడు, మా గొల్లపడుచుల చేష్టలు సరికావని ఈసడించు కొంటూ, పురస్త్రీలలోని నెఱజాణలతో తిరుగుతూ వారిపై మిక్కిలి మక్కువను, అభిమానాన్ని పెంచుకోలేదు కదా!

**కచ్చిత్ స్మరతి నః కృష్ణో గీతానుగమనం కలమ్ ।**
**అప్యసౌ మాతరం ద్రష్టుం సకృదప్యాగమిష్యతి ॥ 14 ॥**

వేణుగీతాలాపనం చేసేవేళ తనను వెంటాడిన మమ్ములను ఆ కృష్ణుడు ఒక్కమాటైనా తలచుకొంటున్నాడా? అతడు తల్లిని చూడడానికయినా ఒకసారైనా ఈ వ్రేపల్లెకు వస్తాడా?

**అథవా కిం తదాలాపైః క్రియన్తామపరాః కథాః ।**
**తస్యాస్మాభిర్వినా తేన వినాస్మాకం భవిష్యతి ॥ 15 ॥**

అదీ కులే గాక అతగాడి మాటలెందుకులే! మరో ముచ్చట చెప్పుకొందాము. అతడు లేకపోతే మనకు, మనం లేకపోతే అతనికి జరగదు కనుకనా!

**పితా మాతా తథా భ్రాతా భర్తా బన్ధుజనశ్చ కిమ్ ।**
**సంత్యక్తస్తత్కృతేఽస్మాభిరకృతజ్ఞధ్వజో హి సః ॥ 16 ॥**

తండ్రి, తల్లి, అన్న, భర్త, బంధుజనం అన్నీ, మనది అనేది అంతా అతనికోసమై పూర్తిగా వదలుకొన్నాము కదే! అతడు కృతఘ్నులకందరికి ఒక పతాకలాంటివాడే.

**తథాఽపి కచ్చిదాలాపమిహాగమనసంశ్రయమ్ ।**
**కరోతి కృష్ణో వక్తవ్యం భవతా రామ! నానృతమ్ (కృష్ణ) ॥ 17 ॥**

అయినా కృష్ణుడు ఇచటకు తిరిగి తన రాకను గూర్చిన మాట ఒకటయినా నీతో అన్నాడా? బలరామ! (కృష్ణుడు లేకుండా వచ్చిన రామా!) ఉన్నది ఉన్నట్లుగా చెప్పు. అబద్ధం చెప్పవద్దు.

**దామోదరోఽసౌ గోవిందః పురస్త్రీన్యస్తమానసః ।**
**అపేతప్రీతిరస్మాసు దుర్దర్శః ప్రతిభాతి నః ॥ 18 ॥**

ఆ దామోదరుడైన గోవిందుడు నగరకాంతల పట్ల మనస్సు చూరగొన్నాడు. ఇంక మనపట్ల ఆతనికి ప్రీతి తొలగిపోయింది. ఇంక అతని దర్శనం మనకు దుర్లభమే.

**ఆమన్త్రితః స కృష్ణేతి పునర్దామోదరేతి చ ।**
**జహసుః సుస్వరం గోప్యో హరిణా హృతచేతసః ॥ 19 ॥**

అంటూ ఆ సమయంలో ఆ గోపికలు బలరాముణ్ణే కృష్ణా! అని, దామోదరా! అని పిలిచి పిలిచి కృష్ణుని ద్వారా హరించివేయబడ్డ మనస్సులతో వారిలోనే వారు చక్కగా పరిహసించుకోసాగారు.

**సన్దేశైః సామమధురైః ప్రేమ గర్భైరగర్వితైః ।**
**రామేణాశ్వాసితా గోప్యః కృష్ణస్యాతి మనోహరైః ॥ 20 ॥**

అపుడు బలరాముడు కృష్ణుని అతిమనోహరాలైన ప్రేమసందేశాలను, సామ మధురవచనాలను, ప్రణయగర్భ వాక్యాలను, గర్వరహితసత్యసూక్తులను వినిపించి గోపికలను ఓదార్చాడు.

**గోపైశ్చ పూర్వవద్రామః పరిహాసమనోరమాః ।**
**కథాశ్చకార రేమే చ సహ తైర్వ్రజభూమిషు ॥ 21 ॥**

మునుపటిలాగే బలరాముడు తోడిగోపాలురతో నవ్వులు చిందించే పలుకులు పల్కుతూ, ఆ వ్రేపల్లెలోని విహారప్రదేశాలలో కలసి వారితో విహరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే ముచుకుందస్య తపఃప్రస్థానం నామ చతుర్వింశోఽధ్యాయః సమాప్తః ॥ 24 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో ముచుకుందుని తపఃప్రస్థానం అనే ఇరవై నాలుగవ అధ్యాయం సమాప్తం॥24॥

## పంచవింశోఽధ్యాయః - ఇరవై ఐదవ అధ్యాయం

## బలరామ వ్రజవిహారః - బలరామ వ్రజవిహారం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**వనే విచరతస్తస్య సహ గోపైర్మహాత్మనః ।**
**మానుషచ్ఛద్మరూపస్య శేషస్య ధరణీధృతః (భృతః) ॥ 1 ॥**

**నిష్పాదితోరుకార్యస్య కార్యేణోర్వీ విచారిణః ।**
**ఉపభోగార్థమత్యర్థం వరుణః ప్రాహ వారుణీమ్ ॥ 2 ॥**

మైత్రేయా! ఈ రీతిగా లీలా మానుషధారియై బృందావనంలో గోపాలురతో కలసి విహరిస్తున్న మహాత్ముడగు, సమస్త భూమండలాన్ని ధరిస్తున్న ఆదిశేషుని అవతారమూర్తి అయిన, నిర్వహించ శక్యంకాని పెద్ద పెద్ద పనులు చేస్తున్న, చేయలసిన పనికై భూమియందు సంచరిస్తున్న బలరామునికి మిక్కిలి ఉపయోగం కోసమై వరుణదేవుడు వారుణిని రావించి ఇలా అన్నాడు.

**అభీష్టా సర్వదా యస్య మదిరే త్వం మహౌజసః ।**
**అనన్తస్యోపభోగాయ తస్య గచ్ఛ ముదే శుభే ॥ 3 ॥**

ఓ కల్యాణీ! మదిరా! మహాతేజస్సంపన్నుడైన అనంతునకు నీవు ఎల్లప్పుడు ఇష్టురాలవు కదా! అందువల్ల బలరాముని సంతోషం కోసమై, అతని ఉపభోగం కొరకై, అతని సన్నిధికి చేరు" అని ఆజ్ఞాపించాడు.

**ఇత్యుక్తా వారుణీ తేన సన్నిధానమథాకరోత్ ।**
**బృన్దావనసముత్పన్నకదమ్బతరుకోటరే ॥ 4 ॥**

**విచరన్ బలదేవోఽపి మదిరాగన్ధముత్తమమ్ ।**
**ఆఘ్రాయ మదిరాతర్షమవాపాథ పురాతనమ్ ॥ 5 ॥**

వరుణుడు అలా చెప్పగా వారుణి బలరాముని దగ్గరకు వచ్చింది. ఆ సమయంలో అతడు బృందావనంలో పుట్టి పెరిగిన కడిమి చెట్టు నడుమ ప్రదేశంలో విహరిస్తున్నాడు. బలదేవుడు కూడ ఆ మదిర వాసనను ఒక్కసారి ఆఘ్రాణించి, పురాతనమైన ఆ మదధారను త్రాగాలనే వేడుకను పొందాడు.

**తతః కదమ్బాత్ సహసా మద్యధారాం స లాంగలీ ।**
**పతన్తీం వీక్ష్య మైత్రేయ! ప్రయయౌ పరమాం ముదమ్ ॥ 6 ॥**

మైత్రేయా! ఆ సమయంలో లాంగల ధారియైన బలరాముడు కదంబవృక్షంనుండి క్రిందకు జాలువారుతున్న మద్యధారనుచూచి మిక్కిలి సంతోషాన్ని పొందాడు.

**పపౌ చ గోపగోపీభిః సమవేతో ముదాన్వితః ।**
**ప్రగీయమానో లలితం గీతవాద్యవిశారదైః ॥ 7 ॥**

అతడు గోపాలకులతోను, గోపికా జనంతోను కూడుకొన్నవాడై, సంగీతాలు పాడుతూ, గీత వాద్యాలు చక్కగా మ్రోగిస్తూ, గంతులు వేస్తూ పరమానందం పొందుతూ ఆ వారుణీ మదధారలను త్రాగాడు.

**సమత్తోఽత్యన్తఘర్మామ్బుఃకణికామౌక్తికోజ్జ్వలః ।**
**ఆగచ్ఛ యమునే! స్నాతు మిచ్ఛామీత్యాహ విహ్వలః ॥ 8 ॥**

దానివలన అతడు మిక్కిలి మత్తుగొన్నవాడై, చెమట బిందువులు ముత్యాలులా శోభిస్తూ ఉండగా, అత్యంత విహ్వలత్వంతో "ఓ యమునా నదీ! ఇలా రా! స్నానం చేయాలనుకొంటున్నాను" అన్నాడు.

**తస్య వాచం నదీ సా చ మత్తోక్తామవమత్య వై ।**
**నాజగామ తతః క్రుద్ధో హలం జగ్రాహ లాంగలీ ॥ 9 ॥**

మద్యపానంతో మత్తుడై ఏదో ప్రేలుతున్నాడని, ఆ మాట లెక్కేమియని యమునానది ఆతనిమాటను తృణీకరించి దరికి రాకుండా ఉండిపోయింది. అందువల్ల ఆ లాంగలధారి మహాక్రుద్ధుడై నాగలి పట్టుకొన్నాడు.

**గృహీత్వా తాం తటే తేన చకర్ష మదవిహ్వలః ।**
**పాపే నాయాసి నాయాసి గమ్యతామిచ్ఛయాన్యతః ॥ 10 ॥**

అతడు మదవిహ్వలుడై నాగలిని పట్టుకొని ఆ యమునానదిని ఒడ్డునుండి లాగుతూ "ఓసి పాపాత్మురాలా! నేను పిలిస్తే రావా? నీవు రావా? శక్తి ఉంటే నీ ఇచ్ఛ వచ్చినట్లు మరో చోటికి పో!"అన్నాడు.

**సాకృష్టా తేన సహసా మార్గం సన్త్యజ్య నిమ్నగా ।**
**యత్రాస్తే బలభద్రోఽసౌ ప్లావయామాస తద్వనమ్ ॥ 11 ॥**

ఆ విధంగా బలరామునిచే వేగంగా బలంగా లాగబడడం వల్ల ఆ నదీదేవత తన దారి వదలి పొరలి పారి, అతడున్న ఆ వన ప్రాంతమంతా ముంచెత్తింది.

**శరీరిణీ తథాభ్యేత్య త్రాసవిహ్వలలోచనా ।**
**ప్రసీదేత్యబ్రవీద్ రామం ముంచ మాం ముసలాయుధ ! ॥ 12 ॥**

అంత ఆ నది శరీరం ధరించి బలరాముని ఎదుటికి వచ్చి భయంచే కన్నులు విహ్వలింపగా "ఓ ముసలాయుధా! నా పట్ల ప్రసన్నుడవు కావలసింది. నన్ను విడిచిపెట్టు." అని ప్రార్థించింది.

**(తతస్తస్యాస్తు వచన మాకర్ణ్య స హలాయుధః)**
**సోఽబ్రవీదవజానాసి మమ శౌర్యబలే యది ।**
**సోఽహం త్వాం హలపాతేన వినేష్యామి సహస్రధా ॥ 13 ॥**

ఆమె దీన వాక్యాలను ఆలకించినప్పటికి హలాయుధుడు "నీవు నా బలవీర్యాలను అవమానపరిచావు. అందువల్ల నిన్ను నేను ఈ నాగటి పోటున వేయి తునుకలు గావిస్తాను" అని కోపంగా అన్నాడు.

**ఇత్యుక్తయా౽తిసన్త్రాసాత్ తయా నద్యా ప్రసాదితః ।**
**భూభాగే ప్లావితే తస్మిన్ ముమోచ యమునాం బలః ॥ 14 ॥**

అలా అతడు వచించగానే, యమునా నది మిక్కిలి జడిసి ఆతనిని బ్రతిమాలింది. అందువల్ల బలభద్రుడు ఆ నదిని అట్లు ప్రవహించిన ఆ భూభాగంలోనే వదలిపెట్టాడు.

**తతః స్నాతస్య వై కాన్తిరాజగామ మహాత్మనః ।**
**అవతంసోత్పలం చారు గృహీత్వైకం చ కుణ్డలమ్ ॥ 15 ॥**

**వరుణప్రహితాం చాస్మై మాలామమ్లానపంకజామ్ ।**
**సముద్రాభే తథా వస్త్రే నీలే లక్ష్మీరయచ్ఛత ॥ 16 ॥**

ఆ తరువాత ఆ మహాత్ముడు అందు స్నానం ఆడినంతనే అతనికి అద్భుతమైన కాంతి వచ్చింది. అపుడు లక్ష్మీదేవి స్వయంగా ప్రత్యక్షమై ఒక చక్కని కలువపూవును శిరోభూషణం గాను, ఒక కుండలాన్ని వరుణునిచే పంపబడిన వాడిపోని పద్మాలమాలను, సముద్రకాంతితో సమానమైన రెండు నీలాంబరాలను ఆతనికి ఇచ్చింది.

**కృతావతంసః స తదా చారుకుణ్డలభూషితః ।**
**నీలామ్బరధరః స్రగ్వీ శుశుభే కాంతిసంయుతః ॥ 17 ॥**

అతడు అప్పుడు కలువపూవును శిరోభూషణంగా ధరించి, చక్కని కుండలాన్ని అలంకరించుకొని, నల్లని వలువలను మేనిపై దాల్చి, అమ్లాన పంకజమాలను ధరించి మనోహర ధీధితులతో బలరాముడు ప్రకాశించాడు.

**ఇత్థం విభూషితో రేమే తత్ర రామస్తథా వ్రజే ।**
**మాసద్వయేన యాతశ్చ పునః స ద్వారకాం పురీమ్ ॥ 18 ॥**

ఈ విధంగా అలంకృతుడై ఆ వ్రజభూమిలో బలరాముడు ఆ రీతిగా రెండు మాసాలు విహరించాడు. తరువాత తిరిగి అతడు ద్వారకాపురికి వెళ్లిపోయాడు.

**రేవతీం నామ తనయాం రైవతస్య మహీపతేః ।**
**ఉపయేమే బలస్తస్యాం జజ్ఞాతే నిశఠోల్ముకౌ ॥ 19 ॥**

అనంతరం బలరాముడు రైవతుడనే మహారాజు కుమార్తె అయిన రేవతిని వివాహమాడాడు. అతనికి ఆమెయందు నిశఠుడు, ఉల్ముకుడు అనే ఇద్దరు కుమారులు జన్మించారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే బలరామ వ్రజవిహారో నామ పంచవింశో౽ధ్యాయః సమాప్తః ॥ 25 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో బలరామ వ్రజవిహారం అనే ఇరవై అయిదవ అధ్యాయం సమాప్తం ॥25॥



## షడ్వింశోఽధ్యాయః - ఇరవై ఆరవ అధ్యాయం
## రుక్మిణీ కల్యాణమ్ - రుక్మిణీ కల్యాణం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెబుతున్నాడు.

**భీష్మకః కుణ్డినే రాజా విదర్భవిషయేఽభవత్ ।**
**రుక్మీ తస్యాభవత్ పుత్రో రుక్మిణీ చ వరాంగనా ॥ 1 ॥**

మైత్రేయా! విదర్భదేశంలో కుండినపురంలో భీష్మకుడు అనే పేరుగల రాజు ఉండేవాడు. అతనికి రుక్మి అనే పేరుగల కుమారుడు, రుక్మిణి అనే పేరుగల శుభాంగియైన కుమార్తె ఉన్నారు.

**రుక్మిణీం చకమే కృష్ణః సా చ తం చారుహాసినీ ।**
**న దదౌ యాచతే చైనాం రుక్మీ ద్వేషేణ చక్రిణే ॥ 2 ॥**

కృష్ణుడూ రుక్మిణినే వివాహమాడ కోరతాడు. చారుహాసినియైన రుక్మిణి కూడ కృష్ణునే పెండ్లాడకోరింది. కాని అలా కోరినా రుక్మి చక్రి పట్ల ద్వేషం పొంది ఆమెను అతనికి ఈయలేదు.

**దదౌ చ శిశుపాలాయ జరాసన్ధ ప్రచోదితః ।**
**భీష్మకో రుక్మిణా సార్ధం రుక్మిణీమురువిక్రమః ॥ 3 ॥**

జరాసంధునిచే ప్రేరేపించబడి, కుమారుడైన రుక్మి బలవంతంపై, పరాక్రమశాలియైన భీష్మకుడు కుమార్తె రుక్మిణిని శిశుపాలునకీయ సంకల్పించాడు.

**వివాహార్థం తతః సర్వే జరాసన్ధముఖా నృపాః ।**
**భీష్మకస్య పురం జగ్ముః శిశుపాల ప్రియైషిణః ॥ 4 ॥**

అనంతరం శిశుపాలుని హితం కోరే జరాసంధుడు మున్నగు రాజులందరు వివాహార్థమై భీష్మకుని నగరానికి విచ్చేశారు.

**కృష్ణోఽపి బలభద్రాద్యైర్యాదవై ర్బహుభిర్వృతః ।**
**ప్రయయౌ కుణ్డినం ద్రష్టుం వివాహం చైద్యభూభృతః ॥ 5 ॥**

కృష్ణుడు కూడ బలరాముడు మున్నగు అనేక యాదవప్రముఖులతో కలసి చైద్యరాజగు శిశుపాలుని పెండ్లి చూడడానికై కుండినపురికి ఏతెంచాడు.

**శ్వోభావిని వివాహే తు తాం కన్యాం హృతవాన్ హరిః ।**
**విపక్షభారమాసజ్య రామాద్యేష్వథ బన్ధుషు ॥ 6 ॥**

రేపు వివాహం కానున్నదనగా శత్రువులను నిగ్రహించే కార్యభారాన్ని బలరామాది బంధువులపై నియోగించి కృష్ణుడు ఆ పెండ్లికుమార్తె అయిన రుక్మిణిని హరించుకొని పోయాడు.

**తతశ్చ పౌణ్డ్రకః శ్రీమాన్ దన్తవక్రో విదూరథః ।**
**శిశుపాలజరాసన్ధసాల్వాద్యాశ్చ మహీభృతః ॥ 7 ॥**
**కుపితాస్తే హరిం హన్తుం చక్రురుద్యోగముత్తమమ్ ।**
**నిర్జితాశ్చ సమాగమ్య రామాద్యైర్యదుపుంగవైః ॥ 8 ॥**

అంత శ్రీమంతుడగు పౌండ్రకుడు, దంతవక్రుడు, విదూరథుడు, శిశుపాలుడు, జరాసంధుడు, సాల్వుడు మున్నగు రాజేంద్రులు కోపోద్రిక్తులై హరిని పరిమార్చడానికై మహాప్రయత్నమే చేశారు. కాని బలరాముడు మున్నగు యదుశ్రేష్ఠుల ధాటికి ఓర్వలేక ఓడిపోయారు కూడ.

**కుణ్డినం న ప్రవేక్ష్యామి హ్యహత్వా యుధి కేశవమ్ ।**
**కృత్వా ప్రతిజ్ఞాం రుక్మీ చ హన్తుం కృష్ణమభిద్రుతః ॥ 9 ॥**

రుక్మిమాత్రం కేశవుని యుద్ధంలో సంహరించకుండా, కుండినపురంలో ప్రవేశించనని ప్రతిజ్ఞచేసి కృష్ణుని చంపడానికై తరుముకొంటూ వెళ్లాడు.

**హత్వా బలం సనాగాశ్వపత్తిస్యన్దనసంకులమ్ ।**
**నిర్జితః పాతితశ్చోర్వ్యాం లీలయైవ స చక్రిణా ॥ 10 ॥**

అంత కృష్ణుడు ఏనుగులు, గుర్రాలు, రథాలు, కాల్బలంతో కూడుకొన్న చతురంగబలాలను కూల్చివేసి, లీలామాత్రంగా రుక్మిని ఓడించి భూమిపై పడవేశాడు.

**హన్తుం కృతమతిః కృష్ణో రుక్మిణం యుద్ధ దుర్మదమ్ ।**
**ప్రణమ్య యాచితో బ్రహ్మన్ రుక్మిణ్యా భగవాన్ హరిః ॥ 11 ॥**

బ్రాహ్మణోత్తమా! అపుడు కృష్ణుడు యుద్ధోన్మత్తుడైన రుక్మిని వధించు తలంపుతో ఉండగా చూచి, రుక్మిణి భగవంతుడైన హరికి నమస్కరించి ఇలా యాచించింది.

**ఏక ఏవ మమ భ్రాతా న హన్తవ్యస్త్వయాఽధునా ।**
**కోపం నియమ్య దేవేశ! భ్రాతృభిక్షా ప్రదీయతామ్ ॥ 12 ॥**

"నాకు ఒక్కడే సోదరుడు. కాబట్టి నీవు ఆతనిని చంపవద్దు. దేవేశా! కోపం ఉపసంహరించు. నాకు భ్రాతృభిక్ష ప్రసాదించు" అని కోరింది.

**ఇత్యుక్తేన పరిత్యక్తః కృష్ణేనాక్లిష్ట కర్మణా ।**
**రుక్మీ భోజకటం నామ పురం కృత్వాఽవసత్ తదా ॥ 13 ॥**

రుక్మిణి ఆ విధంగా ప్రార్థించగా, దుందుడుకు పనులు చేయుటకు ఇచ్చగించని కృష్ణుడు ఆతనిని వదలివేశాడు. రుక్మి కూడ తన మాటప్రకారం కుండినపురి ప్రవేశించకుండా, భోజకటమనే నగరాన్ని నిర్మించుకొని అక్కడ నివసించసాగాడు.

**నిర్జిత్య రుక్మిణం సమ్యగుపయేమే చ రుక్మిణీమ్ ।**
**రాక్షసేన వివాహేన సమ్ప్రాప్తాం మధుసూదనః ॥ 14 ॥**

ఈ విధంగా మధుసూదనుడు రుక్మిని గెలిచి రాక్షస వివాహం ద్వారా తనకు సంప్రాప్తమైన రుక్మిణిని శాస్త్రవిధిని వివాహమాడాడు.

**తస్యాం జజ్ఞేఽథ ప్రద్యుమ్నో మదనాంశః స వీర్యవాన్ ।**
**జహార శమ్బరో యం వై యో జఘాన చ శమ్బరమ్ ॥ 15 ॥**

ఆమెయందు ఆ వీర్యవంతుడైన హరి మన్మథాంశుడైన ప్రద్యుమ్నుని కుమారునిగా పొందాడు. అతనిని శంబరాసురుడు అపహరించుకొనిపోయాడు. అంత ఆ ప్రద్యుమ్నుడు శంబరుని సంహరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే రుక్మిణీ కల్యాణం నామ షడ్వింశోఽధ్యాయః సమాప్తః ॥ 26 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో రుక్మిణీ కల్యాణం అనే ఇరవై ఆరవ అధ్యాయం సమాప్తం ॥ 26 ॥



## సప్తవింశోఽధ్యాయః - ఇరవై ఏడవ అధ్యాయం

## శంబరాసురవధః - శంబరాసుర వధ

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు ఇలా అడుగుతున్నాడు.

**శమ్బరేణ హృతో వీరః ప్రద్యుమ్నః స కథం మునే! ।**
**శమ్బరశ్చ మహావీర్యః ప్రద్యుమ్నేన కథం హతః ॥ 1 ॥**

"మునీశ్వరా! వీరుడైన ప్రద్యుమ్నుని శంబరుడు ఎలా అపహరించాడు? మహాబల పరాక్రమవంతుడైన శంబరుని ప్రద్యుమ్నుడు ఎలా వధించాడు?" అని అడిగాడు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు ఇలా బదులిచ్చాడు.

**షష్ఠేఽహ్ని జాతమాత్రన్తు ప్రద్యుమ్నం సూతికాగృహాత్ ।**
**మమైష హన్తేతి మునే! హృతవాన్ కాలశమ్బరః ॥ 2 ॥**

"మునివర్యా! ప్రద్యుమ్నుడు పుట్టిన వెంటనే వీడు తనను చంపేవాడని తెలిసికొన్న శంబరుడు ఆరవనాడు పురిటింటినుండి ఆతనిని ఎత్తుకొనిపోయాడు.

**హృత్వా చిక్షేప చైవైనం గ్రాహోగ్రే లవణార్ణవే ।**
**కల్లోలజనితావర్తే సుఘోరే మకరాలయే ॥ 3 ॥**

ఆ శిశువును అలా అపహరించు కొనిపోయి పెద్ద పెద్ద మొసళ్లతో నిండిన, కెరటాల నుండి పుట్టిన సుడిగుండాలతో కూడుకొన్న, మహాభయంకరమైన, అనేక జలచరాదులకు నిలయమైన లవణ సముద్రంలో పడవేశాడు.

**పతితం తత్ర చైవైకో మత్స్యో జగ్రాహ బాలకమ్ ।**
**న మమార చ తస్యాపి జఠరేఽనల దీపితః ॥ 4 ॥**

ఆ విధంగా సముద్రంలో పడిన ఆ పిల్లవానిని ఒక చేప మ్రింగింది. ఆ బాలుడు అగ్నిలాగ ప్రకాశించే కాంతి గల్గినవాడు కావడంచే ఆ మత్స్యం జఠరాగ్నిలో అతడు నశించకుండా ఉండిపోయాడు.

**మత్స్య బన్ధైశ్చ మత్స్యోఽసౌ మత్స్యై రన్యైః సహ ద్విజః ।**
**ఘాతితోఽసురవర్యాయ శమ్బరాయ నివేదితః ॥ 5 ॥**

ద్విజోత్తమా! జాలరులు ఆ చేపను మిగిలిన చేపలతో బాటుగా వలవేసి పట్టుకొని అసురశ్రేష్ఠుడైన శంబరునకు ఉపాయనంగా నివేదించారు.

**తస్య మాయావతీ నామ పత్నీ సర్వగృహేశ్వరీ ।**
**కారయామాస సూదానామాధిపత్యమనిన్దితా ॥ 6 ॥**

మాయావతి అన్నపేరు కల్గి, సౌశీల్యం కల శంబరుని భార్య ఆ చేపను వంటచేసే వారికి పంపించింది.

**దారితే మత్స్యజఠరే సా దదర్శాతిశోభనమ్ ।**
**కుమారం మన్మథతరోర్దగ్ధస్య ప్రథమాంకురమ్ ॥ 7 ॥**

ఆ చేప పొట్ట కోసినంతటనే, అందుండి బయటపడ్డ మున్ను దగ్ధమైపోయిన మన్మథుడనే తరువు యొక్క తొలిమొలకయా అన్నట్లుగా ఉన్న ముగ్ధమోహన మూర్తియైన ఒక కుమారుని ఆమె చూచింది.

**కోఽయం కథమయం మత్స్యజఠరం సముపాగతః ।**
**ఇత్యేవం కౌతుకావిష్టాం తాం తన్వీం ప్రాహ నారదః ॥ 8 ॥**

"ఎవడు ఈతడు? ఇతడు చేప గర్భంలో ఎలా ప్రవేశించాడు?" అని ఈ రీతిగా కుతూహలపడుతున్న ఆ తన్వంగి మాయావతిని చూచి నారదుడు ఇలా అన్నాడు.

**అయం సమస్తజగతః సూతిసంహారకారిణః ।**
**శమ్బరేణ హృతో విష్ణోస్తనయః సూతికాగృహాత్ ॥ 9 ॥**

**క్షిప్తః సముద్రే మత్స్యేన నిగీర్ణస్తే వశంగతః ।**
**నరరత్నమిదం సుభ్రు విస్రబ్ధా పరిపాలయ ॥ 10 ॥**

"ఇతడు సకల జగత్తులకు సృష్టిసంహారకారకుడైన విష్ణువు కుమారుడు. పురిటింటి నుంచి శంబరాసురునిచే అపహరింపబడ్డాడు. సముద్రంలో విసరివేయబడ్డ ఈతనిని చేప మ్రింగగా, దాని మూలంగా నీ ఇంటిలో ఈ రీతిగా బయటపడ్డాడు. మంచి కనుబొమలు గల మాయావతీ! ఇతడు మానవలోకానికే రత్నం లాంటివాడు. నీవు విశ్వాసపూర్వకంగా ఈ బాలుని పరిరక్షించు" అని వచించాడు.

**నారదేనైవముక్తా సా పాలయామాస తం శిశుమ్ ।**
**బాల్యాదేవాతిరాగేణ రూపాతిశయమోహితా ॥ 11 ॥**

నారదుడు ఈ విధంగా చెప్పగా మాయావతి ఆ పిల్లవానిని బాల్యనిమిత్తమైన అనురాగంతోను, వాని మిక్కిలి రూపసంపదకు మోహపడి, చక్కగా పెంచసాగింది.

**స తదా యౌవనాభోగభూషితోఽభూన్మహామతే! ।**
**సాభిలాషా తదా సాఽపి బభూవ గజగామినీ ॥ 12 ॥**

మహాబుద్ధిశాలివైన మైత్రేయా! ఆతడు అలా నిండు జవ్వనంతో మిసమిసలాడుతూ వయసు వచ్చిన వాడయ్యాడు. ఆ మదగజయాన కూడ ఆ సొగసుకానియందు అభిలాష కలదయ్యింది.

**మాయావతీ దదౌ తస్మై మాయాః సర్వా మహామునే! ।**
**ప్రద్యుమ్నాయాతి రాగాన్ధా తన్న్యస్త హృదయేక్షణా ॥ 13 ॥**

ఓ మహామునీ! ఆ మాయావతి ప్రద్యుమ్నుని పట్ల మిక్కిలి ప్రణయ వివశురాలై, అతనికి తన హృదయాన్ని, చూపులను సమర్పించి తనకు తెలిసిన సమస్తమాయలను అతనికి నేర్పింది.

**ప్రసజ్జన్తీం తు తామాహ స కార్ష్ణిః కమలేక్షణామ్ ।**
**మాతృత్వమపహాయాద్య కిమేవం వర్తసేఽ_న్యథా ॥ 14 ॥**

తనపై ఆసక్తి చూపిస్తున్న ఆ పద్మలోచనను ఆలోకించి కృష్ణతనయుడైన ప్రద్యుమ్నుడు మాతృభావం వదలి నాపట్ల ఇట్లేల ప్రవర్తిస్తున్నావని ప్రశ్నించాడు.

**సాచాస్మై కథయామాస న పుత్రస్త్వం మమేతి వై ।**
**తనయం త్వామయం విష్ణోః హృతవాన్ కాలశమ్బరః ॥ 15 ॥**

**క్షిప్తః సముద్రే మత్స్యస్య సమ్ప్రాప్తో జఠరాన్మయా ।**
**సా తు రోదితి తే మాతా కాన్తాద్యాప్యతివత్సలా ॥ 16 ॥**

అపుడామె అతనితో "నీవు నాకు పుట్టిన పుత్రుడవు కావు. ఈ మృత్యురూపుడైన శంబరాసురుడు విష్ణువు కుమారుడవగు నిన్ను అపహరించి సముద్రమధ్యంలో పడవేశాడు. అపుడు నీవు చేప కడుపునబడి దానిమూలంగా నా వద్దకు చేరావు. నిన్ను కన్నతల్లి ఓ కాంత! నీకై తపిస్తూ మిక్కిలి వాత్సల్యదృష్టితో ఇప్పుడు రోదిస్తూ ఉన్నది." అని తెలియజేసింది.

**ఇత్యుక్తః శమ్బరం యుద్ధే ప్రద్యుమ్నః స సమాహ్వయత్ ।**
**క్రోధాకులీకృతమనా యుయుధే చ మహాబలః ॥ 17 ॥**

మాయావతి ఈ రీతిగా చెప్పగా ప్రద్యుమ్నుడు శంబరుని యుద్ధానికి ఆహ్వానించాడు. మహాబలవంతుడైన అతడు కోపవిహ్వలనయనుడై అతనితో యుద్ధం చేశాడు.

**హత్వా సైన్యమశేషన్తు తస్య దైత్యస్య మాధవిః ।**
**సప్తమాయా వ్యతిక్రమ్య మాయాం ప్రయుయుజేఽ_ష్టమీమ్ ॥ 18 ॥**

మాధవుని కుమారుడైన ప్రద్యుమ్నుడు ఆ రాక్షసుని సమస్త సైన్యాన్ని కూల్చి, ఆతడు ప్రయోగించిన ఏడు శంబర మాయలను అధిగమించి తాను పేల్చిన ఎనిమిదవ మాయాబలాన్ని అతనిపై ప్రయోగించాడు.

**తయా జఘాన తం దైత్యం మాయయా కాలశమ్బరమ్ ।**
**ఉత్పత్య చ తయా సార్థమాజగామ పితుర్గృహమ్ ॥ 19 ॥**

అతడు ఆ మాయచే కాలశంబరుడనే ఆ దైత్యుని కూల్చి ఆ మాయాదేవితో కలసి ఆకాశానికి ఎగిరి తండ్రియైన కృష్ణుని నివాసానికి వచ్చాడు.

**అన్తఃపురే నిపతితం మాయావత్యా సమన్వితమ్ ।**
**తం దృష్ట్వా కృష్ణసంకల్పా బభూవుః కృష్ణయోషితః ॥ 20 ॥**

మాయావతితో కూడుకొని అంతఃపురమందు వ్రాలిన ఆ ప్రద్యుమ్నుని వీక్షించి కృష్ణుని భార్యలు కృష్ణుడే అని భావించారు.

**రుక్మిణీ చావదత్ ప్రేమ్ణా సాశ్రుదృష్టిరనిన్దితా ।**
**ధన్యాయాః ఖల్వయం పుత్రో వర్తతే నవయౌవనే ॥ 21 ॥**

ఎల్లప్పుడూ అందరిచే ప్రశంసించబడే రుక్మిణి ప్రేమతో తన కుమారుని చూచి ఆనందబాష్పాలు నింపుకొంటూ (అతడు తన కొడుకని తెలియక) "ఈ ఎలప్రాయంలో ఉన్న బిడ్డని కన్న ధన్యురాలు ఎవ్వరో కదా!

**అస్మిన్ వయసి పుత్రో మే ప్రద్యుమ్నో యది జీవతి ।**
**సభాగ్యా జననీ వత్స! త్వయా కాపి విభూషితా ॥ 22 ॥**

నా కొడుకైన ప్రద్యుమ్నుడు జీవించి కనుక ఉంటే, ఈ ఈడువాడై ఉండేవాడు కదా! నాయనా! నీవంటి కుమారుని వల్ల మన్నించబడే ఆ తల్లి ఎంత భాగ్యవంతురాలో కదా!

**అథవా యాదృశః స్నేహో మమ యాదృగ్ వపుస్తవ ।**
**హరేరపత్యం సువ్యక్తం భవాన్ వత్స! భవిష్యతి ॥ 23 ॥**

నాయనా! అదీకాక నిన్ను చూస్తూ ఉంటే, నీపై నాకు కలిగే ప్రీతిని బట్టి చూస్తే, నీ శరీరంలోని ముఖ కవళికలను గమనిస్తే నీవు కృష్ణుని కుమారుడవే. ఏ సందేహం లేదు. నీవు హరి సంతానమే." అని భావించింది.

**ఏతస్మిన్నన్తరే ప్రాప్తః సహకృష్ణేన నారదః ।**
**అన్తఃపురచరీం దేవీం రుక్మిణీం ప్రాహ హర్షయన్ ॥ 24 ॥**

ఈ సమయంలో నారదమహర్షి కృష్ణునితోపాటు అక్కడకు వచ్చి అంతఃపురంలో చరిస్తున్న రుక్మిణీదేవిని చూచి సంతోషం వ్యక్తం చేస్తూ, ఆమెను ఉత్సాహపరుస్తూ,

**ఏష తే తనయః సుభ్రు! హత్వా శమ్బరమాగతః ।**
**హృతో యేనాభవద్బాలో భవత్యాః సూతికాగృహాత్ ॥ 25 ॥**

"ఓ పరమపావనీ! ఇతడు నీ కుమారుడే. శంబరాసురుని సంహరించి వచ్చాడు. పిల్లవాడుగా ఉన్నప్పుడే నీ పురిటింటి నుండి ఇతడు ఆ మాయావిచే అపహరించ బడ్డాడు.

**ఇయం మాయావతీ భార్యా తనయస్యాస్య తే సతీ,**
**శమ్బరస్య న భార్యేయం శ్రూయతామత్ర తే సతీ ।**
**శమ్బరస్య న భార్యేయం శ్రూయతామత్ర కారణమ్ ॥ 26 ॥**

ఈ సతి మాయావతి నీ తనయుని భార్యయే సుమా! ఈమె శంబరుని భార్య కాదు. ఆ సతి నీ కుమారుని భార్యయే. ఈమె శంబరుని భార్య కానే కాదు. దానికి కారణం ఆలకించు.

**మన్మథే తు గతే నాశం తదుద్భవ పరాయణా ।**
**శమ్బరం మోహయామాస మాయారూపేణ రూపిణీ ।**

తొల్లి కామదేవుడు మన్మథుని బూడిదచేసిన తరువాత ఆతనిని పుట్టించడమందు మాత్రమే ఆసక్తి కల్గిన మహాభాగురాలు ఆతని భార్య, తన మాయా స్వరూపంచే శంబరాసురుని మోహపరవశుని కావించింది.

**విహారాద్యుపభోగేషు రూపం మాయామయం శుభమ్ ।**
**దర్శయామాస దైత్యస్య తస్యేయం మదిరేక్షణా ॥ 28 ॥**

ఈ మదిరేక్షణ ఆ దైత్యుడైన శంబరాసురునికి విహారం మున్నగు ఉపభోగసమయాలలో తన అతిసుందరమైన మాయామయ స్వరూపాన్ని ప్రదర్శించింది.

**కామోఽవతీర్ణః పుత్రస్తే తస్యేయం దయితా రతిః ।**
**విశంకా నాత్ర కర్తవ్యా స్నుషేయం తవ శోభనా ॥ 29 ॥**

ఆ కాముడే నీ పుత్రరూపంగా అవతరించాడు. ఈ మాయావతి అతని భార్య రతి. ఇందు నీవు సందేహించవలసిన అవసరం లేదు. ఈ కల్యాణి నీ కోడలే సుమా!" అని వచించాడు.

**తతో హర్ష సమావిష్టౌ రుక్మిణీ కేశవస్తదా ।**
**నగరీ చ సమస్తా సా సాధు సాధ్విత్యభాషత ॥ 30 ॥**

అంత రుక్మిణియు, కృష్ణుడు ఆనందసంభరితులయ్యారు. పురం పురం అంతా బాగు బాగని కొనియాడింది.

**చిరం నష్టేన పుత్రేణ సంయుక్తాం ప్రేక్ష్య రుక్మిణీమ్ ।**
**అవాప విస్మయం సర్వో ద్వారవత్యాం జనస్తదా ॥ 31 ॥**

చాలాకాలానికి కనిపించిన కొడుకొను కలిసికొన్న రుక్మిణిని చూచి ద్వారకానగరంలోని జనం అంతా ఆశ్చర్యం పొందింది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే శంబరాసురవధో నామ సప్తవింశోఽధ్యాయః సమాప్తః ॥ 27 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో శంబరాసుర వధ అనే ఇరవై ఏడవ అధ్యాయం సమాప్తం ॥ 27 ॥



# అష్టావింశోఽధ్యాయః - ఇరవై ఎనిమిదవ అధ్యాయం

## రుక్మి వధః – రుక్మి వధ

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెబుతున్నాడు.

**చారుదేష్ణం సుదేష్ణం చ చారుదేహం చ వీర్యవాన్ ।**
**సుషేణం చారుగుప్తం చ భద్రచారుం తథా పరమ్ ॥ 1 ॥**

**చారువిన్దం సుచారుం చ చారుం చ బలినాం వరమ్ ।**
**రుక్మిణ్యజనయత్ పుత్రాన్ కన్యాం చారుమతీం తథా ॥ 2 ॥**

మైత్రేయా! ప్రద్యుమ్నునికాక రుక్మిణి చారుదేష్ణుడు, సుదేష్ణుడు, బలవంతుడైన చారుదేహుడు, సుషేణుడు, చారుగుప్తుడు, భద్రచారుడు, చారువిందుడు, సుచారువు, మహాబలశాలియైన చారువు అనే కుమారులను, చారుమతి అనే కుమార్తెను కన్నది.

**అన్యాశ్చ భార్యాః కృష్ణస్య బభూవుః సప్త శోభనాః ।**
**కాలిన్దీ మిత్రవిన్దా చ సత్యా నాగ్నజితీ తథా ॥ 3 ॥**

**దేవీ జామ్బవతీ చాపి రోహిణీ కామరూపిణీ ।**
**భ(మ)ద్ర రాజసుతా చాన్యా సుశీలా శీలమణ్డనా ॥ 4 ॥**

**సాత్రాజితీ సత్యభామా లక్ష్మణా చారుహాసినీ ।**
**షోడశాసన్ సహస్రాణి స్త్రీణామన్యాని చక్రిణః ॥ 5 ॥**

కృష్ణునికి రుక్మిణి కాకుండా ఇతరులు ఏడుగురు పరమ శోభనలైన భార్యలున్నారు. వారు కాలింది, మిత్రవింద, నగ్నజిత్తు పుత్రి అయిన సత్య, జాంబవంతుని కుమార్తె అయిన కామరూపిణి రోహిణి, అత్యంత సౌశీల్యవతి భద్రరాజ తనయ అయిన సుశీల, సత్రాజిత్తు నందనయైన సత్యభామ, చారుహాసినియైన లక్ష్మణ అనేవారు. ఈ ఎనమండుగురూ కాక శ్రీకృష్ణునికి వేరే పదహారు వేలమంది భార్యలు కలరు.

**ప్రద్యుమ్నోఽపి మహావీర్యో రుక్మిణస్తనయాం శుభామ్ ।**
**స్వయంవరస్థాం జగ్రాహ సా చ తం తనయం హరేః ॥ 6 ॥**

మహాబలవంతుడైన ప్రద్యుమ్నుడు కూడ స్వయంవరంలో రుక్మి కుమార్తె అయిన పరమశుభాంగిని వరించాడు. ఆమె కూడ శ్రీకృష్ణుని కుమారుని వరించింది.

**(త) యస్యామస్యాభవత్పుత్రో మహాబలపరాక్రమః ।**
**అనిరుద్ధో రణే క్రుద్ధో వీర్యోదధిరరిన్దమః ॥ 7 ॥**

అతనికి ఆమెయందు మిక్కిలి బలపరాక్రమసంపన్నుడైన శత్రుంజయుడగు, వీర్యసముద్రుడైన, యుద్ధంలో అతిక్రుద్ధుడై ఎవ్వరికి నిరోధింప శక్యంకాని అనిరుద్ధుడనే కుమారుడు జన్మించాడు.

**తస్యాపి రుక్మిణః పౌత్రీం వరయామాస కేశవః ।**
**దౌహిత్రాయ దదౌ రుక్మీ తాం స్పర్ధన్నపి శౌరిణా ॥ 8 ॥**

ఆ అనిరుద్ధునకు రుక్మి మనుమరాలి నిమ్మని శ్రీకృష్ణుడు కోరాడు. రుక్మికి కృష్ణునిపై స్పర్ధ ఉన్నప్పటికి కూడా తన మనుమరాలిని కృష్ణుని మనుమనికి ఇచ్చి వివాహం చేశాడు.

**తస్యా వివాహే రామాద్యా యాదవా హరిణా సహ ।**
**రుక్మిణో నగరం జగ్ముర్నామ్నా భోజకటం ద్విజ ॥ 9 ॥**

ద్విజోత్తమా! ఆమె వివాహనిమిత్తం శ్రీకృష్ణునితో కూడ బలరామాది యాదవులు రుక్మిణి నివాస నగరమైన భోజకటానికి తరలి వెళ్లారు.

**వివాహే తత్ర నిర్వృత్తే ప్రాద్యుమ్నేః సుమహాత్మనః ।**
**కలింగరాజప్రముఖా రుక్మిణం వాక్యమబ్రువన్ ॥ 10 ॥**

అనంతరం మహాత్ముడైన ప్రద్యుమ్న పుత్రుడగు అనిరుద్ధుని వివాహ మహోత్సవం అయిన తరువాత కలింగుడు మున్నగు రాజులు రుక్మితో ఇలా అన్నారు.

**అనక్షజ్ఞో హలీ ద్యూతే తథాఽస్య వ్యసనం మహత్ ।**
**న జయామో బలం కస్మాద్ ద్యూతే నైనం మహాద్యుతే ॥ 11 ॥**

“ఓ మహాతేజస్సంపన్నా! ఈ బలరామునకు ద్యూతక్రీడలో అనుభవం లేదు. అయినా అతనికి ఆ ఆట అంటే ఆసక్తి ఎక్కువ. అందువల్ల మనం ద్యూతకేళిలో బలభద్రుని ఏల గెలువరాదు?” అని అన్నారు.

**తథేతి తానాహ నృపాన్ రుక్మీ బలసమన్వితః ।**
**సభాయాం సహరామేణ చక్రే ద్యూతం చ వై తదా ॥ 12 ॥**

బలమదంతో రుక్మి ఆ రాజులతో అలాగే కానిండని పలికి, సభలో బలరామునితో కలిసి జూదమాడడం ఆరంభించాడు.

**సహస్రమేకం నిష్కాణాం రుక్మిణా విజితో బలః ।**
**ద్వితీయేఽపి పణే చాన్యత్ సహస్రం రుక్మిణా జితమ్ ॥ 13 ॥**

ఆ జూదంలో మొదట బలరాముడు ఒకవేయి నిష్కములు పందెంగా ఒడ్డి రుక్మిచే ఓడిపోయాడు. రెండో పందెంలో కూడ అలాగే మరో వేయి నిష్కములు పణంగా పెట్టి అప్పుడు కూడ రుక్మిచే పరాజితుడయ్యాడు.

**తతో దశసహస్రాణి నిష్కాణాం పణమాదదే ।**
**బలభద్రోఽజయత్తాని రుక్మీ ద్యూతవిదాం వరః ॥ 14 ॥**

అనంతరం మళ్లీ బలరాముడు పదివేల నిష్కములు పందెం ఒడ్డాడు. ద్యూత విద్యావిశారదుడైన రుక్మి అతనిని ఓడించి ఆ పందెం మొత్తం గెలుచుకొన్నాడు (నిష్కము అనగా నాలుగు బంగారు నాణెములు).

**తతో జహాస స్వనవత్ కలింగాధిపతి ర్ద్విజ! ।**
**దన్తాన్ విదర్శయన్ మూఢో రుక్మీ చాహ మదోద్ధతః ॥ 15 ॥**

ద్విజశ్రేష్ఠా! అపుడు కలింగదేశపు మహారాజు బిగ్గరగా అరుస్తూ, పకపక ఫక్కుమని నవ్వాడు. పండ్లికిలిస్తూ వెర్రిచేష్టలు చేశాడు. అంత మదోన్మత్తుడై రుక్మి ఇలా అన్నాడు.

**అవిజ్ఞోఽయం మయా ద్యూతే బలదేవః పరాజితః ।**
**ముధైవాక్షావలేపాన్ధో యః స్వం మేనేఽక్ష కోవిదమ్ ॥ 16 ॥**

"ఇతడు జూదం ఏమీ తెలియనివాడు. నేను ఈ బలదేవుని గెలిచాను. అక్షక్రీడలో లేనిపోని గొప్పవాళ్ల మన్నట్లుగా గ్రుడ్డి నమ్మకంతో తానే ద్యూతక్రీడా కోవిదుడనన్నట్లుగా ఇతడు భావిస్తాడు" అని దంభాలు పలికాడు.

**దృష్ట్వా కలింగరాజం తం ప్రకాశదశనాననమ్ ।**
**రుక్మిణం చాపి దుర్వాక్యం కోపం చక్రే హలాయుధః ॥ 17 ॥**

కలింగరాజు పండ్లు ఇకిలిస్తూ ఉన్న ముఖాన్ని చూడడంతోనే, రుక్మి పలికిన దురుక్తులు వినడంతోనే నాగలి ఆయుధంగా స్వీకరించిన బలభద్రుడు కోపోద్రిక్తుడయ్యాడు.

**తతః కోప పరీతాత్మా నిష్కకోటిం హలాయుధః ।**
**గ్లహం జగ్రాహ రుక్మీ చ తదర్థేఽక్షానపాతయత్ ॥ 18 ॥**

అంత హలాయుధుడైన బలదేవుడు క్రోధంతో నిండిన మనస్సుతో కోటి నిష్కాలను పందెంగా పెట్టాడు. రుక్మికూడ ఆ కోటి సువర్ణాల కోసమై పాచికలను పట్టుకొని విసిరాడు.

**అజయద్బలదేవస్తం ప్రాహోచ్చైస్తం జితం మయా ।**
**మయేతి రుక్మీ ప్రాహోచ్చైరలీకోక్తైరలం బల! ॥ 19 ॥**

బలదేవుడు ఆ పందెం గెలుచుకొన్నాడు. ఈ పందెం నేను గెలుచుకొన్నానని గట్టిగా అరచాడు. రుక్మి అయితే "నేనే ఈ పందెం గెలిచాను. బలరామా! అబద్ధం ఆడడం వల్ల లాభం లేదు. చాలు" అని గట్టిగా తృణీకార బుద్ధితో పలికాడు.

**త్వయోక్తోఽయం గ్లహః సత్యం న మమైషోఽనుమోదితః ।**
**ఏవం త్వయా చేద్విజితం మయా న విజితం కథమ్ ॥ 20 ॥**

"నీవు పందెం పెట్టావు. నిజమే. కాని దానిని నేను ఆమోదించ లేదు. ఈ స్థితిలో గెలుపు నీదంటున్నావు. విజయం నాదెందుకు కాకుండా ఉంటుంది?" అని రుక్మి వివాదానికి దిగాడు.

**అథాన్తరిక్షే వాగుచ్చైః ప్రాహ గమ్భీరనాదినీ ।**
**బలదేవస్య తం కోపం వర్ధయన్తీ మహాత్మనః ॥ 21 ॥**

ఆ సమయంలో అంతరిక్షంలో ఆకాశవాణి గంభీరనాదంతో మహాత్ముడగు బలదేవుని కోపాన్ని మరింత పెంపొందిస్తూ ఇలా అన్నది.

**జితం బలేన ధర్మేణ రుక్మిణా భాషితం మృషా ।**
**అనుక్త్వాఽపి వచః కించిత్ కృతం భవతి కర్మణా ॥ 22 ॥**

"ధర్మంగా బలదేవుడే గెలిచాడు. రుక్మి పలికినమాట అసత్యం. అంగీకారం పలుకకపోయినా ఒక్కొక్కప్పుడు అది పనిగా క్రియారూపంగా జరుగుతూ ఉంటుంది" అని వచించింది.

**తతో బలః సముత్థాయ కోపసంరక్తలోచనః ।**
**జఘానాష్టాపదేనైవ రుక్మిణం సుమహాబలః ॥ 23 ॥**

అనంతరం మిక్కిలి బలశాలియైన బలభద్రుడు కోపంతో ఎర్రబారిన కన్నులు కలవాడై ఒక్కసారిగా లేచి ఆ పాచిక పలకతో రుక్మిని కొట్టి చంపాడు.

**కలింగరాజం చాదాయ విస్ఫురన్తం బలాద్బలః ।**
**బభంజ దన్తాన్ కుపితో యైః ప్రకాశం జహాస సః ॥ 24 ॥**

అటు పిమ్మట బలరాముడు మహాబలంతో ఎగిరెగిరిపడుతున్న కలింగరాజును పట్టుకొని, ఏ పళ్లు పైకి పెట్టి వికటంగా నవ్వాడో, ఆ దంతాలూడిపోయేలా విరగగొట్టాడు.

**ఆకృష్య చ మహాస్తమ్భం జాతరూపమయం బలః ।**
**జఘాన యేఽన్యే తత్పక్షా భూభృతః కుపితో బలాత్ ॥ 25 ॥**

అంతేకాక బలదేవుడు కోపబలంతో స్వర్ణమయమైన ఆ సభాభవనస్తంభాన్ని ఊడబెరికి, ఆ పక్షానికి చెందిన రాజులను అందరిని చంపివేశాడు.

**తతో హాహా కృతం సర్వం పలాయనపరం ద్విజ! ।**
**తద్రాజమణ్డలం భీతం బభూవ కుపితే బలే ॥ 26 ॥**

ద్విజశ్రేష్ఠా! ఈ విధంగా బలభద్రుడు క్రోధోద్రిక్తుడు కాగా, రాజమండలం అంతా గగ్గోలు పడి హాహాకారాలు చేస్తూ బెదరిపోయి పారిపోయింది.

**బలేన నిహతం శ్రుత్వా రుక్మిణం మధుసూదనః ।**
**నోవాచ కించిన్మైత్రేయ! రుక్మిణీ బలయోర్భయాత్ ॥ 27 ॥**

మైత్రేయా! ఈ రీతిగా బలదేవుడు రుక్మిని వధించిన వార్త విన్న మధుసూదనుడు రుక్మిణిపట్ల ఉన్న సానుభూతితోను, బలభద్రుని పట్ల ఉన్న గౌరవంతోను ఏమీ మాట్లాడకుండా ఉండిపోయాడు.

**తతోఽనిరుద్ధమాదాయ కృతోద్వాహం ద్విజోత్తమ! ।**
**ద్వారకామాజగమాథ యదుచక్రం చ కేశవః ॥ 28 ॥**

ద్విజోత్తమా! తరువాత పెండ్లి అయిన అనిరుద్ధుని వెంట బెట్టుకొని సమస్త యాదవబలం తోడురాగా కేశవుడు ద్వారకాపురికి తిరిగి విచ్చేశాడు – అని పరాశరుడు చెప్పాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే రుక్మివధో నామ అష్టావింశోఽధ్యాయః సమాప్తః ॥ 28 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో రుక్మి వధ అనే ఇరవై ఎనిమిదవ అధ్యాయం సమాప్తం ॥ 28 ॥

## ఏకోనత్రింశోऽధ్యాయః - ఇరవై తొమ్మిదవ అధ్యాయం

## నరకాసురవధః - నరకాసురవధ

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెబుతున్నాడు.

**ద్వారవత్యాం తతఃశౌరిం శక్రస్త్రిభువనేశ్వరః ।**
**ఆజగామాథ మైత్రేయ! మత్తైరావతపృష్ఠగః ॥ 1 ॥**

మైత్రేయా! ద్వారకానగరంలో కృష్ణుడు ఉండగా ఒకనాడు త్రిభువనేశ్వరుడైన ఇంద్రుడు మదించిన ఐరావత గజాన్ని అధిరోహించి ఆయన సన్నిధికి వచ్చాడు.

**ప్రవిశ్య ద్వారకాం సోऽథ సమేత్య హరిణా తతః ।**
**కథయామాస దైత్యస్య నరకస్య విచేష్టితమ్ ॥ 2 ॥**

అతడు ద్వారకలో ప్రవేశించి శ్రీహరిని కలుసుకొని దైత్యుడైన నరకాసురుని దుష్టచేష్టలను వివరించి చెప్పాడు.

**త్వయా నాథేన దేవానాం మనుష్యత్వేऽపి తిష్ఠతా ।**
**ప్రశమం సర్వదుఃఖాని నీతాని మధుసూదన! ॥ 3 ॥**

“మధుసూదనా! నీవు సమస్త దేవతలకు ప్రభువైనవాడవు, మానవాకారాన్ని స్వీకరించి వుండినా నీవల్ల సమస్తదుఃఖాలు ఉపశాంతి పొందాయి.

**తపస్విజననాశాయ సోऽరిష్టో ధేనుకస్తథా ।**
**చాణూరో ముష్టికః కేశీ తే సర్వే నిహతాస్త్వయా ॥ 4 ॥**

తపస్సులు కావించే పుణ్యాత్ముల వినాశం కొరకై నడుముకట్టిన అరిష్టుడు, ధేనుకుడు, చాణూరుడు, ముష్టికుడు మున్నగు మహాసురులను అందరినీ నీవు సంహరించావు.

**కంసః కువలయాపీడః పూతనా బాలఘాతినీ ।**
**నాశం నీతా స్త్వయా సర్వే యేऽన్యే జగదుపద్రవాః ॥ 5 ॥**

దురాత్ముడైన కంసుడు, కువలయాపీడం అనే మహాగజం, పిల్లలను చంపే స్వభావం కల పూతన, ఇంకా జగత్తుకు ఉపద్రవం చేకూర్చేవారు ఎవరెవరయితే ఉన్నారో, వారందరినీ నీవు వినాశం చెందించావు.

**యుష్మద్దోర్దణ్డసద్బుద్ధిపరిత్రాతే జగత్త్రయే ।**
**యజ్వియజ్ఞాంశసమ్ప్రాప్త్యా తృప్తిం యాన్తి దివౌకసః ॥ 6 ॥**

నీ బాహుబలం, దుర్దాంత బుద్ధివైభవంవల్ల మూడు లోకాలు రక్షించబడ్డాయి. యాజ్ఞికులు అందించే యజ్ఞభాగాలు స్వీకరించి స్వర్గలోకవాసులు తృప్తిని పొందుతున్నారు.

**సోऽహం సామ్ప్రతమాయాతో యన్నిమిత్తం జనార్దన ।**
**తచ్ఛ్రుత్వా తత్ప్రతీకారప్రయత్నం కర్తుమర్హసి ॥ 7 ॥**

జనార్దనా! ఇప్పుడు నేను ఏ కారణంతో వచ్చానో, దానిని విని, దానికి అనువైన ప్రతీకారం కోసమై ప్రయత్నం నీవు చేయవలసి ఉంది.

**భౌమోఽయం నరకో నామ్నా ప్రాగ్జ్యోతిషపురేశ్వరః ।**
**కరోతి సర్వభూతానాముపఘాతమరిన్దమ! ॥ 8 ॥**

శత్రువులను తపింపజేసే కృష్ణా! భూదేవి కుమారుడైన నరకుడనే అసురుడు ప్రాగ్జ్యోతిషపురానికి రాజు. అతడు సమస్త ప్రాణికోటికి ఉపద్రవం కలుగజేస్తున్నాడు.

**దేవసిద్ధాసురాదీనాం నృపాణాం చ జనార్దన! ।**
**హృత్వా హి సోఽసురః కన్యా రురోధ నిజమన్దిరే ॥ 9 ॥**

జనార్దనా! దేవతలకు, సిద్ధులకు, స్వర్గవాసులైన అసురులకు, సమస్త రాజేంద్రులకు సంబంధించిన కన్యలను అపహరించి తన మందిరంలో చెరపెట్టి ఉంచాడు.

**ఛత్రం యత్సలిలస్రావి తజ్జహార ప్రచేతసః ।**
**మన్దరస్య తథా శృంగం హృతవాన్ మణిపర్వతమ్ ॥ 10 ॥**

అతడు జలవర్షణం కావించే వరుణదేవుని ఛత్రాన్ని (గొడుగును) అపహరించాడు. మందర పర్వత శృంగమైన మణిపర్వతాన్ని హరించివేశాడు.

**అమృతస్రావిణీ దివ్యే మన్మాతుః కృష్ణ! కుణ్డలే ।**
**జహార సోఽసురోఽదిత్యా వాంఛత్యైరావతం గజమ్ ॥ 11 ॥**

కృష్ణా! ఆ అసురుడు నా తల్లి అదితికి సంబంధించిన అమృతాన్ని కురిసే దివ్యమణి కుండలాలను కైకొన్నాడు (కాజేశాడు). అంతేకాక ఈ ఐరావతంపై కన్నువేసి ఉంచాడు.

**దుర్నీతమేతద్గోవిన్ద! మయా తస్య తవోదితమ్ ।**
**యదత్ర ప్రతికర్తవ్యం తత్స్వయం ప్రవిమృశ్యతామ్ ॥ 12 ॥**

గోవిందా! అతని దుర్నీతి ఎటువంటిదో అంతా నీకు నివేదించాను. ఈ విషయంలో ఏ ప్రతీకారం ఆచరించాలో, దానిని నీవే స్వయంగా పరిశీలించాలి." అని ఇంద్రుడు వచించాడు.

**ఇతి శ్రుత్వా స్మితం కృత్వా భగవాన్ దేవకీసుతః ।**
**గృహీత్వా వాసవం హస్తే సముత్తస్థౌ వరాసనాత్ ॥ 13 ॥**

భగవంతుడైన దేవకీనందనుడు ఆ శతక్రతువచనాలు విని ఒక చిరునవ్వు నవ్వాడు. వాసవుని చేతితో పట్టుకొని ఒక్కసారిగా తన ఉన్నతాసనంనుంచి పైకి లేచాడు.

**చిన్తయామాస చ విభుర్మనసా పన్నగాశనమ్,**
**సంచిన్త్యాగతమారుహ్య గరుడం గగనే చరమ్ ।**
**సత్యభామాం సమారోప్య యయౌ ప్రాగ్జ్యోతిషం పురమ్ ॥ 14 ॥**

మైత్రేయా! ప్రభువు మనస్సులో పన్నగాంతకుని భావించగానే వచ్చివేశాడు. ఒక్కసారిగా తలచుకోగానే వచ్చి ఆకాశంలో సంచరించే గరుత్మంతుని ఎక్కి, సత్యభామను కూడ అధిరోహింపజేసి ప్రాగ్జ్యోతిషపురానికివెళ్లాడు.

**ఆరుహ్యైరావతం నాగం శక్రోఽపి త్రిదివాలయమ్ ।**
**తతో జగామ మైత్రేయ! పశ్యతాం ద్వారకౌకసామ్ ॥ 15 ॥**

శక్రుడు కూడ ఐరావత గజేంద్రాన్ని అధిరోహించి ద్వారకానగర వాసులందరూ చూస్తూ ఉండగా స్వర్గనివాసానికి వెళ్లిపోయాడు.

**ప్రాగ్జ్యోతిషపురస్యాసీత్ సమన్తాచ్ఛతయోజనమ్ ।**
**ఆచితా మౌరవైః పాశైః క్షురాన్తైర్భూర్ద్విజోత్తమ! ॥ 16 ॥**

ద్విజశ్రేష్ఠా! ప్రాగ్జ్యోతిషపురం చుట్టూ శతయోజనాల భూమి మేరలో మురాసురుని చుర కత్తులతోను, పాశాలతోను బంధించబడి వ్యాపించి ఉంది.

**తాంశ్చిచ్ఛేద హరిః పాశాన్ క్షిప్త్వా చక్రం సుదర్శనమ్ ।**
**తతో మురః సముత్తస్థౌ తం జఘాన చ కేశవః ॥ 17 ॥**

అనంతరం హరి సుదర్శనచక్రం ప్రయోగించి ఆ పాశాలను భేదించి చురకత్తులను ఛేదించడం జరిగింది. అపుడు ఒక్క ఉదుటున లేచి మురాసురుడు యుద్ధానికి వచ్చాడు. కేశవుడు ఆతనిని వధించాడు.

**పాఠాంతరం :-** మురః - మురుః

**మురోశ్చ తనయాన్ సప్త సహస్రాంస్తాంస్తతో హరిః ।**
**చక్రధారాగ్నినిర్దగ్ధాంశ్చకార శలభానివ ॥ 18 ॥**

అటు పిమ్మట మురుని కుమారులు ఏడువేల మంది పోరుకు సిద్ధపడగా హరి వారినందరని తన చక్రధారల నుంచి బయల్వెడలిన అగ్నిజ్వాలలతో దగ్ధమైన మిడుతలు వలె కాల్చివేశాడు.

**హత్వా మురుం హయగ్రీవం తథా పంచజనం ద్విజ ।**
**ప్రాగ్జ్యోతిష పురం ధీమాంస్త్వరావాన్ సముపాగతః ॥ 19 ॥**

ద్విజప్రవరా! ధీశాలియైన కృష్ణుడు మురుని, హయగ్రీవుని, అలాగే పంచజనుని చంపి చాలావేగంగా ప్రాగ్జ్యోతిషపురానికి పరుగు పెట్టాడు.

**నరకేణాస్య తత్రాభూన్మహాసైన్యేన సంయుగః ।**
**కృష్ణస్య యత్ర గోవిన్దో జఘ్నే దైత్యాన్ సహస్రశః ॥ 20 ॥**

అక్కడ నరకుని మహాసైన్యంతో కృష్ణునకు ఘోరసంగ్రామం జరిగింది. ఆ సంగరరంగంలో గోవిందుడు వేలకొలది దైత్యులను కూల్చివేశాడు.

**శస్త్రాస్త్రవర్షం ముంచన్తం తం భౌమం నరకం బలీ ।**
**క్షిప్త్వా చక్రం ద్విధా చక్రే చక్రీ దైతేయ చక్రహా ॥ 21 ॥**

అనంతరం మహాబలవంతుడగు రాక్షసచక్ర వినాశకుడైన చక్రధారియైన కృష్ణుడు చక్రం విసిరి తనపై శస్త్రాలను, అస్త్రాలను ముంచెత్తి విడుస్తున్న ఆ నరకాసురుని రెండుగా చీల్చాడు.

**హతే తు నరకే భూమిర్గృహీత్వాऽదితికుణ్డలే ।**
**ఉపతస్థే జగన్నాథం వాక్యం చేదమథాబ్రవీత్ ॥ 22 ॥**

అలా నరకుడు మరణించగా, భూదేవి అదితి దేవి కుండలాలను పట్టుకొని జగన్నాథుని సమీపించింది. అనంతరం ఇలా స్తుతి చేయసాగింది.

**యదాహ ముద్ధృతా నాథ! త్వయా సూకరమూర్తినా ।**
**త్వత్స్పర్శసమ్భవః పుత్రస్తదాయం మయ్యజాయత ॥ 23 ॥**

"నాథా! నీవు వరాహావతారం దాల్చి నన్ను ఉద్ధరించిన సమయంలో నీ శరీర స్పర్శవల్ల కల్గిన పుత్రుడే వీడు, ఆనాడు నా యందు ఉద్భవించాడు.

**సోऽయం త్వయైవ దత్తో మే త్వయైవ వినిపాతితః ।**
**గృహాణ కుణ్డలే చేమే పాలయాస్య చ సన్తతిమ్ ॥ 24 ॥**

ఆనాడు నీచే ఈయబడ్డాడు. ఈనాడు నీచే చంపబడ్డాడు. ఇదిగో! ఈ కుండలాలను స్వీకరించు. ఈ నరకుని సంతతిని రక్షించు.

**భారావతరణార్థాయ మమైవ భగవానిమమ్ ।**
**అంశేన లోకమాయాతః ప్రసాదసుముఖః ప్రభో! ॥ 25 ॥**

ప్రభూ! భగవంతుడవైన నీవు నా భారాన్ని తొలగించడానికై, మిక్కిలి ప్రసన్నతపూని నీ అంశావతారంతో మానవలోకానికి వచ్చావు.

**త్వం కర్తా త్వం వికర్తా చ సంహర్తా ప్రభవోऽప్యయః ।**
**జగతాం త్వం జగద్రూపః స్తూయతేऽచ్యుత! కిం తవ ॥ 26 ॥**

అచ్యుతా! ఈ జగత్తుకు కర్తవూ నీవే (సృష్టికర్తవూ నీవే), వికర్తవూ నీవే (పోషణ కర్తవూ నీవే). సంహార కర్తవూ నీవే. ఈ జగత్తు ఉత్పత్తి స్థానం నీవే. లయస్థానం నీవే. నీవు జగద్రూపుడవు. అట్టి నిన్ను ఏమని నుతించాలి?

**వ్యాపీ వ్యాప్యః క్రియా కర్తా కార్యం చ భగవన్! యథా ।**
**సర్వభూతాత్మ భూతస్య స్తూయతే తవ కిం తదా ॥ 27 ॥**

భగవంతుడా! నీవు సర్వత్ర వ్యాపించి ఉండేవాడవు. వ్యాపించబడిన విశ్వమంతా నీవే. కాబట్టి కర్త, కార్యం, క్రియ నీవే. నీవు సమస్త భూతాలకు ఆత్మస్వరూపుడవు. అటువంటి నిన్ను ఏమని స్తుతించాలి?

**పరమాత్మా చ భూతాత్మా మహాత్మా చావ్యయో భవాన్ ।**
**యదా తదా స్తుతిర్నాథ! కిమర్థం తే ప్రవర్తతే ॥ 28 ॥**

నాథా! నీవు పరమాత్మవు. భూతాత్మవు. అవ్యయుడవైన మహాత్ముడవు. నిన్ను ఉన్నదున్నట్లుగా స్తుతి చేయడానికి (నేను) నా వాక్కు ఎలా ప్రవరించగలుగుతుంది?

**ప్రసీద సర్వభూతాత్మన్! నరకేణ హి యత్ కృతమ్ ।**
**తత్ క్షమ్యతామదోషాయ త్వత్సుతస్త్వన్నిపాతితః ॥ 29 ॥**

సర్వభూత స్వరూపా! నీవు ప్రసన్నుడవు కావలసింది. నరకుడు చేసిన అపరాధాన్ని పూర్తిగా క్షమించు. నీవు నీ పుత్రుని నిర్దోషుని కావించడం కొరకే స్వయంగా సంహరించావు" అని భూదేవి స్తుతించింది.

**తథేతి చోక్త్వా ధరణీం భగవాన్ భూతభావనః ।**
**రత్నాని నరకావాసాజ్జగ్రాహ మునిసత్తమ! ॥ 30 ॥**

మునిశ్రేష్ఠా! అనంతరం భూతభావనుడైన భగవంతుడు ధరణీ దేవతతో 'అలాగే' అని పలికి నరకాసురుని నివాసం నుంచి నానావిధ రత్నసమూహాల నన్నిటినీ గైకొన్నాడు.

**కన్యాపురే స కన్యానాం షోడశాతులవిక్రమః ।**
**శతాధికాని దదృశే సహస్రాణి మహామునే ॥ 31 ॥**

మహామునీ! అంతట అమేయపరాక్రముడైన కృష్ణుడు కన్యాంతఃపురంలో పదహారువేల ఒక వందమంది (16,100) కన్యకలను చూశాడు.

**చతుర్దన్తాన్ గజాంశ్చాగ్ర్యాన్ షట్సహస్రాన్ సదృష్టవాన్ ।**
**కామ్భోజానాం తథాశ్వానాం నియుతాన్యేకవింశతిమ్ ॥ 32 ॥**

అంతేకాక నాల్గుదంతాలు కల మిక్కిలి ఉన్నతాలైన ఆరువేల ఏనుగులను, కాంభోజ దేశాలకు చెందిన ఇరవై ఒక్క లక్షల ఉత్తమాశ్వాలను చూశాడు.

**కన్యాస్తాశ్చ తథా నాగాం స్తానశ్వాన్ ద్వారకాం పురీమ్ ।**
**ప్రాపయామాస గోవిన్దః సద్యో నరక కింకరైః ॥ 33 ॥**

ఆ సమయంలో గోవిందుడు అప్పుడు నరకుని సేవకుల ద్వారా ఆ రాజ దేవకన్యలను, ఏనుగులను, గుఱ్ఱాలను అప్పటికప్పుడే ద్వారకాపురికి తరలించాడు.

**దదృశే వారుణం ఛత్రం తథైవ మణిపర్వతమ్ ।**
**ఆరోపయామాస హరిర్గరుడే పతగేశ్వరే ॥ 34 ॥**

అక్కడే వరుణచ్ఛత్రాన్ని మణిపర్వతాన్ని వీక్షించాడు. వాటిని హరి పతగేశ్వరుడైన గరుడుని మూపున ఎక్కించాడు.

**ఆరుహ్య చ స్వయం కృష్ణః సత్యభామా సహాయవాన్ ।**
**అదిత్యాః కుణ్డలే దాతుం జగామ త్రిదశాలయమ్ ॥ 35 ॥**

కృష్ణుడు తానుకూడ సత్యభామతో కలసి గరుత్మంతుని అధిరోహించి అదితిదేవికి కుండలాలు సమర్పించడానికై దేవతల నిలయమైన స్వర్గపురికి వెళ్లాడు – అని పరాశరుడు చెప్పాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే నరకాసురవధో నామ ఏకోనత్రింశోఽధ్యాయః సమాప్తః ॥ 29 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో నరకాసురవధ అనే ఇరవై తొమ్మిదవ అధ్యాయం సమాప్తం ॥ 29 ॥



## త్రింశోఽధ్యాయః - ముప్పైయవ అధ్యాయం

## పారిజాతానయనమ్ - పారిజాతమును తెచ్చుట

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడన్నాడు.

**గరుడో వారుణం ఛత్రం తథైవ మణిపర్వతమ్ ।**
**సభార్యం చ హృషీకేశం లీలయైవ వహన్ యయౌ ॥ 1 ॥**

మైత్రేయా! వరుణుని ఛత్రాన్ని, అలాగే మణిపర్వతాన్ని వహించి, భార్యాసమేతంగా హృషీకేశుని తన మూపుపై గరుడుడు లీలగా ధరించి వెంటనే స్వర్గానికి చేరుకొన్నాడు.

**తతః శంఖముపాధ్మాసీత్ స్వర్గద్వారగతో హరిః ।**
**ఉపతస్థుస్తథా దేవాః సార్ఘ్యహస్తా జనార్దనమ్ ॥ 2 ॥**

కృష్ణుడు స్వర్గద్వారం వద్ద తన శంఖాన్ని ఒక్కసారి పూరించాడు. ఆ నాదాన్ని విన్న దేవతలు అర్ఘ్యద్రవ్యాలను చేతులందు పట్టుకొని జనార్దనునికి ఎదురువచ్చారు.

**స దేవై రర్చితః కృష్ణో దేవమాతుర్నివేశనమ్ ।**
**సితాభ్రశిఖరాకారం ప్రవిశ్య దదృశేఽదితిమ్ ॥ 3 ॥**

అక్కడ దేవతలు అందరూ కృష్ణుని అర్చించారు. అతడు అపుడు దేవమాత నివాసమైన తెల్లని మేఘాగ్రభాగం వంటి కాంతితో ఒప్పారే భవనం లోనికి ప్రవేశించి అదితి దేవిని వీక్షించాడు.

**స తాం ప్రణమ్య శక్రేణ సహ తే కుణ్డలోత్తమే ।**
**దదౌ నరకనాశం చ శశంసాస్యై జనార్దనః ॥ 4 ॥**

ఉపేంద్రుడు ఇంద్రునితో కలిసి ఆమెకు నమస్కరించి ఆ దివ్యకుండలాలను సమర్పించాడు. అనంతరం జనార్దనుడు నరకుని వినాశాన్ని ఆమెకు నివేదించాడు.

**తతః ప్రీతా జగన్మాతా త్రాతారం జగతాం హరిమ్ ।**
**తుష్టావాదితిరవ్యగ్రా కృత్వా తత్ప్రవణం మనః ॥ 5 ॥**

అపుడు ఆ జగన్మాత సంతసించి, సమస్తజగత్తులకు రక్షకుడైన కృష్ణుని నిశ్చలభావంతో తన మనస్సును ఆయన యందుంచి ఇలా స్తుతి చేసింది.

**నమస్తే పుణ్డరీకాక్ష భక్తానామభయంకర! ।**
**సనాతనాత్మన్! సర్వాత్మన్! భూతాత్మన్! భూతభావన! ॥ 6 ॥**

ఎర్ర తామరపూలవంటి కనుదోయితో విలసిల్లే వాడా! సమస్త భక్తులకు అభయాన్ని కూర్చేవాడా! సనాతన స్వరూపా! సర్వాత్మా! భూతస్వరూపా! భూతభావనా! నీకు నమస్కారం.

**ప్రణేతర్మనసో బుద్ధేరిన్ద్రియాణాం గుణాత్మక! ।**
**త్రిగుణాతీత! నిర్ద్వన్ద్వ! శుద్ధసత్త్వ! హృది స్థిత! ॥ 7 ॥**

త్రిగుణాత్మక! మనస్సును, బుద్ధిని, ఇంద్రియాలను నడపించేవాడా! సత్త్వరజస్తమోగుణాలకు అతీతంగా ఉండేవాడా! ద్వంద్వాలకు వ్యతిరిక్తంగా ఉండేవాడా! శుద్ధసత్త్వవిభాసితా! అంతర్యామీ! నీకు ప్రణామం.

**సితదీర్ఘాది నిఃశేషకల్పనాపరివర్జిత! ।**
**జన్మాదిభిరసంస్పృష్ట! స్వప్నాదిపరివర్జిత! ॥ 8 ॥**

తెలుపు, నలుపు, పొడవు, వెడల్పు, పూర్తి – అసంపూర్తి మున్నగు వికల్పాలు లేనివాడా! పుట్టుక, పెరుగుదల, మృత్యువు మొదలైన వికారాలు లేనివాడా! స్వప్నావస్థ మున్నగు అవస్థలు లేనివాడా! నీకు వందనం.

**సన్ధ్యా రాత్రిరహో భూమిర్గగనం వాయురమ్బు చ ।**
**హుతాశనో మనో బుద్ధిర్భూతాదిస్త్వం తథాఽచ్యుత! ॥ 9 ॥**

అచ్యుతా! సంధ్య, రాత్రి, పగలు, భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం అంతా నీవే. (మహత్తత్వం, తన్మాత్ర సృష్టి, అహంకార స్వరూపం నీవే).

**సృష్టిస్థితివినాశానాం కర్తా కర్తృపతిర్భవాన్ ।**
**బ్రహ్మవిష్ణుశివాఖ్యాభిరాత్మమూర్తిభిరీశ్వర! ॥ 10 ॥**

ఈశ్వరా! నీవు సృష్టి స్థితి వినాశాలకు కర్తవు. నీ స్వరూపాలగు బ్రహ్మ విష్ణు శివాదిమూర్తులగు కర్తలకు నీవే నియంతవు.

**దేవా యక్షాస్తథా దైత్యా రాక్షసాః సిద్ధపన్నగాః ।**
**కూష్మాణ్డాశ్చ పిశాచాశ్చ గన్ధర్వా మనుజాస్తథా ॥ 11 ॥**

**పశవో మృగమాతంగాస్తథైవ చ సరీసృపాః ।**
**వృక్షగుల్మలతాబహ్వ్యః సమస్తాస్తృణజాతయః ॥ 12 ॥**

**స్థూలా మధ్యాస్తథా సూక్ష్మాః స్థూలసూక్ష్మతరాశ్చ యే ।**
**దేహభేదా భవాన్ సర్వే యే కేచిత్ పుద్గ(ద్గ)లాశ్రయాః ॥ 13 ॥**

దేవతలు, యక్షులు, దైత్యులు రాక్షసులు, సిద్ధులు, పన్నగులు, కూష్మాండులు, పిశాచులు, గంధర్వులు, మానవులు, పశువులు, మృగాలు, మాతంగాలు, సరీసృపాలు, వృక్షాలు, గుల్మాలు, అనేక విధాలైన లతలు, సమస్త తృణజాతులు, స్థూలాలు (ఉపాధిచైతన్యాలు), మధ్యాలు (జడచైతన్యాలు, లక్ష్యాలక్ష చైతన్యాలు), సూక్ష్మాలు, స్థూల తరాలు, సూక్ష్మతరాలు, సమస్తదేహ భేదాలు పొందిన ఉపాధులన్నీ నీవే. పరమాణువులను ఆశ్రయించిన ఉపాధులు నీవే.

**మాయా తవేయమజ్ఞాతపరమార్థాతిమోహినీ ।**
**అనాత్మన్యాత్మవిజ్ఞానం యథా మూఢో నిరుధ్యతే ॥ 14 ॥**

ఎవరు పరమాత్మ స్వరూపాన్ని తెలుసుకోలేడో, అటువంటి వానిని మిక్కిలి మోహింపజేసే నీ మాయ ఏదయితే ఉందో, ఆత్మకన్న భిన్నమయిన పదార్థమందు ఆత్మవిజ్ఞానం కలిగించి మూఢునిలాగా ప్రవర్తింప జేస్తుంది.

**అస్వే స్వమితి భావోఽత్ర యత్ పుంసాముపజాయతే,**
**అహం మమేతిభావో యత్ ప్రాయేణైవాభిజాయతే ।**
**సంసారమాతుర్మాయాయాస్తవై తన్నాథ! చేష్టితమ్ ॥ 15 ॥**

నాథా! ఆత్మ కాని దానియందు సాంసారిక జీవులకు కలిగే ఆత్మజ్ఞానమే మాయ. దానివల్లనే తనది కాని దానియందు తనది అనే భావం కలుగుతుంది. ఈ మాయ సంసార జనని. ఆ మాయాకృత్యమే ఈ సంసారమంతా.

**యైః స్వధర్మపరైర్నాథ! నరైరారాధితో భవాన్ ।**
**తే తరన్త్యఖిలామేతాం మాయామాత్మవిముక్తయే ॥ 16 ॥**

నాథా! ఏ స్వధర్మం ఆచరించే నరులు నిన్ను ఆరాధిస్తూ ఉంటారో, ముక్తి లాభం కోరుకొనేవారు మాత్రమే ఈ సమస్తమైన మాయను తరిస్తూ ఉంటారు.

**బ్రహ్మాద్యాః సకలా దేవా మనుష్యాః పశవస్తథా ।**
**విష్ణుమాయామహావర్తమోహాన్ధతమసావృతాః ॥ 17 ॥**

బ్రహ్మాది సకల దేవతలు, మనుష్యులు, పశువులు, విష్ణుమాయ అనే సుడిలో పడి మోహం అనే గాడాంధ కారంలో చుట్టబడిపోతారు.

**ఆరాధ్య త్వామభీప్సన్తే కామానాత్మభవక్షయమ్ ।**
**యదేతే పురుషా మాయా సైవేయం భగవంస్తవ ॥ 18 ॥**

భగవంతుడా! వారందరు నిన్ను ఆరాధించి కోరికలను మాత్రమే కోరుకొంటారు. కాని సంసార నాశనాన్ని మాత్రం కోరరు. ఈ పురుషులందరూ ఏ జననమరణచక్రంలో పడుతూ ఉంటారో ఆ మాయ నీదే కదా!

**మయా త్వం పుత్ర కామిన్యా వైరిపక్షక్షయాయ చ ।**
**ఆరాధితో న మోక్షాయ మాయా విలసితం హి తత్ ॥ 19 ॥**

నేను శత్రుపక్ష వినాశం కోరుకొన్నదాననై, నీవు నా పుత్రుడవు కమ్మని నిన్ను ఆరాధించాను కాని మోక్షం కోసం కాదు. ఇదికూడా మాయావిలాస ప్రభావం మాత్రమే.

**కౌపీనాచ్ఛాదన ప్రాయా వాంఛా కల్పద్రుమాదపి ।**
**జాయతే యదపుణ్యానాం సోఽపరాధః స్వదోషజః ॥ 20 ॥**

కల్పవృక్షం నుంచి కూడా గోచీగుడ్డ వరకూ కోరుకోవాలనే వాంఛ పుణ్యం చేయనివారికి మాత్రమే కలుగుతుంది. ఆ అపరాధం కూడ తమ కర్మదోషం వల్ల మాత్రమే పుడుతుంది.

**తత్ ప్రసీదాఖిలజగన్మాయామోహకరావ్యయ! ।**
**అజ్ఞానం జ్ఞానసద్భావభూతం భూతేశ! నాశయ ॥ 21 ॥**

అవ్యయా! భూతేశా! సమస్త జగత్తుకు మాయచే మోహం కల్గించేవాడా! నన్ను అనుగ్రహించు. జ్ఞానంలాగా భాసించే అజ్ఞానం నశింపజేయి. (నేను జ్ఞానిననే అభిమానాన్ని కలిగించే అజ్ఞానాన్ని నశింపజేయి).

**నమస్తే చక్రహస్తాయ శార్ఙ్గహస్తాయ తే నమః ।**
**గదాహస్తాయ తే విష్ణో! శంఖహస్తాయ తే నమః ॥ 22 ॥**

ఓ చక్రహస్తా! నీకు నమస్కారం. ఓ శార్ఙ్గహస్తా! నీకు ప్రణామం. ఓ గదాహస్తా! నీకు వందనం. ఓ విష్ణూ! శంఖహస్తా! నీకు నమోవాకాలు.

**ఏతత్ పశ్యామి తే రూపం స్థూలచిహ్నోపలక్షితమ్ ।**
**న జానామి పరం యత్తే ప్రసీద పరమేశ్వర! ॥ 23 ॥**

ఈ స్థూల చిహ్నాలతో కూడిన నీ రూపాన్ని నేను ఇలా చూస్తున్నాను కాని పరమేశ్వరా! నీ పరమార్థ స్వరూపం తెలియజాలను. నన్ను అనుగ్రహించు" అని స్తుతించింది.

**అదిత్యైవం స్తుతో విష్ణుః ప్రహస్యాహ సురారణిమ్ ।**
**మాతా దేవి! త్వమస్మాకం ప్రసీద వరదా భవ! ॥ 24 ॥**

అదితి ఈ ప్రకారం ప్రార్థించగా శ్రీకృష్ణుడు మందహాసం చేసి ఆ దేవమాతతో "అమ్మా! దేవీ! నీవు నా తల్లివి. మమ్మల్ని అనుగ్రహించి వరాలు ప్రసాదించు" అని వేడాడు.

**ఏవమస్తు యథేచ్ఛా తే త్వమశేషైః సురాసురైః ।**
**అజేయః పురుషవ్యాఘ్ర! మర్త్యలోకే భవిష్యసి ॥ 25 ॥**

అపుడు అదితి "నీ కోరికను అనుసరించి అంతా జరుగుగాక! పురుషసింహమా! నీవు సమస్త సురాసురులకు జయింప వీలులేని వాడవై మర్త్యలోకంలో వసిస్తావు" అని అచ్యుతుని దీవించింది.

**తతోఽనన్తరమేవాస్య శక్రాణీసహితా దితిమ్ ।**
**సత్యభామా ప్రణమ్యాహ ప్రసీదేతి పునః పునః ॥ 26 ॥**

కృష్ణుడావిధంగా నమస్కరించిన తరువాత, సత్యభామ శచీదేవితో కలసి అదితికి పదేపదే నమస్కరించి అనుగ్రహించమని వేడుకొంది.

**మత్ప్రసాదాన్న తే సుభ్రు! జరావైరూప్యమేవ చ ।**
**భవిష్యత్యనవద్యాంగి! సుస్థిరం నవయౌవనమ్ ॥ 27 ॥**

“చక్కని కనుబొమలు కలదానా! మిక్కిలి శుభస్థానంలో తగిన అవయవాలు కలదానా! సత్యభామా! నా కరుణవల్ల నీకు ముసలితనం కాని, సౌందర్యంలో విరూపత్వం కాని కలుగవు. నీకు నవయౌవనం శాశ్వతమై ఉంటుంది” అని అదితి ఆమెను ఆశీర్వదించింది.

**అదిత్యా తు కృతానుజ్ఞో దేవరాజో జనార్దనమ్ ।**
**యథావత్ పూజయామాస బహుమాన పురస్సరమ్ ॥ 28 ॥**

అదితి ఆజ్ఞానుసారంగా దేవరాజు జనార్దనుని శాస్త్రవిధితో గౌరవపూర్వకంగా పూజించి సత్కరించాడు.

**శచీ చ సత్యభామాయై పారిజాతస్య పుష్పకమ్ ।**
**న దదౌ మానుషీం మత్వా స్వయం పుష్పైరలంకృతా ॥ 29 ॥**

ఇంద్రుని భార్యయైన శచీదేవి సత్యభామకు “ఆమె ఒక మనుష్య స్త్రీయే కదా!” అని భావించి పారిజాత పుష్పం ఈయలేదు. ఆమె సత్యభామకు ఈయకుండానే ఆ పుష్పాలను అలంకరించుకొంది.

**తతో దదర్శ కృష్ణోఽపి సత్యభామా సహాయవాన్ ।**
**దేవోద్యానాని హృద్యాని నన్దనాదీని సత్తమ! ॥ 30 ॥**

సత్పురుషులలో శ్రేష్ఠుడవైన మైత్రేయా! అనంతరం శ్రీకృష్ణుడు కూడా సత్యభామతో కలసి మనోహరాలైన దేవలోకంలోని ఉద్యానవనాదులైన నందనవనం మున్నగు వాటిని సందర్శించాడు.

**దదర్శ చ సుగన్ధాఢ్యం మంజరీపుంజధారిణమ్ ।**
**నిత్యాహ్లాదకరం తామ్రబాలపల్లవశోభితమ్ ॥ 31 ॥**

**మథ్యమానేఽమృతే జాతం జాతరూపోపమత్వచమ్ ।**
**పారిజాతం జగన్నాథః కేశవః కేశిసూదనః ॥ 32 ॥**

అలా విహరిస్తూ కేశి సంహారకుడైన జగన్నాథుడగు కేశవుడు అమృత మథన సమయంలో పుట్టిన, పూలగుత్తులతో కూడుకొన్న, ఎల్లప్పుడూ సంతోషం కలిగించే, ఎర్రని చిగురుటాకులతో విలసిల్లే, బంగారపు వన్నె చెట్టు బెరడులతోనున్న, దివ్యపరిమళాలు వెదజల్లే పారిజాతవృక్షాన్ని వీక్షించాడు.

**తం దృష్ట్వా ప్రాహ గోవిన్దం సత్యభామా ద్విజోత్తమ! ।**
**కస్మాన్న ద్వారకామేష నీయతే దేవపాదపః ॥ 33 ॥**

ద్విజశ్రేష్ఠా! సత్యభామ కూడా ఆ చెట్టును చూచి గోవిందునితో “ఈ దేవవృక్షాన్ని ద్వారకానగరానికి ఎందుకు తరలించరాదు?

**యది తే తద్వచః సత్యం త్వమత్యర్థం ప్రియేతి మే ।**
**మద్గేహనిష్కుటార్థాయ తదయం నీయతాం తరుః ॥ 34 ॥**

"సత్యభామ నాకు మిక్కిలి ఇష్టురాలనే నీవు పలికే మాట సత్యమయితే," నా ఇంటి పెరటిలో నాటడానికి ఈ చెట్టును పెల్లగించుకొని పోయి తీరాలి.

**న మే జామ్బవతీ తాదృగభీష్టా న చ రుక్మిణీ ।**
**సత్యే యథా త్వమిత్యుక్తం త్వయా కృష్ణ సకృత్ప్రియమ్ ॥ 35 ॥**

కృష్ణా! నాతో పలుసార్లు ఇలా అన్నావు కదా! "సత్యా! నాకు జాంబవతిపైకాని, రుక్మిణి కాని నీవంటే ఉన్నంత ఇష్టం వారిపై ఉండదు." అని వచించావు కదా!

**సత్యం తద్యది గోవిన్ద! నోపచారకృతం తవ(మమ) ।**
**తదస్తు పారిజాతోఽయం మమ గేహవిభూషణమ్ ॥ 36 ॥**

గోవిందా! ఆ వాక్యాలు నిజమయినట్లయితే, ఆ మాటలు నన్ను ప్రలోభపెట్టేవి కాకుండా ఉన్నట్లయితే, ఈ పారిజాతవృక్షం నా గృహంలో అలంకారమై విలసిల్లాలి.

**బిభ్రతీ పారిజాతస్య కేశపక్షేణ మంజరీమ్ ।**
**సపత్నీనామహం మధ్యే శోభేయమితి కామయే ॥ 37 ॥**

ఈ పారిజాత పుష్పమంజరిని నా కొప్పులో దునుముకొని నేను సవతుల నడుమ శోభిల్లాలని ముచ్చట పడుతున్నాను." అని తన కోరికను వెల్లడించింది.

**ఇత్యుక్తః సప్రహస్యైనం పారిజాతం గరుత్మతి ।**
**ఆరోపయామాస హరిస్తమూచుర్వనరక్షిణః ॥ 38 ॥**

సత్యభామ ఇలా వచించగా శ్రీహరి మందహాసం చేసి పారిజాత వృక్షాన్ని పెల్లగించి గరుత్మంతుని పైకి ఎక్కించాడు. అపుడు వనపాలకులు కృష్ణుని వేడుకొంటూ ఇలా అన్నారు.

**భోః శచీ దేవరాజస్య మహిషీ తత్పరిగ్రహమ్ ।**
**పారిజాతం న గోవిన్ద! హర్తుమర్హసి పాదపమ్ ॥ 39 ॥**

"అయ్యా! దేవరాజు పట్టమహిషి శచీదేవి. ఈ పారిజాతం ఆమె సొత్తు. గోవిందా! కాబట్టి ఈ వృక్షాన్ని హరించడం నీకు తగినటువంటిది కాదు.

**శచీవిభూషణార్థాయ దేవైరమృతమన్థనే ।**
**ఉత్పాదితోఽయం న క్షేమీ గృహీత్వైనం గమిష్యసి ॥ 40 ॥**

శచీదేవి అలంకరించుకొనడానికై అమృతమథనవేళ దేవతలు దీనిని ఉద్భవింపజేశారు. దీనిని స్వీకరించి క్షేమంగా నీవు గమ్యం చేరలేవు.

**(ఉత్పన్నో దేవరాజాయ దత్తస్సోఽపి దదౌ పునః ।**
**మహిష్యై సుమహాభాగ! దేవ్యై శచ్యై కుతూహలాత్ ॥)**

ఓ మహానుభావా! ఇది దేవరాజు కొరకే పుట్టింది. అతడు కూడ తన పట్టమహిషియైన శచీదేవికి దీనిని ప్రీతితో సమర్పించాడు.

**దేవరాజో ముఖప్రేక్షీ యస్యాస్తస్యాః పరిగ్రహమ్ ।**
**మౌఢ్యాత్ ప్రార్థయసే క్షేమీ గ్రహీత్వైనం హి కో వ్రజేత్ ॥ 41 ॥**

దేవేంద్రుడు సర్వదా ఏదేవి ముఖం సాభిలాషగా చూస్తూ ఉంటాడో, ఆ దేవి సొంతమైన పారిజాతాన్ని నీవు తెలియనితనంచే కోరుకొంటున్నావు. క్షేమం కోరుకొనేవాడెవడయినా దీనిని కొరుకోగలడా?

**అవశ్యమస్య దేవేన్ద్రో నిష్కృతిం కృష్ణ యాస్యతి ।**
**వజ్రోద్యతకరం శక్రమనుయాస్యన్తి చామరాః ॥ 42 ॥**

కృష్ణా! నిశ్చయంగా దేవేంద్రుడు దీనికి తగిన ప్రాయశ్చిత్తం చేసి తీరుతాడు. వజ్రాయుధం చేత దాల్చి వచ్చే శక్రుని దేవతలు వెంబడిస్తారు.

**తదలం సకలైర్దేవైః విగ్రహేణ తవాచ్యుత! ।**
**విపాకకటు యత్కర్మ తన్నశంసన్తి పణ్డితాః ॥ 43 ॥**

అచ్యుతా! సమస్త దేవతలతో కోరి తగవు తెచ్చుకోవడం నీవంటి వానికి తగదు. పరిణతి దశలో పరమ విషమయ్యే (విషమంచే) పనిని పండితులు మెచ్చబోరుకదా!” అని హితవు పలికారు.

**ఇత్యుక్తే తైరువాచైతాన్ సత్యభామాఽతికోపినీ ।**
**కా శచీ పారిజాతస్య కో వా శక్రః సురాధిపః ॥ 44 ॥**

అని నందనవన రక్షకులు పలుకగా సత్యభామ మిక్కిలి కోపోద్రిక్తురాలై వారితో “పారిజాతానికి ఆ శచి ఎవ్వతె? సురాధిపుడైన ఇంద్రుడెవ్వడు?

**సామాన్యః సర్వలోకానాం యద్యేషోఽమృతమన్థనే ।**
**సముత్పన్నస్తరుః కస్మాదేకో గృహ్ణాతి వాసవః ॥ 45 ॥**

అమృతమథన సమయంలో ప్రభవించిన ఈ చెట్టు సమస్త లోకాలవారికి సమానమైనది వాసవుడొక్కడే దీనిని ఏల తీసుకోవాలి?

**యథా సురా యథైవేన్దుర్యథా శ్రీర్వనరక్షిణః ।**
**సామాన్యాః సర్వలోకస్య పారిజాతస్తథా ద్రుమః ॥ 46 ॥**

ఏ విధంగా ఆనాడు ఉద్భవించిన సుర, చంద్రుడు, లక్ష్మీసంపత్తి సర్వలోకానికి సమానంగా ఉన్నాయో వనరక్షకులారా! అదేవిధంగా ఈ పారిజాతద్రుమం కూడా అందరికీ ఉమ్మడి సొమ్ము.

**భర్తృబాహుమహాగర్వాద్ రుణద్ధ్యేనం యథా శచీ ।**
**తత్కథ్యతామలం క్షాన్త్యా సత్యా హారయతి ద్రుమమ్ ॥ 47 ॥**

"తన మగని భుజబలం మూలంగా శచి గర్వాతిరేకంతో దీనిని నిరోధిస్తోంది. ఇప్పటి వరకూ ఓరిమి పట్టింది చాలు. సత్యభామ ఈ చెట్టుని హరించి తీసుకుపోతోందని చెప్పింది".

**కథ్యతాం చ ద్రుతం గత్వా పౌలోమ్యా వచనం మమ ।**
**సత్యభామా వదత్యేతదతిగర్వోద్ధతాక్షరమ్ ॥ 48 ॥**

"మీరు శీఘ్రంగా వెళ్ళి పౌలోమితో నామాటగా చెప్పండి. ఈ సత్యభామ అత్యంత గర్వంతో రూక్షాక్షరాలతో ఇలా పలికిందని చెప్పండి".

**యది త్వం దయితా భర్తుర్యది వశ్యః పతిస్తవ ।**
**మద్భర్తుర్హరతో వృక్షం తత్ కారయ నివారణమ్ ॥ 49 ॥**

"నీవు నీ భర్తకు అంత ప్రియురాలివేని, నీకు నీ భర్త వశుడైన వాడయితే, నేను నా భర్త ద్వారా ఈ చెట్టును తీసుకొని పోతున్నాను. ధైర్యముంటే నివారింపజెయ్యి."

**జానామి తే పతిం శక్రం జానామి త్రిదశేశ్వరమ్ ।**
**పారిజాతం తథాఽప్యేనం మానుషీ హారయామి తే ॥ 50 ॥**

నీ మగడు శక్రుడని తెలుసు. అతడు దేవతలకు ప్రభువని తెలుసు. అయినా మానవమాత్రురాలయిన నేను ఈ పారిజాతాన్ని ఇదిగో! పట్టించుకొనిపోతున్నాను." అని వారిని హెచ్చరించి పలికింది.

**ఇత్యుక్తా రక్షిణో గత్వా శచ్యా ఊచుర్యథోదితమ్ ।**
**శచీ చోత్సాహయామాస త్రిదశాధిపతిం పతిమ్ ॥ 51 ॥**

సత్యభామ ఇలా పల్కగా వనరక్షకులు వెళ్ళి శచీదేవికి ఆమె చెప్పిన మాటలు తెలియజేశారు. శచి కూడ ఉక్రోషంతో దేవలోకప్రభువైన తన విభుని కయ్యానికి ప్రోత్సహించింది.

**తతః సమస్త దేవానాం సైన్యైః పరివృతో హరిమ్ ।**
**ప్రయయౌ పారిజాతార్థమిన్ద్రో యోధయితుం ద్విజ! ॥ 52 ॥**

ద్విజోత్తమా! అనంతరం పారిజాతం కోసమై ఇంద్రుడు సమస్త దేవసైన్యాలతో కూడుకొన్నవాడై హరితో పోరుసాగింప పయనమై వెళ్లాడు.

**తతః పరిఘనిస్త్రింశగదాశూలవరాయుధాః ।**
**బభూవు స్త్రిదశాః సజ్జాః శక్రే వజ్రకరే స్థితే ॥ 53 ॥**

శక్రుడు వజ్రాయుధం చేత దాల్చగా సమస్త దేవతలు పరిఘాయుధాలు, ఖడ్గాలు, గదలు, శూలాలు మున్నగు ఉత్తమాయుధాలు సిద్ధంచేసి యుద్ధ సన్నద్ధులయ్యారు.

**తతో నిరీక్ష్య గోవిన్దో నాగరాజోపరిస్థితమ్ ।**
**శక్రం దేవపరీవారం యుద్ధాయ సముపస్థితమ్ ॥ 54 ॥**

**చకార శంఖనిర్ఘోషం దిశః శబ్దేన పూరయన్ ।**
**ముమోచ శర సంఘాతాన్ సహస్రాయుతశః శితాన్ ॥ 55 ॥**

అంత గోవిన్దుడు నాగశ్రేష్ఠమైన ఐరావతాన్ని అధిరోహించిన ఇంద్రుణ్ణి, యుద్ధ సన్నద్ధమైయున్న దేవపరివారాన్ని చూచి, దిక్కులు ప్రతిధ్వనించేటట్లుగా శంఖధ్వని కావించాడు. అంతేకాక వేలకొలది లక్షలకొలది వాడియైన బాణసమూహాలను వారిపై విసరాడు.

**తతో దిశో నభశ్చైవ దృష్ట్వా శరశతైశ్చితమ్ ।**
**ముముచుస్త్రిదశాః సర్వే హ్యస్త్రశస్త్రాణ్యనేకశః ॥ 56 ॥**

అనంతరం సమస్త దిక్కులు, ఆకాశం బాణసమూహాలచే కప్పబడి వేయడం ఆలోకించి, దేవతలంతా పలు అస్త్రశస్త్రాలు ప్రయోగించారు.

**ఏకైకమస్త్రం శస్త్రం చ దేవైర్ముక్తం సహస్రశః ।**
**చిచ్ఛేద లీలయైవేశో జగతాం మధుసూదనః ॥ 57 ॥**

జగదీశుడైన మధుసూదనుడు దేవతలు విడిచిన వేలకొలది బాణాలను, శస్త్రాస్త్రాలను లీలగా పెక్కు ముక్కలు గావించాడు.

**పాశం సలిలరాజస్య సమాకృష్యోరగాశనః ।**
**చకార ఖణ్డశశ్చంచ్వా బాలపన్నగదేహవత్ ॥ 58 ॥**

జలాధిష్ఠాన దైవమైన వరుణుని పాశాన్ని గరుత్మంతుడు తన ముక్కుతో పట్టుకొని లాగి ముక్కుకొనతో పాము పిల్లలను తునుకలు చేసినట్లుగా తునాతునుకలు కావించాడు.

**యమేన ప్రహితం దణ్డం గదావిక్షేపఖణ్డితమ్ ।**
**పృథివ్యాం పాతయామాస భగవాన్ దేవకీసుతః ॥ 59 ॥**

యముడు విసిరిన దండాన్ని భగవంతుడైన దేవకీ నందనుడు తన గదను విసిరి ఖండించి భూమిపై పడవేశాడు.

**శిబికాం చ ధనేశస్య చక్రేణ తిలశో విభుః ।**
**చకార శౌరిరర్కంచ దృష్టిదృష్ట హతౌజసమ్ ॥ 60 ॥**

ధనేశుడైన కుబేరుని పల్లకీని చక్రి చక్రంతో నువ్వుగింజల్లాగా నులిచేశాడు. శౌరి సూర్యుని తన దృష్టిపాతంచే తేరిపారచూచి తేజోవిహీనుని కావించాడు.

**నీతోఽగ్నిః శీతతాం బాణైర్ద్రావితా వసవో దిశః ।**
**చక్రవిచ్ఛిన్నశూలాగ్రా రుద్రా భువి నిపాతితాః ॥ 61 ॥**

శార్ఙ్గపాణి తన బాణాలచే అగ్నిని చల్లబరిచాడు. వసువులను దశదిశలకు పారద్రోలాడు. చక్రధరుడు చక్రం విసరగా శూలాల కొనలు విరిగిపోయి రుద్రులు నేలకు ఒరిగారు.

**సాధ్యా విశ్వేఽథ మరుతో గన్ధర్వాశ్చైవ సాయకైః ।**
**శార్ఙ్గిణా ప్రేరితైరస్తా వ్యోమ్ని శాల్మలి తూలవత్ ॥ 62 ॥**

సాధ్యులు, విశ్వేదేవతలు, మరుత్తులు, గంధర్వులు, శార్ఙ్గపాణి వదలిన సాయకాలకు ఆకాశంలో దూదిపింజలుగా తూలిపోయారు.

**గరుత్మానపి వక్త్రేణ పక్షాభ్యాం చ నఖాంకురైః ।**
**భక్షయంస్తాడయన్ దేవాన్ దారయంశ్చ చచార వై ॥ 63 ॥**

గరుత్మంతుడు కూడ తన ముక్కుతో, రెక్కలతో, గోటి కొనలతో దేవతలను పొడుస్తూ, తాడిస్తూ, చీల్చివేస్తూ వీరవిహారం చేశాడు.

**తతః శరసహస్రేణ దేవేన్ద్ర మధుసూదనౌ ।**
**పరస్పరం వవర్షాతే ధారాభిరివ తోయదౌ ॥ 64 ॥**

అనంతరం దేవేంద్రుడు ఉపేంద్రుడు వేలకొలది బాణాలతో ఒకరినొకరు మేఘాలు వర్షధారలు కురిసేటట్లుగా పోరారు.

**ఐరావతేన గరుడో యుయుధే తత్ర సంయుగే ।**
**దేవైః సమస్తైర్యుయుధే శక్రేణ చ జనార్దనః ॥ 65 ॥**

అప్పుడు ఆ యుద్ధంలో గరుడుడు ఐరావతంతో యుద్ధం చేశాడు. జనార్దనుడు శక్రునితోను సమస్త దేవతలతోను పోరాడసాగాడు.

**ఛిన్నేష్వశేషబాణేషు శస్త్రేష్వస్త్రేషు చ త్వరన్ ।**
**జగ్రాహ వాసవో వజ్రం కృష్ణశ్చక్రం సుదర్శనమ్ ॥ 66 ॥**

సమస్త శరాలు, శస్త్రాలు, అస్త్రాలు ఛిన్నాభిన్నం కాగా వాసవుడు వజ్రాయుధాన్ని, కృష్ణుడు సుదర్శన చక్రాన్ని వెంటనే తీసుకొన్నారు.

**తతో హాహాకృతం సర్వం త్రైలోక్యం ద్విజసత్తమ! ।**
**వజ్రచక్రధరౌ దృష్ట్వా దేవరాజజనార్దనౌ ॥ 67 ॥**

ద్విజశ్రేష్ఠా! వజ్రధారి అయిన దేవరాజును, చక్రధారి అయిన జనార్దనుని వీక్షించి మూడు లోకాలలోని వారందరూ గజగజలాడి హాహాకారం చేశారు.

**క్షిప్తం వజ్రమథేన్ద్రేణ జగ్రాహ భగవాన్ హరిః ।**
**న ముమోచ తదా చక్రం తిష్ఠ తిష్ఠేతి చాబ్రవీత్ ॥ 68 ॥**

ఆ సమయంలో ఇంద్రుడు విసరిన వజ్రాయుధాన్ని భగవంతుడైన హరి అందుకొన్నాడు. కాని చక్రి ఇంద్రునిపై చక్రాయుధాన్ని ప్రయోగించలేదు. "ఇంద్రా! నిలు! నిలు!" అని గట్టిగా అరచాడు.

**ప్రనష్ట వజ్రం దేవేన్ద్రం గరుడక్షత వాహనమ్ ।**
**సత్యభామాఽ బ్రవీద్వీరం పలాయన పరాయణమ్ ॥ 69 ॥**

వజ్రాయుధం నష్టం కాగా, గరుడునిచే ఐరావతం గాయపడగా, పలాయనం చిత్తగించనున్న వీరుడగు దేవేంద్రుని చూచి సత్యభామ ఇలా అంది.

**త్రైలోక్యేశ! న తే యుక్తం శచీభర్తుః పలాయనమ్ ।**
**పారిజాతస్రగాభోగా త్వాముపస్థాస్యతే శచీ ॥ 70 ॥**

"త్రిభువనేశా! నీవు శచీదేవి భర్తవు కదా! పలాయనం నీవంటి వానికి తగదు. పారిజాత మాలావైభవ సంపూర్ణయైన శచి నిన్ను సేవించ వేచియుంది.

**కీదృశం దేవరాజ్యం తే పారిజాతస్రగుజ్జ్వలామ్ ।**
**అపశ్యతో యథాపూర్వం ప్రణయాదాగతాం శచీమ్ ॥ 71 ॥**

పారిజాత పుష్పమాలను అలంకరించుకొని, మునుపటిలాగా వలపువూలు విరజిమ్ముతూ ప్రేమతో దరికి వచ్చే శచీదేవిని చూడకుండా ఉండే నీ దేవరాజ్య వైభవం ఏపాటిది?

**అలం శక్ర! ప్రయాసేన న వ్రీడాం గన్తుమర్హసి ।**
**నీయతాం పారిజాతోఽ యం దేవాః సన్తు గత వ్యథాః ॥ 72 ॥**

ఇంద్రా! ప్రయాసపడకు. సిగ్గుపడ తగదు. ఈ పారిజాతాన్ని తీసుకొనిపో! దేవతలారా! దిగులు పడకండి.

**పతి గర్వావలేపేన బహుమానపురఃసరమ్ ।**
**న దదర్శ గృహే యాతాముపచారేణ మాం శచీ ॥ 73 ॥**

ఇంటికి (అతిథిగా) వచ్చిన నన్ను, తనను పతి ప్రేమగా చూచుకొంటాడనే గర్వాతిశయంతో ఇంద్రాణి బహుమానపూర్వకంగా కాని, పరిచర్యాపూర్వకంగా కాని గౌరవంగా చూడనే లేదు.

**స్త్రీత్వాదగురుచిత్తాహం స్వభర్తృశ్లాఘనాపరా ।**
**తతః కృతవతీ శక్ర! భవతా సహ విగ్రహమ్ ॥ 74 ॥**

శక్రా! నేను కూడ స్త్రీనవడం వల్ల ఉదారభావం లేని దాననయ్యాను. నా మగడు కూడా నన్ను ఎల్లప్పుడూ గౌరవిస్తాడనే వల్లమాలిన అభిమానంతో తమతో విరోధం పెట్టుకొన్నదానినయ్యాను.

**తదలం పారిజాతేన పరస్వేన హృతే న మే ।**
**రూపేణ గర్వితా సా తు భర్త్రా కాస్త్రీ న గర్వితా ॥ 75 ॥**

పరుల సొమ్ము వద్దు. హరించిన సొత్తూ వద్దు. ఈ పారిజాతం కూడ నాకు వద్దు. శచి తన చక్కదనంచే మగనివల్ల గర్వించింది. భర్త నావాడనుకొనే ఏ ఆడది గర్వించకుండా ఉంటుంది?" అని ఎకసక్కాలు పలికింది.

**ఇత్యుక్తో వినివృత్తోఽసౌ దేవరాజస్తథా ద్విజ! ।**
**ప్రాహ చైనామలం చణ్డి! సఖ్యుః ఖేదోక్తివిస్తరైః ॥ 76 ॥**

ద్విజశ్రేష్ఠా! సత్యభామ ఈ ప్రకారంగా నిందాగర్భితంగా పల్కగా, అవమానం పొంది శాంతి వహించిన దేవరాజు ఆమెతో "స్త్రీ సహజమైన కోపస్వభావం కలదానా! చాలు. ఇంకవద్దు. నేను మీ సుహృత్తును. మిత్రఖేదం కల్గించే మాటలు ఇంక పలుకవద్దు.

**న చాపి సర్గసంహారస్థితికర్తాఖిలస్య యః ।**
**జితస్య తేన మే వ్రీడా జాయతే విశ్వరూపిణా ॥ 77 ॥**

సంపూర్ణ జగత్తుకు సృష్టి స్థితి సంహార కర్తయైన విశ్వరూపుడైన విభుని వల్ల ఓటమిని పొందిన నాకు ఏ విధమైన సిగ్గు లేదు. సంకోచం లేదు.

**యస్మిన్ జగత్ సకలమేతదనాదిమధ్యే**
**యస్మాద్ యతశ్చ న భవిష్యతి సర్వభూతాత్ ।**
**తేనోద్భవప్రలయపాలనకారణేన**
**వ్రీడా కథం భవతి దేవి! నిరాకృతస్య ॥ 78 ॥**

దేవీ! ఆది, మధ్యం (అంతం) లేని ఏ పరమాత్మయందు ఈ సమస్త జగత్తు ఉత్పన్నమవుతోందో, ఈ జగత్తు ఎవనియందు ఉన్నదో, ఎవనిలో లీనమవుతుందో, అంతంలో కనబడకుండా పోతుందో, ఏ సర్వభూతాత్ముని వల్ల సృష్టి స్థితి పాలన కారణాలు ఏర్పడుతూ ఉంటాయో అట్టి పరమాత్మచే ఓడిపోయిన నాకు సిగ్గు ఏముంటుంది కనుక?

**సకలభువనసూతేర్మూర్తిరస్యాణుసూక్ష్మాం**
**విదితసకలవేదైర్జ్ఞాయతే యస్య నాన్యైః ।**
**తమజమకృతమీశం శాశ్వతం స్వేచ్ఛయైనం**
**జగదుపకృతిమర్త్యం కో విజేతుం సమర్థః ॥ 79 ॥**

ఎవడు సమస్త భువనాలకు ఉత్పాదకుడో, ఎవని రూపం, అణువు కంటే సూక్ష్మమై తెలియరాకుండా ఉంటుందో, వేదాలచే మాత్రం తెలియబడే వానిని, ఎవడు ఇతరులకు తెలియరాకుండా ఉంటాడో, అటువంటి జన్మరహితుని, కర్మవిహీనుని, ఈశ్వరుని, శాశ్వతుని, తన సంకల్పబలంచే జగదుపకారం కోసమై ఉద్భవించిన లీలామానుషావతారుని గెలవడానికి ఎవడు సమర్థుడు కాగలడు" అని పలుకుతూ ఇంద్రుడు కృష్ణుని స్తుతించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే పారిజాతానయనం నామ త్రింశోఽధ్యాయః సమాప్తః ॥ 30 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో పారిజాతమును తెచ్చుట అనే ముప్పైయవ అధ్యాయం సమాప్తం ॥30॥

## ఏకత్రింశోఽధ్యాయః - ముప్పై ఒకటవ అధ్యాయం

## కృష్ణస్య ద్వారకాగమనమ్ - కృష్ణుని ద్వారకాగమనం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**సంస్తుతో భగవానిత్థం దేవరాజేన కేశవః ।**
**ప్రహస్య భావగమ్భీరమువాచేదం ద్విజోత్తమ! ॥ 1 ॥**

మైత్రేయా! ఈ విధంగా దేవరాజు స్తుతించగా భగవంతుడైన కేశవుడు అల్లన నవ్వి భావగాంభీర్యం ఉట్టిపడేటట్లుగా ఇలా అన్నాడు.

**దేవరాజో భవానిన్ద్రో వయం మర్త్యా జగత్పతే! ।**
**క్షన్తవ్యం భవతా చేదమపరాధం కృతం మమ ॥ 2 ॥**

"త్రిభువనేశ్వరా! నీవు దేవరాజువు. మహేంద్రుడవు. మేము మర్త్యులము. నేను అపరాధం చేశాను. నీవు దీనిని మన్నించ వలసిఉంది.

**పారిజాతతరుశ్చాయం నీయతాముచితాస్పదమ్ ।**
**గృహీతోఽయం మయా శక్ర! సత్యావచన కారణాత్ ॥ 3 ॥**

ఈ పారిజాత వృక్షాన్ని దానికి తగిన స్థానానికి కొనిపోవచ్చు. శక్రా! సత్యభామ మాటలపైనున్న గౌరవంతో నేను దీనిని కైవసం జేసుకొన్నాను.

**వజ్రం చేదం గృహాణ త్వం యత్త్వయా ప్రహితం మయి ।**
**తవైవైతత్ ప్రహరణం శక్ర! వైరివిదారణమ్ ॥ 4 ॥**

శక్రా! నీవు నాపై విసిరిన ఈ వజ్రాయుధాన్ని నీవే గ్రహించు. శత్రువులను చీల్చిచెండాడే ఈ ఆయుధం నీదే. ఇది నీ దగ్గర ఉండవలసిందే" అన్నాడు కృష్ణుడు.

**ఇంద్ర ఉవాచ :-** ఇంద్రుడు చెప్పాడు.

**విమోహయసి మామీశ! మర్త్యోఽహమితి కిం వదన్ ।**
**జానీమస్త్వాం భగవతో నతు సూక్ష్మవిదో వయమ్ ॥ 5 ॥**

అపుడు దేవేంద్రుడు "ఈశ్వరా! నేను మర్త్యలోకంలో వసించే మానవుడనని పలుకుతూ నన్నేల తబ్బిబ్బు పరుస్తావు? భగవంతుడవైన నీ దృశ్యమానరూపం నాకు తెలుసు. కాని నీ సూక్ష్మరూపానికి సంబంధించిన జ్ఞానం మాకు లేదు.

**యోఽసి సోఽసి జగత్త్రాణ! ప్రవృత్తౌ నాథ! సంస్థితః ।**
**జగతః శల్యనిష్కర్షం కరోష్యసురసూదన! ॥ 6 ॥**

జగత్తులను రక్షించే ప్రభూ! ఈ ప్రపంచానికి ఎవడు ప్రవృత్తి కారకుడో, స్థితి కర్తయో అతడు నీవే. అసురులను నాశనం చేసే కృష్ణా! జగత్తుకు కంటకప్రాయులైన వారిని లెక్క చూడకుండా నీవే ఏరిపారవేస్తూ ఉంటావు.

**నీయతాం పారిజాతోఽయం కృష్ణ! ద్వారవతీం పురీమ్ ।**
**మర్త్యలోకే త్వయా త్యక్తే నాయం సంస్థాస్యతే భువి ॥ 7 ॥**

శ్రీకృష్ణా! ద్వారకాపురికి ఈ పారిజాతవృక్షాన్ని కొనిపోవచ్చు. నీవు మర్త్యలోకాన్ని విడిచిపెట్టిన తరువాత, ఈ దేవతరువు అక్కడ నుండ తగదు." అని వేడుకొన్నాడు.

**తథేత్యుక్త్వా చ దేవేన్ద్ర మాజగామ భువం హరిః ।**
**ప్రసక్తైః సిద్ధ గన్ధర్వైః స్తూయమానస్సురర్షిభిః ॥ 8 ॥**

అని ఇంద్రుడు పలుకగా విని ఆతనిని వీడ్కొలిపి హరి భూలోకానికి వచ్చివేశాడు. సిద్ధులు, గంధర్వులు, ఋషిగణాలు కృష్ణుడు బయలుదేరే సమయంలో పెక్కు విధాలుగా వినుతించారు.

**తతః శంఖముపాధ్మాయ ద్వారకోపరిసంస్థితః ।**
**హర్షముత్పాదయామాస ద్వారకావాసినాం ద్విజ! ॥ 9 ॥**

ద్విజోత్తమా! అనంతరం హరి ద్వారకకు ఏగుదెంచి, శంఖంపూరించి ద్వారకానగర వాసులందరికీ ఆనందాన్ని కలిగించాడు.

**అవతీర్యాథ గరుడాత్ సత్యభామాసహాయవాన్ ।**
**నిష్కుటే స్థాపయామాస పారిజాతం మహాతరుమ్ ॥ 10 ॥**

సత్యభామతో కలిసి గరుడుని మీదనుంచి క్రిందకు దిగి ఆ పారిజాత దివ్యవృక్షాన్ని ఆమె పెరటిలో నాటించాడు.

**యమభ్యేత్య జనః సర్వో జాతిం స్మరతి పౌర్వికీమ్ ।**
**వాస్యతే యస్య పుష్పోత్థగన్ధేనోర్వీ త్రియోజనమ్ ॥ 11 ॥**

ఆ పారిజాత వృక్షాన్ని సమీపించిన సర్వజనానికి పూర్వజన్మ స్మృతి కలుగుతోంది. దాని పూలనుండి బయలుదేరిన సువాసన మూడు యోజనాల వరకు వ్యాపిస్తోంది.

**తతస్తే సాదరాః సర్వే దేహబన్ధా నమానుషాన్ ।**
**దదృశుః పాదపే తస్మిన్ కుర్వన్తో ముఖదర్శనమ్ ॥ 12 ॥**

అందువల్ల ఆ యాదవులందరు ప్రీతితో ఆ పారిజాత పాదపంలో తమ ముఖాలను చూచుకొంటూ తమ ముందటి జన్మలలోని అమానుష దేహబంధాలను దర్శించుకొన్నారు.

**కింకరైః సముపానీతం హస్త్యశ్వాది తతో ధనమ్!,**
**స్త్రియశ్చ కృష్ణో జగ్రాహ నరకస్య పరిగ్రహాన్ ।**
**విభజ్య ప్రదదౌ కృష్ణో బాన్ధవానాం మహామతిః ॥ 13 ॥**

అనంతరం కృష్ణుడు నరకుని రాజధాని నుంచి కింకరులచే కొనివచ్చిన ఏనుగులను, గుర్రాలను, ధనకనకవస్తువాహనాలను తన బాంధవుల కందరికి పంచి ఇచ్చాడు. బుద్ధిశాలియైన ఆ భగవంతుడు నరకుని చెర నుండి విడిపించిన కన్యలను తానే స్వీకరించాడు.

**తతః కాలే శుభే ప్రాప్తే ఉపయేమే జనార్దనః ।**
**తాః కన్యా నరకేణాసన్ సర్వతో యాః సమాహృతాః ॥ 14 ॥**

తరువాత శుభసమయం రాగా జనార్దనుడు, నరకాసురునిచే బలాత్కారంగా అపహరించబడిన కన్యలనందరిని వివాహమాడాడు.

**ఏకస్మిన్నేవ గోవిన్దః కాలే తాసాం మహామతే ।**
**జగ్రాహ విధివత్ పాణీన్ పృథగ్గేహేషు ధర్మతః ॥ 15 ॥**

మహాబుద్ధిశాలివైన మైత్రేయా! గోవిందుడు ఒకే ఒక సమయంలో వేరు వేరు భవనాలలో వారినందరిని శాస్త్రవిధితో ధర్మపూర్వకంగా పాణిగ్రహణం చేశాడు.

**షోడశ స్త్రీసహస్రాణి శతమేకం తథాధికమ్ ।**
**తావన్తి చక్రే రూపాణి భగవాన్ మధుసూదనః ॥ 16 ॥**

పదహారువేల ఒక వంద మంది కన్యలను వివాహమాడే వేళ భగవంతుడైన మధుసూదనుడు అన్నే రూపాలను తాను ధరించాడు.

**ఏకైకమేవ తాః కన్యా మేనిరే మధుసూదనమ్ ।**
**మమైవ పాణిగ్రహణం భగవాన్ కృతవానితి ॥ 17 ॥**

మైత్రేయా! వారందరు ఎవరికి వారే భగవంతుడైన మధుసూదనుడు నన్నే పాణిగ్రహణం చేసుకొన్నాడని భావించడం జరిగింది.

**నిశాసు చ జగత్స్రష్టా తాసాం గేహేషు కేశవః ।**
**ఉవాస విప్ర! సర్వాసాం విశ్వరూపధరో హరిః ॥ 18 ॥**

విప్రోత్తమా! విశ్వరూపధరుడు, జగత్సృష్టికారకుడు, కేశవుడైన హరి వారందరి భవనాలలో రాత్రి సమయాలలో నివసించడం జరిగింది. అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే కృష్ణస్య ద్వారకాగమనం నామ ఏకత్రింశోఽధ్యాయః సమాప్తః ॥ 31 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో కృష్ణుని ద్వారకాగమనం అనే ముప్పై ఒకటవ అధ్యాయం సమాప్తం॥31॥

## ద్వాత్రింశోఽధ్యాయః - ముప్పై రెండవ అధ్యాయం

## ఉషాపరిణయః - ఉషాపరిణయం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ప్రద్యుమ్నాద్యా హరేః పుత్రా రుక్మిణ్యాం కథితాస్తవ ।**
**భానుభౌమేరికాద్యాంశ్చ సత్యభామా వ్యజాయత ॥ 1 ॥**

మైత్రేయా! హరికి రుక్మిణియందు ప్రద్యుమ్నుడు మున్నగు కుమారులు కలిగారని ఇదివరకే నీకు చెప్పియున్నాను. సత్యభామ భానుడు, భౌమేరికుడు మున్నగు పుత్రులను కన్నది.

**దీప్తిమాన్ తామ్రపక్షాద్యా రోహిణ్యాం తనయా హరేః ।**
**బభూవుర్జామ్బవత్యాం చ సామ్బాద్యా బలశాలినః ॥ 2 ॥**

కృష్ణునకు రోహిణియందు దీప్తిమంతుడు, తామ్రపక్షుడు మున్నగు తనయులు ఉద్భవించారు. జాంబవతి యందు బలవంతులైన సాంబుడు మున్నగువారు ప్రభవించారు.

**తనయా భద్రవిన్దాద్యా నాగ్నజిత్యాం మహాబలాః ।**
**సంగ్రామజిత్ప్రధానాస్తు శైవ్యాయాం త్వభవన్ సుతాః ॥ 3 ॥**

నాగ్నజితి (సత్య) యందు మహాబలశాలురైన భద్రవిందుడు మున్నగువారు కలిగారు. శైవ్య (మిత్రవింద) యందు సంగ్రామజిత్తు మున్నగు సుతులు జన్మించారు.

**వృకాద్యాశ్చ సుతా మాద్ర్యాం గాత్రవత్ప్రముఖాన్ సుతాన్ ।**
**అవాప లక్ష్మణా పుత్రాః కాలిన్ద్యాం చ శ్రుతాదయః ॥ 4 ॥**

హరికి మాద్రియందు వృకుడు మున్నగు సుతులు కలిగారు. లక్ష్మణ గాత్రవంతుడు మున్నగు తనయులను పొందింది. కాలింది యందు కృష్ణునకు శ్రుతుడు మున్నగు తనూజులు కలిగారు.

**అన్యాసాం చైవ భార్యాణాం సముత్పన్నాని చక్రిణః ।**
**అష్టాయుతాని పుత్రాణాం సహస్రాణాం శతం తథా ॥ 5 ॥**

చక్రధారియైన శ్రీకృష్ణునకు మిగిలిన భార్యలయందు ఒక లక్షా ఎనభైవేల మంది పుత్రులు కలిగారు.

**ప్రద్యుమ్నః ప్రథమస్తేషాం సర్వేషాం రుక్మిణీసుతః ।**
**ప్రద్యుమ్నాదనిరుద్ధోఽభూద్ వజ్రస్తస్మాదజాయత ॥ 6 ॥**

వారందరిలోను రుక్మిణీకుమారుడైన ప్రద్యుమ్నుడు పెద్దవాడు. ప్రద్యుమ్నుని వల్ల అనిరుద్ధుడు కలిగాడు. అతని వల్ల వజ్రుడు జన్మించాడు.

**అనిరుద్ధో రణే! రుద్ధో బలేః పౌత్రీం మహాబలః ।**
**ఉషాంబాణస్యతనయాముపయేమే ద్విజోత్తమ! ॥ 7 ॥**

ద్విజశ్రేష్ఠా! అనిరుద్ధుడు యుద్ధంలో ఎవరికీ కట్టుబడని వాడు అయినా అతడు పట్టుబడ్డాడు. మహాబలశాలి అయిన అనిరుద్ధుడు బలిచక్రవర్తిమనుమరాలయిన, బాణుని కుమార్తెయగు ఉషను వివాహమాడాడు.

**యత్ర యుద్ధమభూద్ ఘోరం హరిశంకరయోర్మహత్ ।**
**ఛిన్నం సహస్రం బాహూనాం యత్ర బాణస్య చక్రిణా ॥ 8 ॥**

ఆ పరిణయనిమిత్తంగా హరిహరులకు మహాఘోరయుద్ధం సంభవించింది. ఆ యుద్ధంలో చక్రధారి అయిన హరి బాణుని వేయిచేతులను ఖండించడం జరిగింది.

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు ఇలా చెప్పాడు.

**కథం యుద్ధమభూద్ బ్రహ్మన్నుషార్థే హరకృష్ణయోః ।**
**కథం క్షయం చ బాణస్య బాహూనాం కృతవాన్ హరిః ॥ 9 ॥**

**ఏతత్ సర్వం మహాభాగ! సమాఖ్యాతుం త్వమర్హసి ।**
**మహత్ కౌతూహలం జాతం కథాం శ్రోతుమిమాం హరేః ॥ 10 ॥**

"బ్రహ్మణ్యుడా! ఈశ్వరునకు శ్రీకృష్ణునకు ఉషావివాహనిమిత్తంగా ఎట్లు యుద్ధం జరిగింది? బాణుని సహస్రబాహువులను హరి ఏవిధంగా నాశనం చేశాడు మహాభాగా! దీనిని అంతా వివరించడానికి నీవు తగియున్నావు. హరికథావృత్తాంతం వినాలనే ఈ కోరిక నాకు ఎంతగానో ఉద్భవించింది". అని కోరాడు.

**పరాశర ఉవాచ :-** పరాశరుడు ఇలా చెప్పాడు.

**ఉషా బాణ సుతా విప్ర! పార్వతీం సహ శంభునా ।**
**క్రీడన్తీముపలక్ష్యోచ్చైః స్పృహాం చక్రే తదాశ్రయామ్ ॥ 11 ॥**

విప్రోత్తమా! ఉష బాణుని కుమార్తె. ఆమె ఒకనాడు పార్వతి శంకరునితో కలసి విహరించడం వీక్షించి అటువంటి విలాసంపై తాను ఎంతగానో ముచ్చటపడింది.

**తతః సకల చిత్తజ్ఞా గౌరీ తామాహ భామినీమ్ ।**
**అలమత్యర్థతాపేన భర్త్రా త్వమపి రంస్యసే ॥ 12 ॥**

సమస్త జీవుల మనస్సులలోని విషయాలను గ్రహించగల్గిన గౌరి ఆ భామినితో "చాలు చాలు ఎక్కువ పరితాపం చెందవద్దు. నీవు కూడ భర్తతో కలసి ఆనందం అనుభవిస్తావు" అని చెప్పింది.

**ఇత్యుక్తే సా తయా చక్రే కదేతి మతిమాత్మనః ।**
**కో వా భర్తా మమేత్యేతాం పునరప్యాహ పార్వతీ ॥ 13 ॥**

భవాని ఇలా వరమీయగా అపుడు ఉష "నా చిత్తంలో వరించదగిన ఆ వ్యక్తి ఎవడు? అతడెప్పుడు నాకు మగడు కాగలడు?" అని వేడగా పార్వతి మళ్లీ ఆమెతో ఇలా అంది.

**పార్వతీ ఉవాచ :-** పార్వతి చెప్పింది.

**వైశాఖశుక్లద్వాదశ్యాం స్వప్నే యోఽభిభవం తవ ।**
**కరిష్యతి స తే భర్తా రాజపుత్రి! భవిష్యతి ॥ 14 ॥**

"రాజతనయా! వైశాఖమాసంలో శుక్ల పక్ష ద్వాదశి నాడు నిన్ను కలలో ఎవడు కలుస్తాడో, అతడే నీకు భర్త కాగలడు" అని చెప్పింది.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**తస్యాం తిథౌ పుమాన్ స్వప్నే యథా దేవ్యా సమీరితమ్ ।**
**తథైవాభిభవం చక్రే రాగం చక్రే తథైవ సా ॥ 15 ॥**

దేవి చెప్పినట్లుగానే ఉష అదే తిథినాడు చక్కని ఒక పురుషుడు తనను పొందినట్లుగా కల కనడం జరిగింది. ఆమె కూడ ఆ వ్యక్తియందు అనురక్త అయింది.

**తతః ప్రబుద్ధా పురుషమపశ్యన్తీ సముత్సుకా ।**
**క్వ గతోఽసీతి నిర్లజ్జా మైత్రేయోక్తవతీ సఖీమ్ ॥ 16 ॥**

మైత్రేయా! అనంతరం ఆమె మేల్గాంచి కలలో తాను చూచిన పురుషుని చూడనేరక బిడియం విడిచి చెలికత్తెతో "ఏడి? వాడేడి? ఎక్కడకు వెళ్లిపోయాడు?" అని పలికింది.

**బాణస్య మన్త్రీ కుమ్భాణ్డశ్చిత్రలేఖా తు తత్సుతా ।**
**తస్యాః సఖ్యభవత్ సా చ ప్రాహ కోఽయం త్వయోచ్యతే ॥ 17 ॥**

బాణుని మంత్రి కుంభాండుడు. అతని కుమార్తె చిత్రలేఖ. ఆమె ఉషాదేవి చెలికత్తె. అపుడామె "చెలీ! నీవు అన్న ఆ పురుషుడు ఎవడే?" అని అడిగింది.

**యదా లజ్జాకులా నాస్యై కథయామాస సా సతీ ।**
**తదా విశ్వాసమానీయ సర్వమేవాభ్యవాదయత్ ॥ 18 ॥**

ఉషాకన్య సిగ్గుతో ఉక్కిరిబిక్కిరియై పోయి చిత్రలేఖకు ఆ విషయం చెప్పలేకపోయింది. ఆమె పలు రీతులుగా నమ్మకం గూర్చి పలుకగా ఉష తన స్వప్న వృత్తాంతాన్ని యథావిధిగా తెలియజేసింది.

**విదితార్థాం తు తామాహ పునశ్చోషా యథోదితమ్ ।**
**దేవ్యా తథైవ తత్ప్రాప్తౌ యోఽభ్యుపాయః కురుష్వ తమ్ ॥ 19 ॥**

అపుడు చిత్రలేఖకు స్వప్నవృత్తాంతం అంతా తెలియజేసిన తరువాత, పార్వతీదేవి తనకు చెప్పిన ఉదంతాన్ని అంతా వివరించి, ఆ పురుషుని పొందడానికై ఉపాయమేదైనా ఉంటే చేయవలసిందని అడిగింది.

**చిత్రరేఖా ఉవాచ :-** చిత్రలేఖ పలికెను.

**దుర్విజ్ఞేయమిదం వక్తుం ప్రాప్తుం వాఽపి న శక్యతే ।**
**తథాఽపి కించిత్కర్తవ్యముపకారం ప్రియే తవ ॥ 20 ॥**

దీనిని తెలియుట బహుకష్టము. దీనిని గూర్చి చెప్పుటగాని, పొందుటగాని వీలుకాదు. అయిననూ ఓ ప్రియమైన దానా! నీకు కొంచెము ఉపకారము చేయుదును.

**సప్తాష్టదిన పర్యంతం తావత్కాలః ప్రతీక్ష్యతామ్ ।**
**ఇత్యుక్త్వాఽభ్యంతరం గత్వా ఉపాయం తమథాకరోత్ ॥ 21 ॥**

ఏడు, ఎనిమిదిరోజులు నిరీక్షించుము. అని పలికి అంతఃపురములోనికి వెళ్ళి ఆ యుపాయమును ఒనరించెను.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**తతః పటే సురాన్ దైత్యాన్ గన్ధర్వాంశ్చ ప్రధానతః ।**
**మనుష్యాంశ్చాభిలిఖ్యాస్యై చిత్రలేఖా వ్యదర్శయత్ ॥ 22 ॥**

అనంతరం చిత్రలేఖ దేవదైత్యగంధర్వమనుష్యగణాలలోని ముఖ్యులైన వ్యక్తులను చిత్రపటంపై చిత్రాలు గీసి ఉషాకన్యకు చూపించింది.

**అపాస్య సా తు గన్ధర్వాంస్తథోరగసురాసురాన్ ।**
**మనుష్యేషు దదౌ దృష్టిం తేష్వప్యన్ధకవృష్ణిషు ॥ 23 ॥**

ఉష కూడ చిత్రపటంపై లిఖించబడ్డ గంధర్వులపైనను, పన్నగులపైనను, సురలపైనను, అసురులపైనను దృష్టి మళ్లించి ప్రత్యేకంగా మనుష్యులపై, అందులో కూడా అన్ధకవృష్టి వంశోద్భవులపై తన చూపు ప్రసారించింది.

**కృష్ణరామౌ విలోక్యాసౌ సుభ్రూర్లజ్జాజడేవ సా ।**
**ప్రద్యుమ్నదర్శనే వ్రీడా దృష్టిం నిన్యేఽన్యతో ద్విజ! ॥ 24 ॥**

ద్విజోత్తమా! అనంతరం ఆ సుభ్రువు అయిన ఉష బలరామకృష్ణుల చిత్రాలను వీక్షించి సిగ్గుపొంది జడీభూతురాలయింది. తరువాత ప్రద్యుమ్నుని చూడడంతోనే మరోప్రక్క మరింత సిగ్గుపొంది చూపు మరల్చినదయ్యింది.

**దృష్టమాత్రే తతః కాన్తే ప్రద్యుమ్నతనయే ద్విజ ।**
**దృష్ట్వాత్యర్థవికాసిన్యా లజ్జా క్వాపి నిరాకృతా ॥ 25 ॥**

ద్విజశ్రేష్ఠా! ఆ పైన ప్రద్యుమ్నుని కుమారుని అనిరుద్ధుని కాంచినంతటనే మిక్కిలి విలాసచకితమైన చూపుతో ఆ సిగ్గును ఎటు మరల్చెనో తెలియకుండా అయిపోయింది.

**సోఽయం సోఽయ మితీత్యుక్తే తయా సా యోగగామినీ ।**
**యయౌ ద్వారవతీంచోషాం సమాశ్వాస్య తతః సఖీమ్ ॥ 26 ॥**

"ఆతడే ఈతడు. అతడే ఇతడు." అని ఉషాకన్య అన్నదే తడవుగా చిత్రలేఖ సఖిని ఓదార్చి యోగశక్తిచే లభించిన గమనశక్తిచే ద్వారకానగరానికి బయలుదేరింది – అని పరాశరుడు చెప్పాడు.

**పాఠాంతర శ్లోకాలు :**

**చిత్రలేఖోవాచ :–** చిత్రలేఖ ఇలా అంది.

**అయం కృష్ణస్య పౌత్రస్తే భర్తా దేవ్యా ప్రసాదితః ।**
**అనిరుద్ధ ఇతి ఖ్యాతః ప్రఖ్యాతః ప్రియదర్శనః ॥ 27 ॥**

**ప్రాప్నోషి యది భర్తారమిమం ప్రాప్తం త్వయాఽఖిలమ్ ।**
**దుష్ప్రవేశా పురీ పూర్వం ద్వారకా కృష్ణపాలితా ॥ 28 ॥**

**తథాఽపి యత్నాద్భర్తారమానయిష్యామి తే సఖి ।**
**రహస్యమేతద్వక్తవ్యం న కస్యచిదపి త్వయా ॥ 29 ॥**

**అచిరాదాగమిష్యామి సహస్వ విరహం మమ ।**
**యయౌ ద్వారవతీం చోషాం సమాశ్వాస్య తతస్సఖీమ్ ॥ 30 ॥**

"ఇతడు కృష్ణుని మనుమడు. పార్వతీదేవిచే నీకు భర్తగా అనుగ్రహించబడినవాడు అనిరుద్ధుడు అని పేరు పొందినవాడు. మిక్కిలి ప్రసిద్ధిగన్నవాడు. గొప్ప అందగాడు. ఈతనిని నీవు భర్తగా పొందితే సమస్తం నీవు పొందినట్లే. ద్వారకాపురి పూర్వం కృష్ణునిచే నిర్మించబడి ఆయన రక్షణలో ఉంది. అది ఇతరులకు ప్రవేశించ శక్యం కానిది. చెలీ! అయినా ప్రయత్నించి నీవనుకొన్న భర్తను తీసుకొని వస్తాను. ఇది రహస్యం. నీవు ఎవ్వరికి చెప్పవద్దు. కొద్దికాలంలోనే అతనిని ఇక్కడకు కొనిరాగలను. అంతవరకు నా ఎడబాటును ఒకించుక సహించు." అని ఉషను సమాధానపరచి చిత్రలేఖ ద్వారవతీ నగరానికి వెళ్లింది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే ఉషాపరిణయో నామ ద్వాత్రింశోఽధ్యాయః సమాప్తః ॥ 32 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో ఉషాపరిణయం అనే ముప్పై రెండవ అధ్యాయం సమాప్తం ॥ 32 ॥



## త్రయస్త్రింశోఽధ్యాయః – ముప్పై మూడవ అధ్యాయం

## ఉషాఽనిరుద్ధయోః కల్యాణమ్ – ఉషా అనిరుద్ధుల కల్యాణం

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**బాణోఽపి ప్రణిపత్యాగ్రే మైత్రేయాహ త్రిలోచనమ్ ।**
**దేవ! బాహుసహస్రేణ నిర్విణ్ణోఽహం వినాఽహవమ్ ॥ 1 ॥**
**క్వచిన్మమైషాం బాహూనాం సాఫల్యజనకో రణః ।**
**భవిష్యతి వినా యుద్ధం భారాయ మమ కిం భుజైః ॥ 2 ॥**

మైత్రేయా! ఒకనాడు బాణాసురుడు త్రిలోచనునకు వంగి నమస్కరించి "దేవా! శివా! యుద్ధం లేకపోవడం వల్ల ఈ వేయిచేతులతో ఏమి పనియని మిక్కిలి ఖేదపడుతున్నాను. నా ఈ బాహువులకు సాఫల్యం కలిగించే రణం ఎప్పుడు సంభవిస్తుంది? సంగ్రామం లేకపోతే నాకు ఈ చేతులు పెద్ద బరువే తప్ప ఉపయోగం ఏముంది కనుక?" అని వేడుకొన్నాడు.

**శంకర ఉవాచ :–** శంకరుడు చెప్పాడు.

**మయూరధ్వజభంగస్తే యదా బాణ! భవిష్యతి ।**
**పిశితాశిజనానన్దం ప్రాప్స్యసే త్వం తదా రణమ్ ॥ 3 ॥**

అపుడు శంకరుడు "బాణాసురా! నీ నెమలి గుర్తుగల టెక్కెం ఎప్పుడు విరిగి పడిపోతుందో, అప్పుడు పిశాచాలకు మహానందం చేకూర్చే సంగ్రామం సంఘటితమవుతుంది." అని చెప్పాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**తతః ప్రణమ్య ముదితః శమ్భుమభ్యాగతో గృహమ్ ।**
**భగ్నం చ ధ్వజమాలోక్య హృష్టో హర్షాన్తరం యయౌ ॥ 4 ॥**

అనంతరం వరదాయకుడైన శంభునకు నమస్కరించి బాణుడు తన నివాసానికి సంతోషంతో తిరిగి వచ్చాడు. కాలాంతరంలో అతని మయూరధ్వజం విరిగి నేలపాలయ్యింది. అందువల్ల బాణాసురుడు పరమానందసంభరితుడయ్యాడు.

**ఏతస్మిన్నేవ కాలే తు యోగవిద్యా బలేన తమ్ ।**
**అనిరుద్ధమథానిన్యే చిత్రలేఖావరాప్సరాః ॥ 5 ॥**

ఇదే సమయంలో చిత్రలేఖ అనే శ్రేష్ఠురాలైన అప్సరస తన యోగవిద్యాబలంతో ఆ అనిరుద్ధుని తీసుకొని వచ్చింది.

**కన్యాన్తః పురమధ్యే తు రమమాణాం సహోషయా ।**
**విజ్ఞాయ రక్షిణో గత్వా శశంసుర్దైత్యభూపతేః ॥ 6 ॥**

అనిరుద్ధుడు కన్యాంతఃపుర మధ్యభాగంలో ఉషతో క్రీడించడం తెలుసుకొని అంతఃపుర కావలివాండ్రు మిక్కిలి త్వరగా వెళ్లి దైత్యరాజుకు తెలియజేశారు.

**ఆదిష్టం కింకరాణాన్తు సైన్యం తేన దురాత్మనా ।**
**జఘాన పరిఘం లోహమాదాయ పరవీరహా ॥ 7 ॥**

దురాత్ముడైన ఆ బాణుడు వెంటనే రాక్షససైనికులకు అతనిని బంధించమని ఆజ్ఞాపించాడు. శత్రుసైన్యాన్ని చీల్చి చెండాడగల్గిన అనిరుద్ధుడు వారిని లోహమయమైన పరిఘాయుధంతో కూల్చివేశాడు.

**హతేషు తేషు బాణోఽపి రథస్థస్తద్వధోద్యతః ।**
**యుధ్యమానో యథాశక్తి యదా వీర్యేణ నిర్జితః ॥ 8 ॥**

ఆ దైత్యకింకరులు అందరూ మరణించగా బాణాసురుడు రథం అధిరోహించినవాడై అతనిని చంపడానికి నిశ్చయించి యథాశక్తిగా పోరాడాడు. కాని అనిరుద్ధుని పరాక్రమం ముందు నిలువలేక ఓడిపోయాడు.

**మాయయా యుయుధే తేన స తదా మన్త్రిచోదితః ।**
**తతస్తం పన్నగాస్త్రేణ బబన్ధ యదునన్దనమ్ ॥ 9 ॥**

అపుడు బాణుడు మంత్రి ప్రేరేపించగా, మాయాయుద్ధంచేసి నాగాస్త్రంతో ఆ యదునందనుని బంధించాడు.

**ద్వారవత్యాం క్వ యాతోఽసావనిరుద్ధేతి జల్పతామ్ ।**
**యదూనామాచచక్షే తం బద్ధం బాణేన నారదః ॥ 10 ॥**

అక్కడ ద్వారవతీ నగరంలో "అనిరుద్ధుడు ఏమయ్యాడు? అతడు ఎక్కడికి వెళ్లాడు?" అనే కలకలం బయలుదేరింది. అంత నారదుడు వచ్చి యాదవులకు అతడు బాణాసురునిచే బద్ధుడైన ఉదంతాన్ని తెలియజేశాడు.

**తం శోణితపురం శ్రుత్వా నీతం విద్యావిదగ్ధయా ।**
**యోషితా ప్రత్యయం జగ్ముర్యాదవా నామరైరితి ॥ 11 ॥**

అనిరుద్ధుడు ఒక మాయావిద్యాప్రవీణురాలగు యువతియైన చిత్రలేఖద్వారా శోణితపురం కొంపోబడ్డాడన్న వృత్తాంతం విన్న యాదవులు దేవతలచే కొంపోబడలేదని నమ్మకాన్ని చెందారు.

**తతో గరుడమారుహ్య స్మృతమాత్రాగతం హరిః ।**
**బలప్రద్యుమ్నసహితో బాణస్య ప్రయయౌ పురమ్ ॥ 12 ॥**

అనంతరం తలచినంత మాత్రం చేతనే తన ఎదుట వ్రాలిన గరుత్మంతుని అధిరోహించి హరి బలరామ ప్రద్యుమ్నులతో కలసి బాణుని శోణపురం బయలుదేరాడు.

**పురీప్రవేశే ప్రమథైర్యుద్ధమాసీన్మహాత్మనః ।**
**యయౌ బాణపురాభ్యాశం నీత్వా తాన్ సంక్షయం హరిః ॥ 13 ॥**

పురప్రవేశ సమయంలోనే ఆ మహాత్మునికి ప్రమథగణాలతో భయంకరమైన పోరు జరిగింది. హరి వారిని అందరిని ఓడించి బాణపురసమీపానికి చేరుకొన్నాడు.

**తత స్త్రిపాదస్త్రిశిరా జ్వరో మాహేశ్వరో మహాన్ ।**
**బాణరక్షార్థమభ్యేత్య యుయుధే శార్ఙ్గధన్వనా ॥ 14 ॥**

ఆ సమయంలో మూడు పాదాలు, మూడు తలలు గల శక్తిమంతమైన శివజ్వరం బాణుని రక్షించుటకై వచ్చి శార్ఙ్గపాణితో యుద్ధం చేసింది.

**తద్భస్మస్పర్శసమ్భూతతాపః కృష్ణాంగసంగమాత్ ।**
**అవాప బలదేవోఽపి శ్రమమామీలితేక్షణః (శమమ్) ॥ 15 ॥**

ఆ శివభస్మజ్వరసంబంధమైన స్పర్శవల్ల పుట్టిన తాపం కృష్ణుని శరీరసంస్పర్శమాత్రంచేతనే నశించింది. బలరాముడు కూడ ఒక్కసారి కన్నులు మోడ్చి తాపశాంతిని పొందాడు.

**తతః స యుధ్యమానస్తు సహ దేవేన శార్ఙ్గిణా ।**
**వైష్ణవేన జ్వరేణాశు కృష్ణదేహాన్నిరాకృతః ॥ 16 ॥**

అనంతరం ఆ శివజ్వరం దేవోత్తముడైన హరితో పోరి కృష్ణుని శరీరంనుంచి బయల్వెడలిన వైష్ణవ జ్వరంచే సమసిపోయింది.

**నారాయణభుజాఘాత పరిపీడనవిహ్వలమ్ ।**
**తం వీక్ష్య క్షమ్యతామస్యేత్యాహ దేవః పితామహః ॥ 17 ॥**

నారాయణుని భుజప్రహారం వల్ల పొందిన పరితాపంచే విహ్వలమవుతున్న ఆ శివజ్వరమూర్తిని చూచి పితామహుడైన బ్రహ్మ వీనిని క్షమించమని హరిని వేడుకొన్నాడు.

**తతశ్చ క్షాన్తమేవేతి ప్రోక్త్వా తం వైష్ణవం జ్వరమ్ ।**
**ఆత్మన్యేవ లయం నిన్యే భగవాన్ మధుసూదనః ॥ 18 ॥**

భగవంతుడైన మధుసూదనుడు అపుడు సైరించితినని పలికి ఆ వైష్ణవజ్వరాన్ని తనయందు ఇముడ్చుకొన్నాడు.

**మమ త్వయా సమం యుద్ధం యే స్మరిష్యన్తి మానవాః ।**
**విజ్వరాస్తే భవిష్యన్తీత్యుక్త్వా చైనం యయౌ జ్వరః ॥ 19 ॥**

అంతట ఆ వైష్ణవజ్వరం దేవదేవుడైన కృష్ణునితో నీతో సమానంగా నేను చేసిన యుద్ధాన్ని ఏ మానవులయితే స్మరిస్తారో వారు ఏ జ్వరం లేనివారవుతారని పలికి వెళ్లిపోయింది.

**తతోఽగ్నీన్ భగవాన్ పంచ జిత్వా నీత్వా తథా క్షయమ్ ।**
**దానవానాం బలం విష్ణుశ్చూర్ణయామాస లీలయా ॥ 20 ॥**

అనంతరం భగవంతుడు పంచాగ్నులను జయించి, వాటిని నశింపజేసి, లీలాపూర్వకంగా ఆ విష్ణువు దానవసేననంతా బూడిద చేశాడు.

**విశేషాంశాలు :** పంచాగ్నులు 1) జ్ఞానాగ్ని (ఆత్మ) 2) కాలాగ్ని (పాదాలు) 3) క్షుధాగ్ని (నాభి) 4) శీతాగ్ని (హృదయం) 5) కోపాగ్ని (నేత్రాలు).

**తతః సమస్తసైన్యేన దైతేయానాం బలేః సుతః ।**
**యుయుధే శంకరశ్చైవ కార్తికేయశ్చ శౌరిణా ॥ 21 ॥**

అపుడు సమస్తదైత్యసేనలతో కలిసి బలికుమారుడైన బాణాసురుడు, అలాగే శంకరుడు, కుమారస్వామి శౌరితో పోరాడసాగారు.

**హరిశంకరయోర్యుద్ధమతీవాసీత్ సుదారుణమ్ ।**
**చుక్షుభుః సకలా లోకాః శస్త్రాస్త్రాంశుప్రతాపితాః ॥ 22 ॥**

ఆ సమయంలో హరిహరులకు మహాభయంకరమైన యుద్ధం అతిదారుణంగా సాగింది. వారి శస్త్రాస్త్రాల కిరణ ప్రభావంవల్ల సమస్తలోకాలు ఒక్కపెట్టున క్షోభించాయి.

**ప్రలయోఽయమశేషస్య జగతో నూనమాగతః ।**
**మేనిరే త్రిదశా యత్ర వర్తమానే మహాహవే ॥ 23 ॥**

ఆ విధంగా ఘోరసంగ్రామం జరుగుతూ ఉండగా దేవతలు అందరూ సమస్త జగత్తుకు అకాల ప్రలయం నిశ్చయంగా వచ్చిందని భావించారు.

**జృమ్భణాస్త్రేణ గోవిన్దో జృమ్భయామాస శంకరమ్ ।**
**తతః ప్రణేశుర్దైతేయాః ప్రమథాశ్చ సమన్తతః ॥ 24 ॥**

అపుడు గోవిందుడు జృంభణాస్త్రంచే శంకరుని స్తంభింపజేశాడు. ఆ సమయంలో దైతేయులు, ప్రమథగణాలు సంపూర్ణంగా హరికి ప్రణమిల్లారు.

**జృమ్భాభిభూతశ్చ హరో రథోపస్థ ఉపావిశత్ ।**
**న శశాక తథా యోద్ధుం కృష్ణేనాక్లిష్టకర్మణా ॥ 25 ॥**

జృంభకాస్త్రం దెబ్బతిన్న హరుడు రథంపై చతికిలపడి కూర్చుండిపోయాడు. నిందింపబడని కృత్యాలు ఆచరించే కృష్ణునితో శంకరుడు ఆ సమయంలో యుద్ధం చేయడానికి అశక్తుడు అయ్యాడు.

**గరుడక్షతవాహశ్చ ప్రద్యుమ్నాస్త్రప్రపీడితః ।**
**కృష్ణహుంకారనిర్ధూతశక్తిశ్చాపి యయౌ గుహః ॥ 26 ॥**

గరుడుని దెబ్బచే మయూరవాహనం కుంటుపడగా, ప్రద్యుమ్నుని దివ్యాస్త్రంచే సంతాపం పొంది, కృష్ణుని హుంకారంచే శక్త్యాయుధం శక్తి హీనం కాగా గుహుడు కూడ యుద్ధభూమి నుంచి తొలగిపోయాడు.

**జృమ్భితే శంకరే నష్టే దైత్యసైన్యే గుహే జితే ।**
**నీతే ప్రమథసైన్యే చ సంక్షయం శార్ఙ్గధన్వనా ॥ 27 ॥**

జృంభకాస్త్రంవల్ల శంకరుడు బెండుపడగా, దైత్యసైన్యమంతా నశించిపోగా, కుమారస్వామి ఓటమి చెందగా, ప్రమథసైన్యం సర్వం లొంగిపోగా శార్ఙ్గపాణి వల్ల బాణుడు సంక్షయం పొందాడు.

**నన్దీశసంగృహీతాశ్వమధిరూఢో మహారథమ్ ।**
**బాణస్తత్రాయయౌ యోద్ధుం కృష్ణకార్ష్ణిబలైః సహ ॥ 28 ॥**

నందీశ్వరుడు హయాలను పూన్చి తీసుకొని వచ్చిన మహారథాన్ని బాణుడు అధిరోహించి కృష్ణునితోను, కృష్ణుని కుమారులతోను, బలరామునితోను యుద్ధం చేయడానికై అప్పుడు వచ్చాడు.

**బలభద్రో మహావీర్యో బాణసైన్యమనేకథా ।**
**వివ్యాధ బాణైః ప్రభ్రశ్య ధర్మతశ్చాపలాయత ॥ 29 ॥**

మహావీర్యశాలియైన బలభద్రుడు అనేక బాణాలచే బాణసైన్యాన్ని నానావిధాలుగా పారద్రోలాడు. అందువల్ల సైన్యగణం నష్టమై యుద్ధధర్మం వీడి పారిపోయింది.

**ఆకృష్య లాంగలాగ్రేణ ముసలేనాశుపీడితమ్ (అవపోథితమ్) ।**
**బలం బలేన దదృశే బాణో బాణైశ్చ చక్రిణా ॥ 30 ॥**

నాగలికొనను, ముసలాన్ని గట్టిగా లాగి విసరుతూ తన సైన్యాన్ని మిక్కిలిగా చిందరవందరచేస్తున్న బలరాముని బాణుడు చూశాడు. చక్రి బాణాలచే చెల్లాచెదరైపోతున్న తన సైన్యాన్ని వీక్షించాడు.

**తతః కృష్ణస్య బాణేన యుద్ధమాసీత్ సుదారుణమ్ ।**
**పరస్పరమిషూన్ (సమస్యతో రిపూన్) దీప్తాన్ కాయత్రాణవిభేదకాన్ ॥ 31 ॥**

**కృష్ణశ్చిచ్ఛేద బాణైస్తాన్ బాణేన ప్రహితాంచ్ఛరాన్ ।**
**వివ్యాధ కేశవం బాణో బాణం వివ్యాధ చక్రభృత్ ॥ 32 ॥**

అనంతరం కృష్ణునకు బాణునితో మహాఘోరయుద్ధమే సంక్రమించింది. ఒకరినొకరు కవచాలను చీల్చివేసే సెగలు చిమ్మే బాణాలతో పోరాడారు. బాణునిచే ప్రయోగించబడిన ఆ బాణాలనన్నింటిని కృష్ణుడు శరాలతో ఛేదించివేశాడు. బాణుడు కేశవుని బాధించాడు. చక్రధారి బాణుని వేధించాడు.

**ముముచాతే తథాస్త్రాణి బాణకృష్ణౌ జిగీషయా ।**
**పరస్పరం క్షతిపరౌ పరమామర్షణౌ ద్విజ! ॥ 33 ॥**

ద్విజోత్తమా! ఆ సమయంలో బాణాసురుడు, శ్రీకృష్ణుడు ఒకరినొకరు జయించాలనే కోరికతో, నాశనం చెందించాలనే ఇచ్ఛతో, పరమకోపోద్రిక్తులై అస్త్రపరంపరలను సంధించుకొన్నారు.

**ఛిద్యమానేష్వశేషేషు శరేష్వస్త్రే చ సీదతి ।**
**ప్రాచుర్యేణ తతో బాణం హన్తుం చక్రే హరిర్మనః ॥ 34 ॥**

చివరగా సమస్తశరాలు ఛిన్నం కాగా, అస్త్రప్రయోగం నిష్ఫలంకాగా, శ్రీహరి బాణుని చంపి తీరాలనే నిశ్చయాన్ని మనస్సులో పొందినవాడయ్యాడు.

**ముంచతో బాణనాశాయ తత్ర చక్రం మధుద్విషః ।**
**నగ్నా దైతేయవిద్యాభూత్ కోటరీ పురతో హరేః ॥ 35 ॥**

బాణుని నశింపజేయాలనే భావనతో చక్రం విడుస్తున్న మధుసూదనుడగు కృష్ణునిముందు రాక్షస విద్యయైన కోటరీశక్తి దిగంబరయై నిలిచింది.

**తతోఽర్కశతసంఘాతతేజసా సదృశద్యుతి ।**
**జగ్రాహ దైత్యచక్రారిర్హరిశ్చక్రం సుదర్శనమ్ ॥ 36 ॥**

అపుడు నూర్గురు సూర్యుల కాంతి వంటి సమానమైన తేజస్సుతో భాసిల్లే సుదర్శనచక్రాన్ని దైత్యసైన్య వినాశకారి అయిన శ్రీహరి చేబట్టాడు.

**తామగ్రతో హరిర్దృష్ట్వా మీలితాక్షః సుదర్శనమ్ ।**
**ముమోచ బాణముద్దిశ్య ఛేత్తుం బాహువనం రిపోః ॥ 37 ॥**

ఆ నగ్నస్వరూపురాలిని ఎదురుగా చూచి హరి వెంటనే కన్నులు మూసికొని సుదర్శనచక్రాన్ని బాణునికి గురిచేసి అతని బాహుసహస్రం తెగిపోవాలని విడిచిపెట్టాడు.

**క్రమేణ తత్తు బాహూనాం బాణస్యాచ్యుత చోదితమ్ ।**
**ఛేదం చక్రేఽసురాపాస్తశస్త్రౌఘక్షపణాద్రుతమ్ ॥ 38 ॥**

వరుసగా ఒక వంక రాక్షసులు విసరే శస్త్రాస్త్రాల నన్నింటిని వెంటనే ఛేదించివేస్తూ, ఆ కృష్ణప్రయుక్తమైన చక్రం బాణాసురుని చేతులనన్నీ నరకివేసింది. (రెండుచేతులను మాత్రం వదలిపెట్టింది)

**ఛిన్నే బాహువనే తత్తు కరస్థం మధుసూదనః ।**
**ముముక్షుర్బాణనాశాయ విజ్ఞాతస్త్రిపురద్విషా ॥ 39 ॥**

**సముపేత్యాహ గోవిన్దం సామపూర్వముమాపతిః ।**
**విలోక్య బాణం దోర్దణ్డచ్ఛేదాసృక్స్రావవర్షిణమ్ ॥ 40 ॥**

అది బాణుని బాహువనం నరకి తిరిగి మధుసూదనుని చేతిలో నిలిచింది. అపుడు బాణుని కూల్చాలని హరి దానిని వదలాలనుకొన్న సమయంలో త్రిపురాసురసంహారకుడైన శంకరుడు అది తెలిసికొని గోవిందుని సమీపించి, బాహువులన్నీ తెగిపోయి రక్తధారలు కార్చుకొంటున్న బాణుని చూచి, ఆ ఉమాపతి సామపూర్వకంగా ఇలా అన్నాడు.

**శంకర ఉవాచ :–** శంకరుడు చెప్పాడు.

**కృష్ణ! కృష్ణ! జగన్నాథ! జానే త్వాం పురుషోత్తమమ్ ।**
**పరేశం పరమానన్దమనాదినిధనం పరమ్ ॥ 41 ॥**

"కృష్ణా! శ్రీకృష్ణా! జగన్నాథా! నిన్ను పరేశుడవని, పరమానంద స్వరూపుడవని, అనాది నిధనుడవని, పరముడవని, పురుషోత్తముడవైన శ్రీహరివని నేను ఎరుగుదును.

**దేవతిర్యఙ్మనుష్యేషు శరీరగ్రహణాత్మికా ।**
**లీలేయం సర్వభూతస్య తవ చేష్టోపలక్షణా ॥ 42 ॥**

దేవతలయందు, తిర్యక్కులైన పశుపక్ష్యాదులందు, మనుష్యులందు శరీరం గ్రహించడమనేది నీకు ఒక లీలమాత్రమే. సర్వభూతమయుడవైన నీకు ఇది ఉపలక్షణం.

**తత్ ప్రసీదాభయం దత్తం బాణస్యాస్య మయా ప్రభో! ।**
**తత్త్వయా నానృతం కార్యం యన్మయా వ్యాహృతం వచః ॥ 43 ॥**

ప్రభూ! కావున ప్రసన్నుడవు కావలసింది. ఈ బాణునకు నేను అభయం ఇచ్చియున్నాను. నేను ఏమాటను వరంగా ఇచ్చానో, దానిని నీవు అబద్ధం చేయవద్దు.

**అస్మత్సంశ్రయవృద్ధోఽయం నాపరాధ్యస్తవావ్యయ! ।**
**మయా దత్తవరో దైత్యస్తతస్త్వాం క్షమయామ్యహమ్ ॥ 44 ॥**

అవ్యయా! ఇది ఇతని అపరాధం కాదు. ఎందువల్లనంటే నా ఆశ్రయం పొందడంవల్ల కొంచెం పొగరుతనం పొందాడు. ఈ దైత్యునికి నేను వరం ఇచ్చాను. కాబట్టి నాతోబాటుగా నీవు కూడా వీనిని క్షమించాలి.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**ఇత్యుక్తః ప్రాహ గోవిన్దః శూలపాణి ముమాపతిమ్ ।**
**ప్రసన్నవదనో భూత్వా గతామర్షోఽసురం ప్రతి ॥ 45 ॥**

శూలపాణియైన ఉమాపతి ఈ రీతిగా పలుకగా గోవిందుడు ప్రసన్నవదనుడై బాణాసురుని పట్ల క్రోధం విడిచి ఇలా అన్నాడు.

**యుష్మద్దత్తవరో బాణో జీవతామేష శంకర ।**
**త్వద్వాక్యగౌరవాదేతన్మయా చక్రం నివర్తితమ్ ॥ 46 ॥**

"శంకరా! నీచే వరాలు పొందిన ఈ బాణుడు బ్రతుకుగాక! నీ మాటపై నున్న గౌరవంచే ఈ చక్రాన్ని నేను ఉపసంహరిస్తున్నాను.

**త్వయా యదభయం దత్తం తద్దత్తమఖిలం మయా ।**
**మత్తోఽవిభిన్నమాత్మానం ద్రష్టుమర్హసి శంకర ॥ 47 ॥**

నీవు వరం ఈయడమనేది ఏదయితే ఉందో, అది నాచేత కూడా ప్రసాదించబడినట్లే శంకరా! నీవు నన్ను నీ కన్న అన్యునిగా చూడవద్దు.

**యోఽహం స త్వం జగచ్చేదం సదేవాసురమానుషమ్ ।**
**(మత్తో నాన్యదశేషం యత్తత్త్వం జ్ఞాతుమిహార్హసి)**
**అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః ॥ 48 ॥**

నేను ఎటువంటి వాడినో, నీవును అటువంటివాడివే. దేవాసురమనుష్యమయమైన ఈ సంపూర్ణ జగత్తు అంతా నీ నా స్వరూపమే. కాని ఎవరి చిత్తం అవిద్యచే మోహం చెంది ఉంటుందో, అట్టి పురుషులు మనపట్ల భిన్నదృష్టి కలిగి ఉంటారు. నీవును అదే విధంగా గ్రహించు.

**(ప్రసన్నోఽహం గమిష్యామి త్వం గచ్ఛ వృషభధ్వజ!)**
**ఇత్యుక్త్వా ప్రయయౌ కృష్ణః ప్రాద్యుమ్నిర్యత్ర తిష్ఠతి ।**
**తద్బన్ధఫణినో నేశుర్గరుదానిలభీషితాః ॥ 49 ॥**

వృషభధ్వజా! నేను ప్రసన్నుడనై వెళ్లుచున్నాను. నీవును యథాస్థానం చేరవచ్చు" అని పలికి అనిరుద్ధుడు ఎక్కడ బంధించబడి ఉన్నాడో ఆ తావుకు వెళ్లాడు. అతనిని కట్టివేసిన పాములు గురుత్మంతుని గాలి తగలడంతోనే భీతిల్లి చచ్చుపడిపోయాయి.

**తతోఽనిరుద్ధమారోప్య సపత్నీకం గరుత్మతి ।**
**ఆజగ్ముర్ద్వారకాం రామకార్ష్ణిదామోదరాః పురీమ్ ॥ 50 ॥**

అనంతరం భార్యాసహితంగా అనిరుద్ధుని గరుత్మంతునిపై ఎక్కించుకొని బలరాముడు, ప్రద్యుమ్నుడు, దామోదరుడు ద్వారకాపురికి తిరిగి వచ్చారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే ఉషాఽనిరుద్ధయోః కల్యాణం నామ త్రయస్త్రింశోఽధ్యాయః సమాప్తః ॥ 33 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో ఉషాఅనిరుద్ధుల కల్యాణం అనే ముప్పైమూడవ అధ్యాయం సమాప్తం ॥33॥



## చతుస్త్రింశోఽధ్యాయః - ముప్పై నాల్గవ అధ్యాయం
## పౌండ్రకవాసుదేవవధః - పౌండ్రకవాసుదేవవధ

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు ఇలా చెప్పాడు.

**చక్రే కర్మ మహచ్ఛౌరిర్బిభ్రాణో మానుషీం తనుమ్ ।**
**జిగాయ శక్రం శర్వం చ శర్వాన్ దేవాంశ్చ లీలయా ॥ 1 ॥**

భగవంతుడైన శౌరి మనుష్యశరీరం ధరించి అద్భుతమైన మహాకార్యాలెన్నో కావించాడు. లీలామాత్రంగా ఇంద్రుని, శర్వుని, సమస్తదేవతలను జయించాడు.

**యచ్చాన్యదకరోత్కర్మ దివ్యచేష్టావిఘాతకృత్ ।**
**తత్కథ్యతాం మహాభాగ! పరం కౌతూహలం హి మే ॥ 2 ॥**

ఓ మహాభాగా! దేవతలు చేసిన కార్యాలకే విఘాతం కలిగించిన హరి ఇంకా ఏ ఏ ఘనకార్యాలు ఆచరించాడో వాటిని వివరించి చెప్పు. నాకు వినాలని మిక్కిలి కుతూహలం కలుగుతోంది.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు బదులిచ్చాడు.

**గదతో మమ విప్రర్షే! శ్రూయతామిదమాదరాత్ ।**
**నరావతారే కృష్ణేన దగ్ధా వారాణసీ యథా ॥ 3 ॥**

ఓ విప్రర్షీ! కృష్ణుడు మానవావతారం దాల్చి ఏవిధంగా వారాణసీపురాన్ని దగ్ధం చేశాడో నేను చెబుతాను. సావధానంగా దీనిని ఆలకించు.

**పౌణ్డ్రకో వాసుదేవస్తు వాసుదేవోఽభవద్భువి ।**
**అవతీర్ణ స్త్వమిత్యుక్తో జనైరజ్ఞానమోహితైః ॥ 4 ॥**

పౌండ్రక వంశీయుడైన వాసుదేవుడు అజ్ఞానంచే మోహితులైన జనులు "నీవు వాసుదేవరూపంలో భువిని అవతరించావు" అని పలుకగా (స్తుతిచేయగా) వాసుదేవునిగా ఖ్యాతి వహించాడు.

**స మేనే వాసుదేవోఽహమవతీర్ణో మహీతలే ।**
**నష్టస్మృతిస్తతః సర్వం విష్ణుచిహ్నమచీకరత్ ॥ 5 ॥**

అతడు తానే వాసుదేవుడనని, మహీతలంపై తాను అవతరించానని భావించాడు. అతడు తన జన్మస్మృతిని పూర్తిగా కోలుపోయి విష్ణుచిహ్నాలన్నీ చేయించుకొన్నాడు.

**దూతం చ ప్రేషయామాస కృష్ణాయ సుమహాత్మనే ।**
**త్యక్త్వా చక్రాదికం చిహ్నం మదీయం నామ చాత్మనః ॥ 6 ॥**

**వాసుదేవాత్మకం మూఢ! ముక్త్వా సర్వం విశేషతః ।**
**ఆత్మనో జీవితార్థాయ తతో మే ప్రణతిం వ్రజ ॥ 7 ॥**

అంతేకాక పరమమహాత్ముడైన శ్రీకృష్ణుని సన్నిధికి ఒక దూతను పంపించాడు. "ఓరీ మూఢా! చక్రాదిచిహ్నాలను వదలిపెట్టు. వాసుదేవుడనే నా పేరేదైతే ఉందో దానిని వెంటనే నీవు మార్చివేసుకో. బ్రతుకదలచుకొన్నట్లయితే వాసుదేవ స్వరూపాన్ని సర్వాన్ని విడిచిపెట్టు. నా కడకువచ్చి శరణు పొందు" అని సందేశం పంపాడు.

**ఇత్యుక్తః సప్రహస్యైనం దూతం ప్రాహ జనార్దనః ।**
**నిజచిహ్నమహం చక్రం సముత్స్రక్ష్యే త్వయీతి వై ॥ 8 ॥**

దూత ఈ విధంగా చెప్పగా జనార్దనుడు మందహాసంచేసి అతనితో "నీ చిహ్నమైన చక్రాన్ని నీపైనే విసరబోతున్నానని పౌండ్రకునితో చెప్పు.

**వాచ్యః స పౌణ్డ్రకో గత్వా త్వయా దూత వచో మమ ।**
**జ్ఞాతస్త్వద్వాక్యసద్భావో యత్ కార్యం తద్విధీయతామ్ ॥ 9 ॥**

దూతా! నీవు నా మాటలుగా నీవు ఆ పౌండ్రుకుని వద్దకువెళ్లి ఇలా వచించు. నీ మాటలోని భావం ఏమిటో తెలిసింది. చేయవలసింది ఏదయితే ఉందో అది చేయి.

**గృహీతచిహ్న ఏవాహమాగమిష్యామి తే పురమ్ ।**
**సముత్స్రక్ష్యామి తే చక్రం నిజచిహ్నమసంశయమ్ ॥ 10 ॥**

ఆ యా వాసుదేవచిహ్నాలతోనే నేను నీ పురానికి వస్తాను. నీ చిహ్నమైన ఆ చక్రాన్నే వదలుతాను. సంశయం వద్దు.

**ఆజ్ఞాపూర్వం చ యదిదమాగచ్ఛేతి త్వయోదితమ్ ।**
**సమ్పాదయిష్యే శ్వస్తుభ్యం సమాగమ్యా విలమ్బితమ్ ॥ 11 ॥**

నన్ను రమ్మనమని ఆజ్ఞాపూర్వకంగా నీ వన్నమాటకు రేపే నీకు సమాధానం అప్పగిస్తాను. ఒక క్షణం కూడా ఆలస్యం వద్దు.

**శరణం తే సమభ్యేత్య కర్తాస్మి నృపతే! తదా ।**
**యథా త్వత్తో భయం భూయో న మే కించిద్భవిష్యతి ॥ 12 ॥**

నరేంద్రా! నేను నీ సమీపానికి వచ్చి శరణు వ్యవహారం చక్కబరుస్తాను. నీ వల్ల భయం మళ్లీ మళ్లీ నాకు కొంచెం కూడ లేకుండుగాక!" అని చెప్పి దూతను పంపించివేశాడు.

**ఇత్యుక్తేఽపగతే దూతే సంస్మృత్యాభ్యాగతం హరిః ।**
**గరుత్మంతమథారుహ్య త్వరితం తత్పురం యయౌ ॥ 13 ॥**

కృష్ణుడు ఇలా పలుకగా దూత వెళ్లిపోయాడు. అనంతరం హరి గరుత్మంతుని స్మరించాడు. వెంటనే వచ్చిన గరుడుని అధిరోహించి శీఘ్రగతిని పౌండ్రకునిపురం వెళ్లాడు వాసుదేవుడు.

**స చాపి కేశవోద్యోగం శ్రుత్వా కాశీపతిస్తదా ।**
**సర్వసైన్యపరీవారః పార్ష్ణిగ్రాహ ఉపాయయౌ ॥ 14 ॥**

కేశవుని యుద్ధప్రయత్నం విన్న కాశీనగరాధిపతి ఆ సమయంలో సమస్తసైన్యబలంతో కూడుకొని పౌండ్రకునకు పార్ష్ణిగ్రాహకునిగా (సహాయకునిగా) పయనమై వచ్చాడు.

**తతో బలేన మహతా కాశీరాజబలేన చ ।**
**పౌణ్డ్రకో వాసుదేవోఽసౌ కేశవాభిముఖం యయౌ ॥ 15 ॥**

అనంతరం పౌండ్రకవాసుదేవుడు తన అధికబలంతోను, కాశిరాజు బలసంపత్తితోను కలసి కేశవునకు ఎదురుగా పోరాడుటకై వెళ్లాడు.

**తం దదర్శ హరిర్దూరాదుదారస్యన్దనే స్థితమ్ ।**
**చక్రహస్తం గదాఖడ్గబాహుం పాణి గతామ్బుజమ్ ॥ 16 ॥**

హరి చాలా దూరం నుంచే ఒక ఉత్తమరథంపైనున్న చక్రహస్తుడైన, గదాఖడ్గబాహుడగు, పద్మపాణియైన పౌండ్రకుని చూశాడు.

**స్రగ్ధరం ధృతశార్ఙ్గం చ సుపర్ణరచితధ్వజమ్ ।**
**వక్షఃస్థలే కృతం చాస్య శ్రీవత్సం దదృశే హరిః ॥ 17 ॥**

వైజయంతిలాగా భాసించే పూలమాల ధరించియున్న, గరుత్మంతుని చిత్రాన్ని పూన్చిన పతాకను దాల్చియున్న, వక్షఃస్థలంపై కృత్రిమంగా గైకొన్న శ్రీవత్సాన్ని అలంకరించుకొన్న పౌండ్రక వాసుదేవుని చూశాడు.

**కిరీటకుణ్డలధరం పీతవాసఃసమన్వితమ్ ।**
**దృష్ట్వా తం భావగమ్భీరం జహాస గరుడధ్వజః ॥ 18 ॥**

చక్కని కిరీటాన్ని, కాంతులీనే కుండలాలను ధరించిన, పచ్చని బట్టలతో నిగనిగలాడుతున్న, వేషంలోనే కాక భావంతో కూడ ఉదాత్తునిగా కనిపిస్తున్న ఆ వాసుదేవుని గరుడధ్వజుడైన వసుదేవనందనుడు చూచి భావగంభీరంగా నవ్వాడు.

**యుయుధే చ బలేనాస్య హస్త్యశ్వబలినా ద్విజ!**
**నిస్త్రింశాసిగదాశూలశక్తికార్ముకశాలినా ॥ 19 ॥**

ద్విజశ్రేష్ఠా! చూచిందే తడవుగా గుర్రాలతోను, ఏనుగులతోను, కాల్బలంతోను కూడుకొన్న ఆతని సైన్యంతోను, నిస్త్రింశం, కత్తి, గద, శూలం, శక్తి, విల్లు ధరించియున్న పౌండ్రకునితోను ఒక్కసారిగా యుద్ధానికి సిద్ధపడ్డాడు.

విశే : నిస్త్రింశం – ముప్పై అంగుళాలకు మించియున్న కత్తి

**అసి - విసరడానికి ఉపయోగించే కత్తి।**

**క్షణేన శార్ఙ్గనిర్ముక్తైః శరైరరివిదారణైః**
**గదాచక్రనిపాతైశ్చ సూదయామాస తద్బలమ్ ॥ 20 ॥**

శార్ఙ్గమనే ధనుస్సునుండి విడిచిన శత్రువులను చీల్చివేసే బాణాలతోను, గదాప్రహారాలతోను, సుదర్శనచక్రజ్వాలలతోను క్షణకాలంలో వాని సేనలనన్నింటిని నేలగూల్చాడు.

**కాశీరాజబలం చైవ క్షయం నీత్వా జనార్దనః।**
**ఉవాచ పౌణ్డ్రకం మూఢమాత్మచిహ్నోపలక్షణమ్ ॥ 21 ॥**

కాశీరాజసైన్యాన్ని కూడ నాశనం చేసి జనార్దనుడు తన (వాసుదేవ) చిహ్నాలను చేయించి పెట్టుకొన్న మూర్ఖుడైన పౌండ్రకునితో ఇలా అన్నాడు.

**శ్రీభగవానువాచ :-** శ్రీ భగవానుడు చెప్పాడు.

**పౌణ్డ్రకోక్తం త్వయా యత్తు దూతవక్త్రేణ మాం ప్రతి।**
**సముత్సృజేతి చిహ్నాని తత్తే సమ్పాదయామ్యహమ్ ॥ 22 ॥**
**చక్రమేతత్ సముత్సృష్టం గదేయం తే విసర్జితా।**
**గరుత్మానేష నిర్దిష్టః సమారోహతు తే ధ్వజమ్ ॥ 23 ॥**

"పౌండ్రకా! దూతముఖంగా నీవు నన్ను ఉద్దేశించి ఏ చిహ్నాలు విడిచివేయమని కబురు పంపించావో, దానిని అక్షరాలా పాటిస్తున్నాను. ఇదిగో! చక్రాన్ని విడుస్తున్నాను. గదను విసర్జిస్తున్నాను. గరుత్మంతుని కూడ త్యజిస్తున్నాను. అతడు నీ ధ్వజంపై అధిరోహించుగాక!".

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ఇత్యుచ్చార్య విముక్తేన చక్రేణాసౌ విదారితః।**
**పోథితో గదయా భగ్నో ధ్వజశ్చాస్య గరుత్మతా ॥ 24 ॥**

అని పలికి చక్రం విడిచాడు చక్రధారి. ఆ చక్రాయుధంచే ఆ పౌండ్రకుడు చీల్చబడ్డాడు. గదచే గద ముక్కముక్కలయింది. గరుత్మంతునిచే గరుడధ్వజం కూల్చబడింది.

**తతో హా హా కృతే లోకే కాశీపుర్యధిపో బలీ।**
**యుయుధే వాసుదేవేన మిత్రస్యాపచితౌ స్థితః ॥ 25 ॥**

అనంతరం జనమంతా హాహాకారం చేసింది. బలశాలియైన కాశీపురాధిపతి మిత్రుడు నశించగా అతనిపై నున్న మక్కువతో వాసుదేవునితో పోరాడాడు.

**తతః శార్ఙ్గధనుర్ముక్తైశ్ఛిత్వా తస్య శరైః శిరః।**
**కాశీపుర్యాం చ చిక్షేప కుర్వన్ లోకస్య విస్మయమ్ ॥ 26 ॥**

అపుడు శార్ఙ్గపాణి తన ధనుస్సు నుండి వదలిన బాణాలచే అతని తల నరకి లోకం నివ్వెరపడి చూడగా కాశీపురంలో పడేటట్లుగా విసరివైచాడు.

**హత్వా చ పౌణ్డ్రకం శౌరిః కాశీరాజం చ సానుగమ్ ।**
**పునర్ద్వారవతీం ప్రాప్తో రేమే స్వర్గగతో యథా ॥ 27 ॥**

శౌరి ఈ విధంగా సపరివారంగా పౌండ్రకుని, కాశీరాజును సంహరించి తిరిగి ద్వారకానగరానికి చేరుకొన్నాడు. అందు స్వర్గమందు ఉన్నట్లుగా తాను క్రీడించాడు.

**తచ్ఛిరః పతితం దృష్ట్వా తత్ర కాశీపతేః పురే ।**
**జనః కిమేతదిత్యాహ కేనేత్యత్యన్తవిస్మితః ॥ 28 ॥**

అక్కడ ఆ విధంగా నగరంలో పడిన కాశీరాజేంద్రుని శిరస్సును చూచి జనమంతా "ఏమిటి ఇది? ఎవడు ఈ తల నరకినవాడు?" అని మిక్కిలి నివ్వెరపోయారు.

**జ్ఞాత్వా తం వాసుదేవేన హతం తస్య సుతస్తతః ।**
**పురోహితేన సహితస్తోషయామాస శంకరమ్ ॥ 24 ॥**

తన తండ్రి వాసుదేవునిచే హతుడు కావడం తెలుసుకొన్న అతని కుమారుడు అపుడు పురోహితునితో కలిసి శంకరుని పూజించి సంతుష్టి కావించాడు.

**అవిముక్తే మహాక్షేత్రే తోషితస్తేన శంకరః ।**
**వరం వృణీష్వేతి తదా తం ప్రోవాచ నృపాత్మజమ్ ॥ 25 ॥**

అంత అవిముక్తమనే మహాక్షేత్రంలో వానిచే సంతుష్టి పొందిన శంకరుడు ఆ రాజకుమారునితో వరం కోరుకొమ్మని చెప్పాడు.

**స వవ్రే భగవన్! కృత్యా పితృహన్తుర్వధాయ మే ।**
**సముత్తిష్ఠతు కృష్ణస్య త్వత్ప్రసాదాన్మహేశ్వర! ॥ 31 ॥**

అతడు "భగవంతుడవైన మహేశ్వరా! నా తండ్రిని చంపిన వానిని చంపుటకై నీ అనుగ్రహం వల్ల కృష్ణవధార్థమై కృత్య అనే శక్తి పుట్టి విజృంభించుగాక!" అని వరం కోరాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**ఏవం భవిష్యతీత్యుక్తే దక్షిణాగ్నేరనన్తరమ్ ।**
**మహాకృత్యా సముత్తస్థౌ తస్యైవాగ్నేర్వినాశినీ ॥ 32 ॥**

శంకరుడు అలాగే కాగలడని పలుకగా, అనంతరం దక్షిణాగ్నిని మథించగా, ఆ అగ్నినే వినాశనం చేస్తూ మహాకృత్య అనే శక్తి ఆవిర్భవించి పైకి లేచింది.

**తతో జ్వాలా కరాళాస్యా జ్వలత్కేశకపాలికా (కలాపికా) ।**
**కృష్ణ కృష్ణేతి కుపితా కృత్యా ద్వారవతీం యయౌ ॥ 33 ॥**

అనంతరం ఆ కృత్య మండుతున్న భయంకరమైన ముఖంతో, అగ్నిశిఖలులాగా దీపించే జుట్టుముడులతో, మహాకోపంతో, పుర్రెలమాలతో కృష్ణా! కృష్ణా! అని అరుస్తూ ద్వారవతీ నగరానికి బయలుదేరింది.

**తామవేక్ష్య జనస్త్రాసాద్ విచలల్లోచనో మునే! ।**
**యయౌ శరణ్యం జగతాం శరణం మధుసూదనమ్ ॥ 34 ॥**

మునీశ్వరా! ఆమెను చూడగానే ద్వారకాపురి జనం భయపడిపోయి కన్నులు గిర్రుమని తిరుగగా సర్వలోకశరణ్యుడైన మధుసూదనుని శరణుపొందింది.

**కాశీరాజసుతేనేయమారాధ్య వృషభధ్వజమ్ ।**
**ఉత్పాదితా మహాకృత్యేత్యవగమ్యాథ చక్రిణా ॥ 35 ॥**

అంత కాశిరాజు కుమారుడు వృషభవాహనుని పూజించి ఈ మహాకృత్యను పుట్టింపజేశాడని చక్రి తెలుసుకొన్నవాడై,

**జహి కృత్యామిమాముగ్రాం వహ్నిజ్వాలాజటాలకామ్ ।**
**చక్రముత్సృష్టమక్షేషు క్రీడాసక్తేన లీలయా ॥ 36 ॥**

పాచికల ఆటలో అనురక్తుడైయున్న హరి "ఈ అగ్ని జ్వాలామయమైన జటాధారిణి యగు భయంకర రూపయైన కృత్యను సంహరించు" అని లీలామాత్రంగా తన చక్రాన్ని వదలాడు.

**తదగ్నిమాలాజటిలజ్వాలోద్గారాతిభీషణామ్ ।**
**కృత్యామనుజగామాశు విష్ణుచక్రం సుదర్శనమ్ ॥ 37 ॥**

ఆ అగ్నికీలలు వెదజల్లే జడలతో, జ్వాలామాలలతో మహాభయంకరమైన కృత్యను విష్ణుచక్రమైన సుదర్శనం వెంటపడి తరుమసాగింది.

**చక్రప్రతాపవిధ్వస్తా కృత్యా మాహేశ్వరీ తదా ।**
**ననాశ వేగినీ వేగాత్ తదప్యనుజగామ తామ్ ॥ 38 ॥**

చక్రప్రతాపంవల్ల దాని ప్రభావం క్షీణించగా శక్తి క్షీణించిన మాహేశ్వరశక్తియైన కృత్య వేగంగా పరుగుపెట్ట సాగింది. చక్రం కూడ ఆ శక్తిని వెంబడించింది. ("ననాశ" అనుపదమునకు అదర్శనము కలిగెను అనగా కనిపించకుండా పారిపోయెనని అర్థము.)

**కృత్యా వారాణసీమేవ ప్రవివేశ త్వరాన్వితా ।**
**విష్ణుచక్రప్రతిహతప్రభావా మునిసత్తమ! ॥ 39 ॥**

మునిశ్రేష్ఠా! విష్ణుచక్రంచే దాని ప్రభావం ఛిన్నాభిన్నం కాగా కృత్య శీఘ్రంగా పరుగెత్తి తిరిగి వారాణసీపురినే ప్రవేశించింది.

**తతః కాశీబలం భూరి ప్రమథానాం తథా బలమ్ ।**
**సమస్త శస్త్రాస్త్రయుతం చక్రస్యాభిముఖం యయౌ ॥ 40 ॥**

ఆ సమయంలో కాశిరాజసైన్య వీరులు ప్రమథగణ సైనికులందరు సమస్త శస్త్రాస్త్రాలతో కూడుకొని చక్రానికి ఎదురు నడిచారు.

**శస్త్రాస్త్రమోక్షచతురం దగ్ధ్వా తద్బలమోజసా ।**
**కృత్యాగర్భామశేషాం తాం తదా వారాణసీం పురీమ్ ॥ 41 ॥**

**స భూభృద్భృత్యపౌరాస్తు సాశ్వమాతంగమానవామ్ ।**
**అశేషకోశకోష్ఠాం తాం దుర్నిరీక్ష్యాం సురైరపి ॥ 42 ॥**

విశే : కోశం – ధనసమూహం

**జ్వాలాపరిప్లుతాశేషగృహప్రాకారచత్వరామ్ ।**
**దదాహ తద్ధరేశ్చక్రం సకలామేవ తాం పురీమ్ ॥ 43 ॥**

ఆ సమయంలో సుదర్శనచక్రం తన తేజస్సుచే, శస్త్రాస్త్రాలను గురిపెట్టి విడవడంలో నేర్పు కలిగిన ఆ బలాన్నంతా కాల్చి (వేసింది) కృత్యను కూడుకొనియున్న సమస్తవారాణసీ నగరాన్ని దగ్ధం చేసి, కొండలు, భృత్యులు, పౌరులు, అశ్వాలు, ఏనుగులు, మానవులు సమస్త కోశాలు, లోపలి ఇండ్లతో కూడుకొన్న దేవతలకు కూడ చూడ శక్యంగాని ఆ పురిని బూడిదచేసి, సమస్త గృహాలను, ప్రాకారాలను, ముంగిళ్లను, అగ్నిజ్వాలలు క్రమ్మి, కాశినగర ప్రదేశాన్నంతా ఆ హరి సుదర్శన చక్రం దహించివేసింది.

**అక్షీణామర్షమత్యుగ్రం సాధ్యసాధనసస్పృహమ్ ।**
**తచ్చక్రం ప్రస్ఫురద్దీప్తి విష్ణోరభ్యాయయౌ కరమ్ ॥ 44 ॥**

అంతవరకు చల్లారని ఆగ్రహంతో మహాభయంకరమై, ఇంకను సాధించవలసిన పని ఏమున్నదను కొంటూ అత్యద్భుతమైన కాంతితో ఆ చక్రం విష్ణువు చేతిలోకి తిరిగి చేరింది.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే పౌండ్రకవాసుదేవవధో నామ చతుస్త్రింశోఽధ్యాయః సమాప్తః ॥ 34 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో పౌండ్రకవాసుదేవవధ అనే ముప్పై నాలుగవ అధ్యాయం సమాప్తం ॥ 34 ॥



## పంచత్రింశోఽధ్యాయః - ముప్పై ఐదవ అధ్యాయం

## సాంబ వివాహః - సాంబ వివాహం

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు చెప్పాడు.

**భూయ ఏవాహమిచ్ఛామి బలభద్రస్య ధీమతః ।**
**శ్రోతుం పరాక్రమం బ్రహ్మన్! తన్మమాఖ్యాతుమర్హసి ॥ 1 ॥**

బ్రాహ్మణోత్తమా! బ్రహ్మణ్యుడా! నేను తిరిగి ధీశాలియైన బలరాముని పరాక్రమాన్ని వినాలని కోరుకొంటున్నాను. దానిని నాకు వివరింపదగియున్నావు.

**యమునాకర్షణాదీని శ్రుతాని భగవన్మయా ।**
**తత్కథ్యతాం మహాభాగ! యదన్యత్కృతవాన్ బలః ॥ 2 ॥**

మహాభాగ! భగవంతుడా! బలభద్రుడు చేసిన యమునాకర్షణం మున్నగునవి ఇదివరకే వినియున్నాను. ఆయన ఇంకా కావించిన విచిత్రలీలలు సెలవీయవలసిందిగా కోరుతున్నాను.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు ఇలా బదులిచ్చాడు.

**మైత్రేయ! శ్రూయతాం కర్మ యద్రామేణాభవత్కృతమ్ ।**
**అనన్తేనాప్రమేయేణ శేషేణ ధరణీ భృతా ॥ 3 ॥**

మైత్రేయా! అనంతుడు, అప్రమేయుడు, ధరణీధరుడు, శేషావతారుడు అయిన బలరామమూర్తి ఇంకా ఏ ఏ కృత్యాలు ఆచరించాడో చెబుతాను ఆలకించు.

**దుర్యోధనస్య తనయాం స్వయంవరకృతక్షణామ్ ।**
**బలాదాదత్తవాన్ వీరస్సామ్బో జామ్బవతీసుతః ॥ 4 ॥**

స్వయంవరసన్నాహమునందున్న దుర్యోధనుని కుమార్తెను జాంబవతీపుత్రుడైన సాంబుడు వీరాధివీరుడై బలవంతంగా ఎత్తుకొని పోయాడు.

**తతః క్రుద్ధా మహావీర్యాః కర్ణదుర్యోధనాదయః ।**
**భీష్మద్రోణాదయశ్చైవ బబన్ధుర్యుధి నిర్జితమ్ ॥ 5 ॥**

అందువల్ల అతిక్రుద్ధులైన మహావీర్యులగు కర్ణదుర్యోధనాదులు, భీష్మద్రోణాదులు యుద్ధంలో సాంబుని ఓడించి బంధించారు.

**తచ్ఛ్రుత్వా యాదవాస్సర్వే క్రోధం దుర్యోధనాదిషు ।**
**మైత్రేయ! చక్రుశ్చ తతో నిహన్తుం తే మహోద్యమమ్ ॥ 6 ॥**

మైత్రేయా! ఆ వృత్తాంతం విన్న యాదవులందరు దుర్యోధనాదులపట్ల క్రోధం వహించి వారిని చంపడానికై మహాప్రయత్నం చేశారు.

**తాన్ నివార్య బలః ప్రాహ మదలోలాకులాక్షరమ్ ।**
**మోక్ష్యన్తి తే మద్వచనాద్ యాస్యామ్యేకో హి కౌరవాన్ ॥ 7 ॥**

అపుడు బలభద్రుడు వారిని ఆపి, వారు నా మాటపై నున్న గౌరవంచేతనే సాంబుని విడిచి పుచ్చుతారని, ఆ కౌరవుల వద్దకు తానొక్కడనే వెడతానని, మదాతిరేక వ్యాకుల మధురాక్షరాలతో పలికాడు.

**బలదేవస్తతో గత్వా నగరం నాగసాహ్వయమ్ ।**
**బాహ్యోపవనమధ్యేఽభూద్ న వివేశ చ తత్పురమ్ ॥ 8 ॥**

బలదేవుడు అలా పలికి అనంతరం హస్తిపురం అనే పేరుగల నగరం వెళ్లి బాహ్యోపవన మధ్యభాగంలో విడిది చేశాడు. కాని పురంలో మాత్రం ప్రవేశించలేదు.

**బలమాగతమాజ్ఞాయ భూపా దుర్యోధనాదయః ।**
**గామర్ఘ్యముదకం చైవ రామాయ ప్రత్యవేదయన్ ॥ 9 ॥**

బలదేవుని రాక తెలిసికొన్న దుర్యోధనాది భూపాలురు గోవు, అర్ఘ్యం, పాద్యం మున్నగునవి కొనివచ్చి రామునకు సమర్పించి స్వాగతం పలికారు.

**గృహీత్వా విధివత్ సర్వం తతస్తానాహ కౌరవాన్ ।**
**ఆజ్ఞాపయత్యుగ్రసేనః సామ్బమాశు విముంచత ॥ 10 ॥**

బలదేవుడు వారిచ్చిన అర్ఘ్యపాద్యాదులను యథావిధిగా స్వీకరించి ఆ కౌరవులతో "సాంబుని వెంటనే విడిచి పెట్టవలసినదిగా ఉగ్రసేనుడు మీకు ఆజ్ఞ ఇచ్చాడు" అని చెప్పాడు.

**తతస్తే తద్వచః శ్రుత్వా భీష్మద్రోణాదయో ద్విజ! ।**
**కర్ణదుర్యోధనాద్యాశ్చ చుక్షుభుర్ద్విజసత్తమ! ॥ 11 ॥**

విప్రా! ద్విజసత్తమా! అనంతరం ఆ బలదేవుని మాటలు విని భీష్మద్రోణాదులు, కర్ణదుర్యోధనాది నృపేంద్రులు మిక్కిలి క్షోభ చెందారు.

**ఊచుశ్చ కుపితాః సర్వే బాహ్లీకాద్యాశ్చ కౌరవాః ।**
**అరాజ్యార్హం యదోర్వంశమవేక్ష్య ముసలాయుధమ్ ॥ 12 ॥**

బాహ్లికుడు మున్నగు కౌరవులు అందరు మిక్కిలి కోపం చెందినవారై యాదవవంశం రాజ్యార్హం కాదని భావించి ముసలాయుధునితో ఇలా అన్నారు.

**భో భో! కిమేతద్ భవతా బలభద్రేరితం వచః ।**
**ఆజ్ఞాం కురుకులోత్థానాం యాదవః కః ప్రదాస్యతి ॥ 13 ॥**

"ఓయీ! ఓ బలభద్రా! నీవు ఇప్పుడు పలికిన మాట ఏమి? కురుకులం వారికి ఆజ్ఞ ఈయడానికి ఒక యాదవుడు ఎట్లు అర్హుడు?

**ఉగ్రసేనోఽపి యద్యాజ్ఞాం కౌరవాణాం ప్రదాస్యతి ।**
**తదలం పాణ్డురచ్ఛన్నైర్నృపయోగ్యైర్విడమ్బితైః ॥ 14 ॥**

ఉగ్రసేనుడు కూడ కౌరవులకు శాసనం ఇచ్చే మాటయితే, అపుడు రాజులకు, కౌరవులకు శ్వేతచ్ఛత్రాలు కేవలం బాహ్యవేషాలు మాత్రమే. ఇంక చాలించండి.

**తద్గచ్ఛ బల! పాపాఢ్యం సామ్బమన్యాయ చేష్టితమ్ ।**
**విమోక్ష్యామో న భవతో నోగ్రసేనస్య శాసనాత్ ॥ 15 ॥**

కాబట్టి బలభద్రా! ఇక వెళ్లు. అన్యాయవర్తనుడైన పాపకర్ముడైన సాంబుని నీ మాటచేత కాని, ఉగ్రసేనుని శాసనం చేత కాని వదలిపెట్టము.

**ప్రణతిర్నకృతాఽస్మాకం మాన్యానాం కుకురాంధకైః ।**
**న నామసా కృతాకేయమాజ్ఞా స్వామిని భృత్యతః ॥ 16 ॥**

పూజార్హులమగు మాకు కుకురులు,అంధకులు మొదలగు యాదవులు నమస్కారము చేయనిచో అట్లేకానిమ్ము, కాని ఈ ఆజ్ఞ ఏమి? మేము ప్రభువులము. యాదవులు మా సేవకులు, కావున మమ్ములను ఆజ్ఞాపించుట తగదు.

**గర్వమారోపితా యూయం సమానాసనభోజనైః ।**
**కో దోషో భవతాం నీతిర్యత్ప్రీత్యా  నావలోకితా ॥ 17 ॥**

మాతో సమానంగా మీవారికి సహాసనం, సహభోజనం కల్పించడంవల్ల మీరు గర్వాహంకారులయ్యారు. ఇందు మీదోషం ఏముంది కనుక? మీ పట్ల ఉన్న ప్రీతిచే నీతిని గమనించని పొరపాటు మాది.

**అస్మాభి రర్ఘో భవతో యోఽయం బల! నివేదితః ।**
**ప్రేమ్ణై తన్నైతదస్మాకం కుల్యం యుష్మత్కులోచితమ్ ॥ 18 ॥**

బలదేవా! మేము మీకు నివేదించిన ఈ పూజ కేవలం మీ మీది ప్రేమతో మాత్రమే. ఇది మా కులం నుంచి మీ కులానికి ఉచితమైనది కాదు." అని పలికారు.

**శ్రీపరాశర ఉవాచ:–** పరాశరుడు చెప్పాడు.

**ఇత్యుక్త్వా కురవస్సామ్బం ముంచామో న హరేస్సుతమ్ ।**
**కృతైకనిశ్చయాస్తూర్ణం వివిశుర్గజసాహ్వయమ్ ॥ 19 ॥**

అని పలికి కౌరవులందరు హరికుమారుడగు సాంబుని వదలమను నిశ్చయమునకు వచ్చి వేగంగా హస్తినాపురమందు ప్రవేశించిరి.

**మత్తః కోపేన చాఘూర్ణస్తతోఽధిక్షేపజన్మనా ।**
**ఉత్థాయ పార్ష్ణ్యా వసుధాం జఘాన స హలాయుధః ॥ 20 ॥**

ఈ విధంగా తిరస్కారం వల్ల కల్గిన కోపంచే మత్తత పొంది ఘూర్ణిల్లి పైకి లేచి ఆ హలాయుధుడు తన మడమతో ఒక్కసారిని అదిమి కొట్టాడు.

**తతో విదారితా పృథ్వీ పార్ష్ణిఘాతాన్మహాత్మనః ।**
**ఆస్ఫోటయామాస తథా దిశః శబ్దేన పూరయన్ ॥ 21 ॥**

ఆ మహాత్ముని పాదప్రహారం వల్ల భూమి బ్రద్దలయ్యింది. అనంతరం దశదిశలు ప్రతిధ్వనించేటట్లుగా కంపించేటట్టు అరచాడు.

**స ఉవాచాతితామ్రాక్షో భ్రుకుటీకుటిలాననః ।**
**అహో మదావలేపోఽయమసారాణాం దురాత్మనామ్ ॥ 22 ॥**

కన్నులు మిక్కిలి ఎరుపెక్కగా, కనుబొమలు ముడిపడగా మోము కుటిలం కాగా ఆ హలాయుధుడిట్లు పలికెను. "ఈ దురాత్మకులైన కౌరవులకు అహో! ఎంత పొగరు? వీరు ఏమంత సమర్థులు?

**కౌరవాణాం మహీపత్వమస్మాకం కిల కాలజమ్ ।**
**ఉగ్రసేనస్య యేనాజ్ఞాం మన్యన్తేఽద్యాపి లంఘనమ్ ॥ 23 ॥**

ఈ కౌరవులకు మహీపాలత్వం మా కాలప్రభావముచే వచ్చింది. అందువల్లనే ఇపుడు మహారాజు ఉగ్రసేనుని ఆజ్ఞను ఆజ్ఞాపనంగా భావించడం లేదు. పైగా ఉల్లంఘన చేస్తున్నారు.

**ఆజ్ఞాం ప్రతీచ్ఛేద్ధర్మేణ సహదేవైః శచీపతిః ।**
**సదాధ్యాస్తే సుధర్మాం తాముగ్రసేనః శచీపతేః ॥ 24 ॥**

నేడు రాజైన ఉగ్రసేనుడు దేవేంద్రుని సుధర్మాపీఠంపై స్వయంగా ప్రకాశిస్తున్నాడు. శచీపతి కూడ దేవతలతో పాటు వినయంగా ఆతని ఆజ్ఞ కోసమై ఎదురుచూస్తూ ఉంటాడు.

**ధిఙ్మనుష్యశతోచ్ఛిష్టే తుష్టిరేషాం నృపాసనే । 25 ॥**

ఛీ! చాలామంది మానువుల ఉచ్ఛిష్టమయిన రాజాసనంపై వీరికి తుష్టి కలిగింది. ఎంత నీచం?

**పారిజాతతరోః పుష్పమంజరీర్వనితాజనః ।**
**బిభర్తి యస్య భృత్యానాం సోఽప్యేషాం న మహీపతిః ।**
**సమస్త భూభృతాం నాథ ఉగ్రసేనః స తిష్ఠతు ॥ 26 ॥**

ఎవని భృత్యుల అంగనాజనం పారిజాతవృక్ష పుష్పమంజరులను తమ కొప్పులం దురుముకొనునో, అట్టి మహీపతి వారికి రాజు కాడా? మా ప్రభువైన, సమస్త రాజాధిరాజులకు సార్వభౌముడగు ఉగ్రసేనుడు అట్లుండనీ.

**అద్య నిష్కౌరవాముర్వీం కృత్వా యాస్యామి తత్పురీమ్ ।**
**కర్ణం దుర్యోధనం ద్రోణమద్య భీష్మం సబాహ్లికమ్ ॥ 27 ॥**

**దుష్టాన్ దుఃశాసనాదీంశ్చ భూరిశ్రవసమేవ చ ।**
**సోమదత్తం శలం భీమమర్జునం సయుధిష్ఠిరమ్ ॥ 28 ॥**

**యమజౌ కౌరవాంశ్చాన్యాన్ హత్వా సాశ్వరథద్విపాన్ ।**
**వీరమాదాయ సామ్బం చ సపత్నీకం తతః పురీమ్ ।**
**ద్వారకా ముగ్రసేనాదీన్ గత్వా ద్రక్ష్యామి బాన్ధవాన్ ॥ 29 ॥**

నేడు ఈ భూమిని కురువంశ విహీనం కావించి అనంతరమే ద్వారకాపురికి వెడతాను. కర్ణుని, దుర్యోధనుని, ద్రోణుని, భీష్ముని, బాహ్లికుని, దుష్టులైన దుఃశాసనాదులను, భూరిశ్రవసుని, సోమదత్తుని, శలుని, భీముని, అర్జునుని, యుధిష్ఠిరుని, నకులసహదేవులను, మిగిలిన కౌరవులను వధించి, గుర్రాలతో, రథాలతో, ఏనుగులతో బలాన్నంతా కూల్చివైచి, వీరుడైన సాంబుని భార్యాసహితంగా తీసుకొని, అప్పుడు మాత్రమే ద్వారకాపురికి వెళ్లి ఉగ్రసేనాది బంధువులను సందర్శిస్తాను.

**అథవా కౌరవాధీనం సమస్తైః కురుభిః సహ ।**
**భారావతరణే శీఘ్రం దేవరాజేన చోదితః ।**
**భాగీరథ్యాం క్షిపామ్యాశు నగరం నాగసాహ్వయమ్ ॥ 30 ॥**

అలా కాకపోతే పృథ్వీభారాన్ని తగ్గించడానికై అవతరించిన దేవేశ్వరుడైన కృష్ణునిచే ప్రేరేపించబడి, సమస్తకౌరవులతోపాటుగా కౌరవుల అధీనంలో ఉన్న ప్రాంతాన్నంతా హస్తినాపురం అనే రాజధాని నగరంతో పాటుగా ఒక్కమాటుగా గంగలో విసరివేస్తాను".

**ఇత్యుక్త్వా మదరక్తాక్షః కర్షణాధోముఖం హలమ్ ।**
**ప్రాకారవప్రే విన్యస్య చకర్ష ముసలాయుధః ॥ 31 ॥**

అని పలికి మత్తుతో ఎరుపెక్కిన కన్నులతో ముసలాయుధుడు ప్రాకార దుర్గాలను లాగి పెల్లగించుటకై క్రింది ముఖమై యున్న నాగలిని పట్టిలాగాడు.

**ఆఘూర్ణితం తత్ సహసా తతో వై హాస్తినం పురమ్ ।**
**దృష్ట్వా సంక్షుబ్ధహృదయాశ్చుక్రుశుః సర్వకౌరవాః ॥ 32 ॥**

అంత ఒక్కసారిగా అదిరిపోయిన ఆ గజనగరాన్ని చూచి హృదయాలు సంపీడితాలు కాగా కౌరవులందరు మొర్రోయని ఆక్రోశించారు.

**రామ! రామ! మహాబాహో! క్షమ్యతాం క్షమ్యతాం త్వయా ।**
**ఉపసంహ్రియతాం కోపః ప్రసీద ముసలాయుధ! ॥ 33 ॥**

"ముసలాయుధా! రామా! బలభద్ర! మహాబాహూ! క్షమించు. తప్పు మన్నించు. నీవు కోపాన్నిఉపసంహరించు. అనుగ్రహం చూపించు.

**ఏష సామ్బః సపత్నీకస్తవ నిర్యాతితో బల ।**
**అవిజ్ఞాతప్రభావాణాం క్షమ్యతామపరాధినామ్ ॥ 34 ॥**

బలదేవా! ఇదుగో సాంబుడు. భార్యాసమేతంగా నీ సన్నిధికి చేరుకొన్నాడు. నీ ప్రభావం తెలియక అపరాధం చేసిన మమ్ము క్షమించు.” అని వారు వేడుకొన్నారు.

**తతో నిర్యాతయామాసుః సామ్బం పత్నీసమన్వితమ్ ।**
**నిష్క్రమ్య నగరాత్తూర్ణం కౌరవా మునిపుంగవ! ॥ 34 ॥**

మునిశ్రేష్ఠా! అనంతరం కౌరవులు సాంబుని పత్నీసహితంగా మిక్కిలి శీఘ్రంగా తమ పురం నుంచి బలరాముని సమీపానికి సాగనంపారు.

**భీష్మద్రోణకృపాదీనాం ప్రణమ్య వదతా ప్రియమ్ ।**
**క్షాన్తమేతన్మయేత్యాహ బలో బలవతాం వరః ॥ 36 ॥**

అనంతరం బలవంతులలో శ్రేష్ఠుడైన బలభద్రుడు భీష్మ ద్రోణ కృపాచార్యాదులకు నమస్కరించి ప్రియవచనం పలుకుతూ “మంచిది. దీనిని నేను మన్నించాను” అని వచించాడు.

**అద్యాప్యాఘూర్ణితాకారం లక్ష్యతే తత్పురం ద్విజ! ।**
**ఏష ప్రభావో రామస్య బలశౌర్యోపలక్షణః ॥ 37 ॥**

ద్విజశ్రేష్ఠా! నేటికీ కూడా అటూ ఇటూ కదలినట్లుగానే ఆ పురం కనబడుతోంది. బలరాముని పరాక్రమశౌర్యోపలక్షణమైన ప్రభావం ఇది.

**తతస్తు కౌరవాః సామ్బం సమ్పూజ్య హలినా సహ ।**
**ప్రేషయామాసురుద్వాహధనభార్యాసమన్వితమ్ ॥ 38 ॥**

అనంతరం కౌరవులు బలరామునితోపాటు సాంబుని కూడ పూజించి భార్యా సమన్వితంగా ఉద్వాహధనంతో (చీరనారెలతో) సాగనంపారు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే సాంబవివాహో నామ పంచత్రింశోఽధ్యాయః సమాప్తః ॥ 35 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో సాంబవివాహం అనే ముప్పై అయిదవ అధ్యాయం సమాప్తం ॥ 35 ॥



## షట్త్రింశోఽధ్యాయః - ముప్పై ఆరవ అధ్యాయం

## ద్వివిదసంహారః - ద్వివిద సంహారం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**మైత్రేయ! శ్రూయతాం తస్య బలస్య బలశాలినః ।**
**కృతం యదన్యత్తేనాభూత్తదపి శ్రూయతాం త్వయా ॥ 1 ॥**

మైత్రేయా! బలశాలియైన ఆ బలభద్రుడు ఇంకా ఏమేమి చేశాడో వాటిని గూర్చి చెబుతాను. నీవు సావధానంగా ఆలకించు.

**నరకస్యాసురేన్ద్రస్య దేవపక్షవిరోధినః ।**
**సఖా భవన్మహావీర్యో ద్వివిదో నామ వానరః ॥ 2 ॥**

పూర్వకాలంలో దేవసమూహానికి శత్రువైన అసురేంద్రుడగు నరకునికి మహాబలశాలియైన ద్వివిదుడనే పేరుగల వానరుడు స్నేహితుడుగా ఉండేవాడు.

**వైరానుబన్ధం బలవాన్ స చకార సురాన్ ప్రతి ।**
**నరకం హతవాన్ కృష్ణో బలదర్పసమన్వితమ్ ॥ 3 ॥**

భగవంతుడైన కృష్ణుడు బలపరాక్రమ సంపన్నుడైన నరకుని సంహరించాడు కదా! ఆ కారణంచే బలవంతుడైన ఆ ద్వివిదుడు నరకస్నేహానుబంధకారణంగా దేవతలపై పగబట్టాడు.

**కరిష్యే సర్వదేవానాం తస్మాదేతత్ప్రతిక్రియామ్ ।**
**యజ్ఞవిధ్వంసనం కుర్వన్ మర్త్యలోకక్షయం తథా ॥ 4 ॥**

అందువల్ల అతడు సమస్తదేవతలకు తగిన ప్రతీకారం చేస్తానని, యజ్ఞాలు నాశనం చేస్తానని, ఆ మూలంగా మానవలోకవినాశనం చేకూరుస్తానని భావించాడు.

**తతో విధ్వంసయామాస యజ్ఞానజ్ఞానమోహితః ।**
**బిభేద సాధుమర్యాదాం క్షయం చక్రే చ దేహినామ్ ॥ 5 ॥**

అనంతరం అతడు అజ్ఞానంచే మోహించబడి యజ్ఞాలను నాశనం చేయసాగాడు. సాధుపురుషుల మర్యాదలను విచ్ఛిన్నం చేయసాగాడు. సమస్త ప్రాణులను నశింపజేయ బూనుకొన్నాడు.

**దదాహ చ వనోద్దేశాన్ పురగ్రామాన్తరాణి చ ।**
**క్వచిచ్చ పర్వతాక్షేపై ర్గ్రామాదీన్ సమచూర్ణయత్ ॥ 6 ॥**

వనాలను, గొప్పగొప్పప్రదేశాలను, పురాలను, గ్రామాలను, పల్లెలను కాల్చివేశాడు. కొండలను ఎత్తిపడవేసి కొన్నిచోట్ల గ్రామాలు మున్నగు వాటిని పిండిపిండి కావించాడు.

**శైలానుత్పాట్య తోయేషు ముమోచామ్బునిధౌ తథా ।**
**పునశ్చార్ణవమధ్యస్థః క్షోభయామాస సాగరమ్ ॥ 7 ॥**

పెద్దపెద్దకొండలను పెల్లగించి పైకెత్తి జలప్రదేశాలలోను, మహాసముద్రాలలోను విసరివేశాడు. తిరిగి జలరాశి మధ్యలో నిలబడి వాటిని క్షోభింపజేశాడు.

**తేన విక్షోభితశ్చాబ్ధిరుద్వేలోఽజాయత ద్విజ! ।**
**ప్లావయంస్తీరజాన్ గ్రామాన్ పురాదీనతివేగవాన్ ॥ 8 ॥**

ద్విజశ్రేష్ఠా! దానివల్ల సముద్రం పొంగి చెలియలి కట్టలు దాటి ప్రవహించింది. సాగరతరంగాలు తీరంలో నున్న గ్రామాలను, నగరాలను, అక్కడ ఉన్న సమస్త ప్రాణులను మిక్కిలి వేగంగా ముంచెత్తి వేశాయి.

**కామరూపీ మహారూపం కృత్వా సంస్థానశేషతః ।**
**లుఠన్ భ్రమణసమ్మర్దైః సంచూర్ణయతి వానరః ॥ 9 ॥**

ఆ ద్వివిదవానరుడు తన కోరికననుసరించి అనుకూలరూపం ధరించగల్గినవాడు కాబట్టి గొప్ప ఆకారం దాల్చి సమస్త ప్రాంతాలను కలగుండు పరుస్తూ, దూకుతూ, అంతటిని మర్దిస్తూ పిండి కొట్టివేయ సాగాడు.

**తేన విప్రకృతం సర్వం జగదేతద్దురాత్మనా ।**
**నిఃస్వాధ్యాయవషట్కారం మైత్రేయాసీత్సుదుఃఖితమ్ ॥ 10 ॥**

మైత్రేయా! ఆ దుష్టబుద్ధిచే ఈ జగత్తు అంతా ధ్వంసం చేయబడింది. స్వాధ్యాయం, వషట్కారం లోపించి జగత్తు అత్యంతం దుఃఖంతో కూడుకొన్నది అయ్యింది.

**ఏకదా రైవతోద్యానే పపౌ పానం హలాయుధః ।**
**రేవతీ చ మహాభాగా తథైవాన్యా వరస్త్రియః ॥ 11 ॥**

ఒకనాడు హలాయుధుడు రైవతోద్యానవనంలో మద్యపానం చేసియున్నాడు. మహాభాగురాలైన రేవతియు, అలాగే మిగిలిన ఉత్తమాంగనలు అక్కడ విహరిస్తున్నారు.

**ఉద్గీయమానో విలసల్లలనామౌళిమధ్యగః ।**
**రేమే యదుకులశ్రేష్ఠః కుబేర ఇవ మన్దిరే ॥ 12 ॥**

ఆ సమయంలో చక్కగా ప్రకాశించే రమణీమణులు గొంతెత్తి పాటలు పాడుచుండగా, వారి మధ్యలో యదువంశశ్రేష్ఠుడైన బలభద్రుడు నిజనివాసంలో కుబేరునిలా శోభిల్లాడు.

**తతః స వానరోఽభ్యేత్య గృహీత్వా సీరిణో హలమ్ ।**
**ముసలం చ చకారాస్య సమ్ముఖం చ విడమ్బనమ్ ॥ 13 ॥**

అంతట ఆ వానరుడు అక్కడికి ఒక్క ఉదుటున వచ్చి, సీరాయుధుని నాగలిని, రోకలిని కొనిపోయి ఆ బలదేవునిముందు కోతిచేష్టలు చేశాడు.

**తథైవ యోషితాం తాసాం జహాసాభిముఖం కపిః ।**
**పానపూర్ణాంశ్చ కరకాంశ్చిక్షేపాహత్య వై తదా ॥ 14 ॥**

అలాగే ఆ కపి యాదవాంగనల ముందుకు వచ్చి పండ్లికిలించి వెక్కిరించాడు. మద్యంతో నిండియున్న కల్లుముంతలను పగులగొట్టి అటూ ఇటూ పారవైచాడు.

**తతః కోప పరీతాత్మా భర్త్సయామాస తం బలః ।**
**తథాఽపి తమవజ్ఞాయ చక్రే కిలకిలాన్వితమ్ ॥ 15 ॥**

అంతట బలదేవుడు క్రోధపరవశుడై ఆ మర్కటాన్ని బెదరగొట్టాడు. అయినప్పటికి ద్వివిదుడు ఆయనను గేలిచేస్తూ కిలకిలారావాలు కావించాడు.

**తతః సముత్థాయ బలో జగ్రాహ ముసలం రుషా ।**
**సోఽపి శైలిశిలాం భీమాం జగ్రాహ ప్లవగోత్తమః ॥ 16 ॥**

అంత బలభద్రుడు ఒక్కసారిగా కోపంతో పైకి లేచి తన ముసలం అందుకొన్నాడు. ఆ వానరాధముడు కూడా ఒక పెద్దరాతి బండను కైకొన్నాడు.

**చిక్షేప చ స తాం క్షిప్తాం ముసలేన సహస్రధా ।**
**బిభేద యాదవశ్రేష్ఠః సా పపాత మహీతలే ॥ 17 ॥**

వాడు ఆ కఠోరశిలను తనపై విసరగా యదుప్రవరుడైన రాముడు రోకలిచే దానిని వేయి ముక్కలు కావించి నేలపై పడగొట్టాడు.

**ఆపతన్ముసలం చాసౌ సముల్లంఘ్య ప్లవంగమః ।**
**వేగేనాఽఽగమ్య రోషేణ తలేనోరస్యతాడయత్ ॥ 18 ॥**

అపుడు ఆ ప్లవంగముడు ఒక్క దుముకు దుమికి ఆ రోకలిని ఎత్తుకొనిపోయి మహారోషంతో ఒక్క ఉదుటున అతివేగంగా బలభద్రునిపై పడి అతని రొమ్మున ఒక్క గ్రుద్దు వైచాడు.

**తతో బలేన కోపేన ముష్టినా మూర్ధ్ని తాడితః ।**
**పపాత రుధిరోద్గారీ ద్వివిదః క్షీణజీవితః ॥ 19 ॥**

అంత బలరాముడు మహాక్రోధంతో వాడి నడినెత్తిని పిడికిలి బిగించి ఒక్క దెబ్బకొట్టాడు. ఆ ముష్టి ప్రహారానికి విలవిలలాడి ద్వివిద వానరుడు నోట రక్తం గ్రక్కుకొంటూ ప్రాణాలు విడిచి నేలపై బడ్డాడు.

**పతతా తచ్ఛరీరేణ గిరేః శృంగమశీర్యత ।**
**మైత్రేయ! శతధా వజ్రి వజ్రేణేవ హి తాడితమ్ ॥ 20 ॥**

మైత్రేయా! దేవేంద్రుని వజ్రప్రహారంచే నూరు ముక్కలై పడినట్లుగా ఆ ద్వివిద వానరుని శరీరం ఒక గిరిశిఖరంపై పడగా అది ఛిన్నాభిన్నమయిపోయింది.

**పుష్పవృష్టిం తతో దేవా రామస్యోపరి చిక్షిపుః ।**
**ప్రశశంసుస్తథాభ్యేత్య సాధ్వేతత్తే మహత్ కృతమ్ ॥ 21 ॥**

అంత దేవతలు అక్కడకు వచ్చి "బాగు! బాగు! నీచే మహాకార్యం నెరవేర్చబడింది" అంటూ బలరామునిపై పూలవాన కురిపించి ప్రశంసించారు.

**అనేన దుష్టకపినా దైత్యపక్షోపకారిణా ।**
**జగన్నిరాకృతం వీర! దిష్ట్యాసౌ క్షయమాగతః ॥ 22 ॥**

**ఇత్యుక్త్వా దివమాజగ్ముర్దేవా హృష్టాః సగుహ్యకాః । 23 ॥**

"వీరాధివీరా! దైత్యవర్గానికి ఉపకారి అయిన ఈ పాడు కోతిచే జగత్తంగా ధ్వంసమైపోయింది. అదృష్టవశం వల్ల ఆ మర్కటాధముడు నాశనం పొందాడు" అని దేవతలు రాముని కొనియాడి సంతోషం పొంది గుహ్యకులతోబాటుగా స్వర్గానికి వెళ్లిపోయాడు.

**ఏవం విధాన్యనేకాని బలదేవస్య ధీమతః ।**
**కర్మాణ్యపరిమేయాణి శేషస్య ధరణీభృతః ॥ 24 ॥**

మైత్రేయా! భూమిని శిరస్సుపై ధరించే ఆదిశేషుని అవతారమైన మహాధీశాలియగు బలదేవుని లీలాకృత్యాలు ఈ విధంగా అనంతంగా అపరిమేయంగా ఉన్నాయి అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే ద్వివిదసంహారో నామ షట్త్రింశోఽధ్యాయః సమాప్తః ॥ 36 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో ద్వివిద సంహారం అనే ముప్పై ఆరవ ధ్యాయం సమాప్తం ॥ 36 ॥



## సప్తత్రింశోఽధ్యాయః - ముప్పై ఏడవ అధ్యాయం

**యాదవవంశవినాశః - భగవతః స్వధామగమనం చ -** యాదవవంశవినాశం - భగవంతుని స్వధామగమనం

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ఏవం దైత్యవధం కృష్ణో బలదేవసహాయవాన్ ।**
**చక్రే దుష్టక్షితీశానాం తథైవ జగతః కృతే ॥ 1 ॥**

ఈ విధంగా జగత్తును రక్షించడానికై శ్రీకృష్ణుడు బలదేవుని సహాయం గైకొని దుష్టులైన రాజేంద్రులను, అనేక దైత్యులను వధించడం జరిగింది.

**క్షితేశ్చ భారం భగవాన్ ఫాల్గునేన సమన్వితః ।**
**అవతారయామాస హరిః సమస్తాక్షౌహిణీవధాత్ ॥ 2 ॥**

భగవంతుడైన హరి అర్జునునితో కూడుకొని సమస్తములైన అక్షౌహిణుల కొలదీ సైన్యాన్ని వధించి భూభారాన్ని దించినవాడయ్యాడు.

**కృత్వా భారావతరణం భువో హత్వాఽఖిలాన్ నృపాన్ ।**
**శాపవ్యాజేన విప్రాణా ముపసంహృతవాన్ కులమ్ ॥ 3 ॥**

ఈ విధంగా సమస్తదుష్ట రాజేంద్రులను వధించి, భూమికి భారం తగ్గించినవాడై విప్రశాపం నెపంతో యాదవవంశాన్ని కూడ ఉపసంహరింపజేశాడు.

**ఉత్సృజ్య ద్వారకాం కృష్ణ స్త్యక్త మానుష్యమాత్మభూః ।**
**సాంశో విష్ణుమయం స్థానం ప్రవివేశ పునర్నిజమ్ ॥ 4 ॥**

ఈ విధంగా సమస్తకార్యాలను చక్కబరచి, చివరలో ద్వారకానగరాన్ని విడిచి, శ్రీకృష్ణపరమాత్మ స్వయంభువు కావున మానుషశరీరాన్ని సంత్యజించి, తన అంశలైన బలరామప్రద్యుమ్నాది సహితంగా మళ్లీ తన స్వరూపమైన విష్ణురూపస్థానంలో ప్రవేశించాడు.

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు ఇలా చెప్పాడు.

**స విప్రశాపవ్యాజేన సంజహ్రే స్వకులం కథమ్ ।**
**కథం చ మానుషం దేహ ముత్ససర్జ జనార్దనః ॥ 5 ॥**

"ఆ కృష్ణుడు బ్రాహ్మణశాపం నెపంతో తన కులాన్ని ఏ విధంగా ఉపసంహరింపజేశాడు? జనార్దనుడు ఏ రీతిగా తన మానుషదేహాన్ని విడిచి పెట్టాడు?" అని అడిగాడు.

**పరాశర ఉవాచ :-** పరాశరుడు ఇలా చెప్పాడు.

**విశ్వామిత్రస్తథా కణ్వో నారదశ్చ మహామునిః ।**
**పిణ్డారకే మహాతీర్థే దృష్టా యదుకుమారకైః ॥ 6 ॥**

విశ్వామిత్రుడు, అలాగే కణ్వుడు, దేవమునియైన నారదుడు మున్నగు మహర్షులు పిండారకమనే పుణ్యతీర్థంలో యదుకుమారులకు కనబడ్డారు.

**తతస్తే యౌవనోన్మత్తా భావికార్యప్రచోదితాః ।**
**సామ్బం జామ్బవతీపుత్రం భూషయిత్వా స్త్రియం యథా ॥ 7 ॥**

**ప్రశ్రితాస్తాన్మునీనూచుః ప్రణిపాతపురఃసరమ్ ।**
**ఇయం స్త్రీ పుత్రకామా వై బ్రూత కిం జనయిష్యతి ॥ 8 ॥**

వారంత యౌవనంతో మత్తిల్లినవారై, కాగల కార్యంచే ప్రేరేపించబడినవారై, జాంబవతి కుమారుడైన సాంబుని ఆడదానిగా అలంకరించి ఆ మునీశ్వరులకు అతివినయంగా ప్రణామాలు అర్పించి "ఈ కాంత కొడుకును కనే కోరికతో ఉంది చెప్పండి. కొడుకు పుడతాడా?" అని అడిగారు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**దివ్యజ్ఞానోపపన్నాస్తే విప్రలబ్ధాః కుమారకైః ।**
**మునయః కుపితాః ప్రోచుర్ముసలం జనయిష్యతి ।**
**యేనాఖిలకులోత్సాదో యాదవానాం భవిష్యతి ॥ 9 ॥**

యాదవకుమారులు ఈ రీతిగా ప్రశ్నించగా దివ్యజ్ఞానంతో కూడుకొన్న ఆ మునిముఖ్యులు మిక్కిలి కోపించి "దేని చేతనైతే సమస్తయాదవవంశం నశిస్తుందో, అటువంటి ముసలం పుడుతుంది" అని వచించారు.

**ఇత్యుక్తాస్తైః కుమారాస్తు ఆచచక్షుర్యథాకృతమ్ ।**
**ఉగ్రసేనాయ ముసలం జజ్ఞే సామ్బస్య చోదరాత్ ॥ 10 ॥**

మునులీవిధంగా శపించగా ఆ బాలురదియంతా పూస గ్రుచ్చినట్లుగా ఉగ్రసేనమహారాజుకు తెలియజేశారు. సాంబుని ఉదరం నుంచి రోకలి కూడా పుట్టడం జరిగింది.

**తదుగ్రసేనో ముసలమయశ్చూర్ణమకారయత్ ।**
**జజ్ఞే స చైరకాచూర్ణః ప్రక్షిప్తస్తైర్మహోదధౌ ॥ 11 ॥**

ఉగ్రసేనుడు ఆ ముసలాన్ని ఇనుపపొడిగా కొట్టించాడు. అది ఏరకాచూర్ణమయింది. (తుంగముస్తెపొడి). దానిని యాదవులు మహాసముద్రంలో చల్లివేశారు.

**ముసలస్యాథ లోహస్య చూర్ణితస్యాన్ధకైర్ద్విజ! ।**
**ఖణ్డం చూర్ణయితుం శేకుర్నైకం తే తోమరాకృతి ॥ 12 ॥**

ద్విజశ్రేష్ఠా! అంధకులు లోహమయమైన ముసలాన్ని చూర్ణం చేస్తూ ఉండగా, వారు చివరగా తోమరం ఆకారంలో ఉన్న ఒక చిన్నముక్కను పిండి చేయజాలరైరి.

**తదప్యమ్బునిధౌ క్షిప్తం మత్స్యో జగ్రాహ ఘాతిభిః ।**
**ఘాతితస్యోదరాత్ తస్య లుబ్ధో జగ్రాహ తం జరా ॥ 13 ॥**

వారు దానిని సముద్రంలో విసరివేశారు. దానిని ఒక చేప మ్రింగింది. అది జాలరులచే పట్టుబడింది. ఆ చేపకోయబడుతూ ఉండగా దాని పొట్టనుండి బయటపడిన లోహఖండాన్ని జర అనే లుబ్ధుడు స్వీకరించాడు.

**విజ్ఞాత పరమార్థోఽపి భగవాన్ మధుసూదనః ।**
**నైచ్ఛత్తదన్యథా కర్తుం విధినా యత్సమీహితమ్ ॥ 14 ॥**

భగవంతుడైన మధుసూదనుడు పరమార్థం తెలిసియున్నవాడు కాబట్టి, విధి విహితమైన దానిని అన్యథాకరించుటకు సంకల్పించలేదు.

**దేవైశ్చ ప్రహితో వాయుః ప్రణిపత్యాహ కేశవమ్ (దూతః) ।**
**రహస్యేవమహం దూతః ప్రహితో భగవన్! సురైః ॥ 15 ॥**

అదే సమయంలో దేవతలు పంపగా వాయుదేవుడు వచ్చి కేశవునికి ప్రణమిల్లి ఏకాంతంలో ఇలా అన్నాడు. "భగవంతుడా! నేను సురలపంపున అరుదెంచిన దూతను.

**విశ్వాశ్విమరుదాదిత్యరుద్రసాధ్యాదిభిః సహ ।**
**విజ్ఞాపయతి యచ్ఛక్రస్తదిదం శ్రూయతాం ప్రభో! ॥ 16 ॥**

ప్రభూ! విశ్వేదేవతలు, అశ్వినీ దేవతలు, మరుత్తులు, ఆదిత్యులు, రుద్రులు, సాధ్యులు మున్నగువారితో కలిసి దేవేంద్రుడు తమకు విన్నపం చేసింది ఆలకించండి.

**భారావతారణార్థాయ వర్షాణామధికం శతమ్ ।**
**భగవానవతీర్ణోఽత్ర త్రిదశైః సమ్ప్రసాదితః ॥ 17 ॥**

దేవతలచే వేడుకొన్నబడ్డవాడవై భూభారం తగ్గించడానికై వందఏండ్లకు పైగా ఈ భూమిలో అవతరించిన భగవంతుడవు నీవు.

**దుర్వృత్తా నిహతా దైత్యా భువో భారోఽవతారితః ।**
**త్వయా సనాథాస్త్రిదశా భవన్తు త్రిదివే పునః ॥ 18 ॥**

దుష్టప్రవృత్తులైన దైత్యులు సంహరించబడ్డారు. భూమి బరువు తగ్గించబడింది. తిరిగి స్వర్గంలో దేవతలు నీ వల్ల సనాథులు అగుదురుగాక!

**తదతీతం జగన్నాథ! వర్షాణామధికం శతమ్ ।**
**ఇదానీం గమ్యతాం స్వర్గో భవతా యది రోచతే ॥ 19 ॥**

జగన్నాథా! నీవు అవతరించి నూరేండ్లకు ఎక్కువగా కాలం గతించిపోయింది. తమకు కనుక ఇష్టమయినట్లయితే స్వర్గానికి ఇక విచ్చేయవచ్చు.

**దేవైర్విజ్ఞాప్యతే చేదమథాత్రైవ రతిస్తవ ।**
**తత్ స్థీయతాం యథాకాలమాస్థేయమనుజీవిభిః ॥ 20 ॥**

దేవతలు ఇలా విజ్ఞప్తి చేశారు. తమకు ఇంకా ఈ భూమిపై ఉండడానికి అభిలాష కనుక ఉంటే ఇక్కడనే ఉండవచ్చు. అనుచరులతో తమకిచ్చ వచ్చినంతకాలం నిలవవచ్చు" అని దేవతల దూతగా వాయువు వేడుకొన్నాడు.

**శ్రీభగవానువాచ :–**భగవంతుడు చెప్పాడు.

**యత్త్వమాత్థాఖిలం దూత! వేద్మ్యేతదహమప్యుత ।**
**ప్రారబ్ధ ఏవ హి మయా యాదవానామపి క్షయః ॥ 21 ॥**

అపుడు కృష్ణుడు "దేవదూతా! నీవు వచించినదంతా నేను ఎరుగుదును. అందువల్లనే నేను యాదవవంశవినాశం ఆరంభించాను.

**భువో నాద్యాపి భారోఽయం యాదవైరనిబర్హితైః ।**
**అవతార్య కరోమ్యేతత్ సప్తరాత్రేణ సత్వరః ॥ 22 ॥**

యాదవగణం పూర్తిగా నశించకుండా, పృథివీభారం కూడా సంపూర్ణంగా తొలగిపోయేదికాదు. ఆ కారణంచే అతిశీఘ్రంగా ఏడురాత్రులలో (యాదవసంహారం కావించి) భూమి బరువును నశింపజేస్తాను.

**యథా గృహీతా మమ్భోధే ర్దత్వాఽహం ద్వారకాభువమ్ ।**
**యాదవానుపసంహృత్య యాస్యామి త్రిదివాలయమ్ ॥ 23 ॥**

ఏవిధంగా ఈ ద్వారకానగరభూమిని సముద్రునినుండి పొందానో, అదే విధంగా దానికి ఈ పురిని అప్పగించి యాదవసంహారం కావించి నేను తిరిగి స్వర్గధామం చేరుకొంటాను.

**మనుష్యదేహముత్సృజ్య సంకర్షణసహాయవాన్ ।**
**ప్రాప్త ఏవాస్మి మన్తవ్యో దేవేన్ద్రేణ తథా సురైః ॥ 24 ॥**

ఈ బలరామునితో కలసి నేను మానవ దేహాన్ని ఎప్పుడు ఉపసంహరిస్తానో, దేవేంద్రునితో పాటుగా సురలు అందరూ అప్పుడు నేను అక్కడకు వచ్చినట్లే అని భావించవలసి ఉంటుంది.

**జరాసన్ధాదయో యేఽన్యే నిహతా భారహేతవః ।**
**క్షితేస్తేభ్యః కుమారోఽపి యదూనాం నాపచీయతే ॥ 25 ॥**

మిగిలిన భూభారకారకులైన జరాసంధుడు మున్నగు వారందరూ మరణించారు. కాని యాదవ కుమారగణంవల్ల భూమి బరువెక్కి ఈ భూ భారం పూర్తిగా తొలగిపోలేదు.

**తదేనం సుమహాభారమవతార్య క్షితేరహమ్ ।**
**యాస్యామ్యమరలోకస్య పాలనాయ బ్రవీహి తాన్ ॥ 26 ॥**

అందువల్ల భూమికి ఏర్పడిన పెనుబరువును దింపి, అప్పుడు నేను స్వర్గలోక పాలనకు చేరుకొంటాను. ఈ మాట వారికి చెప్పు" అని చెప్పాడు.

**ఇత్యుక్తో వాసుదేవేన దేవదూతః ప్రణమ్య తమ్ ।**
**మైత్రేయ! దివ్యయా గత్యా దేవరాజాన్తికం యయౌ ॥ 27 ॥**

మైత్రేయా! వాసుదేవుడు ఇట్లు ఆనతీయగా దేవదూత ఆయనకు నమస్కరించి దేవగమనంతో దేవరాజసమీపానికి వెళ్ళిపోయాడు.

**భగవానప్యథోత్పాతాన్ దివ్యభౌమాన్తరిక్షగాన్ ।**
**దదర్శ ద్వారకాపుర్యాం వినాశాయ దివానిశమ్ ॥ 28 ॥**

అనంతరం కృష్ణభగవానుడు దివ్యములు, భౌమములు, అంతరిక్షములు (స్వర్గం, నేల, నింగిలో) అయిన ఉత్పాతాలను రాత్రిపగలు కూడా ద్వారకాపురిలో సర్వనాశనం చేసేవాటిని చూశాడు.

**తాన్ దృష్ట్వా యాదవానాహ పశ్యధ్వమతి దారుణాన్ ।**
**మహోత్పాతాన్ శమాయైషాం ప్రభాసం యామ మా చిరమ్ ॥ 29 ॥**

ఆ దుశ్శకునాలను చూచి కృష్ణుడు యాదవులతో "మిక్కిలి భయంకరాలైన ఈ మహోత్పాతాలను చూడండి. వీటి ఉపశమనానికై మనమందరం ప్రభాసతీర్థానికి వెళ్ళిపోదాం పదండి" అన్నాడు.

**ఏవముక్తే తు కృష్ణేన యాదవప్రవరస్తతః ।**
**మహాభాగవతః ప్రాహ ప్రణిపత్యోద్ధవో హరిమ్ ॥ 30 ॥**

కృష్ణుడు ఈ విధంగా చెప్పగా యాదవశ్రేష్ఠుడు, మహాభాగవతోత్తముడు అయిన ఉద్ధవుడు అపుడు హరికి నమస్కరించి ఇలా అడిగాడు.

**భగవన్! యన్మయా కార్యం తదాజ్ఞాపయ సామ్ప్రతమ్ ।**
**మన్యే కుల మిదం సర్వం భగవాన్ సంహరిష్యతి ।**
**నాశాయాస్య నిమిత్తాని కులస్యాచ్యుత! లక్షయే ॥ 31 ॥**

"భగవంతుడా! ఇప్పుడు నేనేమి చేయవలసి ఉందో ఆనతిని ఈయవలసింది. ఈ యాదవ కులాన్నంతా దేవుడవైన నీవు ఉపసంహరించబోతున్నావని నేను భావిస్తున్నాను. అచ్యుతా! యాదవవంశ వినాశ హేతువులైన దుర్నిమిత్తాలను చూస్తున్నాను" అని వేడుకొన్నాడు.

**శ్రీభగవానువాచ :**–భగవంతుడు చెప్పాడు.

**గచ్ఛ త్వం దివ్యయా గత్యా మత్ప్రసాదసముత్థయా ।**
**బదరీమాశ్రమం పుణ్యం గన్ధమాదనపర్వతే ॥ 32 ॥**

**నరనారాయణస్థానే తత్పావిత (పవిత్రం) మహీతలే ।**
**మన్మనా మత్ప్రసాదేన తత్ర సిద్ధిమవాప్స్యసి ॥ 33 ॥**

అపుడు శ్రీకృష్ణుడు "ఉద్ధవా! నీవు నా అనుగ్రహంవల్ల లభించిన దివ్యగమనంచే గంధమాదన పర్వతంపై ఉన్న పుణ్యప్రదేశమైన బదరికాశ్రమానికి వెళ్లు. అది నరనారాయణస్థానం. భూమండలంలో అది పరమపవిత్రమైనది. అక్కడ నాపై మనస్సు నిల్పి నాప్రసాదంవల్ల సిద్ధిని పొందుతావు.

**అహం స్వర్గం గమిష్యామి హ్యుపసంహృత్య వై కులమ్ ।**
**ద్వారకాం చ మయా త్యక్తాం సముద్రః ప్లావయిష్యతి ॥ 34 ॥**

నేను ఈ కులాన్ని ఉపసంహరించి స్వర్గానికి వెళ్ళిపోతాను. నేను విడిచిన ద్వారకానగరాన్ని సముద్రుడు ముంచివేస్తాడు.

**(మద్వేశ్మ చైకం ముక్త్వా తు భయాన్మత్తో జలాశయే ।**
**తత్ర సన్నిహితశ్చాహం భక్తానాం హితకామ్యయా ॥)**

నా వల్ల భయంతో నా నివాససౌధాన్ని ఒక దానిని మాత్రం ముంచకుండా విడిచి పెడతాడు. ఆ జలాశయంలో భక్తుల హితం కోరి నేను అక్కడ నిత్యం నివసించి ఉంటాను" అని చెప్పాడు.

**ఇత్యుక్తః ప్రణిపత్యైనం జగామాథ తథోద్ధవః ।**
**నరనారాయణస్థానం కేశవేనానుమోదితః ॥ 35 ॥**

అని చెప్పగా ఉద్ధవుడు ఆయనకు నమస్కరించి, ఆ కేశవునిచే అనుమోదింపబడినవాడై (సెలవడిగి) నరనారాయణ స్థానమైన బదరీవనానికి వెళ్లిపోయాడు.

**తతస్తే యాదవాః సర్వే రథానారుహ్య శీఘ్రగాన్ ।**
**ప్రభాసం ప్రయయుః సార్ధం కృష్ణరామాదిభిర్ద్విజ! ॥ 36 ॥**

ద్విజవర్యా! అనంతరం ఆ యాదవులందరు శీఘ్రంగా పయనించే రథాలను ఎక్కి బలరామకృష్ణాదులతో కలిసి ప్రభాసపుణ్యతీర్థానికి వెళ్లిపోయారు.

**ప్రాప్య ప్రభాసం ప్రయతాః స్నాతాస్తే కుకురాన్ధకాః ।**
**చక్రుస్తత్ర సురాపానం వాసుదేవానుమోదితాః ॥ 37 ॥**

అలా వారందరు ప్రభాసతీర్థం చేరుకొన్నారు. ఆ కుకురాంధకులు అందు నియతభావంతో స్నానాలు ఆచరించారు. అనంతరం వాసుదేవుని అనుమతిగైకొని సురాపానం చేశారు.

**పిబతాం తత్ర చై తేషాం సంఘర్షేణ పరస్పరమ్ ।**
**అతివాదేన్ధనో జజ్ఞే కలహాగ్నిః క్షయావహః ॥ 38 ॥**

వారు అలా సురను గ్రోలుచుండగా ఒకరినొకరు అతివాదం చేసుకోవడంవల్ల సంఘర్షణ పుట్టింది. అది ఎక్కువగా మాట్లాడడమనే కట్టెలలో కనకనమండే కలహాగ్నియై సర్వనాశన కారకమయింది.

**జఘ్నుః పరస్పరం తే తు శస్త్రైర్దైవబలాత్కృతాః ।**
**క్షీణశస్త్రాశ్చ జగృహుః ప్రత్యాసన్నమథైరకామ్ ॥ 39 ॥**

**(మృష్టం మదీయమన్నం తే న మృష్టమితి జల్పతామ్ ।**
**మృష్టామృష్టకథా జజ్ఞే సంఘర్షకలహీ తతః ।**
**తతశ్చాన్యోన్యమభ్యేత్య క్రోధసంరక్తలోచనాః ॥)**

"నా అన్నం రుచిగా ఉంది. నీ అన్నం రుచిగా లేదు" అని యాదవులలో మృష్టామృష్ట నిమిత్తకమైన సంఘర్షణ, కలహం ప్రారంభమయ్యాయి. అంత కోపంతో కన్నులు ఎరుపెక్కగా ఒకరినొకరు కుమ్ముకొన్నారు. ఒకరినొకరు ఆయుధాలతో కొట్టుకొన్నారు. వారి కలహానికి దైవమే కారణమయ్యింది. శస్త్రాలన్నీ నశించిపోయాయి. అంతవారు దాపున నున్న ఏరక (కణుపులులేని తుంగగడ్డిని) పట్టుకొన్నారు.

**ఏరకా తు గృహీతా తైర్వజ్రభూతేవ లక్ష్యతే ।**
**తయా పరస్పరం జఘ్నుః సమ్ప్రహారే సుదారుణే ॥ 40 ॥**

వారు పట్టుకొన్న గడ్డి వజ్రాయుధంలాగా అయిపోయింది. దానిచే మహాదారుణమైన పోరులో వారు ఒకరినొకరు చంపుకొన్నారు.

**ప్రద్యుమ్నసామ్బప్రముఖాః కృతవర్మాథ సాత్యకిః ।**
**అనిరుద్ధాదయశ్చాన్యే పృథుర్విపృథురేవ చ ॥ 41 ॥**

**చారువర్మా చారుకశ్చ తథాఽక్రూరాదయో ద్విజ ।**
**ఏరకారూపిభిర్వజ్రైస్తే నిజఘ్నుః పరస్పరమ్ ॥ 42 ॥**

ద్విజోత్తమా! ప్రద్యుమ్నుడు, సాంబుడు మొదలైనవారు, కృతవర్మ, సాత్యకి, అనిరుద్ధుడు మున్నగువారు, పృథువు, విపృథువు, చారువర్మ, చారుకుడు, అక్రూరుడు మొదలైనవారు ఒకరినొకరు ఏరకా రూపవజ్రప్రహారాలతో కొట్టుకొన్నారు.

**నివారయామాస హరిర్యాదవాంస్తే చ కేశవమ్ ।**
**సహాయం మేనిరే ప్రాప్తం తే నిజఘ్నుః పరస్పరమ్ ॥ 43 ॥**

హరి వారిని వారించాడు కాని, ఆ యాదవులు కేశవుని శత్రువులకు సహాయంగా వచ్చినవానిగా భావించి, పరస్పరం కొట్టుకొన్నారు.

**కృష్ణో౽పి కుపితస్తేషామేరకా ముష్టిమాదదే ।**
**వధాయ సో౽పి ముసలం ముష్టిర్లోహో౽భవత్తదా ॥ 44 ॥**

అంత కృష్ణుడు కోపించి వారిని వధించుటకై తుంగను గుప్పిటలో పట్టుకొన్నాడు. అది వెంటనే లోహమయమైన ముసలమైపోయింది.

**జఘాన తేన నిఃశేషాన్ యాదవానాతతాయినః ।**
**జఘ్నుశ్చ సహసా౽భ్యేత్య తథా౽న్యే చ పరస్పరమ్ ॥ 45 ॥**

కృష్ణుడంత హతశేషులైన ఆతతాయులగు యాదవులను దానిచే కొట్టాడు. అలాగే మిగిలినవారు కూడ ఒకరినొకరు వేగంగా పట్టుకొని చంపుకొన్నారు.

**తతశ్చార్ణవమధ్యేన జైత్రో౽సౌ చక్రిణో రథః ।**
**పశ్యతో దారుకస్యాశు హృతో౽శ్వైర్ద్విజసత్తమ! ॥ 46 ॥**

ద్విజశ్రేష్ఠా! అనంతరం దారుకుడు (రథసారథి) చూస్తూ ఉండగనే సముద్రమధ్యంలో చక్రాయుధుని జైత్రమనే దివ్యరథం మిక్కిలి వేగంతో గుర్రాలతో పాటు పడిపోయింది.

**చక్రం తథా గదా శార్‌ఙ్గం తూణీ శంఖో౽సిరేవ చ ।**
**ప్రదక్షిణం హరిం కృత్వా జగ్మురాదిత్యవర్త్మనా ॥ 47 ॥**

తరువాత చక్రం, గద, శార్‌ఙ్గం, తూణీరాలు, శంఖం, కత్తి హరికి ప్రదక్షిణం కావించి ఆదిత్యమండల మార్గాన వెళ్లిపోయాయి.

**క్షణేన నాభవత్ కశ్చిద్ యాదవానామఘాతితః ।**
**ఋతే కృష్ణం మహాత్మానం దారుకం చ మహామునే! ॥ 48 ॥**

మహామునీ! ఒక్క క్షణకాలంలో మహాత్ముడైన కృష్ణుని, దారుకుని మినహాయిస్తే యాదవులలో బ్రతికి బట్టగట్టినవాడు ఒక్కడూ లేకుండా అయిపోయాడు.

**చంక్రమ్యమాణౌ తౌ రామం వృక్షమూల కృతాసనమ్ ।**
**దదృశాతే ముఖాచ్చాస్య నిష్క్రామన్తం మహోరగమ్ ॥ 49 ॥**

వారిద్దరూ అడుగులో అడుగు వేసుకొంటూ నడుస్తూ, ఒక చెట్టు మొదట్లో ఆసీనుడైయున్న బలరాముని చూశారు. అప్పుడు ఆయన ముఖం నుంచి ఒక మహాసర్పం వెలువడుతున్నట్లుగా వారు సందర్శించారు.

**నిష్క్రమ్య స ముఖాత్తస్య మహాభోగో భుజంగమః ।**
**ప్రయయావర్ణవం సిద్ధైః స్తూయమానస్తథోరగైః ॥ 50 ॥**

పెద్ద పెద్ద పడగలు గల ఒకపాము అతని ముఖంనుంచి వెలువడి సిద్ధులు, నాగులు స్తుతిస్తూ ఉండగా సముద్రంలోనికి చొచ్చి వెళ్లిపోయింది.

**తతో౽ర్ఘ్యమాదాయ తదా జలధిః సమ్ముఖం యయౌ ।**
**ప్రవివేశ చ తత్తోయం పూజితః పన్నగోత్తమైః ॥ 51 ॥**

అనంతరం సముద్రుడు అర్ఘ్యం స్వీకరించి బలరామునికి ఎదురుగా వచ్చి స్వాగతం పలికాడు. అపుడు ఆ బలభద్రుడు పన్నగశ్రేష్ఠులచే పూజింపబడుతూ సాగరజలాలలోనికి ప్రవేశించాడు.

**దృష్ట్వా బలస్య నిర్యాణం దారుకం ప్రాహ కేశవః ।**
**ఇదం సర్వం త్వమాచక్ష్వ వసుదేవోగ్రసేనయోః ॥ 52 ॥**

బలభద్రుని నిర్యాణం చూచి కేశవుడు దారుకునితో ఇలా అన్నాడు. "దారుకా! నీవు ఈ సమస్త వృత్తాంతం వసుదేవునకు, ఉగ్రసేనునకు తెలియజేయి.

**నిర్యాణం బలభద్రస్య యాదవానాం తథా క్షయమ్ ।**
**యోగే స్థిత్వా౽హమప్యేతం పరిత్యక్ష్యే కలేబరమ్ ॥ 53 ॥**

బలభద్రుని నిర్యాణాన్ని, యాదవ గణవినాశాన్ని వారికి వివరించు. నేను కూడా యోగసమాధిలో నిలిచి ఈ పాంచభౌతికశరీరాన్ని విడిచి వేస్తాను.

**వాచ్యశ్చ ద్వారకావాసీ జనః సర్వస్తథాహుకః ।**
**యథేమాం నగరీం సర్వాం సముద్రః ప్లావయిష్యతి ॥ 54 ॥**

సమస్త ద్వారకానగర వాసులకు, అలాగే ఆహుకునకు (ఉగ్రసేనమహారాజుకు) ఈ ద్వారకాపురిని ఇంక సముద్రం ముంచి వేస్తుందని తెలియజెప్పు.

**తస్మాద్ భవద్భిః సర్వైస్తు ప్రతీక్ష్యో హ్యర్జునాగమః ।**
**న స్థేయం ద్వారకామధ్యే నిష్క్రాన్తే తత్ర పాణ్డవే ॥ 55 ॥**

కాబట్టి మీరు అందరూ అర్జునుని రాకకై ఎదురు చూడండి. అతడు అక్కడకు వచ్చి వెళ్ళిపోయిన తరువాత మీరు ఎవరూ ద్వారకానగరమధ్యంలో ఉండరాదు.

**తేనైవ సహ గన్తవ్యం యత్ర యాతి స కౌరవః ।**
**గత్వా చ బ్రూహి కౌన్తేయమర్జునం వచనాన్మమ ॥ 56 ॥**

ఆ కురువంశీయుడు ఎక్కడికి వెడతాడో, మీరందరూ అతనితో కలసి వెళ్ళిపోండని చెప్పు. నీవు వెళ్ళి కుంతీపుత్రుడైన అర్జునునకు నామాటగా ఇలా వివరించు–

**పాలనీయస్త్వయా శక్త్యా జనో౽యం మత్పరిగ్రహః ।**
**ఇత్యర్జునేన సహితో ద్వారవత్యాం భవాన్ జనమ్ ।**
**గృహీత్వా యాతు వజ్రశ్చ యదురాజ్యే౽భిషిచ్యతామ్ ॥ 57 ॥**

"అర్జునా! నీవు యథాశక్తిగా నా అంతఃపుర జనాన్ని రక్షించు" అని చెప్పి అర్జునునితో కలసి ద్వారవతి

నుంచి జనాన్ని తరలించి నీవు కూడ వెళ్లవలసింది. వజ్రుడు యాదవసామ్రాజ్యానికి అభిషిక్తుడగుగాక!" అని కృష్ణుడు ఆదేశించాడు.

**ఇత్యుక్తో దారుకః కృష్ణం ప్రణిపత్య పునః పునః ।**
**ప్రదక్షిణం చ బహుశః కృత్వా ప్రాయాద్యథోదితమ్ ॥ 58 ॥**

అది విని దారుకుడు కృష్ణునకు పదే పదే నమస్కరించి, పలుసార్లు ప్రదక్షిణం కావించి ఆయన ఆదేశాను సారంగా బయలుదేరాడు.

**స గత్వా చ తథా చక్రే ద్వారకాయాం తథాఽర్జునమ్ ।**
**ఆనినాయ మహాబుద్ధిర్వజ్రం చక్రే తథా నృపమ్ ॥ 59 ॥**

ఆ మహామతి ద్వారకకు వెళ్లి సమస్తవృత్తాంతం వారికి తెలియజేశాడు. అలాగే అర్జునుని అక్కడకు రప్పించాడు. అనంతరం వజ్రుని రాజు కావించాడు.

**భగవానపి గోవిన్దో వాసుదేవాత్మకం పరమ్ ।**
**బ్రహ్మాత్మని సమారోప్య సర్వభూతేష్వధారయత్ ॥ 60 ॥**

భగవంతుడైన గోవిందుడు కూడ వాసుదేవాత్మక పరబ్రహ్మమును తన యందు ఆరోపించుకొని సర్వభూతాలయందు దానిని ధారణ చేశాడు.

**సమ్మానయన్ ద్విజవచో దుర్వాసా యదువాచ హ ।**
**యోగయుక్తోఽభవత్ పాదం కృత్వా జానుని సత్తమ! ॥**
**(నిష్ప్రపంచే మహాభాగ! సంయోజ్యాత్మానమాత్మని ।**
**తుర్యావస్థం సలీలం చ శేతే స్మ పురుషోత్తమః) ॥ 61 ॥**

(మహాభాగా! నిష్ప్రపంచమగు ఆత్మయందు ఆత్మను సంయోజించి, ఆ పురుషోత్తముడు తుర్యావస్థలో లీలగా శయనించాడు.) సజ్జనోత్తమా! దుర్వాసుడు అనే ముని మునుపు ఏమి పలికాడో, ఆ మాటయందు గౌరవం ఉంచి తన పాదాన్ని మోకాలిపై నిలిపి యోగసమాధిగతుడయ్యాడు.

**ఆయయౌ చ జరా నామ స తదా తత్ర లుబ్ధకః ।**
**ముసలావశేషలోహసాయకన్యస్తతోమరః ॥ 62 ॥**

ఆ సమయంలో జరసుడు అను పేరు గల బోయవాడొకడు ముసలం యొక్క అవశేషమైన లోహాన్ని బాణంగా చేసియుంచిన తోమరంతో అక్కడకు వచ్చాడు.

**స తం పాదం మృగాకారమవేక్ష్యారాదవస్థితః ।**
**తలే వివ్యాధ తేనైవ తోమరేణ ద్విజోత్తమ! ॥ 63 ॥**

ద్విజశ్రేష్ఠా! ఆ బోయవాడు ఆ పాదాన్ని చాలా దూరంలో ఉన్నవాడై చూచి మృగాకారంగా భావించి అదే తోమరంతో కృష్ణుని పాదతలంపై గురి చేసి కొట్టాడు.

**గతశ్చ దదృశే తత్ర చతుర్బాహుధరం నరమ్ ।**
**ప్రణిపత్యాహ చైవైనం ప్రసీదేతి పునః పునః ॥ 64 ॥**

అనంతరం వాడక్కడకు వచ్చి చతుర్బాహుధరుడైన హరిని (మనుష్యుని) చూచి నమస్కరించి పదేపదే తనను క్షమించమని ప్రాధేయపడ్డాడు.

**అజానతా కృతమిదం యదా హరిణశంకయా ।**
**క్షమ్యతామాత్మపాపేన దగ్ధం మాం త్రాతు మర్హసి ॥ 65 ॥**

ఇది ఒక లేడి యనుకొని తెలియకుండా కొట్టానని, ఆ మహాపాపంచే దగ్ధుడనైపోతున్న నన్ను క్షమించి రక్షించవలసిందని బ్రతిమలాడాడు.

**తతస్తం భగవానాహ న తేఽస్తి భయమణ్వపి ।**
**గచ్ఛ త్వం మత్ప్రసాదేన లుబ్ధ! స్వర్గం సురాలయమ్ ॥ 66 ॥**

అంతట భగవంతుడు అతనితో "లుబ్ధకా! నీకు అణుమాత్రం కూడా భయం వద్దు. నా అనుగ్రహం వల్ల నీవు దేవావాసమైన స్వర్గానికి చేరుతావు" అని చెప్పాడు.

**విమానమాగతం సద్యస్తద్వాక్యసమనన్తరమ్ ।**
**ఆరుహ్య ప్రయయౌ స్వర్గం లుబ్ధకస్తత్ప్రసాదతః ॥ 67 ॥**

కృష్ణుడు ఆ మాట పలికినదే తడవుగా విమానం అక్కడకు అరుదెంచింది. కృష్ణుని అనుగ్రహం వల్ల లుబ్ధకుడు దానిని ఎక్కి స్వర్గానికి చేరుకొన్నాడు.

**గతే తస్మిన్ స భగవాన్ సంయోజ్యాత్మానమాత్మని ।**
**బ్రహ్మభూతేఽవ్యయేఽచిన్త్యే వాసుదేవమయేఽమలే ॥ 68 ॥**

**అజన్మన్యజరేఽనాశిన్యప్రమేయేఽఖిలాత్మని ।**
**తత్యాజ మానుషం దేహమతీత్య త్రివిధాం గతిమ్ ॥ 69 ॥**

బోయవాడట్లు స్వర్గానికి వెళ్ళిపోగా శ్రీకృష్ణభగవానుడు తనను ఆత్మ, బ్రహ్మస్వరూపం, అవ్యయం, అచిన్త్యం, వాసుదేవమయం, అమలం, జన్మరహితం, అజరం, అవినాశం, అప్రమేయం, అఖిలాత్మ స్వరూపం అయిన పరమాత్మయందు లీనంచేసి త్రిగుణాత్మకమైన దశలను వదలి తన మానుషదేహాన్ని విడిచివేశాడు – అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే యాదవవంశవినాశః – భగవతః స్వధామగమనం చేతి సప్తత్రింశోఽధ్యాయః సమాప్తః ॥ 37 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో యాదవవంశవినాశం – భగవంతుని స్వధామగమనం అనే ముప్పై ఏడవ అధ్యాయం సమాప్తం ॥ 37 ॥

## అష్టత్రింశోఽధ్యాయః - ముప్పై ఎనిమిదవ అధ్యాయం

## పరీక్షిత్పట్టాభిషేకః - పాండవవనగమనమ్ - పరీక్షిత్తు పట్టాభిషేకం - పాండవ వనగమనం

**శ్రీపరాశర ఉవాచ :-**పరాశరుడు చెబుతున్నాడు

**అర్జునోఽపి తదాఽన్విష్య కృష్ణరామ కలేబరే ।**
**సంస్కారం లమ్భయామాస తథాన్యేషామనుక్రమాత్ ॥ 1 ॥**

మైత్రేయా! అర్జునుడు కూడా బలరామకృష్ణుల శరీరాలను వెదకి అగ్ని సంస్కారం కావించాడు. అదేవిధంగా మిగిలినవారికి కూడా ఔర్ధ్వదేహికక్రియలు ఒనరించాడు.

**అష్టౌ మహిష్యః కథితా రుక్మిణీప్రముఖాస్తు యాః ।**
**ఉపగుహ్య హరేర్దేహం వివిశుస్తా హుతాశనమ్ ॥ 2 ॥**

రుక్మిణి మొదలుగాగల ఎనమండుగురు పట్టపురాణులు కృష్ణుని శరీరాన్ని కౌగిలించుకొని అగ్ని ప్రవేశం చేశారు.

**రేవతీ చైవ రామస్య దేహమాశ్లిష్య సత్తమ! ।**
**వివేశ జ్వలితం వహ్నిం తత్సంగాహ్లాదశీతలమ్ ॥ 3 ॥**

సజ్జనోత్తమా! రేవతి కూడా బలరాముని దేహాన్ని ఆలింగనం కావించుకొని భగభగమండే అగ్నిలో ప్రవేశించింది. ఆమె తాకినంత మాత్రంచేతనే అగ్ని ఆనందభరితుడై చల్లబడిపోయాడు.

**ఉగ్రసేనస్తు తచ్ఛ్రుత్వా తథైవానక దున్దుభిః ।**
**దేవకీ రోహిణీ చైవ వివిశుర్జాత వేదసమ్ ॥ 4 ॥**

అది విని ఉగ్రసేనుడు, ఆనకదుందుభి (వసుదేవుడు) దేవకి, రోహిణి కూడా అగ్నిలో వెంటనే ప్రవేశించారు.

**తతోఽర్జునః ప్రేతకార్యం కృత్వా తేషాం యథావిధి ।**
**నిశ్చక్రామ జనం సర్వం గృహీత్వా వజ్రమేవ చ ॥ 5 ॥**

అపుడు అర్జునుడు వారికి కూడా ప్రేతకృత్యాలు యథావిధిగా నిర్వహించి తక్కిన జనాన్ని గైకొని, వజ్రుని కూడా వెంటనిడుకొని అక్కడనుండి బయలుదేరాడు.

**ద్వారవత్యా వినిష్క్రాన్తాః కృష్ణపత్న్యః సహస్రశః ।**
**వజ్రం జనం చ కౌన్తేయః పాలయంఛ్చనకైర్యయౌ ॥ 6 ॥**

ద్వారకాపురి నుండి బయల్వెడలిన వేలకొలది శ్రీకృష్ణుని భార్యలను, వజ్రుని, పురజనాన్ని కుంతీపుత్రుడు కాపాడుకొంటూ నెమ్మదిగా పయనం సాగించాడు.

**సభా సుధర్మా కృష్ణేన మర్త్యలోకే సముజ్ఝితే ।**
**స్వర్గం జగామ మైత్రేయ! పారిజాతశ్చ పాదపః ॥ 7 ॥**

మైత్రేయా! కృష్ణుడు మర్త్యలోకం విడిచిపెట్టి వెళ్ళిపోగానే సుధర్మ అనే ఇంద్రసభ, పారిజాతమనే దేవవృక్షం స్వర్గానికి చేరుకొన్నాయి.

**యస్మిన్దినే హరిర్యాతో దివం సన్త్యజ్య మేదినీమ్ ।**
**తస్మిన్నేవావతీర్ణోఽయం కాలకాయో బలీ కలిః ॥ 8 ॥**

ఏ రోజున హరి భువిని విడిచి దివికి ఏగెనో ఆరోజునే నల్లని మేను కల్గిన బలియైన కలి అవని యందు అవతరించడం జరిగింది.

**ప్లావయామాస తాం శూన్యాం ద్వారకాం చ మహోదధిః ।**
**వాసుదేవగృహం త్వేకం నాప్లావయత సాగరః ॥ 9 ॥**

శూన్యమైపోయిన ద్వారకాపురిని మహాసముద్రం ముంచివేసింది. వాసుదేవుడు నివసించిన గృహాన్ని ఒకదానినిమాత్రం సాగరుడు ముంచలేదు.

**నాతిక్రాన్తుమలం బ్రహ్మం స్తదద్యాపి మహోదధిః ।**
**నిత్యం సన్నిహితస్తత్ర భగవాన్ కేశవో యతః ॥ 10 ॥**

ఓ! బ్రహ్మణ్యుడా! అక్కడ భగవంతుడగు కేశవుడు నిత్యసన్నిహితుడై ఉన్న కారణంచే, ఈనాటికి కూడా సముద్రుడు ఆ భవనాన్ని ఆక్రమించడానికి సమర్థుడు కాలేకున్నాడు.

**తదతీవ మహత్ పుణ్యం సర్వపాతకనాశనమ్ ।**
**విష్ణుక్రీడాన్వితస్థానం దృష్ట్వా పాపాత్ ప్రముచ్యతే ॥ 11 ॥**

ఆ ప్రదేశం మిక్కిలి పుణ్యప్రదం. సమస్త పాపసంహారకం. విష్ణువుకు విహారస్థానం. దర్శనం చేసినంత మాత్రంచేతనే అఖిలపాతకాలు తొలగిపోతాయి.

**పార్థః పంచనదే దేశే ధనధాన్యసమన్వితే ।**
**చకార వాసం సర్వస్య జనస్య మునిసత్తమ! ॥ 12 ॥**

మునిశ్రేష్ఠా! ధనంతోను, ధాన్యంతోను కూడుకొన్న "పంచనదం" అనే ప్రదేశంలో అర్జునుడు ద్వారకావాసులందరికి ఉనికి ఏర్పాటు చేశాడు.

**తతో లోభః సమభవద్దస్యూనాం నిహతేశ్వరాః ।**
**దృష్ట్వా స్త్రియో నీయమానాః పార్థేనైకేన ధన్వినా ॥ 13 ॥**

ధనస్సును ధరించి అర్జునుడు ఒక్కడే భర్తృవిహీనలైన కృష్ణపత్నులను కొనిపోవడం చూచి ఆ ప్రదేశంలో ఉన్న దొంగలకు ఆశ పొడచూపింది.

**తతస్తే పాపకర్మాణో లోభోపహతచేతసః ।**
**ఆభీరా మన్త్రయామాసుః సమేత్యాత్యన్తదుర్మదాః ॥ 14 ॥**

అంత ఆ పాపకర్ములగు దురాశాపూరితచిత్తులైన అధిక దుర్మదులగు ఆభీరులందరూ ఒకచో గుమిగూడి ఆలోచన సాగించారు.

**అయమేకోఽ ర్జునో ధన్వీ స్త్రీజనం నిహతేశ్వరమ్ ।**
**నయత్యస్మానతిక్రమ్య ధిగేతద్భవతాం బలమ్ ॥ 15 ॥**

"ఈ అర్జునుడు ఒక్కడే విల్లు దాల్చి భర్తను పోగొట్టుకొన్న స్త్రీ జనాన్నంతా కొనిపోతూ, మనలను దాటి వెళ్ళిపోతున్నాడు. ఛీ! ఇక మనబలం ఏ పాటిది?

**హత్వా గర్వసమారూఢో భీష్మద్రోణ జయద్రథాన్ ।**
**కర్ణాదీంశ్చ న జానాతి బలం గ్రామనివాసినామ్ ॥ 16 ॥**

భీష్మద్రోణ జయద్రథాదులను, కర్ణాదులను చంపి మిక్కిలి పొగరెక్కి పల్లెటూరివాండ్రమైన మనబలం ఎట్టిదో తెలిసుకోలేకపోతున్నాడు.

**యష్టిహస్తానవేక్ష్యాస్మాన్ ధనుష్పాణిః స దుర్మతిః ।**
**సర్వానేవావజానాతి కిం వో బాహుభి రున్నతైః ॥ 17 ॥**

ఓరీ! ఓరీ! మనచేతులలో ఉన్న కర్రలను చూస్తూ తన చేతిలో ఉన్న విల్లును చూపిస్తూ ఈ దురాత్ముడు మనలందరిని అవమానిస్తున్నాడు. అతనిని నిరోధించలేకపోతే మనకు ఈ పొడవైన చేతులు ఎందుకు? అని వారు అలుక వహించారు.

**తతో యష్టిప్రహరణా దస్యవో లోష్టధారిణః ।**
**సహస్రశోఽ భ్యధావన్త తం జనం నిహతేశ్వరమ్ ॥ 18 ॥**

అని ఆ దొంగలు కూడబలుక్కొని కర్రలు ధరించి కొందరు, రాళ్ళు చేతబట్టి మరికొందరు వేలకొలదిగా ఆవిధవాజనంపై పరుగెత్తారు.

**తతో నివృత్య కౌన్తేయః ప్రాహాభీరాన్ హసన్నివ ।**
**నివర్తధ్వమధర్మజ్ఞా యది న స్థ ముమూర్షవః ॥ 19 ॥**

అంత కౌంతేయుడు ఆ దస్యులను లెక్కచేయకుండా గేలిచేస్తూ "ధర్మం జ్ఞానం తెలియని మీరు బ్రతుకదలచుకొంటే వెంటనే మరలిపొండి" అని హితవు పలికాడు.

**అవజ్ఞాయ వచస్తస్య జగృహుస్తే తథా ధనమ్ ।**
**స్త్రీజనం చైవ మైత్రేయ! విష్వక్సేనపరిగ్రహమ్ ॥ 20 ॥**

మైత్రేయా! వారు అర్జునుని మాటను సరకుగొనక ఆ స్త్రీల ధనాలను విష్వక్సేనునిచే స్వీకరింపబడిన స్త్రీజనాన్ని కాజేశారు.

**తతో౽ర్జునో ధనుర్దివ్యం గాణ్డీవ మజరం యుధి ।**
**ఆరోపితుం సమారేభే న శశాక స వీర్యవాన్ ॥ 21 ॥**

అంత అర్జునుడు యుద్ధంలో వమ్ముగాని దివ్యమైన గాండీవమనే విల్లుగైకొని ఎక్కుపెట్టడానికి ప్రయత్నం చేశాడు. అంతటి బలవంతుడు కూడా అది చేయలేకపోయాడు.

**చకార సజ్యం కృచ్ఛ్రాచ్చ తచ్చాభూచ్ఛిథిలం పునః ।**
**న సస్మార తథా౽స్త్రాణి చిన్తయన్నపి పాణ్డవః ॥ 22 ॥**

అతికష్టంపై దానిని ఎక్కుపెట్టాడు, కాని అది శిథిలమైపోయింది. అటుపిమ్మట అర్జునుడు ఎంత ఆలోచించినా, దివ్యాస్త్రాలు జ్ఞాపకం రాకుండా పోయాయి.

**శరాన్ముమోచ వై తేషు పార్థో వైరిష్వమర్షితః ।**
**త్వగ్భేదం తే పరం చక్రు రస్తా గాణ్డీవధన్వినా ॥ 23 ॥**

అంత పార్థుడు మహాకోపంతో శత్రువులపై శరాలు గుప్పించాడు. అవి గాండీవంనుంచి విడువబడినా, చర్మాన్ని చీల్చగలిగాయిగాని ప్రాణాలు తీయలేకపోయాయి.

**వహ్నినా యే౽క్షయా దత్తాః శరాస్తే౽పి క్షయం యయుః ।**
**యుధ్యతః సహ గోపాలై రర్జునస్య భవక్షయే ॥ 24 ॥**

అర్జునుని పుట్టుక చివరకు వచ్చిన కారణంచే ఆ ఆలకాపరులతో యుద్ధం చేసే సమయంలో అగ్నిహోత్రుడు ఇచ్చిన అక్షయతూణీరాలలోని బాణాలు కూడా నష్టమైపోయాయి.

**అచిన్తయచ్చ కౌన్తేయః కృష్ణస్యైవ హి తద్బలమ్ ।**
**యన్మయా శరసంఘాతైః సకలా భూభుజో జితాః ॥ 25 ॥**

గతంలో తనద్వారా ప్రయోగింపబడ్డ బాణసమూహములచే సమస్తరాజేంద్రులు జయించబడ్డారంటే, అది శ్రీకృష్ణుని శక్తియే కాని తన శక్తికాదని కౌంతేయుడు భావించాడు.

**మిషతః పాణ్డుపుత్రస్య తతస్తాః ప్రమదోత్తమాః ।**
**ఆభీరై రపకృష్యన్తః కామాచ్చాన్యా ప్రవవ్రజుః ॥ 26 ॥**

అర్జునుడు రెప్పవేసినంతలోనే ఆ దస్యులు ఆ ఉత్తమాంగనలను యథేచ్ఛగా లాగుకొనిపోయారు. కొందరయితే ఇటూ అటూ పారిపోయారు.

**తతః శరేషు క్షీణేషు ధనుష్కోట్యా ధనంజయః ।**
**జఘాన దస్యూంస్తే చాస్య ప్రహారాన్ జహసుర్మునే! ॥ 27 ॥**

మునీశ్వరా! సమస్తములైన అమ్ములు వమ్ములైపోగా ధనంజయుడు వింటికొప్పుతో ఆదొంగలను కొట్టసాగాడు. వారు ఆదెబ్బలను గని పరిహసించారు.

**ప్రేక్షతశ్చైవ పార్థస్య వృష్ణ్యన్ధకవరస్త్రియః ।**
**జగ్మురాదాయ తే మ్లేచ్ఛాః సమస్తా మునిసత్తమ! ॥ 28 ॥**

మునిశ్రేష్ఠా! అర్జునుడు చూస్తుండగానే ఆ మ్లేచ్ఛులు పరమోత్సాహంతో వృష్ణ్యంధకస్త్రీజనాన్నంతా తీసుకొని వెళ్ళిపోయారు.

**తతః సుదుఃఖితో జిష్ణుః కష్టం కష్టమితి బ్రువన్ ।**
**అహో భగవతా తేన ముషితోఽస్మి రురోద హ ॥ 29 ॥**

ఎల్లప్పుడు జయశీలి అయిన అర్జునుడు ఎంతకష్టం వచ్చిపడిందని, అయ్యో! ఆ భగవంతునిచే నేను వంచింపబడినానని భోరున విలపించినాడు.

**తద్ధనుస్తాని చాస్త్రాణి స రథస్తే చ వాజినః ।**
**సర్వమేకపదే నష్టం దానమశ్రోత్రియే యథా ॥ 30 ॥**

“అదే విల్లు, అవే అస్త్రాలు, అదే రథం, అవే గుర్రాలు అన్నీ అకస్మాత్తుగా ఆ మహాత్ముడు లేని కారణంగా శ్రోత్రియుడు గానివానికి ఇచ్చిన దానంలాగా అణగారిపోయాయి.

**అహోఽతిబలవద్దైవం వినా తేన మహాత్మనా ।**
**యదసామర్థ్యయుక్తేఽపి నీచవర్గే జయప్రదమ్ ॥ 31 ॥**

ఆహా! దైవం ఎంత బలవంతమైనది? ఆ మహాత్ముడు నేడు లేకుండాపోయాడు. అసమర్థమైన తక్కువ బలం కలిగినవారికి కూడా జయం కలిగిందంటే అది దైవబలమే కదా!

**తౌ బాహూ స చ మే ముష్టిః స్థానం తత్ సోఽస్మి చార్జునః ।**
**పుణ్యేనైవ వినా తేన గతం సర్వమసారతామ్ ॥ 32 ॥**

అవే బాహువులు. అదే పిడికిలి. అదే స్థానం, ఆ అర్జునుడనే నేను. ఆ పుణ్యాత్ముడైన వాసుదేవుడు లేకపోవడంచే సర్వం సారహీనమైపోయింది.

**మమార్జునత్వం భీమస్య భీమత్వం తత్కృతం ధ్రువమ్ ।**
**వినా తేన యదాభీరైర్జితోఽహం కథమన్యథా ॥ 33 ॥**

నాకు అర్జునత్వం, భీమునకు భీమత్వం నిజంగా ఆతనికొరకు చేసినదే. అలా కానినాడు ఆ దస్యులచే ఎలా ఓడింపబడతాను? అని చింతించాడు.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**ఇత్థం వదన్ యయౌ జిష్ణుర్మథురాఖ్యం పురోత్తమమ్ ।**
**చకార తత్ర రాజానం వజ్రం యాదవనన్దనమ్ ॥ 34 ॥**

ఈ ప్రకారంగా ఆలోచిస్తూ అర్జునుడు మధుర అనే పేరు గల ఉత్తమనగరానికి వెళ్ళాడు. అక్కడ యదుకుమారుడైన వజ్రుని రాజుగా ఒనరించాడు.

**స దదర్శ తతో వ్యాసం ఫాల్గుణః కాననాశ్రయమ్ ।**
**తముపేత్య మహాభాగం వినయేనాభ్యవాదయత్ ॥ 35 ॥**

అటుపైన ఫాల్గుణుడు అరణ్యమందున్న వ్యాసమహర్షిని సందర్శించాడు. అతడు ఆ మహాభాగుని సమీపించి వినయంతో మ్రొక్కాడు.

**తం వన్దమానం చరణా వలోక్య మునిశ్చిరమ్ ।**
**ఉవాచ పార్థ విచ్ఛాయః కథమత్యన్తమీదృశః ॥ 36 ॥**

తన పాదాలకు ఎక్కువసేపు నమస్కరిస్తున్న ఆ అర్జునుని చూచి మహర్షి "పార్థా! ఏమిటిది? మిక్కిలి వన్నెదరిగియున్నావు?

**అవీరజోఽనుగమనం బ్రహ్మహత్యాఽథవా కృతా ।**
**దృఢాశాభంగదుఃఖీవ భ్రష్టచ్ఛాయోఽసి సామ్ప్రతమ్ ॥ 37 ॥**

రజస్వలయైన స్త్రీని కాని కూడితివా? లేదా బ్రహ్మహత్యకాని చేసితివా? గొప్పదైన ఆశకలిగి భంగపడి దుఃఖిస్తున్నావా? ఇపుడు నాకు పూర్తిగా కాంతి లేక దీనుడవై కనిపిస్తున్నావేమి?

**సాన్తానికాదయో వా తే యాచమానా నిరాకృతాః ।**
**అగమ్యస్త్రీరతిర్వా త్వం యేనాసి విగతప్రభః ॥ 38 ॥**

ఎవరైనా సంతతిని అపేక్షించి నిన్నుకోరి నీ ద్వారా నిరాకరించబడ్డారా? పొందకూడని స్త్రీని కాని కూడితివా? ఏల ఇలా కాంతి విహీనుడవై పోయావు?

**భుంక్తేఽప్రదాయ విప్రేభ్యః ఏకో మిష్టమథో భవాన్ ।**
**కిం వా కృపణవిత్తాని హృతాని భవతాఽర్జున! ॥ 39 ॥**

అర్జునా! విప్రులకు పెట్టకుండా మృష్టాన్నాన్ని ఒక్కడవే కొని భుజించావా ఏమి? లేక దీనజనుల ధనాన్ని అపహరించావా?

**కచ్చిత్త్వం శూర్పవాతస్య గోచరత్వం గతోఽర్జున! ।**
**దుష్టచక్షుర్హతో వాఽసి నిః శ్రీకః కథమన్యథా ॥ 40 ॥**

ధనంజయా! ధాన్యం మున్నగువాటిని ఎగరబోసే చేట గాలికి ఎదురుగా కాని వెళ్ళావా? నీకు దిష్టిదోషం కాని తగిలిందా? లేక ఎవరిచేతనైనా దెబ్బతిన్నావా? నీవు ఈవిధంగా శోభ కోల్పోయి ఉన్నావేమి?

**స్పృష్టో నఖామ్బుసాచాథ ఘటామ్బుః ప్రోక్షితోஉపి వా ।**
**కేనాతీవాసి విచ్ఛాయో న్యూనై ర్వా యుధి నిర్జితః ॥ 41 ॥**

గోళ్ళ(నఖాలనుండి) జారు ఉదకాన్ని కాని స్పృశించావా? కుండలోని నీళ్ళతో కాని స్నానం చేసావా? నీకన్న తక్కువ వారితో యుద్ధంలో ఓడిపోయావా? నీవు ఇంతగా వన్నె కోల్పోయావేమి?

**విశే**-నఖజలం స్పృశించడమనగా దానం పట్టుట. నదీతటాకాదులస్నానం వదలి కుండలోని నిల్వనీటితో స్నానంచేయుట. ఇవి అపవిత్రాలు రాజులకు.

**తతః పార్థో వినిఃశ్వస్య శ్రూయతాం భగవన్నితి ।**
**ప్రోక్త్వా యథావదాచష్ట వ్యాసాయాత్మ పరాభవమ్ ॥ 42 ॥**

అంత పార్థుడు నిట్టూర్పు విడిచి "భగవత్స్వరూపా! వినండి" అని పలికి తన పరాభవ వృత్తాంతమంతా పూసగ్రుచ్చినట్లు వ్యాఖానము వివరించాడు.

**యద్బలం యచ్చ నస్తేజో యద్వీర్యం యత్పరాక్రమః ।**
**యా శ్రీ చ్ఛాయా చ నః సోஉస్మాన్ పరిత్యజ్య గతో హరిః ॥ 43 ॥**

"మా బలం, తేజస్సు, వీర్యం, పరాక్రమం, శ్రీ, కాంతి, ఏ శ్రీహరియో ఆమహానుభావుడు మమ్మల్ని విడిచి వెళ్ళిపోయాడు.

**ఈశ్వరేణేవ మహతా స్మితపూర్వాభిభాషిణః ।**
**హీనా వయం మునే! తేన జాతాస్తృణమయా ఇవ ॥ 44 ॥**

మునీశ్వరా! ఆ మహానుభావుడైన ఈశ్వరుడు ముందుగా చిరునవ్వుతో మమ్ము పలకరించేవాడు. నేడు అతడు లేనివారమై మేము గడ్డిపరకతో సమానమైపోయాము.

**అస్త్రాణాం సాయకానాం చ గాణ్డీవస్య తథా మమ ।**
**సారతా యా భవన్ మూలం స గతః పురుషోత్తమః ॥ 45 ॥**

నా అస్త్రాలు, బాణాలు అలాగే గాండీవం సారవంతాలు కావడానికి ఎవడు మూలకారణమో, ఆ పురుషోత్తముడు మమ్మల్ని విడనాడి వెళ్ళిపోయాడు.

**యస్యావలోకనాదస్మాన్ శ్రీర్జయః సమ్పదున్నతిః ।**
**న తత్యాజ స గోవిన్ద స్త్యక్త్వాஉస్మాన్ భగవాన్ గతః ॥ 46 ॥**

ఎవని కృపావీక్షణంచే మమ్మల్ని శ్రీ, జయం, సంపద, ఔన్నత్యం విడవకుండా ఉండేవో, ఆ భగవంతుడైన గోవిందుడు మమ్మల్ని విడిచి వెళ్ళిపోయాడు.

**భీష్మద్రోణాంగరాజాద్యాస్తథా దుర్యోధనాదయః ।**
**యత్ప్రభావేన నిర్దగ్ధాః స కృష్ణ స్త్యక్తవాన్ భువమ్ ॥ 47 ॥**

భీష్ముడు, ద్రోణుడు, అంగరాజైన కర్ణుడు మున్నగువారు, అలాగే దుర్యోధనుడు మొదలైనవారు ఎవని ప్రభావం వలన దగ్ధులైపోయారో, అట్టి కృష్ణుడు భువిని విడిచిపెట్టినవాడైనాడు.

**నిర్యౌవనా హృతశ్రీకా భ్రష్టచ్ఛాయేవ మేదినీ ।**
**విభాతి తాత! నైకోఽహం విరహే తస్య చక్రిణః ॥ 48 ॥**

అయ్యా! ఆ చక్రి ఎడబాటు వలన నేడు మేదినికూడా ప్రాయం గతించినదయ్యింది. శ్రీ తరిగిపోయింది. కాంతి చెడి వెలవెలబోతోంది. నేనొక్కడనే కాదు కాంతిహీనుడను కావడం.

**యస్యానుభావాత్ భీష్మాద్యైర్మయ్యగ్నౌ శలభాయితమ్ ।**
**వినా తేనాద్య కృష్ణేన గోపాలైరస్మి నిర్జితః ॥ 49 ॥**

ఎవని ప్రభావంవల్ల అగ్నిసమానుడైన నాయందు భీష్మాదులు, మిడుతలులాగా అయిపోయి మాడిపోయారో, అటువంటి కృష్ణుడు నేడు తోడులేక గొల్లలకోడిపోయాను.

**గాణ్డీవం త్రిషు లోకేషు ఖ్యాతిం యదనుభావతః ।**
**గతం తేన వినాఽభీరలగుడై స్తన్నిరాకృతమ్ ॥ 50 ॥**

ఎవని గొప్ప మహిమవల్ల ఏ నా గాండీవం ముల్లోకాలలోను మిక్కిలి ఖ్యాతి పొందిందో అతడు లేకపోవడం వలన అది నేడు ఆభీరుల కర్రచే చచ్చుబడిపోయింది.

**స్త్రీ సహస్రాణ్యనేకాని మన్నాథానిమహామునే ।**
**యతతో మమ నీతాని దస్యుభి ర్లగుడాయుధైః ॥ 51 ॥**

మహామునీ! భగవానుని వేలకొలది అంతఃపురకాంతలకు నేనే దిక్కైఉండగా నా ఎదురుగుండానే ఆ దస్యులు కర్రబడితెలు చేతబట్టి లొంగదీసుకొనిపోయారు.

**ఆనీయమానమాభీరైః కృష్ణ కృష్ణావరోధనమ్ ।**
**హృతం యష్టి ప్రహరణైః పరిభూయ బలం మమ ॥ 52 ॥**

కృష్ణద్వైపాయన మహర్షీ! కృష్ణుని అంతఃపురజనాన్ని నేను తీసుకొనివస్తూండగా ఆభీరులు వట్టి కర్రలచే నా బలాన్ని వమ్ముచేసి అపహరించుకుపోయారు.

**నిఃశ్రీకతా న మే చిత్రం యజ్జీవామి తదద్భుతమ్ ।**
**నీచావమానపంకాంకీ నిర్లజ్జోఽస్మి పితామహ! ॥ 53 ॥**

పితామహా! నేను శోభావిహీనుడనౌట వింతకాదు. ఇంకనూ నేను బ్రతికిఉండడమనేదే విచిత్రం. నీచులవల్ల అవమానం పొంది ఆ బురదను ఒడలిపై పూసుకొని సిగ్గులేక దుఃఖిస్తున్నాను, అని అర్జునుడు వాపోయాడు.

**వ్యాస ఉవాచ :-** వ్యాసుడు పలికాడు.

**అలం తే వ్రీడయా పార్థ! న త్వం శోచితుమర్హసి ।**
**అవేహి సర్వభూతేషు కాలస్య గతిరీదృశీ ॥ 54 ॥**

అపుడు వ్యాసభగవానుడు "పార్థా! సిగ్గుపడకు. నీవు శోకింపవద్దు. సమస్తభూతాల యందు కాలగమనం ఈవిధంగానే ఉంటుందని తెలుసుకో.

**కాలో భవాయ భూతానా మభావాయ చ పాణ్డవ! ।**
**కాలమూలమిదం జ్ఞాత్వా భవ స్థైర్యధనోఽర్జున! ॥ 55 ॥**

పాండవా! సర్వప్రాణులు పుట్టుటకు గిట్టుటకు కాలమే కారణం. అర్జునా! ఈ ప్రపంచమంతా కాలమూలమని తెలుసుకొన్నవాడవై, స్థైర్యం అనే ధనంతో కూడుకొన్నవాడవు కావలసింది.

**నద్యః సముద్రా గిరయః సకలా చ వసున్ధరా ।**
**దేవా మనుష్యాః పశవ స్తరవః ససరీసృపాః ॥ 56 ॥**

**సృష్టాః కాలేన కాలేన పునర్యాస్యన్తి సంక్షయమ్ ।**
**కాలాత్మకమిదం సర్వం జ్ఞాత్వా శమమవాప్ను హి ॥**
**కాలస్వరూపీ భగవాన్ కృష్ణః కమలలోచనః । 57 ॥**

నదులు, సముద్రాలు, పర్వతాలు, సమస్తమైన పృథివి, దేవతలు, మనుష్యులు, పశువులు, వృక్షాలు, సరీసృపాలు అన్నీ కాలంవల్లనే సృజించబడతాయి. తిరిగి మళ్ళీ కాలంవల్లనే నశించి పోతాయి. కాబట్టి సర్వం కాల స్వరూపం అని తెలుసుకొని శాంతం వహించు. కమలలోచనుడైన శ్రీకృష్ణుడు భగవంతుడు కాలస్వరూపుడు

**యచ్చాహ కృష్ణమాహాత్మ్యం తత్తదేవ ధనంజయ! ।**
**భారావతార కార్యార్థమవతీర్ణః స మేదినీమ్ ॥ 58 ॥**

ధనంజయా! నీవు కృష్ణుని మాహాత్మ్యాన్ని ఏమి వివరించావో, అదంతే అలా యథార్థమే. భూ భారాన్ని తగ్గించడానికి ఆ దేవదేవుడు భూమిపై అవతరించాడు.

**భారాక్రాన్తా ధరా యాతా దేవానాం సమితిం పురా ।**
**తదర్థమవతీర్ణోఽసౌ కాలరూపీ జనార్దనః ॥ 59 ॥**

మునుపు భారం భరించలేక ధరాదేవి దేవసభకేగి ప్రార్థించింది. కాలస్వరూపుడైన జనార్దనుడు ఆనిమిత్తంగా భూమిపై అవతారం స్వీకరించాడు.

**తచ్చ నిష్పాదితం కార్యమశేషా భూభృతో హతాః ।**
**వృష్ణ్యన్ధకకులం సర్వం తథా పార్థోపసంహృతమ్ ॥ 60 ॥**

పార్థా! తాను చేయవలసిందంతా నిర్వహించాడు. అనేక రాజేంద్రులు చంపబడ్డారు. వృష్ణ్యంధక యాదవవంశం సర్వం ఉపసంహరించబడింది.

**న కించిదన్యత్కర్తవ్యం తస్య భూమితలే ప్రభోః ।**
**అతో గతః స భగవాన్ కృతకృత్యో యథేచ్ఛయా ॥ 61 ॥**

ఆ ప్రభువుకు భూమండలంపై చేయవలసిందంటూ ఏకొంచెమూ లేదు. అందువల్ల ఆ భగవంతుడు కృతకృత్యుడై యథేచ్ఛగా వెళ్ళిపోయాడు.

**సృష్టిం సర్గే కరోత్యేష దేవదేవః స్థితౌ స్థితమ్ ।**
**అన్తేఽన్తాయ సమర్థోఽయం సామ్ప్రతం హి యథా కృతమ్ ॥ 62 ॥**

ఈ దేవదేవుడు సర్గసమయంలో సృష్టిని, స్థితి సమయంలో రక్షణను, లయకాలంలో నాశనాన్ని చేయగల సమర్థుడు. ఇపుడు చేయవలసింది చేసి వెళ్ళిపోయాడు.

**తస్మాత్ పార్థ! న సన్తాప స్త్వయా కార్యః పరాభవాత్ ।**
**భవన్తి భావాఃకాలేషు పురుషాణాం పరాక్రమాః ॥ 63 ॥**

పార్థా! అందువల్ల పరాభవం వల్ల నీవు సంతాపపడవద్దు. అభ్యుదయకాలసమయంలో పురుషుల పరాక్రమాలు రాణిస్తాయి.

**త్వయైకేన హతా భీష్మద్రోణకర్ణాదయో నృపాః ।**
**తేషామర్జున కాలోత్థః కిం న్యూనాభిభవో న సః ॥ 64 ॥**

అర్జునా! నీద్వారా ఒక్కనివల్ల భీష్మద్రోణకర్ణాదులు, అనేక నృపాలురు గతించారు కదా! మరి వారికి అది కాలసంప్రాప్తమైన క్రిందివానివల్లనైన ఒక్కని వల్ల సంభవించిన ఓటమి కాదా!

**విష్ణోస్తథాఽనుభావేన యథా తేషాం పరాభవః ।**
**తతస్తథైవ భవతో దస్యుభ్యోఽన్తే తదుద్భవః ॥ 65 ॥**

విష్ణువు ప్రభావంవల్ల వారికి ఏవిధంగా పరాజయం సంభవించిందో, అదేవిధంగా నీకు కూడా చివరగా ఈ దస్యులవల్ల పరాభవం జరిగింది.

**స దేవోఽన్యశరీరాణి సమావిశ్య జగత్ స్థితమ్ ।**
**కరోతి సర్వభూతానాం నాశం చాన్తే జగత్పతిః ॥ 66 ॥**

ఆ జగత్పతి దేవదేవుడు బహు శరీరాదులలో ప్రవేశించి జగద్రక్షణ చేస్తూ ఉంటాడు. అలాగే సర్వభూతాలను చివరకు నాశనం చేస్తాడు.

**భవోద్భవే చ కౌన్తేయ! సహాయోఽ భూజ్జనార్దనః ।**
**భవాన్తే తద్విపక్షాస్తే కేశవేనావలోకితాః ॥ 67 ॥**

కౌంతేయా! నీవు జన్మించినది మొదలు జనార్దనుడు నీకు సహాయకుడైనాడు. (నీ విపక్షాలవారు పుట్టుక చివర గిట్టే సమయంలో కేశవుని వల్ల విపరీతదృష్టిచే చూడబడి నశించారు.) నీ శత్రువులైన ఆభీరులు కేశవుని ద్వారా కృపాదృష్టిచే చూడబడ్డారు.

**కః శ్రద్దధ్యాత్ సగాంగేయాన్ హన్యాస్త్వం సర్వకౌరవాన్ ।**
**ఆభీరేభ్యశ్చ భవతః కః శ్రద్దధ్యాత్ పరాభవమ్ ॥ 68 ॥**

ఒక్కడవై నీవు భీష్మాదులను, సర్వకౌరవులను చంపావంటే ఎవడు నమ్ముతాడు? అలాగే గొల్లలచే నీకు పరాభవం కలిగిందంటే మాత్రం ఎవడు విశ్వసిస్తాడు?

**పార్థైతత్ సర్వభూతస్య హరేర్లీలా విచేష్టితమ్ ।**
**త్వయా యత్ కౌరవా ధ్వస్తా యదాభీరైర్భవాన్ జితః ॥ 69 ॥**

పార్థా! ఇదంతా సర్వభూతమయుడైన శ్రీహరి లీలావిలాసం మాత్రమే. నీ చే కౌరవులు ఎలా ధ్వంసమయ్యారో, అదే రీతిగా ఆ గొల్లలచే నీవు ఓటమి చెందావు.

**గృహీతా దస్యుభిర్యాశ్చ భవతః శోచితాః స్త్రియః ।**
**తదహ్యహం యథావృత్తం కథయామి తవార్జున! ॥ 70 ॥**

అర్జునా! నీవు ఏ స్త్రీలగురించి శోకించుచున్నావో, ఆ స్త్రీలు దస్యులచే ఏల అపహరించబడ్డారో, ఆపూర్వకథ ఏదైతే ఉందో, ఆ గతించిన కథ కూడా చెబుతున్నాను.

**అష్టావక్రః పురా విప్రో జలవాసరతోఽ భవత్ ।**
**బహూన్ వర్షగణాన్ పార్థ! గృణన్ బ్రహ్మ సనాతనమ్ ॥ 71 ॥**

పార్థా! ప్రాచీనకాలంలో అష్టావక్రుడనే ఒక ఋషీశ్వరుడు సనాతనమైన బ్రహ్మమును జపిస్తూ పెక్కు ఏండ్లు నీటిలో నివాసం ఉన్నాడు.

**జితేష్వసుర సంఘేషు మేరుపృష్ఠే మహోత్సవః ।**
**బభూవ తత్ర గచ్ఛన్త్యో దదృశుస్తం వరస్త్రియః ॥ 72 ॥**

యుద్ధంలో అసురసంఘాలు ఓడిపోగా దేవతలు మేరు పర్వతోపరిభాగంపై విజయోత్సవసభను ఏర్పాటు చేశారు. ఆ మహాసదస్సుకు వెడుతూ సురకాంతులు ఆ మునిని చూడటం జరిగింది.

**రమ్భా తిలోత్తమాద్యాశ్చ శతశోఽథ సహస్రశః ।**
**తుష్టువుస్తం మహాత్మానం ప్రశశంసుశ్చ పాణ్డవ! ॥ 73 ॥**

అర్జునా! రంభ, తిలోత్తమ మున్నగు వేలకొలది అప్సరసలు మహానుభావుని స్తుతించి కొనియాడారు.

**ఆకణ్ఠమగ్నం సలిలే జటాభారధరం మునిమ్ ।**
**వినయావనతాశ్చైనం ప్రణేముః స్తోత్ర తత్పరాః ॥ 74 ॥**

కంఠంవరకు నీటిలో మునిగి, జడలను పెక్కింటిని దాల్చియున్న ఆ మునిని వారు కీర్తించడంలో మునిగి వినయవినతలై ప్రణమిల్లారు.

**యథా యథా ప్రసన్నోఽసౌ తుష్టువుస్తం తథా తథా ।**
**సర్వాస్తాః కౌరవశ్రేష్ఠ! వరిష్ఠం తం ద్విజన్మనామ్ ॥ 75 ॥**

కౌరవశ్రేష్ఠా! ఎంతవరకు ఆయన ప్రసన్నుడౌతాడో, అంతవరకు ఆ అచ్చెరకన్నెలందరూ ఆ ద్విజవరేణ్యుని స్తుతిస్తూ ఉండిపోయారు.

**అష్టావక్ర ఉవాచ :-** అష్టావక్రుడు పలికాడు.

**ప్రసన్నోఽహం మహాభాగా భవతీనాం యదిష్యతే ।**
**మత్తస్తద్వ్రియతాం సర్వం ప్రదాస్యామ్యతి దుర్లభమ్ ॥ 76 ॥**

అంత ఆ ముని " ఓ! సౌభాగ్యవతులారా! సంతుష్టుడనయ్యాను. నా వల్ల మీరు ఏమి కావాలనుకుంటున్నారో అది కోరుకొనవచ్చు. మిక్కిలి దుర్లభమైనా దానినంతా మీకు ప్రసాదిస్తాను అని వరం కోరుకోమన్నాడు.

**రమ్భా తిలోత్తమాద్యాస్తం వైదిక్యోఽప్సరసోఽబ్రువన్ ।**
**ప్రసన్నే త్వయ్యపర్యాప్తం కిమస్మాకమితి ద్విజ! ॥ 77 ॥**

అపుడు రంభ,తిలోత్తమ మున్నగు వేదకాలంనాటినుంచి ఉన్న ప్రసిద్ధాప్సరసలు "ద్విజశ్రేష్ఠా! నీవు ప్రసన్నుడవయ్యావు. మాకింక కావలసిందేముంది?" అన్నారు.

**ఇతరాస్త్వబ్రువన్ విప్ర ప్రసన్నో భగవాన్ యది ।**
**తదిచ్ఛామః పతిం ప్రాప్తుం విప్రేన్ద్ర! పురుషోత్తమమ్ ॥ 78 ॥**

మరికొందరైతే "బ్రాహ్మణోత్తమా! విప్రేంద్రా! నీవు భగవంతుడవు. నీవు మాయందు ప్రసన్నుడవు ఐతే పురుషోత్తముడు మాకు పతి కావాలని కోరుకొంటున్నాము" అని వేడుకొన్నారు.

**ఏవం భవిష్యతీత్యుక్త్వా హ్యుత్తతార జలాన్మునిః ।**
**దదృశుస్తాస్సముత్తీర్ణం విరూపం వక్రమష్టధా ॥ 79 ॥**

ఆ మునీశ్వరుడు "అట్లే అవుతుంది" అని పలికి నీటిలోనుండి వెలుపలికి వచ్చాడు. ఆ వచ్చిన ఎనిమిది వంకరలు గల వికృతరూపం వారి కంటపడింది.

**తం దృష్ట్వా గూహమానానాం యాసాం హాసః స్ఫుటోఽభవత్ ।**
**తాః శశాప మునిః కోప మవాప్య కురునన్దన! ॥ 80 ॥**

ఆ మునిని చూచి చాటున నవ్వుకొనే నవ్వేడి వారి నవ్వు ఆయనకు వినబడింది. కురునందనా! వెంటనే ముని అలుకవహించి వారిని శపించాడు.

**యస్మాద్వికృతరూపం మాం జ్ఞాత్వా హాసావమాననా ।**
**భవతీభిః కృతా తస్మాదేతం శాపం దదామి వః ॥ 81 ॥**

అందునా వికృతరూపుడైన నన్నుచూచి మీరు నవ్వి పరిహసించారు కాన, నన్ను అవమానించారు కాబట్టి నేను మీకు ఈశాపం ఇస్తున్నాను.

**మత్ప్రసాదేన భర్తారం లబ్ధ్వా తం పురుషోత్తమమ్ ।**
**మచ్ఛాపోపహతాః సర్వా దస్యుహస్తం గమిష్యథ ॥ 82 ॥**

"నా అనుగ్రహం వల్ల ఆ పురుషోత్తముని మీరు భర్తగా పొంది కూడా నా శాపం తవిలినవారై మీరందరూ దస్యులచేతికి చిక్కెదరుగాక! అని శపించాడు అష్టావక్రుడు.

**ఇత్యుదీరితమాకర్ణ్య మునిస్తాభిః ప్రసాదితః ।**
**పునః సురేన్ద్రలోకం వై ప్రాహ భూయో గమిష్యథ ॥ 83 ॥**

ఆ నిందావాక్యాలను విన్న ఆ దేవాంగనలు మునిని అనుగ్రహించమని వేడుకోగా, మళ్ళీ మీరందరూ అంతలో స్వర్గం చేరుకొందురుగాక! అని శాపావసానం అనుగ్రహించాడు.

**ఏవం తస్య మునేః శాపాదష్టావక్రస్య కేశవమ్ ।**
**భర్తారం ప్రాప్య తా దస్యుహస్తం యాతా వరాంగనాః ॥ 84 ॥**

ఇలా ఆ మునియైన అష్టావక్రుని శాపం వలన కేశవుని భర్తగా పొందికూడా ఆ ఉత్తమాంగనలు దస్యులచేతికి ఇపుడు చిక్కారు.

**తత్త్వయా నాత్ర కర్తవ్యః శోకోఽల్పోఽపి హి పాణ్డవ! ।**
**తేనైవాఖిలనాథేన సర్వం తదుపసంహృతమ్ ॥ 85 ॥**

అర్జునా! కాబట్టి ఇందు నీవు కించిత్తుకూడా దుఃఖించవలసిన అవసరం లేదు. ఆసర్వలోకాధినాథుడైన శ్రీహరిచేతనే సర్వం ఉపసంహారమయింది.

**భవతాం చోపసంహార మాసన్నం తేన కుర్వతా ।**
**బలం తేజస్తథా వీర్యం మాహాత్మ్యం చోపసంహృతమ్ ॥ 86 ॥**

అందువల్ల ఆ విభుని వల్లనే మాబలం,తేజస్సు, వీర్యం, మాహాత్మ్యం అంతా ఉపసంహరించబడి పోయింది. మా ఉపసంహారం కూడా అతి సన్నిహితమై జరగబోతోంది.

**జాతస్య నియతో మృత్యుః పతనం చ తథోన్నతేః ।**
**విప్రయోగావసానశ్చ సంయోగః సంచయాత్ క్షయః ॥ 87 ॥**

పుట్టినవానికి చావు తప్పదు. ఎత్తునుంచి క్రిందకు పడిపోవడం తప్పదు. కూడుట వీడుట కొరకే. పెరుగుట తరుగుట కొరకే. సంయోగం వియోగం దైవనిర్ణయాలు.

**విజ్ఞాయ న బుధాః శోకం న హర్షముపయాన్తి యే ।**
**తేషామేవేతరే చేష్టాం శిక్షన్తః సన్తి తాదృశాః ॥ 88 ॥**

ఈ విషయాన్ని గ్రహించిన విద్వాంసులు శోకాన్ని పొందరు. సంతోషాన్ని పొంది ఉప్పొంగిపోరు. ఆ జ్ఞానులు ఏమేమి ఆచరిస్తారో, మిగిలివారుకూడా అవే చేస్తూ ఉంటారు.

**తస్మాత్త్వయా నరశ్రేష్ఠ! జ్ఞాత్వైతద్భ్రాతృభిః సహ ।**
**పరిత్యజ్యాఖిలం తన్త్రం గన్తవ్యం తపసే వనమ్ ॥ 89 ॥**

అందువల్లనే ఓ!నరశ్రేష్ఠా! ఇది తెలుసుకొన్నవాడవై అన్నదమ్ములతో కలిసి అఖిలరాజ్య తంత్రాలను విడిచివేసి నీవు తపస్సుకై అడవికి వెళ్ళవలసి ఉంది.

**తద్గచ్ఛ ధర్మరాజాయ నివేద్యైతద్వచో మమ ।**
**పరశ్వో భ్రాతృభిః సార్ధం యథా యాసి తథా కురు ॥ 90 ॥**

నీవు ఇక్కడనుంచి వెంటనేవెళ్ళు. ధర్మరాజుకు నా మాటలు నివేదించు. ఎల్లుండి సోదరులతో పాటు వనాలకు వెళ్ళే ఏర్పాటు ఏదో అది చేయి. అని వ్యాసమహర్షి అర్జునునకు ఆదేశించాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెబుతున్నాడు

**ఇత్యుక్తోఽభ్యేత్య పార్థాభ్యాం యమాభ్యాం చ తథాఽర్జునః ।**
**దృష్టం చైవానుభూతం చ కథితం తేష్వశేషతః ॥ 91 ॥**

మైత్రేయా!వ్యాసునిచే ఇలా ఆదేశింపబడిన అర్జునుడు,ధర్మరాజును,భీముని,నకులసహదేవులను చేరి తాను చూచింది చూచినట్లుగా, అనుభవించింది అనుభవించినట్లుగా పూసగుచ్చినట్లుగా వారికి సర్వం తెలియజేశాడు.

**వ్యాసవాక్యంచ తే సర్వే శ్రుత్వాఽర్జున సమీరితమ్ ।**
**రాజ్యే పరీక్షితం కృత్వా యయుః పాణ్డుసుతా వనమ్ ॥ 92 ॥**

అర్జునుడు వచించిన వ్యాసవాక్యాన్ని వారందరూ వినడం జరిగింది. పరీక్షిత్తును రాజుగా చేసి పాండునందనులు వనాలకు బయలుదేరి వెళ్ళిపోయారు.

**ఇత్యేతత్ తవ మైత్రేయ! విస్తరేణ మయోదితమ్ ।**
**జాతస్య యద్యదోర్వంశే వాసుదేవస్య చేష్టితమ్ ॥ 93 ॥**

మైత్రేయా! యదువంశంలో అవతరించిన వాసుదేవుని లీలా విశేషాలు ఏవయితే ఉన్నాయో అవన్నీ నీకు సవిస్తరంగా తెలియజేశాను.

**యశ్చైతచ్చరితం తస్య కృష్ణస్య శ్రుణుయాత్సదా ।**
**సర్వపాప వినిర్ముక్తో విష్ణులోకం స గచ్ఛతి ॥ 94 ॥**

ఎవడు ఈ కృష్ణచరిత్రను ఎల్లప్పుడూ వింటాడో వాడు సమస్త పాపాలనుండి విడువవడినవాడై విష్ణులోకం చేరుకొంటాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే పంచమాంశే పరీక్షిత్పట్టాభిషేకః – పాండవవనగమనం చేతి అష్టత్రింశోఽధ్యాయః సమాప్తః ॥ 38 ॥**

శ్రీవిష్ణుపురాణంలో పంచమాంశంలో పరీక్షిత్తు పట్టాభిషేకం – పాండవవనగమనం అనే ముప్పై ఎనిమిదవ అధ్యాయం సమాప్తం ॥ 38 ॥



# షష్ఠాంశః - ఆరవ అంశం

## ప్రథమోఽధ్యాయః- మొదటి అధ్యాయం

## కలిధర్మనిరూపణమ్ - కలిధర్మనిరూపణ

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు ఇలా అడుగుతున్నాడు.

**వ్యాఖ్యాతా భవతా సర్గవంశమన్వన్తరస్థితిః ।**
**వంశానుచరితం చైవ విస్తరేణ మహామునే ॥ 1 ॥**

మునీశ్వరా! పరాశరా! నీవు సృష్టి, వంశం, మన్వంతరాల స్థితి, వంశానుచరితం, విస్తృత పూర్వకంగా నాకు వివరించావు.

**శ్రోతుమిచ్ఛామ్యహం త్వత్తో యథావదుపసంహృతిమ్ ।**
**మహా ప్రలయసంస్థానాం కల్పాన్తే చ మహామునే! ॥ 2 ॥**

మహామునీ! కల్పాంతంలో జరిగే మహాప్రలయంలో ఏప్రకారంగా జీవుల ఉపసంహారం జరుగుతుందో దానిని నేను నీ వల్ల వినగోరుతున్నాను.

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు ఇలా బదులిచ్చాడు.

**మైత్రేయ శ్రూయతాం మత్తో యథావదుపసంహృతిః ।**
**కల్పాన్తే ప్రాకృతే చైవ ప్రలయో జాయతే యథా ॥ 3 ॥**

మైత్రేయా! కల్పాంత సమయంలో ప్రాకృతప్రలయం ఏవిధంగా జరుగుతుందో, ఏ ప్రకారంగా జీవుల ఉపసంహారం జరుగుతుందో, దానిని చెబుతాను. సావధానంగా ఆలకించు.

**అహోరాత్రం పితౄణాం తు మాసోఽబ్దస్త్రిదివౌకసామ్ ।**
**చతుర్యుగ సహస్రే తు బ్రహ్మణో ద్వే ద్విజోత్తమ! ॥ 4 ॥**

ద్విజోత్తమా! మానవులకాల పరిగణనలోని ఒకమాసం పితరులకు ఒకరోజు అవుతుంది. అలాగే మానవుల ఒక సంవత్సరం దేవతలకు ఒకరోజు అవుతుంది. అలాగే మానవుల రెండువేల మహాయుగాలు (చతుర్యుగాలు) బ్రహ్మకు ఒకరోజు (అహోరాత్రం) అవుతుంది.

**కృతం త్రేతా ద్వాపరం చ కలిశ్చేతి చతుర్యుగమ్ ।**
**దివ్యైర్వర్ష సహస్రైస్తు తద్ద్వాదశభిరుచ్యతే ॥ 5 ॥**

కృత త్రేతా ద్వాపర కలియుగాలు నాలుగింటిని చతుర్యుగం అంటారు. అది పంద్రెండువేల దివ్య సంవత్సరాలుగా చెప్పబడుతోంది. (360×12000 = 43,20,000సం॥)

**చతుర్యుగాణ్యశేషాణి సదృశాని స్వరూపతః ।**
**ఆద్యం కృతయుగం ముక్త్వా మైత్రేయాన్త్యం తథా కలిమ్ ॥ 6 ॥**

మైత్రేయా! ఇందు మొట్టమొదటిదైన కృతయుగం, చిట్టచివరిదైన కలియుగం తప్ప మిగిలిన అన్ని యుగాలు ఒకే సమానమైన రూపం గలవి.

**ఆద్యే కృతయుగే సర్గో బ్రహ్మణా క్రియతే యతః ।**
**క్రియతే చోపసంహార స్తథాఽన్తే చ కలౌయుగే ॥ 7 ॥**

ఎందువల్లనంటే బ్రహ్మ మొదటి కృతయుగారంభంలో సృష్టి చేస్తాడు, చివరి కలియుగంలో సృష్టి ఉప సంహరిస్తాడు. (ఆరెండింటిలో వ్యత్యాసం కన్పిస్తుంది.)

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు ఇలా అడుగుతున్నాడు.

**కలేః స్వరూపం భగవన్! విస్తరాద్ వక్తుమర్హసి ।**
**ధర్మశ్చతుష్పాద్ భగవన్! యస్మిన్ విప్లవ మృచ్ఛతి ॥ 8 ॥**

"భగవంతుడా! నాలుగు పాదాలు కలిగిన ధర్మం ఏ కారణంవల్ల ఇంచుమించుగా కలియుగంలో లుప్తం అవుతుందో, ఆ కలిస్వరూపాన్ని విస్తృతంగా వివరించవలసింది" అని కోరాడు.

**పరాశర ఉవాచ:-** పరాశరుడు ఇలా బదులిచ్చాడు.

**కలేః స్వరూపం మైత్రేయ! యద్భవాన్ ప్రష్టుమిచ్ఛతి ।**
**తన్నిబోధ సమాసేన వర్తతే యన్మహామునే ॥ 9 ॥**

"మహామునీ! మైత్రేయా! ఏ కలిస్వరూపాన్ని వర్ణించమని నీవు నన్ను కోరావో అది సంక్షేపంగా వివరిస్తున్నాను. ఆకర్ణించు.

**వర్ణాశ్రమాచారవతీ ప్రవృత్తిర్న కలౌ నృణామ్ ।**
**న సామ ఋగ్ యజుర్వేద వినిష్పాదన హేతుకా ॥ 10 ॥**

కలియుగంలో మనుష్యుల ప్రవృత్తి వర్ణాశ్రమధర్మానుకూలంగా సాగదు. అందు ఋగ్యజుస్సామ వేదధర్మాలను పాటించడం జరిగేది కాదు.

**వివాహా న కలౌ ధర్మ్యా న శిష్యగురు సంస్థితిః ।**
**న దామ్పత్యక్రమో నైవ వహ్నిదేవాత్మకః క్రమః ॥ 11 ॥**

వివాహాలు కలియుగంలో ధర్మబద్ధంగా జరగవు. గురుశిష్యవ్యవస్థ సాగదు. దాంపత్యక్రమం సక్రమంగా ఉండదు. అగ్నిహోత్రవిధి, దేవతోపాసన ఒక క్రమపద్ధతిలో పాటించబడదు.

**యత్ర యత్ర కులే జాతో బలీ సర్వేశ్వరః కలౌ ।**
**సర్వేభ్య ఏవ వర్ణేభ్యో యోగ్యః కన్యావరోధనే ॥ 12 ॥**

కలియుగంలో ఎవడు ఏఏ కులంలో పుట్టినా అన్ని విధాలా బలవంతుడైతే చాలు, అతడే సర్వేశ్వరుడు. అన్ని వర్ణాలలోను కూడా కన్యను పెండ్లాడడానికి అతడే యోగ్యుడు.

**యేన కేనైవ యోగేన ద్విజాతిర్దీక్షితః కలౌ ।**
**యైవ సైవ చ మైత్రేయ! ప్రాయశ్చిత్త క్రియా కలౌ ॥ 13 ॥**

మైత్రేయా! కలిలో ఏది తనంత తాను మంచిదనుకొని ఏదయితే చేస్తాడో అతడే దీక్షితుడైన బ్రాహ్మణుడు. అతడు తన బుద్ధిననుసరించి చేసే పని ఏదయితే ఉందో అదే ప్రాయశ్చిత్తక్రియ.

**సర్వమేవ కలౌ శాస్త్రం యస్య యద్వచనం ద్విజ! ।**
**దేవతా చ కలౌ సర్వా సర్వః సర్వస్య చాశ్రమః ॥ 14 ॥**

ద్విజశ్రేష్ఠా! కలిలో ఎవడు ఏమి చెబితే అదే శాస్త్రం. కలిలో అతడే దేవత. అందరికి అతని స్థానమే ఒక ఆశ్రమం.

**ఉపవాసస్తథాయాసో విత్తోత్సర్గస్తథా కలౌ ।**
**ధర్మో యథాభిరుచితై రనుష్ఠానై రనుష్ఠితః ॥ 15 ॥**

ఉపవాసం క్లేశసాధ్యమైన వ్రతమవుతుంది. కలిలో అలాగే ధనదానం, ధర్మం చేసేవారి అభిరుచికి తగినట్లుగానే చేయబడుతుంది.

**విత్తేన భవితా పుంసాం స్వల్పేనాఢ్యమదః కలౌ ।**
**స్త్రీణాం రూపమదశ్చైవ కేశైరేవ భవిష్యతి ॥ 16 ॥**

కలియుగంలో అత్యల్ప ధనవంతుడు కూడా పొగరెక్కి ప్రవర్తిస్తాడు. కేవలం జుట్టును రకరకాలుగా అలంకరించుకోవడమే స్త్రీలకు సౌందర్యాతిరేకం అవుతుంది.

**సువర్ణమణి రత్నాదౌ వస్త్రే చాపి క్షయం గతే ।**
**కలౌ స్త్రియో భవిష్యన్తి తదా కేశైరలంకృతాః ॥ 17 ॥**

సువర్ణం, మణులు, రత్నాలు, అమూల్యవస్త్రాలు ఇంచు మించు లుప్తం కాగా, కలిలో జుట్టునే అనేక విధాలుగా దిద్దుకొని అలంకరించుకొంటూ స్త్రీలు మురిసిపోతూ ఉంటారు.

**పరిత్యక్ష్యన్తి భర్తారం విత్తహీనం తథా స్త్రియః ।**
**భర్తా భవిష్యతి కలౌ విత్తవానేవ యోషితామ్ ॥ 18 ॥**

డబ్బులేని మగనికి స్త్రీలు విడాకులిస్తారు. కలియుగంలో స్త్రీలకు ధనవంతుడే భర్త కాగలడు.

**యో యో దదాతి బహులం స్వం స స్వామీ తదా నృణామ్ ।**
**స్వామిత్వహేతుః సమ్బన్ధో భావీ నాభిజనస్తథా ॥ 19 ॥**

నరులకు ఎవడైతే పుష్కలంగా డబ్బు ఇస్తాడో అతడే ప్రభువు. అంతే కాని ఉత్తమవంశంలో పుట్టిన సత్పురుషుడు ప్రభుత్వ హేతువు కాజాలడు.

**గృహాన్తా ద్రవ్యసంఘాతా ద్రవ్యాన్తా చ తథా మతిః ।**
**అర్థాశ్చాత్మోపభోగాన్తా భవిష్యన్తి కలౌ యుగే ॥ 20 ॥**

కలియుగంలో ఇల్లు కట్టుకొన్నవాడే ధనవంతుడుగా పరిగణించబడతాడు. అలాగే ధనవంతుడే వివేకవంతుడుగా లెక్కించబడతాడు. తాను సంపాదించిన ధనాలన్నీ కేవలం తను అనుభవించడం కొరకే.

**స్త్రియః కలౌ భవిష్యన్తి స్వైరిణ్యో లలితస్పృహాః ।**
**అన్యాయావాప్తవిత్తేషు పురుషాశ్చ స్పృహాలవః ॥ 21 ॥**

కలిలో స్త్రీలు చిలిపి చిలిపి కోరికలకు పై మెరుగులకు ముచ్చటపడుతూ స్వేచ్ఛగా సంచరిస్తారు. పురుషులు అన్యాయంతో సంపాదించిన ధనాలకై ఉబలాటపడుతూ ఉంటారు.

**అభ్యర్థితోఽపి సుహృదా స్వార్థమేవ నిరీక్ష్యతే ।**
**పణార్థార్థార్థమాత్రేఽపి కరిష్యతి తదా స్పృహామ్! ॥ 22 ॥**

ద్విజశ్రేష్ఠా! స్నేహితుడు ఎంత ప్రార్థించి ప్రాకులాడినా మానవుడు ధనమీయక స్వార్థాన్ని మాత్రమే చూచుకొంటాడు. కాని పరులధనం పట్ల చిల్లి గవ్వకైనా ఆశపడిపోతాడు.

**సమాన పౌరుషం చేతో భావివిప్రేషు వై కలౌ ।**
**క్షీరప్రదాన సమ్బన్ధి భావి గోషు చ గౌరవమ్ ॥ 23 ॥**

కలియుగంలో బ్రాహ్మణులపట్ల, సర్వమానవులయందు ఉండే సమానభావమేకాని విశిష్టగౌరవంఉండదు. ఆవుల పట్ల పాలకు సంబంధించిన ఆదరమే కాని అది పూజించదగిన జంతువు అని విశ్వాసం ఉండదు.

**అనావృష్టి భయప్రాయాః ప్రజాః క్షుద్భయకాతరాః ।**
**భవిష్యన్తి తదా సర్వే గగనాసక్త దృష్టయః ॥ 24 ॥**

ప్రజలు అనావృష్టి భయంతో జడిసిపోతూంటారు. ఆకలి బాధతో నకనకలాడిపోతారు. అందరూ ఆశతో ఆకాశం వంక దృష్టి సారిస్తారు.

**కన్దపర్ణఫలాహారా స్తాపనా ఇవ మానవాః ।**
**ఆత్మానం ఘాతయిష్యన్తి హ్యనావృష్ట్యాది దుఃఖితాః ॥ 25 ॥**

మానవులు తాపసులలాగా కందమూలాలు, ఆకులు, అలములు పండ్లు ఆహారంగా స్వీకరిస్తారు. వర్షాలు కురియక మిక్కిలి దుఃఖించి ఆత్మహత్యలు చేసుకొంటారు.

**దుర్భిక్షమేవ సతతం తదా క్లేశమనీశ్వరాః ।**
**ప్రాప్స్యన్తి వ్యాహత సుఖప్రమోదా మానవాః కలౌ ॥ 26 ॥**

కలియుగంలో అసమర్థులైన మానవులు ఎల్లప్పుడూ క్లేశాలు అనుభవిస్తూ దుర్భిక్షం పాలవుతారు. సుఖం, సంతోషం లేక కుమిలిపోతూ ఉంటారు.

**అస్నాన భోజినో నాగ్నిదేవతాఽతిథిపూజనమ్ ।**
**కరిష్యన్తి కలౌ ప్రాప్తే న చ పిత్ర్యోదకక్రియామ్ ॥ 27 ॥**

స్నానం చేయకుండా భోజనం చేస్తారు. అగ్నిహోత్రవిధులు ఉండవు. దేవతా పూజలు లోపిస్తాయి. అతిథి పూజలు కానరావు. కలి ప్రాప్తించగా పితృదేవతల ప్రీతికొరకై పిండోదకాది పూజలు చేయరు.

**లోలుపా హ్రస్వదేహాశ్చ బహ్వన్నాదనతత్పరాః ।**
**బహు ప్రజాల్పభాగ్యాశ్చ భవిష్యన్తి కలౌ స్త్రియః ॥ 28 ॥**

జనులు దురాశాపరులౌతారు. పొట్టిశరీరాలు కలవారైపోతారు. ఎక్కువ తింటూ తిండిపోతులై పోతారు. స్త్రీలు బహుసంతానవతులవుతారు. మందభాగ్యులై జీవిస్తారు.

**ఉభాభ్యామేవ పాణిభ్యాం శిరః కణ్డూయనం స్త్రియః ।**
**కుర్వన్త్యో గురుభర్తౄణా మాజ్ఞాం భేత్స్యన్త్యనాదృతాః ॥ 29 ॥**

స్త్రీలు రెండు చేతులతోను తల బరికికొంటూ ఉంటారు. పెద్దలయందు, భర్తలయందు అనాదరం పెరిగి వారి ఆజ్ఞలను ధిక్కరిస్తూంటారు.

**స్వపోషణపరాః క్షుద్రా దేహసంస్కారవర్జితాః ।**
**పరుషానృతభాషిణ్యో భవిష్యన్తి కలౌ స్త్రియః ॥ 30 ॥**

స్త్రీలు తమ బ్రతుకు తాము బ్రతుకుతూ నీచురాండ్రై వేషాదిధారణలతో దేహసంస్కారం లేనివారై అసత్యాలు కఠినవాక్యాలు పలుకుతూ కలివేళలో జీవిస్తారు.

**దుఃశీలా దుష్టశీలేషు కుర్వన్త్యః సతతం స్పృహామ్ ।**
**అసద్వృత్తా భవిష్యన్తి పురుషేషు కులాంగనాః ॥ 31 ॥**

శీలంచెడి వారు ఎల్లప్పుడు దుశ్శీలురైన వారియందు వలపు బూనియుంటారు. కులస్త్రీలు కూడా పురుషుల పట్ల చెడుప్రవర్తనతో వర్తిస్తారు.

**వేదాదానం కరిష్యన్తి వటవశ్చాకృతవ్రతాః ।**
**గృహస్థాశ్చ న హోష్యన్తి న దాస్యన్త్యుచితాన్యపి ॥ 32 ॥**

బ్రహ్మచర్యవ్రతాన్ని పాటించకుండానే వటువులు వేదాభ్యాసం చేస్తారు. గృహస్థులు అగ్నిహోత్రాలు చేయరు. నరులు ఉచితాలైన దానాలు చేయరు. (అపాత్రదానం చేస్తారు)

**వనవాసా భవిష్యన్తి గ్రామ్యాహార పరిగ్రహాః ।**
**భిక్షవశ్చాపి మిత్రాది స్నేహసమ్బన్ధ యన్త్రితాః ॥ 33 ॥**

వానప్రస్థులు, పరివ్రాజకులు కూడా కందమూలాలు మున్నగు ఆహారాలు విడిచి గ్రామ్యాహార పరిగ్రహాలు చేస్తూ, పాడుతిండి తింటూ, పట్టకూడని దానాలు పడుతూ, మిత్రుడు మున్నగు స్నేహ సంబంధాలకు లోనై జీవిస్తారు.

**అరక్షితారో హర్తారః శుల్కవ్యాజేన పార్థివాః ।**
**హారిణో జనవిత్తానాం సమ్ప్రాప్తే తు కలౌ యుగే ॥ 34 ॥**

రాజులు రక్షకులుగా ఉండరు. పన్నులనెపంతో సర్వభక్షకులౌతారు. కలియుగం సంప్రాప్తం కాగా ప్రభువులు ప్రజల విత్తాలను హరిస్తారు.

**యో యోఽశ్వరథనాగాఢ్యః స స రాజా భవిష్యతి ।**
**యశ్చ యశ్చాబలస్సర్వః స స భృత్యః కలౌ యుగే ॥ 35 ॥**

కలియుగంలో ఎవడెవడు గుర్రాలు,రథాలు,ఏనుగులు,ధనాలు కలిగి ఉంటాడో వాడు మాత్రమే రాజు కాగలడు. ఎవడెవడు బలం లేకుండా ఉంటాడో అటువంటి ప్రతివ్యక్తీ సేవకుడు కాగలడు.

**వైశ్యాః కృషి వాణిజ్యాది సన్త్యజ్య నిజకర్మ యత్ ।**
**శూద్రవృత్త్యా ప్రవత్స్యన్తి కారుకర్మోపజీవినః ॥ 36 ॥**

వైశ్యులు కృషి, వర్తకం మున్నగు స్వీయకర్మలను విడిచిపెట్టి శూద్రవృత్తిని చేపట్టి శిల్పకర్మ, చేతిపని మున్నగు వృత్తుల ద్వారా జీవనం కొనసాగిస్తారు.

**భైక్ష్యవ్రతా స్తథా శూద్రా ప్రవ్రజ్యాలింగినోఽధమాః ।**
**పాషణ్డసంశ్రయాం వృత్తి మాశ్రయిష్యన్త్యసంస్కృతాః ॥ 37 ॥**

అధములు, అలాగే శూద్రులు సంన్యాసచిహ్నాలు, కాషాయాలు మున్నగునవి ధరించి భిక్షావ్రతం ఆచరిస్తారు. వారు సంస్కరించబడకుండానే గౌరవసత్కారాలు పొందుతూ పాషండవృత్తిని ఆశ్రయిస్తారు.

**దుర్భిక్ష కరపీడాభి రతీవోపద్రుతా జనాః ।**
**గోధూమాన్నయవాన్నాఢ్యాన్ దేశాన్ యాస్యన్తి దుఃఖితాః ॥ 38 ॥**

దుర్భిక్షం, పన్నులు మున్నగు పీడలకు గురియై జనులు మిక్కిలి దుఃఖిస్తారు. గోధుమలు,యవలు మున్నగు ధాన్యాలు పండే దేశాలకు వలసపోతారు.

**వేదమార్గే ప్రలీనే చ పాషణ్డాఢ్యే తతో జనే ।**
**అధర్మవృద్ధ్యా లోకానాం స్వల్పమాయుర్భవిష్యతి ॥ 39 ॥**

వేదమార్గం అడుగంటిపోగా, పాషండమార్గం జనంలో వ్యాపించగా, అధర్మం పెరిగిపోయి జనులు లోకులు స్వల్పాయువు కలవారైపోతారు.

**అశాస్త్రవిహితం ఘోరం తప్యమానేషు వై తపః ।**
**నరేషు నృపదోషేణ బాలమృత్యుర్భవిష్యతి ॥ 40 ॥**

నరులు శాస్త్రవిహితం కాని ఘోరతపస్సులు చేయడంవల్లను, రాజదోషంవల్లను బాలమరణాలు సంభవిస్తాయి.

**భవిత్రీ యోషితాం సూతిః పంచషట్సప్తవార్షికే ।**
**నవాష్టదశవర్షాణాం మనుష్యాణాం తథా కలౌ ॥ 41 ॥**

కలియుగంలో ఎనిమిది,తొమ్మిది,పదేండ్ల పురుషులకు ఐదు,ఆరు,ఏడేండ్లుగల ఆడపిల్లలతో ఉండే సంబంధాల వలన సంతానం కలగడం జరుగుతుంది.

**పలితోద్భవశ్చ భవితా తదా ద్వాదశవార్షికః ।**
**నాతిజీవతి వై కశ్చిత్ కలౌ వర్షాణి వింశతిః ॥ 42 ॥**

కలిలో పండ్రెండు సంవత్సరాల వయస్సులోనే జుట్టు నెరసిపోతుంది. ఆ యుగంలో ఇరవైఏండ్లు మించి ఎవ్వడూ బ్రతకడు.

**అల్పప్రజ్ఞా వృథాలింగా దుష్టాన్తఃకరణాః కలౌ ।**
**యతస్తతో వినక్ష్యన్తి కాలేనాల్పేన మానవాః ॥ 43 ॥**

కలియుగంలో మానవులు స్వల్పప్రజ్ఞ కలవారవుతారు. వ్యర్థమైన చిహ్నాలు ధరిస్తారు. దుష్టచిత్తులై జీవిస్తారు. అందువల్ల అక్కడికక్కడే కాలవశంవలన అల్పకాలంలో నశించిపోతారు.

**యదా యదా హి పాషణ్డవృద్ధిర్మైత్రేయ! లక్ష్యతే ।**
**తదా తదా కలేర్వృద్ధి రనుమేయా విచక్షణైః ॥ 44 ॥**

మైత్రేయా! ఎప్పుడెప్పుడు పాషండులు ఎక్కువవుతూ ఉంటారో అప్పుడప్పుడు కలి పెరుగుతున్నట్లుగా విచక్షణులైనవారు గ్రహిస్తూ ఉండాలి.

**యదా యదా సతాం హానిర్వేదమార్గానుసారిణామ్ ।**
**ప్రారమ్భాశ్చావసీదన్తి యదా ధర్మభృతాం నృణామ్ ॥ 45 ॥**
**తదానుమేయం ప్రాధాన్యం కలేర్మైత్రేయ! పణ్డితైః ।**

ఎప్పుడెప్పుడు సత్పురుషులకు హాని కలుగుతుందో, ఎప్పుడు వేదమార్గంలో నడిచేవారి కర్మలకు ఆటంకం కలుగుతుందో, ధర్మాత్ములైన మానవులకు ఎన్నడు కీడు సంభవిస్తుందో, మైత్రేయా! అప్పుడు కలిప్రాధాన్యం పెరుగుతున్నట్లుగా పండితులు గ్రహించాలి.

**యదా యదా న యజ్ఞానామీశ్వరః పురుషోత్తమః ।**
**ఇజ్యతే పురుషైర్యజ్ఞైస్తదా జ్ఞేయం కలేర్బలమ్ ॥ 46 ॥**

ఎప్పుడెప్పుడు యజ్ఞాలకు ఈశ్వరుడైన పురుషోత్తముని పురుషులు యజ్ఞాలతో యజించకుండా ఉంటారో అప్పుడప్పుడు కలి విజృంభణ జరుగుతున్నట్లుగా భావించాలి.

**న ప్రీతి ర్వేదవాదేషు పాషణ్డేషు యదా రతిః ।**
**కలేర్వృద్ధిస్తదా ప్రాజ్ఞైరనుమేయా విచక్షణైః ॥ 47 ॥**

ఎప్పుడు వేదవాదములయందు ప్రీతిలేక, పాషణ్డులయందు సంప్రీతి కలిగి ఉంటారో, అప్పుడు కలివృద్ధి జరుగుతున్నట్లుగా విచక్షణులైన పండితులు ఊహించాలి.

**కలౌ జగత్పతిం విష్ణుం సర్వస్రష్టారమీశ్వరమ్ ।**
**నార్చయిష్యన్తి మైత్రేయ! పాషణ్డోపహతా నరాః ॥ 48 ॥**

మైత్రేయా! కలియుగంలో మానవులు పాషణ్డుల ప్రభావానికి లొంగినవారై జగత్పతియైన, సర్వస్రష్టయగు ఈశ్వరుడైన విష్ణుని ఆరాధించకుండా ఉంటారు.

**కిం వేదైః కిం ద్విజైర్దేవైః కిం శౌచేనామ్బుజన్మనా ।**
**ఇత్యేవం విప్ర! వక్ష్యన్తి పాషణ్డోపహతా నరాః ॥ 49 ॥**

విప్రవర్యా! వేదాలు ఎందులకు? బ్రాహ్మణులు ఎందులకు? దేవతలు ఎందులకు? నీటిలో నానిపోయే ఆచారం ఎందులకు? అని నరులు పాషండులవల్ల చెడిపోయినవారై వాగుతూ ఉంటారు.

**స్వల్పామ్బువృష్టిః పర్జన్యః సస్యం స్వల్పఫలం తథా ।**
**ఫలం తథాఽల్పసారం చ విప్ర! ప్రాప్తే కలౌ యుగే ॥ 50 ॥**

విప్రశ్రేష్ఠా! కలియుగంలో మేఘుడు మిక్కిలి తక్కువగా వర్షిస్తాడు. పంట దిగుబడి మరీ తక్కువగా ఉంటుంది. పండ్లు అల్పసారం కలవైయుంటాయి.

**శాణీప్రాయాణి వస్త్రాణి శమీప్రాయా మహీరుహాః ।**
**శూద్రప్రాయాస్తథా వర్ణా భవిష్యన్తి కలౌ యుగే ॥ 51 ॥**

కలియుగంలో జనులు నారబట్టలను ధరిస్తారు. వృక్షాలు శమీ ప్రమాణంలో మాత్రమే పెరుగుతాయి. సమస్తవర్ణాలు శూద్రప్రాయులై చరిస్తారు.

**అణుప్రాయాణి ధాన్యాని చాజాప్రాయం తథా పయః ।**
**భవిష్యతి కలౌ ప్రాప్తే హ్యౌషీరం చానులేపనమ్ ॥ 52 ॥**

కలి సంప్రాప్తించగా ధాన్యాలు కడుచిన్నవై అణువులులాగా ఉంటాయి. పాలు ఐతే ఇంచుమించు మేకపాలు మాత్రమే లభిస్తాయి. వట్టివేళ్ళ గంధం ఉపయోగించబడుతుంది.

**శ్వశ్రూ శ్వశురభూయిష్ఠా గురవశ్చ నృణాం కలౌ ।**
**శ్యాలాద్యా హారిభార్యాశ్చ సుహృదో మునిసత్తమ! ॥ 53 ॥**

మునిశ్రేష్ఠా! కలియుగంలో అత్తగార్లు, మామగార్లు మాత్రమే దేవతలు. బావమరుదులు, భార్యలే మిత్రులు.

**కస్య మాతా పితా కస్య యదా కర్మానుగః పుమాన్ ।**
**ఇతి చోదాహరిష్యన్తి శ్వశురానుగతా నరాః ॥ 54 ॥**

ఎవనికి తండ్రి? తల్లి ఎవనికి? ఇదంతా కర్మానుసారంగా జరిగి పురుషుడు ఉద్భవిస్తాడంటూ అత్తమామల వెంటబడిన నరులు తల్లిదండ్రులను ఈసడిస్తారు.

**వాఙ్మనః కాయికైర్దోషైరభిభూతాః పునః పునః ।**
**నరః పాపాన్యనుదినం కరిష్యన్త్యల్పమేధసః ॥ 55 ॥**

వాక్కుచేత, మనస్సుచేత, శరీరంచేత మాటిమాటికి దోషాలకు లొంగిపోతూ మానవులు అల్పబుద్ధులై ప్రతిదినం పాపాలు చేస్తూనే ఉంటారు.

**నిఃసత్త్వానామశౌచానాం నిఃశ్రీకాణాం తథా నృణామ్ ।**
**యద్యద్దుఃఖాయ తత్సర్వం కలికాలే భవిష్యతి ॥ 56 ॥**

శక్తి ఉండదు. శౌచం ఉండదు. తేజస్సు ఉండదు. కలికాలంలో ఏది మానవులకు దుఃఖం కలిగిస్తుందో అదే పూర్తిగా వారికి లభిస్తుంది.

**నిఃస్వాధ్యాయ వషట్కారే స్వధాస్వాహావివర్జితే ।**
**తథా ప్రవిరలో ధర్మః క్వచిల్లోకే నివత్స్యతి ॥ 57 ॥**

విప్రవర్యా! స్వాధ్యాయం ఉండదు. వషట్కారం లోపిస్తుంది. స్వధాస్వాహాకార్యాలు శూన్యాలు. లోకంలో కొద్దిగా మాత్రమే ధర్మం ఎక్కడో కనిపిస్తుంది.

**తత్రాల్పేనైవ యత్నేన పుణ్యస్కన్ధమనుత్తమమ్ ।**
**కరోతి యః కృతయుగే క్రియతే తపసా హి సః ॥ 58 ॥**

కాబట్టి కలియుగంలో మనుష్యుడు ధర్మరక్షణకు ఏ కొద్ది ప్రయత్నం చేసినా అది అత్యంత పుణ్యరాశి ప్రాప్తికి హేతువవుతుంది. అదే కృతయుగంలో తపస్సుచేసి సంపాదించినంత గొప్పదవుతుంది–అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే షష్ఠాంశే కలిధర్మనిరూపణం నామ ప్రథమోఽధ్యాయః సమాప్తః ॥ 1 ॥**

శ్రీవిష్ణుపురాణంలో షష్ఠాంశంలో కలిధర్మనిరూపణ అనే మొదటి అధ్యాయం సమాప్తం ॥ 1 ॥

## ద్వితీయోఽధ్యాయః - రెండవ అధ్యాయం

## కలియుగ స్త్రీ, శూద్ర మహత్త్వవర్ణనమ్ - కలియుగ స్త్రీ, శూద్ర మహత్త్వవర్ణన

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**వ్యాసశ్చాహ మహాబుద్ధి ర్యదత్రైవ హి వస్తుని ।**
**తచ్ఛ్రూయతాం మహాభాగ గదతో మమ తత్త్వతః ॥ 1 ॥**

మైత్రేయా! ఈ కలియుగ ప్రసంగంలో మహాబుద్ధిశాలియైన వ్యాసుడు ఏదయితే చెప్పాడో, మహాభాగా! దానిని నేను ఉన్నది ఉన్నట్లు చెబుతాను. అది విను.

**కస్మిన్ కాలేఽల్పకో ధర్మో దదాతి సుమహత్ ఫలమ్ ।**
**మునీనామిత్యభూద్వాదః కైశ్చాసౌ క్రియతే సుఖమ్ ॥ 2 ॥**

ఆ వాదమేమనగా - "ఏ కాలంలో ఆచరించే అల్పధర్మం మిక్కిలి మహాఫలితాన్ని ఇస్తుంది? దేనిచే జీవులకు గొప్పసౌఖ్యం చేకూరుతుంది?"అని ఒక సమయంలో మునీశ్వరులకు పరస్పరం వాదం జరిగింది.

**సన్దేహనిర్ణయార్థాయ వేదవ్యాసం మహామునిమ్ ।**
**యయుస్తే సంశయం ప్రష్టుం మైత్రేయ! మునిపుంగవాః ॥ 3 ॥**

మైత్రేయా! ఆ మునిపుంగవులు ఈ సందేహంలో నిర్ణయం చేయుటకొరకై మహామునియైన వేదవ్యాసుని సన్నిధికి ప్రశ్నించడానికై వెళ్ళారు.

**దదృశుస్తే మునిం తత్ర జాహ్నవీసలిలే ద్విజాః ।**
**వేదవ్యాసం మహాభాగ మర్ధస్నాతం మహామతిమ్ ॥ 4 ॥**

ఆ ద్విజశ్రేష్ఠులు గంగానదీ జలాలలో సగం స్నానం చేసియున్న బుద్ధిశాలియైన మహాభాగుడైన వేదవ్యాసమహర్షిని సందర్శించారు.

**స్నానావసానం తత్తస్య ప్రతీక్షన్తో మహర్షయః ।**
**తస్థుస్తటే మహానద్యా స్తరుషణ్డ ముపాశ్రితాః ॥ 5 ॥**

ఆయన స్నానం పూర్తయ్యేవరకు ఆ మహర్షులు అక్కడ ఎదురుచూస్తూ, ఆ మహానది ఒడ్డున చెట్టునీడలనాశ్రయించి ఉండిపోయారు.

**మగ్నోఽథ జాహ్నవీతోయాదుత్థాయాహ సుతో మమ ।**
**శూద్రః సాధుః కలిః సాధు రిత్యేవం శృణ్వతాం వచః ॥ 6 ॥**

**తేషాం మునీనాం భూయశ్చ మమజ్జ స నదీజలే ।**
**సాధు సాధ్వితి చోత్థాయ శూద్ర ధన్యోఽసి చాబ్రవీత్ ॥ 7 ॥**

ఆ సమయంలో గంగానదిలో మునిగియున్న నా కుమారుడు ఒక్కసారిగా లేచి ఆ మునీశ్వరులు వింటూ ఉండగా "శూద్రుడు సాధువు; కలి సాధువు" అని పలికాడు. అతడు మళ్ళీ మరొకసారి నీటిలోమునిగి పైకి లేచి "శూద్రా! బాగు! బాగు!నీవు ధన్యుడవు" అని చెప్పాడు.

**స నిమగ్నః సముత్థాయ పునః ప్రాహ మహామునిః ।**
**యోషితః సాధు ధన్యాస్తా స్తాభ్యో ధన్యతరోఽస్తి కః ॥ 8 ॥**

అనంతరం ఆ మహాముని ఇంకొక్కసారి మునిగి పైకి లేచి "స్త్రీలరా! బాగు బాగు, మీరు మహాధన్యలు. మీకన్న ధన్యలు ఎవరున్నారు గనుక!" అని అన్నాడు.

**తతః స్నాత్వా యథాన్యాయమాయాన్తం కృతసత్క్రియామ్ ।**
**ఉపతస్థుర్మహాభాగం మునయస్తే సుతం మమ ॥ 9 ॥**

అంతట శాస్త్రవిధిని స్నానం పూర్తిచేసి, చేయవలసిన సత్కర్మలు ఆచరించి వస్తున్న మహాభాగుడైన నా సుతుని చూచి ఆ మునీంద్రులందరూ అతని సమీపానికి వచ్చారు.

**కృతసంవన్దనాం శ్చాహ కృతాసన పరిగ్రహాన్ ।**
**కిమర్థమాగతా యూయమితి సత్యవతీసుతః ॥ 10 ॥**

ఆ మునులందరూ నమస్కారాలు చేసి, ఆసనాలపై కూర్చున్న తర్వాత సత్యవతీనందనుడైన వ్యాసుడు "మీరు ఏల ఇలా వచ్చారు?" అని వారిని ప్రశ్నించాడు.

**తమూచుః సంశయం ప్రష్టుం భవన్తం వయమాగతాః ।**
**అలం తేనాస్తు తావన్నః కథ్యతా మపరం త్వయా ॥ 11 ॥**

అపుడు వారు ఆ మహర్షితో మాకు కలిగిన సందేహం తీర్చుకోవడానికై మీ సన్నిధికి వచ్చాము. అది అలా ఉండనిండు. మరో విషయం అడుగుతున్నాము. అది తమరు మాకు తెలియజేయండి?.

**కలిః సాధ్వితి యత్ప్రోక్తం శూద్రః సాధ్వితి యోషితః ।**
**యదాహ భగవాన్ సాధు ధన్యాశ్చేతి పునః పునః ॥ 12 ॥**

భగవత్స్వరూపులైన తమరు "కలి బాగు, శూద్రులు బాగు, స్త్రీలు బాగు బాగు, వారు ధన్యులు" అని మరీ మరీ పలికారు కదా!

**తత్ సర్వం శ్రోతుమిచ్ఛామో న చేద్ గుహ్యం మహామునే! ।**
**తత్ కథ్యతాం తతో హృత్స్థం పృచ్ఛామస్త్వాం ప్రయోజనమ్ ॥ 13 ॥**

మహామునీ! అది రహస్యం కాదేని, దానినంతా వినగోరుతున్నాము. అది ఏమిటో ముందు తెలియజేయండి. అటుపైన మా రాకలోనున్న ప్రయోజనాన్ని గురించి అడుగుతాము–అన్నారు.

**ఇత్యుక్తో మునిభి ర్వ్యాసః ప్రహస్యేదమథాబ్రవీత్ ।**
**శ్రూయతాం భో మునిశ్రేష్ఠా యదుక్తం సాధు సాధ్వితి ॥ 14 ॥**

మునీంద్రులు ఈ రీతిగా వేడుకొనగా వ్యాసమహర్షి నవ్వి "ఓ! మునిశ్రేష్ఠులారా! వినండి. బాగు! బాగు! అన్న నా అభిప్రాయం ఇదే.

**యత్కృతే దశభిర్వర్షై స్త్రేతాయుం హాయనేన యత్ ।**
**ద్వాపరే యచ్చ మాసేన అహోరాత్రేణ తత్ కలౌ ॥ 15 ॥**

**తపసో బ్రహ్మచర్యస్య జపాదేశ్చ ఫలం ద్విజాః! ।**
**ప్రాప్నోతి పురుషస్తేన కలిః సాధ్వితి భాషితమ్ ॥ 16 ॥**

ద్విజులారా! కృతయుగంలో పది సంవత్సరాలు తపస్సు,బ్రహ్మచర్యం,జపం మున్నగునవి ఆచరిస్తే ఏ ఫలం వస్తుందో, అది త్రేతాయుగంలో ఒక సంవత్సరం ఆచరిస్తే ఆ ఫలం సిద్ధిస్తుంది. అదే ఫలం ద్వాపరయుగంలో ఒక్క మాసం చేస్తే చాలు సిద్ధిస్తుంది. కలియుగంలో ఒక్కరోజు ఆచరిస్తే చాలు ఆ ఫలం చేకూరుతుంది. పురుషుడు కలిలో అంత సులభంగా సిద్ధి పొందుతాడు. అందువల్ల కలి బాగు! బాగు! అన్నాను.

**ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైస్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్ ।**
**యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్ ॥ 17 ॥**

కృతయుగంలో ధ్యానం ఆచరించి, త్రేతాయుగంలో యజ్ఞాలు గావించి, ద్వాపరయుగంలో పూజాదులు చేసి పురుషుడు ఏ ఫలితం పొందుతాడో, కలియుగంలో కేశవుని కీర్తించి ఆ ఫలం పొందుతాడు.

**ధర్మోత్కర్షమతీవాత్ర ప్రాప్నోతి పురుషః కలౌ ।**
**అల్పాయాసేన ధర్మజ్ఞాస్తేన తుష్టోఽస్మ్యహం కలేః ॥ 18 ॥**

ధర్మాలు తెలిసిన మునీశ్వరులారా! ఈ కలిలో పురుషుడు అల్పశ్రమచేతనే మిక్కిలి ధర్మోత్కర్షను పొందుతాడు. అందువల్ల నేను కలియుగవిషయంలో సంతుష్టి చెంది ప్రశంసించాను.

**వ్రతచర్యాపరైర్గ్రాహ్యా వేదాః పూర్వం ద్విజాతిభిః ।**
**తతః స్వధర్మసంప్రాప్తై ర్యష్టవ్యం విధివద్ధనైః ॥ 19 ॥**

(ఇక శూద్రులను ఏల ప్రశంసించానో చెబుతాను వినండి.) ద్విజులైనవారు ముందు బ్రహ్మచర్య వ్రతాన్ని పాలించవలసి ఉంది. అనంతరం వేదాభ్యాసం చేయవలసి ఉంది. అటుపైన తన ధర్మాన్ని అనుసరించి సంపాదించిన ధనాలద్వారా యజ్ఞాలు ఆచరించవలసి ఉంది.

**వృథా కథా వృథా భోజ్యం వృథేజ్యా చ ద్విజన్మనామ్ ।**
**పతనాయ తథా భావ్యం తైస్తు సంయమిభిస్సదా ॥ 20 ॥**

(ద్విజన్ముల) బ్రాహ్మణుల కథలన్నీ వ్యర్థం. భోజనాలు వృథా, యజ్ఞాలు నిష్ప్రయోజకాలు. వీటి ఆచరణలో వారు పతనమయ్యే అవకాశముంది. అందువల్ల వారు చక్కని నియమాలు, మంచి నిష్ఠ కలవారై యుండాలి.

**అసమ్యక్కరణే దోషస్తేషాం సర్వేషు కర్మసు ।**
**భోజ్యపేయాదికం చైషాం నేచ్ఛా ప్రాప్తికరం ద్విజాః ॥ 21 ॥**

ద్విజులారా! అన్ని కర్మలను కూడా సరిగా అనుష్ఠించకపోతే దోషం సంభవిస్తుంది. తినదగినవి, త్రాగదగినవి కూడా వారికి వారి కోరికననుసరించి స్వీకరించడానికి వీలుండదు.

**పారతంత్ర్యం సమస్తేషు తేషాం కార్యేషు వై తతః ।**
**జయంతి తే నిజాంల్లోకాన్ క్లేశేన మహతా ద్విజాః ॥ 22 ॥**

ద్విజులారా! వారికి అన్ని పనులయందు పరాధీనత మాత్రమే ఉంటుంది. స్వాతంత్ర్యం ఉండదు. వారు అన్ని క్లేశాలు అనుభవించి ఉత్తమలోకాలను జయిస్తారు.

**ద్విజశుశ్రూషయైవేష పాకయజ్ఞాధికారవాన్ ।**
**నిజాన్ జయతి వై లోకాన్ శూద్రో ధన్యతరస్తతః ॥ 23 ॥**

(ద్విజులు) బ్రాహ్మణులు చెప్పినది విని వారికి సేవచేసి, పాకయజ్ఞాధికారం (మంత్రహీనమైన కర్మ) వల్లనే శూద్రులైనవారు ఉత్తమలోకాలు పొందుతారు. అందువల్ల శూద్రుడు ధన్యుడన్నాను. (పాకయజ్ఞం అనగా అల్పయజ్ఞమని వాచస్పత్యం)

**భక్ష్యాభక్ష్యేషు నాస్యాస్తి పేయాపేయేషు వై యతః ।**
**నియమో మునిశార్దూలాస్తేనాసౌ సాధ్వితీరితః ॥ 24 ॥**

మునివృషభులారా! ఇది తినవచ్చు, ఇది తినకూడదు, ఇది త్రాగవచ్చు, ఇది త్రాగకూడదు అనే నియమం శూద్రునకు ఉండనే ఉండదు. అందువల్లనే శూద్రుడు బాగు! బాగు! అని నేను కొనియాడాను.

**స్వధర్మస్యావిరోధేన నరైర్లబ్ధం ధనం సదా ।**
**ప్రతిపాదనీయం పాత్రేషు యష్టవ్యం చ యథావిధి ॥ 25 ॥**

తన ధర్మానికి విరోధం కల్గకుండా మానవులు ధనం సంపాదించాలి. ఆ ధనాలను సత్పాత్రులకు దానమీయాలి. శాస్త్రవిధిని అనుసరించి యజ్ఞాలు చేయాలి.

**తస్యార్జనే మహాక్లేశః పాలనే చ ద్విజోత్తమాః! ।**
**తథా సద్వినియోగాయ విజ్ఞేయం గహనం నృణామ్ ॥ 26 ॥**

ద్విజోత్తములారా! ఆ ధనసంపాదన మహాకష్టము. దానిని రక్షించుకోవడంలో మహాక్లేశము. అట్లే దానిని మంచిగా వినియోగించడం ఇంకాకూడా మానవులకు కష్టమే ఎదురవుతుంది.

**ఏభిరన్యై స్తథా క్లేశైః పురుషా ద్విజసత్తమాః ।**
**నిజాన్ జయన్తి వై లోకాన్ ప్రాజాపత్యాదికాన్ క్రమాత్ ॥ 27 ॥**

ద్విజశ్రేష్ఠులారా! ఈవిధంగా పురుషులు ఇతరములైన అనేక క్లేశాలు పొంది, క్రమంగా ప్రాజాపత్యాది లోకాలను జయిస్తున్నారు.

**యోషిచ్ఛుశ్రూషణం భర్తుః కర్మణా మనసా గిరా ।**
**కుర్వతో సమవాప్నోతి తత్సాలోక్యం యతో ద్విజాః! ॥ 28 ॥**

ద్విజులారా! కాని, స్త్రీ త్రికరణ శుద్ధిగా మనోవాక్కాయకర్మలద్వారా పతిసేవ చేస్తూ, మిక్కిలి కష్టపడి పురుషుడు సంపాదించుకొన్న లోకాన్ని అతనితో కలిసి సులభంగా పొందుతోంది.

**నాతిక్లేశేన మహతా తానేవ పురుషో యథా ।**
**తృతీయం వ్యాహృతం తేన మయా సాధ్వితి యోషితః ॥ 29 ॥**

పురుషుడు ఎంతో కష్టపడి సంపాదించుకొన్న ఆ లోకాలను స్త్రీ అంత కష్టపడకుండానే పొందడంవల్ల నేను మూడో పర్యాయం "స్త్రీలారా! సాధు! సాధు!" అని వారిని అభినందించాను.

**ఏతద్వః కథితం విప్రా యన్నిమిత్తమిహాగతాః ।**
**తత్ పృచ్ఛధ్వం యథాకామం సర్వం వక్ష్యామి వః స్ఫుటమ్ ॥ 30 ॥**

మునీంద్రులారా! "మీరు నావద్దకు ఏ నిమిత్తంగా వచ్చారో, అది మీకు తెలియజేశాను. మీకు ఇంకా ఏం కావాలో స్వేచ్ఛగా అడగవచ్చు. స్పష్టమయ్యేటట్లుగా సర్వం మీకు వివరిస్తాను" అని వారికి తెలియజెప్పాడు.

**తతస్తే మునయః ప్రోచుర్యత్ ప్రష్టవ్యం మహామునే! ।**
**అన్యస్మిన్నేవ తత్పృష్టే యథావత్ కథితం త్వయా ॥ 31 ॥**

అని వ్యాసుడు పలుకగా "ఆ మునులు మహర్షీ! ఏది అడగవలసి ఉందో, ఇంకనూ ప్రశ్నించవలసింది ఏమున్నదో, దానికి ప్రత్యుత్తరం ఇందులోనే మాకు నీవు" తెలియజేశావు అన్నారు.

**తతః ప్రహస్య తాన్ ప్రాహ కృష్ణద్వైపాయనో మునిః ।**
**విస్మయోత్ఫుల్లనయనాం స్తాపసాంస్తానుపాగతాన్ ॥ 32 ॥**

**మయైష భవతాం ప్రశ్నో జ్ఞాతో దివ్యేన చక్షుషా ।**
**తతో హి వః ప్రసంగేన సాధు సాధ్వితి భాషితమ్ ॥ 33 ॥**

అంత కృష్ణద్వైపాయనమహర్షి ఒకించుక నవ్వి, ఆశ్చర్యంచే విప్పారిన కన్నులు గల తాపసులను తన వద్దకు వచ్చినవారిని ఉద్దేశించి-

"ఈ మీ ప్రశ్న ఏదైతే ఉన్నదో, దానిని నేను దివ్యదృష్టిచే గ్రహించాను. అందువల్లనే మీతో ప్రసంగవశంగా "బాగు!బాగు" అని అనడం జరిగింది.

**స్వల్పేనైవ ప్రయత్నేన ధర్మః సిధ్యతి వై కలౌ ।**
**నరైరాత్మగుణామ్భోభిః క్షాలితాఽఖిల కిల్బిషైః ॥ 34 ॥**

కలికాలంలో మనుష్యులు తమ సద్గుణాలు అనే జలాలలో కడగబడిన సమస్తపాపాలు కలిగిన వారౌతారు.(పాపాలు తొలగించుకొంటారు) మిక్కిలి చిన్నప్రయత్నంచేతనే ధర్మోపార్జన కావిస్తారు.

**శూద్రైశ్చ ద్విజశుశ్రూషా తత్పరైర్మునిసత్తమాః! ।**
**తథా స్త్రీభిరనాయాసం పతిశుశ్రూషయైవ హి ॥ 35 ॥**

మునిశ్రేష్ఠులారా! శూద్రులు ద్విజసేవాపరాయణులై, స్త్రీలు పతిసేవాసక్తలై ఏ ఆయాసం పడకుండా ధర్మసిద్ధిని పొందుతారు.

**తతస్త్రితయమప్యేతన్మమ ధన్యతమం మతమ్ ।**
**ధర్మసంపాదనే క్లేశో ద్విజాతీనాం కృతాదిషు ॥ 36 ॥**

అందువల్ల నా అభిప్రాయంలో వీరు ముగ్గురు మిక్కిలి ధన్యులు. సత్యయుగం మొదలైన అన్ని యుగాలలోను ద్విజాతులకు ధర్మసంపాదన చేయడంలో మహాక్లేశం సంభవిస్తుంది.

**భవద్భిర్యదభిప్రేతం తదేతత్కథితం మయా ।**
**అపృష్టేనాపి ధర్మజ్ఞాః! కిమన్యత్ కథ్యతాం ద్విజాః ॥ 37 ॥**

ధర్మజ్ఞులైన ద్విజులారా! మీ అభిప్రాయాలను ముందుగా గ్రహించి మీరు అడగకుండానే నేను ఈ విషయాలు మీకు తెలియజేసాను. ఇంకేమి చెప్పవలసి ఉంది? అని వ్యాసమహర్షి అన్నాడు.

**తతః సమ్పూజ్య తే వ్యాసం ప్రశస్య చ పునః పునః ।**
**యథాఽఽగతం ద్విజా జగ్ముర్వ్యాసోక్తిక్షతసంశయాః ॥ 38 ॥**

అంత ఆ మునీశ్వరులు వ్యాసవచనంవల్ల సంశయాలు ఇలా తొలగించుకొన్నారు. అనంతరం వారు ఆ మహర్షిని విధివిహితంగా పూజించి, పదే పదే కొనియాడి వచ్చిన దారినే వెళ్ళిపోయారు.

**భవతోఽపి మహాభాగ! రహస్యం కథితం మయా॥ 39 ॥**

మహాభాగా! మైత్రేయా! నేను నీకు ఈ సూక్ష్మరహస్యాలను తెలియజేశాను.

**అత్యన్తదుష్టస్య కలేరయమేకో మహాన్ గుణః ।**
**కీర్తనాదేవ కృష్ణస్య ముక్తబన్ధః పరం వ్రజేత్ ॥ 40 ॥**

మిక్కిలి దురాత్ముడైన కలిపురుషునకు గల సుగుణం ఇదొక్కటే. కృష్ణసంకీర్తనమాత్రంచేతనే నరుడు బంధాలనుంచి ముక్తుడై పరలోకాన్ని పొందుతాడు.

**యచ్చాహం భవతా పృష్టో జగతాముపసంహృతిమ్ ।**
**ప్రాకృతామన్తరాలాం చ తామప్యేష వదామి తే ॥ 41**

నీవు ఇంక నన్ను ఏదైతే అడిగావో, జగత్తు ఉపసంహారం, ప్రాకృత ప్రళయం, అవాన్తర ప్రళయం-అనే వాటిని గూర్చి తెలియజేస్తాను. అని పరాశరుడు చెప్పాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే షష్ఠాంశే కలియుగ స్త్రీ, శూద్ర మహత్త్వవర్ణనం నామ ద్వితీయోఽధ్యాయః సమాప్తః ॥ 2 ॥**

శ్రీవిష్ణుపురాణంలో షష్ఠాంశంలో కలియుగ స్త్రీ, శూద్ర మహత్త్వవర్ణన అనే రెండవ అధ్యాయం సమాప్తం ॥ 2 ॥



## **తృతీయోఽధ్యాయః** – మూడవ అధ్యాయం

### **నిమేషాది కాలమానం – నైమిత్తిక ప్రలయవర్ణనమ్** – నిమేషాది కాలమానం – నైమిత్తిక ప్రలయవర్ణన

**శ్రీపరాశర ఉవాచ:–** పరాశరుడు చెబుతున్నాడు.

**సర్వేషామేవ భూతానాం త్రివిధః ప్రతిసంచరః ।**
**నైమిత్తికః ప్రాకృతిక స్తథైవాఽఽత్యన్తికో మతః ॥ 1 ॥**

మైత్రేయా! సమస్త భూతాలకు మూడు విధాలైన నైమిత్తికం, ప్రాకృతికం, ఆత్యన్తికం– అనే ప్రళయాలు ఉంటాయి.

**బ్రాహ్మో నైమిత్తికస్తేషాం కల్పాన్తే ప్రతిసంచరః ।**
**ఆత్యన్తికశ్చ మోక్షాఖ్యః ప్రాకృతో ద్విపరార్ధకః ॥ 2 ॥**

కల్పాంతంలో బ్రాహ్మమనే ప్రళయం ఏర్పడుతుంది. దానికే నైమిత్తికప్రళయమని పేరు. మోక్ష రూపమైన ప్రళయానికి ఆత్యంతికం అని పేరు. ద్విపరార్ధం అంతంలో వచ్చే ప్రళయానికి ప్రాకృత ప్రళయమని పేరు.

**మైత్రేయ ఉవాచ :–** మైత్రేయుడు అడుగుతున్నాడు.

**పరార్ధసంఖ్యాం భగవన్! మమాచక్ష్వ యయాతు సః ।**
**ద్విగుణీకృతయా జ్ఞేయః ప్రాకృతః ప్రతిసంచరః ॥ 3 ॥**

"భగవంతుడా! పరార్ధం అనే దాని సంఖ్యాసంవత్సరాలు నాకు తెలియజెప్పవలసింది. దానికి రెట్టింపు కాలమే ప్రాకృతప్రళయం –అని తెలియజేయబడుతోంది కదా!" అని అడిగాడు.

**పరాశర ఉవాచ :–** పరాశరుడు బదులిచ్చాడు.

**స్థానాత్ స్థానం దశగుణమేకస్మాత్ గణ్యతే ద్విజ! ।**
**తతోఽష్టాదశమే స్థానే పరార్ధమభిధీయతే ॥ 4 ॥**

ద్విజవర్యా! ఒకస్థానం నుంచి ఇంకొక స్థానం పదిరెట్లు. అలా ఒకేసారి లెక్కించుకొంటూ పోగా పద్దెనిమిదో స్థానం పరార్ధమని చెప్పబడుతుంది. (అనగా వేయికోట్లకోట్లు కాలం)

**పరార్ధద్విగుణం యత్తు ప్రాకృతః ప్రలయోః ద్విజః ।**
**తదా వ్యక్తేఽఖిలం వ్యక్తం స్వహేతౌ లయమేతి వై ॥ 5 ॥**

ద్విజశ్రేష్ఠా! దానికి రెట్టింపు కాలమేదైతో ఉందో అది ప్రాకృతప్రళయమవుతుంది. ఆ సమయంలో ఈ సంపూర్ణవ్యక్తజగత్తు దానికి కారణమైన అవ్యక్తజగత్తులో లీనమవుతుంది.

**నిమేషో మానుషో యోఽయం మాత్రామాత్రాప్రమాణతః ।**
**తైః పంచదశభిః కాష్ఠా త్రింశత్ కాష్ఠాస్తథా కలా ॥ 6 ॥**

మనుష్యునియొక్క ఒక రెప్పపాటు కాలం మాత్ర (లేదా ఒక లఘువైన అక్షరాన్ని ఉచ్చరించడానికి పట్టే కాలం మాత్రం) అట్టి మాత్ర ప్రమాణం అనుసరించి పదిహేనుమాత్రలకాలం కాష్ఠ. ముప్పై కాష్ఠల కాలం ఒక కల.

**నాడికా తు ప్రమాణేన కలా దశ చ పంచ చ ।**
**ఉన్మానేనామ్భసః సా తు పలాన్యర్ధ త్రయోదశ ॥ 7 ॥**

పదిహేను కలల కాలం ఒక నాడిక అనబడుతుంది. నాడిక అనగా – పంద్రెండున్నర పలాల తూనిక గల రాగిపాత్రలో నీరు తీసుకోవాలి.

**హేమమాషైః కృతచ్ఛిద్రశ్చతుర్భిశ్చతురంగులైః ।**
**మాగధేన ప్రమాణేన జలప్రస్థస్తు స స్మృతః ॥ 8 ॥**

మాగధదేశప్రమాణంలో దానిని జలప్రస్థమంటారు. అందు నాలుగు అంగుళాల పొడవు,నాలుగు బంగారుపూసల శలాకల (ఐదు గురిగింజపూసల ఎత్తు) ప్రమాణంతో రంధ్రాలు చేయాలి. ఆ నీరు ఎంత సమయంలో ఆ రంధ్రాలగుండా క్రిందపడుతుందో ఆ సమయానికి నాడిక అని పేరు.

**నాడికాభ్యామథ ద్వాభ్యాం ముహూర్తో ద్విజసత్తమ! ।**
**అహోరాత్రం ముహుర్తాస్తు త్రింశన్మాసో దినైస్తథా ॥ 9 ॥**

ద్విజశ్రేష్ఠా! ఈ ప్రకారంగా రెండు నాడికల కాలం ఒక ముహూర్తం అనబడుతుంది. అటువంటి ముప్పై ముహూర్తాల సమయం ఒక అహోరాత్రం అవుతుంది. (1రోజు 48×30=1440ని॥ 1440÷60=24 గం॥ల కాలం) ముప్పై రోజుల కాలం ఒక మాసం.

**మాసైర్ద్వాదశభిర్వర్ష మహోరాత్రం తు తద్దివి ।**
**త్రిభిర్వర్షశతైర్వర్షం షష్ట్యా చైవాసురద్విషామ్ ॥ 10 ॥**

అట్టి పంద్రెండు మాసాల సమయం ఒక సంవత్సరం. అది దేవలోకంలో ఒక రోజు. 360 మానవసంవత్సరాలు దేవతలకు ఒక దివ్యవత్సరమవుతుంది.

**తైస్తు ద్వాదశసాహస్రై శ్చతుర్యుగముదాహృతమ్ ।**
**చతుర్యుగసహస్రం తు కథ్యతే బ్రహ్మణో దినమ్ ॥ 11 ॥**

పంద్రెండువేల దివ్యసంవత్సరాలు ఒక చతుర్యుగం అనబడుతుంది. అటువంటి వేయి చతుర్యుగాలు బ్రహ్మకు ఒక పగలు అవుతుంది.

**స కల్పోఽ పృత్ర మనవశ్చతుర్దశ మహామునే! ।**
**తదన్తే చైవ మైత్రేయ! బ్రాహ్మో నైమిత్తికో లయః ॥ 12 ॥**

మహామునీ! బ్రహ్మ పగటి సమయానికే కల్పమని పేరు. అందు పద్నాలుగురు మనువులు ఉంటారు. మైత్రేయా! ఆ కల్పాంతంలో జరిగే ప్రళయానికే బ్రహ్మప్రలయమని పేరు. దానికే నైమిత్తిక ప్రలయమని పేరు.

**తస్య స్వరూపమత్యుగ్రం మైత్రేయ! గదతో మమ! ।**
**శృణుష్వ ప్రాకృతం భూయ స్తవ వక్ష్యామ్యహం లయమ్ ॥ 13 ॥**

మైత్రేయా! ఆ లయ స్వరూపం మహాభయంకరమైనది. దానిని నీకు తెలియజేస్తాను విను. అటుపైన నేను నీకు ప్రాకృతప్రలయాన్ని గురించి వివరిస్తాను.

**చతుర్యుగసహస్రాన్తే క్షీణప్రాయే మహీతలే ।**
**అనావృష్టిరతీవోగ్రా జాయతే శతవార్షికీ ॥14॥**

బ్రహ్మ పగటి కాలమైన వేయి చతుర్యుగాలు చివరి సమయంలో భూమండలం ఇంచు మించుగా నశించిపోతుంది. మిక్కిలి భయం కలిగించే అనావృష్టి నూరేండ్ల కాలం కొనసాగుతుంది.

**తతో యాన్యల్పసారాణి తాని సత్త్వాన్యశేషతః ।**
**క్షయం యాన్తి మునిశ్రేష్ఠ! పార్థివాన్యనుపీడనాత్ ॥ 15 ॥**

మునిశ్రేష్ఠా! ఆ సమయంలో సమస్తజీవులు తక్కువ సత్తువ కలవైపోతాయి. అనావృష్టిపీడతో పార్థివజీవులన్నీ నశించిపోతాయి.

**తతః స భగవాన్ విష్ణు రుద్రరూపధరోఽవ్యయః ।**
**క్షయాయ యతతే కర్తుమాత్మస్థాః సకలాః ప్రజాః ॥ 16 ॥**

అప్పుడు ఆ భగవంతుడైన విష్ణువు అవ్యయుడై, రుద్రరూపం దాల్చి తనయందున్న సమస్త ప్రాణులను లీనం చేసుకోవడానికై ప్రయత్నం చేస్తూంటాడు.

**తతః స భగవాన్ విష్ణుర్భానోః సప్తసు రశ్మిషు ।**
**స్థితః పిబత్యశేషాణి జలాని మునిసత్తమ! ॥ 17 ॥**

మునిశ్రేష్ఠా! అంత ఆ భగవంతుడైన మహావిష్ణువు సూర్యుని ఏడు కిరణాలలోను ఉన్నవాడై సమస్త జలాలను తాగివేస్తాడు.

**పీత్వామ్భాంసి సమస్తాని ప్రాణిభూమిగతాని వై ।**
**శోషం నయతి మైత్రేయ! సమస్తం పృథివీతలమ్ ॥ 18 ॥**

మైత్రేయా! అపుడు భూమియందున్న సమస్తప్రాణులలోగల జలాన్ని, భూగతజలాలను త్రాగివేసి సమస్త పృథివీ మండలాన్ని ఎండింపజేస్తాడు.

**సరిత్సముద్రశైలేషు శైలప్రస్రవణేషు చ ।**
**పాతాలేషు చ యత్తోయం తత్సర్వం నయతి క్షయమ్ ॥ 19 ॥**

నదులు,సముద్రాలు,పర్వతాలు,సెలయేళ్ళు,విభిన్న పాతాళాలు వీటియందు ఏ జలాలు ఉన్నాయో వాటినన్నింటిని నాశనం పొందిస్తాడు.

**తతస్తస్యానుభావేన తోయాహారోపబృంహితాః ।**
**త ఏవ రశ్మయః సప్త జాయన్తే సప్త భాస్కరాః ॥ 20 ॥**

అంతట ఆ విష్ణుప్రభావంవల్లనే ఉదకాన్ని ఆహారంగా స్వీకరించిన ఆ ఏడు కిరణాలే ఏడు సూర్యులైపోతాయి.

**అధశ్చోర్ధ్వం చ తే దీప్తా స్తతః సప్త దివాకరాః ।**
**దహన్త్యశేషం త్రైలోక్యం స పాతాలతలం ద్విజ! ॥ 21 ॥**

ద్విజోత్తమా! అప్పుడు పైకి క్రిందికి దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఏడుగురు సూర్యులు పాతాలపర్యంతం మూడు లోకాలను సమస్తం బూడిద చేస్తారు.

**దహ్యమానం తు తై ర్దీప్తై స్త్రైలోక్యం ద్విజ!భాస్కరైః ।**
**సాద్రినద్యర్ణవాభోగం నిఃస్నేహమభిజాయతే ॥ 22 ॥**

ద్విజవర్యా! ఆ ఏడుగురు భాస్కరులు మండిపోతూ మూడు లోకాలను దహించివేస్తుండగా పర్వతాలు,నదులు,సముద్రాలు రసహీనాలైపోతాయి. (నీరు లేకుండా ఎండిపోతాయి)

**తతో నిర్దగ్ధవృక్షామ్బు త్రైలోక్యమఖిలం ద్విజ! ।**
**భవత్యేషా చ వసుధా కూర్మపృష్ఠోపమాకృతిః ॥ 23 ॥**

ద్విజశ్రేష్ఠా! ఆ సమయంలో మూడు లోకాలలోని సమస్త వృక్షాలు, జలాలు మున్నగునవి దగ్ధమైపోగా, భూమి, తాబేలు యొక్క పృష్ఠభాగమైన పెద్ద డిప్పలాగా అయిపోతుంది.

**తతః కాలాగ్నిరుద్రోఽసౌ భూత్వా సర్వహరో హరిః ।**
**శేషనిఃశ్వాససమ్భూతః పాతాలాని దహత్యధః ॥ 24 ॥**

అపుడు సర్వమును హరించే హరి ప్రలయకాలాగ్నిరుద్రుడై ఆదిశేషుని నిఃశ్వాసాల నుంచి పుట్టినవాడై క్రిందనున్న పాతాలాలను దహించివేస్తాడు.

**పాతాలాని సమస్తాని స దగ్ధ్వా జ్వలనో మహాన్ ।**
**భూమి మభ్యేత్య సకలం హినస్తి వసుధాతలమ్ ॥ 25 ॥**

ఆ మహాభయంకరాగ్ని సమస్తపాతాలలోకాలను దహించి వేసి, భూమిని సమీపించి సమస్త భూమండలాన్ని భస్మం చేసేస్తుంది.

**భువర్లోకం తతస్సర్వం స్వర్లోకం చ సుదారుణః ।**
**జ్వాలామాలామహావర్త స్తత్రైవ పరివర్తతే ॥ 26 ॥**

అప్పుడు ఆ దారుణమైన అగ్ని భువర్లోకాన్ని (అంతరిక్షాన్ని), స్వర్గలోకాన్ని జ్వాలాపంక్తులచే గొప్ప సుడులుగా (సంవర్తకాగ్నిచే) తిరుగుతూ జ్వలింపజేస్తూ అక్కడే పరిభ్రమిస్తూ ఉంటుంది.

**అమ్బరీషమివాభాతి త్రైలోక్యమఖిలం తదా ।**
**జ్వాలావర్తపరీవార ముపక్షీణచరాచరమ్ ॥ 27 ॥**

ఈ విధంగా సుడులు తిరుగుతున్న అగ్నిజ్వాలలచే సమస్తచరాచరాలు నశించిపోగా, సమస్తత్రైలోక్యం తపించిపోగా, అన్ని వస్తువులను వేయించే మంగళంలాగా అయిపోతుంది.

**తతస్తాపపరీతాస్తు లోకద్వయనివాసినః ।**
**కృతాధికారా గచ్ఛన్తి మహర్లోకం మహామునే! ॥ 28 ॥**

మహామునీ! ఆ సమయంలో భువర్లోకంలో స్వర్గలోకంలో నివసించే అధికారాలు కల్గిన మనువులు మున్నగు మహాత్ముల గణాలు ఆ ప్రచండాగ్నితాపానికి తట్టుకోలేక తపించి మహర్లోకం చేరుకొంటారు.

**తస్మాదపి మహాతాపతప్తా లోకాత్తతః పరమ్ ।**
**గచ్ఛన్తి జనలోకం తే దశావృత్త్యా పరైషిణః ॥ 29 ॥**

అక్కడకూడా ఆ కాలానలజ్వాలా మహాతాపాన్ని తట్టుకోలేక రక్షణకోసమై ఆ మహర్లోకానికి పైనున్న జనలోకానికి ఆ పరలోక నివాసపరాయణులు చేరుకొంటారు.

**తతో దగ్ధ్వా జగత్ సర్వం రుద్రరూపో జనార్దనః ।**
**ముఖనిఃశ్వాసజాన్ మేఘాన్ కరోతి మునిసత్తమ! ॥ 30 ॥**

మునిశ్రేష్ఠా! అనంతరం రుద్రరూపి ఐన జనార్దనుడు సమస్తజగత్తును దగ్ధం కావించి తన ముఖం నుంచి వెలువడే నిఃశ్వాసవాయువులచే మేఘాలను ఉత్పన్నం చేస్తాడు.

**తతో గజకులప్రఖ్యా స్తటిత్వన్తో నినాదినః ।**
**ఉత్తిష్ఠన్తి తదా వ్యోమ్ని ఘోరాః సంవర్తకా ఘనాః ॥ 31 ॥**

అపుడు మెరుపుతీగలతో కూడుకొన్న భయంకర గర్జనలు చేసే, గజసమూహాలతో సమానమైన సంవర్తకాలు అనే పేరు గల భీతిని కలుగజేసే దట్టమైన మేఘాలు ఆకాశంలో ఒక్కసారి వ్యాపిస్తాయి.

**కేచిన్నీలోత్పలశ్యామాః కేచిత్ కుముదసన్నిభాః ।**
**ధూమ్రవర్ణా ఘనాః కేచిత్ కేచిత్ పీతా పయోధరాః ॥ 32 ॥**

ఆ మేఘాలు కొన్ని నల్లకలువలాగా నీలవర్ణం కలవి. కొన్ని తెల్లకలువలులాగా ఉంటాయి. కొన్ని ఎర్రని కాంతి కలవి. కొన్ని మేఘాలయితే పచ్చగా ఉంటాయి.

**కేచిద్రాసభవర్ణాభా లాక్షారసనిభాస్తథా ।**
**కేచిద్వైదూర్యసంకాశా ఇంద్రనీలనిభాః పరే ॥ 33 ॥**

కొన్ని బూడిదరంగుకలవి. కొన్ని లత్తుకరసంవలె ఎర్రగా ఉండేవి. కొన్ని వైదూర్యమణులవలె భాసించేవి. కొన్ని ఇంద్రనీలమణులవలె ప్రకాశించేవి.

**శంఖకుందనిభాశ్చాన్యే జాత్యంజననిభాస్తథా ।**
**ఇన్ద్రగోపనిభాః కేచిన్మనఃశిలనిభాస్తథా ॥ 34 ॥**

కొన్ని శంఖాలవలె మొల్లలు(మల్లెలు) లాగా ఉండేవి. కొన్ని నల్లని కాటుకలాగా ఉండేవి. కొన్ని ఆర్ద్రపురుగులవంటివి. కొన్ని మనఃశిలలుగా ఉండేవి.

**చాషపత్రనిభాః కేచిదుత్తిష్ఠన్తి మహాఘనాః ।**
**కేచిత్పురవరాకారాః కేచిత్ పర్వతసన్నిభాః ॥ 35 ॥**

కొన్ని పాలపిట్టరెక్కలులాగే ఉండేవి, కొన్ని పెద్ద పెద్ద నగరాలులాగా ఉండేవి. కొన్ని పర్వత పరిమాణంలో ఉండేవి ఐన గొప్పమేఘాలు ఒక్కసారిగా పైకి లేస్తాయి.

**కూటాగారనిభాశ్చాన్యే కేచిత్ స్థూలనిభా ఘనాః ।**
**మహారావా మహాకాయాః పూరయన్తి నభస్తలమ్ ॥ 36 ॥**

కొన్ని కూటాగారాలతో సమానమైనవి, కొన్ని బృహదాకారం ధరించినట్టివి. ఇట్టివి భయంకర ధ్వనులు గావిస్తూ, మిక్కిలి పెద్దవైన రూపాలు ధరించి ఆకాశభాగాన్ని నిండిపోతాయి.

**వర్షన్తస్తే మహాసారాం స్తమగ్నిమతిభైరవమ్ ।**
**శమయన్త్యఖిలం విప్ర! త్రైలోక్యాన్తర విస్తృతమ్ ॥ 37 ॥**

విప్రోత్తమా! ఆ మేఘాలు పెద్ద పెద్ద ధారలతో వర్షిస్తూ మూడు లోకాలను వ్యాపించియున్న అతి భయంకరమైన అగ్నిని శాంతింపజేస్తాయి.

**నష్టే చాగ్నౌ శతం తేఽపి వర్షాణామనివారితాః ।**
**ప్లావయన్తో జగత్ సర్వం వర్షన్తి మునిసత్తమ! ॥ 38**

మునిశ్రేష్ఠా! ఆ మేఘసమూహాలు ఆ ప్రజ్వలితాగ్ని శాంతించేలా నూరేండ్లపాటు ఎడతెరిపిలేకుండా వర్షం కురుస్తూ సమస్తజగత్తును ముంచెత్తుతాయి.

**ధారాభిరతిమాత్రాభిః ప్లావయిత్వాఽఖిలం భువమ్ ।**
**భువర్లోకం తథైవోర్ధ్వం ప్లావయన్తి దివం ద్విజ! ॥ 39**

ద్విజోత్తమా! అవి మిక్కిలి ప్రమాణం కలిగిన ధారలచే భూమినంతా ముంచెత్తి, పైనున్న భువర్లోకాన్ని, స్వర్గలోకాన్ని కూడా ముంచివేస్తాయి.

**అన్ధకారీ కృతే లోకే నష్టే స్థావరజంగమే ।**
**వర్షన్తి తే మహామేఘా వర్షాణామధికం శతమ్ ॥ 40**

ఆ మహామేఘాలు చరాచారాత్మక జగత్తు అంతా నష్టం కాగా, లోకం అంధకారబంధురమైపోగా నూరు వర్షాలకు పైగా వర్షిస్తూనే ఉంటాయి.

**ఏవం భవతి కల్పాన్తే సమస్తం మునిసత్తమ! ।**
**వాసుదేవస్య మాహాత్మ్యా న్నిత్యస్య పరమాత్మనః ॥ 41**

మునిశ్రేష్ఠా! కల్పాంతంలో నిత్యుడు, వాసుదేవుడు అయిన పరమాత్మయొక్క మహిమవల్ల అంతా ఇలా జరుగుతుంది- అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే షష్ఠాంశే నిమేషాది కాలమానం - నైమిత్తిక ప్రలయవర్ణనం చేతి తృతీయోఽధ్యాయః సమాప్తః ॥ 3 ॥**

శ్రీవిష్ణుపురాణంలో షష్ఠాంశంలో నిమేషాది కాలమానం - నైమిత్తిక ప్రలయవర్ణన అనే మూడవ అధ్యాయం సమాప్తం ॥ 3 ॥



## చతుర్థోఽధ్యాయః - నాల్గవ అధ్యాయం

## ప్రాకృత ప్రలయవర్ణనమ్ - ప్రాకృత ప్రలయవర్ణన

**శ్రీ పరాశర ఉవాచ :**-పరాశరుడు చెబుతున్నాడు.

**సప్తర్షిస్థానమాక్రమ్య స్థితేఽమ్భసి మహామునే! ।**
**ఏకార్ణవం భవత్యేవ త్రైలోక్యమఖిలం తతః ॥ 1 ॥**

మహామునీ! మైత్రేయా! సప్తర్షిమండలాన్నికూడా ఆక్రమించి నీరు అంతా ముంచెత్తి ఉండగా, ఆ సమయంలో మూడు లోకాలు కూడా ఏకార్ణవం (ఒకే సముద్రంలాగా) అయిపోతాయి.

**ముఖనిఃశ్వాసజో విష్ణోర్వాయుస్తాన్ జలదాంస్తతః ।**
**నాశయన్వాతి మైత్రేయ! వర్షాణామపరం శతమ్ ॥ 2 ॥**

మైత్రేయా! అంతట విష్ణుముఖంనుంచి వెలువడిన నిఃశ్వాసాలనుండి పుట్టిన వాయువు ఆ మేఘాలను చెల్లాచెదరు చేస్తూ ఒక వంద సంవత్సరాలపాటు ఒకే రీతిగా వీస్తుంది.

**సర్వభూతమయోఽచిన్త్యో భగవాన్ భూతభావనః ।**
**అనాదిరాదిర్విశ్వస్య పీత్వా వాయుమశేషతః ॥ 3 ॥**
**ఏకార్ణవే తతస్తస్మిన్ శేషశయ్యాస్థితః ప్రభుః ।**
**బ్రహ్మరూపధరః శేతే భగవానాదికృద్ధరిః ॥ 4 ॥**

సర్వభూతమయుడు, ఊహకందనివాడు, భగవంతుడు, భూతభావనుడు, అనాది అయినవాడు,విశ్వానికి ఆది అయినవాడు ఆ వాయువునంతా త్రాగి(పీల్చి)వైచి, ఆ సమయంలో ఏకార్ణవంలో శేషశయ్యాగతుడై, ప్రభువైన ఆదికర్తయగు శ్రీహరియే భగవంతుడగు బ్రహ్మరూపధారియై నిదురిస్తాడు.

**జనలోకగతైః సిద్ధైః సనకాద్యైరభిష్టుతః ।**
**బ్రహ్మలోకగతైశ్చైవ చిన్త్యమానో ముముక్షుభిః ॥ 5 ॥**

**ఆత్మామాయామయీం దివ్యాం యోగనిద్రాం సమాస్థితః ।**
**ఆత్మానం వాసుదేవాఖ్యం చిన్తయన్ పరమేశ్వరః ॥ 6 ॥**

అపుడు జనలోకంలో ఉన్న సిద్ధులచేత, బ్రహ్మలోకంలో ఉన్న సనకాదులచేత కొనియాడబడుతూ, ముముక్షువులచే ధ్యానించబడుతూ తన దివ్యమాయారూపమైన యోగనిద్రను ఆశ్రయించి మధుసూదనుడు తన వాసుదేవాత్మకస్వరూపాన్ని ధ్యానించుకొంటూ పరుండి ఉండిపోతాడు.

**ఏష నైమిత్తికో నామ మైత్రేయ! ప్రతిసంచరః ।**
**నిమిత్తం తత్ర యచ్ఛేతే బ్రహ్మరూపధరో హరిః ॥ 7 ॥**

మైత్రేయా! ఇది నైమిత్తికమనే ప్రలయం అనబడుతుంది. బ్రహ్మస్వరూపధరుడైన హరి ఆ సమయంలో నిద్రించడమే నిమిత్తంగా దీనికి ఆపేరు వచ్చింది.

**యదా జాగర్తి విశ్వాత్మా స తదా చేష్టతే జగత్ ।**
**నిమీలత్యేతదఖిలం మాయాశయ్యాం గతేఽచ్యుతే ॥ 8 ॥**

ఆ విశ్వాత్ముడు మేలుకొన్నపుడు జగత్తు క్రియావ్యాపారంలో సమర్థమవుతుంది. ఆ అచ్యుతుడు మాయానిద్రాగతుడైయుండగా ఈ అఖిలజగత్తు కనుమూసి ఉంటుంది.

**పద్మయోనేర్దినం యత్తు చతుర్యుగసహస్రవత్ ।**
**ఏకార్ణవాప్లుతే లోకే తావతీ రాత్రిరిష్యతే ॥ 9 ॥**

ఏ వేయి చతుర్యుగాలకాలం పద్మగర్భునకు ఒక పగలై ఉందో, లోకమంతా ఏకార్ణవీకృతమై ఉండగా అంతే వేయి చతుర్యుగాలు రాత్రి సమయం అవుతుంది.

**తతః ప్రబుద్ధో రాత్ర్యన్తే పునః సృష్టిం కరోత్యజః ।**
**బ్రహ్మస్వరూపధృగ్ విష్ణుర్యథా తే కథితం పురా ॥ 10 ॥**

అనంతరం రాత్రి గడచిపోయిన పిమ్మట బ్రహ్మ మేల్కొని ఆ బ్రహ్మస్వరూపధరుడైన విష్ణువు తిరిగి పూర్వంలో నీకు చెప్పినట్లుగా యథాప్రకారంగా సృష్టి చేస్తాడు.

**ఇత్యేష కల్పసంహార శ్చాన్తరః ప్రలయో ద్విజ! ।**
**నైమిత్తికస్తే కథితః ప్రాకృతం శృణ్వతః పరమ్ ॥ 11 ॥**

ద్విజోత్తమా! ఇదే కల్పసంహారం, అవాంతరప్రలయం, నైమిత్తిక ప్రలయం అనబడుతుంది. ఇది నీకు తెలియజెప్పాను. ఇటుపైన ప్రాకృతప్రలయం వివరిస్తాను ఆలకించు.

**అనావృష్ట్యాగ్ని సమ్పర్కాత్ కృతే సంక్షాళనే మునే! ।**
**సమస్తేష్వేవ లోకేషు పాతాలేష్వఖిలేషు చ ॥ 12 ॥**

**మహదాదేర్వికారస్య విశేషాన్తస్య సంక్షయే ।**
**కృష్ణేచ్ఛాకారితే తస్మిన్ ప్రవృత్తే ప్రతిసంచరే ॥ 13 ॥**

**ఆపో గ్రసన్తి వై పూర్వం భూమేర్గన్ధాత్మకం గుణమ్ ।**
**ఆత్తగన్ధా తతో భూమిః ప్రలయత్వాయ కల్పతే ॥ 14 ॥**

మునీశ్వరా! అనావృష్టి, అగ్ని మున్నగు వాటివల్ల సమస్తలోకాలు, సకలపాతాలాలు నశించిపోగా, మహత్తత్వం మొదలుకొని విశేషపర్యంతం(పృథివీతత్త్వాది సమస్త వికారాలు) క్షీణించిపోగా, భగవంతుని ఇచ్ఛానుసారంగా ప్రలయకాలం సమీపించగా, మొట్ట మొదటిగా ఉదకాలు భూమిసంబంధమైన గంధగుణాన్ని తమలో లీనం చేసుకొంటాయి. ఎప్పుడు భూమి గంధగుణం నష్టం చెందుతుందో, అప్పుడు పృథివి ప్రలయం చెందుతుంది.

**ప్రణష్టే గన్ధతన్మాత్రేఽభవత్ పృథ్వీ జలాత్మికా ।**
**రసాజ్జలం సముద్భూతం తస్మాజ్జాతం రసాత్మకమ్ ॥ 15 ॥**

గంధతన్మాత్ర నశించిపోగా పృథివి జలమయమై పోతుంది. రసంనుంచి జలం పుడుతుంది. అందువల్లనే జలం రసాత్మకమై ఉంటుంది.

**ఆపస్తదా ప్రవృద్ధాస్తు వేగవత్యో మహాస్వనాః ।**
**సర్వమాపూరయన్తీదం తిష్ఠన్తి విచరన్తి చ ।**
**సలిలేనైవోర్మిమతా లోకా వ్యాప్తాః సమన్తతః ॥ 16 ॥**

ఆ సమయంలో మిక్కిలి వేగంతో ఘోరశబ్దం చేస్తూ,వృద్ధి పొందుతూ, ఈ సంపూర్ణజగత్తును నింపివేస్తూ ఆ జలాలు కొంతకాలంపాటు అలా ఉండిపోతాయి. మరికొంతసేపు చలిస్తాయి. ఆ సలిలంనుంచే పెద్ద పెద్ద తరంగాలు ఉద్భవించి లోకాలన్నీ వ్యాపిస్తాయి.

**అపామపి గుణో యస్తు జ్యోతిషా పీయతే తు సః ।**
**నశ్యన్త్యాపస్తతస్తాశ్చ రసతన్మాత్ర సంక్షయాత్ ॥ 17 ॥**

అనంతరం జలాలయొక్క గుణమైన రసాన్ని తేజస్సు తనలో లీనం చేసుకొంటుంది. రసతన్మాత్ర నశించిపోగా జలాలు నష్టమైపోతాయి.

**తతశ్చాపో హృతరసా జ్యోతిషం ప్రాప్నువన్తి వై ।**
**అగ్న్యవస్థే తు సలిలే తేజసా సర్వతో వృతే ॥ 18 ॥**

అపుడు రసహీనమైన జలమండలం తేజస్సులో కలిసిపోతుంది. ఆ తరువాత అగ్నిలో ప్రవేశించిన సలిలంవల్ల తేజస్సు మిక్కిలి ప్రబలి సమస్తం వ్యాపిస్తుంది.

**స చాగ్నిః సర్వతో వ్యాప్య ఆదత్తే తజ్జలం తదా ।**
**సర్వమాపూర్య తేజోభి స్తదా జగదిదం శనైః ॥ 19 ॥**

ఆ అగ్ని సర్వం వ్యాపిస్తూ జలమండలాన్ని పూర్తిగా గ్రసించి క్రమక్రమంగా తన తేజస్సులచే సమస్త జగత్తులను నిండిపోతుంది.

**అర్చిర్భిః సంవృతే తస్మిన్ తిర్యగూర్ధ్వమధస్తథా ।**
**జ్యోతిషోఽపి పరం రూపం వాయురత్తి ప్రభాకరమ్ ॥ 20 ॥**

ఏ సమయంలో సమస్తం పైన కింద అన్ని ప్రక్కల అగ్నిశిఖలు వ్యాపించివేస్తాయో, ఆ సమయంలో వాయువు కాంతులీనే మహాగ్నిని తనలో లీనం చేసుకొంటుంది.

**ప్రలీనే చ తతస్తస్మిన్ వాయుభూతేఽఖిలాత్మని ।**
**ప్రణష్టే రూపతన్మాత్రే హృతరూపో విభావసుః ॥ 21 ॥**

నిఖిలప్రాణస్వరూపమైన వాయువునందు అపుడు అగ్ని ప్రకాశకరూపం లీనం కాగా, రూపతన్మాత్ర కూడా నశించిపోగా, అగ్ని రూపహీనమై పోతుంది.

**ప్రశామ్యతి తదా జ్యోతి ర్వాయుర్దోధూయతే మహాన్ ।**
**నిరాలోకే తదా లోకే వాయ్వవస్థే చ తేజసి ॥ 22 ॥**

ఆ సమయంలో తేజస్సమూహం నష్టమైపోగా సమస్తభువనం ప్రచండవాయుమయమైపోతుంది. అపుడు లోకంలో వాయువునందు అగ్ని లీనమైపోయి కనబడకుండా పోతుంది.

**తతస్తు మూలమాసాద్య వాయుః సమ్భవమాత్మనః ।**
**ఊర్ధ్వం చాధశ్చ తిర్యక్ చ దోధవీతి దిశో దశ ॥ 23 ॥**

అనంతరం ప్రచండవాయువు తన ఉద్భవానికి మూలకారణమైన ఆకాశాన్ని ఆశ్రయించి పైకి, క్రిందకు, అన్ని ప్రక్కలకు దశ దిశలయందు మహావేగంతో విసరివేస్తుంది.

**వాయోరపి గుణం స్పర్శమాకాశో గ్రసతే పునః ।**
**ప్రశామ్యతి తతో వాయుః స్వం తు తిష్ఠత్యనావృతమ్ ॥ 24 ॥**

అటు తర్వాత వాయువు యొక్క స్పర్శగుణాన్ని ఆకాశం లీనం చేసుకొంటుంది. అపుడు వాయువు శాంతిస్తుంది. ఆకాశం కూడా ఆవరణహీనం అవుతుంది.

**అరూపమరసస్పర్శమగన్ధం న చ మూర్తిమత్ ।**
**సర్వమాపూరయచ్చైవ సుమహత్ సమ్ప్రకాశతే ॥ 25 ॥**

ఆ సమయంలో రూపం, రసం, స్పర్శ, గన్ధం ఆకారం లేని ఒక గొప్ప స్థితిలో ఆకాశం అనే మహాభూతం సర్వం నిండిపోతూ ప్రకాశిస్తుంది.

**పరిమణ్డలం తచ్ఛుషిర మాకాశం శబ్దలక్షణమ్ ।**
**శబ్దమాత్రం తదాకాశం సర్వమావృత్య తిష్ఠతి ॥ 26 ॥**

ఆ సమయంలో నాలుగు ప్రక్కల తన స్థితిని చెడగొట్టుకొన్నదై శబ్దగుణకమైన ఆకాశం కేవలం శబ్దమే మాత్రగా గలదై సర్వం ఆవరించి ఉంటుంది.

**తతః శబ్దగుణం తస్య భూతాదిర్గ్రసతే పునః ।**
**భూతేన్ద్రియేషు యుగపత్ భూతాదౌ సంస్థితేషు వై ॥ 27 ॥**

అనంతరం ఆకాశంయొక్క శబ్దతన్మాత్రను భూతాది గ్రసించివేస్తుంది. ఈ భూతాదిలో ఒకేసారి పంచభూతాలు, ఇంద్రియాలు లయమైపోతాయి.

**అభిమానాత్మకో హ్యేష భూతాదిస్తామసః స్మృతః ।**
**భూతాదిం గ్రసతే చాపి మహాన్ వై బుద్ధిలక్షణః ॥ 28 ॥**

అభిమానాత్మకమైన ఈభూతాదియే తామసం(తామసాహంకారం) అనబడుతుంది. మరల ఆ భూతాదినికూడా (సత్త్వప్రధానమైన) బుద్ధిరూపమహత్తత్త్వం గ్రసించి వేస్తుంది.

**ఉర్వీ మహాంశ్చ జగతః ప్రాన్తేఽన్తర్బాహ్యతస్తథా ॥ 29 ॥**

ఈ విధంగా పృథ్వి, మహత్తత్త్వం, బ్రహ్మాండంయొక్క అంతర్జగత్తుకు అంతిమమైన, బాహ్యమైన సరిహద్దులై ఉన్నాయి.

**ఏవం సప్త మహాబుద్ధే! క్రమాత్ ప్రకృతయస్తు వై ।**
**ప్రత్యాహారే తు తాః సర్వాః ప్రవిశన్తి పరస్పరమ్ ॥ 30 ॥**

మహాబుద్ధిమంతుడైన మైత్రేయా! ఈవిధంగా ఏడు ఆవరణలు(ప్రకృతులు) ప్రలయకాలంలో ఒకదానిలో ఒకటి ఒక క్రమపద్ధతిలో (పృథివి మున్నగునవి తమ కారణంలో) అన్నీ లీనమైపోతాయి.

**యేనేదమావృతం సర్వమణ్డమప్సు ప్రలీయతే ।**
**సప్తద్వీప సముద్రాన్తం సప్తలోకం సపర్వతమ్ ॥ 31 ॥**

దేనితో ఈ అండాకారకమైన జగత్తు ఆవరించబడియున్నదో, అదంతా సప్తద్వీపాలు, సప్తసముద్రాలు, సప్తలోకాలు, సకలపర్వతశ్రేణులు అన్నిటితోపాటు జలాలలో లీనమైపోతుంది.

**ఉదకావరణం యత్తు జ్యోతిషా పీయతే తు తత్ ।**
**జ్యోతిర్వాయౌ లయం యాతి యాత్యాకాశే సమీరణః ॥ 32 ॥**

ఆ ఉదకావరణాన్ని తేజస్సు త్రాగుతుంది. ఆ తేజస్సు ఆవరణం వాయువులో లయించి పోతుంది. ఆ సమీరణావరణం ఆకాశంలో లీనమవుతుంది.

**ఆకాశం చైవ భూతాది ర్గ్రసతే తం తదా మహాన్ ।**
**మహాన్తమేభిః సహితం ప్రకృతిర్గ్రసతే ద్విజ! ॥ 33 ॥**

ద్విజవర్యా! ఆకాశావరణాన్ని భూతాది మ్రింగివేస్తుంది. ఆ భూతాదిని మహత్తత్త్వం గ్రసిస్తుంది. వీటినన్నింటితోను కూడికొనియున్న మహత్తత్త్వాన్ని ప్రకృతి లీనం చేసుకొంటుంది.

**గుణసామ్యమనుద్రిక్త మన్యూనం చ మహామునే ।**
**ప్రోచ్యతే ప్రకృతిర్హేతుః ప్రధానం కారణం పరమ్ ॥ 34 ॥**

మహామునీ! తక్కువ ఎక్కువ అనేవి ఏమీ లేకుండా సత్త్వరజస్తమో గుణాలు మూడును సామ్యావస్థలో ఉండగా, దానిని ప్రకృతి అనే పేరుతో వ్యవహరిస్తారు. దీనినే ప్రధానమని పిలుస్తారు. ఈ ప్రధానమే సంపూర్ణ జగత్తుకు పరమకారణమవుతుంది.

**ఇత్యేషా ప్రకృతిః సర్వా వ్యక్తావ్యక్తస్వరూపిణీ ।**
**వ్యక్తస్వరూపమవ్యక్తే తస్మిన్ మైత్రేయ లీయతే! ॥ 35 ॥**

మైత్రేయా! ఈ విధంగా ఈ ప్రకృతి అంతా వ్యక్తావ్యక్తస్వరూపమై ఉంటుంది. లయసమయంలో వ్యక్తస్వరూపం అవ్యక్తంలో లీనమైపోతుంది.

**ఏకః శుద్ధోఽక్షరో నిత్యః సర్వవ్యాపీ తథా పుమాన్ ।**
**సోఽప్యంశః సర్వభూతస్య మైత్రేయ! పరమాత్మనః ॥ 36 ॥**

మైత్రేయా! ఆ ఏకము శుద్ధము, అక్షరము, నిత్యము, సర్వవ్యాపి అయిన పురుషుడే సర్వభూతాత్మకుడైన పరమాత్మయొక్క అంశమయింది.

**న సన్తి యత్ర సర్వేశే నామజాత్యాదికల్పనాః ।**
**సత్తామాత్రాత్మకే జ్ఞేయే జ్ఞానాత్మన్యాత్మనః పరే ॥ 37 ॥**

**తద్బ్రహ్మ పరమం ధామ పరమాత్మా స చేశ్వరః ।**
**స విష్ణు స్సర్వమేవేదం యతో నావర్తతే యతిః ॥ 38 ॥**

ఏ విధంగా సత్తామాత్ర స్వరూపమైన ఆత్మనుండి(దేహాదిసంఘాతం నుండి) జ్ఞానాత్మ వేరే విధంగా ఉన్నట్లుగా తెలియబడుతుందో, అదే రీతిగా సర్వేశ్వరునిలో నామం,జాతి మున్నగు కల్పనలు లేని శుద్ధ బ్రహ్మస్వరూపం ద్యోతకమవుతుంది. అదే బ్రహ్మము. అదే పరంధామము, అదే పరమాత్మస్వరూపం, ఆయనే పరమేశ్వరుడు, ఆయనే మహావిష్ణువు. ఆ తత్త్వమే సర్వవిశ్వరూపంలో నిలిచియుంది. ఆ స్థానానికి చేరిన యోగిజనం తిరిగి సంసారంలోకి రానే రాదు.

**ప్రకృతిర్యా మయాఽఽఖ్యాతా వ్యక్తావ్యక్తస్వరూపిణీ ।**
**పురుషశ్చాప్యుభావేతౌ లీయేతే పరమాత్మని ॥ 39 ॥**

నేను నీకు ఏ వ్యక్తావ్యక్త స్వరూపిణి ఐన ప్రకృతిగురించి వివరించానో, ఆ ప్రకృతి పురుషుడు కూడా – ఈ రెండూ పరమాత్మలో లీనమైపోతాయి.

**పరమాత్మా చ సర్వేషామాధారః పరమేశ్వరః ।**
**విష్ణుర్నామ్నా స వేదేషు వేదాన్తేషు చ గీయతే ॥ 40 ॥**

ఆ పరమాత్మయే, ఆ సర్వాధారుడే, ఆ సర్వేశ్వరుడే విష్ణువు అనే పేరుతో వేదాలయందు, వేదాంతాలయందు కీర్తించబడ్డాడు.

**ప్రవృత్తం చ నివృత్తం చ ద్వివిధం కర్మ వైదికమ్ ।**
**తాభ్యాముభాభ్యాం పురుషైః సర్వమూర్తిః స ఇజ్యతే ॥ 41 ॥**

ప్రవృత్తిరూపం(కర్మయోగం) నివృత్తిరూపం(సాంఖ్యయోగం) అని వైదికమైన కర్మ రెండువిధాలు. ఈరెండు విధాల కర్మలు ఆచరించే పురుషులచే ఆ సర్వభూతస్వరూపుడు పూజించబడుతున్నాడు.

**ఋగ్యజుఃసామభిర్మార్గైః ప్రవృత్తై రిజ్యతే హ్యసౌ ।**
**యజ్ఞేశ్వరో యజ్ఞపుమాన్ పురుషైః పురుషోత్తమః ॥ 42 ॥**

ప్రవృత్తిమార్గాన్ని అవలంబించే పురుషులు ఋగ్యజుస్సామవేదమార్గాలద్వారా యజ్ఞేశ్వరుడు, యజ్ఞపురుషుడు అయిన పురుషోత్తముని పూజిస్తారు.

**జ్ఞానాత్మా జ్ఞానయోగేన జ్ఞానమూర్తిః స చేజ్యతే।**
**నివృత్తే యోగిభిర్మార్గే విష్ణుర్ముక్తి ఫలప్రదః ॥ 43 ॥**

నివృత్తిమార్గాన్ని స్వీకరించే యోగులు జ్ఞానయోగంద్వారా జ్ఞానాత్మ, జ్ఞానమూర్తి, ముక్తిఫలప్రదాత అయిన విష్ణుని ధ్యానిస్తారు.

**హ్రస్వదీర్ఘప్లుతైర్యత్తు కించిద్వస్త్వభిధీయతే ।**
**యచ్చ వాచామవిషయే తత్సర్వం విష్ణురవ్యయః ॥ 44 ॥**

హ్రస్వం,దీర్ఘం,ప్లుతం అనే స్వరాలచే ఏ వస్తువు కొంచెము వచించబడుతుందో, ఏ వస్తువు వేదవాక్కులకు కూడా గోచరం కాదో అదంతా అవ్యయమైన విష్ణుస్వరూపమే.

**వ్యక్తం స ఏవ చావ్యక్తం స ఏవ పురుషోఽవ్యయః ।**
**పరమాత్మా స విశ్వాత్మా విశ్వరూపధరో హరిః ॥ 45 ॥**

వ్యక్తమైనది ఆ స్వరూపమే. అవ్యక్తమైనది ఆ స్వరూపమే. అతడే పురుషోత్తముడు, అవ్యయుడు, పరమాత్మ, విశ్వాత్ముడు, విశ్వరూపధరుడు, అతడే శ్రీహరి.

**వ్యక్తావ్యక్తాత్మికా తస్మిన్ ప్రకృతిః సమ్ప్రలీయతే ।**
**పురుషశ్చాపి మైత్రేయ! వ్యాపిన్యవ్యాహతాత్మని ॥ 46 ॥**

మైత్రేయా! సర్వవ్యాపకమైన ఏ వికృతరూపం లేని పరమాత్మయందు వ్యక్తరూపమైన ప్రకృతి, అవ్యక్తరూపమైన పురుషుడు రెండూ లీనమైపోతాయి.

**ద్విపరార్ధాత్మకః కాలః కథితో యో మయా తవ ।**
**తదహస్తస్య మైత్రేయ! విష్ణోరీశస్య కథ్యతే ॥ 47 ॥**

మైత్రేయా! నేను నీకు ఏ ద్విపరార్ధకమైన కాలాన్నిగూర్చి తెలియజేసానో, అది ఆ సర్వేశ్వరుడైన విష్ణువుకు ఒక పగలు అవుతుంది.

**వ్యక్తే చ ప్రకృతౌ లీనే ప్రకృత్యాం పురుషే తథా ।**
**తత్ర స్థితే నిశా చాన్యా తత్ప్రమాణా మహామునే! ॥ 48 ॥**

మహామునీ! వ్యక్తజగత్తు అవ్యక్త ప్రకృతిలో లీనంకావడానికి, ప్రకృతి పురుషునిలో లయం కావడానికి ఎంత సమయం పడుతుందో, ఆ కాలం అంతే ప్రమాణం కలదై విష్ణుభగవానునికి రాత్రి అవుతుంది.

**నైవాహస్తస్య న నిశా నిత్యస్య పరమాత్మనః ।**
**ఉపచారస్తథాప్యేష తస్యేశస్య ద్విజోచ్యతే ॥ 49 ॥**

ద్విజోత్తమా! నిత్యుడైన పరమాత్మకు వాస్తవానికి పగలు,రాత్రి అన్నది లేనే లేదు. అయిన కేవలం ఔపచారికంగా ఆ పరమేశ్వరునకు ఈ కాలపరిగణనం చెప్పబడింది.

**ఇత్యేష! తవ మైత్రేయ! కథితః ప్రాకృతో లయః ।**
**ఆత్యన్తికమితో బ్రహ్మన్నిబోధ ప్రతిసంచరమ్ ॥ 50 ॥**

మైత్రేయా! ఈ రీతిగా నీకు ప్రాకృతప్రలయం గూర్చి తెలియజేశాను. బ్రాహ్మణోత్తమా! ఇకపైన ఆత్యంతిక ప్రలయాన్నిగూర్చి ఆలకించు అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే షష్ఠాంశే ప్రాకృత ప్రలయవర్ణనం నామ చతుర్థోఽధ్యాయః సమాప్తః ॥ 4 ॥**

శ్రీవిష్ణుపురాణంలో షష్ఠాంశంలో ప్రాకృత ప్రలయవర్ణన అనే నాలుగవ అధ్యాయం సమాప్తం. ॥ 4 ॥



## **పంచమోఽధ్యాయః - ఐదవ అధ్యాయం**

## **భగవతః పారమార్థికస్వరూపవర్ణనమ్ - భగవంతుని పారమార్థికస్వరూపవర్ణన**

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు పలికాడు.

**ఆధ్యాత్మికాది మైత్రేయ! జ్ఞాత్వా తాపత్రయం బుధః ।**
**ఉత్పన్నజ్ఞానవైరాగ్యః ప్రాప్నోత్యాత్యన్తికం లయమ్ ॥ 1 ॥**

మైత్రేయా! విద్వాంసుడైనవాడు ఆధ్యాత్మికం, ఆధిదైవికం,ఆధిభౌతికం అనే మూడు తాపత్రయాలను తెలుసు కొన్నవాడై జ్ఞానం,వైరాగ్యం ఉత్పన్నం కాగా ఆత్యంతిక ప్రలయాన్ని పొందినవాడవుతాడు.

**ఆధ్యాత్మికో వై ద్వివిధః శారీరో మానసస్తథా ।**
**శారీరో బహుభిర్భేదై ర్భిద్యతే శ్రూయతాం చ సః ॥ 2 ॥**

అందు ఆధ్యాత్మికతాపం రెండు విధాలు. శారీరకం,మానసికం అని. శారీరకమయితే పలు రకాలుగా విభేదాలతో కూడి యుంటుంది. వాటిని గూర్చి ఆలకించు.

**శిరోరోగప్రతిశ్యాయ జ్వరశూలభగన్దరైః ।**
**గుల్మార్శః శ్వయథుశ్వాసచ్ఛర్ద్యాదిభిరనేకధా ॥ 3 ॥**

శిరోరోగం(తలనొప్పి), ప్రతిశ్యాయ(పడిసెము), జ్వరం, శూలరోగం, భగందరం(గుహ్యస్థానంలో పుండు), గుల్మ(పైత్యంచే కడుపులో పుండు), అర్శ(మూలవ్యాధి), శ్వయథువు(వాపు), శ్వాస(ఒగర్పు), ఛర్ది(వాంతి) మున్నగు భేదాలచే అనేకవిధాలుగా ఉంటుంది.

**తథాఽక్షిరోగాతిసార కుష్ఠాంగామయసంజ్ఞితైః ।**
**భిద్యతే దేహజస్తాపో మానసం శ్రోతుమర్హసి ॥ 4 ॥**

అదే విధంగా కంటిరోగం, అతిసారం,కుష్ఠం, అంగామయం(ఒడలునొప్పులు)మున్నగుపేరులతో దేహం నుంచి పుట్టే తాపం వివిధభేదాలతో ఉంటుంది. ఇక మానసికతాపం గురించి ఆలకించు.

**కామక్రోధభయద్వేషలోభమోహవిషాదజః ।**
**శోకాసూయాఽవమానేర్ష్యా మాత్సర్యాది భవస్తథా ॥ 5 ॥**

**మానసోఽపి ద్విజశ్రేష్ఠ! తాపో భవతి నైకధా ।**
**ఇత్యేవ మాదిభిర్భేదై స్తాపో హ్యాధ్యాత్మికః స్మృతః ॥ 6 ॥**

ద్విజశ్రేష్ఠా! కామం, క్రోధం, భయం, ద్వేషం, లోభం, మోహం, విషాదం, శోకం, అసూయ, అవమానం, ఈర్ష్య, మాత్సర్యం మున్నగువాని వల్ల కలిగే మానసిక దుఃఖం అనేకవిధాలుగా ఉంటుంది. ఈ రీతిగా పలురీతులుగా ఉండే దుఃఖసమూహం ఆధ్యాత్మికతాపం అని చెప్పబడుతుంది.

**మృగపక్షిమనుష్యాద్యైః పిశాచోరగరాక్షసైః ।**
**సరీసృపాద్యైశ్చ నృణాం జాయతే చాధిభౌతికః ॥ 7 ॥**

మృగాలు,పక్షులు,మనుష్యులు మున్నగు ప్రాణులు, పిశాచాలు, ఉరగులు, రాక్షసులు,సరీసృపాలు మున్నగువాటివల్ల నరులకు ఆధిభౌతికమైన తాపం కలుగుతుంది.

**శీతోష్ణవాతవర్షామ్బువైద్యుతాది సముద్భవః ।**
**తాపో ద్విజవరశ్రేష్ఠ! కథ్యతే చాధిదైవికః ॥ 8 ॥**

ద్విజోత్తమావతంసా! శీతం,ఉష్ణం,వాయువు,వర్షం,జలం,మెరుపులు మున్నగు వాటివల్ల కలిగే తాపం ఆధిదైవికమనే తాపం ఇని చెప్పబడుతుంది.

**గర్భజన్మజరాఽజ్ఞానమృత్యునారకజం తథా ।**
**దుఃఖం సహస్రశో భేదైర్భిద్యతే మునిసత్తమ ॥ 9 ॥**

మునిశ్రేష్ఠా! వీటికన్న వేరే గర్భావాసం,జన్మ,ముసలితనం,అజ్ఞానం,మృత్యువు,నరకం మున్నగు వాటివల్ల కలిగే దుఃఖం వేలకొలది భేదాలతో వివిధరీతులుగా ఉంటుంది.

**సుకుమారతనుర్గర్భే జన్తుర్బహుమలావృతే ।**
**ఉల్బసంవేష్టితో భుగ్న పృష్ఠగ్రీవాస్థిసంహతిః ॥ 10 ॥**

మిక్కిలి మలపూర్ణమైన గర్భాశయంలో సున్నితమైన తనువు కల్గిన జీవుడు మావిచే క్రమ్ముకొని పృష్ఠభాగం మెడ,ఎముకలు మున్నగునవి కుంచించుకొనిపోగా ఉండిపోతాడు.

**అత్యన్తకటుతీక్ష్ణోష్ణ లవణైర్మాతృభోజనైః ।**
**అత్యన్తతాపైరత్యర్థం వర్ధమానాతివేదనః ॥ 11 ॥**

తల్లి తినే మిక్కిలి పులుపు,కారం,తీక్ష్ణమైన వేడి,ఉప్పు కల్గిన ఆహారాలచే కల్గిన ఘోరమైన తాపాలచే అత్యంతం వృద్ధి పొందుతున్న భరింపరాని బాధతో కుమిలిపోతూ ఉంటాడు.

**ప్రసారణాకుంచనాదౌ నాంగానాం ప్రభురాత్మనః ।**
**శకృన్మూత్రమహాపంకశాయీ సర్వత్ర పీడితః ॥ 12 ॥**

తన అవయవాలు చాచుకోవడం,ముడుచుకోవడం మొదలగునవి చేసుకోలేక మూత్రం, పురీషంతో కూడుకొన్న పెద్ద రొంపిలో పరుండి జీవుడు అన్నివిధాలా పీడను పొందుతూ ఉంటాడు.

**నిరుచ్ఛ్వాసః సచైతన్యః స్మరన్ జన్మశతాన్యథ ।**
**ఆస్తే గర్భేఽతిదుఃఖేన నిజకర్మనిబన్ధనః ॥ 13 ॥**

ఊపిరాడక, చైతన్యం కలిగి అనేకాలైన తన పూర్వజన్మలను స్మరిస్తూ, తాను చేసిన ప్రారబ్ధకర్మకు కట్టుబడినవాడై, మిక్కిలి దుఃఖాన్ని అనుభవిస్తూ తల్లి గర్భంలో ఉంటాడు.

**జాయమానః పురీషాసృఙ్మూత్ర శుక్రావిలాననః ।**
**ప్రాజాపత్యేన వాతేన పీడ్యమానాస్థి బన్ధనః ॥ 14 ॥**

పుట్టబోయే సమయంలో ఆ జీవుని ముఖం, మలం, మూత్రం, రక్తం, వీర్యం మున్నగు వాటితో పూయబడి ఎముకల ప్రోగులన్నీ ప్రాజాపత్యవాయువుచే(గర్భంలో ముడుచుకొనిపోయేటట్లు చేసేదానితో) మిక్కిలి పీడించబడతాడు.

**అధోముఖో వై క్రియతే ప్రబలైః సూతిమారుతైః ।**
**క్లేశైర్నిష్క్రాన్తిమాప్నోతి జఠరాన్మాతురాతురః ॥ 15 ॥**

ప్రబలములైన ప్రసూతివాయువులచే తలకిందులుగా చేయబడి, మిక్కిలి ఆతురుడై బహుక్లేశాలు అనుభవిస్తూ తల్లి జఠరంనుంచి బయటపడి నేలపై పడతాడు.

**మూర్ఛామవాప్య మహతీం సంస్పృష్టో బాహ్యవాయునా ।**
**విజ్ఞానభ్రంశమాప్నోతి జాతశ్చ మునిసత్తమ! ॥ 16 ॥**

మునిశ్రేష్ఠా! పడునప్పుడు మహామూర్ఛను పొంది బాహ్యవాయువుచే తాకబడి పుట్టగానే పూర్వజన్మ విషయ విజ్ఞానాన్ని కోల్పోతాడు.

**కంటకైరివ తున్నాంగః క్రకచైరివ దారితః ।**
**పూతివ్రణాన్నిపతితో ధరణ్యాం కృమికో యథా ॥ 17 ॥**

పుట్టిన తర్వాత, కూడా ముళ్ళు గుచ్చుకొన్నట్లు, రంపాలచే కోయబడినట్లు బాధ చెందుతాడు. పడునప్పుడు మలమయమైన పుండునుంచి పురుగువలె నేలపై పడతాడు.

**కణ్డూయనే చాప్యశక్తః పరివర్తేఽప్యనీశ్వరః ।**
**స్తన్యపానాదికాహార మప్యాప్నోతి పరేచ్ఛయా ॥ 18 ॥**

దురదను గోక్కొనలేక, ఇటూ అటూ దొర్లడం చేతకాక, ఇతరులకు వీలైనవేళ వారి ఇచ్ఛానుసారంగా స్తన్యం,పానం,స్నానం మున్నగు ఆహారవిహారాలు పొందుతాడు.

**అశుచిః ప్రస్తరే సుప్తః కీటదంశాదిభిస్తథా ।**
**భక్ష్యమాణోఽపి నైవేషాం సమర్థో వినివారణే ॥ 19 ॥**

మురికి, మలమూత్రాల కంపు,కొట్టే పడకపై పరుండి చీమలు, నల్లులు, దోమలు కుడుతూండగా వానిని తోలుకోలేక దుఃఖం పొందుతాడు.

**జన్మదుఃఖాన్యనేకాని జన్మనోఽనన్తరాణి వై ।**
**బాలభావే యదాప్నోతి హ్యాధిభౌతాదికాని చ ॥ 20 ॥**

ఈ ప్రకారంగా జన్మ సమయంలో అనేక దుఃఖాలు అనుభవిస్తూ పుట్టిన తరువాత మిక్కిలి క్లేశాలు పొందుతూ బాల్యావస్థలో ఆధిభౌతికం మున్నగు లెక్కలేనన్ని బాధలతో కుమిలిపోతాడు.

**అజ్ఞానతమసాచ్ఛన్నో మూఢాన్తఃకరణో నరః ।**
**న జానాతి కుతః కోఽహం క్వాహం గన్తా కిమాత్మకః ॥ 21 ॥**

అజ్ఞానమనే చీకటిలో కుమిలిపోతాడు. మనస్సు మూఢమైపోయి ఏమీ తెలియని స్థితిలో నరుడుఉంటాడు. "నేను ఎవడను? నేను ఎక్కడనుండి వచ్చాను? ఎక్కడకు వెళ్ళాలి? నా స్వరూపం ఏమిటి?"

**కేన బన్ధేన బద్ధోఽహం కారణం కిమకారణమ్ ।**
**కిం కార్యం కిమకార్యం వా కిం వాచ్యం కిం చ నోచ్యతే ॥ 22 ॥**

నేను ఏ బంధంతో బంధించబడియున్నాను? కారణం ఏది? కారణం కానిది ఏది? ఏది చేయవచ్చు? ఏది చేయరాదు? ఏది అనవచ్చు? ఏది అనరాదు?

**కోఽధర్మః కశ్చ వై ధర్మః కస్మిన్ వర్తేత వా కథమ్ ।**
**కిం కర్తవ్యమకర్తవ్యం కిం వా కిం గుణదోషవత్ ॥ 23 ॥**

"ఏది ధర్మం? ఏది అధర్మం? ఎవనియందు ఏ విధంగా ప్రవర్తించాలి? ఏది కర్తవ్యం? ఏది కాదు? ఏది మంచిది? ఏది చెడ్డది?"

**ఏవం పశుసమైర్మూఢై రజ్ఞానప్రభవం మహత్ ।**
**అవాప్యతే నరైర్దుఃఖం శిశ్నోదరపరాయణైః ॥ 24 ॥**

అని ఈ రీతిగా పశుప్రాయులై, మూఢులై, శిశ్నోదరపరాయణులై, మానవులు అజ్ఞానంవల్ల పుట్టిన మహాదుఃఖాన్ని పొందుతారు.

**అజ్ఞానం తామసో భావః కార్యారమ్భప్రవృత్తయః ।**
**అజ్ఞానినాం ప్రవర్తన్తే కర్మలోపాస్తతో ద్విజ ॥ 25 ॥**

ద్విజశ్రేష్ఠా! అజ్ఞానం తమోగుణంనుండి పుడుతుంది. కర్మచేయడం మానడం అనేది అజ్ఞానులకు దానినుండే కలుగుతుంది. అందువల్ల వైదికకర్మలకు లోపం కలుగుతుంది. అజ్ఞానులకు తామసరూపకర్మ కలుగుతుంది.

**నరకం కర్మణాం లోపాత్ ఫలమాహుర్మహర్షయః ।**
**తస్మాదజ్ఞానినాం దుఃఖమిహ చాముత్ర చోత్తమమ్ ॥ 26 ॥**

మహర్షులు కర్మలోపం వలన నరకఫలం లభిస్తుందని వచిస్తారు. అందువల్ల అజ్ఞానులకు ఇహలోకంలోను, పరలోకంలోను అత్యంతదుఃఖం సంభవిస్తుంది.

**జరాజర్జరదేహశ్చ శిథిలావయవః క్రమాత్ ।**
**విగలచ్ఛీర్ణదశనో వలిస్నాయుశిరావృతః ॥ 27 ॥**

శరీరం ముసలితనం వలన జర్జరితం కాగా క్రమక్రమంగా అవయవాలు శిథిలమైపోతాయి. దంతాలు కదిలిపోయి ఊడిపోతాయి, తలనెరసిపోతుంది. మాంసలోపంవలన స్నాయువులు, శిరలు పట్టు తప్పుతాయి.

**దూరప్రణష్టనయనో వ్యోమాన్తర్గతతారకః ।**
**నాసావివరనిర్యాతలోమపుంజశ్చలద్వపుః ॥ 28 ॥**

అతనిదృష్టి దూరంలో ఉన్నవాటిని చూడలేకపోతుంది. కన్నులలోని గ్రుడ్లు వెలవెలబోతాయి. నాసికారంధ్రాల నుంచి మిక్కిలిగా వెంట్రుకలు బైయటకువస్తాయి. ఒడలు చలిస్తూంటుంది.

**ప్రకటీకృతసర్వాస్థి ర్నతపృష్ఠాస్థిసంహతిః ।**
**ఉత్సన్నజఠరాగ్నిత్వా దల్పాహారోఽల్పచేష్టితః ॥ 29 ॥**

ఎముకలన్నీ బైటపడి అస్థిపంజరమైపోతాడు. వెన్నెముక వంగిపోతుంది. జఠరాగ్ని చల్లారిపోతుంది. తక్కువతిండి తింటాడు. ఏవో చిన్నచిన్న పనులు మాత్రమే చేయగలుగుతాడు.

**కృచ్ఛ్రాచ్చంక్రమణోత్థాన శయనాసన చేష్టితః ।**
**మన్దీభవచ్ఛ్రోత్రనేత్రః స్రవల్లాలావిలాననః ॥ 30 ॥**

ఆసమయంలో అతికష్టంపై కదులుతూ, లేస్తూ, పరుంటూ, కూర్చుంటూ ఉంటాడు. చెవులు, నేత్రాలు శక్తి కోల్పోతాయి. నోటినుంచి చొంగ కార్చుకుంటూ, వెలవెల బోయిన మొగం కలిగి ఉంటాడు.

**అనాయత్తైః సమస్తైశ్చ కరణైర్మరణోన్ముఖః ।**
**తత్క్షణేఽప్యనుభూతానా మస్మర్తాఽఖిలవస్తునామ్ ॥ 31 ॥**

సమస్తములైన ఇంద్రియాలు పూర్తిగా పనిచేయకపోవడం వలన చావుకు సిద్ధమై ఉంటాడు. ఆ క్షణంలో తాను విన్న, కన్న, సమస్తవిషయాలు జ్ఞాపకం రాకుండా పోతాయి.

**సకృదుచ్చారితే వాక్యే సముద్భూతమహాశ్రమః ।**
**శ్వాసకాససముద్భూత మహాయాసప్రజాగరః ॥ 32 ॥**

ఒక్కమాట పలకాలంటే ఆసమయంలో మహాశ్రమ అయిపోతుంది. శ్వాస సరిగా ఆడక దగ్గువచ్చి మిక్కిలి ఆయాసపడుచూ నిద్రలేకుండా ఉంటాడు.

**అన్యేనోత్థాప్యతేఽన్యేన తథా సంవేశ్యతే జరీ ।**
**భృత్యాత్మపుత్రదారాణామవమానాస్పదీకృతః ॥ 33 ॥**

ముసలివాడైపోవడంతో ఇంకొకడు లేవదీస్తే లేస్తాడు. పడుకోబెడితే తిరిగి పడుకుంటాడు. అపుడు సేవకులు, కొడుకులు, భార్య వలన అవమానాలకు గురియైపోతాడు.

**ప్రక్షీణాఖిలశౌచశ్చ విహారాహారసస్పృహః ।**
**హాస్య పరిజనస్యాపి నిర్విణ్ణాశేషబాన్ధవః ॥ 34 ॥**

సమస్తశౌచక్రియలు నశించిపోతాయి కాని విహారాలపై ఆహారాలపై మాత్రం కోరిక పోదు. చుట్టూ వున్నవారందరూ గేలి చేస్తూ ఉంటారు. బంధువులు ఉదాసీనులైపోతారు.

**అనుభూతమివాన్యస్మిన్ జన్మన్యాత్మవిచేష్టితమ్ ।**
**సంస్మరన్ యౌవనే దీర్ఘం నిఃశ్వసత్యభితాపితః ॥ 35 ॥**

వయస్సులో తాను చేసిన చేష్టలను మరొక జన్మయందు చేసినట్లుగా అనుభవిస్తూ, స్మరించుకొంటూ, మిక్కిలి పరితాపం చెందుతూ, నిట్టూర్పు వాయువులు విడుస్తూ ఉంటాడు.

**ఏవమాదీని దుఃఖాని జరాయామనుభూయ వై ।**
**మరణే యాని దుఃఖాని ప్రాప్నోతి శృణు తాన్యపి ॥ 36**

ఈ ప్రకారంగా ముసలితనంలో అనేక దుఃఖాలు అనుభవిస్తూ ఉంటాడు. ఇక మరణకాలంలో ఏ యాతనలు పొందుతూ ఉంటాడో వాటిని చెబుతాను ఆలకించు.

**శ్లథగ్రీవాంఘ్రిహస్తోఽథ వ్యాప్తో వేపథునా భృశమ్ ।**
**ముహుర్గ్లానిః పరవశో ముహుర్జ్ఞానలవాన్వితః ॥ 37 ॥**

మరణకాలంలో మెడ, కాళ్ళు, చేతులు శిథిలమైపోతాయి. శరీరం మిక్కిలి వణికిపోతుంది. అంతలోనే శ్రమ, అంతలోనే తెలివి, పరవశత్వం, అల్పజ్ఞానం కలుగుతూఉంటాయి.

**హిరణ్యధాన్యతనయ భార్యాభృత్యగృహాదిషు ।**
**ఏతే కథం భవిష్యన్తి మమేతి మమతాకులః ॥ 38 ॥**

తన బంగారం, ధనం, ధాన్యం, తనయులు, భార్య, భృత్యులు, గృహం మొదలైనవి నా తరువాత ఏమైపోతాయంటూ మమతానురాగాలతో చింతపడుతుంటాడు.

**మర్మభిద్భిర్మహారోగైః క్రకచైరివ దారుణైః ।**
**శరైరివాన్తకస్యోగ్రై శ్ఛిద్యమానాస్థిబన్ధనః ॥ 39 ॥**

**వివర్తమానతారాక్షి హస్తపాదం ముహుః క్షిపన్ ।**
**సంశుష్యమాణతాల్వోష్ఠకంఠో ఘురఘురాయితే ॥ 40 ॥**

**నిరుద్ధకణ్ఠో దోషౌఘైః రుదాన శ్వాసపీడితః ।**
**తాపేన మహతావ్యాప్త స్తృషా చార్త స్తథా క్షుధా ॥ 41 ॥**

భయంకొలిపే రంపాలతో కోస్తున్నట్లు, మర్మస్థానాలయందు మహారోగాలవలన బాధ, ఎముకలు ముడుచుకొనే అస్థిబంధాలలో యముని బాణాలు గ్రుచ్చుకొన్నట్లు దుఃఖం. కనుగ్రుడ్లు తిరిగిపోతూ ఉండడం, కాళ్ళు, చేతులు తన్నుకోవడం, తాలువులు, పెదవులు, కంఠం, ఎండిపోతూ ఉండడం, గురగుర ధ్వని పుట్టడం. అనేకదోషాల వలన కంఠం మూసుకొనిపోవడం, ఊర్ధ్వశ్వాసవలన పీడించబడటం, మిక్కిలి తాపంతో కుమిలిపోవడం, ఆకలిదప్పులతో బాధపడుతుంటాడు.

**క్లేశాదుత్క్రాన్తి మాప్నోతి యామ్యకింకరపీడితః ।**
**తతశ్చ యాతనాదేహం క్లేశేన ప్రతిపద్యతే ॥ 42 ॥**

యమకింకరులుపెట్టే బాధలతో మిక్కిలి క్లేశంతో శరీరం వదిలిపెడతాడు. అనంతరం కర్మఫలం అనుభవించడానికై అధికక్లేశంతో యాతనాదేహంలోనికి ప్రవేశిస్తాడు.

**ఏతాన్యన్యాని చోగ్రాణి దుఃఖాని మరణే నృణామ్ ।**
**శృణుష్వ నరకే యాని ప్రాప్యన్తే పురుషైర్మృతైః ॥ 43 ॥**

నరులకు మరణసమయంలో ఇటువంటి ఎన్నో భయంకర దుఃఖాలు కలుగుతాయి. ఇక మరణించిన జీవులు నరకంలో ఏ ఏ బాధలు పడతారో చెబుతాను ఆలకించు.

**యామ్యకింకరపాశాదిగ్రహణం దణ్డతాడనమ్ ।**
**యమస్య దర్శనం చోగ్ర ముగ్రమార్గవిలోకనమ్ ॥ 44 ॥**

మొట్టమొదటగా యమదూతలు తమ పాశాలతో ప్రేతాత్మను బంధించి కర్రలతో మోదుతారు. తరువాత యముని జీవులు దర్శిస్తారు. అనంతరం దుర్గమమైన మార్గాన్ని విలోకిస్తారు.

**కరమ్భవాలుకావహ్నియన్త్ర శస్త్రాదిభీషణే ।**
**ప్రత్యేకం నరకే యాశ్చ యాతనా ద్విజ! దుఃసహాః ॥ 45 ॥**

ద్విజోత్తమా! అటుపైన తప్తవాలుకం, అగ్నియంత్రం, శస్త్రాలతో కూడుకొన్న మహాభయంకర నరకం మున్నగు వాటిలో ఒక్కొక్కదానిలోను యాతనలు అనుభవిస్తాడు. ఆ యాతనలు సహించ శక్యం కానివి.

**క్రకచైః పీడ్యమానానాం మూషాయాం చాపి దహ్యతామ్ ।**
**కుఠారైః కృత్యమానానాం భూమౌ చాపి నిఖన్యతామ్ ॥ 46 ॥**

రంపాలతో కోయడం, మూసలలో వేచి కాచడం, గొడ్డళ్ళతో పగులకొట్టడం, భూమిలో పాతిపెట్టడం మున్నగు యమయాతనలు పొందుతాడు.

**శూలేష్వారోప్యమాణానాం వ్యాఘ్రవక్త్రే ప్రవేశ్యతామ్ ।**
**గృధ్రైః సమ్భక్ష్యమాణానాం ద్వీపిభిశ్చోపభుజ్యతామ్ ॥ 47 ॥**

శూలాలపై ఎక్కించడం, పులి నోటిలో ప్రవేశించడం, రాబందులచే(గ్రద్దలచే) భక్షింపబడడం, ఏనుగులచే త్రొక్కబడడం మున్నగు దుఃఖాలు పొందుతాడు.

**క్వాథ్యతాం తైలమధ్యే చ క్లిశ్యతాం క్షారకర్దమైః ।**
**ఉచ్చాన్నిపాత్యమానానాం క్షిప్యతాం క్షేపయన్త్రకైః ॥ 48 ॥**

సలసల మరుగుచున్న నూనెలో ముంచబడడం, బూడిదతో నిండిన బురదలో మునగడం, విక్షేపయంత్రాల ద్వారా ఎత్తైన ప్రదేశంనుంచి క్రిందకి విసిరివేయబడడం మున్నగు యమయాతనలు అనుభవిస్తాడు.

**నరకే యాని దుఃఖాని పాపహేతూద్భవాని వై ।**
**ప్రాప్యన్తే నారకైర్విప్ర! తేషాం సంఖ్యా న విద్యతే ॥ 49 ॥**

విప్రవర్యా! నరకంలో పొందే దుఃఖాలు ఏవైతే ఉన్నాయో, అవన్నీ జీవుడు చేసిన పాపాల వలన కలిగేవే. పాపాలు చేసేవారు నరకబాధలు అనుభవిస్తారు. వాటి సంఖ్యను లెక్కించ జాలము.

**న కేవలం ద్విజశ్రేష్ఠ! నరకే దుఃఖపద్ధతిః ।**
**స్వర్గేఽపి పాతభీతస్య క్షయిష్ణోర్నాస్తి నిర్వృతిః ॥ 50 ॥**

ద్విజశ్రేష్ఠా! కేవలం నరకంలో మాత్రమే దుఃఖపరంపర ఉండడం కాదు. స్వర్గంలో కూడా పుణ్యాలు క్షీణించిపోతే తిరిగి కిందికి పడిపోతామనే భయం వెంటాడుతుంది. కాబట్టి అక్కడకూడా సుఖం లేదు.

**పునశ్చ గర్భే భవతి జాయతే చ పునః పునః ।**
**గర్భే విలీయతే భూయో జాయమానోఽస్తమేతి చ ॥ 51 ॥**

మళ్ళీ గర్భంలోనికి చేరడం, తిరిగి పుట్టడం, మళ్ళీ గర్భంలో నాశనం చెందడం, తిరిగి పుట్టడం, మరల మరణించడమనేది స్వర్గభోగానంతరం అనుభవించేవారి ప్రయాసలివి.

**మ్రియతే జాతమాత్రశ్చ బాలభావేఽథ యౌవనే ।**
**మధ్యమం వా వయః ప్రాప్య వార్ధకే వా ధ్రువా మృతిః ॥ 52 ॥**

పుట్టినవెంటనే మరణించవచ్చు లేక, బాల్యంలో, లేక, యౌవనంలో, మధ్యమ వయస్సును పొందిగాని, లేక, వార్ధకంలోగాని మరణించవచ్చు. ఎప్పుడైనా మరణం తథ్యం.

**యావజ్జీవతి తావచ్చ దుఃఖైర్నానావిధైః ప్లుతః ।**
**తన్తు కారణ పక్ష్మౌఘైరాస్తే కార్పాసబీజవత్ ॥ 53 ॥**

జీవుడు ఎంతకాలం జీవించునో అంతకాలం అనేక విధములైన దుఃఖాలతో కొనసాగుతుంటాడు. ప్రత్తి గింజలలో వస్త్రం తయారుకావడానికి కావలసిన నూలు మున్నగునవి ఎలా ఉంటాయో అదేవిధంగా జీవుడు జన్మించటానికి కారణమైన బీజంలో అన్నీ ఉంటాయి.

**ద్రవ్యనాశే తథోత్పత్తౌ పాలనే చ తథా నృణామ్ ।**
**భవన్త్యనేకదుఃఖాని తథైవేష్టవిపత్తిషు ॥ 54 ॥**

ధననష్టం, ధనోపార్జన, ధనసంరక్షణ, ఏవిధంగా చేకూరుతాయో అదే విధంగా ఇష్టములైనపదార్థాలకు కాని, మిత్రులకు కాని విపత్తు సంభవించేటప్పుడు మానవులకు దుఃఖాలు ఎక్కువగా కలగడం తప్పదు.

**యద్యత్ప్రీతికరం పుంసాం వస్తు మైత్రేయ! జాయతే ।**
**తదేవ దుఃఖవృక్షస్య బీజత్వముపగచ్ఛతి ॥ 55 ॥**

మైత్రేయా! మనుష్యులకి ఏ ఏ వస్తువులు ప్రీతి కల్గిస్తాయో అవే దుఃఖాలు చేకూరుస్తాయి. అది దుఃఖరూపవృక్షానికి బీజప్రాయమవుతుంది.

**కలత్రపుత్రభృత్యాది గృహక్షేత్రధనాదికైః ।**
**క్రియతేన తథా భూరి సుఖం పుంసాం యథాఽసుఖమ్ ॥ 56 ॥**

భార్య, పుత్రులు, సేవకులు, గృహం, క్షేత్రం, ధనం మున్నగువాటివలన మనుష్యులకు క్లేశం ఎక్కువ. అధికమైన సుఖం చేకూరదు. అందువల్ల దుఃఖమే మిగులుతుంది.

**ఇతి సంసారదుఃఖార్క తాపతాపితచేతసామ్ ।**
**విముక్తిపాదపచ్ఛాయామృతే కుత్ర సుఖం నృణామ్ ॥ 57 ॥**

ఈ విధంగా సంసారం అనే దుఃఖం అనెడు సూర్యుని తాపానికి మలమల మాడిపోయే చిత్తం కల నరులకు మోక్షవృక్షచ్ఛాయ తప్ప సుఖం ఇచ్చేది వేరే ఏముంది?

**తదస్య త్రివిధస్యాపి దుఃఖజాతస్య పణ్డితైః ।**
**గర్భజన్మజరాద్యేషు స్థానేషు ప్రభవిష్యతః ॥ 58 ॥**
**నిరస్తాతిశయాహ్లాద సుఖభావైకలక్షణా ।**
**భేషజం భగవత్ప్రాప్తిరేకాన్తాఽత్యన్తికీ మతా ॥ 59 ॥**

అందువల్ల ఆత్మజ్ఞానం కల్గినవారి అభిప్రాయంలో గర్భావాసం, జన్మ, జర మున్నగు అవస్థలయందు ఉత్పన్నమయ్యే ఆధ్యాత్మికం మొదలైన మూడు విధాలైన దుఃఖసమూహానికి విరుగుడు –ఏకమాత్రమైన సనాతనమైన ఓషధి ఒక్క భగవత్ప్రాప్తి మాత్రమే. అది ఒక్కటే శాశ్వతంగా ఉండే, మిక్కిలి ఆహ్లాదాన్ని కలిగించే సుఖప్రాప్తి హేతువవుతుంది.

**తస్మాత్ తత్ప్రాప్తయే యత్నః కర్తవ్యః పణ్డితైర్నరైః ।**
**తత్ప్రాప్తిహేతుః జ్ఞానం చ కర్మ చోక్తే మహామునే ॥ 60 ॥**

మహామునీ! విద్వాంసులు అయిన నరులు అందువల్ల భగవంతుని పొందడంకోసమై నిరంతరం యత్నం చేయాలి. కర్మ, జ్ఞానం భగవత్ప్రాప్తికి రెండూ కారణాలే.

**ఆగమోత్థం వివేకోత్థం ద్విధా జ్ఞానం తథోచ్యతే ।**
**శబ్దబ్రహ్మాగమమయం పరం బ్రహ్మ వివేకజమ్ ॥ 61 ॥**

జ్ఞానం రెండు విధాలుగా చెప్పబడుతుంది. ఒకటి ఆగమాలద్వారా (శాస్త్రజన్యమైన) కలిగే జ్ఞానం. రెండోది వివేకం ద్వారా కలిగే జ్ఞానం. ఆగమాలద్వారా శబ్దబ్రహ్మజ్ఞానం,ఆత్మవిచారం ద్వారా పరమబ్రహ్మ జ్ఞానం కలుగుతుంది.

**అన్ధం తమ ఇవాజ్ఞానం దీపవచ్చేన్ద్రియోద్భవమ్ ।**
**యథా సూర్యస్తథా జ్ఞానం యద్విప్రర్షే! వివేకజమ్ ॥ 62 ॥**

ఓ విప్రర్షీ! అజ్ఞానం ఘోరమైన అంధకారంతో సమానం. దానిని నాశనం పొందించాలంటే ఇంద్రియాల ద్వారా ఉత్పన్నమైన జ్ఞానం దీపంతో సమానమవుతుంది. అందువల్ల వివేకం ద్వారా ఉత్పన్నమైన జ్ఞానం సూర్యునితో సమానం.

**మనురప్యాహ వేదార్థం స్మృత్వా యన్మునిసత్తమ! ।**
**తదేతచ్ఛ్రూయతామత్ర సమ్బన్ధే గదతో మమ ॥ 63 ॥**

మునిశ్రేష్ఠా! ఈ విషయంలో వేదార్థానుసారంగా మనువు ఏదైతే స్మరించి వచించాడో అది చెబుతాను. నేను దానినే సావధానంగా ఆలకించు.

**ద్వే బ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మ పరం చ యత్ ।**
**శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥ 64 ॥**

శబ్దబ్రహ్మ, పరబ్రహ్మ అని రెండు విధాలుగా ఏదైతే ఉందో ఆ రెండును తెలుసుకోవలసిందే. శబ్దబ్రహ్మజ్ఞానంలో (శాస్త్రజన్యజ్ఞానం) నిష్ణాతుడైతేనే పరబ్రహ్మజ్ఞానం (వివేకజన్యజ్ఞానం) లభించి పరబ్రహ్మను పొందగలుగుతాడు.

**ద్వే విద్యే వేదితవ్యే వై ఇతి చాథర్వణీ శ్రుతిః ।**
**పరయా త్వక్షర ప్రాప్తిః ఋగ్వేదాదిమయా ఽపరా ॥ 65 ॥**

రెండు విద్యలు తెలియవలసియున్నాయని, పరవిద్యద్వారా అక్షరపరబ్రహ్మప్రాప్తియని, ఋగ్వేదాది మయమైన వేదవిద్య అపరవిద్యయని అథర్వవేదశ్రుతి చెబుతోంది.

**యత్తదవ్యక్తమజరమచిన్త్య మజ మవ్యయమ్ ।**
**అనిర్దేశ్యమరూపం చ పాణిపాదాద్యసంయుతమ్ ॥ 66 ॥**

**విభుం సర్వగతం నిత్యం భూతయోనిరకారణమ్ ।**
**వ్యాప్యవ్యాప్తం యతః సర్వం తద్వై పశ్యన్తి సూరయః ॥ 67 ॥**

ఏది అవ్యక్తం, అజరం, అచింత్యం, అజం, అవ్యయం, అనిర్దేశ్యం, అరూపం, పాణిపాదరహితం, స్వయంభువు, సర్వగతం, నిత్యం, భూతోద్భవాది కారణం, స్వయంగా కారణహీనం అయి వ్యాప్యవ్యాపకంగా ప్రకటితమై ఉంటుందో, దానినే పండితజనులు జ్ఞానం అనే నేత్రం ద్వారా దర్శిస్తారు.

**తద్ బ్రహ్మ పరమం ధామ తద్ ధ్యేయం మోక్షకాంక్షిభిః ।**
**శ్రుతివాక్యోదితం సూక్ష్మం తద్విష్ణోః పరమం పదమ్ ॥ 68 ॥**

ముముక్షువులైన మునిగణాలు దానినే ధ్యానంచేస్తూ ఉంటారు, అదే బ్రహ్మము, అదే పరంధామము, దానినే వేదాలు అతి సూక్ష్మమైనదని, అదే విష్ణువు పరమపదమని చెబుతూ ఉంటాయి.

**తదేవ భగవద్వాచ్యం స్వరూపం పరమాత్మనః ।**
**వాచకో భగవచ్ఛబ్ద స్తస్యాద్యస్యాక్షయాత్మనః ॥ 69 ॥**

ఆ పరమాత్మ స్వరూపం "భగవంతుడు" అనే శబ్దం ద్వారా చెప్పబడుతుంది. ఆ భగవచ్ఛబ్దం కూడా అనాదియైన అక్షయమగు పరమాత్మవాచకమే.

**ఏవం నిగదితార్థస్య తత్తత్త్వం తస్య తత్త్వతః ।**
**జ్ఞాయతే యేన తద్‌జ్ఞానం పరమన్యత్ త్రయీమయమ్ ॥ 70 ॥**

ఈ ప్రకారంగా తెలియబడే పరమాత్మస్వరూపం ఏదయితే ఉందో, అది తత్త్వవిచారణ ద్వారా లభించే వాస్తవిక జ్ఞానం. అదే పరమజ్ఞానం(పరావిద్య) అవుతుంది. దానికన్న వేరైనది, త్రయీమయమైన జ్ఞానం (అపరావిద్య) అనబడుతుంది.

**అశబ్దగోచరస్యాపి తస్య వై బ్రహ్మణో ద్విజః! ।**
**పూజాయాం భగవచ్ఛబ్దః క్రియతే హ్యౌపచారికః ॥ 71 ॥**

ద్విజశ్రేష్ఠా! ఆ బ్రహ్మం నిజంగా శబ్దానికి గోచరమయ్యేదికాదు. కాని ఉపాసనలో ఆ బ్రహ్మమును 'భగవంతుడు' అనే శబ్దంద్వారా ఔపచారికంగా చెప్పడం జరుగుతోంది.

**శుద్ధే మహావిభూత్యాఖ్యే పరే బ్రహ్మణి వర్తతే ।**
**మైత్రేయ! భగవచ్ఛబ్దః సర్వకారణ కారణే ॥ 72 ॥**

మైత్రేయా! విశుద్ధం, సర్వకారణకారణం, మహావిభూతిశాలి అయిన ఆ పరబ్రహ్మమునందే భగవచ్ఛబ్దం ఉపయుక్తమవుతుంది.

**సమ్భర్తేతి తథా భర్తా భకారోఽర్థద్వయాన్వితః ।**
**నేతా గమయితా స్రష్టా గకారార్థస్తథా మునే ॥ 73 ॥**

మునీశ్వరా! "భగవత్" అనే శబ్దంలో భకారానికి రెండు అర్థాలు ఉన్నాయి. పోషణకు కారణమైనది కావున "సంభర్త" అన్నింటికి ఆధారమైనది "భర్త". అదేవిధంగా గకారానికి కూడా కర్మఫలప్రాప్తిని ఇచ్చువాడు కావున "నేత" అని, లయం చేసేవాడు కావున "గమయిత" అని, సృష్టిచేసేవాడు కావున " స్రష్ట" అని మూడు అర్థాలు ఉన్నాయి.

**ఐశ్వర్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః ।**
**జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా ॥ 74 ॥**

సమస్తమైన ఐశ్వర్యం, ధర్మం, యశస్సు, శ్రీ, జ్ఞానం, వైరాగ్యం –ఈ ఆరింటికి "భగం" అని పేరు.

**వసన్తి యత్ర భూతాని భూతాత్మన్యఖిలాత్మని ।**
**సర్వభూతేష్వశేషేషు వకారార్థస్తతోఽవ్యయః ॥ 75 ॥**

సమస్తభూతస్వరూపుడైన ఆ పరమాత్మయందు భూతగణాలన్నీ నివసిస్తాయి. ఆ సమస్తభూతాలయందు పరమాత్మ స్వయంగా నివసిస్తాడు. అందువల్ల ఆ అవ్యయుడే వకారం యొక్క అర్థం.

**ఏవమేష మహాశబ్దో భగవానితి సత్తమ! ।**
**పరమబ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యతః ॥ 76 ॥**

సజ్జనోత్తమా! ఈరీతిగా ఎంతో అర్థంతో కూడుకొన్న "భగవత్" అనే మహాశబ్దం పరమబ్రహ్మ స్వరూపమైన వాసుదేవాత్మకమే కాని మరొకటి కాదు.

**తత్ర పూజ్యపదార్థోక్తిపరిభాషాసమన్వితః ।**
**శబ్దోఽయం నోపచారేణ త్వన్యత్ర హ్యుపచారతః ॥ 77 ॥**

అందు పూజ్యా పదార్థాలను సూచించే లక్షణంతో కూడుకొన్నపుడు ఈ "భగవత్" శబ్దం పరమాత్మ యందు ముఖ్యశబ్దమై యుంటుంది. మిగిలినచోట్ల గౌణప్రయోగమై ఉంటుంది.

**ఉత్పత్తిం ప్రలయం చైవ భూతానామాగతిం గతిమ్ ।**
**వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి ॥ 78 ॥**

సమస్తప్రాణులయొక్క ఉత్పత్తి, వినాశం, రాక, పోక, విద్య, అవిద్య తెలిసినవాడే భగవంతుడు అని వ్యవహరించబడతాడు.

**జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజాంస్యశేషతః ।**
**భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయైర్గుణాదిభిః ॥ 79 ॥**

త్యాగం చేయడానికి యోగ్యమైన త్రిగుణాలును, వాటివల్ల కలిగే క్లేశాలునులేని జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు మున్నగు సమస్తసద్గుణాలు "భగవత్" అనే శబ్దం ద్వారా ద్యోతకమవుతాయి.

**సర్వాణి తత్ర భూతాని వసన్తి పరమాత్మని ।**
**భూతేషు చ సర్వాత్మా వాసుదేవస్తతః స్మృతః ॥ 80 ॥**

సమస్తభూతాలు (పంచభూతాలు) ఆ పరమాత్మయందు వసిస్తాయి. ఆ పంచభూతాలయందు ఆ సర్వాత్ముడు వ్యాపించియున్నాడు. సమస్తప్రాణులు ఆయనయందున్నాయి. సమస్తప్రాణులయందు ఆయన ఉన్నాడు. అందువలననే ఆయన వాసుదేవుడుగా వ్యవహరింపబడ్డాడు.

**ఖాణ్డిక్యజనకాయాహ పృష్టః కేశిధ్వజః పురా ।**
**నామవ్యాఖ్యా మనన్తస్య వాసుదేవస్య తత్త్వతః ॥ 81 ॥**

ప్రాచీనకాలంలో ఖాండిక్యజనకుని ద్వారా ప్రశ్నించబడి కేశిధ్వజుడు అనంతమైన వాసుదేవనామం యొక్క తత్త్వాన్ని వ్యాఖ్యానిస్తూ ఇలా చెప్పాడు.

**భూతేషు వసతే సోఽన్తర్వసన్త్యత్ర చ తాని యత్ ।**
**ధాతా విధాతా జగతాం వాసుదేవస్తతః ప్రభుః ॥ 82 ॥**

ఆ ప్రభువు సమస్తభూతాలలోను వ్యాపించియున్నాడు. అఖిలభూతాలు ఆ విభునియందు వ్యాపించి ఉన్నాయి. ఆ విధంగా పరమాత్మ సమస్తజగత్తులకు ధాత (రచయిత), విధాత (రక్షకుడు) అయి ఉన్నాడు. అందువల్ల భగవంతుడు వాసుదేవుడని వ్యవహరించబడ్డాడు.

**స సర్వభూతప్రకృతింవికారాన్ గుణాంశ్చ దోషాంశ్చ మునే వ్యతీతః ।**
**అతీతసర్వావరణో౭ఖిలాత్మా తేనాస్తృతం యద్భువనాంతరాలే ॥ 83 ॥**

మునీశ్వరా! ఆ సర్వాత్ముడు అన్ని ఆవరణలకన్న అతీతమైనవాడు. ఆ ప్రభువు సమస్తభూతాలకు సంబంధించిన ప్రకృతి, ఆ ప్రకృతి వికారాలు, దానిగుణాలు, దానికార్యాలకు అనువర్తించేదోషాలు–అన్నింటి కన్న విలక్షణమైనవాడు. పృథివి, ఆకాశం మధ్య ఏదయితేఉందో, అది ఆ విభునిచేతనే వ్యాపించివుంది.

**సమస్తకళ్యాణగుణాత్మకో హి స్వశక్తిలేశావృత భూతవర్గః ।**
**ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః సంసాధితాశేషజగద్ధితో౭సౌ ॥ 84 ॥**

ఆ ప్రభువు సమస్తకళ్యాణగుణస్వరూపుడు. ఆయన మాయాశక్తి లేశమాత్రంగా నిఖిలభూతాలను ఆవరించి యుంది. ఆయన తన కోరికను అనుసరించి విరాట్స్వరూపదేహాన్ని ధరిస్తాడు. సమస్తజగత్తుకు మేలు చేకూరుస్తాడు.

**తేజోబలైశ్వర్యమహావబోధః సువీర్యశక్త్యాది గుణైకరాశిః ।**
**పరః పరాణాం సకలా న యత్ర క్లేశాదయః సన్తి పరావరేశే ॥ 85 ॥**

ఆ ప్రభువు తేజస్సు, బలం, ఐశ్వర్యం, మహావిజ్ఞానం, వీర్యం, శక్తి మున్నగు కళ్యాణదాయకములైనగుణాలకు ఒక నిధి. ప్రకృతి మున్నగువాటి కన్న పరుడు. ఆ పరావరేశునియందు అవిద్య మున్నగు సమస్తక్లేశాలు ఏకోశాన ఉండవు.

**స ఈశ్వరో వ్యష్టిసమష్టిరూపో వ్యక్తస్వరూపో౭ప్రకటస్వరూపః ।**
**సర్వేశ్వరః సర్వదృక్ సర్వవేత్తా సమస్తశక్తిః పరమేశ్వరాఖ్యః ॥ 86 ॥**

ఆ ఈశ్వరుడు సమష్టివ్యష్టి స్వరూపుడు, వ్యక్తరూపుడు, అవ్యక్తరూపుడు కూడా. ఆయన అన్నిటికి ప్రభువు. అన్నింటికి సాక్షి. అన్నిటిని తెలిసినవాడు. సమస్తశక్తిస్వరూపుడు. పరమేశ్వరుడు అని చెప్పబడతాడు.

**సంజ్ఞాయతే యేన తదస్తదోషం శుద్ధం పరం నిర్మలమేకరూపమ్ ।**
**సందృశ్యతే వా౭ప్యధిగమ్యతే వా తత్ జ్ఞాన మజ్ఞాన మతో౭న్యదుక్తమ్ ॥ 87 ॥**

దేనిద్వారా ఏ దోషాలు లేనిది, విశుద్ధమైనది, పరమైనది, నిర్మలమైనది, ఏకరూపమైనదగు పరమాత్మ తెలిజేయబడుతుందో, చూడబడుతుందో, పొందబడుతుందో అదే జ్ఞానం (పరావిద్య) అనబడుతుంది. దానికన్న వ్యతిరిక్తమైనది అజ్ఞానం (అపరావిద్య) అనబడుతుంది,–అని మైత్రేయునకు పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే షష్ఠాంశే భగవతః పారమార్థికస్వరూపవర్ణనం నామ పంచమో౭ధ్యాయః సమాప్తః ॥ 5 ॥**

శ్రీవిష్ణుపురాణంలో షష్ఠాంశంలో భగవంతుని పారమార్థికస్వరూపవర్ణన అనే అయిదవ అధ్యాయం సమాప్తం॥5॥



## **షష్ఠోఽధ్యాయః - ఆరవ అధ్యాయం**

## **కేశిధ్వజ ఖాండిక్యవృత్తాంతః - కేశిధ్వజ ఖాండిక్యుల వృత్తాంతం**

**శ్రీపరాశర ఉవాచ :-** పరాశరుడు చెప్పాడు.

**స్వాధ్యాయ సంయమాభ్యాం స దృశ్యతే పురుషోత్తమః ।**
**తత్ప్రాప్తికారణం బ్రహ్మ తదేతదితి చోచ్యతే ॥ 1 ॥**

మైత్రేయా! స్వాధ్యాయం (వేదం) సంయమనం (యోగం) -ఈరెండింటి ద్వారా ఆ పురుషోత్తముని దర్శించవచ్చు. బ్రహ్మప్రాప్తికి కారణం ఆ రెండూ అవుతాయి. తద్ద్వారా బ్రహ్మ తెలియబడుతుంది.

**స్వాధ్యాయాద్ యోగమాసీత యోగాత్ స్వాధ్యాయమేవ చ ।**
**స్వాధ్యాయయోగ సమ్పత్త్యా పరమాత్మా ప్రకాశతే ॥ 2 ॥**

స్వాధ్యాయం వల్ల యోగం సిద్ధిస్తుంది. యోగంవలన స్వాధ్యాయం లభిస్తుంది. స్వాధ్యాయయోగ సంయుక్తసంపత్తివలన పరమాత్మ (ఆత్మజ్ఞానం) ప్రకాశితమవుతుంది.

**తదీక్షణాయ స్వాధ్యాయ శ్చక్షుర్యోగస్తథాపరమ్ ।**
**న మాంసచక్షుషా ద్రష్టుం బ్రహ్మభూత స్స శక్యతే ॥ 3 ॥**

బ్రహ్మస్వరూపమైన పరమాత్మను మాంసమయములైన నేత్రాలద్వారా చూడడం శక్యం కాదు. ఆ ఆత్మదర్శనం కావాలంటే స్వాధ్యాయం, యోగం రెండు కన్నులులాంటివి.

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అడుగుతున్నాడు.

**భగవంస్తమహం యోగం జ్ఞాతుమిచ్ఛతి తం వద ।**
**జ్ఞాత్రే యత్రాఖిలాధారం పశ్యేయం పరమేశ్వరమ్ ॥ 4 ॥**

"భగవంతుడా! ఏ యోగం తెలిస్తే అఖిలాధారుడైన పరమేశ్వరుని దర్శనం అవుతుంది? యోగం అంటే ఏమిటి? దానిని నేను తెలుసుకొనగోరుతున్నాను. ఆ విషయాన్ని నాకు తెలియజేయండి" అని ప్రశ్నించాడు.

**పరాశర ఉవాచ :-** పరాశరుడు బదులిచ్చాడు.

**యథా కేశిధ్వజః ప్రాహ ఖాండిక్యాయ మహామునే! ।**
**జనకాయ పురా యోగం తథాఽహం కథయామి తే ॥ 5 ॥**

మహామునీ! ప్రాచీనకాలంలో కేశిధ్వజుడు ఏప్రకారంగా ఖాండిక్యజనకునకు యోగం గురించి వివరించాడో, దానిని నీకు చెబుతాను.

**మైత్రేయ ఉవాచ :-** మైత్రేయుడు అడుగుతున్నాడు.

**ఖాణ్డిక్యః కోఽభవద్ బ్రహ్మన్! కో వా కేశిధ్వజోఽభవత్ ।**
**కథం తయోశ్చ సంవాదో యోగసమ్బన్ధవానభూత్ ॥ 6 ॥**

"ఓ! బ్రాహ్మణోత్తమా! ఖాండిక్యుడు ఎవడు? కేశిధ్వజుడు ఎవడైయున్నాడు? వారిద్దరికి యోగసంబంధమైన సంవాదం ఏవిధంగా జరిగింది?" అని ప్రశ్నించాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**ధర్మధ్వజో వై జనక స్తస్య పుత్రోఽ మితధ్వజః ।**
**కృతధ్వజశ్చ నామ్నా స సదాధ్యాత్మరతిర్నృపః ॥ 7 ॥**

పూర్వం జనకవంశంలో ధర్మధ్వజుడు అను పేరుగల రాజు ఉండేవాడు. అతనికి అమితధ్వజుడు, కృతధ్వజుడు అనే ఇరువురు కుమారులు ఉండేవారు. అందు కృతధ్వజుడు ఎల్లపుడూ ఆధ్యాత్మవిషయంలో ఆసక్తిగా ఉండేవాడు.

**కృతధ్వజస్య పుత్రోఽభూత్ ఖ్యాతః కేశిధ్వజో ద్విజ! ।**
**పుత్రోఽమితధ్వజస్యాపి ఖాణ్డిక్యో జనకోఽభవత్ ॥ 8 ॥**

ద్విజోత్తమా! కృతధ్వజుని పుత్రుడే కేశిధ్వజుడు అనే పేరుతో విఖ్యాతుడయ్యాడు. అమితధ్వజుని కుమారుడే ఖాండిక్య జనకుడనే పేరుతో వాసి గాంచాడు.

**కర్మమార్గేణ ఖాణ్డిక్యః పృథివ్యామభవత్ కృతీ ।**
**కేశిధ్వజోఽప్యతీవాసీ దాత్మవిద్యావిశారదః ॥ 9 ॥**

కర్మమార్గంలో ఖాండిక్యుడు భూమియందు కీర్తి గడించి ధన్యుడయ్యాడు. కేశిధ్వజుడు ఆత్మవిద్యయందు ఆరితేరినవాడై మిక్కిలి ప్రసిద్ధుడైయ్యాడు.

**తా వుభావపి చైవాస్తాం విజిగీషూ పరస్పరమ్ ।**
**కేశిధ్వజేన ఖాణ్డిక్యః స్వరాష్ట్రాదవరోపితః ॥ 10 ॥**

వారిద్దరూ ఒరినొకరు గెలవాలని ఎపుడూ భావించేవారు. ఇలా ఉండగా కేశిధ్వజుడు ఖాండిక్యుని రాజ్యం నుంచి భ్రష్టుని కావించాడు.

**పురోధసా మన్త్రిభిశ్చ సమవేతోఽల్పసాధనః ।**
**రాజ్యాన్నిరాకృతః సోఽథ దుర్గారణ్యచరోఽభవత్ ॥ 11 ॥**

ఖాండిక్యుడపుడు పురోహితునితోను, మంత్రులతోను కూడుకొన్నవాడై రాజ్యంనుంచి గెంటివేయబడి అల్పసాధనాలతో దుర్గమారణ్యాలలో సంచరించసాగాడు.

**ఇయాజ సోఽపి సుబహూన్ యజ్ఞాన్ జ్ఞానవ్యపాశ్రయః ।**
**బ్రహ్మవిద్యామధిష్ఠాయ తర్తుం మృత్యుమవిద్యయా ॥ 12 ॥**

కేశిధ్వజుడైతే జ్ఞాననిష్ఠుడు. అతడు అవిద్య (కర్మ) ద్వారా మృత్యువును తరించడానికై జ్ఞానదృష్టితో కాలం గడుపుతూ అనేక యజ్ఞాలు ఆచరించాడు.

**ఏకదా వర్తమానస్య యోగే యోగవిదాం వర ।**
**ధర్మధేనుం జఘానోగ్రశార్దూలో విజనే వనే ॥ 13 ॥**

యోగవేత్తలలో అగ్రేసరుడవైన మైత్రేయా! కేశిధ్వజుడు ఒకప్పుడు యజ్ఞానుష్ఠానంలో ఉన్నాడు. అతని హోమధేనువును ఒక నిర్జనారణ్యంలో ఒక భయంకరమైన పెద్దపులి చంపివేసింది.

**తతో రాజా హతాం జ్ఞాత్వా ధేనుం వ్యాఘ్రేణ ఋత్విజః ।**
**ప్రాయశ్చిత్తం స పప్రచ్ఛ కిమత్రేతి విధీయతామ్ ॥14॥**

అంతట ఆ రాజు ధర్మధేనువును వ్యాఘ్రం చంపినదని తెలుసుకొని దీనికి తగినటువంటి ప్రాయశ్చిత్తమేమిటని ఋత్విజులను ప్రశ్నించాడు.

**తే చోచుర్న వయం విద్మః కశేరుః పృచ్ఛ్యతామితి ।**
**కశేరురపి తేనోక్త స్తథైవ ప్రాహ భార్గవమ్ ॥ 15 ॥**

అపుడు వారు మాకు తెలియదని కశేరువుని అడగమన్నారు. కేశిధ్వజుడు కశేరువును ప్రశ్నింపగా అతడు తనకుకూడా తెలియదని భార్గవుని అడగమన్నాడు.

**శునకం పృచ్ఛ రాజేన్ద్ర! నాహం వేద్మి స వేత్స్యతి ।**
**స గత్వా తమపృచ్ఛ సోఽప్యాహ శృణు యన్మునే ॥ 16 ॥**

ఆ భార్గవుడు కూడా "రాజేంద్రా! దానికి ప్రాయశ్చిత్తం నాకు తెలియదు. శునకునికి తెలుసు. అతనిని అడుగు"అన్నాడు. మునీంద్రా! అపుడు అతనివద్దకు రాజు వెళ్లి అడగగా శునకుడు ఏం చెప్పాడో చెబుతాను విను.

**న కశేరుర్న చైవాహం న చాన్యః సామ్ప్రతం భువి ।**
**వేత్త్యేక ఏవ త్వచ్ఛత్రుః ఖాణ్డిక్యో యో జితస్త్వయా ॥ 17 ॥**

అతడు "రాజేంద్రా! కశేరువు కాని, నేను కాని దీనికి తగిన ప్రతిక్రియ ఎరుగము. ఇపుడు ఈ భూమిలో దానిని తెలిసినవారెవరూ లేరు. నీచే ఓడించబడిన నీకు శత్రువైన ఖాండిక్యుడొక్కడే తగిన ప్రాయశ్చిత్తం చెప్పగలడు" అని అన్నాడు.

**స చాహ తం వ్రజామ్యేష ప్రష్టుమాత్మరిపుం మునే! ।**
**ప్రాప్త ఏవ మయా యజ్ఞో యది మాం స హనిష్యతి ॥ 18 ॥**

అనంతరం కేశిధ్వజుడు "మునీశ్వరా! నేను ప్రాయశ్చిత్తం అడగడానికై నా శత్రువు సమీపానికి వెడతాను. ఒకనాడు అతడు చంపివేసినట్లయితే నాకు యజ్ఞఫలం ప్రాప్తించినట్లే.

**ప్రాయశ్చిత్త మశేషేణ యది పృష్టో వదిష్యతి ।**
**తతశ్చావికలో యాగో మునిశ్రేష్ఠ! భవిష్యతి ॥ 19 ॥**

లేక నేనడిగిన వెంటనే ప్రాయశ్చిత్తాన్ని శాస్త్రానుకూలంగా చెప్పినట్లయితే మునిశ్రేష్ఠా! నా యజ్ఞం ఏ ఆటంకం లేకుండా పూర్తి కాగలదు" అని అన్నాడు.

**ఇత్యుక్త్వా రథమారుహ్య కృష్ణాజినధరో నృపః ।**
**వనం జగామ యత్రాస్తే ఖాణ్డిక్యః స మహామతిః ॥ 20 ॥**

ఈ విధంగా పలికి కేశిధ్వజుడు నల్లని లేడి చర్మాన్ని ధరించి రథం అధిరోహించి ఎక్కడ మహాబుద్ధిశాలి అయిన ఖాండిక్యుడు నివసిస్తున్నాడో ఆ వనానికి వెళ్ళాడు.

**తమాయాన్తం సమాలోక్య ఖాణ్డిక్యో రిపుమాత్మనః ।**
**ప్రోవాచ క్రోధతామ్రాక్షః సమారోపిత కార్ముకః ॥ 21 ॥**

అపుడు ఆవిధంగా వస్తున్న తన శత్రువైన కేశిధ్వజుని చూచి ఖాండిక్యుడు కోపంతో కనులు ఎరుపెక్కగా విల్లమ్ములు ఎక్కుపెట్టి ఇలా అన్నాడు.

**కృష్ణాజినం త్వం కవచమాబధ్యాస్మాన్ హనిష్యసి (నిహంస్యసి) ।**
**కృష్ణాజినధరే వేత్సి న మయి ప్రహరిష్యతి ॥ 22 ॥**

"నీవు కృష్ణాజిన రూపమైన కవచాన్ని ధరించి మమ్మల్ని చంపడానికి వచ్చినట్లున్నావు. నేను కృష్ణాజినం ధరించి ఉండగా నన్ను ఎవరూ కొట్టలేరని భావించావా నీవు?

**మృగాణాం వద పృష్ఠేషు మూఢ!కృష్ణాజినం న కిమ్ ।**
**యేషాం త్వయా మయా చోగ్రాః ప్రహితాః శితసాయకాః ॥ 23 ॥**

ఓయీ మూఢా! జంతువుల పృష్ఠభాగంపై కృష్ణాజినం ఉండదా? అట్టి జంతువులపై నీవు,నేను భయంకరములైన బాణాలను ప్రయోగించలేదా?

**స త్వామహం హనిష్యామి న మే జీవన్ విమోక్ష్యసే ।**
**ఆతతాయ్యసి దుర్బద్ధే! మమ రాష్ట్రహరో రిపుః ॥ 24 ॥**

"అటువంటి నిన్ను నేను చంపి తీరుతాను. నా దగ్గరనుండి నీవు బ్రతికిపోలేవు. ఓరి దుర్బుద్ధీ! నీవు ఆతతాయివి. నా రాజ్యాన్ని హరించావు. నాకు శత్రువవు." అని క్రోధపరవశుడై అన్నాడు ఖాండిక్యుడు.

**కేశిధ్వజ ఉవాచ :** కేశిధ్వజుడు చెప్పాడు.

**ఖాణ్డిక్య! సంశయం ప్రష్టుం భవన్త మహమాగతః ।**
**న త్వాం హన్తుం విచార్యైతత్ కోపం బాణం విముంచ వా ॥ 25 ॥**

అపుడు కేశిధ్వజుడు "ఖాండిక్యా! నేను ఒక సందేహం తీర్చుకొనడానికై నీ సమీపానికి వచ్చాను. నిన్ను చంపడానికి వచ్చినవాడను గాను. కావున తొందరతో ఆలోచించకుండా ఏ పనీ చేయకు. కోపాన్ని, బాణాన్ని త్యజించు" అని వేడుకొన్నాడు.

**తతః సమన్త్రిభిః సార్ధమేకాన్తే సపురోహితః ।**
**మన్త్రయామాస ఖాణ్డిక్యః సర్వైరేవ మహామతిః ॥ 26 ॥**

ఆ మాటలు విన్న ఖాండిక్యుడు మంత్రులతోను, పురోహితులతోను కలసి ఏకాంతంలో మహా బుద్ధిశాలియై అందరితోను కలిసి ఆలోచన కావించాడు.

**తమూచుర్మన్త్రిణో వధ్యో రిపురేష వశంగతః ।**
**హతే తు పృథివీ సర్వా మమ వశ్యా భవిష్యతి ॥ 27 ॥**

అపుడు ఆ మంత్రులందరూ "శత్రువు నీ చేతికి చిక్కాడు. అతన్ని వధించడమే ఇపుడు నీకు చేయదగిన పని. శత్రువు నశిస్తే సమస్త పృథివీమండలం నీ అధీనంలోకి వస్తుంది." అని హితం చెప్పారు.

**ఖాణ్డిక్యశ్చాహ తాన్ సర్వానేతదేవం న సంశయః ।**
**హతే తు పృథివీ సర్వా మమ వశ్యా భవిష్యతి ॥ 28 ॥**

అంత ఖాండిక్యుడు వారందరితో "ఇందు ఏ సందేహం లేదు. కేశిధ్వజుడు మరణిస్తే అఖిల భూ ప్రపంచం నాకు వశమవుతుంది.

**పరలోకజయస్తస్య పృథివీ సకలా మమ ।**
**న హన్మి చేల్లోకజయో మమ తస్య వసున్ధరా ॥**
**నాహం మన్యే లోక జయా దధికా స్యాద్వసున్ధరా ॥ 29 ॥**

అపుడు కేశిధ్వజునకు పరలోకం సిద్ధిస్తుంది. నాకు ఇహలోకరాజ్యం లభిస్తుంది. నేను అతనిని చంపకుండా ఉంటే నాకు పరలోకవిజయం. అతనికి వసుంధర చేకూరుతాయి. పరలోకవిజయం కన్నా వసుంధరా విజయం అధికం కాదని నేను భావిస్తున్నాను.

**పరలోకజయోఽనన్తః స్వల్పకాలో మహీజయః ।**
**తస్మాదేనం న హింసిష్యే యత్ పృచ్ఛతి వదామి తత్ ॥ 30 ॥**

"పరలోక విజయం అనంతమైనది. మహీవిజయం అత్యల్పమైనది. అందువల్ల ఇతనిని నేను చంపను. కేశిధ్వజుడు అడిగినదేదో దానికి సమాధానం చెబుతాను." అన్నాడు.

**తతస్తమభ్యుపేత్యాహ ఖాణ్డిక్యజనకో రిపుమ్ ।**
**ప్రష్టవ్యం యత్త్వయా సర్వం తత్ పృచ్ఛస్వ వదామ్యహమ్ ॥ 31 ॥**

అని పలికి ఖాండిక్యజనకుడు శత్రువైన కేశిధ్వజుని సమీపించి "నీవు అడగదగినది అంతా అడగవచ్చు. నేను దానికి తగినట్టు చెబుతాను-అన్నాడు.

**తతః సర్వం యథావృత్తం ధర్మధేనువధం ద్విజ! ।**
**కథయిత్వా స ప్రపచ్ఛ ప్రాయశ్చిత్తం హి తద్గతమ్ ॥ 32 ॥**

ద్విజోత్తమా! మైత్రేయా! అపుడు కేశిధ్వజుడు జరిగిన ధర్మధేనువు వధను ఉన్నదున్నట్లుగా సర్వం తెలియజేసి, దానికి తగిన ప్రాయశ్చిత్తం ఏమిటో వివరించవలసిందని అడిగాడు.

**స చాచష్ట యథాన్యాయం ద్విజ! కేశిధ్వజాయ తత్ ।**
**ప్రాయశ్చిత్తమశేషేణ యద్ వై తత్ర విధీయతే ॥ 33 ॥**

ద్విజశ్రేష్ఠా! ఖాండిక్యుడు కూడా శాస్త్రవిధిని అనుసరించి దానికి ఏ ప్రాయశ్చిత్తం విధించబడిందో దానినంతా పూస గుచ్చినట్లుగా కేశిధ్వజునకు వివరించాడు.

**విదితార్థః స తేనైవం సోఽనుజ్ఞాతో మహాత్మనా ।**
**యాగభూమి ముపాశ్రిత్య చక్రే సర్వాః క్రియాః క్రమాత్ ॥ 34 ॥**

అనంతరం కేశిధ్వజుడు తానడిగినదానికి తగినట్లుగా చెప్పిన అర్థం అంతా తెలిసికొని, మహాత్ముడైన ఖాండిక్యుని సెలవడిగి, యాగభూమికేతెంచి సమస్తప్రాయశ్చిత్త కర్మలను యథావిధిగా ఒనరించాడు.

**క్రమేణ విధివద్యాగం నీత్వా సోఽవభృథాప్లుతః ।**
**కృతకృత్యస్తతో భూత్వా చిన్తయామాస పార్థివః ॥ 35 ॥**

యథాక్రమంగా శాస్త్రవిధిననుసరించి యాగం పూర్తిచేసి, అవభృథస్నానం గావించి, తాను కృతకృత్యుడైనట్లుగా భావించి ఆ కేశిధ్వజుడు ఇలా ఆలోచించాడు.

**పూజితాః ఋత్విజః సర్వే సదస్యా మానితా మయా ।**
**తథైవార్థిజనోఽప్యర్థైర్యోజితోఽభిమతైర్యథా ॥ 36 ॥**

**యథార్హమస్య లోకస్య మయా సర్వం విచేష్టితమ్ ।**
**అనిష్పన్నక్రియం చేత స్తథాఽపి మమ కిం యథా ॥ 37 ॥**

"ఋత్విజులందరినీ పూజించాను. సదస్యులనందరినీ సత్కరించాను. అదేవిధంగా యాచకులందరికీ వారి కోరికననుసరించి ఈయడం జరిగింది. ఈలోకంలో చేయవలసిన కర్మ ఏదైతే ఉందో అంతా అనుష్ఠించాను. ఐనప్పటికీ నామనస్సు ఏదో క్రియాలోపం చేసినట్లు అనిపిస్తోంది."

**ఇతి సంచిన్త్య యత్నేన సస్మార స మహీపతిః ।**
**ఖాణ్డిక్యాయ న దత్తేతి మయా వై గురుదక్షిణా ॥ 38 ॥**

అని పదేపదే చింతించి ఆ మహీపతి అతి ప్రయత్నంతో తాను ఖాండిక్యునికి గురుదక్షిణ చెల్లించలేదన్న విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు.

**జగామ చ తతో భూయో రథమారుహ్య పార్థివః ।**
**మైత్రేయ! దుర్గగహనం ఖాణ్డిక్యో యత్ర సంస్థితః ॥ 39 ॥**

మైత్రేయా! కేశిధ్వజుడు మళ్ళీ రథమధిరోహించి ఖాండిక్యుడు ఏ దుర్గమారణ్యంలో ఉన్నాడో అక్కడికి వెళ్ళాడు.

**ఖాణ్డిక్యోఽపి తథాఽఽయాన్తం పునర్దృష్ట్వా ధృతాయుధః ।**
**తస్థౌ హన్తుం కృతమతి స్తథాఽఽహ స పునర్నృపః ॥ 40 ॥**

ఖాండిక్యుడు కూడా మళ్ళీ తనవద్దకు వస్తున్న శత్రువును చూచి ఆయుధం ధరించి చంపడానికి సిద్ధపడి లేచాడు. అపుడు కేశిధ్వజుడు అతనితో ఇలా అన్నాడు.

**భో నాహం తేఽపకారాయ ప్రాప్తః ఖాణ్డిక్య! మా క్రుధః ।**
**గురోర్నిష్క్రియదానాయ మామవేహి త్వమాగతమ్ ॥ 41 ॥**

"ఓయీ! మహానుభావా! ఖాండిక్యా! నేను నీకు అపకారం చేయడానికి రాలేదు. కోపించకు. గురుఋణం తీర్చడానికి దక్షిణనీయగా వచ్చినట్లు నన్ను తెలుసుకొమ్ము.

**నిష్పాదితో మయా యాగః సమ్యక్ త్వదుపదేశతః ।**
**సోఽహం తే దాతుమిచ్ఛామి వృణుష్వ గురుదక్షిణామ్ ॥ 42 ॥**

"నీ ఉపదేశం వలన నేను యాగం చక్కగా పూర్తి చేశాను. అందువల్ల గురుఋణం తీర్చడానికి వచ్చాను. గురుదక్షిణ కోరుకొమ్ము" అని ప్రాధేయపడ్డాడు.

**భూయః సమన్త్రిభిః సార్ధం మన్త్రయామాస పార్థివః ।**
**గురునిష్కృతికామోఽత్ర కిమయం ప్రార్థ్యతామితి ॥ 43 ॥**

అపుడు ఖాండిక్యుడు మళ్ళీ మంత్రులతో కలిసి "గురుఋణం తీర్చడానికి వచ్చిన ఇతనిని నేనేమి అడగాలి?" అని ఆలోచించాడు.

**తమూచుర్మన్త్రిణో రాజ్యమశేషం ప్రార్థ్యతామితి ।**
**కృతిభిః ప్రార్థ్యతే రాజ్యమనాయాసితసైనికైః ॥ 44 ॥**

అపుడు వారు "సమస్త రాజ్యం గురుదక్షిణగా కోరవలసింది. సైనికులను కష్టపెట్టకుండా శత్రురాజులు ఇటువంటి సందర్భాలలో రాజ్యం కోరడం అనేది బుద్ధిమంతులైన వారు చేసేదే." అని అన్నారు.

**ప్రహస్య తానాహ నృపః స ఖాణ్డిక్యో మహామతిః ।**
**స్వల్పకాలం మహీరాజ్యం మాదృశైః ప్రార్థ్యతే కథమ్ ॥ 45 ॥**

అపుడు మహామతియైన ఖాండిక్యనృపతి చిరునవ్వు నవ్వి "స్వల్పకాలం అనుభవించే మహీపాలనం మావంటివారు ఎట్లు కోరుకొంటారు?

**ఏవమేతద్ భవన్తోఽత్ర హ్యర్థసాధన మన్త్రిణః ।**
**పరమార్థః కథం కోఽత్ర యూయం నాత్ర విచక్షణాః ॥ 46 ॥**

"మీరందరూ కేవలం లౌకికార్థాలను కోరుకొనే మంత్రులు మాత్రమే. అలా ఐతే పరమార్థం ఏది? అది ఏల సంభవిస్తుంది? అనే విషయంలో మీరు విచక్షణులు కారు." అని ఆ మంత్రులతో అన్నాడు.

**ఇత్యుక్త్వా సముపేత్యైనం స తు కేశిధ్వజం నృపమ్ ।**
**ఉవాచ కిమవశ్యం త్వం దదాసి గురుదక్షిణామ్ ॥ 47 ॥**

అని పలికి ఆ రాజు కేశిధ్వజనృపాలుని సన్నిధికి వచ్చి "నీవు నిజంగా నాకు గురుదక్షిణ సమర్పిస్తావా?" అని అడిగాడు.

**బాఢమిత్యేవ తేనోక్తః ఖాణ్డిక్య స్తమథాబ్రవీత్ ।**
**భవానధ్యాత్మవిజ్ఞాన పరమార్థవిచక్షణః ॥ 48 ॥**

అతనిచే "నేను తప్పనిసరిగా దక్షిణ చెల్లిస్తాను సరే." అనిపించుకొని ఖాండిక్యుడు కేశిధ్వజునితో "నీవు అధ్యాత్మవిద్యకు సంబంధించిన విజ్ఞానం, అందలి పరమార్థం తెలుసుకొన్న విచక్షణుడవు.

**యది చేద్దీయతే మహ్యం భవతా గురునిష్క్రియః ।**
**తత్ క్లేశ ప్రశమాయాలం యత్ కర్మ తదుదీరయ ॥ 49 ॥**

నీవు నాకు గురుదక్షిణ ఇవ్వదలచుకొన్నట్లైతే సర్వక్లేశాలు ఉపశమించాలంటే ఏపని చేయవలసి ఉందో దానిని చెప్పవలసింది" అని అడిగాడని పరాశరుడు మైత్రేయునకు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే షష్ఠాంశే కేశిధ్వజ ఖాండిక్యవృత్తాంతో నామ షష్ఠోఽధ్యాయః సమాప్తః ॥ 6 ॥**

శ్రీవిష్ణుపురాణంలో షష్ఠాంశంలో కేశిధ్వజ ఖాండిక్యుల వృత్తాంతం అనే ఆరవ అధ్యాయం సమాప్తం ॥ 6 ॥



## సప్తమోఽధ్యాయః – ఏడవ అధ్యాయం

## బ్రహ్మయోగవర్ణనమ్ – బ్రహ్మయోగవర్ణన

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెబుతున్నాడు.

**న ప్రార్థితం త్వయా కస్మాన్మమ రాజ్యమకణ్టకమ్ ।**
**రాజ్యలాభాద్ వినా నాన్యత్ క్షత్రియాణా మతిప్రియమ్ ॥ 1 ॥**

మైత్రేయా! అపుడు కేశిధ్వజుడు ఖాండిక్యునితో "రాజ్యలాభం కన్న క్షత్రియులకు మిక్కిలి ప్రియమైనది ఇంకొకటి లేనేలేదు. నీవు నా నుండి అకంటకమైన రాజ్యాన్ని ఏల కోరుకోలేదు" అని ప్రశ్నించాడు.

**కేశిధ్వజ! నిబోధ త్వం మయా న ప్రార్థితం యతః ।**
**రాజ్యమేతదశేషం తే యత్ర గృధ్నన్త్యపణ్డితాః ॥ 2 ॥**

అంత ఖాండిక్యుడు "కేశిధ్వజా! నేను నిన్ను రాజ్యం కోరుకోక పోవడానికి కారణం ఏమిటో చెబుతాను విను. రాజ్యమంతా తనకు కావాలని అవిద్వాంసులైన రాజులు లోభపరవశులవుతారు.

**క్షత్రియాణామయం ధర్మో యత్ ప్రజాపరిపాలనమ్ ।**
**వధశ్చ ధర్మయుద్ధేన స్వరాజ్యపరిపన్థినామ్ ॥ 3 ॥**

క్షత్రియులకు ప్రజాపరిపాలన పరమధర్మం. ధర్మయుద్ధంలో తన రాజ్యానికి శత్రువులైనవారిని చంపడం కూడా ధర్మమే.

**తత్రాశక్తస్య మే దోషో నైవాస్త్యపహృతే త్వయా ।**
**బన్ధాయైవ భవత్యేషా హ్యవిద్యాప్యక్రమోజ్ఝితా ॥ 4 ॥**

నేను శక్తిహీనుడనైన కారణంచే నీచే రాజ్యం గైకొనబడింది. ఇందు నా దోషం ఏమీ లేదు. అవిద్య క్రమం తప్పితే బంధనం కొరకే అవుతుంది. స్వకర్మ ఆచరించకుండా నియమవిరుద్ధ త్యాగం బంధనం అవుతుంది.

**జన్మోపభోగలిప్సార్థమియం రాజ్యస్పృహా మమ ।**
**అన్యేషాం దోషజా నైషా ధర్మమేవానురుధ్యతే ॥ 5 ॥**

జన్మపొందినవారికి భోగలాలసత్వం ఉంటుంది కనుక నాకు రాజ్యంపై కోరిక ఏర్పడింది. అది నాకు జన్మాంతరం నుంచి వచ్చింది. అది మంత్రిమున్నగు ఇతర జనులకు ఉంటే దోషకారణమవుతుంది. అందు ధర్మం అనుసరించబడదు.

**న యాచ్ఞా క్షత్రబన్ధూనాం ధర్మో హ్యేతత్ సతాం మతమ్ ।**
**అతో న యాచితం రాజ్య మవిద్యాన్తర్గతం తవ ॥ 6 ॥**

ఉత్తమ క్షత్రియులకు (క్షత్రబంధువులకు) రాజ్యాదులను యాచించడం ధర్మం కాదని సత్పురుషుల అభిప్రాయమై ఉంది. అందువల్ల అవిద్యా కర్మ రూపమైన ఈరాజ్యపరిపాలనను నేను నిన్ను కోరలేదు.

**రాజ్యే గృధ్నన్త్యవిద్వాంసో మమత్వాహతచేతసః ।**
**అహంమానమహాపానమదమత్తా న మాదృశాః ॥ 7 ॥**

మమకారంచే మతి చెడిపోయినవారు, అహం ప్రవృత్తి అనే మహాపానం చేసి మత్తిల్లి ఒడలు తెలియనివారు ఐన అజ్ఞానులు రాజ్యంపైనున్న దురాశచే కోరుకొంటారు. కాని మావంటివారు ఆ సుఖాలు కోరరని వచించాడు.

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు పలికాడు.

**ప్రహృష్టః సాధ్వితి ప్రాహ తతః కేశిధ్వజో నృపః ।**
**ఖాణ్డిక్యజనకం ప్రీత్యా శ్రూయతాం వచనం మమ ॥ 8 ॥**

అంత కేశిధ్వజ నృపేంద్రుడు సంతసించి బాగుందని మెచ్చుకొని ఖాండిక్యజనకునితో సంప్రీతితో నా మాట ఆలకించమని ఇలా అన్నాడు.

**అహన్త్వవిద్యయా మృత్యుం చ తర్తు కామః కరోమి వై ।**
**రాజ్యం యాగాంశ్చ వివిధాన్ భోగైః పుణ్యక్షయం తథా ॥ 9 ॥**

నేనయితే అవిద్యద్వారా మృత్యువును తరించగోరి రాజ్యం, యాగం వివిధ యాగాలు, అనేక భోగాలు అనుభవిస్తూ పుణ్యక్షయం చేసుకొంటున్నాను.

**తదిదం తే మనో దిష్ట్యా వివేకైశ్వర్యతాం గతమ్ ।**
**తచ్ఛ్రూయతామవిద్యాయా స్వరూపం కులనందన! ॥ 10 ॥**

అదృష్టవశంచేత నీ మనస్సు వివేకంతో కూడుకొన్న ఆత్మైశ్వర్యభావాన్ని వహించింది. వంశానికి వన్నె తెచ్చిన ఖాండిక్యా! నీవు ముందు అవిద్యాస్వరూపాన్ని ఆలకించు.

**అనాత్మన్యాత్మ బుద్ధిర్యా చాస్వే స్వమితి యా మతిః ।**
**అవిద్యాతరుసమ్భూతే ర్బీజమేతత్ ద్విధా స్థితమ్ ॥ 11 ॥**

ఆత్మ కానిదానియందు ఆత్మబుద్ధి, తనది కాని దానియందు తనది అనే తలపు అని అవిద్య–అనే వృక్షానికి బీజం రెండుగా ఉంది.

**పంచభూతాత్మకే దేహే దేహీ మోహతమోవృతః ।**
**అహమేతదితీత్యుచ్ఛైః కురుతే కుమతిర్మతిమ్ ॥ 12 ॥**

పంచభూతస్వరూపమైన దేహమందు దేహి (జీవుడు) తమోగుణం అనే మోహంతో కూడుకొని ఉంటాడు. ఈ శరీరమే నేను, ఇది నాది అని బుద్ధిని కుమతి కలిగి ఉంటాడు.

**ఆకాశవాయ్వగ్ని జలపృథివీభ్యః పృథక్ స్థితే ।**
**ఆత్మన్యాత్మమయం భావం కః కరోతి కలేబరే ॥ 13 ॥**

శరీరంలో ఆకాశం, వాయువు, అగ్ని, జలం, పృథివికన్న వేరుగానున్న ఆత్మయందు ఆత్మమయమైన (పంచభూతాత్మకమైన) భావన ఎవడు చేస్తాడు ?

**కలేబరోపభోగ్యం హి గృహక్షేత్రాదికం చ కః ।**
**అదేహే హ్యాత్మని ప్రాజ్ఞో మమేదమితి మన్యతే ॥ 14 ॥**

గృహం, క్షేత్రం, కళత్రం ఇత్యాదులను అనుభవించడానికి ఉపయుక్తమయ్యే కళేబరమందు ప్రాజ్ఞుడైన మనుష్యుడు ఈశరీరం నేను, ఇది నాది అని ఎవడైనా భావన పొందుతాడా?

**ఇత్థం చ పుత్రపౌత్రేషు తద్దేహోత్పాదితేషు కః ।**
**కరోతి పణ్డితః స్వామ్య మనాత్మని కలేబరే ॥ 15 ॥**

అటువంటప్పుడు తన దేహంచే పుట్టించబడే పుత్రులయందు, పౌత్రులయందు జ్ఞాని ఎప్పుడైనా తన సొంతమనే అభిప్రాయం పొందుతాడా? అట్లే, ఆత్మకాని కళేబరమందు స్వామ్యమును ఎవ్వడును కలిగియుండడు.

**సర్వం దేహోపభోగాయ కురుతే కర్మ మానవః ।**
**దేహశ్చాన్యో యదా పుంస స్తదా బన్ధాయ తత్పరమ్ ॥ 16 ॥**

మానవుడు దేహోపభోగంకొరకే సర్వకర్మలను ఆచరిస్తాడు. ఈ దేహం పురుషుని (ఆత్మ) కన్న వేరయినదని తెలిసేవరకు దానికై చేయు కర్మం బంధహేతువే అవుతుంది.

**మృన్మయం చ యథా గేహం లిప్యతే చ మృదమ్బసా ।**
**పార్థివోఽయం తథా దేహో మృదన్నాలేపనస్థితిః ॥ 17 ॥**

మట్టితో కట్టిన ఇల్లు మట్టినీళ్ళతో ఎలా పూయబడునో, ఈ పార్థివశరీరం అలాగే పృథ్వీభూతమైన అన్నం తోను, జలభూతమైన నీటితోనూ పూయబడి పెరుగుతుంది.

**పంచభూతాత్మకై ర్భోగైః పంచభూతాత్మకం వపుః ।**
**ఆప్యాయతే యది తతః పుంసో గర్వోఽత్ర కిం తతః ॥ 18 ॥**

ఈ పంచభూతాత్మకమైన శరీరం పాంచభౌతిక పదార్థాలచే పుష్టిచెందుతున్నపుడు, పురుషునకు దానిచే గర్వమెక్కడిది?

**అనేకజన్మసాహస్రీం సంసారపదవీం వ్రజన్ ।**
**మోహశ్రమం ప్రయాతోఽసౌ వాసనారేణుకుణ్ఠితః ॥ 19 ॥**

వేలకొలది జన్మల పరిమితి గల సంసారమార్గంలో సంచరిస్తూ, మోహమనే శ్రమకు గురియై ఈ పురుషుడు వాసనలనే ధూళికణాలచే క్రమ్ముకొని ఉంటాడు.

**ప్రక్షాల్యతే యదా సోఽస్య రేణుర్జ్ఞానోష్ణవారిణా ।**
**తదా సంసారపాన్థస్య యాతి మోహశ్రమః శమమ్ ॥ 20 ॥**

ఎప్పుడయితే ఈ రేణుసమితి జ్ఞానమనే వేడినీటితో కడగబడుతుందో, అపుడే సంసారమనే పాంథుని మోహాశ్రమం శాంతిపొందుతుంది.

**మోహశ్రమే శమం యాతే స్వస్థాన్తఃకరణః పుమాన్ ।**
**అనన్యాతిశయాబాధం పరం నిర్వాణమృచ్ఛతి ॥ 21 ॥**

మోహశ్రమ శాంతించగానే, అంతఃకరణం స్వస్థమై, పురుషుడు అనన్యమైన, అతిశయమైన, నిర్బాధమైన, పరమమైన నిర్వాణాన్ని పొందుతాడు.

**నిర్వాణమయ ఏవాయమాత్మా జ్ఞానమయోఽమలః ।**
**దుఃఖాజ్ఞానమలాధర్మాః ప్రకృతేస్తేతు నాత్మనః ॥ 22 ॥**

ఆత్మ అనేది నిర్వాణమయం. జ్ఞానమయం అమలమైనది. దుఃఖం, అజ్ఞానం, మలం అనే ధర్మాలు ప్రకృతికి సంబంధించినవి కాని ఆత్మకు సంబంధించినవి కావు.

**జలస్య నాగ్నిసంసర్గః స్థాలీసంగా త్తథాఽపి హి ।**
**శబ్దోద్రేకాదికాన్ ధర్మాంస్తత్ కరోతి యథా మునే! ॥ 23 ॥**

మునీశ్వరా! నిజంగా నీటికి అగ్నితో సంసర్గం లేదు. అయినప్పటికి గిన్నెతో సంసర్గం వలన ఆ సంయోగం నీటికి కలిగి దానికి మరిగే సమయంలో బుడబుడ చప్పుడు, పొంగు మొదలైన ధర్మాలను పొందుతోంది.

**తథాఽఽత్మా ప్రకృతేః సంగాదహంమానాది దూషితః ।**
**భజతే ప్రాకృతాన్ ధర్మానన్యస్తేభ్యో హి సోఽవ్యయః ॥ 24 ॥**

అలాగే ఆత్మ ప్రకృతిసంగం వల్ల అహంకారం, మమకారం మున్నగువాటిచే దూషితమవుతోంది. ఆత్మ ఆ యా ప్రకృతిధర్మాలను పొందుతోంది. వాస్తవానికి అవ్యయమైన ఆత్మ అన్నింటికన్న వేరైనది.

**తదేతత్ కథితం బీజమవిద్యాయా స్తవ ప్రభో! ।**
**క్లేశానాం చ క్షయకరం యోగాదన్యన్న విద్యతే ॥ 25 ॥**

రాజా! నీకు ఈ అవిద్యాబీజాన్ని వివరించి చెప్పాను. ఆ అవిద్యాక్లేశాలు నాశనం కావాలంటే యోగం (జ్ఞానం) కన్న వేరైనది ఏదీ లేదు.

**ఖాండిక్య ఉవాచ :-** ఖాండిక్యుడు చెప్పాడు.

**తన్తు బ్రూహి మహాభాగ! యోగం యోగవిదుత్తమ! ।**
**విజ్ఞాతయోగ శాస్త్రార్థ స్త్వమస్యాం నిమిసన్తతౌ ॥ 26 ॥**

అపుడు ఖాండిక్యుడు కేశిధ్వజునితో "మహాభాగా! యోగజ్ఞానం తెలిసినవారిలో వరేణ్యుడవు నీవు. ఈ నిమి చక్రవర్తిసంతతిలో యోగశాస్త్రం బాగా తెలిసినవాడవు. దాని అర్థం గ్రహించినవాడవు. కాబట్టి ఆ యోగాన్ని గూర్చి తెలియజేయి" అని వేడుకొన్నాడు.

**కౌశిధ్వజ ఉవాచ :–** కౌశికధ్వజుడు చెప్పాడు.

**యోగస్వరూపం ఖాణ్డిక్య! శ్రూయతాం గదతో మమ ।**
**యత్ర స్థితో న చ్యవతే ప్రాప్య బ్రహ్మలయం మునిః ॥ 27 ॥**

అపుడు కేశిధ్వజుడు "ఖాండిక్యా! నేను నీకు యోగస్వరూపాన్ని గూర్చి తెలియజేస్తాను శ్రద్ధగా ఆలకించు. ఏ యోగాన్ని అవలంబించి బ్రహ్మను పొంది ముని తిరిగి సంసారంలోకి రాడో, అదిచెబుతాను.

**మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః ।**
**బన్ధాయ విషయాసంగి ముక్త్యై నిర్విషయం తథా ॥ 28 ॥**

మనుష్యుల బంధమోక్షాలకు మనస్సే కారణమవుతోంది. మనస్సు విషయాలపై తగులుకొంటే బంధనానికి కారణం. అది విషయవాసనలవెంట పోకపోతే ముక్తికి హేతువు.

**విషయేభ్యః సమాహృత్య విజ్ఞానాత్మా మనో మునిః ।**
**చిన్తయేన్ముక్తయే తేన బ్రహ్మభూతం పరేశ్వరమ్ ॥ 29 ॥**

విజ్ఞానస్వరూపుడైన ముని మనస్సును విషయాలనుంచి వెనకకు లాగి బ్రహ్మమైన పరమేశ్వరుని ముక్తికొరకు ధ్యానించాలి.

**ఆత్మభావం నయత్యేనం తద్బ్రహ్మ ధ్యాయినం మునిమ్ ।**
**వికార్యమాత్మనః శక్త్యా లోహ మాకర్షకో యథా ॥ 30 ॥**

ఇటువంటి బ్రహ్మధ్యాన నిష్ఠుడైన యోగి మనస్సు, అయస్కాంతం తన శక్తిచే వికారాలను పొందిన లోహాన్ని ఆకర్షించేటట్లు ఆత్మభావాన్ని పొందిస్తుంది.

**ఆత్మప్రయత్న సాపేక్షా విశిష్టా యా మనోగతిః ।**
**తస్యా బ్రహ్మణి సంయోగో యోగ ఇత్యభిధీయతే ॥ 31 ॥**

ఆత్మజ్ఞానం కోసమై ప్రయత్నించే యమనియమాదుల అపేక్షద్వారా విశిష్టమైన ఏ మనోగతి కలదో, ఆ గతిని బ్రహ్మమందు బాగుగా కూర్చుటే యోగం అని చెప్పబడుతుంది.

**ఏవమత్యన్తవైశిష్ట్యయుక్తకర్మోపలక్షణః ।**
**యస్య యోగస్స వై యోగీ ముముక్షురభిధీయతే ॥ 32 ॥**

ఇట్లు మిక్కిలి నేర్పుతో కూడిన మనోగతి లక్షణంగా కల్గిన యోగమెవ్వనికి అలవడునో, అట్టి యోగి ముముక్షువు (మోక్షాన్ని కోరేవాడు) అనబడతాడు.

**యోగయుక్ ప్రథమం యోగీ యుంజానో హ్యభిధీయతే ।**
**వినిష్పన్న సమాధిస్తు పరం బ్రహ్మోపలబ్ధిమాన్ ॥ 33 ॥**

మొట్టమొదట యోగాభ్యాసానికి పూనుకొన్న యోగి "యుంజానుడు" అనబడతాడు. క్రమంగా సమాధి చక్కగా స్థిరపడి బ్రహ్మజ్ఞానం పొందినవాడవుతాడు.

**బ్రహ్మచర్యమహింసా చ సత్యాస్తేయాపరిగ్రహాన్ ।**
**సేవేత యోగీ నిష్కామో యోగ్యతాం స్వమనో నయన్ ॥ 34 ॥**

బ్రహ్మచర్యం, అహింస, సత్యం, దొంగతనం చేయకుండడం, దానం పట్టకుండడం –అనే ధర్మాలను చక్కగా సేవిస్తూ యోగి కోరికలను దూరం చేసుకొని మనస్సును స్వాధీనపరచుకొని యోగార్హతను పొందుతాడు.

**స్వాధ్యాయశౌచసంతోషతపాంసి నియతాత్మవాన్ ।**
**కుర్వీత బ్రహ్మణి తథా పరస్మిన్ ప్రవణం మనః ॥ 35 ॥**

స్వాధ్యాయం, శౌచం, సంతోషం, తపస్సు అనే వాటిని ఆచరిస్తూ నియతాత్ముడై మనస్సును పరబ్రహ్మమునందు లగ్నమైన దానినిగా చేయాలి.

**ఏతే యమాః సనియమాః  పంచ పంచ ప్రకీర్తితాః ।**
**విశిష్టఫలదాః కామ్యా నిష్కామానాం విముక్తిదాః ॥ 36 ॥**

ఈ బ్రహ్మచర్యం, అహింస, సత్యం, అస్తేయం, అపరిగ్రహం అనే అయిదును "యమము" అని, స్వాధ్యాయం, శౌచం, సంతోషం, తపస్సు, నియతాత్మ అనే ఐదునూ "నియమములు" అని ప్రసిద్ధిని వహించాయి. ఇవి కామ్యములైతే విశిష్టములైన ఫలితాలనిస్తాయి. నిష్కామములైతే ముక్తి నిస్తాయి.

**ఏకం భద్రాసనాదీనాం సమాస్థాయ గుణైర్యుతః ।**
**యమాఖ్యై ర్నియమాఖ్యైశ్చ యుంజీత నియతో యతిః ॥ 37 ॥**

భద్రాసనం మున్నగు ఆసనాలలో ఏదో ఒక ఆసనముపై ఉండి యమనియమాదిగుణాలతో కూడుకొన్నవాడై యోగి ఇంద్రియనిగ్రహంతో యోగాభ్యాసం చేయాలి.

**యద్యన్తరాయదోషేణ దూష్యతే చాస్య మానసమ్ ।**
**జన్మాన్తరై రభ్యసతో ముక్తిః పూర్వస్య జాయతే ॥ 38 ॥**

ఏదైనా విఘ్నకారణంచే యోగయుక్తుడైనయోగి మనస్సు దూషితమైతే, అది జన్మాంతరంలోనైనా అభ్యాసంలోకి వచ్చి ముక్తిహేతు వవుతుంది.

**వినిష్పన్నసమాధిస్తు ముక్తిం తత్రైవ జన్మని ।**
**ప్రాప్నోతి యోగీ యోగాగ్నిదగ్ధకర్మచయోఽచిరాత్ ॥ 39 ॥**

లేక పూర్ణసమాధి సంపన్నుడైనచో యోగాగ్నియందు సమస్తకర్మలు భస్మం కాగా ఆ జన్మలోనే ఆ సమయంలోనే యోగి ముక్తుడైపోతాడు.

**ప్రాణాఖ్యమనిలం వశ్య మభ్యాసాత్ కురుతే తు యత్ ।**
**ప్రాణాయామః స విజ్ఞేయః స బీజోఽబీజ ఏవ చ ॥ 40 ॥**

ప్రాణమనే పేరు గల వాయువును అభ్యాసం వలన వశం చేసుకొంటే, అది ప్రాణాయామం అనబడుతుంది. అది సబీజం, నిర్బీజం అని రెండు విధాలని తెలుసుకోవాలి.

వి ॥ మంత్రపఠనం మున్నగు ఆలంబనములతో కూడుకొంటే సబీజమని, ఏ ఆలంబనం లేకుండా ఉంటే నిర్బీజమని గ్రహించాలి.

**పరస్పరేణాభిభవం ప్రాణాపానౌ యదానిలౌ ।**
**కురుతః స ద్విధాఽనేన తృతీయః సంయమాత్తయోః ॥ 41 ॥**

సద్గురువు యొక్క ఉపదేశం వలన ప్రాణాపాన వాయువులను ఒకదానిని ఇంకొకదానిచే నిరోధించే సమయంలో క్రమంగా (రేచక పూరకాలనే) రెండు ప్రాణాయామాలు అవుతాయి. ఆ రెండింటినీ ఒకే సమయంలో సంయమనం చేస్తే (కుంభకమనే) మూడో ప్రాణాయామం అవుతుంది.

వి ॥ ప్రాణమనగా హృదయంలో ఉండే గాలి. అపానమనగా గుదమందుండే గాలి.

**తస్య చాలమ్బనవతః స్థూలరూపం ద్విజోత్తమ! ।**
**ఆలమ్బనమనన్తస్య యోగినోఽభ్యసతః స్మృతమ్ ॥ 42 ॥**

ఓ! ద్విజోత్తమా! ఎప్పుడయితే యోగి సబీజప్రాణాయామానికి చెందిన అభ్యాసారంభం చేస్తాడో, అప్పుడు ఆ ఆలంబనం భగవంతుడైన అనంతుడగు హిరణ్యగర్భుని స్థూలరూపం అవుతుంది.

**శబ్దాదిష్వనురక్తాని నిగృహ్యాక్షాణి యోగవిత్ ।**
**కుర్యాచ్చిత్తానుచారీణి ప్రత్యాహారపరాయణః ॥ 43 ॥**

శబ్దం మున్నగు విషయాలయందు వెంట తగిలే శ్రవణం మున్నగు ఇంద్రియాలను యోగవేత్త నిగ్రహించి చిత్తం వెంటనుండువానినిగా చేస్తే అతడు ప్రత్యాహారమనే ప్రక్రియలో సిద్ధహస్తుడౌతాడు.

**వశ్యతా పరమా తేన జాయతేఽతిచలాత్మనామ్ ।**
**ఇన్ద్రియాణా మవశ్యైస్తైర్న యోగీ యోగసాధకః ॥ 44 ॥**

అందువల్ల మిక్కిలి చంచల స్వభావం గల ఇంద్రియసమూహాలు వశం కావడంతోనే పరమయోగభూమిక చేకూరుతుంది. అది వశం కాకపోతే యోగి యోగసాధకుడు కానేరడు.

**ప్రాణాయామేన పవనైః ప్రత్యాహారేణ చేన్ద్రియైః ।**
**వశీకృతై స్తతః కుర్యాత్ స్థిరం చేతః శుభాశ్రయే ॥ 45 ॥**

ప్రాణాయామం ద్వారా వాయువులను, ప్రత్యాహారం ద్వారా ఇంద్రియాలను వశం కావించుకొన్న తర్వాత యోగి మనస్సును శుభాశ్రయమందు నిలకడగా ఉంచాలని వివరించాడు.

**ఖాండిక్య ఉవాచ :–** ఖాండిక్యుడు చెప్పాడు.

**కథ్యతాం మే మహాభాగ! చేతసో యః శుభాశ్రయః ।**
**యదాధారమశేషం తద్ధన్తి దోషమలోద్భవమ్ ॥ 46 ॥**

అంత ఖాండిక్యుడు కేశిధ్వజునితో మహాభాగా! ఈ చిత్తానికి శుభమైన ఆశ్రయమేది? దేనిని ఆధారం చేసుకొంటే దోషాలు, మలాలు సమూలంగా నశించిపోతాయి? దానిని నాకు వివరించు" అని అడిగాడు.

**కౌశిధ్వజ ఉవాచ :–** కౌశికధ్వజుడు చెప్పాడు.

**ఆశ్రయశ్చేతసో బ్రహ్మ ద్విధా తస్య స్వభావతః ।**
**భూప! మూర్త మమూర్తం చ పరం చా పరమేవ చ ॥ 47 ॥**

కేశిధ్వజుడు "రాజా! మనస్సుకు ఆశ్రయం స్వభావం చేతనే రెండువిధాల బ్రహ్మణా ఉంటుంది. అది మూర్తం (సగుణం), అమూర్తం (నిర్గుణం)–అని, లేదా అపరం, పరం–అని రెండు ప్రకారాలుగా ఉంటుంది.

**త్రివిధా భావనా భూప! విశ్వమేత న్నిబోధ మే ।**
**బ్రహ్మాఖ్యా కర్మసంజ్ఞా చ తథా చైవోభయాత్మికా ॥ 48 ॥**

భూపాలా! ఈ జగత్తునందు భావన మూడువిధాలుగా ఉంటుంది. అందు మొదటిది బ్రహ్మాభావన, రెండోది కర్మభావన, మూడోది ఉభయభావన (బ్రహ్మ,కర్మల రెండింటి భావన).

**బ్రహ్మాభావాత్మికా హ్యేకా కర్మభావాత్మికాஉ పరా ।**
**ఉభయాత్మికా తథైవాన్యా త్రివిధా భావభావనా ॥ 49 ॥**

భావభావన కూడా మూడు విధాలుగా ఉంటుంది. అందు ఒకటి బ్రహ్మాభావనతో కూడి ఉంటుంది. మరొకటి కర్మభావనతో కూడి ఉంటుంది. మరోది బ్రహ్మ కర్మల భావనతో కూడి ఉంటుంది.

**సనన్దనాదయో బ్రహ్మన్ బ్రహ్మాభావనయా యుతాః ।**
**కర్మభావనయా చాన్యే దేవాద్యాః స్థావరా శ్చరాః ॥ 50 ॥**

బ్రహ్మస్వరూపా! సనందనాది బ్రహ్మమానసపుత్రులు బ్రహ్మాభావనాసంపన్నులు, దేవతలు మున్నగువారు, స్థావరజంగమభూతాలు కర్మభావనాపరులై ఉంటారు.

**హిరణ్యగర్భాదిషు చ బ్రహ్మాకర్మాత్మికా ద్విధా ।**
**బోధాధికారయుక్తేషు విద్యతే భావభావనా ॥ 51 ॥**

హిరణ్యగర్భుడు మొదలైన వారియందు బ్రహ్మాకర్మాత్మికమైన రెండు విధాలైన భావన ఉంటుంది. జ్ఞానాధికారులైన వారియందు ఈభావన (స్వరూపవిషయక జ్ఞానం, స్వర్గాదివిషయక జ్ఞానం) ఉంటుంది.

**అక్షీణేషు సమస్తేషు విశేషజ్ఞానకర్మసు ।**
**విశ్వమేతత్ పరం చాన్యద్ భేదభిన్నదృశాం నృప! ॥ 52 ॥**

నృపాలా! విశేషజ్ఞాన కర్మలన్నీ క్షీణం కాకపోతే ఇది జగత్తు దీనికన్న పరం వేరు అనే భేదం భిన్నమైన దృష్టిగల ద్వైతవాదులకు ఉంటుంది.

**ప్రత్యస్తమితభేదం యత్సత్తామాత్రమగోచరమ్ ।**
**వచసామాత్మసంవేద్యం తత్ జ్ఞానం బ్రహ్మ సంజ్ఞితమ్ ॥ 53 ॥**

ఏ జ్ఞానంలో సమస్త భేదాలు రూపుమాసిపోతాయో, ఏది సత్తామాత్ర గోచరమో, ఏది వాక్కులకు అగోచరమో, ఏది ఆత్మచేత తెలియగల్గినదో ఆజ్ఞానమే బ్రహ్మజ్ఞానం, అది అనుభవైకవేద్యం..

**తచ్చ విష్ణోః పరంరూపమరూపాఖ్యమనుత్తమమ్ ।**
**విశ్వస్వరూపవైరూప్యలక్షణం పరమాత్మనః ॥ 54 ॥**

అది విష్ణువు యొక్క పరరూపం. అది రూపం లేనిది. దానికన్న ఉత్తమమైనది వేరేది లేదు. అది పరమాత్మ యొక్క విశ్వరూపం, విరూపలక్షణం రెండునూ కలిగినట్టిది. (విశ్వరూపం కన్న విరూపమైన లక్షణం కలది)

**న తద్యోగయుజా శక్యం నృప! చిన్తయితుం యతః ।**
**తతః స్థూలం హరేరూపం చిన్తయేద్విశ్వగోచరమ్ ॥ 55 ॥**

రాజా! యోగి జనులకు మొదట ఆపరమరూపం చింతించడానికి శక్యం అయినది కాదు. అందువల్ల హరి యొక్క స్థూలరూపం విశ్వరూపంలో గోచరమయ్యే దానినే ముందు ధ్యానం చేయాలి.

**హిరణ్యగర్భో భగవాన్ వాసుదేవః ప్రజాపతిః ।**
**మారుతో వసవో రుద్రా భాస్కరాస్తారకాగ్రహాః ॥ 56 ॥**

**గన్ధర్వయక్షా దైత్యాద్యాః సకలా దేవయోనయః ।**
**మనుష్యాః పశవః శైలాః సముద్రాః సరితో ద్రుమాః ॥ 57 ॥**

**భూప! భూతాన్యశేషాణి భూతానాం యే చ హేతవః ।**
**ప్రధానాది విశేషాన్తం చేతనాచేతనాత్మకమ్ ॥ 58 ॥**

**ఏకపాదం ద్విపాదం చ బహుపాదమపాదకమ్ ।**
**మూర్తమేతద్ధరేరూపం భావనాత్రితయాత్మకమ్ ॥ 59 ॥**

భూపాలా! హిరణ్యగర్భుడు, భగవంతుడు అగు వాసుదేవుడు, ప్రజాపతి, మరుత్తులు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, తారకలు, గ్రహాలు, గంధర్వులు, యక్షులు, దైత్యులు మున్నగువారు, సమస్తదేవతా గణాలు, మనుష్యులు, పశువులు, పర్వతాలు, సముద్రాలు, నదులు, చెట్లు, సమస్తభూతాలు, ఆ భూతాలకు హేతువులైన ప్రధానం మొదలు విశేషం వరకు ఉన్నవి, చేతనాలు, అచేతనాలు, ఒకే పాదం, రెండు పాదాలు, బహుపాదాలు కలిగినవి, పాదాలు లేనివి – ఇదంతా హరియొక్క మూర్తరూపమే. ఇది త్రివిధ భావనారూపమైనది.

**ఏతత్ సర్వమిదం విశ్వం జగదేతచ్చరాచరమ్ ।**
**పరబ్రహ్మస్వరూపస్య విష్ణోః శక్తిసమన్వితమ్ ॥ 60 ॥**

ఇదంతా ఈ కనబడే సమస్త విశ్వం. ఈ చరాచర జంతు జగత్తు పరబ్రహ్మస్వరూపుడైన విష్ణువుయొక్క శక్తితో కూడుకొన్నట్టిది.

**విష్ణుశక్తిః పరా ప్రోక్తా క్షేత్రజ్ఞాఖ్యా తథాஉపరా ।**
**అవిద్యా కర్మసంజ్ఞాஉన్యా తృతీయా శక్తిరిష్యతే ॥ 61 ॥**

విష్ణువు శక్తి "పరా" అని చెప్పబడుతుంది. అలాగే క్షేత్రజ్ఞ అనే పేరుతో ఉండే శక్తి "అపరా" అనబడుతుంది. అదేవిధంగా కర్మ అనే పేరుతో "అవిద్య" అనేది మూడోశక్తిగా వ్యవహరించబడుతుంది.

**యయా క్షేత్రజ్ఞశక్తిః సా వేష్టితా నృప! సర్వగా ।**
**సంసారతాపానాఖిలాన్ అవాప్నోత్యనుసన్తతాన్ ॥ 62 ॥**

భూపాలా! ఈ అవిద్యాశక్తితో ఆవరించబడినదై, సర్వగమైన క్షేత్రజ్ఞశక్తి అన్నివిధాలైన, అతి విస్తృతమైన సాంసారికదుఃఖాలను అనుభవిస్తుంది.

**తయా తిరోహితత్వాచ్చ శక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా ।**
**సర్వభూతేషు భూపాల! తారతమ్యేన లక్ష్యతే ॥ 63 ॥**

రాజేంద్రా! ఆ అవిద్యాశక్తిచే కప్పబడినంతనే క్షేత్రజ్ఞనామం గల శక్తి సర్వభూతాలలోను తరతమ భేదంచే కనబడుతూ ఉంటుంది.

**అప్రాణవత్సు స్వల్పాల్పా స్థావరేషు తతోஉధికా ।**
**సరీసృపేషు తేభ్యోஉపి హ్యతిశక్త్యా పతత్రిషు ॥ 64 ॥**

ప్రాణాలు లేని వాటియందు అది మిక్కిలి అల్పంగాను, స్థావరాలయందు అంతకన్న కొంచెం ఎక్కువగాను, సరీసృపాదులయందు మరికొంచెం ఎక్కువగాను, పక్షులందయితే ఇంకా కొంచెం ఎక్కువగాను కన్పిస్తుంది.

**పతత్రిభ్యో మృగాస్తేభ్యః స్వశక్త్యా పశవోஉధికాః ।**
**పశుభ్యో మనుజాశ్చాతిశక్త్యా పుంసః ప్రభావితాః ॥ 65 ॥**

పక్షులకన్న మృగాలయందు, మృగాలకన్న పశువులయందు, పశువులకన్న మనుష్యులయందు ఆ భగవానుని క్షేత్రజ్ఞశక్తి అధికంగా ప్రభావితమై ఉంటుంది.

**తేభ్యోஉపి నాగగన్ధర్వయక్షాద్యా దేవతా నృప! ।**
**శక్రః సమస్తదేవేభ్యః స్తతశ్చాతి ప్రజాపతిః ॥ 66 ॥**

నృపాలా! ఆ మానవులకన్న నాగ గన్ధర్వ యక్షాది దేవతాగణాలయందు, ఆ దేవతల కన్న ఇంద్రునియందు, ఆ ఇంద్రుని కన్న ప్రజాపతి యందు ఆ శక్తి ఎక్కువగా ద్యోతకమవుతుంది.

**హిరణ్యగర్భోఽ_తి తతః పుంసః శక్త్యుపలక్షితః ।**
**ఏతాన్యశేషరూపస్య తస్య రూపాణి పార్థివ ॥ 67 ॥**

పార్థివా! ఆ ప్రజాపతి కన్న హిరణ్యగర్భుడు ఆ క్షేత్రజ్ఞశక్తిచే ఎక్కువగా ఉపబృంహితుడై ఉన్నాడు. ఈ రూపాలన్నీ ఆ పరమేశ్వరుని క్షేత్రజ్ఞ శక్త్యధిష్ఠితమైనట్టివే.

**యతస్తచ్ఛక్తియోగేన వ్యాప్తాని నభసా యథా ।**
**ద్వితీయం విష్ణుసంజ్ఞస్య యోగిధ్యేయం మహామతే! ॥ 68 ॥**

ఆకాశంచే అంతా కూడుకొన్నట్లుగా ఈ అశేషరూపాలు ఆ క్షేత్రజ్ఞశక్తి చేతనే వ్యాపించియున్నాయి. మహామతీ! ఇక విష్ణువు అనే పేరు గల రెండో రూపం ఉందే, అది యోగులచే మాత్రం ధ్యానించబడుతూ ఉంటుంది.

**అమూర్తం బ్రహ్మణో రూపం యత్ సదిత్యుచ్యతే బుధైః ।**
**సమస్తాః శక్తయశ్చైతా నృప! యత్ర ప్రతిష్ఠితాః ॥ 69 ॥**

**తద్విశ్వరూపరూపం వై రూపమన్య ద్ధరేర్మహత్ ॥ 70 ॥**

అదే బ్రహ్మంయొక్క అమూర్తమైన రూపం. దానినే పండితులు "సత్" అని పిలుస్తారు. నృపాలా! దేనియందు సమస్తశక్తులు ప్రతిష్ఠించబడియున్నాయో, అది విష్ణుభగవానుని విశ్వరూపం కన్న విలక్షణమైన గొప్పదైన మరో రూపం. (విశ్వరూపరూపమైన మరో రూపం)

**సమస్తశక్తిరూపాణి తత్ కరోతి జనేశ్వర! ।**
**దేవతిర్యఙ్మనుష్యాది చేష్టావన్తి స్వలీలయా ॥ 71 ॥**

సర్వేశ్వరా! భగవానుని ఆ రూపమే తన లీలచే దేవతలను, తిర్యక్కులను, మనుష్యులను మొదలైన వారిని క్రియావంతులుగా సమస్త శక్తిమంతమైన స్వరూపం కలవారిగా చేస్తుంది.

**జగతాముపకారాయ న సా కర్మనిమిత్తజా ।**
**చేష్టా తస్యాప్రమేయస్య వ్యాపిన్యవ్యాహతాత్మికా ॥ 72**

అన్ని రూపాలలోను అప్రమేయుడైన ఆ భగవానుని వ్యాపించే, దేనిచేతను నిలువరించ శక్యం కాని చేష్టయే ఉంటుంది. అది జగత్తులకు మేలు చేయడం కొరకే కాని, కర్మజన్యమైనది మాత్రం కాదు.

**తద్రూపం విశ్వరూపస్య తస్య యోగయుజా నృప ।**
**చిన్త్యమాత్మవిశుద్ధ్యర్థం సర్వకిల్బిషనాశనమ్ ॥ 73 ॥**

నృపాలా! యోగాభ్యాసం చేసేవాడు ఆత్మశుద్ధికొరకై, భగవానుని విశ్వరూపం యొక్క సమస్తములైన దోషాలను తొలగించే రూపాన్ని ధ్యానం చేయాలి.

**యథాగ్నిరుద్ధతశిఖః కక్షం దహతి సానిలః ।**
**తథా చిత్తస్థితో విష్ణుర్యోగినాం సర్వకిల్బిషమ్ ॥ 74 ॥**

ఏవిధంగా వాయువుతో కూడుకొన్న అగ్ని ఎగసే జ్వాలలతో తృణసమూహాన్ని దగ్ధం చేస్తుందో, ఆ విధంగా చిత్తంలో స్థిరంగా ఉండి యోగుల సర్వకిల్బిషాలను విష్ణువు దహించివేస్తాడు.

**తస్మాత్ సమస్తశక్తీనామాధారే తత్ర చేతసః ।**
**కుర్వీత సంస్థితిం సా తు విజ్ఞేయా శుద్ధధారణా ॥ 75 ॥**

కాబట్టి సకల శక్తులకు ఆధారుడైన విష్ణువునందు చిత్తాన్ని స్థిరీకరించి శుభాశ్రయం చేసుకోవాలి. అదే శుద్ధధారణ అని తెలుసుకోవాలి.

**శుభాశ్రయస్య చిత్తస్య సర్వగస్య తథాత్మనః ।**
**త్రిభావభావనాతీతో ముక్తయే యోగినాం నృప! ॥ 76 ॥**

నృపాలా! మూడు విధాలైన భావనలకు అతీతుడైన భగవంతుడైన విష్ణువును యోగిజనులు ముక్తికొరకై చంచలచిత్తం నుంచి, విలక్షణ విషయాలనుంచి స్థిరం చేసుకోవడానికై శుభాశ్రయం చేసుకోవాలి.

**అన్యే చ పురుషవ్యాఘ్ర! చేతసో యే వ్యపాశ్రయాః ।**
**అశుద్ధాస్తే సమస్తాస్తు దేవాద్యాః కర్మయోనయః ॥ 77 ॥**

పురుషసింహమా! ఆ విష్ణువుకన్న వ్యతిరిక్తమైన, మనస్సుకు ఆశ్రయభూతులైన ఇతర సమస్తదేవతలు కర్మకారకులు. కావున వారు అశుద్ధులు.

**మూర్తం భగవతో రూపం సర్వాపాశ్రయనిఃస్పృహమ్ ।**
**ఏషా వై ధారణా జ్ఞేయా యచ్చిత్తం తత్ర ధార్యతే ॥ 78 ॥**

భగవంతుని మూర్తరూపం చిత్తానికి మిగిలిన ఆలంబనలనుంచి నిఃస్పృహ కలిగిస్తుంది. ఈ విధంగా మనస్సులో విష్ణుభగవానుని స్థిరీకరించుకోవడమే ధారణ అనబడుతుంది.

**యచ్చ మూర్తం హరే రూపం యాదృక్ చిన్త్యం నరాధిప! ।**
**తచ్ఛ్రూయతా మనాధారే ధారణా నోపపద్యతే ॥ 79 ॥**

నరేంద్రా! ఏ ఆధారం లేకుండా ధారణ చేయడమనేది జరిగేది కాదు– కాబట్టి విష్ణుభగవానుని మూర్తరూపాన్ని ఏ విధంగా ధ్యానం చేయాలో చెబుతాను, దానిని ఆలకించు.

**ప్రసన్నవదనం చారు పద్మపత్రోపమేక్షణమ్ ।**
**సుకపోలం సువిస్తీర్ణలలాటఫలకోజ్జ్వలమ్ ॥ 80 ॥**

ప్రసన్నమైన వదనం కలవానిని, చక్కని తామరరేకులతో సమానమైన కన్నులు కలవానిని, సుందరమైన చెక్కిళ్లు కలవానిని, విశాలమైన లలాటభాగంతో ప్రకాశించేవానిని,

**సమకర్ణాన్తవిన్యస్త చారుకర్ణవిభూషణమ్ ।**
**కమ్బుగ్రీవం సువిస్తీర్ణ శ్రీవత్సాంకితవక్షసమ్ ॥ 81 ॥**

అందమైన చెవులయందు అలంకరించుకొన్న మనోహర కర్ణ కుండలములు కలవానిని, శంఖం వంటి కంఠం కలవానిని, విశాలమైన వక్షఃస్థలమందు శ్రీవత్సచిహ్నం కలవానిని,

**వలిత్రిభంగినా మగ్ననాభినా చోదరేణ వై ।**
**ప్రలమ్బాష్టభుజం విష్ణు మథవాఽపి చతుర్భుజమ్ ॥ 82 ॥**

తరంగములవంటి ఆకారంతో ఉండే మూడు వళులు కలిగినవానిని, లోతైన నాభితోనున్న ఉదరం కలవానిని, మిక్కిలి పొడవైన ఎనిమిది చేతులు కల విష్ణువును, లేదా నాలుగు చేతులు గల విష్ణువును,

**సమస్థితోరుజంఘం చ సుస్థిరాంఘ్రివరామ్బుజమ్ ।**
**చిన్తయేద్ బ్రహ్మ మూర్తం చ పీతనిర్మలవాససమ్ ॥ 83 ॥**

జంఘలు, ఊరువులు సమస్థితిలో నున్నవానిని, పద్మాలవంటి సొగసైన పాదాలు కలవానిని, స్వచ్ఛమైన పచ్చని బట్టలు దాల్చినవానిని, బ్రహ్మస్వరూపమైన విష్ణుభగవానుని మూర్తరూపాన్ని ధ్యానించాలి.

**కిరీటహారకేయూర కటకాదివిభూషితమ్ ।**
**శార్ఙ్గశంఖగదాఖడ్గ చక్రాక్షవలయాన్వితమ్ ॥ 84 ॥**

**(వరదాభయ హస్తం చ ముద్రికారత్న భూషితమ్)**

**చింతయేత్ తన్మనా యోగీ సమాధాయాత్మమానసమ్ ।**
**తావద్ యావద్ దృఢీభూతా తత్రైవ నృప ధారణా! ॥ 85 ॥**

నృపాలా! కిరీటం, హారాలు, కేయూరాలు, మొదలైనవాటితో అలంకరించబడి యున్న శార్ఙ్గం, శంఖం, గద, ఖడ్గం, చక్రం, అక్షమాల, వరదం, అభయముద్ర మున్నగువాటితో కూడియున్న రత్నమయ ముద్రికతో నున్న విష్ణువుయొక్క మూర్తస్వరూపాన్ని ఎంతవరకు యోగియొక్క మనస్సు ఏకాగ్రతతో తన్మయభావం పొందుతుందో, ఎంతవరకు మానసం దృఢీభూతం అవుతుందో, అంతవరకు ధ్యానం చేయాలి. ఆ విష్ణురూపంపైనే ధారణ నిలపాలి.

**వ్రజతస్తిష్ఠతోఽన్యద్ వా స్వేచ్ఛయా కర్మ కుర్వతః ।**
**నాపయాతి యదా చిత్తాత్ సిద్ధాం మన్యేత తాం తదా ॥ 86 ॥**

నడుస్తున్నా, నిలుచియున్నా, కూర్చున్నా, లేచినా, తన ఇచ్ఛానుసారంగా ఎటువంటి పనిచేస్తున్నా, తనచిత్తం నుంచి భగవానుని మూర్తి తొలగకుండా ఉంటే, అపుడు మనస్సు స్థిరత్వానికి సిద్ధమై ఉన్నదని గ్రహించాలి.

**తతః శంఖగదాచక్రశార్ఙ్గాదిరహితం బుధః ।**
**చిన్తయే ద్భగవద్రూపం ప్రశాన్తం సాక్షసూత్రకమ్ ॥ 87 ॥**

చిత్తం దృఢమైన పిమ్మట బుద్ధిమంతుడైనవాడు శంఖం, గద, శార్ఙ్గం, చక్రం మున్నగునవి లేకుండా ఉంటే భగవంతుని స్ఫటికాక్షమాలతోనూ, యజ్ఞోపవీతధారణతోనూ కూడుకొన్న పరమశాంతరూపాన్ని ధ్యానించాలి.

**సా యదా ధారణా తద్వదవస్థానవతీ తతః ।**
**కిరీటకేయూర ముఖైర్భూషణై రహితం స్మరేత్ ॥ 88 ॥**

ఎప్పుడైతే ఆ ధారణ పూర్వంలాగా స్థిరమై ఉంటూందో, అప్పుడు కిరీటం, కేయూరం మున్నగు భూషణాలు లేని రూపాన్ని ధ్యానం చేయాలి.

**తదేకావయవం దేవం చేతసా హి పునర్బుధః ।**
**కుర్యాత్తతోఽవయవిని ప్రణిధానపరో భవేత్ ॥ 89 ॥**

తదనంతరం విద్వాంసుడైన పురుషుడు తన చిత్తంలో ఆ భగవానుని ఒక్కొక్క ప్రధానావయవాన్ని ధ్యానం చేయాలి. తరువాత అవయవాలయందు దృష్టి వదిలి, అవయవియైన భగవంతునియందు ప్రణిధానం అనగా చిత్తాన్ని సంపూర్ణంగా ఉంచుట చేయాలి.

**తద్రూపప్రత్యయామైకా సన్తతిశ్చాన్య నిఃస్పృహా ।**
**తద్ధ్యానం ప్రథమై రంగైః షడ్భిర్నిష్పాద్యతే నృప! ॥ 90 ॥**

నృపాలా! ఆ ధ్యానం అదే రూపంపై దృఢపడి, మిగిలిన వస్తువులపై స్పృహ లేకుండా ఏకధారగా సాగాలి. అది మొట్టమొదటి ఆరింటి యోగాంగాలచేత సిద్ధిస్తుంది.

**తస్యైవ కల్పనాహీనం స్వరూపగ్రహణం హి యత్ ।**
**మనసా ధ్యాననిష్పాద్యః సమాధిః సోఽభిధీయతే ॥ 91 ॥**

అదే ధ్యేయపదార్థం మనస్సుద్వారా చేయబడుతున్న ధ్యానమై, సిద్ధయోగ్యమై, కల్పనారహితమై (ధ్యాత, ధ్యేయం, ధ్యానం–అనే భేదాలు లేక) స్వరూపగ్రహణం చేస్తుంది. అదే సమాధి అనబడుతుంది.

**విజ్ఞానం ప్రాపకం ప్రాప్యే పరే బ్రహ్మణి పార్థివ! ।**
**ప్రాపణీయ స్తథైవాత్మా ప్రక్షీణాశేషభావనః ॥ 92 ॥**

పార్థివా! సమాధి స్థితియందే భగవత్సాక్షాత్కారస్వరూపవిజ్ఞానమే ప్రాప్తయోగ్యమై, ప్రాప్యమైన పరబ్రహ్మయందు పొందించవలసినదైన సమస్తభావన క్షీణించి ఏకమాత్రమైన ఆత్మ అయిపోతుంది.

**క్షేత్రజ్ఞః కారణం జ్ఞానం కరణం తేన తస్య తత్ ।**
**నిష్పాద్యం ముక్తికార్యం వై కృతకృత్యం నివర్తతే ॥ 93 ॥**

ముక్తి లభించడానికి క్షేత్రజ్ఞుడు కర్త. జ్ఞానం కారణం (జ్ఞానరూపి అయిన కరణం ద్వారా క్షేత్రజ్ఞునకు) ముక్తిరూపం కార్యం, ఇది సిద్ధమై విజ్ఞానం కృతకృత్యమై మరలిపోతుంది.

**తద్భావభావనాపన్నస్తతోఽసౌ పరమాత్మనా ।**
**భవత్యభేదీ భేదశ్చ తస్యాజ్ఞానకృతో భవేత్ ॥ 94 ॥**

ఆ భూమికలో భగవద్భావాన్ని పరిపూర్ణంగా పొంది (అనగా ధ్యేయ వస్తువుయొక్క వస్తుత్వం తాను పొంది) పరమాత్మతో అభిన్నం కావడం జరుగుతుంది. అతనికి భేదజ్ఞానం అజ్ఞానకృతమవుతుంది.

**విభేదజనకేஉజ్ఞానే నాశమాత్యన్తికం గతే ।**
**ఆత్మనో బ్రహ్మణో భేద మసంతం కః కరిష్యతి ॥ 95 ॥**

విభేదజనకమైన అజ్ఞానం పూర్తిగా నశింపగానే, తనకు (ఆత్మకు) బ్రహ్మకు లేనిపోని భేదాన్ని ఎవడు చేస్తాడు కనుక?

**ఇత్యుక్తస్తే మహాయోగః ఖాణ్డిక్య! పరిపృచ్ఛతః ।**
**సంక్షేపవిస్తరాభ్యాం తు కిమన్యత్ క్రియతాం తవ ॥ 96 ॥**

"ఖాండిక్యా! నీవు అడిగావు కనుక సంక్షేపం గాను, విస్తరం గాను, నీకు ఈ మహాయోగాన్ని తెలియ జేశాను. ఇంక ఏమి నీ ప్రీతి కొరకై చేయమంటావు?" అని కేశిధ్వజుడు అడిగాడు.

**ఖాండిక్య ఉవాచ :–** ఖాండిక్యుడు చెప్పాడు.

**కథితే యోగసద్భావే సర్వమేవ కృతం మమ ।**
**తవోపదేశేనాశేషో నష్టచిత్తమలో యతః ॥ 97 ॥**

అంత ఖాండిక్యుడు! "నీవు యోగసద్భావం తెలియజేయడంతోనే సర్వం నాకు చేసినట్లే అయింది. నీ ఉపదేశంవలన సమస్తమైన చిత్తమలం నశించిపోయింది".

**మమేతి యన్మయా ప్రోక్త మసదేతన్న చాన్యథా ।**
**నరేన్ద్ర! గదితుం శక్యమపి విజ్ఞేయవేదిభిః ॥ 98 ॥**

రాజేంద్రా! కేశిధ్వజా! "నేను, నాది" అనే శబ్దాన్ని ఏదైతే పలికానో, అది "అసత్" తప్ప మరొక్కటి కాదని జ్ఞేయవస్తువును తెలిసినవారికే చెప్పడానికి శక్యమయింది.

**అహం మమేత్యవిద్యేయం వ్యవహారస్తథాஉనయోః ।**
**పరమార్థస్త్వసంలాపో గోచరే వచసాం న యః ॥ 99 ॥**

నేను, నాది అనే వ్యవహారం అవిద్య మాత్రమే. ఈరెండింటి పరమార్థం చెప్పడానికి అలవికాదు. వాక్కులకు అది గోచరమయ్యేది కాదు.

**తద్గచ్ఛ శ్రేయసే సర్వం మమైతద్ భవతా కృతమ్ ।**
**యద్విముక్తిప్రదో యోగః ప్రోక్తః కేశిధ్వజావ్యయః ॥ 100 ॥**

కేశిధ్వజా! నీవు ఇంక వెళ్ళవచ్చు. నాకు చేయవలసిన సర్వశ్రేయస్సు నీవు చేకూర్చావు. ముక్తిదాయకమైన అవ్యయమగు యోగాన్ని నాకు బోధించావు" అని చెప్పాడు.

**పరాశర ఉవాచ :–** పరాశరుడు పలికినాడు.

**యథార్హపూజయా తేన ఖాణ్డిక్యేన స పూజితః ।**
**ఆజగామ పురం బ్రహ్మంస్తతః కేశిధ్వజో నృపః ॥ 101 ॥**

బ్రాహ్మణోత్తమా! మైత్రేయా! కేశిధ్వజుడు కూడా ఖాండిక్యునిద్వారా శాస్త్రవిధిని పూజలందుకొని, అనంతరం తనపురానికి ఏతెంచాడు.

**ఖాణ్డిక్యోఽపి సుతం కృత్వా రాజానం యోగసిద్ధయే ।**
**వనం జగామ గోవిన్దే వినివేశితమానసః ॥ 102 ॥**

ఖాండిక్యుడు తన సుతుని రాజును గావించి యోగసిద్ధికై గోవిందుని డెందంలో స్థిరంగా నిల్పుకొని నిర్జనారణ్యానికి వెళ్ళిపోయాడు.

వి ॥ వాస్తవానికి అప్పటికి ఖాండిక్యుడు రాజ్యభ్రష్టుడు. వనాలలో ఉన్నాడు. అయినా వనంలో కూడా అతనికి దుర్గం, మంత్రులు, భృత్యులు ఉన్నారు. ఖాండిక్యుడు తన కొడుకును వారికి రాజుగా చేశాడు.

**తత్రైకాన్తరతిర్భూత్వా యమాదిగుణశోధితః ।**
**విష్ణ్వాఖ్యే నిర్మలే బ్రహ్మణ్యవాప నృపతిర్లయమ్ ॥ 103 ॥**

ఆ నిర్జనారణ్యంలో అతడు ఏకాగ్రబుద్ధితో, యమం మున్నగు యోగసాధనాలతో సాధన చేసి విష్ణువు అనే పేరుతో భాసించే నిర్మలబ్రహ్మమందు లీనమయ్యాడు.

**కేశిధ్వజోఽపి ముక్త్యర్థం స్వకర్మక్షపణోన్ముఖః ।**
**బుభుజే విషయాన్ కర్మ చక్రే చానభిసంహితమ్ ॥ 104 ॥**

కేశిధ్వజుడు కూడా మోక్షం కొరకై తాను చేసిన కర్మఫలాన్ని క్షీణింపజేసికోవడానికి ఉద్యమించి, విషయఫలాలను అనుభవించాడు. కర్మఫలాలపై కాంక్ష లేకుండా చేయవలసిన కర్మలు ఆచరించాడు.

**స కల్పనోపభోగైశ్చ క్షీణపాపోఽమలస్తథా ।**
**అవాప సిద్ధిమత్యన్తం తాపక్షయఫలాం ద్విజ! ॥ 105 ॥**

ద్విజశ్రేష్ఠుడవైన మైత్రేయా! కేశిధ్వజుడు ఈప్రకారంగా అనేక కల్యాణదాయకాలైన భోగాలు అనుభవించి, దోషాలు తొలగించుకొని, నిర్మలుడై, ప్రారబ్ధకర్మ క్షీణింపజేసుకొని తాపత్రయాలను దూరం చేసే ఆత్యంతికమోక్షఫలసిద్ధిని పొందాడు–అని పరాశరుడు వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే షష్ఠాంశే బ్రహ్మయోగవర్ణనం నామ సప్తమోఽధ్యాయః సమాప్తః ॥ 7 ॥**

శ్రీవిష్ణుపురాణంలో షష్ఠాంశంలో బ్రహ్మయోగవర్ణన అనే ఏడవ అధ్యాయం సమాప్తం ॥ 7 ॥

## అష్టమోఽధ్యాయః - ఎనిమిదవ అధ్యాయం

## విష్ణుపురాణమాహాత్మ్యమ్ – విష్ణుపురాణమాహాత్మ్యం

**శ్రీపరాశర ఉవాచ :–** పరాశరుడు చెప్పాడు.

**ఇత్యేష కథితః సమ్యక్ తృతీయః ప్రతిసంచరః ।**
**ఆత్యన్తికో విముక్తిర్యా లయో బ్రహ్మణి శాశ్వతే ॥ 1 ॥**

మైత్రేయా! ఈ ప్రకారంగా నేను మూడోదైన ఆత్యన్తికప్రలయాన్ని గూర్చి నీకు తెలియజేశాను. దీనివల్లనే జీవకోటికి శాశ్వతబ్రహ్మస్వరూపంలో అత్యంతం లయమైపోవడమనే ముక్తి లభిస్తుంది.

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వన్తరాణి చ ।**
**వంశానుచరితం చైవ భవతో గదితం మయా ॥ 2 ॥**

నేను నీకు పురాణపంచలక్షణాలైన "సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరాలు, వంశానుచరితము" అనే ఐదింటినిగూర్చి తెలియజేసాను.

**పురాణం వైష్ణవం చైతత్ సర్వకిల్బిషనాశనమ్ ।**
**విశిష్టం సర్వశాస్త్రేభ్యః పురుషార్థోపపాదకమ్ ॥ 3 ॥**

ఈ విష్ణుమహాపురాణమనేది సమస్తములైన పాపాలను నశింపజేసేది. సకలశాస్త్రముల కన్న విశిష్టమైనది. నాలుగు విధాలైన పురుషార్థాలను ప్రతిపాదించేది (మోక్షపురుషార్థాన్ని చేకూర్చేది)

**తుభ్యం యథావన్మైత్రేవ! ప్రోక్తం శుశ్రూషవేఽవ్యయమ్ ।**
**యదన్యదపి వక్తవ్యం తత్ పృచ్ఛాద్య వదామి తే ॥ 4 ॥**

మైత్రేయా! అత్యంతశ్రద్ధాసక్తి గల నీకు నేను తెలుసుకొన్న రీతిగా అవ్యయమైన విష్ణుపురాణాన్ని వివరించాను. ఇంకా నేను ఏదైనా చెప్పవలసి ఉంటే దానిని ఇపుడు అడుగు. అది కూడా నీకు తెలియజేస్తాను అని పరాశరుడు చెప్పాడు.

**మైత్రేయ ఉవాచ :–** మైత్రేయుడు ఇలా చెబుతున్నాడు.

**భగవన్! కథితం సర్వం యత్ పృష్టోఽసి మయా మునే! ।**
**శ్రుతం చైతన్మయా భక్త్యా నాన్యత్ ప్రష్టవ్యమస్తి మే ॥ 5 ॥**

"మునీశ్వరా! భగవంతుడా! నేను దేనిని గూర్చి అడిగానో, దానిని అంతా నాకు తెలియజేయడం జరిగింది. నేను ఎంతో భక్తితో అంతా విన్నాను. ఇక నేను మిమ్మల్ని అడుగవలసిందంటూ ఏమీ లేదు.

**విచ్ఛిన్నాః సర్వసన్దేహాః వైమల్యం మనసః కృతమ్ ।**
**త్వత్ప్రసాదాన్మయా జ్ఞాతా ఉత్పత్తిస్థితిసంక్షయాః ॥ 6 ॥**

సర్వసందేహాలూ తొలగిపోతాయి. మనస్సు పరిశుద్ధమయింది. మీ అనుగ్రహం వలన నాకు సృష్టి, స్థితి, లయాల గురించి అవగతమైంది.

**జ్ఞాత శ్చతుర్విధో రాశిః శక్తిశ్చ త్రివిధా గురో ।**
**విజ్ఞాతా సా చ కార్త్స్న్యేన త్రివిధా భావభావనా ॥ 7 ॥**

గురూత్తమా! చతుర్విధాలగు రాశి (జనార్దనుడు విశ్వసృష్టివేళలో, విశ్వరక్షణవేళలో, విశ్వలయవేళలో) నాలుగు విభేదాలలో ఉంటాడు. మూడు విధాలైన శక్తి (విష్ణుశక్తి, క్షేత్రజ్ఞశక్తి, అవిద్యాశక్తి) మూడువిధాలైన భావనలు (బ్రహ్మభావన, కర్మభావన, కర్మబ్రహ్మోభయాత్మిక భావన) పూర్తిగా తెలియడం జరిగింది.

**త్వత్ప్రసాదాన్మయా జ్ఞాతం జ్ఞేయమన్యైరలం ద్విజ! ।**
**యదైతదఖిలం విష్ణోర్జగన్న వ్యతిరిచ్యతే ॥ 8 ॥**

ద్విజోత్తమా! నీ అనుగ్రహంవలన ఈ సంపూర్ణజగత్తు శ్రీవిష్ణుభగవానునికన్న భిన్నమైనది కాదని తెలిసింది. అందువల్ల ఇంక ఏ కొంచెంకూడా వినవలసింది, తెలియవలసింది ఏమీ లేదు.

**కృతార్థోఽహమసన్దేహ స్త్వత్ప్రసాదాన్మహామునే! ।**
**వర్ణధర్మాదయో ధర్మా విదితా యదశేషతః ॥ 9 ॥**

మహామునీ! నేను ధన్యుడనయ్యాను. సంశయాలన్నీ తొలగిపోయాయి. నీ అనుగ్రహంవలన సంపూర్ణంగా వర్ణధర్మాలు, ఆశ్రమధర్మాలు తెలిశాయి.

**ప్రవృత్తం చ నివృత్తం చ జ్ఞాతం కర్మ మయాఽఖిలమ్ ।**
**ప్రసీద విప్రప్రవర! నాన్యత్ప్రష్టవ్యమస్తి మే ॥ 10 ॥**

విప్రవరేణ్యా! ప్రవృత్తరూపకర్మ నాకు పూర్తిగా తెలిసింది. నన్ను అనుగ్రహించావు. చాలు. ఇక నాకు మిమ్మల్ని అడుగవలసిందంటూ ఏమీ లేదు.

**యదస్య కథనాయాసైర్యోజితోఽసి మయా గురో! ।**
**తత్ క్షమ్యతాం విశేషోఽస్తి న సతాం పుత్రశిష్యయోః ॥ 11 ॥**

గురూత్తమా! నేను మిమ్ము ఈ సంపూర్ణవిష్ణుపురాణం చెప్పమని ఆయాసం (కష్టం) కలిగించాను. అందులకు నన్ను క్షమించండి. సాధుజనులదృష్టికి పుత్రశిష్యులయందు భేదం కన్పించదు – అని అన్నాడు.

**పరాశర ఉవాచ :–** పరాశరుడు ఇలా వచించాడు.

**ఏతత్తే యన్మయాఽఽఖ్యాతం పురాణం వేదసమ్మితమ్ ।**
**శ్రుతేఽస్మిన్ సర్వదోషోత్థః పాపరాశిః ప్రశామ్యతి ॥ 12 ॥**

మైత్రేయా! నేను నీకు చెప్పిన ఈ విష్ణుపురాణం వేదసమ్మితమైనది. దీనిని వింటే చాలు. సమస్తదోషాలవలన ఉత్పన్నమయ్యే పాపపుంజం అంతా నశించిపోతుంది.

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వన్తరాణి చ ।**
**వంశానుచరితం కృత్స్నం మయాऽత్ర తవ కీర్తితమ్ ॥ 13 ॥**

సృష్టి, ప్రళయం, వంశం, మన్వంతరాలు, వంశానుచరితం, సవివరంగానే నేను నీకు వివరించడం జరిగింది.

**అత్ర దేవాస్తథా దైత్యా గన్ధర్వోరగరాక్షసాః ।**
**యక్షా విద్యాధరాః సిద్ధాః కథ్యన్తేऽప్సరస స్తథా ॥ 14 ॥**

ఇందు దేవతలు, దైత్యులు, గంధర్వులు, ఉరగులు, రాక్షసులు, యక్షులు, విద్యాధరులు, సిద్ధులు, అప్సరసలు – వీరిని గూర్చి వర్ణించడం జరిగింది.

**మునయో భావితాత్మానః కథ్యన్తే తపసాऽన్వితాః ।**
**చాతుర్వర్ణ్యం యథా పుంసాం విశిష్టచరితా నరాః ॥ 15 ॥**

ఆత్మారాములు, తపోనిష్ఠులు, మునీంద్రులు, చాతుర్వర్ణ్యవిభాగం, మహాపురుషుల విశిష్టచరిత్రలు, మనుష్యులు–వీరిని గురించి ఇందు వర్ణించడం జరిగింది.

**పుణ్యాః ప్రదేశా మేదిన్యాః పుణ్యా నద్యోऽథ సాగరాః ।**
**పర్వతాశ్చ మహాపుణ్యాశ్చరితాని చ ధీమతామ్ ॥ 16 ॥**

పృథివిలోనున్న పుణ్యప్రదేశాలు, పవిత్రాలైన నదులు, సాగరాలు, మహాపుణ్యదాయకాలైన పర్వతాలు, జ్ఞానవంతుల చరిత్రలు ఇందు చెప్పబడ్డాయి.

**వర్ణధర్మాదయో ధర్మా వేదధర్మాశ్చ కృత్స్నశః ।**
**యేషాం సంశ్రవణాత్ సద్యః సర్వపాపైః ప్రముచ్యతే ॥ 17 ॥**

వర్ణధర్మాలు, ఆశ్రమధర్మాలు, వేదధర్మాలు, సంపూర్ణంగా ఇందు వర్ణించడం జరిగింది. వీటిని శ్రవణం చేసినంత మాత్రంచేతనే సర్వపాపాలు పూర్తిగా తొలగిపోతాయి.

**ఉత్పత్తిస్థితినాశానాం హేతుర్యో జగతోऽవ్యయః ।**
**స సర్వభూతః సర్వాత్మా కథ్యతే భగవాన్ హరిః ॥ 18 ॥**

ఏ అవ్యయుడైన భగవంతుడగు శ్రీహరి ఈ జగత్తు ఉత్పత్తి, స్థితి, వినాశాలకు ఏకమాత్రకారణుడై ఉన్నాడో, ఆ సర్వభూతస్వరూపుడు, సర్వాత్ముడు ఇందు కీర్తించబడడం జరిగింది.

**అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః ।**
**పుమాన్ విముచ్యతే సద్యః సింహత్రస్తై ర్వృకైరివ ॥ 19 ॥**

ఆ హరినామాన్ని అప్రయత్నంగా, అర్థం తెలియకుండా కీర్తించినా, సింహాన్ని చూసి తోడేళ్ళు భయ పడినట్లుగా, సమస్తపాపాలనుంచి పురుషుడు బయటపడతాడు. (అనగా విష్ణునామోచ్చారణ చేస్తే చాలు సమస్తపాపాలు తొలగిపోతాయి.)

**యన్నామకీర్తితం భక్త్యా విలాయన మనుత్తమమ్ ।**
**మైత్రేయాశేషపాపానాం ధాతూనామివ పావకః ॥ 20 ॥**

మైత్రేయా! మిక్కిలి ఉత్తమమైన హరినామాన్ని ఎవడు భక్తితో కీర్తిస్తాడో, వాని సమస్తదోషాలు అగ్నిహోత్రునిలో, సమస్తపర్వతజన్యధాతువులు లోహాలును లయం పొందినట్లు పటాపంచలైపోతాయి.

**కలికల్మషమత్యుగ్రం నరకార్తిప్రదం నృణామ్ ।**
**ప్రయాతి విలయం సద్యః సకృద్ యత్రానుసంస్మృతే ॥ 21 ॥**

ఆ భగవంతుని పవిత్రనామాన్ని ఒక్కసారి స్మరిస్తే చాలు. మనుష్యులకు నరకబాధలు పెట్టే దోషాలు, భయంకరాలైన కలి కల్మషాలు వెంటనే నశించిపోతాయి.

**హిరణ్యగర్భదేవేన్ద్ర రుద్రాదిత్యాశ్వివాయుభిః ।**
**కిన్నరైర్వసుభిః సాధ్యైర్విశ్వేదేవాదిభిః సురైః ॥ 22 ॥**

**యక్షరక్షోగణైః సిద్ధైర్దైత్యగన్ధర్వదానవైః ।**
**అప్సరోభిస్తథా తారానక్షత్రైః సకలైర్గ్రహైః ॥ 23 ॥**

**సప్తర్షిభిస్తథాధిష్ణ్యై ర్ధిష్ణ్యాధిపతిభిస్తథా ।**
**బ్రాహ్మణాద్యైర్మనుష్యైశ్చ తథైవ పశుభిర్మృగైః ॥ 24 ॥**

**సరీసృపై ర్విహంగైశ్చ ప్రేతాద్యైః సమహీరుహైః ।**
**వనాద్రిసాగరసరిత్పాతాలైః సధరాదిభిః ॥ 25 ॥**

**శబ్దాదిభిశ్చ సహితం బ్రహ్మాణ్డమఖిలం ద్విజ! ।**
**మేరోరివాణుర్యస్యైతద్ యన్మయం చ ద్విజోత్తమ! ॥ 26 ॥**

**స సర్వః సర్వవిత్ సర్వస్వరూపో రూపవర్జితః ।**
**కీర్త్యతే భగవాన్ విష్ణురత్ర పాపప్రణాశనః ॥ 27 ॥**

ద్విజోత్తమా! హిరణ్యగర్భుడు, దేవేంద్రుడు, రుద్రులు, ఆదిత్యులు, అశ్వినీకుమారులు, వాయువు (మరుత్తులు), కిన్నరులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, సురగణాలు, యక్షులు, రక్షోగణాలు, సిద్ధులు, దైత్యులు, గంధర్వులు, దానవులు, అప్సరసలు, తారలు, నక్షత్రాలు, సకలగ్రహాలు, సప్తర్షి మండలం, లోకపాలగణాలు, లోకాలు, బ్రాహ్మణాది మనుష్యులు, పశువులు, మృగాలు, సరీసృపాలు, పక్షులు, నరకలోకంలో ఉండే చెట్లు, ప్రాణులు, వనాలు, పర్వతాలు, సాగరాలు, నదులు, పాతాళాలు, పృథివి మున్నగు పంచభూతాలు, శబ్దాదివిషయాలు మున్నగువాటితో కూడుకొన్న ఈ సమస్తబ్రహ్మాండం, ఏది ఉందో మేరువుకు ముందు అణువునయి,

వీటన్నింటికీ ఉపాదానకారణం అదే సర్వుడు, సర్వజ్ఞుడు, సర్వస్వరూపుడు, రూపరహితుడు, పాపనాశకుడైన భగవంతుడైన విష్ణువుస్వరూపమని కీర్తించబడుతోంది.

**యదశ్వమేధాఽవభృథే స్నాతః ప్రాప్నోతి వై ఫలమ్ ।**
**సకలం తదవాప్నోతి శ్రుత్వైతన్మునిసత్తమ! ॥ 28 ॥**

మునిశ్రేష్ఠా! అశ్వమేధయజ్ఞంలో అవబృథస్నానం చేస్తే ఏ ఫలితం లభిస్తుందో, అదే సంపూర్ణ ఫలితాన్ని మానవుడు ఈ విష్ణుపురాణం వింటే పొందుతాడు.

**ప్రయాగే పుష్కరే చైవ కురుక్షేత్రే తథాఽర్ణవే ।**
**కృతోపవాసః ప్రాప్నోతి తదస్య శ్రవణాన్నరః ॥ 29 ॥**

ప్రయాగలోను, పుష్కరంలోను, కురుక్షేత్రంలోను, సముద్రతీరంలోను ఉండి ఉపవాసం చేస్తే ఏ ఫలితం నరుడు పొందుతాడో, ఈ పురాణాన్ని శ్రవణం చేస్తే ఆ ఫలం పొందుతాడు.

**యదగ్నిహోత్రే సుహుతే వర్షేణాప్నోతి వై ఫలమ్ ।**
**సకలం తదవాప్నోతి తదస్య శ్రవణాత్ సకృత్ ॥ 30 ॥**

ఒక ఏడాదిపాటు మనుష్యుడు నియమానుసారంగా అగ్నిహోత్రం చేస్తే ఏ ఫలితం లభిస్తుందో ఆ సమస్తఫలం ఈ పురాణం వింటే వెంటనే లభిస్తుంది.

**యజ్జ్యేష్ఠశుక్లద్వాదశ్యాం స్నాత్వా వై యమునాజలే ।**
**మధురాయాం హరిం దృష్ట్వా ప్రాప్నోతి పరమాం గతిమ్ ॥ 31 ॥**

**తదాప్నోతి ఫలం సమ్యక్ సమాధానేన కీర్తనాత్ ।**
**పురాణస్యాస్య విప్రర్షే! కేశవార్పితమానసః ॥ 32 ॥**

జ్యేష్ఠమాసంలో శుక్లపక్షంలో ద్వాదశి నాడు యమునానదీ జలాలలో స్నానం చేసి, మధురలో శ్రీహరిని సందర్శిస్తే ఏ పరమగతిని పొందుతాడో విప్రర్షివైన మైత్రేయా! కేశవుని యందు మనస్సును లగ్నం చేసి ఈ పురాణాన్ని చక్కగా సావధానంగా పఠిస్తే అదే ఫలితాన్ని పొందుతాడు.

**యమునాసలిలే స్నాతః పురుషో మునిసత్తమ ।**
**జ్యేష్ఠామూలే స్థితే పక్షే ద్వాదశ్యాముపవాసకృత్ ॥ 33 ॥**

**సమభ్యర్చ్యాచ్యుతం సమ్యఙ్ మధురాయాం సమాహితః ।**
**అశ్వమేధస్య యజ్ఞస్య ప్రాప్నోత్యవికలం ఫలమ్ ॥ 34 ॥**

మునివర్యా! జ్యేష్ఠమాసంలో శుక్లపక్షంలో ద్వాదశినాడు పురుషుడు యమునానదీ జలాలలో స్నానం చేసి, ఉపవాసం గావించి, మధుర యందున్న అచ్యుతుని శ్రద్ధాభక్తులతో పూజిస్తే అశ్వమేధయజ్ఞం చేసిన సమస్తఫలితం లభిస్తుంది.

**ఆలోక్యార్ధి మథాన్యేషా మున్నీతానాం స్వవంశజైః ।**
**ఏతత్కిలోచురన్యేషాం పితరః సపితామహాః ॥ 35 ॥**

ఇతరవంశంలో ఉన్నత లోకాలను పొందియున్న పితరుల సమృద్ధిని వీక్షించి, మిగిలిన పురుషుల పితృపితామహాదులు తమ వంశంలో వారిని లక్ష్యంగా చేసుకొని ఇలా సంభాషించుకొంటారు.

**కశ్చిదస్మత్కులే జాతః కాలిన్దీ సలిలాప్లుతః ।**
**అర్చయిష్యతి గోవిందం మధురాయామపోషితః ॥ 36 ॥**

**జ్యేష్ఠామూలే స్థితే పక్షే యేనైవం వయముప్యత ।**
**పరామృద్ధిమవాప్స్యామ స్తారితాః స్వకులోద్భవైః ॥ 37 ॥**

**జ్యేష్ఠామూలే సితే పక్షే సమభ్యర్చ్య జనార్దనమ్ ।**
**ధన్యానాం కులజః పిణ్డాన్ యమునాయాం ప్రదాస్యతి ॥ 38 ॥**

**తస్మిన్ కాలే సమభ్యర్చ్య యత్ర కృష్ణం సమాహితః ।**
**దత్వా పిణ్డాన్ పితృభ్యశ్చ యమునాసలిలాప్లుతః ॥ 39 ॥**

**యదాప్నోతి నరః పుణ్యం తారయన్ స పితామహాన్ ।**
**శ్రుత్వాఽధ్యాయం తదాప్నోతి పురాణస్యాస్య భక్తిమాన్ ॥ 40 ॥**

మా కులంలో పుట్టినవాడు ఎవడైనా కాళిన్దీజలాలతో స్నానమాచరించి, ఉపవాసం ఉన్నవాడై, మధురయందు వెలసియుండే గోవిందుని అర్చిస్తాడా? జ్యేష్ఠమాసంలో శుద్ధపక్షంలో జనార్దనుని పూజించి యమునాతీరంలో పిండప్రదానం చేసే వంశస్థుడు ఎవడైనా పుట్టి మమ్మల్ని ధన్యుల్ని కావిస్తాడా? ఆ సమయంలో యమునా నదీజలాలతో తడిసినవాడై సావధానపూర్వకంగా కృష్ణుని చక్కగా పూజించి పితృదేవతలను ఉద్దేశించి పిండాలను సమర్పించి పితృపితామహాదులను తరింపజేసే పుణ్యాత్ముడు ఎవడైనా ఉంటాడా? అలా చేస్తే కలిగే ఫలం ఏదైతే ఉందో, అది విష్ణుపురాణంలోని ఒక్క అధ్యాయం భక్తితో విన్నా లభిస్తుంది కదా! అని వారు సంభాషించుకొంటూ ఉంటారు.

**ఏతత్ సంసారభీరూణాం పరిత్రాణమనుత్తమమ్ ।**
**దుఃస్వప్ననాశనం నృణాం సర్వదుష్టనిబర్హణమ్ ॥ 41 ॥**

ఈ పురాణం సంసారంలో భయభ్రాంతులైనవారిని రక్షించడానికి మిక్కిలి ఉత్తమమైన సాధనం. ఇది మానవుల చెడు కలలను నివారించేది. సమస్తదోషాలను నశింపజేసేది.

**ఇదమార్షం పురా ప్రాహ ఋభవే కమలోద్భవః ।**
**ఋభుః ప్రియవ్రతాయాహ స చ భాగురయేఽబ్రవీత్ ॥ 42 ॥**

ఈ ఆర్షమైన పురాణాన్ని పూర్వకాలంలో బ్రహ్మదేవుడు ఋభునకు చెప్పాడు. ఋభుడు ప్రియవ్రతునకు, అతడు భాగురికి తెలియజేశాడు.

**భాగురిః (స్తవ) శుభమిత్రాయ దధీచాయ స చోక్తవాన్ ।**
**సారస్వతాయ తేనోక్తం భృగుః సారస్వతేన చ ॥ 43 ॥**

భాగురి (స్తవ) శుభమిత్రునకు, అతడు దధీచికి వివరించాడు. అతడు సారస్వతునకు, సారస్వతుడు భృగునకు తెలియజేశాడు.

**భృగుణా పురుకుత్సాయ నర్మదాయై స చోక్తవాన్ ।**
**నర్మదా ధృతరాష్ట్రాయ నాగాయా పూరణాయ చ ॥ 44 ॥**

భృగువు పురుకుత్సునకు, అతడు నర్మదునకు వివరించాడు. నర్మద ధృతరాష్ట్రుడనే నాగరాజుకు, ఆ పూరణుడనే నాగరాజుకు తెలియజేసింది.

**తాభ్యాం చ నాగరాజాయ ప్రోక్తం వాసుకయే ద్విజ! ।**
**వాసుకిః ప్రాహ వత్సాయ వత్సశ్చాశ్వతరాయ వై ॥ 45 ॥**

ద్విజోత్తమా! వారిరువురు కలిసి నాగరాజైన వాసుకికి తెలియజేశారు. వాసుకి వత్సునకు, వత్సుడు అశ్వతరునకు వివరించాడు.

**కమ్బలాయ చ తేనోక్త మేలాపుత్రాయ తేన చ ।**
**పాతాలం సమనుప్రాప్తస్తతో వేదశిరా మునిః ॥ 46 ॥**

అతడు కంబళునకు, అతడు ఏలాపుత్రునకు తెలియజేశాడు. ఈ విధంగా నాగప్రముఖులద్వారా పాతాళం చేరిన విష్ణుపురాణాన్ని వేదశిరుడనే ముని గ్రహించాడు.

**ప్రాప్తవానేతదఖిలం స చ ప్రమతయే దదౌ ।**
**దత్తం ప్రమతినా చైవ జాతుకర్ణాయ ధీమతే ॥ 47 ॥**

ఆ వేదశిరుడు ఈ సమస్తపురాణాన్ని ప్రమతికి బోధించాడు. ప్రమతి పరమబుద్ధిశాలియైన జాతుకర్ణునకు ఉపదేశించాడు.

**జాతుకర్ణేన చైవోక్త మన్యేషాం పుణ్యశాలినామ్ ।**
**వశిష్ఠవరదానేన మమాపేత్యత్ స్మృతిం గతిమ్ ॥ 48 ॥**

జాతుకర్ణుడు మిగిలిన పుణ్యశాలురకు అందరకు తెలియజేశాడు. వశిష్ఠుడు ఇచ్చిన వరం కారణంగా నాకు ఇదంతా స్మృతిపథంలోకి వచ్చింది.

**మయాఽపి తుభ్యం మైత్రేయ! యథావత్ కథితం త్విదమ్ ।**
**త్వమప్యేతచ్ఛమీకాయ కలేరన్తే గదిష్యసి ॥ 49 ॥**

మైత్రేయా! నేను కూడా నీకు విన్నది విన్నట్లుగా దీనిని తెలియజేశాను. నీవుకూడా ఈ పురాణాన్ని కలియుగాంతంలో శమీకునకు బోధిస్తావు.

**ఇత్యేతత్ పరమం గుహ్యం కలికల్మషనాశనమ్ ।**
**యః శృణోతి నరః పాపైః స సర్వైర్ద్విజ! ముచ్యతే ॥ 50 ॥**

ద్విజోత్తమా! కలిదోషాలను నివారించే పరమరహస్యమైన ఈ విష్ణుపురాణాన్ని ఏ మానవుడు వింటాడో, అతడు సర్వపాపాలనుంచి విముక్తుడవుతాడు.

**పితృపక్షమనుష్యేభ్యః సమస్తామరసంస్తుతిః ।**
**కృతా తేన భవేదేతద్ యః శృణోతి దినే దినే ॥ 51 ॥**

ఏ వ్యక్తి ఈ పురాణాన్ని ప్రతిదినం శ్రవణం చేస్తూ ఉంటాడో, అతడు సమస్తదేవగణ, పితృగణ, మనుష్య గణాలను సంస్తుతి చేయడంవలన వచ్చే ఫలితాన్ని పొందుతాడు.

**కపిలాదానజనితం పుణ్యమత్యన్తదుర్లభమ్ ।**
**శుత్వైతస్య దశాధ్యాయానవాప్నోతి న సంశయః ॥ 52 ॥**

ఎవడు ఈ పురాణంలోని పది అధ్యాయాలను శ్రవణం చేస్తాడో, అతడు ఏ సందేహం లేకుండా కపిలగోవును దానం చేయడంవలన లభించే అత్యంతదుర్లభమైన పుణ్యఫలాన్ని పొందుతాడు.

**యస్త్వేతత్ సకలం శృణోతి పురుషః కృత్వా మనస్యచ్యుతం**
**సర్వం సర్వమయం సమస్తజగతా మాధార మాత్మాశ్రయమ్ ।**
**జ్ఞానం జ్ఞేయమనన్త మాద్యరహితం సర్వామరాణాం హితం**
**స ప్రాప్నోతి న సంశయోఽస్త్వవికలం యద్వాజిమేధే ఫలమ్ ॥ 53 ॥**

ఏ పురుషుడు మనస్సునందు అచ్యుతుని, సర్వస్వరూపుని, సర్వమయుని, సమస్తజగత్తులకు ఆధార మైనవానిని, ఆత్మకు ఆశ్రయమైనవానిని, జ్ఞానజ్ఞేయరూపుడైనవానిని, అంతం లేనివానిని, ఆది లేకున్నవానిని, సమస్తదేవతలకు మేలు చేకూర్చేవానిని అయిన విష్ణువును ధ్యానించి, ఈ సమస్తపురాణాన్ని శ్రవణం చేస్తాడో, అతడు ఏ సంశయం లేకుండా సంపూర్ణంగా అశ్వమేధయజ్ఞం చేసిన ఫలం పొందుతాడు.

**యత్రాదౌ భగవాంశ్చరాచరగురుర్మధ్యే తథాఽన్తే చ సః**
**బ్రహ్మజ్ఞానమయోఽచ్యుతోఽఖిలజగన్మధ్యాన్తసర్గప్రభుః ।**
**తచ్ఛృణ్వన్ పురుషః పవిత్రపరమం భక్త్యా పఠన్ ధారయన్**
**ప్రాప్నోత్యస్తి న తత్ఫలం త్రిభువనేష్వేకాన్తసిద్ధిర్హరిః ॥ 54 ॥**

ఏ భగవంతుడు ఆదియందు అఖిలజగత్తును సృష్టిస్తూ, మధ్యయందు పోషిస్తూ, అంతమందు లయం చేస్తూ ఉంటాడో, ఎవడు సర్వసమర్థుడై, బ్రహ్మజ్ఞానమయుడై, చరాచరజంతుజగత్తుకు గురువై యున్నాడో, అట్టి అచ్యుతుని కీర్తించే పరమపవిత్రమైన ఈ విష్ణుపురాణాన్ని వినినా, చదివినా, ధారణచేసినా ఆ పురుషుడు త్రిలోకాలు పూర్తిగా తనకు ప్రాప్తించినా పొందని ఫలాన్ని మించిన ఫలితాన్ని పొందుతాడు. అతడు ఏకాంత ముక్తిరూపసిద్ధిని ఇచ్చే విష్ణుభగవానుని పొందే ఫలం పొందుతాడు.

**యస్మిన్న్యస్తమతిర్నయాతి నరకం స్వర్గోఽపి యచ్చిన్తనే**
**విఘ్నో యత్ర నివేశితాత్మమనసో బ్రాహ్మోఽపి లోకోఽల్పకః ।**
**ముక్తిం చేతసి యః స్థితోఽమలధియాం పుంసాం దదాత్యవ్యయః**
**కిం చిత్రం యదఘం ప్రయాతి విలయం తత్రాచ్యుతే కీర్తితే ॥ 55 ॥**

ఏ భగవంతునిపై మనస్సు లగ్నం చేస్తే అతడు నరకానికి వెళ్ళడో, ఎవ్వనిని స్మరిస్తూ ఉంటే స్వర్గం కూడా అంతరాయం కలగజేసేదవుతుందో, ఎవ్వనియందు చిత్తం కుదుటపడితే బ్రహ్మలోకం కూడా అల్పమైపోతుందో, ఏ అవ్యయమైన పరమాత్మ నిర్మలచిత్తం కలిగిన పురుషుల హృదయాలలో ఉండి ముక్తిని ఇస్తూ ఉంటాడో, అటువంటి అచ్యుతుని కీర్తిస్తూ ఉంటే పాపాలన్నీ పటాపంచలైపోతాయి–అని చెప్పడంలో ఆశ్చర్యమేముంది?

**యజ్ఞైర్యజ్ఞవిదో యజన్తి సతతం యజ్ఞేశ్వరం కర్మిణో**
**యం యం బ్రహ్మమయం పరావరమయం ధ్యాయన్తి చ జ్ఞానినః ।**
**యం చ ప్రాప్య న జాయతే న మ్రియతే నో వర్ధతే హీయతే**
**నైవాసన్న చ సద్భవత్యతి తతః కిం వా హరేః శ్రూయతామ్ ॥ 56 ॥**

యజ్ఞవేత్తలైన కర్మనిష్ఠులు యజ్ఞాలద్వారా ఎల్లప్పుడు ఏ యజ్ఞేశ్వరుని యజిస్తూంటారో, జ్ఞానులు ఏ పరమాత్మ అయిన పరావరబ్రహ్మస్వరూపాన్ని నిరంతరం ధ్యానం చేస్తూంటారో, ఏ పరావరరూపాన్ని పొంది ఎవడు పుట్టడం, మరణించడం, పెరగడం, క్షీణించడం మున్నగునవి పొందకుండా ఉంటాడో, అసత్తు (కార్యం), సత్ (కార్యం) కూడా కాకుండా ఉంటాడో, అట్టి శ్రీహరికన్న వ్యతిరిక్తమైనది అంటూ ఏమున్నది కనుక వినడానికి?

**కవ్యం యః పితృరూపధృగ్ విధిహుతం హవ్యం చ భుంక్తే ప్రభుః**
**దేవత్వే భగవాననాదినిధనః స్వాహాస్వధాసంజ్ఞితమ్ ।**

**యస్మిన్ బ్రహ్మణి సర్వశక్తినిలయే మానాని నో మానినామ్ ।**
**నిష్ఠాయై ప్రభవన్తి హన్తి కలుషం శ్రోత్రం స యాతో హరిః ॥ 57 ॥**

ఏ అనాదినిధనుడైన ప్రభువగు భగవంతుడు పితృదేవతలరూపంలో స్వధాసంజ్ఞకమైన కవ్యాన్ని, దేవతారూపంలో అగ్నిహోత్రంలో విధిపూర్వకంగా హుతమైన స్వాహా సంజ్ఞకమైన హవ్యాన్ని స్వీకరిస్తాడో, సమస్తశక్తులకు నిలయుడైన ఏ భగవంతుని అస్తిత్వవిషయంలో గొప్ప ప్రామాణికవేత్తలుకూడా ప్రమాణాలను నిర్ణయించడంలో సమర్థులు కారో, అట్టి శ్రీహరి శ్రవణపథంలో పడితే చాలు సమస్తపాపాలు నష్టమై తీరుతాయి.

**నాన్తోఽస్తి యస్య న చ యస్య సముద్భవోఽస్తి**
**వృద్ధిర్న యస్య పరిణామవివర్జితస్య ।**
**నాపక్షయం చ సముపైత్య వికల్పవస్తు**
**యస్తం నతోఽస్మి పురుషోత్తమ మాద్యమీశమ్ ॥ 58 ॥**

ఏ పరిణామరూపరహితునకు ఆది, అంతం, వృద్ధి, క్షయం లేవో, ఎవడు నిత్యుడు, నిర్వికార పదార్థమై ఉన్నాడో, అట్టి ఆద్యుడు ఈశ్వరుడు అయిన పురుషోత్తమునకు ప్రణామాలు అర్పిస్తున్నాను.

**తస్యైవ యోఽనుగుణభుగ్ బహుధైక ఏవ**
**శుద్ధోఽప్యశుద్ధ ఇవ మూర్తివిభాగభేదైః ।**
**జ్ఞానాన్వితః సకలసత్త్వవిభూతికర్తా**
**తస్మై నతోఽస్మి పురుషాయ సదాఽవ్యయాయ ॥ 59 ॥**

ఎవడు తన సమానగుణాలను అనుభవిస్తుంటాడో, ఎవడు ఒక్కడే అయినా అనేకరూపాలలో ఉంటాడో, ఎవడు శుద్ధుడైనా విభిన్న రూపాలతో ఉండే కారణంచే అశుద్ధుడు (వికారరూపుడు) గా ఉంటాడో, అట్టి అవ్యయుడు, నిత్యుడు అయిన పురుషునకు వినమ్రుడనై నమస్కరిస్తున్నాను.

**జ్ఞానప్రవృత్తినియమైక్యమయాయ పుంసో**
**భోగప్రదానపటవే త్రిగుణాత్మకాయ ।**
**అవ్యాకృతాయ భవభావనకారణాయ**
**వన్దే స్వరూపమభవాయ సదాఽజరాయ ॥ 60 ॥**

ఎవడు జ్ఞానం (సత్త్వం), ప్రవృత్తి (రజస్సు), నియమనం (తమస్సు) అనువాటికి ఏకరూపుడై ఉంటాడో, పురుషునకు భోగములు కల్పించడంలో సమర్థుడు, త్రిగుణాత్మకుడు, అవ్యాకృతుడు, సంసారోత్పత్తికారణుడు స్వతఃసిద్ధుడు, జరాశూన్యుడో అట్టి ప్రభువునకు నమస్కారం.

**వ్యోమానిలాగ్నిజలభూరచనామయాయ**
**శబ్దాదిభోగవిషయోపనయక్షమాయ । 69 ॥**
**పుంసః సమస్తకరణై రుపకారకాయ**
**వ్యక్తాయ సూక్ష్మవిమలాయ సదా నతోఽస్మి ॥ 70 ॥**

ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి అనే పంచభూత రచనాకుశలుడు, శబ్దం మున్నగు ఉపభోగ్య విషయప్రాప్తి చేకూర్చడంలో సమర్థుడు, పురుషునకు సమస్తేంద్రియాలద్వారా ఉపకారం చేస్తూ ఉంటాడు, అట్టి సూక్ష్మమైన రూపానికి విరూఢ్రూపవ్యక్త పరమస్వరూపానికి నమస్కారాలు సదా అర్పిస్తున్నాను.

**ఇతి వివిధమజస్య యస్య రూపం**
**ప్రకృతిపరాత్మమయం సనాతనస్య ।**
**ప్రదిశతు భగవానశేషపుంసాం**
**హరిరపజన్మజరాదికాం స సిద్ధిమ్ ॥ 71 ॥**

ఈ ప్రకారంగా నిత్యుడు, సనాతనుడైన పరమాత్మయొక్క ప్రకృతి పురుషమయరూపం అనేకరూపాలుగా ఉంటుంది. ఆ భగవంతుడైన హరి సమస్తపురుషులకు పుట్టుక, ముసలితనం, చావు లేని ముక్తిని ప్రసాదిస్తాడు. ఈవిధంగా పరాశరుడు మైత్రేయునకు విష్ణుపురాణం వివరించాడు.

**ఇతి శ్రీవిష్ణుపురాణే షష్ఠాంశే విష్ణుపురాణమాహాత్మ్యమితి అష్టమోఽధ్యాయః సమాప్తః ॥ 8 ॥**

శ్రీవిష్ణుపురాణంలో షష్ఠాంశంలో విష్ణుపురాణమాహాత్మ్యం అనే ఎనిమిదవ అధ్యాయం సమాప్తం ॥ 8 ॥

–0–0–0–